# భారతి

## సచిత్రమాసపత్రిక

సంపాదకుడు

కా. నాగేశ్వరరావు



సంపుటము ౩. భాగము ౧.



ఆంధ్రపత్రికాముద్రాలయము - మద్రాసు

౧౯౨౬

# భారతి—షష్ఠసంపుటము—భా. ౧.

## వ్యాసకర్తల అకారాదిసూచిక

స

## స

| | సంచిక | పుట |
|---|---|---|
| సూర్యనారాయణశాస్త్రి, సన్నిధానము—మందమారుతము–ఝంఝూమారుతము (ప) | ౬ | ౭౩౩–౭౩౪ |
| సూర్యరావు, క్రొత్తపల్లి—ఆంధ్రదేశములోని ఎలుకలభావ (కల) ... | ౧ | ౧౩౩–౧౩౫ |
| ,, ,, దైవస్తుతి (ప) ... ... | ౪ | ౫౪౩ |
| సోమయాజులు, కొ.—విచిత్రగుణకారము (కల) ... ... | ౩ | ౪౧౦–౪౧౧ |
| సోమశేఖరశర్మ, మల్లంపల్లి—కళింగకదంబులు (చ) ... ... | ౩ | ౩౬౯–౩౭౪ |

# భారతి—షష్ఠసంపుటము—భా. ౧.

## వ్యాసముల అకారాది సూచి

# శ

# ర



---

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—ప్రభాతము; ఆంధ్రబాలిక; నైవేద్యము; ఖమావచ (రాగిణి)

సాధారణచిత్రములు:—శ్రీయుత పండిత మోతీలాలు నెహ్రూగారు, జె. యమ్. సేనుగుప్తగారు; ఆకస్మికఛాయాచిత్రములు ౩; పూవుల గడియారము ౪; నాటకపాత్రల చిత్రములు ౩; మైసూరుకళాపరిశ్రమలు-చిత్రములు ౧౮; వింతవస్తువులు ౪; ఇతరచిత్రములును.

---

## మా చందాదారులకు

భారతి ౫ వ సంపుటము రెండవభాగమునకు సంబంధించిన వ్యాసములయు, వ్యాసకర్తలయు అకారాది సూచికలు, ముఖపత్రము, రానున్న సంచికతో వెలువడును.

—సంపాదకుడు, భారతి

---

# ప్రశంస

బులుసు వెంకటరమణయ్యగారు

సీ॥ లనింపారఁ బ్రసిద్ధవైజ్ఞానిక
భాసద్విమర్శ సత్ప్రభలనించి,
రమణీయ వర్ణవిరాజిత చిత్రప్ర
తిమారూపములను సందీప్తినెరపి,
పఠనమాత్రమున సర్వజ్ఞానములనిడి
త్రిగుణతత్వంబులఁ దెలియపఱచి,
కమనీయగీతికా కలితరీతి రచించు
క్రమకావ్యములఁ బంకమ్ముఁ బాపి,
గురువులై సర్వ విజ్ఞాన గరిమఁ దెలిపి,
జగతి లాలించు తల్లివై దిగులుఁ బాపి
యనుపమ విమర్శ కాగ్రతఁ గనఁగఁ గథన
మునను మేటివి భారతీ, మాగుణనయ్య.

# సంవత్సర జాతీయ గీతిక

కవికొండల వేంకటరావు గారు

౧

హిమగిరిశిఖరము-వింధ్యవనీంద్రము-కన్యాకుమారీపదమంజీరము
స్ఫురితము-భరితము-చలితోల్లలితము
స్వాతంత్ర్యముచే-స్వాతంత్ర్యముచే
స్వాగత మనహోయ్, కని, పని వినహోయ్, మనహోయ్ అనహోయ్, జయ్, జయ్, జయ్!

౨

జాహ్నవి, గౌతమి, కృష్ణ, పినాకిని, కావేరి, నర్మద, యమునా సింధులు
అహర్నిశాదులు-ఒకటేగా నము-కలలో-అలలో-అదే ప్రయాణము
స్వాతంత్ర్యముకై-స్వాతంత్ర్యముకై
స్వాగత మనహోయ్, కని, పని వినహోయ్, మనహోయ్, అనహోయ్, జయ్, జయ్, జయ్!

3

గుజరాత్, వంగ, అంగ, మరాటా, త్రిలింగ, తమ్మిళ, కళింగమును జను
లజరులు-అమరులు-అనామయులుగా
స్వాతంత్ర్యము హేయ్! స్వాతంత్ర్యము హేయ్!
స్వాగత మనహోయ్, కని, పని వినహోయ్, మనహోయ్, అనహోయ్, జయ్, జయ్, జయ్!

౪

నౌరోజ్ తిలకులు, లజపద్దాసులు, దానిపథంబున, నలిగిన నొగిలిన
వెచ్చని నెత్తుటి దివిటీ వెలుగున
స్వాతంత్ర్యంబదె!-స్వాతంత్ర్యంబదె!
స్వాగత మనహోయ్, కని, పని వినహోయ్, మనహోయ్, అనహోయ్, జయ్, జయ్, జయ్!

౫

ఇంగ్లండమెరిక, స్వీడన్, స్విట్జు, జపాను, జర్మని, కీచు, పరాసు,
అంబవిశ్వకళ కభివాదనమిదు
స్వాతంత్ర్యమురా, స్వాతంత్ర్యమురా
స్వాగత మనహోయ్, కని, పని వినహోయ్, మనహోయ్, అనహోయ్, జయ్, జయ్, జయ్!




చెన్నపట్టణము, డిసెంబరు ౧౯౨౮

సంపుటము ౬ | విభవ సంవత్సరము పుష్యమాసము | సంఖ్య ౧



# స్వవిషయము

ఆనందము జీవబ్రహ్మములకు సహజావస్థ. సకలజీవములును నిరతిశయానందమును గోరుచు జీవయాత్రను జేయుచున్నవి. ఆనందము జీవజాలమును జీవయాత్రయందు పోషించుచున్నది. ఆనందానుభవమున కనంతములైన సృష్టి విలాసములు ప్రత్యక్ష సాధనములుగ నున్నవి. మహానుభావులు సృష్టివిలాసములందానందసందర్శనమును జేయుచులోకానందమునకు సాధనంబుల నుపదేశించుచున్నారు. ఆనందము దివ్యసౌధములందువలె పూరిగుడిసెలందును, కుబేరులందువలె నిరుపేదలందును, పండితులందువలె పామరులందును, నగరములందువలె వనములందును, అంతరిక్షమునందువలె భూమియందును, ధీరులందువలె భీరువులందును, సాధువులందువలె క్రూరులందును మహానుభావులకు ప్రత్యక్షమగుచున్నది. భారతీదేవి కంగోపాంగములైన చతుర్దశవిద్యలు, చతుష్షష్టికళలు, సకలసాహిత్యములు మానవుల కానందదాయకములై విశ్వకల్యాణమునకు సాధనములుగ నున్నవి.

భారతి అనంతములైన విశ్వవిలాసముల కధిదేవత. భారతి—సావిత్రి, సరస్వతి, వరదాయిని, మహాదేవి, కళాస్వరూపిణి, పురుషార్థప్రదాయిని, ఆనందమయి. అనంత భారతీవిలాసములను శాస్త్రజ్ఞులు పరిశోధించుచు జ్ఞానానందము ననుభవించుచున్నారు; కవులు వర్ణించుచు రసానందమును బడయుచున్నారు. గాయకులు పాడుచు నాదానందము ననుభవించుచున్నారు. శిల్పులు చిత్రించుచు రూపానందమును ప్రత్యక్షము చేసికొనుచున్నారు.

సామాన్యులు మహానుభావుల ననుసరించుచు నానందించుచున్నారు.

అనంతములైన భారతీవిలాసముల కాద్యంతములు లేవు. ఆద్యంతములు లేని భారతీ విలాసవైభవములకు నామరూపములను గల్పించి యానందమును గలుగజేసెడి మహానుభావులు ధన్యులు. అనంతములైన వైభవ విలాసములతో వెలయుచున్న భారతీదేవిననంతవిధముల నారాధకు లుపాసించి సేవించుచు నానందమును బొందుచున్నారు. భారతీదేవి సేవాపరాయణుల కనురూపమైన ఫలమును ప్రసాదించుచున్నది. భారతి ఎవరు సేవించిన విధమున వారికి ప్రత్యక్షమై ఆనందమును ప్రసాదించుచున్నది.

అఖండమైన భారతీవిలాసములం దొక ఖండవిలాసమును ప్రదర్శించుటకు భారతి జన్మించి నామరూపములనుదాల్చినది. భారతికి అయిదేండ్లు నిండినవి. ఆరవయేడారంభమైనది. భగవదనుగ్రహమువలనను, ఆంధ్రమహాజనుల యాదరపోషణములవలనను భారతి క్రమవికాసమును బొందుచు యథాశక్తిని స్వధర్మనిర్వహణమును జేయుచున్నది. భారతి నాదరించి ఎల్లవిధముల పోషించుచున్న వారందఱు భారతీప్రసాదమును బడయుచు నిర్వాహకుల కృతజ్ఞతను స్వీకరింతురుగాత!

భారతియందలి గుణదోషములను గ్రహించుటకు పండితులు సమర్థులు. నిర్వాహకులు సహజాభిమానముతో గుణములను గనుగొనునటులు దోషములను గనుగొనజాలరు. సర్వాంగశోభితమై తాను ఆంధ్రహృదయ స్వరూపమును ప్రత్యక్షము చేయుటయే భారతికి ప్రయోజనము. ప్రవృత్తియందు జాతీయౌన్నత్యము భావౌన్నత్యము మీద నాధారపడియున్న విధమును ప్రపంచేతిహాసములు విశదము చేయుచున్నవి. భారతి నలంకరించుచున్న పద్యములు, కథలు, కావ్యవిమర్శనలు, నాటకములు, పరిశోధనలు, చిత్రములు, తత్త్వవిచారణలు, వింతలు, విశేషములు ప్రజాప్రబోధాయత్తమైన నవజీవనప్రభావమును విశదము చేయుచున్నవి. ప్రజాహృదయ వికాసమునకు భావవికాసము మూలబీజముగ నున్నది. జాతీయభావవికాసము కళాసాహిత్యరూపములను ప్రత్యక్ష మగుచున్నది. ఆంధ్రహృదయస్వభావ మాంధ్రశిల్పమునందును, సంగీతసాహిత్యములందును, నిత్యజీవనమునందును ప్రత్యక్షమగుచున్నది. ఆంధ్రశిల్పమునకు గల వ్యక్తిత్వమును ప్రాచీనమైన అమరావతి, అజంతా శిల్పములవలె వర్తమాన రామారావు చిత్రకళయును విశదము చేయుచున్నది. ఆంధ్ర సంగీత సాహిత్యహృదయమును ప్రాచీనకావ్యములవలె వర్తమాన కావ్యములును విశదము చేయుచున్నవి. ఆంధ్రహృదయ స్వరూపము స్త్రీలయందును పురుషులయందును, బ్రాహ్మణులందును, బ్రాహ్మణేతరులందును, పండితులందును పామరులందును వికాసమును బొందుచున్న విధమును కళాసాహిత్యస్వరూపములు విశదము చేయుచున్నవి. ఆంధ్ర సాహిత్య కళాప్రపంచము సర్వతోముఖమైన వికాసము నభిలషించుచున్నది. ఏతత్ఫలప్రాప్తికై భారతియును గతించిన అయిదేండ్లయందును యథాశక్తిని పాటుపడినది. ఇంతవరకును భారతిని పోషించిన సాహిత్య కళోపాసకులకు వందనము లర్పించుచు ముందును సహాయము చేయుటకు వేడుచున్నాము. కావ్యకళావిలాసినియై, ఆనందదాయినియై భారతి వర్ధిల్లుటకు పరమేశ్వరు డనుగ్రహించుగాత!

# ఆంధ్రుడను

జి. జాషువ కవి గారు

బహుదేశములను పేర్వడసి మీసము దీటు భరతఖండంబు నాపాఠశాల
స్తనయుగంబున గాన సాహిత్యములు పిండు భాషావధూటి నాపంతులమ్మ
సాందీపముని సమక్షమున విద్యగడించు వనమాలి నాసహపాఠకుండు
భక్తివైరాగ్యభావముల తావలమైన భాగవతంబు నాబాలశిక్ష
ఘంటము ధరించి మోహనాక్షరము లెనయ-బ్రతిఫలించెడు నామహోన్నతవిభూతి
వ్రాసుకొందును దశదిశాఫలకపంక్తి-గడనకెక్కిన యాంధ్రపుత్రుఁడను నేను.

ఘనపురాణగ్రంథ కర్త దేవర్షి వ్యాసుండు మాయాస్థానపండితుండు
శివధనుఃపాటనాంచిత బాహువీరుండు భూసుతాభర్త నాపొరుగువాఁడు
ముల్లోకవిజయంబు పుంజీభవించిన భీముండు మాయూరి సాముకాఁడు
గానవైదుషి రాలు గఱచు భక్తుఁడు త్యాగరాయండు మాయింటిగాయకుండు
శీతనగశృంగసీమ నాసీనుఁడనయి-యద్భుతములైన బిరుదుపద్యములు చదివి
వేడ్క మ్రోయించుకొందును విజయభేరి-మడమఁద్రిప్పని యాంధ్రవీరుఁడను నేను.

మాశిల్పనైపుణ్య మహిమంబుఘోషించు తాజమహాలు నుదాహరించి
మాకవిత్వవిలాసమార్దవంబుం జెందు ఘనుఁ దిక్కకవిని మచ్చునకుఁ జూపి
మాధనుర్విద్యారమావైఖరిం జాటు వీరుఁడౌ గాండీవిపేరు సెప్పి
మాసతీతిలకసంపద లచ్చుగ్రుద్దించు సావిత్రి మాంగల్యచరిత మెన్ని
భరతభూమికి గగ్గురుపాటు దోఁప-గగనమండలి మార్మ్రోయఁ గంఠమెత్తి
పందెమొడ్డెద విశ్వ విశ్వంభరమున-నుడువుదప్పని యాంధ్రభూపుఁడను నేను.

సర్వభూముల కహింసాసూక్తి బోధించు దయకు నాచిత్తమద్దాలమేడ
గండుపేదలను బంగారుగుప్పిట దన్పు నీవికి నాచేయి తావలంబు
అత్యనాథులగాంచి యశ్రూదకముఁ జిమ్ముకరుణకు నాగుండె పురిటిగీము
మంజులాలంకారమకరంద ముప్పొంగు కవితకు నాజిహ్వ కల్పతరువు
క్రమ్ముకొనివచ్చు కీర్తిమేఘములమీఁద-నమల సంతోష రసవిమానముల నెక్కి
హాయిగా సంచరింతు నహర్నిశంబు-నిడుమ లంటని విత్తవంతుడను నేను.

# ద్రావిడభాషాపద చరిత్రము

కోరాడ రామకృష్ణయ్య గారు

కుఱళ్ :—ఇది ద్రావిడ భాషావాఙ్మయమున తిరువళ్లువార్ అను నొకకవిచే రచింపఁబడిన యొక గ్రంథమునకు పేరు. అత్యంత గంభీరభావగర్భితములై నీతి బోధకంబులగు చిన్నచిన్న ద్విపదలవంటి వాక్యములతో గూడినదగుటచే దీని కీనామము వచ్చినది. 'కుఱళ్' అనగా చిన్నవాక్యములు గలది — పొట్టివాక్యములు గలది—యనియర్థము. ప్రస్తుతము మన కీశబ్దముతోడనే కాని యాగ్రంథముతో నంతపనిలేదు. ఈ 'కుఱళ్' అనుదానికి 'కుఱు' అనునది మూలరూపముగా గనబడుచున్నది. ఇది కేవల గుణవాచకమేయై, వ్యాపారార్థమును సూచించునది కాకపోవుటచే దీనిని "ధాతు" వనుటకంటె మూలరూపంబనుటయే యుక్తముగానుండును. "ఫలవ్యాపారయో ర్ధాతు రాశ్రయేతు తిజః స్మృతాః" అనువైయాకరణ మతానుసారముగా వ్యాపారార్థము లేనియపుడు ధాతువనుట పొసగదు. కాని ఇది యార్య భాషాధాతువుల విషయము. అచ్చట ధాతువులన్నియు, వ్యాపారద్యోతకములుగనే గ్రహింపబడినవి. ద్రావిడ భాషలలో వ్యాపారద్యోతకములు గాక కేవల గుణద్యోతకములగు మూలరూపములుగూడ నుండుటచే వీనికన్నిటికినిగూడ సామాన్యముగా ధాతుపద ముపయోగించుట వలన హాని యేమియు గనబడదు. భాషలలోనిపదజాలము నందలి విశేషార్థద్యోతకములగు ప్రత్యయాదుల నన్నిటిని వేఱుపఱిచినచో చిట్టచివరకు మిగులు మూలరూపమే (elmental form) ధాతు వగుచున్నది. ఇది యార్య భాషలలో వ్యాపారద్యోతకముగా గ్రహింపబడినను ద్రావిడభాషలలో వ్యాపారార్థద్యోతకముగాక విశేషణవిశేష్యభావద్యోతకము గూడ నగుచున్నది. ఈ 'కుఱు' అనుధాతువు 'పసు' మొదలగు మఱికొన్నిటి వలెనే గుణవాచకమైనధాతువు. దీనికి చిన్న, పొట్టి, అనునర్థము. ఇది ద్రావిడభాషలన్నిటిలో గనబడుచు నొక్కొక్కభాషలో ననేకములగు పదములకు మూల భూతమై యుండుటచే నిది చాలప్రాచీనమైన ధాతువుగా గ్రహింపదగియున్నది.

ద్రావిడభాషలన్నిటిలోను, ఈ 'కుఱు' అనుధాతువునకు 'చిన్న,(smallness,short)పొట్టి'అనియె యర్థము. కన్నడమున, దీనికి, 'కిఱు, కిఱె, కిఱి' అనురూపములు కూడ కలవు. దీనినిబట్టియే, తెలుగునందలి, 'చిఱు, చిట్టి' అనునది 'కుఱు' అను దానితో సంబంధించినదనియే స్పష్టమగుచున్నది. కావున, 'కుఱ్—కిఱ్'అనునది మూల రూపముగావచ్చును. ప్రాచీనకాలమున,నీధాతువు లాయా జనుల యుచ్చారణ పరిపాటినిబట్టి, యొకేయర్థమున భిన్నాచ్చులతో వ్యవహరింపబడుచు నర్థసామ్యముగలిగియు, భిన్నరూపములను బొందిన పదజాలమునకు

---

శ్రీకృష్ణరాయ ధాత్రీనాయకుని సమగ్రప్రతాపము దీపకళిక మాకు
రాజరాజనరేంద్రరమణీయ సద్యశఃకాండంబు పండు రేయెండ మాకు
మన్నె బొబ్బిలి దండిమగలదోస్సారంబు సహజనిష్ఠుర కవచంబు మాకు
అరిరాజమూర్ధన్య పరిభావపంకంబు మురువుమీఱిన చుక్కబొట్టు మాకు
విలసితములైన యుద్ధగ్రంథములు రచించి-యుడుపథంబున వలపుటంగడులు దీర్చి
అమ్ముకొందును సిద్ధసాధ్యాంగనలకు-శుభములందిన యాంధ్రవణిజుండ నేను. (?)

మూలములై యొప్పినవి. 'కుఱు' అను మూలరూపము నందలి శకటరేఫము ద్విత్వమునుబొంది, 'కుఱ్ఱు' అయి శకటరేఫద్విత్వోచ్చారణము టకారరేఫములను గలిపి యుచ్చరించినట్లుండు గావున, కుఱ్ఱు—కుట్రుఅయి, రేఫజాతిపోయి, 'కుట్టు' అనురూపమున, 'కుట్టుసురు' మొదలగుపదములలో దెనుగున గానవచ్చుచున్నది. 'కుఱు' కుఱుచయైన 'ఉసురు' అన్నపుడు, 'కుఱు', విశేషణ మగుటచే, 'ఱు'కారమునకు ద్విత్వమువచ్చినది. ఒకకాల మున ద్విత్వములేకుండగూడ విశేషణమైయుండుటయు కలదు. కావుననే కుఱుగద్దియ, కుఱుగటి, కుఱుగేలు, కుఱుమాపు మొదలగు పదము లేర్పడినవి. మనయాంధ్ర వైయాకరణులు, నిఘంటుకారులు, ఇది 'కుఱుచ'శబ్దమే యనియు, వృత్తియందు 'కుఱుచ' శబ్దమునకు మీదివర్ణ ము లోపింపగా, 'కుఱు' అనునది సిద్ధించుననియు దీని కచ్చుపరమైనచో అకారమునకు 'ట'కారద్వయ మాదేశ మగుననియు, నిట్లే కుట్టారుగ, కుట్టుముక, కుట్టుసురు, కుట్టాపిరి, మొదలగు పదము, లేర్పడినవనియు జెప్పు దురు. 'చిఱు' మొదలగు శబ్దములలోగూడ నిట్లే ప్రాచీనభాషయందలి శకటరేఫాంతమగుపదము విశే షణమైనపుడా శకట రేఫమునకు ద్విత్వము కలుగుటయు, నాద్విత్వరేఫము 'ఱ్ఱ' ఊదిపలుకబడుటచే'ట్రి'గా నుచ్చ రింపబడుటచేతను, 'శిఱ్ఱెలిగళ్' మొదలగు ప్రాచీనసమా సములు తెలుగున 'చిట్టెలుకలు' అనురూపమును బొంది ద్విత్వటకారముతోగూడినవైనవి. ఇది ప్రత్యేకముగా నామవాచకమైనపుడు రేఫోచ్చారణమే నిలచినట్లున్నది. కుఱ్ఱ, కుఱ్ఱడు—చిన్నపిల్లవాడు, పలచన (పలధాతువు), వెచ్చన (వే—ధాతువు) పచ్చన – (పస్‌ధాతువు). మొద లగువానిలోవలెనే ఈ 'కుఱు' అనుదానికి 'చ' అనునది చేర్పబడుచున్నది. ఇ 'చ' యనున దేపద మునొక్క యవశిష్టరూపమో విచారింపవలసియున్నది. సమాసములలో గనబడు 'కుఱు' అనురూపమే 'కుఱుచ' అనుపదముకంటె మిగుల ప్రాచీనమనుటకు సందేహము లేదు; 'కుఱుమట్టము' అనుపదము మఱొకటి కలదు. 'కుఱుకుఱు'అనగా 'అల్పము'

క. ఎఱసంజ నెఱసి విరిసెం
జిఱుచీకటు లెగసి గగనసీమన్ బలసెన్
గుఱుకుఱు తెగలై కనబడి
తఱచై వెనువెనక పెక్కుతారలు దోచెన్.

సమీపము అనునర్థముగల 'కుఱంగట' అనుపదములోగూడ 'కుఱు' అనురూపము కనబడుచున్నది. "సమీపముగా జేరిన కొన్నివస్తువుల సమూహము"అనగా 'రాశి' అనునర్థమున 'కుఱుకు' అనుపదము ప్రాచీనవ్యవహారమున నున్నట్లున్నది. ఇప్పుడు వాడుకలో లేకపోవుటచే క్రొత్తగా గనబడునుగాని భారతము ద్రోణపర్వములో

మ. కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణ
క్షోణిం బ్రవాహంబులై
పఱచెన్ నెత్తురు భూతకోటి విహరిం
పన్ బ్రస్తుతింపన్ సురల్

అని యుద్ధభూమిని భటుల యవయవములు ప్రోవులు గట్టినవనుటకు 'కుఱుకుల్' అనుపదము తిక్కనచే ప్రయోగింపబడినది. మనకు క్రొత్తగా గనబడు నిట్టిప్రయోగములు భారతమున నడుగడుగునకు బొడగట్టుచునే యుండును.

ఇది యాంధ్రతమిళములయందే కాక కన్నడమునను విశేషప్రచారములో నున్నట్లేయున్నది. 'కుఱుగడ్డ' = చిన్నగడ్డము; కుఱుగిడ = చిన్నచెట్టు, కుఱుదడి= చిన్నకర్ర, కుఱుగెయ్యి = చిన్న చెయ్యి, కుఱుగణి = చిన్నబోయియుండుట, అనుపదములలో గానవచ్చుచున్నది. తమిళమున కుఱుగు = చిన్నదగుట, చిన్నబోవుట యను నర్థమున కలదు. దీనికి సంబంధించియే తెలుగున 'క్రుంగు' అనుధాతు వేర్పడియుండును, వాడు క్రుంగిపోయినాడు. అదిక్రుంగిపోయినది. అనగా పొట్టియైనది. క్రిందికి దిగిపోయినది, పొడవు అడగినది. అన్నయర్థము వచ్చినది. కావున తెలుగులో 'క్రుంగు' ధాతువునకు 'కుఱు' అనునదే మూలరూపమని తెలియవచ్చుచున్నది. కుఱ్ + అగు 'కుఱగు—కుఱుగు' అనియైయుండును.

కన్నడభాషలోఁగూడ చిన్నదనము, పొట్టితనము (smallness) అను నర్థమున 'కుఱుచు' 'కుఱిచి' అను పదములు కలవు. తెలుఁగున కుఱుజు అనియు గలదు. 'ఈకుఱుచు' అనుదానినుండియే, 'గుఱుజు' 'గుజ్జు'—(చిన్న,పొట్టి)అనుపదము లాంధ్రకన్నడముల నేర్పడియుండును. తెలుగున మఱుగుజ్జు అను పదమునను, ప్రత్యేకముగ పొట్టివాడు అను నర్థమునగూడ నీ 'గుజ్జు' పదము వాడుకలోనున్నది. నిఘంటువులలో నిది 'కుబ్జ'శబ్దభవం బని తెలుపబడినను, ద్రావిడభాషలన్నిటిలో ననేకములగు పదములకు మూలంబైన 'కుఱు' అనుధాతువునుండి, నిష్పన్నంబై నదనుటయే సమంజసముగా గనబడుచున్నది. కన్నడమున "గుజ్జుకత్తి" అనగా చిన్నకత్తి (a small knife), గుజ్జుమర—పొట్టిచెట్టు (a small tree). ఆచెట్టు గుజ్జుగా పెరుఁగుచున్నది అనియు, నందురు. ఇది మళయాళమున "కొజ్జు" అనియు, తుళుభాషలో "గుజ్జు" అనియు రూపములతో నున్నది. కన్నడమునందలి 'లోపము' తక్కువతనము అనునర్థము గల 'కుత్త' (defect, deficiency) అనుపద మీ 'కుఱు' ధాతువు నుండియే యేర్పడినట్లున్నది. కుఱు + త=కుఱుత=కుత్త— ఈయర్థముననే యాంధ్రమున 'కొఱత' అనుపద మేర్పడినది. ఇందు 'కుఱు' లోని మొదటి క కారముమీద నున్న, ఉకారము—'ఓ'కారముగా మాఱినది. ఇట్టిమూల ధాతువులలోని ఇకారోకారములు. ఎ, ఓలుగా మాఱుచుండుట తఱచుగా గా న న గు ను; తమి. కుట్టు= (to beat, strike) తె. కొట్టు; తమి. కుడి= point sprout—తె. కొడి(దీపపుకొడి); తమి. కుడుపు=a stick for beating drums, తె. కొడుపు; తమి. కుడై—తె. గొడుగు; etc.) కావున, కుఱ్ త—కుత్త, అని కన్నడములో నేర్పడగా దెనుగున 'కుఱు','కొఱు','కొఱుత', 'కొఱత' అనుపద మేర్పడినది.

ఈ 'కుఱు' 'కొఱు' అను రూపమును జెందుటయేకాక ఆదికాలమున 'కుఱు'—'కిఱు' అనురూపము కూడ కలదై యున్నట్లు కనబడుచున్నది. కిఱి— కిఱ— కిఱు కుఱు—కొఱె—కొఱతె—గుజ్జు మొదలగునవన్నియు. నొకే కుటుంబమునకు జెందినవనియే కిట్టెల్ (Kittel) పండితుని యభిప్రాయముగూడ నైయున్నది. ఇందలికకారము తరువాత నొకఇకారము వచ్చియుండుటచే నీతాలవ్యాచ్చు, ఆకకారమును తాలవ్య 'చ' కారముగా మార్చివేసినది. ఇట్టి తాలవ్యీకరణసూత్రి (palatalization) మార్యభాషలలోగాక ద్రావిడభాషలకుగూడ వర్తించుచుండుట సుప్రసిద్ధమే. (Cf— కివి = చెవి, కెంపు = చెన్ను, కెయ్ = చెయ్యి, కిడ= చెట్టు, కిళి=చిలుక ఇత్యాదులు) కావున 'కిఱి', 'చిఱి'—'చిఱు' అయినది. ఇది యొక్క తెలుఁగుననేకాక తమిళ మళయాళములగూడ 'చిఱు' అనురూపమును బొందియున్నది. కాని కన్నడమునను, తుళుభాషనుమాత్రము కిఱి, కిరికిఱు, కిణ, అనురూపములు కలవు. కన్న. కిఱికుల, కిఱిగట్టె, కిఱియక్క, కిఱుకాల, కిఱుబులి, కిఱువెలర్, ఇత్యాదులు 'క' కారముతోగూడినవై ప్రాచీనరూపమనుట నిశ్చయము గావున తుళు కన్నడములలో ప్రాచీనరూపములు నిలచియున్నవనియు తెలుగులో నది యంతరించిపోయినవనియు దలఁపనగును. 'కొఱె' అను రూపముకూడ కన్నడమున 'కొఱెదిన, కొఱెప్రాణ(the point of death) ఇత్యాదులయందు కలదు.

పైని దెలుపబడిన క్రియారూపము 'కుఱుగు' అనునది ఈ 'కుఱ్' అనుధాతువునుండి యేర్పడినదే యని చెప్పబడియెగదా! ఇది యాంధ్రతమిళమళయాళభాషలలో గనబడుచున్నది. ఆంధ్రమునమాత్రము కొంత మార్పు బొందియున్నది. 'కుఱ్' అనునది కేవలవ్యాపారమును సూచించునదిగా లేకుండుటచేతనో ఏమో యీమూలరూపమునే ధాతువుగా గ్రహింపక యాంధ్ర కన్నడభాషావై యాకరణులందఱును 'గు' అంతమందు గల 'కుఱుగు—(లేదా క్రుంగు)' నే ధాతువుగా గ్రహించుచున్నారు. దీనివంటిదే 'పెరు' అనునదొకటికూడ కలదు. 'పెర్' కు 'పేర్' అనురూపముకూడ కలదు. అది పెరుగుచున్నది అనుటకు 'పెరుక్కిఱదు' అని తమిళమున జెప్పుదురు. ఈ 'పెరుగు', 'పెరుక్క' లకు కొంత సంబంధముండునని తోచకమానదు. తెలుగులో ననేకధాతువులు 'గు' 'ఁగు' లతోగూడినవై కనబడుచున్నవి. కలుగు, చెలఁగు, తలఁగు, మలఁగు, వెలుఁగు, తొలఁగు,

తెలుసు, విరుసు, కఱఁగు, చెఱుగు, తిరుగు, తునుఁగు, పెరుఁగు మొదలగు వానిలోని 'గు' ధాతుస్వరూపమునకు జెందినదిగానే తలంపబడుచున్నది. ఇట్లొక తెనుగుననే కాదు. కన్నడభాషా వైయాకరణులుగూడ 'గు' అంత మునే ధాతువుగా నెంచియున్నారు. కేశిరాజు శబ్దమణి దర్పణమున 'గు' అంతమందుగల ధాతువుగా నెంచియు న్నాడు. కేశిరాజు శబ్దమణిదర్పణమున 'గు' అంతమందు గల ధాతువుల ననేకములను దెలిపియున్నాడు. పోగు-గమనే, అగు-ప్రాదుర్భావే తొలగు-విభక్తి, కరగు-విలీనే, మరగు-గోపనే, మొఱగు=వాదన క్రియాయాం, మిఱుగు-చకచకాయమానే, మిగు-అతిక్రమణే, బిగి-బంధనే-ఇత్యాదులు. ఆంధ్రకన్నడవైయాకరణు లిట్లు 'గు' అంతమునే ధాతువుగా గ్రహించి వీనిపైని'ఉన్నా' ద్యనుబంధములను వర్తమానాది కాలద్యోతకములుగా జేర్చి క్రియారూపములను నివృత్తిచేసినను,తమిళవైయా కరణులు మాత్రము యీ'గు' అంతమును ధాతువుగా బరిగణింపక పెర్, పో, ఉణ్, పర్' మొదలగువానినే ధాతువులుగా గ్రహించి, వానిపైని వర్తమానార్థమున 'కిరు', 'గిరు' అనునవి చేర్పబడునని చెప్పుచున్నారు. కిరు-గిరు అనునవి వర్తమానార్థకప్రత్యయములుగా నిటీవలి ద్రావిడభాషావైయాకరణులచే గ్రహింపబడినవి. కాని, యీభాషకు ప్రథమవైయాకరణుడగు తొల్కాపియార్' అను నాయన రచించిన 'తొల్కాప్పియం' అను లక్షణగ్రంథమున 'కిరు-గిరు' అనిచెప్పక 'క్రియలకు జేర్పబడు ప్రత్యయములక్రింద పుం, డుం, తుం, ఱుం, అనునవి ఉత్తమపురుషబహువచనమునను, కు, డు, తు, ఱు అనునవి ఉత్తమైకవచనమునను వచ్చునని చెప్పి యిచ్చి యున్నాడు. దీనినిబట్టి యీ'గు' అనునది ధాతువుల కేదో యొకయర్థమున తరువాత జేర్పబడిన ప్రత్యయము వంటిదిగాని ధాతువునకు లేదా మూలరూపమునకే చెందినది కాదని స్పష్టమగుచున్నది. ఇంతేకాక ఈ'గు'లేశం డగనే యనేకపదము లామూలరూపమునుండి బయలు దేరుచున్నపుడు, 'గు'అంతము క్రియారూపములకుమూల మన్న ననవచ్చును గాని భాషలో మూలరూపము, (Elemental form) అని చెప్పుట పొసగదు.'తునుగు'

దానినుండి,తునిగినది-తునుగుచున్నది. మొదలగుక్రియారూపములును తునుక,తునుగుట, మొదలగు భావార్థకరూపములును నివృన్నంబై యుండవచ్చునుగాని, తుణి, తునియ, తుండు, తుంపర, మొదలగుపదములలో 'గు'కు ప్రసక్తి లేకపోవుటచే 'తున్' అనునదే ధాతువని తలంపనగునే కాని, 'తునుగు' ధాతువనుట సమంజసముకాదు. ఆపద ములలో 'గు' లోపించినదని చెప్పుటలో నర్థమేలేదు. ఆర్యభాషలలోవలె ధాతువు వ్యాపారద్యోతకమైయుండ వలెననియు, తునుగు, వెలుగు మొదలగువానినుండియే క్రియారూపములు బయలుదేరుచున్నవిగావున నవియే ధాతువులై యుండవలయుననియు తలచి వీనికి పూర్వస్థితిని బరిశీలింపకుండుటయే వారు వీనిని ధాతువులుగా బరిగణించుటకు గారణము. ఏదెట్లయినను మొత్తము మీద ద్రావిడభాషలన్నిటిలోను ధాతువున కేదోయొక కారణముచే 'గు' అనునది చివర వచ్చుట తటస్థించు చున్నది. ఇదియొకపెద్ద విశేషము. ఇంతేకాక, ఇది భాషలో చాలా ప్రాచీనరూపమనికూడ తలంపదగియు న్నది. ఈ 'కు' స్వరూపమును దెలియక తమిళులు 'కు' లేదా కిరు (కు+ఇరు), (గిరు)-అనుదానిని వర్తమానార్థక ప్రత్యయముగాజెప్పుచు, దానిని 'పెర్' 'వెళ్' అను హలంతధాతువులకు జేర్చి వర్తమానార్థక రూపములను నివృత్తిగేయుచున్నారు. ఈ 'కు'-'గు' అనునది కాలద్యోతకమై యుండుటను మఱచిన తెనుగు కన్నడులు ఈ 'గు' అంతమునే ధాతువుగా పరిగణించి దానిపై కాలపురుషద్యోతకములగు వేఱుపదములనో, ప్రత్యయములనో చేర్చి రూపములను బడయుచున్నారు. పెరుగుచున్నది అని మనము చెప్పుచుండ, 'పెరుక్కిరదు' అని వారు చెప్పుచున్నారు. వీనిలో సమానభాగముగా గనబడుచున్న 'పెరుగు-పెరుకు' అనునది ప్రాచీన భాషకు జెందిన రూపమైయుండును. ప్రాచీన జనసంఘములలో తెలుగుకన్నడులు, తమిళులనుండి విడివడిన తరువాత భాషను వ్యాకరించుటలో (analyse) వారు 'పెరుగు' అనుదానినే ధాతువుగా గ్రహించి దానిపైని 'చు' 'ఉన్న' అనువానిని కాలద్యోతకములుగా జేర్చి యుండ, యీ తమిళులు, 'పెరు' నేధాతువుగా గ్రహించి

దానికి 'ష'-'గు'-'ఇరు'లను కాలద్యోతకములుగా జేర్చిరి. వానిపై 'అది'-'అదు' అనునవి లింగద్యోతకపదములు చేరి "పెరుగుచున్నది" అనియు "పెరుక్కి-అదు" అనియు నేర్పడినవి. ఇట్లు తెలుగున ధాత్వవయవముగా దలంపబడుచున్న 'గు' అనుదానికిని, తమిళమున వ_ర్తమానార్థక ప్రత్యయముగా దలంపబడుచున్న 'గిరు' (గు+ఇరు) లోని 'గు' కును సన్నిహితసంబంధము కలదనియే, లేదా అవి యొక్కటి యనియే నా యూహ.

దీనినిబట్టి వీనిలోని మూలరూపము 'గు' తో గూడినది కాదనియు, నీ 'గు' అనునది యెట్లో యేదో యొకయర్థమున నా మూలధాతువునకు జేర్పబడిన యొక పదముయొక్క యవశిష్టరూపం(Remnant)బనియు తెలియుచున్నది. ఈధాతువులనుండి 'గు' అవసరము లేకుండగనే భాషలో బయలుదేరిన పదజాలమే దీనికి నిదర్శనము. 'పెర్' అనుధాతువునుండి-పేర్మి, తమి. పెరుమై-పెద్ద,-తమి. పెరిశి. పేరురము, పేరాశ, పెర్గడ, మొదలగునవియు; 'వెల్' అనుదానినుండి వెల్ల, వెల్లన, వెల వెలబోవు, వెలి, వెండి, వెల్లి (కన్న) ఇత్యాదులును 'గు' తోపని లేకుండగనే బయలుదేరియున్నవి.

ఇట్లు 'పెర్' 'వెళ్' 'తుణ్' మొదలగునవియే ధాతువులైనచో వానినుండి క్రియారూపములను నిష్పత్తి చేయునపు డీ 'గు' ను చేర్చుటకు గారణమేమి? ఇది దేనియవశిష్టభాగము అని విచారింపవలసి యున్నది. ఈ 'గు' అంతములగు ధాతువులనుండి బయలుదేరిన కొన్ని నామవాచకములలో నీ 'గు' 'క' గా మాఱు చుండుటం జేసి (మొళక్కు-మొలక, కలగు-కలక; తునుగు-తునుక; పోగు-పోక, (etc) ఒకప్పు డీ 'గు' 'క' అనురూపమును బొందునదై యుండెనని తలంపదగును. 'పెరుక్కి-రదు' మొదలగు వానిలో 'క్కు' కనబడుచున్నను 'పోగిరేణ్' పోగ్వేన్, 'వర్గిరేన్-వర్గిన్డ్రేన్', 'శెయ్గిరేన్' మొదలగువానిలో 'గు' కనబడుచునే యున్నది. కావున నొకకాలమున ప్రాచీనతమిళమున గూడ, పోగు, వరగు, శెయ్గు, పెరగు, అను 'గు' వర్ణాంతరూపములకె ఇరు+ఏన్ అనిగాని, లేదా ఇన్+ఉ (తు) అనిగాని కాల పురుషద్యోతక ప్రత్యయములను జేర్చియుండురనుట సంభావ్యముగా నున్నది.

ప్రాచీనద్రావిడభాషలో నర్థభేదమును దెలుపుట కార్యభాషలలోవలె ప్రత్యయాదులు లేవనియు, నానార్థభేద మొకపదమునకు మఱియొకపదము చేర్చుటచేతనే కలుగుచున్నదనియు, నొకవాక్యమందలి యర్థము అందలి పదముల విశేషణ విశేష్యభావ సంబంధముమీదనే యాధారపడి యున్నదనియు నీభాషలయందలి విభక్తిప్రత్యయములను బరిశీలించినచో దెలియగలదు. 'మరత్తాల్' 'మరత్తిన్' 'నాచేత' 'చెట్టువలన' మొదలగువానిలో 'ఆల్' 'ఇన్'-చేత, వలన-యనునవి మొదట పదములేయై యర్థభేదమును సూచించుటకుగా మొదటి పదమునకు జేర్పబడి, తరువాత ప్రత్యయము లెట్లయినవో అట్లే పోగు, వెలుగు, పెరుగు, తునుగు మొదలగువానిలోని 'గు' పో, వెల్, పెర్, తున్, అను ధాతువులను క్రియలుగా మార్చుటకు జేర్పబడి, తరువాత వర్తమానార్థద్యోతకముగా గ్రహింపబడిన 'అగు' అను సహాయక్రియయొక్క యవశిష్టభాగంబై ప్రత్యయరూపమును దాల్చినదని యూహింపదగియున్నది. పెర్+అగు=పెరగు అనగా పెద్దదియగుట. 'వెండిచెంబు' అన్నపుడు వానికి విశేషణవిశేష్యభావ మెట్లు కుదిరినదో అట్లే రెండుధాతువులను జేర్చినపుడును వాని కాదికాలమున విశేషణవిశేష్యభావము కుదిరియుండును. పెరగు అనగా పెద్దదియైనది అగుట అనునర్థము వచ్చియుండును. అట్లే వెళ్+అగు=వెళగు, వెళుగు=తెల్లనైనది, ప్రకాశమైనదగుట. తుణ్+అగు=తునగు, తునుగు=ముక్క అగుట; తర్+అగు=తరగు, తరుగు=తక్కువయైనదగుట; మెల్+అగు=మెలగు = మెలమెలలాడుట; చలించుట; పో+అగు=పోగు=పోవునదగుట; వా+అగు=వాగు, నోరు (ధ్వని)కలదిఅగుట; పెణ్+అగు=పెనగు=పెనునది అగుట; కుఱు+అగు=కుఱగు, కుఱుంగు, క్రుంగు=తగ్గిపోయినది, క్రిందికిపోయినది, పొట్టిది, అగుట-ఇట్లేరూపము లేర్పడియుండును. 'మరం' అనుదానికి ఇతరపదము తోడి (ఆల్-ఇన్, ఓడు etc.) సంబంధమును జూపుటకుగా అనగా సంబంధార్థమున 'అత్తు'-(అదు) అనున దొకటి చేర్పబడి

తరువాత కొంతకాలమునకు దానియర్థము రూపుమాసి పోవుటచే, "మరత్తు" అనునది కేవలము విభక్తిప్రత్యయములను జేర్చుటకుగా నేర్పరుపబడిన 'అంగము'(declensional base)గా నెట్లు గ్రహింపబడుచు వచ్చినదో, అట్లే యీ 'అగు'కు సంబంధించిన 'గు' అను దానితో జేరిన పెరుగు, వెలుగు, పోగు మొదలగునవి కూడ ధాతువులుగనే గ్రహింపబడజొచ్చినవి. ఈ 'గు' అనునది కేవల ధాత్వవయవము కాదనియు, ఏదో యొక యర్థమున జేర్పబడినదే యను విషయము ద్రావిడభాషలో తొలి వ్యాకరణంబగు తొల్కాప్పియములోని క్రియాపరిచ్ఛేదసూత్రము మనకు స్పష్టముచేయుచున్నది. తొల్కాప్పియనార్ ధాతువులకు 'కు, డు, తు, డు' అను ప్రత్యయములు వచ్చునని చెప్పుటచే, నివి ధాత్వవయవములు కావని మాత్రము స్పష్టముగా దెలియవచ్చుచుండె నేకాని వీనిలో నేవి యే యే కాలముల వచ్చునో యను విషయమున నాతని యభిప్రాయము నిశ్చయింప వీలు లేనట్లున్నది.

ఏది యెట్లయినను ప్రాచీనభాషలో నీ'గు' వర్ణాంతరూపము లేర్పడిన తరువాతనే తెలుగు కన్నడములు ప్రాచీనభాషనుండి విడిపడియుండును. కావుననే యీ ధాతువులనుండి క్రియారూపములు చేయు మార్గ మాయా భాషలలో భేదించుట తటస్థించినది. తమిళులు పోగు, పెరుగు, మొదలగు ధాతువులకు 'ఇఱు' 'ఇన్ఱు' అను మఱి యొక సహాయక్రియ (auxilia y verb) ను జేర్చి దానిపై బురుషవాచకరూపములను చేర్చుటకు మొదలుపెట్టగా, తెలుగువారు ఉరు, (ఉన్రు – ఉండు) అను ధాతువుతో సంబంధించిన 'ఉన్న' అనుదానిని జేర్చి, దానిపై పురుషవాచకరూపములను గలిపి వర్తమానరూపములను జేయ మొదలుపెట్టియుందురు. ఇట్లు పెరుగు + ఇర్ + ఏన్ = పెరుగిన్ఱేన్' పోగు + ఇరు + ఏన్ = పోగిన్ఱేన్ మొదలగున వేర్పడగా, పెరుగు + ఉన్న + ఆను = పెరుగు (చు)న్నాను. పోగు + ఉన్న + ఆను = పోవు (గు) (చు)న్నాను అనురూపము లేర్పడియుండును. ఈమధ్య వచ్చిన 'చు' అనునది ప్రేరణార్థకమున గొన్ని ధాతువులలో చివర నేర్పడినదై, కొంతకాలమున కాయర్థమును గోలుపోయి, కేవలప్రత్యయముగా జేర్పబడుచువచ్చినదేమో యని సందేహము కలుగుచున్నది. తొల్కాప్పియార్ నాటికే 'గు' 'గుం' మొదలగునవి వర్తమానార్థక ప్రత్యయములుగా దలంపబడుటంజేసి 'గు' అంతములగు రూపములప్పటికి చిరకాలముక్రిందటనే యేర్పడియుండవలయును.

ఇంతేకాక భాషలో వర్తమానార్థకరూపములే యర్వాచీనములనియు, ప్రాచీనకాలమున నొకప్పుడు తద్ధర్మార్థక రూపమువంటివే త్రికాలములయందు నుపయోగపడుచున్న ట్లాంధ్రద్రావిడ భాషలయందు రెంటనుగూడ నిదర్శనములు కనబడుచుండుటచే నీ క్రియారూపముల పరిణామమును బట్టి ద్రావిడభాషల ప్రాచీనతనుగూర్చి కొంత మనమూహించుట కవకాశము కలుగునట్లు తోచుచున్నది. ఇట్లే పదముల చరిత్రము భాషాచరిత్రజ్ఞానమునకు దోడ్పడుచుండును.

---

తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

# ఆత్మార్పణము

(వెనుకటిసంచిక తరువాయి)

అగ్గిలో నిగ్గతిల్ క్రొమ్మొగ్గి మగ్గుచున్న-పుల్గుఁ బొడగాంచి విస్మయంబున మునింగి
నిట్ట నిలుచుండి బోయ నిర్నిమిష దృష్టిఁ-జేష్టలందక్కి యొక్కింత సేపుగడపె.

తదనంతరంబున నతండు.

ఇమ్మొయి సాహసంబు గలదే? విలసత్కరుణారసార్ద్రిచి
త్తమ్మున నిల్లొసంగునె పతంగము స్వాంగ? మహో! విహంగ
సంఘమ్మున దీని కీడగు ఖగంబు జగంబున నున్నదొక్క? ని
క్కమ్ముగ నొక్కవేలు పగుఁ గాక కపోతమనంగఁ జెల్లునే.

కటకటా! జ్వాలదగ్ని శిఖాకలాప-మెగసి తనకోమలాంగంబు నేర్చుచుండ
నెట్లు సైరించె? నాబాధ నీ ఫులుంగు-కొఱలు నావేశమున మేన్ను మఱచె నోటు?

అగ్గలమైన సీతువున నంగము కొంగరవోవ మృత్యువుల్
డగ్గఱియున్న నన్గని హుటాహుటిఁ బల్లెకు నేగి ముక్కుతో
నగ్గిని దెచ్చి కోటరమునందలి గూటినిగాల్చి నాచలిన్
దగ్గొనర్చి కూర్చెనుగదా! ముద మియ్యది నాకు ముందరన్.

కట్టా! దీనం దనియక-పెట్టుము నా కన్నమనుచుఁ బీడించితి లేఁ
బిట్టల్ దుట్టతుదకు నా-పొట్టం బెట్టుకొని నీచపుంగతిఁ గంటిన్.

లోకు లీకరణిం బ్రాణిలోకమునకు-మేలు గావించుచుండ్రు కాఁబోలు సతముఁ
బుట్టువుందొట్టి యుపకృతి పొంతఁబోని-కట్టిఁడిని నేను నాకెట్టి గతులుగలవొ?.

"భగవంతుఁడు నన్నేటికి-జగమునఁ బుట్టించె? నాదు జన్మంబునకున్
దగుఫలమెయ్యది? యని లో-వగవక నాజీవనమ్ము" వమ్మొనరిచితిన్.

ధర్మశాస్త్రజ్ఞులెల్ల రెద్దానిఁ "బరమ-పాతకనిదాన మిది" యంచుఁ బల్కుచుందు
రట్టి హింసయ నావ్రతం బయ్యె నెపుడు-నకట నాపాప మేనాఁటి కడఁగిపోవు!



శ్రీయుత పండిత మోతీలాలు నెహ్రూగారు, అధ్యక్షులు

౪౩-వ అఖిలభారత జాతీయమహాసభ, కలకత్తా



శ్రీ. జె. యమ్. సేనుగుప్తగారు, ఆహ్వానసంఘాధ్యక్షులు
౪౩-వ అఖిలభారత జాతీయమహాసభ, కలకత్తా

పొదుగు శుకాంగనల జదిపి బుట్టను బెట్టితిఁ; దల్లిదండ్రులఁ
వదలనిగోరువంక మెడ వంచితిఁ; ద్రుంచితిఁ గుంజనీమలఁ
బొదలు కపోతదంపతులఁ; బొంగుచు నేసితిఁ జూడి మోపునఁ
గదలని లేడిపిండుఁ; బెఱకల్మషముల్ దడవంగ నేటికిన్.

శాకాదుల మెసవి యసం-ఖ్యాకములగు భూతములు సుఖస్థితిమై నీ
లోకమున లేవొకో? యవి-వేకమ్మున నేన యిట్టివెంగలి నైతిన్.

ఉత్తమ మానవజన్మం-బెత్తియు నేఁ జెడితి జ్ఞానహీనుఁడనై; లో
కోత్తరచరిత్రఁ బుల్గు బు-ధోత్తంసస్తోత్రమునకు యోగ్యంబయ్యెన్.

స్వార్థమును వీడనాడి పరార్థమునకు-నర్థమును మానమును మేని నప్పగించు
పుణ్యమూర్తి చరిత్రంబపో సమస్త-జగతి కాదర్శమై సుప్రశస్తిఁ గాంచు.

మంజులంబుగఁ బెక్కు ధర్మములు పల్కి-చేతలం దొకఁడే ననుష్ఠింపలేని
వదరుఁబోతుల కీక సిగ్గు వచ్చుఁగాత-మేత దల్పకపోతవిఖ్యాతచరిత.

క్షుద్రుఁడనై గాఢ తమో-నిద్రారతి నున్న నన్ను నిర్వ్యాజకృపా
ముద్రిత హృదయంబునఁ గడు-భద్రంబుగ మేలుకొల్పెఁ బక్షి గురుండై.

తగుబుద్ధి సెప్పెఁ బావుర-మిఁగ మానెద జీవహింస; నెడఁబాసెద నీ
చగుణంబులఁ; గామంబులఁ-దెగటార్చెద; విడతు సంసృతిఁ; ధర్మరతిన్.

గురువుల సేవించెద; నీ-శ్వరతత్త్వ మెఱింగెదఁ; భవంబులఁ ద్రుంతుఁ;
నిరుపమ నిరుపద్రవ సు-స్థిరతర కైవల్యసౌఖ్య సిద్ధిం గాంతున్.

అని పెక్కుభంగుల విచారించి యంతరంగంబునం బొంగిపొరలు వైరాగ్యభాగ్యం
బునం జేసి హింసావృత్తమ్ము నెడఁబాసి తుచ్ఛంబులగు విషయోపభోగంబుల రోసి
పురుషార్థంబునంద డెందంబుం బదిలపఱచి యుండె నయ్యవసరంబున.

వలఁ జిక్కియున్న పుల్గులు-చలిగాలికి నడలి తాళఁ జాలక జీవం
బుల మీఁది యాసలెల్లం-దొలఁగ విలాపించుచుండె దుర్భరచింతన్.

ఆయార్తనాదములు విని-బోయం డెద మివుల జాలి పొంగారఁగ "నా
రాయణ నారాయణ నా-రాయణ" నాపాప మెక్కరణి రూపడఁగున్.

అంచు నవ్వాలం దరిసి.

మొలఁగల కత్తి దీసి వల ముక్కలు ముక్కలు చేసి యుచ్చులన్
బలితములైన చిక్కములఁ బట్టి రయంబునఁ గోసి కాల్వలై
జలజల నశ్రుతోయములు జాల్కొనఁ బుల్గులనెల్ల నల్లవో!
వెలలిచె; నేటి కెట్టి సువివేకిముగ్గలెఁ గసాయిబోయకున్.

అంత నతండు దనకొదవిన యెఱుక బలిమిం బారలౌకిక చింతాసాగర నిమగ్నుండయి యంద నిలువంబడియుండెఁ; బదంపడి బంధవిముక్తిం గనిన విహంగంబులు మెల్ల మెల్లన తెక్కల నల్లార్చుచుఁ బరిసరతరుశాఖల నధిరోహించెఁ; బిదప మూర్ఛామగ్నమై యొడలెఱుంగక పడియున్న కపోతి యప్పుడ మేల్కొని యున్మిషితలోచనమై నలువలంకులఁ గలయం దిలకించి చెలువునిం గానక.

జీవితనాయక, నీవు-న్నావొకొ? జీవంబుతోడ; నాతికి యుష్మ
త్పావనరూపముఁ జూపఁ గ-దేవల్లభ, యంచు లేచె ధృతిదూరముగన్.

లేచి యనలంబు కడ[వ్రాలి చూచె నందు-లీనమగుచున్న మగని సుజ్ఞాన ఖనిని
చూచినంతనె శోకంబు చుట్టు ముట్ట- నిట్టు విలపించెఁ గానయు బిట్టు వగవ.

వల్లభ, వల్లభ! మంటం-[దెళ్లితె? యీదీనురాలి దిక్కెవ్వరఁటం
చుల్లంబునం దలంచితి-చెల్లరె! నీకింత కఠినచిత్తము తగునే?

ఇది భవదధీన జీవిత-గద! దీనిం డించి పోవఁగా నకటా! సీ!
హృదయ మెటులియ్యకొనె? నా-కెది తెరు? విఁకఁ జేయుకార్య మెయ్యది నాథా?

నాకడుపు నిండుటకు మును-నీకుక్షిం జూడవెపుడు; నే నించుక బా
ధాకలితనైన నోర్వవు-నీకూరిమి పేరిమి న్గణింపఁ దరంబే.

లలిత లావణ్య పల్లవ వితాన లతాంత సముపేత మంజుకుంజములయందు
[గావ[సవన్నదీ కమలశీకరసిక్త శీతలా[ద్రిప్లవ[శేణులందు
బాలరసాల[దుజాల కోమల లతా స్తోమాంచితారామసీమలందు
సుందర వికచారవింద మందిర దీర్ఘికా మనోహరతీరభూములందు
నిరుపమవిశుద్ధ హర్షవార్నిధితరంగ-డోలికాపంక్తులందు నూయేల లూపి
నన్ను మదిఁదేల్చి నట్టి నీ నవ్యలీల-మఱతునే నాథ, యెన్నిజన్మములకైన?

పతి మరణానంతర మీ-క్షితి నొక్క నిమేషమేని జీవనయాత్రక్
సతి గడపుట దుస్సాధ్యం-బతిదుష్కర మని యెఱుంగవా హృదయేశా?

కుసుమకోమలమైన నీ గొనబు మేను-వీతిహోత్రుసన కెట్టు లర్పించి తకట!
అతిథి సేవాపరాయణం బైన నీదు-చిత్త మెంతకుఁ బెరరేచె జీవితేశ?

నేన నీకంటెమును మరణింతు నంచు-నాకొఱకుఁ గుందితివిగదా నాథ, నీవు
తుదకు నాకంటె ముసు నీవ త్రుంగి తకట!-యేగడియ కెద్దిమూఁడునో యెవ్వఁడెఱుఁగు?

ప్రాణపతి, నాకు నీవు నీకేను నెట్టి-విప్రియంబుల నెపుడుఁ గావింపము గద
యేల యీలీల నీకొఱ కేడ్చుసతికిఁ-గానుపింపవు నీవు నిష్కారణముగ?

మూర్ఛయందున్న నన్ను కన్మోఱఁగి యిదియ-సమయమని యెంచి తుణభిన్నసౌహృ
దగుచు నన్నిటడించి నీ వమరపురికిఁ-జేరఁదలఁచితె? నీ కిట్టి నేత తగునె? [దుండ

"సుదతీ! నామదినుండె దీవెపుడు" నంచున్ మత్ప్రియార్థంబు నీ
వెది భాషించితొ! దానిఁ గైతవమఁటం చేనిప్డు డూహింతు న
య్యది నాథా, మెఱమెచ్చు గానియెడ నీ వంగచ్యుతిం జెంద నం
దద నా దేహ మొకింత భంగము? నీకేలా వేయి సిద్ధాంతముల్?

అని భర్తృమరణ సంజనిత దుఃఖాతిరేకంబునఁ బెక్కు-భంగులఁ గొంతడవు పనవి పనవి
పదంపడి యెఱుక తఱచుగల దగుటం జేసి నాకింక నెద్ది కర్తవ్యమని యూహించి
తామున్ను విన్న సతీ ధర్మంబుల సంస్మరించి.

మగని ననుగమించి మరణించు నిల్లాలు-పతియుఁ దానుఁ బుణ్యగతుల కేగి
యతులసౌఖ్యపదవి నంది భవంబులఁ-ద్రెంచునంచు బుధులు దెల్పవిందు.

కావున జీవితేశ్వరు నెయిదుటయ నాకిపు డవశ్యాచరణీయం బని నిశ్చయించితేని
నుద్దేశించి.

నీ యొడలిలోన నగపాలు నిలిపి బోయ-కప్పన మ్మొనరించితె? శేషాంగ మిట్లు
దీనఁగల్గునె పూర్ణాతిథేయ సుకృత? -మతిథి కర్థాన్నమిడుట న్యాయంబె నాథ?

ఏపుణ్యమునం దైనను-నాపాలి నోనంగకుంటె నాథా, మును? నేఁ
డీపుణ్యకార్యమందుర్-నాపాలిని బంచుకొంట నాయంబ కదా!

నీ యనితర వితరణమున-బోయకు నుదయించె సుప్రబోధము దానర్
నాయురులఁ ద్రెంపె నాతఁడు-పోయె దురంతంబు నాదు పుణ్యముకతనన్.

సురుచిరనందన విహగీ-పరిరంభణములకు నీవు పాల్పడుటకు ముం
దరుదెంచి నిన్నుఁ గూడె ద-నలఅలేని మనంబుతోడ ననలాధ్వమునన్.

నాథ, యిపుడే నినుం జేరినను "గపోతి-యిస్సిరో! జీవితేశ్వరు నెడసి పుడమి
రెండు మూఁడు నిమేషంబు లుండనోర్చె"-ననెడిసడి నాకుఁ దప్పనే (?) యక్కటకట!

నెలతో వెన్నెల దోలఁగుర్-జలదముతో నరుగు మెఱుపు చానలు తమభ
ర్తల ననుగమించు వారని- తెలిపెడిని విచేతనములుఁ దెల్లముగాఁగన్.

రమ్యకుసుమంబ వీవు సౌరభమ నేను-నిండునెల వీవు పండువెన్నెలను నేను
పద్మ మీవు తదర్థసంపదను నేను-కలదె యన్యోన్య విప్రయోగంబు మనకు?

అని పలికి సన్నగిల్లు ననలంబుం జేరువ పిడుగుల నెగఁద్రోచి దరికొల్పి యావేశ వికాస
హర్షంబులు ముప్పిరిగొన నిప్పం జుట్టివచ్చి.

ఉల్లమునం గపోతవిభు నుజ్జ్వలమూర్తిఁ దలంచి "నిల్వుమో
వల్లభఁ పోకుపోకు మిదె వచ్చితి వచ్చితి" నంచుఁ బల్కుచుర్
నల్లవో! మంటలో దుమికి నాథునిడాపటఁ బవ్వళించి తాఁ
ద్రెళ్లె జగంబునర్ నిజసతీత్వము నెల్లగు మెచ్చునట్లుగన్.

అంత నగ్గువ్వ జవ్వని.

నవ్యప్రభావిభాసుర-దివ్యవిమానంబు నెక్కి దీపించు పతిర్
భవ్యగుణుఁ గూడి సజ్జన-సేవ్యంబగు నాకమునకుఁ "జివ్వు"న నేగెన్.

అచ్చట నచ్చర లెదుఱై-వచ్చియు స్వాగతము నడిగి వాలిన మోదం
బచ్చుపడ నమ్మిథునమున-కిచ్చిరి హారతులు విబుధులెల్లఁ జెలంగన్.

పదంపడి.

నందనవనహారిచందన-మందారాదిక సురద్రుమముల నమందా
నందంబు చింద నప్పులుఁ-గుందోయి సుఖించుచుండెఁ గూరిమిపేర్మిన్.

బోయఁ డిట నట్లుచనిన కపోత మిథున-వర్తనమ్మును గాంచి "వహ్వా" యఁటంచు
మెచ్చి తానును నట్లుగా నిచ్చగించి-తుచ్ఛ దేహాభిమానంబుఁ ద్రుంచివైచి.

ఆలుబిడ్డలమీఁది యాసల విడచి-పోల నైహిక బంధముల నెల్లఁ గోసి
అఖిలేంద్రియమ్ముల నాత్మ నడంచి-నిఖిలేశు నెడఁదలో నియతిమై నిల్పి
ముక్తకేశుండయి మునివృత్తిఁదాల్చి-ముక్తికాంతాకరమ్మును బట్ట నెంచి
రయమున దుర్గమారణ్యంబు సొచ్చి-పయనమయ్యెను మహాప్రస్థానమునకు.

నిశుపాలికముండులు దన-యొడలింగడుఁ జీల్ప నెత్తు రుడుగక నడవన్
దడపుచునుండ నతం డది-యెడఁదడవక నడచుచుండె నెడలని కడఁకన్.

ఇట్టు లయ్యెలుకుజెట్టి చుట్టి బెట్టిదంపు టిక్కట్టులనేని సరకుగొనక దీక్షాబలంబున గిరిసరిదరణ్యంబు లనేకంబులు గడచి పుణ్యభూమి యను నాస నుత్తరాభిముఖుండై పోవం బోవ.

దావానల మొక్కయెడన్-ద్యావాభూమ్యంతరములఁ దగ నలమి వన
శ్రీవాఁకఁగఁ దీండ్రించుచు-నా విమలాత్మునకు బోయ కడ్డంబయ్యెన్.

అతం డందుల కెంతయు సంతసించి.

ఓ పరమేశ్వర, మత్కృత-పాపంబుల నెల్లసైచి భవసంబంధ
వ్యాపారముఁ బాపఁగదే-నీ పాలం బడితి దిక్కు నీవ దయాబ్ధీ!

అన్నిప్రార్థించుచు నించుక-యనుమానము లేక తద్దవానలమం దొ
య్యనఁజొచ్చి మైఁ దొఱఁగి పావన దేవత్వంబువడసి వన్నియకెక్కెన్.

---

# త్రిలింగలక్షణశేషము - తన్నామవిచారణము

కొత్త సత్యనారాయణ గారు

ఆంధ్రవాఙ్మయమున ముక్కుమొగముగల భాషానుశాసక గ్రంథములలోఁ బ్రౌఢ వ్యాకరణమును గూడ నొక్కటిగఁ బరిగణింప వచ్చును. ఈ గ్రంథమునకు నేతద్గ్రంథకర్తలే నామద్వయమును బ్రకటించి యుండిరి. అం దొకటి

"త్రిలింగలక్షణ శేషము" అనునది.

ఈ నామ మేతద్గ్రంథవిషయమై యెంతవఱ కన్వర్థమయ్యెనో యయ్యది యిట నించుకంత ముచ్చటించుటయే ముఖ్యోద్దేశము.

లక్షణపద మనేకార్థములకు బోధకమై యున్నది. అలంకారగ్రంథములు లక్షణగ్రంథములనియు, ఛందోగ్రంథములు లక్షణగ్రంథములనియు, భాషానుశాసకగ్రంథములు మున్నగునవియు లక్షణగ్రంథము లనియుఁ జెప్పఁబడుచున్నవి. ఇట్లే ఆలంకారికులను, ఛాందసులను (ఛందోగ్రంథకర్తలు), వైయాకరణులను లాక్షణికులని వ్యవహరించుట నైజము. ప్రకృతస్థలమందు నిందలి తృతీయార్థమే చెప్ప కతప్పదు. చెప్పినచో "ఆంధ్రభాషానుశాసక గ్రంథములకు" అని యుపర్యుక్త "త్రిలింగ లక్షణ" పదమున కర్థము తేలినది. ఆ గ్రంథములకు శేషము- అనఁగాఁ దదుద్దిష్టవిషయములకు శేషగ్రంథ మియ్యది యని ఫలితార్థము. ఆ ఫలితార్థమే యిట విచారణీయ విషయమై యున్నది.

ఆంధ్రవాఙ్మయమున లక్షణగ్రంథముల తీరు ద్వివిధముగఁ గన్పట్టుచున్నది.

పూర్వపుటాంధ్రలాక్షణికు లనేకులు సంస్కృతభాషయందును నఖండపాండితీమండితులు గాన, సంస్కృతభాష "అతిపవిత్రమైనదనియు నం దెట్టివిషయము ప్రతిపాదితమైనను నయ్యది పూజ్యము, ప్రామాణికమునయ్యెడు ననియుఁ దలఁచి యాంధ్రభాషావిషయములను గూడ సంస్కృతభాషయందే కూర్చి గ్రంథములు రచించిరి. అట్లు కూర్చి రచింపఁబడిన వానిలోఁ జేరినవే ప్రథమాచార్యులయు, ద్వితీయాచార్యులయు భాషానుశాసకగ్రంథములు. ఈ మార్గ మిట్లుండ మఱికొందఱు పూర్వోక్త విషయములను సులభమగు వచనరచనను దెలుపఁదగువానిని ఆంధ్రభాషయందే పద్యగ్రంథములయందుఁ బ్రతిపాదించియున్నారు. ఆంధ్రభాషాభూషణము, అప్పకవీయము కవిసంశయవిచ్ఛేదము మున్నగునవి ఈ తెగలోఁ జేరినవి.

ఏతదుభయవిధ గ్రంథములలో వేనికైనను బ్రకృతగ్రంథము శేషగ్రంథముగా నుండవలయును గదా! అది యెంతవఱకుఁ బొసగునో విచారింతము.

మొదటి తెగలోఁ జేరిన ద్వితీయాచార్యుల "వికృతివివేకము"లోని పెక్కు విషయములే ప్రకృత ప్రౌఢవ్యాకరణమునందును బ్రతిపాదింపఁబడినవి. వాని నిట దిఙ్మాత్రముగ నుదాహరింతును.

(౧)

సంధి ర్నిత్యం ప్రత్యయాచాన స్తథార్యాసిగస్యచ. —(అథర్వణులు. సంధిపరి. ౪ శ్లో.)

శ్రేష్ఠతావాచకంబులగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్నియచ్చులకును సంధి నిత్యము. ప్రౌఢవ్యాకరణ. సంధి. ౧ సూ.

(౨)

శ్లో. మానార్థా నిత్య మేకత్వ మెడు స్స్యాత్పరిమాణకే.
—అథర్వ. సంధి. ౪ శ్లో.

పరిమాణార్థంబునం బ్రథమైకవచనమునంద యెడు వర్ణకంబగు. —ప్రౌఢ. తద్ధి. ౧౬ సూ.

(౩)

శ్లో. కేచి న్నప న్త్యభేదత్వ మనుస్వార మకారయోః.
—అథ. సంధి. ౧౨ శ్లో.

ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు. —ప్రౌఢ. సంధి. ౨౨. సూ.

(౪)

శ్లో. ఏకత్వే సస్యవాచిత్వం బహుత్వే ధాన్యవాచితా,
లోపాదేశ వికారస్తు తత్ర తత్ర ప్రదృశ్యతే.
—అథర్వ. అజన్త. ౬౩.

సస్యవాచకశబ్దంబులును
—ప్రౌఢ. శబ్ద. ౨౮ సూ.

తఱుచుగ ధాన్యవాచక శబ్దములును,
—ప్రౌఢ. శబ్ద. ౩౪ సూ.



(౫)

శ్లో. అర్థభేదే క్వచిచ్ఛబ్దాదిగా స్స్యాచ్చ తతోఽపి డుజ్,
నామంత్రణే డుజ్ హ్రస్వ స్స్యాత్ బహుతా
త్వత్ర నేష్యతే. —(అథర్వ. అజన్త. ౪౧ శ్లో.)

తెనుఁగునం గొన్ని తత్సమ దేశ్యశబ్దములకం జెంబరంబుగ నేకవచనంబున నీచత్వద్యోతకంబయి 'ఱుగా' యను నొక్క శబ్దంబును దానిపై డువర్ణకాదులునుం జూపట్టెడి. సంబోధనంబున డువర్ణకంబు చూపట్టదు. తుది దీర్ఘంబునకు హ్రస్వంబు వైకల్పికంబు.

—ప్రౌఢ. శబ్ద. ౨౨ సూ.

(౬)

శ్లో. క్వచి దామంత్రణే కానో వైకృతాత్పరతో మతః.
—అథ. అజన్త. ౪౨.

దేశ్యంబులం గొన్నియెడల స్త్రీవాచక స్త్రీసమంబులగు సంబోధ్యవాచకశబ్దంబులమీఁద నేకవచనంబునఁ గానశబ్దం బొందును, అలయను నవ్యయం బొందుననుగానంబడియెడి; అలదీర్ఘాంతమునగు.

—ప్రౌఢ. శబ్ద. ౧౫ సూ.

(౭)

శ్లో. పూజ్యత్వేన ద్రుతః కారుః
భేదకంతూభయాత్మకమ్;
తచ్ఛబ్దస్యా ద్బహుత్వే స్యా
త్తథా తత్ర ద్రుతస్థితిః.
—అజన్త. ౪౩ శ్లో.

తఱచుగా స్త్రీసమంబులగు దేశ్యశబ్దంబులకుఁ గడపలఁ గొన్నింటి కేకవచనంబునం బూజ్యతయందు గారుశబ్దంబగు. —ప్రౌఢ. శబ్ద. ౩౯ సూ.

డుమంతంబులగు తత్సమాదిశబ్దంబులకుం గొన్నిటికి ద్వితీయా బహువచనంబుమీదం బూజ్యతయందు గారునకు మాఱుగ వారగు.

(ఇంచుకంత సవరణము)—ప్రౌఢ. శబ్ద. ౪౧సూ.

(౮)

శ్లో. జడతావాచకత్వే తు న్న్యంతతా తత్ర దృశ్యతే.
—అథర్వ. అజన్త. ౬౫ శ్లో.

అమహదర్థంబున భిన్నవస్తుసముదాయం బర్థమగుచో నేకవచనంబున నంతాదుల తకారంబునకు ద్విరుక్త నివర్ణంబగు. —ప్రౌఢ. శబ్ద. ౫౨ సూ.

(౯)

శ్లో. ఏకాదశాదిసంఖ్యాయా మనోడుశ్చ సబిందుకః;
ఆదేశః క్వచి దున్మాత్ర మాదేశ స్సాన్య త్తథావతా.
—అథ. అజన్త. ౮౬. శ్లో.

ఒకండ్వాదులు పరంబలగుచోఁ దఱచుగ మున్బడి కగు. —ప్రౌఢ సమాస. ౨౨ సూ.

పదికి రెండిరుదొమ్మిదులు బరంబులగునపుడు బిందుపూర్వక డకారంబును ద్విరుక్తనివర్ణంబును బిందువును గ్రమంబుగ దివర్ణంబున కగు.
—ప్రౌఢ. సమాస. ౨౩ సూ.

(౧౦)

శ్లో. క్వచి త్కులకసంబంధో
ప్యత్రనాహితకృద్భవేత్.
—అథ. అజన్త. ౯౩ శ్లో.

పద్యంబునకుఁ గులకంబగు.
—ప్రౌఢ. వాక్యపరిచ్ఛే. ౨౩ సూ.

(ఇట నుభయత్ర ఉదాహరణము తుల్యము.)
(తానొకొండు పండు చెచ్చెరన్) ఇత్యాది.

(౧౧)

శ్లో. "ద్వ్యక్షరాదిచతుర్వర్ణపర్యంతం జననామసు;
లోపే స్యా ద్యతి వర్ణానాం శబ్దే రాజాదికే పరే.
క్వచి దత్వం క్వచి చ్చాత్వం క్వచి డత్వం క్వచిత్పతా;
క్వచి న్మత్వం యథాయోగ మన్యచ్చ వ్యవహారతః.
—అథ.

కర్మధారయంబు బిరుదాద్యుత్తరపదంబయ్యేనేని ద్వ్యక్షరాదంత స్త్రీపుంసంజ్ఞావాచకంబగు పూర్వపదంబు నంత్యాక్షరంబున కంతట దీర్ఘంబు బహుళంబుగా నగు. —ప్రౌఢ. సమాస. ౨ సూ.
(ఇంచుక సవరణము.)

(౧౨)

శ్లో. క్వచి న్నవర్ణే డే ర్లోపః క్వచి డ్డోశ్చ తథా భవేత్;
క్వచి త్తదర్థే డయుగం క్వచి న్న స్యైచ్చ లోపవాన్.
—అథర్వ.

ఒకానొకచోఁ దద్ధర్మార్థకంబులగు నుండు, చను, గొరుకొను లు ప్రశ్నార్థకైకారపరకంబులగునపుడు వాని కడ యచ్చులకు లోపంబు విభాషనగు. అగుచో నుండు డకారంబునకు నకారంబగు.
—ప్రౌఢ. క్రియా. ౨సూ.

(౧౩)

శ్లో. క్వచి త్సమాసాంతగస్య శబ్దస్యాదావపి స్థితిః.
ఉదా. విన్నకన్నవారు,-(అథ.హలన్త. ౧౮ శ్లో)

ద్వంద్వంబునం బూర్వపదాంత్యావయవంబునకు లోపంబొండెయగు. —ప్రౌఢ. సమాస. ౩౨ సూ.

(౧౪).

శ్లో. ద్వంద్వం కేషాంచి దిష్ట స్సాన్య త్త్వార్థశబ్దేన కుత్రచిత్. —అథర్వ. హలన్త. ౧౮ శ్లో.

భావ ద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణంబునకు లోపంబగు. —ప్రౌ. సమా. ౩౧.
(ఇటమాత్రము కొంత మార్పుకలదు.)

(౧౫)

శ్లో. ప్రార్థనార్థే భవే న్నాన్తా త్క చేత్యర్థ విశేషతః.
అథ. క్రియా. ౧౪ శ్లో.

ప్రార్థనంబునం దత్ప్రత్యయాంతక్రియలమీఁదఁ గదకదవుపూర్వకంబు లన్నాదు లనుప్రయుక్తంబునగు.
—ప్రౌఢ. క్రియా. ౯ సూ

ఈ విధముగ వికృతివివేకస్థ గ్రంథస్థవిషయములను గొన్నిటిని స్వీకరించుచుఁ గావలయు నన్నమార్పులు చేయుచుఁ బ్రౌఢవ్యాకరణ కర్తలు స్వీయగ్రంథమును బెంపొందించిరి.

ఇది యిట్లుండ బేరులోని త్రిలింగలక్షణ పదమునకు ఆంధ్రభాషలోఁ దల్లాక్షణిక విషయములను జర్చించియున్న గ్రంథములని యర్థమనియు,వాని కీప్రౌఢవ్యాకరణము శేషగ్రంథమనియు నందు రేమో! అదియును బొసఁగి యుండ లేదు.

కారణ మేమన పూర్వోక్తగ్రంథములలోఁ జేరియున్న "కవిసంశయవిచ్ఛేదము" మున్నగు లాక్షణికగ్రంథములయం దుక్తములగు నంశములే కొన్నిటిని ప్రకృతగ్రంథకర్తలు ముచ్చటించియున్నారు. అవియును నీక్రింద స్థాలీపులాకన్యాయముగ నుదాహృతము లైనవి.

(౧)

క. మనమునను, మనమునం దన
మనమునయం దనఁగ మఱియు మనమందనఁగాఁ
దనరారి పెక్కు తెఱఁగులఁ
బనిగొను నీసప్తమీ విభక్తులు కృతులన్.
—కవిసంశయవిచ్ఛేదము. ౨వ తరంగము. ౭౫ పద్య.

ఉదంతంబు లగు సమహత్తుల కందువర్ణకము పరబగునపుడునవర్ణకంబగు. —ప్రౌఢ. శబ్దం. ప. ౨౧నూ.

(౨)

తే. తొడరియాంధ్రవిభక్తులతోడఁ గలసి
సంస్కృతసమాసములు కొన్ని జగతిఁ బరగు
స్థిరభుజబలంబున జితత్రిపురుషుఁ డంబి
కామనోవల్లభుం డను కరణి ధరణి.
కవి సం. ద్వితీయ తరం. ౮౪ పద్య.

కొన్ని యెడల సిద్ధసమాసమధ్య గతపదంబులతోఁ దద్భిన్న పదంబుల కన్వయంబుచూపఁబడెడి.
—ప్రౌఢ. సమాస. ౩౫ నూ.

(౩)

తే. ఎఱుకఁగలవారె యనుచోట నెఱుకగలరె
యిట్టివారె యనెడుచోట నిట్టిరెయగు
నేయఁగలవారె యనుచోట నేయఁగలరె
యనుచు, లోకప్రసిద్ధోక్తియగుట శర్వ!
—కవి సం. ద్వి. తరం. ౧౦౧ పద్య.

అట్టి, ఇట్టి, ఎట్టి విశేషణంబుల మీఁది తచ్ఛబ్దఝకారంబునకు లోపంబు విభాషనగు.
—ప్రౌఢ. సమా. ౯ నూ.

(౪)

పురమునందలివారని పొసఁగ బలుకు
నెడఁబురంబునవారని యిడఁగవచ్చు.
—కవి. ప్రథ. తరం. ౧౨౪ పద్య.

షష్ఠీతత్పురుషంబులందు నగాగమంబు విభాషనగు. —ప్రౌఢ. సమాస. ౧ నూ.

(ఉభయత్ర ఉదాహరణములు తుల్యములు)

(౫)

క. అగుననుక్రియతోఁ బాసియుఁ
దగుఁ బెక్కువిభక్తులం బ్రథమఁ జెందును భ
క్తగణదయమానచిత్తుం
డగజాధిపుకీర్తి దిశల నలమె ననంగన్.
—కవి. ప్రథమ త. ౮౩ పద్య.

ఒక్కచో సమాసాంతర్గత విశేష్యంబులకగు విశేషణంబుల షష్ఠికిని బ్రథమ చూపఁబడెడి.
—ప్రౌఢ. కారక. ౨౧ నూ.

ఇట్లే అన్యము లనేకములు.

ఈ తీరునఁ బ్రౌఢవ్యాకరణకర్త పెక్కువిషయము లన్యగ్రంథములనుండి గ్రహించి

యొక్కడ యథాతథముగ మఱియొక్కచో భంగ్యంతరేణ వివరించుచు వ్రాసిన గ్రంథము "త్రిలింగలక్షణ శేష" మెట్లగును?

కాని యొకవేళ వికృతివివేకగ్రంథాదులను ప్రౌఢవ్యాకరణ కర్తలు చూడలేదందురా! అది యసంగతము.

శ్లో. అనయో స్సంగతిం యస్తు కరోతి కవితా కృతౌ,
అస్యా అత్యంతదోషత్వా ద్దుష్కవి స్సహి కథ్యతే.

అను ద్వితీయాచార్యుల వాక్యమును నేతద్గ్రంథకర్తలు ప్రత్యక్షముగ స్వీయగ్రంథమున నుట్టంకించిరి.

ఇదియును గాక అథర్వణకారికల నాయాసందర్భముల నడుకుచు నహోబలపతిపండితు డాంధ్రశబ్దచింతామణికి వ్యాఖ్యానము గావించియుండిరిగదా. అట్టి గ్రంథవిషయమై:

కలకంఠుఁడుబహువ్రీహి —చూ సం. ౯ సూ.

దీని నహోబలపతి పండితుఁడు మిశ్రబహువ్రీహి యనెను. కాని యట్లగుట దుర్ఘటంబు.

అని ప్రౌఢవ్యాకరణకర్తలే అహోబలపతిగ్రంథమును నిరసించియున్నారు.

ఇఁకఁ బ్రకృతగ్రంథమున సామాన్యముగఁ జూడ నూతనముగ రచింపఁబడినవి బాలవ్యాకరణ శేషవిషయములు కొన్నిమాత్రమే. చిన్నయసూరిగారు తమ వ్యాకరణమందుఁ బూర్వగ్రంథప్రతిపాదిత విషయముల ననేకములను ఆదరణీయప్రయోగ బాహుళ్యము లేమిచేతనో, మఱి యేయుద్దేశముచేతనో, యుపేక్షించుటయు, ఖండించుటయు సంభవించినది. అట్టి యుపేక్షిత, ఖండిత విషయములను మాత్రముఁ గొన్నిటినిఁ బ్రకృతగ్రంథకర్త లవధానమున నుద్ధరించుచు వివరించియున్నారు.

## ఉపేక్షిత విషయములు

(౧)

రో శబ్దం బొండు, సంబోధనంబున స్త్రీవాచకంబునకుఁ బరంబుగనగు. —ప్రౌఢ. శబ్ద. ౧౪ సూ.

(౨)

శ్లో. దీర్ఘ స్స్యాద్వర్ణ నిర్దేశే ప్రత్యయే ఽన్యత్రచక్వచిత్:
కేషాంచి త్ప్రత్యయే నైవ తత్ప్రయోగస్తు సమ్మతః.
—అథర్వ. అజన్త. ౭౪ శ్లో.

నిర్దేశవిధానోచ్చారణంబులం దఱచుగ నవర్ణాదులుకారప్రత్యయాంతంబులును, రవర్ణమిథ ప్రత్యయాంతంబును నగు. —ప్రౌఢ. సంజ్ఞ. ౨ సూ.

ఒకచోఁ హ్రస్వంబు, దీర్ఘంబగు.
దీర్ఘంబు దీర్ఘంబ. —ప్రౌఢ.

## ఖండిత విషయములు

శ్లో. గ్రామ్యం తత్తద్వ్యథా సాధు కలకంఠముఖాహితాః.
—అథర్వణుఁడు
—(అథ. సంజ్ఞా. ౨౯ శ్లో.

లక్షణవిరుద్ధంబగు భాష గ్రామ్యంబు.

ఈ భాష ప్రయోగమున కనర్హంబు. బాలవ్యాకరణము. —(సంజ్ఞా. ౨౨ సూ. బాలవ్యా.)

ఇట నీయుభయ విషయములను గాంచి ప్రౌఢవ్యాకరణ కర్త

"గ్రామ్యంబు తత్తజ్జాతివర్ణంబునం బ్రయోగార్హం బగు"

అని సవరణరూపముగ సూత్రించియున్నాఁడు.

ఈ విషయము లిట్లుండఁ బకృతగ్రంథము కేవలము "బాలవ్యాకరణశేష"మని యనుటయుఁ గొన్ని యెడలఁ బొసఁగదు. బాలవ్యాకరణసాధితరూపములను దదుద్దిష్టవిషయములనే ప్రకృతగ్రంథమునఁ గొన్నిటిని గ్రంథకర్తలు పేర్కొనియుండిరి.

అన్ని మొదలగు శబ్దము లాఱును ద్విప్రభృతి సంఖ్యావాచకంబులును, మహదర్థంబులును బహువచనాంతంబులగు—

అని బాలవ్యాకరణము చెప్పియుండ

అండత్వాదులు నిత్య బహువచనాంతంబులు.

ప్రౌఢ-శబ్ద. ౩౫ సూ.

అని ప్రత్యేకతః ప్రౌఢకృతి వర్ణించియున్నది.

జడ్డక్కారంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డను లోపంబు లేదు.— బాల. ప్రకీర్ణ. ౯ సూ.

యెద్దియో నూతనవిషయమన్నట్లు,

"ద్విత్వరహితంబగు ద్వితీయావిభక్తి యుకారమున కచ్చు పరంబగుచో సంధి రాదు.—

ముక్తలక్షణ వివేచనము.

అని ప్రౌఢవ్యాకరణకర్త వ్యర్థముగఁ జెప్పవలసివచ్చె.

ఈ విధముగఁ గొన్నిపట్టులమాత్రము జూచినచోఁ, బ్రకృతగ్రంథము "బాలవ్యాకరణశేషగ్రంథ"మనుటకును జంకు కలుగుచున్నది.

ఇఁక నేతద్గ్రంథమునకుఁగల "ప్రౌఢవ్యాకరణ"మను నామాంతరమును గూర్చియు నొకింత ముచ్చటింపవలయును.

గీర్వాణభాషయందు, 'బాలమనోరమ' యను గ్రంథమునకు "ప్రౌఢమనోరమ" యను గ్రంథముండిన ట్లుండవలయునని తలఁచియుఁ దనకాలమున బాలవ్యాకరణమునకు మిక్కిలి ఖ్యాతియుండుటం జేసి దానికిఁ బ్రతిద్వంద్విగనుండవలయునని భావించియు నేతద్గ్రంథకర్తలు ప్రౌఢపదవిలసితనామధేయమును స్వీయగ్రంథమునకు నెలకొల్పిరి. కాని సూత్రఘటనాసామర్థ్యంబునను, గ్రంథప్రణాలికా నిపుణతయందును, రవ్వంతేనియు బాలవ్యాకరణమునకు సరిరాదు కదా ప్రౌఢత్వ మించుకంతైనను గానరాదు.

ఇఁకఁ బ్రౌఢత్వమన్న పూర్వవ్యాకరణముల నుదాహృతములు, సాధితములు గాని ప్రౌఢప్రయోగములను మాత్ర మనేకములను బ్రకృతగ్రంథము సాధించి, యేతద్రూపప్రౌఢతను మాత్ర మాపాదించుకొనియున్నదని చెప్పవచ్చును.

ఈ క్రమముననే గ్రంథమున కుంచిన నామద్వయమును నేతిబీరకాయ చందముగ వెలసియుండుటం జేసి, దానికి నన్వర్థతను సంపాదింప నయితికాదయ్యె.

కాని నామకరణ మెట్లున్నను వస్తువాదరణీయమైనచోఁ జాలదా? యని యందురేని ఆ విషయమున మీకన్న ముందుగ మేమే తలయూఁప సంసిద్ధులము.

ఆంధ్రపండితులు కేవలము సంస్కృతవాసనా పటిమచే "ప్రయోగమూలం వ్యాకరణమ్; ప్రయోగశరణా వైయాకరణాః" యను మాటలను మఱచి, సంస్కృతవాఙ్మయము

వలె నాంధ్రమును వ్యాకరణముచే సాధింపవలయునను నభినివేశముతో భారతేతరప్రయోగముల కనాదరము చూపియుండ నయ్యది యసంగతమని భావించి భాషావ్యాకరణములకుఁగల సంబంధ మరసియున్నవాఁడగుటచేఁ బ్రకృత గ్రంథకర్త ఆదరణీయప్రయోగములను బ్రత్యేకతః చూపించుచు, వానికి సూత్రముల సూత్రించుచు, నూతనమార్గమును నైపుణ్యముగఁ ద్రొక్కి, యాదరణీయుఁడు, చిరస్మరణీయుఁడు నయి యుండుట సిద్ధము.

పూర్వవ్యాకరణములను బఠించినవారలకీగ్రంథమును భాషయం దెంతయో ప్రవేశమిప్పించి, వాఙ్మయజ్ఞానమునకుఁ జేయూఁతయొసగుచుఁ, గర్తృతావిషయమున విశేషప్రయాసమునకు లోనైన యేతద్గ్రంథకర్తల గౌరవాధిక్యమును బ్రకటించుచు రాణించుచున్నదని భావించి పాఠకమహాశయులను విషయాంతరమునకుఁ బోవ నభ్యనుజ్ఞ నర్థించుచుంటిని.

---

# చిత్రనాటకము

పురిపండా అప్పలస్వామి గారు

అనుదినమ్ము నీ విపుల నాట్యాలయమున
సరిగ వేళకు తెరఁదీసి తెరను వాల్చి
అర్థమే కాని నాటక మాడు చుందు
వోయి నాటకసూత్రధారీ! యిదేమి!

కల్పము లతీత మైపోవుఁ గాని నాట
కమ్ముమాత్ర మెన్నఁడు సమాప్తమ్ము కాదు
కడచు రంగమ్ము వెండియుఁ గంటవడదు
చనిన పాత్రల కిఁకఁ బ్రవేశమ్ము లేదు
తవిలివచ్చు వారలకు నంతమును లేదు
ఎవరి మెప్పింప నెంచాఁక నీ యనంత
చిత్రనాటక మిటు ప్రదర్శింతువోయి!

---

౧

రాజు

పరివ్రాజకులకు సాష్టాంగ నమస్కారములు. కవులకు వందనములు.

కవి

ప్రభువులవారికి నిత్యానందము కలుగునుగాక.

సన్యాసి

శిష్యులకు నారాయణపాదభజన సామ్రాజ్యము కూడ కలుగునుగాక.

రాజు

కవులకు భవిష్యత్తుకాచఫలకము వలెనే సుస్పష్టమటగా?

సన్యాసి

భవిష్యత్తు అనంతము. కవులకు స్పష్టమయ్యే భవిష్యత్తు లిప్తామాత్రము.

రాజు

జ్యోతిష్కులకో?

సన్యాసి

వారి బ్రతుకువలెనే దృశ్యాదృశ్యము.

రాజు

వారిద్దరికే సామ్యభేదములెట్లు?

సన్యాసి

కవివాక్యములకు నిత్య సత్యస్థితి ఉన్నది. కాలజ్ఞుని వచనము తాత్కాలిక సత్యనిర్దేశ మాత్రము.

రాజు

సన్యాసివచనమో?

కవి

శిలాశాసనము. కాదు శ్రీమన్నారాయణ శాసనము.

రాజు

కవివరా, లోకానందము కోసము మేము చేసిన ఈకార్యమునకు ఎంతవరకు స్థిరత్వమున్నది?

కవి

సృష్టిస్థితిలయములు లోకములకు వలెనే సామ్రాజ్యములకు కూడ సామాన్యమను ఈ ఆశ్రితుని మాటలు తమకు కోపకారణము కాకూడదు.

రాజు

సత్యముపై కోపించు దుర్బలచిత్తుడనా నేను? పరివ్రాజకా, ఈ నా కార్యమును గురించి తమ అభిప్రాయము?

సన్యాసి

ఈ మీ కార్యమునకు సుస్థిరత్వమున్నది.

రాజు

మీ మీ వాక్యముల సత్యాసత్యముల నిర్ణయించు సామర్థ్యము అమరకోటికే ఉన్నది.

సన్యాసి

స్వకార్య స్థిరత్వవిచారణ ఈ దేహమున్నంతవరకే.

కవి

ఉపాధి భేదించిన ఆ కోరిక నశించునని.

రాజు

అట్టి నమ్మకము కలుగుటకు కూడా ఈ దేహమే కాబోలు నాకడ్డుపడుతున్నది. పోనీ కాని ఈకార్యమును గురించి ప్రజలేమనుకొనుచున్నారు?.

కవి

సంతోషమును ప్రజలకు గోరుముద్దలు పెట్టి తినిపించుచున్నారు సార్వభౌములని.

సన్యాసి

స్వర్గసుఖములను చవిచూపుచున్నారు సార్వభౌములని

రాజు

ప్రజల వాక్యములలో సత్యమెంతవరకు?

కవి

ప్రజలకు ప్రభువులే తండ్రులు.

సన్యాసి

ప్రజలకు ప్రభువులే దేవుళ్ళు.

రాజు

ప్రజల ఇహపరములు పాలకుల హస్తగతములటగా?

సన్యాసి

అది గుర్తించనివారి విషయమున నే 'రాజ్యాంతే నరకం ధ్రువ'మ్మను వచనము.

రాజు

నేను గుర్తించితినా లేదా అని భయము.

సన్యాసి

అందుకు మీ కార్యమే సాక్షి.

కవి

చిత్రకళాదేవికి నిత్యనివాసమైన కృతకాద్రి వలెనున్న ఆ శిలామంటపమే సాక్షి.

సన్యాసి

దానిని తామరమొగ్గవలె తేల్చివేయుచున్న అధ్యాత్మకీర్తన కల్లోలినీ తరంగములే సాక్షి.

కవి

అనంతమైన ఆ ప్రజా సమూహముయొక్క దుఃఖమంతా ఆకాశనైల్యమున మాయమైనది. అనంతమైన ఆ ప్రజాసమూహము యొక్క హాసములవల్ల ఆ శిలామంటపము పాల సముద్రములో లక్ష్మిమైనది.

సన్యాసి

ఆ ప్రజల పాటలలో శ్రీకృష్ణుని వేణువున్నది. ఆ ప్రజల ఆటలలో శివుని తాండవమున్నది. ఆ ప్రజల హృదయములలో సృష్టికర్తకు కమలాసన మున్నది.

రాజు

ఈ సామ్రాజ్యమును స్థాపించి పోషించునది సన్యాసులూ, కవులూ. ఇప్పుడు నాకు మార్గదర్శకులు కూడా వారే. అయితే ఈమంటపమునకు నామకరణము చేస్తిరా తాము?

సన్యాసి

పునాది వేసినప్పుడే నామకరణము చేసినవి ప్రజల హృదయములు.

రాజు

ఏమని?

కవి

మహార్నవమి మంటపము అని.

౨

కవి

స్వామీ, నమస్కారము.

సన్యాసి

కవీ, ఏమి పనిమీాద వచ్చావు?

కవి

సందేహము తీర్చుకోవాలని.

సన్యాసి

కాలము సందేహాలు తీర్చుతుందిగదా.

కవి

కాలమునంటి ఉండడమునకు శక్తి చాలదుగదా మానవులకు.

సన్యాసి

అవును, ఏమది?

కవి

కవుల వాక్యములకు నిత్యసత్యస్థితి ఉన్నదన్నారు తాము.

సన్యాసి

అవును.

కవి

రాజుగారి కార్యమునకు లయస్థితి నేను చెప్పాను.

సన్యాసి

అవును.

కవి

తాము కార్యముకే సుస్థిరత్వము సెలవిచ్చారు.

సన్యాసి

అవును.

కవి

ఈ వాక్యములు సమన్వయము చేసికోలేకుండా ఉన్నాను స్వామీ.

సన్యాసి

రాజు కార్యములో ప్రజాహితము ఇమిడి ఉన్నది.

కవి

అవును స్వామీ.

సన్యాసి

ఆ ప్రజాహితములో ఐహికాముష్మికములు ఇమిడి ఉన్నవి.

కవి

అవును స్వామీ.

సన్యాసి

ఐహికమునకు లయస్థితి ఉన్నది. కాబట్టి నీ వాక్యములకు సత్యస్థితి వచ్చింది.

కవి

చిత్తము.

సన్యాసి

ఆముష్మికమునకు సుస్థిరత్వము నే చెప్పిన మాట.

కవి

చిత్తము.

సన్యాసి

ఆమాట నిరూపించడ మెట్లని మళ్ళీ నీ సందేహము.

కవి

అవును స్వామీ.

సన్యాసి

కాలపుగట్టున నిలబడి నిశ్చలమనస్సుతో చూస్తే ఏమి కనిపిస్తుంది?

కవి

అల్లకల్లోలముగావున్న కాలసముద్రము.

సన్యాసి

ఆ సముద్రములో మనుష్యుడు తన శక్తితో సృజించిన కట్టడములన్నీ నశించుచున్నవి.

కవి

చిత్తము.

సన్యాసి

మనుష్యుడు తన మేలుకోసమే చేసుకొన్న కార్యములన్నీ నశిస్తున్నవి.

కవి

చిత్తము.

సన్యాసి

సామ్రాజ్యములు మునిగిపోతున్నవి. ఎడారులలో పట్టణములు లేస్తున్నవి. సముద్రములు కొండలగుచున్నవి.

కవి

చిత్తము.

సన్యాసి

ఈకల్లోలములో నశించనిది ఏమైనా ఉన్నదా?

కవి

ఉన్నదానికే శాశ్వతత్వము.

సన్యాసి

పరమాత్మ నుద్దేశించిన కార్యములు మాత్రమే కాలసముద్రములో తేలియాడుతూ, పైకెగసి సూర్యునితో కలసి అతని కాంతిని వృద్ధిచేస్తున్నవి.

కవి

మన రాజుగారి కార్యము ఏమి అవుతోంది?

సన్యాసి

ఆకార్యబీజమునకు నిత్యత్వము వచ్చింది.

కవి

బాహ్యరూపమున్నదా?

సన్యాసి

బాహ్యరూపము కాలసముద్రములో కరిగిపోయింది.

కవి

మరి ఈ కార్యమునకు సృష్టి స్థితి లయములు ఉన్నట్లేకదా.

సన్యాసి

కార్యబీజము నశించలేదంటినిగా. అందుచేత నే సుస్థిరత్వమున్న దన్నది.

కవి

తమ మాటలు అర్థముచేసుకొంటాను. సెలవు.

# మైసూరు కళాపరిశ్రమలు—చిత్రములు



(౧) చామరాజేంద్ర సాంకేతిక విద్యాలయము, మైసూరు



(౨) చామరాజేంద్ర సాంకేతిక విద్యాలయ విద్యార్థులు తయారుచేసిన సామానులు



(౩) నూకప్రమాను బీరువా




(౮) చామరాజేంద్ర సాంకేతిక విద్యాశాలయందు తయారయిన పేముసామానులు



(౫) గంధపుమ్రాని చేతికఱ్ఱ



(౬) అందమైన గంధపుమ్రాని నగలపెట్టె - చిన్నది

సన్న్యాసి

ఆలోచన, అనుభవము, మననము నిగూఢ సత్యమును బయల్పరచగలవు.

కవి

చిత్తము.

3

కవి

చంద్రుడా, పూర్వమిక్కడ పట్టణమున్నట్లు జ్ఞాపకము. ఇప్పుడేమైనది?

చంద్రుడు

నన్నెందుకు అడుగుతావు?

కవి

నీవు ఆదినుండీ సృష్టిని చూస్తున్నావు కాబట్టినీ, ఆ మార్పులు కనిపెట్టుతూ ఉన్నావు కాబట్టినీ.

చంద్రుడు

నీకు ఆ మార్పులు అసామాన్యము కాబోలు; నాకు సామాన్యమే.

కవి

నిత్యపరిచయమువల్ల సామాన్యత్వము పదార్థములకు పట్టినా వాటి విలువకు లోటు ఉండదు కదా!

చంద్రుడు

ఆ విలువలు కట్టదగ్గవారుంటే నీవు చెప్పిన మాట వాస్తవమే.

కవి

అందుకనే నేనడుగుతున్నాను.

చంద్రుడు

నీవు ఎవరవు?

కవి

నేను కవిని.

చంద్రుడు

సత్యత్వము వెల్లడిచేసేవాడవనా నీ అభిప్రాయము?

కవి

కావచ్చు. నీ కళ్లముందర సామ్రాజ్యాలు వైభవముతో వెలిగినవి. నీ కళ్లముందరే అవి నశించినవి. నీకు వాటి చరిత్ర గుర్తేగదా.

చంద్రుడు

సామ్రాజ్య డోలికల మీదా, సామ్రాజ్య సమాధుల మీదా నా దృష్టి ఒక్కమాదిరిగానే పడుతుంది.

కవి

అందుకనే నే వేసే ప్రశ్న.

చంద్రుడు

భూమిని అడగలేకపోయావు? సామ్రాజ్యభారాలు వహించేదీ, బరువు దింపుకొనేదీ అదే కదా?

కవి

భారమనే దృష్టి దానికి ఉంటుంది కాబట్టే దానిని అడగలేదు.

చంద్రుడు

నీవు చెప్పినట్లు ఇక్కడ పట్టణమున్నమాట వాస్తవమే.

కవి

అదేమయినట్లు?

చంద్రుడు

అప్పుడు మనుష్యుల పట్టణము, ఇప్పుడు మృగముల పట్టణము.

కవి

అసలు?

చంద్రుడు

అసలు మృగముల పట్టణము. తరువాత మనుష్యులదైనది. ఇప్పుడు మృగములు తమ హక్కు తిరిగి పొందినవి.

కవి

మనుష్యుల పట్టణమును గురించే నే వినదలచుకొన్నాను.

చంద్రుడు

వారి ఇచ్ఛకు ఎంత ఔన్నత్యమున్నదో వారి వైభవమునకు కూడా అంత ఉన్నతి వచ్చినది.

కవి

ఆనాటివారి వైభవమునకు ఆనాటి మనుష్యుల కోరిక కొలతబద్ద అన్నమాట.

చంద్రుడు

ఆనాడైనా యీనాడైనా అంతే.

కవి

వారి కోరికలో ఇమిడినవారి వైభవ మెటువంటిదో?

చంద్రుడు

రత్నభవనములు, చిత్రశాలలు, జంతువాహనములు, నృత్యసమృద్ధి, గానకళావికాసము, కవిత్వవైభవము, చీని చీనాంబరములు, చవులూరు తిళ్లు, సుగంధములు......

కవి

వట్టి గుణవాచకములవల్ల సమష్టివైభవము సన్నగిల్లుతున్నది.

చంద్రుడు

వీటికితోడు వీటిని అనుభవించుటకు నిర్భయత్వమూ, దుఃఖలేశత్వమూ కలుపుకో.

కవి

అంతేనా?

చంద్రుడు

అంతేకాదు. ప్రజాబాహుళ్యముమీద నిర్దిష్టకాలములో నిర్దిష్టదేశముమీద వాటిని వ్యాపింపచెయ్యి.

కవి

అది వారి వైభవమా?

చంద్రుడు

నాశనము గుణముగా గలవారి వైభవము.

కవి

శాశ్వతత్వచిహ్నమేమీ లేదా?

చంద్రుడు

ఈ పాడుపడ్డ పట్టణమునంతా వెదికితివికదా నీకేమీ గోచరించలేదా?

కవి

అవి రాతికాలువలు, ఇవి గజశాలలు, అవి అంతఃపురములు, ఇవి కేళీసరస్సులు.....

చంద్రుడు

వీటి శైథిల్యములో శాశ్వతత్వ చిహ్నా మున్నదా?

కవి

లేదేమో!

చంద్రుడు

కారణము?

కవి

తాత్కాలిక సుఖసంపాదకత్వము వాటి గుణ మనుకొంటాను.

చంద్రుడు

సరి.

కవి

అవి దేవాలయములు......

చంద్రుడు

వాటిసంగతి ఏమిటి?

కవి

అక్కడచేరిన భక్తుల నిత్యప్రార్థనలే పరము నకు బాటలైనవి.

చంద్రుడు

ఆ బాటలకు లేదా శాశ్వతత్వము?

కవి

ఉండదా మరి?

చంద్రుడు

ఆ కట్టడము చూశావా?

కవి

ఆ, దానిపేరేమిటి?

చంద్రుడు

అది ఒక రాజు హృదయకమలము నుండి బయలు వెడలిన సౌరభము.

కవి

ఎందువల్ల?

చంద్రుడు

భక్తుని ప్రార్థనా, కవి గీతమూ, గాయకుని గానమూ, నటునినృత్యమూ ఆ రూపము పొందినవి.

కవి

అది శిథిలమైనదే.

చంద్రుడు

ఆ రాతి కట్టడము శిథిలమైనది.

నీకు గోచరముకాని పరమునకు పోయే పూల బాటలు శిథిలము కాలేదు.

కవి

ఎట్లు?

చంద్రుడు

అప్పుడు మనుష్యసముద్రము ఉప్పొంగి అల లుగా వచ్చి దానిని తాకినది.

కవి

నృత్యగీతాదులు ప్రార్థనారూపముగా ఆ తావు నుండి పైకెగసినవా?

చంద్రుడు

అవును. నేడు నా చలవలో మనుష్యేతర లోకము ఆతావుననే సుఖమును పొందు చున్నది.

కవి

అరణ్యాక్రాంతమైనదని దుఃఖించుట విశాల దృష్టి కాదన్నమాట.

చంద్రుడు

ఆతావుననే తరుచుగా గంధర్వులు విలాస ముగా నేడు సంచరిస్తూ ఉంటారు.

కవి

ఊఁ.

చంద్రుడు

ఆతావు ఖేచరులకు విడిది.

కవి

ఊఁ.

చంద్రుడు

వ్యోమయానము చేయు విద్యాధరుల విమా నములకు ఆతావు విశ్రమస్థానము.

కవి

నీకు ఈవిషయములన్నీ అనుభవసిద్ధములు కాబోలు. నాకు ఊహామాత్రదృష్టములు.

చంద్రుడు

దేవలోకమునుండి నాగలోకమునకు విహా రము సల్పు నాగకన్యకలకు ఆతావు మజిలీ.

కవి

ఊఁ.

చంద్రుడు

దేవతావాహనము లన్నింటికీ ఆతావు లీలో ద్యానము.

కవి

ఈ సాటివైభవమేనా ఇది ?

చంద్రుడు

ఈ వైభవముచూడలేక మీరు కళ్లనీరు పెట్టు తున్నారు.

కవి

చూచుశక్తిలేదు కదా మరి.

చంద్రుడు

మీ బుద్ధి కతీతమైన కార్యములు జరగవచ్చు నని నమ్మకమున్న చాలును.

కవి

దాని పేరడిగినాను. చెప్పినావు కావు.

చంద్రుడు

మనుష్యేతరలోకము పెట్టినపేరా ?

కవి

అది నాకెందుకు ? మానవులు పెట్టినపేరు ?

చంద్రుడు

మానవులుపెట్టినపేళ్లు నానాటికీ మార్పుజెంద పోయినవి.

కవి

నేడు మిగిలినపేరు ?

చంద్రుడు

నేటి మానవులుపెట్టిన పేరున్నది.

కవి

అదే నాకు కావలసినది.

చంద్రుడు

ఈ స్థలము పాడుపట్టణము.

కవి

ఆ తావు ?

చంద్రుడు

దసరాదిబ్బ.

కవి

మహార్నవమి మంటపమా !

# శాలివాహన శకాబ్దములు

కావ్యకంఠ గణపతిశాస్త్రి గారు

వింధ్య దక్షిణమునందంతటను ఇదివఱకును వ్యవహారమునం దవిచ్ఛిన్నముగా వచ్చుచున్న శకాబ్దములకు మూలపురుషుడు శాలివాహనుడను విషయము సుప్రసిద్ధము. ఈ శాలివాహన నామము సుమారు నాలుగువందలయేబది సంవత్సరములు సామ్రాజ్యమేలిన ఆంధ్రచక్రవర్తులలో నొకరిదిగా నుండవచ్చుననుటలో వివాదము లేదు. క్రీ. వె. ప్రథమశతకోత్తరార్ధమునకు దక్షిణాపథమున జ్వలించు సార్వభౌమవంశ మది యొక్కటియే కదా!

ఆ సార్వభౌములలో ఎవడు ఈ అబ్దకర్తయో కనుగొనుటకు మనకు ప్రత్యక్షసాధనము లెవ్వియును లేవు. ఆంధ్రసార్వభౌముల పట్టిక నిచ్చిన మత్స్యవాయువిష్ణుభాగవతపురాణములలో నేదియును శాలివాహననామము నుదాహరింపలేదు. శాసనములలోనుండిగూడ ఫలానా చక్రవర్తి శాలివాహనుడని తేలలేదు. కనుక ఈ విషయమును అనుమానద్వారా నిర్ణయింపవలసియున్నది.

ఆంధ్రచక్రవర్తులలోని హాలుడే శాలివాహనుడని యనేకపండితు లనుమానించుచున్నారు. గాథాసప్తశతీకారుడగు సాతవాహనుడు హాలుడేయనియు, శాలివాహన శబ్దము సాతవాహనశబ్దవికారమనియు వారి యభిప్రాయము. పైవాదము చాలవఱకు యుక్తముగానేయున్నది. హాల శాలి శబ్దములు రెండుగూడ (ధాన్యార్థకసంస్కృతశాలిశబ్ద మిచ్చట నుద్దేశింపబడలేదు.) సాతశబ్దభవములనియే నా యభిప్రాయము. తవర్గీయములగు త ద నలు లకారముగా మాఱుట భాషలలో ననేకప్రదేశములందు కన్పట్టుచున్నది. ఆర్ద్రక—ఆర్ద్ర (కప్రత్యయరహితమై)—అద్ద— అల్లము. విదర్భ—విదర్—విద—వెద—వెల * (వెలనాడు). కత్థ—కత్త—కల్ల (అసత్యాత్మశ్లాఘనము) గోదావరీ—గోదా—గోలా: గోలా అను నది గోదావరీనదీపరమగు ప్రాకృతపదము. (ప్రా. వ్యా. ౧-౩-౧౦౫ చూడుము). తృణశూన్య—తణసొన్ని—తణసొల్లి. (ప్రా. వ్యా. ౧-౨-౧౧౧). ఇత్యాదు లుదాహరణములు. మళయాళములో నిప్పటికిని తకార పొల్లును లకారపొల్లుగానే యుచ్చరించుట వాడుక. వారు అసలు గాయత్రీమంత్రమునుగూడ "తల్సవితుర్వరేణ్యం" అని యారంభించి "ప్రచోదయాత్" అని ముగింతురు. ఇప్పుడు సాతశబ్దము సాలశబ్దముగా మాఱుట భాషాపరిణామసిద్ధాంతమునకు విరుద్ధముగాదని తేలినది. సాలశబ్దమే సాలిశబ్దమైనపిమ్మట సాలివాహనశబ్దము సంస్కృతచ్ఛాయగా నుండకపోవుటవలన మధ్యకాలకవులు దానిని శాలివాహనశబ్దముగా తీసుకొని యుందురని నాయూహ. ఇక సాలవాహనశబ్దములో 'నామైకదేశే నామగ్రహణం' న్యాయమునసాలశబ్దముమాత్రముసాతవాహననామముగా తీసుకొనినపిమ్మట సకారము హకారముగామాఱి "హాల" అయినది యని నా యనుమానము. సకారము హకారముగా మాఱుటకు సింధు—హిందు ఇత్యాది విదేశభాషోదాహరణములుగాక, దశ—దస—దహ ఇత్యాది మహారాష్ట్రి ప్రాకృతోదాహరణములు గూడ గలవు. "చతురాఢ్యోహాలో †శాతవాహనే" అను ప్రాకృత వ్యాకరణమునందలి ఝాడాదిగణ సూత్రాంతర్గతసూత్రము చతురాఢ్య హాలశబ్దములు సాతవాహనునందు వర్తించు దేశ్యపదము లనుచున్నది. మహారాష్ట్రి దేశ్యపదములకు

* "స్వీయాన్వదంతి త్రైలింగాః పరకీయాన్విదర్భజాః, ఉభయంకర్ణకమ్మాయా నోభయం దగ్ధరాష్ట్రజాః."
ఈ చాటు శ్లోకములో కవి వెలనాటివారిని విదర్భజులనియు, వేగినాటివారిని దగ్ధరాష్ట్రజులనియు చెప్పినాడు. ఈ శ్లోక మెవరిదోగాని కర్ణపరంపరగా వచ్చుచున్నది. త్రిలింగశబ్దము త్రికలింగభవమని నాయూహ.

† బృహత్కథాజన్యమగు కథాసరిత్సాగరములో సాతవాహన అనుపాఠము కన్పట్టుచుండ ప్రాకృత వ్యాకరణమున శాతవాహన అనుపాఠము కన్పట్టుచున్నది. రెండవది లేఖకప్రమాదమూలకమేమో?

గూడ సంస్కృతమే మూలమైనందున సాతశబ్దభవము హాలశబ్దమనుటకు ఈసూత్రము విరోధింపదు. సామాన్య సూత్రములను మించిన వికారములను పొందినపదములను వారు దేశ్యములనుగా పరిగణించునట్లు తెలియుచున్నది. చతురాఢశబ్దము సాతవాహన శబ్దభవము గాకపోయినను అది సాతవాహనశబ్ద తుల్యార్థకమగు చతురోఢ శబ్దభవ ముగా నున్నది. సాతవాహనశబ్దమున కర్థము సాతుడు వాహనముగా గలవాడు. చతురోఢ శబ్దమున కర్థము చతురునిచే మోయబడినవాడు. ఈ చతురుడు సాతు డుగా నుండవలెను. ఈ సాతుడు సింహరూపధారియగు యక్షుడని బృహత్కథా పీఠిక చెప్పుచున్నది. ఆ పీఠికను గుణాఢ్యుడే రచించియుండిన పక్షమున నది అనపోద్య ప్రమాణమేగాని దాని నతని తరువాతవారు రచించియు న్నట్లు ఆపీఠికలోనే గలదు. వారు దంతకథలను విని రచించియుందురు. ఆ దంతకథలలోగూడ కొంత సత్య ముండకపోదు. అది ప్రత్యేకముగా విమర్శింపవలసిన విషయము గనుక ఇచ్చట విడిచివేయుచున్నాను.

నేమికృష్ణాపరపర్యాయుడగు అరిష్టశాతకర్ణికి తరువాత హాలుడు సార్వభౌముడైనట్లు చరిత్రకారులు చెప్పుచున్నారు. బృహత్కథా పీఠిక సాతవాహనుని * తండ్రి దీపకర్ణియని చెప్పుచున్నది. ఈ కొసనుండు కర్ణి శాతకర్ణిలోని నామైకదేశమేమో? ఈ దీప కర్ణి ప్రతిష్ఠానములో రాజుగానున్నట్లు బృ. పీ. చెప్పు చున్నది. చరిత్రమునకు ఈ కథను అవిరుద్ధముగా చేయు టకు ఒకయనుమానము నాశ్రయింపవలసి యున్నది. అరిష్టశాతకర్ణి ధాన్యకటకమునందు సార్వభౌముడై యుండ అతనిసోదరుడు దీపకర్ణి రాజప్రతినిధియై ప్రతి ష్ఠానమున నుండి రాజ్యమేలుచుండి యుండును. ఆ కా లమునందలి యాచారప్రకారము రాజప్రతినిధులు రాజు లుగానే వ్యవహరింపబడుదురు విదిశాపాలకుడు అగ్ని మిత్రుడు తనతండ్రి పుష్యమిత్రుని కాలములోనే విదిశా రాజుగానే వ్యవహరింపబడుట యిందులకు నిదర్శనము. ఆరాజప్రతినిధిపదవి అతనితరువాత సాతవాహనునకు వచ్చి యుండును. సాతవాహనుడు (హాలుడు) అరిష్టుని యనం తరము సార్వభౌముడు అయియుండును. ఇతడు ప్రతిష్ఠా నమున నున్నపుడే గుణాఢ్య శర్వశర్మల కాశ్రయదాత యయ్యెను.

శాలివాహనుని జన్మముగురించి రెండు కథలు గలవు. ఒకటి అతడు బ్రాహ్మణునకు కుంభకార కన్యయందు పుట్టెనని చెప్పుచున్నది. ఇంకొకటి అవ్యక్తురాలగు (అప్రౌఢయగు) బ్రాహ్మణ కన్యకు మానవసంపర్కము లేకయే అతడు పుట్టినట్లు చెప్పుచున్నది. ఇది క్రీస్తుజన్మ కథను కొంచెము పోలియున్నది. ఈ రెండు కథలలో రెండవ కథయే బృహత్కథా పీఠికకు చేరువగానున్నది. అచ్చట ఒక ఋషికన్యకు యక్షసంపర్కము వలన నితడు పుట్టినట్లుకలదుగదా! కనుక దీనిలోనే కొంతసత్యముండ వచ్చును. ఒకశాసనములో నొక సాతవాహనరాజు తన నామాంతమున "సాతకానీనో" అని వేసుకొనియున్న దానిని నాకు చదివినట్లు జ్ఞాపకము. అది యెవరి శాస నమో అదిమాత్రము నాకు జ్ఞాపకములేదు. ఈజ్ఞాప కము సత్యసంవాదియగునెడల ఈ పేరు రెండవ కథకు గొప్ప బలమిచ్చుచున్నది. సాతవాహనునకే సాతకానీను డని యింకొకపేరుండునెడల నచ్చట కానీనశబ్దము అతని జన్మసూచకమనుటలో సంశయముండదు. కేవల జ్ఞాపకా ధారముపై నిలిచియున్నందున యీయుక్తిని నేను నొక్కి చెప్పజాలకున్నాను. నేనున్న యీ తిరువణ్ణామలలో నాంధ్రగ్రంథాలయము లేనందున నేను మూలము వెతకుట కవకాశము లేకపోయినది. ప్రకృతము ననుసరిం చెదను.

ఇదివఱకు చూపిన కారణములనుబట్టి సాతవాహన శాలివాహనశబ్దములు ప్రకృతి వికృతులనియు, హాలుడే సాతవాహనుడనియు తేలినది. అయినను హాలుడే అబ్దకర్తయనుటకు ఈ కారణములు సరిపోవు. ఈ సాతవాహనశబ్దము తరువాత రాజులకు కాలనామముగా నుండుటచే శాలివాహనశబ్దముగూడ అట్లగుట సంభవమే. అందువలన అది సాతవాహనుడు అబ్దకర్తయా? అతని

* బృహత్కథా పీఠికప్రకారము ఇతడు కన్నతండ్రిగాడు, పెంపకపుతండ్రి. వేఱు సంతానము లేనివాడు.

తరువాతవచ్చిన సాతవాహనరాజులలో నింకొకడు అబ్దకర్తయా? అను విషయము నిప్పుడు విచారింపవలసియున్నది. చరిత్రకారుడు స్మిత్తు ఇచ్చిన లెక్కప్రకారము పురీంద్రసేనశాతకర్ణి అబ్దకర్తయనిచెప్పవలసివచ్చుచున్నది. పురీంద్రసేనుడు క్రీ. వె. ౭౯వ సంవత్సరమున సింహాసనమెక్కినట్లు స్మిత్తు తలంచుచున్నాడు. స్మిత్తు హాలుడు క్రీ. వె. ౬౯వ సంవత్సరమున సామ్రాజ్యసింహాసన మెక్కినట్లు అభిప్రాయపడుచున్నాడు. ఈచరిత్రకారుడు తన లెక్కను ఊహలపై నిర్మించెనుగాని అనపాద్య ప్రమాణద్వారా నిర్ణయించియుండలేదు. అందువలన పురీంద్రసేనుడే అబ్దకర్తయని యితని లెక్కపై మాత్రమాధారపడి చెప్పుట సాధ్యముగాకున్నది. మఱి తొమ్మిది సంవత్సరములు కలుపుకొని హాలుడు క్రీ. వె. ౭౮వ సంవత్సరమున సింహాసనమెక్కినట్లు ఒప్పుకొనుటయే యింతకంటెను యుక్తియుక్తముగా నుండును. హాలునిప్రసిద్ధిగూడ అందుకు తగియున్నది. హాలుడే అబ్దకర్తయనుటకు అనుమాన ప్రమాణము చాల నెఱపు తోడ్పడుచున్నను ఒక గట్టిప్రతిబంధక మడ్డుపడుచున్నది.

అది యేది? శాలివాహనునకు అబ్దములకు మధ్యనుండు శకశబ్దమే. ఈశకశబ్దము కాలవాచకముగా ప్రాచీన వాఙ్మయములో నెచ్చటను ఉదాహరింపబడలేదు. 'శక్'ధాతువులోనుండి పుట్టిన శబ్దమిది. సమర్థుడు అను నర్థ మిచ్చునదియై యున్నది. శకులు అను నొకజాతి రాజులు ఉజ్జయినిలో నుండి చాలకాలము రాజ్యమేలినట్లు చరిత్ర చెప్పుచున్నది. అందువలన శాలివాహనశకాబ్దములు అనుమాటలో మధ్యనుండు శకశబ్దము ఆ నామము గల యొక వ్యక్తినిగాని శకజాతి రాజునుగాని చెప్పి తీరవలెను. ఈ శకశబ్దమునకు శాలివాహనునితో సామానాధికరణ్యముగాని అబ్దములతో గాదు. శాలివాహన శకుని అబ్దములనియే యచ్చట అన్వయమని తాత్పర్యము.

అయ్యా, యుధిష్ఠిర విక్రమార్క శాలివాహన నాగార్జున విజయాభినందన కల్కిశకము లాఱు అను నొక ప్రసిద్ధి యున్నందున శకశబ్దము అబ్దములతోడనే అన్వయించునంటిరేని ఆవాదము నిలువగూడినది గాదు. శాలివాహనశకాబ్ద వ్యవహారము స్థిరపడినపిమ్మట అర్వాచీన గణిత గ్రంథకర్తలు శకశబ్దము కాలపర్యాయమని భ్రమపడి అందఱితోడను ఈ శకశబ్దమును జోడించియున్నారు. అది యొక ప్రమాణము కాజాలదు. విక్రమాబ్దములకు 'విక్రమసంవత్'అని వ్యవహారము గలదేగాని విక్రమశకమని వ్యవహార మిప్పటికిని లేదు. జ్యోతిష గ్రంథములందు శాకే అని యెచ్చట వచ్చినను శాలివాహనశకాబ్దమే అర్థము చెప్పబడుచున్నది. శకసంబద్ధమైనది శాకము అని నిర్వచనము. ఉదీచ్యుల గ్రంథములలోగూడ ఈ శాకశబ్దము శాలివాహనశకాబ్దపరముగానే వ్యవహరింపబడుచువచ్చినది.

"శాకశ్శరాంభోధియుగోనితో హృతో
మానం ఖతర్కై రయనాంశకా స్స్మృతాః."

జ్యోతిర్విదాభరణము, ౧ అధ్యా. ౧౮ శ్లో.

శాలివాహన శకాబ్దములలో ౪౪౫ తీసివేసి ౬౦ చే హరింపగా శేషము అయనాంశలు అగునని ఈశ్లోక తాత్పర్యము. ఇచ్చట శాకశబ్దమును విక్రమసంవత్సరముగా చేసిన అనేక సిద్ధాంతములకు విరోధము వచ్చును. ఈ జ్యోతిర్విదాభరణకర్త కాళిదాసుడు. సుప్రసిద్ధ కాళిదాసుడే అనువాదముతో నే నేకీభవింపజాలకపోయినను ఈ గ్రంథము ప్రాచీనమని నే నంగీకరింతును. *

* ఈ జ్యోతిర్విదాభరణములోని కొన్ని అధ్యాయము అభూతకల్పనలతో నిండియున్నది. అందువలన నితడు తాను వర్ణించిన విక్రమునకు సమకాలికుడని చెప్పుటకు సంశయము కలుగుచున్నది. విక్రమునకు మూడుకోట్లు పదాతులు, పదిలక్షలు గుఱ్ఱములు, ఇరువదినాలుగువేల ఏనుగులును, నాలుగులక్షలు నౌకాదళమును ఉన్నట్లును, ఇతడు యాభై ఆయిదుకోట్ల శకులను సంహరించి శాకప్రవర్తకు డైనట్లును ఆ అధ్యాయములో కన్పట్టుచున్నది. దానిలోనే నవరత్నశ్లోకమున్నది. పై కల్పనలు నమ్ముటకు వీలు లేనట్లున్నవి. మొదటి అధ్యాయములోని అయనాంశ శ్లోకమువలన శా. శ. ౪౪౫ టికి తరువాత వాడని స్పష్టమగుచుండ కొన్ని అధ్యాయమువలన ఈకవి క్రీ.పూ.

శకపదము రాజవాచకమేగాని కాలవాచకము గాదనుటకు నా కింకొకప్రబల సాక్ష్యమున్నది. అది యేదనగా—అత్యంత ప్రాచీనుడగు చాళుక్యమంగళేశ్వరుని శాసనము. (బాదామి గుహాశాసనము).

దానిలో నిట్లున్నది:—

"శ్రీమంగళేశ్వరో రణవిక్రాంతః ప్రవర్ధమాన రాజ్యసంవత్సరే ద్వాదశే శకనృపతి రాజ్యాభిషేక సంవత్సరే ష్వతీతేషు పంచసుశతేషు......"

ఈశాసనములోని 'శకనృపతి రాజ్యాభిషేక సంవత్సరేషు' అను ముక్క మనకు రెండు విషయములను స్పష్టపఱచుచున్నది. అబ్దకర్తయగు నృపతి శకనామకుడు లేక శకజాతీయుడు. అబ్దములు అతని పుట్టుకనుండి ఆరంభింపబడలేదు. అతని రాజ్యాభిషేక వర్షము నుండియే ఆరంభించినవి.

ఈ నృపతి శకజాతీయుడనుటకు శాలివాహన పదమడ్డుపడుచున్నది. అంతియేగాక స్వశత్రువులగు శకుల రాజుపేరట నొకయుగమును వైదికు లారంభింతురని గాని లేక రాజుచే నారంభింపబడిన దానిని పిమ్మట ఆదరింతురనిగాని నమ్ముటకు వీలు లేదు. కనుక యీ నృపతి శకజాతీయుడు గాడు. అతని నామము మాత్రము శకుడు. అతడు సాతవాహనవంశమునకు చేరినవాడని శాలివాహన పదముచెప్పుచున్నది. ఎవ డీశాలివాహన శకుడు? గౌతమిపుత్ర శ్రీశాతకర్ణి అని ప్రసిద్ధిచెందియున్న రెండవ విలివాయకురుని తండ్రియు, వాసిష్ఠీ పుత్రుడగు మొదటి విలివాయకురుని కుమారుడునగు శకసేనుడే యీ శకనృపతి యని నా యనుమానము. భీమసేనుని భీము డన్నట్లు శకసేనుని శకుడని నామైకదేశనామగ్రహణ న్యాయముచే వ్యవహరించుట సంభవము. ఈశకసేనునకు శివశాతకర్ణి యనియు, శివల కురుడనియు నామాంతరములు గలవు. ఇతడు మాఢారీపుత్రుడు. ఇతడు క్రీ. వె. ౧౫౫లో సింహాసనమెక్కినట్లు స్మిత్తు ఊహించుచున్నాడు. ఏడు సంవత్సరములు తగ్గించి క్రీ. వె. ౭౮లో ఇతని రాజ్యమారంభించినది యని నేను చెప్పునెడల అది చరిత్రకారాశయమునకు చాల చేరువగానేయుండును. శకసేనుడే తన రాజ్యాభిషేక సంవత్సరము మొదలుకొని క్రొత్త సంవత్సరముల నేర్పాటు చేసెనని నేనూహింపను గాని గౌతమీపుత్రుడు శకయవనాదులను జయించి ఆంధ్రసామ్రాజ్య కీర్తిని భరతఖండమునం దంతటను విస్తరింపజేసిన పిమ్మట పితృగౌరవముచే తనతండ్రి రాజ్యారంభవర్షమునుండి శకాబ్దముల నేర్పాటు చేసియుండునని నా యూహ. మున్ముందు పరిశోధనల వలన దీనిసత్యము బయల్పడవలసియున్నది. ఇప్పటికి తర్కబలమంతయు శకసేనుని శకనృపతిగా చెప్పుటకే అనుకూలమై యున్నది.

---

౫౬ సం. ప్రాంతపువాడగు సంవత్కర్త సభలో నున్నట్లు చూపబడుచున్నది. జ్యోతిర్విదాభరణ కవిత్వము చాల క్లిష్టదూరాన్వయాదిదోషములతో కూడుకొనియున్నది. ఇది రఘువంశాది కర్తయొక్క కృతియని చెప్పుట సాధ్యముకాకున్నది. అతని బాల్యకవిత్వమేమో యని చెప్పుటకు సాధ్యము కానట్లు కవి కొన అధ్యాయములో తాను రఘువంశాది కావ్యత్రయము చేసినపిమ్మటనే ఈ జ్యోతిర్విదాభరణమును చేసితినని చెప్పుకొనుచున్నాడు. చతుర్థశతకోత్తరార్థమున సింహాసనమెక్కిన గుప్తచక్రవర్తి చంద్రగుప్త విక్రమాదిత్యునిగా గూడ జ్యోతిర్విదాభరణ విక్రముని చెప్పుట సాధ్యముగాదు. అసలు జ్యోతిర్విదాభరణ గ్రంథమే క్రీ. వె. ౫౩౬లకు తరువాత పుట్టినది. ఈగ్రంథకర్త పురాణకర్తలు తమకృతులను కృష్ణద్వైపాయనునకు ముడిపెట్టినట్లు తన కృతిని కాళిదాసునకు ముడిపెట్టియుండవచ్చును. అతని సమకాలికుడుగా విశ్వసింపబడు విక్రముని వర్ణించి ముందు వారిని వెనుకవారిని ఒకగుత్తముచేసి అతని సభకు చేర్చి యుండవచ్చును.



౮. కొంబి ప్రదర్శనమున ప్రదర్శింపబడిన కొన్ని సామానులు



౭. కొంబి ప్రదర్శనమున ప్రదర్శింపబడిన కొన్ని సామానులు

ఇవి చామరాజేంద్ర సాంకేతికవిద్యాశాలయందు చేయబడినవి.



(౯) నల్ల చేవపీటలో సమర్పబడిన దంతపు దత్తాత్రేయ విగ్రహము



(౧౦) చిత్తరువుచట్రము - గందపుమ్రానిది ; బెంగుళూరు కర్మాగారమున చేసినది




(౧౧) మేజాపై నుంచుకొను అద్దము

# అంగుళీయకము

గర్భాం అప్పారావుగారు, బి. ఏ.

ఒకనాటి మధ్యాహ్నమున మేఘములు క్రిందిభాగము నావరించియుండెను, వర్షము పడుచుండెను. శీతల వాయుప్రచారము మిక్కుటముగా నుండెను. మోహనశ్యామసుందరుల సంభాషణ మగ్గములోనినాడెవలె జరుగుచుండెను.

మోహనుడు శాలువ కప్పుకొని యొక్క కుర్చీపై కూర్చుండెను. శ్యామసుందరుడు పడకకుర్చీపై జేరబడి 'ఏనుగుమార్కు సిగరెట్టు' వెలిగించుచుండెను. శ్యామసుందరుడు సంభాషణనిమగ్నుడగుటచే చలిబాధ లక్ష్యము చేయకుండెను.

"చూడుము మోహనా! న్యాయవాదిమాత్రము స్వతంత్రజీవనముకలవాడాయేమి? సేవకవృత్తిలోనున్నవాడొకరిద్దరు యజమానులయాజ్ఞ శిరసావహింపవలెను. న్యాయవాదియు లోకులకు సేవచేయవలసినవాడే. కావున నిరువురికి సామ్యము లేకపోలేదు. ఏదైన పరమగహనము సేవకవృత్తియే" అని శ్యామసుందరుడు పలికెను.

"అదెట్లు? సేవకుడనువాడొకరిచిత్తవృత్తి ననుసరించి తిరుగవలెను. న్యాయవాది యీ విషయమున స్వతంత్రుడు. ఎవడు నాతని నాజ్ఞాపించలేడు." అని మోహనుడు నుడివెను.

"న్యాయవాదివి కమ్ము. నేను పలికినదానిలోని సత్యమెరుగగల"వని శ్యామసుందరుడు నుడివెను.

"సరే! చూచెద"నని మోహనుడు పలికెను. సంభాషణపద్ధతి యట్లుండెను. చర్చ కడు కదలిక గలిగి యున్నను సారాంశమేమియు తేలలేదని శ్యామసుందరుడు తెలిసికొనెను. కొంతవరకు మూకీభావము వహించెను. అతని దృష్టి సిగరెట్టుపై బడెను. అయ్యది వెలుగుచుండలేదు. కాన దానినుండికూడ నాతడు సారమేమియు గ్రహింపలేకుండెను. అందుచే మరల సంభాషణకుదిగెను.

"మోహనా! నీవు తర్కశాస్త్రజ్ఞుడవు. అయిన నెన్నడు నేనేవిషయము నీ మనమున కెక్కింపలేదు."

"అది నా తప్పుకాదు. నీవెన్నడట్లు చేయలేవు. కాని వాదముల ఫలితమంతే. నీకట్టివాదమే తెలియును."

ఈ మాటకు శ్యామసుందరుడు కోపము తెచ్చుకొని "చివరకు నీవిట్టిమార్గమునే యవలంబించెదవు. తగిన హేతువులు చూపలేనపుడు నీవు మనశ్శల్యములగు వాక్కులు ప్రయోగింతువు. నీలోనున్న లోపమే యిది" అని పలికెను.

"అదిగో! నీవు నీ యిష్టానుసారము మాటలు ప్రయోగించెదవు. నేను నీతో వాగ్వాదమునకు సరిగానని నీవు పలికినపుడే నీవు పొరపడితివని తలంపవు."

ఈ మాటపై శ్యామసుందరుడు సిగరెట్టు క్రిందపడవైచి ఠీవితో నాసీనుడై తనజేబులోనుండి రుమాలు తీసి సులోచనముల అద్దములు శుభ్రపరచి లేచి "నీవు న్యాయవాదివగుటకు దుర్బుద్ధి పొడముచున్నది. సరే జయముపొందుము. నేను పోయెద" ననుచు శ్యామసుందరుడు వెడలిపోయెను. మోహను"డాలోచనానిమగ్నుడైయుండెను.

* * * *

మోహనశ్యామసుందరులు ఆంధ్రనియోగి బ్రాహ్మణవంశమునకు జెందినవారు; ఏకకుటుంబ జనితులు; మిత్రులు. మోహనునితండ్రి స్వోపయోగమునకై బెజవాడలో నొకప్రత్యేకగృహము కట్టించి యందుండెను. అంతకుపూర్వము కుటుంబమంతయు బందరులోనుండెను. మోహన శ్యామసుందరులు పాఠశాలయందు క్రింది తరగతులలో ప్రవేశించునపుడు స్నేహము కుదిరెను. నాటినుండియు వారిమైత్రి దినదినాభివృద్ధి గాంచెను. వస్త్రధారణమున నేమి, అభిరుచులలోనేమి, యభిప్రాయములలోనేమి, పరీక్షాఫలితములలో నేమి వారెన్నడు వేరు

కాలేదు. చివరకు కళాశాలా పరీక్షాఫలితములందు గూడ నైక్యమునే పొందిరి.

*   "   *   *

ఇప్పుడు వారి భావిజీవితము చింతనీయము. దాని విషయమై యింతవరకు చర్చించియుండిరి. మోహనునికి న్యాయవాదిగా ప్రవేశింప తలంపు. శ్యామసుందరుడు కూడ న్యాయవాది పరీక్షయం దుత్తీర్ణుడైయున్నను నా వృత్తియం దాతని కభిమానము లేదు. తనమిత్రుడు న్యాయవాదిగా బ్రవేశించుటకు కృతనిశ్చయుడైయున్నందునను మిత్రుడవలంబింపని వృత్తిని దా నవలంబింప నిష్టము లేనివాడగుటను తాను సహితమావృత్తిలో బ్రవేశింప నాలోచించుచు అప్పుడు మోహనుని విడిచి పైకేగెను.

తిన్నగా శ్యామసుందరుడు వీథిలోనికి రాగానే తళుక్కుమని మెఱుపు మెఱసెను. అత డాకసమువంక జూచెను. తన జేబులో సొమ్ముకై చేతులుపూర్చెను. కాని శూన్యహస్తములే పైకివచ్చినవి. మరల నింటి వైపు తిరిగెను. మోహనుని తల్లి కన్పడెను. ఆమెను సొమ్మడిగెను. ఆమె "ఎందుకు? ఇంతలోనే వెడలి పోయెదవా?" అనెను అందుకాతడు సరియగునుత్తరు వీయక "నేను నడిచిపోవలచితి. వర్షము పడునట్లున్నది. కావున ధూమశకట మెక్కిపోవలెను."

మోహనుని తల్లి యాతనికి కొంతపైకమిచ్చెను. అతడు పోవుచు ఐదిన యిచట లేనపుడు గృహవ్యాపారమెట్లు సాగింపగలుగుచున్నావని యామెనడిగెను. "ఏదో ఒకతీరున; నీభార్యకు కుశలమా?" అని యామె యడిగెను. ఈ లోగా నాతడు గృహద్వారము దాటిపోయెను.

ఒకనాటి మధ్యాహ్నము మోహనుడు శ్యామసుందరు నింటికి వచ్చెను. సేవకు లాతనితో శ్యామసుందరుడు కొలదికాలముక్రిందనే షికారు వెడలెనని చెప్పిరి. వెంటనే మోహనుడు ఉత్సాహవిహీనుడై శ్యామసుందరు జనని యున్న మేడగదికేగెను.

"మోహనా! ఈమండు వేసవిలో నెచ్చటికి ప్రయాణసన్నద్ధుడవై యున్నావు? ఇప్పుడే శ్యాముడు షికారు వెడలెను" అని యామె పలికెను.

మోహనుడు—మా పినతల్లి కుమార్తె పెండ్లి. "నేను గుంటూరు వెళ్లవలసియున్నది. నేను వెళ్లనిచో మా పినతల్లి కోపగించుకొనును. ఈ విషయము చెప్పుటకై వచ్చితిని. శ్యామసుందరుడు వచ్చు సమయమైనదని తలంచెదను."

శ్యామ. తల్లి—"ఏమైనసరే. ఇట్టియెండలో నీవు గుంటూరు వెళ్లరాదు. కడునాయాసపడెదవు. శ్యాము డెతంలో వచ్చునో చెప్పజాలను, బాంకికి వెళ్లెను. ఇందిరా! మోహనుడు గుంటూరు వెళ్లనున్నాడు. మార్గమున వేసికొనుటకై కొన్ని తములపాకు లిమ్ము."

మోహ—"అవునవును. నాకు హితమే. నేను వీని సేవించినప్పుడెల్ల నిన్ను స్మరించుచుండెదను."

ఈ మాట కామె నవ్వెను. ప్రక్కగదిలోనున్న శ్యాముని హృదయేశ్వరియు నవ్వెను. మోహనుడు చేతి గడియారము చూచికొనియెను. అప్పుడు శ్యాముని తల్లి రైలుబండికి వేళ యయినదని గ్రహించి మోహనునకు తములపాకులు తెచ్చుటకై వెడలెను. మోహనుడును లేచి శ్యామసుందరుని చదువు గదిలోనికి పోయెను. మార్గాయాసము పోవ మనోహరమగు నవల యేదైన నుండునని పుస్తకములన్నియు వెదకెను. క్రొత్తపుస్తకమొకటి యాతని కంటబడెను. అది తీసి తెరచునరికొక యుత్తరము అందు కనబడెను. కవరు పై విలాసము తనభార్యచే వ్రాయబడియుండెను. ఆమె శ్యామసుందరునికి తిరుపతినుండి వ్రాసినది. మోహనుని మామగారు తిరుపతిలో నుద్యోగచుండుండెను.

అయిదారు దినములనుండి తనభార్య వృత్తాంతమేమియు తెలియమిచే నుత్సాహపూరితుడై యుత్తరము విచ్చెను. కాని యందలి ప్రథమాక్షరములే యాతనికంపితుని జేసెను. ఎట్టెట్టో యాత డుత్తరమంతయు చదివెను. అందినట్లున్నది:

"ప్రాణప్రియా!

నాపై మీకుకోపమా? మా వదినయొక్క అడ్డుచే నేను మీ కుత్తరము వ్రాయ వీలులేన్నది. పరిహాసప్రియ

రాలను నామె చూడకుండ ఉత్తరము వ్రాయ వీలులేకున్నది. అట్లు చూచినయెడ నాకు సిగ్గు. నేనుత్తరములు వ్రాయుటలో వెనుకబడితినని మీరు వ్రాయ మానరాదు. మానినచో నా మనసు నొచ్చును. మీ యుత్తరము వచ్చినచో రహస్యముగా చదివి దాని నా హృదంతరమున సర్వకాల సర్వావస్థల నుంచెదను. అందువిషయమై మీ రేమియు సందియపడవలదు. మీ వియోగము నే నొక్క క్షణమైన భరింపజాలను. నా మనోవ్యాకులత మీ రెరుంగజాలరు. నా యంతశ్చక్షువుచే మిమ్మెప్పుడును గాంచుచుండెదను. నా విశ్రాంతిసమయమున నా మానసవీధిని మిమ్ము స్మరించుచుండెద. మీరును నన్నట్లాదరించుచుండెదరా? అందు సహస్రాంశమైన నాపై ప్రేమకలిగియుండెదరా? ఈ జబాబునకై నా మన మాతురపడుచుండును. దూరముగానున్న మీ యర్ధాంగిని మరువకుడు.

"ఈ విషయము పైకి నుడువరానిదైనను నాయాత్మను లోన తపింప జేయుచుండుటచే దాని వెడల గ్రక్కవలసెను. మదీయాభీష్టమొండు తీర్చెదరని మిమ్ము కోరుచున్నాను. ఆనాడు మనల జూడ నొక పార్సీ యువతివచ్చినది. ఆమె యొక్క యంగులీయకమును ధరించియుంట కంటిరికదా. అనురాగము వెదజల్లుచున్న కెంపు ఆ యువతి యంగుళి కెంత సొంపు కలిగించుచుండెను? ఆ యువతిశరీరచ్ఛాయ యాసొంపును ద్విగుణీకృతము గావించియున్నది. అట్టిఛాయ మనకు లేదు. శరీరకాంతి లేనంతమాత్రమున నంత చక్కని యాభరణము ధరించుట కభ్యంతరమేమి? నేను దాని ధరించుట మీ కిష్టమగునేని నొకటి నా కొఱకు పంపుడు. నా వ్రాతలో మార్దవము లేదు. దయయుంచి క్షమింపవేడుచున్న దాన. వదిన వచ్చుచుండుటచే లేఖిని యివ్వట నాగినది. సెలవుతీసికొనెద. మనసార నర్పించిన నా ప్రేమాంజలి గొనుడు.

త్వదీయ హృదయాంబుజ భ్రమర-భ్రమర."

మోహనుని తల గిరగిర తిరుగుచుండెను. అతని నాడీపరీక్ష నెవరైన జేయుదురేని ప్రాణములు వీడిపోవుచున్నవని పలుకవలసినదే! ఉత్తరమందలి ప్రత్యక్షరము



విషపూరితమగు శల్యమై మనస్సును బాధించుచుండెను. భ్రమర తన భ్రమర యేనా? యువతుల ప్రేమ యథో లోకమునకు ద్రోయవలసినదేనా? ఇవన్నియు నటనలేనా? మయూరము లొయారము గల పక్షులు; కూత యతికటువు. కేతకి పరిమళోద్గారి; కంటకావృతము. దంతపుబొమ్మలవలె ధవళకాంతుల వెదజల్లు శరీరచ్ఛాయ గలిగి విషపూరిత హృదయలగు ముదితల నెవడు నమ్మునో వానిజీవితము నిస్సారము. ఇట్టి యాలోచనచే మోహనుని మన సల్లకల్లోలమగుచుండెను. ప్రపంచకమంతయు నంధకారమగ్నమయ్యెను. ఒకచో నాసీనుడయ్యెను. 'శ్యామసుందరుడు నా బాల్యస్నేహితుడు. హా మిత్రమా! పవిత్ర హృదయా! నీవు నన్ను మోసపుచ్చితివా' అని తలంచుచుండెను.

కంకణారావములు చెలగ శ్యామసుందరుని భార్య గదిలోనికివచ్చెను. తమలపాకులు కొన్ని యాతనికిచ్చి "మీ రెప్పుడు తిరుపతినుండి తిరిగివచ్చెదర"ని యడిగెను. ఆసమయమున నీర్ష్యాసూయా క్రోధములు ముప్పిరిగొన

నాతడు మండిపడుచుండెను. అతడే ప్రత్యుత్తరమీయ లేదు. మౌనవ్రతము గాంచి యాతని మోము దిక్కామె చూచెను. తన్ముఖవివర్ణతకు బెగడొందెను.

"మీ శరీర మస్వస్థతగా నున్నదియా? గుంటూరు ప్రయాణము మానరాదా?" అని యాతనితో బలికెను.

అతడు మోటుగా "మానను" అనుచు లేచి మారు మాటాడక వడివడి మెట్లుదిగి క్రిందికిబోయెను.

ఉపరిభాగమునుండి హఠాత్తుగా క్రిందపడిన యొక యిత్తడిపాత్ర జింగురుమనుధ్వని ప్రతిధ్వనులతో గదినంతయు నింపిన లక్షణము, మోహనుని చిడిముడిపోకడవలన గదియందు కలిగెను. ఇందిర జీవితమున నిట్టిచర్య నూతనము. ఆమెయెన్నడు మోహనునందట్టి లక్షణము గనలేదు. శ్యామసుందరు నామె పెండ్లియాడిన దినమునుండి మోహను డామెయెదుట స్వేచ్ఛతో బ్రవర్తింపుచు నాతడపహాస్యవచనములనామెకు త్సాహముకలిగించుచుండెను. అట్లయిన నిదియేమి! అట్టి విషయమెన్నడైన జరుగునని యామెతలంచలేదు. మోహనుడు కొలది నిముషములక్రింద నాసీనుడైయున్న కుర్చీపై నామె యాసీనయై యందులకు తగినకారణ మరయుచుండెను.

మేజాపై కొన్ని పుస్తకములుండెను. ఆ దినమే వానినామె సరిగా పేర్చియుంచినది. కాన నందునుండి వేరుపడియున్న నూతన గ్రంథమొకటి యామె దృష్టి నాకర్షించినది. దానిని తీసి తెఱచినది. భ్రమర వ్రాసిన యుత్తరము కంటబడినది. ఉత్తరము చదివినది. మోహనుడు దాని నచ్చటమరచెనని యూహించినది. కాని మోహను డచ్చోటు నావిధముగా బాయుటకు గతమేమి? ఈ విషయ మామెను పలుమరు బాధించుచుండెను. అనాదరభావముతో నా యుత్తరము కవరులోనుంచి మేజాపై విడిచెను. ఆలోచనా నిమగ్నయై యుండుటచే కవరుపై వ్రాతగమనింపలేదు. ఉత్తరమట్లు అజాగ్రత్తగా వదలుట మంచిదికాదని తలంచి తనపెట్టెలో దాచ నుద్దేశించి తన గదిలోనికేగి ట్రంకుపెట్టె తెఱచెను. పెట్టెలో కవరుంచుచుండ పైవ్రాత కనబడెను. ఆమె ముఖము వెలవెల బాఱెను. ట్రంకు పైమూత ఆమె చేతిగాజులపైబడి వానిని పగులగొట్టి చేతికి గాయములు కలిగించెను. ఆ సమయమున నా గాయములు కలిగిన సంగతియే తెలియకపోయెను. విషయ నిర్ధారణకై యాలోచించుచుండెను. తత్క్షణమే మోహనునవస్థకు కారణమేమో కనుగొనెను. ఆమె మొగమంతయు పాలిపోయెను. నుదుటిపై చిరుచెమటలు క్రమ్మెను.

వెంటనే తనలో "భ్రమరకేమి పిచ్చియా? ఈ యుత్తరముయొక్క కవరిదికాకపోవచ్చును. ఈకవరులో నచ్చిన యుత్తరము మరియొకటి కావచ్చును." అని ట్రంకు పెట్టె యట్టె తెరచియుంచి శ్యామసుందరుడు చదువుకొను గదిలోనికేగి ప్రతిస్థలము వెదకెను. కాని యుత్తరము మరొకటి కన్పడలేదు. దీనితో నామె హృదయాంధకారము మరింత దట్టమయ్యెను.

మోహన శ్యామసుందరుల హృదయములొక్కటియే యని ఇందిరకు తెలియును. అట్టి మైత్రి యెచ్చట నామె కాంచలేదు. ఈ హేతువుచేతనే భ్రమరతో నామె స్నేహముచేసెను. ప్రపంచమందలి వైభవమంతయు నాకు భ్రమరా మోహన శ్యామసుందరులందే యున్నది. ఇట్టి బంధమును విడగొట్టు దుర్దినము వచ్చినదని విచారించెను. ఆమె దృష్టికవరోధము కలిగించును కన్నీటి బిందువు లామె కన్నుల నావరించినవి.

ఇందిర మరల నిట్లు తలంచెను.

'మోహనబాబు తనకు భ్రమర వ్రాసిన యుత్తర మిచ్చట మరచి నా ప్రాణవిభునకు వ్రాసిన యుత్తరము తీసికొనివెళ్లి యుండును. లేదా. ఆ యుత్తరము నా ప్రియుని వద్దనే యుండ వచ్చును. భ్రమర తనకొకయుత్తరము వ్రాసియుండిన నాతో నా ప్రియుడు చెప్పకుండునా? అడిగి యీ యనుమాన పిశాచమును వదల్చుకొనియెద.'

అట్టియాలోచనయందు గంటలు గడచిపోయెను. తలనొప్పి మిషపై నాదినము గృహకృత్యములు వదల్చుకొనెను. రాత్రి ౮ గంటలకు శ్యామసుందరు డింటికి వచ్చెను. ప్రియురాలి యస్వస్థత తల్లివలన నెరింగి యామె పండుకొన్న స్థలమునకేగెను. కాని మునుపటిరీతి నాతని

శాహువుల నామె కంత మర్పించలేదు. ఇవన్నియు శ్యామసుందరుడు గమనింపలేదు. ఏదో యాలోచించుచుండెను. ముందు ఇందిరయే మాటాడెను. మోహనుడు గుంటూరు వెళ్లినవిషయ మాతడెరుంగునేమో కనుగొనెను.

"అవును; అతడు నా కావిషయ మెఱిగించెను. తనతో రమ్మని నన్ను బలవంత పెట్టుచుండెను. అత డెప్పు డీస్థలము విడిచెను?"

"ఈ మధ్యాహ్నమే. మీరు షికారువెళ్లిన తత్క్షణమే యాతడిక్కడకు వచ్చెను."

"నీతోనేమైన చెప్పెనా?"

"ఏమియు లేదు. కొన్ని తమలపాకులు అతని కిచ్చితిని. అవి తీసికొని యతడు వెడలెను. భ్రమర సంగతి యేమి?"

తొట్రుపాటుతో "నాకేమి తెలియును?"

ఈమాటతో పెద్ద గాలివీచగా దీపమారి అంధకార మావరించిన ట్లామెకున్న యాకొంచె మాశయు తొలగిపోయి యామె మనసంతయు తిమోమయమయ్యెను.

* * * *

మోహనుడు గుంటూరు వచ్చిన తరువాత తన గృహము విషయము మరచెను. అతడచ్చటనుండవలసినది రెండు దినములే. ఆతనియందు మార్పాతని పినతల్లి గమనించెను. ఆనందమయుడగు నాత డిప్పుడు చింతాకులితు డయ్యెను. ఆటలలో పాల్గొనడు. తన యీడువారి గూడడు. ఆనందజనకములగు నేవిషయములందు బ్రవేశింపడు. ఒంటరిగా నుండును. మాటాడుటరుదు. ఏదైన ప్రశ్నకు త్తరము చెప్పవలసినపుడు వెడచూపు చూచును. 'విద్యాధిక్యమే యిట్టి నడతలకు కారణము. ఇప్పటి విద్యాధికుల స్వభావమే యిది' యని యాతని పినతల్లి తలంచెను.

బెజవాడ వెళ్లి రమ్మని తనతండ్రి మోహనున కుత్తరము వ్రాసెను. కాని యాతని పినతల్లి మోహనునిశరీరస్థితి బాగులేదనియు, గుంటూరులోనే యున్నచో నారోగ్యముగానుండుననియు ప్రత్యుత్తరమిచ్చుటచే మోహనుని తండ్రి మారునాయక మోహను పేరవచ్చిన యుత్తరము లన్నియు నతనికి పంపించి వేయుచుండెను. అందు భ్రమర వ్రాసిన యుత్తర మొండు కలదు. దాని గాంచినంతనే మోహను డసూయాద్యోతక మందహాస మొనరించెను. ఆ యుత్తరమొకవంక పడవైచి తక్కినయుత్తరము లన్నియుజాగరూకతతో జూచి తుదను భ్రమర లేఖను విచ్చి చదివెను.

"హితా!

మీ యుత్తరముచూడ నాకు గలిగిన యానంద మపరిమితము. మీరు నన్నంతగా ప్రేమించుటకు నాయందే గొప్పతనము కాన్పించదు. శాశ్వతముగా నిట్టి దయ నాయందుండునట్లు దేవుడనుగ్రహించుగాక. మీ యందరకు దూరముగానుండుటచే నా హృదయమెప్పుడు విచారయుతమైయుండును. దేవుడెన్నడు మనల నందర మరల బెజవాడలో సమావేశమగునట్లు చేయునో? మీరు నిరంతరమట్లు ఉత్తరములు వ్రాయనిచో నాకు మీపైకోపము కలుగకమానదు. పుణ్యక్షేత్రముల మరణము పొందువారల యాత్మలు శాంతినొందునని పెద్దలందరు. నా యాత్మ మీ యొద్దనేయుండుటచే పుణ్యక్షేత్రమగు నీ తిరుపతిలో నొకవేళ నాకు మరణము కలిగినను నాయాత్మ కట్టిశాంతి కలుగబోదు. ఇందిరకు మదీయ దృఢాలింగనము. మమ్ముజూడ మీరిచటికి రాగూడదా? ఈ సందర్భమున మీరు మరువదగనిసంగతి యొకటి కలదు. గృహమేధి యిచ్చట పవిత్రాశీర్వాదములొందుటకు సహధర్మచారిణిలేనిది వలనుపడదు. జబాబున కెదురుచూచుచుండెదను.

ఇట్లు-భ్రమర."

సంగ్రహమును, సామాన్యమును అగు ఉత్తరము చదువుచున్నంతసేపు మోహనుని చిత్తము చికాకు నొందుచుండెను. మొదట దాని నచ్చట విడువదలంచెను. కాని యెట్లో దానిని తుదముట్ట చదివెను. ఈర్ష్యాగ్రస్తమగు నాతని చిత్తము తగినంత జాగ్రత్తతో దానిని చదువుట కిష్టగింపలేదు. చివరమాట చూచినంతనే

యసూయతో తన వామహస్తమున నలిపివేసి కిటికీలోనికి విసరెను. మలగియున్న యుత్తరము కిటికీద్వారమునకు తగిలి వెనుకకు త్రుళ్లి యాతని పాదములవద్ద పడెను. ఆతఱి నాత డేయాలోచనయందు మగ్నుఁడైయుండెనో కాని పడిన యుత్తరము తీసి జేబునందుంచి యచ్చటికో వెడలెను.

* * * *

శ్యామసుందరు భార్య ఇందిర బెజవాడలోనే కన్నవారింట నుండెను. ఇదివఱకామె రెండుమూడు దినములకంటె నెక్కుడు కాలమచ్చట నుండుట కిష్టపడకుండెను. ఇప్పుడత్తింటికి వెళ్లుట కింతయు నాతురపడలేదు. కూతుల చిత్తవృత్తులు కనిపెట్ట జననులు చూచుచుందురు. ఇందిర జనని తనపుత్రిక యేదియో విషయముచే బాధచెందుచున్నదని గ్రహించి యామెను గనిపెట్టుచుండెను. పూర్వము శ్యామసుందరుడు కూడ నిందిరను నిజగృహమునకు గొంపోవ తొందరపడుచుండెను. ఇప్పు డొక్కమారైన నాతడు అత్తవారిల్లు త్రొక్కలేదు. భ్రమర తనకు వ్రాసిన యుత్తరము ఇందిరచదివి తపించుచున్నదని యతడు తలంచెను. దినములు గడచినకొలది తనభార్యను చూడబోవ సిగ్గుచెందుచుండెను. దినమంతయు నొంటరిగా బయటనే గడుపుచుండెను. అప్పుడప్పుడాతని తల్లి యాతనితో ముచ్చటలాడుచు మాటలమధ్య నిందిరను తీసికొనిరమ్మని చెప్పుచుండెను. శ్యామసుందరు డట్టిసమయమున కోపముచూపుచు నచ్చోటు వీడిపోవుచుండెను.

అట్టియుత్తరము మోహనునిభార్యనుండి గ్రహించినందులకు కడు లజ్జించుచుండెను. అందులకు తానే కారణమని తలంచెను. మోహనునిభార్య కంత చనువిచ్చినందుకు తనను నిందించుకొనెను.

స్త్రీలు కుటిలచిత్తలనియు, పురుషుల నడవడులు స్త్రీలహృదయములం దెట్లుప్రతిఫలించునో యెరుగ నశక్యమనియు భ్రమరతో స్వేచ్ఛగా మాటాడకుండినయెడల నిట్టిది సంభవింపకుండుననియు తలంచెను. ఆహా! భ్రమర యెంతసాహసురాలు! బాల్యస్నేహితులగు మోహనశ్యామసుందరుల స్నేహబంధమును త్రెంచివేసినది. స్త్రీల ప్రవర్తనము హేయము. అను తలంపులు శ్యామసుందరుని హృదయమును తినివేయుచుండెను.

గౌరవమును సూచించు నుత్తరమేదియు భ్రమర కాతడు పంపలేదు. ఉమ్మిడి రామయ్యసెట్టి సోదరులకు కొంతపైకమంపి భ్రమరపేర నొక యంగుళీయకము—భ్రమర కోరినరీతిది—పంపుమని వారికి తెలిపెను. ఇట్లు పంపించుటచే భ్రమర తన చెడుకోరిక యీడేరినను నయ్యది యసూయతో బంపబడెనని తలంచునని యాతడుద్దేశించెను. వస్తువును గాంచి పంపినవారెవరో తెలిసికొనలేక హేయభావమున నయ్యది పంపబడెనని భ్రమర తెలిసికొనును. అని తలంచి యాత డుత్తరమైనను వ్రాయలేదు. అతడనుకొనినట్లే భ్రమర తాను కోరినవస్తువుతో ప్రేమపూర్వకమగు లేఖ లేనందుకు కడు విచారించుచు కన్నీరు కార్చెను.

పుష్పఫలసంభరిత తరు సమన్వితమగు తీరమును నదీప్రవాహము క్రమక్రమముగా పాడుచేయుచున్నట్లు అనుమానము, అసూయ, విశ్వాసహీనత, ముప్పిరిగొని యానందముతో కాలముగడపుచున్న కుటుంబములను బాడుచేయు సమయమున సర్వశక్తిస్వరూపుడగు దేవుడు తన యాజ్ఞాదండచాలనముచే ప్రవాహము నడ్డుగా త్రిప్పివేసెను.

* * * *

మోహనుడు బెజవాడకు మరలివచ్చెను. మునుపటికంటె నిప్పటికి నాతనిలో చాల మార్పు కలిగెను. పెండ్లి అయినప్పటినుండి భార్యను విడిచి మోహనుడొంటరిగానుండు టెరుంగడు. కాన నుత్సాహవిహీనుడై యున్నాడని యాతనితల్లి తలచి భ్రమరను తీసికొనిరమ్మని మోహనునితో జెప్పెను. అందుపై నాతడామెవైపు శూన్యవీక్షణములు పఱపగా నామె భయమొంది యాతనితో నా ప్రశంస చేయుటయే మానుకొనెను.

'మోహనుడు తఱుచు మాటాడడు. చిఱునవ్వో మున నెన్నడు దోపడు. శ్యామసుందరుడైన రా మానినాడు. ఒక్కమారైన నాతడిక్కడకు రాకపోవుట

యెంతి శోచనీయము!' అని మోహనుని తల్లి తలంచుచు మోహనునిగాంచి "శ్యామసుందరు డెక్కడనున్నాడు? చాలదినములనుండి కాన్పించలేదు" అనెను. మోహనుడు "నాకేమియు నాలనిగురించి తెలియ"దనుచు నచ్చోటు వీడి వెళ్లబోవ నాతనితల్లి "ఒకమారాతనియింటికి బోయి యీపూట భోజనమునకు పిలువుము." అనిచెప్పెను. అంత నాతడు "నేనొకరియింట భోజనమున కాహ్వానింప బడితిని. కాన నేనీపూటనింట భుజింపను. అనుచు వెడలిపోయెను.

ఏదో ప్రమాదము వాటిల్లెననియు దానిగూర్చి తెలిసికొనుట కూడదనియుదలంచి ఆమె మిన్నకుండెను. దీని తెలిసికొనుటకు తగిన తెలివితేటలు కలది యిందిరయే యని యెంచి యామెను బిలువ సేవకురాలి నొకతెను బంపెను. ఇందిర రానియెడ తనకు గొప్ప ముప్పు వాటిల్లునని చెప్పుమనెను.

ఇందిరయు వెంటనే వచ్చెను. అక్కడకు వచ్చినందువలన తన కేదైన నూతనవిషయము లభింపగలదని యెంచెను. భ్రమర వ్రాసిన లేఖావృత్తాంతముగూర్చి తన చిత్తము తత్తరపడుచుండెను.

మోహను డింటలేడు. ఎవరియింటనో భోజనమునకే యేగెను. కావున నపరాహ్ణమునకు గాని రాడు. ఇది యిందిర కనుకూలము. మోహనుని తల్లి యిందిర నొక యేకాంత గృహమునకు గొంపోయి గడియవేసి యిందిర చేయిపట్టుకొని యిట్లనియెను. "మోహనుని చిత్తాస్వస్థతకు గారణమేమి? ఆతనిభార్య పేరెత్తిన సహింపడు. ఈ యుదయము శ్యామసుందరు నిచ్చటకు గొని రమ్మనికోర ననాదరణతో నిల్లువెడలిపోయెను"

అన నిందిరయు "నన్నావిషయమే బాధించుచున్నది. దీని మూలకారణ మారయవలెను. చిరకాలము నుండి నా కన్నవారియింటనున్న నాకు దాని నిజస్వరూప మెఱుంగ నెట్లు శక్యమగును?"

ఈ మాటలు చెప్పుచున్నపుడు పూర్వపు కీవి యిందిరయందు గన్పడలేదు. ముఖమునందలి కళయంతయు విచారముచే తగ్గినది. ఈ విషయము గమనించినతోడనే యిందిరను గూర్చి మోహనుని తల్లి యెక్కువగా విచారించెను. కడు గారాబముతో నామె చెక్కిలి ముట్టి "నీవేదైన జబ్బుచే బాధ నొందుచున్నావా?" యని యిందిరను ప్రశ్నించెను.

ఇందిర ప్రత్యుత్తరము తత్క్షణ మీయజాలకుండెను. ఆమె కన్నులు బాష్పపూరితములయ్యెను. మోహనునితల్లి యాతురపడి తత్క్షణ మామెచేయిపట్టుకొని యాగదిలోనుండి భోజనగృహమునకు గొంపోయి "ముందు భుజింపుము. నీ వలసియున్నావు. భోజనానంతరము మనము మాటాడవచ్చును" అనెను.

ఇందిర భోజనమువద్ద గూర్చుండెను. ఆమెను మోహనునితల్లి ప్రేమతో నాదరించుచు గావలసిన పదార్థముల నడ్డించుచుండెను. ఈయాదరణచే నిందిరకన్నులు మునుపటికంటె నెక్కుడు బాష్పములచే నిండెను. ఇంతకుముందు ఇందిర హృదయ మొక్కటియే విచారభూయిష్ఠమై యుండెను. ఇప్పుడు వీరి పరస్పరప్రేమాతిశయములచే విచార మిరువురు పాల్గొనిరి. ఆ కారణమున నిందిరయందలి శాంతికి బలము తగ్గెను.

ఎట్లో భుజించి మోహనుడు చదువుకొను గదిలోనికి ప్రవేశించి మునుపటిశోభ లేనందులకు విచారించెను. పుస్తకములు మేజాపై చిందరవందరగా నుండెను. ఏ వస్తువు సరియగు స్థితిలో నుండలేదు. చినిగిన కాగితములు వార్తాపత్రికలు బల్లపైనను, క్రిందను కుప్పలుగా పడియుండెను. గదియంతయు ధూళిచే దట్టముగా కప్పబడి యుండెను. కొయ్యలపై దుస్తులుండక కుర్చీపై బడియుండెను. పడకకుర్చీపై మురికిదుస్తులు దొర్లాడుచుండెను. మోహను డందులేడు. కాని యాతని చిత్తస్థితియంతయు గదిలోనున్న వస్తువులస్థితి తెలియజేయుచుండెను. కొంతవరకు ఇందిర తన్నే మఱచియుండెను. ఒకటి తరువాత నొకటిగా కిటికీలన్నియు నామె తెఱచెను. గదిలోనున్న వస్తుజాలమును క్రమస్థితిలో నుంచనందుల కామె మోహనుని తల్లిని మనసులో నిందించుచుండెను.

మోహనుని తల్లి యాసమయమున భోజనము చేయుచుండెను. ఇందిర యింతలో నా వస్తుజాలమును

సరిగా నుంచుటకు యత్నించుచుండెను. మరికి దుస్తులన్నిటిని మూటకట్టి వేరుగానుంచెను. చొక్కా యీభొత్తాముల నామె తీసి మేజాబల్లలో నుంచెను. ఆ యుత్తరములలో నొకటి భ్రమర వ్రాసినది కాంచెను.

ఉత్తరము నులిపివేయబడియుండుటగాంచి విచారించెను. గుంటూరులో మోహను డుండునపుడు చేరిన యుత్తరమే యది. దానిని నులిపి పాడుచేయయత్నించి మరల జేబులో నాతడు దాచియుంచియుండెను. ఈర్ష్యాగ్రస్తుడై మోహను డా యుత్తరమున కట్టి దుస్థితి కలిగించెనని గ్రహించి దానిని సరిజేసి చదివి భ్రమర దుష్టబుద్ధికి విచారపడి కారణమారయుచుండెను. ఇంతలో మోహనుని తల్లి గదిలో బ్రవేశించెను. తత్క్షణమే ఇందిరయుత్తరమును మేజాబల్లపై నొక పుస్తకము క్రింద నుంచెను. ఇందిర విచారముతోనున్నట్లామె గ్రహించెను. కాని ఇందిర నందువిషయమై ప్రశ్నింప నియ్యకొనలేదు. కొంత సేపైనతరువాత ఇందిర తన కన్నవారి యింటికిమరలెను.

* * * *

రెండుమూడు దినములు పోయినపిదప మోహనుని తల్లి యిందిరను రప్పించెను. ఈ పర్యాయము మోహనుతల్లి యిందిరను మనఃపూర్తిగా నాశీర్వదించెను. ఇందిర మోహను పంచుగది ప్రవేశించెను. ఆమెను గాంచి మోహనుడు వెల్లబోయెను. ఆతని మోమునందలి విషణ్ణత గాంచినతోడనే యామెకు దుఃఖము పొరలివచ్చెను. అంత మనోహరాకార మింతవివర్ణత జొందుట కద్భుతమందెను. ఆతని బిలువలేక పిలువలేక తుదకు "మీ రెట్లున్నారు?" అని ప్రశ్నించెను. "ఏదోయొకతీరుననున్నాను." అని మోటుగా బలికెను. "భ్రమర వార్తయేమైన మీకు తెలియవచ్చెనా?" అని మరల బ్రశ్నించెను. మోహనుడు కొంతవరకు మిన్నకుండి యేమియు పాలుబోక మేజాబల్లనుండి యుత్తరమొండు తీసి యామె వైపు విసరెను. ఇందిర యా లేఖను జదివెను. అండట్లున్నది.

"ప్రాణప్రియా!

మీవద్దనుండి చాల దినములనుండి లేఖ లేమియు రాలేదు. మీ పినతల్లిగారి కుమార్తె వివాహమునకై గుంటూరు పోవుచున్నట్లు మీ చివర లేఖలో వ్రాసితిరి. అక్కడ కార్యభారముచే నుత్తరములు వ్రాయ మీకవకాశము చిక్కలేదని మొదట తలంచితిని. విమల వ్రాసిన యుత్తరమువలన మీరు బెజవాడకు మరలివచ్చితిరని తెలిసికొంటిని. మీరు వచ్చి ఎనిమిది దినములు గతించినవి. ఇంతకాలములో నొక యుత్తరమైన వ్రాయుటకు మీ కవకాశము లేకపోయెనా? నేనుకూడ మీకు వ్రాయలేదు. అట్లు వ్రాయకుండుటకే నిశ్చయించితిని. ప్రతి దినము మీ యుత్తరమునకెదురు చూచిచూచి విసుగునొంది యట్టియాశ విడిచితిని.

మీకు నాపై కోపమా? ఇదివర కెన్నడు మిమ్మేదియు యాచింపలేదు. అట్లడుగుట నేరమా? అట్లయిన మరల నెన్నడేదియు నడుగను. నాకు మంచిపేరే గలిపితిరి. ఏవో బహుమానముల కేనా స్త్రీలు పురుషుల పాదాక్రాంతలు కావలసినది? అట్లు తలంచి మీరు పొరపడితిరి. నాసంగతియా? నేనట్టిది భరింపగలను. కాని ప్రేమరహితమగు బహూకృతి నేనంగీకరింపజాల.

అంత కాఠిన్యము మీరు నాయెడ వహించెదరని నేను కలనైన నెరుగను. నేను మీకు కోపము కలిగించి యుండవచ్చును. అది మీ రెరుగుదురు. నా మనోవ్యాకులత తిరుపతి వెంకటేశ్వరు డెరుంగును.

దురదృష్టవంతురాలు,
భ్రమర"

ఉత్తరము 'కవరు' లో నుంచుచు నిందిర "మీకీ యుత్తరమెప్పుడు చేరినది?" అని యడిగెను. "కొన్నినిముసముల క్రిందటనే" యను జవాబు వచ్చెను. "ఆ బంగీ యేమి?" అని మరల నిందిర యడిగెను. ఆ విషయప్రశంస యిష్టములేని స్వరముతో "నాకు తెలియ"దని యాతడు చెప్పెను. ఇందిర యాపలుకు పెడచెవినిబెట్టి మేజాబల్ల వైపు నడచి దానిపైనున్న బంగీపట్టుకొని పైవిలాసము చూచి "ఇది తిరుపతినుండి వచ్చినట్లున్నది." అనెను. ఆప్రశంసయే మరల చేయుట యిష్టములేనివానివలె "కావచ్చును." అని మోహనుడు పలికెను. మోహనుడు దానిగూర్చి బాగుగా నెఱిగియుండియు నలక్ష్యభావమున

నున్నాడని గ్రహించి బంగీవిప్పెను. అందు అంగుళీయకము ముఖ్మల్ దిండున నమరియుండెను.

ఆమె దానిగాంచి భయకంపితయై మరల "ఇక్కలి



అంతమగు నంగుళీయకము, దీని నెప్పుడుకొంటిరి?" అని యడిగెను. మోహనుడు కొంతదనుక మిన్నకుండి "నాకు కూడ నీవలె దానిని గాంచుట నూతనమే." అనిపలికెను. ఈ విషయమామెకు పెద్దచిక్కుగానుండెను. "అయితే మీరు దీనిని భ్రమరకొఱకు కొనలేదా?" అని మోహనుని మరలనడిగెను. "ఇదివరకే దానికి జబాబుచెప్పితిని." అని కోపముతో బలుకుచు నస్థిమితచిత్తుడై యటునిటు గదిలో తిరుగుచుండెను.

తత్క్షణమే యిందిర బుద్ధి కేదియో గోచరించెను. ఆమె గదివిడిచి మోహనుని తల్లివద్దకువచ్చి యేమియో యామెతో జెప్పి వడివడి మెట్లుదిగి క్రిందికివచ్చెను. ఆమె కొరకు వేచియున్న బండినెక్కి కన్నవారియింటికి వెడలెను. ఇంతలో మోహను డీబంగీనిగూర్చిన సంశయము తీరనందుకు విచారించుచుండెను. 'భ్రమర యంగుళీయకము పంపుమని శ్యామసుందరునికి వ్రాసియుండవచ్చును. అతడు పంపియుండవచ్చును. అయితే ఆ యంగుళీయకమిదియేనా? అదే యయినయెడ నామె యెందులకు తిరిగి పంపును?'

ఇట్టి యాలోచనలో నుండు సమయమున నిందిర మరల గదిలో ప్రవేశించెను. మోహనుడు ఆనందమును సూచించు నామె మోముగాంచి విభ్రాంతు డయ్యెను. అంత నిందిర "భ్రమరవ్రాసిన యుత్తరమొకటి యీ మేజాపై నాదినము నేను కాంచితిని, అది నా కొకమారియవచ్చునా?" మోహనుడు దానిని తీసెను. ఇందిర దానిలో నేదీని స్మరించెను. చిరునవ్వు నవ్వెను. తాను తనవద్ద దాచియుంచిన లేఖయొకటి పైకితీసి మోహనునకు జూపుచు "మీ యుత్తరము మీరు కొనుడు. మీవద్ద నింతకాల ముపేక్షతో జూడబడుచున్న యీ యుత్తరము మీ ప్రియమిత్రునిది. నేను దాని గొంపోయి యాతని కొసగెదను." వేయి క్రొవ్వొత్తులకాంతినిచ్చు విద్యుద్దీపము వెలిగింపబడగానే గదిలోని యంధకారము పంచబంగాళ మగునట్లు మోహనునకు ఈర్ష్యానుమానములచే గలిగిన యజ్ఞానాంధకారము ఇందిర విజ్ఞానప్రాబల్యమున తొలగిపోయెను. మోహనుడు మైమరచెను. ఆప్రయత్నముతో నామె దారి కడ్డు నిలిచెను.

అర్థవంతమగు చిరునవ్వు నగుచు నిందిర "భ్రమర క్షేమము మీరు కోరవలెనని వెంటనే తిరుపతికేగి యామె వద్ద మీ నేరమునకు క్షమాపణ కోరుకొనుడు." అనెను. "నన్నొకమారా యుత్తరమును జూడనిమ్ము" అని మోహనుడన నిందిర యాతని కుత్తరమిచ్చి "మీరే యీ యుత్తరముహక్కుదారున కిచ్చివేయుడని చెప్పుచు వెడలిపోయెను. అనుమానజలదాచ్ఛాదితమగు మోహనుని హృదయాకాశము నిష్కల్మషమాయెను. సాయంసంధ్యారాగము ఆతని మోమున కందమిచ్చెను.

ఆయుత్తరములు రెండింటిని పరిశీలించి లేదీలోకుట్టియేయని కనిపెట్టి యథార్థస్థితి తెలిసికొనెను. తనకు వ్రాసిన యుత్తరము శ్యామసుందరుని విలాసమున్న కవరులోను, శ్యామసుందరునికి వ్రాసినయుత్తరము తన విలాసమున్న కవరులోను పొరపాటున భ్రమర పెట్టెనని యతడు గ్రహించెను. తన తప్పిదమునకు కడు

విచారించెను. శ్యామసుందరుని కలుసుకొనిన తత్ క్షణమే తిరుపతి వెళ్ల నిశ్చయించెను.



"మీరే యీయుత్తరము హక్కుదారున కిచ్చివేయుడు"

*　　*　　*　　*

ఇందిర తన కన్నవారియింటికేగి తల్లిపాదముల కెరగి యత్తవారియింటికి వెంటనే బయలుదేరెను. శ్యామసుందరు డెట్లు మోసపోయెనో యెరిగించుచు నాతని నిందిర పరిహాసోక్తుల ముంచుచున్న సమయమున మోహను డక్కడకు వచ్చి చేరి యాతని గాఢాలింగన మొనరించెను. శ్యామసుందరు డాతని తిరిగి కౌగలించి యంతయు గ్రహించి కన్నీళ్లు జార్చెను. మోహనునితో బెజవాడవెళ్లి తిరుపతిప్రయాణమునకై యాతని పురికొల్పెను. అంగుళీయకము తన పట్టు చేరుమాలున జుట్టి మోహనుని చేయిపట్టి "మోహనా! నామాటయొకటి చెల్లింపుము. నే నీయంగుళీయకమును బంపితి"నని భ్రమర కెరిగింపకుము. అంగుళీయకము భ్రమర పేరను పంపు మని నగలవర్తకునికి వ్రాసితిని. ఇప్పటికి నామె నీవే దానిని బంపితివని తలంచియున్నది. ఆయభిప్రాయము మాత్రము నీవు తప్పింపకు. నేనెట్టి దురభిప్రాయమునను దానిని బంపలేదు. నేను నీవు క్షమింపగలవని యెరుంగుదును. కాని భ్రమరకు తెలసిన నన్ను క్షమింపదు. నేనామె విషయమున మోటుగా ప్రవర్తించితిని."

మోహను డందులకడ్డువచ్చి "నేను నిన్నుచాల నవమానపరచితిని. అట్టి ప్రియమిత్రునియందు నాకు విశ్వాసము లేకపోవు టెట్లు? నాకు నిన్నుగాంచ సిగ్గగుచున్నది." అని గద్గదస్వరముతో బలికెను.

*　　*　　*　　*

శ్యామసుందరుడు రైల్వేస్టేషనువరకు మోహను ననుసరించెను. మోహనుడు బండియెక్కెను. ఆతడు తిరుపతి చేరినవెంటనే భ్రమరయున్న గదికేగెను. ఆమె విచారావస్థగాంచి యాతురతతో నామెను కౌగలించి



"భ్రమరా! చిన్నచిన్న నేరములు క్షమింపబడవలెను. తిరుపతి వేంకటేశ్వరుడు మనల నొక్కటి చేయుగాక" యని పలికెను.

---

# దశరథనిర్వేదము

శ్రీ వేంకట వీరరాజకవులు

భరతునకుఁ బట్టముం గట్టువాఁడ, రామ-భద్రుఁ గానకంపఁగఁ గోరవల దటంచు
నెంత వేఁడిన కైకేయి స్వాంత మెట్టి-కఠిన పాషాణ సదృశమో కరఁగ దయ్యె!

"అద నిదె రాఘవుం బనుప యాగముఁ గాచి నిశాచరావళిం
గదిసి వధింప" నంచు నల గాధిసుతుం డనఁ, గొన్నినాళ్లకే
మదిఁ గలఁతన్ వహించితిఁ గుమార వియోగ భరాన, నిత్తఱిన్
బదియును నాలు గేఁడు లెటు వాసి చరించెద రామచంద్రునిన్!

"తనయుఁడ, నీకు సర్వ వసుధాస్థలిఁ బట్టముఁ గట్టెదన్ వడిన్
గొనుచుఁ ద్వదీయ వృద్ధజనకుం బరితృప్తు నొనర్పు" మన్ననో
టనె పదునాలుగేఁడు లకటా! 'వనులందు వసింపు' మంచు ని
న్ననఁ గలనా! నితాంత కఠినాత్ముఁడ నై రఘురామచంద్రమా!

పొడమినదాది నిన్నుఁ బరిపూర్ణముదంబున నాదు కన్నులం
దిడికొని పెంచి, నీ శుభములే నిరతమ్ము మదిం దలంచి, ఈ
పుడమి సమస్త మేలు దని పొంగుచు నుంటిని గాని ఇట్లు నీ
వడవులపాలు గావలయు నంచు గణింపఁగనైతిఁ బుత్త్రకా!

నారచీరలు దాల్చి దైన్యమున రామ-చంద్రుఁ డరుదెంచి ననుఁ గాంచి, "జనక! కాన
కరుగుచున్నాఁడ దీవింపు" మనిన నేమి-పలుకఁగలవాఁడ! తనయుని పాటుఁ గాంచి!
ధారుణీభార మూన నుత్తరు వొసంగ-వేఁడుటకు మారు తల్లి నీ రేడువత్స
రములు వని కేఁగ వేఁడిన రాముఁ గాంచి-కలఁగు కౌసల్యాశోకమ్ముఁ గాంచఁ దరమె!

మాయురే! ఒక్కనిముసంబుఁ బాయరాని-రామచంద్రు వియోగ కారణముఁ దలఁచి
దినదినంబు గృశించు సతీలలామ-సీత నేజాడ నింక వీక్షింప నగునొ?

"పట్టభద్రునిఁ జేయవలె రాము"నని యిట్లు-సల్పెదే యంచుఁ గౌసల్య నుడువ
"ప్రథమసూనుని మాని భరతునా పట్టాభిషిక్తుఁ జేయుఁ" దని వసిష్ఠుఁ డడుగ
"ఏదోష మెంచి సహోదరు వని కంపఁగా నెంచి"తంచు లక్ష్మణుఁడు వలుక
"కైక మాయలఁ జిక్కి లోకైకవినుతు.ని ట్లొనరింతురే" యని జనము లనఁగ
నేమి ప్రత్యుత్తరమ్ము నే నిడుదు! పూర్వ-జన్మమున నెట్టి పాపంబు సలిపినానొ
ఎట్టివారికిఁ గాని మహీతలమున-కర్మ మనుభవనీయంబు గాకపోదు!

# వ్యత్యయము

వేలూరి శివరామశాస్త్రి గారు

## ౧

*అగ్రహారీకుఁడైన నరసింహులుకు మొదటి నుండియు మాలకాటఁడు పాలేరు. ఇపు డిరువురికి ఎనుబదేండ్లు.

కాటఁడు నమ్మిన బంటు. నరసింహులను దొంగలు కొట్టినపుడు కాటఁడు ఆ దెబ్బలనన్నియు తానే తినెను. పని పట్టినపుడు పలుతూరులు ముసురు రేలలో కాఱడవుల పయనించి దొర కార్యములు సాధించెను. ఊరంతయు కాలిపోవుచున్నపుడు తన శరీరము కాలినను లెక్కగొనక దొరయిల్లు కాపాడెను. అతఁడు తన దొరమీద ఈఁగను వాలనీయలేదు.

నరసింహులుకూడ కాటని కఱవులలో కాపాడెను. పెండ్లి పేరంటములు చేసెను. ఇల్లు కట్టించిపెట్టెను. అన్నవస్త్రము లిచ్చెను. ఇటులు దొరవలన పాలేరును పాలేరువలన దొరయు అభివృద్ధి చెందిరి.

ప్రాయము చెల్లినపయిని దొరకు సోములను కొడుకును పాలేరునకు రాముఁడను కొడుకును గలిగిరి; కాని పాలేరు పెండ్లాము ప్రసవించి మరణించెను. నరసింహుల ప్రోద్బలమున కాటఁడు మరల లచ్చి యను దానిని పెండ్లాడెను. పెండ్లాడిన కొద్ది రోజులకే జబ్బుపడెను. అసలే వృద్ధాప్యము. అందులో జబ్బు.

ఒకనాఁడు దొరయింటికి నలుగురు సాయమున అతికష్టముగా నడిచి వెళ్లెను. ఎదురుగా దూరమున కూర్చుండెను.

సోములు— ఛీ చండాల దర్శనము పొండు! దూరముగా పొండు! అనెను. కాటఁడు దూరముగా తొలఁగి తొలఁగి కూర్చుండెను.

గదిలో జ్వరశయ్యలో నున్న నరసింహులు—ఏమిరా నాయనా! ఏమిటి? అనెను.



మాలఁడు భక్తిపూర్వకముగా తల నేల మోపెను

ఊహు వింటివా? పాము చెవులు! ప్రొద్దునే కాటఁడు, మధ్యాహ్నము కాటఁడు, సాయం

* ఇట్టి వాడుకమాటలు ఇందు ఉపయోగింపఁబడినవి.

కాలము కాటఁడు, ముందు కాటఁడు, వెనుక కాటఁడు, కాటఁడు, కాటఁడు! ఎందులకు వచ్చిన బ్రాహ్మణ్యము! అని సోములనెను.

నరసింహులు కఱ్ఱగొని వాకిటికి వచ్చి అరుఁగుపై కూర్చుండెను. మాలఁడు భక్తిపూర్వకముగా తల నేల మోపెను. బ్రాహ్మణుఁడాశీర్వదించెను. ఒకరి నొకరు ఆరోగ్యమును గుఱించి ప్రశ్నించుకొనిరి.

కాటఁడు— దొరా! ఇఁక నేను జీవింపఁగల ననుకొనను. వేదన ఎక్కువగా ఉన్నది. నా కిఁక స్వామిసేవ తీఱిపోయినది. అనెను.



కాలుఁడు...నరసింహులయెదుట ఒక మూటను విప్పెను

నరసింహులు కంటినీరు పెట్టుకొని— కాటా! నేనును పిన్నవాఁడనుగాను, నేఁడో ఱేపో నా పయనమును సునిశ్చితము. దాని కేమి? నీ విఁక దుఃఖింపకుము. నారాయణ స్మరణ చేయుము. అనెను.

అదియే ఉపదేశముగా కాటఁడు నారాయణ మంత్రమును గ్రహించి తన కొడుకును దక్క తక్కుఁగల బందుగుల దూరముగా పొమ్మని నరసింహులయెదుట ఒక మూటను విప్పెను. నూఱు అఱకాసులు. వాని జూపి— అయ్యా! ఇది తమకడ సంపాదించినది. నా కొడుకు ఇఁక సవతి కొడుకు, అక్కఱలో తమరు విచారించి వానికి ఈయఁగోరుచున్నాను! అని మనవి చేసెను.

నరసింహులు కుమారుని బిలిచి ఆ ధన విషయము చెప్పి భద్రపఱిపించెను. కాటఁడు ముమ్మాఱు మ్రొక్కి సెలవుగొని నారాయణ స్మరణము చేయుచు వెళ్ళిపోయెను.

దొర అచటనే కూర్చుండి పలుమాఱులు ఆవలించెను. నరసింహులకు అదియే తుది సెలవుగా కానిపించెనా? అతఁడు నిట్టూర్చి ఆకాశము చూచుచు కూరుచుండెను. అతని కేమియు తోఁపలేదా? ధనముకన్న విలువగల పదార్థ మేమైన పోవుచున్నదా? ఔను. తానును అతఁడును ఒకరి వెనుక నొకరు దున్నిరి. పాండ్రపొలములను సుక్షేత్రములుగా మార్చిరి. రాత్రి చేని గట్లమీద ఒకరివెనుక నొకరు పరుండిరి. నీరు కట్టిరి; కోసిరి; కుప్పలు వేసిరి; నూర్చిరి. అక్కఱలో సంచులు సాయము పట్టి బండ్ల కెక్కించిరి. వారికి ఇండ్లదగ్గఱనే దవ్వు. పనిలో ప్రేమలో ఒకటే చెయ్యి; ఒకటే మనసు.

కాటని బాహుబలమును, దానికన్న మిన్నయగు విశ్వాసమును తన భాగ్యమునకు కారణము. ఆ భాగ్యముచేతనే తాను బవంతి కట్టెను; కాటనికి పూరిల్లు వేయించెను. తాను పెండ్లాడెను. కాటనికి పెండ్లిండ్లు చేయించెను. ఆ భాగ్యముచేతనే తన కుమారునికి చదువు చెప్పించెను; రాముని కిరస్తానిబడిలో చదివించెను. అట్టి కాటఁడు తనకడనేకాక ఇహలోకము కడ సెలవుగొని పోవుచుండఁగా ధనముకంటె విలువగల ఒకానొక పదార్థము తనను మఱపించిపోవుటలేదా?

చీఁకటిపడిన తరువాత నరసింహులు కాటని గానఁబోయెను. అముదపు దివ్వె వెలుఁగున కాటని కాయమును నరసింహులు కాంచెను. సంతోష దుఃఖములు ఒకే తూరి.

లచ్చి నా గతి యేమి యని నేలకు గోలకు దెచ్చెను. రాముఁడు దొరగారు వచ్చిరని చెవిలో అఱచెను. కాటనికి స్పృహలేదు. నరసింహులు జ్వరబాధచే వడఁకుచు వెనుదిరిగిపోయెను.

నరసింహులు తన ఆస్తిలో మూఁడవపాలు కాటని కొడుకు రామునికి విల్లువ్రాసి రాముని పిలిపించి యిచ్చెను. రాముఁడు దానిని సోములకడ దాఁచ నిచ్చెను.

స్పృహ వచ్చినపుడు దొరకును పాలేరునకును నారాయణస్మరణము తక్క వేఱు మాట లేదు. శ్మశానాగ్నిలో మంటవెలుఁగున స్వామిభృత్యు లిరువురును ఒకరి నొకరు చూచుకొనుచు పరలోక మేఁగిరి.

౭

సోములు హైస్కూలులో స్కూలు ఫయినలుదాఁక చదివెను. ఆ హైస్కూలు వైదిక ట్రస్టీల చేతులలో పెరిఁగెను. దాన ప్రతి విద్యార్థికిని మతవిభాగమున సనాతన ధర్మములు, ఇంగ్లీషు టీకతో గీత పఠనీయములు. విభూతి, బిళ్లగోఁచి మొదలగునవి విధులు కావుకాని ఆదరపాత్రములు. సోములు వీనిని ముఖ్యముగా అనుష్ఠించెను. దిగువ తరగతులలో గెలుపొందెనుగాని స్కూలు ఫయినలు అతని దారిలో కొండవలె అడ్డుపడెను. తండ్రి గతించిన పదఁపడి చదువుటకు తీరిక లేనివాని వైచెను.

బ్రాహ్మణునకు సేద్యము పాడి గాదని సోముల మతమే కాని రాఁబడిని చూచి ఎత్తి వేయలేదు. ఒకటి రెండు సంవత్సరములు అతిక్రమించిన పిమ్మట తాను చెప్పిన కూలి నాలికి ఎవరును రాకుండుట వలనను తన ఆచారమునకు మాలమాదిగలు పనికి రాకుండుట వలనను, 'శూద్ర స్సర్వస్య ఘాతకః' అని శూద్రునం దిష్టము లేకుండుటవలనను, విశేషించి తాను కష్టపడ లేకుండుట వలనను వ్యవసాయపు కామాటము ఎత్తివేసెను.

రాముఁడు వచ్చి గోడచాటున నిలువఁబడి అయ్యా తమ తండ్రిగారికడ చిన్ననాట నుండియు నాతండ్రి పాలేరు. వారి రెండు స్థానములందు మనమున్నాము. మానాయన విశ్వాసమే నాకును గలదు. అదియు తమకు

విదితచరము. ఆ దయనే తమరు నా యందు ఉంపుఁడు. నేను వ్యవసాయ మంతయు చేసె దను. మీరు లోటుపాటులు సవరించుకొను చుండుఁడు. అని మనవి చేసెను.

సోములు—ఏమీ? 'వారి' 'మనము' 'మా నాయన'? చిత్తము దేవర యాజ్ఞ! వ్రాత్తివ్రాత్తి! వ్రాత్తివ్రాత్తి!!! చండాలుఁడు నాకు చెప్పుట?

రాముఁడు—అయ్యా! ఒప్పో తప్పో చెప్పితిని. తమకు ఇష్టము లేనిచో పోనిండు! విల్లు నాకు దయచేయుఁడు. నా కిచ్చిన పొల మును పాలుకిచ్చితిరి. దానినే ఖాయపఱచి



నా అనుమతి లేకుండ విల్లు వ్రాయుటకు నా తండ్రికేమి హక్కు?

ఆ అంబారము నా కిప్పింపుఁడు. కాదందురా ఈయేడు తమకే తీసుకొని ముందటికి నాకు విడుదల చేయు డనెను.

సోములు— ఏమిరా? నా అనుమతి లేకుండ విల్లు వ్రాయుటకు నా తండ్రి కేమి హక్కు? దొంగలూ దొంగలూ కలిసి ఊళ్ళు పంచుకొనిరఁట! చాలు నీమర్యాద. నీ మొగము చూడరాదు. చీచీ లేచి పో! చేతనగుచో వ్యవ హారము చేసికో. మరి మాటాడకు. అని లోపలి నుండి విల్లు తెచ్చి ముక్కముక్కలు చేసి వానిమీద పాఱవైచెను. మరి రెండు తిట్టి లోనికిఁబోయి తలుపులు మూసికొనెను.

రాముఁడు ఆ కాకితపు ముక్కలకేసి చూచుచు చాలసేపు నిలువఁబడెను. నిలువఁ బడి నిలువఁబడి ఆ ముక్కల నన్నిఁటిని పోగు చేసెను. ఆతఁడు రొండి తడుముకొన లేదు. చుట్ట కాల్చడు కాన అచట నిప్పుపెట్టె ఉండదు. ఇంటికి పరువున వెళ్లివచ్చి ఆ ముక్కల ప్రోవు నకు నిప్పుపుల్లగీచి అంటించెను. అది నిమిష మాత్రమున కాలిపోయెను. రాముఁడు వెను దిరిగి చూడక వెళ్లిపోయెను. రంయిమని గాలి తోలి ఆ కాలిన ముక్కలు ఎక్కడి వక్కడ కొట్టుకొని పోయెను. అచట దాని చిహ్నము కూడ లేదు.

సోములు రాత్రి సగపడ భోజనమయిన వెనుక రివ్వున లేచి వాకిటికిఁ బరువిడెను. ఇటులు పరువెత్తుట పాతికె సారు లాయెను గాన భార్య భయపడలేదు గాని పిచ్చియెత్తెనేమో యనిమాత్ర మనుకొనెను. సోములు కాగితపు ముక్కలు వెదకెను. ఒక ముక్కయేని ఆ యంధకారమున గానిపింపలేదు.

ఈ లోపుగా భార్య లాంతరు గొని వెళ్లెను. ఇపు డా వెలుఁగున సోములకు మరి కాస్త అంధకార మధికమే ఆయెను. అతఁ డాకాశముదిక్కు చూచి పిడికిలించి విధవ! వాఁ డెత్తుకొనిపోయినాఁడు. కానీ! కోర్టున్నది. వాఁ డున్నాఁడు. ఈ యాస్తి వెల ఎంతయుండునో అంతయు వ్యయము చేయింపక దీనిని వానికి దక్కనివ్వను అనుకొనుచు లోనికేఁగెను.

భార్య అనుగమించుచు 'మీరు విల్లు చింపితిరని నేరము రాదుకదా కొంప తవ్వి?' అనెను.

సోములు అరుణసయనములతో,ఉబ్బిన నాడులతో అదరు ముకుజెమరలతో భార్య కేసి చూచెను.

3

లచ్చి యింటనున్న దెల్లయు పుట్టినిం టికి నడచెను-ఇంటిపై నున్న కలప తప్ప. సవతికొడుకుతో కయ్యము పెట్టుకొనెను; అతఁడు మాత్రము కీఁచులాడలేదు. కావున రెండు పక్షములను తానే పోరాడెను.

రాముఁడు తల్లిని బతిమాలుకొనెను. లచ్చి వినలేదు. ఇంటిలో సగమైన ఇమ్మని పోరుపెట్టెను. రాముఁ డిచ్చెను. వారింతె కోఁత లయిన పిదప కుండయు కర్రియు తీసికొని రామునితో చెప్పకుండ పుట్టినింటికి లేచిపో యెను. కొలఁదినాళ్లకే లచ్చి యన్నదమ్ములు వచ్చి ఆయిల్లు సోముల కమ్మివైచిరి.

రాముడు లోగడ అన్నము లేకపోవు టెఱుఁగఁడు. వండుకొనుట అసలే యెఱుఁగఁడు. రెణ్నాళ్లనుండి ఉపవాసము.

ఈ యవస్థయంతయు బడిలో అత నితో చదువుకొన్న రెబెకా చూచెను. తలి దండ్రులకు తెలియకుండ అన్నము తెచ్చి నిద్రించుచున్న రామునిముంగల పెట్టెను. పరి కించి చూచి వెళ్లిపోయెను. ఆదారిని బోవు పాదిరీతప్ప ఆవిషయ మితరు లెఱుఁగరు.

కొంతవడికి రాముఁడు మేలుకనెను. అన్నముచూచి—ఆహా భగవానుఁడా! నా యెడ నీ కెంత దయ! నా యాఁకలికూడ నీకు తెలిసెనా? అనెను.

అతని కన్నులనుండి నీరు జల జల రాలెను. వాకిటికి వచ్చి చూచెను. ఎవరును లేరు. భగవన్నామోచ్చారణము చేయుచు అన్నముముందు కూర్చుండి భుజించుచుండెను. కంచె యావలినుండి రెబెకా రెండుకన్నులును రామునిపై బడెను. రాముఁడును రెబెకాను చూచెను. ఆచూపులో అన్నదానముకన్న ఆత్మదాన మెక్కుడుగాఁ గానిపించెను. వినయ పూర్వకముగా తలవాల్చెను. రెబెకా తలవంచి చిఱునవ్వుతో లోనికేఁగెను.

రాముఁడు రెబెకాకు అన్నమిడు నవకాశము మరల ఈయలేదు. కాని చూచు టకు మాత్ర మీయకపోలేదు. రెబెకా రాముల రహస్య ప్రసంగములను రెబకా తలిదం డ్రులు. అవరోధింపలేదు. రెబెకా రాముని



(౧౨) కట్టితెర



(౧౩) ౧౯౨౪వ సంవత్సరమున జరిగిన వెంబ్లి ప్రదర్శనమున ప్రదర్శింపబడిన కొన్ని సామానులు



(౧౮) నూకుమాని కుర్చీ
దీనిని విడదీసి మరల కూర్చుకొనవచ్చును.



(౧౫) తాపడపు పనిచేసిన నూకుమ్రాను బీరువా

కిరస్తాని మతమున కలియు మనెను. రాముఁడు కిరస్తాని మతమున నేమి యని యడిగెను. రెబెకా చెప్పలేకపోయెను. రాముఁడు లోతుగా చూచెను.

ఒకనాడు ఫాదర్ రెబెకాతండ్రి విశాఖను (Issac) పిలిపించి-నీకుమూర్తి రాముని ప్రేమించుచున్నట్లు నాకు తెలియును. దానికి నా ముద్దులు చెప్పవలెను. అయితే రాముని ఎంత వడిగా కిరస్తాని మతమున కలుపఁగలుగుదునో అంతవడిగా పెండ్లి చేసికొనవచ్చును.. మీ రందఱు కలిసి ఏసు దయచే అతనిని వెంటనే. మతమున కలుపుఁడు; పొండు. ఇదిగో, మత ములో కలిసిననాఁడే వాఁడు పంతులు: నీకూఁతురు పంతులమ్మ. తెలిసినదా? అనెను.

ఈ వార్త తెలుపుటకు విశాఖ రాముని కడకు వెళ్ళెను. రాముఁ డాలోచించుకొనుచు కూరుచుండెను. విశాఖ రాగానే లేచి గౌరవించి కూర్చుండఁబెట్టెను.

నీవు వెంటనే మతము పుచ్చుకొనవలె నని విశాఖ. ఏల? యని రాముఁడు. పుచ్చుకొననిచో రెబెకా నీయ వీలులేదని విశాఖ. నేను గర్భదరిద్రుఁడను; మతమున కలిసిన మాత్రమున ఇత్తువా? అని రాముఁడు. ఆ మాటల కేమి? మతము 'స్వీకరించుచో పంతుల వగుదువు; మా అమ్మాయి పంతులమ్మ యగును అని విశాఖ.

గంభీరముగా ఆలోచించి రాముఁడు-సరే ఆలోచింతు ననెను. ఏసంగతియు రేపు చెప్పుమని విశాఖ యనెను. రాముఁడు సరి యనఁగా విశాఖ వెళ్లిపోయెను.

రాముఁడు వెంటనే సోములకడకు వెళ్లి అయ్యా! నాకు అన్యమతమున కలియవలసి వచ్చిన దుర్గతి పట్టినది. మా నాయన మీ కడ దాఁచినధన మీయఁగోరుచున్నాను అనెను.

వికటవు! నీవు! నీ కొక అన్యమతము! నీవు మతములో కలిసినంతమాత్రమున మా మతమునకు ఏమియు ధోకా లేదు లే.

అయ్యా: ఆ మాట అటుంచుఁడు: డబ్బు మాట చెప్పుఁడు.

ఆ మాట చెవులఁ బడఁగనే సోములు కనులెఱ్ఱజేసి లోనికి బరుగెత్తి రివాల్వరు తెచ్చెను. తల్లి వెనువెంటనే వచ్చి నేరుపుగా లాఁగికొని సూతఁబాఱవైచెను. సోములు చండాలప్రేమ అని తల్లిని తిట్టి నూత దిగు ప్రయత్నమున నుండెను.

రాముఁ డచటినుండి పద్మనాభశాస్త్రి గారియింటికి వెళ్లెను. 'శుని చైవ శ్వపాకేచ బ్రాహ్మణా స్సమదర్శినః' 'శుని అంటే కుక్కయందునూ నున్నూ శ్వపాకే అనఁగా కుక్కలు తినే మాలమాదుగలందునా నున్నూ బ్రాహ్మణులకు ఒకటేచూపు' అని వినఁబడుచుండఁగా ఉపశాంతి కలిగి దూరముగా కూర్చుండెను. పద్మనాభశాస్త్రి రాముని చూచి పాఠము చెప్పుట చాలించి పదిమంది శిష్యులతో బయటికి వచ్చెను. రాముఁడు దండప్రణామము చేసెను.

శిష్యులందఱు పక్కన నవ్విరి. పద్మనాభ శాస్త్రికి కోపము పెరిఁగెను. వాడలోని బ్రాహ్మ



"బ్రాహ్మణులందఱు వచ్చి నాళ్ల నడుమ కేల వచ్చితివని రాళ్లు రువ్వి కఱ్ఱలు విసరిరి."

ణులందఱు వచ్చి నాళ్ల నడుమ కేల వచ్చితివని రాళ్లు రువ్వి కఱ్ఱలు విసరిరి. రాముఁడు దెబ్బలు సహించుచు మాటాడక వెళ్లిపోయెను.

రాముఁ డింటికిఁబోయి ఇఁక అన్నము తినవచ్చును, బైబిలు చదువుకొనవచ్చును అని అనుకొనెను.

రాముఁ డామఱునాఁడే మతమున కలిసి జకరయ్య యాయెను. ఆమఱునాఁడే రెబెకాను పెండ్లాడెను.

౪

జకరయ్యకు బైబిలుచే నోరు నిండెను గాని అన్నముచే కడుపు నిండలేదు.

రెబెకా జకరయ్య లిరువురు నెలరోజులు రెండుపూఁటలు ఫాదిరీ యింటిచుట్టూ తిరిగిరి. ఫాదిరీ తనకు నూటయేఁబది రూపాయ లిచ్చుచో పాతికె రూపాయల ఉద్యోగము నిప్పింతుననెను.

అయ్యా! అన్నముచే కడుపు నిండుట యొకటి; బైబిలుచే నోరు నిండుట యొకటి. ఈ రెండును నన్ను కిరస్తాని మతమునకు గుంజినవి. నేను పూటకూటికి టికానా లేనివాఁడను. నూటయేఁబదిరూక లీయఁగలుగుట ఈ జన్మమున ఇఁక నసంభవము.

జకరయ్యా! ఓటిమాట ఎందుకు? నీ కెంత డబ్బున్నదో ఎవరివద్ద నున్నదో మాకు తెలియదా? కాటఁమా కాసులమూటా అందఱకు తెలియును.

అయ్యా, కాదు కాదు. కాసులమూట మాట నిక్కమే. మా నాయన అప్పండి వారి కిచ్చివేసెను గాని అది మాది కాదు.

ఫాదిరీ నవ్వి ప్రకృతము ఆఱురూపాయలకొకటి. అయిదు రూపాయలకొకటి ఖాళీ ఉన్నవి మీ యిద్దఱు ప్రవేశింతురా? అనెను.

రెబెకా జకరయ్యలు సంతోష పూర్వకముగా అంగీకరించి వెళ్లిపోయిరి.

వారు దూరముగా వెళ్లుటచూచి ఫాదిరీ కంటిజోడు మేజాబల్లమీఁదఁ బెట్టి— తెలివి తక్కువవారు— ఫూల్‌స్— ఇపు డేమయ్యె నది? ఒకటి ౧౫, మరొకటి ౧౦ ఖరసి ౨౫. వీరికిచ్చునది౧౧ తీసివేయఁగా ౧౪. ౧౨౧౪ లు = ౧౬ ౮. ౧౫౦ ఇమ్మనఁగా సకల అబద్ధములూ ఆడినాఁడు. ఇపు డీక ఏఁటేట నూట అరువది యెనిమిది రూపాయలు అకు రాలా యిచ్చునఁగాక అని అనుకొని గుడిలోనికి వెళ్లిపోయెను.

రెబెకా జకరయ్యలు పంతులమ్మగాను, పంతులుగాను ప్రవేశించిరి. రెబెకాకు పది, జకరయ్యకు పదియేను, అసలు జీతము. ఇది వారెఱుఁగరు. ఫాదిరీ వారికి గురుదేవుఁడు.

ప్రతి ఆదివారము రెబెకా జకరయ్యలు చెరియొక పావలా ఏసుపేర ముడుపీయవలసియుండెను. మరియు మరికొన్ని పండువులలో మరికొన్ని ముడుపులు కట్టవలసియుండెను. ఈ విషయమంతయు పర్యాలోచింపఁగా కుడిచేతితో ఇచ్చి ఎడమచేతితో లాఁగికొనినటులుండెను. వీనికి చెల్లఁగా మిగిలిన ద్రవ్యము వారిరువురి పొట్టలకు చాలలేదు. ప్రొద్దుగ్రుంకులు బడిలో వాగి వాగి యింటికడ వారికి వాకట్టు.

ఫాదిరీ తమ జీతములో సగము హరించుచున్నటులు జకరయ్యకు కర్ణాకర్ణికగా తెలిసెను. జకరయ్య మొదటమొదట నమ్మలేదు కాని పిదపఁబిదప సత్యము తెలిసికొనఁగలిగెను.

జకరయ్య ఒకనాఁడు ఫాదిరీ దర్శనమునకు వెళ్లెను. అతఁడు బైబిలు చదువుకొనుచుండెను. జకరయ్య వందనముచేసి తన దైన్యమును చెప్పికొని ప్రకృతము జరుగుచున్న అన్యాయమును పైకి పోనీయకుండ సర్దుపాటు చేసి తనను అనుగ్రహింపవలసినదనియు మతముయొక్క సత్యమునకు తాము తండ్రులనియు మనవిచేసికొనెను.

ఫాదిరీ చిఱునవ్వుతో—ఓరీ! మేము ఏసు కులమువారము, సాక్షాత్తు వారికి శిష్యులము. మీకును ఏసునకును సాక్షాత్సంబంధము లేదు. మాగుండా మీరు ఆ యేసుప్రభువు గుడి వాకి



"మీ నల్లవారందరు మాకు బానిసలు. బానిసలయందు ఉంచవలసిన దయ మాయందు చాలఁగలదు."

టికి మాత్రము వెళ్లఁగలరు. మీ నల్లవారందరు మాకు బానిసలు. బానిసలయందు ఉంచవల

పిన దయ మాయందు చాలఁగలదు. నేను చేయగలిగినంత ఉపకారమును చేసివేసితిని. ఇఁక నా చేతిలో ఏమియులేదు. అనెను.

జకరయ్య తలవాల్చి—And unto him that smiteth thee on the one cheek offer also the other; and him that taketh away thy cloke forbid not to take thy coat also— అని లోలోపల అనుకొనెను. ఫాదరీవద్ద సెలవు పుచ్చుకొని వెళ్లిపోయెను.

కొలఁది రోజులలోనే రెబెకా జకరయ్యలకు ఉద్యోగము ఉద్వాసిత మయినటులు తెలిసెను.

రెబెకా ఆనాఁడు భర్తతో క్రిస్తాని మతము కానిమతము అనెను. జకరయ్య చెలు. నవ్వు నవ్వి నేను పద్మనాభశాస్త్రిగారి యింటికి వెళ్లినపుడు వారు 'శుని చైవ శ్వపాకేచ పండితా సమదర్శినః' అని చదువుచు నన్ను మాడఁగనే తన్ని తగిలినారు. ఫాదరీని చూడ వెళ్లినపుడు వారు 'For whosoever shall do the will of my Father which is in heaven, the same is my brother, and sister, and mother' అని చదువుచున్నారు. నాకు అన్యాయము చేయవలదని వేడుకొనఁగా మీకును ఏసునకును సాక్షాత్సంబంధము లేదు; మాగుండా మీరు ఏసుప్రభువు వాకిటికిమాత్రము వెళ్లఁగలరు. మీ నల్లవారంగులు మా బానిసలు అని తెగడెను. పైని డిస్మిస్ చేయించెను. కావున ఏమతములో తప్పు గలదు మనుష్యునిలోఁ గాక? మానవుల కందఱకు ఒక్కటే మతము కలదు—సమదర్శిత్వము అనెను.

ఆనాఁడు వారికి ధర్మప్రశ్నములతో సరిపోయెను. వారికి దైనందినము గీతాబైబిలుల పారాయణఫలముతో పాటు ఉపవాసవ్రతఫలమును సంపూర్ణముగా లభించుచుండెను.

౫

జకరయ్య ఉదరపోషణకు కాపు భోగయ్యనాశ్రయించెను. ఆశ్రయింపఁగా నాశ్రయింపఁగా ఈ క్రింది పత్రకము కుదిరెను—
"సేద్యమునకు కొంత పొలమిచ్చి పెట్టుబడి పెట్టుట; పంట సాంబాలు; పెట్టుబడిలో సాలుకు ఏఁబదిరూకలు చెల్లుపెట్టుట; పెట్టుబడిమీఁద వూపాయి తొమ్మిదణాల సాలుసరి కాంపౌండు వడ్డీ; ఇల్లూ దొడ్డి తాకట్టు." ఈనియమములతో జకరయ్య అరక కట్టి పొలమున అడుగుపెట్టెను.

జకరయ్య రెండుజాముల వఱకు దున్నఁగా సాయంకాలము వఱకు రెబెకా ఎడ్లమేపును. భర్త మోట తోలఁగా భార్య నీరు కట్టును. వారిరువురును చోడినారు పోసి పెంచి ఊడ్చిరి; మిరపతోఁట పెట్టిరి; పొగాకుతోఁట వేసిరి. రాత్రి రెబెకా రాటముమీఁద నూలుతీయుచు భర్త బైబిలుచదివి చెప్పఁగా ఆలకించుచుండెడిది.

జకరయ్యకు పాటకపు జాతిలో పలుకుబడి ప్రబలము. బిడపు వచ్చినపు డెల్ల అతని కొకనాఁ డతిథి.

ఈ గౌరవములలో అతఁడు తన సేద్యమును మఱవలేదు.

ఒకనాఁడు రైలులో సోములును ఫాదిరీయు కలిసిరి.

జకరయ్య మీ మీఁద పిటీషను పెట్టవను కొనుచున్నారు.

దానికేమి? మీవిల్లుముక్కలు కోర్టుకెక్కునట.

జకరయ్య దుర్మార్గుఁడు.

జకరయ్య ఇన్‌ఫిడెల్, పతితుఁడు.

వానిని నంచుటకు ఏమి ఉపాయము?

మీకు చేతనైన ఉపాయముచేయుఁడు; నేను మీకు భయమురాకుండ జేయుదును. మిషనరీకి ఎంతప్రభావ మున్నదో మీ రెఱుఁగరా?

ఎఱుఁగుదును ఎఱుఁగుదును. మిమ్ము నమ్మనా?

క్రీస్తుమీఁద ఒట్టు.

ఇరువురును రైలు దిగి పోయిరి.

పంటలు చక్కఁగా పండెను. పైరకు పైరొఅగి నేలమీఁద వాలుచున్న చామచిలుక దండు రెక్కలవలె నుండెను. పొగాకు మొక్కలు 'నన్ను కాల్పవలదు నన్ను కాల్పవలదు' అను చందముగా వెడఁద బారు టాకులతో చేతు లొగ్గి నిలువఁబడెను. తవిఁద యాకులు తమ లక్ష్మినంతయు ఎన్నులకిచ్చి దివాలాతీసెను.

రేపు లేక ఎల్లుండి కోయవచ్చుననఁగా భూతములలో కల్లోలము పుట్టెను. గాలి చెలరేఁగెను. మబ్బులు కమ్మి తళిమి తళిమి ఉఱిమెను. పాములవలె మెఱుపులు, ఫిరంగిగుండ్లవలె పిడుగులు, తుపాను. తన కూఁతురైన భూమిని జలము పెద్దపులివలె గ్రసించెను, జపముల కేటి పాడి?

జకరయ్య ఈ వ్యత్యయములో జైనాచార్యులవలె జగదనిత్యతను తెలిసికొనెను.

పదిరోజులకుఁగాని భూతములకు సమత్వము కలుగలేదు.

జకరయ్య భోగయ్యవాకిట నిలిచెను. భోగయ్య దైవికముగా పంట పాడగుటకు చింతించెను. పిదప ఇట్లనెను—నీవు బాకీ తేల్చలేవు, ఈ సాలుకు పెట్టుబడిలో ఈయవలసిన ఏఁబది రూకలు తెచ్చి యిచ్చితో పొలము నీ క్రింద నుండునటులు చూతును. పండినను ఎండినను మిషనరీవారు నీకంటె ఎక్కువ డబ్బు ఇత్తుననిరి, వారి కిచ్చెదను.

అయ్యా! నే నీయఁగలుగుదు ననియే అడిగితిరా?

నన్నిఁక నేమియు అడుగవలదు. చేతనైనచో పైకము తెమ్ము.

జకరయ్య మాటాడలేదు. భోగయ్య సమాధానముతో పనిలేక కాఁబోలు లోనికి వెళ్లిపోయెను.

రెబెకా యింటికి వచ్చిన భర్తముఖము చూచి స్థితిగతులు మాఱెనని తెలిసికొనెను.

అతనికి అన్న మిడుట కింట నూకలు లేవు. నాలు కండెలమ్మి నూకలు తెచ్చుటకు సాలెయింటికి వెళ్లెను.

అతఁడొంటిగా కూర్చుండికూర్చుండి వగచి వగచి యింటిలో అటిటు తిరుగుచుండెను. అపుడచటికి విశాఖ వచ్చెను. అల్లుమామలు కూర్చుండిరి.

జకరయ్యా! మీనాయన నరసింహులుగారి కడ కాసులమూట దాఁచినట్లు వినుకలి. అదియు గాక నరసింహులుగారు నీకేదో విల్లు వ్రాసి యిచ్చినటులును వాడుక. దానివలననే నీకు మేము పిల్లనిచ్చితిమి. ఇట్టి కటకటలో ఆ ధన మేల తెచ్చికొనవు? నీకు పిఱికితనమాయె నేని నే నడిగివచ్చెదను.

నేను పెండ్లికాకమునుపే గర్భదరిద్రుఁడ నంటిఁగదా! కాసులమూట నీటిమూట. విల్లు పొల్లు.

విశాఖ ఆ మాటలు నమ్మలేదు. లేచి సోముల యింటికి వెళ్లెను. ఆ యింటికి తాళము. జలప్రలయమునకు అతఁడు కొండదరి తోఁట లోనున్న యింటిలో కాఁపురముండెను. విశాఖ అక్కడికి వెళ్లెను. సోములు విశాఖనుచూచి తగవులాడ వచ్చె ననుకొనెను. అటులే యయ్యెను. క్రమముగా తగవు పెరిఁగెను. సోములు లోనికేఁగి తలుపులు మూసికొనుచు- ఆకాకితపుముక్కలను తీసికొని వాని నొంటిగా నా కడకు రమ్మనుము అని అఱచెను. విశాఖ శఠియని వెళ్లెను.

సోములు దూరముగానున్న జకరయ్యను చూచెను. వస్త్రము కప్పుకొని అరుఁగుమీఁద కూర్చుండెను. అతనికనులు చంద్రనిప్పులు. నరములు ఉఁడుతితిత్తులు. మొగము కొలిమి. జకరయ్య నమస్కరించి నేలమీఁద దూర ముగా కూర్చుండెను.

కాకితపు ముక్కలు తెచ్చితివా?

అయ్యా! నాఁడే తగులఁబెట్టితిని. మీకు ఆ సందేహము పోగొట్టుటకే వచ్చితిని.

ఈయవా? ఈయవా?

నిక్కము. తగులఁబెట్టితిని.




"కొండపై ప్రతిధ్వనింపక మునుపే జకరయ్య నేలపై వ్రాలెను."

ఇదిగో మా నాయన కళంకము మాపె దను. అని సోములు బట్టచాటున నున్న పిస్తోలు నెత్తెను.

ఏసు మిమ్ము రక్షించుఁగాక !

నీ యేసు నిన్నే రక్షింపలేఁడుచూడుము అని సోములు పేల్చెను. కొండ ప్రతిధ్వనింపక మునుపే జకరయ్యా నేలపై వ్రాలెను. సోములు దగ్గఱకు వెళ్లి చూచెను. ఒక కాకితపు ముక్కయు లేదు. సోములు పాఱిపోయెను. జకరయ్యా కష్టముగా లేచి దూరముగా వెళ్లి లోయలో పడిపోయెను.

క్రమక్రమముగా గ్రామమంతయు గుమిగూడెను. రెబెకా బియ్యపుమూటతో వచ్చి కాళ్లకాడ కూర్చుండి అతని మోమును నిబ్బరముగా చూచుచుండెను. అతనియత్తమామలు సోములను తిట్టుచు ఏడవఁదొడఁగిరి. జను లందఱు ఇంటిలోని కుతికిరి. శూన్యము.

పోలీసువారు వచ్చిరి. వారిమాట వినఁబడఁగనే జకరయ్యా కనులు తెఱచెను. ఇన్‌స్పెక్టరు దగ్గఱకు వెళ్లి నీ మీఁద పిస్తోలెవరు పేల్చిరి ? అని అడిగెను.

జకరయ్యా—నేనే

ఇన్‌స్పెక్టరు పెదవి విఱిచి—ఎందులకు ?

జకరయ్యా—కేవలము నేనే నేనే నేనేలని శ్వాసలు విడిచెను. రెబెకా మూర్ఛిల్లెను.

---

# సుధాకర తత్త్వము

విక్రమదేవవర్మ గారు

సుధ యన నమృతంబు సున్నంబు నౌసుధా
కరుఁ డనంగ ధవళకిరణుఁడ సుమి
సుధ కిర వను సుద్ది సూరికల్పిత మగు
నమృతమునకు వసతి యగునె గ్రహము?

---

# నే ధన్యనైతిని!

**శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయి గారు**

లీలా! లీలా! యింతవఱకేమి చేయుచుంటివే! అబ్బా! రాట్నమున్న నీకు తిండియు, నిద్రయు కూడ నక్కఱలేదుగదా! తండ్రిగారు నీకొఱకై వేచియున్నారు. భోజన మొనర్చి తిరుగబోగూడదా!' యనుచు కమలాబాయి లోవసారాలోనుండి తన ప్రేమరపుపుత్రిక యగు లీలను పిల్చుచుండెను. 'వచ్చుచుంటి నమ్మా' యని చెప్పుచు లీల రాట్నము నక్కడ దిగవిడచి కదురు తీసి తన బీరువాలో జాగ్రత్తపరచి తండ్రియొద్దకు జనియెను.

శ్రీనివాసరావుగా రప్పుడే భోజన మొనర్చి కోటు తొడుగుకొని కమలాబాయి అందిచ్చు తమలపాకు మడుపు లందుకొనుచు నే డెక్కడ మన లీల జాడ గాన బడదే! పాఠశాలనుండి యింటికి వచ్చినదా? యని యేమొ పల్కబోవుచుండగనే లీల తండ్రిగారిం జేరి, 'నాయనా! రేపు రాబోవు డిసెంబరునెలలో జరిగెడి కాంగ్రెస్ మహాసభకు జరుగబోయెడి వస్తుప్రదర్శనమునకై మా పాఠశాలోపాధ్యాయులు యే బాలికలు చాల సన్నముగ నూలు వడకి తెత్తురో వారలచే నూలు దండలు తయారుచేయించి వారలకొక బహుమాన మిత్తుమని నుడివియుండుటచే నే పాఠశాలనుండి వచ్చినదాది రాట్నమువద్ద నే యుంటిని కాన నా ఆలస్యమునకు క్షమింపవే డెదనని పలికెను. 'అమ్మా! నీ కార్యదీక్ష కెంతయు సంతసించితిని. లెమ్మ వేగ జని భోజన మొనర్చి, నూలు వడికి నీ తోడిబాలికలలో విజయలాభమంది నీ వుపాధ్యాయుల ఆదరమునకు పాత్రురాలవు కమ్మని ఆశీర్వదించి తండ్రి ప్రొద్దుపుచ్చు జేసి వేవేగ కోర్టునకు వెడలెను.

శ్రీనివాసరావుగారు ఆ గ్రామమందు పలుకుబడి కలిగిన యొక సంపన్నగృహస్థు; శాంతస్వభావము గలవాడు; భూతదయాపరుడు; బిరుదు లనెడి బురదలో దిగబడి ధనతృష్ణాతురుడై స్వార్థమన్నది పీడకయుండు పెద్ద మనుష్యులవలెగాక, తన కున్న కొద్దియో గొప్పయో పరులసహాయార్థమై వినియోగించుచు, తోడిసత్పురుషుల మెప్పిందుచుండెడివాడు. కమలాబాయికూడ తన పతి సుగుణముల కేమాత్రము తీసిపోవక, పతి ఆదరణకు లోనై ఆయన సత్సంకల్పములకు చేయూత నొసంగుచు తోడిస్త్రీజాతి కెల్ల తల మానికమై యొప్పుచుండెను. ఈ కమలా శ్రీనివాసదంపతుల కేకమాత్ర పుత్రిక లీల. లీల లీలలం గాంచుచు ఆ దంపతు లందుచుండెడి సంతోషమునకు మేర లేదు. అయిదేడులు వచ్చినతోడనే లీల తనకు తానై పాఠశాలకుంబోయి యుపాధ్యాయులు చెప్పెడి పాఠములం దధికశ్రద్ధ వహించి వారియెడ వినయ వివేకములతో ప్రవర్తించు తన నెచ్చెలులలో నగ్రగణ్యయై వెలుగుచుండెను.

సాయంకాలమయ్యెను. గోగణము తమతమ నెలవులు చేరుచుండెను. పక్షులు నోట నొక్కనిడి తమతమ నిలయముల వైపు తిరుగుచుండెను. బాలురు, బాలికలు, పాఠశాలల విడిచి తమతమ పాఠములగూర్చి యొండొరులతో ముచ్చటించుకొనుచు ఇండ్లకు జేరుచుండిరి. లీల కూడ చేత పుస్తకములనిడి గృహము జేరెను. కమలాబాయి లోన వంటచేయుచుండెను. వంటపనులలో తల్లికి కొంత సహాయ మొనర్చి లీల తన చిన్ని పూదోటలోని మొక్కలెట్లున్నవో చూడనేగెను. శ్రీనివాసరావుగారు ఆఫీసు నుండి యప్పుడే యింటికివచ్చిరి. కాలుసేతుల గడిగికొని బల్లపైనున్న వార్తాపత్రికను గైకొని కాంచుచుండెను. కొంతసేపటికి 'లీలయెక్కడ?' యని యాయన సేవకు నడిగెను. 'అమ్మాయిగారిప్పుడే పూదోటలోనికేగియున్నా ర'ని సేవకుడు చెప్పెను. తిన్నగా తానుకూడ తోటలోనికి జని సాక్షాత్ వనలక్ష్మికరణిబోలె పశ్చిమాంబుధిని గ్రుంకనున్న వృద్ధభానుని అరుణకాంతులు ముఖమునందలమునకాన చిన్ని చేతులతో గాలికెగురు ముంగురుల నెగద్రోసికొనుచు నడుమనడుమ తా బడిలో నేర్చుకొన్న జాతీయ గీతములం బాడుకొనుచు పూలమొక్కలనడుమ తిరుగాడు లీలం గాంచి 'ఆహా! అపార కృపామయుడగు భగవాను డెట్టిసుగుణఖనిని నాకు లభింపజేసినాడు! ఈ బా



ఆంధ్ర బాలిక
చిత్రకారిణి: శ్రీ సరస్వతిగారు శారదానికేతనము, గుంటూరు.

లకు సదయహృదయమునకుం దోడు దేశభక్తికూడ నల వడినది! నాహృదయగతమగు ఆశచిగిర్చి పుష్పించి ఫలించు సూచనలు సుగుణమణియగు యీ లీలా మూలముగ భగవంతుడు నాకు గాన్పింపజేయుచున్నా' డని మనమున తలపోయుచు తదేకధ్యానమున ఆమెను వీక్షించు చుండెను. ఇంతలో ఇంటినుండి 'శ్రీనివాసరావుగారున్నారా?' అనుకేక వినబడుటతోడనే ఆలోచనా పరంపరలో మునిగియున్న ఆయన 'ఇదిగో వచ్చుచుంటి' నని లోనికరిగెను. రాత్రి చీకటులు గ్రమ్ముకొనుటంజేసి లీలకూడ వనవిహారము చాలించి యింటిలోని కరిగెను.

## ౨

శ్యామసుందరుడు కొంచెము పొడవరి. చా దాపిరువది యేండ్లుండవచ్చును. విశాలనేత్రములు, ఆజానుబాహులు, సమున్నత శరీరము, పసిడిచాయయుక్తగ్ని ఆతడు చూపరుల కంటియు మనమును గూర్చుచుండెను. ఆతనికి సౌందర్యమునకు తోడు సహజసద్గుణములు సువర్ణమునకు తావి యబ్బినట్లు ఒప్పుచుండెను. ఆతని శరీరచ్ఛాయకు తోడు. ఆతడు ధరించియున్న ఖద్దరువస్త్రములు ఆతని కొకవింతయందము కూర్చుచుండెను. ఆతడు ఆగ్రామములో ఉన్న దొరతనమువారి కళాశాలయందు పట్టపరీక్షకు చదువుచుండెను. ఆతడు ప్రతిపరీక్షలోను అగ్రస్థానమలంకరించి రాజధానికంతయు ప్రథముడుగ నుత్తీర్ణుడగుచుండెడివాడు. ఈతనికి కేవలము విద్యయందే కాక హాకీ, క్రికెట్, టెన్నిస్ మొదలగు ఆరోగ్యాభివృద్ధి నొసగు వ్యాయామముల యందు కూడ చాకచక్యము కడు మెండు. ఎన్నిమారులో నాతడు సహాధ్యాయి బృందముతో గలిసి దేశదేశాంతరముల కేగి తా నేర్చుకొన్న వ్యాయామ పరిశ్రమలయందు ఎదిరిబృందము నోడించి, పొగడ్తలనంది తెచ్చుకొన్న కళాశాల కొక అలంకారమని పేరువడసి జయలక్ష్మిని చేబట్టి పురమునకు, మరలెడి నృపతివలెనే జయజయ ధ్వానములతో గ్రామమునకు మరలుచుండెడివాడు. కాని ఈతని సుగుణములను గని విని మురియు భాగ్యము లేకుండగనే ఈతని తలిదండ్రు లిహలోక సౌఖ్యముల వీడిపోయిరి. తలిదండ్రులు లేని లోటు లేకుండ ప్రసాదరావుతమ్ముని అతిగారాబముతో చూచుచు కంటికి రెప్పవోలె కాపాడుచుండెడివాడు. ప్రసాదరావు కొంచెము ముంగోపముగలవాడు. తాపట్టినకుందేటికి మూడేకాళ్లనువారిలో నొకడు. ఈతడు దొరతనమువారి కొలువునందుండి వారి అడుగులకు మడుగులొత్తుచు, స్వేచ్ఛకు తిలాంజలి నొసంగి స్వార్థమునే కోరుచుండు మహనీయులలో నగ్రస్థాన మలంకరించెను. ఈతడు తమ్ముని ఎన్నిమారులో ఖద్దరువస్త్రముల విడువుమని బోధించెను. కాని, విఫలమనోరథు డగు చుండెను. రాట్నమన్నను, ఖద్దరువస్త్రములన్నను, ఆతనికి జనియించెడి క్రోధ మింతింత కాదు. శ్యామసుందరుడు కళాశాలనుండి వచ్చినదాది మాతృసమానయగు వదిన లక్ష్మీబాయియొద్ద గూర్చుండి ఆమెకు రాట్నము వడకు చుండుట నేర్పుచున్నప్పు డెంతయు మనమున విసుగు చెందు చుండెడివాడు.

ఫిబ్రవరినెల దేశమంతయు సైమనుకమిషను బహిష్కరణాందోళనలతో అల్లకల్లోలముగనుండెను. ఏపత్రికలజూచిన నీవార్తయే! యెవరినోట విన్న నీమాటయే! నాడానగరము దెక్కడచూచినను విద్యార్థులసంరంభమే. శ్యామసుందరుడు ప్రాతఃకాలకృత్యముల నెరవేర్చుకొని శుద్ధమైన ఖద్దరువస్త్రమును ధరించి జాతీయైకమత్యమునకు మూలకారణ మనదగు జెండా చేతనిడి అన్నగారెంతగలదనుచున్నను తనభావిజీవిత మెట్లు పరిణమించునో యను సందేహ మిసుమంతయును లేక దృఢదీక్షాపరుడై "మహాత్మగాంధీకి జయ్"అని కేకలిడుచు రణరంగమున నురికెడి వీరునివలెనే తోడి యువకుల ప్రోత్సహించుచు నగరసంకీర్తనలో పాల్గొనుటకై వెడలెను. సాయంకాలమయ్యెను. పట్టణపురమందిరమంతయు స్వచ్ఛందసేవకుల యుత్సాహముతో, బాలుర జయజయధ్వానములతో గూడ కర్మచారుల తత్తరపాటుతో అల్లకల్లోలముగ నుండెను. శ్యామసుందరుడు నాటిసభయందు స్వచ్ఛంద సేవాదళనాయకుడై యెక్కడచూచిన తానయై నాయకుల గంభీరోపన్యాసముల నతిశ్రద్ధగ నాలించుచు, మనమున నుత్సాహ తరంగములు మొలకలెత్త ఆవేశపూరిత హృదయుడై ఒకచో గూర్చుండి తనలో తానిట్లు తల

పోయ దొడఁగెను. 'అయ్యో! ఈయుపన్యాసముల వినిన కొలఁది నాయొడలు జల్లుమనుచున్నదే! నేనింతవర కెంత మూర్ఖుడనై యుంటిని! దాస్యశృంఖలాబద్ధునిగ నొనర్చు యీవిజాతీయవిద్య నేర్చుకొనుటయందు నా యమూల్య మగుకాల మెంత వృథా ఖర్చుచేసితిని! ప్రపంచమున దైవ సృష్టిలో స్వాతంత్ర్యదేవతలుగ పరిగణింపబడుచుండు పురుషులు దాము తమ స్వేచ్ఛాజీవనమును నిగళబద్ధముగ నొనర్చుకుంటయేకాక తమ భార్యాపుత్రికలగూడ దాస్య వృత్తిని ప్రబోధించి విద్యావిధానములకే దోసి లొగ్గింప జేయుచుండ, ఇక వారలయందు జాతీయతా బీజములు మొలకలెత్తు టెట్లు? మన కన్నతల్లి మన దేశమాత, మన మాతృభూమి యొక్క స్తనముల పాలం గ్రోలి ఆమె యొసగు సుమధుర, సుశీతల జలముచే, పెంపబడి కర్త వ్యవిమూఢులమై,ఆమె పరపదదళిత యగుచుండ గాంచి, స్వేచ్ఛాపరులమై విలాసతరంగములలో మునిగి తేలుచుం టిమే? అయ్యో! తలచుకొన్న కొలఁది నాగుండె నీర గుచున్నది. రెండక్షరముల తోకగతగిలించుకొని బిరుదులకై యాశపడియుండు మహనీయులలో నేనొక్కడను గావలసివచ్చెగా! అయ్యో! ఎంత యవివేకినైతి. ఎట్టి దేశద్రోహినైతి. ఇకనైనను నాయీతుచ్ఛ దేహమును దేశసేవకు, మానవసేవకు అర్పించి, నాజీవితమును సార్థకము జేసికొనెదగాక' అని కృతనిశ్చయుడై అప్పటికి తొమ్మిది గంటల రాత్రియగుటచే, అన్నగారేమందురో అనుభయమున కాళ్లు ముందరపథమును బంధించుచుండ ఇంటివైపు మఱలెను.

## 3

నాడు అమావాస్య. ఆకసమంతయు కటికిచీకటులచే, కారు మబ్బులచే, భయానకమై చూపట్టుచుండెను. మేఘగర్జనములు భయంకరశబ్దములు శ్రీనివాసరావుగారింటియందుండెడివారల హృదయములు మరింత కలవరపఱచుచుండెను. నేటికి వారము దినములనుండి శ్రీనివాసరావుగారు ప్రబలబాధచే పీడితులగుచున్నారు. వైద్యశిఖామణులు అనేకులు రోగినిగాంచి నిరాశను వెల్లడిపఱుచుచుండిరి. లీలాకమలల హృదయములు మిగుల క్షోభిల్లుచుండెను. పిడుగుల ఫెళఫెళారావములు వారి భయకంపిత హృదయములను మరింత కలవరపరచుచుండెను. రోగి కడు నీరసించి, శల్యావశిష్టుడై యుండెను. కమలాబాయి విచారసంతప్త హృదయయై ఆర్తత్రాణ పరాయణుండగు భగవంతుని వేనోళ్ల స్తోత్రముచేయుచు పతి పాదముల చెంత కడు నిశ్చలమానసయై కూర్చుండెను.

అర్ధరాత్రి. జగమంతయు గాఢాంధకారబంధురమై యుండెను. నక్షత్రముల కాంతిగూడ సన్నగిల్లెను. మిణుగురుపురుగుల స్వల్పకాంతులు తక్క వేరొండు వెలుగు లేదు. ఆకసము మేఘావృతమై, వర్షమువచ్చెడు సూచనలు పొడసూపుచుండెను. ఇట్టి భయంకరసమయమున ఇర్వురు యువకులు ద్విచక్రశకటముల నధిరోహించి కడువేగముగ బోవుచు ఇట్లు సంభాషింప మొదలిడిరి.

"అయిన, రాధాకాంతా! డాక్టరుగారు యిప్పుడు వత్తురని యనుకొందువా? ఆయన సదయహృదయుడే. మన యజమానుని స్థితి నాలోచించిన బాగుగ గన్పట్టును! మనలను తండ్రివలె ప్రేమించెడివాడు. ఎట్టివాడైనను మృత్యుముఖమున బడవలసినదే గదా. కానిమ్ము, దైవఘటన యెట్లున్నదో యెరుగ నేరితరము?" ఇట్లు సంభాషించుచు వారు కొంతవడికి డాక్టరుగారి గృహమును సమీపించిరి. డాక్టరుగారు నిద్రించుచుండిరి. వారిని నిద్రనుండి మేల్కొలిపి సంగతంతయు విన్నవించిరి. డాక్టరు సురేంద్రనాథ్‌గారు కడుదయార్ద్రహృదయుడగుటం జేసి శ్రమయని యెంచక అట్టి కటికిచీకటి రాత్రి సమయమున తన పరికరముల చేతనిడికొని, బయలువెడలి కొంతవడికి గృహమును సమీపించెను. డాక్టరెప్పుడు వచ్చునో, ఏమిచెప్పునో అని వీధియరుగుమీద నిలిచి చూచుచుండిన లీల డాక్టరును గాంచినతోడనే ఒక్క పర్వున లోనికిబోయి "అమ్మా! డాక్టరుగారు వచ్చిరే" యనుచు తల్లిం జేరెను.

సురేంద్రనాథ్‌గారు తిన్నగ గదిలోనికిబోయి, రోగి హస్తమును చూచి పరీక్షించి ఒక్క వేడినిట్టూర్పు

విడిచెను. డాక్టరేమిచెప్పునోయని అత్యంతము నాతురులైన తల్లికూతు లిర్వురకును, డాక్టరుయొక్క నిరాశా సూచకదృష్టులు గాంచినంతనే ఏడ్వాగలేదు. "దీనావనా! దీనరక్షణబిరుదాంకా! మా తండ్రిని నా కుంచవా? మా తండ్రిని కాపాడవా?" యంచు లీల బోరన నేడ్వసాగెను. ఇంతలో 'అమ్మా! లీలా' యని తండ్రి పిల్చుచున్నటులయ్యెను. అంత లీల తండ్రియొద్దకు జని "ఏమి నాయనా! ఏలపిల్చితిరి?" యని యనుచుండగనే, శ్రీనివాసరావు తన గారాబు కుమార్తెను కుషిక్కించి జీర్ణములైయున్న తనచేతులతో అదిమిపట్టుకొని హృదయము మీద నిడికొని, "నా కన్నతల్లీ, నా బంగారుమొలకా, నేను మిమ్ముల వీడిపోవుచున్నాను. నాకు పరమేశ్వరుని ఆజ్ఞయైనది. మీరు విచారింపకుడు. మరణము జీవకోటికి సామాన్యమే! నిన్నొక యింటిదానిగ చేయజాలనైతిని. అదియె మనమున బాధించుచున్నది." అని యేమియో పలుకబోయి కఫము కుత్తుక కెగదన్నుటచే మాట్లాడజాలక కొంతవడికి "అమ్మా... నేను...పోవు...చున్నాను...మాతృ....దేశము...మాతృ...భూమిని...మరువ...వలదు...నాజీవితము...వృథాగా...గడిపి...వేసితిని...నీవైనను...భారతాంబ...ఋణము....దీర్చి...యాదీనుని...ఆత్మకు...శాంతిగల్గింపుము...దీనురాలగు...నీతల్లికి...ధైర్యము...చెప్పుము....నీతండ్రి....నీకు ఇక...లేడు...శ్రీమన్నారాయణా... మా లీలా...కమలల...నెట్లు...గాచెదవో."

ఇట్లు పలుకుచు ఆయుదార హృదయుడు విశ్రాంతి దీర్చుకొనువాని భంగి జగద్రంగమును వీడి కన్నులు మూసుకొనెను.

ఇక నేమున్నది? శ్రీనివాసరావుగారి పంచభూతాత్మకమైన శరీరము పంచభూతములలో కలిసిపోయెను. లీలా కమలల హృదయము లెట్లుండునో వ్రాయుటకు కలమాడుట లేదు.

౪

"లక్ష్మీ! లక్ష్మీ! అబ్బా! మన శ్యామసుందరుడెట్టివాడయ్యెనే! దేశము, దేశసేవ, యివన్నియు వీనియందే ఆవిర్భవించియున్నవి. ఈఖద్దరుగుడ్డలు, యీ రాట్నములు యివన్నియు వీనికొరకే బ్రహ్మ సృష్టించెనుగాబోలు! ఇంకను వీడేమో గొప్పగొప్ప చదువులుచదివి, బిరుదములంది, దొరతనమువారి కృపకు పాత్రుడుగా నోపునని యెంతయో మురియుచుంటిని. నా తలపులన్నియు బూడిదగలిసిన పన్నీరాయెనే! తిన్నయింటికి వాసములు లెక్కపెట్టినటులు నాకే పంగనామములు పెట్టుచున్నాడు! తండ్రితో సమానుడనగు నా యాజ్ఞ లెక్కసేయక నిన్న తాను పాఠశాల బహిష్కరించు టెందులకు? పట్టపరీక్షకువెళ్ల సంసిద్ధుడైయుండి మధ్యకొరవితో తల గోకికొనునటు లీకృత్యము లేల? దొరతనమువారెంతయు సమర్థులు. వారేమి సేయ దలచినను ఒక్కత్రుటిలో నొనర్పగలరు. వారి కోపానలమున కాహుతియగుటకంటె వేరొండు లేదు." ఇట్లు యింకేమియో పల్కుచు మూర్తీభవించిన క్రోధదేవతవలె ప్రసాదరావు పడకకుర్చీమీద కూర్చుండి తమ్ముని రాక కెదురుచూచుచుండెను.

శ్యామసుందరుడు లోన నడుగిడుట తోడనే ప్రసాదరావు కనుబొమ్మలెగ్రవడ "ఎవరు వారు? ఓహో! శ్యామసుందరరావుగారా? తీరుబడియైనదా? దేశనాయకులు మిమ్ములవిడచిరా? అసహాయోద్యమాందోళనలో ఎంతమందిమూర్ఖులు పాఠశాలలవిడచి, ఉద్యోగములమాని, కూటికి గుడ్డకు మొఖమువాచి, దేశద్రిమ్మరులై, తిన్నచోట నిలువక, నిలిచినచోట నిద్రింపక, ఫకీరులవలె తిరుగుచుండుట లేదు? నీవు కూడ వారిగతినే అనుసరించుచున్నటులు తోచుచున్నది. కానిమ్ము! నీ ప్రారబ్ధమునకు నేనేమి చేయగలవాడను? వచ్చియు రానిమాటలతో, తప్పటడ్డులతోనున్న నిన్ను తండ్రిగారు తమ మరణసమయమందు నన్ను జేరంబిలిచి 'నాయనా! నీకు రెక్కలు వచ్చినవి. నీతమ్ముడింకను చిరుతప్రాయము వీడలేదు. వానిని నీచేతులలో వీడిపోవుచున్నాను. నీ తల్లి వానిబాల్యమందే గతించినదిగదా? ఇక వాని భారమంతయు నీదే. నీ తమ్ముని నీ వెటులు కాపాడెదవో?' అని నుడివియున్నందున నింతగ చెప్పవలసివచ్చెను." ఇట్లుచెప్పుచు ప్రసాదరావు పడకకుర్చీనుండి లేచి గదిలోనికివెళ్లి ఒక కవరుదెచ్చి తమ్మునిముందు విసరివైచి, ఇదిగో నీ పాఠ

శాలా ప్రధానోపాధ్యాయులు సాయంకాలమున నే దీనిని నాకంపియున్నారు. దీనింగూర్చి నీయభిప్రాయము నను కరింపు"మ నిపల్కెను.

ఇంతవరకు మంత్రముగ్ధునివలె, నిలువబడియున్న శ్యామసుందరుడు ఉత్తరము తనకాలివద్ద పడినతోడనే తొట్రుపాటొంది భయకంపితహస్తములతో దానినెత్తి యీవిధముగ చదివెను.

శ్యామసుందరా!

సైమనుకమీషను బహిష్కారణాంన్దోళనలలో పాఠశాల మానిన యువకులు పాఠశాలనుండి వెడలగొట్ట బడుదురను మా శాసనములను నీవు వినియేయున్నాడవు. నీవు పాఠశాలయందు అందరకంటె నెక్కుడుగ వృద్ధిలోనికి రాగలిగిన వాడవనియు, వినయ వివేక సౌశీల్యాది సద్గుణములు గల్గినవాడవనియు ఎంచి యింతేపమున్నన్నియోమారులు నీవు ఇట్టిపనులుచేసినను ఓపిక వహించితిమి. కాని నేడు జరిగిన విషయమున, నీవేగాక, తాచెడ్డ కోతి వనమెల్ల చెరచినటులు తోడిసహాధ్యాయులనందర, ప్రోత్సహించి, వారలగూడ పాఠశాలలుమాన్పించి,యుత్సవములలో పాల్గొనినందున నిన్ను పాఠశాలనుండి వెడల నడపవలసినదిగ, పైఅధికారులు ఆజ్ఞాపించుచున్నారు.

ఇట్లు
ప్రధానోపాధ్యాయుడు.

ఈ యుత్తరము చదివినతోడనే శ్యామసుందరుని మనోవీధిని, విచారానందము లొక్కటూరి, పరుగిడ మొదలిడెను. నిశ్చేష్టుడై, నోటమాటలేక పదినిమిషములవరకటులే నిలువబడియుండెను. శ్యామా! భోజనమునకు లెమ్ము. ఇంతకే తడవైనది' యని, పిల్చు లక్ష్మీబాయికేక కర్ణపుటముల సోకినంతనే దీర్ఘాలోచనాపరుడైయున్న శ్యామసుందరుడు తెల్వొంది వదినా; ఇదిగో వచ్చుచుంటి'నని తన గదిలోనికి వెళ్లి యుత్తరీయముతీసి, మంచముపై పడవైచి, వంటయింటివైపు మరలెను. లక్ష్మీబాయి వడ్డించి మరది రాకకై నిరీక్షించుచుండెను. శ్యామసుందరుడు పాదప్రక్షాళన మొనర్చుకొని విస్తర ఘుంగిట భుజింపగూర్చుండెనేకాని, మనస్సు మనస్సులో లేదు. ఎంతయో ధ్యానమందువానివలె గన్పట్టుచుండెను, సంగతంతయు నెరింగియున్న లక్ష్మీబాయి "శ్యామా, ఏమటులుంటివి? సరిగ భోజనమైన చేయవేల, భుజింపుము. నాయనా మీ యన్నగారిసంగతి నీవెరింగి యున్నదేకదా! వారికంతతోచిన నంతియేకాని వేరొండుగానరు. దైవనిర్దేశ మెటులున్న నటులగు విచారించి మనస్సును బాధింపచేయుట తక్క వేరొండులేదు." అని పల్కెను.

శ్యామసుందరుడు వేవేగ భుజించి, తల్లివలె ఆదరించి లాలించి ప్రేమించి కన్నకుమారుని భంగి ఆదరించెడి వదినగారితోనైనను మాట్లాడకతిన్నగ గదిలోనికేగి శయ్యపై నొరిగి, రెండుచేతుల తల నదిమిపట్టుకొని 'ఆహా! సర్వేశ్వరా! ఎట్టి విషమస్థితికి తెచ్చితివి? నా మనోదార్ఢ్యము నెరుంగగోరియే నన్నిట్టి యిక్కట్టుల పాల్చేయుచుంటివా? నే నిప్పుడేమి చేయనగు? నాకేదిక ర్తవ్యము! అంతవాని నింతవానిగ నొనర్చి, విద్యాబుద్ధులు చెప్పించి తన సర్వస్వము నన్నుగ భావించి పెంచుచున్న అన్నగారి యాజ్ఞ యొకవంక! దీనావనరయై దిక్కులేక తనపుత్రులేమో తన్నుద్ధరించెదరని నమ్మియున్న భారతమాత, శివాజీ, రాణాప్రతాప్, తిలక్, గాంధీ ప్రభృతులగన్న మాతృభూమి, సీత సావిత్రి దమయంతి చంద్రమతి మొదలగు సాధ్వీమతల్లులగాంచిన పవిత్రజన్మభూమి, దేశసేవకునై పలుబాధలపడి అనేకసంవత్సరములుకఠినకారాగారవాస శిక్షలనొంది అవసానసమయమందు గూడ మాతృదేశమో, మాతృదేశమో యని విలపించుచు ప్రాణములర్పించిన చిత్తరంజన్, గోఖలే, నౌరోజీ, లజపతిరాయి మొదలయిన వీరశిఖామణుల గన్న భారతరత్నగర్భ, నా జన్మధాత్రి హాహారావములు మరియొకవంక!

కానిమ్ము, నా హృదయగతమగు కోర్కెయే పుష్పించి ఫలించుగాక. నేడే మాతృభూరంగమునదు మికి నాసోదరుల సుఖదుఃఖములలోపాల్గొని దేశమాతకు సత్పుత్రుడనై మెలగెదగాక! అపార కృపామయుడగు నప్పరమేశ్వరుడు నా సంకల్పము లీడేర్చి నాకు చేయూతనొసంగి నాజీవితము ధన్యమొనర్పజేయుగాత!"

ఇట్లు తలపోయుచు శ్యామసుందరుడు హృదయ భారము కొంత తగ్గ కర్తవ్యనిర్ధేశ మొనర్చుకొని పొట్ట కూటికై దాస్యవృత్తికి పురికొల్పు విద్యకు స్వస్తిచెప్ప నిశ్చయించి అన్నగారు దీనికెట్టిశిక్ష నొసంగెదరో యను భయమంతయు విడనాడి దినమంతయు నలసియుండుటచే నిద్రాదేవి యొడిలో శరణందెను.

౫

అఘటనా ఘటన సమర్థుండగు భగవంతుని లీలలం గన నేరికరము! ఒకతరి మానవుల సంతోషాంబుధి నోలలాడింపచేయు చుండును. ఇంకొకతరి విచారసాగరమున ముంచుచుండును. ఇంతవరకు జన్మించినదాది కష్టమన్న నెట్టిదియో యెరుంగక నిరంతర సుఖసాగరమున నోలలాడు లీల కడు యిక్కట్టులకు లోనయ్యెను. కృష్ణపక్ష చంద్రునివలె ఆమె నానాటికి క్షీణించుచుండెను. క్షయ రోగపీడితుని దేహము ట్లా బాలదేహము కృశించుచుండెను. మనోవ్యాధికి మందేది యనునట్లు ఆమెరోగము వీరికి వారింప నశక్యమైయుండెను. బాల్యమాదిగ తన్ను పెంచి పెద్దదానినిగ నొనర్చి తనసుఖమునే యభిలషించుచున్న పితృమరణముకై చింత యొకవంక, భర్తృవియోగానల దందహ్యమానయై సతతము కన్నీరు కాల్వలై కార దుఃఖించుచు, శుష్కించి కడు దుర్బలయై మంచముపట్టి నానాటికి కృశించుచున్న తల్లికై చింత మరియొకవంక. అట్టితరి సామాన్య బాలికలైన, ధైర్యము విడనాడి కింకర్తవ్యతా విమూఢలై బెగడంది ఉందురు. అట్లుగాక ధీరయగు లీల పొంగిపొంగి పొరలి వచ్చుచున్న దుఃఖము నాపుకొనుచు తానే అధైర్యమందిన తన తల్లికూడ బెగడంది అసువుల బాయగలదేమో యను భయమున కనువారలకు ధైర్యముతో నున్నట్లే కనవ్పట్టుచుండెను.

నాడు ఏకాదశి. ప్రాతఃకాలకృత్యముల నిర్వర్తించుకొని చేతనొకపళ్లెమిడి దేవతాపూజార్థమై పూలుగొని తెచ్చుటకు లీల తన చిన్ని పూదోటలోనికేగెను. నాటి యుదయమునుండియు కమలాబాయిస్థితి మారినట్లుకాన్పించుచున్నది. తనలో తానేదో గొణుగుకొనజొచ్చెను. నడుమనడుమ, "లీలా! లీలా! నీ ముద్దుముచ్చటలన్నియు తీరకుండగనే, నీ తండ్రి నిన్ను వీడిపోయిరి. నిన్నొక యింటిదానిగ చేసినచో నాకీబెంగ యుండకపోవును. పితృవియోగముచే పరితపించుచున్న నీవు మాతృవియోగముచే ఎంతదిగులందెదవో! సంపూర్ణ యౌవనవతివై వివాహయోగ్యవై యున్నతరి భగవంతు డెట్టి యాపదల పాల్చేసెనే! నీతల్లియిక జీవింపజాలదు. మాతాపితృ విహీనవగు నీకిక దిక్కెవ్వరు? ఎట్టియాపదల పాలందవలయునో! ఎందరి యపహాస్యములకు గురి కావలసివచ్చునో! ఎందరు క్రూరుల క్రౌర్యముల బారి పడకుండ కాపాడుకొనవలయునో! ఆహా! దయామయా! నా చిన్నారి లీల నేమి చేయనెంచితివి? నామెకేది దిక్కు? లీలకు ధైర్యమొసంగుము. ఆపదలనుండి యుద్ధరింపుము. సద్బుద్ధినొసంగి, పుట్టినింటికి, మెట్టినింటికి సత్కీర్తి చేకూర్చునటు లనుగ్రహింపుము. నేనుపోవుచున్నాను. లీలను నీచేతనిడిపోవుచున్నాను. కాపాడుము" అని పలవించుచుండెను

లీల పూలను గొనితెచ్చి తల్లి మంచముపద్దకు వచ్చి చూచుసరికి కమలాబాయి స్మృతితప్పియుండెను. తల్లి స్థితి గాంచినతోడనే లీలకు ధైర్యము సన్నగిల్లెను. కన్నుల నుండి కారు బాష్పముల నొత్తుకొనుచు "అమ్మా! ఏమియో బాధగానున్నటులు గాన్పించుచున్నది" యని లీల తల్లిని పలుకరించెను. అంత కమలాబాయి "అమ్మా! నీ తల్లికి అవసానము సమీపించుచున్నది. ఇక నేపోవుచున్నాను. నీ తండ్రిగారు తమ మరణసమయమందు నీకాదేశించినమాట మరువవద్దు. నాకోరికకూడ నదియే. సత్పుత్రివై నీదేహమును మానవసేవకునై వినియోగించి సచ్చరిత్రవై తోడి స్త్రీలోకమున కాదర్శప్రాయవై, చదువులసరస్వతివై, విద్యలేక దేశమన్న నెట్టిదియో యెరుంగక దేశస్థితి యన్న నెట్టిదియో యెరుంగక భర్త యున్నతాశయముల కంతయు ఆటంకమును గలిగించు వృథాప్రలాపములయందే కాలమంతయు గడపి అవిద్యాంధకారమందు మునిగి తేలుచున్న స్త్రీల నుద్ధరింపుము. అహంకారమును త్యజించి కొద్దిగొప్పలదరికి జేరనీయక నీకాలమును గడుపుకొనుచుండుము. ఇక మాట్లాడజాలకున్నాను, ఆయాస మధికమగుచున్నది. కొంచెము...మంచినీరు..." ఇట్లుచెప్పుచు మనస్సంతయు

భగవదాధీనము గావించి మాయాప్రపంచక రంగమునుండి ఆత్మపాత్రాభినయము సమాప్తి గావించుకొనెను.

గాలికి దుమ్ము రేగిన ట్లీవార్త క్షణములో గ్రామమంతయు వ్యాపించెను. విన్నవారందరు "అయ్యో! సుగుణమణి యగు లీలకెట్టికష్టము సంభవించె! కరుణామయుడగు భగవానుడామెయెడ కడు నిర్దయుడాయెనే! ఇక ఆబాలకేది గతి"యని వగవజొచ్చిరి. మెల్లగనీవార్త పాఠశాలా ప్రధానోపాధ్యాయినియు, దయావతియు నగు, శారదాబాయిగారి కర్ణములంపడెను. వెంటనే ఆమె లీల గృహమునకుంజని తల్లిమంచము వద్దనే కొయ్యవారి పడియున్న లీలంగాంచి తనవద్దనున్న ధనముతో శవమునకు దహనసంస్కారాదుల ముగింపజేసి లీలను తనతో గూడ నింటికి తీసుకొనివెళ్లి ఆదరించి ఆమెకు తల్లిలేని లోటు దీర్ప ప్రయత్నించుచుండెను. లీలయు ఆమె మధురసంభాషణలచే ఆదరసత్కారములచేఁ గొంత దుఃఖముపశమిల్ల తలిదండ్రుల అంత్య వాక్కుల స్మరించుకొనుచు వారి కర్తవ్య మీడేర్ప ప్రయత్నించుచుండెను.

౬

ఆగ్రామమున శారదాబాయిగారి నెఱుగని వారెవ్వరును లేరు. ఆమె బాలికలయందు చూపెడి యనురాగము, విద్యబోధించుటయందు గలనేర్పు, కార్యదీక్ష, ఔదార్యము, సహనశీలత, సర్వసమత్వము గాంచిన ప్రతి వ్యక్తియును ఆశ్చర్యమునొందక మానడు.

శారదాబాయికి పాపము, బాల్యమునందే వైధవ్య దుఃఖము ప్రాప్తించెను. వివాహసమయమునందు తక్క భర్తృముఖమెన్నడు వీక్షింపని యామెను అనేకులు మూలబడవైచి వంటపొయ్యివద్దనే కుక్కి ఆమె యున్న తాళియముల మంటగలుప యత్నించిరి. కాని యోచనాపరురాలగు యాయమ పవిత్రమానసమే యామె సచ్చరిత్రమునకు మూలకారణమనియు, మనోనైర్మల్యము లేక యిరుగుపొరుగు అమ్మల అధిక్షేపములకు లోనై లేనిపోని యసంబద్ధప్రలాపముల తమ విలువగల కాలము వృథ పుచ్చుచు అనేకులు క్రూరుల మోహదృష్టులకు గురియై తమపవిత్రజీవితము మరింత అపవిత్రముగ నొనర్చుకొంటయో, కాక కలకళంకములై, పుట్టినింటిని, మెట్టినింటిని అపకీర్తిపాలుచేసి దేశమాతకు, దుష్ప్రవర్తనలచే మరింతభారమును గల్గించుచున్న పెక్కురు స్త్రీలసంగతి విచారించి, వగచి, యెట్టి అభ్యంతరములు సంభవించినను లెక్కింపక నా యీ తుచ్ఛదేహమును స్త్రీవిద్యకునై బలియొసంగి అవిశ్వాసలై, మూఢలై, అవిద్యాంధకారమునబడి తట్టుమిట్టాడుచున్న నాసోదరీమణుల నుద్ధరించి నాజీవితమును సార్థకము చేసికొనినయెడగాక యని దృఢనిశ్చయయై స్త్రీవిద్యలో ఉన్నతి జెందుచు వచ్చుచున్న పూనానగరమును గూర్చి తానదివరకు వినుచున్నది యగుటంజేసి ఒరుల కీవార్త తెలియజేయకుండ, ఒరులసహాయము పేక్షింపకుండ తాను అబలనను సంగతియే మరచి ఆనేశమాత్ర సహాయయై ప్రోత్సహించుచుండ, తిన్నగ పూనా చేరెను. నాలుగు సంవత్సరము లక్కడనుండి, ఉన్నతవిద్య నంది ఆంగ్ల విద్య నభ్యసించి బిరుదములంది తామే అపరసరస్వతులని యెంచుచు, విఱ్ఱవీగి, కన్నుమిన్ను గానక, పరులతో భాషించినయెడ తమ విద్య కెక్కడ లోపము వచ్చునో యను భయముచే మూర్తీభవించిన గర్వరాసులోయన తిరుగుచుండు మన యీనాటి కొందఱు సోదరీమణులవలె గాక శారదాబాయి యున్నతవిద్యతోపాటు వినయ, వివేక, సత్ప్రవర్తనాదులయందు కూడ తనయంతయామెలేదని పలువురచే గణింపబడి పూనా కళాశాలయందు వన్నెకెక్కి, జన్మభూమికే తెంచి తన స్వంతధనముతో పాఠశాలాభవనము నొకదానిని గొని దానికి శారదాభవనమని పేరిడి, పెక్కురుబాలికల నందుజేర్చి తన ఆశయ మీడేర్చుకొనుచుండెను.

శారదాబాయియొక్క సాంగత్యలాభము వలన లీల గృహకృత్యముల యందేమి అధ్యాపికాత్వము నందు గల నేర్పునందేమి మిక్కిలి నేర్పుగణించి, ఆమెకు తల లోని నాల్కవలె ప్రవర్తించుచు ఆమెకనుసన్నల మెలగుచు తత్ప్రేమ భాజనమై మెలంగుచుండెను. ఒక్క నిమిషము లీల లేకున్న శారదాబాయికి ఈ జగమంతయు నంధకారమయముగ తోచుచుండును. అప్పుడప్పు డామె తన స్థానమున లీలను ఉపాధ్యాయిగ నొనర్చి బాలికలకు పాఠముల చెప్పించుచు తాను చూచి ఆనందించుచు

డును. బాలికలుగూడ లీలను తమసోదరిగ భావించి, పాలు నీరు భంగి ఒక్కటై మెలగుచుందురు. సాంగత్య లాభము వలననే కదా గులాబిచెట్టుక్రిందనున్న మన్ను గూడ పరిమళించుట. అటులే శారదా సాంగత్యము వలన సహజ సద్గుణవతియగు లీల సుగుణశీలయై అన్నిట నామెకు తోడునీడయై తలిదండ్రుల కీర్తి మరింత వృద్ధి పరచుచు, ఆ గ్రామమందు సర్వజన ప్రేమైకవర్తినియై యొప్పుచుండెను.

ప్రాతఃకాలము ఏడుగంటలై యుండవచ్చును. ప్రాతఃకృత్యము లీడేర్చుకొని శుచియై శారదాబాయి లీలను ముందిడుకొని నిత్యమును వలె తులసీదాస కృతమగు హిందీ రామాయణమును చదువుచుండెను. లీలగూడ ఆమె చదువు పద్యముల నర్థముచేసికొనుచు నత్యంత కుతూహలితమానసయై వినుచుండెను. కొంత తడవునకు రామాయణ పఠనము ముగించి, శారదాబాయి లీలతో సంభాషించు చుండెను. ఇట్టితరి పాఠశాల పరిచారికయొకర్తు చేతనొక యుత్తర మునిడి అమ్మా! తపాల వాడిప్పుడే దీని నాకొసంగెనని చెప్పుచు ఆమెచేతి కందిచ్చెను. ఇట్టి సమయమందు ఉత్తర మెవరివద్దనుండియో యని యోజించుచు, కవరుచించి లోని కాగితముతీసి యిట్లు చదువనొడగెను.

ప్రియసోదరీ, నమస్కారములు.

ఈ మధ్య వచ్చిన సైమనుకమీషను బహిష్కార సావసరమున నేను పాఠశాలను బహిష్కరించితిని. దాని ఫలితముగ పాఠశాలనుండి వెడలగొట్టబడితిని. వాడు మొదలు మా అన్నచే పలుబాముల కులోనై వారి కోపానలమున కాహుతి యగుచుంటిని. చదువుమాని, యింటియందు చేతకాని పిరికిపందవలె గూర్చుండినయెడ, తిండి పెట్టుట తనకు గూడ దుర్భరమగుననియూ, యింకను ఏవేవో దుర్భాషలాడి నన్ను కంటకముగ జూచుచుండెను. ఇట్లుండ, మొన్న ఆ గ్రామములో జరిగిన విద్యార్థి స్వచ్ఛంద సేవాదళమునకు నన్ను నాయకునిగ నొనర్చి యుండుటచే నేను అన్నగారి అభిప్రాయములకు వ్యతిరేకముగ, ప్రచారము చేయవలసివచ్చెను. అన్నగారదివిని, ఆగ్రహపరవశులై నా మూలమున తమ యుద్యోగమునకు గూడ భంగముకలుగుననియూ, నేను యిల్లు వీడిపోయిన తాను సుఖముగ దినములు గడుపుకొందుననియు చెప్పెను. కాని అయన యేమన్నను మౌనవ్రతము దాల్చి యూరకుంటిని. ఇంతలో వదినెగారు వచ్చి నన్ను గాంచి, నాకై జాలినొంది, కఠినోక్తులచే నా మనస్సు నొప్పింపవలదనియు, మిమ్మె దైవముగనెంచి, భావించి పూజించుచు, పితృసమానులుగనెంచి, గౌరవించుచున్న ఆతని హేయదృష్టిని జూడవలదనియు, మా అన్నగారిని ప్రార్థించెను. అట్టితరి ఆయన ఆమె నావలకు ద్రోసివైచి 'నీవా నాకు నీతులు గరపుదానవు? ఆ చెనటి నిన్నుకూడ చెరచుచున్నాడే! మీరే దేశభక్తులు, దేశమునుద్ధరింప అవతరించినారు. కాన, యిద్దరుగూడ నొక్కచోటికిబోయి హాయిగ జీవింపుడని" పలువిధముల నిందించెను. పతివ్రతా శిరోమణియగు యామె మిగులవగచి, 'భర్తృ సందేహమునకు గురినైతినే' యని మిగుల దుఃఖించెను. ఈసంగతి వినినంతనే నాహృదయమున మిన్నువిరిగి మీద పడినట్లాయెను. 'అయ్యో! నా మేలు నభిలషించుచు నామూలమున, ఒక పతివ్రతయగు నబల భర్తృసుఖమునకు, దూరముగాపలసివచ్చెనా! తిండిలేకపోయినను, గుడ్డలేకపోయినను, ఆయమ సుఖముకొరకైనను నేనిల్లు వీడిపోవుట నాకర్తవ్య'మని భావించితిని. అన్నగారి సందేహమునకు గురియై వారికంటికి శూలమువలె మెలగుచుండుట హేయమని యెంచితిని. నాసంగతి నీకు తెలియబరచుట నాకర్తవ్యమని ఎంచి నీ కీ యుత్తరము వ్రాయ సమకట్టితిని.

ఇట్లు నీ ప్రియసోదరుడు,

శ్యామసుందరుడు."

ఈ లేఖ గాంచినతోడనే, శారదాబాయి నిశ్చేష్టయై, కొంతవడికి అన్నగారి దౌర్జన్యము, వారిక్రౌర్యము తనకు తమ్మునియందుగల అనురాగమూగాంచి, యట్టితరి అన్నగారిదృష్టికి దూరముగనుంటయే శ్రేష్ఠమనియు, తానుజీవించియున్న పర్యంతము ఆతని కెట్టి కష్టము కలుగజాలదనియు, ఉత్తరము గాంచినతోడనే తనవద్దకు రావలసినదనియు, తమ్మునికొక లేఖవ్రాసెను.

లీలగూడ ఉత్తరముసంగతులను శారదాబాయి నోటి నుండివిని తానుగూడ శ్యామసుందరునికొరకై జాలి నొంది అతని యున్న తాళ్యములకు, ఉదారస్వభావమునకు మనమున మిగుల సంతసించి అట్టి సుగుణముల ప్రోడయగు తమ్మునిగలిగియున్న శారదాబాయియొక్క అదృష్టమును, మిక్కిలికొనియాడి అతడు ఎచ్చినతోడనే తాను అతనియొద్ద శుశ్రూష చేయుచు దేశచరిత్ర, దేశములోని యిప్పటి పరిస్థితులు, నేర్చుకొనుటకు కృతనిశ్చయయై అతనిరాక కెదురుచూచు చుండెను.

౨

నాటి ఉదయమునుండియు లీలా శారదలు శ్యామసుందరుని రాకకై నిరీక్షించుచుండిరి. నిమిషమొకయుగమువలె వారికి తోచుచుండెను. ఎన్నిమారులు గడియారమువంక చూచినను ధూమశకటము వచ్చుసమయమగుటలేదు. ఆతురులైయున్న సమయమందు అన్నిటను విలంబమే కాన్పించును. అట్టితరి ఎప్పుడు శ్యామసుందరుని గాంతుమా! ఎన్నడు వానితో సంభాషింతుమా యనియున్న మన లీలా శారదలమనములెంత వేగిరపడుచున్నవో వారిఆతురత సూచించు మొగములే చెప్పుచున్నవి.

గడియారము టిక్కుటిక్కుమని పండ్రెండుగంటలు కొట్టెను. గణగణమను శబ్దముతో, ఒకజట్కాబండి శారదాభవనముముందు ఆగెను. శ్యామసుందరుడు లోననుండిదిగి ప్రేమదృష్టులతో తన్ను గాంచుచు, తనకెదురుగవచ్చుచున్న అక్కగారికి ప్రణమిల్లి వసారాలోనుండు సోఫాపై కూరుచుండెను. చేత మంచినీరుచెంబు నిడికొని లీల లజ్జాభయము లొక్కమారు, పెనగొన త్రొట్రుపాటొందు అడుగులతో మెల్లగ తలుపుచాటున నుండి శారదాబాయికి ఆచెంబునందిచ్చెను. "లీలా! రమ్మి, టుగమ్మ సిగ్గేలనమ్మా", యని లీలను పిలిచెను. అపరిచితనామము వినుటతోడనే శ్యామసుందరుడు గుమ్మముదిక్కు మొగమై, "అక్కా, 'లీలా!' యని యిప్పుడెవరినామము పేర్కొంటివే? ఆమె ఎవరు? మీపాఠశాలా విద్యార్థినియా?" అని యడిగెను. అంత శారదాబాయి "నాయనా! లీల మాతాపితృ విహీనయగు నొకబాలిక. కేవలము పరమాత్ముని సహాయము తక్క వేరొండుసహాయ మామెకులేదు. చూడు! శై తనము సూచించు ఆమె సుకుమారముఖము గాంచిన ఆమెసద్గుణము లన్నియు కన్నులకట్టినట్లుండును. నిరాశచే, శుష్కించి, వాడిపోయిన నాఆనందమునకు దోహదముగావించిన దీ బాలామణియే?" యని పలికెను.

అక్కగారుచెప్పిన మాటలన్నియు వినుచున్న శ్యామసుందరుడు లీలవైపొక్కమారు చూచెను. అంతవరకు శ్యామసుందరుని ముఖసౌందర్యముగ్రోలుచు, పిపాసాయుక్తములైన లీలా దృష్టులు శ్యామసుందరుని దృష్టులలో లీనమైపోయెను. ఆచూపులలో నేమి మాయాజాలమున్నదో కాని కొంతవరకు వారు ఈ బాహ్యప్రపంచమును మరచి తమజీవితమును ఒకరికొకరు ధారవోసినటులు తెల్పుచున్నవో యను దృక్కులతో అట్లే నిలిచిరి. శారదాబాయి ముసిముసినవ్వులతో 'ప్రణయాంకము' ప్రారంభమయ్యె గదాయని లోన తలపోయదొడంగెను.

శ్యామసుందరుడు ఆ గ్రామమున అడుగిడినదాదిగ జాతీయసంస్థల నిర్మించి అందు రాట్నములను, మగ్గములను పెట్టించి అనేకులు బీదవారల కుపాధి కల్గింప మొదలిడెను. ఇంతియ కాక, పల్లెటూరి గ్రామముల కేగి దేశపరిస్థితులు, దేశము, దేశదారిద్ర్యమున్న దెట్టిదియో యెరుగక తమలోతాము తగవులాడుకొనుచు, అన్యోన్యము ఐకమత్యమునువీడి మతకలహములచే తమ్మతామే నిర్భాగ్యులుగ జేసికొనుచున్న పల్లెలవారిని విద్యావంతులనుగ జేసి, వారలలో ఐకమత్యము గలిగించి రాట్నములయందు, మగ్గములయందు వారికుత్సాహము జనింపజేసి వారి గౌరవమునకు పాత్రుడై, ఒకనిమసమైనను వృథ పుచ్చక ఒరులహితముకొరకై పాటుపడ జొచ్చెను.

……శ్యామసుందరుని వయస్సుతోపాటతనిబుద్ధి వికాసము, కీర్తిప్రతిష్ఠలుకూడ వృద్ధినందజొచ్చెను. స్వార్థరహితమగు సేవ, ఫలాపేక్షలేని దేశభక్తి, మనోవాక్కాయకర్మముల నాతడు చేయుచున్న మానసనేవ యేరిహృదయముల నాకర్షింపకుండును. ఆతనిమాటయన్న పల్లె రును ప్రాణముల నిచ్చుటకైనను సంసిద్ధులగుదురు. - ఆతని



(౧౮) నూతన్రమూని బీరువా



(౧౯) అందమైన దంతపు కరండకము



(౨౦) నూతన్రమూని బీరువా

అడకొత్తు ౨



మూసియుంచినది



తెరచియుంచినది

అడకొత్తు ౧



మూసియుంచినది



తెరచియుంచినది

సత్ప్రవర్తనయే ఆతనికితోడై దారిచూప శ్యామసుందరుడు నానాట వృద్ధికి రాదొడగెను. దేశసేవాపరుడు, స్వార్థత్యాగి, కీర్తికాముడు అగు తమ్మునిగాంచి శారదాబాయి పొందు ఆనందమునకు మేరయే లేదు. లీలకన్నదో దివారాత్రము లాతనిస్మరణయే! ఆతని నామ ముచ్చరింపని గడియ యొక్కటైనను గానరాదు. శ్యామసుందరుడు దినమంతయు పనిచేసి యింటికివచ్చినతోడనే లీలకు నైతిక రాజకీయ ఆర్థికవిషయములను నేర్పుచుండును. వారు ప్రతిదినమును దినమంతయు, తామొనర్చిన సేవను, దానిలాభమును ఒకరికొకరు చెప్పుకొనుచుందురు. ఈవిధముగ దినముల నతిసుఖప్రదముగ వారు గడుపజొచ్చిరి లీలా శ్యామసుందరుల హృదయములుకూడ, నానాటికి ప్రేమపాశములచే గట్టిగ గట్టునడుచుండెను.

౭

శారదాభవనము నిజముగ శారదాభవనమే. బాలికలతో నిండియున్నప్పుడది యెంతయో సుందరముగ చూపట్టుచుండును. బాలికలు చదువుకొనుటకు విశాలములగు గదులు, రాట్నములు వడుకుటకు, మగ్గములపై నేతనేయుటకు తగు పెద్దవసారాలు, బాలికలు స్వేచ్ఛగ ఆడుకొనుటకు తగిన ఖాళీస్థలమును, వివిధములగు పూలమొక్కలతోనిండి బాలికల సేవచే పెరిగి వృద్ధినందుచు బాలికల విద్యాబుద్ధులవలెనే వృద్ధిని సూచించుచున్నట్లుండు నొక యారామము నందుగలవు. ఈగృహమందే శారదాబాయిగారి నివాసము.

వెన్నెల పిండియారబోసి నట్లుండెను. మలయమారుతము కలువలరేనికితోడై దినమంతయు నలసి, విసికి, వేసటనందియున్న ప్రాణికోటి కాహ్లాదకరమై యొప్పుచుండెను. పక్షిగణములు తమతమ కులాయములవీడి జాతిభేదముల విసర్జించి, అన్యోన్యమైత్రి సూచించుచున్నవో యన్నటులు వింతవింతధ్వనులతో కూయుచుండెను.

ఇట్టిసమయమున సుమారు పదునాలుసంవత్సరముల ప్రాయముగల యొకకన్నియ ఆతోటలో నొక కలువరాతి తిన్నెపై మూర్తీభవించిన సౌందర్యదేవతవలె కూర్చుండి యేమియో యాలోచించుచుండెను. స్వర్గమునుండి విహారార్థమై బయలువెడలి, ఆయారామసౌందర్యమునకు మెచ్చి కొంతసేపు శ్రమ బాపుకొననెంచి వచ్చి కూర్చుండిన దేవకన్యకవలె నామె కన్పట్టుచుండెను. ఆమెసౌందర్యమునుగాంచి, సిగ్గంది, మోమువాంచినటులు పద్మినీకాంతుడు మరగుపడజొచ్చెను.

యోచనాసాగరములో లీనమైయున్న యాసౌందర్యరాశికన్నుల నెవ్వరో వెనుకనుండి గట్టిగమూసిరి. లజ్జాభయము లొక్కసారిచుట్టుముట్ట, "అబ్బా? శ్యామసుందరా, పట్టువిడువుము. నీకెప్పుడును హాస్యమే" యనుచు లీల ప్రణయకోప మభినయించుచు దానిపగిది చూపట్టుచు పట్టు విడిపింపకొనజూచెను. శ్యామసుందరుడు పట్టువిడిచి "యేమి నాలీలారాణీ! ఏలయిట్లు ఏకాగ్రచిత్తవై, అన్యమనస్కవై కూర్చుంటివి? నీఆలోచనలు నాకుకొంత పాలియ్యవా? నాప్రేమైకరాశి, నాహృదయ పీఠాధిదేవత, నావలపులరాణి, నాలీలాదేవి మనోగతాభిప్రాయము నెరుగ దగ్గవాడను గానా! నావాక్కులాలించి కరుణించి నాహృదయాందోళనము కొంత తగ్గింపవా?" అని ఆమెచెక్కిలినొక్కి బ్రతిమాల దొడగెను.

"ప్రాణేశ్వరా! లీల నీపదదాసి ఏదినమున నీసుగుణములు విను భాగ్యమునాకు లభించినదో, ఎన్నడు నీసుందరాకారమును నేను కన్నులగాంచితినో, మనోవాక్కాయ కర్మముల దేశసేవా తత్పరుడవై మానవకోటికి నీవొనరించెడి సేవను పత్రికాముఖమున విని, యానందించితినో నాడే నన్ను నీకిచ్చుకొంటిని. నీవంటి పూజ్యుడగు భర్తను చెట్టబట్టి సుఖించుటెన్నడో యని భావించితి. ఇంతవరకు నీమనోగతాభిప్రాయము తెలియక దిగులందితి. నన్ను నీవుకోరకయున్నను నీవంటి దేశభక్తుని కర్ధాంగియగు భాగ్యము లేకున్నను, నీపదదాసినై నీపదసేవ లభింపజేయుమని భగవంతుని పెక్కువిధముల స్తోత్రముచేసితి. తలిదండ్రులు లేనిలోటుదీర్చి నాకన్నివిధముల తోడునీడ అయి నన్నులాలించి పాలించుచున్న శారదాదేవిగారికి నాహృదయాభిలాష యెఱింగింపదలచు

కొంటి. జీవితేశ్వరా, యీలీలకోర్కె నేమిసేయ సమకట్టితివి, నన్ను కరుణించి నాకోర్కె లీడేర్పవా?" యనుచు లీలశ్యామసుందరుని వక్షస్స్థలమున తనవక్షస్స్థలమునుంచి, ఆతనికంఠము కౌగలించుకొనెను. "నా ప్రేమైకరాశీ, త్రికరణశుద్ధిగ నీవే నాయర్ధాంగివి. నిన్నుతక్క నేనన్యులనుకోరను. సుగుణమణివగు నీసద్భావములు, నీదేశభక్తి, నీకార్యదీక్ష, ఎన్నడు నాసోదరీముఖమున విని కన్నులార గాంచి, యెన్నడు అపరిమితానందము నొందితినో, నాడే నాహృదయమునకు నీవు రాణివైతివి. సద్గుణముల కాదర్శప్రాయవగు నీపొందుగోరి నీతోసుఖించు భాగ్యమెవ్వనికి గల్గును! నీవంటి అర్ధాంగి లభించిన నాఅదృష్టమేమని కొనియాడుదును. భార్యాభర్తల అభిప్రాయములు ఏకమై వార లతి సుఖప్రదముగ నుండినసదా వారియిల్లు సంతతలక్ష్మీనివాసమై యొప్పుచు, భూలోకస్వర్గమువలె బొడగట్టుచుండును. ఇంతయేల? లీలా దృఢపాశములచే కట్టువడి శుక్లపక్షచంద్రునివలె నానాట వృద్ధిగాంచుచున్న మనపవిత్రప్రేమకు, ఈనిశాకాంతతో గూడిన శశాంకుడే సాక్షియై యుండుగాక!"

ఇట్లుచెప్పుచు శ్యామసుందరుడు లీలమొగమునెత్తి చెక్కిలిముద్దాడెను. ప్రేమ మయులగు నాకాముకీకాముకుల యానందమునకు స్వాగతమిచ్చుచున్న నటులు పూలమొక్కలనుండి పూవులు జలజల వారిశిరములమీద రాలెను.

ఇంతవరకు మరుగుననుండి ఆభావిదంపతుల అన్యోన్యానురాగ సంభాషణము నాలించి శారదాబాయి ఆనందపరవశయై పోయెను. ఆనందబాష్పము లామె కన్నులనుండి ప్రవహించెను.

## ౬

నాల్గుదినములనుండి, శారదాబాయి అస్వస్థయై మంచము పట్టియుండెను. బాలికలకు పాఠములు చెప్పుట లేదు. లీలయే ఆమెస్థానమున బాలికలకందరకు పాఠములుచెప్పుచు శారదాబాయిలేని లోటుతీర్ప ప్రయత్నించు చుండెను. బాలికలు ఆమె నొకక్షణమైనను వీడక తల్లివెంట పిల్లలభంగి సంతతమామెయొద్దనే యుండుచు, ఆమెకన్నివిధముల తోడ్పడుచుండిరి. శారదాబాయి శయ్యపైనుండియే లీల బాలికలయందు చూపెడియనురాగమును, వారల అన్యోన్యమైత్రినిగాంచి మనమున సంతసించు చుండెడిది.

శారదాబాయి జబ్బు నిమ్మళించుట లేదు. నానాటికి జ్వరమెక్కువగుచునే యున్నది. బాలికలు ఇండ్లకు పోవుటయే లేదు. ఆమెమంచమువద్దనే కూర్చుండి ఆమెకు సేవాశుశ్రూషలు చేయ మొదలిడిరి. లక్ష్మిప్రసాదరావులుగూడ ఆమెకు జబ్బుఅనువార్త తెలియుటతోడనే ఆమెనుచూడవచ్చిరి. ప్రసాదరావు ఇంతకుముందే తమ్ముని సుగుణములు, ఆతనికీర్తిప్రతిష్ఠలు పలువుర చేవిని, 'అయ్యో నేను ఎంతకఠినాత్ముడను? నిష్కారణముగ నవరానిమాటలచే తమ్ముని మనసు నొప్పించి యింటినుండి తరిమివేసితినే? అట్టితమ్ముని నే నింకొకనిజూడజాల. నాయందెంతభక్తి, ప్రేమ, వినయము! లక్ష్మిచెప్పెడి మాటలనైన వినకపోయితిని. కోపముచే మండిపడు చున్నప్పుడు యుక్తాయుక్త విచక్షణ తోపదు. ఇకనైన నాతమ్ముని నాతప్పులు సైరింపుమని వేడుకొనియెద' నని తలపోయుచుండెను. లక్ష్మియన్నచో లీలా శ్యామసుందరుల యనురాగమును వారల ఆదరసత్కారములను వారు మనఃపూర్తిగ చేయుచున్న దేశసేవనువిని అధికానందము బొందుచుండెడిది. లీలవంటి పత్నిలభించిన శ్యామసుందరుని సౌభాగ్యమునకు మురియుచుండెడిది. శ్యామసుందరుడు అన్నగారు తనయందు మాపెడి అనురాగమునకు రెట్టించిన ప్రియముతో ఆతనిని గౌరవించుచుండెను. లక్ష్మీసరస్వతులవలె యింట తిరుగాడుచు అత్యంతప్రీతితో మెలగుచున్న మరదండ్ర నిర్వుర చూచుచున్న శారదాబాయి ఆనందమునకు మేర లేకుండెను.

ఇట్టియానందను నామెయెన్నియోరోజులు అనుభవింప భగవంతు డనుగ్రహింపలేదు. శారదాబాయి వచ్చినపని యీప్రపంచమున సమాప్తియైనదని కాబోలామె తనపాత్ర నీమాయాప్రపంచ నాటకరంగమునుండి తొలగింపదలచెను.

నాడు శారదాబాయికి జబ్బెక్కువాయెను. శ్యామసుందరుడు ప్రక్కలో కూర్చుండెను. లీల పాదములొత్తుచుండెను. శారదాబాయి కన్నుల తెరచి వారిని దగ్గర దగ్గరకుబిల్చి "అమ్మా! లీలా! అబ్బాయీ, శ్యామసుందరా! నాకర్తవ్యము పూర్తియైనది, నేను పరంధాముని జేరబోవుచున్నాను. నేటికి నాకన్నులు చల్లనైనవి. యేపీ మీచేతు లిట్టులెండు. మిమ్ము నేకముచేసి చూచి ఆనందించెదను. ఈపాఠశాలను మీ మీద నిడిపోవుచున్నాను. మీ బాలికలవలె, భావించి వీరినివృద్ధి చేయుడు. బాలికలను సౌశీల్యాది సద్గుణసంపత్తిచే అఖిల దేశముల కాదర్శప్రాయలనుగ నొనర్చి, మీ జీవితమును సార్థకము చేసికొండు. నా యీధనమును పాఠశాలకై వినియోగింపుడు. నే కోరున దిదియే. దయామయుఁడగు భగవానుడు, మీకు ఆయురారోగ్యైశ్వర్యాదుల నిడి ఆదర్శదంపతులుగ నొనర్చి రక్షించుగాత!" ఇట్లుచెప్పుచు శ్యామసుందరుని హస్తమున లీలచేయినిడి "అబ్బాయీ, శ్యామసుందరా, లీల పట్టిచేల; తల్లిదండ్రులులేని లోటు లేకుండ నామెను కాపాడి ప్రేమింపుము. సీతారాముల వలె, అన్యోన్యమైత్రితో మెలంగుడు," అనిపలుకుచు "నేటికి నేధన్యనైతిని. నాజీవితము సార్థకమయ్యె" ననుచు ఆప్రేమైకరాశి అసువులవిడిచెను.

---

# నా ఆశ

బసవరాజు అప్పారావు గారు

బతుకు బరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరు బుట్టి పారిపోయి
ఒకడనె యే తోటలోనొ
పాటబాడుతుండగ నా ప్రాణి దాటి యేగేనా?
ప్రాణి దాటి యేగువేళ పాట నోట మోగేనా?

పాప ఫలము నెత్తణచగ
బతుకు తెరువు వేరు లేక
దాసుడనై దాంపత్యపు
తలుకు లోలక చిట్టితో స
య్యాటలాడుతుండగ నా ఆయువు ముగిసేనా?
ఆయువు ముగిసేటప్పుడు ఆటలలో మొగసేనా?

కత్తిపోట్లు తిని తిని కడు
గాయమైన పేదగుండె
బీతుబోవ పరవశాన
ప్రియమారగ నా చిట్టిని
కౌగిలించుకుండగ నా కాయము సురిగేనా?
కాయము సురిగే అదునుకు కౌగిలిలో కరిగేనా?

# సింహాచలయాత్ర

(ఒక సోదరుడు)

సుమారు రెండుమాసముల క్రిందట, వేరే పనియుండి విశాఖపట్టణం వెళ్లవలసివచ్చింది. వెళ్లిన పనిమీద అక్కడ నాలుగయిదు రోజులు ఆగవలసివచ్చింది. నేనిది వరకెప్పుడూ ఆపట్టణంలో అన్నాళ్లు ఉండలేదు. ఈ సారి పట్టణం అంతా సావకాశంగా చూడడానికి అవకాశం కలిగింది.

వాల్తేరు స్టేషనుకు మెయిలు మధ్యాహ్నము రెండు గంటలకు చేరింది. అక్కడే రైలుదిగి, బండికట్టించుకొని ఊళ్ళోకివెళ్లాను. వాల్తేరు స్టేషనుకు, తన ప్రాముఖ్యతకు తగిన ఆకారమున సౌందర్యములు లేవు. ముందు ముందు బాగుపడడానికి అవకాశం ఉంటుదనితోస్తుంది.

స్నేహితునికి ముందుగా నారాక తెలియపర్చకుండా వచ్చినందుకు, ఆతడు ఊళ్ళో లేకపోవడం వంటి పరాభవం సంభవిస్తుందేమోనని భయపడ్డానుగాని, భగవంతుడిదయవల్ల, అతడు ఇంటిదగ్గరే వున్నాడు; పైగా తీరుబడిగా ఉన్నాడు కూడాను.

విశాఖపట్టణం ఊరు మంచిదేకాని, మునిసిపాలిటీకి ఇంకా కొంచెం శ్రద్ధవుంటే, ఇంకా బాగుండును. క్రొత్తగాబయలుదేరుతూఉన్న పేటలునివాసానికి చాలా ఆరోగ్యప్రదంగా వుంటాయి. సముద్రతీరం కొంచెం ఇరుకైనా బాగానే వుంటుంది. సాయంకాలమప్పుడు సముద్ర తీరానికివెళ్లి చూస్తే చాలామనోహరమైన దృశ్యం కనబడుతుంది. ఎదురుగా సముద్రములోనికి ఉన్న కొండ యీ మనోహరదృశ్యానికి జీవంవంటిది. ఆ కొండే లేకపోతే బహుశః ఆ సముద్రతీరానికి విహారము కోసము ఎవరూ వస్తూవుండరనుకుంటాను. నేను అక్కడనున్నది మంచి వర్షాకాలం కనుక, ఆ సముద్రతీరం చక్కని మేఘాలతో మరింత శోభగావుండేది.

విశాఖపట్టణం వీధులు కొంచెం విచిత్రంగా వుంటాయి. ఒకవీథిలో నిలబడి చూస్తే, ఒకవీథి కొండ



విశాఖపట్టణము కాలేజీమేడపైనుండి కనబడు పట్టణదృశ్యము

మీద నున్నట్లుంటుంది; ఇంకొకవీధి కొండలోయలో నున్నట్లుంటుంది. పట్టణమంతా కొంచెము హెచ్చు తక్కువగా ఇదే మాదిరి.

ఆపట్టణంలో ఉండే రోడ్లల్లో ఒకసారి హార్బరుకు కూడా వెళ్లాము. అక్కడ జరుగుతున్న పని చూస్తే



విశాఖపట్టణము హార్బరునం దొకభాగము

చాలా ఆశ్చర్యం వేసింది. అంతకన్న దానినిగురించి వర్ణించలేను. విశాఖపట్టణం ముందుముందు చాలా అభివృద్ధిలోకి వస్తుంది అనడానికి యీహార్బరే నిదర్శనము.

నేను వ్రాయవలచుకొన్నది విశాఖపట్టణాన్ని గురించి కాకపోయినా దారిలో ఉన్నది కనుక యీపాటి వ్రాయవలసి వచ్చింది.

విశాఖపట్టణానికి సింహాచలక్షేత్రం సుమారు 10 మైళ్లలో వుంది. బి. యన్. ఆర్. లైన్‌మీద సింహాచలము స్టేషనుకూడా వుంది. కాని విశాఖపట్టణంలో దిగి వెళ్లడమే సులభము. విశాఖపట్టణంనుంచి సింహాచలంమీదుగా విజయనగరమును రోజూ లెక్కలేనన్ని మోటార్లు తిరుగుతుంటాయి.



సింహాచలముపైకి ఎక్కు త్రోవలోని యొక్కదృశ్యము

ఒకనాడు నాస్నేహితుడూ నేనూ, ఉదయాన్నే 6 గంటలకు మోటారుమీద బయలుదేరి సింహాచలం చేరుకున్నాము. సింహాచలం ఊరు పెద్దది అనడానికి వీలులేదు. బాగా పల్లెటూరులో లెక్క చెప్పవలసిందే.

మేము వచ్చిన రోడ్డు నంటిపెట్టుకొనే, కొండ వున్నది. అక్కడ మే మెరిగియున్న పెద్దమనిషి ఆ దేవస్థానంలో ఉద్యోగి అవడంనుంచి, మా కాతిథ్యం కొంచెం గొప్పగానే జరిగింది. కొండక్రింద నెక్కడా పెత్తనాలు చేయకుండా కొండ ఎక్కడం ప్రారంభించాము. మెట్లదగ్గరకు వెళ్లడంతోటే, చాలామంది భిక్షుకులు మమ్మల్ని చుట్టూ ముట్టడి వేశారు. ఒక రూపాయి కానులుగా మార్చి, అడిగినవానికి లే దనకుండా ఒక్కొక్క కానీచొప్పున ఇచ్చుకుంటూ కొండమెట్లెక్కాము. భగవంతుడు తనకు ఆలయములో దక్షిణరూపంగా ఇచ్చే దానికన్న ఈ రూపంగా ఖర్చుపెడితే ఎక్కువ సంతోషించుతాడు.

కొండమెట్లు ఎక్కుతుంటే ఇరుప్రక్కల ఉన్న పలురకాల ఫలవృక్షాలు కన్నులకి పండువు చేశాయి. మేము నడచిన దారిప్రాంతములో జైత్తెడుభూమికైనా వృథాగా లేదు. అన్నీ మామిడిచెట్లే! అన్నీ అరటిచెట్లే! అన్నీ పనసచెట్లే! అన్నీ సంపంగిచెట్లే!

ఆమెట్లమీదనుంచి వెనక్కి చూస్తే, క్రింద దూరంగావున్న సమతలప్రదేశం, కొండలు చాలా మనోహరంగా కనిపించాయి.

కొంతదూరం ఎక్కేసరికి పైన ఒకచోట, ఒక ఇనుపగొట్టములోనుంచి నీరు ఏకధారగా సుమారు ౨౦ అ. క్రిందికి పడుతోంది. ఈ గంగను కొండపైనుంచి



ఆకాశగంగ

గొట్టములద్వారా నడిపించి, ఫలవృక్షాలకు, పూలతోట లకు ఉపయోగించుతున్నారు. ఈ గంగ సంవత్సరం పొడ వునా ఏకధారగా ప్రవహించుతూ ఉంటుందట. దీని మొదలెక్కడో ఎవరికీ తెలియదు. పైన ఎక్కడో కొండగర్భంలో పుట్టిందని చెప్పుకుంటారు.

కొండపైన ఒక చిన్నపల్లె ఉంది. అక్కడ దేవ స్థానంతరపు మంగళ్లు, చాకళ్లు, పూజారులు, వగైరా



సింహాచలముపైనున్న దేవాలయముయొక్క ముఖద్వారము

నివాసముంటారు. అక్కడ కాఫీహోటళ్లుకూడా ఒకటి రెండు ఉన్నాయి! అక్కడ విశాలమైన సత్రం ఒకటి ఉంది. ఎంతమంది యాత్రికులు వచ్చినా అందులో బసచేయవచ్చును. కాని ఆ సత్రం వాలకం చూస్తే అంత సదుపాయంగా ఉన్నట్లు తోచదు. అంతరాబడి (సుమారు రెండులక్షలు) దేవస్థానమునకు సత్రము తగదు. దూరదేశమునుంచి వచ్చే యాత్రికులు ముఖ్యంగా ఉత్సవపురోజులలో చాలా ఇబ్బందిపడ తారు. ఎవరైనా గొప్పవారు గాని, పెద్దఉద్యోగులు గాని సకుటుంబముగా వస్తే, ఉండడానికి కొన్నివస తులు ఉన్నాయి; కాని అవి చాలవు. ఈ సత్రంవిష యంలో దేవస్థానము కొంచెము శ్రద్ధవహిస్తే బాగుం డును. తక్కినలక్షణాలు అన్నీ బాగానే ఉన్నాయి.

ఎక్కడ చూచినా విద్యుద్దీపాలు, నీటి కొళాయిలూను! దేవుడి కీపాటినాగరికత ఉండవలసిందే!



సింహాచల దేవాలయోద్యానము

మేము ఉద్యోగస్థుల వసతిగృహములో మకాము చేసి, స్నానానికి ఉపక్రమించాము. గంగధారవద్దకు వెళ్లి అక్కడ స్నానం చేశాము. రోజూ వందలకొద్దీ జనం అక్కడ స్నానం చేస్తూవుంటారు.

ఆ సమీపంలోనే తలవెంట్రుకలు తీయించుకొనే దేవస్థానపుక్షౌరశాల వున్నది. అది చూడడానికి వెళ్లాము. అక్కడికి వెళ్లగానే నాకు కొంచెం నవ్వువచ్చింది. ఒక కిటికీదగ్గర, రైలుస్టేషన్‌లో టిక్కట్లకు మూగినట్లే జనము మూగినారు. అక్కడ ముడుపుచెల్లించి టిక్కట్టు కొంటే నేకాని, లోపల మంగలి సంస్కారం చెయ్యడు!

అక్కడినుంచి దేవాలయం ప్రవేశించాము. దేవా లయంలోకూడా టిక్కట్లు కొంటేనేకాని ప్రవేశం లేదు.

ఆ వ్యవహారం అంతాచూస్తే, నాటకశాల రైలు స్టేషనుజ్ఞాపకానికి వచ్చాయి. అంటే నిరసించడం నా అభిప్రాయము కాదు. భగవంతుడుకూడా దేశకాలాలను బట్టి నాగరికత అవలంబించవలసి వచ్చింది.

యాత్రికులు దేవదర్శనం చెయ్యడానికి పూర్వమే దేవునికి పూజ భోగం వగైరా పూర్తియైనవి. దేవునిదర్శనం చేసికొని బయటకు వచ్చాము.



సింహాచలదేవాలయ గర్భాలయము. దేవాలయము వెనుకప్రక్క నున్న ఎత్తుప్రదేశమునుండి తీసిన ఛాయాచిత్రము

ఆ దేవాలయము లోపల రాతిపని, ఎన్నివందల సంవత్సరాలక్రితము చేశారో కాని చాలా అద్భుతంగా వున్నది. ఒక్కొక రాతి స్తంభం (సుమారు 15 అడుగులు పొడవుగలది) ఎట్లా యెత్తగలిగారో, చాలా ఆశ్చర్యము వేస్తుంది. ఆ రాతి స్తంభాలమీద చెక్కబడ్డ బొమ్మలు, నగిషీలు, మానవుడు చేశాడంటే నమ్మకంపుట్టదు. ఒక స్తంభంమీది నగిషీ ఇంకో స్తంభంమీద లేదు.

అక్కడి ఉద్యోగి ఇంకొకవిషయము చెప్పేసరికి మరింత ఆశ్చర్యము కలిగింది. ఆ దేవాలయము యేరాతితో కట్టబడిందో, ఆ మాదిరిరాయి ఆ కొండమీద లేదు సరి కదా, ఆప్రాంతమున ౫ మైళ్లలోపున ఎక్కడా లేదట. అంతదూరమునుంచి ఇంతంతరాళ్లు మోసుకువచ్చి, ఇంత యెత్తునవున్న కొండమీదికెక్కించి, దేవాలయము కట్టిన మహానుభావులు మానవమాత్రులేనా?



గర్భాలయము వెనుకవైపు గోడపైనున్న శిలాశిల్పభాగము

ఆ దేవాలయములో రాతిచెక్కడాలు అన్నీ చాలా సేపు చూచి చూచి, బసకు వచ్చాము. అక్కడ శ్రీస్వామి వారి ప్రసాదం మాకోసము యెదురుచూస్తూవుంది. దానితో కొంచెము క్షుద్బాధ తీర్చుకొని కొండ దిగాము.

కొండ దిగగానే మోటారు సిద్ధంగా ఉంది. మమ్ములను ఆదరించి ఆతిథ్యము ఇచ్చిన పెద్దమనిషివద్ద సెలవుతీసుకొని తిన్నగా మోటారుమీద విశాఖపట్టణము వచ్చాము.

---

# సరస్వతి భూలోకమునకవతరించుట

కోమాండూరు కృష్ణమాచార్యులుగారు

(ఆంధ్రధహర్ష చరిత్రము)

సావిత్రీవాక్యము :—

బాల! త్రిలోకపూజ్యుఁ డగు పంకజగర్భుని యంతవాని యి
ల్లాలవు నీకుఁ జెల్లఁగ వలంతులమే వచియింపఁ బూనినన్
నాలుక యూడ దత్రిముని నందనుఁ డాడినమాట శల్యమై
కాలుచు నున్న దెట్లయిన కాలగతిన్ దొలఁగింప శక్యమే.

తల్లి త్రైలోక్యమంగళ దర్పణంబు-కమలకోమలమగు నీదు క్రమ ముఖము
కజ్జలాశ్రుజలంబులఁ గందిపోయె - బాల చాలింపు మేల యీలీల జాలి.

అభిజనత్యాగ మేవారి కనభిమతము - నైజమగు ప్రేమబంధముల్ నలుక రావు
నలువ యెడఁబాటు మనసులోఁ దలఁపరాదు - ధీరచిత్తవు నిను నీవె తేర్చుకొనుము.

హిమవాలుకా పూర్ణరమణీయతరదివ్య భాగీరథీనదీప్రాంతవనము
రాధామనోనాథ గాథాశతపవిత్ర సాధుబృందావనీసైకతములొ
రామచాపవిముక్త భీమసాయకభిన్న సప్తసాలసమీప శైలతతులొ
భార్గవోగ్రకుఠార నిర్గతప్రాణరా జన్యరక్తౌఘ నిర్ఝరతటంబొ
యక్షకిన్నర గంధర్వ యాతుధాన - గానఘూర్ణిత హిమశైల కందరములొ
చారుహాసిని! భవదీయ చరణచార-యోగ్యములు పృథ్వి నింకెవ్వియో వచింపు.

అనిన వాణి యిట్లనియె.

ఆర్య! భవదీయ సాహచర్యమున నవని - శాపవిధి నెట్టులైనను సంతరింతు
లోకనాయకచరణాబ్జలోలుపంబు - చిత్తమధుపంబు మరలింపఁ జేతగాదు.

ధరణి తపస్సమాధి కుచితస్థలముల్ నియమింప దేవి, నీ
వెఱుఁగుదు వట్లు గావున మదీయనివాస మనోహరంబుగా
నరసి వచింపుమా యని నిశాంతసమీరము సోఁకునంతకున్
సరసిజగర్భునిన్ విడువఁజాలక తాఁ గను మూయ కుండినన్.

అప్పుడు పితామహహంసకులపాలకుం డీయపరవక్త్రమున నుచ్చైస్స్వరంబునం బలికిన.

అనఘమానసలాలితహంసతరుణి, - లోలలోచనముల బయ లేల సూచె
దమ్మ! వాపీజలావగాహన మొనర్చి-అరుగుదువు గాక మరలఁ బద్మాలయంబు

నిజకర్తవ్యతాసూచకంబగు వాక్యంబు విని భారతీదేవి.

మునివాక్యము నా కెంతయు-ననువై యున్నయది తలఁప నబ్జాసనునిన్
గనిమెద శాపాంతమ్మునఁ - జనిమెద నేఁ డవని కిపుడె చయ్యన యనుచున్.

సావిత్రీసహితయై పరమేష్ఠిపాలికిం జని ముమ్మా రమ్మహిదేవునకుం బ్రదక్షిణంబు సేసి యనుజ్ఞాతయై వేదమాత కైదండ యొసఁగ, మర్త్యలోకమార్గంబు ననుసరించి చని చని ముందట.

జలకేళిరసలోల జంభారికుంభీంద్ర కరఘాతసంచలద్గ్రాహకులము
శమనసైరిభశృంగ సంభిన్నవల్మీక బిలనిర్గతాభీల విషధరంబు
చతురాననవిమాన చక్రాంగకులగరు న్మరుదంకురవిలోల మధులిహంబు
హరవృషోగ్రవిషాణ ఖరఖురోత్పాటిత పర్యంతపర్వత ప్రస్తరంబు
సప్తఋషికృతమృల్లింగ సైకతంబు-అబ్జసంభవ నిర్వర్తితాహ్నికంబు
సకలలోకైకపావన స్వాదుసలిల-మభ్రగంగామహాప్రవాహంబుఁ గనియె.

అమ్మహావాహినీతీర మనుసరించి-కల్పలతికాకుడుంగముల్ గడచిగడచి
మేఘమాలిక లాగిఁ జీల్చి మెఱపుఁ బోలి-దిగియె సావిత్రితోడ వాగ్దేవి యిలకు.

భూతలమందు శోణ మను పూర్వమునుండియు వాసిఁ గన్న వి
ఖ్యాతనదోపకంఠవిపినాంతర బాలతమాలమాలతీ
శీతలగంధవాహము లశేషపథశ్రమమున్ హరింప వా
జ్మాత వసించె తన్నికటమాధవికాలతికాలయంబునన్.

పావనస్వాదు సలిలప్రవాహమందు-వాణి సావిత్రితోఁ బ్రతివాసరంబు
ద్రిషవణస్నాన మొనరించి త్రిపురహరునిఁ-బద్మదళములఁ బూజించు పరమభక్తి.

తాము గోయకుండఁ దమచేతఁ జిక్కిన-వన్యమూలమధురఫలరసముల
తనువు లోమి రపుడు తల్లి! సావిత్రియు-భారతీవధూటి పరమమైత్రి.

వాసరములేఁగె పక్షముల్ వరుసఁ బోయె-మాసములుమాసెఋతువులుమాయమయ్యెఁ
గడచె వర్షంబు లీరీతిఁ గాలచక్ర-మనిలజవమున విశ్రాంతి యనక తిరిగె.

---

శ్రీమతి-పసుమర్తి విశ్వేశ్వరమ్మ గారు

# స్త్రీ విద్య

విద్య మంచి చెడ్డలను బోధించుచు ప్రవృత్తి నివృత్తులను గలిగించి, యిహ పర సౌఖ్యముల నొసంగుటకు మహాసాధనము. ఈమహాసాధన మెంత ప్రయాసమున కోర్చియైనను, గురుకులవాసము చేసి స్త్రీపురుషులు తప్పక సంపాదింపవలయును.

ఇట్లుండ నదేమిపాపమోగాని పురుషులే విద్యాభ్యాసమున కర్హులనియు, స్త్రీ లెంతమాత్రము కారనియుఁ గొందఱు పుణ్యజనుల యభిప్రాయము. స్త్రీలకు విద్యచెప్పించిన యెడల వారు భర్తలయాన నతిక్రమించుటయే కాక, తమ చిత్తము వచ్చినట్లు ప్రవర్తించి యుభయ వంశములకును దుర్యశము నాపాదింతురని కొందఱుపన్యాసము లిత్తురు.

అయ్యో! ఎంత పిచ్చితనము! విద్య, విజ్ఞానమును గలిగించును; అది వివేకమును బుట్టించును; వివేకము దుర్మార్గమునుండి తప్పించి సన్మార్గములోఁ బ్రవేశపెట్టును; దాని వలన నిహ పర సౌఖ్యములు సంభవించును. మఱియొక రహస్యము:

ఏ దంపతులు విద్యావంతులగుదురో యా దంపతులకుఁ బుట్టిన సంతానమనంతయు విద్యావంతము కాకతీఱదు. "తల్లిని బోలిన బిడ్డ, నూలునుబోలిన గుడ్డ" అను లోకోక్తి తమకు జ్ఞాపకమునకుఁ దెచ్చుచున్నదాననుఁ.

విద్య వంశహీనునకు వంశము; ధన దూరునకు ధనము; రూపవికలునకు రూపము; బంధువిధురునకు బంధువు; హితరహితునకు హితుఁడు; వేయేల! సర్వహీనునకు సర్వస్వము. ఇదియొక యపూర్వపుగని దొంగిలించుటకు వీలుకానిది; పంచుకొనుట కవకాశ మియ్యనిది; వెచ్చించినకొలఁది హెచ్చగునది. వెయ్యి మాట లేల? విద్య అనన్వయాలంకారమునకు నిర్దుష్టలక్ష్యము.

పూర్వము మదనసేన యను రాజకన్యక విద్యాగంధసుందరి యగుటంజేసి, కులహీనుఁడయినను, ధనదూరుఁడయినను, రూపరహితుఁడయినను సరియే, విద్యావంతుఁడయినచో నతనికి దన్నిచ్చి వివాహము చేయుమని తండ్రితోఁ జెప్పెనని నే నొక గ్రంథములోఁ జూచియుంటిని. ఒక్క హిందూదేశము తప్ప ఎల్ల దేశములయందును స్త్రీవిద్య సద్యశోముఖముగా నానాటి కభివృద్ధి యగుచుండుట తెలిసికొనుచున్నను మనవా రెందులకు స్త్రీలకు మంచివిద్య చెప్పింపరో నే నూహింపజాలను.

"సంగీతమపి సాహిత్యం సరస్వత్యాః స్తనద్వయమ్,
ఏక మాపాత మధురం అన్యదాలోచనామృతమ్."

ఈ శ్లోకమువలన సాహిత్యశాస్త్ర మమృతతుల్యమని తేలుచున్నది. కాని మనవా రొకర సంగీతము మాత్రమె కాసటబీసటగాఁ దమ

తనయలకుఁ జెప్పింతురు. అదియును పెండ్లి యగువఱకే. కాని ఆ పైని గగనారవిందమె. ఓ సోదరులారా! "సకా విద్యా సురక్షితా" అని మీరు వినియుండలేదా!

ఇది జనాంతికము:

సాహిత్య మొక గొప్ప అద్దము; అందు ప్రతిబింబించనివస్తు వుండదు. వేస్యేల? మన మెఱుంగని స్వర్గాదులు సయిత మందుఁ గనఁబడి అఖండానందమును గలిగించును.

"విద్య లేని జీవి వింతపశువు" అను నార్యోక్తి తమకు విశద మయియే యున్నది. ఓ అన్నలారా! ఇఁకనైనను గటాక్షించి నా అక్కచెల్లెండ్రకు సంగీతముతోపాటు సాహిత్యమును సయితము చెప్పించి వారి జ్ఞానతనువుల నభివృద్ధి చేయ మిమ్ములఁ బదింబదిగ వేడుచు నింతతో ముగించు దానను.

---

## బత్తిపాటలు

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు (కవితాసమితి)

[విభవ ఫాల్గుణ సంచిక తరువాయి]

౫

చీఁకటిడెందంబుఁ జీల్చి చూచితిని
గనియవు నీదు ముంగురు లందుఁ జెదరి
వెన్నెలకెరటాల విఱిచి చూచితిని
నటియింప వందు నీ నవ్వుడీవియలు
తెమ్మెరతెరతెరల్ దిగిచి చూచితిని
మలయవు నీదు కమ్మనియూర్పు లందు
తరుణ సూర్యప్రభల్ తరిచి చూచితిని
మెలిగొనవందు నీ మేనిదీధితులు
లీల నీజగము గాలించి చూచితిని
సందడింపవు నీదు జాడ లెయ్యెడను
ఎం దున్నవాఁడవో యీశ నే నెఱుఁగ!

* * *

ఎం దున్న నా కేల నీవితర్కములు?
నీ వేణుమంజులనినదమ్ము దాఁటి
నీ కర్ణయుగళమ్ము నెఱిఁ జేరుదాఁక
గొంతెత్తి నేఁ బాడికొను బత్తిపాట
విన కెందుఁ బోదువో! వేణుగోపాల!

౬

తరులత లొండొంటిఁ దగఁ గౌఁగిలించి
యలపోక గుసగుసలాడఁగఁ జూచి
నీనామమంత్రంబు నేర్చెడి ననుచు
వినఁగోరి దాని నివ్వెఱగంది నిలుతు!
కదుపులో రాచిల్క గళసనాదమ్ము
మార్మ్రోఁగఁ బలుకు సంపద నింపఁ జూచి
నీ దివ్యకథల వర్ణించెడి ననుచు
వినఁగోరి దాని నివ్వెఱఁగంది నిలుతు!
కడకోనలో నుషఃకాలానఁ బికము
తులకించి పాటగుత్తులు జార్పఁ జూచి
కెరలు నీ ప్రేమమ్ముఁ గీర్తించు ననుచు
వినఁగోరి దానిని వెఱగంది నిలుతు!
వినవిన డెందంబు విరివోలె విరియఁ
దనివారనిను బాడదలఁచి యందందు
జాలువారెడు శబ్దజాలమ్ము దాఁటి
నీవేణుమంజుల నినదమ్ము దాఁటి

నీ కర్ణయుగళమ్ము నెఱఁ జేరుదాఁక
గొం తెత్తి నేఁ బాడి కొను బత్తిపాట
విన కెందుఁ బోదువో వేణుగోపాల!

౨

ఈ నిశీథిని శబ్దమే లేనివేళఁ
బలపలఁ బలుకు నీ పసిఁడికంటికలు (?)
వడి నీవు మసలు సవ్వడిఁ బట్టెనేమొ?
ఈ గాఢతమిని వెలే లేనివేళ
మిఁటమిల మెఱయు నీ మింటిపైఁ జుక్క
పొరి నీదు నగుమొగమ్మును జూచెనేమొ?
ఈ కూర్కుతఱఁ జలమ్మె లేనివేళ
గలగలపోవు సీగాలి కెరటాలు (?)
కులుకు నీకదలికల్ గుర్తించెనేమొ?

*        *        *

ఎలమి నేఁ బక్కినై యెగురంగలేను
చుక్కనై మిన్నెక్కి చూడంగలేను
పరువంపుగాలి నై పరుగెత్తలేను
నినుఁ జూడ కే నిట్లు నిలువఁగా లేను.

*        *        *

గువ్వ లై శబ్దాలు గుమిగూడి యెగుర
చుక్కలై భావాలు సొగసులు నింప
గాలినై రసము చక్కఁగఁ బారువార
నీ వేణు మంజుల నినదమ్ము దాఁటి
నీకర్ణయుగళమ్ము నెఱఁ జేరుదాఁక
గొం తెత్తి నేఁ బాడికొను బత్తిపాట
విన కెందుఁ బోదు వో వేణుగోపాల!

౩

చివురాకు దోసిటఁ జిఱునీటి బొట్లె
ముత్తెముల్ చల్లు నీ మురిపెంపుఁ దీవ
తెరలు నాతలఁబ్రాల తెరచాటులోన
దాఁగిలిమూఁత లాడట నాఁడె దేమొ?
కొనవ్రేళ్ళఁ గ్రొన్నన గుత్తులఁ గూర్చి
సురఁటీల విసరు నీసురపొన్నగున్న
కెరలు నీనునుగాలి కెరటాలలోన
నెలమి మైఁదూఁగుటుయ్యెల నూఁగెదేమొ?
పవడంపు రాగసంపదఁ దోఁగులాడు
పసమీఱు నీ క్రొత్తపరువంపుసంజ
తద్రాగవల్లీ వితానమ్ములోనఁ
దనివార నవవసంతము లాడెదేమొ?
నెఱఁ బాలమున్నీటి నిగనిగల్ దేరు
తళుకుల నించు నీతఱపి రేయెండ
దొరలు నాతరఁగ పొత్తులలోన నిమిడి
వటపత్రశయ్యపైఁ బవళించెదేమొ
పనివడి లవము సవ్వడి సేయకుండ
నిట్టూర్పుఁ బుచ్చు నీ నిశ సంచలించి
తచ్ఛాంతిలోన నూతన సజాతిగతుల
మురళీనినాదంబు మ్రోయించెదేమొ
పులుఁగులపలుకుతీపుల తేట లొలయ
పలుకరించెడి నాత్రపడి యీయుషస్సు
కరుణించి యుదయరాగము చెసల్ నించి
చయ్యన దివ్యదర్శన మిచ్చెదేమొ!

*        *        *

ఏ మొనరింతువో యీాశ, నే నెఱుఁగ!
ఏ నెఱింగిన దొక్కటే చాలు నాకు
నీ వేణుమంజుల నినదమ్ము దాఁటి
నీకర్ణయుగళము నెఱఁ జేరుదాఁక
గొం తెత్తి నేఁ బాడికొను బత్తిపాట
విన కెందుఁ బోదు వో వేణుగోపాల!

# మహాక్షత్రప ద్వితీయ రుద్రదాముడు*

సోమయాజుల వెంకట శివరామశర్మ గారు

పరిశోధకుల పరిశ్రమచే ప్రాచీనభారతచారిత్రము కొంతవఱకు బయటపడుచున్నను చాలభాగము అంధకారమందె అణగియున్నది. మౌర్య చంద్రగుప్తుడు అలెగ్జాండరునకు సమకాలీనుడని స్థిరముగ నంగీకరింపబడినది. ఇందువలన మధ్యయుగముల చరిత్ర మఱింతచిక్కువడుచున్నది. ఆర్యు లెవ్వరు? వారి ప్రథమ నివాస మెక్కడ? ఏకాలమం దెటు లభివృద్ధి నొందిరి? ఇత్యాది ప్రధానవిషయముల గుఱించియే విద్వాంసులు ఏకాభిప్రాయమునకు రాజాలకయున్నారు. మానవతత్త్వవేత్తయగు 'డెనిక'రను ఫ్రెంచిపండితులు మనుష్యవర్గీకరణమున ఆర్యులకు తావొసగుటకే నిరాకరించెను. వేదారంభకాలము క్రీ. పూ. ౪౦౦౦ లని జాకోబీ పండితుడును; కాదు, ౬౦౦౦ సం. లని లోకమాన్యుడును భిన్నమతముల దెలిపియుండగా, వెబర్ పండితుడు ౧౫౦౦ సం. లకన్న నెక్కుడు ప్రాచీనత అసంభవ మనుచున్నాడు. మూలమందే యిట్టిభేదము లుండ శాఖాప్రశాఖల సంగతి చెప్పనేల? కాని, సత్యాన్వేషణ పరులగు పండితవర్యుల పరిశోధనలచే క్రమక్రమముగ చీకటి తొలగుచున్నటులు కాన్పించుచున్నది.

ద్వితీయక్షత్రపుల కాలముకూడ అంధకారచ్ఛన్నమైయుండుటచే నప్పటివిషయములిదమిత్థముగ నిర్ణయింపబడజాలవు. ఇటీవలనే లభ్యమైన యొకనాణెము ఆకాలపు విశేషముల గొన్నిటిని తెలియజేయుచు కొంత చిక్కును విడదీయ గలిగియున్నది.

బరోడా రాజ్యమందలి బీజపూర్ తాలూకాలో లభించిన యొక వెండినాణె మిది. దీనిమీద నున్న రాజుముఖము, శిరోభూషణము, నిడుదలగుకురులు, స్తూపచిహ్నము, అర్ధచంద్రుడు ఇత్యాదులచే నది క్షాత్రపయుగపు నాణెమని నిశ్చయింపబడినది. ముఖబింబము, అక్షరములు కొంచె మరిగిపోయినను నది యెవరిదో నిర్ణయించుట కంతగా శ్రమపడనవసరము లేదు. అందలి బ్రాహ్మీలిపియక్షరము లివి:-

(క్ష) (త్ర)పసరుద్రస (హా) పుత్రస రాజ్ఞో (మ) (హా) (క్ష) (త్ర)

( ) గుర్తులలోని యేడక్షరములు తప్ప మిగిలిన వన్నియు స్పష్టముగ జదువ వీలగును. అఱిగి పోయిన రూపమునుబట్టి యీ యేడింటిని ఊహింప వీలగును. (మ) (హా) ల నూహించుట కొంచెము కష్టము. చూచుటకీ రెండును, ముందున్న (క్ష) యొక్క-

* పండిత శ్యామలాలు భైరవలాలు యం. ఎ. గారిచే నాగరీప్రచారిణీపత్రికయందు వివరింపబడినది.

క్రింది తిరుగుడులో కలిసిపోయి ఒకే యక్షరము వలె నగపడును. కాని పరిశీలించి చూచినచో (మ) (హా) (క్ష) ఈమూడు ప్రత్యేకాక్షరము లని తెలుసుకొన గలము. ఇక మధ్యనున్న (హా)ను గుర్తించుట చాలకష్టము. పైకి 'న' వలె గనుపించినను సూక్ష్మయంత్రమున జూచి నచో దీనిక్రిందికొమ్ము కుడివైపునకు తిరిగి యున్నట్లు తోచును. ఆకాలపు 'న' యొక్క క్రిందిభాగము ఎడమవైపునకును, 'హా'యొక్క క్రిందిభాగము కుడివైపునకును తిరిగి యుండె డిది. రుద్రదాముని గిరినార్ శాసనములను చూచినచో ఇట్టి క్షాత్రపకాలపు లేఖనవిశేష ములు బోధపడగలవు. ఈవిధముగ నీనాణెము 'క్షత్రపరుద్ర సింహపుత్రు'ని దనియు, నతనికి 'మహాక్షత్రప' బిరు దుండెననియు గుర్తింప గలము.

అక్షరములబట్టి ఇది ప్రథమక్షత్రపులది కాదని స్పష్టముగ జెప్పవచ్చును. ఏలన: అప్ప టియక్షరములు ప్రాథమికావస్థయందుండి వంక రటింకరగ నుండెను. చైత్యము గుండ్రము గను, నాణెములు మోటుగను ఉండెను. కాని తరువాతికాలమున అక్షరశైలి సున్నితముగను, నిశ్చితసంకేతయుక్తముగను వికాసము జెంది నది. నాణెములుగూడ సొగసుగ ముద్రింప బడుచుండెను. మన యీ నాణెమునందు నయితము అక్షరసౌందర్యము, త్రికోణాత్మక మగు చైత్యము, బిందుసూచిత అర్ధచంద్రా కృతియు కానవగును.

ఇందలి 'రుద్రసింహపుత్రు' డెవడు? క్షాత్రపచరిత్రయందు ముగ్గురు రుద్రసింహపు త్రులు కానవచ్చుచున్నారు.

౧. ప్రథమరుద్రసేనుడు, క్రీ. శ. ౧౯౯-౨౨౨–ప్రథమరుద్రసింహుని పుత్రుడు.

౨. దామసేనుడు–క్రీ. శ. ౨౨3-౨3౬ ప్రథమరుద్రసింహపుత్రుడు.

3. ద్వితీయయశోదాముడు, క్రీ.శ. 3౧౭-33౨–ద్వితీయరుద్రసింహుని పుత్రుడు.

ఈ ముగ్గురు 'రుద్రసింహపుత్రు'లలో నీనాణె మెవనిదో నిశ్చయించుటకు పూర్వము క్షత్రపులచరిత్ర సంక్షేపముగ వివరింతును.

'క్షత్రప' శబ్దము ప్రాచీన పారసీక్షత్రప శబ్దమునుండి పుట్టినది. సూబేదార్ లేక మండ లాధికారియని దీనియర్థము. ఇంతకుపైహోదా లోనున్న వానికి 'మహాక్షత్రప' యనుబిరు దుండెను. ఈ రెండవరకమువారు తమ ప్రాంత మున సంపూర్ణస్వాతంత్ర్యముతో మెలగుచు నామమాత్రమునకు రాజాధీనమం దుండిరి. మ హాక్షత్రపులు ప్రాంతీయరాజధానీనగర నివా సులై క్షత్రపులచే శాసింపబడుమండలముల బరిశీలించుచుండిరి.

భారతవర్షమునం దనేక ప్రాంతములనీ 'క్షత్రప' రాజులు పరిపాలించుచుండినటులు తెలియవచ్చుచున్నది. ఈరాన్ (పర్షియా) నుండివచ్చిన యీ విదేశీయ 'పార్థియన్' లేక సిథియన్ జాతులు హిందూస్థానమున తమ రాజ్యమును చిరకాలము స్థాపించియుండినవి

అశోకుని యనంతరము మొట్టమొదట 'బాక్ట్రియా' దేశపు హిందూస్థానముపై దండెత్తిరి. తరువాత శకజాతులు, క్రమక్రమముగా 'పార్థియన్' జాతులును దేశము నాక్రమించినవి. భారతీయగ్రంథసముదాయమందు పెక్కుచోట్ల 'యవన' 'శక' 'పహ్లావు' లుదాహరింపబడిరి. ఈ విదేశీయులు దేశమంతటిని వివిధమండలములుగ భాగించి ఒక పెద్దరాజ్యము నేలుచుండిరి. ఇట్టివారిలో కపిశ, తక్షశిల, మథుర, నాసిక, ఉజ్జైని వీని నేలు క్షత్రపులు (మాండలికులు)భారతచరిత్రయం దధిక ప్రఖ్యాతిని సంపాదించిరి.

పశ్చిమ హిందూదేశమును రెండు క్షాత్రపవంశములు పరిపాలించియుండినవి. ఒకటి 'నాసిక' రాజధానిగ నేలిన 'క్షహరాత' వంశము; రెండవది ఉజ్జైని ప్రధాన నగరముగ నేలిన 'చష్టన' వంశము. రాప్సన్‌పండితుని యూహ ననుసరించి 'క్షహరాతు'లు 'పార్థియను'లతోను, 'చష్టను'లు 'శక' జాతులతోను సంబంధము కలిగియుండిరి. క్షత్రపులు శకసంవత్సరము నుపయోగించుచుండిరి. ఇందువలన, 'శక' స్థాపకులైనట్టిగాని, దాని నంగీకరించినట్టిగాని వేరు సమ్రాట్టులకు ఈ క్షత్రపులు సామంతులుగా నుండిరని యూహింపవీలగును. శకవత్సరము నుపయోగించుచుండిన 'కుశన్' వంశమున కీక్షత్రపులు అధీనులైయుండిరని ఫెర్గ్యుసన్ పండితుడు తలంచుచున్నాడు. సార్నాథ్‌నందు లభించిన కనిష్కునికాలపు శాసనమందు 'మహాక్షత్రపఖరపల్లివాన్' 'క్షత్రపవనశ్చర' యను పదములు కానబడుచున్నవి. ఇందు పేర్కొనబడినవారు మథురాక్షాత్రపులని తెలియవచ్చుచున్నది. కనుక కనిష్కుడు 'పార్థియను'ల యొక్కయు, 'శకు'లయొక్కయు పరిపాలనపద్ధతుల ననుసరించి దూరస్థప్రాంతములందు క్షత్రపుల నియోగించెననియు, పశ్చిమదేశపు క్షత్రపులుగూడ కుశన్ సమ్రాట్టుల కధీనులై యుండిరనియు నిశ్చయింపవచ్చును.

క్షహరాతవంశము ఆంధ్ర చక్రవర్తి గౌతమీపుత్ర శాతకర్ణిచే తుద ముట్టింపబడెను. కాని ఆంధ్రుల విజయపతాకము స్థిరముగ నెలకొనియుండలేదు. ఉజ్జయనీ క్షత్రపుడగు రుద్రదాముడు ఆంధ్రుల నోడించి క్షహరాతుల రాజ్యమును గూడ నాక్రమించుకొని తన సామ్రాజ్యమును స్థాపించుకొనెను. ఇతడు చష్టన వంశజుడు. చష్టనునికి తరువాత వానిపుత్రుడు జయదాముడు రాజై ఆంధ్రుల విజయలక్ష్మికి తలయొగ్గెను. తండ్రి జీవించియుండగనే అకాలమృతిచెందుటచే నితని జీవితము 'మహాక్షత్రప' పదవి నలంకరింపక, కేవల క్షత్రప బిరుదముతోనే అంతమొందెను. అతనివెనుక రుద్రదాము డధికారియయ్యెను. మహత్త్వాకాంక్ష గలవాడై తనశక్తిసామర్థ్యములచే నితడు ఆంధ్రుల నోడించి విస్తృత సామ్రాజ్యము స్థాపింపగలిగెను. ఈతని అభ్యున్నతి, 'మహాక్షత్రప' బిరుదము, గిరినార్ శిలాశాసనమం దభివర్ణింప

బడియున్నవి. అనంతర మితనిపుత్రుడు ప్రథమ 'దామఘసద' సింహాసన మెక్కెను. ఇతని మరణానంతర మితని తమ్ముడగు ప్రథమ రుద్ర సింహుడును, పుత్రుడగు జీవదాముడును రాజ్యమున కలహించిరి. రుద్రసింహునే విజయ లక్ష్మి వరించినది. కొంతకాల మతడు క్షత్రప బిరుదమును, తదుపరి మహాక్షత్రప బిరుదమును కలిగియుండెను. మధ్య నతడు తన మహాక్షత్రప పదవిని కోల్పోయి చివరకు తిరిగి సంపాదిం పగలిగెను. ఇవి యాతని జీవితపు మార్పులుగ నుండవచ్చును. ఇతని వెనుక జీవదాముడును, ప్రథమ రుద్రసింహుని పుత్రుడగు రుద్రసేను డును మహాక్షత్రపులైరి. రుద్రసేనునియనంతర మతని యనుజులగు సంఘదాముడు, దామ సేనుడు నొకరివెనుకనొకరు మహాక్షత్రపు లైరి. ఈసమయమున ఈశ్వరదత్తుడను ఆభీర రాజొకడు మహాక్షత్రపబిరుదము ధరించి చరి త్రరంగమున విజృంభించెను. కాని చష్టనవంశ మున కతని విజృంభణమున విశేషనష్ట మే మియు కలుగనందున యశోదాముడు, విజయ సేనుడు, తృతీయ దామజద(శ్రీ), ద్వితీయ రుద్ర సేనుడు, భర్తృదాముడు క్రమశః రాజ్యము చేయగలిగిరి. భర్తృదామునియొక్కయు, నతని పుత్రునియొక్కయు రాజ్యకాలమున చష్టనవం శము రాజ్యాధికారమును కోలుపోయెను. స్వామిజీవదాముడను నాతడు రాజ్యాధిపతియై తన నూతన వంశమును స్థాపించెను. అతని వెనుక ద్వితీయ రుద్రసింహుడు, ద్వితీయ యశో దాముడు రాజ్యము నిర్వహించిరి. కాని వీరెవరును 'మహాక్షత్రప' గౌరవమును పొంది యుండలేదు. యశోదాముడు గతించిన కొలది సంవత్సరములకే స్వామి ద్వితీయ రుద్రదాము డు తిరిగి మహాక్షత్రప బిరుదమును సంపాదింప గలిగెను. ఇతని వెనుక పరిపాలించినవా రంద రును మహాక్షత్రపులనియే పిలువబడిరి. తృతీయ రుద్రసింహుడు ఈవంశమునందలి కడపటిరాజై యుండును. గుప్తచక్రవర్తి చంద్రగుప్తవిక్రమా దిత్యుడు పశ్చిమ హిందూస్థానమును జయించి తన రాజ్యమున కలుపుకొనిన దీకని కాల మున నే.

### నాణెముయొక్క కాలము

పైసంక్షిప్తచరిత్రవలన రుద్రసింహపుత్రు లనేకులు రాజ్యముచేసి యుండిరని విదితమ గుచున్నది. వారిలో (౧) ప్రథమరుద్రసేనుడు, (౨)దామసేనుడు, (౩) రెండవ యశోదాముడు- వీరుముగ్గు రధికప్రసిద్ధి నొందిననారు. వీరిలో ఈ నాణెమునకు సంబంధించినవా రెవరో చూడవలెను.

౧. ప్రథమరుద్రసేనునినాణెములను (Rapson's Catalogue, plate XII) పరిశీలించినచో వానికిని, మన యీ నాణెమునకును నుండు భేద ము స్పష్టముగ గోచరించును. అందలి అక్షర రచన ప్రాచీనమైనది. చైత్యము, అర్ధచంద్రుడు, రాజముఖము రెంటియందును చాల వ్యత్యస్త ములుగా నున్నవి.

౨. దామసేనుని నాణెములుకూడ మనకు లభించిన నాణెముకన్న మిక్కిలి విలక్షణముగ నున్నవి. ఇందలి రాజముఖము, అక్షరరచన,

సాంకేతిక చిహ్నములు ప్రస్తుత పునానెముకన్న కొంచెము ప్రాచీనతను తెలియజేయుచున్నవి.

3. రెండవయశోదాముని నాణెములందును, క్రొత్తగ లభించినదానియందును ఎక్కువ సామ్యము గన్పడుచున్నది. అక్షరము లొక్క తీరుననే యున్నవి. ముద్రానిర్మాణము పోల్పదగియున్నది. రెండు రాజముఖములందును సామ్యము కనుపించుచున్నది. ఇట్టి పోలికను బట్టి క్రొత్తనాణెము ద్వితీయ రుద్రసింహుని పుత్రుడగు ద్వితీయ యశోదామునిదని నిశ్చయింపవచ్చును. కాని యశోదామునికి మహాక్షత్రపదవి లభించినట్లు తెలియరాదు. కనుక నిది యశోదామునిది కాక, మహాక్షత్రపబిరుద ముధరించినరుద్రసింహుని మఱియొకపుత్రునిదై యుండును. ఈ రెండునాణెముల సామ్యమును, యశోదాముని నాణెములమీఁద మహాక్షత్రపబిరుదము లేకుండుటయు జూడ, యశోదామునికి కొంచెమించుమించుగా సమకాలీనుడును, మహాక్షత్రపపదాధికారియునగు వేరొక రాజు మన నాణెమున కధికారి కానగును. చరిత్రయం దట్టివా డెవడో చూతము:

ద్వితీయ యశోదాముని యనంతరము రుద్రదాముడు రాజ్యపాలనము జేసెనని చరిత్రవలన దెలియును. భర్తృదాముని తరువాత మహాక్షత్రపులైనవారిలో నితడే ప్రథముడు. రాప్సన్ప్రకార మీతడు క్రీ.శ. 3౨౭-3౫౫ పరిపాలించెను. ఈ రుద్రదాముని నాణెములుగాని, శాసనములుగాని లభించియుండనందున మన క్రొత్తనాణెముతో సరిపోల్చి చూచుటకు సాధనములు లేకున్నవి. కాని రెండవ రుద్రదాముడు ద్వితీయ యశోదాముని వెనువెంటనే రాజ్యాధిపతి యగుటచే మన నాణెము యొక్క కాలనిర్ణయము మిక్కిలి సులభమగుచున్నది. అందువలన ఇది రెండవ రుద్రదాముని చే ముద్రింపబడియుండుట అసంభవము మాత్రము కాజాలదు. ఈయూహనుబట్టి రుద్రదాముని తండ్రివిషయమైన సందేహము వీడిపోయి, ద్వితీయయశోదామును, ద్వితీయరుద్రదాముడును ద్వితీయ రుద్రసింహుని పుత్రులని స్పష్టము కాగలదు. కనుకనే వీ రిరువురి నాణెములయొక్క ముఖబింబములందు సైతము పోలికలు కానగును.

### స్వామి ద్వితీయ రుద్రదాముడు

చష్టన వంశపు కడపటి రాజులు దుర్బలురగుటచే క్షాత్రపరాజ్యశక్తి క్షీణించి అంతఃకలహములును,అవ్యవస్థయు సర్వత్ర వ్యాపించియుండెను. ఈతరుణము నుపయోగించుకొని జీవదాముడు శక్తిశాలియై క్షత్రప సింహాసనముపై జేయివైచెను. కాని రెండవ పక్షము కూడ కొంతకాలము పోరాడుచుండుటచే జీవదాముడును, అతని పుత్రుడు ద్వితీయ రుద్రసింహుడును తమ రాజ్యకాలము నంతయు శత్రువుల నణచుటయందే వినియోగించ వలసి వచ్చెను. రెండవ యశోదాముని సమయమున గూడ శత్రువులు బలవంతులుగనే యుండిరి. స్వాధికారము పూర్తిగా స్థిరపడనికారణముచే గాబోలు,యశోదాముడు క్షత్రప బిరుదముతో

సంతుష్టుడై యుండెను. కాని రుద్రసింహుని ద్వితీయ పుత్రుడగు రెండవ రుద్రదాముడు గద్దె నెక్కగనే కలహారంగము శాంతించి శత్రు బలము క్షీణించుటచే ఈ నూతన రాజవంశాధికారము సర్వత్ర పాదుకొనగలిగినది. ఇట్టి అనుకూలవాతావరణమున రుద్రదామునిశక్తి నలుగడల విజృంభించి యశనికి 'మహాక్షత్రప' పదవిని సంపాదింప గలిగెను.

భర్తృదాముని యనంతరము క్షత్రప రాజ్యము విదేశీయాక్రమణముచే శిథిలమయ్యె నని అనేకు లభిప్రాయపడిరి. ఇందుకుతగిన చారిత్రిక ప్రమాణములు వారిచ్చియుండలేదు. క్రొత్తవంశపు మొదటిరాజు లిద్దరును మహాక్షత్రపబిరుదము ధరించియుండకపోవుటకు విదేశీయాక్రమణమే కారణమని రాప్సన్ పండితుని యూహ. కాని యథార్థ మది కాదు. క్షత్రపుల లోనే రెండువంశములవారు పరస్పరము కలహించుచుండిరని తెలియుచున్నది. మొదటి వంశము దుర్బలముగ నుండుటజూచి రెండవది విజృంభించి అధికారము వహించినది. విప్లవము నణచి దేశమునంతటి నాక్రమించుకొనుటలో రెండవవంశమునకు చాలకాలము యుద్ధములు సలుపవలసివచ్చెను. ఆకారణముననే ద్వితీయ రుద్రసింహుడును, తత్పుత్రుడు ద్వితీయ యశోదాముడును మహాక్షత్రపబిరుదము ధరించియుండలేదు. అంతియెకాని వారు విదేశీయాధికారమునకు లొంగియుండిరని చెప్ప వలనుపడదు. ప్రాచీనమగు చష్టనవంశముయొక్క పలుకుబడిని తగ్గించి, తన నూతన వంశాధికారమును సమస్తసామంతులచేనంగీకరింపజేసిన దేశమును తిరిగి శాంతిని నెలకొల్పగలుగుటచేతనే ద్వితీయరుద్రదాముడు ఏకచ్ఛత్రాధిపత్యము వహించి మహాక్షత్రపబిరుదమును సాభిమానముగ నుపయోగించుకొనెను.



ద్వితీయ మహాక్షత్రప రుద్రదాముని నాణెము

౮. అసలుపరిమాణముకంటె మూడురెట్లు పెద్దది. ౭. అసలు పరిమాణము



అ. ముఖమువైపు ఆ. వెనుకవైపు

(మొదటి బహుమానము)



(SNAP SHOT)

౧. తూర్పుకనుమలు దూరుచున్న పెన్నానది  ఛాయాచిత్రకారుడు: కె. యస్. ప్రసాదరావుగారు



౨. కుమారుని బేరము

(రెండవ బహుమానము) ఛాయాచిత్రకారుడు:
యం. కె. రంగస్వామి అయ్యంగారు, ట్రిప్లికేను.



3. 'బైసికిల్' ప్రయాణము

(మూడవ బహుమానము)
ఛాయాచిత్రకారుడు: రామారావ్ శర్మ, రాజమహేంద్రవరము







౪. ఛాయాచిత్రగ్రాహకుడు. ఛాయాచిత్రకారుడు: యం. కె. రంగస్వామి అయ్యంగారు, ట్రిప్లికేను.

# కరికాలచోళ మహారాజుల శాసనం

యన్. వెంకటరమణయ్య గారు,
యం. ఏ., పి. హెచ్. డి.

ఈశాసనము గుంటూరుజిల్లా పులవర్తి గ్రామమునందున్నట్లు లోకలు రికార్డ్సు సం పు ౯ ౨ పుట ౩౭౧ లో జెప్పబడియున్నది. శాసన మంతయు, సంపూర్ణముగ వ్రాయబడ లేదు. మనకు లభించినది శాసన మధ్యభాగములోని శకలము; లోకలు రికార్డ్సులో వ్రాయబడి యుండు ఇతరశాసనములందువలెనేనియందును తప్పు లనేకములున్నవి. అందలి విషయము ముఖ్యమైనది; దక్షిణ హిందూస్థానముయొక్క చరిత్ర నిర్మాణమున కత్యంతోపయోగకారి. శకలమైనను, తప్పులకుప్పమైనను, పరిశోధక పండితులదృక్పథమునకు దాని నీడ్చుట మంచి దని తలచి ప్రచురించ నుద్యమించియుంటిని. ఇంతలో నామిత్రులు ప్రభాకరశాస్త్రిగారు, ఏకారణముచేతనో, ఈ శాసనపు ప్రతిబింబ మును దెప్పించితినని చెప్పిరి. దానిని నాకెర విమ్మని వారిని యాచించితిని. నామీదవారికి గల విపులాభిమానముచే దానిని నాకొసంగిరి. ప్రతిబింబమును చదివితిని. కొన్ని సందేహ ములు కలిగినవి. నామిత్రులు సోమశేఖరశర్మ గారు నాతో దానిని చదివి సంశయములను దొలగించిరి. ఇట్లు ప్రభాకరులు సోమశేఖరులు సహాయులుకాగా, ఈ శాసనశకలమునందలి తప్పులను దిద్దుకొంటిని. వారికి నానమస్కార శతములను సమర్పించి కృతజ్ఞుడననుచున్నాను.

శాసనకాలము:

"కరికాలచోళ మహారాజుల శాసనం" అని లోకలు రికార్డ్సులో వ్రాయబడియున్నను, ఇది అమహారాజు శాసనముకాదు; ఏలన; కరికాలుడు క్రీ.శ. ౭వ శతాబ్దమునకు ముందటి వాడు; క్రీ. శ ౭వ శతాబ్దిమధ్య రేనాడుపై ప్రభుత్వము జేసిన పుణ్యకుమారుడను రాజు తాను కరికాలునివంశమున జనించినట్లు చెప్పు కొనియున్నాడు[1]; తమిళపరిశోధకులు ఈకరి కాలునికాలము క్రీ. శ ౪, ౬ శతాబ్దముల నడు మనని నిర్ధారణచేసియున్నారు. లిపివైఖరిని బట్టి చూడ పులవర్తిశాసనము క్రీ. శ ౧౧వ శతాబ్దమునకు ముందటిదికాదని తోచుచు న్నది. కావున ఇది కరికాల మహారాజు శాసనము కాజాలదు. మఱియెవ్వరిదో? వెల నాటి ప్రభువులదని శ్రీ ప్రభాకరశాస్త్రిగా రన్నారు; కాని అది పొరపాటు. వారుతెప్పిం చిన ప్రతిబింబము వెలనాటి ప్రభువుల శాసనపు ప్రతిబింబముతో కలసి వచ్చుటచేతను, లిపి యొక్కరీతిగ నుండుటచేతను, ఆద్యంతములు లేని ఈశాసనపుతునుక, పై వెలనాటిప్రభువుల శాసనఖండమను భ్రమ వారికికలుగుట కవకా శముకలిగినది. వెలనాటిరాజుల శాసనములలో కరికాలుని వృత్తాంతము వచ్చుట కవకాశము లేదు. ఏలన,వారు చోళులుగారు; పరిశుద్ధాం

1. E. I X 1. P 337.

ధ్రచతుర్థకులజులు. వారి శాసనములలో కరికాలప్రస్తావన యెచ్చటను గాన్పించుటలేదు. కావున మనశాసనఖండము వెలనాటిరాజులది కాదు. మఱియెవ్వరిదన్న, ఆకాలమున నే గుంటూరు సీమయం దచ్చటచ్చట సామంతులు గను స్వతంత్రప్రభువులుగను, రాజ్యములు సేయుచుండిన తెలుగు-చోడరాజులదిగ నుండవలయును. ఈతెలుగు చోడరాజులు, కరికాలునివంశజులమని చెప్పుకొనిరి. కావున, శాసనములయందు వారు తమ వంశమునకు మూలపురుషుడగు, కరికాలుని ప్రశంసించుట యుచితమే. ఇట్టి ప్రశంస ప్రచురింపఁబడిన ఆంధ్రచోళశాసనములం దన్నిటియందునుగాన్పించుచున్నది. మఱియు, కరికాలచోళ త్రిలోచనపల్లవుల వైరకథ, ఆంధ్ర-చోళశాసనములయందుదప్ప, మఱియెచ్చటను వర్ణింపఁబడియుండలేదు. పైకారణములవల్ల, ఈపులవర్తి శాసనశకలము. క్రీ. శ ౧౧వ శతాబ్దమునాటి యాంధ్రచోళరాజులదని నిర్ధారణ సేయుచున్నాను.

శాసనవిషయము:—

చంద్రమౌళియొక్క పాదపద్మమునందలి భృంగమగు కరికాలుడు ఇక్ష్వాకుని (?) వంశమునబుట్టెను. ఆరాజు, ఈశ్వరుని ఆరాధించి, సర్వసంపదలను సమృద్ధిపఱచుటకై స్వర్ణవృష్టిని కురిపించెను. త్రినేత్రపల్లవుడను నృపుని గర్వితునిగా నెఱింగి, వాని ఫాలలోచనమును భగ్నముచేసెను. భోజుడనురాజుచే సూర్యుని కర్పితములైనమూడుఅర్ఘ్యపాత్రలను సూర్యుని కడకు బోనీయక ఆకాశమున నాపి భోజుని దాసునివలెచేసెను. ఇక్ష్వాకువంశ ప్రభువులకు రాజధానియు, మనుష్యులకు శుభావహము నగు అయోధ్యనుండి బ్రాహ్మణాదులగు నాల్గు వర్ణములవారిని కొనివచ్చి పల్లవరాజు దేశము నందు రాష్ట్రికులను, నగరములను, యిచ్చి శ్రీ పర్వతచ్ఛాయ యందు ప్రతిష్ఠించెను. అచ్చట తనపేరట లింగప్రతిష్ఠ చేసెను.

విమర్శ:—

కరికాలుడు, చిరకాలముక్రిందట చోళదేశమున రాజ్యముచేసిన ప్రభువు. తొలుదొల్త నితని రాజధాని కావేరి తీరమున ప్రస్తుతపు తిరుచినాపల్లికి పశ్చిమమున మైలు దూరమున నున్న ఉరయూరు. విదేశ వాణిజ్య సౌకర్యార్థమై కావేరి ముఖద్వారముకడనున్న పుహారు లేక కావేరి పూంబట్టినమును కరికాలుడు రాజ్యమునకు ముఖ్యస్థానముగ జేసెను. ఇతడు దిగ్జేత. పాండ్య కేరళ సింహళములను జయించి ఆదేశపు ప్రభువులను దాసులునుగ జేసుకొనెను. ఇంతేకాక సింహళవాసులను వేనవేలుగ గొనివచ్చి కావేరికి వేలగట్టు వెట్టివాండ్రనుగ జేసెను. రాజుల నెత్తిపై తట్టలుపెట్టి మట్టి మోయించెనట! ఉత్తరదేశమును హిమాచలమువరకును జయించి ఆకొండసానువులపై చోళరాజపతాకములను జెక్కించెనట!

ఈవిషయములన్నియుఁ ద్రమిళపరిశోధకుల గ్రంథములనుండి సంగ్రహింపఁబడినవి. ఆంధ్రకావ్యములయందును, ఇట్టి వర్ణనలే కన్ప

డుచున్నవి. తిక్కన్నగారిట్లనుచున్నారు:

శా. చేసేరం బృథివీశు లంపకొనగా
శ్రీసింధుతోయంబులన్
జేసెన్ మజ్జనమున్ గుటుంబున హరిం
చెం బల్లవోర్వీశు ను
ల్లాసం బందగ ఫాలలోచనము
లీలం గట్టె కావేరి హే
లాసాధ్యాఖిలదిఙ్ముఖుండు కరికా
లక్ష్మావిభుం డల్పుఁడే[1].

ఈవిషయములే విపులముగ నవచోళచరిత్ర[2]యందు వర్ణింపబడినవి. ప్రస్తుతము యిచ్చట విమర్శింపబడు శాసనము మనకు పైవిషయములను జెప్పుట యే కాక కొన్ని క్రొత్తవిషయములను తెలియజేయుచున్నది. శాసనమువల్ల మనకు దెలియువిషయములు:

(1) కరికాలుడు గొప్పశివభక్తుడు. ఈతని భక్తివిశేషమును ద్రావిడశైవ గ్రంథములు గొనియాడుచున్నవి. ఆంధ్రశైవులుగూడ నీతడుశివునకు నచ్చిన భక్తుడనియే తలచుచున్నారు. పండితారాధ్యచరిత్ర నవచోళచరిత్రలయం దీతనిభక్తిప్రభావములు గీర్తింపబడినవి.

(2) సర్వసంపదల సమృద్ధికై స్వర్ణవృష్టిని గురిపించెను. ఇది చరిత్రకు అందనివిషయము.

(3) త్రినేత్రపల్లవుడు గర్వితుడగుటనెఱిగి వాని ఫాలలోచనమును భగ్నముజేసెను. ఈవిషయమే నిర్వచనోత్తర రామాయణమునందు "హరించెం బల్లవోర్వీశు నుల్లాసం బందగ ఫాలలోచనము" అను వాక్యముచే సూచింపబడినది. ఇతనికి ముక్కంటికాడువెట్టియను మారుపేరు గలదు. ఈయుదంతము పాల్కురికి సోమన్న పండితారాధ్యచరిత్రయందును గలదు.

"ఏల యిట్టివి వేయు నెన్న ముక్కంటి
కాళ్ి[డు] వెట్టియటన్న గణనాథుఁడొగడు

* * * *

మేదురభక్తిమై మించి లోకముల
నాడి సాక్షాత్త్రినయనుండని నుడువ
కరికాల చోడుఁడన్ గణనాయకుండు

* * * *

విభ్రమలీలఁ గావేరిఁగట్టుచును
ముట్టినమహిమమ్మొ ముక్కంటి కాడు
వెట్టి నాకావేరివెట్టికిఁ బిలువ
ముక్కంటి వాడేల మను వెట్టిజేయు
నిక్కంటివానికి నేజేయ ననుడు;
ఇచ్చినవాఁ డెవ్వఁ డీనేత్రమనుచు
నచ్చుగా ముక్కన్ను నతనిరూపంబు
మునుగల వ్రాయించి మొగిఁ దనకాలి
యుగుటంబున నట యొత్త ముక్కంటి
కాళ్ి[డు] వెట్టి నొసటి కన్నటుపగుల
కాళ్వెట్టిన యహంకారం బడంగె.[3]

1 నిర్వ. ఉ. రా
2 ఆంధ్రపత్రిక ఆఫీసు ప్రకటన.
3 పండితారాధ్యచరిత్ర: ప్రక. 4

ఈకథను విపులముగ నెఱుగ దలపుగల వారలు నవచోళచరిత్రను జదువవలయును. ప్రతిమాంధ్రచోళశాసనమునందును "చరణ సరోరుహావిహతవిలోచన త్రిలోచన ప్రముఖాఖిలపృథ్వీశ్వర కారితకావేరీతీర కరికాలకుల రత్నప్రదీప" యను వాక్య మీకథనే సూచించుచున్నది. ఇదే కొణిదెనలోని ఒప్పిలిసిద్ధి శాసనమున నించుక విపులముగస్మరింపబడినది.

క. కావేరిదరులు గట్టగ
నేవేపల్లవుడు దనదు వెట్టికి రామిం
దా వానినుదుటి కనుఁగో
గా వడిఁ గరికాలవిభుఁడు గాలందుడిచెన్[1].

ఇట్టివి శాసనములయందు పలుచోట్ల గాన్పించుచున్నవి. వీనివల్ల కరికాలుడు త్రినేత్రపల్లవుని జయించెననుట నిశ్చయమనితోచుచున్నది. ఈత్రినేత్రపల్లవు డెవ్వడు? ఈవిషయమును గూర్చి ప్రత్యేకించియొకవ్యాసమును వ్రాయవలసి యున్నది. గ్రంథవిస్తరభీతిచేతను,సందర్భ మిది కాకపోవుటచేతను, ఇచ్చట సూక్ష్మముగ నాతని విషయము వచించి విరమించుచున్నాడను.

ఇతడు పల్లవుడు; కంచిరాజు. పూర్వపశ్చిమసముద్రములకును, కృష్ణా కొల్లడములకును మధ్యనున్న దేశము నేలినప్రభువు. చాళుక్యవంశమునకు మూలపురుషుడగు విజయాదిత్యుడితనితో పోరి సమసెను. ఇతడు శైవమతాభిమాని. అనేక శివాలయములను నిర్మించెను. శూద్రుల అస్పృశ్యత్వమును దొలగించి బ్రాహ్మణుల నర్చకులనుగజేసి వేదశాస్త్రవిహితము శివార్చనను నడపెను. జైనబౌద్ధమతముల నాశముచేసెను. జైనవసతులను, బౌద్ధవిహారములను పడగొట్టించెను. బ్రాహ్మణమతము రించెను. దక్షిణదేశమున ఆర్యనాగరకత ప్రవేశపెట్టి దేశమును బర్బరాంక్రాంతము గాకుండ జేసెను. ఆర్యావర్తమునుండి బ్రాహ్మణులను, బ్రాహ్మణేతరులను బిలిపించి అగ్రహారములను, భూములను ఇచ్చి వారు దక్షిణాథమున శాశ్వతముగ నుండునట్లు చేసె అడవులను నరికించి గ్రామములను, పట్టణములను నిర్మించి వానిని వాసయోగ్యములు జేసెను. కడపట ఇతనికి కరికాలునితో సైరము పొసగెను. పరాజితుడై కప్పము నిచ్చె కంచిరాజ్యము చోళుల స్వాధీనమైనది. వా దక్షిణాంధ్రమండలము నాక్రమించుకొని రేనాడు, పాకనాడు మొదలగు సీమలు చోళుల కుక్కిపట్టులాయెను. త్రిలోచను ధరణికోట రాజధానిగా గుంటూరుమం మును పాలించుచుండెను. శాసనములలోను వాఙ్మయములోను, లోకల్ రికార్డులలో ఉన్నకథలలోని అద్భుత చిత్రములను దొ గించిన దొరకు చారిత్రకసంబంధమైన మింతయే.

ఇట్లు త్రినేత్రుని నిర్జించి, యతనిరాష్ట్ర మున విశేషభాగమును కరికాలు డాక్రమించె

1. S. I. I. Vcl VI.

కొనెను. కృష్ణకు దక్షిణమునసున్న సర్వదేశములకును జక్రవర్తి యాయెను.

[1]భోజుని జయించి దాసునిగ జేసుకొనెను.

ఒప్పిలి సిద్ధకొణిజెన శాసనమునందు ఈ విషయము సంస్మరింపఁ బడియున్నది.

"ఇనుపాదము లచ్చికొంపగ
జనుభోజుని యర్ఘ్యమంత్ర జలపాత్రలుదా
వినువీథి నాగబంచెను
ఘనముగదన యానవాడిచికరికాలుడిలన్[2].

ఈభోజుని కథ కరికాలుని మాహాత్మ్యమును దెలియజేయు అద్భుతవిషయములో మునిగి యున్నది. మహత్త్వసూచకములగు అమానుష చర్యలవలె భోజుని కథయు, చరిత్రరచనమున విసర్జనీయమా? అట్లనుకొనిన భోజుడే మిథ్యాపురుషుడగును. వితర్కమున కవసరముండదు. అటుగాక చారిత్రాత్మకుడగు వ్యక్తియని తలచితిమేని ఎవడాతడను ప్రశ్న కెడము గల్గుచున్నది. ఆకాలము (అనగా క్రీ. శ. ౩,౪ శతాబ్దముల మధ్యయుగము) నందలి, శాసనములందు కృష్ణదక్షిణభూముల నేలిన రాజులలో భోజుడను రాజు గాని, తన్నామాంకిత మగు రాజవంశము గాని పొడకట్టదు. కృష్ణదాటిన దక్కనుపీఠభూమిపై వాకాటకరాజవంశ మొకటి గాన్పించుచున్నది. ఆంధ్రులకు వెనుక దక్కనుపీఠభూమిపై సామ్రాజ్యపదము నాక్రమించి, క్రీ.శ.4,5 శతాబ్దములలో మహావైభవముతో నేలిన వంశమిది. వాకాటక రాజకుటుంబమునకును, సకలోత్తరాపథనాథులగు గుప్తచక్రవర్తులకును బంధుత్వముగలదు. ఇట్లే వేంగి నేలిన విష్ణుకుండినులకును వాకాటకులకును. ఈవాకాటకరాజ్యజన్మస్థానము విదర్భ. విదర్భ భోజులకు బుట్టినిల్లు. భోజయను పదము జాతిని సూచించునది. 'యదున్కృష్ణి భోజుల' నామములందరును గుర్తెరింగినవే. భోజులరాజు భోజరాజు. సంగ్రహముగభోజుడు వాకాటక దేశము భోజదేశమనియు, వాకాటక రాజు భోజరాజనియు, గీర్వాణవాఙ్మయము దెల్పుచున్నది. కావున, ఈశాసనపుభోజుడుచరిత్రాత్మకవ్యక్తియేని, అతడు విదర్భదేశపురాజై యుండవలయును. హూణుల దండయాత్రలు గుప్తసామ్రాజ్యమును విచ్ఛిన్నము సేయువఱకును వాకాటక రాజ్యమును జెడక నిలిచినది. తదనంతరము రాజ్యవిప్లవము జరిగినది. దేశమంతయు, సంక్షోభము నందినది. క్రీ. శ. ౬వ శతాబ్దారంభమునందే పూర్వవాకాటకరాజ్యమున నల చళుక్యాదులగు నూతన రాజవంశములు దలలుపైకెత్తినవి. కరికాలుడు భోజుని గెల్చి యుత్తరాపథముపై దండెత్తిపోవుట నిక్కమేని వాకాటకుల యంత్యదశయందు, అనగా, క్రీ. శ. ౬వ శతాబ్దారంభముననో, ఇంచుక తత్పూర్వముననో యాకార్యములను జేసియుండవలయును.

1. జర్నల్. ఆఫ్. ఆం. హి. Vol, VI.

2. S. I. I. VI, 623.

(5) అయోధ్యనుండి బ్రాహ్మణులు మున్నగు నాలుగు వర్ణములను తోడ్తెచ్చి శ్రీ పర్వతచ్ఛాయయందు పల్లవరాజురాజ్యమున పట్టణములును, గ్రామములును, వారికిచ్చి తగిన యేర్పాట్లను జేసెనట! ఇది పైవిషయమును బోలి నూతనమైనదే. ఒకానొక శాసనము[1] చోళు లయోధ్య నుండి దక్షిణమునకు వచ్చి రాజ్యనిర్మాణమును జేసుకొనిరని తెలుపుచున్నది. ఇది విశ్వసనీయమగునా? అగునేని కరికాలుడు అయోధ్యనుండి బ్రాహ్మణులనే కాక తదితరవర్ణములవారినిగూడ దోడ్తెచ్చుటకు గారణము దెలియుచున్నది. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు చోళులు ఆద్యము దక్షిణాపథస్థులుగారనియు, ఉత్తర దేశమునుండి వచ్చిరనియును జెప్పియున్నారు; నిజమేమో! భావి పరిశోధనమువల్ల సత్యము తేలగలదు.

( ) కావేరికి వేలనుగట్టుట సుప్రసిద్ధవిషయము. దీనిపై వ్యాఖ్యాన మవసరములేదు.

ఈశాసనము శకలమైనను కరికాలుని గురించి నూతనవిషయములను దెలియజేయుచున్నది. కాన, చరిత్రరచయిత కిది మిక్కిలి యుపయోగకారి. ఇంకను లోకలురికార్డుల వల్ల కరికాలుని చరిత్రము గొంత తెలియుచున్నది. ఇతడు ప్రజలసౌఖ్యమునకై పాటుపడిన మహారాజు. దేశమును వెల్లువయందు మునుగనీయక కావేరికి దరులుగట్టుటయంతకు ముందే తెల్పితిని ఇంతేకాక అడవులను నరికించి పురములను గ్రామములను నిర్మించెను. నాగరికులగు ఆర్యజాతులవారిని దోడ్తెచ్చి దేశమునుండి బర్బరత్వమును వెడలనడచెను. ఎన్నియో అగ్రహారములను బ్రాహ్మణుల కొసగెను. లెక్కలేని దేవాలయములను కట్టెను. వ్యవసాయాభివృద్ధికై చెరువులను త్రవ్వించెను. నదులకు ఆనకట్టలు గట్టి కాలువలద్వారా నీటిని తెచ్చి చెరువులను నింపెను. అరణ్యభూములు వ్యవసాయమునకనుకూలములగువఱకును వన్ను నడుగక రైతులకు ఉచితముగ నిచ్చెను. పిమ్మట పన్నులు నేర్పరచెను. నూతనగ్రామము లభివృద్ధికిరాగా రాజ్యపాలనసౌకర్యమునకై వానిని నాడులుగ విభజించెను. ఇట్లు ప్రజాభివృద్ధికై యీమహారాజు పలువిధముల పాటుపడెను. ఇట్టిమహోపకారిని ఆంధ్రులు మరచుటెట్లు? కావుననే దత్తమండలవాసు లంతని నిప్పటికిని స్మరించుచున్నారు. తిక్కన్నగారన్నట్లు, "కరికాలు మ్మోవిభుండల్లుడే!"

### శాసనమూలము

౧. తద్వంశజాత్తో కరికాలచోడః, శశాంక భృత్పాదపయోజభృంగః.

౨. సర్వసంపత్సమృధ్యర్థం స్వర్ణవృష్టిం తథా కరోత్, బాధామ్పాదం సమారాధ్య రాజా రాజతరా మవత్.

3. త్రినేత్రపల్లవం భూపం కృత్వాగవినేశో మాజ్ఞయా, తస్యాంబకం లలాటస్థంభగ్నం కృత్వా వ్యరాజత.

1. S. I. I. VI, 651.

౪. భోజపూజార్ఘ్యపాత్రాణి త్రీణిసూర్యార్పితానిచ, నిజాజ్ఞయాంబరస్థాని చక్రే తం దాసవన్నృపం.

౫. సహ్యపాదోద్భవాం దేవీం కావేరీం చోడమండలే, బధ్వా చోడమహీపాలో రరక్ష వసుధా మిమాం.

౬. ఇక్ష్వాకువంశజాతానాం నృపాణాం నగరీసుభా, శుభానహా మనుష్యాణా మనూ ధ్యా రాజతే సదా.

౭. తత్రస్థాన్ బ్రాహ్మణాదీంశ్చ చతుర్వర్ణసముద్భవాన్, . నీత్వాపల్లవరాజశ్చ రాష్ట్రాణినగరాణిచ.

౮. దత్త్వా శ్రీపర్వతచ్ఛాయె ప్రతిష్ఠామకరోద్భు [వి*] [త్ర*] లింగప్రతిష్ఠాస్య, స్వనామ్నాపల్ల..................




(పత్రికాసంపాదకుడు

# సింహళద్వీప నూతనరాజ్యవిధానము

గూడా కృష్ణమూర్తిగారు

ప్రస్తుతము సింహళద్వీపమందు అమలులోనున్న రాజ్యపరిపాలన విధానమును పరిశీలించి, అందుండు లోపాలోపములు విచారించి, లోపములున్నచో అయ్యవి తొలగిపోవుటకును, అవసరమగుచో నూతనవిధానము సూచించుటకును, పార్లమెంటునందు వలసరాజ్యముల కార్యదర్శి (Secre!ary of State for Colonies) అను ఆమెరి (Amery) గారిచే నొకప్రత్యేకసంఘ మేర్పరుచుటకు తీర్మానము తేబడెను. ఆగష్టు ౭వ తేది ౧౯౨౭ సంవత్సరమున, నలుగురు పార్లమెంటు సభ్యులు గలయట్టి యుపసంఘము నేర్పరచుటకు తీర్మానమాయెను. ఈసంఘమువారు, హిందూదేశమునకు సైమనుసంఘ మేరీతిని పనిచేయవలసి యున్నదో, అటులే సింహళద్వీప రాజ్యపరిపాలన విషయమై నూతనసూచనలు చేయుటకు నియమింపబడిరి. ఈసంఘాధ్యక్షుడు ఎర్ల్ ఆఫ్ డొనమోరు (Earl of Donough-more, M. p.). వీరు పార్లమెంటునందు చాలకాలము సభ్యులుగ నుండి, రాజకీయవేత్తలలో నారితేరిన రాజకీయవేత్త యని పేరుపొందిరి. వీరికి సహాయసభ్యులు సర్ నాథన్, సర్ బట్లర్; డాక్టరు డ్రమ్మండుగార్లు.

ఈనలువురు సభ్యులును ౧౯౨౭ వ సం. నవంబరు ౧౩వ తేదీనుండి ౧౯౨౮, జనవరి ౧౮వ తేదీవరకును సింహళద్వీపమున సంచారము సలిపి, వేర్వేరు ప్రదేశములకు పోయి, వివిధసంఘముల నాయకులయొక్కయు, రాజకీయవేత్తలయొక్కయు, శాసన సభ్యులయొక్కయు, అధికారులయొక్కయు, ఇతర విద్యాధికులయొక్కయు సలహాలను, వాఙ్మూలములను తీసికొని, ప్రస్తుత మమలులోనున్న రాజ్యవిధానమును పరిశీలించి, ఒక నూతనరాజ్యవిధానమునే సూచించిరి. ఇచ్చట నమలులోనున్న రాజ్యవిధానము నంతయును సంపూర్ణముగ మార్చివేయుటయే కాక, ప్రస్తుత మేదేశములోను అమలులో లేని ప్రత్యేక నూతన రాజ్యపరిపాలన విధానము సూచించిరి. ప్రస్తుత మెచ్చటను అనుసరింపబడక పోయినప్పటికిని ప్రాచీనభారతీయ రాజ్యపరిపాలన విధానములో చేరియున్నదగుటచే, భారతీయుల కిది నూతన విధానముగా గన్పట్టదు.

ఈసంఘమువారిచే విచారింపబడినవారెల్లరను వేర్వేరు క్రొత్త మార్పులను, నూతనవిధానములను సూచించియుండిరి. కాని వారవన్నియు త్రోసివేసి యీనూతనవిధానమునే అమలు జరపి, సింహళద్వీపమందు జయప్రదముగా నిర్వర్తింపబడుచో ఇంగ్లాండునందుగూడ ప్రవేశపెట్టుదురట. ఇందుగల ముఖ్యసూచనలు మున్ముందుగ వ్రాయుట యవసరము. సింహళదేశజులకు కార్యనిర్వహణశక్తి లేకుండుటచే, కార్యనిర్వాహకులగు శాసనసభా-అధికారసభ్యులు ఎట్టి బాధ్యతయును లేని అనధికారసభ్యులచే తీవ్రముగను, అనవసరముగను ఖండింపబడుచుండిరి. ఇట్టి కార్యనిర్వహణానుభవమును కలిగించుటకై తగు ఏర్పాటులు జరిగి, అట్టి అనుభవమును వారు బాగుగ పొందినగాని సింహళమునకుస్వరాజ్యార్హత లేదని యీసంఘమువారు విస్పష్టముగ తెల్పియుండిరి. కావ నిట్టి అనుభవమును అనధికారశాసనసభ్యులకెల్లరకును గలుగజేయుటకై యీనూతనవిధానము ప్రత్యేకము అనుకూలించునట. సంపూర్ణముగ మార్పు చేయబడిన విధానమును సూచించుటకు ముఖ్యకారణ మియ్యదియే. ప్రస్తుతము గవర్నరునకున్న అధికారములు హెచ్చింపవలయునట. గవర్నరునకు అధికార మెక్కువ చేయుటకు కారణము సింహళదేశజులు ఆతనిక్రింద కార్యనిర్వహణశక్తియందారితేర గల్గుటకు సహాయపడుటయేయట. ఎన్ని సూచించినను, పాపము, ఏదోరీతిని సింహళదేశజులను స్వరాజ్యార్హులుగ జేయవలయు నను ప్రయత్నము లే యీ యుపసంఘనివేదికయందు గాననగును. అన్నిటికన్నను ముఖ్యములగు మార్పులను రెండింటిని సూచించిరి.

అందు మొదటిది ఇరువదియొక్క వత్సరములు ప్రాయ మగల ప్రతి మగవానికిని, ముప్పదివత్సరములు ప్రాయ ముగల ప్రతి స్త్రీకిని, సింహళమున నివసించు ఇతర దేశజు లందరికినికూడ - అయిదుసంవత్సరము లీద్వీపమం దుండి పౌరస్వత్వపు హక్కు సంపాధించినచో - సమానముగ వోటింగుఅధికారము సంపూర్ణముగ గలవని సూచించిరి. (Manhood Suffrage). రెండవది జాతిమత భేదములు లేక, సర్వసమాన రాజకీయవిభాగములను బట్టియును, వివిధప్రాంతవిభాగములనుబట్టియు శాసనసభకు సభ్యుల నెన్నుకొనవలయుననిరి. (Abolition of Communal Representation.)

ఈమార్పు లెల్లరును ఏకీభావము వహించి ఆమోదించుట లేదు. వివిధ రాజకీయపక్ష నాయకులకు భేదాభిప్రాయము లనేకము లున్నవి. ఈనూతనరాజ్యాంగవిధాన మములులో నుండినచో, చివరకు స్వరాజ్యప్రాప్తి శూన్యమే మో యని వారు భయమందుచున్నారు. ఏది ఎటులున్నను, సర్వసమానమగు వోటింగుఅధికారము నందరును అంగీకరించుచున్నారు. కాని, స్త్రీలకుకూడ పురుషులతో సమానమగుహక్కు నిచ్చుచు, వలస పోయిన భారతీయులకు మాత్రము ఎట్టినిర్బంధములును లేని వోటింగుహక్కు నీయవలదని కొందఱు భేదాభిప్రాయ ములు గలిగియున్నారు. జాతిమతభేదముల విచక్షణ లేకుండ శాసనసభ యెన్నికలు జరుగుటయందు మహమ్మదీయులు భేదాభిప్రాయము కలిగియుండి, తమకు న్యాయముకలుగ లేదని వాదించుచున్నారు.

## నూతనవిధానము-మహాసభ

ఇదివరలో సూచించినరీతిని, శాసనసభలో అనధికారసభ్యులకు కార్యనిర్వాహకశక్తి లేకపోవుటచే, అధికారసభ్యులు అనవసరమగు తీవ్రఖండనలకు లోనగుచుండుటయు, అందువలన పరిపాలన చాల కష్టముగా నుండుటయు తటస్థించుచున్నది. కాన శాసనసభావిధానము మార్చవలసి యున్నది. ప్రస్తుతము అనధికార అధికార సభ్యులు కలిసి ౪౯ మంది మాత్రమే కలరు. కాని నూతనవిధానమున ౬౫ గురు అనధికారసభ్యులు వివిధ రాష్ట్రీయ (Territorial) విభాగములనుండి ఎన్నుకో... బడవలయును. వీరుగాక సింహళద్వీప ముఖ్యకార్య... (Chief Secretary)- ప్రస్తుతము వీరు కలోనియల్ కార్యదర్శి ( Coloinal Secretary ) అని పిలువబడు చున్నారు-న్యాయాధిపతి (Attorney General), కోశాధిపతి (Treasurer) అను మువ్వుర అధికారసభ్య... వర్గ ముండును. వీరు ఉద్యోగరీత్యా (Ex-officio) శాస... సభాసభ్యు లయ్యెదరు. వీరుగాక గవర్నరు పన్నెం... గురు సభ్యులను మించకుండ శాసనసభకు నియమిం... (Nominate) చేయవచ్చును. ఈసభ్యులందరు గూడినస... "మహాసభ" (State Council) అని పిలువబడు... ఈమహాసభయే "కార్యనిర్వాహకసభ" గాను, "శాసనస... గాను మారుచుండవలెను. అది రాజకార్యముల నిర్వ... ణమున కంతకును 'కార్యనిర్వాహకాధివేశనము' (Executive Session) గాను, శాసననిర్మాణమునకు 'శాస... ధివేశనము' (Legislative Session) గాను, రెండువి... లనుకూడ నిర్వర్తించు చుండును.

## మహాసభ-కార్యనిర్వాహకసభాపద్ధతి

మహాసభ యంతయు ప్రస్తుతము కార్యనిర్వాహ... సభ యగును. ప్రథమమున మహాసభ గూడినప్పు... సభ్యులయొక్క సంఖ్యయంతయు ఏడుసంఘములుగా వి... జింపబడును. ఈవిభాగము రహస్యపువోటింగు (Secret ballot) పద్ధతిని జరుగును. ప్రతిసభ్యుడు తా నేసం... మునందు పనిచేయ నిచ్ఛగించునో, ఆసంఘములో నుం... డనని వోటింగునకు పూర్వమే తన యభిప్రాయము... సూచింపవచ్చును. ఇట్లు సంఘములు ఏర్పడినయనంతర... ప్రతిసంఘమునకును (Ballot) పద్ధతినే అధ్యక్షు... నొకరిని గవర్నరుచే నియమింపబడుటకై సూచించెదరు. గవర్నరు సర్వసాధారణముగ ఆసూచన నంగీకరించు... కాని నిరాకరించుటకుగాని, మరల నాలోచించవలె... డని చెప్పుటకుగాని యాతని కధికారము గలదు. ప్ర... సంఘాధ్యక్షుడు సంవత్సరమునకు ఇరువదియేడువేల రూ... ప్యముల వేతనమును బడయుచు, సామాన్యముగ మంత్రి... కెట్టిస్థానము, గౌరవముగలవో, అట్టి స్థానమును, గౌ...

వమునే పొందియుండును. ఆయాసంఘసభ్యులుకూడ మహాసభాసభ్యులుగ నెట్టివేతనమును పొందుచున్నారో, అట్టి వేతనమునే పొందెదరుగాని అదనముగా నేమియును పొందరు. ప్రతిసంఘమును ఒక్కొక్క ప్రత్యేకశాఖాకార్యమును నిర్వహించవలయును గాన రాజకీయవ్యవహారములన్నియును ఈదిగువరీతిని ఏడు శాఖలుగా విభజింపబడెను:—

౧. ఆంతరంగిక పరిపాలనా సంఘము (Home Affairs);-ఇందు పోలీసు, జయిళ్లు,గనులు మొదలగుసర్వ విషయములను అంతరంగపరిపాలనా శాఖలును జేరియున్నవి.

౨. వ్యవసాయసంఘము (Agriculture);

౩. స్థానిక పరిపాలనా సంఘము (Local Administration)

౪. ఆరోగ్యశాఖాసంఘము (Health);

౫. విద్యాశాఖాసంఘము (Education);

౬. ఇంజినీరింగుశాఖాసంఘము(Public Works);

౭. వార్తా కార్యనిర్వాహక సంఘము (Public Communication)

సింహళద్వీపవాసులు కొందరు, పోలీసుశాఖను సంఘపరిపాలనమునుండి విడదీసి, ముఖ్యకార్యదర్శియాజమాన్యము క్రింద నుంచవలయునని సూచించిరట; కాని మంత్రులయధీనము చేయుట ప్రజాంగీకారమే. ప్రతిసంఘమును ఏయేకార్యములు నిర్వర్తించవలయునో అయ్యవి జాగరూకతతో నిర్వర్తించుచు, ఆయాసభ్యులు, అధ్యక్షులు తమ వేర్వేరుశాఖలపై అజమాయిషీ చేయుచుండవలయును. ఏవిషయమునైనను నిర్ణయింపవలయునన్న, నెక్కువమందసభ్యుల అంగీకారము లేనిదే ఆసంఘకార్యములు నిర్వర్తింపరాదు. ఇట్లు అంగీకరింపబడిన తీర్మానమును కార్యనిర్వాహకసభలో మరల చర్చకు తేబడవలయును. ఈ సభయందుకూడ ఆమోదింపబడినచో, గవర్నరు ఆమోదమునకు పంపవలయును. కాన ప్రతితీర్మానమును మూడు కార్యనిర్వాహకమూర్తులచే ఆమోదింపబడినగాని అమలులోనికి రానేరదు. అందు, ఒకటి: ఏశాఖకు ఏతీర్మానము సంబంధించియున్నదో ఆశాఖా కార్యనిర్వాహకసంఘము; రెండు: ఇట్టికార్యనిర్వాహక సంఘములన్నియు కలిసిన కార్యనిర్వాహక సభ యనబడు మహాసభ; మూడు: గవర్నరు. సర్వసాధారణముగా గవర్నరు ఆమోదము లేనిదే యే తీర్మానము అమలులోనికి రాదు. అందు ముఖ్యవిషయములపై తీర్మానములు అమలులోనికి రాకముందే అతనిఆమోదము బడయవలయును. అంతగా ముఖ్యముగాని తీర్మానములన్నియు గవర్నరు ఆమోదమును అనంతరము బడయు నవకాశ మంచుకొని, అట్టిదేమా యున్నచో కార్యనిర్వాహకశాఖవారే అమలులో పెట్టవచ్చును. గవర్నరు ప్రతిసంఘకార్యములతోను పరిచితుడై యుండుట యవసరము గాన, ఆయాసంఘకార్యదర్శులు తీర్మానము సంఘమునందు ప్రవేశపెట్టబడు ముందుగను, అనంతరమునుగూడ గవర్నరుకు పంపవలయును.

ఈకార్యములు గాక, ప్రతిసంఘమును ఏఏవిషయములతో తనకుసంబంధమున్నదో, ఆయావిషయముల సంవత్సరపుబడ్జెట్టు అంచనాలును తయారు చేయుచుండవలయును. ప్రతిసంఘాధ్యక్షునకును సింహళసివిలుసర్వీసునకు జెందిన ఒకయుద్యోగి శాశ్వతకార్యదర్శిగా నుండును.

ప్రస్తుతము కలోనియల్ కార్యదర్శి (Colonial Secretary) యనునాతడు ముఖ్యకార్యదర్శి (Chief Secretary) యని పిలువబడుచుండును. ఈతడును, న్యాయాధిపతి (Attorney General), కోశాధిపతి (Treasurer) అను నీముగ్గురు వేర్వేరుశాఖల నిర్వర్తించుచు, రాజకీయోన్నతోద్యోగులుగా (Officers of State) పరిగణింపబడుదురు. వీరలకు ఎట్టిసంఘములును లేవు.

ముఖ్యకార్యదర్శి:— మాల్దివుద్వీపముల విషయమును, ఆంతరంగికములు కానట్టి సకల వ్యాపారములును (External affairs), శాసనపద్ధతిని నిర్మించుటయు, పబ్లికు సర్వీసు శాఖావిషయములలో ఉద్యోగుల నియమించుటకుగాని, తీసివేయుటకుగాని, మార్చుటకుగాని సర్వాధికారము వహించుటయును,ఆడిట్టు మొదలగు విష

యములన్నియును సరిచూచుటయు ఆతని ముఖ్యమగు రాజకీయ వ్యవహారములు.

కోశాధిపతి:—రాజకీయ ధనవిషయమై, అనగా పన్నులు, రెవెన్యూ సుంకములవిషయమైయును, సాంవత్సరికపు బడ్జెట్టు, అంచనాలు తయారుచేయుటయందును ఈతడు ముఖ్యముగ పనిచేయవలసియున్నది. సాంవత్సరికపు పట్టీలను, అంచనాలను (Estimates) ఏ సంఘముగాని తయారుచేయునప్పుడు ఈతని సలహా యత్యావసరము. ధనవిషయమై యెట్టి చర్చలుగాని కల్గినప్పుడు ఈతడు సూచించిన రీతిని జరుగవలయును. ప్రత్యేక సంఘములు ధనము కోరుచు చేయు అంచనాలలో ఈతడు సూచించినరీతిని ధనము వెచ్చించుట కవకాశముండునే కాని తమ యిచ్చవచ్చినట్లు ఆయా సంఘాధిపతులుగాని, సంఘములుగాని చేయుట కవకాశముండదు. నాణెముల ముద్రణవిషయమై యీతడు సహాయపడుచుండును.

అటార్నీ జనరలు, లేక న్యాయాధిపతి:—సింహళద్వీపమంతటను న్యాయపరిపాలనమును, దొరతనమునకు న్యాయవిషయమై సలహా నిచ్చుచుండుటయును ఈతని ముఖ్యవిధులు.

ఆడిట్టుశాఖ ముఖ్యకార్యదర్శి శాఖలయందు చేర్చబడినదికాని, ఆడిటరును కలోనియల్ ఆడిటరు (Colonial) అని అందురు. ఈతడు రాజకీయ మహాసభకే జవాబుదారీగా నుండవలసియుండును. పై చెప్పబడిన మువ్వురు మంత్రులకు ఎట్టి సహాయసంఘములుగాని లేక పోయినప్పటికిని, వీరు మంత్రులస్థానమునే ఆక్రమించుకొందురు. వీరు దొరతనమునకును, మహాసభకును రాజకీయ, ధన, న్యాయవిషయములయందు సలహాలనిచ్చుచు ఆలోచనమంత్రులుగనే ముఖ్యముగ పనిచేయుదురట.

కాన ప్రస్తుతము నూతన రాజ్యాంగ విధానములో ఏడుగురుమంత్రులు వేర్వేరు సంఘములచే నధ్యక్షులుగా నెన్నుకొనబడినవారును, ముగ్గురు రాజకీయోన్నతోద్యోగులును కలసి పదిమంది మంత్రులగుదురు. ఈ మువ్వురు రాజకీయోన్నతోద్యోగులును దొరతనమువారిచేతనే నియమింపబడుదురు. ఈరీతిగ నేర్పడిన మంత్రులు, వారివారిసంఘములు కూడియే మహాసభ యొక్క ఏ ప్రత్యేకసంఘమందునుగూడ పనిచేయ ని... మహాసభాసభ్యులుకూడ నుండవచ్చును. ఈసంఘ... తోడను, మంత్రులతోడను ఈమహాసభ యం... కార్యనిర్వాహక సభగా మారి కార్యనిర్వాహక వి... ముల నిర్వర్తించును.

మంత్రులసంఘము (Board of Ministers) ఇదివరలో నములులోనున్న కార్యనిర్వాహకసభ... (Executive Council) దీసివైచి దానిస్థానే మంత్రి సంఘము నేర్పరచవలయును. ఇందు మువ్వురు రా... యోన్నతోద్యోగులును, ప్రతిప్రత్యేక సంఘాధ్యక్షు... ను సభ్యులుగా నుందురు. ఈపదిమంది మంత్రులు కూ... కార్యనిర్వాకవర్గమున కుముఖ్యకార్యదర్శియేయధ్య... ఈతడే తనయుద్యోగరీత్యా శాసనసభలయందు నా... కుడు (Leader)గా నుండుటకును, ఉపాధ్యక్షుడు... నుండుటకును హక్కుగలిగియుండును.

ఈసంఘము రాజకీయ వ్యవహారముల కన్నిటి... ముఖ్యాంగము; మున్ముందుగనే సకలకార్యములను ... చూచి లోపాలోపములను వెదకి కార్యసూచనలు చేయు... చు అన్నిటికి సహాయపడుచుండును. ఈసంఘము... అన్నిటికన్నను ముఖ్యమగు కార్యము సాంవత్సరిక... బడ్జెట్టును, అంచనాలును తయారుచేసి మహాసభ... నుపపాదించుట. ఈవిషయమునందుమాత్రము పదిమంది మంత్రులును కలిసి బాధ్యత వహింతురు (Collective Responsibility). ఇతర విషయములం... ఆయా సంఘాధ్యక్షులు గమహాసభ కెంత... ధ్యులో అంతేకాని, కలిసి బాధ్యతవహింపరు. మంత్రి... సంఘమునుండి దొరతనపు ముఖ్యోద్యోగులనుగాక, ఇ... తర సంఘాధ్యక్షులలో నెవరినైనను మహాసభలో నా... కత్వమును వహించుటకును, మంత్రులసంఘమున కధ్య... త వహించుటకును ఎన్నుకొనవచ్చును. ప్రతిసంఘా... ధ్యక్షుడును, దొరతనపు ముఖ్యోద్యోగియును మార్చి... లోనే కోశాధిపతిద్వారా ఆయాసంఘములచే తీర్మా... నింపబడిన అంచనాలను మంత్రులసంఘమునందు ప్రవే...

పెట్టవలయును. మంత్రులసంఘము వేర్వేరు సంఘముల చేతను, మంత్రులచేతను ప్రవేశపెట్టబడిన అంచనాలను పరిశీలించి అవసరమగు సర్దుబాటులను, విమర్శనలను కోశాధిపతియిష్టానుసారముగ చేసి, యేయేసంఘమువారు ఎంతెంత వెచ్చించుట కవకాశ మున్నదో నిర్ణయించి, యీ విషయముల నన్నిటిని పన్నులు విధించుట మొదలగు వాటితోపాటుగా సాంవత్సరికపు బడ్జెట్టులో కలిపి మహాసభలో ప్రవేశపెట్టుటకై సిద్ధపరిచెదరు. ఏసంఘమైనను ఆరీతిని తన అంచనాలను తయారుచేసి మంత్రుల సంఘమునందు ప్రవేశపెట్టకపోయినచో, కోశాధిపతి ఆ విషయమును గవర్నరునకు తెలియజేయును. అప్పుడు వెనుకబడియున్న సంఘముయొక్క అంచనాలను గవర్నరు ఇతర మంత్రుల సహాయముతో పూర్తి చేయవలయును. దానినే ఆమోదింపబడిన అంచనా (Certified Estimate) అందురు. ఇట్టి విషయమున గవర్నరు ఆమోదించుటకు పూర్వమే ఒకతూరి మహాసభలో ప్రవేశపెట్టబడి ఆమోదింపబడవలయును. ఈరీతిని బడ్జెట్టు పూర్తిగ తయారైన యనంతరము మహాసభలో ప్రవేశపెట్టవలయును. అచ్చట ధనవిషయములోగల లోపాలోపములను, క్రొత్తసలహాలను, ఖర్చుయొక్క పరిమితి అపరిమితులను, అందుగల ఆంతరంగిక కష్టనష్టములను గూర్చి ప్రతిసభ్యుడును ముందుగా నెట్టి నోటీసును లేకుండనే చర్చ జరుపవచ్చును.

మంత్రులసంఘముచే నుపపాదింపబడిన సాంవత్సరికపు బడ్జెట్టు అంచనాలు మహాసభలో నోడిపోయినగాని, విశ్వాసరాహిత్యపు తీర్మానము తేబడి నెగ్గినగాని మరల సామాన్యపు ఎన్నికలు (General elections) జరుగవలసినదే. ఓడిపోకపోయినచో, మహాసభయందు ఆయా బడ్జెటు అంచనాలు పూర్తి గాగాని, కొన్నిభాగములు గాని పునర్విమర్శనమునకై మంత్రుల సంఘమునకు త్రిప్పివేయ (Refer back) వచ్చును. ఇటులు వెనుకకు త్రిప్పివేయుటవలన సామాన్యపు ఎన్నికలు తరుచుగా జరుగుట కవకాశ ముండదు. ఇటులు బడ్జెట్టును వెనుకకు పునర్విమర్శనమునకై త్రిప్పివేయుటకు మహాసభవారికి ఒక్కపర్యాయమే యధికారము గలదు. ఆనంతరము మంత్రులు ఆలోచించి పునర్విమర్శనలో జరిగిన మార్పులను, క్రొత్తతీర్మానములను మహాసభయెదుట నుంచి తగు సముజాయిషీ యిచ్చి అప్పుడు మహాసభచే చేయబడిన తీర్మానమునకు లోబడవలయును. మంత్రులసంఘము నాలుగు సం.ల కాలము పనిచేయును. సామాన్యపు ఎన్నిక (General election) జరిగిననే కాని, లేనియెడల నెప్పుడైనను ఒక్కొక్క ప్రత్యేకమంత్రి పోవుచువచ్చినను, నూతన మంత్రులతో విరాజిల్లుచు, ప్రథమమున ఎన్నికలు జరిగినప్పటినుంచియు నాలుగు వత్సరము లుండును. మహాసభలో ఏసామాన్యసభ్యునకు గాని పన్నును హెచ్చించుటయును, విధించుటయును, రెవిన్యూవిషయమై భేదాభిప్రాయము కల్గియుండుటయును మొదలగు విషయములలో తీర్మానమును ప్రవేశపెట్టుటకు అధికారము లేదు. ఇట్టి అధికారము వివిధ సంఘాధ్యక్షులును, ముగ్గురు రాజకీయోన్నతోద్యోగులును మంత్రులసంఘముయొక్క యనుమతి చొప్పున పొందగలుగుచున్నారు.

కార్యనిర్వాహక సభాచర్య (State Council in Executive Sessions):—ఈసభాచర్యయందు ఏసంఘముచేతనైనను నుపపాదింపబడిన తీర్మానమును చర్చింపవలయును. ఈసభకు చర్చానంతరము ఆ తీర్మానమును ఆమోదించుటకును, నిరాకరించుటకును, పునర్విమర్శనమునకై త్రిప్పివేయుటకును సంపూర్ణాధికారముగలదు. ఆయా ప్రత్యేకసంఘ తీర్మానములను మహాసభముందర ఆసంఘాధ్యక్షుడుగాని, ఆయాసంఘములలోని ప్రథమసభ్యుడుగాని ప్రవేశపెట్టవలయును. ఏప్రత్యేక కార్యనిర్వాహకసంఘములోను సభ్యుడుగా నుండుట కిచ్చగింపని ఒక స్వతంత్రసభ్యుడు ఏసంఘముయొక్క కార్యములమీదనైనను ఒకతీర్మానమును ఈకార్యనిర్వాహక సభలో ప్రవేశపెట్టవచ్చును. ఇట్టి సమయమున కార్యనిర్వాహక సభ ఆతీర్మానముపై చర్చ జరుపకయే ఆతీర్మానము ఏసంఘమునకు చెందియున్నదో ఆ సంఘమునం దాలోచించి, చర్చించి ఖండించుటకును, ఆమోదించుటకును, లేక నిరాకరించి మరల సభకు త్రిప్పివేయుటకును ఆసంఘమునకు హక్కునిచ్చి ఆయా సంఘముల కు త్రిప్పి

వేయును. అప్పుడు ఆసంఘములో ఆ తీర్మానము చర్చింపబడునప్పుడు ఏసభ్యుడాతీర్మానమును ప్రతిపాదించెనో ఆతడు అప్రత్యేకవిషయమున అప్రత్యేకసంఘమునందు చర్చలలో పాల్గొనవచ్చును. ప్రత్యేక సంఘములో సభ్యత్వము ఖాళీయగుచో, కొంతకాలపరిమితిగల నోటీసుతో మహాసభలో ఆవిషయ మంగీకరింపబడవలయును.

కార్యనిర్వాహక సభలో చర్చింపబడి, పూర్తిగాగాని,కొన్ని భాగములుగాగానిఆమోదింపబడినతీర్మానములన్నిటితోపాటు ఏనాటిచర్చలో ఆమోదింపబడిన విషయములు ఆనాడే దొరతనపు టున్నతోద్యోగి గవర్నరునకు తెలియజేయుచుండవలయును. ఇట్లు పంపబడిన తీర్మానము లన్నియును గవర్నరు ఆమోదించి, తన యంగీకారము సభాధ్యక్షునిద్వారా సభ్యులకు తెలియపరిచినగాని వారు ఏవిషయముపై నెట్టిచర్యను దీసికొనరాదు. సర్వసాధారణముగా గవర్నరు అన్ని తీర్మానముల నామోదించునుగాని, ఇంగ్లాండునందుగల వలసరాజ్యకార్యదర్శియొక్క యాజ్ఞల ననుసరించి యేతీర్మానమునైనను నిలుపుచేయుటకును, నిరాకరించుటకును, సంపూర్ణాధికార మతనికి గలదు. కాని తొందరపడి నిరాకరించకుండ అట్టి సందిగ్ధములగు తీర్మానముల పునర్విమర్శనమునకై కార్యనిర్వాహకసభకు త్రిప్పివేయవచ్చును. ఒకవేళ గవర్నరు తన ఆమోదమును తెలుపుచో, అట్టి యామోదమును వలసరాజ్యముల కార్యదర్శికి నెరుంగజేయుచు, తానే తనచర్యకు బాధ్యుడైయుండి, కార్యదర్శివిమర్శనమునకు లోనై యుండును.

## మహాసభ-శాసనసభాపద్ధతి

బిల్లు ప్రవేశము:—ఏబిల్లు గాని మహాసభలోనికి ప్రవేశపెట్టుటకు ముందు చర్చకు వీలుగా నుండునట్లును, కావలసిన విషయములన్నియు క్లుప్తముగా నందిమిడియుండునట్లును బిల్లును వ్రాయుటకై ముఖ్యకార్యదర్శి శాఖకు జేరియున్న ప్రత్యేకపు చిత్తువ్రాయసకాండ్రచే ఆబిల్లు వ్రాయబడవలయును. బిల్లును ప్రత్యేకముగా తయారు చేయుటకై యుండువారు పార్లమెంటరీ పద్ధతిని బిల్లును తయారుచేయుటయందు నిపుణులైన చిత్తువ్రాయస[illegible] డ్ర (Parliamentary Draftsmen) అందురు. [illegible] ముఖ్యకార్యదర్శిశాఖకు చేరియుండి, ఆయా [illegible] యవసరమునుబట్టి యెల్లరకును సహాయము చేయ[illegible] ను. వేర్వేరుసంఘములలో ఏవిషయమైనను చర్చింప[illegible] మహాసభలో శాసననిర్మాణమునకై ప్రవేశపెట్టదల[illegible] నన, అట్టి బిల్లును ఈనిపుణులచే ఆ విషయము[illegible] ముఖ్య వివరములన్నియు చేరియుండునట్లుగా [illegible] తయారుచేయించి అయ్యది శాసనసభలో చర్చకై ప్ర[illegible] పెట్టవలయును.

ఏసంఘామాత్యుడైనను బిల్లును ప్రవేశపెట్ట[illegible] ముందు తనసహాయ సంఘామాత్యుల కావిషయమై [illegible] య పరచవలయును. ఇట్లు తెలియపరిచిన యనం[illegible] ఇతరసంఘాధ్యక్షులు తమబిల్లుతో నియ్యది అను[illegible] గా నుండక సరిపడలేదన్నప్పటికిని ఇదివరలో [illegible] సంఘమందు చర్చింపబడిన దగుటచే సర్వసాధారణ[illegible] అట్టి అననుకూలపరిస్థితులు రాకుండగనే యుండును [illegible] ప్రవేశపెట్టవచ్చును. కాని ఒకప్పుడు ఏబిల్లుమీ[illegible] సరియైన యంగీకారము కుదురకపోయినచో, [illegible] సంఘమువారు అట్టి బిల్లును తెచ్చిన సంఘమును [illegible] ప్రతికూలముగ నున్న సంఘమును, రెంటిని చేర్చి [illegible] భేదములను సవరించవలయును. మంత్రులసంఘా[illegible] ఆబిల్లుయొక్క ముఖ్యతను కనిపెట్టి దానిని చర్చిం[illegible] మున్ముందుగనో, యనంతరమో నిర్ణయించును. [illegible] ప్రతిబిల్లు ప్రారంభమున తయారుచేయబడి శాసనస[illegible] చర్చనీయమై యుండును. ఇట్టిబిల్లు ఏసంఘమున[illegible] బంధించినచో ఆసంఘాధ్యక్షుడుగాని, ప్రథమస[illegible] గాని,అదిప్రవేశపెట్టవచ్చును. శాసనసభయందు చర్చిం[illegible] డిన యనంతరము ఆబిల్లు శాసనసభ్యుల తీర్మానము[illegible] అమలు జరుపుటయు, జరుపకపోవుటయు తేలును. [illegible] మాన్యసభ్యులు తాము స్వయముగనే బిల్లును శాస[illegible] యందు ప్రవేశపెట్టజనదు. తాను బిల్లు ప్రవేశపెట్ట[illegible] నన్న, అయ్యది ఆయాసంఘములలో చర్చింపబడి ఆ[illegible] ఘాధ్యక్షునిచే మహాసభలో ప్రవేశపెట్టబడ వలయు[illegible] కాని ప్రతిసభ్యునకు ప్రథమమున ఏసంఘములోన[illegible]



## ఖమావచ (రాగిణి)

రూప అనుప సిగార కియే తన జోబన జోతి విరాజ రహీ హై।
బేద రచాయ పఢే బ్రహ్మచ్యారి అగ్యారికే రజిహి ఆస సహీ హై।
హాస విలాస హులాస సనీ మధిదేస గనీ ఈహి భేస లహీ హై।
యావిధ సో మాలకోసకీ రాగనీ ఖంమావచ నామ కహీ హై॥

ప్రవేశపెట్టబడకుండనే శాసనసభలో ప్రవేశపెట్టుట కవకాశ ముండినకూడ బాగుండుననియే సూచించిరి గాని, ఆవిధముగా తేబడినబిల్లు ప్రథమమున నెట్టి చర్చయు లేకయే ఆవిషయ మేసంఘమునకు జెందినదో ఆసంఘమువారి విమర్శనకై పంపబడి, యథారీతిగనే మరల చర్చకు రావచ్చును.

స్థాయిసంఘములు (Standing Committees). శాసనసభ ప్రారంభదినముననే సభ్యులందరును సభాధ్యక్షునిచే (Speaker) ఏ, బి, అని రెండుభాగములుగా విభజింపబడుదురు. ఇవియే స్థాయిసంఘములు. ఈ సంఘములు ఆయాసంఘములచే తేబడిన తీర్మానములను శాసనముచేయు పద్ధతుల నాలోచించును. అప్పుడుకూడ ప్రతిసంఘాధ్యక్షుడును వారివారిసంఘముల కధ్యక్షులై యుందురు. కాని ఏ, బి, అను రెండుసంఘములను, కార్యనిర్వాహకసంఘముల నన్నిటిని చేర్చి రెండుభాగములుగా నీక్రిందివిధమున చేయవచ్చును: (ఏ)– ఆంతరంగికపరిపాలన, వ్యవసాయశాఖ, స్థానికపరిపాలనశాఖ, విద్యాశాఖ; (బి)– ఆరోగ్యశాఖ, ఇంజనీరింగుశాఖ, వార్తాశాఖ: ఈ యీశాఖలు చేరి, ఏ,బి, అను రెండుస్థాయిసంఘము లేర్పడును. ఈ విధముగ ప్రతిశాసనసభయందును ప్రథమమున ప్రతిబిల్లుపైని చర్చజరుగును.

రెండవపర్యాయము బిల్లును ప్రవేశపెట్టుట:— ప్రస్తుత మములులోనున్న శాసనసభాచర్యనుగూర్చి కల చట్టముల పరిశీలించినచో, ఏబిల్లుగాని రెండవపర్యాయము ఆమోదింపబడిన యనంతరము శాసనసభ యంతయు ఒక సంఘముగా మారిగాని, లేక కొందరుసభ్యులను ప్రత్యేకోపసంఘముగ నెన్నుకొనిగాని వారియామోదమును బొందవలయును. కాని యీ విషయమున ఈ దిగువమార్పులు చేయుట యత్యవసరము:—

౧. సాంవత్సరికపుబడ్జెట్టు, అంచనాలు చర్చించుటకొఱకై శాసనసభ యంతయును గలిసిన ప్రత్యేకోపసంఘము (Select Committee) చేతనైనను;

౨. మంత్రులసంఘముయొక్క యనుమతిని నలుగురైదుగురు సభ్యులు చేరిన ఉపసంఘముచేతనైనను;

౩. లేనిచో ఏ,బి,అను రెండుస్థాయిసంఘములలో ఏదో యొకస్థాయిసంఘముచేతనైనను—

ఏ బిల్లయినను రెండవపర్యాయము శాసనసభయందు చర్చింపబడి యంగీకరింపబడిన యనంతరము పునర్విమర్శనమునకు లోనుగావలయును. శాసనసభ ఏ, బి, అని రెండుభాగములుగా స్థాయిసంఘముల నేర్పరచినచో, ఈ రెండు సంఘములలోను అనుభవజ్ఞులందరును చేరియుందురు గాన వారు ఆబిల్లును చర్చించి అనుకూలపరిస్థితులలో నుంచెదరు. ఒక్కొక్కసమయమున ఏసభ్యుడుగాని స్థాయిసంఘములలో సభ్యుడుగా లేకయుండి బిల్లును ప్రతిపాదించిన యాతడైనచో ఆతడు ఆబిల్లువిషయమై చర్చ జరిగినప్పుడు ఆప్రత్యేకసంఘములోగాని, స్థాయిసంఘములోగాని జరుగు చర్చలలో పాల్గొనవచ్చును.

సాంవత్సరికపు బడ్జెట్టు రెండవపర్యాయము శాసనసభలో ప్రవేశపెట్టబడి నిరాకరింపబడుటకు బదులు పునర్విమర్శనమునకై త్రిప్పివేయవచ్చును. ఇట్లు ఒక్కపర్యాయము మాత్రమే త్రిప్పివేయవచ్చును. పునర్విమర్శనానంతరము శాసనసభాచర్చలో ఆమోదింపబడుటగాని,నిరాకరింపబడుట గాని తేలగలదు. ఆయా ప్రత్యేకసంఘముల యంచనాలుగూడ నిచ్చట చర్చింపబడును. శాసనసభ ప్రత్యేకసభ (Select Committee)లో ఈ విషయమై చర్చ యెంతకాలము జరుగవలయునో, ఆకాల పరిమితిని మహాసభయే నిర్ణయించును. వోటును బాలట్టు పద్ధతినే తీసికొనవలయును

బిల్లు పునర్విమర్శనమునకై త్రిప్పివేయబడి మరల కొన్ని క్రొత్తసవరణలతో ప్రవేశపెట్టబడినప్పుడు శాసనసభకు ఆసవరణలను చర్చించుటకే హక్కుగలదు. అనంతరము సవరణలతోగాని,సవరణలను తీసివేసికాని ఆమోదించవచ్చును, లేదా నిరాకరింపవచ్చును. ఇది గాక, ఏ సంఘమువారైనను ఆకస్మికముగ నేదైన నూతనసవరణను దెచ్చినచో, అయ్యది మహాసభవారి యందరియామోదమును లేనిచో చర్చనీయముగాదు. ఒకప్పుడు ఏసంఘమునందుగాని సభ్యుడుగ నుండని ప్రత్యేకసభ్యుడు ఏసంఘ

మునో నైనను, ఒకతీర్మానపుచర్చలో తా నవసరమని తలంచుచో, తా నిచ్చగించుచో ఆసంఘుచర్చలో ఆతీర్మానముపై తనయభిప్రాయముల వెల్లడించిచర్చలలో పాల్గొనగలడు.

బిల్లుపై మూడవపర్యాయముచర్చ:— ఏబిల్లుగాని పునర్విమర్శన సంఘముచే చర్చింపబడినచో, మూడవపర్యాయము శాసనసభలో ప్రవేశపెట్టబడినప్పుడు తగిన కాలపరిమితి (నోటీసు)తో కొన్ని క్రొత్తసవరణలు ప్రతిపాదింపబడి చర్చలోనికి వచ్చును. మూడవపర్యాయము బిల్లు ఆమోదింపబడిన యనంతరము, అయ్యది గవర్నరుచే నామోదింపబడినగాని శాసనము కాదు. గవర్నరునకు మాత్రము ఆబిల్లును ఆమోదించుటకును, నిరాకరించుటకును సంపూర్ణాధికారము గలదు. కాని అతని పైయధికారి ఆజ్ఞానుసారముగ ఆబిల్లు మహాసభలోని మూడుభాగములలో రెండుభాగములవారిచే నామోదింపబడవలయునని కాని, లేక అయ్యది ఆరుమాసములవరకు చట్టముగాకుండ ఆపుదల చేయవలయునని కాని నియమించుటకు సంపూర్ణాధికారము గలదు. ప్రతిచట్టమును చక్రవర్తి యొక్క ఆమోదమునకును, నిరాకరణకును లోబడియుండును. ఏవిషయమైనను గవర్నరు చక్రవర్తికి నియమిత కాలములో తెలియబర్చనిచో, అందులకాతడు తగినసమాధాన మొసంగవలయును. ఒక్కొక్కప్పుడు చక్రవర్తి గవర్నరుచే నామోదింపబడిన చట్టములను త్రోసిపుచ్చవచ్చును.

అమలులోనున్న చట్టములను అవసరమగుచో మార్చుటకు గవర్నరుచే ప్రత్యేకసంఘ మొకటి యేర్పరుపబడును. మహాసభలో చర్చించుటకు ముందు అయ్యవి వీరిచేచర్చింపబడి అనంతరము సభలో మూడింట రెండు భాగములవారిచే నామోదింపబడుచో, ఆయామార్పుల చేయనగును.

## మహాసభ సామాన్యపద్ధతి

## (General Procedure)

ప్రతిమహాసభయు గవర్నరు ప్రారంభోపన్యాసముతో నారంభమగును. నూతనసభ యారంభమున అధ్యక్షు నెన్నుకొనుమీదట సంఘాధ్యక్షుల యొక్కయు ఉప సంఘాధ్యక్షులయొక్కయు నెన్నికలుకూడ జరుగును. ఈసంఘాధ్యక్షులును, ఉపసంఘాధ్యక్షులును అవసరమగుపట్ల మహాసభ ఉపాధ్యక్షులుగా పనిచేయసమర్థులుగా నుండవలెను. మంత్రుల కెంతవేతనమో అధ్యక్షునకు గూడ నంతే వేతనము. కాని సంఘాధ్యక్షునకును ఉపాధ్యక్షునకు సంవత్సరమునకు పదియేనువేలరూప్యములీయబడును.

మహాసభాధ్యక్షుడు సభాభవనములకును, సభాస్వత్తు నిర్వహణమునకును బాధ్యుడుగానుండును. ఈతనిక్రింద మహాసభోద్యోగులును (Officers of the Council) పలువురు గుమాస్తాలును పనిచేయుచుందురు. ఈయుద్యోగులను సభాధ్యక్షుడు తన యిష్టానుసారముగ నియమింపవచ్చును. అవిశ్వాసతీర్మానములకును, ప్రశ్నకాలమునకును, సభాకాలనిర్ణయమునకును, తక్కిన అవసరములవిషయములకును, అధ్యక్షునికి పార్లమెంటులోని కామన్సుసభాధ్యక్షునికి (Speaker of the House of Commons) ఎంత యధికారము గలదో అంత యధికారముండును.

ఈవిధాన మంతయు నూతనరాజ్యపరిపాలనావిధానమునకు పునాదియై యున్నది. ఇందుగల కొన్ని వివరములు అత్యావశ్యకముగ నెరుంగవలయును.

## కొన్ని వివరములు

మంత్రులు, కార్యనిర్వాహకవర్గములు (Ministers and Executive Committees):— ప్రతిమంత్రియు తనసంఘములో నెక్కువమంది సభ్యులచే నెన్నుకొనబడవలయును. ఆయాసంఘములలో చర్చింపబడు విషయములన్నియును ఎక్కువమంది యంగీకారమును బడయవలయును. ఒక్కొక్కతరి ఏసంఘములోనైనను సంఘాధ్యక్షునకును, సభ్యులకును వ్యతిరేకాభిప్రాయము లున్నచో, సామాన్యముగా ఆవిషయము నాతడు కార్యనిర్వాహకసభలో ప్రవేశపెట్టి, యిట్టి వ్యతిరేకాభిప్రాయము లున్నవనియును తన యభిప్రాయమును, తన సంఘాభిప్రాయమును, అందలి భేదములను ఇవియనియును వివరించి

లో ప్రవేశపెట్టవచ్చును. అతనికి తరుచుగ నిట్లు ఓటమియే తటస్థించుచో, తన పదవికి రాజీనామా నీయవలయును. అంతట మరల నెన్నికలు జరుగును.

పునర్విమర్శనమునకు త్రిప్పివేయుట (Refer Back):— కార్యనిర్వాహకసభవారికి ఏబిల్లునైనను, ఏసంఘములో ఆబిల్లు ప్రథమమున ప్రతిపాదింపబడినదో, ఆసంఘమునకు పునర్విమర్శనమునకై త్రిప్పివేయుటకు సంపూర్ణాధికారముగలదు. పునర్విమర్శించుటవలన ఆయా తీర్మానములపట్ల ఆసభ్యులెల్లరును ఏకీభావము వహించుట కవకాశ ముండును. ఇట్టి పునర్విమర్శనమువలన తొందరగా శాసననిర్మాణముచేయుట కవకాశ ముండక, అందరిలోపముల సవరించి తీర్మానమును స్పష్టీకృతముగ పునర్విమర్శనములో సాధకబాధకముల చర్చించి, దీర్ఘాలోచనయనంతరమే శాసనముగ చేయబడును.

కాని శాసనసభ కిట్టిహక్కు లేదు. శాసనసభ సాంవత్సరికపు బడ్జట్టును, అంచనాలను ఒక్కపర్యాయముమాత్రమే పునర్విమర్శనకు త్రోసిపుచ్చవచ్చును. పునర్విమర్శనానంతరము ఎట్టితీర్మానములు శాసనసభవారంగీకరింతురో అట్టితీర్మానములే శాసనము లగును గవర్నరునకు కార్యనిర్వాహకసభావిషయముల నేమి, శాసనసభావిషయముల నేమి, అన్నింటిని పునర్విమర్శనకు త్రిప్పివేయుటకు సంపూర్ణాధికారము గలదు.

మంత్రులు—మహాసభ:—మంత్రు లందరును కలిసి మహాసభకు బాధ్యులు గారు (Collective responsibility). ఇందులకు కారణము అచ్చట పార్టీలు లేకపోవుటయే. పూర్వముఏమంత్రియైననుమహాసభయొక్కవిశ్వాసమునకు పాత్రుడు గానిచో, మంత్రులసంఘమంతయును రాజీనామా నీయవలయును. కాని యిప్పు డన్ననో, ఏమంత్రి మహాసభవిశ్వాసమునకు పాత్రుడు కాడో, ఆమంత్రియే తనపదవిని విరమించుకొనును. నూతనమంత్రి ఆస్థాన మాక్రమించుకొనును. కాన ఏమంత్రి యొనర్చిన కార్యముల కామంత్రియే బాధ్యుడు (Individual responsibility) కాని సాంవత్సరికపుబడ్జట్టు, అంచనాల విషయమైమాత్రము మంత్రివర్గ మంతయు కలిసి బాధ్యత వహించవలయును (Collective responsibility). ఏలన, ఈవిషయము అతిముఖ్యమైనదియు అవసరమైనదియునగుటచేతను, అదిగాక ఏవిషయమునుఒక్కనికిచెందినది గాకపోవుటచేతను, మంత్రులెల్లరును ఈవిషయమైయంగీకరించినగాని ఎట్టిచర్యను తీసుకొనుటకు వీలుండదు గాన ఇట్టి బాధ్యతయు అవసరము. ఒక్కొక్కతరి ఈవిషయముపై మంత్రు లోడిపోయినచో, వెనుకసూచించిన రీతిని సంపూర్ణముగ నెన్నికలన్నియు జరుగవలసియుండును. ఇతరవిషయములలో నూతనమంత్రులు వచ్చుచుండుటచే మంత్రివర్గము చీలిపోకుండ బడ్జెటుమీద ఓడిపోయినంతవరకుగాని, మరల క్రొత్తయెన్నికలు జరుగుటకు వారికాలము ముగించువరకుగాని అటులే నిలిచియుండును.

మంత్రులసంఘము—ముఖ్యకార్యదర్శి, ఇతరరాజకీయోద్యోగులు—మంత్రులసంఘమునకు గవర్నరుతరువాత ఈద్వీపమందు ఉన్నతోద్యోగియును, గవర్నరు లేని సమయమున ఆస్థాన మలంకరింప నర్హుడును అగు ముఖ్యకార్యదర్శి అధ్యక్షుడుగా నుండును. ఈతను ప్రధానమంత్రి కానేరడు; మొదటిమంత్రియగును (Not the Prime Minister but the First Minister). ఈతనికి మంత్రివర్గమునకు సలహా నిచ్చుటకే హక్కున్నదిగాని కార్యనిర్వహణవిషయములలో ఎట్టి యధికారమును లేదు. రాజకీయోద్యోగులు మువ్వురకునుగూడ మంత్రులసభయందు వోటింగుసమయమున తమవోటు నిచ్చుటకు అధికారము లేదు. వీరు మంత్రులకు, మంత్రులసంఘమునకును ఆలోచనాపరులుగమాత్రమే పనిచేయుచు, ఇతరమంత్రులకార్యముల కాటంకము గలిగించకుండునట్లు తమతమ కార్యముల నిర్వర్తించుచుండవలయును. ఈద్వీపవాసులలోని రాజకీయోద్యోగులు ఇదివరలో రాజకార్యనిర్వహణానుభవము లేనివారు గాన అట్టి యనుభవమును వారికి కలిగించుటయే వీరిముఖ్యోద్దేశముగా నుండవలయును. ముఖ్యకార్యదర్శి మంత్రుల సంఘాధ్యక్షుడే కాని మహాసభలో నాయకుడు (Leader) కానేరడు. కాన మంత్రులసంఘములో నొకనిని మహాసభలో నాయకత్వము వహించుటకై యెన్నుకొనవలయును. ఈము

ఖ్యుడే మంత్రులసంఘమునకు ఉపాధ్యక్షుడుగానుండును. మహాసభలో నీతడు మంత్రులసంఘము తరపునను ప్రత్యేకమంత్రులతరపునగూడ అన్నివిషయములలోను జవాబొసంగవచ్చును. ముఖ్యకార్యదర్శిఆలోచనామంత్రియై, తన శాఖాకార్యముల నిర్వర్తించుకొనుచు, ఇతర శాఖలతో తప్పక, అవసరముగ సంబంధము కలుగజేసుకొని ఆయాశాఖలవారి కాయావిధుల నిరూపించుచు, అన్నివిషయములతోడను పరిచితుడై యుండవలయును. గవర్నరునకు ఇదివరలో ఈతడేసలహానిచ్చువాడు(Adviser)గా ఉండెను గాని యిప్పుడు మంత్రులసంఘము ఈపని నిర్వర్తించును. గవర్నరునకు తెలియవలసిన యెల్లసమాచారములను ఇదివరలోవలె ముఖ్యకార్యదర్శిద్వారా కాకుండ, గవర్నరునకుగల ప్రత్యేకకార్యదర్శి (Private Secretary) ద్వారా పోవుచుండవలయును. గవర్నరు మంత్రులకుగాని, మంత్రులసంఘమునకుగాని తెలియవలసిన విషయములు ముఖ్యకార్యదర్శిద్వారా వారలకు తెలియజేయుచుండును. దానికి జవాబు అవసరమగుచో, ఏమంత్రిగాని మంత్రులుగాని ముఖ్యకార్యదర్శిద్వారానే ఈయవలయును. మంత్రులందరును ఏ యేవిషయములు కాలనీల కార్యదర్శికి (Secretary ot State for Colonies) తెలుపబడుచుండెనో ఆయావిషయములతో అత్యవసరముగ పరిచితులై యుండవలయును.

కోశాధిపతి:—ఇదివరలో కోశాధిపతికి తెలియకుండనే, రాజధనవిషయమై యాతని యభిప్రాయము లేకుండగనే, ఆయాధనవిషయములపై చర్చలు జరుగుచుండెడివి. ప్రస్తుతము దొరతనపు ధనవిషయములలో దొరతనమున కీతడు సలహానిచ్చుచు, ఏయేధనవిషయముల గూర్చి సంఘములలో చర్చలు జరుగుచున్నవో వాటిపై తన ఆలోచన జెప్పుచు, అన్నివిధముల సహాయపడును. ఈతనిసలహా లేనిదే ఆయాసంఘములవారు ధనవిషయములలో తీర్మానించరాదు. ఈతడు మంత్రుల సంఘములో సాంవత్సరికపు బడ్జెట్టు, ఆయాసంఘముల అంచనాలు చర్చకు వచ్చునప్పుడు సలహానిచ్చువారలలో ముఖ్యుడుగనుండి, ఆయాసాధకబాధకముల వివరించిమంత్రులకు సలహానిచ్చును. ధనవిషయమై యీతనియంగీకారము లేనిదే యేదియును జరుగరాదు.

న్యాయాధిపతి:—ఈత డీద్వీపమునకు న్యాయాధిపతి. న్యాయస్థానములన్నియు, నీతని హస్తగతమై యుండును. ఇతడు తన శాఖను నిర్వర్తించుకొనుచు, దొరతనమునకు,మంత్రులకు న్యాయవిషయములను, శాసననిర్మాణవిషయములను తనసలహా నిచ్చుచు,చక్రవర్తిగవర్నరుచే పంపబడు అన్నివిషయములమీద తానుకూడతన యభిప్రాయమును తెలుపుచుండవలయును. ఇదివరలో నీతడు శాసనపద్ధతులను, చట్టముల రీతిని మార్చుచుండెడివాడు. ప్రస్తుత మావిషయము "చిత్తుప్రాయకాండ్ర"(Paliamentay Draftsmen) చేత నుంచబడి యీతనికి ఈద్వీపన్యాయసంరక్షణవిషయమున సంపూర్ణాధికార మీయబడినది.

## రాజప్రతినిధి లేక గవర్నరు

గవర్నరునకు ఈద్వీపపు నూతనపరిపాలనాపద్ధతిలో సంపూర్ణాధికారము లీయబడినవి. ఆతని కధికారములు హెచ్చింపకపోవుటయు, సామాన్యరాజప్రతినిధికుండు గౌరవాధికారమునిచ్చియితరరాజ్యభారమంతయు దేశజులమీద బడవేయుటయును ప్రస్తుపరిస్థితులలో ఈవిధానమున కనుకూలముగా నుండదట. ఈవిషయమున గవర్నరునకు అతీతమగు అధికారము లిచ్చిరని తీవ్రచర్చలు జరుగుచునేయున్నవి. ఈదేశజులు కార్యనిర్వహణమందారితేరినవారు గాకపోవుటచేత వారలు సంపూర్ణస్వరాజ్యమునుగాని, అధినివేశపరిపాలనగాని పొందియలేరు గాన ఈనూతన విధానమున అట్టిశక్తిని గల్గించుటకు గవర్నరునకు కొన్ని సంపూర్ణాధికారము లిచ్చిరిగాని యీ సింహళద్వీపవాసులు స్వపరిపాలనార్హులు కానేరరట; కాననే యిందుల కనువగురీతిని గవర్నరునకు కొన్ని యధికారముల నెచ్చించిరి. అవి యీదిగువ క్లుప్తముగ నన్నియును సూచింపబడెను.

శాసననిర్మాణములలో హక్కు:—గవర్నరుకి న సంత్సరమున ఆద్వీపరాజప్రతినిధికి శాంతియుతమున సభ

రిపాలన కనువగు చట్టముల నిర్మించుటకే యధికారముండి నది. అట్టిశాసననిర్మాణమునకు చక్రవర్తి యాజ్ఞానుసారముగ గవర్నరు వర్తించును. తుట్టతుదకు గవర్నరు అనుజ్ఞ బడయనిదే ఏశాసనము అమలుజరుగదు.

నూతనవిధానములోకూడ ఆయధికారములన్నియు నుంచుచు, కొన్ని హెచ్చించబడెను. ౧౯౨౮ సంవత్సరములో చక్రవర్తియనుమతి నీయబడిన యీక్రిందియధికారములను గవర్నరు ఉపయోగించవచ్చును. ఈక్రిందనుదాహరింపబడిన విషయములపై బిల్లు వచ్చెనో, గవర్నరు తన యిచ్ఛానుసారముగ తనయనుమతి నీయకుండకూడ నుండవచ్చును.

వివాహవిచ్ఛేదములు; గవర్నరున కీయబోవు దానములు; బ్యాంకునోట్లు, నాణెములు మొదలగు విషయములు; దొరతనపు పనుబలమునకు, నౌకాబలమునకు, విమానములకు సంబంధించిన విషయములు; చక్రవర్తిపరిపాలనకు భంగకరమైనట్టియు, అగౌరవమైనట్టియు, ఇది వరలో నిరాకరింపబడినట్టియు విషయములు; ఇందులోనే జాతి మతవైషమ్యముల పెంపొందించు బిల్లులు; సివిలు పబ్లికు ఆఫీసర్లవిషయమైన బిల్లులు-వీనిపయిని గవర్నరు తన యనుమతి నీయడు.

ఇవిగాక గవర్నరు శాసనసభచే నిర్మింపబడిన యేబిల్లునుగాని తా నామోదించుటకు, నిరాకరించుటకును మరల సవరణలతో త్రిప్పివేయుటకును, తన యనుమతి కొంతికాలము నిలుపుచేయుటకును, లేక ఆబిల్లు శాసనసభ్యుల సంఖ్యలో మూడింట రెండుభాగములవారిచే నామోదింపబడవలయు నని తెల్పుటకును, ఏబిల్లుగాని శాసనము గాకుండ ఆరుమాసములు నిలుపుచేయుటకును సంపూర్ణాధికారము గలిగియుండును. ఇంకను ఒకానొక బిల్లు ప్రజాక్షేమముకొరకు తా నవసరమని యెంచినచో, శాసనసభ్యులచే ఆబిల్లులు అనవసరమని నిరాకరింపబడినను, అనధికారసభ్యుల లెక్కలేకయే, అధికారసభ్యుల యనుమతిచొప్పున మాత్రమే అత డాబిల్లును శాసనముగా చేసి అమలుజరుపవచ్చును. ఈఅధికారము లన్నియు అవసరమగుచో నుపయోగించునుగాని సర్వసాధారణముగ నుపయోగింపడని యీప్రత్యేకసంఘనివేదిక ఘోషించుచున్నది. ఇంతకును, మహాసభయంతయు కార్యనిర్వాహకసభగా నూరి గవర్నరున కిన్ని సర్వాధికారము లిచ్చినది సింహళద్వీపవాసుల బాగు గోరి వారిని స్వరాజ్యార్హులగ జేసి, వారలచేతిలో స్వరాజ్యఫలమును వడలి పెట్టుటకేయట.

గవర్నరు తా నీయధికారములను తన సొంతబాధ్యతమీదనే యుపయోగించును. అతడు తనయధికారముల నుపయోగించునప్పుడు కార్యనిర్వాహకసభతో సంప్రతించవలె ననికాని, ఒకచో సంప్రతించినచో వారు చెప్పినరీతిని చేయవలయు ననికాని యెచ్చటను నిర్బంధము లేదు. కార్యనిర్వాహకసభ ముగిసి మరల ఎన్నికలు జరిగినప్పుడు అతడు అధికారసభ్యులతో మాత్రమే సంప్రతించవచ్చును. ఏది ఎటుల ఎవరితో ఆలోచించినను, ఆతని యిచ్చవచ్చిన రీతిని మెలంగవచ్చును. కార్యనిర్వాహక సంఘములకు అధ్యక్షుల నేర్పరచవచ్చును (Nomination). కాని యిచ్చటి పరిపాలనావిధానమున కాతడు బాధ్యుడు కానేరడు. ఈఉపసంఘసభ్యులు గవర్నరున కిచ్చిన యధికారములలోగల ధర్మబుద్ధి, ఉదారత్వము, సింహళదేశజులయెడగల ప్రేమ యీదిగువ వివరణముననే తెలియనగును: "He will thus remain in the position of a supreme arbiter, impartial and independent ":— ఆతడు నిష్పక్షపాతబుద్ధియు, స్వతంత్రుడునగు శ్రేష్ఠమధ్యవర్తిగ నుండును.

ఈవిధముగ నూతనపరిపాలనావిధానము ప్రత్యేకసంఘముచే పార్లమెంటులో నుపపాదింప బడుటకై తయారుచేయబడినది. వీరలు తయారుచేసిన విధానము సింహళద్వీపవాసుల కెంతవఱకు అంగీకారము? అది యిచటి పరిస్థితుల కెంతవరకు అనుగుణముగా నున్నది? ఇట్టివిధానము జనుల స్వరాజ్యార్హుల జేయునా? అను వివిధవిషయములు చర్చనీయములు. సింహళద్వీపవాసులుమాత్రము ఈవిధానము నంతగా నిచ్చగించుట లేదు. ముఖ్యనాయకులును, వివిధప్రజాసంస్థలును వేరేయభిప్రాయములు గల్గియున్నారు. శాసనసభలో ఈప్రత్యేకసంఘ

నివేదిక చర్చింపబడినది. ఈనివేదిక యనేకతీవ్రఖండ నలకు లోనైనదనియే చెప్పవలయును. అట్టి విమర్శనలన్ని యును ప్రత్యేకముగ చర్చనీయములు. కాని సింహళద్వీపవాసుల స్వరాజ్యార్హులుగ జేయ నుద్దేశింపబడిన యీవిధానము ఆపని నెరవేర్చునో లేదో వేరుగ జెప్ప ననవస రమే కాని, సింహళముయొక్క భావిదశ యంత ఈవిధాన మమలులో పెట్టబడినప్పటినుండియు గవర్నరు, కోశాధిపతుల హస్తగతమై యుండు నిశ్చయము

---

# గోరువంక

శ్రీ శేషాద్రిరమణ

గోరువంకలు రెండొక గూటికెలన - వ్రాలి యస్ఫుటముగఁ బాటఁ బాడుచుండె
గూటిలోపల నుండిన కూనపులుఁగు - ఎఱకుఁ బలుమాఱు వాయెత్తి యఱచుచు

అది మనోహరసాంధ్యరాగాభిరామ - దంతురశ్రీపదంబు సాయంతనంబు
గర్భమోహంబునను ధేనుగణము లురికి - సాటుచుండెను బుత్రవాత్సల్యగరిమ.

పతగములు గూండ్లఁ జేరఁగాఁ బయనమయ్యె - కారుకొనఁ జొచ్చె మొలకచీకటి
చివురుటాకులలోఁ జేరి జీర్ణమయ్యె - నఖిలమోహన సాంధ్యరాగాతపంబు. [గో

కఱకువెండ్రుకలకు నీలికాసెఁ జుట్టి - చినిఁగినపటంబు నొగి నడుమున బిగించి
అండజంబులపాలిటి కపరయముఁడు - తిరిగె నొకబోయె ప్రతితరు పరిసరమున.

వేఁటకానిని గనుఁగొన్న వెఱపుకతన - గోరువంకలు డాఁగెను గూటిలోన
విటపిశాఖల కెగఁబ్రాఁకి వేఁటకాఁడు - గోరువంకల లాగెను గూటినుండి.

ఓరి, దయమాలినవెడంగ, యుండుముండు - మేల పులుఁగులఁ బట్టెద వేవఁడ వీవు
వణఁకుచునునున్న వీగోరువంక లేల - విడిచిపెట్టవు? నిర్దయాత్ముఁడవె నీవు?

విడువు మాపుల్గుల నటంచు వేయిగతుల - నఱచుచుండిన యంతలో నాదురాత్మ
డెలమిమై గోరువంకల తలలు నులిమి - పంచెలోఁ బెట్టుకొని యెందొ పారిపోయె.

తల్లికై పల్లటిల్లుచుఁ దలను సాచి - కూనగోరువంక గూటిలో గునియుచుండెఁ
గనులు తెఱవని యీపుల్గుకందువునకు - నెంతగతి పట్టెనని లోన నేడ్చినాఁడ.

గ్రుడ్డువలె నున్న గోరువంక కూన నెటులో - సాఁకకుండిన నేల నాజన్మ మింక
పంజరంబున నిడి దీనిఁ బదిలపఱతుఁ - బ్రదికెనా, నాశ్రమంబు సాఫల్యమగును.

అనుచుఁ జెట్టున కెగఁబ్రాఁకి యడలుచున్న - బాలశారిక నెట్టులో పట్టుకొంటి
ముష్కరకిరాత దుష్కృత్యమునకు నాదు - భావ మెన్నెన్నొ విధములఁ బలవటించె.

ఫలరసంబున నన్నంబు పాలమీఁది - మీఁగడయుఁ గూర్చి మెత్తఁగా మెదిపి మెదిపి
అఱచినపుడెల్లఁ బెట్టి నీ రాన నొసఁగి - పెంచితిని గోరువంకను బిడ్డనట్లు.

ఏడెనిమిది దినంబుల కీఁక లెల్ల - నలమె నెమ్మేనఁ గ్రొంగ్రొత్త చెలువుతోడఁ
బులుఁగుబిడ్డకడుంగడుఁ బొలుచుచుండె - దినదినంబున కొకవింత తేజుతోడ.

*　　*　　*　　*

గొడుగుబెత్తంబుఁను దెచ్చి క్రొత్తదాగు - ఫలకమున నాటి చేసితి పంజరంబు
పులుఁగు చెలువకుఁ బిల్లులవలనఁ దొసఁగు - గలుగమికిఁ గంట వత్తిడి కాచుచుంటి.

జనులు చెంగట లేకున్న సమయమందుఁ - గూయుచుండును వాయెత్తి గోరువంక
అమ్మయో, చెల్లియో, నేనొ యన్ని యెడల- నిలిచియుండుము గోరువంక నిసువు చెంత.

జంపులై నూనెఁ బూసిన చాయఁ దనరి - యింపుగా సాగె నునుపైన యీఁకలెల్ల
సహజ సౌందర్య యౌవనసంపదలకు - మేరమై మించె నాముద్దుగోరువంక.

అస్వాతంత్ర్యంబుచే నడుగంటియున్న - మానవునిపోల్కి పులుఁగును మనుచు టేల
నిర్వహింపితిఁ గర్తవ్య నియతి నంచు - విడిచితిని బుల్గు నొక మహావిటపిమీఁద.

పాల్యపాలక సంబంధ బాంధవంబు - కాలిబందంబు లగుటచేఁ గడచిపోక
పులుఁగు నను వెంబడించి నా మూపుమీఁద - వ్రాలెఁ జిఱుతెక్కగాడ్పు వీవనలు వీవ.

ఎంతకును బోవ దీపులుఁ గింట నుండుఁ - దగులుకొనియె ఋణానుబంధమునఁ జేసి
పరిచయస్నేహ బంధంబు పతగమునకు - సంకెలలఁ గూర్చె ననుకొంటి స్వాంతమందు.

రాత్రి నాల్జాములే పంజరమున నుంతు - గోరువంకను; బగలెల్లఁ గూడఁ దిరుగు
ఎచటి కేఁగిన నచ్చటి కేఁగుదెంచు - నిలువ దెటనేని నను వీడి నిముసమేని.

*　　*　　*　　*

కాళిదాసశకుంతలాంకంబులందు - నాల్గవది గాంచుచుంటి నానంద మెసఁగఁ
బులుఁగు నామేనిపై వ్రాలి పుస్తకంపుఁ - బుటల సవరించుచుండెను ముక్కుతోడ.

అలశకుంతల నత్తింటి కనుపునపుడు - కణ్వమునిరా జొనర్చు నాక్రందనంబు
కాళిదాసుండు నుడివె శ్లోకంబునందు - దానిఁ గనినంత హృదయంబు తల్లడిల్లె.

జంటపులుఁగు లభించిన సమయమందు - గోరువంకయుఁ దప్పక దారిఁ బట్టు
కణ్వునివితాన విశ్లేష గాఢశోక - భరము మిగులును నాకు జేపటనో మాప్ర.

అనుచుఁ దలపోయుచుండిన యవసరమున - పులుఁగు కలకల నఱచి నామొగముఁ
నేను జూచితి నప్వల్గు నెమ్మొగంబు - శాంతముగ నేఁగె నొకకొన్ని క్షణము
కనుల మూసితి నంతలో గండుఁబిల్లి - దూలముననుండి మాపైకిఁ దూఁకె నప్పు
పులుఁగు గిలగిల వాపోయెఁ బుడమి నిండె - రక్తధారలు, చనియె మార్జాల మె

సంతాపము

పొట్టను బెట్టుకొంటివఁటె పుత్తడి బొమ్మ వితాన నున్న నా
పిట్టను, నెంత నోచ్చునోకొ పెంచిన వాని మనం బటంచు న
ప్పట్టున నెంచవైతి; క్షణభంగుర దేహము నన్యమాంససం
ఘట్టన కేల పాల్పఱుపఁ గా గమకించితి వోబిడాలమా?

చిఱుతఱెక్కలనిగ్గు చెలువొందు గోరువంక గోనబైన నడకల గోరువంక
ముద్దుగా నేఁ బెంచి దిద్దినగోరువంక కోమలప్రాయంపు గోరువంక
నునుపైనయీఁకలు దనరారు గోరువంక కూడి వెంటఁ జరించు గోరువంక
అడుగుఁ బెట్టఁగ వెంట నడయాడుగోరువంక గునగున రొద సేయు గోరువంక
కూర్మికాఁ డనఁ జెల్లు నా గోరువంక - శారికామణి యనఁదగు గోరువంక
నాకళేబరమందుఁ బ్రాణంబు లుండఁ - బట్టువడెఁ గ్రూర మార్జాల వదనమందు.

మది దరికొల్పు నీక్షుధకు మాంసము గావలెనేని శారిక
జిదిమి భుజింపఁగా వలెనె? చిక్కఁడె నాదుశరీరమందు నీ
కొదవిన యంతమాంస మయయో నను నమ్మినపుల్గుకూనకు
బ్రదికెడి యోగ మున్నయెడఁ బట్టఁగ నేర్తువటే బిడాలమా!

(?) ంధకారబంధు రాధీన మయ్యె నా - హృదయమెల్లఁ; బులుఁ గదృశ్యమయ్యె
కోలుపోయినాఁడ గోరువంక పేగిటి - నయనరంజకం బనర్ఘ్యమణిని.

---

# ఆకస్మికచ్ఛాయాచిత్రములు

## (SNAP SHOTS)



౨. కృష్ణకాలువలు దాటుటకు బల్లకట్టు



3. పొలములకు నీరు తోడు కారెములు

ఛాయాచిత్రకారుడు: శ్రీ శనివారపు సుబ్బారావుగారు



౧. కావేరిలో నుఱుకుట

(రెండవ బహుమానము)

ఛాయాచిత్రకారుడు: శ్రీ యం. కే. రంగస్వామయ్యంగారు, తిరువలిక్కేణి, చెన్నపురి



శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు
వీరదాసు పాత్రము

# మైసూరు కళాపరిశ్రమలు

బి. సుబ్రహ్మణ్యముగారు

## (ART INDUSTRIES, MYSORE)

౧

మున్నొకప్పుడు మైసూరురాజ్యమునకు పేరుకీర్తులను దెచ్చిన కళలును, చేతిపనులును శరవేగమున మారుచున్న కాలగతిని ప్రజల అభిరుచులను బట్టి కడచినశతాబ్దముచివర తమకున్నతమపమును కోలుపోవు ననుభయమును పొడసూపినది.

దక్షిణహిందూదేశమున మంచి కళాకౌశలమున నొప్పారు చేతిపనులకు పేరునకెక్కిన కేంద్రములలో మైసూరు రాజ్యమునకు ప్రధానస్థానము లభించియుండెను. సోరబు సాగరముల గంధపుమ్రాని శిల్పములు, మైసూరు దంతపుపనులు, తాపడపుపనులు, చన్నపట్టణపు లక్క బొమ్మలు, నాగమంగలము, మాగాడుల ఇత్తడిసామానులు, మేల్నాడు ప్రాంతముల పేములపనులు—పెక్కు ఇతరపరిశ్రమల మాటయటుండ—ఈపరిశ్రమలన్నియు మైసూరురాజ్యమునకు మంచిఖ్యాతిని దెచ్చినవి. ఈనాటికిని వానియౌన్నత్యము నవి కోలుపోయిన వనజాలము.

అయిన నీప్రాచీన కళాపరిశ్రమలు మారుచున్న యిప్పటివ్యాపార పరిస్థితులకు సరిపోవుటకెరిక నవి పొందజాలకున్నవి. మఱియు నవీనాభిరుచులకు, ఉపయోగములకు తగినపద్ధతులను సైతము అవలంబించినవి కావు. "తయారైనవస్తువులు తోడనే అమ్ముడుపోవుటకు అనుకూలమగునట్లు వానియందలి కళావిధానమును, వాని నమూనాలను అభివృద్ధికి దెచ్చుటకు ప్రత్యేకప్రోత్సాహమావశ్యకము."

ఈపరిశ్రమ లంతరించునేమో యను భీతి గలుగుచున్న కాలముననే మైసూరు ప్రభుత్వమువారు పనిపూని ఈకాలపు వ్యాపారపరిస్థితులకు సరిపోవునట్లు సుసన్నద్ధులయిన గట్టిపనివాండ్రను తయారుచేసి సంస్థానమునందలి కళలను, చేతిపనులను పెంపొందించుటకు గాను ౧౮౯౨ వ సంవత్సరమున నొకసాంకేతికవిద్యాసంస్థ (Technical Institute) ను స్థాపించిరి. తొలుదొల్త నది మైసూరుపురమున చేతిపనులను నేర్పు నొకచిన్నపాఠశాలగ మొలకెత్తినది. అందు నాలుగైదురకముల పనులనుమాత్రము నేర్పుచుండిరి. ఆరీతిగా అది యిరువదేండ్లు నడిచినది. తరువాత శ్రీయుతులు మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారి ఆధిపత్యమున నేర్పడిన ఒకసంఘమిచ్చిన సలహాల ననుసరించి ౧౯౧౩ వ సంవత్సరమున "కేంద్ర సాంకేతిక విద్యాశాల" (Central Technical School) అను పేరున కొన్ని మార్పులను కూర్పులను గాంచి పెంపొందినది. అందు చాలినంతవరకు దేశీయములైన కళలు, చేతిపనులు నేర్పుట కేర్పాటు చేయబడినది. ఈవిద్యాశాల కీ. శే. శ్రీ శ్రీ చామరాజేంద్ర ఒడయరు బహదరు—మైసూరుమహారాజు—వారి పేర, వారి సంస్థానప్రజలకు పారిశ్రామికవిద్యలను నేర్పుటయందు వారికిగల అధికాభిమానమునకు సూచకముగ, వారిజ్ఞాపకార్థము నెలకొన్నది. కావున దానికి 'చామరాజేంద్ర సాంకేతికవిద్యాశాల' (Chamarajendra Technical Institute) అను పేరు పెట్టబడినది. ఈవిద్యాశాలయొక్క సుందరభవనమునకు శ్రీజార్జి సార్వభౌములు ౧౯౦౬ వ సంవత్సరమున ఇండియాకు వచ్చినప్పుడు పునాదివైచిరి.

ప్రతిష్ఠాపకులు కోరుకొనిన యీవిద్యాలయముయొక్క మహదాశయములు:

"యువకులను వారి జీవయాత్ర కనువగు పరిశ్రమలయందు చాలియుండునట్లు తయారుచేసి వారు చేపట్టినవృత్తులందు వారిని మిగుల సమర్థులనుగ జేయుట; దేశీయపరిశ్రమలను పోషించి అభివృద్ధికి దెచ్చుట; సంస్థానమున వాడుకయం దున్నట్టియు, లేక, అభివృద్ధికి రాదగినట్టియు కళాసంబంధములగు వృత్తులకు, పరిశ్రమలకు ప్రోద్బలము నిచ్చు రంగులు పూయుట, రాళ్లపై

బొమ్మలు చెక్కుట, చిత్రలేఖనము ఇతరములగు చేతిపనులు మొదలయినవానిని నేర్చుకొనుట కవకాశములను గలిగించుట. ఈతీరున కళలయందును, చేతిపనులయందును శిక్షనొసగుటతోపాటు, వ్యాయామము, స్వార్థరహితము, సగౌరవము నగు జీవితమును గడపుకొనుటకు వలసిన నిశ్చలప్రవర్తనము అలవడుటకును, మనశ్శరీరముల వికాసమునకును, చక్కనిసాంఘిక పరిచయమునకును చాలిన అవకాశములు నొసంగబడును."

ఇట్టి గట్టి యుదారాశయములు ప్రోత్సహింప సమర్థులు, సుసన్నద్ధులు నగుకొందఱు కర్మకారులు, కొన్ని చేతిపనులయందే కానిండు, తత్ప్రతిష్ఠాపకుల మహత్తరములైన యాశలను మిగులునట్లు విద్యాలయమును క్రమముగ నభివృద్ధిమార్గమున బెట్టిరి.

నేడావిద్యాలయమున సమర్థులగు నుపాధ్యాయుల క్రింద ౨౪౧ మంది విద్యార్థులు వడ్రంగము, కంచరము, ఇత్తడిపని, యంత్రములు చేయుట, షేముపని, లోహములపైన, కఱ్ఱపైన చిత్రములు చెక్కుట, ప్రతిరూపములు చేయుట, చిత్రలేఖనము, రంగులు పూయుట మొదలగు పనులను నేర్చుకొనుచున్నారు. ఇంచుమించుగ వీరందఱును విద్యార్థివేతనమును బడయుచున్నారు.

వారు నేర్చుకొనుచున్న ప్రత్యేకవిద్యను, తరగతినిబట్టి విద్యార్థివేతనము ఒకరూపాయమొదలు పండ్రెండు రూపాయలవఱకును గలదు.

ఆవిద్యాశాలయందు తయారుచేయు గృహోపకరణములు, అందమైన ఇతరవస్తువులు పనితనమునను, సొగసుదనమునను చాలశ్రేష్ఠములుగ నుండుటచే ప్రేక్షకుల హృదయముల నాకర్షించుచు వారిసొగ త్తను గాంచుచుండును. వానిని బోలినవస్తువులను తయారుచేయించి యిమ్మని పలువురు తరుచు కోరుచుండుట చేత వానిని చేయించి యిచ్చుటకును, ఆవిద్యాలయమునందలి విద్యార్థులకు వస్తువులకు వెలకట్టుటయందును, వ్యాపారము చేయుటయందును, మఱియు నితరవర్తకవ్యవహారముల యందును అనుభవజ్ఞానమును కలిగించుటకును ఆయా వృత్తిభాగములకు కర్మాగారములు జతచేయబడినవి.

విద్యాలయమునందు తేరిన విద్యార్థులలో ముప్ప వంతుమందికి ఈకర్మాగారములు జీవిక నొసగుచున్న వారు చిల్లరపనులు చేసి సరాసరి నెలకు ముప్పదిమొ ఏబది రూపాయలవఱకు సంపాదించుకొనుచున్నారు.

ఈవిద్యాలయము చిరకాలము శ్రీ హెచ్. ఆల్డర్టన్ అనునొక ఆంగ్లేయ చిత్రకారుని యాధ మున నుండెను. తరువాత నాతనిస్థానమును కళాకో డును, కళాభిమానియు, తనక్రిందనున్న అన్నిపరిశ్ర మూలసూత్రములను బాగుగ నెఱిగినవాడును నగు శ్రీ యస్. రామస్వామి యనునాయన యలంకరించెను.

పైవిద్యాలయ మిట్లు అభివృద్ధికి వచ్చినతరువా కొన్నియేండ్లకు మైసూరు ప్రభుత్వమువారు క్రొత్తమ నాలను సిద్ధపఱచి, క్రొత్తపద్ధతులను ప్రవేశపెట్టి వస్తు లను తయారుచేయుటకై ఈ మేజువారీలను చేర్చుక తన్మూలమున దేశీయములగు పరిశ్రమలకు ప్రత్యేక ప్రో త్సాహమును, అభివృద్ధిని గలిగించుట కొకప్రత్యేకసం యావశ్యకమని గుర్తించిరి. ఈయుద్దేశము నను వారు ౧౯౧౯ వ సంవత్సరమున 'ప్రభుత్వ కళాకర్మా గారము' (Government Art Workshop) అ పేర నొకకర్మాగారమును బెంగుళూరునందు స్థాపించి అదియు ౧౯౨౩ వ సంవత్సరమున కొంతమార్పు కూర్పును పొంది అప్పటినుండి 'Arts and Crafts Institute' అనుపేరును పొందినది.

ఈకర్మాగారమున నిపుడు అరువదిమంది పనివాండ్రు పనిచేయుచున్నారు. ముప్పదిమంది ఉమేదువారీలు విద్యార్థివేతనమును బడయుచు వివిధములగు పనులను నేర్చుకొనుచున్నారు.

వర్తకపరిశ్రమల ప్రధానాధికారి (Director of Industries and Commerce) ౧౯౨౬-౨౭ సంవత్సరపు నివేదికయందు 'ఈకర్మాగారము సమర్థుడగు అధికారి లేకుండుటచేత తనయుద్దేశములను చక్కగా నెరవేర్చుకొనినట్లు చెప్ప వీలులేకున్న'దని వ్రాసి కాని పదపడి యీలోపము తీరినట్లున్నది. ఇప్పుడు కర్మాగారమున శ్రీ యన్. జి. పవంజి అనువారు

కారిగా నియమింపబడిరి. ఆయన పేరుగాంచిన శిల్పచిత్ర కళాకుశలురు. ప్రపంచమున ఎల్లవిధముల నాగరికత యందు మించిన దేశములయందు సంచారముచేసి మంచి అనుభవమును గన్నవారు. మఱియు జర్మనీలో కళల యందు ప్రత్యేకశిక్షను పొందినవారు.

ప్రస్తుతము మీ కర్మాగారముయొక్క దృష్టి యంతయు తాపడము (Inlay work), దంతపు చెక్కడము, గంధపుమ్రానిపై చెక్కడము ఈపనులయందు కేంద్రీకృతమై యున్నది. దీనికి చేరికగా ఉత్తమశ్రేణికి చెందిన వస్తువులను తయారుచేయుట కింకొకశాఖను స్థాపించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈకర్మాగారముల యందు పని నేర్చుకొన్న పనివాండ్రు మంచిసమర్థులు. వారు చేసినవస్తువులు మంచి పనితనమున పేరుగన్నవి.

ఈ కర్మాగారములయందు తయారయిన వస్తువులు, ఇచ్చట పనినేర్చుకొన్న పనివాండ్రు సొంతముగ తయారు చేసిన వస్తువులును పెక్కు భారతీయ సంస్థానాధిపతులయు, రాజప్రతినిధులయు, గవర్నరులయు భవనముల నలంకరించుచున్నవి. ఇటీవల 'వెంబ్లీ'లో జరిగిన మహాప్రదర్శనమున సైత మివి పెక్కురదృష్టి నాకర్షించినవి.

సంస్థానములో ప్రైవేటుపనివాండ్రు తయారు చేయువస్తువులు తోడనే మంచివెలకు అమ్ముడువోవుటకు సౌకర్యములను గలిగించు నుద్దేశమున నీకర్మాగారముల కనుబంధముగా బెంగుళూరులో 'Arts and Crafts Depct' అనుపేర కొట్లను పెట్టిరి. దూరదర్శియు, రాజనీతివేత్తయునగు శ్రీ విశ్వేశ్వరయ్యగారు ప్రారంభించిన 'Mysore Economic Conference' వారు నియమించిన 'Industries and Commerce Committee' వారు ఈకొట్లను ౧౯౧౩ వ సంవత్సరమున తెరచిరి. అది పనివాండ్రకు చాల ప్రోత్సాహమును గలిగించినది. ఇక్కడ ప్రైవేటుపనివాండ్రు చేసినవస్తువుల న్నియు అమ్మకమున కుంపబడును. వానిని అమ్మగా వచ్చిన సొమ్మునుండి కొట్లబాడుగ, సిబ్బందిఖర్చు వగయిరాలకొఱకు కొంతసొమ్మును కమిషనుక్రింద మినహాయించుకొని వారికిత్తురు. ఈవస్తువులే కాక పైనుదాహృతములైన కర్మాగారములయందు తయారయిన వస్తువులు కూడ నిక్కడ విక్రయింపబడును.

మైసూరునందలి చామరాజేంద్ర సాంకేతికవిద్యాలయభవనముయొక్క మేడమీదను అచ్చట తయారయిన వస్తువు లందముగా అమ్మకమున కమర్చబడి యుండును. ఇక్కడ ప్రైవేటుపనివాండ్రు తయారుచేయు వస్తువులును బెంగుళూరులోని కొట్లలో విక్రయించు పద్ధతి ననుసరించియే విక్రయింపబడును.

౨

మైసూరుసంస్థానమున సాగుచున్న కొన్ని చేతిపనులనుగూర్చి యిక్కడ ఇంచుక విశేషించి వివరింపదగును.

## గంధపుకఱ్ఱపై చెక్కడపు పని

మైసూరురాజ్యపు అడవులలో గంధపుచెట్లు తరుచుగా నుండెడివి. కావున అచ్చటిపనివారు ఆకఱ్ఱపై చిత్రములను చెక్కి అందములయిన వస్తువులను, సామానులను పెక్కు శతాబ్దములనుండి తయారు చేయుచుండిరి. ఈగంధపుకఱ్ఱతో ఇప్పుడు కరండకములు, పెట్టెలు, చెక్కడపు సొరుగుబల్లలు, చేతికఱ్ఱలు, చట్రములు మొదలయినవి చాలసుందరముగా తయారుచేయబడుచున్నవి. మైసూరు ఈవస్తువులకు చాలప్రఖ్యాతి చెందినదగుటచే నివి వెంటనే అమ్ముడువోవుచుండును

## దంతపుపని, తాపడపుపని

మైసూరు ఇండియాలో ఈపనికి ముఖ్యస్థానముగా నుండియుండును. పూర్వము పనివాండ్రు నూకుమానుకఱ్ఱపై దంతములతో పూవులబోలిన చిత్రములను తాపడము చేయుచుండెడివారు. ఆరుమూలలు, ఎనిమిది మూలలు గల చిన్నమేజాలు, (వీటినే ప్రాశ్చాత్యులు ప్రాచ్యదేశమునకు చెందినవందురు.) బీరువాలు, కరండములు, తలుపులు మొదలయినవస్తువులు చేయబడుచుండినవి. ఈనాటివారు దంతముతోపాటు ముత్తెపుచిప్పను, నల్లచేవనుకూడ గంధపుకఱ్ఱపైననే కాక ఇతరజాతులకఱ్ఱ

లపైనను చిత్రములు తొపుట కుపయోగించుచున్నారు. అట్లు తాపినచిత్రములు మృగములను, మనుజులను, దేవతావిగ్రహములను బోలియుండును. వేవేలు పరిమాణములుగల తొట్లు (Trays), గోడసారుగుబల్లలు, చిన్న చిన్న మేజాలు, వ్రాతబల్లలు మొదలయిన వస్తువులు తయారగుచున్నవి.

## ఇత్తడిపని

ఇత్తడితో దీపపుసెమ్మెలు, దేవతావిగ్రహములు, పౌరాణికవ్యక్తులు, పక్షులు, ప్రభావళులు—ఇవి యిపుడు చేయుచున్నారు. ఇంకను కఱ్ఱవస్తువులలో నిముడ్చుటకు వీలగునట్లు క్రొత్తచిత్రముల నమూనాలను తయారుచేయువిధమును విద్యార్థులకు నేర్పుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

## పేముపని

మైసూరు అడవులలోని పేములు మంచివి. చాల గట్టిగ నుండును. పురుగులకు లొంగవు. వానితో పెట్టెలు, చేతిబెత్తములు మొదలయిన వస్తువులను తయారుచేయుదురు. చామరాజేంద్ర సాంకేతికవిద్యాలయమున తయారయిన పేముసామానులు మిక్కిలి శ్రేష్ఠములయినవి. కావున ప్రపంచమందంతట ఖ్యాతిని గన్నవి.

## మఱికొన్ని చేతిపనులు

బంకమట్టితో ప్రతిరూపములు, ఇంకను ఇతరములగు ఉపయోగకరములగు సామానులు తయారుచేయుటకు విద్యార్థులు నేర్చుకొనుచున్నారు.

రంగులచిత్రములను తయారుచేయుట కొకశాఖ యున్నను అందు మంచి రూపచిత్రములు (Portraits), ప్రకృతిచిత్రములు (Landscapes) తయారుచేయించుటకు చాలినంతశ్రద్ధ తీసుకొనలేదు.

మైసూరులోనున్న విద్యాశాలకును, బెంగుళూరులోని కర్మాగారమునకును అనుబంధముగా కళలకు, పరిశ్రమలకు సంబంధించిన చిత్రవస్తుప్రదర్శనశాలలు ఉండుట యుక్తముగ నుండును. ఇవి విద్యార్థులకు ఇతరదేశములలో తయారయిన వస్తువులస్థితి విశేషస్వరూపములు, చేతిపనులచరిత్ర మొదలయిన విషయములను తెలుసుకొనుట కనుకూలముగ నుండును. మఱియు నవి వేలువేలు రకమువారికి తమకు వలసినవాటి నేరికొనుటకును, అవి దొరకుస్థలములను తెలిసికొనుటకును న... లుగకూడ నుపయోగించును. ఇంతేకాక, యీప్రదర్శనశాలలు విద్యార్థులవిశాలదృష్టిని పెంపొందించి కర్మకారవిద్యను సుసంపన్నముగ నొనర్చుననుటయం... తరయైన సందేహము లేదు.

## 3

ఇప్పటి మైసూరుమహారాజుగారు ఈసంస్థల... స్వయము మంచిఅభిమానాదరములను చూపుచున్నా... వారి యాదరభావమే తదధికారులకు కార్యనిర్వహణ... నందు ఎక్కువప్రోత్సాహము కలిగించుచుండె...

వర్తకపరిశ్రమ శాఖాధికారులు పైసంస్థలను... సలహాసంఘముయొక్క విచారణక్రింద నుంచిరి. ఈ... కాక, ఈరెండుసంస్థలలో జరుగుచున్నపనిని విచా... చుటకుగాను రెండు కార్యనిర్వాహక సంఘములు—ఒ... మైసూరునను, ఒకటి బెంగుళూరునను గలవు.

ఆయా చేతిపనులను చేయుపనివాండ్రు ఈ... అభిరుచులకును, పరిస్థితులకును సరిపడునట్లు ప... నేర్చుకొని, తమమూలమున జీవితమును గౌరవముగ గ... కొనుటకు వీలగునట్లు చేయుటయే ఈకర్మాగా... లను స్థాపించి పోషించుటయందు మైసూరుప్రభుత్వ... వారికి గల ప్రధానోద్దేశ్యము. ఈకర్మాగారము... ప్రభుత్వమువారికి ఆదాయ మింతయును లేదు.

కాని కర్మకారులు చక్కగా పనులు నేర్చుకొని తాము సొంతముగాపనిచేసికొని సిరిసంపదలతో జీవితము గడుపుకొన కలుగునట్లు ఈకర్మాగారములవలన ప్రోత్సాహము గలుగునేని, ప్రభుత్వమువారు తమప్రయత్నము ఫలవంతము లయినట్లు భావింతురు.

మైసూరుప్రభుత్వమువారు స్థాపించిన యీ... సంస్థలు, కర్మకారులకు పరిశ్రమలపై అప్పిచ్చు... సొమ్ము బయానా యిచ్చుట మొదలయిన సహాయము... రాజ్యమునందలి చేతిపనివాండ్ర నిరుద్యోగితను కొంత... యినను తగ్గించుటకు తోడ్పడుచున్నవి.

ఇట్లు మైసూరుప్రభుత్వమువారు దేశీయము... కళలను, పరిశ్రమలను బాగుగ నభివృద్ధికి దెచ్చి, ... మైసూరు రాజ్యమున నుండిన పేరుప్రతిష్ఠలను మరల... కూర్చెదరుగాక యని యాశింతుము.

---

# అత్త-అల్లుడు

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

ఓహోహో నీవా? సెబాసు రావోయి, కాళ్లు-గడుగుకొనుమోయి, దాహమ్ము కావలయునె?
తెలియవచ్చినదా పరీక్షల ఫలితము? - ఇంటిలో క్షేమమేకద యెల్లవారు?
ప్రసవించినదియె మీవదిన? చెల్లిలిపెండ్లి కుదిరినదా? గొల్లకోటవారి
అబ్బాయిమాట యే మైనది? వరహీన మగుసుమా బొత్తిగా; ఆరునెలలె
కాదె మీచెల్లెలికంటె పెద్ద యతండు? గ్రుడ్లు గ్రుమ్మెదరు లోకులు; సహింప
లేము దెప్పులు; పడలేము నింద; జయంతివారిపిల్లాడు గప్పాలరాజు
తగడుకోడలుపిల్లకు; తప్పు లేదు మానినను పెండ్లి యీయేడు; మాటవరున
కంటినని చెప్పు మిట్లు మీయమ్మతోడ; కోపగించినయేని వాక్రుచ్చ బోకు.

ఆడుపిల్లలు గలవాళ్ల మనుట మరిచి - వెనుక మీయమ్మ పిప్పిచేసినది మమ్ము;
నాడు పెక్కార్భటులు చేసినమగపెళ్లి - వారిబండార మిప్పుడు బైటపడును.
ఎపుడో కట్నము లెరుగని - యపుడు వివాహములు చేసిరట నలుగురికిన్;
ఇపు డటు సాగదు పాపము! - విపరీతమ్మగు నికెంత విసవిసమనిన్.

కనుగొనెదమేకదా, యెంతకాల మింక, - మావదినగారి భారీని, మాట లేటి
కయ్యా? ముంజేతికడియాని కద్ద మేల? - అరయ నీకంటి కీరెప్ప లగునె దవ్వు.

* * * * * *

ఇదిగో వత్తువు సెలవుల - పదిదినములు నుందువు; పదిపా ళ్లిచ్చటనే
చదివెదవు ముందుతరగతి; - ముద మొదవును బిడ్డ కనుచు ముచ్చటపడితిన్.
"బావ వచ్చును నే నోనమాలు నేర్చు - కొందు" నని యూటలూరింది కుర్రపిల్ల; -
"ఇందు రేణ్ణెల్లపాటు నీ వుందు" వనుచు - మనసుపడినార లెంతో నీమామగారు.
ఎందుకది యింక మామాట కేమి లెమ్ము;-ఎదియొ యనుకొని పొంగితి మెదియొ యయ్యొ;
ఏమి చెప్పుదు నాతల్లి యింగితమ్ము? - మర్మ మెరుగదు వెర్రిసంబరమె కాని.
కంప కట్టించి గంగాబొండములు నిల్వ చేయించె నొకమైన తీయనీక,
ఆకులు దూసి చయ్యన మొగ్గ దొడిగించె బొడ్డుమల్లియకు నీర్వోసిపోసి,
గమగమ వలచు గంధముచెక్క తెప్పించె నింట నున్నది కాక యింకనొకటి,
పెరటిలో పచ్చికొబ్బరియాకుతడకల పందిరి వేయించె పట్టుపట్టి,
మురిసిపోయె పరీక్షలు ముగియగానె - వత్తువని, యెంతో యుబలాటపడియె బిడ్డ,
ఏమి చేసితివోయి? యెం దేగితోయి? - తలవనేలేదొ నాచిట్టి తల్లియూసు?

మెయిలు వేళ యతిక్రమించునంతకు జూచి అది దాటిపోయెనో యనుచు మరలు,
పాసెంజరును బిగుల్ వేసి పోయిన జూచి దానిపై రా వంచు తలచి మరలు,
స్టీమరురాక వీక్షించి సౌధమునుండి వెచ్చనూర్పుచు దిగివచ్చి వ్రాలు,
కొమరు వేబండి గుమ్మములోన నిలిచిన పొంగిపోవుచు చూచి క్రుంగికూలు,
అనుదినమ్ము ననుక్షణమ్మును; నెమ్సంగ-దన్నమును నిద్రయును; కంప యమ్యె చిక్కి
తాకలేదోటు నాకూన తపము వేడి - నల్లగుండెకు ప్రళయాగ్ని నాల్క యగుచు!

పంచెలు కోక లమ్ముకొను వర్తకు డొక్కడు రాగ, నేదొ గా
లించెడి రీతి నెవ్వరును లేమి కనుంగొని హాలుచెంతలన్,
కొంచెపు గొంతుతో మదిని గొంకుచునే "పదిరోజు లుండి ప
ట్టంచుల చాపుతె"మ్మనియె నక్కట జాలము చేసి తేటికిన్?

జనకుడు లేనియ ప్డెవియొ జాబులు వచ్చిన నేను "చూడుమీా"
యనుటకు ముందె విప్పి, కని, యందు భవల్లిఖితమ్ము గాంచి, వి
చ్చిన కనుదమ్ములన్ హిమము చింద, నడల్ వడకంగ, రూపు చెం
దినవగపో యనన్ చనియె నిల్వున నీ రయిపోయి యక్కటా!

జాబు చూచెడునందాక సంబరమ్ము - లేఖ చూచినపిమ్మట లేబరమ్ము;
ఉభయ వేగమ్ములకుగూడ నోపలేక - నలిగిపోయినది కదోయి నానిసుంగు.

తన కియ్యది తెలియనిదా ? - కనిపెంచి తనంతవారి గావించెను నీ
జనని కొమార్తల ; నీ వెరు - గనిమెడ తానైన చెప్పగా గూడనిదా?

పదుగు రాడుబిడ్డలు గల భాగ్యవతికి - తీగబోడుల ముచ్చటల్ తెలియకున్నె?
ఒక్క నాబిడ్డభాగ్య మిట్లుండెగాక - కల్గునే లాభ మింక నొకళ్ల ననిన?

ఏవిధి భరించె నొక్కొ లేమావిగున్న - గుబురులం దున్న కోయిల కూజితములు!
ఎటులు గడపెనొ నాబిడ్డ యేరి కెరుక - చల్లనైన వసంతనిశాముఖములు?

గ్రుచ్చుకొనుచున్న దొకమూల కూరుచుండి - అంత మెరుగని యాణిముత్యాలకోన
ఎదియొ తాలిచె నొకవ్రత, మింక రెండు - దినములకు తీరు కఠినంపు దీక్ష కలదు.

---








## శ్రీ అసిత కుమారహాల్దారుగారు

వి. ఆర్. చిత్ర గారు

భారతీయ చిత్రకళయొక్క నవీన పునరుజ్జీవనము నందు పేర్కొనవలసిన చిత్రకారుల సంఖ్య యల్పముగ నున్నది. భారతీయ సంప్రదాయములను మన్నించి, భారతీయ చిత్రకళ యొక ఘనమగు సేవకు బూనొకనిన



శ్రీ అసిత కుమార హాల్దారుగారు

వారందరిలో వయస్సునకు చిన్నవారగు శ్రీయుత అసిత కుమార హాల్దారుగారిప్పుడు లక్నోయందలి ప్రభుత్వము వారి చిత్రకళాశాలకు ప్రధానోపాధ్యాయులుగనున్నారు. పదునారు వర్షముల పిన్నప్రాయముననే తలిదండ్రులనైన నిర్లక్ష్యపెట్టి తమ విద్యను విడిచి, ఆవేశమును బుట్టించు డాక్టరు అవనీంద్రనాథఠాకురు ఆచార్యుని యండ జేరుట వీరి కళాభిరుచి చిత్రసృష్టులందలి సహజోత్సాహమును తెలుపుచున్నది. కళాసృష్టికి జీవితము నంతను వినియోగపరుచుచున్న యల్ప సంఖ్యాకులలో వీరొకరు. భారతీయ సనాతన కళానిర్మాణముల నన్నిటిని వీరు దర్శించి అజంత, బాఘవిహారము లందలి కుడ్య చిత్రములను బాగుగ బరిశీలించిరి. హెర్రింగామునతి అజంతాచిత్రసంపుటమును గొనుట కీతడు తోడ్పడెను. ముఖ్యముగ వీరి ప్రోత్సాహముననే బాఘ కుడ్యచిత్రములు పునరుద్ధరింపబడి లండను నందలి ఇండియా సొసయిటీవారు వీటినిగూర్చి సచిత్రముగ గ్రంథమును బ్రచురించుట కలిగెను. బౌద్ధయుగమునందు మన దేశము పొందిన యపూర్వ నాగరికతను జాటు సనాతన చిహ్నములను గౌరవించునటులు పంగీయులకు నచ్చజెప్పుటకు వీరు చాలవరకు తోడ్పడిరి.

ఇప్పుడు ప్రాగ్దేశముల కళలను నేర్పించుటయందు పేరుగాంచిన శాంతినికేతనపు కళాశాఖగనున్న కళాభవనమును విశేషము వ్యయప్రయాసములకు లోనయ్యి శ్రీయుత హాల్దారుగారే రచించిరి. ౧౯౨౩ వ సం. న వీరు శాంతినికేతనమును వీడి ఐరోపాయందలి కళాసంస్థలను పరిశీలించుటకు బోయిరి. ఐరోపాయందున్న కొలది కాలమునందు వీరు కొందరు చిత్రకారులను సందర్శించి, ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ లందుగల యన్ని చిత్రప్రదర్శనశాలలను జూచిరి. వీరు స్వదేశమునకు మరలినవెంటనే జయపురమునందలి చిత్రకళాశాల కధిపతిగ అవనీంద్రనాథునిచేత నియమింపబడిరి.

వీరు ప్రధానోపాధ్యాయులుగ నుండి కొలదికాల మునకే కళాశాలను చాలవరకు అభివృద్ధి పరచిరి. అంతే కుపూర్వ ముండిన ప్రధానోపాధ్యాయుల క్రింద ఐరోపా విధానములనే యవలంబించుచుండుట వలన వీరు అచ్చటి పనివాండ్రను నియమించి భారతీయ సంప్రదాయములను ప్రవేశపెట్టుట కలిగెను. రాజపుత్రస్థానమునందును, సంయుక్తపరగణాలందును సనాతన సంప్రదాయము లిప్ప టికిని సజీవములై యున్నవి. ఏది యెటు లున్నను వా రచ్చట నుండజాలక పోయిరి; రాజీనామా నివ్వవలసిన వారై లక్నోయందలి ప్రభుత్వమువారి చిత్రకళాశాలను జేరిరి.

ఏర్పాటులందును, సదుపాయములందును భారత దేశమునందలి యుత్తమకళాశాలలలో లక్నో కళాశాల యొకటి దీని నభివృద్ధి పరచుటయందు జూపుచున్న యా దరణపు సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వమువారు అభినం దనపాత్రులు. తక్కిన ఐరోపాదేశీయులతోపాటు అంత కుపూర్వము ప్రధానోపాధ్యాయులుగ నుండిన శ్రీ నెట్ హెర్డు, ఎ. ఆర్. సి. ఎ. గారికి సనాతన హైందవసంప్ర దాయములం దభిరుచి లేకపోవుటచే సనాతనసంప్రదా యానుసారము నూతనకళను సృజించుటకు తోడ్పడ లేదు. శ్రీయుత హల్దారుగారు ప్రధానోపాధ్యాయు లుగ నుండి తమ భావమునందలి యద్భుతదృశ్యములను రంగులతోను, రేఖలతోను వ్యక్తపరచు భావలోకమున మునిగియుండు చిత్రకారుడుమాత్రమే తాను కానని లోకమునకు వెల్లడిజేసిరి. వీరెటుల తమ సృష్టినై పుణ్యా

మును గోత్రవర్గమున నశిపించి చిత్రకారుల, శిల్పు యుల మేలుకొరకు తమ సనాతన కళాభిరుచిని జూపు తిలకించుట యాహ్లాదకరముగ నుండును. శ్రీయుత సి. గంగూలీగారు ప్రచురించుచున్న "ఆధునిక హైం చిత్రకారులు" (Modern Indian Artists) అను థమాలయందలి రెండవసంపుటమున శ్రీయుత హ గారి చిత్రరచననుగూర్చి డాక్టరు జె. హెచ్. క గారిట్లు పీఠికయందు వ్రాసిరి: "పురాణగాథలు, ప్రకృ నిర్మాణము, చరిత్ర, మానవత్వము, ప్రకృతి-దేనిని చిత్రించినను మానవుల యాత్మ దేవునిలో లీనమైయు దన్న భావ మెల్లెడల గానవచ్చునటులు చూపుచు జెందెను."

ఈతని చిత్రరచన యెట్టిదైనను ఈతని చి ములను పౌరాణికములు, సాంఘికములు అని ప్ర ముగ విభజింపజాలము. పల్లెలలో జీవించు దీన లో నాకర్షించుటచే తమ కుంచెతో వారిని, వారి లా ను శాశ్వతముగ నుండునటులు చేసెను. ఈతని చిత్ర లనేకవిషయముల గూర్చి కలవు. వాటిభావము మునందలి యువకుల హృదయము వంటిదే. వాటి యేర్పాటునందు ఆధ్యాత్మికచింతను జూపునది మరి వముకాదు. ఒకవిధమైన "నవ్వు" కలదు. శాస్త్రో రము రేఖ చుక్కయొక్క కదలికయైనను శ్రీయుత హ రుగారి హస్తములందది సజీవమగును. ఈతని పెద్ద రువులందును, ధైర్యముతో వ్రాయబడిన రేఖలయం అజంతభాగములు నేను సజీవములగుచున్నవి.

---



శ్రీ రాఘవాచారిగారి 'పఠానురుస్తుం' పాత్రము-చిత్రము ౧.



శ్రీ రాఘవాచారిగారి 'పఠానురుస్తుం'పాత్రము- చిత్రము ౨.



# నాటకకళ





## శ్రీ. రాఘవాచార్యులుగారి ఉన్మాదనటన

'త్రివేణి' నవంబరు సంచిక యందు శ్రీ.పి.వి. రాజమన్నారు,(బి.యే. బి.యల్.)గారు నాట్యకళాపూర్ణ శ్రీ రాఘవాచార్యులుగారి 'పఠాన్ రుస్తుమ్' పాత్రను గూర్చి యొక సవిమర్శవ్యాసము వ్రాయుచు, నందు వారి నటనమున నద్భుత చిత్రణము గాంచిన యొక ప్రవృత్తి ఉన్మాదమును గూర్చి విశ్లేషణరూపమగు నొక చిన్న విలువగల వ్యాఖ్యానము నొనర్చినారు.

రాఘవాచారి ఉన్మాదమున వివిధగతులును, వివిధ జాతులును మనకు చిత్రించి చూపినాడు. హిరణ్యకశిపునందు ప్రతిహతాహంభావపుటున్మాదమును, కీచకునందు లాలసోన్మాదమును అతడు వివరించెను. దశరథునందు ఖేదోన్మాదము యొక్కయు, రామదాసునందు భక్తివిభ్రమోన్మాదముయొక్కయు చిత్తరు వాతడొసంగెను. విజయనగరపతనమునం దాతడు అనుతాపోన్మాదపు సూక్ష్మానుశీలన మొసంగును. అది అద్వితీయమగు అనుశీలనము; కాని అది వర్ణనకు లోబడదు: ఏలన, నిర్దిష్ట వ్యవచ్ఛేదనమునకు అనువుపడని సూక్ష్మతా వైవిధ్యము నేర్పరించు ఉత్పాదక ప్రకృతి రాఘవాచారి నటనయం దెల్లపుడు వెలయుచుండును.

ఈ 'ఉత్పాదక ప్రకృతి' నిశ్చయముగ రాఘవాచార్యులుగారికి నటశ్రేష్ఠతను సంపాదించు సామగ్రిలో చేరును.

శ్రీరాఘవాచార్యులుగారు 'భావవిక్షోభతనయు' డగు పఠానుపాత్రమును నిర్వహింప నవలంబించిన తంతు శ్రీరాజమన్నారుగారు విమర్శించి యందలి విలువను ప్రకటించుచు, నుదాహరణముగ నొసంగిన రెండు పాత్రవైఖరుల ఛాయాచిత్రము లిందుద్ధృతములైనవి*

ఇందు మొదటి చిత్రమున పఠాను ఆషాబియెడ మోహాయత్తుడై, ఆమె తనను నిష్క్రియతకు నిందింప, హిందూసామ్రాజ్యమునంతె మొందింప తన ప్రతిన నామెకెఱిగించును. రెండవదానియందు ఆషాబి పఠానునకు కత్తినందించి తనకు పెండ్లికానుకగ తుచ్ఛుడగు రామరాజు శిరమును దెమ్మని యడుగ,నతడు నిశ్చేష్టుడై, "నేనేమియు యోజింపజాల" నని గొణగుకొనును. ఈ ఛాయాచిత్రములు శ్రీ ఆచార్యులవారి భావప్రకటనమును సమగ్రముగ ప్రదర్శించుటలేదు.

శ్రీ రాఘవాచార్యులుగారి ఉన్మాదము రిక్తముకాక ఏయే భావముల సంఘర్షణోద్రేకముచే తాను పరిణమించెనో ఆ భావములనెల్ల సముద్రతరంగములవలె చిమ్ముచుండును. ఏకైకరసము, ఏకైకభావము సమగ్ర స్ఫురణము

* ఈ చిత్రముల దిమ్మలను "త్రివేణి" సంపాదకులు మాకు దయతో నొసంగిరి.

గాంచుట యటుండ, భిన్నరసములయు, వివిధ భావములయు సమ్మేళన వైరుధ్యములు వారి ముఖమున గొప్ప పలుకుబడి గాంచును.

శ్రీ ఆచార్యులవారు పాశ్చాత్య దేశముల పర్యటనమునల్పి పడసిన పాశ్చాత్యరంగ పరిచయమున పెంపుగన్న తమ విస్తృత కళా పరిజ్ఞానమును, స్వదేశీయరంగ గౌరవమును గుర్తింపగల్గిన యుత్సాహమును వినియోగించి భారతీయ రంగమునకును, ఆంధ్రరంగమునకును తగిన యభివృద్ధి గూర్పదగుదురు. రంగమున నభినయరూపముననేకాక, సారస్వత రచనా మార్గమునగూడ వీరు నాటక రంగమున కుపచరింపవలయును. శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు మున్నగు కళాభిమానులును, కళాభిజ్ఞులును నటకుడు నాటకము తాను వ్రాసి యభినయించినగాని నాటక రసానుభవము సమగ్రత గాంచదని యభిప్రాయపడుటను శ్రీ ఆచార్యులవారు గుర్తించి, తమ సామర్థ్యము నీతెరువున గూడ ప్రయోగింతురుగాక! [కొం. జ.]

* * * *

### శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు*

వీరు రాజమహేంద్రవర నివాసులు. ఆధునిక సుప్రసిద్ధాంధ్రనటశేఖరులలో నొకరు. హరిశ్చంద్రుడు, దశరథుడు, రాజరాజనరేంద్రుడు, నలుడు, బాహుకుడు, దుష్టబుద్ధి, హిరణ్యకశిపుడు, కంసుడు, యుగంధరుడు, కృష్ణుడు మొదలగు పాత్రలను ధరించి నయించుటయందు ఎంతయు సమర్థులు. ... ద్రూపము, సజీవగాత్రము, సముజ్జ్వల ... ములు, అనురూప గానశక్తి సుబ్బారావుగా...



శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు †

యభినయ సామర్థ్యమునకు తోడగుచున్న...

వీరు రాజమహేంద్రవరమున 'శ్రీ రా... కృష్ణ నాటకసమాజ' మను పేర నొక నా... సమాజమును స్థాపించి తత్సామాజికుల... నాంధ్రదేశమందలి ముఖ్య పట్టణములయ... పెక్కు నాటకములను ప్రదర్శించి రసికవ... ముల పొగడ్తను గాంచి వారి సాదరస... రములను బడయగల్గిరి. వీరి కాయురారో... శ్వర్యములను పరమేశ్వరుడు ప్రసాదించి ... నాటక రంగోద్ధరణము గావించునట్లు అ... హించుగాక!

* ఇది శ్రీయుత రాజవైద్య కోలా అప్పలనరసింహదేవుగారు వ్రాసిన వ్యాసమును పురస్కరించుకొని వ్రాయబడి...

† వీరి హరిశ్చంద్రపాత్రమునుగూర్చి ఇంచుక భారతి ౫ సం. ౧౧ వ సంచికయందుగలదు. వీరి 'వీరదానపా... చిత్ర మీసంచికయందున్నది.




తిరువాంకూరు జూనియరు మహారాణిగారు



ఈమె కలకత్తా నగరమందు జరుగు అఖిలభారత మహిళామహాసభ కధ్యక్షురాలుగ నెన్నుకొనబడినది.

శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయగారు



భారతమహిళా సంఘమునకు ప్రధాన కార్యదర్శినియగు నీమె పాట్నానగరమునజరిగిన భారతమహిళా విద్యాభివృద్ధి మహాసభకు పోయియుండెను. ఈమె ౧౯౨౯ సంవత్సరము జినీవాయందు జరుగబోవు అంతర్జాతీయ విద్యాసమితి మహాసభకు భారతీయ ప్రతినిధిగ బోవనున్నది.

శ్రీమతి కోమలం కన్యగారు



ఈమె చెన్నపురి నివాసి. దక్షిణ భారతదేశమున బయస్కోపు ఫిల్ములకొఱకు అభినయవృత్తి నవలంభించిన ప్రథమవనిత. 'Car craze' (మోటారుకారుల పిచ్చి) యను నొకఫిల్ము తయారుచేయుట యందిపుడు పాల్గొనుచున్నది.

శ్రీమతి యలమంచిలి బసవమ్మగారు



ఈమె గుంటూరుజిల్లా బెల్లంవారిపాలెపు నివా ౧౯౨౮ సం. మార్చి అక్టోబరు నెలలలో జరిగిన హింది వేశిక, రాష్ట్రభాషా పరీక్షలయందు దక్షిణభారత మున సర్వప్రథమగ నుత్తీర్ణయై బహుమతుల బడసినది.

**శ్రీమతి యల్. డి. శ్రీనివాసన్ సతిగారు**



ఈమె పాలంకోటయందు భారతమహిళాసంఘ సహాయకార్యదర్శిని. పాట్నానగరమున జరిగిన భారత మహిళా విద్యాభివృద్ధి సభకు తమిళనాడునుండి ప్రతినిధిగ వెళ్లినది.

**శ్రీమతి యల్. కృష్ణాబాయిగారు**



ఈమె మదరాసు యువజనసమితి కార్యదర్శినిగనుండెను. ఇపుడు అలహాబాదునగరమునందలి క్రాసువెయిటు స్త్రీకళాశాలయందు గృహధర్మశాస్త్రోపాధ్యాయిగ నియమింపబడినది. కీ. శే. సర్ టి. మాధవరావుగారికీమె బంధువట.



# ఆంధ్రాభ్యుదయము

## డాక్టరు అప్పాద్వేదుల లక్ష్మీనారాయణగారు, యం. ఏ.

వీరు విజయనగరవాస్తవ్యులు. ఆయూరనున్న మహారాజావారి కళాశాలయందు ప్రొఫెసరుగ నుండిరి. వీరిపుడు భారతీయప్రభుత్వ వాతావరణ శాస్త్రజ్ఞులుగ నియమింపబడిరి.




## ఉద్యోగములా ? గ్రామములా ?

౧

విశ్వవిద్యాలయములసంఖ్య నానాటికిని హెచ్చుచున్న యీదినములలో పట్టభద్రుల సంఖ్యయు, పరీక్షలయందు త్తీర్ణులు కాలేక భగ్నమనోరథు లైనవారి సంఖ్యయు చూచుచున్న మహాశయులు వీరి భావిస్థితిని గురించి యోజింపకపోరు. ఈవరకు మన యిరుగుపొరుగు దేశములగు వంగ, ద్రావిడ, మళయాళ దేశములకంటె మన యాంధ్రదేశమున కళాశాలలయొక్కయు, విద్యార్థులయొక్కయు సంఖ్య తక్కువగా నుండినందున మనకీబాధ యంతగా తోచియుండలేదు. కాని క్రమముగా మనవారిలో సహిత మీనూతన "విద్య" ప్రబలుచున్నందున మనకును నీసమస్య తప్పినదికాదు.

భోగకారి యనియు, యశఃకారి యనియు, సుఖకారి యనియు కొనియాడబడిన విద్య యీ యువకుల పట్టున ననర్థకారియు, నవజ్ఞాకారియు, దుఃఖకారియు కాకుండు టెట్లని నిర్ణయించి దిద్దు బాధ్యత పూజార్హులగు మననాయకుల ముఖ్యకర్తవ్యమని చెప్ప వచ్చును. కాని సభలలోను, పరిషత్తులలోను, తదితర సమాజములలోను ఈచర్చ యెచ్చటను వినిపించదు. రాజసభలును, శాసన సభలును దేశీయయువకుల స్థితిగతులను విచారింపమి మన దేశపు ప్రస్తుతస్థితిలో నంత యాశ్చర్యకరము కాదు. కాని దేశీయసభలు సహిత మీ యంశము నుపేక్షించుట యెంతయు శోచనీయము.

ఆంధ్రయువకుల భావిస్థితిని గమనించి వారిని తగుమార్గములలో ద్రిప్పు భారము, సంఘమం దెవరిది? దొరతనమువారిదా? పురపాలకసంఘములదా? జిల్లాబోర్డులదా? తాలూకుబోర్డులదా? గ్రామపంచాయతులదా? విశ్వవిద్యాలయాధికారులదా? ఆయా యువకుల తల్లిదండ్రులదా? కాకున్న మరి యింకెవరిది! ఆంధ్రమహా... మొదలైన సమావేశము లెన్నెన్నో ముఖ్యవిషయము... గూర్చి తీర్మానముల నుపపాదించుచున్నను, దేశ... వృద్ధికి ముఖ్యసాధకమైన యువకప్రపంచ భావిస్థితి ... యమై విచారించి, వీరిచే దేశసేవ యెన్నివిధము... చేయించుకొనవచ్చునో, వీరికిని, వీరిమూలముగా ... భూమికిని మహదైశ్వర్యాభివృద్ధి యెట్లు చేయ... అనారోగ్య, అజ్ఞాన, అకాల మృత్యు దారిద్ర్యపిశా... లీదేశమునుండి యెట్లు వీరి సహాయముచే వెడల... వచ్చునో యని యోజించు సమాజము గాని, సంఘము గాని, "కమిటీ" గాని కానరాదు.

'ఎవరికివారే'యమునాతీరే యన్న ట్లే యువ... మునం దెక్కువపైకము వచ్చునా? యని ప్రతియువ... డును, వాని తలిదండ్రులును ఆలోచన చేసుకొనవలసి... కాని అందరికిని సమానమైన సమస్యకదా యిది! సం... ములో నందరును కలిసితీర్చుటకు పూనుకొనినదానిచే ... మున కెంత నష్టము, ఎంత మనోవ్యథ, ఎంత ఉత్సాహ... గము కలుగుచున్నదో యోచించుకొనవచ్చును.

కాంగ్రెసులకును, మహాసభలకును స్వచ్ఛంద ... ములు కావలసినప్పుడును, "హరతాల్"కై న్యూ... మూయవలసినప్పుడును తప్ప, యువకులపైపు నాయకుల కటాక్షములు పర్వవు. జిల్లాసభలలోను, తాలూకాస... లలోను జరుగువ్యవహారములు తెలిసియే యున్నవి వారికి వీరిగొడవయే యక్కఱలేదు. యువకులు ... తట తామే తీర్చుకొను సమస్య కాదిది. ఏవృత్తి ... బించినచో తమకును, దేశమునకును మేలగునో వీరి... తెలియును? సంఘనాయకు లిది తమ పనియని యం...

రించి తగినప్రయత్నములు చేసినగాని దేశమునకు క్షేమము లేదని నా మనవి. ఆంధ్రమహాసభయం దీవిషయమును చర్చించి నాయకులు తగినయేర్పాటులు చేయుదురుగాక. ఇతర విశ్వవిద్యాలయము లిట్టిబాధ్యతల నవలంబించినవా? లేవా యను చర్చలకు దిగక, మన నూతన విశ్వవిద్యాలయ మీ ఘనకార్యమున కాధార మగుగాక!

౨

దొరతనమువారి క్రింద ఉద్యోగములు లభింపకపో వను నమ్మకముతో నింగ్లీషు చదువునకని గ్రామములను వదలి, చిన్న చిన్న పట్టణములను, చివరకు పెద్ద పట్టణ ములను చేరి నానావస్థలుపడి, పరీక్షలలో కడతేరియో కడతేరకో విద్యాసమాప్తి గావించి దొరతనమువారి ఆఫీ సులను రైల్వే ఆఫీసులను, చివర కింగ్లీషు పత్రికల ఆఫీసు లను చేరి, యుద్యోగభిక్ష వేడు నూతన భిక్షుకుల యవ స్థల నెరుగనివా రెవరు? ఎక్కడ చూచినను వీరి రోదనమే. ఈ యుద్యోగ క్షామనివృత్తి యెట్లు? ఏ యింద్రు డీక్షామ మును నివారించు నుద్యోగవర్షము కురిపించును? విదేశీ యులు తమ తమ దేశములకు పారిపోయినను, ఈ క్షామ మెంతమాత్రము తగ్గును? ఇంతే కాదుకదా! సంవత్సర మున కిప్పుడు రెండుపర్యాయము లీసైన్యసంఖ్య వృద్ధి యగుచున్నదే; యేమి చేయవచ్చును? ఉత్సవసమయ ములలో ధూమశకటములు నిండిపోయినప్పుడు బైట నిలిచిపోయినవారివలె నుద్యోగములు దొరకక నిలిచిపో యిన యువకుల గతి యేమి?

పాశ్చాత్యదేశములవలె మనదేశమందు కర్మాగా రములు లేవు, యంత్రములు లేవు. సేనానావికాదళ ములు పరహస్తగతములు. వాణిజ్యము సహితమంతే. ఏమి చేయవచ్చును? అను నార్తారావమే కాని మన యువ కుల కుత్సాహమంత్ర మేదీ? మార్గదర్శకు లేరీ? నా వలన పనిగొమ్మా తల్లీ, యని భారతమాతకు చాగిలపడు కుమా రుని లేవనెత్తి తగినపని చూపు పుణ్యపురుషు లేరీ?

ఈ సమస్య నూతనమైనది. పూర్వపు నాగరికతలో నిట్టి హృదయవిదారకస్థితి లేకుండెను. కాలచక్రము తిరుగు టవల్ల నిట్టి నూతన సమస్యలు రాక తప్పదు. వీటికి తగిన సదుపాయముల బన్నుట సంఘనాయకులకు ముఖ్యకర్త వ్యము. ఇట్టి స్థితికి కారణ మరయుదము.

ఈ దేశపు ముఖ్యవృత్తి వ్యవసాయము. జనులు వసించునది జనపదములందు, గ్రామములందు. ఆవ్యవసాయ ము మాని గ్రామములను వదలి, సేవకోద్యోగములపై వలపుచే పట్టణములందు గుమిగూడి, యీ యవస్థలకు పాల గుచున్న భారతీయ యువకులను మరల గ్రామములం జేర్చు వారెవరు? అట్లు చేరినచో వారికి తగినపనుల నేర్ప రుచువారెవరు? ఇదియే కర్తవ్యమని దేశబంధుచిత్తరంజ నునివలె నమ్మినప్రముఖు లందరును గూడి గ్రామములలో ను, తాలూకాలలోను ప్రస్తుత మేర్పడిన కాంగ్రెసు సమాజములద్వారా వీరికి మహాత్ముని రాట్నపుభిక్షు దయచేసి గ్రామజీవనమున కలవాటు తప్పిన వీరి కందలి సుఖముజూపి వీరల యవస్థ మాన్పరాదా?

గ్రామములలో పనిలేదా? ఉపాధ్యాయులకు పనిలేదా? వైద్యు లక్కరకు రారా? తటాకములు, బావులు త్రవ్వింపగల యింజినియర్లు పనికిరారా? చదువ నేర్చిన కృషికులున్నచో చేదా? అయ్యో, అన్నపూర్ణా దేవి అధిదేవతయైన యీ దేశములో నాకలెత్తినవారి కన్నము లేదా? పనిచేయువారికి పనులు లేవా? ఏల నగర మోహముచే నీ క్లేశము? పూర్వమార్గమును విడిచితిమి. నూతన మార్గము లలవడలేదు. రెంటికిని చెడిన రేవడవలె మన మీ నూతన దుఃఖము నొడిగట్టుకొంటిమి.

ప్రజ్ఞావంతులగు దేశనాయకు లీ తరుణములో మన యువకులకు సన్మార్గదర్శకులై దేశము నుద్ధరింపరాదా!

—చ. భా.

---

## పూవుల గడియారము

మనకు విద్యాలయములలో బోధింపబడినట్లు ప్రపంచపు వింతలు తొమ్మిది యున్నను, అవి మన తాత లనాటికి చెందిన వగుటచే ప్రాతపడి పోయినవి. నేడు ప్రపంచమం దన్ని దేశములలోను వింతలు పుట్టుచున్నవి.

అట్టివానిలో ఎడింబరోలోని గడియారములను తయారు చేయు జేమ్సురిట్చీగారు నిర్మించిన పూవులగడియార మొక వింత. వీ రత్యద్భుత ప్రతిభావంతు లనుట కీ గడి యార మొక నిదర్శనము.

ప్రకృతిరామణీయకతను, బట్టియు చారిత్రక ప్రసి ద్ధిని బట్టియు గ్రేట్ బ్రిటన్‌లోని సుందరములగు వీథుల లో నొక టగు ప్రిన్ సెస్‌వీథి (ఎడింబరో) దక్షిణపుభా గమున నీగడియార మున్నది.

చరిత్రప్రసిద్ధమగు ఎడింబరో కోటకు పోవుమార్గ మున, నొకవైపున చిత్రకళాభవనములును, నింకొకవైపున ప్రిన్ సెస్ స్ట్రీట్ తోటలును గల యొక దిబ్బ కలదు. ఆ తోటలలోనికి ప్రవేశించుచోటుననే స్కాట్లాండుదే శపు మహాకవి యగు సర్ వాల్టర్ స్కాట్‌గారి శిలావిగ్రహ మునకు దిగువభాగముననే యేటవాలు ప్రదేశపు కుడివై పున నీ గడియారము నిర్మింపబడినది.

బయటనుండి చూచుట కది యెనిమిదియడుగుల నడిమికొలత గలిగిన ముఖభాగముపై తిరుగుచున్న పెద్ద పెద్ద ముళ్లుగలిగి యొక మామూలు గడియారము వలె నే యుండును. అది యేటవాలగు ప్రదేశమున నుండుట వలన వీథిలోనుండి తోటలలోనికి పోవుమార్గమున నుండు మెట్ల వద్ద నుండి దాని ముళ్లు తిరుగుటను తోటలోనికి పోవు నెవ రైనను చూడగలరు.

ఆ గడియారపు ముళ్ళపై చిన్నిచిన్ని పూలమొ క్కలు పెంపబడు చున్నవి. అందుచేత నా ముళ్లు కదలు చున్నట్లు కనబడక, చిన్నముల్లుపై కొన్నియు, పెద్దము ల్లుపై కొన్నియు వేలువేలురంగుల పూలవరుసలు కదులు చున్నట్లుండును. ఆగడియారపు ముళ్ళకీలకము అమర్ప బడిన నైపుణ్యమువలన, ఆ యేటవాలగు ప్రదేశముపై పడు వాన గాని, మంచు గాని గడియారముపై బడి లోని యంత్రనిర్మాణము చెడకుండనుండును. అందుచేత వర్ష ము వలన గాని, వాతావరణస్థితిలోని, యేమార్పువలన గాని యా గడియారపు మరలు చెడిపోవు;గడియార మాగిపోదు. ప్రతిదినమును 'కీ' యిత్తురు. గడియారము కాలమును సరిగా తెలుపుచుండును. దాని నచట నేర్పరచిన నాటి నుండి యింతవరకు నే నాడును కాలమునం దింతైన వ్యత్యాసము నది చూపలేదు.

గడియారపుముఖముపై "Tempus fugit" అని వ్రాయబడి యున్నది. దాని యర్థము "కాలము వెత్తి పోవుచున్నది" యని సంవత్సరసంఖ్య ప్రతియేడు మార్పబడును. గడియారమువైపు చూచుటవలన నా మున నప్పు డెంతవేళ యైనదో తెలుపుటయేకాక నా త్సరమును తెలుపుచు 'లాటిన్' భాషయందు 'కాలము త్వరగా గడచిపోవుచున్న'దనియు, నే విషయమున యాలస్యమైన హాని కలుగుననియు నది హెచ్చరించు న్నది. ఈవిధముగ నిది యొక గొప్ప వింతగడియార మనకు 'సహజ'మగు కాలమును తెలుపుచు ముఖ్య హెచ్చరికను చేయుచున్నది.

మొట్టమొదట నిది లీత్ స్ట్రీట్ నందలి 25 వ గల గృహమున గడియారపు నిర్మాతలగు జేమ్సురి డ్‌సన్ వారిచేత 1905 సం. ప్రాంతమునందు బడినది. తరువాత నీకంపెనీవారిచేత నే యిట్టివి టన్, సౌత్‌సీ, లివర్‌పూల్ (గ్రేట్ బ్రిటన్), లియాలోని, సిడ్నీయందును నెలకొల్పబడినవి. ల గడియార మొక్కొక్క దాని ఖరీదు సుమారు రూ. (సుమారు పౌ. 170) అగును.

ఇటు లీ చక్కని పూలగడియారములు వి ములకును, వస్తుప్రదర్శనశాలలకును, కవాతుమైదా లకును మనోహరమును నుపయోగకరమును నగు నే తోచుచయ మగును.

---

## బాలకుల కర్తవ్యములు

### అధ్యక్షులు మాసరిక్‌గారు బా లకు ఉపన్యసించిన విషయము

అక్టోబరు నెల 27 వ తేదీని జెకో కియా స్వాతంత్ర్యస్థాపన దశమసాంవత్స దివసమున, ప్రేగునగరములోని యున్న

# పూవుల గడియారము



చిత్రము ౧



చిత్రము ౨: గడియారమునందలి యంత్రనిర్మాణము

పూవుల గడియారము




చిత్రము 3



చిత్రము ౪

శాలలయందలి బాలురు 15000 మంది తమ రిపబ్లిక్ అధ్యక్షు నభినందించుటకు సమావేశ మైరి. అపు డధ్యక్షుడు వారల కీరీతి నుపదేశించెను:—

సుస్వాగతము!

నేనిప్పుడే మన సైనికదళముతో మన రిపబ్లిక్ యొక్క పదియవసాంవత్సరిక మహోత్సవము నారంభించితిని; ఈయుత్సవమును జరుపువారిలో నిపుడు బాలపులగు మీరు ద్వితీయస్థానము నధిష్ఠించి యున్నారు. మనమందరమును చేరి మనసార ముచ్చటించు కొందము.

నా బాల్యమున నేనాశీర్వదింపబడిన రీతిని, నేను మీకు ఆరోగ్యమును, ఈశ్వరానుగ్రహమును కలుగుగాక యని యాశీర్వదించుచున్నాను. మీరు ఆరోగ్యమును బడసి దానిని కాపాడుకొనుటకు తగు జాగ్రత పూనవలయును. అది కష్టమైనది కాదు. పరిశుభ్రముగా నుండుడు; నీటికి భయపడకుడు; స్నానముచేయుడు; ఈదులాడుడు; మంచిగాలిలో యథేచ్ఛముగ తిరుగుడు; సూర్యరశ్మి మీ శరీరములకు తగులనిండు; మీరుండు గదులను ఇండ్లను బాగుగా గాలి తగులు నట్లుంచుకొనుడు.

మితిమీరి తినకుడు; మత్తునిచ్చు నే పానీయమును త్రాగకుడు.

హాయిగా నాడుకొనుడు; కాని, మీరు విద్యనభ్యసించు నపుడు మనః పూర్వకముగ పరిశ్రమించి అభ్యసింపుడు. బడియందైనను పని నెగవేయ జూడకుడు. ఒకప్పుడు నే నొరులకడ పనినేర్చుకొని యుంటిని. వారియెడ నేనెంతయు కృతజ్ఞుడను. పనిచేయుటవలననే మనము ప్రత్యక్షముగ కార్యానుభవమును పొందగలము.

'సొకోల్స్' అను మన తాలింఖానాలయందు చేరి ఆటలయందు, నతి ప్రతిబోధవంతములగువ్యాయామ క్రీడలందును పాల్గొని మీ శరీరములనుగట్టిపఱుచుకొనుడు.

మీరు పెద్దలగుచున్న కొలది ఏయే వృత్తికి చెందినవారు—పనివాండ్రు, రైతులు, పారిశ్రామికులు, ఉపాధ్యాయులు, శిల్పులు, చిత్రకారులు, రచయితలు-కాగోరుదురో నిర్ణయించుకొనుడు. కాని ఏవృత్తినిగైకొనినను కష్టపడి మనః పూర్వకముగా పనిచేయుడు. స్థానమునుబట్టి, శక్తి ననుసరించి మనమందఱమును పనిచేయవలసియున్నది. సంఘమునకు వివిధశాఖల కర్మకారులు నావశ్యకము. పనులను న్యాయముగ విభాగించి పొందుపరుచుకొనవలెను; కాని నిష్కపటముగా పనిచేయు మనమందఱము మన పనిలో నొకరికొకరు సమానులమే. మంచి పనివారికంటె నొకమంచి యధ్యక్షునియందాధిక్యమేమియు లేదు. మున్నొక పెద్దభవనము కూలిపోయెనను విషాద విషయమును మీరు వినియే యున్నారు. దోషమెవరిదయినను, దానికి చేసిన పనిలోని వంచనయే కారణము. నిష్కపటముగ చేసిన పనివలన మనము మనలను మన పొరుగువారిని పోషించుకొందము. మనకు విధిగ నిర్వచింపబడినట్లు, మనము మనయిరుగు పొరుగు వారలను ప్రేమించుట కార్యరూపముననే కాని నట్టి మాటలతో కాదు. త్యాగరహిత జీవితముత్తమ జీవితము కానేరదు.



మాసరిక్ అధ్యక్షుడు

అనుంగు బిడ్డలారా! మీరు త్వరలో పెద్దలగుదురు. కాలము పరువెత్తుచున్నది. మీరు తండ్రులగుదురు; తల్లులగుదురు. మీబిడ్డలు మిమ్మెట్లు ఆదరించి గౌరవింపవలెనని మీరు కోరుదురో, యట్లే మీరును మీ తలిదండ్రులను ఆదరించి గౌరవింపుడు. మీరుచేయు

నన్నిపనులందును, మీ యెడల నితరులెట్లు వర్తింపవల యునని కోరుదురో అట్లే మీరు నితరులపట్ల వర్తింప వలయునను నియమమునకు బద్ధులై యుండుడు.

కొలది కాలములోనే, మన రిపబ్లికు నిబంధనలు మిమ్ములను దేశసేవ కాహ్వానించును. మీరు యోధులగు దురు; పౌరసంఘ సభ్యులగుదురు; పార్లమెంటు సభ్యుల గుదురు. ఏ పదవిని మీరు పొందినను పౌరధర్మములను నెరవేర్పుడు. తన ప్రజాస్వామిక నిర్మాణప్రణాళిక వలన స్వాతంత్ర్యమును రూఢిపరచు మీరిపబ్లికును ప్రేమింపుడు. మీ దేశమును, మీ ప్రజలను, మీ భాషను ప్రేమింపుడు.

మీతోడి పౌరులందరతోడను — వారియుద్యోగ ములు, వారి భాష, వారి మతమును భిన్నములైనను గానిండు—మీరుస్నేహభావముతో కలసి మెలగవలయును. మనమందరము సమానులము, మరి మనమందరమును సమాన స్వాతంత్ర్యమును కలిగి యుండవలయును. ఎవ రినిగాని, యే విషయమునగాని పీడింప మనకు అధికారము లేదు.

ప్రేగు నగర బాలకులారా! మీరు మాతృదేశసేవకు నడుముకట్టునపుడు ప్రేగు నిక్కముగ మనయందఱకు జనని కాగలదనియు,నగరములకు నగరము కాగలదనియు, జాగ్రతతో గుర్తించి యుండుడు.

ఈ రిపబ్లికుయొక్క భావ్యధ్యక్షుడు, బహుశః మీయందఱిలోనే నిలిచియున్నాడు కాబోలు. ఓయీ భావి ప్రియాధ్యక్షా, నీవును,నీతోడివారలను సర్వప్రపంచ మును కూడ నిర్భయముగ నెదుర్కొన వలయును. మన చరిత్రకు కొలికిపూసలగు మన ఉత్కృష్ట ఆదర్శములను అపుడే నీవు సగౌరవముగ నెరవేర్పగలవు. ఇక ముప్పది నలుబది యేండ్లకు, ఓయీ కానున్న యధ్యక్షుఁడా, నీవీ చోటుననే బాలకులను, యువకులను ప్రబోధింతువు. అపుడు "రాజభవనముపై నెగురుచున్న పతాకముపై నున్న, మనపూర్వుల వద్దనుండి పారంపర్యముగా మనకు వచ్చిన–'సత్యమేవ జయతే'అను నాదర్శవాక్యమును ఎల్ల ప్పుడును, అన్నివిషయములందును పాలింతుమని కొన్ని యేండ్ల క్రిందట నీ చోటుననే మనము మన మొదటి య[ధ్య] క్షునికి వాగ్దానమొనర్చితి"మని నీవు వారికి చెప్ప[ుము]! పతాకమెట్లు సచేతనముగ నున్నదో, ఎట్లు ప[్ర] ధ్వనిచేయుచు, పలుకుచున్నదో వినుము! దానిని ర[క్]షింపుము. నీ తరువాతివారికి దానిని నిష్కళంకము[గ] నప్పగింపుము.

ఈ యుపదేశవాక్యము లాంధ్ర బాలకు[ల] కును, యువకులకును ఆదర్శవాక్యములు కా[గ] లవను నాస మిక్కిలి కలదు.

(రివ్యూ ఆఫ్ రివ్యూస్)

---

## స్త్రీలు—సంస్కారము

సర్ తేజబహదూర్ సప్రూగారు 'స్[త్రీ] ధర్మ' పత్రిక అక్టోబరు సంచికయందొక వ్యా[స] మున, మన దేశమున స్త్రీలు ఈ క్రిందనివ[రించు] సంస్కారముల బడయనుద్యమించి, అవి స్వ[తంత్ర] ముగ గాని, అభిమానుల ద్వారా కాని ప్ర[వ] ర్తింప జేయవలెననిరి.

౧. ప్రతి రాష్ట్రమునను బాలికా పాఠశాలల[ను] బాలికా కళాశాలలను సంస్థాపించుటకును, ఇదివర[కు] కంటె నెక్కువ సమృద్ధిగ సొమ్ము వినియోగపఱుచు[ట] కును అనుగ్రహించునదిగ ప్రతిష్ఠానిక శాసనసభను కో[ర] వలెను.

౨. శాసనసభలవారు బాలికావివాహ విషయ[ము] శాసించుటయందు పూర్వాచార పరులుగ గన్పడిన[చో] దేశమందలి విద్యాసంపన్నులగు యువకులు ఒకసంఘ[ము] నేర్పడి, ఒకానొక వయసునకు లోబడిన బాలికలవివా[హ] మాడ నిరాకరింప వలయును.

3. విద్యాసంపన్నులగు బాలికలు యథా[శక్తి] స్వతంత్ర వృత్తుల నవలంబింప ప్రోత్సాహ మొందవలె[ను].

౪. సంఘసంస్కారమునకు తగులు ప్రతిబంధ[ము] మునను మన ప్రతినిధి సంఘములలో నెప్పుడు నొకకొ[ంద]మంది స్త్రీలుండులాగున మనము జాగ్రత్తపడవలయు[ను].

౫. స్థానిక సంఘములందును, శాసన సభలందును ప్రాతినిధ్యము ప్రసక్తించినంతవఱకు లింగభేదానర్హతలు సంపూర్ణముగ నిరస్తములు కావలెను.

౬. నేడు కలదానికంటె స్త్రీకి బలవత్తరమగు న్యాయ నియతస్థాన మొసగులాగున వ్యక్తిగత న్యాయ నియమములను సంస్కరింపవలెను. ఆస్తిహక్కుల విషయమై 'హిందూలా' ఆమెకు గలిగించిన నికృష్టస్థానము మనమునిర్ణీతముగ సాగనిచ్చుట నాకెంతేయు నసంగతముగ తోచుచున్నది.

ఇదియే యొడతెగక వ్యవహారముల బెంచుచున్నది. మఱియు నా అనుభవమున నేను చూచితిని, న్యాయనియమము (లా) ఆమెకొక నిర్ణీతస్థానమిచ్చిన సందర్భమున సైతము అవివేకులను మగ చుట్టములును, ఆశ్రితులును ఆమెను దుర్గతి పాలు చేయుచున్నారు. వేరు కారణములకంటె, మగవులు తాను చూచుకొను సామర్థ్యమామెకు లేకుండుటయే దీనికి ముఖ్యకారణముగ కన్పడును. విద్యాభివృద్ధి దానికి కొంత విరుగుడు కావచ్చును గాని, శాశ్వత చికిత్స సిద్ధింపవలెననిన మాత్రము మన న్యాయశాస్త్రములే మూలసూత్రము కీమార్పు గావించవలెను.

---

## బేబరు విల్లు

'ది అనిమల్ ప్రొటెక్షన్ క్లిప్‌షీట్' (అక్టోబరు ౧౭) పత్రికయందిట్లున్నది.

భారతదేశపు మొదటి మొగలాయి పాలకుడగు బాబరు హుమాయూను నుద్దేశించి యొక విల్లు వ్రాసెను. దానితాలూకు రెండుప్రతులిపుడు కనబడుచున్నవి. ఒకటి భూపాలసంస్థాన పుస్తక భాండాగారమునను, రెండవది కొల్లాపురపు రాజారామ కళాశాల ప్రిన్సిపాలగు బాలకృష్ణగారియొద్దను కలవు. రెండవది కొంత సమగ్రముగ కన్పడును.

"కుమారా, భారతరాజ్యము వెవ్వేఱు మతములతో నిండియున్నది. దానిపయి నీ కధికారము ప్రసాదించిన పరమేశ్వరునకు సన్నుతి. హృదయఫలకమునుండి మతద్వేషము లెల్లను తుడిచివేయు భారము నీపై నున్నది. ప్రతిమతము ననుసరించియు న్యాయపాలన మొనరించుచుండుము. ముఖ్యముగ గోహత్య మానుము. దానభారతీయుల హృదయములు నీకు వశమగును. అటుపై దేశీయులు రాజాదరమున సంగ్రథితులగుదురు.

ప్రభుత్వశాసనమునకు లొంగియున్న యేజాతికి చెందిన ఆలయములను, విగ్రహములను విధ్వంసము చేయకుము. రాజన్న ప్రజలకును, ప్రజలన్న రాజునకును ప్రీతి కుదురులాగున న్యాయవిచారణ సల్పుము. కఱకు కత్తికంటె ఆదరము ఇస్లామునకు హితము గూర్పగలదు.

షియా సున్నీ భేదములు విస్మరింపుము; లేనిచో ఇస్లాము దౌర్బల్యము బట్టబయలు.

భూతాత్మకమగు దేహమున భూతములవలె వివిధమతావలంబులగు ప్రజలు మైత్రిగలిగి, ఐక్యముగలిగి, రాజ్యదేహమును రోగపటలమునుండి కాపాడుదురుగాక! పరిపాలనా విధానముల నిరూఢానుభవము నీకు చేకూరుటకుగాను ఐక్యసంధాయక శిరోమణి తైమూరు వృత్తాంతము ఎల్లపుడు నీ కండ్లయెదుట నుండవలయును."

'జమాదీ ఉల్ అవల్' ౯౩౫ ఎ. హెచ్.

---

## మాంసభక్షణము వలని ముప్పు

'ది ఓరియంటల్ వాచ్‌మన్ అండ్ హెరాల్డ్ ఆఫ్ హెల్త్' నవంబరు సంచికయందీ క్రిందిరీతి నున్నది:

శాకాహారపరత్వమనునది కేవల భక్షణమున నీతికాని, ఒకజాతి యభ్యాసముకాని కాదు. నిర్మాంసాహారము ఆరోగ్యరక్షణమున మంచి ప్రభావముగలది. మాంసభక్షణమున ముప్పులున్నవి.

జంతువులలో రోగము లుండుట తెలిసినవిషయమే. మాంసపరిశోధనలు రోగగ్రస్త జంతువుల యున్కిని గూర్చి కావలసినంత సాక్ష్యమిచ్చుచున్నవి.

మాంసము భాగుగ వండుట కొంతవఱకు క్షేమక
రమే. రోగబీజములు సత్తువ చెడి సద్యోరోగ జనకము
లుకాకపోవచ్చును. కాని రోగ యుక్తమగు మాం
సమెట్లువండినను నిర్దుష్టమగు నాహారముగ మారజాలదు.
ఏ వంటపనియును, ఆహారద్రవ్యములును, ఆరోగ్యమును
ఒకవస్తువున నెక్కింపజాలవు. మఱియు, సర్వసాధారణ
ముగ మాంసము వండుట మాంసమందలి హానికారక గుణ
ములను తొలగించుటకై కాదు; అందలి 'మాంస' పరిమ
ళము తెప్పించుటకే. ఈ పరిమళము మాంస' రసములలో
నిమిడియుండును. ఈ రసములే జంతుసంబంధములగు
విషములకు ఉనికిపట్లు.

ఆరోగ్యము చెడిన జంతువుల మాంసము తినుట
వలన వెంటనే కలుగు రోగములమాట ఒక్కటే కాదు
మాంసభక్షకుడు యోజింపవలసినది. మాంసాహారమున
గల వ్యర్థపదార్థములను, విషపదార్థములను త్రోసివేయు
టకు తాముపడు శ్రమాధిక్యమువలన లోపలి కోశములకు
స్వాస్థ్యము భంగపడును. మాంసాహారము కొంతకాలము
నకు ఆరోగ్యము చెఱచును. నిర్మాంసాహారము విలువను,
మాంసాహారము వలని యెగ్గులను, యథార్థముగ తెలియ
జేయు విషయముల బట్టి చూచిన, శాకాహార పరత్వము
పిచ్చి 'ఛాందసపు' ఆశయము కాదని గమనించుట
యుక్తము.

మాంసాహారప్రియులు దీనిని గుర్తించి
మాంసభక్షణమును మాని ఆరోగ్యమును పెం
పొందించుకొనదగుదురు.

---

## తెల్లవారు, నల్లవారు.

'బంధగతమగు భారతదేశము: స్వతంత్ర
తకు దాని హక్కు' ('India in Bondage: Her
Right to Freedom') అను గ్రంథమున డాక్టరు
జె. టి. సండర్లాండుగారిట్లు వ్రాసిరి.

నా భారతదేశపు దీర్ఘయాత్రలయందు సర్వసాధా
రణముగ ఆంగ్లేయులు (గౌరవార్హులు కొందఱు తప్ప)
దేశీయులగూర్చి వా రెంత ప్రబుద్ధులైనను, ఎంత విద్యా
సంపన్నులైనను, ఎంత శీలవంతులైనను సరే-
తయో లోకువవారుగ మాటాడును, వారినట్లు
చుండుట నేను కనుగొంటిని. రైల్వేప్రయాణము
వారు తమంతటనే తక్కువ వరకపుబండ్లలో నెక్క
తప్పదు. స్టేషనాలయందు వారు ఆరుబయటనైన
వలయును, లేదా పశువులకైన యోగ్యములు కా
చిన్నిగదులలో నిరుకవలయును. వారు 'కటిమొద్దు'
పిలువబడుట నేను తఱుచు వింటిని. అతి క్రూరముగ
చారమునకు వారు పాత్రులగుటయు నే నెన్నియో
సారులు చూచితిని. ఒక పెద్ద బొంబాయిహోటలులో
ఒక ఆంగ్లేయోద్యోగి తన లావైన చేతికఱ్ఱతో తన నౌ
రును, ఏదోచిన్నతప్పు చేసెనని, దయమాలి తెగమోదు
నేను చూచితిని. ఆ నౌకరు చక్కనివాడు; విద్యావం
న్నాడు. బుద్ధిసామర్థ్యమున తన యజమానునితో
నుడుగను, 'పెద్దమనిషి' తరహా లక్షణములకు అతనికం
నెంతయో మిన్నగను పొడసూపెను. వర్తకులు,
కరులు, ప్రభుత్వోద్యోగులునగు ఆంగ్లేయులు కొంద
నన్నెంతయో గౌరవముతో సత్కరించినవారే,
భారతీయులగు తమ సేవకుల యెడను, క్రిందియుద్యోగు
యెడను మిక్కిలి కఱుకుదనముతో వర్తించిన విధ
తయు నివ్వెఱగొల్పెను. నాపట్ల వారు 'పెద్దమనుషు
భారతీయులపట్ల 'పెద్దమనుషులు' తప్ప మఱేమైన
దురు. అమెరికను బానిసతనపు దినములలో దక్షిణము
యజమానులు (కొందఱు) తమ బానిసలయెడ వర్తించి
విధము నాకెల్లప్పుడు స్మరణకగులు చుండెడిది. ఇ
తయు వింతయు కాదు. ఒకజాతిని, అది వలదన్న
న్నను పరాధీనతయందు నిలుపు ఆశయము, వ్యక్తుల
బంధముల నిలుపు ఆశయము నొక్కటే.

---

## 'ప్లాంట్ పిల్స్' వలన పూలగుత్తులు

ఏ ఋతువైనను నీటిపాత్రలయందు పూవులు వి
యును. వెలుగక్కఱలేదు; ఎఱువక్కఱలేదు; మట్టియ
క్కఱలేదు. ఎట్లు విరియును?

ఈ రహస్యమంతయు నొకఘుటికయం దున్నది. అది బాతు గ్రుడ్డువలె రెండంగుళముల పొడవును, ఒక అంగుళములావును గలిగియుండును. వెల తక్కువయే.

కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమునకు చెందిన డాక్టరు డబ్ల్యు. యఫ్. గెరిక్ గారు ఏడువత్సరములు పరిశీలనము సల్పి ఈ విచిత్రఘుటికను తయారుచేసిరి. ఆ విశ్వవిద్యాలయమున ఆరుబయటను, లోపటను, సుమారు ౨౦౧ రకములకుచెందిన దాదాపు ౨,౧౦౦ మొక్కలు ఏ నిర్ణీత దినముననైనను పూవులు పూచులాగున నేర్పాటు జరిగినదట.




౧. వేళ్లులేని రోజామొక్కలు,'ప్లాంట్ పిల్లు'చేర్చిన బుడ్లలో పెరిగినవి.



౨. తొమ్మిదివారములు వయసుగల కొలంబియా రోజామొక్కలు. ఇవి ఎనిమిదిఅంగుళముల ముక్కలనుండి పెరిగినవి. ఇవి ఎన్నడును నేల సోకినవి కాకున్నను వేళ్లు బాగా పెట్టియున్నవి.

చలికాలమున సైతము, ఇండ్లలో నుండు కొలది వేడిమికే ఘుటిక లోనుండు రసాయనద్రవ్యముల ప్రభావమున మొక్కలు పెరిగి పూచుచున్నవి.

ఏడాది పెరిగి చచ్చు పైరులు సైతము ఇట్లేయే సమయముననైనను పూచునట్లు చేయవచ్చును. —'పాప్యులర్ మెకానిక్స్'

[మాడరన్ రివ్యూ డిసంబరు, ౧౯౨౭]

---

## ఇటలీలోని ఫాసిస్టు సైనికులు అనుసరింపవలసినపదియాజ్ఞలు

౧. శాంతి నిరంతరముగ నుండవలయు ననుమాటఫాసిస్టు నమ్మరాదని జ్ఞాపకముంచుకొనవలయును.

౨. చెరసాలలలో జీవితము ఎన్నటికిని అస్పృష్టవంతమే.

3. ద్వారపాలకుడు ఒక్క గేసాలైక్ గిన్నెను కాపాడుచున్నను, జన్మభూమిని సేవించుటయే యది.

౪. తోడిసైనికుని సోదరునిగ జూచుకొనవలెను. దీనికి కారణములు రెండు: అతడు నీకు సహవాసి; నీయాలోచనలే యతని యాలోచనలు.

౫. తుపాకులను, తూటాలను మీకిచ్చినది క్రొవ్వెరాచి మూలనుంచుటకు కాదు; అవసరము వచ్చినప్పుడు యుద్ధములో నుపయోగించుటకే.

౬. ప్రభుత్వము మిమ్మలను కష్టపెట్టుచున్నట్లు ఎన్నడును అనుకోగూడదు కారణము,-మీరును ప్రభుత్వములో నొకభాగమే. అది యిచ్చిన సైనికవేషమునే మీరు ధరించుచున్నారు.

౭. శిక్షణ ముండితీరవలయును. అది లేనన్న సైన్యమే లేదు. గంద్రగోళము, అపజయము మాత్రమే.

౮. ముస్సోలినీ అభిప్రాయము సర్వదా సరియైనదే.

౯. ఫాసిస్టులలో అవిధేయత అక్షమ్యమైన యపరాధము.

౧౦. అన్నిటికన్న నెక్కువగ బాటింపదగినయంశ మిది: ముస్సోలినీ జీవితము.

[౯-౧౧-౧౯౩౪ తేదీనాటి "పబ్లిక్ ఒపినియన్" పత్రిక నుండి.]

---

## ముస్సోలినీగారి యాదర్శములు

బెనిటోముస్సోలినీగారు తమ స్వీయచరిత్రమున నిట్లు వ్రాయుచున్నారు:—

"ముందుముందు మీ కార్య విధానమేమి? చిట్టచివరకు మీరు చేయవలచుకొన్నదేమి?" అని నన్ను చాలమంది యడుగుచున్నారు.

వానికివియే నా సమాధానములు. నా కొరకు నేనేమియు నడుగను. నావారికొరకు నేనేమియు నడుగను. భౌతికములగు నెట్టి యుపకారములు నా కక్కఱలేదు. ఏ గౌరవములు నాకు వలదు. యోగ్యతాపత్రము లేవియు నేను వాంఛింపను. నన్ను చారిత్రకపురుషు నొనర్చునట్లు కనబడెడి, నన్ను సమర్థించు నేతీరుమానములను నేను కోరను. నా లక్ష్యము సరళమైనది. నా కోర్కె యిదియే: ఇటలీ గొప్పది కావలె; ఇటలీయన్న గౌరవము కలుగవలె; ఇటలీయన్న భయము పుట్టవలె. నా జాతిని పురాతనములగు తన యున్నత సంప్రదాయముల కర్హమైనదానినిగ నొనర్చుటయే నా కోరిక.

ఐతిహాసికముగ, నేటి కించుమించొక నూరేండ్లనుండియు గోల్పోయినదానిని ఫాసిస్టుల పరాక్రమముతో మాజాతి మరల జయించవలయునని నాయభివాంఛ... సాధారణమగు తన పరాక్రమము ప్రదర్శించిన ... మాకొలనేన. యువకులపై నాకు నమ్మకమున్నది... ఆధ్యాత్మిక భౌతిక జీవితమునకు శ్రద్ధాపూర్వక... తీక్ష్ణములు, అతితరోత్సాహ పూర్ణములగు ... మనసులే యాధారము. పగవారినుండి వచ్చిన...



ముస్సోలినీ.

సలహాలను నేను నిరాకరింపను; వారు సరళహృ... లైన సరి. చాడీకోర్లు, దేశద్రోహులు, కపటబుద్ధు... నసత్యవాదులు నగు శత్రువులను జూచిన నా కేవ... ఆత్మగౌరవ భావమును, జాతీయైక్యమును, స్వా...

వైకల్యమును, నీచములగు కడుపుకుంటల మురికి కుంట లలో బడ ద్రోయువానిని నేను సహింపజాలను. ఓడి పోయి గాలిబ్రతుకు బ్రతుకుచున్నవారు, భవనమంతయు శాశ్వతముగ గూలిపోవుచున్నను దప్పించుకొని ప్రాణ ముల గాపాడుకొన్నవారు, దేశమును అవమానమునకు, నాశనమునకు బాల్పరచువారు, నొక్కొక్కప్పుడు మర్యాదగ నోరు మూసికొనియైన పడియుండరు.

అన్ని యహంభావములను నాలోన నే ధ్వంస మొనర్చి వైచితిని. దేశభక్తులగు వారు లనేకులవలె నేనును ఇటాలియనుల సేవాభారమును శిరసావహించుచున్నాను. నా ప్రతి హృదయస్పందనము మీదను అదియే ముద్రితమై యున్నది. వారికి సేవకుడనని నేను చాటుచున్నాను. ఇటాలియనులు నన్నర్థము చేసికొను చున్నారనియు, వారు నన్ను ప్రేమించు చున్నారనియు నా యభిప్రాయము.

లోపములు లేక, క్రోధచెదరకుండ, నిష్కాముడై, నిండునమ్మకముతో నెవ్వడు నటిపించునో, అట్టినాయకుడే ప్రేమపాత్రుడనుట నే నెరుగుదును.

అందుచే నిప్పటివరకు నా యొనర్చినదంతయు బరిశీలించు కొన్నప్పుడు నే నీసంగతి గట్టిగ జెప్పగలను. ఫాసిజము, ఇటాలియనులనుండి పుట్టినదన్న కారణమున ఐతిహాసిక పరిస్థితులనుబట్టి తప్పనిసరిగ నెదుర్కొన వల సిన సంఘటనములు కొన్ని కలవు. ఇప్పటివరకు వాని నది యెదుర్కొనియే యున్నది. మున్ముందెదుర్కొన గలదు. ఇరువదియవ శతాబ్దపు చరిత్రపై ననివార్యమగు తన ప్రభావము నది ముద్రించితీరును.

[ఆర్. డబ్ల్యు. ఛైల్డుగారి యాంగ్లానువాదము. ౯-౧౧-౧౯౩౪వ తేదీనాటి 'పబ్లిక్ ఒపినియన్'నుండి.]

---

## భారతదేశమున వ్యవసాయము

సర్ యమ్. విశ్వేశ్వరయ్యా, (కె.సి.ఐ.ఇ.) గారు పూనా ఎంజనీరింగ్ కళాశాలయం దుప న్యసించుచు మన దేశపు ప్రధానావసరములను దీర్చుటకు విద్యయు, ఎంజనీరింగు శాస్త్రము నెంతగట్టి యగత్యములో వివరించిరి. (ఈ యుప న్యాసము సెప్టెంబరు నెల 'ది మైసూర్ ఇకనామిక్ జర్నల్'లో ప్రకటింపబడినది) అందు వ్యవసాయ సమస్యను గూర్చి ప్రసంగించుచు వారిట్లు నుడివిరి:—

ఈ దేశమున వ్యవసాయము వృత్తిగా ప్రస్తుత మెక్కుర కయిష్టముగ నున్నది. చాలినంత పొలము లేకపోవుట, ఆదాయ మల్పముగుట, ఏడాది పొడుగున పని లేకయుండుట—ఇవి యందుకు కారణములు. దుక్కి, వేత, కోతల సమయమందు తప్ప నీటి వసతులు లేని ప్రదేశ ముల రైతులకు మిగత కాలమంతయు నేమియు పనియుం డదు. మెట్టకపంటల పండించుటకు ఏడాదిలోను సరిగా రెండునెలలు చాలును; మఱి దాని పని యెడతెగకయే కొంతకాలమో యుండకుండుటచే మన రైతులు సేద్యపు పనుల నెపమున నేడాది నంతయు పాడు చేయుచుందురు. మోటారుకారుల నిర్మాణమున ప్రఖ్యాతి వడసిన హెన్రీ ఫోర్డుగారు తమ భూముల యందు తాము సంవత్సరమున ౧౫ దినములు మాత్రమే పనిచేసియు హెచ్చుపంటను పొందగలిగితిమని చెప్పిరి. అమెరికాదేశమునందు యంత్రపు పనిముట్ల యుపయోగము వలన వ్యవసాయమునకు వలయు మనుష్యుల సంఖ్య తక్కువ యగుచున్నను పంటలు మాత్రము నిస్సంశయముగ హెచ్చుగుచున్నవి.

మన దేశమున చాలభాగముల నవలంబింపబడు వ్యవసాయపద్ధతు లింకను ప్రాతకాలపు నాటివే. రైతులు బొత్తిగా నక్షరజ్ఞానశూన్యులు, దరిద్రులు, పొందు పాటు లేనివారు నగుటవలన నవీన శాస్త్రీయ పద్ధతుల విలువ నెఱిగి వానిని వాడుకలో పెట్టుకొనజాలకున్నారు. మూలధనము, శాస్త్రీయపద్ధతులు, మంచి వ్యాపార జ్ఞానముతోడి కార్యదర్శిత్వమున వ్యవసాయము వృద్ధి నొంద వలయును. అనగా వ్యవసాయమును నిజముగ నొక పరిశ్రమగ నొనర్పవలయును.

యంత్రనిర్మాణవిద్య, రసాయనశాస్త్రము, యీ రెండును వ్యవసాయముతో నెక్కువ సంబంధము గలవి,

వ్యవసాయమునందలి శాస్త్రవిభాగమునకు చేరినవి: భూపరిశీలనము, విత్తనముల — యెఱువుల యేర్పాటు, చీడపురుగు తెవుళ్ల నాశనము, పశుపోషణము, నవీన వ్యవసాయ యంత్రముల—ఉపకరణముల యుపయోగమును. మన పెద్ద వ్యవసాయదారులు కొందరైనను దుక్కికిని, ఊడ్పునకును, కోతకును యీ పైపద్ధతుల ననుసరించి చేయుట యారంభింపవలయును. తమ నాగళ్లను, జలయంత్రములను, వ్యవసాయపు పనిముట్లను మరమ్మతు చేసుకొనుటకు తగునట్లు యంత్ర నిర్మాణవిద్యయందు ప్రతి రైతును ప్రాథమికశిక్షను పొంది యుండవలయును. నేను చూచిన కొన్ని నాగరక ఐరోపీయ దేశములలో చెన్నదగిన ప్రతిరైతును తన కత్యవసరమైన విద్యుచ్ఛక్తి మొదలగు వాని సహాయము లభింపనపుడు, అధమమొక ఆయిల్ ఎంజిన్ (తైల యంత్రము) నైన కలిగియుండును. ప్రతి పట్టణమునను, చాల గ్రామములలోను. ఏదో యొక రకపు పారిశ్రామిక పాఠశాల లుండును. ప్రతి పెద్ద నగరములోను పారిశ్రామిక కళాశాలలు గలవు. వ్యవసాయమును, యంత్రనిర్మాణ విద్యయు పరస్పరము ననుసరించి యుండవలసినవి. ప్రస్తుతము వ్యవసాయదారులు యంత్రవిద్య యందలి ఓనమాలనైన నెరుగరు; నీటిపారుదల పనులయందు సంబంధము గల యే కొలదిమంది ఎంజినీర్లో తప్ప తక్కినవారికి వ్యవసాయము తెలియదు. ఐరోపీయ దేశములలో వ్యావసాయిక యంత్రవిద్యా నిపుణులు ప్రత్యేకముగ నున్నారు. వ్యవసాయ విచారణ సంఘమువారు అమూల్యములగు సలహాలను పెక్కిటి నొసగిరి. కాని పల్లెటూరి వారలలో వ్యవసాయవిద్య యెక్కువగ వ్యాపింపజేసి బ్యాంకింగు సౌకర్యములను కలుగజేసి, సహకారమును స్వయం సహాయమును ప్రోత్సహించి, వారికి మంచిమార్గమును జూపెట్టనిదే ఆ సలహాలు ఉపయోగకరముగ కార్యరూపమును పొందజాలవు.

## వింతవస్తువులు

భారతీయ జీవనమున కళ, మతము రెండును సర్వముఖముల ప్రవహించుచున్నవి. పనివాడు అనన్యాత్మకముగ తన ప్రతిభతోడను, సహజకళా కౌ[శలము]తోడను నిర్మించిన సుందరవస్తుజాలము కళాప్రియు[ల]కు సంతతోల్లాసము గూర్చుచున్నది. కేవలము వి[లాస ప్ర]యోజనములకే కాక నిత్యజీవన ప్రయోజనములు[కు ఉప]యోగపడు పీటలు, చెంబులు, ద్వారబంధములు, [గృహ]సామానులు, ఆటవస్తువులు, తాంబూల కరండ[ములు], తివాసులు, చాపలు, భోజనపాత్రలు, 'దేవుడు' [పీఠ]ములు మున్నగు సామాన్యవస్తువులు సైతము మా గర్వ[కారణమగు] సంపదకు నిరూపకములై వెలయుచున్నవి. కా[ని] అన్యసంపత్ వ్యామోహితులగు నేటి భారతీ[యు]యుపేక్షకు శోచనీయముగ గుఱియయి యున్నది. [వి]ప్రబుద్ధులు నిష్కృతి చేయుచు, తమ పూర్వ వైభ[వము]లను, ప్రబోధములను స్మరించుచు పునరుద్ధరింప బూ[ను]నుటయుక్తము. 'త్రివేణి' సంపాదకులు శ్రీయు[త] కోలవెన్ను రామకోటేశ్వరరావుగారు తమ ప[త్రిక]యందు ఇట్టి చక్కని పనితనముతో నొప్పు వింత వస్తు[వుల] ఛాయాచిత్రములు ముద్రించి యాపూర్వకళాసంప[ద]దేశీయుల స్మరణకు తే నుద్యమించుట యెంతయు [ప్రశంస]నీయము. ఈ చిత్రముల నిందు పునర్ముద్రింప మా[కను]మతి నొసంగినందులకు వారికి మే మెంతయు కృతజ్ఞు[లము]. ఇంకను వారి కిట్టివస్తువులగాని, వాని ఛాయాచిత్ర[ము]గాని యెవ్వరేని పంపినచో వారు వానిని తమ ప[త్రిక]యందు ప్రకటించి భద్రముగ త్రిప్పి పంపగలరు. ఈ చక్కని ఆశయమును మన దేశీయు లాదరిం[తురు] గాక !

—భారతి.

## ఇంద్రాణీపూజ

శ్రీ రాజేంద్రకుమార శాస్త్రి

ఆశ్వినమాస ప్రవాసి పత్రికలో ఇటులు [వ్రా]యుచున్నారు.

భాద్రమాస సంక్రాంతినాడు వంగదేశమున [పూర్వ]కాలమున ఇంద్రాణీపూజ చేయఁబడుచుండెడిది. [కాని] కాలధర్మముచే మాసిపోయెను. ఇంద్రాణీపూజ[కు] పేరు పాటపుపూజ; రాటము నుద్దేశించియే [ఈ]

జరిగెడిది. దీనికి కథాకల్పములు కలవు. స్త్రీలే దీనిని పూజించువారు. స్త్రీలే కథ చెప్పకొనువారు. 'రాటముచే ధనధాన్యములు వృద్ధియగును' అని ఈకథ. బాపన పేదరాలొకతె రాటముచే ధనధాన్యముల సంపాదించి గ్రామమున గౌరవము పొందుట కథాశరీరము.

గాంధిమహాత్ముండు దీనిని ప్రచారము చేయుచున్నాఁడో ఈపూజవలన వంగరమణులు దానిని చూపుచున్నారు. ఇంగ్లీషువర్తకుల కోరికచే ఎపుడు సర్కారువారు రాటమును మూల పడవేయించిరో అప్పటినుండియే ఇంద్రాణీపూజ లోపింపదొడఁగెను. ప్రొద్దున స్నానము చేసి పూజాదినమున గృహద్వారమును అలంకరించి స్త్రీలు మడికట్టుకొందురు. ఇంద్రాణీదేవిని చేసి పూజింతురు. స్త్రీలు తమంతతామే పూజచేసికొందురు. ఈపూజకు పురోహితుఁడక్కఱలేదు. ఇంద్రాణీదేవి అనుగ్రహమువలన ముదియయు, నిరుపేదయు అగు బ్రాహ్మణి రాటముచే ఎట్లు చాలడబ్బు సంపాదించి దేశముచే పూజింపఁబడెనో ఆ విషయమును స్త్రీలు కథవలన ప్రచారము చేయుదురు. పూజాదినమున పూజ చేయక స్త్రీలు జలగ్రహణము చేయరు. నాఁడు ఇంటిరాటమును దులిపి తుడిచి తైలసిందూరములతో అలంకరింతురు. అందఱును ఇంద్రాణీదేవికి నమస్కరించునపుడు రాటమునకును నమస్కరింతురు. రాటమును కీర్తించుట ఈపూజలో రెండవపర్వము.

నేడు వంగదేశమున రాటము లేదు; రాటపు పూజయును లేదు. రాటముతోడుతోడుత ఇంద్రాణీదేవి పూజయు లుప్తమయి పోయెను. క్రొత్తగా అక్కడక్కడ రాటము చూడనగునుగాని ఇంద్రాణీపూజ మఱి లేదు. ఇంద్రాణీదేవివరమున దరిద్రులు ఎట్లు ధనికులగుదురో అదియు మఱి చెప్పువారు లేరు. రాటము వంగదేశమునకు ఒక సిరిగా నుండెను. ఆసిరి యిపుడు లేచిపోయెను. రాటపునూలుతీయు స్త్రీలందఱు ఇపుడది లేదని సూదులతో అల్లికపని చేసిగాని, నాటకములు, నవలలు చదివిగాని కాలము గడపుచున్నారు. మనకు సిరిసంపత్తులు ఇఁక ఎటు లుండఁగలవు? మన స్వభావములో ఇంద్రాణీదేవి మనకు విముఖియాయెను. మనపూర్వు లింద్రాణీపూజచేసి ఇంద్రాణీదేవి కృపచే సుఖముండిరి. ఈపూజలో ఒకచో దానివలన తయారయిన వస్త్రములును, రాటమునుండి తీసిన కొంచెము నూలును పండ్లును, పూవులును ఇవన్నియు భోగాస్పదములయ్యెడివి. ఇంటివారందఱును పరమానందముతో పూజాప్రసాదమును స్వీకరించువారు. రాజు మొదలుకొని బిచ్చగానివఱకు ఇండ్లయందు తమతమ శక్తికొలఁది ఈపూజ చేయుచుండెడివారు.

---

## హిందూయువతీ శరణాలయము

దేవదాసీసంఘము స్త్రీప్రపంచముననొకభాగము. ఈసంఘమువారి వృత్తి ప్రాచీనకాలము నుండియు దేవ



శరణాలయమున పోషణమును గాంచుచున్న శిశువు.

హిందూయువతీ శరణాలయ వార్షికోత్సవము - కీల్పాకము, చెన్నపురి.

ఇందు యామినీ పూర్ణతిలకమ్మగారు ఎడమవైపున కూర్చుండి యున్నారు.

దాస్యము. వీరు నృత్తగీతాభినయములచే దేవళ్ల నారాధించుచు నవివాహితలై పవిత్రముగ జీవితమును గడుపుకొనుచుందురు. దేవాలయములనంటి ఈసంఘమువారికి మళ్లు, మాన్యములు గలవు. వీరివలన గాంధర్వవిద్య, భరతశాస్త్రము నభివృద్ధిగాంచినవి. ఇట్టి పవిత్రసంఘము స్వార్థపరమగు పురుషప్రపంచముయొక్క దౌర్జన్యముచే క్రమముగ ప్రభ్రష్టమయి, నైతికమార్గదూరమయి, యానాటి గౌరవమును గోలుపోయి నింద్యజీవనము పాలయినది. సంఘసంస్కరణప్రియుల మనువారి దృష్టి యీ పతితసంఘమువై పునకు మరలినదికాదు.

ఆసంఘమునకు చెందినవారగు శ్రీయామినీ పూర్ణతిలకమ్మగారు పతితమయిన స్వసంఘమును ప్రబోధించి సన్మార్గప్రవణమును గావింప నెంచి ఆరేండ్లక్రిందట నీశరణాలయమును స్థాపించినది. అందామె మిగుల వ్యయప్రయాసములకోర్చి చిన్నవయసు వేశ్యాబాలికలను, తక్కినవారలను, కొందరను దెచ్చి వారి కుచితముగ నన్నపానాది సౌకర్యముల సమకూర్చి, విద్యాబుద్ధులుగరపి పవిత్రజీవితము గడుపుచున్నది.

పవిత్రమగు దేవదాస్యముమాట ఎటులున్నను ఈశరణాలయము పతితులయిన యీనాటి వేశ్యాసంఘమువారు మరల నైతికమార్గము నవలంబించి గౌరవముగ తమజీవితమును గడపుకొనుట కెంతయు నుపకరింపజాలునని తలపవగును.

ఎక్కువమందిని సంస్కరించి సన్మార్గమునకు ద్రిప్పుట కీశరణాలయము చాలదు. కాని దీనిపోషణమే తిలకమ్మగారికి దుర్ఘటముగనున్నది. కాసులులేక కార్యములు జరుగవుకదా! ఉదారాశయులు, సహృదయులునగు సంస్కరణాభిమానులందఱు నీ విషయమును గుర్తించి యీశరణాలయమునకు తగిన సహాయమును సమకూర్చి వేశ్యాసంఘ మభ్యున్నతిని గాంచు మార్గమును జూచుట లెస్స.

ప్రభుత్వమువారును, స్థానిక ప్రభుత్వములవారును ధనరూపమున నీశరణాలయమునకు సహాయము చేయుటావశ్యకము. శ్రీ తిలకమ్మగారును వేశ్యాసంఘ సంస్కరణమే తమపరమార్థముగ నుంచుకొనవలెను. ఇతరులను ననాథల విషయ మామె తలపెట్టకుండుట శ్రేయము.

—భారతి.

---

## ఆంధ్రదేశములోని ఎఱుకులభాష.

చిన్నతనములోనిఅనఁగాఁ పదునాల్గు పదునేనేండ్ల ప్రాయమున మా స్వగ్రామమగు చెందుర్తిలో నేనుండువాఁడను. అందు, జమీందారుల జీతగాఁడొక యెఱుక, వేటకాఁడు పిట్టలను బట్టుకొనుటకై నియమింపఁబడియుండువాడు. వానిపేరు సుబ్బఁడు. వాఁడు, వాని తలిదండ్రులు సోదరులు నొక విన్నమైన భాష మాటలాడుకొనెడువారు. మా యూర వాండ్రు తప్ప నితర భాషలు మాటాడువారు లేరు. అది యేభాషయో తెలిసికొనఁ దలఁచితిని. ఒక్కనాడు మా తోఁటలో మామిడిచెట్టు క్రిందికి సుబ్బఁడు వచ్చినాఁడు. ఓరీ మీ భాష నాకు నేర్పెదవా యని యడిగితిని. నేర్పెదనని సమ్మతించినాఁడు. రెండు మూఁడునాళ్ళు కొన్ని రాలిన మామిడికాయలిచ్చి కొన్నిపదములను వ్రాసికొనుచుండువాఁడను. అప్పటికి నాకుఁ బట్టణములలోఁ బరిచయములేదు. ఏ భాషకు సంబంధించినదోయను నూహ లేదు. వ్రాసికొన్నాఁడను. సుమారు నలువది సంవత్సరములైన నగును. ఒక ప్రాఁతపుస్తకములో నే నీనడుమ నా కాగితమును గనుఁగొని చూచితిని. అది యెఱుకులతో సంబంధము కలిగి కనఁబడుచున్నది. ఆ భాషతోఁ గొంచెమిప్పుడు పరిచయము గలవాఁడనగుటచే నా నందమునుబొంది యెఱుకచెప్పిన మాటలను గొంచెమయినఁ జూచెదరని యందు దెలుపుచున్నాఁడను. ఈ మాటలపై వాగనుశాసనత్వము నా పదలఁచుకొనలేదు. అవసరమైనవారికేమైన నుపయోగింపవచ్చునని తలఁచెదను.

ఈ జాతివాండ్రలో నాఁడువాండ్రీప్రాంతములలో ముష్టియెత్తెదరు; రతుపోసులు గట్టెదరు. ఆఁడువాండ్రకు రహస్యముగా సంతానము కలుగుటకై సాధనములు చెప్పుదురు. ఆలుమగలకు దృఢానురాగము కలుగుటకై మందు లిచ్చెద మందురు. వశ్యక్రియలు చేయుదు మందురు. తాటియాకు బుట్టలు, గిలకలు నమ్మి, ఈతపేళ్లబుట్టలల్లియు జీవింతురు. ఎఱుక చెప్పెదరు. సీతాకళ్యాణము మృత్యుంజయ విలాసము మున్నగు యక్షగానములలో నగపడు నెఱుకలసాను లిట్టివారుగనే యున్నారు. వీండ్రు పదిమంది చేరి మాటలాడుకొనునపుడవి వినువారి కెఱుకలభాషవలెనే కనఁబడును. తెనుఁగు అరవమును గుచ్చెత్తి మాటలాడుదురు. చూడఁగా వీరు పూర్వము అరవ దేశమువారే. ఈ దేశమునకు వచ్చి వందలకొలఁది సంవత్సరములగుటచే, గొన్ని మాటలు మఱచిపోయి వాని స్థానమునఁదెలుఁగుమాటలు వేయుచున్నట్లు ఊహింపవచ్చును.

| | |
|---|---|
| కోడి = కోయి | కాకి = కావురుగం |
| గ్రుడ్డు = ముట్ట | నెమలి = నెవిలి |
| మాంసం = కఱ్రి | గడ్డిపిట్ట = కిరిటి |
| కుంజా = పిల్ల | చిలకబాతు = కెలవ |
| కాజు = కెరాడి | చారబాతు = తారావు |
| గోర = నానాయం | ముగుబాతు = నూటం |
| నత్తకొట్టు = సొగిడి | పరజలు = శెరగ |
| కామిరేడిపిట్ట=పెరక్కడిది | లావు = చాల |
| పిట్ట = కుంజు | అధికం = అరగం |
| కారుకోడి =కాటుకోయి | చాలగలవు=లావు,దెచ్చిబిక్కరం |
| శెట్టికొంగ = పోడకొక్కు | కొంచెమున్నవి = అరగం ఇల్ల |

కొంగ = కొక్కు　　నల్ల లేడి = కడితిర్రి
సేపరాయి = నెర్రెం　　ఇర్రి = లేడి
　　ఆడు లేడి = బోలి
గుఱ్ఱము = కుదర　　ఆముదము = ఆముదుక
దోరపోతు = దోరెగం　　మజ్జిగ = మొజ్జిగ
ఏనుగు = ఆన　　తుపాకి = మఱ్ఱం
పంది = పన్ని　　తుపాకులు = మఱ్ఱంగ
రాత్రి = నావారు　　బియ్యము = ఎరిని
పగలు = పగమారి　　కుండ = కుడవ
ఈవేళ = ఈమాను　　రోకలి = ఒనక
రేపు = తెల్లారి　　చేట = చేట
ఎల్లుండి = మర్నాడు　　ఆవు = మాడు
నిన్న = నేసు　　ఆవులు = మాడుగిక్కిరి
మొన్న = మర్నాడు　　గేదె = గేదె
నిన్న గాక మొన్న =　　మేక = ఆడు
నేసల్ల దెముది నేసు]　　పిల్ల = కుట్టి
చేతులు = కయ్యి　　మంచం = కట్లు
కాలు = నడపానం　　కత్తి = కొల్లి
కన్ను = సూపానం　　నెల్లి = ధాన్యము
నోరు = మూజి　　నీవు = నీను
వెంద్రుకలు = మొగిరి　　వాడు = అదు
వ్రేలు = వేలు　　ఇలాగు = ఇనా
ఛాతి = నెంజుబోర　　పోయినాడు = పోసు
స్తనములు = నెంజుగలు　　వచ్చుచున్నాడు = వారక్కి
నడుము = నిడువు　　కూర్చుండు = ఉక్కో
కడుపు = వరిగి　　లెమ్ము = ఎద్దిరి
ప్రేగు = కొడ　　బాగుగనున్నది = మానల్లక్కిరి
ఎఱుపు = ఎఱ్ఱవాయం　　ఆడుది = పైది
నలుపు = కరతవాయం　　మగవాడు = ఆమల
పచ్చ = పసురు　　అగును = అంబో
పసుపు = మంజల　　లేదు = ఇల్ల
తెలుపు = ఒలుపు　　కాదు = ఇల్ల
బట్ట = తుని　　అడుగుడు = కేరుంగో
గోచి = ఉపతందుని　　అడుగు = కేరు

రవిక = సెట్ట　　అడిగినాడు = కేరుసు
ఉప్పు = నోనం　　చెప్పు = సొన్ను
మిర్చి = మలక్కాయ్　　చేయుము = చెయ్యిల
ఒఱ్ఱి = కారం　　ఇమ్ము = తాంగో
చింతపండు = పిలిబంగ　　వచ్చెదనుపద = వారికేనా
చింతచెట్టు = పిలింజెడి　　ఏమండిబాబు = ఎందావా
సూసె = ఒన్న　　ఓరీ = ఓల
ఏమిరా = ఎందులా　　బ్రద్దలగొట్టు = వెగలకుత్తు
ఉన్నది = ఇక్కిది　　అలాగుకాదు = ఆనాగల్ల
అడవి = కాడు　　కొండ = గెట్ట
ఎక్కు = ఏరువు　　దిగివెళ్లుదము = దీక్కివారుకో
మీద = మేసె　　పెద్ద = శెరుసు
చిన్న = చిరువాయం　　పుచ్చుకో = వాంకో
ఒకటి = ఒండు　　రెండు = రోండు
మూడు = మూడు　　నాలుగు = నాలు
అయిదు = అంజు　　ఆరు = అరు
ఏడు = ఓగు　　ఎనిమిది = ఒట్టు
తొమ్మిది = ఒంబదు　　పది = పొత్తు
　　పదిమీద = పొత్తుమేన
ఇరువది = యిర్దు ముప్పది=ముప్పిదు, మూరడక్కపొత్తు
నలుబది = నాడరక్కపొత్తు ఏబది = అంజరక్కపొత్తు
అఱువది = అర్రక్కపొత్తు డెబ్బది = ఓగరక్కపొత్తు
ఎనుబది = ఒట్టరక్కపొత్తు తొంబది = ఒంబదిపొత్తు
నూఱు = పొత్తుపొత్తులు ఎక్కుదము = ఏరువో
దిగుదము = దిగువో పుంజు = సావ
పెట్ట = పొట్ట, ఈలాగురా=ఇంగవా=ఇనావా
పండుకొనుము=బోదుగో అదేమిటి = అదెందదు
తాటిచెట్టు = పనమరం ఈతచెట్టు = ఈసం నెడి
ఎక్కడికి వెళ్లెదము = ఏటికిపోక్క
ఎక్కడనుండి వచ్చుచున్నావు = ఏటినుండివారక్కిర
ఏమికావలయును = నీకెందాగుం
ఎప్పుడువచ్చినావు = ఎప్పుడొంద
వెళ్లుదమురా = వాంగేపోవో
సారాదికొణమునకు వెళ్లుదము = వోడుటకుపోవో

పండుకొన్నాఁడు = బోదుగుసి
నీ మగఁడు వచ్చినాఁడులెమ్మ = నీమొనాగంపంచియొద్దిరి
అన్నమువండు = సోరాఆసు
కూరవండెదను = నెక్కిలిఅడిక
నీళ్లు తీసికొనిరా = తన్నెత్తుకుండివా
మాటచెప్పెదను = వాతసొన్నికేవా
వెళ్లెదను = నానుపోక్క
వారు వెళ్లినారు = అయివిపోసు
నేను వచ్చెదను = నానువారికి
నేనును వెళ్లెదను = నేనరగా పోక్కి
పశువులను మేపుచున్నారు = మాళ్లమేపక్కిరం
వెళ్లవలెనని నాకున్నది = నేనరగాపావ్వోండిక్కిరి
నీవును వచ్చెదవా = నీనరగావారికానాయెంది
ఎప్పుడయినను సరియే = ఎన్రన్నాసరే
ఏలాగు వెళ్లినాఁడు = ఎనాపోసు
ఎవఁడో యెలుకలవాఁడీదారిని వచ్చుచున్నాఁడు =
ఏగోశేలీదోకులంవారక్కిర
పోయినట్టే పోయినాఁడు = పోనట్టేపోను
వచ్చినట్టేవచ్చినాడు = వందట్టేవంచు
ఏమనిచెప్పెదవు = ఎందందుసొన్నక
ఏలమువెళ్లుదము = ఏపాల్తోపావ్వో
ముందు చెప్పెదను = మిన్నుకుసొన్నికి
నీపేరెవరు = నింబేరేదు
చెప్పెదనువిను = సొన్నిక ఆలకించు
రారాకట్టెలకుఁబోవుదము = వాలాకోలుకొవ్వో
అమ్మెదము = ఇచ్చుంబో
కొందము = కొండుంబో
ఊళ్లవెంట = పోరుళ్లంట
ధాతిమీదఁ ఒకతన్నుతన్నుదును = నెంజుబోరమీద
ఒండొద్ద ఒక్కకొవారుల్లా
నడుము విఱుగును = నిడువొడాకి
కడుపుచింపుతాను = వరిగు పిచ్చొడిక్కి
ప్రేగులు చీరుదును = కొల్లుపిచ్చొడిక్కి
నల్లగనున్నది ఈయాఁడుది = కేరియేనిక్కిరిపైది
ఉన్నమట్టుకింకను జెప్పుకొందము = ఇక్కిరికాడికి ఇంకా
సొన్నింబో.

[కొత్తపల్లి సూర్యరావు]

కేవలము సంభాషణమునందే ప్రచారముననున్న ఇట్టిభాషలు మనదేశమున నింకను కొన్ని గలవు. అడవులలో, కొండలలో నివాసము చేయుచున్న సవరలు, కోయలు మొదలగు కొండజాతులవారు వానిని మాటాడుచున్నారు. వర్ణసమామ్నాయము, లిపి, లేమిచే నవి లేఖనయోగ్యములుగాక వానిని మాటాడు వారితోపాటు క్రమముగ నశించిపోవుచున్నవి.

ఈ భాషలకును, మనదేశముననిపుడు వాడుకలోనున్న ఆంధ్ర ద్రావిడ కర్ణాటాది భాషలకును సంబంధముండుటను పైఎఱుకుల వారి భాషలోని పదములపట్టిక తెలుపుచున్నది. వీనికి లిపినికల్పించి నియమబద్ధములుగను, లేఖనయోగ్యములుగను చేసినచో భాషా తత్వ పరిశోధకులకు వీనివలని ప్రయోజన మనల్పముకాగలదు. ఇట్టి పనిని కావించుటకు ప్రభుత్వవిద్యాశాఖవారును, విశ్వవిద్యాలయములవారును పనిబూనుటావశ్యకము.

పర్లాకిమిడినివాసులు రావుసాహేబు శ్రీయుత గిడుగు వెంకట రామమూర్తి పంతులు (బి. ఏ.) గారు మిక్కిలి పరిశ్రమించి కోయ భాషను సవరించి నియమబద్ధము గావించి లేఖన ముద్రణయోగ్యముగ జేయుచున్నారని వినుకలి. వీరికిని, ఇంకను ఇతరములగు కొండ జాతులభాషలను అనుశాసింప సమర్థులగు వారికిని తగిన ప్రోత్సాహమును, గౌరవవేతనములను ఇచ్చి రూపుమాయనున్న భారతదేశపు ఆదిమజాతుల భాషలను, తన్మూలమున నాభాషలను మాటాడు జాతులను పునరుజ్జీవింప జేయ ప్రభుత్వమువారు, విశ్వవిద్యాలయములవారును, పూనదగుదురు.—భారతి.

---

**దేశింగరాజు మ్లేచ్ఛసైన్యముల నుఱుమాడుట**

(చెన్నపురి చిత్రవస్తుప్రదర్శనశాలనున్న శిలావిగ్రహము నుండి క్రిందిచిత్రము.) దేశింగరాజు ఔరంగజేబుసమకాలికుడు; దక్షిణార్కాడులోని జింజికోటకధిపతి. ఔరంగజేబు, అనితరసాధ్యమయిన తనయశ్వమునులో బఱచుకొనినయా శ్వికశిఖామణియని మెచ్చి దేశింగునికి సర్వస్వాతంత్ర్యము నొసగికప్పముగూడ చెల్లింపనావశ్యకము లేకుండ ఆకోట నొసగెను. కాలక్రమమున దేశింగునిస్వాతంత్ర్యము సహింప

జాలకకర్ణాటకనబాబు అతనిపై దండెత్తగా తన ... పరాక్రమమునుజూపి మ్లేచ్ఛసైన్యమును చించిచెం... తుదకు రణరంగమున వీరస్వర్గము నలంకరించెను. ... కిని ఈయోధుని పరాక్రమము ఆంధ్రద్రావిడప్ర... మున 'జంగమకథ'గాను, జోలపాటగాను పాడబ... న్నది. ఇతని సతీతిలకము పతితోడ సహగమన ... రించిన పతివ్రత. ఈ సాధ్వి పేరనే ఉత్తరార్కాడు... లోనొకయూరు 'రాణీపేట' యనబరగుచున్నది. ...





౧. సంభవ కాండము:— ఇది శైవప్రచారిణీ గ్రంథమాలయొక్క ౧౩ వ కుసుమము. ఇది సులభమగు వచన రచనలో ఆంధ్రీకరింపబడిన శివరహస్య ఖండమునందలి సంభవకాండము. ఆంధ్రీకరించిన వారు విద్వాన్ బ్ర. శ్రీ. ముదిగొండ వీరేశలింగ శాస్త్రి గారు. వెల రూ ౨-౮-౦ లు.

సైజు డెమ్మీ ౧/౮. పుటలు ౧౮౬. గ్రంథములు దొరుకుచోటు:— మేనేజరు—శైవప్రచారిణీ గ్రంథమాల, వరంగల్, నైజాం.

అసలు శివరహస్యఖండము స్కాందపురాణము లోని యొకభాగము. ఇది సంభవ, ఆసుర, వీరమహేంద్ర, యుద్ధ, దేవ, దక్షోపదేశకాండములని ఏడు భాగములుగ నున్నది. అందు ప్రకృతమగు సంభవకాండము తొల్దొల్తటిది. దీనిని ఇదివఱకే అసలు సంస్కృతమునుండి ఇర్వురు మువ్వురు కవులు తెలుగున రచించిరనియు, తాము ఆ తర్వాతివారనియు, రామాయణాదులకువలెనే ఎన్ని భాషాంతరీకరణములు వెలసినను వెలయవలసినదే యనియు సంపాదకులు సెలవిచ్చినారు. నిజమే! 'అధికస్య అధికంఫలం'—అన్నారు ఆచార్యులవారు. అస్తు.

గ్రంథమునందలి శైలియును, భాషాంతరీకరణ చాతుర్యమును చదువరులకు తెల్పుటకై ఈక్రింద నందుండి కొన్ని వాక్యములు ఈయబడుచున్నవి.

"అందఱు హిమవంతుని ప్రశంసించిరి. నగేంద్రుని యంగము లా వాక్యజాలము విని పులకితములైనవి. అతని లోచనము లానందాశ్రుపూరితము లాయెను. కంఠము గద్గదస్వరము వహించె. ఆతఁడు వాత్సల్యమునఁ దనపుత్రికారత్నమును గౌఁగిలించుకొని"— పేజి ౫౫. ఇత్యాదులు. [పం. అ.]

౨. శ్రీభాగవత హృదయము:— ఇయ్యది శ్రీమద్భాగవతాభిప్రాయమును నిశదపఱచు ౩౬౫ భాగవత శ్లోకములకు తెలుగు వ్యాఖ్యానము. తెలుగువ్యాఖ్యానమును శ్రీ సుసర్ల శ్రీనివాసరావుగారు రచించిరి. వారే దీనికి ప్రకాశకులు గూడనై యున్నారు. సైజు డెమ్మీ ౧/౮. పుటలు ౧౯౪. వెల రూ ౧-౨-౦. గ్రంథములు దొరుకుచోటు:- శ్రీ సుసర్ల శ్రీనివాసరావుగారు, రిటైర్డు డెప్యూటీకలెక్టరు, రామారావుపేట, కాకినాడ.

సాధారణముగా ముముక్షువులగు నార్యులెల్లరును భాగవత మహాపురాణమును చదివి భాగవతధర్మమును గ్రహించుచుండుట పరిపాటి. శ్రీమద్భాగవతము అష్టాదశపురాణములలో నొకటి యనుట యందఱెఱింగినదే. అట్టి యీభాగవత మహాపురాణము పైని సంస్కృతమునందు మతత్రయము వారును, ఇతరులును పెక్కులు టీకలును, వ్యాఖ్యానములును వారివారి యభిరుచుల ననుసరించి బహుధా ప్రపంచించి రచించియున్నారు. వానిలో కొన్ని విరళప్రచారమును మఱికొన్ని, బహుళప్రచారమును గాంచియున్నవి. కేవలము వ్యాఖ్యానములును టీకలు మాత్రమే గాక, భాగవతధర్మములను సంగ్రహముగా జ్ఞప్తియం దుంచుకొని మననము చేయుట కనువగు రీతిని కొందఱు కొందఱు పెద్దలు భాగవత ప్రతిపాదిత శ్లోకములను వర్గీకరించి సంక్షేపమున నుద్ధారము సలిపినారు.

మఱి,ఇట్టులు సంగ్రహించి కూర్చిన సంధాతలలో శ్రీశ్రీ మధ్వాచార్యులు వారొక్కరు. వీరి సంధానమగు గ్రంథమునకు భాగవత తాత్పర్యమని పేరు. ఈ భాగవత తాత్పర్యమను గ్రంథముపై శ్రీ విజయధ్వజాచార్య

లను వారు టీక వ్రాసియున్నారట. పైజెప్పిన గ్రంథ మును కూడ సంక్షేపించి, ౩౬౫ శ్లోకములతో * దిన మున కొక్కశ్లోకము చొప్పున పఠించి తత్సారమును మన నము చేయుట కనుగుసనట్లు ఎవ్వరో అవధూతలొక్కరు నీర్పఱచి వారే స్వయముగా వానికి వ్యాఖ్యానము వ్రాసి నట్లును, వారి యీ గ్రంథమునకు భాగవత సారోద్ధార మని పేరనియు, ప్రకృతము ఈ గ్రంథమునకే తెల్గున తాము టీకాతాత్పర్యాదుల వ్రాసితిమనియు శ్రీనివాస రావుగారు సెలవిచ్చిరి.

మొత్తమున నీగ్రంథము ౩౦ ప్రకరణములుగా విభజింపబడినది. ఒక్కొక్క ప్రకరణమునందును మూల శ్లోకములును, వానికి విజయధ్వజాచార్యుల టీక ననుస రించి తెలుగున ప్రతిపదార్థ తాత్పర్యములును, సమ కూర్చి, శ్రీ శ్రీనివాసరావుగారు శ్లోకములకు అకారా దిగా అనుక్రమణికను, పీఠికను సయితము చేర్చి ముద్రిం చినారు. సంస్కృతము నధిగమింపలేని—అధిగమించినను అర్థముకాని—మాబోటి పామరులకు ఈ గ్రంథము చక్క గా అర్థజ్ఞానమును నేకూర్చి, తెలివితో నుపయోగించు కొన్నచో, మోక్షమును సైతము నీయజాలియున్నది. తెలుగు టీక స్వరూప స్వభావాదులకై ఒక్కశ్లోక ముదాహరణము:—

శ్లో. పథి చ్యుతం తిష్ఠతి దిష్టరక్షితం
గృహే స్థితం తద్విహతం వినశ్యతి।
జీవ త్యనాథోఽపి తదీక్షితో వనే
గృహేఽపి గుప్తోఽస్య హతో న జీవతి॥ ౭-౨-౪౦॥

దిష్టరక్షితం=దైవముచే రక్షింపఁబడినది, పథిచ్యు తం = మార్గమునందుఁ బడిపోయినను, తిష్ఠతి=నిలుచును, తద్విహతం=దైవముచేఁ గొట్టబడినది, గృహేస్థితం=ఇంటి యందున్నను, వినశ్యతి=నశించును, అట్లే, అనాథోఽపి= తల్లి మొదలయినవారిచే విడువఁబడి, తదీక్షితో=దైవ ముచేఁ బ్రసన్నదృష్టిచేఁ జూడబడినయెడల, వనే=వనము నందైనను, జీవతి=జీవించును, అస్యహతః = దైవముచేఁ గొట్టబడినయెడల, గృహేగుప్తోఽపి=ఇంటియందు [...] పఁబడినను, న జీవతి=జీవింపఁడు॥౬౨॥

ఇట్లుప్రయత్నముగా సంభవమైన కౌమార దుఃఖమును గనఁబఱచి తదనంతర యౌవనా[...] ప్రయత్నపూర్వకముగ దుఃఖము నేల కొని[...] వలెనని యీక్రింది యేసు శ్లోకములయందు [...] బడినది.

[పం. ౭.]

Karna the Giver:—ఇది రావుబహ[...] పి. సంబందం, (బి. యే., బి. యల్.) గారిచే రచియిం[...] డిన యొక తమిళ [అరవ] నాటకము. భారతము[...] కర్ణునిచరిత్ర నాధారము చేసికొని యిది వ్రాయబ[...] ఇది డెమ్మిసైజున ౫౨ పుటలుగలది. వెల ౮ అణా[...] వలయువారు గ్రంథకర్తగారికి, Pammal Lo[...] G. T. Madras అని వ్రాసిన బడయగలరు.

వ్రతకల్పము:—ఇది కృష్ణాజిల్లా అంగ[...] వాస్తవ్యులగు త్రిపురనేని గోపాలకృష్ణ చౌదరి[...] రచియింపబడినది. క్రౌనుసైజు ౪౬ పుటలు. వెల [...]

కవి ఆంధ్రపండిత బిరుదమును పొందినవారు[...] గద్యపద్యాత్మకమై భక్తిరస పూరితమైన శ్రీమ[...] యుణోపదేశము.

లతాంగి:—ఇది ఏ. కృష్ణస్వామయ్య బి.[...] గారిచే రచియింపబడిన ౨౯ అధ్యాయముల [...] నవల. ఇది క్రౌనుసైజు ౩౧౭ పుటలు గలది. వెల [...]

ఇది యువకుల కొఱకును, విద్యార్థులకొఱకును [...] ముగ నుద్దేశింపబడినదట. ఇందు సంఘజీవన మందలి[...] న్యవిమయములు, స్త్రీవిద్య, స్వతంత్రత, బాల్య[...] హము, బాలవితంతువులు, నగలపిచ్చి, భోగపు [...] ములు మొదలగువాని మంచిచెడ్డలు చర్చింపబడినవి. [...] యభివృద్ధిని, అర్థములేని హిందూ ఆచారముల [...]

* పూర్వులగు అవధూతలు మన యిప్పటి ఆంగ్లసంఖ్య నూహించి వ్రాసినట్లున్నది. కాని వారు అ[...] చొప్పుననే ౩౬౬ రోజులై నప్పుడెట్లు సరిపెట్టుకొనవలెనో ఊహింపనట్లు తోచెడిని.

[పం. ౭.]

నమ్మకముల పోగొట్టుటనుగూర్చి యిందు యత్నముచేయ బడినది. శైలిపోషజుష్టమయి సరళముగానున్నది.

ఇది చెన్నపురి ఆనంద ముద్రాక్షరశాలవారివద్ద దొరకును.

భగీరథుడు:—ఇది బెజవాడ తాలూకా,పోరం కి నివాసులగు కొప్పరపు వెంకటరమణయ్యగారు వ్రాసినది. శ్రీమహాభాగవతములోని కథాంశమునే ప్రధానముగా తీసికొని యీకథ వ్రాయబడినదట. మధ్యమధ్య కొన్ని పద్యములును చేర్చబడినవి. బాలురకొఱకు ప్రత్యేకముగ నుద్దేశింపబడినది. క్రౌనుసైజు, ౮౮ పుటలు. వెల ౫ అణాలు.

(శ్రీ)చందలూరు మహాలక్ష్మమ్మ శతకము:- ఇది నెల్లూరు జిల్లా దర్శి డివిజన్, పోలవరం కాపురస్థులు పో. సుందరి వెంకటశేషాచలపతిరావుగారిచే రచింపబడినది. ఫుల్ స్కేపు చిన్నసైజు ౮౨ పుటలు గలది. వెల తెలియదు.

1. Charecter; 2. Student Life now and then.

[శీలము; విద్యార్థిజీవనము 'ఇప్పుడు, అప్పుడు'] శ్రీయుత కూచి నరసింహముపంతులుగారు ౧౯౧౯లోను, ౧౯౧౬ లోను కాకినాడ పిఠాపురము రాజావారి కళాశాలలో విద్యార్థుల కొసగిన యాంగ్లోపన్యాసము లివి. ఫూల్ స్కేపు చిన్నసైజున ౭౨ పుటలు, ౭౮ పుటలు గలవి. వెల ౨ అ, 3 అ.

వి.ఆర్.సి. ప్రెస్., విశాఖపట్టణమున ముద్రితము.

నీతికథారత్నాకరము:—౧, ౨, 3-భాగములు. క్రౌనుసైజు ౭౫, ౧౦3, ౧౯౯ పుటలు. వెల అ. ౬, ౮, ౯.

పిల్లలనీతికథలు:—౧, ౨-భాగములు. క్రౌను సైజు ౫౯, ౬3 పుటలు. వెల యొక్కొకటి అ. ౪.

ఈపై ౫ భాగములుగా వచ్చిన పైరెండు పుస్తకములును అనేక గ్రంథములనుండి యేర్చిన చక్కని నీతికథల సంపుటీకరణము. విద్యార్థుల కత్యంతోపయోగకరముగ నుండగలవు.

వైశంపాయనుడు:—ఇది శ్రీ కాదంబరీ మహా ప్రబంధకథాసార సంగ్రహము. కేవల కథాంశము మాత్రము వచనమున వ్రాయబడినది. ఇదియును బాలురకొఱ కుద్దేశింపబడినది. క్రౌనుసైజు ౭౫ పుటలు. వెల ౨ అ.

ఈపై గ్రంథములన్నియు తెలుగు సంస్కృత ములయందు పండితులైనట్టి విద్వాన్ మంకాల శ్రీపతి గారిచే రచియింపబడినవి.

దొరకుచోటు: బి.వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్స్, ౫౫, ౫౬ నాటుపిళ్లయార్ కోవిల్ వీథి, చెన్నపురి.

అఖిలపక్షమహాసభా సంఘమువారి నివేదిక

(నెహ్రూసంఘ నివేదిక)

ఈ నివేదిక మొట్టమొదట ౧౯౨౮ సం॥ ఆగష్టు నెలలో వెలువడినది. తరువాత నాయా రాష్ట్రముల కాంగ్రెసు సంఘాధికారుల యాజమాన్యమున నాయా దేశభాషలలో దీనికి తర్జుమాలు వెలువడినవి. తెలుగు తర్జుమా ఈనడుమ ప్రకటింపబడినది. వలయువారు ఆంధ్రపత్రికా కార్యాలయము, నెం. ౯, తంబుశెట్టివీథి, మదరాసు- అను విలాసమునకు వ్రాసికోవలెను. పుస్తకము వెల రూ ౧-౦-౦ మాత్రమే.

గౌహతీ కాంగ్రెసు సమావేశము ముగిసిన తరువాత ౧౯౨౮ సం॥ మేనెలలోగూడిన అ. భా. దే. మ. ఉపసంఘమువారు కాంగ్రెసు కార్యనిర్వాహకసంఘము, దేశములోని తక్కిన రాజకీయ పక్షములతో గూడబలుకుకొని, యొక స్వరాజ్య ప్రభుత్వవిధానమును నిర్ణయింపవలయునని తీరుమానము గావించిరి. తరువాత డిసెంబరు నెలలో చెన్నపురిలోగూడిన దేశీయమహాసభయు నిట్టి తీరుమానమునే మఱియొకదాని నామోదించెను. ఈ తీరుమానముల ఫలితమే అఖిలపక్ష మహాసభ. ఈ మహాసభచే నెహ్రూగారి యధ్యక్షతతో నియమింపబడిన యుపసంఘమువారీ నివేదికను సిద్ధపరచినారు.

నెహ్రూసంఘనివేదిక వెలువడినది మొదలు నేటి వరకు దాని కనుకూలముగను, ప్రతికూలముగను, ఎన్నియో వాదములు బయలుదేరినవి. అనుకూలవాదమే యెక్కువ. మొత్తముమీద నీపక్షపు వాదమంతయు నొకేసిద్ధాంతముపై నాధారపడి యుండును: దేశములోని ప్రధాన రాజకీయ పక్షములన్నిటి యంగీకారమును సంపాదింపగలిగినది కాబట్టి యీ విధానమున కందరొప్పుకొని తీరవలయునని. ఇంక ప్రతికూలపక్షపు వాద మెక్కు తెగకు

జెందినదికాదు. దానిలో స్వాతంత్ర్యవాదము, సాంఘిక వాదము. మున్నగు వాదము లెన్నియో కలవు.

ఇది క్లుప్తముగ నీ నివేదిక చరిత్ర.

ఈ వాదభేదములను గాని, నివేదికలోని యంశములనుగాని విమర్శించుటకిది తావు కాదు. అందుచే మొత్తముమీద నివేదిక స్వభావమును గూర్చి నాలు గైదు మాటలలో జెప్పి యంతటితో విరమించెదము.

సంపూర్ణ స్వాతంత్ర్యము, సాంఘిక ప్రాతినిధ్యము, ఎన్నికహక్కులు మున్నగు నంశములను వేరువేరుగ విమర్శించి నెహ్రూనివేదికను చీల్చి పారవేయ దలచువారికి గావలసినంత యవకాశము కాని యీ సందర్భమున న్యాయ్యముగ బట్టదగిన దారి యదికాదు. ఇచ్చిపుచ్చుకొనగల యుదారభావముతో నీ నివేదిక నెల్లరు గ్రహింపవలయును. ఎన్నియో భిన్నాభిప్రాయములకు సాధ్యమయినంతదగ్గరి సమన్వయమిది యని గురుతింపవలయును. ఇందలి వివిధ నిర్ణయములు పరస్పరాధారములపై నిలిచి యున్నవను మాట నేమరక మనసున నుంచుకొనవలయును.

పై మూడు సిద్ధాంతముల యాధారము మీదనే నెహ్రూసంఘు నివేదిక యేర్పడినది. ఈ సందర్భమును పురస్కరించుకొని సంఘమువారు సాంఘిక ప్రాతినిధ్యము, రాష్ట్రవిభజనము, స్వదేశసంస్థానములతో భారతప్రభుత్వపు సంబంధము మొదలగు క్లిష్టసమస్యలను సమర్థతతో జర్చించియున్నారు. అందుచే నిది భారతీయరాజ్యాంగ వ్యవహారములపై శ్రద్ధ గలవారందరు తప్పక చదువదగినది.

ఈ నివేదికను తెనిగించినవారు ఆంధ్రపత్రిక సంపాదకీయశాఖకు జెందిన శ్రీయుత ఓగేటి వెంకటసుబ్బయ్యశాస్త్రి (బి. ఏ.) గారు. క్లిష్టములగు నిట్టి సంగతులను వ్రాతలో బెట్టునప్పుడు శైలి యెంత బెట్టుసరి పడియున్న, ఎంత ధారాళముగనున్న నంత మంచిది. మొత్తముమీద మిగుల సరళమై తేటతెల్లముగనున్న శాస్త్రిగారి తెనిగింపు పైసంగతిని బూర్తిగ బాటించినదని చెప్పవచ్చును. దీనికి శాస్త్రిగా రభినందనీయులు. (ప్ర. రం.)

**The Beginnings of Local Takation in the Madras Presidency** (ఇంగ్లీషు)

గ్రంథకర్త: మామిడిపూడి వెంకటరంగయ్యగారు, యం. ఏ., అధ్యక్షులు, శ్రీవెంకటగిరి మహారాజాగారి కళాశాల, నెల్లూరు.

క్రౌనుసైజున ౧౦౪ పుటలు; వెల తెలుపలేదు.

ఈగ్రంథమాంధ్రవిశ్వకళాపరిషత్తు ప్రథమప్రచురణము.

**జాతకఫల మణిమంజరి, భా. ౧**

గ్రంథకర్తలు: ఇవటూరి అయ్యన్న, మూర్తిరాజశర్మగార్లు. డిమ్మి ౧౯౮ పుటలు. వెల రు ౧-౮-౦.

విలాసము: ఇవటూరి మూర్తిరాజ శర్మగారు, కొవ్వూరు.

**పరమభాగవతులు:**—ఇది మండలీకము వెంకటశాస్త్రి, బి. ఏ., యల్. టి. గారిచే రచియింపబడినది.

క్రౌనుసయిజు ౧౨౦ పుటలు, వెల ౧౨ అ.

ఇందు ధ్రువుడు, ప్రహ్లాదుడు, గజేంద్రుడు, చక్రవర్తి, అంబరీషుడు వీరిచరిత్రములు చక్కనిశైలిని వర్ణింపబడినవి. మధ్యమధ్య కొన్ని పద్యములు కూడ చేర్చబడియుండుట చదువువారికి కింపుగొల్పును.

వలయువారు సుసర్ల వెంకటసన్యాసి, బి. ఏ., యల్. టి. గారికి (పర్లాకిమిడి, గంజాంజిల్లా) వ్రాయవలెను.

**మార్కండేయ విజయము:**—ఇది శ్రీపతిశాస్త్రిగారిచే రచియింపబడిన అయిదంకముల నాటకము. డెమ్మిసయిజు ౯౪ పుటలు. వెల ౧౨ అణా.

చిరంజీవియు, మృత్యుంజయుడునైన మార్కండేయునికథ యనేకు లెరింగినదే యైనను నాటకరూపమున నది మరింత యింపుగూర్చును. ఈనాటకమునకనుబంధముగ కొన్ని పాటలును కూర్చబడినవి.

దొరకుచోటు: శాస్త్రిబ్రదర్సు, కాకినాడ.

**ఛత్రసాలుడు:**—భా. ౧. (నవల)

ఆంధ్రప్రచారిణీ గ్రంథమాలా ప్రచురణము. లేఖకులు కొంపెల్ల జనార్దనరావు, ప్రతివాది భయంకరం రంగాచార్యులు గార్లు.

డిమ్మిసయిజు వెల రు. ౧-౮-౦.

విలాసము: ఆంధ్రప్రచారిణీ. గ్రంథమాల, పిఠాపురము.

**శృంగార సత్యభామా సాంత్వనము:**—

నాల్గాశ్వాసముల ప్రాచీనప్రబంధము.

గ్రంథకర్త: లింగనమఖి కామేశ్వరకవి. క్రౌనుసయిజు ౨౭౪ పుటలు. కాగితము బైండు అందముగనున్నది. వెల రు 3-0-0.

ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండు కో, తెప్పాలుపెట్టై నం. ౧౧౧. చెన్నపురి.

# సాభిప్రాయ విశేషములు

ఈయేడు కాంగ్రెసుయాత్ర మూడునాళ్ల ముచ్చట గాక పదిదినముల ముచ్చటయైనది. సైమనుకమిషను దయవలన జాతీయ గౌరవమునకు ప్రబోధము గలిగినది. సైమనుకమిషను బహిష్కరణము దేశమునం దంతటను యథావిధిగ సాగుచున్నది. దేశహితపరాయణులు బహిష్కరణ ప్రచారమును జేయుచున్న విధమున స్వార్థపరాయణులు స్వాగతములను సమర్పించుటయందును వింత లేదు. ప్రఖ్యాతమైన రాజకీయపక్షము లన్నియును సహకారమార్గమును వదలి బహిష్కరణమార్గము నవలంబించుచున్నవి. ప్రముఖులైన నాయకులందరును బహిష్కరణదీక్ష నవలంబించుచున్నారు. సైమనుకమిషను వెళ్లిన ప్రదేశములందు బహిష్కరణ దళములు నల్ల జండాలతోను, నిర్గమనధ్వానములతోను ప్రత్యక్షమగుచున్నవి. బహిష్కరణ ప్రచారము నిరంకుశవర్గమునకు కోపావేశమును గలుగజేయుచున్న విధమును వారి దౌర్జన్యవిధానము విశదము చేయుచున్నది. లాహోరునందును, లక్నోయందును పోలీసువారవలంబించిన దౌర్జన్యమార్గము బ్రిటీషుప్రభుత్వతత్త్వమును విశదము చేసినది. లాహోరునందు లాలాజి మొదలగువారును, లక్నోయందు జవాహరిలాలుగారు మొదలగువారును ననుభవించిన క్రూరవేటులు బ్రిటీషుప్రభుత్వ స్వభావమును విశదము చేసినవి. పాట్నాయందు రాజేంద్రప్రసాదుగారును, వారి యనుచరులును నవలంబించిన శాంతిమార్గము బ్రిటీషు దౌర్జన్యమును భేదింపగలిగినది. "అందితే జుట్టు, అందకపోతే కాళ్లు" అనెడి సామెత సార్థకమగుచున్నది. స్వయంకృతాపరాధమునకు ఫలము ననుభవించుట, పశ్చాత్తాపమును బొందుట మానవ ధర్మము. అపరాధపరంపరలను జేయుట యాసుర ధర్మము. బహిష్కరణమునకు గారకులు నిరంకుశవర్గముగాని భారతీయులు గారు. నిరంకుశవర్గము తామవలంబించిన మార్గమునకు ఫలము ననుభవించుట ధర్మముగాని యితరులను నిందించుట, దండించుట ధర్మము గాదు. ఇర్విను ప్రభువు కలకత్తాయందు జేసిన ప్రసంగమునందు నిరంకుశ హృదయమును విశదము చేసెను. బహిష్కరణవాదులను నిందించుటయును, యూరపియను సంఘమున కభయము నొసంగుటయును, సంపూర్ణస్వాతంత్ర్యవాదులను బెదరించుటయును, సైమనుకమిషను ప్రయోజనమును ఇర్వినుప్రభువు వ్యక్తము చేసెను. ఇర్వినుప్రభువు యూరపియను సంఘసమక్షమున జేసిన ప్రసంగము రాయలు కమిషనువలనను గలుగనున్న ఫలమును సూచించుచున్నది. సైమనుకమిషను ప్రవర్తనము, ఇర్విను ప్రభువర్యుని ప్రసంగము భారతీయులకు జ్ఞానోపదేశమును జేయుటకు దగియున్నవి. భారతహృదయమునావరించినపారతంత్ర్యవ్యామోహమును బోగొట్టుట కిట్టి స్వల్పకారణములు సాధనములు గాజాలవు. ప్రజానాయకులు పారతంత్ర్యవ్యామోహమును విసర్జించు

టకు విశేషమైన దుఃఖానుభవ మవసరమని సహకారహృదయము విశదము చేయుచున్నది. ఆత్మగౌరవమును, ఆత్మవిశ్వాసమును లేని ప్రజలకు మోక్షణోపాయము సాధ్యముగాదు. భారతీయుల కెప్పుడీభాగ్యము గలుగునో దురూహాముగ నున్నది. నిరంకుశ వర్గముయొక్క చర్యలు భారతజాతీమైక్యమునకు వినియోగపడుచున్న విధమును సకలపక్ష సమావేశము విశదము చేయుచున్నది.

* * * *

సకలపక్ష సమావేశము

కలకత్తాయందు డిసెంబరు మాసాంతమునందు సమావేశమైన సకలపక్ష సమావేశము భారతస్వాతంత్ర్య సంరంభమునందు నవ యుగారంభమును విశదము చేయుచున్నది. డాక్టరు అన్సారిగారి యాధిపత్యము క్రింద నన్నిపక్షములవారును గూడి భారత రాజ్యాంగవిధానమును నిర్ణయించుట భావి భాగ్యోదయమునకు శుభసూచకముగ నున్నది. భరతవర్షము వివిధ మతములకు, జాతులకు, కులములకు, భాషలకు, సాంప్రదాయాచారములకు నిలయము. భరతవర్షమును మహమ్మదీయులు పాలించినను, క్రైస్తవులుపాలించినను, మరెవరు పాలించినను హిందూదేశమున హిందువులు రెండు వంతులు గలరు. హిందువుల పూర్వాచారపరాయణత్వము హిందూసంస్కారమును చిరకాలము రక్షించినది. చిరకాల సంరక్షితమైన హిందూసంస్కారము ప్రత్యేకత్వమువలనను హిందూసంఘమునకును, మానవ సంఘమునకును నిరర్థకముగ నున్నది. హిందూసంఘము భావమునందువలె కార్యమునందును విశ్వజనీనత్వమును బూనవలసిన యవసరము వర్తమానకాలమునం దేర్పడినది. హిందు సిక్కులు, మహమ్మదీయులు, పార్సీలు, క్రై వులు, నిమ్నజాతులు, బ్రాహ్మణులు, బ్రా ణేతరులు, యూరపియనులు వారి యోజనములకై పెనుగులాడునపుడు హి దేశము నామ మాత్రావశిష్టముగ ను ఇతరు లేలాభములను గోరినను హిందు మాత్రము హిందూదేశలాభములనుగో యుందురు.

హిందూ ధర్మమును చిరకాలము డిన బ్రాహ్మణులు ముఖ్యముగ స్వా జనములను విసర్జించి మాతృదేశ ప్రయో ములను సంరక్షించుట యవసరంబుగ న హిందూదేశమును సంరక్షింపవలసిన భా హిందువులమీద ముఖ్యముగ నున్నది. పక్షసమావేశమునందు హిందువులు భాగ్యసంరక్షణమునకు సంపూర్ణ త్యాగ జేయవలసిన యవసరమును గ్రహిం యుందురు. మహమ్మదీయుల లక్ష్యము భా మునందుగల మహమ్మదీయ ప్రపంచము లగ్నమగుచున్నటులు హిందూదేశము లగ్నముగాకున్నది. క్రైస్తవుల లక్ష్యము శీయులమీద నాధారపడియున్నది. హిం దేశమునగల సంఘములన్నియును భాగ హిందూదేశక్షేమమునకు సాధనము. ము వెనుకబడినను హిందూదేశము వెనుక చున్నది. సకలసంఘములకును, మతము తల్లియైన భరతమాతకు దాస్యవిమోచన నపుడన్ని సంఘములునుదాస్యవిమోచన బొంది వికసింప గలవు. సకలపక్షసమా నం దన్నిపక్షములవారును, మతముల ఃక్షాభిమానమును, మతాభిమానమును

త్యజించి యథార్థమైన మాతృదేశాభిమానము బూని దేశస్వాతంత్ర్యప్రాప్తికై పాటుపడవలసి యుందురు.

సకలపక్ష సమావేశారంభమునందు సేనుగుప్తగారు, అన్సారిగారు, మోతిలాలుగారు చేసిన ప్రసంగము లీమార్గమునె యవలంబించినవి. ఆలీసోదరులు చేయుచున్న హడావడి మాత్రము సంభ్రమమును గలుగ జేయుచున్నది. మహమ్మదీయమతము పేరట నేమేమియొ ప్రగల్భములను గొట్టుచున్నారు. కత్తులు, యుద్ధములు మాటిమాటికి ఎగిరిపోవుచున్నవి. గాంధి మహాత్ము డుపదేశించిన హిందూమహమ్మదీయ సంయోగము, అహింసాతత్త్వము మూలబడినవి. మహమ్మదీయప్రాభవము, దౌర్జన్యము సర్వత్ర ప్రత్యక్షమగుచున్నవి. ఆలీసోదరుల ప్రగల్భములు హిందువులకే కాక మహమ్మదీయులకును నసహ్యమును గలుగజేయుచున్నవి. హిందూదేశసౌభాగ్యమును దేశలక్ష్యముతో జూచుట ధర్మముకాని మహమ్మదీయ ప్రపంచలక్ష్యముతో జూచుట సమంజసముగాదు. ఆలీసోదరు లెంతపెద్ద దుందుభులను మ్రోగించినను హిందువులు మాత్రము ప్రశాంతమనస్కులై హిందూదేశమును, ప్రపంచశాంతిని నుద్ధరించుట ధర్మము. ప్రజ్ఞావంతులైన మోతిలాలునెహ్రు అన్సారిగారల యాజమాన్యము క్రింద కాంగ్రెసు మహాసభయును, సకలపక్ష సమావేశమును స్వధర్మనిర్వాహణమును జేయుటకు కాళికాదేవి ప్రసన్నురాలగునని నమ్ముచున్నాము. భారతీయులందరును లబ్ధావకాశములను సద్వినియోగము చేయుదురుగాత!

*　　*　　*　　*

పండిత మోతిలాలు నెహ్రు గారు

శ్రీయుత మోతిలాలునెహ్రుగారికి కలకత్తా నగరరాజము సమర్పించిన సుస్వాగత మపూర్వముగ నున్నది. ఏ స్నేహాట్టునకుగాని, రాజప్రతినిధికి గాని, నాయకునకు గాని ఇట్టియపూర్వమైన స్వాగతంబును కలకత్తానగర మొసంగియుండలేదు. ముప్పదినాలుగు శ్వేతహయములు గట్టిన రథము, జాతీయపతాకములు, జాతీయరక్షకభటులు, స్వాగతతోరణములు, స్వాగత జయఘోషములు, అపార ప్రజానివహములు, పుష్పవర్షములు, ప్రజలకు మోతిలాలుగారిపట్లగల పరమ భక్తివిశ్వాసములకు నిదర్శనములు. మోతిలాలుగారికి ప్రజలు చూపిన భక్తి ప్రజా హృదయమునం దుప్పొంగుచున్న స్వాతంత్ర్యోత్సాహమునకు నిదర్శనముగ నున్నది. నెహ్రురిపోర్టు మోతిలాలుగారి ప్రతిభను విస్తరింపజేసినది. మోతిలాలుగారి బుద్ధికుశలత నెహ్రురిపోర్టునందును, వారి వాదప్రతివాదములందును విశదమగుచున్నది. వివిధ రాజకీయ పక్షములను, హిందువులను, మహమ్మదీయులను నేకముచేయగల రాజ్యాంగవిధానము మోతిలాలుగారి ప్రతిభను విస్తరింపజేసినది. కలకత్తా కాంగ్రెసునకు నివేదికను సిద్ధముచేసిన పండిత మోతిలాలు నెహ్రుగా రధ్యక్షులుగ నుండుటయును శుభచిహ్నముగ నున్నది. ఒకవైపున నిరంకుశవర్గము, సైమనుకమిషను, స్వప్రయోజన పరాయణులు దేశమును సంక్షోభమయము చేయుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నారు. ఒకవైపున సర్వపక్ష సమావేశము శాంతిని, సంయోగమును సమకూర్చుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నది. సర్వపక్ష సమావేశమునకు

సూత్రధారుడైన పండిత మోతీలాలు నెహ్రూ గారి ప్రయత్నములను సఫలము చేయుటకు స్వాభిమానమును విడిచి సకలపక్షముల వారు ను త్రికరణశుద్ధిగ పాటుపడుటకు భగవంతు డనుగ్రహించుటకు దేశమంతయును వేడుట సహజము. అపూర్వమైన సర్వపక్ష సమావేశ మునకును, కలకత్తా కాంగ్రెసునకును నమూ ల్యఫలము పరమేశ్వరుడు ప్రసాదించుగాత!

*　　*　　*　　*

రాజా రామారాయణంగారు

శ్రీపానుగల్లు రాజా రామారాయణం గారి ఆకస్మికమరణము వారి కుటుంబమునకే కాక, ఆంధ్ర దేశమునకును, చెన్న రాష్ట్రమున కునుఅపారమైననష్టమునుగలుగజేసినది. సామా న్యకుటుంబమునందు జనించినను రామారాయ ణంగారు స్వయంసహాయమువలన మహోన్నత స్థితి నధిష్ఠింప గలిగిరి. విద్యోపార్జనముచేసి ఎమ్. ఏ. పరీక్షయందు తీర్ణులై సంస్కృతాంధ్రాంగ్ల ములందు మంచి పాండిత్యమును గడించిరి. లక్షల రూప్యముల వసతుల నార్జించి సుస్థిర ముగ రాజాబిరుదము నార్జించిరి. ఆరేండ్లు ప్రధానమంత్రిత్వమును వహించి చెన్నరాష్ట్ర రాజ్యాంగముల స్వహస్తగతముచేసికొన గలి గిరి. మంత్రిపదవి లేకపోయినను మంత్రులను, నిరంకుశవర్గమును వశపరచుకొని రాజ్యాంగ ములను వశపరచుకొనగలిగిరి. రామారాయ ణంగారి ఆంధ్రభాషాభిమానము, ఆంధ్రదేశా భిమానము, స్వపక్షాభిమానము, స్వాతంత్ర్య ప్రియత్వము వారి శత్రువులకును, మిత్రులకును వారిమీద గౌరవమును గలుగజేసినవి. వారి నాశ్రయించి నమ్మినవారికి వారు బ్రాహ్మణ బ్రాహ్మణేతరభేదము లేక ఉపకారము జేయుచుండిరి. నిరంకుశవర్గమునకును రా రాయణంగారు పట్టుకొమ్మమై రక్షకు నుండిరి. రాజ్యాంగతంత్రమునందును, గు ందును వారికి గల వివేచనశక్తి స్వవిషయమునందును, స్వపక్ష ప్రయో



కీ. శే. సర్ పానుగంటి రామారాయణం గా
కె. సి. ఐ. ఇ., యం. యల్. సి.,

నందును వలె దేశ ప్రయోజనమున వినియోగించగలిగి ప్రజాగౌరవమునకు పా లైరి. ఆయుర్వేద వైద్య విషయమునను, భాషలవిషయమునను, ఆంధ్రవిశ్వవిద్యా విషయమునను, ధర్మాదాయ దేవాదాయ యమునను వారు చూపిన పట్టుదల వా వాదములకు గారణమైనను వారి గాఢాభి మునకును, దూరదృష్టికిని నిదర్శనముగనున్న పరమేశ్వరుడు వారి యాత్మకును వారి కు బమునకును శాంతిని ప్రసాదించుగాత!

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Ma

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—చెరువుకు; మాలివి.

సాధారణ చిత్రములు:—భారతీయ ప్రేమగీతచిత్రములు* ౪; శిల్ప ప్రకృతిచిత్రములు ౩; ఉమర్ ఖయ్యామ్ చిత్రము ౧; మైసూరు నబ్బుపరిశ్రమ చిత్రములు ౮; జాతీయ మహాసభ చిత్రములు ౨౧; ఆకస్మిక ఛాయాచిత్రములు, ఇతర చిత్రములును.

* ఇది Lawrence Hope గారి The Garden of Kama అను గ్రంథమునందు Indian Love Lyrics అను పేరనున్నది. ఈనాల్గుచిత్రములు, మూడు శిల్పప్రకృతి చిత్రములు, ఉమరుఖయామ్ చిత్రము, సర్వే ఆఫ్ ఇండియా ౧౯౨౭, ౧౯౨౮ సంవత్సరముల సంవత్సరాదిసంచికలనున్న చిత్రములనుండి తీసికొనబడినవి.



"చెరువుకు"

[చిత్రకారుడు: శ్రీ ఏ. సోమేశ్వరరావుగారు]




చెన్నపట్టణము, ఫిబ్రవరి ౧౯౨౯

సంపుటము ౬ విభవ సంవత్సరము మాఘమాసము సంఖ్య ౨

## సామివేణువు

విశ్వనాథ సత్యనారాయణగారు

ఓయి! సామి! నీసామి వేణూరు మధురి
 తా రవము లిందు వినవచ్చెనయ్య! వాని
వెంట నీ కన్ను బొమవంక విచలితాధ
ర ప్రకంపమ్ము నా కేకర ప్రసారి
తాక్షమును యథాదృష్టములట్లు తోచె.

ఈతడవ—మున్ను తెలిసెను లే—గృహమ్ము
కదలఁజాలను—నీ మోసగానితనము.

సామి! నీ సామివేణునిస్వాన మరటి
బోదెలం బోని నా త్రొడల్ పొదివికొంచు
కలమ వెన్నులబోని జంఘలను కదిపి
తీసికొని పోవునా యేని తీసికొంచు
బోవనీ! నేనుమాత్రము బుద్ధిపూర్వ
కముగ మాయింటిపట్టున కదలిరాను.

# ఆంధ్రభాషయందలి సంస్కృతవృత్తములు

తేకుమళ్ల రాజగోపాలరావు గారు

## మొదటి ఛందస్సు (ఉక్త) *

వృత్తసంఖ్య 2†

వృత్తసంఖ్య—

1. శ్రీవృత్తము—పాదమున కొక్కొకగురువు.

## రెండవ ఛందస్సు (అత్యుక్త)

వృత్తసంఖ్య (4)

ఈ ఛందమునుండి ప్రాస మారంభమగును.

1. స్త్రీవృత్తము—పాదమునకు రెండేసిగురువులు. కవిజనాశ్రయమున నిది మధ్యమవృత్తము.

## మూఁడవ ఛందస్సు (మధ్య)

వృత్తసంఖ్య (8)

1. నారీవృత్తము—పాదమునకు మూఁడేసిగురువులు కన్నడమున నిది వామాంగము.
2. కేస—పాదమున కొక్కయగణము. (వృ) § కన్నడమున నిది రతాంతము.
3. మృగి—పాదమున కొక్కొకరగణము కన్నడమున నిది పావనవృత్తము.
4. వినయము—పాదమున కొక్కొకసగణము కన్నడమున నిది ప్రవరము. (కవిజనా.)

## నాలుగవ ఛందస్సు (ప్రతిష్ఠ)

వృత్తసంఖ్య (16)

1. కన్య—పాదమునకు నాలుగేసి గురువులు.
2. వ్రీడ—యగ. కన్నడమున నిది వామాంగము.(వృ)
3. సమృద్ధి—రగ. కన్నడమున నిది దేవరమ్యము.(వృ)
4. సుమతి—సగ. కన్నడమున నిది మృగనేత్ర. (వృ)
6. సుకాంతి—జగ. కవిజనాశ్రయమున నిదివిలాసిని. కన్నడమున నిది జనోదయ.

ప్రయోగము—ధ—నా—ర్జ—నా

ధనప్రియా

ధనాధిపా

ధనంజయా— సీతారామాంజనేయ.

ఆ 3—22.

7. బింబ—భగురువు. వృత్తరత్నాకరమున నిది సుముఖి; కన్నడమున సౌందరము.

## అయిదవ ఛందము (సుప్రతిష్ఠ)

వృత్తసంఖ్య (32)

3. క్రీతి—రగగ. కన్నడమున నిది నందకవృత్తము.
4. ప్రగుణ—సగగ. కన్నడమున నిది సన్మృగనేత్రము. (కవిజనా.)
6. సతి—జగగ. కన్నడమున నిది అనంగము. (వృ)
7. పంక్తి—భగణము 2 గురువులు. కావ్యాలంకార చూడామణి యందును, కవిజనాశ్రయమున నిది సుందరీవృత్తము. కన్నడమున నిది కాంచనమాల.
13. నంద—తలగ. వృత్తరత్నాకరమున నిది మంద వృత్తము. కన్నడమున నిది తిలకము.
15. అంబుజము—భలగ. కన్నడమున నిది క్షేమ. (కవిజనా.)

---

* ఇది ఛందోనామమును దెలుపును.

† ఇది యాఛందమునఁబుట్టిన వృత్తములసంఖ్యను తెలుపును.

§ ఏఛందోగ్రంథమున దీనిలక్షణము లున్నవో తెలుపును.

## ఆఱవఛందస్సు (గాయత్రి)

వృత్తసంఖ్య (64)

కావ్యాలంకారచూడామణియం దిటనుంచి విన్యాసం దోధి కార మారంభమగుచున్నది.

1. సావిత్రి—మ మ.
3. మాలిని—రస. (వృ.)
10. విచిత్ర—య య.
13. తనుమధ్య—తయ.
15. చంద్రవదన—భయ. కన్నడమున నిది శశికాంతము.
16. శశివదన—నయ. కావ్యాలంకార చూడామణి యందును, కవిజనాశ్రయమునను నిది సురలత. అప్పకవి సురలత యను నింకొక వృత్తము క్రింద మరల శశివదన లక్షణమునే చెప్పియున్నాఁడు. కన్నడమున నిది యుదాత్తము.
17. నదీవృత్తము—నర. (వృ.)
25. ముకుళము—నస. (వృ.) కన్నడమున కమలము, ముకుళము, ముకురము.
28. వసుధ—స స. వృత్తరత్నాకరమున నిది రమణీ వృత్తము.
కన్నడమున కుముదము, వినతము, ముకురము.
29. వసుమతి—తస.

## ఏడవ ఛందము (ఉష్ణిక్కు)*

వృత్తసంఖ్య 128

20. హంసమాల—సరగ. కన్నడమున నిది సరళము, 6 యతి.
26. మదలేఖ—మసగ. (వృ.) 4 యతి.
30. కుమారలలితము—జసగ. 6 యతి.
31. సురుచిరము—భసగ. (కవిజనాశ్రయము) అప్పకవీయమున నిది సరసిజము.
43. విభూతి—రజగ.
ప్రయో: మోక్షలక్షణేక్షణా
మోక్షధర్మరక్షణా
మోక్షసౌఖ్యదాయకా
మోక్షరాజ్యనాయకా—యతి లేదు.
సీతారామాం. ఆ. 8-24.
56. మధుమతి—నభగ. (వృ.)
64. మదనవిలసితము—ననగ. (అప్పకవి)
కన్నడమున నిది సులభము.

## ఎనిమిదవ ఛందస్సు (అనుష్టుప్పు)

వృత్తసంఖ్య 256

1. విద్యున్మాల—మమగగ.
ప్రయో: ధర్మారాధ్యా—ధర్మాన్వేష్టా
ధర్మాధర్మా—త్మా ధర్మజ్ఞా
ధర్మాధారా—ధర్మాకారా
ధర్మాధర్మా—త్యంతాభావా.
యతి 5-వ యక్షరము.
సీతారా. ఆ. 8-21.
6. వితానము—జమగగ. (అప్పకవీయము)
38. విమానము—జతగగ. (అప్పకవీయము)
43. సింహరేఖ—రజగగ.
55. చిత్రపద—భభగగ.
57. హంసరుతము—మనగగ.
85. నారాచము—తరలగ. (అప్పకవీయము)
వృత్తరత్నాకరమున నిది నారాచిక.
86. ప్రమాణి—జరలగ. వృత్తరత్నాకరమున నిది ప్రమాణిక.
87. నాగరము—భరలగ. వృత్తవృత్నాకరమున నిది నాగరకము.
103. మాణవకము—భతలగ. కన్నడమునను, వృత్తరత్నాకరమునను గూడ నిది మాణవకమే.
107. సమాని—రజలగ.వృత్తరత్నాకరముననిదిసమానిక.

ఇవి గాక వృత్తరత్నాకరమున వితాన మను పై యాఱవవృత్తము పేర జతగగ (ప్రస్తారమున 38-వ వృత్త

* వృత్తరత్నాకరమున నిది ఉష్ణి.

ము) అనులక్షణ మొకటియు రసలల (208) అను లక్షణ మొకటియుఁ గానవచ్చుచున్నవి.

## తొమ్మిదవ ఛందస్సు (బృహతి)

### వృత్తసంఖ్య (512)

128. భుజగశిశుభృతము—ననయ. కవిజనాశ్రయమునను, అప్పకవీయమునను దీని కిదియే లక్షణము; కాని వృత్తరత్నాకరమున దీనికి—ననమ-లు. కావ్యాలంకారచూడామణిలో—ననయ-లు కల యిది భుజగశిశురుతము.

183. ఉత్సుకము—భభర. (కవిజనా.)

187. భద్రకము—రనర. కన్నడమున నిది హలాయుధ

251. హలముఖి—రనస. (వృ.) [ము.

## పదియవ ఛందము (పఙ్క్తి)

### (1024)

ఈఛందమునుండియే యతి యారంభము. విద్యున్మాల యొక్కటిమాత్రము ఆంధ్రమున నెనిమిదవ ఛందమునవే యతితో నొప్పుచున్నది. వృత్తరత్నాకరమున నేడవఛందమునఁగూడ సంస్కృతఫక్కిని యతి చూపఁబడినది.

క. ఇట నిం దీవలవిశ్రమ
ఘటనలు కల్పింపవలయుఁ గబ్బంబుల నె
చ్చట నిలుపంగాఁ దగు న
చ్చటఁ దగఁ బరికించి నిలుప శాస్త్రప్రాప్తిన్.
—కావ్యాలంకార చూడామణి—౭-౯౮.

క. పదలక పంక్తిచ్ఛందము
మొదలుగ నిట, మీఁదిఛంద*ముల, కందముగా
నుదయించువృత్తసమితికి
విదితంబుగ వళులు వలయు* విధు రవి నయనా
—అనంతునిఛందము, ఆ. ౨—౨౫.

క. వెలయ నిటఁ బట్టి (=పదియవ ఛందము)వళ్లి డ
వలయును విశ్రమము నిలుప * వలయును గబ్బం
బులఁ గావున నే నెయ్యెడ
నిలిపితి నయ్యెడల నెఱిఁగి * నిలుపుఁడు వానిన్.
—కవిజనాశ్రయము, వృత్తాధికారము, ౩౫.

121. పణవము—మనయగ—యతి 6వ యక్షరము. (అప్పకవి.)

ప్రయో: తీర్చెన్ మా—నుల * ది—గులిన్వే—గం
జేర్చెన్ మాకుం * జిరసౌఖ్యంబుల్
దీర్చెన్ లోకుల * దినగండంబుల్
మీ రెన్ నీబలి*మి యమేయం బై.
—ఉత్తరరామాయము, ఆ. ౬—౧౪౬.

ఒకానొక ముద్రితభారతప్రతియందు దీనిని బ్రణవమనుట లేఖకప్రమాదమేమో! ఏతత్పద్యము:

ప (ప్ర?) ణవము:—నీయుల్లం బొక*నియతింగార్యం
బాయత్తంబుగ * ననుసంధింపం
జేయం జాలవు * చెడుతెర్వుం బోఁ
బాయం ద్రోవవు * బలిమిం బుత్త్రా.
—భార. స్త్రీ. ఆ. ౧-౧౯౫.

అనంతుని ఛందమునమాత్ర మిది ప్రణవము.

వృత్తరత్నాకరమునను, గవిజనాశ్రయమునను గూడ నిది పణవమే.

171. మయూరసారి—రజరగ—యతి 7.

వృత్తరత్నాకరమున నిది మయూరసారిణి; అప్పకవీయమున దీనికి మయూరభాషిణి యని పాఠాం.

187. రసాలి—రనరగ—యతి 7. (అప్పకవి)

199. రుగ్మవతి—భమసగ—యతి 6.

వృత్తరత్నాకరమున నిది రుక్మవతి; అప్పకవీయమున దీనికి చంపకమాలి యని పాఠాంతరము. కన్నడమున నిది మందానిలము. ఆంధ్రకామకళానిధియం దిది చాపది. ఆప్రయోగము:—

చా ప ది

భోసలవంశాం*భోనిధిచంద్రా
భాసురతేజో౽*పాస్తదినేంద్రా

శ్రీసముదాత్తా * శేషవిశేషా
వాసవభోగా * వర్ణితవేషా.

—కామకళానిధి, ఆ. ౧.

207. పంచకమలావృత్తము—భయసగ. యతి 7.

—(కవిజనా.)

219. మణిరంగము—రససగ. యతి 6.

220. మేధవిత—ససనగ. (వృ.)

241. మత్తావృత్తము—మభసగ. యతి 6.

అప్పకవీయమున దీనికి హంసశ్రేణి యని పా.

మణిరంగ మను పేరఁ గూడ నం దిదియే వృత్తము చెప్పఁబడినది. వృత్తరత్నాకరమున నిది జ్ఞేయవృత్తము. కన్నడమున పూజ్యము, నవ్యము నని దీనికి పేళ్లు. అనంతుని ఛందమున యతి 8.

296. కౌముది—నతతగ. యతి 6. (అప్పకవీయము)

344 మనోరమ—నరజగ. యతి7. (అప్పకవీయము)

343. శుద్ధవిరాటి—మసజగ. యతి 6. కవిజనాశ్రయమున నిది శుద్ధవరాటి. కావ్యాలంకారచూడామణియం దిది శుద్ధవరాట.

ప్రయో: ఉల్లంబ ప్రియ*మొందఁ గ్రొత్త సం
ధిల్లన్ సెవ్వగ * దీనవక్త్రుఁ డై
యొల్లంబోవుచు * నున్న నవ్విభుం
డల్లం గౌఁగిట * నాన్నృపాలకున్.

—భార. స్త్రీ. ౧-౧౭౫.

351. భోగివిలసితము—భసనగ. యతి 7(అప్పకవీయము)

అప్పకవీయమున దీనికి విలసితమని పాఠాంతరము.

359. నందిని—భతజగ. యతి 6. (అప్పకవి)

429 పంక్తి—భభభగ. యతి 7. (అప్పకవి)

కన్నడమున నిది చిత్రపదము.

496. త్వరితగతి—నజనగ. (వృ.)

పదునొకొండవ ఛందస్సు (త్రిష్టుప్పు)

2048

256. వృంత—ననసగగ. 9 యతి. (అప్పకవి)

286. శిఖండి విరుతము—జసతగగ. యతి 7.

వృత్తరత్నాకరమునను, అప్పకవీయమునను దీనికి ఉపస్థితము, స్త్రీ యని పాఠాంతరములు. వృత్తరత్నాకరమునను, అప్పవీయమునను గూడ నొక స్త్రీవృత్తము రెండవ ఛందస్సులోనిది. వృత్తరత్నాకరమున మఱియొక స్త్రీ వృత్తమునకు భతనగగ, అప్పకవీయమున మఱియొక యుపస్థితమునకు తజజగగ—యతి 8; వృత్తసంఖ్య 365. కావున దీనికి శిఖండివిరుత మనియే నామకరణమును స్థిరీకరించుటయుక్తము.

288. వృత్తము—నసతగగ. యతి 7. (అప్పకవి)

289. శాలిని—మతతగగ. యతి 5.

అనంతుడును, భీమనయు, అప్పకవియు దీని కేడింట యతి చెప్పుచున్నారు. కన్నడమున 8 యతి. కామకళానిధియందు దీనికి 5ట యతి సరిగా విరుగుచున్నది. ఏతత్ప్రయోగము:—

జేతృత్వాత్తా * శేష దేవేంద్రభోగా
ఖ్యాతిస్థాయ * ద్గర్వదుర్వారవీరా
*    *    *    *    *    *
జాతశ్రేయా * జైత్రయాత్రాపటాహా.

—కామకళానిధి. 3.

293. మందారదామము—తతతగగ. యతి7.(కవిజనా.)

కన్నడమున నిది లయగ్రాహి.

357. ఇంద్రవజ్రము—తతజగగ. యతి 8.

ప్రయో: చింతాపరత్వంబునఁ*జెందు దుఃఖా
క్రాంతత్వ ముర్వీశ్వర * కానఁ గీడుం
జింతింపఁ డార్యాత్ముఁ డ*చింతనుండై
యంతఃపరీతాపము * నార్పఁ జాలున్.

—తిక్కన, స్త్రీ. ౧-౭౯.

దీనికి ఆఱవయక్షరమునను విఱుపు గలదు. కాని తిక్కన 8 ని యతిస్థానము చేయుట చూడఁగా కవితావాహిని యాకాలమున నట్టిరాగవరుసనే ప్రవహించుచుండె నని సూచించుచున్నది. నేటికాలమున పద్యగతి మాఱి,

చింతాపరత్వం బునఁ జెందుదుఃఖా

యనురీతిగతి యొక్కువసాధారణ మైనది. ఇట్లే నేటి

కాలమున నిట్టిప్రాచీనపద్యములలోఁ జెక్కుంట గతి భేదమును మనము కనిపెట్టి జనసముదాయముయొక్క శబ్దోచ్చారణాగతుల (?) నెట్టిమార్పులు కలిగినవో తెలియవలసియున్నది.

358. ఉపేంద్రవజ్రము—జతజగగ. యతి 8.

మరుత్తనూజుం బొరి*మార్పఁ జూచుం
బరిస్ఫురత్తోఁకపని*బద్ధుఁ డై యు
ద్ధరావిభుం డం చిది * తల్లనే సం
స్మరించి యాకోపు న*మర్చి యుండెన్.

—శ్రీ. ౧-౧౩౬.

పైవలెనే యిందును

మరుత్తనూజుం * బొరి మార్ప

నన్నను నాటింట విఱుపు గలదు.

365. ఉపస్థితము—తజజగగ. యతి 8. (అ.)

వృత్తరత్నాకరమున జసతగగలు దీనికి లక్షణము. అప్పకవి యీఛందములోని 286-వ వృత్తమును శిఖండివిరుతమనకును నిదే పేరిడుచున్నాఁడు.

366. ఉపజాతివృత్తము—జజజగగ. 8 యతి. ఇది ఇంద్రోపేంద్రవజ్రముయొక్క యుపజాతి.

ప్రమాణము*

మునీంద్ర నిర్భాగ్యత * మొట్టి చావుం
గా నేర దయ్యెం గడు * గట్టిచిత్తం
బనూనమూర్ఛం దెగ*టాటియుం దా
రా నేర్చె నిమ్మేనికిఁ * గ్రమ్మఱంగన్.

—శ్రీ. ౧-౬౪

ఆఱవయక్షరమునను దీనికి విఱుపు గలదు గాని తిక్కన యెనిమిదవయక్షరమునే గ్రహించినాఁడు.

ఉపజాతికి అనంతుఁడు

సమపదము లింద్రవజ్రవి
షమపదము లుపేంద్రవజ్రఁ జను నుపజాతిన్
సమవిషమాంఘ్రులు తద్వ్య
త్క్రమ మైనను నదియ పేరు కమలదళాక్షా.

296. ఏకరూపము—సభజగగ. యతి 8.

వృత్తరత్నాకరమున దీనికి మసజగగలు.

439. దోదకము—భభభగగ. యతి 7.

కన్నడమున నిది దోధకము. వృత్తరత్నాకరమునను దోధకమే. కావ్యాలంకారచూడామణిని కవిజనాశ్రయమునను నిది తోధకము. భారత ముద్రితప్రతులం దిది దోదక మయినది.

మానవదుఃఖము * మాన్యవివేకా
మానసదుఃఖస*మాజము నెల్లం
దాత ఘటించుచు * దైన్యము దెచ్చెం
గాన భవం బిది * గాల్పనె తంద్రీ.

—శ్రీ. ౧-౬౩.

443. స్వాగతము—రనభగగ. యతి 7.

ప్రయోగము :

రాజ రాజగుణ * రాజిత రాజ
త్తేజ రాజకుల * దీప విశిష్టాం
భోజమిత్ర నృప * పూజితపాదాం
భోజ భూవినుత * పుణ్యవరేణ్యా.

—నన్నయ—ఆది. ౮-౫౧.

వేగవంతుఁ డను * వీరుఁడు సాంబున్
వేగవంతుఁ డయి * వీఁకను దాఁకెన్
వేగ బాణపద * వీతతులన్ ది
గ్భాగముల్ విశిఖ * పంజరముల్ గాన్.

—ఆర. ౧-౧౫౧.

487. మౌక్తికమాల—భతనగగ—యతి. 7.

కన్నడమున నిది సాంద్రము.

683. శ్యేని—రజరవ. యతి 7.

వృత్తరత్నాకరమున నిది నైతికావృత్తము; కన్నడమున నిది సైనికము.

699 రథోద్ధతము—రనరవ. యతి 7,

నన్నయ ప్రయోగము.

హారహీర ధవ * ళాంశునిర్మలో
దారకీర్తి రణ * దర్ప సద్గుణా

* ఈ యింద్రవజ్రాఖ్య ముపేంద్రవజ్రాశ్రయ రెం డౌఁగా నుపజాతి యయ్యెన్. —కావ్యా. ౮.

వైరివీర రస * వైద్య మన్మథా
కార ధీర పర * గండ భైరవా.

—సభా. ౨-౩౨౧.

704. భద్రకము—ననరలగ. యతి 7.

దీనికి చంద్రికావృత్త మని కావ్యాలంకారచూడామణియును, కవిజనాశ్రయమును; సుభద్రికయని వృత్తరత్నాకరము; చంద్రిక యని కన్నడము.

817. వాతోర్మి—మభతలగ. యతి 7.

వృత్తరత్నాకరమునం దీనికి మభతగగ.

877. కాంతివృత్తము—తజజవ. యతి 8

కవిజనాశ్రయమున నిది గీతాలంబనము లేక కాంతావృత్తము; అప్పకవి కవితాంతము లేక గీతాలంబనము నను పేళ్లతో తజజలగ యని లక్షణ మిచ్చుచున్నాఁడు. అన్నింటను యతి 8 యే.

880. సుముఖము— నజజలగ. యతి 8.

కవిజనాశ్రయమునను, వృత్తరత్నాకరమునను నిది సుముఖీవృత్తము.

895. పృథ్వీవృత్తము—ననజలగ. యతి 8.

వృత్తరత్నాకరమున దీనికి ననసగగ. కొన్నింట ననజగగ యనియు లక్షణము చూపట్టెడును.

1009. భ్రమరవిలసితము—మభనలగ. యతి 6.

కన్నడమున దీనికి యతి 5.

## పండ్రెండవ ఛందము (జగతి)

4096

241. జలధరమాల—మభసమ. యతి 8. అనంతుని ఛందమున యతి 9.

576. ప్రమేయము—ననమయయ-యతి 9.

కన్నడమున నిది ఘటము.

577. విశ్వదేవి—మమయయ. యతి 8.

వృత్తరత్నాకరమున నిది వైశ్వదేవి.

586. భుజంగప్రయాతము—4 యగణములు. యతి 8.

తిక్కన ప్రయోగము.

వినీతుండ వై ధర్మ * వేదిత్వబుద్ధిన్
దన ర్పొందు నీ విట్లు * దైన్యాతిరేకం

బునం బొంది శోకాగ్నిఁ * బొక్కంగఁ గుంతీ
తనూజాగ్రజుం డాత్మఁ * దాఁ గుంద షన్నే.

—స్త్రీ ౧-౭౭.

781. మణిమాల—తయతయ. యతి 7 ట కానవచ్చుచున్నది.

832. పుటము—ననతయ. యతి 8.

వృత్తరత్నాకరమునదీనికి-ననమయ-లు లక్షణము.

880. తోదకము—నజజయ. యతి 8. అనంతుని ఛందమున తామరస మని, తోవక మని ముద్రితప్రతులలోఁ గానవచ్చుచున్నది. వృత్తరత్నాకరమున నిది తామరసము; కన్నడమున లలితపదము; కావ్యాలంకార చూడామణిని తోదకము.

తిక్కనప్రయోగము.

తమతను తప్పులఁ * దా రెరియంగా
విమలమతీ యిట * వీరికినై శో
కమున వహింపఁగఁ * గాదు మనంబున్
సముచిత మి త్తటి * శాంతము సుమ్మీ!

—స్త్రీ. ౧-౬౧.

944. నవమాలిని—నజభయ. (వృ.)

నిలుకడ గల యతి కానరాదు.

976. కుసుమవిచిత్ర—నయనయ. యతి 7.

1071. స్రగ్విణి—4 రగణములు యతి 7.

ఎఱ్ఱాప్రగ్గడ ప్రయోగము—

సర్వలోకాశ్రయా * సౌమ్యభావోదయా
నిర్వికారాకృతీ * నిత్యసత్యోన్నతీ
గర్వితోద్యద్భుజా * కల్పకల్పోల్లసత్
సర్వసర్వంసహా * చక్రచక్రాయుధా.

—అర. ౫-౪౩౭.

1216. ప్రముదితవదన—ననరర.

వృత్తరత్నాకరమున నిందలి జన్యవృత్తములలో నొకచోట నిది ప్రభ; వేఱొకచోట ప్రముదితవదన. ఆంధ్రమున నేకలక్షణ మయ్యును నడకగతుల ననుసరించి వృత్తరత్నాకరమునఁ జూపఁబడిన మొదటిగతి యగు ప్రభను వీడి, రెండవగతి యగు ప్రముదితవదన స్వీకరింపఁబడినట్లు తోఁచెడిని.

1381. ఇంద్రవంశము—తతజర. యతి 8.

1382. వంశస్థము—జతజర. యతి 5.
అనంతుని ఛందమున యతి 8.

1392. మాలతి—నజజర. (వృ.)
8 ని యతి కానవచ్చుచున్నది.

1397. లలిత—తభజర. (వృ.)
7-న యతి కానవచ్చుచున్నది.

1400. ప్రియంవద—నభజర. యతి 8.
కన్నడమున నిది నిరుపమము, లేక మత్తకోకిల.

1464. ద్రుతవిలంబితము—నభభర. యతి 7.

నన్నయప్రయోగము—

త్రిభువనాంకుశ * దీప్తినిధీ సమ
స్తభువనాశ్రయ * ధర్మధురంధరా
శుభయశఃపరి * శోభితపూర్వది
క్ప్రిభువిలాస కృ*పారసబంధురా.

—ఆది. ౪-౨౬౪.

తిక్కనప్రయోగము—

చనఁగ నాతఁడు * సాత్యకి వాయునం
దనుఁడు గాండివి * తమ్ములు సూరెలం
జనిరి ద్రౌపది * సంభృతశోక యై
చనియెఁ బుట్టువుఁ * జానలు సుట్టిరాఁ.

—స్త్రీ. ౮-౧౧౯.

1472. ఉజ్జ్వల—ననభర. యతి 7.

1756. తోటకము—4 సగణములు. యతి 9.

నన్నయప్రయోగము—

నిరవద్య నరేశ్వర * నిత్యనిరం
తరధర్మమతీ గుణ*ధామ జగ
త్పరిపూజితకీర్తివి*భాసి విభా
కరతేజ నృపోత్తమ * కాంతినిధీ.

ఏడింటను విరుపుకలదని నామతము —ఆది. ౧-౧౬౩.

1772. ప్రమితాక్షర—సజసస. యతి 9.

1866. జలోద్ధతగతి—జసజస. యతి 7. అనంతుని ఛందమున యతి 8.

కన్నడమున నిది జలోద్ధతరతము.

1979. చంద్రవర్త్మ—రనభస. యతి 7.

2041. మేఘవిలసితము—సనసస. యతి 6. (అ.)

## పదుమూఁడవ ఛందము (అతిజగతి)

8192

1153. చంచరీకావళి—యమరరగ. యతి 7.

1344. చంద్రిక—ననతరగ. 7, 8 యతులు (వృ)

1392 ప్రభాతమిశ్రము—నజజరగ. యతి 8.
కన్నడమునను నిది ప్రభాతమిశ్రమే. కవిజనాశ్రయమున నిది ప్రభాతము. కావ్యాలంకారచూడామణియందును ప్రభాతమే.

1401. ప్రహర్షిణి—మనజరగ. యతి 8.

1633. మత్తమయూరము—మతయసగ. యతి 8.
కన్నడమునను నిది మత్తమయూరమే.

1772. సుమంగలి—సజససగ. యతి 8.

2368. క్షమ—ననతతగ. యతి 8.

2780. క్రీతి—సససజగ. యతి 7.

2790. మత్తహంసిని—జతసజగ యతి 7. (అప్పకవి)

2796. మంజుభాషిణి—సజసజగ. యతి 9.

తిక్కనప్రయోగము—

ధన మంతయుం బోలియ * దారుణంబుగా
దనయవ్రజంబు దెగ * దైన్య మారఁగాఁ
దనబంధు లందఱు మృ*తంబుఁ బొంద నె
వ్వరి నైన శోక మను * వహ్ని గాల్పదే.

—స్త్రీ. ౧-౬౩

2806. రుచిర—జభసజగ. యతి 9.
కన్నడమునను నిది రుచిరయే.

3543. జలదవృత్తము—భరనభగ. యతి 10.
వృత్తరత్నాకరమున నిది జలధరవృత్తము. ఆంధ్రచ్ఛందము లన్నింటను నిది జలదమే.

తిక్కనప్రయోగము—

నీపలుకెల్ల నిక్కము య*నింద్యగుణా
యీపురుషార్థహాని సుతు*లీల్గుటకుం
దాపముఁ బొంది తాల్మిఁ దిగ*ద్రావి మహా
కోపుఁడ నైనఁ బాటిలెఁ ద*గుం గినియన్.

—స్త్రీ. ౧-౧౮౪.

[సశేషము.]

౧

ఊఁగవేచెలి! తూఁగుటూయెల, ఊఁగవే సరితూఁగవే
రాగవేగ తరంగితామృత సాగరోదరవీచితో.
పూర్ణజీవనభాగ్య వైభవమునను బొంగుచుఁ బొరలు క్షీ
రార్ణవేశ్వరు గర్భవీచి నుదీర్ణయౌ సిరి కుద్దివై.
మధురమోహన పూర్ణమూర్తిని బుధులు తమ హృదయముల పె
న్నిధిగ నినుఁ గనుచుండఁగా సత్పథవిహారము సలుపుచున్;
కళలు దేరెడి నీదు మొగమును గఱవుదీఱఁగఁగాంచు పు
ణ్యుల తపంబె తపంబుగాఁ దత్ఫలమె కడు సత్ఫలముగా.

౨

చెట్లకొమ్మల సందులన్ మిఱుమిట్లు గొలుపుచు మెఱసి చీఁ
కట్ల ముంచుచు నంతలో మెఱుపట్లు మఱుఁగున డాఁగుచున్;
అడుగుఁదమ్ముల లత్తుకల సంధ్యారుణాంశువులే కనం
బడఁగ, లక్ష్మణునకు మహీసుత పాదపల్లవముల్ బలెన్;
ప్రమద! నీనగుమోము చందురు పండువెన్నెల తేటలన్
సుమధురామృత దీర్ఘికా బహు విమలరసముల క్రమమునం,
దమక మారఁగ దప్పిదీఱఁగఁ ద్రావి సరసుల దృక్చకో
రములు త్రుళ్ళక పల్లటిల్లక స్తిమితభావము నొందఁగా;
నడుమఁ జక్కని తెల్లచుక్కల నల్లచీరబెడం గనం
బడు తమంబున మోహితాత్ముల వెడఁగుచూపులు తడఁబడన్.
తరుణి! నీ ముఖదర్శనమె సౌందర్యలహరీమజ్జనం
బరసి చూడఁగ సరసకవులకుఁ బరమమగు పురుషార్థమున్;
అందమునఁ బుట్టితివి నీ వానందమునఁ బెరిఁగితివి నీ
ఘాంధ్రుగన్ని యఖిలమును నొకటే యందమయి యానందమౌ,

౩

ఊఁగవేచెలి తూఁగుటూయెల ఊఁగవే నరితూఁగవే
రాగవేగ తరంగితామృత సాగరోదరవీచిలో.
గోరఁటాకునఁ గెంపులగు నీచారునఖముల సొంపులం
దారకాళికిఁ జూపనోయనఁ బారసాఁచి పదంబులన్;
బాలచంద్రుని మేలమాడెడి ఫాలతలమున ముంగురుల్
లీలమై, వ్యజనానిలంబునఁబోలె, నట్టువమాడఁగన్;
ఎదను బొదలెడి కోర్కిపెల్లిద ముదుటుగుబ్బలమీఁది ప
య్యెదనె గాదిఁకఁ బ్రిదులఁ జేయఁగ నెల్ల బంధచయంబులన్;
పూవువిల్తుని వైజయంతికవోలెఁ ద్రిభువనవిజయమున్
భావకాళి మనోరథంబుల పంటవై ప్రకటించుచున్.

౪

అమృతపాన మొనర్చియుఁ భవదాననేందు మయూఖనా
శములచే ననిమేషభావ మలభ్యమై సుఖపారవ
శ్యమునఁ గన్నులు మోడ్చుచుండఁగ నక్కజంబుగ విబుధు లో
రమణి! యూఁగవె యూఁగులాడనిరాగరసభరితాత్మవై.
యోగసూత్రమె యగుఁజుమీ యనురాగసూత్రము చెలియరో,
యూఁగవే యది యూఁతగాఁగొని, యొకటిగా భువి దివియునున్.

---



చిత్రము ౧

# తిక్కన విరాటపర్వము

ఎ. వి. రత్నముగారు

సారస్వత విమర్శవిలసనము నభిలషించి యేనల్పజ్ఞత గావించిన యీవిమర్శనము విద్వాంసుల యాదరణీయ సముచితగుణోపేత విమర్శముఁ బ్రక్క నుంచుటకు దగకున్నను, భారతి సాదరానుగ్రహ మూలంబున బాలకలోకావలోకనము ముందట బెట్ట సాహసించి నంములకు తుంపవ్వుడను.

ఆంధ్రకావ్యముల యధునాతన విమర్శములందు పూర్వుల కబ్బనటువంటి యపూర్వధోరణి చాలగలదు. అది మిగుల ప్రశంసనీయమును, స్పృహణీయమును-గాని, ఆంధ్రులు మొదటినుండియు అనుకరణధీప్రభావులనుటకు నిదర్శనముగ, ఎల్లరు నొకేకృతిని గలిపి యొకేరాగమున ముక్తకంఠముగ వినిపించుచుండుటచూడ ఆంధ్ర సారస్వతభాగ్యభోగ్యములను గురించి చింతింపనయ్యెడిని.

శ్రీమదాంధ్రమహాభారతము ఆంధ్రంబుననిరుపమాన కావ్యకళాసంపత్తిని నద్వితీయముగ రాజిల్లుసంగతి విస్పష్టవిదితము. ఆంధ్రవాఙ్మయప్రపంచమున భారతము, నవనవోన్మేష సువర్ణమనోహర కాంతిమతియైన ఉషాకన్య వలె సర్వదా విరాజమానము. ఇట్లకృత్రిమకావ్యకళాశోభను బ్రకాశించు నాంధ్రభారతమున తిక్కనార్యవిరచితము కడుహృదయంగమముగ నుంటంజేసి విమర్శకులు తిక్కన వాగ్వైభవకవనచాతురీమహిమంబును నెంతయు గొనియాడిరి. వారు కావ్యశిల్పదృష్టిని తిక్కనభారతభాగమును బరిశీలించినగాని మూలమునందలి చరిత్రగుణోన్నతు లాంధ్రంబున చక్కగ గొనిరాబడినవా యనెడు విమర్శక దృష్టితో గాదు. కేతన, ఎఱ్ఱన మున్నగు కవివర్యులు తిక్కనయ నితర సులభరచనావైదగ్ధ్యమునకు ముగ్ధులైచేసిన ప్రశంసయేగాని, మూలముకంటె నిది తీర్చి దిద్దబడి, యతిమనోహరముగ జేయబడినదని కాదు. అందుచే వారి సంస్తుతులు విమర్శనాతీతములు. ఇంతయేల? తిక్కన నన్నపార్యులైనను "తాము నేర్చినవిధంబున" మహాభారతమును, రచింపబూని విన్నవించుకొనిరిగాని, "వివిధవేదతత్త్వవేది, అఖిలమునీంద్రాద్యుఁడు, వచశ్శ్రీయుతుఁడు, భవ్యకవితావేశుండు" నగు సాత్యవతేయుని కృతికి మెఱుగులు పెట్టి, సంస్కరించి దానికంటె 'వేయిరెట్లధికమనోహరముగ' జేయ నుద్యమింపలేదు. అట్టిది యెంతటి ప్రతిభాశాలురకైనను తరముగాదు. ఎందుచేనన మొదట నది భాషాంతరీకరణమునకు సాధ్యముకానిపని,- 'మహాకావ్యముల పట్ల ఇక పనిపట్టి మూలముకంటె "రసవత్తరముగా" జేయసమకట్టుటయన, మూలమునకు విరుద్ధముగా బ్రవర్తించి దాని కపచారముచేయుటయే. అట్టిభ్రమను కవిత్రయమువారుగాని, మఱియెవరునుగాని పడలేదు. ఈనాడు మనము పడుతున్నాముగాని. "మహాకవిత్వదీక్షావిధిని, ఆంధ్రావలి మోదముంబొరయునట్లుగ" ఆంధ్రహృదయమున కనురూపముగ, ఆంధ్రజాతీయతత్త్వమున కనుగుణముగ తిక్కన తెనుఁగుచేసెను. ఇదే తిక్కన భారతములోగల విశేషము; మూలములో లేని స్వారస్యము. అంతేకాని తిక్కనప్రణీతంబైనది మూలకృతికంటె రసవత్తరమై మహత్తరముగనున్నదంటే, అది లోతునకుబోయి చూచి చెప్పిన యధార్థసంగతి కాదు. మూలఖనియందలి అసలు రతనము లెవ్వియో చిల్లరరాళ్లెవ్వియో పరీక్షించే రత్నపరీక్షకులు వచ్చిననేగాని యేది యెంతవిలువగలిగియుంటుందో తెలియనేరదు. అట్టి పరీక్ష లేనంతదనుక మిన్నంట వినిపించే ఈయాంధ్రీకరణ ప్రశంసాప్రతిధ్వాన పరంపర లాంధ్రభారతప్రశస్తినే స్వాహాకారములతో ఆంధ్రావని మోదమునంద వినిపించుచుండును.

పరీక్షిస్తే ఫలించేసంగతి యేమంటే, రామాయణ మహాభారతములు మన దేశభాషలందు పరివర్తితములైనవి మూలకథావస్తువును సంకుచించియో, విపులీకరించియో కొనిపోవునవియే కాని, మూలములందలి చరిత్రపోషణ

మున కథావిషయిక సందర్భములను, మఱియు నందుప్రతిబింబితములైన యక్కాలపు టాచారవ్యవహారధర్మముల నిజస్థితిని గ్రహించి వ్రాయబడినవి కావు. ఇట్లు బంగాళీ, హిందీ, మరాఠీ, ద్రావిడ, కర్ణాట, కాంధ్ర భారతరామాయణములను విచారించి చూచినచో నవి వారివారిజాతీయ భావములను, దేశీయాచారములను దృక్పథంబున నుంచికొని జనరంజకముగ వ్రాయబడినవి గాని, మాతృకలందలి చరిత్రపోషణము భావ సౌందర్యసంపత్తిని కనుగొని కాదు. ఇవి భక్తజనంబునకును, జనసామాన్యమునకును మిగుల మనోరంజకముగ నుండును గాని, విమర్శకులకు చారిత్రకదృష్టితో బరిశీలించువారలకు మాతృకలంత సురుచిరములు గానోపవు.

ప్రపంచమున జగజ్జేగీయమానముగ నప్రతిమాన మహాకవిత్వ తేజముతో వెలుగునట్టి మహాకవులను చేతి వ్రేళ్ల మీద లెక్కింపవచ్చును. అట్టి లోకోత్తరకవిత్వ సంపద్విశేషోన్నతిని మహాకవిశ్రేణికి జెందిన వ్యాస వాల్మీకిద్రష్టల కృతులేడ? వాని భాషాంతరీకరణము లేడ? కాని, నేటిమనవారి విమర్శనములు,—ఆంధ్రమహాభారతము ముఖ్యముగ తిక్కనవిరచితమైనభాగము మాతృకనతిశయించు స్వారస్యముల చెన్నొందుచున్నదని, ప్రకటించుట చూడ నద్భుతమవును. భాషాంతరీకరణము రూపాంతరీకరణమనియు, అనువాదము అసలులోని భావసౌందర్యసంపత్తిని తేజాలదనియు చదివియున్నట్టియు, గ్రహించినట్టియు మనయాంగ్లవిద్యా సంపన్నులుగూడ, తిక్కన తనమహాభారతకథను మాతృకకు లేని నలుగులు మెరుగులు పెట్టి మూలముకంటె నెంతో మనోహరముగ రచియించినాడని వినతిపత్రముల నర్పించుచుండుట చాల వింతగానుండును.

ఇట్టి విమర్శలకు కిరీటముగనున్నది, ఇటీవల "భారతి"లో, లోగడ ఆశ్వయుజమాసమునుండి యొకటి వెలువడియున్నది. తద్వ్యాసకర్తలు మూలముతో తిక్కనవిరాటపర్వమును పోల్చిచూచుచు, తిక్కనకవితాక్షీరసముద్రమును ద్రచ్చి యందుండి వెల్వడుభావరత్నములను రసామృతమును నందిచ్చియున్నారు. అట్లు వెలువరింపగల్గుటకు వారుపక్రమమున జెప్పికొన్నట్లు వారినమ్మికయే కారణము. అయితే యిందుకు మొదటనే కల్గు కొన్ని యాపత్తుల కుపపత్తుల నెట్లు చూపించెదరో! తిక్కన యింతరసోదంచితముగ వ్రాయుగల్గుటకు వానికొక నక్కనిమూలాధార ముండియుంటుందంటే విమర్శకులు లేదని యెట్లు రుజువుచేయగలరు? వీరిదగ్గరనున్న సంస్కృతమహాభారతమే నాయేమిటి, తిక్కన యెదుట పెట్టుకొని మెరుగులు పెట్టి యాంధ్రీకరించినది? తనుకడనున్న మూలములో లేని స్వారస్యములు, సంవాదోచిత కథాసంవిధానములు తిక్కనయందు గన్పట్టినంతమాత్రన, అది కేవలము తిక్కనయనన్యసామాన్య కల్పనాసామర్థ్యమునకు సాక్ష్యమని యెట్లు చెప్పనగును? అసలుసంస్కృతమహాభారతముయొక్క యే రెండుప్రతులును నొండొంటితో సమగ్రముగ నన్నివిషయములలోను, సౌలభ్య స్వారస్యములలోను పొత్తులేక యున్నవనేసంగతి నేటి విద్వల్లోకమునకు దెలియనది కాదుగదా! అట్టిచో తిక్కన యే ప్రతి ననుసరించి యాంధ్రీకరించెనో తెలియనపుడు మూలముతో సరిపోల్చి చూడడమనేది మూలమున కొకయపచారము సేయుటకాదా? పోనిందు దానికేమి?.

అందునను, నిందునను,నన్నిటను గల కథావిషయ మొకటియే కావున విమర్శనమున కంతతగవు లేదు. అందుచే విమర్శకులు వెలువరించిన భావరత్నములు, రసామృతము మూలముతో నెట్లు తులతూగుచున్నవో మనము కూడ నించుక విచారింతము. ఆంధ్రీకరణమున (i) మూలమునందుఁ దిక్కన వదలిన రసవత్తరములగుపట్లు, (ii) మూలమునను తెలుఁగునను సారస్యమునందుఁ దులదూగుపట్టులు, (iii) రసమును బెంచుటకును, ఔచిత్యమును బోషించుటకును తిక్కన మూలమునుండిమార్చినపట్టులు, ఇవ్విధంబుగఁ బై మూఁడు శీర్షికల క్రిందను విషయవిభజనముచేసి తారతమ్యఫక్కిని రెండింటను గల వ్యత్యాయ స్వరూపములను విమర్శకులు వివరించియున్నారు. మొదటిదాని విషయమున విమర్శకులు "మాతృకయందటునును చెప్పనేలకో, తిక్కన తెనిగింపక వదలివేసెనని" చూడవదాని విషయమున గారణము లారయగడంగిరి.

మొదటిదానికి గల కారణమే; "ఆ యేల కో" అనేదే మూడవదానిపట్లను చెల్లదా? మొదటి వ్యత్యయమునకు గారణ మారయ లేనపుడు, మూడవదానికి గారణము, లారయుట సమంజసముగా నున్నదా? ఆయాచోట్లను మూలమునుండి వదలివేయుటకును మార్పులు చేయుటకును గల హేతువేమి, అధికారమేమి తిక్కనార్యునకు? కారణమేమున్నది? వారిచిత్తము. "నా నేర్చినభంగిఁ జెప్పెదరణీయుఁడనయ్యెద భక్తకోటికిక్"అని మొదటనే క్షమాపణ చెప్పికొనెనుగా? పోనిండు. ఇదికవిబ్రహ్మ వినయోక్తి యనుకొని, "ఊర్జితకథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాటపర్వము" తెనుగు చేయబడినది. ఔచిత్య నిర్వహణమునను రసపోషణమునను మూలమును మించి మిన్నందియున్నదని విమర్శకులు చూపు మెరుంగల తెరంగారయుదము.

భాషాంతరీకరణ మెంత నేర్పరితనముగను సునిశితముగను జేసినను నది రూపాంతరీకరణమే యనుటకు, "మూలమునను, తెలుగునను సారస్యమున దులతూఁగు పట్టుల"లోనే మన విూవ్యత్యాసమును కొద్దిగనో గొప్పగనో చూడగలము. ఎట్లన.—"పతంత్యరూపేషు యథా చక్షూంషి న కదాచన," అరూపవస్తువులందు నేత్రము లెప్పుడు నెట్లు పడవో యనుదానికి "నరు లొరులు దృశ్యములపైఁ బరఁగింపఁగఁ జూడ్కు లెట్లుపడుఁ దప్పక" యను తిక్కనార్యునియూరానువాదము మూలముతో భావమునందుఁ దులదూగుచున్నదేమో విచారింపుడు. మరొకటి. "యస్సభాయాం స పాంచాలీం క్లిశ్యమానా దురాత్మభిః। దృష్ట్వా నసి తస్యాద్య ఫల మాప్నుహి" అనుదానికి "...అట్లు ద్రుపదపుత్త్రికిఁ బఱుపంగ గాంచి నగిన ఫలముఁ గందుగాక." యని కాంచుటయే కాక నగుట తెలుపఁగల విశేషమని విమర్శకు లొక విశేషమును గనుగొనిరి. కాని, యాదృష్టిలోనే నగుట కూడాగలదు. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధాన' మగుట కనుదృష్టిచేతనే మనోగతములను నావిష్కృతముచేయవచ్చును. వ్యంగ్యార్థమును వాచ్యముగ జేయుటయు నొకకవిత్వవిశేషమనెడిచో నిదియు నొకవిశేషముగనే యెంచవచ్చును. తర్వాత. "బృహన్నళా యస్య యంతా కథం న సజయే ద్యుధి?" యనుచోట రథచోదకప్రస్తావము వాచ్యముగామియె మూలానువాదముల రెంటను గల లోకోత్తరవిశేషమని. యంతా=సారథి యని రూఢ్యర్థము. చోదకత్వము వానిపని కాదా? అది వేరే ప్రస్తావించాలా? సారథికాదు, కడకు రథికుడే యవుతాడనే సంగతి సూచ్యముచేయబడినదని యనేటట్లయితే యదిసందర్భశుద్ధి నేకుఱుటయగు. 'యస్యయంతా' యనుదానికి "బృహన్నల యచ్చటనుండగా" అని విమర్శకు లర్థముచేసిరి. ఈయర్థనిష్పత్తి యెట్లో తెలియదు. ఓపిక పట్టిచూచేటట్లయితే ఇట్లే మూలముతో తులతూగుపట్లు మనవిరాటపర్వమున చాల గాననగును. అభిమానమును పురస్కరించుకొని, మనవి మనము పొగడుకొనుటకు గృహనిశ్చయుల మయ్యెడిచో మనవి మించినవి లేవు మనకు.

ఇఁక మూఁడవది: మార్చి మెఱుగులు పెట్టబడినవి; పాఠకోత్తములు సావధానముగ, గాఢముగఁ బరిశోధింపవలసిన విషయములు:—

(౧) మూలమున బృహన్నల నృత్యగీతాదికుశలత పరీక్షించుటయెగాక స్త్రీలచే నతని నిజస్థితిని పరీక్షింపబడినట్లున్నది. ఆంధ్రమునఁ బరీక్షాప్రస్తావమే వాచ్యము గాక "నైపుణంబున నుచితంబులై నరసి పొచ్చెము లేమి" యని చెప్పుటచే మూలమందలి యశ్లీలతను తిక్కన నిపుణముగ తొలగించెనని విమర్శకులు ప్రస్తుతించిరి. అయితే వీరికి మూలము దొరికినదిగావున దాని యశ్లీలతను గనుగొనగలిగిరి. అటుగాక ఒక్కతిక్కనయే దిక్కయ్యెడిచో, "నిపుణముగ నుచితంబులై నరసి"అంటే, అదియెట్లు? అనే ప్రశ్నకలగదా? ఆనిపుణమైన యుపాయమేదో తెలిసికోవలెననెడి కుతూహలము మనంబున జనింపదా? నిపుణమునగానే మనస్సులో కుతూహలము రేపుచున్నది. అప్పుడేమిదిక్కు!—దిగ్భ్రమమే కాఁబోలు! ఊహాగమ్యమనినచో, ఊహ లనంతములు. తిక్కన యీ సందర్భమున మూలమునకు మెరుగువెట్ట నెంచియున్నచో, ఔచిత్యమును పాటించి యీపరీక్షాసంగతియే యణుమాత్రమయినను సూచింపకను విడిచివేయ వలసియున్నది. కాని యీయశ్లీలతను తిక్కన గూఢముగ

వ్యంగ్యముగా కథలోనికి జారవిడిచెను, గాని కథనుండి
కాదు. ఇక్కడ సంగతిసందర్భములను, ఉపపత్తిని
గ్రహించి వ్రాసినది కాదు. ఎట్లంటే: బృహన్నలను బరీ
క్షింపవలసినది వానివిద్యా ప్రావీణ్యముగాని, నపుంస
కత్వము, పుంస్త్వము గాదు. ఇది కేవల మనుచితము,
అక్రమము. అట్టి పరీక్షణము విరటునియం దెట్టిమర్యా
దను యోగ్యతను ప్రకాశింపజేయును? ఇది విచారింప
వలయును. తనకొమార్తెకు చదువుచెప్పించుట కింతవఱకు
నపుంసకునికొఱకే యెదురుచూచుచున్నాడా? నపుంస
కుడు దొరికిననే కాని విద్య చెప్పించదలచుకొనలేదా?
ఈ పరీక్షణోద్దేశ్య మేమిటి? ఇది యెందులకు? నపుంస
కుడు కానివానియొద్ద కొమార్తె నప్పగించుట భావ్యము
కాదని శంకించేటట్లయితే—యీబాధంతా యెందుకు?
మొదలామెకు విద్యగఱపించుటయే మాన్పించి ఎూ మెన
నూర్యంపశ్యనుగా చేస్తే బాగుంటుందిగా? లేదా విద్య
నేర్చుకొనేటప్పుడుము త్తయిదువులనుకూడా నుంచవచ్చును
గదా. ఈపరీక్షణమువలన నేమిప్రయోజనమో దురూ
హ్యము. అది గాక, "రాజా, నారూపముతో నీకేమి?
దానిందలంచిన గడుశోక ముప్పతిల్లును. తలిదండ్రులు
లేని నన్ను నీబిడ్డవలె నాదరింపుము." అని యనుకంప
జనించునట్టు బృహన్నల పలికినమీదటగూడ నెంతటి
కృపణునకైనను నింకను నతనిని పరీక్షింపవలెననెడితలంపు
గల్గునా? అట్టిది దుఃఖములోనున్నవారి నగౌరవపరచు
టయ. అది రాజైన విగటునిశీలమునకు దగినట్లున్నదా?

(౨) మూలమున సైరంధ్రి,నిదురించుచుండువలలుని
కౌఁగిలించుకొని నిద్రలేపినట్లుంటే "యేతత్కార్యము
పాంచాలి పాణిస్పర్శనముననే నెఱవేఱినది తెనుగున"అని
ప్రశంసించుట. అయితే, మూలమునందలి కౌఁగిలియొక్క
ప్రేమాతిశయస్వారస్యము పాణిస్పర్శచే ద్యోతకమగునా?
ఉల్లంబున నుప్పొంగుచుండ ప్రేమ, తల్లులు పసిబిడ్డలను,
ప్రియురాండ్రు మనోవల్లభులను నిట్లు "స్పర్శల"చే లేపరు.
అదిగాక, ఎవనిని, తనహృదయ పరిభవదవానలమును,
చల్లార్చఘనునిగా, మొదటినుండియు నపేక్షించియున్న
దో యాజ్ఞసేని, యట్టిభీముని, అత్తటి కీచకదుష్కృత
ప్రతీకారమునకు 'ఇప్పట్టున నీవుదక్క నాకు వేఱొండు
శరణ్యము లేదనెడి' భావ ముల్లమునఁ బెల్లుగొన, శోక
దుఃఖపూరితమై హృదయము గుందుచుండ, అనిర్వచనీయ
దయమతో బోయి యొంటరిగ బరుండి నిద్రించుచున్న
భీమునిజేరి, ద్రౌపది కరస్పర్శమాత్రమున మేల్కొల్పు
తుండంటే స్త్రీహృదయమును గ్రహింపకపోవుటయే.
మఱియు. వృకోదరసార్థకనామునిని, మస్తుగ మెక్కి కుంభ
కర్ణునివలె నిద్రపోయెడువానిని కరస్పర్శచే మేల్కొల్పు
నగుననుట, మెస్మరిజంకుగూడా సాధ్యముకాదు. ఇంత
కంటె ఆదర్శప్రేమను జూపుచు, పాంచాలీప్రేమ మహి
మంబుచే భీముడు మైమఱచి నిద్రపోవుచున్నను ఆమె
మైగాలి సోకినంతమాత్రనే మేల్కొనెడివా డనిచెప్పితే
చాలాబాగుండేది. తిక్కనమార్చిచేసినది యటు నైసర్గి
ముగాదు, ఇటు ఆదర్శముగాదు.

(3) ఎవని "మహోగ్రకోపరేఖావిభవంబు వైరు
లకుఁ గాలముచేరున" యని వర్ణితమో ఆభీమసేనుడు,
ఆడువానివేసముఁ దాల్చుటకును, కామప్రేరితకీచకప్రలా
పములకు వలపుఁగత్తెవలెనే మాఱుమాటాడుటకు నెట్లు
సమ్మతించెను?...ఇందులకు సమాధానము మూలమున వ్య
గ్యము. ఆంధ్రమున నేతన్మిమిత్తమే అనగా "ఆసాబసిం
దెగఁజూచి నీకుంజూపి నీచిత్తంబు వడసెద." ఇందుల
కును, తన "మృదురీతి సుచితనిగూఢభంగులను భావ
ములను తనప్రియ వినిపించుటకు" గాను—అద్భుతసంవిధా
నము గల్పింపఁ బడినది." అని విమర్శకులు తిక్కన
కల్పనాచాతుర్యంబును నెంతయు గొనియాడిరి. యిటు
వంటిసందర్భములలో "సమాధానములు" వెదకనక్కఱ
లేకయే యవంతట నవియే మన కగపడుచుండు నించు
కాలోచిస్తే. ఈసందర్భమున కథయంతయు మూలమ
నందు యథాసంభవముగ, నైసర్గికముగ నడిచినది. తిక్క
నయందు వ్యర్థమైన కథాచమత్కారమేగాని స్వభావా
నుసరణ మెంతిమాత్రమును గన్పట్టదు. కీచకునివలె వచ్చే
వారివార్త లీనాడును .మనచెవుల నప్పుడప్పుడు పడుచు
నేయుండును. ఇట్టిహత్యలయుదంతము, కథావిధానము
మనచెవుల నెట్లుపడుచుండునో యట్లే సంస్కృతభార
తమునందును అక్షరరూపమున జరిగినది జరిగినట్లుగ
చిత్రింపబడియున్నది.

ఇఁకఁ దిక్కనార్యునిది కేవలము తిక్కనగొన్న ఊహాప్రపంచము. సందర్భశుద్ధి, పరిస్థితులయౌచిత్యము నెంతమాత్రము గమనింపలేదు. మానవస్వభావానుసరణ మతిమానుషమయినది. విమర్శకులు తెలుగున కనుగొన్న సమాధానమునకు మూలమొసంగుపూర్వ సమాధానము: భీముఁడాఁడువేసమున మోసమునేసి యవ్విధంబుగ రహస్యముగఁ గాకున్న మరెట్లు కీచకు నంతమొందింపగలుగును? సర్వసేనాధిపతియైన కీచకుని వలలుఁడైనెప్పుడెక్కడ నొంటరిగ పట్టేది? సైరంధ్రివలె, సైరంధ్రియని భ్రమించునట్లు, ఆచీకటిలో నర్తనాగారములోపలనో, బయటనో, ఆఁడువేసముననున్న మనుష్యవిగ్రహమొక్కటి, అచ్చోట గన్పట్టుచుంటేనేకాని కీచకుడు లోన బ్రవేశించుట కలుగదు. లోపల ప్రవేశించిననేకాని వానిని భీముఁడంతమొందింప వీలుఁగలుగదు. అంతేకాని సైరంధ్రిని సంతోషపెట్టి యామెచిత్తమును గొనుటకై కాదు, భీముఁడాఁడు వేసమువేసికొని పోయినది. విమర్శకుఁ లిది యించుకైనను నాలోచించినట్లు కన్పట్టదు. ఇఁక దిక్కన మార్చినదాని యౌచిత్యమును జూతము: సైరంధ్రి వెంటను మరొక ఆఁడుదికూడా (తిక్కన మార్చి చేసినట్లు) నర్తనాగారము ప్రవేశించేటట్లయితే, కీచకుఁడిది గాంచకుండా ఎక్కడనున్నాడు? చీకటికాదాయని యందురేమో, కాములకు చీకటిలోకూడ కళ్లు చాలాబాగా కనపడతాయి. కీచకుడు ముందుగవచ్చి నర్తనాగారము గుమ్మమువద్దనే వేచియుంటాడు. ఇంకా కీచకుడు నర్తనశాలవద్దకు రాలేదందురా (తిక్కనభారతములో కన్పట్టునట్లు) ఇది యసంభవము, మానవహృదయమును బరిశీలింపమిని. "మాయరవియేల క్రుంకఁడో" యని తహతహపడుచున్నాడే, ఎప్పుడు, యెప్పుడు చీకటిపడునాయని, యట్టివాడేల జాగుచేయును? చీకటిపడినతోడనే వచ్చి నర్తనశాలగుమ్మము వద్ద, సైరంధ్రిని చేయిపట్టుకొని లోనికి గొంపోవుటకు గాను, కనిపెట్టుకొని యుండుంగాని, ఆంధ్రభారతములోనున్నట్లు ముందు భీముని, సైరంధ్రిప్రవేశము, పిదప కీచకునిప్రవేశమెట్లుకలుగుతుంది? చీకటి పడకముందే యచ్చటవచ్చి కూర్చొనేవారెవరు? సైరంధ్రా, కీచకుడా? ఆలోచింపుడు. "దురభివేశంబైన యాలోను నిశ్చింతుండై సతికేలు పట్టికొని చొచ్చెన్ భీముఁ డత్యుగ్రతన్." అని తిక్కన వారిని ప్రవేశపెట్టెను. కీచకుడు లోపలగాని, ప్రక్కలనుగాని, బయటగాని, లేడనేతలంపుతో భీముడు ప్రవేశించినాడా? ఒకవేళ కీచకుడు లోపలనే యుంటేనో? ఉండడనేదియెట్లు? ఉంటేనేమి?—అప్పుడే కాళ్లు చేతులు విఱిచి కట్టి పడవేస్తాడు భీముడంటే—"విరాటనందనపర్యంకమున కనతిదూరమునఁ బాంచాలి మోసరిలనునిచి, మృదురీతి నుచితనిగూఢభంగులను భాషణములను తనప్రియువినిపించుట" ఎట్లు సంభవిస్తుంది? ఈసందర్భమేమి అతకలేదు. అది పోనిండు. ఈసందర్భమున కీచకుని పాత్రపోషణము కూడా యేమి సహజముగ లేదు. ఇప్పటివాని మానసిక పరిణామమును, భావమును తిక్కన చూపించలేదు. సైరంధ్రిని గలియుట కంఠయాతురముతో వచ్చినవాడు, ఇప్పుడును మొదటితీరుననే యామెముందట ఆత్మస్తుతి ప్రగల్భాలుః వినిపించుతాడేమిటి? అంత మదనార్తినొంది, మెండి మండి యెంతోవలపుతో వచ్చినవాడు, వచ్చినవలపుకత్తెను వెంటనే కౌగిలించుకొని, ముత్తెపెములాడుచు, ముద్దులుగొనునా, లేక దూరముగ నిలబడి "సైరంధ్రిభుజముపై చేయిసారించి" యాత్మోత్కర్ష గావించునా? ఇట్లుచేయుట కీచకుని నీచస్వభావము చూపించుట కంటే, అంత పరితాపము నొందినవాడు చివర కిట్లు తేలిపోయినాడేమి? ఆమొదటి తీవ్రత, ఆవిరహవేదనము ఇంతలోనే నీరసించినదాయని మొదటి నుండియు వాడుపడిన సంతాపమును గనుగొన్నవారికనిపించుతుంది. ఆవిరహవేదనమున కిది యనుగుణముగనున్నదా, ఇక్కడ కీచకుని నడత? తర్వాత, కృత్రిమ సైరంధ్రిపలుకులను నొక పావుగంటసేపు వినుచుండినను, కంఠధ్వనియైనను సైరంధ్రిది కానిదిగా గ్రహింపనేరడేమి? అంత రాగబధిరుడయ్యెనా? ఇక భీమునిపట్ల: తనయిల్లుకానిచోట కీచకుని చంపుటకు పోయేటప్పుడు భీముడు ద్రౌపదిని వెంటబెట్టుకొనిపోవునా? అట్లు చేయుట ద్రౌపది క్షేమము మదినెంచియా? లేక పిచ్చిచేతనా? ఆమెచిత్తమును బడయవలెనంటే కీచకుడుచచ్చిన తర్వాత నామెను దీసికొనివెళ్లి వాని మృతశరీరమును జూ

పింపఁగూడదా?తన సరాగప్రియోక్తులు ప్రియకువినిపించుటమాట దేవుడెఱుగును; తాను మంచమెక్కి కూర్చొని తనప్రియను చీకటిలో మూలగూర్చోపెట్టితే యేతేలయినా, పామయినా పట్టుకొని కఱచితే తనప్రియపని యేమిగాను?అదేమి–చీకటికొట్టుగాని యంతఃపురముకాదుగదా. పోనిండు; భీముని సంభాషణములను వినుటకుగాను దైవముమీద భారమువేసి యెట్లో ప్రాణములు బిగపెట్టుకొని యామూల నొదిగియున్న దనుకొందము. సరే, కీచకుడు భీము సందిటను బడి పెనగులాడుచు తన్నుకొనుచున్నపుడు, ద్రౌపది లేచివచ్చి, తన్ను కీచకుడు తన్నిన తన్నునకైనను ప్రతీకారముగ, వాని బుర్రమీద కర్రదీసికొని చచ్చేటట్లు కసిదీఱ ఒకపెట్టు పెట్టదేమి? అట్లా కొయ్యబొమ్మవలె గోడమూల నొదిగి ప్రాణములు బిగపెట్టుకొని కూర్చుంటుందేమిటి? అట్లా కసిదీర్చుకొనుట ఆడవాళ్ళకు మర్యాద కాదనుకొన్నదా? ఆపోరాటములో భీము డెవడో కీచకు డెవడో స్మరించుట కష్టమనుకొన్నదా? ఏమనుకొంటున్నది యేమి కన్పట్టదే! ఆపోట్లాటను వింటూ భయపడి కొయ్యయిపోయిందా? అంత ద్రౌపది యిపు డిట్లా అయిపోయిందేమి! ఏమి ద్రౌపదండి! ఇది యాంధ్రులద్రౌపదికాని, ఆర్యుల ద్రౌపది కాదు. తిక్కనద్రౌపది; వ్యాసుని ద్రౌపదికాదు. ఇదే కాఁబోలు తిక్కన విరాటపర్వమునం దాంధ్రహృదయము చక్కఁగ ప్రతిష్ఠింపబడినదంటే! తిక్కనచేతంబడి ధర్మజునిశీలముగూడా యీవిధముగానే తఱిగిపోయినది. మూలములో తనయాశ్రితులగుణములను గుర్తెఱింగినవాడై విరటుడు వారినిగూడ యుద్ధమునకు దరలించినట్లుంటే ఆంధ్రమున ధర్మజుడు తానొక ఋషివద్ద రణవిద్య నభ్యసించినట్లును, తనవారుగూడ రణవిద్యాకుశలురనియు చెప్పికొని తమ్మగూడ యుద్ధమునకు గొంపొమ్మనియర్థించును. ఇట్లు తనంతట తాను ముందుగబోయి విరటునితో జెప్పికొనవలసినంత యవసర మేమి కలిగినదో తెలియరాదు. తమ బాహుబలపరాక్రమమును జూపుట కిది యేనా యింక లేదా తిరుణము? ఇది ధర్మజుని గంభీరగుణమునకు దగినట్లు లేదు. సంస్కృతభారతములో నున్నట్లు, విరటుడు తనబలము చాలదని కనుగొన్ననాడు తన యాశ్రితుల సాహాయ్యమునుగొనుట గౌరవహీనముకదా! కాఁబట్టి విచారిస్తే యిదియుఁ దదితరములవలె మూలమునందే యెంతయు నైసర్గికముగ గూర్పబడినది. ఇది –తిక్కనిది–యాంధ్రహృదయమునకు దగినట్లున్నది.

మూలమున బృహన్నలకు "శుక్లవసనము, తెన్గున రణోచితముగ రక్తాంబరము." అని విమర్శకులు మెచ్చుకొన్నా రీమార్పు. అయితే, రణోచితమంటే యేమిటో? బహుశా పంచపాండవులకు పంచరంగుల దుస్తులుండేవేమో! ఎఱ్ఱబట్ట, నల్లబట్ట అపసవ్యంగా చచ్చేవాళ్లకు కట్టబెడతారు – అంటె ఉరితీయబడేవాళ్లకు. అదిగాక పూర్వకాలమున వీరులకు యుద్ధమంటే ప్రియాసమాగమమువంటిదే. తమ్ము ప్రియురాండ్రు 'ము స్తాబు'చేయ చక్కని వేసముతో యుద్ధాలకు బోయేవారు. యుద్ధమునం దెంతయెక్కువగ శరీరము తూట్లుపడేటట్లు దెబ్బలుతింటే, అంత ప్రేమాతిశయముతో ప్రియురాండ్రు కౌగిలియిచ్చి కొంపోయి యుపచారములు చేసేవారు యోధులగు తమవల్లభులకు. ఇది పూర్వకాలపు జర్మనుల, గ్రీకుల చరిత్ర చదివితే కన్పట్టుతుంది. మఱియు తెల్లబట్టమీద నయితే ఎఱ్ఱనిరక్తధారలు స్ఫుటముగ గన్పట్టి మరింత వీరావేశ మెత్తిస్తుంది. కావున నెల్లవిధముల యుద్ధానికి వెళ్ళేటప్పుడు, యుద్ధరంగము మీద, శుక్లవసన ధారణమే బాగా శోభిస్తుంది. ఇట్లే తక్కినమార్పులును విమర్శకులు చూపించినవి పరీక్షించితే ఫలించును. గ్రంథవిస్తరభీతిని వానినన్నిటిని విడిచిపెట్టి యిక నొకటిరెండింటినిమాత్రమే ముఖ్యమయినవాని విచారించి విరమింతును.

విమర్శకులు తిక్కనవర్ణితకీచక విరహోన్మాదవస్థను ప్రశంసించుచు, "పాడనూపినట్లయిన పడి(ఱ్ఱ)సమకట్టి పరికించి కానకబమ్మరించు .....వెనకి రిత్తయల్ గని విహ్వలించు." అనేపద్యము మేఘసందేశమునందలి "మామాకాశప్రణిహితభుజ" మిత్యాది శ్లోకమును షేక్స్పియరు నాటకముల రోమియో,ఆంటొనీ మున్నగువారి వియోగార్తుల ఆత్మగతములను పఠితల తలఁపునకుఁ దెచ్చునని వ్రాసుచ్చిరి. భావమయితే అలాగే కావచ్చు

నేమోగాని, సందర్భముమాత్ర మేమియు బాగాలేదు. సందర్భశుద్ధిని, ఔచిత్యమును విశేషించి మన స్తత్వమును పరికించి రచించుటలో షేక్స్పియరునకు సాటి షేక్స్పియరే; అందునను పరిస్థితులందు మానవహృదయముయొక్క లోతునకు బోయి యందలి గుట్టుమట్టును బయల్వెట్టి తనవాగ్దర్పణమున బ్రతిఫలింపజేయుటలో విశ్వజగత్తునం దద్వితీయముగగూడా కనబడును. ఇందు కాళిదాసుని ప్రతిభకూడా అంతటిదే. అట్టిలోకోత్తరకవి సింహములతో మనభద్రేభంబులను జతపెట్టుచుండుట యేమిభవ్యమో తెలియదు. మన తెలుగులోకూడా అంతటివాండ్లు లేకపోలేదని సంతోషించడానికా? మేఘసందేశమునందును, రోమియో, అంటోనీలయందును ప్రేమానందలహరిని నోలలాడుచు సరిగంగస్నానాలు చేస్తూఉండే ప్రియులకు పిడుగుపడినట్లు వియోగము కలిగినది. ఆదెబ్బతో విరహోన్మాద మెత్తినది. విక్రమోర్వశీయమునందు నిట్లే యీ యున్మాదావస్థ యతి సిద్ధహస్తతతో జిత్రింపబడినది. ఇక్కడ, కీచకున కట్టి సందర్భ మేమిగలదు? తన వలపుకత్తెతో నొక్క నిమేషమాత్రమైనను చేయిచేయి పట్టుకొని కలసియుండుట గలిగినదా? పోనీ, తనయింటికి సైరంధ్రి వస్తానని చెప్పినట్లయిన మోహావేశవివశుడై కొంచెము గాలి కదలినను, నీడ ఆనినను, ఈవిధమయిన భ్రాంతికి, ఉన్మాదమునకు—ఒకవేళ కీచకుడు లోనుగా వచ్చునని యనుకోవచ్చును. అట్లులేదే. ఎప్పుడు ప్రొద్దు గ్రుంకునా యెప్పుడు ముస్తాబయిపోవుదమా యని యాతురపడుతూఉంటే, మధ్య నీయున్మాద మెటనుండి వచ్చును? అదిగాక ఆశగొల్పినపుడు దానిని చేపట్టుటకు మన స్సుత్కంఠతతో త్వరపడుచుండుగాని వెర్రిమొర్రి ఉన్మాదమునకు బలియగునా? కాబట్టి యిది యలంకారశాస్త్రమును తిక్కన మనస్సున పెట్టుకొని తెచ్చిపెట్టిన యున్మాదాలంకారమేగాని స్వభావసిద్ధమయినది గాదు.

"అన్నియు నొకయెత్తు, కీచకపాత్రనిర్వహణ మొక్కటి యొక్కయెత్తు...... మూలమునందుఁ గీచకుడు దౌష్ట్యావతారము. కామోద్రేకమునఁ గేవలమృగప్రాయుఁడు. తిక్కన కీచకుఁ డుత్తమనాగరకుఁడు, సరసుఁడు." అని యివ్విధంబుగ విమర్శకులు తిక్కనకీచకపాత్రమును గొప్పగా ప్రశంసించారు. లోతుగా పరీక్షిస్తేయిదికూడా వెనుకటి వానిలాగుననే ఫలించుతుంది. హృదయస్థితిని, మనఃప్రవృత్తి ననుసరించి నెలకొల్పబడినది కీచకునిపాత్ర, మూలమునందు. తిక్కనయందు లేదది. తిక్కన కీచకునియందు కృత్రిమవిలాసములు చాలా ఉన్నవి. అవి తెచ్చిపెట్టుకొన్నట్లున్నవిగాని, స్వభావజన్యములుగ గన్పట్టవు; సరసములైన నాగరికవిలాసములే కావచ్చును. నాగరకత, పైన కప్పిపుచ్చుచున్నను రెండింటను కామోద్రేకజనితమృగప్రాయత్వము సమానముగానే ప్రతిఫలించుచున్నది తుదకు.

"ఇట్లుదోసములదయ్యము (Monster of Vice) ను, శోచ్యపాత్రము (Tragic Character)గ మార్చిన తిక్కన మానవప్రకృతిపాండితిని, "హేమవిద్యం"బోని దాని నెంతని కొనియాడనగును." అని విమర్శకులు తమ హేమవిద్యనుగూడా గనబరచినారు. కాని యీ హేమవిద్యచే వీరివిమర్శమునందుగాని, తిక్కనయందుగాని కీచ. కుడు శోచ్యపాత్రమయినాడా, ఆలోచిస్తే? (Tragic Character) నకుండే (Tragic element) కీచకునియందు తిక్కన ఏమిచూపించెను? విమర్శకు లేమి కనుఁగొన్నారు? కీచకునిముఖమున నేవో నాలుగు వలపుతెవులు తెలుపు సరసశృంగారపద్యాలు "అనంగవిభ్రమముల కను రూపంబు" లైనవి పెట్టి, మదన సంతాపము ననుభవింపజేసినంతమాత్రముననే "శోచ్యపాత్ర"మవునా? లేదా, కీచకునికథ విషాదాంతముగ ముగిసినంతమాత్రముననే శోచ్యపాత్రముల బంతిలోనికి ఉత్కర్షింప బడునా? అట్లయితే మనప్రబంధకవులలో, మోహవిలాపములందు తిక్కన కీచకుని దిగతుడిచేటటువంటి పాత్రములు చాలా బాగాకలవు. అవికూడా "శోచ్యపాత్ర" శ్రేణిలోనికి జేర్పవలసినదే యిక? శోచ్యపాత్రమున కుండే లక్షణా లేమిపట్టినవి కీచకపాత్రమునకు? అవి విమర్శకులు కనుగొని వెలువరించినచో బాగుండేది.

ఉత్తరకుమారి, బృహన్నలను ఉత్తరసారథ్యమునకై యొడంబడజేయుచు "మాయన్న నన్ను పంపి నీకు చెప్పి నిన్ను తోడ్కొని రమ్మనగా నాకు నీయందుగల ప్రణయముచే అట్లేయని చెప్పి యిటవచ్చితిని. నామా

టను చేయవేని ప్రాణంబులు విడుచుదానను." అనియంటుంది. అందుకు తెనుగున "నీపాల నాకుఁ జనవు కలుగుటంజేసి నిన్ను దెత్తునని పూనివచ్చితిని. ...... అట్లొడంబడక తక్కుట నాపలని వాత్సల్యంబు గొఱంత పఱచుట." అని మూలము లోనిది-ప్రాణంబులువిడుచు దాన-ననేది ప్రణయోత్కర్షను, చిరస్నేహమునుస్ఫురించేటట్లు "ఛలోక్తి"గ నన్నమాట. అందులో సౌకుమార్యము లోపించిందంటే, అంతకంటె గుణవత్తరమయిన సహజమాధుర్యము, గాంభీర్యము మూలములోకన్నట్టు చున్నది. బృహన్నలతోగల యొక్క సంవత్సరముపాటి శుశ్రూష, స్నేహము తెనుగులో నింకను "చనవు" గానే యున్నది; అంతకు మించిపోలేదు. అందుకుపగినట్టుగానే ఉత్తర వాగ్ధోరణిగూడనించుక ప్రౌఢముగా నేయున్నది. యాంధ్రంబున మూలమునందలి ఉత్తరవాగ్విలాస వైఖరి తెనుగునందువలె ఆడంబరము, ప్రౌఢముగాక ముద్దు వచ్చుచు హృదయమును గొనునంత చక్కగ నున్నది.

తిక్కనార్యుని చేతబడిన ద్రౌపది, సుదేష్ణ, ఉత్తర—ఆ యిద్దరు ముప్పురు కాంతలైనను - కేవ మిటీవలి నేటిహైందవస్త్రీలవలె, చేయబడిరిగాని, ద్వాపర యుగమునకు జెందిన వేదవ్యాసుని ధీరకాంతలవలె గన్పట్టరు. అట్లే పురుషపాత్రముల చరిత్రయు పోషింప బడినది. ఈవిషయమున--, అనగా సందర్భోచితపరిజ్ఞానమున, పాత్రపోషణమున, చరిత్రపరిశీలనమున తిక్కనార్యునికంటె నన్నపార్యుడే మూలమునకు మిక్కిలి దగ్గఱగ నున్నాడని చెప్పనగును. నన్నపార్యునందు ఆంధ్ర హృదయము లేకపోవచ్చునుగాక. కాని పాత్రపోషణము నందు ప్రాచీన,ఆర్యచరిత్ర సంపత్తిని విడిచియుండలేదు.

కాఁబట్టి మూలమునకు మెరుగులు, తళుకులు పెట్టి యనువాదము నధికమనోహరముగా రచియించినారంటే అది చాలా పర్యాలోచించి, వెనుకముందుచూచి విచారించి, చాలా అట్టేపెట్టుకొని చెప్పవలసినమాట.

---

# దేశారాధక ప్రబోధకము

మంగిపూడి వేంకటశర్మగారు

స్వాతంత్ర్యం బొకఁ యింత గల్గదు స్వదేశంబందె యింకేల మా
చాతుర్యంబులు శౌర్యధైర్యము లుపజ్ఞల్ ప్రజ్ఞ లంచున్ సదా
చేతోబ్జంబున గంది కుంది కృశివై జీవచ్ఛవంబై వృథా
వీతోత్సాహుడవై చరింతువె గతవ్రీడుండవై భారతా!

దీనత్వంబు వహింపబోకుము పరాధీనుండ నైనాడ నే
నేనిర్మాణము చేయ దక్షుడనుగా నేకార్యమున్ బూనినన్
గానీ విఘ్నములే తటస్థములగున్ గార్యంబులేదంచు శో
కానన్ మున్గి నిరాశ నొందక కృషిన్ గావింపుమా భారతా!

కాలం బెప్పుడు నొక్కరీతి నడవంగాబోదు బ్రహ్మాదులున్
గాలంబున్ గడవంగబోరు సుఖముల్ కష్టంబులున్ గల్గినన్

మేలేయంచు స్వధర్మ నిర్వహణ మోర్మిన్ బేర్మి గావింపగా
బోలున్ గార్యఫలంబు చింతవిడుఁబొప్పున్ ధీరతఁ భారతా!

కాలాతీతుడు కాలరూపుడు జగత్కల్యాణసంధాత తా
నేలాచేసిన హర్షమే యనుచు కర్తృత్వం బుపేక్షించి యీ
కాలంబున్ మది లెక్కచేయక కృషిన్ గావించుచున్ మించి యు
ద్వేలాంభీల విపత్తుబాసి ఫలసిద్ధిన్ గాంచుమో భారతా!

శ్రీమంతుండగువాడె దేనినయినన్ జేయఁ సమర్థుండు నే
నేమో వ్యర్థుఁడ నేమిచేతు నని నీ కేమీ విచారింప నా
హా, మాయం బడి భ్రాంతిలో మునిగి ముగ్ధాత్ముండవై నా వమో
ధీమంతుం డొనరింపరాని పని కద్దే చూడుమో భారతా!

ధీమంతుండె సమస్త కార్యముల సాధింపఁ సమర్థుండు గా
కే మూఢాత్ముడొ ద్రవ్యవంతుడగునే నింతింతగా మెక్కఁగా
కేమీ చేయగలేడు బుద్ధిపరు డూహించుఁ బహూపాయముల్
సామర్థ్యంబుల తారతమ్య మిది లెస్సఁ జూడుమో భారతా!

ధీమంతుండు తలంచెనేని కొదవే తేలేడె ద్రవ్యంబులన్
గ్రామాలఁ సవరింపలేడె ఘననిర్మాణక్రియాదక్షుడై
సామగ్రిఁ సృజియింపలేడె బహుసంస్థల్ నిల్పి కల్పింపడే
భూమ ప్రక్రియలఁ స్వరాజ్యపదవీపూర్ణాదులఁ భారతా!

స్వాతంత్ర్యంబనుచుఁ స్వరాజ్య మనుచుఁ స్వచ్ఛంద వృత్తంచునున్
జాతీయంబగు విద్యయంచును స్వదేశారాధనంబంచు వి
స్ఫీతప్రీతి స్వభావయంచును స్వదేశీయంచు బోధించుచున్
జాతిఁ మేల్కొలుపంగ నిర్ధనికుడుఁ జాలుఁగదా భారతా!

ఈదేశంబు సమస్తముఁ మనది మందేరాజ్య మిందేరికిన్
లే దేహక్కును నెంతమాత్రమును లే లెండింక నిద్రింపకం
డో దేశాత్మజులార, దీక్షగొని రండో యంచు మేల్కొల్పగా
నీ దారిద్ర్యము లడ్డువచ్చునె మదిఁ వీక్షింపుమో భారతా!

ఏ దేశంబునకైన స్వేచ్ఛగొని తే నిచ్చించి కష్టించుచో
పేదల్ మాత్రమె ముందు వచ్చిరి సుమీ వేయింటి కే యొక్కఁడో
శ్రీదుం డున్నవిరాగి, త్యాగియనుచుఁ జెల్వొంది వచ్చెఁ సుమీ
యీ దారిద్ర్యముజూచి భీతిలక లెమ్మా ధీరతఁ భారతా!

ఇసిసీ, ముప్పదిమూఁడుకోట్ల జనమేమీ, మానుషం బేది, బా
నిసలై యన్యుల గొల్చుటేమి యెటనేనిఁ కద్దె యీపింత మీ
యుసురుల్ దేనికి మానమేమిటికి లెండో స్వేచ్ఛ నార్జింపుఁడో
అసహాయోద్యమ దీక్ష గొండొ యని నీవై చాటు మోభారతా!

లేదాసంతయు దేశభక్తి మదిలో లేదాత్మవిశ్వాసమున్
లేదింతేని స్వరాజ్య కాంక్షయు స్వతంత్రేచ్ఛాదులుఁ లే వికన్
ఖాదీయన్న మరేదియన్న నభిమానం బేగతిఁ గల్గు లే
లే దీక్షఁ గొని బోధజేసి ప్రజలఁ లేపంగదే భారతా!

ఔదాసీన్యము మానవోయి, క్షమయే యర్థంబు సాయంబొ నీ
యౌదార్యంబె గభీరతాగుణమె నీ కామేటి మిత్రంబు నీ
శ్రీ దీక్షారతియే త్రిలోకవిజయాశీర్వాద మౌ సంశయ
చ్ఛేదాంతర్యుడవై చరించి సుఫలశ్రీ గాంచు మోభారతా!

అలతుల్ గా రసహాయ శూరులుగదా యార్యప్రజల్ సుంతయే
నలసుల్ గారు స్వరాజ్యధూర్వహణ నిత్యానందులే కాని నీ
వెలమిఁ దక్కి కృశింప ధర్మమగునే యేకాకి నెట్లంచు నీ
కసహాయోద్యమమే శరణ్యముగదా యడ్డేమికఁ భారతా!

ఏ రాజ్యంబు ప్రతిష్ఠ చేసిన నొకండేగాదె ధీరాత్ముఁడై
ప్రారంభించు నొకండె యెంత ఘనకార్యంబైన నద్దానికై
చేరఁ వత్తురు లక్ష లీశ్వరుని యాశీర్వాదముఁ గాంచుచో
నారంభంబు శుభార్థమైన గడుదోడ్డౌ నీవు డో భారతా!

ఒకడేగాదె యనన్యదుర్లభ మహోద్యోగంబునఁ మించి కొం
చక యింద్రాదుల గెల్చి ముజ్జగము మెచ్చంగా సుధాభాండము
త్సుకతఁ జేకొనివచ్చి దాయ లరుదంచుఁ ద్రెల్లబో నిచ్చి త
ల్లికి దాస్యంబును మాన్పడే గరుడు డట్లే క్రాలు మోభారతా!

---

# కాళిదాస సందేశం

అక్కిరాజు సిత్యానన్దశాస్త్రి గారు (ఔమాకాంతుడు)

## "కాళిదాసీయానధర్మ విశిష్టకామం" వాఙ్మయసూత్రం

గురువుల కృపానిశేషంవల్ల పై పంక్తికి వ్యాఖ్యాప్రాయంగా ఈక్రింది అంశాలు వివరిస్తాను.

శ్లో. బలం బలవతాం చాహం కామరాగవివర్జితం;
ధర్మావిరుద్ధో భూతేషు కామోస్మి భరతర్షభ.

[ప. అనుదునేను బలోపేతులైనవారి
కామరాగ వివర్జితమైనబలము
భూతములయందు ధర్మావిరుద్ధమైన
కామమవుదును భరతపుంగవుడనేను ]

ఇది ఉపనిషత్సారమైన గీతయందలివాక్యం. ధర్మబద్ధమైన కామం దైవసంబంధి అనేఅంశాన్ని వ్యక్తం చేస్తూ ఉదాత్తదాంపత్యాన్ని ప్రతిపాదించి ప్రవృత్తిధర్మం ప్రతిష్ఠితంచేసిన వాల్మీకి వాస్తవంగా ద్రష్ట. కాళిదాసు వాల్మీకియొక్క ఆరాధకుడు. వాల్మీకి మనస్తత్వానికి హృదయాన్ని సమర్పించిన అనుగామి. కాలాధకారాన్ని నిర్జించినగౌరవంతో జ్యోతిర్మయరూపుడై కవితాలోకాన్ని అలంకరించిన ఆత్మబలోన్నతుడు. రసశ్రేష్ఠమై లోకప్రవృత్తికి హేతుభూతమైన శృంగారాన్నీ, లోకసంస్థితికి హేతుభూతమైనవీరాన్నీ సర్వోత్కర్షంతో వర్తింపజేసిన కృతకృత్యుడు. జగత్పావనులయిన పార్వతీ పరమేశ్వరులవంటి నాయకులను స్వీయసర్గంలో నెలకొల్పిన నిర్మలచిత్తుడు. సర్వతోముఖమైన వికాసాన్ని కవితకు ప్రసాదించిన మహిమాన్వితుడు. ఉపమానవిభుత్వ సంపన్నుడు పరిమితపదప్రయోగంతో సంశ్లిష్ట భావసముదాయాన్ని అద్భుతంగా చిత్రించే చిత్రకళాప్రదర్శకుడు. చిత్తాలను రహస్యంగా హరించే శక్తిసంపన్నుడు. అననురూపమైన తపఃక్లేశాన్ని అనుభవిస్తున్న కుమారసంభవపార్వతి కవియొక్క యీశక్తినే ప్రదర్శిస్తున్నది. మంత్రబలంతో వశం చేసుకున్నట్లు శ్రోతలసానుభూతిని కాళిదాసుయొక్క సర్గవిశేషం ఆకర్షిస్తున్నది. చికీర్షితమైన యీజిజ్ఞాసకు కాళిదాసుని కుమారసంభవసర్గం ఉచితవిషయం గనుక దాన్ని స్వీకరిస్తాను. శ్రోతృచిత్తవశీకరణాన్ని కవి ఎట్లా ఒనగూర్చిందీ పరిశీలనచేసి తెలుపుతాను.

సర్గవిశేషానికి పూనుకొన్నకవి కాళిదాసు పార్వతి జన్మవృత్తాంతంతో ప్రారంభించాడు. సతి జగద్గురుని సహధర్మిణి. పితృకృతమైన అవమానాన్ని సహించలేక శరీరాన్ని త్యజించి నిష్కరుణుడయిన దక్షుడిపుత్రీత్వాన్ని పాపుకొని ఉదాత్తుడయిన హిమవంతుడిపత్నిని జన్మంకోసం ఆశ్రయించిందని కవి ప్రప్రథమంలోనే శ్రోతలఅభిమానానికి పార్వతియందు ప్రవేశం కలిగించాడు. పార్వతీవర్ణనంలో వాపితమైన శ్రోత్రభిమానానికి కవి దోహదమిస్తున్నాడు. లోకంలో కోమలవస్తుసంచయంలో వున్నసౌందర్యమంతా యేకస్థమై పార్వతీశరీరంగా ఉదయించిందన్నాడు. హిమవంతుడికి బహుసంతానంవున్నా పార్వతిని విశిష్టానురాగంతో పెంచాడన్నాడు. ఆదరప్రేరితమైన నారదాదేశంలో పార్వతికి శివలాభరూపమైన ఉన్నతస్థానప్రాప్త్యాశను కల్పించి అభిమానభాజనమైవున్న ఆమెయొక్క ఔన్నత్యాశయాన్ని శ్రోతృదృష్టిలో నిలిపినాడు. అవతంసమైవున్న చంద్రకళ తనచల్లనికిరణాలతో పరిశ్రమను నివారిస్తూ అభిలషితదార్ఢ్యాన్ని శరీరానికి సమకూరుస్తుండగా అహరహం సుకేశి హైమవతి చంద్రశేఖరుణ్ణి ఉపచరించిందన్నాడు. ఈతీరుగా కవి కఠినశుశ్రూషాక్లేశాన్ని తదేకనిష్ఠతో సంతోషంగా భరిస్తున్న ప్రతిలేని శరీరమృదుత్వాన్ని ప్రదర్శించి పార్వతీమనోరథం ప్రేక్షకులకు ఆరాధ్యంచేశాడు. తరువాత పార్వతికి ఆశాభంగం కలిగించి రుద్రసంరంభానికి భయపడి నిమీలితనేత్రాలతో కనికరించదగిన స్థితిలోవున్న ఆమెను తండ్రియింటికి తీసికొనిపోయినాడని తెలుపుతూ ఆమెవాంఛను ఆమోదిం

చిన శ్రోతృచిత్తాలకు అనుతాపం కలిగిస్తున్నాడు. అనంతరం అంటే ఉగ్రమైన తపోనియమాలకు పార్వతి తనశరీరాన్ని సాధనాన్ని చేయదలచిన సందర్భంలో తల్లిమనస్సు తపించిందనీ, ఉద్దిష్టమహాఫలదృష్టితో తండ్రి చిత్తాన్ని వశంచేసుకొని అనుజ్ఞాదానం చేశాడనీ, పూర్వోక్తమైన శ్రోత్రనుతాపాన్ని సాంద్రతాతిశయంతో కరుణంగా మారుస్తున్నాడు. రాబోవు దారుణతపఃప్రవృత్తిన్ని దృష్టాన్నిచేసి మనస్సును కరిగించడానికి కవి పార్వతిశరీరస్థితికీ మునివృత్తికీ వున్న తారతమ్యాన్ని అద్భుతనైపుణ్యంతో ప్రకటిస్తున్నాడు. ఇవి తల్లి మాటలు:—

శ్లో. మనీషితాః సన్తి గృహేషు దేవతా
స్తపః క్వవత్సే క్వచ తావకం వపుః;
పదం సహేత భ్రమరస్య పేలవం
శిరీషపుష్పం నపునః పతత్రిణః.

(వ. వత్సా, ఇండ్లయం దిష్టదేవత లున్నారు. నీతనువెక్కడ, తపస్సెక్కడ? మృదులమైనశిరీషపుష్పం తుమ్మెదపాదాన్ని సహించగలుగుతుంది. కాని పక్షిపాదాన్ని సహించలేదు.)

"అమ్మా, మనయిండ్లయందు ఇష్టదేవతలున్నారు. వారిఆరాధనం నీకు తగివున్నది. ఉగ్రమైనతపోనియమాలను ఈనీశరీరం ఎట్లాసహిస్తుంది? శిరీషపుష్పం తుమ్మెదపాదాన్ని సహించగలదుగాని పక్షిపదస్థితిని యెట్లాభరిస్తుంది?" అని తల్లి పార్వతిని కౌగలించుకొని అంటున్నది. శిరీషపుష్పతుల్యమైన పార్వతిశరీరమృదుత్వమూ, కాఠిన్యానికిస్థానమై తీక్ష్ణనఖయుక్తమైన పక్షిపాదానికి సదృశమైన తపస్క (?) ర్కశత్వమూ ప్రత్యక్షమైనవి. వాటితారతమ్యం వివృతరూపంతో గోచరించి ది. ఇక తపశ్చరణం ప్రారంభమయింది. పార్వతి గృహాన్ని వదలింది. భూషణాలను విసర్జించింది. సౌఖ్యాలను పరిత్యజించింది. తాపసులవల్కలాలను, జపమాలను స్వీకరించింది. పశేదానాదితాపసవృత్తిలో ప్రవేశించింది. లోకసామాన్యమైన తపోనియమాలను అతిక్రమించింది. ఆహారాన్ని వదలింది. తనుంతటరాలిన పండుటాకులనైనా గ్రహించదు. చంద్రకిరణాలను వర్షోదకాన్ని మాత్రమే జీవనసాధనం చేసుకున్నది. అతిదారుణమైన తపోవృత్తితో అత్యంతకృశత్వాన్ని పొందింది. ఇక భావకహృదయాన్ని నీరు చేసేపార్వతిని కవి ప్రేక్షకదృష్టికి సమర్పిస్తున్నాడు.

శ్లో. శిలాశయాం తా మనికేతవాసినీం
నిరన్తరా స్వన్త రవాతవృష్టిషు;
వ్యలోకయ న్నునిమిషై స్తడిన్మయై
ర్మహాతప స్సాక్ష్యఇవ స్థితాః క్షపాః.

(వ. మధ్యమధ్య వాయుసంయుతిగల నిరంతరవృష్టులందు అనావృతప్రదేశంలో శిలాతలాన శయనించి వున్న ఆమెను మహాతపస్సాక్షులుగా వున్నరాత్రులు విద్యున్మయాలైన అవలోకనాలతో చూచినవి అన్నట్లు వుండెను.)

ఈశ్లోకంలో నిరాహారితవల్లా తపస్కార్కశ్యంవల్లా శుష్కించిపోయి, అస్థిగతప్రాణంతో దీక్షాపరతంత్రురాలైన పార్వతి ఏకాకిని నిశీథమందు అనావృతప్రదేశంలో నిరంతరమైన వాతవృష్టిలో కఠినశిలాతలమందు శయనించి వున్నది. విద్యున్నేత్రాలతో రాత్రులామెను చూస్తున్నవి. అక్కడ మరియెవ్వరుగలరు? అది మహారణ్యమధ్యమైన వివృతప్రదేశం. గాఢాంధకారబంధురమైన కాళరాత్రి; తటిల్లతలు క్షణికోపకృతితో భయంకరమైన నిశాస్వరూపాన్ని తెలుపుతున్న వేళ. వృక్షాలుసయితం సంక్షోభిస్తున్నసమయం. కాని పార్వతి నిశ్చలమైన ఈశ్వరధ్యానానికి హృదయాన్ని సమర్పించి శయనించివున్నది. ఆమె కక్కడ నికేతనం యేమీ లేదు. భద్రప్రదమైన పితృగృహాన్ని వదలివచ్చింది. సహచరీబృందం లేదు. అనవరతశుశ్రూషాతత్పరులైన దాసీజనాన్ని పితృగృహానికి పంపించింది. ఈశ్వరుడితో సంభాషించవలసిన అవసరంలో కవి సఖీసాహచర్యాన్ని కనబరచినా ప్రస్తుతస్థితిలో ఆసఖులు సాధారణజీవుల ఆర్తత్వంతో తలలను దాచుకొనివున్నారు. పుష్పాస్తృతమృదుతల్పాలు లేవు. మనః పూర్వకంగా సర్వసౌఖ్యాలను పరిత్యాగం చేసి బయలుదేరింది. అత్యంతంగా కృశించిపోయివున్న ఆమెకిది

కర్కశపాషాణతలాన్ని ఆశ్రయించి క్లేశాన్ని సర్వాన్ని సహిస్తున్నది. మనస్సును అధిష్ఠించివున్న ఈశ్వరుణ్ణే ఆమె విలోకిస్తున్నది. తపస్సాఫల్యకాంక్షకే ఆమెచిత్తం సమర్పితమైవున్నది. మనోరథసిద్ధికే ఆమె యెదురుచూస్తున్నది. అరూపహార్యుడైన ఈశ్వరుడిసాహచర్యాన్నే ఆమె భావిస్తున్నది. హృదయాలను కరుణాప్రపూరితాలను చేస్తున్నది. ఈతీరున భావకచిత్త వశీకరణశక్తిని పార్వతికి కవి ఒనగూర్చాడు.

ఇక కవి సౌమమార్యాతిశయంతో తనతూలికను ప్రయోగించి సంసక్తభావాలను మనోహరంగా ప్రవర్తించే చిత్రకళాకౌశల్యాన్ని ఉపమానవిభుత్వాన్ని తెలియజేస్తాను. ఇందుకు శ్రీ. యమ్. కృష్ణమాచార్యులవారి కృతిలో ఆగ్రహప్రదర్శనంవల్ల పార్వతికి ఈశ్వర హృదయాన్ని హరించడానికి అవకాశం కలిగిందని ప్రకటించడానికి సమాగమకాంక్షతో చిరకాలం భావంలో ధ్యానిస్తున్నప్రియుణ్ణి అతర్కితంగా క్షణంలో సందర్శించడంవల్ల ఏర్పడ్డ పార్వతి చిత్తవృత్తిని ప్రదర్శించడానికి దత్తాలై వున్న ఉదాహరణాలను సారస్యాకర్షణంవల్ల స్వీకరించి ప్రస్తుత సందర్భానుగుణంగా పొందుపరుస్తున్నాను.

శ్లో. ఇతి ద్విజాతౌ ప్రతికూలవాదిని
ప్రవేపమానాధరలక్ష్యకోపయా,
వికుంచితభ్రూలతమాహితే తయా
విలోచనే తిర్యగుపాన్తలోహితే.

(వ. ఇట్లాద్విజుడు ప్రతికూలవాది అయినప్పుడు చంచలాధరోష్ఠంవల్ల తెలుసుకొనదగిన కోపంగలపార్వతి భ్రూలతలు ఆభుగ్నంగా, కొనలయందు ఎర్రబారిననేత్రాలను అడ్డంగాతిప్పింది.)

ఈశ్లోకం పార్వతిచిత్తరువును ప్రదర్శిస్తున్నది. ఈచిత్తరువులో గోచరిస్తున్నపార్వతి బ్రహ్మచారి అపభాషణానికి ఆగ్రహాన్ని ప్రకటిస్తున్నది. పార్వతిభావాలు ధరించిన బాహ్యరూపం నిర్మలమైనది. కోమల సౌందర్యానికి ఆశ్రయమైనగౌరిలో మనోవృత్తి స్ఫుటాకారంతో గోచరిస్తున్నది. ఈచిత్తరువులోవున్న జీవమంతా బ్రహ్మచారి మాటలయందు అనిష్టాన్ని తెలుపుతున్న పార్వతిదృష్టిలో వున్నది. అధరసంచలనం, నేత్రదీప్తి, భ్రూకౌటిల్యం, అన్యూనసహకారులై వర్తిస్తున్నవి. ఈచూపులో పార్వతి హృదయమంతా అనావృతరూపంలో గోచరిస్తున్నది. ఆమె యెవరియందు అనిర్వచనీయమైన మనోహరత్వాన్ని సందర్శించిందో, యెవరికి ప్రేమను సర్వాన్నీ నిశ్చలత్వంతో సమర్పించిందో, యేపూజ్యుణ్ణి పరవశత్వంతో భావిస్తున్నదో, ఆప్రియతముణ్ణి, ఆలోకైకగురుణ్ణి, అమితభాషి, ఒకబ్రహ్మచారి అపహసిస్తున్నాడు. ఆమెహృదయం దానికి ప్రతివచనం ఇవ్వగోరింది; అధరకంపనాదులతో తిర్యగ్వీక్షణం ప్రతివచిస్తున్నది; తన్మూలంగా పార్వతి బ్రహ్మచారిమాటలయందు తనపుగల అప్రియత్వాన్ని తెలుపుతున్నది. తానొనరించిన వరనిర్ణయం అప్రశస్తమైందనడంవల్ల, క్రోధంవహించిన ఆత్మగౌరవాన్ని తెలుపుతున్నది. తన హృదయారాధనకు ఆస్పదుడని తెలిసినా నిర్లక్ష్యంతో బ్రహ్మచారి అప్రస్తుతంగా తనసమక్షంలో అగౌరవప్రసంగం జరిపినందుకు ఆగ్రహాన్ని తెలుపుతున్నది. బ్రహ్మచారియొక్క ఉపదేశంమీద తిరస్కృతిని తెలుపుతున్నది. ఇన్నిటిని తెలుపుతున్న, అనుభావాన్ని ప్రతిపాదించినవిధానం, వాస్తవంగా కాళిదాసీయమైన విద్యావిశేషం.

ఇక ఉపమానవిభుత్వం ఉదాహృతమవుతున్నది:

శ్లో. తం వీక్ష్య వేపథుమతీ సరసాఙ్గయష్టి
ర్నిక్షేపణాయ పద ముద్ధృత ముద్వహన్తీ
మార్గాచలవ్యతికరాకులితేవ సిన్ధుః
శైలాధిరాజతనయా నయయౌ న తస్థౌ.

(వ. ఆయనను చూచి కంపాన్నిపొంది స్విన్నగాత్రియై స్థలాంతరవిన్యాసంకోసం యెత్తినపాదాన్ని ఉద్వహిస్తున్న గౌరి మార్గమందు పర్వతావరోధంవల్ల సంక్షుభితమవుతున్ననదివలె స్థితికలదీ కాలేదు, గమనంకలదీ కాలేదు.)

ఇది ఔపమ్యసారస్య సమగ్రతకు నిదర్శనం. అతర్కితంగా ఉపస్థితుడైన ఈశ్వరుణ్ణి సందర్శించినపార్వతియొక్క అవస్థావిశేషం బ్రహ్మచారి శివదూషణాభి

నివేశానికి పార్వతికి ఆగ్రహం కలిగింది. నిందాశ్రవణవిముక్తికి స్థలాంతరాన్ని ప్రాపించదలచింది. పాదాన్ని కదలించింది; కాని ఆఉత్తరక్షణంలో బ్రహ్మచారి అదృశ్యుడై ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. జటామధ్యగతమైన చంద్రకళకాంతితో మందహాసాంకితమైన ముఖంతో ప్రసారితాలైన బాహువులతో పరమేశ్వరుడు సముఖంలో నిలిచాడు. క్షణకాలంలోనే అవిచారితమైన మార్పు తటస్థంచింది. పార్వతి యెత్తినపాదంతో అవిధంగానే నిలిచిపోయింది. ఆమెశరీరం కంపిస్తున్నది. స్వేదం ఆమెను ఆవరించింది. అప్పుడు పార్వతి పర్వతంవల్ల మార్గావరోధం కలదై ఆకులపడుతున్న నదివలె వున్నదని కవి తెలుపుతున్నాడు. దుస్సహమైన మునివృత్తిని అవలంబించి శరీరాన్ని తపించజేస్తూ యెవరిసమాగమాన్ని కాంక్షిస్తున్నదో ఆమహాదేవుడి సందర్శనం లభించింది. అందువల్ల ముప్పిరిగొనే భావాలు ఉదయించినవి. శ్లోకంలో కవి చిత్రించినపార్వతియందు ఈభావాలన్నీ సంస్థితాలై కనబడుతున్నవి. ఈభావప్రబలత్వాన్ని క్రియానివృత్తిరూపంగానూ క్రియాప్రవృత్తిరూపంగానూ కవి ప్రకటిస్తున్నాడు. ఆగ్రహప్రేరణవల్ల స్థలాంతరగమనానికి పార్వతిపాదం ఉద్ధృతమైంది. కాని మహాదేవసందర్శనంవల్ల ఆగ్రహం మారిపోయింది. ఉద్ధృతమైన పార్వతిపాదం విధాయకకృత్యాన్ని మరచింది. అస్వాభావికమైన నిరాధారతను విస్మరించింది. పూర్వవ్యాపారం ఈవిధంగా నిలచిపోయింది. ఇక అనంతరవ్యాపారం ప్రచారంలోకి వచ్చింది. ఇది ఆవిష్టభావాల ప్రవృత్తి. ఇందువల్లనే స్వేదయుతమై గాత్రం కంపిస్తున్నది. ఈవిధంగావున్న పార్వతిని కవి అచలావరోధంవల్ల నిలచిపోయిన నదితో ఉపమిస్తున్నాడు. మనస్సుతో దర్శించవలసినవై ప్రస్తుత పార్వతిస్థితిని పరికల్పించిన కారణాలను ప్రత్యక్షగోచరమైన నదీసంస్తంభన సంచలనకారణాలతో ప్రకాశపరుస్తున్నాడు. సమానధర్మాలకు సమగ్రత్వం కలిగించి నిలిపినాడు. ఈశ్వరసందర్శనంవల్ల పార్వతియందు సంకల్పితక్రియానివృత్తి అంటే ప్రస్థాననివారణం కలిగింది. పర్వతస్థితివల్ల నదియందు సంకల్పితక్రియానివృత్తి అంటే, ప్రవాహనివారణం కలిగింది. శివసందర్శనంవల్ల ఆవేశించిన భావాలమూలంగా పార్వతియందు క్రియాప్రవృత్తి బయలుదేరింది. పర్వతస్థితివల్ల కలిగిన ప్రతిక్రియమూలంగా నదియందు క్రియాప్రవృత్తి బయలుదేరింది. రెండుచోట్లా క్రియాప్రవృత్తి క్రియానివృత్తులు కారణయుక్తాలై వున్నవి. ఆవిష్టభావాల ప్రబలత్వాన్ని అత్యధికమైన పరిమాణగురుత్వంతో పర్వతం తెలియచేస్తున్నది. సౌకుమార్యంగల నదీపార్వతులయెదుట గాంభీర్యంగల పర్వతపరమేశ్వరులు సముచితంగా వున్నారు. పార్వతియందూ నదియందూ సహజమైన కంపం వర్తిస్తున్నది. ఈమాటలు కవియొక్క ఉపమానవిభుత్వాన్ని ప్రదర్శిస్తున్నవి.

## కవి సందేశము

ఈతీరున కవితాకౌశల్యానికి సంస్థానాలైన కృతులను వెలయింపగలిగి లోకోత్తరమైన పార్వతీపరమేశ్వరుల దాంపత్యమహిమను భావించిన ఈఉన్నతభావుడు ఒకసందేశాన్ని కవితాసర్గగర్భితంచేశాడు. ఇది వాల్మీకి ప్రేమతత్వప్రతిరూపం. ఇది ధర్మవిశిష్టకామం.

వాల్మీకి ధర్మమూలమైన ప్రేమను భావించాడనీ, కాళిదాసు వాల్మీకిహృదయంలో పుట్టి వాల్మీకిభావనయందు పెరిగినవాడైనా భారతతత్వమ్మీద అధికారాన్ని పొంది వాల్మీకి ప్రేమతత్వానికి పరిణామాన్ని కలిగించిన వ్యాసుడిమీద ఒకవిధమైన ప్రతిక్రియను నడిపి వాల్మీకిభావనకు ఛాయారూపమైన ధర్మవిశిష్టకామాన్ని నెలకొల్పాడనీ, ఒకవిశుద్ధగుణంతో ప్రేమను నిర్ణయించాడనీ విద్యాశేఖరులు "ప్రేమపరిణామంలో" తెలిపివున్నారు. వ్యాసుడియందు ప్రేమను నిర్ణయించింది కామమనీ, కామమంటే మన్మథతాపమేకాక ఇచ్ఛఅనీ వ్యాసుడి ద్రౌపది, శకుంతల, దమయంతి, సావిత్రి, దేవయాని, సుభద్ర, రురుడు, శంతనుడు, సంవరణుడు, ప్రేమనిర్ణయంలో ఈఇచ్ఛనే కనబరుస్తున్నారనీ, ప్రేమపరిణామం విశదంచేస్తున్నది. వ్యాసప్రేమసర్గానికి బీజప్రాయమైన గంధర్వప్రేమతత్వాన్ని వివరిస్తున్నది.

విద్యాశేఖరుల ప్రేమపరిణామం తెలుపుతున్న ఈకవియొక్క ధర్మవిశిష్టకామం అత్యుత్తమసర్గమైన

కుమారసంభవకావ్యంలో ప్రస్ఫుటరూపంతో గోచరిస్తున్నది. అన్యకావ్య సందర్భాలల్లోగూడా కవి ఈవిశుద్ధగుణాభిమానాన్ని యథార్థంగా ప్రకటిస్తున్నాడు. కాని దీనిసర్వరూపాన్ని కుమార సంభవాంతర్గతాన్ని చేశాడు. ఇక ధర్మవిశిష్టకామమంటే ధర్మాయత్తమైన ఒకపవిత్రేచ్ఛ; రూపవిత్తాదుల వ్యామోహాన్ని పరిగణించని ఒకఉదాత్తాభినివేశం. ఈకామానికే కవి ప్రేమనిర్ణయ యాజమాన్యాన్ని సమర్పించాడు. ఇది ఆరాధ్యమైన ధర్మమని నిర్వచిస్తున్నాడు ప్రాకృతమైన కామానికి ప్రేమభావం అతీతం కావడంలోనే ఉత్తమదాంపత్యం సిద్ధిస్తుం దంటున్నాడు; ఇంద్రియలోలత్వజనకమైన కామంతో ప్రేమను నిర్ణయించడంలో వివేకాంధత్వదోషం వున్నదని తెలుపుతున్నాడు. కాంతాపరాయణత్వాన్నే పరమార్థంగా యెంచే ఇంద్రియలోలత్వాన్ని ధర్మవిశిష్టకామం మూలంగా సంఘటితమయ్యే దాంపత్యానికి అధీనంచేస్తున్నాడు.

ఈవిషయాలను బోధించడానికి కవి ప్రథమంలో ఇంద్రియప్రేరణను పరికల్పించి ఉన్మూలమైన ప్రేమనిర్ణయంలోవున్న అనర్థాలను వివరించి దాన్ని నిరసిస్తున్నాడు. అనంతరం కామాన్ని ధర్మవిశిష్టత్వంతో ఆవిర్భవింపచేసి దాంపత్యానుష్ఠానాన్ని సమకూర్చి కామానికి జీవితావకాశసంతోషం కలిగిందని తెలుపుతున్నాడు. తదనంతరం సంఘటితమైన దాంపత్యంయొక్క మహిమను వర్ణించి ఇంద్రియమూలమైన కామం లోకప్రవృత్తికి హేతువవుతున్నదనీ ధర్మసాధనమవుతున్నదనీ తెలుపుతున్నాడు.

## కామప్రేరణం

శ్లో॥ హరస్తు కించి త్పరిలుప్తధైర్య
శ్చంద్రోదయారమ్భ ఇవామ్బురాశిః;
ఉమాముఖే బిమ్బఫలాధరోష్ఠే
వ్యాపారయామాస విలోచనాని.

(వ. చన్ద్రోదయారమ్భమందు సముద్రుడివలె ఈశ్వరుడుగూడా ధీరత్వం కొంచెంతగ్గినవాడై దొండపండువంటి అధరోష్ఠంగల పార్వతీముఖమందు నేత్రాలను ప్రవర్తింపజేశాడు.

శ్లో. వివృణ్వతీ శైలసుతాఽపి భావం
అఙ్గైః స్ఫురద్బాలకదమ్బకల్పైః;
సాచీకృతా చారుతరేణ తస్థౌ
ముఖేన పర్యస్తవిలోచనేన.

(వ. వికసించివున్న కోమలకదమ్బానికి సాటివచ్చే అవయవాలతో శృంగారభావాన్ని ప్రకటిస్తూ పార్వతిగూడా సాచిక్రియచేత సుందరమై వ్రీడావివర్తితనేత్రాలుగల ముఖంతో వుండెను.)

ఇంద్రియప్రేరణమూలమైన ప్రేమనిర్ణయయత్నాన్ని కవి నాయకుల ప్రథమసన్నివేశంలో అంటే ముక్తసంగుడై తపశ్చరణంకోసం హిమనగసానువు నాశ్రయించిన ఈశ్వరుణ్ణి పార్వతి సేవిస్తున్న సందర్భంలో ప్రదర్శిస్తున్నాడు. ఇందుకు మనోహరమైన ఉపాధులు కవికల్పించాడు. ఉత్తరాయణమయింది. మధుమాసం ప్రవేశించింది. మలయవాయువులు బయలుదేరినవి. వృక్షాలు పుష్పపల్లవసంశోభితములైనవి. వివిధాలైన సుమాలూ వెలసినవి. వనం చిత్రవర్ణమయమయింది. పుష్పోడులు రాలుతున్నవి. కోకిల కషాయకంఠంతో పాడుతున్నది. జింకలు మదోద్రేకంతో పరుగెత్తుతున్నవి. అప్పుడు అంటే ప్రకృతి వసంతాలంకృతయై మనోజ్ఞరూపాన్ని ధరించివున్న ఆసమయంలో మిథునాలన్నీ స్నేహోత్కర్షా నిబద్ధాలై పోయినవి. మగతుమ్మెద తన ప్రియురాలి ననుసరించి పుష్పపాత్రంలో జతన తేనె తాగుతున్నది. స్పర్శసుఖంతో నిండిపోయి కండ్లుమూస్తున్న ప్రియురాలిని కృష్ణసారం కొమ్ముతో మెల్లగా గోకుతున్నది. పద్మసౌరభంతోకూడిన వక్త్ర(?)గతజలాన్ని కరేణువు అనురాగంతో ప్రియుడికి ఇస్తున్నది. స్వభుక్తశేషమైన తామరతూడును ఇచ్చి చక్రవాకం చక్రవాకిని ఆదరిస్తున్నది. పుష్పమద్యాన్ని త్రాగి చలిస్తున్న నేత్రాలతో గానంచేసే ప్రియురాలిముఖాన్ని కింపురుషుడు ముద్దుపెట్టుకుంటున్నాడు. వృక్షాలుగూడా పుష్పస్తబకాలనే స్తనాలతో రక్తపల్లవాలనే అధరాలతో

మనస్సును హరిస్తున్న లతావధువులను శాఖా బాహువు లతో ఆలింగనం చేస్తున్నవి.

కవి ఈవిధంగా మనస్సుకు ఆనందపారవశ్యం కలిగించే రమణీయమైన ఒకప్రదర్శనాన్ని సజీవంగా ప్రత్యక్షం చేస్తున్నాడు. కరుణాకరుడు, రసానిష్టుడు వాల్మీకి ప్రతిలేని చిత్తసంస్కార విశేషంతో క్రౌంచదంపతుల శృంగారానుభవంలో సందర్శించగలిగిన నిర్మలమాధుర్యాన్ని కవి అధికతరమనోజ్ఞత్వంతో సర్వవిధద్వంద్వాల శృంగారభావప్రకటనతో శ్రోతలకు అనుభూతం చేస్తున్నాడు. చతుర్విధప్రాణులందూ యేకరీతిగా మహానందప్రదమైన మిథునాల ఆత్మైక్యప్రవృత్తిని ప్రకటిస్తున్నాడు. తిర్యక్కులశృంగారంలో గూడా భావమార్దవాతిశయంతో అమృతమయమైన ప్రేమస్వరూపాన్ని కనబరుస్తున్నాడు. లోకప్రవృత్తికి హేతుభూతమై పావనమైన శృంగారవిషయంలో తనకుగల అభిమానాన్ని విశదీకరిస్తున్నాడు.

ఈకోమలవస్తుసామగ్రితో కవి ఒకరంగస్థలాన్ని సిద్ధంచేశాడు. ఇవి అంటే ఈమధుసంపద ఈసాధుజంతువుల శృంగారలీలలూ ఉద్దీపనోపకరణాలు. రమణీయమైన ఈరంగస్థలంలో కవి నాయికను ప్రవేశపెడుతున్నాడు. నాయికాప్రసాధన విషయంలో కవి సౌకుమార్యాన్ని కనబరుస్తున్నాడు. కవి కనబరచేవిధానం కన్నులకు మిరుమిట్లుగొలిపే కృత్రిమాలంకరణం గాదు. భావసంతుష్టిని కలిగించే ప్రసాధనచాతుర్యం. ప్రకృతిసిద్ధమైన అలంకరణం. పార్వతి లోకైకసుందరి. ఆవసంతవికాసానికి మనఉల్లాసం కలదౌతుంది. సహజమైన చిత్తవృత్తితో స్వీయసౌందర్యాన్ని కుసుమ విశేషాలతో అర్చించింది; అశోక కర్ణికార సింధువారపుష్పాలతో అలంకృతఅయింది. బాలార్కరక్తిమగల చీరమీద కటిస్థానంనుండీ జారిపోతున్న పొగడదండ మొలనూలును చేతితో పైకి తీస్తున్నది. సామీప్యంలో సంచరించడానికి యత్నించే తుమ్మెదను లీలాకమలంతో తోలుతున్నది. చిగుళ్లతో నిండి పూలగుత్తులబరువుతో వంగి, సంచారం చేస్తున్న లతవలె కనబడుతున్నది. ఈశ్వరాశ్రమాన్ని సమీపించింది. యోగాన్ని చాలించి ప్రసన్నుడైవున్న ఈశ్వరుణ్ణి ప్రాపించింది. చిగురుటాకులతో కలసివున్న పుష్పచ్చయాన్ని శివపాదాలవద్ద సమర్పించింది. అలకన్యస్తమైన కర్ణికారమూ, కరస్థితమైన కోమలపల్లవమూ జారిపడుతూవుండగా వంగి వృషభధ్వజుడికి నమస్కరిస్తుంది. ఈవిధంగా మనస్సంహ్లాదజనకమైన విలాసవ్యాపారానికి కవి కోమలాలంకరణాన్ని సాధనంచేస్తున్నాడు. తరువాత పార్వతి గంగాపద్మబీజాలను యెండబెట్టి చేసినజపమాలను యెర్రనికాంతిగల తన చేతితో ఈశ్వరుడికి సమర్పిస్తుంది. ఆయనశుశ్రూషయందు తనకుగలశ్రద్ధను తెలుపుతుంది. ఈశ్వరు డాతాపస్విని ప్రతిగ్రహించడానికి ఉద్యుక్తుడౌతాడు. పార్వతిపై దృష్టిని ప్రసారిస్తాడు. ఇంద్రియప్రేరితు డౌతాడు. మనోవికారాన్ని పొందుతాడు. తన అన్నికండ్లతో యెర్రనిపెదవిగల పార్వతిముఖాన్ని సాభిలాషంగా చూడడం ప్రారంభిస్తాడు. పార్వతిగూడా పులకరించిన అవయవాలతో, చలిస్తున్నకండ్లతో ముఖాన్ని అడ్డంగా త్రిప్పి నిలుచుంటుంది. ఈశ్వరుడి జితేంద్రియత్వానికి పరిశోధనసమయం తటస్థిస్తుంది. ఈతీరున నాయకుడు ప్రేమసర్పణ చోదనానికి సంసిద్ధపడివున్న ఇంద్రియక్షోభ రణాన్ని కవి వివృతరూపంతో గోచరించజేస్తున్నాడు. మనస్సంవేద్యమైన ఈభావంయొక్క స్వరూపాన్ని కవి తాకౌశల్యంతో ప్రదర్శిస్తున్నాడు.

శ్లో. సదక్షిణాపాఙ్గనివిష్టముష్టిం
న తాం సమాకుఞ్చితసవ్యపాదం;
దదర్శ చక్రీకృతచారుచాపం
ప్రహర్తు మభ్యుద్యత మాత్మయోనిమ్.

(వ. దక్షిణాపాంగమం గుంచిన ముష్టిగలవాణ్ణి వంచబడిన భుజంగలవాణ్ణి సంకుచితమైన కుడికాలుగల వాణ్ణి వర్తులారంగా జేసిన సౌమ్యచాపంగలవాణ్ణి ప్రహరణానికి ఉద్యుక్తుడైవున్నవాణ్ణి మారుణ్ణి ఆయన చూశాడు.)

[స శేషము

## శైలి

(శ్రీరామ స్తవము)

కవితిలకః కాంచనపల్లి కనకమ్మగారు
(విద్వాన్)

పరమార్థంబది జీవకోటి కొసఁగన్ వాగ్దేవివై, ప్రీతివై
హరివై, శంకరుఁడై, గణేశ్వరుఁడవై, యాదిత్యుఁడై, యంబవై
పరుఁడై, దేశికుఁడై, పరాత్పరుఁడవై, ప్రత్యేకరూపంబులన్
ధరియింపంగల నీదుశక్తి దలఁతున్ ధర్మార్థకామంబులన్
బరివర్జించిన భక్తపాళికిఁగదా ప్రాప్తించు ద్వద్యోగ మో
కరుణాసాగర, రామచంద్రనృపతీ, కైవల్యదాత్రాకృతీ.

వరముల్ వేడక వాంఛలేక మదిలో వైరాగ్యముంబూని స
త్వరమే నాత్మగతుండవైన నినుఁ గొల్వంగల్గె నాభాగ్యమే
ధర భాగ్యంబని యెంతు నీ పదములన్ ధ్యానింతు మోదింతు నా
పరమార్థం బిఁక వేరఁ గోరుమన తాత్పర్యాభియోగంబునన్
గరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్య దాత్రాకృతీ.

హరియే యీజగ, మిద్దియే హరి, యటం చాత్మావలోకంబునన్
హరిపూజావిధినున్న భక్తులకు బ్రహ్మానంద సంధాయకుం
డురుదీక్షాపరుఁ డార్తరక్షణమునన్ యోగీశ్వరేశుండ వో
కరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్యదాత్రాకృతీ.

నరనారాయణ రూపమొంది ప్రజలన్ నానావినోదంబులన్
గురుశక్తిం దగ రక్షణంబొసఁగు నీగోప్తృత్వ మేపాటిదో
పురుషార్థంబు నెఱుంగనట్టి పశులన్ బ్రోవంగ నేఁగాంతులే
కరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్యదాత్రాకృతీ.

జరయున్ మృత్యువు వెంబడింపఁగ మదిన్ శంకాలవంబున్ గటా
చొరనీఁడెంతయు మెచ్చు నీభవముఁ జూచు న్నాకమ ట్లీభవిన్
గరమర్థించుచు స్వప్రయోజకత సౌఖ్యంబంచు మోదించుగా

నరుడెందుఁ దనయజ్ఞతన్ గణనకున్ రానీఁడు నీమాయచేఁ
గరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్యదాత్రాకృతీ.

పారినానాత్వము నీదు నైజమయి పెంపుంగాంచుచో జీవులన్
స్థిరభావంబును దాల్పకున్న భవవార్ధిన్ ముంచి బాధించి, ము
క్తిరమాదూరులఁ జేయనెంచెదవు సందేహంబులం బెంచెదో
కరుణాసాగర రామంద్రనృపతీ కైవల్యదాత్రాకృతీ.

ఒరులన్ నమ్ముట యాధిహేతువని యార్యుల్ వల్క నాలించి బ్ర
హ్మరతిన్ సౌఖ్యము కల్గునం చనెడు నాత్మారాములంగాంచి నీ
చరతిన్ గాలము పుచ్చుచుండెదరు విశ్వాసంబు లేకుంట మా
నరు దాత్మార్గ్యము వారిఁబ్రోవఁ దగదా నారాయణా దీనులన్
గరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్యదాత్రాకృతీ.

పరముం బావనజీవనంబు సుమముల్, ప్రజ్ఞానముల్ భక్తియుల్
సురసాలంబును గల్పవల్లియునగున్, యోగంబు నీరంబెయా
నరయన్ బీజముసు మ్ముమాపతి యతండా, చార్యుఁడే కాపు సం
సరణాబ్ధిన్ లభియించు సత్ఫలము నీసాయుజ్యమన్ దాని కం
దురు సర్వంబును నీ ప్రభావముగ నెంతున్ వేకటాక్షింపవే
కరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్యదాత్రాకృతీ.

శరణంటిన్, దమచిత్తమంటి, గృతికిన్ జాలన్ హరీ యంటి, నీ
చరణంబే గతియంటి, రిక్త నిఁక నాసర్వస్వ మీవంటి, నన్
బరిశోధింపకుమంటి, మంటిని సదానందంబున న్నీకృపన్
గరుణాసాగర రామచంద్రనృపతీ కైవల్య దాత్రాకృతీ.

---

# యుగములు—మన్వంతరములు

కవికొండల వేంకటసత్యనారాయణమూర్తిగారు

"యుగములు-మన్వంతరములు" అనుశీర్షికక్రింద నొకవ్యాసమును వ్రాసెదనని నేను మా చదువరులకు వాగ్దానము చేసియుంటిని. కొంచెమాలస్యమైనందులకు పాఠకులు మన్నించెదరుగాక.

ప్రస్తుతము పురాణములలోఁ గనఁబడుచున్న యుగ-మన్వంతర, పరిమానము లిట్లున్నవి.

| | దేవమానము |
|---|---|
| కృతయుగప్రమాణము | 4000 సం. |
| త్రేతాయుగ ప్రమాణము | 3000 సం. |
| ద్వాపరయుగ ప్రమాణము | 2000 సం. |
| కలియుగ ప్రమాణము | 1000 సం. |
| కృతయుగసంధి | 800 |
| త్రేతాయుగసంధి | 600 |
| ద్వాపరయుగసంధి | 400 |
| కలియుగసంధి | 200 |
| | 12000 |

దేవమానము ననుసరించి యీ 12000 సంవత్సరములును కలిసి యొక మహాయుగమగుచున్నది. ఇది మనుష్యమానము ననుసరించి 12000 × 360=4320000 సంవత్సరములగుచున్నది. ఇట్టివి 71 మహాయుగములైన నొక్క మన్వంతరమగును. యుగములకును మన్వంతరములకును పురాణములలో నుదహరింపఁబడిన సంబంధమిది. ఇఁక దీనియందుఁ గల సందర్భాసందర్భములను విచారింతము.

పురాణముల ననుసరించి వైవస్వతమన్వంతరమున 28 వ మహాయుగ మిప్పుడు ప్రవర్తిల్లుచున్నది. దీనినిబట్టి వైవస్వతమన్వంతర ప్రారంభమునుండి 28 వ ద్వాపరయుగాంతము వఱకునైన మానవసంవత్సరములసంఖ్య—

| | |
|---|---|
| 43,20,000 | సం.లు మహాయుగప్రమాణము |
| 27 | మహాయుగములకు |
| 11,66,40,000 | సంవత్సరములు |
| 14,40,000 | ఇరువదియెనిమిదవకృతయుగము |
| 28,8,000 | కృతసంధి |
| 10,80,000 | త్రేతాయుగము |
| 2,16,000 | త్రేతసంధి |
| 7,20,000 | ద్వాపరయుగము |
| 1,44,000 | ద్వాపరసంధి |
| 12,05,28,000 | సంవత్సరములు |

పండ్రెండుకోట్ల అయిదులక్షల యిరువదియెనిమిదివేల సంవత్సరములు. ఈ సంవత్సరములలో పురాణముల ననుసరించి వైవస్వతమనువుమొదలు ధర్మరాజువఱకును తేలిన తరములసంఖ్య* 47 అనఁగా నలువదియేడు తరములలో పండ్రెండుకోట్ల అయిదులక్షల యిరువది యెనిమిదివేల సంవత్సరములు గడచెను. దీనినిబట్టి సగటున నొక్కొక్క తరమునకు.

*భారతి 5 సంపుటము, 6 సంచిక, 850 పుట చూడుడు.

12,05,28,000 ÷ 47=27,77,191 $\frac{23}{47}$ సం. ఇరువదియేడులక్షల డెబ్బదియేడువేల నూట తొంబదియొక్క సంవత్సరములు! ఏతరమునందుగాని యేరాజుగాని యిన్నిసంవత్సరములు జీవించెనని పురాణములు చెప్పసాహసింపలేదు.

కావున నీసంఖ్య పౌరాణికులు పొరబడి వ్రాసినసంఖ్యగాఁ గనఁబడుచున్నది. ఏలయన యుగప్రమాణము హిమాలయపర్వతములకు దక్షిణమునంగల భారతవర్షమునకు మాత్రమే చెల్లునుగాని, హిమాలయమున కుత్తరమునంగల కింపురుషవర్షాది దేవభూములకు ఈ ప్రమాణము చెల్లదని స్పష్టముగా పురాణములలోఁ జెప్పఁబడియుండఁగా, కృత, త్రేత ద్వాపర, కలియుగప్రమాణసంఖ్యలకు 4000 + 3000 + 2000 + 1000 సంవత్సరములు దేవమానములనియును దానిని మానవ సంవత్సరములలోనికి మార్చుకొనుటకు 360 తో గుణింపుమనియు చెప్పుట పొరపాటై యుండవలెను. ఏలయన దేవలోకము (హిమాలయ పర్వతోత్తరప్రదేశము) లలో నీ 'యుగ మానమే' లేనప్పుడు ఇది దేవమానమని చెప్పుట సమంజసముగాలేదు. కావున నీ 4000, 3000, 2000, 1000, సంవత్సరములసంఖ్య మనుష్య మానమనియే మన మంగీకరింపవలెను. లోకమాన్య బాలగంగాధరతిలకుకూడ "Arctic home in the Vedas" అను పుస్తకమున నీయభిప్రాయమునే వెల్లడించెను. ఇట్లయిన సగటున మనుష్యునియొక్క జీవితపరిమాణ మెంతవఱకు తేలునో చూతము.

వైవస్వతునకు మూడవపురుషుఁడగు పురూరవుని కాలమున కృతయుగము పోయి త్రేతాయుగము ప్రవేశించినట్లు పురాణములు చెప్పుచున్నవి. అనఁగా త్రేతాయుగ సంవత్సరములు 3000, ద్వాపరయుగ సంవత్సరములు 2000 నడుమసంధి 400 సంవత్సరములును వెరసి 5400 సంవత్సరములును పురూరవుఁడు మొదలు ధర్మజునవఱకునుగల 45 తరములకును పంచిపెట్టిన (5400 ÷ 45=120) ఒక్కొక్క మనుజుని జీవితకాలము సగటున నూటయిరువదిసంవత్సరములు తేలినది. ఇది యే మనుజునియొక్క సరియైన ఆయుఃపరిమాణము. ధర్మరాజాదులును నింతకాలమే జీవించినట్లు తెలియుచున్నది.

ఈ లెక్కనే ప్రమాణముగాఁ జేసికొని చూచిన ద్వాపరయుగాంతము మొదలు కలియుగాంతము వఱకునుగల 1200 సంవత్సరములును నింతకుముందే యెంతో కాలముక్రిందట పూర్తియై యిప్పుడు కృతయుగము మూడవపాదము నడుచుచున్నదని చెప్పవలెను. ఈకృతయుగప్రారంభమునుండియు గణితశాస్త్రజ్ఞులు ఏకారణముచేతనో తాము కృతపురుషులుగా నుండుటకు నంగీకరించి వెనుకటి మానము దేవమానమని భావించి దానిని 360 చేత హెచ్చించి యుగకలియుగములను మఱికొన్ని లక్షలసంవత్సరములు

గమే ప్రవర్తిల్లునట్లు నిశ్చయించిరి. ప్రాయశః ఇందుకుఁగల కారణము కృతయుగ మనఁగా నేవేవియో మహద్విశేషము లుండునని వా రూహించి, యవి యన్నియు లేకపోవుటచేత నింకను కృతయుగము రాలేదని వారభిప్రాయ పడియుందురు. కాని నిజముగానిది కృతయుగ తృతీయపాదమని చెప్పవలసియున్నది.

### మన్వంతరములు

'యుగముల' ప్రమాణములు భారతవర్ష మున కుత్తరమునంగల దేవభూములలో లేన ట్లే 'మన్వంతరము'ల సంజ్ఞ హిమాలయమున కుత్తరమునంగల దేవభూములలోనేగాని భార తవర్షమున లేనట్లు గోచరించుచున్నది. ఏలయన స్వాయంభ్వా (?) ది మనువులెవ్వరును భారత వర్షవాసులుకారు. వీరెల్లరును రమ్యకవర్ష నివాసులని భాగవతాది గ్రంథములవలన తెలి యుచున్నది. రమ్యకవర్ష పరిపాలకులకు 'మను వు'లనిపేరు. రమ్యకవర్ష మనఁగా మధ్య సైబీ రియా దేశము. సురలకు కొంతకాలము రమ్యక వర్షాధీశ్వరుఁ డధిపతియని తోఁచుచున్నది. అక్కడివారికి రమ్యక వర్షాధీశ్వరుఁడగు మను వే శకపురుషునివలెఁ గాననగుచున్నాఁడు. పరి పాలకుల. రాజ్యప్రారంభసంవత్సరములే, పూ ర్వము, వ్రాతలయందుఁ జేర్చుచుండిరి. ఇట్టి వ్రాతలు భారతవర్షమునను గలవు. ఇందుకుఁ గొన్ని శాసననిదర్శనములనుజూపుచున్నాను.

"స్వస్తి(శ్రీ) శకవర్షంబులు ౧౧౮౭ అగు నేటి శ్రీమదనంతవర్మ శ్రీవీరబాణదేవ ప్రవ ర్ధమాన విజయ రాజ్యసంవత్సరంబులు ౭ అగునేటి శాహికన్యా శుక్లత్రయోదశియు గురువారమునాండు."

"స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౨౦3 అగు నేటి శ్రీమదనంతవర్మ వీర శ్రీనరసింహరాజ్ఞ తుదేవరల ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్స రంబులు ౭ అగు......"

"స్వస్తి శ్రీ శకవర్షంబులు ౧౨౮౧ అగు నేటి శ్రీదేవాదిదేవ శ్రీగన్నాథదేవరల విజ యరాజ్య సంవత్సరములు ౧3......"

ఈ మొదలగు శాసనములఁబట్టి శకవర్ష ములతోఁబాటు అప్పటి దేశాధిపతి రాజ్యము నకు వచ్చినసంవత్సరములను కూడ పేర్కొను నాచారముకలదని స్పష్టపడుచున్నది.

మన్వంతరమనఁగా నొకమనువుపరిపాలిం చినకాలమని యర్థము. ఒక్కొక్కమనువు 71 మహాయుగము పరిపాలించెననిచెప్పుట ప్రకృతి విరుద్ధము. మఱియు నీమనువుల వంశవృక్షము కూడచదువరుల సౌకర్యార్థ మిటఁ బొందుపఱ చెదను. (చూ. ౧౭౦ పుట)

పై వంశవృక్షమున 1, 3, 4, 5, 6, 7, 8 మనువులు కాననగుచున్నారు. వసూధిని పౌత్రుఁడగు స్వారోచి(?)యను రెండవమను వీ వంశవృక్షమున గోచరింపలేదు. ఈతఁడు స్వా యంభువునకును స్వాయంభువు పౌత్రుఁడగు నుత్తమునకును నడుమ పరిపాలించెను. వంశ వృక్షమునుబట్టి చూచిన నీనడుమ పరిపాలింప




వలసినవాఁడు ప్రియంవదుఁడు. కాని యీతఁడేకారణము చేతనో రాజ్యమును పరిపాలింపక నీతనిస్థానమున స్వారోచి పరిపాలించెను.

పైమనువులందఱును వరుసగా 6 వరములలోనివారు. అందుచే వీరెల్లరును నొకరితరువాత నొకరు పరిపాలించిరనుట కెట్టి సందియము నుండదు.

ఈ మనువులయొక్క రాజ్యాంగవిధానములను నడిపించుటకు దేవతలు, ఋషులు, రాజులు, అను పేర కొన్ని సంఘములును, ప్రతి సంఘమున కొక్కొక్క అధ్యక్షుఁడును నున్నట్లు కనబడుచున్నది. మనువు మాఱిపోవఁగనే ప్రాతసంఘములును, సంఘాధ్యక్షులును మాఱి క్రొత్తమనువున కనుకూలమగు క్రొత్త సంఘములును క్రొత్తసంఘాధ్యక్షులును వచ్చుచుండిరి. ఏలయన స్వాయంభువునాఁటి దేవతలు, ఇంద్రుడు, ఋషులు, రాజులు వేలుగను స్వారోచి, ఉత్తముఁడు మున్నగు మనువుల నాఁటి దేవతలు, ఇంద్రుఁడు, ఋషులు, రాజులు వేలు వేలుగను నున్నట్లు పురాణములు చెప్పుచున్నవి. ఈ పరిపాలనముయొక్క వివరములన్నియు నేను ముందుముందు ప్రచురింపబోవు "భూతములు-అసురులు-సురలు" అను వ్యాసములలో విపులముగా వ్రాసెదను.

వీరుత్తరధ్రువమునకు సమీపమున నివసించువా రగుటచే మన దివారాత్రములకంటె వారి దివారాత్రములు దీర్ఘములుగానుండును. వారియాయువును మనయాయువుకంటె దీర్ఘముగానుండును

## యుగములకును, మన్వంతరములకును నెట్లు మైత్రి కుదిరెను ?

ఈ భారతవర్షములోని యుగములకును రమ్యకవర్షములోని మన్వంతరములకును నెట్లు

మైత్రి కుదిరెనో యింక యోజింపవలసియున్నది. వైవస్వతమనువునకు మూడవ పురుషుఁడగు పురూరవుఁడును నాతనియనుచరులును మొదటపాంచాల దేశమునఁ బ్రవేశించిరి. వీరుభారతేతర వర్షవాసులగుటచే వారిదేశములో ప్రవర్తిల్లుచుండిన మన్వంతరములును భారతదేశమున ప్రవర్తిల్లుచుండిన యుగములునుకూడ వీరు వాడుచుండిరి.

ఇట్టివాడుక లిప్పుడును మనదేశమున వ్రాతలలో కలవు. ఎట్లన-'1928 సం. జూలై 15 తేదియగు విభవనామసంవత్సర జ్యేష్ఠబహుళ ౧3 ఆదివారమున'—అనియును—"Dated Moon Ramadan 16 th, Hegira 1172, which is the 14 th of May 1759' అనియును, పాశ్చాత్యపాలకుల శకములను మనశకములతోఁగూడ కలిపివాడుచున్నాము. అట్లే యార్యులును మొట్టమొదట యిక్కడ ప్రవేశించినప్పుడు భారతవర్షములోని యుగములతోఁబాటు ఉత్తరదేశములోని మన్వంతరములను కలిపి వాడుచుండిరి. వైవస్వతమన్వంతరములోనే ఆర్యులు ప్రప్రథమమున మనదేశమున ప్రవేశించియుండవలెను. ఏలయన భారతఖండవాసులు వాడిన మన్వంతరములలో వైవస్వతమన్వంతరమే మొదటిది. వారిక్కడకు వచ్చినపిమ్మట మఱియేడు మన్వంతరముల వఱకును ఉత్తర వర్షనివాసులగు ఆర్యుల పరిపాలనమునకును భారతవర్షమునకు వలస వచ్చిన ఆర్యుల పరిపాలనమునకును సంబంధముండి పిమ్మట భారతవర్షమున కేతెంచిన యార్యులు భారతవర్షముననే స్వతంత్రరాజ్యము నేర్పాటు చేసికొని మనువులతో తమకుఁగల రాజకీయసంబంధములను త్రెంపుకొని యుండవచ్చును. అందుచేతనే వైవస్వతునకు పిమ్మట మఱియేడుగురు మనువులుమాత్రమే మనపురాణములలోఁ గాననగుచున్నారు. అంతేకాని ఒక్కొక్క మనువు కోట్లకొలఁది సంవత్సరములు పరిపాలించినచో ప్రస్తుత మనువని చెప్పఁబడు వైవస్వతమను విప్పు డెక్కడనున్నాఁడు? అతని మన్వంతరము (పరిపాలనము)లో నుండవలసిన 1 ఆదిత్యులు, 2 వసువులు, 3 రుద్రులు, 4 సాధ్యులు, 5 విశ్వులు, 6 మరుత్తులు, 7 భృగువులు, 8 అంగిరసులు, అని పిలువఁబడు దేవతల యెనిమిది గణములును నేమయ్యెను? అతనికాలమున సప్తఋషులుగా నుండవలసిన 1 అత్రి, 2 వసిష్ఠుఁడు, 3 కాశ్యపుఁడు, 4 గౌతముఁడు, 5 భరద్వాజుఁడు, 6 విశ్వామిత్రుఁడు, 7 జమదగ్ని యేమైరి? అతనికాలమున రాజులుగా నుండవలసిన ఇక్ష్వాకుమున్నగువా రేమైరి?-వైవస్వతునకు పిమ్మట రాజ్యమునకు రాఁబోవు నాతని సోదరుఁడగు సావర్ణి యిప్పు డెక్కడనున్నాఁడు? అతనికాలమున దేవతలుగను, ఋషులుగను, రాజులుగను నుండవలసి వారందఱును నిప్పు డెక్కడ నివసించియున్నారు? సావర్ణికి పిమ్మట రాజ్యమునకు రాఁబోవు మనువులును నాయాకాలముల నుండవలసిన దేవతలు, ఇంద్రులు,

ఋషులు, రాజులు నిప్పు డెక్కడ నివసించి యున్నారు ?-

వీరందఱును నిదివఱకే పుట్టినట్లు పురాణములు చెప్పుచున్నవిగదా? ఇదివఱకేపుట్టి యింకను జీవించియున్నచో వారిప్పుడేమనుకు కానగారు? ఈమొదలగు ప్రశ్నములకు సమాధానము కానరాదు.

అందుచే దీనినంతటిని నించుక విమర్శనాపూర్వకముగా తిలకించిన నీమనువుల పరిపాలన మెల్ల నిదివరకే ముగిసెననియు, ప్రస్తుతము ప్రవర్తిల్లుచున్న కాలము వైవస్వత మన్వంతరముగాని కలియుగముగాని కాదనియును, ఉత్తర దేశములలోని మన్వంతరములకును భారత వర్షములోని యుగములకును నెంతమాత్రము సంబంధము లేదనియును, ప్రస్తుత కాలము కృత యుగములోని మూడవపాదమనియును చెప్ప వలసియున్నది.

---

## అనార్కలి

పురిపండా అప్పలస్వామి గారు

నిస్తుల మనోహరమ్ము దానిమ్మపూవు
ప్రమదవనభూషణమ్ముగాఁ బ్రస్ఫుటించె
ప్రతికుసుమకోమలినిఁ జేరు ప్రణయజీవి
భ్రమరుఁ డద్దాని మనసార వలచికొనిమె.

ఒండొరులు నూతనానురాగోదయమున
లోకమే విస్మరించి ప్రలోభపూర్ణ
ముగ్ధ హృదయాల గోర్కు లుప్పొంగిపోవ
నతులితానందమునఁ దేలి యాడునపుడు.

ఎంత దారుణమొక్కొ మహేంద్రుచేతి
యశనిపాతంబు! కాలాంబుదాళినుండి
విస్ఫులింగాల వెదచల్లి భీషణోగ్ర
నిస్వనాలతోఁ బడియె దానిమ్మమీఁద.

ఆ సుధాపూర్ణ మృదుల శోణాధరాంచ
లమ్ముల నూతనదరహాస లలిత రేఖ
కరఁగిపోలేదు; యౌవన తరుణశోభ
వాడిపోలేదు; ప్రణయభావప్రపూరి

తాంతరంగ మధుర వాంఛ లడఁగలేదు:

అంతలోననె, అకట! దురంతమృత్యు
దంష్ట్రిలను జిక్కి సుమబాల తనువు వీడి
కఠిన మృత్తికా గర్భానఁ గలసిపోయె.

ఆపుకోలేని నిబిడమహార్తి నెడఁద
వ్రయ్యలైపోవ, నున్మత్తభయదశోక
మూర్తియై, విశ్వమే వగఁబొగుల, పనవి
పనవి రోదించె హతభాగ్యబంభరుండు.

అట వసంతయామినుల శోకాతిరేక
దైన్యగీతాళి నిర్మలార్ద్రస్వనాన
నిప్పటికిఁగూడ చిరవిరహైకజీవు
లకు నినాదించు, నోడలు పుల్కరములొంద.

---

# దమయంతీ సంవరణము*

శ్రీ శేషాద్రిరమణకవులు

## ప్రథమాంకము

[ఇంద్రుఁడు యముఁడు, వరుణుఁడు. అగ్ని ప్రవేశింతురు. అందఱును విమానముల నేలపై నాపి యందుందురు.]

### వరుణుఁడు

వానకారు మొయిలు మ్రోతవలె నేది మోధ్వని వినవచ్చుచున్నది. అదిగో ధ్వని ననుసరించి యొకరథ మిటులె వచ్చుచున్నది. అందొక వీరకుమారుఁ డున్నాఁడు.

### అగ్ని

ఈతఁడెవఁడో రాజకుమారునివలె నున్నాఁడు. మానవలోకమునఁ గూడ నింత సుందరపురుషు లుందురు కాఁబోలును.

### నలుఁడు

(ప్రవేశించి ఆశ్చర్యముతోఁ జూచి రథము దిగి) ఎవరో ఇచట విమానములపై నాసీనులైయున్నారు. వీరి వైఖరిజూడ వేల్పులవలె నున్నారు. సందర్శించి నమస్కరించెదఁగాక (ఎదురేగి) మహానుభావులారా? మీయందఱకుఁ బ్రణామములు.

### దేవతలు

(ఒకరిమొగమొకరు చూచుకొందురు.)

### ఇంద్రుఁడు

ఓయీ! నీ వెవఁడవు. నలుఁడవా? నీయందు వీరసేనుని పోలికలు చూపట్టుచున్నవి. అతఁడు మాకుఁ జిరపరిచితుఁడు గాన నీవును మిత్రగణములోనివాఁడవు.

### నలుఁడు

(తలపంకించి) సర్వజ్ఞులగు మీ రెఱుంగని దేమున్నది.

### ఇంద్రుఁడు

నలనృపాలా? చిరకాలమునుండి నీచరిత్రము మేము వినుచున్నారము. నీవిపు డెచటికేగుచున్నాఁడవో తెలుపఁగలవా? ఇతఁడు యముడు. ఈయన అగ్ని వరుణుఁ డీతండు. నే నింద్రుఁడ. నిన్నొక యంశమున యాచింప వచ్చితిమి.

### నలుఁడు

(సంతోషముతో) వేల్పులు యాచకులుగ నా దరికి వచ్చుట సుకృతాతిశయము. యాచకునకుఁ బ్రాణమేని యొసంగుట నా వ్రతము. ఇంద్రునియంతవాఁడు యాచకుఁడుగా వచ్చెఁగదా? ఏమి యొసంగనగును. (ఆలోచించి) కలదుగదా! ప్రాణాధికయగు దమయంతి. కోరినచో నాయమనేని యొసంగెద. (?)

---

* శ్రీహర్షుని నైషధములోని ౫,౬,౭,౮,౯ సర్గములను ననుసరించి వ్రాయఁబడిన రెండంకముల రూపకము. దాదాపుగా నిది భావానుకరణము. శే. ర.

వరుణుఁడు

నరపాలకుమారా ? బదులు చెప్ప వేమి ?

నలుఁడు

అడుగక మున్నె మీకామితము దీర్చుటకు వెర వారయుచున్నాఁడను. అడిగించుకొని యాచకుని దైన్యమును గాంచి యిచ్చువాఁడు దాత కాఁడుగదా !

యముఁడు

ఆహా ! నలునిగుణము లెంత ప్రశంసాపాత్ర ములు.

నలుఁడు

వేల్పులారా ? అమృతస్వరూపులగు మిమ్ముఁ జూడ నాకానంద మతిశయించుచున్నది. మీ యాగమనంబున మధ్యమలోకంబు తరించినది. మీకోర్కి తెలుపుఁడు. ప్రాణంబైనను బ్రాణాధికంబైనను సమర్పించెదను.

వరుణుఁడు

ఇతఁడు త్రోవలోనికి వచ్చుచున్నాఁడు. ఇఁక నింద్రుఁ డీతని లోఁగొనుట కెంతయో సేపు బట్టదు.

ఇంద్రుఁడు

నిషధరాజా ? ఇంక దాఁపనేల ? దమయంతిని వరింపఁదలంచి మేము నలుపురము వచ్చినారము. స్వయంవరము సాటఁబడినదిగదా, నీవు దూతకృత్యము నిర్వహించి మాలో నొకనికి దమయంతిని సమకూర్పవలయును. ఇదియె మాప్రార్థనము.

అగ్ని

రాజా ? భూలోకంబున రాజు లెందఱులేరు ? వారలనందఱను యాచించితిమా? గుణశాలి వగు నీకు సాధింపరానికార్య ముండదని యీ దైన్యమునకు సహించితిమి.

నలుఁడు

(విచారముతో నాలోచించి) వేల్పులారా! జీవులహృదయము గ్రహింపశక్తిగల మీ రిటులఁ గోరిన నేఁ జెప్పవలసిన దేమున్నది. నేనును నందులకె పోవుచున్నాఁడ. ఎట్లు దూతకృత్యంబు నిర్వర్తింపఁ గలుగుదును. వలఁపు వేఁడిచే నుడికిపోవు నేను మీ రహస్యము కాపాడఁగలనా ? అంతిపురి కెటు లేఁగుదును. చిరకాలమునుండి వినుకలిచే నాపై వలపుగొన్న ఆసుందరి కెటుల మీగుణ ప్రశంస వినిపింతును. తలకుమాలిన భారము నంటఁగట్టి నన్ను నవ్వుల పాలు సేయకుఁడు.

ఇంద్రుఁడు

భూపాలా ? ఆడితప్పనగునా ? క్షణభంగుర మగు సంసారసౌఖ్యము లాసించి కీర్తియు ధర్మంబు దిగద్రాఁగెదవా ? అచేతనములగు చింతామణి కల్పకాదులె యర్థులఁ గోర్కె మన్నించుచుండ వేల్పులమగు మా కోర్కె నీవు దీర్పఁజాలవా ?

అగ్ని

రాజా ? ఇదియె మాకు బురుషార్థముసుమా.

యముఁడు

నలచక్రవర్తీ ! మాప్రార్థనము మన్నింపుము.

వరుణుఁడు

పరోపకార జన్యమగు కీర్తిని గైకొనుట కిదియ తరుణము.

నలుఁడు

అశక్తి ప్రమాదంబులు గలుగునేమొ యని వెఱచుచున్నాఁడ! దివిజులారా! దూతకృత్య మున కియ్యకొంటిని. ఇఁక నా కాజ్ఞ దయ చేయఁ బ్రార్థించెద.

ఇంద్రుఁడు

అంతిపురి ప్రవేశించుటకు నీకుఁ దిరస్కరిణి యను మంత్రరాజ ముపదేశించెదము. దీని సహాయమునఁ బరులకుఁ గానరాకుండ నిచ్చ కొలంది సంచరింపవచ్చును. (ఉపదేశించి) రాజా? కార్యసిద్ధి యగునుగాత. పోయిరమ్ము.

నలుఁడు

(రథము నెక్కి) సెలవు పుచ్చుకొనుచున్నాఁడను.

[నిష్క్రమించును.]

---

ద్వితీయాంకము

[విదర్భానగరమున చెంత రథము నాపి నలుఁడు రథము దిగి పాదచారిగాఁ గనిపించును]

(కొంచెము నడిచి) తిరస్కరిణీమంత్రబలంబున నేను అదృశ్యుఁడనైతిని. పరుల వంచించి నే నంతిపురి ప్రవేశింపవలయును. వంచనము పాపముగదా? పాపము. ద్వారపాలకులు విచ్చుకత్తులతోఁ గాచియున్నారు. వీరు నిక్కముగా వంచింపఁబడిరి. ఇంక నంతిపురికిఁ బోయెద.

(లోనికిఁబోయి) ఇటఁ బరిచారికాంగనలు స్వేచ్ఛావిహారము లొనరించుచున్నారు. ఎటులో తప్పించుకొని అంతర్గృహంబున కేఁగెద.

మరాళిక

ఏమి యీవింత! అద్దములో నొక దివ్యపురుషుని ప్రతిబింబము గోచరించుచున్నది. ఇసుక నేలపై పాదపద్మముల గుర్తులు కనిపించుచున్నవి. కల్పసుమములతావులు గుబాళించుచున్నవి. ఎవఁడో మాయావియగు పురుషుడంతిపురి చేరినటు లున్నది.

నలుఁడు

నేను పరులకుఁ గనిపింపకుంటినేగాని పరులు నన్ను గుర్తింప నవకాశములు లేకపోలేదు. అదిగో! ఆయువతి వేసిన బంతి నాకు దగిలి వెనుకకు మఱలినది. కారణమెఱుంగక యామె నివ్వెఱపోయినది. ఈపావురమును బట్టుకొన నలువురు జవ్వను లురికి వచ్చుచున్నారు. నడుమ చిక్కువడుదునుగాఁబోలు. (తొలఁగి) ఇఁక నిట నున్నచోఁ బట్టువడకపోను. కార్యభంగమగును. (కొంచెము నడిచి) ఇదిగో? ఇచట దమయంతి యాసీనురాలై యున్నది. చెంత జేరి వినోదింతుగాక.

గీ. చిఱునగవు వెన్నెలలఁగాయఁ జిగురుమోవి
యించుకించుక కదల నీచంచలాక్షి
చెప్పుచున్నది యేదియో చెలులతోడ
లేమ దరిజేరి నేను నాలింతుఁగాక,

దమయంతి

నిషధరాజకుమారా? నిజముగా నీపై నామనము లగ్నమైయున్నది. మన యిరువురిహృదయ

ములు అంచతొయ్యలి కలిపినది. ఇదిగో?
ఈ కుసుమ మాలిక యలంకరించికొనుము.
(కనులు మూసికొని మాలికనుఅలంకరించును.)

మరాళిక

రాజపుత్రీ? నలుఁడిచట నున్నాఁడని సుమ
దామ మలంకరింతువు. నీవు కేవల భ్రాంతివశ
మున పదరుచున్నావు. నిబ్బరించి మనసు
కుదురుపఱచికొనుము.

(మాలిక నలుని కంఠమునఁ బడును.)

దమయంతి

(కనులువిచ్చి) ఏమి యీవింత! అలరుఁదండయే
మైనది.

మరాళిక

నలునికంఠమున వైచితివిగదా!

దమయంతి

చెలీ? నేను భ్రాంతి పడితినంటివిగదే? భ్రాం
తిచే నలుని జూచితినని కుసుమమాల నెందో
జారవిడిచి యుందును.

మరాళిక

ఎందోకాదు నలుని కంఠమునందే.

నలుఁడు

మరాళిక నన్ను గుర్తించెనాయేమి (ఆలో
చించి) మంత్రబలమున నదృశ్యముగానున్న
నన్నెటుల గుర్తింపఁగలదు.

గీ. వలపు వ్రేసున వాఁడిన వనిత మేను
చూడఁ జూడఁగ నొకవింత సొంపుగూర్చె
కఱఁగినకొలందిగా నుత్న కాంతితోటఁ
గ్రాలు పదియాఱువన్నె బంగారమట్లు.

దమయంతి.

రాజపుత్రా? గాఢ వేదనా తప్తమగు నాశ్వా
నుకౌఁగిలించికొమ్ము. నేను నీదాననేగదా?

(నలదమయంతులు కౌఁగిలించికొందురు)

మరాళిక

రాజపుత్రీ? నలుఁడిచట నేడి? వలపుచే సర్వము
నీకునలస్వరూపముగాఁ గన్పించుచున్నది. రేపు
నలుఁడు స్వయంవరమునకుఁ దప్పక రాగలఁడు.

నలుఁడు

ఆనందాతిశయమును భరింపఁజాలకున్నాఁడ.

దమయంతి

మరాళీ? నేను నలుని కౌఁగిలించినదికల్లయేనా?
ఆతఁడు నన్నును గౌఁగిలించెనుగదే? అంతయు
భ్రాంతియేనా? కట్టా ఎంతదురదృష్టవంతురా
లను. స్వప్నసౌఖ్యము నేని సంపూర్ణముగాఁ
బడయఁజాలకపోతిని.

పరిచారిక

(ప్రవేశించి) అమ్మా మెవరో నలువురు చెలు
వలు మిమ్ముదర్శింపవచ్చి ద్వారముననున్నారు.
వేల్పుగరితలవలెనున్నారు. సెలవైనఁ బిలిచి
కొనివత్తుము.

దమయంతి

మంచిది కొనిరమ్ము.

[నలువురు దేవదూతికలు వత్తురు. మరాళిక
మెదురేగి కొనివచ్చి పీఠములను జూపించును]

నలుఁడు

ఇచట దమయంతి నాపైఁగల ప్రేమచే నిజరూ
పాను కరణంబులగు చిత్తరువుల నెలకొల్పినది.

ఇందుఁగూర్చుండి జరుగఁబోవు ప్రసంగము నాలించెదఁగాక. (కూర్చుండును).

ఇంద్రదూతి

అమ్మా! దమయంతీ! నే నింద్రునిదూతికను. వీరలు మువ్వురు వరుసగా యమవరుణాగ్నుల దూతికలు. నీకు సమస్తలోకాధీశ్వరుండును బృందారకసందోహమహాళి సందానిత మందారమరంద బిందు సందీప్తచరణారవిందుఁడు నగు పురందరుఁడు పారిజాతప్రసూనంబులను నాచేనుపాయముగాఁబంపినాఁడు(అనిఇచ్చును).

దమయంతి

భక్తి పూర్వకముగఁ బరిగ్రహించుచున్నాను.

ఇంద్రదూతి

ప్రేమపూర్వకముగఁ బరిగ్రహింపవలయును. దమయంతీ? దేవేంద్రుఁడు నీకొక లేఖ కాంచన కేతకీదళముపై వ్రాయఁబోయి వేల్పులవ్రాత మనుష్యాంగనలు గ్రహింపఁ జాలరని మాని నాఁడు. ఇంద్రునిసందేశము నేన యెఱింగింతును.

దమయంతి

అస్వతంత్రురాలనగు నాతో దేవేంద్రుఁడు జరుపవలసిన రాయభారము లేముండును.

ఇంద్రదూతి

అదియె విన్నవించుచున్నాను. ఇంద్రుఁడు నిన్నువరింప నెంచినాఁడు. సమస్తలోకపూజ్యుఁడగు నింద్రునికి రాణివి కాఁజాలిన నీయదృష్టము నెంతని కొనియాడఁగలను.

సీ. వేలుపుచెలువల విహితోపచారంబు
ప్రమదంబునిండారఁ బడయవచ్చు
నందనోద్యాన సంతానాదితరువుల
నీడలఁ బ్రియమార నిలువవచ్చు
మూఁడుసంజలయందు మునికన్యక లొసంగు
నుపహారవస్తువు లొందవచ్చు
అమరేంద్రురాణివాసమునందు గణ్యవై
భువనైకవిఖ్యాతి బొందవచ్చు
తే. నిఖిలసురలోక సామ్రాజ్య నిరుపమాన
భారధారేయుఁడగు శచీప్రాణవిభుఁడు
తనకుఁదానుగ నినుగోన దలఁచినాఁడు
కన్యకారత్నమా యెంతధన్యవమ్మ.

౧ వ చెలికత్తె

దమయంతీ? ఇదియ యుత్తమకార్యము

౨ వ చెలికత్తె

ఇంక నాలోచింపక యంగీకారము తెలుపుము.

3 వ చెలికత్తె

ఇందులకుఁదగిన ప్రత్యుత్తరంబంగీకారమేగదా!

దమయంతి

ఇంద్రదూతీ? పాకశాసనుని గొప్పతనము వేదములే ప్రశంసింపఁజాలకున్నవన మనమెంతవారము. సర్వహృదయవేదియగు నింద్రుఁడు నాచిత్తవృత్తి నెఱుంగనివాఁడుకాఁడు. ఇంద్రుని సందేశము శిరసావహించెద. నన్ను ఇంతకుమున్నె నలునకర్పించుకొంటిని. ఇంకనేను జేయవలసిన దేమున్నది.

ఇంద్రదూది

నలునిమీఁదివలపుచే నింద్రునిగొప్పతనము గ్రహింపఁజాలకున్నావు. ఇంకనేని తగవూహిం

వుము. మానవలోకమున నుంటకంటె దేవలోకమున కేగుట యోగ్యముగదా?

దమయంతి

దూతీ? నీవెన్ని చెప్పినను నాకు మానవలోకముపై మమత తగ్గదు. ఈలోకముననున్న వారికి స్వర్గము లభించుమార్గములు కలవు. స్వర్గవాసులకెన్నఁటికేని యధోగతితప్పదు. దేవలోకమున సౌఖ్యమున కేగాని. ధర్మమునకుఁ దావు లేదు. మానవలోకమున నీ రెంటికిని దావుగలదు. స్వర్గము ప్రాణాంతమున సౌఖ్యకరము. మనుష్యలోకము యావజ్జీవితసౌఖ్యకరము.

తే. నిషధరాజకుమారుపై నిలిచియున్న
మనసు పురుహూతుపైకెట్లు మరలనేర్చు
ఇంద్రియసుఖంబులనుగోరు నింతికేల
ప్రాణమెడలిననాఁటి నిర్వాణవాంఛ!

వరుణదూతి

సతీ? మామనవులుగూడ యించుక నాలింపవలయును.

దమయంతి

చెలులారా? మీతలంపులు నేనుమున్నె యెఱుంగుదును. ఇంద్రదూతికిఁ జెప్పిన దేమీకును ప్రత్యుత్తరంబు. సర్వము విధివిహితము:. నియతిబద్ధము. జీవులెవరి ప్రియమును వా రభిలషింతురు. అందు నింద్యంబులేదు. నాపై నింద్రుడు కోపించెనేని నలునితోఁగలసి సప్తతంతువొనరించి హావిర్భాగములచేఁ దృప్తినొందింపగలను. ఇఁక నీప్రసంగము ముగింపుఁడు.

యమదూతి

యముఁడందటివంటివాఁడుకాఁడు. ఆలోకో[త్త]రునిగుణము లాకర్ణింతువేని నలుని గలనైన దలంతువా? నాప్రసంగమునకు మాత్రము కొంచమవకాశమిమ్మా దమయంతీ?

దమయంతి

వేల్పుచెలువలారా? ప్రాణేశ్వరునిదక్క ని... లఁగూర్చిన ప్రశంసాదికము నాలించుట కు... సతీధర్మమునకు విరుద్ధము. ధర్మశాస్త్రములి... లెచెప్పుచున్నవి. ఇఁక మీరు మాటాడదగ... యింద్రునిపాదములపై నానఁబెట్టుచున్నా...

దూతికలు

అమ్మా? మేమిఁక సెలవుపుచ్చుకొందుము

దమయంతి

మంచిది పోయిరండు.

(దూతికలు నలువురు నిష్క్రమింతురు).

(నలుఁడు)

[ముందునకువచ్చి] దమయంతీ? నీచిత్తశు... ప్రశంసాపాత్రము. మానవలోకము నీశుద్ధా... తఃకరణముచేఁ బవిత్రమైనది. వినుకలిచే... ప్రేమించి ఇంద్రాదులసందేశమును గూ... దిరస్కరించిన నీనిశ్చలభావము నిఁకఁ బరీ... ధింపవలసిన భారము నాతలపైనున్నది. ఎం... సాహసింపనున్నాఁడ;

తే. ఒరసినకొలంది బంగారు మెఱుఁగుదాల్చు (?)
సానబట్టినకొలఁది వజ్రము రహించు
తెలిచినకొలంది యాభీమతనయచిత్త
నిశ్చలత్వంబు స్పష్టమౌ నిష్కపముగ.

దమయంతి

మరాళికా? లోకమంతయు నాకు నలమయముగానున్నది. చెలిమికత్తెల చిత్రకౌశల్యముచే నైషధుని రూపరేఖావిలాసముల నెఱింగిన దాది నాముందా దివ్యమూర్తినటించుచున్నది. నేను నిజముగా నలునిజూచినను ఇపుడు భ్రాంతియో సత్యమొ గ్రహింపఁజాలను. చూచితివా నాచిత్తవృత్తి.

మరాళిక

అమ్మా? అనురాగప్రథమావస్థ లిటులెయుండును.

నలుఁడు

తిరస్కరణి నుపసంహరించి దమయంతికిఁ గనిపింపఁదగిన తరుణమిదియె. అదిగో భీమరాజు పుత్రియేదియొ నన్నుఁగూర్చియె భాషించుచున్నది. ఇపుడె సమీపింతుఁగాక.

దమయంతి

మరాళీ; అంచ చెప్పినది మొదలుకొని నాహృదయము నలునిపై లగ్నమైయున్నది. చెలికత్తెలు వ్రాసిన చిత్రపటములను జూచుటాదిగ నాపురుషసత్తముని దివ్యమూర్తియె కనుల ముందు నటించుచున్నది. నిజముగా నలుఁడే వచ్చినను నేనిపుడు నిర్ణయింపఁజాలనేమో?

మరాళి

ఎవరోనూతనపురుషుఁడిటులవచ్చుచున్నాఁడు.

దమయంతి

(నిదానించిచూచి) ఎవరైయుందురు; ఇపుడా చర్చతగదు. అతిథిపూజ గావించుటయే ధర్మము. కులశీలాదికముల నావల నెఱుంగవచ్చును. చెలులారా? ఈ మహనీయున కతిథిపూజ గావించుఁడు.

నలుఁడు

(సపర్యలు పరిగ్రహించి) దమయంతి యడకువ యెంతయుఁ బ్రశంసాపాత్రము. ఈయమసౌశీల్యమున కీగృహస్థ ధర్మనిర్వహణము వన్నెబెట్టుచున్నది. ఈయమతో నేనేమనిభాషింప నలయును.

దమయంతి

తొందరపనులులేవేని యీరత్నసింహాసనమున నాసీనుఁడవుగమ్ము. రాజకుమారా? నీవెచట నుండి వచ్చుచుంటివి? నీయాగమన హేతువు నడుగవచ్చునా?

మరాళి

రాజపుత్రీ? నీవు కొంచమాగినచో సర్వము నీయనయే నివేదింపఁగలఁడు. కొంచెమాగరాదటమ్మా.

దమయంతి

చెలీ! అతిథిపూజా సమాదరణాదికము లెటుంగవు. గృహాగతులఁ బూజించి కామితముల నమకూర్చుట మనకు విధియని పెద్దలుచెప్ప లేదా?

తే. కలితనవరత్నఖచితశృంగారసింహ
పీఠమియ్యది దీనిపై విశ్రమింపు
మవసరంబయినీకుఁ గార్యాంతరములు
గలుగుచో విన్నవింపఁగాఁ గలనె నేను,

నలుఁడు

పీఠముపై నాసీనుఁడై కన్యకామణీ? పర దేశము నుండి వచ్చుచున్నాఁడను. పనివడివచ్చి ప్రయత్నముదాఁచవచ్చునా? నీతోనొకవిషయము ముచ్చటింపవచ్చినాఁడ.

దమయంతి

ఇతనిముఖమునందుబలెఁ బల్కులందును సౌకుమార్యగాంభీర్యము లతిశయించుచున్నవి. నాహృదయమేలకో యీ యువకునియందు లగ్నమై మరలకున్నది. (ప్రకాశముగా)

ఉ. పేరెదినీకు, సాహసము పెంపున నిచ్చటికేగు దేరఁగా,
గారణమేమి? యంతిపురకావలికాండ్రమొరింగిమమ్ము
లన్, జేరఁగ నెట్లువచ్చితో విచిత్రము? నీవుపురూరవుం
డవో, మారుఁడవో నలుండవో సమగ్రముగా నెఱుఁ
గంగఁ జెప్పుమా.

నలుఁడు

(తనలో) ఇపుడే యీమెకు నావృత్తాంతము చెప్పుదునా? అంతరంగ మెఱుంగకమున్న నా చరిత్ర మెఱింగించిన నెట్లు పరిణమించునో? కర్తవ్యముతోఁచకున్నది. (ఆలించి) (?)

తే. అరుణపల్లవమధ్యంబునందునుండి
మంచుచినుకులు తోఁచినమాడ్కిఁ—చెలువ
పెదవి కదలించి నిర్మలగదనకాంతి
ప్రజ్వరిల్లఁగ నేదియో పల్కుచుండె

(ప్రకాశముగా) సతీ? నేను దిక్పాలుర యాస్థానముననుండి నీవద్దకు నతిథిగా నరుదెంచితిని. నాకార్యము నొనరించుటయ నాకాతిథ్యము. పరులెవరు లేరుగదా? నేను తలదాల్చిన కార్యభరము నివేదింపవచ్చునా?

దమయంతి

(తనలో) ఏమిది? దిక్పాలురు నాకడకనుపసిన సందేశములేముండును? ఆలింపకతప్పదుగదా. (ప్రకాశముగా) రాజకుమారా? చెప్పుము.

నలుఁడు

చెలువా? నీలావణ్య విలాసాతిశయము లాలించి వేల్పులందఱు నిన్నుఁ గైకొన కాంక్షించుచున్నారు. అందు ముఖ్యముగా నింద్రుఁడు, యముఁడు, వరుణుఁడు, అగ్ని నన్ను నీవద్దకు దూతగాఁ బంపినారు. తొలుత ఇంద్రునిసందేశ మెఱిగించెద విన్నవింతును.

శా. ఇంతీ? సర్వజగద్విభుండయిన, దే
వేంద్రుండు నీపైఁగృపా
స్వాంతుండైనను బంపినాఁడు సుమి, నా
సందేశ మాలించి నీ
యంతశ్శుద్ధివచింపవమ్మ! దివిజా
ధ్యక్షుండు తానై నినున్
బంతంబొప్ప వరింపఁగా దలఁచె నీ
భాగ్యంబు సామాన్యమే.

తే. వరుణుఁడగ్నియు యముఁడు నీపై విరాళి
గొని వరింపఁగఁ దలఁచి రోవనజనేత్ర
వీరిలోపల నెవ్వనిఁ గోరుకొనెదో
తెలియఁజెప్పుమి నీనేర్పు తేటపడఁగ.

దమయంతి

(అనాదరముగానాలించి) నేనడిగిన ప్రశ్నయొకటి, నీవుచెప్పు ప్రత్యుత్తరము వేఱొకటిగ నున్నది. నీపేరును గులమునుగోర నింతపనికేదియో ప్రసంగించితివి? దిక్పతులు గొప్పవారుకానిమ్ము కాకపోనిమ్ము. నాకు నీచరిత్ర

# శిల్ప, ప్రకృతి చిత్రములు



౧. ఎలిఫెంటా గుహాల ద్వారపాలకులు



౨. చాంపానేర్ నగరద్వారము

'కలగూరగంప' చూచునది.

విన నుత్సాహమగుచున్నది. తొలుత నాపలు కునకుఁ బ్రత్యుత్తర మీయవలసిన భారము నీపయిఁగలదు.

తే. ఏకులంబున జనియించి తెద్దినీదు
నామ మేా యెఱిఁగింపు మో నరవరేణ్య
అప్రమత్తుఁడవగుచు దిశాధినాధ
వృత్త మెఱిఁగించియుందు వీ వింతదనుక.

నలుఁడు

నేనెవఁడనో తెలిపినఁగాని యీయమతనయభిప్రాయమును జెప్పనటు లున్నది. నాపేరుచెప్పెదనేని కార్యభంగమగును. అనృతము పాపహేతువు. (ప్రకాశముగా) రాజపుత్రీ? హీనకులజుఁడు తనకులము పెంపుఁజెప్పఁకొనును గాని ప్రసిద్ధవంశజుఁడెన్నఁటికిఁ జెప్పఁకొనఁడు. ప్రత్యక్షవ్యవహారమునకు నీవునేను పదంబులుండఁ బేరుతో నేమిపని? అదికాక తనపేరు తా జెప్పికొనఁ దగ దందురు. అడిగితివిగాన కొంత వఱకు నావృత్తాంత మెఱిఁగించెద.

తే. రమణి? నీవలె నేనును రాజవంశ
మండనుండను, స్వకులాభిమానవేని
భావమున నెలకొల్పి దిక్పాలకార్య
కరణమున కభిముఖి వీవు గాఁగదమ్మ.

దమయంతి

రాజకుమారా? మమ్ము నీవు వంచించుచున్నావు. ఇఁకనిన్ను మేము వంచించినను దోసము లేదు. పేరుచెప్పట నీకెటుల ననాచారమొ అంతిపురిలోనుండిన కన్యలమగు మేము నీతో నేకతమ భాషించుటయు నట్టిద.

క. పరపురుషులతో నంతః
పురములో (?) మాటలాడఁబోలునె; ధర్మా
చరణంబు నిర్వహించుచుఁ
జరియించెద వింతసాహసము తగునొక్కొ.

నలుఁడు

(తనలో) ఈయమమాటలనేర్పు అచ్చెరువు కలిగించుచున్నది. ఏమని ప్రత్యుత్తర మొసంగి యీయమ యభిమతము గ్రహింపనగునో తెలియకున్నది. ఇటులభాషింతుఁగాక. (ప్రకాశముగా) రాజపుత్రీ నావిజ్ఞాపనము చిత్తగింపుము.

చ. వరుణుఁడు నింద్రుఁడుఁ యముఁడు
వహ్ని భవద్విరహానలంబుచే
తొరగుచునే మొ ప్రాణములు;
తొయ్యలి నాకయి వేల్పులందు నొ
క్కరుని వరింపుమమ్మ
ఫలకారణమానని నాదురాకకై
సురలు తపించుచుండెదరు
చూపుల దైన్యము కందళింపఁగన్.

దమయంతి

రాజకుమారా? నీకుఁ బ్రత్యుత్తరమీయ నామన మియ్యకొనకున్నది. చిఱునవ్వుతో నూరకొందునా? గర్వవతి యనుకొనెదవు. కాదు పొమ్మందునేని నిన్నుఁదూలనాడినటుల గును. పలుకకున్నఁ దిరస్కరించినటు లగును. కాన నేప్రత్యుత్తరమిచ్చుచున్నదాన.

చ. త్రికరణ శుద్ధిగా నిజము
దెల్పెద నాహృదయంబు ధర్మదీ
పకు నలునాశ్రయించెఁ బెర
వారి ప్రశంసలఁ దెచ్చెదేల ? చా

లిఁక; నలు నే వరించు పెటు
లేని ఘటిల్లక పోయెనేని చా
వె కడకు నిశ్చయింబు విని
పింపకు మన్యగుణప్రసంగముల్.

నలుఁడు

(తనలో) ఈయమనాపయి దృఢానురాగమై యున్నది. సంతోషాతిశయమునఁ గార్యభంగము జరుగునేమో. ఇపుడు నేను ప్రమత్తుఁడ గారాదు. నన్నీమె యెఱింగి నేనిప్రయత్నమంతయు విఫలమగును. (ప్రకాశముగా) సిరిరా మోకాలొడ్డినటుల వేల్పులు తమంత వలచిరాఁ దిరస్కరించుచున్నావు. పిమ్మట పశ్చాత్తాపపడెదవు.

గీ. కలిగెఁబో, సర్వగీర్వాణ కాంతమకుట
మణిగణ విరాజమాన కోమల పదాంబు
జాతులగు దిక్పతులనెల్ల సాహసించి
యొల్లనని వాకొనెడి మానవోత్పలాక్షి.

దమయంతి

నేను వేల్పులను వరింపనని నొక్కి చెప్పుచున్నను మరల నాహృదయము నొప్పించుచున్నాఁడవు. నాహృదయము నలున కింతకుమునె సమర్పించితిని. దీనికి వ్యతిరేకము జరుగఁజాలదు.

నలుఁడు

(నవ్వి) జరుగఁజాలదుగా. వేలుపులమహిమ నెఱుంగనిదానవు గావున నేది భాషించుచున్నావు. ఎన్నివిధములఁ జూచినను నీవు వేల్పుల పాలబడకతప్పదు. ఇటు వినుము.

సీ. ఉద్బంధమునఁ బ్రాణ ముజ్జగించెదవేని
యింద్రుండు నిను వరియింపఁగలఁడు
వహ్నికుండంబునఁ బడి చావనెంతువా
యగ్నిహోత్రుండు పెండ్లాడఁగలఁడు
జలములోఁబడి యుసురులను వీడదవేని(?)
వరుణు కామితము సాఫల్యమౌను
ఆత్మహత్యకును లోనై మృతినొందిన
శమనుని పూర్వపుణ్యము ఫలించు
గీ. వలదు వలదంచుఁ దొలుతొత్త పలికి పిదపఁ
బెండ్లియాడుట మిక్కిలి బేలతనము
కష్టసుఖములనోచించి కర్జ మెంచి
యెవ్వఁ డభిమతుఁడో నిశ్చయించుకొమ్మ.

దమయంతి

(విచారముతోఁ దనలో) అక్కటా! ఎంత దురదృష్టవంతురాలను. హృదయ మొకనికి తనువొకనికి నగునుకాఁబోలు. కానిమ్ము (ప్రకాశముగా) ఓరాజకుమారా? యముని దూతవుగాన నన్ను బాధించుచున్నావు. నీ కోపికయున్న నలుని ప్రశంసింపుము. లేదా మానుకొమ్ము. పరప్రశంసలతో నాకుఁ బని లేదు.

తే. అంచతెలపిన రూపునీయందుఁదోఁచు
చున్నయది నీవు నలుఁడవై యుందువొకొ
దిగధినాయక పరిణయాదికమునింకఁ
గట్టిపెట్టుము; తెలుపుమీకార్యవిధము.

నలుఁడు

(తనలో) ఇంకను నీయమ చిత్తశుద్ధి పరిశీలింతు గాక. ఇది దూత్యమునకుఁగూడ నుపకరించును గదా. (ప్రకాశముగా) దమయంతీ, నీవు బేలవై క్రిందుమీఁద యోజింపఁజాలకుంటివని నాకు విచారమగుచున్నది. వేల్పుల వరింపనని పట్టు పెట్టెదవేగాని వారు వరించిననెటులఁ దప్పించు

కొందువు. కల్పవృక్షము చింతామణి కామధేనువు మున్నగువానిని వేల్పులు గోరెదరేని నీవు వారిపాలఁబడకతప్పదు. హృదయపూర్వకముగ దిక్పతులలో నొకని వరించుటయె సర్వవిధముల శ్రేయము.

దమయంతి

అయ్యో? వలచినవానిఁ బెండ్లాడుటకేని నోఁచనినాజన్మ మెందులకు. ఓ నలమహారాజా? త్రికరణశుద్ధిగా నిన్ను వలచిన దమయంతిని దిక్పతులబారినుండి తొలఁగింపఁజాలవా? ఎంత యన్యాయము. వేల్పులారా? మీరైన నన్ను గనికరింపరా? (వెక్కి వెక్కి యేడ్చును.)

నలుఁడు

ఎంత సాహసమునకుఁ బాల్పడితిని. ఈయమ చింత నెటులఁ బాపనేర్తును. పరాధీనుఁడనగుటచేఁ గార్యసాధనమునఁ బ్రమత్తుఁడనై యింతకు సాహసించితిని. ఎటు లీయేడ్పు మానఁగలదు. నిరపరాధయగు నీయమ కన్నీరు ఎంతటి విప్లవమునకేని కారణము కాకపోదు. (ప్రకాశముగా) దమయంతీ! విచారింపకుము. శుద్ధాంతమునఁ జేరుట దోసంబె. నాచరిత్రము మఱుఁగుపఱచితిని. ఇది సాహసంబె. అనుగ్రహింపుము. విచారపరవశమగు నీ ముఖము నొకనిముసమేని చూడఁజాలను. నన్నుఁ గరుణింపుము.

క. చింతింపఁబోకుమా ? దమ
యంతీ కనులెత్తిచూడుమా ? నలభూ
కాంతుఁడను నేను నీచర
ణాంతికమును జేరినాఁడ నరయుమి నన్నున్.

దమయంతి

(నలుని తేరిపాఱఁజూచి) అయ్యో! ఎంతసాహసము జరిగినది. నిజమెఱుంగక యెంత పొరపడితిని.

(సిగ్గుతో ద్వారముచాటున కేఁగును.)

మరాళిక

అమ్మా ? ఇంతలోనే చాటున కేగవలయునా! ఇంతవఱకును జరిపిన తర్జనభర్జనము లేమిటి ? ఇంతలో నీ సిగ్గేమిటి ?

నలుఁడు

ఎంతప్రమాదము జరిగినది. ఈయమవిచారముజూచి మనసుచెడి నాపేరు చెప్పితిని. వేల్పుల కార్యము పూర్తిగాభంగమైనది. కామరూపులగు దిక్పాలకులు నాసాహసమున కేమందురో గదా? విరహోన్మాదియగు నావంటి వివేకహీనునకుఁ బరోపకారసుకృత మెట్లులభింపఁగలదు.

తే. చేసితి ప్రయత్నమును గార్యసిద్ధికొఱకు
సర్వవిధముల నరసితి శక్తికొలఁది
కడకుఁ గార్యాంతమునఁ బొరపడుటచేసి
నిష్ఫలంబయ్యె నేమందునిర్జరులకు.

అశరీరవాణి

నలదమయంతులారా? మీ హృదయములు అన్యోన్య ప్రేమాభిరామములు గాన నచిరకాలమునఁ బరిణయము జరుగఁగలదు. నలభూపాలా? దూత్యంబున నీవు ధర్మంబు నిర్వహించితివని వేల్పు లానందపరవశులైరి. దమయంతీ? నీశీలము చిత్తవృత్తి ప్రశంసాపాత్రము.

సమాప్తి

# నిరశ్రు రోదనము

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు, బి. ఏ.,

రాలవిదేల యశ్రులు పరంపరలై, చినచిన్న సోనలై,
కాలువ చాలులై, చలదగాధతరంగిణులై, విభీషణో
ద్వేల విలోల వీచికల వీఁకఁడిఁ బాఱెడు నేఱులై, జగ
జ్జాలము ముంచవేల? యవశంబుగఁ జేయవిదేల లోకమున్?

మిడిమిడి దుఃఖ మెందఱొ యమేయముగాఁ గొని యేడ్చుచుండ, నీ
యొడలు గుటుంబముం గులము నూరును దేశము-నింత యేల-యీ
పుడమి సమస్తముం వెతల ముంపఁగఁజాలిన నాదు ఖేద మె
వ్వడువునఁ దెల్పనో నకట! బాష్పజలంబులు మాయమైన-చోన్.

అటమట నంతరంగ వివృతాక్షికిఁ గన్పడుచుండి, పెక్కుసం
కటముల కొక్కచుక్క యనఁగాఁ గరమూఱి, హృదంతగంబునన్
గుటిలత నిండు నశ్రువులు కొండలను న్నుటపాకవహ్నికిన్
బుటపుట పొంగి పైకుబికి పోర్లవిదేల విలోకనంబులన్?

అనుదిన నూతనక్రమ విహారనిరూఢిఁ జరించుచుండి, భూ
జనులకు లేమిఁగూర్చు నది సాజము లేమికి, దేననైననుం
ధన నిలయాదివస్తుసముదాయమునందునఁ; గాని, శాంతిఁగై
కొనుటకు నేఁడ్వ బాష్పములకుం గొఱగల్గుట యేమి లేమియో!

హితులు నెలంత బందుగులు నెవ్వరు నొవ్వననొంపకున్న, నే
కతమునసైన నేమి, సిరి గాసిల, ముప్పదిమూఁడుకోట్ల నే
కతమున నుండు వేళ, మదిఁగల్గు భరంబును దేల్చివైవ ను
ద్ధతిఁగొని పారు నశ్రుఝరమైనను గల్గ దిదేమి లేమియో!

లేమికిఁ బెంపులేదను మలీమసవాక్యములెల్ల దబ్బరల్
గా, మహనీయవైభవ విలాస మదాతిశయంబు లేమికిం
దామరతంపరై కలదనన్ జగమంతయుఁ జాటఁజూతు; న
న్నోమెదుదువీవు, నీఋణము నోపిన యంతకుఁ దీర్పకుందునే?

ఘోరదురంత చింత సమకూర్పఁగ నూటెడు బాష్పజాలముల్
ధారలఁ గాఱవేమి ? పరితప్తవిలోకనసీమ నాఱెనో
దారుణదావవహ్ని సవిధంబయి క్రాఁగు నెడంద మ్రందెనో,
నీరసరూపమై చనెనో నిస్వసనా నిలఘాత ధూతమై !

భిదురసమానఘాత పటువేదన లెన్నిటినేనిఁ గాంచియున్
బ్రిదులని నాయెడంద యినుమే యనుకొంటిని తొల్లి; యిప్పు డం
గదశిఖితప్తమై యదియె గాత్రము నీరసముంబొనర్చెఁ గా,
కెది యెరియించు? నశ్రుకణమేనియు లేనటు బాడబాభమై.

చిత్తవికల్పవేదనకు సిద్ధరసాయనధార, లాత్మవి
చ్ఛిత్తిమహార్తి కంజన విశేషము, లాధిమహోగ్రబాధ ఘో
నొత్తెడు తైలలేపము, లనూనమనః పరితాప మార్పఁగాఁ
జిత్తడిజల్లు లశ్రులు నశించినఁ జేయునదేమి నేనికన్.

అపరిమితానుకంప నను నారయు వారలఁ జేరఁ బోయెనో,
వ్యపగతనైజధైర్య విభవంబున లేమికి నోర్వలేమి డి
ల్లపడు సతీసుతాదిజనులం గనఁబోయెనొ, యశ్రుపూరముల్ !
కృపణుఁడనైతిఁబో ! ప్రకృతికిన్ తుదినయ్యవిగూడ లేమిచేన్.

ఏడువ నర్థహైన్యమున, కేడువ నుద్యమభంగభంగి, కే
నేడువ నాలుబిడ్డలు భరించెడిలేమికి, నేడ్వఁ "గైతకున్
గాఁడితఁ" డన్నదూఱునకుఁ; గంటికి మంటికి నేకధారగా
నేడువఁ జాల నందులకె యేడ్చెదఁ; దోడ్పడరారె యశ్రువుల్.

కాలవిలాసవక్రగతి కల్పిత దుఃఖశతంబు బిందు లీ
లాలఘిమాప్తి నూఱుచుఁ గొలందికిమీఱఁ గడంగుచుండు కీ
లాలముకంటె పేరలుఁగులున్ బ్రవహిల్లక పిక్కటిల్లినం
బ్రేలిపెటీలనన్ హృదయ భిత్తిక లొక్కట ముక్కలౌఁగదే !

ఏవిధి నెట్టి వంత ఘటియిల్లఁగఁ జేసిన నిన్ను దిట్టబో
నోవిధి, యొక్కసారి నయనోష్ణజలంబుల భాగ్యమిమ్ము; చాల్ !
త్రావుదుఁ బూసికొందు దిశలంబడఁ జిమ్ముదు భూమిఁ జల్లుదు
న్నావెతలెల్ల చెల్లెనని నమ్ముదు నందుల నీఁదులాడుదున్.

ననునొకపెద్దసేసి, భువనవ్యసనాళికి నెల్ల రాజుగా
నొనరుప నింతశోక మహిమోన్నతిఁ గూర్చితిఁగాదె; యింక రా
జునుఁబ్రకటింప నశ్రుజలశోభన పట్టమహాభిషేకముం
బొనరుపవేల? మాలవిధి, మూర్తము మించిన పున్నెమబ్బునే!

ఘోరవిషాద మెప్డుఁ గన క్రూరవిధిన్ ఘటియిల్లెనేని, హృ
ద్భారము సర్వముం దొలఁగి స్వస్థత కల్గఁగ వేఁడివేఁడి క
న్నీరు కపోలపాళి పయినింబడి పొర్లుచుఁ బాఱునట్లుగా
పారము ముట్ట నేడ్వఁగలవార లదెంత తపంబొనర్చిరో!.

వెలికిలఁబండి,దృష్టి గృహాభిత్తిక నొక్కట నిల్పి, మెట్టిసం
చలనములేక దుస్సహవిషాదములం గణియించుచుండఁగన్
గొలుకులజాఱి కర్ణములకుం డిగునీరు తలాపి నింకఁగా
వలవల మెల్ల నేడ్వఁ గలవార లదెంతతపం బొనర్చిరో!.

హా! యని యాత్మదుఃఖముల నావలఁ ద్రోయఁగఁ జాలువారు, "ను
స్నూ" యని శోకభార మెటనో పడనూఁదెడువారు, రాగముల్
దీయుచు ఖేదమెల్ల పదిదిక్కులఁ గల్పెడువారు, బాష్పముల్
పాయక చక్క నేడ్వఁగలవారు నదెంతతపం బొనర్చిరో!.

కనుఁగవ నశ్రుగోళములు గ్రక్కునఁ జిప్పిలువేళ తెప్పలం
గననగుబాగుఁ, జెక్కులుడిగంగఁ గవోష్ణతరంగమిచ్చు స్ప
ర్శనసుఖ, మక్కునందుబడి చల్లఁగఁ దాపము నార్చుసొంపునుర్జ
బనుపడునట్టు లేడ్వఁగలవార లదెంతతపం బొనర్చిరో!.

పటుతరవేదనానల వివర్ధిత దాహసుతప్తబిందు వొ
క్కటియయినం జగంబులను గల్గినవస్తుల దేనిమీఁదనేన్
దటుకునఁబడ్డ, నద్దిశతధా త్రుటిముఱై దరికొంచు సర్వమున్
జటిలతఁ గాల్చునంచునొకొ! నల్వ, యొసంగవునాకు నశ్రువుల్!.

వ్యసనసామ్రాజ్యచక్ర ధూర్వహణదక్షు, పటుతమోభేద్య హృదయభాస్వ
త్తగదు తగదంచు మానె విధాతనాకు, స్వల్పమగునార్తి కర్హమౌ నశ్రుకణము

# నవనాగరిక గ్రామజీవనము

పాలపర్తి ఆంజనేయులు గారు

౧

మాది గుడివాడతాలూకా ఏవూరు. వాళ్లు ఎప్పుడో యాభైయేండ్ల క్రిందట పొలాలు, గొడ్డు గోదా లోకుల పాల్జేసి కరిణీకాలు కాలదన్ని పాటిమీద బూర్లమూకుడు బోర్లపడ్డదని బస్తికెక్కారు. అప్పటివాళ్లకు కలెక్టరు ఆఫీసన్నా తాలూకా ఆఫీసన్నా మాతాపితృస్థానాల్లో ఉండేవి. చెయ్యెత్తి దండంపెట్టేవారు. కాని మావాళ్లు యింకా కొంతమంది మా గ్రామంలోనే ఉన్నారు. వాళ్లను చూద్దామని వెళ్లాను. వెళ్లిందాక బులపాటుగా ఉందిగాని వెళ్లిన తర్వాత నీళ్లలో నుండి బయటపడ్డ చేపలాగ ఏంతోచక కొట్టుకున్నానంటే నమ్మండి. ఆవూళ్ళో క్లబ్బా లేదు. బల్లలూ కుర్చీలుమాట చెప్పేదేమిటి! న్యూస్ పేపర్లు అసలే లేవు. మాట్లాడేవాళ్లు లేరు. వాళ్లను మనము పల్లెటూళ్ల గబ్బిలాయలంటే వాళ్లు నన్నూ నా వెఱ్ఱిముఖాన్ని చూచి బస్తీగబ్బిలాయి అనుకొన్నారేమో అనిపించింది. ఇది బస్తీజీవిత రహస్యము.

ఒకనాడు సాయంత్రం ఏంతోచక హేండుస్టిక్కు పుచ్చుకొని కాలవగట్టున షికారుబయలుదేరాను. తుమ్మలులో ప్రొద్దుకుంకుతూన్నది. ఆకాశాన వ్యాపించిన కెంజాయ ఆకుల సందులోనుంచి చూస్తూంటె ఆవెనక ఏవైన పూరికొంపలుముట్టుకొని భగభగామండిపోతున్నాయేమో అనిపించింది. కళ్లకనిపించే దృశ్యం మంటల్లాగున్నా ఒంటికి మాత్రం చల్లని పిల్లవాయువులు తాకుతూంటె అన్యాయత్తమైన చిత్తంతో నడుస్తున్నా. ఆపర ధ్యానంలోనే ఒకసారి తలయెత్తిచూస్తె కొంచెందూరం లో ఒకముసలాయన గట్టుమీద కూర్చొని ఉన్నాడు. ముఖం కొంచెం ముడతలు పడ్డది. తల, మీసాలు పూర్తిగా నెరిసి సబ్బుపూసినట్టున్నది. వయస్సు అరవై దాటి డెభైయ్యోపడిలో పడ్డట్టున్నది. ముఖానికి చెయ్యి అడ్డంపెట్టుకొని నావైపు పరకాయించి చూస్తున్నాడు. నేనూ ఆయన్ని సమీపించా. అల్లాగే తలయెత్తి

"ఏవూరుమీది" అన్నాడు.

"మాది బందరూ"

"మీ ఇంటి పేరేం?"

"మా ఇంటిపేరు ఏవూరివారు"

"రామయ్యగారి కొమాళ్లా"

"అవును"

"ఇల్లా ఎక్కడికి వెళ్లుతున్నారూ?"

"షికారువెళ్లుతున్నాను"

"కాసేపుకూర్చోండి" అన్నాడు ముసలాయన.



"పోనీ పెద్దవాడు కూర్చోమన్నాడు గదా అని నేనూ కూర్చున్నా."

పోనీ పెద్దవాడు కూర్చోమన్నాడు గదా అని నేనూ కూర్చున్నా. ఆయన ధరించినవి నీరకావిపట్టిన ముతకకద్దరుధోవతులు అయినా, మాటసవ్వడిబట్టి చూస్తే కూపస్థమండూకంలాంటి సంసారి కాదనిపించింది. నేనూ క్రిందనుండి మీద్దాక పుట్టమట్టిరంగు కద్దరుకట్టుకున్నా. ఆయన తేరిపారచూచి "మీరు నాన్‌కోపరేషన్‌వాళ్లా" అన్నాడు.

"అవునూ, మీరు అట్లాగే కనిపిస్తున్నారే"

"మా దేంవుంది పల్లెటూళ్ల వాళ్లం. మామసలా విడ వడికినసూలు ఉంటే నేయించికట్టుకొన్నాగాని మా కేంబస్తీ పోకులున్నాయా"

"పెద్దవాళ్లు మీమాట ఏలా ఉన్నా; బస్తీలో ఉండే షాపులు, కాఫీహోటల్సు, కాలేజీలు, కోర్టులు అన్నీ మీరు లేకపోతే ఊడ పీక్కొని పోవల్సిందే" అన్నాను నేను. "అవును బాబు, అవును. అదంతా నాకనుభవము అయినదే. ఏదో మాటవరుసన అట్లా అన్నాను గాని యీగాంధిమహాత్ముడే యేపదేండ్లకింద్ర టనో వచ్చినట్లయితే నాగతి యిల్లా ఉండేదికాదు" అని మిక్కిలి దీనంగా విచారంగా అన్నాడు. నాకు ఆశ్చర్యమూ వేసింది, జాలీకలిగింది. ఇంతవఱకూ ఆయన యెవరో నాకు తెలియదు. అందుచేత

"మీపేరేమి?" అన్నాను.

"నాపేరు వెంకట్రామయ్య"

"ఓహో! మీరా! నేను గుర్తుపట్టలేకపోయినా అప్పుడప్పుడు మిమ్మలను చూచి ఉంటాను. మానాయన గారు ఉండగా మీరు యెప్పుడైన మాయింటికి వచ్చేవారు. కాని నేను అప్పుడు చిన్నవాణ్ణి. మీ రూపే మారిపోయింది."

"మీనాయన గారు నేను చిన్నప్పుడు అనుకుండే వాళ్లం. కొంచెం యించుమించుగా ఒకటే యీడువాళ్లం. మీనాయనగారు పోయి చాలా కాలమైందనుకుంటాను."

"ఆ అయింది పది పన్నెండేళ్లు. మీపేరు ప్రఖ్యాతివింటు ఉండేవాణ్ణేగాని. ఇటీవల ఎప్పుడూ చూడలే. చూచినా ఫలానా అని యెఱగను. మీ పెద్దబ్బాయి ఇంగ్లండేమో వెళ్లాడని...................

"చిన్నకుఱ్ఱవాడితోపాటే వీడూ అనుకున్నాము దణ్ణంపెట్టాము. అప్పుడు నేను చాల యిబ్బందుల్లో ఉన్నాను. సొమ్ముపంపడానికి లేకపోయింది. పైగా వాడు అక్కడ దేన్నో చేసుకొన్నాడట. దాన్ని వదిలించుకోడానికి సాధ్యంకాలేదు. అది యిక్కడికిరానన్నది. ఏపదివేలో యిస్తేగాని విడాకులు ఇప్పుడు నాదగ్గర యెక్కడ ఉన్నాయి?"

"ఏమోలేండి, దైవఘటన యేలా వుంటే అలా జరుగుతుంది. అదంతా తలచుకొని విచారపడి చేసేదిమాత్రం యేమి వుంది."

"అదంతా మరిచేపోయినాము. అదంతా చిత్రకథ. ఏదో కృష్ణా,రామా,అనుకొంటూ ఉన్నా ఇదే బాగుంది. సౌఖ్యానికి, ఐశ్వర్యానికి మితం లే వుంది. లేని పోని పోకిళ్లుపోతే నామోస్తరుగానే పడ్తారు. మావాళ్లకు ఇప్పట్లో తెలివివచ్చేటట్లు కపించదు."

"ఏదైనా కొంత అనుభవం అయితేగాని కైనా తెల్సిరాదు. చూసి నేర్చుకోవడం సామంగా తటస్థించదు."

"చదువులూ ఉద్యోగాలకోసం ఉ యిక్కడ పొలాలుబీళ్లు పడడం. ఇదేగా పరియవసా"

"మీకు అనుభవం వుంది గనుక అల్లా అన్నా మేమే ఆమాట అంటే బ్రాహ్మలు ఉద్యోగాలు లే ఉండాల్ని అట్లా అంటున్నారంటారు. మాబ్రాహ్మ కూడా బి. ఏ. పట్టాలు, పంచాంగం కట్టలు పట్టు యిల్లిల్లు, ఊరూరు తిరుగుతున్నారు. పూటకూలికైనా ఖర్చుకు ఏంలేక పెళ్లాం మెళ్లోపుస్తెకూడా తాకట్టు పెట్టున్నారు. ఇంత అనుభవం అయినా డిగ్రీలో వదల్లా"

"అందఱు అందలం ఎక్కాలంటె మోనే మీవాళ్లమాట ఆలా ఉంచండి. మావాళ్లో?"

"చదువుకుంటే తప్పేమి ఉంది లేండి."

"అదికాదు మావాడు ఒకసారి బస్తీకి వెళ్లి తర్వాత మళ్లీ పొలం మొఖం చూస్తాడా? నిజంగా పాపం నేను చేతులార చేసుకుందే. నాపిల్లకాయ పొలానికివెళ్లితే నామూషి అనుకున్నా. సొమ్ము కాదు. వాళ్లను వ్యవసాయంలోనే దింపినట్లయితే పరపంచ ఉండాల్సినగతి పట్టేదికాదు. కాని నావాళ్లు

స్థితికంటె యిదే బాగుంది. నేను నావ్యవహారాల్లో తిరిగేటప్పుడు తిన్నచోట పడుకోటంలేదు. పడుకున్న చోట తినటంలేదు. ఎప్పుడు ఒకటేయావ. ఇహంపరం మంచి చెడ్డ విచారణ లేనేలేదు. ఎవరికున్న చారెడు చెక్కా వాళ్లుదున్నుకొని జీవనంచేయడంకంటెయీరోజులలో మంచి పని మరొకటి లేదని నా అనుభవంవల్ల నాకు తెల్సివచ్చింది. అందుకు నాజీవితమే సాక్షి. ఇప్పుడు చాలా చీకటిపడ్డది. 'ఇక లేద్దాము" అని ఆయన లేచాడు.

"ఇప్పుడు నాయకుల దృష్టికూడా సిద్ధాంతరూపములో గ్రామాలమీదికే మళ్లింది. కాని క్రియలోకి వచ్చేటప్పటికి చాల కాలము పట్టుంది". అంటూ నేనూ లేచి ఇద్దరము మాట్లాడుకుంటూ యింటికి వచ్చాము.

నాకు ఆయనతో పరిచయం కలగడం ఆవూళ్లో పెన్నిధి దొరికినట్టున్నది. రోజూ ఆయనదగ్గరకు వెళ్లేవాడిని. ఆయన జీవితచరిత్రంతా నాతో చెప్పాడు. అదంతా వినదగ్గది తెల్సుకోదగ్గదిగా ఉంది. కీడులో మేలుంది; మేలులో కీడుంది.

౨

మాగ్రామంలో దాదాపుగా రైతాంగమంతా కమ్మవారె. వెంకట్రామయ్యకు తండ్రిచని పోయేప్పటికి పెండ్లిపేరంటం అంతాచేసి ఇరవై యెకరాల పొలం యిచ్చిపోయినాడు. ఆయన బ్రతికి ఉన్నరోజులలో గొప్ప ఆస్తిపరుడుకాకపోయినా గ్రామపెద్దలలో ఒకడుగా ఉండి పేరు ప్రతిష్ఠసంపాదించుకొన్నాడు. వెంకట్రామయ్యకష్టపడి పనిచేసెవాడూ, తెలివి తేటలు కలవాడూ గనుక ఆస్తిని అభివృద్ధిచేశాడు. అతనిభార్య కూడా పొదుపరియైన యిల్లాలే. వెంకట్రామయ్యకి మొదటినుండి పెద్ద ఆస్తిసంపాదించాల్ని పదిమందిలో పేరుగడించాల్ని బాగా ఉండేది. ఆస్తి డబ్బు ఉంటే గాని రాణించదనుకున్నాడు. పండిన గింజలు నిలవబోసి మంచి ధరవస్తేగాని అమ్మేవాడుకాడు. నెమ్మది నెమ్మదిగా కొంచెం డబ్బుచేరిందాక నాలుగ జతలయెడ్లు. బండ్లు, పాలేళ్లు అట్టహాసం అంతా పెంచాడు. పొరుగూరి బ్రాహ్మలవి ఉద్యోగస్తులవి పొలాలుకవులుకి పుచ్చుకొన్నాడు. వ్యవసాయం బాగా జోరుగాసాగించాడు. వూళ్ళోమాలాళ్లకి పాతికపరక పెట్టుబడిపెట్టి వాళ్లను లోబరుచుకున్నాడు. ముంజేత ఊడ్పు ఊడ్చి బాగా పండిస్తున్నాడు. గ్రామంలో బాగా పలుకుబడి యేర్పడ్డది.

3

గ్రామంలో అతని కారువాళ్లలో పెద్ద పిన్న వచ్చినా మాట్లాడగల శక్తిగలవాడు, కావలసిన సప్లయిలు వగైరాలు చేయగలవాడు అతను ఒక్కడే కనుపిస్తున్నాడు. తాసిల్దారువచ్చినా, డిప్టి కలెక్టరువచ్చినా ముందు వెంకట్రామయ్యకు కబురుపంపించ వల్సిందే. ఈ ప్రకారంగా గ్రామంలోనే కాకుండా ఉద్యోగస్తులలోకూడా పలుకుబడి సంపాదించాడు.

పలుకుబడితోబాటు పరపతికూడా హెచ్చింది. అందుచేత ఊళ్ళో యెవరిపొలం అమ్మవచ్చినా అతను కొనవలసిందే. అతను కొనదలచుకొన్నాడూ అంటే ఆవూళ్ళో యింకొకడు ధరపెట్టడు. ఏధరకైన అతనికి అమ్మవలసిందేగాని తప్పించుకొని పోవడానికి వీలులేదు.

క్రమక్రమంగా అంగబలం, అర్ధబలం, అధికారబలం అన్ని యేర్పడ్డాయి. ఏమిచేసినా సాగివస్తున్నది. దానితో ఆశే దురాశ అయింది. ఆవూళ్ళో ఒకపేద బ్రాహ్మడు ఉన్నాడు. ఆయనకు అయిదెకరాలచేను ఉంది. ఎవరో మాలవాళ్లు ఆచేనుచేస్తున్నారు. ఆచేనుకు ప్రత్యేకముబోదెలేదుగాని అనుశ్రుతంగా ప్రక్కచేనుపైనుండి నీళ్లుపెట్టుకొని సాగుచేస్తుండేవాళ్లు. అప్రక్కచేను కోమట్లది. అది వెంకట్రామయ్య కవులుకి పుచ్చుకొన్నాడు. నాటినుండి బ్రాహ్మలచేను సాగుకావడం గండంగానే ఉంది. వెంకట్రామయ్య చేనుమీదనుండి నీళ్లుపెట్టుకోనివ్వడం మానివేశాడు. ఎప్పుడో ఊడ్పులన్నీ అయిపోయి ములకవస్తే వాళ్లచేలోకి వదిలేవాడు. అప్పుడు లేతఊడ్పు ఊడ్చినా పండేదేకాదు. మాల వాళ్లుసాగుచేయడం వదిలేశారు. ఎవళ్లూసాగుచేసేవాళ్లే కనుపించలె. వెంకట్రామయ్యనే ఆ బ్రాహ్మలుకూడా

బ్రతిమాలుతున్నారు. ఒక సంవత్సరం పాలికి పుచ్చుకున్నాడు. పొలంతాను పుచ్చుకున్నా లేత ఊడ్పే ఊడ్చాడు. పంటకోత కోసి గింజలు రాలకొట్టాడు. బటాబటీలుగ రెండుపుట్లు 'అయినా అన్నాడు. తన సగం తాను తీసికొన్నాడు. తాలుబెడ్డ అంతకలిపి బ్రాహ్మలకు కొల్చాడు. ఆధాన్యం అమ్మితే వాళ్లకు శిస్తు డబ్బులు తేల్లా. అంతటితో వాళ్లు పొలం బేరం పెట్టారు. 'చవుడేసిబీడుపడ్డ భూమి యెవరు కొంటా' రన్నారు ఊళ్ళోవాళ్లు. అంటూ "ఏదో వెంకట్రామయ్యగారినే బ్రతిమాలుకొండి. ఏదో ధరచేసి పుచ్చుకొంటాడు" అన్నారు. "బోడిలేని పొలంనేనేంచేసుకో"నన్నాడు. వెంకట్రామయ్య. చివరకు బ్రతిమాలంగా అయిదువందల రూపాయలకు పుచ్చుకొన్నాడు అయిదెకరాలూ. నాటి నుండి అయిదెకరాలు అయిదుపుట్లు పండుతున్నాయి.

౪

పైనచెప్పిన విధంగాకుండా మరొకవిధంగాకూడా పొలాలు సంపాదించడం మొదలుపెట్టాడు. వెంకట్రామయ్య పొలంప్రక్కనే ఒక ఉద్యోగస్థుడి భూమి ఉంది. ఆయనకు బెజవాడతాలూకా కచ్చేరిలో గుమాస్తాపని. చేను ఎవరో రయితులు సాగుచేస్తున్నారు. వెంకట్రామయ్య ప్రతియేడు గట్టువిరిచి అతరాపు గుమాస్తాచేలోకి వేస్తున్నాడు. పొలంచేసే రయితులు అప్పుడప్పుడు మారడం వెంకట్రామయ్యకు యింక యెక్కువ వీలైంది. ఒక సంవత్సరం పొలంకట్టుబడికి యివ్వడానికి గ్రామంలోనికి గుమాస్తా సీతారామయ్యవెళ్లితే రైతులు "మీపొలం తగ్గిపోయింది. మామూలుకట్టుబడి ఇవ్వమూ" అన్నారు. కరణాన్ని బ్రతిమాలుకొని పొలంకొలిపించుకొన్నాడు. దాదాపు డెభై సెంట్లదాకా తరుగు కనిపించింది. ఎట్లా తగ్గిందని కరణాన్ని అడిగితే ఏంచెప్పాడు కాడు అతనుకూడా. తాలూకా గుమాస్తాయేమో జరిగిన సంగతి గ్రహించాడు. తన పొలం అతరాపు పొలాలు కొలిపించవలసిందని 'తహసీల్దారుకు అర్జీపెట్టుకొన్నాడు. ఎన్నాళ్లకు ఎండార్సుమెంటేలేదు. స్వయంగా గుడివాడ వెళ్లి తోటిగుమాస్తాలను అడిగాడు. "ఈతాలూకా ఆఫీసులో నీకు ఎండార్సుమెంటు పుట్టనేపుట్టదు. మా వెం[...]ట్రామయ్య చౌదరీగారే తహసీల్దారు మమ్మ[...] నీవువెళ్లవయ్యా" అన్నారు గుమాస్తాలు. చివరకు[...]లో వ్యాజ్యంవేశాడు. రెండుమూడేళ్లు వాయిదా[...] పడ్చుమాళింది. తీరావిచారణకు వచ్చేటప్పటికి సాక్షు[...] ఎవరుకనిపించలేదు. కరణం చెప్పనన్నాడు. ఇదివర[...] సాగుచేసిన రైతులు చెప్పనన్నారు. వెంకట్రామయ్య[...] ఊరంతా సాక్షులే. కరణాన్నికూడా తన [...] సాక్ష్యం చెప్పమన్నాడు వెంకట్రామయ్య. కా[...]ణం ఒప్పుకోలే. తనపొలం మొదటినుండి అంతే[...] దని, 20 సంవత్సరాలనుంచి ఆగట్లు అలాగే ఉన్నా[...] వెంకట్రామయ్యసాక్ష్యంచెప్పించాడు. కోర్టువారు [...] కొట్టేశారు.

పొలంపోతే పోయిందనుకుంటె అసలు సీతా[రా]మయ్య ఉద్యోగానికే మోసంవచ్చింది. తనంత వా[...] వ్యాజ్యంవేశాడని ఇతన్ని వెంకట్రామయ్య ఒకకంట [...] కనిపెట్టే ఉన్నాడు. ఇల్లా ఉండగా బెజవాడకు [...] సింహశాస్త్రీగారు డిప్టీకలెక్టరుగ వచ్చారు. ఈయ[న] వెంకట్రామయ్యకు చాలా పరిచయం. ఈసమయంలో [...] ఎవరిచేతనో గుమాస్తా సీతారామయ్య తీరువ దరఖా[స్తు]ల్లో లంచంపుచ్చుకొన్నాడని అర్జీపెట్టించాడు. [...]మంగా డిప్టీకలెక్టరు దగ్గిరికి డిస్పోజలుకు రావడం [...]సుకొని ఆయన్ని చూట్టానికి వెళ్లినట్టు వెళ్లాడు.

డి. క.—ఏం, చౌదరీగారు దయచేయ[...] ఎప్పుడొచ్చారు? అంత కుశలమా? మొన్న [...] పంపిన నెయ్యి చాల బాగున్నదండి. ఎక్కడున్నా [...] సప్లయిలు మాకు తప్పవు.

చౌదరి—కోర్టుపని ఉండి వచ్చి మిమ్మ[ల్ని] చూచిపోదామని యిల్లా వచ్చాను. మా రైతుల ప్రాణా[...]లన్నీ మీ చేతుల్లో ఉంటాయి గదండీ.

డి. క.—ఏమిటయ్యా, నీవుకూడ అట్లా మాట్లా[...]డుతావు. ఈజిల్లా రైతాంగంలో నీకంటె ఎక్కు[వ] పలుకుబడిగల రైతు ఎవరయ్యా? నీకు పరిచయం గా[...] ఉద్యోగస్థు డెవ డున్నాడు.

చౌదరి—సరే? మంచిమాటే చెప్పారు. ఉద్యోగస్తులతో ఎట్లాగైనా పడవచ్చు. ఏదో మంచి చెడ్డ చెప్పుకోవచ్చు. గుమాస్తాలతో బొత్తిగ పడలేకుండా ఉన్నామండి.

డి. క.—అవునయ్యా! అనె కంప్లెంట్లు వస్తున్నాయి. మా తాలూకా ఆఫీసులో గుమాస్తా సీతారామయ్య అనే అతను నీటితీరువ దరఖాస్తుల్లో రైతులను యేడిపించుక తింటున్నాడట. తహసీల్దారు విచారణ చేసి రిపోర్టు పంపాడు. ఏంచేయనా, అని ఆలోచిస్తున్నా. ఉద్యోగం తీసేస్తే యేడుస్తారు. చేసెపనులు యీలా ఉంటాయి.

చౌదరీ—ఆయనమాటె చెప్పారు బాబో, చాలా అసాధ్యుడు. నన్నే నానాతిప్పలు పెట్టాడు. నామీద అన్యాయంగా వ్యాజ్యంవేసి బోలెడుడబ్బు ఖర్చు పెట్టించాడు. ఇటువంటి గుమాస్తాల చేతుల్లో మేము బ్రతుకగలమా. ఇంక మీబోటివా రుండబట్టి యీలా ఉంది గాని.

డి. క.—నిన్నే అల్లాచేసినవాడు చిన్న రైతులను వదిలిపెట్టాడా! ఆరునెలలు సస్పెండు చేస్తాను.

చౌదరి—ఇంక మీరు కనికరంగానే చూచారు. మీరు మా గుడివాడ డివిజనుకు రావాలండి.

డి. క.—కానీ వస్తాంలే.

చౌదరీ—రావాలనె మాకోరిక. ఇక సెలవు పుచ్చుకుంటాను.

డి. క.—మంచిది.

"గుమాస్తాగాడి మచ్చుమాసింది. ఇక కరణంగాడు ఒకడున్నాడు. వీడు మనతో కలవకుండా ఉన్నాడు. వీడికికూడ బుద్ధిచెప్పాలి. దానికి ఒకపేమార్గం ఉంది. అది చేసి తీరాల్సిందే" అని ఏమేమో ఆలోచిస్తూ రైలు వచ్చాడు.

ఆ సాయంత్రం గుడివాడచేరాడు. మఱునాడుదయము తహసిల్దారు తమ గ్రామం మకాంఅనివిన్నాడు. తక్షణం యింటికి బయలుదేరివచ్చాడు. ఆ రాత్రి మాలవాళ్ల చేత పోరంబోకలోని తుమ్మచెట్టు కొట్టించాడు. ఆదుంగలు తెప్పించి కరణంగారి గడ్డివామిదొడ్లో పడేయించే యేర్పాటుచేశాడు.

మఱునాడు ఉదయాన్నే తహశీల్దారు గారు వచ్చారు. పొలాలుతనిఖీకివెళ్లి పోరంబోకలోతుమ్మచెట్టు కొట్టె ఉండడం చూచాడు. "ఎవరయ్యా ఇది కొట్టింది" అని కరణాన్ని అడిగాడు.

"అయ్యా తెలియదండి. నేనూ ఇప్పుడె చూస్తున్నాను" అన్నాడు కరణం.

వెంకట్రామయ్య కొత్తగ మేడకట్టించాడు. అది రోడ్డుకూ కాలవకూ కూడలిలో ఉంది. సాధారణంగా యే ఉద్యోగస్తుడు వచ్చినా ఆమేడలోనే మకాం. సప్లయి అంతా వెంకట్రామయ్యదే. తహసీల్దారు నాయడుగా రగుటచేత వెంకట్రామయ్యగారి యింట్లోనే భోంచేశారు. భోజనానంతరము కులాసాగా తాంబూలము వేసుకొనె సమయంలో "తుమ్మచెట్టు దుంగలు కరణంగారి వామిదొడ్లో ఉన్నాయని ఎవరో పిల్ల లంటున్నా" రని నెమ్మదిగా వెంకట్రామయ్య అంటించాడు. తహసీల్దారుగారికి వెంటనే పట్టరాని కోపం వచ్చింది. వెంటనే బంట్రోతుని పిలిచి ఆ తుమ్మ మొద్దులు పట్టించుకొని కరణాన్ని వెంటతీసుకొని రమ్మన్నాడు.

తుమ్మమొద్దులూ, కరణంగారూ హాజరయినారు.

తహ—ఏమయ్యా, గవర్నమెంటు నౌకరువై యుండి ఇటువంటి దొంగపనులుచేసి పైగా నిర్భయంగా అబద్ధాలు ఆడ్తావ్. చూడు నిన్ను డిస్మిస్ చేస్తాను. నీకేం బుద్ధిలేదూ.

కరణంగారు చేతులు నలుపుకుంటూ "అధికార్లు నేచెప్పేదికూడా చిత్తగించాలి. నే నేపాపపుణ్యం ఎఱుగను. ఎవరో నాకు ద్రోహంచేయాల్ని అల్లాచేశారు. మీరు ఆగ్రహిస్తే మేము బ్రతకజాలం"అన్నాడు. "నిన్ను చూస్తె యీవూళ్లోవాళ్లకు గిట్టదా! ఎందుకుచేస్తారుద్రోహం. నీవు చెప్పేమాటలు నమ్మటానికి వీల్లేకుండా

ఉన్నాయి. నిన్న నాలుగు నెలలు సస్పెండుచేశాను." ఈ ప్రకరణం ఎంతమొత్తుకున్నా లాభంలేకపోయింది. ఈ ప్ర



"నిన్న నాలుగు నెలలు సస్పెండుచేశాను."

కారంగా వెంకట్రామయ్యచేసేద్రోహాలు అంతు లేకుండా ఉన్నాయి.

౫

అధికార్ల ప్రాపకము దొరికిన తర్వాత పహోదాల కేంతక్కువా. ఇపుడు వెంకట్రామయ్య చౌదరీగారు తాలూకాబోర్డు ప్రెసిడెంటు జిల్లాబోర్డు మెంబరు. అన్ని వ్యవహారాల్లో ఆయన పేరు మోగిపోతున్నది. స్వసంఘం లోకూడా ఆయన నాయకుడుగానే ఉన్నాడు. పది మంది పెద్దమనుష్యులు వస్తూపోతుంటారని ఇప్పుడు మేడ కూడా కట్టించాడుగదా!

వెంకట్రామయ్యచౌదరీ గారికి ఒకకూతురు ఇద్దరు కొడుకులూ. పెద్దవాడు స్కూలుఫైనలుదాకా చదివి మానేశాడు. రెండోకుఱ్ఱాడు నాల్గోఫారము చదువుతున్నాడు. కొమార్తెకు పదివేలు కట్నంయిచ్చి గుంటూరుజిల్లానుండి పెద్దసంబంధం తెచ్చి వివాహం వేలు ఖర్చుచేసి చేశాడు.

వెంకట్రామయ్య చౌదరీగారికి యిప్పుడు యాభై ఏండ్లు ఉంటాయి. ఇద్దరు కొడుకులూ, కా చేసే కూతురూ, పెద్దమేడా, వంద ఎకరాలమా సిరిసంపదతో తులతూగుచున్నాడు. 'ఆయనకేం దల్లా బంగారమవుతున్నది. దశవెళ్లబోస్తున్నాడు' వూళ్లో అమ్మలక్కలు చెప్పుకుంటున్నారు.

వెంకట్రామయ్యగారి యిల్లు ఒకసత్రక కాలవలకు రోడ్లకు కూడలిగా ఉందేమో ఎప్పు ఉద్యోగస్థులు. పోయ్యే ఉద్యోగస్థులు, ఎపుడు టీ పాలు కాగుతూ ఉండడమే. ఉద్యోగస్థులకు మే మకాం. క్రింద వెంకట్రామయ్యగారి స్వంత ఆఫీ అక్కడ రోజూ బేరాలుసారాలు, ఇచ్చుకోడం పు కోడం టంకసాల మోగుతుంటుంది.

౬

చౌదరీగారి పెద్దకొడుకు స్కూలు ఫైనలు వచ్చేటప్పటికే స్కూలు పాఠాలు, పరీక్షలు,మార్కు రావడం పోవడం యిదంతా నాన్సెన్సు అనిపించి అంతటితో ఇంగ్లీషు ఇంప్రువ్ చేసి ఫారిన్ యూ టీలకు వెళ్లుదామని రేనాల్డ్సు నావెల్సు 'కొను యింటికి వెళ్లిపోయినాడు.

చదువు అబ్బినా అబ్బకపోయినా బ స్తీ మాత్రము పూర్తిగ అబ్బినాయి. ఇతను మేడమీ గదిలో ఉంటాడు. ఆగదిలో ఒకవైపున పందిరి తెరతో సహా ఒకకాంపుకాటు ఉన్నది. ఒక రోజ్ ఉడ్ టేబిల్. దానికి సెంటర్న రివాల్వింగ్ గ్లాసు. దానికి రెండువైపుల బుక్ షెల్ఫ్లు ఉన్నా ఆషెల్ఫ్లమీద రేనాల్డ్సు నావెల్సు, ఆంధ్రప్రచారిణీ అపరాధపరిశోధకనవలలుగలవు. ఇంక టాయిలెట్ నులుహాజలైక్ స్నో సెంట్సుకొన్నిగలవు. సిజరు పెట్టెలు ఒకడజను విడిగా ఉన్నాయి. ఫైయర్సు కొన్ని ఉన్నాయి. అతనిపేరు కేశవాయ్ చౌదరీ కొంచెము పొడుగుగ చామనచాయగా నాజూకుగా

టాడు. బంగాళా క్రాపు. సుమారు ఇరవై సంవత్సరాల వయస్సు.

ఊళ్లో పిల్లలికి యితను ఆదర్శపురుషుడు. చదువుకు గుడివాడదాకా వెళ్లివచ్చిన పిల్లలు యిద్దరు ముగ్గురు యితనిచుట్టూ చేరుకుంటారు నలుగురుచేరి కాఫీలుతాగడం, చీట్లపేకలాడడం సిగరెట్లు పీల్చడంతో దినచర్య పూర్తి అవుతుంది. వెంకట్రామయ్యగారు సాధారణంగా ఊళ్లో ఉండడం తటస్థించదు. వ్యవహారాలమీద బందర్లో, బెజవాడో గుడివాడో పోతుంటాడు. ఇంటివద్దబోలెడు వ్యవహారం ఉన్నా మనకేశవరాయ్ చౌదరీ అదేమి అంటించుకోడు. ఇల్లు మొఖంమొత్తితే ఏబందరో బెజవాడో వెళ్లుతాడు. ఇదేం యిల్లాచేస్తున్నావు అనే వాళ్లు లేరు. ఈయన ఆధునికనవనాగరికగ్రామ సీమ యువకుడూ.

౭

వెంకట్రామయ్యగారి రెండవ కొడుకు బందర్లో 5 వ ఫారము చదువుతున్నాడు. మెద్రాస్ హోటల్లో భోజనంచేస్తున్నాడు. అప్పటికి కమ్మహాస్టల్ మొదలయినవిలేవు. ఎవరయినా తడిసిగాని గుడిసె కట్టరు. ఆకారణంచేత పిల్లవాడు స్వయంరాజా స్వయం మంత్రిలాగ సంచరిస్తూ నాటకాలూ, కాఫీహోటల్సు, సిగరేట్లు షోకుల్లోపడ్డాడు. దీనితో క్రమక్రమంగా ఆరోగ్యం చెడ్డది. 'బ్రతికివుంటె అన్నంలేకపోతుందా చదువులేకపోతేమానె' అని తండ్రి చదువుమాన్పించాడు. బందరులోనే కొంతకాలం మందు యిప్పించాడు. లాభకారికాలేదు. ఇంటికి తీసికొనివెళ్లి నాటువైద్యులను పిలిపించి మందులు యిప్పించాడు. చికిత్సచేసిన కొలది రోగం పెరుగుదల్లోనే ఉందికాని తగ్గుదలచూపలే. తర్వాత ఒళ్లు నీరుమూపి ఒకనెలరోజులు అవస్థపడి పాపము! ఇపిల్లవాడు గతించాడు.

౮

పుత్రవియోగము. దుఃఖకారణమైనను ఆకస్మికముగా తటస్థించినదికాదు గనుక వెంకట్రామయ్య మాములుపనిధోరణీలోనే ఉన్నాడు. అసమయములో గుడివాడలో ఒకరైసుమిల్లు కట్టిస్తున్నాడు. ఈహడావుడిలో దుఃఖము మరిచిపోయినాడు. ఆత్మపరిశోధన కలగనేలేదు. ఈమిల్లు పూర్తి అయ్యేటప్పటికి యెంత లేదన్నా యాభైవేలు అయ్యింది. మిల్లు ఓపెన్ చేసిన రోజున సమారాధనలు సంతర్పణాలు జోరుగా జరిగాయి. ఆసందర్భములో ఉద్యోగస్థులకు జరిగిన టీ పార్టీ వైభవము చెన్నపట్నం బాంక్వెటు హాలునుమించి పోయిందన్నమాట. జిల్లాలో మూలమూలలవున్న ఉద్యోగస్తులూ దొరలూదొరసానులూ అంతాదిగారు. స్పెన్సరు అండుకోవారుకూడా హాజరైనారు. నల్లదొరలకు మెద్రాసు కుప్పసప్లయి. ఆరోజున నాటకాలు, యింకా రసికులకు మేళాలు మొదలయినవన్నీ యేర్పాటుకాబడినాయి. అనుకున్నవి అనుకున్నట్టుగా అన్ని జరిగిపోయినాయి. అందఱు వెంకట్రామయ్యగారిని స్తోత్రపాఠంచేశారు.

రదనుకూలంగానే ధాన్యం బేరంకూడా బాగా సాగింది. చౌదరీగారి మిల్లుకువెళ్లితే సొమ్ము వెంటనే చేతిలోపడుతుందనేవాడుక కలిగింది. స్వగ్రామంలోనే కాక గుడివాడ బెజవాడలోకూడా కమిషన్‌కొట్టుపెట్టి ఖాయిదావర్తకం సాగించాడు.

౯

ఈవిధంగా అవిచ్ఛిన్నంగా అద్వితీయంగా బండి నడిచిపోతూంటే వెనక్కి తిరిగిచూచుకోవడంగాని,ముందు సంగతి విచారించుకోవలసిన అవసరంగాని యేంవుంది? ఆయన్నిపొగడేవాళ్లేగాని ఆక్షేపించేవాళ్లు ఒక్కరూ లేరు. అందరు సెబాష్ అంటె సెబాష్. వెంకట్రామయ్యచౌదరీగారి మాటచెలామణీ అయినట్లు కరెన్సీనోట్లు కూడ చెలామణికావడంలే. శరవేగంగా ఉడాయించే గుఱ్ఱం ఆగమన్నా ఆగుతుందా? పొదలు, కంచెలు అడ్డం వచ్చినా ఎగిరిదూకి వెళ్లిపోతుందిగాని. గౌరవమునకా లోటులేదూ. కలెక్టర్లు, సబ్ కలెక్టర్లు కుర్చీలు యిస్తున్నారూ. పలుకుబడా తక్కువలేదూ. ధనం ప్రవాహంవలె ప్రవహిస్తున్నదీ. అడిగితే లేదనేవాడు

లేదూ. మరల అడిగేవాడులేడూ. ఇక ఆయనకేం లోటున్నదీ!

ఒకనాడు రైసుమిల్లు ఆఫీసులో ఉండగా టెలి గ్రాంవచ్చింది. వాళ్లకువర్తకరీత్యా టెలిగ్రాములు రోజూవస్తూంటాయి గనుక మనమోస్తరుగా ఆయన గాభరాపడలేదు. దాన్నివిప్పిచూస్తే యిలా ఉంది. బొంబాయి.

"నేను రేపు కొహినూరు స్టీమర్లో ఇంగ్లాండువెళ్లు చున్నాను. అచ్చట చేరగానే తెలియజేస్తాను. సొమ్ముపంపవలెను. ఉత్తరమువల్ల అన్ని సంగతులు తెలియగలవు......రాయ్."

కొంచెం సేపు వెంకట్రామయ్యనిర్విణ్ణుడై పోయి నాడు.



"కొంచెంసేపు వెంకట్రామయ్య నిర్విణ్ణుడైపోయినాడు."

మరల తెలివితెచ్చుకొని శాంతంగఆలోచించాడు. ఇది ఒకందుకు మంచిదే ననుకొన్నాడు. వెంకట్రామయ్య చౌదరీగారి కొడుకు ఇంగ్లాండు వెళ్లాడన్నా గొప్ప బర్జాగా ఉంటుం దనుకున్నాడు. తనగొప్పకు గౌర వానికి వన్నె తెస్తుందని వెంకట్రామయ్య సరిపెట్టుకొని సంతోషించాడుకాని తల్లిమాత్రం ఉన్నఒక్క కొడుకూ కళ్లయెదుట లేకుండా పోయినాడని కంటికి నేలకు ఏకధారగా యేడ్చింది పాపము!

## ౧౦

కాలచక్రపరిభ్రమణంలో సుఖదుఃఖాలు, కలిమి లేములు, శీతోష్ణాలు కావడికుండల్లాగ ఒకటివెంట ఒకటి వస్తుంటాయి. ఓడలు బండ్లు బండ్లు ఓడలవుతుంటాయి. గుఱ్ఱమెక్కేవాడే పడతాడు. కాలాన్ని అదృష్టాన్ని శా సించాల్ని ఎంతకోరిక ఉన్నా మనము శాసించలేంగదా. చావు కబురు చల్లగా చెబుతున్నాగంటారేమో నిజమే, ఏంచెయ్యం. వ్యాజ్యాలు సాజ్యాలు, అప్పులు సొప్పులు వెంకట్రామయ్యను ఒక్కసారి చుట్టేశినాయి. బందరు సబ్ కోర్టులో వెంకట్రామయ్య చౌదరీగారిమీద ఒకవార సత్వపుదావా దాఖలు అయింది. ఒక విడోతాలూకు 20 ఎకరాలభూమి ఆమెకు తెలిసినంతవరకు వారసులు యెవరులేక పోవడంచేత ఆమెను మప్పతిప్పలుపెట్టి క్రయం వ్రాయించుకున్నాడు. పదేండ్లు అయింది. ఆమె యీమధ్య చచ్చిపోంగానె వారసులూ వంశవృక్షాలూ బయలుదేరినాయి. దావా దాఖలు అయింది.

వెంకట్రామయ్య తనతెలివి పలుకుపడి, డబ్బు అంతా ఉపయోగించాడు దావా తనపక్షంకావడానికి. పెద్దచేతులైన పెట్టాడు ప్లీడర్లగా. సాక్షులు దస్తావేజులు సమకూర్చాడు. విశ్వామిత్రసృష్టి చేయగలిగినంతపనీకు చేశాడు, తడిమన్ను పొడిమన్ను అయ్యేటట్టు కోర్టుచు ట్టూ పీడర్ల చుట్టూ తిరిగాడు. వ్యాజ్యపర్యవసానం యెట్లా ఉన్నా యీవెధవముండ వ్యాజ్యంతో అతనికికూడా వైధవ్యంపట్టేటట్టుగాఉంది.

ఈదావా ప్రారంభం అయిన రెండేళ్లనుండి వేర సారాలు ఉడిగాయి. పైరుపంటలు సన్నగిల్లినాయి. అతను చూస్తూ ఉన్నప్పుడే ఎక్కడేం జరుగుతున్నదో తెలియకుండా ఉండేది. బోలెడు కామాటం పెరిగి పోయింది.ఏదో మేకపోతు గభీరంగా యీడ్చుకొస్తుంటె

ఆభండారంకాస్తా బయటపడ్డది. నౌకర్లు గుమాస్తాలు ఇష్టమువచ్చినట్లు సంచరించటం మొదలుపెట్టారు. దీపం ఉండగానె చక్కబెట్టుకోడంవాళ్ళ కుమాత్రం తెలియదూ!

ఇదివఱకు యజమానికొఱకు ఇతర్లను ద్రోహం చేసేవాళ్లు ఇప్పుడాయన పాతం ఆయనకే ఒప్పచెప్పటం మొదలు పెట్టారు.

కష్టాలన్నీ కట్టకట్టుకొనివచ్చాయి. ధాన్యం ధర తగ్గిపోయింది. బ్యాంకు వాయిదా అయిపోయింది. వాళ్లు సొమ్ముకుపలగాలగీ చేయడం మొదలుపెట్టారు బస్తాకు పావలా మొదలు అర్థరూపాయిదాక నష్టము కనబడుతున్నది. కోస్తాబేరము అసలే లేదు. ధర పెరిగే సూచనలే లేవు. ధాన్యం అమ్మకతప్పిందికాదు. నిలవబోసిన లక్షబస్తామీద మొత్తం ముప్పైవేలన్నా నష్టం వచ్చింది. బ్యాంకు ముప్పు ఎట్లాగో వదిలించుకున్నా మార్వాడీల బాధతప్పిందికాదు. వాళ్లు ఎట్లాపసిపట్టారో పట్టారు. బెజవాడనుండి అంత వచ్చివాలారు. ఇది ఈలా ఉండగా కోర్టులో దానావాదులపక్షమయి పొలం అప్పగించటమేగాకుండా పది సంవత్సరముల ఫలసాయంక్రిందా ఖర్చులక్రిందాపదిహేను వేలు డిక్రీ అయింది. వాళ్లు ఫాక్టరీకి జప్తువారంటు పట్టుకొచ్చారు. వెంకట్రామయ్యకు ఏంచేయటానికి తోచలే. ఇంతలో ఒక ఋణస్తుడు కోర్టులో వెంకట్రామయ్యచౌదరీగారిని ఇన్‌సాల్వెంటుగా డిక్లేరుచేయమని పిటీషన్ పెట్టాడు.

వెంకట్రామయ్య నిలువున కుంగిపోయినాడు. నట్టేట్లో పుట్టి మునిగినట్లయింది. కొంప నాలుగు వైపుల ఒక్కసారి ముట్టుకున్నది. దావానలం చుట్టేసింది. ప్రాణం తెప్పరించుకొంటానికి అవకాశము చిక్కలేదు. దారి మధ్య పాము కఱచినట్లు, మొదలు నరికినచెట్టులాగు పడిపోయినాడు మనిషి ప్రాణత్యాగం చేసుకుంటాడేమో అని భయమేసింది. తలుపు తెరచి నలుగురు మొఖంచూడలేకపోయినాడు.

కోర్టువారి హుకుంప్రకారము యావదాస్తి అప్పజెప్పినాడు. ఇది సాహుకారు దివాలాకాదు. అంత స్థిరాస్తేగాని చరాస్థిలేదు దాచుకుంటానికి.

దురాశ దుఃఖంచేటు పరపీడనం ప్రాణసంకటం. వెంకట్రామయ్యకుయిదియొకగొడ్డలిప్రేటు. నిన్న మొన్నటిదాక మహదైశ్వర్యముతో తులదూగుచున్న మనిషి నేడు కాసు గవ్వలకు టికాణాలేక కట్టువస్త్రాలతో కదిలిపోవలసివచ్చింది కాని ఆ ఐశ్వర్యము ఆవళ కేవలము పొంగు. కాల్పనికము. కృత్రిమం. ఇది ఒక స్వప్నంలాగ వెంకట్రామయ్యకు కనిపించినా చేసిన దుష్కర్మలన్నీ కాలసర్పములాగ కనిపించకపోలే. తనకు వచ్చిన విపత్తుకు ఎవరిని నిందించటానికి అవకాశము కనిపించలే. అతని చరిత్ర అతనికి స్ఫురణకువచ్చింది. స్వీయచరిత్ర తరిచి చూచుకొన్నకొలది మనస్సుకు విశ్రామస్థానము కనిపించలేదు. అనంత పాపాఘాతంలోనికి దిగిపోతున్నాడు. జడ్జిమెంటుడే (విచారణదినము) వచ్చింది. అచ్చట అతనే జడ్జి, అతనె ఫిర్యాది, అతనే ముద్దాయి, అతనే సాక్షి. మరెవ్వరు లేరు సర్వము అతనే. ప్రళయకాల ఝంఝామారుతము వలె మహోగ్రమగు తుపాను ఒకటి అతని మానసకుహరమునవీచుచున్నది. దుష్కర్మములన్ని చిన్నవి పెద్దవి ఒకటి తర్వాత ఒకటిసాక్ష్యమిస్తున్నాయి. "బీదబ్రాహ్మణునిపొలమునకు నీరు ఎక్కకుండాచేసి అమ్మించింది ఎవరు? నేనే. పొలాలుగదుముకొని తప్పుడు సాక్ష్యాలు పలికించింది ఎవరు? నేనే. ఉద్యోగాలు తీసేంచింది ఎవరు? నేనే. అనాథస్త్రీ ఆస్తి అక్రమంగా అమ్మించింది ఎవరు? నేనే. అధికారుల ప్రాపకము సంపాదించుటకు లంచములు పెట్టింది ఎవరు? నేనే." అని అతనిమస్తిష్కమునుండి వెడలు ప్రశ్నపరంపరకు తండోపతండములుగ "నేనే, నేనే" అని సాక్ష్యమిచ్చుటకు హృదయకవాటము దెరచుకొని బహిర్గతమగుచున్న పాపసందోహముచే అతనిగుండె బ్రద్దలైపోతున్నది. ఈ ఆలోచనలతో అతని శిరము పెటపెటలాడి వ్రక్కలైపోతున్నది. చేతులతో నదిమినను వస్త్రముతో బిగించినను నిలుచునట్లు లేదు. నిశితపాపతూణీరములు అతనిహృదయకుహరమున గ్రుచ్చుకొనుచున్నాయి. పాపదావాగ్నిలో దగ్ధమైపోతున్నాడు. ఈమహావిపత్సముద్రమున నీదులాడునప్పుడు పాపచింతలు దుష్కర్మములు తప్ప వేరొండు వెంట వచ్చుటలేదు. వద్దన్నను, దూరముగ దరిమివేసినను అవి

అతనివెంటనంటి వాని హృదయతాపమును వేమడుంగులు రెచ్చకొట్టుచున్నవి. దారపుత్రాదులు, బంధుమిత్రులు నిస్సహాయులై నారు. అతను ధనము కోరుటలేదు. భూములు కోరుటలేదు. ఇండ్లు వాకిళ్లు వాంఛించుటలేదు. మనశ్శాంతి కావాలె. అదిమానసికవ్యథ. ఆత్మపరితాపము, చేత్తోతీసివేసేదా! మాటల్తో ఓదార్చేదా!

పుటము పెట్టనిది బంగారు నిజస్వరూపం ఎట్లు విశదముగాదో అటులనే కలుషపూరిత మానవుడు పశ్చాత్తాపాగ్నిచే పరితప్తముకానిది ఆత్మనిజస్వరూపము గాంచజాలడు. వెంకట్రామయ్య తీవ్రపరితాపాగ్నిలో పరితప్తమైపోయినాడు. దైవనిర్ణీతమైన శిక్ష ననుభవించుటకు కృతనిశ్చయుడై నాడు. "నాపాపఫలము నేనే అనుభవించెదగాక" అని అన్నపానీయములు మాని ఉపవాస వ్రతము సల్పినాడు.



"నా పాపఫలము నేనే అనుభవించెదగాక."

౧౨

ఏషాస్య పరమా గతి రేషాస్య పరమాసమ్పత్,
ఏషోఽస్య పరమో లోక ఏషోఽస్య పరమ ఆనందః

పశ్చాత్తాపాగ్నియందు వెంకట్రామయ్య పాపసంచయం భస్మమైపోయింది. ఆత్మజ్ఞానము పొందినవాడు పరమాత్మను పొంది శాశ్వతానందం పొందజాలుట సహజమేకదా. వెంకట్రామయ్య నేడు భగవన్నామామృతము గ్రోలుచున్నాడు. భగవన్నామసంకీర్తనాతత్పరుడై,

"పరమానందముగోరు పరబ్రహ్మ భజన నింపారు మనసా,
పరమభక్తులగోష్ఠి నిజేరు పాయనిసత్యనిరతుడవై వేమారు.
.........................................."

అని గానముచేయుచున్నాడు.

వెంకట్రామయ్య సినతండ్రి కొడుకు నరసయ్య సచ్ఛీలుడు, ధర్మబుద్ధిగలవాడు. మంచి ఆస్తిపరుడు, నిర్ధనుడైన వెంకట్రామయ్యను అతను చేరదీసి పోషించుచున్నాడు. వెంకట్రామయ్య పెద్దవయస్సువచ్చినవాడగుటచే కాయకష్టము చేయలేకపోయినప్పటికిని నరసయ్య గృహకృత్యములందు సహాయపడుచు కాలము గడుపుచుండెను.

మాబస్తీల్లోకూడా వెంకట్రామయ్యను బోలు పరపీడనానంద నిమగ్నులు, నిరంతర ధనలక్ష్మీసేవా ధురంధరులు, నిరంకుశాధికారాభిలాషులు, కపటనాటకసూత్రధారులు, గోముఖవ్యాఘ్రము లెందరో గలరు. అధర్మవర్తనులై ఎంతకాలము మనగలరు. 'ధర్మ ఏవ జయతే' సర్వేజనా స్సుఖినోభవంతు.



3. చిట్‌పాణి లోయలో ప్రాతఃకాలము

ఇది ఉత్తరహిందూస్థానములో నిదగను.

## ఉమర్ ఖయామ్ చిత్రము



సొలుపుగ మాటనేర్చినవి మూఁగవి కుండలు రెండువేలు లో
పల నొకమూలనుండి యిటు పల్కెఁ నన్నుఁ గని "కుంభకారులన్
బిలిచినవారు, మమ్ముఁ బురవీథుల నమ్మినవారలేరి? యే
తలమున కేఁగినారలు? వదంతి యెదేనియు విన్నఁ దెల్పుమా".

—పానశాల.

# కమ్మరీఁడు

పండిత పెనుమెచ్చ సత్యనారాయణరాజు గారు

కటకట! కమ్మరీఁడ!! యిటు క్రమ్మరఁ గొల్మిని నూఁదియూఁది బల్
చటులత నిప్పుగొల్పి కడు సాహసవృత్తినిగాఁచి యిన్ము; నీ
పటుతర బాహుపాండితి నవారణ మారణయంత్రసంచయం
బిటుల సృజింతె రేఁగఁగ నహీనభయంకర ఘోరయుద్ధముల్.

బొగ్గులుకొల్మిలోఁ గ్రోవిడియూఁదుచోఁ; నెగయు పొగలు నింగి నేలఁగవియఁ
బొగయాఱి జిగిదేఱి భగభగమండుచోఁ; నగ్నిచ్ఛటల్ దెస లలమికొనఁగ
సమ్మెటవ్రేటులు పమ్ముచోఁ జెదరెడు; మిణుఁగుల్ కనులు మిఱుమిట్లుగొలుపఁ
గరఁచుచుఁ జఱచుచుఁ గడువడిఁ గమ్ముచోఁ; నరులెడందల నడునడునడంకఁ
గ్రమ్మఁ జెమ్మటల్ మేన నక్తందివంబు నమ్ము లీఁటెలు తరవరు లాయసమున
నేమిటికిఁ జేయుచుంటివి యిట్టివీఁకఁ గడమపడకుండఁ జెప్పవెమా కమ్మరీఁడ!

తొలుదొల్త దేవతల్ పొలదిండి మూఁకలున్; ఘోరంబుగాఁ బోరఁ గొన్నినాళ్లు
తరువాత శ్రీరామదశకంఠసైన్యముల్; ఘోరంబుగాఁబోరఁ గొన్నినాళ్లు
పదపడి కౌరవ పాండవవాహినుల్; ఘోరంబుగాఁబోరఁ గొన్నినాళ్లు
మొన మొన్న జర్మనుల్ ఘను లింగిలీషువార్; ఘోరంబుఁగా బోరఁ గొన్నినాళ్లు
ప్రాచ్యపాశ్చాత్య దేశముల్ పాడువాఱె; దుర్భరాఘోరదుర్భిక్షఁ దోఁగితోఁగి
యొక్కపెట్టున నల్లాడి యుంటకకట! కావొకో నీవు కర్తవు కమ్మరీఁడ!

చెంగుమ సాహసింపకుము సేయఁగఁబూనిన నెన్నొ యెన్నొ ని
ర్భంగములై సుభిక్ష నిడు ఫాలలవిత్రములాది సాధనా
లంగుగనుండె; వాని నగు నంగద యేరికిలేదు; గాన నీ
వింగ సృజింపఁ బూనుమవి; పృథ్వియు శాంతిలు శస్త్రమార్జకా!

ఇంకఁగాలే దదే హిమశైలభూభాగ; పతిత దేవాసుర ప్రతతి రక్త
మారఁగా లే దదే శ్రీరామరావణా; హవరుధిరాభిషిక్తవసుమతియుఁ
బోవఁగాలేదవే పొలయానుగృధ్రముల్; శివకాకముల్ కురుక్షేత్రభూమిఁ
దొలఁగఁగాలేదవే వలపోయుభారత; సుందరీమణుల మునుంగు లకట!

యిట్టి భీభత్సరంగమ్ము లిన్నియున్నఁ; దలనుబైకెత్తి చూడవు తలఁకఁబోవు
ప్రజల సంక్షోభమున కేమి భయముపడవు; కటికిరాయొకో నీగుండె కమ్మరీఁడ!

మానుముమాను మింక ఘనమారణయంత్రము లేల చేయఁగన్
మానుగఁ గర్ష కోపకర ణమ్ములఁ జేయుము నీతిబాహ్యమా
మానవ లోకమంతకును మక్కువ గూర్పుము గానిపించునీ
మానితనూత్న మార్గ మిది మాయురెయంచు నుతింత్రుధీవరుల్.

యుద్ధకళావిదగ్ధులగు యోధులు నవ్విన నవ్వని మ్మనం
బద్ధముగాఁ దలంచి యిది పావనభారత దేశమెంతయున్
వృద్ధి నిబద్ధిగాఁ గను సమృద్ధిగఁ బండుట క్షేత్రరాజముల్
బుద్ధమహర్షి సూత్రముల పూర్వ వికాసము నొందు దీనిచే.

ఓహరి సాహరిం బగర యుద్ధములం దెగటార్ప నాయుధాల్
సాహసవృత్తి నీవు మఱి సల్పక మానితి వేని నాఁచికో
లూహాలె మెల్లడన్ బ్రబలి యుద్ధతు లీ భరతావనిన్ గడున్
మోహముతోడఁ గొందురని మోహమునొందకు శస్త్రమార్జకా!

తాత్పర్యంబున శాంతి సుస్థిరముగా ధాత్రి౯దగ౯ నిల్పఁగా
హృత్పద్మంబునఁ గోరి నీవు మఱి యీదృగ్ఘోర శస్త్రాదులన్
సత్వణ్యార్థివి యాచు మాని తవిమేన్ సంయార్థులున్ బ్రీతి నీ
పత్పంకేజము లాశ్రయించెదరు కోపాటోపశూన్యాత్ములై.

ఆఱునే క్రోధాగ్ని యతిశాంతి రసపూర; జలదాళివర్షధారలనుగాక
చెదరునే పరిపంథి జీమూత సంఘంబు; లతిశాంతి వాయుసంహతినిగాక
కూలునే యీర్ష్యాప్రకుంభినీజమ్ములు; తతశాంతి పరశుఘాతములఁగాక
సమయునే లుబ్ధాహి జాలంబు ఘనతర; శాంతి గారుడమంత్రసమితిఁగాక
పోవునే యహంకారప్రభూతమద్ది; "శాంతిభేతాళభర్జనసరణిఁగాక
దూరమిది యోజనముచేసి తొలఁగవయ్య స్వీయప్రాక్తనకార్మికవృత్తి నింక

శాంతిపూనినీవు సరగ నీఘోరాతి ఘోరకర్మము లనుగొడవ లుడిగి
(?) విడిచిపుచ్చి నీదు విద్యమెఱయఁ జేయవయ్యారైతు చేవదేర.

ఏనాఁడు రైతులందఱు నీనాణెపు పరికరముల నిక్కపుబుద్ధిన్
బూనెదరో నాఁడె పృథ్వి యనూనవికాసమ్ము నొందు నూతనఫక్కిన్.

ఎపుడుకొడవండ్లు తొల్లిక లినుపకత్తు లాదిగాఁగలపనిముట్టు లాదరమున
నీవుసేయుదో యావేళ నీప్రపంచ మధికశాంతిని బడసెడి నలర జనము.

ఫలభారమునఁ జేసి తలవాంచి వినయంబు చాటెడుశాలి సస్యమ్ముతోడ
గలకలనవ్వుచు నిలువెల్లఁబువ్వులఁ బరఁగెడు నలనువ్వుపైరుతోడఁ
బ్రతిపర్వముననుండి యతిరుచ్యరసపూరములుగాఁబు పుండ్రేక్షు కులముతోడఁ
గ్రొంగ్రొత్తఫలములు గుత్తుగుత్తులుగాఁగ నలరారు ద్రాక్షాలతాళితోడ,
సకలసస్యాఢ్యయై భూమి జరగునాఁడు నిన్నుఁదలపోసి కేల్మోడ్చి నిఖిలజనము
కలఁతలను మాటతలఁపక క్రాలుఁగానఁ బరఁగఁజేయుము కర్షకోపకరణముల.

ఎపుడు యుద్ధేచ్ఛయుడుగునో యీజనంబు కపుడ తొల్లింటి ఋషికాల మరుగుదెంచు
దాన సర్వంసహాదేవి సంతసించి స్వస్తివచనంబు వలుకుఁ బ్రశస్తమతిని.

అనువుగ ఓంశాంతిః శాం తినాఁ జనుపలుకు వినఁబడఁ దెల్లముగాఁగన్
జనములు పాఁడియుఁ బంటయు ఘనముగ; మనెదరు త్వదీయఘనతఁ బొగడుచున్.

ఏమనుచుంటివోయి! యిక నీదృశకృత్యము లాచరింపఁగాఁ
బోము; యటంచునా! భళిరె పుణ్యచరిత్ర! నమోనమోస్తు తే
యేమరుపాటనేని మఱి యెక్కడ నొక్కఁడు యుద్ధ మిద్ధరన్
ఏమెయి నాచరింపకయ యీశ్వరు సత్కృపగల్గి వెల్గుతన్

సురచిరకంధివస్త్రపరిశోభిత దివ్య తనూవిలాసినీ!
నిరుపమదీప్యమానమణినిర్భరపర్వతమండలస్తనీ!!
కరములు మోడ్చి మ్రొక్కెదము కావుము. కావుము. విష్ణుభార్య మా
చరణయుగాళితాఁకుడును సైఁచి యపారకృపా రసాత్మవై.

—--—

## కథకుడి కష్టాలు

మునిమాణిక్యం నరసింహారావు గారు, బి.ఏ., యల్.టి.

"శాస్త్రిగారూ మీరు ఆ భవభూతినీ కాళిదాసునూ చదివిందే చదివిందే ఎన్నిసార్లు చదువుతారండీ? ఆధునికవాఙ్మయం చూడరేం వాఙ్మయ ప్రవాహం వర్తమానకాలంలో చిత్రగతులలో ప్రవహిస్తున్నది. అదిగమనించరేం"

"అల్లాగా ఏమిటోయి ఆధునికవాఙ్మయంలో ఉండే చిత్రవిషయము"

"నూతనత్వము"

"నూతనత్వమా? అంటే?"

"అంటే ఏమిటో మీకొకమాటలో చెప్పటం కష్టం. ఉన్న విషయం ఏమిటంటే భాష విషయంలోను భావం విషయంలోను మార్పు వస్తున్నది. నూతనత్వం బయలుదేరుతున్నది. ఆధునికవాఙ్మయము నూతనత్వంతోడి కళకళలాడుతూ జీవకళలతో పొంగిపోతున్నది. త్రుప్పుపట్టిన ప్రాచీనవిషయాలను వదిలేస్తున్నాం."

"వదిలేస్తున్నాం అని అంఘావు. నీవు గూడా కవి అయినావా?"

"కవిని గాదు లెండి. అదే మోస్తరు. పత్రికలకు వ్యాసాలు, కథలు వ్రాస్తున్నాను."

అవును, భారతి అనే పత్రికచూచాను.

"అదేనండి అట్టి పత్రికలలోనే నేనూ వ్రాస్తుంటాను.

అయితే అబ్బాయి నీవు వ్రాసిన కథ ఒకటి వినిపించు చూస్తాను"

"శాస్త్రిగారూ, ఇప్పటి కాలంలో బొడ్డూడని ప్రతివాడూ కథ వ్రాయటం మొదలుపెట్టాడు. కాని నిజమైన కథ వ్రాయటం చాలాకష్టం సుమండీ."

"ఏమిటోయి కష్టాలు?"

"అడిగారు కాబట్టి చెబుతాను. నేనే ఉన్నాననుకోండి. ఒక కథ వ్రాయాలంటే ఎన్నో విషయములు ఆలోచించాలి. వ్రాయటంలో ప్రాచీన పద్ధతులను వదలివేసి నూతన విషయాలను చొప్పించాలి. పురాణయుగంలో "అనంగ అనంగ ఒక రాజు ఆ రాజుకు ఏడుగురు కుమాళ్లు, వారందరు ఒకరోజు వేటకెళ్లారు. ఒక అడవిలో వారికి అతి చక్కని సుందరి కనుపించింది" అని వ్రాయటం ఆచారం, కొంత కాలమైనతరువాత పూటకూళ్ల పెదరాలు కథలలో ప్రవేశించింది. ఎవరో ఒకడు ఆమె ఇంటికి వచ్చి "పెద్దమ్మా పెద్దమ్మా ఈ వూళ్లో విశేషాలు ఏమి అని అడగటం ఆమె ఆ వూరి రాజుగారి కూతుర్ని గురించిచెప్పటం" అట్లాకథ నడపటం ఆచారం అయింది. పూటకూళ్ల పెద్దమ్మ కథకంతా సూత్రంగా ఉండేది. ఇప్పటి కాలంలో అల్లా కథ ఆరంభిస్తే నవ్వుతారు."

"ఎందుచేతనోయి?"

"అందులో నూతనత్వం ఏది. మాటవరుసకు చూడండి పూర్వము కృష్ణుని గానాన్ని గురించి మురళీగానం అనేవాళ్లు, కొంతకాలమైన తరువాత వేణుగానం అన్నారు. ఇప్పుడు అల్లా అంటె అంతా నవ్విపోరూ?

"మరి ఏమనాలోయి?"

"బొంగువాయిద్యం అనాలండి. ఇల్లా అనడంవల్ల అర్థం చెడకుండా సౌలభ్యం, మాధుర్యం నూతనత్వం కుదిరినవి."

"అల్లాగా. ఇప్పుడు కొంచెం అర్థం అయింది నూతనత్వం అంటే ఏమిటో. ఇది వదిలేసి నీ కథ విషయం ఏదో చెబుతానన్నావు చెప్పవూ?"

"ఇంతకూ చెప్పవచ్చేదేమిటంటే కథ నూతన పధ్ధతిలో ప్రారంభించాలని. నేను ఆ విషయాలన్ని ఆలోచించి తూచి చివరకు ఇట్లా కథ మొదలుపెట్టాను. [ఆమె మొదట ఆయనను మామిడిచెట్టుక్రింద నుంచుని చూసింది.]

"ఆగవోయి. ఇదేమిటోయి ఎవరు ఆమె? ఆమె పేరేమి? ఏవూరు ఆమెది? ఇవన్నీ చెప్పకుండా నామరూపాలు లేకుండా కథారంభం ఏమిటి?"

"చూశారా మీరు అడిగిన ప్రశ్నలన్నీ వస్తవి. వాటికి జబాబు కోసం పాఠకులు కథను కొంసా చదువుతారు. ఆ విధంగా కథ పూర్తిగా చదువవలెననే ఉత్సాహం పుట్టిస్తున్నాను. కథారచనా చమత్కృతులలో ఇది యొకటి. అయితే నా కథానాయికకు ఏమి పేరు పెడదామని మహాబాధపడ్డాను. ఆధునిక కథకులలో వేలూరు శివరామశాస్త్రి గారు వ్యక్తులను పేర్లు పెట్టటంలో అసమానప్రజ్ఞ సంపాదించారు. ఎవరూ వినని పేరు ఒకటి ఆయన సృష్టించగలడు.

నేను అటువంటి పేరు ఒకటి అడిగి పుచ్చుకొందామనుకొన్నా గాని మళ్లీ ఇంకో ఆలోచన వచ్చి మానేశాను. నాయకికి సావిత్రి అనే పేరు పెట్టాను."

"సావిత్రి. పాతపేరేనే. నూతనత్వం ఏది?"

"పేరు పాతదైతే నేమండీ, పాతపేళ్లే పెట్టి వాళ్లకు కొత్త వ్యక్తిత్వము కల్పించటంలో పోకున్నది. Old wine put in new bottles అనే సిద్ధాంతాన్ని ఆచరణలోకి పెట్టాను."

"బాగుంది. కథపేరు గూడా సావిత్రి అనే పెట్టినావా?"

"ఎబ్బే! అల్లా పెట్టలేదండీ. కథకు ఇంకా నామకరణం చేయలేదు. ఆ విషయంలో శివుడుగారిని అడగాలె. ఆయనదగ్గర కొఱవి దయ్యము, దొరసాని దుఃఖము, దయ్యాల కొంప, అనే చక్కని పేర్లు కొన్ని ఉన్నవి. అందులో ఒకపేరు అడిగి పుచ్చుకొంటా. ఏదో విధంగా ఆ గండం గడుస్తుంది. కాని కథావస్తువు విషయమే చెడ్డకష్టం వస్తుంది."

"ఏమిటి కష్టమోయి?"

"అదే కష్టమండి శాస్త్రిగారూ. నే పడ్డ కష్టాలు చూడండి! కథావస్తువుగా దేనిని గ్రహించాలా అని. ఒక వెధవముండ పెండ్లి తీసుకొందామని ఒక ఆలోచన వచ్చింది."

"ఛీ అదేమిటోయి. వెధవముండ పెండ్లి కథావస్తువ."

"మీకు కష్టంగా ఉందా. వెధవముండ పెండ్లి అయినా దీర్ఘసుమంగళీభవ అని పేరు పెడితో ఆదోషం పోతుంది. ఒకాయన కుమారుడికి నాగడు అని పేరు పెట్టాడట. అందరూ చీవాట్లు వేశారు ఆయనని. ఇదేంపేరు వెధవ పేరు వాడు రేపు స్కూలుకు వెడితే అంతా నవ్వరా అని. అప్పుడొకాయన క్రాపింగు పెట్టండి ఆ పాత పేరు పెట్టిన దోషం పోతుంది అన్నాడట. అల్లాగే వెధవముండ పెండ్లి కథావస్తువుగా గ్రహించినా పేరు పెట్టటంలో ఆ దోషం పోగొట్టవచ్చు. కాని అదొకటి దొరుకుతున్నది!"

"అదేమిటి అల్లా అంటావు పెండ్లిచేయటానికి వెధవముండ దొరకలేదు?"

"సరే. ఏ వెధవముండను తీసికొని ఇంత ఇంటిదాన్ని చేసి చేరెడు పసుపూ, చేరెడు కుంకుమా, ఒక చీరా ఇద్దామా అని పరకాయించి చూస్తే ఎవ్వరు కనిపించలేదు. ఎందుచేత ననగా వెధవముండలందరికి శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రిగారు కొద్దిరోజుల క్రిందనే వివాహం చేశారు. ఇంక ఒక్కతే మిగిలింది. ఆ ఒక్క అమ్మాయికి మొన్ననే సుమంగళీభవ అని వివాహం జరిగింది."

"పోనీ మొగాళ్ల వివాహం చేయరాదు?"

"పోనీ మొగాళ్లకు ఎవరికైనా వివాహం చేసి కథ నడుపుదామా అంటే మా భాష మరిది పెండ్లి అయిపోయిందా! కలెక్టరుగారి అబ్బాయికి వివాహం అయింది, చింతలపూడి వారి సంభావన అయిపోయింది."

"అల్లాగా మళ్లీ వివాహం కథావస్తువుగా తీసుకుంటే నూతనత్వం పోతుందన్న మాట. ఆహా బోధపడ్డది. అప్పుడేమిచేశావు?"

"ఏం జేసేదండి. మనుష్యవర్గం మానేసి జంతువర్గంలోకి పోయినా. జంతువును తీసికొని వాటిచేత మాట్లాడించి కిప్లింగులాగ కథ నడుపుదామంటే గొప్ప యిబ్బంది వచ్చింది."

"నీ ఇబ్బందులన్ని విచిత్రంగా ఉన్నవి. ఇప్పుడు వచ్చిన ఇబ్బంది ఏమిటి?"

"చూడండి. ఉన్న జంతువులలోకల్లా కుక్కలూ, పిల్లులూ, తాలూకా గుమస్తాలలాగ కాస్త గౌరవంగా బతుకుతున్నవి. అయితే ఇందులో కుక్కలన్నీ శివుడుగారి దగ్గర న్నవి. పిల్లుల నన్నింటినీ చింతా దీక్షితులుగారు కాజేశారు. ఇక దున్నపోతూ గాడిదా మిగిలినవి."

"అవా నీ కథకు వస్తువు."

"ఏం జేసేది? నాకు విచారం వేసింది. పోని వాటిపైనే కథ వ్రాద్దామంటే అవీ అవి

పించలేదు. గౌతమిాచరిత్రలాగ ఒక గాడిద స్వీయచరిత్ర వ్రాద్దామంటే ఒక్క గాడిదైనా ఒక్క దున్నపోతైనా కనుపించందే! ఏమా చిత్రం అని పరకాయించి చూస్తే, స్కూలు మాస్టర్లు నిమిషనిమిషానికీ గాడిద, దున్న పోతూ అంటం వినిపించింది. ఇంక మన కెట్లా వస్తవి. అవి వాళ్ల సొత్తు. నిస్పృహ చెందాను. చూశారా శాస్త్రిగారూ నిజంగా మంచికథ వ్రాయాలంటే ఎన్ని కష్టాలున్నవో. ఇవన్నీ ఏం తెలుస్తయి ఇతరులకు. కథ వ్రాస్తే అది బాగుండలేదు, కథకు ఉండాలిసిన లక్షణాలు లేవు, టెక్నిక్ లేదు అని ఆక్షేపిస్తారు."

బోధ పడుతున్నదోయి. అపుడేమి చేశావు."

"పోని అని పక్షివర్గం లోకి వెళ్లానండి. ఏదైనా ఒక పక్షిని తీసికొని దాని చేత మా ట్లాడించి. నీతిపాఠం చెబుదామని"

"అయితే మరిచిపోయినా నీవు వ్రాసే కథలకు నీతి ఉంటుందా."

"అయ్యో ఉండేటట్టు చేస్తానండి. గుం టూరులో ఉండే భావనాచార్లుగారు లోకంలో ఉండే నీతులను అన్నీ క్రోడీకరించి సంక్షేపించి పది ముఖ్యనీతుల క్రింద తేల్చారు. నా కథకు అందులో ఏది తీసుకొన్నా సరిపోతుంది."

"సరే. సరే. పక్షులను మాట్లాడిద్దామను కున్నావు. ఏమయింది"

"విన్నారా, సరే మంచి ఆలోచన వచ్చిం దని ఇటు చూద్దును గదా ఒక్క పక్షి లేదు."

"ఏమయినవి?"

"కోయిలలు చిలుకలు పార్వతీశకవుల దగ్గరున్నవి. ఇంకేముంది. ఇక గుడ్లగూబ మిగి లింది. దాన్ని చూస్తేనే నాకు భయం. అయినా తప్పనిసరి గదా దాని దగ్గరకు పోదునుగదా అది దేవులపల్లి వారి సంస్థానంలో ఆస్థాన కవిగా ప్రవేశించిందట. ఇక నాతో అది మా ట్లాడుతుందా."

"చివరకు ఏమిా తోచక ఆంగ్లకవిలాగ చీ పురుకట్ట పైన కథ వ్రాద్దామనుకొనేసరికి గురి జాడ అప్పారావుగారి పూటకూళ్లమ్మ వెంటబడ్డ ది చూశారా శాస్త్రిగారూ కథకుడి కష్టాలు ఇవి ఎవ్వరు గమనించరు. ఇంకేమి వ్రాసేది చెప్పండి. గంగిరెద్దు మీద వ్రాద్దేమంటే అడివి బాపిరాజుగారికి కోపం వస్తుంది. చిమ్మట మిాద వ్రాద్దామంటే వేదుల ఆయనకు కోప మాయె?

"అప్పుడేమి చేశావు. గొప్ప అవస్థే."

"నూతనత్వంకోసం పడ్డ పాట్లండి ఇవి. అప్పుడు తీవ్రంగా ఆలోచించగా ఆలోచిం చగా ఒక్క విషయం తట్టింది. అపు డొక క్రొత్తవ్యక్తిని సృష్టించినాను."

"అంటే పైన చెప్పిన స్త్రీకాకుండా, వెధవ ముండకాకుండా, కుక్కకాకుండా, ఉండే ఒక నూతన వ్యక్తి అన్నమాట"

సరిగ్గా అంతే. అది యొక వ్యక్తి. అది చూపులకు మనిషే. కాని మనిషికాదు. దున్న పోతుగాదు. గుడ్లగూబ కాదు. కోతి కాదు.

పిల్లికాదు. కుక్కకాదు. వెధవముండ కాదు. అయితే గుడ్లు గూబవి. ముఖం కోతిది. బుద్ధి కుక్కది. ఎక్కింది దున్నపోతు. చూపులు పిల్లివి. ఇటువంటి వ్యక్తి ఎవరు చెప్పండి?"

"దున్నపోతు ఎక్కాడు అన్నావు కాబట్టి యముడు అనాలిసొచ్చింది. అయితే యముడు మళ్లీ పాతవస్తువేనే?"

"అయితేనేం. యముడిని ఎవరైనా ఇటువంటి వ్యక్తి అని చెప్పారా. ధర్మరాజు అన్నారుకాని కుక్కబుద్ధి కలవాడు అన్నారూ? చూశారా వ్యక్తిత్వంలో నూతనత్వం. ఇందాక తమరు మనవి చేసేనా లేదా ? పాతసారాయి క్రొత్తసీసాలలో పోయటం అనే సిద్ధాంతాన్నే మనస్సులో నుంచుకొన్నానని. అదండి ఇది."

"సరి సరి చాలా కష్టించారు."

"అయితే ఇప్పటెంతవర కయింది? నాయిక పేరు కుదిరింది. నాయకుడు యముడు. ఇక ఏభాషలో వ్రాద్దామా అన్న శంక పట్టుకొంది. గొప్పకవులు ఏభాషలో వ్రాశారూ? ఎవరు గొప్ప కవులు అని మళ్లీ ప్రశ్న. నన్నయభట్టాది కవులు. నిజమే కాని వాళ్లు పాతబడ్డారు. ఆధునికకవులలో ఒకరు వాడుక భాషలో వ్రాయాలన్నారు. శ్రీపాదవారు గ్రాంథికంలో పుస్తకాలు వ్రాయాలన్నారు. వాళ్లేదో కొట్టుకొన్నారు. నాకెందుకు ఆసంగతి. మొత్తముమీద చాలమంది వాడుకభాషలో వ్రాస్తున్నారు. అయితే ఇంతటితో కష్టాలు గట్టెక్కలేదు. గిడుగు పంతులుగారు అరసున్నాలు లేకుండా వ్రాయమన్నారు. అసలు సున్నాలు లేకుండా వ్రాయమంటారు ఉమాకాన్తము గారు. ఈ ఉమాకాన్తముగారు—(ఉమాకా... మందులు కనిపెట్టింది ఈయన యేమో నా... తెలియదు.) ఈ మధ్య కొన్ని పుస్తకా... వ్రాసి అందులో సున్నాలు పెట్టి వ్రాయ... మూలానే నన్నయభట్టు దగ్గరనుంచి నానా... హేబువరకు కవిత్వం చెడిపోయిందనీ, అం... ముందు సున్నాలు లేకుండా ఉండి కవిత్వ... సలక్షణంగా ఉందని వ్రాశారని ఎవరో అ... కొన్నారు. కృష్ణశాస్త్రిగారి కవిత్వం నిం... సున్నానీ అసలు ఆయన కవిత్వానికి అ... ష్టాన దేవత సున్నా అని వీరు సిద్ధాంతం చే... రట. వారిమతం అది. రెండు కలిపి కా... గ్రాంథికం కాస్త గ్రామ్యం కలిపి వేసప్పు... పచ్చడిలాగ భాష తయారైతే వంటికి మం... దేశానికీ మంచిది. పైత్యప్రకోపాలన్నీ పోతయి అని మల్లాది సూర్యనారాయణగా... వాదిస్తారు. ఉచ్చారణను ఆధారణను చే... కాని వ్రాయాలని అతివాదులు, భాషలో శబ్దరూపాన్ని పాడుచేయకుండా ఉండా... మితవాదులు అంటున్నారు. నే నిందులో ... మతాన్ని అవలంబించినా నా వ్యక్తిత్వా... లోపం వస్తుంది. నూతనత్వానికి భంగంకలు... తుంది. అందుచేత నేను గూడ ఒకరు... భాష తయారు చేశాను. నేనంటం ఏమిటం... ఏదో పూర్వంనుంచి వస్తున్న అరసున్నా... బొత్తుగా తీసివేయక, పూర్వంనుంచీ శబ్దా... శాసనాన్ని అనుసరించి అరసున్న వేసేవా...



జో బన రూప సో పూరి రహీలలనే ఏఃహీ ఆపన (ప్రీయరి ఝూవే,
పోల పటాతని సంకహియే రతి ఆతుర అంగసై అంగసుహావే,
తాహీకే సంగకరే రస రంగ సంకేత నికేత నికేతనికో చలి ఆవే,
లాలకహే మాలకోసకీరాగనీ యాహీకో మాలవీనాయక హోవే.



[జయపుర చిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని.]

వేయకపోవటం, వేయనక్కరలేనిచోట వేయటము"

"అయ్యో. అదేమిటోయి,భాషను పాడు చేయటమే"

"పాడుచేయటం యేమిటి. భాషకు క్రొత్త క్రొత్త అలంకారాలిస్తున్నాము. దానికి నూతనత్వం కూరుస్తున్నాము ఏమంటారు"

"ఏమిటనేది, మీ చిత్తం."

"శాస్త్రిగారూ, ఈ విధంగా, పేరు, వస్తు పురసం, భాష మొదలైనవి ఇల్లా ఉండాలని నిర్ణయించి అప్పుడు కథ వ్రాయాలి చూశారా ఎంత కష్టం ఉందో!"

"చాలా కష్టమండీ—నాకు ఇప్పుడిప్పుడు తెలుస్తున్నది మీ నూతనత్వ తత్వము-ఇంతకూ మీకథ ఏమైంది ? సావిత్రి కథ ఎట్లానడిపారు పాత కథ చెప్పారా?"

"శాస్త్రిగారూ నేను మొదటే మనవిచేసుకొన్నా పాత విషయములకే క్రొత్తరంగులు వేస్తున్నానని. కథ మట్టుకు పూర్వపుకథే కాని, ఈ క్రొత్తభాష, ఈక్రొత్తభావాలు, ఈ నూతనత్వం. ఆ కథకు అమర్చేటప్పటికి బహు హృద్యంగా ఉంటుంది కథ చదివి వినిపించనా?"

"ఇప్పటికే చాల కాలహరణము అయిపోయింది వినటానికి ఓపిక లేదు. ఆ కథలో ఉండే నూతన విషయము లేమిటో మాత్రం చెప్పండి."

"అట్టేలేవు మొదటివిషయం సావిత్రి భర్త ఫలాని పేరు గలవాడని కథలో ఎక్కడా చెప్పకపోవటం."

"ఎందుచేతనూ—వాడికి పేరుందిగా"

"వెధవ. వాడికి ప్రాముఖ్యము ఏముంది కథలో. సావిత్రి మొగుడనే వాడికి పేరు. మన వూళ్ళో ఆయనను వెంకమ్మ మొగుడు అని చెప్పుకొంటారే అదేమోస్తరు! వాడు అనామధేయుడు."

"సరే ఇదోగొప్ప విషయమే. ఇంకేమున్నది."

"మిగతావన్నీ సామాన్య విషయములే అదోరంగుతో కనబడుతవి. సావిత్రీ సావిత్రిమొగుడు అడవికి వెడతారు. మొగుడు చస్తాడు. యముడు ప్రాణాలు హరించి మోటారుకారు మీద వెళ్లిపోతాడు. సావిత్రి ఇంకో కారులో వెంటబడుతుంది. యముడు కారు మెల్లగా పోనిస్తాడు. ఆయన దృష్టి సావిత్రిమీద పడుతుంది. కొంచెం సంచలనం కలుగుతుంది. ఇంక కొంచెం సేపు చూసేసరికి మోహములోకి పరిణమిస్తుంది ఆవికారము. సావిత్రి అంత చక్కనిదాన్నిచూస్తే "బ్రహ్మదేవునికైన పుట్టు(?) రిమ్మతెగులు" అని ఉంది. మరి యముడి మాట చెప్పనక్కఱలేదు. వికారపుచూపులు చూస్తాడు మెల్లగా పలుకరించి ఏమి కావాలె అంటాడు. నా విభుని ప్రాణములు ఇయ్యమంటుంది. యముడు సావిత్రియొక్క ఆలింగనం కోరతాడు. సావిత్రి నిర్ఘాంతపోయి ధర్మోపదేశం చేస్తుంది.

అంతటితో నాలుగో ప్రకరణం పూర్తి అవుతుంది.

ఆరో ప్రకరణంలో వైతరణి దాటుతారు. ఏడో ప్రకరణంలో మళ్లీ అడుగుతుంది సావిత్రి తన విభుని ప్రాణాల నియ్యమని. యముడు మళ్లీ అయిదు నిమిషములు సావిత్రియొక్క భౌతిక శరీరం తనవశం చేయమంటాడు.

ఎనిమిదో ప్రకరణంలో భౌతికశరీరానికి ఆత్మకుగల సంబంధం చర్చకొస్తుంది.

సావిత్రికి ఒక్కటే కోరిక. అదేమీ భర్త యొక్క ప్రాణములను తెచ్చుకొనుట.

ఆమెకు భర్తయందు అపారమైన ప్రేమ. ఆమెప్రేమ ఎంత పవిత్రమైనదో ఎంత అగాధమైనదో ఎవ్వరు చెప్పలేరు. మహాపతివ్రత. ఆలోచించి సావిత్రి భర్త ప్రాణములకొఱకు ఆయనమీదఉండే ప్రేమచేత తనభౌతిక శరీరాన్ని యముని కఠిన బాహువులలో పడేసి అయిదునిమిషములు ఆ సుకుమార శరీరాన్ని ఆ సురునివశం చేస్తుంది. యముడు సావిత్రిని సంభోగించి ఆమె పతిభక్తికి మెచ్చి ప్రాణాలు ఇచ్చేస్తాడు.

ఆ మహాపతివ్రత చేసిన పని తప్పులేదని భర్తయందు గల ప్రేమ అద్వితీయమని, భర్త ప్రాణరక్షణార్థమై ఆమె అమానుషమైన మాన త్యాగము నొనరించినదనీ సురాసురలు అను దించారు. నీచ మానవులు ఏమంటే లెక్కేమిటి. దేవదుందుభులు మ్రోగినయి అని వ్రాసి పూర్తిచేశాను"

"అయ్యో అయ్యో. నాచెవులలో సీసం కరిగించి పోసినా నా కింత బాధ పుట్టదోయి. ఇదేమిఅన్యాయమోయి సావిత్రిని దొమ్మరి ముండను చేశావు. అప్రాచ్యుడా."

"శాస్త్రిగారూ. అంటే భయపడపోకండి నూతనంగా ఉందంటారా? లేదంటారా?"

"ఒరి నీ నూతనత్వం తగలెయ్య! నేను పోతా. ఈ మాటలు నా చెవులకు సోక నియ్యకు.'

---

# నిద్ర

డాక్టరు నండూరు శివరావుగారు

సతత శ్రీవిభవాభిరాముఁడగు రాజన్యుండు నిన్ గాంచునే
తతకుంజాంతర డోలికన్ ననలపై దారుణ్యలావణ్య లో
ఝతివల్ పాదము లొత్త తెమ్మెరలు పుష్పాసారసారం బనా
గతముం జల్లగఁ బవ్వళించియును నిద్రా! వేడ్కమై నొక్కెడన్.

తనుసారంబు ద్రవించి వెల్వడల స్వేదస్ఫూర్తి కాటెండలో
దినమెల్లన్ ధర దున్ని కర్కశధరిత్రిన్ జాపపై బండి క
ప్పను గట్టంగనులేని కాపులకు భూపాలుం డపేక్షించు నీ
ఘనబాహాపరిరంభ సౌఖ్యమునఁ జక్కం జేతు నిద్రాసతీ!

పరగ న్నిన్నొకరాత్రి పొందమికి. సత్వంబేగు నార్నెల్లదం
దుర, సత్యంబగునేని గాలి తగులం దూలాడు కందోయి దు
స్తరహానే ముకుళింప యత్నమున, సత్వాధిక్యమే సౌఖ్యహా
ధరనింగూడిన వానిదే సుఖము నిద్రా! కామ్యసౌఖ్యప్రదా!

ధరణిన్ దివ్యసుఖంబులీయఁగల యుద్యత్సంపదల్ గల్గియున్
నరుఁ డత్యంతవ్యథార్తుఁడై పొగులు నిన్ గానంగలేకున్న నీ
కరుణాలోకనజాలమోహనము స్వర్గంబన్న మర్త్యాళికిన్
నరకం బన్నదె వేరు నీయదయకన్నన్ నిద్ర కామ్యప్రదా!

నినుఁ గన్నంతనె యెట్టిదుఃఖచయమేనిన్ బంచబంగాళమా
తనజన్మంబునఁ గాంచలేని సుఖసంధానాతి చిత్రమ్ములం
గనుఁ గామ్యంబు జనించులే తడవుగా క్ష్మాపాలచంద్రుండు చూ
డనిన్ నిర్ధనుఁడైన నిన్ గలసి యుండన్ నిద్ర కామ్యప్రదా!

# పల్లెటూరు స్కూలు తణిఖీ తంతు

భమిడిపాటి కామేశ్వరరావుగారు

వెంకటాయిగారు గడ్డిపాలెంలో ఉదర నిమిత్తం బడిపంతులుగా కుదురుకున్న సాధారణుడు. ఆయన బహు సౌమ్యుడు. ఆయనికి స్థిరాస్తి భార్య, చరాస్తి తనే. అతగానికి నమ్మకంగా వచ్చే సాలాదాయం ఏమీ అంటే ఒక ఆడశిశువు; కొండొకచో కవలలు. పైఖర్చుకి నాలు గురాళ్లుకాక, పంటలరోజుల్లో ఊరివాళ్లు వనూలుచేసి అతడికి ముట్టచెప్పే ఇరవై బస్తాల ధాన్యమూ అతని సంసారానికి కొంతకూడు. పంటలు అటూ ఇటూ అయినప్పుడల్లా ఈధాన్యం గురించి జనం లోపల కొంచెం తిట్టుకున్నా ఇస్తూనే ఉండేవారు. ఇది గాక, ఇతరత్రా ఓ అక్షరాభ్యాసం అనో, ఓ దసరా అనో పేరెట్టి అతడు ప్రజల దగ్గిర్నించి ఓ జామారో గట్రో గుంజుకుంటూండేవాడు. పైగా, ఓ దస్తావేజు గోకిపెట్టో, ఓ సంబంధం ముడెట్టించో, ఓ సాక్ష్యానికి తగులడో, ఓ బ్రాహ్మణార్థానికి ఏడిశో దిష్టి కొట్టకుండా ఇంతో అంతో కతుకుతూండేవాడు. ఇంకా, స్కూలు తణిఖీదార్లలో ఎవడేనా ఒకొక్క తరిపి ఘటం వచ్చినప్పుడు అతగాణ్ణి మనుగుడుపుకి మేపినట్టు మేపి అతని సిఫార్సువల్ల గ్రాంటు కొడుతూండేవాడు. క్రితం ఏడు మాత్రం, పై అధికారి, గ్రాంటు సరిగా పారెయించ లేదుట—ఏదో ఒకానొక సప్లయి తృప్తికరంగా జరక్క! ఇన్నిన్ని వీళ్లూ ఉండడంవల్ల అతనికి మరొహ లోటు ఏమీ రాకుండా నిమ్మకి నీరోసినట్టు జరిగిపోవలిసిందేకాని, ఒక్క అసిఘాత వచ్చిపడింది. ఆ పాలెం మొత్తానికి అతనిదే ధర్మలోగిలి. అందువల్ల ప్రతీ ప్రయాణీకుడూ కూడా వీళ్లింటో ఆగడం సాగించాడు, పొద్దెక్కితే పొద్దెక్కిందనీ, ఎండైతే ఎండనీ, వానైతే వాననీ, మబ్బైతే మబ్బనీ, ఏదైతే అదనీ కారణంగా చెప్పి, తన్ని మెడేసుగుని బలవంతపెట్టగా అవతల తన పన్లన్నీ నిప్పడిపోయినా సరే ఇకబాగుండదని తప్పనిసరివల్ల ఆగిపోతూన్నట్టు నటించి వాళ్లింటో ఆగని బంధువుడూ, తిష్ఠవెయ్యని పరిచయుడూ, జ చెయ్యని బంధుపరిచయుడూ, చెయికడగని పరిచయ బంధువుడూ లేడు. అల్లాంటప్పుడు ఖర్చు ఒకయెత్తు, చాకిరీ దాని పైయెత్తూగా మరీ! పిల్లల చాకరీతో గా ఈపెద్దల చాకరీతో కూడా ఇంటావిడ తంటాలు పడ్డే పోవడం రూఢైతేగాని, రావడానికి మార్గాలు ఏర్పడ్డ వెంకటాయిగారు సంసారవిషయంలో వీళ్లేక చెప్పడం విషయంలో మాత్రం కుమ్మరిపురుగులా ఉటూ ఆర్జనకి ఇంకా అన్యమార్గాలు అన్వేషిస్తూండే వాడు. పక్కఊళ్లో ఎక్కడేనా (అనగా, గడ్డిపాలెం చుట్టూ ఊరగాయి కుండలున్నట్టు అనేక గ్రామాదు లున్నాయి) ఎవరేనా కుండ తడుపుకుంటే సరి, అక్కడల్లా హాజరు—కబురు ఏ కాకి చెప్పేదో కాని! ఏదేనా తూబాకాగాని, రాండోలుగాని వినిపించితే అదే కన్యాప్రదాతగారి సవినయాహ్వానం, వేరే పిలుపెందుకు! అని వెంకటాయిగారి మతం.

ఒకసారి వెంకటాయిగారి పెళ్లాం పురుడోసుకోడానికి పుట్టింటికెళ్లింది—ఏటేటా ఇదో చిక్కుగా! తొల్చూరుకొడుకు ఒక్కడూ మాత్రం తండ్రితో ఉండిపోయాడు (చదువు చెడిపోతుందని). ఆ తరవాతవాళ్లంతా కూడా ఆడపిల్లలే అవడంవల్ల వాళ్లు అయిదారుగురూ తల్లితోనే వెళ్లిపోయారు. దాంతో ఇంట్లో గంజికాచి పోసేవాళ్లు కరువయారు. కాని, జనం రావడం మానలేదు. కొన్నాళ్లు వెంకటాయిగారే పొయ్యి కాల్చుగున్నాడు. అయితే తన పెట్టుతోటి తనూ ష పొడగట్టూకూడా దిగనారుకు రావడంవల్ల తన పెళ్లాన్ని గార్ని పదిరోజులపాటు పంపిపెట్టవలిసిందని ఆవిడ డుక్కి వెంకటాయిగారు రాయగా రామేశ్వరతీర్థం గని కలపడానికి ఆవిడ కాశీ వేంచేసిందని అతడు అప్పట్లో జబాబు రాసి మరి మాసంనాటికి ఆవిణ్ణి పంపించాడు.

ఆవిడ వచ్చింతరువాత కొంపలో హద్దులేని సొద మాత్రం ముదిరింది. వెనకటికి మళ్లే ఎవడేనా వీళ్లింట్లో ఖైటా యిద్దామనుకుని గడపలో పాదం పెట్టేసరికి ఆవిడ వెంకటాయిగారి మీద ఓ టాప్పడవ బూతులు దిమ్మరించేది, లేకపోతే కుర్రాణ్ణి మాటని పిల్చి రంజా వాయించినట్టు వాదేది. ఆపళంగా వచ్చినవాడు తారెత్తి నిష్క్రమిస్తూండేవాడు. కాని, మరో గ్రహచారం! ఎవరు మాట్టాడుతున్నా సరే ఆవిడ వినిపించుకోదు. పైగా, ఆవిడ వచ్చిన రాత్తిరే ఊళ్లో ఒక పెళ్లి ఊరేగింపుకి అవుట్లతో బాణాసంచా కాలుస్తూంటే, "ఇదేమిటి? ఇంత పొగ ఎక్కడిదో!" అని ఆవిడ ముక్కుమీద వేలేసుకోడాన్నిబట్టి, ఆవిడికి ఏమాత్రమో కొన్నివీసాలు చెముడు కుడా ఉన్నట్టు వెంకటాయిగారు గ్రహించాడు. గ్రహించి, ఆవిడ ఎవర్నేనా పట్టుకు దులిపేటప్పుడు తనే నోరు నొక్కుగుని, ఊరుకోమని, ఆవిడికి సంజ్ఞ చేసేవాడు. సంజ్ఞలు చేస్తే చెమిటివాళ్లు కంట్లో పడతారు. అందుకని అల్లాంటప్పుడు ఆవిడ గట్టిగా, "నాకేం? నీ నోరే నొక్కిస్తా! ఎల్లాగైతేం, చేశావు బోడి ఉద్యోగం, మా అమ్మాయికి ఒక్కనగేనా పెట్టలేక పోయావు!" అని అరిచేది. "కొంపలో ఇదో తంపి కుడా వచ్చి పడిందేమిట్రా ప్రభో" అనుకుంటూ వెంకటాయిగారు స్వహస్తపాకం చేసుగునే నాటి కంటే కూడా చిక్కి సహమయాడు.

మరికొద్దిరోజుల్లో పక్కఊరైన నందిపిల్లిలో వివాహం అయింది. కర్మంజాలక వీరికి పిలుపుకూడా వచ్చింది. నడిచే త్రాణలేక వెంకటాయిగారు "పోనిస్తాదాం తగలేసిన భోయినం" అని చాలాభాగం విరక్తి తెచ్చుగుని మానేసెయ్యాలని అనుకున్నాడుగాని ఆవిడ, "వెడితేవెళ్లు, లేకపోతే మాను. వెడితే నాకేమీ పుష్టీ లేదు, లేకపోతే నాకేమీ నష్టీ లేదు. చచ్చినాసరే నేను ఈవాళ బియ్యమూ పొయ్యను పప్పూ వెయ్యను" అని కేకెట్టింది. పాపం, వెంకటాయిగారు ఎనిమిదింటికే స్కూలుకట్టేసి (ఇనసపెక్టరు కొత్తవాడొచ్చాట్ట, వాడెల్లాంటి వాడో గడా అని మనస్సులో కొంత ఫికరగా ఉన్నా) కొడుకుని వెంటేసుగుని నందిపిల్లికి అడ్డం పడ్డాడు.

ఆవేళే రెండుజాములు తిరిగింతరువాత ఇద్దరు మనుష్యులు గడ్డిపాలెంలో ప్రవేశించారు. ఒకడు, కొన్ని కాగితాలూ గొడుగూ చంకని పెట్టుకుని భంట్రోతుకి మళ్లే తొందరగా ముందు నడుస్తూంటే, రెండోవాడు బుట్టకల పాగా చుట్టి, పిల్లినడక అభినయించి, తల టెక్కించి, అంగలు వేస్తూ వెంబడించాడు. ఆయన నడక యొక్క మాంద్యానికి ఒక కారణం దర్జా అయి ఉంటుంది కాని, అంతకంటె బలువయినకారణం బొజ్జ. ఈ చివర లక్షణంతోటి ఆయన సరిగ్గా మూడుమూర్తులా స్కూళ్ల తనిఖీదారులాగ ఊరుకున్నాడు. ఊళ్లో చాలమంది హడిలిపోయి పగటి మతాబాలు కాలుస్తూ వీధులో నిలబడి ఉండగా, వాళ్లని దర్యాప్తుచెయ్యడంలో మేష్టరుగారు గ్రామాంతరం వెళ్లడం గ్రహించి, వాళ్లు తిన్నగా స్కూలు భవనందగ్గిరికి దారెట్టి, దాని సింహద్వారం తలుపు ఉతగయెత్తి పారేసి లోపల ప్రవేశించిన మీదట భంట్రోతు మాత్రం ఇవతలికివచ్చి మేష్టరుగారిఇల్లు అడిగి కనుక్కొని ఆయనా పిల్లాడూ నందిపిల్లి భోజనానికి వెళ్లడపుసంగతి ఆ చెమిటమ్మగారి దగ్గిర్నించి కొన్ని పావుగంటలలో కమ్మెచ్చులాగి పుచ్చుగుని, ఒకకూలివాడిచేత ఆ ఊరు కబురు పంపించి, తను మళ్లీ స్కూలుభవనంలోకి వెళ్లిపోయాడు. ఊళ్లో పెద్దలుకొందరు చొరవచేసి లోపలికెళ్లి ఆ అధికారితో అనవసరపు సంభావణచేస్తూ కూచున్నారు.

మనిషివాడు చావంతపని జరిగి నందిపిల్లిలోపడి పందిరివేసి ఉన్న ఒక ఇంటిదగ్గిర ఆగేసరికి అప్పుడప్పుడే బ్రాహ్మలు ఇవతలికివచ్చి త్రేణుస్తూ చేతులు కడుక్కోడంలో మేష్టరుగారు కూడా తనచేతికి ఏమాత్రమో జిడ్డుపట్టుకోగా తన బిరుసుగడ్డం వరహాకట్టెలా ఉండడంవల్ల వేళ్లు గడ్డాన్నెట్టి పాముతూ పక్కాయనతో, "పరాయి ఇంట్లో విస్తరివేసేటప్పటికి ఎంతమొర్రో అంటూన్నా నెయ్యి కాస్త ఎక్కువగా పడితీరుతుంది స్మండి. జిడ్డు వదలటం లేదు!" అంటూ ప్రసంగంలో ఉండగా

మనిషివాడు ఆయన్ని సమీపించి, "వదల్తుందండి. ఇన పమేష్టారు వచ్చారండి. తమర్ని యెంటనే దయ్ సెయ్య మన్నారు" అన్నాడు. "ఓరి నీ యినుం కాల్చా! వచ్చింది మాసిగంగారా, కాళ్లుకడగడం గారా? ఈ మధ్య మాసిగం గారు మారి కొత్తవాడు కూడా వచ్చాడన్నారు! అతనొక్కడేనావచ్చింది? పెళ్లాంపిల్లలూకూడా రా లేదుకద, నాలుగెడ్లబండీ చేసుగుని? అతడేమీ ఖాళీబస్తాలూ, ఖాళీడబ్బాలూ వేసుగురాలేదు కద?" అని మేష్టరు కసుక్కున్నాడు. వాడు సమాధానం చెప్పకుండానే ఇంటా కటి పక్కాయన, "అయ్యా, మాసిగం, కాళ్లుకడగడం అంటున్నారేమిటి? తెగతిని పెళ్లిపందిట్లో ఇవేం కూతలు మీ శ్రాద్ధపుకూతలు?" అని కొద్దిగా కూకలేస్తూ హెచ్చరించాడు. తను మేష్టరుగనుక అవన్నీ పడితీరాలి అనుకొని గావును వెంకటాయిగారు అవన్నీపడి, "అయ్యా! నూక్కాళ్ల పెద్దతణిఖీదార్ని మేం తద్దినం అనీ, తరవాత ఆయన్ని మాసిగం అనీ, మరీ మైనరుతణిఖీదార్ని కాళ్లుకడగడం అనీ సంభావణలో చెప్పుగుంటుంటాం. తద్దినపుబాధ అస్మదాదులైన అల్పులకి లేకపోబట్టి నేను వైరీతిగా ప్రశ్నించాను. వారు మాకు పిత, పితామహ, ప్రపితామహ లాంటివారు. ఇదీ సంగతి!" అనిచెప్పి, "కుర్రాడా, పదరోయ్?" అని కేకేసి పైమీది కొల్లాయి నడుంకి పట్కాలాగ బిగించి, అమాంతంగా ఎగడి, "ముందు సూచించకుండా వచ్చాడు, ఈకొత్తవాడికి ఇదోరోగం గావును" అని అనుకుంటూ ఉడాములమీద స్వగ్రామం జేరుకుని, పరిగెత్తే అవస్తలోనే బొట్టు గిల్లేసుకుని, జుట్టు రక్కేసుకొని, తమ యింట్లోకి అడుగెట్టి "గార్లొండి వంటకానీవమ్మోయ్!" అని పిన్నత్తగారి చెవులో ఉరిమి, బయటికి ఉరికి, తెంపుగుని పడ్డట్టు నూక్కాల్లోకి దూకి, ఆ బొజ్జాయనే అధికారి అయి ఉంటాడుగదా అనుకుని, ఆయన పాద పద్మసన్నిధిని గాలుపుకొట్టి గుడ్లు తేలేసి నోరువెళ్లబెట్టి కర్రలా బిగుసుకుపోయినట్టు పడిపోయాడు. ఈ అల్లరంతా నిజమే అనుకుని నలుగురూ పోగై, "క్షణంలో వచ్చేది తెలియదుగదా!" అంటూ జాలిపడి ఓ పెద్దచెంబుడు చన్నీళ్లు వెంకటాయిగారి మొహంమీద చరిచి, ఓత్రవ్వాగిన్నెడు వేడిగంజి లోపలికి ఎక్కించగా, అప్పటికి ఆయన కాస్త కళ్లువిడడి, పెదవికదిపి, అధికారికేసి తిరిగి, "అయ్యా—తమరు—నందిపిల్లి—దార్ని—వస్తున్నారని—తెలిసి—అల్లా—వెళ్లి—" అని చెయ్యి కదుపుతూ, "ఏమైతేం? క్షమించాలి!" అని గొణగగా, అధికారి నిజంగా అతడు గాలుపుదెబ్బ తిన్నాడనుకొని, "ఓ యెస్, క్షమించాను లెండి. ఎండగదా ఎందుకొచ్చిన శ్రమ మీకిది? మేం రామూ? బండీ పంపలేదని కోప్పగించే బాపతు కాదు మాది! ఫర్వాలేదు లేవండి!" అని అభయం ఇచ్చిన మీదట వెంకటాయిగారు లేచి, "భోజనం వేళదాటింది. దొరువుదగ్గిర ఒళ్లుతడుపుగుని మడిగట్టుకోండి" అని ప్రార్థించగా, ఆయన "అట్లానే, కాలకృత్యాలు అయినాయి. ఇక లేవడమే. మా ఆలస్యం లేదు కాని, నా కోసం తెగశ్రమపడి ఎక్కడలేనివీ పుట్టించుకొచ్చి విశేషయత్నంచేసేరు గనక! ఒక్కటే ఈ పక్కఊళ్లో — ఏవదీ? (అని కళ్లుమూసుగుని) దేవుడు చాలామేలుచేస్తే, గోకారం! (కళ్లు తెరిచి) గోకారంలో నాకు పెట్టిని భోయినం ఏంభోయినమండీ! నాలుగు కూర్లు, నాలుగుపచ్చళ్లు, క్షీరాన్నం, మామచక్రాలు అబ్బ, అబ్బ! యధావిధి, యధావిధి! అయితేం, ఆ దినించీ ఇంత జఠరాగ్నీ జీర్ణపుష్టీ ఉన్నఘటాన్ని ఆకట్టే చిక్కులేక పోయింది. మరో నాదారిస్వరూపం అయితే ఈపాటి టిక్కట్టు పుచ్చుకోవలిసిందే, త్వరగాకానీండి. నేను ఉండలేను" అనగా, "చిత్తం, పచ్చడీ మెతుకులూనండీ, నాకేముందీ, కుటుంబీకుణ్ణి రండి" అంటూ వెంకటాయిగారు అధికార్ని తిన్నగా తనఇంటికి తీసిగెళ్లి, ఆయనమొఖం ఇంకా ఏదో ఆలోచనలో ఉన్నట్టు కనిపెట్టి, "వస్తా" అని ఆయన దగ్గర ఒక్కమాటు సెలవుపుచ్చుగుని, "అబ్బాయి, పంతులు గారికి తుంగచాప వెయ్యి, చూస్తావేం?" అని కుర్రాణ్ణి కసురుగుని, లోపలికివెళ్లి, ఒకపావుగంట తరవాత ఓ గిన్నెపట్టుగుని పైకివచ్చి, "వంటాలస్యం ఉంవండి ఒక్క క్షణం. ఈలోపులో తమరిది స్వీకరించాలి!" అని అక్కడపెట్టగా, అధికారి "మీకేమన్నా మతి పోయిందా ఏం?" అని గట్టిగా కోపపడి, వెంటనే

తెచ్చారేమిటి?" అని నిమ్మళంగా కనుక్కున్నాడు. "అబ్బే, ఒక సేరుపాలు—మజ్జిగోడలంటివి—మరగ కాచి, ఇంత మిరియప్పొడీ పటికె పంచదార చూర్ణమూ రంగరించానండి. మంచిపని చేస్తుంది. ఇదివరకాయన ఇదంటే చెవికోసుగునే వారు. మరోమాట చెప్పకండి, పుచ్చుగోండి" అని మేష్టరు పట్టుపట్టగా, అధికారి అతి సిగ్గుతో అయిష్టంగా (విషంపుచ్చుగుంటూన్నట్టు అభినయిస్తూ) నిమిషంలో గిన్నెలో తడేనా లేకుండా ఊడ్చేసి, పిదప నాలుగైదు నిమిషాలు కళ్లుమూసుగుని ఆయాసంనటించి, కళ్లు తెరిచి, "అబ్బ!" అని,

అ—అయితే పంతులుగారూ!

వెం—చిత్తం!

అ—వంటాలస్యం ఉండనే ఉంది గనుక, ఈ లోపున పోనీ నేను తలంటు అభ్యంతరం తీర్చుకుంటేం?

వెం—(మనస్సులో, "నాదుంప తెంపు, నీ మొహం తగ......" అనుకుంటూ.) ఓ, మరీ మంచిదీ! తమ ఓపిక! మంగల్ని పిలిపిస్తాను! అబ్బాయి, ఇల్లారా! (కుఱ్ఱాడు వస్తాడు)

అ—మంగలి ఏం లాభం! అంటుకునే వస్తువు లభ్యంకానప్పుడు?

వెం— ఏవస్తువు?

అ—ఆవునెయ్యి! నేను గోఘృతంతోగాని అభ్యంగనం చెయ్యను. అల్పులు వాడుకునే తైలాలకి మెదడు మెతగవాసన! నా మెదడు కొనుక్కోవాలని పెద్ద పెద్ద కంపెనీలవాళ్లు, తన్నుకుంటున్నారు!

వెం—ఎవరుతన్నుకున్నా, సాయంత్రం ఊళ్లో కనుక్కొని కాస్తకాస్తే పోగుచెయ్యాలండి.

కుఱ్ఱాడు—అమ్మకి పురుడొచ్చిన తరవాత తాతయ్యగారిఊరు పంపడానికి ఓ శేరు ఆవునెయ్యి కొన్నావుగా నాన్నా! ఇంట్లో ఉంటేనే లేదంటావేం?

వెం—(కుఱ్ఱాణ్ణి చేగోడీ నమిలినట్టు నములుదాం అని మనస్సులో అనిపించినా పైకి నవ్వుతూ) మరేరోవ్! ఇట్టే మరిచిపోయాను! (అని అధికారికేసి తిరిగి) మావాడికి, పోతాలుతప్ప కడంవి అన్నీ హృత్కవిలిగా జ్ఞాపకం ఉంటాయండి, మీ ధర్మమా అని.

అని ఇంట్లోకివెళ్లి, నెయ్యితెచ్చి, మంగల్ని పిలిపించి, అధికార్ని తలంటుకి కూచోపెట్టి, దొరువునీళ్లు తెచ్చి, నీళ్లకింద మంటచేసి, నీళ్లు ఆయన కోరినన్నీ బాలింతరాలికి పోసినట్టుపోసి, ఆయన శేత మొత్తానికి మడి కట్టించాడు.

ఈలోగా, అడక్కుండానే కుఱ్ఱాడు చెప్పిన మాటలవల్ల వంటచేసే ఆవిడ పేచీమనిషి అనిన్నీ, తన ఘ్రాణేంద్రియ సాహాయ్యంవల్ల తయారవుతూన్న పిండివంటల స్వభావమున్నూ అధికారి పసి పట్టి, పొట్టనాసుగుపోకుండా బట్ట కొంచెం వొదులుచేస్కుగుని వీధి అరుగుమీద పచారు చేస్తున్నాడు. వెంకటాయిగారు వచ్చి, "పీటా అదీ వేశారు, రండి" అని అధికార్ని పిలిచాడు "పనికి, అల్లాంటివి లేవు వడ్డించెయ్య మనండి" అని అధికారి వడ్డనకి హుకుం ఇచ్చాడు. మేష్టరు మళ్లీ లోపలికెళ్లి ఒక్కక్షణంలో పైకొచ్చి, "వడ్డనఅయింది, రండి" అని అధికార్ని లోపలికి తీసుగువెళ్లేసరికి, అధికారి నిర్జీవుడైపోయినాడు. అనగా, మరేంలేదు, విస్తరికేసి చూసేసరికి గుండె ఝల్లుమని పోయింది. దాల్లో, బకాసురుడికి తోడినట్టు కుంభంమట్టుకు తోడి ఉంది. దాని అగ్రమందు — సార్వా గడ్డికొంపమీద కొండముచ్చు మొహంలాగ—వెక్కిరిస్తూ ఉస్తికాయంత ఉసిరీ పచ్చడి ఉంది. అధికారి, అంతమనిషీకూడా, పట్టి పాకం చలిమిడి అయిపోయి ఆపీటమీద కూలబడి, మరోటేమీ అనలేక "మీరో మరీ!" అన్నాడు. వెంకటాయిగారు, "నేను తరువాత కానిస్తానులెండి, ముందు తమరుపుచ్చుగోండి ప్రొద్దుపోయింది. ఏమీ ఆట్టేచెయ్యలేకపోయాం. నిమ్మళంగా కూచోవాలి. కావలిసినవి నాతో చెప్పి వడ్డించుకోండి, ఆవిడికి చెముడు" అని మనవి చేసుగున్నాడు. అధికారి కళ్లనీళ్లతో పరిషించి, విస్తరి చూపిస్తూ, "ఎల్లా నేనిది ఏడవడం?" అన్నాడు. తత్క్షణమే, వెంకటాయిగారు, నిరుడు తనకి తక్కువగ్రాంటు మాత్రమే రాగలదని పైనించివచ్చిన ఆర్డరుకాగితం తెచ్చి అధికారి మొహంమీదపెట్టి, "నేనెల్లా ఏడవడం ఇదీ!"

అని ఒకొక్క అక్షరమే ఉచ్చరించాడు. అధికారి ముక్కుమీద (ఎడంచేత్తో) వేలు పెట్టుకొని, "ఇదివరకు వాడికి ఏకదాహంట, నేనూవిన్నా. అది తీరక చాలా చోట్ల ఇల్లానే చేశాట్ట. నేను గ్రాంటు కురిపిస్తాను చూడండి, అన్నం పట్టుకు చెబుతున్నాను!" అని వెంకటాయిగారిని సముదాయించాడు. "అల్లాయితే రానీ వమ్మా రానీ! ఆపెద్ద విస్తరి ఇల్లా పెట్టు!" అంటూ వెంకటాయిగారు ముసలమ్మకి సంజ్ఞలు చెయ్యగా, ఆవిడ వేసివున్న విస్తరి పట్టుకుపోయి, తాజావిస్తరి తెచ్చి పెట్టింది. అధికారి ముఖవికాసంతో దంత పరిశ్రమ చేస్తూ రంగంలో ప్రవేసించాడు. నేతిగిన్నె పక్కనే ఉండడం ఇంటిదగ్గర అలవాటని ఆయన చెప్పడంవల్ల, వెంకటాయిగారు ఆవిడచేత అల్లా చెయించడమేకాక, దొన్నెకుట్టివేసి, అందులోకూడా ఆద్యం ఉంపించాడు. చిటికెలో అధికారి, గారెల పర్వంలోకి వచ్చాడు. మొదట్లో, ఆవిడ రెండు పుంజీలుమాత్రమే వడ్డించింది. అవి జమిలిగాతింటూ, అధికారి,బొజ్జ ఎడంచేత్తో నిమురుకుంటూ,

అ—అబ్బ! ఏమటో అనుకుంటాంగాని, భోజనం చెయ్యడంకూడా కష్టమేనమ్మండి.

వెం—అడ్డమా! నా ఉద్దేశంకూడా అంతేనండి. నింపాదిగా కూర్చోండి. తమకు తెలియని దేముంది! కోటి విద్యలూ కూటికొరకే!

పదపడి, ముసిలావిడ పళ్లెంతో గార్లు మారు తెచ్చింది. వేగినవి వడ్డించమని ఆవిడతో చెప్పమని అధికారి (అంగాస్త్రంపెట్టి ఎడంచేత్తో ముక్కుతుడుచుకుంటూ) కోరగా, వెంకటాయిగారు తనవేలితో పళ్లెంలో వేగిన గారెలున్న భాగంచూపించి, ఆ ప్రాంతానివి వడ్డించమని ముసలమ్మకి సంజ్ఞచేశాడు. వేగినవి ఆపళ్లెంలో మరోప్రాంతాన్ని ఉన్నాయని తన తాత్పర్యం అయినట్టుగా, ముఖంచిట్లిస్తూ అధికారి ఆ భాగం చూపించాడు. వెంకటాయిగారు తనమాటే నెగ్గాలని తను మొదట చూపెట్టిన చోటే మళ్లీచూపించాడు. ముసలమ్మకి ఈయొక్క వయినం బోధపడక, ఇవీ, అవీ, మరి మిగిలినవీ కూడా అధికారి విస్తట్లో బోర్లించి, పళ్లెం వెంకటాయి నెత్తి నెట్టికొట్టి "సత్రంబొక్కు జంతువుల్ని తీసుకురావద్దని ఎన్నిమాట్లుచెప్పినా సిగ్గులేదు. మర్యాదట! తెచ్చి తెచ్చి ఎవణ్ణో సర్వభక్షకుణ్ణి తెచ్చావు! కుర్రాడికి ఒక్కటైనా లేదు. వాడికోసం మళ్లీవండి తగులడాలి!" అని పాడిస్తూ వంటింట్లోకి తుర్రుమంది. అధికారి, "ఈమెకి ఇంత కోపం ఏమిటండీ! నేనుగనుక సరిపోయింది. మరోళ్లయితే తక్షణం లేచిపోదు రీపాటి! బాగానే ఉంది. మీకు కూడా తగ్గలేదుకద!" అని వెంకటాయిని ఓదార్చి,నిశ్శేమంగా గార్లుపుచ్చుగుని, "మజ్జిగ అక్కర్లేదండి" అన్నాడు. వెంకటాయిగారు చాలా నొచ్చుగుని "అయ్యొ కర్మమా! కోపంవచ్చినట్టుంది. మీ రేమీ అనుకోకండి. ఆమె స్వభావమే అంత!" అన్నాడు. అధికారి "అందుకోసం కాదండి. గార్ల తరవాత పెరుగైనా సరే చేదే." అని లేచి చెయ్యికడుక్కుంటూనే డ్రెస్సు వేసుకోబోతూ "ఇక మనం బళ్లోకివెడదాం. పిల్లల్ని పిలుచుకురండి. మీ కుర్రాణ్ణి ఇంతలో భంట్రోతుకి అన్నంపెట్టమనండి" అన్నాడు. వెంకటాయిగారు "చిత్తం" అని లేచి కోటు తొడుక్కొని పిల్లలకోసంవెళ్లాడు. కుర్రాడు భంట్రోతుకి పీటవేసి వడ్డన ప్రారంభించాడు. అధికారి కోటులో కుక్కని, గుండీలు పెట్టుగుని, తలపాగా పెట్టు "బాబోయ్!" అని కెవ్వునికేకెట్టాడు. "ఏమిటి! ఏమిటి" అని భంట్రోతు అడిగాడు. "తేలు తేలు! తలంతా పాడిచింది. పాగాలో ఉంది గావున బాగా నొప్పి తోంది." అని కళ్లు బిగించి మూలుగుతూ ఉరుకున్నాడు. తరువాత భంట్రోతు చెప్పిన మీదట ఆయన పాగా తీసి దులపగా కప్పంత తేలు రాలింది. చెప్పుచ్చుక కుర్రాడు చంపాడు. చంపి,"మా నాన్నదగ్గిర ఉల్లిపాయతో చేసిన తేలుమందు ఉందండి" అని ధైర్యం చెప్పాడు. "అది ఒకవేళ వెల్లుల్లిపాయేమో నాకు సయించదు. కనుక్కోసు కుర్రాడా!" అని అధికారి డొక్కోడం ప్రారంభించాడు. భంట్రోతు కరువో కాలమో అన్నట్టు అన్నం అంతా రెండు ముద్దల్లోలాగుతూ, అధికారితో, "భయంలేదండి, అయ్యగారు! తలమీద కట్టు వల్లమరిపైకి ఎక్కడాన్కి వీల్లేదు. తమరు వేసు

# ౪౩-వ అఖిల భారత జాతీయ మహాసభ-కలకత్తా

## ఇతరమహాసభలు



౨. శ్రీ పండిత
జవాహర్‌లాల్ నెహ్రూగారు
అధ్యక్షుడు, భారత సోషలిస్టు యువజన
మహాసభ-కలకత్తా



౧. శ్రీ సర్ హుకుమ్‌చంద్ [illegible] గారు
అధ్యక్షుడు, భారత మార్వాడీమహాసభ-కలకత్తా



౩. శ్రీ కే. నటరాజన్ గారు
అధ్యక్షుడు, భారత సంఘసంస్కరణసభ, కలకత్తా

గారెలాంటి వస్తువులు వాడతారు గనుక ఆ చేదుకి తేలు కాటు లోపలికి అసలు ఎక్కదు. మందు అనవసరమండి" అన్నాడు. వాడి తిండి అవుతూనే ఇద్దరూ స్కూలుకి పరిగెత్తారు. మేస్టారబ్బాయికూడా వెనకాలే వెళ్లాడు. మరి కాస్సేపటికి కొంతమంది కుర్రాళ్లని వెంటబెట్టుగుని మేస్టారు స్కూలు జేరుకున్నాడు. అధికారి పొట్ట వొదిలి తలపట్టుగుని ఆపసోపాలు పడుతున్నాడు.

మే—అదేమిటండి?

అ—తేలండీ!

మే—ఎక్కడా?

అ—తలమీద.

మే—మందు తెస్తునా?

అ—వద్దండీ. ఇప్పుడు టైములేదు. అసలుపని పాడవుతుంది మందేస్తూ కూర్చుంటే!

అని మూలుగుతూనే "చూడండీ! మేస్టారు!"

మే—చిత్తం!

అ—ఈవేళ శుక్రవారం. నేను రాత్రి అన్నం తినను.

మే—దయచేసి చెప్పండి, ఏం తింటారో!

అ—ఇందాకటివే ఆయిదారు పెరుగులో పారె యించమని ముసలమ్మకి కబురు పంపండి.

మే—(తేలయేది జెట్టియేది ఆ మినప దినుసు మీద వీడి ఏవ అల్లానే ఉంది అని మనస్సులో అనుకని) అవశ్యం!

అని తిట్టుగుంటూ కుర్రాణ్ణిపంపించాడు. వాడు ఇట్టేవెళ్లి దక్కావచ్చాడు.

అ—మేస్టారూ! నాకు బాధగా ఉంది! సంగతి త్వరగా తెమల్చండి!

మే—తమ చిత్తం! నాలో ఏముందీ!

అ—సరే! స్కూలంతా సరిగ్గా ఉన్నట్టేనా!

మే—చిత్తం.

అ—హాజరు పట్టీ, వగైరా, అన్నీ! (అని మూలు గుతాడు).

మే—చిత్తం.

అ—అయితే, తమరు కాస్త తలపాగాయేనా కుడా లేకుండానే వచ్చారేం?

మే—మీకు చాదస్తంగాని, మాపరమటింట్లో చిలక్కొయ్యమీ సిరండి వెళ్లి! దాన్ని గుమ్మడిపండు లాటి ఇస్త్రీమడత తలపాగా నాది ఉందో లేదో తమకు బోధ పడుతుంది! లేదనే మీ ఊహ?

అ—హాజరు పట్టీలో ఉన్న పేర్లేనా ఇప్పు డొచ్చిన వాళ్లవి?

మే—మీకు వెర్రిగాని, కానివాళ్లుంటే నేను వీధులోనే పంపించెయ్యనూ!

అ—సరే, వీళ్లు ఏయే క్లాసులు?

మే—అందరికీగూడా ఏకమొత్తాన్ని గట్టిగా చెప్పడమేగాని, క్లాసులంట్లో భేదం నే ఎరగను. అక్కడికీ, అదుగో ఆ మధ్యరూ పైక్లాసు. ఈకడం వాళ్లంతా కిందిక్లాసు!

అ—పైక్లాసు వాళ్లకి కూడా పుస్తకాలు లేన ట్టున్నాయేం?

మే— ఈ మధ్య పెళ్లి ఊరేగింపుకి పాలెం అంటుగుందండి. అప్పుడవి కాలిపోయి ఉంటాయి.

అ—సరే. అల్లాయితే నేను కాస్త లోకజ్ఞానం పరీక్ష చేస్తాను. మీరు తప్పుగోండి. (అని కొంత మూ లుగుతాడు. పిల్లలు కొంచెం నవ్వుతారు.)

మే—చిత్తం.

అ—ఏయ్! విభూతి కుర్రాడు! మీ ఇంటి పేరు?

వి—గడ్డిల్లు.

అ—నీ కన్నేళ్లుంటాయి ?

వి—పెద్దవాళ్లనికనుక్కోవాలి.

అ—నేను పెద్దవాణ్ణేనా ?

వి—అవునండి.

అ—ఎంచేత?

వి—మీకు బొజ్జ ఉందిగా!

అ—("విషయం మార్చి ప్రశ్నలు వేస్తే అసలు మాట్లాడరేమో వీళ్లు" అని మనస్సులో అనుకుని) తర వాతవాడు! బొజ్జ ఎల్లా వస్తుంది?

త—గార్లు తింటేనండి.

అ—(మేస్టరు కేసి చూసి)మీస్కూల్లో అఖంకు లున్నారే!

మే—చిత్తం తమ దయ!

అ— మూడో వాడు! బూర్లు తింటే మాత్రం రామా?

మేస్టారి అబ్బాయి— (అడక్కుండానే) ఆవడ లు తిన్నా వస్తుందండి.

అ—(కోపంతో) ఎవరండీ, ఈ పిల్లవాడు! మా చెడ్డవాడూ!

మే—చిత్తం. క్షమించాలి. మా వాడేనండి.

అ—ఓహో! అవునండోయి. అయినా సరే అడక్కుండా సమాధానం చెప్పకూడదు. నేను కనక సరి పోయింది, క్షమించాను. (అని మూలిగి) నాలుగోవాడు! బొజ్జ యెందుకు?

నా—బండి యెక్కడానికండి!

అ—ఛీ! అయిదోవాడు!

అయిదో—పెద్దపెద్ద కోట్లు పట్టించుకోడాని కండి!

అ—ఛిఛీ! ఆరోవాడు?

ఆ—ఆయాసంగా ఉంటూంటే చేతులు జేర వేసుగోడానికండి!

అ—టట్! అవేవీకావు. అంపర్నీ కడుపులో పెట్టుగోడానికి. చాలు కాని, ఈ పుస్తకం తీసుకో! పైక్లాసులో మొదటివాడు! ఎక్కడేనా తీసి వాచకం కానీ!

మొ—(ఏదో తీసి) "ఆ ముని అంతట..."

అ—"ముని" అంటే ఏమిటి, రెండోవాడు!

రెం—మనిషండి.

అ—మరి నేను మునినేనా?

రెం—కాదండి.

అ—ఏం చేత?

రెం—"ముని" అంటే మంచి మనిషండి.

అ—అక్కడితో ఆగు! మూడోవాడు! మన్యే ఉత్తరం చూపెట్టు!

మూ—ఇంటిదగ్గర ఉందండి.

అ—ఉత్తరపు దిక్కేకపోవడమేమి టిక్కడా. (అని పళ్లుబిగిస్తాడు).

మూ—అదాండీ! (అని ఇంటికప్పు చూపిస్తాడు)

అ—ఎవడాచెప్పేండి?

మూ—మా అన్నయ్యండి, మొన్న సెలవులకి వచ్చి మ్యాపులో చూపించాడు.

అ—విన్నాంగాని, మేస్టారూ, తమరు కొంచెం గజ్జికట్టండి, వింటాం.

మే—చిత్తం! తమకు బాధ తగ్గిందాండి!

అ—చిత్తం! నాగోడవెందుకు, తమరు ఉపక్ర మించండి!

మే—ఎంతమాటన్నారు! అల్లానే. బాలులారా! (అని గొంతుకసర్దుకుని) సూర్యుడు భూమిచుట్టూ గిరగిర గిరిగిరా తిరుగుచున్నాడు.

అ—అదేమిటయ్యా, అబద్ధాలూ!

మే—ఆ మాటకొస్తే మీరు చెప్పండిచూస్తాను! ఏం ఎక్కువచెబుతారో మహా! ఇందాకణ్ణించి విన్నాగా నేనూను!

అ—స్వతిమీరి మాట్లాడకండి!

మే—అయ్యా, పిల్లలుగలవాణ్ణి! పెద్దలనాటి నించీ ఇంతే! పైగా నాకు సర్వీసు అయిపోతోంది. ఇహ తిప్పగోమని ఊళ్లోవాళ్లూ అంటున్నారు. (కోపంగా) పైన మీచిత్తం!

అ—పిల్లలుగలవాడవైతే మాత్రం, తల్లకిందులు చదువా చెప్పేది?

మే—మనవిచేశాగా! అల్లాయితే బాలులారా భూమేట సూర్యుడిచుట్టూ తిరుగుతూంట! విన్నారా? గిరగిరా!

అ—ఇదేమిటి! నమ్మకం ఇంతట్లో ఎల్లా మార్చు గున్నావు? మళ్లీ అప్పుడే భూమి గిరగిరా?

మే—అయ్యా! నా జీతం రాళ్లు నాలుగూ గిర గిరా తిరిగి వస్తూంటే నాకు చాలు.

అ—నాకూ అంతే.

మే—బాగా అన్నారు! మీ కడుపు చల్లగా! అల్లాంటప్పుడు దేంచుట్టూ ఎవరు తిరిగితే, ఎవడికొంప ఏం మునిగిపోయింది చెప్పండి. పైగా ఎవరిచుట్టూ ఎవరు తిరిగినా, లెక్కల్లో తేడాలుండవని మా పంచాంగం శాస్త్రుల్లుగారన్నాడు. మీతో నేను ఏకీభవిస్తూనే ఉన్నాను. గాని స్వల్పాల్లో నాతో పట్టింపులుపోకండి, ఊరిఖేను.

అ—సరే లెండి.

అని అధికారి వ్రాయడం అభినయించి, తానిది వరకే రాసి గోప్యంగా తెచ్చిన కాగితపుముక్క ఒకటి పైకితీసి, అసలు రిపోర్టు తరవాత పంపుతాననిన్నీ అది ఎట్లా ఉండవచ్చునో మచ్చు చూపించుతున్నాననిన్నీ చెప్పి, తను ఈ సంగతులు మహా, అప్పుడేరాసినట్టు చదివాడు.

"మనోగణితము మోతాదు. లెక్కలు సుమారు. తెలుగు జబ్బు. నల్ల బల్ల నల్లగానూలేదు, బల్లపరుపు గానూలేదు. అది ఘోరమరమ్మత్తు కోరెడిని. స్కూలులో స్వేచ్ఛదేశీయకసరత్తు సున్న. బోధనా పరికరములు శూన్యము. ఉక్తలేఖనము తప్పులకుప్ప. చూచివ్రాతలో శ్రద్ధ మిళితమైలేదు. చూచివ్రాతలో చూచుటయు,వ్రాయించుటయు, దిద్దుటయు ముఖ్యములు. చిత్రలేఖనము ఎంతైన వృద్ధికి జాగా ఒసంగుచున్నది. నేను, అందరికీ తెలిసిన విషయముగురించి, రమారమి, ఒక మాదిరి పాఠమిస్తిని. పిల్లలు పద్యములను అర్థమగునట్లు చదవకూడను. గొంతెత్తి పాడవలెను. ఉపాధ్యాయుడు పిల్లలను పోగు చేసికొని వచ్చినట్లు కన్పింపదు."

మే—తమరు చదివిన వాటిల్లో చాలా ఇప్పుడు జరగనేలేదే?

అ—ఆమాత్రం నాకు తెలియకపోలేదు. నా ఉద్దేశం ఏమిటంటే,

ఒకవేళ అనికూడా జరిగి ఉంటే వాటి విమర్శ ఇల్లా ఇల్లా ఉంటుంది సుమా, కబడ్దార్, అని.

సరే పిల్లలకి రేపు సెలవనిచెప్పి పంపించెయ్యండి.

మే—చిత్తం. కొంచెం వీళ్లని ప్యాసుచేసి మరీ వెళ్లరూ?

అ—ఓ యెస్. సరే. పెద్దక్లాసు ఎందరూ?

మే—ముగ్గురు.

అ—సరే. ముగ్గురే గనుక అంతా ప్యాస్. చిన్న క్లాసు చాలా ఉన్నారా?

మే—మరేనండీ! చిక్కొచ్చిందీ!

అ—ఏకాలు వీళ్లల్లో ఎవరికి లేవో, చెప్పండి!

మే—ఆ వీభూతి కుర్రాడికి లేవండి.

అ—ఇహ నేమ్మరీ! వాడు తప్ప చిన్న క్లాసంతా కూడా ప్యాస్!

పిల్లల్ని పంపించేసి, స్కూలు కట్టేసి, అంతా మేష్టరుగారి ఇల్లు జేరుకున్నారు. క్రమేణా చీకటి పడింది. అధికారి అవడల్ని పరామర్శచేశాడు. చేస్తూ, మేష్టర్ని పిల్చి, "నైట్‌స్కూలు గ్రాంటుకూడా మీరు లాగుతూ న్నట్టున్నారు. నైట్ స్కూలికి పదండి చూద్దాం" అన్నాడు. అందుకు, మేస్టరు, "చిత్తం. నైట్‌స్కూలు ఏదీ అని అడిగితే ఓటి చెప్తాను వినండి. నైట్‌స్కూలనే పదార్థం తమ కటాక్షవీక్షణంతో కూడుకుని ఉండేదే గాని వేరే ఉంటుందని చూస్తున్నారా యేమిటి? ఇప్పుడు తమరు దయచెయ్యగా ఈ పగటిస్కూలు నివేదించుగున్నాడా, ఈ విధేయుడు! ఈ మాటు తమరు వేంచేసినప్పుడు అక్కడికి ఆ కాస్తమాటా దక్కించుకుని ఆ నైట్‌స్కూలుని కూడా తమ ఎదట దాఖలుచేసుగుంటాడు!" అంటూ విధేయతతో దాటుకున్నాడు. అధికారి బేవ్ మని త్రేణ్చి చిరునవ్వునవ్వి, "ఈ మాట తప్పకండి"

అని హెచ్చరించాడు. మేష్టరు నాలిక కరుచుకుని "అంతే! సెబాసు" అన్నాడు.

మరికాస్సేపటికి మేష్టరు అధికారి దగ్గిరికి వెళ్లి "ఇక నేను పడక 'అరణ్యామెంటు' చేస్తాను" అన్నాడు. తక్షణం భంట్రోతు వెంకటాయిని వీధులోకి పిల్చుకుపోయి కొంతసేపు చెవిలో ఏదో ఉపదేశించాడు. వెంకటాయిగారు, "తప్పుతుంది బాబూ; అల్లానే!" అన్నాడు. భంట్రోతు "తొమ్మిది దాటకూడదు. దాటితే మళ్లీ పంతులుగారికి భయం. భయం అంటే మనుష్యుల్ని గురించి కాదు. పురుగూ బుట్రా ఉంటుం దని!" అన్నాడు. వెంకటాయిగారు, "అల్లాగే వెళ్లివస్తా!" అని కండువా వేసుగుని ఎక్కడికో వెళ్లాడు.

ఆయన వచ్చేసరికి వీళ్లు లేరు. నిద్రపోతున్న కొ డుకుని లేపి వెంకటాయిగారు అడగగా వాడు ఏమీ ఎరగనన్నాడు. ముసలమ్మ సమాధానం గ్రహించే సరికి తెల్లారుతుం దేమో అని భయమేసి వెంకటాయిగారు అస్సలు అడగనేలేదు. ఆరాత్రి వెంకటాయిగారికి నిద్రపట్టలేదు.

మర్నాడు టపాలో వెంకటాయిగారికి మరి నాలుగు రోజుల్లో ఆ స్కూలికి తణిఖీ శంతు జరుగుతుంది గనక సిద్ధముగా ఉండవలసిందని అసలు అధికారి దగ్గిర్నించి ఉత్తరం వచ్చింది!

---

## పసిపిల్ల

చిట్టావూరి కామేశ్వరరావు గారు

వనజదళమున మకరంద కణమువోలె
శుభ్ర గగనాంగణంబునఁ జుక్కవోలె
తల్లి యొడిలోనఁగల పసిపిల్ల, నిన్నుఁ
గనుఁగొనంగ సంతోషము గలుగు నేల?

తల్లి ముఖమును జూచి సంఫుల్లవదన
వై పకపక నవ్వెదవు నిరంతరముగ!
అందు నూతనసోయగ మరసెదో? సు
ఖాలయముఁ గాంచెదో? మతేమైనఁ గనెదొ?

జీవనంబను నిద్దురఁ జెంది, మృత్యు
దేవతానికేతన శోభ దెలియలేక
మెలఁగెదము మేము;—విందవై మేదినీవ
లయమున కరుదెంచితివి విలాసగతి వి

నూతనముగ మధుర మాసనాతనాల
య సుఖసంపదలు స్మరించి యలరు గుత్తి
వోలె మురువుగ నవ్వెదవో? ప్రపంచ
మను విశాల నాటకశాలఁ గనిన కతనఁ

బలుకనేరని యానందభావ మనుభ
వించెదో?—అనిమిత్తము లెంచరాని
హేయవిభ్రాంత కష్టసుఖాయుతములు
నగుమనోగతము లెఱుఁగమి, నరిదికుతుక (?)

మొలుకు తీయని నగవులు వెలుఁగఁ జేసె
దో?—ఒకటియుఁ గాకుండిన నుజ్జ్వలం బ
మలమహానందభరితనిశ్చలగుణంబు
పుణ్యమగు నాదికారణ మూర్తివేమొ!

---

# రాగిణీకుమారి

రాగిణీకుమారి నివాసము కలకత్తా నగరము. ఆమెతండ్రిపేరు ఫణీంద్రనాథబోసు; తల్లి పేరు శివకామినీదాసి. తండ్రి కలకత్తానగరమున వైద్యవృత్తి వలన జీవించుచుండెను. రాబడి యంత యధికముగ లేకున్నను వారుమాత్రము గౌరవముగనే జీవించుచుండిరి. రాగిణీకుమారి మిగుల సౌందర్యవతి. ఆమె మొగము చందురుని హసించుచుండెను. అంతియగాక యీ యమ మిగుల గుణవతి. తండ్రికి తన కుమారి తను ఉన్నతవిద్యలు చదివింపవలయునని కోరిక. రాగిణీకుమారికి పదునాలేండ్ల ప్రాయము. ఆయమ నాల్గవఫారమును క్వీను ఎలిజబెత్తు కళాశాలలో చదువుచుండెను. పిల్లలందఱిలో నామెయే తెలివితేటలలో మిన్నయగుటచేత నుపాధ్యాయినులెల్ల రాయమ్మాయి యన్న ప్రాణపదముగ నెంచుచుండిరి. విద్య వినయ మున్నప్పుడే రాణించును. రాగిణీదేవి మూర్తీభవించిన వినయదేవత. ఇంతియగాక యాయమశీల మెంతయు కొనియాడదగినది. బడికి వేళ యతిక్రమింపకుండ నరిగి తన పాఠములనెల్ల క్రమముదప్పకుండగ వల్లించి మరల యింటి కరుగుదెంచిన తోడనే తన మాతృదేవతకు గృహకృత్యములలో సాహాయ్య మొనరించు చుండెడిది.

ఆదివారపు సెలవు దినములయందు రాగిణీదేవి తన చెలికత్తెలతో సముద్రపు టొడ్డునకు షికారున కేగుచుండెడిది. ఒకనాడామె తన వాడుకచొప్పున చెలికత్తెలతో సముద్రపు టొడ్డునకు షికారేగినది. కాలమానము వాతావరణమును చాల బాగుండుటచే చెలికత్తెలామెను జలక్రీడలకై ప్రోత్సహించిరి. వారి మాటలు కాదనజాలక రాగిణీదేవికూడ వారి తోడ సముద్రజలములయందు క్రీడ నొనర్ప మొదలిడెను. కర్మవశమున రాగిణీదేవి కాలు జారి చెలికత్తెల చేతుల పట్టు విడచి సముద్రమున పడిపోయెను. చెలికత్తె లెల్లరు భీతమనస్కులై యార్తనినాదము లొనర్చుచు నచటికనతి దూరమున గూర్చుండియుండిన పురుషులను బిల్చివారికి జరిగిన సంగతిని వివరించిరి. కాని యా పురుషులెల్లరు 'అయ్యో, పాపము' అనువారలే కాని యొక్కరైన నా గభీరజలముల దిగి యా లలనావతంసమును మృత్యుగహ్వరమునుండి తప్పించువాడు లేకపోయెను.

అప్పుడే గాలిషికారున కరుదెంచుచున్న యదుభూషణు డను యువకు డీ జనసమూహమును సమీపించి వారివలన జరిగిన సంగతి నెఱింగి దన ప్రాణములనేని లక్ష్యపెట్టక సముద్రము పోటివేళయందున్నదని జడియక యదటున నా గభీర జలరాశి మధ్యంబున దుమికి మిగుల కష్టముతో గలయ వెదకి దూపంబున సుధాబ్ధిఃపట్టియగు నిందిరను తిరస్కరించు జలజాతాక్షి, రాగిణీకుమారిని దన బాహువుల

చే పట్టుకొని తీరమును జేర్చెను. ఇది వీక్షించుచున్న జను లెల్లరు నా యువకుని ధైర్యస్థైర్యముల నేవిధముల గొనియాడిరి.

రాగిణీ దేవి చైతన్యవిహీనయై యుండెను. యదుభూషణుడు దగ్గిరనున్న చిదుగుల నేరిచి తెచ్చి యగ్ని రగుల్కొల్పి రాగిణీ దేవికి ఉష్ణమును కలిగించెను. కొంత సేపటికి శతపత్రేక్షణయగు రాగిణి కన్నుల దెరచి తన ప్రాణరక్షకుడగు యదుభూషణునకు వందనము లర్పించి తన కంఠముననున్న యొక బంగరుగొలుసును బహుమతిగ నీయబోయెను. కాని యదుభూషణు డా కాంచనాభరణమును వందనములతో నామెకే ఇచ్చి యొక బండిని గొనితెచ్చి యా యిందుముఖిని పితృగృహమునకు గొంపోయెను. జరిగిన కథయంతయు రాగిణీకుమారివలన నామె తల్లిదండ్రులు లాలకించి యదుభూషణుని తమ కొనర్చిన యుపకృతి కభినందించి యప్పుడప్పుడు తమ గృహమున కరుగుదెంచుచుండుమని ప్రార్థించిరి.

యదుభూషణుడు ప్రవేశపరీక్షకు చదువుచుండెను. అతడు తన తరగతి యందలి విద్యార్థు లందరికన్న మిగుల చురుకైనవాడు. అంతియకాక యతని కీత యన్న మిగుల సరదా. 'అఖిలభారత-ఈతపందెము' లో నాతడు మొదటివాడుగా గెలిచి 'కింగుజార్జి' సువర్ణపతకమును బొందెను.

యదుభూషణుడు పైన వివరించిన సంగతులు జరిగినప్పటినుండియు రాగిణీకుమారి యింటికి తరుచు వెళ్లుచుండెడివాడు. రాగిణీ కుమారియు తనకు దెలియని పాఠముల నీతని వలన దెలిసికొని బాగుగ చదువుకొనుచుండెను.

కాలక్రమమున వారి స్నేహము మోహముక్రింద పరిణమించినది. ఇందిర యాశరదిందువదన; అరవిందనాభు డా యదుభూషణుడు. వారిరువురు సుగుణయుతులు; అనురూపవంతులు; విద్యాసంపన్నులు అట్టివా రొకరి నొకరు ప్రేమించుటలో నేమి యాశ్చర్యము?

శివకామిని విద్యావిహీన. ఆమె కొక నేపును ధనవంతుడగు నల్లుడు దొరకవలయుననియే కోరిక.

కొమార్తె నున్నతవిద్యకై చదివించుటాపాలతి కెంతమాత్రము నిష్టములేదు. కలకత్తా నగరమున నంబాలాల్ అను లక్షాధికారి కలడు. అతడు విద్యాశూన్యుడు. అంతియకాక స్ఫోటకమువలన నాతని రూపముగూడ వికృతముగ నుండెను. అతనిభార్య కాలధర్మ మొందెను. శివకామిని వారి యింటికేగి పెనకొమరిత రాగిణిని వివాహ మొనరించు కొనవలసినదని కోరెను. వారి కింతకన్న నేమి కావలయును? వా రొప్పుకొనిరి. తండ్రికి రాగిణిని యదుభూషణున కిచ్చి వివాహ మొనరింపవలయునని కోరికగ నున్నది. యదుభూషణుడు లక్షాధికారి గాకున్నను విద్యావంతుడు.

రాగిణిని అంబాలాలున కీయనిమొదల యే నూతిలోనో, గోతిలోనో పడుదునని పట్టుబట్టు

కొని శివకామిని అన్నాహారముల వర్జించికూర్చుండెను. చివరకు భర్తగూడ లొంగిపోవలసివచ్చెను. ప్రియసుత దీనాలాపము లాయమ చెవి జొరలేదు. యదుభూషణు డొనరించిన యుపకార మింతలోనే యామె స్మృతిపథమునుండి మాయమైనది. ఆమె కంబాలాలుని లక్షరూపాయలు దప్ప నింకేమియు గోచరింప లేదు. చివరకు రాగిణీకుమారిని అంబాలాలున కిచ్చుటయే స్థిరపడినది. యదుభూషణు డీవార్త రాగిణీ వదనమునుండి వినినంతనే మొదలునఱకబడిన కదళీతరువువోలె నేలంగూలి కొంత తడవునకు స్పృహ దెచ్చుకొని మిగుల విచారించెను. రాగిణీకుమారికి గూడ నేమిచేయుటకును దోచలేదు. దైవసమానులగు తలిదండ్రుల మాట ధిక్కరించుట యామె కెంతయో పాపకార్యముగ దోచినది. అందువలన యదుభూషణుని తనపై యాశ వదలుకొనుమని చెప్పివైచి తలిదండ్రుల గాంచి "జననీజనకులారా, ఈ దేహము మీవలన నుత్పత్తియైనది. నా సుఖమును చూడవలసిన మీరలే యివ్విధమున నా గొంతుకోయ దలచుచుండ నిక నాకు దిక్కెవ్వరు? మీ మాటకు నేనెదురుపల్కను గావున మీ చిత్తమువచ్చినవారికి నన్నిచ్చి పెండ్లి సేయుడు." అనగా విని శివకామిని హర్షపులకితగాత్రియై అంబాలాలు ఇంటి కరిగి ముహూర్తము త్వరలోననే కుదుర్చుకొని వచ్చెను. వివాహదినము సమీపించినది. రాగిణీదేవిని చీని చీనాంబరములతోడను, అమూల్య రత్నాభరణముల తోడను అత్యద్భుతముగ నలంకరించిరి. కాని పూర్ణిమాశశాంకు దిరస్కరించు నామె మోముదమ్మిపై మాత్రము కత్తివైచినను నెత్తురుచుక్క లేదు. ఆమె యాననము చింతాకులితమై యుండెను. పెండ్లికొమరుడును పెండ్లికొమరితయు, రంగీతోలావీథిగుండ శ్రీరామచంద్రుని యాలయమున వివాహమాడుటకై యూరేగింపుతో బయలువెడలిరి. తల్లిదండ్రులును, బంధుమిత్రులును మహోత్సాహముతో యూరేగింపు వెంట నడుచుచుండిరి. ఊరేగింపు జుమ్మామశీదును సమీపించినది. ఆ సమయమున ఉత్తరహిందూస్థానమంతయు హిందూమహమ్మదీయ కలహముల తో నిండియుండెను. మహమ్మదీయులయందు సంఘీభావము గలదు. అంతియగాక మతమన్నచో వారు తమ ప్రాణములనైన నర్పించుటకు వెనుదీయరు. బాజాభజంత్రీలతో ఉత్సవము ముందునకు పోవుచుండెను. ఒక్కుమ్మడి పెక్కుమంది మహమ్మదీయులు తాముండిన జుమ్మామశీదునుండి వెలువడి యూరేగింపుపై బడి లాఠీలతో మోద మొదలిడిరి. తన యనుంగుపత్నిగానున్న రాగిణీదేవిని రక్షించుటకైన యత్నింపక అంబాలాలు పిరికిపందయై యీ దేహము శాశ్వతమైనదని యెంచి కాలికి బుద్ధిసెప్పి పారిపోయెను. రాగిణీదేవి తల్లియు తండ్రియు అంబాలాలు చర్యనుగాంచి మిక్కిలి వ్యసనపడిరి. శివకామిని యుక్తాయుక్తముల నెఱుంగక యిట్టివానికి తనతనయ నర్పింపదలచినందుల కెంతేనియు మదిచింతిం

చెను. కాని కాలము విషమస్థితియందుం దుండెను. కాలాగ్నిరుద్రులవలె మహమ్మదీయులు హిందూ-ఉత్సవమందున్న వారిపై బడి మోదుచుండిరి. అందఱును తమకు మరణ మకాలమున రానున్నదా యని వగచుచుం డిరి. అట్టియెడ యదుభూషణు డాత్రోవను పోవుచు నాదురంతమునుజూచెను. ఆతనిరక్తనాళములయం దుష్ణరక్తము ప్రవహించుచున్నది. చేతిలో నొక్కకత్తి తప్ప వేరు ఆయుధమెద్దియును లేదు. పరిస్థితులగాంచి యాతడించుకేనియు వెనుదీయలేదు. తలచుకొనినయెడల నింకొక సందుగుండ నాతడు నిరపాయముగ దాటిపోగలడు కాని యితరులకు కష్టసమయములయందు తోడ్పడుట యాతనికి చిన్నప్పటి నుండియు నలవాటు. చుట్టుపక్కల షాపులపై గూరుచుండి తమాషాను పరికించుచున్న హిందూవర్తకులతో నాతడిట్లలనియెను "హైందవ యువకులారా" ఏల యీ లీల చూచుచు నూరకున్నవారు? మీనాళములయం దా భీమసేనుని రక్తము పారుటలేదా! సింహశార్దూలముల చించిచెండాడిన భరతుని భూమియందు జన్మించినమీ కీపిఱికితన మెట్లు లభించినది?

జన్మ అశాశ్వతము. మనకు మరణ మెప్పుడైన నున్నదియే. వీరమరణమును పొందిన జన్మరహితమగు వీరస్వర్గమును జూరగొందుము, లేక విజయులమైన యబలామానసంరక్షణ పుణ్యఫలమును బడయుదుము." అని వీరాలాపములబల్కి వారినెల్లర దనవెంట నిడుకొని మహమ్మదీయులనెల్లర తన యవక్రవిక్రమమున బారదోలి పెండ్లివారినందఱిని మృత్యుగహ్వరమునుండి రక్షించెను. పెండ్లికూతురు రాగిణీదేవి తన ప్రాణరక్షకుడు యదుభూషణుడే యని వినినప్పుడు పొందిన యానంద మింతింతయనరాదు. శివకామిని ఫణీంద్రుడు ఆయదుభూషణుని భూషించి యనుకొన్న ముహూర్తమునకే శ్రీ రామచంద్రుని యాలయమున రాగిణీకుమారిని కన్యాదాన మొనరించిరి. నూతన దంపతులు పొందిన యానందమునకు మేర లేదు. శ్రీరామచంద్రుని కరుణవలన నా దంపతులు చిరకాలము మానవసేవ యొనర్చుచు తమ జన్మమును సార్థక మొనర్చుకొనిరి.

---

# కృష్ణుని పలుకు*

శ్రీ శివశంకర శాస్త్రిగారు

మూన్నాళ్ళనుండియు ముద్దులకృష్ణు
వెదకుచున్నావుగా వెర్రిరాధమ్మ!
మూడుజన్మలకైన ముగ్ధమానసము
కనుగొనజాలునే కల్యాణరూపు?
ఆయాసమేకాని అన్వేషణమున,
దయ కల్గ నాతండె దర్శనం బిచ్చు.
చాలేల అతని కో చంచలనయన?
ప్రత్యక్షముగ నుండి భ్రమియింపజేయు.
వీక్షణావరణంబు వీడిపోకున్న
సాధ్యమెట్లౌను తత్సందర్శనంబు?
అతనిజాడలు పట్టు నంత నేర్పరివ?
గుట్టుమట్టెల్ల నీ వెట్టెరుంగుదువో?
పాదంబు కడుపులో బ్రహ్మాండమెల్ల
నిండును మంజీర నినదంబుతోడ.
పిచ్చిదానా, నీకు బృందావనమున
అతని చిన్నెలే అగపడలేదె!
బృందలో నేటికి — పృథ్వి నెల్లెడల
కన్నులు గలవారు కాంచగాగలరు.
నెమిలిపింఛము భవన్నీలాంశుకమున
బంగారుశాలువు బాహుయుగ్మమున
వెలయుచున్నవి చూడు వెర్రినారాధ!

పుష్పమై యాతండు పొదలలో లేడు
నీకొప్పులోననే నిండియున్నాడు.
తమ్మిలో దేనెగా ద్రవియింపలేదు
నీముఖాబ్జమునందె నెలవుకొన్నాడు.
వంశిలో లీనమై వర్తిల్లలేదు
వరలుచున్నాడు నీవాక్సుధాఝరిని.
మోహనాంగుని ఏల మూలల వెదుక
నిఖిలలోకమ్ముల నిండి యుండంగ?
ఆతడు దొంగిలి నట్టి దో రాధ,
వెన్న కా, దాలాటి స్వీన్నమానసము
సిగ్గులు హరియించె, చీరలు కాదు,
తరుణు లాతని దారి తప్పింపలేదు,
దారితప్పినవారి దరిజేర్చునతడె,
మధురలో పౌరులే మరపింపలేదు,
భక్తులెల్లెడ వాని బంచుకొన్నారు.
నిలువజాలవయేని నీవు శ్రీకృష్ణు
విగ్రహంబును నేడు వీక్షింపకుండ
బాహ్యచక్షువు మూసి పరమార్థదృష్టి
వివృతంబు సేయు, తద్విశ్వరూపంబు
సాక్షాత్కరించు ఈ క్షణములోపలనె!

ఇతి శ్రీమ గంత ద్రాధావల్లభో విజయతే!

---

* మన్మిత్రులు, పూజ్యులు నయిన శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి కోరికపై శ్రీ శారదా నికేతన వార్షికోత్సవమున పాడుటకై చెప్పినది. శ్రీ రాయప్రోలు సుబ్బారాయకవీంద్రుని "జడకుచ్చులలో" "రాధపిలుపు" నకు మారువేసమున కృష్ణుని ప్రత్యుత్తరము.

# జైనుల మతకథలు

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు

[౧౦. పంచనమస్కారకథ]

శ్లో. తొం చేవ్వ మోఖ్ఖపదవీ, తొం చియ సరణం జణస్స సవ్వస్స,
తొం ణికాకారణవిద్దో జాయిజరామరణవాహిహరో.†
—పంచనంద్యాచార్యుడు.

విక్కలీ ప్రసిద్ధిపొందిన దేశాలల్లో పూర్వకాలాన అంగదేశం వొకటీ. మనకథజరిగిన కాలంలో అంగదేశాన్ని పాలిస్తూన్నరాజు పేరు నరవాహనదత్తుడు. నరవాహనదత్తుడన్న పేరు కొంచెం రాజసాన్ని కనపరుస్తూన్నా, పరిపాలనకార్యాలు ఆలోచిస్తే ఆ పేరు శుద్ధసాత్త్వికాన్ని వెల్లడిస్తూ (నరులకు వాహనుడు-అనగా ప్రజలప్రేమకు పాత్రుడు) ఉండేదని పెద్దలు చెబుతుంటారు. అసలే మంచీ తెలివితేటలు కలవాడాయె. అపైని ప్రజాప్రేమా ఆస్తికత్వం — మొదలయిన వన్నీ వుండటంచేతా, అంధర్నీ సమానంగా చూసుకోవడం చేతా ఆరాజుపరిపాలనా అంటే మహా ఆనందం ప్రజలకు.

ఇల్లా వుండగా నరవాహనదత్తుడి రాజ్యానికంథా అలంకారప్రాయమైన చంపాపట్నంలో వృషభదాసు-అని వక కోమటి మహాపుణ్యాత్ముడు వుండేవాడు: పుణ్యాత్ముడంటే పుణ్యాత్ముడా! ఎప్పుడూ జినస్మరణే. ఏప్పుడు చూసినా జినసేవయే. జినకథాశ్రవణమే. రాత్రుళ్లూ పగళ్లూ విధీవిరామం లేకుండా ఎంతెంత మందో భక్తులు సన్యాసులు పండితులు మొదలయిన పెద్దలందరూ రావడం, నానావిధాలయిన మతసంభాషణల్తో కాలక్షేపం జరగడం—ఇదీ ఆయనపని. దీనికి తగ్గట్టే ఆయనభార్యాగారుకూడా—ఆమె పేరు అర్హద్దాసీలేండి—అమితదైవభక్తి గలది. భర్తచేసే ప్రతిపనిన్నీ ఆకునకుతొడిమెలాగా అంటుకూనే వుంటుంది. కాబట్టే అనుకూలమైనదాంపత్యంకంటే మించిన పుణ్యలోకం లేదంటారు; పెద్దలు.

వృషభదాసు చాలా సంపన్నుడూ. కావలసినంత నౌకరీచాకరీలు కలవాడూ; ఆపైన పెద్దసెట్టీకూడాను. ఆయనదగ్గఱ ఉద్యోగం దొరుకుతుందంటే ఉబ్బిపోని వాళ్లు ఎవ్వరూ ఉండరంటే నమ్మండి. అంతప్రేమతో సేవకులను ఆదరిస్తాడన్నమాట. వృషభదాసుదగ్గఱ ఉండే సేవకులలో గోపాలుడుకూడా వకడు. వాడిపని ఎప్పుడూ అతనిపశువులను మేపుకోరావడం. ప్రతిరోజూ పొద్దుటే లేచి పశువులు తోలుకోపోయి మేపుకొని వస్తూంటాడువిసుగులేకుండా. ఇల్లా వుండగా వకనాడు మామూలుకు మల్లే అడవికిపోయి వస్తూండగా దోవలో మాంచి మంచులో కూచోని కదలకుండా మెదలకుండా సమాధిలో వున్నచారణయోగినిచూశాడు గోపాలుడు, గడగడ వణికిపొయ్యేచలిలో—ముద్దలు ముద్దలుగా మంచుపడుతూన్న బయలులో—చివఱకు గోచీ అయినా లేకుండా నిశ్చలంగావున్న ఆమున్ని చూశేప్పటికి గోపాలుడుహృదయం నీరైపోయింది. కాని ఏంచెయ్యడానికీనూడా తోచలేదు. తనదగ్గరా బట్టాపాతా ఏమీ లేవాయె అతనికి కప్పడానికీని. పైగా అతన్నిగుఱించి జాలిపడు...

---

†ఛాయ:—శ్లో. త్వం చైవ మోక్షపదవీ, త్వంచైవ శరణం జనస్య సర్వస్య, త్వం నిష్కారణవైద్యో, జాతిజరామరణవ్యాధిహరః.

అర్థము:—ఓజినదేవా! మాకునీవే మోక్షమార్గం. సర్వజనానికిన్నీ నీవే దిక్కు. (మాబోంట్లకు) నీవే నిష్కారణవైద్యుడు. జాతి జరా మరణం రోగం—మొదలయినవాటి నన్నీ హరించేవాడవు.

డగానే ప్రొద్దు వాలిపోతున్న దాయెను. ఏంచెప్మా అను కుంటూ చాలాసేపు అక్కడ్ణే నిలుచున్నాడు. ఎంతసేపు నిలుచున్నా కొయ్యబొమ్మ తెచ్చి కొట్టినా పల్కదు అన్నమో స్తరుకు ఏమీ లోపం లేదు.

చివఱకి ఎల్లాగో ఓలాగా ఇంటికి చేరుకున్నాడు. ఆర్రాత్రి ఏమీ నిద్దర పట్టలేదు వాడికి. తరవాత వాడు చాలాసేపు ఆలోచించుకొని వృషభదాసు ఇంట్లోవుండే కొన్ని బట్టలు తీసికొని ఇంకా ఝామురాత్రి ఉండగానే బయలుదేరి పశువుల తోలుకొని సరిగ్గా చారణముని వున్నచోటుకు చేరాడు. ఆతెచ్చిన బట్టలన్నీ ఆయనకు చుట్టబెట్టి పశువుల్ని చుట్టుప్రక్కల తోలి తానుమాత్రం ఆయనకు సేవచేస్తూ ఉన్నాడు. ఇంతలో తెలతెల్ల వార వస్తున్నది. ఇంతలోచారణముని కన్ను తెఱచి చూశాడు. ఎదట గోపాలుడూ తనవు నిండాబట్టలు కప్పి పరిచర్య చేస్తుండడం గమనించి నవ్వుకొన్నాడు. తర్వాత ఎవరు నీవూ? అన్నాడు. ఉన్నదంతా చెప్పగానే జాలిపుట్టి వాణ్ణి దగ్గరికి తీసికొని "నాయనా! బుద్ధిమంతుడవోయ్. చూడూ నీకు ఏకమంత్రం వుపదేశిస్తాను. దాన్ని నీవు జపంచేస్తుంటే ఎంత కష్టమైన పని అయినా నెగ్గుతుం టుంది సుమా."— అని చెప్పి "ణమో అరిహంతా ణం"— అని ఉపదేశం చేసి వెంటనే వెళ్లి పోయాడు. గోపాలుడు అప్పట్నించీ దాన్ని శ్రద్ధతో జపం చేస్తూ వచ్చేవాడు.

ఏకనాడు గోపాలుడు పశువుల దగ్గఱకి వెళ్లకుం డా ఇంట్లోనే వుండవలసి వచ్చింది. అందులోనూ ఆనా డు వృషభదాసు దగ్గరకూర్చొనే పనిచెయ్యాలసి వచ్చిం ది. పనిచేసేప్పుడంతా ముందుగా ఏమో పెదవులు కద ల్చ్తూ చెయ్యడాన్నిచూచి "ఏమోయ్. ఇంత పొగరు వచ్చిందా? ఏమిటి గొణుగుతావూ?"— అని ఆగ్రహ పడ్డాడు వృషభదాసు. ఏమీ లేదు—అని మొదట తప్పిం చుకోడానికి చూశినా వృషభదాసుకు ఆగ్రహం హెచ్చి పోతున్నది: ఇక విధిలేక వున్నదంతా చెప్పేశాడు గోపాలుడు. వృషభదాసు మహా ఆనంద పడ్డాడు— భలే! నాకు సేవకు డనిపించావు— అంటూ అతణ్ణి ప్రేమదృష్టితో ముంచెత్తినాడు. ఎందుకని అంటారా? చెప్పలే సజ్జన లక్షణమే అదీ! కాబట్టే 'సతత స్వత్యం ధర్మానురాగిణః' అన్నారు.

గోపాలుడు ఇట్లామంత్రాన్ని నిరంతరంగా జపిస్తూ తనపనులు తాను నిరభ్యంతరంగా చేస్తున్నాడు. ఈమధ్యకాలంలో ఇంకోచిత్రం జరిగింది. గోపాలుడు మామూలుగా పశువులను తోలుకొని అడవికి పోయేడు. అక్కడికి గంగానది కూతవేటుదూరంలో వుంది. వర్షా కాలం అయినందుచేత ఆరోజుల్లో గంగ ఇధరీ అదరీ తన్ని పారుతున్నది. గోపాలుడు పరధ్యానంగా పశువుల వెంట వస్తున్నాడు. ఇంతలో పశువులకి అద్దరిని మిసమిస లాడుతూ ఏపుగా పెఱిగిన పచ్చికపట్లు కనపడ్డాయి. వెంటనే అవి తోకలెత్తికొని అరుస్తూ ఏటికడ్డంగా పరి గెత్తసాగాయి. గోపాలుడు ఈసంగతి కనిపెట్టేలోప ల్నే దాదాపు ఆవులన్నీ నదిలో దూకినవి. ప్రవాహం చాలా జోరుగా వున్నది. ఏమో ఏ మ వు తుం దో? అనే చింతతో ఆమంత్రాన్ని పఠిస్తూనే గోపాలుడు తా నుకూడా గభాలున గంగలో దూకాడు. సరిగా ఆసమ యానికే అక్కడ పెద్ద సుడిగుండం ఏర్పడ్డది, ఇదివరకే అందులోకి వచ్చి తల్లక్రిందులుగా ఒకపెద్దతనాబీ తిరుగు తున్నది. గురిచూసి దూకినట్లు ఆమూలం గోపాలుడి డొక్కలో పొడుచుకున్నది. సరి గోపాలుడు మునిగి పోయాడు. ప్రచ్ఛన్న దుర్జనకృత్యంలాగా ఆతనాబీ అతని ప్రాణాలు తీసివేసింది.

ఈవిధంగా చచ్చిపోయిన గోపాలుడి ఆత్మే కొన్నాళ్లకు కర్మశేషంవల్ల అర్హద్దాసీగర్భంలో ప్రవే శించింది. భార్య అపరూపంగా గర్భం ధరించినందుకు వృషభదాసుకు కల్గిన సంతోషానికి హద్దూపద్దూలేదు. ఆసంతోషాన్ని ఆయన అనేకధర్మకార్యాలవల్ల వెల్లడిం చాడు. చిట్టచివఱకు అర్హద్దాసీకి మొగపిల్లడు పుట్టాడు. పిల్లడన్నా పిల్లడా? బంగారపు విగ్రహం. అమిత గారా బంగా పెంచుతున్నారు. పిల్లాడిపేరు సుదర్శనం— అన్నారు. లోకులంతా అన్నారుకదా—ఒక్క పేరే కాదు, రూపం, గుణం, తేజస్సు—అన్నీకూడా సుద ర్శనమే—అని.

క్రమంగా సుదర్శనం ఫదిపద్ధారు ఏండ్లవాడై నాడు. అందుకు తగ్గట్టే చక్కగా విద్యాబుద్ధులూ— మర్యాదామాన్యతా అబ్బినాయి. కావలసినంత ఐశ్వర్యం. ఓ—బోలెడందరు హితులూ ఏర్పడ్డారు. మంచి అందం, దానికి మెఱుగుపెట్టే యౌవనం, క్రమంగా అతనిలో జతపడ్డవి. ఇక చెప్పవలసిందేమందీ? వీళ్లూ వాళ్లూ అనేభేదం లేకుండా అంథా అతన్ని రెప్పాల కుండా చూసి మురిసి పోతుండేవాళ్లు. ఊళ్లోవాళ్ల సంగతే ఇల్లావుంటే కన్నతల్లి తండ్రుల ఆనంద్దానికి మేర వుందా; చెప్పండీమతీ.

వృషభదాసు వన్నేవాసీ కల కొడుకుని చూసి కోని పొంగిపోతూవున్నా, వైరాగ్యమార్గంలోనుంచి వంచితుడు కాలేదు. కాబట్టి భార్యతో ఆలోచించి, అన్నివిధాలా వియ్యానికి తగ్గసాగరదత్తశెట్టికూతుర్ని మనోరమను కోడలినిగా చేసికొన్నాడు. తర్వాత మతికొంతకాలం పోనిచ్చి రాజుగారితో మనవిచేసి తనశెట్టిపదవిని అతనికిఇప్పించి తాను భార్యతోసహా సమధిగుప్తునిఆశ్రమానికివెళ్లి అక్కడ జినదీక్షనుస్వీకరించి మహాఆనందంతో

శ్లో. ధన్యోఽస్మి పుణ్యనిలయోఽస్మి నిరాకులోఽస్మి
శాంతోఽస్మి నష్టవిపదస్మి విదస్మి దేవ!
శ్రీమజ్జినేంద్ర భవతోఽంఘ్రియుగం శరణ్యం
ప్రాప్తోఽస్మి చే దహ మతీంద్రియసౌఖ్యకారి.

అని భజనచేస్తూ సిద్ధిపొందినాడు. నిజమే. విచణుల కృత్య మింతే అంటారు.

సుదర్శనం తర్వాత తన గుణసంపదవల్ల రాజుకు అత్యంతం విశ్వాసపాత్రుడైనాడు. విశ్వాసమంటే కాస్తా కూస్తా గాదు. సుదర్శనం ఒక్కక్షణం దగ్గఱ లేకపోతే ఇఖ రాజుకు మతిపోతుంది. అంతే. దీనిబట్టి తెలిసికోండి. వారిస్నేహం ఎల్లాంటిదో!

రాజుల్తో స్నేహం పాముల్తో చెలగాటం—వకటే అంటారు. రెండూ మొదట చాలా ఆనందమే కలిగిస్తాయి. కాస్తంత మధ్య చిక్కుపడ్డదా అంటే—రెండూకూడా ప్రాణాలు తీసేస్తాయి. ప్రస్తుతం ఈసామెతకి ఉదాహరణంగానే ఉంది సుదర్శనంజీవితం. ఏమంటారా?—రాజుతో మైత్రి రోజుకు రోజూ ఎక్కువ అవుతూండడం మూలాన్ని అతనికి సిరిసంపదా ప్రజల్లోపలుకుబడీ పరపతీ—అన్నీ వున్నాయి. దీనికి ఆనందించాలసిందే.

కాని ఇంకో బెడద పట్టుకొన్నది. రాజుగారి పట్టపుదేవి వుంది వఖ మహాయిల్లాలు. ఆమెకు రాజు ఎంతప్రేమించినా, ఏమేమి చేసినా తృప్తిలేదు. ఆయిల్లాలు 'నాఽగ్ని స్తృప్యతి కాష్ఠానాం' అనేతరహాల్లా. సుదర్శనాన్ని చూశేటప్పటికల్లా ఆమెమనస్సు దుర్ధర్షము అయిపోతుంది. ఒళ్లు జలదరిస్తుంది. తర్వాత ఏమిటో ఏంచేస్తున్నదోకూడా తన్ను తాను తెలిసికోలేనంత ఇది షైపోతుంది ఆ ఆత్మ. ఏంచేస్తుందీమతీ! విచారిస్తే ఆమె తప్పు ఏమీ కనపడలేదు. న్యాయంగా మొదట నవ్వులూ తుళ్లులూ—ఆ తర్వాత సైగలూ—సిమ్మట రాయబారాలూ సాగించింది. ఏంసాగిస్తే ఏముందీ? పాపం అవన్నీ—అంధేందూదయముల్, మహాబధిరశంఖారావముల్—అన్నట్టే అయ్యాయి. చిట్టచివరకు తనదాసీని ఆశ్రయించి ఆమెను ఎల్లానైనా కార్యం గట్టెక్కించమని ప్రార్థించింది.

అనడానికి దాసీదే. అయినా అది—పేరు నిపుణిక—ఎన్నోవిధాల నీకిది తగదని చెప్పింది. ఆదలించింది. బెదరించింది. ఏమీ ప్రయోజనం కనపడలేదు. చివరకు విసిగి సరే ఏలాగో అతన్ని ఇక్కడికి తేవడం నాపని. తర్వాత సాధించుకోవడం మీ వంతే—అన్నది నిపుణిక. ఓ! చాలు. ఈ పాటిచేస్తే అంథా అయినట్టే!—అని చిటికవేసింది రాణి.

తరవాత నిపుణిక సుదర్శనాన్ని వెంబడించే దేది. ఎందుకంటే—కాస్తంత సందు దొరికితే, ఈమంత్రం అతనిచెవులో వుపదేశించడానికి! అయితే ఏంచెయ్యను! ఏమీ సందు దొరకలేదు. ఎప్పుడు చూశినా, ఏవేళప్పుడూ రాజూ సుదర్శనం కలసే వుంటున్నారు. ఆఖరుకి వఖనాడు ఎల్లాగైనా ఇవాళ్ల పట్టితీరాలెనని పట్టుదల్తో అతన్ని అనుసరించింది. రాత్రి చాలాసేపు అయింతర్వాత సుదర్శనం రాజుదగ్గఱ సెలవుతీసికొని వెళ్లుతున్నాడు. దాసి అతనివెంట వెళ్లింది. వెళ్లగావెళ్లగా చివరకు వాళ్లిద్దరూ ఒకరివెనకాల మఱొకరు చొప్పున స్మశానంలో

చేరారు. సుదర్శనం అక్కడ కాయోత్సర్గం చెయ్యడానికి కూర్చోబోతూ వెనక్కి తిరిగి చూసేసరికి నిపుణికవున్నది. విచారిస్తే సంగతీసందర్భం అంతా బోధపడ్డది. సుదర్శనం ఆమెను గట్టిగా చీవాట్లు పెట్టి తరిమివేసినాడు. దాసి వెనక్కివచ్చి రాణితో జరిగినవిషయం యావత్తుచెప్పింది. అయినా ఆమెవదల్లేదు. "సరే! ఉండేచోటు తెలిసిందికదా! ఇక ఫరవా లేదు. రేపు ఎల్లాగైనా తీసికోరాక తప్పదు. లేకుంటే నిన్ను ఏంచేయిస్తానో! చూచుకో" అన్నదిరాణి. పాపం పచ్చివెలక్కాయపాకంలోబడ్డది నిపుణిక.

మర్నాడు రాణీ దాసీ — ఇద్దరూ మాట్లాడుకున్నారు. ఎట్లాగైనా సుదర్శనాన్ని ఆనాడు తేవలసిందే అనుకున్నారు. అయితే ఉపాయ మెల్లా? పోతుటీగ దూరకుండా జనానాకు పహరా ఇస్తుంటారాయెను. అందుకని నిపుణిక ఒకయుక్తి చేసింది. పగటిపూటే ఊళ్లో తిరిగి మనిషి అంత ఎత్తుగల మట్టిబొమ్మను సంపాదించింది. దానికి మగవాడివేషం వేసి కనికనిచీకట్లో ఆబొమ్మను బండ్లోపెట్టుకొని జనానాలోనికి వస్తున్నది. పహరావాళ్లు ఆబండిని చూసి ఆపి పరీక్షించారు. లోపల ఎవడో మగవాడు కూర్చున్నట్టు కనిపిస్తే ఆగ్రహంతో ఆంబండ్లోవున్న బొమ్మని చెయిబట్టుకొని జట్టున లాగారు. వెంటనే అది క్రిందబడి తుత్తునకలైపోయింది. వెంటనే నిపుణిక లేచి కండ్లెఱ్ఱజేసి అరుస్తూ—"ఇంత పొగరెక్కిందా? రాణీగారు ఇవాళ్ల ఉపవాసం వుండి నరవ్రతం చేస్తూంది. ఆమె ఈబొమ్మను పూజిస్తేనే గాని ఇక గంగముట్టుకోదు. అందుకే నేనీబొమ్మను నాల్గురోజులనుండీ చేయించి తీసికొచ్చాను. మీరు బద్దలు చేస్తారా? నేను వెళ్లి రాణితో చెబుతాను. వీపులు బ్రద్దలు అవుతాయి"అని ప్రచండంగా ఉపన్యాసం ఆరంభించింది. ఆదెబ్బతో పహరావాళ్లు హడలిపోయి ఆమెను అనేకవిధాల ప్రార్థించారు. చివఱకు ఎల్లాగో సమ్మతించినట్లు నటించి—'అల్లా అయితే నేను మఱోబొమ్మను తెస్తాను. మఱిమీరు అడ్డుకోకుగదా'—ఉన్నది. "తల్లీ—బుద్ధివచ్చింది. మఱల ఇల్లాంటితప్పుచేస్తామా?" అన్నారు వాళ్లు. నిపుణికకు పట్టరానంత ఉత్సాహం వచ్చింది.

వెంటనే నిపుణిక శ్మశానంలోకివెళ్లింది. అక్కడ అప్పటికప్పుడే సుదర్శనం కాయోత్సర్గాన్ని అవలంబించి వున్నాడు. నిపుణిక కదలకుండా మెదలకుండా కూచున్నవాణ్ణి కూచున్నట్లే బండ్లో పెట్టుకొని అంతఃపురంలోకి వచ్చి రాణీగారి యెదుట సరకు దింపింది. రాణీగారు ఆమెకు చాలా బహుమతులిచ్చి పంపివేసి ఏన్నోవిధాల అతన్ని సమాధిలోంచి చలింప జేయుటకై పాట్లుపడ్డది. ఆలింగనాలూ, గిచ్చుళ్లూ మొదలయిన విద్యఅంథాచేశింది. కాని సుదర్శనుడు కదలకుండా,చలించకుండా ఉన్నాడు. స్థాణువత్ అథవా నల్లచట్టువత్. కాబట్టే పెద్దలు అన్నారు కూడాను:—

'సంతః కష్టశతైశ్చాఽపి చారిత్రాన్న చలం త్యపి.'
—నేమిదత్తుడు.

ఇంతవరకూ వున్న రాణిగారి మోహమంతా చివరకు విసుగెత్తి నిరాశగా మారి క్రమంగా ఒక్కొక్కమెట్టూ ఎక్కి ఇక్కడినుండీ కోపంగా ఆవిర్భవించి చివఱకు ప్రబలమైన ద్వేషంగా అలముకొన్నది. ఇక మఱి ఆ ద్వేషాన్ని ఆపుకోలేక దాన్నంతా సాహసంగా మార్చివేసుకొన్నది. వెంటనే ఆమె ఏంజేసిందనుకొన్నారూ! ఒళ్లంతా గిచ్చుకొని గాయాలు చేసికొని పెద్ద పెద్దరాగాలు తీయడం ఆరంభించింది. ఆదెబ్బతో అంతఃపురం అంతా ఒక్కమాటు గొల్లుమన్నది. ఒక్క గొల్లుమనడం మాత్రమే గాకుండా ఆ యేడ్పు ఫిరంగి దెబ్బలాగా నూటిగా వెళ్లి రాజుగారి గుండెలకు ధాంమని తాకింది. దానితో ఆయన దిందరవందరై అంతఃపురానికి పరుగెత్తికొని వచ్చాడు.

రాణిగారు ఆయన్ను చూస్తూన్నే వెక్కి వెక్కి యేడుస్తు సుదర్శనుడు తన్ను బలాత్కరించాడు— అనే మొదలయిన కృతు లెత్తుకొని స్వరమున తాళలయాదులు తప్పకుండా గానా బజాయించింది. రాజుగారి వివేకమంథా ఇదివఱకే గంగలో కలిసింది కాబట్టి వెంటనే అతన్ని వురిదీయించడానికి ఉత్తరువిచ్చాడు. అయినా సుదర్శనుడు కదలలేదు. మెదలలేదు. తలార్లు ఆయన్ని తీసికొపోయి అప్పుడే శ్మశానం ఉరిస్తంభానికి కట్టివేసి కత్తులతో ఒక్కమాటుగా కంఠానికి గురిచూసి కొట్టారు.

కాని ఏంచిత్రం జరిగిందనుకొంటారూ— అప్పుడా కత్తులు పూలమాలలై అతనికంఠానికి చుట్టుకొన్నవి. దేవతలు అతన్ని పూలతో నింపారు.

తర్వాత రాజుగారు ఈసమాచారం తెలిసి అక్కడికి వచ్చి అతన్ని ప్రార్థించి తీసికొనిపోయి యప్పటిలాగానే అతన్ని ఉంచారు. కాని సుదర్శనుడు విరక్తుఁడై తనకొడుకు సుకాంతుడికి ఆ పదవి ఇచ్చి తాను విరక్తుడై అడవులకు వెళ్లి మునియై జైనేంద్రదీక్షను పూని దర్శన జ్ఞాన చారిత్ర తపోత్యాగాదులచే కేవలజ్ఞానము నొంది నిర్బాధకమగు మోక్షపదవి నొందినాఁడు. కనుక నీ భక్తులు జినుని యిట్లు నుతించుచుందురు గదా!

శ్లో. సజయతి జినచంద్రః కేవలజ్ఞానకాంతిః
ముదిత సకల భవ్యోత్కృష్ట నేత్రోత్పలాఢ్యైః
అసుర సురనరేంద్రైః ఖేచరేంద్రైస్సుభక్త్యా
శ్రుతజలధిమునీంద్రైస్సేవిత శ్శర్మదాతా.

౧౦ పంచనమస్కార మంత్రకథ ముగిసినది.

---

# రాధికావిరహము*

మద్దూరి సాంబయ్య గారు

లలితయమునానదీతీర కలితవనుల
నొంటిమెయి నొక్క విరిపొదరింటియందు
నీపయి విరాళిఁ దాపమందెడిని రాధ
నాథ! దయచేయు, మో జగన్నాథ, కృష్ణ!

మోవితేనియ లానుచు ముద్దుగొనుచు
లాలనలుసేయు నిన్నుఁ దలంచి రాధ
మంతనంబున నీకయి మరులుజెంది
దెసలఁ బరికించుచుండె నేతెమ్ము కృష్ణ!

నిన్నుఁ గలయంగవచ్చుచు నెలఁత మిగుల
వడిగ నడువంగఁబోయి కంపంబుఁ జెంది
తొట్రిలుపదాంబుజంబులఁ ద్రోవనడుమ
సోలి పడుచుండె రమ్ము గోపాలకృష్ణ!

వలపు సెగలకుఁ దాళక వెలఁది తెల్ల
తమ్మితూడులె చే కడియమ్ములట్లు
పూని నీతోడఁగూడి సంభోగమందు
నాన జీవించియుండె రావయ్య, కృష్ణ!

మాటిమాటికి నొక వింత మండనంబు
లీలఁగైసేసి తానె శ్రీలోలుఁడనెడు
భావనాపారవశ్యమై పడఁతియుండె
నొక్కపరి చూతుగాని రావోయి, కృష్ణ!

"చెలియ, యిదియేమె తడవయ్యె చెలువుఁడింక
రాకయుండె నడుమ నుపద్రవములేమి
గలుగఁబోవుగదా" యని పలుమరు నను
నడుగుఁ గడు నాతురత రాఁగదయ్య, కృష్ణ!

కరిమొయిలులీల నలమిన యిరులఁ గాంచి
పతి యిదే వచ్చెనని బాహులతలు సాచి
కౌఁగిలించుచు మై నెఱుంగని వలపున
ముద్దిడుచునుండు మాటి కమ్ముదితె కృష్ణ!

తాను కైసేతఁగాంచి సిద్ధపడియుండి
నీవు వచ్చుట తడవైన నిలువలేక
సిగ్గువిడి నల్వురు వినంగ బిగ్గరగ మ
హార్తితో నేడ్చు రాధ రావయ్య, కృష్ణ!

ఇది జయదేవకవిరచిత
సదమలగీతంబు రసికజనులకు మిగులన్
ముదమొసఁగి కృష్ణుని పయిన్
గదలని సద్భక్తి నిలుపుఁగాతసతమున్.

---

*జయదేవకవి రచిత గీతగోవింద మహాకావ్యమందలి "నాథహరే జగన్నాథహరే" అను ద్వాదశాష్టపదికి అనువాదము.

# హరిదాసు

రాజావాసిరెడ్డి శ్రీదుర్గా సదాశివేశ్వరప్రసాద్ బహదర్ గారు

16 వ శతాబ్దియందొక పురుషుడు డిల్లీ సమీపమందలి యరణ్యములో వసించుచుండెను. ఇతని యూరుపేరులేవియో, కులగోత్రములేవియో, తలిదండ్రులెవ్వరో, పూర్వవృత్తాంతమెట్టిదో, తెలియరాకున్నవి. కాని జనము వీనిని 'హరిదా'సని పిలుచుచుండిరి. ఇత డైహికసంపదలు నశ్వరములని గుర్తించి మునిజనములకు శరణ్యమైన యరణ్యముజేరెను. అక్కడ నొక కుటీరము నిర్మించుకొని యందు నివసించుచుండెను. అక్కడ నితడు ప్రశాంతముగా గూర్చుండి పరమపురుషుని ధ్యానించుచుండువాడు. ఇట్లత డొకొకతూరి భక్తిపరవశుడై మహానంద మనుభవించుచు నాకలి దప్పులగూడ నెరుగకుండు వాడట. సంగీతశాస్త్రమున బాగుగా బరిశ్రమించిన వాడు. గాత్రము శ్రావ్యమైనది. తంబురా బట్టుకొని భక్తి తత్పరుడై పరమేశ్వరునిగూర్చి భక్తిగీతములు పాడుచున్నప్పుడు శ్రోతలకుంగూడ హృదయముం జలించి దేహము పులకరించునట్లు భక్త్యావేశముపొరలివచ్చును.

ఈతనికి 'తాన్సే'ననువాడు శిష్యుడుండెను. తాన్సే నితనియొద్ద సంగీతము జక్కగానేర్చుకొన్నాడు. తాన్సేనుడు సుగుణమణి యనిపించుకొన్న 'అక్బర్ చక్రవర్తి' యాస్థానమున సంగీతపండితుడుగా నున్నాడు. సార్వభౌముడు తనకు తీరిక గలిగినప్పుడెల్ల తాన్సేనుని పిలిపించుకొని గీతముల పాడించి యానందించువాడట. శ్రావ్యమైనవాని గీతసరణి ననేకమార్లు పాదుషా ప్రశంసించుచుండువాడు. ఇట్లతడు ప్రస్తుతించినపుడెల్ల తాన్సేనుడు 'రాజా! ఇందు నాప్రజ్ఞ యేమియులేదు. ఇదంతయు నాగురుపాదుల కటాక్షమే! నేను వారి పాదపరాగపరమాణువును. మీప్రస్తుతులన్నియువారికి జెందదగినవి.' అన్ని విన్నవించుచుండువాడు. ఈ మాటలు వాని వినయశీలమునకు నిదానములని చక్రవర్తి యనుకొనుచుండెనే కాని వానినంతగా సరకుచేయకుండెను.

ఒకనాడేలనో సార్వభౌముని మన మీమాటలపై పారినది. భగవానుడు హరిదాసుని పరీక్షించుటకీసంవిధానము సంఘటించుచున్నాడేమో? సార్వభౌముడు ఇట్లడిగినాడు. "తాన్సేన్! నీగీతములందలి మాధుర్యముచే ముగ్ధుడనై నిన్ను ప్రశంసించినపుడెల్ల నీవు నీగురుని ప్రస్తుతించెదవే అతడెవరు? ఎక్కడనున్నాడు? ఆతని గీతమాధుర్యము నాకు చవిజూపవా?" అని. అత డామాటల కేమియు బదులు చెప్పలేదు. ఎంత గ్రుచ్చి గ్రుచ్చి యడిగినను బదులు చెప్పకుండుటచే అక్బరు కోపగించెను. అప్పుడు తాన్సేనుడు "అయ్యా! అతడు ఆస్థానములకువచ్చి అడుగుకొనువాడు కాదు. సమయముచూచి ఆయనకడకు మిమ్ములీసికొని పోయి ఆయనపాట వినిపించెద" నని ఆయన

చెప్పెను. "సరే యట్లేచేయు" మని చక్రవర్తి యనెను.

పిమ్మట తాన్‌సేను ఒకనాడు పాదుషా గారిని తనవెంట తనగురువు హరిదాసు ఉన్న యడవికి తీసికొనిపోయి సార్వభౌముని ఆతని కుటీరము వెలుపల కూర్చుండబెట్టి "అయ్యా! మీరిచ్చట సడిసవ్వడి చేయక గూర్చుండియుండుడు. నేను లోపలికి బోయి యాభక్తవర్యుని ప్రసన్నుని జేసికొని పాటపాడించెదను." అని చెప్పి తాను లోపలికిబోయెను. గురునకు సాష్టాంగపడి లేచి కుశలాదికము లడిగి "స్వామీ! సంసారపు గజిబిజి పాటులచే మనస్సు చీకాకైయున్నది. భక్తిపూరితమైన తమగానమును విని చిత్తశాంతి సమకూర్చుకొనుటకు వచ్చినాను. అనుగ్రహింపకోరెదను." అనెను. హరిదా సంతట తంబురాను చేతికి తీసికొని శ్రుతిసవరించి పాడ నారంభించెను. కొంతసేపగు నప్పటికి భక్తివివశుడైన యతనిగానప్రవాహము మృదుస్వనముతో ననర్గళముగా ప్రవహింపసాగెను. కుటీరము వెలుపలనున్న అక్బరు చక్రవర్తిగూడ ఆ గాన మాధుర్యమునకు ముగ్ధుడై ఆనందపారవశ్యముచే నప్రయత్నముగ నోరెత్తి 'వహ్వారే' యని ప్రశంసించెను.

ఆధ్వని విని హరిదాసు "తాన్‌సేన్! వెలుపల నెవరో యున్నట్లున్నారే!" యనెను.

"ఔనుస్వామీ! అక్బరు సార్వభౌముడు శ్రోత్రపేయమైన మీ గానమును విన గుతూహలపడి నన్ను గోరగా తీసికొనివచ్చి వాకిట కూర్చుండబెట్టితి" నన్నాడు తాన్‌సేను. హరిదా సామాటలు విని "తాన్‌సేనూ! నీవవివేకివిగదోయీ! ఐహికభోగములలో నంటుకొనియున్నవాని నిట్లు తీసుకొని రాదగునా? అట్టియిన మన చిత్తశాంతి జీర్ణింపదోయీ! అయినను వాని నింతదూరము తీసికొని వచ్చితివి కాన లోపలికిగూడ గొనిర"మ్మనెను. తాన్‌సే నట్లు చేసినాడు. అక్బరుపాదుషా లోపలికి వచ్చి తాను సార్వభౌముడనని గర్వింపక హరిదాసు పాదములపైబడి నమస్కరించినాడు. హరిదాసు పాదుషాను కుశలమడిగి "చిరునవ్వుతో నాపాట వినుటకా యింత దూరమువచ్చితివి? ఇదిగో పాడుదును. నీమనసార విను" మనెను. అని తంబురా దీసికొని పాడసాగెను. ఆగానమాధుర్యముచే నాకర్షితములై రెండులేడిపిల్లలు పరుగుపరుగున వచ్చి యక్కడ నిలచి చెవులు దోరగించికొని వినుచుండెను. హరిదా సిట్లు కొంతసేపు పాడి విరమించెను. అక్బ రప్పుడు తన మెడయందున్న అమూల్యమైన మౌక్తికహారమును తీసి హరిదాసుని పాదములపై నిడెను. సర్వస్వము త్యజించిన సన్న్యాసి కావెలలేని ముత్తియపు పేరుతో ప్రయోజనము? మట్టిబెడ్డయు, మణియు వానిదృష్టిలో సమానము లేకదా! హరిదాసు దానిని రును తీసి తనచెంతనున్న జింకపిల్లలలో నొకదాని మెడలో వైచెను. ఆజింకపిల్లలు చెంగు చెంగున దుముకుచు పరుగెత్తిపోయినవి.

అక్బ రదిచూచి లజ్జపడి తనలో నిట్లను కొనినాడు:—"అమూల్యమైన ఈ హారము

# ౪౩-వ అఖిల భారత జాతీయ మహాసభ-కలకత్తా



౭. శ్రీ కే. యఫ్. నారిమన్‌గారు
అధ్యక్షులు, భారత యువజనసభ-కలకత్తా



౧౦. శ్రీ డాక్టరు యం. ఏ. అన్సారిగారు
భారతీయవస్తుప్రదర్శనోత్సవ ప్రారంభకుడు-కలకత్తా



౯. శ్రీ యం. ఆర్. జయకరుగారు
అధ్యక్షులు, సంఘసంస్కరణమహాసభ-కలకత్తా



౬. శ్రీ డా. జి. వి. దేశముఖగారు
అధ్యక్షుడు, అఖిలభారత వైద్యమహాసభ-కలకత్తా



౮. శ్రీ సుభాషచంద్రబోసుగారు
స్వచ్ఛంద సేవాదళ నాయకుడు, జాతీయమహాసభ-కలకత్తా



౧౧. దేశబంధునగరమున జాతీయమహాసభా ... జాతీయపతాకము



౧౭. జాతీయపతాకము చెంత
మహాసభాధ్యక్షుడు, మహాత్ముడు




౧౩. జాతీయమహాసభా మంటపసింహద్వారము



౧౮. భారతీయ వస్తుప్రదర్శనావరణ ప్రవేశద్వారము

నేనెంత కష్టపడి సంపాదించితిని. ఈయడవిజను నకు దీనివిలువ యేమితెలియును. కోతికి కొబ్బరికాయ చిక్కినట్లయినది వీని కీహారము లభించుట" అని అక్బరు పాదుషా ఆతనిగానసౌష్ఠవము గుర్తించినాడు; ఆదరించినాడు; నిరీహుడైన యతి డది స్వీకరింపకుండుటచే సిగ్గుపడినాడు; చీకాకుపడుచున్నాడు; తనహారపు విలువ దలచికొని చింతించు చున్నాడు కాని వాని యాధ్యాత్మికసౌష్ఠవమును గుర్తింపలేక పోయినాడు; దానికి విలువగట్టలేకున్నాడు. అది సామాన్యజనులకు సాధ్యమగునా? హరిదాసు పాదుషాయొక్క ముఖవికృతిచూచి ఆతని హృదయము తెలిసికొన్నాడు. తెలిసికొని మరల తంబురా మీటుచు గానమొనర్పసాగినాడు. ఆవనమందలి లేడు లన్నియు పరువు పరువుననచ్చి గానము వినుచున్నవి. వాని యన్నిటి కంఠములందును పాదుషాహారముం బోలిన వెలగలహారములేయున్నవి! ఆ విచిత్ర సంవిధానము పాదుషాచూచినాడు. ఆశ్చర్యపడి లజ్జతో తలవంచుకొనుచున్నాడు. వాని యూహాప్రపంచమంతయు స్వప్నమువలె నంతర్ధానమైపోయినది. హరిదాసుని ప్రభావము గుర్తించినాడు. అత డొక మహాత్ము డనుకొన్నాడు. తన యవివేకపు తలపుల దెలిసికొనియే యతడు తనను మృదువుగా మందలించుట కిట్టి సంవిధానము గల్పించినా డనుకొన్నాడు. మిసమిసల చూచి మోసపోయి ఐహికసుఖములు మాత్రమే యపేక్షించి పారమార్థిక సౌభాగ్యము భంగపరచుకొనరాదని తెలిసికొన్నాడు.

ఇంతలో హరిదాసు "సార్వభౌమా! వీనిలో మీహార మేదియో గుర్తించితీసికొ"మ్మని చెప్పినాడు. పాదుషా కప్పు డేమి చేయుటకు తోపలేదు. హరిదాసుని పాదములపైబడి "నన్ను క్షమింపు" మని వేడుకొన్నాడు. హరిదాసు వానిని లేవదీసి "రాజా! భయములేదు. ప్రాపంచికసౌఖ్యములే పరమార్థమనుకొనకు. సద్వ్రాత్తికలవాడవై పరలోకపాథేయమును సమకూర్చుకొనుము. న్యాయదృష్టితో ప్రజాహితముగా రాజ్యము పాలింపుము. మతపక్షపాతము లేని నీవంటిప్రభువు లభించుట ప్రజలభాగ్యము. నీకు మంగళమగుగాక! పోయిరమ్ము." అని యాశీర్వదించి పంపెను.

ఈ కథ హిందూమహమ్మదీయమైత్రి కొరకు పరిశ్రమించిన అక్బరుపాదుషాయొక్క సౌజన్యమును ప్రకటించుచున్నది.

---

# అంతస్సమాధి

శ్రీ. శ్రీనివాసరావుగారు (కవితా సమితి)

"ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికరగుంభిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతురాంతఃపురవధూప్రసాదన సరసికా !"

అని పఠించితి 'పారిజాతాపహరణ'
సత్ప్రబంధమునందు—అక్షణమునందె
మనసునకు నవశత ఘటిల్లెను! గ్రహింప
రాని ఆవేగమున చేతిలోని పుస్త
కము ధరణిపైన పడియె! అఖండవివిధ
భావభంగీతరంగ సంపదలు పొదల,
హృదయమెగసెను పూర్వ విస్మృతనితాంత
దశదిశాంత పరిశ్రాంత ధవళకీర్తి
చామరమ్ములతో సముజ్జ్వలవిభావి
రాజితమ్మగు శ్రీకృష్ణరాయభూప
మంటపమునకు—

—కవిశిఖామణు లనేకు
లదిగొ మధురాతిమధురదివ్యప్రబంధ
కథన సుధల నఖండ సుఖప్రదముగ
చిలుకుచున్నారు !—

—కృష్ణరాయలు మజ్జ్వ
లాంగడీధితు లెగసి స్వీయాక్షికోణ
నిర్గతాపాంగరుచి సమున్మేషమునకు
వింతసొగసుల నెగడించు విధము చూప
అదిగో ముదమున పారవశ్యమ్ము చెంది
మెచ్చుచున్నాడు నయన నిమీలనమున,
కప్రమదరహాసమున, శిరః కంపనమున !

* * * *

మది గలంచిన శైశిరోన్మాద రేఖ
వదలి నంతట నూత్న లావణ్యమునకు
సదమలానూన తేజః ప్రశస్తి నొసగు
శ్రీగరిష్ఠవసంతసమాగమమున
మెల్లగా వీచు పిల్ల తెమ్మెరల కులికి
కులుకు మెలకువతో నవకోరకములు
నూతన వయః పిపాసాపరీతహృదయ
సదనసంస్థిత గాఢవాంఛలకు రేగి
తెరలు తెరలగు సిగ్గుదొంతరల పొరల
మనసు బిగువున నెగజిమ్మికొనుచు, ఘనని
యోగశాంతిని కలగాంచి ఒడలు నిలువు
పులకరిల్లిన హృదయ మాపుకొనలేక
వలపుదెసల పిసాళించు వలను తెలిపి
విరిసి వెలిగి విజృంభించు వేళలందు
ఏమనోహరమంజు లారామభూమి
సౌరభానంతసౌందర్య సౌఖ్యగతుల
నందనవనోప మానంద బంధురంబొ
అదియె విలసిలు కృష్ణరాయల సభాప్ర
భాశుభాకరతలము—

* * * *

—ఆ వైభవమ్ము
అప్పటి ధరారమణ గౌరవాతిశయము,
ఆదినమ్ముల సౌఖ్యానుమోదరక్తి,
నాటి సంపత్సమృద్ధి, ఏనాటికైన
ఆంధ్రనిర్భాగ్యధాత్రికి నలవడునొకో?

# గుంటూరి పెద్దయ్యగారు

• బులుసు పాపయ్యశాస్త్రి గారు

దరిదాపుగా ఇన్నూరు సంవత్సరాల కిందట గుంటూరి త్రివిక్రమశాస్త్రి అనే పండితుడు గోదావరిజిల్లా నుండి విశాఖపట్నంజిల్లాకు వచ్చెను. ఈ జిల్లాలో తొలి మజిలీ ఉపమాకాక్షేత్రానికి పడమరగా నాలుగుమైళ్ల దూరములో ఉన్న వేంపాడు అనే గ్రామములో చేరెను. ఆ ఊరిలో అప్పుడు బ్రాహ్మణులు లేరు. సంపన్నులయిన క్షత్రియులు త్రివిక్రమశాస్త్రిగారిని ఆ ఊరిలో నిలిపిరి. త్రివిక్రమశాస్త్రిగారి వాడుకపేరు పాపయ్య. ఈపేరు ఆయనకు రావడానికి చిత్రమయిన కారణమున్నది.

త్రివిక్రమశాస్త్రిగారి తల్లి జొత్తిగా అపసంతిది, పరమ సత్యకాలము. గడుసుదనము లేశమూ లేనిది. అలాటి అపసంతివారిని వేళాకోళాలు చేయడము చాలామందికి సరదాగదా. చక్కగా, పుష్టిగా, ముద్దుగా ఉన్న తన కొడుకును (త్రివిక్రమశాస్త్రిగారిని) ఆమె యెత్తుకుని ముద్దులాడుతూ ఉన్నప్పుడు ఇరుగమ్మలూ పొరుగమ్మలూ ఆమెతో, "నువ్వెందుకు అలాగు ముద్దులాడుతావూ? ఆబిడ్డడు నీకొడుకు కాడులే" అనేవారు. వారు హాస్యాలాడుతూ ఉన్నారని గ్రహించలేని ఆసత్యకాలపు ఇల్లాలు ఆ బిడ్డను గట్టిగా సందిట బట్టుకుని ఆ హాస్యాలాడే వారితో, "నా పాపడేనర్రా, నే కనుక్కున్నానర్రా, నా పాపడేనర్రా, నాకళ్లతోడర్రా," అనేది. ఈలాగు దినదినమూ నాలుగయిదుమార్లు 'నా పాపడు, నాపాపడు' అనవలసివస్తూ ఉండేది. ఆ బిడ్డణ్ణి 'పాపడూ', 'పాపా', అని పిలుస్తూ ఉండేది. తరువాత తరువాత ఇరుగమ్మలూ పొరుగమ్మలూ, "నీ పాపడేడీ, నీపాపయేడీ." అంటూ ఆ బిడ్డడికి 'పాపడు,' 'పాప,' అని నామకరణమే చేసివేసిరి. అతడు ఎదిగిన తరువాతకూడా 'పాపయ్య' అన్న వాడుక పేరే స్థిరమయ్యెను.

త్రివిక్రమశాస్త్రిగారికి ఇద్దరుకొడుకులు. పెద్ద కొడుకు అచ్చన్నగారు, రెండవ కొడుకు పెద్దయ్య అనే వాడుకపేరు గల వెంకట శివుడు. ఈయన అన్నదమ్ములిద్దరిలో చిన్నవాడయి ఉండగా పెద్దయ్య అన్న పేరు ఎందుకు వచ్చెనో తెలియదు. దానికారణము ఆయన శ్రీ. శంకరభారతీస్వామివారితో పద్యములో చమత్కరించి చెప్పిరి. ఆ పద్యము తరువాత వ్రాస్తాను.

పెద్దకొడుకయిన అచ్చన్నగారికి తండ్రి చదువు ఏమీ అబ్బలేదు. సాము చేయడమూ, ఊరిలో రాజులతో గూడి వేటలకు వెళ్లడమూ, అడవిపందులూ కణుజులూ మొదలయిన మృగాలను పొడవడమూ—ఈ విద్యలు అబ్బినవి. ఆయనకు లోకజ్ఞానము తక్కువ, తిక్క హెచ్చు.

పెద్దయ్యగారు అలాటివాడు కాలేదు. ఆయన తండ్రివద్ద మంచి సంస్కృతపాండిత్యము సంపాదించెను. ఇంతే కాక ఆంధ్రసాహిత్యమూ కవితానైపుణ్యమూ కుదుర్చుకొనెను. ఈ విద్యలవల్ల ఆయనకు చాలా లాభమున్నూ గౌరవమున్నూ వచ్చెను.

ఆయన ఉన్న వేంపాటికి ఎనిమిది మయిళ్లదూరములో ఉన్న సత్యవరము కాకర్లపూడివారు ఏలుతూ ఉండేవారు. అప్పటిరాజుగారు విద్యాప్రియులు. 'రుక్మవతీపరిణయము' అనే ఆంధ్రప్రబంధమున్నూ, 'ప్రద్యుమ్నాభ్యుదయము' అనే సంస్కృతకావ్యమున్నూ చెప్పి, అడిదము సూరకవిగారికి సమకాలికులయి ఆయనతో వాదాలాడిన రేకపల్లి సోమనాథశాస్త్రిగారు ఆ కాకర్లపూడివారి ఆస్థానపండితుడు. మన పెద్దయ్యగారు ఆ సంస్థానాధిపతుల దర్శనముచేసి, శ్రావ్యమయిన పెద్దపెద్ద సంస్కృతిసమాసాలూ చిత్రమయిన పార్సీలబ్జులూ వేసి ఒక నవోత్పలమాల చెప్పెనట. అది నాకు దొరకిన ప్రతి నిబట్టి ఈ దిగువ వ్రాస్తున్నాను. లేఖక పాతక ప్రమాదాలు ఉన్నట్టు తోస్తుంది. ముఖ్యముగా అవి పార్సీలబ్జులలో హెచ్చుగా ఉన్నవేమో.

## నవోత్పలమాల

వీరు తెనుంగు సాము లర
  బీతర బీయతు లొప్ప గొప్ప స
ర్కారు లవల్ జమీలు దర
  ఖారుగ నేలిన రాజమాన్యహం
వీరులు డక్కనీలు తజ
  వీజుగ లాయక యున్న మేటి మం
జోరు జొహారు యాబురు మ
  షూరు మదారు ఖరారుదారు బి 4
ల్కారుషు త్రుఫ్‌సవారులు హ
  లోవలగోలు తుపాకిబారు బ
ర్దారు జిరాగుజాల సర
  దారులజారు కడాని తేరు లం
బారు మిటారు నౌబతు షు
  మారు ఫిరంగి పుకారు కుత్తినీ
డారు గుడారు పైకము కొ
  టారు మదారు బజారులందు నే 8
దారు మదారు దారుసర
  దారు సవారు షికారు లందు నే
క్మార్యరుగ నాలుమాలులు త
  యారుగ నీరి హజారమందు వే
యాలులు పెద్దపేరులు జొ
  హారులు చూచి హమీరు లౌర ద
ర్బారు ఫసందుమీలు వహ
  వా యని మెచ్చు నవాబువారు వస్ 12
షేరు బహాదరుల్ పెదవ
  జీరులు నాలులు మాలుకొన్న దా
ర్మాలుగ మోది కోటలను
  మాపి తమాము మకాము లెల్ల ఫీ
ర్మా రొనరించి మిక్కిలి మ
  రాతపు లంది రిబేజుమాలు ద
ర్బారులు దారు గేరు దళ
  వాయుల చాయలు దేరు కల్కుకై 16
జారు కడానిబాను నిమ
  చాలు తలు క్కన బందొ బస్తుగా

బోరు బజోరు కాకరల
  పూడి వజీరు లదే యనన్ మహో
దారులు పూర్ణ నిర్మల సు
  ధాకర కాంతికలాపకీర్తి వి
స్తారులు భూరి భూసుర వి
  తాన మహోహుతి గంధ గౌతమీ 20
తీర నిసర్గ దుర్గ పరి
  దీపితహర్మ్య తలాగ్రభాగ సం
చారులు, దేవ వారవన
  జాతముఖీసమ వారకామినీ
వారకరాబ్జకేలిత సు
  వర్ణమణిద్యుతి దండచామర
ప్రేరిత వాతధూత నవ
  ఫేనసమాన వితానమండపా 24
గార సువర్ణపీఠ పరి
  కల్పితరాజ్య రమామహీమహో
దారులు సేతు శీతనసు
  ధాధరమధ్య మహీతలస్ఫుర
ద్వీరవిశేష సంజనిత
  తీవ్రదవానల బాడబాగ్నిసం
హార మహోగ్రనేత్ర చటు
  లానలతుల్య పటుప్రతాప త 28
ప్తారినృపాల జాల మకు
  టార్చితపాదపయోజపీఠసం
స్కారులు, రామచంద్రపుర
  సాలనివాసులు, రామచంద్రవం
దారులు, రామచంద్రవసు
  ధావరపౌత్త్రులు, రామచంద్రవ
ద్వీరయశో విశిష్టగుణ
  విస్తృతిమంతులు, రామచంద్రధా 32
త్రీరమణాభిధానులు, వ
  రిష్ఠవసిష్ఠసగోత్రపావనుల్,
కారణజన్ములు, లబ్ధిశశి
  కల్పకఖేచరగోత్రదానదీ

క్షారతు, లిందిరాసుతేప
సంతజయంత సమానసుందరా
కారులు బ్రహ్మకల్పము సు
ఖంబుగ వర్ధిలు వార లిద్ధరన్. 36

ఈనవోత్పలమాలే కాక యీ కింద వ్రాసిన పద్య మున్నూ చెప్పిరట:

సీ. నీమేను శత్రుల నెమ్మేని కొఱఁబ్రాకు;
నీ హాగు వైరుల వెనుకసాగు;
నీ కటారరుఱంబో నీకటారుగఁ జేయు;
నీగద పరుల దం డించును గద;
నీ బల్లె మహితుల ప్రాబల్యమడగించు;
నీ శక్తి రిపుల ఖం డించుశక్తి;
నీ పంకి పరింపకి నిర్మూలనమొనర్చు;
నీ యమ్ము పరవాహినికి భయమ్ము;
నీదు కైజారు కైజాతి నిఖిలశతులఁ
దార్చు జమువీటికి నిజము ధాటి ధాటి
కడఁగి వైరుఁనోంచుఁ గాకరలపూఁడి
రామచంద్రావనీప, సూర్యప్రతాప.

పై నవోత్పలమాల శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు చెప్పినదని మొన్నమొన్న ఒకమాట వింటిని. "గౌతమీ తీర...సంచారు ౘ," "రామచంద్రపురవాసులు," అనే మాటలనుబట్టి యీపద్యము గోదావరిజిల్లాలో ఉన్న రామచంద్రపురము నేలుచుండిన కాఁకరలపూఁడివారి పయినిచెప్పిన పద్యముగా కనబడుతుంది. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారు గోదావరిజిల్లావారు గనుక ఆయనే యీపద్యము చేసినవారేమో. సీసపద్యమందున్న "రామచంద్ర" రాజుగారి పేరే ఉండడముచేత అదిన్నీ ఆయనదే యేమో. కానివిశాఖపట్నంజిల్లాలో అవి గుంటూరి పెద్దయ్యగారి పద్యములే అని చిరకాలమునుండి ప్రతీతి.

ఈకింద వ్రాసిన పద్యము వత్సవాయివారిమీద చెప్పిరట. ఎప్పుడో ఏస్థితిలోనో తెలియదు:

ఉ. భూమిపతిత్వదిగ్విజయ
భోగసమృద్ధులు గల్గి వానర,
స్తోమసహాయవంశముని
దూషణకార్శ్యము లెల్ల మాని నా,
సా మగు వత్సవాయికుల
సంభవరామనరేంద్ర చంద్రు తో
రామనరేంద్రచంద్రు లెన
రారు కృపాళిర భాగ్యకాంతులన్.

ఈ క్రింది పద్యములున్ను ఆయన చెప్పినవే అని నాకు దొరకిన పద్యాల కాకితములో ఉన్నది.

ఉ. తిట్టినఁ బర్వు తక్కువని
తిట్టఁగరా దొకవేళఁ గాక చేఁ
దిట్టినఁ జెట్టుకాయ వడిఁ
దెంచిన యట్టులు లోతు నీళ్లలోఁ
బుట్టి మునింగినట్లు పెను
బూతము గొట్టినయట్లు మారిచే
మొట్టినమాడ్కి బల్ పిడుగు
మొత్తిన భంగిఁ దుపాకి గుండుచేఁ
గొట్టినరీతి నుండవలెఁ
గో! యన లోభినృపాల కోటికిన్.

తిట్టితినా భుజంగవిష
దిగ్ధదవానలధాగధగ్య చి
చ్చిట్ట చిటార్భటీ ప్రకట
తీవ్రవచోగ్ర మహోగ్ర విస్ఫుర
ద్ఘట్టన విస్ఫులింగ లయ
కారణ కారణ లబ్ధలుబ్ధరా
ట్పట్టణ గోపురధ్వజని
పాతహతాహతిఁ గాఁగ నే మటీ
తిట్టితినా జగద్విలయ
తీవ్రనిశాతకృతాంతదంతసం
ఘట్టనజాతపావకశి
ఖాతతి భగ్గున మండఁజేతుఁ; జే
పట్టితినా సుధామధుర
పాయసగోఘృతగోస్తనీరసాల్
తట్టుపునుంగు వాసనలు
దార్కొను మత్కవితాచమత్కృతిన్.

ఉ. వ్యాకరణంబు ప్రజ్ఞగల
వాఁడని చెప్పుటె కాని రెండు వే
ల్నాలుకలుండినన్ దినము
నందొకటైనను బొంకలే,డహో!
వ్రాలిన కంకిపాటి భగ
వాను నృపాంగని ప్రజ్ఞ యెట్టిదో
నాలుక యొక్కటే, దినము
నన్ బదిలక్షలున్ బొంకు నిద్ధరన్.

చ. గురుతర ఘూర్జరకుచము
కొంగుమఱుంగుపట్ల, ద్రావిడీ
తరుణిపయోధరంబు పయి
దార్కొనుపట్టున, నాంధ్రసుందరీ
సరసగుణ స్తనంబు నర
చాటగుచోట్ల, జనాళిచేతిలోఁ
గరమరుదైనచోఁ బొడఁగు
కాయయె ................

ఈ కడపటిపద్యము ఈయనకుమారుడు పాప
య్యగారు చెప్పినదని నా వినికి.

పెద్దయ్యగారు పద్యాలు చెప్పే, తమ పాండి
త్యము మరొక విధముగా కనపరొచ్చె సత్యవర సంస్థానా
ధీశ్వరుల మన్నన పొంది వారివల్ల మాన్యాలు సంపాదిం
చిరి. అవి యిప్పటికిన్ని ఆ కుటుంబమువారు అనుభవిస్తూ
ఉన్నారు

ఆ దినములలో 'వేంపాడు' మొదలయిన యేడు
గ్రామాల కరణపుపని ఖాళీ ఆయెను. ఆ పనికోసము
చాలామంది దరఖాస్తులు పెట్టిరి. పెద్దయ్యగారిని కూడా
దరఖాస్తు పెట్టుమని ఆ ఊరిరాజులు చెప్పిరి. కాని,
"నేను కావ్యాలూ ప్రబంధాలూ చదువుకున్నానుగాని
లౌక్యవిద్య నేర్చుకోలేదు. కరణపుపనికి నే నేలాగున
తయారు పడగలను?" అని పెద్దయ్యగారు వెనుకదీసిరి. కాని
రాజులు చాలా బలవంతపెట్టడముచేత ఆయనకూడా దర
ఖాస్తు పెట్టిరి. కమీషనరు దొరగారు దరఖాస్తుదార్ల
నందరినీ పిలిపించి వారి వారికి గల అర్హత లేవో అడిగిరి,
ఎవరి ప్రజ్ఞలు వారు చెప్పుకున్న తరువాత, దొరగారు,
"మీ రందరూ బ్రాహ్మణులుగదా, మీకులవిద్య అయిన
సంస్కృతము నేర్చి ఉందురు. 'మహిమ్నస్తోత్రము'
(పుష్పదంతకృత శివమహిమస్తోత్రము) లో మొదటి
ఆయిదు శ్లోకములకూ అర్థము చెప్పగలవారు లెండి" అని
రట. పెద్దయ్యగారు ఒక్కరే నిలబడిరట. దొరగారు
పెద్దయ్యగారిచేత ఆ శ్లోకముల కర్థము చెప్పించి
సంతోషించి పయిని చెప్పిన కరణపుపని పెద్దయ్యగారి
ఇచ్చిరట. ఆ ఉద్యోగము ఆయన మనుమలవరకు
ఆకుటుంబమువారే చేస్తూ ఉండిరి.

ఆ రోజులలో తెనుగు జిల్లాలలో మతవిషయము
లలో అధికారము గల శంకరాచార్య పీఠస్థు
"ఉద్దండ భారతీ స్వాములవారు." ఆయన చాలా కఠి
శాసనుడట. ఆయన చెప్పినట్టు పాదపూజలు చెల్లించని
వారిని దెబ్బలు కొట్టించేవారట. ఆ స్వాములవారు తమ
సంచారములో వేంపాడు వస్తూవుండగా విని పెద్దయ్య
గారు ఊరిబయట స్వాములవారి తోవలోఉన్న చెరువు
గట్టుమీద కాచుకొని ఉండిరట. స్వాములవారు రాగానే
పెద్దయ్యగారు ప్రత్యుత్థానాభివందనాలు చేసి స్వాము
వారిని పల్లకీదింపించి అక్కడనే కూర్చుండబెట్టిరట
స్వాములవారు నీవే రెవరని అడుగగా పెద్దయ్యగారు

ఉ. ఆరయ వేము పాటిపుర
మందుఁ బ్రసిద్ధుడు, సద్గుణుండు, గుం
టూరుకులప్రసూతుడు, ప
టుత్వకవిత్వమహత్త్వ తత్త్వవి
ద్యారసికప్రధాన ధన
దానవిధాన నిదాన మానగం
భీరమహారసజ్ఞులను
పెద్దన 'పెద్దనఁ బెద్దయాఖ్యుఁ'డన్.

అని చెప్పిరట. స్వాములవారు విని, "తెనుగు కవిత్వ
ముక్కలు నాలుగు బడబడలాడించి పండితుడనని
వీగుతూ ఉన్నావు కాబోలు. 'ఆపోహి ష్ఠేత్యాది' మం
త్రానికి అర్థము చెప్పు, నీ పాండిత్యం చూస్తాము"
అనిరట. పెద్దయ్యగారు తడుముకోకుండా అర్థము చెప్పి
రట. స్వాములవారు సంతోషించి, "మీ గ్రామాని

వస్తాము, తోపతీయి," అనిరట. పెద్దయ్యగారు, "స్వామీ, మా గ్రామమే మీదర్శనానికి వచ్చినది. మా గ్రామంలో బ్రాహ్మణకొంప నాది ఒక్కడిదే. ఇక్కడ ప్రముఖులు రాజులు; వైష్ణవ సంప్రదాయము వారు." అనిరట, స్వాములవారు, "అయితే ఇక్కడ మాకు పాదపూజలూ భిక్షలూ ఏమీ జరుగవా?" అనిరట. పెద్దయ్యగారు, "ఇదుగో, శిష్యుడు చెల్లించు మనేపాదపూజ," అని పళ్లెములో రూపాయలు పోసి, "ఇంతకంటె ఈ గ్రామములో ఏమీలభించదు," అని సవినయంగా విన్నవించిరట. స్వాములవారు పెద్దయ్యగారిని తమవెంట దీసుకుని నక్కపల్లి వెళ్లి ఆరాత్రి తమ పండితులనూ పెద్దయ్యగారినీ కూర్చుండబెట్టి కొంతగోష్ఠి చేయించి మెచ్చి మరునాడు పెద్దయ్యగారికి 'గుర్రము కోకలు' బహుమతిగా ఇచ్చిరట. గుర్రము కోకలు ఇయ్యడమన్నది అసాధారణ సమ్మానము.

నక్కపల్లిహుండా పదిహేను గ్రామలు కొత్తగా ఇంగ్లీషువారి స్వాధీనమయ్యెను. వాటిశిస్తు వసూలు కాక చిక్కులుపడి కమీషనరుగారయిన అలెగ్జాండరు దొరగారు పెద్దయ్యగారికి ఆ హుండా గుత్తకిచ్చి రట. శిస్తులు వసూలుచేసి యిచ్చి పెద్దయ్యగారు మెప్పు పొందిరట. ఆ గ్రామములలో చిరుదొడ్డిగల్లు (దొడ్డిగిల్లు అనేది నాడుకరూపము) చిక్కులుపెట్టెనట. పెద్దయ్యగారు ఈక్రింది పద్యము చెప్పిరి:

గీ. పట్టిమాటలు గల్పింపఁ బుట్టినిల్లు
   కడమ వ్యాపారముల కరకాలిముల్లు
   గుత్తకిచ్చిన యాళ్లలో గొగ్గిపల్లు
   దొంగలకు ముడ్డిగిల్లు నీదొడ్డిగిల్లు.

ఒకసమయములో ఆయన తనవృత్తాంతము చెప్పుకోవలసి వచ్చినప్పుడు ఈ క్రిందిపద్యము చెప్పిరి.

సీ. జననాయకులు నూరి సర్వదుంబాలాగ
      మెచ్చి యేరికి మాన్య మిచ్చినారొ
   బ్రౌనుకల్పిలెక్కపట్టి కర్ణాలలో
      మెచ్చి యేరికి సెలవిచ్చినారొ
   అల్కసాండరుదొర యాదిలో నేరికి
      మెచ్చి హుండా గుత్త కిచ్చినారొ
   శంకరభారతీ స్వామివారేరికి
      మెచ్చి గుఱ్ఱముకోక లిచ్చినారొ
   అట్టియోగ్యత లెక్కల గట్టితనము
   మామలీయతు సాహిత్య మహిమములపుఁ
   బెద్దయగువారి కవ్వార లద్దితలఁపఁ
   బరగణా కర్ణము-లోకి బహదరీకి.

ఈపద్యము ఆయనే చెప్పినదో ఆయనను పొగడుతూ మరియెవరైనా చెప్పినదో తెలియదు.

పయిపద్యము లన్నింటిలోనూ నెరసులు కనపడవచ్చును. అవి కవివో లేఖకపాఠములవో చెప్పజాలను. పద్యములు నాకు దొరికిన కాకితములలో ఏలాగు ఉన్నవో ఆలాగువ్రాసినాను. ఆయన పాండిత్యము గొప్పదయినా కొద్దిదయినా సత్యవరసంస్థానమువల్ల మాన్యాలు సంపాదించెను దొరగారివల్ల ఏడుగ్రామాల కరణపు పని సంపాదించెను. శంకరాచార్యుల వారివల్ల గుర్రము కోకలు సంపాదించెను.

పెద్దయ్యగారి అన్నగారు అచ్చన్న గారు విద్యాంసులుకారు. ఆయనకు తిక్కహెచ్చు. కటుంబము ఆస్తి అంతా పెద్దయ్యగారు సంపాదించినదే అయినప్పటికీ కొందరి దుర్బోధవల్ల అచ్చన్నగారు ఆస్తి పంచిపెట్టమని తమ్ముణ్ణి బలవంతపెట్టెరి. పెద్దయ్యగారు "మనకు పంపకమనగా ఏమిటి? మన ఆస్తిలో మీకు కావలసినది మీరు పుచ్చుకోండి" అనిరట. అందుపయిని తిక్కఅచ్చన్నగారు ఇంట్లోనుండి రుబ్బురోలూ పొత్తరమూ తెచ్చి,'రుబ్బురోలునాదీ' పొత్తరము నీదీ' అనిన్నీ సన్నెకల్లూపొత్తరమూ తెచ్చి,' సన్నెకల్లునీదీ,పొత్తరము నాదీ," అనిన్ని, రోలూ రోకళ్లూ తెచ్చి, "రోలు నాదీ, రోకళ్లునీవీ," అనిన్ని,ఈలాగే పీటలూ మంచాలూ పరుపులూ మొదలయినవి పంచి,"దానీసుబ్బిని పిలువు, దానిని ఈ ఫిరంకత్తితో రెండుముక్కలు చేస్తాను, నీకోముక్కా నాకోముక్కా," అనిరట. పెద్దయ్యగారు లోలోపల నవ్వుకొని, "మన ఆస్తిలో నాకు వంతు అక్కరలేదు. ఈ

ఆస్తిఅంతా మీతోప పుతాన; మీరు సత్యవరమువెళ్లి అక్కడి మనమాన్యాలు అన్నీ మీరు అనుభవిస్తూ సుఖముగా ఉండండి" అని బళ్లమీద సామాను కట్టించి అన్నగారితో సత్యవరము పంపిరి.

అన్నన గారి మామగారు కొల్లూరి బాపన్నగారు. ఆయనా తిక్కవారే. అల్లుడు జయంతి సోమన్నగారు, ఆయనా తిక్కవారే. వారి తిక్కలు చూచి పెద్దయ్యగారు ఈ కింది పద్యము చెప్పిరి.

క. కొల్లూరి బాపనాఖ్యుని
కల్లుడు గుంటూరి యచ్చ నాఖ్యుఁ డటనిక్క
అల్లుఁడు జయంతి సోమన;
అల్లురకును మామగార్ల కజుఁడొనఁ గూర్చెన్.

పెద్దయ్యగారికి ముగ్గురు కొడుకులు. వారిలో దవవారైన పాపయ్యగారికే యింటివిద్య అబ్బెను. ఆయనను గురించి మరొకమారు వ్రాస్తాను.

---

# భరత ధాత్రి

బండారు తమ్మయ్యగా

విజ్ఞాన సర్వస్వ విఖ్యాతిగైకొన్న వేదముల్ గన్నపవిత్రవాణి
దేవదుర్జేయుఁడౌ రావణుఁ బొరిగొన్న శ్రీరాముఁ గాంచిన వీరమాత
ప్రాణకుట్టనమైనఁ బలికి బొంకని బలిదానవేంద్రునిఁగన్న దానశీల
సత్యార్థమై కష్టశతములువడిన హరిశ్చంద్రుఁగన్నసూనృతచరిత్ర
షేక్స్పియరాదులఁ జిన్నవుచ్చెడు మేటి కాళిదాసునిఁగన్న జ్ఞానరాశి
తరతరంబులనుండి పరదేశనరపతి ప్రతతి కన్గుట్టిన రత్నగర్భ
కూర్మితో నెప్డు ముప్పది కోట్లప్రజల భవ్యజాహ్నవీముఖనదీపయము లొసఁగి,
లీలఁ బాలించు వింతబాలెంతరాలు స్వర్గసౌఖ్యప్రదాత్రి, శ్రీ భరతధాత్రి.

---

# మైసూరు సబ్బుపరిశ్రమ చిత్రములు



౧. గవర్నమెంటువారి సబ్బుఫ్యాక్టరీ భవనము-బెంగుళూరు



౨. సబ్బులను తయారుచేయు యంత్రములు.



3. సబ్బుబిళ్లలకు ముద్రలు వేయుట



४. సబ్బుబిళ్లలను కాగితములలో చుట్టుట



౫. సబ్బుపెట్టెలను ఎగుమతికొఱకై రైలుస్టేషనుకు పంపుట



౬. మైసూరు దసరా ప్రదర్శనమునందు ప్రదర్శింపబడిన గవర్నమెంటువారి సబ్బుఫ్యాక్టరీ శాల



౧. ఎస్. జి. శాస్త్రిగారు

[illegible]

వీరు ప్రప్రథమమునుండి గవర్నమెంటువారి సబ్బుఫ్యాక్టరీకి అధికారిగా నుండుచున్నారు.

౨. సబ్బును కాచుటకు తొట్టి

# మైసూరునందు సబ్బు పరిశ్రమ

(బి. సుబ్రహ్మణ్యముగారి ఆంగ్లవ్యాసమునుండి)

౧

పరిశుభ్రముకొఱకు హిందువులు షీకాయ, కుంకుడుకాయ, కొన్ని చెట్లపట్టలు, క్షారము గల మట్టి (సర్జికా) మొదలగువాని నుపయోగించుట యెక్కువ. ఇప్పుడు సంవత్సర సంవత్సరమునకును సబ్బుల యుపయోగమును హెచ్చగుచున్నది. పశ్చిమ దేశములలో నీసబ్బుల కిదివరకెక్కువ వాడుక యున్నను భారతీయులును సబ్బువాడుక యందు త్వరాభివృద్ధి ని గాంచుచున్నారు. ముతుకరకముగాను, ఆధునిక శాస్త్రీయపద్ధతులవలన నాగరికముగాను కూడ భారతదేశమందు చేయబడు సబ్బులు కాక 1926-27 సం॥ విదేశములనుండి రూ 1, 59,00,000 విలువగల సబ్బులు దిగుమతి యైనవని యొకరిలెక్కవలన తేలుచున్నది.

సబ్బులుచేయు విధము సూత్రరూపమున చాల సులువు. కాస్టిక్‌సోడాతో కలిపి తైలములు క్రొవ్వులు ఉడుకబెట్టి గ్లిసరిన్ చేర్చిన యెడల సబ్బు తయారగును. సోడియమ్ లవణములయొక్కయు క్రొవ్వుగల అమ్లముల యొక్కయు కలయికయే సబ్బు.

౨

1916 వ సం॥ చెన్నపురి వస్తుపరిశ్రమల ప్రదర్శనమునందు సర్ ఫ్రెడరిక్ నికాల్‌సన్ గా రుపన్యసించుచు "స్థితిగతులు ప్రతికూలముగా నుండిన తప్ప యేదేశమందైనను కావలసినంత ఉపయోగకరమగు ముడిపదార్థము దొరుకునప్పుడు దాని నుపయోగించుకొని మంచివస్తువులు తయారుచేయకపోవుట దోషమే యగును" అని చెప్పిరి. ప్రపంచమంతటిలోను భారతదేశమున నూనెనిచ్చుపదార్థములు చాల ఉత్పత్తియగుటచే నూనె చవుకగాను యెక్కువగాను కావలసిన యే పరిశ్రమయైనను భారతదేశమందు వృద్ధిపొందుట కవకాశములు గలవు. సబ్బు తయారుచేయుటకు భారతదేశము మిక్కిలి తగియున్నది. సబ్బు తయారుకు కావలసిన ముడివస్తువులలో ముఖ్యమైనవి నూనెయు, కాస్టిక్ సోడాయును. 100 కి 85 వంతులు తైలములును మిగత 15 వంతులు కాస్టిక్‌సోడాయు నవసరమగును. అంతేకాక ప్రపంచమున సబ్బుచేయు దేశములన్నియు నెక్కువ నూనెనిచ్చు పదార్థములు కలవికావు. భారతదేశమొక విషయమున వీటిని మించిన యవకాశము కలది. విదేశములు మొదట నూనెపదార్థములపై రవానాఖర్చుల నిచ్చుకొని, పిదప తయారైన సబ్బులకును ఖర్చుల నిచ్చుకొనవలయును. అనగా ముడిపదార్థములపై 100 కి 85 వంతులపై మొదట రవానా ఖర్చులుపెట్టి తీసికొనిపోయి, తయారైన పదార్థముపై నూ

టికి నూరువంతులకును ఖర్చులుపెట్టికొని మన దేశమునకు చేర్చిన వెనుక నే విదేశీయులు తమ సబ్బుల నమ్ముకొనవలసియుందురు. మన దేశ మున దిగుమతియగు సన్నివస్తువుల విషయ మునను సుమారుగా నీవిషయమే నిజము. మన దేశములోనే సబ్బులు తయారైన నూటికి 15 వంతులు ముడిపదార్థములు, కాస్టిక్ సోడా, కొఱకైయే మనము రవానా ఖర్చులు పెట్టు కొనవలయును. మన దేశములోనికి దిగుమతి యగు సబ్బులన్నిటిపైనను నూటికి 15 చొ॥ పన్ను విధింపబడుచున్నది. ఇదియు భారత దే శమున సబ్బు పరిశ్రమకు తోడ్పడుచున్నది. భారత దేశపు సబ్బుల చెల్లుబడియు భారత దేశ మున నే యుండును గాన తయారుచేయువానికిని సులువు. భారతీయ కార్మికుని పని బాగుండ నిదో, వానికిచ్చు కూలియు తక్కువయే కదా.

ఈ విషయములను గమనించిన మన దేశ మున సబ్బుపరిశ్రమ యద్భుతముగ సాగగల దను నుత్సాహము కలుగును. కాని ప్రతికూల విషయములును కొన్ని కలవు. విదేశమున వస్తువులు చేయువారు పెద్దమొత్తున నొకే సమ యమున లెక్కలేనంత సామగ్రి చేయగలుగు టచే వారి తయారుధర యెక్కువ యుండదు. మరియు విదేశములలోని వస్తునిర్మాతలు సు మారు నూరేండ్లుగా సాంకేతిక విద్యయందు గొప్ప నైపుణ్యమును అనుభవమును గలిగి యుండుటయు వారికొక గొప్పబలము. అసలు మొదటనే విదేశవస్తు నిర్మాతకు పెట్టుబడిఖర్చు లెక్కువ యుండకపోవుటచేత మూలధనము నకు వడ్డీ ఖర్చు మొదలగునవి సంవత్సరసంవత్స రమునకు నెక్కువ యుండవు. ఈ కారణము వలననే మరమ్మతులకును, ప్రాతయంత్రము విడిచి క్రొత్తయంత్రములు కొనుటకును కావ నగు ఖర్చు తక్కువయగును. తయారుచేయు వస్తుసామగ్రి పెద్దమొత్తుబడిమీద యెక్కువ యగుటచేతను, కాయకష్ట మెక్కువ లేకుండ యంత్రములమూలముననే యన్ని పనులను చేయించుకొను నుపాయము లుండుటచేతను యూరపుఖండమునం దేచోటనైనను భారత దేశమం దేపట్టణమునకంటెనైనను సబ్బుచే యుటకగు వ్యయము తక్కువయగును. తయా రైనవస్తువుల వ్యాపారముగూర్చి చూతుము నిన నేడు భారత దేశమున రైల్వేరవానా ఖర్చులు చాల యెక్కువ. మద్రాసునుండి బెం గుళూరునకుగాని బెంగుళూరునుండి బొంబా యికిగాని యగు రవానాఖర్చు విదేశమగు ఇం డనునుండి భారత దేశమున బొంబాయి, కరాచీ, చెన్నపురి, కలకత్తా; యే నగరమునకు గాని యగు వ్యయముకంటె హెచ్చు. నిర్భాగ్య మగు మన మాతృదేశమున యే పరిశ్రమగాని వృద్ధినొందుట కీవిషయ మొక గొప్ప యవరో ధము. ఇంతేకాక భారత దేశమందుకంటె పారి శ్రామికవిషయములం దెక్కువ యభివృద్ధిగాం చిన విదేశములయందు వ్యాపారమునకు పెట్టు బడివిషయమున సహాయము చేయుటయందు ప్రభుత్వమువారైననేమి, యితర ప్రత్యేకవ్యక్తు లైన నేమి మిక్కిలి యుదారముగను ఉపకా రబుద్ధితోను ఉందురు. ఆధునిక విదేశీయ వ్యా

పారమునందొక శతాబ్దముకంటె హెచ్చు అనుభవము, ప్రకటనలద్వారమున వ్యాపారప్రచారము, ముఖ్యవ్యాపారమునకు తోడుగ నితర చిన్నచిన్న పరిశ్రమలు; ఇవన్నియు నుండుట వలన యూరపుఖండపు వస్తునిర్మాతలు ప్రపంచమందరితోడను వ్యాపారమున పోటీతగిలి గెలువగలుగుచున్నారు. ఈమధ్యనే క్రొత్తగా రసాయనిక పరిశ్రమాదులయందు ప్రవేశించి చిన్న యంత్రసాధనములను కొలది పెట్టుబడిని మాత్రము కలిగిన భారతీయ వస్తునిర్మాతలీ పోటీయందు జయ మొందుట కష్టము కదా. మొన మొన్నటివఱకు భారత దేశమున రసాయనసాంకేతికశాస్త్రజ్ఞులు బహుకొలదిగ నుండుటయు నిజముగ నొక లోపమే. ఇప్పుడట్టివారు వలసినంతమంది యున్నారు; వ్యాపార పరిశ్రమలకొఱకు తమకాలమును శక్తిని వినియోగించి పాటుపడుచుండు పెట్టుబడిదారులట్టివారి సేవాసహాయములను వినియోగించుకొనకుండిన దోషము వారిదే యగును.

### 3

మైసూరు సంస్థానప్రాంతముల లభించు ముడిపదార్థములతో మంచిరకపు సబ్బులు తయారుచేయు నవకాశముల విషయమున బెంగుళూరు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్‌సైన్స్ నందు వరుసగ కొన్ని పరిశోధనలు గావింపబడిన పిదప 1917 వ సం॥ బెంగుళూరునందు మైసూరు ప్రభుత్వమువారి వలన నొక సబ్బు ఫ్యాక్టరీ స్థాపింపబడెను. మైసూరునందు పరిశ్రమల నన్నిటి నభివృద్ధిచేయుటకు దివాను సర్. మో. విశ్వేశ్వరయ్యగా రేర్పరచిన విధానమం దిదియొక భాగము. ఇంగ్లాండునుండి యంత్రసాధనములు తెప్పింపబడి 1918 సం॥ మే నెలనుండి యంత్రశాలయందు పని యారంభింపబడినది. మైసూరు ప్రభుత్వమున పారిశ్రామిక రసాయనికుడును, రసాయన యంత్రశాస్త్రజ్ఞుడును, ఇంగ్లాండునందలి సన్‌లైట్ సబ్బు ఫ్యాక్టరీ యందు ప్రత్యేక శిక్షణమును బడసినవారునైన శ్రీ యస్. జి. శాస్త్రి, బి. యే. యమ్. యస్. సి. (లండన్), యఫ్. సి. యస్. యఫ్. యమ్. యు. గారు వ్యవహర్తగనుండి పనుల సాగించుచున్నారు.

మొట్టమొదట, బజారులోదొరుకు మంచిరకపు బట్టలుదుకు సబ్బుతో నేవిధముగను తీసిపోని బట్టలసబ్బును మాత్రము తయారుచేసిరి. కాని మఱి కొలదికాలములోనే మంచిరకపు అందమైన ఒళ్లుతోముకొను సబ్బులు చేయుటారంభించి 1918 నవంబరు నెలలో మైసూర్ టాయ్‌లెట్ సోప్స్‌ను విక్రయించుటారంభించిరి. మైసూరు ప్రభుత్వమువారు స్థిర పద్ధతులపై నేర్పడిన పరిశ్రమలను ప్రోత్సహించి యభివృద్ధిచేయుచు సంస్థానమున నున్న యితరపరిశ్రమలకును, వస్తునిర్మాతలకును ఆదర్శప్రాయముగ నుండునట్లు తమ యంత్రాలయములోని వస్తువులు అత్యుత్తమమైనవిగను నమ్మకమైనవిగనునుండునట్లుచూచుచున్నారు. అందుచే నీ యంత్రాలయము నవీన నాగరిక

పద్ధతులపై నడుపబడుచున్నది. పెట్టుబడిగా వ్యయపరచిన మూలధనమంతయు, దానిపై వడ్డీతోసహా నేడు మైసూరుప్రభుత్వమువారికి వచ్చివేసినది.

ఈ సబ్బులు తమకొక పేరును గడించికొన్నవి. భారతదేశమున నన్నిప్రాంతములవారిచే నుపయోగింపబడుచున్నవి. మైసూరు చందనపుసబ్బు చాలమంది యెరుగునదే. ఈ యంత్రాలయాధికారులు తమ సబ్బులు యేవిధమగు కల్తీగాని లేక చెడుపదార్థములు చేరనివైయున్నవని పూచీకత్తు (హామీ) నిత్తురు. అధమము పది ఆంగ్లేయుల యంత్రశాలలయందును, మరన్ని భారతీయ యంత్రశాలలయందును, నేడీ చందనపుసబ్బులను తయారుచేయుటయే యిక్కడి చందనపు సబ్బుల శ్రేష్ఠతకు నిదర్శనము. ప్రపంచమంతటిలోను మంచి చందనపు నూనె యెక్కువగా గలదగుటచే మైసూరుసంస్థానమున శ్రేష్ఠమైన చందనపు నూనె సబ్బులు తయారుకాగలవు. చందనపుసబ్బేకాక యింక మూడు నాలుగు విధములసబ్బులు నిచ్చట చేయబడుచున్నవి. టర్కిష్ బాత్ సబ్బు, కార్బాలిక్ సబ్బును తయారగుచున్నవి. వైద్యాలయములందును, ఆరోగ్యసంస్థలందును, క్లబ్బులందును మిక్కిలి యుపయోగపడునట్టి యొకవిధమైన తేలిక సువాసనగల ద్రవరూపమైన సబ్బును తయారుచేయుట యీ మధ్యనే యారంభించిరి. బెంగుళూరులోను, మైసూరులోను, సివిల్ మిలిటరీ వైద్యాలయములందీ ద్రవరూపమైన సబ్బు నుపయోగించుచున్నారు. ఈ వస్తువుయొక్క యుపయోగతకు తృప్తినొంది చెన్నపురి జనరల్ హాస్పిటల్ వారును దీని యుపయోగము నారంభించినారు. ఇట్టి ద్రవరూపమైన సబ్బు అమెరికాయందును యూరపు ఖండమునందు నుపయోగింపబడుచున్నది. గ్రేట్ బ్రిటన్‌లో ను యిప్పుడిప్పు డుపయోగించుచున్నారు. భారత దేశమునమాత్రమిట్టిది మొదటి ప్రయత్నమేకాని జయప్రదమైనది. కాలక్రమమున నిది తగు నాదరమును బడసి పేరుపొందునని యాస కలదు.

మైసూరుప్రభుత్వ సబ్బుఫ్యాక్టరీని స్వయం పోషకమగునట్లు చేయుటకొక ఎలెక్ట్రొలైటిక్ ఆల్‌కాలీ ప్లాంట్‌ను స్థాపించి దానిద్వారా ఫ్యాక్టరీకికావలసిన కాస్టిక్ సోడానంతయు తయారు చేసుకొనవలెనను నుద్దేశ్యము కలదు. బెంగుళూరునందు విద్యుచ్ఛక్తి చాల చవుకధరకు లభించును; ఇండియాప్రభుత్వమువారివద్దనుండి పన్ను (duty) లేకుండ ఉప్పును సులభముగా పొందవచ్చును. ఇచ్చట తయారగు కాస్టిక్ సోడా యంతయు బెంగుళూరులోనే ఖర్చుకాగలదు; అందుచేత నొక ఎలెక్ట్రొలైటిక్ ఆల్‌కాలీ ప్లాంట్ నేర్పరచి ఫలితమును పరీక్షించి చూచుటకు మంచి యాశావంతమగు నవకాశములు కలవు. ముతకరకపు గ్లిసరిన్ తయారు చేయుట కొక వాక్యూమ్ ఇవాపొరేటర్

తెప్పింపబడినది; త్వరలోనే దానిని నిర్మించి పని నారంభింతురు.

మైసూరుప్రభుత్వమువారీ క్రొత్తపరిశ్రమను నెలకొల్పుటవలన సంస్థానమున ప్రత్యేక వ్యక్తుల ప్రయత్నములకును ప్రోత్సాహము కలిగినది. నేడు బెంగుళూరులోనే సంవత్సరమునకు సుమారు నాలుగులక్షల రూపాయల వ్యాపారమును చేయు మూడునాలుగు సబ్బు యంత్రాలయములు కలవు. ముందు చెప్పబడినట్లు మైసూరు దర్బారువారి విధానమేమన: క్రొత్తకొత్త పరిశ్రమల నారంభించుటయు, భారతదేశమునను ఉత్తమతరగతి వస్తువులు తయారుకాగలవని చూపుటయు. సంస్థానములోని ప్రత్యేకవ్యక్తులగు వ్యవహారికులు సిద్ధపడి యీ ప్రభుత్వమువారి పారిశ్రామిక సంస్థలను తీసుకొని జయప్రదముగ నడుపగలమను హామీ నిచ్చుచో ప్రభుత్వమువారు వీనిని ప్రజలకు బదలాయింతురు (లోబరతురు.)

౪

సబ్బు పరిశ్రమకు సంబంధించినంతవరకు, భారతదేశమున నత్యుత్తమ తరగతి సబ్బులు తయారుకాగలవని యనేకమారులు నిరూపింపబడినది. ఈ పరిశ్రమ బాగుగా వృద్ధినొంది వ్యాపించుటకు కొన్ని యార్థికాంశము లడ్డు తగులుచున్నవి. అంతేకాక, స్వదేశ పరిశ్రమలను గట్టిగా ప్రోత్సహించుటకు వలయు జ్ఞానవంతమగు ప్రజాభిప్రాయమింకను కొఱవడియున్నది. కాని పరిస్థితులు యేయేట సుభసూచకముగ మారుచున్నవి. భారతదేశమున నేడు కొన్ని పరిశ్రమలు చక్కగా కొనసాగజాలకుండుటకీ స్వదేశపరిశ్రమాభిమాన లోపమే కారణము. లేనియెడల సర్ పి. సి. రే గారి యధ్యక్షతక్రింద నారంభింపబడిన కలకత్తా సోప్ వర్క్సువారి పని చాలింపబడియుండకుండును. ఒక్క సబ్బులకొఱకే భారతదేశమునుండి సంవత్సరమునకు సుమారు ఒకటిన్నర కోట్ల రూపాయలకంటె నెక్కువ విదేశములకు పోవుచున్నవి. సబ్బు వాడుక యెక్కువగుచున్నకొలది యేయేట నీ మొత్తము మెక్కువకూడ నగుచుండును. మన దేశమునుండి పరదేశముల కేకధారగా పోవుచున్న యీ ధనప్రవాహమును దేశాభిమానులింకను నెన్నాళ్లు సాగనిత్తురు? ఈ యపార ధనప్రవాహము నాపుటకు జ్ఞానవంతమగు ప్రజాభిప్రాయమే ముఖ్యావసరము.

జ. బ్రహ్మానంద




శాసన పరిశోధకుడు

# శ్రీయుత రామన్ మహాశయులు

మండాది రామనాథం గారు

యమ్. ఏ., డి. యస్‌సి. (ఆనర్స్) యఫ్. ఆర్. యస్.

క. ఉప్పర మెగసి యజాండము, చిప్పలు రాలంగ మేరుశిఖరంబులపై
గుప్పించి యెగసి కొండు నొ, తప్పక నామనసులోని తహతహదీరన్.— శ్రీనాథుఁడు.

మహాత్ముల జీవితము లత్యద్భుతములు. అద్భుతము లన్నమాత్రమున నే పామరుడును వారల చరిత్రములతో వన కానిశ్యక మేమని నిరుత్సాహపడ నవసరము లేదు. అనసూయమైన మనస్సుతో వారల చర్యల నెన్నడేని



శ్రీయుత రామన్ మహాశయులు

దలచుకొనిన దన్మయత్వము గలుగునన్న యావంతయు నతిశయోక్తి లేదు. వారల నర్థము చేసికొనవలెనన్న నన సూయమైనబుద్ధిమాత్రము కావలయును. అందులకనే శ్రీకృష్ణభగవానుడు తన భగవద్గీత నట్టి నికృష్టమైన తార్కిక విమర్శనకైనను జవా బిడగలుగు దానినిగా జెప్పినను నప్పుడప్పుడు తన నర్థముచేసి కొనుట కనసూయమైన బుద్ధి కావలయునని వక్కాణించియున్నాడు.

మహాత్ముల చరిత్రము లద్భుతములు మాత్రమే కాదు. అవి పావనములు కూడను. మనము చీఁటిలో బడి దారిదొరకక యవస్థపడునపుడు, వారల చరిత్రలు, వారల యాదర్శములు, వారల భావములు తేజోమయములై మనల నజ్ఞానాంధకారమునుండి విముక్తులను జేయ సమర్థములై యున్నవి వారల ప్రకాశ మొక పర్యాయము కేవలము గడ్డిపోచపైన బ్రసరించిన నాగడ్డిపోచకూడ నొకానొకకాలమునకు ఉత్కృష్టదశనందుటకవకాశ మేర్పడును.

ఒక సంఘముయొక్కగాని, ఒకదేశముయొక్కగాని, వ్యక్తిత్వమును నాగరికతయును స్ఫుటముగా గుర్తింప వలయునన్న, ఆసంఘములోనిగాని, ఆదేశములోనిగాని, మహనీయుల చరిత్రములను, యాదర్శములను దిలకించుటయే ముఖ్యమన్న ఎవరును అపార్థము చేసికొనరని భావించెదను. తదితరులచరిత్రలను శోధనచేయుట యన్న ఒక మూర్ఖుడు గణితశాస్త్రమునందు త్రిభుజము యొక్క మూడు కోణములు కలసి 180 డిగ్రీలని నిరూపించుటకు గాను, తనకు శక్తి యున్నంతవరకు, లేక తనజీవితకాలమంతయు వేరువేరు త్రిభుజములను గీయుచు వాని కోణములను కొలచుచుండిన ట్లుండును.

ఈరాత్రి నేనొంటిగాగూర్చొని శ్రీరామన్‌గారి చర్యలనుగూర్చి, జీవితమునుగూర్చి యాలోచించినప్పుడు పైన జెప్పిన భావములే నాయాలోచనములను గప్పివేసినవి. మొదట ఎచ్చటలేని యాశ్చర్యభావము, తదుపరి నా పామరత్వమును నేమరచిపోయి పారవశ్యభావమును బొందితిని. మా దేశము పరదేశీయుల ఇచ్ఛాప్రభుత్వమునకు

లోబడి తన వ్యక్తిత్వమునుజూపుట కవకాశములు చాల తక్కువగనున్నను, మా దేశముయొక్క దాస్యనివృత్తియను బలవత్తరమైన యవసరమనునది గాంధిమహాత్మునివంటి దేశభక్తులను బడయుటయేగాక శాస్త్రపరిశోధనకు గావలసిన పారతంత్ర్యరహితమేమి, భాగ్యవంతత్వమేమి,యను నవకాశములు మా దేశమున పూజ్యములైనను, పేరెన్నికగన్న యిరోపియన్ శాస్త్రజ్ఞులతో—గొప్పయవకాశములుండి గొప్పవారలైన శాస్త్రజ్ఞులతో—తుల్యమగు పీఠము నలంకరింపసమర్థులగు శ్రీరామన్ మహాశయునివంటి అధిక మేధాశాలిని మా దేశము బడయగల్గినదని తలచుకొనిన, యే స్వదేశీయునకు పరమానందము కల్గకుండును? అట్టియానందోద్రేకమే ఈమహాశయునిగురించి మా తెలుగువారలకు తెలియబరచవలయునను కోరికకలుగజేసినది. ఈవ్యాసమునం దాయనను మహనీయునిగా నేనెందులకు భావించినది చదివిన కొలది క్రమముగ తేటపడగలదు. ఆయననుగూర్చి వ్రాయుటకు బూర్వ మేశాస్త్రమునం దాయన ప్రవీణత వహించియున్నాడో ఆ పదార్థవిజ్ఞాన శాస్త్రవిషయమై చదువరులకు,వేర్వేరుశాస్త్రములయందు దానికి గల స్థానమును గుర్తించుటకై కొంతపరిచయము కలుగజేయ సాహసించెదను.

ప్రకృతిశాస్త్రములు ప్రకృతిని వర్ణించుశాస్త్రములు. ప్రకృతియందు వింతలను కనుగొని వాని నలవాటుపగచుకొనుట ప్రకృతిశాస్త్ర ఉద్దేశ్యములలో ముఖ్యమైనదియని చెప్పవచ్చును. అలవాటుపరచుకొనుటయనునది ముఖ్యముగా గమనింపవలెను. అయ్యదియే, ప్రకృతిని జూచి ఆనందించు కవిత్వమునుండి మన ప్రకృతిశాస్త్రములను స్పష్టీకరించును. కవి యెంతసేపటికి ప్రకృతిలోనివింతలను జూచి గంతులువేయుచు సంగీతము పాడుచుండును. తనకిం తాశ్చర్యము కలుగజేసినదానికి కారణమేమోయను విమర్శన మాతని కుండదు. అట్టి విమర్శనయే యున్న అతని ఆశ్చర్యము కొద్దికాలమమాత్రమే యుండగలదు.అప్పుడు కవిత్వమున కవకాశమేయుండదు. కావున ప్రకృతి నర్థము జేసికొనుటకు, కవిత్వము ప్రథమసోపానమైనను, 'తల్లీనతావాప్తి'చే ప్రకృతిని నిజముగా నానందించుట కంతరాయమై యున్నది.

ప్రకృతిలోని వింతలను జూచుటయే కవి
యొప్పుకొనబడిన,ప్రకృతిశాస్త్రజ్ఞుడు కవియై యుండ
నని చెప్పవచ్చును. కవిగాకుండుటయే, మనము
చాలమంది ప్రకృతిశాస్త్రజ్ఞులు నిజమైనశాస్త్రజ్ఞ
కుండుటకు కారణము. కవి యానందము నిచ్చువా
యని (నా పైమాటలచే)కవియై యుండవలసిన, ప్ర
శాస్త్రజ్ఞులయొద్దకు వెళ్లి ఆనందమునకు బదులు
మునుగూడ బడయుట అరుదుకాదు. "వింత"
మాటకు గొంతయర్థమును చెప్పవలసియున్నది.
తెలయనిదే వింత. అదేకాదు; మన కిదివరకు తెలిసిన
మూలకముగా అర్థము చేసికొనుటయే వింత నగు
కొనుట. ఒక్కొక్కప్పుడు మన కంతయు తెలిసిన
బొరపడుచుందుము. అట్టివానిలోనుండి మేధాశా
శాస్త్రజ్ఞుడు వింతలను జూపగలడు. అనగా మామూ
న్యముగా దోచు విషయములనుండియే అతి
విశేషమును బడయగలడు. చూడుడు! ఆనం
గెలీలియోయొక్క అధిక మేధాసంపత్తిని!
దినమున తనకుమాత్రమేగాక ఇతరుల యెదుట
డుచు ఉయ్యేలలూగుచున్న ఒక దీపమును జూ
యవస్థయందున్న మరి యేవస్తువునకుగూడ చెందు
కొన్ని సిద్ధాంతములను నిరూపించినారు. (Lamp
pendulum) ఈసందర్భమున ప్రకృతిశాస్త్రవిషయ
మరియొకసంగతి జ్ఞాపకమునకు వచ్చినది. అయ్య
తియందొకచోట నొకవిశేషమును కనుగొని, దాని
తియంతకును యేయేయవస్థలం దాధర్మము చెం
కనుగొనుటకూడను. ఇది మన శ్రమలను చాలవరకు
చును. ఇది మన శ్రమలకు విరామమునొసగి ఫలము
చెప్పవచ్చును. ప్రతివస్తువుయొద్దకు వెళ్లి నీసంగతి
యని యడుగకుండ మేధాశాలియైన వాడు తన
బుద్ధిచే (Analytical mind) సర్వాంగీకారమైన
మును బడసినప్పుడు వాని యానందమునకు మేర
డదు. ఆసంగతి నితరులకు దెలియబరచిన వారలు
య్య మనకష్టములనుండి బయట బడితిమి. దురా
ముగానున్న ఈప్రకృతి, చివరకు కొన్నిధర్మముల
నైనదే" అని మనస్సునకు విశ్రాంతి కలుగును.

ప్రకృతి సాధ్యమైనదికదా యని పూర్తిగా గర్వమును చెందకపూర్వమే, మరల ప్రకృతి యసాధ్యమైనదిరా యని వెంటనే యనిపించును. ఏమన ఎవరైన ప్రపంచమున జరుగు ప్రతిసంగతికి కారణమును జెప్ప సమకట్టిన, అప్పుడు ప్రకృతియొక్క విచిత్రమును, దాని యనంతత్వమును దానిముందు మనయొక్క స్వల్పతయును గోచరింపకమానదు. దీనికి కారణము ఒకతీరుగా యిట్లు జెప్పవచ్చును. వస్తువులననుసరించి మనము తెలిసికొనిన కొలది సందేహములు హెచ్చుచుండును. ఒకానొక కాలమున వస్తువుల చలనమునుగూర్చి పరిశ్రమచేసి, ఆశాస్త్రమందు సర్వాంగీకారమగు ధర్మములను గ్రహించి, ఆధర్మములనుండి, అమితమైన దూరముననున్న, నక్షత్రములయొక్కయేమి, గ్రహములయొక్క యేమి, చలనమును, వానిబరువును, వానికి మనకుండు దూరమును, సూర్యగ్రహణమును, చంద్రగ్రహణమును, అవి ఎప్పుడు వచ్చునదియు చెప్ప నేర్చుకొంటిమి. అయ్యది యమోఘమైనపనియే. అంతమాత్రమున వస్తుతత్వము ముగిసెనా? ప్రకృతి శాస్త్రచరిత్రమునుదిలకించినచో, మనము ప్రకృతి పైభాగమునందే యుంటిమనియు, దాని ఒక్క పొరనైనను చీల్చజాలకుంటిమనియు ఇప్పటి మనజ్ఞానముతో గ్రహింపగలము. తర్వాతనో నిశితమైన మానవునిబుద్ధి తనకన్న ఎన్నతరముగాని రెట్లు ఎక్కువపరిమాణము గ్రహములనుండి అదేవిధముగా నెన్నతరముగాని తనకన్న నెన్నిరెట్లో తక్కువ పరిమాణముగల 'మాలిక్యూల్' అను నణువుపై ప్రసరించినది. కాని కొన్నాళ్లవరకు ఈఅణువులు మహాగ్రహములలో మహానక్షత్రములలో నిరాఘాటముగా విహారముచేసిన మనవిమర్శనాబుద్ధికిని, మన గణితశాస్త్రమునకును, గౌరవ నిచ్చినవికావు. ఒకప్పుడు ఈగ్రహము లమితదూరముగా నుండుటచే వానిసంగతి మనకు ఏమి తెలియగలదాయని నిరుత్సాహపడినరోజులును గలవు. అంతేకాదు. మనవిమర్శనాశక్తి ప్రవేశింపలేనిచోట, మన కవితాశక్తి విజృంభించినది. సూర్యగ్రహణము చంద్రగ్రహణమును, దుష్టరాక్షస నిరోధమని యూహించితిమి. చంద్రునియందున్న కళంకమునకు ఏమియో గాథలను కల్పించితిమి. కాని కొన్నినాళ్లకు అవి ఎంతదూరములైనను, మనగదిలోగూర్చొని, గదితలుపులు వైచికొని, కాగితమును, కలమునుతీసికొని, మనలెక్కను పూర్తిచేసితిమి గదా?

ఈఅణువులు ఎక్కడచూచినను అవియే. కాని వానిని మనస్థూలదృష్టితో చూడజాలము. వానివిషయమై మనము తెలిసికొనగల్గినది అవి సమిష్టిగా మన ఇంద్రియములు గోచరింపగలుగు కొన్ని గుణములను. అట్లయిన, పాఠకుడు, ఈగుణములనుండి అసలువాటిసంగతి ఏమో గ్రహింపగూడదా యని సులభముగా ప్రశ్నింపవచ్చును. అయ్యా, అట్టి మనమార్గము అనపాయకరమైనదికాదు. ఏమన, ఒకవస్తువునుచూచుట, వానిపైకి గలుగు మార్పులను గ్రహించుట ఇది సులభమే కావచ్చునుగాని, ఒక గదిలోనేమున్నది తెలియకుండనే, బయటగోడలను, ద్వారమునుజూచి గదిలోని సంగతులన్నియు తెలిసికొనప్రయత్నించుట మొదలిదానియంతసులభము కాజాలదు. పూర్తిగా చెప్పలేమని చెప్పుటకు వీలులేదుగాని, మనమార్గము మాత్రము ప్రమాదాస్పదమైనది యని చెప్పవచ్చును. ఈఅణువులపైని పరిశోధనయు నట్టిదియే యైయున్నది.

పదార్థములు అణువుల సమ్మేళమని స్థిరపడినది. (మరికొన్నినాళ్లకు) ఇకనంతట వస్తువులగుణములు రకరకములుగానుండుటకు కారణము యీఅణువులనుండి మొదలిడితిమి. కొన్నాళ్లు మనయాటలుసాగినవి. కాని, మన యమిత శోధనయే మరల మనకు ముప్పును దెచ్చినది. ఈ భౌతిక అణువు (Molecule) అనేదానినికూడా విభజించి వేయవలసివచ్చినది. Atom అనేదియే పరమాణువని నిశ్చయమునకు వచ్చితిమి. మనశాస్త్ర మింతటితో పూర్తియైనది అనితృప్తిపడితిమి. కాని విరామమేమోయని ఎరుగని, మనబుద్ధి, తదనుకూలమైన మనపరిశోధన, ఈ పరమాణువునుగూడా భేదించివేసినది. అయ్యది ప్రోటాన్ (Proton) అను ఒక సూర్యగ్రహముచుట్టు ఎలెక్ట్రాన్ (Electron) అనుగ్రహములు పరుగెత్తుచున్నవని, చూచితిరా, మనముస్థూలనక్షత్రమండలినుండి సూక్ష్మనక్షత్రమండలికి దిగితిమి. ఇదియంతయును శ్రద్ధగా చదువుచున్న

పాతపకు, సకారణముగనే, ఇట్లు ప్రశ్నింపవచ్చును. మీరుచెప్పునదంతయును ఊహాఖేలనముకాదని మమ్ముల నొప్పింపగలరా? మీరు మాకు ఆప్రోటానును, Electron నును మాయీకంటికి చూపగలరా? యని ప్రశ్నింప వచ్చును. అప్పుడు ఏదైనలేదని చెప్పుటకు బెంగాలీ వాడు ప్రయోగించు మందహాసమునే మేమును ప్రయోగింపవలసియుండును. కాని మామందహాసము బెంగాలీ వానియంత భావశూన్యమైనదికాదు. దాని వెనుకనే ఇటుల జవాబుకూడా నిచ్చెదము. "నాయనా, ఒకవస్తువున్నదనిచెప్పుటకు,మనకన్నులు చూచినచూచినట్లు లేకున్న చూడనట్లా! మన సెండాకాలమున శోషింపజేయుచు వీచుపశ్చిమగాడ్పు, దానిరూపమును తిలకింపనంతమాత్రమున, లేదని యనుకొనగలమే? దానిని తలచుకొనిన, చల్లనికాలమనకూడ,గుండెలదరుటమానునే!అంతియకాదు. మన ఇంద్రియ స్ఫురణయావశ్యకతములేకయే,ఒకవస్తువుయొక్క గుణములను విమర్శించు పద్ధతులను మాశాస్త్రమవలంబించుచున్నది. అచ్చోట జ్ఞానదృష్టియును, పరిశోధనమును రెండును ఒకదానికి నొకటితోడై ఎచ్చోట సూలదృష్టినినిగుడింపలేమో యచ్చట జొన్పి ఊహాఖేలన మనుకొనుడి, మరి ఏమైననను కొనుడి; వస్తుతత్వమును గ్రహింపసాహసించెదము. మాసాహసము మీరెన్నడు తలవని, వినని సంగతులను మాయాపై జ్ఞానముపయోగపరచుకొని, మీకన్నుల కగుపడునట్లుగనే, మీచెవులకు వినుపడునట్లుగనే, కొన్ని సంగతులను చూపగల్గు బహుమతిని పొందుచున్నది. "అల్లైనప్రోటక(Proton)Electron స్థిరపడినట్లైకదా! ప్రకృతికంతయు గనిపెట్టితిరికదా!" యని ప్రకృతిశాస్త్రజ్ఞుని నభినందింప మొదలిడెదరా,సముధానముతో, ఆతడిట్లుచెప్పును. "ప్రకృతియనంతమైనది. దానిచేష్ట లద్భుతములు. ఒకపరి తనరహస్యమునంతయు బట్టబయలు చేసినట్లుండును. ఒకపరి గంభీరముగ నగాధముగ నుండును. Protonను Electron ను గనిపెట్టితిమే యనుగర్వము మా కావంతయును లేదు. ప్రకృతి ఇంకను మమ్ము వెక్కిరించుచునే యున్నది. కాని అయ్యదియే మేము కోరుకొనునది. ప్రకృతి ఎంత అనంతత్వమును దాల్చుచున్నదో దానితోబాటు నిశితమగు మా బుద్ధియు ననంతత్వమును దాల్చుచున్నది."

ఈ సందర్భమున ప్రకృతిశాస్త్రమునకు ప్రతిపక్షులనుండి కఠినమైన ప్రశ్న పరంపరలను గురిపింపజేయు సంశమును కదలించితిని. అయ్యది మన యింద్రియస్ఫురణయావశ్యకతలేకయే వస్తుతత్వమును గ్రహించు పద్ధతుల ప్రకృతిశాస్త్రము లవలంబించుచున్నదనుట గురించి ప్రతిపక్షుల ప్రశ్నల Max Planck గారి మాటలతో సంక్షేపముగ చెప్ప వచ్చును.

"Is the Physical world simply a more or less arbitrary creation of the intellect or are we forced to the opposite conclusion that it reflects phenomena which are real and quite independent of us? Expressed in a concrete form, can we rationally assert that the conservation of energy was true, even when nobody could think about it or that the heavenly bodies will move according to the Law of gravitation, when our earth and all that there is in is in ruins?"

ప్రపంచమే నిజమని నమ్మ పాశ్చాత్యుల కే! ఇట్టి సందేహములు బయలు దేరినచో, వేదాంతశాస్త్రమును మొదలిడుటతోడనే ప్రపంచ మంత కల్ల యని ప్రారంభించు మన హిందువులు, ఇంతకన్న గాఢమైన ప్రశ్నలు వేయక మానరు. Max Planck మహాశయుడు, ఆప్రశ్నలకు సవినయముగా జవాబునిచ్చినాడు. అనగా సవినయ మనుదానికి చెప్పుచున్నాను. ప్రశ్నలలో నూటిగా జవాబిచ్చుటకు శక్యముగాని ప్రశ్నలు కొన్ని ఉండును. దీనికి కారణము జవాబను మానావశ్యమయినది యగుటయని ప్రతిపక్షులు భావింపవచ్చును భ్రమింప వచ్చును. కాని ఆయావిషయములయం దభిరుచియున్నవానికి, మొదలునుండి, యాయావిషయములయందు పెంపొందిన వానికి, తనజవాబుయొక్క నమ్మకము మాత్రము ననుమానింపడు. కాని అట్టి ప్రశ్నల కష్టములవలన నూటియైన జవా బీయజాలదు.

జవాబుఅనుభవమే. ఈవిషయమును నుచ్చరించుచు Max Planck గారు వ్రాసిన దిందు పొందుపరచెదను.

"No Physicist doubts the truth of the observation that a being endowed with physical intelligence and possessing means of detecting ultraviolet rays, would recognize these rays as being similar to the normally visible ones, though no one has seen either an ultraviolet ray or such a being. No chemist has any scruples about ascribing to solar sodium, although he can never hope to put a salt of Sodium into a test-tube............................... Indeed however confidently one lays the foundations of the world-picture of the future no general rules can be formulated. The greatest foresight is here desirable. There is a second consideration in connection with this question what it simply and solely depends upon is the realisation of a definite object even though unattainable. This object is——not the complete adaptation of our ideas to our perceptions but the complete liberation of the physical picture from the individuality of the seperate intellects. This is perhaps a more accurate paraphrase of what I have called ..............in order to avoid misunderstanding "the liberation from the anthropomorphous elements" as if a picture could be independent of the painter: this is a contradiction in terms."

దీనికి పోల్పదగు విషయము భగవద్గీతయం దొకటి యున్నది. అయ్యది కర్మచేయుచుండుము, కర్మను నమ్మకుండుము, దాని యం దాసక్తిని వహించకుము అని చెప్పు సందర్భము. ఇయ్యది పైకి చూచుటకు ఒకదాని కొకటి సంబంధింపన ట్లగుపడును. అంతేకాదు వికటవాదు లున్న యెడల నపహాస్యములను జేయ సాహసించెదరు. వెనుక ఒకడొకడట భార్యను కాఫీ నియ్యమని యడుగుటకు My dear idea, will you give me an idea of coffee?" అని అన్నాడట. వీనిమాటలనే పరికించి, కృష్ణుని వేదాన్తమున కర్థశూన్యము చేయుదురో? దీనికి జవాబు, అనుభవజ్ఞులగు వేదాన్తులే. ఈ భావమునకు ముగింపుగా, భగవద్గీత నుండి 2 శ్లోకముల నుదాహరించెదను.

శ్లో॥ నైవకించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ నశ్నన్ గచ్ఛన్
స్వపన్ శ్వసన్.

శ్లో. ప్రలపన్ విసృజన్ గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్.

ఈయర్థమునే, మాప్రకృతిశాస్త్రజ్ఞుల యాదర్శముల కన్వయింతురు గాక!

పదార్థ విజ్ఞాన శాస్త్రమును గురించి చెప్పుటకు మొదలు ప్రకృతి శాస్త్రములను వర్ణించితిని. నిజముగా ఈశాస్త్రముల యొక్క యుద్దేశ్యము బరికించినచో దాని యైక్యభావము వలన, శాస్త్రములన్నియు ఒకేశాస్త్రముగా కనుపట్టును. ముఖ్యముగా గణితశాస్త్రము, పదార్థవిజ్ఞాన శాస్త్రము, రసాయన శాస్త్రము ఒకదాని కొకటితోడుగా నుండును. ఒకదాని హద్దులుమీరి మరియొకదానిలో పొర్లుచుండుటయును సంభవించుచుండును. అందులకనే ఇప్పుడీక్రింది శాస్త్రములు కూడ బయలుదేరినవి ఏమనగా Applied Mathematics (లేక Mathematical Physics, Physical Chemistry) కాని ఒక సంగతి మాత్రము చెప్ప వచ్చును. Physics తదితర 2 శాస్త్రములకును మధ్యస్థానము నాక్రమించుచున్నది. అచ్చమైన గణితశాస్త్రజ్ఞుడు తాను రచించుకొన్న ప్రపంచమును తనవిమర్శకబుద్ధిచే పెంపొందించుచుండును. అతడు ప్రపంచమును జూడ వెరచును. రసాయుడన్ననో, ఓపికగల్గి పైచూపులకు (అతని చూపులకు గూడను) పరస్పర సంబంధములేని ప్రకృతిలోని విశేషముల జాబితాను తయారు చేయును. వానిని విమర్శించుదమన్న శాంతచిత్త మతనికుండదు, ఇక Physicistలో

ఈ 2 గుణములను మేళవించినవి. ఈ 2 గుణములలో నతని కేదికొరవడినను నిజమైన Physicist అనిపించు కొనడు. కాని దాని స్థానమును మీకు పొందు పరచి నను కొనెద.

పదార్థవిజ్ఞానశాస్త్రము మొదలెన్నియో ఉపభాగములతో నిండి బయలుదేరినది. ఆవిభజనము ఒకమోస్తరుగా మన ఇంద్రియవ్యాపారము మూలముగా జరిగినదని చెప్పవచ్చును. ఉదాహరణము కన్నులతో జూచునది లేక ఇంకను మరీశాస్త్రీయముగా జెప్పవలయునన్న కన్నులతోజూచుటకు సహాయభూతమైనది. అది తేజము. దానిపై తేజోశాస్త్రము బయలుదేరె. మన శరీరము ఉష్ణమును, శీతమును గుర్తించును. మనత్వగింద్రియమునకు, అట్టిభావమును కలుగజేయునది ఉష్ణమంటిమి. అయ్యది ఉష్ణశాస్త్రమయ్యె. తర్వాత కర్ణములతో వినునది శబ్దము. శబ్దశాస్త్రము ట్లుత్పన్నమయ్యె. దీనికన్న పూర్వము (Mechanics) ఉద్భవమైనది. అయ్యది వస్తు చలనమును గూర్చినదై యున్నది.

మన ఇంద్రియములతో నేసంబంధము లేకుండ, మరి 2 శాస్త్రములున్నవి. అయ్యవి, Magnetism, Electricity యును, అనగా అయస్కాంతమును గురించియు, విద్యుత్‌ను గురించియు. మొదటిది—ఇనుమునయస్కాంత మాకర్షించును. దానివిషయమైన చర్చ Magnetism. రెండవది—అద్దముపై పట్టువేసి రుద్దిన, పట్టునకు బెండువంటి పదార్థముల నాకర్షించును. ఇది విద్యుత్. దీనిశాస్త్రము Electrcity యని యనిపించుకొనును. ఈరెండు శాస్త్రములును, పరస్పరసంబంధము లేకుండ మొదలిడినవి. రానురాను మనజ్ఞాన మభివృద్ధియైనకొలది కదలెడివిద్యుత్, కదలని అయస్కాంతమెట్లు వర్తించునో, అట్లు వర్తించుననియును, అయస్కాంతమును గదలించినయెడల, దానిపరిసరములందున్న ఏవిద్యుత్ వలయము నందైనను (circuit) విద్యుచ్ఛక్తిని కలిగించుచున్నదనిన్ని గుర్తింపబడినది. దీనిని స్వచ్ఛముగ సర్థముచేసికొనినది Faraday, ఫారడే అను మహనీయుడు. అతనియూహ యప్రతిమానమైనది.

అంతమున్బూర్వము 2 విద్యుదుద్వేగమున వస్తువులను (Electric charges) దగ్గరకు వచ్చిన, ఆరెండు నాకర్షింపబడకుండనుండవలెన వానిరెంటిని ఆగబట్టవలెనని కనిపెట్టబడినది. ఈశక్తి రణము, ఆరెండువస్తువులయందున్న విద్యుత్తే కారణ తలచిరికాని, ఆరెంటిమధ్యమందు స్థలమునకు (Spac ఏమైన సంబంధమున్నదా యని యాలోచించిన కారు. కాని ఈమహనీయుడు, ఆస్థలమునందు వేర్వే పదార్థములనుంచి, అప్పుడు ఆ 2 చార్జీలకు యాకర్షణశక్తిని కొలువగా, వేర్వేరుపదార్థములకు రుగా నుండెనని గ్రహించెను. దానివలన ఆయన చిన దేమనగా, 2 (Charges) మధ్యనుండు స్థలము గూడ, ఆశక్తితో సంబంధ మున్నదని, అత చెను. ఒకచార్జినుండి మరియొకదానికి, దారములు నట్లు గాని, లేక రబ్బరునాళములతో కట్టినట్లుగా ఊహించినచో, వాని కట్టి యవస్థకలుగునో, అట్టి స్థయే ఆరెండుచార్జీల మధ్యప్రదేశమునకు భావించినాడు. అనగా పరస్పరమాకర్షించుకొను లను; ఆకాశమను ప్రదేశమందుంచితిమేని, ఆయాకా మునందు స్థితి ఎట్లుండుననగా, రబ్బరునాళములను డుచేతులతో లాగిన నెట్లుండునో, అట్లుండును. నాళమును మీరు లాగినపుడు అది ఏమిచేయుచున్న కొనెదరు ? అది మీరెండుచేతులను దగ్గరకు తీసికొ ప్రయత్నించుచున్నది. దానినిగుంజు మీప్రయత్న నకు అది ముడుచుకొనవలెనని దానిప్రయత్న రాజీకుదిరినది. అట్టిస్థితియే ఈయాకాశమునందు కల్గినది. అట్లుగాక, పరస్పరము నైముఖ్యభావ జెందు చార్జీలను ఆకాశప్రదేశములోనికి, దీసికొని యెడల, ఆమధ్యప్రదేశపు పటము నెట్లూహించ నేజెప్పవలెనా? అప్పటిస్థితి, రబ్బరు తనసహజస్థితి యదిమినట్లుండును. ఇట్టి యద్భుతమైన యూహ యమోఘమైన విశేషములను బయటికి తీసికొనివచ్చి విద్యుత్తునకును పదార్థమునకువలెనే, జడత్వమున్న సూచింపబడినది. కాన, ఏవిద్యుద్వలయమునయందైన చేయుటతోడనే, రావలసిన విద్యుత్ ప్రవాహము

కొంచెము ఆలస్యము పట్టును. ఎవరో అడ్డుకొన్నట్లుండును. ఈమహనీయుని నామమే, అయస్కాంతపుచలనము—కాక—అయస్కాంతముచుట్టు నుండెడు ప్రదేశమునందున్న శక్తి కేదయిన మార్పుగల్గిన అయ్యది విద్యుత్ప్రవాహమునకు సమానమని కనిపెట్టబడిన విషయమందును శోభించుచున్నది. ఈతడు విద్యుత్ పరిసరప్రదేశమును వర్ణించినరీతి, అయస్కాంతత్వమునకును, విద్యుత్తునకునుగల పరస్పరసంబంధమును కనిపెట్టుట. ఈరెండును (Physics) నకు గొప్పనూత్నతేజము నిచ్చినవి. వీనిఫలితములు మీరు వినినయెడల నాయర్థమే మోమీక్షస్ఫురింపగలదు. ఆమహనీయుడిట్లు(Magnetism)నకును (Electricity) కి నైక్యత గూర్చుటయేగాక తేజస్సునకును పైవానికిగూడ సంబంధము గల్పించినాడు. ఈతడు పూర్తిగా తత్సంబధము కనిపెట్టెనని నేనుచెప్పనుకాని మనకదృష్టకరమైన యతని యనుమానము తత్సంబంధముపైకి పోయెను. అయ్యదియే పదివేలు. అతడు చేసిన ప్రయోగములు సంబంధమున్నదని నిరూపించినవి. సంబంధమిట్టిదని నిరూపించుటకు అతడు కేవలము (Physicist) అగుటవలన చెప్పలేకపోయినాడు. కావలసినది అగణితమైన గణితశాస్త్రప్రజ్ఞ. అది యతనికి కొరతపడియె.

ఈసందర్భమున నాయభిప్రాయము నొకదానిని చెప్పదలచినందులకు పాఠకులు క్షమింతురుగాక. ఇట్టిమహనీయులబుద్ధి గణితశాస్త్రమందు విహారమొనర్చిన బుద్ధి కన్నను ఎన్నతరమైనదని నాభావము. ఇది గణితశాస్త్రజ్ఞుని తీసివేయుటకాదు. ఆఘటితమైన యెన్నియేని సమస్యలను సలీలముగ పరిష్కరించు వీరిమేధాశక్తియల్పమే? నేనిక్కడ జెప్పదలచినది. అట్టి మేధాశక్తికినిగూడ మించియున్నది. Faraday వంటి మహనీయుని బుద్ధి అని. ఏమన గణితశాస్త్రమనునది, Physicist నకు ఆయుధమువంటిది. దానిలో నిరంకుశప్రౌఢి యబ్బినా, ఎట్టి విపదంధకారమునుండియైనను తత్సహాయమున విముక్తినందగలడు.

అదినిశ్చయము. ఈగణితశాస్త్రమునందుండు చమత్కారమేమనగా, అయ్యది, ఒక్కొక్కప్పుడు తదధినేతను అంధకారమునుండి బహిర్గతునిజేసినప్పుడు అతని కన్నులకు మిరుమిట్లుగొల్పుప్రకాశమైన విశేషములను జూపును. ధృఢహృదయుడయ్యేనా వాని నర్థముచేసికొనును. కాదు ధృఢహృదయుడుమాత్రమే కాదు. ప్రపంచజ్ఞానముకూడ కావలెను. నాభయమేమన తల్లీనతౌవాప్తిజెందిన యీగణితశాస్త్రజ్ఞులకు ప్రపంచస్ఫురణమే ఒక యవమానముగా భావింతురు అందువలన నేపైనసూచనచేసిన ప్రకారముగ విశేషములు వీరికాశ్చర్యమునుగాని ఆనందమునుగాని కలుగజేయవు. వెంటనే పుటత్రిప్పివేసి మరి యొక ప్రశ్ననందుకొందురు. ఆదియట్లుండె.

Faraday గణితశాస్త్రమను నాయుధము లేనివాడు. కాని అతడు కనిపెట్టియర్థము చేసికొనిన విషయములో గణితశాస్త్రజ్ఞుడయినవాడు, దీనితర్వాత ఇది, దీనితర్వాత ఇది, ఇట్లు సక్రమముగనే వేసినగాని రాదు అని ధృఢనిశ్చయుడై చెప్పు విశేషములు. ఏమని భావింతురు? Faradayయొక్క మేధాశక్తిని! చెమటవడిసి, అప్పటికి అర్థముచేసికొనలేని జవాబులనుబడసెడు ఈగణితశాస్త్రసహాయము లేకనే కన్నులకు గట్టినట్లు, అమోఘమైన ఫలితములను బడయుటకు ఆబుద్ధి ఎట్టిదై యుండవలెను! అయ్యలారా! ఇదే మహనీయత. సామాన్యులమైన మనము అడుగులో అడుగువేసికొనుచు నడచిననేగాని గమ్యస్థానమునుచేరలేము. అదియును అనుమానమే. మహనీయులకో, మనమార్గములు వారలకనవసరము. అంతయు వారి దివ్యదృష్టికి ప్రసన్నమగును. వారల క్షేత్రోవవెడలిన సులభమో, మనకన్న బాగుగ తెలియగలదు. అట్టి మహనీయతయే, శ్రీయుతరామన్ మహాశయునియందున్నదని నాశక్తికొలది చూప ప్రయత్నించెద.

(సశేషము.)

# కుక్కుటధ్యానము

డాక్టర్ నిడమర్తి ఈశ్వరప్ప గార్లు
బి.ఎ.,యం.డి.బి.,యఫ్.యం.హెచ్.ఎస్.

గుడిసె ముంజూరిలో మాటు మడఁగియుండి-పిడుగువలె వచ్చి నీవాత వేసికొనెదె
నన్నో? ప్రేయసినో? చిన్నినాయనలనో?-నేఁగి నీ కే మొనర్చితే చెనటికత్తి!

బ్రహ్మయిచ్చిన యాయువు బ్రదుకనీవు-పోవునెడ నిముసమ్ము వాపోయనీవు
భార్యకుం బిల్లలకుఁ దుది పలుకుసున్న-ముందుగాఁ జెప్పి రారాదె మొండికత్తి!

తిండికి నీఁకు బాయసముఁ దియ్యని పండ్లును బిండివంటలున్
దండిగ లేవె? యేల కరుణాలవశూన్యత మమ్ముఁ జంపెదో?
పండుగ లేవివచ్చిన నపారముదబ్ధిని నీవు దేలఁగా
గండము మాకెగాదె? కడికండలుగా మముఁ జేసె దోనరా!

నీదువాకిలికడ వచ్చి నిలుచుబండి-బందుగుసఁ దెచ్చుఁగాని మాపాలి కతఁడె
మృత్యుదేవత యనగ నసత్యమానె?-బండియా మా కది ఫిరంగిగుండుగాని?

పాప మెఱుంగమోయి, నిరపాయముగా మముఁ జేయ వైతి వే
పాపముఁ జేసినామొ తొలిబామున, నీభవమందు మమ్ము దు
ప్రాపులఁ జేర్చి యిట్లు బలవన్మరణంబును గూర్చితేల? మా
తాపముఁ దీర్పవా రెవరు దైవమ! నీవె దయం దొలంగినన్.

కరకర నూఱుకోయి పిడికత్తిని నాయఁడ, బండరాతిపైఁ
బరపరఁ గోసి నీపొలము పంటకు నన్బలి వెట్టకోయి, వ
త్సరముఁ గుటుంబపోషణము సల్పెడి నీవరిఁ గోసికొమ్మ న
న్నురవడిఁ జంప నాపలల మొక్కదినమ్మునఁ గుక్షి నింపునే?.

ముప్రొద్దుల న్నమ్మమ్ము ముద్దుగాఁ జేరిచి తవిటియుండల మేపు తండ్రి వీవ
కుక్కలు నక్కలుం గొఱుకకుండగ మమ్ముఁ గూటఁగాచెడి రక్షకుండ వీవ

పెంపను మముఁ బట్టి చంపను విక్రయింపను శక్తిఁ గల్గిన ప్రభుఁడ వీవ
కల్యవైతాళికు ల్గాఁగ ని న్నేమెల్కొల్పు చరణాయుధమ్ముల స్వామి వీవ
ఏమెడం గృతజ్ఞులము నీయెడను మేము-అట్టి మముఁగొట్టి నీపొట్టఁ బెట్టికొనెదె?
తనయులం జేతులం జంపి తినెడితండ్రి-యుండునే యొండు మానిసిదిండిగాక?.

గోముగఁ గాపువాఁడు మముఁ గూడును గూఁడును గూర్చి పేర్చియుక్
ప్రేమను వీడి చంపి పలురీతులఁ జేసిన మందుమాకుల
స్నేమము నీటఁగల్పి యవినీతిని బాపఁడె సాపడండె? ని
స్సీమముగా మనీషులకు శేముషి యిట్టి యమానుషంబులక్.

ఖగనాథుండదె నింగి నిశ్చలత రెక్క ల్సాపి చక్రాకృతిం
దిగుచున్ రివ్వున మీఁది కేఁగుచును సంధింపంగ నేగున్న నే
నెగురందన్నుకపోవ నిల్లొడుపుమై నెంతే న్విజృంభింప నా
సగప్రాణం బెటు సంతతిం దనదు పక్షద్వందము న్గప్పెడిన్!

అకట! బేలవుసుమ్మి నాప్రాణపదమ!-సంతుఁ గావంగ నెంతే దిసంతుఁగొట్టి
గ్రద్దపై ముక్కుమొగ మెట్టుగాఁగఁ జేతె?-కాచికొనెదవా యర్భకుకత్తినుండి?

కొండలమించుమేటి వరికుంభమ్ముమ్రింగెడి దేవి పొట్టకుం
గండియ యున్నదో యది యగాధమొ? యాఁకలి దప్పి తీఱకే
కుండలతోడఁ బానకముఁ గ్రోలుచు మారుధిరంబు జుఱ్ఱు నా
చండికకొల్వు కుక్కుటపు జాతికి మారణహోమ మక్కటా!

తప్పక సృగాలవైద్యుండు తమముమీఱ-విధిగ మముఁజూచు మేమన్నఁ బ్రీతిగాన
వానిఁ గనినంత జాడ్యము ల్వాయుమాకు-వానిపంటివైద్యము చేయలేని దేది?

గుడిసెలో నీవింక గుఱికల విడకుండఁ బ్రాగ్దిశాంగన వెల్లఁబాఱకుండ
నభిసారిక ల్స్వగృహములకుఁ బోకుండఁ బిట్టలు పొట్టకై వెడలకుండఁ
జుక్క లొక్కొక్కటే రుక్కుదక్కనుచుండ రిక్కఱాయుఁడు చిక్కఁ బొక్కుచుండ

జాయాపతులయల్క సమసిపోవుచునుండఁ జోరులసతు లింక గ్రుక్కచుండ
నలిచిలేపెద మోయి నిన్ననుపఁ గృపికి-"కొక్కరోకోయి" కాదోయి కోడికూఁత
"కొయ్యఁబోకోయి"యంచు వేకువను మొదలుఁ-బ్రార్థనముఁ జేతుమోయిమాపాలిశేషు!

అన్న! నామాంసమన్న నీప్రాణమైన-నకట నేఁ జావకిఁక తప్పదన్న నాదు
పీఁక నొక వ్రేటునం దెగవేయుమయ్య-నులిపిమాత్రము నన్జంప వలదు వలదు.

వీరాగ్రేసర! కత్తిపట్టితని గర్వింపంగ నేలాజి మా
వారి న్నీవలె దున్మలేదె కలహవ్యాజంబు లేకుండ? నా
గోరు ల్వాలవె? సవ్యసాచినిజుమీ కూలంకషప్రజ్ఞనీ
నారంగస్థలులందుఁ జూడవె నను న్నాశస్త్రకౌశల్యమున్?

అని వెనుఁ జూపినంత మన నక్కడె యోధుఁడ! పోమకుండు జం
పును మఱి నిన్ను నక్కలకు బువ్వముఁబెట్టును గాని చూడు నే
వెనుకకుఁ దగ్గినన్ రిపువు భీతిని, గాయముఁ జెందినన్ దటా
లున నను వెచ్చగాఁ గడుపులో నిడికొంచు భరించు నాదృతిన్.

జినుఁడ, బుద్ధుఁడ, బాపఁగా జీవహింస-మఱల నొకసారి యవతరింపంగరాదె?
కావవేల మహాత్మ! యోగాంధి మమ్ము-నాలకై కంకణముఁగట్టు నపరబుద్ధ?

కొందఱు తిందురు మము మఱి-కొందఱు మేమన్న ముట్టుకో నొల్లరు మీ
రందఱు విడచి యమందా-నందము మా కిడఁగరాదె నరవరులారా!

---

౧౮. పండిత మాలవ్యాదులు
విషయనిర్ణయసభకు పోవుచున్నారు





౧౯. అధ్యక్షులు, వసంతాదేవి, సేనుగుప్త
మున్నగువారు సభకు పోవుచున్నారు

౧౭. బాబూ రాజేంద్రప్రసాదు,
శ్రీనివాస అయ్యంగారు మొదలయినవారు
సభకు పోవుచున్నారు





౧౬. సర్ సి. పి. రామస్వామి అయ్యర్‌గారు,
బిసెంటుగారు కన్వోకేషన సభకు పోవుచున్నారు



౨౦. భారతీయ వస్తుప్రదర్శన ప్రదేశము



౨౧. దేశబంధు నగరమునందలి విషయనిర్ణయ మహాసభ



౨౨. అధ్యక్షుల ఊరేగింపు

# బ్రహ్మచర్యము

గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు

శ్లో. శిష్యస్తృత్తిక్రమేణైవ విద్యామాప్నోతియశ్శుచిః, బ్రహ్మచర్యవ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే.

(తా. సత్యము, శాంతము, ఇంద్రియనిగ్రహము, మొదలగు సద్గుణంబులచేఁ బవిత్రుఁడై విద్యాభ్యాసమొనరించునాతని నియమమే బ్రహ్మచర్యముయొక్క మొదటిపాద మనఁబడును.)

ఈమనువచనమును బట్టి బ్రహ్మచర్య రహితమగు విద్యాభ్యాసముగాని, విద్యాభ్యాస శూన్యమగు బ్రహ్మచర్యము గాని లేదనుట స్పష్టము. ఈకారణము బట్టియే మనపూర్వులు గురుకులవాస మొక్కనియమముగ నేర్పఱచియుండుట.

పూర్వము విద్యార్థులు గురుకులములందేయుండి, గురువుల యాజ్ఞకు బద్ధులై బ్రహ్మచర్యమును బాలించుచు విద్యాభ్యాస మొనరించుచుండెడివారు. తల్లిదండ్రులు బాల్యముననే కాలధర్మము నొందినచో, వారిపుత్రుఁడు గురుకులవాసమునుండి వచ్చుపర్యంతము, ఆతనిస్థావర జంగమాత్మకమైన యాస్తిని రాజు కాపాడవలయునని మనువు శాసించియున్నాఁడు. ఆకాలమున గురుకులవాస మెంతటి నియమముతో వర్తిల్లుచుండెనో దీనింబట్టి తెలిసికొనవచ్చును. భీష్మాచార్యుఁడును గురుకులవాసమేర్పఱచియే ద్రోణాచార్యుని మూలమున కౌరవపాండవులకు సకలవిద్య లలవడఁజేసినట్లు విదితమయ్యెడి.

మఱియు, పూర్వకాలమున విద్యార్థులవయోబుద్ధుల పరిశీలించి వారివారి యిష్టానుసారముగా వివిధవిద్యలబోధించుచుండెడివారు. విద్యార్థులు పంచభూతములతోవలె గురువులతోను స్నేహము గలిగియుండి, సృష్టికావ్యములోని జీవితరహస్యముల ముఖ్యముగఁ దెలిసికొనుచుండెడివారు. భూతదయ, కృతజ్ఞత, మొదలగు లోకోత్తర గుణంబు లలవడఁజేయుచు, విద్యార్థులను బ్రహ్మచర్యపాలకులనుగాఁ జేయుటయే యానాఁటి గురువులముఖ్యకర్తవ్యమైయుండెను. కనుకనే యప్పటి విద్యావంతులు తేజోవంతులై ఘనకార్యములొనర్చి నేఁటికిని మనచేఁగీర్తింపఁబడుచున్నవారు.

ఇఁక నేఁటి విద్యావిధానము నరయుఁడు. మన పూర్వులచే నిషేధింపఁబడిన భృతకాధ్యయనాధ్యాపనములే (డబ్బుఇచ్చి చదువుకొనుట, డబ్బుతీసికొని చదువు చెప్పుట) సర్వతోముఖముగా రాజ్యము చేయుచున్నవి. ఈపద్ధతివలనినష్టములు కరతలామలకములగుటచే విశేషించి విస్తరింపఁబనిలేదు. తాత్కాలిక గురువులు; తాత్కాలిక శిష్యులు. ఒకమాట యధికముగ మాటాడినచో "నేను జీతముగట్టలేదా?" అని విద్యార్థియనును. ఆవిషయమును మరల నొకపర్యాయము చెప్పవలసినదని విద్యార్థి యడిగినచో గంటయయినది. ఇంకొక పర్యాయ మాలోచింతమని యుపాధ్యాయుఁడనును. శిష్యవాత్సల్యము, గురుభక్తి అనువానికిఁ బ్రవాసము తటస్థించుట కీవిద్యావిధానమేకదా కారణము.

మఱియు, ఈకాలమున విద్యార్థికిని ఆత్మీయశక్తులు గలవను భావములేక విద్య గఱపఁబడుచున్నయది. ఉపాధ్యాయులదృష్టిలో బాలురు యంత్రములుగఁ బరిగణింపఁబడుచున్నారు. ఇంతయేల? చిరంజీవులను నిర్జీవ ప్రతిమలనుగ నీనాఁటి విద్యావిధానము చేయుచున్నదనుట యతిశయోక్తి యనఁజాలము. ఆత్మికశక్తులకు విరుద్ధమగు పరిశ్రమంబును నెడతెగక చేయుచుండుటచే విద్యార్థు లనారోగ్యవంతు లగుచున్నారు. ఇట్టిస్థితిలో దేశసేవ యన్నవారికిఁ దల కంటగించుననుటలో నాశ్చర్యమేమి? అధ్యాపనమూలమున నుపాధ్యాయు లెట్లో పొట్టబోసికొనుచు, బాలుర భవిష్యజ్జీవితము దుఃఖభాజనముగా నొనర్చుచున్నారనుట నిశ్చయము. ఇట్టి విద్యార్థులకు మాతాపితృభక్తి, దేశభక్తి, బ్రహ్మచర్యము అనునవి యెట్లలవడును? విచారింప నేఁటికాలమున జ్ఞానోపనార్జ

శోద్దేశముతో విద్యాభ్యాస మొనరించువారు అరుదనియు జెప్పనగును. కనుకనే పట్టభద్రుల మనుకొనువారును నిష్ప్రయోజకులుగ నుండఁగలుగుట.

ఈసందర్భమున విద్యాపరమార్థమును గుఱించి యించుక ముచ్చటించుట యవసరము గాకపోదు. విద్యయన ఆత్మశిక్ష. మానవకళ్యాణమును వెలునరించుటయే శిక్ష యనఁబడును. విచారింప, ఈశ్వరాంశములై మనుజునిలో నణఁగియున్న స్వార్థత్యాగము ధర్మనిష్ఠ, భూతదయ లోనగు పవిత్రగుణముల వికసింపఁజేయుటయే విద్యాప్రయోజనము. శ్రుతులు, స్మృతులు లోనగునవియన్నియు నాత్మవికాసమును పెంపొందించుటకే యేర్పడినవి. ఆత్మజ్ఞానమునకు దూరమగు విద్య యొకవిద్య గానేరదు. ఈవిషయముననే పాశ్చాత్యులకును, భారతీయులకును గొప్ప వ్యత్యాసము గలదు. 'మృగాములకంటె మనుజుఁడు విలక్షణమైన బుద్ధిగలజీవి.' అని పాశ్చాత్య సిద్ధాంతము. కనుకనే వారి పరమావధియు శక్తికొలఁది బుద్ధికి సానబెట్టి, అసాధ్యములను సాధ్యములుగా నొనర్చుటమాత్రమే. దీని ననుసరించియే వారి విద్యావిధానమును నున్నయది. ఇఁక భారతీయ సిద్ధాంతము దానికెంతయు వ్యతిరేకము. మనుజుడు ఈశ్వరాంశసంభూతుడు. ఇతని పరమావధి తనయందిమిడియున్న యీశ్వరతత్త్వమును ప్రతిఫలింపఁజేయుట. వివిధవిద్యాప్రయోజనమును ఇయ్యదియే. తొల్లింటి విజ్ఞులు, ఆత్మజ్ఞానమునకు సాధనముగాని ప్రయత్నము నిరర్థకమనియే ఘంటాపథముగా జెప్పియున్నారు. భారతీయ సిద్ధాంతమునకు దూరమై, జీవుని శృంఖలాబద్ధునిఁ గావించునదియగు నిప్పటి విద్యావిధానము, ఇట్లే కొంతకాలముండినచో భారతదేశము నామమాత్రావశిష్టమగునని బుద్ధిమంతులు పెక్కండ్రు నుడువుచుండుటకుఁ గారణ మితర మేమియుఁగాదు.

విద్యాప్రయోజనము ఆత్మికశక్తిని వికసింపఁజేయుటయని తెలిపియుంటిని. అట్లయిననే సర్వకార్యములును హస్తగతములగును. సామాన్యదృష్టితోఁ జూచినచో మనశక్తి చాల స్వల్పమనియే తోఁచెడి. కాని, ఈబ్రహ్మాండము లన్నియు సృష్టించి అంతరిక్షమున దాఁబమారుగాకుండ నిలిపిన యీశ్వరుని శక్త్యంశమని తలఁచినమేని యీమనశక్తి కుండు పరిమాణ మపారమని తెలియఁగలదు. ఇట్టి మహాద్భుతశక్తిగర్భితం బగు మన శక్తిబలమునించుకైనఁ గనుఁగొనవలయునన్న, అయ్యది దుర్వినియోగమొందకుండఁ బ్రయత్నింపవలయు. దానికి ముఖ్యసాధనము నిగ్రహము. దీనినే యింద్రియనిగ్రహ మందురు.

నిగ్రహముచే నాత్మికశక్తులన్నియు నపారబలసమన్వితము లగును. ఈరహస్యము దెలిసియే తొల్లింటి ఋషులు తన్నిగ్రహమునకై పడరానిపాట్లు పడి తపస్సంకల్ప సిద్ధులైనట్లు వినుచున్నారము. కొందఱుఋషులు మౌనవ్రతముఁబూని తమ వాక్ఛక్తిని వీర్యవంతముగ నొనర్చియున్నారు. అట్టివారిపలుకులు వేదవాక్యములును, తిట్లు శాపములును గాఁజాలినవి. ఇక సంకల్పశక్తి సామర్థ్య మనిర్వాచ్యము. దీనికే భావనాశక్తి యనియుఁ బేరు. దీని ప్రభావముచేతనే కవీంద్రులు లోకోత్తర గ్రంథముల రచియించి మృతజీవులైరి. దీనిప్రభావముచేతనే శూరులు శత్రుసంహార మొనరించి కీర్తికాయులైరి. దీనిప్రభావముచేతనే పరమమునులు బ్రహ్మసాక్షాత్కారమును బడసి నిత్యానందభరితులైరి. ఇంతయేల? ఈశక్తికి మించినపదార్థము బ్రహ్మసృష్టిలో దొరకదనిన నొక్కమాటతో సంపోవును.

ఇట్టి యద్భుతశక్తికిఁ గారణమగు నిగ్రహము బ్రహ్మచర్యముపై నాధారపడియున్నది. గృహమునకు స్తంభమువలె శరీరమునకు మూలాధారము బ్రహ్మచర్యమనఁదగును. "బ్రహ్మచర్య మాయుష్యకరాణాం—లోకములో నాయుస్సును వృద్ధిపఱచుకొనుటకుఁ గల సాధనములలో బ్రహ్మచర్యమును మించినది లేదు. దేనిచే వాలఖిల్యాది ఋషిసత్తములు దీర్ఘాయుష్యాదులఁ బడయఁజాలిరో, అట్టి బ్రహ్మచర్యరసాయనంబును గ్రోలి మీరును దీర్ఘాయురారోగ్య బలసంపన్నుల రగుడు" అని చరకముని యుపదేశించియున్నాఁడు.

"ఆచార్యో బ్రహ్మచారీ బ్రహ్మచారీ ప్రజాపతిః
ప్రజాపతి ర్విరాజతి విరా డింద్రోఽభవద్వశీ"

బ్రహ్మచర్యపాలనముచే మనుష్యుఁడు ఆచార్యపద మలంక

రించును. దానిచే భూపాలకుఁడై జనులనుదన వశవర్తులఁ గావించుకొనునని పైవచనాభిప్రాయము. ఆయువు, వీర్యము, బుద్ధి, కీర్తిలోనగునవి యన్నియు బ్రహ్మచర్యమును బాలింపని కతమున నష్టములగునని మును లుద్బోధించి యున్నారు.

ఇట్లు ఆయుష్యవర్తనంబును, సర్వకార్యసాధకంబును నగు నీబ్రహ్మచర్యవ్రతము బాలుర కెంతటి యావశ్యకమో వేఱ చెప్పఁబనిలేదు. భవిష్యద్దేశ సౌభాగ్యము వారిపై నాధారపడియుండుటచే వారీవ్రతపాలనంబున నప్రమత్తులై యుండినచో, ఏనాఁటికైన భారతమాతకు ముక్తిగలుగునని చెప్పుట కవకాశమేర్పడును.

'బ్రహ్మచర్యం త్వా విద్యాగ్రహణాత్'

విద్యాభ్యాస మొనరించునంతకాలము బ్రహ్మచర్య వ్రతమెంతయు ముఖ్యమను ఋషిపుంగవుల వచనమును నాదరించుచు మనవిద్యార్థులు తేజోవంతులై దేశసౌభాగ్యమునకుఁ గారకు లగుదురుగాక యని కోరుచున్నాను.

---



# శ్రుతి-స్వరముల పరిణామము

పండిత వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు

శ్లో. "చైతన్యం సర్వభూతానాం వివృతి జగదాత్మన నాదబ్రహ్మతదానంద మద్వితీయ ముపాస్మహే.

షెక్కునత్సరములనుండి భారతీయ సంగీతమందలి శ్రుతులగూర్చియు, స్వరములగూర్చియు మనవారేమి, పాశ్చాత్యులేమి వివాదపడుచునేయున్నారు. ఒకస్థాయియందు పండ్రెండుస్వరములుమాత్రము కలవని కొందఱును, బదునారుగలవని కొందఱును అభిప్రాయ పడుచున్నారు. ఈభిన్నాభిప్రాయములకు కొంతతావులేకపోలేదు. భారతవాగ్గేయులుశారంగ్ఙదేవుఁడు, నారదుఁడు, రామామాత్యుఁడు, సోమనార్యుఁడు, వేంకటమఖి, యిత్యాదులెల్ల ఈ సంగతులం దేకాభిప్రాయులు కాక భిన్నమతముల జెప్పియుంటయు నొకకారణము కాకపోదు. సౌంస్కృతకాలపు సంగీతస్థితినిగూర్చి గమనింపనెంచిన పాశ్చాత్యశాస్త్రకారులు సర్ విలియమ్ జోన్సు, పాటర్సన్, కెప్టను విల్లార్డు, కెప్టనుడే, ఏ. జె. ఇల్లిస్, జొసానోక్ మొదలగువారు మనవారిరచనలను సరియైనతత్వముతో భాషాంతరీకము జేయజాలి యుండకపోవుటచే గొంత భిన్నాభిప్రాయములతో నుండిరి. ఇటీవలి మనశాస్త్రపరిశోధకులు సర్ రాజా సౌరేంద్రమోహన టాకూర్, సహస్రబుద్ధి, అబ్రహాం పండితార్, డీవల్ మొదలగువారు కొందఱు పాశ్చాత్యుల ననుసరించుటకే నుత్సాహము జూపినట్లు కొన్ని విరుద్ధాభిప్రాయములనే జెప్పిరి. మఱికొందరు తమయభిప్రాయములను జెప్పినవారును గలరు. ఈ సంగతులనెల్ల నాచిన్నిపొత్తమగు "22 శ్రుతులు-స్వరావళి"ని వివరించితిని. కావున నాచర్చలిటు జెప్పకయే నానేర్చుకొలది మనశ్రుతులు స్వరావళి యెట్లు కలుగునో క్లుప్తముగా జెప్పుదును

ముఖ్యముగా ప్రకృతపు కర్నాటక సంగీతమున జతుశ్రుతి రిషభమనియు, షట్శ్రుతి రిషభమనియు నిట్లు కొన్ని స్వరములు శ్రుతులసంఖ్యతో చేర్కొనుటచే స్వరముల నెంచునపుడెల్ల శ్రుతులగూర్చికూడ కొంత తెలియవలయు. ప్రథమమునుండియు నీదేశమున నొకస్థాయియందలిశ్రుతు లిరువదిరెండుమాత్రముకలవని చెప్పబడుచుండెను. క్రీ. పూ. నాల్గవశతాబ్దమునాటి భరతనాట్యశాస్త్రమును దీనికి పూర్వమైన గర్భోపనిషత్, కటిమియామిలై శాసనములు మున్నగు శాస్త్రములు దీనిగూర్చి చెప్పుచుండుటచే, మన ద్వావింశతి శ్రుతిపద్ధతి గ్రీకుశాస్త్రజ్ఞుల "ఒలింపియన్" మొదలగువారి శ్రుతిపద్ధతి "(Quarter tone)" కన్న పురాతనమైనదని గ్రహింతుము. 'ధీరద్ద్వావింశతిం శ్రుతీ ర్మన్యంతే' అని యిరువది రెండు శ్రుతులుమాత్రము గణింపబడవలెనని మనవారు జెప్పుచుండిరి. కోహలుఁడు యాబదియారు శ్రుతులు కలవని చెప్పునది త్రిస్థాయియందలి వాని చేర్కనుటే యని ఖల్లినాథుడు చెప్పెను. "అనంత్యంహి శ్రుతీనాంచ సూచయంత్తిం విపశ్చితః" అని చెప్పుటనుగూర్చి కూడ ఖల్లినాథుఁడు వ్రాసెను కాని యీ సంగతి సంగీతప్రశంసమున కుదురదని ఖండించెను. నాద మనురణనాత్మకము కావున కొన్ని చలనములు కలిగినప్పుడెల్ల నాద ముదయించుచుండును కావున యనంతములగు నాదములు కలవని గ్రహించినను యన్ని నాదములను శ్రవణేంద్రియము గ్రహించుట లేదు: కావుననే నిమిషమునకు 32 చలనములకు తక్కువకలవి, 3,000 చలనములకు పైన కలవి శ్రవణేంద్రియము గ్రహించదని పాశ్చాత్యశాస్త్రజ్ఞులు లెక్కవేసిరి. "శ్రవణేంద్రియ గ్రాహ్యత్వాత్ ధ్వనిరేవ శ్రుతిర్భవేత్" అని యెంచబడుటవలనను అనంతశ్రుతు లిట యప్రస్తుతము.

ఇటీవల పింగేల్, సహస్రబుద్ధిగార్లు 44 శ్రుతులుగలవని వింతసంగతులు చెప్పిరి. కాని వీరిపరిశోధనములంత ఫలవంతములు కాకుండెను. 22 శ్రుతులను గణించుటే భావము. కడచినవత్సరమున చెన్నపట్టణమున జరిగిన అఖిలభారత గాయక మహాసభవారు నాచెప్పు చొప్పున 22 శ్రుతులే మన సంగీతమునకు దగియన్నవని

యెంచుట మనభాగ్యమే. యింతటనుండి యీవివాదము సమసిపోగలదని నాతలంపు. ఇందుకు నిదర్శనముగా చెన్నపట్టణమందలి సి. సుబ్రహ్మణ్యయ్యరు కొలదిదిన ములక్రిందట 22 శ్రుతులకు నే జెప్పిన విలువల గణించి వ్యాసములు వ్రాయుచున్నారు.

ఒకస్థాయియందు 22 శ్రుతులకన్న నెక్కువ, ముఖ్యముగా 53 యేల యెంచబడ వనుదానికి సమా ధానమట. యప్రస్తుతమైనను, ఒకవాక్యములో శ్రుతు లెక్కువనుకొలది వానివిలువయు మిక్కిలి తక్కువగుటచే శ్రవణేంద్రియము వాని వరుసనాదముల నంత చక్కగా గ్రహింపలేదని జెప్పవచ్చును.

మనస్థాయియందలి స్వరావళి మూడురకముల శ్రుతిచేరికలచే నలరారుచున్నది. భరతాదివాగ్గేయు లును ఈమూడువిధము లనువానినే "ద్విశ్రుతి స్త్రిశ్రు తిశ్చైవ చతుశ్శ్రుతిక యేనచ" అని చెప్పియుండిరి.

యిందుచే యెన్ని విభాగములు చేయదలచినను యీ మూడు పాంశములు జ్ఞప్తియం దుంచవలయు: 1. స్థాయియందు 3 విధములగు శ్రుతియంతరము లుండ వలెను; 2. 3 పెద్దయంతరములు (Ratios) రెండేసి తక్కిన చిన్నయంత్రములు నుండవలెను. 3. అంతరములు క్రమభి న్నములతో (Integers only to be used) నుండవల యును. ఈసంగతులు పొసగునట్లు స్థాయిని యీవిధముగు శ్రుతులుగల విభాగికముగ మాత్రము జేయవచ్చును—

| స్థాయియందలి శ్రుతులు | త్రికముల క్రమాంతరం (Ratio) | అంతర గాంధారమునందలి శ్రుతులు | అంతర గాంధారము విలువ | పంచమము శ్రుతులు | పంచమము విలువ |
|---|---|---|---|---|---|
| | | | (cents) | | (cents) |
| 22 | 4:3:2 | ·7 | 382 ,, | 13 | 709 ,, |
| 29 | 5:4:3 | 9 | 372 ,, | 17 | 704 ,, |
| 32 | 6:4:5 | 10 | 375 ,, | 19 | 712.5 ,, |
| 34 | 6:5:3 | 11 | 388 ,, | 20 | 706 ,, |
| 41 | 7:6:4 | 13 | 380.5 ,, | 24 | 702 ,, |
| 46 | 8:7:4 | 15 | 391 ,, | 27 | 704 ,, |
| 53 | 9:8:5 | 17 | 385 ,, | 31 | 702 ,, |

ఇందుచే 22 విభాగములే తక్కువసంఖ్య గలిగి పైసంగతులను కరము నిలబెట్టుచుండుటయే కాక, హెల్మహోల్ట్సు శాస్త్రవేత్త చెప్పు గాంధారవిలువ 386 కును, పంచమమువిలువ 702 కును కూడ సరస ముగా సరిపోవుచున్నది. 53 శ్రుతుల విభాగపు పద్ధ తియు నవ్యమయ్యు పైకారణముచే యెక్కువభాగములు సంగీతమున నొప్పవు. తక్కినపద్ధతులు 29 భాగికమున పంచమము నవ్యమయియు గాంధారమున కొంతెక్కువ్యత తగ్గియున్నది. 32, 34, 38 కూడ నవ్యముగా లేదు. ఇందుచే 22 శ్రుతులే మిక్కిలి తగినపద్ధతియని యెంచవల యును. అందుచే మనవారు మిక్కిలి ఘనతజెందిరి. వీరి చాతుర్య మాశ్చర్యమే.

శ్రుతులసంఖ్య 22 అని యెంచినపిమ్మట వీని పేర్లు సప్తస్వరముల స్థానములు మున్నగు సంగతులు ముఖ్యములు భారతవాగ్గేయులలో భరతుడు శ్రుతులపేర్లు వచించియుండలేదు. కాని శారంగదేవునకు పూర్వము నారదుడు "సంగీతమకరందమున" వీనిపేర్లను జెప్పెను. కాని యేమికారణముననో యీ పేర్లు యనంతరమున వాడ బడి యుండలేదు. శారంగదేవునిపేర్లనే ప్రతివాగ్గేయుం డును రామామాత్యుడు, సోమనార్యుడు, అహోబలుడు దామోదరుడు మున్నగువారు వాడియుండిరి. 1. తీవ్ర, 2. కుముద్వతి, 3. మంద, 4. ఛందోవతి, 5. దయావతి, 6. రంజని, 7. రక్తిక, 8. రౌద్రి, 9. క్రోధ, 10. వజ్రిక, 11. ప్రసారణి, 12. ప్రీతి, 13. మార్జని, 14. క్షితి, 15. రక్త, 16. సందీపని, 17. ఆలాపిని, 18. మదంతి, 19. రోహిణి, 20. రమ్య, 21. ఉగ్ర, 22. క్షోభిణి, వరుసన సప్తస్వర ములు ఛందోవతియందు షడ్జమును, రక్తికాయందు రిష భమును, క్రోధయందు గాంధారము మార్జనియందు మధ్య మము ఆలాపినియందు పంచమము, రమ్యయందు ధైవ తము, క్షోభిణియందు నిషాదమును మనవాగ్గేయులు చెప్పు చుండిరి. ఇందుచే శ్రుతులు నాలుగేసికాని మూడేసి కాని, రెండేసికాని చేరినప్పు డుదయమగు స్వనము స్వర మనబడుచున్న దని గ్రహింతుము. మధుకణ లేశములు ప్రత్యేకముగా నంతమాధుర్యము కలవి కాకపోయినను ఇట్టివి కొన్నిచేరి మధువెట్లయ్యెనో అట్లే శ్రుతులు

కొన్ని చేరి స్వరములై రంజింపజేయుచున్నవి. క్షీరము దధిరూపము దాల్చుచందమున, మృత్తిక ఘటముగ నేర్పడువిధమున, సప్తవర్ణములు వెలుతురునకు కారణ మగు భాతి శ్రుతులు స్వరరూపము దాల్చుచున్నవి—షడ్జగ్రామమున స్వరము లిట్లున్నవని భరతాదులమతము. షడ్జము 4 వ శ్రుతియందును, రిషభము 7 వ శ్రుతియందును గాంధారము, 9 వ శ్రుతియందును, మధ్యమము 13 వ శ్రుతియందును పంచమము, 17 వ శ్రుతిపైనను దైవతము, 20 వ శ్రుతిపైనను నిషాదము, 22 వ శ్రుతి యందును కలుగుచున్నవి. ఇందుచే షడ్జగ్రామము

స రి గ మ ప ద ని స
3 2 4 4 3 2 4 శ్రుతులచొప్పున నున్నది. ఇంతయే కాని జోన్సుగారు, పాటర్సను డే, ఇల్లిసు మొదలగువారు చెప్పువిధమున

స రి గ మ ప ద ని స
4 3 2 4 4 3 2 శ్రుతులు

చొప్పున లేదు. వీనియంతరములు మొదలగు సంబంధములు, యిత్యాది సంగతులనెల్ల క్రమముగ నేను వ్రాసిన పుస్తకమున జూచుకొనునది. పూర్వపు షడ్జగ్రామము పైవిధమున యుంటచే ప్రకృతపు స్వరావళికిని, దీనికిని మిగుల భేదముకలదు. వెల(?)గ్రామరాగపద్ధతి రామామాత్యునికాలము 1549 నాటికే యంత మెందుటయు, మూర్ఛనలతో గూడిన రాగము లన్నియు నించుమించు ఒక్క స్వరము షడ్జమునుండియే ప్రారంభింప బడునట్టి పద్ధతి వాడుకనందుటయు, షడ్జమధ్యమ గ్రామసంపుటి కలుగుటచే మధ్యమము 'వినాశీ' గ గ్రహింపబడుటయు, మొదలగు మార్పులు కలిగెను. అందుచే పూర్వపుపద్ధతి యప్పటికే కనుబడుట లేదు.

## శుద్ధస్వరావళి

కాని షడ్జగ్రామమున స్వరావళి యమరియుండు విధమున అనగా స్వరములు

స రి గ మ ప ద ని స
3s 2s 4s 4s 3s 2s 4s శ్రుతుల

చొప్పున కలిగియుండు విధమగుదానిని రామామాత్యుడు ముఖారిమేళమని పేర్కొనినాడు. దీనినే యితడు శుద్ధస్వరావళిగ నెంచినాడు. "సుద్ధసప్తస్వరైర్యుక్తో ముఖారీమేళకోభవేత్" అని చెప్పినాడు. ఇందు 3 రకముల యంతరములు అనగా పెద్దయంతరములు 4 శ్రుతులు చొప్పునను, 3 శ్రుతులు చొప్పునను కలవియు చిన్నయంతరము 2 శ్రుతులను కలిగినదియు నున్నవని గ్రహింపవలయును. తన వింశతి మేళములందు నిదియే ప్రధానమైనదట అహోబలుడును యీ విధమగు స్వరసమూహమును శుద్ధస్వరావళిగ నెంచెను. అనంతరము వేంకటమఖియు నీస్వరావళిని శుద్ధములుగనే యెంచి ముఖారిమేళమును తన లక్ష్యాన్వితమగు 19 మేళకర్తలందు ప్రథమమున పేర్కొనినాడు. అనంతర మీతడు డెబ్బదిరెండు మేళముల నేర్పరచి రనకల్పితములని, చెప్పు వానియందలి మొదటి రాగాంగరాగము కనకాంబరియని చెప్పనదియే యీ శుద్ధస్వరావళికి తుల్యమగుచున్నదని నవీనుల యభిప్రాయపడుచున్నారు. కాని యిప్పుడు దక్షిణమున శంకరాభరణమేళము అనగా

స రి గ మ ప ద ని స
4 3 3 4 4 3 2 శ్రుతుల

చొప్పునగలదానినే శుద్ధమేళముగ కొంద రెంచుచున్నారు. ఉత్తరమునను దీనినే శుద్ధస్వరావళియని జెప్పుదురు. వారు దీనినుండి కోమలస్వరములు గాని తీవ్రస్వరములు కాని యేర్పడినుట కద్దు. పాశ్చాత్యదేశములందును యీస్వరావళినే (Diatonic majer scale) శుద్ధస్వరావళిగా నెంచబడుచున్నది. మన శంకరాభరణమునకును పాశ్చాత్యుల యీ శుద్ధస్వరావళికిని (Major scale) దైవతమునందు మాత్రము కొంచెము వ్యత్యాసము కల దనుసంగతి మనము మరువకూడదు. వీరిస్వరావళి యిందుచే

స రి గ మ ప ద ని స
4 3 2 4 3 4 2 శ్రుతులచొప్పునయున్నది. అనగా మనము 405 స్పందనములుగల దైవతము నుపయోగింపగా తరి వారు 400 స్పందనములు గలదానినే వాడుదురు. ఎట్లుడైనను మన ప్రకృతపు శంకరాభరణమునుండియే మిగిలిన వికృతస్వరములు కలిగినవందుము. వికృతములకాధారము లగునవే శుద్ధస్వరము లందుము. ఇందుచేతనే శంకరాభరణమేళపు స్వరములే శుద్ధములని చెప్పుదురు.

హోబలుడు వీణాతంత్రియందు శుద్ధస్వరములను కలుగ జేయుటకు జెప్పియంశములు మనము గమనించిన యతని స్వరములు శంకరాభరణమనకు దుల్యములే యని తలం తుము,

ఈస్వరావళియొక్క-యంతరముల నారయుట పైన చెప్పినశ్రుతులబట్టి యుండును. చతుశ్రుతికమును ఘన స్వరము (Major tone) అనియు, త్రిశ్రుతికమును (Minor tone) అనియు, ద్విశ్రుతికమును (Semi-tone) అనియు పాశ్చాత్యులు చెప్పుకొందురు. వీని విలువలవరుసగ (1) చతుశ్రుతికము 3/2 × 3/2 ÷ 2/1=9/8. (2)త్రిశ్రుతికము 5/4 8/9=10/9 (3) ద్విశ్రుతికము 4/3 4/5=16/15 అగును. ఈ సంగతులవలన మన ప్రకృతి వికృతి స్వరావళి ఏల 22 శ్రుతు లెట్లు కనుగొనవచ్చునో ముందు చూతుము—శంకరాభరణస్వరావళి యీ విలువలతో ని ట్లున్నది:—

స రి గ మ ప ద ని స

9/8 10/9 16/15 9/8 9/8 10/9 16/15

## వికృతి స్వరములు

స్వరములు నియతశ్రుతులనుండి మారి వేరుస్థానములం దుండినప్పు డవి వికృతిస్వరము లని గ్రహింపబడుచుండెను. ఇట్లు నియతస్థానములనుండి ఒకశ్రుతిప్రమాణమున కాని, ద్విశ్రుతిప్రమాణమున గాని తగ్గినప్పుడును, హెచ్చినప్పుడును యీ వికృతిస్వరము లేర్పడుచుండును. ఒకస్వరమునుండి మరియొకస్వరమువరకు రెండుశ్రుతులు మాత్ర మున్న నిట ఒకవికృతిస్వర మే కలుగునని గ్రహించవలయును. ఇట్టి వికృతి భేదములు స్వరము లన్నియు బొందుచుండిన ట్లిప్పుడు కాని, పూర్వకాలమున గాని చూడము. గ్రామరాగకాలమున, అనగా 4 వ శతాబ్దము, భరతునికాలమునకు బూర్వమునుండియు గల్లినాథుని క్రీ. వె. 1460 లేక రామామాత్యుని కాలము క్రీ. వె. 1549 వరకు 'మధ్యమము' 'అవినాశి'గ నెంచబడెను. ఇందుచే షడ్జపంచమము లిప్పటివలెకాక వికృతులు కలవిగనే భావింపబడెను. రామామాత్యుడు కొంత యీపద్ధ తవలంభించినను, సోమనార్యుడు, అహోబలుడు మొదలగువారు షడ్జపంచమములు 'అవినాశి' స్వరములుగ నెంచి, మధ్యమము 'వినాశి' లేక వికృతులు పొందునదిగ జెప్పి మార్గదర్శకు లైరి. ఇప్పటికి నీపద్ధతి యనుసరించబడుచు కలదు. ఇందుచే రి, గ, మ, ద,ని, స్వరములు అయిదుమాత్రము సోమనార్యుని కాలమునుండియు వికృతులను పొందునవిగ భావింప బడుచుండినను, యీ వికృతుల సంఖ్యనుగూర్చిన పాఠభేదములు భిన్నాభిప్రాయములు నేటివరకు ప్రబలుచునే యున్నవి. సోమనార్యుడు చెప్పు 7 వికృతులు వేంకటమఖికి రుచింపలేదు. రామామాత్యుడు చెప్పు 7 వికృతులు సోమనార్యుడు భిన్నముగ జెప్పెను. శార్ఙ్గదేవుని 12 వికృతులు రామామాత్యుడు ఖండించెను. ఇట్లు పూర్వపు వాగ్గేయులే భిన్నాభిప్రాయులై వేరువేరు మతముల జెప్పుతరి వనయూహ లెట్లుండునో యాలోచింపుడు.

## భరతాది వాగ్గేయుల మతములు

వికృతిస్వరములను ప్రత్యేకించి భరతముని చెప్పకపోయినను, 1. కాకలీనిషాద, 2. అంతర గాంధార, 3. షడ్జసాధారణ, 4. మధ్యమసాధారణములను, "స్వర సాధారణము" లనుపేర మరినాలుగు యితరస్వరములను చెప్పియుంటచేతను, వీని నుపయోగించుటకు గొన్ని నిబంధనలు చెప్పుటచేతను యీతడును రాగకళను పోషించుటకు శుద్ధస్వరములు మాత్రము చాలకపోవుటచే వికృతి స్వరముల యావశ్యకతను గమనించె నందుము. 8 శతాబ్దము లైనవెనుక శార్ఙ్గదేవుని కాలమునాటి కీయావశ్యకత యత్యంత మగుటచే కాబోలు, పెక్కు-వికృతులు చెప్పబడుచుండెను. శార్ఙ్గదేవుడు 12 వికృతిస్వరములను చెప్పుటచే నితనికి మొత్తము 19 స్వరము లేర్పడినవి. కాని యితడు భరతుని 'స్వరసాధారణ' ములను కూడ జెప్పియుంటచే తనవికృతములు లక్ష్యములు కావనియు, దానే వానిని యెంచి చెప్పెననియు గ్రహింతుము. ఈతని వికృతిస్వరములు చ్యుతచ్యుతషడ్జములు త్రిశ్రుతాత్మక చతుశ్రుతాత్మక గాంధారములు లేక సాధారణాంతర గాంధారములు, చ్యుతచ్యుత మధ్యమములు, షడ్జమధ్యమ గ్రామపంచమములు, చతుశ్రుతిక

రిషభధైవతములు, కాకలి కైశికి నిషాదభేదములు——వీనిస్థానములు, ఏయేశ్రుతియందవి కలుసునదియు మొదలగుసంగతులు నా పుస్తకమున స్పష్టముగ దెలియును. ఇతని అచ్యుతషడ్జమధ్యమములు మున్నగునవి శుద్ధములనుండి భిన్నములు కావు. కావుననే రామామాత్యుడు, సోమనార్యుడు, అహోబలుడు యిత్యాదులు యీనుతమవలంభించి యుండలేదు. ఇందుచే 3 శతాబ్దములకు వెనుక రామామాత్యుడు వీని ఖండించి ఏడువిక్రృతులనే చెప్పెను. ఇతనికి మొత్తము పదునాలుగు స్వరములు కలవు. అవియెల్ల లక్ష్యమందు దృష్ట మని రచించెను. ఇతడు పంచమమును పూర్వపువారివలె కాక వికృతులు పొందునదిగ నెంచెను కాని షడ్జమమును వారివలె వికృతులు పొందునదిగనె చెప్పెను. ఇతని వికృతిస్వరములు 1. 10 వ శ్రుతినిగల సాగ లేక షట్శ్రుతిరి. 2. 11 వ శ్రుతినిగల అంతర గ. 3. 12 వ శ్రుతినిగల చ్యుత మ. లేక చ్యుతమధ్యమగాంధార; 4. 16 వ శ్రుతినిగల చ్యుత ప. లేక చ్యుతపంచమ మధ్యమము; 5. కైశికి ని. లేక షట్శ్రుతిధైవతము; 6. కాకలి ని. 7. చ్యుత స. లేక చ్యుతషడ్జనిషాద. ఈయన చ్యుతమధ్యమగాంధారము, చ్యుతపంచమ మధ్యమము, చ్యుతషడ్జనిషాదములను పేర్కొనుట కవి గాంధారమధ్యమనిషాదసంజ్ఞు లని చెప్పుటకే. వీనినే సోమనార్యుడు వరుసగ మృదుమధ్యమము, మృదుపంచమము, మృదుషడ్జమని పేర్కొనినాడు. కాని వీనిని, ప్రాచీనవికృతము, * లని యలక్ష్యము చేసినాడు. సోమనార్యుడును రామామాత్యునివలె 7 వికృతులనే చెప్పెను కాని వీ రిరువురకు భేదములు కలవు. ఇతనికిని మొత్తము 14 స్వరము లగుచున్నవి. పై ప్రాచీన వికృతములతో 17 స్వరములగును. ఇతనివికృతులు 1. 4 వ శ్రుతియందలి చతుశ్శ్రుతి రి. లేక తీవ్రరి. 2. 10 వ శ్రుతియందలి సాధారణ గ. లేక షట్శ్రుతి రి. 3. 11 వ శ్రుతియందలి యంతరగాంధారము; ౪. 15 వ శ్రుతియందలి షట్శ్రుతి మ. (ఇదియే మన ప్రతిమధ్యమము;) ౫. 21 వ శ్రుతియందలి తీవ్ర ద. లేక చతుశ్శ్రుతి ద. ౬. 23 వ శ్రుతియందలి కైశికి ని. ౭. 24 వ శ్రుతియందలి కాకలి ని. ఈయనచెప్పు స్వరములందు శు. రి., శు. ద., శు. గ. తప్ప తక్కినస్వరము లిప్పు డాస్థానములనే, అనగా ఆయాశ్రుతి విలువయందే, వాడబడుట విదితము. ఇందుచే నిప్పుడు శు. రి. శు. గ. లను వదలి, అంతర గ. కాకలి ని. స్వరములను శుద్ధస్వరములుగ నెంచినప్పుడు 5 వికృతులను గ్రహింతుము. కావున 7 శుద్ధస్వరములతో నివి జేరిన మొత్తము 12 స్వరము లగుచున్నవి.

ఆనంతర మర్ధశతాబ్దమునకు వెనుక అహోబలుడు తన వికృతిస్వరములకు పేర్లను వీరివలెనెంచక, ఒక్కొక్క శ్రుతి యధికమగువానిని వరుసగ తీవ్ర, తీవ్రతర, తీవ్రతమ, అతితీవ్రతమము లనియు, నొక్కొక్కశ్రుతి తగ్గియుండిన వాని నిట్లే కోమలములనియు, నూతనపేర్లను చెప్పి యుత్తర హిందూస్థానమువారికి మార్గదర్శియాయెను. ఇతని తీవ్రతరరిషభము శుద్ధగాంధారమే; తీవ్రతమ గ. శుద్ధ మధ్యమమే; పూర్వ ని. శుద్ధనిషాదమే. ఈయన చెప్పు శు. రి. శు. గ. మొదలగు శుద్ధస్వరములు షడ్జగ్రామమందు పూర్వులు చెప్పనవే.

ఇక వేంకటమఖి కాలమున షడ్జపంచమములు పూర్తిగ 'అవినాశీ' స్వరములుగ నెంచబడెను కాని ఈయన పంచశ్రుతి రిషభధైవతములు వరుసగ శుద్ధ గాంధార నిషాదస్థానములందే కలవని చెప్పుటచే వికృతిస్వరములు మొత్త మీయన అయిదే చెప్పినవాడాయెను. సోమనార్యుడు, వీని నొకశ్రుతి కోమలముగ జెప్పి శుద్ధ రిషభమని, చతుశ్శ్రుతి ధైవతమని చెప్పుటచే నివి శుద్ధ గాంధార, శుద్ధనిషాదములతో దుల్యములు కావనియు నివియే యిప్పుడు వాడబడునవనియు గ్రహింపవలయును. వేంకటమఖి చెప్పు వికృతులు వరుసగ (1) 10 వ శ్రుతియందలి సాధారణగ లేక షట్శ్రుతి రి; (2) 11 వ శ్రుతియందలి అంతర గ; (3) 16 వ శ్రుతియందలి వరాళి మధ్యమము; (4) 25 వ శ్రుతియందలి కాకలినిషాదము.

(ఇట పంచ శ్రుతి, రి. ద. లు, శు. గ., శు. ని. లందే కలవు. శు. గ., శు. ని. లిప్పుడు ఎంచబడుటలేదు.

* షడ్జమము 4 వ శ్రుతి యంటిమి కావున కాకలి 'ని' 24 వ శ్రుతి యౌనది.

కావునను, అతడు వీనిని ముఖారిమేళమందలి వికృతులను గొంచుటచేతను యివిప్పుడు దృశ్యములుగ నిట చేర్కొన లేదు. చతుశ్రుతి రిషభధైవతముల నితడు చెప్పలేదు.) ఈయన చెప్పు అంతరగాంధార, వరాళిమధ్యమ, కాకలి, నిషాదస్థానములు గమనీయములు. సోమనాథుడు లక్ష్యముగ 'బూర్వోక్తవికృతము' లని చెప్పిన వీయన గణించి ముఖ్యములని చెప్పినట్లు ఆస్థానములందే తిన పైస్వరములను చెప్పుట సాహసమే. ఈయన చెప్పు ఈయంతరగాంధార స్థానము సోమనాథుని మృదుమధ్యమము కావున యీ స్థానమున, అనగా 303¾ చలనముల విలువకలదిగ, నిప్పటి యంతరగాంధారము లక్ష్యమున లేదు. సోమనాథుని అంతరగాంధారమే, అనగా 300 చలనములు కలదే, యిప్పుడు వాడబడుచున్నది. తక్కినస్వరములు యీయన వరాళిమధ్యమము, అనగా సోమనాథుని మృదుపంచమము, 341 1/3 చలనములు విలువగలదానిని కూడ నిప్పుడు వాడుచున్నారు. మరియు నీయన కాకలి నిషాదమును, అనగా సోమనాథుని మృదువడ్జమమును, 455 5/8 చలనములుకలదానిని యిప్పటి శంకరాభరణమున వాడుటయు గద్దు. ఇందుచే సోమనాథునిస్వరములేకాక, యతడు తోసిరాజనిన 'ప్రాచీనవికృతములు' అనగా వేంకటమఖిచెప్పినవియు, నిప్పటి గానమందు లక్షింపబడుచున్న వనవలసియున్నది. కాని లక్షణమందిప్పుడు 12 స్వరములే చెప్పబడుటచే నైదువికృతులనే నెంచవలయును. ఫిడేలునందు యన్నిస్థానములు ధ్రువమగుచున్నను; 'సారికలు'గల వీణెయందు మాత్రము 12 స్వరములే ధ్రువమనినను పైవానిన్నెల్ల మనవారు గమకములచే నారోపించగలుగుచుంట విదితము. మనవారిప్పుడు లక్షణమందు చెప్పు 12 స్వరములందలి వికృతులు (1) శ్రుతియందలి శుద్ధ రిషభము; (2) 10 వ శ్రుతియందలి సాధారణగాంధారము; (3) 15 వ శ్రుతియందలి ప్రతిమధ్యమము; (4) 19వ శ్రుతియందలి శుద్ధ ధైవతము; (5) 23వ శ్రుతియందలి కైశికి నిషాదము. శుద్ధస్వరములు (1) శుద్ధషడ్జము; (2) చతుశ్రుతి రిషభము; (3) అంతర గాంధారము; (4) శుద్ధమధ్యమము; (5) శుద్ధ పంచమము; (6) చతుశ్రుతి ధైవతము; (7) కాకలినిషాదము. నివీ విలువలు షడ్జమమునకు గల వీనిసంబంధము యంతరముల తో నిట్లున్నది:—

| స్వరము | చలనములు | అంతరము |
|---|---|---|
| షడ్జము | 240 | 1 |
| శు. రి. లేక ద్విశ్రుతి రి. | 256 | 16/15 |
| చతుశ్రుతి రి. | 270 | 9/8 |
| సాధారణ గ. | 288 | 6/5 |
| అంతర గ. | 300 | 5/4 |
| శుద్ధ మ. | 320 | 4/3 |
| ప్రతి మ. | 337 ½ | 45/32 |
| శుద్ధ ప. | 360 | 3/2 |
| శు. ద. లేక ద్విశ్రుతి ద. | 384 | 8/5 |
| చతుశ్రుతి ద. | 405 | 27/16 |
| కైశికి ని. | 432 | 9/5 |
| కాకలి ని. | 450 | 15/8 |
| హెచ్చు స. | 480 | 2 |

కాని కొందఱు పదియారుస్వరములు స్పష్టముగ నున్నవనియు, వేంకటమఖియు శు.రి., పంచశ్రుతి రి., శు. గ., సాధారణ గ., షట్శ్రుతి రి., అంతర గ., శు. మ., వరాళి మ, శు.ప., శు.ద., శు. ని., పంచశ్రుతి. ద., కైశికి. ని., షట్శ్రుతిద కా. ని. శు. స అను 16 పేర్లుగల స్వరములను చెప్పెననియు మొదలగు సంగతులు చెప్పుచున్నారు. కాని వేంకటమఖి పంచశ్రుతి, రి., శు. గ. లు; షట్శ్రుతి రి. సాధారణముగ లు, పంచశ్రుతి ద., శు.ని. లు, షట్శ్రుతి ద. కైశికి ని. లు వేరువేరుస్వరములు కావనియే చెప్పియుంట వీరు గమనించుటలేదు. ఇట్లు వేంకటమఖి పద్ధతి ననుసరించి కాక చతుశ్రుతి రిషభధైవతలను గ్ర

హించినయెడల నివి శుద్ధగాంధార నిషాదములతో దుల్య
ములు కావు కనుక వీనిని వేరుస్వరములుగ నెంచి చెప్ప
వచ్చును. కాని శు. గ. శు. ని. లను మనము లక్ష్యమున
గ్రహింపకున్నాము కావున వీరు చెప్పునట్లు స్వరములు
భావింపలేము. వివిధపేర్లు ఒక్క స్వరమునకే వేంకట
మఖి చెప్పుటచే వానినెల్ల ప్రత్యేకములుగ వీరు గ్ర
హించునెడల సోమనార్యుని 21 పేర్లుగల స్వరములను
యక్లే రామామాత్యుని 22 పేర్లుగల యన్నిస్వరములను
వీరు వింతగ గ్రహింపవలసియున్నది. కోఁడలు చతుశ్రుతి
రిషభము శుద్ధగాంధారము యిట్లు చతుశ్రుతిదైవతము,శుద్ధ
నిషాదము నొక్కస్థానముననే యున్నవని పొరపాటభిప్రా
యపడి యందుచే శుద్ధగ. ని. లు లేవనుచున్నారు. వీరు
వేంకటమఖి చెప్పునట్లు పంచశ్రుతి రిషభదైవతములు వరు
సగ శుద్ధ గ. ని. లతో దుల్యము లగుననియు, చతుశ్రుతి
రి. ద. లు ఒక్కటి కావనియు గ్రహింపప్రార్థితులు. అ
ప్పుడు సోమనార్యుడెంచు స్వరము లన్నియు గలుగగల
వు. మరియు గొన్ని రాగములం దిప్పుడు లక్ష్యమున ము
ఖ్యముగా మన తోడి, గౌళ యిత్యాదులందు, శుద్ధ రి.
ద. లు కొంత కోమలములగు వానినే అనగా ఒక్కశ్రుతి
కలవానినే, మేటిగాయకులు వాడుచుంటచేతను, వేంకట
మఖియొక్క వరాళి, మ. ను, సోమనార్యుని 15 వ
శ్రుతియందలి షట్శ్రుతి మ. ను, ప్రతిమధ్యమమునుకూడ
వాడుటచేతను సోమనార్యుని కాకలినిషాదముకన్న వేంక
టమఖి చెప్పు ఒకశ్రుతి యధికమగు కాకలినిషాదమును
కూడ నవీనులు వాడుటచేతను, కొన్నిరాగములందు విపు
లము లగువానిని ముఖ్యముగా 420 చలనములుగల దేవ
గాంధారి యిత్యాదియందలి దైవతమును, సావేరి గాంధా
రము మున్నగువానిని వాడుటచేతను యీ మొదలగు కార
ణములచే నిప్పటిస్వరములు పై స్వరములు మాత్రమే కా
వనితోపించుచునే యుండును. కావుననే యిరువదిరెండు
శ్రుతులు మనసంగీతమున కాధారము లగుచున్నవందుము.

పైస్వరములను ముఖ్యసంవాదిపద్ధతివలన కనుగొని
వాని నేర్పరచి, ద్వావింశతిశ్రుతులయందు ఏయేస్వర
మెంతటి విలువ కలదియు నారయుట ముఖ్యము. అనగా
శ్రుతులవలన ఏయేస్వరము లెట్లు కలుగునదియు సంవా
దత్వమున నెంచుదము. స్వరములయంతరముల నేర్పరచు
టకు ముందు వీని తత్వముగూర్చి కొన్ని ముఖ్యసంగతులు
నేర్వవలయును. ధ్వనులు యను రణనాత్మకములు. ఏదేని
వస్తుచలనమువలననే ధ్వని కలుగుచున్నది. సోమనా
ర్యుడు“అను రణనాత్మకధ్వనిః” అని వచించినాడు. స్వర
ము లిట్లయ్యు చెవికి స్నిగ్ధము లగునవియే యని శార్ఙ్గదే
వుడు చెప్పెను. శ్రుత్యనంతరభావీయ స్నిగ్ధోఽను
రణనాత్మకః స్వతో రంజయతి శ్రోతృచిత్తం స స్వర
ముచ్యతే” సోమనార్యుడుదాహరణముగ నిట్టిస్నిగ్ధములగు
ధ్వనులు తంత్రి కదలునప్పుడెల్ల దానియందలి భాగభాగ
ములందును కలుగుచుండు ననియు నివే స్వయంభు స్వర
ములనియు జెప్పెను. ఇట్టిస్వరములను వరుసగ జేర్చి చెప్పి
‘స్వరపరంపర’ యని పేరిడెను. స్వరపరంపరయందలివి
సంవాదిబద్ధముగనే యుండును. ప్రథమస్వరము యనంత
రము మనము సంవాదిస్వరముగ గ్రహించు 2 వ స్వయం
భుధ్వని దీనికి హెచ్చుస్వరమే యనియు, 3 వ స్వయం
భుసంవాదిస్వరము పంచమమనియు, 4 వది మధ్యమమని
యు, నైదవది గాంధారమనియు నిట్లు గ్రహింపవచ్చును.
ఈ సంగతులు రాగవిబోధయందు చూచుకొనునది. సం
వాదిస్వరములను గుర్తించుటకు భరతాది మనవాగ్గే
యులు రెండుస్వరములకు 13 శ్రుతులు కాని, 9 శ్రుతు
కాని వ్యత్యాసముండవలయునని దృష్టాంతముగ జెప్పిరి.
13 శ్రుతులు వ్యత్యాసమున్నది పంచమమనియు, 9 శ్రు
తులుకలది మధ్యమమనియు గ్రహింతము. హెల్మహో
ల్ట్సుశాస్త్రవేత్తయు స్వరపరంపరను (Harmonic
series) తీగెయందు ముళ్లు (Nodes)కలుగజేసి యనుభ
వింపవచ్చుననియు, వీనిప్రమాణ మాయాస్వరముయొక్క
సంఖ్యయే చెప్పుననియు మొదలగుసంగతులు చెప్పెను.
ఇందుచే రెండవస్వయంభుధ్వని లేక స్వరము $^2/_1$; 3 వది
లేక పంచమము $^3/_2$; 4 వది లేక మధ్యమము $^4/_3$; 5
వది, లేక గాంధారము $^5/_4$ యగుచున్నవి.

పైస్వరముల యన్యోన్యతవలన సంవాదిపద్ధతి నను
సరించి, అనగా షడ్జపంచమపద్ధతి, షడ్జమధ్యమపద్ధతి,
షడ్జగాంధారపద్ధతి, వీనివలన మనస్వరములను, శ్రుతులను
యెంచుదము; కేవల మొక్క షడ్జపంచమపద్ధతి కాని

షడ్జమధ్యమపద్ధతికాని, షడ్జగాంధారపద్ధతికాని యట్లు చేయుటకు సాధ్యపడకున్నది. అందుచే నీమూడుపద్ధతుల నవలంభింపవలసియున్నది. అప్పుడును కొలది చిన్న మార్పులు కలుగుచుండును. ఈచిన్నమార్పులు మనసంగీతమునకే యేల ప్రపంచమందలి యందలి సంగీతపద్ధతులకు దృశ్యములే – యావశ్యకములే. షడ్జపంచమపద్ధతి ననుసరించి కొన్ని స్వరములు చూడుడు:—

(1) స 1 —— ప $3/2$

(2) ప $3/2$ —— చతుశ్శ్రుతి రి. $9/4$ ఒకస్థాయితగ్గిన

(3) చ. రి. $9/8$ —— చతుశ్శ్రుతి ద. $27/16$

(4) చ. ద. $27/16$ —— మృదు మ. $81/32$ (ఇది అంతరగాంధార మని కొందరెంచుదురు. కాని యిది మృదుమధ్యమమే యగుచున్నది. ఇందుచే భరతుని 13 శ్రుతుల వ్యత్యాసము ననుసరించి చ. ద., అం. గ. లు సంవాదులు కావనవలయును.) ఒకస్థాయితగ్గిన

(5) మృదు మ. $81/64$ —మృదు స. $243/128$

(6) మృదు స. $243/128$—వరాళి మ. $243/128 \times 3/2 = 729/256$ (దీనికి ఒకస్థాయి తక్కువ వరాళి మ. $729/512$. ఇది $64/45$ కు తుల్యముగ నున్నదందుము.

(7) వరాళి మ $64/45$ —ద్విశ్రుతి రి. $32/15$. ఒకస్థాయి తగ్గిన

(8) ద్విశ్రుతి రి. $16/15$ —ద్విశ్రుతి ద. $8/5$

(9) ద్విశ్రుతి ద. $8/5$ —సాధారణ గ. $12/5$ ఒకస్థాయి తగ్గిన

(10) సా. గ. $6/5$ —కై. ని. $9/5$

(11) కై. ని. $9/5$ —ఏకశ్రుతి మ. $27/10$ ఒకస్థాయి తక్కువ

(12) ఏకశ్రుతి మ. $27/20$—ఏకశ్రుతి రి. $81/40$ ఒకస్థాయి తక్కువ

* (13) ఏకశ్రుతి రి. $81/80$—ఏకశ్రుతి ద. $243/160$

(14) ఏకశ్రుతి ద. $243/160$ —త్రిశ్రుతి రి. $729/320$

(15) త్రిశ్రుతి రి. $729/320$ — త్రిశ్రుతి ద. $2187/1280$ ఒకస్థాయి తక్కువ

(16) త్రిశ్రుతి ద. $2187/1280$—షు. మ. .........

* ఇక్కడనుండి విలువలు వ్యత్యాసములు కావున గణనీయములు కావు. వరాళి మ. యందు స్వల్పమార్పు చేయవలసి వచ్చినది. షడ్జమధ్యమ పద్ధతిని చూతము.

(1) స/. —— మ. $4/3$

(2) మ. $4/3$ —— శుద్ధ ని. $16/9$

(3) శు. ని. $16/9$ —— శుద్ధ గ. లేక పంచశ్రుతి రి. $64/27$

(4) ఒకస్థాయి తగ్గిన పంచశ్రుతి శు. గ. లేక రి. $32/27$ ఏకశ్రుతి ద. $128/81$: దీనికి ఒక కోమా విలువ అనగా $81/80$ కలపినయెడల ద్విశ్రుతి ద. కలిగి $8/5$ వచ్చును.

(5] ద్విశ్రుతి ద. $8/5$ —ద్విశ్రుతి రి. $32/15$ ఒకస్థాయి తగ్గిన

(6) ద్విశ్రుతి రి. $16/15$ —ప్రతి మ. $64/45$:

కాని యిది వరాళి మధ్యమ మగుచున్నది. ఇందుచే భరతముని 9 శ్రుతుల వ్యత్యాసము ననుసరించి ద్విశ్రుతి రి., ప్రతి మ. లు సంవాదులు కాక ద్విశ్రుతి రి., వరాళి మ. లు యట్లనుచున్నవి.

(7) వరాళి మ. $64/45$ —మృదు స. $256/135$

(8) * ఇంతటినుంచి యీపద్ధతి విలువలుసుకరములు కావు. ఏకశ్రుతి ద. యందు కొలదిమార్పు చేయవలసి వచ్చినది. షడ్జ గాంధారపద్ధతి చూతము.

(1) అంతరగాంధారము $5/4$ —కాకలినిషాదము $15/8$

(2) కా. ని. $15/8$ —ప్రతి మ. $45/32$

(3) ప్ర. మ. $45/32$—ద్విశ్రుతి రి. $135/128$: ఇది కొంచము తీవ్రమగుటచే నొక కోమ $81/80$ తీసివేసిన ఏకశ్రుతి రి. $25/24$ వచ్చును.

(4) ఏకశ్రుతి రి. $25/24$ —ఏకశ్రుతి ద. $25/16$ ఒకస్థాయి తగ్గిన

(5) ఏకశ్రుతి ద. $25/32$ —శుద్ధ గ. లేక

— త్రిశ్రుతి రి. $75/32$ ఇక్కడనుంచి సరళ విలువలు రావు.

ఈ మూడుపద్ధతులయందలి విలువలు సంపుటీ చేసిన మనకార్యము నెరవేరుచున్నది. మనద్వావింశతి శ్రుతుల విలువలు, వీనియందలి యిదివరలో మనము గమనించిన స్వరములవిలువలు యీ విధమున గనుపరుపవచ్చును. కాని యిట త్రిశ్రుతిరిషభ దైవితముల వినుపించుటలేదు. కావున వీని నిట్లు గమనింతుము త్రిశ్రుతి దైవితము అంతర గాంధారమునకు మధ్యమవ్యత్యాసము కలది కావున నిది $5/3 \times 4/3 = 5/3$ యగుచున్నది. దీనికి పంచమవ్యత్యాసమున నున్న త్రిశ్రుతి రి. $5/3 \times 2/3 = 10/9$ అగును. ఇవికూడ పైవిలువలకు జేర్చినవి యిట్లు సమన్వయము చేయవచ్చును—

| స్వరము | శ్రుతుల నంబరు | | సవరణ స్వరముల విలువ | నిమిషమునకు చలనముల విలువ | అంతరము (షడ్జము స్వరమునుండి) | సెంటు విలువ (cents) |
|---|---|---|---|---|---|---|
| స షడ్జము | 0 | 0 | | 240 | 1 | 0 |
| రి ఏకశ్రుతి రి. | 1 | | 248 | 250 * | 24/25 | 70 |
| ద్విశ్రుతి రి. | 2 | ద్విశ్రుతికము | | 256 | 16/25 | 112 |
| త్రిశ్రుతి రి. | 3 | త్రిశ్రుతికము | | 266 2/3 | 10/ | 182 |
| చతుశ్రుతి రి. | 4 | చతుశ్రుతికము | | 270 | 9/8 | 204 |
| గ శుద్ధగాంధారము గ. | 5 | త్రిశ్రుతికద్విశ్రుతికము | | 284 4/9 | 32/27 | 294 |
| సాధారణ గ. | 6 | చతుశ్రుతికద్విశ్రుతికము | | 288 | 6/5 | 316 |
| అంతర గ. | 7 | చతుశ్రుతిక త్రిశ్రుతికము | | 300 | 5/4 | 386 |
| మృదు మ. గ. | 8 | ద్విచతు శ్రుతికము | | 303 3/4 | 81/64 | 408 |
| మ శుద్ధమధ్య మ. | 9 | చతుశ్రుతి త్రిశ్రుతి ద్విశ్రుతికము | | 320 | 4/3 | 498 |
| ఏకశ్రుతి మ. | 10 | ద్విచతుశ్రుతికము ద్విశ్రుతికము | 324 | 324–333 1/3 | 27/20 లేక 25/18 | 520 లేక |
| ప్రతిమధ్య మ. | 11 | ద్విచతుశ్రుతిక త్రిశ్రుతికము | | 337 1/2 | 45/32 | 590[568 |
| వరాళి మ. | 12 | చతుశ్రుతికత్రిశ్రుతికద్విద్విశ్రుతికము | | 341 1/3 | 64/45 | 610 |
| ప శుద్ధపంచ మ. | 13 | ద్విచతుశ్రుతికత్రిశ్రుతికద్విశ్రుతికము | | 360 | 3/2 | 702 |
| ద ఏకశ్రుతి ద. | 14 | చతుశ్రుతిద్విత్రిశ్రుతిద్విద్విశ్రుతికము | 372 | 375 *378 | 25/16 లేక 63/40 | |
| ద్విశ్రుతి ద. | 15 | ద్విచతుశ్రుతిత్రిశ్రుతిద్విద్విశ్రుతికము | | 384 | 8/5 | 814 |
| త్రిశ్రుతి ద. | 16 | ద్విచతుశ్రుతిద్విత్రిశ్రుతిద్విశ్రుతికము | | 400 | 5/3 | 884 |
| చతుశ్రుతి ద. | 17 | త్రిచతుశ్రుతిత్రిశ్రుతిద్విశ్రుతికము | | 405 | 27/16 | 906 |
| | | 16 కి బదులు ప్రత్యేక స్వరములు | 420 | 420 | 7/4 | |
| ని శుద్ధ ని. | 18 | ద్విచతుశ్రుతద్విత్రిశ్రుతిద్విద్విశ్రుతికము | | 426 2/3 | 16/9 | 996 |
| కైశికి ని. | 19 | త్రిచతుశ్రుతిత్రిశ్రుతిద్విద్విశ్రుతికము | | 432 | 8/5 | 1018 |
| కాకలి ని. | 20 | త్రిచతుశ్రుతిద్విత్రిశ్రుతిద్విశ్రుతికము | | 450 | 15/8 | 1088 |
| మృదు స. ని. | 21 | | | 455 5/8 | 243/8 | 1110 |
| స హెచ్చు స. | 22 | త్రిచతుశ్రుతిద్విత్రిశ్రుతిద్విద్విశ్రుతికము | | 480 | 2/1 | 1200 |

ఇట 6 శ్రుతులవిలువలు అనగా (1) ఒకశ్రుతి ఋషభము, (2) చ్యుతమధ్యమగాంధారము, (3) ఏకశ్రుతి మధ్యమము, (4) వరాళి మధ్యమము, (5) ఏకశ్రుతి దైవితము, (6) చ్యుతషడ్జ నిషాదము విలువలు కొంత భేదాభిప్రాయములను కలుగజేయుచున్నవి. ఇందుకుకారణము స–ప, స–మ, స–గ పద్ధతులందు మనము చేసిన

కొలది సవరణలే. ఇట్లు చేయనిది సరళ విలువలు కనుగొన లేము. వీనివిలువలు నిర్ధారణ సేయుటకు లక్ష్యమే ప్రధానముగ నున్నది. ఇందుచే వీని నిట్లెంచుదుము.—

(1) ఏకశ్రుతి రి. ద. లు :—మన పైవిలువ ననుసరించి షడ్జము 240 చలనము లగుదానిగ నెంచినప్పటి రిషభము 250 చలనములు కలదిగనున్నది. ఉత్తర హిందుస్థానమున లక్ష్యమందు 252 చలనములు కలది, అనగా $21/20$ యంతర మగు రిషభమే వాడుచున్నారు. దక్షిణమున మనవారు పైదానికన్న కొంచము కోమలమగుదానినే వాడుట కద్దు. ఇందుచే లక్ష్యము ననుసరించి కర్ణాటకగానమున 248 చలనములు గల రిషభమే కల దనవలయును. కావున 5 వది యగు నీ రిషభమును, దీనికి సంవాది యగు ఏకశ్రుతి దైవతమును సరి చేయవలసియున్నది. ఏకశ్రుతి దైవతము స–ప సమ–పద్ధతుల ననుసరించి రెండువిధములవిలువలు చూడసూపుచున్నవి. $25/16$ $63/40$ యంతరముల చొప్పున నున్న 375, 378 చలనములు గల ద్వివిధ విలువలందు 378 విలువగల దైవతమును ఉత్తరమున వాడుచున్నారు. కాని 375 విలువ గలదానిని మాత్రము కర్ణాటకమున వాడబడుటకానము. అందుచే మనము సవరణచేసిన విలువ ననుసరించియున్న రిషభమునకు పంచమమగు దైవతమునే మనవారు గణించుటచే దీనివిలువయు 372 గ నెంచవలసి యున్నది. ఇది $31/20$ అంతరముకలది యగును.

(2) వరాళి మ :—ఇదియు రెండువిలువలకు తావిచ్చుచున్నది. ఇందు ఒక చతుశ్శ్రుతికము ఒక త్రిశ్రుతికము, రెండు ద్విశ్రుతికములు చేరియున్నవనియు, ఒక్క చతుశ్శ్రుతికము, రెండు త్రిశ్రుతికములు, ఒక్క ద్విశ్రుతికము, చేరియున్నవనియు నిట్లు ద్వివిధాభిప్రాయమునకు లోనగుటచే దీని విలువ $64/45$ లేక $40/27$ అను రెండు విధముల తోపించుచున్నది. కాని లక్ష్యమందుత్తరమునను, దక్షిణమునను $64/45$ అంతరము కలదియే వాడబడుటచే దీనివిలువ 341 $1/3$ చలనము లగుచున్నది.

(3) మృదుషడ్జ మృదు మధ్యమములు:—మృదు షడ్జము విలువయు పై స–ప, స–మ, పద్ధతుల ననుసరించి రెండు విధము లగుచున్నది: (1) $256/135$; (2) $243/128$. దీనియందు కొంచెము తీవ్రమగు దానినే కర్ణాటకగానమున మనవారు పాడుచున్నారు. స–ప, పద్ధతి ననుసరించిన $243/128$ విలువగలదానినే మనము గణింపవలయును. కాని ఉత్తరమున $256/135$ విలువగలది వాడబడుట విదితము. ఈస్వరమునకు సంవాదియగు మృదుమధ్యమముకూడా నీ రెండు విలువల ననుసరించి ద్వివిధముగ దోపించు కాని మనము పైదాని విలువ $243/128$ గ నెంచితిమి. కావున దీనికి సంవాదియగు మృదుమ. విలువ $81/64$ అగు నదియే మనము గణింతుము.

(4) ఏకశ్రుతిమ:—ఏకశ్రుతిమధ్యమము విలువయు ద్వివిధమున, అనగా $27/20$, $25/18$ గ పొడసూపుచున్నది. స–ప. పద్ధతి ననుసరించి కలిగిన $27/20$ విలువగల మ. మనకు తగియున్నది. కాని కొంత శ్రమపడిగణించిన విలువ, అనగా ఏకశ్రుతి రి. మధ్యమమగునదిగ దీని నెంచునప్పటి విలువ $25/24 \times 4/3 = 25/18$ అగును. ఇది మనకు నవ్యముకాదు. ఉత్తరమున వాడబడు $27/20$ యంతరముగల 324 విలువగలదియే మనము వాడిన నవ్యము. ఇయ్యది దక్షిణమునంతగా లక్షింపబడకపోవుటచే దీనివిలువ యిది యని సులభముగ జెప్పజాలకున్నాము. ఇట్టి దీనిని మనము గ్రహించుటకు బదులు, దేవగాంధారి, ఆరభి ఇత్యాది రాగములందు పరిస్పష్టమగు మరియొకస్వరము మనగానమున నావశ్యకముగ నుండుటచే నద్దానిని యమలునకు బెట్టుట ముఖ్యము. దీనివిలువ 420 చలనము లగుటచే నిది $7/4$ అంతరమున నుండినది. కావున మనగానమునంతగా కానబడని ఏకశ్రుతి మ నుపయోగించుటకు బదులు 420 చలనములుగల. యీస్వరము నుపయోగించుట సమ్మతము. ఈమార్పు లన్నియు నాశ్రుతివీణ (Diachord sonometer) యందు గమనించితి కావునను, మేటిగాయకుల సమ్మతము నొందిన పిదపనే నేనీమార్పులను చేయుటకు సాహసించితిని.




## గ్రంథాలయోన్నతి ఎట్లు కాగలదు?

మొన్న కలకత్తాలో జరిగిన, అఖిలభారత గ్రంథాలయమహాసభ కాహ్వాన సంఘాధ్యక్షు లైన శ్రీయుతులు రవీంద్రనాథ ఠాకూరుగారు తమ యుపన్యాసమున గ్రంథాలయముల యుపయోగము విరివిగ పెరుగుటకొరకు కొన్ని అమూల్యములగు సూచనలను కావించినారు. ఆసూచనలను, జనవరి (౧౯-౩౯) మాడర్న్ రివ్యూపత్రిక ఉద్ధరించినది. ఈ క్రింద దాని అనువాదము గలదు.

ఉపన్యాస మిట్లు ప్రారంభమగుచున్నది:—

అత్యాశ మానవుని ముఖ్యాంతశ్శత్రువులలో నొక్కటి. మానవుడొకసారి, సేకరించి నిలువచేయుటకు మొదలిడుచో సంఖ్యను హెచ్చించుతలంపున కూడ బెట్టుటకు గల ఉద్దేశమును విస్మరించును. ఆతడు ధనాగారమునకు ధనము ప్రోవుచేయుచున్నను, మతము నవలంబించుటకు మనుష్యుల జేర్చుచున్నను కూడదీయు నుత్సాహమున నే కొట్టుకొనిపోవును. అప్పటి గ్రుడ్డితొందరలో అతని ఆశయ మగునవధి అస్పష్టమైపోవును. సంఖ్యాబాహుళ్యము చేత విలువను కొలువరాదని అతని మనస్సు మరచిపోవచ్చును.

*  *  *  *  *

సేకరించుటయందు గల పై పేరాస గ్రంథాలయములకొఱకు గ్రంథములను సేకరించుటయందు వర్తించుచున్నది కాని వాని ఉపయోగ సౌకర్యములయందు కానరాకున్నదనుచున్నాడు.

ఎన్నో గ్రంథాలయముల కిప్పుడు ప్రోవుపెట్టు తృష్ణ పట్టుకొన్నది. వానిలో ముప్పాతికవంతు పుస్తకముల కుపయోగమే లేదు. గ్రంథబాహుళ్యమువలన, ఉపయోగార్థ ముద్దేశింపబడిన కొన్ని పుస్తకములును మూలబడుచున్నవి. మనవాడుకలో ధనవంతుని గొప్పవాడందుము. ఒక లక్షాధికారి ఏదేని సమావేశమునకు వచ్చెనేని అందరును ఒకరిని మించిఒక రాతని గౌరవింప జూతురు. ఆ గౌరవ మత డొసంగవలసిన దానిపైనగాక కేవల మతని కున్న దానిపైననే నిలుచును. చాలవర కీవిధమున గ్రంథాలయముల గొప్పదనము గ్రంథసంఖ్యవలన నిర్ణయింపబడుచున్నది. పుస్తకము లుపయోగించుటకు గల సౌలభ్యములే గ్రంథాలయమునకు ప్రతిష్ఠగూర్పవలసియుండ, అట్టి సౌలభ్యములు గ్రంథాలయములచే పరిగణింపబడకున్నవి.

మన భాషయందలి పదజాలము రెండు తావుల కానవచ్చును. మొదటిది నిఘంటువు. రెండవది సారస్వతము. ఒక పెద్ద నిఘంటువునందు, వాడుక లోనివి కొన్నియే ఐనను, అన్ని పదములను సేకరించుట లాభకరమైనది. కాని సారస్వతమందలి పదసంఖ్య మిక్కిలి తక్కువ. ఆపదములకు ప్రాణ మున్నది. అందుచేత ఒక్కటియు మిగిలించుట కష్టము. అయినను నిఘంటువునకంటె సారస్వతమునకే ఎక్కువ విలువ యని ఒప్పుకొనక తీరదు.

ఈ పరమార్థమే గ్రంథాలయమునకు చెందును. అందు బహుగ్రంథ సముపార్జనార్థమయిన భాగము ఉపయోగము గలదియే కాని నిరంతరము అనేక విఘ

ముల ఉపయోగము కొరకయిన రెండవభాగము ఆలయ మహత్త్వమును నిర్ణయించును. ఇది సామాన్య గ్రంథాలయాధికారి (Librarian) ఎక్కువపుస్తకములను మిక్కిలిగా ఉపయోగింప జేయు మాటను కూడ తలపెట్టడు. ఏలన సంఖ్యాబాహుళ్యమును ప్రదర్శించి లోకమును ఉక్కిరి బిక్కిరిచేయుట సులభము.

*     *     *     *

## తరువాత గ్రంథాలయములను మిగుల నుపయోగకరములుగ జేయుటకై మార్గములను గూర్చి:

గ్రంథాలయమునకు మహత్తమోపయోగము చేకూర్పవలసినయెడల అచటి గ్రంథముల విషయము లందరికిని స్పష్టముగా తెలుపుడు చేయవలెను. లేకున్న జనసామాన్యమున కవి అందుబాటు కావు. గ్రంథాలయ మప్పుడు ఎక్కువవసతి కలిగియు రాకపోకలకు సౌకర్యము లేని నగరమువలె నుండి పోవును. ఏదేని ముఖ్యాన్వేషణతో గ్రంథాలయమునకు వచ్చువారు తమ ఆవశ్యకత కొలది దారి చేసికొందురు. కాని గ్రంథాలయమే ఇందు తనకునుగల బాధ్యత గుర్తింపవలయును. గ్రంథములున్నయందులకు వాని నందరిచేతను చదివించవలెను. అప్పుడే గ్రంథాలయమునకు సార్థకత. కేవలము జనులను పుస్తకములను చూచిపోవుటకు రానిచ్చుటమాత్రము చాలదు. దాని ఆహ్వానమెంతయు చురుకుగ నుండవలెను. "తన్నష్టం యన్న దీయతే" ఇవ్వబడనిది వ్యర్థమైనదన్న మాట.

గ్రంథాలయము తనపుస్తకములజాబితాను చూపి అందరిని అందుండి ఎంచుకొమ్మనుట పరిపాటి. కాని ఈగ్రంథానుక్రమణికలందు ఉపోద్ఘాతము, ఆహ్వానము, స్వాగతోత్సాహమును లేవు. తా నిచ్చు విందుతో పాఠకుల నాహ్వానించుటకు ఏగ్రంథాలయ మెక్కువ ఉత్సహించునో అద్దియే ఆతిథ్యపరత్వము కలది. ఇట్టి ఆతిథ్యము మాత్రమే గ్రంథాలయమును పెద్దజేయునది కాని గ్రంథముల సంఖ్య కాదు. పాఠకులు గ్రంథాలయమును పుట్టింతురనుట పరిపూర్ణ సత్యముకాదు. గ్రంథాలయము కూడ పాఠకులను సృష్టించును.

## గ్రంథాలయాధికారి కర్తవ్యములు

ఈపరమార్థము దృక్పథమందు నిల్పియున్న గ్రంథాలయాధికారి నెరవేర్పవలసిన విధి ఎంతగొప్పదియో ఎరిగికొనగలము. అతనిపని గ్రంథములను ప్రోగుచేసి, విషయవిభాగముచేసి జాగ్రత్త పెట్టుటతో ముగియబోదు. అనగా అతని ముఖ్యధర్మము కేవలము పెంచుట తెంచుటలు కాదు. ఉన్న గ్రంథముల నన్నిటి నతడు సద్వినియోగము చేసికొనియుండవలెను. గ్రంథాలయము మిగుల పెద్దదైనయెడల అట్లర్థ మొనర్చుకొనుట అతని కశక్యమగును. అందువలన నాఊహయందు పెద్దగ్రంథాలయము ఉగ్రాణమువంటిది. చిన్నదిమాత్రమే భోజనశాలవలె దినదినము ఆహారమును, ఆనందమును సమకూర్చునది.

*     *     *     *     *

## చిన్న గ్రంథాలయము

చిన్నగ్రంథాలయము నాయుద్దేశమం దిట్టిది: ప్రతి విషయమునందును ముఖ్యగ్రంథములుమాత్ర ముండవలెను. ఆగ్రంథములు సంఖ్యారాధనకుగాక ఒక్కొక్కటియు ప్రత్యేకాధిక్యము కలదిగ నుండవలెను. అందు గ్రంథాలయాధికారి నిరుద్దేశపూర్వకమగు అర్చనాసక్తి కలిగి, గ్రంథాలయమును కేవలము నిండించుటయందు దృష్టి మానము లేక, వాస్తవముగ ననవసరములగు పుస్తకములను విసర్జించు వివేచన కల్గియుండవలెను. చిన్నగ్రంథాలయమున అతిథుల ఆనందమునకు సరిగా సరిపోవు సామగ్రి యుండవలెను. దాని అధికారికి గృహమేధి గుణము లుండవలయును; కాని ఉగ్రాణపు కావలివాని గుణము లుండకూడదు.

*     *     *     *     *

## తనభావమును విస్పష్టము చేయుట కొకయుదాహరణము నిచ్చిరి:

ఒక ఉదాహరణగా స్వదేశవిదేశములందు ప్రకటింపబడు పత్రికలను తెప్పించు భాండాగారమును పరికింతము. అందలి నిర్వాహకవర్గములో నొక్కడు సరిశప్పక ప్రతిపత్రికలో కుతూహలమిచ్చు విషయములను వ్రాసి

పెట్టి, అందరికిని కానవచ్చుచోట నుంచినచో ఆపత్రికల ననేకులు పఠించు నవకాశ మధికమగును కదా. అట్లుకాకున్న మూడుపాళ్లు పత్రికలు ముట్టుకొనబడక నానాట పెరుగుచు మూలల బడి మురిగిపోవుచున్నవి. నూతనముగ ప్రకటింపబడు గ్రంథముల సంగతియు నింతియే. గ్రంథాలయాధికారులును, వారిచేతిక్రిందివారును గ్రంథములందుగల విశేషము లెరింగికొనుటకు యత్నింపరు. కాని గ్రంథములు చేతికివచ్చిన వెంటనే అందలి సారస్వత సంపద అందరికిని తెలియవలసినదనుట విస్పష్టమే కదా.

తెలియవలసిన దెవరికి? ప్రతివిషయమునను కొందరు ముఖ్యపాఠకులగు. అట్టి పాఠకసంఘములు విధిగా ప్రతి గ్రంథాలయమునకును ఉండవలయును. అవియే గ్రంథాలయమునకు జీవము. గ్రంథాలయాధికారి సామర్థ్యము అనేక పాఠకసంఘముల నాకర్షించి పరిరక్షించుటయందును, పాఠకునికిని గ్రంథములకును మధ్యస్థుడై పరిచయము హెచ్చించుటయందును గలదు. అనగా అతనిమీద గ్రంథభారము, పాఠకభారమునుకూడ కలదు. ఈరెండింటిని నిపుణముగ వహించుటయం దాతని విధి నిర్వహణము నిర్ణయింపబడును.

* * * * *

## గ్రంథాలయాధికారి కర్తవ్యములను గూర్చి మఱికొన్ని సూచనలు:

పుస్తకములనుగూర్చి కూడ గ్రంథాలయాధికారి తాను సేకరించినవాని విషయమునేకాక అప్పుడపుడు ఎన్నియోవిషయములగూర్చి ప్రకటింపబడు గ్రంథములతోగూడ పరిచయము కలిగించుకొనుచుండవలెను. మాటకు మాశాంతి నికేతనపాఠశాలలకొరకు పిల్లలకై ప్రచురింపబడు పుస్తకములలో వారికొరగ కేర్పరుచుకొనజాలియుండుటకు వానినన్నిటిని చూచి యుంచుకొనుచుందుము ప్రతి గ్రంథాలయమును ఇట్టి పనికి తోడ్పడవలయును. ఇది కుదురు పెట్టన: అప్పటివరకు అనేక విషయములగూర్చి ప్రకటింపబడి పేరుగన్న గ్రంథముల పట్టికనుంచుకొనవలయును. ఇట్లొక గ్రంథాలయము యత్నించుచున్నట్లు తెలిసినచో గ్రంథప్రకాశకులును క్రొత్తగ్రంథముల అనుక్రమణికలు, ప్రాతగ్రంథముల విషయ వివరణలును నొసంగి తోడ్పడుదురని నా నిశ్చయము.

## అఖిలభారత గ్రంథాలయ సమితి కొకసూచన:

తుదకు అఖిలభారత గ్రంథాలయ సమ్మేళనమునకు నాకావించు ప్రార్థన మిది. ఈ సమ్మేళనము వైజ్ఞానికసారస్వత చారిత్రక గ్రంథములలో ప్రఖ్యాతములగు వానికి జాబితాలు, మూడుమాసములకో, అర్ధసంవత్సరమునకో అథమము సంవత్సరమునకో ఒకమారు వినిర్మించి అన్నిచోట్లకును బంపునట్లు చూడవలెను. దేశమందంతటను గ్రంథాలయములను స్థాపించి, అభివృద్ధిపరచుట సమ్మేళనోద్దేశమునేని సంగ్రహింపబడు పుస్తకముల మార్గదర్శికల నొసంగుటచేత ఉద్దేశము సఫలము కాగలదు. మరియు అప్పుడే గ్రంథసంపాదనయు గ్రంథరక్షణయు గాక గ్రంథాలయ ప్రధానకార్యమగు గ్రంథవిషయ పరిచయమునకును, విషయములతో కుతూహల మిచ్చువానినంతటను చురుకుగ తెలియజేయుటకును తోడ్పాటు లభింపగలదు.

ఆంధ్రదేశ గ్రంథాలయములవారు రవీంద్రుని పై యమూల్యోపదేశములను మార్గదర్శకములుగ స్వీకరించి అచిరకాలమున ఆచరణములోనికి దెచ్చుకొందురుగాక.

---

## కిష్కింధ, పంచవటి-స్థలనిర్ణయము

శ్రీపెండ్యాల వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భారతచరిత్రమను గ్రంథమునందలి పటమునందు కిష్కింధ బళ్లారి ప్రాంతముగా గుర్తించియుండిరి. వీరు శ్రీ కొ. లక్ష్మణరావుపంతులుగారి హిందూ మహాయుగము అను గ్రంథమునందలి యభిప్రాయము ననుసరించి వ్రాసియుందురని తోచుచున్నది. ఇది పొరబాటని మనవిచేయుచున్నాడను. కిష్కింధ, పంచవటి— ఈస్థలముల నిర్ణయము ముఖ్యముగా వాల్మీకిరామాయణము ననుసరించి చేయవలసియుండును. హిందూమహాయుగమను గ్రంథమునందు

శ్రీలక్ష్మణరావుపంతులుగారు అయోధ్యనుండి లంకవరకు గల శ్రీరామునిమార్గమును నిర్ణయించుచు పటముతో గూడ వ్రాసియున్నారు. వారు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి వలెనే కిష్కింధ బళ్లారిప్రాంతమని నిర్ణయించినారు. ఇంతేకాక పంచవటి భద్రాచలప్రాంత మనికూడ వ్రాసినారు. వాల్మీకిరామాయణమునందు శ్రీరామునియొక్క ప్రయాణమును వివరించుపట్టులనుఆధారముగాగొని ఊహపై శ్రీరామునిమార్గమును నిర్ణయించుటలో కిష్కింధయు పంచవటియు పై విధముగా నిర్ణయించబడినవి. కాని ఆవాల్మీకిరామాయణమందే సుగ్రీవుడు సీతాన్వేషణము కొరకై వానరవీరులను నలుదిశలకు పంపుచు వారు వారు రుగవలసిన మార్గములను వేరువేరుగా వివరించిన పట్టులను వారు గమనించినటులు కనుపించదు. తూర్పున కరుగు వారికి గంగ,కౌశికి,యమున,సరయువు వీట్లను మార్గముగా చెప్పినాడు. దక్షిణమున కరుగువారికి వింధ్యము, నర్మద, గౌతమి, వరద,కృష్ణవేణి వీట్లను మార్గముగా చెప్పినాడు. పశ్చిమమునకరుగువారికి సురాష్ట్ర,బాహ్లిక,శూర, భీమ, సింధుసాగరసంగమ దేశములను చెప్పినాడు. ఉత్తరమున కరుగువారికి శూరసేన, పుళింద, ప్రస్థర, మద్రక, భరత, కురుమొదలగు దేశములను చెప్పినాడు. ఇందునుబట్టి నర్మదకు దక్షిణమున తపతీనది తగులనిచోట (దక్షిణమునకు జనువారలకు తపతీనదిని చెప్పనందున) నర్మదానదియొక్క ఉత్తరతీరమునందలి వింధ్యపర్వతముల నడుమ ప్రదేశమే కిష్కింధయని సులభముగా నిర్ణయింపవీలగుచున్నది. పంచవటి ప్రదేశము భద్రాచల ప్రాంతముకాక నాసికప్రాంతమని మహారాష్ట్రులయొక్కయు, ఆధునికవిమర్శకులలో కొందరియొక్కయు అభిప్రాయమనికూడ లక్ష్మణరావుపంతులుగారు వ్రాసియున్నారు. ఈవ్రాత ననుసరించి పంచవటి నాసికప్రాంతమైనయెడల పైకిష్కింధ నిర్ణయమునకు బాగుగా సరిపోవుచున్నది. ఇదియుగాక ఆంధ్రీకృత బ్రహ్మాండపురాణమున కిష్కింధవింధ్యపర్వతపాదమున నున్నదని విస్పష్టముగా వ్రాయబడియుండుట పైనిర్ణయములకు మిక్కిలి బలమొసగుచున్నది. పర్ణశాల భద్రాచల ప్రాంతముకాక నాసిక ప్రాంతమనికూడ నిర్ణయమగుచున్నది. కావున పైవిషయములను విమర్శించి పండితులు నిర్ణయించెదరుగాక. విక్రయదస్తావేజులో విక్రయస్థలమునకు నాల్గు హద్దులనువ్రాసి ఆ స్తిని వివరించునటువలె వాల్మీకి రామాయణములో కిష్కింధకు విస్పష్టముగా హద్దులు చెప్పబడియుండుటవలన ఆవిషయము నిస్సందేహముగ కూడ నిర్ణయింప వీలగుచున్నది.

[కొచ్చర్లకోట వెంకట్రామయ్య]

---

## అమెరికా కుటుంబములు

కుటుంబ విషయములు అను శీర్షికక్రింద న్యూయార్కు నందలి 'సర్వే గ్రాఫిక్'(Survey Graphic) అను పత్రికలో డాక్టర్ లూయిస్ అనువా రిట్లు వ్రాయుచున్నారు:

మనప్రస్తుత నాగరికతకు కుటుంబమే పునాదిగనున్నది. ౧౯౨౧ సం. జనాభాయందు ౨౪,౩౫౧,౬౭౬ కుటుంబములు యునైటెడ్ స్టేట్సులో నుండెను. ౧౯౨౮ లో దాదాపు ౨౮౪ మిలియన్లు కుటుంబములు కలవు. సగటున నొకకుటుంబము నందలి జనసంఖ్య ౪.౩ అయియున్నది. కుటుంబపరిమాణము నానాటికి తగ్గిపోవుచున్నది. పూర్వ మొకకుటుంబమునందు ఏడెనమండుగురు పిల్లలుండెడివారు. అట్టిది ౧౭౯౦ జనాభాలో కుటుంబజనసంఖ్య ౫.౭ అయినది. పెద్దకుటుంబములు దక్షిణదేశమునందును, మిగుల చిన్నకుటుంబములు పసిఫిక్ తీరమునందును కలవు. పట్టణవాస కుటుంబములకంటె పల్లెటూరి కుటుంబములే పెద్దవిగనున్నవి. ౧౯౩౦ లో కుటుంబసంఖ్య ౪.౩—౪.౧ వరకు దిగినది.

౧౯౩౪ లో యునైటెడ్ స్టేట్సునందు జనసంఖ్యలో ౧౦౦౦-కి ౧౦.౨ చొప్పున వివాహములు జరిగినవి. ఇతర దేశములతో సరిపోల్చిన యెడల మనవివాహములసంఖ్య చాలయెక్కువగనే కన్పించును. ౧౯౩౪ సం వత్సరమునందు ఇంగ్లండులోను, వేల్సులోను, వేయింటి

టికి ౪.౪ చొప్పున వివాహములు జరిగినవి. జర్మనిలో ౪.౧ చొప్పున వివాహములు జరిగినవి. కాని యీ రెండు దేశములలోను యుద్ధానంతరము వివాహము కాక యుండినకన్యల సంఖ్యాపరిమితిని బట్టి యింతవరకైనను హెచ్చినవనుట నిస్సందేహము. అమెరికాలో వివాహములకు అవకాశములు మెండుగనున్నవి. కుటుంబబలమును జన్మములసంఖ్యను బట్టి కూడ స్థిరపర్చవచ్చును. రిపబ్లికు పరిపాలన ప్రారంభమయిన తర్వాత జనసంఖ్య సంవత్సరమునకు నూటికి ౩½ చొప్పున హెచ్చినది. ౧౮౭౦ లో వేయింటికి షుమారు ౮౦ హెచ్చు కన్పించెను. అది మొదలు నానాటికి క్రమేణ క్షీణించుచునే యున్నది. ఇప్పుడు వేయింటికి ౨.౧ మాత్రమే హెచ్చు కన్పించినది.

విడియాకులమూలమున కలిగిన భగ్నకుటుంబముల సంఖ్య నానాటికి హెచ్చినది. ౧౯౨౫ సం. లెఖ్ఖప్రకారము ఏడువివాహములో నొకటిచొప్పున కోర్టులో రద్దు కాబడినవి. పల్లెటూళ్ళలోకంటె పట్నములలోనే విడియాకులసంఖ్య హెచ్చుగనున్నది. డైవర్సుకోర్టులలో దాంపత్యవిభాగముల యొక్కయు విడియాకుల యొక్కయు కేసులసంఖ్యయే హెచ్చుగ కన్పించుచున్నది. ౧౮౮౫ సంవత్సరములో ౧౦౦౦ వివాహములలో ౬౦ వివాహములు రద్దగుచుండెను. ౧౯౨౫ సం. రంలో ౧౦౦౦-కి ౧౫౪ చొప్పున రద్దయినవి.

నాగరికదేశ మనిపించుకొనిన అమెరికాలోనే యిట్టిదుర్ఘంతములు జరుగుచుండ మిస్ మేయో భారతదేశమునకు వ్రేలు చూపినది. వీపుపైమచ్చ నెరుగకుండుట నైజమేకదా!

[దుర్గుమహంతి ఆదినారాయణ]

---

## హారుంరశీదు–నౌశేరవాఁ

ఈరాన్ దేశపు చక్రవర్తి "నౌశేరవాఁ" అనునతఁడు విచారశీలత్వమునందును, న్యాయపరాయణత్వమునందును అతిప్రసిద్ధిని పొందిన మహానుభావుఁడు. ఆదేశప్రజను లిప్పటికిని "నౌశేరవాఁ ఆదిల్" అని ఆయనను స్మరించుచుందురు. బాగ్దాదునందలి ప్రఖ్యాతుఁడయిన "ఖలీఫా" హారుంరశీ దనునతఁ డొకసారి తన పార్శ్వదులతోఁగూడి లోఁతయిన కొండగుహలో నెవ్వరికిని తెలియకుండ గుప్తమయియున్న నౌశేరవాఁ తొలూకు సమాధిని చూడఁబోయినాఁ డని యీరాన్ దేశీయుల నమ్మకము. నౌశేరవాఁతొలూకు మృతశరీరము రకరకముల మసాలాలు చేర్చి సురక్షితముగా నుంపఁబడినది. హారుంరశీదు చూచునప్పటికి నౌశేరవాఁదేహ మెంతో విలువగల యొక సింహాసనముపైని ఉంపఁబడి కనుపడినది. అతని శరీరమునందలి యవయవము లన్నియు నెప్పటియట్లే యున్నవి. చెవులుమాత్రము తెల్లఁబడిపోయినవి. నౌశేరవాఁ చనిపోయిన మఱి రెండునందల సంవత్సరముల తరువాతను హారుంరశీదు సింహాసన మెక్కినాడు. ఒక పుస్తకములో అతఁడు తాను చేసిన ఆ యాత్రనుగుఱించిన సంగతు లీప్రకారముగా వ్రాసి యుంచఁబడినవి.

"కొండల మధ్యను గుహలో ఘోరాంధకారములో ఆ సమాధి యున్నది. దాని యెదుటను స్వర్ణసూత్రముతోఁ గూర్పఁబడిన దళసరివస్త్ర మొకటి వ్రేలాడుచున్నది. హారుంరశీ దాపరదాను తొలఁగించుటకు ప్రయత్నించిన వెంటనే, పురాతనము, జీర్ణము అగు నా పరదా క్రిందను పడి మట్టిలో కలిసిపోయినది. సమాధికి నాలుగువయిపులను ఉన్నగోడలపైని తాపించిన మణులకు పరిమితి లేదు. ఆరత్నముల కాంతులచేతనే అట్టిచిమ్మచీకటిలో సయితము, ఆ సమాధి యున్నచోటు స్పష్టముగా నగపడుచుండెను. ఫాదుషా తొలూకు మృతశరీరమే సింహాసనము మీఁద నుంపఁబడినదో, అదియు నవరత్నఖచితమయినదే. ఆమృతదేహము చూడఁగా జీవించియున్న మనుజుఁడే కూర్చున్నాఁడని తోఁప మొదలిడినది. నౌశేరవాఁ మరణించుట లేదు; జీవించియే యున్నాఁ"డని ఖలీఫాకు భ్రాంతికూడఁ గలిగినది. ఆయన వెంటనే సాదరముగ తలవంచి నౌశేరవాఁకు వందనము చేసినాడు.

ఫాదుషా తొలూకు మృతశరీరము మిక్కిలి అద్భుతములయిన ఉపాయములవలన సరిగా సజీవముగానే ఉన్నట్లు సురక్షితమై యున్నప్పటికిని దానిపయిని కప్పబడిన వస్త్రముమాత్రము బొత్తిగా జీర్ణించిపోయినది.

ఖలీఫా చేయివైచి ముట్టిన వస్త్రము లన్నియు జాటి పడిపోయి మంటిలోఁ గలిసిపోయినవి. ఆకారణము చేతను, ఆయన తన యొద్దనున్న బహుమూల్యమయిన శాలువచేతను ఘాదుషామృతశరీరముపైని కప్పుటయేకాక, నాలుగువయిపులను గొప్పవిలువగల క్రొత్త పరదాలను కట్టుట కాజ్ఞాపించి ఆసమాధిస్థాన మంతయును కస్తూరి, కర్పూరము మొదలయిన సువాసనద్రవ్యములచేతను పరిమళించునట్లు చేయించినాఁడు కూడను.

రత్నఖచితమయిన — ఆసింహాసనముపైని కొంచెమేమో వ్రాయఁబడి యున్నట్లతని కగపడినది. ఆయన వెంటనే 'మోవిదాలు' అనువారిని పిలిపించి పహలవీభాషలో ఏమి వ్రాసియున్నదో చదివి వినిపించుఁడని యాజ్ఞాపించినాడు. క్రిందను వ్రాయఁబడిన నీతి — ఉపదేశ మందులో అంకితమయి యున్నది.

౧. ఈ సంసారము చిరస్థాయి కాదు. ఏమనుష్యుఁడైతే దీనిసంబంధములో చాల కొలఁదిగా ఆలోచించుచున్నాఁడో వాఁడే అందఱికంటెను గొప్ప బుద్ధిమంతుఁడు.

౨. సంసారముద్వారా నిహతుఁ డగుటకు ముందుగానే దానిసుఖము ననుభవింపుము.

౩. ఎవరైతే నీకధీనులై యున్నారో వారిపైని, నీకంటెను ఉచ్చస్థితిలో నున్నవారివలన నీ వెట్టియాశ నుంచుకొనియెదవో అదేప్రకారముగా అనుగ్రహము కలిగి యుండుము.

౪. నీవు ప్రపంచము నంతను జయింపఁజాలినప్పటికిని ఎప్పుడో ఒకప్పుడు మృత్యువు, నిన్నుఁ దప్పక పరాజితుని చేసియేతీరు నని మాత్రము జ్ఞప్తియం దుంచుకొనుము.

౫. నీ సుఖముచేతను, ఐశ్వర్యముచేతను ప్రతారితుఁడవు కాకుండునట్లు సావధానముగ నుండుము.

౬. నీ వేమి చేయుదువో దానికిమాత్రమే ప్రతిఫలమును పొందెదవు. అంత కధికముగఁగాని, అల్పముగఁగాని పొందఁజాలవు.

ఖలీఫా, నౌశేరవాఁ చక్రవర్తిచేతను మిక్కిలి యొజ్ఞనై నదియును, పద్మరాగమణిచేతను నిర్మితమైనదియు నగు నొక ఉంగరమును చూచినాఁడు. దానిపై నీక్రింది విధమున వ్రాయఁబడియున్నది:—

౧. నిష్ఠురత్వమును చేయకుము. సత్కార్యములను చేయుట కభ్యసించుచుండుము. ఎప్పుడును తొందరపాటు పడకుము.

౨. ఒకవేళ నీవు నూఱు సంవత్సరములవఱకును బ్రదికియుండఁగల వనుకొనుము. అయినప్పటికిని మృత్యువునుమాత్రము మఱచిపోకుమా?

౩. బుద్ధిమంతుల సావాస మన్నింటికంటెను హెచ్చువిలువగల దని యాలోచించుకొనుము.

హారుంరశీదున కచ్చట నెన్నిగూ రత్నములు, ముత్తెములు మొదలయినవి యగపడినవి. వానిలో ననేకములయిన రత్నములు కూర్చఁ బడినదియు, హెచ్చు విలువగలదియు నగు కిరీటము కూడ నున్నది. దానికైదు కోణము లున్నవి. ఆ యైదంచులమీఁదను ఈ క్రిందియుపదేశవాక్యములు వ్రాయఁబడి యున్నవి:—

## ఒక వైపున

౧. ఆత్మజ్ఞానము గలవారినిగూర్చి నాసమ్మానము ప్రకటించుము.

౨. పరిణామ మాలోచించి కార్య మారంభింపుము. మొట్ట మొదటను పాఱిపోవుటకు మార్గమును స్థిరపఱుచుకొని తరువాత నగ్రేసరుఁడ వగుము.

౩. ఎవ్వరిని వ్యర్థముగా సతాయింపకుము. ఆందఱుసుఖము విషయమునను, స్వాతంత్ర్యము విషయమునను దృష్టి యుంచుము.

౪. ఇతరులను బాధించు సామర్థ్యమును నీధైర్యము తాలూకు అధికారముగా నాలోచింపకుము.

## రెండవ వైపున

౧. ఏదియేని కార్యమును ప్రారంభించుటకు ముందుగా అందుల కుపయోగించు వ్యక్తితో పరామర్శిం

చుము. ఆవ్యక్తి దూరదృష్టిగలవాఁడు కాకపోయిన పక్షమున వానిభరోసావలన కార్యమారంభింపకుము.

౨. జీవనముకొఱకు ధనమును, ధర్మముకొఱకు జీవనమును త్యాగము చేయుము.

3. మంచిపేరు సంపాదించువిషయమున నీ సమయమును వ్యయపఱుచుము. నీవు ప్రకృతమైన ఐశ్వర్యమును కోరుదువేని సంతుష్టుఁడవు, త్యాగివి యగుము.

## మూఁడవ వైపున

౧. విఱిగిపోయిన దానికొఱకును, పోఁగొట్టుకొన్న దానికొఱకును, దొంగిలింపఁబడిన దానికొఱకును నష్టమయిన దానికొఱకును, కాలిపోయిన దానికొఱకును, దుఃఖింపకుము.

౨. అన్యుని యింటిలోఁ గూర్చుండి ఆజ్ఞాపింపకుము. నీయింటిలోఁగూర్చుండి భోజనము చేయుట నభ్యసింపుము.

3. స్త్రీకి వశీభూతుఁడవు కాకుము.

## నాలుగవ వైపున

౧. మందమయిన, నీచమయిన కులమునుండి స్త్రీని పరిగ్రహింపకుము. సిగ్గులేనిపురుషునితో కలిసి కూర్చుండకుము.

౨. చరిత్రహీనులగు వ్యక్తులకు దూరముగా ఉండుము. అనుగ్రహము తాలూకు మర్యాదను తెలిసికొఁజాలని వానియందు సద్భావ ముంచకుము.

3. ఇతరుల వస్తువులయందు లోభపడఁ బోకుము.

౪. రాజులకు భయంపడుము. ఏమా? వారగ్గి పఱెనే శ్వాలి కాల్చివేయుదురు.

౫. నీ విలువను తెలిసికొనుటకు ప్రయత్నింపుము. ఇతరులవిలువకుఁ దగిన ఆదరణ చూపుము. నీ కంటెను ఉన్నతస్థితిలో నున్నవానితో వివాదపడకుము.

## ఐదవ వైపున

౧. రాజునకు, రమణికి, కవికి భయపడుచు ప్రవర్తింపుము.

౨. ఏప్రాణినికూడ హింసింపకుము. ఇతరుల దోషములను వెదకు స్వభావమును వదలిపెట్టుము.

3. ఆనందపూర్వకముగా ఉండుట కభ్యసింపుము. ప్రతిసమయమునను విరక్తుఁడవయి యుండకు. ఇట్లుండెదవేని నీజీవనము దుస్సహమై పోయెడిని.

౪. నీకులములోని స్త్రీలను సమ్మానించుచు, వారిని రక్షించుము.

౫. క్రోధమునకు వశీభూతుఁడవు కాకుము. వివాదసమయమున నెప్పుడును శాంతిని స్వీకరించుటకై సిద్ధపడుము.

౬. ఆదాయమును మించిన వ్యయము చేయఁబోకుము.

౭. మొట్టమొదటను క్రొత్తమొక్కలను వేసి తర్వాతను చెట్లు నఱకుటకు ప్రయత్నింపుము.

౮. పండుకున్నప్పుడు ప్రక్కను మించునట్లు కాళ్లు చాఁపకుము.

సమాధిస్థలమును విడుచునప్పుడు ఖలీఫా దీని మార్గము ఎప్పటికిని బందుచేయవలెను. అట్లు చేసినచో నెవ్వరును లోభపడి మృతశరీరమును గూర్చి అమర్యాదచేయుట కవకాశ ముండదు. అని యాజ్ఞాపించినాఁడు. అది మొదలామార్గము బందుచేయఁబడినది. అటుపైని మరి యెవ్వరును అచ్చటికి వెళ్లఁజాలకపోయినారు. ఇప్పటికిఁగా దెప్పటికిని వెళ్లఁజాలరు. ఆస్థానమెచ్చట నున్నదో ఆసంగతియే యెవ్వరికిని తెలియదు.

(మాధురినుండి)

[పురాణం సూర్యనారాయణ తీర్థులు]

---

## విమానప్రమాదములు

### 1928 సం॥ మొదటి 6 మాసములయందు జరగిన ఘోరములసంఖ్య

| | |
|---|---|
| గాలిలో ఘూర్ణనమువలన | 2 |
| నిండుయెగురులో విమానేతరమగు ఘూర్ణనమువలన | 25 |
| ఎంజిన్ చెడుటచే గాలినుండి జారిపడుట, గిరగిర తిరుగుటవలన | 17 |
| ఎంజిన్ చెడకుండానే గాలినుండి జారిపడుట, గిరగిర తిరుగుటవలన | 98 |
| అన్ని కారణములచే బలవంతముగా నేలకు తాకుటవలన | 83 |
| అనవసరముగ నేలకు దిగిపోవుటవలన | 55 |
| ప్రమాదమునుండి తప్పించుకొనుటవలన | 44 |
| బరువెక్కించుటచే ప్రమాదమువలన | 10 |
| గాలిలో తగులబడుటవలన | 4 |
| నానావిధములు | 41 |
| తెలియనివియు, సందేహాస్పదములును | 11 |
| మొత్తము | 390 |

### విమానసంచారము చేసినవారు

| | |
|---|---|
| ప్రాణాంతకమైన గాయములు(చనిపోయినవారు) | 153 |
| ప్రమాదకరమగు గాయములు | 133 |
| చిన్న గాయములు | 143 |
| ఘాతపడకుండ తేలినవారు | 399 |
| సంఖ్య | 828 |

(లిటరరీ డైజెస్టునుండి)

[దుగ్గమహంతి ఆదినారాయణ]

---

## "హారప్ప"

౧౯౨౯ వ సం. జనవరి నెల 'ఇండియన్ ఆంటిక్వేరిపత్రికయందు శ్రీవినోదవిహారీ రాయ వేదరత్నగారు సింధునదీ ప్రాంతముల బయలు పడిన 'హారప్ప' యను నగరము కొందఱు పరిశోధకులు పేర్కొనినట్లు అనార్యులకు జెందినది కాక ఆర్యులకు జెందినదే యగునని యీ క్రింది శ్రుతిస్మృతి ప్రమాణములను పురస్కరించుకొని నిశ్చయించుచున్నారు.

ఈశిథిలము లార్యనాగరకతకు చెందినవని నేను తలతును. ప్రాచీనకాలమున నార్యులు సప్తసింధుప్రాంతములను, పంజాబునందును నివాసము చేయుచున్నప్పుడు ఈ (మోహంజోదారో, హారప్ప)నగరములను రెంటిని దేవనిర్మితదేశము (ఋ.వే. ౩-౩౩,౪, మనుసం. ౨-౧౭) అనగా ఒండుపేరుకొని ఏర్పడిన సముద్రగర్భస్థలమున నిర్మించియుందురు.

వేదకాలమున 'హరియూపియ' అను ఒక నగరముండెను. అచ్చట చయమానపుత్రుడు అభ్యావర్తి రాజనకును, వరశిఖునిపుత్రులకును యుద్ధము జరిగెను. ఇంద్రుడు అభ్యావర్తితో చేరి హరియూపియనగరమునకు తూర్పు పడమరగలవిడిసియుండిన వరశిఖపుత్రులను చంపెను. (ఋ. వే. ౬-౨౭, ౫)

పరుష్ణి (రావి)నదిచేరువను చయమానపుత్రుడు కవికిని, దండెత్తివచ్చిన సుదాసుడను(ఋ. వే. ౭-౧౮,౫) ఆర్యవీరునకును మఱియొక యుద్ధము జరిగెను. ఈ యుద్ధమున ఇంద్రుడు సుదాసునితో చేరి కవిని చంపెను.

దీనినిబట్టి చయమానునిపుత్రు లొకరిపిదప నొకరీహరియూపియ నగరమును పరిపాలించిరనియు, ఎత్తివచ్చిన శత్రువులతో రెండు మారులు పోరాడిరనియు నే నూహించుచున్నాను. హరియూపియనగరము పరుష్ణి (రావి) నది ప్రక్కనుండెను కాబోలు. రావినదికి తూర్పువైపున నున్న హరియూపియ యే ఇప్పటి హారప్ప కాదగును. ఇంద్రుడు కవితో యుద్ధముచేసినపుడు హరియూపియను విధ్వంసము చేసి, వేఱొకచోట సుదాసుని కొఱకొక క్రొత్తనగరమును నిర్మింపజేసి యుండును. (ఋ. వే. ౭-౨౦, ౨.)

ఈసుదాసుడు పురుకుత్సునిపుత్రుడగు (ఋ. వే. ౭-౧౯,౩) త్రసదస్యునకును, యదుతుర్వసులకును (ఋ. వే. ౭-౧౯,౬; ౪-౩౧, ౧౭). సమకాలీనుడు. త్రసదస్యుడు క్రీ. పూ. ౫. సహస్రాబ్దమున రాజ్యపాలనము గావించెనని నేను లెక్కించి ఊహించుచున్నాను. ఆతని కాలమున ప్రయాగకు తూర్పున ఒక సముద్రముండెను. (మను. ౨౨, ౨౧-౨౨)

ఆసముద్రమిపుడు నైమండురేవునకు (నవద్వీపము దగ్గరనున్నది.) దక్షిణమున నున్నది. కావున అభ్యావర్తి; అతనిసోదరుడు, కవి క్రీ. పూ. ౫వ సహస్రాబ్దమున హారప్ప లేక హారియుపియను పరిపాలించియుండురని నేనూహించుచున్నాను. అభ్యావర్తి ఒకచక్రవర్తి (ఋ. వే. ౬-౨౭-౮). భరద్వాజఋషి అతనివలన గోవులను ఇతరవస్తువులను కానుకలు పడసెను. కావున, భరద్వాజ ఋషి, అతనికి పురోహితుడనియు; అభ్యావర్తి పృథువంశములోని ఆర్యుడనియు (ఋ. వే ౬-౨౭, ౮) నిస్సంశయముగా నేను చెప్పగలను. హారియుపియ లేక హారప్ప క్రీ. పూ. ౫వ సహస్రాబ్దమున నొక ఆర్యచక్రవర్తికి రాజధానిగ నుండెననియు, సుదాసుడచట ఆర్యులతో యుద్ధముచేసెననియు (ఋ. వే. ౭-౮౩,౧) ఇపుడు స్పష్టమగుచున్నది. కాబట్టి, హారియుపియ లేక హారప్ప నగరము క్రీ. పూ. ౫వ సహస్రాబ్దమున అనార్యనాగరకతకు కాక ఆర్యనాగరకతకు స్థానముగానుండెనని నేను నొక్కి చెప్పగలను..

---

## అవమానకరమే-నిజమయితే

కొందఱు భారతీయసంస్థానాధీశులు, 'భారతీయ ప్రభుత్వపు రాజకీయశాఖలోనికి భారతీయుల నధికారులుగ తీసికొనుట యెంతయు కానిపని'యని యొక మహజరును బట్లరు కమిటికి పంపుకొనిరని ఇండియన్ నేషనల్ హెరాల్డుపత్రిక చెప్పుచున్నది. అఖండ(ఆంగ్ల)సామ్రాజ్య రాజకీయ ప్రతినిధులుగ భారతీయులను నియమించుట తమగౌరవమును కుంచించుటగా వారు తలచుచున్నారట. హెరాల్డుపత్రిక, సంచితముకాదేని, ఈసంస్థానాధీశులు విదేశప్రభుత్వము తమపై నధికారము నెఱపుట కవమానము ను జెందకుండుటయేకాక, ఎంతసమర్థుడయినను భారతీయుని, తమ్ము తలద్రొక్కియేలుచు నిరంతర మొకకంటకమని పెట్టియేయుండుటకై నియమింపబడు నేవిదేశీయవ్యక్తికంటెను తీసిపోయిన వానిగా తలచుచున్నారు. ఇది లజ్జాకరము.

[మాడరన్ రివ్యూ]

---

## వేరుపురుగు డైరక్టరులు

"ప్రపంచములో అన్నిదేశాలముందూ బ్రిటిషు పరిశ్రమ నేడు పలుకుబడికి వస్తున్నది. ఎక్కువ అర్హమూ, సమర్థమూ, అయిన పారిశ్రామిక జాతిగా ప్రపంచములో బయలు రావడానికి ప్రయత్నిస్తున్నది. ప్రయత్నము సాఫల్యముకాగలదు. కాని అందుకు దారి కఠినమైనది. ఈసంధిదినాలలో బాధ్యత ఉన్నవాళ్లకు నేను ఉపదేశించే ముక్కలివి: "ఈతరుణమప్పుడే తరగతిభేదాలు లేక దేశపుయువకులు వెలువడి, దేశపుసామర్థ్యము ప్రదర్శించితే, మనమింతవరకూ మనకటకు తోడ్పడిన పారిశ్రామిక ఔన్నత్యమును తిరిగీ పడసి, తిన్నగా సాగించగలుగుదుము." ఇది అసమర్థులకు కాలముకాదు. వాళ్ళ వయస్సుతో నిమిత్తము లేదు. ఉమ్మడివర్తకసంఘాలు వచ్చి పరిశ్రమల చోటు లాగుకున్నప్పుడు సంఘనిర్వహణకు సంబంధించినవాళ్లూ, వాటిడైరెక్టర్లూ అనేకులు బయలుదేరి బలిసిపోయిన సంగతి నాఅనుభవముతో చెప్పగలను. ఆడైరెక్టర్లు పరిశ్రమలకు వేరుపురుగులు. లేశమూ తమతప్పులేక వేలకొలదిమంది పరిశ్రమల మితనిర్మాణము (Rationalisation of Industry) వల్ల పనినుండి తొలగిపోతూ ఉన్నప్పుడు, అధికారస్థానాలు ఆక్రమిస్తున్న డైరెక్టర్లనూ, వంతులు తమకు పట్టుకొని లంచాలవల్ల నేకాని పరిశ్రమల నిర్మాణమునకని వదలిపోవనివాళ్లనూ చూస్తూ ఇక దేశము సహించలేదు. వ్యర్థులు సమర్థులకు చోటిచ్చివేయాలి. ఆనియమమువల్లనే బ్రిటిషుపరిశ్రమ నిలుకడకు పెనసులాను నేటికాలములో సాగిపోగలదు."

—రివ్యూఆఫ్ రివ్యూస్.

అని బాల్డ్వినుగారు బ్రిటిషువారిని గట్టిగా ప్రోత్సహించిరి. భారతీయులకును—ఆంధ్రులకు—ప్రోత్సాహము గలుగగల దను నాశతో నీబాల్డ్వినుగారి మాట లిట నుద్ధృతము లయినవి.

---

## బిల్వమంగళస్వామి

భక్తితత్వమును ప్రేమ తత్వముతో నైక్యముచేసి పండితపామరజనహృదయంగమముగ మధురకవితాగానము చేసిన మహామహులలో బిల్వమంగళస్వామి — లీలాశుకులు—ఒక్కరు. భారతభూమి నా సేతుశీతాచలము నెల్లరును ఆనందముతో గానము చేయుచున్న శ్రీకృష్ణకర్ణామృతమువలన నీతడు లోకప్రసిద్ధిని జెందియున్నాడు. ఈ కవివతంసమును ప్రతిప్రాంతమువారును తమతమప్రాంతమువానినిగా తలచుచున్నారు. ఇతని దేశ, కాలముల నింతవఱకు గట్టిగా తేల్చినట్లు కానరాదు. శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవి (యం. ఏ.) గారు, ప్రాచీన గ్రంథపరిశోధనము గావించి యందుపలబ్ధము లయిన బిల్వమంగళకర్తృక గ్రంథములను, ఇతరగ్రంథప్రమాణములను పురస్కరించుకొని ఇతని దేశకాలములనుగూర్చి, చర్చించి, ఆంధ్రహిస్టారికల్ రీసర్చిసొసయిటీ త్రైమాసికాంగ్లపత్రిక, జూలయి (౧౯-౩౮) సంచికయందు కొంత చర్చించియున్నారు—ఆచర్చ యిట్లు కలదు:

లీలాశుకుల కృష్ణకర్ణామృతము మిక్కిలి ప్రసిద్ధిని గాంచినగ్రంథము. మూడుసిపద్యములుగల మూడు భాగములందు గలవు. లీలాశుకకర్తృకములగు గ్రంథములు పెక్కు బయలు పడినవి. సంస్కృతప్రాకృతవ్యాకరణములు, ఉపనిషత్తులు, తాంత్రికగ్రంథములు, కావ్యములు, భక్తిప్రధానములగు స్తోత్రములు నిప్పటికిలభించినవి. సంస్కృత వ్యాకరణశాస్త్రమున నతడు వైయాకరణి 'దేవు' డను నాతడు రచియించిన 'దైవ' మను గ్రంథముపై 'పురుషకార' మను వ్యాఖ్యానమును రచియించెను. భోజదేవుని 'సరస్వతీకంఠాభరణ' మను సూత్రాత్మక వ్యాకరణగ్రంథమునకు 'కృష్ణలీలావినోద' మను పేరున నొక విస్తృత వ్యాఖ్యను బిల్వమంగళుడు చేసెను. సిద్ధాంతకౌముదికిక్కనున్న 'సుబంతసామ్రాజ్యము' 'తిజంత సామ్రాజ్యము' అను రెండువ్యాకరణగ్రంథములు బిల్వమంగళునికైలిబోలియున్నవి. వరరుచి ప్రాకృతవ్యాకరణసూత్రములను నిరూపించుటకుగాను భట్టికావ్యముఫక్కిని రచియించిన 'గోవిందాభిషేకము' లేక 'శ్రీచిహ్నకావ్యము' అను పేరుగల ప్రాకృతకావ్యమున బిల్వమంగళుడు మొదటి యెనిమిది సర్గములను రచియించెను. చివర నాలుగు సర్గములను అతనిశిష్యుడు, దుర్గాప్రసాదుడు రచియించెను. కేనోపనిషత్తుపైగల శంకరభాష్యమునకు 'శంకరహృదయంగమ' మను నొకవ్యాఖ్యకు బిల్వమంగళుడు కర్త. వివిధకృష్ణపూజావిధానములను వివరించు 'క్రమదీపిక' యను నొకతంత్రగ్రంథ మీతనికృతి. ఈపేరుగల గ్రంథమే భిన్నకర్తృక మింకొకటి కలదు. బిల్వమంగళుని కావ్యములలో సర్గత్రయాత్మకమయిన 'కాలవధ' యొక్కటి ఉపలబ్ధమయినది. లీలాశుకులస్తోత్రముల పెక్కులు మనోహరభావములకును, సుందరరచనమునకును పేరుగన్నవి. గణపతి, కర్కోటకుడు, రామచంద్రుడు, అభవుడు, బాలకృష్ణుడు, కృష్ణుడు, దక్షిణామూర్తి—వీరిని స్తుతించునవియె యిపుడు లభించినవి.

పైగ్రంథములన్నియు బిల్వమంగళుని దేశకాలములను కనుగొనుట కెట్లుపకరింపగలవో చూతము. దుర్గాప్రసాదుడు గోవిందాభిషేకమును పూర్తిచేయుటయొక్క

కావ్యమున కంతటికిని వ్యాఖ్యానమును వ్రాసియున్నాడు. గురువును గుఱించి అందు ఏమిచెప్పినాడు?

"కోదండమంగళవచో గదితే హి ధామ్ని
శ్రీకృష్ణదర్శనపరః కిల కర్ణభృత్యైః;
జాతః క్రమేణ పరహంసపదే స్థితోఽస్మి
యోఽంకస్థితస్త మవలోక్య జగామ తృప్తిమ్.
శ్రీపద్మపాదమునివర్య వినేయవర్గ
శ్రీభూషణం మునిరసౌ కవిసార్వభౌమః;
శ్రీకృష్ణరూప పరమామృత పానశీల
శ్చక్రే ఽదీయచరితం బహుధా హితాయ."

—సర్గ ౧.

"శ్రీకృష్ణలీలాశుక బద్ధకావ్యం
వివృత్య లోకస్య హితాయ పూర్వమ్;
తచ్ఛేషపూర్తించ పునర్విధాయ
వివృణ్మహే ఽథోత్తరభాగ మేతమ్."

—సర్గ ౯.

"ముక్తిస్థలాలయ శివాపపభక్తిలేశా
ద్దుర్గాప్రసాదయతి రిత్యభిధాం దధానః;
కర్తా స్వయం సుకృతమాత్రఫలా న్యభీప్సుః
కృష్ణేఽర్పయా మ్యథ విశుద్ధకరా మహాన్తః."

—సర్గ ౧౨.

"చాపమంగలఘరో జఈసరో
బిల్వమంగలఘరో ఎహాఇ జో;
మజ్ఝ ఏస పరిఆరకాలణా
భమ్మదం ఉపగఓ పసీఅట."

(ఛాయ:—చాపమంగలగృహో యతీశ్వరో
బిల్వమంగళగృహోవా భవతి యః;
మమ ఏష పరిచారకారణాత్
బ్రహ్మతా ముపగతః ప్రసీదతు.)

దీనినిబట్టి లీలాశుకుడు: సన్న్యాసియనియు, ఆశ్రమస్వీకారమునకు పూర్వ మాతనియింటి పేరు 'కోదండమంగలము' లేక 'బిల్వమంగలము' అనియు స్పష్టమగుచున్నది. ఇతడు పద్మపాదాచార్య పరంపరాగతుని శిష్యుడని రెండవశ్లోకమున సూచనగలదు. దుర్గాప్రసాదుడు 'ముక్తిస్థలము'నకు జెందినయాతడు. ఇక 'బిల్వమంగళ' అను మాట కర్థమేమి? దానికిని కోదండమంగళమునకును సంబంధము గలదా? కలదు. మలయాలమున 'విల్లునకు సంబంధించిన'అను అర్థముగల 'విల్వ' అనుపదమునకు 'బిల్వ' అనునది ఔత్తరాహోచ్చారణము. 'విల్' అనుపదము ద్రావిడభాష లన్నిటిలో 'విల్లునకు' సామాన్యవాచకము. మలయాలమున 'విల్వ' అనునది విల్లునకు ధర్మవాచకము. కావున 'బిల్వమంగళస్వామి' అనగా 'విల్వమంగళ' కుటుంబమున జన్మించిన ఒకసన్న్యాసి అని అగును. దుర్గాప్రసాదుడే అతనిని 'లీలాశుకు' డనుచున్నాడు. ఇపుడు వీరి అభేదమును సులభముగ ఊహింపదగును. కొచ్చి సంస్థానమునందలి తిరుచ్చూరులో పద్మపాదు డొకమఠమును స్థాపించినాడు. అచ్చటగల పెక్కు వ్రాత గ్రంథములయందు 'విల్వమంగలత్తె' అని వ్రాయబడియున్నది.

ఇక ముక్తిస్థల మెక్కడనున్నది? అని జగన్నాథమా? లేకున్న మలబారులో ఆపేరుగల యేదయిన నొక ప్రదేశమా? అది శ్వేతారణ్యమునకు దక్షిణమున ౧౦ మైళ్లదూరమున నున్న 'మూక్కుత్తల' కాదగును. అది జగన్నాథమైనచో దుర్గాప్రసాదుడు బిల్వమంగళుని అనుగ్రహమును 'పూరి'వద్ద సంపాదించియుండునని అనవచ్చును. గణపతి స్తోత్రమునందు తత్కర్త పడమటి (అరేబియా) సముద్రమునకు తూర్పున చేరువలో నున్న దొరసముద్రమను స్థలమునందలి ఒకదేవతను పేర్కొన్నాడు. ఈదొరసముద్రము మల్లిక్ కాఫూరు రూపుమాపిన బల్లాలరాజుల రాజధానియగు సుప్రసిద్ధద్వారసముద్రము. కేనోపనిషద్భాష్యవ్యాఖ్యాన మిట్లు ప్రారంభించుచున్నది.

"తత్త్వం కిమపి కృష్ణస్య సముత్తీర్ణజగద్భ్రమమ్,
స్వప్రభం సుఖసామ్రాజ్యం స్వానతే స్వాదిమావధి.
వన్దే భగవతీం గంగాం తుంగాం భగవత స్తనుమ్;
ఉన్మజ్జంతి నిమజ్జంతి యస్యాం భువనవీచయః.
కేనేషితపోనిషదః (?) కృష్ణలీలాశుకో మునిః;
ఆచార్యవచసాం చార్థ మాహ వీక్ష్య వివక్షితమ్.

విస్మృతిం ద్వయత త్త్వజ్ఞా వేదవ్యాఖ్యా సుశిక్షితాః;
పరవాక్యప్రమాణజ్ఞాః పరీక్షుంతా మిమాంక్రమాత్."

ఇందలి గంగానదీస్తుతికల శ్లోకము. దీని నాతడా చేరువను—కాశీపురమున గావచ్చును—ఉండి రచియించి యుండునని సూచింపవచ్చును. 'కాలవధ' మను నాతని కావ్యమున మృత్యుభీయమువలన శివలింగమును కౌగిలించు కొనియున్న మార్కండేయుని జేరవచ్చిన యముని శివుడు నిర్జించినగాథ వర్ణితమైనది. ఈగాథ సామాన్యమేయైనను దానికిని శ్వేతారణ్యమునకును సంబంధము గలదు. బ్రిటిషు మలబారులో 'ఎడకొళం' రైలుస్టేషనుకు మూడు మైళ్లదూరమునను్న 'తిరునావాయ్'యు ఈ శ్వేతారణ్యమును నొక్కటియే. కేరళులచే 'శిశు' లేక 'వాలయార్' అని పిలువబడిన నీలనది శ్వేతారణ్యమునకు ప్రక్కనున్నట్లు కవి కావ్యమున చెప్పియున్నాడు చూడుడు:

"శిశుసరితం వదన్తి సరితం తవపార్శ్వచరీమ్"

సుప్రసిద్ధ మీమాంసకుడగు పయ్యూరపట్టేరికుమారుడు వాసుదేవుడు చకోరసందేశమున నిట్లు చెప్పెను:

"ధామోపన్యష్ఛిదిశి గతే యోజనానాం త్రయేతం,
నావాక్షేత్రం క్రితసిలమపి శ్వేతపూర్వాటవీ సా."

స్థలమాహాత్మ్యమున శ్వేతారణ్యము లేక 'తిరునావాయ్' దక్షిణకైలాసమని చెప్పబడినది. ఈయాధార లేశములతో పాటు అతనిబాలకృష్ణస్తోత్రమును పరిశీలింతము. అది (తన లీలాశుక ద్వారమున) కృష్ణుకు స్వయముచెప్పినది. బాలగోపాలదేవుడు దానిని తన వేణువున గానముచేసెను. దానిమాధుర్యమును, చారిత్రక విశేషములను కనుగొందము.

"ఆదిత్యప్రజ్ఞ సంజ్ఞంయ దాదిత్యాదధికం మహః;
నిర్జిత స్సముద్భృత్యైవ నిర్మలం యేన మన్మథః.

అర్జితై రస్త్రకుసుమై రారా దారాధయన్ యయా;
ఈశాన దేవ ఇత్యాసీ దీశానో మునితేజసామ్.

ఆస్పదస్య హి యస్యాసీ దశేషగుణసంపదామ్;
అద్వితీయఇతఖ్యాతి రాత్మబుద్ధ్యా న కేవలమ్.

తయో రనుగ్రహాపాంగ సంక్రాన్త జ్ఞానసాగరాః;
సాగరా ఇవ గంభీరా స్సన్తి ధన్యా స్సహస్రశః.

తయో రేవ కృపాపాత్రం కృష్ణలీలాశుకో మునిః;
యదాశ్రమాంగణే నిత్యం రమన్తే తన్త్రివిస్తరాః.

తిలకం కులపాలీనాం నీలీతి నిలయం శ్రియామ్;
యమలం జనయాంచక్రే యంవ కీర్తింవ శాశ్వతీమ్.

యస్య దామోదరో నామ సవితా సవితృసన్నిభః;
అనృణస్యహి యస్యాస న్నధమర్ణా మరుద్గణాః.

యస్య తత్ప్రియ సర్వస్వం రాఘవేశానసంజ్ఞకమ్;
వినేయః సవిధేయానాం సుహృత్......

యస్య దక్షిణకైలాస లీలాపరిణతం మహః;
చర్చాచందనగంధేన సుగంధయతి మానసమ్.

కృష్ణలీలాశుకస్యాస్య కిశోర మధిదైవతమ్,
స్తుతిరత్న మిదం బ్రూతే వేణువాది ముఖేన్దునా."

ఈ శ్లోకములు చాలమనోహరములు. కవితాధోరణి రమణీయము. అదియుండె. అందలి చారిత్రకాంశము లెవ్వి? లీలాశుకుడు రాఘవేశునకు మిత్రుడు. ఆతనితండ్రి దామోదరుడు; తల్లి నీలి. అతని శాశ్వతకీర్తియే తోడబుట్టువు. అతనిగురువు ఆదిత్యప్రజ్ఞుని శిష్యుడగు ఈశానదేవుడు.......................

ఈశానదేవునకును, ఆదిత్యప్రజ్ఞునకును పెక్కురు శిష్యులు జ్ఞానసాగరులు కలరు. వీరిరువురిగృహములు తంత్రవిద్యకు విహారభూములు. చివరకు దక్షిణకైలాసపతి యొక్క దివ్యతేజస్సు చందనలేప గంధము నాలీలాశుకుని హృదయమును వాసింపజేసినది. సన్న్యాసి తనపూర్వులను గూర్చి చింతించునా? చింతింపడు. ఆతనియందీ స్తోత్రమును కృష్ణుడే వేణువుతో గానముచేసెను.

ఒకవర్గమునకు జెందిన సన్న్యాసుల పేరుల చివరను 'ప్రజ్ఞా' అను శబ్దము చేరియుండును. ఉదాహరణము: నృసింహప్రజ్ఞుడు. ఇతడు సురేశ్వరుని అరణ్యవార్తికమునకు రమ్యమైన వ్యాఖ్యానమును రచియించినాడు. ఇది 'ఆనందగిరి' కృతమునకన్న నెక్కుడుపయోగకర మయి

నది. ఇందలి ఈశానదేవుడు, ముద్రితమైన 'గురుదేవపద్ధతి' యను గొప్ప తంత్రగ్రంథమును రచియించిన ఈశానశివ గురువు నొక్కరే కాదగుదురు. 'రాఘవేశుడు' గొప్పద్వైతవేదాంతగ్రంథరచయిత యగు రాఘవేశుని కంటె భిన్నుడు కాదగును. మనరాఘవేశుడు భాగవతముపై నద్వైతవ్యాఖ్యానమును రచియించిన యాతడు కావచ్చును. ఈగ్రంథ మముద్రితము. ఇంక నెందేని లీలాశుకుడు తలిదండ్రులను గాని, గురువునుగాని పేర్కొనియున్నాడా? అవును. కృష్ణకర్ణామృతమునందలి తుదిశ్లోకమున పేర్కొనియున్నాడు. ఈశ్లోకము మలబారు లిఖితగ్రంథమున కలదు

"ఈశానదేవచరణాభరణేన నీలీ
దామోదరస్థిరయశః స్తబకోద్గమేన;
లీలాశుకేన రచితం తవ, దేవ, కృష్ణ,
కర్ణామృతం వహతు కల్పశతాంతరేఽపి."

తెలుగు అచ్చుపుస్తకమున నీశ్లోకముయొక్క మొదటిపాద మిట్లున్నది:

"ఈశానదేవచరణాభరణేన నీవీ" అని మొదటి శతకము చివరనున్నది.

౧౭ వ శతాబ్దమునకు జెందిన ఆంధ్రదేశీయుడగు వ్యాఖ్యాత 'నీలీ' అను పదమును 'నీవీ' అని పొరపడినాడు. ఈపొరపాటుకు రెండుకారణములు. ౧. 'లీ' కి 'వీ'కి వ్రాతయందు మిక్కిలిగ పోలికయుండుట. ౨. ఈశానదేవ దామోదర శబ్దములు రెండును శివవిష్ణుపరములుగ తటాలున స్ఫురించుట. వాఙ్మయచరిత్రమును తడవబూనని వ్యాఖ్యాత నీ రెండువిషయములును కన్నులు గప్పివైచినవి. ఉదాహృతశ్లోకములను బట్టి లీలాశుకులు మలబారు నివాసియనియు, ఆతడు భారతదేశమంతట సంచారము గావించెననియు, ఆతనికి శ్రీకృష్ణుని యెడగల అత్యంతభక్తిచేత నాతని నెల్లరును ఆత్మీయునిగ జెప్పుచున్నారనియు తేలుచున్నది.

భోజదేవుని అష్టాధ్యాయి వ్యాఖ్యానము లీలాశుకుని క్రీ. ౧౦౬౧కి తరువాతివానిగ దెలుపుచున్నది. మాధవుడు ధాతువృత్తియందు 'పురుషకారము' నుండి యుద్ధరించిన గ్రంథభాగము లీలాశుకుని ఆతనికాలమునకంటె అనగా క్రీ. శ. ౧౩౫౦కంటె పూర్వపువానిగా తెలుపుచున్నది. పైనజెప్పినట్లు ఈశానదేవుడు ఈశానశివగురువేయగుట సరియగునేని అతడు క్రీ.శ.౧౧౦౦ ప్రాంతములవాడు కాన, లీలాశుకులు అప్పటికి రెండు దశాబ్దములు తరువాతివాడుగా జెప్పవలెను. కాని, లీలాశుకుడు తన 'పురుషకారము'న క్షీరస్వామి, బోపదేవ, దుర్గ, భోజ, హేమచంద్ర, హరదత్త హరియోగుల గ్రంథములనుండి ప్రమాణములను గైకొనియున్నాడు.

క్షీరస్వామి పేర్కొని యుండుటచే దుర్గుడు లీలాశుకులకంటె పెద్దవాడు. హేముడు క్రీ. శ. ౧౧౫౦ ప్రాంతములవాడు; హరదత్తుడు క్రీ.శ. ౧౦౦౦ సంవత్సరములనాటి వాడుగ నున్నాడు. ఆతని చరిత్రము 'హరదత్తాచార్య చరిత'మను పేర తంజావూరు లైబ్రరిలో నున్నది. దానిని బరిశీలించినచో ఆతని కాలమునుగూర్చి ఇంకను చక్కగా దెలియగలదు.

'కవి కామధేను' గ్రంథకర్త అయినచో దేవుడు మహాదేవునికి తర్వాత క్రీ. శ. ౧౨౭౧ సం.న రాజ్యమునకు వచ్చిన సేవన రామచంద్రుని సభయందుండిన హేమాద్రికి సమకాలికుడు.

ఎట్లు చూచినను లీలాశుకునికాలము క్రీ. శ. ౧౨౫౦ కి పూర్వమును ౧౬౫౦కి పరమును కాజాలదు.

[భారతి]

---

## పాఠశాలలయందలి శిక్షానియమములు— విద్యాబోధక భాష

నవంబరునెల 'ప్రోగ్రెస్ ఆఫ్ ఎడ్యుకేషన్' యందు ప్రకటింపబడిన, బొంబాయి రాజధాని మాధ్యమికోపాధ్యాయుల సభయందలి యస్. ఆర్. జయకర్ గారి అధ్యక్షోపన్యాసము ఉదారమగు నభిప్రాయములతోడను భావయుతమగు సూచనలతోడను నిండియున్నది. ఉప

న్యాసమున వారు శిక్షా నియమముల గూర్చి యిట్లు వ్యాఖ్యానముచేయున్నారు:—

క్రమము, నియమము గూర్చి ముచ్చటించు నీ సమయమున యీ రెండు సుగుణములును నిరంకుశముగ నెల్లప్పుడు పాలింపవలసిన శ్లైపోవకుండునట్లు మీ కొక హెచ్చరిక వాక్యమును చెప్పవలసియున్నది. భారతదేశము వృద్ధిస్థితియందు, ముఖ్యవిషయము విద్య నెట్లువ్యాపింపజేయుట యనునదియే. నా అభిప్రాయ మిది—భారతదేశమున విద్యాభిలాషులగు ననేకమందియు దీని నంగీకరింతురని నా నమ్మకము—వీలగునంత హెచ్చుగా విద్యావ్యాప్తి యగుటకు నియమముల విధానముల పేరున నైనను నేదియు నడ్డురా కూడదని. విద్య బహుళవ్యాప్తినొంది, విశ్వజనీనమైపోయిన పిదప (పొలములోని కలుపుమొక్కలను పెరికివేయునట్లు) సంస్కారమునకు సమయము రావచ్చును. కాని అంతవఱకును మనము నియమ—విధానములను గూర్చి యంత పటాటోపము చేయకూడదని చాలమంది గట్టిగా ననుకొనుచున్నారు. నిర్భాగ్యుడగు భారతీయ విద్యార్థి యెన్నికకు సాధారణముగ నున్నవానిలో—అధిక సంఖ్యాకు లగు భారతీయవిద్యార్థులు బొత్తిగా నేవిద్యయు లేకుండుటకంటె లోపభూయిష్టమైన విద్యనైన నభ్యసించుట మంచిదే. విద్యతో సంబంధముగల భారతీయుడును ఆంగ్లేయుడును భేదదృష్టితో నీవిషయమును చూచుటకంటె నిట్టి విషయమున నిది తప్పని సరియగును. ఈ విషయమున పూర్వాశ్రయ మేమియు లేక అక్షరజ్ఞాన రాహిత్యము—అజ్ఞానము (మూఢత్వము)ననున్న దాని నుద్ధరించి పైకి తేవలసిన దేశముతో మనము వ్యవహరించుట లేదు. పూర్వకాలమున బాగుగా నిర్వహింపబడి బహుళవ్యాప్తినొందిన విద్యకు బ్రహ్మాండమగు సామర్థ్యమును కనుపరచియుండినవారితో మనము వర్తించుచున్నాము; కాని వారు నేటి పరిస్థితుల ననుసరించి మంచి ఫలితములొందుటకై తమ విధానములను మార్గములను మార్చుకొనవలసియున్నారు. నేడు భారతదేశము నెదుట నున్న యేకమాత్రసమస్య యిది — చవుకగా నందఱకును లభ్యించువిద్య; దీని యభివృద్ధికేదియు నడ్డురాకుండు టవసరమని యీ విద్యాశాఖవారు జ్ఞప్తి యుంచుకొందురు గాత.

జయకరుగారీ క్రింది వాక్యములను కూడ నుడివిరి. అవి సత్యములు, నిశ్చితములు:

జీర్ణకోశము—దానిశక్తి నటుంచి, మానవశరీరతత్త్వము ననుసరించి అది యిదివర కలవడి యుండని దానిని యరిగించుకొని పట్టించుకొనజాలదను న్యాయము సత్యమైనది. ఇదియే నిజమైనప్పుడు ఒకవిదేశీయమగు భాషయందు మనవిద్యాపరీక్షలన్నియు నున్నవిధాన మంతయు మన భారతీయవిద్యార్థికి చదువును చాల యెక్కువ కష్టమొనర్చివేయును. దేశముయొక్క రాజకీయ పరిసరములననుసరించి దాని విద్యావిధానము భేదించుచుండు నను సర్వజనసమ్మతమైనది. నేను ఆకాంక్షించి మనవిచేయునదెల్ల నిదియే: ప్రజల అవసరములు, రాజకీయవిషయములందు కూడ, వీలగునంత త్వరలో తీరునట్లు కనుపడునట్లు మన విద్యావిధానములును ఆదర్శములును యేర్పడవలయును. మన (ప్రయత్న) ప్రయోగమునందు ముఖ్యతమ సారాంశము శీఘ్రత. దీనిని మరువకుందురుగాక. [జ. బ్ర.]

---

## జపాను దేశపు రాజశాసనము

జపాను చక్రవర్తి నూతనముగ సింహాసన మధిష్ఠించునపుడు వెలువడిన రాజశాసనములో ఈక్రింది అంశములున్నవి:

"దేశములోపల, మా ప్రజలవిద్యావ్యాసంగమును, వారల నైతిక ఆర్థికములగు అభివృద్ధిని, తన్మూలమున పరస్పర సాహాయ్యము, సంతృప్తియు, యావజ్జాతి శక్తిశ్రేయస్సులును—వెలుపల, ఇతరజాతులన్నిటితోడ సౌహార్దమును, తన్మూలమున ప్రపంచశాంతి పరిపోషణమును మానవశ్రేయోభివృద్ధియును నిర్వహింప యత్నించుట మాకు గల ముఖ్యోద్దేశము. కావున ప్రేమపాత్రులగు మా ప్రజలందరు ఏకమనస్సుతో అసూయ లేక సంఘప్రయోగమునకు పనిచేసి, మా యీ ఆశయములు నెరవేరు

టకును, అందువలన వంశపారంపర్యముగ వచ్చుచున్న ఉత్కృష్టసాంప్రదాయముల నధిక మొనర్చుటకును, మా పూర్వుల జీవాత్మలను సంతోషమనస్కతతోడ సందర్శింపగల్గుటకును మా కెంతయు తోడ్పడుదురుగాత యని కోరుకొనుచున్నాము."

జపాను దేశీయుల కొనర్చుటకు వాగ్దత్తము లైనవానిలో ప్రథమస్థానము విద్య నభివృద్ధి కొసంగబడుట గమనింపదగినది. భారత దేశముపట్ల విదేశీయ (బ్రిటిషు) ప్రభుత్వవైఖరి దీని కెంత విరుద్ధము!

(మాడరన్ రివ్యూ)

---

అహమద్ జోగూ, నూతన అల్బేనియా రాజు

'లివింగ్ ఏజ్' పత్రికయొక్క జర్మను విలేఖరి యొకడు నూతన అల్బేనియారాజుయొక్క దుస్తుల విశేషములను, యితర విషయముల నిట్లు వ్రాయుచున్నాడు:

నిన్న నొక కిరీటములేనిరాజు, సంస్థానము లేని రాజ్యాధిపతి ప్రభునామము దాల్చెను. ఇట్లున్నను నేడతడు రాజత్వచిహ్నములగు సకల శృంగార వస్త్రాలంకారములను దాల్చి, పేరునను నిజమునకును కూడ రాజైయున్నాడు.

జోగొల్లీ కుటుంబమునకు చెంది మాట్యామండలమునకు వంశపారంపర్యమగు పెద్దయైన అహమన్ జోగూగారు అల్బేనియా రిపబ్లిక్కున కధ్యక్షుడై అల్బేనియా పార్లమెంటును, నానాజాతి సమితిని, కూడ లెక్కసేయని యపరిమితాధికారమును కలిగియున్నాడు.

సాధారణముగ అహమద్ జోగుగారు తన ముఖ్యసేనాని పదవియధికారమువలన తాను ధరింపనగు యోధదుస్తులను దాల్చియుందురు. సన్మానపు విందులపుడును, తాను ప్రజలకు కనపడవలసిన ప్రత్యేక సమయములందు నతడు కవాతుదుస్తులు (కోటు పంట్లాములు) దాల్చును. మొన్నటి ఐరోపా మహాసంగ్రామమునకు ముందు కొలది కాలము మాత్రమే అల్బేనియా రాజ్యమేలియుండిన విలియమ్ ఆఫ్ వీడ్ యొక్క వింతమాదిరి రాజదుస్తుల యనుకరణమిది. ఇది యనేక మార్పులనుపొంది తుదకిట్లు స్థిరపడినది. మొట్టమొదట అహమద్ జోగూగారొక తెల్లని మిలిటరీయంగీని, తెల్లపంట్లామును, తెల్లని(స్వారి చేయునపుడు ధరించు) జోళ్లను తొడుగుకొని మెచ్చుచూచిరి. త్వరలోనే వానినిమార్చి ఎఱ్ఱనిపంట్లామును, నల్లని జోళ్లను నారంభించిరి. పిమ్మట ఎఱ్ఱనిగుడ్డ అస్తరు



అహమద్ జోగుగారు

వేసిన నల్లని పైఅంగీని చేర్చెను. ఈ దుస్తు దాల్చినపుడతడు కొంతవర కొక సంగీత సుఖాంత నాటకమున నాయకునివలె (కొంత హాస్యపురీతిగా) కనపడినను, అతని కాదుస్తులు సరిగా నమరియున్నవనియు, స్త్రీలపై గొప్ప ప్రభావము కలిగియున్నవనియు నంగీకరింపక తప్పదు.

అతడు తన జీవితమునకు నెపోలియన్ బోనపార్టిని ఆదర్శముగ నుంచుకొన్నాడనుట నిస్సంశయము. అతడు తన వ్రాత బల్లపై నెల్లప్పుడు నెపోలియన్ జీవితచరిత్రము నుంచుకొని, అతిశ్రద్ధతోను ఆసక్తితోను చదువుచుండును. భవిష్యత్తు ముందు చెప్పబడినట్లు, అతని రాజపదవి నొందవలెనను కోరిక యిపుడు నెరవేరుచున్నది. అతడాజ్ఞలనిచ్చును, ఉద్యోగములనిచ్చును, ఉపకారములచే

యును—అప్పు డప్పుడు ఉరితీతనుకూడ తీర్మానించుచుండును—ప్రభుభక్తి కలిగి ధైర్యసాహసములు కల యుద్యోగీయవర్గము నిత డేర్పరచుకొనెను. వారు తమప్రభువును మించి బంగరు జరీకోటు పంట్లాములదాల్చి హోషుగా తిరుగుచుందురు.

కాని, యిన్నియున్నను కూడ, అతని పోషకుడును రక్షకుడునైన ముస్సోలినీ యొకమారు తలయూపినంతనే అహమ్మన్ యొక్క ఆశాస్వప్నములన్నియు నెరవేరకముందే యతనిశక్తిప్రాభవమంతయు నడుగంటగలదు.

[జ. బ.]

---

## జనసామాన్యమునకు విద్య
## ఉత్తమరూపమైన సంఘసేవ

అక్టోబరునెల 'సోషల్ సర్వీస్ క్వార్టర్లీ' యందు శ్రీ మనేక్‌లాల్ హెచ్. వకీల్‌గా రిట్లు వ్రాయుచున్నారు:

ఈవిషయమున పనిచేయగల ఏకమాత్ర ఉపాయము జనసామాన్యమున కక్షరజ్ఞానమే. అందరు బీద స్త్రీపురుషులును చదువను వ్రాయను లెక్కింపను ఎఱిగిన యెడల వారికి శుభ్రత ఆరోగ్యమును గూర్చిన మాత్రములు తెలియగలవు. వారి కూలిడబ్బుల విలువ వారికి తెలియగలదు. వడ్డీవ్యాపారమునకు డబ్బు అప్పిచ్చువారివలన మోసపడుట తగ్గగలదు. సహకార పరపతి సంఘములు ప్రారంభదశ దాటినవెనుక బయటి సంఘసేవకు లక్కఱ లేకయే యభివృద్ధి నొందగలవు. వారు ప్రభుత్వమువారిని వయోవంతులకు వోటుహక్కు నిమ్మని కోరుదురు. తమ బిడ్డలకు ప్రాథమికవిద్య నిమ్మని కోరుదురు. వారు అక్రమమైన తీవ్రమైన పోరులు సలుపక తమ గృహములను మాత్రము సంరక్షించుకొందురు. వారి సాంఘికనీతిప్రమాణము ఉన్నతినొందును. గ్రుడ్డిపోటీకి బదులు పరస్పర సహకారము ప్రేమ శ్రేయాభిలాష యేర్పడును. స్త్రీ పురుషునితో సమభాగిని యగును. ఆమె మాతగా చేయు సేవలు ప్రజలచే నింకను యెక్కువగా నామోదింపబడును. చదువు వచ్చిన స్త్రీ తనకు రావలసిన గౌరవాదుల హక్కుతో నాకాంక్షింపగలదు; మఱియు నీతిరక్షణకై పాటుపడువారికంటె నెక్కువసంఖ్యగానున్న స్వార్థపరులగు అవినీతిపరులవలన నామె చెడగొట్టబడి వ్యభిచారములోనికి దిగుట కవకాశములు తగ్గును. [జ. బ.]

---

## మూర్తిమత్త్వము

నేటి తరమునుయొక్క ప్రజాసమూహ మానసిక తత్త్వమును యెదిర్చి మించుటకు మనము మూర్తిమత్త్వము లేక వ్యక్తిత్వమును పెంపుచేసుకొనవలెను; లేక వృద్ధి పరచుకొనవలయును.

నిరుటి సంవత్సరమంతయు వార్తాపత్రికలయందు 'మన దేశమున నెవ్వరైన మహాపురుషులున్నారా?' 'నే డెవ్వరును పురుషోత్తములు లేరు!' 'మన కాలమున వ్యక్తిత్వము తక్కువా?' యీ మొదలగు శీర్షికలతో వ్యాసములు నిండుచుండెను. నేను అమెరికా కేగినపుడు పత్రికావిలేఖరులు నన్నిట్లడుగజొచ్చిరి 'స్త్రీయొక్క గొప్ప ఆస్తి యేది— సౌందర్యమా, ఆకర్షణశక్తి (వశీకరణశక్తి) యా, తెలివితేటలా?' 'మూర్తిమత్త్వము' అని నే నంటిని.

ముస్సోలినీగా రొకసారి నాతో కథాసరణి ప్రసంగించుచు 'గుంపు గుంపు నేలజాలదు' అని చెప్పిరి. ఒకప్పుడు తాపీపనివానిగానుండిన, ఆయన, యిప్పుడు క్రొత్త విశ్వసామ్రాజ్యమును గూర్చి యాలోచనలు సాగించుచు, వట్టి మూర్తిమత్త్వబలమువలననే యిటలీ నేలుచున్నారు. అఫ్గనిస్థానపు అమీరు అమానుల్లాగారు నేటివరకును చేయజాలకుండిన దానిని తాను జయప్రదముగ నెరవేర్పగలిగి పేర్వడసిన ముస్తాఫా కెమల్ పాషాగారు మునుపొక సామాన్యసైనికుడు మాత్రమే. వ్యక్తిత్వమే యతని విజయమునకు రహస్యము. చైనాదేశ మింకను అల్లకల్లోలమున నుండుటకు కారణమేమి? ఉత్తమ వ్యక్తిత్వముగల నాయకుడు లేకుండుటయే. చియాంగ్



మూర్తిమత్త్వవిజయము: సామాన్యస్థితియందుండి క్రమముగ నభ్యున్నతికివచ్చి మహానాయకులై కీర్తిమంతులైయున్న ఆర్గురు వ్యక్తులు.

ఎడమవైపునుండి కుడివైపునకు:—రిజాఖాన్, కొస్సాక్‌జాతి సైనికుడైయుండి నేడు పెర్షియాకు ప్రధాన మంత్రియయ్యెను; డాక్టర్ మాసారిక్, గుఱ్ఱపుబండివానికొడుకు—నేడు జెకోస్లొవేకియాను "సృష్టించిన" వాడు (అధ్యక్షుడు); మహాత్మా గాంధీ, రాజకీయాదులందు ప్రవేశించి క్రమముగ త్వరలో నున్నతికి వచ్చెను; జగ్లుల్ పాషా, బీదకుటుంబమున జన్మించిన యితడు ఈజిప్టునకు ప్రధాన మంత్రియైయుండెను. (ఇపుడు లేదు) బెనిటో ముస్సోలినీ, సాంఘికవాదియైయుండి పలుసార్లు ఖైదునపడియుండిన యితడు మొదట తాపిపనిచేయువాడు. నేడు ఇటలీకి సర్వాధిపతి-శాసకుడయ్యెను; ముస్తాఫా కెమాల్ పాషా, సైనికుడుగనుండిన యితడిపుడు టర్కీ-ప్రభుత్వాధికారమునకు వచ్చెను.

కాయ్‌షేక్‌గారివద్ద గొప్పలక్షణములనేకమున్నవికాని, కేకేయందు సామాన్యప్రజలందఱను వశపరచుకొని వారి దృష్టియందతని మూర్తిమత్త్వము ప్రధానవ్యక్తికాలేదు. ఈజిప్టుదేశపు శాన్‌పాషాజగ్లూల్‌గారు తన మూర్తిమత్త్వమువలననే అనుయాయులను ఫెల్లాహీనుల హృదయములను హరించి వేసెను. వారతని నెన్నడును భక్తితో గౌరవింపకుండరు.

నూర్గురు సిపాయిలను, నూర్గురు నాట్యకారులను నూర్గురు విద్యార్థులను తరిఫీదుచేయుడు—అందధికసంఖ్యాకులు లోకవిఖ్యాతి విజయమును పొందనచ్చును. కాని అత్యల్పసంఖ్యవారు తక్కిన తమ సహపాఠులందరిలోను ధ్రువతారలవలె ఉన్నతికి వచ్చి ప్రకాశింతురు. నిర్బంధవిద్య నేటి పనివానిని నిన్నటిపండితుని జ్ఞానశిఖరమునకెక్కించును. పండితులను నొక జనసమూహముకూడ నింకొకజనసమూహము నేలజాలరు. ఐనను మనము తెలిసియే జనసమూహ మానసికతత్త్వము వంకకుతొందరతో పోవుచున్నాము. ప్రజాభిప్రాయమును బోధించు కొలదిమంది చేతులలో వార్తాపత్రిక లున్నవి. దూరశ్రవణము, వార్తాప్రసారమును, గుత్తదారుల స్వాధీనములోనున్నవి. నేడు వస్తువులన్నియు ఒకేపరిమొత్తమున తయారగుచున్నవి. అట్టిదుస్తులనే మనము తొల్చుచున్నాము; వాటివలననే ఫాషన్ (నవీనసౌందర్యరీతి) యేర్పడుచున్నది. మనదగ్గఱి చుట్టుపట్టులనుండు వస్తువులన్నియు నట్టివే; దానివలన మనసౌందర్యరుచుల కడ్డు కలుగును. వ్యక్తిత్వ పృథక్త్వకృషులన సంస్కారము) బలియొనర్చి నేటి తరమువారు మన నాగరికత యెన్నడు నెరుగనంతటిబాగుగా దుస్తుల దాల్చుచున్నారు. మంచి యాహారమును గొనుచున్నారు. మేలైన గృహములలో నివసించుచున్నారు. అన్నివిధముల మునుపటికంటె సదుపాయముగ నున్నారు. మనకు భావి ప్రపంచమున వచ్చురాజులు మూర్తిమంతులుగ ప్రకాశింతురు. మఱికిగుంటలనుండి మొలిచియు, దివ్యసౌరభమును వెదజల్లు ప్రసూనములను, బీద గుడిసెలనుండి వచ్చియు రారాజులైనవారిని, మనమప్పుడే చూచియున్నాము. పెర్షియాకుషా(రాజు)ఐనరిజాఖాన్ మున్నెవ్వడు? గాంధీ, ముస్సోలినీ, కెమాల్‌పాషా, మాసారిక్, వీరెవరు? నెపోలియన్‌మాత్రము మొదటనెట్టివాడు? మూర్తిమత్త్వ

మే జయించి ముందుకు రాగలదు. గెంఘిస్ ఖాన్, టామర్ లేన్, మహావీరుడగు అలెగ్జాండర్ – ఈ విశ్వవిజయులు తమ ప్రజ్ఞాసామర్థ్యములను జనసామాన్య కొలతబద్దతో కొలిచి చూచుకొనియుండిరా? వారు తమ తోడిమానవులను నీచముగా చూడలేదు కాని ఆదేశముకొఱకు, ప్రేరణకొఱకు పైకిచూచిరి (దైవసహాయ్యముకొఱకు). మూర్తిమత్త్వము భద్రపరచుకొని పెంపుచేసుకొనుటయన త్యాగమునకు సంసిద్ధమైయుండవలెనన్నమాట. ఆమార్గము బంటరిబాట. సమూహములో (గుంపుతో) నొకడైయుండుటయే యింతకంటె సౌఖ్యప్రదము. నవీనప్రాచ్యఖండముల మహానాయకుల ప్రక్కన నేటి యూరపుఖండమున వ్యక్తిత్వము గల గొప్పవారు అరుదుగా నగపడుచున్నారు. క్రీస్తుమతమువలె, ప్రథమమున (ఆదిని) ప్రాచ్యదేశమునుండియే జీవము వచ్చి, పాశ్చాత్యఖండమున జ్ఞానజ్యోతిని ప్రసారముచేసి, మాకు కలకాలములకు కీర్తిమంతులైయుండు మహాపురుషుల ప్రసాదించినది. యంత్రమానవుని (కీలుబొమ్మ) తత్త్వముగల మానవసంతతి సకలవిధ వస్తుయంత్రనిర్మాణ విధానమునెఱుగ జాలినమాత్రము, ప్రేరణాత్మను విశ్వనాయకత్వమును కోల్పోయినయెడల నేమిప్రయోజనము? నేటికాలమున కత్యంతావశ్యకమైనవారు ధైర్యమును సాహసమును గల గొప్ప పృథక్త్వముతోడి మూర్తిమంతులు. [జ. బ్ర.]

(జనవరి ౫ వ తేదీ 'స్ఫియర్' నందు లేడీ డ్రమ్మండ్ హే గారు వ్రాసినదానినుండి)

---

## చాంపానేర్ నగరద్వారము

'చాంపానేర్' అనునది బొంబాయి రాజధానిలోని 'పాంచ్ మహల్స్' మండలమునందలి 'కలోల్' తాలూకాలోనున్న ఒక జీర్ణనగరము. ఇది బరోడాకు ఉత్తరము ౨౫ మైళ్ల దూరమున పావాగర్ గుట్ట ఈశాన్యభాగము నానుకొని యున్నది. ఇది తొలుత రాజపుత్రరాజులది. ౧౪౮౩ సం. 'మహమ్మూదు బెగర' అనునతడు వారిపై దాడివెడలి అచ్చట తొలుత నొక ముసల్మానుభవనమును గట్టమొదలుపెట్టెను. మరుసంవత్సరమాతడు రాజపుత్రులను తరిమివైచి దానిని తన వశము చేసికొని అభివృద్ధి గావించి తనరాజధానిని అహమదాబాదునుండి యచటకు మార్చుకొనెను. దాని కాతడు మహమదాబాదు చాంపానేర్ అను పేరు పెట్టెను. ఆ నగరము త్వరలో మంచి వర్తకస్థానమయ్యెను. పట్టుబట్టలు అక్కడ మిక్కుటముగ నేయుచుండిరి. కత్తుల పరిశ్రమ బాగా సాగుచుండెడిది. ఇందుకు కావలసిన ఇనుము మొదలయిన వస్తువులు ఆ చేరువనున్న గుట్టలలో లభించెడివి. దీని యీ భోగము కొలదికాలమునకే ముగిసినది. ౧౫౩౫ వ సంవత్సరము హుమయూను చక్రవర్తి యీ నగరమును కొల్లగొట్టెను. సుల్తాను బహదూరుషా (దీని నేలుచుండిన రాజు కాబోలు) చనిపోయిన తర్వాత రాజధాని అహమ్మదాబాదునకు మారిపోయెను. ౧౬ వ శతాబ్దప్రారంభకాలము నాటికి ఈనగరమునందలి భవనములు శిథిలములై నేల కొరగజొచ్చినవి. అడవి పెరిగి చుట్టు ముసురుకొనివచ్చినది. ప్రదేశము రోగభూయిష్ఠమైనది. ఇట్లు క్షీణించిన యీ నగరమున ౧౮౦౩ సంవత్సరమున ఆంగ్లేయుల చేతబడునాటికి ౫౧౦ మంది జనులు నివసించియుండిరి. అనారోగ్యభూయిష్ఠమగుటచే నెన్నిమార్లు ప్రయత్నించినను జను లచట నివసించుట కొక్కకపోయిరి. ఇపుడు అక్కడనుండువారు కొన్ని పదులకు మించియుండరు.

ఈ నగరము యొక్క శిథిలములనుగాంచిన దీని పూర్వపు వైభవము తెలియును. మహమ్మదు బేగర కట్టించిన కోట మూడుమైళ్లు పొడవు, ౨౮౧ గజములు వెడల్పు గలిగియున్నది. దీనిచుట్టును పెద్దపెద్ద నాపరాళ్లతో గట్టిన దిట్టమైన ప్రహరి కలదు. దీనిపై సమానకొలతలయందు కట్టిన బురుజు లున్నవి. ముసల్మానుపద్ధతి ననుసరించి కట్టిన వసారాలు వీనికి అందమును గూర్చుచున్నవి. ఇది నగరహృదయమున గలదు. దీనికి పడమట, తూర్పు చాలదూరము సుందరోద్యానములు భవనములు నుండినట్లు వానిని చుట్టియుండిన ప్రహరిగోడయొక్క జాడలు ఇప్పటికిని కలవు. దీనినిచుట్టి ఉత్తమనిర్మాణకౌశల్యమునకు నిధానములగు సరస్సులు, భవనములు, మసీదులు నుండినవి. ఇప్పటికిని ఐదుమసీదులు చెక్కుచెదరక ఉన్నవి. వానిలో నొకదానికి 'జామామస్జిదు' అని పేరు. పశ్చిమహిందూస్థానమున సుందరశిల్పకళాన్వైభవమున నొప్పారు ముసల్మానుభవనములకీ 'మస్జిదు' వీసమైనను తీసిపోదు. నగరమున ఆగ్నేయమున ఒక లోతయిన కృత్రిమసరస్సు కలదు. దానిచుట్టును రాతిమెట్లు కలవు. ఈ సంచికయందు దీనగరద్వారచిత్రమును గాంచనగును.

# సాభిప్రాయ విశేషములు

కలకత్తా కాంగ్రెసు స్వరాజ్య సంరంభమునందు నూతనశకమును స్థాపించినది. కాంగ్రెసు వ్యవహారము లతిరయమున ప్రవర్ధమానంబగుచున్న ప్రజాశక్తిని ప్రత్యక్షము చేసినవి. నెహ్రూ స్వాగతము, స్వచ్ఛంద సైనికదళములు, నానాసభలు, జనసమూహములు, నిర్భయోపన్యాసములు, వ్యగ్రోత్సాహము, ప్రవర్ధమానం బగుచున్న ప్రజాశక్తికి పరమ ప్రమాణములు. ప్రజానాయకుడైన పండితమోతీలాలు నెహ్రూగారికి 36 తెల్లగుఱ్ఱములు గల రథోత్సవరూపమున కలకత్తా యొసంగిన మహాస్వాగతము ప్రజాశక్తిని విశదము చేయుచున్నది. ప్రజలును, నాయకులును చక్రవర్తులకు దుర్లభమైన మహాస్వాగతమును మోతీలాలుగారి కొసంగిరి. కలకత్తా నలంకరించిన స్వాగతతోరణములు, కర్పూరహారతులు, విజయధ్వానములు, స్వాతంత్ర్య ప్రదర్శనమునకు నిదర్శనములు. కలకత్తా కాంగ్రెసును సందర్శించిన సంశయాత్ములకైనను ప్రజాహృదయమునందు ప్రవర్ధమానం బగుచున్న స్వాతంత్ర్యాభిలాష సువ్యక్తమైనది. ప్రజాశక్తి విజృంభణమును జూచుచుండియును గనుగొనజాలని ఫుల్లరులు, ఓడ్వాయరులు స్వప్రయోజనపరాయణత్వమును వెల్లడి చేయుచున్నారు. కాని సామ్రాజ్య క్షేమమును మానవ కల్యాణమును వెల్లడిచేయుటలేదు. వర్తమాన స్వాతంత్ర్య యుగమునందు నిరంకుశత్వము దుస్తరమని నిరంకుశాధికారవర్గము గ్రహించుట వివేకము. స్వల్పసంఖ్యాకులైన నిరంకుశాధికారులు మహత్తరమైన ప్రజాసంకల్పమును చిరకాలము నిర్బంధింపజాలరు. రుష్యా సామ్రాజ్యచరిత్ర నిరంకుశవర్గమునకు జ్ఞానోదయమును గలుగ జేయవలసియున్నది. కాలమాసన్నమైనపుడు స్థిరమైనసంస్థలు నీటిబుగ్గలవలె మాయమగుచున్నవి. అమీరు అమానుల్లాగారి చరిత్రము రాజ్యపరివర్తన సందర్భములను విశదము చేయుచున్నది. కలకత్తాయందు దేశబంధు నగరమునందు ప్రదర్శింపబడిన స్వాతంత్ర్యోత్సాహములు భారతప్రబోధమును సువ్యక్తము చేయుచున్నవి. కాంగ్రెసునందు సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానమోడిపోయినను ప్రవర్ధమానం బగుచున్న ప్రజాభిప్రాయమును దెలుపుచున్నది.

* * * *

**సంపూర్ణస్వాతంత్ర్యము:**

**అధినివేశ రాజ్యాంగ విధానము**

నెహ్రూని వేదిక అనేకమైన యూహాపోహలకు గారణంబైన విధమును గతించిన నాలుగైదుమాసములందును వ్యాపించిన వాదప్రతివాదములు విశదము చేయుచున్నవి. ఈ యూహాపోహలు కలకత్తాయందు మహాప్రస్థానావస్థను బొందినవి. కలకత్తాయందుగూడిన కన్వెన్షను సభయందు జిన్నా మహమ్మదాలి గారులు చేసిన ప్రసంగములు దేశావృతమైన సాంఘిక లక్ష్యమును విశదము చేయుచున్నవి. సుప్రసిద్ధనాయకులైన మహమ్మదల్లీగారు సిద్ధాంతములందు సంపూర్ణస్వాతంత్ర్యమును, అచరణమునందు

సాంఘికలాభములను బోధించుట విచిత్రముగ గనుపడుచున్నది. భారత స్వరాజ్యమునకు మూలాధారము జాతీయసంయోగము గాని జాతీయవియోగముగాదు. మహామ్మదీయులును, హిందువులును ప్రత్యేకసాంఘిక ప్రయోజనములకై పెనగులాడునపుడు దేశప్రయోజనములు సంకుచితములగుట సహజము. మహామ్మదీయ నాయకులందు అబ్దుల్ కలామ్ అజదు, సర్ ఆలీ ఇమాము, మహామ్మదాబాదు రాజాగారులు మొదలగువారుగాక సామాన్యముగ మహామ్మదీయ సంఘమంతయును ప్రత్యేకప్రయోజనములను గోరుచున్నది. నెహ్రూని వేదికకు సంయుక్త నియోజకవర్గము కీలకము. హిందువులు, సిక్కులు, క్రైస్తవులు, పార్సీలు ప్రత్యేక నియోజక వర్గమును నిరసించుచు సంయుక్తనియోజకవర్గము నంగీకరించుచున్నారు. మహామ్మదీయుల ప్రతిఘటనమభివృద్ధిని బొందుచున్నది. మహామ్మదీయ ప్రతిఘటనము హిందూప్రతిఘటనమునకు దోహదంబునొసంగుచున్నది. నిరంకుశవర్గమునకును యూరపియనుసంఘములకును హిందూమహామ్మదీయవిభేదము లెప్పటివలనే యానందమును గలుగచేయుచున్నవి. కన్వెన్షను సభ నెహ్రూని వేదిక నంగీకరించినను మహామ్మదీయ భేదాభిప్రాయము దానిని నిర్వీర్యము చేసినది.

మహామ్మదీయసంఘము సాంఘికలక్ష్యమును విడిచి దేశలక్ష్యము నారాధించుటకు హిందువులైనను సకలవిధముల త్యాగము జూపుట పరమావసరమై యున్నది. భరతవర్షము కృశించుచున్న సమయమునందు సంపూర్ణ వినాశముకన్న నేసంఘమైనను చైతన్యము గలిగి శక్తిని గలిగియుండుట దేశమునకును, లోకమునకును శ్రేయోదాయకము.

అధినివేశరాజ్యాంగ విధానముపట్ల యువజనహృదయము విముఖత్వము జూపుట సహజముగనున్నది. యువజనహృదయము స్వాతంత్ర్యోత్సాహముతో వికసించుచుండును. యువజనహృదయమునకు నిర్బంధములు భయమును గలుగజేయజాలవు. దేశమోక్షమునకై ఆత్మార్పణము జేయుటకు యువజనులు సర్వకాలములందును సంసిద్ధముగ నుండగల విధమును ప్రపంచేతిహాసములు తెల్లము చేయుచున్నవి. జవాహర్ లాలు నెహ్రూగారు కాంగ్రెసు వేదికయందు జేసిన ప్రసంగములు భారత హృదయాంతరాళము నుండి వెడలిన భావములుగ బరిగణింపబడదగి యున్నవి. యువకులైన జవాహర్ లాలు గారును, సుభాష్ చంద్రబోసు గారును శ్రీనివాసయ్యంగారితో జేసిన యొడంబడికను నిరాకరించుటయందు విచిత్రము లేదు. నిర్బంధకారకులను నిర్బంధితులు విశ్వసింపజాలరు. అధినివేశరాజ్యాంగ విధానమును యువజనులు నిరాకరించుట సహజము. అతివాదులందు జరుగుచున్న పరివర్తనము మితవాదులందును జరుగుచున్న విధమును కలకత్తాతీర్మానములు విశదము చేయుచున్నవి. మితవాదులు, మితవాదకాంగ్రెసు నాయకులు స్వతంత్రవాదులకు స్వతంత్రవాదమును వ్యాపింపజేయుటకు సంపూర్ణాధికారమునొసంగుటయే స్వాతంత్రవాదవ్యాపనమును విశదము చేయుచున్నది. మితవాదులు నెహ్రూని వేదికను, కాంగ్రెసు తీర్మా

నమును బలపరచి స్వరాజ్యముపట్ల ప్రజలకు గల దృఢసంకల్పమును విశదముచేసిరి.

* * * *

గాంధీమహాత్ముడు

అధినివేశ రాజ్యాంగవిధాన తీర్మానమును గాంధీమహాత్ముడు ప్రతిపాదించుట విస్మయమునుగలుగజేసినది. కాని మహాత్మునిస్వభావము నెరిగినవారలకు విస్మయమునకవకాశము లేదు. గాంధీమహాత్మున కుదారాశయములందువలె కార్యసాధనమునందును నమ్మకము గలదు. మాటలతో చింతకాయలురాలవని మహాత్ముడెరిగియున్నాడు. కాని నిరంకుశవర్గము చూపుచున్న తిరస్కారధిక్కారములు ప్రజలను కార్యపరతంత్రులను జేయుననెడి విశ్వాసము గాంధీమహాత్ముని విడువలేదు. మహాత్ముడు విదేశయాత్రను జేయుటకు జేసిన యేర్పాటులను విసర్జించి స్వదేశమునందు కార్యరంగమున పనిచేయుటకు సిద్ధముగనున్న విధమును వారి ప్రసంగములు విశదముచేయుచున్నవి. ప్రజలయందును, నాయకులయందును వారి విశ్వాసము సన్నగిలుచున్న విధమును వారి ప్రసంగములు, వ్రాతలు విశదము చేయుచున్నవి. ఈ సంవత్సరాంతమునందు శాసనోల్లంఘన ప్రస్థానము సాధ్యమని మహాత్మునకువిశ్వాసము లేదు; కాని మహాత్ముని తీర్మానము విజయమును బడయుటకు శాసనోల్లంఘనప్రస్థానమునందును, మహాత్ముని నాయకత్వమునందును ప్రజలకుగల విశ్వాసమె మూలకారణముగ నున్నది. కాంగ్రెసునిర్ణయించినకార్యవిధానమునం దన్నిమతములవారికిని త్యాగముచేయుట కవకాశములు గలవు. ఖద్దరునకు, మద్యపాననిషేధమునకు పనిజేయవచ్చును. శ్రీమంతులు, సామాన్యులు కాంగ్రెసు నిర్ణయించిన రుసుమును చెల్లింపవచ్చును. ప్రజలు కార్యపరాయణులైనపుడు మహాత్ముడు నిస్సందేహముగ తిరిగ నాయకత్వము వహించుట నిశ్చయము. ప్రజలందరును కాంగ్రెసుసంఘములందును, స్వచ్ఛందసైనికసంఘములందును సభ్యులుగ జేరి గాంధీమహాత్ముని సంకల్పము సార్థకముచేయుట స్వరాజ్యసంపాదనమునకు పరమసాధనముగా నున్నది.

* * * *

సైమను సప్తక బహిష్కరణము

సైమను కమిషనును సకలపక్షములవారును బహిష్కరించుచున్న విధమును వారి పర్యటన వృత్తాంతము విశదముచేయుచున్నది. కలకత్తాయందు మోతీలాలు నెహ్రూగారి కొసంగిన స్వాగత మెంతయద్భుతముగ నెరవేరినదో సైమనుసప్తక బహిష్కారమును నెరవేరినది. పంజరములోని చిలుకలనువలె సైమనుసప్తకమును గొనిపోవుట బ్రిటిషుప్రభుత్వ దౌర్బల్యమునకు నిదర్శనము. బ్రిటిషు ప్రభుత్వమున కాసురబలమున్నను ధర్మబలము లేదని బహిష్కరణోద్యమము విశదముచేయుచున్నది. సైమనుసప్తకమును రహస్యముగా గొనిపోవుటయే బ్రిటిషుప్రభుత్వ దౌర్బల్యమును తెల్లముచేయుచున్నది. ఇర్వినుప్రభువు బహిష్కరణ విజయమును పరోక్షముగా నంగీకరించినటులు వారి డిల్లీ ప్రసంగము విశదము చేయుచున్నది. ఇంతవరకును నాయకులు సైమనుకమిషనును బహిష్కరించినను పార్లమెంటు కమిటీయెదుటను భారతీయులు వారి నివేదికను స్ఫుటముచేయుట కవకాశములు

గలవని ఇర్విన్ప్రభువు తెలిపినభావము బహిష్కరణ విజయము నంగీకరించుచున్నది. భరతఖండమునందు సైమనుకమిషనును బహిష్కరించిన నాయకులు బ్రిటిషు ద్వీపములకేగి సాక్ష్యమునిచ్చుట యసంభవము. భారతీయ నాయకులు వారి యాత్మగౌరవము నెన్నికష్టములు సంప్రాప్తములైనను లక్ష్యముచేయక కాపాడుకొనుటకు భగవంతుడు సాహస ధైర్యముల నొసంగుగాత! చెన్నపురి నాయకులును ప్రజలును సైమనుసప్తకమును హరతాళములతోను, నల్లజండాలలోను, నివర్తనఘోషములతోను సత్కరింతురుగాత యని కోరుచున్నాము.

* * * *

## ఆంధ్ర విశ్వ విద్యాలయము

చిరకాలము తపస్సుచేసి పడసిన ఆంధ్ర విశ్వవిద్యాలయమును సుబ్బరాయనుగా రొకక్షణమున ధ్వంసము చేయుట విచిత్రముగనున్నది. ఆంధ్రుల దౌర్భాగ్యస్థితికి విశ్వవిద్యాలయ శాసన చరిత్రము నిదర్శనముగనున్నది. విశ్వవిద్యాలయస్థానము విశ్వవిద్యాలయము విశాఖపట్టణమునకు సంక్రమించినను ఆంధ్ర విశ్వవిద్యాలయమును ముక్కలుచేయుట కేవల మన్యాయముగ నున్నది. దత్తమండలములను, చిత్తూరును మద్రాసు విశ్వవిద్యాలయముతో సంధించుటయును, ఆంధ్ర విశ్వవిద్యాలయము నుండి విడదీయుటయును అనుచితముగ నున్నది. విశాఖపట్టణము నందలి విశ్వవిద్యాలయము విశాఖపట్టణ విశ్వవిద్యాలయ మగును గాని ఆంధ్రవిశ్వవిద్యాలయము కాజాలదు. ఆంధ్రదేశములోని సగముభాగము చీలిపోయిన తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయనామము సార్థకము గాజాలదు. ఆంధ్రదేశములోని విద్యాలయములను విడదీయుటవలన ఆంధ్రత్వమునకును, వారి వైజ్ఞానిక సంయోగమునకును భంగము గలుగుచున్నది. ఈ లోపమును వెంటనే తీసివేయుట ఆంధ్రనామధారుల కందరకును పరమధర్మమైయున్నది. విభజించి పాలించుట విదేశీయుల ధర్మము. ఆ ధర్మమునే మన మంత్రులవలంబించుట మన దురదృష్టము. వెంటనే ఈ దుర్దశను తొలగించి ఆంధ్రత్వమును స్థిరతరము చేయుట కాంధ్రులు వారి శక్తి నుపయోగించి భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు గాత!

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras

## చిత్రములు



---



కన్నప్ప
"భక్తిః కిన్న కరోత్యహో వనచరో భక్తావతంసాయతే."
చిత్రకారుడు: శ్రీ తేజోమూర్తుల కేశవరావుగారు, ఆంధ్రజాతీయకళాశాల, బెజ




చెన్నపట్టణము, మార్చి ౧౯౨౯

సంపుటము ౬ విభవ సంవత్సరము ఫాల్గునమాసము సంఖ్య 3

## మూగనోము

విశ్వనాథ సత్యనారాయణగారు

బియ్యాపు గింజలఁ జిగురుపేడిన గందపు పచ్చిబొట్టుతో
దియ్యని చిన్ని నీనొసలితీరులు కుంకుమతీర్చి ముంగిలఁ
తొయ్యలి నాముచారికలతో పసపాడిన ముద్దరాలు నీ
పయ్యెదవ్రాల నీవు నతిఁపట్టిన దీవనలీయ జూచెదుఁ.

నీ తెలిపట్టుచీర మెయి నీడలుపారి ముసుంగుసంజ క్రొం
బూతల తెల్లలేమొగిలు పోలిక వాలిక గాలి దూలిపో
నేతబెడంగు కుచ్చెలలు నీ చిరుకాళుల ముద్దుతోఁచెనో
లేతపొరాడు పయ్యెద చలించిన పచ్చనితాళి తోఁచెనో ?

కమ్మని పాలబుగ్గవవుగా పతికోసమ యిన్నినోములఁ
కిమ్మనకుండ నోచెదవు కేవల మాతని నీయెడంద క్రొం
దమ్మిపువుం దుమారములు దమ్మినచిక్కని తేనె పాలలో
చెమ్మల యూటలఁ మెదపి చేతువో నెయ్యపు తియ్యముద్దగా.

దూసిన నాగమల్లికల దోసిళులన్ తొలిజాము ప్రొద్దుతా
మూసినకంటిమూత తెరపుళ్లయిన ట్టివి మందహాసిక
న్యాసితపుల్లగల్ల పరిణామము లచ్చపవల్లు శారద
శ్రీసముపేతముల్ పులకరించెను నీమెడ గందపూతలన్.

ఓసి, మనోజ్ఞనీరదనవోదయకాల వియద్విలంబమా
నాసితవారి వాహనివహానత కైశిక, మాగనోములో
కోసలు దేరు కన్నుదల కూడిన భాగ్యపుటెర్రజీరలో
మాసరమయ్యె నీమెడద మాగిన నెయ్యపు తియ్యదొంతరల్.

పైదలిచాలులో వ్రతము పట్టిన నీకును తావొసంగుము
త్తైదులకాళ్ల వంగబడి తాకక కన్నుల నద్దువేళ నీ
మీదనరాగమాడ పసిమీగడచూపులు నవ్వుపూలు భా
వోదయమున్ ఫొనర్చియు తలోదరి నీవ్రతరక్ష చేసెడిన్.

కొనలకు నూనె రాచి కొనగోళులదువ్విన కొండెచుట్టుచు
ట్టినవదులైన క్రొంజడ ఘటించినమెర్రనిపోకబంతితో
నిను నెదురైన కుంకుమపు నీటులుగుల్కెడు మోముకన్నె నే
మని నుతియింతు ప్రాతరమృతాకృతిగార్యఫలోన్ముఖత్వమున్.

వినయమునేర్చుకో జదువబెట్టిరి మైదువలైనవారి ద
ర్శన సుకృతంబు నిత్యపరిసంగతి తెచ్చిరి యింతనుండి మా
టనియమ మభ్యసింప గవటాకును నిన్నియమించి రీవు తె
చ్చిన పతిశీలతాధికతచే దెలుగుల్ పరిపూతు లౌటకున్.

నీనడయాడు త్రోవలు పునీతములైనవి నీదృగంతరే
ఖానతవాయువీచిక లనంత సుధాపరిషేచనక్రియా
స్థానములైన వోసిపసిథాన, భవన్నియమప్రభావసం
ధానముచేత నీపతి సుధామయ మూర్తిసముజ్జ్వలించెడున్.

---

# ఆంధ్రభాషయందలి సంస్కృతవృత్తములు

తేకుమళ్ల రాజగోపాలరావుగారు

[వెనుకటి సంచిక తరవాయి]

## పదునాలుగవ ఛందము; (శక్వరి)

16384

2017. అసంబంధ—మతన సగగ—12 యతి.

కవిజనాశ్రయకారుఁడు దీనికి, 11న యతి నిడుచున్నాఁడు. అనంతునకు అప్పకవికి 12 యతి. 8 నికూడ విఱుపు కలదని నామతము.

ప్రయోగము — కారానీతంబై చను—మతన సగాయుక్తిః:

—కవిజనాశ్రయము.

2033. వసంతతిలకము—తభజజగగ—యతి 8.

అప్పకవీయమున సింహోద్ధతము, ఔద్ధర్షిణి, శోభావతి, మధుమాధవి యని దీనికి నామాంతరములు చేర్పఁబడినవి. వృత్తరత్నాకరమున నిది సింహోన్నతము, కన్నడమున వసంతతిలకము, అనంతుని ఛందమున వృద్ధర్షిణి యనియుఁ గానఁబడుచున్నది.

నన్నయప్రయోగము

ఈబాలునెత్తికొని—యింటికిఁ జన్న నన్నున్
నాబంధులందఱుమ—నంబున నేమినారె
ట్లీబాలు నార్యనిభు—నిట్టుల డించిపోవం
గా బుద్ధిపుట్టునని—కన్య మనంబులోనన్.

—ఆది. 5—27

3515. భూనుతవృత్తము—రనభభగగ—యతి 10.

—కవిజనాశ్రయము.

కావ్యాలంకార చూడామణియందు దీనికి రనన భగగ—10 యతి. *

3121. లోలావృత్తము—మసమభగగ— 8 యతి.

వృత్తరత్నాకరమున నిది యాలోలవృత్తము.

3820. నవనందిని—సజసనగగ — 10 యతి (అప్పకవి)

3823. వనమయూరము—భజసనగగ—9 యతి.

కన్నడమునను నిది వనమయూరమే. ఎ.

వృత్తరత్నాకరమున నిది యిందువదన.

నన్నయప్రయోగము

రాజకులశేఖరప—రంతపవివేక
భ్రాజితజగద్వలయ—భానుగసముద్య
త్తేజనిరవద్యయువ—తీమదనవీరో
గ్రాజివిజయాత్రిభువ—నాంకుశనరేంద్రా.

—ఆది. 5—261

ఎఱ్ఱాప్రగడ దీనినే మయూరమను చున్నాఁడు.

ప్రయోగము

భూసురకదంబసుర—భూరుహవికాసో
ద్భాసితకృపారసవి—పాకసుగుణైకో
ల్లాసహరవాసనృగ—లాంఛనమృణాళీ
హాసనవకీర్తివిస—రాకలితలోకా.

—అర. 6-411.

4096. కమలవిలసితము—ననననగగ— 9 యతి.

ప్రయోగము

వనజనయనుఁగరి—వరదునిఁజేరఁ
జని ముకుళితకర—జలజయుగుండై
తనువునఁ బులకలు—తలుచుగమించన్
వినయమునను సుర—విభుఁ డిటు లెంచెన్.

—ఉత్తర రామాయణము 4-280.

* శ్రీనివాసరసభావలిఁ జెందె గగంబుల్—కవిజనా. అందమైరనభతతినంది గగంబుల్—కావ్యాలం.

5815. సుందరవృత్తము—భభరసలగ—9 యతి. కన్నడమునను నిది సుందరవృత్తమే. అప్పకవీయమున నిది సుందరీవృత్తము.

5824. అపరాజిత—ననరసలగ—9 యతి. కవిజనాశ్రయమున నిది పరాజిత. అప్పకవికి యతి 9; కా 98ని కూడ విలు పున్నది.

7095. జలంధరవృత్తము—భభభజస—11 యతి(కవిజనా.)

8128 ప్రహరణకలితము—ననభనలగ—8 యతి. కన్నడమునను నిది ప్రహరణ కలితమే.

తిక్కన ప్రయోగము

ఇది యిట్లగుట—ఖ్లెటఁగి పలికినా
విమరుఁడు సభ గో—విదులు వొగడఁగా
నది వినియును నే—నడఁపన దురితం
బొదవెఁ గలఁక నే—టొలయ కుడుగునే.

—స్త్రీ. 1-185.

పదునైదవ ఛందము (అతిశక్వరి)

32768

4625. చంద్రరేఖ—సరమయయ—8 యతి.

4672. మాలిని—ననమయయ—9 యతి.

తిక్కన ప్రయోగము

కమలభవకిరీట—గ్రామపద్మావలీసం
గమసుభగపదాబ్జా—గాఢభక్తిప్రకార
ప్రముదితమునిశశ్వ—ద్భావనాగమ్యరమ్య
క్రమపరిణతమూర్తీ—శ్రౌతశాఖాగ్రవర్తీ.

విరా—1-335.

4800. మాలతి—ననరయయ—9 యతి. (కవిజనాశ్రయము)

7648. అలసగతి—ససనభయ—10 యతి.

8172. అతిరేఖ—సజననయ—6, 11 యతులు (వృత్తరత్నాకరము)

10923. సుగంధి—రజరజర—9 య.

సులక్షణసారమున నిది సుగంధి-కాని యందు హాగణములతో లక్షణము చెప్పఁబడినది:—

ఏడుహామ్ములంగముక్ వచెన్మిదిక్ సుగంధికిక్. కవిజనాశ్రయమున నిది హంసమాన లేక శాంక్ష, అప్పకవీయమున దీనికిశాలిని, ప్రశాంతి, చామరము నను నామాంతరములు చేర్పఁబడినవి.

ప్రయోగము (రజరజర)

ఈగతిక్ ద్విరేఫవేణు—లెల్ల సంతసంబుతో
వేగనేఁగు దెంచియంత—వింతకాంతి నెంతయుక్
బాగుమీరి నట్టి మేటి—పైఁడిగట్టువిల్తునిక్
యోగినాథుఁ జూచి రాగ—యోగ మొప్పనొక్కటక్.

—రాజశేఖర విలాసము, 2-121.

11184. సుకేసర—నజభజర—యతి 11. వృత్తరత్నాకరమున నిది ప్రభద్రకము. కన్నడమున సుకేసరయే కవిజనాశ్రయమున ప్రభద్రకము.

11632. మనోజ్ఞవృత్తము—నజజభర—10 యతి. కన్నడమున నిది నవనలినము.

11707. మణిభూషణము—రనభభర—10 యతి. (అప్పకవి.)

కవిజనాశ్రయమున నిది మణిభూషణశ్రీ.

నన్నయ ప్రయోగము

రామవిక్రముఁ డశేయుఁడ—రాతి బలావళీ
సామజాహితుఁడు సాంబుఁడు-సాల్వచమూపతిక్
క్షేమవృద్ధి యను వానిన—కృత్రిమసాహసో
ద్దాముఁ దాఁకె శరధారల—ధారుణిఁ గప్పుచుక్.

—అర. 1-155.

14044. నలిని—ససససస—యతి 10. అప్పకవి.

16364. ఇల—సజననస—8 యతి. అప్పకవి.

16384. మణిగణనికరము—14 లఘువులు నొకగురువు—9 యతి.

వృత్తరత్నాకరమున 14 లఘువులు నొకగురువుగలవృత్తములు కొన్ని చెప్పఁబడినవి యతిస్థానములందు భేదకారణములు.

అందు 8, 11 యతులుగలది శశికళ
7, 10 ,, స్రక్కు
9, 8 ,, మణిగణకిరణము.

ఆంధ్రమున తిక్కన 9 ని యతి నిలిపి మణిగణనికరమును జెప్పినాఁడు.

ప్రయోగము

గాడుపుల పఱియలు—గఁబుకులఁ గొనుటఁ
బిడుగుల తునియలు—సెదరి యునికిఁ బెం
దడిగలుఁబడగలు—దఱచు మురియరై
పుడమి గలయుటకుఁ—బొగు లోలయ మదిన్.

—స్త్రీ. 2-3.

కన్నడమునను నిది మణిగణనికరమే.

పదునాఱవ ఛందస్సు (అష్టి)

65536

10178. చంద్రశ్రీ—యమనసరగ—12 యతి. కవిజనాశ్రయమున 13 యతి. కాని 7, 13 విరుపులు గలవు.

కన్నడమున నిది విజయానందము.

ప్రగాఢంబై యొప్పున్ యమనసర—బద్ధాగ్రగాప్తిన్—కావ్యాలం.

కవీంద్రేంద్రతన్మజా యమనసరగ—ప్రాప్తమై నన్—కవిజనా.

11184. మేదినీవృత్తము—నజభజరగ—11 యతి.

13264. ప్రియకాంతావృత్తము—సయనయసగ—11 యతి.

16384. ఫలసదనము—ననననసగ—10 యతి.

19248. వాణిని—నజభజతగ—వృత్తరత్నాకరము.

21816. పంచచామరము—జరజరజగ—10 యతి.

ప్రయోగము

కనన్ సుభద్రకున్ సమంబు—గాఁగనే మృగీవిలో
కనన్ నిజంబుగాఁగనే జ—గంబునందుఁ జూచిరా
కనన్ దదీయకర్ణనీయ—హావభావధీవయః
కనన్ మనోజ్ఞలేఖలెన్నఁ—గాఁదరం బెఱేఁరికిన్

విజయవిలాసము— ౧—౩౨.

21855. మదనదర్పణము—భసజరజగ—11 యతి.
కవిజనాశ్రయమున నిది మదనదర్పము. యతి ౧౦.

23416. పద్మకము—నభజజజగ—8 యతి. కవిజనాశ్రయమునను, వృత్తరత్నాకరమునను నిది పద్మ, కన్నడమున మంగళవృత్తము.

నన్నయప్రయోగము

కొడుకుపలుకువిని—కూడదునాక దురాత్ముఁడై
కడఁగిమీకు నపకారము నేసి ధరిత్రి వె
ల్వడఁగఁబంచెఁగడు—బాపమతిన్ ధృతరాష్ట్రుఁడె
య్యెడల దుర్జనుల—నేమఱి నమ్మఁగఁబోలునే.

ఆది. ౬-౨౨౪.

కావ్యాలంకారచూడామణియందు దీనికి 11 యతి. కవిజనాశ్రయమునను. అనంతుని ఛందమునను గూడ, నట్లే.

"ప్రభవమైపరగు సత్కృతిఁ—బద్మకవృత్తమై"—కావ్యాలం.

ప్రభవమై కవిజనాశ్రయ—పద్మమనంజనున్—కవిజనా.

32727. గజవిలసితము—భరననగ—11 యతి.
వృత్తరత్నాకరమున నిది ఋషభగజ విలసితము.

32768. పాలాశ దళవృత్తము—5 నగణములు 1 గురువు. యతి 11 (కవిజనా.)

అప్పకవీయములో దీనికి త్వరితగతియను నామాంతరము చూపఁబడినది.

పదునేడవ ఛందము (అత్యష్టి)

131072

18928. మందాక్రాంతము— మభనతతగగ—యతి 11.
కన్నడమునను నిది మందాక్రాంతమే.

తిక్కన ప్రయోగము

వీణానాదప్రతిమనిగమా—విర్భవత్స్వరపుణ్యా
శ్రేణీసంపాదితవిమలతా—స్థేమనిర్లేపచిత్త

త్రాణక్రీడాకలనసతతో — త్సాహవద్దివ్యభావా
ప్రాణాపానాహరణనిపుణ— ప్రాపణీయానుభవా
—శ్రీ. 2-184.

32768. పాలాశదళము — 5 నగణములు. 1 గగము.
యతి 11.

దీనికే త్వరితగతియని నామాంతరము తెలుపఁబడి
నది. కావ్యాలంకారచూడామణియం దిది త్వరిత
పదగతి.

38750. పృథ్వి—జసజసయలగ—12 యతి.
కన్నడమునను నిది పృథ్వియే; కాని యతి 9.

నన్నయ ప్రయోగము

తిలాణుమణికోటిసంఘటిత — దివ్యదేహంబుతోఁ
దిలోత్తమయనంగ నొక్క యువ—తీలలామంబును
త్పలాక్షి సృజియించెసర్వగుణ—భాసిరూపక్రియా
కలావిదుఁడు విశ్వకర్మ తన—కౌశలం బేర్పడన్.
—ఆది. 8-103

దీనికి తొమ్మిదిని సరియైన విఱుపుకలదు.

43691. సుగంధి—(కవిజనాశ్రయము)—రజరజరవ—
యతి 11

భాసురంబుగారజద్వయంబు—పైరవంబుగూడఁగా
నా సుగంధికిన్ దిశావిరామ—మంచితంబగున్
ధరన్. —కవిజనాశ్రయము.

కాని యాంధ్రలాక్షణికులు ఈలక్షణము నంగీక
రించినట్లు తెలియఁబడదు.

46112. హరిణి—నసమరసలగ.—12యతి.
కన్నడమున నిది హరిణీప్లుతము.

46828. చంపకకేసరి—సజసససలగ—యతి 9. అప్పకవి.

56240. నర్కుటము—నజభజజలగ—11 యతి.
కన్నడమున నిది కనకాబ్జిని-వృత్తరత్నాకరమున
కోకిలకము. తిక్కనప్రయోగము.

వినుముమరుత్తనూభవుఁడు—విశ్రుతకర్మగతిన్
జనకకురుక్షితీశ్వరునిఁ—జంపెఁగదా సమరం
బున నదియేమెటింగిచని—పోయిన రేయి గడుం
గనలున ముట్టి మువ్వురముఁ—గ్రౌర్య ముదగ్రమున్
గన్.
—శ్రీ. 1-118.

59330. శిఖరిణి—యమనసభలగ—13 యతి.
కన్నడమునను నిది శిఖరిణియే.

తిక్కన ప్రయోగము

తపస్స్వాధ్యాయాదిక్షపితమలచి—త్తప్రకలితా
విపజ్జాలజ్వాలావిరమణసుధా—వృష్టిలలితా
జపాపుష్పక్షీరచ్ఛవికిరణసం—సర్జనధరా
సపర్యానిర్వాహప్రచురకలన —స్థైర్యమధురా.
—శ్రీ-1-167.

ఏడును, పదుమూఁడును సహజవిరతులని మామతము.

64983. వంశపత్రపతితము—భరనభనలగ—11 యతి.
కొన్ని సంస్కృత చ్ఛందస్సుల నిది మణిమరీచి.

## పదునెనిమిదవ ఛందస్సు (ధృతి)

262144

30841. క్ష్మాహారము—మనయతనస—9 యతి అప్పకవి.

37857. కుసుమితలతావేల్లిత— మతనయయయ— 12
యతి. కన్నడమున నిది కందర్పదర్పచాపము. అందు
యతి6. ఇం దేసహజమైనవిఱుపుకలదని నామతము

65536. త్వరితపదగతి—నననననయ—11 యతి.
కవిజనాశ్రయకర్తయుఁ, గావ్యాలంకారచూడా
మణికారుఁడును 5 నగణముల 1 గగముతో పదు
నేడవ ఛందమున దీనినిఁ గూర్చియున్నారు.

74914. నిశ—ననరరరర—9 యతి—అప్పకవి.
వృత్తరత్నాకరమున నిది సింహవిక్రీడితము.

93019. మత్తకోకిల—రసజజభర—11యతి.
కన్నడమున నిది మల్లికామాల; వృత్తరత్నాకర
మున నిది హరనర్తకము. కావ్యాలంకారచూడామణ్యా
దుల మత్తకోకిలయే.

నన్నయ ప్రయోగము—

అమ్మనీకు నివాసశక్తిఁద—దంగదేశమునందు మే
ఘమ్ముతెల్ల పలంకులంగడుఁ—గ్రమ్మసర్వజనప్రమో

దమ్మెగాఁ బ్రభవద్భృహజ్జల — ధారలొప్పఁగ వృష్టిఁజే
సెమ్మెహెనదిదీర్ఘికాసర — సీనదంబులునిండఁగాఁ
ఆర. 3-౧౧౩.

90971. హరనర్తనము—రసజజయభర—9 యతి. అప్పకవి. మత్తకోకిలను హరనర్తనమని వృత్తరత్నాకరము.

131072. అతివినయవృత్తము—నననననసము—యతి 11. కవిజనాశ్రయము.

పందొమ్మిదవ ఛందము (అతిధృతి)

524228

75714. మేఘవిస్ఫూర్జితము—యమనసరరగ—8, 13 యతులు.

అప్పకవ్యాదులు 13 మాత్రమే యతియనుచున్నారు.

కన్నడమునను నిది మేఘవిస్ఫూర్జితమే.

149337. శార్దూలవిక్రీడితము—మసజసతతగ—13 యతి.

177900. కవికంఠభూషణము—సజసససజగ—9 యతి.

186039. భూతిలకము—భభరసజజగ—12 యతి.

ప్రయోగము

కావున నయ్యమనస్కయోగము—నాథదుర్లభ మారయన్
సేవల తత్త్వవిచారముం బరి—కింప నేరనివారికిన్
భావమునందున నాత్మనాత్మని—బాగుగా విభజించు మే
ధావికి నిత్యసుఖంబుగాఁ విశే—షంబుగా సులభంబగున్.
—సీతారామాంజనేయసంవాదము-3-40.

186040. తరలము—నభరసజజగ—12 యతి.

సులక్షణసారమున నిది ధృవకోకిల; కన్నడమున తరళ.

నన్నయ ప్రయోగము

తనువుమీన్ షోలవల్చు జాలరి—దానినట్లును గాకయే
నను కన్యకఁ గన్యకావ్రత—మంతరించిన నెట్లుమ
జ్జనకునింటికిఁ బోవనేర్తుఁ బ్ర—సాదబుద్ధి యొనర్ప స
న్మునిగణోత్తమ నాకుదోషవి—ముక్తియెట్లగునట్లుగాన్.
—ఆది-3-40.

186587. చంద్రకళ—రససతజజగ—11 యతి.

కన్నడమున నిది ఖచరప్లుతము.

225265. శుభికావృత్తము—మభనన భభగ—13 యతి.
—కవిజనాశ్రయము.

ఇరువదవ ఛందము (కృతి)

10,48,576

208676. మత్తేభవిక్రీడితము — సభరనమయలగ—14యతి.

కన్నడమునను దీని కీపేరే.

355799. ఉత్పలమాల—భరనభభరలగ—10 యతి.

కన్నడమునను నీపేరేకాని యతి 12.

372076. ప్రమదానన్నము—సజజభరసలగ— వృత్తరత్నాకరము.

372079. ప్రభాకలితము—నజజభరసలగ — 13 యతి—కావ్యాలంకార చూడామణి యందలియు, కవిజనాశ్రయము నందలియు 11 యతికంటె 13 సమంజసము.

372151. అంబురుహము—భభభభరసలగ—13 యతి.

కన్నడమున నిది నగరంజితము.

నన్నయప్రయోగము

రాజకులోత్తమ రాజమనోహర—రాజనారి సభాంతర
భ్రాజితసద్గుణ పార్థివశేఖర—పార్థసన్నిభ బాంధవాం
భోజవనద్యుమణీమణికాంచన—పుంజభూషిత భూమరు
ద్రాజసమానపరాక్రమరాఘవ—రాజరాజ నరేశ్వరా!
—సభా—1-295.

373176. ఖచరప్లుతము—నభభమససలగ—12 యతి.

కన్నడమున నిది యనవద్యము.

466883. సువదన—మరభనయభలగ — 8, 7 యతులు (వృత్తరత్న)

699691. వృత్తము—రజరజరజగల—వృత్తరత్నాకరము.

ఆంధ్రమున వృత్తము లన్నియు గుర్వంతములే.

ఇరువది యొకటవ ఛందము (ప్రకృతి)

2097152

302993. స్రగ్ధర—మరభనయయయ—8, 15 యతులు.

కన్నడమునను నిది స్రగ్ధరయే.

తిక్కన ప్రయోగము

మాళిస్రక్సంగరంగత్-మధుకరపటలీ-మానసాకృష్టివిద్యా శాలిస్ఫారాబ్జరేఖాం- జలిపుటఘటనా-చాటుఫాలస్థలత్సౌమ్మ పాల్రశ్రేణీవిశాలాం-బకకుముదవనీ-బాంధవాయత్తచంద్ర శ్రీలీలాగాఢకాంతి-- స్మితవదనరుచి -- స్ఫీతునాగేంద్ర కేతుఁ. విరా--3-78.

394972. లాటీవిటవృత్తము--సససససమతయ--13యతి. ఏడింటఁగూడ విఱుపు కలదని నామతము.

711600. చంపకమాల--నజభజజజర--11 యతి. కన్నడమునను జంపకమాలయే.

744804. వనమంజరి--నజజజజభర--14 యతి.

718983. మత్తవిలాసిని--భభభభభభర --వృత్తరత్నాకరము.

782271. కరిబృంహితము--భనభనభనర-- 13 యతి.

965356. మణిమాల--సజసజసజస--11 యతి.

తిక్కనప్రయోగము--

భవదీయసూనులరిసైన్య-పంక్తిఁగొనికాల్చిఁ రెల్ల బొగడన్ వివిధాస్త్రశాస్త్రనయసాంద్ర-వృష్టిఁ దెగటాఱి పెంపు మిగులన్

దివికేగి యందుమహనీయ-- తేజమెసఁగంగ హృద్యబలభిద్విభవసౌఖ్యసంపదలుగాంచి సం--తోషమునఁ దేలిరేల వగవన్. స్త్రీ--౧--౧౧౮.

1048576. కనకలత--7 నగణములు, సగణము--13 యతి (అప్పకవి)

## ఇరువది రెండవ ఛందము (ఆకృతి)

4194304

1490944. తురగవృత్తము--ననననసజజగ--15 యతి. కావ్యాలంకారచూడామణియం దిది తురగవల్గితము.

1797559. మానిని--భభభభభభభగగురువు-13 యతి. 7 టను, 19 టను గూడ విఱుపుకలదని నామతము. కన్నడమున నిది వనమంజరి.

నన్నయప్రయోగము--

ఏచితనర్చి తలిర్చినక్రోవుల-నిమ్మగుసతావులజొంపములన్ బూచిన మంచియశోకములన్ సుర--పొన్నలఁబొన్నగేదఁగులన్

గాచి బెడంగుగఁ బండినయాసహ--కారములం గదళీతతులం జూచుచు వీనుల కింపెసఁగన్ విను--చున్ శుకకోకిలసుస్వరముల్. ఆది. ౪--౨౦.

అనంతునిఛందమున గావ్యాలంకారచూడామణి యందును 3 యతులు.

ప్రయోగము

కామినిస త్ప్రభ- కారము కాలగ--కారముసైపరి-కల్పితమై

1930711. భద్రకము--భరనరనరనగ--12 యతి.

వృత్తరత్నాకరమున నిది ప్రభద్రకము; కవిజనాశ్రయమున పాదపూరణకుఁ గాఁబోలు సుభద్రకము; కన్నడమున భద్రకము; కాని యతి 16. కావ్యాలంకార చూడామణియందు భద్రిణి. అందముగా భసంయుతరస త్రయాగ్రగురువై సుభద్రకమగున్--కవిజనా.

1947095. మద్రకము--భర నర నసనగ--11 యతి. అప్పకవి.

2097152. విచికిలితము--ననననననగ గురువు--యతి 13. కవిజనాశ్రయమున నిది విచికిలస్తబకము.

605988. మహాస్రగ్ధర--సతతనసరరగ--9, 16యతులు. కన్నడమునను నీపేరే కాని యతి 16.

నన్నయప్రయోగము

అమరేంద్రారాతులిట్లా--హవముఖ మునసేయం దత్తీక్ష్ణబాణౌ

ఘము ఘోరంబై సురానీ--కముపయిఁ బెలుచం--గప్పినం జూచిదైత్యో

త్తములం గోదండనక్రో--ద్ధతభుజులఁ మహా--బాణుల్ వీరలక్ష్మీ

రమణుల్ దుర్వారహత్యా--గ్రయమున నరనా--రాయణుల్ దాకిరంతన్.

--ఆది. 2-22.

## ఇరువది మూఁడవ ఛందము (వికృతి)

8388608

149797. పద్మనాభవృత్తము—7 తగణములు 2గురువులు 13 యతి.

1797556. మయూరగతి— 7 భగణము 2 గురువులు— (వృత్తరత్నా)

3595120. కవిరాజ విరాజితము నజజజజజజలగ— 14 యతి. కవిజనాశ్రయకారుఁడు మూఁడు యతులను 8,14,20 నుంచినాడు. 8,14,20 సహజమగు విఱుపులు. కావ్యాలంకారచూడామణి యందును 8,14,20 యతులు. అనంతుఁడును 3 యతులే వేయుచున్నాఁడు.

నన్నయప్రయోగము.

చనిచనిముందట నాజ్యహవిర్ధ్రుత—సౌరభధూమలతాతతులన్
చెనఁగినమ్రాకుల కొమ్మలమీఁదన— పేతలతాంతములైనను బా
యనిమధుప ప్రకరంబులఁజూచిజ—నాధిపుఁడంత నెఱింగెఁదపో
వనమిదియల్ల చె దివ్యమునీంద్రని — వాసముదానగునంచు నెదన్.

—ఆది. 4—21.

కలయఁగనే కనకారవపడుక్తజ—కారవకారని—కాయనిరం— కావ్యాలంకార చూడామణి.

3861424. అశ్వలలితము—నజభజభజభలగ—13 యతి.

4194081. మత్తాక్రీడ — మమతననననగల—14 యతి. కన్నడమున నిది క్రీడ. అప్పకవీయమునను వృత్తరత్నాకరమునను నిదియే లక్షణము. కాని కవిజనాశ్రయమున నిది మయమననననలగ 15 యతి.

## ఇరువది నాలుగవ ఛందము (సంకృతి)

16777216

3614521. అష్టమూర్తి—ఘనతసరభజయ,9,17యతులు అప్పకవి.

4155367. తన్వి—భతనసభభనయ.—13 యతి. కన్నడమున నిది సుందరము. యతులు 6,14.

4193479. క్రౌంచపదము—భమసభననయ — 11—19 యతులు.

వృత్తరత్నాకరమున భమసభనననగలు. దీనిలక్షణమగుట నిది 25వ ఛందస్సునఁ జేరుచున్నది.

ప్రయోగము

తావులుమీఱం—బూవులవానల్—సలుచుగఁగురియఁగ—దతఘనభేరుల్
గ్రేవల మ్రోయం— గేవలగీత—క్రియలకు వనితలు—గిఱికొనియాడన్
దేవతలెల్లన్(?)—శ్రీవిభుటిల్లన్—స్థిరమతిఁగొలువఁగ—దివిజవిభుండున్
బావకముఖ్యా—శావిభుయుక్తిం—బగతుని నడఁచిన—ప్రభుఁ గనవచ్చెన్

ఉత్తరరామచరిత్రము—౭—౧౨౪.

ఇందు 6న ప్రాసయతియు, 11,19ని యతులును గాననగును.

8388193. సరసిజము—మతయనననస—తిక్కనకు 10 యతి అప్పకవికి 10,18 యతులు 5నకూడ విఱుపు కలదని నామతము. అనంతుని ఛందమునను గావ్యాలంకారచూడామణియందును గవిజనాశ్రయమునను 10, 18 యతులు.

తిక్కనప్రయోగము—

శ్రీరమ్యత్వం బారఁగఁబెంపూ—ర్జితముగ మణివిలసితమకుటములన్
దారంజూడన్ సారవిభూతిన్— ధరణిపులనిమిష—భవనిభు లగుచున్
భూరిప్రీతిన్ సూరెలఁగొల్వన్ — భువనవినుతమగు—పొలుపువెలయ ము
న్నీరాజుండన్ దారుణదైవం — బిటువలచునె తుది—నితనిఁ గటకటా.

స్త్రీ. ౨—౩౭.

ఇంద్రె దింటం బ్రాసయతికలదు.

## ఇరువది యైదవ ఛందము (అతికృతి)

(33554432.)

5381311. భాస్కర విలసితము—భనజయ భనసగ—18 యతి (కవిజనా)

ఎనిమిదింటను పదమూఁడింటను నిరువదింటను గూడ విఱుపులుకలవని నామతము.

తిక్కనప్రయోగము

క్రారవనృపతిత—నూజళతంబుం—గం పెపవనసుతు-పటు
భుజలీలా
ఘోరతఁ దడఁబడ-మేదిని మీఁదన్—గూలె వికటముఖ-
కరచరణత్వం
బేరిక యినఁగన-గొన్న విషాదం—బెంతయుమదినోల-యఁ
గఁబ్రియకాంతల్
చేరివిలపనముఁ-దద్దయునార్తిం—జేయఁగ నునికి వ-నటఁ
దిరిఁ బెట్టన్.
—స్త్రీ. 2-46.

14368768. బంధురము—ననననసభభభ గురువు—అప్పకవియు, భీమనయు 16 యతి.

కన్నడమున నిది హంసపదము. యతులు 9, 16. కావ్యాలంకార చూడామణియందు దీనిని సింధురమనుట లేఖకప్రమాదము.

తిక్కన ప్రయోగము

సకలరథములను నఖిలగజములున్—సర్వహయంబులతో
బెరయన్
శకలములుగ భటనికరమఖిలముం—జావఁగ ద్రౌపదిపు
త్రులతో
నొకఁడును బ్రదుకక పాడిపాడియఁగ న—య్యుర్విక్షి
వారల రూపుల మ
స్తకములు కడమవడక వడిబలిగా—సంతసమందఁ బిశాచ
తతుల్.
—స్త్రీ. 1-115.

కళాపూర్ణోదయమున 9, 15, 21 లోఁ సూ
యతులున్న తావుల యతులు వేయఁబడినవి.

అరుదుగఁబిడికిట—నడఁగెడు నడుముల్—హస్తి సమా
నపు యానములన్
గురుజఘనములును—కుచములభరముం—గొప్పల గొప్ప
తనంబులు మే
గరగరికలుసిరి—గలనగు మొగముల్—కల్కి మెఱుంగు
గనుంగవలుం
దొరయఁగ వెడపడఁ-తులు విటఘనముల—దోచుచు
ప్పడనప్పురిలోన్.
—కళా. 1-123.

కళాపూర్ణోదయమున నీపద్యమును బంధురకము నుట లేఖకప్రమాదము.

16776647. క్రౌంచపదము—భమన భనన ననగ.

కన్నడముననను నిది క్రౌంచపద మే. కాని యతులు 6, 11, 19. ఉత్తరరామాయణమునఁ గంకంటి పాపరాజు భమన భనన నయలుచెప్పి దీనిని ఇరువదినాలుగవ ఛందమునఁ జేర్చుచున్నాఁడు. గణములను జూడక నడకనుమాత్రమే గమనించినందున నిట్లు జరిగియుండును.

16777218. ధరణిధరగతి—8 నగణములు 1 గురువు. 8, 16 యతులు. అప్పకవి.

కవిజనాశ్రయమున నిది జలదరవము, 15 యతి. కన్నడమున నిది విదళితసరసిజము 13 యతి.

## ఇరువదియాఱవ ఛందము ఉత్కృతి.

(67108864)

8388601. వరాహము— మననననననసగగ—10, 15 యతులు. అప్పకవి.

15658735. మంగళమహాశ్రీ—భజసనభజసనగగ—9, 17 యతులు.

తిక్కనప్రయోగము—

ఈతఁడు రణంబునకు—నెత్తి చనుచుండియును—తొలి
యును భక్తిఁగని నాకుం

ప్రీతియొసఁగంబలికి—ప్రేమమొలయఁ బొగడి— పెద్దయు
 వినీతి నిరతుండై
చేతులు మొగిడ్చి జయ—సిద్ధియుగ దీవనవి—శిష్టనయని
 మ్మనిన ధర్మం
చేతల ననూనమగు—నిద్ధజయమాతలకు— సెట్లయిన సిద్ధ
 మగునంటిౕ. శ్రీ.౨—౨౫.

2,3854849. భుజంగవిజృంభితము. మమతననరసలగ
9,19 యతులు.

కన్నడమునను నిది భుజంగవిజృంభితమే.

ఛందోగ్రంథములందుఁ జెప్పఁబడిన యనేకవృత్త
ములకు నడక సరిగా లేనందునఁ బ్రయోగార్హములుగా
లేవు. ప్రయోగార్హములగువాఁ గూడఁ గొన్నింటినే
కవులు వాడిరి. కవియొక్క—ధోరణి ననుసరించి యతిస్థా
నములు మాఱుచువచ్చినవి. పద్యనామములందుగూడ నేక
లక్షణములకు భిన్న నామములందుఁ గానఁబడుచున్నవి.
మొత్తముమీఁద నీప్రకరణమున 215 వృత్తములకు లక్షణ
మీయఁబడినది. దీనికి యాంధ్రచ్ఛందస్సులఁ గానరాక
కర్ణాటకచ్ఛందస్సులలోనే కానఁబడు మొదటిప్రకరణ
ములోని 44 సంస్కృతవృత్తములను జేర్చినచో లక్షణ
గ్రంథగ్రథితములగు సంస్కృతవృత్తముల సంఖ్య 259
యగును. ఇందలి భేదములకుఁ గారణములు మున్ముందు
చూతముగాక!

---

# అనంతలీల

అల్లంరాజు రంగనాయకులుగారు

ప్రకృతి సుందరి జీవితేశ్వరవియోగ-దుఃఖపూరితాంభోనిధి దోగలేక
 చెలియ కోయిల జతగూడి కల తెరంగ-శేషముగ దెల్పి విలపించి సిగ్గువిడిచి

"పడతి ! నానాథు డంబరపథవిహారి - మలయ పవనోర్మిడోలికానిలయమూర్తి
విశ్వజీవనవర్తి వివేకమూర్తి - అతని తోడ్తెచ్చి పరితాప మడతు వమ్మ"

అనగ, పికము గొంతెత్తి దిగంతరములు-మారుమ్రోగగ జగమెల్ల మధురగాన
ఝరులు నిండింప మ్రోడులు శిరసు లెత్తి-చివురు లెత్త వసంతుండు చేరవచ్చి

వివిధ సుమజాల మర్పించి విమలసౌర-భముల తనులత నించి ప్రేమమున ముంచి
"సాధ్వి! నీప్రియు డరుదెంచుజాడ దెలుప-దూతగా బంచినాడమ్మ తొలుత నన్ను"

అనగ నప్పుడు సఖి హృదయాంచలముల-నవ్యమోద సుధాధార నాట్యమాడి?
నట్లు దోచ నొక్కింత ధైర్యంబు నొంది-కడల నెమకంగ మొదలిడె కాంతురాక!

* * * * *

కలువపూవులు వంచిన తలలనె త్తె-పక్షు లాకాశవీథుల బయలు వెడల
జంతు సంతతి నిశ్వాసచయము తగ్గ-గ్రీష్ము డరిగె భానూజ్వాల గృహామునుండి!

*　　*　　*　　*　　*

అవిరతానంత నీలాభ్రహర్మ్యరాజ-ప్రాంగణమ్మున ముత్యాల రచ్చవోలె
చలువ పందిరి పొడసూపె; చదల దివ్య - పద్మనయనలు పవడంపుపట్టుపాన్పు

వితతి బరపించి చుక్కల విరులదారి-సరళముగజేసి ధవళచామరకలితక
రాబ్జులై యీశ్వరుని యండ కరిగి నిలువ-మొరసె దుందుభి భువనాలు పులకలెత్త

తరళసౌదామనీరాజి మెరయుచుండ-చలువ తెమ్మెర తెరువుల వెలుపుచుండ
నీలనీరదరథముపై నిఖిలలోక-భారవహునుండు కూర్చుండి ప్రకృతి భామి

నీమణీదర్శనోత్సాహ నిభృతహృదయ-సాగరుం డౌచు వినువీథి కేగుదెంచి
అమృతపూర్ణప్రవాహంపు టలల నడుమ-పయన మొనరించి నగముల పజ్జ విడిసి

వన్యభూముల విహరించి పట్టరాని-పరువువారుచు పొలముల పత్తనముల
పొంగి పొరలుచు తిరుగాడి భువన మెల్ల-తిరిగి వేసారి ప్రేయసి సరస జేరె.

*　　*　　*　　*　　*

బీటవారిన ప్రియురాలి పేద హృదయ-మమృతహృదయాన హత్తింప నయ్యొ బోలు
నిత్యనూతనకల్యాణనిలయయగుచు-పచ్చమేల్పట్టు వసనమ్ము ప్రకృతితాల్చె!

రాగమయమైనహృదయేశు కౌగిలింత-లక్షయసుఖాంబునిధి ముంచనయ్యొ నేమొ
విధివిరామము లేకుండ వివశ యగుచు-కుముదినీకాంత రేయంత కులుకుచుండె?

జ్ఞానమయమైన లోకేశు గానరవము-వినగబడియె గాబోలు నెమ్మనము విచ్చి
స్వాదుసుస్వర ప్రణయప్రభాతగీత-మాలపింపగ దొడగె విహంగకులము!!

---

# కాళిదాససందేశం

అక్కిరాజు నిత్యానన్దశాస్త్రిగారు (ఉమాకాంతుఁడు)

(వెనుకటి సంచిక తరువాయి)

"కామభంగః"

శ్లో. తపః పరామర్శవివృద్ధమన్యో ।
ర్భ్రూభఙ్గదుష్ప్రేక్ష్యముఖస్య తస్య
స్ఫురన్నుదర్చిః సహసా తృతీయా
దక్ష్ణః కృశానుః కిల నిష్పపాత.

(తపోఘర్షణ హేతువువల్ల అధికంగా వృద్ధిపొందిన కోపంగలిగి, భృకుటీదుష్ప్రేక్ష్యమైన ముఖంతోవున్న ఆయన మూడవకంటినుండి, ఉద్దీపిస్తూపుట్టే జ్వాలలు అగ్ని వేగంతో బయలుదేరింది.)

శ్లో. క్రోధం ప్రభో సంహర సంహరేతి
యావద్గిరః ఖే మరుతాం చరన్తి
తావత్ స వహ్నిర్భవనేత్రజన్మా
భస్మావశేషం మదనం చకార.

(వ. "ప్రభువా! కోపాన్ని ఉపసంహరించు, ఉపసంహరించు" అనే దేవతలవాక్కులు ఆకాశమందు ప్రవర్తించేటంతలోనే, ఈశ్వరనేత్రోద్భవమైన అగ్ని మదనుణ్ణి భస్మావశేషుణ్ణిగా చేసింది.)

ఇంద్రియలోలత్వజనకమైన కామం ఆవిర్భవించింది. నాయకులకు అన్యోన్యాభిలాషం కలిగింది. వ్యాససర్గంలో గాంధర్వప్రేమ ప్రధానంగా వున్నది. ఈకామం సమకూర్చదలచిన దాంపత్యానికి, పూర్వమార్గం వున్నది. వ్యాసుడి గంగాశంతనులున్నారు. యయాతి దేవయానలున్నారు. శకుంతలాదుష్యంతులున్నారు. గాంధర్వప్రేమను, అంగీకరించకపోయినా, కన్యాదాత హిమవంతుడు, మరియొకరిని కోరక, ఈశ్వరుడే అల్లుడు కావలెనని, అభిలషిస్తున్నాడు. యయాతిదేవయానుల సందర్భంలో వున్నట్లు పరిణయానుకూల్యానికి అంతరాయభూతమైన, తారతమ్యం ఏమీ లేదు. పార్వతి ఈశ్వరుడి పూర్వపత్ని. తిరిగీ ఈశ్వరసాహచర్యప్రాప్తినిపొందడంలో తుటియే లేదు. దేవతలందరూ, నాయకులసమాగమాన్ని ఉత్కంఠంతో ప్రతీక్షిస్తున్నారు. త్రిలోకోపకారానికి కారణభూతమైన విషయం. సర్వమోదావహమైన దాంపత్యం. కాని కవి ఈకామం చేసేప్రయత్నానికి భంగం కలిగిస్తున్నాడు. ప్రవర్తకత్వం దీనిది కాదంటున్నాడు. ఇంద్రియలోలత్వజనకమైన కామం ప్రేరించే దాంపత్యానికి తనసర్గంలో స్థానంలేదని తెలుపుతున్నాడు. వ్యాసుడి శకుంతలాదుష్యంతులను స్వయం సర్గంలో వర్తించజేసిన సందర్భంలోగూడా, కవి ఈమనస్తత్వాన్నే ప్రకటిస్తున్నాడు. వ్యాసగాథను కొంతవరకు మార్చి శకుంతలాదుష్యంతుల వ్యాసప్రేమతత్వమ్మీద ప్రతిక్రియను నడుపుతున్నాడు. వ్యాసదర్శితమైన వీరిదాంపత్యం తనకు సమ్మతంకాదని సూచిస్తున్నాడు. ఇంద్రియలోలత్వజనకమైన, కామమొనరించే ప్రేమనిర్ణయంలో దోషమున్నదని వ్యంగ్యంగా తెలుపుతున్నాడు. తరువాత దాంపత్యానికి ఒకనూతనరూపం కలిగిస్తున్నాడు. స్వీయమైన ప్రేమతత్వంతో దాంపత్యాన్ని ప్రకాశించజేస్తున్నాడు. ఈ ఉద్దేశంతోటే కవి వ్యాససంయోజితమైన వీరి దాంపత్యానికి విక్రియను పరికల్పిస్తున్నాడు. దుష్యంతుడే శకుంతలాపరిగ్రహశంక లోకాపవాదభయమూలమని వ్యాసుడు తెలుపుతున్నాడు. కాని కవి ఇంద్రియప్రేరణనిర్ణయించిన ప్రేమానుబంధంలో దోషం వున్నదని తెలుపడానికి దీనిని—అంటే పరిగ్రహశంకను—బహుకామినీబాహులతాపరివేష్టితులైవుండే భోగలంపటులకు సహజమైన విషయోన్మత్తతయం దారోపిస్తున్నాడు. దూర్వాసః శాపవ్యాజమూలంగా, ఈవిషయాన్ని ప్రకటిస్తున్నాడు. ఈదంపతులకు సమాగమాన్ని కలిగించిన వ్యాసుడిప్రేమభావనమీద ప్రతిక్రియను నడపడానికి కవికి దూర్వాసః శాపవ్యాజమే, మూలాధారం. కవి, కామపరితృప్త్య

ర్థంలోనే దుష్యంతుడి స్త్రీకాంక్ష వర్తించిందని తెలుపుతున్నాడు. శకుంతల ఆవిధంగా స్వీకృతమైన భార్యే. ఇక విషయాలు శుద్ధాంతభోగంలో తేలుతున్నప్పుడు, కాంతా కాంక్ష విషయాలకే స్వాధీనమై వున్నప్పుడు ఇంద్రియ వికారద్వారంతో దుష్యంతుడి మనస్సులో ఛాయాకృతితో ప్రవేశించి స్థలాంతరంలోనే వున్న శకుంతలారూపం కొన్ని దినాలలో గాఢతమస్సులో లీనమైపోవడంలో ఆశ్చర్య మేమున్నది! అందుకే దూర్వాసుడితో:—

శ్లో. స్మరిష్యతి త్వాం న స బోధితోఽపి సన్
కథాం ప్రమత్తః ప్రథమం కృతామివ.
(శాకున్తలమ్)

(స. పూర్వంకృతమైన కథను ప్రమత్తుడివలె, ఆయన జ్ఞాపితుడై కూడా నిన్ను స్మరించకుండా వుండగలడు.)

అని అనిపిస్తున్నాడు. ఇక దూర్వాసుడు శాపావసానాన్ని ప్రసాదించిన సందర్భంలో కవి ప్రమత్తలకుతగిన అభిజ్ఞానకారణాన్నే యేర్పరచాడు. శచీతీర్థానికి వందనంచెయ్యడంలో తనకు దుష్యంతుడిచ్చినఉంగరం జారిపోయివుండవచ్చునని శకుంతలచేత పలికించి, రాజుకు కలిగించదలచిన అభిజ్ఞానకారణానికి కవి అనవేశాడు. తరువాత జాలోపజీవికది, శచీతీర్థస్థలంలో దొరికేటట్టు చేశాడు. అది ప్రియురాలికరాన్ని అలంకరించడానికి యేర్పడ్డబహుమానం. రాజనామాంకితం. ఈతీరున అనుమానప్రమాణం యేర్పడ్డది. ప్రబోధితుడైనాడు. అందుకే అంటే విస్మృతినివారణానికి వాగ్బలం చాలనిదిగనుకనే అంగులీయక సందర్శనంవల్ల అభిజ్ఞానం కలుగుతుందని దూర్వాసుడిచేత చెప్పించి సుందరమైన లోగడ అల్లికను కవి తయారుచేశాడు.

ఇక దంపతులమనస్తత్వాలకు అభీష్టపరిణామాన్ని కలిగించడానికే కవి నష్టాంగులీయకవిషయాన్ని పరికల్పించాడు, ఇందుకే కాళిదాసు పుత్రయుక్తఅయిన శకుంతలను ప్రవేశపెట్టక, గర్భభారాన్ని ధరించివున్న శకుంతలను,దుష్యంతిసమక్షంలో ప్రవేశపెడుతున్నాడు. భర్తృనిరాకృతఅయిన ఆమెలో అసహాయపదార్శ్యల్యానికి తోడు, దీనత్వాన్ని ప్రవేశపెట్టి అశ్రునిరోధంగల వీక్షణంతో భర్తృసాన్నిధ్యాన్ని యెడబాపుతున్నాడు. "అతిక్రాంతకులాచారవు; పితృగృహప్రవేశానికి నీవర్హవు కా"వని ఆత్మబంధువులచేత అనిపించి అత్యంతశోచనీయమైన ఆమె నిస్సహాయస్థితిని తెలియజేస్తున్నాడు. శకుంతల దీనత్వానికి మనస్సు కరగినా తనకు భర్తవాదిత్వం లేదని స్థిమితంగా వున్నరాజుకు ఆకాశయానంతో అంటే, ఎటుపోయినసంగతీ తెలియకుండా ఆమెస్థలాంతరాన్ని ప్రాపించినతరువాత, అభిజ్ఞానం కలిగించి, దుస్సహసంతాపాగ్నిని రాజులో ప్రవేశపెట్టి చిత్తకాలుష్యాన్ని దహిస్తున్నాడు. ప్రథమం శకుంతల విషయంలో వర్తించిన దుష్యంతుడి ఇంద్రియలోలత్వమూలమైన ప్రేమను, ద్రోహవిముక్తని, వేదనతో ప్రతీక్షిస్తున్న పశ్చాత్తాపమూలమైన ప్రేమగా కవి పరిణతాన్ని చేశాడు. ఇక మారీచాశ్రమంలో కోరిక ఫలించినట్లు ఆమె సందర్శనభాగ్యం రాజుకు కలిగించాడు. శకుంతలాదర్శనంతో ఆయనహృదయాన్ని సంపూర్ణంగా మార్చివేస్తున్నాడు. అత్యంతంగా కృశించిపోయిన ముఖంతో జటాబద్ధమైన కేశపాశంతో, మలినవస్త్రధారణంతో, ఉద్దీపిస్తున్న విశుద్ధవర్తనంతో, ఆతినిష్కరుణుడయిన తనవియోగవ్రతాన్ని చిరకాలంనుండీ ధరించివున్న శకుంతలను కవి దుష్యంతుడికి కనబరుస్తున్నాడు. భూవలయాన్ని యేకచ్ఛత్రాధిపత్యంతో పాలించగలిగిన చక్రవర్తిలక్షణసంపన్నుడయిన, పుత్రుడి మాతృత్వంలో, పరమసాధ్వీత్వంతో అరణ్యావాసంచేస్తున్న ఆమెసందర్శనాన్ని ప్రసాదించాడు. దుష్యంతుడిహృదయంలో పవిత్రమైన ప్రేమభావం ఉదయించింది. ఆమెపూజ్యతకు సర్వభావాలతో వశీకృతుడై పాదానతుడైనాడు. కవి ఇంద్రియదృష్టిగల నాయకుడి ప్రేమను పవిత్రమైన భావదృష్టిగల ప్రేమగా మార్చాడు.

నాయికకు మరివొకవిధంగా చిత్తవిశుద్ధిని కలిగిస్తున్నాడు. తాపసాశ్రమాలల్లో పుట్టి,ధర్మవేత్తల సాన్నిధ్యంలో పెరిగి, ముగ్ధత్వంలో, ప్రాణేశలాభానికి తోడు ఐహికభోగోపలబ్ధి గుణాతిశయమని భావించిన, నాయికఆశను, భర్తృనిరాకరణంతో, సమూలఘాతంగా, కూల్చి

వేస్తున్నాడు. ఆమె చిత్తంలోనుండి, రాజప్రాసాద భ్రమలను, భోగవిలాసాలభ్రమలను, తుడిచివేస్తున్నాడు. మృదుహృదయాన్ని ఛేదించిన స్వబంధువుల "అతిక్రాంతకులాచారవనే" నిందోక్తితోటీ, లోకవీక్షణభీతివల్ల శరణ్యమైన, అరణ్యవాసంతోటీ ఆమెమనశ్చింతకు తీవ్రత్వాన్ని కలిగస్తున్నాడు. ధ్యానపరితప్త మవుతున్న చిత్తాన్ని మాలిన్యవివర్జితం చేసి, దాంపత్యతత్వాన్ని బోధిస్తున్నాడు. భర్తృసౌభాగ్యం, అపేక్షితవస్తు సంచయాని కంతటికీ అతీతమైందనీ, మహారణ్యాన్నే మహీతలస్వర్గంగా మార్చగలశక్తి దానికి వున్నదనీ, భోగభాగ్యాల భావాభావాలు, గుణదోషాలై దాన్ని స్పృశించలేవనీ, ఆమెకు విశదం చేశాడు. భర్త్రారాధనంలో, సర్వకామాలూ సిద్ధిని పొందుతున్నవని ఆమెకు ప్రదర్శించాడు. దంపతిప్రేమ, ఆనందమయమైన ధర్మస్వరూపంతో ఆమెకు గోచరించేటట్టు చేశాడు. ఈతీరుగా నాయకులకు మనఃపరిణామం కలిగిన తరువాత, పునస్సమాగమాన్ని సమకూర్చాడు. జాయాపతులను, యేకీకృతులను చేసిన, నిర్మలప్రేమ, మూలమయిన దాంపత్యాన్ని అనుభవంలోకి తెచ్చాడు. ప్రేమనిర్ణయకర్తృత్వాన్ని స్వీకరించినందుకు, ఇంద్రియలోలత్వజనకమైన కామాన్ని, వియోగాగ్నిలో దహించి, రూపుమాపినాడు. కాళిదాసు ప్రేమభావనలో ఈ కామానికి, స్థిత్యర్హత లేదు. ఇక విచారణకు, ప్రధానాంశమయిన, కుమారసంభవసర్గంలో, ఇది ఉత్తరక్షణంలోనే, అంటే ఉత్పత్త్యనంతరం విలంబం యేమీ లేకుండానే వినాశం పొందింది. ప్రయోజనాపేక్షతో అంటే త్యాజ్యతాప్రకటనకు స్వీకరించినా, క్షణాధికమైనస్థితికి అర్హమైందికాదని కాళిదాసుభావన. ఇది రూపవిత్తాదులను ఆశ్రయించి, చిత్తాన్ని అధోమార్గాలలో ప్రవేశపెట్టడానికి యత్నిస్తూవుండే వ్యావహారికకామం. అందుకే బ్రహ్మచారితో పార్వతీసహానంచేత "అరూపహార్యుడైన పినాకపాణిని ఈమె పతిగా కోరుతున్న"దని పలికించాడు.

శ్లో॥ అరూపహార్యం మదనస్య నిగ్రహాత్
పినాకపాణిం పతి మాప్తు మిచ్ఛతి.

(వ॥ మదనుణ్ణి నిగ్రహించడంవల్ల రూపహార్యుడు కాని, పినాకపాణిని (ఆమె) పతిగాపొందకోరుతున్నది.)

వధూవిషయంలో, ఆకర్షణసాధనమైన, రూపం, ఈశ్వరుడికి ఆరాధ్యం కాలేదు. మృత్యువుగూడ విడదియ్యలేని, ప్రాణతంతు సంశ్లేషంతో, నిర్మలజీవనంతో దంపతులుపొందే ఆనందానుభవం, ఈ ఇంద్రియలోలత్వజనకమైన కామానికి రుచించదు. ఉత్తమపురుషార్థాలు దీనికి సంతాపప్రతిపాదకాలు. అనురాగచాంచల్యమే దీనికి ఆనందానుసంధానం. పశుత్వమే దీనితత్వం. ఆమరణాంతం మదనారాధనమే దీనికి సాధ్యపురుషార్థం. ఆత్మవినాశనమే దీనికి గమ్యస్థానం. సుందరీసుఖోపలబ్ధికి ఆత్మజాభ్యుదయాన్నిసహితం, ఆహుతిచెయ్యడమే దీనికి పరమప్రయోజనం ఈకామతత్వాన్ని, వివరించే ముఖ్యాభిప్రాయాలను కవి దేవేంద్రసాన్నిధ్యంలో కాముడు, ఆత్మశక్తి విశదీకరణంచేసిన సందర్భంలో విశదంచేశాడు. ఇది కామంయొక్క సాధారణ ప్రవృత్తి.

శ్లో॥ కామేకపత్నీవ్రతదుఃఖశీలాం
లోలం మన శ్చారుతయా ప్రవిష్టా
నితమ్బినీ మిచ్ఛసి ముక్తలజ్జా
కణ్ఠే స్వయంగ్రాహనిషక్తబాహుమ్.

(వ॥ పాతివ్రత్యదుఃఖశీలను, లోలమైన నీమనస్సులో, సౌందర్య కారణంచేత ప్రవేశించినదాన్ని యేనితమ్బినిని లజ్జను త్యజించి, స్వయంగ్రహణంచేత, కంఠమందు నిషక్తబాహువు కలదాన్నిగా నీవుకోరుతున్నావు.)

శ్లో॥ అసమ్మతః కస్తవ ముక్తిమార్గం
పునర్భవక్లేశభయాత్ప్రపన్నః
బద్ధ శ్చిరం తిష్ఠతు సున్దరీణాం
ఆరేచితభ్రూచతురైః కటాక్షైః.

(వ॥ నీకిష్టుడుగాని యెవడు సంసృతిభయంవల్ల ముక్తిమార్గాన్ని పొందెనో తెలుపుము. ఆరేచితభ్రూచతురమైన, సుందరీకటాక్షాలతో, అతడు చిరకాలంబద్ధుడై వుండును గాక!

శ్లో. అధ్యాపిత స్యోశనసాఽపి నీతిం
ప్రయుక్తరాగప్రణిధి ర్ద్విషస్తే
కస్యార్థధర్మౌ వదపీడయామి
సిన్ధో స్తటా వోఘ ఇవ ప్రవృద్ధః.

(వ॥ శుక్రుడివద్ద నీతిశాస్త్ర మభ్యసించినవాడై నప్పటికీ ప్రయుక్తరాగప్రణిధి అయిన,యేనీ శత్రువుయొక్క అర్థకామాలనువి స్తరిల్లిన ప్రవాహం నదీతీరాలను పీడించనట్లు పీడించవలెనో చెప్పు.)

నేను "అర్థధర్మాలను కూల్చివేస్తా" ననే కాముడి మాటలలో ఈకామం తత్వం గర్భితమైంది. అర్థధర్మాలు నశించిన వెనుక పశుక్రియాపరాయణమైన ఆసురప్రకృతి ప్రధానమవుతుంది లోకప్రతిష్ఠకే హాని ఆపతిత మవుతుంది. ఇక దాంపత్యం మనోహరమైన రూపాన్ని వదలిపెడుతుంది. ధర్మమూలమై, ఉత్తమ ప్రయోజనసాధనమైన దాంపత్యపరమార్థం సమగ్రత్వంతో నశిస్తుంది. కవి దీనితత్వాన్ని తెలియచేసాడు. విశుద్ధదాంపత్యమందు దీనికి ప్రత్యర్థిత్వ మున్నదని ప్రకటించాడు. ఈ కామంలో నిర్ణీతమైన ప్రేమకు ఉత్తమత్వం లేదని కాళిదాసు లోకాన్ని ప్రబోధిస్తున్నాడు. ఇంద్రియ ప్రేరణతో ప్రేమను, నిర్ణయించడం అత్యంతం అనర్థహేతువని, మన్మథుడికి సజీవదహనం సంప్రాప్తించిన కారణాన్ని ఆకాశవాణి రతికి తెలిపిన సందర్భంలో కవి తెలియజేశాడు.

శ్లో॥ అభిలాష ముదీరితేన్ద్రియః
స్వసుతాయా అకరో త్ప్రజాపతిః
అథ తేన నిగృహ్య విక్రియా
మభిశప్తః ఫల మేత దన్వభూత్.

(వ॥ ప్రేరేపించబడ్డ ఇంద్రియాలు గలవాడై ప్రజాపతి ఆత్మజ నభిలషించాడు. అనంతరం ఇంద్రియవికారాన్ని నిరోధించి ఆయన శపించగా, కాముడేఫలాన్ని అనుభవించాడు.)

కాముడు అంటే ఇంద్రియలోలత్వం ప్రజాపతి చేత, ఆత్మజను మోహించజేసి, శాపోపహతుడైనాడని, అన్నాడు. ఇంద్రియప్రేరణకు లోబడడంలో యుక్తాయుక్త వివేకం నశిస్తుందనీ, బుద్ధి సంస్తంభించిపోతుందనీ, తెలుపుతున్నాడు. ధర్మానికి అధీనమై వర్తించడంవల్లనే ఈకామం ఉత్తమత్వాన్ని ప్రాపించి, శ్రేయస్కరమవుతున్నదని కాళిదాసు ప్రవచనం. ధర్మపరిరక్షణకోసం, దాంపత్యవిశుద్ధికోసం, ఔచిత్యపరిపాలనంకోసం, ఈస్వేచ్ఛావ్యవహారిని, కామాన్ని, హరనేత్రాగ్ని కల్పించి, తృటిలో భస్మమాత్రావశేషాన్ని చేశాడు.

## ధర్మప్రాదుర్భావం

శ్లో. అనేన ధర్మ స్సవిశేష మద్య మే
త్రివర్గసారః ప్రతిభాతి భామిని,
త్వయా మనోనిర్విషయార్థకామయా
య దేక ఏవ ప్రతిగృహ్య సేవ్యతే.

(వ. భామినీ, అర్థకామాలను తలపెట్టని నీచేత ధర్మం ఒక్కటే స్వీకృతమై సేవించబడు తున్నందువల్ల, నాకిప్పుడు ధర్మం సాతిశయంగా త్రివర్గాలసారమై తోస్తున్నది.)

ఇంద్రియలోలత్వం స్వేచ్ఛావర్తనను పొందడంవల్ల దాంపత్యం అధోగతిపాలౌతుందని కవి తెలియజేశాను. ఇక దాంపత్యానికి యెట్లా ఉత్తమత్వం సిద్ధిస్తున్నదీ తెలుపుతున్నాడు. ప్రేమను వ్యావహారికమైన కామం నిర్ణయించినప్పుడే దాంపత్యానికి శైథిల్యం లభిస్తుందనే, అభిప్రాయాన్ని ప్రకటించాడన్నాను. ఇంద్రియాలను, రూపవిత్తాదులను, ఆశ్రయించివున్న వ్యావహారిక కామంలో, ఇంద్రియప్రేరణం ప్రేమను నిర్ణయించ అనర్థమని కవి ఇదివరకే తెలియజేశాడు. వ్యావహారిక కామంయొక్క స్పర్శదోషంలేని ప్రేమనిర్ణయానికే కవిని అభిమానం దత్తమైవున్నదని సూచిస్తున్నాడు. కవిసర్గంలో, కామం ధర్మశబలితమై, పావనత్వంతో వెలుస్తున్నది. నిర్మలమైన అంతఃకరణప్రవృత్తికి భంగం కలిగించదలచే రూపవిత్తాదులను, భోగభాగ్యాలను త్యజించింది. సత్వాన్ని ధర్మంలో విలీనం చేసింది. ధర్మసారూప్యాన్ని పొందింది. ఈవిషయాన్ని కవి పార్వతీప్రేమతత్వప్రవర్తనంలో, తెలియజేస్తున్నాడు. ఇక పార్వతీప్రేమతత్వాన్ని విచారణచేస్తాను.

కాళిదాసు వ్యాసస‌ర్గంలో ప్రేమను నిర్ణయించిన కామాన్ని స్వీకరించి, ధర్మవిశిష్టమైనరూపభేదంతో స్వీయసర్గంలో వెలయించి వాల్మీకి ప్రేమభావనంలో తనకుగల అధినివేశాన్ని ప్రకటించదలచాడు. వాల్మీకి సీత ప్రదర్శించినటువంటి, మనోహరమైన ధర్మశేబళితప్రేమ తత్వాన్ని సాధనాంతరంతో, కాళిదాసు పార్వతిప్రద ర్శిస్తున్నది. వరనిర్ణయంలో కవి పార్వతియొక్క ఆత్మ నిర్దేశాన్ని, స్వీయవ్యాపారాన్ని కనబరుస్తున్నాడు. పార్వతిపితృసాన్నిధ్యంలో వుండగా, ఆమె, ఈశ్వరు డికి, అర్ధాంగి ఔతుందని నారదు డాదేశిస్తాడు. ఉన్న తిస్థానాన్ని ఆక్రమించవలెననే, ఆశా, సంతోషమూ, పార్వతిమనస్సులో అంకురించినవి. భర్తృసంబంధమ యిన సంకల్పం ఉత్పన్నమయింది. భర్తృనిర్ణయం కేవల పిత్రాయత్తంకాదు. ఈఅంశాన్నికవి ఈక్రిందిశ్లోకంలో ప్రస్ఫుటంగా కనబరుస్తున్నాడు.

శ్లో. కదాచి దాసన్నసఖీముఖేన సా
    మనోరథజ్ఞం పితరం మనస్వినీ
    అయాచ తారణ్యనివాస మాత్మనః
    ఫలోదయాన్తాయ తపఃసమాధయే.

(వ. నిశ్చలచిత్త ఆమె ఒకప్పుడు అభిలాషాభిజ్ఞు డైన తండ్రిని ఫలోత్పత్తి అవధిగాగల తపోనియమాల కోసం తన అరణ్యనివాసాన్ని యాచించింది.)

పార్వతీమనోరథాన్ని తండ్రి యెరుఁనని, ఆమె సంకల్పాన్నే ప్రధానం చేశాడు. ఇంతేకాకుండా, తపః ఫలోదయమయ్యేవరకూ, అంటే అపేక్షితభర్తృలాభం కలిగేవరకూ, అరణ్యవాసాన్ని కోరిందని, వరసంఘట నాన్ని,ఆమెకర్తృత్వానికే సమర్పించదలచాడు. తిరిగీ:—

శ్లో॥ అథానురూపాభినివేశతోషిణా
    కృతాభ్యనుజ్ఞా గురుణా గరీయసా.

వ॥ అనంతరం, యుక్తమైన అభినివేశానికి సం తోషాన్ని పొందిన పూజ్యతముడైన జనకుడివల్ల అను జ్ఞను పొందినదై................)

అనే శ్లోకంలో, అనురూపమైన గౌర్యాసక్తికి తండ్రి సంతోషించి అనుజ్ఞాదానం చేశాడని తెలపడంలో వరవిషయికమైన భావాభినివేశానాన్నీ, పార్వతియందే ఆరోపిస్తున్నాడు. ఈతీరున కవి వరనిర్ణయంలో పార్వ తియొక్క కామవృత్తిని కనబరచాడు. ఇది ఇంతవరకూ, వ్యాసుడి శకుంతల, దమయంతి, సావిత్రి, దేవయాని, ప్రేమసమర్పణంలో ప్రేమనిర్ణయానికి అవలంబించిన, స్వయంనిర్ణయ విధానాలతో, బాహ్యరూపంలో పోలి వున్నది. అయితే ప్రేమతత్వం రెంటికీ భిన్నం.

. ఇక, ఇది, కామంతో ప్రేమను నిర్ణయించవలసిన సందర్భం అయినా వరనిర్ణయవ్యాపారం కన్యకే వదల వలసిన విషయమయినా, కవి, వాల్మీకిసర్గంలో వెలసిన పితృకృతవరనిర్ణయంమీద, తనకున్న అభిమానంతో, దీన్ని సంపూర్ణంగా ఆచ్ఛాదితాన్ని చేసి, వాల్మీకినే ఇక్కడకూడ కనబరుస్తున్నాడు. పత్యభిలాషనునాయిక యందు ఉత్పత్తిచేసిన నారదసందేశ సందర్భంలో ఆదే శాన్ని హిమవత్సమ్మతంచేసి,జనకాభీప్సితమైన సంకల్పమే కన్యవల్ల స్వీకృతమైందని తెలుపుతున్నాడు. పితృనిర్ణ యమే నాయికకు అభీష్టమన్నాడు.

శ్లో. శైలాత్మజాపి పితు రుచ్ఛిరసోఽభిలాషం
    వ్యర్థం సమీక్ష్య లలితం వపు రాత్మనశ్చ.

(వ. శైలాత్మజగూడా ఉదాత్తుడయిన జనకుడి అభిలాషను సుందరమైన తనశరీరాన్ని నిష్ఫలమైనవా టినిగా తలచి.)

అనేశ్లోకంలో కన్యయొక్కవాంఛనూ, జనకుడి అభిలాషనూ సమానప్రతిపత్తిని కనబరచి, అభేదరూ పంగావున్న కన్యేచ్ఛా జనకాభిలాషా కలసి వరలాభాభిని వేశానికి, కారణాలైనవని తెలిపినాడు. ఈవిధంగా వర నిర్ణయం పితృకృత మైందన్నాడు. వివాహం సిద్ధించిన ప్పుడు

శ్లో. అథ విశ్వాత్మనే గౌరీ
    సందిదేశ మిథః సఖీం
    దాతా మే భూభృతాం నాథః
    ప్రమాణీక్రియతా మితి.

(వ. అనంతరం పర్వతనాథుడు మద్దానరూపా ర్థాని నిర్ణయ హేతువుగా చేయబడునుగాక అని రహ

స్యంగా విశ్వాత్ముడికి (ప్రియవయస్యతో గౌరి సందేశం పంపింది.)

పితృదత్తమైన పరిగ్రహం నాకు అత్యంతం ప్రియమైనదని పార్వతి అన్నది. ఆమహానుగ్రహాన్ని నాకు కలుగజేయవసిందని వేడింది. ఈతీరున కవి కన్యయొక్క కోరికతో ప్రేమను నిర్ణయింపవలసినసందర్భంలోగూడా వరనిర్ణాయకత్వాన్ని పిత్రాయత్తం చేసి నేర్పుతో వాల్మీకినే అనుసరించాడు. పార్వతీవరాభిలాష పితృపుత్రికలయందు ఏకకాలమందే ఉదయించింది. పార్వతియొక్క వరలాభవాంఛకు, జనకుడికోరిక కారణమైనదన్నారు.

[సశేషము]

---

## నిశీథసాంత్వనము

శ్రీ శ్రీనివాసరావు, (కవితాసమితి)

ఈనడిరేయి నాహృదయ మీవిధిగా మధుధారయై, వృథా
మైన శశాంక కౌముదులయందు ద్రవించె నిశీథనిర్మల
ప్రాణము మాటిమాటికి భయమ్మున నాగళ మింక మ్రోగగా
మానునొకోయటన్న యనుమానముతో కడు సంచలింపగన్.

శాంతవిభావరీహృదయ సాధ్వసముం గ్రహియించి వింతలో
నెంతయు తెల్లబోయినటులే యొక లేతెలిమబ్బు నింగిపై
నంతయుఁ గ్రమ్మికొన్న ధవళాంశుమరీచులలో మునింగి తా
నంతట మాయమై చనియె నావిరియట్లుగ చూచుచుండగన్.

ఏగతి పాడకుందును జనించిన యూహలనెల్ల నామన
స్సాగర మంతకంతకు నిసర్గపిపాసల బొంగి నింగిపై
నూగగ నేగునంతట, నవోజ్జ్వలమోహనకావ్యగీతికా
వాగమృతమ్ము లాగక స్రవంతినులై ప్రవహించునంతటన్.

మామకవాణి ఈ నిఖిల మంగళలోకదరస్మితమ్ములో,
నీమృదుచంద్రికా పులకితేందుశిలాజలధారలో, దిశా
స్తోమ సుధాకపోలపరిచుంబన తత్పరమాతరిశ్వహృ
త్సీమసుఖమ్ములో, కని నదించు నుదంచితభావరాగముల్.

నా లలితధ్వనుల్ విని మనస్సు వినిర్మలతాపరీతమై
చాలసుఖప్రభూతిగన, శర్వరి నానవగీతగాన ప
త్సౌలసుషుప్తి దేలెడిని శాంతిగ నుత్పలకోరకావళీ
మాలికలే మనోహర సమంచిత శయ్యగ హాయిహాయిగా.

---



౮. బర్మాదేశమందలి కొండలు

జనమంచి వేంకటరామయ్యగారు ఆంధ్ర కవిత్వ పాఠకులకు పరిచితులే. ఈయన తన కృతుల నిన్నినాళ్లు ప్రచురించకుండుటకు, ఈయన ఆశయము ఘన మౌటయును, తదాశయము తన కృతులలో సఫలీకృతము కాలేదేమోయను సందేహము జనించుటయును కారణములని యూహించ వీలగుచున్నది. పుటలను లెక్కిడి గొప్ప చెప్పుకొను మూఢాత్ములు, సంపుటములు దొంతరవెట్టి మోదించువారు, ఏకధారగ శతగ్రంథములను చెప్పి సముత్కటమోదంబును బొందువారు, పెక్కురున్న ఈ కాలమున ఇట్టివా రరిది. సమర్థు లగు విమర్శకుల కీ నవకుసుమాంజలి తావిచ్చుచున్నను, అట్టివారు దీనిని విమర్శించని కారణమున జనించిన ఖేదమే న న్నీవ్యాసరచనకు ప్రోత్సహించినది. సహృదయులు నా లోపముల నెరింగించినచో చాల కృతజ్ఞుడను.

కేవలము గ్రంథనామములలోనే సౌందర్యమును సాధించుట కవుల యాచారమై పోయిన ఈ కాలమున, వేంకట రామయ్యగారు తమ కావ్యమునకు 'నవ కుసుమాంజలి' యను నామముంచుటచే, నీయన వారికి భిన్నులని తోచుచున్నది. ప్రస్తుతకవు లెవరును తమ కావ్యరచనాదర్శమును వెల్లడి సేయుట లేదు. కావ్యరచనము మానైజమని ఢాబు వారుకూడ కలరు. ఈయన మాత్రము కవిత్వరచన సరస్వత్యారాధనమని తెలిపి సత్కవిత్వ మెట్లుండవలెనో అమృతకలశియందు బాగుగా సూచించినారు. దానినిబట్టి ఈయన కవిత్వరచనాదర్శము, "పెద్దలకిల్ల దాహాశమనంబై యోలలాడంగతచ్ఛివమూర్ధోపరిఖేల దంబరధునీదివ్యప్రవాహము"లను భువిపారించుటయు క్రొత్త త్రోవద్రొక్కి, క్రొత్త సీమల జూపి చిత్తములకు క్రొత్త వికసనముకూర్చుటయు, కోయిలగూసినయట్లె మదికి హాయిగొలుపుటయు, ప్రకృతికి నపూర్వయోగకల్పనము చేసి వన్నెవెట్టుటయు, నంత్యమునతనకు శివునకు నభేదతాదాత్మ్యమగుటను చూచుటయు నని తెలియుచున్నది. కావ్యరచనాదర్శము, కేవలము తేనె సోకించినట్లు తీయదనము గొల్పుటయును, ఆంధ్రావనిమోదముం బొరయునట్లు సేయుటయు, జనములు మెచ్చుటయునైన చాలదు. కవిబ్రహ్మ, తన బ్రహ్మత్వమును గుర్తెరింగి, జీవేశ్వరైక్యతను నిరూపించవలయును. మహాకవులగు త్యాగరాజు, వేమన్న, రామదాసు, కబీరు మొదలగువా రీయాదర్శమును పాలించి జీవన్ముక్తులైనారు. వేంకట రామయ్యగారి ఆశయము వాఙ్మయసేవమై, శివమూర్ధోపరిఖేల దంబరధునీ దివ్య ప్రవాహతుల్య జవాకాంక్షియై, వనప్రియ కంఠ హుంకృత్యనుకరణమై, ప్రకృత్యలంకారమై, అంత్యమున జీవేశ్వరైక్యతా నిరూపణమై ధన్యత గాంచినది.

ఇట్టి యుచ్చాదర్శమును పాలించ నెంచినవారికి స్వీయకృతిసౌందర్యమున నమ్మకము కుదుర కుండుట సహజమే.

వేంకటరామయ్యగారి కవిత్వమును విమర్శించునప్పుడు, కవికిని, యోగికిని గల తారతమ్యమును గుర్తించుట అవసరము. కవి భౌతిక సౌందర్యమును చూచును. [భవభూతి మొదలగువారంతర్జగత్తునకు సంబంధించిన సౌందర్యము వర్ణించినను, జగముయొక్క అంత్యపరిణామము, జీవేశ్వరసంబంధము, మొదలైనవి ఆధారముగా గొనియుండలేదు.]

బాలునకు మృత్యుస్వభావజ్ఞాన మేల? ప్రేమనశింపదు. వీటినే కవితా సత్యములందురు. యోగి సృష్టిసత్యమును గుర్తించి నీతిబోధకముగా దానిని జనులకొసంగును. కవికి భావములు తమంతట తామే స్ఫురించును. యోగి కాలోచన, తర్కము అవసరము. కవికి కొన్ని విశిష్టవిషయములే ఆనందమును గొల్పును. యోగి కీభేదముండదు. ఆతనికి కోకిలధ్వని, కాకనిస్వనముకూడ ఈశ్వరుని కంఠ ధ్వనులే. వస్తుసౌందర్యము కవి నాకర్షించును. యోగికి వస్తుసౌందర్య మవసరము లేదు. ప్రతి విషయమును అతని ఆలోచనకు గురియగుచుండును.

వేంకటరామయ్యగారు కవినుండి యోగిని దగ్గఱుచున్నారు. ఈయన భావములు తఱచు జీవదశాంత్య పరిణామమువైపునకే మొగ్గుచుండును. ఈయన సుందరవస్తువు నొకదానిని కొంతవరకు వర్ణించి, పిదప నీభావములే ఆధారముగా జేసి తమ ఆధ్యాత్మికాభిప్రాయములను గుప్పింతురు. మాయబొమ్మ, ఆటగీతము, నిత్యమల్లి, శుకవిలాపము మొదలైన ఖండములిట్టివి. అందుకే ఈయనను యోగి యనవలసివచ్చెను. వస్తుసౌందర్యముకంటె వస్తుపరిణామచింతచే బయలుదేరు భావములే ఈయనకు ప్రీతికరములు. ఈ విషయమునే ఈయన నిత్యమల్లియందు

'ప్రకృతి కన్న బ్రకృతిచేతవ్యక్తమైన భావమే
యకలుష ప్రమోదదాయి యగును సూరిజనులకున్.'

అని చెప్పియున్నారు. ఈ ప్రకృతిచేత వ్యక్తమైన భావము కవికి సౌందర్యమువైపునకును, యోగికి సత్యమువైపునకును మొగ్గుచుండును. నిత్యమల్లిలో,

'రాగమునకు ద్వేషమునకు ప్రకృతియును వికృతియునున్
యోగమునకుత్తోడుపడుచునుండు నెపుడు నియతిమై.'

అను పద్య మున్న ఘట్టమంతయు కవియొక్క ఆధ్యాత్మికాభిప్రాయములతోనే నిండియున్నది.

ఆవేశము, స్వభావోక్తి, సృష్టి, ధ్వని యను కవితాలక్షణములలో మొదటిరెండును నవకుసుమాంజలిలో విరివిగా నున్నవి. అనుభవమున్న కవీంద్రుడు వ్రాసిన కైతలలో నావేశ మెక్కువగా నుండును. వేంకటరామయ్యగారి కవిత్వము ఆవేశప్రధానమైనది.

" ఏడ్చెను రాఘవుండు మును
పిమ్మట సొమ్మసిలంగ లక్ష్మణుం

డేడ్చను భీమసేనుని సు
కృత్రిమపున్మృతి వించు ధర్మజుం
డేడ్చిరి యంతవారె యెటు
లేడ్వక యుందును పామరుండనై
యేడ్చితి నేనుగూడ నిను
మృత్యువె యీడ్చుకపోవ తమ్ముడా" ?

అనుపద్య మెట్టి కఠినునైనను "పాపము!" అనిపించకమానదు.

ఆ. "తండ్రిలేడు, కలడు తమ్ముడొక్కడు నాకు
తల్లి లేదు సవతి తల్లిగాని;
ధైర్యమే ధనమ్ము, దైవమే శరణమ్ము
గాగ మనుచు నిట్లు కష్టపడుదు."

అని వినిపించిన బాలు డెట్టివారికైన సంతాపము గలిగించుననుటలో అతిశయోక్తి యుండదు. నిర్వేదగీతమున మొదటిపద్యము భగ్నహృదయుఁడైన కవియొక్క నిర్వేదము మూర్తి దాల్చినట్లు గోచరించును. మొత్తము మీద వేంకటరామయ్యగారి కవిత్వము నాటక కవిత్వమనవచ్చును. అతిశయోక్తి, భ్రాంతి మంతము, ఉత్ప్రేక్ష, ఆదిగాగల యలంకార ములు నాటక కవితలో నుండవు. నవకుసు మాంజలి యంతటిలోను కవియే పల్కుచు న్నట్లులేదు. నాటకకవిత యనుట కీ యంశ ముకూడ తోడగుచున్నది. "నవకుసుమాం జలి" అంతయు కవి యనుభవవర్ణనే. ఈయన స్వభావోక్తి మొత్తముమీద ఛాయాగ్రహణ మువంటి దనవచ్చును. వర్ణనలు రంగుతాల్పక కేవలము ఛాయాచిత్రమువలె వర్ణ్యవస్తువు రూపమునే కన్నులకు కట్టుచుండును. ఈయన వర్ణనలకైక్యత ఎక్కుడు. ఐక్యతలేని వర్ణన వస్తుస్వరూపమును కన్నులకు కట్టలేదు. ఉదా హరణముగాఁ ప్రభంజన విజయమును పరికిం తము. ప్రథమమున పండుగ సందడిలోనున్న కుటుంబికులను కవి వర్ణించెను. ముందు రా నున్న యాపదలను సూచించు విషయము లిందు తక్కువ. పై పెచ్చు ప్రభంజనమును మఱింత భీకర మొనర్చుటకు "ఆ చిత్త జల్లు లివి యుత్సవంబులకు నంకిలి సేయనేర్చునే" అను విరుద్ధ భాషణములను ప్రవేశపెట్టెను. పిమ్మట ప్రభంజనము వీచెను. గగనాంగణ మున స్వైరవిహార మొనర్చుమబ్బులు, తలల నూచు పెనుమ్రాకులు, దండడిగొట్టుకొను తలుపులు, గల్లలమని చలియించు పెంకుటిండ్ల తడకలును గాలియొక్క వేగమును సూచించు చుండ, కూలకనిలిచియున్న తాళవృక్షములు విరుద్ధ విషయము లయ్యును నెత్తిని దాల్చిన చిఱుమొవ్వులతో కర్వలిద్రిమ్మరిని యావేగ మును కొలుచుచున్నవి. ఇట్లే "స్త్రీ పునర్వి వాహ మహోత్సవమును" గాంచి విడ్డూరము పుట్టె ననువారికి ప్రథమ వితంతు వివాహ దర్శనమున బయలుదేరు వ్యతిరేకభావముల మధ్య..." అనాథలై, గోరములందుచున్న మన కూతుల దుస్థితిగూడనిట్టులే మాఱిన బాగుగా నె"యనువారి భావము ఐక్యతను పాగొట్టక, చీకటియొక్క పరిమాణమును చూపు చిన్ని దీపమువలెను, నిశ్శబ్దమును గోలిచెడికీచురాయి వలెను ఐక్యతకు మఱింత సాయము చేయు చున్నది.

ప్రకృతికి నపూర్వమోగకల్పనము నేత నవకుసుమాంజలిలో తక్కువ. పైరు గాలి సుఖమును జొన్న చేలు శిరము లూచి మెచ్చిన వట. గౌతమీ సైకతము భాటసారికి మెత్తగానుండెనట. వటదళీయు వెనుక నిసుకతిన్నె లట్లు పిశంగవర్ణవారిదము లుండెనట. మర్మ కవిత ముసుగేకాని మోముజూపని తురకబిబ్బీయట. తుచ్ఛంపు కృతిశతము టెంకతొక్కతక్క నింకేమిలేని బుడుతమ్మావిపండ్లట! ఇట్టులే అక్కడక్కడి నెఱసులుకాన్పించినను, అపూర్వయోగకల్పనము ఇందు తక్కువే. (?) ఈ కల్పనకన్న భావనచే చేయు సృష్టి మిన్న. అది నవకుసుమాంజలిలో నాకు కానరాలేదు.

ప్రస్తుత కవులు ప్రబంధకవులవలె యొకరి నొకరనుకరించక, స్వతంత్ర పథముల నన్వేషించుచున్నారు. వేంకట రామయ్యగారి కవనము ప్రస్తుత 'భావకవిత్వమునకును, పూర్వపు ప్రబంధకవిత్వమునకును కూడ భిన్నమై క్రొత్తత్రోవ త్రొక్కినది. ఈయన ఉపమలు అపూర్వములు. వస్తువుతో వస్తువునేగాక, పురాణగాథలలోని పాత్రములతో నీయన పోల్చిచూపుచుండును. కైత క్రొత్తసింగారమొప్ప శకుంతలవలె భరతవంశప్రతిష్ఠకై బయలువెడలినదట! ప్రాకృతులు, ప్రకృతిరహస్యశోధనకు బాల్పడి, ద్రౌపది చీరలల్వనేరక నిహతాశులైన ధృతరాష్ట్రతనూజులపోల్కి తలలు వ్రేలవైతురట! ఈయన మనస్సు దిలీపునిచే కాపాడబడిన నందినీధేనువువలె నేనియమం బెఱుంగక యథేచ్ఛముగా విహరించునట! ముసుమకరి కరి పోరాడిన చెఱువు పోలిక తన మనస్సు కలగుండు పడినదట. ఈ ఉపమానములు సాధారణోపమలవలె కేవలము ఉపమేయముయొక్క సౌందర్యమేకాక ఉపమాన సౌందర్యముకూడ గోచరింపజేయును. ఇవి ప్రస్తుత కవితలో లేవు. పూర్వకవిత్వములో నాకు కానరాలేదు. వేంకటరామయ్యగారి భావములన్నీ క్రొత్తవి. ఈయనకు పుట్టనుండి యొకటే దారిం బ్రవర్తిల్లు చీమలబారులవలె తలపులు పుట్టును. ఒక్కొక్కటిగ ఆకాశమున చుక్కలవలె పద్యములు పైకివచ్చును. ఒక్కొకసారి చీదరగొంటు మానసము పాదరసమువలె చెయిపట్టున కందక ప్రాకిపోవును. పూలను పూయక, మొగ్గల దొడుగిక, పసుల కాళ్ల త్రొక్కులబడు నేలతీగవలె నీయన కష్టముల పడుచుండును. వ్రాసిన కొలదిని నూత్నభావములే ఈయనకు తట్టుచుండును. ఈయన శైలి క్రొత్తది. మానవుడు, వానివాతావరణమేకాక, చందమామ నిత్యమల్లె మొదలైన ప్రకృతి విషయములను కవితాసామగ్రిగా గ్రహించుట, అతిశయోక్తి, భ్రాంతిమంతము మొదలగు పురాణాలంకారములను వదలికొముదిస్నిగ్ధమైన స్వభావోక్తిని, ఉపమను వాడుట, కాల్పతత్వము, నిర్వేదము అను మానసికాంశములనుగూర్చిన కైత లల్లుట, వర్ణనీయవస్తువును వర్ణించి వర్ణించి

"మేలుకొన్న సమాధిని గీలుకొన్న
బ్రహ్మవేత్తకు మాయాప్రపంచమట్లు",
"పోయె నద్వాంత మైపోయె పోయెనంద్రు
... మతులు పోవుటయెకాని"

అను వాక్యములతో పాఠకుని చింతా సముద్రమున బడవైచుట ఇవి యన్నియును క్రొత్తలే.

ఈయన మానసము సౌందర్యమునుండి సత్యము దెస తిరుగుచున్నది. సుందరోపమానములనుగాక, సాధారణములైన, "గుమ్మరి పుర్వుచందమున సంసారంబునం బ్రాజ్ఞుడొ,జను డంటించుకొనం డోకించుకయు తజ్జంబాలజాలంబు," "కైతలకు కళాకళల్గు వేళావేళాలుం గల్గు సంద్రమ్ముంబోం దెడు పాటు పోట్లకు బలె" "పోవుదురు తల్లిదండ్రులు భుక్తికొఱకు, ముక్తికయి శ్రద్ధయు వివేకమునుబలె." మొదలగువాటినివాడుటే ఇందుకు ప్రమాణము. ఇంకను బలవత్తర ప్రమాణ మీయనసందేశము. వేంకటరామయ్యగారు సందేశహరుడనుటకు, నిర్వేదగీతమున ఈయన పొందు హృదయభరము, కాలతత్వమునుగూర్చిన ఈయన చింత, జీవేశ్వర సంబంధమునుగూర్చి "నవకుసుమాంజలి"లో చేసిన సమాలోచనము సాక్షులు. ఈయన చింత, నిర్వేదము, అశాంతి, సందేశము నిచ్చుటతో సమాప్తమైపిమ్మట నీయన నిత్యసంతోషియౌను. ఈయన సందేశము వేదాంతసారమగు జీవేశ్వరైక్యతమై యుండవచ్చునని "మాయవస్తువు లివి మాసిపోవు నెపుడు, మాయకుండునదియె మదికి గూర్చు", యనువాక్యమునుబట్టి యూహింప వీలగుచున్నది.

పూర్వకవులలో పోతన మెట్లో, ఆధునికులలో నీయన అట్లు. శైలి ద్రాక్షాపాకము. ధార గంగాప్రవాహము. భావములాధ్యాత్మికములు. ఉపమానములలో పోతన కొన్నిచోట్ల జీవుని కలతను గొనివచ్చును.

" ఊహకలంగి జీవనపు
టోలమునం బడి పొక్కుచు న్మహా
మోహలతానిబద్ధపద
ముక్తి విడిపించికొనంగ లేక సం
దేహము బొందు దేహి క్రియ........."

ఈయన ఉపమానములుగూడ నాధ్యాత్మికములుగానున్నట్లు పైన చెప్పియున్నాను. ఘోరదారిద్ర్యమాతని పీడింప, కష్టపరంపర ఈయనను పీడించెను. ఈయన నవకుసుమాంజలిలోని 'అనామయము'లోని కందములు పోతన కందములను, అందును ఆశ్వాసమునకు ముందుండు కందములం బోలుచున్నవి. వృత్తమే ఇరువురికిని క్రీడారంగము. ప్రస్తుతము వేంకటరామయ్యగారు భారతిలో క్రొత్తపద్ధతి నవలంబించి వ్రాయుచున్నారు. ఈయనకు యోగిపదమును తెచ్చుట కవికూడ తోడ్పడుచున్నదని నా అభిప్రాయము. నవకుసుమాంజలి నిజముగ నవకుసుమాంజలియే. ఉమాకాన్తులు "నేటికాలపు కవిత్వములో కవితయే లే"దని వ్రాయుట డబాయింపని ఇందుమూలమున తెలియనగును. ఈయనమాట ఆయన మెత్తనేలేదు!

# మల్లికామారుతము*

వడ్డాది సుబ్బారాయుఁడు గా.

సాధుభుజంగగాయనులసంగతి శోభిలుచందనాద్రి వి
ద్యాధరసుందరీస్మితసుధాధవళంబు హిమాచలంబు, నం
భోధు లినుండు సారె కెట మున్గెడుఁ దేలెడు నవ్వి, మేర లా
నీధర, సర్వదృక్కవలయేందుఁడు మారుతమంత్రి భాసిలున్.

అలకల నంధ్రసుందరుల కౌ చెలగేదఁగిఱేకు, పాండ్య భా
మలమెడ రెట్టి సేయు చరుమౌక్తికభూషలు, కన్నడంపుఁగాం
తలకును వీనులం దగుచు దంతపుఁగమ్మలు, నీయశంబు మి
క్కిలి, ఘనసారపత్రికలు కేరళనారుల కొచ్చుఁ జెక్కులన్.

కొమ్మల దాఁగి నింగి పలుకుల్గ వచించియు, మత్తుగొల్పి ప
ల్గొమ్ముమెగమ్ము డీకొలిపి, గూళతనమ్ముల నీకు శత్రు వా
నమ్మునిముచ్చు శంబరకుఁ డాత్మకృత మ్మిడ దుష్ఫలమ్ము, దే
శమ్ముఁ ద్యజించి సిగ్గువడి జాల్ముఁడు వాఱెను నవ్వ నల్గురున్.

---

* నన నే నవ్యము నాంధ్రవాణి కిడఁ గాన్కన్, మల్లికామారుతం
బను నుద్దండకవీరితప్రకరణంబం దాది నాఅంకముల్
దెనుఁగుం జేసితి; నేఁడు దక్కినవి నాల్గింటిన్ రచింపం దొరం
కొనితిం; గా నది మూలదర్పణము, నాకున్ సాయ మౌ మీశ్వరా!

మును షడ్వింశతివత్సపూర్వము, యసంపూర్ణంబుగా మల్లికం
దెనుఁగుం జల్పి, సరస్వతిం బ్రకటితం జేయించితిం బత్రికన్;
వెను కే శేఁ దెలిఁగింత్రు శేష మనుకొంటిం గాని, పూరింప నిం
దనుకం బూనమి నేకవుల్, గడఁగితిం దద్ద్రశ్య సంపూర్తికిన్.

(కడపటి యంకములోని మొదటివి కొన్ని పద్యములు)

మందమరుచ్ఛిశుప్రసవమందిరగహ్వరచారిభోగినీ
బృందశిరోవిభూషణసమిద్ధమణీగణకాంతి చిత్రమై,
పెందయతో నగస్త్యముని ప్రేయసి తోయము వోయ వృద్ధి యౌ
చందనసంతతిన్, వలదెసన్ మలయాచలరాజ మొప్పెడున్.

కలవు మహేంద్రముఖ్యము లగంబులు గొప్పవియే జగంబునన్;
మలయమహీధరంబు మహిమంబున నన్నిటికన్న మిన్న యౌ;
గులగిరులం జయించుకుచకుంభములన్, గుణపక్షపాతినుల్
పొలఁతులు చందనంపుమిషఁ బూసరె తద్యశమున్ విశుద్ధమున్.

ఆమలయాచలంబున నొకప్పుడు కోయని గండుఁ గోయిలల్
మామిడి లేఁజివుళ్లు దిని మత్తిలి కూయుచు నుండ, మన్మథ
స్వామికిఁ బ్రాణమిత్రుఁ డనఁజాలినదక్షిణగంధవాహుఁ డ
య్యామనివేళ లీలను విహార మొనర్చెను మెల్లమెల్లగన్.

గిరితటంబులు స్వేచ్ఛమైఁ దిరుగుచటులు-మరకతద్యుతితనువొందెమాతరిశ్వుఁ;
డద్ది గనినంత వనదేవతాక్షియుగము-లయ్యె సవిలాసములు, సహర్షాశ్రువులును.

అంత ఫణిపతి వాసుకి మంత్రియగు-మణిధరుతనూజ మంజుల, మదనజయప
తాక వదనాబ్జగంధలుబ్ధభ్రమరక-యట సఖులుఁదాను వనిఁ గన్యయాడుచుండె.

జఘనమంథరగతి కుచశ్రాంతమధ్య-సఖులతోఁ గోసికొనుచు వాసంతు లింతి,
పింఛతాపింఛరుచిరు సవిధలతాని-కుంజ సంచరు దేవుఁ గన్గొనియెఁ బవను.

ఆకులకన్య మారవిశిఖావళిచేతను బీడ్యమానయై
స్తోకనిమీలితాక్షులను జూచుచు వానిఁ, గృశాంగి సంగసౌ
ఖ్యాకలనంబు ధ్యానమున నొటను దారిచి చూలు, తత్క్షణం
బాకె కుమారకుం గనియె నాకులలోన భయాకులాత్మయై.

పాలీయం దనయానురాగమున లోపాముద్ర చన్నేఁపి, యా
బాలుం డంత నగస్త్యమౌని వరక్లుప్తశ్రౌతసంస్కారుఁడై,
కాలానుక్రమతం బ్రవృద్ధి గనియెన్ గన్పిందుగా, ముద్దునన్
లాలింపన్ మునిభామినుల్ గొనుచుఁ గేలం గేల నప్పట్టునన్.

హస్తపల్లవపుటమున నబ్ధిశోష-నాది నాచాంతుఁడై విష్ణు, వతనిహృదయ
మంతకం బెను విస్తృత మనుచుఁ దలఁచి-యన్యరుచిమౌని తిరముగా నటనె నిలిచె.

ముగ్ధకరపల్లవములను ముందుకిడుచు-నళికమునఁ గుంతలము లళు లటు చలింప
మొలనుబదములఁ గింకిణుల్ మొరయఁ బుడుతఁ-డంకణంబున జానువులాన్ప్రాకు.

కలభకర్ణములను నులుపుచుఁ గొదమసిం-గములజూలు వేడుకను బెఱుకుచు
నాడు బుడుతఁ దిగుతు రవినయ! మృగబాధ-సేయకనుచు మునులు స్నేహగరిమ.

మారమతంగజంబునకు మైమఱపించెడు మత్తుమందు, శృం
గారపయోంబురాశి కధికంబుగఁ బొంగు ఘటించు చంద్రికా
పూరము, రాగపుంజివురుపుంజముఁ బెంచు వసంత, మంగనా
చారుకటాక్షసత్కృతము, జవ్వన మొందెను బాలుఁ డవ్వలన్.

కనె నొక్కర్తు నతండు స్వర్ణకదళీగర్భాంగకచ్ఛాయ, నూ
తన నైజోరువిలాసయుక్తి, స్మరభృత్యశ్రేణిఁ గల్పించుచున్,
ఘనలజ్జావిచలత్కనీనిక, కటాక్ష శ్రీ నిసత్కారభా
జనుఁ దన్ జల్పెడు కామనీయకనిధిన్ స్వప్నానఁ గన్యామణిన్.

అప్పు డతఁడు మందహాసాననుఁడు దన-చెంత కేగుదెంచు నింతిపైట
చేలచెఱఁగు లీలఁ గేలఁ బట్టెడునంతఁ-దరుణి నౌల కనిచి తలఁగె నిద్ర.

విగళితధైర్యుఁడై యతఁడు వెండియు హా! ప్రియురాల! నాకు నీ
వగపడుమం చజస్రమును నార్తవిలాపము లాచరించుచున్
దెగలయి నేను నే ననుచుఁ దీవ్రముగా మెయిఁ దాఁకు మన్మథా
శుగముల కెల్ల నొక్కరుఁడె సూటిగ నయ్యె శరవ్యుఁ డయ్యెడన్.

పూరువు

కొండమీదనుంచి కిందకు పడ్డట్లయినది. నిలబడతామంటే కాళ్లాడవు. మాట్లాడదామంటే నోరు వణుకుతుంది. మనస్సుకు యౌవనము పోలేదు కాని శరీరముకు ముదిమి వచ్చింది.

శర్మిష్ఠ

అయ్యో తండ్రీ, ఎంత పని చేశావురా!

పూరువు

కృష్ణారామా అనుకుంటూ కూర్చుండవలెను కాబోలు. ఎప్పటి కప్పుడు నాసంగతి నేను మరిచి పోతున్నాను. మొన్న నాన్న గారు వేటకు వెళ్లుతుంటే ద్రుహ్యుడూ అనువూ కూడా వెళ్లుతున్నారని తెలిసి నేను ఉత్సాహముకొద్దీ గుర్రము నెక్కబోయి పడ్డాను. అన్న లిద్దరూ నన్ను చూచి నవ్వారు.

శర్మిష్ఠ

నవ్వరు నాయనా, నీవు చేసిన పనికీ! తండ్రిగారికి కావలసి ఉంటే ఏ కోరిక లేనా చెల్లించలేకపోయినావా? పదికాలాలపాటు బతకదలచినవాడవు, ముక్కు పచ్చలారని వాడవు నీవయస్సు చేతులారా తండ్రివశము చేస్తావా?

పూరువు

తండ్రిగారి మాట ఎలాదాటేది అమ్మా.

శర్మిష్ఠ

తండ్రిగారి మాట అనుకొంటున్నావు. అది తండ్రిగారి మాట కాదు.

పూరువు

నన్ను తండ్రిగారు అడిగితే నే గదా నే ఇస్త.

శర్మిష్ఠ

నీ తండ్రిగారికి ముసలితనమైనా ఒక్కటే యౌవనమైనా ఒక్కటే. దానికోసం ఇదం తాను ఆ దేవయాని కోసం.

పూరువు

దొడ్డమ్మకు ఇందులో ఏమీ సంబంధం లేదు. ఇమ్మనిగాని వద్దనిగాని ఆవిడగా శేమీ నాతో అనలేదు.

శర్మిష్ఠ

ఆవి డెప్పుడూ అనదునాయనా! అనకుండానే అన్ని పనులూ చేయించుకుంటుంది. చేయకపోతే తండ్రితో చెప్పి శాపము పెట్టిస్తుంది. పోనీ నాయనా ఈ ముసలితనముతో నైనా బదికి ఉన్నావు చూచి సంతోషించడానికి. ఆవిడశాపంగానే తగిలినట్లయితే ఈ దుఃఖాలతో బాటు పుత్రశోకం కూడా అనుభవించవలసి వచ్చేది.

పూరువు

నేచేసినపనికి దేవయానిదొడ్డమ్మ చాలాసంతోషించి నాకు బహుమానా లంపింది.

శర్మిష్ఠ

నేరక జేసిన చిన్నతప్పుకు ఆజన్మమూ నేను దాస్యము చేస్తున్నాను గదా ఎటువంటిసుఖములు ఎరగనుగదా!

పూరువు

తండ్రిగారు. నిన్ను గౌరవిస్తూనే ఉన్నారుగదా ఇక దుఃఖముల మాట తలపెట్టడ మెందుకు?

శర్మిష్ఠ

నీ తండ్రిగారు నన్ను గౌరవించారనే గదా నాయనా, నీకు ఈ అవస్థ వచ్చింది. నాజన్మము అంతా దానికి నేను ధారపోశాను. నీ యౌవనమంతా నీవు నీతండ్రిద్వారా దానికి ధారపోశావు. ఇంకా ఎంతవరకూ ఆవిడ మనను పీడించుకు తింటుందో?

పూరువు

అమ్మా, ముదిమివల్ల అనుకోని దుఃఖాలు చాల వచ్చినవి. అందరూ తప్పులేనిదే నన్న సహ్యించుకొంటున్నారు. ఇంద్రియములు పట్టు తప్పినవి. ఇచ్ఛను తీర్చుకోలేని అశక్తికన్న పెద్దదుఃఖ మింకొకటి ఉన్నదా?

శర్మిష్ఠ

కాదురా నాయనా, నాకడుపున నీవు పుట్టకుండా ఉన్నా బాగుండేది. దానికడుపున పుట్టనైనా పుట్టావుకావు.

పూరువు

యౌవనపు ఇచ్ఛకు ఈ ముసలి దేహముబదులు చెప్పగలదా? కొండలు తిందామనే ఇచ్ఛేగాని పట్టెడు మెతుకులు లోపలికి పోవు. దేశాలు జయిద్దామని ఇచ్ఛ. దేహము కదలదు. దృష్టిశ్రవణములమాట చెప్పనే అక్కరలేదు. కాని ఒక్కసంతోషము మాత్రము నన్ను నిలబెట్టుతోంది.

శర్మిష్ఠ

సంతోషము కూడానా, నాయనా?

పూరువు

ఈ కష్టములన్నీ నాతండ్రిగా రనుభవించవలసినదే కదా. అవి నేను పుచ్చుకొని తండ్రిగారికి యౌవనసుఖము ఇచ్చాను గదా అని సంతోషము.

శర్మిష్ఠ

నీమాటకు నేనెందుకు అడ్డుచెప్పాలి? ఆస్వప్నసుఖమైనా నీకున్నందుకు నాకుమాత్రం సంతోషం గాదు నాయనా.

పూరువు

అమ్మా, ఈ అవస్థలో నేను లోగము ముఖము చూడలేను. ఏ అడవిలోనో ఒక కుటీరము నిర్మించుకొని భగవంతుని ధ్యానిస్తూ కాలక్షేపం చేస్తాను. యౌవన భానూదయం అయిన తరువాత మళ్లీ నీముఖం చూస్తాను. మనస్సును పగ్గములతో బిగించి ఈముసలి దేహముతో జతగూర్చి అందాకా జీవయాత్ర చేస్తాను.

శర్మిష్ఠ

నీతోకూడా ఉండి నీకు గంజో అంబలో కాచి పోద్దామన్నా ఈ దాస్యమువచ్చి పట్టుకొంది నాకు. పుట్టింది మహారాజు కడుపున; అనుభవాలు ఎంతటినికృష్టులకైనా రానివి.

పూరువు

అమ్మా, నీ దాస్య విమోచనమునకు మార్గము నాకు కనిపిస్తూ ఉంది.

శర్మిష్ఠ

ఏమిటి నాయనా, ఏమిటి.

పూరువు

నాకు యౌవన ప్రాప్తికూడా దానితో పాటే కలుగుతుంది.

శర్మిష్ఠ

ఎలాగ.

పూరువు

గాలముకు ఎర్రనుకట్టి పెద్ద చేపనుపట్టు తాడు గాలపు వేటకాడు. నా యౌవనమును బలిగా సమర్పించి నీకు దాస్యవిమోచనమూ, నాకు సర్వాభీష్టములూ సంపాదిస్తున్నాను.

శర్మిష్ఠ

ఎందుచేత ఆలాగనుకొంటున్నావు?

పూరువు

ఎంతటి కార్యమైనా బలిచేత నిర్వహించుకో వచ్చుగదా. ధనమూ, ప్రాణమూ, తపస్సూ బలిగాపెట్టి ఆత్మసౌఖ్యమూ, దేశసౌఖ్యమూ, ముక్తీ సంపదించు కొంటున్నారు లోకులు.

శర్మిష్ఠ

నాదాస్య విమోచనానికి నీవు నీయౌవనాన్ని బలిగా ఇచ్చావా? నీసౌఖ్యానికి నేనెన్ని దాస్యాలైన చేస్తానుగదా!

పూరువు

నాపుట్టుకకే శీలాన్ని బలిగాఇచ్చావుగదానీవు.

శర్మిష్ఠ

ఏమినాయనా, నీవే ఆలాగంటున్నావు?

పూరువు

ధర్మబద్ధమైన వివాహఫలముగా నేను జన్మించి ఉన్నట్లయితే ఈమాట నేనెందుకంటాను?

శర్మిష్ఠ

హృదయములు కలిసిన గాంధర్వము మావివాహము.

పూరువు

లోకదృష్టికి మావివాహములో ధర్మము కనిపించదేమో?

శర్మిష్ఠ

మావివాహానికి ఫలముగా మాకు ధర్మమే పుత్రరూపముగా ఉదయించింది. ఇంక మావివాహము ధర్మబద్ధముకాక ఏమవుతుంది?

పూరువు

మీకు ఉదయించిన ఆధర్మమెవ్వరు.

శర్మిష్ఠ

నీవే!

పూరువు

ఎట్లు?

శర్మిష్ఠ

ధర్మముకోసమే నీయౌవనము నీతండ్రికి నీవు ధారపోశావు.

ధర్మరూపుడైన నాభర్తముదిమి నీలో ప్రవేశించినది.

అందువల్ల నీలో నాకు నాభర్త కనిపిస్తున్నాడు. నీలో నాకొడుకుకూడా కనిపిస్తున్నాడు.

పూరువు

అమ్మా, ఈమాటలు నేను వినలేను. వెళ్లుతున్నాను.

శర్మిష్ఠ

నేను చెయ్యిపట్టుకు తీసికొని వెళ్లనా.

పూరువు

వద్దు. నాతండ్రిగారు వస్తూఉన్నట్లు చప్పుడైంది. నే వెళ్లగలనులే.

శర్మిష్ఠ

జాగ్రత్త నాయనా, కఱ్ఱగట్టిగా పట్టుకో తూలిపోయేవు! దారి సరిగా చూచుకొంటూ వెళ్లు, రాళ్లూ రప్పలూ తోవలో ఉండేని. బళ్లూ రథాలూ వస్తూఉంటవి బాటపక్కనుంచి నడు.

పూరువు

జాగ్రత్తగానే వెడతానులే, అమ్మా.

[వెళ్లిపోవును. యయాతి ప్రవేశించును.]

శర్మిష్ఠ

(తలవంచి నిలబడును. మాటాడదు.)

యయాతి

నమస్కృతులతో స్వాగతము చెప్పవేమి నాకు శీలవతీ.

శర్మిష్ఠ

(మాటాడదు)

యయాతి

అన్యులతప్పుకు నేనా శిక్షాపాత్రుడను కోమలీ.

శర్మిష్ఠ

(మాటాడదు.)

యయాతి

అనుభూత సౌఖ్యములు స్మృతిపథమునకు రాగా కష్టములు రాగలవనే భయముకూడా లేకుండా నామనస్సు నన్ను నీదగ్గిరికి లాగుకు వచ్చింది. మనోహారిణీ,

శర్మిష్ఠ

(మాటాడదు.)

యయాతి

ఒక్కమాటకు కూడా నోచుకోలేదా నేను, ప్రాణసఖీ.

శర్మిష్ఠ

నా బ్రదుకంతా తప్పులతో అల్లుకుపోయినది. నేను ఏపని చేసినా నాకో నావారికో కష్టములు రాకతప్పదు. అందుకని నేను నీతో ఏమి మాట్లాడేదీ?

యయాతి

కుశల ప్రశ్నలకు కూడా తగనా?

శర్మిష్ఠ

నీకు నేను ఏవిధముగా నమస్కారము చేయగలను. చేయడముకు నాచేతులాడవు. నాతప్పువల్ల నాకు ఆజన్మదాస్యము వచ్చింది. నాతప్పువల్ల నీకు ముదిమీ తరువాత నాచిన్నకొడుకుకు ముదిమీ వచ్చింది. నాకొడుకుల శ్రేయస్సు కోసము నేను మౌనము ధరించ పూనుకొన్నాను.

యయాతి

నాకోసము ఈ ఒక్కమారూ వ్రతభంగము చెయ్యి.

శర్మిష్ఠ

లాభము ?

యయాతి

నా హృదయదాహము తీరుతుంది.

శర్మిష్ఠ

మొదటినుండి తుదివరకూ ఆత్మపరాయణత్వమేనా ?

యయాతి

ఆ ఆత్మలో నీవుకూడా ఇమిడిఉన్నావు గదా!

శర్మిష్ఠ

మీ రనుకొన్నట్లు కాను.

యయాతి

ఎందువల్ల నీలో ఇంత మార్పు వచ్చింది.

శర్మిష్ఠ

నీకు ప్రబోధము కలుగడముకు నేను మౌనవ్రతము త్యజిస్తున్నాను. ఇక మార్పుకు కారణములు చెప్పనా ?

యయాతి

హృదయదాహము అతిశయింప చేస్తున్నావా.

శర్మిష్ఠ

ఆత్మ, ఆత్మ, ఆత్మలాభముతప్ప ఇంక ఏమీ లేదా నీకు.

యయాతి

అపచారములు చేసిఉన్నట్లయితే క్షంతవ్యములైతే క్షమించు.

శర్మిష్ఠ

ఇప్పుడే నీవు ధర్మరూపుడ వని మన అబ్బాయితో చెప్పాను.

యయాతి

నిజంగా, అయితే ఇది ప్రణయకలహమా?

శర్మిష్ఠ

ఎప్పుడైతే నీముదిమి అబ్బాయికి బదలీచేసి అతని యౌవనము నీవు గ్రహించావో అప్పుడే అతని ధర్మము పెంపొందింది.

యయాతి

నాది క్షీణించినదనా ?

శర్మిష్ఠ

చెప్పడమెందుకు?

యయాతి

ధర్మలోపముకలిగినా పతివ్రతలు భర్తలను దూషించవచ్చునా!

శర్మిష్ఠ

నీవు దేవయానికి భర్త వేమో? నాకు ఇప్పుడు కావని నానమ్మకము.

యయాతి

శుక్రాచార్యశాపము నిన్ను ఆలాగ అనిపిస్తూ ఉంది.

శర్మిష్ఠ

ఆశాపముమాట జ్ఞాపకమే ఉంటే నాదగ్గిరికి ఎందుకు వచ్చావు నీవు? ఒకమారు శిక్ష అనుభవించినవాడు రెండవమారు ఆకార్యమే తలపెట్టినప్పుడు శిక్షణకు వెరవవద్దా ?

యయాతి

నీపై ప్రేమ బలాతిబలమై నన్ను లాగుకువచ్చిందని ఇదివరకే చెప్పాను గదా!

శర్మిష్ఠ

శాపభయము న న్నామాట అనిపించలేదు.

యయాతి

మరి?

శర్మిష్ఠ

దేవయాని భర్త నాకు ఒకప్పుడు భర్త అయి నందుకే నేను వస్తున్నాను.

యయాతి

దేవయానీశర్మిష్ఠలు నన్ను కోరి భర్తగా చేసి కొన్నవారే!

శర్మిష్ఠ

దేవయాని అంతకుముందు తనహృదయమును ఒకనికి అమ్మివేసింది.

యయాతి

కచతిరస్కృత అని దెప్పుతున్నావా ?

శర్మిష్ఠ

ఒకరికి అమ్మిన హృదయమును మళ్లీ నీ కెట్లు ధారపోయగలదో ఆలోచించు కొన్నావా?

యయాతి

ధారపోసిందిగాదా మరి ?

శర్మిష్ఠ

కచుడే నేడు ఆమెకు చిక్కితే ధారపొయ్యడం నీకు బోధపడును.

యయాతి

మా ప్రేమజీవితములో కచునకు చోటు లేకుండా చేసుకొన్నాము.

శర్మిష్ఠ

నీవిషయములో ఆమాట నిజమేమో. దేవయాని విషయములో నీవు నిర్ధారణగా ఎట్లు చెప్తావు?

యయాతి

ఆమె కచుణ్ణి నాలో చూచుకొంటూ ఉంది అనుకో.

శర్మిష్ఠ

నీతో వ్యభిచార మన్న మాట.

యయాతి

ఎంతటి మోటుమాటలు!

శర్మిష్ఠ

నీ చేతలో?

యయాతి

నా చేతల కేమి?

శర్మిష్ఠ

ఎందుకోసము నాదగ్గిరికి వచ్చావు?

యయాతి

చెప్పానుగాదా!

శర్మిష్ఠ

నాతో సరసాలాడుటకు వచ్చిన నీవు నాకేమి కావాలి?

యయాతి

భర్తను.

శర్మిష్ఠ

నాకొడుకు యౌవనము కొల్లగొట్టి ఆయౌవనముతో నాకు సౌఖ్యమియ్యడానికి వచ్చిన నీవు నా భర్తవా? దేవయానికి భర్తవేమో!

కచుని మోహించింది. నిన్ను చేబట్టింది. నీ ద్వారా నాకొడుకు యౌవనాన్ని.........

యయాతి

నీతి విరహితమైన మాటలు నీనోట రావచ్చునా?

శర్మిష్ఠ

నీతివిరహితమైన చేష్టలు నీతికి గురువైన శుక్రుని కూతురులో నీకు కనిపించవు కాబోలు.

యయాతి

శర్మిష్ఠా, నీఊహకు అందని ఉత్కృష్టమైన నీతి ఉండవచ్చునని నీ వెందు కనుకోవు. వ్యక్తుల నీతులు సంఘమును కట్టివేయగలవా?

శర్మిష్ఠ

వ్యక్తినీతి సంఘనీతిని మించి ఉండవచ్చును. అప్పుడు వ్యక్తినీతి సంఘనీతిగా మారిపోతుంది.

యయాతి

మాకేవరకూ సంఘనీతి మనకు అనుసరణీయము. పోనిగాని కోపము కట్టిపెట్టు. దేవయాని మాట మన కెందుకు? ఆనాడు నీవు నాకోసమని అనిమిషత్వము పూని కాచుకొని ఉన్న దినములు జ్ఞప్తికి తెచ్చుకో, ఆ ప్రేమలో ఆవేశమూ, ఆ ఆశలో ఆత్రతా, ఆనిరీక్షణలో సౌకుమార్యమూ, ఆనీప్రేమనవనీతములో తారళ్యమూ జ్ఞప్తికి తెచ్చుకో.

శర్మిష్ఠ

అది గతకాలము. అది గతసౌఖ్యము.

యయాతి

నామీద పూర్వమువలె ప్రేమవర్షము వర్షించవా ఒక్కమారు?

శర్మిష్ఠ

కూడదు.

యయాతి

నేను నీ భర్తను కానా?

శర్మిష్ఠ

కావు

యయాతి

ఎవరు నీభర్త!

శర్మిష్ఠ

యయాతిమహారాజు

యయాతి

నేను యయాతిని కానా?

శర్మిష్ఠ

నీ దేహము యయాతిది. నీమనస్సు యయాతిది. ప్రేమకు నీమనస్సును పురిగొల్పే యౌవనము నాకొడుకుది.

యయాతి

అయితే.

శర్మిష్ఠ

తెలియదా? నీలో నాకొడుకును నేను చూచుకొంటున్నాను.

యయాతి

ఎంత చెడ్డమాట!

శర్మిష్ఠ

నాకొడుకు యౌవనము కొల్లగొట్టినప్పుడు ఈఊహ నీకు తోచలేదు కాబోలు!

యయాతి

నీవల్ల నేగదా నాకు శాపము తగిలి ముదిమి వచ్చింది. నేను నాప్రతిబింబమైన నాకొడుకు యౌవనాన్ని ఎందుకు సంపాదించాను ?

శర్మిష్ఠ

దేవయానికోసము. నావల్ల నీకు ముదిమి వస్తే నాయౌవనమే నీవు తీసుకోలేకపోయావా ? యౌవనముకు లింగభేద మున్నదా ?

యయాతి

నీయౌవనము నేను గ్రహిస్తే అప్పుడు నాయౌవనము ఎవరియందు ఫలోన్ముఖము కాగలదు?

శర్మిష్ఠ

ఇప్పుడో?

యయాతి

నీవు కువ్యాఖ్యానములు కట్టిపెట్టితే.

శర్మిష్ఠ

నాకొడుకు యౌవనాన్ని అనుభవించేటంత దుర్నీతికి నేను ఒడబడలేను.

యయాతి

అయితే వెడతాను శర్మిష్ఠా!

శర్మిష్ఠ

పూరువుమీద దయలేదా!

యయాతి

భర్తను తృణీకరించిన శర్మిష్ఠ కొడుకుమీద నాకు దయా?

శర్మిష్ఠ

తనబ్రతుకు చిచ్చుపెట్టుకొని తనతండ్రికి తన అమూల్య ధనము ఇచ్చివేసిన కొడుకుమీద నీకు దయ ఉండరాదా ?

యయాతి

యయాతి కృతఘ్నుడుకాడు.

దేవయాని

(వెనుకనుండి గట్టిగా నవ్వును.)

---

జనమంచి వెంకటరామయ్య గారు

## శ్రీకృష్ణాష్టమీవిశేషము

ఏమి యిచ్చితివయ్య నా కిపు, డేమి కొంటివి నాకడన్
స్వామి, నీ తగిలించుకొన్నది వట్టి దండుగబేరమే!
పామరున్ ననువిల్చికొంటివి వ్యర్థునిం జపలాత్మునిన్
బ్రేమమీఱఁగ నమ్ముకొంటివి నిన్నుఁ జింతామణి నహో!

గ్రుడ్డిగవ్వకు వచ్చె హెచ్చగు కోటికోట్లమహాధనం
బడ్డమే మిఁక వైభవంబున నద్వితీయుఁడ నైతిఁగా!
బెడ్డముక్కయు నీదు సత్కృపపేరి స్పర్శమణిం బ్రభూ,
దొడ్డబంగరు కొండయౌఁ, దనుఁ దొట్టి సూర్యుఁడె చుట్టిరాన్.

గాలిబొంగరమట్లు పాఱితి గాలి యే కడవీచినన్
మేలు కీ డనుకోక యాకడ మిట్టిపాటు ఘటిల్లఁగన్;
వ్రీలె సత్త్వ తూలె మైవడి వెచ్చనూర్పులు వెడలు, నీ
పాలఁ జేరితిఁ దల్లియొడిఁజను గ్రోలి కూరుకుబిడ్డనై.

పాడుచీఁకటి పేదకొంపకు వచ్చినాఁడవు సామి, నీ
కూడ నొక్కటఁ దెచ్చినాఁడవు కోటిసూర్యులవెల్గు; నీ
నీడయేఁ గనరాదు దానను నీవువచ్చిన జాడయేన్!
ప్రోడవై కికురించినాఁడవు! ముంచినాఁడవు కొంపయే.

మూఁగనై పడియుంటి నే నేమూలనో చలిముద్దనై
రాగమెల్ల నశించి యెడఁద విరాగమొంది కృశింపఁగా;
మత్తకోకిల మట్లు నేఁ డిదె క్రొత్తపాటలఁ బాడెదం
జిత్తగింపుము చేర్చి నీ శ్రుతిఁ జిన్నికృష్ణ, ముదంబునన్.

---

# మూఁడు తమాషాలు

వేలూరి శివరామశాస్త్రిగారు

శ్రీ తిమ్మజగపతిరాజుగారు రాజ్యమునకు వచ్చినతోడనే కందా కందా నిండిపోయెను. గబ్బిలములు మ్మాత్రమే నివసించు శాల లన్నియు దివ్యభవనములుగా మాఱెను. చుట్టములు, చుట్టముల చుట్టములు, వారి చుట్టములు, మిత్రులు, మిత్రుల మిత్రులు, వారి మిత్రులు, మిత్రుల చుట్టములు, వారి చుట్టములు, వారీ వీరీ మిత్రులు, నవుకరులు, వారి బందుగులు, వారి మిత్రులు, ఆ మిత్రుల బందుగులు. ఇటులు మితీ మేరా లేని జనము దివాణములో శేవిణీ. వీరిలో నూటికి తొంబది తొమ్మిది మంది రాజుగారి పేరు ఎఱుఁగరనినచో వారి ముఖముకూడ ఎఱుఁగ రని చెప్పవలసిన పని లేదు.

వీరి కందఱకు ఇండ్లు వాకిళ్లు, పెండ్లిండ్లు పేరంటములు పురుళ్లు, గిరుళ్లు, సమస్తమూ దివాణమే భరించుట. ప్రతి-అణువు ప్రతిపరమాణువు తిమ్మజగపతిరాజుగారు తిమ్మ జగపతిరాజుగారు అని కీర్తించుచున్నది.

తిమ్మజగపతిరాజు ఒకనాఁడు సభాభవనమున కూర్చుండెను. సేవకుఁడు దూరమున.

అతని మనస్సున మూఁడు విషయములు మూఁడుకోట్ల విషయములై ముప్పతిప్పలు పెట్టుచుండెను. ఒకటి—దివాణమున మితి లేని దాసికలు, రెండు—సేవకులు, మూఁడు సంగీత సభ్యులు. ఈ మూఁడును మూఁడే, అందు ఈ మూఁడవ విషయము మూర్ఖాకరము. సంగీతసభ్యులలో ఎక్కువమంది సువారపు దొరలు. ముత్తాతలు తాతలు తండ్రులు వరుసగా వచ్చుచున్నవియు, ఇష్టదేవతలవలె అర్చింపఁబడునవియు, వేలకు వేల చిల్లులను దుర్గుణములవలె లోన దాఁచుకొనునవియు, మడతలు విప్పఁబో మానము దక్కని వస్త్రములను ధరించి, పాపము వంశప్రతిష్ఠను జాత్యాభిజాత్యమును రక్షించుటయే తమ యునికికి ప్రయోజన మనిపించు ఈ సభ్యులను చూచినపు డెల్ల తిమ్మ జగపతిరాజుగారికి చంద్రునిలో కళంకము గుఱుతు దవులును. వారి పొగడితలు వినినపుడు అతనికి కర్ణశూల. మొన్న జరిగిన సంగీతసభలో వారి మెచ్చికోలును, అభిజ్ఞతాసూచకమగు బళిబళీయను అఱపులును, వీని అన్నిటికంటె మిక్కుటముగా తల ఆడించుటయు రాజుగారి మనోజ్వరమునకు నిదానము. తిమ్మజగపతిరాజుగారు వీని నన్నిటిని తలఁచి తలఁచి చింతానిమగ్నులై యుండి ద్వారమున పదశబ్దము వినెను.

షరాబు కుటుంబ వ్యయపు చిత్తా తెచ్చి తిమ్మజగపతిరాజుగారి కిచ్చి నిలువఁబడెను. నౌకరు గంటమును ఒరనుండి పైకి తీయుచుండెను. రాజుగారు చిత్తా తేరిపాఱఁ జూచిరి.

ఆదాయపు మొత్త మంతయు కేవల కుటుంబ పోషణమునకే సరిపోయెను.

కుటుంబమున కేవలము తాను తన భార్యయు. ఈ యిరువురకు రాజ్యమున వచ్చు ధన మంతయు ఖర్చు!

రాజుగారు తెలతెలఁబోవుచు షరాబు కేసి చూచిచూచి ఆకాశముకేసి మొగము ఎత్తిరి. నౌకరు గంటమును చేతి కిచ్చెను.



నవుక రిచ్చిన గంటము ఇచ్చినరీతిగనే రాజుగారి చేతిలో ఉండెను.

షరాబు అనెను—దేవర వారు ఆలకించునెడల మనోవినోదమునకు ఒక కథ చెప్పెదను. రాజుగారు 'మంచిది' అనిరి. షరాబు చెప్పఁ దొడఁగెను—తొల్లి తంజావూరు మహారాజులుంగారు సోమరిపోతులకు ఒక సత్రము వేసిరి.

రాజుగారు నడుమ అడ్డమువచ్చి 'అటువంటిది ఉండునా? అని అడిగిరి.

షరాబు ధైర్యముతో నవ్వి—అయ్యా! అటులు అనకుఁడు. మన దేశమున నక్కఊళలను విని చలిచేఁగాఁబోలు ఏడ్చుచున్నదని దుప్పటుల తానులుతానులు చింపించి అరణ్యమంతయు పఱపించిన పుణ్యపురుషు లున్నారు. పామునోట కప్ప అడ్డుపడఁగా దానిని తొలఁగించిన బ్రాహ్మణులకు అగ్రహారము లిచ్చిన ధర్మదాత లున్నారు. గారెల మాన్యములు, బూరెల మాన్యములు అరిసెల మాన్యములు అనేకములిచ్చిన శక్తిగ్రహణపారీణు లున్నారు.

రాజుగారు అడ్డమువచ్చి 'సరే' అనిరి. షరాబు మరల ఇటులు కథను అందుకొనెను. —తంజావూరు మహారాజులుంగారు సత్రము వేసిన మఱుదినము లగాయతు దేశమంతట సోమరిపోతులు తయారయిరి. సత్రమునకు ఇండ్లు చాలలేదు. పాకలు వేసిరి. పాకలకు నగరము చాలలేదు. స్థలములు ఉన్నంతవరకు పాకలు, పందిళ్లు పాఁకిపోయినవి. రోజురోజూ పాకలుపందిళ్లు వేయుచునే యుండిరి. వచ్చుచున్న సంసారములు వచ్చుచున్నవి; పడు పాకలు పడుచున్నవి. అందులనే వడుగులు, పెండ్లిండ్లు, శోభనములు, సీమంతములు, పురుళ్లు, పుణ్యములు జరుగుచున్నవి.

రాజుగారి పెదవులపై కనీకనఁబడకుండ ఒక చిఱునవ్వు మెఱసెను. షరాబు కనిపట్టి యిటులు ఉపక్రమించెను.—

రాష్ట్రముమీఁద వచ్చు ఆదాయ మంతయు ఆసత్రము ఒకనెలరోజులలో తినివేసెను. సత్రమున పదార్థములు అరుదాయెను. వంట లగునటులు కానిపింపలేదు. అపుడు మంత్రివచ్చి మహారాజులుంగారితో — అయ్యా! ధనము నిండుకొన్నది. సత్రము ఆఁపుదలచేయ ఆజ్ఞ యీయవలయును' అని మనవి చేసికోఁగా మహారాజులుంగారు విని—అప్రతిష్ఠ అప్రతిష్ఠ! తంజావూరు మహారాజు పొట్టకు పట్టెఁడన్నము పెట్టలేకపోవుటా? ధనము తీసికొని రండు, ధనము తీసికొని రండు! ఎక్కడనుండి యైనను సరియ—తీసికొని రండు; నేల త్రవ్వి తీసికొని రండు! అని సెల విచ్చెను.

ఈ మాటలు విని మంత్రి—అయ్యా! తమ బోటివారివలననే భూమికి రత్నగర్భ అని పేరు వచ్చినది. తమవంటి అమాయికుల వలననే నైష్కర్మ్యసిద్ధి అయత్నముగా లోకులకు సిద్ధించినది కాని దేవరవారు ఆలకింపవలయును. సత్రమునందు ఉన్నవా రందఱును సోమరిపోతులు కాదు. నేనొక పరీక్ష చేసి అసలు సోమరిపోతులను తమకు చూపి వారికి మాత్రమే సత్రమునందు ఏర్పాటుచేసి మన ప్రతిష్ఠ కాపాడెదను. అందులకు తమ అనుజ్ఞ ఈవలెను అని వేడుకొనెను.

మహారాజులుంగారు మాట వినిపించుకొనినటులు కానరాలేదు. మంత్రి మరల ఇటు లనెను.—

దేవరవారు సోమరిపోతులకు ప్రభువులు, తమ చిత్తానుసారము నేల త్రవ్వించుటకు మాత్రము ధనమేది?

మహారాజులుంగారి చెవికి బాగుగా నాటెను.—మంత్రీ! మంచిది! పరీక్ష చేయుము.

మంత్రి మహారాజును వెంటఁ బెట్టుకొని పోయెను. పాకలు పందిళ్లు ఇండ్లు అన్నియు తిప్పెను. ఓ! తిరునాళ్లు! బ్రహ్మసత్రము! ఏడ్చువారు, పొరలాడువారు. అన్నమునకు రమ్మని పిలుచుచో—ఆ తొందర ఏమి? ఉండవయ్యా అనువారు. ఈ రీతిగా పలురకముల వారు.

మంత్రి గాడిప్రోయినుండి కొఱవి ఒకటి తీసి పాకలకు అంటించెను. అగ్నిహోత్రుని ప్రతాపము ప్రారంభించెను. అగ్నిలో ఎన్ని రవ్వలు ఎన్ని కెంపులు ఉన్నవో! వాని క్రక్క మొదలు పెట్టెను.

ఎక్కడివా రక్కడ లేచిపోఁ దొడఁగిరి. ఒకచోట మాత్రము మూవురు పడుకొని యుండిరి. మంత్రి దాపునకు వెళ్లి—మహారాజులుంగారు దయచేసినా రని బిగ్గఱగా అఱవఁగా ఒక్కఁడును కనులు తెఱచి చూడలేదు.

మంత్రి మరల—పాక లన్నియు కాలిపోవుచున్నవి లెండు లెండు అనెను.

అందొకఁడు—నడికొప్పు అంటుకొని అని అనెను.

కొంత సేపటికి నడికొప్పు కాలి తాటాకు మీఁదఁ బడఁగా వాఁడు మెల్లగా లేచి గజ గమనముతో వెళ్లెను.

మంత్రి రెండవవాని కడకువెళ్లి—నడి కొప్పులు కాలి ఇండ్లు తగులఁబడి పోవుచున్న వని అఱచెను.

వాఁడు—బట్ట కాలనీ! అనెను. బట్ట కాలుచుండఁగా వాఁడు లేచి దులుపుకొ౦న కుడనే మెల్లగా రెండడుగులు వైచెను.

మంత్రి మూఁడవవాని కడకుపోయి—ఓరీ! మంటలో మాఁడిపోవుచున్నావు అనెను.

వాఁడు కొంతవడికి కనులు తెఱవకయే కుడి డొక్క అంటుకోనీ! అనెను. అనుపదమే కుడి డొక్క అంటుకొనెను.—ఇదిగో కుడి డొక్క కాలుచున్నది లే అని మంత్రి చెప్పెను.—ఎడమడొక్క కాలనీ! అని అతఁ డనెను. ఎడమడొక్క కాలుచుండఁగా నలుగురు పట్టి వానిని వాకిటికి ఈడ్చిరి.

అపుడు మంత్రి—వీరు మూవురుమాత్రమే తమ సత్రమునకు అర్హులు అని మహారాజులుం గారిని ఒప్పించి మిగిలినవారిని వెళ్లఁగొట్టి సత్రమును నిలిపి రాజుగారి ప్రతిష్ఠను కాపాడెను.

అని చెప్పి షరాబు కథ ముగించెను.

తిమ్మజగపతిరాజుగారి ముఖము విశాలమాయెను. అతఁడు షరాబును ప్రేమపూర్వ



తిమ్మజగపతిరాజుగారి ముఖము విశాలమాయెను

కముగా చూచి తాటాకుమీఁద గంటముచే వ్రాలుపెట్టి అతనిని పంపివేసెను.

౨

చైత్రనవరాత్రములు. దివాణమునందు నిత్యకల్యాణము పచ్చతోరణము. దాసికలకు, సేవకులకు, వారికి సంబంధించినవారికి, వారి తోకలకు, అందఱకు దివాణముననే విందు.

రొట్టలు వేసికొనుచు దాసికలు విందు గుడుచుచుండిరి. విస్తళ్లలో భక్ష్యములరాసులు; నోటినిండా హాస్యప్రసంగములు; వలయును వలదు అనుకేకలు; వడ్డనవారి సరసములు; వింతలు వినోదములు.........

ఆసమయమున హఠాత్తుగా తిమ్మజగపతిరాజుగారు అచటికి వచ్చిరి. కొందఱు దా

సికలు లేచి నిలువఁబడఁగా మోకాలిపైకి తీసికొనిన వస్త్రములతోపాటు చాటుగా దాఁచికొన్న భక్ష్యములు నేలకు జారెను. దాచికొన్న భక్ష్యములతో కొందఱు గర్భిణులనను కరించిరి. కొందఱు లేవక కూర్చుండియే యుండిరి. వారికెవరును వీరే మహారాజు లని ఎఱుక చేయలేదు.

రాజుగా రిటు లనిరి—మీ రందఱును ఇచట నున్న సేవకులనుగాని, మరి మీయిష్టుల నుగాని పెండ్లాడవలయును. అటులుచేసి కొనకేని దేవిడీమన్నా.

ఒకరిమొగము లొకరు చూచుకొనిరి గాని ఎవరును బదులాడలేదు. రాజు నిష్క్రమించెను. గుసగుస లారంభమయి సంతగోల లోనికి డేకెను.

వృద్ధదాసి రాణికి విన్నపము చేయుదు నని బయలుదేరెను. దానికుడిచేయి ఒకతె యు, ఎడమచేయి మరియొకతెయు పట్టుకొనిరి. మిగిలినవా రందఱు వెంట నడిచిరి. దాని కుడి కాలు సొట్ట. పేరుమాత్రము హంసీయాన. రాణీవాసమున ప్రవేశింప దాని కొకరియనుమ తితో పనిలేదు.

అది ముందర రాణియెదుట పలవించెను రాణి ఓదార్చి—ఏమి ఆపద? అని అడిగెను. హంసీయాన—అమ్మా! ఆపదయనఁగా ఆపదా. పెండ్లికొమారులు పెండ్లిండ్లు చేసికొననిది మమ్ములను దివాణమున ఉంపరఁట. ఎంత



అమంగళము! సంసారులకు ముండమోయుట ఎంత ఆపదో మాకు పెండ్లాడుట అంత ఆపద. పోనిండు! అమ్మా! దేవరవారి సెలవుచొప్పున మే మందఱము పెండ్లి అయినవారమే. ఎటు లందురా మేము దేవదాసీలము. మాకందఱకు దేవునితో వివాహమైనది. కాదందురా మహారాజులే మాకు భర్త. తాము దేవరవారితో మా ఆడుకూయి వినిపింపవలయును. అనెను.

ఈ విన్నపములో మహారాజులే మాకు భర్త అన్నమాట రాణిచెవిలో రయిమని మ్రోఁగెను. ఆమె కొంచె మాలోచించి లోనికివెళ్లి—ఈ సంగతి మహారాజుగారికే విన్నవించుకొమ్ము అని కబురు చేసెను. హంసీయాన లబలబలాడుచు మహారాజ దర్శనమునకు పోయెను. అతఁడు—పెండ్లియాడని దాసిమోము చూడనని తెలిపెను.

దాసిక లొక్కరొక్కరే తఱలిరి. లోఁగడనే పెండ్లియైయున్న వారు కొందఱును, అపుడు పెండ్లియాడిన మఱికొందఱును వేళ్ళమీఁద లెక్కపెట్టఁదగినటు లుండిరి. మహారాజు మనస్సులో ఒకశల్యము ఊడినటు లాయెను.

3

నాఁడు పంచమి. మంత్రిఆజ్ఞచే పలువురుసైనికులు ఒడ్డెసైనికుల వేషము తాల్చిరి. నాలుగైదు ఓఢ్రపుమాటలు వల్లించిరి. నాటి రాత్రి నగరము ముట్టడించునటులు అభినయింపుఁడని వారికి మంత్రి ఆదేశించెను.

రాత్రి దివాణమునందు పూజలు జరుగుచున్నవి. నౌకరులందఱు రాజాజ్ఞచే రావింపబడిరి. అందఱును మహాకాళికి మ్రొక్కిరిల్లి పిదప రాజునకు నమస్కరించి బారులు తీరి నిలువఁబడిరి. వారిలో నూటికి తొంబదితొమ్మిదిమంది అపుడే తమరాజును చూచిరి.

దేవపూజకుఁడు సహస్రనామార్చనము చేసెను. అవధారులు అయినవి. పండితుల పూర్వపక్షోత్తరపక్షకోలాహలము ముగిసెను. మంత్రపుష్ప మాయెను. నివేదన జరిగెను.

నౌకరులు బహుభక్తితో దేవిని చూచుచుండిరి. దాని కెక్కువగా ప్రసాదముమీఁద వారి కెక్కువ భక్తి కలిగెను. కనుల కద్దుకొనువారొకరు, మూతి కద్దుకొనువారొకరు, దాఁచికొనువారొకరు, తినఁజూచువారొకరు. రాజుగారెదుట నుండుటవలన వారి మర్కటచాపలము గంతులవఱకు పోలేదు.

ఆ సమయమున నగరము వెలుపల పరాసు తుపాకులు మ్రోఁగెను. పక్షులు గోల పెట్టెను. పశువు 'లంబా' యని అఱచెను. ఆకాశము గద్గదికతో రోదన మొనరించెనా యనునటు లుండె నాధ్వని ప్రతిస్పందము.

దేవపూజకుఁడు దేవితో చెప్పకయే పాఱిపోయెను. పండితులు చూచి వచ్చెదమని చెప్పుచు అదేఁపోత. సేవకులు అత్తరిత్తి చూచుచుండిరి.

వేగులవాఁ డొకఁడు పాఱుతెంచి రాజుగారితో—అయ్యా! ఓఢ్రరాజు నగరిలోనికి పరువెత్తికొని వచ్చుచున్నాఁడు. దేవర యాజ్ఞయేమి? అని మనవి చేసెను.

తిమ్మజగపతిరాజు సేనకులను జూచి—ఓరీ మీరు తల్లియెదుట నున్నారు. మానప్రాణములు పోవనున్న ఈ యుద్ధమునందు 'ప్రాణము లున్నంతవఱకు పోరాడుదుము' అని ప్రతిజ్ఞ చేయుఁడు అనెను.

ఒక వృద్ధసేవకుఁడు గబగబ దేవి యెదుటికిఁ బరువిడి 'ప్రాణము లున్నంతవఱకు నేను పోరాడుదును' అని ప్రతిన చేసెను. మరియొకఁడు చేసెను. గొఱ్ఱెల మందవలె అందఱును చేసిరి.

పిదప రాజు ఇటులు అనెను—మీరు వెనుక చూడక నా వెనువెంట రండు.

వృద్ధభటుఁడు రాజు ననుగమించెను. మరియొకఁడును.

మిగిలినవా రందఱు ఒకరి మొగ మొకరు చూచికొనిరి. ఎవరి మొగమునను నెత్తురు చుక్క లేదు.

ఒకఁడు వృద్ధభటునితో—నే నింటికిఁ బోయి గునప మెత్తికొని వత్తు ననెను. మరి యొకఁడు—తవుగోల తెత్తు ననెను. మరి యొకఁడు చాకు తెత్తు ననెను. ఇంకొకఁడు—సూది.

ఈమాట విని అందఱు నవ్విరి. రాజును, ముందర నున్న ఇరువురు భటులును వెను దిరిగి చూడకయే చనుచుండిరి. వారికిని వీరి కిని చాల వ్యవధాన ముండెను. క్రమక్రమ ముగా వారు వీరికి కానిపించుటయే లేదు.

ఈ భటులలో ప్రధానుఁడు మిగిలినవా రితో—ఓరీ మన మింటికిఁ బోయి భార్యాపిల్ల లను తీసికొని పాఱిపోదమా లేక ఒంటరిగా పాఱిపోదమా? అని అడిగెను.

గుభుగుభుమని తుపాకి మోఁతలు విన బడెను. మరి ప్రశ్న లేదు; సమాధానము లేదు. ఎవరిత్రోవ వారిదే. పాఱిపోవుటలో అసహా య శూరులు! భూమిలో పూఁడిపోయినటులు వా రొక్కరును కాన రాలేదు.

రాత్రి చాలసేపటి దాఁక తుపాకులు మోఁగుచునే యుండెను. రాజు ఎంతసేపు వెనుదిరిగి చూచినను ఇరువురు తక్క మరి భటులు లేరు. యుద్ధ మంత మైనది. రాజు గారికంటె భటుల కెక్కువ జయము కలిగినది.

౪

నాఁడు నవమి, ప్రొద్దు గ్రుంకెను. అప్పుడు యామినీపూర్ణతిలక పాట.

తిమ్మజగపతిరాజుగారు గానరసమును నిక్కముగా ఎఱిఁగినవానిని కనిపట్టవలయునని పవలంతయు ఆలోచించెను. ఆలోచన అయిన వెంటనే మృదువేషముతో సభను అలంకరిం చెను. సభ్యులందఱు లేవబోవుచుండఁగా వ ద్దని వేఁడుకొని నమస్కరించి దిండును ఆను కొని కూర్చుండెను. సభ్యులును కూర్చుండిరి.

రాజబంధువు లొకచోట, ఉద్యోగు లొకచోట, పండితు లొకచోట, పామరు లొక చోట, నడుమ రాజు. రాజుముందు యామినీ పూర్ణతిలక.

తిలక పాడ నారంభించెను. సభ్యుల తలయూఁపు లారంభ మాయెను. భేషుభేషు నాదములు. హెచ్చరికలు. తిలక కృతజ్ఞత తెలుప సభకు జేతు లెత్తెను.

సభ్యులకు మరికొంచెము ఉత్సాహము ఈతూరి ఇందాఁకటికంటె ఎక్కువగా ఊఁపుద మని కొంద అనుకొనిరి. ఎంత తలయూఁచిన అంత అభిజ్ఞత!

తిలక పంచమశ్రుతిలో పాడుచుం డఁగా రాజోద్యానమున కోయిలలు కోకో యని కూసినటులున్నవని రాజబంధు వొకఁడు కీర్తించెను. సభ్యుల ఆహానాదము భేరీనా దమువలె మిన్ను ముట్టెను. తిలక పక్ష



3. టాజ్ మహల్



౮. మౌలాఆలీ కొండ

శ్రుతిలో పాడఁగావిద్దుఅంకెవలె నున్నదని రాజు గారి భావ. సభ్యుల బలీ నాదము అంకెవలె ఉండెను.

రాజు సేనాపతి దిక్కు చూచెను.



గీతములు, వర్ణములు, కృతులు అయినవెనుక తిలక రాగ మాలపింపఁ బాడఁగెను. ఆమె శుద్ధములును విజాతీయములును అగు భావములనే సంచారము చేసెను.

రాజ బంధువులలో తలయూఁపులు; పండితులలో శిరశ్చాలనములు; పామరులలో తలత్రిప్పులు; ఉద్యోగులలో తల తిరుగుళ్లు. అందఱకు శిరఃకంపమా? ఆశిరఃకంపములకు వీవనలచే విసిరినటులు గాలివీచెను. సభ్యులు రాగమునయందు ఆరోహణమునకు తలలెత్తిరి. అవరోహణమునకు తలలు దింపిరి. పాట వినుటకు పాతాళమునుండి పన్నగరాజు పైకి వచ్చి తన వేయిపడగలను ఆడించుచుండెనా?

కొందఱు తాళము వేయుచుండిరి. కొందఱు-బాగుబాగు-అనుచుండిరి. ముందర నున్న రాజబంధు వొకఁడు తన యభిజ్ఞత లెస్సగా తెలుపుటకుఁ గాబోలు తల నూఁపెను. ఊఁపుతో శిరస్సుపైనున్న ముప్పదిమూరల పాగ' తిలకకు దాపుగా పడెను. తిలక త్రుళ్లి పడెను. ఒకతూరి సభా సభా నివ్వెరపడెను.

'తిలక చిఱునవ్వుతో మరల అందుకొనెను. వెంటనే తలయూఁపులు.

సేనాపతి ముందరికి వచ్చి—మీలో ఎవరు తలత్రిప్పుదురో వారితల ఈకత్తికి బలి అని నిలువఁబడెను. తరువాత చాలమంది సైనికులు బిలబిలమని వచ్చి విచ్చుకత్తులతో నడుమనడుమ నిలువఁబడిరి.

'తిలక నిర్భయముగా కూర్చుండెను, ఆమె చక్రము త్రిప్పినటులు, తీఁగ ప్రాఁకినటులు. లత చెక్కినటులు, ఈశ్వరుని క్రొత్తక్రొత్త విభూతులు చూపుచున్నటులు, నాదబ్రహ్మమున తాను లీనయయి సభ్యులను లీనులఁ గావించి మృదువుగా, మనోహరముగా అటిటు కదలక బొమ్మవలె, సరస్వతివలె పాడెను.

సభ్యులకు, అందును ముని ముందు కూర్చున్న సభ్యులకు వాక్కు ఉన్నటులు లేదు; తలలు అసలు ఉన్నటులే లేవు.

ఆహాయనక, బళీయనక, భేషనక, ఇతరుల మోములను చూడక, ఆనందజడులైన



అంతేష్మఖు లొకరిరు వురు ఏకాగ్రతతో చెవులతో మనస్సు పెట్టకొని నడుమనడుమ తల లూడించుచుండిరి. మిగిలినవారు తమ్ముఁజూచి పరిహసించుటయు వారెఱుఁగరు.

తిమ్మజగపతి రాజుగారు లేచి వారికడకు వెళ్లి అయ్యా— తాము ఈ కృపాణమును కరుణించినారు. మీ అభిజ్ఞత మృతికి ఆనల అని వినయవినమితులైరి.

---

# అధీరధీరగతులు

శ్రీ విక్రమదేవవర్మగారు

ఇంచుకంత దెలియు నీలోకభవులె యు,
వైళ మింత లేక దేనిఁ జేయ
రిట్టులుండఁ జేయునే? యెట్టిపని నను
ద్దిష్టుఁడగుచు నన్ని దెలియు విభుఁడు.

ఒకొకమనుజుని సృజియింప నొకొకలక్ష్య
మొండుఁగద యహంకృతి నధీరుండు దానిఁ
దెలియలేకెన్ని యోమార్గములను ద్రొక్కి—
చేయవలసినదానిని జేయలేక

పొందవలసిన దానిని బొందలేక
చచ్చు చొదవుచు సంసారచక్రమందు
భ్రమణ మొందుచు దుఃఖాంబురాశిమునిఁగి
తేలెడు విధాన మాఱయుంజాలఁ డహహ!

బుధుఁ డహంభావమును బాసి విసిగఁ జేయఁ
దగు పనుల స్వార్థరాహిత్యముగ నొనర్చి
చీళనర్తుఁడై ఘోరసంసృతిని మీఱి
శాశ్వతానందమయమగు స్థాన మొందు.

---




## ౧

వేటూరు సత్యబంగారు రావు ౨౪ ఏండ్లయువకుడు. ఆంధ్రుడు. కృష్ణానదీ ముఖప్రాంతమందున్న వేటూరతని జన్మస్థానం. కాని యితనితాత ఆయన చిన్నతనమందు వర్తకవ్యాపార సందర్భములో ఉత్తరార్కాడుజిల్లాలోని పోలింగిపురంలో చిన్న యిల్లు సంపాదించి అక్కడనేయుండిపోయెను. బంగారురావు తండ్రి ఆప్రాంతాలనే రివిన్యూయిన్‌స్పెక్టరుగసి రిటైరవడం చేత వారికుటుంబం తిరిగి తమప్రాంతాలకువచ్చే ప్రయత్నాలేమీ జరిపియుండలేదు.

బంగారురావు బి. యే క్లాసు రెండుసంవత్సరాలు మద్రాసులో చదివాడు. అందుచేతనున్నూ, చాలా కాలంనుంచి అతని తండ్రి తాతలు అరవదేశాల్లో ఉండడంచేతను బంగారురావు అసలు ఆంధ్రుడైనా మొత్తము మీద వేషభాషల్లోను, మరి యితర అలవాట్లలోను మన తమిళసోదరులను మిక్కిలి పోలియుంటాడు. ఇంట్లోను అక్కడ తెలుగు భాషేవిశేషంగా మాట్లాడుతాడుకాని ఆభాష తెలుగుజిల్లాల్లో వాళ్లకి కొంచెం యాసగా యుండకమానదు ఆయన మాట్లాడడం మొదలుపెడితే అరవం ఆంధ్రం పరస్పరం మరచి మిళితమైపోతాయి. అది "యిట్లాకొంచుకురా", "వీరిస్టారండా", "వుడిచివేయండ", "తోసివుడు", "అప్పిడప్టిషుంది", అనేవి యీయన వినోద భాషా జ్ఞానం వెల్లడించు కొన్ని samples (శాంపిల్సు.)

## ౨

ఈ బంగారురావు బి. యే. ప్యాసు అయినవెంటనే ఉద్యోగాన్వేషణం మొదలు పెట్టాడు. అంటే చాలాచోట్లు తిరిగాడని కాదు అర్థం. దరఖాస్తులు మాత్రం పెట్టి try (ట్రై) చేశాడు. కొంత కాలానికి పేపర్లలో Advertisement column (అడ్వర్టయిజుమెంటు కాలం) చూస్తే విసుకు, అసహ్యం పుట్టింది. ఎక్కడికి దరఖాస్తులు పెట్టినా తిరిగి జవాబు లేదు.

దరఖాస్తుల్తో ఉద్యోగాలయ్యేరోజులు పోయి చాలాకాలం అయింది, ఆవిషయం మన బంగారురావుకేం తెలియదు, ఉద్యోగం సంపాదించాలంటే ముందు ఆఫీసర్నే చూడాలో, గుమాస్తానే చూడాలో- లేకపోతే ఆఫీసు మేనేజరంటూ ఉంటే అతన్నే చూడాలో, చూస్తే యెవరిని యెల్లాచూడాలో, సిఫార్సు ఏరకంది పట్టుకెళ్లాలో, యిందులో యెవరికేనా పంపు, ఫలం యివ్వాల్సి ఉంటుందో, యిస్తే ఉద్యోగం కాకముందో, అయింతరువాతో, ఏమీ తెలియదు యీతంటికి. అందుచేత యెంతకాలం కాచుకూర్చున్నా ఉద్యోగం యెక్కడా కలిసి రాలేదు.

## 3

చివరకు ఒకనాడు తెనాలిలో అతని అత్తారింట్లో unemployed circles(అన్‌యెంప్లాయిడ్ సర్కిల్సు)లో చీట్లపేక ఆడుతుండగా పేకాఫీసు మెంబరొకాయన యీయన బావమరిది తోటి 'యేమయ్యా మీ

Brother-in-law (బ్రదరిన్లా) యేం చేస్తున్నా డేమిటి. ఊరికే నే ఉన్నట్టున్నా డే. Why not he accept tutorship to a young fellow reading in fourth form? This student is the son of a small Zamindar. బహుశా ఏ 30 రూపాయలో యిస్తాడు. per month (పెర్ మన్తు)' అన్నాడు.

అప్పుడుమాత్రం యెవరు మాట్లాడలేదు. పేకాట బహుతీవ్రంగా నడుస్తోంది. బేస్తులు, పై బేస్తులు, కుదేళ్లు, కుంచేళ్లు, తాబేళ్లమీద పోతోంది. మెంబర్ల points of dispute(పాయింట్స్ ఆఫ్ డిస్ప్యూటు)తో యింటికెంపులు లేచిపోతున్నాయి. అందుచేత ఆట ముగించేవరకు ఊరుకుండి తరువాత యీ చెప్పినాయన్ని డిగి details (డిటైల్సు) తెలుసుకుని ఆయనవద్దనుంచి ఒక letter of introduction (లెటర్ ఆఫ్ ఇన్ ట్రడక్షను) తీసికొని బెజవాడ చేరుకున్నాడు బంగారు రావు.

## ౪

బెజవాడలో జమీందారుగారియిల్లు చేరి ఆయన్ని సమీపించి ఉత్తరం యిచ్చాడు. అది చూసుకొని ఆయన "సరే మీరిప్పుడు ఊరికే నే ఉంటున్నారా యేమిటి?" అన్నాడు.

"చిత్తం"

"మాపిల్లవానికి Tution undertake (ట్యూషన్ అన్డరుటేక్) చేస్తారా. Fourth form (ఫోర్తు ఫారం) చదువుతున్నాడు అబ్బాయిగారు Daily (డైలీ) "Two hours morning, Two hours evening, వాడితో studies లో spend చెయ్యాలి."

"చిత్తం, చిత్తం"

"నేను నా dealingsలో కొంచెము blunt గా ఉంటాను. మీ అపేక్ష ఏమిటో మొగమాటము విడిచి చెప్పుతారా?"

"తమరే శెలవివ్వండి. నేనేం చెప్పను?"

"అయితే Rs 25 Rupees per mensem. యేమంటారు?"

(కొంచెము మాటనంజుతు) "Rs. 30. అయినా అయితే......"

అన్నాడు మేటూరు.

"సరే దానికింత higgling యేమిటి. రేపటి నుంచి మొదలు పెట్టండి?"

అన్నాడు జమీందారు.

"Thank you very much, Sir, నమస్కారమండి. శెలవుతీసికొంటాను" అని బయటపడి రైలుస్టేషనుదగ్గరవున్న Welcome Hotel లో తయారై టిఫినికి కూర్చున్నాడు Mr. S. B. R. Metur.

Mr. S. B. R. Metur అంటే యెవరో క్రొత్త మనిషికాదు. మన దేశవాళీ బంగారురావే. కాకపోతే కొంచెం పేర్లో మార్పుకలిగింది. మనిషిపాతవాడే. ఈ పేర్లో మార్పుయిప్పుడు క్రొత్తగారాలేదు. కాలేజీలో చదివేటప్పుడే యితని circle of friendsలో S.B.R. Metur అని అందరూపిలుస్తూంటే యితనికిహృదయము పులకరించినది. అందుచేత చిన్నపిల్లలకి చొక్కాతొడిగేసి గుండెలమీదికి వీపులోడిగేటట్లు యింటిపేరు తిరగేసి వాడేవాడు అప్పటినుంచి. డాక్యుమెంట్లు, రిజిస్ట్రేషన్ మొదలైన వ్యవహారవిషయాల్లోతప్ప యెవరికైనా తన address (ఎడ్రస్) యిచ్చేటప్పుడు, Letter heads (లెటర్ హెడ్స్)లోను Visiting cards (విజిటింగ్ కార్డ్సు) మీద క్రొత్తఫక్కీయే తొక్కేవాడు S.B.R. Metur అని చదివితే పేరు మహాబాగావుండేది అతనికి. ఎవరైనా విన్నవాళ్లు 'యితనెవడురా ఎవడో బంగాళీవాడల్లావున్నాడు'అని అనుకుంటారని లోపలసంతోషం. అదీకాక పేర్లమార్చి వాడటంFashion of the day (ఫాషన్ ఆఫ్ ది డే)కూడాను.

Tiffin (టిఫిన్) పూర్తికాగానే మేటూరు బయలుదేరి సరాసరి Telegraph (టెలిగ్రాఫ్)ఆఫీసుకి చేరుకున్నాడు.పాలింగిపురానికి wire (వైర్)యిచ్చాడు. మరి రెండు రోజులకల్లా అతని Family (ఫామిలీ)నంతా బెజవాడకు Import (దిగుమతి)చేసుకొన్నాడు.

౫

బెజవాడవారిలో జమీందారుగారింటికి మూడు ఫర్లాంగులదూరంలో ఒక చిన్న decent house (డీసెంటు హౌస్) Rent (రెంటు) కు పుచ్చుకున్నాడు నెలకు పదిహేను రూపాయలిచ్చి. దానితోటి వచ్చేజీతంలో పదిహేను రూపాయలు పోయింది. మిగత పదిహేను రూపాయలకి ఖర్చుకని పెట్టుకుండేది. భార్యాభర్త లిద్దరికి కాఫీగతప్రాణా లయిపోయినాయి మొదటినుంచి. వీరికి తోడు మూడేండ్ల ఆడపిల్ల. సరిగా వేళకి ఆపిల్ల ఆరాటంచూస్తే దానికికూడా కాఫీతోటే ఉగ్గపెట్టారా తల్లిదండ్రులు అని సందేహం స్ఫురిస్తుంది. మొత్తం మీద పొద్దునా సాయంత్రం కాఫీతోటి యెనిమిదిరూపాయ లయిపోయేవి. తక్కిందె కాస్తా కాఫీహోటల్ కింద సరిపోయేది. సంసారానికి యిక యితర ఖర్చులకింద యే ముప్పదిరూపాయలయినా కాకమానవు యేఖర్చయినా తగ్గిద్దామంటే సంపతుల్లో యెవరికి చేతకాదు. అందు చేత నెలకు ముప్పదిరూపాయల చొప్పున అప్పుచేయడం మొదలుపెట్టాడు మేటూరు. తండ్రినేనా యెవరినేనా అడుగుదామంటే కొంచెము shameful (షేమ్‌ఫుల్) గా feel (ఫీల్) చేసేవాడు ఆంధ్రదేశంలో పడ్డ కొద్ది కాలంలోనే వేషభాషల్లోమార్పు వచ్చేసిందికాని కాఫీ మొదలైన దక్షిణదేశ సంపర్కపు అభ్యాసాలు మాత్రం మార్చుకోలేకపోయినాడు మేటూరు.

అయితే అప్పుతీర్చే విషయంలో ఆలోచన ఏమిటి? బిళ్ల కుడుంవంటి తెల్లరూపాయి యిట్టే చేతిలో వేసికొని మీనం మేషం లెక్కవేసిచెప్పాడుగా సిద్ధాంతి గారు, ఇతన్ని అదృష్టం కేవలం కౌగలించుకుంటుందని, అదికూడా చాలా త్వరలోనేనని! కాబట్టి దాపులోనే యేదో బంగారు కొండొకటి తనకు యోగిస్తుందని, మంచి వుద్యోగం ఒకటి యెవరో పిల్చియిస్తారని ధైర్యం. ఇల్లా ఒక ఆరునెలలు గడచింది. అదృష్టం కనబడలేదు. ఏమూలనుంచీ ఆస్తియేమీ సంక్రమించలేదు.

ఇతని అత్తగారికి మంచి ఆస్తివుందని, యితని భార్యపేరట యే రెండువేలో బ్యాంకిలో వేసి ఉంచిందని వాళ్లువాళ్లు చెప్పగా విన్నాడు. అడుగుదామంటే బాగుండదేమో! భార్య యెన్నిమాట్లు అడిగిచూచినా "నాకేతెలుస్తుంది. యెవరాస్తి యెవరికిస్తారు?" అంటూ వచ్చిందికాని, యేమున్నావుంటే గుట్టుబయలు పెట్టింది కాదు.

౬

ఇక యిదంతా బాగుండలేదనుకున్నాడు మేటూరు. ఎక్కడచూచినా age of lotteries (ఏజ్ ఆఫ్ లాటరీస్)గా కనిపించింది. వాళ్లువాళ్లు లాటరీలు వేయటం చూసి తనకేదైనా దొరికితే ముక్తి వాటిల్లోనే అని అనుకున్నాడు. వెంటనే St Barthalomew Relief Fund (సెంట్ బార్థలోమ్యూరిలీఫ్ ఫండ్) నిమిత్తం మొదలు పెట్టిన Grand Raffle (గ్రాండ్ రాఫ్ఫల్) తాలూకు చీట్లపుస్తకం ఒకటెక్కడో పట్టాడు తంటాలుపడి. Friends (ఫ్రెండ్స్) అందరిచేత తల ఒకపావలా చీటీ వేయించాడు. పుస్తకం అల్లా అమ్మినందుకు రెండుచీట్లు Free (ఫ్రీ)గా వచ్చేశాయి. అవి తన యిష్టంవచ్చిన నంబరు చీట్లేవేశాడు. వేసిన మూడు నెలలకు Results (రిజల్ట్స్) చెప్పారు. చాలా ఆతుర్దాతో మేటూరు ఆకాగితంలో లీస్టు అంతాపరికించి చూశాడు. చూడడం పూర్తి అయింది. మొహంలో నెత్తురుచుక్క కనబడలేదు. "అరరే కాస్తలోపోయింది" అన్నాడు. "నానంబరుపై నంబరుకు క్రింద నంబరుకు prize (ప్రైజ్) వచ్చింది. కాస్తలోతప్పిపోయింది అదృష్టం. Imust try again (ఐమస్టు ట్రై ఎగెన్)" అన్నాడు.

మళ్లీ ఏలూరులో మల్లెలవారి మేడలాటరీ అన్నారు. చీటీ పదేసి రూపాయలు. "పోతేపోయింది అదృష్టంవుంటే తప్పకుండానాకేవచ్చితీరుతుంది; సిద్ధాంతి గారు ఇల్లుకూడా సంపాదిస్తానన్నాడుగా! Perhaps this opportunity is specially intended for me," (పర్ హాప్స్ దిస్ ఆపర్ ట్యూనిటీ యీజ్ స్పెషల్లీ ఇన్ టెన్ డెడ్ ఫర్ మి). అంటూ Try (ట్రై) చేశాడు మరొక chance (ఛాన్స్). తీరా అంతా అయిం తర్వాత చూస్తే యితనిపేరుకి 25 పేర్లలోగా

యిటూ ఆటూ ఏపార్ట్వనా ఒక్క prize (ప్రైజ్) పడారాలేదు. "What is this? (వాట్ టీస్ దిస్?) యీమారు Sure (ష్యూర్) అనుకున్నాను. Nonsense (నాన్ సెన్స్) నా పేరుచెప్పితే యేదీ కలిసిరావడం లేదు. కాబట్టి యీమాటు నా Wife(వైఫ్) పేరట Try(ట్రై) చేస్తాను" అన్నాడు Brother Metur (బ్రదర్ మేటూరు)

మళ్ల Next lottery (నెక్స్టు లాటరీ) కోసం యెదురుచూస్తూ వుంటే మూడువంజల రూపాయలది చేతి వంకీ, రాళ్ల కుర్చుడి, lottery (లాటరీ) అన్నారు. Each ticket one Rupee (యీచ్ టికెట్ ఒన్ రూపీ). "నాకు లేకపోతే నా wife (వైఫ్) కేనా లేదా అదృష్టం. చూద్దాం" అని 3, 4 టిక్కెట్లు అక్కడోనంబరు అక్కడోనంబరు కొన్నాడు. తరువాత అదృష్టాన్ని నిరీక్షిస్తూ కూర్చున్నాడు. చెప్పిన time (టైం) ప్రకారం కొన్నాళ్లకు Lottery box (లాటరీ బాక్సు) తెరిచారు. కాని మామూలికి ఏమాభిన్నంగా జరుగలేదు. మేటూరికి సున్నా అయింది వ్యవహారం. మూడు వంజలరూపాయల వంకి యాభైవేల రూపాల ఆస్తిపరురాలైన ఒక షాహుకారి భార్యపేరట వచ్చింది. న్యాయమంటేగా మరి. మనిషేం, భగవంతుడేం, కలిగినవాళ్లకి యింకా యివ్వడం, లేనివాళ్లకి ఉన్నది కాస్త లేకుండచేయడం. ఈమామూలు అందరకు తెలిసిన విషయమే.

ఇల్లా The cawnpore Poor Relief Lottery (ది కాన్పూర్ పూర్ రిలీఫ్ లాటరీ), The Scuth Indian Lottery Bureau R ffle (ది సౌత్ ఇండియన్ లాటరీ బ్యూరో రాఫుల్) The Kalinga Fcrtunato Horse Raffle (ది కళింగా ఫార్చ్యునేటో హార్స్ రాఫుల్) The Aryapur Deaf and Dumb School Raffle (ది ఆర్యాపూర్ డెఫ్ అండ్ డమ్బు స్కూలు రాఫుల్) The Kistna Luck home Raffle (ది క్రిష్ణా లక్ హోమ్ రాఫుల్) మొదలైనవి యింకా యెన్నో లాటరీల్లో విశేషంగా ప్రయత్నం చేసి చూశాడు. కాని అదృష్టం యెక్కడదాక్కున్నదో కాని మొహం అయినా చూపించింది కాదు. మేటూరు ప్రాణంవిసిగింది. కాని ఎల్లా ఊరుకోగలడు? దేనికే నా అలవాటు పడకుండా వుండాలికాని, అలవాటైనతరువాత ఆవిషయం పరిచిపోవడం చాలాకష్టం. ఈలాటిపని చేయడం ఆలాటి అలవాటే. అందుచేత మేటూరు మొదట సారపటుగా వీటిల్లోకి దిగినా తరువాత గ్రహపాటుగా మారి చివరకు అలవాటుగా పరిణమించింది వీటి వీటి తాలూకు అభ్యాసం యితనికి.

కాని యీమారు మేటూరు చిన్న చిన్న రకాల లాటరీలు ప్రారంభించాడు. Christmas (క్రిస్టమస్) మద్రాసు వెడుతూ జమీందారు గారు కొంచెం తోదాకకలిసి వస్తుందని యితనినికూడా రమ్మన్నాడు. వెళ్లు ముందు వెళ్లగానే అక్కడ మూర్ మార్కెట్టులో పెట్టిన సీజను లాటరి అన్నిటిలో ఒక trial (ట్రయల్) చూశాడు Metur. కానీ కానీ రింగులు కూడాకొని రెండు రూపాయలవి, అనగా నూట యిరవై రెండింటి chances (ఛాన్సెస్) వంచినురిచూసి సంకల్పంలో చూశాడు. ఇంకా ఏమేమో try(ట్రై) చేశాడు; ఫలి తం...? వేరే చెప్పాలనా "Loss and Disappointment" (లాస్ అండ్ డిస్ అప్పాయింట్



మెంటు). యీ స్నేహితు లిద్దరూ యితన్ని వదలి పెట్టలేక వెంటనే కనిపెట్టుకు తిరుగుతున్నారు.

'ఛా! Bad days (బ్యాడ్ డేస్) యికయిల్లాంటివాటిల్లో వేలు పెట్టకూడదు' అనుకొన్నాడు మేటూరు ఒకరోజు సాయంత్రం.

౨

ఇల్లా మేటూరిగారి తత్వం కొద్దిగా మారవచ్చే సమయానికి ఒకనాడు మధ్యాహ్నం జమీందారుగారు గిండి Horse (హార్సు) రేసెస్‌కి వెళ్లటం తటస్థించింది. ట్యూటరుగారు కూడా వెంటవున్నారు. గిండి grounds (గ్రౌండ్సు)కి రాగానే మొదటి పందెం వేశాడు జమీందారు. ఈపందెంలో ఫలితాలు యెప్పటివప్పుడే చెపుతారు. లేకపోతే ప్రజలకు వాటియందు వెర్రి వ్యామోహం పుట్టదు. ఇప్పుడు ఫలితాలు చెప్పారు. జమీందారు యెనభై రూపాయలు గెల్చాడు. ఇంకా నూరు, నూటయాభై గెల్చారు కొంతమంది. అది చూసేటప్పటికి మేటూరుకు మళ్లీ చాపల్యం పుట్టింది.

తనుకూడా వెయ్యాలని నాలుగు రూపాయల టిక్కెట్టుకొని పందెంవేశాడు. జాకీలు అశ్వారూఢులైనారు. గుర్రాలు పరుగెత్తాయి. ఫలితాలు చెప్పారు. మేటూరుకు పదిరూపాయలు లాభించింది. ఆఁ బాగుంది అనుకొన్నాడు. మళ్లీ పదిరూపాయలు వేశాడు. నలభై రూపాయలు win (విన్) వచ్చింది. "I think luck is just courting me. I must not stop here" (ఐ థింక్ లక్ ఈజ్ జస్టు కోర్టింగ్ మీ ఐ మస్టు నాట్ స్టాప్ హియర్)అనుకొన్నాడు. ఇప్పుడే మనిషికి కొంచెం అంధకారం కమ్మేది. వచ్చిన నలభై రూపాయలు మళ్లీ పందెంవేశాడు. బాగావెళ్లేదైనా యితను పందెంవేసిన గుర్రం యికని గాలిబాగా సోకిందనగానే వెనక పడింది. అతని సొమ్మంతా హళ్లీ చుట్టింది. మేటూరికి పౌరుషం హెచ్చింది. ధైర్యం వెనక్కీముందుకీ కాకుండా లాగింది కాని అదృష్టాన్ని కనుక్కోవాలని పట్టుదల తీవ్రమయింది. "అదృష్టం దాసుడుమాత్ర లామెతోంది; తెలివితేటలతో పనిచేస్తే ఎందుకు పట్టదు నాకదృష్టం" అనుకొన్నాడు.

మళ్లీ మళ్లీ మూడుమాట్లు మూడు యిరవై రూపాయలు వేశాడు. మూడు యిరవైలు అరవై రూపాయలు నష్ట మయింది. కొంతసేపటికి తెలివి తెచ్చుకున్నాడు. ఇల్లూ, సంసారం, స్థితి, జ్ఞాపకం వచ్చాయి. ఈరోజు క్షేమంగా చాలుననుకొన్నాడు. జూదం ఆడటానికి, యిల్లాంటి ప్రయత్నాల్లో పాల్గొనడానికి యేమీ భేదంలేదను కొంటున్నాడు.

సరిగ్గా ఆసమయానికి బాగాయెరుగున్న frierd (ఫ్రెండు) ఒకడు కనబడి భుజంమీద చెయ్యివేసి "యేరా! brother (బ్రదర్) మొహంవ్రేలేశావు. రమారమణ గోవిందో హరి అయిందాయేమిటి? మనకి లానేఅయింది. కాని పదిరూపాయలతో బుద్ధివచ్చిందిరా. నీకేదో యింక heavy (హెవీ)గానే తగిలినట్టుందే? నీమొహం చెపుతోంది" అంటూ విచారమున్నడైన మేటూరు వద్దనుంచి బదులు రాకముందే అతన్నివిడిచి "అరే! Fools (ఫూల్సు) ఆగండిరా నేనూవస్తున్నాను," అని కేకేసి యింకో group of disappointed fortune-huuters (గ్రూప్ ఆఫ్ డిస్ అప్పాయింటెడ్ ఫార్చ్యూన్ హంటర్సు)ను కలుసుకున్నాడు.

ఆరాత్రి మేటూరి కునికితే ఒట్టు. అరవై రూపాయల నష్టం దుర్భరంగా కనిపించింది. దానికి తోడు కొంచెం లాభించిన జమీందారు పానీ"వూరు కోకపోయి నారండీ. Why did you stake so much? (వై డిడ్ యు స్టేక్ సోమచ్)" అన్నాడు కూడాను. అందుచేత ఆత్రంతో మరింత విచారించాడు. దుఃఖపడ్డాడు. ముందుముందు గతి ఏమిటో అని బెంగ పడ్డాడు. ఇన్ని కష్టాలు పెట్టుతున్న ఆయదృష్టాని భగవంతుణ్ణి తిట్టిపోశాడు. తెల్లవారింది. బంగారువన్నె సూర్యుడు తన తేజఃకిరణము లన్ని దిక్కులకును ప్రసరింపచేశాడు. సూర్యోదయమును దానితో మేటూరుకు జ్ఞానోదయమును కలిగినట్టు కనపడింది. "ఎప్పుడూ ఆశ పనికిరాదు. చెంపలు వేసికొంటున్నా. లాటరీలు యిక వద్దురా బాబూ, యెన్నడూ వద్దురా బాబూ" అంటూ మంచందిగాడు మేటూరు. ఆరోజుసాయంత్రమే బయలుదేరి తాను, జమీందారు బెజవాడకుచేరారు మరునాడు.

౫

బెజవాడచేరిన కొన్నాళ్ల వరకూ పాపం మేటూరు లాటరీలజోలికి వాటిజోలికి వెళ్లకుండా యెల్లాగో వూరుకున్నాడు. కాని యెన్నాళ్లిల్లా వూరుకోడం? - ఒకరోజున రామమోహనరాయి రీడింగురూమ్‌లో హిందూ పత్రిక చూసేటప్పటికి మతి చంచలించింది. Address (ఎడ్రెస్, జాగ్రత్తచేసి Kalinga Astıological Bereau (కళింగ ఎస్ట్రాలాజికల్ బ్యూరో) వారి publication (పబ్లికేషన్) Peeps into the future (పీప్సు యిన్ టు దీ ఫ్యూచర్) తెప్పించాడు. మనం మామూలుగా చూస్తూండే అదృష్టదీపిక అనే పుస్తకం వంటిదేయిదీని. అందులో యెన్నిమాట్లు మేటూరు వేలు పొడిచి చూసినా You will pass in Part I only' (యూ విల్ పాస్ యిన్ పార్టువన్ ఓన్లీ) 'You will pass in Part II only' (యూ విల్ పాస్ యిన్ పార్టు టూ ఓన్లీ) అనే వచ్చేది. అదిచూచి "యిదెక్కడిదో Intermediate (యిన్‌టర్ మీడియట్)లో compartmental system (కంపార్టుమెంటల్ సిస్టమ్) అమల్లోకి వచ్చింతరువాత ఆలోచించి Special (స్పెషల్) గా వ్రాసిన గ్రంథ మల్లేవుందే. బి. యే. ప్యాసుఅయిన ముండాకొడుకు యింకా యిన్‌టర్ మీడియట్ గతేమిటి?" అని గిర్రున విసరి ఆగ్రంథాన్ని పారేశాడు యింటి పూరుమీదికి.

కాని వేలంవెర్రి యెల్లాంటిదో యీవెర్రిఅల్లాంటిదే. మనశరీరంలో ప్రవేశించి poisonous bacteria (పాయిసనస్ బ్యాక్టీరియా) అనగా సూక్ష్మజీవక్రిములు యెంతచెరుపు చేస్తాయో యీవెర్రికూడా మనుష్యుల తత్వాలని యెంత చేసైనా మార్చేస్తుంది. అందుచేతనే కాబోలు మేటూరుగారు చివరకు వీధులవెంబడి బయలుదేరుతూ Canvass (క్యాన్వాస్) చేయబడే బిళ్లోరి అద్దాలు, పెద్దపెద్ద బొమ్మపటాల లాటరీలను కూడా వదిలిపెట్టాడు కాడు. కాని నెత్తిమీద కూర్చుంది దుర్దృష్ట దేవత. కనుక ఫలితంలోమాత్రం ఏమీ మార్పు కలగలేదు. మన తాపత్రయాలకోసం నక్షత్రాలు, అవసరంగా మారవుకదా మరీ!

౬

మేటూరు ప్రాణం విసిగివేసారింది. ఒకరోజున భార్యతో "ఏమే, ఏంచెప్పావు ఆవిషయం? నీవా! మీఅమ్మకున్నంత గుంభన ఉన్నది నీదగ్గిర. నీవు రహస్యం బయటపెడతావా. నే నెరగనూ?" అన్నాడు. "అయ్యో! నాకు తెలియదండీ. ఇస్తే యిస్తుందేమో; ముందుగా యేమడగను నేను. యేం బాగుంటుంది" అన్నది Mrs. Metur (మిసెస్ మేటూరు.)

"చాల్చల్లే. ఎవరికి చెపుతావు. ఇప్పుడే యిక్కడికి కాస్తానాకిందే వినియోగ పడుస్తానేమో అని భయం మీవాళ్లకి. సరేకాన్లే, నాకు అదృష్టం అంటూవుంటే బయటపడక పోతుందీ? కాని అదేదో త్వరలో రేక పోతే మనస్సుకు చాలా కష్టంగా వుంటుంది! నాలుగు డబ్బులు దొరికే ఉద్యోగమూ యేమీ దొరికింది కాదు. పోనీ ప్లీడరీకిపోతే బాగుంటుందని చూస్తే ఆపదుష్కర్యే ఖర్చులో? అప్పటికి యింకా అప్పా! పైన పరీక్ష అయి రాగానే యెన్నాళ్లు వూరికే కూర్చోవాలో! ఏమీ బాగుండ లేదు వ్యవహారం" అంటూ ఒక రోజు ప్రొద్దున పడకకుర్చిలో విశ్రమించియున్న మేటూరు కన్నుమూసికొని కాస్త కునికాడు.

నిద్రలో యేదో మంచి కలవచ్చింది. చాలాకే పాలు కనిపించాయి. అందులో అంశాలన్నీ మేటూరుకు జ్ఞాపకం లేవు కాని కలధోరణిచూస్తే అతనికేదో గొప్ప యదృష్టం దాపులోనే వున్నట్టు తోచింది. ఆ స్వప్నం త్రం అంతా కుడికన్న దిరింది అతనికి. ఇదికూడా మంచి టప్పటికి తప్పక యేదో మంచి కలుగ నున్నదని అనుకున్నాడు మన మేటూరు. భార్యకు యెడమ కన్ను దిరింది కూడా చెప్పింది. ఈ రెండు సంఘటనలు జతపరిచి చూస్తే తమకు మహత్తరమైన అదృష్టం సంభవింప నున్నదని దంపతులిద్దరూ కులాసాపడ్డారు. ఆరునెలలు సహవాసం చేస్తే వారు వీరవుతారు. అనేసామెత వూరికే పుట్టిందా. పెనిమిటి సహవాసం కలిగిన తరువాత పూర్ణమ్మకు కూడా అదృష్టదేవతను గురించిన పిచ్చి కొద్దిగా పట్టింది.

౧౦

ఇల్లా కలవచ్చిన మరుదినం ఇంగ్లీషు న్యూయియర్సుడే. ప్రొద్దున్నే రెండు లోటాల కాఫీ త్రాగేసి మేటూరు కుర్చీలో జారగిలపడి జన్మభూమి ఇష్యూ ఒకటి చూస్తుండగా మూడు ఉత్తరాలుయిచ్చి "New Year's day (న్యూయియర్సుడే) మామూల్ యివ్వాలసి వుంది పంతుల్ సాబ్" అని సూచించే లాగ బలే యింపుగా గౌరవపూర్వకంగా జాగ్రత్తగా యెవడు అరిచి చచ్చినాసరే మామూళ్లేమిటని కలాయించే గట్టిగుండె పెద్ద మనుష్యుని మనస్సును కూడా యిద్దామని బుద్ధి పుట్టించే లాగ, అతన్ని చూచి విన్నవాళ్ల సహజగర్వాన్ని చక్కిలిగింత పెట్టితీరేలాగ, ఆర్చి ఆర్చి, రెండు మాట్లు "సలామ్‌సాబ్" అని Magic Salute (మ్యాజిక్ శాల్యూట్) కొట్టి వెళ్లి పోయినాడు షేక్ బడే, ఆ వార్డుపోస్టుమన్.

ఆమూడు ఉత్తరాల్లో ఒకటి తెనాలి stamp (స్టాంపు) వేసివుంది. దస్తూరీ, ముద్ర, చూడగానే మేటూరు గ్రహించాడు అది తన Brother-in-law (బ్రదర్ ఇన్ లా) దగ్గరనుంచని. కవరు లావుగా వుంది. ఏమిటా అని విప్పిచూశాడు. రెండు మందపాటి కాగితాలున్నాయి అందులో. అందులో ఒకదాని మీద యిల్లా వుంది?

Tenali
Dated, 31-12-28.

IN HASTE

Dear Bil,

Find enclosed a check in favour of my sister and yourself. Acknowledge receipt of the samc. Attend to it More in my next.

Yours affly.
Sanjiva Rao.

తెనాలి
డిశెంబరు, 31-12-28......

తొందరలో

బావా!

మాచెల్లెలి పేరట, నీపేరట ఒక చెక్కు యిందుతో పంపడమైనది. ముట్టినట్టు రాస్తూ దానివిషయం చూడు. మళ్లీ ఉత్తరంలో విపులంగా—

సంజీవరావు

వెంటనే రెండవ కాగితం మడత విప్పాడు. అదే చెక్కు. అందులో రూపాయల మొత్తం వేసే చోట రూ. 2000 అంకె వేసుంది. అది చూశాడు మేటూరు. ఇక రెండవ అక్షరం వంక కన్ను పోనియ్యలేదు. కాగితం ఇక చూడకుండానే మడిచి ఆల్లావుంచు కున్నాడు. చేతితో కళ్లు మూసుకున్నా డనడానికి వీలులేదు, తెరుచుకున్నా డనడానికి వీల్లేదు. అల్లా యేమిటో ధ్యానంచేస్తున్నట్టున్నాడు. కాని అతని ధ్యానంమాత్రం అక్కడలేదు. అతని హృదయంలో సంతోషతరంగాలు పర్వతాగ్రా లంటేటట్టు పొర్లి పోతున్నాయి. అప్పుడే పూర్ణమ్మవచ్చి "మావాళ్ల దగ్గిరనుంచి ఏమైనా వుందా ఉత్తరం?" అని కచ్చేరిసావిడి తలుపునంటి నుంచుని ప్రశ్నించింది. ఆప్రశ్న విన్నాడుగాని మేటూరు జవాబేమీ యివ్వలేదు మొదట. కాస్సేపటికి ఆచెక్కు నేలమీదకి జారవిడిచి "అదిగో రెండు వేలకి చెక్కు పంపించాడు,"



అని ఆవిడవంక తిరక్కుండానే ఏమేమో ఆలోచించడం మొదలుపెట్టాడు (భార్య్య ఆ చెక్కు తీసి జాగ్రత్తచేసింది) ఎందులోను extremes (ఎక్స్ట్రీమ్సు) పనికి రాదు. 'అతి సర్వత్రవర్జయేత్' అన్నారు. కాని మేటూరికి మితిమీరిన ఆనందంతో ఒకవిధమైన అంధకారం కమ్మేసింది. అనిర్వచనీయమైన వేగంతో భావతరంగాలు ఒకదానొకటి తరుముతున్నాయా అన్నట్లు ఉబికిపోతున్నాయి, అతను యింతకాలం పడిన మనోవేదన అదృష్టదేవతా న్వేషణమందు కలిగిన Disappointments (డిస్అప్పాయింటు మెంట్సు) యిక తొలగిపోయినా యనుకొన్నాడు. ఇంత కాలానికి గదా అదృష్టం నన్నువరించిం దనుకొన్నాడు. చెక్కు తనకూ, తన భార్యకూగదా అనుకొన్నాడు, ఎవరికైతే ఏం. ఇందులో ఎవరిదైనాగాని చివరకి తనదేగా అను కొన్నాడు. ఇక కష్టాలు బాసి నాయిరా బాబూ, యిదే సిద్ధాంతిగారు చెప్పిన అదృష్టం కాబోలనుకున్నాడు. మర్నాటినుంచి వెధవట్యూషన్ వదిలేసి యేదైనా మంచి profitable concern (ప్రాఫిటబుల్ కన్సరన్) లోదిగో లేక ఆజూలైలో pleadership course (ప్లీడరుషిప్పుకోర్సు)కి వెళ్లో Life(లైఫ్)లో fortune build (ఫార్చ్యూన్ బిల్డు) చేస్తా మనుకున్నాడు. ఇల్లా ఒక్క త్రుటిలో లెక్కలేనన్ని భావాలతోటి అతని బుర్ర నిండి పోయింది.

మళ్లీ కాస్త ఒళ్లు తెలిసింది. ఏమిటో జ్ఞాపకం వచ్చిం దతనికి. చివ్వున కుర్చీలోనుంచి లేచి భోజనశాల్లోకి వెళ్లాడు.

౧౧

భోజనశాల ప్రవేశించి భార్యనుపిల్చి "ఇదిగో! చెక్కుఏదీ" అన్నాడు మేటూరు. "నాపెట్టెలో దాచాలెండి". జాగ్రత్తగానే ఉంటుంది. ఆమాత్రం తెలియదనుకున్నారా యేమిటి? అయితేనూ రేపు Bank (బ్యాంకు) వుంటుంది కాదండీ? ఈచెక్కుమార్చి తిరిగి నా పేర వేయిస్తారా యేమిటి పైకం? లేకపోతే మీ పెదనాయనగారి ద్వారా యెవరైనా నమ్మకమైన వాళ్లకి యెక్కువ వడ్డీకి తిప్పేయేర్పాటు చేస్తారా? యేమిఆలోచన చెప్తుతారు?" అన్నది పూర్ణమ్మ చారులో తిరగమాతవేస్తూ. ఈడబ్బు ఎల్లాగా జాగ్రత్తచెయ్యడం అని ఆవిడా చాలా ఆదుర్దాపడుతోంది పాపం.

భార్యమాటలువిని కొంచెం నిర్ఘాంతపోయాడు మేటూరు. వెంటనే గట్టిగా "కాస్త అదృష్టం బాగపడిందేమో అనుకుంటున్నా. దానికూడా పుడకలాగ తయారవుతున్నావూ? నే యేదోయింక ఆలోచిస్తున్నా. వీలైతే లాకాలేజిలో ఒకయేడాది వెలగపెడదా మనుకుంటున్నాను చదువు. సరసంవదిలేసి నిజంగా నీమనస్సులో వున్నమాట చెప్పూ. నే నే మనుకోను" అన్నాడు. "అయితే చెప్తుతావినండి. మీరేమీ అన్యథా వద్దు. లాకాలేజీఆలోచన మానెయ్యండి. ఈరోజుల్లో అదేమీ లాభం లేదు. చూడడంలే మా అన్నయ్య మూడేండ్లనుంచి చేస్తున్నాడు. ఈరోజువరకూ దమ్మిడీ రావడం లేదన్నమాటే. నెలకు యేముప్ఫైరూపాయలో వస్తే యేంలెక్క! ఏదోవున్నవాళ్లు కాబట్టి వాళ్లవాన్నిగురించి అనుకోడంలేదు. మనకట్లా ఎల్లా కుదురుతుంది? బండీ సాగేవుపాయం చూడాలి. ఇక్కడికే చాలా అప్పుచేశారు. అది తీర్చేఆలోచన చూడండి. ఏదైనా ఉద్యోగంలో ప్రవేశించాలి. శుభ్రంగా మామన్నాయనతో చెప్పి బ్యాంకు ఉద్యోగం సంపాదించండి. అది బాగావుంటోంది యీరోజుల్లో."

"ఆ! మనకెవ్వరిస్తారు అల్లాంటి ఉద్యోగాలు. అదృష్టవంతులగ్గాని మనకెవ్వరిస్తారండీ."

"ప్రయత్నం చేస్తేగాదండీ. ఇంట్లోకూర్చుని 'రా' అంటే ఉద్యోగంవస్తుందా? మనశక్తివంచన లేకుండా పురుషప్రయత్నంచేసి, ఆతరువాత భగవంతుడిమీద పైన వెయ్యాలి భారం. ఇంకా కొద్దిరోజుల్లో మామన్నాయన యిక్కడికేమో వస్తాడట ఏదోపనిమీద. అప్పుడు మనవిషయాలు చెప్పి నీవల్ల కావాలిసని ఆగట్టిగా చప్పి ప్రయత్నంచేస్తాను. ఈ పైకంవిషయం మాత్రం మీరిప్పుడేమీ అపేక్ష పెట్టుకోవద్దు."

"అయితే పోనీ, నావంతైనా నాకివ్వవూ! తొంచెక్కు యిద్దరిపేరట వ్రాసింది యెందుకు మరీ,

రలో వ్రాశాడట మీఅన్నయ్య. ఈ మా ఉత్తరంలో యెవరి కెంత ఉద్దేశించారో రాస్తాడు బహుశా."

"అల్లా యెందుకంటుంపండి? చూడండి మళ్లీ చెక్కు. మొదట సరిగా చూశారో లేదో" అంటూ తన పెట్టె తియ్యబోయింది అన్నపూర్ణమ్మ......కొంత సేపటికివచ్చి "యిదిగో చెక్కు" అని తనభర్తకిచ్చింది.

మేటూరు సావకాశంగా చూశాడు చెక్కును. తరవాత సుబ్బు రెండూ పడకుటింటిచూరు కప్పగించాడు కొంచెంసేపు. మళ్లీ ఒకమాటు చెక్కువంక చూశాడు. తరువాత బిగ్గరగా చదువుకొన్నాడు. అందులో యిల్లావుంది.

Please pay to Mr. & Mrs. S. B. R. Metur two thousand only sterling best wishes. (ప్లీజ్ పే టు మిస్టర్ అన్డు మిసెస్ యస్.బి. ఆర్ మేటూరు టూ థౌజండ్ ఒన్లీ స్టెర్లింగ్ బెస్టువిషెస్)

"ఇదేమిటే! యెంతపొరబాటూ! ఏదీ—2000, Sterling best wishes (స్టెర్లింగ్ బెస్టు విషెస్సా) ఆ! ఔరా! బావా! ఎంతమోసమోయి! ఎంతమోసమో చూశావుటే? చూశావా మీఅన్నయ్య యేంచేశాడో?"

"అదేమిటే, ఏమిటండీ?"



"ఏమీలేమూ. అతనుపంపిన 2000 New year wishes (న్యూ యియ్యర్ విషస్) సంవత్సరాది అభివందనాలు. అతని తప్పేముందిలే, తప్పంతా నాదే" అంటూ మోకాళ్లమీద తలవాల్చి కొంతసేపు విచారించి యిల్లా మొదలుపెట్టాడు: "అదృష్టం, అదృష్టం, అని కలవరిస్తూ ఏదికాస్త మంచి సూచన కనబడ్డా అదృష్టం వళ్లోవచ్చి పడుతోందని విభ్రమించెందుతూ నోట్లో వేళ్లు పెట్టుకుంటున్న నాకు, మనసారా చేయవలసినంత ప్రయత్నం యెందులోనూ చేయక ఉద్యోగమే నన్ను వరించి వస్తుందని కూర్చున్న నాకు, కలిగిందానికి మించినవ్యయంచేస్తూ పటాటోపమే ప్రధానంగా యెంచిన నాకు, దైవభక్తిలేక పురుషకారమనేది యెరుగక వేరే అదృష్టమంటూ యేదోవచ్చి ఉన్నట్టుండి నన్నుచాలా గొప్పవాణ్ణిగా చేస్తుందని మూఢరీతిని నమ్మిన నాకు, అదృష్టదేవత దయ్యమై దాపరించి పీడింపబడుచున్న నాకు, యీమోసంచాలా సహాయంచేసింది. జ్ఞానంప్రసాదించింది. కళ్లుతెరిచాను. బావా, మంచిపాఠం చెప్పావోయి! అదృష్ట పిశాచమా! నీకోనమస్కారం. నిన్ను నేనొల్లను. నన్ను నీవుకోరకు. దైవచింత కలిగి శక్తివంచనలేక పురుషప్రయత్నం చేస్తూ మంచిచెడుగుల నాలోచిస్తూ నలుగురూపోయే మార్గానే పోతాను. ప్రపంచంలో అందరూ లాటరీలమూలానే ఆస్తులు సంపాదించి బాగుపడుతున్నారా? ఇక నాతత్వం బాగా మారిపోవాలి"

ఇట్లా అంటూ వుండగా సహవాసదోషంచేత అదృష్ట పిచ్చి కొద్దిగా పట్టిన పూర్ణమ్మ వెంటనే మేలుకొని యిల్లా అన్నది పెనిమిటిని ఓదారిస్తూ. "పోనిండి; ఇదీ ఒకందుకు మంచిదే. ఇప్పటికైనా యీ మాయ మార్గంవదిలేస్తే బాగుపడతాం. మా అన్న కాకితం పంపిస్తే, పోనీ కాస్తనిదానంగా చూస్తే పోయేదిగా? మీకే అల్లావుంటే నాకేంతెలుస్తుంది ఆడదానికి? వాళ్లూవాళ్లూ అన్నమాటలు నిజమే కాబోలు, నా పేర వేసిన రూపాయలు పంపిందను కున్నాను మా అమ్మ. నాకూ నిజం తెలియదు. మొదట్లోచెపితే నా మాట మీద నమ్మకం లేక పోయింది గదా మీకు?"

ఆరోజు మొదలుకొని చాలా మారిపోయినాడు మేటూరు. పెద్ద Reformation (రిఫర్ మేషన్)వచ్చే సింది మనిషిలో. First thing (ఫస్టు థింగ్) crop (క్రాప్) తీసి మేకపాదం అంత పిలక పెట్టాడు. బిళ్ల గోచీ ప్రారంభించాడు, ప్రొద్దున్నే స్నానం, మూడు కాలాలా సంధ్యా, గాయత్రీజపం మొదలు పెట్టాడు. పొద్దునా సాయంత్రం అతను పెట్టే వీభూతి పెండెకట్లు, స్నానంచెయ్యగానే ఆచిన్నపిలక ముడిలో ముడిచిపెట్టే జపాపుష్పంచూచి తీరాలిసిందే.

౧౨

ఈ క్రొత్తఫక్కీన నాలుగు నెల్లు గడిచింది. తరువాత ఒకరోజు ఉదయం మేటూరు పినమామగారు దిగారు. ఏదో బెజవాడలో పనిమీద వచ్చాడాయన. ఈయనకు Madras Secretariat (మద్రాసు శెక్రటేరియట్టు) లో యెనిమిది వందల రూపాయల ఉద్యోగం. ఆరోజు ఉదయమే భోజనాల ముందర సందర్భానుసారం గామాట్లాడుతూ పెనిమిటి విషయం తీసుకొచ్చి, వాళ్ల చిన్నాయనతోటి తన పెనిమిటికి ఉద్యోగం యిప్పించాలన్నట్టు సూచించి వదిలేసింది కూతురు. ఇక మామా అల్లుడు అందుకున్నారా విషయం. విపులంగా ముచ్చటించారు. "Influence (ఇన్ఫ్లూయన్సు) కలవాణ్ణి అవడంచేత Indian Bank Agent (ఇన్డియన్ బ్యాంకిఏజంటు) ను ఎరుగున్నాను. అతనితో చెప్పి try (ట్రై) చేస్తాను. Bank (బ్యాంకి)లో ప్రవేశిస్తావాయేమిటి? మొదట రెండొందరూపాయలిస్తారు నెలకి. తరువాత జీతం హెచ్చు చేయడానికి పరిమితిలేదు" .అన్నాడు మామగారు. 'అల్లాగే'నన్నాడు అల్లుడు. పని అయిపోయిన కారణాన ఆరాత్రేవెళ్లి పోయినాడు మామ గోవిందయ్య.

తరువాత పదిహేను రోజులకి ఒకనాడు ఉదయం పదిగంటలకు please start to-day's Mail. Govindayya (ప్లీజు స్టార్టు టుడేస్ మెయిల్—గోవిందయ్య.) అని టెలిగ్రామ్ వచ్చింది మేటూరికి.

వెంటనే భార్యతో సంప్రదించి పదిహేను రూపాయలు బదులుచేసి రాత్రి పదిగంటలకు బెజవాడలో మెయిల్ ఎక్కాడు మేటూరు. మరుదినం ప్రొద్దున యెనిమిది గంటలకు మద్రాసుచేరాడు.

౧౩

ఆరోజున సాయంత్రం మామగారితో ఆరున్నర గంటలకు ఇండియన్ బ్యాంకు ఏజంటును చూడ్డానికి వెళ్లాడు. ముందుమామగారు వెళ్లిమాట్లాడి అల్లుణ్ణి పిలిచాడులోపలికి. అతను వెళ్లేటప్పటికి యెదురుగుండా పెద్దసోఫామీద జారిగిలబడి Navy cut cigarette (నేవీకట్ సిగరెట్) పీలుస్తూ కూర్చున్నాడు Agent Appadurai (ఏజెంటు అప్పాదురై). మనిషిమాత్రం అంగుష్ఠమాత్రుడు. మొహంలో కళకాంతులు లేవు. "ఎక్కడుందిరా యితనికి సుడి; యేమదృష్టం!" అనుకున్నాడు మేటూరు. Agent (ఏజంటు)ను చూస్తూనే Salute (శాల్యూట్) కొట్టాడు. కొంతమంది ఎవరైనా సలామ్ పెట్టినా, దణ్ణం పెట్టినా, ఎంతో please (ప్లీజు) అవుతారు. Life (లైఫ్)లో ఏంలేకపోయినా సరే ప్లీజ్! ఎవరైనా సలాములుకొడుతూంటే చాలు. అందులోను ఎవరైనా చూస్తూవుండగా అయితే మరీసంతోషం; కాని యీ Agent (ఏ జంటు) మాత్రం వాటికోసం ఆశించే మనిషల్లే కనబడలేదు.

Salute (శాల్యూట్) రిటర్న్ చేయనేలేదు.

ఇంతట్లో "That's my son-in-law" (దట్స్ మై సన్ యిన్‌లా) అన్నాడు గోవిందయ్య అల్లుడు వంక వేలుచూపించి.

"I see that's the candidate"? (ఐసీదట్స్ దీ కాండిడేట్)

"Yes Sir; (యస్ సార్)

"Your qualifications please" (యువర్ క్వాలిఫికేషన్స్ ప్లీజ్)

"I am a graduate Sir." (ఐయామ్ ఎ గ్రాడ్యుఏట్ సార్)

"Your age ?" (యువర్ ఏజ్)

"Twenty five Sir;" (ట్వెన్‌టి ఫైవ్ సార్)

"That's al right you may go."

(దటీజ్ ఆల్ రైట్ యు మె గో.)

"Good night Sir" (గుడ్ నైట్ సార్)

ఇల్లా సంభాషణకాగానే ఆగదివదలి బయటపడి




"దీనికర్థ మేమిటి? ఉద్యోగం యిస్తాడన్నమాటా, లేదన్న మాటా?" అని మేటూ రాలోచిస్తూ వుండగామామగారు కూడా వచ్చాడు. "సరే లేవోయి మాట్లాడాను. పిటీషన్ పెట్టుకుంటే ఆర్డరుపంపిస్తానన్నాడు వారంరోజుల్లో వెంటనే దరఖాస్తుచెయ్యి" అంటూ మోటారు బస్సు ఎక్కాడు యింటికిపోవడానికి. అల్లుడూ ఎక్కాడు ఆయనతోటి.

మరునాడు టపాలోపంపాడు మేటూరు అప్లికేషను జాగ్రత్తగారాసి. దరఖాస్తుపంపిన రాత్రే బయలుదేరి మరురోజుకి బెజవాడ చేరాడు. యథాప్రకారంగా జపం గిపం సాగించాడు రోజూ. ఒకవారం రోజుల్లో చేతికొచ్చింది మద్రాసులో ఇన్‌డియన్ బ్యాంకిలో డబ్బైరూపాయలమీద ఉద్యోగానికి ఆర్డరు. ఆర్డరురాగానే జమీందారుగారి దగ్గర శెలవుతీసికొని family తో (ఫ్యామిలీ) సహా చెన్నపట్నం చేరాడు బంగారు రావు. (మేటూరు అనికూడా వ్రాసుకోడం, పిలిపించుకోడం లేదు పాపం, లాటరీస్ గీటరీస్ అన్ని fail (ఫెయిల్) అయినప్పటినుంచి) కొత్త ఉద్యోగంలో ప్రవేశించి కాలక్షేపం చెయ్యడం మొదలు పెట్టాడు.

౧౩

కొంతకాలం యిల్లా సుఖంగా గడిచింది. ఇంతలో అతని అత్తగారికేం బుద్ధిపుట్టిందో యెప్పుడో యివ్వటమేమిటని యివ్వదలచిన మూడువేల రూపాయలను కూతురు పూర్ణమ్మపేర రాసి చెక్కు పంపించింది. బాగా చురుగ్గా పనిచేసేవా డవటంవల్లనూ, మామగారి ప్రాపకం కొంతవుండడంవల్లనూ, ప్రవేశించిన ఏడాదికే, నెలకు నూరురూపాయల జీతం యిచ్చారు బంగారు రావుకి. ఇంతట్లో Master Matur (మాస్టరు మేటూరు) పండంటి కొడుకు కలిగాడు. ఇక్కడినుంచి యీదంపతుల ఐశ్వర్యం బాగావృద్ధిపొందిందని చెప్పచ్చు. కొంచెం కొంచెంగా అప్పుకూడా తీర్చేశాడు బంగారుడు. అంతా కులాసాగా నడిచింది చాలాకాలం.

ఎప్పుడో అనుకున్న అదృష్టం, అంతనిరీక్షిస్తే రాని అదృష్టం, అంతవెంబడించి వేటాడితే అందని అదృష్టం, ఇన్నాళ్లకక్కడా కలిగిందని భార్యాభర్తలు మిక్కిలి సంతోషించారు. ఒక్కమాటు వెనక్కితిరిగి చూసుకుంటే లాటరీలపిచ్చి, బెజవాడట్యూషన్, ఆరోజులూ మిక్కిలి నవ్వుకలిగించేవి వారికి, ఆశ్చర్యపడేవారు. క్రాపుతీసి పిలకపెట్టడానికి, సంధ్యావందన మవలంబించడానికి, జపానికి, అదృష్టం కలిసిరావడానికి ఏమైనా సంబంధం వుందో లేదో తెలియదు. కాని యీమార్పులు మొదలెట్టి నప్పటినుంచి మంచికలిగి ఐశ్వర్యమంటింది కాబట్టి యీఅభ్యాసాలు వదిలిపెట్టాడు కాడు మేటూరు.

ఈయనవిషయం కొన్ని సంవత్సరాలు పోయింతరువాత విచారిస్తే చాలా గొప్పఅదృష్టవంతుడై బ్యాం

కులో గొప్పపదవిని స్వీకరించి, చివర రోజుల్లో రావు సాహెబ్ బిరుదును పొందాడని తెలుస్తుంది. "అదృష్టమంటే అల్లాకలిసిరావాలె. అదృష్టవంతులంటే ఆదంపతులే" అని అనుకునేవాళ్లు వాళ్లనిచూచినవాళ్లందరూ.

యోగంవుంటేసరి మనిషికిసరిగ్గా కాలానికీనాటంతటవే మారిపోతాయి నక్షత్రాలు. మన అదుర్దాదేమీ పనిచేయదు. Three cheers to Mr. & Mrs. Metur. (మిస్టర్ అండు మిసెస్ మేటూరుకి జయ్.)

---

# కర్షకా!

జాస్తి శ్రీరాములు చౌదరి గారు

సలసలమండు వేసవినిఁ జల్లని చెట్టులనీడ వీడి నీ
పలుగును బాఱఁ బల్లికను బట్టుకయ ట్లుడికించు నెండలో
పల హిమశైలమున్ దొఱఁగివచ్చు ప్రవాహమువోలెఁ జెమ్మటల్
ద్రొలగగ కాల్వలై పొలములోఁ బని సేయుదు వెంత యోపికో ?

వర్షము లెండనాక వలువాయను రేయను వేళ లేకయే
వర్షమునందు నీవు పలుపాటులఁ బొందెదవోయి తెక్కవోన్
హర్షసుఖంబు లెట్టివో మహాధనవంతుఁడవయ్యు నేరవో
కర్షక ! కష్టజీవివి యొకండవు నీవెసుమీ జగానకున్

తఱి యేతెంచెను మొక్కనాటుటకు నేత క్షేత్రమందంచుఁ గా
తరముం బొందెదవన్న ? యొక్కపుడహో దైన్యంబుఁ దోపింపనే
వెరవోయంచును జింతనొందెదవు సంవృష్టుల్ భువిన్ లేక యా
తురతో నుందువు కర్షకా ? సతము నీదుస్వాంతమందున్ గటా ?

సోకును బొంద కెండపొడసోకినఁ గందెడు దేహకాంతులన్
షోకుగఁ బట్టణాల నగుచుం దిరుగాడి ప్రభుత్వదాసు లా
మూఁకలు తాత లేర్పఱుచు మూటలఁ జిమ్ము లెగానియారయన్
లోకువగారె నీకు మదిలోఁ దలపోయుము వారిఁ గర్షకా !

విద్యాహీనుఁడ లోకమంతకును నే భృత్యుండనంచు న్మదిన్
చోద్యంబందకు నీవు భృత్యుఁడవా ? యీ సుక్షేత్రముం బాసి పల్
విద్యల్ నేరిచి పట్టభద్రులగుచుం విఖ్యాతికై దాసులౌ
నుద్యోగంబులవారు భృత్యులో మది న్నూహింపుమా కర్షకా ?

---

# అద్దెకొంపలు

భమిడిపాటి కామేశ్వరరావు గారు

ఒకరి తాలూకుకొంప, మరియొకరు, ఆ ఒకరికి అసహ్యంవేసిన తక్షణం ఖాళీచేయగల పద్ధతిని, తాత్కాలికంగా, అసలుకి మోసం రాకుండా వాడుకుంటూ, అట్లా కొంప వాడుకుంటూన్నందుకుగాను వరతుప్రకారం ఆ ఒకరికి (అనగా కొంపయజమానికి) నెలనెలా రొఖ్ఖమూ వేణా "ఇంత" అని దాఖలు చెయ్యవలసిన ప్రతిఫలం ఉందే, దాన్నే, "అద్దె" అంటారు. దీన్నే కొందరు (తెలుగువాళ్లే) "బాడుగ" అంటారు. అన నీండి. "అద్దె" అనడం కంటె "బాడుగ" పాడుగా లేదు. అట్టి సందర్భంలో, ఆ కొంపకి "అద్దెకొంప" అనీ, ఇచ్చిన వాడికి "అద్దెయజమాని" లేక "ఇంటి ఆయన" అనీ, పుచ్చుకున్న వాడికి "అద్దెకున్నాయన" లేక "అద్దెకొచ్చినాయన" లేక "కాపరం ఉన్నవాడు" అనీ చెప్పుగుంటారు. ఆస్తియొక్క దాన విక్రయాలు అద్దెతో పోల్చిచూడగా—దానంలో, దాత ప్రతిఫలం కోరడు (కొందరు కీర్తికోరి తీరతారు), ప్రతిగృహీత ఎల్లకాలమూ వాడుకుంటాడు. విక్రయంలో, అమ్మేవాడు ప్రతిఫలం తింటాడు, కొనేవాడు ఎల్ల కాలమూ అనుభవిస్తాడు (పేచీలు లేకుండా ఉంటే!); కాని, అద్దె విషయంలో, యజమాని ప్రతిఫలం లాగు తూంటాడు, అద్దెకున్నవాడు తాత్కాలికంగా ఉంటూంటాడు. హక్కువారిదీ, భుక్తంపీరిది!

హయాణశకంతో బయలుదేరిన ఉద్యోగాలల్లో సర్దుకుంటొచ్చిన వారికి కారణాంతరాలవల్ల బదలాయింపులు మామూలై గ్రామాంతరవాసం తప్పనిసరి అవుతొచ్చినప్పణ్ణించీ "అద్దెకొంపలు" అనేటటు వంటివి జనించి ఉంటాయి. ఇట్టివి బస్తీలలో విరివిగానూ, పల్లెలలో సకృత్తుగానూ వెలవడం సహజం. ఏదేనా ఊరికి ఓ కొత్తకోర్టుగాని, అడిషనల్ కోర్టుగాని, పాత తీర్థంగాని, పుష్కరంగాని, మరి ఏదో ఒక ముఖ్యసంస్థగాని వచ్చే కాలమే అద్దెకొంపలకి చిత్త. అటువంటప్పుడు, అదివరదాకా ఒకరికి చాలీచాలకుండా ఉంటూన్న ఇల్లు, వారికే తెగఎక్కువై పోయి ఊరుకుంటుంది. ఆమట్టున, వారు, అ ఉన్నదాల్లోనే కొంత అద్దె భాగంకింద కేటాయిస్తారు (తమమేలుకోరేవాళ్లు కూకలేసినమీదట). కాబట్టి, కొన్నికొన్ని పుట్టుకచేతనే అద్దెకొంపలుగా కూర్చినవి; కొన్నికొన్ని పెంపకంచేత అద్దెకొంపల లీస్టులో చేర్చినవి; కొన్నికొన్ని బలిమిక్షేత అద్దెకొంపలుగా మార్చినవి. ఆంగ్లవిద్య నేర్చిన వాళ్లల్లోచాలామందిది జన్మస్థానం పల్లెటూరైనా, ఉద్యోగస్థానం బస్తీయే అవుతూంటుంది. వార్ని, ప్రయాణాల్లో, ఎవరేనా, "తమ దేవూరు ?" అని ప్రశ్నిస్తే, పైరెండింటల్లోనూ ఎందుకో అందుకు ఎక్కువ ప్రసిద్ధి కెక్కిన ఊరుంటుందే అదే తమదని చెప్పేసి దాటుగు పోతూంటారు. ఏమయితేంః ఒక ఊళ్లో కొంపపాడు. దాన్ని చూస్తే వారికి మంట. గృహాభిమానం అట్లా చచ్చినప్పుడు, గ్రామాభిమానం కూడా ఎట్లా చస్తుందో చెప్పచ్చు. కాని, తద్వారా దేశాభిమానం కూడా చావకుండా ఎట్లా ఉంటుందో ఋజువు చెయ్యమంటే మాత్రం కష్టం. అల్లాంటివాళ్లు బస్తీలో అద్దెకొంపకి మేతవేసి, పల్లెటూరిలో స్వంత కొంపకి కడుపు మాడుస్తూంటారు. ఆ పల్లె కొంపలో ఎవరేనా కుదురుకుని తమరికి అద్దె ముట్టచెప్పాలని కాదు వారు అహోరించేది! ఎవరేనా ఉండి దీపం పెట్టుగుంటే చాలని! అదీకాదు! కొందరు, అ దీపంనిమిత్తం స్వంత ఖర్చుమీద కోతిమార్కు కిరసనాయిలు డబ్బాకుడా (ఉండగలవారికి) సప్లయిచేసే వాళ్లుకూడా ఉంటోచ్చారు. కాని, అనేకడిపార్టుమెంటుల ఉద్యోగాలు ఇప్పుడు పల్లెటి దిక్కునకూడా ఆవిర్భవించడం వల్ల పైస్థితి కొంచెం తిరగబడి అక్కడ సమేతూ అద్దెలు వస్తూనే ఉన్నాయి, ఇటీవల. అదీగాక, పొలాలవల్ల రాబడి అనేది విస్తారం ఎండకి ఎండి వానకి తడిసి మాసిగలు పడ్డమీదట సాలుకి ఓసారి (మహాఅయితే రెండుసార్లు) వస్తేరావచ్చు

అనే బాపతుది అవడంచేతనున్నూ, అద్దె అనేది సునాయాసంగా, నెలనెలా, నమ్మకంగా వచ్చేది అవడం చేతనున్నూ, అద్దెమీద జనానికి మోహం ఎక్కువై, "పల్లెటూర్లో పాతిక ఎకరాలు ఉండే కంటే బస్తీలో నాల్ల నడాన్ని మాంచి మొగలో ఒక్క అద్దె కొంప వుంటే చాలదుషోయ్?" అనే అభిప్రాయం బాగావేళ్లుబారింది. అక్కణ్ణించి "వీరికి సాలుకి ఓ వంః బస్తా నిరాటంకంగా వస్తుంది" అని పించుకోడం కంటె "వీరికి అద్దెలవల్ల సాలుకి ఓ వంద వస్తుందపు!" అని పించు గోడమే పెద్ద మనిషి తరహాకి లక్షణం అయింది.

ఎట్లా అయితేం, అద్దెకి మోజు ఎక్కువై, అన్నింటితో పాటు అది కూడా ఒక "ఫాషన్" అయింది. అనగా, ప్రతీవాడూ, ప్రతీదీ, నెలకి, రోజుకి, క్షణానికి కూడా అద్దెకివ్వడం సాగించాడు. మార్వాడీ డబ్బుగాని నగలుగాని అద్దెకిస్తాడు. చాకలి బట్టలు అద్దెకిస్తాడు. వారస్త్రీ శరీరం అద్దెకిస్తుంది. కార్మికుడు కరచరణాలు అద్దెకిస్తాడు. లాయరు తెలివి తేటలు అద్దెకిస్తాడు. డాక్టరు ఆరోగ్యం అద్దెకిస్తాడు. ఉపాధ్యాయుడు తెలియడం అద్దెకిస్తాడు. గబ్బిలపు ఉద్యోగి మనస్సు అద్దెకిస్తాడు. మంగలి శూన్యత్వం అద్దెకిస్తాడు. వాహనం వేగం అద్దెకిస్తుంది. ఇల్లాగా, సర్వత్రా అద్దె వ్యాపించి ఉంది. కాబట్టి, కొంప అద్దెకివ్వడంలో విడ్డూర్యాం బొత్తిగా లేదు. కొందరు గడవక, కొందరు మొహమాటం చొప్పున, కొందరు ఒక్కరూ ఉండలేక, కొందరు దురాలోచనతో, కొందరు దూరాలోచనతో, కొందరు సంక్రమించిన ఆస్తిలో కొంత ఊరికే ఉండిపోడం ఎందుకని, కొందరు సాటివాళ్లు ఇస్తూంటే తమరు తీసి పోవడేం అనీ, లాంటి అనేక కారణాల వల్ల యజమానులు కొంపలు అద్దెకిస్తూంటారు. ఒకడు తనవర్ణం వాడికి గాని ఇవ్వడు. ఒకడు తనశాఖవాడికే ఇస్తాడు. ఒకడు బ్రహ్మచారికిగాని ఇవ్వడు. ఒక్కొక్కడు డిస్ట్రిక్టు మునసబులకే ఇస్తాడు (సరిహద్దు గోడ కేసులు, స్వంతానివి, చాలా వుండి). ఒకొక్కడు పోలీసు వారికిగాని ఇవ్వడు (తను ప్రతీవాడి మీద ఎగరచ్చునని, మహా!) ఒకొక్కడు గృహస్థునికిగాని ఇవ్వడు. సాధారణంగా ఎవరుకు నా తమ బంధువులకి యివ్వరు (సంసారపు గుట్లు బయట పడతాయనీ, భోజనానికి దానికీ పిలుస్తూండా లనీ, మొత్తంమీద కొంత ఎంగ ఎందుకే నామంచిదని) ఏమైనా సరేగాని, అద్దె కొచ్చేవాడు తేగలపాతర సంతానం వాడయితే, ఎంతశాంతుడైన యజమానికైనా సరే అరికాలిమంట నెత్తికెక్కుతుంది. (కొంప నిమిట్లమీద ధ్వంస ధూళి చేస్తారని) అందుచేత, ఏకపుత్రుడో లేక దత్తుడో అయిన పెళ్లి కుమారుణ్ణిచూస్తే కన్యాదాతకి పథ్యమైనట్టు, అన్నహితవు లేని నెలభోక్తనిచూస్తే హోటలు మేనేజరుకి ప్రాణమైనట్టు, పోడిఎరగని తడిగల ఇస్తోక సంసారం అద్దెకొస్తున్నారంటే. ఇంటివారు ఎగిరిగంతేస్తారు. అందులో ఆ అద్దెకువచ్చేవాడు ఇరుపార్శ్వాలనా అన్నవాడు లేని వాడయితే ఇంటివారికి మరీయిష్టం. ఒకవేళ ఉన్నా, మాటలుగాని, చూపులుగాని, భోయినాలుగాని, మామూగాని లేనివారయినా చాలు.

అవసరం కలగగానే, తలదాచుకునేటందుకు స్థలం దొరికి తేచాలని, జనం ఘూటుఘూటు మంటూ కొంపల కోసం తిరుగుతారు. "అద్దెకివ్వబడును" అని కట్టినవ్నీ లేనివీకూడా తణిఖీచేస్తారు. వాటి యజమానుల్ని పట్టుకుంటారు. వ్యవహారం చొప్పున యజమానులు తమ అద్దె భాగంయొక్క శ్రేష్ఠతా, సౌకర్యమూ, హంగూ వగైరాలగురించి. ఒక గంభీరోపన్యాసం ఇచ్చి, లోగడ అద్దె ఖాళీచేసినవాళ్ళయొక్క చెడ్డతనం, లోట్లు, పిసినిగొట్టుతనం, పేచీకోరు స్వభావంగురించి— (మీవరెల్లాంటివారైతే మనకేంగాని అంటూనే) విస్తారంముచ్చటించి, ప్రస్తుతం అద్దెకొచ్చినవారితో ఏదో బాదరాయణసంబంధం అతుసమర్థించి, తమయొక్క స్వార్థత్యాగమూ, జనాన్ని గూర్చి తాముపడుతూన్న పాట్లూ, అద్దెలకివ్వడంవల్ల తమకుండే నష్టాలూ వాటిని, తాము లెఖచెయ్యకపోనీ ఎవరో పరాయివాళ్లు సుఖిస్తారుగదా అదే తమరూ కోరేది తాము ఈవ్యాపారంలోకిదిగడమూగురించి కొన్నిడప్పీలు కొట్టి, అద్దెకొచ్చినవాణ్ణి గభరాయింపజేస్తారు. దాంతోటి ఆవచ్చినవాడు, కడుపునిండి—మస్తాబుచేసిన తాంబూలాలు కరపుపిల్లయొక్క పైమెరుగుచూసి తాంబూలాలు తప్పకున్నట్టు—అడ్వాన్సుపారేసి చేరేస్తాడు; కాని, కాపురం

చేసిచూసిన మీదటగాని కమామీషు పూర్తిగా తేల్తాం డదు. కొన్నాళ్లు నిదానించేసరికి ఒకొక్క అద్దెకొంప యొక్క ప్రత్యేకపు చిక్కులు అద్దెకున్నవారికి నాటి, జీర్ణించి, శల్యగతం అవుతాయి.

అజలగాయతు అద్దెకున్న వాళ్లల్లో సణుగుడు బయల్దేరుతుంది. సాటివాళ్లంతా చేరి చిక్కులువెళ్ల బోసు కుంటుంటారు. "మా భాగం దివ్యంగానే ఉంటుందికాని, వీధికి ఫర్లాంగుదూరం దీంతగలెయ్యా! ఛత్తే కేక అందదు. రాత్రెళ్లప్పుడుచావే"అని ఒకరు. "మా భాగం చందుగా పెట్టెలాగ కుదిమట్టంగా ఉంటుందికాని,ఒక్కటొచ్చింది: స్త్రీలకి ఇబ్బంది వచ్చినప్పుడు మాచెడ్డ ఇబ్బంది. వీధు లోంచి చుట్టుతిరిగి దొడ్లోకి వెళ్లాలి." అని ఒకసంసారి. "మాకు దొంగభయం దొ్రటభయం లేవుగాని, ఖర్చుపడ్డ జనాభా యావత్తు మాగుమ్మంలోంచే నడవడం" అని ఒక ఓఘాయిత్యుడు. "మాకొంపకి మట్టుకిరోగంటగాని, వానాకాలంమాత్రం నరకం. కాస్తసంయుక్తాగ్రగుడం కూడా ఉండదు రోడ్డుమీంచి కొంపలోపడడానికి" అని ఒక నారాయణరావు. "మా ఇల్లు మహా ఎకాక్క ఇల్లు! కానయితేం, దొడ్డి బహుకుశలం. ఒకొక్కరే వెళ్లాలి, రావాలి!" అని ఒక కుసుమయ్య. "మా ఇల్లు మాత్రం తీసిపోయిందిటగాని, ఒక్కటే లోటు! గాలిరాదు. రాకపోతే పీడాపోయిరి. ఇదివరకే ఉందేమో అంటే దీపం ఆర్పడానికికూడా లేదు." అని ఒక ఆంజనేయులు. "మావాటా పెద్దదే అనడం, కాని, అనేక మాట్లనించి చూస్తాను, పురుళ్లకి ఇంతా అంతా కాదుకద చిక్కు!" అని ఒక బ్రహ్మయ్య. "మా ఇల్లు ఫస్టు. కాని కొంపకి చుట్టంవచ్చేసరికి ఇంటాయన పెళ్లానికిమంట. స్నానానికి వెళ్ళి నూతివగ్గరచేదిడు నీళ్లుపోసుకుని రెండోచేద తీసే సరికి యజమానివచ్చి చేద అటకాయిస్తాడు— నీళ్లు వీధులో కెడితే పన్ను అంటు గుంటుందట" అని ఒక కూర్మయ్య. "మునిసిపాలిటీపన్ను హెచ్చినప్పుడుకూడా మా ఇంటి అద్దె హెచ్చుతూనే ఉంటుంది" అని ఒక వ్యాపారి. కొంపలు ఇతరులవిగనక ఇలాగంటి లోట్లు మాత్రమే చెప్పుగుంటూ, ఆ అద్దెకే అంతకంటె మంచి కొంపదొరికితే లేచిపోదామని వీరూ, ఆకొంపమీదే (దమ్మిడీ మరమ్మతైనా లేకుండా, ఉన్నవారిని పొమ్మని, వచ్చేకొత్తవారిదగ్గర) మరినాలుగు రూపాయలు లాగా లని యజమానులూ తీవ్రయత్నాలుచేస్తూనే ఉంటారు. కర్మవాదన ధర్మమా అని ఉన్నస్థితికే సరిపుచ్చుగుని దేవు ళ్లాడుతూంటారు.

అద్దెలకి ఉండేవారిని నాలుగుభాగాలుచెయ్యొచ్చు. అనగా అల్పాలు మినహాయించగా, వీరు నాలుగు రకాల కిందకి వస్తారు. మొదటిరకం: ఇంటివారు పరోక్షముం దుండగా, యావత్తుకొంపలోనూ ఉండే ఏకకుటుంబం. వీరిది స్వరాజ్యం. వీరి అరచెయ్యిదుర్భిణీకింద పెడితే, లేఖలు గోచరించి తీరతాయి. కొద్ది మరమ్మతు వగైరా చేయించడానికి ఇంటివారు రావడానికి వీల్లేక అద్దెకింద చెల్లురాసి వీళ్లే ఇంటిబాగు చూసుగుంటారు. గృహం పరులదే అయినా పెద్దమరమ్మతు అగత్యమో, అద్దెలో పెంపకమో వచ్చేసరకూ వైదీకానికి గూడా వీరు "స్వగృహే" అనేటట్టు ఉంటారు.

రెండోరకం: ఇంటివారు పరోక్షముం దుండా, మధ్య ఉమ్మడి హాలుగల రెండు సమాన వాటాలలో ఉంటూండే రెండు వేరు సంసారాల వాళ్లు. చేరిన కొన్నాళ్లు వీరు క్షీరనీర న్యాయ్యంగా ఉంటారు. వారిలో ఒకవాటా ఆవిడ గడుసుదీ రెండోవాటా ఆవిడ మెత్తనిదీగనక అయినా, మొదటి ఆవిడ రెండో ఆవిణ్ణి కీలుబొమ్మనిజేసి, ఆడించి, దానిచేత చాకిరీ చేయించు గుని, దాని యిల్లు ఓకడకి తెస్తుంది, ఇది అరుదు. సాధారణంగా జరిగేరీతి వేరు. ఓవాటాలో జనంతక్కువ ఉంటారు. ఆఅద్దెకే,సమానవాటా అయిన రెండోదాల్లో ఎక్కువ ఉంటారు. ఎక్కువవారు తక్కువవార్ని తోసు గొస్తారు. అల్లాంటప్పుడే యుద్ధాలుజరగడం. ఎటొచ్చీ, కొన్నిచిన్నవి,కొన్ని పెద్దవి. ఉమ్మడిస్థలం ఇద్దరూ వాడు కుంటారుగాని ఎవరూ తుడవరు. ఒకవేళతుడిస్తే, ఇద్ద ర్లోనూ లౌక్యం ఎవరుఎరుగరో వాళ్లు తుడుస్తారు. ఉమ్మడిహాలు తమరొక్కరే వాడుకోవాలని ఇద్దరూ ప్లానువేస్తుంటారు. ఓరింటికి బంధువులువస్తే, వారు ఆబంధువులికి ఉమ్మడిహాలులోనే విడిది యిస్తారు. రెం

డోవాటావాడు, ఉమ్మడిహాలుమీద తనహక్కు నాశనం అయిపోతుందని పెళ్లాంతో కూడ బలుక్కుని, తన యితరపనులు మానుకుని తనుకూడా ఓచాప తనపక్క వేసుగుని పెద్దప నున్నట్టు ఎడో రికార్డు ముందేసుగుని సృష్టిలో లేనికాగితం వెతుకుతూంటాడు. ఓవాటాదారు ఉమ్మడిహాలులో ఏతిరగలో రోలో పెట్టుగుంటే, రెండోవాడు ఏ నులకమంచమో, పిడకలతట్టో అరువేసా తెచ్చి పెట్టించి మరోపని చూసుగుంటాడు. కొంతకాలం జరిగిం తరవాత ఓరింటో ఏ తద్దినమో అయినప్పుడు, రెండోవాటా ఆయన అచ్చాడీలవంటి మ్లేచ్ఛుల్ని తీసుగొచ్చి సిగరేట్టుపొగతో ఘుమఘుమ లాడుతూ ఉమ్మడి హాలులో ప్రసంగిస్తూంటాడు. రాత్రెళ్లు వీరివేపున వారూ, వారివేపున వీరూ లఘు, గురు, మరి ఇతరమైన శంకలు తీర్చుగుంటూండడం, ఉదయాన్నే లేచీ ఆకాశరామన్న మీదపెట్టి ఒకర్ని ఒకరు అక్షులూ పక్షులూ రాల తిట్టుగోడం.స్వతస్సిద్ధంగా చేతులోవుండే వాయువు జబ్బో, లేక మనస్సులో ఉండే ఇతరతెగులో కాని, వీలునుబట్టి పుల్లి స్తరాకులు అవతల వాటాస్థలంలో వెయ్యాలనే ప్రతీవాళ్లూ చూడడం. ఒకచోట, రాత్రి ఎనిమిదిగంటలవేళ, ఒకవాటా ఆయన, "లంకాదహనం" చేస్తూ అరుగుమీద కూర్చుని ఉండగానే రెండోవాటా ఆవిడవచ్చి, ఊరంత పుల్లి స్తరాకుల మోపుతెచ్చి మొదటి వాటాకి ఎదురుగుండా దిబ్బన గిరవపెట్టగా,

ఆయన—చెట్టంతమనిషిని ఇక్కడ ఉంటూండనే ఏమిటమ్మా ఆపనీ?

ఆవిడ—ఏం లేదండీ! మాయింటో భోయినాలు అయినాయి, పుల్లి స్తరాకులు.

ఆయన—ఆమాట నాకూ తెలుసు, మావేపునేనా మీరు వెయ్యవలసింది?

ఆవిడ—ఏంజెయ్యమన్నారు?

ఆయన—సిగ్గులేదుటమ్మా! మీవేపున వేసుగోలేరూ?

ఆవిడ—మాకు మైలగదా మరీ, మావేపు నెల్లా వేసుగోడం, మైలవిస్తర్లు?

ఆయన—అహోటా! ఎంత రాతువమ్మా!

అనేసరికి ఆవిడ గొల్లున రాగాలెట్టి, (ఇది, స్త్రీయొక్క ద్వితీయాస్త్రంగా మరీ!) రెండోవాటా వచ్చినాడు, ఆడవాళ్ల వ్యాపారలలోకి జొరబడి, తనఘోషా చెడగొట్టి, తనని అనవచ్చినమాటా అనరానిమాటా అని నానాగోలా ...త్రించాడని మొగుడుగారికి రిపోర్టుచేసేసరికి, వాసు భేతాళుడల్లావచ్చి "మావాళ్లతో ఏమిట్రా ప్రేలాప్, మావిస్తర్లగోల నీకెందుకురా? పుంఢాకోర్! చూడు, నీఉద్యోగం లాగించేస్తాను" అని ఆయనమీద కలియబడగా మేజస్ట్రీటంత పనిజరిగి, జనంవచ్చి వారిని విడదీసే సరికి కోడికూసింది.

మూడోరకం! ఈరకంకూడా యజమానులు పక్షమందు ఉండేదే. అయితే దీల్లో మూడు చిల్లరి రకాలున్నాయి. ప్రథమం! నానా సంసారాలవాళ్లు గూడు పుఠాణీలా ఉండే ఒక అద్దెకొంపల గుత్తిలోనో, లేక పోలీసు లయినులా ఉండే అద్దెకొంపల మాలలోనో ఉండేవారు. వీటికిదొడ్డి, పాకీదొడ్డి, నుయ్యిలాంటివి ఉమ్మడి. దొడ్డికి మరుగుఉండక స్త్రీలు బాధపడతారు. పాకీదొడ్డిదగ్గిర ఉదయం అయినులగాయతు సుమారు ఏడు వరకూ నూరుగజాలపోటీ పందెంలాంటివి జరుగుతూండడంవల్ల రద్దీ ఎక్కువ. నూతిప్రాంతాలకి పగటిభాగంలో మొగాళ్లు వెళ్లలేరు. ద్వితీయం! పైనిచెప్పినలాంటి వాటిల్లోనే బ్రహ్మచారులు (తిరుచు విద్యార్థులు) గాని తాత్కాలిక బ్రహ్మచారులుగాని ఉండడం. ఇందులో ధూమస్తంభ నిర్మాణం జరుగుతూంటుంది. "టీ" పానం ఉంటుంది. కిల్లీ ఉమ్ముల అసహ్యం కనిపిస్తుంది. నాజూకు చేతిగొలుసులు, సిల్కుకండువాలు, మనీపర్సులులాంటివి స్వతహా జడపదార్థాలైనా ఎగిరిపోతూంటాయి. కొత్తరిష్టువాచీలు తప్పకుండా తిరుగుతూంటాయి గనక, నడుస్తూంటాయి. తృతీయం! పైనిచెప్పినలాంటి వాటిల్లోనే కొన్ని వాటాల్లో సంసారులూ, కొన్నింటల్లో తాత్కాలిక బ్రహ్మచారులూ కలగలుపుగా ఉండేవి. వీటిలో, చెప్పేదేముందీ? జాబుల్లూ, ...నిట్టూర్పులూ, రేపులచూపులూ, మాపులతాళ్లలూ ...టివి ఉంటాయి.

ఇక నాలుగోరకం! దీల్లో, ఇంటివారు ఒక వాటాలో ఉండగా, వారి దివ్యసముఖమందు, తక్కిన వాటాల్లో అద్దెకొచ్చిన వాళ్లుంటారు. ఇల్లా ఉండడం అద్దెకివెళ్లేవాడి సాహసానికి పరమావధి. అద్దెకివెళ్లేవాడికి ఇది కత్తిమీదసాము, పులితో చెలగాట. ఇంటివారి ఉద్దేశం తమరు పాలకులమనీ, ఇవతలవాళ్లు పాలితులనీ; తమరి హృదయం విశాలమనీ, ఇవతలవారిది ఇరకాటం అనీ; తమరి అంతస్థుకి కొన్ని వందల మెట్లు కిందిలోకంలో అద్దెలిచ్చేవాళ్లు ఉండాలని. ఇంకాకొందరి అద్దె యజమానుల ఊహ ఏమిటంటే, అద్దెలవాళ్ల యొక్క రాకపోకలు, రీతులు, ఖర్చులువగైరా అంతాకూడా తమ ఇష్టానుసారంఉండాలని. ఈఅభిప్రాయం ఆయనదేకాదు. ఆయన కుటుంబానిది. కాబట్టి, ఆయనకి ఆయన తల్లిదండ్రులకి, పుత్రీపుత్రులకి, పౌత్రదౌహిత్రులకి, లేకపోతే వీరి ఆర్డరు పొందిన వారికి— ఇంతమందికీకూడా అద్దెలవాళ్లని ఆంక్షలు పెట్టడానికి జన్మహక్కు ఉంది. కాని, వీళ్లనేంమాశారూ! వీరంతా ఓయెత్తూ, అద్దె యజమానురాలుగారు ఒక్కత్తే ఒకయెత్తూ! ఒకొక్క యజమానురాలి చర్య అద్భుతం! అసలు ఆవిడ గృహిణి. అందులో అద్దెకొంపల రాణి, అందులో కాస్తస్వాతిశయంపడా ఉండే ఆవిడ అద్దెకొచ్చిన వాళ్లని ఎల్లాచూస్తుందనితను ఊహాశక్తిచేసినకోడల్ని అత్తగారు ఇంతగా రాకాయించదు! నీతితప్పిన పెళ్లాన్ని తాళి గట్టిన ముగుడు ఇంతగా దండించడు! నేరంచేసిన పాపిని దండనాధికారి ఇంతగాదుయ్యబట్టడు! చవట పరిపాలన చేసే మండలేశ్వరుణ్ణి సామ్రాజ్య మంత్రి ఇంతగా ఆజ్ఞ పెట్టడు! అద్దెల వాళ్ల ఆచారం గర్వం, తన ఆచారం మడి. తన వస్తువు ఇంకోరి ఇంట్లో కనబడితే, వారిది దొంగతనం; ఇంకోరి వస్తువు తనింట్లో ఉంటే, "ఎక్కడికి పోతూంది! పొరపాటు!" అనడం. అద్దెల వాటాల తూముల్లోంచి ప్రవహించేది అపవిత్రమైన కంపుముండానీరు, తనవాటాతూముల్లోంచి వెళ్లేది పావనమైన అభిషేకజలం (ఇదంతా కలిసి ఒకటేతూము. అయినాసరే ఆవిడ వాదన అంతే) దొడ్లో తక్కినవాళ్ల వాటాల్లో. కానీఇన్నీ కేవలం తనవే. నఖుసురూవచ్చే నూతి దగ్గిర తమరితాలూకు పిల్లగుడ్డలు మాత్రమే జాడించవచ్చు! అద్దెలవాళ్లు గనక ఆపనే అక్కడ చేస్తే, "ఎవళ్లకొచ్చింది ఈవినాశకాలం! అన్నం తింటూరా, గడ్డి తింటూరా!" అంటూ తను ఆపనిచేస్తూనే, ధరీ అంచూ లేకుండా లెక్చరు పూర్వకంగా తిట్టడం. ఇవతలవాళ్లు ఏమైనా సమాధానం చెప్పబోతే, "ఉంటే ఉండు, సాయంత్రవేళకి నాకొంప ఖాళీచెయ్! మరే! నన్నాట్టే వాగించకు! నానాలిక మంచిదికాదూ!" అని తారస్థాయిలో అరవడం ఇన్నిహారతులూ అయింతరవాత తనకి అవసరం వచ్చే సరికి, పూర్వ చరిత్ర యావన్మందీ మరిచిపోయినట్టు, లేని నవ్వు తెప్పించు గుంటూ రావడం. (ఓగంట తిరక్కుండానే) తన పని ముందు అయ్యేటట్టు చూసుగోడం. ఒకవేళ తమరింట్లో వంటకాకపోయినప్పుడు, తనతాలూకు ఏమనమడికో అద్దెవాటా వాళ్లింటో అన్నంపెట్టించి, చెయ్యికడిగేసరికి వాడు "అమ్మమ్మా, జియ్యా" అనో "అమ్మమ్మా, యాక్కు" అనో అంటాడనుకోండి మాట వరసకి. ఆఫళంగా ఆవిడపళ్లు కొరికి పెదిమి కరుచుకొని వాణ్ణి మొట్టి చంపేటంత అభినయంచేసి, రెక్కట్టుగుని బరబరా ఈడ్చుకు పోతూ, "వెధవ ఏడుపూ నువ్వూను, కాస్సేపు నిమ్మళించుగోకుండాను!" అంటూ తిట్టి అన్నంపెట్టించిన వాటా వారి కిటికీకి ఎదురుగుండానే వాణ్ణి కూచో పెడుతుంది. నాలుగైదు సార్లు ఈవైఖరి భరించి, తరవాత సారి, ఆవాటా ఆయన "అమ్మా! ఇదేమండీ! మీ వాటా లేదా? పోనీ దొడ్డిలేదా?" అంటే ఆవిడ "నువ్వు చెప్పనవసరం లేదు. పుత్రనాగమ్మకి భయం చెప్పాన దొడ్లోకి వెళ్ల లేడు. అదీగాక. మావాడికి మావాటాలో కూచుంటే విరోచనం సరీగా కాదు! నువ్వూరగవ్! నీపని నువ్వు చూసుగుంటూ! అదీగాక బోలెడు పురుగులు న్నాయి, మనుష్యులు తిరుగుతూంటారు, ములిగిపోలేదు పోదూ!" అని ఆయన మీద సబబులు కురిపించింది. ఇంకోరి సంగతి వచ్చేసరికి ఈప్రమేయమే ఆవిడికి జ్ఞాపకం ఉండదు. ముఖ్యంగా, అద్దె యజమానురాలి అభిమాన విద్య ఏదీ అంటే దాసీజన పరిపాలన. ఆవిడికి దాసీలు చెలికత్తెలు లాంటివారు. తను ఏదాసీదాన్ని నియమి

స్తుందో అదే అద్దె కాపరాల వాళ్లందరికీ దాసీగా ఉండాలని ఆవిడ ఆజ్ఞ. ఒకవేళ తనూ అదీ పేచీపడి కట్లపాముల్లాగ లుంగలుచుట్టుగుని వీధినిబడి తిట్టుగునేటప్పుడు (ఈముచ్చట వారానికి రెండుసార్లేనా అవుతుంది.) అద్దెకాపరాల వాళ్లంతా ఏకమై ఆదాసీ దాంతో వైరంకట్టాలి. మొదట్లో ఏదాసీదైతేమని అంతాఒకదాన్నే పెట్టుగుంటారు. కానీ, ఇంతమందికీ ఒక్కత్తే దాసీది అవడంవల్ల ఒకరిపనిముందూ (అంటే ఇంటివారిపని) ఒకరిపని వెనకాఅయి, అసహ్యాలుపుట్టి తిట్టుగోడాలు జరిగి, కొందరు కాపరాలవాళ్లు దాన్ని మానిపించేసి, (చాకిరీ స్వయంగా చేసుకోగలిగినా దగ్గా పడిపోతుందని భయమేసి) కొత్తదాన్ని పెట్టుగుంటారు. అక్కణ్ణించి, ఇంటావిడ, కొత్తదాసీని ఎల్లాగేనా ఖజ్జాలోకి లాగమని పాతదాన్ని గిల్లడంలోనూ, ఎవ్వరూ ఇనూ్కా కలపకుండానే ఏదోకరుణం చూసుగుని తనే వెళ్లి విరుచుగుని కొత్తదానిమీదపడి కరవడంలోనూ మునిగిపోతుంది. ఒకానొకచోట ఇల్లాంటి విషయం లోనే హిడింబాయమ్మగారు అనే ఒక అద్దెయజమానురాలు కొంతగ్రంథం జరిపింది. హిడింబాయమ్మ లోగడ కాశీవెళ్లినప్పుడు అక్కడ సిగ్గు భిడియాలూ అడ్డబాసా కట్టగట్టి గంగలో విడిచిపెట్టింది—ఏదో విడిచిపెట్టాలి గదా అని. దాంతోటి, ఆవిడ ఇంటికొచ్చేసరికి, అదివరకు గంటకి యాభైమైళ్ల చొప్పున ఉండే ఆవిడ వాగ్వేగం రెట్టింపైంది. ఆవిడ గాత్రమాధుర్యం గురించి మాత్రం ఎవరూ "గారంట్రీ" గా చెప్పలేరు. వారి తాలూకు వాటాలో ఉన్న, మాచిరకాల స్నేహితుడైన కేశవరావుగారి కొత్తదాసీని పదిరోజులపాటు హిడింబాయమ్మ గదిమి, అదరకాయించడం కేశవరావుగారు తన ఇంట్లోంచే విని,పదకొండోనాడు వ్యాపారం ముదిరినట్టు కనబడి, తను దొడ్లోకివెళ్లి సంగతి కనుక్కోడానికి యత్నించాడట. అప్పుడు వారికి ఈసంభాషణ జరిగిందిట.

కే—అమ్మ! ఏమిటండి, ఆకేకలు?

హి—ఇక్కడ శ్రీమేలు్స ఉన్నారని చెప్పవేమే, దాసీముండ!

దా—ముండలు మాలో ఉండరమ్మా! నువ్వే సెప్పు!

కే—అమ్మా! నాకు బోధపడింది. తమరు పెద్దలు! తమరు ఎక్కడా ఎప్పుడూ నోరు మెదపనట్టు అల్లా సెలవిస్తారేం?

హి—(చేతులూ తలాతిప్పుగుంటూ, ఆడిపోతూ) రైంయ్యిమంటూ వొచ్చావుగాని ఆడవాళ్లమీదికి, నను నడు! ముక్కముక్కలవుతోందే అమ్మా! అని దాసీ దాన్ని మురుక్కాలవ కాస్తతుడవ్వే అని అనుగుతూంటేనూ, "ఏమిటే, ఏమిటే, ఏమిటే" అంటూ అడ్డొచ్చాడు పెద్దమనిషి! ఇంతేనా బిచ్చ్యే! సంతోషించాంలే నీతెలివికి!

కే—(అక్కడే కూర్చుని ఉన్న ఆవిడ భర్తగారితో) భీమారావుగారూ! వింటున్నారా? ఈఅంతఃపురస్త్రీయొక్క మాటమార్దవం?

భీ—చిత్తం! వింటున్నానండి!

కే—అమ్మా? మాదాసీది మీమురుక్కాలవ ఎందుకు తుడవాలీ?

హి-ఎందుకా, మండుకు! మీవంటింటోంచి కంపు వస్తోంది గనక!

కే. మావంటింటోంచి తూము నూతిపళ్లెంమీదికి ఉంది. నూతిదగ్గర, ఈతూమువేపు కంపులేదని ఇక్కడికి సెకనుకి పదిమంది చొప్పున వచ్చేజనం అందరికీ తెలుసు. అక్కణ్ణించి నీళ్ల దారి మీస్నానాలగది అంటారేం అందులోకి ఉంది. దాని తరవాత నించి మురుక్కాలవ ఉండనూ ఉంది. నాముక్కు బద్దలవుతూనే ఉంది. కాబట్టి ముక్కుపేళేపనులు మీస్నానాలగదిలో జరుగుతూండాలి. అందుకని, మీకు శక్యం అయితే మీదాసీ దానిచేత తుడిపించుగోండి. డబ్బునే ఇస్తాను. కామా కూడమా తుడవడమే మాపూచీ అంటారా, ఆకంపునీళ్లు తుడవడానికి డబ్బిచ్చినా ఏదాసీదీ రాకపోతే, ఎక్కణ్ణించి ఎక్కడికి మేంతుడవాలో చెప్పండి, నేనేస్వయంగా చీపురుకట్ట పుచ్చుగుంటాను, మీ ఇంట్లో ఉన్నందుకు

హి_కాక మరేమిటి! చీపురుకట్ట ఉద్యోగమే నీకు రాసింది. తుడుతుడు! దాసీ దాన్ని మానిపించి డబ్బుమాట కట్టుకో! అంతా తుడు!

కే_భీమారావుగారూ! తప్పెవరిదో గ్రహించండి!

భీ_గ్రహించానండి. నాది.

కే_అదేంకర్మం? మీతప్పేమిటి?

భీ_తప్పులు బాబూ, తప్పుకాదు! మొదట, పెళ్లి చేసుగోడం. రెండు, కొంప అద్దెకి ఇవ్వడం!

కే_అల్లా వాదిస్తే ఈప్రపంచమే తప్పు! అతి వేదాంతంలోకి దిగకండి మరి! మేం జీతమిచ్చేదాసీది మేంచెబితే వినాలి. వింటుంది..మాడబ్బుతో మాదాసీని కుదుర్చుకునే స్వతంత్రత మాకు లేదూ? ఇక ఇండియాకి ఇంగ్లీషువారు స్వాతంత్ర్యం ఇస్తారా? అడగచ్చా?

భీ_ఇస్తారేమోకాని, మా ఆవిడ ఇవ్వనిమాట రూఢి.

కేశవరావుగారు సున్నితపు మనిషి. ఆపళంగా, ఆయన, తను అన్నప్రకారం చీపురుకట్టపుచ్చుకుని నూతి పళ్లెం చివరదాకా నాలుగురోజులుతుడిచాడట. ఎవరూ చూడనప్పుడు నూతిపళ్లెం పాడిచేసిరమ్మని, హిడింబాయమ్మ తన చిన్నసంతానానికి "క్లీ"యిచ్చి ఆ నాలుగు రోజులూకుడా కసిగానే ఉందట. తరవాత, ఈసంగతి నలుగురికీ తెలిసి, కలవరంపుట్టినమీదట, యజమానిగారు చాలా నొచ్చుగున్న పిదప, ఆవిడకూడా కొన్ని మెట్లు దిగి కేశవరావుగార్ని బతిమాలుకున్నమీదట ఆయన ఆ ఉద్యోగం మానేశాడట. అప్పట్నించీ హిడింబాయమ్మ ఆయనతో మాట్లాడుతోచ్చినా, ఆయన అవిణ్ణివినిపించుగోడట. అందుచే, అప్పుడప్పుడు, కొడుకుమీద పెట్టి నేటివరకూ తిడుతూనే ఉంటుందట. భీమారావుగారి మంచితనంచూచి కేశవరావుగారు అక్కడే ఉన్నాడు. ఇది నాలుగోరకం. ఇది అధమాధమం. ఇంకా, వీధివేపు అద్దెకొట్లూ, ఉద్యోగి జీతంలో పదోవంతు అద్దెఉండే గవర్నమెంటు తాలూకు అద్దెభవనాలూ, బజార్లోహెచ్చు అద్దెలుండే కొట్లూ, ఊరుబయటిశ్మశానాల దగ్గిర తక్కువ అద్దెలకి దొరికే కొంపలూ, కొంపకి అద్దెకి పుచ్చుగున్న వాడు దాన్లో కొంత మళ్లీ తక్కువ అద్దెలకిచ్చిన భాగాలూ (నాటకంలో నాటకంలాగ!) వగైరా అనంతంగా ఇతర రకాలు ఉన్నాయి.

కొంపలు ఎందుకు ఖాళీ చేస్తూంటారో కుడా చిత్రమే. కొందరు చాలక, కొందరు చిక్కులు అల్లానే ఉండటాన్నించి, కొందరు ఇరుగు పొరుగు సరిగా లేక, కొందరు అంత అద్దెయిచ్చుగోలేక, కొందరు కొత్త ఇల్లు కట్టుగుని, కొందరు పాతయిల్లు కొనుక్కుని బాగుచేయించడానికి కొత్తయిల్లు కట్టేకంటె ఎక్కువ పెట్టుబడిపెట్టి, కొందరు విసిగెత్తిపోయి, కొందరు దెయ్యాలున్నాయని గ్రహించి, కొందరు పాములు కనపడి, వంటింట్లో మొండిచెయ్యి మొలవడంవల్ల కొందరు, ఇంటిసరంబీకి తేనెపట్టుపట్టి కొందరు, కొంపమీద గద్దవాలి కొందరు, ఇంటిమీద బ్రహ్మచెముడు పాకడంచేత కొందరు, దొడ్లో అరిటిచెట్టు దక్షిణానికి గెలవెయ్యడంచేత కొందరు, కొందరు తమ కొంపకి వాస్తుప్రకారం నుయ్యో, ద్వారబంధమో తబ్దీలుగా పడడం మూలాన్ని, కొందరు అచ్చిరాక, సరి, కొందరు మారితేచాలని.

అద్దెలధోరణినిబట్టి చూస్తే భౌతికలోకం యొక్క అస్థిరత్వం స్ఫురణకొస్తుంది. కొంపలేకాదు. ఊళ్లూ, జిల్లాలూ, ఈఇండియా, ఈప్రపంచం ఇవన్నీ కూడా అద్దెవ్యాపారాలే కదా అనిపిస్తుంది. రోగం వల్లో, చెడదచేతో, అవాంతరం మూలాన్నో, ఖూనీ ద్వారానో, ఆత్మహత్యరూపంగానో, దారిద్ర్యం ధర్మమా అనో ఏదో తరవాతతరవాతమాత్రమే మానవులకి గోచరించే కారణాన్ని పురస్కరించుకుని జీవుడు శరీరం ఖాళీచేసి పోతూండడం ఆరగారగా చూడగా ఎవడిమట్టుకి వాడికే తెలిసేదాన్ని బట్టి—జీవుడికి శరీరాలు అద్దెకొంపలు.



శ్రీ కృష్ణుని జలక్రీడలు

# నెహ్రూనివేదిక—స్వాతంత్ర్యవాదులు

ప్రతివాదిభయంకరం రంగాచార్యులు గారు

౧

## స్వాతంత్ర్యవాదుల ప్రాబల్యము

నెహ్రూనివేదిక వెలువడిననాటి నుండియు దానికి వ్యతిరేకముగ జెలరేగుచున్న సమస్యలలో ముఖ్యమయినవి రెండు. మొదటిది (సంపూర్ణ) స్వాతంత్ర్య సమస్య. రెండవది సాంఘికసమస్య. ఈసాంఘికసమస్య (హిందూ-మహమ్మదీయైకమత్యము) చాలప్రాతది. ఏసందర్భమున రాజకీయసంస్కరణము లమలులోనికి వచ్చినను ఇది వానికడ్డుదగులుచునే యుండినది. దీనిమూలమున నాసంస్కరణము లోటుపాలగుచునే యుండినవి. ఇది రానురాను మరింతతీవ్రత దాల్చినది. అందుచే స్వరాజ్యప్రాప్తికి దీనియాటంకము మెండుగ నుండునన్నమాట నెవ్వరు నెన్నడు నేమరియుండలేదు. నెహ్రూసంఘమువారును నిశితముగ నీసమస్యను చాల జాగ్రత్తతోడనే పరిశీలించిరి. కాని స్వాతంత్ర్యసమస్య మాత్రము ప్రస్తుతమున్నంత తీవ్రతతో తమ్మెదుర్కొనునని నెహ్రూసంఘమువారైనను తలచియుండరు. అట్లు తలచుటకు వారికవకాశము గూడ లేదు. ఎట్లయిన నేమి, స్వాతంత్ర్యవాదము 'ఇదియెంత' యని దేశములోని తక్కిన రాజకీయపక్షములకు త్రోసివైవ నలవికానంత బలమును సంపాదించినది. ప్రధానరాజకీయపక్షములన్నిటిచేతను ఏకకంఠ్యముగ నామోదింపబడిన నెహ్రూనివేదికను స్వాతంత్ర్యవాదులు కాంగ్రెసుమహాసభలో నధికసంఖ్యాకులై త్రోసివేయ గలుగుదురేమో యని పెద్దలందరు నాందోళన పడిన మాటకూడ నిజము, తుదకు కాంగ్రెసులో జయమెవ్వరిదన్న స్వాతంత్ర్య పక్షము వారిదని యొప్పికొనక తప్పదు.

మొత్తముమీద దేశములో నన్ని పక్షముల వారి శ్రద్ధను ఆకర్షించుచున్నది నెహ్రూనివేదిక. దానిని తీవ్రముగ నెదుర్కొన్నది—ప్రాతవడిపోయి యున్న సాంఘికసమస్య కాక— స్వాతంత్ర్యసమస్య. ఈసందర్భమున నెహ్రూనివేదికకును స్వాతంత్ర్యవాదులకును గల సంబంధముగూర్చి తెలిసికొనుట యవసరము. ఈసంగతి దెలిసికొనుటకుముందు స్వాతంత్ర్యవాదపు పరిణామము గూర్చికూడ క్లుప్తముగ దెలిసికొని యుండుట మంచిది.

## స్వాతంత్ర్యవాదవిజృంభణము

మొదటి నుండియు (ఇంచుమించుగ కాంగ్రెసు మహాసభయేర్పడిన నాటినుండియు నని చెప్ప వచ్చును.) దేశములోని రాజకీయనాయకు లెవ్వరును, రాజకీయ పక్షములేవియు, బ్రిటీషు సామ్రాజ్యమున కతీతమైన స్వాతంత్ర్యమే భారతీయుల రాజకీయాదర్శ మని ప్రకటించి యుండలేదు—హింసామార్గము ద్రొక్కి హిందూ దేశములోని బ్రిటిషు ప్రభుత్వమును గూలద్రోయవలయునని ప్రయత్నించు ఒక్క 'విప్లవవాదులు' తప్ప. కాని సామ్రాజ్యమును వీడిపోవుటను గూర్చి వారెన్నడు నాశించి యుండరనుట కవకాశము లేదు. వంగవిభజన సమయమున జరిగిన యాందోళనము దీనికి నిదర్శనము. ఐనను అది యాచరణకు రాజాలని పిచ్చియాశ, హితకరముకాదు అను తలంపుతో దానిని విడిచివైచిరనుట మాత్రము నిజము. మొట్టమొదట 'స్వరాజ్య' శబ్దము ప్రచారములోనికి దెచ్చిన శ్రీదాదాభాయి నౌరోజీ గారు 1906 సం॥ నాటి కలకత్తా కాంగ్రెసులో దమ యధ్యక్షోపన్యాసమున భారతీయుల రాజకీయాదర్శము నిట్లు నిర్వచించిరి. "ఈ విషయమంతయు నొక్కమాటలో జెప్పవచ్చును. స్వపరిపాలనము, లేక స్వరాజ్యము. అది ఇంగ్లండు స్వపరిపాలనమునకుగాని సామంతదేశముల (బ్రిటిషు సామ్రాజ్యములోని యని యభిప్రాయము) స్వపరిపాలనమునకుగాని సమానముగ నుండవలయును." మరియు నాకలకత్తా కాంగ్రెసు స్వపరిపాలము

విషయమున నిర్ణయించిన తీరుమాన మిట్లున్నది. "స్వపరి పాలనము ననుభవించుచున్న (బ్రిటిషు సామ్రాజ్యము) లోని సామంత దేశములలో నెట్టి ప్రభుత్వవిధా నమములలో నున్నదో యట్టి ప్రభుత్వవిధానమే భారత దేశమున గూడ ప్రవేశపెట్టవలయును". తరువాత మరల 1920 సంవత్సరముపరకు పై కలకత్తా కాంగ్రెసు తీర్మానముబోలు తీరుమానములనే కాంగ్రెసు మహాసభ యామోదించుచువచ్చినది. కాని యాపదునాలు గేండ్లలోనే రాజకీయవ్యవహారముల పరిణామము నను సరించి సామ్రాజ్యబంధమును త్రెంపివైచుకొన్ననేకాని భారతదేశమునకు క్షేమముండజాలదను నభిప్రాయము దేశమునందంతట గాఢముగ గ్రమ్మివైచినది. ఐన సామ్రా జ్యముపై నభిమానము పూర్తిగ నశించినదని చెప్పుటకు గూడ నవకాశము లేకుండెను. 'పెద్ద'లలో 'శాసనబద్ధ మగు నాందోళనము' మీదను, (Constitutional Agitation) 'సామ్రాజ్యస్థ స్వపరిపాలనము' మీదను (Swaraj within the British Empire) నమ్మక ముచెడనివార నేకులుండిరి. ఇట్టి సందర్భములలో ౧౯౨౭ లో గలిగిన 'అతివాదమితవాద' విభేదములకన్న తీవ్రము లైన విభేదములు పుట్టుటయు, రాజకీయపరిస్థితులు మరింత విషమరూపము దాల్చుటయు దప్పనిసరి యగు చుండెను. ఈసంగతి గాంధిమహాత్ముడు గ్రహించినంత బాగుగ నితరనాయకులు గ్రహించినట్లగుపడదు. పై రీతిగ విషమపరిస్థితులురాకుండజేసి రాజకీయాందోళన మున సాధ్యమయినంతవరకు ఐకమత్యము గలుగజేయు టెట్లని యాయన యాలోచించెను. దీనికి ఫలితముగ, ఒక రాజీపద్ధతిమీద నేర్పడినదే 'స్వరాజ్యము భారతదేశీయమహాసభ యాదర్శము' అను తీరుమానము. ఈస్వరాజ్యమునకు "వీలైన, సామ్రాజ్యస్థము, అవసర మైన, సామ్రాజ్యాతీతము"నని మహాత్ముడు వ్యాఖ్యాన మొనరించెను. కాని స్వాతంత్ర్యవాదము దీనిచే నడగిపో లేదు. పెంపందుచునే యుండెను. తుదకు ౧౯౨౭ సం॥ డిసెంబరులో మదరాసు కాంగ్రెసు "స్వరాజ్యము సామ్రాజ్యముతో సంబంధములేని సంపూర్ణస్వాతంత్ర్య" మని వ్యాఖ్యాన మొనర్చెను. ఇట్టి వ్యాఖ్యానమును మొదటినుండియు మిగుల బట్టుదలతో నెదిరించుచుండి గాంధిశిష్యులకు తుదకు మొన్నటి డిసెంబరులో కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో తనరాజీ తీరుమానమునకు "కాంగ్రెసు పేరుతో సంపూర్ణస్వాతంత్ర్యమునకై కావింపబడు ప్రచారమున కీతీరుమాన మేవిధమునను అడ్డుపడదు" అనుమాట జేర్చుట తప్పనిసరియైనది.

'సామంతరాజ్యముల ప్రతిపత్తి'ని (Dominion Status) దాటి తమలక్ష్యము పోవాలనని చెప్పుకొను మితవాదులకుగూడ స్వాతంత్ర్యవాదము నేడో రేపో ముఖ్యముగ సమర్థింపవలసియేవచ్చుచున్నది. ఇట్టి 'అతివాదము' నకు ప్రభుత్వమువారే బాధ్యులని నుడువుచు మితవాద మహాసభలో సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్‌గారు తమ యధ్యక్షోపన్యాసమున నిట్లు సెలవిచ్చినారు. "పైకిపోవు విరుద్ధముగ నుండవచ్చును. కాని ప్రతిసంస్కరణమునకు తిప్పలతో, సంశయములతో, నిండిన తమ విధానము మూలమున ప్రభుత్వమువారే అతివాదమును లేవదీసిరి. అంతేకాక, అది యంతరించిపోవుటకు సిద్ధముగ నున్నప్పుడెల్ల మరల వెనుకటికన్న నెక్కువబలము సంపా దించుకొనుటకు ప్రభుత్వమువారే దానికి సాయపడిరి. ....... ..............నిరుటి సైమను సంఘమునియామకము సంపూర్ణ స్వాతంత్ర్యపక్షము పుట్టుటకు కారణమైనది. ................."

మొత్తముమీద మామూలు రాజకీయపక్షములలో సంపూర్ణ స్వాతంత్ర్యసమస్య వంగవిభజనసమయమున నొక్కరవ్వంత ప్రవేశముగలిగించుకొనెనని చెప్పవచ్చును. అటుపై ౧౯౨౦ సం॥న గాంధిమహాత్ముడుదానికి రాజ కీయరంగమున ప్రబలమగు నొకస్థానము గల్పించెను. దీనిని చెట్టుకొమ్మలు గాఢముగ నల్లుకొని పోయినవి. దీనికి తములు రెండు. నీడ, చీకటి. ఈరెంటిలో నేది రెండవవాని త్రోసివైచి మొదట నిలుచును? నీడయా! చీకటియా! ఇదియే యిప్పటి సమస్య. ఇట్టియీ సందర్భమున స్త్రీలు సమస్య విషయమున నెట్లు ప్రవర్తించిరో కొంచెము లోచింతము.



౫. ఉదకమండలములో ప్రసిద్ధమగు ఉద్యానవనము

## అఖిలపక్ష మహాసభ నిర్మాణము స్వాతంత్ర్యవాదుల బాధ్యత

నెహ్రూసంఘ నివేదికకును స్వాతంత్ర్యవాదులకును గల సంబంధము గూర్చి తెలిసికొనవలెనన్న నీ సంఘమేర్పడుటకు గారణభూతముగ నున్న అ. ప. మహాసభ యెట్లేర్పడి నదియు ముందు కొంత తెలిసి కొనవలెను. నేటి స్వాతంత్ర్యపక్షమునకు నాయకులుగ నున్న శ్రీమాన్ యస్ శ్రీనివాసయ్యంగారు కాంగ్రెసు మహాసభ కధ్యక్షులుగ నుండిన కాలముననే వారి యాధ్వర్యముననే కాంగ్రెసుకార్యనిర్వాహకసభ అ. ప. మహాసభ నిర్మాణమునకు బ్రయత్నము గావించెను. ౧౯౨౬ సం|| డిసెంబరు మాసమున గౌహతీలో జరిగిన కాంగ్రెసు మహాసభకు శ్రీనివాసయ్యంగారు అధ్యక్షులుగ నుండిరి. దానికి మునుపే వారు భారతీయుల రాజకీయాదర్శము సంపూర్ణస్వాతంత్ర్యముగ నుండవలయునను నభిప్రాయమునకు దమ సమ్మతి ప్రకటించియుండిరి. గౌహతీకాంగ్రెసులో మహాత్ముని పట్టుదలమూలమున స్వాతంత్ర్యమును గూర్చిన తీరుమానము చర్చకే రాకుండ పోయెను. అటుపై దమ యధ్యక్షతక్రింద గడచిన ౧౯౨౭ సం|| మంతయు నేదో యొక విధముగ హిందూమహమ్మదీయ సంయోగసమస్యను రాజ్యాంగవిధాననిర్మాణసమస్యను బరిష్కరింప వలయునని పట్టుదలతో ప్రయత్నముల సాగించిరి. రాజ్యాంగవిధానము నిర్మించు బాధ్యతను పూర్తిగ కాంగ్రెసువారే పూనుకొనవలెనను నభిప్రాయము సంపూర్ణస్వాతంత్ర్యవాదులగు శ్రీమాన్ అయ్యంగారికే లేకుండెను. దానికై వారు దేశమునందలి రాజకీయపక్షము లన్నిటిసాయమును బొంది వానిసలహాలను గైకొనుట నవసరమని తలచిరి. కాబట్టియే, అయ్యంగారి యభిప్రాయముల ననుసరించియే, ముఖ్యముగ వారిప్రోత్సాహము మీదనే, ౧౯౨౮ సం|| మే నెలలో బొంబాయిలో గూడిన కాంగ్రెసు ఉపసంఘము వారు "భారతశాసనసభయందు గల ప్రజానియోజితసభ్యులతోడను, రాష్ట్రీయశాసనసభ్యులతోడను, వివిధపక్ష నాయకులతోడను కలిసి సంప్రతించి సార్వజనికాధికారముల పై నాధారపడి యుండెడు స్వరాజ్యవిధానమును నిర్ణయించుటకు ఈసభవారు కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గము వారిని కోరుచున్నారు" అని తీర్మానించినారు. కాంగ్రెసు రాజ్యాంగవిధాననిర్మాణమునకు బూనుకొనుట కిదియే మొదటిసారి. ఈసందర్భమున పైతీరుమానమునకు కాంగ్రెసు ఉపసంఘములో నప్పుడు ప్రాతికూల్యమెక్కువగా నుండెనన్న సంగతి చదువరులు మనసున నుంచుకొనవలెను. ప్రాతికూల్యము వచ్చినను అయ్యంగారు నెహ్రూమున్నగు నాయకుల పట్టుదలను బట్టియు బలుకుబడిని బట్టియు దీరుమాన మామోదింపబడెను.

అటుపై ౧౯౨౭ సం|| డిసంబరులో మదరాసు నగరమున గూడిన దేశీయమహాసభ సామ్రాజ్యాతీతమగు సంపూర్ణజాతీయస్వాతంత్ర్యమని 'స్వరాజ్య' పదమునకు వ్యాఖ్యానము గావించినది. ఆకాంగ్రెసు మహాసభయే రాజ్యాంగవిధానము సిద్ధపరచు విషయమున మరియొక తీరుమానము గావించెను. అం దిట్లున్నది:

"………ఈ ప్రయత్నములో కార్యనిర్వాహకవర్గమువారు ఇతరసభ్యులను చేర్చుకొనవచ్చును. దేశములోని రాజకీయ, సాంఘిక, వాణిజ్య, కార్మికప్రతిష్ఠాపనలతో నవశ్యము సంప్రదింపవచ్చును….. ఈస్వరాజ్యవిధానమును…అఖిలభారత కాంగ్రెసు సంఘసభ్యులును, పైనుదహరింపబడిన సంస్థల ప్రతినిధులును, భారతశాసన సభలలోను, రాష్ట్రీయసభలలోను గల ప్రజానియోజితసభ్యులును కలిసిన సభాముఖమున చర్చించుటకు నివేదించవలెను."

ఈరెండు తీర్మానములను బట్టియు అఖిలపక్ష మహాసభ నిర్మాణమున స్వాతంత్ర్యవాదుల కెంతవరకు బాధ్యత కలదో స్పష్టమగుచున్నది. స్వాతంత్ర్యవాదుల యాదర్శమును కాంగ్రెసుమహాసభ యామోదించుటచే వారి యీబాధ్యత మరింత యెక్కువైనది. అఖిలపక్ష మహాసభ కార్యక్రమము విషయమునను, వివిధపక్షముల సంయోగము సంపాదించుట విషయమునను గూడ వారి బాధ్యత వెనుకటికన్న, మదరాసుకాంగ్రెసు తీరుమానముల మూలమున, నెక్కువైనదనుట స్పష్టము.

## నెహ్రూసంఘకార్యక్రమము—స్వాతంత్ర్యవాదుల సహాయము

కాంగ్రెసు తీరుమానము ననుసరించి ౧౯౨౮ సం॥ ఫిబ్రవరినెలలో అఖిలపక్షమహాసభ యేర్పడినది. కొన్ని సమావేశములు జరిగిన తరువాత—ఈ సమావేశములన్నిటియందును స్వాతంత్ర్యవాదులు పాల్గొనిరి—తుదకు మేనెల ౧౯ తేదీనాడు మహాసభ రాజ్యాంగ విధానమునునిర్ణయించుటకై నెహ్రూసంఘమును నియమించెను. నెహ్రూసంఘమువారి కార్యక్రమమునగూడ స్వాతంత్ర్యవాదులు పూర్తిగ పాల్గొనిరి. ఈసందర్భమున సంఘసభ్యులుగనుండి సుభాష్‌చంద్రబోసుగారును, పైనుండియే జవహర్లాల్ నెహ్రూగారును నివేదకనిర్మాణమునకు విశేషముగ దోడుపడియుండిరి. ఇంతటితో నొక యధ్యాయము ముగిసినది. మహాసభకు స్వాతంత్ర్యవాదుల సాయము గూడ నింతటితో ముగిసినది.

౨

## లక్నో తీర్మానము—స్వాతంత్ర్యవాదుల ప్రాతికూల్యము

నెహ్రూనివేదిక వెలువడినది. నివేదిక నామోదించుటకై లక్నోలో నఖిలపక్షమహాసభ మరియొకసారి సమావేశమైనది. మాళవ్యాగారు రాజ్యాంగ విధానమును గూర్చిన తీరుమాన మువపాదించిరి. అందు సంపూర్ణ స్వాతంత్ర్యవాదుల స్వాతంత్ర్యప్రచారమునకు భంగమేమియు నుండరాదనియు, భారతదేశములో స్థాపింపబడబోవు ప్రభుత్వవిధానము అధినివేశ రాజ్యముల ప్రతిపత్తికి (Dominion status) కొరవడి యుండరాదనియు గలదు. ఇంతటితో తగాదాయారంభమైనది. స్వాతంత్ర్యవాదుల పక్షమున జవహర్లాలు నెహ్రూగారు అధినివేశప్రతిపత్తి నంగీకరించు భాగము నాక్షేపించుచు నొక ప్రకటనము గావించిరి. స్వాతంత్ర్యవాదు లాతీరుమానముపై చర్చలో పాల్గొనలేదు. మహాసభ తీరుమానము నామోదించెను. నాటినుంటియు స్వాతంత్ర్యవాదులు ప్రత్యేకసంఘముగ నేర్పడి నివేదికకు ప్రతికూలముగ, కాంగ్రెసుసభ యధినివేశప్రతిపత్తి నంగీకరింపకుండజేయుటకై యత్నింప మొదలిడిరి. అదియొక్కటియే-అధినివేశప్రతిపత్తియొక్కటియే-నివేదికలో వారి యాతీవ్రప్రతిఘటనమునకు గురియైన యంశము. ఈ యొక్క సమస్యమీదనే వారు ఈవిషమసమయమున గూడ కాంగ్రెసును చీలదీయుటకు, గాంధిమోతీలాలు నెహ్రూగార్లను వారిపక్షమును కాంగ్రెసునుండి తరిమివేయుటకుగూడ సిద్ధపడిరి! ఈప్రయత్నము సఫలమగునేమోయను సంశయము కలకత్తాలో నలజడి గలిగింపకపోలేదు. కాని తుదకు వారిప్రయత్నము లెటులైననేమి, సఫలముకాలేదు.

## స్వాతంత్ర్యవాదుల చర్యలు పరస్పరవిరుద్ధములు

కడచిన డిసెంబరులో కాంగ్రెసు విషయనిర్ధారణ సభయందు గాంధిమహాత్ముడు మొట్టమొదట నుపపాదించిన రాజీతీరుమానము ఆత్మవైరుధ్యము (Self contradiction) గలిగించుకొనుచున్నదని స్వాతంత్ర్యవాదు లాక్షేపించిరి. జవహర్లాలుగా రాక్షేపించిరి కదా, ఇంక నేమి సందుదొరకినది యని శ్రీనివాసయ్యంగారుగూడ నిట్టి యాక్షేపణకే మొదలిడిరి. ఈయాక్షేపణ లెంతవరకు సమంజసములో యించుక నాలోచింతము. జవహర్లాలుగారి యాక్షేపణ సహజముగనుండుటచేనందు గొంత యర్థమున్నది. కానిఅయ్యంగారి యాక్షేపణలో మాత్రమర్థమే లేదు. మొదటినుండియు ఒక 'కన్వెన్షను' ఏర్పరుప వలయునని శ్రమపడి దాని నమలులోనికి గొనివచ్చిన వారు అయ్యంగారు. మొన్న కాంగ్రెసువారములో కలకత్తాలో ఎస్సోసియేటెడ్ ప్రెస్ విలేఖరితో వారిట్లు సెలవిచ్చిరి. "బ్రిటిషు ప్రభుత్వము సంపూర్ణముగ నధినివేశప్రతిపత్తి నొసంగుట కంగీకరించినచో నప్పుడు దానిని స్వీకరింప వలయునా యక్కరలేదాయని మన మాలోచించుటకు సమయమువచ్చును." అంతవరకు డొమినియను ప్రతిపత్తి విషయమున గాని, రాజ్యాంగవిధానము విషయమునగాని మనము తలపెట్టకూడదని వారి యభిప్రాయము. ఐన నింక నీయఖిలపక్ష

మహాసభ యెందులకు? రాజ్యాంగవిధాననిర్మాణమునకై అయ్యంగా రింతటి యాందోళన పడి రేల? పైన తాము సూచించిన యభిప్రాయము గాంధిమహాత్ముడు మొదటినుండి చాటుచుండెననియు, నా యభిప్రాయముతోనే అయన యెన్ని యోసారులు కాంగ్రెసు రాజ్యాంగవిధానమునకు బూనుకొను సలహాను తిరస్కరించి యుండెననియు అయ్యంగా రెరుగ రా? పైన తామన్నట్లు ఇంకను బ్రిటిషు గవర్నమెంటువారి సూచనల నాలోచించుటకు తమకు మనసున్నప్పుడు మహాత్ముని స్వరాజ్యాదర్శమును మార్చుట కవసరమేమి కలిగినది? తాము సర్వపక్షమహాసభను గూర్ప యత్నించునప్పుడు, భారతదేశములోని గొప్పన్యాయవాదులలో నొకరై మహామేధావియని పేరందిన శ్రీనివాసయ్యంగారికి, ముస్లిము లీగు, జస్టిసుపక్షము, మితవాదసంఘము మున్నగుసంస్థలు తమ సంపూర్ణస్వాతంత్ర్యాశయము నంగీకరింపవను నభిప్రాయము తట్టియుండలేదా? మరల ౧౯౨౭ సంవత్సరము ఫిబ్రవరిలో జరిగిన అఖిలపక్షసభవారు ఇరుపక్షముల వారికి సమాధానముగనుండునట్లునిర్ణయించిన "సంపూర్ణబాధ్యతాయుత ప్రభుత్వము" (Full Responsible Government) అను సందిగ్ధపదమునకు తామంగీకరించిరి కదా, యింక నట్టిదియేయగు స్వరాజ్యశబ్దమునకు సామ్రాజ్యాతీతస్వరాజ్యమని వ్యాఖ్యాన మొనర్చుటకై తామేల యంతటి శ్రమకు పాలైరి? ఈ వ్యవహారమంతయు బరస్పరవిరుద్ధము కాదా?

## ఢిల్లీతీరుమానము-స్వాతంత్ర్యవాదుల సంతృప్తి

ఇంకొక సంగతి. పైనూచించిన పత్రికాప్రతినిధితోడి సంభాషణముననే శ్రీనివాస అయ్యంగారు లక్నోసభ ముగిసినపై ఢిల్లీలో జరిగిన కాంగ్రెసు ఉపసంఘసభ (All India Congress committee) తీరుమానమును గూర్చి యిట్లు సెలవిచ్చిరి. "నేను ఢిల్లీతీరుమానము పక్షమున నిలిచెదను. ఆతీరుమానము స్పష్టమైనది, నిష్కపటమైనది, యని నాయభిప్రాయము. అసందిగ్ధముగ నది మనయాదర్శము బ్రకటించుచున్నది. కాంగ్రెసువారికి నిరంతరమగు స్వాతంత్ర్య ప్రయత్నమునకవకాశ మొసంగుచునే యది రాయబారములకు గూడ తావిచ్చుచున్నది." వెనుక నొకసారి జవహర్లాలుగారు గూడ నీతీరుమాన మన్నిపక్షములవారికి సంతృప్తికరముగ నుండదగునని చెప్పియుండిరి. ఇది చాల నాశ్చర్యకరముగ నున్నది. ఈఢిల్లీతీరుమానమున "బ్రిటిషు సంబంధము తెగిపోయిననే కాని భారతదేశమునకు నిజమగు స్వాతంత్ర్యముండదు" అని యున్నది. ఇది రాయబారముల కవకాశ మెట్లిచ్చుచున్నదో తెలియదు. ఇచ్చిపుచ్చుకొనుటలున్నగదా రాయబారములు? "సైమను కమిషనుగాని బ్రిటిషు మంత్రివర్గముగాని సంపూర్ణమగు అధినివేశప్రతిపత్తి నీయబోవుట లేదన్నమాట కాంగ్రెసు వారికందరకు దెలియును" అని అధినివేశప్రతిపత్తియైనను బ్రిటిషు పార్లమెంటువారీయరను నమ్మకము గల అయ్యంగారు తమ ఢిల్లీతీరుమానము రాయబారముల కవకాశమిచ్చుచున్నదని యెట్లు తలంచుచున్నారో బోధపడుటలేదు. డొమినియనుప్రతిపత్తినే యీయని బ్రిటిషువారు సంపూర్ణస్వాతంత్ర్య మీయరని వేరుగ జెప్ప బనిలేదు. ఒకవేళ వారు డొమినియన్ ప్రతిపత్తి నిచ్చినను ఢిల్లీతీరుమానము ననుసరించి కాంగ్రెసువారు స్వీకరింపరాదు. ఇంక రాయబారములకు దావెక్కడ? ఐన, బ్రిటిషు సంబంధము తెగిపోయిననే కాని మనకు నిజమగు స్వాతంత్ర్య ముండదని కాంగ్రెసువారి యభిప్రాయమును స్పష్టముగ జాటుటకే యాతీరుమానము కాని వేరేమియు లేదని అయ్యంగారి యభిప్రాయమా? అట్లయినయెడ నీగొడవయేల? ఈవాదమంతయు నెందులకు? 'అధినివేశ స్వాతంత్ర్యరాజ్యములయందలి ప్రభుత్వవిధానమున కీప్రభుత్వవిధాన మెన్నటికి కొరవడరాదు' అను లక్నో అఖిలపక్షమహాసభ తీరుమానమున కీప్రతిఘటనమంతయు నెందులకు?

## ఢిల్లీతీరుమానము-ఒక పెద్ద గంద్రగోళము

ఈ ఢిల్లీ తీరుమానము విషయమున మరియొక గొడవయున్నది. స్వాతంత్ర్యవాదుల పక్షమున పై బ్రిటిషు సంబంధముగూర్చిన వాక్యము కాంగ్రెసు ఉపసంఘమువారి యామోదమునకై తేబడెను. మొత్తము తీరుమానమును

శ్రీనివాస అయ్యంగారు ఉపపాదించిరి. మోతీలాలు నెహ్రూగారు రామోదించుచు దానియెడ దమసంతృప్తి దెలియబరచిరి. సమావేశము ముగిసినది. వెంటనే మోతీలాలు నెహ్రూగారు తాము పైతీరుమానము నామోదించి నను డొమినియన్ ప్రతిపత్తి నంగీకరించుటకు తమకెట్టి యభ్యంతరము నుండజాలదనియు, దను యీయభిప్రాయము నామోదింప నిష్టములేకున్న కాంగ్రెసు సంఘములు తమస్థానమున కలకత్తా కాంగ్రెసునకు మరియొక యధ్యక్షుని నెన్నుకొనవచ్చుననియు సవాలుచేయుచు నొక ప్రకటనము గావించిరి. ఐనను, నేవో రెండు మూడు తప్ప తక్కిన రాష్ట్రీయకాంగ్రెసుసంఘము లన్నియు నెహ్రూగారి యధ్యక్షులను స్థిరీకరించినవి. మరల కలకత్తాలో కాంగ్రెసు సమయమున ఢిల్లీ తీరుమానము మార్చవలయుననియు, నది యసంబద్ధముగ నుండెననియు నెహ్రూగారు వాదించిరి! ఆతీరుమాన మసంబద్ధమైన దన్నమాట నిజమేకాని యీసందర్భమున నెహ్రూగారి చర్యకూడ నసంబద్ధముగనే యున్నది. కలకత్తా కాంగ్రెసు నాటికే ఢిల్లీ తీరుమాన మసంబద్ధముగ నుండెనని వారికి తెలియవచ్చినదా? ఢిల్లీలో నాతీరుమాన మామోదించి నప్పుడు వారికీసంగతి తెలిసియుండదా?—ఇది కేవలమసంభవము. ఐన నెహ్రూగారు దాని నేల యామోదించిరి?—డొమినియన్ ప్రతిపత్తిని తానంగీకరించుటకు వెనుదీయనని సవాలుచేయ సాహసించిన నెహ్రూగారు అయ్యంగారి తీరుమానము నేల యంగీకరించిరి? ఇదియొక పెద్ద గంద్రగోళము.

## కాంగ్రెసు రాజీతీరుమానము

ఇంక కలకత్తా కాంగ్రెసులో నామోదింప బడిన రాజీతీరుమానము విషయమున స్వాతంత్ర్యవాదు లవలంబించిన వైఖరి గొంత పరీక్షింతము. తన మొదటి తీరుమానమునకు అయ్యంగారి పక్షము తీవ్రప్రతిఘటనము జూపినప్పుడు గాంధీజీ మరియొక తీరుమానము దేవలసివచ్చెను. ఇరుపక్షములకు నెన్నియో చర్చలు రాయబారములు జరిగిన పిమ్మట, గాంధీమోతీలాలుగారలు కాంగ్రెసు నాయకత్వము విడిచిపెట్టెదమని చెప్ప దాని కంగీకరింపక త్రాడు లాగి లాగి తుదకది తెగిపోవ సిద్ధముగనున్నప్పుడు, మహాత్ముడు తమ వాదపద్ధతి నతితీవ్రముగ నిరసించిన పయి స్వాతంత్ర్యవాదులు రాజీ కంగీకరించిరి. రాజీ తీరుమానము వెలువడినది. విషయనిర్ధారణసభలో మహాత్ముని తీరుమానమును అయ్యంగారామోదించిరి. తమ పక్షమునకు జెందిన ప్రముఖులందరితో, జవహర్లాలు సుభాష్‌బోసు, మున్నగు వారితో, సంప్రతించియే తామాతీరుమానము నంగీకరించినట్లు గూడ వారు ప్రకటించిరి. ఇంతటితో వివాద మంతరించినదని యందరు దలచిరి. కానిస్వాతంత్ర్యవాదు లూరకుండ లేదు. మహాసభలో తీరుమానము చర్చకు వచ్చునాడు ప్రత్యేకముగ దమ సంఘమును సమావేశపరచి రాజీతీరుమానమునకు సవరణ నుపపాదించుటకు తీరుమానించిరి. ఈసంఘసభలో నధ్యక్షులగు అయ్యంగారు తాము తీరుమానము నంగీకరించుటకు ముందు పక్షసభ్యులందరితో నాలోచించి వారి యంగీకారము బడసి యుంటిమని మూడునాలుగు సారులు తమచర్య సమర్థించుకొనిరి. కాని లాభములేక పోయెను. ఆయనసమర్థనము సరికాదని యెవ్వరును సమాధానము చెప్పలేదు, సరికదా, ఆయన నొకమూలకు ద్రోసివైచి మీయిష్టము వచ్చినట్లు మీరు చేయవచ్చును, మా పక్షము పక్షమంతయు దీరుమానమును ప్రతిఘటించితీరు నని సమాధానము చెప్పిరి. తుదకు తీరుమానము ప్రతిఘటించి తమ పట్టుదల ప్రకటించిరి. తమ సవరణ పోయినను పట్టుదల మాత్రము స్పష్ట పరచుకొనిరి. నెహ్రూ నివేదికయెడ స్వాతంత్ర్యవాదుల బాధ్యతయొక్క పరిణామము ప్రస్తుతమున కీరీతిగ ముగిసినది.

## ఏది యసంబద్ధము ?

స్వాతంత్ర్య వాదులందరును, గాంధీజీ మొదటి తీరుమానము ఆత్మవైరుద్ధ్యము(Self cantradiction) గలిగించుకొనుచున్నదని యాక్షేపించిరి. కాని నిజ మది కాదు. అతీరుమానము శ్రద్ధగ గమనించినచో నం వాక్య వైరుద్ధ్యమేమియు గనబడదు తీసివేయదగిన మాటయొక్కటియు నందు లేదు. అసంబద్ధత కొంతవరకైనను అసలు రాజీతీరుమానమునకు బట్టినదని చెప్పవచ్చును

ఈయసంబద్ధత యెట్లు కలిగినది? పైన వివరింపబడిన స్వాతంత్ర్యవాదుల యసంబద్ధప్రవర్తనము బట్టియే రాజీతీరుమానము తుద కసంబద్ధతకు బాల్పడక తీరినది కాదు. కాంగ్రెస్ మహాసభలో సవరణపై స్వాతంత్ర్యవాదుల యుపన్యాసముల జదివినచో స్వాతంత్ర్యమును గూర్చియు, అఖిలపక్షమహాసభను గూర్చియు మదరాసుకాంగ్రెసు చేసిన తీరుమానముల పరస్పరసంబంధమును గమనించినచో,—ఈతీరుమానములే ముఖ్యముగ నీయలజడికంతకు గారణము—'భారతస్వాతంత్ర్య సంఘము' (Independence of India League) ఏర్పడినవిధము' బరిశీలించినచో, నసంబద్ధమయినది స్వాతంత్ర్యవాదుల ప్రవర్తనకాని మహాత్ముని తీరుమానముకాదని స్పష్టపడును.

### మహాత్ముని పరీక్ష

నెహ్రూనివేదిక విషయమున గాంధీజీ తీరుమానము గెలిచినను, కాంగ్రెసులో జయము స్వాతంత్ర్యవాదులదే యని యీవ్యాసమునకు మొదట దెలుపబడినది; ఐన నిది నిండుగెలుపని తలపరాదు. ప్రబలమగు వారి యస్తిత్వము కలకత్తాలో విస్పష్టముగ నంగీకరింపబడినది. ఈయస్తిత్వము నిలుపుకొనుటకు కాంగ్రెసు వారి కొకయేడాది గడువొసంగినది. ఇది స్వాతంత్ర్యవాదుల కార్యవాదిత్వమునకు మహాత్ముని పరీక్ష.

---

## జాతీయత

దువ్వూరి రామిరెడ్డిగారు

ఓసి జాతీయతా, నీబలోజ్జ్వలత్వమెంత! నీశక్తిసామర్థ్యమెంత! నీదు
శంఖరవమునఁగల యింద్రజాలమెంత! అస్థిపంజరములుసైత మాడునౌర!

నీయాజ్ఞచేఁగదా నిఖిలభారతభూమి గాంధీమహాత్ముని కట్లఁబడెను;
నీకోర్కెచేఁగదా నెఱలోభియైనను దాచియుంచిన నిధుల్ త్రవ్వియిచ్చె;
నీధర్మమునఁగదా నెఱజాణయైనను మోటుఖద్దరు మేన మోయఁదొడఁగె;
నీపిల్పుచేఁగదా నిర్నిద్రకీర్తులు చెఱసాలలం జిక్కి చీకుపడిరి;
ఒక్కపెట్టున నీభారతోర్విసెల్ల నూపి, కెరలించి, వేమాఱు ప్రోత్సహించి
త్యాగసామ్రాజ్యపట్టభద్రతనుగూర్చి, వడిగ స్వాతంత్ర్యరథమును నడిపెదరరె!

పూర్వకీర్తి ప్రతాపంబుఁ బొగడినావు; భావిభాగ్యోదయం బగపఱచినావు;
వర్తమానదాస్యంబును వదలఁజేయ, నేయుపాయంబు వెదకెదో యింకమీఁద!

---




ఫాసిస్టువాది స్వాతంత్ర్యమునకు ప్రతిపత్తి.



# రాగఁడ తళుకులు

## ఛందోవిశేషములు

కొన్ని సంవత్సరముల క్రిందట భీష్మప్రతిజ్ఞ యను నామాంతరముగల ప్రతిజ్ఞాశాంతనవ నాటకము రచియించునపుడు, లయతాళములకు సరిపడునట్టి కొన్ని వృత్తము లానాటకమున వ్రాయఁదలఁచి ౭, ౧౪, ఛందస్సుల ప్రస్తరించి నాలుగు వృత్తము లేర్పఱచి వాటికి పేళ్లను లక్షణములను కల్పించి లక్ష్యములు నిర్మించియున్నాను. వాటిలో ఒకటిమాత్రమే ఆనాటకమున ముద్రితమైనది. భారతీపాఠకులు తిలకింతురుగాక యను తలంపుతో వాటి నిందు వివరించుచున్నాను.

### ౧. నవామృతలహరీ వృత్తము:

ఇది ప్రస్తరింపఁగా ౭ వ ఛందస్సులో ౧౨౭ వ సమవృత్తమైనది.

దీనికి లక్షణము:—

కవీశజనములు కవింపజనలము
లవారినుతిగను నవామృతలహరి.

ఒక జగణము, ఒకనగణము, ఒకలఘువు, క్రమముగా కలసి, ఒకపాద మగును. అట్టిపాదములు నాలుగొక పద్య మగును. ఇందు ప్రాస కలదు. యతి లేదు. ఇందలి మొదటి రెండు పాదములు పల్లవిగాను, తక్కిన రెండుపాదములును అనుపల్లవిగాను ఏర్పఱచుకొని కొన్ని పద్యము లొకపాటగా వ్రాయవచ్చును. అది లయతాళములకు సరిపడును.

దీనికి లక్ష్యము:—

౧. సతీరమణ ! హర !, రతీరమణహర !, పల్లవి—
శితాంతరరి ముని, నితాంతనుతపద ! అనుపల్లవి.

౨. ప్రమాణములకును, ప్రమాణమయి ధను,
ప్రమేయ మగుచును, ప్రమాతవగుదఁట ! సతీ—

౩. వెలుంగుదువు దివిఁ, జెలంగుదువు భువి,
మెలంగు దిటునటు తొలంగుదువు గన. సతీ—

### (౨) సమగతివృత్తము:—

ఇది ప్రస్తరింపఁగా ౭వ ఛందస్సులో ౬౪వ సమవృత్త మైనది. దీనికి లక్షణము:—

సమగతియను వృ। త్తము కవిహృదయం
గమ మగు నయుగం। బమరిన గురువుగ.

రెండు నగణములును, తరువాత ఒక గురువును కూర్చిన యెడల ఒక సమగతివృత్తపాద మగును. తక్కిన విషయమంతయు నవామృతలహరికినలెనే దీనికిని గ్రహించునది. కాని యిందొక్క విశేషము. ఒక్కొక్కమాఱు రెండేసి యక్షరముల చొప్పున మొదటియాఱక్షరములను, మూఁడు జంటలుగాను, కడపటి గురువును ప్రత్యేకముగాను, ఉచ్చరించుచు, పాడుట కనునగుటచేత దీనికి సమగతి యనుపేరు పెట్టబడినదనియు, పాదాంత్యనియమము దీనికి శోభతెచ్చునదనియు గ్రహించునది.

దీనికి లక్ష్యము:—

౧. కరివరశరణా?, నరనుతచరణా
సురగణభరణా, పరిమితకరుణా! కరి.

౨. నినుఁగొలిచినదా, సునిగనవలదా?
మనుపఁగఁదగదా?, మునిజనవరదా! కరి.

౩. చరమడిగితినా?, స్థిరమడిగితినా ?
దరిసెనమిడునా, దరణకుఁ దగనా?—కరి.

(౩) సుధారసవృత్తము:—

ఇది ప్రస్తరింపఁగా, ౧౪వ ఛందస్సులో ననఁగా శక్వరీఛందస్సులో ౫౪౮౯వ సమవృత్తమైనది. దీనికి లక్షణము:—

చనరత్నవిరామమోలి సాజరల్ లగం
బెనయంగ సుధారసాఖ్యవృత్తమై చనున్.

సగణము సగణము జగణము రగణము లఘువు గురువు క్రమముగా కలసి, ఒకపాద మగును. ప్రాస సహజము. తొమ్మిదింట ననఁగా, నాల్గవగణము మొదటి యక్షరము యతిస్థానము. దీని మొదటిపాదము పల్లవిగాను, అంచలి కడపటి భాగము దానితో సమానాక్షరమైనకల్పితపదముతోఁగాని, పదములతోఁగాని కలసి, అనుపల్లవిగాను, ఏర్పడఁదగును. లేదా, అదే రెండుసారు లుచ్చరింపఁ దగును. అపుడు లయను చక్కగాసరిపడును.

దీనికిలక్ష్యము:—

౧. కరుణాకర! లోకపాల! కాలకంధరా!
కరుణింపుము దేవదేవ! కావు మీశ్వరా!
పరిచర్య లొనర్చుచుందు భక్తియుక్తి నీ
చరణంబులు గొల్చుచుందు సంతతంబు నో॥ కరు

౨. తొలిబామునఁ జేసినట్టి దోస మెట్టిదో!
కలనైన నెఱుంగఁ జాలఁ గాని యాపదా
కులసంసరణాబ్ధి నడుమఁ గ్రుంగుచుంటి నీ
తలఁపే గతి లేదనెత్తి దారి చూపుమో॥ కరు

(౪) కర్ణామృత వృత్తము:—

ఇదియును ప్రస్తరింపఁగా, ౧౪ వ ఛందస్సులో ౩౨౭౭ వ సమవృత్తమైనది. దీని లక్ష్యలక్షణము లప్పుడు సంస్కృతమున నిర్మింపఁబడినవి. కాని యాలక్షణము ననుసరించి తెలుఁగు పద్యములును రచింప వచ్చును.

లక్షణము:—

దిగ్దంతి విరామం తయసైర్భైనచ గాభ్యాం,
యుక్తంకవివిత్తం కిల కర్ణామృత వృత్తం.

తగణము, యగణము, సగణము, భగణము, రెండు గురువులు క్రమముగాఁ గలసి ఒక పాదమగును. తొమ్మిదవ యక్షరము యతిస్థానము. తెలుఁగునఁ ప్రాస నియమము. ఇందు మొదటి రెండు పాదములు పల్లవిగా, ఈ పద్యములు లయతాళములకు సరిపడును.

దీనికిలక్ష్యము:—

౧. రేమానస! మామాశల మస్యే నిజతత్త్వం,
తత్త్వం పదలక్ష్యం పరతత్త్వం ఘనసత్వం.
భూమాన మమానం పరమాత్మాన మసంగం
లీలాయితభూతాదికజన్మస్థితిభంగం, రేమా.

౨. జీవేశ్వర భేదాశ్రితయ మాయేశ మదృశ్యం
బ్రహ్మోఽహమితిజ్ఞాన ఫలీభూత ముపాస్యం
దృశ్యస్యతు కర్తార ముపాదాన మనేకం
సచ్చిత్పరమానంద మరూపం విభుమేకం, రేమా.

ఈశ్లోకములు రెండు మాత్రము నాళీమ్మ(?) ప్రతిలో అచ్చుపడినవి. గుణజ్ఞులైన కవులు పై నాలుగు వృత్తముల యౌచిత్యమును గ్రహింతురు గాక యని కోరుచున్నాను.

[మల్లాది సూర్యనారాయణశాస్త్రి]



## రా మ క లి

జో బనవంతీ మహామయమతీ సుమోజభరీ మాన బఢావే,
బేఠీ సబ అలిహారీ, మనాయకే వాహీ తో కామకలాలోలిన భావే,
హోత ప్రభాత సఖీ సముఝావత కాహేకో పావహీ పావ లగావే,
లాల క[illegible] రామకలీ యహ [illegible] కహావే.



[జయపుర చిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసు

# కళింగకదంబులు

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

౧

కళింగదేశమును పరిపాలించిన గంగవంశపు రాజులకాలములో కదంబవంశజు లుండినట్లు గాంగశాసనములవలన దెలియవచ్చుచున్నది. ఇంతవఱకు నేను చూచిన గాంగశాసనములలో కదంబులను పేర్కొనునవి మూడు మాత్రమే కలవు. అవియేవన:

(౧) వజ్రహస్తుని పర్లాకిమిడి శాసనము.[1]

(౨) మూడవవజ్రహస్తుని మందసాశాసనము.[2]

(౩) దేవేంద్రవర్మకంబకాయశాసనము

వీటిలో మొదటిశాసన మెప్పటిదో మనకు తెలియదు. అందు శకవర్షముకాని, మఱి యేయితర సంవత్సరముకాని లేదు. అప్పటికి కళింగదేశమును పరిపాలించుచుండిన రాజు వజ్రహస్తుడనియు, అతడు గంగామలకుల తిలకుడనియు మాత్రము తెలియుచున్నది. ఈతని తండ్రిపేరుకూడ శాసనమున దెలుపబడియుండలేదు. అందువలన గంగవంశపు రాజులలో ఈవజ్రహస్తు డెవరో మనకు తెలియదు ఈ కారణములవలన ఈ శాసన మెప్పటిదో తెలిసికొనుటకు వీలులేదు. కాని లిపినిబట్టి చూచినచో అది క్రీస్తుశకము పదునొకండవ శతాబ్ది టిదని చెప్పవచ్చును.

గంగామలకుల తిలకుడైన వజ్రహస్త దేవుడు కళింగమును పరిపాలించుచుండగా ఆతని రాజ్యమునందలి 'పంచవిషయముల' కధిపతియు, 'గంగామలకులతిలకుడు'ను[4], చోళకామదిరాజు ప్రియతనయుడును అయిన దారపరాజు నగ్గరిసలుకికులతిలకుడును, ఎఱయమరాజుకొడుకును అయిన శ్రీకామది నామాంకిత రాజపుత్రునికి కన్యాదాన సమయమున 'హూస్సండి'[5] గ్రామమును దానముచేసెను. ఈదానమును తెలియజేయుటయే ఈ శాసనముయొక్క ప్రయోజనము. దానమొసంగబడిన ఈ గ్రామమునకు పాలకుడుగ నున్న

1. Ep. Ind. Vol. III, p. 22G.

2. C. P, No. 12 of 1917-18.

3. భారతి; సం

4. గంగవంశపురాజుల పరిపాలనములో గంగవంశజులే సామంతులుగ నుండినట్లు తెలుపునది ఈ యొక్క శాసనమే. రాజవంశమువారి పేర్లకును, సామంతవంశమువారి పేర్లకును గల వ్యత్యాసము గమనింపదగినది.

5. ఈ శాసనమున ఈ గ్రామముపేరు రెండుమూడుచోట్ల వచ్చును. ఒక్కచోట తక్క మిగిలిన అన్నిచోట్లను 'మూతో' ఇది 'హూమ్మండి' అనియే కలదు. ఇతరచోట్ల 'హూమ్మండి' అని స్పష్టముగ చదువబడియుండుట చేత 'హూస్సండి' అని చదువబడినదికూడ 'హూమ్మండి' అనియే చదువవలసియుండునని నాయూహ. లేఖకుని అశ్రద్ధచేత 'స' 'మ' ల పోలికలు కొన్నికొన్నిచోట్ల ఒక్కరీతినే యున్నవి.

వాడు ఉగ్రఖేడిరాజు. ఇతడు కదంబామలకుల తిలకుడు; 'నిడుసంతి' వంశసముద్భవుడు. కదంబవంశమున 'నిడుసంతి' అనునది ఒకశాఖ కావచ్చును. ఉగ్రఖేడికి రాణక బిరుదముకలదు. ఇది 'మండలేశ్వర' పదతుల్యము కాదగును.

రెండవది మూడవవజ్రహస్తునిశాసనము. ఇందుకూడ కదంబవంశజులు పేర్కొనబడి యున్నారు. ఈశాసనము క్రీస్తుశకము ౧౦౫౮ నాటిది. పరమమాహేశ్వరుడును, 'పంచవిష యాధిపతి'యు, కదంబామలకులతిలకుడును, మహామండలేశ్వరుడు నైన రాణక శ్రీభామ ఖేడికొడుకు రాణక శ్రీధర్మఖేడి 'పంచపాత్ర విషయము' లోనిదగు 'మహేంద్రభోగము' నందలి 'మధిపత్థరఖండము'ను 'ఉజణ'కునికి దానముచేసినట్లు తెలుపుటకే ఈశాసనము పుట్టినది. ఇప్పటి 'మాధియా', 'పత్థరఖండము' అనబడు రెండుగ్రామములును శాసనమున పేర్కొనబడిన 'మధిపత్థరఖండము'నకు సరిపోలి యున్నవనియు, అందువలన శాసనములోని గ్రామమును ఇప్పటి యారెండుగ్రామములుగ గుర్తింప వచ్చుననియు, అవి మహేంద్రగిరి యున్న మందసా జమీందారీలో ఉండుట చేత 'పంచవిషయ' మనబడు 'పంచపాత్రవిషయము' మందసా జమీందారీ ప్రాంతదేశ మగుననియు, 'మహేంద్రభోగ' మనునది 'మహేంద్రగిరి'యున్న భాగము కాదగుననియు శ్రీయుత గోడవర్తి రామదాసు పంతులు గారు వ్రాయుచున్నారు.[1] ఈశాసనముముద్రకమీద వాడుకగా గాంగశాసనములమీద కాన్పించు వృషభలాంఛనము కాక మత్స్య లాంచనము కలదు.

ఇక కదంబులను పేర్కొను మూడవ శాసనము దేవేంద్రవర్మ కంబకాయ శాసనము. ఈ శాసనము శ. ౧౧౦౩ నాటిది. ఈ శాసనమునాటికి కళింగమును పరిపాలించుచుండిన రాజు దేవేంద్రవర్మ. ఇతని పరిపాలనములో పరమమాహేశ్వరుడును, పంచవిషయాధిపతియు, కదంబామలకులతిలకుడునైన రాణక శ్రీధర్మఖేడి యొక్క కుమారుడు రాణక శ్రీ ఉదయాదిత్యదేవుడు చేసిన దానమును తెలుపుటకు ఈ శాసనము పుట్టినది. దానముచేయబడినగ్రామము 'శేవెనిజి'(?). ఉదయాదిత్యదేవుడు ఆ గ్రామమును రెండుభాగములు చేసి ఒకభాగమును నారాయణ నాయకునికిన్ని, వేఱొకభాగము 'ఈజణ'[2] కునికిని ఒసంగెను.

---

1. Jour. Myth. Soc. Vol. XIV, p. 269.

2. మందసాశాసనమునను, కంబకాయశాసనమునను ధర్మఖేడి పేరు కలదు అంతేకాక ప్రతిగ్రహీతపేరు కూడ ఇంచుకవ్యత్యాసముతో సమానముగ కనబడును. ఒకదానిలో ఆ పేరు 'ఉజణక'అనియు, మఱియొక్కదానిలో 'ఈజణక' యనియు కలదు. ధర్మఖేడిపేరును, కొంచెము వ్యత్యాసముగనున్నను ప్రతిగ్రహీత పేరును రెండుశాసనములలో సమానముగనే గనబడుచుండుటచేత మందసాశాసనములోని ధర్మఖేడిని కంబకాయశాసనములోని ధర్మఖేడిగను, ఆశాసనములోని ప్రతిగ్రహీతను ఈశాసనములోని 'ఈజణకు'నిగను, ఈశాసనములోని దేవేంద్రవర్మను మందసాశాసనములోనివజ్రహస్తుని కొడుకుగను పోల్చ బుద్ధి [illegible] సరిపోవును. ఇది ఆలోచింపవలసినవిషయము.

ఈ పై మూడు శాసనములను బట్టియు మనకు దెలియవచ్చు విషయము లివి:

(౧) కళింగమును పరిపాలించిన గంగవంశ పురాజుల కాలములో కదంబులు ఉండిరి.

(౨) కదంబులు గంగవంశపురాజుల క్రింద గ్రామపాలకులును, విషయాధిపతులును అయి న సామంతులుగ నుండి పేరు కెక్కిరి.

(౩) కదంబులు పరిపాలించిన రాజ్యము పంచవిషయము: దీనికి పంచపాత్ర విషయ మనియు నామాంతరము కలదు. ఇది (శ్రీ గొడవర్తి రామదాసు పంతులుగారి వ్యాసము ననుసరించి) యిప్పటి మందసా జమీందారీ ప్రాంతము కావచ్చును.

(౪) కదంబులపేర్ల చివర 'ఖేడి' పదము సామాన్యముగ గనబడుచున్నది. ఇందువలన ఆ పదముకదంబవంశసూచకమని గ్రహింపదగును.

(౫) గాంగవంశపురాజుల శాసన ముద్రి క లన్నిటిమీద సర్వసాధారణముగ వృషభ లాంఛనము ఉండవలసి యుండగా మందసా, కంబకాయ శాసనముద్రికలమీద మాత్రము మత్స్యలాంఛనము కనబడుటకు గారణము ఆ శాసనములందలి అసలుదాతలు కదంబవంశజు లగుటయే యని నాయూహ. ఇదియే సరియైన చో ఇందుమూలమున కళింగదేశమునందలి కదంబులది మత్స్యలాంఛనము కాదగు నని తేలుచున్నది.

౨

'ఖేడి' పదాంచితులను పేర్కొను గాంగ శాసనములు ఇంకను రెండు కలవు: అవి యేవన:

(౧) గంగామల కులతిలకు డైన ఇంద్రవర్మ విషమగిరి శాసనము.[1] శకవర్షము కాని మరి యే యితర సంవత్సరము కాని ఇందు లేక పోవుటవలన ఇది యెప్పటిదో తెలియదు. ఇందు మహాసామంతనాగఖేడి 'దూతకు' డని తెలుపబడినది. శాసనముద్రికమీద నున్నది వృషభలాంఛనము. నాగఖేడి కదంబామలకుల తిలకుడని తెలుపబడలేదు.

(౨) దేవేంద్రవర్మ విశాఖపట్టణము శాసన ము.[1] ఇందలిగాంగవంశపురాజు దేవేంద్రవర్మ. ఇతని మాతులుడు శ్రీధర్మఖేడి. ఇతనిచేత ఉపదిష్టుడై దేవేంద్రవర్మ దానము చేసెను. ఇది గాంగశకము ౨౫౪ నాటిది. గాంగశకము ఎప్పటినుండి యారంభమైనదియు ఇంకను సుని శ్చయముగ దెలియరాకపోవుటచేత ఈ శాస నము శకవర్షపరిగణనమునగాని, క్రీస్తుశకపరి గణనమునగాని ఎప్పటిదైయుండునో యూహిం ప వీలుకాదు. ఈ శాసనము ముద్రికమీదది కూడ వృషభలాంఛనమే. ఇందుకూడ ధర్మ ఖేడి కదంబవంశజు డని ఎచ్చటను దెలుపబడి యుండలేదు.

ఈ పై రెండు శాసనములలోను గూడ 'ఖేడి' పదాంచితులు కదంబవంశజులని తెలుప

1. C.P. No. 9 of 1917-18,
1. Ind. Ant. Vol. XVIII p. 145.

బడక పోయినను, ఆ రెండు శాసనముల ముద్రిక లమీాదనుగూడ వృషభమే లాంఛనముగ నున్నను వారు కదంబవంశజులనియే నానమ్మకము. ఇట్లు నమ్మటకు నాకు 'ఖేడి' పదమే యాధారము. నేను పరిశీలించి చూచినంతవఱకు గాంగ శాసనములలో ఇతరు లెవ్వరును 'ఖేడి' పదాంచితులుగ గన్పట్టరు. 'ఖేడి' పదము కదంబవంశసూచక మని ఇదివఱలో నిశ్చయించుకొనియుండుటచేత పై శాసనములలోని 'నాగఖేడి', 'ధర్మఖేడి' అనువారలు కదంబు లగుదురనియే నాయూహ.

అట్లయిన శాసనముద్రికలమీాద వృషభలాంఛన మేలయుండవలెను? కదంబ లాంఛన మని తేల్చిన మత్స్య మేల లేకపోవలెను? అను ప్రశ్న పుట్టవచ్చును. కాని దీనికి సమాధానము సులభమే. ఈశాసనములలోని దాతలు గంగవంశపురాజులు కాని మత్స్యవంశపు సామంతులు కారు. ప్రధానముగ కదంబవంశజులు దాతలైననే మత్స్యలాంఛన ముండవలసిన యవసరముకలదు గాని లేనిచో లేదు. అందువలన మన మిది వఱలో తేల్చుకొన్న సిద్ధాంతముల కీ శాసనములు ప్రతిబంధకములు కాకపోవుటయే కాక, కదంబులకును, గంగవంశపురాజులకును సంబంధబాంధవ్యములు కల వను క్రొత్తవిషయమును తెలియజేయుటకుకూడ ఇవి తోడ్పడు చున్నవి.

3

ఇక కళింగమున కీకదంబు లెక్కడ నుండి వచ్చి యుందురో ఇంచుక విచారింతము. ఈ విచారణలో కూడ 'ఖేడి'పదమే మన కెక్కువగ తోడ్పడునని నా యూహ.

ధార్వారమండలములో హాన్‌గల్లు తాలూకాయందలి హానుగల్లనబడు పానుగల్లు క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దము మొదలు సామంతులుగనుండి ప్రసిద్ధిగన్న కదంబులలో ఒక్క వంశమువారికి రాజధానిగ నుండెను. ప్రాచీన కదంబరాజ్యము బాదామిచాళుక్య, రాష్ట్రకూటవంశముల విజృంభణము మూలమున అంతరించిన పిదప క్రీస్తుశకము పదునొకండవ శతాబ్దిలో వర్ధిల్లినవి పానుగల్లు, గోవా కదంబరాజ్యములే. ధార్వారమండలము నంటియున్న బెళగాము మండలమును గూడ ప్రాచీనకాలమున ఒకప్పుడు కదంబుల రాజ్యము వర్ధిల్లినది. బెళగాముకదంబులకు 'పలాసిక' (ఇప్పటి హాల్సి) రాజధానిగ నుండెను. బెళగాము మండలమును చేరియున్న కొల్హాపురసంస్థానమును, దాని నంటియున్న రత్నగిరిమండలమునుగూడ ఒకవేళ పలాసికదంబులయొక్కగాని, పానుగంటి కదంబులయొక్కగాని రాజ్యములో చేరిన చేరియుండవచ్చును. ఎట్లయినను ఇవియన్నియు నొకప్పుడు కదంబులు వ్యాపించిన మండలములే. రత్నగిరి మండలములోని ఇప్పటి 'ఖేడ్' తాలూకా ప్రాచీనశాసనములలో 'ఖేటాహార'[1] మని పేర్కొనబడినది. ఈప్రాంతములు

1. Bomb. Gaz. Vol. I, Part II, P. 355.

నుండియే-ప్రాయికముగ ఖేటాహారమునుండికా వచ్చును-కదంబులు కళింగమునకు వచ్చి యుందురు. నిశ్చయముగ అచ్చటినుండియే వచ్చి రని చెప్పలేకపోయినను పశ్చిమమునుండి మాత్రము వచ్చి రని చెప్పుటకు సంశయింప బనిలేదు.

మఱియొక విషయము: వైజయంతి, పలాసిక, పానుగంటి కదంబులకు మధుకేశ్వరస్వామి ఇష్టదైవము. వారి శాసనములలో ఈ పేరు 'జయంతి మధుకేశ్వరు' డనియు గలదు. కళింగదేశములో 'నగర' మను పురమున గూడ 'మధుకేశ్వరు' డున్నట్లు గాంగశాసనముల ననుసరించి తెలియుచున్నది. గంగవంశజుడైన దానార్ణవుని కుమారుడగు రెండవ కామార్ణవుడు ఈ 'మధుకేశ్వరు'నికి గుడి కట్టించినట్లు అనంతవర్మ చోడగంగదేవుని శాసనములలో గలదు. అయితే వాటిలో మధూకవృక్షమునుండి పుట్టుటచేతనే ఆ దేవునికి 'మధుకేశు' డను పేరు కలిగినట్లు కలదు. కాని యిది సరియైనదిగ దోచదు. కళింగదేశమున 'మధుకేశ్వరు' డుండుటకు కారణము కదంబులే యని నా తలంపు. స్వదేశమును వీడి కళింగమునకు వచ్చినవా రగుటచేతనే వారు ఇక్కడకూడ తమ యిష్టదైవమునకు మధుకేశ్వరుడనియే పేరు పెట్టుకొనియుండవచ్చును. గాంగవంశజులకు ఇష్టదైవము గోకర్ణస్వామి కాని మధుకేశ్వరుడు కాడు. అందువలన కళింగనగరమునందలి మధుకేశ్వరస్వామి కళింగ కదంబులయొక్క ఇష్టదైవమే యని నిశ్చయింపవచ్చును. గంగవంశపురాజులు మధుకేశ్వరునికి గుడికట్టించియుండినచో అది యొక పుణ్యకార్యము గనుకనే అట్లు చేసియుందురు కాని ఇష్టదైవమని మాత్రము కాదనియు, ఈ మధుకేశ్వరాలయ నిర్మాణము కళింగ గాంగరాజ్యమునందలి కదంబుల ప్రాబల్యమునే సూచించుననియు నా నమ్మకము. ప్రాచీనకదంబుల యిష్టదైవము కళింగమున గూడ గానవచ్చుట కళింగకదంబులు పశ్చిమ లేక నైఋతిదిశనుండియే వచ్చిరనుట కింకొక యుదాహరణము.

'మాల్ఖేడ్' ఖేడాహారము-ఇట్టి 'ఖే' ద్వదాంచితము లైన పదములు పశ్చిమమున జాల గాన్పించును. అందువలన 'ఖేడి' పదాంచితు లగు కళింగ కదంబులు పశ్చిమదిశాగతు లనియు, అందొకవేళ ఖేటాహారమునుండియే కాదగును వచ్చియుందురనియు, ఎట్లయినను పానుగల్లు, బెళగాం ప్రాంతములవా రనియు నిశ్చయింపవచ్చును.

కళింగకదంబులు పానుగంటి ప్రాంతము వారై యుందు రనుటకు మఱియొక యాధారము కలదు. వీరి లాంఛనము మత్స్యము. వీరి కిది లాంఛన మె ట్లయ్యెను?

కళింగకదంబులు మత్స్యదేశమునుండి వచ్చుటయే వారు మత్స్యలాంఛనము నవలం

బించుటకు కారణమని నాయూహ. పానుగల్లు నగరము ప్రాచీనశాసనములలో[2] (మత్స్య దేశ మునకు రాజధానియైన) విరాటనగరముగ పేర్కొనబడియున్నది. అందువలన ధార్వారు మండల ప్రాంతమును మనము మత్స్య దేశముగ పరిగణింపవచ్చును. కళింగ కదంబులు మత్స్య దేశాగతులుకనుక నేమత్స్యలాంఛనులైరనియు, అసలు ఖేడాహారప్రాంతములం దుండువారలు గనుక నే 'ఖేడి' పదాంచితులైరనియు నేనూహిం చుచున్నాను. అయితే ఇవి యూహలేకాని నిర్ధారణగ నొక్కి చెప్పదగిన విషయములు మాత్రముకావు. పరిశీలించి ఇంకను చర్చింప దగినవి.

౪

కళింగదేశమున క్రీస్తుశకము పదుమూ డవశతాబ్దిని విశాఖపట్టణమండలములోని ఒడ్డా ది రాజధానిగ మత్స్యవంశజులు కొందఱు ప్ర పాలించినట్లు చరిత్రవలన దెలియుచున్నది. వారికిని మత్స్యమే లాంఛనము; కళింగకదంబు లదికూడ మత్స్యలాంఛనమే. ఆ మత్స్యవంశ జులకును, ఈ మత్స్యలాంఛనులకును సంబంధ మేదైన నుండునా? ఒడ్డాది మత్స్యరాజు శాసనములుమాత్ర మీ సంబంధమును నిశ్చ యించుట కేమియు దోడ్పడవు. మత్స్యలాం ఛనమాత్రముననే వారికిని వీరికిని సంబంధ ము న్నదియు, లేనిదియు నూహింపవలయును. ఈ విషయ మింకను విమర్శనీయము.

---

## చిత్రకారుఁడు

భమిడి ఉమామహేశ్వరావధానిగారు

దివి విరాజిల్లెడు దివ్యమహాత్ముల
సచ్చరిత్రలనన్ని సమకూర్చి ముందు
హృన్మందిరంబందు నింపొందవ్రాసి
ఉత్సాహజలధిని నోలలాడుచును
నీలాంబరములోని నీలిమ దీసి
లలితపల్లవముల రక్తిమ దీసి
స్వర్ణపాత్రలలోని బసిమిని దీసి
చిత్రవర్ణంబుల చెలువును దీసి
కనులుపండువుసల్పఁగాఁ జాలునవియు
పరికించుకొలఁదిని భావ మెచ్చునవి
సకలజనాళి పూజల నందునవియు
చిత్ర చిత్రంబుల చిత్రించి వాని
వసుధ మూర్తీభవింపఁగఁ జేతు నహహా!

---

2. Bomb. Gaz. Vol. I, Part II, P. 558; Mysore & Coorg from Inscriptions-Rice, P. 2.

# కర్ణాటకము

వేలూరు రామమూర్తి గారు

## హిందూదేశమునందలి బ్రిటిషుసామ్రాజ్యమునుగూర్చి మేజరు ఇవాన్సు బెల్లుగారు వ్రాసిన లేఖలలో 3-వ లేఖ

[సంపు. ౪. సంచి. ౧౧ తరవాయి]

### ౪-వ భాగము

ఈ యిరుపక్షములు అనగా, వాలాజావంశము, కంపెనీ అన్యోన్యవ్యవహారములందు ఒండొరులయొక్క సంబంధము లతివిచిత్రములై, క్లిష్టములై ఇవ మిద్ధమని నిర్ణయింప వీలులేనివై యున్నవి. పరస్పరము వ్యతిరేకములయిన హక్కులవల్ల క్రమక్రమముగ సందిగ్ధములైనవి. తుదకు వారూనిన కొన్ని నియమములకే విరుద్ధములై పోయినవి. వ్యవహార సందర్భమున—దక్షిణదేశములో సత్పరిపాలనమునకు భంగకరములైనవి. ఇవన్నియూ నేనొప్పుకొనుచున్నాను. దానివలని ఫలితములను బట్టి ౧౮౦౧ సం.రం సంధి (దేశమునకు గూడ) లాభకరమయ్యెననియు ఒప్పుకొనుచున్నాను. కాని నా వాదన ఏమనగా, ఇరుపక్షములకును మధ్యజరిగిన ఆ సంధిలో—సక్రమమైన, కృత్రిమము కానట్టి సంధిలో—బలవత్తర పక్షము నిర్బంధించి కొన్ని హక్కులను సంపాదించుటవలనగాని, బలహీనపక్షము లోబడిపోవుటవలన గాని, వారివారి పరస్పరసంబంధములు మారలేదనియే. నబాబుగారు యింక ముందు కూడ కర్ణాటక రాజ్య స్వతంత్ర ప్రభువుగానే యుండవలసి యుండెను. కంపెనీ ఇంతకు పూర్వపుసంధులచే అప్పుడప్పుడు కొంత నియమితకాలము మాత్రమే వ్యవహరించినటుల కార్యనిర్వాహణాధికారమును మాత్రము శాశ్వతముగ అవలంబించిరి. ఆజీముద్దౌలా స్వతంత్రప్రభువు. గవర్నరు కర్ణాటకరాజ్య పరిపాలనాధికారియని నా నమ్మకము.

ఇట్టి విపరీతపు సంబంధములు (ఒకరు స్వతంత్ర ప్రభువై యుండ యింకొక ప్రభువు పరిపాలనాధికారియై యుండుట) అకాలములో నీదేశమునందు మామూలే యయి యుండెను. మొగలుపాదుషా యొక్క సార్వభౌమాధికారమును మనముగూడ నొప్పుకొనియున్నాము. మనటంకశాలలోని నాణెములుకూడ ఆతని పేరనే వేయబడెను. మన బ్రిటిషుగవర్నర్లు, గవర్నరు జనరలులుకూడ కప్పములను చెల్లించి విధేయులగు బానిసలమని విధేయముగ నర్జీలనుకూడ పంపుకొనుచుండిరి. అట్టిమొగలు పాదుషావంటి వాడుకూడ ఏబదిసంవత్సరముల కాలము తాత్కాలికముగ బలవంతులయిన కొందఱి పోషణయందు, సంరక్షణయందుండుచు వచ్చెను. తన రాజభవనమునందే ఖైదీవలెయుండిన సతారారాజు మహారాష్ట్ర సామ్రాజ్య స్వతంత్రప్రభువై యుండగా పీష్వా తద్రాజ్య పాలనాధికారి. ఈమధ్య ౧౮౧౮ లో కూడ బ్రిటిషు ప్రభుత్వము ఒకసంధివల్ల మహారావు ఓముద్‌సింహుని కోటారాజ్య స్వతంత్రప్రభువుగానొప్పుకొని, రాజారాణా జాలిము సింహుని తద్రాజ్యమునకు వంశపారంపర్యపు పాలనాధికారిగా నియమించెను.* ఐరోపాఖండ రాజ్య

* "కోటారాజయిన మహారావు ఓముద్‌సింహుని తరువాత ఆతని రాజ్యమునకు, ఆతని ప్రథమపుత్రుడును, యువరాజును అయిన మహారాజాకూవార్ కిశోర్‌సింహుడును, ఆతని వారసులును క్రమప్రకారము శాశ్వతప్రభువు లయ్యెదరు. ఆరాజ్యముయొక్క పరిపాలనమంతయు రాజారాణా జాలిముసింహుడు నిర్వహించుచు, ఆతని వెనుక ఆతని జ్యేష్ఠపుత్రుడు కూవార్ మధూసింహుడును ఆతని వారసులును క్రమప్రకారము శాశ్వతముగ నిర్వహించెదరు" (Volume of Treaties 1853 P 443.) ఈపద్ధతి తుదకు వారిద్దరకును అనుకూలముకాకపోవుటచే కొన్ని పోరాటములయిన వెనుక ౧౮౩౮లో క్రొత్తసంధిచే రాజ్యమును యిప్పుడు కోటా, ఝల్లావార్ రాజ్యములుగానున్న రెండుభాగములుగా పంచితిరిగి కంపెనీ తీర్పు దిద్దవలసివచ్చెను.

వ్యవహారము లందు సయితము యిటువంటి ఏర్పాటులు పెక్కులు కలవు. స్విట్జర్లండు సంయుక్తరాష్ట్రము లందలి యొక భాగముగ నుండి ప్రజాస్వామిక పరిపాలన ననుభవించుచుండిన న్యూఛాటెల్ ప్రాంతమునకు ప్రస్సియారాజు ప్రభువని చెప్పబడుచుండెను. తురుష్క సుల్తాను డాన్యూబ్ నది పరిసరప్రాంతములకును, సర్వియా యీజిప్టు దేశములకును ప్రభువు కాని సంధి షరతుల ప్రకారము నాతడు యీదేశముల సామాన్యపరిపాలన వ్యవహారమునందు జోక్యము కలిగించుకొన గూడదు. ఇటులనే విక్టోరియారాణి ఇయోనియా ద్వీపములను పాలించుచున్నది కాని ఆమె వాటికి ప్రభువుకాదు.

లార్డు హారిసు అన్నట్లు ఈ యిరుపక్షములు ఫలాని ఫలాని సంబంధములలో నున్నారని నిర్వచించుట కొంత కష్టము అయినను అసలు తెలుపుటకేమాత్రమునూ ఆసాధ్యముకావని యీ వీరి యిద్దరిసంబంధమును ఏమాత్రము అసాధారణము కావనియు, ఈస్టు ఇండియాకంపెనీ "సర్వాధికారియు, నబాబుసామంతుడును అని లార్డు హారిసు చేసిన నిర్వచనము చరిత్రాత్మకములగు యధార్థవిషయములకును, ఉభయులకును జరిగిన సంధులలోని షరతులకును కేవలము వ్యతిరేకమనియూ కానవచ్చును.

మదరాసును, కడలూరును, ఇంకను హిందూ దేశములోని కొన్ని పరగణాలను హైందవప్రభువుల నుండియు, నైజామునుండియు, వంగదేశపు నబాబునుండియు, మొగలు పాదుషానుండియు—నబాబుయొక్క అధికారముతో నిమిత్తము లేకయే—ఫర్మానాలవల్ల పొందియుండుట చేతను సైనికబలసత్వము లుండుట చేతను, కంపెనీవారు నబాబుతో మిత్రులైయుండి సరిసమాన హోదాగౌరవములతో వ్యవహరించిరి. కాని కర్ణాటకములో వారు పొందిన యింకా కొన్నిపరగణాలకు సంబంధించి నంతవరకు నబాబు సర్వాధికారియు, కంపెనీ సామంతులును అయియుండిరి.

వాలాజానబాబుగారి కాలమునాటికి బ్రిటిషు వారికి మదరాసు కడలూరు మాత్రమే స్వాధీనములో ఉండెను. అదిమొదలు వాలాజానబాబు చుట్టుప్రక్కల నుండు భూమినంతయు ఒకరిస్వాధీనమున నే యుంచుట యెక్కుడుసౌకర్యమని తలచి, పూనామల్లి, ఆదిగాగల తాలూకాలను ఒకటి తరువాత నొకటిగ సన్నదులు నిచ్చివేసెను. ౧౭౬౩ లో తనమిత్రులగు కంపెనీవారికి ఆకాలములో జాఘీర్ అని పిలువబడెడు, ౧౪ లక్షల రూప్యమును ఆదాయముగల చంగల్పట్టుజిల్లాను యిచ్చెను. అధిక రాజ్యసంపాదనచే కొంత స్వాధికారమును పొందుచున్నను న్యాయముగను మొట్టమొదటి పద్ధతిప్రకారము కంపెనీ నవాబుయొక్క సామంతులే. మరియు ఒక్క మదరాసుతప్ప తక్కిన రాజ్యమంతయు, ఆదేశపు స్వతంత్రప్రభువైన నబాబుయొక్క సన్నదు అధికారముచే జాగీరులుగా పొందియుండిరి. ఇట్టివారి అన్యోన్యసంబంధములు ౧౭౦౧ వ సంధిచే చెక్కుచెదరకుండుటయే కాక ౧౭౯౨ లో యీగతించిన నబాబుగారి మరణమునకు పూర్వముగాని తదనంతరముకాని ఎవ్వరును ఆక్షేపించి యెరుగరు.

పారిసు సంధిలో పరాసుగవర్నమెంటు వారిచే మహమ్మదాలీ గారిని కర్ణాటక స్వతంత్రప్రభువుగా నొప్పించుట ఎంత అవసరమని ఈస్టుఇండియాకంపెనీ తలంచిరో ౧౭౬౩ మార్చి ౯ వ తేదీని మదరాసుప్రభుత్వము వారు బోర్డు ఆఫ్ డైరక్టర్లకు వ్రాసిన లేఖచే విదితమగుచున్నది. ఈ ప్రశ్నవును నబాబుగాను, సలాబత్ జంగ్ను నైజాముగాను అంగీకరింపచేయుటవలన మనము యింకొక లాభముకూడ కలదు. అదియేమనిన మనము యీ ప్రభువులవలన పొందిన పరగణాలపై మనకు గల హక్కు స్థిరపడగలదు. అతేకాకుండ దక్కను రాజ్యమునకుగాని కర్ణాటకరాజ్యమునకు గాని పూనినప్పు డెట్టి సంబంధము లయందున్నారో అట్టి పరస్పర సంబంధములనే హక్కుదారుల మని పోరాడే యితరుల ప్రక్కనచేరి వారు యికముందు జోక్యముకలిగించుకొనే అవకాశము లేకుండాచేసి అందువలన రాజ్యమునకు ముమ్ముందు శాంతినిగూడ చేకూర్చవచ్చును.[1]

1 Asiatic Annual Register, vol. X, 1808, P. 495.



౨. పడమరకనుమలలో ఒకభాగము

# ఆకస్మిక ఛాయాచిత్రములు

## (SNAP SHOTS)



౧. నాసికవద్ద ఒక చిన్న ఏరు
ఛాయాచిత్రకారుడు: శ్రీ జి. ఏ. రాజమన్నారుగారు



౪. బైరాగులబండి
ఛాయాచిత్రకారుడు: శ్రీ చక్రవర్తుల వెంకట్రావుగారు



౩. జాలరి (రెండవ బహుమానము)
ఛాయాచిత్రకారుడు: శ్రీ చక్రవర్తుల వెంకట్రావుగారు, దంగేరు



స్వేచ్ఛాజీవనము (అరకలు)
ఛాయాచిత్రకారుడు: శ్రీ మైలవరపు లక్ష్మీనారాయణమూర్తిగారు

అజీముద్దౌలాకు తరువాతి నబాబు అగు ఆతని పుత్రుడు అజమ్‌జాగారి కాలములో మదరాసు గవర్నరయిన సర్ థామస్ మన్రో ౧౮౦౧ సంధియొక్క 3 వ షరతునుగూర్చి యిటులు వ్రాసినాడు.

"ఈషరతువలన నబాబు తన స్వతంత్రప్రభుత్వపు హోదాను త్యజించుటలేదు. ఇతర ప్రభుత్వములతో కంపెనీ యనుజ్ఞలేనిదే ఉత్తరప్రత్యుత్తరములు జరుపనని యిదివరకు సంధులలో చేసిన షరతును, మరల నొప్పుకొనుచున్నాడు—"

"కర్ణాటక రాజ్యాదాయములోని అయిదవభాగము తద్రాజ్యము అంతకును ప్రభువైనందుకు ఆతని వంతుగా నిర్ణయింపబడినది.

"ఆతడింకను కర్ణాటకమునకు ప్రభువే. ఏసంధివలన వారికి రాజ్యాదాయమునుండి అయిదవపాలు యియ్యబడునట్లు నియమింపబడియెనో ఆ సంధిలో నీతడుకూడ (అజమ్‌జా) పాల్గొన్నట్లగును.

"ఈ రాజ్యపాలనమును శాశ్వతముగ పూని యున్నాము. కాని యిదివరలో తత్పరిపాలనను పూనినప్పుడెట్టి సంబంధములయందున్నారో అట్టి పరస్పరసంబంధములనే కంపెనీయును, నబాబున్ను కలిగియున్నారు. నబాబు యింకను కర్ణాటకరాజ్యప్రభువు. ఆహక్కు ననుసరించి ప్రభుత్వనికరాదాయమునుండి అయిదవపాలును పొందుచున్నాడు."[1]

"దేశమును అప్పుడప్పుడు యిదివరలో స్వాధీనము చేసుకొను సందర్భములను" గూర్చి—అనగా పరాసువారితోను, హైదరు టిప్పూలతోను జరిగినయుద్ధముల సమయమున కర్ణాటకప్రభుత్వమును కంపెనీవారు తాత్కాలికముగ నిర్వహించిన సందర్భములను గూర్చి—చెప్పుటలో, అజీముద్దౌలా కుమారుడైన అజముజాయొక్కయు, కంపెనియొక్కయు పరస్పరసంబంధములు—, వాలాజా నబాబు, ఆయనకుమారుడు ఉమ్దుల్, ఉల్ ఉమ్రాలకాలములయందెట్లులుండెనో అట్లే యున్నవి." అని సర్ థామస్‌మన్రో సూచించుచున్నాడు.

౧౮౦౧ సం॥రం సంధికి అనంతరము నబాబు ఎప్పటివలెనే, నిరభ్యంతరముగ, అక్షీణముగ, యధాస్థితిగ కర్ణాటక ప్రభువుయొక్క ఉత్తమాధికారమును బ్రిటిషు ప్రభుత్వమువారు సమర్థించినట్లుగా ౧౮౦౧ సెప్టంబరు ౧౪ న కోర్టు ఆఫ్ డైరక్టర్లకు గవర్నరు వ్రాసిన జాబులోని యీ దిగువ భాగమును బట్టి తెలియగలదు.

౭౫ వ శీర్షిక—తాను యివ్వనొడంబడిన వార్షిక ధనమును, తనపై ప్రభువునకు ఏమార్గముగా పంపుకొనవలెనో తెలియజేయ వలసినదిగా తిరువాన్కూరు రాజాగారు, పంపుకున్న దరఖాస్తును, శ్రీవారివద్దనున్న రెసిడెంటునుండి అందుకొంటిమి. అందుపైన, శ్రీవారు మామూలు ఆచారప్రకారము తా మీయవలసిన పేష్‌కష్, నజరానాలు, నజరులను కర్ణాటక నబాబుగారికే పంపుకొనవలసినదిగా శ్రీవారికి తెలియబరచినాము.[2] ఫోర్టు సైంటుజార్జినుండి కోర్టు ఆఫ్ డైరక్టర్లకు ౧౮౦౩ ఫిబ్రవరి ౨ న వ్రాయబడిన యుత్తరమునందు "మేము తమకు యిదివరలో తెలియపరచుకున్న నియమముప్రకారమే, తిరువాన్కూరు రాజాగారు కర్ణాటకరాజ్య స్వతంత్రప్రభువైన నబాబుగారికి ౨౨౬౬ పగోడాల ౧౫ అణాలుగడచిన ఫసలీకిగాను యివ్వవలసిన పేష్‌కష్‌క్రిందను కన్యాకుమారికై యివ్వవలసిన నజరానాక్రిందను ఖీదాగా శ్రీ నబాబుగారికే చెల్లించినారు.[3]

ఆప్రకారమే ట్రివాన్కూరు పేష్‌కష్, నబాబుగారి బొక్కసమునకే చెల్లింపబడుచు వచ్చెను. కాని గత నబాబుగారి మరణానంతరమునుండి మద్రాసు ప్రభుత్వమువారికి మార్పబడి ౧౮౬౧-౬౨ సంవత్సరము క్రింద జమకట్ట బడినటుల కాన్పించుచున్నది.

"క్రీ. శే. కర్ణాటకనబాబుగారి ఖాతాకు తిరువాన్కూరు రాజాగారిద్వారా జమ
రు. ౧౩౩,౯౮-౦-౦ లు."[4]

1 Gleig's Life of Sir Thomas Munro, vol. ii, P. 356.
2 Carnatic papers, 1861, P. 118.
3 Madras administration Report 1861-1862, Para, 604, P. 106.
4 Paper 7, p. 48, Karanatic paper, 1806.

"అజీముద్దౌలాకే తప్ప ఆతని తర్వాత వచ్చెడి యింకెవ్వరికిన్ని ౧౮౦౧ సంధివల్ల యేవిధమగు హక్కున్ను సంక్రమించలేదు. అని డాల్హౌసీ తన మినిటునందు విరుద్ధముగా వ్రాసినాడు. వాస్తవముగ యథార్థముగ ఆసంధివల్ల ఈస్టుఇండియాకంపెనీకి తప్ప తదితరులకు ఎవరికిని గ్రాంటు యీబడలేదు. మొదటగా నబాబు తన వంశపారంపర్యపు రాజ్యమునందు నబాబుగా ప్రతిష్ఠాపింపబడి కంపెనీవారియెడ దానప్రదాతయయ్యె. కంపెనీ ప్రతిగ్రహీతయయ్యెను. మదరాసు ఒక్కపట్టణమే తమ స్వాధీనమున నుండు తను ఆస్తిని అభివృద్ధిపరచుటకై (వాలాజాగారి)నుంచి పూనామల్లి, చంగల్పట్టులను తీసికొనినదిమొదలు, అజీముద్దౌలావలన కర్ణాటకరాజ్యపు సివిల్, మిలిటరీ పరిపాలనములను పొందినంతవరకు నబాబులే దాతలు, కంపెనీ ప్రతిగ్రహీతలును. హక్కువలన స్వతంత్రప్రభువులైన నబాబు లేవియివ్వలేదో అవి యన్నియు వారి స్వాధీనమున నున్నట్లే యెంచవలయును. సంధిప్రకారము అజీముద్దౌలా పరిపాలనమును కంపెనీకి వదలుకొనినను యింకను ఆతడే కర్ణాటకరాజ్యస్వతంత్రప్రభువే యైయుండెను. అట్లు స్వతంత్రప్రభువని బ్రిటిషు ప్రభుత్వ మనేకతూర్లు ఒప్పుకొని ప్రకటించినది కూడను. ఆతని మరణానంతరము ఆ రాజ్యమును వరుసగ నిద్దరు ఏలిరి. ఆతని కొమరుడు అజమ్‌జాయున్ను ఆతని మనుమడు మహమ్మద్‌ఘౌస్‌న్ను ఆతని సింహాసనమును ఆతని తరువాత నధిష్ఠించిరి. ఈ గత నబాబు మరణించినదాదిగా మన ప్రభుత్వము రాజ్యపాలనగురించిన సెట్టిప్రకటనయు చేయలేదు. తమకే యీ ప్రభుత్వాధికార మున్నదని బహిరంగముగా గాని, ఉద్యోగరీత్యాగాని ప్రకటించలేదు — అజీమ్‌ఉద్దౌలా కుమారుడైన అజీమ్‌జా తన అన్న కొమరుడైన గత నబాబుగారి మరణానంతరము మహమ్మదీయ ఆంగ్ల న్యాయశాస్త్రము ప్రకారము కూడ ఆతనివారసుడై తనతండ్రియొక్క ప్రతినిధియేకాక తన తండ్రి దాయాదితో కేవలము కంపెనీ వారొప్పుకొనిన ౧౮౦౧ సంధిమరతుల ప్రకారము ఒడంబడునంతమాత్రమున తొలగింపబడిన ఆలీహుస్సేనునకును, ముత్తాతయైన మహమ్మదల్లీకిని, పెదతాతయగు ఉమ్దతుల్ ఉమ్రాకును, తన తాత ముత్తాతయు, వంశస్థ (చూ.పు. ౩౭౯.) మూలపురుషుడును అగు అన్వరుద్దీన్ ఖాన్ పుత్రదుహితృపారంపర్యముల ద్వారాకూడ ప్రతినిధి న్యాయశాస్త్రవిధులప్రకారమైతే నేమి, సంధుల లోని యొడంబడికలవలన నైతేనేమి, న్యాయప్రకారమైతేనేమి, యథార్థమైననేమి కర్ణాటక స్వతంత్రప్రభుత్వము అజీమ్‌జాయందు సహజంగానుండి తీరినది.

మఱియు తత్స్వతంత్రప్రభుత్వమును వారు (కంపెనీ) న్యాయప్రకారముగా సంపాదింపకపోవుటయే కాక, వహించుటగాని, మాది అని వాదించుటగాని లేదనుట యథార్థమైన విషయము.

పరిపాలనాధికారము మనకు వచ్చుటచే వాలాజా కుటుంబపు యజమానికికూడ ప్రభుత్వాధికారమునకు సిరపడుచున్నది

అజీముద్దౌలా వంశపారంపర్యపు స్వతంత్రప్రభువు. ౧౮౦౧ సంధివలన వానికెట్టి హోదాహక్కులుండెనో అట్టిహోదాహక్కులే ఆతని వెనుక రాజ్యమునేలిన యిద్దరకును ఉండెను. ఏలన బ్రిటిషుప్రభుత్వము గత నబాబు మరణించిన ౧౮౫౫ సంవత్సరమువరకు తత్సంధియొక్క మరతులు పూర్ణముగా చెల్లుబడిలోనుంచి ఇరుపక్షములును అందులకు బద్ధులని పదేపదే చెప్పియున్నారు. గతించిన నబాబుగారి సక్రమపు వారసునకు కూడ అట్టిహక్కులే. ఆ వంశమునకు న్యాయమైన ప్రతినిధు లుండునంతకాలము తద్వంశ ప్రధాన ప్రతినిధికి కూడ అట్టిహక్కులే చెందును.

కొలదికాలము క్రిందటనే అధికారమునకు వచ్చిన రాజవంశమును గూర్చి—వారిలోని తుది మొగ్గలును నామమాత్రపు ప్రభువులై యుండ—వాదించుచు, దైవదత్తమైన ఉత్తమాధికారముగల వంశమును గూర్చి (అనగా చాలా అనాదికాలమునుండియు పాలించుచున్న వంశమును గూర్చి) వాదించునట్లుగా నేను చెప్పుటనుగూర్చి ఎవరైన నభ్యంతరము పెట్టుచో నేను ఇచ్చుజవాబు యిది— దక్షిణదేశము స్వాధీనము చేసుకొని పరిపాలించుటకు మనకుగల హక్కును, అందలి ప్రజలను మన అధికారము

## * ఆజీముజాయొక్క వంశవృక్షము

అన్వరుద్దీన్‌ఖాన్ ౧౭౪౪ లో కర్ణాటక నబాబై యుద్ధమునందు ౧౭౪౯ లో హతుడాయెను.

ఆతని తరువాత ఆతనికొమరుడు

మహమ్మదాలీ కొంతకాలమునకు ఒక ఫర్మానావల్ల వాలాజా అమీర్ ఉల్ హిందు అనిబిరుదు వడసెను.

౧౭౯౫ అక్టోబరు ౧౩ న చనిపోయెను.

ఆతని తరువాత—

ఉమ్దత్ ఉల్ ఉమ్రా. ఈతడు తన తండ్రికి వెనుక రాజ్యమేలెను. ౧౮౦౧ జూలై ౧౫న చనిపోయెను.

పుత్రుడని చెప్పెడి అలీహుస్సేను—౧౮౦౨ ఏప్రెల్ ౬న సంతానహీనుడై చనిపోయెను.

అమీర్ ఉల్ ఉమ్రా ఒక్కడే పుత్రసంతానము. మాత్రము పొంది చనిపోయెను.

అజీముద్దౌలా తనపెదతండ్రికి వెనుకరాజ్యమునకు వచ్చి ౧౮౧౯ ఆగష్టు 3 న చనిపోయెను.

అజమ్‌జా. తనతండ్రికి వెనుక రాజ్యమునకు వచ్చి ౧౮౨౫ నవంబరు ౧౨ వ తేదిన ఒకపురుషశిశువు గలిగి చనిపోయెను.

మహమ్మద్ ఘౌస్‌ఖాన్. తనతండ్రికి తరువాత తన పినతండ్రియొక్కరక్షణక్రింద రాజ్యమునకు వచ్చెను. ౧౮౫౫ అక్టోబరు ౭న సంతానహీనుడై చనిపోయెను.

అజీముజాన్యాయము ప్రకారము యిపుడు నబాబు.

ప్రస్తుత విషయములను గూర్చి ఏ కొంచెముకూడ తెలియక, యీ విషయమునుగూర్చి పూర్వచరిత్రగూడ అంతమాత్రమే తెలిసినజ్ఞానముతో లార్డుహారిసు, తన మినిటులోని ౬౦ వ శీర్షికయందు (Carnatic-papers 1860. P. 14) "అజీముజాగారికి శాస్త్రసమ్మతిమైన పుత్రులులేరు" అని చెప్పినాడు. అజీముజాకు నలుగురు పుత్రులు కలరు. అందొకరు జీర్ ఉద్దౌలామహమ్మదాలీఖాన్. ఇతడు పుట్టిన తరువాతనే యీతని తల్లిని అజీముజా నిఖాభార్యగా పెండ్లాడెను. రెండు: ఇంతిజామూల్ మూల్కు- అహ్మద్‌ఖాన్. మూడు: ఉమ్దత్ ఉద్దౌలా నూరూల్‌ఖాన్. నాల్గు: మూజాజ్ ఉద్దౌలాఖాన్. ఈ తుదిముగ్గురును సద్వంశజాతయు, బిజాపురు ఖిల్లాదారుని మనుమడగు ఖాన్‌మహమ్మద్‌ఖాన్‌గారి కుమార్తెయునై ఘనతవహించిన సాదల్ ఉన్నీసాబీగమ్ గారికి జన్మించిరి. శాస్త్రీయ వివాహమునకు 'షావాదీ' ఆచారము జరిగితీరవలెననెడి పామరజనాభిప్రాయమునుబట్టి బహుశః లార్డుహారిసు అట్లు తప్పుతోవను పడియుండవచ్చును. ఇయ్యది పూర్తిగా పొరబాటు. అట్టిదని వారికి యీ పాటికి ప్రభుత్వన్యాయవాదులు చెప్పియే యుందురు.

నకు లొంగియుండునట్లు కోరగల నైతికబలమును, మనము ఎన్నో సార్లు నిలువబెట్టిదమని ప్రతిజ్ఞలు కావించిన నిరాక్షేపణీయమగు తద్వంశపు స్వతంత్రప్రభుత్వము వలననే కలిగినది. ఆంగ్లేయులకు స్వతస్సిద్ధమైనట్టి హక్కు ఏదియు లేదు. ఉన్న హక్కులన్నియును స్వతంత్రప్రభువువలన పొందిన ఫర్మానాలవలననే గల్గినవి. వాలాజా నబాబును గాని, ఉమ్దతుల్ ఉమ్రా నబాబును గాని జయించి ఎట్టిహక్కులను సంపాదింపలేదు. ఏలన వీరిరువురును (కంపెనీ వాలాజావంశము) ఒకరితో నొకరు పోరాడుకొనక పోవుటయేకాక, ఎల్లప్పుడును బద్ధస్నేహముతో మెలగిరి. ౧౮౦౧ సంధివల్ల స్పష్టముగా పొందినవితప్ప యింక నితరముగ అజీముద్దౌలానుండి మనమేమియు పొందలేదు. మనముచేసిన అన్ని వాగ్దానములు, ఒడంబడికలు ఇంగ్లండుప్రభువు స్వయముగా నిచ్చిన అభయహస్తముల దగ్గరనుండికూడ, అజీముద్దౌలాను రాజ్యాధిష్ఠితుని కావించుటరిని స్థిరపరచి పునరుద్ధరించితిమి. అతడు రాజ్యాంగమునందలి అసలు అధికారమును అంతయు వదలుకొనుట ఒకసంధి యందలి నమ్మకముచేతనే. ఆసంధియొక్క షరతులవలనను, లిఖితమైన వాగ్రూపమైన ప్రకటనల వలనను అతని పట్టాభిషేక సమయమునందలి కావించిన కొన్ని కర్మకాండల వలనను, అతడు రాజ్యాదాయములోని అయిదవపాలును గైకొనుచూ, కర్ణాటకరాజ్య స్వతంత్రప్రభువుగానే యుండుననియు, శాశ్వతపు సివిలు మిలిటరీ పరిపాలనతప్ప ఈస్టు ఇండియాకంపెనీ ఇతరముగ నేమియు సంపాదింప లేదనియు, ప్రస్తుత పరిస్థితులలో మనశత్రువులైన వ్యక్తులు గాని, రాజ్యములుగాని, యీ కర్ణాటకమును మన స్వాధీనమున నుంచుకొనుటకు మన కేసబబును, అధికారమును లేదనియు, ఆ రాజ్యము యివ్వబడిగాని, మనచే జయింపబడి గాని, స్వాధీనము చేసుకొనబడి గాని యుండలేదనియు, ౧౮౫౫ అక్టోబరువరకు వాలాజావంశమునకు మనము ట్రష్టీలముగా ౧౮౦౧ సంధిప్రకారము తత్ప్రభుత్వము చేసినామనియు, అప్పటినుండియు, ఆప్రభువునకు యివ్వవలసిన ఆదాయభాగమును యివ్వ నిరాకరించుటచే ఆ సంధిని భంగపరచితిమనియు, ఇప్పుడు హక్కుగాని, హోదాగాని, ఏమియును లేకయే మొండిగా వ్యతిరేకముగా మన మా రాజ్యము ననుభవించుచున్నామనియుకూడ వాదింపవచ్చును. ప్రజలు తెలివితేటలుగలిగి తమ ఇష్టానుసారము తమ యభీష్టము తెలియజేసినప్పుడు, దైవదత్తాధికారమును (అనాదినుండి పాలించుచున్న అధికారము) నిరంకుశప్రభుత్వమును నిర్మూలముకావించుటయందు నాకట్టి అభ్యంతరము లేదు. కాని హిందూదేశము రాజకీయముగ నింకను అట్టిస్థితికి రాలేదు. అకాలముగను, అస్వభావికముగను వచ్చే అట్టి పరిణామమువలన నెట్టి లాభమును లేదని నా అభిప్రాయము. అట్టి పరివర్తనము ప్రజలచేగాని, రాజవంశములు మారుటచే గాని, విదేశమునుండి వచ్చునవిగాని, ఎట్టివైనను నాకు పెద్ద అభ్యంతరము లేదు. అవి అవసరమగుటచేతనే వచ్చెనని తలంచెదను. వంశపారంపర్య ప్రభుత్వము ప్రజల స్వాతంత్ర్యమును క్షేమమును అభ్యంతరపెట్టునో అది యట్టి పనికిమాలినదని నా తలంపు. కాని అట్టి సందర్భమేమియును యిట లేదు. అజీముజా స్వతంత్రప్రభుత్వపదవిని కోరుటలో రాజకీయాధికారమును గాని, అంతమన ప్రభుత్వముయొక్క శాసననిర్మాణ, కార్యనిర్వాహణాధికారమునందు జోక్యము కలుగజేసికొను నధికారముగాని కాంక్షింపజాలడు. వాలాజావంశమునకు మనము అన్ని సంధులలోను ఒప్పుకొనబడి, నిలుపబడిన వంశపారంపర్యపు హక్కు నిర్వివాదనీయమై, నిరాక్షేపణీయమై మనచేకూడ మాడ అని వాదింపబడనిదై అజీముజాకు సహజముగ చెందుచున్నది. తన స్వతంత్రప్రభుత్వ హోదాను ఒప్పుకొనమని అడుగుటలో, అతడు, వాలాజావంశమును నాశన మొనరింపవద్దని, ఖండితముగా తెల్పుచు, నిలువబెట్టుడని కోరుచున్నాడు. అనాదిగా వంశము ఉండునట్లయితే ౧౮౦౧ సంధిచేతను పూర్వపు సంధులలోని అనుకూలపు షరతులవల్లను [1] హక్కులను పొందినట్టి ఒక రాజవంశము అయి యుండును. లేనిచో

1. Article 2 of treaty 1801.

నాశనము అగునట్లయితే, కర్ణాటకరాజ్యపు సివిలు మిలిటరీ పరిపాలనమునకును, తద్రాజ్యాదాయమునకును మనకు గల హక్కుగూడ సున్నచుట్టి నాశనమై పోవును. ఉండే టట్లయితే, యిరువురి హక్కులును నిలువవలయును. పోవునట్లయితే యిరువురివి అంతరింపవలయును. అట్లైనో, మన ప్రభుత్వమువారు అట్టివిధముగ బహిరంగ ప్రకటన కావించి తద్రాజ్య స్వతంత్రప్రభుతను వహింపవలెను. అట్టి ప్రకటన చేయుచు, ప్రభు వెవరు అను సందేహము యిప్పుడుగాని యికముందుగాని లేకుండునట్లు నివృత్తిచేయుట ఆచరణలో పరిపాలకులైన ప్రభుత్వముయొక్క విధియై యున్నది. శాస్త్రప్రకారము పరిపాలనాధికారులును, నిజమునకు సార్వభౌమాధికారులును అయిన బ్రిటిషువారికి యీరాజ్యము వారసు లేని కారణముచేగాని, లేక నవాబుల రాజద్రోహ కారణమువలన గాని సంక్రమించినట్లు ప్రకటన రాణీగారిపేర చేయవలసి యుండును. ఇంతవరకు యిట్టి ప్రకటన చేయబడను లేదు. ఇకముందు చేయబడను బోదు. అయ్యది సాక్షాదబద్ధము కావున కర్ణాటకరాజ వంశము నశింప లేదు; బేవారసు కాలేదు. ఇంతలో అట్లు కాగలవనియు తోచదు. యజమాని లేనపుడు మన మాక్రమించి యనుభవించుటచే గాని, యజమానియుం డియు హక్కునాదని వాదింపకుండుటచే గాని సంక్రమింపగల హక్కు మన కేమాత్రమును యీవిషయములో లేదు. ఏలనగతించిన నవాబుగారి మరణమువరకును అతని స్వతంత్రప్రభుతనుగాని, మన మారాజ్యపరిపాలనకు ట్రస్టీలమై యుండుటను గాని ఎవ్వరు ఆక్షేపింపలేదు. మతియు అంతటినుండియు, తద్రాజ్యమునకు సక్రమపు వారసుడు ఎడతెగక తనకు స్వతంత్రప్రభువు హోదాకైగల హక్కునుగూర్చి వాదించుచునేయున్నాడు. కావున అనుభవస్వాధీనాధికారములు వాలాజావంశీయులకే యున్నవి. తద్వంశము అంతరింపకుండగనే నవాబుహోదాకును రాజ్యాదాయమున వారికి గల భాగమునకును ఎవ్వరికిని హక్కులేదని మనము చెప్ప సాగితిమేని సంధులను భంగపరచినవార మగుదుము. ఆకారణముచే తద్రాజ్యపు సివిలుమిలిటరీ పరిపాలనములు చేయుటకు మిగతా ఆదాయానుభవమునకును మనకుగల హక్కుగూడ అంతటితో అంతరించుచున్నది. కాని న్యాయమెట్లున్ననూ మనము మాత్రము యథాప్రకారము ఎట్టికొదువయు లేక పరిపాలనచేయుచునే యుండవచ్చును. కాని లార్డుఛాతమ్ "హక్కులేని అధికారము అసహ్యము. అట్టిది క్రమముగ కృశించి తుదకు నశింపగలదు" అని చెప్పినట్లు జరుగగలదు.

---

# ఆరోగ్యప్రార్థనా నవరత్నమాలిక

రాజా మంత్రిప్రగడ భుజంగరావు గారు

జనకుం డర్మిలి మీఱ నందనుల రక్షాశిక్షలం జేయు పో
ల్కిని నీ వేడుజగంబులన్ నిజకృపాలీలాకటాక్షంబులన్
ఘన దుర్వార మహోగ్రశాసనములన్ రక్షించి శిక్షింపఁగా
నిను దక్కంగ నధీశుఁ డెవ్వఁ డొక నో నేతా! జగన్నాయకా!

శా. నీయాజ్ఞం బ్రభవిల్లు నెల్లజగముల్ నీయాజ్ఞ వర్ధిల్లెడున్
నీయాజ్ఞన్ విలయంబుఁ గాంచునఁట! తండ్రీ! చిత్రమా! నాకు, నా
ప్యాయంబొప్పఁ గృపార్ద్రమై, మృదులమై, భాసిల్లి యేతీరునన్
నీయంతఃకరణంబు తీక్ష్ణమగునో నేతా! జగన్నాయకా!

శా. జౌనౌ! తత్త్వము మాకెఱుంగఁబడె దేవా! శీతలాంభఃకణ
స్నానంబుల్ ఘటియించు నంబుదములోనన్ వజ్రమేర్పడ్డ చం
దానన్ మాయఘ సంచయంబున, భవచ్ఛాంతాంతరంగంబునం
దే నిర్ఘాత మహోగ్రరోష మొదవున్ నేతా! జగన్నాయకా!

శా. నీకారుణ్య కటాక్షలోపమున నానెమ్మేనఁ దీవ్రామయం
బేకాకారత నావహిల్లి హృదయంబెల్లన్ మహావ్యాకులం
బై కంపిల్లఁగఁ జేసె, భానుమణియం దార్కాంతిసూర్యప్రభా
నీకం బుద్ధతమై జ్వలించుకరణిన్ నేతా! జగన్నాయకా!

శా. నేఁడైన న్నను వత్సలత్వము మదిన్ నిండార వీక్షించి యీ
పీడంబాపఁ దలంపుమయ్య! "మతి నిన్ వేధించు నీపాప మీ
జాడన్, మత్కరణీయ"మే మనెదవో! సర్వేశ! నీపాదమం
దే డెందంబిఁక నాకు నేటియఘ మోనేతా! జగన్నాయకా!

మ. అరయన్ లెక్కయె నీకు మత్తనుగతవ్యాధిన్ నివారింప! నీ
శ్వర! నీదివ్యకృపా నిరీక్షణ సుధాసారప్రవాహంబుల
క్కఱమై సోక, నపారఘోర భవరోగంబుల్ ప్రశాంతించు నే!
నిరయంబైనను స్వర్గమై నెగడు నో నేతా! జగన్నాయకా!

మ. తొలుతంగల్గిన దుస్సహవ్యథలు నీదుప్రాప్తిపదాక్షిణ్య వీ
క్షలసంపర్కముచేతఁ బోలుఁ గ్రమతన్ శాంతింపఁగాఁ జొచ్చె,నో
యలఘుప్రేమనిధాన! నాకు నిఁకఁ బూర్ణారోగ్యభిక్షుంబు సం
ధిలఁజేయంగదవయ్య! మ్రొక్కెదనిదే! నేతా! జగన్నాయకా!

శా. సత్యంబింకఁ బరార్థచింత మది లేశంబైన లేదయ్య! నా
కత్యంతంబు భవత్పదాంబుజయుగధ్యానంబె సర్వార్థ, మీ
క్షిత్యాది ప్రకృత ప్రపంచకము నుచ్ఛిష్టంబుగాఁ జూచుచున్
నిత్యంబున్ నిను నమ్మియుందును గదా! నేతా! జగన్నాయకా!

శా. నీపై నిశ్చలభక్తి నిల్పి నిను ధ్యానింపంగఁ, బాపౌఘముల్
బాపంజాలు భవత్కథామృతము నాస్వాదింప, వీల్ చిక్కనీ
యాపన్నత్వము మాన్పి దేహమునఁ బూర్ణారోగ్యముం గూర్పుమీ!
నీపాదాబ్జము నమ్మినాడనుజుమీ! నేతా! జగన్నాయకా!








# భారతీయ చిత్రకళ*

తలిసెట్టి రామారావు గారు, బి. ఏ.



శ్రీ తలిసెట్టి రామారావు గారు

## చిత్రలేఖనము క్షీణించుట

అజంత చిత్రకారులు ౬౫౦ వ సంవత్సరమున తమరంగులను, కుంచెలను విడిచిన నాటినుండియు సుమారు ౧౫౮౧ వ సంవత్సరము వరకు—అనగా అక్బరు చక్రవర్తి చిత్రరచనను ప్రోత్సాహపరచిన వరకు—హిందూదేశమున రచింపబడిన చిత్తరువు లెన్నటను గానరాకపోవుట యాశ్చర్యము. మిక్కిలి యభివృద్ధి చెందగల కళా బీజము లజంతచిత్రములందు గలవని కళావిమర్శకు లభిప్రాయపడియుండ చిత్రలేఖన మొక్కపరి క్షీణించి యుండదు. పర్షియా దేశపు చిత్రవిధానముల విదేశీయులు ప్రవేశపెట్టిన వెంటనే వాటియందు హైందవులు ప్రవీణులగుటవలన నీ రీవిద్య కచ్చటచ్చట జీవమును బోసి యీ వేయి సంవత్సరములు నేదో యొకవిధమున బోషించి యుండిరని యూహింపవచ్చును. లేనియెడల చిత్రవిద్య యన్న నేమియో యెరుగనివారు కొంత ప్రవీణత గలిగి యుండిన విదేశపు చిత్రకారులతో వారి విద్యయందు సమానులుగ నుండజాలుట యసంభవము. ఇందుకు కొన్ని నిదర్శనములు కలవు:

౧. పదునైదవ శతాబ్దమునకు జెందిన జైనమత గ్రంథములయందు కొన్ని చిత్తరువులు కానవచ్చుచున్నవి.

* ఇది శ్రీయుత తలిసెట్టి రామారావుగారు రచియించిన 'భారతీయ చిత్రకళ' యను గ్రంథమునందలి ఆరవ అధ్యాయము. ఈ గ్రంథము ఆంధ్రగ్రంథమాలయం దచిరకాలమున వెలువడనున్నది. ఇందు భారతీయచిత్రకళచరిత్ర-ప్రారంభదశనుండియు ఇప్పటివఱకు గల చరిత్ర-యంతయు సంక్షేపముగ రామారావుగారు వ్రాసియున్నారు. భారతియందు కొన్ని మాసములనుండి ప్రకటితములగుచున్న హాస్యచిత్రములు వీరివేయని భారతీపాఠకులకు తెలుపుట కెంతయు సంతసమగుచున్నది. —సంపాదకుడు, భారతి.

౨. ఈ కాలమున దళ్వంతు అనే చిత్రకారు డుం డెనని నిదర్శనములు కలవు.

౩. తారానాధుని చరిత్ర.

ఇదివరకు జెప్పినటులు హిందూదేశపు చిత్తరువు లన్నియు గోడలమీద వ్రాయబడుటవలన కాలవాహిని యం దవి కొట్టుకొనిపోయెను. గ్రంథకర్త లీ కళాచరిత్రము నెన్నడును వ్రాయ దలపెట్టక పోవుటవలనను, తక్కిన గ్రంథములం దెట్టియాధారములును గానరాక పోవుటవలనను, ఈకాలపు చిత్రరచనముగూర్చి విశేషము తెలియకున్నది. అచ్చటచ్చట తలయెత్తినను, మొత్తమున నీవిద్య యనేక కారణములవలన క్షీణించెను.

భాషయందు, మతమునందు, ఆచారమునందు, వేషమునందు, సాంఘికజీవనమునందు హిందువులతో నెట్టి సంబంధము లేని మహమ్మదీయు లీదేశమును జయింప మొదలిడిరి. హిందూనృపులందు గొప్పవారు లేకపోవుట వలన దేశమున నుత్సాహము సన్నగిలెను, గుప్తులకాలమున నన్నివిద్యలు నెంత యభివృద్ధికివచ్చెనో యిప్పు డంతతగ్గెను.

ప్రజల మతమునందు గొప్పమార్పులు జరిగెను. చాల శతాబ్దములు దేశమున నాదరింపబడిన బౌద్ధమతము కలహముల వలనను, గొప్ప మతప్రచారకులు లేకపోవుటవలనను క్షీణించుచు వచ్చెను. హిందూమతము బౌద్ధమతసంపర్కమువలన గొంత సంస్కరింపబడి నూతనరూపమున బ్రజ్వరిల్లసాగెను. మతమున చిత్రలేఖనమునకు జోటివ్వని మహమ్మదీయు లాధిపత్యమును వహించిరి. ఈకారణముల వలన బౌద్ధులచే ముందుకు తేబడిన చిత్రలేఖనము బౌద్ధమతముతో క్షీణించుటయే కాక వేఱురూపమున నైనను మరల లేవజాలకపోయెను. హిందూమతము చిత్రకళను బ్రోత్సాహపరచునదైనను ఈవిషయమున నెట్టి యుత్సాహమును కలిగింపజాలక పోయెను. చిత్రకళ కుంచెలను, వర్ణములను బరిత్యజించి, యినుప పనిముట్లను, శిలలను సహాయములుగా గొనెను. ఎలిఫెంటా, ఎల్లోరా, బొరోబుదరు లందలి శిలానిర్మాణములను జూ[చిన] హిందూమతము ఎట్టిచిత్రకళకు ప్రోత్సాహకారియో గ్ర[హ]రించును. ఇట్టి మహాశిల్పు లీ కాలమున నుండుటవలన చిత్రకళ పూర్తిగ మాయము కాలేదనుటకు మరియొక నిదర్శనము.

హిందూదేశమున చిత్రరచన యున్నతదశయం దుండుకాలమున నలువైపులనున్న దేశముల కన్నిటికి వ్యాపించెను. ఈకాలపు చిత్తరువులు మాతృదేశమున గానరాకపోయినను తురుష్కస్థానము, టిబెత్తు, నేపాళములందు హిందూవిధానములను తత్తద్దేశీయ రుచుల ననుసరించి మార్పుజెంది యభ్యసింపబడెను. వీటిని బరి[శీ]లించిన నీ కాలపు హైందవచిత్రరచనను గూర్చి మనకు గొంత బోధపడగలదు.

౧౯౦౬ వ సంవత్సరమున డాక్టరు స్టైయిన్, గ్రున్ వెడెల్ పండితుడు, డాక్టరు లీకాక్ చైనాకు జెం[ది]న తురుష్కస్థానమునందలి 'టాక్లమాకన్' యెడారి యం దిసుకచే గప్పబడియుండిన పురాతనసౌధములను గనిపెట్టువరకు నే యాధారములును లేకయుండెను. వీటియందు లభించిన వివిధభాషల గ్రంథములును పెక్కుచిత్తరువులు కలవు. వీటిని పండితు లింకను పూర్తిగ బరీక్షింపలేదు. కాని యివియన్నియు నేడు, ఎనిమిది శతాబ్దములకు జెందినవనియు, చిత్తరువులలో నధికాంశ మజంత విధానముల ననుసరించి యున్నవ[ని]యు, నిందు గ్రీకు, హైందవ, పర్షియను, చైనీయ నాగ[రి]కతలు మేళవించెననియు జెప్పవచ్చును.

చైనా పర్షియా దేశములందు హైందవకళ యెట్టి మార్పులను జెందెనో డండన్, ఉయిలిక్, నందలి చిత్త[]రువులవలన స్పష్టముగ దెలియగలదు. అచ్చటనిర్మాణము లన్నియు క్రీ. త. ౮౯౧ వ సంవత్సరమున జనశూన్యము లైనందున నీచిత్తరువు లాకాలమునకు బూర్వము వ్రాయ బడినవగుట నిశ్చయము.

ఇరువురు పురుషులు గుఱ్ఱముమీదను, లొట్టియ మీదను గూర్చొని యున్నటులు గలదు. అవలోకితేశ్వరుని తాంత్రిక చిత్రము తిబెత్తు దేశీయుల చిత్రనిర్మాణవిధానమును తెలియజేయును. పర్షియా దేశపు వతుర్భుజ బోధి





సత్త్వవిగ్రహమున భావము, నాలుగు భుజములు హైందవములై యుండ చిత్రరచన స్పష్టముగ పర్షియాదేశమునకు జెందియున్నది. ఇచ్చట గల జలకన్యక అన్నిటినిమించిన సుందరమైన చిత్తరువు. ఖోటాను భూములను సారవంతములుగ జేయుటకు విధవయైన నాగుల రాణి నొకమంత్రి వివాహ మాడెనని, హుఅన్ త్సాంగు వ్రాసెను. ఈకథ యీచిత్రమునకు జెందినదై యుండవచ్చును. చిత్రలేఖనము, అలంకారములు అజంత చిత్తరువులను బోలియున్నవి. ముఖముమాత్రము చైనీయము. దీనిప్రక్కనున్న యిరువురు పురుషుల చిత్రములును, వెనుకభాగమున నున్న బుద్ధునివిగ్రహమును నిస్సంశయముగహిందూదేశమునకు జెందినవి.

పూర్వకాలమున చైనాదేశపు రాజకన్యయగు ఖోటానురాణి తన శిరోజములందు పట్టుపురువుల గూళ్లను దాచి తనరాజ్యమునకు దెచ్చెనని యొక కథ కలదు. ఈరాణియొక్క చిత్రము వెడల్పు రేఖలతో మోటుగ వ్రాయబడి యున్నను సుందరముగ నున్నది.



తొమ్మిదవ శతాబ్దమున పాడైన 'ఇదికుత్తెషాహ్రి' నగర ప్రాంతమున చైనా దేశీయులు బౌద్ధసన్యాసుల నందరిని జంపివైచిరి. ఇచ్చట లీకాక్‌గారు కొన్ని చిత్తరువులను సంగ్రహించిరి. ఈ చిత్రములవంటి వాని నిప్పటికిని తిబెత్తున వ్రాయుచున్నారు.

యార్‌ఖోటా యందును, చిక్కన్ కోల్, టొయోఖ్ లందును లభించిన చిత్తరువు లన్నియు హైందవ విధానముల ననుసరించి యున్నవి.

భారత చిత్రరచన మొదట ఖోటానుకు వ్యాపించెను. అచ్చటనుండి కొరియాద్వారా జపానును ప్రవేశించెను. కభోధ, ధర్మరక్షయను నిరువురు భారతసన్న్యాసులును, అటుపిమ్మట ౬౧౮–౧౨ సంవత్సరములలో చైనానేలిన యాంగ్టి చక్రవర్తియొక్క దర్బారున నుండిన 'బజ్న' యను చిత్రకారుడును, ఈతని కుమారుడగు 'వెయిఛియైసాంగ్'ను ఈ విధానము లచ్చట వ్యాపించుటకు కారకులైరి. బజ్నయు, నాతని కుమారుడును బౌద్ధచిత్రకారులుగ బ్రసిద్ధివహించి యుండిరని చైనాదేశపు విమర్శకుల యభిప్రాయము.

ఈ చిత్తరువు లన్నిటియందును రేఖ ప్రధానమును వహించెను. జపాను చైనాలందు చిత్రలేఖన మంతవు మందు లేదని చెప్పజాలము. బ్రిటిషు మ్యూజియమునందు గల నాల్గవశతాబ్దమునకు జెందిన 'కు యెచిహి'చే రచింపబడిన చిత్ర మిట్టి యూహకు తావీయదు. కాని హిందూవిధానములు బౌద్ధమత సహాయమున నీదేశములందు వ్యాపించి యాదరింపబడి పురాతన దేశీయకళలను చాలవరకు మార్చగలుగుట నిశ్చయము.

ఇతరమతముల నుండి హిందూమత మనేకాంశము లను గ్రహించెను. ఇటులనే హైందవకళ యెంతగొప్పదైనను పరదేశ రచనను నీరసభావమున నిరాకరింపలేదు. గ్రీకువిధానములు గాంధారశిల్పమున గానవచ్చుచున్నవి. అజంతయందు చైనావిధానములు కొంతవరకు గలవని కొందరి యభిప్రాయము.

దగ్గరనున్న తిబెత్తు నేపాళములందు హైందవకళ యెటులు విజృంభించెనో యిక జూతము.

చిత్రకళ నభ్యసించునంతటి యభివృద్ధి తిబెత్తు చెందకపూర్వమే నేపాళము హిందూవిధానముల నభ్యసించెనుకాని యిప్పుడీచిత్తరువు లంతగా లభించుటలేదు.

ధనార్జనమునకును, ప్రార్థనకును తిబెత్తునం దిప్పటికిని చిత్రరచన విశేషముగ జరుగుచున్నది. గోడలమీదను, కాగితములమీదను వ్రాయబడుచున్న నూలుటంకాలనుపతాకములమీద విశేషముగ చిత్రములు కానవచ్చుచున్నవి

ఈ చిత్తరువులం దెక్కువ ప్రత్యేకనియమ బద్ధములుగ వ్రాయబడును. ఒక సమకోణ చతుర్భుజమును వ్రాసి దానిని నిడివిగీతలవలనను, అడ్డగీతలవలనను అనేక సమభాగములుగ విభాగించెదరు. ఇం దేయే భాగమున నేయేయంగ ముండవలెనో యటులు నియమము దాటక విగ్రహమును వ్రాసెదరు. ఇట్టివి భావోదయమునకు దావీయకపోయినను వర్ణలేపనమున ప్రసిద్ధి చెందుచున్నవి. రంగులు గాఢముగను, ఘోండికగను ఉండును. నీలియు, ఎఱుపును కలియుచోట లేపనము మనోహరముగ నుండును. హైందవాచారానుసారము వివరములన్నియు నతి స్పష్టముగ గానవచ్చును.

చిత్రప్రదర్శనశాలలందుగల పతాకములం దెక్కువ పదునేడవ శతాబ్దము, తరువాతికాలము నాటివైనను, 'చ్యూ-జు' నందు లీకాక్ గారికి లభించినవిమాత్ర మెనిమిదవశతాబ్దము నాటివి. ఇంతకు బూర్వముకూడ నిట్టి పతాకములపైని చిత్తరువులను రచించుచుండి రనుటకు నిదర్శనములు కలవు. బ్రిటిషు మ్యూజియమునందు గల పట్టుపతాకములన్నియు మంచిస్థితియం దున్నవి. ఇవి బౌద్ధమతమునకు జెందినను, చిత్రరచనయందు చైనాచిత్రములను బోలియున్నవి. తక్కిన పతాకములందువలె వీటియందును వర్ణలేపనము మనోహరము. నూలుతో నల్లబడిన పతాకము లనేకములు కలవు గాని ఇవి యంతసుందరముగ లేవు. ౧౧వ శతాబ్దమున నాలందయందు బుద్ధుని, బోధిసత్త్వులచిత్రములను బట్టలపై జిత్రించినవి కలవు. కాన హిందూదేశమునందు నిట్టివి వ్రాయుటయు గలవని చెప్పవచ్చును.

బౌద్ధమత పతన కారణములలో జారత్వ మొకటి. గౌతముడు మరణించిన కొలదికాలమునకే బౌద్ధమతమున నీ యవగుణము ప్రవేశించెనని మధుర యందలి శిల్పములు చాటుచున్నవి. ఈ జాతికి జెందిన చిత్తరువు—బుద్ధుడు కాళిని కౌగలించుకొనునటులు—ఫ్రాన్సునందు గలదు. ఇది కడు హేయమైనది.

ఈ చిత్తరువులందు రూపచిత్రములు (Portraits) చాల సుందరమైనవి కలవు. ఇందు తిబెత్తు లామాలచిత్రములు రెండెంచతగ్గవి.

రష్యాకు జెందిన మంగోలియాయందు కూడ బౌద్ధచిత్రములు భారతకళావిధానముల ననుసరించి చిత్రింపబడినవి. హిందూదేశమున "క్షితిపతి" యనియు, చైనాయం "దాయుస్సునిచ్చు దేవు" డనియు, జపానునందు "సౌఖ్యప్రదాత" యనియు ప్రసిద్ధిగాంచిన వృద్ధుని చిత్తరువును, పూర్వజన్మమున బుద్ధుడొక రాక్షసియొక్క కులను జంపి తుదకు పశ్చాత్తప్తు డయ్యెనను కథను తెలియజేయు చిత్తరువును ఇందు ముఖ్యములు.

ఈ కాలపు బౌద్ధచిత్రము లించుమించుగ నన్నియు నిట్టివగుటచేతనే వీటియందు జీవకళ తక్కువగ నున్నది. వేలకొలది సంవత్సరము లొకేవిధముగ వ్రాయబడు చిత్రములు వేరువిధముననుండుట యసంభవము. కాలము ననుసరించి మారుచుండు భారతీయ చిత్రరచన విదేశములందు పాదుకొనినను, ఎక్కువసత్వమును జూపజాలకపోయెను. దీనికి ముఖ్యకారణ మాదేశములందలి కళాభ్యాసకుల భావశూన్యతయై యుండవచ్చును.

ఇప్పుడు కానవచ్చు సనాతన నేపాళ చిత్రములన్నియు తిబెత్తు చిత్రములను బోలియుండును. భ

న్నియు బౌద్ధమతమునకు జెందినవి. ప్రాస్సనం దిట్టి చిత్తరువులు పది కలవు. మత్స్యేంద్ర లేక పద్మపాణి యను మారుపేరులుకల యవలోకితేశ్వరు నారాధించు భక్తుల యుత్సవమును తెలియజేయునది యిందు ముఖ్యము. ప్రకృతి దర్శనజ్ఞానము దీనియందు కానవచ్చు చున్నను, హైందవ కళాచర్చయం దిది యెట్టివిధముననను ఉపయోగ కారికాదు. ఇదికాక తాంత్రికచిత్రము లనేకములున్నవి. వీటియందు చిత్రకారుని అలంకారజ్ఞానము గోచరించు చున్నను, కళాజ్ఞానము మాత్రము కాన్పింపకున్నది.

కలకత్తాయందును, కేంబ్రిడ్జియందును రెండుపురాతన గ్రంథములు కలవు. వీటియందలి చిత్తరువులు గణింపదగినవైనను విమర్శన కాగజాలవు. వీటికాలమును నిర్ణయించుట సాధ్యము కాకున్నది. ఇది పదునొకండవ శతాబ్దమునకు జెందినయెడల తారానాథుడుచెప్పిన ధీమనుని పశ్చిమవిభాగములకు జెందినవై యుండవచ్చును.

కేంబ్రిడ్జి గ్రంథమున సింహళద్వీపపు జంబాలుని (ధనదేవుడు) చిత్రమొకటి కలదు. స్పష్టముగ నిది భారతదేశమునకు జెందును

సింహళమునందు పూర్వము పెక్కుచిత్తరువు లుండెను. పంద్రెండవ శతాబ్దమున 'పలొన్నారువ' యందలి 'మహాదమమశాయ' దేవాలయపు గోడలమీద కొన్ని జాతక కథలు చిత్రింపబడెను. వీటికాలమును నిశ్చయముగ జెప్పుటకు సాధ్యముకాదు. బహుశః పంద్రెండవ శతాబ్దమునకు పూర్వము 'నిస్సంక మల్ల రాజు' సీగిరియ చెంతనున్న 'దంబుల్ల' శిలాదేవాలయమును బాగుచేయించినప్పు డిందుగల చిత్తరువులు వ్రాయబడియుండును. ఈ దంబుల్ల దేవాలయమునందు విజయుడు సింహళమునకు వచ్చుట, మహేంద్రుని మతబోధ, దుత్తగామిని ఏలాలల పోరాటమునుగూర్చిన చిత్తరువులు—సుందరమైనవి—కలవు.

---

## పానకాంక్ష.

కొల్లూరి ధర్మారాయకవి, బి. ఏ.

దాహపీడితమైన క్షేత్రంబు గగన
దత్తకాలాంబువులఁ గొని, తక్కుజలము
నిచ్చును పిపాసనొందెడు వృక్షములకు;
నాల్క తడియారగా పవనంబు జలధి
నుండి శీకరంబులఁ గొనుచుండు;

నక్లై,—

త్రాగుఁబోతుఁ దనము త్రొక్కరాని మార్గ
మనుచుఁ జెప్పదు రేకాని, వినినవార
లెవ్వరును లేరు!—ప్రకృతిలో నిమిడియున్న
నీతిపాటించి, కాలనిర్ణీతతటముఁ
జేరునంతవరకు, ప్రేయసీ, త్వదీయ
వదనకౌముదీ దత్త నిర్మల సుధాంబు
పానవిస్మృతజీవినై పరము మరతు!

---

# శ్రీయుత రామన్ మహాశయులు

మండాది రామనాథం గారు
యమ్. ఏ., డి. యస్ సి. (ఆనర్స్), యఫ్. ఆర్. యస్.

(వెనుకటిసంచిక తరువాయి)

పదార్థ విజ్ఞానశాస్త్రవిషయమై నే జెప్పునది ఇంకను ముగియ లేదు. మఱియ జెప్పుటకు నా యలవియగునా? నా ప్రయత్నమంతయు పైపైన పదార్థవిజ్ఞానశాస్త్రవిషయమై పాఠకులు తెలిసికొనవలెనని. అదియును ముందు నే జెప్పబోవు రామన్ మహాశయుని పరిశోధనల నర్థము జేసికొనుట కుపకరించుననికూడ భావము.

Faraday తర్వాత, Magnetism ను, Electricity ని, Light ను గణితశాస్త్రగూఢ సూత్రములతో బంధించినవాడు. Maxwell మహనీయుడు. ఆ సూత్రము లిందు పొందుపరచెదను. అర్థముచేసికొన్నవారల కుపకరించును.

$$\text{div } E = 4\pi\rho$$

$$\text{div } H = 0$$

$$\text{rot } E = -\frac{1}{c}\frac{\partial H}{\partial t}$$

$$\text{rot } H = \frac{1}{c}\frac{\partial E}{\partial t}$$

వీనినుండి

$$\nabla^2 E = \frac{1}{c^2}\frac{\partial^2 E}{\partial t^2};$$

$$\nabla^2 H = \frac{1}{c^2}\frac{\partial^2 H}{\partial t^2}$$

అను సూత్రములను పొందబడినవి.




వీని భావమేమన: Faraday భావముతే నిజమైనయెడల, అకాశమందు విద్యుత్ ప్రకంపన మొకటియు, అయస్కాంత ప్రకంపన మొకటియు పరస్పరము ఒకదాని దెసకు ఒకటి 90° ల కోణము (సమకోణము) చేసికొనుచు ఆకాశమునందు విద్యుత్ ప్రకంపన మొక చెంప, అయస్కాంత పకంపన మొకచెంప కలుగుచుండ, ఈ రెండును కలిసి వీటి రెంటికి సమకోణము చేయుచున్న దెసను ఈ సంయుక్త ప్రకంపనము, ఒక నిశ్చితమైన గమన వేగముతో వెడలిపోవునని. ఈ నిశ్చితమైన వేగమును గుణింపగా అయ్యది తేజస్సున కిదివరకు నిర్ణీతమైన వేగమునకు సరిపోయె. ఎంత ఆశ్చర్యము! మఱి Maxwell ముందంజవేసి తేజఃకిరణము లనగా మఱి 'ఏవో' కావు. అయ్యవి ఈ అయస్కాంత, విద్యుత్ సంయుక్త ప్రకంపన మనునది ఆకాశమున బరువెత్తుటయే యని చెప్పె. మూడు శాస్త్రములను ఒక్కచోట ముడివేయబడినవి. ఇక్కడ నే నాగవలయును. అట్లు కలిగేకాదు; మరల వెనుకకు వెళ్లవలసిన యవసరము కలిగినది. ఉష్ణశాస్త్రమును తేజఃశాస్త్రమును ఇంద్రియ స్ఫురణావశ్యకతనుండి ఎట్లు విముక్తినందినవో మనకు తెలియవలసిన యదను వచ్చినది.

తేజస్సుయొక్క నిజతత్త్వము 'నా రయు ప్రయత్నములు 17 వ శతాబ్దమున నారంభమయ్యె నని నుడువవచ్చును. అయ్యది తేజస్సునకు గమనవేగమున్నదని తెలిసికొనుటలో ప్రారంభమైనది. బృహస్పతిగ్రహముచుట్టు తిరిగెడు చంద్రగ్రహమునకు లెక్క వేయగా కొంచెము హెచ్చుతగ్గులు వచ్చుచుండెను. అప్పుడు తేజస్సునకు సెకండుకు 1,87,000 మైళ్ల చొప్పున గమనవేగ మున్నదని ఒప్పుకొన్నయెడల లెక్క సరిపోయెను. అటు తర్వాత ఇతరప్రయోగము లీప్రయోగము సుస్థిరపరచినవి.

మనము చూచు తేజస్సు తెల్లగా నుండును గాని అయ్యది నిజము ఏడురంగుల సమ్మేళనమని నిరూపింపబడినది. తెల్ల కిరణమునుండి, ఏడురంగుల స్పెక్ట్రమును, ఏడురంగులనుండి తెల్లకిరణమును తెప్పింపబడినవి.

అయిన తేజస్సేమిటి? అదేమైన వస్తువా? లేక అణువులా? అని ఈలాగంటి ప్రశ్నలు బయలు దేరినవి. దానికి, ఆకాలమునందు, ప్రకృతిశాస్త్రమునందు నిరంకుశాధికారము నందిన Newton మహాశయుడు తేజస్సు నీతీరున వర్ణించెను. మండుచున్న వస్తువునుండి సూక్ష్మములగు అణువులు బయలుదేరి మన కంటిలోపడుట వలన తేజస్స్ఫురణము కలుగుచున్నదని చెప్పినాడు. ఈతని యధికారమే అతని సమకాలికుడైన Huyghens యొక్క యూహను బయటికి రానిచ్చినదికాదు. అందువలన నిజతత్త్వము తెలియబడుట ఆలస్యమయ్యెను. హైగెన్సు (Huyghens) యొక్క అభిప్రాయమేమన తేజస్సునుసది ఆకాశమనునది. ఇయ్యది యీ తేజస్సుకొరకై సృజింపబడినది. ప్రకంపన చెంది యాప్రకంపనము అలలమూలముగా స్థలస్థలమునకు మారుటయే తేజస్సని భావించినాడు. ఇయ్యది శబ్దప్రచారమునకు బోలికగ నున్నది. శబ్దమేదైనపదార్థము Matter



పరిశోధనాగారము

ప్రకంపనమొందిన గలుగుచున్నది. తేజస్సు పదార్థము కానట్టి యాకాశప్రచాలనము వలన కలుగుచున్నది. అట్లైన రెంటిస్వభావ మించుమించుగా నొకటియైన శబ్దమును గోడకావలనుండి గూడ వినుచున్నాము. శబ్దము టంకముల చుట్టి తిరిగి వచ్చి మనకర్ణముల ప్రవేశించుచున్నది. ఆదేరీతిగ నీతేజస్సు, ఒకవస్తువు దానికడ్డముగ నున్నదానిని తప్పించుకొని మనకంట నేలబడదు? అని సహజమైనప్రశ్న నడుగవచ్చును. ఇయ్యదియే అలల యూహకు దుస్తరమైన సమస్యగా గన్పట్టెడి. అయ్యది యును గడుపబడియెను.

అదియెట్లన? అలయనగా కొంచెమర్థము చెప్పవలెను.




ఈపటమును చూడుడు. A నుండి B దెసకు ఒక ప్రకంపనము వెడలిపోవుచున్నది. దీనిలోనుండు చను త్యాకారమును జూచితిరా? ఏచోటనైన నీప్రకంపనము ఏపదార్థమున నయ్యది వెడలుచున్నదో ఆపదార్థమునకు గలుగజేయునవస్థ మరికొంతమారను బోయిన నదేరీతిగా గలుగజేయుచున్నది. చూడుడు: M. N. అనుచోట్ల నొకటేస్థితి యున్నది. సూక్ష్మబుద్ధులగు పాఠకు లిట్టివి మరియెన్నియేని గుర్తించగలరు.

ఇట్టిస్థలములమధ్యనుండు దీర్ఘత (పొడవు)అలయొక్క రకమును దెలుపుచు నాయలకది యెచ్చటనైనను పొడవు నందు సమానతను దాల్చుచున్నది. దీనిని "అలపొడవు" (Wavelength) అని పిలుతము. శబ్దముయొక్క యలలకు తేజస్సునకు గలభేద మీయలపొడవునందే యున్నది. శబ్దముయొక్క యలపొడవును మనము కొలతకట్టచే గొలువవచ్చును. తేజస్సునకన్ననో, మీరు కొలువగలిగిన చిన్న మిల్లిమీటరును దీసికొన్నను దానిలోసైతము వేల కొలది యలలున్నవన్న మీ రాశ్చర్యమనస్కుల రయ్యెదరు. మీకంటితో నట్టియలను జూచుట యసాధ్యమని భావింతురు. భావించిన భావింతురుగాక; ఇట్టిభావన కిదివరకే ప్రత్యుత్తర మొసంగితిని. కావున అలయొక్క హ్రస్వతవలన శబ్దమునందున్న వక్రగమనమును తేజస్సునందు కనుగొనుట సులభముగాదు. కాని, దానికి తగిన (Suitable) ఆటంకములనుంచిన నాయాటంకపునీడలో అలలయూహాప్రకారమునిర్ణీతమైనవెలుగుగీతలు(Bright bands)చూడబడినవి. తేజస్సుగూడ నాటంకముల చుట్టును వంగగలదని నిశ్చయింపబడినది. దీనితో న్యూటన్ మహాశయుని(Emission theory)రంగమును వదలిపెట్టెను.

ఇప్పుడు మీ చక్షురింద్రియములతో జూచిన తెల్లరంగునందు విభజింపబడిన యేడురంగులను గూర్చి మరింత విస్పష్టముగ జెప్పగలను. నేనిదివరకు అలలపొడవును బట్టి యలయొక్కరకము నిశ్చయింపబడునని చెప్పితినిగదా! ఈయేడురంగులు నేడురకముల యలలను కలిగియున్నవి. వాని పొడవులు కొలువబడినవి. కావున మనచక్షురింద్రియము యెర్రరంగును యెర్రరంగుగా బిలిచినను బిలువకున్నను దాని యలపొడవు మన నేత్రస్వభావముపై యాధారపడదు. మనయింద్రియ స్ఫురణావశ్యకతనుండి తేజస్సు బహిర్గతమయినది.

ఇంకను తేజస్సును గురించి కొంత చెప్పవలసియున్నది. అలలకు రెండురకములున్నవి. పైనచూపబడిన పటమునందు ప్రకంపనము (Disturbance). అది వెడలిపోవు A. B. మార్గమునకు ప్రతిచోట నడ్డముగా గలుగుచున్నది. ఇయ్యదియే మరియొకవిధముగా గూడ గలుగవచ్చును. ఈప్రకంపనము మార్గమునకు నిలువుగా గూడ జరుగవచ్చును ఈక్రిందిపటమును దిలకింపుడు.

ఒకచోట పదార్థము (Medium) దీర్ఘింపబడినది. మరియొకచోట సంకుచింపబడినది. మొదటిరకమును "Transverse vibration" అని పిలుతురు. రెండవదానిని "Longitudinal vibration" అని పిలుతురు. శబ్దము గాలిలో రెండవరకపుప్రకంపనముచే కలుగుచున్నది.

తేజస్సునందు ప్రకంపన మెట్లుకలుగుచున్నది! మొదట నిలువుగా కలుగుచున్నదని యూహించిరిగాని తరువాత ప్రయోగములవలన Transverse అని నిర్ణయింపబడినది. దాని నిట్లు వర్ణించెద. 'అ' 'ఆ' అనునవి రెండుకన్నములు. ఒకచోట "అ" యను కన్నము దగ్గరకు వచ్చినాడు. దానిదగ్గరకు వచ్చినప్పుడు అది నిలువుగా నుండినను మరేవిధమున నుండినను దానిలోనుండి దూరి




పోవు స్వేచ్ఛ యతనికున్నది.

సరే. ఒకసారి కన్నములో దూరినాడా యతని స్వేచ్ఛ మితమును పొందుచున్నది. ఎదురుగానున్న కన్నముయొక్క కన్నములోనుండి గూడ వెళ్లవలెనన్న

మొదటికన్న మెట్లున్నదో యట్లున్న నేగాని వెడలలేదు. పటములో గనుపర్చినట్లుండే "అ" అను రెండవకన్నము నుండి దూరుట దుస్తరము. తేజస్తత్వమించుమించు ని ట్లు నిరూపింపబడినది. స్వేచ్ఛగానున్న తేజస్సున్నదను కొనుడు! దానిని మనమున నెట్లూహించెదరనగా నది పోవుమార్గమునకు చుట్టును Transverse ప్రకంపన మున్నదనుకొనుడు. మొదటి కన్నమునకు బదులు Tourmaline అనుస్ఫటికము నుంచుడు. దానిపై యా తేజముపడువరకు దొంగవానివలె స్వేచ్ఛత యా తేజస్సునకు నైతమున్నది. దానిలో ప్రవేశించిన పిదప స్వేచ్ఛ



ఉపన్యాసమందిరద్వారము

మితమును బొందును. ఆస్ఫటిక మేతీరుననున్నదో దాని Positionనకు అనుకూలమైన యొక Transverse ప్రకంపనమే బయటకు వెడలుచున్నది. అప్పుడు దానికి యేక పార్శ్వత (One sidedness) కలిగినదన్న మాట. రెండవ కన్నమునకు బదులు రెండవ Tourmaline స్ఫటికము నుంచుడు. మీరు తేజస్సును రెండవస్ఫటికమునుండిచూడవలెనన్న దానిని మొదటి స్ఫటికమున్న orientation లో నేయుంచినగాని పూర్తిగా జూడజాలరు. దీనివలన తేజస్సుయొక్క అడ్డుప్రకంపనము నిరూపింపబడినది.

ఇక యుష్ణమునుగురించి ప్రసంగింతము. సూర్యుని యొద్దనుండి కిరణమువచ్చి యేదైన పదార్థముపై బడినపుడావస్తువును ప్రకాశవంతము చేయుటయేగాక వేడిజేయుటనుగూడ మీకందరకును దెలిసినసంగతియేగదా! తేజో కిరణములు అలలనిగూడ జెప్పియుంటిమిగదా! అట్లయిన నీప్రకాశముతో బాటు కల్గిన యుష్ణము తేజఃకిరణ ప్రసారమువలనకలిగినదా? లేక తేజఃకిరణములవలె యుష్ణకిరణము లున్నవా? ఈ రెండు ప్రశ్నలకు సమాధానము ఔనని చెప్పవలెను. తేజఃకిరణములకు వేడిచేయు శక్తి గలదు. అదియునుగాక మనముచూచు తేజఃకిరణములకన్న అలపొడ వెక్కువగల కిరణము లున్నవి. అవియును వేడిజేయగలవు. వాటిని Infrared కిరణములని పిలుతురు. కావున నాకాశమున నుష్ణప్రచారము తేజఃకిరణములవలెనే అలలమూలముగ జరుగుచున్నది. కావున నుష్ణ కిరణములను "కనబడని తేజస్సు" అని చెప్పవచ్చును. చూచితిరా! ఉష్ణకిరణప్రసారము తేజఃకిరణ ప్రసారము నొకటియే యైయున్నవి. వీనిలో నింకను జేర్పవలసినవి యున్నవి. ఇదివర కాకాశమునందు విద్యుత్ప్రకంపన మొనర్చిన విద్యుదయస్కాంత సంయుక్త ప్రకంపన మొకటి బయలుదేరునని Maxwell సూత్రములనుండి నేర్చుకొంటిమి. వానిని ప్రపంచస్ఫురణకు దెచ్చినవాడు Hertz అను జర్మను శాస్త్రజ్ఞుడు. ఇయ్యదియే మన మిప్పుడు విచిత్రముగ వినుచుండు తంతిలేని టెలిగ్రాపునకు మూలము; ఈ Electro-magnetic అలలకును, తేజఃకిరణములకును భేదము. ఒక అలపొడవునందు తప్ప మరి యితరవిషయముల యందొక జాతికి జెందినవే,కాని యివి మనయుష్ణకిరణముల అలపొడవునకన్నను పొడనైనవి. సరియే; తేజఃకిరణములకన్న పొట్టియలలుగల కిరణము లున్నవాయన, ultra-violet కిరణములనియు అటు తరువాత X కిరణములనియు, గామాకిరణములనియు గనిపెట్టబడినవి. మొదటివి ఫొటోగ్రాఫిక్ ప్లేటును నలుపు జేయగలవు. X కిరణములు అనునవి యలెక్ట్రాన్ అను అణువులు, చాలావేగమున బోయి యేపదార్థముపైన

డీకొట్టుకొన గలుగుచున్నవి. ఇయ్యవి మనము చూచు తేజఃకిరణములవలెగాక పదార్థములయందు ప్రవేశింప గలవు. అనగా మీ చేతిని X కిరణమునకు అడ్డముగా నుంచితి రనుకొనుడు. మీ చేతి కీనీడకుబదులు యెముకలు స్పష్టముగాను మాంస మస్పష్టముగాను గనబడును. అనగా X కిరణము లెముకలలోనికి ప్రవేశింప లేవన్నమాట. ఈ X కిరణము మూలమున నేదైన నెముక విరిగినయెడల నెట్లువిరిగినది చూడవచ్చును. నవీనవైద్యశాలలం దివి యుపయోగింపబడుచున్న సంగతి మీకు విశదమే. గామా కిరణములనునవి యొకరసాయనిక పదార్థము మరియొక పదార్థముగా మారునపుడు కలుగుచున్నవి.

ఉష్ణమునుగురించి మరికొంత చెప్పవలెను. కిరణ రూపమున వచ్చు వేడిగాక పదార్థమునందున్న వేడివిష యము చెప్పవలెను. ఈవిషయమున ననుభవమునుండి సానలదీరిన రెండుధర్మము లున్నవి. మొదటిది ఉష్ణము నకును పనిజేయగల్గు ద్రఢిమకును భేదము లేదని. దీనియర్థ మేమన? ఒకవస్తువును మరియొకవస్తువుపై రాపిడిగా రుద్దితి రనుకొనుడు! అందువలన మీ దార్ఢ్యతను (Energy) దానిపై వినియోగించుచున్నారు. ఈదార్ఢ్యతవృథాగా నాశనమైపోవుచున్నదా? మఱి యేమయిపోవుచున్నది? అని ప్రశ్నవచ్చును. శాస్త్రజ్ఞుల యభిప్రాయ మేమన: ప్రపంచమున దార్ఢ్యతను మనము క్రొత్తగా సృష్టిజేయలే మనియు,నున్న దానిని నాశనముజేయ లేమనియును. అయిన పైనజెప్పిన యుదాహరణమునందు వినియోగింపబడిన దా ర్ఢ్యత యేమైనదనిన నక్కడ వేడిగలుగుచున్నది. వేడియును నొకవిధమున దార్ఢ్యతయే యని థర్మోడయినమిక్స Thermo dynamics యొక్క ప్రథమధర్మము నిర్దేశించు చున్నది. ఒక్కమారీధర్మమును మరల దిలకింపుడు. దార్ఢ్య ముపోగానే దానికిబదు లుష్ణముగుపడుచున్నదన్న మనస్సు కు సంతృప్తికరమైన పటము గోచరించుటలేదు. అందున కై యీయుదాహరణము నుపయోగపరచెదముగాక. ఒక వీణెయందు తీగెను ప్రయోగించితి మనుకొనుడు. మొదలు తీగెకు రెట్టింపుపొడవుగల తరంగ దీర్ఘతగల ముఖ్య స్వరము బయలుదేరును. తరువాత తక్కువ స్పష్ట ముగా దీనిలో సగము పొడవుగల తరంగదీర్ఘతగల యుపస్వరము బయలుదేరును. ఈరీతిగా స్పష్టత తగ్గుచు తరంగ దీర్ఘత తగ్గుచు స్వరములు కలుగుచుండును. కొంత కాలమునకు శబ్దమేమియు వినబడదు. కాని ప్రకంపనము మటుకు మనకు చెవులకు వినబడునంత దార్ఢ్యతగల శబ్ద మును గలుగజేయకున్నను పైనజెప్పినరీతి తరంగదీర్ఘత తగ్గితగ్గిపోయి పదార్థముయొక్క విభజనమందు చివరిస్థితి యగు అణువులను ప్రకంపన మొందించును. ఆయణుప్ర కంపనమును మనము చూడజాలము. కాని యదిసృష్టిగ గలుగజేయు నుష్ణమును గుర్తింపగలము. కావున మనకు పైకిగనపడు వస్తుదార్ఢ్యత క్రమముగా సూక్ష్మములగు నణువుల దార్ఢ్యతను వృద్ధిచేయుచున్నది. అట్టివృద్ధియే సృష్టిగ మనత్వగింద్రియము ఉష్ణముగా భావించు చున్నది.

ఇక థర్మోడయనమిక్సు రెండవ సిద్ధాంతమును గురించి:—ఎక్కువ వేడిగా నుండు పదార్థమునుండి తక్కువ వేడిగానుండు పదార్థములోనికి వేడి ప్రవహిం చును. "చల్లగానుండు పదార్థమునుండి వేడిపదార్థము లోని కుష్ణము ప్రవేశింపదు" అని మన యనుభవమువలన గనుగొనుచున్నాము. దీనికి విరుద్ధమే ప్రకృతిలో గోచ రింపగల్గిన నది యిట్లుండవలెను. మన చేతిని మంచుగడ్డపై బెట్టినయెడల మంచుగడ్డ క్షణక్షణమునకు చల్లబడవలెను. కాని మన చేయి క్షణక్షణమునకు వేడిచెందవలెను. కాని మనము కనుగొనిన దిట్లున్నదా!

అయిన ప్రథమసూత్రప్రకారము చల్లని పదార్థ మునుండి వేడిపదార్థమున కుష్ణము ప్రవేశించుననుమాట కాటంక మేమియును లేదు. ఏమన? వేడియన్న యణు వుల దార్ఢ్యతయని చెప్పియుంటిమి. చల్లని పదార్థమై నను దానిలో గొంతదార్ఢ్యతయున్నది. అట్టిదార్ఢ్య తను దానినుండి తొలగించి మరియొక పదార్థమున కిచ్చు మన్న ప్రథమసూత్ర మేమాత్ర మాటంకపరుపదు. మఱి అట్టి యూహవలన దార్ఢ్యతశాశ్వతతకు భంగమేమియు రాదు. కాని యిక్కడనే యూష్మమునొక్క రెండవసూ త్రమందికొనును. "దార్ఢ్యతయొక్క శాశ్వతతను నేనొప్పు కొందునుగాని దాని కీనియమములనుమాత్రము నేను కల్పిం దును. ఉష్ణతరమైన వస్తువునుండి యూష్మమైనవస్తువునకు

దార్ఢ్యశాశ్వతకు భంగము లేకుండ నుష్ణప్రవాహమున కొప్పుకొనెదను. కాని చల్లనిపదార్థమునుండి వేడిపదార్థమునకు, దార్ఢ్యత శాశ్వతముగా నుంచినను నుష్ణప్రవాహము సాగజాలదు” అని రెండవసూత్రము చెప్పును. దీనికి విరుద్ధము దరిద్రుడు ధనవంతునకు ధన మొసంగినట్లుండును. ఈసూత్రమే సామాన్యవస్తుచలనశాస్త్రమునుండి యుష్ణశాస్త్రమును విశదీకరించుచున్నది.

ప్రథమసూత్రమునకు వస్తుచలనశాస్త్రప్రకారము (Mechanics) అర్థము చెప్పగలిగితిమి. రెండవసూత్రమున నిరోధింపబడితిమి. ఇది యెంతయును మనస్సునకసంతృప్తిగనున్నది. ఈ యుష్ణము ప్రథమవిషయమునందు వస్తుచలనశాస్త్రప్రకారము వర్తించుచు రెండవ విషయమున చంచలబుద్ధిని జూపుట నిజమైన శాస్త్రజ్ఞునికి ప్రశాంతము నియ్యజాలదు. అందులకై దీనికిగూడ సకారణముగ మెకానిక్సులోనుండి నిరూపింపవలెనని ప్రయత్నములు బయలుదేరినవి. ఇయ్యదియే స్టాటిస్టికల్ మెకానిక్సు (Statistical mechanics) అనుదానికి బీజప్రాయమైనది. ఇంతవరకు వచ్చితిని గనుక దానిని కొంచెము వర్ణించెదను.

వేడియన్న యణువులచలనమని చెప్పియుంటిని. కావున నొకయణుసమూహమును దీసికొందము. అందు వాని యిష్టము వచ్చినట్లు చలించుచున్నవి. ఒకదాని నొకటి డీకొనుచున్నవి. వానిచలన మొకవిధమని నిరూపింప నవకాశము లేదు. అట్టి యణువుల నేకర్మముచే బంధింపగలమని మొదట మనస్సున సందేహమును నిరుత్సాహమును బొడమును. గణితశాస్త్రజ్ఞుని మేధాశక్తియందును జోరబడినది. ఇక్కడ నొక విశేషము గలదు. మనకు కావలసినది ప్రత్యేకప్రత్యేకాణుచరిత్రము గాదు అవి సమిష్టిగా గలుగజేయు ఫలితము... అందువలననే మన దారి సుగమము. ఎప్పుడైనను సమష్టిఫలితములు దీసికొనినపుడు నిశ్చయమునకు దగ్గిర గాకున్నను, నిశ్చయమున కటునిటు నుండును. అందులకే యిట్టి ఫలితములకు (Probability) అనగా సంశయత యని వాడినారు. ఒకపని నూటికి యేబదిపాళ్లగునని చెప్పిన నేబదిపాళ్లు సంశయమును నేబదిపాళ్లు నిస్సంశయమును నందునిమిడియున్నవి. నూటికి డెబ్బదియైదుభాగములు నిస్సంశయత యున్నదనుకొనుడు. దీని కర్థము విశేషభాగము పనియగునట్లున్నదన్న మాత్రమున బనియగునని నిశ్చయముగా జెప్పలేము. పనియగుటకంత యవకాశమున్నను బని నెరవేరకయే పోవచ్చును. కాని పని నెరవేరకపోవుట యను నది చాల యసందర్భమని మాత్రము చెప్పగలను.

ఇదేవిధముగ నొక యణుసముదాయమును దీసికొని యవియన్నియు నొకసగుటైన గమనవేగమునకు దగ్గరనున్న గమనవేగములు గలిగియుండు స్థితి యెంత నిశ్చయమైనది యని గుణింపబడినది. ఇది పూర్ణాంకము గాదు. భిన్నాంకమగును. కావున నొక యణువుల గుంపుయొక్క స్థితిని వర్ణించవలెనన్న దాని యుష్ణమాన మనుదానిచేతనేకాక (Temperature) యట్టిస్థితియొక్క నిశ్చయతను బట్టిగూడ వర్ణింపవచ్చును. దానినే యంట్రోపి (Entropy) యనికూడ నందురు.

అట్లైన రెండు వస్తువులను—భేదములైన యుష్ణమానము లందున్నవి (అనగా నొకటి వేడిగాను మఱియొకటి చల్లగాను)—లేక రెండణువుల గుంపులను (ఈ విధముగాగూడ వస్తువును భావింపవచ్చునుగదా!) సంపర్కములోనికి దీసికొనివచ్చితి మనుకొనుడు. ఈ రెండు గుంపులకును స్థితి నిశ్చయతలు భేదముగా నుండును. ఇప్పుడు ప్రశ్న యేమనగా? ఈ రెండు వస్తువులు, ఒకదాని నొకటి యంటుకొనినప్పుడు వాటిస్థితి యేస్థితిలోనికి మారుచున్నదని. దీనికి ప్రత్యుత్తర మీ క్రిందియూహపై నాధారపడి యున్నది. ఏస్థితియైనను తనకన్న నిశ్చయమైన స్థితిలోనికి మార బ్రయత్నించును. ఇట్లనుటయే యొకటి మఱియొక దానికన్న నిశ్చయతరమని చెప్పుటకుగారణము. ఈ యూహ నాధారము జేసికొని పైప్రశ్నకు ప్రత్యుత్తర మేమనగా? నా రెండును కలిసి మఱియొక స్థితిని జెందును. ఆ స్థితియెట్టిదనగ? దానియందున్న యంట్రోపి రెండువస్తువుల సంయుక్తనిశ్చయతలకన్న నెక్కువ యైనది. ఇట్లు చెప్పుటచే యుష్ణము ప్రవహించు మార్గపుదెస నిర్ణీతమైనట్లే. ఈ చర్చవలనకలిగిన ఫలితములు మన సామాన్య-

భావములోనికి మార్చబడినపుడు వేడియగు వస్తువునుండి చల్లని వస్తువులోని కుష్ణప్రవాహము జరుగునని యనగా నట్లు జరిగెవనేగాని పైన జెప్పిన Entropy (నిశ్చయత) వృద్ధి కాజాలదు. కావున నిప్పుడు థర్మోడయనమిక్సు యొక్క రెండవ ధర్మము మన మనస్సునకు సంతృప్తి కరముగా నున్నది. కావున చూచితిరా! కిరణప్రసార జనితమైన యుష్ణమును యెలెక్ట్రోమేగ్నటిక్ తరంగము లలో జేరకున్నది. పదార్థములందుండుష్ణము మెకానిక్సునందు జేరుకున్నది. శబ్దవిషయ మిదివరకే కొంత సూచనగా జెప్పితిని. అయ్యది పదార్థప్రకంపనమువలన కలుగుచున్నదని చెప్పితిని. కావున శబ్దశాస్త్రము మెకానిక్సులో నిమిడినది. కావున పదార్థవిజ్ఞానశాస్త్రము రెండు పెద్దభాగములుగా విభజింపవచ్చును. ఒకటి: మెకానిక్సున్ను; రెండవది: యెలెక్ట్రోమేగ్నటిక్ తరంగములున్ను. ఈ రెంటినిగూడ సమ్మేళనము జేయవలెనని గట్టి ప్రయత్నములు జరుగుచున్నవి. నేడు గాకున్న మఱియొకనాడైన నీపని నెరవేరగలదు. ఇప్పటి కప్పుడే కొన్ని యూహాబీజములు వెవజల్లబడినవి. మెకానిక్సునందును, ఎలెక్ట్రోమేగ్నటిక్ తరంగములందును దార్ఢ్యత యనునది సామాన్యముగ నున్నదని మీ రిదివరకే గ్రహింతురు. ఒకవస్తువు తన స్థితినిబట్టి కొంత దార్ఢ్యత గలిగి యుండును. అదేవిధముగా నాకాశప్రకంపనమువలన గలుగు తరంగములుగూడ దార్ఢ్యత గలిగియున్నవి. ఏమన! ఉష్ణకిరణము పదార్థముపై బడిన దనుకొనుడు. అది వేడి జెందుచున్నది. పదార్థము వేడిజెందుట యనగా దాని యణువులకు దార్ఢ్యత వృద్ధిచెందుట యని నేర్చుకొంటిమి గదా! కావున నీ యాకాశతరంగములకుగూడ దార్ఢ్యత యున్నది. ఆ కారణములనే యొకేయల పొడవుగల రెండు కిరణము లొకటి స్పష్టముగను, మఱియొకటి యస్పష్టముగను దార్ఢ్యతాభేదముచేత పదార్థములను బ్రకాశింప జేయుటకు గారణము.

ఈ యిరువదియవ శతాబ్దమున విద్యుత్తనునది యణుస్వరూప మని నిరూపింప బడినది. పదార్థ మంతయును విద్యుదణువులతో నిర్మింపబడినదనియు, విద్యుదుద్వేగమువలన పదార్థముయొక్క బరువును, జడత్వమును కలుగుచున్న వని చెప్పవచ్చుననిగూడ నూహింపబడినది.

ఇట్టి సందర్భమున (Quantum theory) క్వాంటంథియరి యనునది ప్రపంచము కండ్ల జూచినది. దీని భావ మేమన? విద్యుత్తేలా గణుస్వరూపమో, పదార్థమెట్లణుస్వరూపమో, దార్ఢ్యత యనునది గూడ నట్టే యణుస్వరూప మని. అనగా నణువనుటవలన దానికంటె జిన్నది యుండదని యెట్లు భావింతుమో యదేవిధముగా నీ దార్ఢ్యతాణువుకన్న జిన్నది యుండదు. అంతియేకాదు, పూర్ణాంక సంఖ్యగల యణువులుమాత్రమే కలియుట యెట్లు సంభవించునో యాలాగుననే యీ దార్ఢ్యతాణువులు పూర్ణాంకసంఖ్యగలవియై యుండవలయును. అనగా ఒకటిన్నర దార్ఢ్యతాణు వుండదు. వీని ప్రసక్తి, దీని యావశ్యకత, అలలు తమ దార్ఢ్యతను పదార్థమున కిచ్చివేయు సందర్భమున జనించినది. దార్ఢ్యత నీ తీరున నూహించిననేగాని యచ్చట కొన్ని విపరీతాంశములకు కారణము నిరూపించుటకు వీలులేకపోయినది.

ఈ యిరువదియవ శతాబ్దమున క్వాంటంథియరీవలెనే వెనుకటి యూహలను మార్పు జెందించినది మఱియొకటి యున్నది. "అది ఐన్‌స్టైన్" (Einstein) అను మహనీయునిచేత బ్రతిపాదింపబడి మఱికొందఱిచే పెంపొందింపబడినది. దాని పేరు రిలెటివిటీ (Relativity) యని యనెదరు. దాని భావములు పదార్థసంబంధ రహితమైన ప్రదేశము (Space) లేదనియు, ప్రదేశమనునది పదార్థసంచలనముపై నాధారపడి యున్నదనియు; నదే తీరున పదార్థసంబంధ రహితమైన కాలము లేదనియును, న్యూటన్ మహాశయుడు పదార్థసంబంధ రహితమైన యొక ప్రదేశము నూహించి పదార్థసంబంధ రహితమైన కాలముప్రకారము తన గణితశాస్త్రమును పెంపొందించినాడు. అది కొద్దిపాటి గమనవేగముతో బోవు పెద్దవస్తువులనుగూర్చి యగుటచే నెక్కువ తేడా రాలేదు. కాని యీ కాలమున ఎలెక్ట్రానులు చాల సూక్ష్మాణువులు తేజోవేగము నించుమించుగా నందుచు తిరుగాడు వానికి న్యూటన్ ధర్మములను వర్తింప ప్రయత్నింప దప్పులుపోయి

నవి. అప్పుడు Einstein సిద్ధాంతములు లెక్కలను దిద్దినవి.

అంతియేకాదు. న్యూటన్ ఆకర్షణ ధర్మము (Law of Gravitation) అనునొకదాని నొప్పుకొని (ఒప్పుకొనుటకు దాని ఫలితములు సరియైనవి యగుటయే కారణము) తన ఖగోళశాస్త్రమును గుణించినాడు. ఐన్‌స్టైన్ జనరల్ ప్రిన్సిపలాఫ్ రిలెటివిటీ వలన మింకవిస్కీగారు (Minkoviski) కాలముతోను మనము వస్తువును వర్ణించుటకుగా నేర్పర్చుకొనిన పొడవు వెడల్పు మందములను మూడును గలిసి యీ నాలుగింటితో సృజింపబడిన ప్రపంచమందు పొడవు వెడల్పు మందముతో సృజింపబడిన ప్రపంచమునందు వస్తువున కేతీరున వంకరయుండునో యట్లే యా ప్రపంచమునందును వంకరయుండుననియు, దానిని మన సామాన్యపరిభాషలోనికి మార్చిన యెడల న్యూటన్‌గా రూహించిన గ్రావిటేషన్ ధర్మ ముత్పన్నమగుచున్నదనియు నిరూపించిరి.

ఇక శ్రీయుత రామన్ మహాశయునిగూర్చి చెప్పెదను. ఈయనగారు చెన్నపట్టణము ప్రెసిడెన్సీ కాలేజీలో M. A. ప్యాసైరి. ఆ చిన్నవయసుననే తన బుద్ధికుశలతచేత తమ గురువర్యుల కాశ్చర్యము గలిగించిరి. శబ్దశాస్త్రమునందు ప్రసిద్ధిజెందిన (Melde) మెల్డీ యనువాని ప్రయోగమునకు నూత్నావకాశములను ఛెంపొందించి మెద్రాసు యూనివర్సిటీవారి బహుమతిని బొందిరి. ఇయ్యది సామాన్యుల కసామాన్యమైనదిగా గన్పట్టినను రామన్‌గారి భావములో నొక బాల్యఖేలనముగా గమనించెదరు. కాని నాయభిప్రాయ మేమన! ఈ విషయమున్న తాదర్శములను బెట్టుకొని చదువు బాలురకుత్సాహజనక మైనది. గురువర్యులు చెప్పినంతవరకే నేర్చుకొని దానికి బూర్వపక్షముగాని, నూతనశక్తి ద్రొక్కుటగాని యను విషయములచే బుద్ధిని వికసింపజేయుట ముఖ్యకర్తవ్య మని విద్యాధికుడు గాదలచిన ప్రతి విద్యార్థియు నేర్చుకొనవలసిన పాఠము.

ఈయనగారి మొదటి ముఖ్యమైన పరిశోధన శబ్దశాస్త్రమందు. అయ్యది వీణాతంతువుల ప్రకంపనవిధమునుగూర్చి. దీనివిషయమై యదివరకు (Helmholtz) హెల్మ్‌హోల్ట్స్ అనునాతడును, మఱికొందఱును కొంత పరిశ్రమజేసిరి. హెల్మ్‌హోల్ట్స్ గణితశాస్త్రమునం దల్పమైన మేధావి. పేరెన్నికగన్న Fourier's Series అనుదాని చేయూతజేసికొనియును కొన్ని నాటుధర్మములను (వైద్యములో నాటువైద్యమున్నట్లు) ప్రమాదిగానుంచుకొని కొంతవఱకు తంతువుల ప్రకంపనమునుగూర్చి సమాచారమును గ్రహించినాడు. కాని సర్వసమస్యాపరిష్కారణ మొనర్పగలుగునట్లుగ నీతని పద్ధతి వివరింప లేదు. ఆపనియే రామన్ మహాశయుడు నెరవేర్చెను. ఈయిర్వురొనర్చిన ఘనకార్యముల బోల్చినచో గణితశాస్త్రజ్ఞునకును బదార్థవిజ్ఞానశాస్త్రవేత్తకును గలభేదమగపడగలదు. హెల్మ్‌హోల్ట్సుయొక్కపనిని దిలకించినచో నాతడత్యధిక మేధావియని యబ్బురపడియెదరు గాని యాతడీతంతువుల సమస్యను బరిష్కరించినరీతి హృదయదుర్భరముగానుండును. అంతకష్టపడి చివర కతని నర్థముజేసికొంటిమా గణితశాస్త్రప్రపంచమునుండి మన నిజప్రపంచమునకు భావములుమార్చుకొనువరకు గృత్యాద్యవస్థ యగును. ఇక రామన్‌మహాశయుడన్ననో యాతంతువుల నిజమైనతత్వ మారసి తత్కారణమున సులువైనమార్గమున సమస్యలను పరిష్కరించెను. నాభావ మేమన? రామన్‌మహాశయుని కన్నులయెదుట స్పష్టముగగోచరించినట్లు హెల్మ్‌హోల్ట్సు కన్నులయెదుట నా వీణాతంతువుల తత్వము గోచరింపలేదని. ఎప్పుడైనను నే విషయమందైనను సుస్నిగ్ధమయిన (intimate)సంబంధమును గల్పించుకొనిన వారకే దానిలోని లోతుపాతులు చక్కగా తెలియగలవు.

ఈయన పరిష్కరించిన సమస్యయేమో కొంచెము చెప్పెదను.. పూర్తిగా జెప్పవలెనన్న నపరిచితుడగు శ్రోతకునకు గష్టముగా నుండును. ఫిడేలు (fiddle) వాద్యమందు తీగ యొకవైపు గట్టిగా కట్టివేయబడును. మఱియొకవైపు ననదియొక మెట్టు (Bridge) మీదుగా బోయి యావల ముడి వేయబడును. ఇప్పుడు వచ్చుప్రశ్నయేమనగా? బద్దవేసి తంతువుపై రాచినప్పుడు కలుగు శబ్దస్వభావ మెట్టిది? ఇట్లనుటతోడనే గాయక శిఖా

మణి "ఓ యింతమాత్రము తెలియదా? నా గాన కళాకౌశలముచే నట్టిస్వరమును తెప్పించమన్న దెప్పించెదను దీనికి గారణ మెక్కడ నే తీరుగ బద్దిత్రోరాచన నే స్వరము వచ్చునో నాకు దెలియును గావున. మీకును గావలసిన దదియేగదా!" అని చెప్పును.

ఈ గానకళాకోవిదునకు వినమ్రుల మయ్యెదము. వారు చెప్పిదాని కంతయును మే మొప్పుకొనెదము. అంతియే కాదు. వారి నిఖిల స్వరరచనాకౌశలము నొక్కొకపరి యప్రతిభులమై పొడగాంచెదము—కాని ఒకమాటచెప్ప వలసియున్నది. ఆయన జ్ఞానమంతయును దుస్వరమునుండి సుస్వరమును విచక్షణ జే యుటయందు వ్యవసాయమునొందిన కర్ణముపైననే యాధారపడి యున్నది. ఈ జ్ఞానయానంద మింద్రియగోచరము. ఇంద్రియములు పనిజేయుట మానినతోడనే పడేలు నావల యుంచవలసినదే. దీనికి గారణము శబ్దతత్వ మాత డింద్రియ స్పర్శనావశ్యకతనుండి విడిపింప లేదు. మేము మాతా బేలునడకతోనైనను జేయ సమకట్టినది శబ్దముయొక్క నిజతత్వమును గనుగొని దానిపై మనము విను సర్వదుస్వర సుస్వరములకు గారణము నిరూపించుచుందుము. నా యభిప్రాయము సంగీతమును మేము నేర్చుకొన్నట్లుగా నేర్చుకోవలెనని గాదు. అట్లే యైనచో ప్రపంచమున గానము గగనకుసుమమయ్యెడిదే.

శబ్ద మనునది పదార్థ ప్రకంపనము వలన గలుగుచున్నదని యిదివరకే సూచించితిని. ఆ పదార్థ మొకప్పుడు గాలిగా గాని, యొకప్పుడు వీణయందలి తీగెగా గాని యిట్లే మఱియేపదార్థమైన గావచ్చును. అట్లయిన వేర్వేరు స్వరములు గలుగుటకు కారణమేమనిన? దానికి వేర్వేరుగా నలలపొడవు లుండుటయే యని యిదివరకే చెప్పితిని. ఒక ప్రకంపమును గుర్తింపవలెనన్న నింకొకవిధముగా గూడ గుర్తింపవచ్చును. ఒక సెకండులో స్వరము యెన్ని యలల నతిక్రమించు చున్నదో ఆ యలసంఖ్య (Frequency) ను బట్టియు స్వరముసు నిర్ణయింపవచ్చును. పెద్ద అవ్యక్తమైనధ్వని కల్గిన దనుకొనుడు. దానియలసంఖ్య యెంతయని యడుగవచ్చును. దానికి నిరూపకమైన యలసంఖ్య లేదు. దానిలో నెన్నియో స్వరములు తారుమారుగా, గలుగుటచే నవ్యక్తముగా వినబడుచున్నది. అట్లుగాక స్వరములన్నియు నొక్కస్నేహభావముతో వినబడినచో యది సంగీత మనిపించుకొనును. ఈ సందర్భమున నచ్చపు స్వరమునకును (Pure note), సంగీతస్వరమునకును భేదమును గమనించవలెను. ఒక యచ్చపు స్వరమును దీసికొనుడు. దానియలసంఖ్య ౩౫౦ అనుకొనుడు. దీనికి సంబంధించిన సంగీతస్వరమో ౩౫౦ అల సంఖ్యగల స్వరమేగాక ౭౦౦, ౧౪౦౦, యీతీరుగా నితర బాంధవ్యములైన స్వరములన్నియు మిళితములై యొకస్వరముగా గన్పట్టును. ముఖ్యమైనది ౩౫౦ తరంగ సంఖ్యగల స్వరమే. కాని దానిమాధుర్య మితర స్వరములతో మేళవించుటయందున్నది. అట్లయిన ముఖ్యస్వరముతో నుపస్వరము లెన్ని కలియుచున్నవని ప్రశ్నించిన నయ్యది యాయా వాద్య విశేషమును బట్టి యుండునని చెప్పవలయును. అందులకనియే యొకేపాటను హార్మోనియము మీద పాడండి ఫిడెల్ మీద పాడండి వీణమీద పాడండి ఏ వాద్యము మీదపాడినది మీరు చెప్పగలరు గదా! దీనికి గారణ ముపస్వర సంఖ్యాభేదము. ఒకే మాట నొకడు శ్రావ్యముగ మాటాడును. మఱొకడు కర్ణకఠోరముగ నుచ్చరించును.

ఒకేస్వరము దార్ఢ్యముగను మఱి బలహీనముగను నుచ్చరింపవచ్చును. దానికి గారణము ప్రకంపన పరిమితి భేదమువలన (Amplitude) కావున నొక స్వరముయొక్క దార్ఢ్యత దానియలపొడవుపైన నాధారపడదు. కాని ప్రకంపనా దార్ఢ్యతపై నాధారపడును.

ఒక తీగెను ప్రయోగించి నపు డనేక స్వరములు రాగలవు. దాని ముఖ్యస్వరముయొక్క తరంగదీర్ఘత తీగ పొడవునకన్న రెట్టింపుగా నుండును. అనగా ౧ వ పటమున జూపబడినట్లు తంతుప్రకంపనమందును దీనిలో చివరభాగములుతప్ప తదితర భాగము లన్నియు ప్రకంపనము నందుచున్నవి. దీని మొదటియుపస్వరము యొక్క తరంగదీర్ఘత తీగ పొడవెంతో యంత పొడవుండును. అనగా దానివిధము ౨ వ పటమున నున్నట్లుండును. దీనిలో ప్రకంపన

మొందని స్థలములు మూడు గలవు. అట్టివానికి "అచలిత ములు" (Nodes) అని పిలుతుము. ఈ తీరుగా తీగెను పూర్ణాంక భాగములుగా విభజించు నచలితస్థానములు గల యుపస్వరముల నెన్నియేనియును బడయవచ్చును. ముఖ్యస్వరపు తీగెపొడవుపైనను, దాని దిట్టతనము (Tension) పైనను, బరువుపైనను నాధారపడియుండు ను. తక్కితరోపస్వరముల యలసంఖ్య పైదానికన్న కొన్ని పూర్ణాంకపు రెట్లు కలిగియుండును.

పైన వివరించిన స్వరములు తీగెయొక్క సహజ స్వరములు. ఆస్వరములు తీగెను మ్రోయించిన కొలది కాలముననే యాగిపోవును. దీనికి గారణము తీగెలోనియు, గాలిలోనియు సంఘర్షణశక్తి (Frictional-force) కారణము. ఆగకుండ బాడవలయునన్న ననువైనశక్తి బ్రయోగింప వలసియుండును. అనువైనశక్తి యనగా మోడుగా నొకేవిధమయిన శక్తిని తీగపై బ్రయోగింప గూడదు. ఒకప్పుడు గట్టిగను మఱియొకప్పుడు తేలికగను బ్రయోగింపవలసి యుండును. కాలప్రవాహమునం దీశక్తి యొక్క మార్పును జిత్రించినచో నదియు తరంగమువలెనే యుండును. ఇంతయేల? కాలప్రవాహమునందు సమాన మైన గడువుల వెనుక మరల మరల నొకేమార్పు కలుగు చుండునట్టి యేవిషయమైనను తరంగముగా మనస్సున జిత్రించుకొనవచ్చును. నే జెప్పిన దానినిబట్టి పైనవివరింప బడిన శక్తికి ప్రకంపన సంఖ్య యొకటి యుండవలెను. పరిమితియందు మార్పులు లేక ప్రకంపనమొందునట్టి యీశక్తిని ప్రకంపనమొందు పదార్థముపై బ్రయోగించి నప్పు డెట్టి మార్పులు గలుగు ననిన నొక బలవంతుడు బల హీను నటు నిటు నూచిన గలుగునట్టి స్థితియే గలుగును. బలహీనుని నొక విధముగ సహజమైన ప్రకంపన మున్న దనుకొనుడు. బలవంతు డతని నూచినప్పుడు ప్రారంభమున బెనగులాడును; తరువాత బలవంతు డూచినట్లెల్ల నూగును. కావున బరిమితియందు మార్పుజెందు శక్తిని ప్రకంపనము జెందు వస్తువుపై బ్రయోగించినపుడు దాని సహజమైన ప్రకంపనసంఖ్యను వదిలివేసి నూతనముగా వచ్చిన శక్తి ప్రకంపనసంఖ్య నలవర్చికొనును. వస్తువుయొక్క సహజ మైన ప్రకంపనసంఖ్యయు, శక్తిప్రకంపన సంఖ్యయు నొకటి యయ్యెనా! ప్రకంపనదార్ఢ్యత పోయినకొలదియు హెచ్చగు చుండును. దీనిని (Resonance) అందురు. ఈ నూతన శక్తిని బ్రయోగించి దాని ప్రకంపనమును ప్రకంపనమొందు వస్తువునకు పెట్టింపజేయవలెనని మన యుద్దేశము గాదు. ఆవస్తువు సహజరీతినే యాగకుండ పాడవలెనని మన యుద్దేశ్యము. కాన మనము ప్రయో గించుశక్తి యెట్టిదై యుండవలయునన్న సంఘర్షణశక్తి నణచివేయు సామర్థ్యముగలిగి యంతకన్న నెక్కుడు పనిచేయక యుండవలెను.

ఫిడేలువాద్యమును దీసికొందము. దీనిప్రకంపనము పైన వివరింపబడిన రక్షితప్రకంపనపు (Maintained) జాతిలో చేరినదే. దీని విషయము చర్చించుటకు బూర్వ ము దార్ఢ్యతను దగ్గించు లేక గ్రసించు శక్తులెవ్వియో తెలి సికొనవలెను. 1. తీగెచుట్టు, 2. తీగెనుగట్టివేసినయా ధారములు ప్రచలితములగుట. ఈ రెంటిలో ముఖ్యమై నది రెండవది. ఇట్టి తీగపై పీరియాడిక్ (Periodic) శక్తిని ప్రయోగించినప్పుడు గలుగు చలనచరిత్రము గను గొనవలసియున్నది. ఈ శక్తులకున్న పరస్పరసంబంధమును బట్టి యాచరిత్రశోధనము గావింపవలసియుండును.

రామన్‌గారు ప్రశ్న నుద్ఘాటించిన దెట్లన? మొదలు బద్దె(కమాను) వేసి తీగపై రాచినపుడు తీగెకు గలుగు గమనవేగములను విమర్శించినాడు. తీగెకు బద్దెతో బాటు బోవునపు డొక గమనవేగమును వెనుకకు బోవునపుడు మఱియొక గమనవేగ ముండును. మొదటిది బద్దెవేగము నకు సరిగానుండునని నిరూపించినాడు. మొదటిగమనవే గమునుండి రెండవగమనవేగమునకు మార్పు క్రమముగ జరుగదు. అయ్యది జృంభణముగా జరుగును. రెండు గమనవేగములు కలుగుచున్నవనియు నొకదానినుండి మఱి యొక దానిలోనికి జృంభణము (Jump or Discontinuity) కలుగుచున్నదని గుర్తించుట యాయన పరిశో ధనలో మొదటిమెట్టు.

ఆయన రెండవయూహ గమనవేగ మనునది తరంగ స్వభావమును జెందుచున్నదని గుర్తించుట. దాని నీక్రింది విధమున వర్ణించెదను. తీగ నొకచోట రాచినపుడు ప్రకం

పనము రెండుచివరలకు బరుగెత్తుచున్నది. అనిన నర్థమేమి? తీగెయందు బ్రతిభాగము నొక దానివెంట నొకటి బ్రకంపనము నందికొనుచున్నవి. అనగా గమనమునందు చున్నవి. బ్రతిభాగమును కాలక్రమమున నొకేవిధమున గమనవేగము నొందుచున్నవి. దీనినే యింకొక విధముగా నూహింపవచ్చును. రాచినచోటనుండి, 2 చివరలవరకు గమనవేగము, పైన జెప్పినట్లు బ్రకంపనమువలెనే పరుగెత్తుచున్నది. బ్రకంపన మేతీరుగ, తరంగరూపముతో వెడలుచున్నదో, యీ గమనవేగముకూడ తరంగరూపముతో బరుగెత్తు చున్నది. ఈ తరంగమునకును, బ్రకంపనతరంగమునకును భేద మొకటియున్నది. అయ్యది గమనవేగ జన్మస్థానమందు గలుగజేయబడిన, గమనవేగముల భేదమును, ఒకదానినుండి మరియొకదానిలోనికి జృంభణము కలుగుచుండుటనుబట్టి యేర్పడుచున్నది. అనగా జన్మస్థానమందుకల్గిన, జృంభణముకూడ, తీగెవెంట పరుగెత్తుచున్నది. ఈ విమర్శనుండి రామన్‌మహాశయుడు గమనవేగపుటలలకు బటమున జూపబడిన రూపములను నిరూపించినాడు.




పటము నర్థముచేసికొనుటకు మఱియొకవిషయము చెప్పవలెను. గమనవేగపు టలలు 2 దెసల బరుగెత్తును. తీగె చివరకు వెళ్లి, యక్కడ బ్రతిఫలింపబడి, వెనుకకు బరుగెత్తును. ఎచ్చటనైన, చలనమును గుర్తించవలసినచో, ఈ తరంగముల సంయుక్తఫలితమును దీసికొనవలసి యుండును. పై జూపబడిన పటములో, P అనుస్థలమున, బ్రకంపన మెట్లు కలుగుచున్నదో కనుగొనవలెననిన, P అను తీగెలోని భాగమునకు A నుండి C వరకు, తరంగము వచ్చునంతవరకు, P C కి సమానమైన గమనవేగముతో జలన మొందును. దాని చలనపుపటమును గీచినచో, కాలముతో




హెచ్చుగుచుండును. గనుక 2వ పటమున A B వరకు బ్రచలిత మగును. తరంగము C దగ్గరకు వచ్చినతర్వాత జృంభణము జరుగును. అప్పుడు "P"కి గమనవేగము P D పరిమితియును, గ్రిందిదెసకు వర్తించును. ఈ గమనవేగ మెంత వరకువర్తించుననగా, తరంగము C నుండి B దగ్గఱకు వెళ్ళి మరల D వద్దకు వచ్చువరకు. అందుచేత నంతవరకు చలనము 2 వ పటమున B D వరకు సాగును. అటుపైన పటమున జూపబడినట్లు జరుగును. ఇట్లే తీగెయొక్క ప్రతియేస్థలమునైన నే తీరుగ, కాలము ననుసరించి చలించుచున్నదో, పటమును వ్రాయవచ్చును. ఇది నిశ్చయమో కాదో, తెలిసికొనవలెననిన, నే చోట మనము తెలిసికొనదలచితిమో, యా చోట, వెలుతురును బ్రసరింపజేసి, తీగె మ్రోగుచున్నప్పుడు, తీగెవెనుక బ్రక్కగా, ఫొటో ప్లేటును, చప్పున లాగినయెడల, పైన జెప్పినరీతినే, పటము రాగలదు, దీనివలన మనము తెలిసికొనున దేమన, తీగెలో నొక స్థలముయొక్క చలనచరిత్ర తెలిసికొనిన యెడల అనగా బద్దెరాచినచోట సంగతి తెలిసినయెడల, వివిధస్థలముల పైయుపాయమున చలనపుపటమును వ్రాయగలము. అయ్యదియే మనకు గావలసినది. ఈ తీరుగా, గమనవేగపుటలలయూహతో, నెంతోసులువుగ, హెల్మ్‌హోల్ట్సు తలబ్రద్దలుజేయు గణితముతో బరిష్కరించిన సమస్య నీతడు నిర్వర్తించినాడు.

పైనవివరించిన యుదాహరణమందొకే జృంభణము కలుగుచున్నదని యూహించితిమి. ఒకే కాలమందు తంతువుపై, నొకటికన్న నెక్కువసంఖ్యగల జృంభణములు కలుగవచ్చును.

అనగా P అనుచోట గమనవేగమునందు జృంభణము జరుగుచున్న దనుకొనుడు. అప్పుడే, Q యందును గూడ, జృంభణము జరుగవచ్చును.




జరుగవచ్చుననిన, Q యందు జరిగిన జృంభణము మఱికొంతసేపటికి, P దగ్గరకు జేరును. కావున నీప్రకంపనములను, జృంభణముల సంఖ్యను ఆధారముగా రకముల నేర్పరుపవచ్చును. ఆదియే రామన్‌గారు చేసినదికూడను.

మఱియొకసంగతి:— ఈ జృంభణములన్నియు, సమాన పరిమితి కలిగియుండవలెననియు, వీటి, ఒక్కొక్క దానిపరిమితి, బద్దెను తీగెపై రాచినపుడు కలిగిన

గమనవేగముల భేదమునకు సమానమనియును, రామన్ గారు నిరూపించినారు. ఏది యెట్లున్నను, గమనవేగపు టలల పటమును, వ్రాసిననే కాని, యితరపటములను వ్రాయుటకు వీలుండదు. అందువలన నాపని సముహద్బుట కింకను తెలిసికొనవలసిన విశేషము లేమనగా, A. C. అనునది A. B. యను తీగతో, నెంత కోణము చేయుచున్నది తెలియవలెను. దానినిగూడ, నొక సులభమైన సూత్రముతో రామన్ గారు కనిపెట్టినారు.

ఆయన యేర్పరచిన మార్గముతో, బరిష్కరింపగల్గిన సమస్య లెన్నియేని కలవు.

౧. తీగెను బద్దతో రాచినపుడు, బద్దెనంటుకొనక జారిపోయిన యెడల, నప్పుడు దాని ప్రథమగమన వేగమేక పరిమితి కలిగియుండదు. అట్టిస్థితిలో దీగె చలన చరిత్ర నెట్లు నిర్ణయింపనగును?

౨. సులభముకొరకు, బద్దతో రాయబడిన స్థలమొక చుక్కగా (Point) గ్రహింపబడినది. నిజముగా నది కొంతపొడవు—అనగా—బద్దెవెడల్పెంతో, యంత, కలిగియుండును. దీనిని గూడ మన విమర్శనయందు గుర్తించిననే మార్పులు చెందవలసి యుండును?

౩. మన మనుకొనిన ప్రకంపన మొకటి కలుగవలెనన్న, బద్దె నెట్టి గమనవేగముతోను, ఎంత బరువుతో నదుమవలసి యుండును?

౪. పైదాని నిర్ణయమునందు, తీగె, దేనిపై నెక్కింపబడినదో, యా వాద్యోదర మెట్టి పాలు గొనుచున్నది?

ఈ విధముగ నెన్నియేని ప్రశ్నలు రాగలవు. వీని నన్నిటి నొకదానివెంట నొకటి రామన్ మహాశయుడు వర్ణించినాడు.

ఏదో కొంత ప్రకంపనమందు తీగెలనుగూర్చి రామన్ గారు చేసిన పరిశోధనల విషయము, కొంత యభిప్రాయము నిచ్చితిని. పూర్తిగ నివ్వవలయుననిన, గ్రంథవిస్తరభీతి యొకటి. పాఠకునియొద్దనుండి పదార్థవిజ్ఞానశాస్త్రపరిచయము కావలసియుండుటను బట్టి ఈ విషయమున నిచ్చుట నాగెదను.

కాని యీసందర్భమున సామాన్యముగ నైరోపియన్ వాద్యములందు మ్రోయించుటకు గష్టతమమైన వుల్ఫ్‌నోటు (wolfnote) నకు గారణములు కడుంగడు చమత్కారముగ రామన్ గారిచ్చినవి చెప్పెదను. వుల్ఫ్‌నో టన్న, నొక తోడేలు బొబ్బరించినట్లు స్వరముండు నన్నమాట. అది వాయించినపుడు, వాద్యోదరమంతయు నల్లల నాడును. దీనికి నూహింపబడిన కారణము, వాద్యోదరముయొక్క సహజమైన స్వరపు ప్రకంపనసంఖ్యకును, పాడబడెడి, స్వరపు ప్రకంపనసంఖ్య సమానము కా బ్రయత్నించుచున్నదని. కాని, ఇది యెట్లు మన వినెడిశబ్దదార్ఢ్యతలలో, జర్వితచర్వణముగా కల్గెడి మార్పులతో సంబంధము కలిగియున్నది తెలియలేదు. (white) వైట్ అను నాతడు కొంతసమాధానము చెప్ప బ్రయత్నించినాడు. కాని యది తృప్తికరముగ లేదు. రామన్ గారు చెప్పిన దీ క్రిందివిధమున నున్నది.

మనము తీగె కిచ్చు దార్ఢ్యత కొంతభాగము వాద్యోదరము లాగికొనుచుండునని యిదివరకే యొకచో జెప్పితిని. ఈ లాగుట యెక్కువగుకొలది, స్వరదార్ఢ్యత తగ్గకయుండవలె ననిన, బద్దెను గ్రమక్రమముగ హెచ్చుగ నదుమవలసి యుండును. కాని ఈ యదుముట కొక పరిమితి యున్నది. ఆ చరమ పరిమితికి దక్కువగ నదుమబడినపుడు సహజమైనస్వరమును తీగె కలుగజేయును. ఆస్వరములో ముఖ్యభాగము ముఖ్యస్వరము దీసికొనును. కాని యదుముట యెక్కువయయిన కొలది, ప్రాముఖ్యత, మొదటి యుపస్వరమునకు వెళ్లును. ఇది శాస్త్రరీత్యా గ్రహింపబడిన విషయము. దీని నుపయోగించి, రామన్ గారు వుల్ఫ్‌నోటును వర్ణించినారు. ఇదివరకే వాద్యోదరము యొక్క సహజప్రకంపన సంఖ్యయును, వాయింపబడు స్వరప్రకంపన సంఖ్యయు నొకే పరిమితిని చెందబోవునపుడే వుల్ఫ్‌నోటు చెప్పితిని. ఈ సంగతి జరుగునపుడు మొదలు జరుగున దేమన, ముఖ్యస్వరము ముఖ్యముగా మ్రోయు చుండును. కాని కొంతసేపైనతర్వాత, వాద్యోదరము దార్ఢ్యత గ్రహించుట, హెచ్చగుచుండుట బట్టి బద్దెనదుముట హెచ్చుచేయవలసి యుండును. ఇక్కడ జరుగు ప్రకంపనము (Resonance) రిసోనాన్సు ప్రకం

పనముగుటచే, దార్ఢ్యతా నష్ట మమితము. అందువలన బద్దెనదుముట్ట, పైనచెప్పిన చరమపరిమితిని గూడ దాటి పోవును. అపుడు తీగ తనముఖ్యస్వరమును భరింపలేక పోవును. దీని ఫలిత మేమన, తీగప్రకంపనరీతి క్రమక్రమముగ, మొదటి యుపస్వరము ముఖ్యతవహించిన రీతిలోనికి మారుచున్నది. అప్పు డుదరప్రకంపనము తగ్గును. (అనగా, రిసోనాన్సు ప్రకంపన మిపుడు లేకపోవుటవలన) అప్పుడు దార్ఢ్యత నష్టము వెనుకటియంత హెచ్చుగా నుండదు. నష్టమగుట తగ్గుచుండును. ఇది యెప్పుడు చరమపరిమితికన్న తక్కువ యగునో, యప్పుడు మరల తీగ, వెనుకటి తనసహజ ప్రకంపనమనగా, ముఖ్యస్వరము ముఖ్యముగా నున్నట్టి ప్రకంపనమును బొందును. ఈతీరుగా తీగ ప్రకంపన మొక తీరులోనుండి, మఱియొక తీరులోనికి మారుచుండుటచే, మనము వినెడి స్వరదార్ఢ్యతలో జర్విత చర్వణముగ కల్గుమార్పులకు గారణమయినది. ఈ విధమున, రామన్ గారు, వుల్ ఫనోటు ప్రాంతముల, బద్దెతో, మార్పునొందని స్వరమును బడయలేనందులకు, అటుపైనవచ్చు బొబ్బరింత ధ్వనికిని గారణముల నిరూపించినాడు. ఈ యూహ కనుకూలముగ, వాద్యోదర ప్రకంపనముయొక్కయు, తంతు ప్రకంపనముయొక్కయు ఫొటోగ్రాపులను తీసినారు. అవి యాయన యూహించిన యూహలను నిరూపించినవి.

ఈయనగారు హెల్మహోల్ట్సు తప్పు డభిప్రాయములతో, మొదలిడి పరిశోధన చేసినట్టిదియు, దిద్దబడిన యూహలతో, (Kaufman) కాఫ్మాన్ అను నాతడు పరిశోధన చేసినదియునగు, Pianoforte, పియానో విషయమై కాఫ్మాన్కన్న పూర్తిగ పరిశోధన చేసినారని మాత్రము చెప్పెదను. ఆ విషయమున నంతకన్న చెప్పదలచ లేదు.

ఈయన శబ్దశాస్త్రపరిశోధనలనుండి, వెడలిపోక పూర్వము, మన హిందువుల పురాతనాన్నత్యమును దెలియజేయునవి యును, ఇప్పటికి నశింపకయున్నవియు నగు, 3 వాద్యవిశేషములందు రామన్ గారి యప్రతిమానమైన, నిశితమైనబుద్ధి ప్రవేశించిచేసిన పరిశోధననుగురించిచెప్పిన, పాఠకులకు నుత్తేజముగ నుండునని భావించెద. అవి వీణ, తాంబుర, మృదంగములును. వీణ, తాంబురలలో నీయన జూపిన విశేషమేమన సామాన్యముగ ప్రకంపనమొందు తీగలకు జెందు హెల్మహోల్ట్సు ధర్మము (ఐరోపియన్ వాద్యము లీ ధర్మమునకు లోనైనవే) వీణకును, తాంబురకును చెందదని. అది ఏమన, తీగపైనే యచలితస్థానము పైనసైన వాయించినచో ఆ స్థానమున చలితస్థానముగల యుపస్వరములు కలుగ నేరవు. మనవీణ, తాంబురలో గలుగు విశేషము, దార్ఢ్యత యేమాత్రము తగ్గక, యుపస్వరముల చలితస్థానముల మ్రోయించినను కలుగుచున్నవి. అందువలననే, వీణలో గలుగు, గానవిశేషము సుస్వరసమృద్ధమగుటచే, నితర ఐరోపీయ వాద్యములకు గలుగనేరదు. దీనికి గారణము, రామనుగా రూహించినది, వీణయందును, దాంబురయందును, మెట్టుయొక్క ప్రత్యేకాకారతవలననని. ఇతర వాద్యములందు, మెట్టు కోసుగా నుండును. కాని ఇచ్చట పైభాగము, వంకరగా నుండుటచే, తీగలో నొక పాయింటుమాత్రమేకాక కొంత నిశ్చితమైన పొడవు, మెట్టునానుకొని వెడలిపోవును. రామనుగారు దీనివిషయమై శాస్త్రీయముగ బరిశోధన చేయలేదుకాని, యాయన చేసిన యవలోకనము (అనగా హెల్మహొల్ట్సు ధర్మము వర్తింపక పోవుటయనునది) చాల ముఖ్యమైనది. అయ్యదియే, ప్రారంభస్థానముగ, నింకను బరిశోధనచేయుట కవకాశ మున్నది.

సామాన్యముగ, మృదంగములు సుస్నిగ్ధములగు యుపస్వరములను గలుగజేయుచున్నదని నమ్ముచున్నది కాని, రామన్ గారు హిందూమృదంగములయందు గాంచిన విశేషము సుస్నిగ్ధమైన యుపస్వరములు కలుగజేయుచున్నది. ఈయన యూహించిన కారణము, హిందూ మృదంగముల ప్రత్యేకకట్టుబడియందున్నదని గ్రహించినాడు.

(స శేషము)






నూటయెనిమిదియేండ్ల వృద్ధుడు

కప్పురుచేరుగారను నితనికి ౧౦౮ ఏండ్ల వయస్సట. ప్రపంచములోకెల్ల వృద్ధుడగు జారు ఆగా అను పేరొకరు టర్కీయందుగలరు. వారి వయస్సు ౧౬౭ ఉండునని చెప్పుకొందురు.

---

## బోగి

దక్షిణ హిందూ దేశమందు అనేక పండుగలున్నాయి. అందులో ఆడివిటి, పండుగ అని రెండు ముఖ్యమైనవి. కర్కాటకసంక్రమాణమునకు ఆడివిటని, మకరసంక్రమాణమునకు పండుగ అని, పెద్దపండుగని పేరులు. ఈరెండు అయనములకే ఇంతముఖ్యత వ్యావసాయపు వృత్తిచే కలిగినటుల కనిపించుచున్నది. ఆడివిటి వెళ్లిన దగ్గరనుండి ఊడ్పుపనులు, పండుగ వెళ్లినదగ్గర నుండి నూర్పుపనులు ప్రారంభించుతారు. ఆడివిటికన్న పండుగ విస్తారశ్రద్ధాభక్తులతో ఆచరించుతారు.

పండుగకు తొలిరోజుకు భోగి యని పేరు. భోగిపండుగయనికూడా అంటారు. దీని కీపేరెలా గొచ్చెనా అని శాన్నాళ్లాయి నాకు తలంపుండేది. ఈపదమున కర్థమేమో కనిపెట్టవలెనని యత్నించాను. సి. పి. బ్రవున్‌దొరగారు వ్రాసిన నిఘంటువులో ఇట్లున్నది:—

> భోగి:—The name given to the eves of some particular feasts in Madras భోగిమూటము is the custom of Lighting fires at every house door all the preceding night. పండుగ తొలినాడు.

శబ్దరత్నాకరము:—

భోగి, బోగి:— సంక్రాన్తి పండుగకు తొలిదినము.

ప్రతి పండుగకు తొలి దినమునకు బోగియనిపేరున్నట్లు నేనెక్కడను విన లేదు. సంవత్సరాది దినమునకు తొలిరోజు కొత్తమావాస్య, దీపావళీకి తొలిరోజు నరక చతుర్దశి. కర్కాటక సంక్రమాణమునకు తొలిరో జాచరణముచేయరు. వినాయక చతుర్థికి లేదు. జంధ్యాల పౌర్ణమికి లేదు. గావున ఒక్క మకరసంక్రాన్తి పండుగకు తొలిరోజునకే బోగియని పేరున్నట్లు స్పష్టపడుచున్నది. ఆపేరు దానికెందుకు వచ్చింది?

ఈపండుగ ఎలాగు చేస్తారో మొదట మాతాము. తెల్లవారితే బోగి అనగా ఆసాయంకాలమునుండి కట్టెలు వీధిలో ఒక దగ్గర పోగు చేయడానికి ఆరంభిస్తారు. ఇంటింటవెళ్లి కట్టెలు యాచిస్తారు. ఇచ్చినవి తెచ్చి ఆచోట పోగుచేస్తారు. ఝామురాత్రివరకు కట్టెపుల్లలు పోగుచేసి అప్పుడు దానికి నిప్పుతగిలిస్తారు. అదిమొదలు

తూంటే చుట్టూకూర్చుని కథలు కబుర్లు చెప్పుకుంటూం టారు. నిద్రొస్తే అక్కడేపడుకుంటారు. అర్ధరాత్రిన ఈమంటవేశేవాళ్లులేచి పెరళ్లల్లోను జొరబడి దొరికిన దానినల్లా తెచ్చి మంటలో పడేస్తారు. దూలాలేమిటి, వాసాలేమిటి; ద్వారాలు, తలుపులు బల్లలు, బళ్లు; ఇవి అవి అని లేదు; పనికొస్తాయి పనికిరావని లేదు. ఇంటి వారు ఏమరచియుండగా ఆయింటిలో ఏమిదొరికి తే అదల్లా పట్టుకెళిపోచ్చి మంటలోపడేతురు. ఇట్లు పెద్ద మంట మండుతూంటే తెల్లవారుఝామున కుండలతో నీళ్లుతెచ్చి ఆమంటపై పెట్టియుంచుదురు. నీళ్లుకాగేసరికి ఆమంటతో సంబంధించినవారంతా ఆబాలగోపాలమున్ను తలంటుకుని ఆనీటితో అభ్యంగనముచేతురు. సూర్యోదయ మయేసరికి అంతా అభ్యంగనాలుచేసి కొత్తబట్టలు కట్టుకొనియుందురు. తర్వాత పిండివంటలతో భుజింతురు.

పైన జరిగించిన వాటిల్లోనల్లా ఒక్క ఆమంటకే 'భోగి' మంటయని పేరు. పోసుకున్న నీళ్లకుగాని, కట్టుకున్న బట్టలకుగాని, తిన్న శాల్యాన్నములకు గాని ఈపేరులేదు. ఆమంటకు భోగిమంటనడం ఏమా అని ఆలోచనపుట్టింది. ఫాల్గుణ పౌర్ణమినాడు వేశేమంటకు కామదహనం అంటారే గాని భోగి అనరు. ఈరెండుమార్లే తప్ప మరెప్పుడు మంటవెయ్యరు!

ఇలా గూహించుచుండగా, నాకు కోదుభాష నేర్చుకుందామనే సరదాపుట్టింది. మొదట ఈజాతివారి ఆచారవ్యవహారసాంప్రదాయములు గ్రహించుటకై ఇదివరకు ప్రచురమైన గ్రంథములు చదివాను. వీరు మధ్య పరగణాలలో గోండులని,గంజాం మాలయాలలో, కూయి కూవీలని, విశాఖపట్నం మాలయాలలో ఉత్తరమున కోందులని, నైరుతిప్రాంతమందు కోయాలని పేర్లతో నొప్పుచున్నట్లు బోధపడ్డది. వీరి ఆచారములు కొంచెం కొంచెం ఆయాదేశ విపరీతములచే మార్పు చెందినప్పటికి ముఖ్యమైన హంశములయందు మాత్రం సామాన్యముగానే యున్నవి. అలాగుననే భాషాపదములను కూడా. అందుచే ఈజాతులభాషలు అన్నీ సంపుటీకరించి చదువుతూ వారి యాచారములను కళ్లారా చూచి గ్రహించుటకు చుట్టుపట్లనున్న కోదుగ్రామాలకు వీలైనప్పుడల్లా వెళ్లియుంటిని.

వివాహప్రక్రియలు ఈ అయిదు జాతులవారికీ సామాన్యమే. సంవత్సరమునందు జరిపేపండుగలుకూడా సామాన్యములే. ముఖ్యమైనపండుగ పుష్య పున్నమ. ఈజాతులవారు ఎప్పుడు పండుగజేసుకున్నా పున్నమి నాడే. వీళ్లకు సంక్రమణాలు తెలియవు. సంక్రమణాలు కేవలం గణితంమీదివి. వీళ్లకు గణితంయొక్క జ్ఞానం వీళ్లకంతా దృగ్గణితమే. కళ్లకు కనిపిస్తుంది. చంద్రుని కళలు పెరగడం తరగడం, నక్షత్రాలూ కనిపిస్తాయి కళ్లకు. వీటిని రాత్రియందుచూచి యోగం మూర్తం పడిగడతారు. అందుచే పుష్యమాసంలో పున్నమే వాళ్లకు పండుగ, పెద్దపండుగ. చతుర్దసినాటి రాత్రి వాళ్లు భోగిచేస్తారు.

గ్రామంలో వాళ్లంతాకలసి కఱ్ఱ గంప జాగ్రత్త పెట్టి ఒక్కదగ్గర కూడవేస్తారు. దానికి నిప్పుతగిలించి అది మండుతూంటే నలుదిక్కులాపోయి దొరికిన దాని నల్లా ఎత్తుకొచ్చి అందులో పడవేస్తారు. కూరల పెరళ్ల లోను తోటలలోను జొరబడి గుమ్మడికాయలు, చిక్కుడుకాయలు మొదలైనవి తెంచుకొచ్చి మంటలో కాల్చుకుని తింటారు. ఆడపిల్లలు యింటింట పాటలుపాడుకుంటూవెళ్లి బియ్యం, మినుములు, ఉలవలు మొదలైనవి అడిగితెచ్చుకుని ఈమంటపై ఉడకపెట్టి తింటారు. ఇలాగు తెల్లవార్లు మంటవేస్తూ దానిచుట్టూ ఆడుకుంటూ సరదాగా ఉంటారు. మొగవాళ్లు డప్పులు, టమ్కాలు వాయిస్తూ యుంటే, ఆడవాళ్లు నాట్యంచేస్తారు. ఇదంతా ఆమంటచుట్టే.

ఈమంటకు 'భోగి' అని వాళ్ల భాషలో అంటారు. ఈమంటకేకాదు ఏమంటకైనా 'భోగి' అంటారు. మన తెనుగులో అసలుపదమును దాని తెనుగు అర్థమును కలిపి 'భోగిమంట' అంటాం. 'భోగి' లోంచి వచ్చిందే 'బొగ్గు.'

ఈ భోగివేయడపు ఆచారము సంక్రమణపు పండుగ నాచరించని ఓఢ్రులుసైతం మవలంబించియున్నారు.

ఇది కేవలము ద్రవిడజాతుల సాంప్రదాయకమువలె కన బడుచున్నది. ఈపదమునకున్న అర్థము కోదుజాతుల భాషయందున్నది. దానిఅర్థము 'పంట' అనియె.

[గొ. రామదాసు]

---

## వేణీసంహారమున నాయకుం డెవఁడు?

ఎవఁడు నాటకముయొక్క ప్రతియంకమునందుఁ బ్రవేశించునో, ఎవనిచరిత్ర నాటకమునందంతట వర్ణింపఁ బడునో, ఎవఁడు నాయికయొక్క సకలాభీష్టముల నెర వేర్చునో, ఎవఁడు ప్రతినాయకునితో యుద్ధమొనర్చునో, ఎవఁడు సమస్తపాత్రలలోఁ బ్రధానుఁడుగానుండి నాటక ప్రయోజనము ననుభవించునో, వాఁడే నాటకమున నాయకుఁ డనఁబడును. నాయకుఁడవ వానికే చెల్లును.

ఈనాటకమునఁ గొందఱు ధర్మరాజు నాయకుఁ డనియుఁ గొందఱు భీమునకు నాయకుఁడనియుఁ జెప్పు చున్నారు. ఈరెండు పక్షములలో రెండవ పక్షమే సముంజసముగానున్నది. ఎట్లన? ధర్మరాజుషష్ఠాంకము నందుమాత్రమే ప్రవేశించును. వేణీసంహారవిషయకమైన కథను బోషించుటకు ధర్మరా జేమియుఁ బనిచేయలేదు. ప్రతినాయకుఁడగు దుర్యోధనునితో యుద్ధముఁ జేయలేదు ద్రౌపదియొక్క కోరికలనేమియు నెరవేర్పలేదు. అది యునుంగాక, వీరరసప్రధానమగు నాటకములయందు నిర్వ క్రపరాక్రమసంపన్నుఁ డగు వీరరసప్రధానుఁడే నాయ కుఁడుగానుండవలయును. ఈనాటకమునం దెచ్చటను ధర్మరాజుయొక్క పరాక్రమము కొంచెముగూడవర్ణింపఁ బడలేదు. రంగమునే ప్రవేశింపనటువంటి ధర్మజుఁ డభి మానవతియగు ద్రౌపదియొక్క కోరికలనెట్లు నెరవేర్చును? ద్రౌపదియొక్క వేణీసంహారరూప మగు నభీష్టమును ధర్మరాజు నెరవేర్పలేదు.

ఇదియునుంగాక ధర్మరాజు ధీరోదాత్తుఁడనికూడ జెప్పుటకు వీలులేదు. ధర్మజుని ధీరోదాత్తత్వ మీనాటక మునం దెచ్చటను నిరూపింపఁబడలేదు. కాని తద్భంజక మగు చార్వాకుని ప్రసంగ మాఱవ యంకమున వర్ణింపఁ బడినది చార్వాకునిమాటలువిని ధర్మజుఁ డగ్నిగుండమునఁ బడి చచ్చుటకుఁ బ్రయత్నించును. ధీరోదాత్తుఁ డీవిధ ముగా నాత్మఘాతుకుఁడుగా నుండుట సంభవింపదు. నిర్వక్రపరాక్రమసహితుఁడుగాను, నిర్భయుఁడుగాను నుండును. సోదరులు మరణించినారని విన్నంతమాత్రమున ధీరోదాత్తుఁడగు నాయకుఁడు దానుకూడఁ జచ్చుటకుఁ బ్రయత్నించునా? ఎన్నటికిని జరుగదు.

ఇఁక భీమసేనుఁడన్నచో నైదంకములయందుఁ బ్రవేశించును. ఒక యంకమునందు మాత్రమే ప్రవేశింప లేదు. వేణీసంహారకారణమగు బీజ మితనిచేతనే చెప్పఁబడినది. మఱియు నితనిచేతనే వృద్ధిఁబొందింపఁ బడినది. తుదకు వేణీసంహారరూపమగు ప్రయోజనము గూడ భీమునిచేతనే కల్పింపఁబడినది. కనుక వేణీసంహా రమునకుఁ గర్త భీమసేనుఁడనియే చెప్పుట సమం జసము. ఈనాటకమునఁ బ్రధానభూతమగు వీరరసము నకు నితఁడే యాలంబనవిభావము. నాయిక యగు ద్రౌపదియొక్క సకలాభీష్టముల నితఁడే నెర వేర్చును. నాటకమునందంతట నితనిపరాక్రమమే వర్ణింపఁబడినది. వీరరసమునకు సహాయభూతమగు రౌద్రరసమునకుఁ గూడ నాశ్రయ మితఁడే. సకలకథాసంవిధానమునకు భీముఁడే సృష్టికర్త. ఈ రూపకముగూడఁ దుదకు భీమసేన సం బంధమగు భయంకర కర్మతోనే ముగింపఁబడినది.

కాని నాటకములో ధీరోదాత్తుఁడే నాయకుఁ డుగా నుండవలయునని చెప్పుటవలన భీమసేనుని విషయ ములో సంశయము గలుగుచున్నది. భీముఁడు ధీరోద్ధ తుఁడు. అయినప్పటికిని భీముని గురుజన వినయాదులు పంచమ, షష్ఠాంకములయందు స్పష్టమగుచున్నవి. కనుక ధీరోదాత్తగుణములు కొన్నింటినైన భీముఁడు గలిగియు న్నాఁడని చెప్పవచ్చును. బాగుగా విచారించిన ధీరో దాత్తత్వమను ముఖ్యగుణము భీమధర్మజులయం దిద్దఱి యందును గాన్పింపదు. ఒకవిధముగాఁ జూచిన "గ్రుడ్డి లో మెల్ల" యనునటు భీమసేనునియందే ధీరోదాత్తత్వగు ణము ఇంత గాన్పించుచున్నది. పూర్వోక్త ప్రకారముగా విచారించిన ధర్మజునియం దంతమాత్రముగూడ ధీరోదా త్తత్వ గుణములేదని చెప్పవచ్చును. ఆలంకారికులు గూడ

భీమునే నాయకునిగాఁ దలచుచున్నారు. పండితులు కూడఁ గొంతమంది భీముఁడే నాయకుఁడని చెప్పుచున్నారు. కనుక, వేణీసంహారమున భీముఁడే నాయకుఁడని నాయభిప్రాయము.

[జాస్తి నరసయ్య.]

---

## భారతదేశమునందలి కొన్ని ప్రకృతిదృశ్యములు

### ౧. బర్మాదేశమునందలి కొండలు

ఈదృశ్యముల చిత్రములు సంచికయందు చేర్పబడినవి. వానివివర మీక్రింద నున్నది.

బర్మాదేశమున కొండ లెక్కువ. సాధారణముగ నెక్కడజూచినను కన్పించును. వట్టికొండలేకాదు. వందల కొలదిమైళ్లదూరము ఎడతెగక సాగుచున్న పర్వతపంక్తులు; ఇట్టి కొండవరుసల మూలమున నచ్చట వాటితోబాటుగ వందలకొలదిమైళ్ల దూరము వ్యాపించియుండు లోయలుగూడ నేర్పడినవి. ఇట్టి ప్రతిలోయలోను ఒకనది, లేకున్న వాగు. ఉత్తర దక్షిణ దిశలలో కొండల వరుసలు పోవుచుండును. వానినడుమ లోయలు. మొత్తముమీద కొండల యెత్తు ౫౦౦౦ అడుగులకు లోబడియే యుండును. ఇట్టి లోయలను దాటుటకు త్రాటి వంతెనలు నిర్మింపబడును వాని ననుసరించియే, చేతికాధారముగ నొక సన్నని త్రాడుఁగూడ నుండును. కొన్ని కొన్ని చోట్ల జంతువులను, బండ్లను దాటించుటకు బల్లవంతెన లుండును. త్రాటివంతెనపై బల్లచెక్కలను బిఱిమటచే నీబల్ల వంతెన లేర్పడును. బర్మాలో ఇట్టి వంతెనల యావశ్యకత మెండుగ నుండుటచే, వానిని నిర్మించు నిపుణులుగూడ ప్రత్యేకముగ నచ్చట గలరు. ఈ రెండు రకముల వంతెనలును ఎప్పటి కప్పుడు తీసివేయుట కనుకూలమైనవే. ఇందున్న ఈబొమ్మలో నట్టి సగమునిర్మింపబడిన బల్లవంతెన నొకదానిని గాననగును.

### ౨. చలికాలములో క్వెట్టానగరము

క్వెట్టా నగరము కిర్తారు పర్వతముల ఉత్తరపు చివరనున్నది. ఇది భారతదేశమునకు పశ్చిమోత్తరద్వారముగ నుండుటచే మంచి కట్టుదిట్టములు గలిగియుండుట భారతదేశమున నింగ్లీషువారి కిది ముఖ్యమైన సైనికస్థానము. ఇచ్చట ఎండకాలములో విపరీతముగ నెండలు; శీతకాలములో చెప్ప నలవికానిచలి. చలికాలములో క్వెట్టానగర మెట్లుండునో ఇందున్న యీబొమ్మ తెలియజేయుచున్నది.

### 3. తాజ్‌మహల్

టాజ్‌మహలును గూర్చి క్రొత్తగ నిందు చెప్పబనిలేదు. ఆగ్రాలోని 'పెరల్' మసీదు 'జాస్మిన్' శిఖరమునుండి తాజ్‌మహల్ మనోహరదృశ్యము ఇందుగల చిత్రమున జూపబడినది.

### ౪. మౌలాఆలీ కొండ

ఈ కొండ హైదరాబాదు నగరపు (దక్కను) సరిహద్దులో నున్నది. దీనిపై మహమద్ అల్లీపను ఆలీ అంకితముగ నిర్మింపబడిన మసీదొకటి కలదు. అతి కష్టముతో కొండ శిఖరమునకు మెట్లు కట్టబడినవి. ఈమెట్లపై నుండి చూచినచో హైదరాబాదు నగరపు సౌందర్యము మహోన్నతములగు తన దివ్యభవనములతో స్పష్టముగ గానవచ్చుచుండును.

### ౫. ఉదకమండలములోని ప్రసిద్ధమగు ఓషధీవనము

౭౩౬౧ అడుగుల యెత్తున నీలగిరి కొండలపై నున్న ఉదకమండలము ప్రకృతిసౌందర్యములకు, సహరమనోహరములగు తరుదృశ్యములకు మిగుల పేరందిన చోటు. ఈ తోటచిత్రము అచటి రామణీయకమును స్పష్టపరచుచున్నది.

### ౬. కోటప్పకొండ

ఇది గుంటూరుజిల్లా నరసారావుపేట తాలూకాలో నున్నది. ఇది యొక పుణ్యక్షేత్రము. ఈ పర్వతదృశ్యము రమణీయముగ నుండును.

### ౭. పడమటికనుమలలో నొక దృశ్యము

ఇచటి ప్రకృతిసౌందర్యము దర్శనీయము. అనన్యవైకవేద్యము.

## ఖడ్గతిక్కనా ?



నెల్లూరు పురమునకు పడమర నలువదియైదు మైళ్లదూరమున అనగా కడప నెల్లూరు మండలముల సరిహద్దున సోమశిల, లేక సోమేశ్వరము అను పేరుగల పుణ్యక్షేత్ర మొకటి కలదు. కడప మండలమునుండి తూర్పుకనుమలను దాటి నెల్లూరు మండలములోనికి ప్రవహించుచున్న పినాకినీనది (అపరగంగ) యీ క్షేత్రము నానుకొని యున్నది. దాని యొడ్డుననే శ్రీసోమేశ్వరుని దేవాలయము గలదు. అది మిగుల పురాతనమని ప్రతీతి. ఆలయమంత పెద్దది గాదు. దాని యందును, తత్పరిసరములయందును శిల్పమైన పుణ్యమంతగా గానిపింపదు కాని ప్రశాంతమగు ప్రకృతి యా దేవుని సేవింప బోవు యాత్రికులను హృదయానందమును, శాంతిని సమకూర్పజాలిన అకృత్రిమసౌందర్యముతో నలరారుచున్నది. అచ్చట దేవాలయము ముందర నున్న మంటపమునకు రెండు వైపుల రెండు శిలావిగ్రహము లున్నవి. రెండడుగులు ఎత్తు రెండడుగులు వెడలుపుగల నల్లరాతిబండలపై నవి చెక్కబడియున్నవి. భారతీయవీరు డొకడు గుఱ్ఱముపై నెక్కి కుడిచేత కత్తినెత్తి పట్టుకొని ఎడమచేత కళ్లెమును పట్టుకొని యుద్ధమునకు కాబోలు వేగముగ పోవుచున్నట్లు చెక్కబడి యున్నది. రౌతునకు, గుఱ్ఱమునకు పెక్కు అలంకారము లున్నవి. ఏకారణముననో ముఖము బ్రద్దలయి రౌతు బొమ్మ విరూపమును జెందినది. కాటమరాజుతో యుద్ధము గావింపబోవుచున్న ఖడ్గతిక్కన విగ్రహమట యిది. ఈ నానుడిని రూఢిపరుచు ఇతరప్రమాణము లేవియు అక్కడ కానరావు. ఇది యా విగ్రహము యొక్క ప్రతికృతి. ఈ ప్రతిమ లిక్కడికేల, ఎట్లు, ఎప్పుడు చేరినవో తెలియరాదు. చరిత్ర పరిశోధకులు దీని తత్త్వము నారసి ప్రకటింతురు గాక.

---

## బెర్నార్డ్ షాగారితో సమావేశము

బెర్నార్డుషా జెనివా కరిగినపుడు పెక్కుమంది పత్రికావిలేఖరు లాతని దర్శనమును కోరిరి. ఒకసారి నోబెలు బహుమానమును నిరాకరించిన యాతఁడు తన దర్శనమున కమితమగు ఖరీదు నేర్పఱచెను. ఎట్టిప్రమేయము నిచ్చినను ఆతఁ డుపన్యాసమును నొసంగఁడు. కాని అంతర్జాతీయవిద్యాసమ్మేళనమువారు (International Students' Union) 'టీపార్టీ' కను విమచేనాతని దర్శనలాభమును బడసిరి.

ఆమేధావి మృదువైన తెల్లగడ్డముతోను, తేజఃస్ఫురితములగు నేత్రములతోను కట్టుకట్టిన బెణకిన చేతితోను,

తెల్లని మీగడవంటి శరీరముతోను ద్వారసమీపమున ప్రత్యక్షమగు సరికి, అమితోత్సాహముతోను అనేకులు కెమెరాలతో ఫోటో తీయుచుండ లోని కాహ్వానింపబడి యెను. ప్రొఫెసరు మాడరియగా బెర్నార్డుషాను సుఖాసీను గావించి "తమ దర్శనముకొఱకు గంభీరహృదయము లగు కొందఱు విద్యార్థులు వేచియున్నా"రనెను. అందుల కతడు తానెఱింగిన విద్యార్థులలో చాలమంది గంభీర హృదయులు కారని చెప్పెను. మఱియు తానాహ్వానింపబడిన ట్రీప్రయత్నము లేవియు కనిపించుట లేదనియు, తానందుల కొకింతయైన విచారింప ననియు అనివార్యము లగు నా విద్యార్థుల ప్రశ్నములకు తనకు తెలిసినంతవఱకు సదుత్తరముల సంతోషముతో నీయ బ్రయత్నించుననియు దెలిపెను.

ప్రశ్న. "తెలివితేటలుగల స్త్రీ అనగా నేమి?"

షా:—ఈమధ్య నేను వ్రాసిన 'The Intelli. gent woman's guide to Socialism and Capitalism' అను గ్రంథమును చదివినస్త్రీ. ఆగ్రంథము వెల 15 షిల్లింగులు.

ప్ర. "మానవకోటిపై మీకు విశ్వాసము లేదను మాట నిజమేనా?"

షా. మానవకోటిపయిన నెప్పుడైన నొకప్పుడు నాకు విశ్వాస ముండెనని యెవరు చెప్పిరి? అది యెల్లప్పుడును మారిపోవు చుండును. చరిత్ర ఆరేడు విధముల నాగరికత లుండెననియు, నవియన్నియు నశించి పోయెననియు తెలుపుచున్నది. అన్నియు మననాగరికత వలెనే అభివృద్ధిలోనికి వచ్చి మానవకోటియందలి మార్పులవలననే యంతమొందెను. మనము కూడ నట్లు కాకుండుట కేకారణమును గోచరించుట లేదు. అట్లు జరుగు సూచనలే కనబడుచున్నవి.

ఒకవిద్యార్థి:—అయితే ఈనాగరికత నశించిపోకుండ మన మేమియు చేయజాలమా?

షా:—మన మేమి చేయవలసినది నానాజాతి సమితి తెలుపుచున్నది. దానిని గురించి నేనను నాగ్రంథములందు వ్రాసినాను. కాని ఎవ్వరును ఆసమితి చెప్పినది వినరు; నాగ్రంథములును కొని చదువరు. ఎట్లయినను ఆధునికమానవకోటి నేటి సృష్టియొక్క తుదిమెట్టు కాదు. మనము దానికిలొంగిపోయినచో జీవితశక్తి యింతకంటె ఎక్కువమేలుకలుగజేయు సమయమును శీఘ్రము సమీపింపజేయునని తెలిసికొని యుండుట సంగతము.

మూడవవిద్యార్థి:—లీగ్ ఆఫ్ నేషన్సునుగురించి మీరేమి తలచెదరు?

షా:—నాటకరచయితగా రంగనిర్మాణమున నాకు మిక్కిలి యభిమానముగలదు. కొంతమంది పెద్దమనుష్యు లుపన్యసించు వేదిక నాలోకింతుము. కాని వా రుపన్యసించు విషయముల నెవ్వరును కొంచమైన వినుటకు శ్రద్ధవహింపరు ఏలన, వారేమి యుపన్యసింప నింటివద్దనుండి బోధింపబడిపంపబడిరో, యంతకు మించి యొకవాక్యమైన పలుకరు. గతదినము బ్రియాండు మాత్రము నాలుకజారి యథార్థములగు విషయముల [illegible]రించెను. రంగస్థలాధికారి యనుభవముతో మీకొక రహస్యమును తెలిపెదను. ఉపన్యాసవేదిక వెనుకనున్న తె[illegible] మాత్రము అమోఘమైన ప్రయోజనము గలిగియున్న[illegible] కార్యదర్శి కార్యాలయమున నుండు కొంతలు దానిని[illegible] సద్వినియోగ మొనరింపవలెనో తెలిసికొని యున్నా[illegible] దీర్ఘోపన్యాస మిక కొంతసేపటికి సంపూర్ణమగు సమయమున కార్యదర్శి కార్యాలయమున నుండు యొక[illegible] నూతన వస్త్రాలంకృతయై మనోహరగమనమున ఆయ[illegible] కొంతరమునుండి యరుదెంచి యొకచో నాసీనయగును. సభాసదులందఱు నామెనుజూచి యుపన్యాసము నా[illegible]కింతురు. ఉపన్యాసకుడును సభాసదులదృష్టి నాకర్షిం[illegible] నందుకు తనను తా నభినందించుకొనును.

ప్ర. "మానవజాతినభివృద్ధిచేయుట సంభవమగునా?"

షా:—మనముకోరిన మాదిరి మానవుల నుద్భవింప జేయుట సాధ్యమగునా యను విషయ మెఱుంగుటయే ముఖ్యమే. లండనులో నొకప్పు డీవిషయమును గూర్చి సంభాషించుచున్నపు డొకస్త్రీవచ్చి, 'అట్టి విషయము లనుగుఱించి సంభాషించుట భావ్యముకా'దనెను. మీరా అశ్వశిక్షణము నొకింత తెలిసికొనియున్నవా [illegible]

ప్రత్యేకముగా నొకగుణ్ణమును మామూలుగా పనిచేయునట్టిదిగా గాని, పండెపు గుణ్ణముగాగాని సమగ్రసౌష్ఠవముతో తయారుచేయుట కష్టతరమని యెఱుంగుదురు. దానియొక్క ప్రవర్తనను, ఆత్మనుగుణించి మన మేమియు లెక్కచేయము. అట్లే ఏమాదిరిమనుష్యుని, లేక ముఖ్యముగా, ఏమాదిరిస్త్రీని, మనము తయారుచేయగోరెదము? మూర్ఛ, రోగము లేనట్టియు, త్రాగుబోతులు కానట్టియు మంచిమనుష్యుల తయారుచేయగోరెదమని చెప్పుదుము. కాని ప్రతి పర్యాయమును ప్రపంచమున నిక్కముగా నొక మంచిమనుజుం దుష్ప్రవర్తించినప్పుడు మనము వానిని చంపివేయుచుంటిమి. ఈ విషయమున మనల తరుచుగా కాపాడగలిగినది స్త్రీ పురుషుల సరిగా నెంచుకొనుటయే యైయున్నది. ఇపుడు మీరు జెనివావీథులందు నడచినచో ఆకర్షణశక్తిగల యౌవనవతుల పెక్కురను కన్గొనెదరు. కాని వారిలో నెవరిచేతను మీరు ప్రత్యేకముగా నాకర్షింపబడకపోవచ్చును. తుదకు శరీరసౌష్ఠవము చేతను, ధీవిశేషముచేతను నిమ్మాకర్షింపగల యొకయువతిని మీరు కలిసికొనవచ్చును. కాని ధీవిశేషమునకు సంబంధించినంతవఱకు బహుశః మీరు పొరబడినవారే యగుదురు.

[జొ. వేం. రా.]

---

హరప్ప, మోహెంజోదారోలలో
దొరకినముద్రలు

అమెరికన్ ఓరియంటల్ సొసైటీ నాలుగవ సమావేశమందు 'సుమేరియను ముద్రల' విషయమై ప్రొఫెసరు ఎర్టన్, ప్రొఫెసరు మైకెల్సన్, ప్రొఫెసరు డంకన్‌గారిట్లు చెప్పిరి.

"హరప్పా, మొహెంజోదారోలలో దొరకిన ముప్పదిరెండు ముద్రలను, సుమేరియన్ హిట్టయిటు. ఇజిప్షన్, ఈలమైట్, చైనా, క్రీట్, క్రైఫ్రిమోట్ అక్షరములతో సరిపెట్టి పరిశీలించితిమి. అందు వలన మాకు దోచినదేమంటే, కొన్ని యక్షరములు, మొత్తము మీద నొక శాసన మనుకొండి, సుమేరియనుదై యుండు నేమో? మాకు కనిపించిన నిదర్శనముల వలన హరప్పా, మొహెంజదారో ముద్రలయందలి లిపి యితరదేశలిపులసంపర్కము లేకుండా స్వదేశజన్యమైనదని వక్కాణింపగలము"

[గో. రామదాసు.]

---



శ్రీ యశ్వంతసింహ గారు

వింధ్య సాత్పుర హిమాలయ పర్వతప్రదేశముల యందును, పసుమర కనుమలయందును వీరు ఈవేషమున నే సంచారమును చేసిరి. వీరు శరీరవ్యాయామపాఠశాల నొకదానిని గుంటూరున స్థాపించిరి. ప్రజల శరీరవ్యాయామాభివృద్ధికొఱకు వీరు చాల పాటుపడుచున్నారు.

[చ. జ.]

---

## ఆంధ్రభాషా స్వాతంత్ర్యము

అమెరికన్ ఓరియంటల్ సొసైటీ నూటయైదవ సమావేశమందు తెలుగు లేక యాంధ్రభాష యొక్క స్వాతంత్రతను స్థిరపరచుటకు పరికరము జాగ్రత్త పెట్టవలెనని రివరెండు డాక్టరు లీమర్ గారిట్లు చెప్పిరి.

క్రీ. పూ. ౧౧౦౦ సం. ములనాటి తెలుగు లేక యాంధ్రభాష చిహ్నములు: ఆయుగమునందు రెండువిధములైన మనోభావముల విషయమైన పరికరములు:—దైవ సంబంధమైనవి, కాలసంబంధమైనవి. తెలుగుభాషనంతను బరిశీలించుటకు ప్రస్తుతము వాడుకలోనున్న వాఙ్మయమును వెదకివెదకి, అట్టిపదములను సంగ్రహించి, యందుండి మూడువేల సంవత్సరముల యీలోపున జేరిన పదములను విసర్జించవలెను. అప్పుడు క్రీ.పూ.౧౦౦౦ సం.లకుపూర్వ మాంధ్రు లుపయోగించు మాటలు లభ్యమగును. దైవసంబంధమైనట్టిన్ని, కాలసంబంధమైనట్టిన్ని, కాలము కాలభాగములతో సంబంధించినట్టిన్ని వస్తువులకు భావములకు నుపయోగించు పదములను బరిశీలించి విభజనచేసిన యిరోపియనులు, మహమ్మదీయులు, నార్యులు రాకపూర్వము పరలోకసంబంధమైనట్టిని, దినములు, మాసములు, సంవత్సరములవిషయమైన జ్ఞానమాంధ్రులకు విశేషమా,స్వల్పమా,ప్రదేశమాత్రమా లేక లోకసామాన్యమా యనుహంశమువెల్లడిగలదు."

ఈమార్గము ననుసరించి పనిచేసిన మనతెనుగు వాఙ్మయస్వాతంత్ర్యమును స్థిరపరుచగలమని నేనును దలంచెదగాని యిట్టిపని విద్వాంసులుసమకట్టుకునిచేయవలెను.

[గొ. రామదాసు.]

## పండితుడు

నిత్యహిందూ ౧౪-౨-౨౯ నాటిదానిలో "అగస్త్యగాథలు: సంస్కృతము, తమిళగ్రంథములలోనివి" యను చిరునామాతో సంపాదకుని లేఖలలో ముద్రించి యున్నది. దాని యుపోద్ఘాత మిట్లు వ్రాసియున్నది.

"పండితు డనగా తన యిష్టమైన భాషయందు—సంస్కృతమేగాని, లేదా విశేష గ్రంథములుగల దేశభాషయేగాని,— పరిపూర్ణజ్ఞానమును సంపాదించిన వాడని యర్థము—గాని యీకాలమందు విపరీతార్థ మొకటి దానినంటుకుపోవుచున్నది. ఏమంటే, పూర్వకాలసంబంధమైన వాటియందుండుకునే గౌరవము ప్రబలమై, తాను చదివిన గాథలను విచక్షణలేకుండా నమ్మినవారని, అపూర్వకాలము నిన్నటిదేగాని, వెయ్యిసంవత్సరము క్రిందటిదిగాని, పండితుడన్నవాడు, మనిషి కుండుకున్న స్వతంత్ర విచారణ లేకుండా, దాని నతిభయభక్తులతో నంగీకరించును. ఇంతేగాదు; పూర్వపు పురాణములైతే చాలు; ఒకదాని కొకటి విరుద్ధముగా నుండినప్పటికి పండితుడని పించుకున్నవారు వాటి నొప్పుకొనును. ఒకగాథకు మరి యొకగాథకు విరోధమున్నయెడల నది విరోధముగాక సమర్థింపజూచును. అది చేతగానప్పుడు రెండింటిని సహించి తనబుద్ధియే మందమని యొప్పుకొనును".

నిజమైన పాండిత్యమంటే యిదియే — అగపడుచున్న వస్తు వసత్యమని. కనిపించినదే సత్యమని నమ్మినవారేగదా పండితులు! ఆలాగునే తనబుద్ధి కగుబడుచున్న విరోధము నిజముగా నక్కడలేదు. ఆరెండిటియొక్క సత్యము తాను చూడలేదు, గాన తనబుద్ధిమాంద్యమే యది. అట్లు తనను దాను తెలియగలుగుచున్నాడు. అతనే నిజమైన పండితుడు! [గొ. రామదాసు]



ఈమె దివాన్ బహదూర్ టి. రంగాచారిగారి సతీమణి. స్త్రీలయభివృద్ధిగూర్చిమిగులపాటుబడుచు మదరాస్ లేడీస్ క్లబ్ ను స్థాపించినది. తరువాత నీక్లబ్ విల్లింగ్డన్ క్లబ్ తో చేర్పబడెను. ఈమె తన 58వ యేట ఫిబ్రవరి మొదటివారమున చెన్నపురియందు దివంగతురాలయ్యెను.



అధ్యక్షులు : భారతీయ విజ్ఞానశాస్త్ర (Science) మహాసభలు-చెన్నపురి.

౧. డాక్టరు సిరీల్ యస్. ఫాస్సగారు, భూతత్త్వశాస్త్ర శాఖాధ్యక్షుడు. ౨. యస్. యార్. బోసుపండితుడు, గణిత, భౌతిక శాస్త్ర శాఖాధ్యక్షుడు. 3. కే. సి. మెహతా పండితుడు, వృక్షశాస్త్రశాఖాధ్యక్షుడు. ౪. రామను పండితుడు, విజ్ఞానశాస్త్ర మహాసభాధ్యక్షుడు. ౫. ముఖర్జీ పండితుడు, రసాయనశాస్త్ర శాఖాధ్యక్షుడు. ౬. జి.యల్.సి. హొవర్డుసతి, వ్యవసాయశాఖాధ్యక్షురాలు. ౭. లెప్టనెంటు కర్నల్ ఆర్. ఇ. రైటుగారు, వైద్య, పశువైద్యశాఖాధ్యక్షుడు. (టైమ్సు ఆఫ్ ఇండియానుండి)



ఉమాపరిణయము

[శ్రీ వరదా వెంకటరత్నముగారు (రాజమండ్రి) రచించిన వర్ణ చిత్రమునుండి.]

## విచిత్ర గుణకారము

"రెండొహాట్లు రెండూ" అని మొదలెట్టి "పదహారు పదహార్లు రెండువందలేభైయారూ" అన్న ముక్క కంఠతా వచ్చేటప్పటికి మనపిల్లలు లెక్కలలో ప్రైపాస్ పరీక్ష గెలిచినట్లు సంతోషిస్తారు. ఈక్రింద చూపిన గుణకారపు పద్ధతిచూస్తే యిహవాళ్ల ఆనందము చెప్పనలెనా? ముఖ్యముగా యెస్టిమేట్లు, ఇంజనీరింగు కొలతలు మొదలైనవాట్లలో వచ్చు పెద్దపెద్ద గుణకారముల కిది బాగా పనికివచ్చును. (లండను నుండి వచ్చు "ఎంజినీరు" అను వారపత్రికనుండి గ్రహించినది.)

ఉదా:— 12345
67893
838139085

గబగబ అంకెలు వేయవలసినదే. ఇహ మనసులో (నోటిని) నడవ్వలసిన తంతు.

"స్థానమందున్న"
1
5
9 (సరిచూచుకొనుటకు
10 తప్ప ఈ అంకెలు
11 కూడా వ్రాయవలె
8 సిన పనిలేదు.)
4
2

| | | లబ్ధము | స్థాన మందున |
|---|---|---|---|
| $3 \times 5$ | = 15 | 5 ఒ. | 1 ప. |
| $1 + 4 \times 3 + 9 \times 5$ | = 58 | 8 ప. | 5 వం. |
| $5 + 3 \times 3 + 8 \times 5 + 4 \times 9$ | = 90 | 0 వం. | 9 వే. |
| $9 + 2 \times 3 + 7 \times 5 + 3 \times 9 + 8 \times 4$ | = 109 | 9 వే. | 10 ప. వే. |
| $10 + 1 \times 3 + 6 \times 5 + 2 \times 9 + 7 \times 4 + 3 \times 8$ | = 113 | 3 పవే. | 11 ల. |
| $11 + 1 \times 9 + 6 \times 4 + 2 \times 8 + 3 \times 7$ | = 81 | 1 ల. | 8 ప. ల. |
| $8 + 1 \times 8 + 6 \times 3 + 2 \times 7$ | = 48 | 8 ప. ల. | 4 కో. |
| $4 + 1 \times 7 + 2 \times 6$ | = 23 | 3 కో. | 2 ప. కో. |
| $2 + 1 \times 6$ | = 8 | 8 ప. కో. | — |

| కిటుకు | లబ్ధము | స్థానమందున |
|---|---|---|
| ఒకట్లు × ఒకట్లు | = ఒకట్లు | పదులు. |
| ఒ × ప + ప × ఒ | = పదులు | వందలు |
| వం × ఒ + ఒ × వం + ప × ప | = వందలు | వేలు |
| ఒ × వే + వే × ఒ + వం × ప + ప × వం | = వేలు | పదివేలు |

ఇదేమోస్తరు పైస్థానములకున్ను. మనోవేగాన్ని నడిచే తంతు వ్రాతను బట్టి గణించకూడదు. దీనినే మనస్సుకు పట్టిపోవునట్లు బొమ్మగా చూపవచ్చును. చుక్కలే అంకెలు.

ఒ—స్థా: ప.

ప—స్థా: వం.

వం—స్థా: వే

వే—స్థా: ప. వే.

ప. వే—స్థా: ల.

ల—స్థా: ప. ల

ప. ల—స్థా: కో

కో—స్థా: ప. కో

ప. కో

గీతలతో చేర్చిన అంకెలను జోడుజోడుగా గుణించి కలిపి స్థానమందున అంకెను పైస్థానపు లబ్ధమునకు (మొదటనే) కలుపుకొనవలెను.

డెసిమల్సు (దశాంకములు) ఉన్నా సున్నలున్నా ఏమీ తేడాలేదు. పాయింటు లబ్ధములో మామూలుగా ఎక్కడ పెట్టెదమో అక్కడనే పెట్టవలెను. సున్న మాట: $4 \times 0=0$; $0 \times 6=$సున్న: ఒకసంఖ్యకంటె ఒక సంఖ్యలో తక్కువ అంకెలు (స్థానములు) ఉంటే (ఉదా. 98765 / % 583) అర్థంలేనిచుక్కలుగాని సున్నలుగాని ఎడమపక్కను నింపి, పైపద్ధతినే గుణించవలెను.

నాలుగు లెక్కలు చేసేటప్పటికి తప్పులంటూ రానేరావు. తప్పులొచ్చేవారికి మామూలు గుణకారంలోనూ వస్తాయి ఎక్కాలురాకా, అంకెలు ఒకదాని కింద ఒకటి వరస తప్పకుండా, ఒకొక్కస్థానము విడుస్తూ వేయడంలోను, కూడ్డంలోనూ కూడికలో స్థానమందున అంకెలు కలుపుకోడంలోనూను.

[కొ. సోమయాజులు.]

---

## పాఠశాలలు-తెలుగు వాచకములు

ఈనాడు పాఠశాలలలో దేశభాషలను (మనకు) తెలుగును-నేర్పుట సన్నగిల్లినది. ఉన్న కొంచమునకు సారదూరములయిన పుస్తకములే ఎక్కువగ గతియగుచున్నవి. చిన్న తరగతుల పిల్లల సంగతి మఱియు చెప్పనక్కరలేదు. నేనునేనని 'వాచకము' లను 'కథ'లను వ్రాయువారు వేనవేలుగ కనబడుచున్నారు. కాని రచనములను బట్టి చూచినచో వారికిది తలకుమిగిలినపని యని తోపకపోదు. పై వ్రాతలను ముద్రించి ప్రకటించువారును పెక్కురు బయలుదేరుచున్నారు. పుస్తకములలోని విషయము చాలవరకు పిల్లల కందక పొందకయుండును. రచనయు నించుమించుగ కొరకరానిది. మీదుమిక్కిలి దోషభూయిష్ఠము. ఈ పుస్తకములను చదివినబాలురు గట్టిపునాది అమరకపోవుటవలన తమ మనోగత భావములను ఇతరులకు తెలియునట్లు నాలుగు మాటల నొక్కటిగా జేర్చి సరిగా వ్రాయలేక యుక్కిరిబిక్కిరి యగుచున్నారు. ఇక నిట్టిపుస్తక సృష్టికి ప్రయోజనము? గ్రంథకర్తలయు, ప్రకాశకులయు స్వార్థసంపాదనమనదగును.

పాఠశాలలలో చదువవదగిన పుస్తకముల నొక సంఘము (తామేర్పరిచినది) నిర్ణయించవలెనని ప్రభుత్వపువిద్యాశాఖవారు శాసించి యున్నారు. ఈసంఘము నిర్ణయింపని పుస్తకములను పాఠశాలలు కన్నెత్తియైనను చూచుట మహాపరాధమగుచున్నది. ఈ సంఘము యొక్క నిర్మాణమును సామర్థ్యమును పుస్తక నిర్ణయపద్ధతిని గురించి వేరుగ చర్చింపవలసి యున్నది. సంఘము నిర్ణయించిన యా పుస్తకములలోనైన నాయా తరగతులకు తగిన పుస్తకముల నేరుకొనుటయందు పాఠశాలల అధికారులు తమకు గల బాధ్యతను పరిగణింపక స్వసౌకర్యములను చూచుకొను చుందురు. ఇన్నిటివలన కలుగు ఫలితము మన పిల్లలకు చదువు కల్లయగుట.

భావికాలమున పౌరప్రముఖులై వెలయనున్న మనయీనాటి చిన్నికుఱ్ఱల నాధారముగా గోరియున్నది మన దేశాభివృద్ధి. ఆ కుఱ్ఱల యభివృద్ధి వారికి నేడు మనము సమ

కూర్చు విద్యాసంపదపైననే మూడువంతుల వరకు నిలిచియున్నది. సత్యమిట్టిదికాగా, ఇందుకు విపరీతముగ జరుగుచుండ నివారణమార్గముల నరయక నోళ్లు దెరచుకొని చూచుచున్నారు బాలకుల పాలకులు! ఎంత ప్రమాదము! చేయి కాలిపోయిన పిదప ఆకుల కొరకు అడవికి అంచెకూలీలను పంపుదురు కాబోలు!

---

## ప్రొఫెసరు డి. కె. కార్వేగారు

వీరు పూనాయందలి భారత మహిళా విశ్వ విద్యాలయ సంస్థాపకులు, సుప్రసిద్ధసంస్కర్తలు, సంఘసేవాతత్పరులు. వీరీ మధ్య ఆంధ్రదేశమం దనేకచోట్ల శ్రీవిద్యనుగూర్చి యుపన్యసించి యుండిరి. ఇపుడు దక్షిణదేశమున సంచారము చేయనచ్చిరి. మదరాసునం దుపన్యాసముల నొసగుచున్నారు.



---



సంయుక్తాదేవి పృథ్వీరాజున కంపిన అంతిమ సందేశము

[శ్రీ ది. బుచ్చికృష్ణమ్మగారు (రాజమండ్రి) రచించిన వర్ణ చిత్రమునుండి]

---

# ౪౩-వ భారతజాతీయమహాసభ, కలకత్తా-తీర్మానములు



పండిత మోతీలాల్ నెహ్రూగారు
అధ్యక్షులు

## ౧

### మహానాయకుల మరణమునకు సానుభూతి

జాతీయ మహాసభాధ్యక్షులును సుప్రసిద్ధ భారత నాయకులును అగు శ్రీయుత లాలా లజపతిరాయి, హకీం అజ్మలుఖాన్, సింహాప్రభువుల మరణమునకై విషాదమును, తత్కుటుంబములకు సానుభూతియు దెల్పు తీర్మానము జాతీయ మహాసభాధ్యక్షునిచే ప్రతిపాదింపబడెను. సభికులందరు భక్తిపురస్సరముగా నిలుచబడి తీర్మానము నామోదించిరి.

## ౨

### కాంగ్రెస్ విదేశీయశాఖలు

నూతనముగా లండన్ న్యూయార్కు నగరములయందు స్థాపింపబడిన కాంగ్రెస్ శాఖలను అంగీకరించుచు జవాహర్లాలు నెహ్రూగారు తీర్మానము నుపపాదించిరి. గోవాకాంగ్రెస్ సంఘమును కూడ కాంగ్రెస్‌వారొప్పుకొనిరి. ఆయా దేశములలో నింకను కాంగ్రెస్‌సంస్థలను స్థాపించి ప్రచారము చేయవలసినదని తీర్మానము కోరెను. కోబ్ కాంగ్రెస్ సంఘమువారి దరఖాస్తును విచారింపవలెనని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారిని తీర్మానము కోరినది.

## ౩

### అస్వతంత్రజాతులతో సంబంధము

సామ్రాజ్య నిరంకుశత్వమునకు లోబడి అనేక విధముల ఇబ్బందుల నొందుచున్న అస్వతంత్రజాతులతో మైత్రిచేసికొనవలెనని మూడవతీర్మానము కోరెను. మరియు ఈవిషయమై వ్యవహారము జరుపుటకు విదేశాంగశాఖ స్థాపించవలెనని కూడ తీర్మానము కోరెను.

## ౪

### యుద్ధ భయము

మద్రాస్ కాంగ్రెస్ మహాసభవారు యుద్ధభయమును గురించి యామోదించిన తీర్మానమును ఈసభవారు మరల నామోదించుచున్నారు. మరియు ప్రస్తుత భారత ప్రభుత్వము భారతీయుల యభిప్రాయమును సూచించినదనియు, భారతదేశముయొక్క సరిహద్దులను రక్షించుటకుగాక భారతదేశమును తన యధీనమునను౦చుటకే యాంగ్లేయరాజనీతి యేర్పడియున్నదనియు ఈమహాసభవారు తలచుచున్నారు. ఇరుగుపొరుగు రాజ్యములతో గాని ప్రపంచములోనే యితర రాజ్యములతోగాని భారతీయు

లకు తగాదా లేదనియు, సామ్రాజ్యకాంక్షుకై ఆంగ్లేయులు భారతీయుల కనర్థదాయకముగా ప్రవర్తించుటకు భారతీయు లొప్పుకొనరనియు, ఈసభవారు ప్రకటించుచున్నారు.

## ౫

## బ్రిటిష్ వస్తు బహిష్కరణము

విదేశవస్త్రములను, విదేశవస్తువులను బహిష్కరింపవలెనను తీర్మానము సభలో నత్యధిక సంఖ్యాకులచే నామోదింప బడెను.

## ౬

## బార్డోలి సర్దారు నభినందించుట

బార్డోలీ సత్యాగ్రహోద్యమమును కడుసమర్థతతో నడపి విజయలక్ష్మిని చూరగొనిన ధీరుడు బార్డోలీ సర్దారుగారి నభినందించు తీర్మానము సభికులచే నుత్సాహపూర్వకముగా నంగీకరింపబడెను.

## ౭

## ప్రభుత్వగౌరవముల నిరాకరణ

విజాతీయ పరిపాలనమును బలపరచి విదేశీయ ప్రభుత్వమును వారి యుద్యోగీయులను గౌరవించుటకొసంగబడు విందులు మొదలగువానికి వెళ్లుట జాతీయ గౌరవమునకు హానికరమును భారతస్వాతంత్ర్యేచ్ఛకు ఆటంకమును అని సభవారభిప్రాయ పడుచున్నారు. కావున ప్రభుత్వోద్యోగీయుల గౌరవార్థమై యొసంగబడు లీవీలు, దర్బారులు, విందులు మున్నగువానికి భారతీయులు ముఖ్యముగా కాంగ్రెస్ సభ్యు లెవ్వరును పోరాదు.

## ౮

## ప్రాచ్యజాతుల సమితి

ఆసియా ఖండములోని యితర దేశముల ప్రతినిధులతో సంప్రదించి అఖిల ఆసియా జాతీయ సమితి సభను ౧౯౩౦ సంవత్సరమున భారతదేశములో జరుపవలసినదని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారిని ఈసభవారు కోరుచున్నారు.

## ౯

## చీనా, ఈజిప్టు మొదలగు జాతులకు సందేశము

౧. సంపూర్ణ స్వాతంత్ర్యమును, సంపూర్ణజాతీయ స్వత్వములును గడించి చీనాదేశములో నిరంకుశాధికారమును అంతము చేసినందులకు ఈ భారతజాతీయ మహాసభ చీనాదేశస్థులకు స్నేహపూర్వకమగు సద్భావమును వెల్లడిచేయుచున్నది.

౨. ఈజిప్టు, సిరియా, పాలస్తైన్, ఇరాక్ దేశములకు ఈ భారతజాతీయ మహాసభ వాత్సల్య పూర్వక సందేశము నంపుచు భారతదేశ స్వాతంత్ర్య పోరాటమున కాటంకమగు పాశ్చాత్య సామ్రాజ్య శృంఖలముల నుండి వారును తప్పక విముక్తియగుదురని కోరుచున్నది.

3. సామ్రాజ్య విచ్ఛేదక సంఘముయొక్క సమావేశమును భారతదేశమున కాహ్వానించుచు, ఈ సభవారి పక్షమున సామ్రాజ్య విచ్ఛేదక సంఘసభలో పాల్గొనుటకొక ప్రతినిధి నేర్పాటు చేయవలెనని కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారిని సభవారు కోరుచున్నారు.

## ౧౦

## రాజీ తీర్మానము

నెహ్రూ నివేదికను ఈ మహాసభవారు విచారించి భారతదేశముయొక్క రాజకీయ, సాంఘిక సమస్యలను పరిష్కరించుట కిది చక్కని పద్ధతులను సూచించుచున్నదని తలచుచున్నారు. మరియు సంఘము వారు ఏకగ్రీవముగా చేసిన సిఫారసులకు సభవారు నెహ్రూ సంఘము నభినందించుచున్నారు. మద్రాసు కాంగ్రెసు మహాసభలో నామోదింపబడిన స్వాతంత్ర్య తీర్మానమునీ సభవా రంగీకరించుచు, నెహ్రూనివేదిక దేశములోనున్న ముఖ్య పార్టీలన్నియు నంగీకరింప గలిగిన గరిష్ఠ సామాన్యమును తెల్పుచున్నది గనుక. రాజకీయాభివృద్ధిని సూచించు చున్నదనియే తలచుచు దాని నంగీకరించుచున్నారు.

రాజకీయపరిస్థితులకు లోబడి, ఆంగ్లపార్లమెంటు సభవారు డిసెంబరు 1929 సంవత్సరము లోగా నీ రాజ్యాంగ విధానము నామోదించినచో, ఈ మహాసభవారు ఈ రాజ్యాంగ విధానమును స్థాపింపగలరు. ఆతారీఖు లోగా నాంగ్ల పార్లమెంటువారు ఆమోదించనిచో, లేక అంతకు పూర్వమే నిరాకరించినచో కాంగ్రెస్ వారు దౌర్జన్యరహిత సహాయ నిరాకరణము నవలంబించి అప్పుడు నిర్ణయించగల పద్ధతుల ననుసరించి పన్నుల నిరాకరణమునుగాని, మరియే సాత్విక పద్ధతిని గాని అవలంబించవలసినదని దేశీయులను ప్రబోధించెదరు.

పైదానికి అనుగుణ్యముగా నున్నయెడల, కాంగ్రెస్ పేర సంపూర్ణ స్వాతంత్ర్య ప్రచారమును సాగించుట కేయభ్యంతరములును కలుగజేయబడవు.

౧౧

## సైమన్ సంఘ బహిష్కరణ

సైమన్ సంఘ బహిష్కారమును మునుపటికంటె తీవ్రముగా కొనసాగింప వలెనను తీర్మాన మీ క్రిందివిధముగానున్నది. సైమన్ సంఘమును జయప్రదముగా బహిష్కరించిన భారతీయులను, పోలీసు దౌర్జన్యమును లెక్కజేయక శాంతమును నిగ్రహమును ప్రకటించి అధికారుల పశుత్వమును అన్యాయమును జయించిన లాహోర్ లక్నో పౌరులను ఈ మహాసభవా రభినందించు చున్నారు.

ఐనను సైమన్ సంఘమును బహిష్కరించుటకు భారతీయులు చేసికొనిన కృతనిశ్చయమునకు విరుద్ధముగా కొందరు భారతీయులు ప్రవర్తించు చున్నారని సభవారు గమనించుచున్నారు. మరియు కొందరు భారతీయోద్యోగీయులును ఆంగ్లేయోద్యోగీయులును లాహోర్ లక్నో నగరములలో పోలీసు దుండగములలో పాల్గొనిరి. సాధనమైనంతవరకు యీ వ్యక్తులతో భారతీయులు సాంఘిక సంబంధము లేవియు పెట్టుకొనకుందురు గాక యని మహాసభవారు కోరుచున్నారు.

ఇట్టి వ్యక్తులకు విందులు చేయరాదనియు, వారి గౌరవార్థమై చేయబడు విందుకెవ్వరును వెళ్లరాదనియు సభవారు కోరుచున్నారు.

హరతాళములను యితర ప్రదర్శనములను జరిపించి సైమన్ సంఘము యికమీద దర్శించు రాష్ట్రప్రజలు సైమన్ సంఘ బహిష్కారమును జయప్రదముగా కొనసాగించవలెనని యీ సభవారు ఆయా రాష్ట్రములను ప్రబోధించుచున్నారు.

౧౨

## భారత సంస్థానములలో బాధ్యతాయుత పరిపాలనాస్థాపన

స్వదేశ సంస్థానములలో ఏకవ్యక్తిపరిపాలనను తొలగించి బాధ్యతాయుత పరిపాలన నేర్పరుప వలెనను తీర్మానము సభవారిచే నంగీకరింప బడెను.

౧౩

## కాంగ్రెస్ నిర్మాణమున మార్పులు

కాంగ్రెస్ నిర్మాణ ప్రణాళికయందు గావింపవలసిన మార్పుల విషయమై విషయ నిర్ణయసభవా రామోదించిన తీర్మానము మహాసభవా రంగీకరించిరి. కాంగ్రెస్ ముగిసిన పిదప ఖర్చులు పోగా ఆహ్వాన సంఘము వారివద్ద మిగిలిన మొత్తములో సగభాగము జాతీయోపసంఘమువారి కొసంగవలెనని యిందులో నొకసవరణ కోరుచుండెను. ఇది రాబోవు సంవత్సరమునుండి అమలులోనికి వచ్చును. కాంగ్రెసు కార్యక్రమమును నిర్వహించుటకీ మొత్త మవసర మని జవాహర్లాలు గారు నుడివిరి.

౧౪

## మరణించిన రాజకీయనిర్బంధితులు

ఈ సంవత్సరమున కారాగారముల యందు మరణించిన ఐదుగురు రాజకీయ నిర్బంధితుల కుటుంబములకు సంతాపము దెలుపుచు విజయకృష్ణబోసుగారు ప్రతిపాదించిన తీర్మాన మంగీకరింపబడెను.

## ౧౫

### నాభామహారాజు

నాభామహారాజుగారి యెడల ప్రభుత్వమువారవలంబించిన చర్యల ఖండించుచు అతని యెడల సానుభూతిని ప్రకటించుచు విషయనిర్ణయసభవారు గావించిన తీర్మానమును శ్యామసుందర చక్రవర్తిగా రుపపాదించిరి. తీర్మాన మంగీకరింప బడెను.

## ౧౬

### లాహోర్ పోలీసు దుండగములు

లాహోరులో పోలీసులు అక్రమముగా చేయుచున్న దౌర్జన్యములను, జాతీయోద్యమాభిమానుల యొక్కయు, విద్యార్థుల యొక్కయు, గృహములను సోదాచూచుట, అరెస్టు చేయబడినవారిని హింసలు పెట్టి బాధించుట మొదలగు కృత్యములను ఖండించుచు తీర్మాన మామోదింపబడెను.

## ౧౭

### ప్రతినిధి రుసుము

ఒకరూపాయ నుండి అయిదు రూపాయలకు హెచ్చింపబడవలెనను తీర్మాన మంగీకరింప బడెను.

## ౧౮

### రాజకీయనిర్బంధితుల నభినందించుట

పంజాబు సైనికశాసనము ననుసరించి నిర్బంధింపబడిన శాంతసింగు మొదలగు పంజాబు రాజకీయ ఖయిదీలను, కేరళరాష్ట్రమున అనేక యిబ్బందుల నొందుచున్న నారాయణ మీనన్ గారిని అభినందించుచు తీర్మాన మంగీకరింపబడెను.

## ౧౯

### రాబోవు కాంగ్రెస్ మహాసభ

రాబోవు సంవత్సరము జాతీయమహాసభ పాంచాలములో జరుప వలసినదను పాంచాల ప్రతినిధుల ఆహ్వానమును సభవా రంగీకరించిరి.

---



# రామస్తవము

మద్దూరి సాంబయ్యగారు

శ్రీరామా! భవదీయదివ్య పదరాజీవంబులన్ జేరి, త
త్సారోదార మరందపాన బహుళాశాపూర్తితో, మన్మన
స్సారంగంబు, త్వదీయ దివ్యసుగుణాంచద్వర్ణనా రూపఝం
కారంబుం బొనరించుచున్నది, కటాక్షం బుంచి యాలింపవే.

హృదయం బన్ మరుభూమిలో నెవరొ తండ్రీ! యేలోకో యెన్నఁడో
వెదబెట్టించి రెఱుంగలేను కవితాబీజంబులన్, వాని నీ
సదపాంగామృతవృష్టిచేఁ దడిపి సత్సస్యంబు గావించి మో
క్షద సంవిత్ఫలభాక్కులం జలుపవే కాకుత్స్థ వంశాగ్రణీ!

మది నుప్పొంగు కుతూహలంబుకొలఁదిన్ మారాముఁ గీర్తింపఁగా
నిదె ప్రారంభముఁ జేసినాఁడ సుదినం బెన్నిన్ విచారింపలే
దిది చింతింపుచు, నీదుతల్లి యనిశం బేనామముం బాడు న
య్యది యోజించుచు, నంతరాయములఁ జేయంబోకు లంబోదరా!

మును నామందరనాల్కఁ జేరి రఘురామున్ దండకారణ్య మం
పిన పాపంబును గట్టుకొంటి వది యీవేళన్ దదీయోజ్జ్వల
ద్గుణముల్ వర్ణనసేయ నారసనయందున్ జేరి పోగొట్టు కొ
మ్మనుచున్, నన్నుఁ గృతార్థుఁ జేయుమనుచున్ బ్రార్థింతు నిన్ భారతీ.

నే నిన్నమ్మి భవద్గుణోన్నతుల వర్ణింపంగఁ బూనంగ 'నీ
కైనీవే' యని మిన్నకున్నఁ గృతి నెగ్గంజేయ నాచేతనౌ
నే? నేముందుగఁ జెప్పినాఁడ నటుపై నీయిచ్ఛ, మోమాటముం
బూనన్ రా దిటువంటివేళలఁ జుమీ భూపుత్రికావల్లభా!

ఈతఁడు మద్గుణాళి నుతియింపఁగలాఁడె యటంచు నెంతయున్
జేతమునందు సందియముఁ జెందకు, మాదికవీంద్రులున్ భవ

న్నేతృతలేక సుంత తమ నేర్పునవ్రాసిరె? అద్ది యున్నచోఁ
జేతకుఁ గానివాఁ డెవఁడు చెప్పుము శ్రీరఘువంశదీపకా!

నాచిత్తంబునఁజేరి త్వద్గుణలసన్న వ్యామృతస్వాదుసా
మీచీన్యంబును వెల్లడించుకొనినన్ మేలబ్బు, లేకున్న నే
నాచే నైనటు వ్రాయకే విడువ, దానన్ మాధురీలోపమే
యాచో నయ్యపకీర్తి నీకెకద రామా, భక్తచింతామణీ!.

నిక్కంబై తగుభక్తి నీచరిత వర్ణింపంగఁ బ్రేరేచ, నే
రిక్కల్ లెక్కయొనర్చువానిగతిఁ దంద్రీ! పూని ప్రారంభ మే
ఫక్కిన్ జేయఁగనైనో యెట్లు ముగియింపన్ జెల్లునో నేరకే
న్యక్కారార్హుఁడనైతి, నిట్టితటి రామా! దిక్కు నీవేకదా.

అకటా! సర్వరసాలవాలము సమస్తానందకందంబు వి
శ్వకళాస్థానమునౌ భవన్మధురరూపంబుండ నిన్నాళ్లు కా
నక మూఢాత్ముఁడనై కవిత్వమనుచున్ బ్రాపంచికంబుల్ నిర
ర్థకముల్ వర్ణన లెన్నొ చేసితిని, నేరంబెంచకే రాఘవా!

అనయంబున్ నిను సంస్మరించుటకు నాకర్హత్వమేలేని మా
ట నిజంబౌట వరంబొకండు నిను వేడంబూనితిన్ సర్వపా
ప నివృత్త్యర్థ మదేమనన్ దినము త్వత్పాదాంతికంబందు నీ
గొనముల్ సాలెడు పద్యరత్న మొకటిన్ గూర్పంగ రామప్రభూ!

ఆదికవీంద్రులెల్ల భవదవ్యయసద్గుణరత్నజాలమున్
మోదముతోడ నెంచి తుదముట్టకె మోతుపు వేతనమ్ము సం
పాదనఁజేసి, రందు నొకభాగము నాకు నొసంగుమయ్య ని
ర్వేదను లెక్కపెట్టి యొనరింతును జీవన మింత రాఘవా!

అవురా యెంతని విన్నవింపఁగలనయ్యా రామ! మత్పూర్వసం
భవకర్మాఖ్యపిశాచ మొందు నను నాపాదించి నీపాద ప

ల్లవముల్ నేరఁగనీదు, సంసృతినె యుల్లాసంబు గల్పించు, శాం
తివిదూరున్ ననుఁ జేయు, బాణమున దీనిన్ ద్రుంపఁగా లేవుగా.

నీరసమైన నా కవిత నిర్మలదివ్యసుధామధుత్వ వి
స్ఫారతఁగాంచఁ గంటి సదుపాయ మొకం డదియేమనన్ భవ
త్సారగుణ ప్రకీర్తనవిధంబె అహా మతిమంతుఁడన్ గవిన్
సూరిని ధీరుఁడన్ సుఖుఁడ శుద్ధుఁడ బుద్ధుఁడ నైతి రాఘవా!

కామమదాదిరోగముల గాసిలువారలనాల్క రామనా
మామృతపానమం దరుచినందుట నిక్కము, సాధు సంగతి
శ్రీమహితౌషధం బొకటి సేవ యొనర్చినచో దదీయ స
ర్వామయముల్ దొలంగి యమృతాప్తి ఘటించు నుదంచితంబుగన్.

చపలత్వంబున మించు మామక మనశ్శాఖామృగంబెట్టి వే
లుపులం గొల్వక రామచంద్ర! మును మీలో మీకు నేలాటి య
చ్చపు నేస్తంబు ఘటిల్లెనొక్కొ యల సంస్కారంబుచేనేమొ రా
మపదోచ్చారణమాత్ర నాతఁడె సుమీ మా వేల్పటంచాడెడిన్.

తలపుంగుబ్బలి రామచంద్రమృదుపాదవ్యాప్తిమైనంత, దు
ష్కలుషధ్వాంతము వీడిపోయె, విమలజ్ఞానప్రకాశంబు రా
జిలెఁ, గామాదిక తస్కరాళి యెటకో చేరెన్, ముదంభోధి ప్రో
జ్జ్వలమై పొంగె, మనశ్చకోర మమృతప్రాశంబుఁ గావించెడిన్.

రామా! నిన్నెదకోటలో నిలిపి, ధైర్యంబన్న ఖేయంబునన్
బ్రేమాపూరము నించి, నీస్మరణమన్ భేరీధ్వనుల్ మ్రోయగన్
రోమాంచద్వయహర్ష బాష్ప శరసందోహప్రయోగంబునన్
గామాదిప్రతివీరులన్ రణమునన్ ఖండించి చెండాడెదన్.

శివుఁ డారాముఁడు నే నటంచు, హరియున్ శ్రీరాముఁ డేనంచు, రా
ఘవుఁ డేనంచును బద్మసంభవుఁడు వక్కాణించుచున్నార, లీ

వివిధాలాపములందు నిక్కమెదియో వీక్షింప నేనొల్ల,
యవతారోన్నతి కిన్ని వాక్యములు సాక్ష్యంబౌట రామప్రభూ!

ఎంత తపంబుచేసి జనియించెనొ పంక్తిరథేశుఁ డౌర నీ
యంతటివాని లోకగురు నాత్మజుఁగాఁగని "రామభద్ర! నా
చెంతకురార ముద్దిడర చెక్కిలిఁజూపర" యంచు సమ్మద
స్వాంతముతోడ నిన్ బిలుచు నంతటి భాగ్యముగల్గ రాఘవా!

పర్వేందు ప్రతిమాన మంజు వదనున్ బాలున్ సమస్తావనీ
పర్వున్ రాఘవునెత్తి తల్లి భవనప్రాంచన్మణి స్తంభకాం
తర్వర్తిప్రతిబింబకోటిఁగని యానందించెఁ జిత్తంబునన్
"సర్వం రామమయం జగ"త్తను వచస్సార్థక్య మూహించుచున్.

లలితానర్ఘ్యమణిప్రభాకలిత డోలామధ్యభాగంబునన్
లలనల్ నిన్నుఁ బరుండఁ బెట్టి తమి జోలల్ వాడి జోకొట్టి యు
య్యెల లూపంగల భాగ్యమబ్బుటకు వా రేనోముల న్నోఁచిరో
తొలిజన్మంబునఁ దెల్పురామ! సుజనస్తోమైక కల్పద్రుమా!.

శ్రీశోభాయుత ముగ్ధవక్త్రమయి రాశీభూతలావణ్యమై
ఆశావాసమునై విశాలనయనాఢ్యంబై దశస్యందనో
ర్వీశప్రాక్తన పుణ్యమై ముని మనస్తృప్త్యాస్పదంబౌ భవ
త్త్రైశోరాకృతి నెంతు రామ! నతభక్తవ్రాతకల్పద్రుమా!.

దరహాసస్ఫురదాననంబు కరుణోదంచత్కటాక్షంబు ల
త్యరుణోష్ఠంబు వినీలకుంతల భరం బాస్నిగ్ధగండంబులున్
మెఱయన్ శైశవ తాండవక్రియలఁ బేర్మిన్ దల్లులన్ మువ్వురం
బరమానంద సుధాబ్ధి ముంచు రఘురామా! నిన్ను ధ్యానించెదన్.

కులుకు మొగంబునన్ గుటిలకుంతలముల్ విలసిల్లఁ, గర్ణకుం
డలరుచి చెక్కుటద్దముల నాట్యమొనర్ప నొయార మొప్ప చూ

పుల, నవకంపుఁ బిన్నతనపుం జెయిదంబులఁ దాండవంబులన్
లలితపు నవ్వులన్ దనరు రామకిశోరము నాశ్రయించెదన్.

క్రీడాలోలుని ధూళిదిగ్ధతనుఁ బంకేజాక్షు నాశాంబరున్
చూడాలంకృతరత్నభూషు దరహాసున్ బాలు రాముం దమిన్
జేడెల్ గ్రుచ్చి కవుంగిలించుకొనఁ బో శీఘ్రంబె పర్వెత్తు నా
నాఁడే యేక సతీవ్రతంబు నెలమిన్ దాఁబూనినాఁడో యనన్.

తల్లులఁ బాయలేవెపుడుఁ దాపసులన్ గనియుండ వెంతయున్
బల్లిదులైన రక్కసుల పాటవమే వినియుండ వాజినా
విల్లసఁగా నెఱుంగ, వెటు భీతియె లేక మునీంద్రుజన్నమున్
జల్లఁగఁ బ్రోవ ధైర్యమున సాగితివో రఘురామడింభకా!.

జనకుఁడు భీతిఁ దల్లడిల, సంతసమంద గురుండు, గాధినం
దనుఁడు జయోత్సుకత్వ పరతన్ మునుముందు గమింపఁ, బౌరకా
మినులును దెల్లవోయి యనిమేషతఁ గాంచఁగ, సానుజుండవై
మునిపరు వెంట ధైర్యమునఁ బోవునినున్ నుతియింతు రాఘవా!.

చొక్కపుజాళువాసరిగ చుక్కలపై రతనాలజిల్గు పూ
లెచ్చికినపట్టులాగు, నగిపీమగరాజిగి తాపడంబుచే
నక్కజమైన కుందనపు టంగరకాయు వెలుంగ మానితో
గ్రక్కున జన్నమేలఁ జను రాఘవలక్ష్మణులన్ నుతించెదన్.

చెదరినముంగురుల్, చెమటచేత గఱంగిన చిత్రకంబు, బా
లదినకరాతపంబునను మ్లానతఁ జెందిన మోము, భూరజం
బు దవిలినట్టి పాదయుగమున్ దనరార మునీంద్రు వెంట స
మ్ముదమున నేగు భానుకుల ముఖ్యుల రాఘవులన్ నుతించెదన్.

తొయ్యలిఁగూల్తునా యనెడు తోరపుసిగ్గును, మీఱరాని యా
దయ్యముబోలు రాచజడదారిపయిన్ గలభక్తి "దీనితో

గయ్యమ" యన్నయీసును మొగంబునఁ గన్పడ నొక్కయమ్మునన్
వ్రయ్యలుగాఁగ దాటకను వ్రాల్చిన రాఘవు సంస్మరించెదన్.

ఆశాలిహోగ్ర జిహ్వాభీల వక్త్రంబు చిఱునవ్వు వెన్నెలల్ గురియుమోము
ప్రస్ఫురద్విస్ఫులింగస్ఫార నేత్రముల్ కరుణారసముఁజిల్కు కన్నుదోయి
అభ్రంకషోరు దీర్ఘాసహ్య రూపంబు లావణ్యనిలయ కల్యాణతనువు
ఉద్ధురస్పర్ధోగ్ర యుద్ధప్రయత్నంబు సరసవినోద నిస్తంద్రలీల [రమ్ము
కలుగుతాటకయును దానుఁ గదనమునకు-గడఁగి "యెపుడెక్కిడియె విల్లెపుడు
దీసెనెపుడేసె"ననుచుగాధిజుఁడు వెఱఁగు-పడనసురఁగూల్చినరఘుప్రవరుఁదలఁతు

కొదలూడన్ నిజయాగరక్షణకు నీ గొంపోవుచున్, రేల నీ
నిదురం జెందెడువేళ జాగ్రతమెయిన్ మేల్కాంచు, నీరూప మా
పదశీర్షంబుగ మాటిమాటికెలమిన్ వర్ణించుచున్ బొంగుటే
కద గాధేయుని ప్రాక్తపఃఫలమనన్ గాకుత్స్థ వంశాగ్రణీ!.

తల్లీ! పావనపరేణ్యువెంటఁ జనెదన్, దత్కామితార్థవ్రజం
బెల్లన్ దీర్చి శుభస్థితిన్ మరలనే నేతెంతు, లేదిట్లుభీ
తిల్లన్ గారణమంచు స్వీయజనయిత్రిన్ బాష్పధారార్ద్రిత
మ్మిల్లన్ గాంచి వచించు రాము రుచిరస్మేరాననున్ గొల్చెదన్.

మును శాముం డవతారపూర్తిఁ ద్రిదివంబున్ జేరఁగా నెంచువే
ళ నయోధ్యన్ వసియించు జంతువులకెల్లన్ ముక్తి సత్రంబుఁబె
ట్టెనటంచున్ వినియుంటి, నట్టియెడ తండ్రీ! యేడ మత్పూర్వ క
ర్మనన్ దాఁచెనో కోలుపోతిఁగద సామ్రాజ్యంబు రామప్రభూ!

---






**బి. యమ్. లక్ష్మీపతిగారు బి. యి. యమ్. యి.**

వీరిది బెంగుళూరు. వీరు బెం. మహాదేవ ముదలియారు గారి పుత్రులు. చెన్నపురి ఇంజనీరింగు కళాశాల పట్టభద్రులు. శీల్ పాకునందలి చెన్నపురి కార్పొరేషన్ వాటర్ వర్క్సు నందు ఎంజినీరుగ నుండిరి. కొలది కాలము కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలయందు వ్యవసాయపు పనిముట్ల తయారీయందు ప్రత్యేక శిక్షణము వడసిరి. వీరిని మదరాసు ప్రభుత్వము వారు వ్యవసాయపు పనిముట్ల తయారు, పరిభాష నేర్చుకొనుటకు విదేశమున కంపిరి. గ్లాస్గోలోని జాన్ వేలేస్ కంపెనీ వారి వద్ద వీరు సుమారొక సంవత్సరము పనినేర్చుకొనిరి. మాంచెస్టరు రగ్గతి లీ యందొక కంపెనీలో నింకొకయేడు పని నేర్చుకొని వీరు దేశమునకు తిరిగి వత్తురు. వీరు 8-10-1927 న భారతదేశమును విడిచి విదేశమునకు ప్రయాణమైరి.

---



**డాక్టరు కె. వి. కృష్ణనుగారు**

**యమ్. ఆర్. సి. పి.**

వీరు మదరాసు గిండీ కింగ్ ఇన్‌స్టిట్యూట్ నందు సహాయవైద్యులు. ఎడింబరోయందీమధ్య జరిగిన యమ్. ఆర్. సి. పి. పరీక్షయందుత్తీర్ణులైరి. వీరిపుడు రాక్‌ఫెల్లర్ వేతనము పడసి అమెరికా సంయుక్త రాష్ట్రములందు పరిశోధనల చేయ బోయిరి.

---



ఉపద్రిష్ట వెంకటకృష్ణయ్యగారు
బి. యే., యల్. యల్. బి., ఏ. యస్. ఏ. ఏ.

వీరు గుంటూరుజిల్లా తెనాలితాలూకా పల్లబాడు అగ్రహారంవారైన ఉపద్రిష్ట లక్ష్మయ్యగారి కుమారులు. బొంబాయి బి. ఇ. యస్. అందు టి. కంపెనీ (లిమిటెడ్) యందు ఎలెక్ట్రికల్ ఎంజినీరగు ఉ॥ నారాయణరావు బి. యస్. సి. (గ్లాస్గో) గారి సోదరులును.

వీరు చెన్నపురి విశ్వవిద్యాలయమున పట్టభద్రులై బొంబాయి విశ్వవిద్యాలయమందు యల్. యల్. బి. పట్టమునంది, బొంబాయియందే అక్కౌంటెన్సీ (లెఖ్ఖలతనిఖీ) చదివిరి. వీరిబావమరిది బొంబాయి బి. బి. అందు సి.ఐ. రైల్వేయందు ఛార్టర్డ్ సివిల్ ఎంజినీరగు వి.యమ్. వాడీ, బి. యస్. సి. (గ్లాస్గో) ఏ. యమ్. ఐ. సి. ఇ. గారిని ఆంధ్రదేశమువారును బొంబాయివారు నెరుగుదురు. తన బావమఱది అన్నగార్ల ప్రోత్సాహమున వెంకటకృష్ణయ్యగారు అక్కౌంటెన్సీయందున్నతవిద్యనందుటకై లండనునకేగి 1928 నవంబరులో యీపరీక్షకై యీయేడు వెళ్లిన భారతీయులందరిలోను ముఖ్యముగ బొంబాయివారియందు ఏకమాత్రుడుగను తీర్ణతగాంచిరి. వీరుతమ 26 యేటనే యీపట్టములందుట ప్రశంసనీయము.

ఈమాసమునందే వీరు భారతదేశమునకు తిరిగి వచ్చి ఇన్కార్పొరేటెడ్ అక్కౌంటెంటుగా పని నారంభింతురు.

ఈ జనవరి 13 వ తేదీనాడు తమ సంక్రాంతి ప్రీతిభోజన సమయమందు లండను ఆంధ్రసభవారు వీరిని వీరి విజయమున కభినందించిరి.

---



వి. వి. చౌదరిగారు
యమ్. ఎ., బి. యల్, యల్. యల్. డి.

వీరు గుంటూరు జిల్లా తుమ్మపూడి గ్రామస్థులు. మద్రాసు విశ్వవిద్యాలయమున పట్టభద్రులై కలకత్తా విశ్వవిద్యాలయమున యమ్.ఏ. బి. యల్.నందు కృతార్థులై లండనుకేగి అచ్చట యల్. యల్. బి. పరీక్షయందు మిదప గౌరవముతో మొదటి తరగతియందుత్తీర్ణులై యల్.యల్.డి. లైరి. వీరు క్రిమినల్ లాయందు ప్రత్యేకనైపుణ్యముగలవారు. ఇంతవరకు చెన్నపురి హైకోర్టులో యల్.యల్. డి. బ్యారిస్టరులు ఇద్దరే. శ్రోత్రగా హైకోర్టుజడ్జియైన పాండలేగారును, డాక్టరు జాన్గారును. చౌదరిగారితో నిపుడు ముగ్గురైనారు. ఆంధ్రులలో వీరొక్కరే. యల్. యల్. డి. లైనందుకు వీ రెంతయు ఆదరపాత్రులగుదురు. వీరు చెన్నపురి హైకోర్టునందు ఒరిజినల్ అపీలెట్ సైడున పనిచేసెదరు.

## లండన్ నగరమున టెన్నిస్ పందెములందు ఆంధ్రుల విజయము



1. నెల్లూరునందు వైద్యులుగనుండిన పి. ఉదయాచలరావునాయకుగారు. ఇపుడు లండన్‌నందు వైద్యపరిశోధనమునకై ప్రత్యేకముగ సెలవుగైకొని వెళ్లియున్నారు.

2. సి. రఘునాథంగారు, బి. యే., యల్. టి. వీరు చెంగల్ పేట్ యందు జన్మించిరి. డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగ నుండిరి. నెల్లూరుజిల్లాయందు దర్శి, వెంకటగిరి రేంజీలయందును, జింజిరేంజియందును పనిచేసిరి. వీరితండ్రి సి. ఆర్. చక్రపాణి అయ్యంగారు. రఘునాథంగారు టీచర్ డిప్లమాకొఱకు (ఉపాధ్యాయ ఉద్యోగమునకు ఉల్లాసు) 1928 జూలై 22 వ తేదీని ఇంగ్లాండుకు వెళ్లిరి. ఇపుడు లండన్ డే ట్రైనింగ్ కాలేజియందు డా. నన్‌గారివద్ద విద్యార్థిగనున్నారు.

వీరిరువురును 1928 ఆగష్టులో లండన్‌నందు జరిగిన టెన్నిస్‌పందెములందు డబుల్స్ ఆటలో లేడీచాటర్జి కప్పును బహుమానముగ బడసిరి.

---

## నిరాశ

బులుసు వేంకటరమణయ్యగారు

ఏయనంత విశాలోర్వి నేతలమున
నిలువఁగాఁ దావులేదని నెమ్మిఁదలఁచి
తనివి తీరంగ నింగి సౌధాలఁగట్టి
నా ప్రణయదేవిపాదము నాత్మఁగొలిచి
కలయొ కల్లయొ నే సుఖకలితుఁడ నయి
ప్రణయదేవతగుణములఁ బాడిపాడి
ఆశఁ గౌఁగిలికై కేయి నటు మరల్చి
చూచితిని___
అదేమి మోసమో సుదతి లేదు
లేదు నాకింక సుఖగంధ లేశమైన.

*   *   *   *

నెలయు నమృతంపు బిందువుఁ జిలుకఁ [డేమి?
కమ్మదెమ్మరకుం దయ కలుగ దేమి ?
ప్రణయదేవత నాకంటఁబడఁ ద దేమి ?

*   *   *   *

దుఃఖమయమయ్యె జీవిక తుదకు నాదు
నాశలన్నియు నేఁగె నాకాశగతిని.






## బఘూబెన్ లోట్‌వాలా కన్య

గౌరవనీయులగు శ్రీ విఠల్‌భాయి జె. పటేలు గారితో నీమె యూరపుఖండమున సంచారముచేసి గత వత్సరము తిరిగి వచ్చినది. ఈమె భారతీయ దినపత్రికకు సంపాదకత్వము వహించిన ప్రథమయువతీమణి. ఈమె బొంబాయి మ్యునిసిపల్ కార్పొరేషన్ (పురపాలకసంఘము) నందు చేరిన సభ్యురాండ్రలో నొకతె. నేడు మిగుల విశాల ప్రచారము గలిగిన దేశీయ భాషా దైనిక పత్రిక-సొంతముగ తన తండ్రిగారిచే నిర్వహింపబడు చున్నది-'హిందూస్థాన్ ప్రజామిత్ర'కు నీమె సంపాదకురాలు.

శ్రీమతి యస్. జె. రామానుజులు



ప్రభుత్వమువారిచే నీమె గుంటూరు పురపాలక సంఘమునకు సభ్యురాలుగ నియమించబడినది.



## శ్రీమతి తొట్టాకట్ జానకి అమ్మ

ఈమెది తిరుచూరు. కొచ్చిను సంస్థానమున గౌరవ బెంచి మేజిస్ట్రేటుగ నియమింప బడిన ప్రథమ నారీమణి ఈమెయే. మంచి మర్యాదగల కుటుంబమునకు చెందు ఉన్నత పదవులయందున్న బంధువర్గముగల, యీమె ప్రభుత్వమువారు నియమించిన గౌరవపదవి కంతయు తగియున్నది.





శ్రీమతి ఆర్. శాంభవిబాయి బి.యే.

ఈమె బట్టు కులమున పట్టభద్రురాలైన ప్రథమవనిత. ఇపుడీమె దక్షిణకనరాజిల్లాబోర్డున సభ్యురాలుగ నియమింపబడినది.



శ్రీమతి జె. యస్. జస్టిన్ సతి

ఈమె తిరునల్వేలిజిల్లా విద్యాసంఘమునందు సభ్యురాలుగా నియమింప ఒడినది.



శ్రీమతి యమ్. సొరాబ్జీ సతి

ఈమె, మలబారునందలి కన్ననూరులో న్యాయవాదియు పురపాలకసంఘ పూర్వాధ్యక్షుడు నగు, శ్రీమనేక్ జీ సొరాబ్జీగారి భార్య. కన్ననూరునకు ప్రత్యేక బెంచి మేజస్ట్రేటుగ దక్షిణ భారతదేశమున నియమింపబడిన ప్రథమ పార్శీయువతి.



## యమునా అభయంకరు కన్య

ఈమె డాక్టరు అభయంకరుగారి కుమార్తె. నూరతు యువజనసభయం దీమె సైకిలు త్రొక్కుట యందును, గానమందును, వ్యాసరచనయందును ప్రథమ బహుమానము నందుటయే కాక చాంపియన్‌షిప్ మెడ లును పడసెను.



## కమలామీనన్ కన్య, బి. యే.

శాసనసభ్యులగు సి. గోపాలమీనన్‌గారి కుమార్తెయీమె. ఈమధ్య బెజవాడయందు జరిగిన టెన్నిసు పందెములయందు గెలుపొందినది. ఈ భారతీయ నారీమణి యీ పందెములందు పాల్గొని విజయమందినందు కీమెకు దాసు శ్రీనరరావుపంతులు గారొక ప్రత్యేక బహుమానము నొసగిరి.



అఖిలభారత మహిళా మహాసభ
ఈసభయొక్క – సాయంసంఘసభ్యురాండ్ర ఛాయాపటమునందున్నారు.

మొదటివరుస, కూర్చున్నవారు:—శ్రీమతులు బ్రజలాల్ నెహ్రూ, పి. కె. సేన్‌గారి సతి, సరళాదేవి చౌదరాణి, మజహారుల్ హక్ గారిసతి, శ్రీ శ్రీ మండీసంస్థానపురాణి (అధ్యక్షురాలు), ఫరిమాన్ జీగారి సతి, మూడేకోపర్ గారిసతి, యస్. సి. ముఖర్జీగారి సతి, బైరాంజీగారి సతి గార్లు.

రెండవ వరుస, నిలుచున్నవారు:—శ్రీమతులు శుక్లాగారిసతి, ఆదుర్తి భాస్కరమ్మ, కుమారి నీలకంఠకన్య, మైల్స్ ఇర్వింగ్ సతి, కుమారి బహుమార్ జీ కన్య, కుమారి లాజరస్‌కన్య, మాయాదాస్‌సతి, కమలాదేవి ఛటోపాధ్యాయ, గోప్‌లాండు కన్య, కుమారి ఖేమ్‌చంద్ కన్య, ముఖర్జీగారిసతి, హెర్లేకర్ సతి గార్లు.



శారదా స్త్రీసమాజము, మదరాసు:—తిరువళిక్కేణియందలి యీ సమాజముయొక్క 17–వ వార్షికోత్సవము జనవరి 26 వ తేదీని జరిగెను. మంత్రి ముత్తయ్య మొదలియారుగారి భార్య అధ్యక్షత వహించి పూలమాలతో కూర్చొని యున్నది. ఆ వరుసలోనే మొదట కూర్చొనియున్నది సోదరి సుబ్బలక్ష్మమ్మ. అధ్యక్షురాలి ఎడమచేతివైపున న్యాయమూర్తి ముత్తా వెంకట సుబ్బారావుగారి భార్య కలదు.

తృతీయ ఆంధ్రరాష్ట్రీయ విద్యావిషయిక సంస్కరణసభ - కాకినాడ. ౨౦-౧౨-౧౯౨౫.
(శ్రీవిద్యార్థినీ సమాజము)



అనంతపుర భారతీయమహిళాసమాజసమాజమునాటి స్థాపనము

[illegible]



### సేవాసదనము-మైలాపూర్

చెన్నపట్టణము మైలాపురమునందున్న యీ సేవాసదనమున ఫిబ్రవరి 2వ తేదీ సాయంత్ర మొకసభ జరిగెను. అందు పూనానగరవాసు లగు ప్రొఫెసర్ కార్వేగారు 'మహిళావిశ్వవిద్యాలయము'గూర్చి ఉపన్యసించిరి. ఈ చిత్రమునందు కుర్చీలలో కూర్చున్నవారిలో మధ్యను కార్వేగారును, వారి కుడిచేతివైపున న్యాయమూర్తి ముత్తా వెంకటసుబ్బారావుగారి సతియు, ఎడమచేతివైపున డా. ముత్తులక్ష్మిగారును కూర్చొని యున్నారు.



శ్రీమతి సుమతీదేవిమిత్ర

ఈమె లక్నో పురపాలక సంఘమునకు సభ్యురాలుగ నెన్నుకొనబడిన మొదటిది. మహిళాకాంగ్రెస్ తరఫున నభ్యర్థినిగ నుండుటవలన నత్యధికముగ వోట్లు వచ్చెను.



శ్రీమతి చార్లెటీ సంజీవరావుసతి

ఈమె విశాఖపట్టణము జిల్లాబోర్డునందు సభ్యురాలుగ ప్రభుత్వమువారిచే నియమింపబడెను.



జ్యోతిర్మయీ గంగూలీకన్య, యం. ఏ.

ఈమె మదరాసునం దీమధ్యజరిగిన చెన్నరాష్ట్ర అస్పృశ్యతానివారణసభ కధ్యక్షత వహించెను.



శ్రీమతి సరోజిని దేవిగారు

## శ్రీమతి సరోజిని దేవిగారు

ప్రస్తుతము అమెరికాదేశమున సంచారముగావించుచున్న శ్రీమతి సరోజినీ దేవినిగూర్చి చికాగో పట్టణమునుండి వెలువడు 'యూనిటీ' యనుపత్రిక యిట్లు నుడువుచున్నది.

స్వయముగనే యామె ప్రపంచమందలి గొప్ప స్త్రీలలో నొకతె. ఆమె ధీశక్తినిబట్టియు, మనోబలమునుబట్టియు వెంటనే యామె నేటి గొప్పనాయకులలో జేర్పదగినదని తెలియవచ్చును. కాని ముఖ్యముగ నామె గొప్పదన మామె భారతీయత్వమువిూదనే, చితికిపోయి యునజయ్యమై యుండు స్వదేశము పక్షమున నామెపూనిన ప్రతినిధిత్వమువిూదనే యాధారపడియున్నది. ఈదృష్టినే యామె గురుతింపబడుననియు, గౌరవింపబడుననియు మానమ్మకము. భారతదేశములోని యుత్తమోత్తమకవులలో నొక్కతెగ, తమశాంతిగానమునకు, స్వాతంత్ర్యసంగీతమునకు మూలాధారముగ భారతీయులామెను బరిగణింతురు. ఇంతియకాదు. ఆమెకు భారతీయరాజ్యాంగవేత్తలలో గూడ స్థానముకలదు. 1925–26 సం॥లో నామె భారతజాతీయసంస్థలలో నెల్ల గొప్పదగు జాతీయమహాసభ కధ్యక్షురాలుగగూడ నొనర్పబడినది. ఉన్నతవంశము, విశేషవిజ్ఞనము, సంపూర్ణమగు నాత్మసమర్పణము, మహాధీశక్తి, గొప్పమనోబలము, ఇట్టిసహాయసంపత్తితో నామె, తన ప్రజల మహత్తరభాగ్యమునకై, వారిహక్కులకై పోరాడువారిలో నగ్రస్థానమున నిలిచియున్నది. అన్యాయమగు నైచ్యమునకు దురభిప్రాయ

ములకు, సరియైన తమ మాతృదేశమునుగూర్చిన సత్యమును దెలియజేయుటకై యామె నేడమెరికాకు వచ్చియున్నది బాగుగ సదోధము గలిగి, మంచి పరిజ్ఞానము గలిగియున్న ప్రజాభిప్రాయమునెదుట తనయాశయము వెలిపుచ్చుటకై యామె యిటువచ్చినది. 'యూనిటీ' యామెకు వినయ పూర్వకముగ దనప్రశంస నర్పించుకొనుచు స్వాగత మొసంగుచున్నది. అసలు సంగతి బోధపడిన జాలును, ఈదేశము లోబడిపోవును (అనుకూలాభిప్రాయముగలదగును). మాకు స్వాతంత్ర్యయుద్ధమన్న నేమో తెలియును. తన రక్తమును, దనయైశ్వర్యమును నిరంకుశత్వవిముక్తికై ప్రవహింపజేసిన మహాత్సంప్రదాయము మాది మాగర్వముచే మా మనసులు బండబారిపోయి యుండవచ్చును. మాస్వాభ్యముచే స్వార్థపరులమైపోయి యుండవచ్చును. కాని మాజాతి హృదయ మింకను తన గాంభీర్యములను గోలుపోలేదు. అట్టి హృదయమును చేరుటకు దనవాచాశక్తిచేతను, మనశ్శక్తిచేతను, శ్రీమతి సరోజినీదేవికన్న నెక్కువగ సమర్థులగువారు వేరుగ నుండరని మా యభిప్రాయము. సభాసమూహముల గాంచినప్పుడమెరికా హృదయ మామెకు విస్పష్టమగును.

[మాడర్న్ రివ్యూ నుండి.]

## ముగ్గులలో మనుష్యుల చిత్రములు

ఇంతవఱకు ముగ్గులలో మామూలుగ నేవో లతలు చెట్లు, తీగలు మొదలగువాని చిత్రణమే యగపడుచుండెడిది. మొన్న నీనడుమ బొంబాయిలో స్త్రీమహామండలి మహాసభా సందర్భమున జరిగిన ప్రదర్శనములో మామూలు పట్టు పనులు మున్నగువాని తోపాటు



శ్రీమతి లీలావతి.





కొన్ని ముగ్గులుగూడ ప్రదర్శింపబడినవి. ఈముగ్గుల ప్రదర్శనములో విశేషము మానవచిత్రరచనము. శ్రీయుత మంగళదాస్ దేశాయిగారి భార్య శ్రీమతి లీలావతి యనునామె నేలపై రంగు రంగుల ముగ్గులతో యశోదా కృష్ణులు, దీపము నందుకు, నిరీక్షణము అను మూడు బొమ్మలను చిత్రించెను. ఈమె చిత్రరచనా ప్రావీణ్యము రెండు బంగారుపతకములను, ఒక రజత పతకమును సంపాదించినది. ఈమె తన చిత్రరచనమున శ్రీయుత అసితకుమారహాల్దార్, అబ్దుల్ రహమాన్, చుగతాయిగార్ల ననుసరించి పోయెను.

[ఫిబ్రవరి, మాడర్న్ రివ్యూనుండి]






## చెన్నపురి చిత్రకళా ప్రదర్శనము

### శ్రీ కౌతా రామమోహనశాస్త్రి గారు

దక్షిణ హిందూదేశీయులచే ప్రదర్శింపబడినవానిలో కె. రామమోహన శాస్త్రిగారిచే రచింపబడిన చిత్తరువులలో "రాగిణితోడి" అను చిత్తరువు, గొప్పరచనానైపుణ్యమును, వర్ణవైదుష్యమును, భావగాంభీర్యమును వెల్లడించుచు, అన్ని విషయములచేత చూపరుల నేత్రములను హృదయములనుగూడ ఆకర్షించుచున్నది. వారిచేతనే రచింపబడిన "మదీయ స్వప్నానందలహరి యంతరించెను. నా వీణాతంత్రులు తెగిపోయెను" అను చిత్తరువు, చూపరులను తన్మయత నందించుచున్నది. రామమోహన శాస్త్రిగారింతవరకే, సంపాదించిన కీర్తి, ప్రాముఖ్యతలకీ చిత్తరువు లింకను మెరుగు బెట్టగలవు. "వసంతము" రామమోహన శాస్త్రిగారిచే రచింపబడిన ఒక చిత్తరువునకు (52 ఎ) దీ. బ. టి. రంగాచారిగారి బహుమాన మొసగబడెను. ఈ చిత్తరువుకంటె వారిచే రచింపబడిన ఇతర చిత్తరువులు ఎక్కువ బహుమానార్హములుగ గన్పించుచున్నవి. "ప్రొఫెసరు రాధాకృష్ణన్" "డా॥ సి. వి. రామన్" "సి. ఆర్. రెడ్డి" "గగనేంద్రనాథ టాగూరు"గార్ల రూపములను రామమోహన శాస్త్రిగారు రేఖాచిత్రములలో రచించి ప్రదర్శించిరి. వీనిలో "సి. వి. రామన్"గారి చిత్తరువునందు రేఖానైపుణ్య మెక్కువ బాగుగ ప్రస్ఫుటమగుచున్నది. శాస్త్రిగారు "డైపాయింటు" ఎచ్చింగులో నొక చిత్తరువును గూడ రచించిరి. ఈ తరగతిలో భారతీయులచే రచింపబడిన చిత్తరువు ప్రదర్శింపబడుట కిదియే ప్రథమమని దెలియుచున్నది. ఇది యూరోపియను ప్రేక్షకుల దృష్టి నధికముగ నాకర్షించుచున్నది. కె. ఆనంద మోహనుగారి "హిమాలయవాసి యగు శివుడు" అను చిత్తరువు గూడ చాల బాగుగా నున్నది.



చెవి(టిపంతులు

"పొరుగింటి అమ్మాయి ఎప్పుడూ పాడుతూ ఉంటూంది. వద్దన్నా వినదు. నా చదువంతా తగలడుతూ ఉంది."

---

* ఫిబ్రవరి ౨౨ వ తేది—ఆంధ్రపత్రిక ౬ వ పేజి.



## భారతనారీమణులు

[౧, ౫ తరగతులవఱకు ౫ ప్రత్యేకపుస్తకములు]

గ్రంథకర్త : శ్రీమతి కోకా కృష్ణవేణమ్మగారు. ప్రకాశకులు: వేంకటరాం అండుకో, ఏలూరు. క్రౌను సైజు. అచ్చు, బైండు, కాగితము బాగుగనున్నవి.

భారతదేశమున పురాణములందును చరిత్రయందును ప్రసిద్ధికెక్కిన నారీమణుల కథలు ఐదు తరగతులలో అతి సంగ్రహముగా వ్రాయబడినవి. క్రొత్త సంగతులు లేకున్నను కథానివేదనము సాఫుగా జరిగినది. ఆయా తరగతులవారు అవగాహన మొనర్చుకొనగలరు. ఈ సముదాయములో ఒక నారీమణికథయే రెండుమూడు తరగతుల పుస్తకాలయందును చెప్పబడినది. దీనికి బదులు ఇంకను క్రొత్తవారి కథలు చెప్పబడిన బాగుండును. ఆంధ్రనారీమణులను గూర్చియు నాలుగు, అయిదు తరగతుల పుస్తకములలోనైనను ఉండవలసినది. అది ఒక లోపమని మా అభిప్రాయము. ఇతరవిషయములు సంతుష్టములుగనే ఉన్నవి.

| | | | |
|---|---|---|---|
| వెల | ౧ తరగతిపుస్తకము | రు | ౦-౨-౦ |
| | ౨ | ,, | ౦-౨-౦ |
| | ౩ | ,, | ౦-౩-౦ |
| | ౪ | ,, | ౦-౩-౦ |
| | ౫ | ,, | ౦-౪-౦ |

—శ్రీ.శ్రీ.

## ఏకలవ్యుడు

గ్రంథకర్త: బి.టి. నరసింహాచార్యులుగారు. ప్రకాశకులు: దీనదయాళు అండు కో మద్రాసు. క్రౌను సైజు. పుటలు ౨౬. వెల రు ౦-౨-౬.

చిన్నబాలురకై పెద్ద అక్షరములలో ఉన్న చిన్న పొత్తము.

కథ ౧౩ ముక్కలుగా భాగింపబడినది ఏడవ భాగములో ఏకలవ్యునిగూర్చి ఎత్తికొనబడినది. "ఇది యిట్లుండ, హస్తినాపుర సమీపమునందొక వనము గలదు. ఆ వనమందొక ఎఱుకులవాడు గలడు. ఆతనిపేరు ఏకలవ్యుడు......" ఈ మోస్తరుగా చిన్నపిల్లలకు కాబట్టి విసంధులు పాటించిన బాగుండెడిది. అరసున్నలు లేవు. కాని బండిరాలు ఉన్నవి. ఎక్కడనో తక్క, వాక్యములు సాధారణముగా నాతిదీర్ఘములై ఉన్నవి.

—శ్రీ.శ్రీ.

## అచ్చయ్యమ్మ

గ్రంథకర్త: అడ్డా మృత్యుంజయశాస్త్రిగారు. రిప్లె అండుకో, కాకినాడ, క్రౌనుసైజు, పుటలు ౩౬.

'స్త్రీనీతిబోధిని' అని దీనికే వేరొకపేరు. సంసారపక్షమైన నీతులు తేటవచనమున తెలుపబడినవి.

—శ్రీ.శ్రీ.

## మల్లికార్జునశతకము

గ్రంథకర్త: కడివెండి రామబ్రహ్మాచార్యులు; అచ్చమ్మపేట. గుంటూరుజిల్లా; క్రౌనుసైజు, పుటలు ౨౬. వెల రు ౦-౫-౦.

మల్లికార్జునస్వామిమీద ఉత్పలములలోను, చంపకములలోను రచింపబడిన శతకము. చివర 'శ్రీమద్భ్రమరాంబాష్టకము' ఉన్నది. మల్లికార్జునశతకము తెలుగులో ప్రకటింపబడుచున్న అనేక శతకములలో ఒకటి.

—శ్రీ.శ్రీ.

## హనుమచ్ఛతకము

గ్రంథకర్త: ఎఱ్ఱమిల్లి సూర్యప్రకాశకవి. డెమ్మీ సైజు పుటలు 33. ప్రకాశకుడు: ఎఱ్ఱమిల్లి సుబ్బారాయుడు, అమలాపురం.

౧౮౧౭ సంవత్సరములో గ్రంథకర్తగారి మునిమనుమనిచే, ప్రకటింపబడినది. ఇందు శబ్దాలంకారములు దొర్లింపబడినవి. 'వార్ధిలంఘనసంరంభ వాయుడింభ' అని మకుటము. —శ్రీ.శ్రీ.

## రామదేవశతకము

గ్రంథకర్త: తిరునగరి వేంకటనరసనూరి. హోప్ అండుకో, గుంటూరు. క్రౌనుసైజు. పుటలు ౨౦. వెల రు ౦-౨-౦.

రకరకాల శతకాలను పేరుకొనుచు ఉపోద్ఘాతములో ఉన్న వ లక్ష్మీనారాయణగారు '......నీతి మత శృంగారపరము లేగాక పెక్కు శతకము లితరవిషయము లగూడ బోధించుచున్నవి...... రామలింగేశశతకము... మున్నగునవి క్రొత్తదారులు తీసినవి' అని వ్రాసినారు. రామదేవశతకము ఎక్కువ ఈ రెండవరకమునే పోలును. మొదటివి కొన్ని పద్యాలు దైవప్రార్థనతో సాగినను తర్వాత తర్వాత ఆచారాదులను విమర్శించునవి ఉన్నవి. 'క్రొత్తదారులు తీసిన' శతకముల వెనుకనే ఇది నడచును.

—శ్రీ. శ్రీ.

## భారతసిద్ధచరిత్ర, 1 వ భాగము

క్రౌన్ సైజు 262 పేజీలు. వెల రు. 1-6-0.

కాపలపాటి కృష్ణమూర్తిగారిచే రచింపఁబడిన యీగ్రంథమున 1 గౌతమబుద్ధుఁడు, 2 శంకరాచార్యులు, 3 చైతన్యదేవుఁడు, 4 త్రైలింగస్వామి, 5 రామకృష్ణ పరమహంస, 6 వివేకానందస్వామి, చరిత్ర లింపుగ వర్ణింపఁబడినవి. ఎడనెడ శ్లోకములు, పద్యములు పూర్వకవి గ్రంథముల లోనివి చేర్పఁబడినవి. శ్రీనోరి సుబ్రహ్మణ్యశాస్త్రి, వడ్డాది సుబ్బరాయకవి, కూచి నరసింహము పంతులు, మొదలగు మహామహులచేఁ బ్రశంసింపఁబడిన యీగ్రంథప్రాశస్త్యమును వేఱుగ నుడువ నవసరము లేదు. కాని భారతసిద్ధులలో మతస్థాపకులగు శ్రీ రామానుజులు, మధ్వాచార్య, బసవేశ్వరుఁడు దీనిలో లేకుండుట విచారకరము. రెండవ భాగమునవారు చేర్పఁబడుదురు గాక. అయినను కాలక్రమానుసారులగు సిద్ధులు వరుసగ నుండఁదగు. ఇందు చరిత్ర ప్రసిద్ధమంతఁగ లేని త్రైలింగస్వామి వర్ణింపఁబడుట ప్రశంసనీయము. ఈగ్రంథము పాఠశాలలలోఁ బాఠ్యగ్రంథముగా నుంపఁదగియున్నది. వలయువారు గ్రంథకర్తగారి పేర విజయనగరమునకు వ్రాసిన బడయగలరు.

పెం. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

## వీరవనితలు

క్రౌను సైజు 123 పేజీలు.

ఇది ఆంధ్ర శేషగిరిరావుగారిచే రచింపఁబడినది. గ్రంథముయొక్క ప్రథమభాగము. ఇందు, రాణిసంయుక్త, 2 కరుణదేవి, 3 పద్మిని, 4 జహ్వేరీబాయి, 5 రాంబాయి, యను రాజపుత్రవనితల చరితములు బాగుగ వర్ణింపఁబడినవి. అందందు, రసికజనమనోభిరామము, అనిరుద్ధచరిత్ర మొదలగు గ్రంథములలోని శృంగారరసప్రధానపద్యములు చేర్పఁబడినవి. ఆలంకారిక మతమున వీరశృంగారరసముల కైక్యముఁ గలుపరాదు కాని యీ కాలమునందలి గ్రంథములలో రససాంకర్యము చేయఁబడు చున్నది. స్త్రీలకుఁ బాఠము చెప్పుటకు శృంగారరస మతివేలమైయున్నదను సందియమును విడిచినయెడల గ్రంథము పాఠశాలలలో పాఠ్యగ్రంథముగా నుపయోగింపఁబడఁదగియున్నది. వలయువారు గ్రంథకర్తగారి పేర పాలకొల్లునకు వ్రాసిన బడయగలరు.

పెం. వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

## తంజావూరు మహారాష్ట్రరాజుల చరిత్ర

గ్రంథకర్త: కే. ఆర్. సుబ్రహ్మణ్య అయ్యరుగారు గ్రంథము క్రౌను సైజు; పుటలు ౧౧౧. ఈగ్రంథము వలయువారు గ్రంథకర్తగారికి, 60, టి. యస్. వి. కోయిల్ వీథి, మైలాపూరు, మద్రాసుకు వ్రాయవలెను.

ఇటువంటి చిన్నచిన్న స్థానికసంస్థానముల చరిత్రము లింతవఱకు—ఏవో అక్కడక్కడ కొన్ని తప్ప-

రచియింపబడియుండలేదు. ఈకొఱత కొంతవఱకు ఈ పుస్తకము నివారించిన దనవచ్చును.

ఇందు మొదటి అధ్యాయము తంజావూరు చరిత్ర విజయనగర రాజుల కాలమునుండి కుంఫిణీ ప్రభుత్వమువరకును సంగ్రహముగ వర్ణింపబడినది. రెండవ అధ్యాయమున తంజావూరు నాయకరాజ్య చరిత్రము తెలుపబడినది. తంజావూరురాజ్యమును మహారాష్ట్రులకు పూర్వమేలినవారు నాయకులే యగుటచేత వారి చరిత్రము నీరెండవ ప్రకరణమున దెలుపుట యుక్తముగ నున్నది. మూడవ ప్రకరణమునందు తంజావూరు మహారాష్ట్రరాజ్య సంస్థాపకుడగు వెంకాజీ పరిపాలనము వర్ణింపబడియున్నది. ఈసందర్భమున వెంకాజీ, శివాజీల పరస్పరసంబంధము కొంత తెలుపబడినది. పై యిరువుర కలహములవల్ల దక్షిణాపథమున మహారాష్ట్రసామ్రాజ్య సంస్థాపన సాగినదికాదని గ్రంథకర్త విచారించుచున్నాడు. తదనంతరము వెంకాజీ మువ్వురు కొమారులగు షాహజీ, శరభోజీ, తుకోజీలు కలిసి రాజ్యముచేసినట్లు చెప్పబడియున్నది. ఈకాలముననే మొగలుల దండయాత్ర సాగినది. తంజావూరు సంస్థానము స్వాతంత్ర్యమును గోల్పోయి మొగలాయి సామంతరాజ్యముగ మారినది. షాహజీ మరణానంతరము శరభోజీ, తుకోజీలు రాజ్యముచేసిరి. వీరికాలమున రామనాథ సంస్థానముతోడి యుద్ధము సంభవించినది. కావేరికి గట్లు తెగిపోగా మహారాష్ట్రులు వాటిని మరమ్మతుచేయించి ప్రజల కృతజ్ఞతకు పాత్రులైరి. పదునెనిమిదవ శతాబ్ది మధ్యమున దక్షుడగురాజు లేకపోవుటచే రాజ్యమరాచకమయ్యెను. అటుపిమ్మట ప్రతాపసింహుడు, తుల్యాజీ, అమరసింహుడు మొదలయినవారు రాజ్యముచేసిరి. రెండవశరభోజీ తంజావూరిలో రాజ్యముచేసిన మహారాష్ట్రులలో కడపటివాడని చెప్పవచ్చును. ఇతడే రాజ్యమును కుంఫిణీవారి కప్పజెప్పిన ఘనుడు. పదునొకండవ యధ్యాయమున ఈ మహారాష్ట్రరాజుల రాజ్యపాలనాపద్ధతియు, పంద్రెండవ యధ్యాయమున వారి పరమత సహనమును, ధర్మకార్యములును, పదుమూడవ అధ్యాయమున ఆర్థికపరిస్థితులును చక్కగా వర్ణింపబడినవి.

తంజావూరి మహారాష్ట్రరాజులు తమిళకర్ణాట ఆంధ్రగీర్వాణ విద్వాంసులకు ఆశ్రయమొసంగి దేశీయ వాఙ్మయమును ఎంత యభినివేశముతో పోషించియుండిరో, వారికాలమున వేలువేలుభాషలలో నెట్టి యుద్గ్రంథములు బైలువెడలినవో తెలిసికొనగోరువారు ఈ గ్రంథమును తప్పక చదివితీరవలయును.

గ్రంథకర్త ఈమహారాష్ట్రరాజుల కాలపు వాఙ్మయచరిత్రకు ప్రత్యేకము ఒకప్రకరణమును వినియోగించియుండిన చాలబాగుండెడిది. ఎక్కడికక్కడ ముక్కముక్కలుగ విడదీసిచెప్పుటచేత అప్పటివాఙ్మయాభివృద్ధిని గురించి సరిఅయిన యొక చక్కని అభిప్రాయమునేర్పఱచుకొనుటకు వీలుకాకున్నది. తంజావూరు మహారాష్ట్రరాజులు తమకు పూర్వులైన నాయకరాజులవలెనే ఆంధ్రకవులను పోషించుటయే కాక తాముకూడ స్వయముగ గ్రంథకర్తలై గ్రంథములను రచియించియున్నారు.

తంజావూరు మహారాష్ట్రరాజులు రచియించిన తెలుగు యక్షగానములు ఇప్పటికిని అముద్రితములై తంజావూరు సరస్వతీ పుస్తకభాండారమున గలవు. ప్రత్యేకము ఈమహారాష్ట్రరాజుల ఆదరప్రోత్సాహములవల్ల అభివృద్ధిచెందిన ఆంధ్రవాఙ్మయ స్వభావమును గుఱించి గ్రంథకర్త విపులముగ వర్ణించియుండిన నెంతయో ఆంధ్రభాష కుపకారకముగ నుండెడిది.

ఈగ్రంథములో నున్న గొప్పలోపమేమన— మహారాష్ట్రరాజుల వంశవృక్షము లేకపోవుట. అది యున్నచో గ్రంథపాఠకులకు విషయపరిగ్రహణమునకు చాల సహాయకారిగ నుండెడిది. మ. సో. శ.

## Hindi English Self-Instructor.

హిందీ–ఇంగ్లీషు స్వబోధిని. గ్రంథకర్తలు: శ్రీ మోటూరి సత్యనారాయణ, అవధనందన్‌గార్లు. ప్రకాశకులు: దక్షిణ భారతహిందీప్రచారసభ, ట్రిప్లికేన్, మదరాసు. 1/16 క్రౌనుసైజు. 147 పుటలు. అట్టబైండు. వెల ఒక్కరూపాయి.

ఇది హిందీప్రచార పుస్తకమాల 7 వ ప్రచురము. ఇదివరకు వీరిచే ప్రచురింపబడిన స్వబోధినులన్నిటి

కంటె నిది మేలురకముగా రచియింపబడినది. ఇదివరకు స్వబోధిను లన్నిటిపైన నిది యొకగొప్ప సంస్కార మన దగును. ఎక్కువ సక్రమముగను, సులువుగను పాఠము లేర్పరుప బడినవి. పాఠశాలా విద్యార్థులకు ననువుగ నుండునట్లు పాఠముల క్రమమును పద్ధతియు నుండుట గమనింప దగినది. ఇంగ్లీషున కెక్కువ దగ్గరగ నుండునట్లును గ్రంథకర్తలు పాటుపడిరి. వ్రాసిన వారిద్దరును దినమును హిందీని పెద్దలకు పిన్నలకును బోధించి దాని మంచిచెడ్డలను కష్టసుఖములును యెఱిగిన వారగుట వారి కార్యము విజయవంతముగ నిర్వహింపబడినదనుట కేమియు సందియముండదు. ఒకేపుస్తకములో హిందీవ్యాకరణ సూత్ర సారాంశమంతయు నించుమించుగా నిమిడ్చివేసినను తగు నుదాహరణములతోను మధ్యమధ్య నిష్టము కలిగించు సంభాషణ వాక్యములతోను చదువుట కింపగునట్లు జ్ఞాపకమునకు సులువగునట్లును చేయబడినది. పుస్తకము చివరను అంకెలు సంఖ్యలు, ఫ్రాక్షన్లు, వారములు మాసములు, దిక్కులు, అన్నపానీయములు, వంట సామగ్రివస్తువులు, పండ్లు కాయలు, ధాన్యములు, శరీరావయవములు అంగములు, జంతువులు, పక్షులు, బంధుత్వములు, పనివాండ్రు, లోహములు, రాళ్లు, మందులు, రోగములు–ఈ మొదలగు వాని పేర్లన్నియు తెలుపుట వలన చదువుకొనువారి కనేక హిందీశబ్దములు తెలియగలవు. పాఠ్యవాచకము, వ్యాకరణము, శబ్దకోశము నన్నియు ఒప్పుగా నొకేపుస్తకముగా నుండుటయే యీ హిందీ ఇంగ్లీషు స్వబోధినియొక్క విశేషోపయోగము. హిందీ యభిలాషులందఱకు నిది యమూల్యోపయోగముగ నుండగలదు.

[జ. బ్ర.]

## శ్రీమద్భగవద్గీతా

సాధారణ భాషాటీకాసహితము (హిందీ). 1/32 క్రౌను చిన్నసైజు. 327 పుటలు. వెల రెండున్నర అణాలు మాత్రమే.

ఇది గోరఖ్‌పూర్ గీతాప్రెస్‌వారిచే ప్రచురింపబడినది. ఇందు శ్రీమద్భగవద్గీత సంస్కృత మూలశ్లోకము లిచ్చి వానితాత్పర్యమును సరళమైన చక్కని హిందీ వచనమందు వ్రాసిరి. అక్కడక్కడ పాఠాంతరములను విశేషార్థములను కూడ యిచ్చిరి. 18 అధ్యాయముల సంపూర్ణగీతను హిందీయందు ప్రవేశముగల ప్రతివాడును చదువుకొని సామాన్యముగనర్థము చేసుకొనుటకు మిక్కిలి బాగుగనున్నది. ముద్దులొల్కు సంపుటీకరణము, భావము చెడకుండ సాధారణటీకయు, గల యీ చిన్నపుస్తకము అతిచవుకగనుండి ప్రతివానిహస్తమున నుండుట కనుకూలముగ నున్నది. జేబులోను పెట్టుకొనవచ్చును. గీతా పారాయణపరుల కత్యంతోపయోగము. మురళీకృష్ణుని రంగుల చిత్రము అట్టపై నున్నది. [జ. బ్ర.]

## హిందీశిశుబోధిని

క్రౌను 1/16 సైజు 16 పుటలు. వెల 0-2-6. కాకినాడ గ్రేఫజరుపేట కూచిమంచి సుబ్బారావుగారు వ్రాసినది. నాగరీ, తెలుగు లిపిలో అక్షరమాల, చిన్న మాటలు వాక్యములు మొదటి పాఠములుగా నుపయోగింప దగినవి వ్రాయబడినవి. హిందీ ప్రచారమునకు కొంత తోడ్పడగలదు. [జ. బ్ర.]

## శరభ రాజీయము

కవి: తుళ్లూరి శరభరాజు. ప్రకాశకులు: వేటూరి శంకరశాస్త్రిగారు, అర్క రసాయనశాల, ముక్త్యాల. డెమ్మీ సైజు. పుటలు ౩౮౮. వెల రు ౧–౮–౦.

మూడాశ్వాసములు సమగ్రముగను, నాల్గవయాశ్వాస మసమగ్రముగనుగల యీవైద్యప్రబంధమున ఆంధ్రదేశవైద్య సంప్రదాయము ననుసరించి రోగలక్షణములు, ఔషధయోగములు (ఎక్కువగా) వివరింపబడినవి. నాల్గవ యాశ్వాసమును ఇంచుమించు శరభరాజుకుమారుడు మాధవరాయడు రచియించినాడు. కవిత్వము దోషబహుళము. ఇందు "ఛాందసులకు తప్పులు దోపవచ్చును. వైద్యము విషయప్రధానముగదా!" అని ఏతద్గ్రంథ సంపాదకులు 'నివేదనము'న నివేదించినారు. తప్పులను పాటించువారు దీనితో తృప్తిచెంద దగుదురు.

జీర్ణించిపోవుచున్న యిట్టి తెలుగునాటి వైద్య గ్రంథములను పెక్కిటిని సంపాదించి ముద్రించి సమస్త

రించుటకు ముక్త్యాలప్రభువులు శ్రీశ్రీ రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వరప్రసాదబహద్దరువారు మిక్కిలి తోడ్పడు చున్నారని సంపాదకులు తమ సంతోసమును ప్రకటించినారు. శ్రీరాజావారి యాయుర్వేదాభిమానము సంపాదకులతోపాటు తెలుగునాటి వారికందఱికిని మిగుల సంతసమును గూర్చునది కాదగును.

## శృంగార సత్యభామా సాంత్వనము.

గ్రంథకర్త: లింగనమఖి కామేశ్వరకవి. ప్రకాశకులు: జి. యస్. శాస్త్రి అండుకో, తపాలుపెట్టె నెం. ౧౧౦, మద్రాసు. క్రౌనుసైజు. పుటలు ౨౬౪. కాగితము, బైండు అందముగా నున్నవి. వెల రు. 3-0-0

నాల్గాశ్వాసముల యీ రసవత్ప్రబంధమును క్రీ.శ. ౧౬౭౦ ప్రాంతముల మధుర రాజధానిగా పాండ్యదేశమును బరిపాలించిన ముద్దళగిరికి కృతికర్త కృతి యొసగినాడు. ఇతడు కృతిపతి తాతకాలమునుండియే వీరియాస్థానమున కవియై సత్కారముల బడయుచుండినవాడు. మధుర రాజులపేర వెలసిన కృతులలో నిదియే మొదటిదగును. ఇందలికథ నరకాసురవధ. ప్రధానరసము శృంగారము. కవిత ప్రాసయమకాదిశబ్దాలంకారబహుళము. శైలి. నాతికఠినము, సరసము. మచ్చునకొకటి రెండు పద్యములు:

ఉ. తావులవెంబడిం దగిలి
తార్కొనెఁ దేటులు తేఁటిమొక్కలం
బోవక నాటెఁ బుప్పొడియుఁ
బుప్పొడితోఁ దగెఁ బూవుసోన యా
పూవులసోనతో మిగులఁ
బొల్చెను కల్పలతప్రసూనమా
ధ్వీవిసరంబు నావెనుక
వీచెను కమ్మని చల్లదెమ్మెరల్.

ఉ. తెమ్మెర వీవఁగానె కడు
తెల్లని సీవిరిగుంపు లంతటన్
గ్రమ్మెను పండువెన్నెలలు
గాసినకైవడి వాడిజాబువా
కమ్మపసిండికాఁడలు చొ
కాటముగాఁ దమహస్తపంకజా
తమ్ములఁ బూనునచ్చరల
తండము నిండె నఖండసంపదన్.

## పురాణవాచకము

౧-౫ తరగతులవరకు ౫ ప్రత్యేకపుస్తకములు. గ్రంథకర్తలు: విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు, యం. ఏ., యల్. టి., భోగరాజు నారాయణమూర్తిగారు. ప్రకాశకులు: వెంకటరాం అండు కో, ఏలూరు. క్రౌనుసైజు. కాగితము, అచ్చు, బైండు బాగుగ నున్నవి.

| | | | |
|---|---|---|---|
| ౧ పుస్తకము | వెల | రు. | ౦-౨-౬ |
| ౨ | ,, | ,, | ౦-3-౦ |
| 3 | ,, | ,, | ౦-౪-౦ |
| ౪ | ,, | ,, | ౦-౫-౦ |
| ౫ | ,, | ,, | ౦-౬-౦ |

ఈ పురాణవాచకములలో రెండువంతులు రామాయణ మహాభారతేతిహాసముల కథలు ముక్కలు ముక్కలుగ నున్నవి. ఒకవంతు భాగవత పురాణమంజరి కథలున్నవి. పెక్కువాచకపుస్తకములలో వలె 'కుక్క' 'నక్క' 'మంగలిరాముడు' మొదలగు విషయములుగూర్చిన కథలుగాక గ్రంథకర్తలు భారతదేశము యొక్క ప్రాచీన చరిత్రను, నాగరికతను, ఔన్నత్యమును చాటు నితిహాస పురాణగాథలను వ్రాయుట తెలుగు పిల్లల భాగ్యము. వీరియెడల బాలకులు కృతజ్ఞులై యుండదగుదురు.

ఒకతరగతి పుస్తకములో చెప్పిన కథనే ఇంకొక తరగతి పుస్తకములో విరివిగ చెప్పియుండుటచేత పునరుక్తి రాకతప్పనదికాదు. ఇట్లుకాక రామాయణ మహాభారతములనుండి తీసుకొన్న కథాభాగమును తరగతికితగిన శైలిలో ఒకతరగతి పుస్తకముననే విరివిగ వ్రాసి తరువాత కొంతభాగమును ఇంకొక పుస్తకమునందును ఇట్లే కథను ౫ పుస్తకములయందును వ్రాసి ముగియజేసి యుండిన బాగుండెడిది. మొదటి రెండుతరగతులపుస్తకములలో తప్ప తక్కినవానిలో నొండొంటి శైలియందు విశేష

మంతగా గాన్పింపకున్నది. అట్లుకాక క్రిందితరగతి దాని కంటె పైతరగతి దానిశైలి మించియుండు టావశ్యకము.

ఈ పుస్తకములయం దచ్చటచ్చట కనుపించుచున్న 'అందలును చంపబడిరి', 'ధర్మరాజునకు పట్టాభిషేకము చేయబడెను', 'కౌరవులు చంపబడిరి' ఇత్యాది కర్మణి ప్రయోగములు తెలుగుబాసకు అందము నిచ్చునవి కాజాలవు. స్వతస్సిద్ధములు, శాస్త్రసిద్ధములు నయిన అరసున్నలు, శకటరేఫలు, సంధులు, వీనియందు సరిగా పాటింపకుండుట పిల్లలకు కలవరమును గలిగించును. అసలు ఈ తరగతులవారికి ఇట్టినియమములే లేకుండుట శ్రేయము. ఉండవలయునన్న సరిగా నుండవలెను. చిన్నపిల్లలకొరకయిన యిట్టివాచకములను రచయితలు, ప్రకాశకులు పనిపూని నిర్దుష్టముగ నుండునట్లు చేసినచో వారికి చాలమేలు చేసినవా రగుదురు. ఈవాచకములలో కథా సందర్భముల ననుసరించి చిత్రములు, రామాయణ మహాభారతములనుండి ఏర్చి చేర్చిన పద్యములు నున్నవి. చివర నీతిపద్యములు నున్నవి. మూడవతరగతి పుస్తకమున మొదలు చివరవ్యాకరణవిశేషములును గలవు. ఈపుస్తకములను పాఠశాలలయం దుపయోగింప విద్యాశాఖవా రంగీకరించి యున్నారు. —భారతి.

## ఆంధ్రవాచకము

(౧–౫ తరగతులవరకు ౫ ప్రత్యేక పుస్తకములు)

గ్రంథకర్తలు: ఏ. జయరామరావుగారు, బి. ఏ. యల్. టి., దర్భాజగన్నాథశాస్త్రిలుగారు, కే. హెచ్. వి. యస్. నారాయణగారు బి. ఏ. యల్. టి.

క్రౌనుసైజు. కాగితము, అచ్చు, బైండు అందముగానున్నవి. బొమ్మలున్నవి. ప్రకాశకులు: వేంకటరామ్ అండుకో, ఏలూరు.

| | | | |
|---|---|---|---|
| వెల ౧ వ | తరగతి | పుస్తకము రు | ౦–౨–౬ |
| ౨ | ,, | ,, | ౦–౩–౦ |
| ౩ | ,, | ,, | ౦–౪–౦ |
| ౪ | ,, | ,, | ౦–౫–౦ |
| ౫ | ,, | ,, | ౦–౬–౦ |

ఈవాచకములు చిన్నతరగతుల పిల్లలకు సంతోషమును, ఉత్సాహమును, ధైర్యమును, దేశభక్తిని గలిగించు కథలతోడను, వారికి నిత్యజీవనమునం దావశ్యకములైన విషయములతోడను ఒప్పియున్నవి. ఇతిహాసపురాణాదులు, దేశచరిత్ర, మహనీయుల జీవితములు, ప్రకృతిలోని పెక్కువిషయములు నీవాచకములయందలి కథలకు మూలములు. తేటతేనెవలె నూటలూరించు నీపుస్తకముల రచనము తెలుగుదనము గలిగి వెలయుచు విషయములను బాలకుల మనములయందు లెస్సగా నాటుకొనజేయగలిగియున్నది. శైలి ఆయాతరగతికి దగినట్టులున్నది. గ్రంథకర్తలు ప్రాచీనపద్యకావ్యములనుండియు, శతకములనుండియు, చాటువులనుండియు చక్కని పద్యములను ఏర్చి యీ వాచకముల చివరను చేర్చియున్నారు. నేడు చెదలువలె బయలుదేరుచున్న పిల్లల పుస్తకములలో నివి ఉత్తమములు. ఇట్టివానిని రచియించి బాలురకొసఁగిన గ్రంథకర్త లభినందనార్హులు. అక్కడక్కడ బొమ్మలనుకూడ చేర్చి యీవాచకములను నిర్దుష్టముగ ముద్రించిన ప్రకాశకులును ఇట పేర్కొనదగుదురు.

—భారతి.

## శ్రీకృష్ణభారతము, (భీష్మద్రోణపర్వములు)

కృతికర్త: కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు. కృతిపతి: శ్రీయుత రేపాక సత్యనారాయణమూర్తిగారు. పాలకొల్లు, పడమటిగోదావరిజిల్లా.

రాయలుసైజు, పుటలు ౬౧౧. బైండు సొగసుగా నున్నది. వెల తెలుపలేదు.

కవిరాజ బిరుదాంచితులగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలుగారు తెలుఁగునాటివారి కీనాఁటివారు కారు. మఱియు వారీగ్రంథముయొక్క పీఠికయందు

"నేనాంధ్రంబునఁ గించి
న్న్యూనంబుగ నూఱుకృతుల నున్నతి నొందం
గా నొనరించితి లోకము
వానిం జవిచూచి యెఱుఁగు బలుకఁగ నేలా?"

అని చెప్పికొనియున్నారు. ఇఁక వీరిమధురకవితయందలి రసమును గ్రోలని యాంధ్రుఁ డున్నచో వింతగాఁ జూప

టకపోదు. శ్రీ శాస్త్రిలుగారు నూలమునకు సరిగఁ దెనిఁగింపఁ బూనినవారగుటచే తిక్కన సోమయాజిగారేకారణముననో తెనిగింపక విడిచిన భీష్మ పర్వాంతర్గతమును 'భగవద్గీతాధ్యాయము' సమగ్రముగ నీసంపుటమున గల దని పాఠకు లెఱిఁగి యుండవలెను.

కృతిపతియగు శ్రీ రేపాక సత్యనారాయణ మూర్తి గారు గోదావరీమండలమునందలి పాలకొల్లు గ్రామనివాసులు, వైశ్య శిఖామణులు. వీ రీసంపుటముద్రణమున కయినధనమునొసఁగి శ్రీ శాస్త్రిలుగారి నాదరింపిరట. 'శ్రేయాంసి బహు విఘ్నాని' అన్నట్లు ౧౫ సంవత్సరములకు పూర్వము ప్రారంభమయిన యీ భారతాంధ్రీకరణము యుద్ధపంచకముతో మూలబడి యుండినది. ఇపుడు శ్రీ నారాయణమూర్తి గారి తోడ్పాటుచే నీరెండుపర్వములును బయలు దేరినవి. ఇట్టి యుదారహృదయులు, కవిపండిత ప్రియులునగువారి నీకాలమున వ్రేళ్లపై లెక్కింపవలసియున్నది. వీరివలెనే యీభారతాంధ్రీకరణము సంపూర్ణమయి యచిరకాలమున నాంధ్రలోకమునకులభించుటకు వలసిన సాహాయ్యమును శ్రీశాస్త్రిలుగారికొసంగఁజాలిన శ్రీమంతు లాంధ్రదేశమున బయలు దేరుదురనునాశ ఇంకను గలదు. ఆశాభంగము కలుగకుండ దైవ మనుగ్రహించుఁగాక!

—భారతి.



శ్రీ రేపాక సత్యనారాయణమూర్తి

## మధ్వాచారిజీవితము

కర్త: లక్కోజి వీరభద్రరావుగారు. డిమ్మీ చిన్న సైజు. పేజీలు ౫౬. వెల ౧-౮-౦.

## బ్రాహ్మణస్వరూప కథనం

కర్త: శ్రీమద్బోధానంద సరస్వతీ యతీంద్రులు. డిమ్మీసైజు. పేజీలు ౩౨. వెల ౦-౮-౦. వలయువారు: గురుకులాశ్రమము, చిలమూరు; అనంతవరం. అని వ్రాసిన బడయగలరు.

## కృష్ణవేణీ మాహాత్మ్యము

పద్యకావ్యము: కర్త: మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారు, నర్సారావుపేట. డిమ్మీసైజు. పేజీలు ౧౧౧. వెల రు. ౦-౬-౧.

స్కాందపురాణాంతర్గతమైన సహ్యాద్రిఖండము నందలి కృష్ణానదీమాహాత్మ్యము దీనికిమూలము. ఇందు మూడాశ్వాసములు గలవు. ప్రాచీన పద్ధతి ననుసరించి గ్రంథమును కవి ప్రారంభించినాడు. విశేషముగ నిందు ఆధునిక కవులను—మాడభూషి వెంకటాచార్యులు మొదలుకొని గుఱ్ఱము జాషువకవిగారు తుదగా నరువది డెబ్బదిమంది కవులను సీసమాలికయందెట్లో యిమిడ్చిబంధించినాడు. పురాణమున కనువాదమగుటచే నీగ్రంథము పురాణశైలి నుండుట వింతకాదు. మచ్చునకు

ఉ. ముక్తినిఁగోరు సత్వగుణ
ముఖ్యుల కీ చరితంబుఁ దెల్ప వి
ధ్యుక్తముగాని నాస్తికమ
తోద్ధతులై చరియించు వారికిన్
భక్తివిహీనులై తిరుగు
పందలకున్ దెలుపంగరాదు బల్
రక్తి నెలంగునే మణిని
రాజునకీయక వాజకిచ్చినన్.

*        *        *        *        *

క. గిరిదక్షిణభాగంబున
నరసింహుఁడు భవ్యరూపునం గుహాసీమం
తరమున వెలసెను లోకో
త్కర సేవన లెసఁగ దివ్య తరమహిమతగన్.

చ. ఒనరగఁ గృష్ణవేణి మణి
యోషధభాసిత బీజరాజికై
కొని సరిదీశునింగవయు
కోరిక నేగుచుఁ గీలశైలమున్
గని చనుదేర మార్గమును
గానక యిచ్చట నిల్చె నిల్వ
బీజనిచయ మంకురింప నిది
సార్థకమయ్యెను బీజవాడనాన్.

గ్రంథస్థ గుణదోషకవితా సారస్యగ్రహణమునకు వాతకుల కివి చాలును.

## దుర్గావతి

చారిత్రక నాటకము. సరస్వతీగ్రంథమాల ౧౪ వ పుష్పము. కర్త: ఆంధ్ర శేషగిరికవి. డిమ్మీసైజు. పేజీలు ౯౬. వెల ౧ రు. వలయువారు సంపాదకుడు: సరస్వతీ గ్రంథమాల, కాకరపఱ్ఱు అని వ్రాసిన బడయగలరు.

పంచాంకపరిమితమగు నీనాటకమున దుర్గావతి యను నొకరాజపుత్రయువతిచరిత్ర మోదాంతముగ వర్ణితమైనది. ఇందలి చరిత్రాంశము అక్బరుచక్రవర్తి కాలము నాటిది. చారిత్రకవిషయము లున్నవున్నట్లు లుండుట శ్రేయము కాని లేనిపోని కల్పనలతోనింపి ఇట్లు నాటకములయి చరిత్రానూ్మలనమునకు దోడుపడుట సమంజసముకాజాలదు. ఇక నీ నాటకమునందలి రచనము పాత్రపోషణాదులను గూర్చి చెప్పటావశకముకాదు; కాని ఈక్రిందిప్రయోగములను బరికింప పాఠకులకు వేడికోలు: 'తెల్విహీననయి' 'కృపాపాత్రుమ్రను' 'సమార్చన' 'ప్రహలాద' 'మస్సకాసను' 'విమలయానంద బాష్పములో' కారుణ్యనెలవులు మొదయినవి.

## గీర్వాణవాక్ప్రపంచచరితము

కర్త: పిన్నంరాజు వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు గూడూరు, నెల్లూరుజిల్లా. క్రౌను సైజు. పేజీలు ౧౨౯. వెల ౧–౪–౦

## ఆసవారిష్టదీపిక

కర్త: డాక్టర్ కొత్తపల్లి బుచ్చయ్య శర్మగారు. పోలమూరు, ప. గోదావరి. డిమ్మీసైజు. పేజీలు ౨౫౧ వెల ౯ అ.

## మార్గోపదేశిక

ఇదియొక తెలుగు లక్షణగ్రంథము. (తరగతి) గ్రంథకర్త వఝ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు, ప్రధానాంధ్రోపాధ్యాయులు, సంస్కృతకళాశాల, విజయనగరము.

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండుసన్సు, ఎస్ప్లనేడ్ చెన్నపురి. డిమ్మిసైజు పుటలు ౧౧౦. వెల తెలియదు.

## పంచాయతీకోర్టుసంగ్రహం

కర్త: అక్కిరాజు వాసుదేవరావుగారు, నత్తికొండ, పిడుగురాళ్ల పోస్టు. డిమ్మీసైజు. పేజీలు ౮౭. వెల రు ౧.

## TELUGU LITERATURE

## ఆంధ్రవాఙ్మయచరిత్రము

క్రౌనుసైజు, ౧౩౭ పుటలు, వెల రు. ౧.
Heritage of India Series లో ప్రకటితమైనది.

తెలుగు వాఙ్మయచరిత్రమును ఈచిన్న పుస్తకము నకు కర్తలిద్దరు. చెన్నపురమున సుప్రసిద్ధ న్యాయవాదులు పండిపెద్ది చెంచయ్యగారొకరు; ప్రఖ్యాత విశ్వకవి పోషకులగు రాజా మంత్రిప్రగ్గడ భుజంగరావు గారు రెండవవారు.

ఈ గ్రంథమును రచించుటలో "ఆంధ్రకవుల జాబితాను సమగ్రముగ నొసగి వారి గ్రంథములను గూర్చి విస్తరించిన సమాచారమును దెల్పుటయేకాక తన్మూలమున (కాలక్రమమున పెరిగిన) ఆంధ్రవాఙ్మయపు వారసత్వము (heritage) యొక్క వాస్తవమైన విలువను నిర్ణయించుటయే" తమ యుద్దేశ్యమైనట్లు గ్రంథకర్తలు ముఖపత్రమునందు తెలియజేసియున్నారు. ఈయుద్దేశ్య మెంతవఱకు నెఱవేరినదో చూడవలసి యున్నది.

విమర్శకులందు పేరందిన కట్టమంచి రామలింగారెడ్డిగారు దీని కొకయుపోద్ఘాతమును వ్రాసియున్నారు. అది విలువకలదేగాని యందు వచింపఁబడినవిషయములు కొన్ని నిజమునకు దూరములగుటచే దాని విలువయించుక తగ్గిపోయినది. ఈ క్రింది వాక్యముయొక్క నిజ మరయుదము. "సంస్కృతము నందును, దేశభాషలయందును ఉండిన జైనబౌద్ధ వాఙ్మయములు బ్రాహ్మణమత పునర్విజృంభణము వల్ల దాక్షిణ్యము లేక నాశనము చేయబడుట మన వాఙ్మయచరిత్రలోని విషాదకరమగు విషయములలో గొప్పది." ఇది నిరాధారమైన వ్రాత. జైనబౌద్ధవాఙ్మయ వినాశనహేతువు బ్రాహ్మణ మతపునర్విజృంభణము కాదు. బ్రాహ్మణమతమును నిర్మూలింప సమకట్టిన లింగాయత మతమే దీనికి ప్రబలకారణము. ఈమతగురువులలో ప్రముఖులొక్కరు తమ శిష్యులకు శైవేతర మత గ్రంథములను దగుల వేయుడని యుపదేశించి యున్నారు.

"శివనిందా విషయంబగు
నవమానము సెప్పునట్టి యప్పుస్తకముల్
అవిచారంబున గాల్పగ
నవు జెప్పెడి వాని జంప నగు నీశానా"

లింగాయతులచే బౌద్ధులు, జైనులు పడిన పాట్లు వీరశైవవాఙ్మయము జదివిన వారికెల్లను గుర్తెరుకయే. అయినను రెడ్డిగారు దీనినెఱుఁగ కుండుట వింతయే! అట్లెఱుంగకున్నను నిందను బ్రాహ్మణ మతముపై మోపుట వింత వింత!

ఇక గ్రంథమునుగూర్చి విచారింతము. ప్రవేశాధ్యాయమునందు ఆంధ్రోత్పత్తియు, ఆంధ్రదేశవర్ణనయు, ఆంధ్రజన శాఖావిచారమును, ఆంధ్రభాషాప్రశంసయు, ఆంధ్రలిపి పరిణామమును వర్ణింపబడియున్నవి. కడపట ఆంధ్రవాఙ్మయ చరిత్రమున కాధారములను గూర్చి కొంత వ్రాయబడినది. ఈయాధారములలో శాసనములుగూడ చేర్పఁబడినవి. ఈగ్రంథరచనమునందు, రచయితలు సౌకర్యార్థమై వాఙ్మయమును యుగములుగ విభజించి, యట్లు విభజింపబడిన యుగములను సూక్ష్మముగ వర్ణించియున్నారు. ఆంధ్రలిపి పరిణామమును గూర్చి ముచ్చటించుచు, క్రీస్తుపూర్వము నాలుగవశతాబ్దిని ఉత్తరదేశమున బ్రాహ్మియు, దక్షిణాపథమున ద్రావిడబ్రాహ్మియు వాడుకయందుండెనని గ్రంథకర్తలు నుడివియున్నారు. 'ద్రావిడబ్రాహ్మి' యనునది క్రొత్తమాట. దీనియర్థమును వివరించియుండిన చదువరులకు ఉపయుక్తముగ నుండెడిది.

ద్వితీయాధ్యాయమున ఆంధ్ర వాఙ్మయమునకు ప్రోత్సాహమిచ్చి నటువంటి చారిత్రక మతవిషయములు వర్ణింపబడియున్నవి. మొదట క్లుప్తముగ నాంధ్రదేశ చరిత్రము, ఆంధ్రరాజుల కాలమునుండి క్రీ. శ. ౧౯ వ శతాబ్ది వఱకును వ్రాయబడియున్నది. ఇందు ప్రమాదము లనేకములు గలవు. ఆంధ్రరాజులు బౌద్ధులట! వీరు బౌద్ధులు కాని వారిశాసనము లుద్ఘోషించుచుండ గ్రంథకర్త లిట్లు వ్రాయుటకు గారణమేమో! పల్లవరాజులు బౌద్ధమతమును, బౌద్ధవాఙ్మయమును నిర్మూలము

చేసిరట. ఈవ్రాతకాధారము లెవ్వియో! మఱియు పల్లవులు దమరాజధానియగు కంచినుండి వెంగిమండలపు టుత్తరపు సరిహద్దువఱకు నిజసామ్రాజ్యమును వ్యాపింపజేసిరని వ్రాసియున్నారు. ఇది చరిత్రకు విరుద్ధమయిన సంగతి. ఇంకను ప్రాచీన పల్లవులు జైనులనియు, జనసామాన్యము జైనమత మవలంబించి యుండిరనియు జెప్పియున్నారు. పూర్వము దక్షిణదేశమున జైనమతము ప్రాముఖ్యము వహించియుండినది నిజమే. అయితే పల్లవరాజులు జైనులని చెప్పుటకుగాని, ప్రజలు జైనమతమునే స్వీకరించిరని గాని చెప్పుటకాధారములు గానరావు. ఉన్నచో గ్రంథకర్తలు చూపిరేని వారికి చారిత్రక పరిశోధకులు కృతజ్ఞులు కాగలరు. ఇట్లే ప్రాచీన చాళుక్యులు జైనులని నిర్ణయించియున్నారు. చాళుక్యులశాసనములు వారు హిందువులని వేనోళ్ల ఘోషించుచుండ వారుజైనులని పలుకుట ఆశ్చర్యము.

గ్రంథకర్తలు మతచరిత్రమును మిక్కిలి సంగ్రహముగా వ్రాసిరి. ఈవిషయము నింతకంటె విపులముగ వ్రాసియుండిన మతప్రాబల్యమువలన వాఙ్మయాభివృద్ధి యెట్లయినదియు చక్కగా తెలిసికొనుట కవకాశముండెడిది.

తృతీయాధ్యాయమున ఆంధ్రకవి జీవితము వర్ణింపబడినది. ఇందు విమర్శపక్షముకంటె కవిత్వపుపక్షమే యెక్కువగ గన్పించుచున్నది. గ్రంథమున నెల్లెడలను నగుపడెడు లోపమొకటి యీయధ్యాయమున మఱింత స్పష్టముగ దెలియవచ్చుచున్నది. కట్టుకథలనుండి చారిత్రకవిషయములను వేర్పఱుచశక్తిచాలక వానిని తారుమారుపఱుచుట ఇందు తెల్లముగ గాన్పించుచున్నది.

పంచమాధ్యాయమున నాంధ్రకవిత్వపు టారంభదశ వర్ణింపబడినది. నన్నయకు పూర్వము కవిత్వముండెనా లేదా యనునంశము మొదట చర్చింపబడెను. ఈసందర్భమున మార్గిదేశికవిత్వముల భేదము సూచింపబడెను. మార్గికవిత్వమును నన్నయ యుత్పత్తిజేసెనను అభిప్రాయము గ్రంథకర్తలకున్నట్లు తోచుచున్నది. నన్నయకుపూర్వము వాఙ్మయమున్నను అది 'తెలుగు - సంస్కృత' వాఙ్మయము కాదనియు, అట్టి 'తెలుగు=సంస్కృత' వాఙ్మయము నన్నయకాలమునుండియే ఆరంభమైనదనియు చెప్పియున్నారు. తెలుగు=సంస్కృత వాఙ్మయస్వరూప మెట్టిది? అది ఛందస్సునుబట్టి నిర్ణయమగుచున్నదా? లేక భాషలోని సంస్కృత దేశీయపద సమ్మేళనమునుబట్టి నిర్ణయమగుచున్నదా? ఏపక్షము నవలంబించినను తెలుగు సంస్కృత వాఙ్మయము నన్నయనాటినుండి యారంభమయినదని రాయిగ్రుద్దినట్లు చెప్పుటకు వీలులేదు. సంస్కృతదేశీయపద సమ్మేళనముచేనైనచో శాసనాదులలో ఇట్టి వాఙ్మయము క్రీ. శ. ౭వ శతాబ్దినుండియే ఆరంభమయినదని చెప్పవచ్చును.

ఈయధ్యాయమున మిక్కిలియు గమనింపదగిన విషయములు రెండుగలవు. (౧) నన్నయకుపూర్వముండిన వాఙ్మయస్వరూపము యుద్ధమల్లు, మోపూరు శాసనములవల్ల దెలియుచున్నదని గ్రంథకర్తలు వ్రాసిరి. యుద్ధమల్లుడు ఆంధ్రపండిత లోకమునకు జిరపరిచితుడే. మోపూరెవ్వడో! శాసనదాతయగు మనుష్యుని పేరా! లేక శాసనమున్న స్థలము పేరా? స్థలము పేరయిన మోపూరెచ్చటిదో, శాసనదాత యెవ్వడో తెల్పిన బాగుండెడిది. శాసనపరిశోధకపండితప్రపంచమునకు ఈ శాసనము క్రొత్తది. గ్రంథకర్త లెంత ప్రయాసపడి సంపాదించిరో! (౨) వేమనయొక్క చతుష్పదిగీతములయొక్కయు, ద్విపదలయొక్కయు ఛందస్సును పెంచి, నన్నయ తరువోజ, అక్కఱ, సీసముల ఛందస్సును సృజించెను అని గ్రంథకర్తలు వ్రాసియున్నారు. ద్విపదగీతముల ఛందస్సు యొక్క పరిణామరూపమే తరువోజాదుల ఛందస్సుగ నుండవచ్చును. పరిణామకారకుడు నన్నయ్యయా? క్రీ. శ. ౮, ౯ శతాబ్దములలోని శాసనములలో తరువోజలు సీసములు గాన్పించుచున్నవి. కావున నివి నన్నయ్యకు పూర్వమే యేర్పడి యుండినవి. ద్విపద, గీతల ఛందస్సు నన్నయ్యకు ముందే మారకమును బొంది తరువోజాదుల రూపమును ధరించినమాట నిశ్చయము. ""Vemana's quartets and dvipada, from which Nanniah in all probability composed his Taruvoja, Akkaras, and Sisam, represent the higher reaches of Desi metrical art." అను వాక్యము

వల్ల నన్నయ్యకు పూర్వము గీతపద్యములు రచించిన వేమన యొక్కఁడుండెననియు, అతని గీతపద్యముల ఛందస్సును పెంచి నన్నయ్య తనతరువోజాదుల నిర్మించుకొనెననియు దెలియుచున్నది గదా! ఎవ్వరీవేమన? వేమన పద్యములు (గీతములు) రచించిన సుప్రసిద్ధతత్త్వజ్ఞాన వేత్తయగు వేమన యోగీంద్రుడొక్కఁడు గలడు. ఇతడు క్రీ. శ. ౧౪, ౧౫ శతాబ్దములనాటి వాడు. క్రీ. శ. ౧౧ వ శతాబ్దియందు జీవించియుండిన నన్నయ్య ఈవేమన్న పద్యముల ఛందస్సును పెంచి, తరువోజాదుల నిర్మించుకొనుట యసంభవము. కావున మన గ్రంథకర్తలు పేర్కొనిన వేమన మరొకఁడుగ నుండవలయును. అతడు నన్నయ్యకు పూర్వపువాఁడై యుండవలయును. ఆంధ్రపండితుల కీతడు క్రొత్తవాడు. నన్నయ్యకు పూర్వము పద్యములు లేవని వాదించువారు ఈగ్రంథమును జూచిన నేమందురో?

ఆరవయధ్యాయమున పరివర్తనయుగములోని వాఙ్మయము పరామర్శింప బడినది. ఇందు ఆంధ్రభారతరచననుగూర్చి కొంతముచ్చటించి యున్నారు. జైన భారతమునకును వ్యాసభారతమునకును గల భేదమును సూచించిరి. తదనంతరము క్రీ. శ. ౧౧ వ శతాబ్దిలోని నన్నయ్య సమకాలికులగు కవులను గొందఱిం బేర్కొని పండ్రెండవ శతాబ్దికి దాటిరి. ఈశతాబ్దిలోని కవులు మొదటి ప్రతాపరుద్రుడు, పాల్కురికి సోమనాథుడు, నన్నెచోడుడు, మొదలగువారు. నన్నెచోడుని కవిత్వముపై గమనింపదగ్గవిమర్శ కొంత కలదు. ఇతడుతమిళకన్నడపదములను ఆంధ్రకావ్యములలో బ్రయోగించిన కవులలోఁ బ్రథము డనిరి. నన్నెచోడునికాలపు టాంధ్రభాషాస్వరూప మిట్టిదని స్పష్టముగ దెలిసినగాని పై జెప్పినట్లు సిద్ధాంతీకరించుటకు వీలుపడదు. శాసనములు అప్పటి భాషాస్వరూపమును గొంతవఱకును దెలియజేయుచున్నవి. ఆకాలపు భాషయందు, ఇప్పుడు మనము ద్రావిడ, కర్ణాటపదములఁ అని నిరసించునవి పెక్కులుగాన్పించుచున్నవి. కావున నన్నెచోడుఁడు ద్రావిడకర్ణాటపదములను దన గ్రంథమున జొప్పించెననుటకంటె తనకాలమందు పండితులు వాఙ్మయమునందు బ్రయోగించు భాషయందు గ్రంథమును విరచించెననుట సమంజసము. ఇంకను, చోడకవియొక్కకవిత్వము నిర్దుష్టము గాదనియు, సర్వాంగీకారమును బొందిన వ్యాకరణ సూత్రములకు విరుద్ధమైన సంధులను జేసినాడనియు వ్రాసిచ్చినారు. ఆంధ్రభాషను శాసించినన్నపార్యుడు ఆంధ్రశబ్దచింతామణిని వ్రాసెనందురు. ఇతనికి వాగనుశాసనుడను బిరుదుగలదు. ఆంధ్రశబ్దచింతామణిని ఇతఁడు వ్రాసెననుట సందేహాస్పదమైన విషయము. నన్నెచోడునికాలపు భాషాపరిస్థితులను, పదిహేనుపదహారు శతాబ్దములనాటి భాషాపరిస్థితులనుబట్టి వ్రాసిన వ్యాకరణ సూత్రములనుబట్టి విమర్శించుట సద్విమర్శనపద్ధతిగాదు. నన్నయ్యమొదలగువారి గ్రంథములీవ్యాకరణ సూత్రముల ననుసరించి వ్రాయబడినవి. నన్నయ్య నన్నెచోడునికి ముందున్నవాడు. అతనిభారతమున నరసకన్నడములుగాని వ్యాకరణ విరుద్ధములగు నపప్రయోగములు గాన్పింపవు. నన్నయ్య యెఱుంగని భాషయందు నన్నెచోడునికాలపు పండితులు గ్రంథమువ్రాయుటయెట్లు? అనునాక్షేపమురావచ్చును. ఇందుకు సమాధానము: నన్నయ్య తనకాలమున శిష్టాచారులలో వాడుకయందున్న భాషయందే భారతమును వ్రాసియుండును. వ్యాకరణదాసులగు పరిష్కర్తలు తరతరములనుండి యాభాషను సంస్కరించి ఇప్పటి భారతభాష నేర్పఱచిరి. నన్నెచోడుని గ్రంథమున కా దురదృష్టము పట్టలేదు. కావుననే యాతనికవనము ఇతరుల కవనముకంటె భిన్నముగ గాన్పించుచున్నది.

తరువాత పదమూడవ శతాబ్దిలోని రామాయణభాషాంతరీకరణమును కొంత గ్రంథమును వ్రాసినారు. ఈసందర్భమున రంగనాథ, హుళక్కి భాస్కరాదులు పేర్కొనబడిరి. పదునాల్గవ శతాబ్దము నందు అయిదుగురు గొప్ప కవులుండిరని చెప్పి, వారు వేములవాడ భీమన, నాచన సోమనాథుడు, అమరేశ్వరుడు, శ్రీనాథుడు నని పేర్కొనిరి. పదునేనవ శతాబ్దిలోని కవులలో బమ్మెర పోతన్నను, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని గొనియాడిరి. పిమ్మట ప్రబంధయుగ మారంభమైనది. ఆద్యమున కృష్ణరాయని కవిత్వము విమర్శింప బడినది. తదనంతరము అల్లసాని పెద్దన, నందితిమ్మన, ధూర్జటి, సంకుసాల నరసయ్య,

పింగళిసూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు మున్నగువారి కవిత్వము వర్ణింపబడినది. ఇచ్చట పాఠకులుగమనింపదగిన విషయము లొకటి రెండు కలవు. కుమ్మరి మొల్ల, కుమారి ధూర్జటి ఒక్కచో చేర్కొన బడిరి. కుమ్మరి మొల్లవలె పినధూర్జటియు స్త్రీయని గ్రంథకర్తల యభిప్రాయమేమొ! లేకున్న 'కుమార' అనుపుంలింగమును 'కుమారి' యను స్త్రీ లింగమునుగా మార్చియుండరు. మఱియు తెనాలి రామకృష్ణుడు శైవ వైష్ణవమత ప్రవర్తకులగు నప్పయ్యదీక్షిత తాతాచార్యుల సమకాలికుడనియును, వీరందఱును వెంకటపతి రాయల ఆస్థానమున నుండి రనియు వ్రాయబడి యున్నది. ఇది సుప్రసిద్ధ విమర్శక విద్వాంసులగు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును, వేటూరు ప్రభాకరశాస్త్రిగారును వ్రాసిన వ్రాతలకు విరుద్ధముగ గన్పించుచున్నది. మన గ్రంథకర్తలు పాండురంగమాహాత్మ్య మొక్కటి తక్క రామకృష్ణుని గ్రంథములను గుర్తెఱిగినట్లు కన్పించదు. ఎనిమిదవ ప్రకరణమున క్షీణయుగపు కవులు ప్రశంసింపబడిరి. ఇందు విజయనగరరాజ్యవినాశనమును, వైయాకరణులయు ఆలంకారికులయు నిరంకుశత్వమును, ఆంధ్రప్రబంధములలోని లోపములును వర్ణింపఁ బడినవి. ఈయధ్యాయమునందే శ్లేష బంధకవిత్వములు విమర్శింపబడినవి.

పదిహేడు, పద్ధెనిమిది, పందొమ్మిది శతాబ్దముల ఉత్తరాంధ్రవాఙ్మయము మిక్కిలి సంగ్రహముగ వ్రాయబడినది. పిమ్మట ద్రావిడకర్ణాటాంధ్రకవుల చరిత్ర కొంతవఱకు వ్రాయబడినది. తంజావూరి రఘునాధరాజు వ్రాసిన గ్రంథములలో వాల్మీకిచరిత్రము మాత్రము చేర్కొనబడినది. గ్రంథకర్త లీగ్రంథమును చూచియైన నుండరేని అది వచనకావ్యమని వ్రాయుటయసంభవము. సరస్వతిపత్రిక (కాకినాడ) యందు ప్రకటింపబడినపై రఘునాధరాయల వాల్మీకిచరిత్రము పద్యకావ్యము. ఇట్లే చదువక వీ రనేక గ్రంథములను విమర్శించినట్లు తోచుచున్నది. తరువాత సారంగధరవిజయవిలాస గంథకర్తయగు చేమకూర వెంకటకవియు, రాధికాసాంత్వనమును వ్రాసినముద్దుపళనియును చేర్కొనబడిరి. మధుర, పుదుకోట, మైసూరు సంస్థానములయం దభివృద్ధినందిన తెలుగువాఙ్మయ మటుపిమ్మట వర్ణింపబడినది. కడపటి నాంధ్రవచనకావ్యము ద్రావిడదేశమున నుత్పత్తియైనదనియు, దక్షిణదేశపు కవులు యక్షగానములను వ్రాసిరనియు జెప్పబడినది. ఇది విచారణీయము. దక్షిణదేశమందలి కవులకును ఉత్తరాంధ్రకవులకును గల భేద మించుక సూచింపబడెను. దక్షిణదేశకవుల గ్రంథములు నీతిబాహ్యములనియు, ఏతత్కారణమున వీరికవనము పాశ్చాత్యులగు షా, ఇబ్సెన్ మున్నగువారి కవనమును బోలియున్నదనియు వచింపబడినది.

తొమ్మిదవ అధ్యాయమున ద్విపదకావ్యములు, శతకములు, పాటలు, ఏలలును, పది పదకొండధ్యాయములందు తురకకిరస్తానికవుల గ్రంథములును విమర్శింపబడినవి.

పండ్రెండవ అధ్యాయముతో నవయుగ మారంభమైనది. మొట్టమొదట గ్రామ్యగ్రాంధిక వివాదవర్ణనతో వినాయకపూజ నడచినది. తరువాత వాఙ్మయపరిశోధనమును గురించియు ప్రాచీనతాళపత్రగ్రంథసంపాదనగురించియు కొంతగ్రంథము గడచినది. తర్వాతవాఙ్మయవిమర్శనమును గురించి చెప్పుచు, రామలింగారెడ్డి, సుబ్బారావు, వేంకటరాయశాస్త్రి, ప్రభాకరశాస్త్రి, కాశీభట్ల సోదరు(?) లు చేర్కొనబడిరి. మానవల్లి రామకృష్ణకవిగారు తాళపత్ర గ్రంథసంపాదనమునందును, విమర్శనశక్తియందును, పాండిత్యమునందును పైవారికి దీసిపోయినవారుగారు. గ్రంథకర్త లట్టివారిని స్మరింపకుండుట చిత్రము.

ఈనవయుగమునందలి వాఙ్మయము మూడుతెరగులుగ విభజింపఁబడినది. ౧. జ్ఞానవాఙ్మయము. ౨. ఐక్య (పునర్యోజన) వాఙ్మయము. 3. రిజూవినేషన్ వాఙ్మయము.

౧. ఈతరగతియందు తర్జుమాగ్రంథములు, విజ్ఞానచంద్రిక, విజ్ఞానసర్వస్వము, సూర్యారాయనిఘంటువు, ఆంధ్రులచరిత్ర చేర్కొనబడినవి. ౨వ తరగతియందు నాటకములు, నవలలు, చిన్నకథలు, పిల్లకావ్యములు

చేర్పబడినవి. నాటకములనుగూర్చి వ్రాయుసందర్భమున పగటివేషాలు, వీధిభాగవతాలు వర్ణింపబడినవి. ప్రభావతీ ప్రద్యుమ్నము దడనబడినది. క్రీడాభిరామము, పల్నాటివీరచరిత్ర మున్నగువానికి నాటకములకు గల సంబంధము చెప్పబడినది. ఆంధ్రనాటకములు మూడు విధములు. ౧. సంస్కృత ఆంగ్ల నాటకముల కనువాదములు. ౨. సాంఘికపరిస్థితులను దూరునవి. ౩. చారిత్రాత్మకములు. ఈసందర్భమున వెంకటరాయశాస్త్రులు, బళ్లారి కృష్ణమాచార్యులు, వీరేశలింగం, అప్పారావు, సుబ్బారావు, కృష్ణమూర్తిశాస్త్రి మున్నగువారు పేర్కొనబడిరి.

నవలలనుగూర్చి వ్రాయుచో వీరేశలింగం, లక్ష్మీనరసింహం పంతులు ప్రశంసింపబడిరి. నవకావ్యములలో పేర్కొనదగిన గ్రంథము వెంకిపాటలు అని గ్రంథకర్తల యభిప్రాయమైనట్లు తోచుచున్నది.

ఇంతవఱకు గ్రంథ విషయమును సంగ్రహపఱచి వర్ణించితిమి. ఇక గ్రంథముయొక్క విలువను గురించి కొన్నిమాటలు వ్రాసి చాలింప దలచుచున్నారము.

ఆంగ్లమున వ్రాయబడిన ఆంధ్రవాఙ్మయచరిత్రలలో నిది మొదటిది. కావున ఆంధ్రులు గానివారికి ఆంధ్రవాఙ్మయ మిట్టిదని యెఱుంగుట కిది ముఖ్యసాధనముగా గలదు. దీనిని చదివినవారికి ఆంధ్రవాఙ్మయ మంత ముఖ్యమైనది కాదనియు, ఆంధ్రకవులు స్వతంత్ర గ్రంథములు వ్రాయజాలని వారనియు దోచును. ఇది వాస్తవస్థితిగాదు; కావున నీగ్రంథకర్తలు ఆంగ్లమున నిట్టిగ్రంథమును వ్రాయుటచే ఆంధ్రేతరులకు ఆంధ్రవాఙ్మయమును గూర్చి తప్పు టభిప్రాయమును గల్గించుచున్నారు. అందువల్ల వీరు ఆంధ్రులకు ఆంధ్రభాషకు ఉపకారముజేసినవారుగ పరిగణింప బడరు. ఇంతియకాక చాలినంత పరిశోధనమును వీరు చేసినట్టు కానరాదు. నూతనపరిశోధనలవల్ల బయల్పడిన విషయము లనేకములన వీరెఱిగినట్లు కానరాదు. శాసనవాఙ్మయమును, పత్రికలలో జరుగు వాఙ్మయ సంబంధమగు చర్చలును వీరుచూచుచున్నట్లు తోచదు.

[వేం. ర.]

## ఆంధ్రపండితరాయశతకము

సకలానంద గ్రంథమాలిక ౯వ పుష్పము. కర్త: కీ. శే. సత్యవోలు సోమసుందర కవిగారు. రాయల్ సైజు. పేజీలు ౩౭. వెల రు. ౦-౪-౦. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక నుండి పునర్ముద్రితము.

పదునేడవ శతాబ్దముననుండిన షాజహాను చక్రవర్తి యాస్థానమున నుండిన పండితరాయ బిరుదాంచితు డగు జగన్నాథకవి భిన్నభిన్న విషయములను వర్ణించుచు,విమర్శించుచు అప్పుడప్పుడు రచించిన ఆపాతమధురము లగు శ్లోకములు పెక్కులు గలవు. వానిలో నూటముప్పదిటిని శ్రీ సత్యవోలు సోమసుందర కవిగారు ఇట్లు తెలిగించిరి. ఇందు మూలశ్లోకములును గలవు. ఆంధ్రానువాదసరణిని, రచనాసౌందర్యమును గుర్తెఱుగుటకు మచ్చు:

శ్లో. యేనామీ ఆముకులోద్గమాత్
ప్రతిదినం త్వా మాశ్రితా షట్పదా
స్తే భ్రామ్యంతి ఫలా ద్బహిః
కథ మహో దృష్ట్వా న సంభావసే,
యే కీటా స్తవ దృక్పథం నచగతా
స్తే త్వత్ఫలాభ్యంతరే
ధి క్త్వాం చూత పరాపరావరపరి
జ్ఞానానభిజ్ఞో భవాన్. ౯౩

చ. కొలుచుచు నెల్లప్రొద్దులును
పుట్మలమౌల్ గలనాట నుండియుగ్
ఫలముల నిప్డు వైదెరుగఁ
బల్కవు చూచియుఁ జూతవృక్షమా!
తొలిచి భవత్ఫలాంతరముఁ
దూఱెడుఁబుర్వులు దృక్పథంబులై
వెలయవె హా! పరాపర
వివేకవిహీనుని నిన్నహింపనే.

## బంగారము

శ్లో. హేమ్నః ఖేదో న దాహేన చ్ఛేదేన కషణేన వా,
తదేవహిపరం దుఃఖం యద్గుంజా సమతోలనమ్. ౧౧౪

గీ. తొలుత గుంజాసమేతమై తూఁచుటెడలఁ
గ్రిందికిని మ్రొగ్గి మతి గుందుఁజెందుఁగాని
కాల్చి సాఁగించి తునియలుగా నొనర్చి
కర్షణ మొనర్చినను నేగి గనదుపసిఁడి.

పింగళిసూరన, రామరాజభూషణుడు, తెనాలి రామకృష్ణుడు మున్నగువారి కవిత్వము వర్ణింపబడినది. ఇచ్చట పాఠకులుగమనింపదగిన విషయము లొకటి రెండు కలవు. కుమ్మరి మొల్ల, కుమారి ధూర్జటి ఒక్కచో చేర్కొనబడిరి. కుమ్మరి మొల్లవలె పినధూర్జటియు స్త్రీయని గ్రంథకర్తల యభిప్రాయమేమొ! లేకున్న 'కుమార' అనుపుంలింగమును 'కుమారి' యను స్త్రీ లింగమునుగా మార్చియుండరు. మఱియు తెనాలి రామకృష్ణుడు శైవ వైష్ణవమత ప్రవర్తకులగు నప్పయ్యదీక్షిత తాతాచార్యుల సమకాలికుడనియును, వీరందఱును వెంకటపతి రాయల ఆస్థానమున నుండి రనియు వ్రాయబడి యున్నది. ఇది సుప్రసిద్ధ విమర్శక విద్వాంసులగు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవిగారును, వేటూరు ప్రభాకరశాస్త్రిగారును వ్రాసిన వ్రాతలకు విరుద్ధముగ గన్పించుచున్నది. మన గ్రంథకర్తలు పాండురంగమాహాత్మ్య మొక్కటి తక్క రామకృష్ణుని గ్రంథములను గుర్తెఱిగినట్లు కన్పించదు. ఎనిమిదవ ప్రకరణమున క్షీణయుగపు కవులు ప్రశంసింపబడిరి. ఇందు విజయనగరరాజ్యవినాశనమును, వైయాకరణులయు ఆలంకారికులయు నిరంకుశత్వమును, ఆంధ్రప్రబంధములలోని లోపములును వర్ణింపఁబడినవి. ఈయధ్యాయమునందే శ్లేషబంధకవిత్వములు విమర్శింపబడినవి.

పదిహేడు, పద్దెనిమిది, పందొమ్మిది శతాబ్దముల ఉత్తరాంధ్రవాఙ్మయము మిక్కిలి సంగ్రహముగ వ్రాయబడినది. పిమ్మట ద్రావిడకర్ణాటాంధ్రకవుల చరిత్ర కొంతవఱకు వ్రాయబడినది. తంజావూరి రఘునాథరాజు వ్రాసిన గ్రంథములలో వాల్మీకిచరిత్రము మాత్రము చేర్కొనబడినది. గ్రంథకర్త లీగ్రంథమును చూచియైనను౦దు రేని అది వచనకావ్యమని వ్రాయుటయసంభవము. సరస్వతిపత్రిక (కాకినాడ) యందు ప్రకటింపబడినపై రఘునాథరాయల వాల్మీకిచరిత్రము పద్యకావ్యము. ఇట్లే చదువక వీరనేక గ్రంథములను విమర్శించినట్లు తోచుచున్నది. తరువాత సారంగధరవిజయవిలాస గ్రంథకర్తయగు చేమకూర వెంకటకవియు, రాధికాస్వాంత్వనమును వ్రాసినముద్దుపళనియును చేర్కొనబడిరి. మధుర, పుదుకోట, మైసూరు సంస్థానములయం దభివృద్ధినందిన తెలుగువాఙ్మయ మటుపిమ్మట వర్ణింపబడినది. కడపటి నాంధ్రవచనకావ్యము ద్రావిడదేశమున నుత్పత్తియైనదనియు, దక్షిణదేశపు కవులు యక్షగానములను వ్రాసిరనియు జెప్పబడినది. ఇది విచారణీయము. దక్షిణదేశమందలి కవులకును ఉత్తరాంధ్రకవులకును గల భేద మించుక సూచింపబడెను. దక్షిణదేశకవుల గ్రంథములు నీతిబాహ్యములనియు, ఏతత్కారణమున వీరికవనము పాశ్చాత్యులగు షా, ఇబ్సన్ మున్నగువారి కవనమును బోలియున్నదనియు వచింపబడినది.

తొమ్మిదవ అధ్యాయమున ద్విపదకావ్యములు, శతకములు, పాటలు, ఏలలును, పది పదకొండధ్యాయములందు తురకకిరస్తానికవుల గ్రంథములును విమర్శింపబడినవి.

పండ్రెండవ అధ్యాయముతో నవయుగ మారంభమైనది. మొట్టమొదట గ్రామ్యగ్రాంథిక వివాదవర్ణనతో వినాయకపూజ నడచినది. తరువాత వాఙ్మయపరిశోధనమును గురించియు ప్రాచీనతాళపత్రగ్రంథసంపాదన గురించియు కొంతగ్రంథము గడచినది. తర్వాతవాఙ్మయ విమర్శనమును గురించి చెప్పుచు, రామలింగారెడ్డి, సుబ్బారావు, వేంకటరాయశాస్త్రి, ప్రభాకరశాస్త్రి, కాశీభట్ల సోదరు(?)లు చేర్కొనబడిరి. మానవల్లి రామకృష్ణకవిగారు తాళపత్ర గ్రంథసంపాదనమునందును, విమర్శనశక్తియందును, పాండిత్యమునందును పైవారికి దీసిపోయిన వారుగారు. గ్రంథకర్త లట్టివారిని స్మరింపకుండుట చిత్రము.

ఈనవయుగమునందలి వాఙ్మయము మూడుతెరగులుగ విభజింపఁబడినది. ౧. జ్ఞానవాఙ్మయము. ౨. ఐక్య (పునర్వ్యాపన) వాఙ్మయము. 3. రిజూవినేషన్ వాఙ్మయము.

౧. ఈతరగతియందు తర్జుమాగ్రంథములు, విజ్ఞానచంద్రిక, విజ్ఞానసర్వస్వము, సూర్యారాయనిఘంటువు, ఆంధ్రులచరిత్ర చేర్కొనబడినవి. ౨వ తరగతియందు నాటకములు, నవలలు, చిన్నకథలు, పిల్లకావ్యములు

చేర్పబడినవి. నాటకములనుగూర్చి వ్రాయుసందర్భమున పగటివేషాలు, వీధిభాగవతాలు వర్ణింపబడినవి. ప్రభావతీ ప్రద్యుమ్నము చదువబడినది. క్రీడాభిరామము, పల్నాటివీరచరిత్ర మున్నగువానికి నాటకములకు గల సంబంధము చెప్పబడినది. ఆంధ్రనాటకములు మూడు విధములు. ౧. సంస్కృత ఆంగ్ల నాటకముల కనువాదములు. ౨. సాంఘికపరిస్థితులను దూరునవి. ౩. చారిత్రాత్మకములు. ఈసందర్భమున వెంకటరాయశాస్త్రులు, బళ్లారి కృష్ణమాచార్యులు, వీరేశలింగం, అప్పారావు, సుబ్బారావు, కృష్ణమూర్తిశాస్త్రి మున్నగువారు పేర్కొనబడిరి.

నవలలనుగూర్చి వ్రాయుచో వీరేశలింగం, లక్ష్మీనరసింహం పంతులు ప్రశంసింపబడిరి. నవకావ్యములలో పేర్కొననగిన గ్రంథము వెంకిపాటలు అని గ్రంథకర్తల యభిప్రాయమైనట్లు తోచుచున్నది.

ఇంతవఱకు గ్రంథ విషయమును సంగ్రహపఱచి వర్ణించితిమి. ఇక గ్రంథముయొక్క విలువను గురించి కొన్నిమాటలువ్రాసి చాలింప దలచుచున్నారము.

ఆంగ్లమున వ్రాయబడిన ఆంధ్రవాఙ్మయచరిత్రలలో నిది మొదటిది. కావున ఆంధ్రులు గానివారికి ఆంధ్రవాఙ్మయ మిట్టిదని యెఱుంగుట కిది ముఖ్యసాధనముగా గలదు. దీనిని చదివినవారికి ఆంధ్రవాఙ్మయ మంత ముఖ్యమైనది కాదనియు, ఆంధ్రకవులు స్వతంత్ర గ్రంథములు వ్రాయజాలని వారనియు దోచును. ఇది వాస్తవస్థితిగాదు; కావున నీగ్రంథకర్తలు ఆంగ్లమున నిట్టిగ్రంథమును వ్రాయుటచే ఆంధ్రేతరులకు ఆంధ్రవాఙ్మయమును గూర్చి తప్పు టభిప్రాయమును గల్గించుచున్నారు. అందువల్ల వీరు ఆంధ్రులకు ఆంధ్రభాషకు ఉపకారము జేసినవారుగ పరిగణింప బడరు. ఇంతియకాక చాలినంత పరిశోధనమును వీరు చేసినట్టు కానరాదు. నూతనపరిశోధనలవల్ల బయల్పడిన విషయము లనేకములన వీరెఱిగినట్లు కానరాదు. శాసనవాఙ్మయమును, పత్రికలలో జరుగు వాఙ్మయ సంబంధమగు చర్చలును వీరుచూచుచున్నట్లు తోచదు.

[వేం. ర.]

## ఆంధ్రపండితరాయశతకము

సకలానంద గ్రంథమాలిక ౫వ పుష్పము: కర్త: శ్రీ. శ్రీ. సత్యవోలు సోమసుందర కవిగారు. రాయల్ సైజు. పేజీలు ౩౨. వెల రు. ౦-౮-౦. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక నుండి పునర్ముద్రితము.

పదునేడవ శతాబ్దమునందుండిన షాజహాను చక్రవర్తియాస్థానమున నుండిన పండితరాయ బిరుదాంచితు డగు జగన్నాథకవి భిన్నభిన్న విషయములను వర్ణించుచు,విమర్శించుచు అప్పుడప్పుడు రచించిన ఆపాతమధురము లగు శ్లోకములు పెక్కులు గలవు. వానిలో నూటముప్పదిటిని శ్రీ సత్యవోలు సోమసుందర కవిగారు ఇట్లు తెలిగించిరి. ఇందు మూలశ్లోకములును గలవు. ఆంధ్రానువాదసరణిని, రచనాసౌందర్యమును గుర్తెఱుగుటకు మచ్చు:

శ్లో. యేఽమీ ఆముకులోద్గమాత్
ప్రతిదినం త్వా మాశ్రితా ష్షట్పదా
స్తే భ్రామ్యంతి ఫలాద్యభిః
కథ మహో దృష్ట్వా న సంభావసే,
యే కీటా స్తవ దృక్పథం నచగతా
స్తే త్వత్ఫలాభ్యంశిరే
ధి క్త్వాం చూత పరాపరావరపర
జ్ఞానానభిజ్ఞో భవాన్. ౯౩

చ. కొలుచుచు నెల్లప్రొద్దులను
షట్పదముల్ గలనాట నుండియుం
ఫలముల నిప్డు పైదిరుగ
బల్కవు చూచియుఁ జూతవృక్షమా!
తొలిచి భవత్ఫలాంతరముఁ
దూఱెడుఁబుర్వులు దృక్పథంబులై
వెలయవె హా! పరాపర
వివేకవిహీనుని నిన్దహింపనే.

### బంగారము

శ్లో. హేమ్నః ఖేదో న దాహేన చ్ఛేదేన కషణేన వా,
తదేవహిపరం దుఃఖం యద్గుంజా సమతోలనమ్.౧౧౮

గీ. తొలుత గుంజాసమేతమై తూఁచువెడలఁ
గ్రిందికిని మ్రొగ్గి మతి గుందుఁజెందుఁగాని
కాల్చి సాఁగించి తునియలుగా నొనర్చి
కర్షణ మొనర్చినను నేగి గనదుపసిడి,

## చెట్టు

శ్లో. భుక్తం స్వాదుఫలం కృతం చ శయనం
శాఖాగ్రజైః పల్లవైః.
త్వచ్ఛాయాపరిశీతలం సుసలిలం
పీతం వ్యపేతశ్రమైః;
విశ్రాంతా స్సుచిరం పరం సుమనసః
ప్రీతిః కిమత్రోచ్యతే
త్వం సన్మార్గతరు ర్వయంచ పథికా
యామః పునర్దర్శనమ్. ౧౮

ఉ. తియ్యనిపండ్లు మెక్కితి మ
తిప్రమదంబున నీప్రవాళముల్
శయ్యఁ గూర్చి పండితిమి
చల్లనినీడల విశ్రమించి నీ
రొయ్యనఁ ద్రావి నీసుమన
మున్నతినాని ముదంబుఁగంటి మో
యయ్య ! సువృక్షమా ! చనుదు
మా ! కననబ్బుత నిన్నుఁ గ్రమ్మఱన్.

## శ్రీయుత కే. యల్. శర్మగారి ఉత్తమారోగ్య గ్రంథమాల

నాలుగు శ్రేష్ఠములగు గ్రంథములు :

పుదుచ్చేరిలో ప్రకృతి చికిత్సా గ్రంథ ప్రకటనాలయ (నేచరు క్యూరు పబ్లిషింగు హౌసు పాండిచెరీ) మునకు యజమానులును, ప్రకృతి చికిత్సా పద్ధతి యందు ప్రామాణికులలో నొకరు నగు శ్రీయుత శర్మగారు ఉత్తమారోగ్య గ్రంథమాల (బెటరు హెల్తుసీరీసు) అను శీర్షికక్రింద ప్రకటించిన నాలుగు గ్రంథములను కృతజ్ఞతతో నందు కొంటిమి.

౧. వెన్నెముక స్నానము (స్పైనలుబాతు) ౨. ప్రాణాయామము, ౩. మానసిక చికిత్స (మెంటలుహీలింగు) ౪. టీకాలు మశూచకము. ఈ నాలుగు గ్రంథములును ఆంగ్ల భాషలో వ్రాయ బడినవి. ఈ నాలుగు గ్రంథములకును ఒక్కొక్క గ్రంథమునకు వెల రెండణాలుమాత్రమే. వీనియందలి వివరములను గూర్చి మా అభిప్రాయము ముందు తెలుప బడును.

శ్రీ శుద్ధానంద భారతీస్వాముల వారు (బెజవాడలో ప్రకృతి చికిత్సా సంఘాధ్యక్షులు) ప్రకటించిన స్వరాజ్యమను కరపత్రమును నందుకొంటిమి.

## Satyagraha in Champaran
## చాంపరాను సత్యాగ్రహము

గ్రంథకర్త: శ్రీయుత బాబు రాజేంద్రప్రసాదు గారు. డిమ్మిసైజు పుటలు ౨౮౦. మేలికాగితము. వెల రు. ౨-౮-౦

## నవీనచిత్రకథలు

క్రౌనుసైజు. పుటలు ౬౯. వెల రు. ౦-౬-౦. ప్రకాశకులు కే. మునిస్వామినాయుడు అండుకంపెని, ౨౪౬, చైనాబజారు రోడ్డు, చెన్నపురి.

## సీమంతిని

అయిదంకముల నాటకము. డిమ్మీసైజు. ౮౬ పుటలు. వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: గూడూరి వెంకటశివకవిగారు. ప్రకాశకులు. ఆదిశైవపత్రికా కార్యాలయము, చిలువూరు, అనంతవరంపోస్టు, గుంటూరుజిల్లా.

## శుక్లనామ సిద్ధాంత పంచాంగము

శ్రీ. త్రిపురాటం శివరామశాస్త్రిగారు గుణించినది.

ప్రకాశకులు: అలుదూరు త్రిపురాటం జయరామ శాస్త్రిగారు, ధర్మవరము.

ప్రకృతము వెలువడుచున్న పంచాంగములలో మంచివనదగిన వానియం దిది చేరును. జ్యోతిషమున నిత్యకృత్యములయందు పరిగణించవలసిన విషయము లిందు జనసామాన్యమునకు సుబోధముగనుండునట్లు వివరింపబడినవి.

## అష్టావక్రగీత (సాంధ్ర తాత్పర్యము.)

క్రౌనుసైజు, ౧౪౮ పుటలు. వెల రు. ౧-౮-౦.

గ్రంథకర్త: పేరి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారు.

విలాసము:- ప్రొప్రయిటరు, సుజనరంజని ప్రెస్సు మెయిన్‌రోడ్డు, కాకినాడ, తూర్పుగోదావరిజిల్లా.

### నివాళి. ౧ వ పూజాపుష్పము

గ్రంథకర్తలు: వేంకటకాళిదాస కవులు, విజయనగరము.

క్రౌను సైజు. పుటలు 33, అచ్చు, కాగితము, బైండు అందముగా ఉన్నది. వెల రు. ౦-౧-౦.

### వర్ణన రత్నాకరము (౧, ౨ భాగములు)

సంపాదకుడు: దాసరి లక్ష్మణస్వామిగారు, పిఠాపురము.

డిమ్మీ సైజు. ౬౧౮ పుటలు. అందమైనబైండు, వెల రు. 3-౮-౦.

### మిత్రభేదము (వచనము)

క్రౌను సైజు. పుటలు ౭౮. వెల తెలియదు.

అనువాదకుడు: బులుసు వేంకటరమణయ్యగారు విజయనగరము

ప్రకాశకులు: కే. శ్రీనివాసరావుగారు, శ్రీ వేద వ్యాసప్రెస్, విజయనగరము.

### హిందూబాంధవి (పక్షపత్రిక.)

రెండవసంపుటము, ౧, ౨, 3, సంచికలు వెలువడినవి. సంచిక సైజు పూల్స్కాపు. పుటలు ౧౨. చందా ఒకసంవత్సరమునకు రు. ౨-౧-౧.

సంపాదకుడు; శ్రీచతుర్వేదుల వెంకటరాఘవయ్యగారు. పల్లిపాడు, (నెల్లూరుజిల్లా).

ఈపత్రిక వెనుక ఎప్పుడో పుట్టి నడుమ నాగిపోయి మరల నీసంవత్సరము జనవరినెల ౧౫వ తేదినుండి ప్రారంభమయినది. సంపాదకులు స్వవిషయమున నుడివినట్లు 'పూర్వాచారపరుల సమైక్య, సహకారత, దేశాభ్యుదయమునకనావశ్యమని తలంచునంత సనాతన సంఘ సంస్కారపక్షముల విభేదతాపరిఖ విస్తరించుచున్నది. ఇందు సనాతనపక్షము వారిదోషము గూడ గలదు. ఈ యగడ్త పూడ్చుటయే' హిందూబాంధవి జననపరంపరల పరమోద్దేశ్యమై యున్నది.

భారతీయు లాదికాలమునుండియు సనాతన ధర్మ ప్రతిపాదకమని విశ్వసించి గౌరవించుచున్న మహాభారతమునెడ నిరసనభావ ముదయించునట్లు విమర్శించుచు నిటీవల శ్రీ పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు మహాభారత విమర్శన మనుపేర నొక గ్రంథమును ప్రచురించిరి. దానిని ఖండించుచు 'పెండ్యాలపండిత డిండిమ' మనుపేర వెలువడుచున్న యొకవిమర్శన మీ సంచికలయందు గల వ్యాసములలో ముఖ్యమయినది. ఇంకను రజస్వలావివాహము, అస్పృశ్యతానివారణము మొదలయిన విషయములను ఖండించుచు వ్రాసిన వ్యాసములును గలవు. రాజకీయవిషయముల నీపత్రిక స్వరాజ్యపక్షము నవలంబించినది.

ఈపత్రిక తనయుద్దేశము ననుసరించి, దేశకాల పరిస్థితులను పురస్కరించుకొని, తీవ్ర విమర్శనమునకు బూనుకొనక, సనాతన సంఘసంస్కరణపక్షములు రెంటికిని సామరస్యము గుదురునట్లు ప్రయత్నించుట లెస్స. సనాతనాచారపరాయణు లగు నాంధ్రమహాశయు లీపత్రికాపోషణమున సంపాదకులకు సాయపడెదరుగాక.

## శ్రీకృష్ణుని వేణుగానము

పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

ధైర్య మహాసర్పదర్పవిధ్వంసమ్ముఁ జేయఁజాలిన వైనతేయుఁ డనఁగ
లజ్జాభిధానదుర్లక్ష్యరోగ మణంపఁ బేరుసెందిన వేల్పువెజ్జనంగ
ఏకపత్నీగర్వభీకరాంభోరాశిఁ జులుకింపఁగా నగస్త్యుం డనంగ
మానినీజనమానమత్తేభకుంభంబు విదళింప సింగంపుఁగొదమ యనఁగ
జగతిఁ బేరొందినట్టియాశబ్ద మిట్లు - కుండలిశయాను పిల్లనగ్రోవినుండి
బయలు దేఱి కళిందుకన్నియతటంబు - నందుఁ బరువెత్తుచున్నదో సుందరాంగి.




శ్రీ స్వయంపాకుల జానకీరామమూర్తి గారు

బి. ఏ., బి. యల్



వీరు నెల్లూపురమున న్యాయవాదిగ నున్నారు. నటనకౌశలము, నాట్యకళాభిమానము గలవారు సుప్రసిద్ధాంగ్లకవియగు షేక్స్పియరు రచియించిన 'రోమియో అండు జూలియట్' అనువిషాదాంత నాటకమున* నాయకుడగు 'రోమియో' పాత్రమును ధరించిరి.

టి. సుదర్శనరావుగారు

వీరును నెల్లూరువారే. పై నాటకమున నాయికయగు జూలియటు పాత్రమును ధరించిరి. భావగంభీరములగు షేక్స్పియరు నాటకముల యందలి పాత్రములను ప్రదర్శించుట సుకరము కాకున్నను పైయిరువురును ఇట్లు వానిని ప్రదర్శింపబూనుట మెచ్చదగినది; కాని ఇంకు



Juliet:

Yond Light is not day-light, I knew, I.
It is some meteor that the sun exhales
To be to thee this night a torch-bearer
And light thee on thy way to Mantua.

Act 3, Scene 5.

* నెల్లూరు 'లిటరరి క్లబ్' వారు ఈ నాటకమును ప్రదర్శించిరట.

ప్రకటింపబడిన పాత్రప్రతికృతులు పాత్రములయందు చున్నవి. ఈ కొరంతతీరు ప్రయత్నమును వీరు కాపింప సముచితభావ స్ఫూర్తి కొఱవడియుండుటను సూచించు దగుదురు.



Romeo:
If I profane with my unworthiest hand
This holy shrine, the gentle fine is this.
My lips, two blushing pilgrims nearly stand
To smooth that rough touch with a tender kiss.
Act 1, Scene 5.



హిందూమహామండలియు కలహాములు-భర్తల అభ్యోపాయములు

# సాభిప్రాయ విశేషములు

గత మాసమునందు దేశమునం దంతటను సైమను నిర్గమన ఘోష ప్రతిధ్వనిల్లినది. నల్లజండాలు, నిర్గమన ఘోషలు సత్యాగ్రహ విజయమును సువ్యక్తము చేసినవి. కత్తులు కర్రలు తుపాకులు ఫిరంగులు నిరర్థకములై ధర్మ పరమైన సత్యాగ్రహబలమును విశదము చేసినవి. దైవాసుర సంపదల సంరంభమునందు దైవసం పదల ప్రాబల్యమును, నల్లజండాలు, బహిష్కార ణోత్సవములు విదితము చేసినవి. ఫిబ్రవరి ౧౮-వ తేదియందు సైమనువర్గమునకు చెన్నపురి యొసంగిన స్వాగతమును ప్రభుత్వ మవలం బించిన నిర్బంధరహస్యతంత్రములును, సత్యా గ్రహవిజయమును విస్పష్టము చేయుచున్నవి. ప్రభుత్వాధికారులు బహిష్కరణోత్సవమును హరతాళమును సకలవిధముల ప్రతిషేధించిరి. చెన్నపురి రక్షకభటులతోడను, సైనికులతోడ ను నిండిపోయినది. రక్షకభటు లాయుధపాణులై నగరసంచారమును జేయుచు ప్రజాహృదయ ములందు భయభ్రాంతులను గలుగజేసిరి. బహి ష్కార ప్రచారమునకును, హరతాళ ప్రచార మునకును ప్రబలమైన యాటంకములనుగలుగ జేసిరి. రక్షకభటులు బహిష్కరణ ప్రకటనలను చించివేసిరి. కరపత్రముల నిచ్చినవారలను నిర్బంధించిరి. బహిష్కరణోద్యమమునందు పాల్గొనుటకు చెన్నపురికి వచ్చిన నాయకు ల నక్రమముగ నిర్బంధించిరి. దేశభక్త వెం కటప్పయ్య పంతులుగారు, స్వామి నాయు డుగారు, కళా వెంకటరావుగారు, గుళ్లపల్లి పున్నయ్యశాస్త్రిగారు మొదలగువారిని నిర్బం ధించిరి. బులుసు సాంబమూర్తిగారిని చాల కాలము క్రితమే బెజవాడయందు నిర్బంధించిరి. సాంబమూర్తిగారును, వెంకటప్పయ్యపంతులు గారును సుప్రసిద్ధ దేశభక్తులు, ప్రజానాయకులు. వారిని దొంగలకు, దోపిడిగాండ్రకును నేర్పడిన 151, 108 శాసనముల క్రింద నిర్బంధించుట కేవలమన్యాయమనియు, న్యాయవిరుద్ధ మని యు ధీమంతు లంగీకరింపగలరు.

చెన్నపురియందు నిర్బంధించిన వార లను వెంటనే విడుదలచేయుటయును, నిరంకు శాధికారులు తగిన సముజాయిషిని చెప్ప జాలకపోవుటయును ప్రభుత్వమువారి యన్యా యాచరణమును చెప్పకయే చెప్పుచున్నది. వెంకటప్పయ్య పంతులుగారు బహిష్కరణో త్సవమునందు పాల్గొనుటకై వచ్చియున్నటులు నిర్భయముగ దెలిపియుండిరి. శాంతినిగాపాడు టకై వచ్చినాననియును శాంతికి భంగమును గలుగజేయుటకై వచ్చియుండలేదనియును వారు చెప్పియుండిరి. సంగతి సందర్భములను విచా రించకుండ నిర్బంధించుటయును, వెంటనే విడిచిపెట్టుటయును నిరంకుశాధికారుల నిర్ల క్ష్యస్వభావమును విశదము చేయుచున్నవి.

ప్రపంచమునం దే యితర దేశములందును నిట్టి దౌర్జన్య కార్యములు సాధ్యములు గావు. సాంబమూర్తిగారి నిర్బంధమునకు తలతోక గనుపడదు. ఆరంభమునందు నేరారోపణ లేదు. విచారణయందు నేరారోపణమున కవ సరమైన యాధారములు గనుపడవు. అయి

నను సాంబమూర్తిగారు వారి నిష్కళంకమైన దేశభక్తికి చిల్లర నేరములకువలె నిర్బంధము లననుభవించుచున్నారు. ఈ నిర్బంధము లన్నియును బహిష్కరణోద్యమము నిరంకుశ వర్గమునకును వారి యనుచరులకును గలుగజేసిన భయభ్రాంతులకు నిదర్శనముగ నున్నవి. గాంధి మహాత్ముని నిర్బంధమునుకిరణశంకర రాయిగారి నిర్బంధమును నీరహస్యము నే విశదము చేయుచున్నవి. విదేశ వస్త్రదహనసందర్భమున గాంధిమహాత్ముడు నిర్బంధింపబడుట పరిహాసాస్పదముగనున్నది. సైమను బహిష్కరణోత్సవమును కాంగ్రెసు కార్యవిధానమును నిరంకుశవర్గమునందు గలుగజేయుచున్న భయభ్రాంతులను వారి నిర్బంధవిధానము చెప్పక చెప్పుచున్నది. నిరంకుశవర్గ మవలంబించుచున్న నిర్బంధవిధానము ప్రజాహృదయమునందును, నాయకుల హృదయమునందునుభయభ్రాంతులను నధికారవర్గము తలపెట్టినటులు గలుగజేయ లేదని చెన్నపురి వ్యవహారములు విశదము చేసినవి.

* * * *

ధర్మవిజయము

ఫిబ్రవరి 18వ తేదియందు చెన్నపురిలో సంపూర్ణముగ హరతాళముజరిగినది. బలవంతము లేకుండ నేదుకాణములన్నియును మూయబడినవి. కొత్వాలుబజారు, చీనాబజారు, చింతాద్రిపేటబజారు మొదలగు స్థలములు పూర్తిగ మూయబడినవి. ప్రజలయందు ప్రబలుచున్న స్వాతంత్ర్యాభిలాష నీ హరతాళము విశదము చేయుచున్నది. ప్రశాంతముగ జరిగిన బహిష్కరణోత్సవము ప్రజానాయకుల ధర్మవిజయమునువిశదము చేయుచున్నది. నాయకులుభయపడిపోలీసుకమీషనరు ప్రతిషేధించినమార్గమును నతిక్రమించ లేదని యాక్షేపించుటయు క్తము గాదు. నాయకులును, కాంగ్రెసును నిర్ణయించినది బహిష్కరణోత్సవముగాని శాసనోల్లంఘనముగాదని సర్వత్ర తెలిసియున్నది. గాంధి మహాత్ము డీవిషయమునే కలకత్తా ప్రసంగమునందు స్పష్టము చేసెను. చెన్నపురి ప్రభుత్వము శాసనోల్లంఘన ప్రస్థానమును ప్రతిషేధించుటకు బూనుకొన లేదు. కాంగ్రెసునాయకులు దౌర్జన్యమార్గము నవలంబించుటకు బూనుకొని యుండ లేదు. పోలీసుకమిషనరు ప్రతిషేధించినమార్గము నుల్లంఘించి శాసనోల్లంఘనమును జేయుట సుకరము. కాని కాంగ్రెసునిర్ణయముబహిష్కరణోత్సవము, హరతాళము జరుపుటయును మాత్రమైనపుడు సమష్టిశాసనోల్లంఘనమునకై పూనుకొనుట యసంగతము. చెన్నపురియందు జరిగిన హరతాళమును, బహిష్కరణోత్సవమును కాంగ్రెసు పూనుకొనిన ధర్మవిజయమునకు సూచనలుగ నున్నవి. ప్రజానాయకులుచేయుచున్న బహిరంగప్రచారమునకును, అధికారవర్గము చేయుచున్న రహస్యప్రచారమునకునుగల భేదము ధర్మాధర్మ విజయములకుగల భేదమును విశదము చేయుచున్నది.

* * * *

సైమనుకమిషను

సైమనుకమిషను వచ్చిన సంగతి గోప్యముగ నుంచబడినది. వారేమార్గమున నెప్పుడు వెళ్లునదియును నెవరికిని తెలియకుండెను. వారిని మోటారుబండ్లమీద రహస్యముగా ప్రభుత్వమందిరమునకు గొనిపోవుటయందే పరాజయము ప్రత్యక్ష మగుచున్నది. ఊరుపేరులేని సంఘములును, నాయకులును సమర్పించిన

సన్మానములందును, నివేదికలందును, విందులందును పస లేదని సర్వత్ర తెలిసియున్నది. ఈ యాడంబరములు సైమనుసప్తకమును గాని, లోకమునుగాని వంచింపజాలవు. కార్పొరేషను సమర్పించిన సన్మానపత్రమునందుగల గౌరవమును నగరమునందు గలిగిన యాందోళనము విశదము చేయుచున్నది. చెన్నపురికి యజమానిమైన కార్పొరేషను రహస్యముగ హార్బరునందు సన్మానపత్రమును సమర్పించుట పరిహాసపాత్రముగ నున్నదని మెయిలుపత్రికసైతము ఖండించినది. ఈ సందర్భములందు రామస్వామిమొదల్యారుగారేమి చెప్పినను పరిహాసపాత్రముగ నున్నది. చెన్నపురి కార్పొరేషను సమర్పింపదలచిన సన్మానపత్రమును కార్పొరేషను భవనమునందు సమర్పింపజాలకపోవుట సన్మాన దౌర్బల్యమును వెల్లడి చేయుచున్నది.

సైమనుకమీషనుకు సమర్పింపబడిన యితరసన్మానములును నీ మార్గమునె యవలంబించినవి. యమ్. సి. రాజాగారు నిర్మించిన సన్మానసంఘములవలెను, నితరసంఘములును నూతనముగ నిర్మింపబడిన స్వప్రయోజనసంఘములుగ తేలినవి. ధర్మవిజయము బహిష్కరణపక్షమునకు గలిగిన విధమును సన్మానపక్షమవలంబించిన రహస్యాచరణము చాటుచున్నది.

సైమనుకమీషను వచ్చిపోయినది. స్వప్రయోజనపరాయణులు స్వప్రయోజనములను నివేదించిరి. చెన్నరాష్ట్రప్రభుత్వము ద్వంద్వప్రభుత్వమును నిరసించుచు రాష్ట్రీయస్వపరిపాలనమును సిఫారసు చేసినటులు తెలియుచున్నది. న్యాయశాంతిశాఖల విషయమై మద్రాసుప్రభుత్వమునందు భేదాభిప్రాయములు ప్రబలినటులు తెలియుచున్నది. ప్రభుత్వసివేదిక ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును, నిరాకరించినది. జనసమ్మతమై యవసరమైన యీవిషయమును నిరాకరించుట ఆంధ్రుల దౌర్బల్యమును తెలుపుచున్నది. చెన్నపురి ప్రభుత్వము సమర్పించిన విధానమును సంపూర్ణముగ కనుగొనక విమర్శనమునకు బూనుకొనుట ప్రస్తుతము నిరుపయోగము. ప్రధాననాయకుల సహాయమును, సలహానులేక సైమనుకమీషను చేసినవిచారణ అసంపూర్తియు అనుపయోగము నని రాజ్యాంగపరిజ్ఞాత లంగీకరింపవలసి యుందురు. చెన్నపురి ప్రభుత్వ మవలంబించిన నిర్బంధవిధానము నిష్కారణమనియును భయజనక మనియును సంగతిసందర్భములు విశదము చేసినవి. ఇప్పటికైనను అధికారులు వారి పొరబాటుల నంగీకరించి శాంతిమార్గము నవలంబించుట ప్రయోజనకరము.

* * * *

శాసనసభలు-ఆదాయవ్యయములు

సామ్రాజ్యశాసనసభ, రాష్ట్రీయశాసనసభలుగూడి దేశాదాయవ్యయములను నిర్ణయించుచున్నవి. సంస్కరణములు వ్యయభారమును వృద్ధిచేసినటులు ఆదాయమునుగాని నిర్మాణవిధానముగాని వృద్ధిని జేయలేదని గతానుభవము విశదము చేయుచున్నది. అన్నిరాష్ట్రములందును ఆదాయమునకు మించిన వ్యయము గనుపడుచున్నది. దీనికి ప్రతీకారము వ్యయమును తగ్గించుటగాని పన్నులను వృద్ధిచేయుటగాదని నిరంకుశవర్గము సైతమంగీకరించుచున్నది. కాని ఏ శాసనసభయందునునీ

మార్గ మవలంబింపబడ లేదు. సామ్రాజ్యశాసన సభయందు రైలు రేట్లు తగ్గించుటకు వీలు లేదని శాఖాధికారి విశదము చేసెను. కార్డుల ధరను కానికి తగ్గించుటకు వీలు లేదు. సైన్యవ్యయము తగ్గించుటకు వీలు లేదు. చెన్నరాష్ట్రశాసన సభయందు స్టాంపుల పన్నును తగ్గించుటకు వీలు లేదని కోశాధికారసభ్యుడు విశదము చేసెను. మంత్రులును భారతీయకార్య నిర్వాహక సభ్యులును కీలుబొమ్మల వలెను మెలంగుచున్న విధమును వ్యవహారక్రమము విశదము చేయుచున్నది. కృష్ణను నాయరుగారు నారాయణమీనను గారి నిర్బంధమును సమర్థించుటయును, అల్లాడి కృష్ణస్వామయ్య గారును, ఉస్మాను సాహెబు గారును పోలీసువారు సైమను కమిషను సందర్భమున నవలంబించిన యక్రమములను సక్రమము లని సమర్థించుటయును భారతీయాధికారులు పడుచున్న దుర్దశను విశదము చేయుచున్నవి. సామ్రాజ్యశాసనసభయందును, రాష్ట్రీయశాసనసభల యందును కాంగ్రెసు సభ్యులుపపాదించిన తీర్మానము లోడిపోవుట సామాన్యవిషయముగ నున్నది. దేశరక్షణ శాసనమును, కోస్తా వ్యాపారశాసనమును ప్రతిఘటించుటకు ప్రజాప్రతినిధులకు బలము లేకపోయినది.

చెన్నరాష్ట్రశాసనసభయందు నిర్బంధ మార్గము నవలంబించిన యధికారవర్గమును నిరసించుట కయినను శాసనసభ నోచి కొనలేదు. దేశభక్తులను నిర్బంధించిన యధికారులను గాపాడుట కంగీకరించిన సభ్యుల ప్రవర్తన విషయమై వ్యాఖ్యాన మనవసరము. అధర్మాచరణమునకు దగిన ఫలమునధర్మ పరాయణు లనుభవించుచుదురు గాత! శాసన సభలను, సభ్యులను నావరించిన దార్బల్యమంతయును స్వరాజ్యము వలననే యంతరింపవలయునుగాని సామాన్యసాధనముల మూలమున నంతరింపజాలదు. స్వరాజ్యసంపాదనమునకు కాంగ్రెసుకార్యనిర్వాహకసభయును, గాంధిమహాత్ముడును నిర్ణయించిన కార్య విధానమే శరణ్యముగ నున్నది.

* * * *

### స్వరాజ్యసాధనము

స్వరాజ్యసాధనములందు విదేశవస్తు బహిష్కారము ప్రధానసాధనముగ నిర్ణయింపబడినది. విదేశవస్తువులందు విదేశవస్త్రము ప్రధానస్థానము నలంకరించుచున్నది. విదేశవస్త్రములందు బ్రిటీషువస్త్రములు ప్రధానస్థానము నలంకరించుచున్నవి. 70 కోట్ల రూప్యములు విలువగల బ్రిటీషువస్త్రబహిష్కారము సాధ్యమైనపుడు స్వరాజ్యము సులభసాధ్యముగా గలదు. విదేశవస్త్రబహిష్కారము ఖద్దరు నిర్మాణవ్యాపకములమీద నాధారపడియున్న విధమును గాంధిమహాత్ము డవలంబించిన నిర్మాణవిధానము రుజువుచేయుచున్నది. 1920-21 సంవత్సరములందు దేశమునందు ప్రబలిన వ్యగ్రోత్సాహము తిరిగి 1929-30 సంవత్సరములందు ప్రబలగల విధమును వర్తమానపరిస్థితులు విశదము చేయుచున్నవి. విదేశవస్త్ర దహనమును నేరముగ నారోపించి గాంధి మహాత్ముని నిర్బంధించుట నిర్బంధవిజృంభణమునకు శుభచిహ్నముగ నున్నది. నిర్బంధ విజృంభణమును సాత్త్వికనిరోధమునకును, సాత్త్వికనిరోధము స్వరాజ్యసంపాదనమునకును సాధనములు గాగలవు. గాంధిమహాత్ము

డుపక్రమించిన సత్యాగ్రహప్రస్థానమునకు మార్గమును నిరంకుశవర్గ మనాలోచితముగ నిర్మింప బూనుకొనుటయును ప్రజాప్రవృత్తి కనుకూలముగ నున్నది.

భరతఖండమునందన్ని పక్షములవారికిని రాజ్యాంగసంస్కరణములు విసుగును పుట్టించినవి. అన్ని పక్షములవారును స్వరాజ్యమును గోరుచున్నారు. కాని ప్రత్యక్షాచరణములేక స్వరాజ్యము సాధ్యముగాదు. ఒకవేళ సాధ్యమైనను ప్రయోజనకరముగాదు. ప్రత్యక్షాచరణమునకు కాంగ్రెసు నిర్ణయించిన విదేశవస్త్రబహిష్కారము, ఖద్దరునిర్మాణము, మద్యపాననిషేధప్రచారము, అస్పృశ్యతానివారణప్రచారము పరమసాధనములుగ నున్నవి. గాంధిమహాత్మునివలెనే సాహసధైర్యములను బూని కార్యవిధానమునకు బూనుకొనుట శ్రేయస్కరము.

గాంధిమహాత్ముడు బర్మాసంచారమునకు భంగము గలుగకుండుటకై రూ 50లు జామీనునిచ్చి నిర్బంధమునుండి విడుదలను బడసెను. గాంధిమహాత్ముడు శ్రద్ధానందోద్యానవనమునందు విదేశవస్త్రదహనమునకు బూనుకొనినపు డేయపరాధమును జేయలేదు. ఆయన వ్యక్తిసాత్త్వికనిరోధప్రస్థానమునకుగాని, సమష్టిసాత్త్వికనిరోధ ప్రస్థానమునకుగాని పూనుకొనలేదు. ఈసందర్భములందు మహాత్ముని యాచరణమునం దేవిధమైన యాక్షేపణలకును నవకాశములేదు. మహాత్ముని యాచరణము వారి ధైర్యమునకు నిదర్శనముగాని, వారిభయమునకు నిదర్శనముగాదు. స్వరాజ్యప్రచారమును జేయుటకు దీక్షనుబూనిన మహాత్ముని సంచారమువలన గలిగిన ప్రయోజనము వారి నిర్బంధమువలన గలుగజాలదని గతకాలానుభవము విశదము చేయుచున్నది. గాంధిమహాత్ముని మార్గమునే ఇతరనాయకులును సాహసమును బూని యవలంబించుట ధర్మము. సాంబమూర్తిగారివంటి ధీరులు నిర్బంధములకు భయపడరను విషయము లోకప్రసిద్ధము. స్వరాజ్యకార్యవిధాన మటువంటి ధీరులవలననే కొనసాగవలసియున్నది. స్వరాజ్యప్రచారకులయందు నిర్బంధ నివాస భయము చిరకాలముక్రితమె పోయినది. శ్రీకృష్ణజన్మస్థాననివాసము నింద్యార్హము గాకను గౌరవార్హమైనది. వర్తమాన సందిగ్ధావస్థయందు నూతనకార్య విధానమునవసరంబుగ నున్నది. ఆకార్య విధానమునకు గాంధిమహాత్ముడు నాయకత్వమును వహించుట కార్యసిద్ధికి శుభసూచకముగ నున్నది. ప్రజానాయకులు కాంగ్రెసు నిర్ణయించిన కార్యప్రణాళికను గాంధిమహాత్ము డవలంబించిన కార్యవిధానము ననుష్ఠించి స్వరాజ్య సంపాదనమునకు సంసిద్ధు లగుటకు భగవంతు డనుగ్రహించుగాత!

———

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras

# విషయసూచిక

# చిత్రములు

త్రివర్ణచిత్రములు:—జాగాయ్, మాధాయ్; గునకలీ.

సాధారణ చిత్రములు:—అజంతా చిత్రములు ౫; లిపి చిత్రములు ౭; ప్రాచీన శిల్ప చిత్రములు ౨; ఇతర చిత్రములును.

---

ఈ సంచిక ౧౩, ౧౪, ౧౬ ఫారములలో పుటలసంఖ్య పొరపాటుయినది. పాఠకులు మున్ముందా సంఖ్యను దిద్దుకొన ప్రార్థితులు.

—సంపాదకుడు.



జాగాయ్, మాధాయ్
శ్రీయుత నందలాల్ బోసుగారి చిత్రము ననుసరించి చిత్రించినది
[శ్రీ వి. ఆర్. చిత్రగారి అనుమతిని]

# సంవత్సరాది

నెట్టి లక్ష్మీనరసింహాము గారు

శ్రీ శుక్లాంబరధరతనుఁ
డై, శశివర్ణుఁడయి, విష్ణుఁడై, ద్విభుజయుగుం
డై, శాంతవదనుఁ డగు వి
ఘ్నేశుఁడు విఘ్నములడంచు నీ శుక్లసమా.

శా. శుక్లద్వీపము వీడు, శుక్లగరుడ
శ్వాం డాత్మసంజాతుఁడుఙ్,
శుక్లగ్రావసుతావిభుండు పదదా
సుండుఙ్, నిజార్ధాంగి శ్రీ
శుక్లాంశుప్రియసోదరీమణియుఁ గా
శోభిల్లు శ్రీవిష్ణు వీ
శుక్లాబ్దంబున సర్వలోకులకుఁ బా
చుం గాక విక్లేశముల్.

తే. శుక్ల శోణితయోగప్రసూతములగు
భూతములకు మున్నుగ, జతుర్భువనములకు

మున్నుగా నున్న కాలమం దెన్నఁ డొదవెఁ
బ్రభవ విభవ శుక్లాది విభాగసరణి?

ఆ. అఱువదేండ్ల కిప్పు డరుదెంచె మరల శు
క్లాహ్వయంబు కలిగినట్టి యతిథి;
యొక్క వత్సరంబె యుండును బండుగ
చేసి, గౌరవింపఁ జెల్లు మనము.

సీ. శ్రీవనేందిర విందు చేసె వేఁప విరులన్
మామిడి మొగ్గలన్ మాధవునకు;
శుభమస్తటంచు భూసురు లెల్లరకును బం
చాంగశ్రవణము చేయఁ గడఁగిరి:
క్లబ్బు మెంబర్ల పల్కులన్ వినంబడియె "హే
పీ న్యూ యియరు"రని యన్యోన్యముగను
సంరంభమున భక్తజనులు శ్రీరామలీ
లాసమారంభాభిలాషులైరి;
వచ్చె మరలఁ గ్రొత్త వత్సరం, బిది మహో
త్సవదినం బటంచు జనములు నగ
రముల, గ్రామములను బ్రమదంబు నొందిరి;
ముదముల పెను గాది గద యుగాది!




చెన్నపట్టణము, ఏప్రిల్ ౧౯౨౯

సంపుటము ౬ శుక్ల సంవత్సరము చైత్రమాసము సంఖ్య ౪

## సానుభూతి

మంగిపూడి వేంకటశర్మగారు

వ్రండు వేసవి మట్టమధ్యాహ్న మయ్యెది నాఁడు ప్రొద్దుటినుండి వేఁడి వెలుఁగు
తనదు నామమును సార్థకముఁ గావించుచు మలమల జగమెల్ల మాఁడ్చుచుండె
నెత్తికి తిన్నఁగా నిలిచెను సూర్యుండు నీడ లుండియు లేనిజాడ నుండె
నప్పు డొక్కగృహస్థుఁ డందందు పనిమీఁదఁ దిరిగి యా కట డస్సి మరలి యింటి
కేఁగి యిల్లాలిఁ గని యన్న మిడు మటంచుఁ - బలికి మడి గట్టుకొనుచుండె పసినిసుంగు
కంచమును బెట్టుకొని భుజియించు కోర్కెఁ - గూరుచుండెను వడ్డనఁ గొనియె గృహిణి.

వండుకొన్న దేల వడ్డించు కొన్న దే - తిన్నదాఁక లేదు దేహులకును
మరుక్షణంబునందె మాయగా చేటంత - మబ్బు పట్టి మిగుల నబ్బురముగ.

చిటచిటమని చినుకులు పడి - యట నటఁ బడసాగె పురిని నంతట నరు లొ
క్కట వాన వాన యనుచును - త్రుటిలో వెలుపలికి వచ్చి త్రొక్కట పడుచున్.

వాకిళ్లలో నారవైచిన బట్టలు తడియకుండఁగ తీయఁ గడఁగువారు
ఎండఁబోసిన ధాన్య మెత్తంగ తట్టలు బుట్టలు గొని వేగఁ బోవువారు
దారి నేఁగెడు బాటసారు లెందే తలల్ దాఁచుకో తలలెత్తి చూచువారు
ఎండవాన యటంచు నెలమిఁ బాడుచు పిల్ల లాట లాడఁగ వీథి కరుగువారు
లేదు మబ్బేమి తొందర లే దటంచు - చిన్న పెద్దలు కొందరు చెప్పువారు
నగుచు నెట్లున్న మానవు లట్లె యుండ - జోరుజోరునఁ గురిసెను కారువాన.

కనుకట్టో గారడో యన - కను మూసుక విప్పులోన గాలి విసరునన్
మిను నిండ కారుమబ్బులు - ఘనమై కార్కమ్మి యిరులు గ్రమ్మెన్ దిశలన్.

ఉరుములు మెరుములు పిడుగులు - నురుతరగతి జీవకోటు లులికిపడ, కనుల్
మిరుమిట్లు చెందఁగా హా - త్సరసిజములు తల్లడిల్ల సందడి చేసెన్.

ఆకసంబెల్ల చిల్లు లైనట్టి రీతి - నాగుపాములు వ్రేలాడులాగు ధార
లెడతెరపి లేక యొకపెట్ట పుడమియెల్ల - కడలి యగుదాఁక కురిసె నక్కడిదివాన.

ఆ యకాలవర్ష మత్యంతకష్టంబు - నష్ట మొదవఁ జేసె నరులకెల్ల
ఖగమృగాళినెల్ల గాసిల్లఁగాఁ జేసె - సూక్ష్మజీవకోటి సురుఁగఁ జేసె.

సూర్యచంద్రులు పగలు రేల్ చొచ్చి చూచి - పోదురు గృహస్థు ని ల్లింటిమీఁద పడ్డ
చినుకు లివతలికిని రావు జీర్ణపర్ణ - శాలఁబోలును సంసారి పూరియిల్లు.

ఆతండు పండితుఁడు కవి - జాతీయగ్రంథకర్త సదమలగ్రంథ
వ్రాతములు వేలకొలఁదిగ - ప్రీతి నినిచె దేవదారు పెట్టెలలోనన్.

వస్తువు లన్నియు పోనీ - వస్తుండఁగ వచ్చుఁ గాని ప్రాణపదములౌ
పుస్తకములు తడియఁగఁ గని - వాస్తవవాస్తవ్యుఁడగు నెవండు సహించున్.

పుడకలు పిడకలు తడిసిన - కడు కష్టము వంట యనుచు గందరగోళం
పడకు, మరి యుప్పు పప్పుల - గొడవపడకు, ఎట్లా గడుపుకోవచ్చు సుమీ!

బట్టలు పాఁతలు తట్టలు - బుట్టలు తడిసినను చెడవు పోలియవు చినుకుల్
పెట్టెలలోనికి దిగినన్ - వట్ట మగును గాన కప్పవలె దిట్టముగన్.
అని యెచ్చరించె గృహిణిని - తను చెప్పిన యట్లె యామె తత్తరపడుచున్
చని పుస్తకాల పెట్టియ - లను కావఁగ కాయశక్తులను పాటుపడెన్.

తాతతండ్రులనాఁటి ప్రాఁతశాలువలెల్ల విప్పి చెంగులు జార కప్పికప్పి
చిరిఁగి జీర్ణంబులై చెరిమూల చేరిన కంబళ్లరసి తెచ్చి కప్పికప్పి

తాటాకుచాఁప లేఁతాకు చాఁపలు గోనె పట్టాల గుడ్డలు పరచి పరచి
తన చీరెలును భర్తధరియించు దోవతుల్ పరిపూర్తిగా తెచ్చి పరచి పరచి
శీఁటచేటలు కొని తెచ్చి మాటి మాటి - తట్టబుట్టలు బోర్లించి తడియకుండ
గ్రంథముల కాఁపుదలచేసెఁ గాని యితర - వస్తువుల జోలితలఁప దాఁగేస్తురాలు,

తలదాఁచుకొనఁగ నించుక - తలమైనను లేక వానఁదడిసెడు పసి బి
డ్డలఁజేర్చి చిన్ని తిన్నియు - నిలిచి విధివిలాసమునకు నివ్వెరపడుచున్.

నకనకమను తా నాఁకట-నొకనిసుఁగు బుజాన నిద్రనొందె, పెనఁగు బు
వ్వకు పోరువెట్టి యొకశిశు-వీక నా గృహపతి యవస్థ యేమనవచ్చున్.

దీనుల కుపాల్యాలించెడు - దీనదయాపరుఁడు దేవదేవుఁడు తనకున్
లేనేలేఁడని తోఁచెడు .. దీనికి త-ప్పేమిచేసితినో యని వగచున్.

ఆఁకొని జాలిగ నేడ్చెడు - నీకూనకు చిన్నమన్న మిడలేని జడుం
డీకూళ యీ యభాగ్యుం - డీకుతలమునందు పుట్టు టేక నెందుకొకో!

ప్రేమతో తనుఁ జూచు పెండ్లాము బిడ్డలకైన నన్నము పెట్టలేనివాఁడు
ముమ్మరముగ వాన ముంపకుండఁగ కొంప గట్టి చేయింప లేనట్టివాఁడు
కడుపున పుట్టిన గారాముబిడ్డల విద్దెబుద్ధులజోలి విడుచువాఁడు
తనదారపుత్రులు ధరియింప మరియాదమైన దుస్తులను తేలేనివాఁడు
పెండ్లియాడ నేల పిల్లల కన నేల - కూడు గుడ్డ కొంప గోడిలేక
దారపుత్రు లేడ్వ తా నేడ్వఁగా నేల - పుట్ట నేల యిట్టి వట్టివాఁడు.

తాఁ జేసినట్టి గ్రంథా లెల్ల కోరికల్ కొనసాగ ముద్రించు కొనఁగనైన
నచ్చువేయించిన యాపుస్తకములైన కొల్లగా ప్రచురించుకొనఁగనైన
తనకోశముల నెల్ల నునుపఁగా నలమరుల్ పెనుబీరువాలును కొనఁగనైన
తనపొత్తకంబులుంచిన బీరువాల్ దాచుకొన మిద్దెటిలు కట్టుకొనఁగనైన
కలము గైకొని కైతలు గిలుకువేళ - నుప్పుపప్పులు లే వప్పుసప్పుచేయఁ
జాలనని భార్య గొణఁగుచు సణఁగకుండ - కాసు తేలేని వానికి కైత లేల?

అగ్నిహోత్రభయము లామనికాలాన - వానకాలమందు వానభయము
సీతుబీతు మిగులశీతకాలమునందు-లేదు సౌఖ్య మింటిపేదలకును.

శీలపరులకును గౌరవ-మాలోచనచేయు నరుల కతికష్టంబై
కాలము గడవదు; దుష్టుల-కాలంబము లబ్బు నేమికాలమహిమయో!

అని యీశ్వరేశ్వరుని తన - మనమున నిడి భక్తి రస నిమగ్నుం డగుచున్
కనుదోయి మొగిచి నమితా - ననుఁడై దీనుఁడయి ప్రార్థనం బొనరించెన్.

నిను నమ్మి యున్నవారము - ఘనమగు నీకరుణ గోరి కరయుగములు మో
డ్చినవారము శరణార్థుల-మనఘా! మా యార్తి మాన్పవయ్య మహాత్మా!

అన్నార్తు లగుచు శిశువులు - కన్నీరోడంగ నేడ్వఁగాఁ జూడఁగ మా
కన్నీరు ధార లగుచును-మున్నీరుగ నిండి జగము ముంచె మహాత్మా!

ఆపన్నశరణ్యుఁడవు ద-యాపారీణుఁడవు నత జనావన నిత్య
వ్యాపారుఁడవు ప్రసన్నుఁడ - వై పాలింపఁ గదె వర్ష మాఁపంగదవే!

ఇంటిలోని నీటి నేతమెత్తిన రీతి - పెద్ద గిన్నెతోడ వేగిరముగ
తోడి పారఁబోయఁ దొడఁగె నాయిల్లాలు-విరతిలేక మదిని విసుగులేక.

ఎంత కష్టపడిన నేమిలాభములేక - యెంత నీరు తోఁడె నంత నీరు
తోరమగుచు తోడుతో నిండుచుండెను - తెరపిలేక వాన కురియుకతన.

అప్పు డామె యే యుపాయంబుఁ గానక - గరిటెతోడ నింటి గడప క్రింద
పెద్దకన్న మిడియె పిల్లకాల్వ యనంగ - వాకిటికిని వెడలె వాననీరు.

లోకనాటకరంగంబు లోనితెరలు - సూత్రధారుండు మార్చుచు చిత్రమైన
దృశ్యములు చూపుచున్నట్టి తెరఁగు తోఁప-భువిని దివిని చెలంగె నబ్బురపు మార్పు.

కుంభవృష్టి వడిగ కురియు చున్నప్పుడే -వానబాధ యింక మాను నన్న
సన్న గన్న పులుఁగు సంతోసమున కుల్కి - కిలకిలారవముల కెరలి కూసె.

వడిగఁబారు మెయిలుబండి హఠాత్తుగా-నిలిచినట్లె వాన వెలిసిపోయె
ఇంద్ర ధనువుతోఁప నిఁక వాన వలదంచు - శాసనంబుచేయు చందమునను.

ఒంటిచినుకు పడిన నొట్టయ్యె గగనంబు - నిండియున్న మబ్బుపిండు విచ్చె
వెలుఁగు వచ్చె ద్యుమణి వెలుఁగంగఁ జొచ్చెను - జనులకెల్ల సంతసంబు హెచ్చె.

వారివారి పనులఁ జేరిరి నరులెల్ల - పిల్లకాయలెల్ల వీథిలోని
కరుగుదెంచి యాటలాడంగఁ గడఁగిరి - మనములందు వేడ్క లినుమడింప.

కాలికంచాల నిసుకలో కట్టికట్టి - వానకాలువలకు గట్లు వైచివైచి
పడవలను చేసి నీటిలో విడిచివిడిచి - చాలవేడుక తెప్పల తేలి రపుడు.

# *ఆశ్చర్యచూడామణి-వాల్మీకిరామాయణము

కిళాంబి రాఘవాచార్యులు గారు

సంస్కృత వాఙ్మయమున వాల్మీకిరామాయణము ననుసరించి మహావీరచరితము మొదలగు నాటకము లనేకము రచియింపఁబడినవి. అందు శక్తిభద్ర కృతమగు ఆశ్చర్యచూడామణి యను నాటక మొకటి నూతనముగఁ బ్రకటింపఁబడినది. శక్తిభద్రమహాకవి దక్షిణదేశస్థుఁడని ప్రస్తావనయందలి 'ఆకాశం ప్రసూతే పుష్పం;సికతాః తైలముత్పాదయంతి; యది దక్షిణస్యాదిశః ఆగతం నాటక నిబంధన' మ్మను నటీవాక్యమువలనఁ దెలియుచున్నది. ఇతఁడు క్రీ. శ. 8, 9 శతాబ్దములయందుండె ననియు, జగద్గురు శ్రీశంకరాచార్యుల శిష్యుఁడనియుఁ గీర్తిశేషులగు మహామహోపాధ్యాయ గణపతిశాస్త్రిగారిచే భాసునివని ప్రకటింపఁబడిన నాటకముల నీతఁడే రచియించి యుండవచ్చు ననియుఁ బీఠికయందు కుప్పుస్వామిశాస్త్రి గారిచే వ్రాయఁబడినది. ఇది విమర్శనీయము.

వాల్మీకి రామాయణమునందు శూర్పణఖా వృత్తాంతము మొదలు యుద్ధకాండాంతము వరకు గల కథాభాగమును గైకొని కవి యీనాటకమును రచించియున్నాఁడు. ప్రథమ ద్వితీయాంకముల శూర్పణఖావృత్తాంతమును, చతుర్థాంకమున జటాయువధయుఁ,బంచమాంకమున సీతతో రావణుఁడశోకవనమున భాషించుటయు,షష్ఠాంకమున హనుమంతుఁడు సీతను జూచుటయు, సప్తమాంకమున రావణవధయు, సీతయగ్నిప్రవేశమును వర్ణింపఁబడినవి. కాని శక్తిభద్ర మహాకవి రామాయణము నందలి కథను మార్చియున్నాఁడు. ఈ మార్పులను గూర్చి కుప్పుస్వామిశాస్త్రిగారు తమ యుపోద్ఘాతమున

'Where the author deviates from Valmiki's original in the construction of the plot, he shows sound judgment.'

అని వ్రాసియున్నారు. వాల్మీకి రామాయణకథయందుఁ గవిచేసిన మార్పులు పాత్రౌచిత్యమును కుపకరించుచున్నవా లేదా యను విషయముమాత్ర మిటఁ జర్చింపఁబడును.

౧. ప్రథమ ద్వితీయాంకములు : శూర్పణఖా వృత్తాంతము—

అరణ్యకాండమున ౧౭-౧౮ సర్గలలో వివరింపఁబడిన శూర్పణఖావృత్తాంత మిట మార్చబడినది. రామాయణమునందు శూర్పణఖ తన రాక్షసరూపముతో రామునిఁజూచి మోహించి యతని వరింపు మన, రాముఁడు లక్ష్మణుని యొద్దకామెనుబంపుటయు,లక్ష్మణుఁడామెతో బరిహాసోక్తుల నాడి శ్రీరామునే వరింపు మన,

* "శక్తిభద్రవిరచితమగు ఆశ్చర్యచూడామణి" చెన్నపురి 'బాలమనోరమా' ముద్రాశాలయందు ముద్రితము.

శూర్పణఖ రామునిఁ జేరవచ్చి సీతను మ్రింగఁ జూచుటయు, లక్ష్మణుఁడు రామాజ్ఞచే శూర్పణఖ కర్ణనాసముల ఛేదించుటయు గలదు.

ఆశ్చర్యచూడామణియందు శూర్పణఖ తననైజ స్వరూపమునువిడిచి సుందరాకృతితో లక్ష్మణుని వర్ణింపఁబోయినది. పర్ణశాలానిర్మాణ మొనరించి తనసోదరునికిఁ దెలుపుదమని గోదావరీతీరమునకుఁ జనుచు, లక్ష్మణు డామెసౌందర్యమును గాంచి,

'అస్యాతిమాత్రాయతలోచనస్య
నతభ్రుణః క్రమపయోధరస్య,
ఆశ్చర్యరత్నస్యవిలాసయోనేః
కి మాకరో ద్వ్యర్ను వసుంధరాను.'

అని తర్కింపుచుఁ జిత్తవికారమును బొందును. రామాజ్ఞచేఁ దాను వచ్చితిననియుఁ, దన్ను వివాహ మాడు మనియు శూర్పణఖ యాతని వేడుకొన,

'వాసో వల్కలమాస్పదం విటపినో వన్యం శరీరస్థితిః,
శయ్యా దర్భలతాప్రసాధన మపాంవర్షి జటానాంభరః;
బాలే కింబహునావనేఽనమృగన్యాయస్యనత్వంపదం,
సారంగాక్షితపోభృతఃక్వతపసాంశత్రుఃక్వసంకల్పజః.'

అని యామెను మరల్ప యత్నించి విఫలుఁడై పర్ణశాలాసమీపమున నామెను, దనకై వేచి యుండుమని చెప్పెను శూర్పణఖ లక్ష్మణునికై వేచియుండి యాతఁడు రాకపోవుటచేఁ దిరిగి రాముని సమీపింప, రాముఁ డామెను లక్ష్మణునియొద్దకు మరలఁ బంపెను. లక్ష్మణుఁ డామెను వరింప నిష్టపడకపోవుటచే శూర్పణఖ తన స్వస్వరూపముతో నాతని నాకాశమార్గమునఁ గొనిపోవుచుండ, లక్ష్మణు డామెకర్ణనాసికముల ఛేదించెను.

అగ్నిసాక్షిగఁ బరిణయము నొందిన భార్యనుసైత మయోధ్యయందు విడిచి శ్రీరాముని పరిచర్యకై యరణ్యములఁ గ్రుమ్మరుచు,

'నాహం జానామికేయూరే నాహం జానామికుండలే,
నూపురేత్వభిజానామి నిత్యం పాదాభివందనాత్.'

అను శ్లోకమున వాల్మీకి వర్ణించినట్లు పరస్త్రీవైముఖ్యముచే నలరారు లక్ష్మణుఁడు వివాహితయో యవివాహితయో తెలిసికొనకపూర్వమే సుందర స్వరూపధారిణియగు శూర్పణఖను గాంచి చిత్తవికారమునుఁ బొందెననుటయాతని పాత్రమున కెట్టియాధిక్యమును గలిగించుట లేదు. ఇంద్రియలోలుఁడగు సామాన్య మానవునివలె లక్ష్మణుఁడు చిత్రింపఁబడియున్నాఁడు. రామాయణమందు మనకుఁ గల గౌరవమునకుఁ బ్రథమకారణ మందలి ముఖ్యపాత్రములగు సీతారామలక్ష్మణుల గుణాతిశయమే. చూడామణి నాటకమునఁ బ్రథమాంకముననే 'ప్రథమకబళే మక్షికాపాతః' యనునటులు లక్ష్మణుని యుదారస్వభావమునకుఁ గొంత వాటిల్లినది.

౨. తృతీయ చతుర్థాంకము లందు మాయా సీతావృత్తాంతము, సీతాపహారణమును, జటాయువధయు వర్ణింపఁబడినవి. ఖరదూషణాదుల వధచే నుద్ధృతకంటకమగు జనస్థానమును గాంచి సంతోషముచే మునులు సీతారాముల కాశ్చర్యచూడామణ్యంగుళీయకములఁ గానుకగా నొసఁగుదురు. వాని

ప్రభావమును గవి యీవిధముగ వర్ణించి యున్నాఁడు:

'మణి మంశుకే సరిత మంగులీయకం
కలధౌతసిద్ధ మపి ధారయంతి యే;
సమవాప్య తా నవళే మాశు మాయినః
ప్రకృతిం వ్రజంతి సహసా క్షపాసురాః.'

ఇచటనే చూడామణి నాటకమందు బీజన్యాస మొనరింపఁబడినది. మాయామృగము ననుసరించి రాముఁడు చనుటయు, 'హాలక్ష్మణా, హా సీతా'యని మాయామృగము పలవించుటయు, రావణుఁడు పర్ణశాలఁ జేరుటయు మూలము నందువలెనే వర్ణింపఁబడినవి. కాని రావణుఁడు రాముని వేషమును ధరించి సీతతో భాషించిన యనంతరము సూతుఁడు లక్ష్మణుని వేషమును ధరించి, భరతునికిఁ బరరాష్ట్రభయము సంభవించిన దని మునులు జ్ఞానదృష్టిచే గ్రహించి రథమును బంపిరని విన్నవింప, సీతతో రావణుఁడు రథ మారోహించి బయలు దేఱును. రాముఁడు మాయామృగమును జంపి పర్ణశాలకు వచ్చుచుండ శూర్పణఖ సీత వేషమును ధరించి యాతని సమీపించినది. రాముఁడు శూర్పణఖను సీతగనే భావించెను. కాని రాముఁడు శూర్పణఖయొక్కయు, సీత రావణుని యొక్కయు నైజస్వరూపములను గుర్తించు టెట్లు? శూర్పణఖ సీతవేషమును ధరించినను మారీచుఁడు హతుఁడైనట్లు వినిన తోడనే దుఃఖించును. రాముఁడు

'దేవి కి మద్యాపి శోకం న ముంచసి,'

యని యామె కనులఁ దుడువ నాశ్చర్యాంగులీయకప్రభావమున శూర్పణఖస్వరూపమును దాల్చును.

రావణుఁడు రాముని వేషమును ధరించి పుష్పకారూఢుఁడై చనుచు సీతాస్పర్శ సుఖ మనుభవింపఁగఁగోరి

దేవి!

'నియమాభిషేకజటిలం తపోవనే
వనవల్లరీకుసుమమాత్రమండనం;
రచయామి దేవి రథయానవేగతః
శ్లథితం శిరోరుహనిబంధనం తవ.'

యని యామె శిరోరుహములను ముడివైవ యత్నింప,

'ణం కుమారో ఆసణ్ణో'

యని సీత యాతని హస్తము నంటి వారించినది. రావణుఁ డాశ్చర్యచూడామణిప్రభావముచే రాక్షసరూపమును దాల్చును.

'ఆర్యపుత్ర! సౌమిత్రే! పరిత్రాయస్వ పరిత్రాయస్వ'

యని శోకించును. జటాయు వామెను రక్షింపవచ్చి నిహతుఁడగును.

ఈ కథావిధాన మెంత రమణీయముగ నున్నను సీతారాములపాత్రముల కెట్టిశోభను గలిగించుటలేదు. జననమాది పరస్త్రీ పరపురుషవిముఖులగు సీతారాములకు క్షణమాత్రమైనను మాయాసీతారామ వేషధారులగు శూర్పణఖారావణులపై యనురాగాతిశయమును జూపింపఁజేయుట విరసముగఁ గాన్పించుచున్నది. మరియు, సీతారాములు

కలలోన నైనను, ప్రమాదవశమున నైనను అన్య యువతీపురుషుల ముట్టియుండ లేదని రామాయణమువలనఁ దెలియుచున్నది. వివశ యై యనన్యగతికయైనపుడు రావణుఁ డామెను బలవంతముగ రథముపైఁ జేర్చి లంకకుఁ గొని పోయెను. అందుననే హనుమంతుఁడు తన వీఁపుపైఁ గూర్చుండి రాముని సమీపమునకు రమ్మని యడిగినను, సీత యతని మాటలకు సమ్మతింపక, వేర్వేరు కారణముల నిర్వ చింపుచు,

'భర్తృభక్తిం పురస్కృత్య రామా దన్యస్య వానర,
న స్పృశామి శరీరంతు పుంసో వానరపుంగవ!
యదహం గాత్రసంస్పర్శం రావణస్య బలాద్గతా,
అనీశా కిం కరిష్యామి వినాథా వివశా సతీ.'

అని వారించినది. అట్టిలోకోత్తరగుణసం పన్నులగు సీతారాములకుఁ బ్రమాదవశమున నైనను బరస్త్రీపురుష సంస్పర్శమును గలిగించుట పాత్రౌచిత్యభంగకరమని నాతలంపు. కాని శూర్పణఖారావణులచే మాయాసీతా రాముల వేషముల ధరింపఁజేసిన శక్తిభద్రమహా కవికి మరియొకమార్గము స్ఫురింపలేదు. మూల మునలేని కల్పన మొనర్చి కవి సీతారాముల పాత్రౌచిత్యమును బోషించియుండలేదు.

3. సప్తమాంకమున రావణసంహారా నంతరము సీత యగ్నిప్రవేశము వర్ణింపఁబడినది. సీతను దనయొద్దకుఁ దీసికొనిరమ్మని శ్రీ రాముఁడు

'హత్వా వాలిన మర్ణవే గిరిశతై రాబధ్య సేతుం క్రమాత్,
లంకామేత్యసహాయబంధుసహితం కృత్వాహతం రావణమ్;
యామద్య ప్రతిపాలయామివచనప్రామాణ్యతో మారుతేః,
సంవాసాదపి నామ సా నృపసుతా నస్యా దవర్ణాస్పదమ్.'

అని వితర్కింప, లక్ష్మణుఁడు

'సుఖాభిలాషీ స్త్రీభావో దుర్వినీతాశ్చ రాక్షసాః,
దూరే వయ మతో దేవ్యాః పరీక్షా భావశుద్ధతా.'

అని వచించును. ఇందు రామలక్ష్మణు లకు సీత పాతివ్రత్యము విషయమై సందేహము జనించిన దనుమాట నిజము.

సీత రాముని సమీపింపక పూర్వము ధూళి ధూసరితగాత్రయు, నేకవేణీధరయు నైనప్పటికి ననసూయవరమువలన రాముని సన్నిధిని మనోహరరూపమును దాల్చినది. రాముఁ డామెను గాంచి సుగ్రీవునితో

'సుగ్రీవ! పశ్య ఇదానీం త్వయా దృష్టపూర్వం విరహచారిత్రమ్.'

'హరిచందనప్రణయినౌ పయోధరౌ,
కుసుమాచితం సురభి కేశబంధనమ్;
అరుణప్రభాతిశయచోర మంబరమ్,
విరహవ్రతాయ వహతే పతివ్రతా'

యని పల్కెను. హనుమంతుఁడును సీతను గాంచి,

'దేవ! లంకాయా మన్యా మయా దృష్టా-సాంప్రత మియ మన్యా'

యనును. సీత రామునితో నేదియో వచింపఁబోవ, రాముఁడు

'నను తే రూపమేవ కథయతి'

యని యామెను నిరసించును. లక్ష్మణ పవనపుత్రులును సీతను గాంచి,

'తవ వచన శ్రవణస్య ఫలమేతత్'

అనియు,

అందు నొకహంస బిసకాండ మనెడు భ్రాంతి-నెట్టెటో ముక్కునను బట్టి
మెగురుచుండ
జాఱిపడె దారి రయమునఁ జంద్రకిరణ-ధవళ మొకహార మాతని తలిమమునను.

ఔర! స్పృశించుమాత్రన, మదంగకముల్ పులకింపఁ జేయు; నీ
హారము స్వప్నదృష్ట యగు న మ్మదిరాక్షి ధరించినట్టి దే;
చారుసితేతరాంశుకము సంగతి, నా లలితాంగి తుంగప
క్షోరుహపాళిఁ గప్పు, నిదిగో; సరమందు మసార మూనవాల్.

తరళహారచ్ఛవిచ్ఛటాచ్ఛురితగగన-తలుని, రాకాహిమాంశు సుందరుని,సమర
తరుణులాశ్చర్యనిశ్చల తారకేక్ష-ణముల నీక్షించి రతని, నానందగరిమ.

సంతతనిమజ్జదమరయోషా స్తనోరు - శాతకుంభకుంభస్థలస్ఖలన జర్జ
రితమహోర్మిమాలను, స ప్తఋషిసిసేవి-తప్రతీర, స్వర్ణదిఁ గం చతండు చనియె.

చలనమునఁ గా సమస్తసుమసౌరభ మెల్లెడ వెల్లిగొల్పున
మ్మలయమరుత్తు పుత్రకుని, మన్మథమోహనుఁ జూచి యానతుఁ గా,
దళముగ డెందమం దలరి నందనదేవత న్రమ మైన త
ద్గళమునఁ దేనె చిందు విరిదామము నవ్యము వెట్టెఁ బ్రేమునఁ గా.

దానినెత్తావి రేఁగి యంతటను ముసరు-భసలతతి యమునాఝరీభ్రాంతి గొలుప
నతఁడుగంధర్వగీతమోహితకురంగ-సముదయముఁ జేరె మిన్నందుహిమనగంబు.

అగ్రసన్నద్ధ లిఖితసింహాంకచీన - పటసముత్తుంగకాంచన ధ్వజవిరాజి,
యంబికాలయ సౌధ, ముదాత్తకీర్తి - కనియెఁ గైలాసకూటసంకాశ మతఁడు.

ఇడకుఁ బింగళకును నడిమి దా నాడి పర్వ(ల) శ్రేణి గూఢమై పరఁగుదాని
విమల మా హృదయారవిందంబునందు సువ్యక్తమై తెలియంగఁ బడెడుదాని
నంత బాహ్యోపసర్గానుపహతములై నియమ స్థిరత్వముల్ నెగడుబుద్ధి
స్వాత్మ నీక్షించుచు, నానందవారాశిమగ్నమై పూర్ణసమాధియందు
నున్న వర్ణినిఁ బులకసంఛన్న దేహ-శాంతగంభీరవేష విస్మయయుతాక్షుఁ
డగుచు నొకసిద్ధయోగ,నత్యంతవినయ-వినమితశిరస్కుఁడై యటఁ గనియె నతఁడు.

చామరకలాప వీటీవ్యజనమణీక-లాచిభృంగారశుకదుకూలములు కేలఁ
దాల్చి యాత్మావలోకోత్క-ధావితాక్షు-లైన పరివారనారుల నరిగి కాంచె.

కను మటు నేత్రపర్వ మనఁగాఁ దను వర్ణిని, భూషణధ్వనుల్
వినఁబడు నద్దెసం గనులు వే మరలన్, సుషమాసుధారసం
బును గురియించునత్తరుణిఁ బూఁబొదరింట నవీననీరదం
బునను మెఱుంగుదీవియనుబోలె, నతం డెలమిం గనుంగొనెన్..

వదన మదే నయనము లవె-యదె భ్రూ వదె గళము నదియె యరుణాధర మ
య్యదియే కుచకుంభయుగం-బదె జఘనం బవ్వె పదము లమ్మదిత యిదే.

ఝుళఝుళత్కంకణతనుసంచలితకుచతఁ-జపలనయనోత్పలతఁ జలాచలచికురత
స్రస్తకర్ణావతంసత శ్రమజలాళి-కత నడుచు నింతి నామదిఁ గాదు బంతి.

రూపముఁ దాల్చి వచ్చినమరుండొ మధుండొ యనంగఁ జాలునా
రూపసిఁ, గందుకం బెటులు ద్రుళ్లిన నట్లు భ్రమించు బెళ్కునుం
జూపులతో సవిభ్రమతఁ జూడకె చూచుచు, వాలుఁగంటి దే
వీపరిచర్యగాఁ జలుపువేడుక క్రీడ ముగించెఁ గోవెలన్.

కందుక కేళిఁ జెక్కులను గ్రమ్మిన చెమ్మట నంటి వ్రేల్కురుల్
చెందొవరేకువంటి తన చేకొనవ్రేలను బైకిఁ ద్రోయుచున్
సుందరి వానిఁ గన్గొనలఁ జూచు చరాళకనీనికంబులన్,
మందసమీర సంచలిత మంజులతం దలఁపించె నత్తఱిన్.

కూరిచి యింద్రనీలములు, గ్రుచ్చినముత్తెపుఁ జేరులుం బలెం,
దోరపు లోనికందురుచితో దిగువెన్నెలనిగ్గులుం బలెన్,
సూరసుతాప్రవాహ మెడఁ జొచ్చిన గాంగఝరంబులుం బలెన్,
వారిరుహాక్షి నీలసిత భవ్యకటాక్షము లల్లె వానిపై.

(సశేషము)

---

# శృంగారకావ్యములు: శృంగార రాధామాధవసంవాదము

పారనంది జగన్నాథస్వామి గారు

౧

అన్ని సారస్వతములలోనూ శృంగారభావ ప్రదర్శనమునకు చాలా ముఖ్యస్థానము గలదు. శృంగారము ప్రధానరసముగా గల కావ్యాలు సాధారణముగా నూటికి ఎనభై తొంభై వంతున ప్రతీసారస్వతములోనూ ఉంటవని చెప్పవచ్చును. ఈ భావాలలో దీనికే ఇంత ప్రాముఖ్యము ఎందుకు వచ్చిందో గదా అన్ని రసములకంటె! ఇది ఎక్కువ ఆనంద జనకమనా? దీనంత మెత్తగాను, దీనంత సులభముగాను మరేరసమూ చదువరులను ఆకర్షించదనా? అందరి హృదయాల లోనూ దీనంత ప్రాయముగా మరేదిన్నీ వ్యక్తమవుతూ ఉండదనా? కవులు ఇతివృత్తముల కొరకు మానవహృదయాన్ని పరీక్షించునపుడు వారి దృష్టికి గోచరమయే సామాన్యభావము ఇదే అనా? ఈ హేతువులలో ఏదైనా కావచ్చును; లేక అన్నీ కలిసి కావచ్చును. కాని శృంగారరసవర్ణనము సమంజసముగా ఉండడానికి మాత్రము సామాన్యకవి హృదయము చాలదని నొక్కి చెప్పవచ్చును. అది ఎంత సుగమమో, ఎంత సాధారణమో, అందుచేతనే ఎంత హృదయతలగతమో, అంతసూక్ష్మమైనది కూడా. అవిచ్ఛిన్నప్రవాహము ఎట్లు అందరికి సులభమైనా ఎక్కడనో కొన్ని కొన్ని స్థలములందే పుణ్యతీర్థ మవుతుందో, అలాగే ఈరసముకూడా ఎంత విస్తృతముగా ఉన్నా, అక్కడక్కడ మాత్రమే ఉన్నతకవులకు ఆశ్రయ మవుతుంది. సూక్ష్మగ్రాహులైన సహృదయులకే ఆరసము చక్కగా సాధ్యమై, వారి కవనములోనే ఒప్పారుతూ, వారి కావ్యములు శాశ్వతము లౌనట్లు సాధన మవుతుంది. ఇట్టి కారణముచేతనే సుకావ్యములు చాలా తక్కువగా ఉంటవని వేరే చెప్ప నక్కరలేదు. ఏది "శృంగార కావ్యములు" మెండుగా బయలువెడలుటకు కారణ మయిందో అదే అల్పసంఖ్యాకములు తప్ప తక్కినవన్నీ ఉత్కృష్టకావ్యములు కాకపోవుటకు కూడా కారణ మయింది.

శృంగారభావము సాక్షాత్తుగా సంభోగేచ్ఛావాసనపై ఆధారపడి యున్నది. ఈ వాసన మనోనిర్మాణములో చాలా శక్తిమంతమైనది. దానికి అందుచేతనే అనేకవ్యాపారాలలో ప్రసక్తి ఉంటూ ఉంటుంది. అది సాక్షాత్తుగా కాకుండా ప్రకారాంతరముగా వక్రగతిని అవలంబించిన్నీ ప్రభవిస్తూ ఉంటుంది. ఒకానొక తత్వజ్ఞుని అభిప్రాయము ప్రకారము దీనితో సంబంధము లేని ముఖ్యవ్యాపారమే లేదు.

అనగా ఆశక్తియొక్క వినియోగము ఏమాత్ర మైనా లేకుండా ఉండే మనోవ్యాపారాలు చాలా తక్కువని సమన్వయము చేయగలము. ఈ ఇచ్ఛ, ఈశక్తి సంభోగేతరవ్యాపారాల్లో ఖర్చు అవుతూ ఉంటుంది. స్త్రీపురుషుల అన్యోన్యవిలాసాలను, సంతానసంరక్షణను కూడా ఈవాసనయొక్క సాక్షాత్ కృత్యముల క్రిందనే పరిగణించినా, ఇంకా ఎన్నో ప్రకా రాంతరకృత్యములలో ఆశక్తి వినియోగ మవు తుంది. వాటిలోకెల్ల ఎక్కువ సాక్షాత్తుగా ఉండేది శృంగారకావ్యముల రచనపఠనాలు. ఈకావ్యాలద్వారా ఆ భావసంతుష్టి పొందుట బుద్ధిపూర్వకముగా జరుగుతుందని పరిశోధ కులు చెప్పరు కాని ఈసూత్రాన్ని అనుస రించి చాలామంది మనోవృత్తులను సూటిగా సమన్వయించుట సాధ్యమని నిరూపిస్తారు.

ఈసంతుష్టి సున్నితముగాను, పచ్చిగాను ఉండవచ్చును. అది ఆభావోద్రేకము ఇంద్రియ గతమా, లేక హృదయగతమా అనే విభజ నను పట్టి ఉంటుంది. కేవల ఇంద్రియసుఖాన్ని సంపాదించేది ఉన్నంత పచ్చిగా మనోగత మైనది ఉండదుగదా! దీనిని బట్టే సభ్యాసభ్య శృంగారవర్ణనలను నిర్ణయించ వీలుంటుంది. సాధారణముగా మహాకావ్యాలని చెప్పతూ ఉండే మన ఉద్గ్రంథాలలో సహితమూ ఇంద్రియసంబంధశృంగారవర్ణనలు కనబడక మానవు. కుమారసంభవాదికావ్యాలలోను, వసుచరిత్రాదిప్రబంధాలలోనుకూడా ఇట్టి వర్ణ నలు లేవని అనము కాని మొత్తముమీద వాటిలో వర్ణితమైన శృంగారరసమునకున్ను, బిల్హణీయము మొదలైనవాటిలో వర్ణితమైన దానికిన్ని కావలసినంత భేదము ఉన్నది. అది సంఖ్యలోనే కాకుండా జాతిరూపాలలోకూడా అని సద్విమర్శకు లందరు ఒప్పుకొనక తీరదు. ఆ అంశము స్పష్టపరిచే ఉద్దేశముతో ఒకవిధ మైన వర్ణనలను సూచిస్తాను. అవి కేవల శారీ రకసంభోగవిషయికవర్ణనలు. శృంగారమన్న దివ్యరసానికి పశుసమమైన ఈ కామప్రవృత్తిగా అధఃపతనము కలిగింది. ఇది నింద్య మనిన్నీ, అవినీతి అనిన్నీ నేను వాదించలేదు. రెండింటికీ గల ముఖ్యభేదమును చూపిస్తూ ఒకటి ఎట్లు మనుజునిలో ఉత్కృష్టమైన ఆత్మ కు ఆనందకరమో, ఒకటి ఎట్లు అనిత్యమైన శరీరమునకు సుఖకరమో నిరూపిస్తున్నాను. ఇట్టి నియమముల ననుసరించే గదా శిల్పము లో ఎక్కువ తక్కువలను నిర్ధారణ చేయ గలము.

ఈ తక్కువ స్థానమునే ఆక్రమించగలి గిన శృంగారప్రబంధములు కొన్ని ఆంధ్రసార స్వతములో బయలుదేరినవి. సంస్కృతసార స్వతములో ఇందుకు పోలికలు లేకపోలేదు. వాటి కన్నిటికీ కామశాస్త్రసంప్రదాయదోష ము తగిలిందని చెప్పవలసి యుంటుంది. కామ శాస్త్రమని ఒకటి మన దేశములో చాలాకాల ము క్రిందటనే వర్ధిల్లినది. అందులో శాస్త్ర దృష్ట్యా కామకళలు, కామవిధానములు మొద లైనసంగతు లనేకములు వర్ణనీయములు. వాటి చర్చ పూర్తిగా బుద్ధితర్కగతము. ఆవర్ణనలు

చర్చలు; అంతేకాని భావముల ఉద్రేకము ఫలముగా గల కావ్యరచనలు కావు. శాస్త్రమునకూ, కావ్యమునకూ గల శాశ్వతభేదమును మనస్సున ఉంచుకొంటే కామశాస్త్రమందున్న సంభోగవర్ణనలకు తల ఊపే విమర్శకులు ఆవర్ణనలతో నిండిపోయే కావ్యములకు కూడా ఆదరము చూపినట్లు కాదని స్పష్టమవుతుంది. తెలుగులో కూడా ఈకామశాస్త్రగ్రంథాలు బయలువెడలిన తరువాతనే ఈశృంగారప్రబంధాలకు ఆధారము దొరికింది. శాస్త్రమనే పేరుతో చేసిన చర్చలను పద్యరూపముగా నాయికానాయకుల నోళ్లలో ఉంచినంతమాత్రాన అనౌచిత్యము వాటిల్లునని ఎవరనగలరు అనే పొరపాటు కొంతవరకు ఈకావ్యముల రచనకు ప్రోద్బలకము అయియుంటుందని నా ఊహ. ఎఱ్ఱన అనే మధ్యకవి, సుమారు 1560 సం.నాటి వాడు, కొక్కోకమును తెనిగించి కేవలము ఇంద్రియసుఖప్రియులైనవారికి చవిచూపాడు. ఒకవిధముగా ఆ తరువాతనే బయలుదేరినవి ఈప్రబంధాలన్నీ. భావవికారములకు తావు ఇవ్వని కొక్కోకాంశములను భావోద్రేకము లవునట్లు కావ్యసరణిని వేంకటకవి మొదలుగా గల శృంగారకవులు లోకములో విరజల్ల ప్రారంభించారు. కాని ఈవెద యెప్పుడూకూడా గొప్పపంటపండినట్లు రుజువులేదు. ఏకొద్ది కాముకబృందముల లోనోతీవ్రప్రచారముకలిగియుండి, ఏకొద్దిమో చనదివసములలోనో విరాజిల్లి చెదపుట్టలవలె తగ్గిపోతున్నట్లు సారస్వతచరిత్రకారులు ఊహిస్తున్నారు.

ఈ ఊహకు మరొక బలమైన నిదర్శనము కలదు. ఇట్టి ప్రబంధాల "కృతిపతు" లందరూ —పతు లనండి, భర్త లనండి, ఏమన్నా సరే, సహృదయముగా లేదని నామనవి—మధుర తంజాపురీ నాయకులే. అవును, వారిలో చాలామంది ఆంధ్రసారస్వత వృద్ధింకరులే; అయినా వారి పురుషార్థములు మాత్రము ఆద్యంతే తరములు. ఐహిక సంపదలతో విర్రవీగుతూ ఉండి, శరీరమే సర్వమని దృఢముగా నమ్మియుండి, మధుసమమైన మదముతో ప్రమత్తులై యుండిన ఈ బుద్బుదప్రాయ ప్రభువుల కామసంతుష్టికి ప్రవర్తించిన కావ్యాలు ఇవి. వారిచ్చిన "పడుపుకూటి" కొరకు ఈమధ్యమకవులు వ్రాసిన కావ్యాలు ఇవి. అట్టివారు వాస్తవముగా మధ్యములే గదా.

మొన్న మొన్నటివరకు ఇట్టి కావ్యాలు సొగసైన అచ్చుకూర్పులో బయలువెడలలేదు. ఏబజారుప్రతో అశృంగారముగా, హేయముగా, తప్పులతడకగా దొరికేది. బహుశః విమర్శకులు విధించిన కఠినదండమునకు పాత్రములై ఇట్టి ప్రచురణలు బహిష్కారములో పడిపోయి యుండిపోయినవి కాబోలు. కాని యిప్పుడు అన్ని గ్రంథాలతోపాటు వీటికి కూడా ఉద్ధరణ ప్రాప్తించింది. చక్కని అచ్చులో, ముద్దులు ఒలికే బొమ్మలతో ఈగ్రంథాలుకూడా ఇప్పుడు దొరుకుతున్నవి.



౫. గంధర్వలోకము
గంధర్వులు, కిన్నరులు, అప్సరలు

## ౨

రాధామాధవసంవాదము అనే పేరు వల్ల రాధామాధవులు వ్యక్తులవలె సూచింపబడ్డా, ఈగ్రంథములో చెప్పిన కథనుబట్టి చూసినా, ఈ దేశములో అనాదిగా వస్తూ ఉన్న సంప్రదాయాన్నిపట్టి చూసినా, వారు ఒకవిధమైన శాశ్వతభావానికి ప్రతిబింబములుగా నిలిచియున్నారని సూచిత మవుతూ ఉంటుంది. శృంగారానికి, దాని ఫలమైన ప్రీతిలోలత్వానికి, దాని తుదిసోపానమైన ఐక్యానికి వీరిద్దరినీ సంజ్ఞామాత్రులుగా ఈ దేశస్థులు పరిగణిస్తున్నారు. ఆధ్యాత్మికవిచారణపరిణామములో భక్తికిన్నీ, ఆభక్తియొక్క సవిశేష కల్పనమైన ప్రీతికిన్నీ అగ్రస్థానము ఉత్తరదేశమందు విజృంభించిన వైష్ణవసంప్రదాయ మతములో ప్రాప్తించింది. ఆశాఖలలో ఒకటి రాధాకృష్ణశాఖ. ఆప్రీతికి రాధాకృష్ణులు అనే నామరూపములు కల్పించి ఆ మతప్రవర్తకులు వర్ణించారు. ఈ పురాణపురుషుల అసాధారణ ప్రీత్యైక్యమును సిద్ధాంతమందు ప్రతిపాదితమైన జీవబ్రహ్మల మైక్యమునకు బ్రతిబింబముగా భావించి సాధకుల సాధనకు సాధనముగా వర్ణించారు. ప్రీతిసంబంధములలో కెల్ల అసమానమైనదీ, అత్యుత్కృష్టమైనదీ తల్లిపిల్లలదా, లేక భార్యాభర్తలదా అని నిర్ణయించవలసినప్పుడు రెండోదానికి ఆధిక్యము చాలామంది విచక్షణులు స్థిరపరిచారు. ఒండొరులను ప్రయత్నపూర్వకముగా ప్రీతిరూపమున అన్యోన్యము ఆకర్షించుకొంటూ ప్రీతిసాధనమున ఐక్యము పొందగలరు. ఇట్టి సంబంధము మరొకటి లేదు. అదిన్నీ కేవల సాంప్రదాయిక దంపతులలో కనబడే దానికంటె కాముకులలో ఎక్కువ స్ఫుటముగా వ్యక్తమవుతుంది. అన్యోన్యాకర్షణతో కూడుకొన్న ఆవలపును ప్రదర్శించుటకు కాముకుల చేష్టలు కావలసియున్నా, అది కేవలశారీరికభోగముక్రింద దిగిపోకుండా ఉండేటట్లు పురాణ పురుషులై అమానుషశక్తిమంతులని ప్రసిద్ధికెక్కియున్న ఆరాధామాధవులను ఆ అసాధారణ ప్రీతివిగ్రహులుగా నిర్మించి, సవిశేషభక్తిసాధనకు బింబములుగా ఆ రాధాకృష్ణ మతస్థాపకులు ప్రవర్తింపజేసినట్లు మనము సూటిగా ఊహించవచ్చును. రాధే కృష్ణుని వలచి మోహమును మప్పి తుదకు ప్రసాదింపబడినదని గదా గాథ. ఆలాగే జీవుడే బ్రహ్మను వలచి, బ్రహ్మను తన భక్తిమోహముచేత వశపరచుకొంటే తుదకు బ్రహ్మ ప్రీతిని పొందగలడని సూచన. కేవల బ్రహ్మప్రసాదము వల్లనే కలిగే ఫలముకంటె జీవుడు తన ప్రీతిచేత ఆకర్షించిన బ్రహ్మప్రసాదము శాశ్వతతరమని అభిప్రాయము. ఈ ఉన్నతాశయములను వ్యక్తపరుచుటకు కల్పించిన భాగవత తత్వములలో కెల్ల ఈరాధాలీల అగమ్యమై సంతృప్త్యవధి లేనిదై విరాజిల్లుతుంది. రాధ స్వతంత్రురాలై, ఎవరి ప్రేరణా లేకుండా, చక్కని లోకజ్ఞానము గల ప్రౌఢగానుండి, ప్రీతి అనగా మెట్టిదో చవిచూపి, చవిచూసిన్నీ, ప్రయత్న పూర్వకముగా ఆప్రీతి

సాగరుని పొంద నిశ్చయించుకొన్నది. కాబట్టే ఆనావికుఁడు తన ఆశ్రీతినావపై ఆమెను అనన్యలభ్యమైన స్థానమునకు తీసుకోపోయేడు.

ఇట్టి గాథను ఆధ్యాత్మికాపేక్షతో ఎంత వర్ణించినా వర్ణించేవారికి గాని, వినేవారికి గాని విసుగు రాదు. కాని క్రమముగా అసులభమైన ఆధ్యాత్మికతత్త్వచ్ఛాయ తగ్గి తగ్గి, వారి సంబంధములో మిలితమైయున్న కాముకుల శృంగారచ్ఛాయ ఎక్కువవుతూ, దేశములో విరుద్ధోపయోగమునకు సాధనముగా మారింది. శృంగారచేష్టల వర్ణనలను వినగోరువారికిన్నీ, అట్టి వర్ణనలను చేయగోరువారికిన్నీ ఈ రాధామాధవగాథ సుకరమైన ఆశ్రయమైనది. ఎంత బూతు పెట్టినా, ఎట్టి అశ్లీలము వర్ణించినా, ఎంత అసభ్యము ఆపాదించినా, భగవన్నామస్మరణ అనిన్నీ, అందుకు పురాణప్రామాణ్యమున్నదనిన్నీ, దేవాంశసంభూతులైనవారి చర్యలు వినీత్యవినీత్యతీతము లనిన్నీ, మనుష్యులకు ఉదాహరణము లెన్నటికీ కాలేవనిన్నీ తమ్ముతాము సమాధానపర్చుకొంటూ, కవులూ, కాముకస్వభావపరులూ వారి శృంగారభావోద్రేకశాంతికి ఈ రాధామాధవులను సజ్జులుగా ఉపయోగించ ప్రారంభించారు.

3

అట్టి కావ్యాలలోనిది ఈ రాధామాధవ సంవాదము. దీనిని మహాకావ్య మనిన్నీ తద్గ్రంథకర్త వెలిదండ్ల వేంకటపతి మహాకవి అనిన్నీ చెప్పేవారు ఉండవచ్చు. ఈ కవి కాలము విషయమై భేదాభిప్రాయాలు ఉన్నవి. వీరేశలింగం పంతులు వారు నిర్ణయించిన కాలముకంటె నూరు సంవత్సరాలు పూర్వనిగా మరికొందరు విమర్శకులు నిరూపించారు. ఈ కావ్యకృతి "భర్త" (భర్తా!) తంజావూరు అమాత్యులలో ఒకడు. జనకమహారాజు శుకయోగిని "చనవున వేడె కృష్ణుకథ" "పాపములు వాఱఁగ" కృష్ణుని మొక్కి ఇట్లనెన్:

జనకరాజేంద్ర వినవయ్య సావధాన
మతినిఁ గృష్ణుని చరితము ల్మహిని వింద
మవి రుచింపవు మాకు మా యనుభవంబు
చెలఁగు శృంగారరూపమోఁ జిత్తగింపు.

ఈ అవతారిక మిషతో కవి కృష్ణుని మోహము, రాధ విరహము వర్ణింప ప్రారంభించాడు. కాని ఈ జనకశుకుల శృంగారరుచికల్పనకు ఎట్టిసందర్భశుచిఉన్నట్లు కానరాదు. జనకమహారాజునాటికి కృష్ణావతారము అసందర్భము కాకపోయినా, ఏపురాణములోనో, ఏమూలనో జనకునివద్దకు శుకయోగి వచ్చి సకలావతారముల పుణ్యకథల చెప్పినట్లు ఉన్నా, శాశ్వత బ్రహ్మచారి అనిన్నీ, ఆబాల్యవైరాగి అనిన్నీ ప్రసిద్ధివడసియున్న శుకయోగికి మహిని అందరూ వినే కృష్ణకథలు రుచింపక శృంగారకథలే ఆతని అనుభవానికి వచ్చినట్లు చెప్పట చాలా అసంబద్ధముగా కనుపిస్తుంది. కొంపదీసి ఎక్కడైనా శుకయోగి శృంగారపురుషుడని ఉందో ఏమిటో, పండితవర్యులు

సాధింతురుగాక. లేదా, శృంగారముయొక్క ప్రాబల్యము రుజువుచేయడానికి శుకయోగి లొంగుబాటు కూడా నిదర్శనముగా కావలసి వచ్చిందా ఏమిటి ? కాని ఈ రాధామాధవ కథలో క్రొత్త నా కేదీ కానరాలేదు.

కథ పాతదే. రాధ కృష్ణుని మేనత్త. బాలకృష్ణుని పెంచి ఉగ్గుపెట్టి ఉయ్యేలలో ఆడించి ఆనందించేది. అంత చిన్న పిల్లకాయను చూచే మోహపరవశయై, ఆనాడే బాలునికి తెలియని శృంగారచేష్టలు చేస్తూ ఆనందం పొందేది. ఆతరువాత కథంతా సులభముగా ఊహ్యము. రెండువిధాల ప్రబంధశృంగారము, ఆ రెండురకాల చేష్టలు, కట్టుకథలలోని చిలుక దూతిక, అన్నీ పాతవే. వర్ణనలన్నీ సంప్రదాయసిద్ధమైనవే. కవి పూర్వుల ఫక్కీని అనుసరించాడు. I-48లో తారాశశాంకాదులు ఉటంకింపబడ్డారు కూడా. పాత శృంగారప్రబంధాలలోని పద్యాలు కొన్ని కవి తన కావ్యములో కూర్చినట్లు కనబడుతుంది. శిల్పములో ఏదీ క్రొత్త సంగతి కానరాదు. సవతులందరూ సంధిజేసికొని కృష్ణుని వంతులు వేసుకొన్నారు; ఇది మాత్రము కొత్తసంగతి కాబోలు.

రాధామాధవులను కేవల శరీరసుఖ భోగులైన కాముకులవలె కవి భావనచేసినట్లు కనిపిస్తుంది. వర్ణనలలోనే కాకుండా వాచ్యముగా కూడా ఆపదము ఉచ్చరింపబడి యున్నది. తుదకు కృష్ణుడు దక్షిణనాయకుడు అయినాడు. (III-159.)

రాధతోడిదే......
లోకముగాంగ నుండె నిఁక
లోకులు కాముకు డంచు నెంచరే.
—[III-125.

ఈభావనే కావ్యాన్ని మొత్తముమీద ఆవరించుకొనియున్న భావన యైనా, వారు ఆధ్యాత్మికతత్త్వసూత్రాల బింబము లన్న మాటకు సూచన లేకపోలేదు. బాలకృష్ణుని పరుండబెట్టుతూ, "నాదేవుడ" అని జోకొట్టేది. దేవుడు=భర్త అని నిర్వచనము చేస్తారేమో. "సర్వజ్ఞమూర్తి వీవు" అని ఉంది. ఇంకా చూడండి—

II-6. 'పదిరెండేండ్లగు ప్రాయమందు......
......రుక్మిణ్యాదులౌ కన్యలౌ
పదియాఱ్వేల వివాహమై నగుణరూ
పబ్రహ్మమై కన్నవి
న్నది గా దీమహిమం బటంచు......'

తిరిగీ III-24. లో

'...నిర్వికారు డనినన్
నిర్మోహియౌ నిర్జితేం
ద్రియుడౌ నన్నను. దాళియుండె.'

ఆఖరున శుకయోగికూడా కృష్ణుని శృంగార చర్యలద్వారా అతని మహత్వమును జనకునికి నచ్చచెప్పాడట—

'కృష్ణదేవుడె మఱి దేవు లేఁకను గలరె?'

అని. కాని ఈ ఉత్కృష్టభావన చదువరుల హృదయమున బాగా నాటేటట్లు గ్రంథరచన ఉండనందున, గ్రంథప్రయోజనము ఇది కాద

నిన్నీ, ఇదే అయితే ఏమీ నేరవేరలేదనిన్నీ చెప్పక తీరదు. ఇదే కాని ప్రయోజనము కాకపోతే ఈ గ్రంథములో శాశ్వతముగా ఉండవలసిన సంగతి ఏదీ ఉండదు.

అందరిలోకీ రుక్మిణి ఎక్కువ ఉదారస్వభావురాలివలె కనిపిస్తుంది. III-143-147 అందుకొరకు చదవవలెను. కాని అక్కడ కూడా శరీరభోగమే నొక్కి చెప్పియుండకపోతే ఎక్కువ సమంజసముగా ఉండునేమో. ఏలాగైనా ఉన్న స్థలములకంటె ఇక్కడ కవియొక్క హృదయము లోతు తెలియడానికి ఎక్కువ అవకాశము లున్నవి. ఇంకా ఎక్కువ చక్కగా చిత్రింప సాధ్యముకూడా.

ఈ ప్రబంధముయొక్క గొప్పంతా దాని శైలి. దాని చర్చకు తగిన ఉదాహరణములు ఇవ్వాలంటే ఒకచిక్కు వస్తుంది. కొంచెము శృంగారము ఎక్కువగా గల పద్యాలే ఎంచవలసి వస్తుంది. అదేమో కాని, కవితాధారయొక్క జోరు అంతా అట్టిచోట్ల లోనే ఇమిడియుంది. వీరేశలింగం పంతులువారు చెప్పినట్లు శృంగారప్రబంధాలలో మాటల మాధుర్యము ఎక్కువగా ఉండి చదువరులను గుంపులుగా ఆకర్షిస్తుంది. ఈవర్ణనలు పచ్చిగా ఉండడము కలదు. అవి నీతిభంగకరములు అగునా కావా అనేది నాకు అప్రస్తుతము. శిల్పి ఎట్లు ఉన్నది అనేదే నాకు ప్రస్తుతము. సాధారణముగా ప్రబంధాలలో ఉండే పదక్లిష్టత, వక్రగతార్థములు, శ్లేషగతరచనలు ఈ కావ్యములో లేకపోయినందుకూ, అందరికీ ఎక్కువఅందుబడిలో ఉన్నందుకూ నీతిపరులు దీనినిబహిష్కరిస్తారా, శిల్పపరిశీలకులు మెచ్చుకొంటారా? మరొక విశేషము. దీనిలో గ్రాంథికభాషావాదమునకు కుదరని ప్రయోగాలు చాలా చాలా ఉన్నవి. ఉదాహరణములుగా:

| | |
|---|---|
| చందాన | ద్రోహానకు |
| ముద్దయితే | నీవల్ల |
| వల్లను | అలిగేవేమయ్య |
| అడిగేవని | అనుకోరాదని |
| చర్చ సేయగబోతే | మళ్లీ |
| జూడగలిగుందును | లోకాన |
| వచ్చేనన్నాడా | భోజనానికి |
| పోయేదుగాని | పోకురాపోయి |
| రాచకొమాళ్లు | ప్రార్థించినకొద్దీ |
| నగర్లోనికి | దినాల |
| మంచితనానకు | ఇందుకోసమె |
| అడిగేవారొ | కూడా |
| మరచేవు | దిద్దుకోరారంటే |

ఇవి చాలవా? వీటిని పరీక్షిస్తే గ్రాంథికభాషావాదుల రెండు యుక్తులకు ఆధారము లేనట్లు తోస్తుంది. నిజమైన తెలుగు సంప్రదాయము ప్రకారము ఈవ్యావహారికరూపాలు ప్రబంధాలలో కూడా ప్రయోగార్హములు. ఏకవి చక్కని భావను హాయిగా ఉండేటట్టు వాడ నిశ్చయించుకొంటాడో, అతడు ఈ వ్యావహారికపదాలు వాడి తీరుతాడు. రెండోది, మాండలీకాల గురించి చేసే తగాయిదాకు కూడా

ఆధారము లేదు. ఈ వెలిదండ్ల వెంకటపతి దక్షిణదేశపు కవి. తంజాపురీనాయకుని కొరకు వ్రాసిన కావ్యము ఇది. కాని కావ్యములో మాండలీకాల చిక్కు ఏమీ కానరాదు. చక్కగా అర్థమవుతూ ఉంటుంది గదా. పాత బజారు ప్రతిలో ఉన్న వాటిని ఆధునికసంస్కర్తలు తమ వాదానికి అనుగుణముగా దిద్ద ప్రయత్నిస్తూ, దిద్దలేనివాటిని ఉంచివేసి, దిద్ద వీలున్న వాటిని మూర్చివేస్తూ ఉండడము చాలా శోచనీయము. ఆలాగు చేయుటకు ఎవరికీ అధికారము లేదు. చదువరులు, విమర్శకులు, సంపాదకులు అట్టి విపరీతసంస్కరణమును ఆమోదించకూడ దని నా అభిప్రాయము. కవి వ్యాకరణబాధ అంతగా పెట్టుకోక, లోకములో ఉండే ప్రయోగాలను ఉపయోగించేసంప్రదాయాన్ని అవలంబించాడు. "నిత్య పెండ్లికొడుకు", "సిరామరక్షు", "ఇహ మున్న హి పర మున్నహి యైతే"—ఇట్టి లోకసిద్ధోక్తులను ధైర్యముగా ప్రయోగించిన కవి ధన్యుడు గదా.

ఈ భాషావిశేషముకొరకు, రాధామాధవుల ఆధ్యాత్మిక వినియోగముకొరకు, సారస్వతమందు ఇట్టి శృంగారమునకు గల స్థానము కొరకు ఈవిమర్శనము వ్రాయదలచి వ్రాశాను.

---

## దురదృష్టము

నాదెళ్ల వెంకట్రావుగారు, బి. ఎ.

జీవితపథాన నడుచుచుఁ బోవుచుండి - త్రోవ రెండుగఁ జీలిన తావునందు
దైవవశమున నేఁ దప్పుదారిఁ బట్టి-బయలు దేఱిన చోటికే వచ్చిపడితి.

బ్రతుకనెడి యలవైకుంఠపాళియందుఁ - బెక్కుమెట్టుల నెక్కియుఁ బెద్దపాము
నోటఁ బడిపోవుచును బొరపాటువలన - జబ్బుమని తొలిమెట్టుకు జాఱిపడితి.

జాఱిపడి లేవఁబోక విచారపడుచు - సోలి నసిమాలి పసఁదూలి కూలియుండ
జాలిఁగొని హెచ్చరించె విజ్ఞాని నన్ను - నమృతధారారసం బొల్కునట్టినుడుల.

"జీవయాత్రాపథంబునఁ బోవునపుడు - కాలు జాఱక యుంటలో ఘనత లేదు
జాఱి పడినన్నిసారులు సత్వరముగ - మగుడ లేచినవాఁడె పో మహిని ఘనుఁడు".

---




వేలూరి శివరామశాస్త్రిగారు

౧

తిరుమలాచార్యులు గుంటూరు కాలేజిలో తప్పి కలకత్తా-బ్రహ్మసమాజ-కాలేజిలో ప్రవేశించెను. వెంటనే తిరుమలరాయ్ అని పేరు మార్చివేసెను.

దీనికి రెండు హేతువులు: ఒకటి— కలకత్తాలో అందఱు రాయిలే; రెండవ హేతువు కొంచెము లోఁతు—ఆంధ్రవైష్ణవులలో చాలమంది నియోగులే [వైదికులును లేకపోలేదు.] తనది వైష్ణవము పుచ్చుకొన్న నియోగికుటుంబము; ఆమూల మన్వేషించి 'ఆచార్యులు' తీసి 'రాయి' పెట్టుకొనెను. రాయి రావులు ఏకోదరములు; లేక రావే రాయి.

కలకత్తాలో తిరుమలరాయి పొట్టిపేరు రాయి. ఇంటికడ ఆచార్లు.

వాదములందు అతఁడు ఇష్టసాహసుఁడు. సహాధ్యాయుల సమ్మేళనములందు రాయి ఆస్తికులతోపాటు నాస్తికులనూ ఖండించెను. క్రీస్తుమతమును ఏకి బ్రాహ్మమతమును సాఁక లేదు. మత మనునది అతనిపాలిట మూఢ విశ్వాసము. దానిగుఱించి యెంత వాదించినను వాగ్వ్యయము కాదు. అతఁడు సేశ్వరవాదియో, నిరీశ్వరవాదియో, ఆగ్నాస్టో (Agnosto) ఇంతవఱకు ఎవరికిని తెలియలేదు.

అతఁ డపుడపుడు సాంఘికధర్మముల గుఱించి తనజట్టునకు చెప్పుచు వచ్చెను. 'వివాహవిధి మనుష్యుఁడు విధించుకొనిన క్రూరనరకము. ప్రేమ చలము; ఏకమాత్రనిష్ఠము కాదు' అని.

అతనివాదముల కబ్బురపడి చాలమంది అనుయాయులై అతనిని తమకు నాయకునిగా అంగీకరించిరి. కొందఱు అతఁ డిరువదవ శతాబ్దికి మూలపురుషుఁడును, మతకర్తయును కాఁగలఁడని తమ దూరదృష్టితో చూచిరి.

అతఁడు వాదములలో శరప్రయోగము చేసెనా లక్ష్యమును వేధించి తీఱును. అతఁడు జ్ఞాసివలె తలయెత్తుకొని తిరిగెను. రాజువలె ఆత్మగౌరవము రక్షించుకొనెను. దేశనాయకునివలె పలుమందిని చెప్పుచేతలలో అకట్టెను. అన్నిఁటికంటె తనకు ప్రకృతమైన చదువులో మొదటివాఁడుగా నిలుచుండెను.

సెలవులలో రాయి స్వగ్రామమునకు వచ్చి ఆచార్లుగా మాఱెను. వారిగ్రామ మంత

పల్లియగాదు; బస్తీయుఁ గాదు. హోటలు లేదు కాని కాఫిహోటలు కలదు. స్కూలు ఫైనలు తప్పినవారు దానికింది క్లాసులు తప్పిన వారితోపాటు పలువురు; బ్రాందిషాపుతో పాటు సోడాషాపు. రోడ్డు ఊరినడుమను లేదు కాని అంటుకొని పోవును. కోర్టు లేదు కాని పంచాయతీకోర్టు. తగవులతోపాటు తీర్పులు హెచ్చు. దినుసుల వెల యిబ్బడి. అలికిజనము మిక్కుటము. క్రొత్తగా వెలసి పాడుపడిన వడ్లమరల రేకుపాకలు. దాపున కాలువ. ఇట్టి ఈగ్రామమునకు ఆచార్లు టెన్నిసుకోర్టుతో ఒక క్రొత్తశోభ కలిగించెను. చుట్టుపక్కల యిండ్ల ఆఁడువారు ఆడువారిని పసపాటలు కూడ మానుకొని చూచుచుండిరి. వారిలో ముఖ్యముగా ఆబంగాళాబాబును.

ఆచార్లతల్లి మూఁడుకాళ్ల ముసలి. ఆమె తనకొడుకు ఇంచుమించుగా ఇండియా నేలు ననుకొనును. అతని కెదురాడదు. సలహా చెప్పుటకుఁగూడ జంకును. అన్నమునకు తొందరపెట్టదు. ఒకనాఁ డతఁడు టెన్నిసు సన్నాహముమీఁద నుండఁగా ఆత్రొందరలో తన అధికారము బయటఁబడ దనుకొని—నాయనా, నీపెండ్లి కనులారఁ జూచుకొని మరి మరణింపవలెనని నాకోరిక అనెను.

'అమ్మా! నాపొట్ట పోసికొనుట నేను నేర్చికొననిదే ఇంకొక పొట్టనుగూడ నేల తెచ్చి కొనవలయును?'

'ఏమినాయనా, రంగనాథుని అనుగ్రహమువల్ల గ్రాసవాసోదైన్యము లేదు. నీవు ఉద్యోగము చేయఁదలఁచినచో గానేరుకావా? నాకన్ను లున్నందులకు ఏమిఁఫలము?'

'అమ్మా, గవర్నరే? పొరపాటు పొర పాటు. ఈకాలమున రెవిన్యూ ఇన్‌స్పెక్టరు కూడ కాలేను. దేవుని డబ్బు తినుటకా యిఁక? ఆఁడుది కూర్చుండి తినలేదా? పరీక్షలు నెలలో తేలును. వెంటనే కోడలిని నీకు చూపింతును.'



'మానాయన మానాయన! కానీ తొందరగా కానీ!'

౨

టెన్నిసు

టెన్నిసు ఆడువా రందఱు ఆచార్లకింద తయారయి ఆచార్యుని మించినవారే.

నాఁడు బంతి అందించు బాలసేవకులు రాలేదు. ఆటతమకమున ఎవరిబంతి వారే తెచ్చికొనుచుండిరి.

ఆబంతులలో ఒకబంతియందు ఆచార్లకు కడుఁ బ్రీతి. అది మాయామృగమువలె చెంగు చెంగున దుమికి పక్క గుడిసెకడఁ బడెను. మెఱుపువలె మెఱసి ఒకమనిషి* దానిఁ దీసి లోని కేఁగెను.

ఆచార్లు రెం డడుగులు వైచి తల యెత్తి చూచి వెనుదిరిగెను. మఱియొకబంతితో ఆట సాగెను.

అటుతరువాత ఆచార్లే ప్రతియాటయు ఓడెను. తనమీఁదఁ బడకుండ కొన్ని బంతులను చేతితోఁ గొట్టి తప్పించుకొనెను. మీఁదఁ బడిన కొన్ని బంతుల నెఱుఁగనే యెఱుఁగఁడు.

సూర్యుఁడను బంతి విధిచే నేలకుఁ గొట్టఁబడెను. అది అస్తాద్రి గుహాగృహము దూరెను.

వల, బంతులు, బాటులు జాగ్రత్తపెట్టించుటకు ఆచార్లు క్రీడాక్షేత్రముననుండెను. మిగిలినవా రందఱు విసిరికొట్టిన బంతులవలె పాఱిపోయిరి.

ఆచార్లు గుడిసెవైపునకు అడుగులు వైచుచుండెను. మెఱుఁగుఁ దీఁగవంటి యొక జవ్వని తొంగితొంగి చూచి లోపలికి లోపలికి కొక్కొకఅడుగే వేయుచుండెను. ఆచార్లు గుమ్మము చుట్టు పక్కల చూచెను. ఎవరును లేరు. చేతులు ద్వారమునకు ఆనించి మోము లోపలఁ బెట్టి చూచెను. ఎవరును లేరు. లోపలికి వెళ్లెను. మగ్గము దారపుఁగండెలు తక్క నెవరును లేరు. గదిగుమ్మములో తలపెట్టి చూచెను. ఎవరును లేరు. లోనికి వెళ్లెను. మూల ఒక జీవత్ప్రతిమ నిలువఁబడియుండెను. అతఁడు 'నాబంతి యేది ?' అని అడిగెను.



ఆజీవత్ ప్రతిమ 'నా కేమి తెలియును?' అని పైట సవరించుకొనెను. సవరణయొక్క ఉద్దేశము నెఱవేఱెను.

ఆచార్లు నాబంతి నా కి మ్మనెను. అది యీయఁబడలేదుకాని మరికొంచె మెక్కువ భద్రపఱుపఁబడెను.

* మగ-యాడు-భేదము తెలియని వ్యక్తి వాచిగా ఈపదము వాడుకలో నున్నది.

ఆచార్లు కొంచెమునే పదేపదేగా చూచెను. సమీపించి పైటలోని బంతిని మృదువు మృదువుగా లాగికొనెను. పైట క్రమ్మఱ క్రమ్మఱ సవరించుకొనఁబడుటచే కిందఁ బడునట్లు కానిపించియు లోనికే పోయెను. అతఁడు నేర్పుగా తీయఁజూచెను. తీయఁబడు లోపుగా అది ఆకాశమున కెగిరి అటకమీఁద అటికలో కూర్చుండెను దానితో ఒక కొత్త బంతియాట మొదలాయెను.

దానిపేరు రంగి. రంగిని రంగమ్మ యని యో రంగనాయిక యనియో వ్యవహరించుచో దానికి కొత్త లావణ్యము రాదు. పేరులో ఏమున్నదని షేక్స్పియరుకూడ అన్నాఁడు. కాని రంగికి బదులు రంగనాయిక యన్నచో పదమునకు ఉన్న లావణ్య మూఁడదు. కవి నిరంకుశుఁడై తన్నెక్కడ దుర్వినియోగము చేసిపోవునో యని ఒకానొకపుడు పదములు కూడ భయపడుట కలదు.

లోకులు దాని రంగి యందురుగాక! ఇచట రంగనాయిక. అసలు దానిపే రదియే నేమో! నామకరణము సుబ్బమ్మ. వాడుకలో సుబ్బి.

ఆచార్లు 'నీ పేరేమి?' అని అడిగెను. రంగనాయిక 'నాపేరు రంగి—నాపేరు-రంగ' అనఁబోవుచుండఁగా అతఁడు-'కాదు, నేనొకపేరు పెట్టుదును, 'కందుకావతి' అని, 'కందుకావతీ!' అని పిలిచెను. 'ఏమి?' అని ప్రత్యుత్తరము వచ్చెను. ఇరువురును నవ్వుకొనిరి.

కందుకావతి 'నీ కొక పేరు నేనును పెట్టెద' ననెను. ఆచార్లు 'ఏమిపే'రని అడిగెను. కందుకావతి-'రంగనాథుఁడు' అనెను. ఆచార్లు 'నీ వీ పేరు పెట్టినందులకు బదులు నేను ముద్దు పెట్టెద' ననెను.



కందుకావతి వెనుక వెనుక కొదిగి తల్పమున కానుకొనఁగా ఆచార్లు ముందు ముందులకుఁ జని కవ్వించి ముద్దాడెను.

వాకిట దగ్గు.

విని రంగనాథుఁడు త్రుళ్లిపడెను. కందుకావతి లోలోన నవ్వుకొనుచుండఁగా రంగనాథుఁడు వెలుపలికి వెళ్లెను. జబ్బుతో తీసికొనుచున్న నరసింహులు — 'ఏమి బాబూ, మాయిల్లు పుణ్యక్షేత్రము చేసితిరి!' అనఁగా

ఆచార్లు—'నాబంతి మీయింటఁ బడినది, అందులకు వచ్చితిని' అనెను.

'దొరికినదా? ఏదీ?'

'లేదు. అటకమీఁద పడినదఁట.'

'ఓసీ బాబుగారికి తీసియిమ్ము'

'ఇపుడు పనిమీఁద ఉన్నాను; రేపు తీసి యిచ్చెదను.'

3

మఱునాఁడు బంతికొఱకు ఆచార్లు కందుకావతి యింట నుండెను.

'పెండ్లి యాడనని ప్రతిజ్ఞ చేయుము.'

'ఱంకు సాగుచో పెండ్లి యేల?'

'జాగ్రత్త జాగ్రత్త! ఱంకా? ఱంకా? నామాట బొంకని తోఁచుచో నిన్నటి ముద్దులతోనే ఆఖరు. ఐనను నీవు నాకు పతివి-పరిత్యక్త పతివి. మరల వినుము. నాఁటికి నా తలిదండ్రులు చచ్చి నెల. నరసింహులు నా మేనత్తకొడుకు. త్రాగుబోతు. నే నొకనాఁడు నిద్రపోవుచుంటిని. కలలోవలె కొంత యేమో వినఁబడెను. లేచి చూచితిని. పక్కన పురోహితుఁడు. నామీఁద పసపు బట్ట. మెడలో తాళి. తాళి తెంపి పురోహితుని కాళ్లకు కట్టితిని. నన్ను పట్టుకొని పలువురు మరల కట్టిరి. తెంపిపోసి మన్యములలోనికి పాఱిపోతిని. వాడు నరసింహులు వెదుకుచు వచ్చెను. వచ్చిననాఁడే జ్వరమునకు బలి యాయెను. నేఁటికిని అదియే జ్వరము. పాపఫలము వెంటనే కానిపించెను. వాఁ డిపుడు నా పోషణలో ఉన్నాఁడు. వింటివా? దాన జేసియే నాకు వాఁడన్న భీతిలేదు. ప్రత్యుత నేనన్నవానికి భీతి. నిన్న నీవు తొట్రిలి వాకిటికి పరువెత్తితివి. నీకు వెనుకగూడ కన్నులు కలుగుచో అపుడు నా నవ్వు చూచియుందువు. వింటివా? పోసి నరసింహులనే అడిగిచూడుము. లేక నేనే నీముం దడిగెదను.'

ఆచార్లు ఆలోచించి ఆలోచించి పలుమాఱులు సమాధానము చెప్పవచ్చియు ఆగిపోయెను.

కందుకావతి—'తొందర లేదు. ఆలోచించుకొనుము' అనెను.

'నాకొంప తవ్వుటకు ఎవరా యాలోచన?' అని వాకిలి పలికెను.

ఆచార్లు లేచెను కందుకావతి నవ్వెను. నవ్వి చేయి పట్టుకొని కూర్చుండఁబెట్టెను. నరసింహులు లోనికి వచ్చి—'తమరా బాబయ్యా! ఎఱుఁగక అంటిని. అయ్యా! తమబంతి యింకను దొరకలేదా? అవును దొరకదు; అవును దొరక' దనెను.

కందుకావతి నరసింహులకేసి ఒకచూపు చూచెను. జ్వరమునకుఁగూడ నతఁ డంతకంపింపలేదు.

ఆచార్లు అటక యెక్కి బంతి తీసి క్రిందఁ బడవైచెను. కందుకావతి చేకొనెను. ఆచార్లు దిగి రాఁగనే బంతిచూపి కందుకావతి మరల దాని నటకమీఁద వైచెను.

ఆచార్లు చేగడియారమున నాలుగు గంటలు చూచి పెన్నిసురంగమున సహచరుల కెదురు చూచెను.



"కందుకావతి నరసింహులకేసి......అత డంత కంపింప లేదు."

నాఁడుకూడ ప్రతియాటయు తానే ఓడెను. ఆచార్యు లనాచార్యులాయెనని సహచరులు గేలిచేసిరి. నవ్వుచు అతఁ డింటికేఁగెను. క్రమక్రమముగా అంధకార మావరించెను.

నడికిరేయి అనుకోకుండ కందుకావతికి కన్నులపండు వాయెను. కందుకావతి ఆచార్లను కూర్చుండఁ బెట్టెను.

'ఆలోచన అంతమాయెనా?'

'ఆహా!'

'నీపేరు.'

'రంగనాథుఁడు.'

'నిక్కమే?'

'ముమ్మాటికి.'

కందుకావతి మగ్గమునుండి మూఁడుతంతువులు తెచ్చి పసుపురాచి అతని మెడలో వైచెను. రంగనాథుఁడు పసుపుకొమ్మొకటి వెదకి తెచ్చి దారమునకుఁ గట్టి కందుకావతి మెడలోఁ గట్టెను. కట్టినతరువాత 'లోఁగడ నామాటయు ఇప్పటి ఈ చేఁతయు సరిగా లే' వనుకొనెను. కందుకావతి తలుపులు మూసెను.

౪

తిరునాంచారమ్మ పను లన్నియు తీర్చుకొని తీరికగా కూర్చుండెను. ఆమె వీథిలోనికి వెళ్లనున్న కుమారునితో 'నాయనా! పెండ్లిమాట యేమి?' అనెను.

'ఉండవమ్మా! ఇఁక నెలలో పరీక్షలు తేలును. తేలిన వెనువెంటనే నీకాలిముందు కోడలు.'

'కాదు నాయనా! నేను మంచిసంబంధము విచారించితిని. వారు నిరుపేదలు. పిల్లను చిదిమి దీపము పెట్టవచ్చును. చదువుల సరస్వతి. నేనిఁక పనిపాటలకు పనికిరాను. మగఁడు లేని ఆపిల్ల అక్కయు, తల్లియు నా చేతి కక్కఱకువత్తురు.

'ఏమీ? ఆపిల్లఅక్కా? ఆహా! నే నెఱుఁగుదును. సరిలే. ఆలోచింపుము.'

'వేయేండ్లు వర్ధిల్లు నాయనా వేయేండ్లు వర్ధిల్లు! బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా పనికిరారు.'

ఆచార్లు లోలోపల 'అక్కా? అక్కా? అనుకొనుచు అతిపనిమీఁద వెళ్లిపోయెను. తిరునాంచారమ్మ తొండరడిప్పొడియాళ్వారు పాట పాడుకొనుచు గుమ్మములో కూరుచుండెను. పొరుగింటి కోయిలకుంట పున్నయ్య తిరునాంచారమ్మతో కాలక్షేపమునకువచ్చెను.

'ఏమి నాయనా! భోజనము లయినవా?'

'అయినవి కాని ఏమిపాట' అది?

'తొండరడిప్పొడియాళ్వారుపాట.'

'అబ్బ! మధ్వ వైష్ణవమునకు నామములు పెద్ద! విప్రనారాయణచరిత్ర మనరాదూ?'

'పోనీ! ఔను నాయనా!'

'తగినదే పాట!'

'ఏమి నాయనా?'

'తగినదే అంటెనిగా తగినదే.'

'అనఁగా?'

'మనవాఁడూ .........మనవాఁడు — ఇపుడు విప్రనారాయణుఁడే. పోనీ! మీ అవ్వ మాటల్లో ఏదీ? ఆపాడి! ముక్కుపొడి! తొండరడిప్పొడి!'

'అదియేమి నాయనా? మావాఁడు పరీక్ష తేలఁగనే పెండ్లాడును. పిల్ల తెలియునా?'

'అంతు సాగుచో పెండ్లి ఎందులకవ్వా?'

'మానాయన అనినచో గిట్టనివాళ్లు అట్లు చెప్పుదురు.'

'అతనికి పెండ్లి, శోభనము ఒకపర్యాయమే అయిపోయినవి.'

'కాలేదు నాయనా, గిట్టనివా ళ్లెవరు చెప్పిరి నీకు?'

'అవ్వా, ఈకాలపువారి పెండ్లిండ్లిక ఈ విధముగనే జరుగును. కులగోత్రములతో పనిలేదు. బాజాబజంత్రీలు వలదు. మంగళ సూత్రముల మాట లేదు. కోర్టులలో పేరులు రిజస్టరు అగును. తీఱిపోవును.'

'కాదు నాయనా, ఏలోకపుమాట లివి? మా నాయనకు ముహూర్తము కూడ పెట్టించితిని. అద్వైతులకుఁగూడ విందు లేర్పాటు చేసితిని. నీవు రావలయుఁ జుమీ! గిట్టనిమాట లెందుకు?'

'గిట్టనిమాట లేమిటమ్మా! నేను నా కనులతో చూడఁగా?'

'నీకనుల కేదో జబ్బు! రెండురోజులు చనుబాలు పోయించుకో! మానాయన అటువంటివాఁడు కాఁడు. కాఁడంటే కాఁడు.నమ్ము.'

ఇటులు వారు మాటలాడుకొనుచుండఁగా ప్రతివాదిభయంకరం రంగాచార్యులు ఉబుసుపోక అవ్వతో నవ్వవచ్చెను.

పున్నయ్య—'అవ్వా! నామాట నమ్మనిచో మీ రంగణ్ణి అడుగుము!' అనెను.

రంగ—'ఏమది ?'

తిరు—'ఏమిలేదు ఏమిలేదు ఎందుకు వేళాకోళము ?'

పున్న—'మన తిరుమలయ్య ముచ్చట.'

రంగ—'అవ్వా! ధన్యురాలవు! అటుపైన కర్చులేక ఆఁబెయ్యయంత కోడలు. మీరిక బట్టలు కొన నక్కఱ లేదు. శుద్ధ స్వదేశీ-స్వగ్రామ-స్వపేటి-ముతకగుడ్డలు.'

తిరు—'ఏమిటి బాబూ! మీ వందఱివి గిట్టనిమాటలు! మీరెన్నియేని అనుఁడు. మా వాఁడటువంటివాఁడు మాత్రము కాఁడు.' అని లోనికిఁ బోయి తలుపులు మూసికొనెను.

'అగుచో మీవాఁ డిపు డెచట' అని బయటినుండి వినఁబడెను.

'ఏమో! ఏపనిమీఁద బయటికి వెళ్లినాఁడో! గిట్టని మాటలు నాకేల?' అనుకొనుచు ఆమె పాశరములు పాడఁదొడఁగెను.

౫

(౧)

ఇంటర్మీడియేట్ పరీక్షలలో జయము నొందినవారి పేరులు ప్రకటింపఁబడెను. తిరుమలరాయ్ పేరు మునిమొదట.

ఆచార్లు టెన్నిసు సహచరులకును, ఇతరులకును ఫలాహారము లొసఁగెను. అందఱును చదువులో అప్రతిముఁడ వని అతని కీర్తించిరి. టెన్నిసు సహచరులు 'కందుకప్రియ' 'టెన్నిసురంగనాథ' అనుబిరుదు లిచ్చిరి.

నాఁడు అతనితల్లి పులిహోర,వడలు,ఇడ్లు లోనగు పిండివంటకములును, తంగళి కరియా మధు లోనగు పచ్చళ్లును చేసెను. తిరువారాధన చేయించెను.

సాయంకాలమున చాటుగా వచ్చి నరసింహులు పదిరూకలుబహుమతి గొనిపోయెను.

నాఁడు క్రీడాక్షేత్ర మంతయు విజయవీర నాదములచే మాఱు మ్రోఁగెను. జయమందు పట్టుదల యెవరికిని లేదు. ఎవరియిష్టము చొప్పున వా రాడిరి. ఒకఁ డాకాశమునకు, ఒకఁడు నేలకు, ఒకఁడు దిగంతములకు బంతిని కొట్టెను. ఆచార్లు తనకు చిక్కిన బంతుల నన్నింటిని నేర్పుతో కందుకావతి యింటిలోనికే కొట్టెను. అందఱును—'దీనిభావమేమి తిరుమలేశ?' అని పాడిరి. పాడిన ప్రతివానిమీఁదను 'దీనిభావమిది' అని బంతిచే ఆచార్లు సమాధానము చెప్పించెను. చీకటిపడెను.

(౨)

ఆచార్లు తనయింట బంతులు వైచుట కెంత యుల్లాసము చెందెనో కందుకావతి అంతచింత జెందెను. 'ప్రేమ ఔచితి నెఱుఁగదా? లేక పాత్రనుబట్టి ఔచిత్యమా? ఔను. పెండ్లియాడిన దానితో ఎవఁడేని యిట్టి సరసము చేయునా? చేసినను దాని యందము వేఱు' అనుకొని ముకుళించెను.

నరసింహులు పదిరూపాయలతో కుబేరుఁడై కల్లంగడికి పోయెను. తాగెను, తాగించెను. తినెను, తినిపించెను.

బ్రాంది షాపునకు వెళ్లెను. తాగెను తాగినంత పోయించెను. ఒకసీసా బట్టచాటున బెట్టుకొని ఇంటికి వచ్చెను. మంచము మీఁద కూర్చుండి సంగీతములు తీసెను. 'రంగీ' యని పలుమాఱు లఱచెను. 'రంగీ! ఏల దుఃఖము? ఏల కన్నీరు? జగతియంతయు ఆనందము. ఆనందింపుము, సుఖింపుము, క్రీడింపుము!' అని యని మగతలో పడెను. పోయెను నరకమునకో లేక స్వర్గమునకో!

(3)

రాత్రి పదిగంటలకు కందుకావతి తలుపు మీఁద చప్పుడు. విని కందుకావతి ఊరకుండెను. నరసింహులు లేచి—'ఏల ఊరకున్నది? మతిమాఱెనా?' అనుకొని మరలకునికిపాటులు పడెను.

తలుపుమీఁద మరల మ్రోఁత. కందుకావతి తలుపుతీసెను. ఆచార్లు గదిలోనికి వెళ్లెను. కందుకావతియు.

ఆచార్లు 'ఇవిగో నీకు కానుకలు!' అని కొన్ని ఆభరణములను వలువలను దీసి బల్లపైఁ బెట్టెను.

కందుకావతి—'తమరు పరీక్షలో మునిమొదట జయమందుటయే నాకు అన్ని కానుకలును. నాకేమి ఈ బహుమతు లేమి? కన్నవారును విన్నవారును నవ్వరా?' అనెను.

'నీవు వీని నిపుడు ధరింపవలెను.'

'అటులనవలదు. నాకొక ప్రతిజ్ఞ కలదు. అది చెల్లువఱకు తాల్పను. కానిచో మీ దయచే లోఁగడనే బంగారుపిచ్చుకను గానా?'

'ఏ మా ప్రతిజ్ఞ?'

చెప్పెను.

'పోనీ తీసి దాఁచికొనుము.'

'మాయిల్లు మీ రెఱుఁగనిది కాదు. పొరుగింట దాఁచిరానా?'

'మంచిది.'

కందుకావతి తిరునాంచారమ్మను లేపెను. 'మీ అబ్బాయికి సంబంధము కుదిరెనా?' అని అడిగెను. 'కుదిరె' నను ప్రత్యుత్తరము విని—'తమకొడుకు పిల్లకు నగలు చేయించెను; మీకిమ్మని నాచే పంపెను' అని యిచ్చెను. తీసికొని తిరునాఁచారమ్మ తలుపులు మూసికొనెను.

ఆచార్లు ఆనందముతో శయ్య సవరించుకొని పడుకొని దిగి మరల సవరించుకొని పడుకొనెను. తల యెత్తి దిండ్లు సరిగా పెట్టుకొనెను. లేచి మరల దిండ్లను సరిచేసికొని శయనించెను.

కందుకావతి తలుపులు మూసెను. ఆచార్లది దొంగనిద్ర కాదు. ఊరకయే కనులు మూసికొనెను.

'అపుడే నిదురయా?'

'ఈ రేయి యంతయు లేదు నిదుర.'

ఈమాట విని నరసింహులు లేచి కూర్చుండెను. అతనికిని లేదు నిదుర.

సుఖపారవశ్యముచే కొందఱకు నిదుర రాదు. దుఃఖపారవశ్యముచే కొందఱకు రాదు. కర్మకు సుఖదుఃఖములే కందుకఖేల.

లోపల పరిహాసములు పాటలు; బయట బంధుబూతులు రోదనములు. లోపల వలపు పలుకులు వాటపు ముద్దులు; బయట తల మూఁపులు దంతనిష్పీడనములు. లోపల పరిమళ నిశ్వాసములు ప్రేమశపథములు; బయట వేఁడి యూర్పులు కోపశపథములు. లోపల కాలజ్ఞానము లేదు; బయటను లేదు.

కొక్కొ-రోకో. నరసింహులు త్రుళ్లిపడి బ్రాందీసీసా యెత్తి గడగడ తాగెను. కఱ్ఱతీసికొని గదిగుమ్మము కాచెను.

(౪)

కొంతవడికి తలుపులు విడివడెను. చెట్టాపట్టాలు పట్టుకొని ఇరువురును వచ్చిరి. ఆచార్ల తలపైమృత్యుదండమువలెనరసింహుల దండము పడెను. కందుకావతి ఆచార్ల తలవంచి తనతల అడ్డుపెట్టెను. తల పక్కనపగిలెను. మరలఎత్తిన కఱ్ఱవెంట రక్తముకాఱి నరసింహుల తలతడిసెను. కందుకావతి మరల ఆచార్ల తలమీఁదఁ బడనున్న కఱ్ఱను లాగుకొనెను.

ఆచార్లు తెల్లబోయెను. నరసింహుల నొకత్రోపు త్రోసెను. అతఁడు గోడపైఁబడెను. ఆచార్లు గొంతుక పిసుకఁబోయెను.

'కందుకావతి—చంపకుము.'

'ఛీ చంపెదను.'

'చంపకుము. ఇది ఆజ్ఞ'

'ఆజ్ఞయా?నీయాజ్ఞ! చంపెదను.'

'చంపఁదలచిన నేను చంపలేకపోతినా? చంపకుము. చంపితివా ?'

'ఏమి? చంపిన? నీవు చూచుచుండఁగా చంపిన? ఏమి చేయుదువు ?'

'ఛీ చంపకు! నాకు స్మృతి పోవుచున్నది లేకున్న నిన్ను నెట్టివైచియుందును.'

ఆచార్లు నరసింహులను మరల త్రోసెను. మరొకగోడపై బడెను. మరల త్రోసెను. కందుకావతి కూలఁబడి వారించెను. వారించిన కొలఁది త్రోసెను. అతఁడు మంచముపైఁ బడెను. తల మంచపు కోడుమీఁద. ఆచార్లు రెండుచేతు లెత్తికొట్టెను. రక్తము చూచి వదలెను.

కందుకావతి 'నీవిచట ఒక నిమిషమేని ఉండవలదు పొమ్ము పొ' మ్మనెను. ఆచార్లు 'వెళ్ల' ననెను.



'ఇఁక నామొగము చూడఁజాలవు.'

యాజించి ఆచార్లు వెళ్లిపోయెను.

(౫)

క్రమముగా కందుకావతి ఎఱుక బాసెను. రెండుతలలనుండి రక్తము మాత్రము జాగరి ల్లెను.

వారును వీరును పోగయిరి. శాంతిని భంగింప పోలీసులు వచ్చిరి. ఆసుపత్రి డాక్టరు. అతనితో నరసింహులుకు ప్రకృతము పని లేక పోయెను. కందుకావతికి క్రమముగా తెలివి కలిగెను. పోలీసుల ఆర్భాటము హెచ్చెను. కందుకావతి అచట వారి కేమి చెప్పను తిరస్కరించెను.

పోలీసు కేసు. నరసింహులు తప్పతాగి వచ్చి తనను కర్రతో మోదె ననియు, తాను త్రోయఁగా మంచపుకోటికి వానితల కొట్టుకొనె ననియు,పిదప స్మృతితప్పి పడిపోతిననియు కందుకావతి చెప్పెను. ప్లీడరు ఆచార్లమాట తేఁగా 'స్త్రీలమర్యాద కోర్టువారు కాఁపాడవలె' ననెను.

పోలీసువారు ఆచార్లవద్ద పదివేలుమాత్రము వదిలించిరి.

ప్రమాదవశమున ఈనేరము జరిగె ననియు, తనప్రాణరక్షణకు కందుకావతి త్రోసె ననియు, 'దాన తల ఆనుషంగికముగా కోటికి కొట్టుకొనె ననియు' దానిని పోస్టుమార్టమ్ నిర్ధారించెననియు, శిక్షతగ్గించి రంగనాయికకు మూడేండ్ల ఆరునెలల విడికైదు కోర్టువారు విధించిరి.

౬

కందుకావతికి కోర్టు శిక్ష విధించెను. సంఘము ఆచార్లను వెలివేసెను.

న్యాయదండమునకు లోకుల అనుకంప కలదు. తన కోకవిధముగా మనశ్శాంతియు కలదు.

వెలి సంఘము విధించిన దండము. వెలి యను ఉచ్చును ఎవరును జాఱవిడియరు;ప్రత్యుత బిగింతురు. అది మహారాచి మచ్చ; అంటురోగము; శిరోజాడ్యము.

కందుకావతి ఆచార్లకు బదులు తాను శిక్ష పడెను. నీరవముగా భరించెను. ఆచార్లు తనదోషమునకే తాను వెలిపడెను. అది అతనికి హృద్రోగము. సంఘముమీఁద సంస్థ పటపట గొఱికెను. అందఱకు సంబంధించిన పిల్లను జేసికొని సంఘమును పాదాక్రాంతము చేసికొన నూహించెను.

చెఱసాలలో కందుకావతికి అందఱును చుట్టములే. జైలుసూపర్నెంటు కందుకావతిని నూలుపనిమీఁద మేస్త్రీగా నియమించెను. కందుకావతి యనిన అందఱకు అతి మర్యాద.

ఆచార్లయింటికి ఎవరును రారు. అతనిని ఎవరును భోజనమునకుఁ బిలువరు. మెన్ని సుకోర్టుకూడ అతనికి మన్నా. అతఁడు అందఱను ద్వేషించెను. తనవాచాలత నుపయోగించి ఒకజట్టు లేవఁదీయుట కిది కలకత్తా కాదు. చేయఁదగిన దేదియు లేదు. సంఘము మీఁద కసి. దీనిపునాది కందుకావతి మీఁద.

ఈహడావడిలో కాలేజిరోజులు దాఁటి పోయెను. అతఁడింటికడనే ఉండవలసివచ్చెను. ఇది యొక ముప్పు.

పదివేలు అప్పు. చేతిలో తగినంత ద్రవ్యము లేదు. వెలిఖాయపడియుండుచో దేవాదాయముకూడ రాదు. ఇది యొకసంకటము.

'నగలు చేయించి కందుకావతి కిచ్చితిని. అవియే యుండుచో ఒకదెబ్బన పెండ్లి కాకుండునా?' అని ఆచార్లు చింతించుచుండెను. తల్లి—'ఏమినాయనా! పిల్లను విచారించిరానా?' అనెను. 'ఏమిపెట్టి విచారింతువు?' అని కొడుకనఁగా పెట్టెలోనుండి నగలమూట తెచ్చి 'ఇదిగో! ఆనాఁడు నీవు పెండ్లికూఁతునకుఁగాను చేయించి నా కిమ్మని ఎవరిచేతనో పంపిన నగలమూట! ఈనగలుపెట్టి విచారింతు' నని తల్లియనెను.

ఆచార్లు నగలు చూచెను. 'అమ్మా! నీ కిచ్చిన దెవరు?'

'ఎవరో చీఁకటిలో; నీవు కాదు నాయనా పంపినది?'

ఆచార్లు నిర్విణ్ణుఁడు. మాటలేదు; పలుకు లేదు. తెలిసినమూర్ఛ.

'నీవుకాదా? పంపినది?'

'ఔను.'

'ఇంకేమి.'

తిరునాంచారమ్మ ఆనగలతో నంబూరు తిరుమలమ్మకడకు వెళ్లెను.

తిరుమలమ్మకు ఆ నగమూట అంతయు పాముమీఁదిరత్నము. అయినను బంగారము. కాని సంఘములో వెలి. అయినను నరుఁడు అదృష్టలభ్యుఁడు. కాని లోకనింద. అయిన నేమి? పిల్లకు స్వర్గసుఖము.

తుదకు తిరుమలమ్మ యిటు లనెను. ఈనగలు ఇపుడు వలదు. పెండ్లికాలమున పెట్టవచ్చును. పెద్దలను కనుఁగొని అంగీకారమును కొలఁదిరోజులలో తెలిపెదను.

తిరునాంచారమ్మ ఆనగలను మరల చింతవలె మూటకట్టుకొనెను. సంగతు లన్నిటిని కుమారునికి తెలిపెను.

నరసింహులు చావు అతనిని బాధింపలేదు. తనకు బదులుగా కందుకావతి గాయము చెందుట బాధింపలేదు. తనను తప్పించి కందుకావతి చెఱఁబడుట బాధింపలేదు. వెలి అతనిని బాధించెను. కందుకావతి నగలను తనతల్లి కిచ్చుట బాధించెను. తిరుమలమ్మ నగలను త్రిప్పి పంపుట అతనిని బాధించెను. దీనికి కారణము కందుకావతియే.

దినములు గతించెను; మాసములు గతించెను. తిరుమలమ్మ కడనుండి అంగీకారము లేదు. తిరుమలమ్మకూఁతుపెండ్లి అయిపోయెను. అయినట్లు కొన్నాళ్లకు నంబూరినుండి వచ్చిన శాఁకాఁడు చెప్పెను.

ఆచార్ల కిపుడు కందుకావతి యందము వికారమాయెను. దానిమాటలు మాయమాటలు; చేతలు కత్తికోఁతలు. లోఁగడ

కొన్ని విషయములలో తనను రక్షించుట ఎపుడో తనను భక్షించుటకే. నగలిడుట తన్నీసడించుటకుఁగాక వేఱేమి?

అతని కుపశాంతి లేకపోయెను. కేవల మందులకే కాలేజిలోఁ జేరెను.

## ౭

తిరునాంచారమ్మ ఒకనాఁడు పక్కలోఁది పక్కలో ప్రాణములు విడిచెను. ఆఱముగ్గిన పండు ఆర్భాటము లేకయే రాలును.

రాయి కలకత్తానుండి వచ్చెను. ఏకర్మయు చేయలేదు. భద్రాద్రిరాముని సేవింపలేదు. పరీక్ష ఓడెనో గెలిచెనో తెలిసికొను పూచీ అతని కున్నటులు కానిపింపలేదు. కాని లోకులకు లేకపోలేదు.

అతఁడు తప్పినటులు టెన్నిసు-సహచరులకు తెలిసెను. పట్టిక అతనిసంఖ్య లేని చోట నల్లగీటుతో గోడమీఁదనుండి వసారాలో పడుకొనిన ఆచార్లమీఁద పడెను. అతఁ డులికిపడి లేచి చూచెను. వాకిటికి పరువిడి తలుపులు తెఱచి దారి కటూ ఇటూ చూచెను; శూన్యము.

తలుపులుమూసి తిరిగి వచ్చి కాకితమును, నల్లగీటును చూచెను. తన నెంబరు లేదు. ఒక్కనిట్టూర్పు పుచ్చెను. ఆనిట్టూర్పుతో కాకితము అరుఁగుకిందికి పోయెను.

పరీక్ష పోయినందులకు అతఁడు మరియొక నిట్టూర్పు విడువలేదు.

అతఁ డూరక ఆకాశమును జూచుచుండెను. ఒకమబ్బు వచ్చుచుండెను; ఒకమబ్బు పోవుచుండెను. కానిపించుచున్న నక్షత్రములు మఱునిముసమున కానిపించుటలేదు. చంద్రుఁడంతవాఁడుకూడ మబ్బుచే మాయమగుచుండెను. తెల్లనిచోట నలుపు; నల్లనిచోట తెలుపు. అతనిమదిలో ఏపరివర్తనమును లేదు.

అతనికి ఒకమేఘము రాటమువలె కనఁబడెను. అదియే మగ్గముగా మాఱెను. అదియే కందుకావతి యాయెను. మబ్బు విఱిగెను.

టెన్నిసు-బంతి పోవుటయు, తాను రంగనాయికయింటికి వెళ్లుటయు, అది బంతి దాఁచుటయు, తాను తీయుటయు, అది వెనుక వెనుక కొదుగుటయు, తాను ముద్దిడుటయు స్మృతికి వచ్చెను. 'ఆహా! కందుకావతీ' యని తలఁచుకొనెను.

పిదప, తాను నగలు కొను కిచ్చుటయు, అది తిరుగఁగొట్టుటయు, నరసింహులు తనను జంపవచ్చుటయు, వానిచావును, తనకు పదివేలు వదులుటయు, వెలియు, తాను పెండ్లాడ యత్నించుటయు, దరిద్రపు తిరుమలమ్మ పిల్ల నీకుండుటయు స్మృతికి దగిలెను. ఒక చింతాసముద్రము. అతఁడూఁపిరియాడక కొట్టుకొనుచుండెను.

కవాటముపై అంగుళిధ్వని. ఆచార్లు చమకితుఁ డాయెను. 'ఇపుడు తనయింటికిమృత్యువు తక్క మరి యెవరు రారే! వెన్నెలయైనను నడరేయి. టెన్నిసు వారేమో? ఐనను— ఎవరు?'

మరల అంగుళిధ్వని.

ఆచార్లు తలుపుతీసెను. తెల తెలఁబోయి వెనుక వెనుకకుఁ బోయెను. లోలోపలఁ 'అపుడే ఏల వదలిరి ?' అనుకొనెను.

కందుకావతి లోనికి వచ్చి తలుపులు మూసెను.

'నీవు లోనికి రాఁగూడదు. తలుపులు మూయకు, బయటికి పొమ్ము.'

'వెళ్లుటకే వచ్చితిని. తలుపులు నాకొఱకు మూయలేదు నీకొఱకు.'

ఆచార్లు రిచ్చవడి అరుఁగుపై కూర్చుండెను. కందుకావతి సమీపించి 'ఓయీ! నీవు నేఁడు పరుండవలయును. పరుండఁగా నిన్ను నేను చూడవలయును' అనెను.

'చాలా సారులు చూచితివి.'

'మరల నేఁడు చూడవలయును.'

ఆచార్లు— 'చూడుము అని పరుండెను.'

రంగనాయిక పదతలములకడకు వచ్చి— 'ఇదిగో నీబంతి! ఇఁక నీబంతితో ఆడుకొనుము.'

'పడవేయుము!'

రంగనాయిక బంతిని మెల్లగా పక్కలో పడవైచి పాదములు ముట్టి వెళ్లిపోయెను. ఆచార్లు వెనువెంటనే వచ్చి తలుపులు మూసికొనెను. రంగనాయిక చప్పుడు కాకుండ బయట గొళ్లెముపెట్టి వెళ్లిపోయెను. ఆచార్లు పడుకొని ఆకాశము చూచుచు—'ఇపుడీది యేమి చేయును?' అని యాలోచించెను. గబగబ తలుపులు తెఱవఁజూచెను. రాలేదు. గోడదుమికి కందుకావతియింటికి వెళ్లెను. తలుపునకుబయట గొండ్లెము. లోపలికేఁగెను శిథిల గృహమున శూన్య దేవత రాణివాసముండెను.



ఇంటిప్రక్క నున్న కాలువయెక్కి— 'ఎవ రా మునగానాం తేలానామ్?' అనెను.

అతఁడు నీటిలో దిగి కేవలభారమైన కేశభారమును ఒడ్డునకుఁ జేర్చెను. లావణ్యప్రవాహము ప్రవాహమునఁ గొట్టుకొనిపోయెను.

రంగనాథుఁడు కొంచెముసేపు చూచి చూచి కేశభారమును కత్తిరించి తీసికొనెను. భారహీనమైన ఆపదార్థమును నడికాలువ లోనికి త్రోసివైచెను, ఆశరీరము నదిలో కొట్టుకొనిపోయెను.

అతఁడు కట్టపై కొంతద వ్వరిగి యరిగి— నాకు 'అపుడా వెలి? లేక యిపుడా?' అనుకొనెను. సందేహము మాత్రము విడలేదు.

## పెండ్లిరాయబారము

చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు

శతానందుఁడు— (జనకరాజ పురోహితుఁడు; పెండ్లికూతురు పక్షమువాఁడు)

చేసి సృష్టికిఁ బ్రతిసృష్టి చేవ సూపి - ప్రజల నేలుచు రెండవబ్రహ్మ యనుచు
భువనముల నన్నిటను యశంబున నెసంగు-గాధిజా! కొమ్ము నా నమస్కారములను.

విశ్వామిత్రుఁడు— (పెండ్లికొడుకు పక్షమువాఁడు)

ఓ శతానంద! దీర్ఘాయు వొప్పి మనుము- మైథిలుఁడు తత్త్వవేత్త క్షేమంబె సర్వ
భూతములఁ దండ్రి యట్టులు ప్రోచు నీదు-తండ్రి లెస్సయె చెపుమ గౌతమకుమార!

శతానందుఁడు—

తమయనుగ్రహమున రాజు తండ్రి మిథిల-యఖిలజనులును లెస్సలయ్యా మహాత్మ!
ఏలొకోకాని తెలియ నా యెడఁద యిపుడు - చల్లనై క్రొత్తక్రొత్తగాఁ బల్లవించె.

కటికచీఁకటి దెసలకుఁ గదిమి యెత్తి - చిఱునగవు గాయు మోములఁ జెలఁగి కేల
విల్లు నమ్ములు దాల్చి మీవెంట నున్న - యీయిరువు రెవ్వరయ్యా మునీంద్రతిలక!

పేరోలగ మొనర్చెఁ బేరురమ్మునఁ బూలదండలతోడ నుత్సాహరసము
ఎఱుఁగనైయున్నది యెగుబుజమ్ములయందు విలుదూపుగములతో వీరరసము
కనుకట్టుగట్టెను కాకపక్షముల భృంగశ్రేణితోడ శృంగారరసము
నెఱిఁ బాఱుచున్నది నేత్రాంతములను బ్రవాహాకృతులను గృపారసంబు
ఇన్నిరసముల నొప్పెడు నింద్రియముల-తోడి యిమ్మూర్తులను జూడఁ దొల్లి యెప్పు
డెందుఁ దోఁపని క్రొత్తసూనంద మెదను-ముంచె వివరించి చెప్పుమమోఘవచన!

చూచితిఁ గాని యెందఱినో సుందరమూర్తుల వారియందు నా
లోచన మింత నిల్చి మఱలుం ద్రుటిలోఁ దలపోయ వీరి శో
భాచతురత్వ మేమొ కనుపట్టినదాదిగ నట్టె నిల్చె నా
లోచన లెల్ల మాని మునిలోకదివాకర! విప్పిచెప్పవే.

దిరిసెనఁపుఁ బూవుమెత్తలఁ దిరుగనైన - మృదుపదాబ్జమ్ము లేలొకో యదయుఁబోలి
కఱకుఱా లేచు గహనభాగములయందుఁ - దిరిగివచ్చుట చెప్పు ముద్వేలభావ!

జనకుపనుపున వచ్చితి సంభ్రమమున - నున్న వెన్నియో పను లయిన న్నిజంబు
వీరిఁ గనునంత నవి యేకమై రహించె - నాత్మసన్నిధి యోగికృత్యంబులట్లు.

విశ్వామిత్రుఁడు—

కౌసల్యాదశరథుల మ-హా సంతోషాబ్ధిచంద్రు లస్మత్క్రతుదీ
క్షాసంరక్షకు లుదితవి-లాస జనులు వీరు రామలక్ష్మణు లయ్యా!

తోడు లున్నారు భరతశత్రుఘ్ను లనఁగ - సమవయోరూపలావణ్య శౌర్యఖనులు
వారలను దల్లిదండ్రులవంక విడిచి-వీరిఁ గొనివచ్చినాఁడ నా వెరవు మెఱయ.

పడఁతితనమును దాల్చి బీభత్సరసమ-యరుగుదెంచెడుగతిఁ ద్రోవ కడ్డమైన
గడుసురాకాసి మూఁకల కాఁపు ఘోర-తాటకను గూలనేసెను మేటి యితఁడు.

నాయజ్ఞవాటి మాయో-పాయులఁ బలురక్కసులను బరిమార్చిరి యీ
యాయుష్మంతులు నాదగు-శ్రేయం బేమని వచింతు ఋషిరాట్తనయా!

వింతకును వింత గాదె యీ వీరుపాద-రజము సోఁకున ఱాయి స్త్రీరత్నమగుచు
నే నహల్యను ధన్యను నిన్నుఁగంటి-మంటి శ్రీరామ యని మ్రొక్కె మఱియుమఱియు.

శివధనుర్భంగపణము నా చెవిని సోఁకి-శిష్యముఖమునఁ బే ర్పరీక్షింపఁదలఁచి
వచ్చినాఁడ నిదేమి భూవల్లభుండు - శివధనుర్భంగ ముంకువ జేసినాఁడు.

శతానందుఁడు—

ధన్యుఁడను ధన్యతముఁడ మీదర్శనమునఁ - గన్నులారంగ మాయమ్మఁ గాంచనైతి
ఎన్నినాళ్లయ్యె నా కామె యించు పలుకు - చెవులకుఁ సోఁకి గీతికరవళియట్లు.

మొదటినుండియు జగతి కభ్యుదయమొదవఁ-జేయు గాధేయ! మాయప్ప చెల్లుబడుట
ఎపుడు నామేలు వినుట నిశ్చింతవఱకుఁ - బల్కితిని సైచి యిఁక ధనుర్వార్త వినుఁడు.

జానకి యొక్కనాఁడు తనచాయను బోని సఖీజనమ్ముతో
డ్తో నరుదేర మోదమునఁ దోఁగుచుఁ దూఁగుచు బంతులాడుచో
నేనెఱి తప్పియో చెదరి యీశుధనుస్సునఁ జిక్కె బంతి యా
పై ననిచెక్క పయస్యలను వారును వే చని యొప్పనేర్పునన్.

ఒకరి కిర్వు రిర్వురకు ముప్వు రటు మూఁగు-రకును నల్వురగుచుఁ బ్రకటశక్తి
నెల్లచెలులు బంతి నెటులేనిఁ దివియంగఁ - బాటువడిరి యదియుఁ బట్టు పట్టె.

చిఱునగ వంకురింప నొకసీమను గద్దియనుండి సీత య
త్తెఱవలవంకఁ జూచి యొకతీరునఁ దాఁ దల యూఁచి లేచి యం
దఱు వెఱఁగంది చూడ నటఁ దళ్కని మైనిగ యిల్లు నిండఁగా
బరువగు వింటి నెత్తెనఁట బంతిని బట్టిరి తోడిచేడియల్.

బలువు మొనగాండ్రు పదివేల వరుసవార-లెత్తఁగాలేని విలు సీత యిగురుఁగేలి
వ్రేల నెత్తుటఁ గని రాజు వింతకగుచుఁ - దద్ధనుర్భంగమే పన్నిదంబు వెట్టె.

కవులయుపమల కుపమమై క్రాలుసీత - నూత్నసౌందర్య మెవ నిడి యత్న మొదవఁ
జేరి రెల్ల నృపాలురు మీరు వచ్చు - టరసి పంపించె విభుఁడు సన్నవల వినుఁడు.

తాటకను గూలనేసిన మేటి యన్న-నాఁడుదానిని నడఁచిన యట్టివాఁడు
వీరపురుషుండొ వాఁ డొకవింతనరుఁడ-టంచు నిరసించునేమొకో యచటి జనము.

విశ్వామిత్రుఁడు—

స్త్రీత్వపుంస్త్వ విచారణ సెల్లునొక్క-ప్రాణముబఁ దీయువారలపట్ల నిట్టు
లనుచు నేఁ జెప్ప రఘుసింహ మరసి చేసెఁ - దాటకావధ మని సమాధాన మిమ్ము.

శతానందుఁడు—

పాదరజమున నొకఱాయి పడఁతి యయ్యె-నన్న నది గారడీకృత్య మౌ నటంచు
బిట్టు పలికెదరేమొకో వింత వారు - తద్రహస్యంబుఁ దెలుపు తత్త్వజ్ఞతిలక!

విశ్వామిత్రుఁడు—

గారడీకృత్య మొకయేడుగడెలకన్న - నిలుచునే సర్వకాలంబు నియతితోడఁ
గాలుసోఁకినఱా లన్ని కలికిమిన్న-లయ్యెనే యంచు మాటాడుమయ్య యచట!

శతానందుఁడు—

సరియ మీ రిప్డు చెప్పినవరుస చక్కఁ-దనము నడిగెద రొక్కకొండ ఱట నన్ను
క్రాలునలు పంచుఁ జెప్పినఁ గదలి క్రమ్మ-ప్రశ్నమున కేమి ప్రత్యుత్తరమ్ము చెపుఁడు.

విశ్వామిత్రుఁడు—

ప్రతిన సెల్లినవెనుక నేర్పుఋపఁదగిన - ప్రశ్న మియ్యది యరయ నిప్పట్లఁ జనదు
విల్లు విఱిచినవాఁడెకా విభుఁడు చెప్ప-మైన జలదంబు మించున కగు నటంచు.

*　　　　*　　　　*　　　　*　　　　*

అంతఁ జనె గౌతమాత్మజుఁ డధిపుకడకు - సభను నిండిరి యెల్ల రాజన్యవరులు
శంకరునివిల్లు కొలువు నలంకరించెఁ - సీత కై సేసికొనియుండెఁ జెలులతోడ.

పాలు గాఱెడు మోము ప్రపంచ మేలఁ-జాలు చూపులు వెలయఁగఁ జాలి యోలి
వీరశృంగారముల మునివీరుతోడ-సోదరునితోడఁ జేరె రఘూత్తముండు.

ఈత్రోవ భక్తుల నే నాదరింతు నం చోలిఁ గ్రిందును మీఁదుఁ గేల నిమిరి
ఈరీతిఁ గొండలనేని నెత్తెద నంచుఁ గేలిఁ ద్రేల్కొన నవలీల నెత్తి
ఈలీల వంచెద నెల్ల దుష్టుల నంచు ననుచునేర్పునను ఱివ్వనను వంచి
ఈచాయఁ గొందు సుధీచిత్తము లనుచుఁ గుంటు లేకయ చెవి కంట లాగి
దారుణాశయ నాస్తి కాధమ వితండ-వాదములతోడఁ బెళ్లునఁ బట్టి విఱిచె
శివునిచాపంబు రాముండు దివిని సురలు - పూలు గురిసిరి యలరె సీతాలతాంగి.



## ఓయి వనమాలి!

శ్రీ పురిపండా అప్పలస్వామి గారు (కవితాసమితి)

అసలె జలసేచనము లేని యిసుకనేల - పూర్వసౌభాగ్య విభవవిస్ఫూర్తి నేమొ
యెటులొ చిగురించె నేఁటి కీమృదులలతిక - ప్రవిమల కృపారసామృత వారి ధారఁ
జివికి హస్తశాఖావలంబన మొసంగి - ఓయి వనమాలి, రక్షణ నేయవేని
ఈదరిద్రాణ వైశాఖ పృథునిదాఘ - దినములను తీవ్రవేదనఁ గనలి కనలి
యభినవోన్మేష జీవవిన్యాస మెల్ల - పస దొరఁగి డీలుపడి మంటిపాలు గాఁగ
నెపుడు నిర్మూల మగునోయ దెవరి కెఱుక!





## కాళ్ళూరు వెంకటరామారావు గారు

అరణ్యం అంతటా గాఢనిశ్శబ్దం అలుముకుంది. ఝామురాత్రికి పైగా అయివుంటుంది. ప్రశాంతమైన చంద్రకాంతిలో వృక్షాగ్రాలు తళతళ మెరుస్తున్నాయి. నేలమీద అక్కడక్కడ చంద్రకాంతి తెల్లని మరక మరకలుగా చెట్లసందుల్లో నించి పడుతూంది. అప్పుడే వర్షంకురిసి వెలిసినందువల్ల చెట్లనుండి నీటిబిందువులు రాలుతున్నాయి. నేలరాలిన ఆకులు తడిసిమెత్తబడి శబ్దంచెయ్యడం లేదు.

ఇంతలో దూరాన్ని నిబిడంగా అల్లుకున్న పొదలూ తీగలూ హఠాత్తుగా కదలడం ప్రారంభించినవి. తుప్పలలోనించి దారిచేసుకుంటూ ఒక భయంకర ఖడ్గమృగం నడుస్తూంది. దారిలోవున్న తీగెలు దాని వురవడి కాగలేక పటపటా తెగిపోతున్నాయి మదోద్రేకంచేత శరీరం కానకుండా నడుస్తూంది ఆజంతువు.

తోవలో కనబడ్డ పెద్దపెద్ద వృక్షాలకు ఆనుకొని ఒంటికసి తీరేటట్లుగా రాసుకుంటూంది. చిన్న చెట్లను ముట్టెతో ఒక్కొక్క దెబ్బకొట్టి పెళ్లుమనిపడదోస్తూంది. నడిచేటప్పుడు దానినీడవల్ల వెన్నెలమరకలు పోయి గాఢమైన చీకట్లు బయలుదేరుతున్నాయి. అల్పజంతువులు గుండెలు కొట్టుకుంటూ నలుదిక్కులా చెల్లాచెదరై పోతున్నాయి. కాని అది వాటిలో ఒక్కదానిజోలికైనా పోలేదు.

మాటిమాటికి నేలమీదముట్టె నానించిపసిపడుతూంది. ఒక్కొక్కచోట నిలబడి చంద్రుడివంక చూస్తూ మూలుగుతూంది. మరొకప్పుడు నేలమీద పరుండి ఒక్కసారిగా కుప్పించి దుముకుతూంది. భూమిమీద పడి దొర్లుతూంది. కామపరవశుడైన క్రూరరాక్షసుడి లాగ కనబడుతూంది ఆభయంకరమృగం.

ఇంతలో దానికి రెండు వందలగజాల దూరంలో ఏదోసడి వినబడ్డది. చప్పున ఆగి చెవులురిక్కించుకొని ఆశబ్దాన్ని శ్రద్ధతోవింది. ముట్టెతో నేలమీద పసిపట్టింది. తక్షణం క్రోధమూర్తియై నాలుగుకాళ్లతోనూ నేలను తవ్వడం ప్రారంభించింది. దానివైఖరి చూస్తే ఏదో మహాయుద్ధానికి కాలుతవ్వుతున్న యోధుడిలా నుంది.

క్రమక్రమంగా దూరంగా వినబడిన సడి సమీపిస్తూంది. వేరొక బ్రహ్మాండమైన ఖడ్గమృగం మందగమనంతో వస్తూంది. అది మెల్లిగా మొదటి దానిని సమీపించి టక్కున ఆగిపోయి దానివంక రెప్పవాల్చకుండా చూసింది.

తక్షణం దాని శాంతస్వరూపం అంతా నిముషంలో భయంకరాకారంగా మారిపోయింది. కళ్లు ఘోరంగా చింతనిప్పుల్లాగు మెరిశాయి. పౌరుషోద్రేకంచేత శరీరం రెట్టింపుగా పొంగి పోయింది. అదీకూడా కాళ్ళతో నేల దువ్వడం ప్రారంభించింది.

రెండు జంతువులూ ఒకదానివంక ఒకటి తీక్ష్ణంగా చూసుకున్నాయి. తోకలు "ఝైంయి" మని తిప్పుతున్నాయి. ఒకదానికొకటి వెనకతియ్యకుండా రణసన్నాహంలో వున్నాయి. నాలుగుకాళ్లూ వంచి భూమిమీ

కుప్పిగంతుకి సిద్ధంగా మోకరించుకొని కూచున్నాయి. కాని యేదిగాని ముందుగా యుద్ధంలోకి దిగలేదు.

ఇల్లా వుండగా సమీపంలోనే ఒక ఆడజంతువు ప్రవేశించి వీటిని చూసింది. ఒక్కనిముషం ఆగి మెల్లగా దగ్గిరకి చేరింది. ఈ రెండు కూడా దాన్ని చూశాయి. చూడ్డంతోటే రెండింటికీ పౌరుషం మరింత పెరిగి పోయింది. ఒక్కొక్కటి స్త్రీజంతువువేపు చూసి మళ్లా ద్విగుణీకృతక్రోధంతో తోక తిప్పుకుంటూ యెదుటనున్న శత్రువునంక చూసేది.

ఉండి వుండి స్త్రీమృగం భయంకరగర్జన చేసింది. ఆ అరుపు వినీ వినడంలో రెండు పురుషమృగములూ చప్పున ఒక దానిమీదికి వేరొకటి దుమికాయి. ఆ ఆడు జంతువు అరపు వాటికొక రణభేరీమోతలాగు వినబడ్డది. ఆ అరపు వాటిశరీరాలను పులకాంచితములుగా చేసింది. అది విన్నందువల్ల వాటిపరాక్రమము ఉప్పొంగిపోయింది. తత్క్షణం అవి కలియబడి పోరాట ప్రారంభించాయి.

ఆజంతువుల భయంకరగర్జనల వల్ల వనసీమ లన్నీ మారు మ్రోగుతున్నాయి. పదఘట్టనలచేత చుట్టుప్రక్కల భూభాగమంతా గోతులు పడిపోయినది. దెబ్బలవల్ల ఫెళ్లుమనే శబ్దాలకు విధీవిరామము లేదు. కొండల మీద నుండి సెలయేళ్లలాగు గాయాల నుండి రక్తధారలు స్రవిస్తున్నాయి. సమీపంలో వున్న వృక్షాలూ, పొదలూ, తీగలూ సమూలంగా నాశనమైపోయి, స్వచ్ఛమైన చంద్రకాంతి యుద్ధభూమినిండా పడుతూంది. రక్తసిక్తములైన వాటి బలిష్ఠకాయములు వెన్నెలలో భయావహములై బీభత్స ప్రదర్శనం చేస్తున్నాయి.

సమీపంలోనే కూచుని స్త్రీమృగం యీ మహా సంగ్రామమును కుతూహలంతో విలోకిస్తూంది. రుధిరధారలతో భూమిఅంతా తడిసిపోయినది. పోరాడుతున్న కొద్దీ, రక్తంకాలువలు కడుతున్న కొద్దీ,శరీరంనుంచి కండలు వూడిపోతున్న కొద్దీ వాటికి పంతమూ, పౌరుషమూ, మత్సరమూ ఎక్కువై పోవడంచేత పోరుమరింత తీవ్రస్వరూపం ధరించినది.

ఇలాగ్గా యుద్ధరమారమీ రెండుగంటలసేపు సాగింది. అప్పటికి ఒకదానిశక్తి కొంచెం తగ్గిపోయినట్లు గా తోచింది. అది అలసట సూచనలు కనపర్చడం ప్రారంభించింది. ఆసంగతి గ్రహించిన వెంటనే రెండవది దానిమీదికి లంఘించి నేలమీద పడేసింది. శత్రుకళేబరముపైని కూచుని ముక్కముక్కలుగా చీరేసింది.

విజయోత్సాహంతో, రక్తసిక్తములైన బాహువులతో ఆఖడ్గమృగం స్త్రీమృగం దగ్గరకి వెళ్లింది. నిరుపమానమైన సంతోషంతో విజయలక్ష్మిని వరించిన పురుషమృగమును స్త్రీమృగము గౌరవించి గాఢాలింగన మొనర్చుకొన్నది. ఆక్రూరసత్వముల మోహోద్రేకము సంపూర్ణ ప్రాణహరణంతోగాని శాంతి పొందలేదు.

*　　　　*　　　　*　　　　*

౧

రామనాథుడూ, విశ్వేశుడూ చిన్ననాటి నుంచీ ప్రాణ స్నేహితులు. విజయ నగరమునకు సమీపాన్నే వున్న ఒక పల్లెటూరు కాపురస్తులు. సంపన్న కాపు కులస్థులు.

రామనాథుని తండ్రి గ్రామంలో రెవెన్యూపెత్తనదారు. విశ్వేశుని తండ్రి కల్లాంటి వుద్యోగాలు లేక పోయినా పూర్వార్జిత ధన సంపద బాగా వుంది.

పిల్లలిద్దరినీ పల్లెటూరు వీధిబడిలోనికి పంపారు. అప్పటినుంచీ వాళ్లిద్దరికీ స్నేహమేను. ఆటల్లో వాళ్లిద్దరూ ఒకపక్షాన్నే వుండేవారు. బడిలో యిద్దరూ ఒక బెంచీ మీదనే కూచునే వారు! రాత్రివేళ యిద్దరూ విశ్వేశుని యింటిలో ఒక్క దీపందగ్గిరే కూచుని చదువుకునేవారు.

పల్లెటూళ్లో చదువు పూర్తికాగానే విజయనగరంలో ప్రవేశించి స్కూలుఫైనలువరకూ సాగించారు.

అక్కడనుంచి ఉన్నత విద్యకోసం చెన్నపట్నం వెళ్లాలని రామనాథుడికి బుద్ధి పుట్టింది. విశ్వేశుడుకూడా జననీ జనకులను ఒప్పించి స్నేహితునితో బయలుదేరాడు.

చెన్నపురిలో వాళ్లిద్దరూ పచ్చయప్ప కళాశాలలో ప్రవేశించారు. బి.యే. పట్టం పొందిన తరువాత మే

వృత్తిలోకి దిగడమూ అనేప్రశ్న వాళ్లకి కలిగింది. వెనక ముందు లాలోచించుకుని చివరకు లాకాలేజీలో ప్రవేశించారు. ఆసంవత్సర మే "సరస్వతి" అనేమహారాష్ట్ర యువతికూడా న్యాయవాద పరీక్షకొరకు లాకాలేజీలో ప్రవేశించినది.

చిన్నప్పుడు కుర్రవాళ్లను చూచినవారు యిప్పుడు మళ్లా పోల్చుకో లేకుండా వున్నారు. వాళ్ల వేష భావము లు పూర్తిగా మారిపోయినవి. చిన్నప్పటి స్నేహితులకి కూడా వాళ్లేదో దేవలోకంలోనుంచి దిగిన దేవకలభాగు కనపడేవారు సెలవులకి స్వగ్రామం వొచ్చారంటే వూళ్లో ఆబాలగోపాలమూ వాళ్లని చూడాలని యెంతో సరదాతో వస్తూవుండేవారు. "పిల్లోళ్లు మారిపోయినారా" అని దీర్ఘాలు తీసుకుంటూ రైతులు చెప్పుకునే వారు. నవనాగరకతా లక్షణాలు వాళ్లలో పూర్తిగా నిండిపోయినవి.

సరస్వతి తండ్రి మహారాష్ట్ర దేశంలో ఒకచిన్న జమీందారీకి దివానుగా పనిచేస్తున్నాడు. సంఘసంస్కరణం అంటే అభిమానం కలవాడు. తాను నమ్మినవిధానములను కేవల వాగాడంబరముతో వెల్లడించడమే కాక ఆచరణలో పెట్టగల కార్యశూరుడు. అతని తండ్రినాడే వారికుటుంబము ఆంధ్రదేశమును వొదిలిపెట్టింది.

కుమార్తెకి ఉన్నత విద్య చెప్పించి న్యాయవాద పరీక్షకు చదివించాలని అతని అభిప్రాయము. బంధువు లందరూ తన్ను జాతిభ్రష్టునివలె చూచినప్పటికీ అతడు కించిత్తూ చలించలేదు.

ఒకేతరగతి విద్యార్థు లగుటవల్ల సరస్వతికీ, రామనాథవిశ్వేశులకునూ మంచి స్నేహం కలిగింది. సరస్వతి మంచి కలిసి కట్టుగల యువతి. తేటనీటివలె స్వచ్ఛమైన హృదయం కలది.

క్రిస్టమసు సెలవులకి సరస్వతితో కూడా వారిద్దరూ వాళ్లవూరు వెళ్లారు. దివానుగారు సౌజన్య హృదయులైన ఆయువకులను ఉచితరీతిని ఆదరించారు.

ఇంతలో ప్రపంచాన్నంతటినీ కదలించిన మహాయుద్ధము "యూరోపు" ఖండములో ప్రారంభమైనది. యించుమించుగా యూరపులోని అన్నిముఖ్యదేశములూ కూడా యుద్ధంలోకి దిగినవే. బ్రిటిషు సామ్రాజ్యాం తర్భాగ మవడంచేత హిందూదేశము కూడా ధనమునూ, మనుష్యులనూ విరివిగా సాయంచేయడం మొదలు పెట్టినది. ఉత్సాహపూరితులైన యువకులు కళాశాలలు వీడి సైనిక శిక్షణ పొంది రంగములోనికి పోవడం ప్రారంభించారు. ఇతరప్రదేశము లన్నిటికంటె చెన్నపురిలో యీసంరంభం మహాయెక్కువగా వుంది.

మార్చినెల. సాయంకాలం ఆరున్నరకి పైగా అయింది. ఒక సౌధోపరిభాగమున నున్నగదిలో రామనాథుడూ, విశ్వేశుడూ కూచున్నారు. చల్లగాలి ధారాళంగా గదిలోనికి వొస్తూంది. రామనాథుడు తన చొక్కా గుండీలను తీసి శరీరానికి చల్లగాలి తగిలిస్తున్నాడు.

అప్పుడే వారిద్దరూ "క్లబ్బు" నుండి ఇంటికి వచ్చారు. ఆసాయంత్రము ఒక మిలిటరీ ఉద్యోగి క్లబ్బులో గొప్ప ఉపన్యాసం యిచ్చాడు. సామ్రాజ్య క్షేమము కొరకు హిందూదేశం సహాయం చేయవలసిన అగత్యం బాగా వివరించి ఆసమయాన్ని సైన్యంలో చేరిన యువకులకు గల లాభాలు తెలియచేస్తూ చాలాసేపు మాట్లాడినాడు.

అది విన్నది మొదలు రామనాథునిమనస్సు మారిపోయినది. సైన్యంలోకి పోయి ఉన్నతోద్యోగాలను సంపాదించాలని అతని మనస్సు తొందర పడుతూంది. క్లబ్బునుండి యింటికి వొచ్చేవరకూ అదే ఆలోచన. గదిలోని విద్యుద్దీపపుకాంతిలో రామనాథుని విశాల ఫాలము నిగనిగ మెరుస్తూంది. విశ్వేశు డొకపడకకుర్చీలో విశ్రాంతిగా కూచున్నాడు. సరస్వతి వారి కెదురుగా వేరొకకుర్చీలో కూచుంది. రామనాథుడు మెల్లగా "సరస్వతీ! లెక్చరు విన్నావా?" అన్నాడు.

విశ్వేశు డదరిపడి లేచి, "ఏమ కేం? అలా గడుతున్నా వెందుకూ? మళ్ళీ యేదైనా వికారపు బుద్ధి పుట్టిందేమిటి?"

"బుద్ధి కేముందిగాని, నాకోమారు యూరపు దేశ మంతటూ తిరిగి రావాలని వుంది సుమా!"

"మీ నాన్న డబ్బిస్తాడా ?"

"అదే గట్టిచిక్కు. కాని డబ్బు అక్కరలేకుండా యాత్రచెయ్యగల వుపాయం ఈసాయంకాలపు లెక్చరులో మనకి తెలియలేదూ ?"

"ఆఁ ! యేమిటే! సైన్యంలో చేరాలని వుందా యేమిటి?"

"అలా గడుసుతా వెందుకూ? మనం పటాలంలో చేరితే నిముషంలో మంచి position లోకి వచ్చేస్తాం. B.L. ప్యాసయి మనం యిండ్లలో కూర్చోవడం నాకిష్టంగా లేదు. కావలసినంత పేరూ, ప్రతిష్ఠావస్తుంది. ఏం సరస్వతీ! మాటాడవూ?

"అది బాగుంది గాని మీవాళ్ళకి రాసి వాళ్ల అనుమతి పొంది మరీ బయలు దేరాలని నావుద్దేశం."

"సరస్వతీ! మేం యెలాగో వుండిపోవాలన్న వుద్దేశంతో నువ్విలాగు చెబుతావు. నీకు మాయందుగల ప్రేమకు కృతజ్ఞులమేగాని ఉన్నతోద్యోగములతో, నూతన గౌరవాలతో వచ్చే స్నేహితులను చూడ్డానికి నీకు కోరిక లేదూ? నువ్వు సంతోషంతో పంపిస్తేగాని మేము వెళ్లము."

"బాగుందిగాని మీరు వెళ్లిపోతారంటే నా కెందుకో కష్టంగా వుంది. అయినా మీ ఉత్సాహభంగం చెయ్యడం నాకిష్టంలేదు వెళ్లి శీఘ్రంగా రండి. అయితే మీవాళ్ళకి రాయరూ? "

"మళ్లీ అదేమాటగదా! వాళ్ళకి తెలుస్తే అడుగు కదల నివ్వరని చెప్పడం లేదూ? మేం సైన్యంలో చేరిన తరువాత రాస్తే మరి పరవా వుండదు."

సరస్వతి చిరునవ్వుతో "రామనాథుని వన్నీ దొంగయెత్తులే" అంటూ విశ్వేశునివంక చూసి, "అయితే తరుచు యుద్ధరంగాలను గురించి నాకు జాబులు రాస్తూ వుంటా రన్నమాటేగదూ?"

"అయ్యో! అలాగని నువ్వు కోరాలా సరస్వతీ! ఎంత ప్రేమార్ద్రహృదయవు! రామనాథుడు పట్టినపట్టు విడిచీదటం కాదు. ఈప్రయాణసమయంలో నీలాంటి స్నేహితురాలిని విడిచి వెళ్ళడం కష్టంగా వుంది."

సరస్వతినయనములు అశ్రుపూరితము లయినవి. రామనాథు డామెను చూచి, "అయ్యో! సరస్వతీ! ఎంత మెత్తని మనస్సు నీది! చాల్లే, వూరుకో. మళ్లీ త్వరగా రావాలని భగవంతుని ప్రార్థించు. మీనాయనగారికి మానమస్కారములు చెప్పు."



"అయ్యో సరస్వతీ! ఎంత మెత్తని మనస్సు నీది! చాల్లే, వూరుకో."

పైకల్లా ధైర్యంగా మాటలాడినప్పటికీ సరస్వతిని వదలివెళ్ళడం రామనాధునికికూడా కష్టంగానే వుంది. సరళమై, సౌఖ్యప్రదమైన ఆమె స్నేహలాలనమున అతడిన్నాళ్లూ మైమరచిపోయి వున్నాడు. ఇప్పు డామెను విడిచిపెట్టి వెళ్ళడం అంటే మనస్సుకు నొప్పి కలుగుతూంది. అతనికి తెలియకుండానే ఆమెయెడల ప్రేమ భావాలు ఆతని మనస్సులో వృద్ధిపొందినవి. అవి యిప్పటికిగాని అతనికి తెలియలేదు.

విశ్వేశుడుమాత్రం మనస్ఫూర్తిగా మొదటినుంచీ సరస్వతిని ప్రేమించినాడు. ఆమె సుందరవిగ్రహం చూసేసరికి అతనికి నేత్రపర్వంగా వుండేది. రహస్యంగా తనహృదయపీఠముమీద సరస్వతీవిగ్రహాన్ని నిల్పి సంతతధ్యానం చేస్తున్నాడతడు. అతని కీయెడబాటెంతబాధ కలిగించినదో వేరుగ చెప్పనక్కరలేదుకదా!

౨

నాలుగు సంవత్సరములు గడిచాయి. రామనాథుడూ, విశ్వేశుడూ సైన్యంలో మంచి ఉన్నతాధికారములను పొందినారు. వాళ్లిద్దరూ కలిసి ఒకపటాలంలోనే వుండాలని వాళ్లఆశ. కాని పైఅధికారులు వాళ్ళని వేరువేరు పటాలాల్లో పడేశారు. అసలు యుద్ధరంగమునకు వెళ్ళవలసివచ్చినప్పుడు రామనాథుడున్న పటాలమొకదేశమూ, విశ్వేశుడున్న పటాలం వేరొకదేశమూ వెళ్ళక తప్పినది కాదు.

వారిద్దరిమధ్యా తరుచు ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచేవి. వారివారి రంగస్థలాలను వర్ణిస్తూ యిద్దరూ తరుచు సరస్వతికి రాస్తూవుండేవారు. బొంబాయిలో వకీలువృత్తిని ప్రారంభించిన సరస్వతి తన కృతజ్ఞతను తెలుపుతూ జవాబు లిస్తూవుండేది.

నాలుగు సంవత్సరాలు గడిచిన తర్వాత, సకలదేశపీడాకరమైన సమరము చాలించబడినది. చాలవఱకు కొత్తపటాలములను యుద్ధం అయిన తర్వాత విడగొట్టేశారు. రామనాథునిమాత్రం ప్రభుత్వంవారు శాశ్వతంగా తమ సైన్యములో వుండిపోవలెనని కోరినారు. ముందు వెనుక లాలోచించి అతఁ డందుకు సమ్మతించి ఒక సంవత్సరము సెలవు తీసుకుని స్వదేశానికి బయలుదేరాడు.

బయలుదేరకముందు యీ సంగతులన్నీ ప్రియమిత్రునికి రాసి వెంటనే ప్రయాణమై రమ్మని కోరాడు. కాని విశ్వేశు డున్న పటాలం అప్పటికి విడగొట్టకపోవడంవల్ల మరికొన్ని నెలలవరకూ రావడానికి వీలులేదని అతడు జవాబిచ్చినాడు. అది చూసిన తరవాత తన ప్రయాణపురోజు నిశ్చయించుకుని రామనాథుడు సరస్వతికి తెలియచేశాడు.

రామనాథుడు గృహోన్ముఖుడై దారిలో బొంబాయిలో దిగి సరస్వతిని చూసి మరీ వెళ్లాలని నిశ్చయించుకున్నాడు. అనుకున్నరోజుకి స్టీమరు బొంబాయి రేవు చేరినది. రేవు దూరాన్ని కనబడుతూండనగా రామనాథుడు స్టీమరుపై కప్పు (Deck) మీద నిలబడి పరిచితులైనవారెవరైనా కనబడతారేమోనని ఆశతో యెదురుచూస్తున్నాడు. చిరకాలానంతర మాతృదేశసందర్శనమువలన అతనిమనస్సు సంతోషతరంగితమైపోతూంది.

స్టీమరు రేవును సమీపిస్తున్నకొద్దీ దూరదేశాగతబంధుమిత్ర సందర్శనలాలసులగు జనులు రేవులో నిలబడి ఉత్సాహంతో జేబురుమాళ్లను యెగరేస్తూ తమ సంతోషాన్ని తెలియచేస్తున్నారు. స్టీమరు పైభాగమున నిలిచి స్వదేశాగమన కుతూహలులైన ప్రజలు జయజయధ్వానములు చేయుచున్నారు.

రామనాథుడు స్టీమరుదిగి రేవులో ప్రవేశించాడు. కూలివాడొకడతనివెనుక సామాను నెత్తిమీద పెట్టుకుని నడుస్తున్నాడు. రేవులోనున్న అఖండజన ప్రవాహములోనికి దృష్టులు సారిస్తూ అతడు నడుస్తున్నాడు. ఒక్కరుగాని పరిచయు లతనికి కనబడలేదు.

మెల్లి మెల్లిగా జనమును తప్పించుకొని అతడు ఫస్టుక్లాసు ప్రయాణీకులు కూచునే హాలులో ప్రవేశించి ఒక కుర్చీలో కూచున్నాడు. తన దొరటోపీ (Hat) తీసి మేజాబల్లమీద పెట్టాడు.

మరి రెండునిముషాలకి అతని వెనకనించి ఒక మహారాష్ట్రయువతి ఆ హాలులోనికొచ్చి నలువైపులా ఎవరికోసమో చూస్తూనిలుచుంది. ఒకడవాలానాథ రామె వెనకనే ఉన్నాడు. రామనాథున కామెను చూసేసరికి శరీరం రోమాంచితమైనది. అతడు వెంటనే లేచి ఆమె చేయి పట్టుకొని "Saraswati! Are you here?" (సరస్వతీ! నీ విక్కడే వున్నావా?) అన్నాడు.

సరస్వతి దిగ్భ్రమచెంది ఒకనిముష మూరుకొని, "రామనాథ్! ఏమి టిది? నిన్ను పోల్చుకో లేకపోయాను.



"సరస్వతీ! నీ విక్కడే వున్నావా?"

పూర్తిగా దొరగారి వైపోయావు. నీ వీవేళ రావేమోనని నిరాశ పొందిపోయాను. నేను స్టీమరుదగ్గరే యింతసేపూ నిలుచుని నిన్ను కలుసుకోలేకపోయాను" అంది.

"నేను రాలేనని నువ్వెంత నిరాశ పొందినావో, యీ రేవులో నీవు నాకు కనబడకపోతే నే నంతకు రెట్టింపు నిరాశ చెందినాను. నేను వచ్చేరోజు ముందుగా తెలియచేసినప్పుడు నన్ను receive చేసుకోడానికి రేవుదరకేనా నాసరస్వతి రాకపోతుందా అని కదూ నా ఆలోచన? సరస్వతీ! ఎన్నాళ్లయింది నిన్ను చూసి! ఇప్పు డెంత సంతోషంగా వుంది!"

"ఏం? ఎంతసంతోషంగా వుందీ?" నవ్వుతూ సరస్వతి అన్నది.

"నువ్వు రావడంవల్ల నా హృదయంలో చాలా భారం తగ్గిపోయింది సుమా. స్టీమరు దిగడంతోటే నీవు కనబడకపోవడంవల్ల నామనస్సు పరిపరివిధాలపోయింది!"

"నేను రేవులోకి రాకపోతే నీవు మా యింటికి రానేరావు కాబోలు!" అని మందహాసంతో అన్నది.

"దానికేంగాని సరస్వతీ! నేను యుద్ధంలో వుండగా నన్ను ఒక్కసారైనా చూద్దామని బుద్ధి పుట్టిందా నీకు?"

సరస్వతి జవాబు చెప్పకుండానే వెనక నిలుచున్న డవాలాబంట్రోతును చూసి, "ఏమోయ్! మనం అనుకున్నవారు వచ్చారని దాదాగారితో చెప్పి యిల్లా తీసుకొనిరా" అని చెప్పి పంపేసి, స్నేహితుని వంక చూసి, "ఏమిటోయ్? ఒక్కసారైనా చూడాలని బుద్ధి పుట్టిందా అంటావా? నా వుత్తరాలు నీకు అందలేదూ? నీకు యెదురుగా కొంతదూరము వద్దామనుకున్నాం కూడాను నేనూ, దాదాగారూనూ. దాదాగారికే చూడాలని ఆతురతగా వున్నప్పుడు నామాట అడగడ మెందుకూ?"

సరస్వతిమాట లాతనిచెవుల కమృతపు సోనలైనవి. ఆమె మృదుహస్తాన్ని తనచేతులమధ్య నుంచుకుని సాభిప్రాయంగా ఆమెవేపు చూస్తూ, "సరస్వతీ! నే డెంత సుదినం!" అన్నాడు మెల్లగా.

ఆ పలుకులు సరస్వతికి వేరువిధంగా తోచినవి. కేవలం తొందరస్వభావంకల రామనాథుని మాటలలో ఆమె కొక కొత్త మృదుత్వమూ, నెమ్మదీ గోచరించాయి. ఆమెకూడా మందస్వరమున "ఆహా! నిజంగా" అని మాత్రం మారుపలికింది.

ఇంతలో సరస్వతితండ్రి నౌఖరుతోకూడా లోపల ప్రవేశించాడు. రామనాథుడు వెంటనే లేచి ఆయన కెదురుగా వెళ్లి కరస్పర్శనం చేశాడు. కుశలప్రశ్నలయిన తర్వాత యుద్ధవిశేషాలనుగూర్చి వారు చాలాసేపు ముచ్చటించుకుంటూ ముగ్గురూ మోటారులో యింటికి పోయారు.

భోజనా లయిన తర్వాత విశ్వేశుని గురించి సరస్వతి చాలాప్రశ్నలడిగింది. వాటికి సమాధానం చెబుతూ రామనాథుడు విశ్రాంతిపొందినాడు. దాదాగారూ, కుమార్తెయూ అతన్ని చాలా గౌరవించారు.

ఆ సాయంత్రం ముగ్గురూ కలిసి సినీమాకి వెళ్లారు. మిత్రుడు వచ్చినందుకు గౌరవసూచకంగా సరస్వతి యెన్నో వినోదాలు యేర్పాటు చేసింది. ఆసారి అతడు బొంబాయిలో అయిదురోజులుమాత్రం వుండి, మళ్లీ నెలరోజుల్లో తిరిగీ వచ్చేటట్టు ఒప్పుకుని స్వగ్రామానికి వెళ్లాడు.

3

అనుకున్నట్టుగా నెలరోజులనాటికి రామనాథుడు మరల బొంబాయి వొచ్చాడు. చారిత్రక ప్రసిద్ధిగల స్థలాలను సందర్శిస్తూ, వినోదవిహారాల్లో సరస్వతితో అతను చాలారోజులు గడిపాడు. విశ్వేశుని వద్దనుండి జాబులు వస్తూనేవున్నాయి. అతడు రావడానికి ఇంకా రెండునెలలు గడువుంది.

బొంబాయిలో వున్న రోజుల్లో సరస్వతి గడియైనా అతన్ని వొదిలిపెట్టి వుండలేదు. వీథిలోకి వెళ్లే టప్పుడు మిలిటరీ (సైనిక) దుస్తులను ధరించిన రామనాథుని చూడాలని ఆమె కెంతో మనసుగా వుండేది. మోటారులో అతనితోగూడి విందులకూ, సినీమాలకూ, సభలకూ వెళ్లడమంటే ఆమెకు సరదా.

రమారమీ నెలరోజులు బొంబాయిలో వుండి అతడు మళ్లీ స్వగ్రామం చేరుకున్నాడు. సరస్వతి ప్రియమిత్రుని వొదల్లేక వొదల్లేక వొదిలిపెట్టింది. ఆమెను కూడా తనతో రావలెనని చాలా బలవంతపరిచాడు. సరస్వతి మందహాసవదనంతో "తరవాత యెలాగూ రావాలి కదూ? యిప్పు డెందుకూ?" అని జవాబు చెప్పింది.

రామనాథుడు స్వగ్రామం చేరిన తరవాత పది రోజుల్లో విశ్వేశుడు మరి వారంరోజుల్లో రానైయున్నట్టు జాబు రాశాడు. అపరిమిత సంతోషముతో నాతడు వచ్చేనాటి కొకరోజు ముందుగానే విశాఖపట్టం వరకూ వెళ్లి అతన్ని కలుసుకొని తీసుకొచ్చాడు.

చాలా కాలం అయిన తర్వాత కలుసుకోవడం వల్ల మిత్రులిద్దరూ ఒక్క నిముషమైనా ఒకరి నొకరు విడిచిపెట్టి వుండలేకపోయేవారు. ఉద్యోగ సంబంధము లైనకబుర్లు చెప్పుకుంటూ, యుద్ధరంగములను వర్ణించుకుంటూ వాళ్లు అతిసంతోషంగా కాలంగడుపుతున్నారు.

యుద్ధంలో బ్రిటిషు సామ్రాజ్యానికి సహాయ మొనర్చినవారందరికీ బహుమతు లివ్వడానికని చెన్నపట్నంలో గవర్నరు ఒకసభ చేశాడు. ఆసభకు రావలెనని మిత్రు లిద్దరికీ ఆహ్వానపత్రికలు వచ్చినవి.

చెన్నపురిలో పని పూర్తిచేసుకొని బొంబాయి వెళ్లాలని విశ్వేశుడు నిశ్చయించుకున్నాడు. తమప్రయాణంగురించి సరస్వతికి తెలియచేస్తూ సభ జరిగేనాటికి చెన్నపురి రావలెననిన్నీ, అక్కడినుంచి అందరూ కలిసి బొంబాయి వెళ్ళవొచ్చననిన్నీ రాశాడు. కాని కొన్ని కారణాంతరములచేత సభకు వచ్చి ప్రియమిత్రులకు జరుగు సన్మానమును చూసేభాగ్యము లేనందుకు విచారిస్తూ సభ జరిగిన వెంటనే మాత్రం తప్పక బొంబాయి రావలెనని ఆమె జవాబిచ్చినది.

సభ యింకా వారంరోజు లుండనగా రామనాథుడూ, విశ్వేశుడూ చెన్నపురి చేరారు. చిన్ననాటి స్నేహితుల నేకులు వారిని ఆహ్వానించారు. తమవిద్యాభ్యాసమునాటి స్థలాలన్నీ దర్శిస్తూ వాళ్లు నిరుపమానానందమును పొందినారు.

ఇట్టి సంతోషసమయంలో సరస్వతి లేనందుకు వారు చాలావిచారించారు. మద్రాసులోని వారివినచర్య యేరోజుకారోజు సరస్వతికి రాయకుండా వుండ లేకపోయేవారు.

ఏప్రిల్ నెల. వసంతసమయ సౌభాగ్య మెల్లచోట్లను ద్యోతక మవుతూంది. దినమంతయు తీక్ష్ణ సూర్యాతపతప్తులగు జనులు దినాంతకాల శీతల వాతపోత సౌఖ్యమున మైమరచి ఉద్యానవన ప్రదేశముల కాలాతిక్రమణమును గణింపక విశ్రమించి యున్నారు. ఏడు గంటలకు పైగా అయింది. జనాకీర్ణమైన చెన్నపురం లోని ప్రజలు వారివారి పనుల ముగించుకుని యిళ్లకు చేరుకుంటున్నారు. బజారులన్నీ విద్యుద్దీపముల కాంతిలో వింత శోభను పొందినవి.

పార్కు (ఉద్యానవనము)లో స్నేహితు లిద్దరూ ఒక చలువరాతి తిన్నెమీద కూచుని సంభాషించు కుంటున్నారు. ఉద్యాన వనంలోని పుష్పాలమీద నుండి తియ్యని సువాసనలు గాలిలో తేలిపోతున్నాయి. తిన్నె వెనకనున్న పొన్న చెట్టు నీడను వారిద్దరూ కూచున్నారు. అనేక విషయాలు దాటిన తర్వాత వారి సంభాషణ క్రమంగా యీ క్రింది విధంగా మారింది.—

రామనాథుడు:—"విశ్వేశం! సరస్వతి లేకపోవడం మన కేమీ వుత్సాహంగా లేదు సుమా!"

"నేను రమ్మని రాశానుగదా. మనం యెన్నిసార్లో సరస్వతితో ముచ్చటించుకుంటూ యీ రాయిమీద కూచుంటూ వుండేవాళ్ళంకదూ! అందుచేత యీ వేళ మరీ చిన్నపోయిన ట్లగుపిస్తూంది."

"ఈ summer (వేసవి) వరకేకదూ ఆమె మనలని యెంత విడిచిపెట్టి వుండినాను? ఆతర్వాత మన సుందరమూ ఒక్కచోటే వుండవొచ్చు."

"ఏం? అలాగంటున్నావు? సైన్యాధిపత్యం సరదా తీరిందా యేమిటి? మళ్లా బొంబాయిలో ప్రాక్టీసు పెడతావు కాబోలూ?"

"ఆఁ!అయ్యో! నీతో చెప్పడమే మరచిపోయాను. అది నువ్వెరగవు కాబోలూ? ఇల్లాంటి సంతోష వార్త యిన్నాళ్లు నీకు తెలియచెయ్యకుండా దాచిపెట్టినందుకు క్షమించు విశ్వేశం. ఈ summer లో సరస్వతి వివాహం చేసుకుంటుంది. తెలిసిందా?"

"ఆ! అలాగా! ఏమిటీ? పెళ్లే? యెప్పుడూ? యీసమ్మర్‌లోనే! పెళ్లికొడు కెవరూ?"

"పెళ్లికొడుకా? ఆమహాభాగ్యానికి నోచుకున్నవాడు నీప్రియస్నేహితుడు రామనాథుడే!"

ఆమాట వినేసరికి విశ్వేశునిముఖం చిన్నబోయినది. అతని హృదయంలో ఒక ఆందోళన బయలుదేరినది. ఆ ఆవేదన కష్టంతో ఆపుకున్నాడు. కాని కొంతసేపటివరకూ మాటాడ లేకపోయాడు. చివర కెలాగో ప్రయత్నంతో లేని ప్రసన్నత తెచ్చుకుని, "ఓహో! యింతకాలమూ చెప్పకుండా దాచావా?" అన్నాడు.

"విశ్వేశం! I request you to excuse me (నీవు నన్ను క్షమించాలి.) ఈప్రయాణాలూ, అడావిడీ యిందులోబడి చెప్పడం మరిచిపోయాను. మొన్న నేను బొంబాయి వెళ్ళినప్పుడే యీప్రస్తావన దాదాగారు నా దగ్గిర తీసుకొచ్చారు. చాలాసేపు సంభాషించినమీదట బాగా వితర్కించుకుని కుమార్తె అనుమతిపైనే ఆయన యీనిశ్చయం చేసుకున్నాడు."

"మీ సోదరూ వాళ్లూ యెరుగుదురా యీసంగతి?"

"ఏమో వా ళ్లేఅభ్యంతరాలు కల్పిస్తారేమోనని వాళ్లతో చెప్పలేదు సుమా యింతవరకూను."

"ఏం? ఏం తప్పుచేస్తున్నావని వాళ్లు అభ్యంతరాలు కలిగిస్తారూ?"

"తప్పు కేముందిలే. వాళ్లు కొంచెం పూర్వాచారపు చాదస్తపురకం కదూ. నే నేదో ప్రమాదంచేస్తున్నానని గోలచేస్తారు. అంతా అయిపోనిచ్చి తెలిసినా ఫరవాలేదు."

ఇదంతా వింటూ విశ్వేశుడు దీర్ఘాలోచన చేస్తున్నాడు. అతని హృదయం భారంగా తిరుగుతూంది. ఇంతవరకూ అన్నివిషయాల్లోనూ తనతో సమానంగా వొచ్చిన రామనాథు డిప్పుడు తనకంటె అదృష్టవంతుడైపోయాడు. తను గాఢంగా ప్రేమించి మనస్సులోనే పెంచిన ఆలోచన నిమిషంలో ముక్కముక్కలై పోయినది. సరస్వతి రామనాథుని సొమ్మైపోయినది. తనచేతిలో నుండి దాటిపోయినది.

ఈ ఆలోచనలు అతని మనస్సులో గిర్రున తిరిగిపోయినవి. ఒళ్లు తిరుగుతూవున్నట్టుగా తోచింది. ముఖలక్షణాలు వికారంగా మారిపోయాయి. కాని అతను పొన్నచెట్టునీడని కూర్చోవడంవల్ల యిదంతా రామనాథుడు కనిపెట్టలేదు. సరస్వతినిగురించి ప్రస్తావన రావడం, అందులో వివాహప్రసక్తి వచ్చినందుచేత ఆతడు సంతోషాతిశయమున శరీరం మరిచిపోయివున్నాడు. బాల్యస్నేహితునితో తన భావిసౌఖ్యమయజీవితమును గురించి ముచ్చటించడానికి అతని మనస్సు ఉరకలువేస్తూంది. తన

సౌఖ్యాన్నిగూర్చి చెప్పుకుని ఆనందించడానికి విశ్వేశుని కంటె ఆప్తులు అతని కెవ్వరూ కనబడలేదు.

ఎట్టకేలకు విశ్వేశుడు మరల "అయితే వివాహం యేనెలలోనూ ?" అని అడిగాడు.

అడగడమే తడవుగా రామనాధుడు "ఎప్పుడా? మే నెలలోనే కదూ? ఇప్పటికింకా రెండు నెల లుందోయ్. పెళ్లికి నాతరపున వచ్చేవాళ్లలో పరమాప్తుడవు నీవే సుమా. పెత్తనం అంతా నీదే. నీకోసమనే వివాహం యింతదాకా ఆపుచేసుకోవలసి వచ్చింది. ఏం ? ఆలోచిస్తా వేం? వివాహానికి కావలసిన యేర్పాట్లన్నీ నీవు చూసుకో వచ్చును. ఏం? సిద్ధమేనా ?" అన్నాడు. అతడాడిన ప్రతిమాటలోనూ ఉత్సాహ సంతోషము లుప్పొంగిపోతున్నాయి. ఒక్కొక్కమాట ఒక్కొక్క శూలపు పోటులాగ తన మిత్రుణ్ణి బాధిస్తున్నాయని ఆ నిర్మలహృదయు డెరగడు. సరస్వతితో కూడిన సౌఖ్యమయభావిజీవితము మనోవీథిని పొడకట్టి అతన్ని తన్మయుణ్ణి చేసేస్తూంది. తన భావోద్రేకమే కాని స్నేహితుని చిత్తవృత్తిని కనిపెట్టేస్థితిలో లేడు రామనాధుడు.

౪

విశ్వేశునికి క్రమంగా కోపం హెచ్చిపోతూంది. మిత్రుని సంతోషాతిశయం చూస్తున్న కొద్దీ అతనికి వొళ్లు మండుకు పోతూంది. రామనాధునితవబహిఃప్రాణంగా చూసుకుంటూ వున్న విశ్వేశుని మనస్సులో యీ వింతమార్పు క్షణంలో కలిగింది. పందెంలో ఓడిపోయిన వాడికి గెలిచిన వాడియం దేలాటిభావాలు కలుగుతాయో అలాంటివే యిప్పుడు విశ్వేశుని కలవర పెడుతున్నాయి. పందెంలో రామనాధుడు గెల్చేసి బహుమతియైన సరస్వతిని పొందాడు.

సరస్వతిని ప్రేమించి ఆమె నెల్లాగైనా పొందవలెననే కోరిక మొదటినుంచీ విశ్వేశుని హృదయాంతరాళంలో వుంది. తనజీవితానై్ననా నిమిషంలో పరిత్యజించ గలడు గాని ఆకోరికను మాత్రం అతడు వదలలేడు.

ఇప్పు డేమయిందీ ? సరస్వతి రామనాధునకు అప్పుడే వాగ్దాన మయిపోయినది. తన ఆశలన్నీ భగ్నములై పోవలసిన వేనా ? ఇంక తనకు ప్రాణం వుండి మాత్రం లాభ మేమిటి?

రామనాధు డెంతటి మిత్రద్రోహి! తను లేనిసమయంచూసుకుని సరస్వతిచేత వాగ్దానం చేయించుకున్నాడు!

పైవిధములైన ఆలోచనలు అతన్ని క్షోభపెట్టేస్తున్నాయి. తన్నుద్రోహంచేసిన దుర్మార్గుణ్ణి ఒక్క వేటుతో హతిమార్చేస్తేమాత్రం, పాపం, యేముం దనుకున్నాడు. విశ్వేశు డామెను ప్రేమించినట్లే రామనాధునకు తెలియదు. కాని ఆసంగతి తామసపూరితుడైన విశ్వేశున కాసమయంలో స్ఫురిస్తుందా?



"అప్రయత్నంగానే అతనిహస్తం మొలలోనున్న బాకుమీదకి పోయింది."

రామనాథుని ముఖంవేపు తీక్ష్ణంగా చూస్తున్నాడు విశ్వేశుడు. అప్రయత్నంగానే అతనిహస్తం రాతిబెంచీ మొలలో నున్న బాకుమీదకి పోయింది.

చేరబడి సంతోషంతో మాటలు చెబుతూవున్నాడు రామనాథుడు. కొమ్మలసందులో నుండి విద్యుద్దీపపు కాంతి అతని మెడమీద పడుతూంది. విశ్వేశుని దృష్టి ఆమెడమీద కేంద్రీకరింపబడ్డది. ఆ బాకుతో ఒక్కపోటు పొడిచి అందులోని ఉత్సాహపూరిత రక్తప్రవాహమును బయటకు తీసేయా లనుకున్నాడు.

రామనాథు డిదంతా గమనించలేదు. అత నేదో గొడవ చెప్పుకుపోతున్నాడు. "ఇదుగోనోయ్! పెళ్లి అయిన వెంటనే ఏసిమ్లాయో పోయి Honey moon గడుపుదామని సరస్వతి చెప్పిందోయ్. నిన్నుగూడా సిమ్లాకి తీసుకుపోవాలని ఆమె అభిప్రాయం. నువ్వు కూడా సెలవుపెట్టి వుండిపోతే తరవాత మనిద్దరమూ గూడా ఒక పటాలంలోనే వుండేటట్లు యేర్పాటు చేసుకుందాం. అప్పుడు సరస్వతి కూడా మనతోటే వుంటుంది. ఆమెకి నువ్వంటే ప్రాణం సుమా. మనం ముగ్గురమూ ఒక్కచోటే వుండాలని ఆమె ఆలోచన."

వింటూన్నకొద్దీ విశ్వేశునకు తేళ్లూ, జెర్రులూ శరీరంమీద ప్రాకినట్లుగా అవుతూంది. తల తిరుగుతూంది. ఉద్రేకంతో అతను బాకుపిడిని గట్టిగా పట్టుకుని పైకి లాగినాడు. హఠాత్తుగా అతనికి మెళుకువ వచ్చినట్లయింది. తక్షణం రహస్యంగా బాకును తిరిగీ యథాస్థానంలో దాచేశాడు.

"ఆఁ—! ఏం చెయ్యబోతున్నావూ? ఒక స్త్రీ కోసం—కేవలం ఒక స్త్రీకోసం—అమాయకుడై, నీ క్షేమంకోసం తనరక్తమేనా ధారపోయడానికి వెనుదీయని ప్రాణాధికస్నేహితుని వధించడానికి సిద్ధపడుతున్నావా? ఛీ—విశ్వేశా! నువ్వు మహాపాపివి. హంతకుడివి. పులికన్నా ఘోరమైన ఘాతుకత్వంగల నరజంతువవు నీవు. మిత్రరక్తంతో నీహస్తాలు కలుషితం చేసుకోడానికి చూస్తున్నావు. ఎంతమహాపాపికైననూ ముక్తి వుందిగాని నీకుమాత్రం లేదు." అని అతని అంతరాత్మ బోధిస్తూంది.

కాని ఆవెనుకనే వేరొకబుద్ధి "విశ్వేశం! ఇప్పుడు వెనకతీశావంటే ఇంక నీజన్మకి సౌఖ్యం సున్నా. నీజీవితం అంధకారావృతమైపోతుందిసుమా. నీవాంఛితార్థం సిద్ధించనప్పుడు నీబతుకు కాల్చనా? నీసౌఖ్య నిధానమును అపహరించినవాడు నీ కెల్లాంటి స్నేహితుడు? పొడువు—పొడువు— యిదే మంచితరుణం—", అని బోధిస్తూంది.

విశ్వేశునికి అంతరాత్మ బోధన చెవి కెక్కలేదు. ఇంద్రియాధీనమైన బుద్ధికే లొంగి పోయినాడు. "ఆమెడమీద ఆవిద్యుద్దీపపుకాంతి పడుచున్నచోట—ఒక్కపోటుతో అన్ని బాధలూ తొలగి పోతాయి. రామనాథు డీప్రపంచకంలోనే లేకపోతే సరస్వతి నా దైపోక తప్పదు కదా! కాని యీనడివీధిలో యిల్లాంటి పని చెయ్యకూడదు. ఇంటికి పోయిన తరవాత పనిపట్టేస్తాను." అనుకున్నాడు.

రామనాథుడు ప్రియమిత్రుని పరాధీన మానసమును గ్రహించి, "ఏమోయ్! బొత్తిగా కలివిడిగా లేవు యీవేళ?" అన్నాడు.

"ఏదో తలనొప్పిగానూ, వంట్లో వికారంగానూ వుంది; బాధగా వుంది."

"అయితే లే. యింటికి పద, పడుకుందుగాని. కడచినరాత్రి నిద్ర లేనందుచేత కలిగింది యీబాధ. చెయ్యి ఊతగా యివ్వనా? రావోయ్!" అని అతన్ని మెల్లగా లేవదీశాడు.

దారిలో విశ్వేశుడు జబ్బు పడిన వాడిలాగు తూలిపోతూ నడిచేవాడు. రామనాథు డతన్ని పట్టుకుని బుజానికి ఆనించుకుని నడిచేవాడు. అడుగడుగునా అతనికి దాహం కావలసి వచ్చేది. సమస్తోపచారాలూ రామనాథుడే చేశాడు. చివర కెల్లాగో ఒక బండిమీద బసకి చేరుకున్నారు.

విశ్వేశు డొక పడకకుర్చీలో కూచున్నాడు. అతని శరీరమంతా మంటల్లో వున్నట్టుంది. తనకేవో సపర్యల చేయబోతూవున్న రామనాథుని చూసి, "నేనిలాగే ఒక గడియసేపు కూచుంటాను. ఏమీ గడబిడ చేయకు. మరొక గంటకు అదే పోతుంది" అన్నాడు.

మళ్లా అతని మనస్సులో తర్కవితర్కములు ప్రారంభమైనవి. "నీకు తలనొప్పి వచ్చిందన్న దగ్గిరనించీ ఎంత ఖేదపడుతున్నాడో చూడూ రామనాధుడు! ఇటువంటి సుగుణఖనియైన మిత్రునా నీవు చంపడం? కేవలం ఐహిక సౌఖ్యాలేనా మనుష్యునకు కావలసినవి? పరలోకపు చింత కొంచెమైనా వుండ నక్కర లేదా? కేవలం కామప్రేరితమైన యీ మోహంకంటె, అస్వార్థమై భవ్యమైన మిత్రప్రేమ పవిత్రతరముకాదా? ఈలోకంలో కాకపోతే యింకోలోకంలోనైనా సర్వేశ్వరుని యెదుట యీ మహాపరాధమునకు జవాబు చెప్పుకోకుండా నీవు తప్పించుకో లేవు సుమా! మిత్రద్రోహివై యిప్పుడు నీవు చంపివేసి నప్పటికీ తరవాత నీవు సౌఖ్యపడలేవు. నీ అంతరాత్మ నిన్ను సౌఖ్యపడ నివ్వదు. భూలోకనరకం అనుభవిస్తావు సుమా! జాగ్రత్త!" అని అతని అంతరాత్మ నొక్కినొక్కి చెబుతూంది.

"విశ్వేశం! సమయం దాటిపోనిస్తున్నావు సుమా! తరవాత విచారించి లాభంలేదు. ఏమో! పరలోకం అనేది వుందో లేదో యెవడికి తెలుసునూ? ఊహాప్రపంచంలో దేవులాడవలసినవాళ్లు కవులుగాని నీలాగు సౌఖ్యపడదలుచుకున్న వాళ్లు కాదు. మొన్న నేకదా మహాసంగ్రామమున వందలకొద్దీ ప్రాణాలు తీసేశావు. ఇది నీకొక లెక్కా? సరస్వతీ, రామనాధుడూ సౌఖ్యపడుతూ వుంటే నీవు చూస్తూ భరించగలవా? నీ ప్రాణాలు నిలుస్తాయా? లే. ఒక్కపోటు పొడిచి సుఖించు." అని వేరొక బుద్ధి హెచ్చరిస్తూంది.

విశ్వేశుడు నిశ్చయం చేసుకున్నాడు. తెగించేశాడు. రామనాధునివంక చూశాడు. అతడు కుర్చీలో కూచుని జనాకీర్ణమైన వీధివంక చూస్తూ చల్లగాలి అనుభవిస్తున్నాడు. విశ్వేశుని హస్తం బాకుపిడిమీదికి పోయింది. ఆయుధప్రయోగంలో నిపుణతగలవాడైనా బాకును పైకితీయడాని కతనికి శక్తిలేకపోయినది. చివరకు మహాప్రయత్నంతో ఊడతీశాడు. అతని చెయ్యి గడగడా వణికిపోయింది. లేవాలని ప్రయత్నించాడు. కాని లేవలేకపోయాడు. ఆపాదమస్తకమూ శరీరం వొణికిపోతూంది. పళ్లు బిగపట్టాడు.

రామనాధుడు మిత్రుని యమయాతన కొంచెమూ యెరగడు.

విశ్వేశుని భావనా ప్రపంచంలో కండ్లముందు వికృతస్వరూపములు భయంకరనృత్యం చేస్తున్నాయి. అవి పండ్లికిలించి అతన్ని చూసి వికటాట్టహాసములు చేస్తున్నాయి. నాటిని చూసేసరికి అతని శరీరం జలదరించి పోయినది. అవి క్రమంగా మీద పడేటట్లుగా కనుపిస్తున్నాయి. లేవడాని కతనికి శక్తి లేదు.

ఎలాగో ఊపిరి బిగబట్టి, చివరసారి నిశ్చయం చేసుకుని, "హు"మ్మని లేచాడు. కాని, అతని కాళ్లలో బలం లేకపోయినది ప్రపంచమంతా గిర్రున తిరిగిపోతున్నది. నయనములకు దృష్టిమాంద్యమూ, దృష్ట్యవరోధమూ కలిగినది. చేతులోవున్న బాకుతోసహా "గభాలు"న నేల మీద పడిపోయినాడు విశ్వేశుడు. అడ్డంగావున్న కుర్చీ రెండుముక్కలుగా విరిగిపోయినది.

ఈశబ్దం విని రామనాధుడు ఉలికిపడి లేచాడు. తక్షణం వెళ్లి స్నేహితుణ్ని లేవనెత్తాడు. అతనికి శరీరస్మృతి లేదు. పరుపుపైని పరుండబెట్టి చల్లని నిర్మలోదకముతో అతని ముఖం కడిగేసి విసనకర్రతో విసిరాడు. అతనిచేతులో బాకు వున్నందుకు రామనాధుడు ఆశ్చర్యచకితుడై కారణము వూహించ లేకపోయాడు. అతని కనులయందశ్రువులు చిమ్మినవి. పదిహేను నిముషాలకు విశ్వేశుడు కన్నులు విప్పి చూశాడు. దయాప్రపూరితమై, శాంతిభరితమైన రామనాధుని వదనము అతనికి కనబడినది. మెల్లగా లేచి కూచున్నాడు. దీనుడై మిత్రునిచూసి "కొంచెం మంచినీళ్లు" అన్నాడు. దాహం తీర్చుకున్న తరవాత అతనికి బాగా మెళుకువ కలిగినది.

రామనాధుడు "ఏమిటోయ్! అంతట్లోనే యిలాగైపోయావూ? డాక్టరుకి కబురంపనా?" అన్నాడు.

"Dear friend(ప్రియమిత్రమా)! Excuse me (నన్ను క్షమించు). డాక్టరక్కర లేదు. ఏదో వికారంచేత అల్లాఅయింది. పరవాలేదులే! నీదయాహృదయానికి నా నమస్కారములు. ఇంక నా కేబాధా లేదు. నీవు పోయి పడుకో."

"నేను పడుకోడానికేమిలే; నీవంట్లో బాధ తగ్గితే సరి." అని చెబుతూ విశ్వేశుని తలపట్టుకుని, "అబ్బా! యెంతగట్టిగా కొట్టుకుంటున్నాయోయ్ కణతలు! కాస్త అమృతాంజనం రాయనా?" అన్నాడు రామనాథుడు.

"అబ్బే! యేమీ అక్కర్లేదు. నిద్రపోతే అదే తగ్గిపోతుంది. నీగదిలోకి పోయి పడుకో. నేనూ పడుకుంటాను. చాలారాత్రి అయింది."

"పోనీ యీరాత్రికి నేను నీగదిలో పడుకోనా? ఏదేనా అవసరంవస్తే దగ్గరగా వుండడం మంచిదికాదూ?"

"రామనాథ్! ఎంతనిర్మల హృదయమోయ్ నీది! Thank you (నేను నీకు చాలా కృతజ్ఞుడను). నాకీబాధ నిద్దరలోపోతుంది. విశేషమైన అవసరముంటే పిలుస్తానులే; నీగదిలోకి పోయి పరుండు. పొద్దుటే కలుద్దాం."

రామనాథుడు వెళ్లాడు. విశ్వేశుడు మంచం మీద కూచుని తనమిత్రుని కరుణార్ద్రహృదయమునకు ఆశ్చర్యపోయాడు. "రామనాథ్ మనస్సుకీ నామనస్సుకీ స్వర్గానికీ నరకానికీ వున్నంత తేడా వుంది. కలుషపూరితమైన నామనస్సుకి తన పవిత్ర ప్రేమచేష్టలవలన నతడు తగినబుద్ధి చెప్పాడు. నాకు రవంతబాధ కలిగేసరి కతని కెంతదుఃఖం వొచ్చింది! తెలివి రాగానే నిర్మలశాంతి సంభరితమైన ఆతని వదనారవింద సందర్శన మవడంవల్ల మండుతూన్న నాహృదయం చల్లపడి సౌఖ్యపడింది. ఆపవిత్రుని యెడల నట్టిదురూహల తలపోసిన నానేరము క్షమార్హమైనది గాదు."

ఒక్కనిముషము కళ్లు మూసుకుని ధ్యానించి, మంచందిగి మోకాళ్లపైన కూచుని, చేతులుజోడించి, "సర్వేశ్వరా! దయానిధీ! నీకృపాభిషేచనమువల్ల నే దుర్మదాంధుడనగు నేను నాలోని పశుత్వమును నిర్మూలించ గలిగి


"ప్రభూత్తమా! కష్టసమయమున కర్తవ్యము నుపదేశించి నాస్నేహితుని రక్షించితివి."

నాను. ప్రభూత్తమా! కష్టసమయమున కర్తవ్యము నుపదేశించి నాస్నేహితుని రక్షించితివి. తండ్రీ! దాసానుదాసుడను. మహాపరాధిని. రక్షింపుము. నాకృతజ్ఞతాపూర్వకవందనము లందుకొని రక్షింపుము." అని పరాత్పరుని ప్రార్థించుకుని ప్రశాంతమనస్కుడై నిద్రపోయాడు.

—

సోమంచి సూర్యనారాయణశర్మ గారు

# ప్రబోధము

దేశం బేక్రియ నున్నదో ఘనుల సందేశంబు లెట్లున్నవో
దేశారాధక బృంద మందుకొను సందేహంబు లేలాటివో
దేశీయోద్యమ మెంతసంచలితమై తెల్వొందెనో నీదుహృ
త్కోశంబందునఁ జిత్తగింపు గుణసింధూ ఆంధ్రసత్పుత్రికా!

ధీరోదారులు నిర్వికారులు లసద్ధీసారు లుద్యత్సదా
చారుల్ సంతతభవ్యసత్యపథసంచారుల్ మహోదారు లౌ
పేరుం గాంచిన యాంధ్రవీరుల మహద్విక్రాంతి నేఁ డేస్థితిం
గూరెఁ దేఁటియుఁ బాఱఁజూడు మటు సిగ్గో ఆంధ్రసత్పుత్రికా!

అన్నంబందునఁ బానమందు గృహశయ్యాయానపీఠంబులం
దెన్నం వేసమునందు వాసమున వేయే లింక బాసందునో
యన్నా చిన్నము సందు గానకయో దాస్యం బుగ్గునం బాలఁజే
కొన్నా మిప్పటికేని గన్దెఱవ వెగ్గో ఆంధ్రసత్పుత్రికా!

సకలాశాగతవైరివీరతతి నిచ్ఛాశక్తి శాసించి సు
ప్రకటానర్గళదోర్విభూతిమెయి నేలంజాలి యీనేల సా
రకళారిందమమై విరాజిలిన యాంధ్రాదిత్యతేజంబు నేఁ
టికి దాస్యాంబుధరంబు మాటినది కంటే ఆంధ్రసత్పుత్రికా!

* * * * * *

ఇనునిం గప్పిన వెల్ల మబ్బు లవి యట్లే యుండ వేజామునం
దునో ఝుంఝానిల ముద్భవించుటనె తోడ్తోనే దిగంతంబులం
గనఁ దోలుం బుధు లాప్రభంజనుఁడు వేగం రేఁగి బిట్టూఁచు సా
కును గల్పింపఁ దపించు టీ వరయవాక్కో ఆంధ్రసత్పుత్రికా!

కడుపారం దనుఁ గన్నయమ్మయు గనంగా జన్మదేశమ్ము నె
క్కుడు స్వర్గమ్మునకన్న మిన్న యని వాకొన్నారు విద్వాంసు లా
నుడిలోఁ దెంచియు మాతృభూహిత వ్రతానుష్ఠాతవై యొప్పి మేల్
కొడుకు ల్గాంచు పదమ్ము సమ్మదము గైకొ మ్మాంధ్రసత్పుత్రికా!

---

# ప్రైమ్మినిస్టర్

ముద్దుకృష్ణ

'మానవుల చర్యలు చూస్తున్న కొద్దీ కుక్కలమీద గౌరవం హెచ్చుతూ వున్న'దని ఒక్క ఫ్రెంచి వ్యాసకర్త వ్రాసినాడని చెప్పుతూ, మా ప్రైమ్మినిస్టరును తట్టినాడు నా స్నేహితుడు. తగిన బాహ్యచిహ్నాలతో కృతజ్ఞత చూపుతూ 'భౌను' అన్నది ప్రైమ్మినిస్టర్.

ప్రైమ్మినిస్టరంటే చాలామందికి తెలియదు. మా పెంపుడుకుక్క. ఈ పేరు పెట్టడానికి చాలా కారణాలున్నవి. ప్రస్తుతం అన్ని పాశ్చాత్య దేశాలలో అందులో ముఖ్యంగా ఇంగ్లాండులో ప్రధానమంత్రిత్వం స్వభావం కుక్కవంటిది. గాలికదిలినా ఏ దేశమో, ఏ విరోధిజాతో దండయాత్రబయలు దేరి వొస్తూవున్నదని అనుమానపడి, భోంయిమని దేశమంతా అల్లరి చేయడం; తన దేశాన్నీ ప్రజలినీ కావలికుక్కవలె కాపాడుతున్నా ననుకుని, ఇతర దేశస్తులు పెద్దమనుష్యు లెవరైనా సదుద్దేశంతో సవినయంగా ఏకోర్కెలు తెలపడానికో, ఏహక్కులనుగురించి అడగడానికో వొస్తే ఇంట్లోవాళ్లు మేలుకుని పట్టుకునేలోపుగా గొల్లుమని ముందడుగువేసిన సాహసికుణ్ణి వీలైతే కాలు పట్టికరవడం.

మాకుక్కకు ఈ పేరుపెట్టడానికి ఈసమానలక్షణాలే కాకుండా ఇంకోకారణంకూడా వున్నది. నామకరణం అంటే మజాకాదు. పిల్లలుగలవాళ్లకి తెలుసును ఈపాట్లు. తొమ్మిదినెలలూ, పుట్టినతరవాత నామకరణం చేసే వరకూ మంచిపేరు పెట్టవలెననీ ఎంత ఆలోచించినా, ఎన్ని పేర్లు వెతికినా ఒక్కటీ తోచక పోవడం పాతపేర్లు ఒక్కటీ అతక్కపోవడం చివరకు ప్రాణంవిసిగి ఆసమయానికి ఏ అమ్మమ్మో ఆగ్రహిస్తే తప్పనిసరిగా ఆవిడ అసహ్యమైన పేరే పెట్టడం మామూలు.

కుక్కపిల్లను కొందా మనుకున్నప్పటి నుంచీ ఆలోచించాను పేరునుగురించి; స్నేహితుల నేకమందిని అడిగాను.

విక్టోరియా హాస్టలు విద్యార్థులు నవనాగరికులు 'ఫేషనబులుగా' వుంటారని వాళ్ల నడిగితే యూరోపియన్ పేర్లు బాగావుంటవి అన్నారు. కొందరు నాన్కోపరేషను వాళ్ల నడిగితే, 'డయరు, ఓడయరు, క్లయివు, నీలు' ఏదైనా పెట్టమన్నారు కసిగా. ఇంకా ఇతరులు, టెర్రర్, ఫైడెలిటీ, ఫైత్ఫుల్, లిలీ, బూచి, సీజర్, ఏవో చాలా చెప్పేరు. ఏదీ నాకు నచ్చలేదు. కాలమే నిర్ణయించింది తుదకు.

కుక్కపిల్లను కొన్నానిమిషం ఒకస్నేహితుడువచ్చి, 'వార్తాపత్రిక చూశావా. ఇంగ్లాండులో ఎన్నికలు తెలిసినవి. ప్రైమ్మినిస్టరును

ఎన్నుకున్నా' రన్నాడు. ప్రధానమంత్రి, ఆపదవీగురించి చాలా మాట్లాడుకున్నాము. వెంటనే తోచింది ఆపేరే కుక్కకు పెట్టవలెనని. ఒకదౌర్భాగ్యపు కుక్కపిల్లకు పేరు పెట్టడానికి ఇంతగోలా, ఇంతశ్రమా ఎందుకు అంటారు చాలామందిబుద్ధిమంతులు.

కుక్కఅంటే సామాన్యమైన జంతువు కాదు. విశ్వాసంలో స్నేహితుణ్ణి మించినది. కాపుదలలో బంటును అతిక్రమించినది. దేశచరిత్రలలో శాశ్వతంగా యశస్సుగడించిన మహాపురుషులతో సమంగా అనేకశునకాల పేర్లు కూడా కాలాన్ని ధిక్కరించి, మృత్యువు నెదిరించి జీవన్మృతములైనవి. మొన్న నేవిన్నాము శ్రీ శివాజీమహారాజు చనిపోయినప్పుడు ఆయనచితిలోనికి ఉరికి మృత్యువులో కూడా ప్రభువు ననుసరించిన ఆయన పెంపుడుకుక్క చరిత్ర. జాతీయ ధర్మాలను, గౌరవాన్ని కాపాడుకో వలెనన్న సంగతి కన్నులువిప్పి గ్రహించిన భారతీయులు ఆశునకశ్రేష్ఠానికి వొకపెద్దఘోరీ కట్టించి దానిపేరూ, యశస్సు స్థిరంగా నిల్పడానికి ప్రయత్నిస్తున్నారు. దేశగౌరవాన్ని కాపాడడానికి ప్రాణాలర్పించిన నెల్సను, కిచెనరువంటి వీరాగ్రేసరులతో తులతూగే హెల్వెల్లెనుకుక్క, ల్యూవెల్లెనుకుక్క, ఇంకా అనేక శునకాలున్నవి. ఏదోవంశాన్ని నిలుపుతాడనుకుంటే మైనారిటీ తీరగానే పంపకానికి నోటీసిచ్చే పుత్రుని నామకరణానికి పడేశ్రమలో కొంతశ్రమైనా పడకూడదా మానమూ, ప్రాణమూ, ధనమూ కాపాడేందుకు ప్రాణాలైనా అర్పించే విశ్వాసపాత్రమైన దానికి సరియైనపేరు పెట్టడానికి!

మానవులచర్యలు చూస్తున్న కొద్దీ కుక్కలమీద గౌరవం హెచ్చుకపోయినా, ఈరెండుజాతులకూ చాలాపోలికలు కనిపించగలవు. కుశాగ్రంగా చూస్తే, ఇంగ్లీషువాడికి బుల్డాగ్గుకుండే పట్టుదలా, కావలికుక్కకుండే జాగరూకతా వున్నవి. నోటితో బుట్టపట్టుకుని బజారుపని చేసుకుని వొచ్చే కుక్కలున్నవి. ఆజాతిలోనివాడు అమెరికా వాడు. ఒకగొర్రెలకాపరి కొండనెరియలోపడి చనిపోతే నిద్రాహారాలు మాని, ఆ అస్థిపంజరాన్ని కనిపెట్టుకున్న కుక్కకథ విన్నాం. ఆజాతిలోనివాడు కాసాబయాంకా. స్కాచ్చివాడు వేటకుక్కజాతిలో వాడు; బుద్ధికుశలతలోనూ, చురుకుతనంలోనూ ఫాక్సుటెర్రియరు జాతిలోవాడు ఐరిషువాడు. రష్యావాడు మందకుక్కజాతిలో వాడు. అరవవాడు ఊరికే మొరిగే జాతిలోవాడు. బెంగాలీవాడు చడీ చప్పుడూ లేకుండా పిక్కపట్టుకునే జాతిలో వాడు.

ఒక్కకుక్కజాతే కాదు. ఇతర జంతువులకూ మానవులకూ సమానత్వాలున్నవి. హిందువుడు పిల్లిజాతిలోవాడు. అందుచేతనే కుక్కను ముట్టుకుంటే అంటని వొంకపెట్టేము. పిల్లికీ కుక్కకూ అనలేపడదు గదా. పిల్లి ఎప్పుడూ ఇల్లుకనిపెట్టి వుంటుంది. దానికి యజమాని మనుష్యులూ సంబంధం లేదు. సాధ్యమైనంతవరకూ వొకరికొంటి, వొకరిజోలికి

లేదు. మచ్చికచేస్తే దగ్గరగావొస్తుంది, కాని ఎంతలాలించినా, ఎంతవూరించినా వెంటరాదు. ఇల్లే కనిపెట్టుకుని ఉంటుంది.

పాశ్చాత్యుడు కుక్కజాతిలోని వాడు. వీనికి ప్రదేశంతో సంబంధంలేదు. కుక్క యజమానిని విశ్వసించినట్టుగా ఇతడు ధనాన్ని నమ్ముతాడు. తోకాడిస్తూ ఆవెంట బడతాడు. ఎంతైనా వోర్చి తెగించి కాపలాకాస్తాడు. ఇం కొకరిని ముట్టనియ్యడు. ఈయజమాని ఎక్కడ వుంటే అక్కడ వుంటాడు.

బాగా ఆలోచిస్తే ఈపోలికలు చాలా నిజంగా కనపడగలవు. కుక్కకు పిల్లి లోకువ గదా! ఆలాగా పాశ్చాత్యుడికి హిందువుడు లోకువ. ఇంకోసంగతి, ఇల్లు పాడైపోయినా పిల్లివదలదు. ఏదోవిచారంగా నశించిన గొప్ప నుగురించి కాబోసు కలలుగంటూ అక్కడే పడివుంటుంది. కుక్క ఆలా కాదు. ఇల్లుపా డైతే యజమానితోపాటు మకాం ఇట్టేమారు స్తుంది. దానికి స్థలం కొత్తలేదు. జోస్తీ అతి త్వరితంగా చేస్తుంది. ఒకముక్క పారవేసినా, కొంచం చనువుగాతట్టినా, సస్నేహంగాచూ పినా, 'థ్యేంక్యూ' అని తోకాడిస్తూ కృతజ్ఞత వెంటనే చూపుతుంది. పిల్లికి ఈపేచీలు ఏమీ చేతకావు. స్థలం చచ్చినా మార్చదు కదా! ఎంతో చనువుగాచూస్తేనేగాని దగ్గరకు రాదు. ఒకవేళ వొచ్చినా మ్యావని ఒకసారిరాసుకుని మళ్లీ వెంటనే నీజోలి నాకెందుకు, నాజోలి నీ కెందుకన్నట్టు వేదాంతంగా వెళ్లిపోతుంది.

హిందూపాశ్చాత్య భేదం చూడండి. ఈ విషయాల్లో, పాశ్చాత్యుడు టిక్కెట్టు మారకపోతే స్వదేశం నుంచైనా ఇట్టే మకాం మారుస్తాడు. స్థలం కొత్తలేదు. వీలైతే భోం యిమని భయపెట్టి, లేకపోతే తోకఆడిస్తూ 'థేంక్యూ'లతో స్నేహంచూపుతూ కార్యం నిర్వహిస్తాడు. హిందువుడు చచ్చినా దేశం వదలడు. ఆట్టే ఎవరితోనూ పూసుకుని తిర గడు. వెలిగా వుంటాడు. ఎంతసేపూ పాడు యింట్లోపిల్లిలా నశించిన తాతముత్తాతల గొప్ప, గౌరవం తలుచుకుంటూ స్వప్నాలలో శ్మశానదృష్టితో జపం చేస్తుంటాడు.

జంతుజాలానికి వుండేశక్తులు తక్కువ కావడంవల్ల అవి యెప్పుడూ ప్రకృతిని అనుస రించి వొకేపంథాను వెళ్లుతూ వున్నవి. మనుష్యులకు బుద్ధి అధికంగా ప్రసాదించడం వల్ల ఒకఅడుగు ఇటువేసినా ఒకఅడుగు అటు వేసినా ప్రకృతికి మహాదూరంగా పోయి అతీ తుడో, అధమాధముడో అయిపోతున్నాడు. తప్పుదారులు తొక్కుతున్నా మానవాళిని చూసి ఫ్రెంచివ్యాసకర్త కుక్కలమీద గౌర వం హెచ్చు చేసుకున్నాడు. కేవలం ఈశతా బ్దంమనుష్యులమీద నిరసన, హేయత చూప డానికి శునకాలమీద గౌరవం హెచ్చించు కున్నా వ్యాసకర్త మాప్రైమ్మినిష్టరులాంటి శునకశ్రేష్ఠాన్ని దానిచురుకు, సుగుణాలనే అవగాహన చేసుకుంటే ప్రైమ్మినిస్టరుని, ఆజా తిని పూజించేవాడనుకుంటాను.

# వైరాగ్యోదయము

వాడ్రేవు శ్రీరంగనాయకమ్మ గారు

ధారుణి వైరాగ్యోదయ - మేరీతిం గలుగు నంచు నెంతయుఁ జింతం
గూరిన మది నూహింపఁగ - నారాయణ! యొక్కనాఁడు నాకుం దోఁచెన్.

ఎట్టు లంటేని విను మింక నే వచింతు - గట్టిగా నీదు దయఁ జూపఁ గడఁగితేని
నీవ యొక కారణంబును నెమ్మిఁ గల్ప - నంబుఁ జేయుదు వీరీతి నంబుజాక్ష!

సకల చరాచరంబులను జక్కఁ గనుంగొనఁజాలు నీకు నేఁ
బ్రకటన సేయ నెంచుటది పల్మరు విన్నను నవ్వరే యొరుల్
పకపకమంచు; నవ్వినను భావమునం దొక యించుకేనియున్
వికటముగాఁ దలంపకుము; వెంగలి నౌదును గాని యచ్యుతా!

తల్లిదండ్రులు ప్రేముడిఁ బిల్ల లాడు-కూర్మివాక్యంబులకుఁ జెవిఁ గూర్చుచుండ్రు;
జగతి సర్వంబుఁ గలిగించు జనకుఁడీవు,-వికటవాక్యంబులకు నైన వీనొసఁగవె?

కించిజ్ఞురాలనగు నే - నంచితగతి నీకుఁ దెల్ప నాలోచనలో
మించె న్నాయభిలషితం - బెంచి భవద్ధృదయమందు నేర్పడ వినుమా!

ధారుణి నొకకడ వెలయుం - బేరున నుజ్జయని యనఁగఁ బెంపగుపురి యం
దే రీవీరున కెన యనఁ - బౌరుషవంతుండు గలఁడు భర్తృహరి యనన్.

ఇలఁగల సర్వభోగముల నెన్నఁడుఁ దన్నెడఁబాయకున్కి ను
జ్జ్వలత రహించి యన్నిటను జాలఁ బ్రశస్తివహించి మించి య
క్కలిమిపడంతి చంచలతఁ గానక యింట వసింపఁ బ్రీతి న
ప్పలుకువెలంది యాస్యమునఁ బల్మరు నృత్యమొనర్ప వేడుకన్.

చామ పతివ్రతామణి సుచారిమ భానుమతీసమాఖ్య త
న్నేమరుపాటొకించుకయు నెన్నఁడుఁ జెందక భక్తియుక్తితో
నేమము మీఱఁ గొల్వ నవనిం గన లోటొకయింత గాన కు
ద్దామభుజాబలంబునను దద్దయుఁ బేరును బెంపుఁ గాంచుచున్.



చిత్రము ౭



చిత్రము ౮

ఒక్కనాఁడు విలాసార్థ ముత్సహించి - భానుమతి తన్నుఁజేరి సుభాష లాడ
నిష్టగోష్ఠీ వినోదాల నెసఁగుచుండ - మేడపై నాతఁ డెంతయు మెలఁగుచుండె.

గొబ్బునఁ దూర్యనాదములు గూడి చెవిం బడ వార లేమొ యం
చుబ్బుచుఁ జూడ నేఁగ నట నోయి పరాత్పర! వారు గాంచి ర
బ్బబ్బ! యచేతనాంగమును నాస్తయుతంబుగ నేఁగుదాని న
య్యబ్బుర మే మటంచును నిజాంగన తన్నటుఁ బ్రశ్న సేయఁగన్.

మనమున నాశ్చర్యము గదుఁ-బెనఁగొన నది మాటు సేసి ప్రియుఁడను వనితా!
వినవే లోకాచారము - ననుసరణముఁ జేయ నేఁగు నంగన యనుచున్.

వామాక్షి సహగమనమును - నేమంబునఁ జేయ నేఁగు నెమ్మిం గంటే?
కోమలి నన విభుఁ డాడఁగ - నా మహిళారత్న మిట్టులంచు వచించెన్.

సహగమనమును జేయఁగాఁ-జనవలయునె-వనిత? యంచును బల్కిన వల్లభుండు
కలఁగిన మనంబుతోడఁ జూడ్కుల నిగిడ్చి-బెట్టుగా మది నూహించె నిట్టులనుచు.

కాంత నెఱుంగదో యిటులు కారణ మేమి వచింపఁగా మదిన్
వంత జనించె; సత్కులజ, వాసియు వన్నెయుఁ గల్గులేమ, నే
నెంతయు దీనిభావము నహీనమతిం గనుఁగొందు నంచుఁ దాఁ
జింతనఁజేసి, నాఁడె తనచేడెను వీడి రయంబు మీఱఁగన్.

వేట యన్ బల్ నెపంబును వే ఘటించి-దుర్గమారణ్యపదములఁ దోడనె చని
యాప్తుఁడౌవాని నొక్కని నమరఁ బిలిచి-చెప్పఁబంచెను దా మృతిఁ జెందినట్లు.

తల్లిరో! నీదునాథుండు చెల్లెనమ్మ!-బెబ్బులికిఁ జిక్కి యని వాఁడు బిట్టువగవ
వార్త చెవినూఁదెనో లేదో వనిత నేలఁ-గూలి తనప్రాణములు వేగఁగోలుపోయె.

తన సతీరత్న మిట్టులు చనిన తెఱఁగుఁ-దిరిగి వే వచ్చి వేగరి తెలుప విభుఁడు
బెదరుగదిరిన మనమున వీడుఁ జేర-నూరి వెలుపలఁ గనె శవ మూర! యతఁడు.

[illegible]కాంక్షిణీవే బిట్టుగ్గా విలపించె నిట్లు - నిక్కమా నీదుమరణంబు నెలఁత! నాదు
సత్యహీనంపుఁ జావునఁ జచ్చి తీవు - నిక్కముగ; నేను జానంగ నేరనైతి.

పరమపతివ్రతామణిరో! భావమునం దిటు లెంచటంచు నే
నెఱుఁగఁగనైతి; నీమనము నేఁ దెలియంగలవాఁడఁ గాను; నీ
మరణముఁ గాంచి జీవముల మానిని! పాయక యుంటి నేను, రా
నరయఁగలేవు నీవు నరి యాఁగుము నీవెనువెంట వచ్చెదన్.

అని వగఁ గూరిన మతిఁ జిం - తన సేయుచునుండ నండఁ దథ్యముగాఁగన్
మునివరుఁ డొక్కఁడు మృత్పా - త్రను బగుల నడంచి బిట్టు దా వలపోయన్.

ఏల యిాలీల జాలిని గూలి తనుచుఁ-బ్రచ్ఛ సేయంగ భూనియు నిట్లు వల్కె-
నయ్యయో! యిాఘటంబున కరయ నీదు - పత్నిఘటమునకును భేదభావమేమి?

దేహము,ఘటంబుఁ బాంచభౌతికము,పోవు-నెప్పటికినై నఁ దమతమ యిక్కలఁగన;
నేల చింతిల్ల! నీవును నేనుగూడ-నట్టివారమె కా మది నరయు మనిన.

వైరాగ్యోదయ మగుడున్ - వారని భక్తిని మునీంద్రు వరపాదంబుల్
చేరఁగ శిరమున నాతఁడు - ధారుణి సాష్టాంగముగను దగఁబడ మునియున్.

వానిమనమున భక్తిని వరల నాటి - తన తెఱంగున వేవేగఁ దాఁ జనుటయు
భర్తృహరియంత దుఃఖభావంబు వీడి - భవహరంబైన వైరాగ్యపదవిఁగాంచె.

నీవే భూనీంద్రుఁడవై - యిావిధమున బోధఁ జేసి యాతనికి దయన్
వే వైరాగ్య మొసంగితి; - దేవా, నావిషయమందు దిక్కగు మట్లే.

కావున నళినదళాక్షా! యేవెరవునఁ జింత సేయ నేలా నాకున్
వేవేసమయము చనుదే - నీవే వైరాగ్యవృత్తి నెగడింతు మదిన్.

పంచ. (శ్రీ)మానివంద్య! భక్తలోకమానసాబ్జబంభరా!
దీనజన కృపావనా! తదేకనిష్ఠ మిాఱ నో
శ్రీనివాస! నీపదాబ్జసేవఁ జేతు నెప్పుడున్
మానసమున నిట్టు లంచు మానఁబోక భక్తితోన్.

శ్రీకాంత నురమునఁ జెన్ను మిాఱ వహించి కౌస్తుభమణిఁ దాల్చి కంఠసీమ
శంఖచక్రములహస్తద్వయి ధరియించి గదయు శార్ఙ్గము రెండుకరముల నిడి
మణిమేఖలను నడుమున నంటఁ గీలించి భర్మచేలము మేనఁ బాదుకొలిపి
కమ్మకస్తురితిలకమును నుదుట దిద్ది యాదల మకుటంబు నలవరించి
వెలయు నీసర్వమంగళ విగ్రహమును-నామనః పద్మపీఠమునను సభక్తి
కంబుగాఁగీలుకొలిపి నిక్కంబుఁబూజ-సేయుదుం బూన్కి మైఁ; గృపసేయుమయ్య

# రుద్రదేవుని అనుమకొండ శాసనము

శ్రీ శేషాద్రి రమణకవులు

కాకతీయ రాజులకుఁ దొలుత అనుమకొండ రాజధానిగ నుండెను. కాకతీయ ప్రోలరాజు స్వతంత్ర రాజ్యస్థాపనము గావించినది అనుమకొండయందే. అనంతరము రుద్రదేవుఁడు కాకతీయ రాజ్యపునరుద్ధారకుఁడయి తండ్రి వేసిన పునాదులపైఁ గాకతీయాంధ్ర సామ్రాజ్య సౌధమును నిర్మించెను. రుద్రదేవుని కాలమున అనుమకొండయే రాజధాని నగరము. పద్మాక్షి దేవాలయము మొదలు సిద్ధేశ్వరాలయము వఱకు గల ప్రదేశమంతయు రాజభవనముగ నుండి యుండును. రుద్రదేవుఁడు కొంతకాలమునకు ఆంధ్రసామ్రాజ్యమునకు ముఖ్యస్థానముగ ఓరుగల్లును నేర్పాటు చేసియుండె ననుట సత్యము. రుద్రదేవుని చరిత్రము నెఱుంగ నగు సమగ్రము శిలాశాసనము అనుమకొండలోని జీర్ణాలయమందుఁ గలదు. ఆలయపుఁ బూర్వనామము రుద్రేశ్వరము. ఆలయమునకుఁ గుడివైపున నున్న ద్వారమునం దీశాసనము భద్రపఱుపఁబడి దర్శనీయముగా నున్నది. ఆలయములోఁ బొక్కటి రాళ్లవలె మూఁడు గర్భాలయములు గలవు. అందు దక్షిణాభి ముఖముగా ఆలయమున వాసుదేవరను, కుడివైపు సూర్యదేవరను, ఎడమవైపు రుద్రదేవరను దొల్లి ప్రతిష్ఠించిరి. ఇపు డెడమవైపు గుడిలో నొకలింగము గలదు. మిగిలిన రెండు గర్భాలయములలోఁ బీఠములు మాత్రము గలవు. అపూర్వ శిల్ప రమణీయమగు నీయాలయమున కెదురుగా వెయ్యిస్తంభముల మండపము గలదు. ఎదురుగ జక్కని నంది విగ్రహము గలదు. కుడివైపున గొప్పనూనెరు, ఎడమవైపు వంటశాల గలవు. ఈ యాలయమునందలి శిల్పము అపూర్వ విలాసవంతమై దర్శనీయమై యున్నది. జీర్ణాలయముతో నీపాటి పరిచయము పాఠకులకుఁ గలిగించితిమిగాన నీయాలయమును ఆశ్రయించియున్న శాసనమును విమర్శించెదము.

## శాసనము

నల్లని కురువిందశిలపైఁ జక్కఁగఁ జెక్కఁబడిన యీశాసనరాజము నేటివఱకు సురక్షితముగా నున్నది నాలుగైదు తావులఁ గొంచెము చెడినను చరిత్రాంశముల నెఱుంగుటకెట్టి యాటంకము కలుగదు. లిపి మనోహరముగా వట్రువదేరియున్నది. శిల్పి తన నేర్పుఁజూపి వర్ణములను జక్కఁగఁ జెక్కినాఁడు. శాసనము శిలకు నాలుగువైపుల వ్రాయఁబడినది. అంతయు సంస్కృతశ్లోకములు అనుక్రమణిక మాత్రము తెలుఁగునందు వ్రాయఁబడినది. శాసనము స్థాపించినకాలము శా. శ. ౧౧౮౪ చిత్రభాను సం. మాఘశు ౧౩లు క్రీస్తు శ. ౧౧౬౨ అగును. శాసన గ్రంథకర్త భారద్వాజగోత్రుఁడును, శ్రౌతకర్మ కర్మఠుఁడును నగు రామేశ్వర దీక్షితుఁడు. సంస్కృతశ్లోకరచనమున నీతఁడు మిక్కిలి నేర్పరి. ధారయనన్యసాధారణముగా నుండును. ఈయన రచించిన యపూర్వగ్రంథములు గాని, ప్రత్యేక జీవితచరిత్రముగాని గ్రహింప నవకాశములు లేవు. సమకాలికుఁడగు రుద్రదేవునియొక్కయు, నతని తండ్రియగు ప్రోలరాజుయొక్కయు విజయ యాత్రాంశముల నీకవి కన్నులఁ గట్టునటులఁ జెప్పినాఁడు. ఈశాసనమునందుఁ జేర్కొనఁబడిన ప్రత్యర్థి వీరులచరిత్రములు సమగ్రముగా గ్రహింపవలసియున్నవి.

కాకతీయులు పశ్చిమచాళుక్యరాజులకడ దండనాయకులుగా నుండి క్రమముగాఁ బ్రభురాజ్యము క్షీణించుకొలంది స్వాతంత్ర్యము నార్జించుచు వచ్చిరి. రాజానుచారముగ వీరును వరాహలాంఛనులై నాణెములపై వరాహచిహ్నములు నెలకొల్పిరి. శాసనములలోఁ దొలుత వరాహస్మరణ గావించిరి. ప్రత్యర్థుల బొమ్ములపై వరాహ ముద్రలవైచిరి. తదనుసారముగ అనుమకొండ శాసనములోఁ దొలుత వరాహస్మరణము గలదు. ఈశాసనమునందు త్రిభువనమల్లునివద్దనుండి ఐగ్గన మారంభింపఁబడినది.

త్రిభువనమల్లుని కుమారుఁడు ప్రోలరాజు. ఇతని భార్య ముప్పరు. ఈదంపతుల కుమారుఁడు రుద్రదేవ చక్రవర్తి. రాజధాని అనుమకొండ. త్రిభువనమల్లునిగూర్చిన వివరము లేవియు శాసనమున లేవు. ప్రోలరాజును గూర్చియు, నాతని పరాక్రమమునుగూర్చియుఁ జరిత్రాంశము లిందుఁ గొన్ని గలవు. ప్రోలరాజు పరాక్రమజీవితము నెఱుంగుట కీయాధారములు సహకారి కాఁగలవు.

## ప్రోలరాజు ప్రతిపక్షనాయకులు

ఖాజీపేట చెఱువువద్దనున్న కన్నడశాసనమువలన గాకతీయవంశమునఁ బ్రోలరాజు గలఁడనియు, నతని కుమారుఁడు బేతరాజనియు, నితఁడే త్రిభువనమల్లుఁడని యుఁ, త్రిభువనమల్ల బేతిరాజనియు వ్యవహరింపఁబడె ననియుఁ దెలియును. ఈ బేతిరాజు పశ్చిమ చాళుక్య రాజగు త్రిభువన మల్ల దేవవిక్రమాదిత్యచక్రవర్తి వద్ద రాజప్రతినిధిగా నుండెను. ఈవివరము లీశాసనమున లేవు. రుద్రదేవుని తండ్రియగు ప్రోలరాజువృత్తాంతము, విజ యములుమాత్రమె యీ శాసనమునఁ జేర్కొనఁబడి యున్నవి. ప్రోలరాజు క్రీ. శ. ౧౧౧౬ మొదలు ౧౧౫౭వఱకు రాజ్యమేలియుండును. తైలపదేవుఁడు, గోవిందరాజు, గుండరాజు, జగద్దేవుఁడు, అనువారు నలుగురు ప్రోలరాజునకుఁ బ్రతిపక్షులు. తైలపదేవుని గూర్చి శాసనమునం దీక్రింది విధముగాఁ జెప్పఁబడి యున్నది.

శ్లో. హస్త్యారోహణకర్మకర్మఠగతిం
చాళుక్యచూడామణిం
శశ్వద్యుద్ధనిబద్ధగర్వ్వరమతిం
యుద్ధే బబంధ క్షణాత్:
శ్రీమత్తైలపదేవ మంబుదనిభ
స్తంబేరమస్థం క్షణాత్
ప్రఖ్యాతో రిపుకంఠఖండనవిధా
భక్తానురాగా జ్జహా.

చాళుక్యవంశజుఁడును, గజారోహణకర్మఠుఁడును యుద్ధకౌశలుఁడును నగు తైలపదేవుని నేనుఁగుపై నుండఁ గనే బంధించి ప్రోలరాజు భక్తానురాగమున విడిచెనని పై శ్లోకమునకు భావము. ఈతైలపదేవుఁడెవరో తెలిసి కొనవలసియున్నది. చరిత్రకారులితఁడెవరో నిర్ణయిం పక చాళుక్యుల సమీపబంధువనియు, భావిపరిశోధన మున నది తేలుననియుఁ జెప్పిరి. పశ్చిమ చాళుక్యులకు సంబంధించిన శాసనములన్నియు ఓరఁగల్లునకుఁ బశ్చిమభాగ మునఁ గల్యాణపురమువఱకుఁ గలవు. తైలపదేవుఁ డెవ రో నిజాము రాష్ట్రమునందలి శాసనములు శోధించిన తేటపడును. తైలపదేవుని శాసనములు. మహబూబు నగరములోని బూదపూరులోని ఆంజనేయాలయమునం దును, గంగాపురము చెఱువుకట్టమీఁదను, నల్గొండ సమీపమునను మేము గత సంవత్సర మేసవిలోఁ గని పెట్టితిమి. తైలపదేవుని శాసనమొకటి నల్లగొండ చెంత పానుగల్లులో విష్ణ్వాలయములో బిగింపఁబడియున్నది. కొంతభాగమందు గోడలోఁ గలసిపోయినది. అందు "లబ్ధ్వా తైలపదేవాఖ్యా త్తన యాశ్చక్రవర్తినః, లబ్ధ్వా ఖిలోర్వరంధ్యా...పరః, సమస్తగుణసంభూతః శ్రీమ ద్భ్యాముండలేశ్వరః. ధర్మాశ్రయ ధార్మిక నిజాగ్రజ ధర్మ భీమ.....గోకర్ణబ్రహ్మపుర్యాస్థితం అని తైలపదేవుఁడు భీమరాజు గోకర్ణుల నామము లొకచోఁగలవు. తైలప దేవుఁడు ప్రోలరాజుచే బంధింపఁబడి విడిచిపెట్టఁబడి రుద్రదేవునిచే మరణించెను. గోకర్ణుఁడు, భీమరాజు రుద్ర దేవుని కాలములోని వారుగాన నిందుఁ జేర్కొనఁబడిన తైలపదేవుఁడె ప్రోలరాజు ప్రత్యర్థి. చాళుక్యచూడా మణి యనుటఁబట్టి పశ్చిమచాళుక్య కుటుంబసంబంధి యని భావింపఁ జనును. ఇతఁడు త్రిభువనమల్లదేవుని వ ద్దప్రతినిధిగా నున్నట్లు పూర్వోక్త శాసనాదియందుఁ గలఁ 'శ్రీపృథ్వీవల్లభ సత్యాశ్రయకుల తిలకచాళుక్యా భరణ శ్రీమత్త్రిభువనమల్ల దేవః 'కులశశిసార్వతో'...... లితాఖణ్డితారిపర్గః, శ్రీమత్కల్యాణపురస్థిత' నిజ విజయ స్కంధావారసుఖాన్తరస్థం.' అనుభాగములు విశేషణ ములుగాఁ గైకొంటిమేని స్ఫుటపడఁగలదు. ఈతైలప దేవుఁడు పశ్చిమచాళుక్యుల రాజప్రతినిధిగానుండి మహ బూబునగరము చెంతనున్న కోడూరు రాజధానిగా నేలిన రాజు. ఈయంశము మహబూబునగరమునకు రెండుమై

డల దూరములోనున్న నెకొండశాసనములో నీక్రింది విధముగాఁ జెప్పఁబడెను.—

౧. "స్వస్తిసమస్తభువనాశ్రయ శ్రీపృథ్వీ
౨. వల్లభమహారాజాధిరాజపరమే
౩. శ్వర పరమభట్టారక సత్యాశ్రయకు
౪. లతిలక చాళుక్యాభరణ శ్రీమత్త్రి
౫. భువనమల్ల దేవెర విజయరాజ్యముత్త
౬. రోత్తరాభి వృద్ధి ప్రవర్ధమానమాచంద్రార్కతారాం?
౭. రసలుత్తమిరె శ్రీజయన్తి పురద నెలెవీడినోప
౮. సుఖసంకథావినోదధిం రాజ్యంగేయుత్తమిరె ఓస్వస్తిసలో
౯. ధిగతపంచమహాశబ్దమహామణ్డలేశ్వరం జయాంగనాధ్
౧౦. శ్వరసుపహసిత మనసిజర్భూత్తే త్రిలోకీలాలిత క్ర్తిబేగీళ
౧౧. వంశదవదహనన స్తత్తురలోడయ పలినచోడ కుళోదులో దని

చండలదేవి ప్రియుండు శ్రీమన్మహామండలేశ్వరకుమార తైలపదేవర పట్టమహాదేవిలక్ష్మీదేవి కుమార పెర్మాడిదేవర పట్టమహాదేవి బిక్కిదేవి రాజధానికోడూరునుండి వచ్చినెకొండ

రామేశ్వరదేవరకు విక్రమశకవర్ష ౪౬ శ్రావణ బ ౩౦"

పై శాసనమువలన తైలపదేవుఁడు జయంతి పురాధీశ్వరుఁడును పశ్చిమచాళుక్య వంశజుఁడునగు త్రిభువనమల్లదేవుని రాజప్రతినిధియని స్పష్టముగాఁ దెలియుచున్నది. వేగీళవంశదహన యనుపదము వేగీశవంశదవానయను కొననగును. ఆవిశేషణము పశ్చిమచాళుక్యులకుఁ దూర్పు చాళుక్యులకుఁ గల విరోధాతిశయము తెలుపును. విక్రమ శకము ౪౬. క్రీ.శ. ౧౧౨౨ అగును. ఇది ప్రోలరాజుకాలమగుటచే నీతైలపదేవుఁడు పశ్చిమచాళుక్య రాజప్రతినిధి యగుట సత్యము. బూవపూరుశాసనములో స్పష్టముగా నీతైలపదేవుఁడు వేంగీశ వనదవదహనుఁడని చెప్పఁబడినాఁడు. అందీతైలపదేవుని యంశమీక్రింది విధముగాఁ గలదు.—

(౨) ధాకర పరిజన సంపత్కర శ్రీమచ్చన్దల
(౩) దేవీనయన సరసిజసుయ్యర్కా నృప
(౪) త్తిహరనార్యర్భాం గురుజనషదపంగ
(౫) రాజితచాళుక్య కటక రక్షపాళనామా
(౬) ది సమస్త ప్రశస్తి సహితం శ్రీమ
(౭) న్మహామణ్డలేశ్వరం కుమార తైలపదేవ
(౮) దేవర పట్టమహాదేవి లక్ష్మీదేవియ
(౯) రుం కుమారం పెర్మాడి దేవనుం బా ఈ
(౧౦) వనుం శ్రీకోడూరు పురద నెలె వి
(౧౧) విధనోళ సుఖసంకథా వినోదాదిం రాజ్య
(౧౨) గెయ్యుత్తమిరె .

ఇందలి శకాబ్దము, నెకొండ శాసన శకాబ్దము నొకటియే. తైలపదేవుడు చందలదేవి, లక్ష్మీదేవి యను రాణులకు భర్తయనియుఁ గోడూరు రాజధానిగఁ గలవాఁడనియుఁ గుమారుని పేరు పెర్మాడి దేవుఁడనియుఁ గోడలు బిక్కిమదేవియనియు నితఁడు ప్రోలరాజుచే సంగరరంగమున బద్ధుఁడై విడిచిపెట్టఁబడె ననియు నెఱుంగనగును. ఇంకఁ గొన్ని తైలపదేవుని శాసనములు గలవు గాని విస్తరభీతిచే వదలుచున్నారము. కడకీతైలపదేవుఁడు రుద్రదేవునిచే మరణించినది ముందుఁ దెలుపుదుము.

## గోవిందరాజు

ప్రోలరాజు ప్రతిపక్షవీరులలో గోవింద రాజొకఁడు. ఈతని చరిత్రము సవిస్తరముగా గ్రహింపనగు నాధారము లింతవఱకు లభింప లేదు. ఆంధ్రచరిత్రకారు లీ గోవిందరాజును కొండపల్లి పాలించు వాఁడని చెప్పినారు. దూరము యోచించినచో నితఁడు కంబముమెట్టు చెంతగల నేలకొండపల్లి పాలించు వాఁడనియు, నేలకొండపల్లినే పూర్వ శాసనములలో కొండపల్లి యని వ్యవహరించిరనియు మా విశ్వాసము. గోవిందరాజును ప్రోలరాజు జయించినటులుఁ దెలుపు శాసనశ్లోకము నిట నుదాహరించెదము.

శ్లో. యోకుంతారిపతే ర కుంత
పరశుశ్లక్ష్ణాగ్ర ధారోల్ల స
ద్ధారాపాత నిపాతనైక చతురం
గోవింద రాజాహ్వయం;
బద్ధ్వాస్మద్యత్తదోదయక్షితిభృతే
రాజ్యం దదౌ లీలయా
లుంతాకో విషయస్యతస్య సమరే
సద్వీర దీక్షాగురుః.

ఇందుఁ బేర్కొనఁబడిన గోవిందరాజు పశ్చిమ చాళుక్య త్రిభువన మల్ల దేవుని పక్షమున నేలకొండపల్లి ప్రాంతమునకుఁ బాలకుఁడుగ నుండెను. ఉర్లుగొండ శాసనములో త్రిభువనమల్ల దేవుని మంత్రి నెమ్మన ప్రగడ యను బాణవంశజునకుఁ బుణ్యముగాను, కొండపల్లిలో భూమి దానము చేసితినని గోవిందరాజు శా.శ. ౧౦౪౫ అగు కార్తీక శుద్ధ ౬ సోమవారము నాఁడు (క్రీ. శ. ౧౧౨౩ లో) శాసనము వేయించెను. ఈ శాసనముచే గోవిందరాజునకు ప్రోలరాజు సమకాలికుఁ డనియుఁ బశ్చిమ చాళుక్య రాజప్రతినిధియనియు, నేలకొండ పల్లి పాలకుఁ డనియుఁ దెలియును. గోవిందరాజును తొలగించి ప్రోలరాజు నిల్పిన రాజప్రతినిధియగు ఉదయరాజు బలనాటి చోడులలోని వాఁడనుట ప్రమాదము. పండిత గురు మల్లికార్జునునిచే శాపము నొందిన వాఁడును, పానుగల్లు పాలకుఁడును నగు ఉదయరాజు ప్రోలరాజు సమకాలికుఁడు. ఇతఁడే గోవిందరాజు స్థానమున రాజప్రతినిధియై పేరొందెను. లుంతాక విషయము నల్లకొండ మండలము కావచ్చును.

ప్రోలరాజు ప్రతిపక్షులలో గుండరాజొకఁడు. ఈతఁడు మహావీరుఁడు. ఈతని ప్రోలరాజు వధించిన విధ మీక్రిందిశ్లోకమునందు విపులముగా వర్ణింపఁబడి యున్నది.

శ్లో. క్రుద్ధేనోద్ధుర మంత్రకూట నగరీ
నాథాదయో నిస్త్రపో
గుండః ఖండిత ఏవ ముండితశిరః
క్రోడాంక వక్షస్థలః
ఏడోడింభకవత్పలాయనపరో
జ్ఞాతో గతః స్వాం పురీం
ఆహూతోపి నరేశ్వరస్య పురతః
ప్రోలేన యుద్ధాయ యత్.

ఇందుఁ బేర్కొనఁబడిన గుండరాజు మంత్రకూట పాలకుఁడు. మంత్రకూటము నిజామురాష్ట్రములో గోదావరీతీరమున నున్న మంతెన. నూజవీడు చెంతగల మంతెన యనుట ప్రమాదము. నిజాములోని గోదావరీతీరస్థ మంతెనకుఁ గాకతీయులనాఁటనుండి మంత్రకూటమని పేరుగలదు. గుండరాజు పేరుతోఁ గట్టఁబడిన గ్రామములు నేఁటికి నిజామురాష్ట్రములోని మంతెనచెంతఁగలవు. ప్రోలరాజు గుండరాజును జయించినపిమ్మట మంత్రకూట ప్రాంతమునకు రేచెర్ల గోత్రుఁడగు కామచమూపతిని రాజప్రతినిధిగ నియోగించెను. ఈతఁడే ప్రోలరాజుపక్షమున మంత్రికూట ప్రభువగు గుండరాజును జంపెనని రామప్పగుడి చెంత నీతని పుత్రుఁడగు రుద్రసేనానిశాసనము వెల్లడించు నాఁడు. అందలి ముఖ్యాంశమిది.—

కామనారు చమూపతిః

శ్లో. శ్రీమత్ప్రోలనృపాల సైన్యపతినా
విఖ్యాత విక్రాంతినా
యుద్ధే యేన మహాబలేన నిహతో
మంథన్య గుండాధిపః;
అన్యే వైరి నృపాలకా ప్రతిదిశం
ప్రాదుర్భువంతత్క్షణా
త్సింహేనేవ నిహంతితో గజపతో (?)
శేషా గజాః క్షుద్రకాః.

గుండరాజు మంత్రకూట ప్రభువు. కాకతీయుల కాలములో రామారణ్యత్రిపాదు లనుయోగిసర్యండీ మంత్రకూటమునందె యుండెను. గుండరాజు శేశాఖకుఁ జెందినవాఁడో, యెంతటి విస్తీర్ణ రాజ్యమున కధిపతియో యెఱుంగవలసియున్నది. ప్రోలరాజు గుండరాజుమీఁదికి దండయాత్ర కేఁగుతఱికామచమూపతిసంగర భారవాహుఁడై గుండరాజును జంపియుండుననియుఁ ప్రభువగుటచే ప్రోలరాజావిజయము తానె వహించెననియు విశ్వసింప

ననుమ. ప్రోలరాజు ప్రతిపక్షవీరులలో జగద్దేవుఁడు మిగుల గొప్పవాఁడు. జగద్దేవుని ప్రతిఘటనము రుద్ర దేవుఁ డీక్రింది విధముగాఁ దనశాసనములోఁ జెప్పుకొని యున్నాఁడు.—

శ్లో. అన్యచ్చానుమకొండనామనగరీం
సంవేష్ట్య యోయం స్థితో
నానామండలికాన్వితో భువి
జగద్దేవ స్సదేవప్రభః;
స్తబ్ధ స్తంభిత ఏవకార్యకరణే
శక్తః క్షణాన్నిర్గతః
శ్రీమత్ప్రోలనృపస్య తస్య జయినః
కిం బ్రూమహే గౌరవం.

ఇతఁడు మైసూరు రాష్ట్రములోని నగరమండల మునకుఁ జెందిన పట్టిపొంబుచ్చపురాధీశుఁడనియు నింకఁ గొన్ని విశేషణములతో జగద్దేవుని వేఱొకనిగ నాంధ్ర చరిత్రకారులు పేర్కొనిరి. కాకతీయ రాజ్యమునకు వ్యాప్తి ప్రోలరాజు కాలమున మైసూరువఱకు లేదు. ఈ జగద్దేవుఁడు అనుమకొండకుఁ జేరువలోనున్న సామంతులఁ గూడఁ బలుకుకొని ప్రోలరాజును రాజ్యభ్రష్టుని చేయు టకు బయలు దేరి యుండును. తుదకు విఫలప్రయత్నుఁడై యింటిత్రోవఁ బట్టెను. జగద్దేవుఁడు పశ్చిమచాళుక్య రాజులకడ రాజప్రతినిధిగ నుండి ధర్మపురి వేములవాడ ప్రాంతములను బాలించు నొక మాండలికుఁడు. ఇతని శాసనములు కొన్ని నిజామురాష్ట్రమునఁ గలవు. అం దొకదానిలోఁ బ్రోలరాజు జగద్దేవు నణఁచినటులఁ గలదు.

శ్లో. తత్పుత్రో భూద్దేవపాలనామధేయో ధియాన్నిధిః
జగద్దేవ మహీపాల పాలితస్సమ్మత స్సతాం
యస్థాది భక్తమాలష్యా జగద్దేవాదనంతరం
కాకతీశః ప్రోలభూపస్యాధీరం పర్యపాలయత్.

౪౭వ నెంబరు అమునగల్లు శాసనము.

కరీమునగరమునకు ఎనిమిదిమైళ్లదూరము నందున్న నగునూరులో నొకవీరశిలపై నాలుగువైపుల నాలుగు వీరవిగ్రహములు కలవు. అందొకవైపు విగ్రహముక్రింద నీవిధముగా నొకశాసనము వ్రాయఁబడి యున్నది.

౧. స్వస్తిశ్రీ శిమస్త ప్రశస్తి సహితం
౨. శ్రీ మనుమహామండలేశ్వరం
౩. దొమ్మెరాజులు శ్రీమచ్చా
౪. లుక్య విక్రమగా...ద
౫. ఉత్తమ విస్యనాళ్కిసెర్ద్య
౬. ప్రమాది సంవత్సరద వై
౭. సక బహుళ చదివెలు
౮. పుయమగు సుక్రవర
౯. మనాడు మేడరజుజ
౧౦. జగద్దేనడుం ఎనభఇ
౧౧. వేలుతో పొడిచి గెలిచె.

దీనివలన దొమ్మెరాజు మండలేశ్వరుఁడనియు, మేడరాజు జగద్దేవుఁడు నాతని సంబంధులుగానుండి ప్రతిపక్షుల యెనుబదివేల సైన్యముతోఁ బోరి గెలిచిరని చెప్పఁబడెను. దొమ్మరాజు, మేడరాజు రుద్రదేవుని కాలములోనివారనునంశము ముందుఁ జెప్పనున్నారము. జగద్దేవుఁడు ప్రోలరాజు కాలములోనున్న యొకరాజప్రతి నిధియని దీనిచే స్పష్టమగుచున్నది. లేములవాడలో భీమేశ్వరాలయమున కెదుటనున్న శాసనమున జగద్దేవుని విషయము నిస్పష్టముగాఁ జెప్పఁబడియున్నది.

౧. స్వస్తిశ్రీ లేంబాలవాడ
౨. సమావాసోసమస్తప్రశస్తో
౩. పేత సమధిగతే పంచమహా
౪. శబ్దాద్యలంకారశ్రీతః శ్రీమ
౫. హామండలేశ్వరంపా
౬. వాకకులతిలకః శ్రీమజ
౭. గద్దేవర సరుసుకచ్చుళే ౧౦౨౧
౮. యయసర్వధారిసంవత్స
౯. రదవైశాఖసుద్ద చతుర్ద
౧౦. సి ఆదివారదందుహరీ
౧౧. శ్వరదేవరిగె................

ఈశాసనమువలన స్పష్టముగా నొక కాలమున * జగద్దేవునకు వేములవాడ రాజధాని యనియు నతఁడు వి శేష రాజ్యమున కధికారియనియు శా. శ. ౧౦౩౮ సరియగు క్రీ. శ. ౧౧౧౭లు ప్రాంతమునఁ బ్రోలరాజునకు సమకాలికుఁడుగానుండెననియు స్పష్టమగుచున్నది. పైనుదాహరించిన శాసనమునందలి ప్రోలరాజు ప్రత్యర్థి వీరులందఱు అనుమకొండ సమీప వాసులనియు, నిజాము రాష్ట్రము లోనివారనియు స్పష్టపడినదిగదా? రుద్రదేవుని ప్రత్యర్థులగూర్చి విచారించుదము.

రుద్రదేవుని ప్రత్యర్థులు అనుమకొండ శాసనానుసారముగా, దొమ్మరాజు, మేడరాజు, మైళిగిదేవుఁడు, భీమరాజు, శ్రీతైలపదేవుఁడు, కంమారు ఉదయచోడుడు అనువారు కనుపించుచున్నారు. జగద్దేవుని సందర్భమున దొమ్మరాజుపేరునగు నూరు శాసనమున స్పష్టపడినది. ఈదొమ్మరాజు ప్రోలరాజుకాలమున బ్రతిపక్షిగనుండి రుద్రదేవునికాలమునఁ బ్రతిఘటించి రాజ్యమును గోల్పోయినాఁడు. ఇతఁడు ధర్మపురి మొదలు భద్రాద్రి వఱకు గల దేశముపాలించు రాజు. భద్రాద్రి చెంతగల దొమ్మగూడె మీతని పేరుతోఁ గట్టఁబడినదె. ఈతనిని గూర్చి, అనుమకొండ శాసనములో నిటులఁ జెప్పఁబడి యున్నది.

శ్లో: త్వంగత్తుంగ తురంగ పుంగవచయా
రోహక్రమే కర్మఠం
దొమ్మం చారుపరాక్రమక్రమభరం
భఙ్త్వోసకృల్లీలయా ;
కర్ణంపార్థ ఇవామలైఃశర శతై
ర్విద్రావ్య విద్రావ్యయో
పేభే సర్వవిశేష యుక్తనగర
గ్రామం సరుద్రో నృపః.

దొమ్మరాజు అశ్వమును నడిపించుటలో మిక్కి నేర్పరి; పరాక్రమశాలి. ఈతనిగూర్చి ప్రత్యేకశాసనములు కరీమునగరు, వరంగల్లు మండలములలోని గోదావరితీరమున దొరుకఁ గలవు.

శ్లో. ఈడే మేడవిడంబడంబర భర
క్షోదక్షమంత్ర్మాభ్మతాం
దుర్వారోద్ధుర వీరమస్త్రి సమయా
దానైక దీక్షాగురుం
శ్రీమన్మైళగి దేవ సఙ్గసమయా
ప్రోద్భూత ధర్పాపహం
ప్రాప్త శ్రీపోలవాస దేశ విభవం
శ్రీరుద్ర దేవం సదా.

---

* ఈజగద్దేవుఁడు గాక ఓరుగల్లు ప్రాంతమున నింక నిరువురు జగద్దేవులు గలరు. కొలనుపాకలో నొక జగద్దేవుఁడు కొన్ని శాసనములు వేయించినాఁడు. ఇతని పేర శాసన సహితమగు జయ స్తంభము కొలనుపాక చిన వాగుగడ్డవద్దను శాసనము చండికాంబగుడి గోడలోను గలదు. ఇతఁడు ప్రోలరాజు సమకాలికుఁడే. బసవేశ్వరుని భక్తగణములోనివాఁడును బసవపురాణమున జేర్కొనబడిన వాఁడునగు జగదేక మల్లుఁడొకఁడు. ఇతఁడు వీర చూడామణి, ఈ జగదేకమల్లుఁడును ప్రోలరాజు కాలములోనివాఁడెగానచ్చును. మైసూరు మండలములోని జగదేకమల్లుఁడు కాకతిప్రోలరాజు ప్రత్యర్థియనఁజాలము.

శ్రీ మూఁడవ తైలపదేవుఁడు కల్యాణ నగరమును రాజధానిగఁ జేసికొని కర్ణాటాంధ్ర దేశములు పాలించుచుండెను. ఇతని చివరశాసనము క్రీ. శ. ౧౧౪౨ లోనిదిగ బెలగాములో నున్నది. కాకతీయ ప్రోలరాజు క్రీ. ౧౧౬౦ వఱకును, రుద్రదేవుడు తరువాతను బాలించిరి గాన నీమూఁడవ తైలపదేవుఁడు ప్రోలరాజుకాలమున బంధింపబడి యున్ముక్తుఁడగుటయుఁ బిమ్మట రుద్రదేవునిచే వధింపఁబడుటయుఁ బొసఁగియున్నది. రుద్రదేవుఁడు తన రాజ్యమున కొక హద్దు కటకమని చెప్పినాఁడు. ఇదియె కళ్యాణపురి. దీనిచేఁగూడ మూఁడవ తైలపదేవుఁడు ప్రోలరాజు రుద్రదేవులకు లోఁబడినవాఁడని తేలును. అనంతరము తైలపదేవుని రాజ్యమును బిజ్జలుఁ డాక్రమించుకొనెను. చాళుక్యచూడామణి బిరుద మీతనికిఁ దగియున్నది. కాకతీయుల ప్రత్యర్థి యీమూఁడవ తైలపదేవుఁడను కొనుటకు బాధకములు గానరావు.



గునకలీ

పీవకీ బాత్ రహీ చిత్ర ల్యాయకే బాత సహేలీ సునిత్య చలావే ।
బాస సువాస సనీ అతీఘర కంచన కుంభకే బేఠి సుహావే ।
సారీ కసుంభి సురంగలసే మతి కంచన భూషణ అంగ బిభావే ।
లాల కహే మాలకోసకీ రాగనీ గునకలీ జిహ నామ కహావే॥



గోవిందదాసుగారి యనుమతిని.]

ఇందుఁ బేర్కొనఁబడిన మేడరాజు మేళగిరాజు ఎవరో ఆంధ్ర చరిత్రకారులు నిరూపింపఁ జాలక పోయిరి. మేడరాజును వీరచోడుని ముఖ్యసేనాని యగు మేడమార్యునిగఁ దొలుత భ్రాంతిపడిరి. తరువాత నది పూర్వపక్షముజేసి యావిషయము భావిశోధకులకు వదలివేసిరి. మేళగిదేవుఁడు, పర్ణఖేతవాసియు యాదవులలోఁ బూర్వుఁడగు మల్లయోగి, అతని రెండవ కుమారుఁడగు అమరమల్లయోగి కావలయునని పొలవాసదేశమును స్మరింపఁ జాలక పోయిరి. ఇందుఁ బేర్కొనఁబడిన మేడరాజు వరంగల్లు మండలములోని పాకాల తాలూకాలోని కురువపట్టమొదలు గోదావరి ప్రాంతము వఱకుఁ బాలించు రాజు. ఇతని మంత్రియగు నాగదేవరాజు పార్శ్వజినేశ్వరాలయము నిర్మించి దానము గావించినటులు పాకాల తాలూకా గోవిందాపురము పెద్దచెరువులోని శాసనము నందుఁ గలదు! అందు మాధవవర్మవంశమున దుగ్గరాజు జనించెననియు నతనికి మేడరాజు జగ్గరాజు అను నిరువురు కుమారులు గలరనియుఁ గలదు.

ఈశాసనము క్రీ. శ. ౧౧౬౭ లో నిది గావున (శా. శ. ౧౦౮౯ ప్లవ సం॥ ఫాల్గుణ శు. 3 లు) అనుమకొండ శాసనమునకు 3౫ సంవత్సరములు వెనుక వ్రాయఁబడినది. దీనివలన మేడరాజు ప్రోలరాజు కాలమున విజృంభించి యుత్తర వయస్సులో రుద్రదేవునిచే భంగపరుపఁబడెనని తెలియును. మేడరాజు ప్రోలరాజు సమకాలికుఁ డని తెలుఁపు శాసనము పైనుదాహరించినారము. మైలగి దేవుఁడు పాలించు పొలవాస రాజ్యము కరీమునగరు జిల్లా జగత్యాల తాలూకాలో నున్నది. దీని నిపుడు పొలాస యనుచున్నారు. పూర్వమిది రాజధానియని విశ్వసింపనగు చిహ్నలు కొన్ని నేటికి మిగిలి యున్నవి. ఇట పొలస్తేశ్వరాలయము గలదు. ఆలయము వలన పొలవాసయని పేరు వచ్చి యుండునేమో యని సందియమగుచున్నది. మైళగిదేవుని శాసనములు ప్రత్యేకించి ప్రచురింపఁ దలఁచి యిచ్చట వలయు నంతవఱకె సూచించి వదలితిమి. తైలపదేవుఁడు ప్రోలరాజు కాలమునఁ బ్రబల ప్రత్యర్థిగా నుండి క్రమముగ బలహీనుఁడై రుద్రదేవుని కాలమున మరణించెను. అనంతర మాతని రాజ్యమును భీమరాజు హరించెను. ఈ భీమరాజు వర్ధమానపురము బాలించు రాజు. కాశ్యపగోత్రుఁడు. గోకర్ణుఁ డీతని సోదరుఁడు. కల్వకుర్తి తాలూకా లోని మామిళ్లపల్లి శాసనములో భీమరాజు గోకర్ణుఁడు గావించిన దానములు చెప్పఁబడెను. అందు భీమరాజు కుటుంబములో మొదటివాఁడు గోకర్ణుఁడనియు, నతని కుమారుఁడు ఉదయాదిత్యుఁ డనియు, నుదయాదిత్యుని కుమారులు భీమరాజు గోకర్ణ లనియు నీ క్రింది విధముగాఁ జెప్పఁబడెను.

శ్రీవాంశె వంశతిలకః కలికాలకర్ణో
గోకర్ణ ఇత్యుద భవద్భువ నైకవీరః
అథాభూదుదయాదిత్యః
సత్యస్సంగ స్సుత స్తతః
అథ తత్కృతి నక్షత్ర
గణప్ర గుణ తేజసః
భీమగోకర్ణ భూపాలౌ
సూర్య చంద్రా వివోదితౌ.

భీమరాజు మిగుల దుర్మార్గుఁడు. ఈతఁడు గోకర్ణుని వధించినాఁడు. ఇతఁడు మాతుస్సపత్నీ రతుఁడనియు నరపశువనియు సోదరహంతయనియు దైలపదేవునిరాజ్యము హరించెననియు రుద్రదేవుఁడు శాసనములలోఁ జెప్పుకొనినాఁడు. మామిళ్లపల్లి శాసనము అనుమకొండశాసనము కంటె ముందు ౪౪ సంవత్సరముల క్రిందట విళంబి సంవత్సరములో నెలకొల్పఁబడినది. దీనిచే భీమరాజు ప్రోలరాజు కాలమున యౌవనమునందుండి రుద్రదేవుని నాటికిఁ గాలము తీరినవాఁడైయుండెనని చెప్పవచ్చును. రుద్రదేవుఁడు భీమరాజు దుర్మార్గముల కేవగించి యతని రాజధానియగు వర్ధమానపురము ప్రవేశించి నగరము కాల్చి శృంగారవనము పెఱికి వేయించి దుర్గము కూలద్రోయించి రెండవ యమరావతిని బోలి వెలుఁగొందు నాపురమును సర్వవిధముల నాశనము గావించెను. ఈ యంశము రుద్రదేవుఁడు అనుమకొండ శాసనములోఁ జెప్పుకొని యున్నాఁడు. రుద్రదేవుని ధాటికి వెఱచి భీమరాజు సకుటుంబముగా నడవులకుఁ బారిపోయి నటులు అనును

కొండశాసనములో నీ క్రింది విధముగాఁ జెప్పఁబడి యున్నది.

శ్లో. యస్యాక్షివీక్షణభయా చ్చకిత స్సభీమో
దుర్యోధనస్య నృపతే రివ విహ్వలాంగః;
స్వభ్రాతృమాతృ వనితాసహిత స్సమగ్ర
లక్ష్మీం విహాయ వనమేవ యయా విలజ్జః.

రుద్రభూపాలునిచే సర్వవిధముల విధ్వంసము గావింపఁబడిన వర్ధమానపురములో మరల నడుగుఁబెట్టక భీమరాజెటనో జీవయాత్ర గడిపియుండును. పిమ్మట వర్ధమానపురము పూర్వవైభవము పూర్తిగాఁ గోలుపోయి సామాన్యమగు పల్లెటూరుగా మాఱిపోయెను. విజయానంతరము రుద్రదేవుఁడు కందూరునకేగి యారాజ్యమేలు ఉదయచోడమహారాజు కుమార్తెయగు పద్మావతిని బెండ్లాడెనని అనుమకొండ శాసనములోని యీక్రింది శ్లోక భాగమువలన గ్రహింపవచ్చును.

"శ్లో. కన్దూరోదయ చోడవంశ
విలసత్ క్షీరాబ్ధి గర్భోద్భవ
త్పద్మాకాశ్రయ రుద్రదేవ నృపతేః
కిం వర్ణ్యతే విక్రమః;

రుద్రదేవుఁడు పద్మావతిని గ్రహించి కందూరు ఉదయచోడుని మన్నించి విడిచియుండును. రుద్రదేవునకు కందూరు ఉదయచోడుఁడు సమకాలికుఁడును,మామయునని విశ్వసించుట కనుకూలముగా అనుమకొండ శాసనమునకు ౫౬ దినములలో వ్రాయఁబడిన జటచర్లలోని చోడోదయుని శాసనమ్మున్నది. జటచర్ల చోడోదయుని శాసనమునం దాతని శుల్కాధికారము శుల్కనిబంధనములు చెప్పఁబడినవి. రుద్రదేవుని కాలమున స్వతంత్ర రాజే ఆంధ్రదేశమున లేనపుడు కందూరు ఉదయ చోడుఁడు స్వతంత్రించి శుల్కాధికారము నెటులు ప్రకటింపఁగలఁడు? రుద్రదేవుఁడు పద్మావతిని బెండ్లాడి కందూరురాజ్యము ఉదయచోడులకు నిచ్చియుండుననుట సత్యము. జటచర్ల వేంకటేశ్వరాలయములో నుదయచోడునిశాసనము ఈక్రిందివిధముగ వ్రాయఁబడియున్నది.

"స్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వర వీరమాహేశ్వర కోడూర్పురవరేశ్వరసూర్య వంశోద్భవ కులతిలక కాశ్యపగోత్ర కలికాలాన్వయనామాది సమస్తప్రశస్తి సహితం శ్రీమన్మహామండలేశ్వర కందూరి ఉదయనచోడనమహారాజుల సుంకాధికారులు."

ఈశాసనములోని కందూరి ఉదయనచోడుఁడే రుద్రదేవుఁడు పేర్కొన్న కందూరోదయ చోడుఁడనుటకుఁ గాలము, నామము, సంబంధము సరిపడుచున్నది. శాసనకాలము ౧౦౮౮ చిత్రభాను సంవత్సరము. శాలివాహనశకము అనుటకు మారు లేఖకుఁడు విక్రమశకమని వ్రాసియున్నాఁడు. ఈవ్యత్యాసము సవరించికొందుమేని కందూరి ఉదయచోడుఁడు రుద్రదేవుని సమకాలికుఁడగును.

రుద్రదేవుఁడు సంస్కృతాంధ్రకర్ణాటభాషలలోఁ బ్రసిద్ధుఁడగు కవి. ఇతఁడు నీతిసారమను నొక యాంధ్రగ్రంథమును రచించెనటగాని ప్రకృత మాగ్రంథము కానరాదు. రుద్రదేవుఁడు సంస్కృతమున విద్వాంసుఁడని తలంచుట కనువైనయాధారము అనుమకొండ శాసనములోఁ గలదు. "సురగురుః విద్యారతిః" అను విశేషణ మిందులకు దార్కాణగాఁ గైకొనవచ్చును. రుద్రదేవునియొక్కయు నతని తండ్రి ప్రోలరాజు యొక్కయు విజయాదికములు ప్రతి పక్షవీరులు నేఁటి నిజాము రాష్ట్రములోని భాగములు పాలించినవారేగాని తదన్యులుగాదు. రుద్రదేవుని ప్రథమప్రతాపరుద్రుఁడనిచరిత్రగ్రంథములలో సంకేతించియున్నారు. రుద్రదేవునకుఁ బ్రతాపరుద్రుఁడను నామము లేనపు డీసంకేతముతోఁ బనియుండదని మాతలంపు. రుద్రదేవుని మరణానంతరము కాకతీయరాజ్యము పరహస్తగతమయ్యెను. రుద్రసేనాని దాని నుద్ధరించి గణపతిదేవుని కొసంగి కాకతీయరాజ్యస్థాపనాచార్య బిరుదము నొందెను. రుద్రదేవుని శాసనములు ఉప్పలపాలెము పట్టునందుఁగలవు. పాలెముపట్టు శాసనమున (రామప్ప గుడి శాసనమందురు) శకము శా. శ. ౧౧౩౫ సరియగు ౧౨౧౩లోఁ బ్రతిష్ఠింపఁబడెను. రుద్రదేవుని రాజ్యకాలము క్రీ. శ. ౧౧౬౦ మొదలు ౧౧౯౬ వఱకు గాన

౧౧౯౬-౧౨౧౩ క్రీ. శ. లోఁగా రుద్రదేవుఁడు మరణించుటయు, నారాజ్యము శత్రువులు లోఁగొనుటయు, రుద్రదేవుఁడు విరోధులఁ జంపి రాజ్యము పునరుద్ధరించుటయు జరిగియుండును. దీనినిగూర్చిన వివరము లింకను శోధింపవలసియున్నది.

శ్లో. శ్రీమద్రుద్రనరాధిపే రిపుమహీపాలాద్రివజ్రేదివం
యాతే కాకతినాథ భాగ్యవిలసత్సౌజన్యసమాకర్షణే
సంభ్రాంతాః సముత్థితాః సరభసంవైరిక్షమాపాలకాః

*　　*　　*　　*　　*

శ్లో. యత్సేనాధ్వజదండాగ్ర పతాకాభిః ప్రతర్జితః
ద్రుతం నాగతిభూపాలః పలాయనపరోభవత్

కాకతీయ రుద్రుని రాజ్యము హరించిన ప్రత్యర్థి రాజులలో నాగతి భూపాలుఁడొకఁడు. ఈతఁడు మేడరాజు మంత్రియగు నాగవర్మకానోపును. మేడరాజున కనంతరము ప్రబల సైన్యముతోఁ బ్రత్యర్థులఁ గొందఱఁ గలుపుకొని రుద్రదేవుని మరణానంతరము కాకతీయ సామ్రాజ్యమును లోఁగొని రుద్రసేనానిదాడి కాఁగలేక కోల్పోయియుండును. చరిత్రములలోని కీయంశ మింతవఱకుఁ జేరలేదు. రుద్రదేవుఁడు ప్రతిపక్షుల ప్రతిఘటనము తప్పించుకొనుటకై తనతండ్రి కాలమునుండి కట్టింపఁబడుచున్న ఓరుగల్లు కోటనుపూర్తిచేయించి తనతుదికాలమునందుఁ బ్రవేశించి రాజకీయవ్యవహారములు నవరించుచుండెనని శివయోగసారములో కొలని గణపతిదేవుఁ డిట్లు చెప్పెను :

తరల:—

అనుమకొండ పురంబుగాదని
యావిభుం డిల నోరుగ
ల్లనుపురంబు ఘటించి యచ్చటి
కచ్చుగా నరుదెంచి య
మ్మనుజనాథుఁడు నాయకత్వము
మల్లమంత్రికిఁ జిన్నమ
ల్లనకు ధారుణి పెద్దసంప్రతి
నాతతంబుగ నిచ్చినన్.

రుద్రదేవుని అనుమకొండ శాసనముగల చరిత్రాంశములు యథామతి నిర్ణయించినారము. పూర్వగ్రంథకర్తలుదాహరించిన శ్లోకములు పాఠభేదములుగ నుండునని మేము స్వయముగా శాసనమును ఎత్తివ్రాసిన ప్రతిని బట్టి యిందు విమర్శించితిమి. ఇంకఁ గొంతపరిశోధన జేసిసమీఁదట సవిమర్శము చరిత్రవ్యాసముతో రుద్రదేవుని శాసనము గ్రంథరూపకముగా కాకతీయ గ్రంథమాల పక్షమునఁ బ్రకటింపనెంచి యింతవఱకు లభ్యమైన యంశముల నాంధ్రమహాజనులకు విన్నవించుకొంటిని.

---

## కృష్ణా!

అప్పల వీరవేంకట జోగయ్యశాస్త్రి గారు

అరయన్ గోతతి మేతమాని సతమున్ వ్యత్యస్తచిత్తంబుతో
నెరగొంచున్ మురళీనినాదమున, కెంతేన్జిక్కి నిక్కంబుగా
మఱచెన్ వత్సలనోడ పాలుగుడుపన్ మన్నించి నామాట, నీ
సరవిన్ వేణువు మేళవింపకుము కృష్ణా! దేవకీనందనా!

---

# హిందూజాతీయత — మతము

కేతవరపు వేంకటశాస్త్రి గారు

భూగోళ మనేక ఖండములుగా విభజింపఁబడినది. ప్రతి ఖండమునందును ననేకములగు మానవ సంఘములు గలవు. వానికే జాతులని కూడ నామము గలదు. ఇట జాతిశబ్దము సంఘవాచకముగాని కులవాచకము కాదు. ప్రతిజాతికిని జాతీయత యను ధర్మము కలదు. జాతీయత యనఁగా జాతిలోఁ బ్రతి వ్యక్తికిని సమానమై సంబంధించియుండు ధర్మము. అది చక్రవర్తి మొదలు గర్భదరిద్రుని వఱకును, పండితుఁడు మొదలు పామరుని వఱకును, ముదుసలి మొదలుకొని బాలుని వఱకుఁ గల ప్రతి మనుజునికి నొక్కరీతిగా సంబంధించి యుండును. కాని యాధర్మము ప్రపంచములోని యన్ని జాతులకు నొక్కటియై యుండదు. వేషము, భాష, యాచారములు, సాంఘికధర్మములు మొదలగునవి ప్రతి సంఘమునకు నెట్లు వేఱువేఱుగ వర్తిలుచున్నవో యదేవిధముగ జాతీయతాధర్మము గూడ నాయా జాతులను బట్టి వేఱువే అగుచున్నది. ప్రతిసంఘమునందుఁ బ్రతివ్యక్తియు దను సంఘాభివృద్ధికొఱకై ముఖ్యముగా నొనరించు కార్య మేది కలదో యదియే యాసంఘమునకు లేక జాతికి జాతీయతాధర్మ మనిపించుకొనును. అట్టి ధర్మములాయాజాతుల వారిలో నొకరిద్ద ఱేర్పఱుచుటవలన వచ్చినవి కావు. ఎన్నియో శతాబ్దముల కాలమునుండి వచ్చుచున్న సంఘములందాయా సంఘముల యభివృద్ధికిఁ గారకములై సంఘ మంతటిచేతను నాచరింపఁబడుచు సంఘములోని ప్రతివ్యక్తియందును దమంత తామె నెలకొని వచ్చు ధర్మములు. అట్లనాదిగా వచ్చు జాతీయతాధర్మముల ననుసరించి సంఘము ప్రవర్తిల్లవలసినదేకాని సంఘములోని వ్యక్తులు దురదృష్టవశమున విపరీతప్రవర్తనులయి జాతీయతాధర్మములను మార్చివేయుట కెంతమాత్ర మవకాశము లేదు. అట్లొకవేళ మూర్ఖతచే మార్పఁ దలంచినచో సంఘమంతటికిని నాశము గలుగును. ఇందుల కొక నిదర్శనము చూడుఁడు.

మనము గట్టిగా పునాదివేసి యొక యిల్లో మేడయో కట్టుకొన్నాము. కొంతకాలమునకు "ఇల్లు మేడగానో మేడ యిల్లుగానో మార్పవలె" నన్న బుద్ధి మనకుఁ బుట్టవచ్చును. అప్పుడు మన మేమి చేయుదుము? పైపై మార్పులు మాత్రమే చేసి కొందుము. అట్టి మార్పు లేమి చేసికొన్నను మనకిల్లో మేడయో మిగులును. అవి ముందుగా వేయబడిన పునాది ననుసరించియే యుండును గాని వేఱువిధముగా నుండవు. మఱియుఁ బైపై మార్పులతో సంతృప్తిచెందక పునాదియే మార్చుటకు యత్నించినచో సర్వనాశనమగును. పునస్సృష్టి మరలఁ గావలసియుండును. అట్లే సకలజాతులును నాయా జాతీయతాధర్మములనెడి పునాదులపై మందిరాదులవలె నొప్పుచున్నవి. ఆ జాతులందుఁ బయిపయి మార్పులు చేసికొనవచ్చును గాని జాతీయతాధర్మమును మార్ప నవకాశము గాదు. అందుచే జాతీయత ననుసరించియే సంఘము వర్తింపవలసినది కాని సంఘమును బట్టి జాతీయతమార్చుకొన నవకాశము లేదనుట స్పష్టము.

మఱియు జాతీయత జాతికిఁ బ్రాణము వంటిది. మన దేహమువంటిది జాతి. మన ప్రాణమువంటిది జాతీయత. ప్రాణ మున్నప్పుడే దేహమునకు వృద్ధి. అప్పుడే సామర్థ్యము, కాంతి, అందము మొదలగునవి కలుగుచున్నవి. ప్రాణము పోయినచో దేహము కట్టెకంటెఁ గూడ నధమాధమ మగుచున్నది. దానియందున్న శక్తి, బలము, కాంతి, యందము సర్వమును నశించుచున్నవి. అట్లే జాతీయతాధర్మ మున్నంతసేపే జాతియొక్క ప్రాధాన్యము, పెంపు, వైభవము మొదలగునవి విశదమగుచుండును. అది యొకవేళ నశించినచో జాతి క్షీణఁగునంటిదని వేఱుగాఁ జెప్పనక్కఱ లేదు. శరీరము నిలువఁబెట్టుకొనుటకు మనము ప్రాణమును కాపాడుకొనుచున్న విధముగా జాతిని స్థిరముగా నిలువబెట్టఁగోరినచో ముందుగా జాతీయతను గాపాడుకొనవలయును.

మన ప్రభువులగు నాంగ్లేయులకు జాతీయతాధర్మము వాణిజ్యము. వారలు తమ జాతీయతను నభివర్ధింపుటకయి దానిని ప్రతికార్యమునందును జొనిపినారు. వారేకార్యమాచరించినను ముందుగా వర్తకమునకు మూలమగు లాభనష్టములను బరిశీలింపకుండఁ జేయరు. లాభనష్టములను బరిశీలించి పనిచేయుట వర్తకలక్షణము కదా. వారు రాజకీయములోఁగాని, మఱిదేనిలోఁగాని ముందుగా మదింపువేసి లాభమేకాని నష్టములే దన్నది స్పష్టమగువఱకు నాపని చేయనే చేయరు. ప్రతి విషయములోను వారట్లు వర్తించి తమ జాతీయతను బెంపొందించుకొనుట చేతనే లోకమున వారంత యభివృద్ధికి వచ్చిరి.

ఆంగ్లేయజాతికి వాణిజ్యమట్లే మన హైందవజాతికి మతమే జాతీయతాధర్మము. మన హైందవజాతి సౌధము మతమనెడి పునాదిపైనే దృఢముగా నెలకొని యున్నది. మన మతమును, మన హిందూసంఘమును, నిప్పట్టునఁ గొంతవఱకు వివరించుట యప్రస్తుతము కాదు.

మన హిందూసంఘ మిట్లెంతకాలమునుండి వచ్చుచున్నదో చరిత్రకారులయినను, సరిగా నిర్ణయింపలేకపోయిరి. అయినను మనసంఘ మిప్పు డత్యంతనాగరికములని ప్రసిద్ధికెక్కిన పశ్చిమదేశములు కేవల మనాగరకములై యున్నకాలమునకుఁ బూర్వ మెన్నో వేల సంవత్సరములనుండియు, నాగరికతావిశిష్టమై, తపోవిద్యావివేకవంతమై, ప్రపంచమం దంతటను సుప్రసిద్ధమై వఱలుచున్నదనుట నిర్వివాదాంశము. అప్పటినుండియు మన జాతికి మతమే జాతీయతయై యొప్పుచున్నది. జాతీయతను బెంపొందించిన జాతి వర్ధిలునని తలపోసియే మన పూర్వులెల్లప్పుడును దమకు జాతీయతయగు మతమును బోషింపఁ జొచ్చిరి. మతమన జ్ఞానమార్గము. ప్రకృతిమయమయిన ప్రపంచములో నంతర్లీనమై సర్వత్ర నిండియుండు నిత్యవస్తువును దెలిసికొనుట కా మతమే పరమసాధనము. అదియే ముక్తిప్రదము. అదియే సర్వదుఃఖనాశకము. అట్టి జాతీయతను వర్ధించుటకే కేవలము పరమేశ్వర స్వరూపమును దెలుపు నుపనిషత్తు లేర్పడినవి. యోగశాస్త్రములు సంపన్నములయినవి. బ్రహ్మసూత్రములు రచింపఁబడినవి. ప్రకృత్యతీతుఁడును, నిరాకారుఁడునునగు బ్రహ్మమును దెలిసికొన జితేంద్రియులకుఁ దప్ప తక్కిన సామాన్యులకు దుర్లభమని యాలోచించి పరమకారుణికహృదయులగు పూర్వులు పరమేశ్వరుని యవతారములను లీలలను వర్ణించి సర్వజనులకును దదాసక్తిని గల్గించిరి. సగుణబ్రహ్మమును వర్ణించుటకే పురాణములు భారతాదీతిహాసములును బయలువెడలినవి. ఈశ్వరావతారములను, లీలలను మాటిమాటికిఁ జదివికొని క్రమముగా జితేంద్రియులై ధారణాశక్తిని సంపాదించి కొంతకాలమునకుఁ బరతత్త్వమును దెలిసికొన సమర్థులగుచుండిరి. అట్టి శక్తిలేనివారు సగుణబ్రహ్మమునే యుపాసించుచుండిరి. ఎట్లయినను బ్రజలకు జాతీయతాధర్మమగు మతమునం దాసక్తి గల్గించుటయే వారి ముఖ్యోద్దేశము. పురాణాదులు చదువఁజాలని యసమర్థులకుఁ గూడ మతాసక్తిని గల్గించుటకై విగ్రహారాధన కల్పించిరి. దేవాలయములు నిర్మింపఁబడినవి. రామకృష్ణాది ప్రతిమ లందు స్థాపింపఁబడినవి. ఈరీతిగా పరమజ్ఞాని మొదలు మందబుద్ధివఱకుఁ గల సర్వజనులకును మతాసక్తిని గల్గించి మన పూర్వులు మతము నభివర్ధించిరి. మనపూర్వు లిట్లతిప్రయత్నములచేఁ బెంపొందించిన మతమనెడి గట్టి పునాదిపై నానుకొని యుండుటచేతనే మన హైందవజాతిసౌధము పరమతములనెడి ప్రభంజనము లెంతవీచినను, సుంతేనియు జలింపలేదు. వన్నెయు వాసియుఁ దఱుగలేదు. దానిని బడఁగొట్ట మహమ్మదీయు లధికముగా యత్నించిరి. కాని కూల్పలేకపోయిరి. ప్రస్తుతమునఁ బాశ్చాత్యనాగరకతాప్రవాహములు నలువంకలు ప్రవహించి చుట్టుముంచుకొని వచ్చుచున్నను, మన హైందవజాతిసౌధ మింకను శిథిలము కాలేదు. తన్మధ్యమున నింకను ధవళకాంతులతో మెఱయుచునే యున్నది. ఇన్ని మహోపద్రవములను జెందుచున్నను మన జాతిసౌధము పటుత్వము సడలకుండుటకు ముఖ్యకారణము పూర్వము మన జాతీయతను మిక్కిలి పెంపొందించుటయే యని వేఱ చెప్పనక్కఱలేదు.

మన పూర్వులు మన కొనర్చినది మఱియొక యుపకార మున్నది. రానురాను ప్రజ లల్పమతులై కార్యపరులై పురాణాదులను బఠించుటయుగాని, లేక వానిని

వినుటకుఁ గాని దేవాలయము లందుండు రామకృష్ణాది విగ్రహములను దర్శించుటకుఁ గాని యసమర్థ లయినచో మతాసక్తి తగ్గిపోవునేమోయని యోజించియే మన మతమును మన సాంఘికాచారములతోను ధర్మములతోను కర్మములతోను మిళితము గావించినారు. అట్లు చేయుటచేఁ బ్రతిమానవుఁడును బ్రతిదినమును నేదోవిధమునఁ బరమేశ్వరనామోచ్చారణ మొనర్చుచున్నాఁడు. బుద్ధిపూర్వకముగాఁ గాకపోయినను మానవుఁడు మతసంబంధమును గలిగించుకొనుచున్నాఁడు. ఈ విషయమై కొంచెము చర్చింతము. స్నానము దేహపరిశుద్ధికై యేర్పడినది. అది హిందువుల కొకయాచారము. హిందువులు సామాన్యముగా స్నానమాడునపుఁడు "సకల దురిత క్షయార్థం, శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం మహోదధి స్నానం— గంగానదీస్నానం— కూపజలస్నాన మహం కరిష్యే" అని సంకల్పము చెప్పుకొందురు. అంత మాత్రమునఁ బరమేశ్వరునకుఁ బ్రీతి కలిగినను కలుఁగకపోయినను మనకుఁ బ్రధానదేవత యగు పరమేశ్వరుని దివ్యనామ మొకసారి యుచ్చరిత మగుటయే చాలు నని మనవారి తలంపు. అట్లే భోజనమునకు ముందుగాఁ బ్రాణాహుతు లర్పించుచున్నాము. ప్రాణస్వరూపుఁ డగు నీశ్వరుని స్మరించుకొనవలయు ననియే వారి యుద్దేశము. ఇంతే కాదు. సకలకర్మారంభములందును ముందుగా విఘ్నేశ్వర పూజ కావించుచున్నాము. విఘ్నేశ్వరుఁడు పరమేశ్వర మూర్తులలో నొకఁడు. పయిప్రకారము జరుపలేని వారి గతియేమి? అని ప్రశ్నింప నవసరము లేదు. అట్టివారికి మఱికొన్ని మార్గములున్నవి. మన మతమున, వాణి, దుర్గ, రాముఁడు, కృష్ణుఁడు, ఎల్లమ్మ, పోలేరమ్మ, మొదలగు వారందఱును దేవతామూర్తులే. సామాన్యముగా నిట్టి నామములు అధమపక్షము పదిసారులయిన నుచ్చరింపకుండ నుండలేదు. ఎట్లన, వ్యవహారార్థము మనము పెట్టుకొన్న పేర్లన్నియు దేవతల పేళ్లే. ఓరాముఁడా, యనియో, కృష్ణాయనియో, ఎల్లమ్మా యనియో పిలువకుండ వ్యవహారములు ముగించుకొనలేము. ఇవన్నియు మన జాతీయతయగు మతమునకు సంబంధించినవే కాదా! ఆచారములందువలెనే సాంఘికకర్మము లన్నింటియందును మతసంబంధ మున్నదనుటకు సందియము లేదు. మనకు జాతకగర్మము మొదలు ప్రేతకర్మమువఱకుఁ గల షోడశ కర్మములును విహితకృత్యములు; మఱియు ధర్మ్యములు. స్వధర్మాచరణమే ముక్తికి సాధనమని గీత చెప్పుచున్నది. ఇంతేకాక ప్రతికర్మమునందును ముందుగా దేవతాపూజ సల్పక తీఱదు. మంత్రోచ్చరణము తప్పదు. దీనివలన వివాహాదికృత్యము లన్నియు ధర్మ్యములే యనియు, ధర్మము మతమున కొకయంగము గావున వివాహాదులుకూడ మతమునకు సంబంధించినవే యనియు నూహింపవలసి యున్నది.

యూరపునం దేమి, మఱి యితరఖండములం దేమి యెన్నియో సంఘములు గలవు. అవన్నియు నాగరకత గలవే? ఆ సంఘములకుఁ బ్రత్యేకము జాతీయతాధర్మము గలదు. సంఘధర్మములు గలవు. మతధర్మములు గలవు. మఱియు వారికి సంఘధర్మములగు వివాహాదులు వినోదప్రాయములు. వానిని ఖనము చేయవచ్చును. చేసి వానిని మనము విసర్జింపవచ్చును. ఇంతయేల? పై ఖండములందు స్త్రీపురుషులిష్టము వచ్చినపుడు పెండ్లాడి లేనపుడు విడాకులిచ్చుకొనవచ్చును. సంఘధర్మము లెట్లు మాఱిపోయినను వారి కంత పట్టుదల లేదు. కాని మన హిందువు లట్లు కాదు. మనకు సంఘధర్మములును మతధర్మములును వేఱువేఱుగా లేవు. మన సంఘధర్మము లన్నియును మతముతో నేకీభవించియే యున్నవి. మతధర్మములనుండి సంఘధర్మములను విడదీయ నవకాశము లేదు. అందులకుఁ గారణ మేమి? సంఘధర్మములు మతాతిరిక్తములు కాకపోవుటయే యని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. మన సంఘధర్మములు శాశ్వతములగు మత ధర్మములతో మిళితములయ్యు భిన్నములై వర్తించుటచే మన సంఘధర్మములు కూడ శాశ్వతములు కావలసివచ్చినవి. వానిని మార్పుచేయుట యశక్యము. అందుల కొకవేళ యత్నించినచో నశక్యకార్యములకై చేసిన యత్నములవలెనే నిరర్థకములగును. భూమండలమును దిరుగవేయ నశక్యము. అది తెలిసియు నందులకు యత్నించినచో విఫలమనోరథు లగుదురు. అట్లే హిందువుల సంఘధర్మములను మార్ప

యత్నింతురుగాక. అందు విఫలప్రయత్నమేకాని వేఱుగా ఫలము లేదు. ఒకవేళఁ గొందఱు పట్టుదలతో సాంఘికధర్మములను మార్ప యత్నించినచో మన మతమును మార్చిన వారమేయగుదుము. మతధర్మములు మాఱిపోవుచున్నచో సంఘమునకు మతమందున్న విశ్వాసము తొలఁగిపోవును. సంఘమునకు మతవిశ్వాసమంతరించిపోయినచోఁ దమ జాతీయతాధర్మమును జెఱిచినవారగుదురు. జాతీయతచెడిన జాతి చెడిపోవునని యిదివఱకే మనవిచేసియున్నాను.1

మానవస్వభావములు వేఱువేఱగుటచే సంఘములం దంతఃకలహము లుండుట నైసర్గికమే యైనను దానిని బురస్కరించుకొని జాతికిఁ బ్రాణమువంటి జాతీయతాధర్మమును జెఱుచుకొనుట శ్రేయస్కరము కాదు. కావున హిందూశబ్దధారియగు ప్రతివ్యక్తియు నట్లు జాతీయతను జెఱచు నన్ని సంస్కరణములనుఁ బ్రతిఘటించుట న్యాయ్యమని మనవిచేయుచున్నవాఁడను.

---

## దైవస్తుతి

కొత్తపల్లి సూర్యరావు గారు

సర్వేశుండవు మేదినీశులు తిరస్కారంబులం జేయఁగా
సర్వజ్ఞుండవు సజ్జకోటి తమదుష్పాండిత్యము ల్చూపఁగా
సర్వాత్ముండవు పాంచభౌతికతనుల్ స్వాహంకృతిం దెల్పఁగా
సర్వప్రజ్ఞుఁడవౌ కుమారరమణ, నీ శాంతత్వ మూహించెదన్.

కరుణావార్నిధి నీకృపాఘురులు లోకంబెల్ల వ్యాపింప, నీ
మిరిమెత్తం బ్రభవించు సజ్జనత; దుర్మేధాంకురశ్రేణియున్
మురుగెత్తున్; దురితౌఘము ల్మనుఁగుఁ; గ్రమ్మం జెమ్మ నీ యుల్లముం
బారి భూభేదముచే కుమారరమణ సంపూర్ణప్రభావోదయా!

సాగరవారి శర్కరగ, శైలము పిండలివండు గాఁగ, భూ
భాగము ధూమరీతి, శశిభానులు బొగ్గులకైవడి, న్నభం
బేఁగెడు నేల గాఁగ రహియించును నీకని భావకావ్యగా
థాగతి నోయుమారరమణ! తథ్యమ తెల్పుచు నుంద్రుగా కవుల్.

గగనము నీ కుమారరమణ గాంగఘటంబగు, ధూమకేతునం
దుఁ గలుగు కొయ్యచేతను విధుం డనుబెజ్జము వడ్డ, జ్యోత్స్నతీ
రగుజల ముట్టఁ గట్టఁగను బ్రాజ్ఞుఁడు చల్లినవాలుకాగతిం
దగు నుడురాజియంచును యథామతి నెంచెద సృష్టిచిత్రమున్..

---

1. ఇట, వివాహోచితవయోనిర్ణయ, తచ్ఛాసననిర్ణయములను గూర్చి కొంతచర్చ గలదు. ఈనాడు తీవ్రవివాద విమర్శలకు గుఱియైయున్న యాచర్చకు భారతియందు స్థానము మృగ్యము. కావున నీ వ్యాసమునందలి యట్టి చర్చకు తావు లేదయ్యెను.

—సంపాదకుడు "భారతి."

# తేలు

దిగుమర్తి సాంబశివరావుగారు



మన దేశమున తేళ్ళను చూడనివారునూ, దానివలని బాధను పొందనివారునూ ఉండరనియే చెప్పవచ్చును. కాని చాలామందికి తేళ్ళసంగతి పూర్తిగా తెలియదు. అందుచేతనే నాకు యీవ్యాసం వ్రాయాలని బుద్ధిపుట్టింది. అంతేగాక యీమధ్య సరదాకు నేను కొన్ని తేళ్ళను పెంచాను. ఒకప్పుడు నావద్దనున్న తేళ్ళసంఖ్య నూటయాభైకి దాటియుండేది. అందుచేత వాటి యాహారము మున్నగుసంగతులు నాకు తెలుసును. అనేక మార్లు సంగతి కనుక్కోడానికని తేలుకాటు మందుల మంచి చెడ్డలు విచారించడానికని! తేళ్ళ చేత కుట్టించుకుని కొంచెం బాధకూడా పడ్డాను. నాకు తెలిసిన మాత్రాన సంతుష్టిపొందక నలుగురికీ తెలిపిన మంచిదని తోచుట చేతకూడా యీ వ్యాసం బయలుదేరవలసి వచ్చింది.

తేళ్ళలో ముఖ్యమయినవి రెండు రకములు. అవి యేవనగా పెద్దజాతికిచేరిన మండ్రగబ్బలూ చిన్నజాతికి చేరిన మామూలు తేళ్లూను. ఆకుతేళ్లని యింకోరకం ఉందిగాని, యవి యంతగా కనపడవు; వాటివలన అపాయము లేదు. ఒకవేళ అవి కుట్టినా చీమ కుట్టినటులనే కొంచెం సేపు బాధ ఉండును.

మండ్రగబ్బరకమునకు చేరిన తేళ్లు బాగుగా పెరిగిన తమలపాకంత మొదలు పెద్ద చెప్పంతవరకూ ఉండును. ఇంతకంటెకూడ పెద్దరకములు గలవు. ఈజాతికిచేరినవి పొలములలోనూ, అడవులలోనూ పుట్టలలోనూ వుంటాయి. ఇవి కుట్టిన బాధయుండునుగాని ప్రాణాపాయము లేదు. అంత యెక్కువ బాధ కాదు. తేలుయొక్క ఆకృతికే జడిసియే మనిషి యెక్కువగా బాధపడును.

మామూలుగా చిన్నజాతికి చేరిన తేళ్లు తిరిగి మూడురకాలు. నల్లతేలు, ఎఱ్ఱతేలు, మిశ్రమరంగు తేలు. ఇందు మొదటి రెండురకాలు తరుచు కనబడతాయి. వీటిలో మొదటిదానికంటె రెండోరకం కుట్టిన బాధ యెక్కువ. అందుచేతే, 'వాడెక్కడి ఎఱ్ఱ తేలులాంటి వాడు' అను లోకోక్తికూడా కలదు. ఈరెండు రకముల తేళ్ల వలన కలిగిన బాధ మందుపయోగించిన యడల చాలా భాగం తగ్గినప్పటికీ చిమచిమ మాత్రం కుట్టిన జాగాలో యిరవై నాలుగు గంటలవరకూ మామూలుగా ఉంటుంది. మూడవ జాతి తేలు అనగా మిశ్రమరంగు గలది విషతుల్యము. ఇది కుట్టిన యెడల మందు లేదు. మనిషయినను జంతువయినను సరే చావకతప్పదు. దీనిపుట్టుకకూడా విచిత్రమయినదే. ఇది యతి విస్తారమయిన ఉక్కచేతపుట్టును. అంతేకాక కప్పుకుపోయిన పాముకన్నముల యందునో, యెలుకకన్నముల యందునో ఉండే ఉక్కలో యిది బయలుదేరి, యాకన్నము లేకారణంచేతనయినా బయటపడినప్పుడు అది బయటకు వచ్చును. అంచేతే మనవాళ్లు, పామయినా ఏదయినా, గోడలలోనున్న నెరియలలో జొరబడిన జాగ్రతగా దానిని చంపప్రయత్నిస్తారుగాని యాకన్నాన్ని మట్టితోగాని మరి దేనితోగాని మెత్తనియ్యరు. ఏలనన అట్టి కన్నములో ఆపాము చనిపోయి దాని దుర్గంధ పూరితమగు ఉక్క మిశ్రితాలి రంగుగల తేలుపుట్టుట కనువగుసదుపాయం కలుగజేయును. ఇట్టి తేలు బయటపడి ఎవరినయినా కుట్టిందంటే వాడిపని హజామతే.

ఎఱ్ఱజాతి తేళ్లు గొద్దింకలు, గొజ్జిపురుగులు అని పిలువబడు రెక్కల పురుగులను తిని బ్రతుకును. పేడను కూడా తినును. నల్లజాతి తేళ్లు ముఖ్యముగా పేడను మట్టిని తినును. ఇట్టివి సాధారణంగా పిడకలుండు జాగాలలో ఉంటాయి.

తేలు ఒకేసారి ముప్పై మొదలు నలభై వరకూ పిల్లలను పెట్టును. ఆపిల్లలు తల్లి తేలు వెన్ను మీద నుండు

ఒకసన్నని పొర పగిలి బయటకు వస్తాయి. అవి తల్లివెన్ను నంటిపెట్టుకుని దానివెన్నుమీదనే తిరుగుతూ అయిదారు రోజులవరకూ ఉంటాయి. తర్వాత రెండు మూడు రోజులు అవి తల్లి యొడలంతటనూ ప్రాకులాడుచు కాలము గడిపి క్రమేణా తల్లిని వదలి దూరంగా తమ దారిని తాము పోవుట కారంభిస్తాయి.

పిల్లలను పెట్టిన తేలు చావదు. అది చచ్చునని మనవా రనుకొనుట నెర్రి. పిల్లలను పెట్టిన వారంరోజులకు దాని వెన్నుమీదనుండి ఒక తెల్లని పొరవంటి యనగా దేనినుండి యాపిల్లలు బయటకు వచ్చినవో యా మావి ఊడిపోతుంది. అంతేగాని తల్లి తేలు చావదు. నావద్ద సుమా రేడెనిమిది తేళ్లు యీనినవికాని ఒకటియూ చావలేదు. తేలు సాధారణంగా ఒక సంవత్సరంకంటె యెక్కువ కాలం బ్రతికినటుల కనబడదు ఇవి పిల్లలను సాలునకు ఒకటి రెండుసార్లు పెడతాయి. ఎండాకాలం లో విస్తారంగా పిల్లలను పెట్టుట కనబడుతుంది. నావద్ద ఒకే తేలు రెండుత లీనిన కారణమున యీ పైసంగతి చెప్పగలను.

చిన్నచిన్న తేలు పిల్లలను తల్లి తేలు, పై తేళ్లు కూడా తింటాయి. ఇలాతినడం నాకన్నులతో జూచి యితర తేళ్లను ఈనిన తేలువద్దనుండి వేరుచేశాను. పెద్ద తేళ్లను బల్లులు తొండలు పిల్లులు కూడా తింటాయి. తొండ తేలును సులువుగాను బల్లికంటె బాగుగాను తినును.

తేళ్లను సాధారణంగా గారడీవాళ్లు, తేలుమందుల నమ్మేవాళ్లు పెంచుతారు. గారడీవానికి యిది సహాయ ముచేయును. ఏలాగంటే దానికి నేర్పిన యలవాటును బట్టి పేకలోని ముక్కను డెక్కలతో బట్టి బయటకు లాగుతుంది. ఇంకా చిల్లరపనులు తేళ్లచేత చేయించ వచ్చు. తేలుమందుల నమ్మేవాళ్లు సాధారణంగా వాటిని చూపుచు మందులమ్ముతారు. ఎవరినయినా కుట్టించు కొమంటారుకాని కుట్టింపరు. ఎందుచేతనంటె వారి మందుసంగతి యప్పుడే బయటపడుతుంది.

అంతేగాకుండగా మనిషిచేతులలో పెరిగిన తేలు మనిషిని కుట్టదు. అవి మనిషిచే నలవాటుపడి కుట్టుట యను స్వభావమును మరుస్తాయి. మనం కుట్టించుకుందా మని ఎంత ప్రయత్నించినా యా తేళ్లు పెంపుడువయి మనిషిశరీరముమీద ప్రాకుట కలవాటపడినవయినట్లయితే కుట్టవు. ఇట్లు చాలా తార్కాణాలు చూశాను. క్రొత్త తేలును నాలుగైదు రోజులు మనశరీరంమీద అలవాటు చేసి తర్వాత దానిని వదలివేసిననూ దానివలన ఎవరికి నీ భయముఉన్నప్పటికీ బాధలేదు.

తేలుకాటకు మందు అని అమ్మబడు మందు లెన్నియోగలవు. కాని వాటివలన యేవిధమయిన లాభము ఉన్నట్లు కనబడదు. నేను నావంటిమీద సుమా రు నలభయి రేభై రకాల మందులు వాడి చూశాను. ఇందులో బజారులో అమ్మబడే వీ పుస్తకాలలో అనగా ఆయుర్వేద గ్రంథాల్లో చెప్పబడిన క్రియలు అనేకాలు చూశాను. కాని వాటివేటివలననూ నాకుసుఖము గలుగలేదు. మంత్రం కూడ యిట్టిదే. ఈమందులు మంత్రాలు కొంత కొంత మందికి గుణమిస్తాయి. ఈగుణాలు కుట్టిన తేలు రకాన్ని బట్టి యవి పొడచినపోటుయొక్క హెచ్చు తక్కువలను బట్టి ఉంటాయి. మంత్రవేత్తలమని చెప్పువారు ఏమైనా మందువేశావా అని అడిగి మందువేస్తే మంత్రం పనికిరాదు పొమ్మంటారు. అయినా ప్రయత్నిస్తా మంటారు గాని లాభం ఎక్కడోకాని కనబడదు.

మంత్రం సంగతి చూద్దాం అనీ, దానివలన లాభం వుంటుంది అదిమెస్మరిజం (Mesmerism) వంటిది గదా అనీ, దానియందు మంచి నమ్మికతో ఒక రోజున క్రొత్తగా దొరికిన తేలుచేత కుట్టించుకుని ఏవిధమయిన మందూకూడా వేయకుండా మంత్రవేత్తదగ్గరకు వెళ్లాను. మీకేనా తేలుకుడతా అన్నాడు. అవునన్నాను. సరే కూర్చోండని చెప్పి ఏమయినా మందువేశారా అన్నాడు. లేదన్నాను. ఎక్కడ కుట్టిం దన్నాడు. చేతిమీద అని జాగా చూపించాను. సరే చొక్కాతీసె య్యం డన్నాడు. తీశేశాను. లోపలికివెళ్లి నాలుగు క్రొత్త చీపురు పుల్లలు తీసుకవచ్చాడు. చెయ్యి జాప మన్నాడు. చాపేను. దానిమీద ఏదో మంత్రిస్తూ చీపురుపుల్లలతో కొట్టాడు. చెయ్యి విదప మన్నాడు. విదిపాను. ఏలా ఉందన్నాడు. ఆలాగేఉం దన్నాను. పది

గజాల దూరం పరుగెత్తమన్నాడు. పరుగెత్తాను. తిరిగి యటులే నాలుగైదు సార్లు పరిగెత్తమన్నాడు. పరుగెత్తాను. చెయ్యి విదపమన్నాడు. నాలుగైదుసార్లు విదిపాను. కూర్చోమన్నాడు, కూర్చున్నాను. చేతితో నేలమీద ఠక్కిక్కొద్దీ గ్రుద్దమన్నాడు. బాధలో గ్రుద్దగలిగినంత యిదిగా గ్రుద్దాను. ఎలా ఉందన్నాడు. అలాగే ఉందన్నాను. తిరిగి మంత్రంవేశాడు. తిరిగీ పైరీతిగానే వ్యాయామం చేయించాడు. ఎలాఉందన్నాడు. తప్పకుండా మంత్రంవల్ల పోతుందని గట్టినమ్మకంతో వచ్చిన నాకు మంత్రంవల్ల యేవిధమయిన మేలు కలుగలేదు. పాపం నాలుగైదు సార్లు మంత్రించాడు. ఒకటి రెండు రకాలమంత్రాలు ప్రయోగించాడు. కాని లాభం లేకపోయింది. మీకు కుట్టింది చాలా చెడ్డ తేలండి బాగాకూడా కుట్టినట్టుగా ఉంది. అయినా ఒక గంటలోపుగా పోతుంది. ఇంటికెళ్లి యీలాచేయండని ఓప్రక్రియచెప్పాడు. మంత్రం సంగతిలా అయిందికదా అని అనుకుంటూ యింటికిపోయి నామామూలు ప్రక్రియ చేసుకున్నా. గాని మంత్రంవేశేటప్పుడు మంత్రవేత్త నాకిచ్చిన వ్యాయామంవల్ల అపరిమితమయిన చెమట పట్టింది. మంత్రానికి యీ exerciseకు సంబంధం యేమిటాయని యాలోచిస్తూ మర్నాడు కొన్ని పుస్తకాలు తిరగేశాను. ఒకపుస్తకంలో ఓఇంగ్లీషు డాక్టరు ఏమన్నాడంటే తేలు కాని, పాముగాని కరచినప్పుడు మనవాళ్లు పైకెక్కుతుందేమో యని కట్టుకట్టినరీతిగా కట్టుకట్టక కుట్టినభాగమున వేడినీళ్లు పోసియు, బాగుగా మర్దించియు నాభాగమునకు అపరిమితమయిన వ్యాయామం యిమ్మనమన్నాడు. ఆలా యిచ్చిన యెడల యావిషం శరీరమంతటా వెంటనే ప్రవహించి శరీరమందంతటనూ ఉన్న రక్తములో కలసిపోయి యారక్తములోఉన్న జీవములవలన తినివేయబడుతుందన్నాడు. ఆలాచేయక కట్టుకట్టుకు కూర్చున్నచో ఆవిషమును అక్కడవున్న రక్తము పూర్తిగా తినివేయలేని దగుటచేత యాభాగం చచ్చిపోయి ఆకారణంచేత శరీరమంతయూ క్రమేపీ చచ్చిపోవునన్నాడు. అనగా ఆభాగమునుండి చావు ప్రారంభమవునన్నాడు. ఇది పాములవిషయంలో తప్పదన్నాడు. అందుచేత ఏదయినను కుట్టిన వెంటనే యాభాగమున కపరిమితముగాను తదితరభాగములకీ కూడా కసరత్తు యివ్వాలన్నాడు. ఆలాటి కసరత్తువలన బాధ త్వరలో పోవునన్నాడు. అప్పుడు మంత్రవేత్త నాకిచ్చిన వ్యాయామమునకు అర్థం తెలిసింది. బహుశా మంత్రంవల్ల కాకపోయినా వ్యాయామంవల్లనయినా తగ్గిపోతుందని మనవాళ్లు మంత్రం తంత్రం కలిపి యేర్పాటుచేశారని బాగుగా తట్టింది.

ఈపైది మంత్రం సంగతి. ఇంక మందుల సంగతి చూడగా అదీ ఆలాగే కనబడుతోంది. ఆయుర్వేదంలోని తేలుకాటుకు యాభయి యరవై మందులు చెప్పాడు. ఒకొక్క తత్వానికి ఒకొక్క మందుట! తత్వాన్నిబట్టి మందు పనిచేస్తుందిట!! కాని యాతత్వాలు తెలిసికొని మందిచ్చేవారు ఏరీ!!!!

నాకు తెలిసినంతవరకూ మనిషి తత్వాలతో పనిలేకుండా తేలుకుట్టిన బాధ పోవును అని చెప్పుటకు తగిన మందులు మూడున్నాయి. ఆమూడు మందులూకూడా తేలుయొక్క శరీరముచేతనే తయారు కాబడుతూ ఉన్నాయి. ఈ కారణముచేతనే పాశ్చాత్యదేశీయుల Anti-Philaria, Malaria, cholera మున్నగు Injections and Vaccines మాదిరిగా పనిచేసిన పైమందులు తేలు వలని బాధను అణుస్తాయి. ఈపైని వేర్కొనిన యింగ్లీషు మందులలో గుణములు లేని వున్నాయికాని తేలుమందట్టిది గాదు. ఏలన అది లోపలికి inject చేయవలసిన పనిలేదు.

ఇంగ్లీషు డాక్టర్లు తేలుకాటుకు injections అనిపేరు పెట్టి మత్తుగలిగించి బాధకనబడకుండా చేయుటకు Morphia injection యిచ్చుచున్నారు. ఇది చాలా తప్పుపని. బాధపోవుటకై యది తెలియకుండనుండుటకు మందట! ఇది బాధ పోగొట్టుటయా లేక దానిని గప్పి పుచ్చుటకుగాను యింకో విషాన్నికూడా శరీరమున జేర్చుటయా?

నేను చెప్పే మందులు కొంచెం వినండి. ఇవి సులభమున్నూ సులువును కలుగజేసేవిన్నీయై వున్నాయి.

౧. తేలుకుట్టినప్పుడు సాధారణంగా అది మన కంటబడుతుంది. అప్పుడు దానిని చంపివేస్తాం. చంపిన పిదప దాని రక్తమును లేక రసిని తీసి యది కుట్టినచోట మర్దనా చేసినయెడల తేలుబాధ వెంటనే పోవును. చిమచిమకూడా ఉండదు. కాని ఆభాగం మాత్రం యిగవై నాలుగు గంటలదాకా కడిగివేయరాదు. ఇది కూడా అనుభవంమీదే చెప్పుతున్నా.

౨. తేలు కనబడినప్పుడు దానిని చంపి ఒక నల్ల ఉమ్మెత్తకాయలో ఉంచి గుడ్డచుట్టి మట్టిరాసి కుమ్ములో పెట్టి తేలుతో సహా అది ఉడికిన పిదప తేలుతో సహా కల్వంలో ఉంచి నీరుల్లిపాయల రసం పోసి మర్దించి కణికగా చేసికొని యుంచి యెవరికయిననూ తేలుకుట్టినప్పుడు కణికను నీటిలో నరుగదీసి రాసి గుడ్డపాగ వేయవలెను. గంధమారగానే బాధపోవును.

3. నాలుగయిదు బాగుగా పెరిగిన తేళ్లను సంపాదించి వాటిని చంపి ఒక గాజుసీసాలో వేయుము. తర్వాత సీసాలో రెండుఅవున్సుల కిరసనూనెను పోయుము. ఆసీసా నాలుగు నెలలపాటు అట్లే యుంచవలెను. పిదప తేళ్లను తీసిపారవేయవచ్చును. అప్పుడు తేలుసారము extractum of scorpion తయారగును. ఎవరికయినా తేలుకుట్టినచో దూదితో యాకిరసనూనెను కొద్దిగా మర్దనా చేసిన యెడల బాధ వెంటనే పోవును.

అవసరాన్నిబట్టి ఏ మందయినా వాడవచ్చును. భోజనమునకు ముందు తేలుకుట్టిన భుజింపకుండుట మంచిది.

---

## స్వప్న కేళి

కె. అన్నమరాజశర్మ గారు

శిలలు గిరికంధరంబులు సెలలు తరులు - శాద్వలంబులు తారలు శాంతి నెపుడు
భావనాస్పందవాణినిఁ బలుక నేర్చు - తన్నిశాయామమే నాకు ధన్యతమము!

తరుణ శరదిందు చంద్రికా ధౌత మృదుల - పులినశోభిత వాలుకాభూములందె
మౌనముద్రను ధ్యానసమాధిలో ని - లీన మొందుదు స్వప్నడోలికలు కదల.

ఎచట మలయమారుతకాలువ లెద చలింప - స్వాదురాగాలతో రహఃస్థలము లంటి
చలువరానేల నొఱయుచు సందడించు - నదియె నాస్వప్నకేళికి నాటపట్టు.

సౌరభోద్గార మంద నిశ్వాసగతుల - నిండువెన్నెల సరసిని నృత్యమాడు
కలువకన్నియ లేనవ్వుకాంతిఁ జిలికి - స్వర్గసోపానపఙ్క్తుల సంతరించు.

---

# సింగరేణి బొగ్గుగనులు—హైదరాబాదు (దకను)

అ. వెం. రామచంద్రరావు గారు, బి. ఏ., యల్. టి.

సింగరేణి కోలరీసు కంపెని లిమిటెడ్ సుమారు నలుబది సంవత్సరముల క్రిందట స్థాపింప బడెను. అప్పటినుండియు రాత్రింబగళ్లు గనులలోని బొగ్గును తవ్వుచునే యున్నారు. ఎంత త్రవ్వినను బొగ్గునకు అంత మనుమాట లేకుండ నున్నది. బొగ్గు గనులున్న పట్టణము "ఎల్లండ"ను పేరకూడ పిలువబడుచున్నది. రైల్వేస్టేషను మాత్రము కంపెని పేరట 'సింగరేణి కోలరీ'సని పిలువ బడుచున్నది.



'ప్రిట్' గని రెండు 'లిఫ్టు'ల దూరదృశ్యము

హైదరాబాదు రాజ్యములో చూడదగిన పెక్కు స్థలములు కలవు. ప్రతిసంవత్సరము హనుమకొండలోని సహస్రస్తంభదేవాలయమును, హనుమకొండకు నలుబది మైళ్లదూరమున నున్న రామప్పదేవాలయమును, ఓరుగల్లు దుర్గమును, ఔరంగబాదుజిల్లాలోని ఎల్లోరా అజంతా గుహాలను జూచుటకనేకులు వచ్చుచుందురు. ఇంగ్లాండు నుండి వచ్చు ప్రతియుద్యోగియును తాను మరల స్వదేశమునకు బోవుటకు ముందు వీటి నన్నిటిని దర్శించి పోవుచుండును. ఒకనెలరోజుల క్రిందటనే మద్రాసు గవర్నరుగారగు గోషన్ ప్రభువుగారు ఎల్లోరా అజంతా గుహాలను దర్శించి వెళ్లిరి. హైదరాబాదులోని పైనుడ్పిన బొగ్గుగనులు కూడ నైజాము రాజ్యములో చూడదగిన వాటిలో ముఖ్యమైనవని తెలిసికొనవలెను.

సింగరేణికి వెళ్లుటకు 'డోర్నకల్' జంక్షనులో దిగవలెను. బెజవాడనుండి డోర్నకల్ కు మెయిలులో మూడు ఘంటలుమాత్రమే ప్రయాణము. అక్కడ సింగరేణికిపోవు రైలుబండ్లలో డోర్నకల్ కు వచ్చు ప్రతి బండికిని నొక టెప్పుడును సిద్ధముగానుండును. డోర్నకల్ నుండి సింగరేణి పదునాగుమైళ్లకన్న నెక్కువ దూరము లేదు. ఎత్తుపల్లముగల అడవిప్రదేశముగుండ రైలు పోవుటవలన సుమారు ఒకటిన్నరగంటకాలము సింగరేణిజేరుటకు పట్టును. ఆ రైలుమార్గము బొగ్గుకొరకే వేయబడినది. సింగరేణినుండి వచ్చు ప్రతిరైలునకు సుమారేబది బొగ్గు "వేగనులు" (waggons) తగిలింపబడును. అందుచే రైలు త్వరితముగ పోవుటకు వీలులేదు. అట్లే డోర్నకల్ నుండి పోవు ప్రతిరైలు 'ఖాలీవేగను'లను తీసికొనిపోవుచుండును.

బొగ్గుగనులను గూర్చిన సరియైనజ్ఞానము కలవారరుదని చెప్పవచ్చును. పుస్తకములలో ఇంగ్లాండులోని గనులనుగురించి మనము చదివియుందుము. ప్రతివిద్యార్థికిని ఇంగ్లాండులోని బొగ్గుగనులలో పనిచేయు కూలివాండ్రు "డేవి" (Davy) అను శాస్త్రజ్ఞుడు కనుపెట్టిన సేఫ్టి ల్యాంప్ (Safety lamp) పట్టుకొని పనిచేయుదు

యని తెలిసియుండవచ్చును. ఆ 'సురక్షిత దీపము' కని పెట్టుటకు పూర్వము గనులలో అనేక ప్రమాదములు జరుగుచుండెను. సింగరేణి గనులలో అట్టి దీపమే అవసరము లేదు. తమంతట నవి అంటుకునపోవు ప్రమాదవాయువు లెక్కడ లేవు. ఈ కంపెని 'జనరల్ మేనేజరు' గారు గనులలోనికి బోవుటకు ఉత్తరవిచ్చెదరు. కాని సింగరేణికి వచ్చుటకుముందే వారి ఉత్తరవు పుచ్చుకొనుట మంచిది. లోకల్ ఫండ్ (Local Fund) వారు ప్రయాణీకుల కొరకు నిర్మించిన బంగాళాయొకటి బస చేయుటకు చాల సహాయముగా నున్నది. దానిలో మంచములు, కుర్చీలు, బల్లలు మున్నగునవన్నియు అమర్చబడియున్నవి. మూడు కొళ్లాయిలు, స్నానమున కొకగది, ఒకవంటయిల్లు మున్నగునవన్నియు అందున్నవి. సింగరేణిలో మంచి 'హొటల్సు' లేకపోవుటవలన వెంట నొక వంటమనిషిని తీసికొనివచ్చుట మంచిది. భద్రాచలమునకు పోవు యాత్రికులు సింగరేణిలో దిగి మోటారుబస్సు యెక్కి వెళ్లుదురు. భద్రాచలము సింగరేణినుండి నలుబది మైళ్లు దూరమునన్నది. వారు గనులు చూచుటకు ప్రయత్నించవలెను. అనేకులు గనులలోనికి పోవుట యనిన భయపడుదురు. భయపడుటకు తగిన కారణమేమియు లేదు.

ఇప్పటివరకును కంపెనివారు యిరువదిమూడుగనులు (Pits) త్రవ్వినారు. బొగ్గు అయిపోవుటచే యిరువది గనులు మూయబడినవి. ఇప్పుడు ౨౦, ౨౨, ౨౩ నెంబర్ల గనులే పనిచేయుచున్నవి. వీటిలో 21వ నెంబరుగని 'స్ట్రిట్' గని (Strutt Pit) మిక్కిలి పెద్దది. తక్కిన రెండుగనులనుండి త్రవ్వు బొగ్గుదీనిలోనిబొగ్గునకు సమానము కాజాలదు. దినమునకు సుమారు రెనుబది 'వేగనుల' బొగ్గు త్రవ్వబడుచున్నది.

'స్ట్రిట్' గని యొక్క లోతు సుమారు యెనిమిది వందల అడుగులు. నలుబది గజముల దూరమున రెండు బావులు త్రవ్వబడియున్నవి. ప్రతిబావిలోను రెండు పెద్ద లిఫ్టులు (big lifts) గలవు. ఇవి క్రిందికి మీదికి మూలమున లాగబడుచుండును. ఒక 'లిఫ్టు' క్రిందకు పోవునపుడు మరియొకటి మీదకు పోవును. ఈ 'లిఫ్టులో' ఒకమారు పదునారుగురు మనుష్యులు పోగలరు. 'లిఫ్టు' గనిలోనికిపోవుట కొక్క నిమిషముకన్న నెక్కువపట్టదు. గనిలోపల శుభ్రమైనగాలి వచ్చుటకు మంచియేర్పాటులు చేయబడియున్నవి. ఒక 'యంజను'చే గొప్ప పంకాయొకటి భూభాగమున నడుపబడుచున్నది. ఆ పంకామూలమున వచ్చుగాలిని చల్లపరచి యొక్కగొట్టముద్వారా గనిలోనికి పంపుదురు. సుమారు పదునైదువందల అడుగుల పరిమాణపు గాలి ప్రతినిమిషము లోపలికి పంపబడుచుండును. వేరే యంత్రమొకటి లోపలనుండు చెడుగాలిని పైకి లాగివేయుచుండును. గనిలోపల త్రాగుటకు స్వచ్ఛ



'స్ట్రిట్' గని చేరువదృశ్యము-కూలీలు, వరంగల్లు ఉస్మానియా కాలేజి స్వచ్ఛందసైనికులు

మైన నీరున్నది. భూగర్భములోనున్న నీరగుటచే అది చాల రుచికరముగను, దేహారోగ్యకరమునునై యున్నది. గనిలోని నీటిని, పైకిపోవునటులు చేయుటకు లోపల పెద్దయంత్రములు కొన్నియున్నవి. అవి గనిలోని నీటినంతయు నాలుగు ఘంటలలో పైకి తోడగలవు. లోపల కొళాయిలు చాల యున్నవి.

'లిఫ్టు'లో లోపలకు పోవునపుడు దారి అంతయు చీకటిగానుండును. ఒకటి రెండు 'ఎలక్ట్రిక్' దీప

ములు తప్ప వేరేమియు కానరావు. లోపలకు పోవువారి సహాయార్థమై కంపెనివారు ఒకరిద్దరి మనుష్యులను బంపుదురు. వారివద్ద దీపములుండును. గనిలోనికి పోయిన తక్షణమే మరియొక వింతదేశమునకు పోయినట్లుండును. లోపల రాధారిమార్గములలో కొన్ని 'ఎలక్ట్రిక్' దీపములున్నవి. బొగ్గుతీసికొనివచ్చు డబ్బాలకొరకు(trucks) రెండు జతలపట్టాలు మార్గములో నమర్చబడియున్నవి. బొగ్గుత్రవ్వు ప్రదేశములు బావిలోపల భాగమునుండి రెండు మూడు మైళ్లువరకు గలవు. 'లిఫ్టు'దగ్గరకు బొగ్గు డబ్బాలలో తేబడుచుండును. రెండుడబ్బాలు బొగ్గుతో ఒక్కమారుగా 'లిఫ్టు'లో పైకిబంపబడును. క్రిందికి పోవు 'లిఫ్టు' మూలమున రెండుఖాళీడబ్బాలు లోపలకు పోవుచుండును.



'లిఫ్టు' లను పైకి లాగుటకై బావిపై నమర్చియున్న యంత్రపరికరము

గనిలోపల ప్రమాదకరమైన వాయువు లేమియు లేవు. కూలీలు యిలాయిదీపములనే పట్టుకొనిపోవుదురు; వారు చుట్టను నోటచెట్టియే పనిచేయుదురు. చలికాలమున వారు బొగ్గుముక్కలను అంటించి చలి కాచుకొందురు. సుమారు వెయ్యమంది కూలీలు గనిలో రాత్రింబగళ్లు పనిచేయుచుందురు. ఒక్కదినము కష్టపడవలసిన పనివాండ్రు మూడుజట్టీలుగా విభాగింపబడి ఒకరితరువాత మరొకరు వచ్చి పనిచేసి పోవుచుందురు. ఒక్కొక్క పనివాడు యెనిమిదిఘంటలు చీకటిలో యిలాయిదీపము పట్టుకొని పనిచేయవలసియున్నది. పగ లెనిమిది ఘంటలు పనిచేయువాండ్రు సూర్యరశ్మి చూచుటయే దుర్లభము. పగలంతయు లోపల నుండుటచే వారు పైకివచ్చుసరికి సాయంకాలమగును.

రాత్రి యెనిమిదిఘంటలకు కూలివాండ్రు పనికి పోవుదురు. ప్రతివాని చేతిలో యొకదీపముండును. అట్టి వందలకొలది దీపములు రోడ్డులమీద జూచుటకు నయనానందకరముగా నుండును. కూలివాండ్రయందు అనేకదేశస్థులుందురు. గనులు కనిపెట్టినపుడు ఇక్కడి కూలివాండ్రు పనిచేయుటకు భయపడిరట. అందుచే పంజాబునుండి, ఒరిస్సానుండి కూడ వచ్చి నివాసముల నేర్పరచుకొన్న పనివాండ్ర నేకు లిక్కడ నున్నారు. వారిలో నెవరిని జూచినను ఆరోగ్యముగను, దృఢముగను కనబడరు. సామాన్యపు కూలివాడు రోజునకు ౮ అణాలు మొదలు ఒకరూపాయివరకు గడించును. వచ్చిన ఆదాయములో సగము త్రాగుడునకుపోవును. ఎనిమిదిఘంటలు సూర్యరశ్మి లేని గనులలోపనిచేసి త్రాగెడి కూలివాండ్రకు ఆరోగ్యమెట్లుండును?

'స్క్రీట్'గని పైభాగమున బొగ్గును విడదీయుటకు మంచి యంత్రములు గలవు. నెంబరు ౨౧, ౨౨ గనుల నుండి కూడత్రవ్విన బొగ్గ కూడ ట్రక్కులలో 'స్క్రీన్'గని దగ్గరకు తేబడుచున్నది. ఇక్కడ బొగ్గును జల్లించుటకు, రకరకముల బొగ్గును విడదీయుటకు, బొగ్గులోని రాళ్లను విడదీయుటకు దగిన యంత్రములు గలవు. బొగ్గ అనేకవిధములుగా నున్నది. అన్నిటికంటెను గుండ్రబొగ్గ చాల మంచిది. ఒకవెడల్పయిన పట్టామీద బొగ్గ పోవునప్పుడు సుమారు వందమంది పనివాండ్రు రాళ్లను, చెడ్డ బొగ్గును విడదీయుట కానవచ్చును. మంచిబొగ్గ దానంతటనే రైలు 'వేగనుల'లోపడును.

గనిలోని బొగ్గు యేర్పడియుండు విధము చూడ వగియున్నది. సుమారు యేడుఅడుగుల దూరమునున్న రెండు రాతిపొరలమధ్య బొగ్గు గాననచ్చును. అందు లోను పైభాగమున గల బొగ్గు అంత మంచిదికాదు. మధ్య ను యిసుక రాతి పొరయుండును. క్రింద భాగమునున్న బొగ్గు అన్నిటికంటె శ్రేష్ఠమైనది.

రగుచుండును. పట్టణమంతకును మంచినీటిని సరఫరా చేయు తటాక మొకటి మిక్కిలి పరిశుద్ధముగా నుంచబడి కంపెనీవారి స్వాధీనమున నున్నది

ఊరికి మరియొకప్రక్క కంపెనీకంతయు విద్యుచ్ఛక్తినిచ్చు గొప్ప యంత్రశాల (Power House) యొకటి కలదు. అందారు పెద్దడైనమోలున్నవి. ఇంజనులకు కావలసిన నీరు ఖాళీఅయిన "ఉస్మానియా" గనినుండి వచ్చును. ఆనీటి రం గెఱ్ఱగా నుండును. 'బాయిలర్ల'కు నుపయోగించుటకు పూర్వ మా నీటిని శుద్ధిపరతురు. సిలిండర్లలో నుండి వచ్చునీరు వేడిగా నుండును. దానిని చల్లపరచుటకు గొట్టములనుండి నీరు జల్లులు జల్లులుగా ఒక చెరువులో పడున ట్లేర్పాటు చేయబడియున్నది. సుమారు నూరు జల్లుగొట్టము లచ్చట నున్నవి. నీటితుంపరలు యెప్పుడును గాలిలో నుండుటచే ఉదయమున పదకొండు ఘంటలలోపలను మధ్యాహ్నము రెండుఘంటల తరువాతను మనమక్కడ ఇంద్రధనస్సును చూడగలుగుదు మనుట పైన వ్రాయబడిన వింతలలోకెల్ల వింత.



సింగరేణి కోలరి తటాకముపైనున్న 'వార్ఫు' (wharf)

గనికి సమీపమున యొకపెద్ద కార్ఖానా గలదు. అందు కంపెనీకి కావలసిన యానత్తు సామగ్రియు తయా

---

# పురుషోత్తమక్షేత్ర తత్త్వము

శ్రీ విక్రమదేవవర్మ గారు

అలర సుభద్ర బ్రహ్మగ మహాహలి హాలహాలాళినుండుగా
నలపురుషోత్తముండు కమలాక్షుఁడుగాను త్రిమూర్తు లావలన్
జెలువుగ వాణియు న్విమల శ్రీయుఁ ద్రిశక్తులు గాఁగఁ దోఁచుటన్
సులలితభక్తిచేఁ బురిని సొంపుగఁ గొల్తుము నిత్య మాత్మలోన్.




కమ్మనితావి — ఉమర్‌ఖయ్యాం.

# హైందవ సాంఘిక పరిణామము

వల్లూరి సూర్యనారాయణరావు గారు

ప్రస్తుతము మనహైందవ సంఘములోని మూఢాచారము లన్నిటికిని పూర్వాచార పరాయణులు మూడువేల సంవత్సరములక్రింద వ్రాయబడిన గ్రంథములనుండి ప్రమాణములను కనుపరచెదరు. ఈప్రమాణములలో ఎన్ని పరస్పరభేదము లున్నను, వీనినన్నిటిని సమన్వయము చేయగల సమర్థులు వీరిలో కలరు. మానవకోటిలోని యితర సంఘముల చరిత్రలుగాని, వారి ప్రస్తుతాచారములుగాని, వానిలో అనుసరించతగినవి, కూడనివిగాని, వీరి కేమాత్రమును తెలియవు. ఆయాసంఘములలో, ఆచారముల కెట్టి పరిణామములు కలిగినవో వానిని మనవానితో పోల్చినపుడు, సాధక బాధకము లేవి బయలు దేరునో వీరు గ్రహింపజాలరు. సాంఘికాచార పరిశీలనమే వీరికి గిట్టదు. ఈ కలియుగములో మంచిచెడ్డలు రెండును ప్రతిమానవసమాజములో వృద్ధియగుచున్నవనియు, ఏసంఘము గాని లోపములులేక ఆదర్శప్రాయమైన పరిపూర్ణావస్థ పొందనేరదనియు వీరికి తోచదు. శాస్త్రములలో చెప్పిన నిత్యనైమిత్తిక విధులాచరించనివారు రౌరవాదినరకములలో పడుదురనియే వీరి యభిప్రాయము. అన్యమతములవారికి మోక్షము చేకూరదనియే వీరి తలంపు. వీరికి మార్పుఅనగనే తలకంటగింపు.

ఇట్టివారి మాటలను నవనాగరికవిద్వాంసులు పెడచెవిని పెట్టినను, వీరికి మూఢులైన జనసామాన్యముమీద ఇంకను పలుకుబడి యుండుటచేత, ప్రతిసంఘ సంస్కరణమునకు వీరి పాండిత్యము అడ్డుతగిలి, మన విదేశీయపరిపాలకులు మనమతముతో జోక్యము కలిగించుకొనుచున్నారని మాటిమాటికి వారిని, మన ప్రజాప్రతినిధులను వీరు భయపెట్టుచుందురు. రాజకీయస్వాతంత్ర్యములకు ముందుకు దూకెడి మననాయకులు ప్రజలను బాధించుట ఈ సామాజిక దాస్యశృంఖలములను పడగొట్టుకొనజాలకున్నారు.

ప్రతివ్యక్తియొక్క మతము అతనికిని పరమాత్మకును సంబంధించినవిషయము. సామాజికవ్యవస్థలతోగాని, రాజకీయవిషయములతోగాని అట్టిమతమునకు ఎట్టిసంబంధ ముండకూడదు. ప్రజల ఐకమత్యమునకుగాని, వారి శరీరమానసారోగ్యములకుగాని భంగము కలిగించు మతసూత్రములును, అవి యెంత పురాతనములైనను, ఎంతపవిత్రము లైనవని భావించినను, త్రోసివేయకతప్పదు. కాబట్టి నిష్ఫలమని యెంచబడు కర్మకాండను ఎంత తగ్గించుకొన్న అంతమంచిది. ఇది నీతితోగాని మోక్షసంపాదనతోగాని సంబంధించదని చెప్పుటకు మనకర్మభూమిలోలేని అనేకకోట్లప్రజ

లుండుటయే నిదర్శనము. వారందరు దేవుని పుత్రులైనపుడు వారిని కర్మబాహ్యులుగ జేసి, నరకమునకు ఆయన పడద్రోయునా? ఈభారతదేశములోనైనను, సన్యాసులకు ఈకర్మకాండతో పనిలేదటగాని, గృహస్థులుమాత్రము దీనిలో మునిగి తేలుచుండవలెనట! పూర్వకాలములోని వర్ణాశ్రమధర్మములలో ఎట్టి మార్పులు చేయకూడదట! ఏమార్పులనైనను ప్రజాసామాన్యములో చొప్పించవలెనన్న, మన యాచారవ్యవహారములన్నిటిలో వేదకాలమునుండి అవి యెప్పుడెప్పుడు ఎట్టి పరిణామము పొందినవో, యెట్లు ప్రస్తుతకర్మకాండ వృద్ధియైనదో, యేకారణములచేత ప్రస్తుతమున నది నామమాత్రావశేషముగ నున్నదో మనము బాగుగా గ్రహించి, మంత్రార్థము తెలియని మూఢపురోహితుల చేతులలో కీలుబొమ్మలమై ఉళక్కి మాటలతో పిచ్చిపిచ్చి కర్మలను మనవా రందరు ఏల చేయుచుండవలెనో తెలిసికొని, మన నవనాగరికపండితులు విచారించి గ్రంథములను దేశభాషలో వ్రాసి ప్రచారము సలుపవలసియున్నది.

నూతనముగా క్రొత్తమతము సృజించనక్కఱలేదు. మనవలెనే ముక్కు చెవులుగల ఒక దేవుడు(Anthropomorphic God), నరకస్వర్గములును ఉన్నవని బోధించు బ్రహ్మసమాజము విజయము నొందినదా? వేదములుమాత్రము అపౌరుషేయములనియు, వానిని శిరసావహించి వానిలోని కర్మలనుమాత్రము ఆచరింపదగునవియు బోధించు ఆర్యసమాజమంత్రము మనలో వ్యాప్తిచెందినదా? భక్తిజ్ఞానవైరాగ్యములను బోధించు మనవేదాంతమే మనకు శరణ్యము. ప్రపంచములోని మతసాంప్రదాయము లన్నియు మన హిందువులలో కనపడుచునేయున్నవి. కాని సమస్తనీతిసూత్రములకును మనవేదాన్తమే పునాది. మనశ్శుద్ధికొఱకును, చిత్తనిరోధముకొరకును మూడువేలేండ్లక్రింద ప్రతిపాదింపబడిన కర్మకాండయంతయు ఈ కాలమునకు పూర్తిగా పనికిరాదనుటకు దాని ప్రజోల్లంఘనమే తార్కాణము. మన వేదాంతము నిశ్చయముగా ప్రచ్ఛన్నబౌద్ధమతమే. అయినను దానివలన నష్టమేమి? ఆరెండును నైతికసూత్రముల కన్నిటికిని సహేతుకములైన పునాదుల నంగీకరించెను. నిర్వాణమనుడు, మోక్షమనుడు, ఈరెండును జన్మపరంపరలవలనగాని సిద్ధించవు. క్రైస్తవ బ్రాహ్మసామాజిక మహమ్మదీయమతములు ఏకేశ్వరోపాసనను ప్రతిపాదించినంతమాత్రమున ఆధ్యాత్మిక విషయములలో మనలను తృప్తిపొందించ జాలవు. పూర్వజన్మములలోని కర్మలఫలములను మన మనుభవించవలయుననియు, దైవదూషణ భూషణములు మన కెప్పటికిని ఉపచరించవనియు, కర్మఫలక్షయ మగుటకు కర్మ భక్తి జ్ఞాన యోగములు సాధనములు మాత్రమే యనియు మన వేదాంతము బోధించుచున్నది. ఈ వేదాంతసూత్రములు సులభశైలిని సామాన్యప్రజలకు కూడ బోధపడునట్లు చెప్పవలెనుగాని, పుక్కిటిపురాణములు, అభూతకల్పనలు, గాథలు, వెర్రిమొర్రి కర్మ

కాండలు మొదలగువానియందు మూఢవిశ్వాసములను ప్రబలచేయుట పాపమని నాతలంపు. కొంతవరకైనను హేతుపూర్వకముగాని నమ్మకములను (Dogmatic beliefs) ప్రజల మనస్సులనుండి పారద్రోలవలెను. కొన్ని నైతికసూత్రములను బోధించుట కేర్పడిన కల్పనాకథలను వేదవాక్యములుగా భావించ వలసినదని పసిబాలురకు కూడ చెప్పకూడదు. ఈకాలములో ప్రపంచములోని మానవసంఘములను మొత్తముమీద నైతికపదమును త్రొక్కించునవి రాజకీయసాంఘిక శిక్షలేగాని నైతికశిక్షలు కావు. కేవలము పరలోకశిక్షలు సన్మార్గమునకు ఈనవయుగములో త్రోవ చూపజాలవు.

ఒకవేళ ఇంకను కొంతకాలమువరకు జనసామాన్యమునకు మతవిశ్వాసము లవసరమైనను, మనసంఘాభివృద్ధి హానికరమగు మూఢాచారములు, వెర్రినమ్మకములు, అతిక్లిష్టమైన కర్మకాండలు త్రోసివేయబడునట్లు ప్రచారము సల్పుట మన నవనాగరిక పండితుల విధి. ఒక్కసారిగ సాంఘికవిప్లవము రాకుండ, మనలను బంధించిన కొన్ని శృంఖలములను వదలించుట మిక్కిలి యవసరమని నమ్ముచున్నాను. మనలోని వర్ణములు, వివాహములు, నైతిక సూత్రములు, స్త్రీ స్వాతంత్ర్యము, కర్మకాండ, శౌచా శౌచములు, దేవతలు, దయ్యములు, విదేశగమనము, అస్పృశ్యత, పంక్తిభేదము, దృష్టిభేదము, ఈ మొదలగు సాంఘికవ్యవస్థల పరిణామములను గురించి ప్రజలలో ప్రబోధము కలుగవలెనన్న మనమతగ్రంథముల నుండియే సరియైన ప్రమాణములను కనుపరచి, వీనిలో క్రమక్రమముగ మార్పు లెట్లు వచ్చినవో, వీనిని మతముతో సంబంధించునట్లు చేయుటవలన, ఎట్టి యనర్థకములు మూడుచున్నవో, స్పష్టముగ దేశభాషలలో తెలుపవలెను. మనవిదేశీయ ప్రభుత్వములో ధర్మజ్ఞసభలు లేకపోవుట వలనను, ఒకవేళ కొన్ని నెలల క్రిందట కాశీలో కూడినట్లు పండితసభల నేర్పాటుచేసి తీర్మానములు కావించినను వాని నమలులోపెట్టుటకు మనస్వదేశ ప్రభువులు లేకపోవుట చేతను, శాసనసభ్యులు బిల్లులు ప్రవేశపెట్టుటకు జంకుటచేతను, సంఘసంస్కరణములు విరివిగ జనబాహుళ్యములో ప్రచారణలోనికి వచ్చుచుండలేదు. సంస్కృతాంగ్లేయ భాషలు రెంటిలోను సమర్థులై, పక్షపాతము వహించని పండితులు ఈ సాంఘికాచార విమర్శనగ్రంథములను వ్రాయవలెను. నేను సంస్కృత పండితుడను కాకపోయినను, ఆంగ్లేయభాషలో ననువదింపబడిన మన మతగ్రంథములను బట్టి మనపండితులు విమర్శించతగిన కొన్ని ముఖ్య విషయములను సూచించుచున్నాను.

శ్రుతిస్మృతిపురాణములలో విరోధము కనబడునపుడు పూర్వపుది తరువాతిదానికంటె బలీయమని ఆపస్తంబులవారు, జాబాలి, కుల్లూకభట్టు, జైమినిమహర్షి మొదలగువారు చెప్పియున్నారు. ఋగ్వేదకాలములో ఇప్పటి వర్ణములు లేవు. కాని తరగతుల భేదము

లున్నవి. అన్యోన్యవివాహములు, భోజన ప్రతిభోజనము లుండెను. ప్రతివర్గమువారును వారికిష్టమైన వృత్తుల నవలంబించవచ్చును. ఆకాలములోకూడ మంత్రములు బాగుగా తెలిసినవారు బ్రాహ్మణులని పిలువబడి గౌరవమును పొందుచుండిరి. క్రమక్రమముగా వారియాధ్యాత్మికజ్ఞానమువలనను, నైతికవర్తనమువలనను ఇతరవర్ణముమీద పలుకుబడి కలిగించుకొనిరి. ఇట్టి సద్గుణము లలవరుచుకొను క్రింది వర్ణములవారు బ్రాహ్మణవర్ణములోనికి తరుచుగా పోవుట కలదు. ధార్ష్ట్రియను క్షత్రియవంశము బ్రాహ్మణులైనట్లు భాగవత పురాణములో చెప్పబడియున్నది. గార్గ్య, తర్యారుణి, కవి, పుష్కరుణి మొదలగువారు మొదట క్షత్రియులుగానున్నను తరువాత బ్రాహ్మణులైరి. బ్రాహ్మణుడైన భరద్వాజుని భరతుడు తనకుమారునిగ బెంచుకొనెను. క్షత్రియుడైన నాభాగుడు వైశ్యుడాయెను. దాసీపుత్రుడైన కవషుని గొప్పఋషిగా తక్కినఋషులందరు అంగీకరించి, ఆయనను కొలిచిరి. వర్ణవ్యవస్థ గుణకర్మస్వభావానుసారముగ నుండునుగాని జన్మమాత్రముబట్టి కాదని భగవద్గీతలలో స్పష్టముగా వ్రాయబడియున్నది. వ్యాసుడు బెస్తదానియందును, వసిష్ఠుడు ఊర్వశియందును, అగస్త్యుడు కుండయందును, ఋశ్యశృంగుడు లేడియందును, పరాశరుడు మాలదానివలనను పుట్టి బ్రాహ్మణులైరి.

శ్లో. "శూద్రో బ్రాహ్మణతా మేతి
బ్రాహ్మణ శ్చైతి శూద్రతాం,
క్షత్రియా జ్జాత మేవంతు
విద్యా ద్వైశ్యా త్తథైవచ."

—మనుస్మృతి.

శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందును; బ్రాహ్మణుడు శూద్రత్వమును పొందును. క్షత్రియ స్త్రీ(?)వలనను, వైశ్యస్త్రీ(?)వలనను పుట్టినవారు నట్లే యగుదురు.

శ్లో. "నవిశేషోఽస్తి వర్ణానాం
సర్వం బ్రాహ్మ మిదం జగత్,
బ్రహ్మణా పూర్వసృష్టంహి
కర్మభి ర్వర్ణతాం గతమ్."

—భారతము : శాంతిపర్వము.

వర్ణములలో విశేష మేదియు లేదు; ఈ జగత్తంతయు పూర్వకాలమునందు బ్రహ్మమయముగానే చేయబడి కర్మలచేత వర్ణత్వమును పొందినది.

భారతానుశాసనికపర్వమునందు మంచిపనులు చేయుటచేత శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందుననియు, వైశ్యుడు క్షత్రియత్వము పొందుననియు, పుట్టుకసంస్కారములు ద్విజత్వమునకు కారణములు కావనియు, మంచినడత యొక్కటియే కారణమనియు చెప్పబడియున్నది. ఈ విధముగా ఆరణ్యపర్వములో రెండుమూడు చోట్లను, భాగవత సప్తమ స్కంధమునను నుదాహరించబడెను.

పై కారణమును బట్టియే అంతర్వర్ణ వివాహములు వేదకాలమునందే గాక స్మృతుల

కాలములో కూడ ప్రచారములో నున్నట్లు స్పష్టమగుచున్నది.

"అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్య జఘన్య వర్ణమాపద్యతే జాతిపరివృత్తౌ, ధర్మ చర్యయా జఘన్యో వర్ణః పూర్వపూర్వ వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ."

—ఆపస్తంబసూత్రము.

అధర్మచర్యచేత నగ్రవర్ణమువాడు జాతి పరివృతమందు తక్కువ తక్కువ వర్ణమును పొందును; ధర్మచర్యచేత హీనవర్ణమువాడు జాతి పరివృతమందు పూర్వపూర్వ వర్ణమును పొందును.

శ్లో. "బ్రాహ్మణీ క్షత్రియా వైశ్యా
బ్రాహ్మణస్య ప్రకీర్తితాః,
క్షత్రియా చైవ వైశ్యాచ
క్షత్రియస్య విధీయతే;
వైశ్యాచ భార్యా వైశ్యస్య
శూద్రా శూద్రస్య కీర్తితా."

—శంఖధర్మశాస్త్రము.

బ్రాహ్మణునికి బ్రాహ్మణక్షత్రియవైశ్య జాతీయులును, క్షత్రియునికి క్షత్రియవైశ్యజాతీయులును, వైశ్యునికి వైశ్యజాతీయమాత్రమును భార్యలుగా నుండవలెను. ఈ వివిధవర్ణములభార్యలకు పుట్టినపుత్రులు దాయమునకు సమానముగ నర్హులు. చనిపోయినవారికొరకు ఆశౌచమును పట్టవలెను. శూద్రునికి బ్రాహ్మణస్త్రీ వలన కలిగిన పిల్లలే చండాలురని వాడబడిరి. కాబట్టి మన మాలమాదిగలు అస్పృశ్యులని యెంచబడకూడదు. బ్రాహ్మణులు ఒకప్పుడు మాంసమునుకూడ తినుచుండిరి. పూర్వకాలమందు యువతీవివాహము లున్నట్లు స్పష్టము. (ఋ.మం. 2; సూ. 35, మం. 4, 6; ఋ. మం. ౯; సూ. 37; మం. 3; ఋ. మం. 5; సూ. 41; మం. 7)

పరాశర, వృద్ధపరాశర స్మృతులలో కలియుగములో వర్జింపవలసినవని వ్రాసిన యాచారము లన్నియు అంతకు పూర్వ మాచరణలో నుండుటచేతనే తరువాత ఏకారణముననో నిషేధింపబడినవి. దరిమిలానుపుట్టిన యాజ్ఞవల్క్య, ఔశనస, శంఖ, వృద్ధపరాశరస్మృతులలోకూడ శ్రాద్ధకర్మలయందు తప్పక కొన్ని జంతువుల మాంసమును బ్రాహ్మణులకు పెట్టవలెనని వ్రాయబడి యున్నది.

పైన చెప్పినవిషయములలో మనలో నెట్టి మార్పులు కలిగినవో నేను వేరుగ చెప్పనక్కరలేదు. శ్రుతిస్మృతులలో చెప్పిన ప్రాయశ్చిత్తకాండగాని, ఆచారకాండగాని మొత్తమాత్రము మన మాచరించుచుండుట లేదు. ఇదివరకు మన సంఘములో ఎట్లు మార్పులు జరుగుచుండెనో యిప్పుడుకూడ మన దేశకాలపరిస్థితులనుబట్టి మన ప్రస్తుతాచారములలో మార్పు చేసికొనక తప్పదు. మన హైందవసామాజిక వ్యవస్థలో జనబాహుళ్యములో గొప్పమార్పులు కలిగించవలెనన్న మనశ్రుతిస్మృతులను తెలుగుచేసి, వారికి చూపించిన చాలును. అప్పుడు మనసాంఘికపరిణామము, ఎట్లు మారినది, యెట్లు ముందు మారవలసినది వారికి స్పష్టమై, సంఘము నూతనమార్గములు శీఘ్రముగా తప్పక త్రొక్కగలదు.

# శ్రీయుత రామన్ మహాశయులు

యమ్. ఏ., డి. యస్‌సి. (ఆనర్స్), యఫ్. ఆర్. యస్.

మండాది రామనాథం గారు

(వెనుకటిసంచిక తరువాయి)

(౧) చర్మముపైన, నల్లని పదార్థముతో నొక వలయాకారమున్నది. దాని మందము, వలయమధ్యప్రదేశమునుండి, వలయపు హద్దులవరకు వెళ్లునంతవరకు క్రమముగ తగ్గును.

(౨) ఈ వలయముచుట్టు మఱియొక సన్నని చర్మపు వలయమున్నది.



1. ముఖ్యస్వరము



౨. స



3



4

ప





గ







౨. పస

ఈ పటమునందు జూపబడిన చిత్రములు మృదంగమును వాయించి, దానిపై సన్నని యిసుకనుజల్లిన, చర్మము ప్రకంపన మొందని స్థలములను జూపు పటములు.

(౧)వ పటము మృదంగముయొక్క ముఖ్యస్వరమునకు సంబంధించినది. ఇది రావలయునన్న మణికట్టుతో నేర్పరులు కొట్టినట్లు మృదంగముపై వాయించవలెను. ౨వది ప్రథమయుపస్వరము. ఇది చిటికెనవేలుతో, పైజెప్పిన నియమముతో వాయించిన యెడల రాగలదు. ఇతరపటము లితరస్వచ్ఛములగు నుపస్వరములకు సంబంధించినవి. ౨పటమునకు సంబంధించిన స్వరమును "స" అను స్వరముగా భావించిన, "ప" అను స్వరము రావలెననిన, 3, ౪ పటములకు సంబంధించిన యుపస్వరములు మేళవించిన వచ్చును. "గ" అనునది ౫, ౬ పటములకు సంబంధించిన యుపస్వరములు కలిసినకలుగుచున్నది. ౭,౮,౯ మూడుపస్వరములు కలిసిన ౨వ "స" కలుగుచున్నది. దీనివలన మనము తెలిసికొనవలసినదేమనగా, మన హిందూ మృదంగము లితరమృదంగములు తలంపబడినట్లుగా గాక, ఉపస్వర సమ్మేళనమువలన సుస్వరభరితమై యొప్పుచున్నవి.

ఇట్లే రామన్‌గారు శబ్దశాస్త్రమం దెన్నియేని పరిశోధనలను గావించిరి. క్రొత్తగా వ్రాయబడిన Richardson రిచార్డ్‌సన్ అనువాని శబ్దశాస్త్రమందు ముఖ్యమైన విషయములం దెచ్చటజూచినను రామన్‌గారి నామధేయమును, తదనుచరుల నామధేయములును ప్రసన్నము లగుచుండును.

## Scattering of Light

ఈయన పరిశోధనలలో దర్వాతది "Scattering of Light" అనుదానియందు. ఇది ప్రప్రథమమున (Lord Rayleigh) లార్డు రాలే యను నాతనిచే, నీలాకాశమునకు నీలిమకు గారణము నరయుటలో బయలుదేరినది. ఈమాటలకు దర్జుమా "తేజస్సుచిందబడుట" తేజస్సనగా పదార్థము కాదని నేర్చుకొంటిమి. అట్టిచో బదార్థమునకు జెందునట్లు తేజస్సునకుగూడ "చిందు" అను పదప్రయోగముచేయుట ప్రశ్నింపబడ

వచ్చును. దాని కీ క్రిందివిషయములను గమనించిన చో, "చిందు" అనుపదమున కెంతవర కర్థము దెచ్చుకొనవలెనో తెలియగలదు. ఈచిందుట యనునది తేజఃకిరణమార్గమున నేవైన నలకలున్నపుడు కలుగుచున్నది. అప్పుడు కిరణ మార్గమున నేకాక దాని ప్రక్కలనుండి (Lateral) చూచిన నాచిన్ననలక మనకన్నుల కగుపడగలదు. అనగా తేజస్సుయొక్క కిరణ ముఖ్యమార్గమున నేకాక, దాని ప్రక్కలకుగూడ నుపకిరణము (Secondary) లు వచ్చుచున్నవి. ఒక ముఖ్యకిరణమునుండి యుపకిరణము లీతీరుగా, జాల సన్నని నలకలమూలముగా వచ్చుటయే, తేజస్సు చిందుట యని యర్థము.

అయిన నొక ప్రశ్న రావచ్చును. తేజఃకిరణ మద్దముపై బడి, ప్రతిఫలింపబడినప్పుడు వచ్చు కిరణమును, చిందబడిన తేజస్సనగూడదా యని యడుగ వచ్చును. మీ యిష్టమువచ్చిన నట్లే పిలువవచ్చును. కాని యీచిందుటకును, నలక తేజస్సు జిందుటకును భేదము నుమాత్రము గమనింపవలెను. ప్రతిఫలింపబడిన తేజస్సువిషయములో నక్కడ తేజస్సు తరంగదీర్ఘతకన్న నెన్నియోమడుంగులు విస్తీర్ణతగల యద్దముతో మన ప్రశ్న సంబంధించి యున్నది. అంతేకాక, ప్రతిఫలింపబడి తేజస్సుయొక్క స్పష్టత (Intensity) తరంగదీర్ఘతపై నాధారపడదు. చిందబడిన తేజస్సునందు తరంగదీర్ఘతా పరిసరములలోనే నలక కొలతలున్నవి (Dimension ). అంతేకాక, చిందబడిన కిరణముయొక్క స్పష్టత తరంగదీర్ఘతపై నాధారపడి యున్నది. అనగా తరంగదీర్ఘత కురుచయైన కొలది స్పష్టత హెచ్చుగును. ఆకారణమున తెల్ల వెలుగు (ఏడురంగులతో సంయుక్తమయినది) చిందబడినపుడు కురుచతరంగదీర్ఘతగల నీలరంగే స్పష్టముగా నగుపడును.

తేజస్సు నలకపై బడినపు డెట్టిస్థితి కలుగుచున్నది రాలేగారితో మనమూహింతము. ఒక చెరువునం దొక బెండు తేలియాడుచున్న దనుకొనుడు. అలలసంఖ్య తక్కువగా నున్నపుడు బెండుతరంగములతోపాటు, క్రిందికి పైకి తేలియాడుచుండును. అనగా, ఏపదార్థమునం దది తేలియాడుచున్న యాపదార్థమునకును నీబెండునకును గమన వేగమునందు తారతమ్యము లేదు. జలములో నొక యణుస్వరూపమును దాల్చి యిపుడు మనకున్న బుద్ధితో నుండిన, మనకు బెండుకదలినట్లుగానే యగుపడును. బెండుకు జలముపై తారతమ్యగమనము లేదు. ఇట్టి స్థితిలో వెంటవెంటనమితవేగమున తరంగములు వచ్చిన వనుకొనుడు. అప్పుడు బెండు క్రిందికిబోక పూర్వమే, మఱియొక తరంగమువచ్చి పైకెత్తివేయుచుండును. అప్పుడు బెండుచలనమునే యుండదు. అందువలన నేపదార్థమం దది తేలియాడుచున్నదో యాపదార్థమునకును, దీనికిని తారతమ్యగమనము గలుగుచున్నది. అప్పుడు వెనుకటివలె జలములో మనముంటిమా బెం డిప్పుడు పైకి క్రిందికి ప్రకంపన మొందుచుండును. ఆప్రకంపనమందుటలో, దానియలసంఖ్య దాని కీనూత్నావేశము కల్పించిన, ప్రకంపనముయొక్క యలసంఖ్య ఒకటియే యగును. ఈ బెండీతీరుగ కదలుచున్నపుడు జలములో నూతనప్రకంపనము కలుగును. ఆప్రకంపనమన్ని మార్గముల వెడలిపోవును. ఈ విధముగా, బెండునకు గలుగజేసిన తారతమ్యప్రకంపనమువలన జలములో నుద్వేగము నిచ్చిన తరంగ మన్ని దెసలను చిందబడినది.

ఇట్టి యూహయే, కిరణమార్గమందు కిరణతరంగదీర్ఘతతో బోల్పదగు కొలతలుగల నలక, యుండిన యెడల, ముఖ్యకిరణముయొక్క తరంగదీర్ఘతను సరిపోవు పొడవుగల, ఉపకిరణ తరంగములు పలుదెసల బరుగెత్తుచున్నవని చెప్పును. ఇంకను దీని విషయమై కనిపెట్టబడిన విషయములు మఱికొన్ని యున్నవి. చిందబడిన తేజస్సేకపార్శ్వతను బొందు ననునది యొకటి అనగా, నక్కడ, టోర్మలీన్ స్ఫటికమునుంచి త్రిప్పినచో, చీకటి వచ్చును. చీకటి పూర్తిగామాత్రము రాదు. ఎందులకన, నేకపార్శ్వత పూర్తిగా జరుగనందుచేత. ఇదివరకే స్పష్టతనుగురించి చెప్పితిని. అయ్యది తరంగదీర్ఘత తక్కువయైనకొలది హెచ్చుగునని కావున తెల్ల వెలుగు నలకలపై బడినపుడు ప్రక్కలవచ్చున దేకపార్శ్వతము పూర్తిగా నందని నీలకిరణము. తదితరకిరణముల స్పష్టత మన కంటి కగుపడునంతగా లేదు. ఇప్పు డాకాశనీలిమ యెందులకు వచ్చినదో చెప్పనగును. తేజస్సును చింతజేయు సూక్ష్మపదార్థము లుండి తీరవలెను. ఒకప్పుడు కొన్ని నలకలు గాలిలో వ్రేలాడుచుండుట వలన, చిందబడుట కలుగుచున్నదియని యూహించిరి. కాని గాలిలోనుండు నణువులెందులకు చిందగూడదని తలంపబడి, కారణము గాలిలోని యణువులకే నిరూపింపబడినది తేజస్సున కలరూపము నిచ్చుటచే, మనము సహజముగా జూచెడి, యాకాశనీలిమను వర్ణింపగలిగితిమి. అదెంతయు నుత్సాహకరమైన విషయమే

# ప్రాచీన శిల్పచిత్రములు



౧. పాండవ సింహాసనము

కాని, యీ తేజఃకిరణము చిందుటయనునది యెన్ని యో పరిశోధనలకు జన్మస్థానమయ్యెను. గాలిలోని యణువులు తేజస్సును చిందజేయగల్గినచో, నితరపదార్థములందున్న యణువులు (Molecules) తేజస్సును జిందజేయగూడదాయను ప్రశ్నలు బయలుదేరినవి. చిందినచో ఆచిందబడుట యనునది అణురూపముపై నాధారపడదా యనునది మఱియొక ప్రశ్న. అంతియకాదు. ద్రవపదార్థమున్న దనుకొనుడు. అక్కడనున్న దొకయణువుమాత్రమే కాదు. అసంఖ్యాకములగునణువు లొకచోట నున్నవి. అవియును సుస్థిరలదాల్చి యొక్కచోట నుండవు. పదార్థమునందుండు నుష్ణముచేతన, గాక, దార్ఢ్యతవలన నంతములేని గమనము నీయణువులు చెందుచున్నవి. అట్టి,—సంశయతచే దప్ప, (Probability) నిర్ణయింప శక్యముగాని—యీయణువుల గమనస్థితి, పరస్పరపార్శ్వస్థితి (Neighbourhood) ఇవి, తేజస్సును జిందుటయందెట్టి పాల్గొనుచున్నవి యను ప్రశ్నగూడ ముఖ్యమైనదే.

ఇట్టిప్రశ్నలను బరిష్కరించుట కెన్నియేని ప్రయోగములీ బౌబజారునందున్న యిండియన్ యసోసియేషనునందు జరిగినవి. అవి యన్నియును రామన్ గారిచే నూహింపబడి, వారి శిష్యులవలన గావింపబడినవి. వానినుండి రాబడిన ఫలితములను క్రిందివిధమున సంక్షేపముగ జెప్పెదను.

చిందబడిన యుపరేఖయం దేకపార్శ్వత పూర్తిగా జరుగదని చెప్పితిని. చిందజేసెడి యణువు గుండ్రముగా బంతివలె నున్న, శాస్త్రప్రకార మేకపార్శ్వత పూర్తిగా జరుగవలెను. జరుగకున్నయెడల, నణువు గుండ్రముగా నున్నదని చెప్పుటకు వీలులేదు. దానికి బంతిరూపముగాక వేరురూపము నియ్యవలసి యుండును. కోడిగుడ్డు తీరుగా నున్నదని యూహింపవచ్చును. అటుల నూహించుట కొప్పుకొనని యెడల, నణువునకు తేజస్సును జిందజేయుటలో, భిన్నములైనదెసల భిన్నగుణము లుండవలెను. దీనినే (optical anisotropy) ఆప్టికల్ యనైసొట్రాపియని పిలిచెదరు. చూచితిరా! నలకలచే చిందబడిన తేజస్సు నర్థము చేసికొనినయెడల, మన హస్తములలో నెట్టి యాయుధ మగుచున్నదో! మనము కంటితో జూడలేని యణువుల రూపములను నణువులోని గుణములను మనోనేత్రమున చిత్రించ సమర్థులమై యున్నది.

కావున నీయేకపార్శ్వత పూర్తికి లోపము (Defect of polarisation) అణువుల పరిశోధన కొక మార్గమును గల్పించినది. ఈ మార్గమున నెన్నియేనియు ప్రయోగములు రామన్ గారి ప్రోత్సాహమున గావింపబడినవి.

చిందబడిన తేజస్సునుగురించి, మఱియొకసంగతి నిదివరకు దెల్పితిని. అయ్యది స్పష్టతనుగురించి. దీనిగురించి జెప్పుటకుబూర్వము, తేజస్సునకు దరంగరూపము నిచ్చుటచే గలిగెడి, యొక యాశ్చర్యకరమైన విషయమును జెప్పెద. ఒకచోటికి 2 తరంగములు వచ్చినవనుకొనుడు. అక్కడ తేజస్సు వృద్ధియగుచున్నదా? లేక నాశన మగుచున్నదా? ఈ రెండుప్రశ్నలకు జవాబు రెండును జరుగవచ్చునని. ఏస్థలమున తరంగములు రెండు చేరుచున్నవో, ఆ స్థలమున రెండుతరంగముల కుండు స్థితిపై నక్కడ కలిగెడి స్పష్టత యాధారపడియున్నది. బొమ్మలు రెండు 1 వ పటములో, రెండలలును, M అనుస్థలమునకు ఒకే రకమైన ప్రకంపనమిచ్చుచున్నవి. అనగా, M ఒకేవైపు




నకు లాగబడుచున్నది. అట్టిస్థితిలో ప్రకంపనపరిమితి యొకదాని కొకటి కలుపబడును. అందుచేత స్పష్టత ద్విగుణీకృత మగును. ఒక పిల్లవాని నిద్దరుమనుష్యు లొకేవైపునకులాగిన నెట్లుండునో, యీస్థితియునంతయే. అటుగాక, 2 వ పటములో రెండుతరంగముల ప్రకంపనము, వేర్వేరు మార్గముల జరుగుచున్నయెడల, M అను దేవైపును కదలదు. సమానబలిష్ఠు లిద్దరు బాలుని, చెరియొకవైపున లాగినట్లుండును. అందుచేత స్పష్టత నాశన మగును. కావున రెండుతరంగము లొకచోట జేరినపు డాచోట స్పష్టతలుగను కలుగవచ్చును కాకున్న నాశనము కావచ్చును. దీనివలన పాఠకు డేమాత్రము నున్నశాస్త్రప్రథమసూత్రమునకు భంగము కలిగినదని భయపడ నవసరము లేదు. ఏమన, నొకచోట, తేజస్సు నాశనమయినచో, దీనికి గసిదీర్చుకొనునట్లుగా, మరియొకచోట స్పష్టత హెచ్చుచున్నది. కావున శైవిమర్శనవలన సూక్ష్మబుద్ధియగు పాఠకుడు నేర్చికొనవలసిన దేమన, నేచోటనైన స్పష్టత, అచ్చటికి వచ్చు తరంగముల స్థితిభేదమును బట్టియుండును. అంతే

కాక, 2 వ పటములో, 1 వ తరంగము, 2 వ దానికన్న నర్థతరంగదీర్ఘము ముందుగనో యాలస్యముగనో బయలుదేరినచో, స్పష్టతకు నాశము కలుగకుండెడిది. కావున నొకతరంగమునకన్న మఱియొకతరంగ మర్థతరంగ మాలస్యముగనో, త్వరగనో వచ్చినయెడల, నాశనము కలుగుచున్నది. దీనినే (Interference) యింటర్ ఫెరెన్సు అని పిలిచెదరు.




పైపటమునందు, A B C D అనునది ద్రవపదార్థముతో నింపబడిన యొకపాత్ర మనుకొనుడు. I అను మార్గమునుండి ముఖ్యరేఖలను ద్రవపదార్థముపై బ్రసరింపజేసితి మనుకొనుడు. అప్పుడు తేజ మన్ని దెసలను జిందివేయబడును. S అను దెసనుండి మనము చిందబడిన తేజస్సును బరీక్ష చేయుచుంటి మనుకొనుడు_ పటములో జూపబడినట్లుగా, ద్రవపదార్థము నొకదానికొకటి, అర్థతరంగదీర్ఘత దూరముగానుండునట్లు చెక్కలతో గదులు గదులుగా భాగించితి మనుకొనుడు. జ్ఞాపకముంచుకొనుడు! తేజఃకిరణముయొక్క తరంగదీర్ఘత మనము కొలువగలుగు మిల్లిమీటరులో నెంతో వేల వంతు గనుక మీరు చేయుగదులు పరిమితసంఖ్యగలయవి యగును. అణువులు కదలకయున్న యెడల, మన దగ్గరకువచ్చు చిందబడిన తేజస్సులకు, చెక్కలకుబదు లద్దము లుంచినచో నాయద్దములలో బ్రతిఫలింపబడినట్లుగా, తేజస్సు మనయొద్దకు వచ్చును. అద్దములొకదానికొకటి, యర్థతరంగదీర్ఘమున నుండుటచే మనకంటి దగ్గరకువచ్చు తరంగము లొకదానికన్న నొక టర్థతరంగ దీర్ఘ మాలస్యముగావచ్చును. దానివలన తేజస్సును మనము చూడ జాలక నే పోవచ్చును. కాని నిజముగా ద్రవపదార్థములు తేజస్సును చిందజేయుచున్నవని కనిపెట్టబడినది. దీనికి గారణము చెప్పుటయెట్లు? పైతర్కములో నణువులన్నియును బ్రతిచెక్కలో సుస్థిరతదాల్చియున్నవని యూహించితిమి. అయ్యది నిజమా? ఒకప్పుడు అణువులన్నియు సమవ్యవస్థితములుగా నుండవచ్చును. కాని ఈస్థితినుండి మార్పులు గలుగవచ్చును. ఏమన, అణువు లొకచో నుండునవి కావు. ఎల్లపుడును బిచ్చివానివలె, నొకరీతి లేక, పరుగెత్తుచుండును. అందుచే ద్రవపదార్థమునకు, మన మణువుల లోతుకరకువెళ్లి తిమేని దానిగరిమయందు హెచ్చుతగ్గు లుండును. ఈ హెచ్చుతగ్గులు కలుగుటచే, మనమనుకొనినట్లుగా, తేజము నాశనము కాజాలదు. అందువలన తేజస్సు చిందబడును. కావున స్పష్టతయనునది. అణువుల సమవ్యవస్థితిలో కలుగు హెచ్చుతగ్గులవలన గలుగుచున్నది. (Fluctuations- in the uniform distribution). దీని విషయమై, ఐన్‌స్టయిన్‌గారు శాస్త్రప్రకారము శోధనచేసి, యీ హెచ్చుతగ్గులకు, Statistical mechanics వలన పరిమితికనిపెట్టినాడు. అదినిజమో, యబద్ధమో తేల్చుకొనుటకు, మన చిందబడిన తేజస్సుయొక్క స్పష్టత పరిశోధనవలన తేలగలదు. కావున చిందబడిన తేజస్సుయొక్క రెండవ యుపయోగ మయ్యది యణువులరూపము నేకాక, పరస్పరమెట్టి చలనస్థితిలోనుండునదికూడ తెల్పుచున్నది. ఇట్టి భావములతో గొన్ని పరిశోధనలు జరిగినవి.

రామన్‌గారు పైనవివరింపబడిన హెచ్చుతగ్గుల తత్త్వమును, గరిమయందే కాక మరి రెండు విషయములలో బొడిగించినారు. ఒక ద్రవపదార్థములో నింకొక (దానిలో గరగిపోవు) ద్రవపదార్థము నుంచితి మనుకొనుడు. వీనిలో మనమణువుల లోతునకు వెళ్లినచో నొకదానిలో నొకటి సమముగా కలిసియుండుట, ఒకానొకప్పుడు మాత్రమే కలుగుచుండును. అనగా నీకలియుటలో హెచ్చుతగ్గులు కలుగుచుండును. ఈ హెచ్చుతగ్గులుకూడ దేజస్సును జిందజేయవలసి యుండునని కనిపెట్టబడినది. (Fluctuations in Compositions) ఈ మార్గమున బరిశోధనలు గావింపబడినవి.

అణువుల కొక్కరూప ముండవలెనని యూహించి తిమికదా? మరియు అణువులశాస్త్రప్రకార మివన్నియు నిష్టమువచ్చినట్లు వ్యవస్థితములై యున్నవిగదా! అట్టిసందర్భమున నొకయణువు మరియొక యణువుప్రక్కన నిలుచుకొనియుండుటలో, వానికున్న రూపములవలన, రకరకములుగా నిలువవచ్చును. ఇట్టి నిలుచుటలకుగూడ హెచ్చుతగ్గులు కలుగవచ్చును. అయ్యదియునుగూడ తేజస్సును జిందజేయవచ్చును. (Fluctuations in Orientation). ఈయూహతో Debye యను నాతడు, ద్రవపదార్థములను, కిరణమార్గమున నుంచినపుడు వచ్చిన ఫొటోగ్రాపునందున్న వలయాకారపు తెల్లరంగునకుగారణము లతడు చెప్పలేకపన్నను, వీరు చెప్పగల్గినారు. ఈ యూహను నిరూపించుటకు నిరుడు కొన్ని ప్రయోగములు చేయబడినవి. అదియును నిరూపించినవి.

ఈవిధముగా, రామన్‌గారు, రాలేగారు కనిపెట్టిన 'తేజస్సు చిందబడుట' యనునది నిరుపమానకౌశలముతో నుపయోగించి, యెన్నియో క్రొత్తయంశములను బయటకు దీసికొనివచ్చిరి. ఆయనగారి మాటలలోనే, యాపరిశోధకుల సారాంశము నిట్లు చెప్పెదను.
"One important outcome of our researches has been to show that while light scattering is in one sense a molecular phenomenon, in another sense, it is a bulk effect having a thermal origin. It is the thermal agitation of the molecules which causes them to be distributed and Orientated in space with incomplete regularity and it is the local fluctutions in the properties of the medium, thus arising which give rise to optical heterogeneity and consequent diffusion of light. The subject of light scattering is this a meeting ground for thermo dynmics, molecular physics and the wave-theory of radiation. That the combination of theories in such diverse fields gives us predictions which have been experimentally verified is one of the triumphs of modern Physics."

ఈసందర్భమున, రామన్‌గారు, సముద్రముయొక్క నీలిమకిచ్చిన కారణమెన్నదగినది. రాలేయను నాతడు నీలాకాశము సముద్రమున ప్రతిఫలింపబడినదని యూహించెను. కాని రామన్‌గారాయూహను త్రోసివేసి, మరి యితరులు నీరములో నలకలుండుటచే తేజస్సు చిందబడుచున్నదని యూహించిన యూహను త్రోసిపుచ్చి, శుద్ధముగా నణువులవలన, చిందబడిన తేజస్సే మనకంటికి నీలముగా నగపడుచున్నదని నిరూపించినాడు. అదియే కాక, పరిశోధనాగారమందు, (Reseachlabaratory) నలకలు లేని స్వచ్ఛమైననీటిని, కిరణమార్గమునందుంచి, ప్రక్కనుండి చూచిన, సముద్రమునందున్నట్లే, చక్కని నీలిమయగుపడునట్లు చూపించినాడు ఇదెంతయు నాశ్చర్యముగదా?

## NEW RADIATION

ఇయ్యది రామన్‌గారు తాను క్రొత్తగా బదార్థవిజ్ఞాన శాస్త్రజ్ఞులకెల్లరకు విస్మయమును గలుగునట్లుగ గనిపెట్టబడి, వారిచే "New Radiation" అని పిలువబడినది. కాని (Pringsheim) ప్రిన్‌గ్‌షైమ్ అను జర్మనీయుడు దీనిని 'Raman effect' అని పిలిచినాడు. ఈనామమే, దానికి నూటిగా సరిపోవును. గనుక మనము గూడ నట్లేపిలుతము. ఈక్రొత్త విషయము పదార్థవిజ్ఞానశాస్త్రమున కిచ్చెడి నూతనావలోకము నాలోచించిన చో, నిదెంతయును, దానిసృష్టికర్తయగు, రామన్‌గారి నామము శాశ్వతముగా పదార్థవిజ్ఞాన పితామహులనదగిన ఫారడే, మాక్సువెల్, ఐన్‌స్టయిన్, మరి యితర నామధేయములతో, పదార్థవిజ్ఞానశాస్త్రచరిత్రమునందు నుండునట్లు చేయసమర్థమైనది. అందులకనియే, 'Raman effect' రామన్ ఎఫెక్టు అని పిలుచుటయే యుత్తమమని నుడివితిని.

దీని విషయమై చెప్పుటకు బూర్వము "శేడియే షన్"గురించి చెప్పెదను. ఒక లోహముదీసికొని దాని నెర్రగా కాల్చినపుడు, దానియొద్దనుండి వచ్చు తేజస్సును తరంగములవారిగా, (Spectrometer) స్పెక్ట్రామీటరుతో విమర్శించినచో నొక్కొక లోహమునుండి, లోహరకమును దెలుపు తరంగములు బయలు దేరుచున్నవని కనిపెట్ట

బడినది. ఒకేలోహమునుండి తరంగభేదము గల కిరణ ప్రసారము జరుగవచ్చును. అవి యన్నియు నాయాలోహములయొక్క వ్యక్తిత్వమును గుర్తించుట కనువైనవి. ఇయ్యది ప్రతిలోహమునకే కాక, ప్రతియితర ఎలిమెంటు(Element)నకుగూడ జెందును. కావున దగినంత యుష్ణముగా నున్నపుడు, ప్రతియెలిమెంటును తనకు సహజమైన కిరణప్రసారమును గావించుచున్నది. ఇయ్యది మనచక్షురింద్రియగోచరముకాని, యిన్‌ఫ్రారెడ్ నందును, అల్‌ట్రా వైలెట్టునందునుగూడ కలుగవచ్చును. ఇట్టి కిరణప్రసారమును, ముఖ్యకిరణప్రసారమని చెప్పవచ్చును. (Primary radiation). ఈ విషయమును బూర్తిగా నర్థము చేసికొనుటకు, మరియొక సంగతి చెప్పెదను. తగినంత యుష్ణముగా లేనప్పుడు, కిరణప్రసారము జరుగకపోవుటయేకాక, తెల్లవెలుగుదానిపైబడి, విమర్శింపబడినచో, నేచోట నిదివరకు ముఖ్యకిరణప్రసారము కలిగినదో, యాచోటనే కిరణనాశనము కలుగుచున్నది. అనగా నాపదార్థము దాని సహజమైన కిరణమును (అనగా) కిరణములోని దార్ఢ్యతను గ్రసించుచున్నది.

ఈముఖ్యకిరణప్రసార మేవస్తువునుండి వచ్చుచున్నదో, దానిరాసాయనికాణువుయొక్క (Atom) గుణముపై నాధారపడియున్నది. పదార్థము లన్నియు ఎలెక్ట్రాన్ అను పరమాణువునుండి నిర్మింపబడినవియని తేలిన తర్వాత నీయాటమున కొకరూపము నిర్ణీత మయ్యెను. ఈవిషయమందు పరిశోధన చేసినవారు(Rutherford) రూథర్‌ఫోర్డును, (Boher) భోరును. మొదలు చాల సులభమైన యుదజని (Hydrogen) యణువును దీసికొని, దానిలో (Proton)ప్రోటా నను సూర్యగ్రహము వంటి దానిచుట్టు, నొక ఎలెక్ట్రానను గృహము పరుగెత్తుచున్నదని యూహింపబడినది. భోరనునాతడు చెప్పినదేమన, ఎలెక్ట్రాన్‌యొక్క యయనము (orbit) ఒకే రేడియస్ (Radius) కలిగియుండదనియు, దాని కొన్నియో నిరూపకమైన రేడియస్‌గల అయనము (Quantized orbits)లు న్నవనియు నూహించెను. తేజముచే నావేశము (Excit)నొందనపుడా యెలెక్ట్రానునకు సహజమైనయయన.ముండును. ఈ యయనమునుండి దానికన్న పెద్దదియగు అయనములోనికి నెలెక్ట్రాను దుముకవలెనన్న దార్ఢ్యత కావలసియుండును. అది యణువుపైనబడు తేజస్సునుండి లాగుకొనును. అందువలన కిరణగ్రసనమయినది. అటుగాక పెద్దయయనమునుండి, చిన్నయయనములోని కెలెక్ట్రాన్ దుమికినదన్న దార్ఢ్యతయణువునుండి వదలివేయబడుచున్నది. ఈ వదలివేయబడినదార్ఢ్యత అణువుయొక్క ముఖ్యకిరణప్రసార మగుచున్నది.

ఇచ్చటనే, Quantom Theory యనునదివచ్చుచున్నది. పీఠికలో, పదార్థము కిరణమునకు, దార్ఢ్యతనిచ్చునప్పుడుగాని, కిరణమునుండి దార్ఢ్యతబుచ్చుకొనునపుడుగాని, దార్ఢ్యతాణువులు మన విమర్శనలోనికి వచ్చునని నిర్వచించితిని. ఈదార్ఢ్యతాణువు పరిమితి, కిరణతరంగసంఖ్యపై నాధారపడియున్నది. అనగా,వదలివేయబడినగాని, తీసికొనబడినగాని దార్ఢ్యత నలసంఖ్యచే భాగించిన, వచ్చెడిలబ్ధ మన్ని తరంగసంఖ్యల కొకటియైయుండును. దీనిని Planck's constant ప్లాంకుకాన్స్టాంటుఅని అందురు. కావున, దీనివలన, నావేశము చెందిన యుదజనియణువునుండి వదలివేయబడిన దార్ఢ్యతయెట్టి తరంగసంఖ్యగల కిరణమునిచ్చుచున్నదనియన్న, దార్ఢ్యతను ప్లాంకుకాన్స్టంటుచే భాగించిన రాగలదు.

అయిన, నీ దార్ఢ్యతయనున దేయయనమునుండే యయనమునకు దుముకుచున్నదో, యారెంటిపై నాధారపడియుండును. ఒకే అయనమునకు, వేర్వేరయనములనుండి,ఎలెక్ట్రాన్ దుముకవచ్చును. ఈదుముకుటలో వేరువేరు దార్ఢ్యతలు వదలివేయబడుచున్నవి. వేర్వేరు దార్ఢ్యతలకు సంబంధించిన వేర్వేరుతరంగ సంఖ్యగల కిరణము లుద్భవమగుచున్నవి. కావున నొక్కొక యయనమునే తీసికొనిన ప్రతిదానికి,నితరయయనములనుండి,దానిలోని కెలక్ట్రాన్ దుముకుటవలన నొక వేర్వేరుతరంగములుగల కిరణముల సమూహ ముద్భవ మగుచున్నది.

కావున జూచితిరా, యీ ముఖ్యకిరణప్రసారము వలన నేవిధముగా నణువులోనికి దూరి, యే కిరణము, ఎలెక్ట్రాన్ ఏ అయనమునుండి, మరియేయయనములోనికి దుమికినదో చెప్పుట కలవియగుచున్నది. ఈ తీరుగా ప్రపం

చములోనున్న ఎలిమెంటు లన్నియు నీముఖ్యకిరణప్రసార విమర్శనవలన, వానిలోని ఎలెక్ట్రానుల వ్యవస్థితము నిర్ధారింపబడినది. ఇదెంతయును ముఖ్యమైనది.

(Sir George Stokes) జార్జిస్టోక్సుకనిపెట్టినది ఫ్లోరెసెంటు రేడియేషన్ (Flourecent radiation). ఇది ముఖ్యముగా, గొన్నిరంగులు కలుగజేయు రసాయనములందు జూడనగును. అట్టిరంగును నీళ్లలో వేసితి మనుకొనుడు. ఆరంగునీరును తెల్లవెలుగు మార్గములోనుంచిన, మీకది యాకుపచ్చగనో, లేక మరియొక రంగుగనో యగుపడును. కాని తెల్లకిరణమునకు బదులు ఒకేతరంగ సంఖ్యగల (Monochromatic) కిరణమును (మీయిష్టమువచ్చిన తరంగ సంఖ్యగలది) నానీటిపై బ్రసరింపజేయుడు. అప్పుడును, మీరు మొదటజూచిన యాకుపచ్చ రంగేయగుపడును. అనగా, ఫ్లోరెసెంటు రేడియేషన్‌లో కిరణముయొక్క యల సంఖ్య ఆవేళము కలుగజేయు కిరణముయొక్క తరంగసంఖ్యపై నాధారపడదు. కాని పదార్థముపై నాధారపడును.

మన మింతకుబూర్వము, చిందబడిన తేజస్సును గూర్చి నేర్చుకొంటిమి. దానికిని ఫ్లోరసెంటు రేడియేషన్‌కును భేదమున్నది. మనము పైననేర్చుకొనిన చిందబడినతేజస్సునం దలసంఖ్యయు నావేళ కిరణతరంగ సంఖ్యయు నొకటియే. అదియునుగాక, యీ చిందబడిన తేజస్సేకపార్శ్వతనందియున్నది. ఫ్లోరసెంటు కిరణములో నేమాత్ర మేకపార్శ్వత లేదు.

కిరణముచిందబడినచోట కాంప్టన్ (Compton) అను నమెరికన్ శాస్త్రజ్ఞునిచే మరియొక యుపకిరణప్రసారము కనిపెట్టబడినది. దానికిగా నతడు Nobel నోబెల్ బహుమానమునందినాడు. దానిని రామన్‌గారిప్పుడు కనిపెట్టిన దానితోబోల్చిన నేమంత బ్రమాదకరమైనదిగా దోచదు. కాని యది కనుగొన బడినపుడు మాత్రము దానిప్రాముఖ్యతహెచ్చైనదే. ఏమన: నయ్యది దార్థ్యత యణు స్వరూపముగ బదార్థముచే వదలిపెట్టబడుచున్నదానికి మంచి తార్కాణమును జూపినది. దానిలో జరుగునదేమన, క్రొత్తగా కలిగిన యుపకిరణమావేళము కలుగ జేసిన కిరణ తరంగ సంఖ్య కన్న తరంగసంఖ్య తక్కువ గలిగి యుండును. మరియు నావేళ తరంగ సంఖ్యపై నాధారపడి యుండును. ఏకపార్శ్వతను గూడ గలిగి యుండును, కాని అది యే వస్తువు కిరణమును చిందజేయుచున్నదో దానిపై నాధారపడదు.

ఈముఖ్యకిరణప్రసారముPrimary radiation ఫ్లోరెసెంటురేడియేషన్, సనాతనపు జిందబడిన కిరణప్రసారము (Classical scattering) కాంప్టన్ రేడియేషన్ వీనినన్నిటి నేలజెప్పితినన, రామన్‌గారు కనిపెట్టిన కిరణప్రసారము పనిలో నేదియునుగాదని నిరూపించుటకును; దానినర్థము చేసికొనుటకు వీలుగానుండునని యును వీరుకనిపెట్టినది, చిందబడిన తేజస్సునందు గనుక దీనికిని, Primary radiationనకును సంబంధమేమియు లేదు. కాని ప్రాముఖ్యతయందు, దీనితో సమానమైనదని నాయభిప్రాయము. ఏ తీరుగ, Primary radiation అణువులోని Electronల వ్యవస్థితములైనవో, తెలిపినట్లే, ఆమార్గముననే ఇంకొక తీరవలోకనమిచ్చుటకు రామన్ ఎఫెక్టు సమర్థమై యున్నది. ఆమార్గములో నింతవర కెక్కుడు శోధనకాలేరు. ఏమన, ఈ రామన్‌గారి క్రొత్త కిరణప్రసారము, దాని పసితనమందే యున్నది. కాని పసితనమైనను, నది జూపు భవిష్యత్ ప్రకారము మాశ్చర్యకరమైనదిగా గనపట్టుచున్నది.

అది కనుగొనబడినది సనాతన కిరణప్రసార, పరిసరములలో. ఇక్కడ పాఠకుడు "అయ్యది యదృష్టపూర్వకముగా లభించినదేమో. అట్లయిన మీరు రామన్‌గారి కిచ్చు గౌరవము సకారణమా?" యని యడుగవచ్చును. ఇట్టి ప్రశ్నలు శాస్త్రపరిశోధకులు కాని వారియొద్దనుండి వచ్చిన క్షంతవ్యములే. ఏమన నావిషయమందు పరిచయము లేకపోవుట వలననే, క్రొత్త సంగతులు ప్రపంచము కండ్ల నెట్లు జూచునది, తెలియకపోవుటవలన నట్టి ప్రశ్నలు సహజములే. ఇంతయేల, కనిపెట్టబడిన విషయముయొక్క విపరీతతను

నట్టి, యొక్కొకపరి శాస్త్రపరిశోధకులే యాశ్చర్య నిమగ్ను లయ్యెదరు. ఇంత మాత్రమున కనిపెట్టబడిన విషయ మదృష్ట పూర్వకమైనదని భావించి, కనిపెట్టిన వారి గౌరవము సన్నగిలునాయను ప్రశ్నకు సమాధాన మణుమాత్రము సన్నగిల్లదని. దీనికి గారణముల విన రించినచో, జాలమంది యభిప్రాయములలో 'తెలివి' యను దానికి జేసికొను నపార్థములను స్పష్టీకరించవచ్చు ను గనుక, నావిషయము కొంత మాట్లాడెదను. మనము బాల్యావస్థయం దున్నప్పుడే, తెలివిగల పిల్లవానినిజూచి, తెలివి తక్కువ పిల్లలు "వాడు ఒట్టి బండగా జదువు తాడురా, మనము వాడివలె చదివితే వానికంటె పది రెట్లయ్యే వాండ్లమురా" అని యనుకొనుట లరుదుకాదు. ఈ వాక్యములలో నెంత యర్థమున్నదో, పైసందేహ వాక్యములలో నంతియయున్నదని నాభావము. ఈపిల్లల నెవరు చదువ వద్దనిరి? చదువకయున్న భగవంతుడు పై నుండి వర్షము కురిపించినట్లుగా, వీరి నెత్తిలోనికి తెలి విని పోయునా? అట్టి భావములున్న, తెలివివచ్చు నంత వరకు, జన్మాంతమువర కున్నచోటనే యుండవలెను. ఈవిషయమునే యింకొకవిధముగ తిలకింతము. తెలివి గలవాడంత గష్టపడి చదువుటకు గారణమేమి? దీనికి జవాబు, వానిలోనున్న, యొకవిధమైన జ్ఞానజిజ్ఞాస వాని నొక్కక్షణ మూరకుండ నియ్యదు. అద్భుత విషయ ములవెంట నద్భుత విషయముల విమర్శించిననేకాని, వాని కి మనస్సమాధాన ముండదు. అందువలన గష్టపడి చదు వుట యనునది, వాని తెలివి తక్కువ నెన్నటికిని సూచిం చదు. ఇంకను, నీవిమర్శనను బొడగింతము. వారటుల గష్టపడిన యెడల, నెడ తెగకుండ, నతని యబ్బురపు ప్రతిభాస్ఫురణముల జూపగల్గునా? ప్రపంచ పక్ష ములో జవాబిడవలెనన్న, చూపలేకపోవచ్చునని జవా బీయవలసి యుండును. అనగా, నొక యద్భుతకార్య మును జేయుట కొక్కొకసారి, నెన్నిపగలులో, యెన్ని రాత్రులో తలబ్రద్దలు చేసికొనవలసి యుండును. అం తియేకాక, క్రొత్త విషయము మనమునకు స్ఫురించి నపుడు, చాల చులకనగనే జరుగవచ్చును. అనగా, దాబడిన శ్రమయంతయు నిశ్చయముగా, నిరుపయోగ మును ఛాందసమనియును భావింపవచ్చును. ఏమనఁ నొక్క క్షణములో, నాక్రొత్త దృశ్య మేశ్రమయు లేక మనము నకు దట్టుటవలన అట్టి సందర్భములో గనిపెట్టిన యాశిడే యదృష్ట పూర్వమని భావించిన భావింపవచ్చును. కాని, యీవిషయములో మానసికశాస్త్రపు టూహలలోనికి దిగుటకు నేనియు నటింపనుగాని, పాయన్‌కార్ (Poincare) అను నాతడు చెప్పిన భావములు మాత్ర ము స్ఫురణకు దెచ్చెదను. అతని భావమేమన, వృథా శ్రమ యనునది, నిజముగా వృథాకాదనియును, నయ్యది మనస్సులో మెండ లోకకలవరతను బయలుదేరదీయు ననియు, గలవరతను విమర్శించుకొనుచు, సహజస్థితికి వచ్చినపుడు క్రొత్తవిషయము స్ఫురించుననియు జెప్పి నాడు.

కావుననే నిక్కడ జెప్పదలచినదేమన, రామన గారు కనిపెట్టిన దదృష్టపూర్వకము గావనియు, వారి లోనుండు జ్ఞానజిజ్ఞాసయే, తదనుకూలమైన మార్గమున నాయనచే బనిచేయించినదనియు, దానికి సకారణము గనే, యీయభినవమును, గీర్తికరమునగు విషయమును గాంచుఫలము నందజేసినదని దీనికి నోబెల్ బహుమాన మందినను మనమాశ్చర్యపడ నవసరములేదు. నాకుతోచు నోబెల్ బహుమానమునకన్న ప్రపంచమునకు గలుగజేసిన యీనూతనవిజ్ఞానమువలన, బ్రపంచముయొక్క కృతజ్ఞ తాబహుమానము నంద నర్హుడని నాయభిప్రాయము. ఈభావమునకు ముగింపుగా నాయాంధ్రవిద్యార్థిసోదరు లకు జేయు హితబోధ యేమనగా, జ్ఞానజిజ్ఞాస, తదను కూలపరిశ్రమ యనునవియే, నిజమైన తెలివి యనిపించు కొనగలదనియును, కన్నులుమూసికొని కలలుగనుచున్న తెలివి గల్గదనియును జెప్పుచున్నాను.

రామన్‌గారు చిందబడిన తేజస్సునుగురించిశోధ నచేసెనని చెప్పితిగదా! దానిలో నన్నివిధముల బరిశో ధన చేసెననియును జెప్పితిని. కాని రామన్‌గారికి, దానిలో దృష్టికరముగాని విషయమొకటి బాధించు చుండెను. అయ్యది, చిందబడిన తేజస్సుయొక్క యేక పార్శ్వతలో గనుపడిన లోపమునుగురించి. అది, యీలో

షమునకు నావేశమును గలుగజేయు గిరణతరంగ సంఖ్యపనేదో యాశ్చర్యకరమగు సంబంధమున్నదని మాచిరి. ఇది యప్పటి చిందబడిన తేజోశాస్త్రమునుండి యాహింపదగినదికాదు. దీనికి గారణ మారయవలెననియే, మనస్సులో నాయనను తంటాలు పెట్టెను. నిరుడీయాలోచనాపరంపరలో నాయన కీయూహ పొడమెను. సనాతనముగా చిండబడిన తేజస్సుయొక్క తరంగసంఖ్యయు ఉద్వేగమును గలిగించిన తేజస్సుయొక్క తరంగ సంఖ్యయు నొకటియే. కాని యీయన యూహయేమన, కాంప్టన్ ఎఫెక్టులోవలెనె నిచ్చట నేమైన తరంగసంఖ్యమారుట యేమైన యున్నదేమో, యానూతనకిరణముయొక్క యేకపార్శ్వతా భేదమే, యీతంటాలునకు గారణమేమో యని యనుమానము కలిగినది.

ఆయనుమానమే, స్పెక్ట్రోస్కోప్‌తో చిందబడిన తేజస్సును విమర్శింపజేసినది. విమర్శించినపుడు, మార్పుచెందిన కిరణప్రసారమును గనుగొనినపుడాయన యానందమేమని చెప్పను. అయ్యది యనుభవైకవేద్యముగాని వర్ణింపనలవికాదు. ఏమన ప్రపంచములో గొన్నియాశలు పెట్టుకొని, యాయాశల కనుకూలముగ, బనులు జరిగిన పెద్దయానందమును బొందుదుమే! కాని కేవలశాస్త్ర పరిశోధనమే యాశగల వారలకు దాము దలచినది సమకూరినపుడా యానంద పరిమితికి, స్వచ్ఛత కంతమున్నదా?

ఇంకను జెప్పవలసిన దేమన కాంప్టన్ కని పెట్టినదానిలో, గిరణతరంగసంఖ్య తగ్గుటయేకాని, హెచ్చుటలేదు. అదియునుగాక, అచ్చట నాతగ్గుట ప్రతి వస్తువునకు సమానమే. అందువలన, దీనివలన, వస్తువులోని భౌతికాణువు Molecule (అనగా ఒకపదార్థము నుండి యొకపదార్థమును వేరుపరచునణువు) తత్వము నేమాత్రముతెలియదు. అది ఎలెక్ట్రానుతో దార్ఢ్యతాణువు డీకొనుటలో గలిగిన మార్పు. రామనెఫెక్టులో గిరణతరంగ సంఖ్య హెచ్చుగుటయు, తగ్గుటయును రెండును సంభవించినవి. అదియునుగాక యీహెచ్చుతగ్గులు వస్తువుయొక్క భౌతికాణువుపైన నాధారపడి యున్నవి, ఎందుచేత ననగా, వేర్వేరుపదార్థములను గిరణమార్గము నందు నుంచిన మార్పుచెందిన చిందబడిన తేజస్సు Modified scattered light నకు భిన్నభిన్నముగా నుండును. కావున నిదియెంతయును కాంప్టన్ ఎఫెక్టునకన్న నణువులయొక్క సమాచారము మనకందజేయ సమర్థమై యున్నది. వారు కనిపెట్టినది బాల్యావస్థయందున్నది కనుక నింతకన్న దానివిషయమై చెప్పజాలను.

కాని రామన్‌గారు తానుగనిపెట్టిన దానికిచ్చిన యూహ యుత్సాహ కరముగ నుండును గనుక, దానిని వివరించెద. ఈయన వర్ణించినరీతి:— తేజస్సులో నుండు దార్ఢ్యతకణుత్వము నూహించినాడు. అనగా తేజస్తత్వమున నవీనముగా బయలుదేరిన యూహలనే యుపయోగపరచినాడు. బల్లమీద బంతుల నుంచితి మనుకొనుడు. ఒకబంతి నింకొకబంతితో గొట్టితి మనుకొనుడు. అప్పుడు రెండు సంగతులు సంభవింపవచ్చును. ఎంతబలముతో బంతికొట్టబడినదో, యంతబలముతో పరుగెత్త వచ్చును. కాకున్న కొంచెము తక్కువగా పరుగెత్తవచ్చును. మొదటి దానిని (Elastic collision) అనిఅందురు రెండవదానిని In-elastic collision అని అందురు. రామన్‌గారు చెప్పిన దింకొకటియున్నది. అయ్యది యూహాప్రపంచమున జరుగునుగాన, దానికి Super-elastic collision అని పేరిడిరి. అనగా, కొట్టబడిన బంతి, కొట్టిన బలమునకన్న వేగముగా బరుగెత్తవచ్చును. ఈయాటలలో మనకు గోచరించు దృశ్యమునే, తనకువచ్చిన సనాతన కిరణమును, తత్కిరణమున కిరుప్రక్కల వచ్చిన మార్పు చెందిన కిరణములకు నూహించినాడు. దార్ఢ్యతాణువనుబంతి వచ్చి Molecule అను మరియొక్క బంతిని కొట్టుకున్నది. ఈఅణువు మరల గిరణరూపమున, దార్ఢ్యతాణువులను వదలివేయుచున్నది. కాని యీ యిచ్చివేయుటలో, బైన చెప్పినట్లు మూడు రకములు జరుగవచ్చును. పుచ్చుకొన్న దార్ఢ్యతాణువునకు సమానముగను, లేక దానికన్న హెచ్చుగను, లేక తక్కువగ నిచ్చివేయవచ్చును. ఈమూటికి సంబంధించినవి, సనాతనమును, దాని కిరుప్రక్కలనున్న, మార్పు

చెందిన కిరణములను. ఇది యాయన యూహ. ఇంకను బరిశోధన చేయవలసియున్నది.

దీనియొక్క ప్రాముఖ్యతనుబట్టి యిప్పుడే, యమెరికాలోనేమి, ఐరోపాలోనేమి, అప్పుడే ప్రయోగముల మొదలిడినారు. అమెరికాలో Wood అనునాతడు, 40 అడుగుల ఫోకల్ లెన్‌క్తు గల Spectrometer ను నుపయోగపరచి, దీని తత్త్వమును బయటకు లాగ యత్నించుచున్నాడు. వారలు చేయుపనులు ధన మమితముగ నుంటుటవలన, లేక రామన్‌గారన్నట్లు "కుండలతో పైకముండుట"వలన, వారలు చేయుపను లమానుషములుగ నుండును

ఈవిషయముననే నా దేశజనులకు, తమ విధ్యుక్త ధర్మమును జ్ఞాపకముచేయ సాహసించెద. ప్రతి భాగ్యవంతుడు నీవిషయమున, రామన్‌గారికి దోడుపడవలసియుండును. అట్లు చేయుటచే, తమదేశమునే యుద్ధరించిన వారయ్యెదరు.

రామన్‌గారి పనినిగూర్చి యేవియో, నాశక్తికొలది కొన్నిమాటలను వ్రాసితిని. ఇక పాఠకుల సెలవు దీసికొను యద నాసన్నమైనది. నేకరమించుటకుముందు, నా దేశజనులకు జెప్పునదేమన, తమ యావచ్ఛక్తిని, తమ బాలురవిద్యాభివృద్ధికి వినియోగపరచవలెనని. ఇచ్చట కలకత్తా విశ్వవిద్యాలయముయొక్క గొప్పదనమును జూచినచో, బ్రతియాంధ్రునకును దిగులు పుట్టవలసినదే! పేరెన్నికగన్న ప్రొఫెసర్లను, బ్రతిశాఖయందునుబడసి, వారలచే M. A. క్లాసు విద్యార్థుల కుపన్యాసము లిప్పించుటయే గాక, పరిశోధనముల జేయించుచున్నారు. మన దేశములో B. A. కన్న పైకిరాలేదు. విశ్వవిద్యాలయము స్థాపింపబడినది.. కాని తన పెద్దపనిని నిర్వహింపలేనందులకు, ధనాభావమే కారణము. ఓస్వదేశీయులారా, మీ రెన్నడును జమీందారులు ధనమిచ్చి మీవిశ్వవిద్యాలయమునున్నతస్థితికి దెచ్చెదరని కలలు కనవద్దు. అంతవరకు మీరోపిక పట్టవద్దు. మీరోపిక పట్టినను, మీ బాలురు, ప్రతిభావిశేషులగు బాలురు, పరదేశీయ విశ్వ విద్యాలయముల నీసడింపబడి చదువుట కోర్వలేరు. మీ బాలురపయి ప్రేమయున్నచో, మీ బాలురగౌరవమున కేమైన యాదరణమున్నచో, నిప్పుడీ విశ్వవిద్యాలయస్థానమునుగూర్చిన ప్రశ్నలన్నియును మూలబెట్టి, యెవరికి దోచినది వారు విశ్వవిద్యాలయమునకు దానముచేసినచో, నొక్కరోజులో, కలకత్తా యూనివర్సిటీతో, మీయూనివర్సిటీ తులతూగగలదు. అంతేకాదు. ఒకవిశేషమున్నది. మీ బాలురబ్బురంపు ప్రతిభావంతులు. వారల కవకాశములు లేకపోవుటవలననే, పైకి రాలేకపోవుచున్నారు. ఇది జ్ఞాపకముంచుకొన్నచో, నేతర్వాత జెప్పదలచినది మీరే యూహింపగలరు. కావున మీరు చేయుక్రమము M.A. క్లాసులను స్థాపించుటయును, బరిశోధనాగారములు నెలకొల్పుటయును, మీరీ ప్రోత్సాహమునే చూపినచో విశ్వవిద్యాలయాధికారులు మీ బాలురకు తగినగురువర్యులను బడయుటలో వారి కాలము నుపయోగపరచెదరు. బాలుడనగు నేను పెద్దలరగు మీకింతకన్న జెప్పుటభావ్యము కాదు.

---

# విశ్వభారతి ఆదర్శము-భారతవర్షమునకు దానిఅనువర్తన

బెజవాడ గోపాలరెడ్డి; బి. లిట్ (విశ్వభారతి)

## ౧

## ఆదర్శము యొక్క మూలము

ఇటీవల జరిగిన మహాసంగ్రామము శ్రీరవీంద్రనాథ ఠాకూరుగారిని మిగుల కలత పెట్టెను. దేశాభిమానము, జాతీయత యను గొప్ప నామముల వహించి యుద్ధము యొక్క ఘోరమగు అపరాధములకు ఎటుల పశ్చిమ దేశములలో ప్రతి యొక్కొక్కటియు బలియగుచున్నదో ఠాకూరు గారు గమనించిరి. అట్టి పరిస్థితులు ప్రపంచశాంతిస్థాపనకు యెటుల వినాశకరములో గూడ వారు గనుగొనిరి. మిథ్యా దేశాభిమానము, పరుల నాశమున గోరు జాతీయత యను పిశాచద్వయము,శాంతిపక్షములచే ఉత్కృష్ట భావాంబరమున విహరించుచు కవితా కూజితముల వినిపింపజేయు రవీంద్రునికి శాంతినివ్వక, అతని హృదయమును మిగుల పీడింప జొచ్చినవి. రక్తపిపాసములగు ఆ పిశాచములు తమ భీకరవదనగహ్వరముల తెరచి, కరాళదంష్ట్రములచే ఇకిలించుచు, ఆహారము పడిన కొలది అతిశయించు క్షుధతో వారి అంతర చక్షువులయెదుట నాట్యమాడునట్లు కాన్పించెడివి. చిరకాలము ఈ విషమావస్థయందు ప్రపంచము తగులొక్కని యుండవలసిన దేనా, లేక యేదైన సుఖకరమగు ఉపాయ మున్నదా యని వారు దీర్ఘముగ ఆలోచించి సంస్కృతుల రైక్యత (cultural unity) యను మృదు సూత్రములచే, యీ రాష్ట్రములు ఒకదానితో నొకటి బంధింపబడకుండిన ప్రపంచశాంతిస్థాపన దుష్కరమని తీర్మానించు కొనిరి. తమ తమ భిన్నసంస్కృతుల విజ్ఞాన వినిమయముచే, అభిన్న భిన్న రాష్ట్రముల ప్రజలు ఒకరినొకరు పూర్ణముగ అర్థముచేసికొన గల్గుదు రనియు, అదియే యీ యుద్ధముల పరుసను తుది ముట్టింప గలదనియు వారి నిశ్చయము.

ఈ యుద్దేశ్యముతోడనే, శాంతినికేతనమువద్ద విశ్వభారతియను విశ్వకళాపరిషత్తును ౧౯౨౧ సం||న నెలకొల్పిరి. ప్రాచ్య పాశ్చాత్య విద్వాంసులు, శాస్త్రజ్ఞులు అచ్చోచేరి వారి పాండిత్యబీజముల నాటెదరని వారి యాశయము. ఫ్రాంస్, జర్మనీ, రష్యా, టిబేట్, చైనా, జకోస్లొవేకియా మున్నగు దేశములు విశ్వభారతి ఆహ్వానమును గైకొని తమ పండితుల పంపినవి.

## కొన్ని ఆక్షేపణలు; వాటి సమాధానములు

ఒక దేశము మరియొక దేశముయొక్క తత్వమును, వేదాంతమును, ఇతిహాసమును, సారస్వతమును, జీవన మర్మమును తెలిసికొన గలిగినపుడు, ఆ దేశముపై, అది యేలాటి ద్వేషభావమును వహింపజాలదని ఠాకూరు గారి అభిప్రాయము. కాని పెక్కు విమర్శకులు, ఈ ఆదర్శముయొక్క మూలసూత్రముమీదనే తమ ఆక్షేపణల స్థాపించెదరు. ఒక దేశముయొక్క జీవనతత్వమును, సంస్కృతిని మరియొక దేశము సంపూర్ణముగ గ్రహించినను, ఆ దేశముపై ఏలాటి అభ్యంతరము లేక ద్వేషభామును పూనగలదని వారి వాదన. సంస్కృతుల యిచ్చి పుచ్చుకొనుటచే జాతీయ వివాదములు, సమరములు తుది చెందజాలవని వారి నమ్మకము. జర్మనీకిని, ఇంగ్లాండునకును జరిగిన ఇటీవలి సంగ్రామము వ్యాపారవిషయమున గాని, విజ్ఞానవిషయమున గాని, ఒకరి నొకరు తెలిసికొనక పోవుటచే కాదు. కాని వారి వాణిజ్యనిరంకుశత్వమునకు, రాజ్యవిస్తరణకును, సార్వభౌమత్వమునకును వారికి గల దహించుచున్న అభిలాషయే కారణమని వారి విశ్వాసము. ఈ తుచ్ఛ అభిలాషత్రయమే సంగ్రామముయొక్క పునాదనియు, సంస్కృతుల రైక్యము, అంతర్జాతీయత యను గొప్ప విషయముల మాటాడుటచే ఆదోషములు పోజాలవనియు వారివాదన. ఇటు లీ ఆదర్శమును విమర్శకులు మిగుల ఉత్సాహ

పూరితులై ఖండించెదరు. కాని దీనికిమారు, మరేదైన, మనయుద్దేశ్యమును నెరవేర్చు ఉపాయముగాని, ఆదర్శము గాని యున్నదాయని ప్రశ్నించిన, తలగోకుకొనుచు, పీలముఖము వేసి, మౌనముద్రను వహించెదరు. దీనికి సమాధానము చెప్ప సామర్థ్యము లేకపోయినను, ప్రపంచములోని గొప్ప ఉపద్రవములలో నొకదానిని వారింపబూను ఒక ఆదర్శమును అతిక్రూరముగ విమర్శించెదరు. ఇచటనే, వారి మానసిక సంకుచితత్వము ప్రదర్శింపబడుచున్నది.

నా మట్టుకు నేను, విశ్వభారతి ఆదర్శమునకు రాష్ట్రముల శాశ్వతవిరోధముల మాన్పగల శక్తి యున్నదని నమ్మువారిలో నొకడను. కాని రాష్ట్రములన్నియు హృదయపూర్వకముగ ఆదర్శమును గైకొని, దాని ప్రకారము అనువర్తించ వలెను. మనము యింకొకని కనడపడిక, తత్వము, భావములు, తలంపులు తుదకు వాని చిత్తవికారములు సంపూర్ణముగ తెలిసికొనినపుడు, వాని యెడల మన కొకవిధమగు సానుభూతి తప్పక కలుగును. పూర్తిగ తనకు తెలిసిన విషయములపై గాని, వ్యక్తులపైగాని, ప్రదేశములపైగాని సానుభూతికలుగుట మానవుని ప్రకృతిలోనే యున్నది. ఈ సానుభూతి ఒకతూరి యేర్పడిన తర్వాత, తిరుగ వాటిపై విరోధభావముగాని, విద్వేషభావముగాని వహింప జాలము. దీనినే పెంచిన సమాజములకు, సంఘములకు, ప్రాంతములకు, దేశములకు అనువర్తింప గలదు. సరియగు సానుభూత్యభావమే రాష్ట్రముల జీవనప్రణాళికను చెఱచు చున్నది. జాతీయతయను పేరుతో నొకరి గొంతుకలకు నొకరు దుమికి వారి రక్తస్రవణమునకు ప్రోత్సహించుచున్నది. ఇంతకన్న భయంకరమగు నేరములు ప్రపంచమున లేవను నంతటి ఘోరపాతకముల కావించుటకు పురికొల్పుచున్నది. ఒక కరమున వికృతరూపమునుదాల్చిన పదార్థతత్వము Materialism ను, దానిని అవలంబించి యుండు అసంఖ్యాకములగు దుర్గుణములను పట్టుకొని, మరియొక చేత దుర్భరమగు నాస్తిక తత్వమును బట్టి, రక్తసిక్తములగు దుకూలముల ధరించి, యెముకల గద్దియపై ఉపవిష్టించియున్న, రాక్షసి యెదుట చేతులొగ్గి నిలువబడి, దాని కనుసన్నలరీతి నడచునట్లు చేయుచున్నది. సంస్కృతుల యైక్యముచే జనితమగు అంతర్జాతీయతయే యీ క్రూరప్రవర్తనయను విషమునకు విఱుగుడు. అదియే మనకు గతి.

మరికొందఱు విమర్శకులు, 35 కోట్ల భారతీయులు పరరాజ్యభారముక్రింద చితికి నలిగిపోవుచుండ మన దేశములో మనమే విదేశీయులరీతి నుండ, మన దేశాభ్యుదయమునకు తోడ్పడునటుల మాట్లాడుటకు, వ్రాయుటకు మనకు స్వాతంత్ర్యము లేకున్నపుడు భారతవర్షము విశ్వసౌభ్రాతృత్వము, అంతర్జాతీయత యను విషయముల ఆలోచించుటకు దగదని నమ్ముచున్నారు. మన దేశమును, మనము సంరక్షించుకొనుటకు లేక మనభావి రాజ్యప్రణాళికను మన ముచ్చటించుటకు వీలులేక నిస్సహాయులమై యున్నాము. ఇంత యెందుకు, ఆత్మగౌరవముగల మరి యే యితరరాష్ట్రమైన కోరు కనీసపు అధికారములు మనకు లేవు. ఇట్టి నిస్సహాయస్థితియందు, అధికారమదముచే కైపెక్కి, దుర్బలరాష్ట్రములపై నిరంతరము తన పశుబలమును ప్రదర్శించుచుండు పరప్రభుత్వముయొక్క నిష్ఠురపిడికిళ్లనుండి విముక్తలగుటకు, భారతవాసీయులు తమ యావత్తు శక్తిని, బుద్ధిని వినియోగించ వలయునని ఆ విమర్శకులు చెప్పుచున్నారు. ప్రపంచముయొక్క సమస్యలకు పరిష్కారముల, గొప్ప ఆదర్శముల ఆలోచించుటలో, భారతవర్షము తన కాలమును వృథాచేయరాదనియు, అట్లు చేయుటచే తన గౌరవమునకును, ప్రాణమునకును ముప్పు వాటిల్లునియు, మన దేశము బానిసరాజ్యమని పాశ్చాత్యులచే తలపబడు నంతకాలము, వారు ఆపె హితవాక్యముల సరకుగొనరనియు, ఇతర స్వతంత్ర రాష్ట్రములు అనుభవించుచున్న ఉన్నతస్థానము తనకు దుర్లభమనియు వారు అభిప్రాయపడుచున్నారు. అంతర్జాతీయతను గూర్చి భారతవర్షము ఉపన్యసించుటకు అధికారము లేదని చూపుటకు పైకారణము లన్నియు చూపుచున్నారు. అధిక సంఖ్యాకులగు భారతవాసీయులు, యీ అభిప్రాయముతోనే నేటికాలమున ఉండుట శోచనీయము.

పైకారణములు వారు చెప్పుట, వారి మాతృదేశముపట్ల వారికి ఉండు భక్తిశ్రద్ధలవలననే గాన, వారిని దూషింపనిలేదు. మాతృఆరాధనాతన్మయత్వమున ఇతర పెద్ద విషయముల సరిగా కాంచలేకపోవుట సహజము. భారతవాసీయు లందరును ఈ ఆదర్శముయొక్క విలువను గ్రహించి, దాని పతాకము చుట్టు చేరగల దినము సమీపముననే యున్నది.

విమర్శకులు ఆదర్శమును గూర్చి చెప్పున దేమిటో సరిగ అర్థము కాకున్నది. ఈసందేశమును భారతవర్షము ప్రపంచమునకు యివ్వగూడ దనుటకు ఆపె రాజకీయముగ అస్వతంత్రు రాలనియా? విదేశీయ భారమునుమనము తొలగద్రోయువరకు, గర్భాంతరాళమునుండి పైకి ఉబికివచ్చు భావావేశముల భారతవర్షము ప్రకటింపగూడదా? పరుల వినాశమును అపేక్షించు జాతీయతయెడ తిరస్కారభావము గలిగెన విశ్వభారతి ఆదర్శము భారతవర్షముయొక్క జన్మహక్కు దానికి ఆపెయే హక్కుదారు. అది తన దేహములోనే యిమిడి యున్నది. మన సమాజములోనే కలసి యున్నది. ఇతర దేశము లన్నిటి నుండియు, ముఖ్యముగ పాశ్చాత్యదేశములనుండి మన దేశము పెక్కు విషయముల సేకరించినది. అందులకు ఆపె చిరకాలము కృతజ్ఞురాలై యుండగలదు. నిస్సంకోచముగ పాశ్చాత్యదేశముల పాదములకడ, తనకు లేని విషయముల పొందుటకు కూర్చుండ గలదు. ఇట్లనుటలో తిరిగి వారికేమియు యివ్వజాలదని అర్థము చేసికొనుట పొరబాటు. తన మొదటి పొరలచే నిర్మితమై, ఎముకల లోని మజ్జచే శక్తివంతమై నాళములలోని రక్తముచే చాయను సౌందర్యమును పొందిన తన సందేశము కలదు. వాదములకు గూడ తావివ్వనంతటి యథార్థముగ ఆపెకు యీ సందేశము కలదు. బ్రిటిష్‌వారు కనికరించి మనకు స్వరాజ్యమును ప్రసాదించుదనుక, తన సందేశమును యితరుల కిచ్చుటకు ఆగి వేచియుండవలయునా? సంపూర్ణ స్వతంత్ర భారత వర్షపు సంయుక్తరాష్ట్రముల త్రివర్ణ పతాకము నాటబడి ఆకసమున ఎగురవేయబడువరకు తనభావములను, అభిప్రాయములను అణచి ధ్వంస మొనర్చ వలయునా?

## అంతర్జాతీయత, స్వరాజ్యము

జాతీయవాదుల అర్థముచేసికొనుటకు యిచ్చటే కష్టము. స్వరాజ్యప్రాప్తి ప్రయత్నమునకు అంతర్జాతీయత యెట్టులు నిరోధమగు చున్నది? నాకు తెలిసినంత వరకు, అంతర్జాతీయత పూజారులెవరును హిందూదేశము స్వరాజ్యమునకు యత్నింపగూడదని చెప్పుటలేదు. వారు మనదేశము తన విషయములలోనే తృప్తినొందుచు యితర దేశముల స్పర్శ యక్కర లేదనుచు యితరులు చెడుటచే మన మభివృద్ధి పొందవలయునని అభిలషింపగూడదని మాత్రము చెప్పుచున్నారు. మన అన్ని ద్వారముల తెరచియుంచి, వాటిగుండా వీయు అన్ని దిక్కుల పోతవాయువులచే మనఃక్లాంతిని బాపుకొని, అవి వివిధ ప్రాంతములను భిన్నభిన్న వాతావరణముల గుండ గ్రుమ్మరుచు సంపాదించి తెచ్చు సౌరభములచే మనము తన్మయత్వము నొందవలసి యున్నది.

స్వరాజ్యము మనకు వచ్చితీరవలయును. ప్రతి యదార్థభారతీయుడును దానికై యపేక్షించు చున్నాడు. మన ప్రయత్నములకు, కావలయునని యెవడైన, యెవతెయైన ఆటంకముల కలుగజేసిన, దేశద్రోహులు, ఘాతకులు, ఆత్మరహితులును, స్వార్థపరులునగు బానిసలు, మాతృ అవమానాభిలాషులు నున్నగు సంక్రాంతి బిరుదములతో వారిని సత్కరించి కలిపురుషుని వాహనముపై ఊరేగింప వలసి యున్నది.

స్వరాజ్య ప్రాప్తియే మన అభిలాషాంతముకాదు. దాని ఆవలనున్న అభివృద్ధిసౌధమునకు స్వరాజ్యము యొక పాథేయము మాత్రమే. అట్లయిన మన వ్యాపారవిషయములను, బుద్ధిసంబంధములగు ఆసక్తులను, కవిత్వవిచారములను, సౌందర్యవాంఛలను, వైవాహిక తీర్మానములను స్వరాజ్యము వచ్చువరకు ఆపుదల చేయవలయునని గాని, వదలివేయ వలయునని గాని నిర్బంధమా? అట్టి మొదటి అశ్రావ్యమగు ఉద్రేకవినాశమగు స్వరాజ్యము మన కక్కఱలేదనుటలో చదువరిగూడ నాతో ఏకీభవించుచున్నాడని నమ్ముచున్నాను. మన జపమంత్రము రవీంద్రుడు గీతాంజలిలో చెప్పినట్లుగాప

"వైరాగ్యసాధనచే గలుగు ముక్తి నాకు వలదు" అను నదిగా ఉండవలయును.

ప్రపంచములోని గొప్ప ప్రవక్తలు, మతసంస్థాపకులు చాలమంది ఉచ్చకులములకు జెందినవారు కారు. వడ్రంగి కుమారుడు ఏసుక్రీస్తు. తన దివ్యసందేశమును లోకములో చాటగా పెక్కుమహీపతులు ఆతని మతావలంబకులైరి. అతను తక్కువ కులమునకు చెందినవాడని, వారు ఆతని మతమును తృణీకరింప లేదు. బుద్ధుడు తన మతమును స్థాపించినపుడు, రిక్తహస్తుడగు సన్యాసియే. ఆతని బౌద్ధమతము మహాసంపన్నులగు అశోక బింబిసారులకు శిరోధార్యము కాలేదా? హిందూమత ఆధారములగు ఋషులు అడవులలో తిరుగుచు, కందమూలాదుల భక్షించుచు నిరుపేదలయి యుండిరి. కాళిదాసు నన్నయ, శ్రీనాథుడు, పెద్దన మున్నగు కవులు మరొకరి ఆస్థానకవులై వారిపై యాధారపడి యుండిరి. ఓమర్ ఖయాం, గోల్డుస్మిత్, డికెన్సు, జాన్సన్ మున్నగు వందలకొలది వాఙ్మయకారకులు, శాస్త్రవేత్తలు ద్రవ్యాభావముచే పలుకష్టముల పాలైరి. వీరి వ్రాతలను లోకము అనాదరణతో చూచినదా? వందల కొలది సంవత్సరముల క్రితము వ్రాయబడిన వారి పుస్తకములు క్రూరకాలగర్భాంధకారమున మాటుపడి పోయినవా? కాన, సందేశము నిచ్చుటగాని, లోకముయొక్క ఏవిధమైన అభివృద్ధికైన సహాయపడుటగాని, ద్రవ్యలోపము, రాజకీయపరతంత్రత యను కొలతబద్దలతో కొలువ దగదు. ఇతరస్వల్పవిషయముల సరకుగొనక, జ్ఞానిగను కవిని కవిగాను, సందేశమును సందేశముగను మనము ఆదరింపవలసియున్నది.

సంధి

జాతీయత జాతీయతయే, అంతర్జాతీయత అంతర్జాతీయతయే 'వీటికి ఎన్నడును పొత్తు కలుగదు' అను ప్రలాపముల మానివేయ వలయును. రాజకీయవేత్తలు, తమ స్వల్ప అభిప్రాయములను, సంకుచితత్వమును విసర్జించి అంతర్జాతీయతవైపుగూడ తమ దృష్టిని మరల్చవలెను. అంతర్జాతీయవాదులు గూడ వీలైనప్పుడెల్ల జాతీయవాదులను కూపస్థమండూకములనియు తమదేశము చుట్టు అభేద్యమగు హిమాద్రివలె పర్వతశ్రేణులుండి, ఇతరుల స్పర్శలేనందున సంతసించువారనియు హేళన చేయరాదు. వారు ఏసమాజమునకుగాని, ఏదేశమునకుగాని చెందినవారము కామని అభిప్రాయ పడరాదు. వారుకూడ భారతవర్షపు స్వాతంత్ర్యసమరమున పాలుతీసికొన వలయును. ప్రపంచము నంతయు ప్రేమించి విశ్వసౌభ్రాతృత్వమునకు చెందినవారు వారి సంఘమును మండలమును, ప్రాంతమును, వారి దేశమును ప్రేమింపరాదనుకొనుట తెలివి మాలినతనము. కాని వాటివాటి కనువగు పరిణామముల గమనించి అనుసరించవలయును. విశ్వభారతి ఆదర్శ సంస్థాపనాచార్యుడగు ఠాకూరుగారికి వంగదేశము ప్రతి, భరతవర్షము ప్రతి గల ప్రేమ అద్వితీయమని చెప్పిన మన్నింపబడుదునుగాక.

---

## అచట

తన్నీరు కృష్ణమూర్తి గారు

అచటి వనభూమి తేటినై య్యాప్రసూన - నిర్గతసుధాధనంబు దొంగిలిచునుండ
పాడువనమాలి నాకు దాపరకమయ్యె - పరుగుపరుగున వచ్చి నన్ పారదోల;—
అచటి పూగుత్తినై దిశలందు నాదు - సౌరభంబుల జిమ్మి విషణ్ణహృదయ
గహ్వరములందు వెన్నెలల్ గాయజేయ - కఠినహృదయుండు ప్రక్కమార్గంబులోన
బోవుచును నన్ను త్రుంచుకపోయె నకట;—
అచటి భూజంబునై మార్గమందు బోవు - బాటసారుల ఆయాసభార మంతె
మాన్ప యత్నించుచుండ ఆమాయదారి - వాయుదేవుండు నన్ బడవైచిపోయె;—




## ఇంగ్లండులో నాటకరంగము.

ఆంధ్రనాటకరంగమునకు సుపరిచితులగు శ్రీమాన్ తాడిపత్రి రాఘవాచార్యులుగారు పశ్చిమదేశసంచారమున నుండినప్పుడు ఇంగ్లండుదేశపు నాటకకళను గూర్చి వారు ఆంగ్లమున వ్రాసిన యుత్తరమున కనువాద మీ క్రింద బ్రకటింపబడుచున్నది :—

నేటి యింగ్లీషునాటకకళ పెంపు నాకు తెలిసినది. అనాచ్ఛాదితమగు తన యందములో, అల్లే, చాటు లేని తన కురూపిత్వములో జీవిత మున్నదున్నట్లుగ నందు చిత్రింపబడినది. ఆధునికసంఘముచే నతి పవిత్రముగ దాచియుంచబడిన బురదనేలలు, పర్రలు నిర్దయముగ బహిరంగ పరుపబడినవి. నిరంకుశములు, నిరంతములు నగు పచ్చికోరికలనుండి జనించు దురంతము తీవ్రముగ బయల్పరుపబడినది. గౌరవపూర్ణముగ గానవచ్చు మూర్ఖవిశ్వాసముల తెరచాటున బడియున్న యసహ్యములగు నేటి జీవితకష్టములు తళుకు గలిసిన మోట యెగతాళిలో వెలువరింపబడినవి. వాస్తవములగు స్థితిగతులనడుమ సంఘము, విజ్ఞానము, నాగరకతయు ననుభవించు సంపూర్ణమగు నిస్సహాయత చిత్రింపబడినది. శాశ్వతములగు సత్యములు దుఃఖగానమునకు బాల్పడినవి. పరమును గూర్చిన దృష్టి, శాశ్వతధర్మమును గూర్చిన యాలోచన యొక మోటుపరిహాసముగ బరిణమించినవి. తప్పనిసరిగ వచ్చుచున్న ఎక్కువతక్కువల మూలమున జనించు పెద్దపెద్ద సమస్యలన్నియు విస్పష్టముగ సవిమర్శముగ బ్రకటింపబడినవి. ఇంతవరకు భారతీయునికన్న ఆంగ్లేయుడు గొప్పవాడే. ఏకష్టముగాని, యేపెనగులాట కాని సంఘటించినప్పుడు తాబేటివలె తటాలున తల వెనుకకు లాగికొనుట భారతీయునికి సహజము.

సరే, నాటకరంగమునకు మరలెదను. పాశవములైన మోటునడతలచే సొగసుగ జిత్రింపబడిన విలాసమయములగు సాంఘికజీవితరథ్యలలో నుద్భవించుచున్న దిగ్భ్రమగలిగించు నావికలత్వము-మానవుని స్వార్థపరత్వము నుండి, దురాశనుండి పుట్టు యుక్తులయెడ ప్రకృతియొక్క భయంకరమగు నా తిరుగుబాటు, క్రూరమగు కుక్షింభరత్వము రక్తమును పీల్చివై చెడి ప్రతీకారముయొక్క నిష్ఠురమగు నాగెలుపుటఱపు-సహజములగు నాసలకు, పూర్వాచారముల తలుపులను, కిటికీలను దొంగతనముగ దెఱచివైచి, వెలికి పారిపోవ సాయమొసంగు నాకపటవర్తన క్రూరమందహాసము-నేరముల యమాయికత-పడుపుకత్తె పవిత్రత-కల్లలమారి నీతిసంపత్తి - న్యాయశాస్త్రముయొక్క యన్యాయము-శిక్షలోని యధర్మము-నాస్తవము, వేదనాకరము నగు విస్పష్టతతో వీనినన్నిటిని జిత్రించుటకు ప్రయత్నింపబడినది. మరుగు లేని జీవితమిది, మూర్తీభవించిన స్వాభావికత; మరియటుపైనంతయు శూన్యము-మోక్షము. జీవితప్రవాహౌద్ధత్యమున బడి స్త్రీపురుషులెంత నిస్సహాయులై యున్నదియు గ్రహించుకొనుచు, ప్రేక్షకు లింటిదారి బట్టుదురు.

అందమొప్పు నాట్యము, అద్భుతమున ముంచివైచు కథావస్తువు, దివ్యమగుపరిసరము-ఇంతయున్నను నేనస్పష్టమగు నొక నిరాశకులోనైతిని. జీవితప్రవాహమును నేను చూడగల్గినమాట నిజము. ఆ ప్రవాహమున స్నానమను భవింపవలెనని నాకోరిక; అందుచే దానినీదుటకు నాకొక

దారి కావలయును. అందు బడి కొట్టుకొనిపోవ దారి యక్కర లేదు.

నాటకరంగము సమస్యల బరిష్కరింపక యేల విడిచివైచుచున్నది? తన సమస్యలను సర్వమునిండియున్న యామహాశక్తి యెదుట బెట్ట దాని కీభీతి యేల? కడపటి దిద్దుబాటులో విశ్వాసముంచుట సిగ్గుపడవలసిన యంశమా? ఆనందకరమగు పరిసమాప్తిపై నమ్మక మొక చేతగాని తనమా!

ఉత్పాదక శక్తిగ మాత్రమే భగవంతు డంగీకరింప బడినట్లు నాకు తోచుచున్నది. పరమేశ్వరుని లయకారకత్వముగూడ బహుళః అంగీకరింపబడినది కావచ్చును. కాని రక్షకత్వము ఒక కల్పనకథ మాత్రమే యయినది శాంతిరక్షకుడు, న్యాయధర్మపాలకుడునగు నొక యీశ్వరుడు కలడని నమ్ముట యొక ప్రాతపడిపోయిన యాచారముగ గానవచ్చుచున్నది. ఆధునికవిజ్ఞానము పరమేశ్వరుని బారద్రోలినది.

దాని ప్రయోజనము దానికుండవచ్చును; దాని స్వరూపగాంభీర్యము దానికుండవచ్చును; కాని యీ నాటకరంగము నాయెదుట బెట్టిన చిత్రము నాకేమో యసమగ్రముగ గన్పట్టుచున్నది.

—'త్రివేణి' నుండి.

---

## తెలుసు

మల్లవరపు విశ్వేశ్వరరావు గారు

ఈ బ్రతుకున వ్యర్థమైన
ఈప్సితములు స్వర్గవాటి
మరల పూచి సఫలీకృత
మగునని తెలుసు.

ఇంకిపోయి నా కందని
ఈలోకపు సానుభూతి
నందనమున మకరందపు
నదులై పొంగు.

వెలిపుచ్చకయే వాడిన
వలపు కోరికల రేకులు
నాకలోకమున నచ్చర
లే కోరెదరు.

యౌవనమున నే జీవన
యాత్ర ముగిసి పోయినచో
అజరుడనయి త్రిదశులలో
నాకృతి గాంతు.

సౌందర్య పిపాసలోని
సత్యము నిపు డెరుగనిచో
అమృతము గ్రోలినయప్పుడె
అనుభవింతును.

---




## వేణీసంహారమున నాయకుఁ డెవరు?

"ప్రఖ్యాతో రామాయణాది ప్రసిద్ధః నాయకో
ధీరోదాత్తః రాజర్షి ర్దివ్యోవా, తదుపేతం నాటకమ్."
—రత్నాపణము.

"ప్రఖ్యాతవంశో రాజర్షి ర్దివ్యోవా యత్ర నాయకః,
తత్ప్రఖ్యాతం విధాతవ్యం వృత్త మత్రాధికారకమ్."
—దశరూపకము.

ఆలంకారికుల నాయకలక్షణ మిట్లేకాని "ఎవఁడు నాటకముయొక్క ప్రతియంకమునందు వచ్చునో..." ఇత్యాది ఫాల్గున భారతి సంచికలో నరసయ్యగారు చెప్పినట్లు లేదు. వేణీసంహారమున ధర్మరాజు నాయకుఁడా? భీముఁడు నాయకుఁడా? యను సంశయములో ధర్మరాజే నాయకుఁడని పలువుర విపశ్చితుల నిశ్చితాభిప్రాయము. శ్రీనరసయ్యగారు చెప్పినట్లు లక్షణమైనచో సేనాధిపతియు నాయకార్హుఁడు. అయిన సమస్త పాత్ర ప్రాధాన్య మతని కబ్బదేమో. అట్లు చూచిన నా పదవి భీమునకును నబ్బదు. నిపుణముగఁ బరికించిన పాత్రప్రాధాన్యము ధర్మజునకేకాని భీమునకురాదు. వేణీసంహార విషయక కథను పోషించుటలో ధర్మజు డేమియుఁ జేయలేదని వ్రాసిరికాని ధర్మజు నాన యేమియు లేకుండిన నాటకమే యుండెడిదిగాదని మనవి. ధర్మజు నభిమతమే లేనిచో భీమ యుద్ధ ప్రసక్తియే లేకుండెడిది.

"...నగురుర్నాహం విధేయ స్తవ" అని యప్పటి కోపము చొప్పున నన్నాఁడే గాని భీముఁడెల్లప్పుడును అన్నగారికి విధేయుఁడే యని సూక్ష్మదృష్ట్యా నాటకమును బరిశీలించినఁగాని తదితర భారతాదులవల్లఁగాని డెలియుచున్నది.

ధర్మరాజు పరాక్రమ మెచటను వర్ణింపఁబడ లేదని నరసయ్యగారు వ్రాసిరి. భీముని పరాక్రమము మాత్రము వర్ణించెనా కవి? కృత్యములవల్ల నవగతము గాఁదగ్గది. తుదియంకమున భీమునిలో దుర్యోధనభ్రాంతి గలిగిన ధర్మరాజు తన పరిష్వంగములో నులిచేయ సంకింపలేదా యావ్యక్తిని? యుద్ధప్రయత్నము చేయ కుండెనా? 'నేను భీముఁడను' అనియే యావ్యక్తి చెప్ప కోకపోయిన భీముఁ డెట నుండెడివాఁడో! ఈ విచిత్ర ఘటనము వల్లనే ధర్మరాజు పరాక్రమము వర్ణింపఁబడిన ట్లర్థముచేసికోవలె.

ఇఁక ధర్మజునిలో ధీరోదాత్తగుణములు లేవను నరసయ్యగారి వ్రాఁత వారి యితరనాటకపరిశోధనాలోపమును బ్రకటించుచున్నది. వారన్నట్లు చార్వాకుని ప్రసంగము గుణభంజకము గాదు, గాని గుణరంజకమే యగును.

"మహాకులీన తౌజ్జ్వల్యం మహాభాగ్య ముదారతా,
తేజస్వితా విదగ్ధత్వం ధార్మికత్వాదయో గుణాః."

"ఆదిగ్రహణాత్ మహామహిమత్వపాండిత్య ప్రభృతయః."

ఈ గుణములన్నియు ధర్మజున కున్నవని అందఱును సంగీకరింతురు. ఇంకను బ్రకృత నాటక చార్వాక వర్ణనముచే నీతని యౌదార్యాదిగుణములు పోషింపఁబడినవి. అనిర్వచనీయమైన సోదరప్రేమాతిశయము, తుచ్ఛమైన యైహిక విషయ నిరసనము, తన దేహమును గూడఁ బ్రాకృతులవలెఁ బ్రేమింపక సులభముగఁ ద్యజింపఁ జూచుట, ఒక సోదరుఁడు గతించినను దాను జీవింపను ప్రతిజ్ఞాప్రాబల్యము మొదలగు గుణములు వర్ణింపఁబడినవి.. ఇదియే కవి యా సమయమున చమత్కృతిచే

దననాయకునియందుఁ జూపిన యమూల్యగుణము. సోదరి ప్రేమాతిశయమే ధర్మజునకు వినాశప్రయత్నము గావించినది. ధీరోదాత్తుఁడు, మహాకవి కాళిదాసుని నాయకుఁడైన, దుష్యంతుఁడును ప్రాకృతుఁడైన విదూషకు నొక సమయమున "సఖే, త్రాయస్వమాం" అన్నాఁడు. దుష్యంతుఁడ ట్లనఁదగునా? యని ముక్కునవ్రే లుంచు మూఢుఁ డుండునా ? మఱి దుష్యంతుఁడంత మాత్రమున నాయకుఁడుగ నుండ నర్హుఁడు గాఁడా? కావున సమయాసమయముల ననుసరించి కవి తన నాయకునకు వివిధము లగు గుణములను వర్ణించు చుండును. "న కానిశి స్వప్నగతం దదర్శతం, జగాద గోత్రస్ఖలితేచ కానతం" అని నలగుణములు వర్ణించునపుడు "నీవీమోచన వేలాయాం వస్త్రమూల్యనిరీక్షణ" మ్మనురీతి,నయ్యూ,నిషధలోని స్త్రీలందఱు కులట లేనా?యని ప్రశ్నింపవగునా?

మఱి యన్ని యంకములందును బ్రవేశించు ముఖ్యపాత్రమే నాయకుఁ డన్న లక్షణమే నిష్కృష్టమైన ముద్రారాక్షసములో నాయకుఁ డెవరు? చాణక్య ప్రవేశ మంతటను రెం డంకములలోఁ జంద్రగుప్తునిది-నాయకునిది. క్రియయంతయు బ్రాహ్మణునిదే. విశేషించి రాజును "వృషల" యని పిల్చుట. కాఁబట్టి పూర్వోక్త లక్షణము వ్యభిచరించుచున్నదిగాన సరిపడదు. ఆలంకారికులును భీమునే నాయకునిగఁ దలఁచుచుండి రనుట అసత్యము. సత్యమేయైననావాక్యములనెత్తివ్రాసినసమంజసము.

ప్రకృతవేణీసంహార నాటకమున ధర్మరాజే నాయకుఁడు. అనుజులు చక్రవర్తికి సైనికు లట్లు తోడ్పడినారు. చక్రవర్తియు నెపుడును యుద్ధము చేయఁడు. అంతయు సైనికులే, అట్లే సోదరులును. తుదకు చక్రవర్తి గెల్చెనను పేరే. ధీరోదాత్తగుణములు ధర్మజునకు సరిపడ్డవి. ఇతరులకు లొంగినవాఁడు గాఁడు. ప్రధానుఁడును ధర్మరాజే, కావున ధర్మజుఁడే నాయకుఁడు గాని భీముఁడు గాఁడు. భీముఁడే యైనచో

"వ్యాయోగే ప్రఖ్యాత మితివృత్తం ధీరోదత్తో నాయకః వీరరసః ప్రధానం" అని వ్యాయోగ మనియే పిలిచిన బాగుండును.—

[నల్లమోతు వీరరాఘవయ్య]

---

## చేతివ్రేళ్లనుండి మెరుపులు

వంగదేశపు వృక్షశాస్త్ర శోధకుడైన జగదీశచంద్రవసువుగారు, వృక్షములుకూడ బాధపడునని నిరూపించి యున్నారు. పచ్చని యాకున కొక సూది గుచ్చి వేరొక సూదిని మరియొక కొసను గుచ్చినచో ఈరెంటికి మధ్య విద్యుచ్ఛక్తికి సంబంధించిన యొత్తిడి యుండునని వీరు నిరూపించినారు. ఇట్టి యొత్తిడి పుట్టుటకు నరములుండి తీరవలెను; కాబట్టి వృక్షములకు నరములున్న వని ఈయన సిద్ధాంతము. కావున మానవదేహము నరముల పంజరముతో కూడిన కారణమున, మెదడను యంత్రశాలతో కూడిన విద్యుద్యంత్ర మన్నమాట. నరములే మన దేహమునందలి విద్యుచ్ఛక్తికి వాహకములు. ఈనరములు వ్రేళ్ల చివర, కాళ్ల చివర, కొనలుతీరి యుండును కాన విద్యుచ్ఛక్తి వ్రేళ్లనుండి పెకి మెరుపులు (Sparks) మూలమున పోవుచుండవలెను. అనుకూలమైన యంత్రసహాయముతో, ఈ మెరుపుల ఛాయాచిత్రమును తీయుటకు వీలుండవలెను. జర్మనీదేశములో మ్యూనిచ్ లోని ఇద్దరు శాస్త్రజ్ఞులు ఈ మెరుపులను ఛాయాగ్రహణము చేసినట్లు ఫిబ్రవరి Popular Science అను అమెరికాదేశపు పత్రికనుబట్టి తెలియుచున్నది వ్రేళ్ల చివరనుండి మెరుపులు వచ్చుచున్నట్లు నిరూపింపబడినది.

మన యోగవ్యాయామ శాస్త్రజ్ఞులు, సమాధిలో కూర్చుండునప్పుడు లేడి లేక పులి చర్మమును ఉపయోగింతురు. ఇది శరీరములోని విద్యుత్తును పైకి పోనీయకుండుటే కాక, శరీరమునకును చర్మమునకును రాపిడివల్ల నూతన విద్యుత్తును శరీరమందు ప్రవహింపజేసి నూతన వికాస మొంపజేయును. యోగులు పద్మాసనము వేసికొని చేతులను మోకాళ్ల కడ నుంచి బొటన వ్రేలిని చూపుడు వ్రేలిని కలిపియుంతురు. కారణము దేహమందలి విద్యుత్తు భూమికి సంక్రమించక తిరిగి దేహమందే ప్రసరింపజేయుటయే దీని యుద్దేశ్యమని వారు వ్రాసినప్పుడు మేము నవ్వితిమి. కాని ఇప్పుడది నిజమేయని తేలిపోయినది.

సన్యాసులు, విద్యుత్తునకు దుర్వాహకములగు పాము కోళ్లను ధరించి తిరుగుట, భుజించునప్పుడు కొ

పీటలపై సూర్చుండుట, అనులలో భుజించుట (లోహపు కంచములు విద్యుద్వాహకములు) ఇందుకే నేమో. బుద్ధిలేక పెట్టిన వనుకొన్న మన ప్రాచీనాచారముల కీరితి శాస్త్రవ్యాఖ్యాన ము పరదేశస్థుల వల్లనైన జరుగుట ముదావహము.

[శ్రీ. గో. కృ. మూ.]

## పంచవటి, కిష్కింధ, స్థలనిర్ణయము

పై చిరునామాతో నొకవ్యాసము భారతి సంచిక ౬, సంఖ్య ౨ లో కనిపించినది. ఇందు కిష్కింధ వింధ్య పర్వతములలో నున్నదనిన్ని పంచవటి నాసికపట్నమే యనిన్ని వ్రాసిరి. రామాయణమును సరిగా పరిశీలించి చూచిన యెడ వింధ్యకు కొంత దూరముగా నుత్తరమున కిష్కింధ యున్నట్లు గనబడును. దక్షిణదిక్కునకు వెళ్లుటకు నియమితులైన వానర్లు రాముని వద్ద శెలవుదీసికొని దక్షిణముగా వెళ్లి వింధ్యపర్వతమును జేరిరని వాల్మీకి చెప్పియున్నాడు. ఆ పర్వతములలోనే కిష్కింధ యున్నయెడల దక్షిణముగా వెళ్లిన పైన వింధ్య నెక్కిరని చెప్పు టెట్లు సమంజసముగా నుండును?

సీతారామలక్ష్మణులు పంచవటిలో నివసించి యుండగా రావణుడు సీత నెత్తుకు బోవుట. తరువరి సీతను వెదుకుచు రామలక్ష్మణులు మూడుయోజనములు వెళ్లి దండకారణ్యమును వదలి క్రౌంచారణ్యమును ప్రవేశించిరి. అందులో కొంతదూరము వెళ్లి కబంధుని వధించి దక్షిణముగా బోవ పంప యొద్దకు వెళ్లిరి. అచ్చట శబరి చేసిన యాతిథ్యమును గొని యిచ్చట నుండి దక్షిణముగా వెళ్లి కిష్కింధ పర్వతమును యెక్కి దాని దక్షిణపు వైపుకు దిగగా కిష్కింధ పట్నము గానవచ్చినది. ఇట్లు వాల్మీకి చెప్పియున్నాడు. దీనిని బట్టి యాలోచించగా పంచవటి కిష్కింధకు ఉత్తరమున కొంతదూరముగా నున్నట్లే దెలియును.

ఇట్లుండగా పైవ్యాసమందు వింధ్యకు సుమారు 100 మైళ్లు దూరమున దక్షిణమున నున్న నాసికయే పంచవటియని జెప్పియున్నది. వింధ్యకు త్తరముగానున్న పంచవటి వింధ్యకు దక్షిణముగానున్న నాసిక యెట్లు కాగలదో తెలియకున్నది?

కిష్కింధ వింధ్యకు త్తరముగా నున్నది. కిష్కింధకు త్తరముగా పంచవటియుండె. నేడు పంచవటియని, కిష్కింధయని, చూపు ప్రదేశములు రామాయణము నందు జేర్కొనిన స్థలములుగావు.

[గో. రామదాసు.]

## విశాల భారతము

'మీరట్ కాలేజీ మేగజైను'లో డాక్టరు బి. ఆర్. చటర్జీగారు విశాల భారతదేశమును గూర్చి వ్రాయుచు నిట్లు నుడువుచున్నారు:

### ఒక సంస్కృత శాసనము

ఇండో-చైనాలోను, మలే, ఆర్చిపెలగో (జావా, సుమాత్రా, బాలీ, బోర్నియో, మొదలగు) దీవులలోను వ్యాప్తమైన భారతీయవిజ్ఞానమునుగూర్చి తెలియజేయు మూలాధారములలో నెల్ల మిగుల బురాతనమైనవి చైనారాజ్యాంగ చరిత్రలు. (The Chinese Imperial Chronicles) ఈప్రాంతములకు వచ్చిన చీనాదేశపు రాయబారుల వ్రాతలవలన క్రీ. శ. ౧ శతాబ్దములో కాండిన్యుడను నొక బ్రాహ్మణుడు ఇండో-చైనాదేశపు మధ్యభాగమున నొక బలీయమగు రాజ్యమును స్థాపించియుండెననియు, చీనావారు ఆరాజ్యమును ఫూ-నన్ (Fu-nun) అని పిలిచెడివారనియు మనకు దెలియుచున్నది. మరియు చంపా (ఇప్పుడు దీనికి అన్నాం అని పేరు) ప్రాంతములో దొరకిన క్రీ. శ. 7 వ శతాబ్దము నాటి సంస్కృత శాసనమొకటి ఈ ఫూనన్ రాజ్యమునకు రాజధానియగు భవపురనగరముయొక్క స్థాపనమునుగూర్చి నుడువుచున్నది. అందుచే పైసంగతిని ధ్రువపరచుట కీశాసనమొక యాధారము. ఈ కాండిన్యుడా దేశపు (ఇండో చైనా దేశపు) రాజకన్య నొక్కతెను బెండ్లాడి యొక రాజవంశమునకు మూలపురుషుడైనట్లు తోచుచున్నది. ఈ రాజ





4- 16

వంశము నే తరువాతి గాథలు హిందూదేశములోని సూర్య వంశముతో గలిపివైచినవి.

క్రమక్రమముగ, నీరీతినే, భారతీయవిజ్ఞానముతో నిండిన రాజ్యము లనేకములు ఇండో-చైనా దేశమున స్థాపింపబడెను. వానిలో ప్రధానమయినవి కాంభోజ రాజ్యము (Kambuja) [మొట్టమొదట నిది ఫూ-నన్ రాజ్యమునకు సామంతదేశము. నేడుదీనికి కాంబోడియా (Cambodia) యని పేరు]; చంపా రాజ్యము [ప్రస్తుతమున నిది అన్నాం (annam) అని పిలువబడుచున్నది]; [ద్వారవతి దక్షిణ సయామదేశములోనున్నది] హంసవతి [బర్మాదేశమునందలి పెగూప్రాంతములో;] [అరిమర్దనపురము] [పెగూప్రాంతములోనిది.]

## బోర్నియో, సుమాత్రాలలో

ఆర్చిపెలగో దీవులలో మున్ముందుగ భారతీయ రాజ్యము స్థాపింపబడినది బోర్నియో, పడమటిజావా, బాలీ, సుమాత్రాద్వీపములయందు. నాలుగవ శతాబ్దమునాటి సంస్కృత శాసన మొకటి (బోర్నియోలోనిది) బోర్నియోలో మూలవర్మయను రాజొకడు యజ్ఞము జేసినట్లు తెలుపుచున్నది. పడమటిజావా దీవిలో పూర్ణవర్మయను రాజు ఎన్నియో కాలువలను త్రవ్వించెను. తాను విష్ణుదేవుడని యితడు చెప్పుకొనెను. బాలీద్వీపములో హిందూమతము నేటికిని ప్రచారముననున్నది. సుమాత్రాను పూర్వమున సువర్ణద్వీపమని పిలిచెడువారు. తుదకు మధ్య-జావా, తూర్పు-జావాలుగూడ బలీయములగు భారతీయరాజ్యములకు నిలయము లయినవి.

శ్రీవిజయమునకు (పూర్వదక్షిణ-సుమాత్రాలోనిది) సంబంధించిన శైలేంద్రరాజుల రాజ్యము చాల కాలమువరకు-కొన్ని శతాబ్దములవరకు – చీనా, ఇండియా దేశముల నడుమ, సముద్రతీరమున, నొక బలవత్తరమగు రాజ్యముగ నుండినది. ౭వ శతాబ్దమున నీ శ్రీవిజయ రాజులు సుమాత్రా, జావా ద్వీపములలోను, మలేద్వీపకల్పము నందును, ఆర్చిపెలగోలలోని మరియెన్నియో దీవులలోను, దమ యేలుబడి సాగించిరి. శ్రీవిజయము సంస్కృతవిజ్ఞానమునకు ప్రధానపీఠములలో నొక్కటి యని చీనా యాత్రికుడగు ఇ-త్సింగ (I-tsing) దాని ప్రశంసించుచున్నాడు.

క్రీ. శ. ౧౪వ శతాబ్దమునగూడ మజపహిత్ అను హిందూ-బౌద్ధసామ్రాజ్యము-దీని సంస్కృతపు పేరు బిల్వతిక్తము-అర్చిపెలగో దీవుల నన్నిటిని, మలేద్వీపములోని కొన్ని భాగములనుగూడ, బరిపాలించెను. ఈ సామ్రాజ్యపు నౌకాదళము మిగుల సమర్థ మయినది. తూర్పున ఆస్ట్రేలియా మొదల్కొని ఉత్తరమున ఫిలిప్పైన్ దీవులవరకు గల ద్వీపములన్నిటిలో నీ నౌకాదళము సామ్రాజ్యమునకు మూలాధారముగ నుండెడిది.

చంపా (అన్నాం), కాంభోజము (కాంబోడియా) బోర్నియో, జావా, సుమాత్రా, బాలీ దీవులు మలేద్వీపకల్పము మున్నగు చోటుల దొరికిన సంస్కృతశాసనములు విశాలభారతచరిత్రమును నిర్మించుటకు మూలాధారములు. ఇండో-చైనాయందలి ఫ్రెంచి పరిశోధకులు, జావా ద్వీపములోని డచ్చిపురాతత్త్వపరిశోధకులు ఈశాసనములగని పెట్టి ప్రకటించునద్భుతకార్యమును నిర్వహించిరి. దేశాంతరములందు విజృంభించిన మన విజ్ఞాన ప్రభావమును గూర్చియు, రాజకీయమగు మన గొప్పతనము గూర్చియు మనదేశములో, మన కేమియు తెలియదు. కారణము: ఇంగ్లీషు వ్రాతలలో నీవిషయమును వ్రాయబడినది రవ్వంతయు లేదు.

## కాంబోడియా

క్రీ. శ. 6 వ శతాబ్దములో కాంభోజదేశము (కాంబోడియా) ఫూ-నన్ సామ్రాజ్యపు టధికారమును ధిక్కరించి స్వతంత్రమై బలీయమగు నొక ప్రత్యేక రాజ్యముగ నేర్పడెను. ఈ కాంభోజ రాజ్యమునకు సంబంధించినవి యించుమించుగ నైదువందల శాసనములు గలవు. వీనిలో చాలశాసనములు పెద్దవి నిర్దుష్టములు సంస్కృతమున వ్రాయబడి యున్నవి. ఇవి యన్నియు క్రీ. శ. 6 మొదలు 14-వ శతాబ్దము వరకు నీ హిందూ రాజ్యమునకు సంబంధించిన వైజ్ఞానిక రాజకీయ చరిత్రలను వ్రాయుటకు కావలసినంత సామగ్రి నొసంగ గలవు.

కాంబోడియా దేశమునకు దూరుపున చంపారాజ్యముండెను. అన్నాం, చీనా దేశీయుల దండ యాత్రలకు తెగక దన్నెదుర్కొనుచుండుటచే నీహిందూరాజ్యము ఎక్కువ విషమస్థితిలో బడి యుండెడిది. ఈ రాజ్యమునకు సంబంధించినవి 150 శాసనము లున్నవి. చీనా, అన్నాందేశముల రాజ్యాంగ చరిత్రములను వీనికి జతపరచినచో నొక చక్కని చంపారాజ్య చరిత్రమేర్పడగలదు. ఇండో-చీనా దేశములోని హిందూ పరిపాలనమునకు జెందిన యీపరిశోధనల నన్నిటిని నిర్వహించిన కీర్తి సంపూర్ణముగ ఫ్రెంచి పురాతత్వ వేత్తలది.

జావా, సుమాత్రా, బాలీ, మొదలగు రాజ్యములకు సంబంధించిన శాసనములు సంస్కృతమునను, కవిభాషలోను-ఈకవిభాష జావాదేశపు పురాతన గ్రాంధికభాష-కొలదిగ మాత్రమే దొఱకును. కాని కవిభాషలో 13, 14 శతాబ్దముల నాటి జావాదేశ పరిస్థితులను దెలుపు రాజ్యాంగ చరిత్రలు రెండు కలవు! జావా ఈ రెండు శతాబ్దములలో చాలగొప్ప దశ ననుభవించినది. 9, 10. శతాబ్దములనాటి అరబ్బీ వర్తకుల గాథలు గూడ నానాటి యీద్వీపముల చరిత్రకు సంబంధించిన యెన్నియో ముఖ్యాంశములను మనకు దెలుపును. జావాదేశపు హిందూరాజ్యమునకు జెందిన చరిత్రను ప్రోవుచేసి యుంచుటయే కాక, యచ్చటి గొప్పగొప్ప దేవాలయములను, స్మారక చిహ్నములను భద్రపరచి యుంచిన డచ్చి పురాతత్వవేత్తల పరిశ్రమ యమూల్యము.

## అంకార్ వత్ (Angkor Vat)

కాంబోడియా ద్వీపములో 12 వ శతాబ్దపు మొదటిభాగమునందు రెండవ సూర్యవర్మ కట్టించిన విష్ణ్వాలయ మొకటి కలదు. ఈయాలయముపేరు అంకార్ వత్. ప్రపంచములోని గొప్పగొప్ప యద్భుతములలో నొక్కటిగ నిప్పుడిది వాసికెక్కినది. ఈయద్భుత దేవాలయము, ఎచ్చటనో మహాటవులనడుమ మునిగి యుండి మరపునకు బాల్పడెను.

హెచ్. మొహాట్ (H. Mouhot) అనునొక ఫ్రెంచి పరిశోధకుడు 1860 సం॥ న దీనిని మరల బయల్పరచెను. బ్రహ్మాండమయిన యీదేవాలయము నగమ్యగు నొక యడవి నడుమ గాంచుటతోడనే తానెన్నడు ననుకొని యుండని యాదృశ్యమున కచ్చెరువంది తన డైరీలో ప్రపంచము నందలి గొప్పగొప్ప కట్టడముల నన్నిటి నిదిమించి యున్నదనియు, రోముగాని, గ్రీసుగాని యిట్టి యద్భుతమగు కట్టడము నిర్మించి యుండలే దనియు వ్రాసికొనెను. అంకార్ వత్ దేవాలయమునకు సంబంధించిన యేర్పాటు లన్నియు బ్రహ్మాండమయినవే. ఈయాలయముచుట్టు గల యగడ్త వెడల్పు 700 అడుగులు. రాతితో గట్టబడిన ప్రాకారపు గోడ తూర్పు పడమరలకు మైలుదూరము ఉత్తర దక్షిణముగ నొక యరమైలు దూరము వ్యాపించి యున్నది. ఆలయమునకు మూడంతస్థులు గలవు. గొప్పగొప్ప శిఖరములు గలవు. లోపలి గోడలపై రామాయణము, మహాభారతము, హరివంశము మున్నగు గ్రంథములలోని దృశ్యములకు సంబంధించిన పెద్ద పెద్దబొమ్మలు చెక్కబడి యున్నవి.

## బొరాబదర్

జావాద్వీపములో బొరాబదర్ అను బౌద్ధస్తూప మొకటి కలదు. దీనిపై జెక్కబడిన బొమ్మలన్నియు బుద్ధుని జీవితమునకు సంబంధించినవి. ఇది అసలొక కొండ. కొండను కొండనే స్తూపముగ జెక్కి వైచిరి. మధ్యజావాలో ప్రాంబనన్ అనుపేరున నొకగుడియున్నది. అందలి రాతిగోడలపై రామాయణము మొదటి యైదు కాండలును బొమ్మలు చెక్కి యున్నవి. కాంబోడియాలోని యట్టి మహోన్నత దేవాలయములు జావాలో గానరావు. కాని శిల్పము విషయమున మాత్రము జావాతో కాంబోడియా సరితూగజాలదు. జావాలోని కొన్ని బౌద్ధ శిల్పముల యందమును మించగల శిల్పచిత్రములు ప్రపంచమున చాల తక్కువ.

[మాడర్న్ రివ్యూనుండి]

---

## విద్యాలయములు - పాఠ్యపుస్తకములు

డిసెంబరుమాసపు ఎడ్యుకేషన్ రివ్యూ నేటిబడులలోని పాఠ్యపుస్తకములను విమర్శించుచు నిట్లు వ్రాయుచున్నది:—

'విద్యాలయము' లకు సంబంధించిన పాఠ్యపుస్తకములు తప్పని సరిగా తమ మర్యాదను గోల్పోవుచున్నవి? అవి యంత్రములలో తయారైనట్లుండును. వానిలో నాత్మలేదు; ప్రాణములేదు; ఉత్సాహములేదు. పాఠ్యపుస్తకము లన్నియు సమానపద్ధతిపై నుండవలె ననుట యొకటి, బోధన పద్ధతులలో ఎంతవరకు సాధ్యమయిన నంత క్రింది మెట్టునకు దిగవలయునను కోరిక యొకటి పుస్తకములను నిర్జీవములుగ జేసివైచు చున్నవి. ఐన విద్యాశాలవారు మాత్ర మీసంగతి నెల్లప్పుడు విస్పష్టముగ గ్రహించుకొనరు. ఇంగ్లండు దేశములోని 'విద్యాసంఘమువారు' (Board of Education) పాఠ్యపుస్తకముల సంఖ్యను గూర్చి యాలోచించుట కొక సంఘమును నియమించి యుండుట గమనింపదగిన సంగతి. ఈ సంఘము వారి తీరుమానములు హిందూ దేశమునకు గూడ గొంత వరకు గమనింప దగినవే యగును. ప్రాథమిక పాఠశాలలలో కేవలము మూడవ పద్ధతికి జెందిన పాఠ్య సామగ్రియేదో పిల్లలకు సమకూర్పబడుచున్న దని ప్రజల మొర. సత్యసౌందర్యములు లెక్కకు వచ్చుట లేదనియు ఫిర్యాదు వచ్చుచున్నది. శూన్యమై శిథిలమై యుండు నధమపదార్థమునకును, తమకు సహాయ కరమై సత్యసౌందర్యములతో నిండియుండు నుత్తమ పదార్థమునకును గల భేదమును గనిపట్టగల విచక్షణను పిల్లవాండ్ర కిచ్చు నున్నత వాఙ్మయము విద్యాలయములలో నరుదగుచున్నది. ఈసంగతి హిందూదేశము విషయమున నాలోచించినచో, మరింత ప్రాధాన్యము వహించును. ఏలయన నిచ్చటి పుస్తకములను వ్రాసినవారిలో చాలమందికి వాఙ్మయ పరిజ్ఞానము సున్న. మరియు నిట్టి పుస్తకములు విద్యాలయముల లోనికి ప్రవేశించుటకు సామాన్యముగ నాయా గ్రంథకర్తల ప్రభుత్వోద్యోగము కారణము. పై సూచింపబడిన యట్టి విచారణయే యొకటి హిందూదేశమున గూడ జరుగునేని ఏపాటి వాఙ్మయవిచక్షణ గలవారికైన నాశ్చర్యము గలిగించి వైచు స్థితిగతు లెన్నియో వెలువడ గలవు.

[మాడర్న్ రివ్యూ నుండి]

## జాన్సను లేఖ

### (మిథ్యాపోషణ ఖండనము)

'జాన్సను' నామధేయుఁడు అనంతమేధాసంపన్నుఁడు. ఈ యాంగ్లేయుఁడు కవియు, విమర్శకుఁడును, వ్యాసకర్తయు, కవిజీవితకారుఁడును, మంచి సంభాషణ చతురుఁడునై యశస్సాంద్రుఁ డాయెను. గ్రంథరచన మూలమున ధనసంపాదన మొనరించువారము కామని కొందఱు భ్రమాసంభరితదుర్గర్వమున బీరములాడుదురు. మఱికొందఱు ధనసంపాదనార్థ మెట్టిహేయ్యమునకైనను బాల్పడుదురు. * జాన్సను అట్టునిట్టును గాక గ్రంథకర్తృత్వమున కొక యనూనగౌరవము గడించి, తనకాలమున నిరంకుశసాహిత్యచక్రవర్తియై ఖ్యాతి గాంచెను.

ఈతఁ డొక నిఘంటు రచించెను. నేఁడు నామమాత్రావశిష్టమై యున్నను, అది యొక మహాగ్రంథము. ధనరహితుఁడగు జాన్సను ఏడు సంవత్సరము లష్టకష్టము లనుభవించి గ్రంథనిర్మాణ మొనరించెను. తద్గ్రంథప్రారంభావసరమున 'చస్టరుఫీల్డు' ప్రభువు నిఘంటుకర్త కోరు సాహాయ్య మొసంగి కృతిపతి కాఁ గోరెను. కాని,

---

* cf "No man but a blockh:ad,", said Johnson, "ever wrote except for money." The doctrine is, of course, perfectly outrageous and specially calculated to shock people who like to keep it for thier private use, instead of proclaiming it in public............ "So long as he (author) supplied a good article and got a fair price, he was a fool to grumble, and a humbug to affect loftier motives—Leslie Stephen.

అతని పోషణము మాటలందే గాని క్రియయందుఁ గాన్పింపకుండెను. అమాయికుఁడగు జాన్సను పోషకుఁడు ప్రసన్నుఁడగునని భ్రమించి, ప్రభుసందర్శనార్థము వేచివేచి విసిగి వేసారి పరిభవానలతప్తుఁడై వెను దిరిగెను.

కాని, అవిరళ కష్టార్ణవ నిమగ్నుఁడై తన గ్రంథము జాన్సను పూర్తిజేసినంతనే, ప్రభుహృదయ మొక్కసారి విశాలమాయెను. అంత, నిఘంటు కడునవసర మనియు, విద్యానిధియగు జాన్సను భాషానుశాసన మొనరించుటకు నిక్కముగ సమర్థుఁడనియు నుగ్గడించుచు నా ప్రభువు రెండు వ్యాసములు వ్రాసెను. మానియగు జాన్సనున కట్టి వర్తనము కడుంగడు దుస్సహమాయెను. తానొక యుదారునివలె విద్యాపోషకునివలె నటించి, అవసరమగు కష్టసమయమునఁ గుమతియై యుపేక్షించిన ప్రభువు తాను కృతిపతి కాఁ గోరియే యట్లు గ్రంథరచనానంతరము ప్రశంసించెనని యెంచి కుపితుఁడై, ఆ ప్రభువే గాక ఇతరమిథ్యా పోషకులందఱు గూడ విశీర్ణహృదయులగునట్లు జాన్సను ఒక కమ్మ లిఖించి యాతని కంపెను. *

సాధారణాంగ్ల సారస్వత జ్ఞానము గల వారలకును, ఆంగ్లాలంకారశాస్త్రమునం దొకింత పరిచయము గల వారలకును గూడ నీ ప్రసిద్ధలేఖ సుపరిచితము.

"ప్రభూ!

నేను విరచించిన నిఘంటును 'ప్రపంచ పత్రిక' యందు రెండుసారు లుగ్గడించితివని వినియుంటిని ఇట్లు ప్రశంసాపాత్రుఁడ నగుట కడు గౌరవప్రదమే, కాని మేటి మానవాదరణ మెన్నఁడు చవిచూడని వాఁడ నగుటచేత నే నెటులు పరిగ్రహింప వలయునో తెలియకున్నది.

కించి త్ప్రోత్సాహమున నిన్ను తొలిసారి సందర్శించి, భవదీయ వచన రచనా సారస్యము గాంచి, ఇతర జనానీకమువలె ఱిచ్చవడి, అన్యజనాసాధ్యపదార్థము నాకు సాధ్యమాయెనని గర్వించితిని కాని ప్రోత్సాహమంతరించెను, మానవంతుడ నగుటచే నేనిఁక నీసమక్షమునకు రాఁజాలక పోతిని. నాకుఁగల కళాప్రావీణ్యమంతయు వెల్లడియగు పలుకులచే స్తుతియించి నిన్ను రంజింపఁ గడంగితిని. చేయఁగలంత చేసియుంటిని. స్వల్పమే యైనను తాఁజేయున దంతయు ఱిత్తయగుట యెవ్వనికైన దుస్సహము గదా!

నీదు మొగసాలల వ్రేలాడి వెడలింపఁ బడి నేఁటికి ఏడు సంవత్సరము లాయెను. ఈలోనఁ గష్టములఁ బొరలాడుచునే నాపని సాగించుచుంటిని. నాకష్టము లుదహరించుట నిరర్థకము. ప్రోత్సాహపుఁ బలుకొక్కటియైనను లేక ఆదరణమందహాసమైన నెఱుంగక నా గ్రంథము బూరించి ప్రచురణయోగ్య మొనరించితిని: ముందెన్నఁడు పోషకుని ఎఱుంగని వాఁడ నగుటచేత, ముందెన్నఁడు నిట్టి ప్రవర్తనగూడ నెఱుంగనైతిని.

'వర్జిలు' గాథయందలి గోపాలునకు తుదకు ప్రేమతో బరిచయమాయెను— ప్రేమ శిలాంతరవాసి యని ఆతనికిఁ దెల్లమాయెను. *

నీటఁబడిన మనుజుఁడు నిజప్రాణసంరక్షణార్థ మట్టిట్టు గొట్టుకొనుచుండు సమయమున గతినాత్ముఁడై యుపేక్షించి, ఆ హతభాగ్యుఁ డెట్టులో తీరము జేరు నంతనే యుదారహృదయుఁడై సాహాయ్య మొనరింపఁ బోవు వాఁడె గదా పోషకుఁడు? ప్రభూ; నా పరిశ్రమము తొలుదొల్తనే అరసి యుంటివేని, అది సకరుణముగ నుండెడిది. అటుగాక నేను ఉత్సాహరహితుఁడనై యనుభవింపఁ జాలకుండు నంతవఱకును, నేను పరిచితుండనై అపేక్షింపకుండునంతవఱకును, నీవు నన్నుపేక్షించితివి. ఉపకారము అసలే లేనపుడు కృతజ్ఞత నేఁ జూపకుండుటయు, దైవికముగా నేనే సాధింపఁ జాలినది పోషకుని ప్రదాన మని జనులు భ్రమించుట కవకాశమీయ

* cf. "The letter was, as Mr. Carlyle calls it, "The fai famed blast of doom proclaiming into the ear of Lord Chesterfield and through him, of the listening world, that patronage should be no more."
—Leslia Stephen

* cf. "The shepherd in Virgil grew at last acquainted with Love, and found him a native of the rocks.'

కుండుటయును సమంజసమే యగును గాని క్రూరదూష
ణము కాఁజాలదు.

ఏ విద్యాభిమాని సాహాయ్యమైనను బడయక నా
గ్రంథ మింతవఱకు దేజాలితి గదా; అటులనే ముగింపఁ
గలను. నాఁటి ఆశాస్వప్నము నాఁడే పటాపంచ
లాయెను........."

---

## బొమ్మలాట

ప్రతిదేశమందును పుణ్యకథలను పామర్లకు బోధ
చేయుట కనేకమార్గము లవలంబించియున్నవి. అందులో
మనదేశమందు పెక్కుమార్గము లేర్పరచియున్నవి.

పురాణశ్రవణ మట్టిపద్ధతులలో నొకటి. దినకృ
త్యములైన పిమ్మట రాత్రిభోజనములు గావించుకొని
గ్రామస్థులందరు ఆ గ్రామచావడివద్ద చేరుదురు. చావడి
మధ్యను చిన్నదీపమువద్ద వ్యాసపీఠమైన రామాయణ
మునో, భారతమునో, భాగవతమునో విప్పి యొకయువ
కుడు జదువ గ్రామపండితుడు ఉచ్చైస్స్వరమున రాగ
ముతో నర్థమును అభినయించును. ఇట్లు ప్రతిదినము
రాత్రి ఘంట రెండు ఘంటలసేపు పురాణశ్రవణము జరు
గును. ఇందులకై గ్రామస్థులందరు నా పండితవరునికి
పారితోషికమును చెల్లించుదురు.

భాగవతము రెండవ మార్గము. ఒకపుణ్యకథయం
దలి పాత్రలను ఒక్కొకరు ఒక్కొక పాత్రచొప్పున
పాఠముచేసి, యాపాత్రల కుచితమైన వేషములను ధరి
యించి యాపుణ్యకథను ప్రదర్శించెదరు. ఇందు మృదం
గము తాళములతో పాడెదరు; పాత్రలసంభాషణగూడ
యక్షగానమునసే. సంగీతజ్ఞానము పాత్రలను ధరించిన
వారికి విశేషముగా నుండ నవసరము. రంగస్థలప్రదర్శ
నము మాత్రములేదు. ఈవిధప్రదర్శనము మన హిందూ
దేశమంను ప్రతిప్రాంతమందు నున్నది. ఏయేప్రాంత
మందు నాయా ప్రాంతభాషలో నాయా దేశాచార
ప్రకారము ప్రదర్శింపబడును. కాన నీవిధానము హిందూ
దేశమునకెల్ల సహజ మనియే దోచుచున్నది. భాగవతప్ర
దర్శనము ఉత్సవకాలముల యందేతప్ప, పురాణశ్రవ
ణమువలె ప్రతినిత్యము నుండదు. ఇది నాగరికతజెందిన
నాటక మగుచున్నది.

బొమ్మలాట లేక చర్మనాటకము మూఁడవవిధా
నము. తెల్లనిబట్ట ముడతలు లేకుండా సాగదీసి కొంచె
మెటవాలుగా నుండు తెరవలె గట్టుదురు. ఈ తెరకు వెనుక
ప్రక్క దీపములు పెట్టుదురు. ముందువైపు నాట జూడ
వచ్చినవారంతా విశ్రమింతురు. తెరపై దీపము లున్న
వైపున తోలు తోచెక్కిన బొమ్మలను వేసి యాడించె
దరు. బొమ్మలన్నీ సఖం ముఖములు గలవే. అవయవ
ముల కీళ్ల వద్ద త్రాళ్లతో కలిపి కీళ్లాడేటట్టు చేయుదురు.
ఇట్లు కథలో నొక్కొకపాత్రకు నొక్కొక బొమ్మను
చేతురు. ఆయాపాత్రల వర్ణస్వరూపము దెలియుటకు
చర్మము పలుచనగా జేసియు వర్ణము నాచర్మమునకు
వేతురు. అలంకారస్థానములయందు చిన్నచిన్నరంధ్రము
లతో నాయా యలంకారములను జెక్కుదురు. ఈ బొ
మ్మలు తెరపైవేసిన నెంతయో సుందరముగా నలంకార
ములతోను దుస్తులతోను నగుపడును.

ఆట ప్రారంభమందు మద్దెల్లు, తాళాలు ప్రయోగిం
చుచూ విఘ్నేశ్వర, సరస్వతులప్రార్థన, ఇంకా నితర
దైవముల ప్రార్థన పాడుదురు. తర్వాత కథ యారంభించి
పాడుదురు. పాత్రానుగుణ్యముగా బొమ్మలచే నభిన
యము చేయించుదురు. ఇందుకు బొమ్మచేతికి చిన్నదా
రములు జారుముడి వేసి యుండును. ఆ జారుముడిలో
నొక బెత్తపుకొన తగిలించి యాచేయినాడింతురు. పాత్ర
ను పాడేవారు పాత్రానుగుణ్యముగా స్వరమును మార్చె
దరు. ఇది ముఖ్యముగా నొక్కరే యన్నిపాత్రలను
పాడినప్పుడే. హాస్యరసముకూడా ప్రతియాటయం దుం
డును. పామరుల కిది యానందదాయకమేగాని నాగరి
కుల కంత మనస్కరించదు. ఏలయంటే చాలామోటుగా
నుండును. ఇందుతో సంబంధించిన బొమ్మలుకూడా
వికారముగా నుండును. బొమ్మలాట చూచినవారి కంద
రకు కేతిగాడి విషయమై తెలిసిన హాంశమే!

ప్రతియాటకు నొక కలాప మని గ్రంథముండును.
ఈ కలాపమందు శాస్త్రీయమైన వాక్కు లుండును. ప్రతి

పద్యప్రయోగమునకు నిఘంటుప్రమాణ మిచ్చియుండును. శుద్ధమై, సంస్కృతజటిలమై, పామరులకు నర్థకఠినమైన పదముల పొందు గలిగి, ఈబొమ్మలాట కలాపము విలసిల్లు చున్నది. ఇంత పవిత్రమైన భావయందున్నప్పటికి నీతిబోధక మైనప్పటికి దీనిని ప్రదర్శించువారలను బొమ్మలాటవాండ్లని ప్రత్యేకసంఘముగా నెంచి యుంచివేసినారు.

మన ఆంధ్రవాఙ్మయమున బొమ్మలాట కలాప కావ్యములు గణనకే తేబడలేదు. రానురాను వీటి యందు నిరాదరణ గూడ పెరుగుచున్నది. ఇప్పుడు పల్లిటి గ్రామాదులను దక్క నెక్కడను నీప్రదర్శనము లంతగా గాన్పించవు. ప్రదర్శకులు గూడ గౌరవహీనులై జీవన యాత్ర చేయుటే కష్టముగా ననుభవించుచూ మూలలంట పట్టిపోయి యున్నారు. ఈప్రదర్శనము మన తెలుగుదేశ మం దెంత నిరాదరణను జెందుచున్నను నిది కేవలము మన యాంధ్రదేశ భవము. హిందూదేశమం దేప్రదేశమందున్నను దానిని మన తెనుగు పేరు, బొమ్మలాట యనియే చెప్పుదురు. తమిళ, మళయాళ దేశములందు దీనికి బొమ్మలాట యనియే పేరు చెప్పుదురుగాని యాభాషాపదములతో చేర్కొనరు. ఉత్తర మధ్య హిందూస్థానముల యందు మన తెలుగు లెచ్చు పెచ్చుట వలసవెళ్లియున్నారో అచ్చటల్లా నీప్రదర్శనము కూడా ఉన్నది. కలాపమైనను భాషాంతరీకరింపలేదు. అందుచే బొమ్మలాట ప్రదర్శనము కేవల మాంధ్రదేశముయొక్క సహజ చాతుర్యమును వ్యక్తపరచు చున్నది. ఇట్టిదీనిని మనము నిరాకరించినప్పటికి మనదేశ ఔన్నత్యమును మాత్ర మది వెల్లడిచేసి దేశదేశములయందు చాటుచునే యున్నది.

తూర్పు హైందవద్వీపములలో (East Indies) నొకటైన జావాదీవియందు నీప్రదర్శనము నేటివరకు నతిగౌరవముతో జరుపబడుచున్నట్లు హ్యుబర్ట్ ఎస్ బెనర్ దొరగారు లండన్ మెర్క్యురిలో వ్రాసియున్నారు. వారియుపన్యాసమును నేను జదివిననాటనుండి బొమ్మలాటవిషయమై కొంతజ్ఞానము సంపాదించుటకు యత్నము జేస్తిని గాని నాకు కలాపమే లభ్యము కాలేదు. అందుచే నా కలాపములం దుపయోగించిన వాఙ్మయమును దాని లావణ్యమును గుర్తించలేకపోతిని. అయినను జావాలోని బొమ్మలాట విషయమై చదివి మనదేశమందు ప్రదర్శించురీతినే యచ్చటగూడ ప్రదర్శింపబడు చున్నదని కంటిని. తెరగట్టడం దగ్గరనుండి కేతిగాళ్ల వరకు ప్రతిపాంశము సమానముగా నున్నవి. పాటలు, భాష, పోలికలు చూచుటకు మాత్రం నాకింకను అవకాశము గలుగలేదు.

భాషవిషయమై బానశీ దొరగారు ఇట్లు వ్రాసియున్నారు.

"The bulk of Javanese literature was evolved during the period of the Hindu Occupation, owed its inspiration to Hindu Sources, and was written in the Kawi dialect."

కవిభాషాసాంప్రదాయములను గుర్తించిన మన యాంధ్రదేశమునకును జావాకును గల సంబంధము బాగా వ్యక్తము కాగలదు. ఏమన జావా బొమ్మలాట కవిభాషలోని పాటలతో ప్రారంభమగునట. ఈ పాటల యర్థమెవ్వరికి తెలియకపోయినను అందరు నతిశ్రద్ధాభక్తులతో విందురట. ఇవి పాడునంతసేపు నిశ్శబ్దముగా నుందురట.

బొమ్మలాట ప్రక్రియ యంతయు మన యాంధ్రదేశీయమైనదే కాన నట్టి బొమ్మలాటలం దుపయోగించు కవిభాషకూడ మన యాంధ్రవాఙ్మయ సంబంధము గలిగి యుండునేమో యని యూహించెద. ఆ భాషాజ్ఞాన ముండినగాని దీనిని స్పష్టముగా జెప్ప నలవికాదు. ఆకవిభాషను గ్రహించుటకు నవకాశముగూడ నావంటివానికి దూరమే. ఆ భాషయందు రచించిన వ్రాతపుస్తకములు లేడెన్ పుస్తకభాండారము నందున్నవట. ఒక 25 గ్రంథములు మాత్రమే Royal Asiatic society పుస్తక భాండారములో నున్నవట. వీటి ప్రతులను సంపాదించవలెనంటే ధనము చాలా ఖర్చు పెట్టవలెను. సామంతులు దేశాభిమానము గలిగి ఈగ్రంథములను సంపాదించి యందలి వాఙ్మయపరిశీలన గావించిన మనయాంధ్రదేశమునకును జావాకును పూర్వమం దెప్పుడు రాకపోకలు గలిగియుం

దేవో, యెట్టి సంబంధ ముండేదో యన్నియు స్పష్టపడ గలదు.

దీనికంతకు సూచక మైనది బొమ్మలాటయే. ప్రస్తుతమందు నిరాదరణను బొంది నిర్జీవమై యున్నప్పటికి నిది మన దేశముయొక్క పూర్వ్యాసనతను వెల్లడిచేయుచున్నది. ఇతరదేశములకు, సముద్రమున కావల నున్న దేశములకు గూడ వెళ్లియుండుటచే పూర్వపు ఆంధ్రులప నీప్రదర్శనమం దెంత గౌరవ ముండేదో బోధపడుచున్నది. దాని పూర్వ్యాసనత నైన నాలోచించి బొమ్మలాట కలాపములను బైలుపరిచి యాంధ్రవాఙ్మయమందు వాటికి ఉచితస్థాన మీయవలసి యున్నది. దానివలన మరచిన కవిసార్వభౌము లెందరో బయలుపడుదురని నా నమ్మకము. ఈ బొమ్మలాటవాండ్లు, బొమ్మలాట కలాపములు ముఖ్యముగా కృష్ణా గోదావరీనదుల మధ్యప్రదేశమందు లభ్యమగుదురని విన్నాను. ఈ ప్రదేశమే గదా మన తెలుగుభాషకు జన్మస్థానము; వృద్ధిస్థానము; విజృంభణస్థానము గూడ. ఈ ప్రదేశమందు వెదకిన కలాపముల వ్రాతప్రతులు లభ్యము కాగలవు. భాషాభిమానులు వీటిని సంపాదించి ప్రచురించిన నాంధ్రవాఙ్మయమునకు చాలా యుపకారము కాగలదు.

[గో. రామదాసు]

---

## కిష్కింధనుంచి లంకకు మార్గము

### ఒక ప్రబల సందేహము

౧. సీతాన్వేషణార్థమై కిష్కింధనుంచి దక్షిణదిశకు హనుమదాదులను బంపునపుడు సుగ్రీవుడు మార్గమును వివరించు పట్టున వింధ్య, నర్మద, గౌతమి, కృష్ణ, వరద, మేఖల, ఉత్కల, దశార్ణ, అశ్వవంతి, అవంతి, విదర్భ, మహిషి, ఋచిక, వంగ, కాశి, కళింగ, అంగ, దండక, గోదావరి, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళ, సహ్యాద్రి, కావేరి, తామ్రపర్ణి, జలనిధి—ఇట్లు వాల్మీకి రామాయణమున వివరింపబడినవి. ఈ వివరణమంతయు ప్రస్తుతభూగోళశాస్త్రానుగుణ్యమై యున్నదని చెప్పవచ్చును.

౨. అయితే తరువాతను హనుమదాదులు చేసిన ప్రయాణము వివరించుపట్టున పైవివర మెంతమాత్రము కానరాకపోవుటయే కాక ప్రస్తుతభూగోళశాస్త్రవిరుద్ధముగా వింధ్యపర్వతములకు దక్షిణపుటంచుననే సముద్ర మున్నటుల కన్పించుచున్నది. హనుమదాదులు కిష్కింధనుంచి ప్రప్రథమమున వింధ్యపర్వతములయందు ప్రవేశించి వెదకివెదకి వారి కొసగబడిన గడువంతయు వింధ్యపర్వతములమీదనే గడపినట్లును వారు ప్రవేశించిన ఋక్షబిలము వింధ్యపర్వతముల లోనిదే అయినట్లును ఋక్షబిలమునుండి తిరుగ వింధ్యముమీదికే వచ్చినట్లును సంపాతితో సంభాషణము వింధ్యపర్వతముల మీదనే జరిగినట్లును ఆ వింధ్యపర్వతముల దక్షిణపు అంచుననే సముద్రమును జూచినట్లును ఆ దక్షిణసముద్రపు ఉత్తరతీరముననే కపులు ప్రాయోపవేశము చేసినట్లును హనుమంతు డచటినుండియే సముద్రమును దాటినట్లును వాల్మీకిరామాయణమున చెప్పబడినది.

౩. యుద్ధానంతరమున సీతాసహితుండై శ్రీరాముడు అయోధ్యకు వచ్చుచు భరద్వాజాశ్రమమునుంచి ముందుగా తమ రాక వృత్తాంతమును దెలుపుటకు హనుమంతుని భరతు కడ కంపినపుడు భరతునితో హనుమంతుడు శ్రీరామవృత్తాంత మంతయు తెలుపు పట్టున వింధ్యపర్వతము ప్రక్కనే సముద్రమును జూచినట్లును అచ్చటనే సముద్రమును దాటినట్లును చెప్పబడినది.

౪. సుగ్రీవుడు శ్రీరామునితో తాను అన్ని దేశములను జూచినవృత్తాంతములను దెల్పు సందర్భమున దక్షిణదిశయందు వింధ్యాద్రిని చందనవనమును మాత్రమే చూచినటుల చెప్పియున్నాడు. ఇందువలన ఆపైని సముద్ర మనియే భావము తేలుచున్నది.

౫. సంపాతి అంగదునితో నిశాకరఋషికిని తనకును జరిగిన సంభాషణమును జెప్పునపుడు దక్షిణాబ్ధి తీరస్థమైన యీ వింధ్యపర్వతమని విస్పష్టముగా చెప్పబడి యున్నది.

౬. హనుమదాదులు సముద్రమువద్దనుంచి తిరుగ కిష్కింధకు ప్రయాణము చేసినపట్టున సముద్రము వద్ద

నుంచి బయలుదేరి కొంత ప్రయాణములోనే మధువనమున ప్రవేశించినటుల చెప్పబడినది. ఆ మధువనము కిష్కింధలోనిదే.

౭. పైవిషయము లన్నిటిని పరిశీలించగా సుగ్రీవుడు హనుమదాదులకు మార్గమును వివరించుపట్టున తప్ప తక్కిన ఎల్లచోటులను కూడ వింధ్యాద్రులకు దక్షిణతీరముననే దక్షిణసముద్ర మున్నటుల చెప్పబడియుండుటను విమర్శకులు గ్రహించగలరు.

౮. ఒకవేళ దక్షిణసముద్రము వింధ్యపర్వతముల వరకు కూడ రామాయణకాలమున వ్యాపించియుండెనేమో యని ఊహించుటకు సుగ్రీవుడు చెప్పిన మార్గవివరణము అందుకు వ్యతిరేకముగా ప్రస్తుతానుగుణ్యమై యున్నది గదా! నిజమునకు వింధ్యపర్వతములకు పశ్చిమమున పశ్చిమసముద్ర మంటియున్నది గాని దక్షిణమున దక్షిణసముద్ర మంటియుండలేదు గదా!

౯. వాల్మీకి రామాయణమును బట్టియు బ్రహ్మాండపురాణమును బట్టియు కిష్కింధ వింధ్యపర్వతముల కుత్తరమున నున్నదనుట నిస్సందేహము. అటనుండి దక్షిణమున చాలవరకు వింధ్యపర్వతము లుండుటకూడ నిస్సందేహము. ఆ వింధ్యపర్వతములకు దక్షిణముననే సముద్రమని రామాయణమం దెల్లెడలను (ఒక్కచోట మాత్రము తప్ప) కాన్పించుచుండుటకును ప్రస్తుతభూగోళశాస్త్రానుగుణ్యముగా ఎట్లు సమర్థించెదరో యని విమర్శకోత్తములను ప్రార్థింపుచున్నాడను.

కొచ్చర్లకోట వెంకటరామయ్య

---

## లిపిచిత్రములు

ప్రాచ్యదేశముల యందు లిపితో చిత్రములను చిత్రించుటయు నొక లలితకళగ పరిగణింపబడుచున్నది. అరబ్బీవ్రా లందుకు చాల తగియుండును. మృగములు, పక్షులు, పుష్పములు, మొదలయినవి లిపితో చిత్రింపబడును. మహమ్మదీయులు వీనిని చిత్రింతురు. అరబ్బీ లిపిచిత్రమునకు 'తుగ్రా' అనిపేరు. ఇట్టిచిత్రము లొకవాక్యముననో, పదముననోగల అక్షరములతో చిత్రింపబడును.

ఢిల్లీ నివాసియు, ప్రసిద్ధ లిపిచిత్రకారుడు నగు 'అమీర్ పుంజకాష్' అను మహమ్మదీయుడు లిపిచిత్రములను తాము దొలుత పర్షియను లిపితో చిత్రించెను. ఇవి అలంకార చిత్రములుగను, రాజముద్రికలును, ఉండును. అవియు చాలరకములు; కాని, వానిలో పూవులు, మృగములు ఎక్కువగా నుండును. కురానులోని వాక్యములనో, ఇతరమత నీతిగ్రంథములలోని వాక్యములనో, గైకొని వానియందలి యక్షరములతో నివి చిత్రింపబడును. మహమ్మదీయులు ఇతరచిత్రముల నుపయోగింపరామిచే వీనితో దమయిండ్ల గోడల నలంకరించుకొందురు. వీనిని చూచినమాత్రమున వారికి పవిత్రములగు నుపదేశవాక్యములు స్మృతిపథమున ప్రత్యక్షమగుచుండును. గృహాలంకారములు, నీతిబోధకములు నయి యీచిత్రములు పేరుగన్నవి. రోగములు, ఇతరపీడలు నశించుచున్న విశ్వాసముతో వీనిని మహమ్మదీయులు రక్షాబంధములుగ గూడ నుపయోగించు చొనుచుందురు. జంతుచిత్రములలో నధికభాగము సింహచిత్రము లుండును.

ఈలిపిచిత్రములుకొన్ని ఈసంచికయందుగలవు.

---

## ప్రాచీన శిల్పచిత్రములు

### ౧. పాండవసింహాసనము

ఇది చరిత్రప్రసిద్ధమైనది. ప్రకృతము మైసూరు మహారాజుగారి స్వాధీనమున నున్నది. విజయనగర సామ్రాజ్య ప్రతిష్ఠాపకులు దీనిని పెనుగొండవద్ద భూగర్భముననుండి త్రవ్వితీసిరి. అదిమొదలుకొని దీనిని పెక్కురురాజు లధిష్ఠించిరి. ఇది తొలుత పాండవులదని గుర్తింపబడినది. అత్తికఱ్ఱతో, దంతముతో నిర్మించిన దీనిపై బంగారు తాపటముకలదు. సింహాసనము గొప్ప సామ్రాజ్య చిహ్నము. దానిమహిమ అమూల్యము. పాశ్చాత్యులకు కిరీటమెట్లో, హిందువులకు, ముసలుమానులకు సింహాసనమట్లు. చిన్న సామంతరాజు సైతము స్వాతంత్ర్యము పొందినతోడనే సింహాసనమును స్థాపింపగోరును.




హిందూ స్త్రీల లక్ష్మీవిలాససభ, తిరువళిక్కేణి

మదరాసునందలి యీ సభయొక్క వార్షికోత్సవ మీమధ్య జరిగెను.



చెన్నపురి తండియార్ పేటయందలి శిశుసంరక్షణాలయమునందుగల పిల్లలు (ఆంధ్ర. మార్చి 18-9)



సంగీత ప్రవీణులు

దక్షిణఇండియా మ్యూజిక్ ఎకాడమివారు జరిపిన సంగీతపుపోటీపరీక్షయందు బహుమతులు పొందినవారు.



## ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము

రచయిత: కవిత్వవేది. ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్.

ఈవాఙ్మయచరిత్రమును బ్రకటించి వావిళ్ల వారు ఆంధ్రలోకమునకు గొప్ప యుపకారమును గావించిరి. అనర్ఘనూతనగ్రంథకుసుమములతో భాషాదేవిని నిరంతరము అర్చనసల్పు వీరివ్రతము ప్రశంసనీయము.

ఆంధ్రవాఙ్మయ చరిత్రమునందు నూతనయుగము ఆరంభమై నడచుచున్నది. ఈనూతనయుగపు చిహ్నములలో చరిత్రరచన ముఖ్యమైనది. దేశచరిత్రలు, స్థానిక చరిత్రలు పెక్కులు రచింపబడినవి. వాఙ్మయ చరిత్రలుగూడ కొన్ని బయలు వెడలినవి.

ఈవాఙ్మయచరిత్రలు నన్నయకాలము నుండి నేటివఱకును గాలక్రమమున జనించిన యాంధ్రకవుల యొక్కయు, వారిగ్రంథముల యొక్కయు జాబితాలతో నిండియున్నవి. అట్టి జాబితా నొక్కదానిని ఆంధ్రలోకమునకు వీరేశలింగం పంతులుగారు ప్రసాదించియున్నారు. ఇప్పటికి తెలుగు విమర్శకులకు కవులజీవితముల మూలమున శ్రీపంతులువారు భిక్షము వెట్టుచునే యున్నారు. అయితే కవులజాబితాలు వాఙ్మయ చరిత్రముగాదు. వాఙ్మయ మెట్లు ఉత్పత్తి యైనదియు, ఎట్లు ఏయే కారణములచేత పెరిగి నూతనరూపములను ధరించినదియు, ఎట్లు క్షీణించినదియును, అట్టి క్షీణదశకు గారణము లెవ్వియైనదియు, వాఙ్మయచరిత్రమున ముఖ్యముగ వర్ణింపదగిన విషయములు. ఇంతవఱకు బ్రకటితములైన వాఙ్మయచరిత్రలందు పైవ్రాసిన విషయములు ప్రస్తుతము పరామర్శింపబడు గ్రంథమునందువలె, చక్కగవర్ణింప బడి యుండలేదు. ఏతత్కారణమున నిది ఇతర వాఙ్మయ చరిత్రలకంటె మేలైనది అని చెప్పవచ్చును.

గ్రంథరచనమున 'కవిత్వవేది' అనుసరించిన మార్గము మంచిది. వాఙ్మయచరిత్ర నంతటిని యుగములుగ, ఇతరచరిత్ర కారులవలె విభజించెను. ఇందు నూతనమేమియును గానరాదు. ప్రతియుగవాఙ్మయ చరిత్రమును వర్ణించునప్పు డవలంబించిన పద్ధతియం దించుక నూతనత్వము గన్పించుచున్నది. ప్రతియుగ వాఙ్మయచరిత్రయు మూడు భాగములుగ విభజింప బడినది. మొదట వాఙ్మయాభివృద్ధికి దోడ్పడిన రాజకీయ మతసాంఘికోద్యమముల చరిత్రయు, పిమ్మట పైయుద్యమములు వాఙ్మయాభివృద్ధి కెట్లు తోడ్పడినదియు, కడపట ఆయాయుగముల వాఙ్మయములలో గమనింపదగిన విషయములను వ్రాయబడియున్నవి. ఈపద్ధతి వాఙ్మయ చరిత్రరచనకు గొంత యనుకూలతను గలుగజేయుచున్నను చెప్పిన విషయమే మరల రెండు మూడు పర్యాయములు చెప్పవలసి వచ్చుటచేత పునరుక్తిదోషమున కెడమిచ్చుచున్నది.

మనగ్రంథకర్త సాధారణముగ మిక్కిలి జాగ్రత్తతో వ్రాయువాడైనను అచ్చటచ్చట కొన్ని ప్రమాదముల పాలైయున్నాడు. ఇందుకు దారకాణగా నొకటి రెండు విషయములను జేర్కొనుచున్నాము.

౧. గ్రంథముయొక్క ౮ వ పుటయందు "తెల్లంగువాడని నిర్ధరింపబడిన గౌతమీపుత్ర శాతకర్ణి" యను నొకవాక్యము గలదు. గౌతమీపుత్రుడు తెల్లంగు వాడనుట కాధారము లేవి? వీరభద్రరావుగారి రాజరాజనరేంద్రసంచికలోని వ్యాసమేనా? అట్లగునేని రావుగారి యద్భుతకల్పనాశక్తిని బ్రకటించు నీవిషయమును సత్యాసత్యభేదమును గుర్తింపజాలక కవిత్వవేదిగారు పరమ

ప్రమాణముగా గొనుట యాశ్చర్యము. వీరభద్రరావు గారి వాదమును చూడుడు. గౌతమీపుత్ర శాతకర్ణి బ్రాహ్మణుడు. శాతకర్ణి నామము కులనామమై యుండవచ్చును. ఆంధ్రబ్రాహ్మణులలో కర్ణకమ్మలను తెగ యొక్కటి గలదు. "వీరిని కరణబ్రాహ్మణు"లని వీరభద్రరావుగారన్నట్లు తోచుచున్నది. "ఈకరణబ్రాహ్మణులు తెలగాణములోని వారు" కావున గౌతమీపుత్రుడు తెల్లంగువాడు.

గౌతమీ పుత్రుడు బ్రాహ్మణుడగుట నిజమే; శాతకర్ణియనునది కులనామమా? అగునని యంగీకరించినను అట్టి కులనామములను వ్యక్తుల నామములతో జేర్చుకొనుట యాచారమా? పూర్వము యిట్టి యాచారములున్నవనుట కాధారములు లేవు. ఇప్పుడు "ఇంటిపేర్లు" వ్యక్తులపేర్లను వెనుకకు నెట్టి ముందుకువచ్చినను, కులముపేర్లు, తెగలపేర్లు వచ్చినట్లు గాన్పించదు. ఉ. జి. కె. దుగ్గిరాల అన్నారుగాని, జి. కె. ఆరువేల్ అనలేదు. శాతకర్ణుడనునది కులసూచకమగు నామ మనుటకంటె వంశసూచక నామమనుట సమంజసముగ నున్నది. వాదమునకై కులనామమని యొప్పుకొన్నను, 'శాతకర్ణులు', 'కరణబ్రాహ్మణులును,' నొక్క రనుట కాధారము లేవి? 'శాతకర్ణ' శబ్దము తన 'శాత' నెప్పుడు బోగొట్టుకొని ఉత్త "కర్ణ" యైనది? ఈప్రశ్నలకుఁ దగు సమాధానములనిచ్చుదాక పైవాద మంగీకృతము కానేరదు. సందేహాస్పదము నీవాదమును వేదవాక్యముగ నంగీకరించి దానిమీద నూహాసౌధముల నల్లుట చరిత్రకారుని లక్షణము గాదు.

౨. 'అరవశతాబ్దమున జయసింహవల్లభుడు వేంగి నుండి పశ్చిమతీరము వఱకు స్వతంత్రరాజ్యమును స్థాపించి ప్రథమ చళుక్యుడాయెను.!' అన్నది కేవలము ప్రమాదజనితము. జయసింహ వల్లభునికిని, వేంగిదేశమునకు ఏలాటి సంబంధమును లేదు. పట్టాభిషేక సంచికలో నిట్టివాక్యమున్న నదియును తప్పే. కావున, పునర్ముద్రణమున గ్రంథకర్త యీతప్పును దిద్దుకొనునని తలచెదము.

ఆంధ్రోత్పత్తిని గురించిన వీరియభిప్రాయ మిది: "లిపిభాషా జాతివృత్తములచే నితరములకంటె నెక్కుడు సన్నిహితత్వముఁజూపుచున్న కన్నడమును జూచి, కర్ణాట త్రిలింగ భాషలకొకమాతృకయనియును, నాయాదిభాష హళె తెలుగన్నడములుగా జీలి, తెలుఁగే దెలుఁగై పిదప నాంధ్రమయ్యెననియు సిద్ధాంతపఱచు టుచితము." పుట ౧౨.

"తెల్గు సీమలలో" చాళుక్యపరిపాల నారంభకాలములోనే తూర్పున నుండువారికిని, పశ్చిమమున నుండు వారికిని భాషాభేదము లేర్పడి ముదిరిపోయినందున పశ్చిమమున నున్నవారిభాష. హళెగన్నడమనియు, తూర్పున నున్నవారిభాష. తెలుగన్నడ (తెలుఁగు) మనియు వ్యవహారనామములఁ బొంది ప్రత్యేకసారసత్వముల సృష్టికి హేతుభూతములై" యుండెను. పుట ౧౧.

"తెలగాణము మొదట నితరనాడులవలె నొకనాడనియు, బ్రాహ్మణాదిభేదము లెన్నియున్నను, తెలఁగలందఱును పశ్చిమ దక్షిణాంధ్రవాసులే యనియు; వీరు ప్రాముఖ్యమును బట్టియే తెలుఁగునామము భాషకు సిద్ధించినదనియు, అసలు తెలుఁగుసీమ వీరిదే యనియు పూర్వోత్తరాంధ్రులు తెలుఁగువార్కు గానేరకపోయినను నేకభాషావలంబకు లగుటవలన తెల్లంగు లాంధ్ర గణములోఁజేరిన దానివలన నన్నదమ్ములే యనియు, దేలుచున్నది." పుట ౭.

ఇందు గమనింపదగ్గ విషయములు.

౧. కర్ణాటకులు, తెల్లంగులు, ఆంధ్రులు, ఈమూడుజాతులవారి భాష యొక్కటియే.

౨. చాళుక్యుల కాలమున హళెకన్నడ, తెలుగన్నడము లను నూతనభాష లేర్పడినవి.

౩. పశ్చిమ దక్షిణాంధ్రమే తెలగాణము. తెలుఁగువా రచ్చటి వారు. అసలు తెలుగు సీమ వీరిది.

౪. తెలుగువారి యొక్కయు, ఆంధ్రులయొక్కయు భాష యొక్కటి యగుటచేత తెలుగువా రాంధ్రులలో నొకతెగవారుగ పరిగణింప బడవలసినవారై యున్నారు.

ఈవాదము గూడ శ్రీవీరభద్రరావుగారివలన పుట్టినదే.

"అందలిప్రజలే కర్ణాటులైరి గావున గర్ణాటులు నాంధ్రులలోని వారే. చాళుక్యపరిపాల, నారంభకాల మున నాంధ్రులలో దూర్పున నుండు వారికిని, పశ్చిమము న నుండువారికిని భాషాభేదము లేర్పడి ముదిరిపోయినం దున పశ్చిమమున నుండువారి భాష హళెగన్నడమ నియు దూర్పున నుండువారి భాష తెళుగన్నడమనియు (తెలుగు) వ్యవహారనామములను బొంది ప్రత్యేక సార స్వతములకు హేతుభూత మైనవని కొందఱి యభిప్రా యము."

ఈవాదము ఆధార రహితము. ఆంధ్రులు కర్ణాటు లొక్కరే యనువాదమును నిల్పుటకు వీరు తెచ్చిన సాక్ష్య ము చాలదు. కావున నిది యొప్పుకొనదగినది కాదు. వీరభద్రరావుగారు హళెకన్నడమునకు ప్రతిగా తెళు గన్నడమును సృజించినారు. ఇట్టిపేరుగల భాషయొకటి యుండెననుట కాధారము లెవ్వియు గానరావు.

అజ్ఞాతయుగపు కవిత్వమును వర్ణించు సందర్భ మున, నన్నయ్యకుపూర్వ మాంధ్రమున గ్రంథము లుం డెనా? యను ప్రశ్నవేసుకొని దానికి గ్రొత్తసమాధా నము నిచ్చియున్నారు: నన్నయ్యకు పూర్వము చెనుగున కవిత్వము లేకపోయినను, "ఆంధ్రులగు పూజ్యపాదుడు, ఆదిపంపకవి, నాగార్జునుడు, మోళిగయ్య, భీమకవి మొదలగువారైదవశతాబ్దమునుండియు కర్ణాటకమున కావ్యములను, లక్షణగ్రంథములను నిర్మించుచు వచ్చిరి." వీరు స్వభాషయందు గ్రంథములు రచించిన రచించి యుండవచ్చును. కాబట్టి యాకాలమున ఆంధ్రగ్రంథ ములు వ్రాయబడి యుండవచ్చును. ఆగ్రంథము లేవైన వని యడుగ, జైనకవికృతము లగుటవల్ల పరశురామప్రీతి జేయబడినవని యుత్తరమిచ్చి, యంతటితో దృప్తినందక "ప్రథమశతాబ్దికే, యనగా చాళుక్యులకు బూర్వమే హళె గన్నడ తెలుగన్నడ భేదములు పుట్టియుండనగు"; "తెళు గన్నడము ప్రత్యేకించిన పిమ్మట కొంతసారస్వతము పైవాదమున కనుగుణముగ పెరిగియుండవచ్చును. కాని యుత్తరమున నుండిన ఆంధ్రులుమాటలాడుచున్న ప్రాకృ తములో తెళుగు (తెళుగన్నడము) చేరసిపోవుచుండిన కొలదిని సహజమగు నూత్న మిశ్రభాషా నిరసనముతో మొదట మిన్నకుండినజైనులు చాళుక్య ప్రభుత్వారంభ సూచనలు, బ్రాహ్మణ మతాధిక్యము వర్ధిల్లిన కొలదిని యాలోచించుకొని కర్ణాటకము తమకు జన్మస్థానమువంటి దిగాన, నక్కడకె వలసపోయి యుండవచ్చును. ..... త్యజింపకున్న బ్రాహ్మణమత ప్రవిష్టులు బలవంతపెట్టి వెళ్లగొట్టి యుందురనుట యనుభవవిరుద్ధము గాదు." "తెళుగు... ప్రాకృత సంపర్కము గారణముగా, నయిదవ శతాబ్దికనగా చాళుక్యప్రభుత్వారంభకాలమునకు నాం ధ్రముగా మారియుండననగును." ఇట్లు పరిణమించిన యాం ధ్రభాషలో మొదట రచియించిన గ్రంథము నన్నయ్య యాంధ్రభారతము.

హళెకన్నడమును, తెళుగును ఒక్కమాతృక నుండి చీలి వేర్పడిన భాషలనుట కాధారములు లేవు. నన్నయ పూర్వపు కవిత్వస్వరూపము నన్నయకవిత్వము వంటిదే. ఇది శాసనస్థములగు గద్యపద్యములవల్ల దెలియ వచ్చుచున్నది. కావున తెళుగన్నడ ముండెనని వాద మున కొప్పుకొన్నను వానిపాడ యెచ్చటను గాన్పింపదు.

పెక్కురు కర్ణాటకవుల జన్మస్థానము వేంగియనుట నిజమే. వారాంధ్రులనుట సాహసము. చాళుక్యులు కన్నడదేశస్థులు. వారు వేంగి నాక్రమించుకొనిరి. కుబ్జ విష్ణు వొంటరిగ నాంధ్రదేశమునకు వచ్చియుండునా! అతనివెంట కర్ణాటులెవ్వరేని వచ్చియుండగూడదా! అట్లు కన్నడరాజవంశముతో నాంధ్రదేశమునకు వచ్చిన కన్నడిగులు దమమాతృభాషయందు కవనము చెప్పియుం డగూడదా? మధుర తంజావూరు ఆంధ్రనాయకులకడ ననేకులు తెలుగు కవీశ్వరులును, గ్రంథకర్తలునుండిరి. వీరు ద్రావిడదేశస్థులు. ఆంధ్రమున గ్రంథములు రచిం చిరి. ఏతత్కారణమున వీరు రాజభాషయగు నాంధ్ర మున గ్రంథములు రచించిన ద్రావిడులనుట యుచితమా! కావున వెంగి దేశజులగు కర్ణాటకకవులు చాళుక్యులతో నచ్చటికి వచ్చిన కర్ణాటకులనియు, వారి మాతృభాష కన్నడమనియు, ఆంధ్రభాష కాదనియు, వారు తెలుగు భాషయందు కవనము చెప్పియుందురను ఊహకు ఆధార

ములు లేవనియు తలచుట యుక్తము. మనరక్తముతో బుట్టిన జాత్యభిమానముచేత దక్షిణదేశములోని గొప్ప వారందఱును నాంధ్రులనియే మనము చెప్పుచున్నాము. సత్యాసత్యములను సుత్తెలుంగ నేఱక యిట్లు "సర్వమాంధ్రమయం జగ"త్తనుటవలన నప్పులపా లగుచున్నాము. అయితే నన్నయ్యకు పూర్వముండిన ఆంధ్రవాఙ్మయ మేమైనది? అను ప్రశ్నకు సమాధానము చెప్పవలసియున్నది. అది నన్నయ్యచే దహింపబడినదని యనేకుల యభిప్రాయము. వాఙ్మయమంతయు నన్నయచే దహింపబడి యుండదు. తనభాగమునకు అనర్వణభారతమును దహించెను. నన్నయ్యవంటి వారనేకులు తక్కిన జైనకవి కృతవాఙ్మయమును దహించిరి. నన్నయ్యవంటివా డిట్టి యకార్యమును చేయునా? యని కొంద అమాయకుల ప్రశ్న. నన్నయ్యకంటె సర్వవిధముల గొప్పవాడును, ఇంచుమించుగ నన్నయ్యకు సమకాలీనుడును, మతసంస్కర్తయు, మహాత్ముడును నగు మల్లిఖార్జున పండితారాధ్యునివంటివాడు

"శివనిందా విషయం బగు
నవమానము సెప్పునట్టి యప్పుస్తకముల్
అవిచారంబున గాల్పగ
నవు జెప్పెడి వాని జంప నగు నీశానా."

అని తనశిష్యులకు ఉపదేశముచేసెను. వైదికమతాభిమానులగు నన్నయ్యాదు లవైదికమతస్థుల గ్రంథంబుల నగ్నికి ఆహుతి జేసియుందు రనుటకు సందేహింప బనిలేదు. వీరు "దీనిచే నింద్యులుగారు; మతావేశ మెట్టిపనినైన గావించును."

ఆంధ్రగద్యచరిత్రము నన్నయ్యతోడనే యారంభమైనదని వ్రాసినారు. పద్యచరిత్రకు శాసనములలోని పద్యము లుపయుక్తములైన గద్యచరిత్ర రచనయందు శాసనము లేల పనికిరావు? క్రీ. శ. ౭ శతాబ్దమునాటివి ఆంధ్ర వచనశాసనములు కొన్ని గలవు. తరువాతివి పెక్కుగలవు. కొన్నిటియందలి భాష నన్నయ్యభారతములోని వచనములను బోలియున్నది. శాసనములోని వచనము వాఙ్మయములో చేర్చదగినదా? యన్నప్రశ్న రావచ్చును. చేర్చదగినదనియే మాయభిప్రాయము. ౭ వ శతాబ్దము నాటి యాంధ్రభాషాస్వరూపమును తెలుపు దాఖలా లెవ్వియు లేవు. మనకున్న ముఖ్యాధారములు శాసనములే. కావున ఆంధ్రగద్యచరిత్ర రచనయందు పైశాసనముల ప్రస్తావన యుండుట యవసరము.

ఆంధ్రనాటకములను గూర్చి మిక్కిలియు సంగ్రహముగ వ్రాయబడియున్నది. విపులముగ వ్రాసియుండవచ్చును. గ్రంథకర్తగారి యభిప్రాయము లనేకులకు రుచించక పోవచ్చును. నవయుగమును గూర్చియు, నూతనకవనమును గూర్చియు గ్రంథాంతమున కొంత వ్రాయబడియున్నది. భావకవిత్వచరిత్రమును సూక్ష్మముగ వ్రాయుచు 'కృష్ణపక్షు' కర్త కృష్ణశాస్త్రిగారిని గ్రంథకర్తగారు విశేషముగా పొగడియున్నారు. పైవారి కవిత్వములో భావములకంటె మాటలజబర్దస్తీ యెక్కువగ గన్పించుచున్నది. 'లోకో భిన్నరుచిః' అన్నారు గదా పెద్దలు. మఱియు "ఎంకిపాటలు... మోహనశృంగార పరంపరకు జేరునేమో!" అన్న సంశయము కవిత్వవేదిగారిని బాధించుచున్నది. "మోహనశృంగారపరంపర" "సంఘనీతికి బాహ్యము"అని వీరు చెప్పుచున్నారు. ఎంకిపాటలో నేమి నీతికి దూరమగు విషయము గలదో మాకు గాన్పించుటలేదు. అభిప్రాయభేదము.

ఇంతవఱకు గ్రంథకర్తకును మాకును గల యభిప్రాయభేదమునుగూర్చి ముచ్చటించితిమి. ఇట్లభిప్రాయ భేదములు గల స్థలములు కొన్నిమాత్రమే. గ్రంథము చక్కగ వ్రాయబడినది. శైలి సులభము. ఇంపైనది. ఆంధ్రవాఙ్మయచరిత్ర నెఱుంగగోరువారు దీని నవశ్యము జదువవలయును.

వేం. ర.

## గృహప్రవేశం

గ్రంథకర్త: రవీంద్రనాథ్ఠాకూర్ గారు. అనువాదకులు: శోభనాదేవి, వైకుంఠరావుగార్లు. క్రౌనుసైజు ౧౨౩ పుటలు. వెల ౧౨ అణాలు.

ఇది విశ్వభారతి గ్రంథమాల ౧ వ పుష్పమైన నాటకము. ౧౯౩౭ జనవరిలో ప్రచురింపబడినది. వలయువారు 'విశ్వభారతి ఏజెన్సీ, ౨, ఫిలిప్ వీథి, జార్జిటవుఞ్ మదరాసు' అని వ్రాసిన బడయగలరు. వావిళ్ల-



6 4 18

రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, ఎస్ప్లనేడ్, చెన్నపురి వారివద్దకూడ పుస్తకాలు దొరకును.

౧. శ్రీవేంకటశాస్త్రి స్మృతి-భక్తమందార శతకము. డెమ్మీసైజు. ౩౬ పుటలు. వెల ౪ అణాలు.

౨. శ్రీసూర్యనారాయణ స్మరణ, ఆపదుత్తారక స్తవము. డెమ్మీసైజు. ౨౮ పుటలు. వెల ౪ అణాలు.

౩. శ్రీవేణుగోపాలక స్మృతి; భక్తకల్పద్రుమశతకము. డెమ్మీసైజు ౩౮ పుటలు. వెల తెలియదు.

ఈ పైమూడు పద్యకావ్యములును ఆలమూరు గ్రామ కాపురస్తులు శ్రీ నరసింహదేవర వేరుశాస్త్రి గారు వ్రాసినవి. వారి ద్వితీయపుత్రుడు, తృతీయపుత్రుడు, నాలవ కుమారుడును నవయౌవనమునందే ఒకరి తరువాత నొకరు కీర్తిశేషులు కాగా నాదుఃఖమును తండ్రి భరింపలేక పైకి వెళ్ళబోసికొనిన కొంతశాంతికదాయని యీపద్యకావ్యములను వ్రాసిరి. కీర్తిశేషుల ఫోటో చిత్రములుకూడ చేర్పబడినవి.

పుస్తకములు వలయువారు గ్రంథకర్తను, ఆలమూరు, రామచంద్రపురము తాలూకాకు వ్రాసిన బడయగలరు.

## నివాళి

కర్తలు: వేంకటకాళిదాసకవులు, ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము, విజయనగరము. ఇది శ్రీకొల్లూరు ధర్మరాయ కవిగారు సంపాదించు 'పూజాపుష్పముల'లో మొదటిది. క్రౌనుసైజున ౩౮ పుటలుగల యీఖండకావ్యముల 'నివాళి' మూల్యము ఒకరూపాయి. ఆంధ్రదేశమున పెక్కురివలె వీరును బాహ్యమూల్యమునే యెక్కువ గణించిన ట్లగపడును. గ్రంథము వ్యాప్తిలోనికి వచ్చుట కిది చాలఆటంకము గూర్చును. వెల తక్కువయైనచో గ్రంథములోనివిలువ తగ్గదు: ఎక్కువతో హెచ్చదు.

ఇది అనేకవైఖరుల ప్రణయపథముల ద్రొక్కిన కావ్యావళి. ఒక ఉదారమసువాణి-ఈప్రణయయాత్రయందు హృదయము అధిగమించిన, సమ్మతమగు, ఉత్కృష్టకవితను సమీపించునట్టిది-ఏదియు నిందు వినబడదు. కవిహృదయము పరిణతిలేక క్రిందిమెట్టుననే తిరుగాడు చున్నది. ఇంకు ఊహాపథముననే కాని హృదయపథమున నంతగ గతులు కన్పడవు. భావనయు తరుచు నీరసతకు బలియగుచున్నది. దీర్ఘసమాసములు తరుచుగ భావగతికి అడ్డుపడుచున్నవి. ప్రధానభావ ప్రవాహమునకు నిరోధముగూర్చుట యనులోపమును సమాసములు తమ స్నిగ్ధతచే తొలగింపజాలవు. అవి సార్థకత బడసినచో కవులకు శీఘ్రాభివృద్ధి సూచించును. తెలుగు నుడికారము, హృదయము గరగించు రసావలంబనము వీరి కవితకు దవ్వుల నున్నవి. భావమందు తూగు తక్కువగ నున్నది. 'నేత్రాంతర పక్ష్మళాంచలములు' మున్నగు అర్థస్ఫూర్తి లేని ప్రయోగములును కొన్ని గలవు. శ్రీకారాదుల పునరుక్తి మితిమీరియున్నది. వాడుకలోలేని, ఇంపుగూర్పని, శక్తిలేని తద్ధితాదులు కొన్ని ప్రయుక్తములైనవి.

అధ్యయనమునను, రచనాప్రయత్నములను, కవితా పరిశీలనాదికమునను వీరికవిత క్రమమున వృద్ధి గాంచవచ్చును.

## వర్ణన రత్నాకరము

౧, ౨ భాగముల సంపుటము. డిమ్మి సైజు. పుటలు ౬౦౮. వెల రు. ౩-౮-౧.

శ్రీదాసరి లక్ష్మణస్వామి గారు సంధానించిన యీ సంపుటమున దాదాపు మూడువందల ఆంధ్రపద్య కావ్యములనుండి యేర్చికూర్చిన వర్ణనముల పద్యములు, రెండుపందలకు పైబడు విషయములకు సంబంధించినవి కలవు. ఇంకను రెండువందల విషయముల గూర్చిన వర్ణనములు గల ౩,౪ భాగముల సంపుట మచిరకాలమున వెలువడనున్నదట.

అపారమగు నాంధ్రసారస్వతమున వెలసిన పద్య కృతు లనేకములు. తద్వర్ణితవిషయము లనంతములు. శక్తి ద్విషయవర్ణనవైఖరియు వివిధముగ నుండును. అన్ని కృతుల నామూలాగ్రము చదివి విషయముల దెలియ గుతూహలమున్నను ఈ కాలమువారి కవకాశము, ఓపిక

చాలినంత లేదు. ఆంధ్రసారస్వత ప్రపంచమున విహార ముచేయువారికి-అందును క్రొత్తపుంతల ద్రొక్కు-వారికి-ప్రాతపుంతల బాగుగా దెలిసియుండు టావశ్యకము. కాని యది యెట్లు సాధ్యమగును? ఈ వర్ణనరత్నాకరము మూల మున నది సాధ్యము కాగలదు. ముద్రితములు,నముద్రితము లునయి యిపుడుపలబ్ధములగుచున్న సమగ్రా సమగ్రాంధ్ర పద్యకావ్యములను—పదునొకండవ శతాబ్దము మొదలు ఇరువదవ శతాబ్దము వఱకుగల కాలమున నుత్పన్నములయిన వానిని—ఆమూలాగ్రము చదివి, వానియందలి యెల్ల విష యములను భిన్నభిన్నవిధముల వర్ణించు పద్యములు విష యానుక్రమముగ నిట్లొక గ్రంథరూపమున శ్రీలక్ష్మణ స్వామిగారు ప్రకటించిరి.

ఇందు సంధాత పరిశీలించిన గ్రంథములయు, తత్కర్త లయు పట్టిక గలదు. కవులుండిన * శతాబ్దములసంఖ్యయు కలదు. ఆశ్వాస సంఖ్యయు పద్యసంఖ్యయు గలవు.

సులభజీవిక నభిలషించు నీకాలమున న్వ్యయప్ర యాసములకు సహించి ఓపికపట్టి యీరత్నాకరమును కూర్చిన లక్ష్మణస్వామిగారెంతయు నభినందింప దగు దురు. ఆంధ్రభాషయం దొకింత ప్రవేశము గల ప్రతియాం ధ్రమహాశయునకును నీగ్రంథము కల్పకము. ప్రతిగ్రంథ భాండాగారమునకు ఒక నూతనాలంకారము. సహజము గనే పరిమితమైన దీని మూల్యము ప్రయోజనముతో బోల్చిచూడ నత్యల్పమగుట నిస్సంశయము.

ఆంధ్రలోక మీగ్రంథముయొక్క విలువను గుర్తించి ప్రయోజనమును బడయునేని సంధాతృపరిశ్ర మము సఫలము గాగలదు. దీనితోపాటు ౩,౪ భాగ ముల సంపుటమునకును ఆంధ్రలోకము స్వాగతమును చెప్పునుగాక.

## గుంటూరు నల్లమస్తాన్

గ్రంథకర్త: చంద్రమౌళి చిదంబరరావుగారు. సం పాదకుడు: పంగులూరి వీరరాఘవుడు, అప్పికట్ల, బాపట్ల తాలూకా, గుంటూరుజిల్లా. ఇది భక్తిలతా గ్రంథమాల చతుర్థ కుసుమమట. డెమ్మీ 1/8 సైజు ౨౦ పుటలు. వెల 3 అణాలు.

సుమారు ౩౩ ఏండ్లక్రిందట గుంటూరునందు సిద్ధిపొందిన మస్తాన్‌సాహెబుగారి చరిత్ర, ఆనోట ఆనోట వినినది-మానవాతీతమగు,నమ్ముటకు వీలేకాని- అద్భుతకా ర్యములతో నిండియుండుకథ నిందు వర్ణించిరి. చనిపోయిన మనుష్యులను, జంతువులను బ్రతికించిరట మస్తాన్‌గారు!

## ఆసేతు కైలాసపర్యంత సంపూర్ణభారత దేశ సవ్యప్రదక్షిణ తీర్థయాత్రా ప్రదర్శిని

గ్రంథకర్త: ఇరింకి నరసింహమూర్తిగారు, తోలేరు, వీరవాసరంపోస్టు, భీమవరంతాలూకా, పశ్చిమ గోదావరిజిల్లా. డెమ్మీ 1/8 సైజు ౯౩ పుటలు. వెల ౧ రూపాయి.

ఇందు గ్రంథకర్తగారి గ్రామము తోలేరు మొ దలుకొని ౩౧౪ ప్రదేశముల విశేషము వివరింపబడినది. వివరణము మాత్రము సంపూర్ణముగాను, ఇంపుగాను, సరి గాను లేదు.

## అల్లాహో అక్బర్

గ్రంథకర్త: భోగరాజు నారాయణమూర్తిగారు. ఇది విజ్ఞానచంద్రికా గ్రంథమాల ౩౪ వ సుమము. ఇది గ్రంథమాలవారి పారితోషిక చారిత్రక నవలయట. క్రౌను సైజు ౪౦౪ పుటలు గలది. వెల చందాదారు లకు రూ ౧-౮-౦, ఇతరులకు రూ ౧-౧౪-౦ ను. వెలయువారు బెజవాడకు వ్రాసిన గ్రంథముల బడయగ లరు. ఇందుపై విమర్శ ముందుముందు ప్రచురింపబడును.

## ఆంధ్ర నవీనవాచకములు ౧-౬.

ఆంధ్రనవీన ప్రథమవాచకము: క్రౌనుసైజు ౭౧ పుటలు, 3 అణాలు.

ఆంధ్రనవీన ద్వితీయవాచకము: క్రౌను సైజు ౭౮ పుటలు, 3 అణాలు.

ఆంధ్రనవీన తృతీయవాచకము: క్రౌనుసైజు ౮౪ పుటలు, ౧-౩-౭.

ఆంధ్రనవీన చతుర్థవాచకము: క్రౌనుసైజు ౧౦౪ పుటలు, ౪ అణాలు.

---

* కవులకాలము విషయమున అభిప్రాయభేద ముండవచ్చునుగాని అది గ్రంథప్రయోజనమును కుంచింపబోదు.

ఆంధ్రనవీన పంచమవాచకము: క్రౌను సైజు ౧౦౧ పుటలు. ౫ అణాలు.

ఆంధ్రనవీన షష్ఠ వాచకము: క్రౌను సైజు ౧౧౨ పుటలు. ౬ అణాలు.

ఇవి మొదటి తరగతినుండి మొదటిఫారం పఱకు నుద్దేశింపబడిన వాచకములు. మాక్మిలన్ అండ్ కంపెనీ వారిచే ప్రకటింపబడినవి. వీని గ్రంథకర్తలైదుగురు: చావలి సూర్యప్రకాశరావు, హరి పేరయ్యశాస్త్రి, శ్రీ రామగిరి రంగరావు, జనమంచి శేషాద్రిశర్మ, సంగ శేషాచలశాస్త్రిగార్లు.

ఇవి ౧౯౩౧-౩౨ సంవత్సరములయందే నూతనముగా ప్రచురింప బడినవి. వీనిని గూర్చినవిమర్శ ముందు ముందు ప్రచురింపబడును.

## ఇష్టాగోష్ఠి

డిమ్మిసైజు పుటలు. ౨౨౩ వెల రు. ౧-౪-౦.

పుస్తకమునకు గ్రంథకర్తగారి పేర, పశ్చిమగోదావరిజిల్లా, తాడేపల్లి గూడెమునకు వ్రాయవలెను.

ఇది శ్రీయుత యద్దనపూడి వెంకటరత్నముగారు రచియించినది. "ఇది పైకి వినోదార్థముగ నుండినను లోకవృత్తమును జక్కఁగాఁ దెలుపునట్టి గ్రంథమై యున్నది. కొంతహాస్యరసము, కొంతవేదాంతము, కొంతధర్మచర్య, కొంతనీతి మొదలగున వన్నియు నిందు సందర్భోచితముగ నిమిడియుండుటచే నిది చదువరులకు నెంతో యానందము గలిగించుటయే గాక నూతనవిషయముల నెన్నో బోధింపఁజాలియున్నది"—అని చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ఈ గ్రంథపీఠికలో వివరించి యున్నారు.

కాని గ్రంథము శ్రీవారు మెచ్చినంత శ్రేష్ఠముగా లేదు. గ్రంథమునందలి శైలి బహుళముగా గ్రాంథికమే కాని వాడుకమాటలుకూడ చాల నున్నవి. ఆమాటలు గ్రాంథికశైలితో 'మేలుకలయిక' నొందక వేఱై యున్నవి. కావున శైలికి తగినసాఫీ లేకపోయినది ఒక్క శైలి విషయమునఁనేగాక ఔచితివిషయమున గూడ నీగ్రంథము వెనుకబడుచున్నది. పుట 41-లో 'పితృకార్యమునకు సంబంధించిన వంట'లో తగిలియున్న యువతి మగనితో గవసినట్లుగా వర్ణించిన ఘట్ట మనౌచిత్యసారము నంటుచున్నది: ఇట్టి సందర్భములు మఱి రెండుమూడ్గ్రంథమున నున్నవి. కథానివేదనావసరమున ఒక ఘట్టములో కొంతసేపు ఉత్తమపురుషము, మఱికొంతసేపు ప్రథమ పురుషము ఉపయోగింపబడుట చూడ (పుట 45-48) వెంకటరత్నముగా రీగ్రంథమును రచించుటలో (పాండిత్య) కౌశల్యముకంటె కుతూహలమునే యెక్కువగా చూపిరని చెప్పుటకు ఎడము కలుగుచున్నది.

(ఆంధ్ర శేషగిరిరావు, బి. ఎ.)

## నవీనచిత్రకథలు

ఇదియొక చిన్నకథల పుస్తకము. గ్రంథకర్తగారొక 'సుప్రసిద్ధాంధ్రపండితులు'. దీని వెలరు ౧-౬-౧. వలసినవారు క. మునుస్వామి నాయుడు అండు కంపెనీ, బుక్కుసెల్లర్సు అండు పబ్లిషర్సు, 286, చైనాబజారు రోడ్డు, మదరాసు అని వ్రాసికొనిన బడయగలరు.

ఆంధ్రభాషలోని గద్యగ్రంథములయందలి కథలు ఎక్కువగ పురాణాదులనుండి "గ్రహింపఁబడి పలుతెఁగుల రచియింపఁబడిన" వగుటచే తాము "మనయాంధ్రవాఙ్మయమున నూతనాంశములను బోధించు గద్యగ్రంథములుండుట యత్యావసరమని యాంగ్లభాషయందున్న కొన్ని చిత్రకథలను" దెలుగున వ్రాసినట్లు పీఠికలో గ్రంథకర్తగారు వ్రాసికొన్నారు. కథలు 'చిత్ర'కథలే కాని యివి బోధించు 'నూతనాంశము' లేవో తెలియవచ్చుటలేదు. ఇట్టి చిత్రకథలు తెలుగులో "భారత భాగవత రామాయణాదీతిహాస పురాణములనుండి" గ్రహించిన కథలలో కావలసినన్ని యున్నవి. రాక్షసులు, దేవతలు, గారడీలు-వీనికన్నిటికి మనపురాణములలోను, చిన్నపిల్లలకు అవ్వలు, తాతలు చెప్పుచుండు కథలలోను గొరతయేమియు లేదనుట యెల్లరెరిగిన సంగతియే. అందుచే నీ'నవీన చిత్రకథలు' విద్యార్థులకు బోధించు'నూతనాంశము' లెవ్వియు లేవని మాయభిప్రాయము.

పుస్తకముశైలి మొత్తమునీద మిగుల సరళముగ నున్నమాట నిజమే. కాని యది గ్రంథకర్తగారు తలచినట్లు "రెండవ మూడవ నాలవఫారము" లవరకుగూడ జాలి యుండునని మేము తలంపజాలము.

## శుక్ల నామ సం॥ సిద్ధాంతపంచాంగమ్

విద్వాన్ తొగర్చేటి భాస్కరశాస్త్రి గారు, పెసరవాయి వెంకట్రామ సిద్ధాంతిగారు గుణించినది.

డిమ్మిసైజున నున్నది. మామూలు చేటసైజున నున్న తప్పుడు తెలుగు పంచాంగముల కంటె నిది మేలుగ నున్నది. ఇందు వానిలోకంటె నిత్యోపయోగవిషయములు హెచ్చుగ గలవు. అట్టివి ఇందును సంస్కృతమననే ఉన్నవి: తెనిగించియుండిన బాగుండును.

## దశావతారములు

క్రౌనుసైజు; పుటలు ౧౧౫. గ్రంథకర్త: వంగిపురం రంగస్వామి అయ్యంగారు. ప్రకాశకులు: ఎడ్యుకేషనల్ పబ్లిషింగు కంపెనీ, నుంగుంబాకం, మదరాసు. పుస్తకమువెల రు. ౦-౫-౦.

ఇది యొక వచనగ్రంథము. శ్రీమన్నారాయణుని పది యవతారములు నిందువరుసగ వర్ణింపబడినవి. ఇంచుమించు ఈకథ లన్నిటిని గ్రంథకర్తగారు భాగవతము నుండియే తీసికొన్నారు. సందర్భానుసారముగ నందందు భాగవతములోని పద్యములుగూడ జేర్పబడినవి. రామకథయు, కృష్ణకథయు పుస్తకములో చాలభాగము నాక్రమించినవి. ఇం దనుచితమేమియు లేదు. కాని, తక్కిన కథలలో గొన్ని చేర్చవలసిన యంశములు విడువబడినవి. పరశురాముని కథలో నతనికి కర్ణునితోడను, భీష్మునితోడను గల సంబంధమును గూర్చిన కథాభాగమును గ్రంథకర్తగారేల విడిచివైచిరో తెలియదు. ఇట్లే బుద్ధచరిత్రకు సంబంధించిన యంశములు గూడ కొన్ని యుపేక్షింపబడినవి. ఇట్లగుటచే నీ రెండు కథలు గొంతవరకసమగ్రములుగ గన్పడును. శైలి ధారాళముగ నున్నది. కాని సంస్కృతపదములసందడి యెక్కువ. 'సమస్తకోరికల' (౧౩వ పుట), 'అంగవిహీనముచే' (౬౦వ పుట) మున్నగు వ్యాకరణమునకు సరిపడని ప్రయోగము లచ్చటచ్చట గలవు.

## అశోకచక్రవర్తి ధర్మశాసనములు

గ్రంథకర్త: శ్రీచిలుకూరి నారాయణరావుగారు, యం. ఏ., యల్. టి. డిమ్మిసైజు పు. ౨౦౦. వెల రు ౨-౦-౦.

## ఉపనిషత్తులు

(తెనుగున ఛందోబద్ధములయిన) ఈశావాస్య, కేన, ఐతరేయకములు. అనువాదకుడు శ్రీ ఆత్మానందయోగి. డిమ్మి ౧౬ పుటల సైజు; పు. ౪౨; వెల రు ౦-౬-౦.

## ప్రాచీనహైందవప్రజాస్వామికప్రభుత్వము

గ్రంథకర్త: శ్రీ దేశభట్ల లక్ష్మీనరసింహముగారు, యం. ఏ., యల్. టి. క్రౌనుసైజు పు. ౧౨౪; వెల రు ౧-౧౦-౦.

## సంస్కృతలోకోక్తులు

శ్రీచిలుకూరి నారాయణరావు (యం.ఏ. యల్. టి.) గారి ఆంధ్రవివరణము గలదు. డిమ్మిసైజు పు.౨౧౪; వెల రు ౧-౦-౦.

## ఛత్రసాలుడు ౧, ౨ భాగములు

అనువాదకులు: శ్రీ ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు, కొంపెల్ల జనార్దనరావు గారు. డిమ్మిసైజు పు. ౨౪-౨౨౨. విలాసము: ఆంధ్రప్రచారిణీ గ్రంథమాల, పిఠాపురము. వెల: ఒక్కొకభాగము ౧-౮-౦.

ఈనవల తొలుత మహారాష్ట్రభాషయందు జననమందినది. కర్త: శ్రీయుత బాలచంద్ నానాచందషాహా వకీలుగారు. దాని హిందీఅనువాదమున కిది తెలుగుచేత. ఇందలిగాథ ఔరంగజేబు శివాజీచక్రవర్తు లున్నకాలము నాటిది.

కథానాయకుడు ఛత్రసాలుడు; శివాజీమహాప్రదేశమును బొంది తనదేశమగు బుందేలుఖండమును ఔరంగజేబు అధికారమునుండి తొలగించి

యచట స్వాతంత్ర్యపతాకమును నెలకొల్పిన మహావీరుడు. ఒకవంక కథానాయకుడు, అతనితండ్రి చంపతరాయలు స్వార్థమునకు స్వస్తిచెప్పి, దేశకల్యాణమును కాంక్షించి స్వాతంత్ర్యమును బడయుటకై విశ్వప్రయత్నము గావించుచుందురు. ఇంకొకవంక వారిబంధువులు, ఇరుగుపొరుగురాజ్యముల ప్రభువులు నగువారు వ్యక్తిద్వేషము, స్వార్థము కారణములు కాగా దేశీయులలో కలహములను బెంచి దేశమును నిరంతరదాస్యబంధమున నుంపప్రయత్నించుచున్నారు. రెండవపక్షమువారి దుష్ప్రయత్నములన్నియు హీరాదేవి యను నొకస్త్రీయొక్క దురాశచేతను, దుస్తంత్రములచేతను నయినవి. తుదకు స్వాతంత్ర్యపక్షమే గెలిచినది. రెండుపక్షములను గ్రంథకర్త సమంజసముగా నిర్వహించినాడు.

వీరరసప్రధానమయిన ఈనవల శృంగారరసమును కూడ నింత చవిచూపును. ఎడనెడగల ప్రకృతివర్ణనమపూర్వమే యైనను చాల క్లిష్టముగ నున్నది. దేశస్వాతంత్ర్యము పరమార్థముగనెంచి శత్రువులతో పోరిపోరి ప్రాణముల నర్పించిన చంపతరాయలు, శివాజీచక్రవర్తి ఛత్రసాలునకు బోధించిన రాజనీతి చాలవిలువగలది. దేశస్వాతంత్ర్యప్రాప్తికి ప్రజల యన్యోన్యానుకూల్యమే మూలసూత్రమని యీనవల గట్టిగా చెప్పుచున్నది.

మూలగ్రంథమున పదియవప్రకరణమునకు తర్వాత కథ కొంత లోపించునట్లుండెననియు, దానిని అనువాదకులు తాము కల్పించి పూరించితిమనియు దానిని ఉపోద్ఘాతమున జెప్పియున్నారు. కల్పితభాగము కథలో కథగా హత్తుకొనిపోయియుండుట అబ్బురమును గొలుపకపోదు. ఇది అనువాదకుల కల్పనాశక్తికి నిదర్శనము. తెలుగుచేత నిర్దుష్టము; కాని సంస్కృతపదబహుళముగ, ప్రౌఢముగ నున్నది. హిందీమూలమునకు ప్రత్యక్షానువాదమగుటచేతను, క్లిష్టకల్పనములకు ఆకరమగుటచేతను శైలి కటువుగా నున్నను సజీవముగా నున్నది. ఇట్టిశైలి వినోదమునకొఱకు నవలలను చదివి యానంద పడవెదువారికి రుచింపదు. కాని ఓపికపట్టి చదివినచో కథతోపాటు కొంత భాషాపరిచయము నిది గలిగించుట సత్యము. కావున ప్రాచీనప్రబంధప్రపంచమున నాముక్తమాల్యదకు గలస్థానము నేటి నవలాప్రపంచమున నీనవలకు గలదనిన నతిశయోక్తి కాజాలదు. ఈనవల పాఠశాలలయందు- హైస్కూళ్లు, కాలేజీలు - అవశ్యముగ చదువవలసిన గ్రంథము (detailed text)గా నిర్ణయింపదగినది. *

పాఠ్యగ్రంథనిర్ణయ సంఘమువారు గుణభూయిష్ఠమయిన యీనవలను పాఠ్య గ్రంథములలో జేర్చిన విద్యార్థులకు కొంత మేలు చేసినవారగుదురు. అనువాదకుల రచనమున జీవకళ నిండారియున్నది. అయ్యది క్రమముగ పుష్టిని జెంది ఇతోధికసుందరగ్రంథరచనాచతుమ గాగలదు. అనువాదకు లీసుభలక్షణమును గుర్తించి అభిజ్ఞతను, రచనాసౌష్ఠవమును, అవకాశమును పెంపొందించుకొనుచు సముచితరీతిని భాషాసేవను, తన్మూలమున దేశసేవను గావించుచు చిరజీవులయి వెలయుదురు గాక!

—భారతి.

## సీమంతిని

ఐదంకముల నాటకము. గ్రంథకర్త: గూడూరు వెంకటశివకవిగారు. ఆదిశైవ గ్రంథమాలయం దీప్రస్తక

* ఇపుడు పాఠశాలలలో చదువబడుచున్న పుస్తకములు చాలవరకు శబ్దదోషములు, వాక్యదోషములు, అసంగతివిషయములు మొదలగువానితో నిండి బాలురకు భాషానభిజ్ఞతాజాడ్యము నాపాదింపజేయుచున్నవి. ఈ జాడ్యమునకు పాఠ్యగ్రంథ నిర్ణయసంఘము (Text book Committee) వారు బాధ్యులగుదురు. ఆ సంఘమునందలి సభ్యులు భాషాపాండిత్యము, లోకజ్ఞతగలిగి, బాలురబుద్ధిస్వభావము, పరిణామక్రమమును దెలియగలవారుగ నుండదగుదురు. అట్టివారును తామునిర్ణయించుగ్రంథములను గ్రంథకర్తలయు, ప్రకాశకులయు ప్రోత్సాహప్రార్థనములకు లోనుగాక సవిమర్శనముగాపఠించి, వానిమంచిసెబ్బరలను గుర్తించిమంచివానినే నిర్ణయించుట శ్రేయము. ప్రస్తుతమున్న పుస్తకములను చూడ సంఘము, తత్కార్యనిర్వాహవిధానము తృప్తికరముగ నున్నట్లు చూపట్టదు. ముందయినను ఇట్టి లోపములు తొలగుట పరమావశ్యకము. దీనికయి ప్రజలు తీవ్రముగ ప్రయత్నింప దగుదురు.

మారవది. ఇందలికథ పౌరాణికము. నలచక్రవర్తి మనుమడగు చంద్రాంగదుడు దీనికి నాయకుడు. సోమవార వ్రత మాహాత్మ్య ప్రతిపాదకము. ఈ పేరున నొక ప్రబంధ మాంధ్రమున గలదు. అది పదునేడవ శతాబ్దికి జెందినది. ఇటీవల ముద్రితమయినది. ఈ "గ్రంథకర్త లిదివఱ కనేక నాటకములు కృతియొనరించి యుండుట"ను గ్రంథమాలాసంపాదకులు సంపాదకీయ భూమికయందు సెలవిచ్చియున్నారు. అట్టివారి కవిత్వమునందలి రసము నాస్వాదించుటకై యుద్ధరించిన యీ క్రింది మచ్చు గద్య పద్యభాగముల పాఠకులు పరికింపదగుదురు:

కం. నరపాలచంద్ర! మీచేఁ
బరిపాలనఁ జేయునట్టి పట్టణ మిపు డా
సురపాలు నగరురీతుగఁ
గర మొప్పెను సుజనకలిత! సౌఖ్యం బెసఁగన్.

ఆ. వె. భోగికులశశాంక! భోగిభూషణునకు
భోగిశయనునకును పోరుమాటి
తిండిబోతుతండ్రి మెండుగా దమకీర్తిఁ
బొగడఁజాలరెంత బొగడ నేను.

ఐన నాదోచినటుల వర్ణించెద వినుండు. ఇవ్వనలక్ష్మికి మాలూరఫలంబులే నిబ్బరమగు గబ్బిగుబ్బలును, ఇందలిసరస్సునంగల వికసించిన కమలపత్రంబులే నేత్రంబులుగను, యివ్వనంబునం గల మదేభంబులే గమనంబులుగను, మత్తభ్రమరసంఘంబులే శిరోరుహంబులుగను, కలకంఠంబుల కలరవంబులే మృదుమధుర భాషణంబులుగను, కమ్మని కప్రపుదిన్నెలే పరిమళోపేతంబగు శరీరంబుగను, అఁటిమహీరుహంబులే యూరువులుగను, తీవియగు వల్లరుల పెంపకమే మిరుమిట్లుగొను కాంతిగల భుజములుగను, సల్లలితంబగు నవపల్లవ ప్రకరంబులే పాణితలంబులుగను, పగడంపు తీవియలే తీవియగు కరంబులుగను, సౌగభోన్నత విభవంబగు పుష్పంబులే చిఱునవ్వుగ నొప్పి ప్రత్యక్షంబుగ నివ్వనలక్ష్మి వీక్షించువారలకొక్క చక్కర బొమ్మరీతి నెక్కుడు మక్కువఁ బొడమునట్లు గన్పట్టుచున్నది. ఏమీ యివ్వసంతుని మహిమ? ఇంతని జెప్ప నేరికి శక్యమగును? ఇప్పుడు నా మానసారవిందంబు పరమానందమై వికసించినది. అమాత్యవరా మితిలేని యానందమందితి.'

ఇట్టికై నేత యాంధ్రవాణి కెంత యానంద దాయకమో! భాషాస్వరూప మెఱుగకయే గ్రంథకరణమునకు దొరకొను నిట్టి మహనీయు లెంతరో యభివంద్యులు.

## అభిజ్ఞాన శాకుంతలము

(గ్రంథకర్త్రి): విద్వత్కవి తిలక (?) కాంచనపల్లి కనకాంబగారు. మహాకవి కాళిదాసకృతమగు నభిజ్ఞాన శాకుంతలమున కిదివఱకే తెలుగున ననువాదములు పెక్కులున్నవి. వానిలో గొన్నియుత్తమములయి యొప్పియున్నవి. ఉపరి నేడిది యొక క్రొత్తయనువాదము. సుప్రసిద్ధమయిన ఈనాటకకథను గూర్చి యిచ్చట విస్తరించుట పనిలేనిపని.

ఈ క్రిందిపద్యములను బట్టి సహృదయులను పాఠకు లీయనువాదవైఖరిని గుర్తింపదగుదురు:

శా. ఏగు న్నేఁడి దతా శకుంతల యనన్
హృత్సీమ నుత్కంఠ యా
నాఁగన్ బాష్పము లెల్లరాల్పడియె మాం
ద్యం బందెఁ జూడ్కిన్ వగన్
రాగం బాకుల పెట్టు నన్నె యిటర
ణ్యస్థున్, గటా, యింక నే
లాగున్ గేస్తులు వంత నోర్తు రొకొ పి
ల్లన్ గ్రొత్తఁగాఁ బంపుచోన్.

మూలము: యాస్యత్యద్య శకుంతలేతి హృదయం
సంస్పృష్ట ముత్కంఠయా,
కంఠ స్తంభిత బాష్పవృత్తికలుష
శ్చింతాజడం దర్శనమ్;
వైక్లబ్యం మమ తావ దీదృశ మహో
స్నేహా దరణ్యౌకసః,
పీడ్యంతే గృహిణః కథం ను తనయా
విశ్లేషదుఃఖై ర్నవైః.

మ. తొలుతన్ మీరు గ్రహింప కెవ్వరితె తాఁ
దోయంబులం గ్రోలదో

తలి శేస్త్రీ ప్రియభూష యయ్యును భవ
త్సఖ్యంబునన్ గోయదో
యలరుల్ పుట్టఁగఁ దొ_ల్త మీ కవతె కా
నానంద మాయీ శిశుం
తల ప్రాణేశ్వరునింటి కేగెడు నను
జ్ఞన్ మీర లిం డెల్లరున్.

మూలము: పాతుం న ప్రథమం వ్యవస్యతి జలం
యుష్మాస్వపీతేషు యా,
నాద త్తే ప్రియమండనాపి భవతాం
స్నేహేన యా పల్లవమ్;
ఆద్యే వః కుసుమప్రసూతిసమయే
యస్యా భవ త్యుత్సవ
స్సేయం యాతి శకుంతలా పతిగృహం
సర్వై రనుజ్ఞాయతామ్.

ఉ. మమ్ముఁ దపోధనాధ్యుల స
మంచిత రీతిఁ దలంచి యెంచి స్వీ
యమ్మగు సత్కులమ్మునల
యయ్యది నీయెడ నీమె కట్లొ చు
ట్టమ్ము లెఱుంగకుండఁ గడు
డక్కిన కూర్మి గణించి దీని న్యా
యమ్మ సపత్నులట్ల గన
నవ్వలఁ గల్గుఫలం బదెల్ల భా
గ్యమ్మనఁ జుమ్ము దాని నగు
నా! వదియింపఁగ నింతి బంధుసల్!

మూలము: అస్మాన్ సాధు విచింత్య సంయమధనా
నుచ్చైః కులం చాత్మన
స్త్వయ్యస్యాః కథమ ప్యబాంధవకృతాం
స్నేహప్రవృ త్తించ తామ్;
సామాన్యప్రతిప త్తిపూర్వక మియం
దారేషు దృశ్యా త్వయా,
భాగ్యాయ త్త మతఃపరం నఖలు త
ద్వాచ్యం వధూబంధుభిః.

మ. గురుశుశ్రూషయొనర్పుమా సవతులన్
గొమ్మ సఖీవృ త్తితో
వరుఁ డేభంగ మొనర్చినే నలుక మా
ర్వల్కన్నదే మానుమా
పరివారంబు గడుం గృపం గనుము సం
పద్గర్వము నీవడు తా
ల్పరు రామల్ గృహిణీపదం బిటు పెరల్
చూడన్ కులాధుల్ గదా.

మూలము: శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీ
వృ త్తిం సపత్నీజనే,
భ ర్తు ర్విప్రకృతాపి రోషణతయా
మాస్మ ప్రతీపం గమః;
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే
భాగ్యే ష్వనుత్సేకినీ,
యాం త్యేవం గృహిణీపదం యువతయో
వామాః కులస్యాధయః.

ఆ. వె. చూతమంజరి నటు నూతనాసవపాన
లోలుపుఁడవు నీవు గ్రోలి గ్రోలి
కమలవసతిమాత్రఁ గడు నిర్వృతిం జెంది
మఱచి తెట్లు దాని మధుకరంబ.

దీనికి పాఠాంతరముగ,

మ త్తకోకిల— నూతనాసవ లోలుపుండవు నోటినింపుగ
[నీవుమున్
జూతమంజరి నవ్విధంబునఁ జుంబనం బొనరించి యం
బ్జాతగర్భనివాసమాత్ర నపారనిర్వృతి నొంది యే
రీతి దాని స్మరింపకుంటివి వరే ద్విరేఫ! విరాళిమై.

మూలము: అభినవమధులోలుప స్త్వం,
తథాపరిచుంబ్య చూతమంజరీమ్;
కమలవసతిమాత్ర నిర్వృతో,
మధుకర విస్మృతోఽ స్యేనాం కథమ్.

## ద్రవ్యశాస్త్రము

గ్రంథక ర్త: యద్దనపూడి వెంకటరత్నంగారు.
డిమ్మీసైజు; పుటలు ౨౨౩. వలయువారు 'యద్దనపూడి
వెంకటరత్నంగారు, తాడేపల్లి గూడెం, పశ్చిమగోదావరి
జిల్లా' అని వ్రాసిన బడయగలరు.

### బాలవ్యాకరణ గుప్తార్థ ప్రకాశిక

గ్రంథకర్త: శ్రీ॥ శే॥ మహోపాధ్యాయ కల్లూరి వేంకటరామశాస్త్రిలుగారు. డిమ్మిసైజు. పుటలు ౫౬౭ వెల రూ. ౫-౦-౦. విలాసము: కల్లూరి రామచంద్ర మూర్తిగారు బి. ఏ., బి. ఇ. డి., రాజమండ్రి.

సుప్రసిద్ధులను గ్రంథకర్తగారిని గూర్చి కాని, గ్రంథమును గూర్చి కాని ఆంధ్రలోకమునకు క్రొత్తగా నిప్పుడు చెప్పవలసిన దేమియు లేదు. ఈగ్రంథము వెనుక రెండు భాగములుగ నుండినవి. ఇప్పు డారెండుభాగము లును కలిపి ఏకముగ ముద్రింపబడినవి.

### పెద్దాపురము ముట్టడి

'ఆంధ్రచారిత్రాత్మక సమవాకారము.' గ్రంథ కర్త: బుద్ధవరపు పట్టాభిరామయ్యగారు, గాంధినగరము, కాకినాడ. డిమ్మిసైజు, ౧౧౩ పుటలు గలవు. వెల. రు ౧-౦-౦.

దీనిపై విమర్శ ముందు ముందు వెలువడును.

### కవితాసమితి వార్షిక సంచిక

క్రౌను ౧ సైజు; ౧౧౪ పుటలు గలవు. వెల అంచెకూలితో రు ౧-౧-౦.

సంచిక ముచ్చటగా నున్నది. ప్రసిద్ధులగు పండితులు, కవులు, ఐతిహాసికులు- సమర్థులగు రచయితలు వ్రాసిన చక్కని పద్యగద్యవ్యాసములతో నిది చదువుట కును, ఇంపుగ నున్నది. ఈసమితి సదాశయములు అధ్యక్షులగు శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఈసంచికయందు తెలియజేసిరి. అవి యెంతయు కొనియాడ దగినవై తెలుగువారి సానుభూతికి ఈసమితిని పాత్రము చేయుచున్నవి.

ఈసంచిక వలయువారు సమితి కార్యదర్శులగు శ్రీ పురిపండా అప్పలస్వామిగారికి విశాఖపట్టణము వ్రాయవలయును.

---

## వెరవు?

పింగళి వెంకటసుబ్బారావు గారు

ఈ విషాదాంతరంగము నెల్ల నరసి, - ఉండు చోటెరుంగక కలగుండు వడుచు
చెదరిపోయిన హృది నెట్లు చిక్కబట్ట - వచ్చు నయ్యయో! నీదయ వచ్చుదనుక.

ఓడ నీరేవు జేరెడు జాడ గాన; - వెడలినారలు నావికుల్ విడిచిపెట్టి;
వెలవు దోపదు; సంద్రమా వెలపు గొల్పు, - ఏడుగడవని నమ్మితి జూడు గృపను.

చిరిగె తెరచాప, ఓరగా నొరగె కొయ్య,-బిగువు దప్పెను చుక్కాని, పగులు జూపె
కూర్పుబల్లల నీరేమొ కొలదికొలది - లోన కేతెంచుచుండుట గానవేని,
రాదు, ముప్పు దప్పింపగారాదు పిదప.

---



6 4- 19

# సాభిప్రాయ విశేషములు

వర్తమాన ప్రపంచపరిస్థితులు ధర్మాత్ములకు పరమ విషాదమును గలిగించు చున్నవి. ఒక వైపున నానాజాతిసమితి సమావేశములు, కెల్లాగు ఒడంబడికలు, కార్మికసమితులు, విశ్వ విద్యాలయములు, దాన ధర్మములు, శాంతి వాఙ్మయములు ప్రబలుచున్నవి. వేరొకవైపున సంగ్రామములు, సంగ్రామసన్నాహములు, పర పీడనము, స్వార్థపరత్వము, ధనస్వామ్యము, జాతీయాహంకారము, రోషావేశములు విజృం భించుచున్నవి. ఈ వివిధసిద్ధాంతములను బోధిం చెడి గురువుల సంఖ్యకు మితిమేరలు లేవు. ఎవరి నోటినుండి యైనను మాట వెలువడిన వెంటనే తంతివార్తలమూలమునను, వాయువార్తల మూలమునను వెలువడిన మాటలు వేదవాక్య ములవలె ప్రపంచమునం దంతటను పత్రికలద్వా రా వ్యాపకమునుగాంచుచున్నవి. గురువులుమా టలాడుటకుజంకుచున్ననుపత్రికాప్రచారకులు బలవంతముచేసి వారి యభిప్రాయములను వెల్ల డిచేయుట యాచారమైనది. పత్రికలకు విలేఖరు లుగా నుండుటయును, నాయకుల యభిప్రాయ ములను చతురముగ గనుగొనుటయును ఘన కార్యముగ పరిగణింపబడుచున్నది. అసంఖ్యా కములైన పత్రికలు నాయకాగ్రేసరుల యభి ప్రాయములను వెదజల్లుచున్నవి. ప్రజలకు నాయకాభిప్రాయములను, చదువుటకుగాని చది వినదానిని మననము చేయుటకుగాని అవకాశ ములు లేకున్నవి. సామాన్య ప్రజలయందును, నాయకుల యందును జిజ్ఞాసయే పోయినది. పత్రికాభిప్రాయములే సుకరముగ జనాభిప్రా యములగుచున్నవి. ఏలండను టైమ్సో, డెయి లీమేలో, పయనీరో, హిందూపత్రికయో ప్రక టించిన భావములు పాఠకులు వారివారి సం స్కారముల కనురూపముగ తమ యభిప్రాయ ములుగ గ్రహించుచున్నారు. శ్రవణ మనన ధ్యాసలు లేకుండ స్థిరాభిప్రాయములను వెలు పుటకును, పరులయభిప్రాయములను ఖండించు టకును సులభసాధనము లేర్పడినవి. ముఖ్య ముగా నీ దురవస్థ రాజ్యాంగ విషయములందు దినదినప్రవర్ధమానం బగుచున్నది.

రాజకీయవిషయములందు పరిజ్ఞానము గాని, పరిచయముగాని, యనుభవముగాని యవసరము లేకున్నది. మాటలాడెడివా రంద రును నాయకులు, ధీరులు, దేశభక్తులు. మంచి వాగ్ధోరణి, ఖండనసామర్థ్యము, పరివాదసామ ర్థ్యముగలవక్తలు, లేఖకులు నాయకులై జనా భిప్రాయమును నిర్ణయము చేయుచున్నారు. ఈ విషమ దశయందు జిజ్ఞాసువులకు చేయదగి నదియు కనుపడకున్నది.

చీనాయందు ప్రబలుచున్న స్వాతంత్ర్య సంగ్రామము సంగ్రామాభిలాషను పురికొల్పు

చున్నది. ఆఫ్ఘనిస్థానమునందు వ్యాపించుచున్న మతసంగ్రామము మతాభిమానమును ప్రజ్వలింపజేయుచున్నది. రుష్యాయందు ప్రబలుచున్న సాంఘిక ధర్మాభిమానము సాంఘిక ధర్మమును పురిగొల్పుచున్నది. అమెరికాయందు ప్రబలుచున్న ధనాగమనాభిమానము ధనాశను ప్రోత్సహించుచున్నది. ప్రపంచవ్యాప్తమైన రాజ్యాధికారాభిలాష అధికారతృష్ణను పురిగొల్పుచున్నది. స్వాధీన రాజ్యములందు సంకుల సంరంభములను గలుగజేయుచున్న సంకీర్ణభావములు పరాధీన రాజ్యములందు మహోపద్రవమునకు మూలము లగుచున్నవి. అస్థిరమును, అసహజమునునైన రాజ్యాంగస్థితియందు మహాపరివర్తనము దుర్లభమైనను సహజముగను గనుపడుచున్నది.

బాధ్యతాయుత ప్రజాస్వామ్యము వర్తమానయుగధర్మముగ నున్నది. నిరంకుశప్రభుత్వమునకు నిలయములైన రుష్యా, తుర్కీ, చీనా, పరిష్యా మొదలగు దేశములందు ప్రజాస్వామ్యము స్థిరపడినది. పరాధీన రాజ్యములన్నియును స్వాతంత్ర్యసిద్ధికై మహాప్రయత్నములను చేయుచున్నవి. విశ్వ వ్యాప్తమైన స్వాతంత్ర్యవాతావరణ మితర దేశములను వలె భరతఖండమును నావరించినది. ముప్పదిమూడు కోట్ల ప్రజలును, ప్రాచీనసభ్యత్వమును, మతాభిమానమును, అహింసాధర్మ పరత్వమునుగల భరతఖండము నందు స్వాతంత్ర్యాభిలాష వాయువేగ మనోవేగములతో వ్యాపించుట సహజము. సంకీర్ణములైన హిందూదేశ పరిస్థితులు స్వాతంత్ర్యవాతావరణమును భిన్నరూపములను వ్యాపింపజేయుచున్నవి. నిరంకుశాధికారవర్గము స్వీయస్వత్వములను సంరక్షించుకొనుటకు విశ్వప్రయత్నములను జేయుచున్నది.

హిందువులు, మహమ్మదీయులు, బ్రాహ్మణులు బ్రాహ్మణేతరులు, నిమ్నజాతులు వారి వారిలాభములకై మహాతంత్రములను పన్నుచున్నారు. నిరంకుశాధికారవర్గము సాంఘిక విభేదములను మిత్రభేదమునకై వినియోగించుచు స్వీయాధికారమును సంరక్షించుకొనుచున్నది. వివిధసంఘములును కర్తవ్యమును నిర్ణయింపజాలక పరస్పరకలహములకు బూనుకొనుచు ఆత్మనాశనమును జేసికొనుచున్నవి. దేశమునందు వ్యాప్తములైన పరస్పర కలహకారణములు దేశదౌర్భాగ్యమునకు వినియోగపడుచు ప్రతిపక్షులకు సంతసము గలుగజేయుచు, నిర్బంధవిధానవ్యాపనమునకు, వినియోగపడుచున్నవి.

* * * *

ఢిల్లీ ముస్లీము మహాసభ

ఢిల్లీయందు గూడిన ముస్లిము మహాసభావృత్తాంతమును, సూరతునందుకూడిన హిందూ మహాసభా వ్యవహారములును, లక్నో, ఫరక్కాబాదు, కటియావాడు రంగపురములందు గూడిన రాజకీయసభలును దేశావృతములైన మహాసంక్షోభస్థితులను సువ్యక్తము చేయుచున్నవి. మహమ్మదీయ సంఘమునందు జిన్నాపక్షము, ఆలీసోదరులపక్షము, అబ్దులుకలాము అజాదు

పక్షము మొదలగు పక్షములు ప్రబలి దేశ ప్రయోజనములను, మహమ్మదీయ ప్రయోజనములను నిరర్థకము చేయుచున్నవి. ఒకపక్షము వారు నెహ్రూనివేదిక నామోదింప గోరుచున్నారు. వేరొకపక్షమువారు నెహ్రూనివేదికను నిరాకరింపగోరుచున్నారు. మూడవ పక్షమువారు రెండుపక్షములవారికిని రాజీనామాను కుదుర్చుటకు గోరుచున్నారు.

నెహ్రూ నివేదికను నిరాకరింప గోరెడు పక్షమొకవైపున సంపూర్ణ స్వాతంత్ర్యమును, రెండవ వైపున సాంఘిక ప్రాతినిధ్యమును గోరుచున్నది. ఆలీ సోదరు లీపక్షమునకు నాయకులు. వీరి మతమునందు హిందూ దేశమునందు మహమ్మదీయాధికార వ్యాపనము ప్రధానముగాని బాధ్యతాయుత పరిపాలనము స్థాపించుట ప్రధానము కాదు. మహమ్మదీయేతరులు కాఫరులు. సర్ ఆలీ ఇమాంగారు వీరివిషయమై తెలిపిన భావములు భారతచరిత్రయందు శాశ్వతప్రతిష్ఠను బడయ గలవు. మహమ్మదీయ ప్రాతినిధ్యమును, మహమ్మదీయాధికారమును స్థిరతరముజేయదలచిన మహమ్మదీయులు స్వరాజ్యమును,స్వప్రయోజనమును దూరస్థము చేయుచున్నారు. మహమ్మదీయులను సామదానోపాయములను సంతృప్తులను జేయుటకు హిందువులు సంసిద్ధులుగా నుండినను హిందువులసంసిద్ధికిని మితిమేరలు గలవు. గాంధిమహాత్మునివంటి త్యాగమూర్తులు హిందువులు మహమ్మదీయులనుపూర్తిగ సంతృప్తులనుజేయుటకు మహాత్యాగము చేయవలయునని విశ్వసించినను, సామాన్య ప్రజానాయకుల కీచిత్తప్రవృత్తి విశ్వసనీయము గాకున్నది.

నెహ్రూ నివేదిక మహమ్మదీయాభిప్రాయమునకు విశేషానుకూల్యమును గలిగియున్నది. సింధురాష్ట్ర నిర్మాణమును, పశ్చిమోత్తరరాష్ట్ర నిర్మాణమును, శాసనసభలయం దధికతర ప్రాతినిధ్యమును, హిందువుల క్షేమమునకు ప్రతికూలమైనను, నెహ్రూ నివేదిక అంగీకరించుచున్నది. రాష్ట్రీయాధికారమును, సామ్రాజ్యాధికారమును విభజించుటయందు నెహ్రూనివేదిక చూపిన దూరదృష్టి విచక్షణోపేతముగ నున్నది. హిందూదేశస్వాతంత్ర్యమునకు మూలబీజమైన రాష్ట్రీయ సామ్రాజ్యాధికారముల సంరంభమునకు స్థానము లేకుండచేయుట భారతరాజ్యాంగ నిర్మాణమునకు ప్రాణముగ నున్నది. మహమ్మదీయ నాయకులు సంకుచిత దృష్టితో రాష్ట్రీయ స్వాతంత్ర్యమును విస్తరింపజేయ గోరుట సంరంభములకును, దేశారిష్టములకును మూల కారణముగా గలదు.

ఢిల్లీ మహమ్మదీయ సభయందు మహమ్మదీయ నాయకులు ప్రతిపాదించిన ఈ సవరణ నెహ్రూ నివేదికయందలి ముఖ్యవిషయమును పాడుచేయుచున్నది. ఈ మార్పువలన మహమ్మదీయులకు తాత్కాలికముగ స్వల్పప్రయోజనములు సమకూడినను కాలక్రమమున మహమ్మదీయులకును, దేశమునకును పరమానర్థములు సంప్రాప్తములు కాగ

లవు. మహమ్మదీయులు వారి లక్ష్యమును భారతీయులకు మూలాధారమైన మాతృదేశ మునందులగ్నముచేయుట వివేకముగాని మహ మ్మదీయ సంఘమునందును, మహమ్మదీయ మతమునందును, మహమ్మదీయ రాజ్యములం దును లగ్నముచేయుట వివేకము గాదు. ఢిల్లీ యందు గూడిన సభ యందు నెహ్రూ నివేదిక ఒక పక్షముచేతనైనను, సవరణ లతో నైనను, నామోదింప బడుట వివే కోదయమునకు సుభసూచకముగ నున్నది. ఆలం, షేర్వానిగార్లు చూపిన తెలివితేటల వలన విషయనిర్ధారణ సభయందును, బహి రంగసభయందును నెహ్రూ నివేదిక సవరణ లతో నంగీకరింపబడుట ప్రశంసనీయముగ నున్నది. కాని భేదాభిప్రాయములతోడను, సంక్షోభములతోడనునిండినసభయందు తీర్మా నముల నామోదించుటవలన విశేషమైన ప్రయోజనము గలుగదు. సంక్షోభమునకు ప్రధాన కారకు లగు ఆలీసోదరుల ప్రవర్తనము మహమ్మదీయులకును, హిందువులకును పరమ విషాదమును గలుగజేయుచున్నది. ప్రాజ్ఞులైన జిన్నాగారును సంక్షోభమునకు కారకులైన ఆలీసోదరులకు స్థానము నొసంగుట యనుచిత ముగ నున్నది. జిన్నాగారు మహమ్మదీయ సభ సక్రమముగా జరుగలేదని నిర్ణయించు టయును సన్యాయముగ నున్నది. భిన్నపక్ష ములనాయకులు స్వాభిమాన భరితులై స్వపక్ష మతమును సమర్థింపగోరునపు డేపక్షమైనను సభావ్యవహారములు సవ్యముగా జరుగలేదని యాక్షేపించుట సహజము. నెగ్గనిపక్షము మీా యాక్షేపణను జేయుట సాధారణ విషయము. ముసల్మానులందు షాఫి, ఆలీసోదరులు, అబ్దురు రహీముగారులు మొదలగువారు కేవలము మహమ్మదీయాధికారమును, మహమ్మదీయాధి క్యమును గోరుచు నెహ్రూనివేదికను ధ్వంసము చేయగోరుచున్నారు. సంపూర్ణ స్వాతంత్ర్య మును ప్రతిపాదించిన నెహ్రూనివేదికను నిరాక రించుటయును, శాసనసభలయందు సాంఘిక ప్రాతినిధ్యమును, ప్రత్యేకసియోజకవర్గమును గోరుటయును విపరీతనిర్ణయము లనియును, మూలచ్ఛేదకరమైన పాండిత్యప్రకర్ష ణ యని యును ప్రాజ్ఞు లంగీకరింపగలరు. జిన్నాపక్షము భారతజాతీయ మహమ్మదీయ పక్షము. ఈపక్ష మునకు మహమ్మదీయ లాభముల కను కూలమైన నెహ్రూనివేదిక అనుకూలముగ నున్నది. అఖిలభారతదేశమున కనుకూలమై పక్షపాతరహితమైన నెహ్రూనివేదిక డాక్టరు ఆలము, ఆజాదు, షేర్వాని, మొహమ్మదా బాదు మహారాజాగారులు మొదలగు మహ మ్మదీయనాయకుల యామోదమును బడయు చున్నది. వీరి యామోదమును బడసిన విధాన మునందును మహమ్మదీయ ప్రయోజనముల కధికమైన ప్రముఖత గలదని హిందూనాయకు లాక్షేపించుచున్నారు.

* * * *

హిందూమహాసభ

శ్రీయుత రామానంద ఛటర్జీ గారి యాధిపత్యముక్రింద గూడిన హిందూమహా

సభ నెహ్రూవేదికపట్లను, కాంగ్రెసు తీర్మానముపట్లనుజూపిన తిరస్కారభావ మసహ్యముగ నున్నది. ఆలీసోదరుల వలెనే మూంజీగారును సమరోత్సాహమును ప్రకటించుట యనుచితము. మహమ్మదీయనాయకులు స్వప్రయోజన పక్షాయణు లగుటవలన హిందూనాయకులు సమరోత్సాహమును జూపుట యధర్మము. మహమ్మదీయు లధిక ప్రాతినిధ్యమును గోరుట వలన హిందూనాయకులు మహమ్మదీయాశయములను నిరోధించుట యనుచితము. సింధు పశ్చిమోత్తర రాష్ట్రముల విషయమునను, స్థాన సంరక్షణ విషయమునను, సంయుక్త నియోజకవర్గవిషయమునను హిందూమహాసభ యామోదించిన తీర్మానములు సంకుచిత లక్ష్యమును విశదముచేయుచున్నవి. హిందూనాయకులైనను విశాల హృదయమును జూపించి మహమ్మదీయులను త్యాగరూపమున హిందూదేశ లక్ష్యమునకు లగ్నముచేయుట శ్రేయస్కరము. హిందువులు మహమ్మదీయుల మీద నాగ్రహించి మాతృద్రోహమునకు బూనుకొనజాలరు.

లక్నోయందు గూడిన మితవాదులసభ నెహ్రూనివేదికను సంపూర్ణముగ నామోదించుచున్నది. బాధ్యతాయుత స్వపరిపాలనము వెంటనే స్థాపింపవలసిన యవసరమును బెజంటమ్మగారును, మితవాదనాయకులును విశదముచేసిరి. చింతామణిగారు, జగతునారాయణగారు సంయుక్తరాష్ట్రముల పక్షమున ప్రభుత్వాధికారు సమర్పించిన రాజ్యాంగవిధానము పునోభివృద్ధిని జూపుటలేదని వెల్లడిచేసిరి. ఫరకాబాదునందు జవహరిలాలు నెహ్రూగారి యాధిపత్యముక్రిందను, రంగపురమునందు సుభాసుచంద్రబోసుగారి యాధిపత్యము క్రిందను గూడిన రాష్ట్రీయసభలు స్వరాజ్యసంపాదనమునందు భారతీయులకుగల దృఢసంకల్పమును విశదము చేసినవి. గాంధిమహాత్ముని రాజ్యాంగ రంగమునందు ప్రవేశము స్వరాజ్యసంరంభమునకు నూతనోత్సాహమును గలుగజేసినది. నిరంకుశ ప్రభుత్వమెన్ని నిర్బంధములను గల్పించినను స్వరాజ్యప్రస్థాన మతివేగమునను జరుపుచున్న విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

* * * *

నిర్బంధవిధానము

గాంధిమహాత్ముని రాజ్యాంగ రంగమునందు ప్రవేశించుటయును, విదేశవస్త్ర బహిష్కారమును, విదేశవస్త్రదహనమును నిరంకుశ హృదయమునందు భయభ్రాంతులను గలుగజేసినవి. విదేశవస్త్రదహనమునకై గాంధిమహాత్ముని నిర్బంధించుటయును, శిక్షించుటయును ప్రభుత్వదౌర్బల్యమును ప్రకటించుచున్నవి. శ్రద్ధానంద పార్కును రాజమార్గమని నిర్ధారణచేయుటయును, గాంధిమహాత్ముని శిక్షించుటయును క్షీణించుచున్న ప్రభుత్వప్రతిష్ఠను మరింత క్షీణింపజేయుచున్నది. కలకత్తా మేజిస్ట్రేటు తీర్మానము, పోలీసు కమి

పనరు ప్రవర్తనము నిరంకుశ ప్రభుత్వహృదయమును విశదము చేయుచున్నవి గాని ధర్మలక్ష్యమును విశదము చేయుటలేదు. శ్వేతభవనమునందు వింటరుటను ప్రభువుగారు చెప్పిన మాటయె కలకత్తాయందు పోలీసుబంట్రోతు ప్రతిధ్వనించుచు భారతరాజ్యాంగ భారమును వహించుచున్నటులు తలంచుచున్నాడు. దేశభక్తులను నిర్బంధించెడి పోలీసుబంట్రోతు రక్షకాభిమానమును బూనుచు దుర్నయములను జేయుచున్నాడు. దేశసేవాపరాయణుడైన సాంబమూర్తి గారికి రక్షకభటులు చూపిన యగౌరవము నిరంకుశ ప్రభుత్వమునందలి జడత్వమును, రసరాహిత్యమును విశదము చేయుచున్నది. దేశమునం దంతటను ప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధవిధానము ప్రభుత్వహృదయమునందు గలిగిన భయభ్రాంతులకు నిదర్శనముగ నున్నది. ప్రభుత్వ మవలంబించిన నిర్బంధవిధానము పరిహాసపాత్రమై ప్రజాహృదయమునందు స్వాతంత్ర్యజ్వాలలను ప్రజ్వలింపజేయుచున్నది. ప్రభుత్వ మవలంబించిన తంత్రము నిరుపయోగమైన విధమును దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి.

ప్రధాన సంఘములును, ప్రముఖులైన నాయకులును సైమనుసంఘమును బహిష్కరించి భారతజాతీ యాత్మగౌరవమును సువ్యక్తము చేసిరి. సైమనుసంఘసభ్యులు తమ దురవస్థను గ్రహింపగలిగిరి. వివిధరాష్ట్రములందును సంచారము చేసినను, సన్మానపత్రములు సమకూడినను, శాసనసభలు సహకారమును ప్రకటించినను, ప్రభుత్వము రాజ్యాంగవిధానములను సమర్పించినను, సంఘములు, సభలు ప్రత్యేకప్రాతినిధ్యమును గోరినను, సైమనుసంఘవ్యవహారక్రమ మసంబద్ధమై, శక్తివిహీనమై, ప్రజాపోషణ రహితమై, నిరాదరణను బడయుచున్నది.

ఇర్విన్ప్రభువు, సైమను సప్తకము, నిరంకుశవర్గము, సహకారులు, జోహుకుమువాలాలు బహిష్కారధర్మ బలమును గ్రహించిరి. సైమను సంస్కరణ విధానము లే రూపమును దాల్చినను విద్యావంతులైన ప్రజానాయకుల యామోదమును బడయక ప్రయోగయోగ్యములు గావు. ఇర్విన్ప్రభు వీప్రతిష్టంభనమునకు ప్రతీకారమును యోచించుచున్నారను శుభవార్తలు సఫలము లగునని నమ్ముచున్నాము. పార్లమెంటు సభ్యులును, భారతీయ ప్రతినిధులును గూడి నిర్ణయించెడి రాజ్యాంగవిధానము ప్రయోగయోగ్యమై ప్రజాదరణమును బడయుచున్నది. సైమనుకమిషను డిల్లీయందు కార్యనిర్వాహక వర్గముతోను, ఆర్థికసంఘముతోను, విద్యాసంఘముతోను సంప్రతించుచున్నది. ఈ సంప్రతింపుల ఫలమైన ప్రజానాయకుల సాహచర్యము వలననే సమకూడవలసి యున్నది.

సైమనుకమిషను బహిష్కారము, నెహ్రూ నివేదికామోదము స్వరాజ్యసంరంభమునందు భారతసంకల్పమును విశదము చేయుచున్నవి.

కాంగ్రెసుపక్షము, స్వరాజ్యపక్షము, స్వతంత్ర పక్షము, హిందూసభ, మహమ్మదీయ సభ, మితవాదసభ, హోమురూలుసభ మొదలగు రాజకీయపక్షములు స్వల్పమైన మార్పులతో నైక్యమౌనివేదిక నంగీకరించుచున్నవి. అన్ని పక్షములవారును, మతములవారును రాజకీయ నిర్బంధ విధానమును, ముఖ్యముగాను గాంధి మహాత్ముని నిర్బంధమును నిరసించుచున్నారు. స్వరాజ్య సంపాదనమునందు దృఢమైన ప్రజా సంకల్పమును సువ్యక్తము చేయుటకు జనాదర ణమునకు యోగ్యమైన కార్యవిధాన మవసర ముగ నున్నది.

* * * *

నిర్మాణకార్యవిధానము: విదేశవస్త్రవహిష్కారము

స్వరాజ్యము నన్నిపక్షములవారు కోరు చున్నను స్వరాజ్యసంపాదన విధమునందు భేదాభిప్రాయములు గలవు. మితవాదులు సక్రమాందోళన విధానము నవలంబించి విఫల మనోరథు లైరి. ద్వంద్వప్రభుత్వవిధానము నన్నిపక్షములవారును నారాధించి నిరాశను జెందిరి. స్వరాజ్యసంపాదనమునకు ప్రత్యక్షాచరణము మూలసాధన మని ప్రపంచాను భవము విశదము చేయుచున్నది. ప్రత్యక్షాచరణమునందు దండనసాధనము ప్రపంచము నకు పరిపాటియైన విధానము. దండనసాధన మును కాంగ్రెసు ప్రతిషేధించుచు శాంతిసాధ నమును స్వరాజ్యమునకు ప్రతిపాదించుచు న్నది. శాంతిమార్గమునను స్వరాజ్యానుతాప మును ప్రజాహృదయమునందు ప్రజ్వలింప జేయుటకు స్వరాజ్యశ్రవణమననధ్యానము లన వరతమును నవసరముగ నున్నవి. ఈ కార్య విధానమును దేశమునం దంతటను వ్యాపింప జేయుటకు గల సాధనములందు ఖద్దరు వ్యాప నము, విదేశవస్త్రవహిష్కారము ప్రముఖములుగ నున్నవి.

స్వరాజ్య ధ్వజము నారోహణముచేయు ట, మద్యపాననిషేధమును బోధించుట, స్వరా జ్యోత్సవములను చేయుట మొదలగు పనులు స్వరాజ్య స్థాపనమునకు సాధనంబులైనను, ఖద్దరు నిర్మాణము, ఖద్దరుధారణము సకల జనులకును నాచరణయోగ్యమైన ముఖ్యసాధ నముగ నున్నది. స్వరాజ్యసమస్య ఆర్థిక రాజ కీయ సాంఘిక సమస్య. ఈ సమస్యలు ప్రత్యేక సమస్యలు గాక పరస్పరాశ్రయ మును గలిగియున్నవి. ఆర్థికస్వాతంత్ర్యము రాజకీయ సాంఘికస్వాతంత్ర్యములకు మూలా ధారముగ నున్నది. భారతీయ పారతంత్ర్య మున కార్థికపారతంత్ర్యము మూలకారణముగ నున్నది. ప్రజాపోషణమున కవసర మైన యన్నవస్త్రము లున్నపు డితరపరిస్థితు లెటు లున్నను స్వరాజ్యము సంభవ మగుచున్నది. ప్రజలు స్వయంసహాయ విధానము నవలం బించుచు వారి కవసరమైన ఖద్దరును నిర్మా ణము చేయగలిగినపుడు స్వయంసహాయ సాధ నమునను స్వరాజ్యమును సాధ్యమగుచున్నది. నిర్వ్యాపారులై నిస్సహాయస్థితియందున్న ప్రజ లను వ్యవసాయ పరాయణులను జేయుటకు

ఖద్దరు పరమసాధనముగానున్న, దిస్త్రీలు పురుషులు, చిన్నలు పెద్దలు, శ్రీమంతులునిరుపేదలు ఖద్దరు నిర్మాణమును, ఖద్దరు ధారణమును జేయుట కవకాశములు గలవు. స్వదేశఖద్దరు దీక్షతో విదేశవస్త్రబహిష్కరణము సహజముగ గలుగుచున్నది. పరావలంబనమునకు మూలాధారమై చిహ్నముగ నున్న విదేశ వస్త్రములను బహిష్కరించుట స్వరాజ్య సంపాదనమున కత్యంతావసరముగ నున్నది. కలకత్తా కాంగ్రెసు, కాంగ్రెసు కార్యనిర్వాహకసభ వర్తమాన సంవత్సరమునందు ప్రచండమైన విదేశవస్త్ర బహిష్కరణ ప్రస్థానమును జేయుటకు నిర్ణయించినవి. విదేశవస్త్ర ప్రస్థానమును జేయుటకు గాంధిమహాత్ముడు నాయకత్వమునుబూనుట భారతీయుల కుత్సాహమును, నిరంకుశాధికారవర్గమునకు విషాదమును గలుగజేయుచున్నది. ప్రజాహృదయమునందు మహాసంచలనము బయలుదేరినది. ఖద్దరు ప్రచారమునకు బలము గలిగినది. విదేశవస్త్రదహనమున కవలంబనము ప్రబలినది. అసహాయోద్యమారంభమునందు విదేశ వస్త్ర దహనమునకు ప్రతికూలించిన మితవాదులును, మితవాద కాంగ్రెసుపక్షమును వర్తమానసమయమునం దామోదమును జూపుచున్నవి. సంయుక్తరాష్ట్రీయముల రాష్ట్రీయ సభయందు మితవాదనాయకులైన జగతు నారాయణగారు తెలిపిన భావము భారతహృదయమునందు పశ్చాత్తాపంబగుచున్న స్వాతంత్ర్యభావ పరివర్తనమును విశదము చేయుచున్నది. "సంపూర్ణస్వాతంత్ర్యము ప్రస్తుతము ప్రయోగయోగ్యము గాదని నేను విశ్వసించుచు నను వెంటనే బాధ్యతాయుత పాలనము దేశమునకు సమకూడనపుడు నాజీవితమును స్వాతంత్ర్యవాదినిగనుముగింపవలసియుండును" అని మంత్రిపనిని జేసిన జగతు నారాయణ గారు చెప్పినపుడు సామాన్య భారతీయుల చిత్తప్రవృత్తి యెటు లుండునదియును విస్తరించి వ్రాయుట యనవసరము. బాధ్యతాయుతప్రభుత్వమును స్థాపించి ప్రజాహృదయమునందు శాంతిని గలుగజేయుటకు బదులు నిర్బంధవిధానము నవలంబించుచు కోపోద్రేకములను ప్రజ్వలింపజేయుట కేవల మసంప్రేక్ష్యకారిత్వముగ నున్నది.

* * * *

దండనవిధానము

ఆంధ్రదేశ నాయకుడు, త్యాగమూర్తి సాంబమూర్తిగారు దండనము ననుభవించుచున్నారు. వారివిషయమున నధికారవర్గ మవలంబించిన వ్యవహారక్రమ మంతయును నక్రమ పూరితమై ఆంధ్రహృదయమునందును, భారత హృదయమునందును పరమాసహ్యమును గలుగజేసినది. సాంబమూర్తిగారిని సామాన్య నేరస్థునివలెను బాధించుట యన్యాయము. గాంధి మహాత్ముని విదేశవస్త్రదహనమునకై నిర్బంధించుటయును, ఒకరూపాయిజరిమానాను వేయుటయును న్యాయాధికారప్రహసనముగనున్నది. శ్రద్ధానందపార్కును రహదారి యని నిర్ధారణ చేయుటయును, వస్త్రదహనమును నేరముగా

పరిగణించుటయును, నేరమునకు రూపాయిని జరిమానా వేయుటయును ప్రహసనపరంపర లుగ నున్నవి. ఈ విషయములందు వ్యాఖ్యాన మనవసరము. సాంఘికవాదులను 31 మందిని నిర్బంధించుట నిర్బంధప్రస్థానమునందు ప్రచండప్రస్థానముగ నున్నది. ప్రభుత్వ మవలంబించుచున్న దారుణమైన నిర్బంధ విధానము ప్రజానాయకుల హృదయమునందు నిరాశను గలుగజేయుచున్నది. నిర్బంధము లేదేశమునందును శాంతిని గలుగ జేయలేదని ప్రపంచ చరిత్ర వేయినోళ్లను చాటుచున్నది. నిర్బంధములు వినాశమునకు సాధనము లగుచున్నవి గాని వికాసమునకు సాధనము లగుటలేదు. ప్రపంచమునందు ప్రవర్ధమానం బగుచున్న మహాసంరంభముల యనుభవానంతరమున నైనను బ్రిటీషురాజ్యనీతిజ్ఞులందు శాంతికి సాధనమైన త్యాగప్రవృత్తి గలుగకుండుట శాంతికాములకు పరమ సంతాపమును గలుగజేయుచున్నది. గాంధిమహాత్ముడు శాంతిసాధనమును, స్వరాజ్యమును, ధర్మమును స్థాపించుటకు జేయుచున్న ప్రయత్నములు ప్రపంచామోదమును బడయుచున్నవి. గాంధిమహాత్ముడు లోకోత్తర పురుషుడుగా నెంచబడుచున్నాడు. అన్ని జాతులవారు, మతములవారు, పక్షములవారు మహాత్ముని సత్యప్రియత్వమును, శాంతిమార్గమును, కార్యపరత్వమును శక్తిసామర్థ్యమును కొనియాడుచున్నారు. అన్యోన్యాశ్రయముగల భారతీయులును, బ్రిటీషురాజ్యనీతిజ్ఞులును గాంధిమహాత్ముని ధర్మప్రవృత్తిని నిర్లక్ష్యముచేయుట ఆత్మనాశనమునకు గారణంబగుచున్నది. నిరంకుశవర్గము స్నైమనుకమిషను ననుగ్రహించినది. నిర్బంధములను ప్రసాదించుచున్నది. భారతనాయకులు సిద్ధముచేసిన నెహ్రూనివేదిక జనాంగీకారమును బడయుచున్నది. నెహ్రూనివేదికను బలపరచుటకును, నిరంకుశపాశములను నిర్మూలము చేయుటకును 33 కోట్లభారతీయుల దృఢసంకల్పము, వ్యవసాయ పరాయణత్వము పరమసాధనములుగ నున్నవి. భారతీయుల వ్యవసాయ పరాయణత్వమును సువ్యక్తము చేయుటకు స్వదేశవస్త్ర దీక్ష, విదేశవస్త్ర బహిష్కరణము, విదేశవస్త్ర దహనము ప్రచండసాధనములుగ నున్నవి. గాంధిమహాత్ముని యాదేశానుసారముగ ప్రజ లీసాధనములనారాధింతురు గాత!

## గాంధిమహాత్ముడు: ఆంధ్ర దేశసంచారము

గాంధిమహాత్ముడు చైత్ర వైశాఖమాసములం దాంధ్రదేశసంచారమునకు పూనుకొనుట ఆంధ్రులభాగ్యముగనున్నది. మహాత్ముని సంచారము దరిద్రనారాయణుల సహాయమునకై ఖద్దరునిధికై ద్రవ్యమును సమకూర్చుటయైనను మహాత్మునిసంచార మాంధ్రదేశమునం దఖండమైన సంచలనమును గలుగజేయగలదు. పరస్పరాశ్రయముగల సమస్యలు మహాత్ముని ప్రసంగములందును, కార్యవిధానమునందును విస్పష్టములు గాగలవు. చిరకాల లబ్ధమైన మహాత్ముని సంచారము నాంధ్రప్రజానాయకులు వ్యవసాయపరాయణులై వినియోగించుటకు భగవదనుగ్రహము గలుగుగాత!

శ్లో. వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురు నన్దన,
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయో ఽవ్యవసాయినామ్.

Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras

# విషయానుక్రమణిక



త్రివర్ణచిత్రము—"అభయహస్త"

సాధారణచిత్రములు—హోయ్సల శిల్పచిత్రములు ౬; ('మైసూరు పురాతనశిల్పకళ' అనువ్యాసమునకు సంబంధించినవి.) అజంతాచిత్రములు ౪; ఇతర చిత్రములును.



* ఈసంచికలో పుటలసంఖ్య తప్పుపడినది. దిద్దుకొన ప్రార్థన

# బెంగాలు కెమికల్సువారి
# 3 దివ్యౌషధములు




## అక్వపిక్కోటిస్ కాంక్

అజీర్ణవ్యాధి, మందాగ్ని మొదలైన ఉదర సంబంధమైన వ్యాధులకు దివ్యౌషధము. నిత్యము భోజనానంతరం సేవించిన కలరా రానీయకుండ కాపాడగలదు.




## పికోటిస్ బిళ్లలు

అక్వపికోటిస్ కాంక్ నకు బదులు తయారైనది. ఒకబిళ్ల సేవించిన వెంటనే బాధ నివారణమగును.




## లిక్విడ్ ఎక్స్ట్రాక్ ఆఫ్ కాల్ మెగ్

లివర్ సంబధమైన వ్యాధులకు గుణమివ్వగలదు. పెద్దలుకూడ సేవింపదగినది.

బెంగాల్ కెమికల్ వారిచే తయారైన ఔషధములనే కోరుడు. మట్టపురకం కొనకుడు.

## బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వరుక్సు లిమిటెడ్, కలకత్తా.



"అభయహస్త"

చిత్రకారులు: శ్రీ వై. సుబ్బరావుగారు, రాజమండ్రి.




చెన్నపట్టణము, మే ౧౯౨౯

సంపుటము ౬ శుక్ల సంవత్సరము వైశాఖమాసము సంఖ్య ౫

## సందేశము

ఓలేటి వేంకటరామశాస్త్రిగారు

తల్లీ! యేమిటికమ్మ నీకు బహుసంతానాస్థ? నీకున్న సొ
మ్మెల్లన్ జెల్లకపోవునన్ భయమొ, నీయిల్లిల్లుఁ బాడారుచున్
గుల్లంబోవు నటంచు భీతియొ, నినుం బోషింపఁగా దక్షులౌ
పిల్లల్లేరను చింతయో తెలుపు సంప్రీతిన్ నినుం గోరెదన్.

ఇందఱు బిడ్డలఁ గనుచుంటిం-దగ నే ధన్య నని తలంచకు వీరల్
ముందింక నేమగుదురో యను-సందేహమువంతదె కడుపుచల్లని తల్లీ!

పుట్టినవారికే కడుపు పోసికొనన్ దగుదారి లేక యె
ట్టెట్టులో జీవయాత్రఁ జరియించుచుఁ గాలము వెళ్లఁబుచ్చికో
వెట్టయి యుండ నీ వకట! వెఱ్ఱివో వెంగలివో యెఱుంగ! ని
ట్టిట్టి నవప్రసూతి భరియింతువు భారతమాత! యేమనన్?

6. 5. 1 ౯౦౦

ఆణిముత్తియములఁ బోలునట్టి సుతులఁ-గొందఱంగాంచి పరితృప్తి నొందరాదె
కడుపు చుమ్మలువోవ నీగతి నభాగ్య-హేతువుగ నింతసంతాన మేల నమ్మ?

కడుపేదు బిడ్డలన్ గనినఁగాని నివృత్తినిగోర వెంతప్రే
ముడిగల తల్లివో, పొగడఁబోలు భవత్ప్రబలానురక్తి మె
ల్లెడల; నదెల్లకాని, యొక యించుకయైన గణింపకుంటి నీ
యొడలికిఁ గల్గు చేటు; తగునో యిది నీ కుచితప్రవర్తినీ!

పరిమితంబయి యారోగ్యభాగ్య గరిమ-గలిగి నిన్నుద్ధరించు యోగ్యతఁ దనర్చు
సముచితాపత్యలాభంబు చాలదమ్మ?-తిరియ నీకుక్కమాతి పిందియ లిఁకేల?

అడ్డక నీవిటు పెక్కురు-బిడ్డలఁ గనుచుంటివేని బేద లగుచు వా
రెడ్డతనంబునఁ గూటికి-గుడ్డకు దవుగారె పంచి కుడిచెడు పట్లన్.

ఒక్కనికే సరిపడు కూ-డొక్కొక్క కబళముగఁ బంచియొసఁగెదె? యకటా!
పెక్కండ్రు సుతులు; కెవ్వని పొక్కయు నిండదుగదా? యిటుల్ తగు నమ్మా?

పెంపఁ, బ్రేమింప, విద్యఁ జెప్పింప, బ్రదుకు-తెరవు చూపింప నీకెంతొ భరముగాదె
యపరిమితమైన సంతతి యమ్మ యేని-భరతమాతృక! తెలియు మీపాటియైన.

అల్పాయుష్కులు నంగవిక్లబులు నష్టారోగ్యభాగ్యుల్ దరి
ద్రుల్ పీడాకరులైన దుర్బలులు పుత్త్రుల్ పుట్టరే నీ కనే
కుల్ పుట్టన్ సుఖమేమి యున్నయది? నీ గోడెంత? నీకేమి సం
కల్పం బున్నదొ తెల్పుమించుక యెఱుంగన్ గోరితిన్ దల్లిరో!

సత్యానిబద్ధమైన యొకసద్విషయం బిదిగాదె? సంతతా
పత్యఫలానుభూతి తలఁపన్ భవదీయ సముజ్జ్వల స్మహా
న్నత్య వినాశహేతువనిరన్; దలపోయుము! నీవునన్ బర
ప్రత్యయనేయబుద్ధి వనరాదు గదమ్మ, యథార్థదర్శనీ!

---

# ఉత్తరహిందూస్థానభాషలు—దేశి*

కొరాడ రామకృష్ణయ్య గారు

ప్రస్తుతము హిందూదేశమున వ్యవహారములో నున్న భారతీయభాషలు మూడు తెగలై యున్నట్లు తెలియవచ్చుచున్నది. అం దుత్తరహిందూస్థానము నందలి భాషలు మరాటీ, ఉరియా మొదలగు వానితో గూడి ప్రాకృతభాషాజన్యము లగుటచే నార్య భాషాకుటుంబమునకు జెందినవిగా నెంచబడుచున్నవి. ఇక దక్షిణహిందూ దేశమునందలి భాషలన్నో, యివియు, వీనిలో గొన్ని భాషలయందు విశేషముగా సంస్కృత పదజాలము చేరియుండిన కారణమునను, సంస్కృత భాషా వాఙ్మయనిష్ణాతు లగువారే మొట్టమొదట నీభాషలను వ్యాకరించి లక్షణగ్రంథములను రచించినవా రగుట చేతను, సంస్కృతభాషాజన్యములే యనియు, ప్రాకృతాహ్వయము లనియు పలువురచే తలంపబడినను, ఆధునిక భాషాతత్త్వవేత్తల విమర్శనపూర్వకంబులగు పరిశీలనా ఫలితములనుబట్టి చూడగా నీభాష లార్యకుటుంబమునకు జెందినవి కావనియు, నొక ప్రత్యేకకుటుంబముగ నెంచదగి యున్నవనియు దెలియవచ్చుచుండుటె కాక వీని కార్యభాషాకుటుంబముతో కంటె సిథియన్ కుటుంబమునకు జెందిన భాషలతో నెక్కుడు సంబంధ మున్నట్లును దెలియుచున్నది. ఈ దక్షిణదేశభాషలను ద్రావిడ భాషలని చెప్పుచున్నారు ఇవి కాక హిందుదేశ మధ్య భాగమున వ్యవహరింపబడు ననాగరకజాతుల భాషలు మఱికొన్ని గలవు. అవి ముండాశాఖకు జెందినవిగా దెలుపబడుచున్నవి.

ద్రావిడభాష లనబడు దక్షిణదేశభాషలు సంస్కృతభాషాజన్యములు కావని తలంచుట కాధార మేర్పడిన పిదప ఉత్తరహిందూస్థాన మందలి ప్రాకృతాదిభాషలు ప్రాచీనార్యభాషనుండి బయలుదేరుటకును, ఈప్రాకృతములనుండి యాధునికభాషలు బయలుదేరుటకును గల కారణము అంతకు పూర్వమునుండియు నీదేశమున వ్యవహారములో నుండిన దేశీయభాషలతోడి సంసర్గమే యయియుండునా, లేక ఆర్యభాషయె కాలక్రమమున నిన్ని విధములగు ప్రాకృతములక్రింద మాఱినదా యను విషయ మొకటి విమర్శనీయం బగుచున్నది. ప్రాచీనార్యభాష ప్రాకృతభాషలుగా మారుటకు కాలక్రమమున నొకభాషలో స్వతస్సిద్ధముగా బయలుదేరు మార్పులే కారణమని చెప్పుట కవకాశము కనబడదు. ఏల యనగా, నార్యజనసంఘ మీ దేశమునకు వచ్చుసరికీ దేశము నిర్జనంబగు శూన్యదేశముగా నుండెనని తలంప దగదు. ఈ దేశ మార్యులచే దస్యులు, నిషాదులు, మ్లేచ్ఛులు నని పేర్కొనబడిన యనాగరకులగు ననార్యజాతులకు నివాసభూమియై యుండె ననుట నిర్వివాదాంశము. వీ రచ్చటచ్చట గ్రామము లేర్పఱచుకొని, రాజ్యములను స్థాపించికొని తమభూముల నాక్రమించుకొన వచ్చుచుండిన యార్యులతో పోరుచు, వారి యజ్ఞయాగాదికర్మను ధ్వంసముచేయుచు ననేకవిధముల బాధింప జొచ్చిరి. కాని యార్యులు బలవంతు లగుటచే వారితో ననేకములగు యుద్ధములు సల్పి, యీ యనార్యులను వారి సుక్షేత్రములనుండి వెడలగొట్టి వాని నాక్రమించుకొనుచు, వారిని క్రమక్రమముగా తూర్పు దక్షిణభాగముల నరణ్యప్రదేశములకు తరుముచు వచ్చిరి. ఇది కొన్ని శతాబ్దముల కాలము పట్టియుండును. ఈకాలమునం దనవరతము యుద్ధములే జరుగుచుండెనని తలంప దగదు. ఆర్యు లీయాదిమనివాసులకంటె నాగరకులును, సంపూర్ణమైన భాష కలవారు నగుటచే దమకంటె నధికసంఖ్యాకులై యుండిన యీ యనార్యులను దమ కధీనులుగా జేసికొని వారితో గలసి యుండుటయు సంభవించెను. అప్పుడు వారిపై తమయధికారమునే గాక భాషాప్రభావమును గూడ నెఱపిరి. ఇట్లన్యోన్యసంపర్కము గలిగిన సందర్భమున నీ యనార్యజనులు నాగరకులగు నార్యులభాష నభ్యసింప యత్నించియుందురు. వీ రీ నూతనభాషను శిశు

* ఈ వ్యాసము ౩౧-౧-౧౯౩౫ నాడు మా కార్యాలయమును జేరినది.—సంపాదకుడు: భారతి.

వులు తమ మాతృభాష నభ్యసించు రీతినే యభ్యసించిరి. కఠినములైన ధ్వనులను తమకు సులభమైన రీతిని మృదువుగా జేసికొని సులభమైన రీతిని పలుకజొచ్చిరి. భాషావైఖరి తమకు క్రొత్తగా నుండుటచే తమ కనువైన రీతిని తమ యుచ్చారణ పరిపాటి ననుసరించి యాయా ధ్వనులను, పదములను నుచ్చరింప జొచ్చిరి. ఈకారణముచే గొంతకాలమున కార్యభాషా ధ్వనులయందును, పదస్వరూపమునందును విశేషములగు మార్పు లేర్పడినవి. ఈ రీతిగా ప్రాచీన ప్రాకృతభాష వైదికయుగమునసే యేర్పడినది. తరువాత పాళీభాషయ జనుల యుచ్చారణరీతులయందలి యాయా దేశభేదమును బట్టి మాగధి, శౌరసేని, మహారాష్ట్రి మొదలగు ప్రాకృతభేదము లేర్పడినవి. ఇట్లార్యభాష దేశీయజనుల నోళ్లలో బడి నలిగి, మారురూపు జెంది వేరుభాషలుగా నేర్పడినను, ఈ జనులతోడను, వారి భాషలతోడను గలిగిన సంపర్కముచే నార్యభాషయు గొంత మార్పు చెందకపోలేదు. ప్రాచీన ప్రాకృతభాషకును లేదా పాళీభాషకును, సంస్కృతమునకును గల భేదములు ముఖ్యముగా స్వరములకు సంబంధించినవే(Phonology). వాక్యసంవిధానము, విభక్తిప్రత్యయములు మొదలగువానిలో నీపాళీభాషకును సంస్కృతభాషకును విశేషము వ్యత్యాస మగపడదు. అచ్చులలో గొంచెము మార్పు కలిగినను, హల్లులలో విశేషము మార్పు లేదు. సంస్కృతమున గల హల్లు లన్నియు పాళీయందును గలవు. కాని తరువాతి ప్రాకృతభాషలలో అజ్మధ్యస్థ మగు హల్లు లన్నియు జారిపోయి వాని స్థానమున 'అ'కారములు వచ్చినవి. అనగా భాష జనసామాన్యమున బాగుగా వ్యాప్తి జెందినకొలది ఉచ్చారణ సౌలభ్యమునకై హల్లులు జారవిడువబడి యుండును విభక్తిరూపములలోను, క్రియారూపములలోను సంస్కృతమునకు, పాళీకి నంత విశేషవ్యత్యాస మేర్పడలేదు. కాని తరువాతి భాషలలో మార్పు లధికముగా వచ్చినవి. ఉదాహరణముగా నొక వాక్యమును గ్రహింతము.

"అతీతే బారాణసియం బ్రహ్మదత్తే రజ్జంకారితే బోధిసత్తో తస్స అమచ్చ రతనం అహోసి॥"

ఇందు 'వారాణస్యాం' అనుదానిలో 'వ'కారమునకు బకారము; సంయుక్తాక్షరమగు 'స్యాం' అనునది 'సియం' అని రెండక్షరములుగా నుచ్చారణసౌలభ్యము కొరకు విడగొట్ట బడినది. ఇట్లు సంయుక్తాక్షరముల మధ్య నొక యచ్చు చేరి యొక యక్షరము రెండక్షరములుగా జేయబడినచో దానిని స్వరభక్తి(Anaptyxis) అని యందురు. (cf. Principles of Dravidian Syllabation). ద్రావిడభాషలలో పదమధ్యమున ద్విత్వాక్షరము తప్ప వేరే సంయుక్తాక్షర ముండదు. కావుననే సంయుక్తాక్షరములు గల సంస్కృతపదము లీభాషలలో తద్భవములుగా చేరునపుడా సంయుక్తాక్షరముల మధ్య యచ్చులు బయలుదేరి యవి రెండక్షరములుగా మారుచుండును.—సం. ఇంద్రం;త—ఇందిరం; కావ్యం=కావ్వియం; సూర్య=సూరియన్; చంద్ర=సందిరన్; దివ్యం=తివియం; రహస్యం=రకసియం; అహల్యా=అహలియ; గర్వ=కరువ.

రత్నం = రతనం – ఈరూప మీవాక్యములోనే ప్రాకృతరూపముగా నున్నది. ఇట్టిది ద్రావిడభాషల మాటలాడు జనులకు సహజమైన యుచ్చారణరీతిగా గనబడుచున్నది.

రాజ్యపదము పైవాక్యములో 'రజ్జం' అయినది. ద్విత్వాక్షరమునకు పూర్వము దీర్ఘము హ్రస్వ మగుట లేదా మొదటి దీర్ఘాక్షరము హ్రస్వ మైనపుడు దాని తరువాతి యక్షరము ద్విత్వమును జెందుటయు ద్రావిడభాషలలో పరిపాటిగనె యున్నది. యకారము తద్భవరూపములలో 'జ'కార మగుటయు గలదు. కార్యము=కర్జము; ఆ + అది=అయ్యది; మూవురు=మువ్వురు; ఈయు=ఇచ్చు; కాపు=కప్పు: ఇదియు ద్రావిడభాషా సంప్రదాయానుసారముగనె యున్న ట్లగపడుచున్నది.

సత్వపదము సత్తయినది. బోధిసత్వ=బోధిసత్త.

అమాత్య=అమచ్చ. తస్య=తస్స.

ద్రావిడభాషలలో సంస్కృతపదములలోని సంయుక్తాక్షరములను విడగొట్టి రెండక్షరములు(Syllables)

గా జేయనపుడు అందలి పూర్వాక్షరమును ద్విత్వముచేసి పలుకుటయు గలదు. పదమధ్యమున ద్విత్వాక్షరములు గాని సంయుక్తాక్షరములను వీరు పలుకలేకుండుటయే దీనికి గారణ మయియుండును.

పఠమం-ఇది సం. 'ప్రథమం' అనుదానికి ప్రాకృతరూపము. ఇచ్చట రేఫ థకార సంయోగము 'ఠ'కారోత్పత్తికి గారణమైనది. ప్రాచీనార్యభాషలలో మూర్ధన్యాక్షరములు లేవనియు, నవి సంస్కృతభాషలో నార్యులు హిందూదేశమునకు వచ్చిన, పిదప బయలుదేరిన వనియు, నవి ప్రాచీనార్యపదములలో రేఫదంత్యాక్షర సంయోగము కలిగినపుడే పొడమచు వచ్చిన వనియు పాశ్చాత్య శబ్దశాస్త్రవేత్త యగు "ఫార్చునెటోవ్" (Fortunatov) అనునాయన కనిపెట్టినాడు. కావున నే యామార్పు ఆయని పేరుతో నొక సూత్రముగా 'Fortunatov' law" అని ప్రసిద్ధి జెందినది కానియీ సూత్రమున కతివ్యాప్తిదోషము పట్టుటచే నిది సరి కాదనియు, నీ మూర్ధన్యాక్షరములు సంస్కృతభాషలో గనబడుటకు ప్రాకృతభాషలతోడి సంసర్గమే కారణ మనియు దలంపబడుచున్నది. ద్రావిడభాషలలో మూర్ధన్యాక్షరములతో గూడిన యనేకధాతువులు దంత్యాక్షరములతో గూడిన వానికంటె cf. ఓడు_ఓదు; కాడు కాదు; కుడి-కుది; కట్టు-కత్తు; మునై-మును; కోల్-కోల్; కొట్టు-కొత్తు - భిన్నార్థసూచకము లగుటచే నీయక్షరములు ద్రావిడభాషలకు సహజములే గాని తెచ్చి పెట్టుకొనినవి కావు. ఇంతేగాక గ్రీకు, లాటిన్, గాథిక, జెండ వెస్టా మొదలగు సింధునదికి పశ్చిమమున నున్న యార్యభాషలలో నీధ్వనులు కనబడక పోవుటచేతను, కఠినాక్షరములను పలుకలేని దక్షిణ హిందూదేశ జనుల భాషలలో నీధ్వనులు కనబడుచుండుటచేతను సంస్కృతమే యీభాషలనుండి యీధ్వనులను గ్రహించియుండును గాని వేరువిధమున గాదని కాల్డువేల్ మొదలగు వారు నిరూపించి యున్నారు. కావున 'ప్రథమం' అను సంస్కృతపదము అనార్యజనుల యుచ్చారణలో (వీరు మహాప్రాణముల_ఒత్తక్షరముల-యుచ్చారణ కలవాటు పడినవారు కాకుండుటచే) 'పడమం' అని కాగా, మూలరూపములో మహాప్రాణ ముండుటంజేసి మఱికొంత కాలమునకు, మఱికొంద ఱీపదమధ్యమున మహాప్రాణము నే చొనిపి యుందురు. తెలుగులో నిట్టి పదము లింకను గలవు. సం. పృథివీశబ్దము ప్రాకృతములో 'పృథవీ' యయి, తద్భవపదముగా దెనుగుభాషలోనికి వచ్చునప్పటికి 'పుడమి' యను రూపమును దాల్చినది. దీనినిబట్టి కాలమున నార్యజనసంఘమునకును ద్రావిడజనసంఘమునకును గలిగిన సమ్మేళన మెట్టిదో మన మూహింపవచ్చును.

పాళీభాషలో సంస్కృతములో నున్న ఋ, ఌ, ఐ, ఔలు జారవిడువ బడినవి. ఋ, ఌలు అ, ఇ, ఉలు గా మాఱినవి: గృహ=గహ; ఋణ=ఇణ; ఋషభ=ఇసభ; ఋత్విజ=ఇరిత్విజ. ద్రావిడభాషలను మాటలాడు జనుల కీధ్వనులు పరిచితములు గాకుండుటే గాక, 'ఋత్విజ' శబ్దము 'ఇరిత్విజ' అను రూపమును జెందుట. సం. రక్త-త. ఇరత్తం; రాజన్=అరశన్. etc. ఈ మొదలగు తద్భవరూపములను బోలియుండుటచే పాళీలో నీరూప మేర్పడుటకు ద్రావిడజనుల యుచ్చారణసంప్రదాయమే కారణ మేమో యని తలంపదగియున్నది. ఐ, ఔలు ద్రావిడభాషలలో 'అవు' అని ద్వ్యక్షరములుగా బలుకబడుచుండుటచే నీద్రావిడవర్ణ సమామ్నాయమున నివి సంస్కృతభాషా సంసర్గము మూలమున జేర్పబడిన వని తలంపబడుచున్నది. ఇక పదమధ్యమందలి పరుషములు సరళము లగుట గూడ ద్రావిడభాషా సంప్రదాయానుసారమే యై యున్నది. అఱవమున పదమధ్యమున ద్విత్వాక్షరము లైతే తప్ప సరళములే గాని పరుషము లుండవు.

సం. ఋత-ప్రా. ఋద cf. తె. రొద.

సం. వ్యాపృత-ప్రా. వ్యావట. cf. తె. వ్యావర్తి

సం. ఉత—పా. ఉద. } cf. తె. అన్నదమ్ములు;
సం. పృషత—ప్రా. పసద. } మూరగాయలు.

ఇక నాధునికభాషల విషయము జూచినను అందు అనార్యసంప్రదాయములు, ముఖ్యముగా ద్రావిడభాషా సంప్రదాయములవలెనే కనబడుచున్నవి. 1. ఈ భాషలలో గూడ ఋ, ఌలు లేవు. 2. ఆర్యభాషలలో లేని హ్రస్వ 'ఎ'కార 'ఒ'కారములు కలవు. ఇవి

ద్రావిడభాషలలో నుండుటచేతను, సంస్కృతమున లేకుండి యీ తరువాతిభాషలలో గనబడుటచేతను నిది యు ద్రావిడభాషా సంప్రదాయమే యనవలసియున్న ది. 3. సంయుక్తాక్షరములకు బూర్వమున గల ఇ, ఉలు ఏ, ఓలుగా మారుట-సం. సిందూర—ప్రా. సిందూరో; మరాటీ; శేందూర. సం. పుస్తకం—ప్రా. పొత్థ; అం. హిందీ-పోథా; మరా; పోథీ; cf. తెలుగు-పొత్తము'

సం. తుండం-ప్రా. తుండ; తోండం; మరా' తోండ; cf. తె. తొండము. సం. తాంబూల—మరా. తాంబోళీ; cf. తాంబోలము.

4. పరుషములు సరళము లగుట—సం. సకల—మరా. సగళ. సం. బకః-మరా. బగళా. సం. లోక—మరా. లోగ్. cf. ఉలుగం (from ఉలో.)

సం. వాపీ—మరా. బావడి. cf. తె. బావి.

5. లకారము నకార మగుట.

సం. నింబ—మరా. లింబ.

సం. లాంగల—మరా., గుజ నాంగర cf ములు గోరింట-మునిగోరింట; తొల్ పది-తొమ్బది, etc.

6. మ కారమనునాసిక వకార మగుట—

సం. భ్రమర—ప్రా. భ్రవర (భ్రవఁర).

సం. నామ—మరా. నాంవ.

సం. గ్రామ—మరా. గాంవ. cf. తె. మామ-మావ; కామయ్య, కావఁయ్య, etc.

7. సంయుక్తాక్షరము లేకాక్షరములుగా విడ గొట్టబడుట—

సం. వంధ్యా—సింధి-వంఝు. cf. తె. వంజ.

సం. విద్యుత్—మరా. వీజ.

సం. వర్ష—మరా. వరీస. cf. తె. శ్రీ-సిరి.

సం. శ్లోక—మరా. శిలోక.

ద్రావిడభాషలలో తద్భవపదము లిట్లే విశ్లేష మును బొందును.

8. ఈభాషలలో నార్యభాషలలో వలె నొక వా క్యమునందలి పదముల సంబంధమును సూచించుటకు విభక్తి ప్రత్యయ ముపయోగింపబడుటకు బదులుగా ప్రత్యేక పదములే యుపయోగింప బడుచున్నవి. ద్రావిడభాష లలో వలెనే యివి కొన్నిభాషలలో ప్రత్యేకపద ములుగా గాక పదభాగములుగను, మఱికొన్నిటిలో నంగమునకు జేర్పబడిన స్వతంత్రపదములుగను గానవచ్చు చున్నవి.

9. ద్రావిడభాషలలో వలెనే యీభాషలలో ద్వివచనము లేదు.

10. కొన్నిభాషలలో మూడులింగము లున్నను, తూర్పుహిందీ, బెంగాలీలలో రెండు—అనగా స్త్రీపుం లింగములు మాత్రమే కలవు. ఇది ద్రావిడభాషలలోని మహ దమహ ద్భేదముతో సరిపోవుచున్నది.

11. బహువచనము 'సకల', 'లోక' మొదలగు పదముల నేకవచనరూపమునకు జేర్చుటవలన నేర్పడు చున్నది బెంగాలీలో కుక్కురసకల=కుక్కలు; బీహా రీలో ఛోకరాలోక=పిల్లలు; మరాటీలో దోఘేజన; సర్వజన, etc.

ద్రావిడభాషలలోని ప్రాచీనస్థితి వీనియందు బొడసూపుచున్న దనవచ్చును. 'కళ్' అనుదాని యర్థ మిప్పుడు తెలియకున్నను అది యొక కాలమున బహువ చనమును సూచించు ప్రత్యేకపదమై యుండు ననుట నిశ్చయము. 'రు' అనునది 'అవర్' అను పదముయొక్క యవశిష్టభాగము. సంస్కృతభాషలో నాయా విభక్తుల కాయా బహువచనప్రత్యయము లుండుటయే గాని ప్రత్యేకముగా బహువచనప్రత్యయ మనునది లేకుండుట చేతను, ద్రావిడభాషలలో ప్రాచీనకాలమున బ్రబలి యున్న సంప్రదాయమును బట్టియే యీభాషలలో వేరు పదములను జేర్చి బహువచనరూపములను జేయు నలవాటు కలిగియుండు నని తలంపవచ్చును.

12. కొన్ని భాషలలో నిలిచియున్న కొన్ని ప్రాచీనప్రత్యయములు, క్రొత్తగా బయలుదేరిన ప్రత్యయ రూప పదములును ద్రావిడభాషలలో వలెనే వష్ఠ్యా దిపదమునకు జేర్పబడుచున్నవి. ఇదియే ద్వితీయాది విభక్తి ప్రత్యయములు జేర్పబడు నంగము (oblique base).

ప్రాచీనప్రాకృతమునకు అపభ్రంశమునకు జెందిన పదములనుండి యేర్పడిన వని చెప్పుటకు వీలులేని విభక్తిప్రత్యయములలో ముఖ్యమైనది యొకటి 'క' యను చతుర్థీ ప్రత్యయము కలదు. అనేకములగు నాధునికభాషలలో గనబడుచున్న యీ 'క' ప్రత్యయము ద్రావిడభాషలలో చతుర్థీ లేక షష్ఠీ ప్రత్యయముగా నున్న 'కు' నుండి వచ్చిన దని కాల్డువేల్ (Caldwell) పండితుడు చెప్పియున్నాడు. కాని భండార్కరు పండితు డిది యసంగత మనియు, తక్కిన విభక్తిప్రత్యయము లన్నియు ప్రాకృతరూపములనుండియే వచ్చినట్లుగా గనబడుచుండుటచే నీ చతుర్థీ విభక్తి ప్రత్యయ మగు నొక్క 'క' యనునది మాత్రమే ద్రావిడభాషలనుండి యెరువు తెచ్చుకొనబడిన దనుట తగ దనియు, నిది బహుశః అపభ్రంశపదమగు 'కేహిం' అనుదానినుండి యేర్పడియుండు ననియు దెలుపుచున్నాడు. గుణే పండితుడు గూడ నిట్లే తలంచుచున్నాడు. ఈ యాధునిక భాషలు, అందు ముఖ్యముగా మరాటీ మొదలగునవి, ద్రావిడ భాషలనుండికొంత పదజాలమును సంగ్రహించి యుండును గాని వ్యాకరణవిషయమున నట్టి సంగ్రహణము సంభవించియుండ దనియు, అందులో విభక్తు లన్నిటిలో నిది యొక్కటియే యెరువు తెచ్చికోబడిన దనుట సమంజసము కా దనియు, కొందరు దీనిని 'కృతే' అను పదము నుండి వచ్చిన దని తలంచుచున్నా రనియు, మొత్తము మీద భండార్కరు చెప్పినట్లుగా 'కేహిం'నుండి వచ్చిన దని చెప్పుటయే యుక్తముగా నున్నదని యభిప్రాయపడినాడు. ఏభాషకు సంబంధించిన వ్యాకరణవిశేషముల నా భాషాసంప్రదాయములను బట్టియు, తత్సన్నిహిత భాషలను బట్టియు సాధించుచు, వానికి దగిన రీతి నుపపత్తులను గల్పింపవలయు ననుట యుక్తపద్ధతియే. కాని యీ యాధునికోత్తరహిందూస్థాన భాషలపై ద్రావిడ భాషా సంప్రదాయముల ప్రభావము (influence) కొంతవరకైన నుండె నని చెప్పక వీలు లేకుండుటచే నా 'క' ప్రత్యయమునకు ద్రావిడభాషలయందలి 'కు'ప్రత్యయముతో గల సంబంధమును గూర్చి కాల్డువేల్ పండితుని యభిప్రాయమే సరి యగు నేమో యని సందేహము కలుగక మానదు. ఇంతకు ద్రావిడభాషలలో నైన నీ 'కు'ప్రత్యయముయొక్క పూర్వచరిత్రము - వ్యుత్పత్తి తెలియవచ్చుట లేదు. ఏపదముయొక్క యవశిష్టభాగమో దేనినుండి యెట్లేర్పడినదో, యీభాషలలో నేదైన పదమునుండి యేర్పడినదో, లేక మఱి యే యితర భాషలనుండి యైన నీ ద్రావిడభాషలలో సంక్రమించినదో నిశ్చయముగా జెప్పుటకు వీలు లేకున్నది. ఈ ప్రత్యయమె 'సిథియన్' కుటుంబమునకు జెందిన భాషలు గొన్నింటిలో గూడ గానవచ్చుటం జేసియు, ద్రావిడ భాషల కార్యభాషలతో కంటె సిథియన్ కుటుంబమునకు జెందిన భాషలతో వ్యాకరణవిషయములందు గూడ నెక్కుడు సంబంధ మున్నట్లు గనబడుటం జేసియు నీ 'కు' ప్రత్యయ మతిప్రాచీనంబగు ప్రత్యయ మనియు, నార్యభాషలలో గూడ దీనిపూర్వచరిత్ర నన్వేషించుట కడు దుర్లభం బగుచుండుటచేతను. ఒకవేళ నిది యనార్యభాషాసంసర్గమువలననే భాషలలో సంక్రమించియుండు ననియు నూహించుటకు దగిన యవకాశము లేకపోలేదు.

మరాటీభాషలోని షష్ఠీవిభక్తి నిజమైన విభక్తియే కాదు. 'చ'అను నొకప్రత్యయమును నామమునకు జేర్చుటచే నది విశేషణ మగుచున్నది. తరువాతి నామముయొక్క లింగవచనవిభక్తు లన్నిటితో నీరూపమే యన్వయించుచున్నది. తెలుగులో నౌపవిభక్తికప్రత్యయముగా జెప్పబడుచుండిన 'ఇ'ప్రత్యయము నిట్టిదే. ఇది 'ఇన్'గా మారిన 'ఇల్' పదముయొక్క యవశిష్టభాగము. ఇదియే కన్నడమున 'ఇన్'అను రూపమునను, తమిళమున 'ఇన్' అను రూపమునను ఔపవిభక్తికప్రత్యయమగు 'ఇ' అనుదాని ధర్మమునే నెరవేర్చుచున్నది. ఊరు, కాలు అను పదములకు 'ఇ' చేర్చుటచే 'ఊరి', 'కాలి' అని అవి విశేషణము లగుచున్నవి. ఈ 'ఊరి', 'కాలి' అనువానినే ద్వితీయాది విభక్తిప్రత్యయములు చేర్పబడు అంగముగా (oblique base) గ్రహించుచున్నాము. తమిళమున 'మరత్తు' అని 'అత్తు'అను నొకపదము చెప్పబడిన దానికే ఈ'ఇన్'అనుదానిని చెప్పిఅంగముగా గ్రహించుచున్నారు. ఈ ఇన్నంతముపై విభక్తిప్రత్యయములు చేర్పబడుచున్నవి: మరత్తిన్ అనునది షష్ఠి, మర

త్తినాల్, మరత్తినోడు, మరత్తినదు, మరత్తిక్కాళ్'. 'ఇక్' అనునది షష్ఠి లేక విశేషణద్యోతక ప్రత్యయ మని మఱువబడుటచే షష్ఠీవిభక్తికి ఇన్నంతముపై మఱి యొక్క ప్రత్యయము చేర్పబడుచున్నది. మరాఠీభాష లో గూడ సంస్కృతాద్యార్యభాషలలోని పద్ధతికి విరుద్ధమగు నీపద్ధతియె యవలంబింపబడుటచే నిది ద్రావిడ భాషా సంసర్గ ప్రభావ మనియే నిశ్చయింపవచ్చును.

13. ఉరియా బెంగాలీలలో తప్ప తక్కిన భాషలలో విశేషణములకు విశేష్యములబోలె లింగభేదము సూచింపబడుచున్నది. కాని యీభాషలలో మాత్రము లింగవిషయమునసే గాక, విభక్తివచనముల విషయమున గూడ విశేషణము లేవిధమైన మార్పులును బొందవు. ద్రావిడభాషలలోగూడ విశేషణములకు లింగవచనవిభక్తులు లేవు. ఉత్తరహిందూస్థానభాషలలో నీ పైరెండు భాషలలోమాత్రమే యట్లుండుటచే వీనికి ద్రావిడభాషలతోడి సంసర్గ మెక్కువ యగుటచే నట్లయ్యె ననియు, తక్కినవి మూలమును సంస్కృత ప్రాకృత భాషా సంప్రదాయమునే యనుసరించిన వనియు తెలియుచున్నది. మఱియు విశేషణములలో తరతమభావము (comparison) అధిక, బహోత, సబసె అను ప్రత్యేక పదముల సహాయముచే వ్యక్తము చేయబడుచున్నదిగాని 'ఈయస్', 'ఇష్ఠ' ప్రత్యయములచే గాదు. ద్రావిడ భాషలలోగూడ 'మిక్కిలి', 'చాలా' ఇత్యాది పదముల మూలముగా జెప్పవలెనదే గాని సంస్కృతమందువలె ప్రియ, ప్రేయస్, ప్రేష్ఠ అనునట్లు ఒక్క విశేషణపద మునుండియే యేర్పడిన రూపములు లేవు.

14. క్రియాపదప్రక్రియ విషయమును జూడగా ఒక్క వర్తమానార్థకరూపమే ప్రాచీనభాషలనుండి యేర్పడినది; ఈభాషలలో నుపయోగింపబడుచున్నది. కాని సామాన్యముగా ద్రావిడభాషలలోవలె ధాతుజన్య విశేషణములనుండి క్రియాపదములను నిష్పత్తిచేయు నలవాటు ఈభాషలన్నిటిలోను ప్రబలియున్నది. ప్రాకృత భాషలలోనే యంతరించిన వికరణభేదములు ఈభాషలలో బొత్తిగా కనబడవు. ద్రావిడభాషలలో వలె నొక్కటె వికరణము(conjugation)అని చెప్పవచ్చును.

ప్రాచీన వర్తమానార్థక రూపములు పలుభాషలలో గనబడుచున్నను ఇవిగాక క్రియావిశేషణములకు లింగపురుషద్యోతక ప్రత్యయములను జేర్చుటచే నేర్పడిన రూపములు మఱికొన్నియు గలవు. ఈ రూపములు బెంగాలి, హిందీ మొదలగు వానిలో తద్ధర్మార్థకమును (habitual present) సూచించునవైయుండ, మరాఠీలో ప్రాచీనవర్తమానార్థకరూపములు తద్ధర్మార్థబోధకం బగుచున్నది. భూతభవిష్యత్ క్రియారూపములు గూడ క్రియావిశేషణములనుండి యేర్పడినవి. ఇట్లీభాషలలో సంస్కృతప్రాకృత రూపములనుండి యేర్పడిన క్రియారూపము లుండియుండగా క్రియాజన్యవిశేషణములను లింగపురుషద్యోతక ప్రత్యయాదులను జేర్చుటచే వేఱుగా క్రియారూపములను నిష్పత్తిచేయుట ద్రావిడభాషాసాంగత్యమువలన గలిగిన ఫలమే యని నిశ్చయించుట కవకాశ మేర్పడుచున్నది. మరియొక విశేషము కలదు. మరాఠీభాషలో భవిష్యదర్థసూచకములు 'సల' యను ప్రత్యయములుకలవు. ఇవి ప్రాచీనవర్తమానార్థక రూపములకు జేర్పబడుటచే నేర్పడిన రూపములు;భవిష్యదర్థద్యోతకము లగుచున్నవి. దీనినిబట్టి ప్రాచీనవర్తమానార్థరూపము భవిష్యదర్థమును గూడ సూచించినదై యుండ, తరువాతి కాలమున నొక రూపమును రెండర్థములయందు వాడుకొనుటవలన గలుగు చిక్కును దొలగించుటకు గానెలయు, భవిష్యదర్థసూచకములుగ వేరు ప్రత్యయములు చేర్పబడినవి. ద్రావిడభాషలలోగూడ ప్రాచీనకాలమున రెండు కాలములను, మూడు కాలములనుగూడ సూచించు రూపములుండినవి. భవిష్యద్వర్తమానములకు విభేద మంతగా నుండెడిదికాదు. కాలక్రమమున నీభాషలలో ప్రత్యేకము వర్తమానకాలసూచకములు, భవిష్యత్కాల సూచకములునగు రూపములు బయలుదేరినవి. ప్రాకృతభాషలు, తజ్జన్యములను మరాఠీ మొదలును ఉత్తరహిందూస్థానభాషలును ఆర్యభాషా కుటుంబము నకు జెందిన వగుటచేతను, సంస్కృతాదిభాషలలో వర్తమానాదిరూపములు ప్రత్యేకముగా నుండుటచేతను ఒకరూపమే రెండుకాలములను సూచించు పద్ధతి యార్యభాషలనుండి వచ్చినదని చెప్పుట కవకాశము లేకుండు

టచే, నిది యనార్యభాషాసంసర్గఫలమని చెప్పకపోలు లేదు.

ఈపైని జూపిన విషయములనుబట్టి యార్యభాషలలో గొన్ని ద్రావిడభాషాసంప్రదాయములు-లేదా అనార్యభాషాసంప్రదాయములు వ్యాకరణవిషయము లందే గానవచ్చుచున్నట్లు స్పష్టమగుచున్నది. సామాన్యముగా నొకభాష కితరభాషలతోడి సంబంధముకలిగినపుడది యాభాషలనుండి కొంత నూతన పదజాలమును సంగ్రహించిన సంగ్రహించునుగాని తన వ్యాకరణపద్ధతిని విదలి యన్యభాషావ్యాకరణమార్గముల ననుసరించుట సంభవింపదని భాషాతత్త్వవేత్తల దృఢాభిప్రాయమై యున్నది. ఆపదములవిషయమునగూడ నొకభాష మాటలాడు జనులు తమ కితఃపరము పరిచయము లేని నూతనవస్తువులను, భావములను సూచించుపదములనుమాత్రమే సంగ్రహింప దొరకొందురుగాని, యితరభాషలలోని పదజాలమునంతను దెచ్చి తమభాషలో గలిసికొనుట కొప్పుకొనరు. కావుననే భాషలసాజాత్యమును నిర్ణయించుపట్ల నాయాభాషలలో సామాన్యవ్యవహారమునను, నిత్యవ్యవహారమున నత్యావశ్యకముగ బ్రయోగింపబడుచుండు సామాన్యపదములలో సామ్యముగలదా లేదా యనియు, నాయాపదములకు మూలములగు మూలధాతువులు, లేదా మూలరూపములలో (roots or elemental forms) సామ్యము కలదా లేదాయనియు పరిశీలింతురు. ఇట్టి పదజాలమును సామాన్యముగా నొకభాష మరియొక భాషనుండి యెరువు తెచ్చికొనుట సంభవింపదు గావున వీనియందలి సామ్యమునుబట్టి భాషలసాజాత్యము నిర్ణయింపబడును. ఇట్లు పదములవిషయమున భాషలలో నిచ్చి పుచ్చుకొను నాచారము కొంతవరకు ప్రబలముగా నున్నను, వ్యాకరణవిషయమున మాత్ర మట్టిది లేదనియే నమ్మబడుచున్నది. అయితే పై యార్యభాషలలో ననార్య సంప్రదాయములకు సంబంధించిన వ్యాకరణాంశములు గనబడుచున్న వేయనుశంక బయలుదేరకమానదు. పైవిషయము అల్పసంబంధముమాత్రము గలిగిన భిన్నజాతీయములగు భాషలనుగూర్చి చెప్పబడినదని తలంపదగియున్నది. ప్రస్తుతమాంగ్లభాషకును దేశీయభాషలకును గల సంబంధ మట్టిదియ. ఇంతకుపూర్వము మహమ్మదీయుల రాజ్యపరిపాలన కాలమునుండియు ఉర్దు, పరిషియన్ మొదలగు భాషలకును ద్రావిడభాషలకును గలసంబంధము నట్టిదే. కావుననే యాకాలమున నీదేశభాషలలో ననేకములగు రాజకీయపదములును (తహసీల్ దార్, గుమాస్తా, దఫేదార్, రోజు ఈమొదలగునవియు), ఇటీవలికాలమున నింగ్లీషునుండి రాజకీయవ్యావహారికపదములును (మునసబు, రోడ్డు, లాంతర, మొదలగునవియు)అనేకము లీభాషలలోనికి వచ్చిచేరినవి. కాని ఆయాభాషలవ్యాకరణ సంప్రదాయము లేమియు నీభాషలలో చేరియుండలేదు. ఇంతకాలమునుండి మహమ్మదీయులు దక్షిణదేశీయులతో గలసి యాయాప్రాంతముల నాయాదేశభాషలనే తాము నేర్చికొని వ్యవహరించుచు నచ్చటి జనులతో గలసి నివసించుచున్నను, వారిస్వీయభాషాసంప్రదాయము లీదేశభాషలలోనికిగాని, ఈదేశభాషా సంప్రదాయములు వారి మాతృభాషలోనికిగాని సంక్రమించినట్లు కనబడదు. కావున ప్రాకృతభాష లేర్పడు కాలమున నార్యభాషను వ్యవహరించినజనులకును నచ్చటి యనార్యజనులకును గలిగిన సంబంధవిశేషమే యార్యకుటుంబమునకు జెందిన యీప్రాకృతభాషలలో ననార్యసంప్రదాయములు చొచ్చుటకు గల హేతువును నిరూపింపగలిగియుండునని తలంపదగి యున్నది. దీనినిబట్టి ప్రాకృతభాషల యుత్పత్తి హేతువేగాక ద్రావిడభాషల ప్రత్యేకతయు నిర్ధారితంబగుచున్నది. ఇట్లీదేశమున నార్యానార్యజనులకు గలిగిన సంబంధస్వరూపము నందలి భేదమునుబట్టియే యీదేశమున నాయాప్రాంతములందలి యాయాభాషా వాఙ్మయములస్థితిగతు లేర్పడి నట్లగపడుచున్నది.

ఆర్యభాషలలోని యనార్య సంప్రదాయము లిట్లు ద్రావిడభాషా సంప్రదాయములను బోలియుండుటచే, హేమచంద్రాది ప్రాకృత వ్యాకరణకర్తలు ఆర్యభాషలకు సంబంధింపనివిగా దెలిపిన దేశిపదజాలముకూడ కొంతవఱకు ద్రావిడభాషలకు జెందినదై యుండునని తలంపవచ్చును. ఇట్టి పదములనుగూర్చి కాల్డువెల్ పండితుడు విమర్శించుచు, నివి ద్రావిడభాషలకు సంబంధించిన పదములే యైనచో, నీయార్యభాషాపదజాల

ములో సామాన్య ద్రావిడధాతువులు, నిత్యకృత్యముల నుపయోగములో నుండెడు కొన్ని పదములు నీ మొదలగు నవికూడ నుండవలసినదే యనియు, నట్టి వానిని తాము గాంచ గలుగ లేదనియు జెప్పుచు నివి ద్రావిడభాషాపద ములయి యుండ వను నభిప్రాయమును తేల్చినాడు—

"If the non-Sanskritic element contained in the northern vocabularies had been Dravidian, we might also expect to find in their vocabularies a few primary Dravidian roots such as the words for head, foot, eye, etc., but I have not been able to discover any reliable analogy in words belonging to this class. Few, if any, traces of distinctly Dravidian elements are discernible in the North Indian Vernaculars."

ఈభాషలలోని వ్యాకరణవిషయములందే ద్రావిడ సంప్రదాయముల ప్రభావము కనబడుచున్నప్పుడు సామాన్య వ్యవహారమునందలి పదములును గొన్ని గాన వచ్చిన నాశ్చర్యము లేదు. అయితే యీపదము లార్యజను లనార్యజనులనుండి సంగ్రహించి, తమభాషలో నాయా యర్థములను దెలుపు పదములు లేక, తెచ్చిపెట్టుకొని వ్యవహరింప జొచ్చినారని తలంపదగదు. ఏలయన గా నార్యులీదేశమునకు వచ్చునప్పటికే నాగరకులై సంపూర్ణమైన భాష గలవారగుటచే తాము నిత్యవ్యవహారమున నుపయోగించుకొను పదములకొఱకై సంబంధమే సహింపని యనార్యజాతులనుండి గ్రహించిరనుట సమంజసముకాదు. ఒకవేళ వారు తమకు పరిచితములుగాని వస్తువులు, జంతువులు, చెట్లు మొదలగువానిని దెలుపుపదములను స్వీకరించిన స్వీకరింతురేగాని, తమకు పరిచితములగు వస్తువులను దెలుపుటకుగా తా మిదివరకు నిత్యము వాడుకొనుచున్న పదములను మాని యన్యభాషాపదములను గ్రహింపనొల్లరు. కావున నీభాషలలో నట్టిపదములు దొరకుట దుర్లభమై యుండవలసినదే. కాని హేమచంద్రుని దేశినామమాలలోని పదములలో గొన్ని యట్టి నిత్య కృత్యముల నుపయోగపడునవిగా నుండుటయు, నవి ద్రావిడభాషలకు సంబంధించినవిగా గనబడుచుండుటయును బట్టి విచారింపగా, నివి యార్యజనులచే సంగ్రహింపబడియుండవు గావున వారితో గలసి వారిభాషను నేర్చికొని వారితో సమ్మేళనమును బొందిన యనార్యజనుల మూలముగా నిత్యకృత్యముల వ్యవహారములో నుండు వారిస్వీయభాషలలోని పదములగూడ కొన్ని యీ యార్యభాషలలోని కెక్కియుండునని మనము తలంపదగియున్నది. ఇట్టి పదజాలముకూడ నాయా జనసంఘములకు గలిగిన సంబంధ స్వరూపమును తేటపరుప గలుగుచున్నదనుటకు సందియము లేదు. ప్రస్తుతము హేమచంద్రుడు దెలిపిన 'దేశి' పదములలో ద్రావిడభాషలకు సంబంధించిన వెంతవరకు గలవో పరిశీలింతము. దేశీనామమాల యను గ్రంథమున హేమచంద్రుడు తెలిపినపదము లాతని వ్యాకరణముచే సాధింపబడనివనియు, పూర్వపు కోశములలో దొరకనివియు, లక్షణార్థమును దెలుపునవి కావనియు, నట్టివానినె తా నిందు గ్రహించితిననియు దెలిపినాడు. ఇంతేగాక తరువాతిభాషలలో నింక ననేకపదములు చేరియున్నను, చిరకాలమునుండి ప్రాకృతభాషలో వ్యవహారములోనున్న పదములనుమాత్రమే తాని దేశి యను పదముచే దెలుపుచున్నట్లును చెప్పినాడు. అట్టి దేశిపదములలో గొన్నిటికిగల ద్రావిడ భాషా సంబంధ మీ క్రింద దెలుపబడుచున్నది. అందు మొదటి అకారాదిపదములలోనే నాలుగైదుపదములు కుటుంబసంబంధమును దెలుపు పదములు కలవు.

1. ప్రా. అప్పో=తండ్రి ఇది 'అప్ప' యనురూపమున సామాన్యముగా ద్రావిడభాష లన్నిటియందును గానవచ్చుచున్నది.

2. ప్రా. అమ్మా, అవ్వా=తల్లి, తల్లితల్లి. ఈయర్థమున నివి ద్రావిడభాషలలోను కలవు. అమ్మ శబ్దము తుళుభాషలో తప్ప తక్కినభాష లన్నిటిలోను గలదు. 'అవ్వ'-అమ=అమ్మమ్మ. (Kittel) చిక్కవ్వ, దొడ్డవ్వ ముత్తవ్వ etc. అని కన్నడభాషలో గలవు. తెలుగున భారతకాలములో 'అవ్వ' అను పదము అమ్మమ్మ (grandmother), ముసలమ్మ అను నర్థమున నేగాక

స్త్రీమాత్ర పరముగా పూజ్యురాలు అను నర్థమునఁగూడ వాడబడుచుండెడిది.

౩. ప్రా. అక్కా=అప్ప- వృద్ధభగినీ- (sister). "అంబార్థస్తు సంస్కృతసమః"-సంస్కృతములో 'నమ్మ' యను నర్థము కలదు.-కాని ద్రావిడభాషలలో ప్రాకృతమందువలెనే 'భగినీ' అప్ప యనియె దీని కర్థము.

౪. ప్రా.'అత్తా'="పితృష్వసా-శ్వశురభార్యా". ద్రావిడభాషలలో, ముఖ్యముగ దెలుగున నిది యీయర్థమె కలిగియున్నది.

౫. ప్రా. అద్దాఓ=దర్పణం—తె. అద్దము.

౬. ప్రా.భవో=భాగినేయః; భావో = జ్యేష్ఠభగినీపతి: భావ, బావ అను పదములు ద్రావిడభాషలలో మిసుల వాడుకలో గలవు.

౭. ప్రా.మమిమ్మా, మల్లాణీ, మామా=త్రయోపి మాతులానీ వాచకాః. దక్షిణదేశమున 'మామి' యను పదము, శ్వశ్రుభార్య యనునర్థమున వాడుకలో గలదు.

౮. ప్రా. వహుణీ="జ్యేష్ఠభార్యా-" తె. వదిన. తమి. మదిని. సంస్కృతములో 'వధుని' అను రూపమున జేరిన పదమునుండి ప్రాకృతములో నేర్పడియుండును. కన్నడమున వివాహము అనునర్థముగల 'మదివె, మదువె' అనుదానికి సంబంధించియుండవచ్చును.

౯. ప్రా. ఉడిదో=మాషధాన్యం. కొన్నిప్రాంతములలో తెలుగున 'ఉద్దులు' అని చెప్పుటయు గలదు. కన్నడమున 'ఉద్దు—ఉద్దు' అనగా 'మాషము'. తమిళమున, 'ఉళున్దు' 'ఉలున్దు' అనియు, మళయాళమున 'ఉటున్ను' అనియు, మహారాష్ట్రమున 'ఉడీద' యనియు పదములు గలవు. తమిళమునందలి 'ళ' లెక్కన కొన్నిభాషలలో 'డ' అగుట కలదు.

౧౦. ప్రా. ఊరో=గ్రామః, సంఘుళ్ళో. తె. ఊరు; తమి. మళ. ఊర్. తుళు. ఊరు. ఇది 'ఉండు', 'నిలుచు', 'అగు' అను నర్థముగల "ఉట్" అను ద్రావిడధాతువునుండి వచ్చినది. తెలుగున 'to be fit'- తగియుండు: ఉట్ —పెట్ + పు='ఒప్పు'. ఉఱు=నిలిచిపోవు-వెనుదీయు. cf ఉఱుడు, ఉఱక. ఈయర్థమొక్క వ్యతిరేకార్థరూపములయందే భాషలో నిలిచినది. తుళు-ఉన్తు- to stand, to stop, cease. cf. తె. "ఉండు."

౧౧. ఉచ్ఛిల్ల=ఛిద్రం—ఛిల్లశబ్దశ్ఛిద్రార్థే. ఛిల్ల ఉచ్ఛిల్లశబ్దాః స్వతంత్రాః. cf. తె. చిల్లి.

౧౨. ప్రా. కల్లా=కవిసం-మద్యం. cf. తె. కల్లు; కన్న. కల్లు; త. కళ్; మళ. కళ్, కల్లు; తుళు. కలి: సంస్కృతములోని 'కల్యం' అను రూపము దీనినుండి యేర్పడినదే యగును.

౧౩. ప్రా. కారం=కటు—తె. కన్న, కార. 'క్షార' శబ్దభవమయి యుండును. మహారాష్ట్రము-ఖార. అల్పప్రాణత్వము-క-కయగుట ద్రావిడభాషా సంప్రదాయానుసారంబై యుండు

౧౪. ప్రా. కురుల = అదయనిపుణయోః- కుటిలకేశేచ. తె. కురులు. కన్న. కురుళ్; త. కురళ్, కురుళ్, చురుళ్; మళ. కురుళ్, కుఱుళ్; మహా. కురళ. cf. తె. కురుళ్-చుట్టు.

౧౫. ప్రా. ఖడ్డం=శ్మశ్రు-తె.గడ్డము; కన్న. గడ్డ; తమి. కట్టై.

౧౬. చిచ్చీ=హుతాశనః. తె. చిచ్చు; కన్న. కిచ్చు; త. కిచ్చు.

౧౭. ప్రా. చించా=అమ్లికా. తె. చింతచెట్టు-పండు.

౧౮. ప్రా. ఝుండుఓ=కందుకః-తె. చెండు; కన్న. చెండు-సెండు.

౧౯. ప్రా. ణేసరో=రవిః-కన్న. నేసఱ్, నెసఱు; త. ఞాయిఱు, నాయిఱు; మళ. ఞాయఱు, ఞాయిఱు; (త. నీఱ్ =light cf. తె. నీరు).

౨౦. ప్రా. పడ్డీ=ప్రథమప్రసూతా. cf. తె. ఆవుపడ్డ.

౨౧. ప్రా.పసింఢీ=కనకం—తె.పసిడి, పసిండి-పైడి. ధాతువు "పసుర్-పసిర్": కన్న. పసుర్ పణ్ణ= green, Yellowish colour తె. పసుపు.

౨౨. ప్రా. పావో=సర్పః. కన్న. పావు; తె. పాము; తమి. పాంబు; మళ. పాంబు.

౨౩. ప్రా. పొట్టం=ఉదరం. cf. తె. పొట్ట; కన్న పొట్టె-పుట్టి.

౨౪. ప్రా. పోయంతో=శపథః cf. తె. పంతము.

౨౫. ప్రా. పుల్లీ=వ్యాఘ్రః, సింహశ్చ- తె. పులి; త. మ. పుళి-పిలి; క. పులి.

౨౬. ప్రా. పేండం=ఖండం, వలయశ్చ- cf. తె. పెండేరము, గండపెండేరము.

౨౭. ప్రా. బోందీ=రూపం,ముఖం, శరీరం,చేటీ. cf. తె. బొంది, బొందె; త. బొంది.

౨౮. ప్రా. మేరా=మర్యాదా. cf. తె. అంతమేరకు.

౨౯. ప్రా. ముంగుసూ, ముగ్గసో=నకులవాచకాః. cf. తె. ముంగిస; కన్న. ముంగిసి.

౩౦. ప్రా. మాసురీ=శ్మశ్రుః. cf. తమి. మసిర్. మయిర్, మయిరు.

౩౧. ప్రా. ముద్దీ=చుంబితం. cf. తె. ముద్దు; కన్న. ముద్దు, ముత్తు.

౩౨. ప్రా. మడో=కంఠః. తె. మెడ,

౩౩. ప్రా. మఇలో=కలకలో గతతేజాశ్చ. cf. తె. మయిల, మైల.

౩౪. ప్రా. రడ్డీ=ప్రధానం. cf. తె. రెడ్డి; క. రడ్డి, రెడ్డి; త. ఇరడ్డి.

౩౫. ప్రా. రొట్టం=తణ్డులపిష్టం. cf. తె. రొట్టె; త. క. రొట్టి.

౩౬. ప్రా. మాడియం=గృహం. cf. త. మాడం; తె. మేడ.

౩౭. ప్రా. వాయణం = భోజ్యోపాయనం;-తె- వాయనము.

౩౮. ప్రా. సెట్టి=గ్రామేశః- తె. క. సెట్టి,చెట్టి. తు. సెట్టి.

౩౯. ప్రా. మొగ్గర=మట్మల. cf. తే. మొగ్గ, మొగడ. (ధా) మొగడించు=ముకుళించు. ఇది వైకృతమని శ. రత్నా. కాని కన్న. మొగ్గె, మొగ్గు; తమి. మొగ్గు-అని ద్రావిడభాష లన్నిటిలో నీరూపము లుండుటచేతను, 'ముగు', 'మూగు', 'మూయు' — మొగిళ్, మొగిలు, మొయిలు (మేఘము = సూర్యుని, ఆకాశము ను మూయునది.) మొదలగు ననేకరూపము లీధాతువునుండి బయలుదేరియుండుటచే ద్రావిడభాషలనుండియే యిది సంస్కృతమున కెక్కియుండును.

౪౦. ప్రా. వెళ్ళాం=ధవళం_తె. వెల్ల,వెలి, etc.; త. కన్న, వెళ్లి; తె. వెండి, etc.

౪౧. ప్రా. కావి=నీలివర్ణా. cf. తె. కావిరంగు; త. కావేరి.

౪౨. ప్రా. సూలా=వేశ్యా-కన్న. సూళె.

౪౩. ప్రా. కురుడో=అదయనిపుణయోః cf.తమి. కురుశాల్; కన్న. కురుడు; తె. గ్రుడ్డివాడు; అర్థభేదము గలిగినది.

౪౪. ప్రా. మేంఠో=హస్తిపకః. cf. తె. మావటీడు; కన్న. మావటిగ.

౪౫. ప్రా. కస్సో, కచ్చరో = పంకః. cf. తె. కసవు; కన్న. కస, కసు, కసవు.

వైదిక సంస్కృతభాషలనుండి నిష్పత్తిచేయుట కవకాశము లేని దేశీయపదములు అని హేమచంద్రుడిచ్చిన 'దేశీనామమాల' యను పదపట్టికలోని యీ పైపదములు ద్రావిడభాషలలో నిత్యవ్యవహారమునగూడ నున్నవగుటచేతను, కొన్ని యీభాషలన్నిటిలోను గల బడుమూలధాతువులకు సంబంధించినవిగా నుండుటచేతను, ప్రాకృతములకు నుత్తరహిందూస్థానభాషలకు గలిగిన యనార్యసంపర్కము ద్రావిడభాషాసంపర్కమే యయి యుండునని నిశ్చయింపదగియున్నది. ఆంధ్రభాషాలక్షణకర్తలందరు నీభాష వికృతియేయని చెప్పినను, "కొంత గలిగె"యని దేశ్యమును ప్రత్యేకముగా విడదీసి తెలుపుచుండుటచే నీయుత్తర దక్షిణదేశభాషలకు పదపరికరవిషయమున నిచ్చిపుచ్చుకొనుట కొంత గలిగినను సాజాత్యసంబంధముమాత్రము కలదని తలచుట కవకాశమేమియు నగపడదు.




త్రోలుగిప్పిన శుష్కశల్యాలమీఁదఁ-జబుకునేయకు మయ్య యో సాయబయ్య,
నిర్దయత నను నిముసమ్ము నిలువనీవ?-యుసుఱు వెసలును నీకు నాయుసురు తగులు.

నేలఁబడుటయొ ప్రాణాలు నిలువ బిగువఁ-బట్టి పఱువులెత్తుటయొ దైవమున కెఱుక
యేదియుం జేయఁ జాల నాకేది తెరువు?-చచ్చెదను సుమ్మి నీకేమివచ్చుఁ బిదప?

బండిలోఁ గునుకుచుం బడియుండి యెడనెడఁ బగ్గాలజాడించి పఱతె నన్ను!
'చల్చలో-శే' యంచుఁ జావుకేకలఁబెట్టి పడఁదిట్టి యుంకించి పఱతె నన్ను!
కమ్మచ్చులంబోలు కంఖాణములతోడి పందెమ్ములను వైచి పఱతె నన్ను!
పావలా కాసించి పదిమంది నెక్కించి బండి పూటముఁజేసి పఱతె నన్ను!
సాఁగి ప్రేవులుం బెగివడఁ జచ్చుదాన-ముక్కుకొన నూపిరి న్నుర్వఁ గ్రక్కుదాన
గడియ శ్రమఁదీర్చికోనిమ్ము బడుగుదాన-నుత్త జీవచ్ఛవంబనై యుంటిగాన.

అడుగు నడుగున మునికోలఁ బొడిచెదేల?-కారు రక్తముంగనఁ గనికరము రాదె?
కటికివాఁడైన నీకంటె కరముమేలు-జంతువుల నొక్కవ్రేటునం జంపునతఁడు.

ఉలవ లుద్ధరి యెన్నఁడే నున్నవయ్య?-గడ్డిపరకలకేఁ గడుం గఱవు నాకు
పోతు వెన్నెని కుండల బురదనీరు-బరువుచేటయ్యెఁ జుమి నాదు బొనకడుపు

పమ్మిన వేడ్క మోఁది బలవంతముగా ననుఁ దోలి నాదు క
ష్టమ్మును సుంతయే నెఱుఁగఁజాలకె సాయబుగాని చేతిలో

బొమ్మవు నయ్యు నీకు పలుపోకలఁ దోఁకను ద్రిప్పి కన్నుక
న్నెమ్ములఁగూల్చెదో కొరడ! యేలకు నేలకుఁ దూలిరాలవో!

వంగి మెత్తమెత్తగను గన్పడెదుగాని-మొదటివలె గాక యాఁదోఁకఁ దుదకుఁదనువు(?)
సన్నగిలుచున్న నీశక్తి సాఁగునకట-సాధుపీడయె కొరడ నీ సాజగుణమ?

వెనుకనె నిక్కి-తక్కుచు గభీరముఁ జూపుచు నా మెయిగ్గ గబు
క్కునఁబడి నన్ను నేఁచెదవు కూళ! నినుం గనఁజాలఁ గాని నా
కనులకు గంతలున్న నిటుఁ గట్టులసందునఁ జిక్కియున్న ముం
దునఁ ద్రుటినిల్వుమా కొరడ! త్రుళ్లడఁగింపనె? పంటఁజీల్పనే?

నినుస మాశ్రయమును వీడి నిలువలేవు-ఆశ్రయంబుండియు న్నత మల్లలాడి
లెక్క సేయక నన్బాధ స్రుక్కఁజేతె?-గుణము తనువుతోఁబాటుదే కొరడ, నీకు.

ఎట్టి జంతువులం జంపి పుట్టినావొ?-ఎన్నితోలుల కలయికన్మనుచునుందొ?
ఎన్ని సత్వంబులం గూల్ప నెంచినావొ?-కలనుఁ గనఁజాల నినుఁబోలు ఖలుని కొరడ!

చిరుగంటలగ్గ గంఠసరులను బతకాల సింగారముల నీటు సేయువారు
ఇరుగడల న్నిల్చి యాగ్రహాంగ నీక వీచోపుల న్మెల్ల వీచువారు
కాయంబు నించుకఁ గసుగందనీయక యంచెల నందందు నుంచువారు
ముఖమాలు దుస్తుల ముస్తీబుఁగావించి తెమ్మెర న్వాహ్యాళిఁ ద్రిప్పువారు
అంతిపురి నా సురక్షితం బైనవసతి-వివిధమై రుచ్యమౌ వస్తు వితతి తిండి
యెత్తుగానున్న మెత్తని క్రొత్తపాన్పు-స్వామికిన్ముద్దుబిడ్డవశ్వంబ! నీవు

మొగమును బారెఁడెత్తి మొగమోట మొకించుకయేనిలేక మ
మ్మొఁగని 'యిహీహిహీ' యనుచు మూతిని ద్రిప్పకుమోయి, కేళి సే
యఁగఁ జనదోయి చూడు మఱి హాయినెఱుంగుదు నోయి? నన్నుఁ బో
లఁగలుగుదోయి పెన్పరువుల న్వడి నెత్తుకఁ బఱ్వులెత్తఁగన్?

మీవార లేవార లేవార దూరానఁ బోవుచున్నను సంకుమూతినెత్తి
స్వాహాపరోహక్రమ మంద్ర స్వరములతో నామంత్రణముల సేసి

చరణ సంస్పర్శతో స్వాగతం బొనరించి సంతసమ్మున బూదిఁ గొంత పొరలి
సరివారితోఁగూడి వరిచేనులోఁ దూఱి క్షేత్రపాలుని భిక్ష స్వీకరించి
దంపతుల చిత్రలీల కాదర్శమిడుచు-స్వైరవిహారణముం జేతె చాకి విడువ!
ఘోటకముతోటి సాటియ న్మాట లేదు-కలదె నీపాటి సుఖమైన ఖరమ, నాకు?

ప్రీతిని దువ్వి తట్టుచును వెచ్చనియుల్వలఁ బోసి కమ్మగా
గోతము మూతికియ్యఁ దిని క్రొవ్వను గుఱ్ఱము; స్వేచ్ఛమించి పె
న్గోఁతలఁ గూసి ప్రుచ్చిలుచుఁ గుక్షిని నింపును గర్దభంబు; నా
రీతియె? 'రెంటికిం జెడిన రేవఁడ' నైతిని గాదె దైవమా?

ధాతయిచ్చిన రూపు నా దాతమాపు-దుస్థితిం దలపోయ నా దుఃఖమెల్లఁ
బోయి పక్కున న్నవ్వు ఉప్పొంగిరాగ-'నిహ్హిహిహి'యందు సకిలింపు 'టిహిహి'గాదు.

ఇన శశాంకులుస్గూడ నా కీడుగారు-వెదకిన న్వారు కనరారు విధులఁ దీర్చి
కలఁడె యెందేని నాబోఁటి కష్టజీవి?-లేఁడు యీ రేడుజగముల లేఁడు లేఁడు.

అన్నా, నన్ క్షమియింపుమా మఱచి లేఁడన్నాను వేఱొక్కఁడీ
వున్నావే! ననుబోలి రేఁబవళు లేయుద్యోగముల్జేసి యే
నెన్నోలక్షలఁగూర్చి పేర్చె దొకకాసే న్నీకుఁ గా దోరి నా
గన్నా! నీ మృతిఁ గోరువారలకె లుబ్ధాగ్రేసరా, సర్వమున్.

స్వామిపుష్టికై నే నుపవాసముందు-నుపవసింతువు పెరవారి కూడ్చిపెట్ట
నేఁ గృతజ్ఞను వారు నిన్నెట్టువారు?-ఘూర్వహులమాచు మేనులఁ ద్రోతుమెటనో.

—

# ముద్దుపళని

ఆంధ్ర శేషగిరిరావుగారు, బి. ఏ. (సారస్వతసమాజము)

ముద్దుపళని వారాంగన. ఈమె తెనుఁగున "రాధికాసాంత్వనము" అను పద్యకావ్యమును రచియించిన విదుషీరత్నము.

చోళరాజ్యరమకు తిలకమగు తంజావూరునందు ఆంధ్రనాయక రాజ్యము అంతరించిన అనంతరము మహారాష్ట్రులు ప్రబలిరి. ఆమహారాష్ట్ర ప్రభువులు భోసలాన్వయులు. వారిలో ప్రతాపసింహుఁ డనువానికి ముద్దుపళని వలపునెలఁత. ఈమహారాష్ట్ర ప్రభువు క్రీస్తుశకము ౧౭౩౯ వ సంవత్సరము మొదలుకొని ౧౭౬౩ వ సంవత్సరమువఱకు తంజావూరి రాజ్యమును పరిపాలించెను. అట్లగుట నాతనివలపు నెలఁతయగు ముద్దుపళని క్రీస్తుశకము ౧౭౬౩ వ సంవత్సర ప్రాంతమునందు తంజనగరమున జీవించియుండెనని నిర్ణయింపనగును.

తన యేలిక యగు ప్రతాపసింహమహారాజును ముద్దుపళని రాధికా సాంత్వనము కృత్యాదిని ఇట్లు కీర్తించినది:

సీ. ఏ రాజు కువలయంబెల్ల రంజిలఁ జేసి
జైవాతృకాఖ్య నిచ్చలుఁ దలిర్చు
నేలోకబాంధవుం డిలఁ దమంబు లడంచి
చక్రప్రమోదంబు సంఘటించు
నేఘనుండు శరంబు నేవేళ గురియించి
పరవాహినుల నెల్ల భంగపఱచు
నేయాశుఁ డార్యవనాయత్తమతిఁ గాంచి
కీర్తింప సర్వజ్ఞమూర్తి యానుప్రఖ్యా
తే. వాఁడు నృపమాత్రుఁడే రఘూద్వాహదవాహవర్ధిత భోసలాన్వయపయోధి
సోమతుళజేంద్రవరతనూజుండు శ్రీప్రతాపసింహక్షమాపాల తల్లజుండు.

అట్టి "మహారాజుకృపఁ జెందినట్టి" తనకు భాగ్యములకుఁ గొదువ లేదని వచించుచున్నది. "చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహ మహారాజ బహుకృతానేక చామీకరాంబరాభరణ"ములు కలదానని ముద్దుపళని తన కావ్యమునందలి ఆశ్వాసాంత గద్యములోఁ జెప్పుకొన్నది.

ముద్దుపళనితండ్రి ముత్యాలు.[1] ఇతఁడు బ్రహ్మవిద్యా ప్రవీణుఁ డగు తిరుమల తాతయాచార్యుని శిష్యుఁడు. ముత్యాలు భార్య పోటి. ఈదంపతులకు వేలాయుధుఁడు, ముద్దుకొమరయ్య, ముద్దయ్య, రామస్వామి అను నలుగురు పుత్రులును, ముద్దుపళని, ముద్దులక్ష్మి, పద్మావతి అను ముగ్గురు పుత్రికలును పుట్టిరి. వీరిలో ముద్దుపళని "సాహిత్యవిద్యావిశారద"యై వినుతికెక్కెను. రాధికాసాం

1. ముద్దుపళని తల్లి పేరు ముత్యాలని శ్రీ వీరేశలింగంపంతులు కవులచరిత్రలో వ్రాసినది పొరపాటు.

త్వనము కృత్యాదిని గల క్రిందిపద్య మావిష యములఁ దెలుపుచున్నది:

సీ. సాహిత్య విద్యావిశారద శారద
వై ముద్దుపళనినా నమరు నిన్ను
గురుతరంబై తగుగుణగణప్రౌఢి వే
లాయుతుండైన వేలాయుధాఖ్యు
భరతభావాభావభావజగురుఁడు నాఁ
గొమరు చెందెడు ముద్దుకొమరవరుని
రూపవిభ్రమకళారూఢి నెంతయు రతీ
దేవి యా ముద్దులక్ష్మీ వధూటి
బుద్ధి నల్లూరు ముద్దైన ముద్దయాఖ్యు
దీటు లేనట్టి పద్మావతీ లలామఁ
దెలివిమీఱు రామస్వామి నెలమిఁ గాంచె
మేటిముత్యాలు పోటివధూటి వలన.

ఆంధ్రకవులు ప్రాయికముగా తమ గద్య లందు తమ తల్లులపేళ్లు చెప్పి తాము వారల గర్భశుక్తి ముక్తాఫలములమని వ్రాసికొందురు. కాని ఈగ్రంథకర్త్రి యీ మర్యాద నతిక్ర మించి తన గద్యయందు తండ్రినామ ముదా హరించి, "ముత్యాలు గర్భశుక్తి ముక్తాయ మాన" అని వ్రాసికొన్నది. ఇది యొక విశేషము. తంజావూరి రఘునాథరాయలకు (౧౬౧౪-౧౬౩౦) విజయవిలాసము, సారంగ ధరచరిత్ర యను రసవత్ప్రబంధములను కృతి నిచ్చిన చేమకూర వేంకటకవికూడ తనగద్య యందు తండ్రిపేరే చెప్పుకొన్నాఁడు. ఇట్టి నూతనమర్యాద నవలంబించుటలో వీరియుద్దే శ్య మెట్టిదో తెలియరాదు.

శృంగారమూర్తియగు చిన్నికృష్ణుఁ డీకవ యిత్రి యిష్టదైవతము. "సంగీతసాహిత్య భరతశాస్త్రాదివిద్యలు" ఈమెకు "శ్రీచిన్నికృష్ణ కరుణాకటాక్ష వీక్షణమున" లభించినట్లు రాధి కాసాంత్వన మందలి ఆశ్వాసాంత గద్యవలనఁ దెలియనగును. ఇష్టదైవతమగు చిన్నికృష్ణుఁ డీమెకు స్వప్నమున సాక్షాత్కరించి తనచిత్త మునకు సమ్మతమైన "రాధికా సాంత్వన ము"ను తనకు నంకితముగా రచియింపుమని వచియించెనఁట. ఇట్లని క్రిందిపద్యము తెలుపు చున్నది.

తే. చిన్నికృష్ణుఁడ నే నాదు చిత్తమునకు
సమ్మతంబైన రాధికాసాంత్వనంబు
తగ నొనర్పు మదీయాంకితముగ నీవు
లలితగుణపేటి! శ్రీముద్దుపళని బోటి!

బ్రహ్మవిద్యావేత్తయుఁ, దనతండ్రికి దేశి కుఁడునైన తిరుమల తాతాచార్య వంశము నకుఁ జెందిన వీరరాఘవాచారి ఈమెకు విద్యా గురువు. "రాధికా సాంత్వనము" రచియించు టలో నీవిదుషీమణి తన దేశికుఁడగు వీరరా ఘవాచారి సహాయసంపత్తిని పొందియుండు నని బ్రౌనుదొర ఊహించుచున్నాఁడు.

రాధికాసాంత్వనము నాలుగాశ్వాసముల శృంగార ప్రబంధము. ఈశ్లాఘ్యకపాయితమైన తనమేనత్త రాధికాదేవి ననునయించి దక్షిణ నాయకుఁడైన శ్రీకృష్ణమూర్తి ఆమెతోడను, ఆమె పెంపుడుకూఁతు రగు ఇళాదేవితోడను శృంగారవిహారములఁ దేలు కథ ఈ కావ్యమున

ప్రస్తావిత విషయము. రాధికా సాంత్వనమున నాయకుఁడొక్కఁడు, నాయికలిద్దఱు. ఆంధ్ర ప్రబంధముల నామములు ప్రాయికముగా నాయికలనుబట్టియే యేర్పడును. కావున నిందలి నాయికల నిరువురనుబట్టియు ఈ కావ్యమునకు రెండు నామములు కలిగినవి. రాధను బట్టి "రాధికాసాంత్వన"మనియు, ఇళాదేవిని బట్టి "ఇళాదేవీయ" మనియు దీనికిఁ బేళ్లు వచ్చినవి. ఇందు రాధికాసాంత్వన మను నామమే బహుళప్రచారము నందినది. కావ్యమునందలి ఆశ్వాసాంతగద్యయందుకూడనీనామమేవాడఁబడినది. అగుటచే గ్రంథకర్త్రికిఁగూడ నీనామమే ప్రియతరమగుట నిశ్చయము.

చెన్నపురియందలి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్న రాధికా సాంత్వనము ముఖపత్రమున బ్రౌనుదొర ఆంగ్లభాషయందుఁ జిన్న యుపోద్ఘాతమును వ్రాసియున్నాఁడు. దానిసార మిచ్చట తెనుఁగునఁ జెప్పెదను. "కావ్యమునంతను ఈ విదుషీమణియే రచియించె నన వలనుపడకున్నది. ఇందలికొన్ని భాగములు అతిశయపాండిత్యమును ప్రకర్షించుచున్నవి. ఆభాగములను వ్రాయుటలో నీమెకు ఈమె దేశికుఁడు వీరరాఘవాచారి తోడుపడి యుండును. మిగిలిన భాగములందలి కవిత్వము స్త్రీరచనమగుట నిశ్చయము. కూర్చుటకు సులభమైన వృత్తములనే బహుళముగా ముద్దుపళని చేకొనియుండుట గమనింపఁ దగిన విషయము. అఖండయతి, వబయోరభేద యతి మొదలగు తేలికయతులనే ఈమె వాడినది."

రాధికాసాంత్వనమునుగాక ముద్దుపళని "సప్తపదులు"[2] అను నొక గేయ కావ్యమును గూడ రచించినది. "గోదా" అనుమాఱుపేరు గల చూడికొడుత్తనాచ్చియారు రచియించి నట్లుగా వాడఁబడుచున్న "తిరుప్పావు" అను అఱవభాషలోని పాటకు ఈకావ్యము తెలుఁగు సేత. "సప్తపదుల"లోని క్రిందిభాగ మీవిషయమును వెల్లడించును.

"..............ముద్దుపళని
పూని సేయు ద్రవిడపాటలోని భావమూ
చెలగి తెలియగానునాదుజిహ్వాకొనను నిలచి [యిటుల
బలికె తిరుప్పావుసప్త పదిపదంబునా".

ఈగేయకావ్యము అముద్రితము. *గ్రంథము పూర్తిగ నుపలబ్ధమగుటలేదు. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్న గ్రంథమునందుఁ బదిపాటలు గలవు. ఇంకను నిరువదింటిచేఁగాని గ్రంథము సమగ్రము కానేరదు. ఉన్నంతవఱకు నిందలి పాటలు చాల మనో

2. శ్రీ వీరేశలింగము పంతులు కవులచరిత్ర రచియించునాఁటికి ఇది లోకమునకుఁ జేరఁబడలేదు. ఈగ్రంథము అసమగ్రప్రతి యొకటి చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున నున్నది. అముద్రితము.

* ఇది అముద్రితముకాదు; ముద్రితమే. అనుపలబ్ధభాగమును శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పాటలగనే అనుసరించి గ్రంథమును పూరించినారు. గ్రంథము సంపూర్ణముగా 'స్వధర్మ ప్రకాశిని' యందు గతశుక్ల సంవత్సరమున ప్రకటితమై దానినుండి పునర్ముద్రణమునుగాంచి ప్రచారమున నున్నది. సంపాదకుడు:—భారతి.

హారముగ నున్నవి. ముద్దుపళని మధుర రచనములు తెలుఁగువారికిఁ గ్రొత్తలు కావు. ద్రవిడ గేయములకు భాషాంతరీకరణము లైనను నిందలిపాటలు స్వతంత్రరచనములవలె నొప్పుచున్నవి. శ్రీకృష్ణుని దేవేరులలో నిరువురి మానములఁ బొడసూపిన రవరవలు ఈగేయ కావ్యమున ప్రస్తావిత విషయము. తంజాపురి ఆంధ్రనాయక రాజులు గాన విద్యకు చక్కని పోషణ మిచ్చిరి. వారితరువాత నచ్చట రాజ్యాధికారము వహించిన మహారాష్ట్రులు కూడ గానవిద్యాపోషణమునకుఁ గృషి సల్పిరి. అట్టికృషికి ఫలముగా ముద్దుపళని "సప్తపదులు" పొడసూపినది. "సువ్వీసువ్వాలే"అను పాటనుబోలి వీనులవిందైయున్న ఇందలిపాటలు ముద్దుపళని రచనాపాటవమునకును, సంగీత పాండిత్యమునకును సాక్షీభూతములై యున్నవి. శైలి తెలియుటకై ఇందలి యొకగేయములోని కొన్ని చరణముల నిచ్చట నుదాహరించుచున్నాను.

"మాసములకునెల్ల మంచి మార్గశిరముపర్యాయ
యాసగలిగినట్టి చెలులుడా సీరా రే[మహాహ
మంచినగలమించి కులము నెంచియవతరించి
చంచలాక్షులెల్లకూడ జనగరారే [నట్టి
న్యాయశాలినైననందనందనుడు[శీయశోద
తోయజాక్షిసింహ శిశువుతో సమానుఁడే
నల్లమబ్బుచాయ మిగుల తెల్లనేయు మేని
ఫుల్లపుండరీకనయనపురుషవర్యుఁడే [డాలు
కీరవాణులార! వారినికోరి చేరి తేరి సకల
పూరుషార్థములను తృప్తి బొందరారే!"

ముద్దుపళని కవనమునుగూర్చి కవిచరిత్రకారుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు: "ఈమె కవిత్వము నాతికఠినమై మృదువుగా నుండినందుకు సందేహము లేదు. ఈమెకు మంచి సంస్కృతాంధ్రసాహిత్యమును గలదు. అందందు తప్పులున్నవి. కాని యట్టితప్పులు పురుషకవిత్వమునందు సహిత మనేక గ్రంథములలోఁ గానఁబడుచున్నవి."రాధికాసాంత్వనములోని అనేక భాగములు అతిశయ శృంగార దూషితములై సభ్యలోకమునకు ఏవఁ బుట్టించుచున్నవి.

జాతీయములును,లోకోక్తులును సూటిగా నుపయోగించుటయందు పురుషులకంటెస్త్రీలే యెక్కుడు ప్రవీణురాండ్రనుట జగ మెఱిఁగిన సంగతి. స్త్రీలు మాట్లాడునెడ జాతీయములు, లోకోక్తులు అప్రయత్నముగ జాలువాఱుచుండును. అట్లే ముద్దుపళని కవిత్వమునం దంతటను జాతీయములు, సామెతలు యథోచితముగ వెల్లివిరిసి కావ్యమునకు శోభ తెచ్చినవి. ఉదాహరణమునకై రాధికాసాంత్వనమందలి పద్యములఁ గొన్నిటిని ఎత్తి వ్రాసెదను.

గీ. తనదుమట్టెంత? తానెంత? తానె యింత.
చేయఁ జూచిన నే నెంత చేయరాదు?
వేలు వాచిన రోలంత విరివియైన;
రోలు వాచిన నది యెంత మేలు గనునొ?

గీ. కుట్టఁ దేలు కుట్టకున్నఁ గుమ్మరబూచి
తో సిరాజటంచుఁ ద్రోచెఁ జెలియ
దానివేలు దీసి దానికన్ను పొడిచి
నటులుచేయకున్న నగునె చిలుక?

గీ. తగరుకొండమీఁదఁ దాఁకఁ గోరినదారి
నెదిరిఁ దన్నుఁ దెలియ కింత పలికె
నెంతమీను వచ్చి యెంతమీనును మ్రింగెఁ
గానఁ ద్రుళ్లి నెద్దె గంత మోచు.

గీ. కాని పదరకు మీఁకమీఁద దాని మొగము
కనఁగ వలదని శౌరికిఁ గట్టుపెట్టి
బింకములు కూల నఱకాలఁ బెట్టి నేల
రాయకున్నను నాపేరు రాధ కాదు.

గీ. లేని పట్టింపులెల్లను బూని చాన
నేనె యెదురైనఁగాని యింతైనఁ జూడ
దల్పునకుఁ గిల్మి వచ్చిన నర్ధరాత్రి
గొడుగు తెమ్మన్న కతగాను గోమలాంగి!

ఇట్టిపద్యములు ముద్దుపళని లోకోక్తి సంఘటనాపాటవమును వెల్లడించుచు నిది స్త్రీ కవిత్వమని చెప్పక చెప్పుచున్నవి.

ముద్దుపళని మహారాష్ట్రవనిత యని బ్రౌనుదొర అనుమానించెను. రాధికాసాంత్వనము కృత్యాదిని పేర్కొనఁబడిన ఈ కవయిత్రి బందుగులనామములు తెలుఁగు సాంప్రదాయమునకు విరుద్ధములై వారిమహారాష్ట్రజాతీయతను సూచించుచున్నవి. "ముద్దుపళని" అను నామముకూడ మహారాష్ట్ర వాసన కొట్టుచున్నది. అగుటచే బ్రౌనుదొరయూహ సత్యమని నమ్మవచ్చును.

రాధికాసాంత్వనము నంధ్ర ప్రబంధము. అది వెలసినది తమిళ దేశమున. గ్రంథకర్త్రి మహారాష్ట్రవనిత. గ్రంథకర్త్రి పోషకుఁడు మహారాష్ట్రప్రభువు. "దేశభాషలందు లెస్స" యైనది కావున మహారాష్ట్రప్రభువు ప్రతాపసింహుఁడు ఆంధ్రభాషకు మోహితుఁడయ్యెను. నేర్చుకొనుటకు అత్యంతసులభమైనది కావున మహారాష్ట్రవనిత ముద్దుపళని దానిని చక్కఁగ నేర్చుకొని అందలి మెఱుఁగుల నెఱిఁగి అంత కవనము చెప్పెను. విజాతీయులగు మహారాష్ట్రులచే విదేశమగు తమిళరాష్ట్రమున జనన మొందినను రాధికాసాంత్వనకావ్యము నేటి వఱకు నిలిచియుండి ఆంధ్రభాషప్రాశస్త్యమునకు, సౌలభ్యమునకుఁ దార్కాణమై యున్నది. ఆంధ్రభాషా మాధుర్యమునకుఁ జొక్కి విజాతీయులు కొందఱు ఈభాషయందు కావ్యములు రచియించిరి. అట్లు మనభాషయందు కావ్యములు రచియించిన విజాతీయులలో మహారాష్ట్రజాతికిఁ జెందినవారియందు ముద్దుపళని గాక చిదంబరకవి నామము నూతనముగ వినిపించుచున్నది మహారాష్ట్రుఁడగు నీచిదంబరకవి తెనుఁగున "అంగదరాయబారము"[3] అను పద్యకావ్యమును వ్రాసెను.

ఆంధ్రవిదుషీమణిహారమున ముద్దుపళని యొక యనర్ఘరత్నము. సంస్కృతాంధ్రములందలి ఆమె సాహిత్యజ్ఞానమునకు రాధికాసాంత్వనరచనము సాక్షి. ఆమెకు తమిళభాషా పరిచయము కలదనుటకు "తిరుప్పావు" భా

3. ఇది అముద్రితము. నాకడ నొక వ్రాఁతప్రతి యున్నది. రాజమహేంద్రవరము తాలూకా సీతానగరమందలి గౌతమీసత్యాగ్రహాశ్రమనివాసులును, కాంగ్రెసుపత్రిక సహకారిసంపాదకులునునగు శ్రీ క్రొవ్విడిలింగరాజుగారిచ్చినది.

షాంతరీకరణము తార్కాణము. ఆమె సంగీత విద్యాపారంగతురా లనుటకు "సప్తపదులు" అను మనోహర గేయకావ్యరచనము నిదర్శనము. ఆమె భరతవిద్యాధురీణ యనుటకు ప్రతాపసింహ ప్రభువర్యుని మనసు కెక్కిన వేల్లాటకర్త్రే యగుట సాక్షి. జనించినది మహారాష్ట్రజాతియందైనను ఆంధ్రభాషయందు రసవంతమైన కవిత్వము చెప్పిన ముద్దుపళని వైదుష్యము కొలదులు వెట్టదరము కానిది.

—"ఆంధ్రవిదుషీమణులు" నుండి.

---

## కలదె ముక్తి?

గుండిమెడ వేంకటసుబ్బారావు గారు

ఎట్టి నీచహృదయమేని యొక్కొకవేళ-నుచ్చమునకు స్థాన మొసగుచుండు!
అట్టివేళ నాత్మ స్వార్థవిదూరమై-పరుగులిడును స్వర్గపథమునందు!

కాలప్రవాహవైఖరి లెక్కగొనక దివాంధుడై యున్న పెద్దన్నయొకడు!
అరుణోదయ ప్రభాగరిమ గాంచగలేక నిద్రించుచున్న దరిద్రు డొకడు!
భువన పూజ్యులు మహాత్ముల బోధనములకు బధిరుడైయున్న నిర్భాగ్యు డొకడు!
శత్రుభయార్తయై జనని యేడ్చుచునున్న చలియింపనట్టి దుర్జాతి యొకడు!
అహాహ! కల రింక దుష్టగ్రహాప్రఘట్టి-తాత్ములై యున్న శుంఠ లీ యార్యభూమి!
కలుషితంబు లీ హృద్గుహాగర్భములను-వెలుగునే దివ్య తేజ మేవేళనైన!!

స్వర్గమార్గము లంటి జగదీశు గీర్తించు కృష్ణపక్షుల కిరీంకృతులతోడ,
అరుణోదయస్ఫూర్తి ధరణిజాటెడు వాయసముల కాకా నినాదములతోడ,
పంచమ స్వరమున బరమాత్ము భజియించు కోకిలంబుల కుహూకుహూలతోడ,
అర్ధరాత్రుల పృథ్వి కరిగాపులైయుండు గ్రుడ్లగూబల ఘుటాఘుటులతోడ,
విధివిరామంబులేక, సావేశగతుల, బహుముఖంబుల బహువిధోపాయములను
ప్రకృతికాంత బోధించు కర్తవ్యపథము, క్షుద్రచిత్తంబులకు నెట్లు గోచరించు!!

ఆ నికృష్టమూర్ఖమానసంబు లికెప్పు, డుచ్చమునకు స్థాన మొసగునొక్కొ?
స్వార్థదూరము లయి యాయాత్మ లేనాడు, స్వర్గపథమునందు బరుగులిడునొ!

మేటి దురాచారమేసుముల్ తొలగి సుజ్ఞానార్కు డేనాడు కానబడును,
అంతర్గతంబైన స్వార్థచింతా మహారోగ మేనాడు నిర్మూలమగును,
ప్రవిమల భావప్రవాహంబులేనాడు గిరినిర్ఝరములట్లు పొంగిపొర్లు,
ఆరిపోవుచునున్న స్వాభిమానజ్యోతి క్రమ్మఱ నేనాడు ప్రజ్వరిల్లు,
ఘోరము లగు సాంఘికదురాచారములకు-స్వస్తివాక్య మేనాడు దిక్కులమిఱ్ఱుమ్రోగు,
అంతదనుకను నామమాత్రావశిష్ట-ము లగు మూర్ఖజాతుల కెందు గలదె ముక్తి??

---

# తిక్కన విరాటపర్వము

గుఱ్ఱం వేంకటసుబ్బరామయ్యగారు, యం. ఏ.

## విమర్శకు సమాధానము

వైశాఖ "భారతి" యందు నా తిక్కన విరాట పర్వప్రశంసంగూర్చి యొక విమర్శనము వెలువడినది. అందలి ముఖ్యాంశములకు యథోచిత సమాధాన మొసంగ నుద్దేశించినాఁడను. తిక్కన మూలమునకు మెఱుఁగువెట్టినాఁడనుట అసాధువని విమర్శకుమతము. అందుల కొసంగఁబడిన వాదములలోఁ బ్రధానములని నాకుఁ దోఁచినవాని నీక్రిందఁ బొందుపరుచుచు, నేను వెంటనే నా సమాధానమునుగూడఁ జెప్పికొనెదను.

"కేతన, యెఱ్ఱన మున్నగుకవులు తిక్కనను గొనియాడినది యతని యనితరసులభరచనావైదగ్ధ్యమై పుణ్యమునకుఁగాని, కావ్యశిల్పదృష్టిచేఁ బరికించి కాదు" అని విమర్శ. కాని, తిక్కనంగూర్చి "చతురానన సన్నిభుఁడు", "కావ్యకళా జనిభూమి". "సారకవితా నిర్మాణ చతురుఁడు" అని కేతనయు, "తనకావించిన సృష్టి తక్కొరులచేతంగా"దని, "కవిబ్రహ్మ" యని ఎఱ్ఱనయుఁ బ్రశంసించియున్నారు. ఈ స్తుతి కావ్యశిల్పసృష్టినే సూచించునట్లు నాకుఁ దోఁచును. తిక్కనయే తన్నుఁగూర్చి "అమలోదాత్త మనీష నైనుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడన్, కళావిదుఁడ" నని తెలిపికొన్నాఁడుగదా.

'మాతృకకు మెఱుఁగువెట్టుట భాషాంతరీకరణమునకు సాధ్యముగానిపని. అనువాదము అసలులోని భావసౌందర్య సంపత్తిని తేఁ జాలదు' అని విమర్శ. ఈ సూత్రము శబ్దశః చేసిన భాషాంతరము (literal translation) నకుఁ జెల్లునని యొప్పుకొనెదను. కాని, యాంధ్రభారతము కేవలానువాదముగాక రూపాంతరీకరణమే యనియు, ప్రాయికముగ సంస్కృతభారతమునకును, తిక్కన కబ్బమునకును; శ్రవ్యదృశ్యప్రబంధములకుఁగల భేదము గాన వచ్చుననియుఁ, గొలఁది మార్పులతో విరాటపర్వము నొక నాటకముగ మార్పవచ్చుననియు పూర్వమే మనవిచేసియున్నాఁడను. కాళిదాసు మూలమునందలి శకుంతలకథకు మెఱుఁగు పెట్టలేదని విమర్శకులు వాదింతురా? కావున, పై సూత్రము ఆంధ్రభారతమునకుఁ జెల్లదని తలంతును.

'ప్రపంచమున అప్రతిమాన ప్రతిభావంతులగు కవులను చేతివ్రేళ్లమీద లెక్కింపవచ్చును. అట్టి మహాకవి శ్రేణికిఁ జెందినవ్యాసుని కృతియేడ? తద్భాషాంతరీకరణమేడ?' అని విమర్శ. ఉత్తమకవులను చేతివ్రేళ్లమీద లెక్కింపవచ్చుననుట కాధారమేయ్యది? మనకు వినవచ్చిన యే రెండుమూడు నాలుగు వాఙ్మయములనో ఆధారముచేసికొని యట్లు నుడువుట న్యాయ్యమా? నానా దేశములలో మనకుఁ దెలియని భాషలు వాఙ్మయములెన్ని లేవు? వానియందు మనదృక్పథమున నింతవఱకుఁబడని మహాకవు లెందఱుండరాదు? కావున ప్రపంచమందలి వాఙ్మయ సర్వస్వము నాకలించినఁగాని, లోకోత్తర ప్రతిభాశాలులగు కవుల 'చేతివ్రేళ్లపై' లెక్కింపవచ్చువారో, కోటానుకోట్లో నిర్ణయింప వలనుపడదని నా మనవి. మఱి తిక్కనయు తత్కవిశ్రేణికిఁ జెందినవాఁడే యని నుడువ సాహసించినాఁడను. కావున పారాశర్యకృతికిని తిక్కన తెలుఁగునకును నచింపరానియంత యంతర ముండ నవసరము లేదు.

'తిక్కన యింతరసోదంచితముగ వ్రాయఁగల్గుటకు వారి కొక చక్కని మూలాధారముండియుండునని నలేదని యెట్లు బుజువుచేసెదరు? సంస్కృతభారత ప్రతులలోఁ బరస్పరసంబంధము లేనపుడు, తిక్కన యేప్రతి ననుసరించెనో తెలియనపుడు మూలముతో సరిపోల్చిచూచుట ము లమన కపచారము చేయుటకాదా?' అని విమర్శకవాదము. నేను సంస్కృత భారతప్రతులను బోల్చిచూచుటయందు బడి శ్రమచేసినవాఁడను గాను. నాయొద్దనున్న గ్రంథముమీఁదనే ఆధారపడి

పోల్చిచూచితిని. తిక్కన స్వయముగఁ గల్పించినవని నేను చూపినమార్పులకును కొండొక సంస్కృత భారతప్రతిలో మూలము కలదని రుజువుపరుచు భారము విమర్శకులది గాని నాదిగాదు. వారట్లు చూపఁగలుగుదురేని, కృతజ్ఞతాపూర్వకముగ గ్రహించి, యంతవఱకుఁ దిక్కన స్వకల్పనమునుగూర్చిన నావిమర్శను మార్చుకొనెదను. సంస్కృత పాఠభేదసమస్య పరిష్కరింపఁ బడునవఱకు, వ్యాసకృత మిదమిత్థమని నిర్ణయింపఁ బడునవఱకును, ఆంధ్రవిమర్శకులు తెలుఁగు భారతమును మూలముతో సరిపోల్చి పని పెట్టుకొనక, చేతులు ముడిచికొని యుండవలయునను కట్టడ యెంతవఱకు సమంజసమో పాఠకులే నిర్ణయింపఁ గలరు.

'మూలమునందు తిక్కన వదలిన రసవత్తరములగు పట్టుల విషయమున వ్యాసకర్తలు "మాతృకయందట్టి నట్టేలకో తిక్కన తెనిఁగింపక వదలివేసె"నని చెప్పినపుడు, మూలమునుండి మార్చిన పట్టులకును ఆ "యేలకో" చెల్లదా? దీనికిమాత్రము కారణమరయుట సమంజసమా? మూలమునుండి వదలుటకును, మార్పులు చేయుటకును హేతువేమి, అధికారమేమి తిక్కనార్యునకు? ' అని విమర్శకప్రశ్న. విమర్శకులు నావాక్యమును బూర్తిగ నుద్ధరింపలేదు. "మాతృకయందున్నట్టి నేలకో తిక్కన తెలిఁగింపక వదలెనను కొఱంతం బొడమించు శ్లోకరత్నములు మెఱయుచున్నవి" అని నేను వ్రాసినది. వదలుట 'కొఱఁత' యని యొప్పుకొనియున్నాను. "ఏలకో" యను ప్రహేళికవింగూర్చి వినయోక్తి. ఇది కొఱఁతయనుట యెట్లో, మార్పు గుణమనుట యనట్లె చెల్లునని యొప్పుకొనెదను. ఇఁకే మూలమునుండి వదలివేయుటకును మార్చుటకును కాళిదాసమురారి భవభూత్యాదులకు ఎట్టి హేతువో, అధికారమో, అట్టిదే తిక్కనకును ఎట్లుకలుగకపోవును?

"పతంత్యరూపేషు యథా దక్షూనః షింకదావన" శ్లోకమునకు నరులొరులు వృశ్యములపైఁ బరఁగింపఁగఁ జూడ్కులెట్లు వడుఁదప్పక " యను తిక్కన తెలుఁగు దూరానువాదమని విమర్శకవాదము. ఇందు గూర్చి నేను మత్పూర్వవ్యాసమునసే యిట్లు వ్రాసినాఁడను. "ఇది మాతృకయందలి నఞ్ద్వయప్రయోగసారస్యము దుహితృకయందుఁ దెనుఁగునుడికారమున కనువుగఁ ద్యజింపఁబడినను నిశ్చయద్యోతన ముభయములఁదుల్యమే" అని. దీనికి మించి యిప్పుడును నేను వ్రాయవలసినదిలేదు.

"య స్వభార్యాం సపాంచాలీం క్లిశ్యమానాం దురాత్మభిః. దృష్టవానసి తస్యాద్య ఫలమాప్నుహి కేవలం" అను దానిని "అట్లు ద్రుపదపుత్త్రికిఁ బఱుపంగఁ గాంచి నగిన ఫలముఁ గంటఁగాక" యని తిక్కన తెనిఁగించుటలో, మూలంపు "దృష్టి" యందే వ్యంగ్యమగు "నవ్వు" వాచ్యమగుటచే నది యొకవిశేషము గాదని విమర్శ. "దృష్టి"యందు ఏ మనోగతమేనియుఁ బ్రకటము గావచ్చుఁగదా? ఒక నవ్వుమాత్రము వ్యంగ్యమగుట యెట్లు? ప్రకరణముఁబట్టి మనమూహించికొనవలయుఁగాక. కావున నిట వ్యంగ్యవాచ్య తారతమ్యమప్రసక్తమని నాతాత్పర్యము.

"బృహన్నళా యస్యయంతా కథం నసజయేద్యుధి" యనుచోట రథచోదక ప్రస్తావమెట్లు వాచ్యము గాలేదు? "యస్యయంతా" అనుటకు అచ్చట నుండఁగా" అను అర్థనిష్పత్తియెట్లు? చోదకత్వముగాక రథికత్వమే సుప్తమగునఁగదా సందర్భశుద్ధి నేకులును?' అని విమర్శ. అచ్చటనుండఁగా" నను వ్రాఁత పొరఁబాటే "అచ్చట నిర్వహించుచు నుండఁగా" నని యుండవలయును. ఇట విమర్శనా భావమును చక్కఁగా గ్రహింపలేదు. మూలానువాదముల రెంటను, ప్రకరణమందు ధర్మజునకుఁ గిరీటియే యుద్ధముసేసి కౌరవులఁ గెల్చియుండవలయునను నమ్మకము గలదు కాని దీని నప్పుడే స్పష్టముగ విరటునితో నుడువుట కాతని కిష్టము లేదు. కావున సారస్యముచేఁ గాని, వేఱుమార్గమునఁగాని ఉత్తరుని జయమునకు బృహన్నలయే కారణమని నొక్కిపలుకుట ధర్మజు నుద్దేశ్యము. తెలుఁగుకథలోఁ, బిమ్మట చలమురేఁగ సరికి ఆతఁడు వాచ్యభంగిగనే బృహన్నళారణకేళిని బ్రశంసించును. కాని సంస్కృతమునఁ దుదివఱకు యుధిష్ఠిరుఁడు తనభావము స్పష్టపరుపఁడని నాయూహ. ఈ దృష్టిచే నరసి "యంతృ" శబ్దప్రయోగమున నొక సారస్య మున్నదనుకొన్నాఁడను. "యంత" అనుటకు

"సారథి"యేగాక "మావటివాఁ"డనియు రూఢ్యర్థము గదా. ఇవిగాక "పాలకుఁడు" ("A director, governor, ruler") అను వ్యుత్పత్త్యర్థమునుగూడ ఆప్టే(Apte) యిచ్చియున్నాఁడు. కావున "యంతృ"శబ్దప్రయోగమునఁ బ్రకరణముం బట్టి "సారథి" యని, విరటుఁడర్థము చేసికొనవలెననియు, "పాలకుఁడు" అనునది నిజగుప్తార్థముగ నుండవలయు ననియు ధర్మజుఁ డుద్దేశించినట్లు నేను గ్రహించితిని. మరల దీనినే ప్రస్తావించుచుఁ గంకభట్టు "తాదృశేన సహాయేన కస్మాత్సనవిశేష్యతే" అని "సహాయ" శబ్దమును వాడుటయందును ఇట్టి సారస్యమే కలదని నాయూహ. ఈసారస్యగ్రహణము భ్రమయో ప్రమయో నిర్ణయించుట పెద్దలకే వదలెదను.

"పరీక్ష్యచైనం ప్రమదాభి రాశువై అపుంస్త్వమ ప్యస్య నిశమ్య చ స్థిరం" అనుటను"నైపుణంబున నుచితంబుమై నరసి పొచ్చెము లేమి" అని తిక్కన మార్చినను ఎట్లు పొచ్చెము లేమిఁ గనుగొనె నను ప్రశ్న కవకాశముకలుగుటచేతను, పాఠకులయూహ లనంతము లగుటచేతను, అశ్లీలత దూరీకృతముగా లేదని విమర్శకవాదము. ఇట బృహన్నల "నేను పేడిని; నట్టువొజ్జను; నాసేవఁ గైకొనవేఁడెదను" అని పలుకఁగా విరటుఁడు "వివర్ణమైన హృదయంబున గారవమంద, నైపుణంబున నుచితంబుమై పొచ్చెము లేమి నరసి, తదీయసేవఁ గైకొనుటకు నిశ్చయించెను" అని తిక్కన యనువాదము. బృహన్నల పలుకులందు పొచ్చెము, అనఁగాఁ గపటము లేదని విరటుఁడు "నైపుణంబున నుచితంబుమై" నరసెనట. ఎట్లరయుట నైపుణమో, ఉచితమో, తిక్కన పాఠకులకే వదలినాఁడు. ఒకరికి స్త్రీలచేఁ బరీక్షింపించుట నిపుణము, ఉచితమని తోఁచునెడల, మఱియొకరికి రూపురేఖ, మాటపొందు, అనుభావము-ఇత్యాదులఁ గనిపెట్టి పొచ్చెము లేమి నెఱుఁగుటయే "నైపుణంబున నుచితంబుమై నరయుట" యని తోఁపవచ్చును. కావున నిందు కవి అశ్లీలతాదూరుఁ డగుటయేగాక, పాఠకుల యౌచిత్యనైపుణ్య పరిజ్ఞానముం బరీక్షించుచున్నాఁడని గూడఁ దలఁపనగును.

'సైరంధ్రి నిద్రించుచుండు వలలుని కౌఁగిలించుకొని నిద్రలేపెనను మూలమును "పాంచాలి పాణిస్పర్శనంబున మేల్కని" యని తిక్కన మార్చుటలో, కౌఁగిలియొక్క ప్రమాతిశయసారస్యము పాణిస్పర్శద్యోతకమగునా? మస్తుగ మెక్కి కుంభకర్ణునివలె నిద్రించు భీముని కరస్పర్శచే మేల్కొల్పుట సాధ్యమా?' అని విమర్శక ప్రశ్న. పాంచాలిపూనికతో నిజపాణిస్పర్శనంబున వలలుని మేల్కొల్పెనని కాదు. పాంచాలిపాణి స్పర్శమాత్రముననే వలలుఁడు మేల్కొనెనని తిక్కన హృదయము. కావున నిట "ప్రేమాతిశయసారస్య" ప్రస్తావనమసంగతము. "మస్తుగ మెక్కి కుంభకర్ణునివలె నిద్రించు"వాఁడు కాఁడు తిక్కన భీముఁడు! మఱి మిక్కిలి జాగరూకతగల యుదాత్తనాయకుఁడు.

'భీముఁడు కీచకుని పరిమార్చిన ఘట్టమున, సంస్కృత భారతమునందు జరిగినది జరిగినట్లుగఁ జిత్రింపబడియున్నది సైరంధ్రివలె, ఆచీఁకటిలో నర్తనాగారములోపలనో, బయటనో, ఆడువేసమున నున్న మనుష్యవిగ్రహము కన్పట్టుచున్నఁగాని కీచకుఁడు లోనఁ బ్రవేశించుట కలుగదు. తిక్కన చెప్పినట్లుగాక, కీచకుఁడు ముందుగ నేవచ్చి నర్తనాగారముసమ్మమువద్ద వేచియుండును. కావున భీమునితో మఱియొక ఆడుది ప్రవేశించినఁ గీచకుఁడు కాంచకుండునా? కామాతురుఁడైవచ్చిన కీచకుఁడు ఆమెముందట ఆత్మస్తుతి ప్రగల్భములు వినిపించునా? కంఠధ్వనియైనను సైరంధ్రిదికానిదిగా గ్రహింపఁడేమి? భీముఁడు తన యిల్లు కానిచోటఁ గీచకునిచంపుటకుఁ బోవునప్పుడు ద్రౌపదిని వెంటఁ బెట్టుకునిపోవునా? చీఁకటిలో ఆమెను ఏ తేలైనను పామైనను కఱువదా? భీమకీచకులు పెనఁగులాడునపుడు ద్రౌపది లేచివచ్చి కీచకుని బుఱ్ఱమీద ఒకపెట్టుపెట్టదేమి?' అని విమర్శలకు యాక్షేపణ. జరిగినది జరిగినట్లుగఁ జిత్రించుట చరిత్రకార్యముగాని, కావ్యంపుఁబనికాదు. ఎట్లు జరుగుట సహేతుకముగ సరసముగఁ దోఁచునో, అట్లుకదా కవి చిత్రింపవలెను.? అందులకే గదా, మహాకవులు మూలకథలకు మార్పుచేర్పులను గావించినది? కావున ఎట్లు జరిగెనో అట్లు వ్రాయఁబడినది అనునట్టి వాదము కావ్యముపట్లఁ జెల్లదు. కీచకుఁడు

ముందుగనేవచ్చి నాట్యశాల గుమ్మమువద్ద వేచియుండి నట్లును, భీమకీచకుల సంభాషణ జరుగునట్లును కాదా, జరిగినేని కీచకుఁడు కంఠధ్వని సైరంధ్రిదిగా గ్రహించి నట్లును విమర్శన అభీష్టముప్రకారము తిక్కనరచించిన, అది కీచకకథగాక వేఱుగాథయగును. సైరంధ్రీవేషు ధారి భీముఁడే తొలుత నర్తనాగారముప్రవేశించెననియు, పిదపఁ గీచకుఁడువచ్చి యాతనిని సైరంధ్రిగ భ్రమించి సరసల్లాపములుగ ప్రగల్భములు పల్కఁజొచ్చెననియు; అందుకు సైరంధ్రివలెనే భీముఁడుబదులువల్కెననియు, సంస్కృతభారతమునందే యున్నది. ముఖ్యాంగములనే మార్చి మూలకథను తాఱుమాఱుసేయక, అవసరములగు సూక్ష్మస్వల్పవ్యయముల మాత్రముగావించి యుపంశమును సహేతుక మొనర్చుట మహాకవిలక్షణము. కావున తిక్కన విమర్శకులు చూపించు పథమును ద్రొక్కలేదు. వలలుఁడు నర్తనాగారము లోపలనో బయటనోగాక, లోపలనే పాన్పుమీఁదఁ బరుండి యుండెనని మూలము. నాట్యశాల అంధకారబంధురమని మూలానువాదములు రెండును దెల్పుచున్నవి. "దుర్నిరూపము," "దుర్గమము" అదృష్టిగోచరము" అని ఆం. భా. "తమసా సంవృతం మహత్" సం. భా. వెలుతురుగల బయలినుండి వచ్చు వానికి-కాముకునకుఁగాని, సన్న్యాసికిఁగాని - కటికిచీఁకటి గదిలోనెవరున్నారో, వారు పురుషులో స్త్రీలో తెలియుటయెట్లుఘటిల్లునో, ఇప్పటికిని నాకు దురూహ్యము. కీచకుఁడు విమర్శకు లనుకొనునట్లు, దూరమున నిలఁబడి ప్రగల్భములు పల్కలేదు.

"ఉద్వృత్తాంగ జోన్మాదుఁడై.
కీచకాధముండు కిమ్మీరవైరిపైఁ,
గేలుసాచి యా విశాలనయన
గాఁ దలంచి, మేను గరుపార నిట్లను
మదనఘూర్ణమాన హృదయుఁ డగుచు"

నని తిక్కనరచించినాఁడు. కావున కీచకునితీవ్రవేళ, కామోద్రేకము ఎంతమాత్రము 'నీఁసింప'లేదు. కీచకుఁడు కంఠస్వరముగుఱుతింప నందులకుఁ గారణము. భీముఁడు తన గొంతుమార్చుకొని సైరంధ్రివలెనే పలికియుండునని" యూహించుట సులభము. భీముఁడు మృదురీతిఁబల్కెనను తిక్కనవాక్యమును గూడ నిదే సూచించుచున్నది. మఱి, భీముఁడు సైరంధ్రినితోడఁ గొనిపోవుట కేల సమ్మతించె ననఁగా, భీమునకుఁ గీచకసంహార మొకయుపాయకరమగు ఘనకార్యముగఁ దోఁపలేదు. అది యతని కదలీఁగాఁ క్రీడామాత్రముగాఁ గన్పట్టెను. కావుననే తనప్రియురాలిని తోడఁ గొంపోవుట కెంతమాత్రమును జంకలేదు. చీకటిలోఁ దేలో, పామో ద్రౌపదినిగఱునదాయనుటకు, సూర్యునిం దలఁచిన మాత్రమున నాతని రక్షకుఁడగు మహిమగల ద్రౌపదింగూర్చి యిట్టి భయము కేవల నిరాధారము, హాస్యాస్పదము. ఆమెయే కీచకుని కత్తితో మోదరాదాయనిన, నిజభర్తసులువుగ నిరపాయముగ నతనివధింపఁగలఁడను దృఢవిశ్వాసముగల యామెకు-ఆర్య ద్రౌపదికిఁగాని, ఆంధ్రద్రౌపదికిఁగాని-విమర్శకులు గఱపు వర్తనము అనవసరము; అనుచితమును.

'ధర్మరాజు తనసోదరులను, తనను యుద్ధమునకుఁ గొంపొమ్మని విరటునిఁ బ్రార్థించుట యతని గంభీర గుణమునకుఁ దగినట్లు లేదు. విరటుఁడు తనబలము చాల దని కనుఁగొన్నవాఁడు తనయాశ్రితుల సాహాయ్యముఁ గొనుట గౌరవహీనమగునా ?' అని విమర్శకాక్షేపణ. విరటుఁడు తనబలము చాలదని కనుగొన్న ట్లెచ్చటనున్నది? వలలుఁడు బలాఢ్యుఁడని యెఱిఁగి యుండిన నుండుఁగాక! కంకభట్టును, దామగ్రంథియు, తంత్రీపాలుఁడును రణవిద్యాకుశలులని, విరటుఁ డెట్లెఱింగెను? ధర్మరాజే నిజ సోదరులతోఁ దన్నుఁ గొంపోవుటకు విరటు నియ్యకొల్పుట విరటునివలని వాత్సల్యముచేత కావున యుధిష్ఠిరగాంభీర్యమున కిది యేమాత్రమును గొఱఁతవెట్టదు.

'రక్తాంబరము రణోచితముగా' దని విమర్శకవాదము. ఇట అంబరప్రసక్తి బృహన్నలకుఁగాని, యుద్ధసన్నాహియై తరలిన యుత్తరునకుఁ గాదు. నే నెఱిఁగినంతవఱకు, రణమున కేగువీరులు—జర్మనులు, గ్రీకులు, గాని హిందవులుగాని—కవచధారులయినట్లు వర్ణితులే గాక, వారు దాల్చిన యుడుపుల రంగు ప్రస్తావముగాన రాదు. మఱి రక్తాంబరము రణోచితమనుటలో నాయు

ద్దేశ్యమేమన, "రక్త" శబ్దమే రణసూచకము. మఱి, ప్రాచ్యపాశ్చాత్త్యు లుభయులచే యుద్ధమున కధిదైవతము గాఁ దలఁపఁబడు అంగారకుని (Mars) గూర్చి యిట్లు గదా మనవారు వక్కాణిం. "అంగారకం రక్త వర్ణం రక్త మాల్యాంబరధరం రక్తగంధానులేపనం, రక్తాశ్వం, రక్తఛత్రం, రక్తధ్వజపతాకాది శోభితం" మఱియు, వాల్మీకి రామాయణమున, ఇంద్రజిత్తు యుద్ధమున కేగు నప్పుడు రెండుమారులును విజయార్థము హోమములఁ గావించు తఱి నాతఁడు రక్తాంబరములు ధరించినట్లు వర్ణింపఁబడినాఁడు. కావున రక్తవర్ణము రణసూచకమని నా తాత్పర్యము.

'కీచకునకు వలపు గత్తెతో సమాగమమే కలుగ నప్పుడు, సైరంధ్రి తనయింటికి వచ్చెదననియైన నతనితోఁ జెప్పనప్పుడు, "పాడసూపిన ట్లైన వడిఁబట్టి సమకట్టి" పద్యమునందలి యున్మాద మెటనుండి వచ్చును?' అని విమర్శకాక్షేపణ. కీచకునిది అయోగశృంగారము. అది భావోద్రేకమునందును, కామాతురమునందును వియోగ శృంగారమున కంతమాత్రమును దీసిపోవదు. "తొలుత నుండి సైరంధ్రి తన్ను వలచియే యున్నది. కట్టకడకు వాస్తవము వెలిఁబుచ్చి కూటమి కియ్యకొన్నది." అని కీచకుని భ్రమ. మనస్సంతయు సైరంధ్రివ్యక్తియందే మగ్న మయి యుండఁగా, నతనికి మదనతాపము దుస్సహమగు టయు, ఊహలు పలువిధములఁ బరువులిడుటయు భావోన్మాదము పైకొని యెటుచూచిన సైరంధ్రిరూపమే, చేష్టలే తోఁచుటయు, వెంటనే వాస్తవము స్ఫురించి నిర్భర వేదన కలుగుటయుఁ గరముసహజము. ఇట్టి రచన "మానవహృదయము యొక్కలోతునకుఁ బోయి యందలి గుట్టుమట్టును బయల్వెట్టి, తనవాగ్దర్పణంబునఁ బ్రతిఫలింపఁజేయుట" గావి, అలంకారశాస్త్రమునుండి యెరువుఁ దెచ్చుకొనుట యెంతమాత్రమును గాదు. మఱి, పైపద్య ప్రస్తావమున నేను షేక్స్పియరు గాళిదాసాదుల స్మరించుటయే దుస్సహముగఁ దోఁచి, విమర్శకులకు నాపైఁ గినుక వొడమిన నేమనవలయును?

'శోచ్య పాత్రము (Tragic character) న కుండు (Tragic element) శోచ్యగుణము కీచకుని యందు తిక్కన యేమిచూపించెను? అని విమర్శకప్రశ్న. ఇందులకుఁ బ్రత్యుత్తరము నాపూర్వవ్యాసముననే కలదు. "తిక్కన కీచకుఁడు ఉత్తమనాగరకుఁడు, సరసుఁడు; కాని, భావోద్రేక పూరితుఁడై, చలచాచవాని యురుల లోఁ జిక్కువడి, తన నేర్పును, రసజ్ఞతయుఁ బెడత్రోవఁ బట్టగా, గడపటికి సమూలనాశనముం గాంచును."

ఉత్తర బృహన్నలను సారథ్యమున కర్థించుచు, "పరిత్యక్ష్యామి జీవితం" అనుటయే మెఱుఁగు, హృదయంగమ మని విమర్శకాభిప్రాయము. "నావలని వాత్సల్యము గొలంతపెట్టెదవా?" అన్న నే మనసు కరఁగి యను కూలుఁడగు బృహన్నలపట్ల "ప్రణయాదుచ్యమానా త్వం పరిత్యక్ష్యామి జీవితం" అనుట గోటఁదీయుపనికి గొడ్డలి నెత్తుటగా నాకుఁదోఁచును.

'తిక్కనార్యుని చేతఁబడిన స్త్రీ పురుషపాత్రములు కేవలమిటీవలి హైందవస్త్రీలవలెఁ జేయఁబడి గాని వేదయుగమునకుఁ జెందిన వ్యాసుని ధీరపాత్రములు గావనియు, 'సందర్భోచిత పరిజ్ఞానమున, పాత్రపోషణమున, చరిత్ర పరిశీలనమున, తిక్కనకన్న నన్నపార్యుఁడే మూలమునకు మిక్కిలి దగ్గఱగానున్నాఁ'డనియు విమర్శక సిద్ధాంతము. ఈయద్భుత సిద్ధాంతముల సోదాహరణముగ నిలఁబెట్టవలసిన భారము విమర్శకులపైననే యున్నది. వలసినంత యుపపత్తి నొసఁగక, యిట్టిసిద్ధాంతములకుఁ గడంగుట కేవల నిష్ప్రయోజనము, సాహసము నని తోఁచును.

మఱి 'ఆంధ్రులు అతిమాత్రముగఁ దమ్మఁ దాము పొగడికొను స్వభావము కలవా'రనియు 'సుగుణసంపత్తి యందుఁ బ్రాచీ నార్యులకు మిక్కిలి లోపువా'రనియు నీవిమర్శయందు ఆంధ్రజాతిమీఁదనే నిందారోపణము కలదు. ఇందులకును, నావ్యాసమునకు సంబంధము శేఱుపపత్తి మృగ్యము. నన్నితిక్కనప్రశంసకుఁ బ్రేరేపించినది జాత్యభిమానముగాని, వ్యక్త్యభిమానముగాని కాదనియు, గుణానురాగమే, "రసప్రపలుబ్ధబుద్ధి" యే యనియుఁ బ్రకరణ శుద్ధిగఁ బాఠకలోకమునకు విన్నవించువాఁడను. మఱియు నేను చరిత్ర పరిశోధకుఁడను గాను; కావున, చారిత్రక దృష్టితోఁ గావ్యముల పరిశీలించుటకు నాకధికారము

లేదు. అంతేకాక, చారిత్రకపరిశోధనము వేఱు; సారస్వత విమర్శనము వేఱని వాతలంపు. ఇందుల కనుగుణముగ, వాఙ్మయమున నాకుఁగల లఘుపరిచయముం బురస్కరించుకొని, కావ్యశిల్పదృష్టితోఁ దిక్కన విరాటపర్వముం బరికించి నాకుఁదోఁచిన యంత వ్రాసినాఁడను. ఇందలి గుణదోషములను సత్యైకదృష్టులగు సహృదయులే నిర్ణయింతురుగాక.

ముగింపునకు మున్నొకమాట. విమర్శయందు ఈ క్రింది వాక్యములవంటివి గొన్ని కానవచ్చుచున్నవి. "ఇక్కడ (తిక్కన) సంగతి సందర్భములను, ఉపపత్తిని గ్రహించి వ్రాసినదిగాదు." "తిక్కనయందు స్వభావానుసరణ మెంతమాత్రమును గన్పట్టదు." "తిక్కనది కేవలము తిక్కగొన్న యూహాప్రపంచము. సందర్భశుద్ధి, పరిస్థితుల యౌచిత్యము నెంతమాత్రము గమనింపలేదు." ఆంధ్రావని యంతెల్లెడఁ "కవిబ్రహ్మ"యని పూజింపఁబడు తిక్కన రచనమును విమర్శించునపుడు — అభిప్రాయభేద మెంత తీవ్రముగనైన నుండుఁగాక—పైతీఱున, మూఁడవఫారము విద్యార్థి వ్రాఁతను విమర్శించుధోరణి నవలంబించుట న్యాయ్యమా? విమర్శను మర్యాద నతిక్రమించినదను నడికి గుఱిసేయుటగాదా? యను ప్రశ్నను విమర్శకులకే వదలెదను.

---

## తమస్విని

శ్రీ. శ్రీనివాసరావు గారు (కవితాసమితి)

నినదించునా వినూతన చకోరకగీతి
 కనిపించునా సుధాకర బంధురజ్యోతి
నాయమావాస్యా విహాయసమ్మున నేడు?

* * * *

ఒక ఎరుంగని వేదనోద్వేలత వహించి
వికసించి ముకుళించి బెగడు నక్షత్రాలు;
ఏదొహృదంతర బాధపడలేక విడిపోయి
కదలాడు తెరువింత కనరాక జలదాలు;

ఏ చెట్టు మసకలందొ చరించి సమీర
వీచికలు బ్రదుకు నాతో చెప్పుకొని ఏడ్చు;
నాగర్భమున రోదనధ్వానములె మ్రోగు'

* * * *

ఏ నెరుంగుదు ప్రేయసీ నూత్నయౌవనా
ధీనుడై ప్రియుడు వర్తిలిన వెన్నెలవేళ
తీయనై నాటి సందీప్తి తోచెను కాని
ఈయమావాస్యనే హెచ్చు నేవరియింతు!
నేను దట్టపుమంచు సోనలే కురియింతు!

---

## సింహాచలేశ మహత్త్వము

శ్రీ విక్రమదేవవర్మ గాఉ

భర్గలింగంబుఁ జూడని వైష్ణవులకు - లింగమే బ్రహ్మ మను శైవపుంగవులకుఁ
దెలివి గలిగింప సింహాద్రి వెలసి లింగ-తను దదంతర్గతాకృతిఁ దనరు నృహరి.

# నేనే అపరాధిని

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు.

'రుక్మిణీ! ఇల్లు కుదిరింది రేపు ఉదయమే మన మా యింటికి వెళ్లాలె: సామాను సర్దుకొని సిద్ధంగా ఉండు, అనినాడు గోపాలరావు యింటికి రాగనే. 'ఏమీ. యిల్లు కుదిరిందా? గచ్చుయిల్లేనా? దొడ్లో బావి ఉన్నదా? బావి వంటయింటికి చేరువేనా? పాకీదొడ్డికూడ ఉన్న దేమో చూచారా? లేకపోతే యిబ్బంది. యిరుగుపొరుగు వాళ్లు మంచివాళ్లేనా?' అని గ్రుక్కతిప్పకుండ ప్రశ్నించినది రుక్మిణి.

'ఆ- ఇల్లు గచ్చుయిల్లే. బావీ దొడ్డీ ఉన్నవి. ఇరుగుపొరుగు ఆడవాళ్లు మంచివాళ్లో చెడ్డవాళ్లో నాకు తెలియ'దన్నాడు. గోపాలరావు నవ్వుచు.

'అద్దె యే మాత్రము?'

'ఎనిమిదిరూపాయలు'

'అబ్బా! ఇక్కడకంటె మూడు హెచ్చా! కష్టమే.

'అవును, ఏమిచేయను? నీవు ఈమట్టికొంప అలుకోలేక అవస్థపడుతుంటే చూడ లేక మతి మందు తగిలించుకున్నాను. అప్పుచేసైనా ఆడదానిని సుఖపెట్టాలెనని ఈకాలపు సామెత.'

'ఊరిక నామీద నెపంపెడతారు కాని మీకు మాత్రం యీయిల్లు బాగాఉందా యేమిటి? ఈ పందికొక్కుకన్నాలు చూచి నాకంటె మీరే ఎక్కువగా విసుక్కుంటున్నారు. మీకోసమే అనుకోరాదూ!'

'నాకేమి, పగలు పదిగంటలకు కచ్చేరికి వెళ్లితే సాయంత్రం ఏడుగంటలకుగాని కొంపకు రాను. ఈ యిల్లు ఎట్లా ఉంటేనాకేం బాధ? ఎల్లప్పుడూ ఉండేదానవు నీవూ. నీకోసమే యీయిల్లుమార్చడం. చిగురుటాకులవంటి నీ మెత్తనిచేతులతో పేడా మన్నూపెట్టి యిల్లు అణచి అణచి అలుకుతుంటే నా చేతులతో రుద్దినట్లు నా కెంతో బాధగా ఉంటున్నది. అందువల్లనే మనకొచ్చే ఏభై రూపాయల జీతంలో పిల్లలు, మనము తిండి తినగా నెలనెలా ఎనిమిదిరూపాయలు ఎత్తియియ్యడం కష్టమైనా, నీ శ్రమ చూడలేక నే యిల్లు కుదిర్చాను. ఇంకా వేడినీళ్లకు చన్నీళ్లు తోడుగా ఏటా మాన్యంమీద రెండువందలు వస్తున్నాయి కాబట్టి ఈమాత్రం అవకాశం చిక్కింది. లేకపోతే ఎంచేస్తాము?

పెనిమిటి ప్రేమపూర్వక భాషణములకు రుక్మిణి పొంగిపోయినది.

ఆరాత్రి ఏ రెండుజాములు నిద్రపోయిరో కాని, మిగిలిన కాలమంతయు క్రొత్తయింటికి పోయే యత్నములోనే సతీపతులు గడపినారు.

తెల్లవారగనే గోపాలరావు బజారుకు వెళ్లి మూడు ఒంటెద్దు బండ్లను తీసికొనివచ్చినాడు. రెండు బండ్లలో సామాను వేసినారు. ఒక బండిలో కొద్దిగా సామాను పెట్టుకొని, ఎడబిడ్డను పక్కనూ పసిబిడ్డను ఒడిలోనూ కూర్చుండబెట్టుకొని రుక్మిణి కూర్చున్నది.

బండ్లు క్రొత్తయింటికి చేరగానే భార్యతో 'సామాను నేను యింట్లో వేయిస్తాను; వంటప్రయత్నము చేయ' మన్నాడు గోపాలరావు.

'అవును కచ్చేరిరోజుకూడాను' అని రుక్మిణి వంట వస్తువులు మాత్రము తీసుకొని వంటచేయుటకు వెళ్లినది.

గోపాలరావు సామాను యింటిలో వేయించి బండ్లవాండ్లకు బాడుగ యిచ్చి పంపివేసి పదివేలరూపాయలు కర్చుపెట్టి కట్టించుకొన్న యింట్లో ప్రవేశించినట్లుగా సంతసించినాడు. ఇల్లు అనుకూలమైనదిగా నుండుటచేత రుక్మిణికూడ చాలసంతోషించినది. బస్తీలలో అనుకూలమైన యిల్లు లభించుట నిజముగా బ్రహ్మానందకరమైన విషయమేగదా.

సకాలమున వంటజేసి పెనిమిటికి భోజనముపెట్టి కచ్చేరికిబంపి,తరువాత పిల్లలకుబెట్టి తానుగూడభోజనము చేసి, పట్టింటబడియున్న సామానులు సర్దుకొనుటకు రుక్మిణి

ఆరంభించినది. సాయంత్రము నాల్గుగంటలవరకు అదే పనిని చేయుచున్నను సర్దుబాటు పూర్తికాలేదు. కాన రేపు చేయవచ్చునని రుక్మిణి ఆ పనిని అంతటితో నాపి సందెపనులు తీర్చుకొని మడిగట్టుకొనుటకు సిద్ధమగుచున్నది.

ఇంతలో గోపాలరావు కచ్చేరినుండి వచ్చి, రుక్మిణీ! సామాను లేమి సర్దుతావు. పెట్టె సర్దుకో' అనినాడు నవ్వుచు. అదేమి టనినది రుక్మిణి. "మీ చెల్లెలు పెద్దమనిషైనదట. 'మాఅమ్మాయిని వెంటనే పంపగోరెదను. ఇంట్లో ఎవ్వరూ లేరని మీకు తెలుసును గదా' అని మీ నాయనగారు"

"ఉత్తరము వ్రాసినారా?"

"కాదు, తంతి నిచ్చినారు."

"అవును, యింట్లో ఎవరున్నారు!" అని రుక్మిణి తల్లిని దలచి కన్నీరు నించినది.

గోపాలరావుకు భార్యకన్నీరు చూడగనే జాలి వేసినది. "ఈరాత్రికి బహుశః మనిషికూడ రావచ్చును. రేపుదయమే వెళ్లుదువుగాని విచారపడకు" అనినాడు.

"వెళ్లుటకేమి, వెళ్లుతాను; అదికాదు నా విచారము. ఈ అడ్డుకూడా తీరింది–ఇక వా ళ్లుంచరు. ఇక మా నాన్నే గంజి కాచుకోవాలె. మా అమ్మ మా నాన్ననూ, మమ్మన్నీ గూడా పశువులనుచేసి విడిచిపోయింది" అనినది రుక్మిణి కన్నీళ్లతో.

'చాలు చాలు నీ పిచ్చి; పదేండ్లనాడు పోయిన తల్లికోసం యిప్పు డేడు పేమిటి'

"ఎప్పుడూ ఏడుపే. తల్లి కొఱత సామాన్యపు కొఱతా! తల్లి లేకపోతే పుట్టింటిసుఖమే లేదు. అందు వల్లనే గదా తల్లి ఉంటే పుట్టిల్లు; పాలుంటే పరమాన్నము అంటారు!"

"అవునుగాని, పిల్లలకు అన్నము పెట్టావా?"

"ఆ, ఇందాకనే పెట్టాను."

"సామానులు చక్క–పెట్టావు; తలా దువ్వుకొన్నావు; పిల్లలకు అన్నమూ వండిపెట్టావు. అప్పుడే మడి కూడా కట్టుకున్నావు. నీవు ప్రయాణ ప్రయత్నం మీద నే ఉన్నట్టున్నావు చూస్తే."

"అయ్యో, నాకేం తెలుసు, ఇట్లా టెలిగ్రాం వస్తుందని–నేను కలగన్నానా?"

"కలగన నక్కర్లేదు. మీ ఆడవాళ్లు ఎప్పుడూ పుట్టింటికి వెళ్లే ప్రయత్నములోనే ఉంటారు. ఈ విషయంలో మీకు దివ్యదృష్టి ఉన్నది."

"బాగానే ఉన్నవి మీ మాటలు" అని, రుక్మిణి పక్కున నవ్వి, "ఎక్కడ సామాను లక్కడ ఉన్నవి. ఈ యిల్లు వదిలిపోవడ మంటే నాకు ఎట్లాగో ఉన్నది. మీ రిట్లా హాస్యంచేస్తారు" అనినది.

"అవును. యిప్పుడు నీ మనస్సులో ఎట్లా ఉన్నదో నాకు తెలుసును. ఈపాటున రెక్కలుకట్టుకొని వెళ్లి మీ చెల్లెలివద్ద వాలి, ఆపెద్దమనిషైన పిల్ల కింత చిమ్మిలి పెట్టి నీ వింత తినాలె"నని ఉన్నది.

"మీ హాస్యాలకేమి. మా చెల్లెలినీ నన్నూ చూస్తే మీ కెప్పుడూ నవ్వులే. మీతో మాట్లాడుతుంటే నాకు వంటకు పొద్దుపోతుంది."

"అవునవును–వెళ్లు. ఈ పూటైనా యింత కమ్మని కూరా, గాఢైనచారూ చెయ్యి. రేపటినుండి నా అవస్థ ఉండనే ఉన్నది, సుబ్బమ్మహోటలులో. ఉడకని ముక్కలూ, కాగనిచారూ, ఒకటీ రుచీలేని భోజనము."

"అవును–ఇల్లు కదులుదామంటే మీకు భోజనానికి యిబ్బందనే నాకు దిగులు."

"అవునులే కాని"అని పిల్లవాని నెత్తుకొని గోపాలరావు వాకిలిలోనికి వెళ్లినాడు.

౨

రాత్రి ఒంటిగంట బండిలో వారనుకొనినట్లే రుక్మిణిని తీసికొనిపోవుటకు ఆమె పెదతండ్రి కొమారుడు వచ్చినాడు. ఉదయముబండిలో గోపాలరావు భార్యాబిడ్డలను పంపలేక పంపలేక పంపినాడు. గోపాలరావు చాల మంచివాడు; భార్యానురాగముగలవాడు; సరసుడు;

చదువుకొనినవాడు. విశేషించి హాస్యాలాపప్రియుడు. కాని కొంచెము తొందరపాటు స్వభావము కలవాడు. కాన ముందువెనుక లరయక శీఘ్రముగా కోపమును, మనోవ్యాకులమును చెందుచుండును. కాని రుక్మిణి వచ్చిన తరువాత తన సాధుప్రవర్తనముచే సమయోచిత సపర్యలచే నాతని సంతుష్టిపఱచి ఆతని ఆత్రభావమును వెలు వడకుండ చేసినది. రుక్మిణి కాపురమునకు వచ్చిన ఆఱు సంవత్సరములనుండియు ఆ సతీపతు లిద్దఱిట్లే యన్యోన్యానురాగములో సుఖమైన కుటుంబ జీవనము చేయుచున్నారు.

భార్యాబిడ్డలను రైలులోనికి ఎక్కించునప్పటికి గోపాలరావుకు నిజముగా కనులకు నీరే క్రమ్మినది. పెనిమిటి వదనము చూచి రుక్మిణి జాలిచెంది, పదిదినముల కంటె ఎక్కువ యుండననని నమ్మబలికి రైలుయెక్కినది.

గోపాలరావు యింటికి వచ్చినాడు. భార్యాబిడ్డలు లేకపోవుటచే యిల్లు దోబూచిగానుండి విచారము గొల్పినది. అచ్చట నొక్కక్షణమైన నిలుచుటకు గోపాలరావుకు మనస్సు గొల్పలేదు. వెంటనే ఉత్తరీయమును బుజముపై వేసుకొని తలుపుకు తాళము పెట్టి యే స్నేహితుని యింటికో వెళ్లిపోయినాడు.

రాత్రిభోజనముగూడ చేసిన తరువాత తొమ్మిది గంటలరాత్రికి గోపాలరావు మరల యింటికి వచ్చినాడు. దగ్గిరనున్న ఎలక్ట్రిక్ లైటు సాయముతో తలుపు తాళము తీసి లోనికి బోవగనే కాలికేదో తగిలినట్లయి గోపాలరావు ఉలిక్కిపడి చూడ అది ఒక పెద్ద కాగితపు కవరు. గోపాలరావు లాంతరు వెలిగించి చూచినాడు. దానిపై నెవరి పైవిలాసమును లేదు. లోపల బరువుగా నున్నట్లు తోచుటచే ఏమి కలదోయని చించి చూచినాడు. బి. వి. కృష్ణారావు, స్పెషలుడ్యూటీ యిన్స్పెక్టరు, రేపల్లె, గుంటూరుజిల్లా-అను పైవిలాసము వ్రాయబడినపది రెండు అణాకవరులును ఒక చిన్న చీటియును నున్నవి. ఆ చీటి యందిట్లు వ్రాయబడియున్నది:—

ప్రియా,

ఈ పాడు స్పెషలుడ్యూటీ యెందుకు వచ్చినదో కాని, నిన్ను వదిలి పెట్టియుండడము నాకు చాల విచారముగా నున్నది. విధి లేక వచ్చితిని. నాకు ప్రాణమంతయు నీమీదను, బొంది యిచ్చటను నున్నవి. ఏమిచేయుదు? ఉద్యోగధర్మ మట్టిది. నీవు పోస్టాఫీసునుండి కవరులు తెప్పించుకొనుట కష్టముగు నేమోనని వజను అణాకవరులు పైవిలాసముగూడ వ్రాసి పంపినాను. ఇవి జాగ్రత్త పెట్టుకొని తఱుచు ఉత్తరములు వ్రాయ గోరెదను.

బి. వి. కృష్ణారావు.

ఆ ఉత్తరమును జూచి "ఎవ డీ కృష్ణారావు? ఇతని ఉత్తరములు నాయింటి కెందుకు వచ్చినవి?" అని నిర్ఘాంతపోయినాడు గోపాలరావు. ఉత్తరక్షణమునందే గోపాలరావు హృదయమున అనేక దుర్భావము లుదయించినవి. తన ప్రియభార్యయైన రుక్మిణి యెడల బలితంపు అనుమాన మేర్పడినది భ్రాంతుడైనాడు. మతి చెడినది. విహ్వలహృదయముతో, 'హా రుక్మిణీ! ఎంతమోసము చేసితివి! ఎంతఘాతుకమున కొడిగట్టితివి! బి. ఏ. అని ఆశించితివా! ఇన్స్పెక్టరని మోజుపడితివా! నీ మన్నన లన్నియు కపటములేనా? నీ ప్రేమప్రకటనమంతయు బాహ్యనటనమేనా? నీ సాధువర్తనమంతయు దొంగవేషమేనా? హా! నారీహృదయ మెంత అగాధము! ఎంతవిషపూరితము! ఎంత దుర్జ్ఞేయము! హంతకునిహృదయమునైన నెఱుగవచ్చును; చోరుని చిత్తమునైన గ్రహింపవచ్చును; కామినీహృదయకపటమును మాత్రము గ్రహింపనశక్యము పరపురుషాసక్తవగుటకు, రుక్మిణీ! నేను నీకేమి యపకార మొనర్చితిని? ఏమి యనాదరణ చేసితిని? నా సర్వస్వము నీవేనని నీపైగాఢానురాగము కలిగియుంటినే! నాయక్కఱలనైన తగ్గించుకొని నీకోర్కె లీడేర్చుచుంటినే. ఆ యభిమానమైన నీకు లేకపోయెగా! ఏమి నాయూహ! అంత సుగుణశీలయగు నారుక్మిణి యిట్లు చేసియుండునా? అక్రమముగా నామెపై దురూహపడుచుంటి నేమో? దురూహ యెట్లు? "ప్రియా" అని ఆ దుష్టుడు చేతులార వ్రాసిన యుత్తర మెదుటనేయున్న దిగదా. "తఱుచు ఉత్తరములు వ్రాయవలెనట! ప్రాణమంతయు నిక్కడ, బొంది యక్కడ నున్నదట" కవరులు పోస్టాఫీసునుండి వచ్చుట కష్టమని అణాకవరులు పంపెనట. అవి జాగ్రత్తగా దాచవలెనట. ఎంతవివరముగా వ్రాసినాడు. ఇన్ని పైవిలాసములు

వ్రాసినకవరులు పెద్దకవరులోపెట్టి దానిపై పేరు వ్రాసినాడుకాదు. ఎంత దొంగముండాకొడుకు, అయ్యో! ఇంత పాపిష్ఠి ఉత్తరమును కండ్లార గాంచి నమ్మకుండు టెట్లు? ఛీ! ఇట్టి యిల్లాలి నేలుటకంటె బ్రహ్మచారిత్వము లగ్గు. సన్యాసమే మేలు. మృత్యువే యుత్తమము: ఆ పాపాత్మురాలి మొగము నిక చూడరాదు. ఒక ఉత్తర మాదుష్టురాలి కిప్పుడే వ్రాసి పాఱవేసి పోయిగ నుందును. దాని పాపఫల మదియే యనుభవించును."

కోపతీవ్రతచే గోపాలరావు అప్పుడే యొక ఉత్తరమును వ్రాసి సమీపముననున్న తపాలాపెట్టెలో వేసి వచ్చెను. నూరు సుగుణము లున్నను నవి రాణించుటకు బహుకాలము పట్టును కాని యొక్కదుర్గుణ మున్న నది క్షణములో పొడసూపి కొంపలు కూల్చివేయును

3

పగలు మూడుగంట లైనది. ఊరిలో పిలువబోవుటకై నాత్రపడుచు రుక్మిణి జడవేసికొని పిల్లలకు తలదువ్వుచున్నది. ఇంతలో సమర్త పెండ్లికూతురైన సీత "అక్కయ్యా, బావవద్దనుండి ఉత్తరము వచ్చినది. నాన్న నీకివ్వమని లోపలికి బంపినారిదుగో" అని అక్కచేతిలో బెట్టినది. "మీ బావగారికి రైలుయెక్కించినది మొదలు జాబులు వ్రాయుటే పని. నాన్నమాట కాదనలేక పంపుతారు గాని మేము లేకపోతే వారికి దిన మొకయుగము ముఖ్యముగా హోటలుభోజనము చేయలేక కొంత ఆ శ్రమ" అని నవ్వుచు చెల్లెలిచేతిలోని కవరునందుకొని చింపుచు గదిలోనికి వెళ్లినది రుక్మిణి. తన సుఖమయసంసారమున కది యశనిపాతమనియు, తన పరమసాధ్వీత్వమున కది గొడ్డలిపేటనియు, తన యకల్మషచిత్తమున కది విషదగ్ధశల్యమనియు, పాపము, రుక్మిణి భావించి యుండెనా? లేదు. సరసములై, మృదులములై, ప్రేమభావ భరితములై, హాస్యరసపూరితములై యెప్పుడు మనోజ్ఞశబ్దజాల శోభితంబగు ప్రాణేశ్వరుని స్వహస్త లిఖితలేఖయే యని తలచినది కాని, అది కాదు ఇది. అలనాటిలేఖ లమృతసన్నిభములు. ఇది హాలాహలతుల్యము. రుక్మిణి నిశ్శంకముగ లేఖ విచ్చి చూచినది. వెంటనే, 'అయ్యో! ఏవ డీకృష్ణారావు! కలనైన మాచి యెఱుగనే'

అనుచు గాలితాకుడుకు నల్లలనాడు తీగవోలె శరీర మాపాదమస్తకము కంపింప రుక్మిణియు, నుత్తరమును నొక్కమాఱే నేలగూలినారు. ఏదియో పనితొందరలలో నుండుటచే రుక్మిణి పాటెవ్వరును జూడనేలేదు. కొంతసేపటి కవరిశైత్యోపచారములు లేకయే రుక్మిణి తెలివొందినది. తన పెనిమిటి వ్రాసినదేనా యని పరీక్షించి చూచినది. సందేహములేదు. అతనిదే దస్తూరి. "అయ్యో! ఎట్టిదారుణాపనింద తలపై బడినది! ఇంకొకటి ఇంకొకటి గాదే. మనసునసైన తలపరాని, వాక్కునసైన నుచ్చరింపరాని, చెవినైన వినరాని యపనిందే! మొగము చిన్నబోయి, కన్నులు చెమ్మగిల్లుచుండ, నెంతయో దుఃఖముతో నిన్నగాక మొన్న, పంపలేక పంపలేక నన్నంపిన నా పెనిమిటి యింతలో యింత యనుమానమున కెట్లు లోనయ్యెను? నన్ను పరీక్షించుట కిట్లు వ్రాసియుండరు గద! రామ! రామ! ఎప్పుడును లేని పరీక్ష లిప్పు డెందులకు వచ్చెను? వారికి నాపై పరిపూర్ణవిశ్వాసమే! గాఢానురాగమే! అయిన ఇట్లేల వ్రాసిరి? వారు నాపై నీవిధముగా దురభిప్రాయపడుటకు కాశ తాళీనముగా బలీయమగునాధారము లేవైన జిక్కియుండవలెను. అయ్యో, చిక్కియుండవలెనని నా యూహ లేల? చిక్కినవనియే గదా వారు వ్రాసిరి! ఎట్లులభించియుండును? అనుమానము లేనిచోట ఆధారము లెట్లు చిక్కినవి? అయ్యో! ఏమి దారి! నా ప్రాణపతికి గాని నా కీజన్మ మెందుకు? ఈ ప్రపంచ మెందుకు? ఈ బిడ్డ లెందుకు? ఏ నూతిలోనో, గోతిలోనోపడి ప్రాణమువిడుతునా? అయ్యో! నా నిర్దోషత్వము వెల్లడించుకొనకుండనే? ఎట్లు వెల్లడించుకొందును? నా ప్రాణేశ్వరుడు నాకిక దర్శనమైన నిచ్చినగదా! ఉత్తరము వ్రాయుటకైన నవకాశ మిచ్చినగదా!. ఆ ఉత్తరమెంతకఠినముగ నున్నది! కొరడాదెబ్బలు చర్మమునే నొప్పించును; కత్తివ్రేటు శరీరమునే ఛేదించును; కాని యీ యుత్తరములోని మాటలు హృదయమునే వ్రక్కలు సేయుచున్నవే! ఏమని వ్రాసినారు? మరల జూతునా!

రుక్మిణీ:—

"ఇంతకాలమునుండియు నీవు యోగ్యురాల వని నమ్మి నిన్న త్యధికముగా ప్రేమించుచుంటిని; గౌరవింపు

చుంటిని. కాని బి. వి. కృష్ణారావు అను నీప్రియుడొకడు నీకు స్వయముగా వ్రాసినయుత్తరమును, అతనికి నీవు మరల జవాబు వ్రాయుటకై యాతని పైవిలాసము వ్రాసిపంపిన పదిరెండు అణాకవరులును నేను నేడు స్వయముగా జూచితిని. ఎన్నాళ్లనుండి యీవిధముగా చరింపుచుంటివోగాని నేటికి నీతుచ్ఛత్వమును కండ్లార గాంచితిని. పాపమెన్నటికైనను బ్రద్దలు కాకమానదు. ఇక నీ యకృత్యమును నీ వేవిధముగను కప్పిపుచ్చుకొనజాలవు. నీ కపట లేఖలను నేనిక నమ్మను. నేటితో నీకును నాకును సరి. గౌతమశాపోపహతయైన అహల్యవలె అచ్చటనే పడి యుండుము ఇది కడసారి జాబు.

తా. గోపాలరావు"

"అయ్యో! ఎంతనిష్కరుణముగ నున్న వీమాటలు! ఆఱువత్సరములు నా సంగతినుండి నాయోగ్యతాయోగ్యతలు గుర్తించియు నీయుత్తరమును చూచినంత మాత్రమున నిట్లు నాపెనిమిటికి నమ్మకము గలుగుట నా పాపముగాని వేఱు గాదు. నా పండువంటికాపురమును భగ్నముచేయుట కెవరిచే నీలేఖలు సృష్టింపబడెనో దైవమునకెరుక. అయ్యో! ఏమి చేయుదును?చచ్చుటకును, బ్రతుకుటకును పాలుపోకున్నది. త్వరపడి ప్రాణములు విడిచిన అపనింద స్థిరపడిపోవును. బిడ్డలగతికులై పోదురు. ప్రాణములపై తీపిచే బ్రదికిన, భర్తకు దూరమై పుట్టినింట పడియుండెడి బ్రదుకు మరణముకంటె నధమమైనది."అని రుక్మిణి పలువిధముల తలపోయుచు సంతతధారగా వెడలెడి కన్నీళ్ల గోట జిమ్ముకొనుచు,నుత్తరముదెస చూచుచు,మరల మరల దుఃఖింపుచు,తాను పిలుపునకు పోవలసినమాటయే మఱచిపోయినది. మేళమువాయించుటకై వచ్చిన భజంత్రీలు వాకిట నిలిచియున్నారు. అరగంటయైనది. గంటయైనది. రుక్మిణి బయటికి రాలేదు. అదేపనిమీద నుండి యుండునని రుక్మిణికొఱ కెవ్వరును వెదకలేదు. కాని యెంతసేపటికిని రుక్మిణి పిలుపుకు బయలుదేరమిచే తండ్రి చూచిచూచి విసిగి లోనికి వచ్చి సీతను జూచి "అమ్మ! అక్కయ్య యేదీ? పేరంటము పిలవడాని కింకా వెళ్ల లేదేమి" అనినాడు. అక్కయ్యా, నాన్న పిలుస్తున్నారంటూ సీత అక్కడినుండి బిగ్గరగా నఱచుచు గదిలోనికి వచ్చినది. సీతపిలుపుతో రుక్మిణికి బాహ్యస్మృతి గలిగినది. అవమానకరమైన తన పెనిమిటిజాబు నెవరును జూచుట కామె కిష్టము లేదు. కాన ఆయుత్తరమును చప్పునచేతికి దీసికొని నలిపి పిడికిట బట్టుకొనినది. తన దుఃఖము గూడ సీత చూడకుండనుండవలెనని రుక్మిణి తలంచెను; కాని ఆమె కంటినీరు తుడుచుకొను లోపలనే సీత అక్క వద్దకు వచ్చెను. ఆక్కదుఃఖమును చూడనేచూచెను. కాన బిక్కమొగముతో "ఎందు కేఅక్కయ్యా, ఏడుస్తున్నావు" అని తానుగూడ కన్నుల నీరు నించెను. "ఏమీ లేదమ్మా, ఏమీ లేదు. ఎదో మీ బావగారు కోపంగా ఉత్తరం వ్రాస్తే కొంచెం కష్టం తోచింది, అంతే. నాన్నకు చెప్పబోకేం"అని రుక్మిణి లేని యుత్సాహమును దెచ్చుకొని లేచినది. తల్లి లేని సీతకు తానే పెద్ద. తా నుపేక్షించిన సీత ముద్దుముచ్చట లెవ్వరివలన దీరును? కాని అపనిందావ్యథచే హృదయము కొండంత భారముగా నున్నను, తనదుఃఖమొగుల కెఱుకపడకుండ మొగమును చన్నీటిచే పలుమాఱు గడిగి, బొట్టు పెట్టుకొని, పెట్టెలోని మేలైన చీరనొకదానిని తీసి కట్టుకొని పిలుపునకు వెళ్లి వచ్చినది. ఏదో విధముగా పేరంటమైపోయినది. ఆ రాత్రి యేదియో నెపము పెట్టి రుక్మిణి భోజనము చేయలేదు. నిద్రగూడ పోలేదు. ఏదియో వివరింపజాలని యావేదనాదుఃఖములో నిశి గడపినది. ఆ ఒక్క రాత్రికే రుక్మిణి సగమునకు సగము చిక్కిపోయినది. క్రమక్రమముగా నామె తనూలతే మఱింత శోషిల్లినది. మొగము కళాహీనమైపోయినది. కంటితడి యాఱుటే లేదు. వారముదినములగునప్పటికి రుక్మిణిపోలికే లేదు. పూర్వపుదినములలో రుక్మిణి ఎప్పుడు చూచినను చేయనిశ్ళృంగారము, మాయని మడత. ఇప్పుడో, పిచ్చిది. సర్వదా ఏదియో యోచన. పట్టుమని పదిమాటలాడుటే మానుకొనినది. నలుగురిలోనికి రావలెనని యుత్సాహమే లేదు. ఏకాంతమే ఆమె కిష్టము. తల్లి ఆదరణ తప్పవగుటచే పిల్లలుగూడ చాల చెడిపోయినారు. కాని ఆ విషయముగూడ రుక్మిణి మదికి తగులనే లేదు. కాని రుక్మిణి యిట్టి యిహబంధదూరముగా నున్నను, ఆమె నింకను నొక్క ఆశ మాత్రము పీడింపుచున్నది. ఏమన: త్రికరణశుద్ధిగా తాను పవిత్రురాలు; భగవంతుడు

సజ్జనహితుడు; తన నిర్దోషత్వ మెఱుకపఱచి యేనాటి కైన తనకు భర్తృసాన్నిధ్యము కలిగింపడా యని యామె యాశ. ఆ ఆశాంకురమే యామెను మృత్యువుపాలు గాకుండ రక్షించుచున్నది.

౪

గోపాలరావైన సుఖముగా లేడు. ఉద్యోగవిశేషమున పగ లేదియో విధముగ గడచిపోవుచున్నను, రాత్రిని గడపుట యాతనికి బహు దుస్తరముగ నున్నది. రుక్మిణి తన యెడల జూపిన భక్తిశ్రద్ధలకు సంబంధించిన ప్రేమగాథ లెన్నియో ఆతని స్మృతి పథమున నంకితములై యున్నవి. అవి మఱవరాని ప్రేమ చిహ్నములు. తనకంటె నితర దైవము లేదనునంతటి భక్త్యనురాగములతో రుక్మిణి తనను సేవించినది. అట్టి రుక్మిణి సత్ప్రవర్తనకును తా నిప్పుడు ప్రత్యక్షముగా జూచిన లేఖకును నెట్లు సమన్వయము చేయవలెనో ఆతనికి తోచలేదు. దుఃఖ మొకవంక, ఆశ్చర్య మొకవంక, కరుణయొకవంక, కాఠిన్య మొకవంక చేరి యాతని మానసమును కల్లోలపెట్టుచున్నవి. ఈయుత్తర మెవరికో సంబంధించినదై రుక్మిణి నిరపరాధిని యైనచో, తాను వ్రాసినజాబును చూచి రుక్మిణి యెంత శోకసంతప్తయై యల్లాడిపోవుచున్నదో యని తలచినప్పు డాతని కనుకొలకులనుండి వెలువడెడి కన్నీటిధారలతో నాతని పర్యంకము తడిసి ముద్దయై పోవుచున్నది. ప్రత్యక్షముగా జూచిన దానికి నిదర్శనము లెందులకు? రుక్మిణి నిశ్చయముగా దుశ్శీలయని భావించినప్పు డాతని నేత్రములనుండి యగ్నికణములు రాలుచున్నవి. 'ఛీ ! ఎంత దుర్మార్గకృత్యము సేయుచు నెంతటి సాధుచరితగా నటించి మోసపుచ్చినది!' అని తలంచినప్పు డాత డరరే, స్త్రీహృదయ మెంత యగాధమని ఆశ్చర్యముగ్ధుడైపోవుచున్నాడు. ఈవిధముగా పొడముచున్న భావపరంపరల కల్లోలముచే నాతనికి రేలు సుఖనిద్రాదాయకములగు విశ్రాంతిసమయములుగా నుండుట లేదు. భూలోకనరక మనుభవించుట కేర్పడిన కాళరాత్రులుగా నుండుచున్నవి. ఇతరులతో జెప్పుకొనిన విచారము తగ్గుటయు, సంతోషము హెచ్చుటయు నైజము. కాని యవమానభరముచే రుక్మిణిగాని, గోపాలరావుగాని తమ మనోగత క్లేశమును నాప్తులగువారితోగూడ జెప్పుకొనుటకు సాహసింపలేదు. లోలోన తపించి కృశించిపోవుచున్నారు. 'ఏమోయి గోపాలరావూ! ఇట్లా చిక్కిపోతున్నావు?' అని గోపాలరావునుగాని, "ఏమే అమ్మాయి! యిట్లా చిక్కిపోతున్నా"వని రుక్మిణినిగాని బంధుమిత్రు లెవ్వ రడిగినను, ఏమీ లేదనియే సతీపతుల ప్రత్యుత్తరము.

౫

రుక్మిణి యుమ్మలికమునకు కారణము నెఱుగుటకు వేంకటప్పయ్యగారు (రుక్మిణితండ్రి) చాలప్రయత్నించిరి. కాని అవమానముచే రుక్మిణి తండ్రికి నిజస్థితిని దెలుపలేదు. కాన తాను కొమార్తె నడావిడిగా పిలిపించుటచే నల్లునకు కోపమువచ్చెనేమో యని భావించెను. సీతకు చేయవలసిన వేడుకలన్నియు పూర్తియైనందునను, అల్లునికి కోపముగా గూడ నున్నందువలనను రుక్మిణిని వెంటనే పంపివేయ నెంచి, "నీభార్యాబిడ్డలను విదియ సోమవారమునాడు పంపుచున్నాను" అని మామగా రల్లునకు జాబు వ్రాసెను. దానికి ప్రత్యుత్తరముగా, "పంప నక్కరలేదు" అను నొక్కటేముక్కతో అల్లునివద్ద నుండి జాబు వచ్చినది. వేంకటప్పయ్యగారు గూడ కొంచెము తామసపు మనిషే కాన, 'ఇంట్లో ఆడదిక్కు లేదు కాబట్టి పిలిపించానుగాని వినోదానికి కాదుగదా. ఇందుకే యితని కింతకోప మేమిటి? భార్య కావలసినవాడైతే తీసుకపోతాడు; లేకపోతే లేదు. నాబిడ్డ నాకు సేగా యేమిటి' అని అల్లుని యుత్తరమును రెండుముక్కలుగా చించిపాఱవేసి మాట్లాడకుండ ఊరుకొనినాడు. తండ్రి పంపుదునని వ్రాసినప్పుడైన పంపమని వ్రాయుదురేమోయని కొండంతయాశతో నున్న రుక్మిణి కా యుత్తర మొకపిడుగుపాటై యామెను పూర్తిగా దుఃఖసముద్రములో ముంచివైచినది. నాటినుండి యామె పూర్తిగా మనుష్యప్రపంచమునకే దూరమైనది. క్రమముగా రుక్మిణి మనోవ్యాధి శరీరవ్యాధిగా పరిణమించినది. మొదట కొంచెముగా జ్వరము; తరువాత నదియే పెచ్చు పెరిగి సంధించి తబ్బిబ్బుమాటలుగూడ పుట్టినవి. వేంక

టప్పయ్యగారు గోపాలరావుకు తంతివార్త నంపి యాతని రాక కెదురుచూచుచుండిరి.

౬

కోటు, తలగుడ్డ వగైరాలు ధరించి గోపాలరావు కచ్చేరికి వెళ్లబోవుచుండ టెలిగ్రాఫ్ బంట్రోతు టెలిగ్రామ్ తెచ్చి గోపాలరావున కందించినాడు. "రుక్మిణికి చాలజబ్బుగా నున్నది. జీవించునట్లు లేదు. వెంటనే రావలసినది" అని అందు వ్రాసియున్నది. "నన్ను రప్పించుటకిది యొకయెత్తు. వీరి పిచ్చి టెలిగ్రాములకు నేను జడిసి పరిగెత్తేవాడను గాను. పాపము! జీవించదట! జీవించకపోయిన ప్రపంచమునకు లోటు లేదు. పాపాత్ముల భారము మోయలేక పరితపించు భూదేవిభారము కొంత తీరగలదు." అని కోపముతో గోపాలరావా తంతివార్తను సావడిలో విసరికొట్టి కచ్చేరికి వెళ్లి పోయినాడు. అనుమానమువంటి అంతశ్శత్రువును, కోపమువంటి పాప గుణమును వేరొకటి లేదుగదా! రెండును నేకమై మనుష్యసాధారణమగు కనికరస్వభావమునకే గోపాలరావును దూరముగా జేసివైచినవి. పాపము, బిడ్డలవిషయమున గూడ నాతనికి జాలి గలుగ లేదు.

సాయంత్రము మైదుగంటలకు గోపాలరావు కచ్చేరి నుండి యింటికి వచ్చి మనస్సులోనున్న చిందఱవందఱచే బయటికి పోవుటకు మనసొప్పక, తలుపు దగ్గఱగా వేసికొని రెండుచేతులు మెలికవేసి మొగముపై పెట్టుకొని మంచముమీద వెల్లకిల పడుకొనినాడు.

తన తలంపు నిజమో,-అబద్ధమో! రుక్మిణికి నిజముగా జబ్బుగానున్నదో, లేక తన్నురప్పించుటకు పన్నిన పన్నాగమో-అని వేవిధముల యోచింపుచున్నాడు. ఇంతలో బయట నెవరో 'ఎవరండి యింట్లోను' అని కేకవేసి తలుపుత్రోసినట్లు చప్పుడైనది. ఆ చప్పుడు వినగనే గోపాలరావు చివాలున లేచి వాకిలిలోనికి వచ్చి "ఎవరు నీవు?" అన్నాడు.

"నేను సాహేబును. ఇన్‌స్పెక్టరుగారి జవానును".

గోపాలరావు 'దొంగను పట్టుకున్నాను. వీడే ఉత్తరాలు నడిపేవాడై యుండాలె' అని నిశ్చయించి "ఎందుకొచ్చావు" అన్నాడు.

"మహారాజ్? ఒక తప్పొచ్చింది, క్షమించి దయచేయించాలి."

"ఏమిటి?"

"ఏమీ లేదు మహారాజ్ మా యిన్‌స్పెక్టరుగారి భార్యగారు ఇక్కడ రివిన్యూ యిన్‌స్పెక్టరుగారి యింట్లో మొన్నటిదాకా ఉన్నారు. సరకారుపనిమీద ఈ తెనాలికి పంపిస్తూ మా యిన్‌స్పెక్టరుగారు అమ్మగారికిచ్చి మాట్లాడి ఒంట్లో ఎట్లా ఉందో కనుక్కొని రమ్మని ఒక కవరు యిచ్చారు. రివిన్యూ యిన్‌స్పెక్టరుగారు ఆ కిందటి రోజుననే యీయిల్లు వదలినారంట. ఆ ఖబరు నాకు తెల్సిందికాదు. ఇక్కడనే ఉన్నా రనుకొని కిటికీలోనుంచి లోపలికి వేసి పొయ్యాను".

"తలుపు తాళంవేసి ఉంటే ఎట్లా వేసిపోయినావు! అట్లా పాచేస్తే తప్పుగాదూ?"

"నిజమే మహారాజ్! పాచేయరాదు. ఆనాడు దారిలో, వాడి దుంప తెగ, ఒకడు దోస్తీ అయి కొంచెం నిషానీళ్లు తగిల్పించాడు. అంగువల్ల దిల్ అచ్ఛానహీ. కిటికీతల్పు తీసి ఉంటె వేసి పొయినాన్."

"అయితే మీ అమ్మగారు యీవూళ్లో వీరి యింట్లో యెందు కున్నదీ?"

"ఈ యిన్‌స్పెక్టరుగారి భారియాగారికి మాఅమ్మగారు పిన్నమ్మకూతురంట. అయ్యగారు రేపల్లెకు పొయ్యేటప్పుడు అమ్మగారు బయటూ ఉండి కొంచెము జబ్బుగా ఉన్నారు. డాక్టరుగారు ప్రయాణంచేయరాదన్నారు. అందుకోసం అమ్మగారిని యిక్కడ ఉంచి అయ్యగారు రేపల్లె వెళ్లినారు."

"మీ అమ్మగారి కిప్పుడు జబ్బు నయమేనా?"

"ఆ, జబ్బు నయమే. అమ్మగారు వారంరోజుల క్రిందటనే రేపల్లె వచ్చారు. కవరు అందలేదని అమ్మగారు చెప్పగానే అయ్యకు బడా కోపం వచ్చి ఎక్కడ పాచే

# హొయ్సల శిల్పచిత్రములు



చిత్రము ౧

(ఇందలి చిత్రితమైన రాతిపలక-తెర గమనింపదగినది)



చిత్రము ౨

(ప్రహరీగోడపైని శిల్పము)

ఖావో తెమ్మని లగాలగీ చేస్తున్నారు. ఈవారంలో కచ్చేరి పని తగిలి యీ తెనాలికి రెండుమార్లు వచ్చాను. ఎప్పు డొచ్చినా దర్వాజా బందుచేసే ఉన్నది. తమరు యెర్కీ ఉంటే యిప్పించండి మహరాజ్! తమకీ వెయ్యి సలామ్‌లు చేస్తాడు యీ ఫకీర్."

"మీ అమ్మగారి పేరేమి?"

"అది యెంకమ్మ, సుబ్బమ్మ వంటి పేరు గాదండీ! మర్చిపోయినా-సెప్తా ఉండండి. ఆఁ ఆఁ-ప్రియా అని మా అయ్యగారంటారు. కాని అమ్మగారి అసలు పేరు ప్రియం వదమ్మగారంట."

ఆ సమయమున గోపాలరావు కెదురుగా కవి యున్నచో నాతని ముఖమున క్షణక్షణమునకు గల్గిన భావవికారములను చక్కగా వర్ణించియుండును. చిత్రకారు డున్నచో వేయిచిత్రములనైన చిత్రించియుండును. చుట్టచుట్టి విసిరిన త్రాడేవిధముగా వికృతమగునో ఆవిధముగా నా సాహేబునోటినుండి వెలువడిన యొక్కొకమాట కాతని హృదయమును చుట్టివైచిన యనుమానపాశము విచ్చిపోయినది. రుక్మిణి నిర్దోషత్వము వెల్లడియైనందులకునుతన యనుమానము తొలగినందులకును, తనహృదయ భారము తీరినందులకును నాత డొక్కక్షణకాలముమాత్రము సంతసమనుభవించెను. కాని యుత్తరక్షణముననే యాతనిచిత్తము పశ్చాత్తాప చింతా సాగరమున నిమగ్నమైపోయినది. నిరపరాధిని యగు రుక్మిణిని దూషించి ఉత్తరము వ్రాయుట, సమాధానము చెప్పుకొనుటకైన నవకాశ మీయకుండుట, మామగారు పంపుదునని వ్రాసినప్పుడైన పంపమని వ్రాయకుండుట, నేడు "రుక్మిణి మిక్కిలి ప్రాణాపాయస్థితిలో నున్న"దని వచ్చినతంతివార్తను నిర్లక్ష్యముగా నలిపిపాఱవేయుట- ఒకటా, రెండా! ఏపాప మెఱుగని పుణ్యశీల యగు తన యిల్లాలు ఈ యవమానపరంపరకు లోనై యెంత కుందుచున్నదో! ఒకవేళ ఇహలోకమునే వీడినదేమో! అని తలచినప్పుడు గోపాలునకు భోరున నేడుపు వచ్చి కనుకొలకులనుండి కవోష్ణబాష్పములు జలజల రాలినవి. ఒక్కక్షణమైనను నిలువలేదు. నెలదినములనుండి తనకు హృదయశల్యమై బాధించిన యా కవరు నా బంట్రోతు చేతిలో విసరికొట్టి, నేల గొట్టిన తంతివార్తను చేతిలో బట్టుకొని, యధికారికి చూపించి నాల్గుదినములు సెలవు గైకొని, అప్పుడే బయలుదేరనున్న రైలుబెట్లో ప్రయత్నముమీద నందించుకొని మామగారి యూరికేగినాడు గోపాలరావు.

౭

"అమ్మా! సీతాదేవీ! నీవు పుణ్యాత్మురాలవు. ఇద్దఱుబిడ్డలను పెనిమిటిచేతిలో బెట్టి ఆ ప్రాణేశ్వరుని ముఖారవిందం చూస్తూ ప్రాణం విడిచావు. నా కాభాగ్యం లేదు. అయ్యో! అయ్యో! ఎబ్బే, రాముడు ఏమి మంచివాడు. అంతకాలము భార్యతో కాపురముచేసిగూడ ఆమె మంచి తెలుసుకో లేకపోయినాడే? తెలుసుకున్నాడూ? తెలిసిఉంటే ఉళ్లో పామరులవాడుకు జడిసి అంత మహా యిల్లాలైన పెళ్లాన్ని వదులుతాడా? ఇదియేమి న్యాయం, నా మొఖం న్యాయం. న్యాయమే కలవాడైతే రాజ్యమే వదలి భార్యనే యేలుకో లేకపోయినాడా? పాపం! పాపం! నిండుచూలాలు అడవిలో దిక్కులేక యెంత యేడ్చింది! ఎవరు మీరు? అప్పుడే నను రమ్మని అడావుడిచేస్తారేం? మావారు రావద్దూ? మా బిడ్డలను నేను గూడ నప్పజెప్పొద్దూ? సీతామ్మవారు యిట్లాగే వచ్చిందా? ఏరీ నా కుశలవులు? రాండి నా కన్నయ్యలూ రాండి మీ నాన్నగారి కొప్పగిస్తా రండి. ఒరే, ఎవరు నీవు రావణుడవా? ఛా, కాదు. రావణు డప్పుడే మాడిపోయినాడు. సీతాదేవి ఉసురుకొట్టింది. వా డెట్లా బతుకుతాడు? వాడుకాదు, వాడుకాదు. వీడు కృష్ణారావు. ఏరీ నా కుశలవులు? నాన్నలూ! నా కన్నయ్యలూ! మీరు సీతా కుశలవుల్లాగ నాన్నతో యుద్ధంచేయవద్దు. ఇదిగో ఈ కృష్ణారావును కొట్టండి కొట్టండి. హీ! హీ! బలేదెబ్బలు తగిలినాయి; చచ్చాడు చచ్చాడు. అదిగో! భూమి ఎట్లా విచ్చిపోయిందో! సీత యెట్లా లోపలికి పోయిందో! అవును, అంత మాట పడ్డాక ఇంకా బ్రతకడమేమిటి? భేష్ భేష్. పాపము! రాముడి ముఖం చూడండి ఎట్లా ఉన్నదో? కత్తివాటు వేసినా నెత్తురు లేదు. భూమి పగిలింది. నేను గూడ సొరంగంలోకి పోతున్నా పోతున్నా"అని రుక్మిణి కహర్నిశములూ క్కటే సంధిప్రలాపములు. సంధించిన

వారి ప్రేలుడు కర్థ మేమని యనుకొనినను రుక్మిణి వాక్యము లంచలకాశ్చర్యము నే గొలుపుచున్నవి. ఆ వాక్యములు వినుట కూరిజనము సావడి నిండినారు. జబ్బుకు ముందు రుక్మిణి విడువకుండ జదివిన యుత్తరరామాయణమే నేడు రుక్మిణి యిట్టి తబ్బిబ్బుమాట లాడుటకు కారణమని యందఱు భావించిరి. నిజముగా గూడ రుక్మిణి పెనిమిటివద్దనుండి తండ్రికిగూడ జాబు వచ్చినతరువాత యుత్తరరామాయణమును విడిచిపెట్టలేదు. సీతా పరిత్యాగఘట్టములోని పద్యము లెన్నియో ఆమెకు కంఠస్థముగా వచ్చినవి.

పాపము! రుక్మిణి తండ్రి దుఃఖము చూడ శక్యము గాకున్నది. రుక్మిణియు, సీతయు పసినిసుగులుగా నున్ననాడు తల్లి గతించినది. నాటినుండి మరల పెండ్లిమాట తలపెట్టకుండ బిడ్డలను ప్రాణపదముగా పెంచుకొనినాడు వేంకటప్పయ్య. తనకు ఏడుగడ వారే యనుకొని పంచప్రాణము లాబిడ్డలపై నిడుకొని మహాగోముగా పెంచుకొను చున్నాడు. తల్లి లేని లోపము వారి కేవిధముగను కలిగింపలేదు. అందులో పెద్దబిడ్డ యగుటచేత రుక్మిణిపై ఆయనకు మిక్కిలి ప్రేమ. వినయ విధేయతలు గలదియు, చదువుకొనినదియు గూడ నగుటచేత రుక్మిణియం దాయనకు గౌరవభావము గూడ నధికము. మొగబిడ్డలకు నోచినవాడు కాకపోవుటచేత రుక్మిణీపుత్రుల నిరువుర చూచిన ఆయనకు మహాసంతోషము. ఆ దౌహిత్రుల నిరువురను జూచుకొని నావంటి పుణ్యాత్ముడు లేడని ఆయన యుబ్బుచుండును. అట్టి తన ప్రేమపాత్రమగు గాదిలికూతురు వేడుకనిమిత్తమై వచ్చి మృత్యువు పాలై పోవుచుండ పాప మాబ్రాహ్మణు డెట్లు భరించును?

సీతదుఃఖము చెప్పుటకే సాధ్యముకాదు. తల్లి లేనిబిడ్డలగుటచేత నాయక్కచెల్లెండ్ర కొకరిపై నొకరికి మక్కువెక్కున. కాన అక్క మంచమెక్కిన తరువాత సీతకన్నుల నిండ నన్నమును కంటినిండ నిద్రయు నెఱుగదు. తండ్రియు, చెల్లెలును నిట్లన్నము నీళ్లుగానక నల్లాడుచుండ రుక్మిణి మన లోకములోనే లేదు. గోపాలరావుకు తంతివార్త పంపిన యానాటిరాత్రి రుక్మిణికి పిచ్చిమాటలు మఱింత యెక్కువైనవి. వైద్యులకు బంధువులకు గూడ నాశ లడుగంటినవి. "ఎంత కఠినాత్ముడో పెనిమిటి రాలేదు. ఈ పిల్లప్రాణమంతయు నాతనిమీదనే యున్నది. ఆ మొగుడిని చూడడానికే జీవాత్మ నిలిచియున్న" దని యంద ఱనుకొను చున్నారు.

౮

రాత్రి పదునొకండు గంటలైనది. ఇంట జబ్బు మనిషి యున్నప్పుడు తలుపులు మూసికొని సుఖముగా నిద్రించువా రెవ్వరు? కాన తలుపులు తీసియే యున్నవి. అందఱు మేలుకొనియే యున్నారు. వాగివాగి రుక్మిణికి హీనస్వరము పడిపోయినది. ఇంతలో ఘణఘణమని గుఱ్ఱపుబండి వచ్చి వాకిట నిలిచినది. కోటు లేదు, పైనుత్తరీయము లేదు. పిచ్చివానివలె గోపాలరావు గుఱ్ఱపుబండిలోనుండి క్రిందకు దుమికి యెక్కయుఱుకుచు దుటునవచ్చి రుక్మిణి మంచముపై బడి, ఆమె వక్షస్థలమున తన తలను మోపి, "రుక్మిణీ! నీవు పరమపతివ్రతవు; నేనే యపరాధిని. నన్ను క్షమించవూ?" అని బోరున నేడ్చినాడు. కర్ణశేయములగు నా వాక్కులు రుక్మిణి మహావ్యాధి కమృతసమములైనవని వేఱుగ చెప్పవలెనా?

కలిదిండి నరసింహరాజు గారు

ఆనాగరకుఁడై
ఆదికాలపు నరుఁడు
తరులలో
గిరులలో
చలికి వానల కడలి
తల దాఁచుకొను వేళ—
తినుచున్న
శునకంబు
నోటి కడ్డమువచ్చి
గాటంపు కంపుతో
కనరాని క్రిమిపుంజ
కలితంపు పెమ్మొందు
గ్రహియించి
గ్రసియించు
విపరీత
వేళలో—

పాశవోన్మదమోహ
పాశములలో చిక్కి,
స్వచ్ఛంద మగు ప్రేమ,
సంతానవత్సలత,
సౌందర్య పరిశీలనా
చాతుర్యమును, లేక
అల్లిబిల్లిగ మాట
లాడుటే కాని
పలుకు మాధుర్యంపు
చెలువ మావంతేని
తెలిసికొని
కులుక నేర్వని
మోటువేళలో—

అమ్మా,
గోమాత, నీవు
కనిపించినా వతనికి
జ్ఞానంపుకళిక వైనా వతనికి.

చెన్నారు పాలాను
చిన్నారి నీలేగ
మేను దువ్వుచు,
బాష్ప
మిళితలోచన వైన
నీకంటి కొనలనుండి,
మాతల్లి,
ఏకాంతియో వెడలసాగె.

అమ్మ, ప్రశాంతహృద్యహృద
యాంశులు చతుసులఁ దాండవింప, దై
వమ్మువిధాన నీవు ప్రియ
వత్సముతో కనిపింపకున్నచో,
ఎమ్ములమీఁది దుర్మలిన
మే పరమాన్నము కాఁగ, మేము ని
త్యమ్మును కోనలందు తిరు
గాడుచు నుండెడివారమే కదా!

జయ గోమాతా
మానవజ్ఞానప్రదాత్రీ
జయ నీపూజ్యను
సంతానమునకు
జయ హేశాంతస్వరూపిణీ
జయ హే భాగ్యవిధాత్రీ
దీర్ఘ జీవితప్రదాత్రీ.
జయ్ జయ్ జయ్.




నేను తోటమాలీగా వుంటున్నాను. నెలకు ఎనిమిది రూపాయిలు జీత మిస్తారు. నేనూ, నా కుమార్తె, నా భార్యా, చిన్ని మనుమడు ఆతోటలో ఒక గుడిసెలో కాపుర మున్నాము. తోటకు నీళ్లు మళ్లించడము, పూవులు పూయించడం, కూరగాయలు కాపించడం, పండ్లచెట్లు జాగ్రతతో దోహదం చేసి పండించడం, ఏరోజు కారోజు ఆపూవులు ఆకాయలు పండ్లు తీసుకొనివెళ్లి మా యజమాని కివ్వడం, తోట జాగ్రత్తగా కాపలా కాయడం-యివి నా పనులు.

మా యజమానికి నలభైయైదేండ్లు దాటి వుంటాయి. ఆయన కొక కుమారుడున్నాడు. ఆయనకీ వుంటాయి యిరవైయేండ్లు. మంచి చామనచాయవంటివాడు. నూనూగుమీసము. నూత్న యౌవనము. తీరైన దేహసౌష్ఠవము. చిన్నవైనా అందాలు ఒలికే కండ్లుగల ఆయన్ని చూస్తే, మరోమాటు చూడాలని ఎవరికైనా పుట్టుతుంది బుద్ధి. ఇదివరదాకా ఆయన స్కూల్లో చదువుకుంటూవుండేవాడు. ఇప్పుడు చదువు పూర్తియైంది, యింటికి వచ్చాడు. చిన్నప్పటినుంచీ ఆయన్ని నేను యెత్తుకొని మోసి, తోటంతా తిప్పి, కావలసిన పువ్వులు, కాయలు, పండ్లు కోసియిచ్చి పెంచిన కారణంచేత నాకు ఆయనంటే ఏదో ఒకవిధమైన ప్రేమ. ఆయన యిపుడు తోటలోనికి షికారు వస్తే ఎంతపని వున్నా ఆయనవెంటే ఏవో ప్రొద్దుపోని కబుర్లు చెబుతూ తిరుగుతూ వుంటాను. నేనన్నా ఆయనకికూడా చాల ఆదరం, ప్రేమాను.

ఇలా కొన్నాళ్లయింది. నా కూతురికి పెండ్లివారు వచ్చారు. పెండ్లికొడుకు కూడా పిల్లచూపులకు వచ్చాడు. పిల్లవాడు బాగున్నాడు. పాతికేండ్లుంటాయి. మా అల్లుని తండ్రికి అయిదుగురు కుమార్తెలు, అయిదుగురు కుమాళ్లు. మా అల్లుడు నాలుగోవాడు. మా వియ్యంకునికి ఆట్టే ఆస్తిపాస్తి యేమీలేదు. ఏమాత్రమో తక్కువగా రెండెకరాల దొడ్డి ఒకటి ఉన్నది. ఇల్లొకటి వున్నది. ఆ దొడ్డిలో కూరానారా పండించుకుంటూ కూలినాలీ చేసుకుంటూ మావియ్యంకుడు సంసారం గడు

పుకుంటున్నాడు. మా అమ్మాయి నిచ్చి ఆ కుర్రవానికి పెండ్లిచేస్తే బాగుంటుందని చూడ గానే సంకల్పం కలిగింది. కాని ఒక సందేహం కూడా వెంటనే పీడించింది. సందేహం కాదను కుంటాను, బాధ కలిగింది......ఒక్కటే ఒక్క పిల్ల బ్రతికివున్నది. ఎంతమందో కలిగి పోయారు. పెద్దదిచూస్తే పెండ్లిఅయి, కాపురానికి వెళ్లి, అన్నీ సలక్షణంగా జరిగి, తటాలున కళ్లముంద శే ఎగిరిపోయింది. ఇప్పటి కింకా ఆ దుఃఖము తీరనేలేదు! దాని కడుపున కాసిన ఒక కసు వున్నాడు. వాణ్ని చూస్తూ ఈ ముసలితన ములో మా దుఃఖమును ఉపశమింపజేసుకుంటు న్నాము నేనూ, నా భార్యాను. ఇక యీ చిన్న పిల్లనుకూడా పెండ్లి చేసి అత్తింటికి పంపితే తరు వాత విడిచి ఉండడం ఎలాగని తలచుకుంటే పట్టరాని దుఃఖం వచ్చింది. ఆ రోజుల్లా నేను నా భార్యా ఆలోచించుకున్నాము. ఎంతయినా కడుపుతీపునకు అంతంలేదు. చివరకు సాహ సించి మా సొంత బీదసంసారమైనా అల్లుడు ఇల్లరికం ఉంటే పిల్లనిచ్చి పెండ్లిచేస్తానన్నాను. ఆమా టనేటప్పటికి మా వియ్యంకుడు సంతో షంచేత ఎగిరి గంతువేసినాడు. ఆతనికి దారిద్ర్య భారంచేత ఒకకొడుకు సంసారభారం తగ్గినా మేలే అనుకున్నాడు కాబోలు. తన కొడుక్కి పెండ్లిఅయితే చాలునని ఉన్నవాడు. కాబట్టి ఇల్లరికం అంటే వెంటనే అంగీకరించాడు. ఎలాగో పెండ్లి అయిం దనిపించాము. పెండ్లి అయినప్పటినుంచిన్నీ అల్లుడు మా యింట్లోనే వుండిపోయినాడు. ఇక మరివొకమా టయినా పుట్టినింటికి వెళ్ల లేదు.

మరికొన్నాళ్లయింది. మా అమ్మాయి చూపులకు నల్లనైనా అందంగానే కనుపిస్తుంది. సోగలైన దాని కండ్లు, నల్లనై నిగనిగలాడే దాని తలకట్టు, నుదుటిపై సహజంగా నాట్యం చేసే ముంగురులు, తీరైన ముఖమూ, యివ్వన్నీ నల్లతనాన్ని మరిపించి సౌందర్యాన్ని ఇనుమ డింపజేస్తున్నాయి. అయినా నా పిల్లను నేను ఆట్టే పొగడుకోవడం మంచిదికాదు. నా భార్య సొగసుకత్తె కావడంచేత తల్లి పోలికలున్న నా పిల్లకూడ అందకత్తె అని చెప్పవలసినదే. అయి నా మా కులంలో అందమైనవాం ళ్లుండరో? ఇపుడు యౌవనం ఆవిర్భవించింది. సహజంగా సొగసైన దేహానికి యౌవనప్రాదుర్భావము మరింత వన్నె తెచ్చింది. మేము బీదవాళ్లమైన ప్పటికి నా కూతురికి విలువైనకోకలు, రవికెలు, నగలు, నాణాలు లేకపోయినప్పటికీ అది వున్న వాటిని సింగారించుకుని ఎదుట నిలబడితే గుట క వేయక నిలబడి దాని అందం తనివితీర చూడని మగవా డుండడు. మా పిల్లను చూస్తే తెలిసిన వా డెవడైనా యీమె తోటమాలికూతురు అని అనుకోవాలి కాని యితరులు ఎవరూ అనుకోరు.

తోటలో నేను యూతాం తోడుతూంటే నా కూతురు ఒకనాడు మొక్కలకు నీళ్లుమళ్లిం చుతూ వున్నది. సాయంకాల మవుతుం దప్ప టికి; కాని సూర్యాస్తమయం కాలేదు. ఆకా శంమీద అపుడే శుక్లచంద్రుడు సగము గూప ముతో తనకు రాబోయే మహావైశ్వర్యమును తలుచుకుంటూ కనిపించాడు. ఎప్పటిలాగే మా

చిన్నబాబుగారు తోటలోనికి షికారు వచ్చారు. తోటంతా తిరిగి పొద్దుట విడిచిన గులాబి పువ్వులను, మరికొన్ని వాసనపూవు గుత్తులను చేర్చి చెండుగా కట్టి, నడుమ నడుమ వాసన చూస్తూ, నా కూతురు నీళ్లుమళ్లిస్తున్న తావుకు వచ్చి కొంచెందూరాన నిలబడ్డారు. పువ్వుల గుత్తి వాసనచూడడంలో ఆయన నా కుమార్తె అందంఅంతా ఆఘ్రాణిస్తుండిపోయారు. ఆలాగే ఆమె సౌందర్యరసం అంతా ముగ్ధుడై క్రోలడం ఆరంభించాడాయన. సౌందర్యతృష్ణకు పిపాసయేగాని దాహముతీరుట లేదుగాబోలు. మా అమ్మాయికూడా చిన్నబాబుగారివైపు అప్పుడపుడు చూసితనలో తాను ముసిముసి నగవులు నవ్వుకుంటూ ఉన్నది. ఆయన వెన్నెల్లో ప్రతిమలాగ చైతన్యరహితమై తెప్పయినా వాల్చకుండా ఆమెవంకే చూస్తూ ఉండిపోయాడు. ఒకరినొకరు చూసుకుంటూ వారిద్దరూ ఆ స్థితిలో ఎంత సేపటినుంచి ఉన్నారోగాని, నేను ఏతాంపైకెత్తి నడుము సాచుకొని ఒకసారి తల పైకెత్తి అటువైపు చూచునప్పటికి ఒక్క త్రుటిలో అంతా వారివైఖరిఅంతా అర్థమైపోయింది. రెండవక్షణంలో నాకేమి తోచిందో నే నిపుడు చెప్పలేను. చిన్నబాబుగారివంక ఒకసారి చూచాను. చూచిన వెంటనే చూపు మరలించి ఏతాం దింపకుండా పిల్లవైపు మరియొకసారి చూచాను. అంతలో నా తలలో ఏమేమి యూహలు పొడమెనో కాని, అప్రయత్నంగా 'పిల్లా! మీయమ్మ పిలుస్తున్నట్టుంది! ఎందులకో? ఒక్కసారి వెళ్లి చూచిరా!' అని అన్న మాటలు మాత్రం నోటినుండి వెలువడ్డాయి కనురెప్ప పాటులో మళ్లీ మారుమాట చెప్పకుండా నాకూతురు చేస్తున్నపనిని యెలావున్న దానిని ఆలాగే విడిచిపెట్టి మెఱుపులా లేచి మాయమైంది. నిజంగా నా భార్య దాన్ని పిలవలేదు. కాని నా హృదయంలో వున్న ఊహలు ఆమె ఏలాగున గ్రహించిందో!... ... ఆడవాళ్లు మగవాళ్ల మనసు ఇట్టే పసికడతారు కాబోలు!

మా బాబుగారికి నా మాటలు చెవిని పడ్డాయో లేదో గాని, ఒకటిరెండు క్షణాల వఱకు ఆయన అక్కడనే నిలబడిపోయాడు. కొంత సేపటికి నన్ను చూచి నన్ను మామూలు



"ఏతాం పైకెత్తి.........అర్థమైపోయింది"

ప్రకారం పలకరించకుండా గబగబ అక్కడ నుంచి నడిచి వెళ్లిపోయారు.

*   *   *   *

మరికొన్నాళ్లయింది. వేసవిసాయంకాలపుటెండ ఆరోజున పెందరాళే తగ్గిపోయింది. ఆకస్మికంగా ఎక్కడనుంచో పెద్దమేఘం వకటి వచ్చి ఆకాశమంతా క్రమ్మేసింది. క్షణాలో అంతా చీకటైపోయింది. ఒక్కమారు భయంకరమైన పెనుగాలి కూడా వీచింది. పిమ్మట చిరువాన చిటపటమని కురిసింది. మళ్లీ వాన వెలిసేటప్పటికి, ఎక్కడిమబ్బు అక్కడికి చెదరిపోయింది. సూర్యభగవాను డస్తమిస్తున్నాడు. వేసవికాలంలో చిరివాన కురిసిన వెనుక దక్షిణానిలం చాలామనోహరంగా వుంటుంది. ఆ పిల్లవాయువులు పుష్పములలోని పరిమళమును అపహరించుకొని తమ తెఱలపై కొనిపోతూ వున్నట్టున్నవి. వర్షం వెలిసిన తరువాత ఏలాగున వున్నదో చూద్దామని తోటలోనికి వెళ్లాను.

ఒకచోట సంపెంగచెట్టు తీగెలు ముండ్లపొదలాగున అల్లుకొని ఒక నికుంజంగా యేర్పడి వున్నాయి. ఆ తావు మా పెద్దబాబుగారికి చాలా ప్రీతికరమైనది. ఆ సంపెంగపూవులు పూచినపుడు చెట్టుదగ్గర కూర్చుండి ఆ పరిమళం ఆఘ్రాణించడం అంటే ఆయనకు మిక్కిలి యిష్టం. అందుచేత ఆయన ఆ నికుంజమునకు సమీపములో ఒక్క గున్నమామిడి క్రింద చిన్న తిన్నె కూడా కట్టించుకున్నాడు. సాయంకాలము ఎపుడైనా వచ్చినపుడాయన ఆ తిన్నెపై పడుండి నేను చెప్పే లోకాభిరామాయణం, మంచీచెడ్డా, కబుర్లూ వింటూంటాడు. ఇపుడా సంపెంగచెట్టువైపునుంచి, ఆ తిన్నెవైపునుంచి మంచి సువాసనలు వస్తున్నాయి. సంపెంగ పుష్పించిందని అనుకుని మంచిపువ్వులు రెండు కోసి మా బాబుగారికి తీసుకుని వెళ్లియిద్దామని ఆ పొదవైపు మొగమై రెండడుగులు వేశాను. అంతలో ఏదో చిన్న అలికిడి అయినట్లు నాచెవికి సోకింది. ఈ సమయంలో తోటలోని కెవరు వచ్చివుంటారా అని అనుకుంటూనే పరధ్యానంగా మరిరెండు అడుగులు వేశాను. సంపెంగపూవులు వాసన వెదజల్లడమే గాని, కంటికి కాటుకపెట్టికొని వెదకినా సులభంగా కనబడవు. అందుచేత వాసన ఏవైపునుంచి వస్తున్నది అని ఆలోచించి పొదంతా వెదకడం ఆరంభించాను. తుదకు నాకు ఎడమవైపున ఒక మంచిపువ్వు కనిపించింది. దాన్ని అందుకోబోతే దాని చెంతనే మరియొకటికూడా కనిపించింది. ఈ తోటంతా పరిమళంతో నింపేస్తున్న పువ్వు లీ రెండే యని నేనపుడనుకున్నాను. ఆ రెండుపువ్వులు కోద్దామని మరికొంత ప్రయత్నం చేసి, అందకపోతే దిగి మరియొకవైపునకు వచ్చి అందుకోపోయినాను. అపుడు నా కళ్ల కొక క్రొత్తవిషయం, ఎన్నడూ తలచనిది, కనుపించింది. నేను ఒక్కసారిగా నిర్విణ్ణుణ్ణై అయిపోయినాను. కనురెప్పలు సారించి మరియొకసారి నిశ్శబ్దంగా ఆ

వైపే చూశాను. మా చిన్న బాబుగారి కవుగిటిలో నాకూతురు పరవశమై అరమోడ్పు కను



దోయితో, తొలగియాడెడి పెదవులతో,...... ఉన్నది. ఆ ఉభయులు తన్మయులై ఆనంద సముద్రములో తేలియాడుతూన్నట్టున్నారు. నేను చూస్తున్నది నిజమా? కలా? అని సందేహం కలిగింది. కన్నులు మరియొకసారి నులుపుకొని అట్టే మళ్లీ చూచాను. నేను సమీపంలో వున్న సంగతి వారికేమీ తెలిసినట్లు తోచదు. నేనిలా చూడడం నాకే ఎందుచేతనో సిగ్గుచేటనిపించింది. దేహమంతా కంపమెత్తింది. కులగౌరవమును, మర్యాదను కూలద్రోసుకున్న ఆ కాముకులను చూచేటప్పటికి పట్టరాని కోపము, జాలి కూడా ఒక్కసారిగా కలిగినవి. దేహమంతా నాకు ముచ్చెమటలు పోసింది. సంశయమూ, భయమూ కూడా ఒక్కమారుగా నా మనస్సున తట్టినవి. అంతట ఏమి చేయుటకు తోచక, కొమ్మలు నరకబడిన చెట్టువలె స్తబ్ధుడనై పోయాను. అపుడేనో అవ్యక్తమైన స్వరమొకటి-కాదు శబ్దమొకటి-నా నోటినుండి అప్రయత్నముగ వెలువడినది. సుఖసుప్తులయియున్న యా రమణీరమణులు దాన్తో ఉలికిపడి లేచారు. నలుదిక్కులు బెదరినచూ



పులతో పరికించారు. నే నింకను వారివంకే చూస్తున్నాను. వారు మాత్రం నావైపు చూడనేలేదు. కాని యింతలో నాకొక భయంకరమైన శబ్దము వినబడింది: పిడుగువలె నా శబ్దము నా కర్ణరంధ్రములలో ప్రవేశించి హృదయ

మును చీల్చి దహించివేసింది. ఇంటి నడికప్పు విరిగి కూలినట్లు తోచింది. నాకు కన్నులు మరల మిరుమిట్లు గొలిపియుండెను. ఉత్తర క్షణములో మా చినబాబుగారు తల రెండు ప్రక్కలైై, ఆయన నెత్తుటివరదలో పొరలాడుతూ వుండుట కనిపించింది. ఆ చెంతనే మూర్ఛపోయిన నా కూతురుకూడా రక్తంలో పొరలాడుతున్నది. ఆ స్థితి చూచేటప్పటికి నా కన్నులు తిరిగిపోయినవి. తల దిమ్మెక్కిపోయింది. నేను నిలబడిన స్థలందగ్గరనుంచి ఒక్క అంగుళమైనా కదలలేక పోయాను. చేతులు, కాళ్లు, దేహము, అంతా కొయ్యబారి పోయినవి. మనసులోనిమాట మనసులో మణిగిపోయింది. నాలుకతడి యారిపోయింది.

... ... ...

నెత్తుటిలో పొరలాడుచున్న యా యువతీ యువకులను మరియొకసారి చూచాను. చూచి కనులు పైకెత్తినాను. వారి కవతల యమకింకరునివలె భయంకరుడై దండిపాణియై వికృత హాసముతో శవమును పరీక్షిస్తువున్న నా అల్లుడు కనిపించాడు. ఆతని వికృతహాసము నా కదివఱకు కలిగిన భయమును ద్విగుణము చేసింది. ఎట్లో ఆతనివంక మొగమై, 'ఎంత పని చేసితివిరా! నాయనా!' అని మాత్రము అనగలిగాను. నా మాట లాలకించి ఆతడు కఱ్ఱ విసరివైచి పరుగెత్తినాడు. నే నేమయితినో-నా కేజ్ఞాపకము లేదు ఇపుడు.

౨

కొన్ని నెలలు గడచిపోయాయి. ఈ లోపుగా నేనున్నూ నా అల్లుడున్నూ కలిసి మా చిన్నబాబుగారిని హత్యచేసినట్లు పోలీసువారు మాపై అభియోగము దెచ్చినారు. ఈ కేసు రావడంతో నాకొంప నట్టేట కూలిపోయింది. పరమేశ్వరుడు తప్ప నేను దోషినో నిర్దోషినో తెలిసినవా రెవ్వరూ యీ భూమిపై లేరు. తెలిసినమానవుడు నా తోపాటు ముద్దాయిగా నున్నాడు. నే నేపాపపుణ్యములు ఎఱుగనని న్యాయస్థానంలో ఘంటాపథంగా చెప్పాను. నేరస్థుడైనప్పటికి నేరంచేయలే దనే వాదంతో బయిలుదేరే న్యాయాధికారులు ముద్దాయీలు చెప్పకొనేమాటలు నిజమైనా విశ్వసించరు. అందుచేత ఇపుడు నానిర్దోషిత్వవాదంకూడా ఎవరూనమ్మలేదు. న్యాయాధి





6 5- 6

కారి కేసుపూర్తిగావిచారించి ముగించారన్నారు. నేనూ నాఅల్లుడూకలిసి మాచినబాబుగారిని చంపినట్లు అభియోగము ఋజువైనదనిన్నీ, యింత ఘోరమైన నరహత్య చేసినవారికి దయాదాక్షిణ్యాలు చూపించ నక్కరలేదనిన్నీ న్యాయాధికారి యెంచి మాకు ఉరిశిక్ష విధించాడు. 'నీవు నేరం చేశావు. నీకు వురిశిక్ష వేయబడినది' అన్నమాటలు వినబడినపుడు నాకు ఎక్కడాలేని భయం వేశింది, నేను నేరం చేయనప్పటికీ నాకీఘోరశిక్ష యెందుకు విధించారో తెలియకపోవడంచేత విపరీతమైన భయం వేశింది. ఉరితీయడమంటే-ఉరిమాట తలుచుకునేటప్పటికి దేహమంతా ఝంఝామారుతములో అల్లాడిన వృక్షమువలెనే ఊగిపోయింది. ఒక్కఅడుగైనా ముందుకు పెట్టలేకపోయాను. 'బాబయ్యా! నేను ఏపాపం ఎరుగను బాబయ్యా! అన్యాయం అన్యాయం......' అని గట్టిగా న్యాయాధికారివైపు ముఖం పెట్టి అరచాను. కాని 'ఉష్'మని శబ్దము మాత్రం వినబడినది. నాకు కన్నులు ఉండి ప్రయోజనం లేకపోయినస్థితిలో నున్నవపుడు. త్రోవ తెన్నులు కనబడలేదు. నానోటనుండి మాటలు యింకా పూర్తిగా రానేలేదు. చెప్పదలచుకున్నదంతా చెప్పనేలేదు. కాని పోలీసు జవాను మాత్రం మెడమీద చేయివైచి గట్టిగా నొక్కి, 'పదం-పదరా!' అని గర్జించాడు. అసలేజీవచ్ఛవమైయున్న నాకు ఆ గర్జనతో ఉన్న చైతన్యం కూడా హరించిపోయింది.

నేను కేసులో ముద్దాయిగా నున్నపుడు మా పెదబాబుగారు మాత్రం నన్ను విడిచిపెట్టలేదు. ఆయనతో జరిగినసంగతి కూడా ఏమీ చెప్పలేదు. కాని చిన్నప్పటినుంచి నా సంగతిసందర్భములు ఎఱిగిన ఆయనకు నేను దోషిని కానని పూర్తిగా నమ్మకం ఉంది. అదీకాకుండా, చిరకాలం వారి కొలువుచేసి ఉండడంచేత నా మీద ఆయన కొకవిధమైన ప్రేమ కూడా వుంది. తన సొంతపైకం ఖర్చుపెట్టి ఆయన నాకు ప్లీడరును కూడా కుదిర్చిపెట్టినాడు. కాని దైవము వేరుగా తలుస్తున్నప్పుడు ఎవ రేమి సహాయం చేసినా ఉపచరించదు. నా కర్మం యిట్లుండగా ఆ ప్లీడరుమాత్రం యేం సాయం చేస్తాడు ?

నేను ఇపుడు కారాగారంలో చెరను అనుభవిస్తూ, ఉరితీసేరోజు ఎపుడు వస్తుందో అని రోజులు లెక్కపెట్టుకుంటున్నాను. ఉరితీయబడేవారి బ్రతుకు పశువుల జన్మకంటె చాలా హేయతరమైనది. ఎటు చూచినను నేనొక్కడనే జీవుణ్ణి అక్కడ. నా ముందు బయలు, ఆ బయలులో నొక పెద్దరావిచెట్టు; ఆచెట్టుమీద అప్పుడపుడు వాలే రాబందులు-ఇవి తప్ప నాకు తోడెవ్వరును ఆ చెఱసాలలో కనబడ లేదు.

ఇక నన్ను ఉరితీసేదినము పదిహేనురోజులకు వస్తుంది. ఆరోజు వచ్చేవఱకు ఏదో విధంగా దృష్టిమరల్చుకొని దైవమునే ధ్యానం చేస్తూ కాలంగడిపితే బాగుంటుందని ఆలాగే

వేశాను. ఇల్లువాకిలి, భార్యాపిల్లలు, వీరిమీదకు దృష్టి మనసు పరుగెత్తకుండా భగవన్నామస్మరణ చేస్తూ, యీరోజులలో చాలా భాగం గడిపేశాను. కాని అపుడపుడుమాత్రం నా యిల్లాలి దుఃఖం, ఆమె దురవస్థ తలచుకొని గంటలకొలది కన్నీరు కారుస్తూ వుండేవాణ్ణి. పెండ్లి ఆశినది మొదలు యీ విపత్తువచ్చేవఱకు కష్టంలోనూ, సుఖములోనూ మేమిద్దరము ఒకరినొకరు ఒకక్షణమైనా విడిచివుండడం ఎరుగము. అందుచేత యీ ఎడబాటు—యీఆపదల్లో వచ్చినఎడబాటు-భరించడానికి మాకిద్దరికి శక్యంగాకపోయింది. నా యేడ్పు విని ఒకనాడు కావలివాడు గట్టిగా యేడువవలదని నోటిమీద రెండుదెబ్బలుకొట్టి, మరల ఏడ్పు వినబడినచో ఇంకా కఠినంగా శిక్షిస్తానని భయపెట్టి వెళ్లినాడు. దెబ్బలబాధ ఓర్చుకోకలిగినా దుఃఖబాధ ఓర్చుకోలేక పోయినాను. దుఃఖంలో వున్నప్పుడు గట్టిగా ఏడువనివ్వని ఏమి పాపిష్టిలోకమురా ఇది అని అనిపించింది.

ఒకసారికాబోలు నా యిల్లాలు నన్ను చూచుటకు వచ్చిందట. చెఱసాల కావలివాళ్లు నన్నుచూచుటకు ఆమెకు అనుజ్ఞ ఇవ్వలేదు. వారందరూ ఆమె యెవరిచేతనో వ్రాయించి తెచ్చుకొన్న అర్జీని పైదొరకు చూపించి సెలవు తేవడానికి అయిదురూపాయీలు లంచం కావాలన్నారు. అయిదురూపాయీలు కాదుగదా నా భార్యదగ్గర అపుడు అయిదు చిల్లిగవ్వలైనా లేవు. కటికి దరిద్రం అనుభవిస్తున్నది. ఇంటిలోవున్న సామానులు,ఆవును, గేదెను, అన్నింటిని వరుసగా ఆమె తెగనమ్ముకొని, నేను ఈకేసులో తగులుకొనియున్న ఎనిమిదిమాసములనుండి జీవనం చేసింది. ఈ లోపుగా కూతురుచావు, మనుమని మరణంతో ఆమెకు జబ్బుకూడా చేసింది. కష్టాలన్నీ పరంపరగా రావడంచేత ఆమెకు మతి చలించింది. కాని ఆచలించిన మతిలో కూడా నన్ను ఒకసారి చూడాలని అనుకొని అర్జీ వ్రాయించుకొని వచ్చింది. కాని అయిదు రూపాయీలు ఎట్లా వస్తాయి? పొట్టకే పిడికెడు మెతుకులు సంపాదించుకోలేని దుస్థితిలోనున్న నా భార్య అయిదురూపాయిలు ఎక్కడనుండి తేగలదు? దీనితో నన్ను కడసారి చూడాలని ఉన్న ఆశ కూడా తీరక మరింత బాధాకరమై పోయింది. ఆమె కావలివాళ్లను ఎంతో వేడుకొన్నది. బ్రతిమాలుకొన్నది. కన్నీరుకాలవలై పాగేటట్టుగా ఏడ్చి తన దుర్భరమైన సంతాపభరమంతా వెల్లడించింది. నీటిబొట్లు పడగాపడగా రాయిఅయినా కరిగిపోతుంది గాని కఠినమైన మానవాధముల మనసు కరగబోదు. మా కావలివాళ్లమనసు కరగలేదు. అందుకు వాళ్లననవలసిన పని యేమున్నది? నాలాగున ఉరిశిక్ష విధింపబడ్డవాళ్లనూ, వాళ్ల పెండ్లాముబిడ్డలను, వారి యేడ్పులను వాళ్లిదివరకు ఎన్నిసారులు చూచియుండలేదు? వినియుండలేదు? ఇట్టికథ వారికి అలవా టయిపోయింది. నా భార్యగోడు వారికి క్రొత్తదాఏమి? అదీ కాకుండా, కఠినులు, దుర్మార్గులు, మూర్ఖులు, పాపులు అయిన నరాధముల సహవాసములో నిరంతర



మూ మెలగుతూవుం డే హృదయమన్నది చంపుకుని తిన్నవాళ్లకు దయదాక్షిణ్యములు నశించిపోవడంలో ఆశ్చర్య మేమున్నది? దయ, అంతఃకరణ, అన్న మాటలు భావాలు వారు మరిచిపోయి వుంటారు. దిక్కుమాలియున్న యీ ఆపత్కాలంలో నా భార్య దగ్గర ఐదు రూపాయలైనా లేకపోవడంచేత ఆమెదుఃఖము, విలాపము, దుస్థితి, అశ్రువులు లెక్కకు రాక పోయినవి. ఇట్లామె కావలివారికి కరుణ ఎప్పటికైనా వస్తుందేమో యని ఎన్నిదినముల వఱకో వస్తూపోతూ ఉండేది. చివరకు ఒక నాడు ఆమె దుఃఖము పట్టజాలక గోలపెట్టి ఏడుస్తూ రాత్రి ప్రొద్దుపోయేవఱకూ చెఱసాల ప్రక్కనున్న రోడ్డుపై పొరలాడుతూ ఉండిపోయింది. ఆవేళ చెఱసాలాధికారి తెల్లవాడు మోటారుకారులో నెక్కి యింటికి అతివేగంగా వస్తున్నాడు. దీపముల కాంతీ, మోటారు కారు వికారపుకూతా, ఒడలెరుగని దుఃఖంచే వివశమై బాటకడ్డంగా పడియున్న నా భార్యకు గోచరంకాలేదు వినబడనూలేదు. దొర మోటారును మెల్లగా నడుపుతూ, కొమ్ముబూరను గట్టిగా నొక్కుతూ, గట్టిగా చాలాసార్లు అరిపించాడు. కాని నా భార్య కొంచెమైనా చలించ లేదు. పేడెత్తిన కోపంతో ఆపాటున అతడు తటాలున మోటారును ఆపి, దిగి, శవాకారంగా పడియున్న నా భార్యను సమీపించినాడు. ఆమె ఎవరో, ఎందుల కట్లా పడియున్నదో, తెలియకపోవడంచేత, దొర ఆమెను తన చేతి బెత్తంతో యిటునటూ దొర్లించడానికి ప్రయత్నించినాడు. కాని ఆమె జీవించి యున్నట్లు తప్ప స్మృతి కలిగియున్నట్లు కనుపించలేదు. తన దగ్గరనే దీపం పట్టుకొనియున్న నౌకరుపంకే చూచి ఆమెను చేతులమీద తీసుకొని వచ్చి బండిలో వేయమన్నాడు. బంగాళాకు ఆమెను తీసుకొని వెళ్లినతరువాత పాప మాదొర నా భార్యకు స్మృతి కలిగించడానికి ఎన్నో ఉపచారాలు చేయించి, ఆకలిచే సొమ్మసిలి యున్నందువలన గంజి కాపించి పోయించినాడు. తెలివివచ్చిన వెనుక ఆమె గోడునంతా సావధానంగా విన్నాడు. ఆమెచెప్పిన దుఃఖభాజనమైన కథవినేటప్పటికి కన్నుల వెంబడి నీరుతిరిగింది. దీని

నంతా చూస్తూ దొరకు సాయంచేస్తున్న దొర సానికికూడా పట్టరాని దుఃఖము వచ్చి వెక్కి వెక్కి ఏడువసాగింది. చిట్టచివరకు దొర గద్గద స్వరంతో నాభార్యను జూచి, "సరేలెమ్మ— నీదురదృష్టమునకు మేముకూడా చాలా వగస్తున్నాము. కిడచినదాని కెవరును ఏమియు నిపుడు చేయజాలరు. లెమ్ము. ఆ మెత్తపై పండుకొమ్ము. తెల్లవారినతరువాత నీ భర్తను నీకు చూపిస్తాను. నీ యిష్టమువచ్చినంత సేపు ఆతనితో మాటలాడి దుఃఖోపశమనం చేసుకొనుటకు అవకాశ మిస్తాను. నీ దుఃఖం చూస్తే నాకే కడుపు తరుగుకొనిపోతున్నది. ఈరాత్రి యిచ్చటనే యుండుము. ఎల్లుండి సూర్యోదయమునకాబోలు నీభర్త యీలోకమును విడిచి పెట్టవలసియుంది. దుఃఖింపకుము" అని యోదార్చినాడు.

* * * *

దొర తెల్లవారకమునుపే లేచి నౌకరిని పిలిచి నా భార్య మేల్కొంచినదేమో చూచి రమ్మని పంపించాడు. వాడు కొంత సేపటికి తిరిగివచ్చి, 'సామీ! ఆమె ఎంతపిలిచినా పలకడంలేదు. ఒళ్లు తెలియకుండా వికారంగా నవ్వుతూ, కనురెప్పలు వాల్చకుండా చూస్తూ పడియున్నది. చూడగా చూడగా నాకు భయంకూడా వేసింది. తమరు ఒకసారి అక్కడకు దయచేయండి' అని అన్నాడు. ఆ మాటలాడుతూ వున్నప్పుడు వాడిమొగము మీద కత్తివేటునకు నెత్తురుచుక్క లేదు. మారుమాటాడకుండా దొర, దొరసాని వాని వెంట నడచివెళ్లినారు. పోయి చూచేటప్పటికి అంతయు సమాప్తమయియుంది. పాపము!



భరించలేని దుఃఖభారముచేత రాత్రి ఎపుడో నా భార్య అట్లే కొయ్యబారిపోయింది. రాత్రి అంతా ఆదురదృష్టవంతురాలు ఒకవంక దుఃఖ బాధ,మరియొకవంక మరణ వేదన ఎంతగా అనుభవించి ప్రాణాలు విడిచిందో! ఆమెను తలుచుకుంటే ఇపుడు నాలోని రక్తం గడ్డకట్టుకొని పోతున్నది. నాకు రానున్న దుర్మరణం గురించి విచారించి,భయపడి, పాపమాయిల్లాలు వికృత హాసంతో ప్రాణములు విడిచిపెట్టిందికాబోలు!

ఆమెసంగతి తెలుపుటకు వెదుకుకుంటూ దొర నాదగ్గరకు వచ్చాడు. దొర నా దగ్గర రావడం అందరికీ లాగే నాకూ ఆశ్చర్యం,

భయం కలిగించినది. సంగతిఅంతా విని యింకా మొండినై. జీవింపవలసిందేనా హతవిధీ అని అనుకుని పెద్దనిట్టూర్పు విడిచాను. కండ్లవెంట ఎందుచేతనో కాని నీరురాలేదు. దుఃఖప్రవాహము గడ్డకట్టుకొని పోయింది కాబోలు. కాని ఆమాటలన్నీ విన్నతరువాత నిలుచున్న మనిషిని అమాంతంగా కూలిపోయినాను. దొర నన్ను విడిచి వెళ్ళిపోయినాడు. వెళ్ళుతున్నపుడు, 'రేపుదయం తెల్లవారక మునుపు నిన్నురితీస్తారు; సిద్ధముగా ఉండుము. ధైర్యముతో ఉండుము. నీవుకోరేది- నేనుచేయగలది- యేమైన ఉపకారముంటే చెప్పుము, చేస్తాను. మనసును కలతపెట్టు కొనకుము. ఈ లోకములో పొందలేనిన్యాయం పరలోకంలో దేవునిముంగిట పొందగలవులే'అనియింకేవేవో అన్నమాటలు నా చెవిసోకినట్లయింది.

* * * *

నేను లేచి చూచేప్పటికి నాచెంతను మంటిమూకుటిలో యీగలు ముసురుతున్న అన్నము, పులుసు ఉన్నాయి. కనులెత్తి చూచినపుడు పైన దీపపుకాంతి మినుకు మినుకుమని కానవచ్చింది.

బయిటంతా గాఢాంధకారం వ్యాపించియున్నది. అపుడు నేనింత సేపూ మూర్ఛలో మునిగి వున్నానా అని ఆశ్చర్యపడ్డాను. మళ్లీ మెలకువ ఎందుకు వచ్చిందా, ఆ మూర్ఛ పెద్దనిద్ర అయితే చాలా బాగుండేదే అని అనుకున్నాను. ఎప్పుడైనా చచ్చేదే కదా! ఒక పూట ముందు సులువుగా ప్రాణాలు వదిలివేస్తే బాగుండేదే అని విచారించాను. అపుడు నా భార్యయొక్క సంగతి జ్ఞాపకం వచ్చింది. ఆమె చాలా అదృష్టవంతురాలనిపించింది. అంతలో లోపలి కావలివాళ్లు పన్నెండుగంటలు కొట్టుతున్నారు. గంటలు ఒకటితరువాతఒకటి లెక్కపెట్టినాను. చావు సమీపిస్తున్నదని తోచింది. ఇక ఆరుగంటలుమాత్రమే నేనీభూమిమీద యీపాడుజీవితం గడపడంకదా అని తోచింది. ఒకవింతచలి ఆపాదమస్తకమూ నన్ను కంపింపచేసింది. వళ్లంతా ముడుచుకొనిపోయింది. కాని ఎందులకో విపరీతపు నవ్వు వచ్చింది. నేను గట్టిగా నవ్వనారంభించాను. నవ్వు ఆపుకుందామని ప్రయత్నంకూడా చేయలేక పోయినాను. నా కెందులకు నవ్వు వచ్చిందో, నేను ఎందులకు నవ్వుతున్నానో నాకే తెలియలేదు. నవ్వినవ్వి చివరకు వెక్కి వెక్కి ఏడ్చినాను. ఇంక ఏడవలేకపోయినాను. నేను ఏడవలేక ఆలాగే సొమ్మసిల్లి పోయా ననుకుంటాను. కండ్లు తుడుచుకొని లేచి, ఒళ్లు సారించుకొని, నా గది యినుపకమ్ములు పట్టుకుని నిలబడ్డాను. కావలివాళ్లు మళ్లీ గంటలు కొట్టుతున్నారు. ఒకటి- రెండు- మూడు-నాలుగు-నాలుగుగంట లైంది. చంద్రాస్తమయంతో నా జీవములు కూడా అస్తమిస్తా యని తోచింది. నాకు నా అంతిమక్షణమునకు నడుమ ఇంకెన్నో లెఖపెట్టదగినన్ని నిముషాలుమాత్రమే ఉన్నాయి. ఇంక డాక్టరు, మేజస్ట్రీటు, దొర - అంతా కాగడాలు వేసుకు వస్తారు. వీరే కాబోలు నా పాలిటి యమదూతలు, భగవంతుడా!

* * *

ఇపుడు నాకు మృత్యువంటె యెందులకో అపరిమితమైన భయం పట్టుకుంది. మనసు పాదరసంలాగ పట్టుకోవడానికి వీలు లేకుండా నాలుగుదిక్కులా పరుగెత్తుతూ ఉన్నది. ఏదో భరించలేనిభారం ఒకటి మనసులో క్షణక్షణానికి ద్విగుణమైపోతూ, ఊపిరితీయడమే దుస్సాధ్యం చేస్తున్నది. నా చేతులు, కాళ్లు, అవయవములు, బుద్ధి-అన్నీ కూడా తిమ్మిరెక్కిపోయిన ట్లున్నాయి. 'అబ్బా, ఉరితీయబడజాలను. ఓహోహో! ఉరి......ఉరి......ఉరిశిక్ష నాకే?............ నేనేం మహాపాపం చేశానో కదా!' అని అనుకుని కంపించి పోయినాను.

'ఏ వీరాగ్రేసరుడనో అయివుంటే, యుద్ధరంగంలో, చావువస్తుందని ఎఱుగకుండా, సాహసంతో ప్రాణాలు వదిలివేయ గలిగియుందును గదా! ఎంత భయంకరమైనా, ఆ చావు స్వయంగా కోరి తెచ్చుకొన్నది; చాలా గౌరవకరమైనది. చచ్చినా వీరస్వర్గం వస్తుం దంటారు తెలిసినవాళ్లు. ఈ చావేమిరా భగవంతుడా! కోరనిచావు! తప్పనిచావు వచ్చిందే! ఈ చావువలన ఎంతటి అగౌరవము! ఎంతటి అమర్యాద!' అని అనిపించింది.

*      *      *      *

మరికొంత సేపటికి 'పోనీ, మా చిన్న బాబుగారి లాగున, సౌఖ్యసముద్రంలో, శ్రీమహావిష్ణువు అనంతశయనం మీద ఉన్నట్టు' ప్రియురాలి అనురాగం మీద తేలియాడుతూ, ఉత్తరక్షణంలో కలుగుతూ వున్న చావును తెలుసుకోకుండా, యౌవన దేవతను ఉపాసిస్తూ మహదానందములో ఉసురులు విడిచి వుంటే, అదైనా 'కొంత మే' లని తోచింది.

*      *      *      *

ఇంకా కొంత సేపటికి 'పోనీ, కొంత కాలం రోగగ్రస్తుడనై మంచంపట్టి, యెట్లో దేహం అంతా చివికిపోయిన తరువాత, శ్లేష్మం కంఠానరోధం కలుగజేసి ఊపిరాడకుండా చేసినపుడు తెలివితప్పిపోయి చచ్చిపోవడమైనా కొంత మేలేకాదా!' అని అనుకున్నాను.

*      *      *      *

మళ్లీ కొంత సేపటికి 'పోనీ, అకస్మాత్తుగా రైలుక్రింద పడిపోయి చచ్చిపోకూడదూ?—కొండచివరనుంచి జారిపడిపోయి తలవని తలంపుగా చనిపోకూడదూ?— ఏ పామయినా కరవకూడదూ?—పోనీ, ఎవరైనా మందని విషమిచ్చి నా కెరుకలేకుండా ప్రాణాలను తీసివేయకూడదూ?—అబ్బా! ఏ చావయినా ఉరిచావుకంటె మేలు' అని అనిపించింది.

*      *      *      *

భగవంతుడా! ఆత్మహత్య చేసుకునే వాళ్లు చావడానికి—బలవంతంగా చావడానికి, ఎలా నిశ్చయించుకుని సిద్ధపడి ప్రాణాలు తీసుకుంటారో కదా!

ఈలాంటి ఊహాలు నామనసులో అపుడు తెంపు లేకుండా పరుగెత్తినవి. చావంటే నాకింత భయం ఎందుకు కలిగిందో!

అయ్యో! ఈ విధముగా దిక్కుమాలిన చావు చావవలసిన దేనా? చావవలసిన దేనా? ......చావలేను! చావలేను!

ఇన్నాళ్లు భూమిపై సుఖంగా కాలం గడిపి యిపుడీవిధంగా దుర్మరణం అనుభవించ వలసిన దే కాబోలు! మృత్యువు కనబడకపోయినా, పేరు తలచుకుంటేనే యింతభయంకరంగావుంది. తల్లీ! సావిత్రీ! నీ వెలా ఆ కాలాంతకుణ్ణి చూచి బ్రతక కలిగినావమ్మా! నీకు భయము కలుగ లేదూ? అవును-అది నీచావు కాదుకదా!

*　　*　　*　　*

అబ్బబ్బా! ఏమి యీవిపరీతపు బాధ!... చావు సమీపిస్తున్నదని తెలిసినవాళ్లకు, అందులో ముఖ్యంగా బ్రతకాలని ఉన్న మానవులకు, కలిగేబాధ భరించడానికి శక్యం కాదు. అటువంటి విపరీతపుబాధ, యమబాధ, యీ ప్రపంచములో యింకొకటి ఉండబోదు.

ఈ దిక్కుమాలినచావు, చావు సమీపిస్తున్నదని క్షణముక్షణము జ్ఞాపకంచేస్తూ సమీపిస్తున్న చావు—చావవలసినదే కాబోలు. ఉరిత్రాడు మెడకు తగిలించి వ్రేలాడతీస్తారు కాబోలు. ఉహుఁ,హుఁ.........నా కెవ్వ రింక దిక్కు? .........నే నెవ్వరికొరకు బ్రతకాలని ఆశతో ఉన్నాను? నాకెవ్వరు లేరే?......... నే నెవ్వరు? ... ... ... ...

ఆకాశంమీద చంద్రుడు నా కష్టం చూడజాలనివాడువలె అస్తమిస్తున్నాడు. ఇంకొక క్షణంలో వెన్నెల నన్నగిలి చీకటి ఆకాశమంతా వ్యాపిస్తుంది. పుణ్యాత్ములు నిర్భాగ్యుల కష్టాలు చూచి ఓర్వలేక యిలాగే తొలగిపోతూ వుంటారు.

నేను ఇంకా బ్రతకడానికి ఏదైనా ఉపాయం ఉందా? లేదు. ఇం కెక్కడిది!

హృదయం పాషాణం కాకపోయినా యీ దుఃఖకష్టసమయములో పాషాణసన్నిభమయినా కాకున్నదే! కాని చావంటే నే నెందులకు ఇంత భయపడుచున్నాను? ఉరిత్రాడు మెడకు బిగించినపుడు- అపు డెంత బాధపడతానో! ప్రాణాలు పోయేటపుడు పడేబాధ ఎలా వుంటుందో! చివరకు ప్రాణాలు ఎలా పోతవో! ఈ దేహాన్ని బలవంతంగా విడవలేక విడవలేక విడిచిపెట్టిన జీవాలు ఏమవుతాయో!...... ఈ అంతంలేని ప్రశ్నలకు నాకు జవాబు ఏమీ తోచడంలేదు.

నేను చావ కూడదని నిశ్చయించుకుంటాను. కాని ఆ నిశ్చయం కొనసాగడం ఎలాగ?

ఓ ప్రియురాలా! నీవు చాలా అదృష్టశాలివి సుమా! దుర్భరమైన నా దురవస్థను చూచి ఓర్వలేక సులువుగా తనువు చాలించగలిగినావు. కాని అంతటి మహాభాగ్యం నాకు కలుగదు. నేను చావలేకున్నాను.

అయ్యో! అయిదుగంటలు కొట్టుతున్నారే!.........ఉరిదీసే సమయం దగ్గరకు వస్తున్నది. ఓ దైవమా! ఓ దైవమా!...... దైవ

మంటూ ఒక డున్నాడా? ఉన్నాడో లేదో, సంశయముగా నున్నది......ఉన్నాడనుకొంటాను. లేడు-ఉన్నాడు. ఉండి నా కేమి ఉపకారము? ఏం ప్రయోజనం ?

నేను నిర్దోషిని కానా?

ఏపాపం ఎరుగనివాణ్ని నన్ను కాపాడనా?

నేను నిర్దోషిని అని నీవు ఎరిగి వుండిన్ని నన్నే శిక్షిస్తున్నావు! దోషులను ఎందుకు విడిచిపెట్టుతున్నావు? ఇది ఏమి అన్యాయము?

నేను దోషిని కాను. నే నేపాపము ఎరుగను. నేను దోషిని కాను. ఓ దైవమా! నీవు నాకు లేవు. ఓమునస్సాక్షీ ! నీవే ప్రమాణమవు. దైవానికీ, లోకానికీ నీవే సాక్షివి.

*     *     *     *

నాకు మెళుకువ వచ్చింది. లేచి కనులు విప్పి చూనేటప్పటికి అరుణకాంతులు ఆకాశమంతా నిండుకొనిఉన్నాయి. తొలి దిక్కున చిన్న వెలుగు పైకి వ్యాపిస్తున్నది. నా గుండెయపై కూర్చుండి నాచిన్ని కుమారుడు ముద్దుమాటలతో నన్ను లేపుచున్నాడు; కొట్టుచున్నాడు. కన్నులు సారించి మరియొకసారి చూశాను. పూర్ణబ్రహ్మానందము పూనినట్లయింది.

నే నింతవఱకు అనుభవించింది స్వప్నగత వృత్తాంతమేనా !!!



"నేను దోషినికాను......... నీవే సాక్షివి"

కొడాలి ఆంజనేయులు గారు

# సాగరసంగీతము

౧

ఘటకుటజకోటరకులాయపల్లవముల
పాట చాలించి నిదురించె పావురాయి
కార్తిక తమోనిశీథి (?) భీకరతరంగ
ఘోష శాంతించి మనుమోయి కొంతతడవు!

౨

క్రమలాతూపదాంక రేఖావిభూతి
తామ్రపర్ణీ తరంగిణి తరలి వచ్చె
ప్రణయసంగీతసరణి నంబరతలమ్ము
తేటవెన్నెల మోసు లెత్తింపు మోయి!



మాడుంబ నరసింహాచార్యులుగారు

౧

కృష్ణారావును, సీతారామశాస్త్రియును బాల్యస్నేహితులు; బ్రాహ్మణ కులస్థులు. కృష్ణారావింటిపేరు కలగరపువారు. అతని నివాసస్థలము రాజమహేంద్రవరము. సీతారామశాస్త్రి యింటిపేరు పెద్దాడవారు. అతనిపితరులు తమ నివాసస్థలమగు రాజానగరము విడిచిపెట్టి కొడుకుల ఇంగ్లీషుచదువులకోసము రాజమహేంద్రవరము వచ్చి చేరునప్పటికి సీతారామశాస్త్రికి ఆరేండ్లకన్న నెక్కువలేవు. కృష్ణారావునకును సరిగా అదేవయస్సు. కలగరపువారింటి కెదురుగానే పెద్దాడవారి బస యుండేది. అప్పటినుండియు చదువులు, ఆటలు, షికార్లు, చిరుతిండ్లు, ఒకటేమిటి, అన్నిటిలోను ననుదినము కలిసికొనుచు కృష్ణారావును, సీతారామశాస్త్రియును చాలా చనువుగా నుండేవారు. వారి స్నేహము ఆలాగు సుమారు పండ్రెండు సంవత్సరాలు నిరంతరాయముగా సాగినది. తరువాత గ్రామాంతరములం దుండవలసి వచ్చుటచే ఏ అయిదారేండ్లో మాత్రమే వారి కెడబాటు గల్గినది. ఆటుపిమ్మట దైవవశాత్తు వారుభయులును కాకినాడలోనే మకాము పెట్టుట తటస్థించినది. ఆ బాల్యస్నేహితు లిద్దఱును రామారావుపేటలోనే సమీపగృహములలో బసచేసినారు.

సాధారణముగా సమానపరిస్థితులలో నున్నవారికే గాఢమైన స్నేహము కుదురునని లోకులు చెప్పుచుందురు. కాని యామాత్రము వీరివిషయములో బొత్తిగా వర్తింపలేదు. కృష్ణారావు గృహస్థాశ్రమములో ప్రవేశించి అప్పుడే ఇద్దరుబిడ్డలతండ్రి యైనాడు. ఇంగ్లీషువర్తక కంపెనీలో గుమాస్తాగానుండి నెలకు వందరూపాయలు తెచ్చుకొనుచున్నాడు. తండ్రి కొద్దికాలముక్రిందటనే చనిపోవుటచేత రాజమహేంద్రవరములోని యిల్లు అద్దెకిచ్చి అతనితల్లియు, సోదరీసోదరులును కూడ కాకినాడలో కృష్ణారావుదగ్గఱనే ఇప్పుడు వాసముచేయుచున్నారు.

సీతారామశాస్త్రి పరిస్థితులు వేరు. అతని తలిదండ్రులిద్దరును బాగున్నారు. వారిప్పుడు తమ తక్కిన ఇద్దఱు మగపిల్లలకును ఇద్దఱు ఆడపిల్లలకును చదువు చెప్పించుకొనుచు రాజమహేంద్రవరములోనే యున్నారు. సీతారామశాస్త్రి బి. ఏ. పరీక్షకు దరఖాస్తు పెట్టియుండియు డిగ్రీ ఆశ సైతము విడిచివైచి సహాయనిరాకరణ సందర్భమున ఇంగ్లీషువిద్యకు స్వస్తి చెప్పినాడు. పిమ్మట గవర్నమెంటు ఉద్యోగములో ప్రవేశించుట కిష్టపడక తన జీవితమును దేశసేవయందే గడుప ప్రతిజ్ఞపట్టినాడు. అయినను అతనితండ్రియగు కామశాస్త్రిగారికి మాత్ర మింకను పాశ్చాత్యవిద్యావ్యామోహ మేమాత్రమును సడలలేదు. ఆయన స్వగ్రామమందలి తనగృహమును పాడుపెట్టి అద్దెయిండ్లలో పట్టణవాసక్లేశ మనుభవించుచు బిడ్డలను ప్రభుత్వోద్యోగ స్వీకారమునకు తయారు చేయుచుండెను. పరాధీన స్థితిలో నున్న భారతప్రజల కెదురుగా కనబడుచుండు బ్రతుకుతెరవొక్క ఉద్యోగస్వీకారమే గదా!

సీతారామశాస్త్రి నాలుగేండ్లపాటు ఏదో పల్లెటూరిలో మకాముపెట్టి సొంతవ్యవసాయము చేసినాడు. కాని మున్ముందు పత్రికాసంపాదకత్వము వహించి తన దేశభాషాపాండిత్యమును, ఆంగ్లభాషాప్రవీణతయు సార్థకపడునట్లు దేశసేవచేయ నుత్సహించుచున్న యాయువకునకు పల్లెటూరి జీవనము సరిపడనందున నతడు తనమకామును కాకినాడకు మార్చి ఇంగ్లీషు దినపత్రికలకు వార్తలను, వ్యాసములను వ్రాసిపంపి కొంత ధనము సంపాదించుచు అక్కడ సుఖముగనే కాలక్షేపము చేయ ప్రారంభించెను. అతడింతవరకు వివాహమే చేసుకోలేదు. బ్రహ్మచర్యదీక్ష నవలంబించి నిరాడంబర జీవనము చేయుచుండెను. విధవరాలగు నతని మేనత్త మాత్రమే సంరక్షకురాలై యతని గృహమునందుండెను.

గృహపరిస్థితులందే కాక మత సాంఘిక రాజకీయములందు కూడ ఈబాల్యమిత్రు లిరువురు భిన్నాభిప్రాయులే. సీతారామశాస్త్రి సనాతనమతావలంబి; కృష్ణారావు సంఘసంస్కరణాభిలాషి. సీతారామశాస్త్రి శుద్ధఖద్దరు వస్త్రధారి. స్వదేశపరిశ్రమలకు ప్రోత్సాహము కలిగించుటవలననే దేశదారిద్ర్యము తీరి, భావదాస్యముపోయి, ఆర్థికముగను, రాజకీయముగను దేశమౌన్నత్యము నొందు నను నభిప్రాయము గలవాడు. కృష్ణారావునకు ఖద్దరువస్త్రధారణదీక్ష లేదు. అతడు తరుచు మిల్లునూలు బట్టలే కట్టుచుండును. యంత్రసహాయము లేనిది మనము కేవలము చేతిపనులవలన పాశ్చాత్యులతో ఏవిషయమునను పోటీ చేయలేమని యతనివాదము.

ఇట్లీయుభయులకు గల భేదములే పోలికలకన్న నెన్నోరెట్లెక్కువగ నున్నవనుట స్పష్టము. కాని వారి యుభయుల మధ్య గాఢముగ నాటుకొనియున్న స్నేహలత దుర్ఛేద్యమై, నిష్కళంకమై, యనివార్యముగ సాగుచునే యున్నది. వారు దినమున కొకసారియైన తప్పక కలిసికొని సంతోష సల్లాపములచే కాలము బుచ్చుచుందురు. తరుచుగా సాయంసమయములందు షికారుపోయి యిసుకపఱ్ఱలో కూర్చుండి సాంఘిక రాజకీయాది విషయములను గూర్చి దీర్ఘ ప్రసంగములు గావించుచుందురు.

సీతారామశాస్త్రి యెంత సనాతనమతాభిమానిగ నుండదలచుకొన్నను బాలవితంతువుల దురవస్థ దలచినప్పుడు మాత్ర మాతనిహృదయము చలించిపోవుట మానలేదు. వితంతుబాలికల దుస్థితినిగూర్చి వ్రాసిన గాంధిమహాత్ముని వ్యాసములును, ప్రముఖులగు బ్రహ్మమతావలంబుల వ్రాతలును ఎప్పటికప్పుడు తెచ్చి చూపి కృష్ణారావు సీతారామశాస్త్రి భావములందు మార్పు గలిగింప జూచుచుండెను. అది యట్లుండ రమారమి ఒక సంవత్సరకాలమునందే శాస్త్రి దగ్గరబంధువులలో ముగ్గురు బాలికలు వితంతువు లైపోయిరి. ఆ వితంతుబాలికల దురదృష్టమును గూర్చి యీ మిత్రు లిర్వురు చాలదినములు విచారించినారు. వితంతూద్వాహములను గూర్చి యీయుభయులమధ్య నెన్నియో ప్రసంగములును, వాదప్రతివాదములును నడిచినవి. ఆవాదములందు శాస్త్రిహృదయము తామరాకుమీది నీటిబొట్టువలె సంచలింపజొచ్చెను. తనహృదయాకాశమున మెరుపువలె నప్పుడప్పుడు మెఱయుచుండు నొక పూర్వవిషయ మప్పుడు శాస్త్రిస్మృతిపథమున సాక్షాత్కరించెను.

చామనచాయ మేను. చంద్రబింబమువంటి మొగము. చారెడేసికండ్లు. మంచి చుఱుకుతనము గలిగి మహాలక్ష్మి యను సార్థకనామముతో నొప్పు సుమారు పదహారు సంవత్సరముల యీడుగల యొక వితంతుయువతితో నత డప్పుడప్పుడు సంభాషించియుండెను. ఆయువతి నివసించిన గృహము రాజానగరములో శాస్త్రి యింటికి పోవుదారిలోనే యున్నది. వారింటిపేరు క్రొత్తపల్లి వారు, మతనైతికసాంఘికరాజకీయాది విషయములందామెకు గల పరిజ్ఞానమును ఆధ్యాత్మికజ్ఞానార్జనమునందామెకుగల ఉత్కంఠయు దలచి తానొకప్పుడు ఆశ్చర్యముచే సమ్మోహితుడైపోయిన సంగతి యతని మనోనేత్రమున కప్పుడు గోచరించెను. అట్టి విద్యావతియగు వితంతుయువతి యందచందము లడవి గాచిన వెన్నెలయై పోవుట శుద్ధ అన్యాయమని యతనికి దోచెను. ఆమె తన్ను తప్పక కామించియున్నదనియు, దనకు వివాహేచ్ఛ యున్నను లేకున్నను ఆమెజీవితమును సౌఖ్యవంతముగ నొనర్చుటకైన తానామెను తప్పక వివాహమాడతీరవలె

ననియు నతనికి దన యంతర్వాణి ప్రబోధించుచున్నట్లు పొడగట్టెను.

మహాలక్ష్మినిగూర్చి తానెఱిగిన ముఖ్యవిషయ ములు కొన్ని శాస్త్రి కృష్ణారావున కెఱుకపఱచి మఱియు నిట్లనియెను. "గతపర్యాయము రాజానగరము వెళ్లినప్పుడు ఆయింటిలోనివా రందరు నాకు పరమాప్తులుగా కన బడిరి. మహాలక్ష్మి తనకు నాయందుగల పూజ్యభావ మును వెల్లడించుచు నెంతోచనువుగా తనకష్టసుఖములు నాతో చెప్పుకొన్నది. ఆయింట్లో నప్పుడు మహాలక్ష్మియు, ఆమెనాయనమ్మయు, మేనత్తయగు సుబ్బలక్ష్మమ్మయు, తమ్ముడగు కేశవరావును ఉన్నారు. స్త్రీలు ముగ్గురును వితంతువులే. మహాలక్ష్మికిమాత్రము వైధవ్యచిహ్నము లేమియు లేవు. ఆమె సౌభాగ్యవతివలె కలకలలాడుచు నవ్వుమొగముతోనే మాట్లాడినది. స్త్రీలోకమునంతను మాతృసమానముగ జూచుచు యావజ్జీవము బ్రహ్మచర్య మవలంబించియుండుట మోక్షప్రాప్తికి సులభసాధనమని నమ్మియున్నవాడ నగుటచే, నే నింతవరకును వివాహము నకు విముఖుడనై యుంటిని. కాని విశాలహృదయముతో యోజించిచూచినకొలది సంసారసుఖము లనుభవింపవలె ననిగంపెడాసతో నువ్విళ్లూరుచుండు ముగ్ధలగు నట్టి బాల వితంతువులకునిర్బంధవైధవ్యము విధించుట నిర్దాక్షిణ్యమని నాకు స్ఫుటముగ గోచరించుచున్నది. కావున నే నిప్పుడు బయలుదేరి రాజానగరముపోయి అక్కడ కొన్నాళ్లుండి మహాలక్ష్మికిని నాకును పరస్పరానురాగము కుదిరినచో నామెను తప్పక వివాహమాడెదను. అట్టి సంఘటనము లభింపనిచో నేను యావజ్జీవము బ్రహ్మచారిగానే యుండి పోవుదును. ఇదే నానిశ్చయము."

కృష్ణారావున కతనిమాట లత్యధికముగు నద్భుతా నందములు కల్గించెను. శాస్త్రి మంచి పట్టుదలగల వాడు. కార్యశూరుడు. తాను నమ్మిన దానిని తప్పక ఆచరణలోనికి దేగలిగినవాడు. అందుచే శాస్త్రి సంఘ సంస్కర్తగ మారినచో దేశమున కెంతో లాభము చేకూర గలదని కృష్ణారావు నిజముగా నుప్పొంగిపోయెను. శాస్త్రి తా నాదినముననే ప్రయాణమై వెడల నిశ్చయించు కొన్నందున కృష్ణారావు ననుమతిగొని స్వగృహమున కేగెను. పిమ్మట నతడు తన మేనత్తకోరిక ననుసరించి యామెను రాజమహేంద్రవరములో తమయింట దిగ బెట్టి "వివాహార్థినై కన్యాన్వేషణమున కరుగుచుంటి" నని మాత్రము తలిదండ్రులతోను, మేనత్తతోను చెప్పి వారి యొద్ద సెలవుగైకొని యతడు రాజానగరము ప్రయా ణమైపోయెను.

## ౨

సీతారామశాస్త్రి రాజానగరము పోయియుండి మూడుమాసములు కావచ్చినది. ఈలోపుగ కృష్ణారావున కతనియొద్దనుండి రెండు ఉత్తరములు మాత్రమే వచ్చినవి. ఆయుత్తరములనుబట్టి ఒకయేడాదిక్రితమే-అనగా గత పర్యాయము శాస్త్రి మహాలక్ష్మితో మాట్లాడివెడలిన కొద్ది నెలలలోనే-ఆమె తల ముండనముచేయించుకొని నాటి నుండియు వైధవ్యనియమములన్నియు యథావిధిగ నిర్వర్తిం చుచు విరాగిణియైయున్నదని యతనికి తెలియవచ్చెను. శాస్త్రియత్నములు తాననుకొన్నంత సులభముగ సఫల మగుసూచన లేమియు గానరావని కృష్ణారావు తలపోయు చుండెను. రాజానగరముపోయి తనకు తెలియవచ్చిన మహాలక్ష్మి విచిత్రవృత్తాంతమంతయు గన్నులార గాంచ వలెనని యొకటి రెండు సారులు కృష్ణారా వనుకొనెను. కాని, యాయాలోచనలు క్రియారూపము వహింప వయ్యెను.

ఒకనాడు కృష్ణారావు మధ్యాహ్నభోజనముచేసి వచ్చి తమసావడియందున్న పడకకుర్చీలో పరుండియుం డెను. అది క్రిస్టమసు సెలవులకు ప్రారంభదిన మగుటచే ఉద్యోగవ్యవహారపు తొందర లేమియు లేక అతడు నిశ్చిం తగ విశ్రాంతి గైకొనదలచెను. కాని దేశమందలి రాజ కీయసాంఘిక పరిస్థితులనుగూర్చిన భావపరంపర లతని మెదడునజేరి పనిచేయుచు నతని చిత్త విశ్రాంతి కించుక భంగము కలిగించుచుండెను. ఇంతలో తపాలామనిషి వచ్చి కొన్నియుత్తరములును, ఒకటి రెండు వార్తాపత్రికలును, భారతి మాసపత్రికయును బల్లమీద పడవైచి వెళ్లిపో

యెను. కృష్ణారావు ముందునకు వంగి బల్లమీది ఉత్తరములు తీసి చదువుకొనెను. అందులో శాస్త్రి వ్రాసిన ఉత్తరమేదియు లేనందున అతని కాశాభంగము కలిగెను. వార్తాపత్రికలు చదువుటకు బద్ధకము తోచినను చిత్రములను కథలలోని బొమ్మలునైన చూచు నభిలాషతో నతడు భారతి నందుకొనెను. కాని ఇంతలో శాస్త్రి సంగతి తలపునకు రాగా నతడేమేమో యాలోచించుచు తెరచిన భారతీపత్రికను గుండలపై బెట్టుకొని కుర్చీలో జారగిలపడి పరుండెను.

అప్పటికే అరమోడ్పుగానున్న కృష్ణారావు కన్నులు క్రమముగా కునుకు వచ్చుచుండెను. ఆసమయములో



నెవరో వ్యక్తి మెల్లగా వెనుకనుండివచ్చి యతని కన్నులు మూసెను. హఠాత్తుగా నిద్రాభంగ మగుటచేత నతడులిక్కిపడి యెవరా అంతచనువుగా తనకన్నులు మూసినవారని యాశ్చర్యపడెను. ఆరేండ్ల యీడుగల యతని కుమార్తె తండ్రియెడ మిక్కిలి చనువుగా వర్తించు స్వభావము గలిగి తరుచుగా కొంటెపనులు చేయుచుండును. ఆబాలికయేమో యని యతడు చేతులు తడిమి చూచెను కాని యవి చిన్నపిల్ల చేతులు కావు. "ఎవరా మోటుతనము?" అని ఒక కేకవేసి అతడు చేతులు త్రోసి నైచి వదలించు కొనెను. నవ్వు మొగముతో సీతారామశాస్త్రి వచ్చి యెదుట నిలువబడెను.

"ఓహో! నీవేనా? అప్పుడే యెట్లు వచ్చితివి?" అనుచు కృష్ణారావతనిని సంతోషముతో తనప్రక్కనున్న కుర్చీలో కూర్చుండ బనిచెను. శాస్త్రి కూర్చుండి, "నేను ఉదయము తొమ్మిదిగంటలకే వచ్చినాను. కాని వచ్చిన వెంటనే విసుగుగా నుండుటచే నిక్కడకు రాలేకపోయినాను" అనెను.

"మీమేనత్తను రాజమండ్రిలో దిగబెట్టి నట్టున్నావే. తిన్నగా ఇక్కడికే రాక నీవు మీయింటి కెందుకు వెళ్లినావు?"

"వచ్చేటప్పుడు మామేనత్తను మరల తీసికొని వచ్చినాను."

"వెళ్లిన పని యేమైనది? కాయా, పండా?"

"(చిరునవ్వుతో) కాయాలేదు – పండూలేదు. మోడే."

"(నవ్వుచు) మోడేమిటి? పెండ్లి లేకుండ ఇంకా మోడులాగున ఉంటా నన్నమాటా?"

"అది చాలాకథ ఉన్నది. సావకాశముగా చెప్పవలెను."

"ఇంకా సావకాశమేమిటి? ఈ వారమురోజులు మాకు సెలవులే గనుక నీయిష్టము వచ్చినంత విరళముగా మీ వాదప్రతివాదములు ప్రదర్శింతువు గాని_ముందుగా మహాలక్ష్మి నిన్ను వివాహమాడుట కంగీకరించినదా, లేదా? ఒక్కమాటలో చెప్పివెయ్యి."

"కృష్ణారావూ! ఎందుకు నీ కా తొందర? మా వాదప్రతివాదములు సంపూర్ణముగ విన్న తర్వాత నే నవివాహితుడగా నుండిపోవుటలో నాది తప్పిదముగునో కాదో నీవే నిర్ణయింతువుగాని.

గర్వాను, అహంకారము, ద్రవ్యాపేక్ష, కఠినత మొదలగునవి ప్రజలను వానియెడల నహితు లుగ జేసివై చెను.

"మంత్రి—సరియే! రాజా!

"రాజునొద్ద సెలవుదీసికొని ప్రధాని సైన్యాధ్యక్షునితో కొలదిసేపు మాటాడెను. తరువాత కొంతమంది విలుకాండ్రు వచ్చి నేరస్థుల వెనుక నిలిచిరి. రాజు ముందున నుండెను. విలుకాండ్రందఱును సంతోషమును బట్టజాల కుండిరి.

"రాజు—వీరినందఱి నొక్క త్రుటిలో చంపి వేయవలయును. సిద్ధముగ నుండుడు.

"సేనాని—సైనికులారా! మీపని కానీయుడు.

"విలుకాండ్రు తమ యధ్యక్షుని యాజ్ఞను వినిరి. మొదట చంపబడినవ్యక్తి యా రాజేంద్రుడే!

"అనగా నారాజునట్లు ప్రతిమానవుడును తనలోననే యుండిన శత్రువులను జయింపజాలక, పైశత్రువులను జూచి వారిని దండింప దలచి, తాను బాధపడుచున్నాడు. కనుక తనలో నున్న శాత్రవుల నెవ్వరుజయింతురో యట్టివారే యీప్రపంచమునంతయును జయింతురు. అపుడే కష్టసుఖముల కెంతయును వారిమీద హక్కుండదు.

"అందుచేత, నీయహంకారము—'నే నేదియో మానవులకు సేవ చేయగల' ననెడి యహంకారము—ఆ సేవయే యెప్పుడును చేయవలెననెడి యాశమూలముననే గదా నీ కిట్టిస్థితి గలిగినది. దీనికి నిన్నేమియు ననవసరము లేదు;—ప్రపంచమంతయు నిట్లే యున్నది!

"మానవు డొకప్పుడు సుందరుడు; చిదానందుడు; దయామయుడు; శాంతివాది; నిర్మల జీవ ప్రతిమ: ఒకప్పు డా సర్వలక్షణలక్షితుడై యుండిన మానవుడు—ఈ సకలప్రపంచము నందలి చరాచరములందును విశేషగుణవిశిష్టుడయ్యు నిర్విశిష్టుడై యుండగలిగిన మానవుడు, ఈపాంచభౌతిక సముదాయమున కతీతుడై 'శివోహ'మ్మని చెప్పగలిగిన మానవుడు—ఇపుడు నిర్జీవపాషాణ ప్రతిమ. దురాత్ముడై, యరిషడ్వర్గజితుడై, యీషణత్రయీవ్యాధితుడై మనుచున్నాడు. ఆ మానవశ్రేష్ఠుడేనా యీ నిర్జీవపాషాణప్రతిమ?—" అని పలికెను.

విశ్వే.— (జడదారి పాదములపై బడి) తండ్రీ! నీవే నిజమగు మిత్రుడవు—నా యజ్ఞానాంధకారమును దొలఁగద్రోచిన జ్ఞాన భాస్కరుడవు. నా కిపుడు జ్ఞానమును ప్రసాదించితివి. నాకిపుడు నాస్థితి యర్థమైనది. దయామయుడగు నాపరమేశ్వరుడే సకలమును చేయవలయునుగాని, మనము కర్తల మగుదుమా? ఆతడే మనల సుఖుల జేసినను, దుఃఖభాజనుల జేసినను. లోకరక్షణదక్షుడగు పరమేశ్వరునిలీల లనంతములు! మానవుడు సాంతుడను సంగతి మఱవక, నాయనంతుని కెల్లప్పుడును జోహారు చేయుచుండవలసిన దే!

జడదారి—ఓయీ! ఇది యొక మహాత్తర తత్త్వప్రకారము పొరపాటు!—నీమానవసమే

యన్నియును చేయుచున్నది. నీవు దేనిని చేయ బూనుదువో, యట్టిపనిని నీవే నిమేషకాలములో చేయజాలుదువు—నీవే యీసకలప్రపంచ స్రష్టవు! నీవే యనంతశక్తుడవు! అది యగుట నీలోననే యున్నది. ఇదియే యద్వైత రహస్యము నాయనా!—ఇదియే యొక్కొకపుడు ప్రతిమానవునకును నిజమని తోచుచుండును. నీకే భౌతికజ్ఞాన మున్నదియో యదియే సృష్టికర్తయని తెలిసికొనుము. తానే యీశ్వరుడను స్థిరమైన నమ్మకముచేతను, మననముచేతను మానవుడీశ్వరుడగుటకు సమర్థుడగుచున్నాడు. తన్నే ప్రతిరూపమునందు నారోపించుచున్నాడు గావుననే సర్వమయుడగుచున్నాడు. ఇదియే రహస్యము నాయనా! ఇదియే మనజ్ఞాను లందఱును కష్టపడి తెలిసికొన్న మహత్తర తత్త్వము.

విశ్వే.—తండ్రీ! నేనే సర్వమయుడ నగుదునని చెప్పియుంటివిగదా! అందుచేత, నే నే పనిని చేయనక్కరలేదా? నే నేమానవునకును సేవజేయనక్కరలేదా? సర్వమును దైవమయమే మైనపుడిక పరిచర్య యేమి?

జడదారి—నాయనా! మరల నీవు పొరబడుచుంటివి—నీ వెపుడు పరులనియు, మానవజాతియందు నీచులనియు తలచి వారి నుద్ధరించుటకు తలపెట్టితివో యపుడే నీకీ యద్వైతజ్ఞానము నశించినది. అందుచే నెంతకాలము నీ మానసికవృత్తి నిమ్నజాత్యుద్ధరణమునందు నెలకొనియుండునో యంతకాలము నీకది యున్నది. సంఘసేవయందే నీకు సుఖ మున్నది. కాని యొకటి: నీ మనోవృత్తి నింతకంటె ఘనముగ జేసికొనుట కొకమార్గ మున్నది. నీ వెట్టికర్మను జేయుచుండినను, ఆ కర్మఫల మపేక్షింపక, స్థిరముగ నెప్పుడు కర్మను కర్మకొఱకే చేయుదువో యపుడే నీ కెన్నడును లేని సుఖ మలవడును; చిదానందమొదవును. అట్లు నీ వెపుడు చేయుదువో యపుడే నీకు నీ యాత్మస్వరూపము వ్యక్తము కాగలదు.

విశ్వేశ్వరు డీయుపదేశమును విని, యా జడదారిముందఱ మోకరించి, ఖిన్నుడై "దేవా నే నేమియు నెఱుగను. సంతతమును నే నేదియో గొప్పకార్య మొనరించుచున్నా ననెడి యహంభావము తోడను, యారివారెల్ల నా వంటివానిని సైతము పిచ్చివానిని జేసినందులకై కలిగిన కోపముచేతను నిజముగ పిచ్చివాడనైతిని. ఇది వారి తప్పు గాదు! అంతయును నా లోపమే! నే నెపు డీ విశ్వతత్త్వరహస్యములను కనిపెట్టజాలకుంటినో యంతకాలము నీ యరిషడ్వర్గమునకు లోబడి యుండవలసినవాడనే! కనుక నిపుడు కేవలము పరమేశ్వరునియందే నమ్మక ముంచి, యాతడే న న్నీప్రపంచమున నడపుచున్నాడని నమ్మి, యీ సంఘవ్యవస్థ కతీతుడనై, నా కాపరమేశ్వరునిచే నేర్పరుపబడిన పనిని నిష్కాముడనై నెఱవేర్చుటయే శ్రేయమని తోచుచున్నది." అని సాగిలబడి మ్రొక్కెను.

విశ్వేశ్వరు డట్లు మ్రొక్కి తల పైకెత్తునరికాతని కా జడదారి కానబడలేదు. తాను మాటాడుచున్నపు డాత డెటకేని పోయియుం

డెనా? లేక మాయమయ్యెనా? విశ్వేశ్వరు డా చుట్టుపట్టులనంతయు వెదకెను. కాని యా ముదుసలిజడదారి జాడ మాత్రము కానరా లేదు. విశ్వేశ్వరు డాతనినే పరమేశ్వరుడని నమ్మి, యచటికి పోయి ప్రతిదినమును ప్రార్థించుచుం డెను. ఆత డాముదుసలి—ఆ విశ్వేశ్వరుపాలిట విశ్వేశ్వరుడు—చెప్పినమాటలందలి నిశ్చయా ర్థమును గ్రహించి సంతసించి, తన మనమున నొకవిధమగు శాంతి నెలకొల్పెను. విశ్వేశ్వరు డిపుడు స్వర్గీయానంద మనుభవించుచుండెను. ఇదియేనా యాతనికి మంగళము? ఆజడదారి మాటలందలిసత్య మాతనికి స్ఫురించెనా? విశ్వే శ్వరుడు తరువాత తన కర్తవ్యమును ధీరుడై నెఱవేర్చుచుండెను. ఎవ రేమి యనినను లక్ష్య గించుకొనుట మానెను. తన యాస్తినంతయు ను మాలలకు పంచియిచ్చి వారిస్థితిని బాగు చేసెను. తన జీవనమునకు మాత్రము కొలదిగ నుంచుకొనెను. ఆతడా జడదారి బోధించిన చోటనే యొకపర్ణశాల నేర్పఱుచుకొని యందు ననే నివసించుచుండెను. తనశక్తినంతయు ధార వోసి మానవజాతికై పాటుపడుచుండుటయందే యాతనికి నిస్తులానంద మలవడుచుండెను. ఆ జడదారిమాటలే విశ్వేశ్వరునికి మంగళప్రదము లైనవి! శివమ్!

---

## అ జం తా చి త్ర ము లు




౨. రురు జాతకము

బోధిసత్త్వుడు మృగజన్మమును బొందియుండినకాలమున కాశీరాజు చేపట్టుబడి కాశీనగరమునకు రథమునఁ గొంపోబడు

# (వేదాంతి) చిట్టిగాడు

ముద్దా విశ్వనాథం గారు

ఒకరోజున ధర్మారావుదొరగారు స్వారి బయలుదేరినారు. దారిలో పువ్వులు కోతామని దిగినారు. ఆయన తిరిగి వచ్చేసరికి గుఱ్ఱం పుడాయించింది. "ఆగు, ఆగు, పంచకల్యాణీ" అంటూ పేరుపెట్టి గట్టిగా కేకలు వేశారు. దొరగారు. ఆగినట్టుండేది, ఆయన తీరా దగ్గఱకు వచ్చేటప్పటికి ఇట్టే పరుగెత్తేది. కొంతసేపటికి ఆపక్కన పొలంలో వున్న చిట్టిగాడు యిదంతాచూచి, గబుక్కున వెళ్లి కళ్లెం పట్టుకుని గుఱ్ఱాన్ని ఆపి, యజమానికి వప్పచెప్పాడు. ఈకుర్రాడి సుఃఖలక్షణాలు చూచేటప్పటికి మహాసంతోషవయింది ధర్మారావు గారికి. "అబ్బాయీ! మంచి తెలివితేటలతో పట్టుకున్నావోయి, మాగుఱ్ఱాన్ని. చాలా సంతోషించాం. నీ కేం బహుమానం ఇయ్యగలం?" అని జేబులో చెయ్యి పెట్టినాడు.

"నాకేమీ వద్దండీ" అన్నాడు, చిట్టెయ్య.

ధ—వద్దూ? మరీ మంచిది. ఇల్లాగ ఎవరూ అనడం వినలేదు. సరే, నువ్వు పొలంలో ఏం చేస్తుంటావు?

చి—నేను కంపలు తవ్వుతున్నాను. గొఱ్ఱెలను కాస్తున్నా.

ధ—నీ కీపని సరదాగా వుంటుందా?

చి—ఓ.

ధ—పోయి ఆడుకోరాదూ?

చి—నా కీపని కష్టంగా లేదండీ, ఆటకంటె ఎక్కువ కులాసాగా వుంది.

ధ—నిన్నెవరు ఈపనిలో పెట్టారు?

చి—మాబాబు.

ధ—అతగాడేడీ?

చి—అల్లదుగో, ఆచెట్ల మరుగున గుడిసెలో వున్నాడు.

ధ—అతని పేరు?

చి—కిష్టమ్మ.

ధ—నీపేరో?

చి—చిట్టిగాడంటారు, బాబూ.

ధ—నీ వయస్సు?

చి—రేపు సంకురాత్తిరికి ఎనిమిదేళ్లు వెళతాయండి.

ధ—ఈపొలంలో ఎంత సేపటినుంచి ఉన్నావు?

చి—పొద్దుట ఆరుగంటల కొచ్చానండి.

ధ—మరి, నీకు ఆకలి వెయ్యటంలే?

చి—కాస్సేపుండి, గంజి కెళ్తానండి.

ధ—ఒరే కుఱ్ఱాడా! నీదగ్గఱ ఇప్పుడు ఆరణాలుంటే ఏం చేస్తావు?

చి—నాకు తెలవదు బాబూ. ఇదివఱకెప్పుడూ నాదగ్గ ఱంతసొమ్ము లేదండి.

ధ—నీకు ఆటవస్తువు లేమీ లేవూ?

చి—ఆటవస్తువులా? అవేంటి బాబూ?

ధ—గోళీకాయలు, బంతులు, బొంగరాలు, అలాంటివిరా.

చి—లేదండి. చెల్లికే కొన్నది మా మామ్మ, మొన్న తీర్థంలో, గెంతులేశేకప్ప,నొక్కితే కూశే పిట్టలు, లక్క సామానులున్నూ. నాకు ఆడుకుందికి ఒక గుడ్డంబొమ్మ వుండేది. అది విరిగిపోయిందండి.

ధ—అయితే నీ కేమీ వద్దూ?

చి—వద్దండి, దొరగారూ! రోజల్లాగొడ్లల్ని మేపుకు వచ్చేటప్పటికే సరిపోతుంది. ఇదే నాకు సరదాగా వుంటుంది, ఆడుకోవడం కంటేను.

ధ—సరే, నీదగ్గఱ డబ్బుంటే పళ్లూ, అప్పచ్చులూ కొనుక్కోకూడదూ?

చి—అక్కఱలేదండీ, నాకు కావలసిన వన్నీ మా అమ్మ యిస్తుంది. అవ్వే చాలు.

ధ—పోనీ, పుల్లలు కోసుకునేందుకు ఒకచిన్న కత్తి వద్దూ?

చి—నాదగ్గఱ ఉందే? ఒకటి. మా అయ్య ఇచ్చాడు.

ధ—అయితే చూడు, నీచెప్పులు బొత్తిగా పాడైపోయినట్టున్నాయి. ఒకజత కొనుక్కోమిమ్మా.

చి—ఇంటిదగ్గఱ మరొకటుందండీ, పండుగల్లో వాడుకునేందుకు.

ధ—ఒరే చిట్టీ! నీతలగుడ్డంతా చినిగిపోయిందే?

చి—ఇంకా పాడైపోయిన తరువాత నెత్తి మాడుతుంది, బాబూ. అప్పుడు కొత్తది కొనుక్కుంటా.

ధ—అబ్బాయీ! వర్షం వస్తే ఏం చేస్తావురా?

చి—అల్లా మంచెకిందికి పోయి కూచుంటానండీ, వాన వెలిసేదాకా.

ధ—ఇంటికి వెళ్లకముందు ఆకలి వేస్తే ఏమిటి చేస్తావు, చిట్టెయ్యా?

చి—ఒక్కొక్కప్పుడు దుంప తింటానండి.

ధ—అదీ దొరక్కపోతేనో?

చి—నాకేం పరవా లేదండి, ఆ గొడవే తల పెట్టను.

ధ—మరివొచ్చి, ఈ వేసంగిలో నీకు దాహం వెయ్యదట్రా?

చి—ఆ చెలమలో ఉన్న నీళ్లు చాల్నండి.

ధ—హోరి చిట్టిగా! ఎంత వేదాంతివిరా?

చి—అయ్యా?

ధ—నువ్వు వేదాంతివి అంటున్నానురా. అంటే యేవిటో నీకు తెలియదు కాబోలు.

చి—తెలవదు బాబూ, తెలవకపోతే యిబ్బంది లేదుగదా?

ధ—లేదు, లేదు. (నవ్వును.)సరే, చిట్టెయ్యా! నీ కేమీ అక్కఱలేనట్టుంది. నీకు అవసరం కలిగించేందుకు సొమ్ము యేమీ యివ్వను లే.అయితే,నువ్వు బళ్లోకి వెళుతున్నావా?

చి—లేదండి. కోతలయిన తరువాత ప్రవేశ పెట్టిస్తానన్నాడండి, మా అయ్య.

ధ—మఱి, నీ కప్పుడు పుస్తకాలు కావాలె కాదూ?

చి—అవునండి, బళ్లో అందఱికీ పేర్లు పుస్తకమున్నూ, ప్రార్థనపుస్తకమూ వున్నాయండి

ధ—సరే, నీకు నేను ఆపుస్తకాలు రెండున్నూ కొనియిస్తాను. నువ్వు సంతుష్టి గలక్కుర్రవాడివని సంతోషించాను. ఇల్లాగని మీ బాబుతో చెప్పు. పో, నీ గోత్రాలు కాసుకో.

చి—చిత్తం, బాబూ, శెలవు తీసికొంటానండి.

ధ—మంచిది.



౩. బింబిసారుని అంతఃపురము

# పంచవన్నెల చిలుక

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

౧

ఇంబడరు శక్రచాప ఖండంబువోలెఁ
దైలబిందున్ను పడినట్టి తరఁగవోలె
రంగురంగులపువ్వుల రాశివోలె
సరస వనలక్ష్మికిం బ్రాణసఖియఁ బోలె
భావశబలతఁ గైకొన్న స్వాంతమువలె
వివిధవర్ణభూషలు దాల్చి ప్రియునికొఱకు
నుత్సహించుచుఁ గూర్చున్న యువతివోలె
సృష్టి సౌందర్య మంతయు నేకవస్తు
గతము గావింపఁబడిన పద్ధతిని మిగుల
ముద్దులను మూటగట్టెడు మూర్తితోడ
మోదమున మున్గి తేలెడు మొగము తోడ
నయన పర్వంబుఁ జేయుచున్నావు నాకు
స్వాగతము నీకు నో పంచవన్నె చిలుక!

౨

అమరలోకంబునందు నిత్యము వసించు
చుండి వాహ్యాళికోసమై యుర్వి కరుగు
దెంచు కిన్నరకన్యవో! యని తలంతు
నమ్మఁగాఁ జాలఁ బక్షిమాత్రమ్మ వగుట
నే సువర్ణఖండమున జన్మించినావొ?
ఏమహర్షి వరంబుల నెలసినావొ?
అహహ! ఏపుణ్యనదిఁ దీర్థమాడినావొ?
పంచవన్నెల చిలుకా! వచింపు మమ్మ!

౩

వాహనంబుగఁ గైకొని పంచశరుఁడు
నిన్నుఁ గల్యాణమూర్తిని నిలుపఁ బట్టి
కాక త్రైలోక్య విజయి యై క్రాలఁగలఁడె?
లాంతి పులుఁ గైనచో నంత ఖ్యాతిఁ గనునె?
నీదు చక్కందనమ్మును నిశ్చయముగ
నపహరించెనో యేస్వల్పమైన రతియుఁ?
గానిచో నట్టి యందంబు గలుగు టెట్లు?

నిన్ను యాచించి నీరామణీయకంబు
నెరవుఁ గొని పోవుచుందురో సురతరుణులు,
మునుల తపములు సెఱచెడు పనుల కొఱకుఁ?
గాక మోహింపఁగాఁ జేయఁ గలుగు టెట్లు?

౪

పండ్లరసమును ద్రాగుటఁ బట్టి యేమొ
అంత మధుర బుగా మాటలాడఁ గలవు.

అంత సుందరమూర్తివి యగుట నేమొ
అంతముద్దులు గులుక మాటాడఁగలవు.

ఉల్లమున నంత యుల్లాస మూఱు నేమొ!
అంత శ్రావ్యంబుగా మాటలాడఁగలవు.

ఆననమె కాదు నీదు ప్రత్యంగ మరయ
నమృతము స్రవింపఁగా మాటలాడుచుండు.

---




"ఎక్కడిదాకా?"

"దేవాలయానికే! మీరూ అక్కడికేనా?"

"మరెక్కడికి?"

"అయితే పనండి, మరి!"

అని కాఫీహోటల్కి వెళ్లేవారు అనుకుంటున్నారు. అంటే "కాఫీహోటల్" అనడానికి చాలమంది అప్రయత్నంగా కాఫీదేవాలయం అనేస్తున్నారు. కాఫీదేవాలయంలో కేవల కాఫీయే కాక అనేక ఇతరవస్తువులు దొరికినా, ఆయొక్క కాఫీ పేరే ఆలయమొత్తానికి రావడంలోనే కాఫీయొక్క ఘనత వెల్లడి అవుతోంది. "టీ" నీరు ఒకటీ, "కోకో"ఒకటీ—ఈ రెండూ మహాగొప్ప వైనట్టు కాఫీతో దెబ్బలాటకొస్తాయి. కాని, ఈప్రాంతాల్లో కాఫీద్రావకం తేనీరుని "చా"పోవే'అంటుంది; కోకోని "కోకో! కం!" అంటుంది. పైగా కొన్ని విందుపార్టీలు జరుగుతూంటాయి "టీపార్టీ" లంటూ. నిజంపడితే వాటిని కాఫీపార్టీలనాలి. అడ్డమైనదానికి కాఫీ పేరు పెడితే కాఫీకి దిష్టికొట్టి పోతుందని ఇతర పేర్లు చూసుకుంటున్నారుగాని, ఎక్కడైనాసరే మూడుపాళ్లు కాఫీయే. కాఫీలో కుడా తాగడం అనేది ఉన్నా, స్పృహపోవడం లేకపోబట్టి పిన్నల్ని తీసుకుని పెద్దలుసయితం దీనికి ఎగడుతున్నారుగాని, అలవాటు విషయంలో ఇదీ తత్తుల్యమే! ఏది? అన్ని అలవాట్లకిమల్లేనే కాఫీ అలవాటూనూ! ఓగడుసువాడు ఓమెత్తటివాణ్ణి చూసి బలవంతంగా దీనికి ఇప్పిస్తాడు. తరవాత, వీడు, ఒకరోజున తనభోజనానికి ఆలస్యం అవుతుందని తెలిసి ఓమాటు దేవాలయానికి వెళ్లి సంగతి సందర్భాలు చూస్తాడు, "ఓహోహో!" అనుకుంటాడు. మొన్నాడు వీడుపారుగూరువెళ్లి అక్కడ తనపని పెందరాళే కాదేమో అనే భయంచొప్పున (అసలు పనే ఉండదుగామరీ, అంచేత!) కాఫీహోటల్కి పోనీ అని వెడతాడు. నాలుగోనాడు భోజనం ఆలస్యం కాదని తెలిసినా, తనకి డబ్బులేత్స్యం లేదని ప్రకటించడానికి వెనకతనికి ఇప్పించిన వాణ్ణి దేవాలయానికి కొట్టుగెళ్లి, వారికి గురుదక్షిణగా వార్ని మేపుతాడు పదపడి "మనం (అనగా తనే) ఎప్పుడు మానాలంటే అప్పుడే మాన్తాం. అల్లాంటిది లేదు. (అని నాలిక చప్పరించి) కాని, ఏముటో!" అంటూ మధ్యాహ్నం, సాయంత్రంకుడా వెళ్లి సంధ్యావందనం పూర్తి చేస్తాడు. అక్కణ్ణించి కాఫీ తాగితేగాని "మోషన్" కాదంటాడు, కాకూడ దంటాడు. తాక్కపోతే తలనొప్పి, తోచకపోడం, పిచ్చిపిచ్చిగా ఉండి మెదడు పనిచెయ్యకపోడం, కాళ్లు పీకడం—లాంటివి ఉద్భవిస్తాయి అంటాడు. కాబట్టి, కాలక్రమాన్ని బలవంతం, కక్కుర్తి, దర్జా, ప్రతిమర్యాద, మొహమాటం, అలవాటుకాని అలవాటు, అలవాటులాంటిది, అనాటే, అభ్యాసం, అవసరం, ఉండలేనితనం, వ్యసనం, తప్పనిసరి తద్దినంలోకి దిగుతుంది వ్యాపారం. అందుకని, నిర్భంధంగా కాఫీకోసమున్నూ, ఐచ్ఛికంగా ఇతరతినుబండాల కొరకున్నూ, ఇంటిదగ్గిర రేవుపెడితే ఇంటిల్లపాతికీ అలవాటవుతుందని భయం వల్లనైతేనేమి, ఎన్నాళ్లు ట్రైనింగుపొందినా తమకిగాని, ట్రైనింగు ఇచ్చినా తమ ఆడంగులకి కాని కాఫీలో పాళ్లు అవగాహన కానందువల్లనై

తేనేమి, జనులు దేవాలయానికి వెడుతూంటారు. కాఫీ హొటలుధర్మమా అని కొందరు పెద్దలకి వెందరాళే నిద్ర లేవడం, కొందరు పిన్నలకి పొద్దెక్కకుండా స్నానం పడుతున్నాయి. ఇటీవల కొందరు పట్టుదల విద్యార్థులు ఝామ తెల్లారకట్టే లేచివెళ్ళి, హొటల్ మేనేజర్ని లేపుతున్నారు—అతడు ఒకవేళ తనకి డబ్బొచ్చేమాట మరిచిపోయి ఆలస్యంచేస్తాడేమో అని. ఒక కాఫీదాసు ఉద్దేశం తను కాఫీ సేవించకపోతే ఎల్లాగని. ఒకాయనఊహ, తను కాఫీపుచ్చుగోకుండా సూర్యోదయం అంచూ ఒకటా? అని. ఒక ఆసామీ నమ్మకం తను వీలైనంత త్వరగా కాఫీ తాక్కపోతే ప్రపంచపు "సివిలిజేషన్" "హొల్ట"వుతుందనే. ఒక పెద్దమనిషి తను కాఫీపుచ్చుగున్న సంగతి నలుగురుతో చేనా అంటేనేగాని ఆక్కడికి కసితీరదన్నాడు. ఆయనే ఒకవేళ కర్మవశంచేత కాఫీతాగడం లేటయితే, "ఏమండీ, లేటయిందేం ఈవేళ?" అని ఎవరేనా అడిగినప్పుడు "అబ్బే, రెండోమాటు లెండి!" అని అబద్ధం ఆడడం ధీరలక్షణం అని రాసిస్తానన్నాడు. ఒక ప్రముఖుడు కారణాంతరంవల్ల పల్లెటూరిలో పది రోజులు ఆగవలిసొచ్చి, అక్కడికి అయిదు మైళ్లలో ఉన్న బస్తీ బండీమీదవెళ్లి అనుదినమూ కాఫీమాత్రమే పుచ్చుగుని వచ్చి, ఆకాఫీయేనా బాగుండలేదని స్నేహితులతో విచారంగా చెబుతూ, వాళ్లనికూడా ఏడవ మంటాడు. ఒక కర్మిష్ఠితనతండ్రితద్దినంనాడు "ఈవేళ కాఫీ ఎల్లా తాగను మరీ, చూసిమాసి" అనుకుని, బ్రాహ్మలొచ్చేవరకూ పడుకుని, ఎల్లాగో తద్దినంకానిచ్చి,పిండాలుగంగలోకలిపి ఇంటికివచ్చేటప్పుడు దార్లో కాఫీహొటలికి వెళ్లి, రెండుమూడు కప్పులుతాగి, ఇంట్లోపడి తలకి పట్టేసుగుని నిద్దరపోయి సాయంత్రానికి లేచి అప్పుడు రెండు మెతుకులు కొరికేవాడు. ఒకపితృభక్తుడు కాఫీప్రియుడైన తన తండ్రిగారి ఆబ్దికం అయిపోయి బ్రాహ్మలు ఇక వెళ్లిపోయేటప్పుడు వాళ్లిద్దరిచేతా చెరోమర్రచెంబుడు కాఫీ తాగింపించి మరీ వాళ్లని సాగనంపేవాడు.

ఇంతాచేసి కాఫీ అనే ద్రావకంలో మిళాయించేవి ఏవి? అనగా, పాలు, పంచదార, కాఫీగింజల చూర్ణంతాలూకు సారం.  కుంకుడుపులుసు, సీకాయిపులుసు, చింతగింజల చూర్ణపురసం, హాలాహలం వీటికిమల్లే నల్లగాఉండుకుంటుంది తెలుగులో ఈసారాన్ని "డికాక్షన్" అంటారు. (సంస్కృతంలో కషాయం అనచ్చు). "సుబ్భరంగా పాలే పుచ్చుకోకూడదా రాజాలాగ, డికాక్షన్ అంటూ అహోరించకపోతే!" అని కొందరు కూకలేస్తూంటారు. తెల్లగా ఉండే క్షీరానికీ నల్లగా హాలాహలంలా ఉండే డికాక్షన్‌కీ పొత్తు ఎక్కడ ఏడిసిందని వారి ఉద్దేశం. కాని, వాటిసంబంధం సముద్రమథనకాలం నాటినించీ వస్తూనే ఉంది. ఈ రెండూ కలిపేసరికి దీని తెల్లవర్ణమూ దాని నల్లవర్ణమూ కూడాపోయి మధ్యవర్ణం ఒకటి ఛాయపడుతుంది. అనగా క్షణక్షణమూ కాఫీహొటళ్లల్లో ఆయొక్క వర్ణసంకరం ప్రత్యక్షం అవుతూంటుంది. ఆమధ్యవర్ణానికి ప్రత్యేకవ్యక్తిత్వం, విశేషఖ్యాతీకూడా ఏర్పడ్డాయి. "మీరు ఈమాటు మెడ్రాసు వెళ్లినప్పుడు నాకు టీకాఫీకలర్ స్టిక్కు తెచ్చిపెడుదురూ!" అని పెద్దమనుష్యులు తమ స్నేహితులకి జ్ఞాపకం చేస్తూంటారుకూడాను. అంతేకాక ఆరెండూ కలపడంలో సొగసుంది! కలపడం అంటే తెలుగువాడి కలపడం కాదు. తెలుగువాడికి కలపడం ఎంత తెలుసునో కలపడంకూడా అంతే తెలుసు.కలిపినా వేరుచేసినా అరవలది ఆనేర్పు. అందులో రప్పదేరిన అరవ అయ్యారు కాఫీకలపడం చూస్తే మెడ నెప్పెట్టిపోతుంది. ఎవరో ఒక కొత్త కాఫీదాసు వీధులో నడుస్తూ, 'ఈకాఫీహొటలు బ్రాహ్మలదేనా?' అని కనుక్కొని, వచ్చిన సమాధానం తనకి నచ్చిన తరవాత లోపల ప్రవేశిస్తాడు. అప్పుడే ఎవరూ కనిపెట్టకుండా, దొంగపోటుగా తనమొహం అద్దంలో ఎల్లా ఉంటుందో చూసుగుని మెచ్చుగుని, 'ఓకప్పు కాఫీ ఇవ్వండి' అని ఆర్డరు జారీచేసి, ఒకబల్ల దగ్గిర ఉండే ఖాళీకుర్చీ ఈడ్చుకుని కూర్చుంటాడు-ప్రపంచంలో సహంవ్యాపారాలు తనలో ఉన్నట్టు. ఈపాటికప్పుడే అయ్యారు ఒక కప్పులజోడీ లాగిపుచ్చుగుని, ఒక 'స్పూను'పంచదార లోపలిగిన్నెలో గిరవేసేసి, 'ఎన్నాసార్, కప్పా, అరకప్పా' అంటాడు. అని, జబాబు ఏమైనా సరే, సాధారణంగా కప్పే కలుపుతాడు. ఆమట్టున అతడు లోపలికప్పు కుడిచేత్తో పైకితీసి,

గుజ్జుపుమొహంవాళ్లు తగిలేవరకూ పైకెత్తి, ఎడంకప్పు పక్కమూతివాళ్లకి అంటుగునేదాకా కిందికిపెట్టి, అంత ద్రావకమూ హడిలిపోయి జవజవలాడి పేకదారంలా అరేటట్టు తొణక్కుండా పొకంతీస్తాడు. ఈలోపుగానే కాఫీకొచ్చినవాడు తన ఎదటిబల్ల మీద కప్పులూ, కాఫీమరకలూ, ఏరేసిన మిర్చిముక్కలూ చూసి, 'ఈబల్ల కొంచెం తుడవాలండి' అని కేకేస్తాడు. ఆపళంగా కప్పులలాగే కింకరుడు హాజరవుతాడు. కొండొకచో ఈపనికి ఒక మలయాలీ ఉంటాడు. అతడికి జుట్టు రేవునెత్తిమీద మాత్రమే ఉంటుంది, నశికప్పుమీద పెంకులున్నట్టు! అతడు గబగబా ఓ బాల్చీలాంటిది తెచ్చి దింపుగుంటాడు. దింపుగుని కప్పులు దాల్లో పారేసి, ఒకవేళ రూల్సు ఎరగని వాళ్లు పోసిననీళ్లు విస్తారం ఉంటే గుడ్డతోనే (అదిసాధారణంగా తెడపదు, కాలదు) బాల్చీలోకి తోసుగుంటాడు. పిదప తనగుడ్డతో బల్లంతా శుభ్రపరిచే సంకల్పంతో పాముతాడు. దాంతోటి ఒకచోటి మాలిన్యం సర్వత్రా సర్దుకుంటుంది—ఒకడి తప్పు అనేకమందిని వెంటాడించినట్టు! పైపెచ్చు ఆగుడ్డకి సంబంధించిన గంధద్రవ్యాలు బల్లకే అంటుగుని ఒకవిధమైన కొత్తవార్నీసు తయారై ఈగల్ని ఆకర్షించి వాటిని మరివదల్దు. తక్కిన ఈగలు ఈసంగతి కనిపెట్టి, మనుష్యులమీదగాని వాలడం మానేస్తాయి. కప్పులమీంచి ఆవిరి వస్తూంటే కాఫీ తాగడంలో ప్రవేసు లేనివాడు 'అబ్బా వేడిస్మండి' అని అది చల్లారేవరకూ కప్పు ముట్టుగోకుండా ఆగుతాడు—కాఫీహోటల్లో అప్పలెశ్యేతిగురించి పట్టింపులు లేవని తెలిసీకూడాను! అది చల్లారింతరవాత, చక్కెర ఎక్కువగా వేయించుగుని, ఆకప్పు పైకెత్తి గడగడా పానకం తాగినట్టు పీల్చేస్తాడు. కాని, కాఫీద్రావకం సాంప్రదాయానుసారంగా తాగనేర్చిన శిష్టులు నెమ్మదినెమ్మదిగా ఊదుకుంటూ, చప్పరించుగుంటూ, మాటలుచెబుతూ, కాస్తకాస్త చొప్పునే కాఫీ కతుకుతారు. ఒకొక్క పెద్దమనిషి పెద్దకప్పు బల్లమీదే వొదిలేసి చిన్నకప్పుని మూతివగ్గిరికీ, బల్లమీదికీ మళ్లీమూతివగ్గిరికీ—ఇలాగ్గా సెకనుకి రెండుసార్లు బదలాయిస్తూంటాడు. ఆసమయంలో బల్లమీది పెద్దకప్పు యొక్క ఉపయోగం పూర్తి అయింది కావు ననుకుని కప్పులకింకరుడు దాన్లో ఇంకా కొంతకాఫీ ఉండగానే కప్పుని బాల్చీలోకి దిగలాగుతాడు—కొన్నిప్రాణాం లుండగానే మనిషిని పాడిమీదికి లాగేసినట్టు. ఈవిషయంలో కొందరు కుశాగ్రబుద్ధులైన కాఫీదాసులు దూరం ఆలోచించి, తమరు తమ కుడిచేతితో చిన్నకప్పులోంచి కాఫీ ఆరగించేటప్పుడు, బల్లమీది పెద్దకప్పు ఎడంచేతితో వడేసి, రాయల్లా పట్టుగుంటున్నారట! వాళ్ల ఊహ కప్పుల కింకరుడొచ్చి బల్లమీది కప్పు లాక్కుపోబోతే తనూ, ఆయమకింకరుడూ తద్విషయం కుస్తీపట్టచ్చుగదా అని!—సత్యవంతుడు ప్రాణాన్ని 'పోవుచున్నాడె!' అంటూ సావిత్రి ఇటూ, 'పో, బాల!' అంటూ యముడు అటూ పాడుతూ లాగినట్టు!

కాఫీదేవాలయం ఎల్లకాలమూ హడావిడిగానే ఉంటుంది (హర్తాలు రోజుల్ని తప్ప). కాని అందులో ఉదయం, ఓంటిగంటకీ, సాయంత్రం టైములోమాత్రం ఊపిరిసలపకుండా ఉంటుంది. ప్లేట్లు, చమ్చాలు, గ్లాసులు వగైరాల చప్పుడు వినిపిస్తుంది. అందిచ్చేవాడికి చాకచక్యం చాలా అవసరం. అందివ్వడంలో కూడా అరవలే ఘట్టు. అందులో ఒకొక్కడు అష్టావధాని. "ఏంకావాలండీ, మీకు! మీకు!" అని చదుగుడి ఆడుతూ కనుక్కుంటూనే, వెళ్లిపోయే ఇద్దరు ఇవ్వవలసిన డబ్బు గురించి మేనేజరుతో "ఎక్ప్రెస్ణా, రెండుబేర్" అంటూనే, బల్ల తుడవమని అప్పుడే ఎవరో కోరగా, "బల్ల తుడవరా ఎధవా" అని తుడిచేవాణ్ణి కసురుతూనే, "నాకు పెసరట్టండోయ్" అని అప్పుడే ఎవరో కోరగా లోపల వండేవాడికి "పెసరట్ రోస్ట్" అని కబురు అందిస్తూనే, దొడ్లో కప్పులు కడిగేవాణ్ణి "కప్పు లెవిరా, బేగీ!" అని పళ్లు బిగించి లోపల తిడుతూనే, లోగడ దరఖాస్తుచేసుగున్న ఎనమండుగురికి ఎనిమిది ప్లేట్ల సరుకు ఏకకాలమందే ఎడంచేతిమీద గోపురంలా పేర్చుగువచ్చి టకటకా ఇస్తూనే, వారికే ఎనిమిది కప్పుల కాఫీ ఓకేసారి ఎడంచేతివేళ్లతో నొక్కితెచ్చి, ఒకొక్కరిముందు ఒకొక్క కప్పు పెట్టి, ఒకధరినించి ఒకొక్క సెకనులో ప్రతికప్పులో కాఫీనీ ఒకొక్కసారిగా "దేవలపర్సు" సాగదీసినట్లు పిలకసాగదీసి కూచోబెట్టి చక్కాబోతూం

టాడు. 'గంటైంది చెప్పి, ఇంకా నాకు ఉప్మా అందలేదు' అని కొందరు మేనేజరుతో ఫిర్యాదు చేస్తూంటారు. "ఒక అరకప్పు కాఫీ తెస్తూ బాబూ! నేను కారుకి పో వాలి" అని కొందరు విసుక్కుంటూంటారు. "ఈవేళ ఇడ్లీలోకి సాంబారా, పచ్చడా?" అని కొందరు అడుగు తూంటారు. ఏవృత్తిలో ఉండే జనం అయినాసరే. కాఫీ పుచ్చుగోందే పన్లోకి త్రికరణశుద్ధిగా దిగరు, బండీవాడి మొదటికిరాయి డబ్బులు కాఫీకి, పుల్లలవాడి మొదటిపుట్టి డబ్బులు కాఫీకి, మంగలిచేసే మొదటి క్షౌరం డబ్బులు కాఫీకి. అందుకని కొందరు ఖురానారకం వీధికొట్టు వాదిలి లోపలికి జొరబడుతూంటారు—గర్భ గుడిలోకి జొరబడ్డట్టు. కొందరు తమ మాట వడ్డనవాళ్లు ఎంతసేపటికీ వినిపించుకోకపోతే, చనువుచేత తమరే వెళ్లి పెసరట్టు వగైరా వేసుగుంటారు—స్వహస్తపాకుల్లాగ. ఒకొక్క పట్టింపు పెద్దమనిషి పాలూ, డికాక్షనూ వేరే వేరే తెమ్మని అవి తనే మిశాయించుగుంటాడు, మహా. ఒకొక్కడు ముందు ఒక అరకప్పు తాగి, మాట్లాడు తూండి మళ్లీ అరకప్పు తెమ్మని, కప్పురేటు ఇస్తాడు—ఈపద్ధతి తనకి కాస్త రాహిత్తు కాకపోతుందా అని. మర్యాణ్ణించి మేనేజరు ఇందుకు ఒప్పుగోడు. "ఇంత మంది వచ్చి ఇన్ని రకాలుగా ఫలారాలు చేస్తున్నారు గదా ఎవడు ఎంత ఇవ్వాలో సరిగ్గా చెబుతారండీ, ఈ వడ్డనవాళ్లు! ఏమి మేధండీ, వీళ్లది!" అని కొందరు వడ్డనవాళ్లని మెచ్చుగుంటూంటారు. కొందరు వడ్డనవా ళ్లతో లెక్కల్లో తేడాలొచ్చి మేనేజరుదగ్గర పేచీల్లో ఉంటూంటారు. ఈలోపుగా మేనేజరుగారి చిరపరి చయులు చక్కావస్తారు. దాంతో మేనేజరు "చూడ్రా! పంతులుగారొచ్చారు, ఏం కావాలో కనుక్కో! నాలుగు ఇడ్లీ ఇయ్యి సాంబారేసి" అని వడ్డనవారితో అని, "ఈ వేళ సాంబార్ చాలా నైస్‌గా ఉందండీ, సార్" అని బలవంతం చేస్తాడు. "అత్తారింట్లో కంటేకుడా ఏం బల వంతం చేస్తున్నావోయ్! ఎటొచ్చీ నువ్వు బిల్లు చేస్తావు! నీసొమ్మేం పోయింది" అని లోపల అనుకున్నా, చుట్టు పక్కల అనేకమంది ఖురానామనుష్యులు (అనగా కాఫీ దాసులంతా ఖురానామనుష్యులే!) [illegible]

తను అక్కర్లేదనడం తన ఆత్మగౌరవానికి మిక్కిలీ భంగం అనుకుని, నలుగురి ఎదటా తను పిసినిగొట్టు కానట్టు ప్రకటించుగోడానికికుడా అనుకూలసమయం అదే అను కుని, "సరే, తెమ్మను" అని నసుగుతాడు. విడి విడిగా వచ్చినవాళ్లల్లో కొందరు డబ్బు ఇచ్చేస్తారు, కొందరు రాసేస్తారు, (ఈరాతలన్నీ మేనేజరుకి మట్టితే అతను కుబేరుడవుతాడు) కొందరు పరిచయులు ఇంతా అని చెప్పేస్తారు, కొందరు ఇంకా ఖురానావారు బరా బర్‌గా చక్కాపోతారు. పనపడి ఎవరో ఒకాయన అయిదారుగురు అతిథుల్ని తీసుకుని తయారవుతాడు. అతిథులు సాధారణంగా కోర్టు సాక్ష్యాలకి వచ్చినవారో, డబ్బున్న కుర్రాణ్ణి ఉబ్బేసి వాణ్ణి గ్రంథంలోకి దింపి వెంటపడి వచ్చినవారో, ఎవడికేనా పందులో నేనా లాభం రావడంవల్ల వాణ్ణి మొహమాటపెట్టితోలుకొచ్చిన వారో, బస్తీస్నేహితుణ్ణి చూడొచ్చిన బంధువులో అయి ఉంటారు. సమూహంగా వచ్చినవాళ్లలో కొన్ని విశే షాలు జరుగుతూంటాయి. కొందరు నిర్మొహమాటస్థులు కలిసివస్తారు. ఓడిచేత మరోడు పెట్టించాలని ప్రతీవాడు యత్నిస్తాడు. అందుకని వారిలో ప్రతివాడూ (ఎంతైతే తనకేమి!) తెగ ఆర్డరు ఇస్తూంటాడు. వీరిలో గడుసు వాళ్లంతా ఘనపదార్థాలు గబగబా నమిలేసి, చివరికి ద్రవ పదార్థాల్లోకి వచ్చి కాల్తూన్న కాఫీ అయినా సరే నోట్లో పోసేసుగుని వీధులోకెళ్లి నిలబడతారు. మిగిలిపోయిన చాదస్తుడు ఉసూర్న బిల్లు చెల్లిస్తాడు. కాని, ఒకసారి ఇద్దరు తమాషా స్నేహితులు ఒక కాఫీదేవాలయం ఎదట కలుసుగుని, "ఇదుగో, మీకోసమే చూస్తూంటూ, రండి!" అంటే, "ఇహనేం, నే వెతికేదీ మీకోసమే!" అని ఒక ర్నొకరు ఆహ్వానించుగుని, ఆలయంలో ప్రవేశించారు. ఒకడు కాస్తంత పెద్దమనిషి, రెండోవాడు అకాస్తంతే చిన్నమనిషి. కాని, లోపల అభిప్రాయాలుమాత్రం తిండిఖర్చు వీడికి రుద్దాలని వాడూ, వాడికి రుద్దాలనివీడూ.

పెద్ద—చూస్తారేం? తెమ్మనండీ!

చిన్న—తమరు పెద్దలు! తమరే ఉపక్రమిం చండి.

[illegible]—[illegible] ఏముంది? మాకు చాదస్తంగాని

చి—అందుకనే నండి నే అన్నదీను.

పె—(వడ్డనవాడితో) నాలుగేసి ఇడ్లీ నెయ్యేసి తేంపి!

చి—(కాస్సేపు ఆగి) నాలుగేసి పెసరట్లు పడా తెంపి ఇంత అల్లం పారేసి!

పె— (పదార్థాలు గబగబా బొక్కుతూ) రెండేసి ప్లేట్లు సేమియా!

చి—(ఓప్లేటు సేమియా మందుచ్చుగున్నట్టు ఒకేసారి గొంతికలో పోసుకుని) నాలుగేసి థైర్‌వడె! పెరుగేసి!

అంటూ చెరోసారి ఆర్డరు చేస్తూ మొత్తం అణాతక్కువ రెండురూపాయలు తిన్నారు. ఇంతలో చిన్నవాడు మూతి కడుక్కుంటూంటే, పెద్దవాడు, వీధిలో సైకిల్ మీద పోయే ఒకాయన్ని కలుసుగోవలసిన పనున్నట్టు మిష పెట్టి, ఆయన్ని కేకేస్తూ, చివాల్న లేచిపోయాడు. చిన్నవాడు కంగారు లేకుండా, చెయ్యి కడుక్కుని పెద్దాయనకంటె మరోఆకు చదివే ఉన్నవాడవడంచేత, బల్లమీద సిద్ధంగా ఉన్న కిల్లీలు రెండు నములుతూ, మరో రెండు చేతపుచ్చుకొని, ఆ పెద్దాయనకాతా పేజీ తీసి రెండురూపాయలూ అందులో రాసి చక్కాపోయాడు. వీటిల్లో ఎవరు సెస్తుతారో చివరదాకా తెలియదు.

మరోతరహావా రున్నారు. వారు కలిసేవచ్చి, తిని, కాఫ్యాదులు తాగి, మొత్తపుఖర్చు ఇవ్వడానికి ప్రతీవాడూ తలో మనీపర్సు వెల్లగిస్తాడు (అందులో ఉన్న డబ్బుసంగతి వేరుమాట!) కాని వారినాయకుడు "పుచ్చుగోకండి, నిజంగానే!" అని మేనేజరుతో నిక్కచ్చిగా చెబుతాడు. అంతమట్టు కొచ్చినా కుడా అతిథుల్లో ఒకొక్కడు (చివరకితనని ఎల్లానూ ఇవ్వనివ్వరుగదా అనే ధైర్యంకొద్దీ) "చిల్లర నాదగ్గిర ఉందిగా!" అంటాడు—(కాఫీహోటల్లో చిల్లరికి కరువొచ్చినట్టు!) అటువంటప్పుడు ఆనాయకుడు మొహమాటస్తుడైతే "నాదగ్గిరా ఉంది!" అని తనే చెల్లిస్తాడు. నిర్మొహమాటస్తుడైతే, "సరే, అల్లాయితే!" అని ఊరుకుంటాడు. ఆపళంగా ఆ అతిథి లోపల, అడ్డంగా మాడి, చచ్చినట్టుయావత్తుసొమ్మూ దాఖలుచేసుగుని, "అన్నన్నా! మనకి వెధనతొందరస్మీ" అని ఒక్కడూ ఉన్నప్పుడు పక్కకి తిరిగి వేలు కొరుక్కుంటాడు. ఒకడు తనుతిన్న ఖర్చుసొమ్ము తనస్నేహితుడు చెల్లిస్తూంటే, రావిఆకులా ఊరుకుని, ఇవతలపడ్డ తరవాత ఆడబ్బులు వాడికి ఇవ్వచూపుతాడు, (ఏమొహం పెట్టుగుని వాడు పుచ్చుగో వచ్చాడని!). వాడు "ఆ, పోదురూ!" అని బెట్టుచేసినప్పుడు, "పోనీలెండి, అధమం కిల్లీ లేనా నన్ను కొననియ్యండి!" అని ఆఖర్చు తనుఅచ్చుగుని, "మీరు సిగరెట్లు కాల్చరనుకుంటాను!" అంటాడు. అంటే రెండోవాడు "కాల్చకేంలెండి, ప్రస్తుతం అక్కర్లేదు" అని అనేస్తాడు. కొందరు పెద్దకండువాలు వేసుగుని ఉండీకుడా స్టిక్కులూ, కొత్తజోళ్లూ, తాంబూలం వెయ్యాలనే ఊహతో అవి దొరకపుచ్చుగుని, ఒకవేళ మేనేజరికి గాని, ఆవస్తువు యజమానికి గాని దొరికిపోయినప్పుడు, "మీదా? మీదే?" అని ఆశ్చర్యపోయి, నవ్వుతూ, "అచ్చంగా నాదే అనుకున్నాను స్మండి!" అని అది అక్కడ వొదిలిపెట్టి జారిపోతారు. ఒకరొచ్చి, "కఫ్ కాఫీ, స్ట్రాంగ్, ఎస్సెన్స్" అంటాడు. "స్ట్రాంగ్" అనడం ఎందుకంటే, కాఫీ తను పూర్వాన్నించి ఎరుగున్నదే అని నలుగురికీ తెలియాలని, ఎంత తక్కువ పంచదార, ఎంతఎక్కువ డికాక్షన్‌తోనూ కాఫీ తాగగలిగితే అంత నాజూకుమనిషి అనుకుంటారని, కేవల డికాక్షన్ (అనగా హాలాహలం) అస్ఖలితంగా స్వీకరించి శివుడంతవాడు కాదలచిన తన అవర్యం నలుగురూ గ్రహించాలని. ఇంకోరొచ్చి, "కోదండపాణీ! నువ్వే ఇవ్వవోయ్, ఓకప్పుకాఫీ!" అంటారు. అనగా వారిఉద్దేశం, "ప్రతీఎల్లయ్యా తక్కినవి వడ్డించగలడుగాని, కాఫీ కలపలేడు! కాఫీలో పాలుమాత్రమే కాక పాళ్లుకూడా ఉన్నాయి! (అవి ఏమాత్రం చెడ్డా డబ్బులు శుమ్మడండగ!) ఆపాళ్లు నీకే తెలుసు! అదొక ఆర్టు! ఆ ఆర్టు నువ్వేకానీ!" అని. కొందరు, ముందు డికాక్షన్ తక్కువనీ, అది పోసింతరవాత పాలుతక్కువనీ, (విసుక్కుని) వడ్డనవాడు కాసిని పాలచుక్కలు రాల్చిం

తరవాత మళ్లీ డికాక్షన్ తకు్కువనీ అనేవారుంటారు! కాని, వాళ్లు రోజుకి ఓ కాఫీహొటలికి వెళ్లాలి, వెడతారు.

కాఫీ దేవాలయాల్లో విశీకాన్లు లగాయతు వంద రూపాయల నోటుదాకా చలామణీ అవుతాయి. "నాకు కాఫీఖర్చు జోరైపోతోందండీ! ఇక మానాలి!" అంటూనే ఉంటారు కొందరు కొందరు జబ్బుచేసి పడిపోయి కుదిరేవరకూ మాన్తారు. కొందరు జబ్బులో, డాక్టరుగారి అనుమతిని మరోకప్పు పుచ్చుగుంటారు. కొందరు ఎల్లానేనా మానాలని, ఆ కైమికి, కాఫీ ప్రత్యామ్నాయి వేడినీళ్లో, చారో ఊదుకుని కొద్దికొద్దిగా పీలుస్తారు. కొందరు మానినవాళ్లు, ఆ కైమికి, ఇంత ఉప్పేసి మజ్జిగే దేశవాళీ కాఫీగా భావించి పుచ్చుగుంటారు. ఒకొక్కడు ప్రాణాలు ఉగ్గపెట్టుగుని పదిరోజులపాటు కాఫీ మానేసి, పదకొండోనాడు తెల్లారకట్టనించి పూటకి మూడు కప్పులు మింగి లోగడబాకీ కూడదీసుకుంటారు. ఒకాయన తనపక్క ఒక దారుణరోగి కూచుని కాఫీ తాగుతూండడం అసహ్యించుగుని కాఫీ మానేశాడుట—ఆపూటకి! కాఫీ మానేసి, కొందరు అస్మదాదులు కాఫీహొటళ్లకి వెడుతూనే ఉన్నారు. "మానేశావుగదా, ఇక ఎందుకయ్యా!" అంటే "క్లైమేట్" కోసం అని చెబుతున్నారు.

బస్త్రీజనం తప్పనిసరిగా ప్రతీరోజూ, అవాంతరాలు జరిగితే తప్ప, కలుసుగునే చోటు కాఫీ దేవాలయమే. ఇల్లాంటి సంస్థలు లేకపోతే ఎవరిపన్లో వారుంటారు గనక ఒకరొకరికి పరిచయమే ఉండదు. మరీ గొప్పవారు కానివార్ని ఎవర్నేనా పొద్దున్నగాని, ఒంటిగంటకి గాని కలుసుగోవాలంటే, ఆయనకి మామూలైన దేవాలయం కనుక్కుని వెడితే సరి! ప్రయాణాల్లో ఎవరైనా "మిమ్మల్ని ఎక్కడో చూసినట్టుందండీ!" అని ఇంకోర్ని హెచ్చరించినప్పుడు పీరూ వారూ జ్ఞాపకశక్తులు కలబోసుగుని ఆరాలు తియ్యగా, ఆకలుసుగోడం ఏదో కాఫీదేవాలయంలోనే అయిఉంటుంది. వార్తలు పుట్టడానికీ, ప్రకటన చెందడానికీ కాఫీదేవాలయం మిక్కిలి వీలు. లండన్‌లో, నానాజాతుల కాఫీదేవాలయాలు గల ఒక ఘంటాపథంలో, రాజాధిరాజుల కాఫీహొటలికి ఎదురుగుండా వీరాస్వామినాయుడుగారి హిందూ కాఫీహొటలు అనేక పరికరాలతో ఉందట. కాఫీవిషయంలో హిందువులు తీవ్రంగానే పనిచేస్తున్నారు.

---

## వెన్నదొంగ

జనమంచి వేంకటరామయ్య

౧

వెన్నదొంగను విడిచిపుచ్చకు, పెనఁచి నీభుజలతికలన్
సన్నుతాంగిరొ, పొదివిపట్టుము సందిటన్ బిగియారఁగా.
సాఁగనిచ్చుట యాగడంబుల సాఁగనిచ్చుటయే యగున్
వేగలేమిఁక వీని విడిచిన వేగ లేమియె తలఁకొనున్.

కుచఁరుకొనియెడు నట్లు నీకొనగోర గోరఁట క్రొవ్విరుల్
చిదుమునట్టులు మెఱుఁగు బుగ్గలు చిదిమి చేతులఁ బెట్టవే.
అది ప్రొసంగక యుండినన్ భవదధరపల్లవ పుటమునం
దొదుఁగు పలువిరి మొగ్గమొనలను ఒత్తి యొత్తిడిఁ బెట్టవే.
పెడ మొగం బిడి పెనఁగులాడఁగఁ దొడఁగునేనియు సుదతిరో,
మెడమ చెక్కిలి చిక్కనిచ్చిన యెడు పెఱింగి మెలంగవే.
చెఱకు విల్తుని కఱకుఁదూపుల చుఱుకుగల నీబెళుకువాల్
చుఱుకుఁ జూపులఁ బరఁగఁజేయవె, సోలి తూలి తపించెదన్;
వ్రాలి నేను నీదు మ్రోలను ఏలికొమ్మని వేఁడెదన్.
జాలి దాఁచుట కదియ యదనని బేలతనమును బూనుచున్
ముద్దు పెట్టఁగఁ బోయెదవుసుమి ముక్కుముంగర యూడెదన్!
బుద్ధి వచ్చెడి దనుక దిద్దక దొద్దకానిని నమ్మెరే?
నమ్మఁదగ దీ మెమ్మెకాని విన్రమనటనల భ్రమయుచున్;
నమ్మినను సర్వస్వముం గొనుఁ జుమ్మి! యవ్వల శుద్ధమో
ఈమ్మెసుమి కడతేఱఁగా మనకాఁపురమ్ములు కొమ్మరో!
మెఱిమి మెఱుముల, నుఱిమి యుఱుముల మేఘమాలిక పోలికం
గురియఁదగు నవ్వెనుకఁ జల్లని సరసవృష్టి సుతుష్టిగా;
అపుడు తెయ్యని యాడఁజొచ్చెడు నాడుచుండఁగఁ బింఛియం
బిపుడు చిక్కఁగఁ బోవు సామియు నింటఁ బెంపుడు నెమలి వై.
వీనినతలు వింత గొలిపెడుఁ, బిలువఁ బలుకక యుండుఁ, గ
న్నానఁ జొచ్చెడు, వెడలెడును గుమ్మానఁ—దెలియవు రెండునున్.
కంటఁ గన్నిడి చూడకున్న సుఖంబు భద్రము లే దికన్;
వెంటఁ బెట్టుక వెడలఁజెల్లదు అంటఁగట్టక కొంగునన్.

౨

వెన్నదొంగను జాలవిడఁచితి వెదకిపట్టియుఁ జెలియరో,
వెన్నఁ బో విడనాడి యక్కట వ్రేలు నాకుట యయ్యెనే!
పట్టవచ్చునె యునికిప ట్టనునట్టి దొక్కటి లేని యా
జెట్టి నేరికినైనఁ దానయి పట్టువడకుండినఁ గృపన్.

పట్టువడె నొకపట్టునం గృపఁ, గట్టువడె మెడఁజుట్టి తా
కట్టువెట్టిన జాజిదండల యట్టి నామృదుబాహులన్.
త్రొక్కులాడుచు సిగ్గువెఱపులు నొక్కుచుండఁగ నో రెటో
చిక్కితివి నీవంటి నే నిదె దక్కితిని నీకంటినన్.

మగువ కెంతటి తెగువరా! యని నగుమొగంబున ననుఁ గనన్
మొగము నెత్తఁగ నోడి కను లర మూసి మూఁపున డాఁచితిన్.
పట్టియును నేఁ బట్టువడిన ట్లిట్టు లుండఁగ నన్నుఁ జే
పట్టె మంచునఁ దోఁగు క్రొంజివురట్టి నాకెంగేలి వ్రేల్

పట్టి యభయం బిచ్చి; యంతటఁ బ్రక్కకును ననుఁ దార్చి తా
నిట్టు లనియెఁ గృపామరందము లుట్టిపడఁ గనుదమ్ములన్:
"వెన్నదొంగిలినాఁడ వని నను వెదకిపట్టఁగ వచ్చి యా
వెన్న యిడ్డ సువర్ణపాత్రయు వేడ్క నా కిపు డిచ్చితే!

ఏమి నీయుచితజ్ఞతాక్రమ మేమి నీసరసత్వ మో
భామ, యే మనువాఁడ నిఁక, నీప్రేమభంగు లపూర్వముల్!
మోము డాఁచియు ముద్దు లీయఁగఁ బూను నీచతురత్వ మో
కోమలీ, పువు డాఁచి వలపులు గొలుపు లతికనె తోఁచెడున్.

అనఘమగు నీ ముఖమెసుమి కళ్యాణభాజన మింక నీ
యనుపమానవచోమృతమెసుమి యందుఁ గల యమృతంబులన్;
ముద్దుమో మొకయింత యెత్తవె, మూఁగనోము సడల్పవే,
యెద్ది నీకు హితంబొ వేఁడుమి యిచ్చితిని నిను మెచ్చితిన్."

అనుచు ని ట్లుపలాలనము సేయఁగను నే మొగ మెత్తి య
ల్లన వచించితి: "స్వామి, నీకృపఁ గని కృతార్థతఁ గంటి; మ
ద్వదన మేటికిఁ? దద్వినిస్సృతవచన మేటికిఁ? గేవలము నా
హృదయ మిదె—నవనీత కోమలహృదయ మిదె—నాజీవితమె నీ

యదిగఁ జేయుదు, నదికదా కళ్యాణభాజన మదికదా!
నీదువెలుఁగున నిలుచుటయును, నీదుపదములఁ గొలుచుటయును

సాదరంబుగ నిడవె నాథ, మహాప్రసాదము నా కగున్."
ముదితరో, యిటు లంటి నాథునిపదము లంటి; విభుండు "నీ
హృదయవాసుని రమణి, నను నీ వెపుడు చేసితి వపుడె నా
హృదయవాసిని వైతి" వని న న్నెత్తి యెదఁ గదియించిన్
ధన్యమయ్యెను నాదుజన్మము, మాన్యనైతిని గన్యలం
దన్య మేటికి నాకు వే ఱొక పుణ్య మేటికి సకియరో!

నల్లమబ్బును గౌఁగిలించిన నలువునం గడుఁ జల్లనై
జల్లుమనియెను నా యొడల్ నిలువెల్లఁ గడిమిబెడంగున్!
ఏమి సెప్పుదు నప్పు డో చెలి, యేమి సెప్పుదు! డెంద మా
శ్యామసుందరు వగలు గని, యా ప్రేమసాగరు పొత్తు గని, తా
నేమి యయ్యెనో యెందుఁ బోయెనో యెఱుఁగనే చెలి యెఱుఁగనే!

మఱచితిని నా బాధ లెల్లను, మఱచితిని నీ బోధ లెల్లను,
మఱచితిని విశ్వంబు, నను నే మఱచితిని, మైమఱచితిన్!
వెఱచితిని వెఱపింపఁబోయి వివేకహీనత సామినిన్,
బఱచితిని నే నెందులకొ, అది స్వర్గమో అపవర్గమో!

పారవశ్యము—నిరవధికసుఖపారవశ్యము—దక్క నే
వే తెఱుంగను సామితో నొక వే తెఱుంగని పొత్తున్.
కన్ను మూసితిఁ గన్నగానిని గట్టిపెట్టితినో యనం
గన్ను మూయుట తలుపు దీయుటకన్నఁ దప్పిద మయ్యెనే!
గడియ కడచెనొ, గంట కడచెనొ, కడచె నొక నిముసంబుగా,
విడిచె ననుఁ బయికొన్నమ బ్బటు వెడలుచుండఁగ రవి దివిన్.
కలయఁ జూచితి దిక్కులెల్లను, గలఁగి డెందము తొట్రిలన్,
గలయ యయ్యెను నాదుభాగ్యము కరఁగి పాఱె యదేడనో!

యమున కోర్కులు నించెనో, తదుపాంతబాలతమాల కుం
జములఁ బెంచెనొ, గాఢమోహతమమున నన్నిటు ముంచెనో!
కనులఁ బెట్టిన చలువకప్రపుఁ గాటుకట్టులు కరఁగి పా
ఱెనుగదే చెల్వి, నాదుభాగ్యము కనులు విచ్చి కనుంగొనన్!

---

# ఇతిహాస లేఖకులకు విజ్ఞప్తి

శ్రీ విక్రమదేవవర్మ గారు

ఇప్పుడు మన దేశముయొక్క యితిహాసము పూర్ణాంగమయి యుండలేదు. కాని అందులకై ప్రబలప్రయత్నములు చేయఁబడుచున్నవి. ప్రయత్నకారులలోఁ బ్రథములు పాశ్చాత్యపండితులు. వారు మన దేశమందలి ప్రాచీనగ్రంథములను, శిలాతామ్రశాసనములను, మఱికొన్ని విషయములను సాధ్యానురూపముగా విమర్శించి మన దేశచరిత్రాంశములను కొంతవఱకుఁ దెలిసికొని వానిని బత్త్రికలయందును, బుస్తకాకారముగాను బ్రకటించి యున్నారు; మఱి బ్రకటించుచున్నారు. అట్టి ప్రకటనములకొఱకు సంఘములు సైతము స్థాపింపంబడియున్నవి. ఇప్పు డిప్పుడు మన దేశమందలి కొందఱు పండితులు వారి ననుకరించుచున్నారు. కాని మన పండితుల ప్రయత్నావళియొక్క బాల్యదశ యింకను బాయలేదు. దాని ముఖ్యకారణము ధనలోపమే యగును. మన దేశపండితులు ప్రాయశః ధనవంతులు గారు; ధనవంతులు ప్రాయశః పండితులు గారు. ధనికు లట్టిపనులకొఱకుఁ దమ ధనమును వెచ్చించుట కిచ్చగింపకుండుట దుఃఖకరవిషయము. అందువలనఁ బనులు లెస్సగా నెఱవేఱకున్నవి. ధనికు లితిహాసప్రయోజనమును బాగుగా నెఱిఁగి, తన్నిర్మాణముకొఱకు నిజధనమునుండి కొంత వెచ్చించుట సముచితము.

ఇతిహాసము జనసంఘముయొక్క బాగోగులను దెలుపుచు దేశవాసులను సుచరిత్రవంతులుగాఁ జేయును. ఇతిహాసము లేని దేశము సుసభ్యదేశములలో వాసికెక్కఁజాలదు. భారతదేశము ప్రాచీనచరిత్రహీన మయినదని కొందఱందురు. కాని ఆవాక్యము సత్యమయినదిగాదు. సమగ్రభారతదేశముయొక్క ప్రాచీనేతిహాస మేకాకృతిగా రచింపంబడకున్నను, దదంతర్గత విభిన్నప్రదేశముల ప్రాచీన చరిత్రాంశములు వేదములందును, ధర్మసూత్రములందును, అర్థశాస్త్రములందును, బురాణములందును, గావ్యనాటకాదులందును, శిలాతామ్రశాసనాదులందును వర్ణింపంబడి యున్నవి. వాని నన్నింటి సత్యార్థములను సమీచీనముగా గ్రహించి మన దేశముయొక్క సాంగేతిహాసమును రచించుట కష్టతమకార్యము. ఇతిహాసలేఖకులు పైని బేర్కొనంబడిన గ్రంథములనే కాక మిస్టరు స్మిత్తు, మిస్టరు హంటరు మొదలయిన పాశ్చాత్యదేశస్థుల యొక్కయు శ్రీయుక్త రమేశచంద్రదత్త, హీరాలాల, వెంకయ్య మొదలయిన స్వదేశస్థులయొక్కయుఁ బొత్తములను, యవనుల యితిహాసములను, బౌద్ధజైన ధర్మగ్రంథములను జక్కఁగాఁ జదువవలెను. ఈ దేశముయొక్క యితిహాసమును గాలానుసారముగాను, బరిపాలనపద్ధతి ప్రభేదానుసారముగాను బురాణయుగ మనియు,

శాసనయుగ మనియు, యవనయుగ మనియు, నాంగ్లయుగ మనియు నాలుగు భాగములుగా విభజించుట యుక్తము. ఆయాయుగములందలి ప్రదేశముల స్థితిగతులు, పరిపాలకుల రీతినీతులు జనుల యాచారవ్యవహారములు, భావల యున్నతి నతులు, మతముల జననప్రచారములు మొదలగు సకలోపాదేయవిషయములు నాయా భాగములందు నుండవలెను.

వేదమునకు "త్రయీ" యను పర్యాయపద ముండుటవలన ఋక్కు, యజుస్సు, సామమనునవి మూడే వేదములని కొందఱందరు. కాని అథర్వము నాలుగవ వేద మయి యుండుటవలనను, వేదశబ్దము చతుస్సంఖ్యావాచకప్రసిద్ధిని గాంచుటవలనను వారినుడి సరియయినది గాదు. మంత్రభాగమును, బ్రాహ్మణభాగమును, ఉపనిషద్భాగమును గలిగియుండుటవలన వేదమునకుఁ ద్రయీశబ్దము పర్యాయపదమయ్యెను. కాని ఆపస్తంబసూత్రమునందు "మంత్రబ్రాహ్మణయో ర్వేదనామధేయ"మని కలదు. ఆపస్తంబమతానుసారముగా నుపనిషద్భాగము బ్రాహ్మణభాగాంతర్గతమని యెఱుంగనొప్పును. ఋక్కనఁగాఁ బద్యమనియు,యజుస్సనఁగా గద్యమనియు వేదపరిభాష. మంత్రభాగము గొంత పద్యాత్మకముగాను, గొంత గద్యాత్మకముగాను నున్నది. గద్యపద్యాత్మకమయిన సమగ్రమంత్రభాగము పూర్వ మేకముగా నుండెననియు, దానిని యజ్ఞముకొఱకు వేదవ్యాసమహర్షి ఋక్శాఖ, యజుశ్శాఖ, సామశాఖ, అథర్వణశాఖ యను నామములతో లోకంబునఁ బ్రవర్తింపఁజేసెననియును బురాణప్రసిద్ధము. యజ్ఞమునందు హోత పఠించు భాగమునకు ఋగ్వేదమనియు,అధ్వర్యుఁడు పఠించు భాగమునకు యజుర్వేదమనియు, ఉద్గాత పఠించు భాగమునకు సామవేదమనియు, బ్రహ్మ పఠించుభాగమునకు నథర్వవేదమనియును వ్యవస్థ గలిగెను. అట్లయ్యు నొక వేదమందలి మంత్రభాగ మింకొకవేదమునందుఁ గన నయ్యెడిని. సామవేదముయొక్క సమగ్రమంత్రభాగము, నథర్వవేదముయొక్క రమారమి సగము మంత్రభాగమును ఋగ్వేదమంత్రభాగమునుండి గ్రహింపఁబడెను. యజుర్వేదము ప్రాయశః శ్రౌతసూత్రమట్లు యజ్ఞకరణవిధానగ్రంథమే యగును. కనుక ఋగ్వేదముయొక్క సమగ్రమంత్రభాగమును, ఋగ్వేదమునందు లేని యథర్వవేదమంత్రభాగమును నిర్దుష్టమంత్రభాగమను టొప్పును. ఈమంత్రభాగకథిత విషయావళినిగూర్చి బ్రహ్మాండపురాణ మిట్లు నుడువుచున్నది:

శ్లో. మంత్రా నవవిధా ప్రోక్తా
　　ఋగ్యజుస్సామలక్షణాః,
　స్తోత్రం నిందా ప్రశంసా చా
　　క్రోశ స్తోష స్తథైవచ,
　ప్రశ్నానుజ్ఞా తథాఖ్యాన
　　మాశాస్తి ర్ద్విధయో మతాః.

ఈ శ్లోకార్థము సుబోధము. దీనివలన వేదమంత్రభాగము కేవలము యజ్ఞప్రతిపాదకమే కాదనియు, దానియందలి స్తుతినిందాప్రశం

సాదు లైతిహాసికుల కుపాదేయవిషయము లని యును దెలియనగును.

ప్రత్యేకశాఖ యేకాధిక బ్రాహ్మణయుక్త ఋక్శాఖయొక్క మైతిరేయ, కౌషీతకి యను రెండు బ్రాహ్మణములుమాత్ర మిప్పుడు గనఁబడుచున్నవి. యజుశ్శాఖయొక్క బ్రాహ్మణములు రెండు—శుక్లయజుశ్శాఖయొక్క బ్రాహ్మణము శతపథము; కృష్ణయజుశ్శాఖయొక్క బ్రాహ్మణము తైత్తిరీయము. సామశాఖయొక్క యెనిమిది బ్రాహ్మణములలోఁ దాండ్య బ్రాహ్మణము ప్రధానమయినది. దానిని గొందఱు పంచవింశ బ్రాహ్మణ మందురు; మఱి కొందఱు మహాబ్రాహ్మణ మందురు. అథర్వణ శాఖయొక్క బ్రాహ్మణనామము గోపథము. కృష్ణయజుశ్శాఖయొక్క తైత్తిరీయబ్రాహ్మణమునందు మంత్రభాగము సైతము మిశ్రమమయియుండుటవలన దానిని కేవలము బ్రాహ్మణ మనుట యనుచితము. ఈ బ్రాహ్మణములందు సైతము చరిత్రాంశము లున్నవి. కనుక వాని నన్నింటిని విమర్శించి చరిత్రాంశములను గ్రహింపఁదగును.

ఉపనిషత్తులు సంఖ్యాతీతములు. అందు నూటయెనిమిదిమాత్ర మిప్పు డీదేశమునందుఁ గనఁబడుచున్నవి. అందుఁ గొన్ని బ్రాహ్మణతుల్యములు; కొన్ని బ్రహ్మప్రతిపాదకములు; కొన్ని యోగశాస్త్రబోధకములు; కొన్ని మంత్రశాస్త్రజ్ఞాపకములు; మఱికొన్ని సన్న్యాసధర్మప్రతిపాదకములు. ఆ యుపనిషత్తులను బరిశీలించి వానినుండి చరిత్రాంశములను గ్రహింపఁజనును.

సూత్రగ్రంథములు సైతము శాఖాభేదానుసారముగా నున్నవి. అవి సూత్రాత్మకములయి యుండుటవలన వానిని సూత్రము లందురు. బ్రహ్మాండపురాణమున సూత్రశబ్దనిర్వచన మిట్లున్నది:

శ్లో. అల్పాక్షర మసందిగ్ధం
సారవ ద్విశ్వతోముఖం,
అస్తోభ మనవద్యంచ
సూత్రం సూత్రవిదో విదుః.

సూత్రమనఁగా నల్పాక్షరమయము,నసందిగ్ధార్థబోధకము నగు ననవద్యవాక్యమని పైశ్లోకము యొక్క తాత్పర్యము. సూత్రచయరచిత గ్రంథము సైతము సూత్రనామవ్యవహృతము. యజ్ఞాదికథితగ్రంథమునకు శ్రౌతసూత్రమనియు, గృహ్యకర్మవిధానకథితగ్రంథమునకు గృహ్యసూత్రమనియు, వర్ణాశ్రమధర్మవిధానకథితగ్రంథమునకు ధర్మసూత్ర మనియు వాడుదురు. వానిని యాజ్ఞవల్క్య, ఆపస్తంబ, ఆశ్వలాయన, గౌతమ ప్రభృతి ఋషులు రచించిరి. ఆసూత్రగ్రంథములను విమర్శించి చరిత్రాంశములను గ్రహింప నొప్పును.

శుక్రకౌటిల్యాదుల యర్థశాస్త్రములందును జరిత్రాంశములు గలవు. వానిని గ్రహించుట సమంజసము.

పురాణ మనినంతనే ప్రాచీనగ్రంథ మని సూచితమగును. పురాణశబ్ద నిర్వచన మిట్లున్నది:

శ్లో. సర్గశ్చ ప్రతిసర్గశ్చ
వంశో మన్వంతరాణిచ,
వంశానుచరితం చేతి
పురాణం పంచలక్షణం.

జగత్తుయొక్క సృష్టివర్ణనమును, దాని నాశన కథనమును, రాజవంశమహర్షి వంశ కీర్తనమును, మన్వంతరముల వివరణమును, వంశానుచరిత రూపకోపాఖ్యానమును గల గ్రంథమునకుఁ బురాణ మందురు. నిర్వచన మిట్లున్నను, ఇప్పటి పురాణములందు నుపరికథితవిషయ పంచకే మించుమించుగా నుండి, నదీక్షేత్ర వ్రతాదుల మహిమములును, శ్రాద్ధకల్పమును, పితృపాఖ్యానమును, పూజావిధానములును, మంత్రోద్ధారాదినానావిషయములు నుండును. అంతేకాక, కొన్నిపురాణములందు విష్ణు మహిమప్రతిపాదకకథలును, గొన్నింటియందు శివమహిమప్రతిపాదకకథలును, గొన్నింటి యందు దేవీమహిమప్రతిపాదకకథలును, మఱి కొన్నింటియందు నన్యదేవతామహిమప్రతి పాదకకథలును జేర్పఁబడియున్నవి. మతబా హుళ్యమునుబట్టి గ్రంథబాహుళ్యము కల్పిత మయ్యెను. కేవల చరిత్రాత్మక ప్రాచీన పురా ణాంశనిచయము న్యూనాధికముగాఁ గలిగి యుండుటవలనఁ బురాణములయొక్క నామ ములందును, గర్తృత్వమునందును మార్పు గలుగలేదు. అది నిక్కముగాఁ బురాణముల ప్రామాణ్యమును వృద్ధిపఱచెడిని. పురాణ ములకంటెను బురాణాఖ్యాన మతిప్రాచీనము. అది గురుశిష్యసంవాదరూపముగాఁ జాలఁ గాలమువఱకుఁ బ్రవర్తించెను. పురూరవచ్చక్ర వర్తికాలమునందుఁ గాఁబోలు, వాయుఋషి నైమిషారణ్యవాసులకుఁ బురాణాఖ్యానమును బ్రప్రథమమునఁ జెప్పెను. సంవాదరూపకాఖ్యా నము మహాభారతయుద్ధసమయమందు సంహి తానామముతో గ్రంథాకారమును ధరించెను. పురాణాఖ్యానరచయితయు, మహాభారతము యొక్క మొదటిగ్రంథమయిన యజ్ఞసంహితా రచయితయు బాదరాయణవ్యాసుఁడు. ఇతఁడు పరాశరపుత్త్రుఁడు. ఈ వ్యాసుఁడు వేదవ్యా సుఁడు గాఁడు. వేదవ్యాసునకు నితనికి నించు మించు నూటయేఁబదిసంవత్సరములయంతర ముండును. ఇతఁడు పురాణసంహితను రచిం చినట్లు వాయుపురాణమున నిట్లున్నది:

శ్లో. ఆఖ్యానైశ్చాప్యుపాఖ్యానై
ర్గాథాభిః కల్పజోక్తిభిః,
పురాణసంహితాశ్చక్రే
పురాణార్థవిశారదః.

వ్యాసమహర్షి తన మైదవశిష్యుఁడగున సూతునకు నుక్తసంహితను జెప్పెను. దానిని సూతుఁడు తన శిష్యషట్కమునకుఁ జెప్పెను. ఆయార్గురిలో ముగ్గురుమాత్రమే సంహితా కర్తలయిరి. ఆ సంహితాచతుష్టయమే పురా ణముల జననకారణ మయ్యెను. వానియందు వేదశాఖలందుఁబోలెఁ బాఠభేదములు గలవు. మఱియు నా నాలుగును బైని చేర్పఁబడిన మైదులక్షణములతో నొప్పుచున్నవి. ఆ సంహితల యాధారముచేతఁ బదునెనిమిది పురాణములు రచింపఁబడెను. ఆ పురాణముల

పేరుల మొదటియక్కరములతో నీ క్రింది శ్లోకము చమత్కారముగా రచింపఁబడి యున్నది :—

శ్లో. మద్వయం భద్వయం చైవ
బ్రత్రయం వచతుష్టయం,
అనాపలింగకూస్కాని
పురాణాని పృథక్పృథక్.

౧. మత్స్యపురాణము; ౨. మార్కండేయపురాణము; 3. భవిష్యపురాణము; ४. భాగవతపురాణము; ౫. బ్రహ్మపురాణము; ౬. బ్రహ్మాండపురాణము; ౭. బ్రహ్మవైవర్తపురాణము; ౮. వరాహపురాణము; ౯. వామనపురాణము; ౧౦. వాయుపురాణము; ౧౧. విష్ణుపురాణము; ౧౨. అగ్నిపురాణము; ౧3. నారదపురాణము; ౧४. పద్మపురాణము; ౧౫. లింగపురాణము; ౧౬. గరుడపురాణము; ౧౭. కూర్మపురాణము; ౧౮. స్కందపురాణము. వీనిలో మత్స్య బ్రహ్మాండ వాయుపురాణములందు సంహితా భాగ మధికము. భాగవత విష్ణుపురాణాదుల యందు సంహితాభాగము రూపాంతరముగాఁ జెప్పఁబడెను. అగ్ని గరుడపురాణములయందు సంహితాభాగము గనంబడదు. అంతేకాక యగ్నిపురాణమునందు నామలింగానుశాసనముయొక్క కొంతభాగమును, సుశ్రుతముయొక్క కొంతభాగమును,నలంకారశాస్త్రముయొక్క కొన్నియంశములును గలవు. గరుడపురాణమునందు మంత్రశాస్త్రవిషయము గొంత గలదు. భవిష్యపురాణమునందు రాజపుత్రస్థానముయొక్క కొందఱు వీరుల చరితములును, శంకరరామానుజకబీరాది మతప్రవర్తకుల జీవితములును, యవన చక్రవర్తుల చరిత్రములు, నింక నితరాధునికవిషయములును వర్ణింపంబడెను. పురాణము లిట్టి ప్రక్షిప్తవిషయములనుగలిగి కలగూరగంప లట్లుండుటవలన వానియందు సంహితాభాగము గనంబడదు. అయినను బురాణముల కర్తృత్వము వ్యాసునియందు న్యస్తమయి "అష్టాదశ పురాణానాం కర్తా సత్యవతీసుతః" అని చెప్పఁబడెను. ఉపపురాణ మను పేరుతో సైతము కొన్ని పొత్తములు గలవు. కనుక సకల పురాణోపపురాణకథితవిషయములను బాగుగాఁ బరిశీలించి చరిత్రాంశములను స్వీకరింపఁ దొప్పను.

ప్రాచీనార్వాచీన కవుల కావ్య నాటకాదులయందుఁ గొన్ని చరిత్రాంశములు సూచితములయి యున్నవి. మన దేశమందలి కొన్ని పుస్తకములు నామమాత్రావశిష్టములయినవి. మఱి కొన్నింటి పేరుల నయిన నెఱింగినవారు లేరు. ఐతిహాసికు లనాదరమును జూపకయున్న కావ్యనాటకాదులను గూడఁ జక్కగా విమర్శించి విషయగ్రహణము సేయఁజనును.

మన దేశమందలి శిలాతామ్రశాసనములలో నింక నెన్నియో కనఁబడనున్నవి. అందు కొన్ని పెట్టెలయడుగునను, కొన్ని ఘోరారణ్యమధ్యములందును, మఱికొన్ని భూగర్భమునందు నుండవచ్చును. శాసనములను

విమర్శనపూర్వకముగాఁ జదువవలెను. శాసన నిర్మాతలు ప్రాయశః విద్యావంతులయి యుండరు. ఉదాహరణమునకై "వానిని బంపించి" యని చెక్కవలసిన దానిని భ్రమించి బాకుఁ దలకట్టు దగిలించినచో "వానిని చంపించి"యై గర్హితార్థ మిచ్చును. పాఠకుఁడు సైతె ముచిత జ్ఞుఁడై యుండవలెను. "రాముని కుక్క"యను దానిని బఠించునపుడు "రామునియొక్క కుక్క" యని గ్రహించుట యుక్తమో, కాక "రామునకు ఉక్క" యని గ్రహించుట యుక్తమో పాఠకుఁడు నిర్ణయింపవలసి యుండును గదా!

ఉపరికథితపుస్తకములను, శాసనములను జదివినంతనే యితిహాసలేఖకులు గాఁజాలరు. వారి బుద్ధి విశదమయి యుండవలెను. విశదము కాని బుద్ధి గలవారి లేఖనము యథార్థముగా నుండదు. భాషాపాండిత్యమును, భాషాస్వాతంత్ర్యమును, ఊహోదారత్వమును, సంకుచితత్వరాహిత్యమును, పూర్వసంకల్పసిద్ధాంతబుద్ధిహీనతయు, అనిర్ధారితసిద్ధాంతసహితప్రవర్తనమును, మతాభిమానహీనతయు, తద్ధర్మాభిమానరాహిత్యమును, అప్రతిహత తర్కవాదమును, అపవాదభీతిత్యాగాదులును విశదబుద్ధిమంతుల లక్షణములని తెలియందగును.

నా యీ వ్రాతయందు నించుకంత సార ముండునేని దాని నితిహాసలేఖనోద్యము లు గ్రహింతురుగాక.

---

అజంతా చిత్రము



౪. అప్సరసలు, గంధర్వులు

# కీ. శే. బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి గారు*

గోదావరీమండలంబున మార్కండేయ క్షేత్రంబున కుత్తరదిక్కునందు గవ్యూతిత్రయ దూరంబున ములున్న మందపాటి రాజసంస్థానమునకుం జెందిన, "మునిగుళ్ళు" యను పేరం బ్రసిద్ధికెక్కి యిప్పుడు ముగ్గుళ్ళయని వ్యవహరింపఁబడు బ్రాహ్మణాగ్రహారంబునఁ గల్లూరి వారను భూసురోత్తము లొప్పుచుందురు. అందుఁ గామసోమదేవీ వేంకటశాస్త్రు లను దంపతులకు శాలివాహన



కీ. శే. బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి గారు

శకము 1779 సంఖ్య నొప్పునట్టి పింగళనామ సం॥ర భాద్రపద బ ౧౩ జయవారమునఁ దెల్లవారుజామున నాశ్లేషా నక్షత్రయుక్త కర్కటలగ్నమందు కల్లూరి వేంకటరామశాస్త్రి గారు జన్మించిరి. ఇమ్మహాపురుషుని గర్భోత్పత్తికి ముందొక్కనాఁ డాయనతల్లి గారి స్వప్నములో నీశ్వరుండు పాడకట్టి నీగర్భమున నొక్కమహాతేజస్వి పుట్టునని యానతిచ్చినట్లుఁ, బిమ్మట నామె గర్భవతియై శాస్త్రిగారిం గన్నయట్లును జెప్పుదురు. ఆయుర్ధ కర్కట జన్మలగ్నములయందుఁ జంద్రశుక్రు లుండుటయును వారియుచ్చస్థితిం జెప్పుచున్నది. "ప్రజ్ఞాద కర్మ విజ్ఞానం బుధేనైవ విచింతయేత్" అను ప్రమాణంబు ననుసరించి ప్రజ్ఞాకరుండైన బుధుఁ డుచ్చస్థుండై యుండుటయే వీరి ప్రజ్ఞాప్రభావము వేనోళ్ళఁ గొనియాడఁబడుచున్నది. రాజ్యమందుఁ బృహస్పతి యుండి వాగ్విద్యాస్థానములను జూచుచుండుటచేత వారికి విశేష విద్యావైశద్యము కలిగిన దని వ్రాయు టతిశయోక్తి కాఁజాలదు.

## విద్యాభ్యాసము

వీరి కైదుసంవత్సరములు వచ్చినప్పుడు వీరి మేనమామ గారగు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీపతి సోమయాజులు గారిచే నక్షరాభ్యాసము చేయింపఁబడి నాటి నుండియు విద్యలయం దపారాసక్తి గలిగి పదిరెండు వర్షముల ప్రాయము వచ్చునప్పటికే బ్రహ్మశ్రీ బొడ్డపాటి గౌరీపతి శాస్త్రులవారియొద్దఁ గావ్యనాటకాలంకార సాహిత్యజ్ఞానము సంపాదించి జనస్తుతికిం బాత్రమైరని విన్ని యుంటిని. వీరు కావ్యములు చదువునప్పుడు, "ప్రతిదినము రెండు మూఁడు శ్లోకములచొప్పున జదువుము. పాఠము చెప్పుకొనుటకుఁ బూర్వము క్రొత్త శ్లోకములు సమన్వయము చేసికొని ర"మ్మని గురువుగారాజ్ఞాపింపఁగా మనశాస్త్రిగారు రానురనాఁడు 90 శ్లోకములుం గల సర్గ మంతయు సమన్వయించుకొనుటయే గాక కంఠపాఠమును జేసికొని వచ్చిరనియు, ఇట్లే ప్రతిదినమును బాఠము చదివి గురువు మెప్పులకుం బాత్రమై ప్రసిద్ధిం గాంచి రనియుఁ బెద్దలు చెప్పుదురు.

*బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక యను గ్రంథమున శ్రీకవిరాజ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు వ్రాసినదానినుండి. దీనిని ప్రకటనార్థము శ్రీయుత పాలకోడేటి సూర్యప్రకాశరావుగారు పంపిరి.

క్రీ. శే. బ్రహ్మశ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రి గారు

## శాస్త్రపాండిత్యము

ఇట్లు సాహిత్యజ్ఞానము గలిగిన పిమ్మట 18 వ సంవత్సరమున తాళ్ళపూడి యను కుసునూరు వీరభద్రపురా గ్రహారంబునకుం జని యటఁ గాశీపురవాసులగు జగదీశ పండేశీవారియొద్ద శిష్యులును, భాష్యాబ్ధిమథన సంగృహీత సుధీభావులును, కల్లూరివంశ ముక్తామణులును, నిరుపమానులైన బ్రహ్మశ్రీ నరసింహదీక్షితులుగారి శిష్టాచారమార్గగతి విశిష్ట చరణారవిందంబులయొద్ద శిక్షితులై వ్యాకరణ మహాభాష్యాబ్ధి పారంగతులైరి. (సూత్రభాష్యము, గీతాభాష్యము, మహాభాష్యము, ననుభాష్య త్రయమును జదివిరి). బ్ర॥ కల్లూరి వీరావధానులు గారి యొద్ద వేదవేదాంగ వేదాంతజ్యోతిషధర్మశాస్త్రాదులయం దపార పాండిత్యము సంపాదించిరి. మఱియును వైయాకరణ సార్వభౌమ లనిపించుకొనుటయే గాక కుశాగ్రబుద్ధి ప్రభాగరిష్ఠులనియు, సాహిత్య చక్రవర్తులనియుఁ బ్రఖ్యాతిం గాంచిరి.

## ఉద్యోగము

క్రీ. శ. 1885 మొదలుకొని రాజమహేంద్రవరమున ట్రైనింగ్కాలునందు శాస్త్రులుగారు సంస్కృతోపాధ్యాయులుగా నుండి పిమ్మట బోధనాభ్యసన పాఠశాల (ట్రైనింగుకాలేజి) యందును, సర్వకలాశాలయందును సంస్కృత ప్రధానోపాధ్యాయులై ప్రసిద్ధిగాంచిరి. పాఠశాలలయం దుపాధ్యాయత్వమును నిర్వహించుచు వ్యాకరణాది శాస్త్రావలోకనము, ఉభయభాషా కవిత్వతత్త్వవిచారము చేయుచుండుటయే గాక స్వయం కృషిచే మాసత్రయంబులో మిడిల్ స్కూలు పరీక్షయందుఁ గృతార్థులైరి! కళాశాలాధికారులగు నాంగ్లేయులును, హిందువులును వీరి నెంతో ప్రేమాతిశయంబునం జూచుచుండిరి. వీరి కిచ్చిన యోగ్యతాపత్రములే యిందులకు నిదర్శనములు. రాజకీయకళాశాలలనుండి వీరు విశ్రాంతి నొందినతరువాతఁ గొవ్వూరు సంస్కృతకాలేజీ ప్రధానోపాధ్యాయులుగా దాదాపు రెండు సంవత్సరములుండిరి. వీరి యొద్ద నభ్యసించిన విద్యార్థులు పెక్కురు శిరోమణియం దుత్తీర్ణులైరి. ఇయ్యది వీరి బోధనాప్రభావంబుననే కలిగిన దని పాఠశాలాధికారులు ప్రస్తుతించిరి.

## గౌరవబిరుదములు

1920 సం॥రము జూన్ 5,6 తేదులందు బరంపురమున సమావేశమైన 5 వ ఆంధ్రసారస్వత మహాసభవారు వీరికి శ్రీమన్మహోపాధ్యాయ బిరుదము నొసంగిరి.

## గ్రంథరచనము

వీరు సాత్త్వికబ్రహ్మవిద్యావిలాసనికసన మను గ్రంథమందు వంశముక్తావళి యను నొకగ్రంథమును కాళిదాస మేఘసందేశమున కాంధ్రీకరణమును, జార్జిముక్తావళి యనుగ్రంథమును, కోటిలింగేశ్వర శతకమును, చతురాస్యము లోనగు మఱికొన్ని గ్రంథములను రచించిరి. శైలిం జూపుట కొక్కొక పద్యము:

మ. తనచంద్రోపమకీర్తితోడ వెలయం దన్మండలం
బెల్లహో, యనముల్ కొన్ని గతింపఁగా సదరమీనాభి
ఖ్యుండై యొప్పుచుఁ, జనులెల్లం బొగడంగఁ దేల్చె శ్రు
తులన్ సంతోషనీరాకరం, బునఁ దాఁ బుణ్యజనాత్మ
హరి యగుచున్ మూర్తిప్రభావంబునన్.

"వంశముక్తావళి"

ఉ. తమ్ముఁడ మేఘుఁడా! తిథులఁ దద్దయు నెన్నుచు
సాధ్వి మన్నెడుం, జుమ్మి నిజంబుగా వదినెఁ జూచెదు
పో గమనంబు సార్థమా, నెమ్మిని నిండి పువ్వుసరణిన్
విరహంబునఁ దీగ బోండ్ల జీవమ్మపు దూడఁ జూడ
సుమబంధము నైఖరి నాస నిల్పఁగా.

"మేఘసందేశము"

మ. సాగ కార్ముల్బులు మంటచా ల్మెఱపులున్ బం
గారు కన్నీటియే, టిగ మున్ సల్పిన దాండయాత్రికుల
ధాటీదృష్టు లేచ న్మహా, యుగమై తోఁచిన దుర్దినాళి
బహుదుర్యోగంబు మాయించి బల్, సుగమం గూర్చెడు
నాంగిలేయవిజయజ్యోతిశ్శ రచ్చంద్రికల్.

"జార్జి ముక్తావళి"

శ్లో. అలంకృత్వా వానం జలధిహృదయస్థాంగలమహా
నృణా మత్రత్యానాం నయనతిమిరం హంసు ముదితః,
చిరా దాస్మాకీనా త్సుకృతపరిపాకా త్సముచితా
జ్జయశ్రీమాన్ జార్జి ర్వ్రజతి విదితం డిల్లినగరం.

"జార్జి ముక్తావళి"

మ. విను నీవే దళిదంద్రుడు లిద్దఱును గావే యర్ధనారీశ్వ మూ, ర్తిని విశ్వంబు సృజించి ప్రోచియు నయారే నేహనా నాస్తి కిం, చన యన్నట్టి శ్రుతిప్రకారమున నీజాగ్రల్ల లాటంతపా, క్షిని సర్వంబు లయింప సాక్షివి గదా, శ్రీకోటిలింగేశ్వరా!

"కోటిలింగేశ్వర శతకము"

## గుప్తార్థ ప్రకాశిక

మఱియు శ్రీ వేంకటరామశాస్త్రిగారు చిన్నయ సూరికృత బాలవ్యాకరణము గంభీరార్థ సందర్భము కలది యై సర్వజనసుబోధము కాకుండుటం జేసి కొందఱుమిత్రుల ప్రబోధనంబునఁ బై పేరున దానికి వ్యాఖ్యానము లక్ష్య లక్షణ సమన్వితముగా నతివిపులముగా వ్రాసియున్నారు. "బాలవ్యాకరణ గుప్తార్థప్రకాశిక" అనఁగా బాలవ్యాకరణములోని రహస్యార్థమును బ్రకాశింపఁ జేయునదియని యర్థము గుప్తార్థము దాఁచఁబడిన యర్థము. బాలవ్యాకరణములో ననేకస్థలములం దర్థము గుప్తమై యున్నదనుట నిశ్చయము. దానిని బ్రకాశింపఁ జేయునది గావున నే దీనికి "గుప్తార్థప్రకాశిక" యను పేరు సార్థకమగుచున్నది. వీరీ ప్రకాశికలో ననేకవిషయములు పేర్కొని సప్రమాణ ముగా నుదాహరించినారు. బాలవ్యాకరణ మర్థము కాని వారికిని, అందలి సందేహములం గూర్చి చర్చించుచుండు వారికి నిది దర్పణము వంటిది. ఇది చదివినపిమ్మట నే విషయమందు నెవ్వరికి నెట్టి సందేహములును బుట్టవని నానమ్మకము.

మఱియొక్క విషయము మాత్రము చెప్పుచు న్నాను.

"వివిధకళాప్రవీణు లతివిశ్రుతవైభవసాంద్రు లెంచ శ్రీ భువి మను బుట్టి గిట్టి రొకపూరుషులైన నొకం డెఱుం గు నేకవులగు తొంటివారలు జగత్త్రియమం దిపుడున్న న సింతు రా, శివకరులైనవారు మృతజీవులు కీర్తిశరీరు లెన్నఁ గన్" అని చెప్పినట్లు వారిపాండిత్యమునకుం దగ నేదేనొ క్క మహాగ్రంథము రచించియుండవలసి యున్నది. అట్లు చేసినవారు కారు. కొందఱు మనశాస్త్రిగారిని సూర్యసి ద్ధాంతము నాంధ్రీకరింపుఁ డని కోరిరఁట; వారును మంచి పద్ధతిని దానిం దెనిఁగింప నిశ్చయించి రఁట: కాని యది యును గొనసాగినదికాదు. నేను వారిదర్శనము చేసినప్పుడు సర్వదా "మీరు సర్వాలంకారగ్రంథములం గ్రోడీకరించి తెలుఁగున నొక యలంకార శాస్త్రగ్రంథము రచింపవల యు" నని కోరుచుండువాఁడను. వారును "నేను నీవు చె ప్పిన ట్లలంకారసర్వస్వ మను పేరితో నొకలక్షణగ్రంథము వ్రాయుదు" నని చెప్పినవారే కాని చెప్పినట్లు చేసినవారు కాకపోయిరి. వారి కావిషయమునఁ గుతూహలము లేక పోలేదుగాని కాల మలంఘ్యముకదా! ఉపకారవేతనము నొందినది మొదలు వారి కేవో యనివార్యములైనపనులు తటస్థించుచు నే వచ్చినవి. అంత నాల్గుసంవత్సరములు మహా రోగము. తరువాతఁ బరమపదయాత్రయుఁ దటస్థించినది. వారి యుద్యమము నెఱవేఱి లోకము ధన్యము కాలేకపో యినది. అట్లయినను వారి గ్రంథములలోని "గుప్తార్థప్రకా శిక" పరమోత్తమమైనది. అదియే వారికీర్తి నాచంద్రతా రార్కముగాఁ బ్రకాశింపఁ జేయుటకుం జాలునని సంత సించుచున్నాను.

## ప్రజ్ఞావిశేషము

మఱియు వీరు పెక్కు కృతివిమర్శనములు, హాస్యరసము దాకరములు, శాస్త్రచర్చలు పెక్కులు చేసియుండిరి. ప్లవ సం॥ర ఆషాఢమాసనిర్ణయమున జరిగిన పండితమహా సభలో మూఁడుదివసంబులు వరుసగా నిరర్గళధారాప్రవా హంబుగ నుపన్యసించి పండితమండలి కచ్చెరువు గలిగించిరి. అర్ధోదయ మహోదయ నిర్ణయము, వినాయకచతుర్థీ నిర్ణ యము మున్నగు ధర్మశాస్త్రాది జ్యోతిష విషయములం గూర్చి అప్పుడప్పుడు విపులముగాఁ జర్చించి నిర్ణయ పత్రికలు వ్రాసి లోకపూజ్యతం గాంచిరి. రౌద్రి సం॥ర పుష్కరనిర్ణయ విషయమై పలువురు పలువిధములఁ దగవులాడ రాజమహేంద్రవరపురమున నొకసభ గావించి సందర్భవశమున నలికాయంత్రముం గూర్చి చర్చించుచు శ్రావణశుద్ధ తృతీయా భానువారమే పుష్కరారంభ మని నిర్ణయించి ప్రఖ్యాతిం బడసిరి.

## జ్ఞాపకశక్తి.

వీరి జ్ఞాపకశక్తి యత్యద్భుతము. ఏదేని యొకశ్లో మందు సందేహము గలిగి వీరి నడిగినప్పుడు దానిసాధుత్వా

సాధుత్వములు నిర్ణయించుచు, నిది యీపుస్తకములలో నాయాయాశ్వాసములలో నిన్నియిన్నవపద్యములలో నున్నదని చెప్పి యీపుస్తకములు తెప్పించి రుజువు చేయుట నే ననేకపర్యాయములు చూచియున్నాను. వా రాపద మెప్పుడు చూచియున్నారో, అది యెట్టి జ్ఞాపకశక్తియో చెప్పుటకు శక్యము కాదు; అది యమానుష శక్తి యని చూచినవారికిఁ దోఁపక మానదు. ఈలో వీరి కపస్మారరోగము వచ్చినప్పుడును నీశక్తిపోలేదు. మఱియు నేజాతకచక్ర మేని యొక్కచూఱు చూచినచో దాని మఱచుట వీరెఱుంగరు. 30,40 సం॥లకైన నాజాతకుఁడు వచ్చి నాజాతకము చెప్పఁగలరాయని యడిగినప్పుడు చూచినవానివలెఁ జెప్పుట నే నెఱుంగుదును. ఈజ్ఞానము రోగకాలమందును నిలిచియున్నది. ఇట్లే వీరు బాల్యము నుండియుఁ జదివిన శ్లోకములు మొదలగునవి జ్ఞాపకమున నున్నవని చెప్పు టతిశయోక్తి కాఁజాలదు.

## దైవభక్తి

వీరు ప్రతిదినమును స్నానసంధ్యాద్యనుష్ఠానము నిర్వర్తించి పార్థివలింగపూజ గావించి వెనుక లలితా మంత్ర జపమ్ము జేయుచుండువారని తెలియుచున్నది. వీరు ప్రత్యహంబును శతరుద్రీయపారాయణము, ఉపనిషత్పారాయణము, భగవద్గీతా పారాయణము, రామాయణ పారాయణమ్ము జేయుచుండెడివారు. బాల్యమున విద్యాభ్యాసము నిమిత్తము కాశీక్షేత్రమునకుం బోఁదలంచియు, దల్లిగారి యాజ్ఞ జేసి యది లభింపమింజేసి సర్వదా కాశీక్షేత్రమును, విశ్వేశ్వరుని మనంబున నిలుపుకొని ధ్యానించుచుండువారని తెలియుచున్నది. 60 సంవత్సరములు వచ్చువఱకును బ్రతిసాయంకాలమందును శివదర్శనము చేయక భుజించువారు కారు.

## ఆర్థికము

వీరికిఁ బితృపితామహార్జితమైన భూములవలన సాలునకు 7, 8 నూర్లరూప్యములు వచ్చును. ఉపాధ్యాయపదమునం దుండునపుడు నెలకు 30, 40, 50, 60 చొప్పున సాలునకు 5, 6 నూర్ల రూప్యములుమాత్రమే వచ్చుచుండును. ఈధనంబునఁ గుటుంబ భరణము చేసికొనుచుఁ గొడుకులకుఁ గూఁతులకుం బెండ్లిండ్లులోనగు శుభకార్యములు చేసికొనుచు గౌరవము చెడకుండఁ గాలక్షేపము చేసినారు. వీరు జ్ఞానమువచ్చినది మొదలుకొని యెప్పుడు నెట్టియిక్కట్టు వచ్చినప్పుడు నొరులవద్ద ఋణపత్రము వ్రాసియుండలేదు. "ఋణేశు చిం" అనున్యాయంబున వీరెప్పుడును ఋణము చేసియున్నవారు కారు గావున సర్వజన నమస్కారపాత్రమైనవారు. ఇట్టివారు లోకములో కొంచెము మాత్రమే యుందురు. ఎంతవాఁడు నెప్పుడైన ఋణముచేయక తప్పదు. వీరు ఋణముచేయలేదని ముమ్మాటికిని జెప్పవచ్చును.

## చరమదశ

వీరు కాలధర్మము నొందుటకు మున్ను రోగగ్రస్తులైరి. ఆకాలములో నేను 2, 3 తడవలు పోయి చూచితిని. తన్ను, నెదిరి నెఱుంగక పిచ్చిమాటలు పలుకుచుండువారు. ఆరోగ మప్పటికి స్మృతిం గలిగింపలేదు గాని మరల భూమిపై నడుగుపెట్టి నడువనీయలేదు. సర్వదా పల్యంకమే శరణము. అప్పు డప్పు డింటిలో మనుష్యసాహాయ్యంబున నడయాడుచుండువారు. అప్పుడు మిక్కిలి దౌర్బల్యము నొందినవారయ్యును గ్రంథపరిశీలనము మాత్రము మానలేదు. ఆమరణము జ్ఞాపకశక్తి యొక్కమారిదిగానే యున్నది. అట్టివీరు విభవ సం॥లో నుత్తరాయణమున జ్యేష్ఠమాసములో శుక్లపక్షమున నేకాదశీదినమునఁ బగలు పదునాల్గుఘటికలమీఁద దక్షిణకాశి యనం జను మార్కండేయ క్షేత్రాంతర్గత కోటిలింగక్షేత్రంబునఁ బుత్రపుత్రికాది సమస్తబంధుసముదాయ సన్నిధానంబున భౌతికశరీరమును విడిచి పరంధామంబు నొందిరి.

---

# మల్లికామారుతము

వడ్డాది సుబ్బారాయఁడు గారు

(వెనుకటి సంచిక తరువాయి)

నిడుపులు శ్వాసముల్, చెమట నెమ్మొగమందు, శ్రమంబు మేన, నం
దొడలను గంపముం, దొగకనుంగవ మో, డ్పను నీవికారముల్
వెడవిలుకానిపీడను బలెం బరిఖేలనఖేదమందు నో;
నొడళుల నెల్లఁ దోఁచు పులకోద్గమ మొక్కఁడు భేదకం బిటన్.

చెమ్మటను దొప్పదోఁగిన చెలువసుంద-రాంగకములఁ బ్రతిఫలించు చాతఁడు త్రుటిఁ
దొగచెలి తదీయలావణ్య దుగ్ధజలధి-యలలమధ్యంబునం దీఁదునట్లు దోఁచె.

మాధవమరుత్తు ననుఁగుఁగుమారుఁ డితఁడు-ప్రీతి గుంభోద్భవుఁడు పెంపఁ బెరిఁగినాఁడు;
నిన్నుఁ గనఁగోరు నీతని కిన్నరనుత-గుణము లాలించి యుత్కంఠఁ గూరితిగద.

మునుపె గాఢానురాగంబు వినికినైన;-దపుడు సంప్రాప్తుఁ గని మోహనాంగి యతని
తనువునను దమ్మిపూవులదండవోలె-మాన్మథవిలాసవీక్షాళి మరలఁ జిమ్మె.

మోముఁదమ్మితావి మూఁగించు చళులను-గప్పురంపురజము గుప్పినట్లు
దశనకుట్మలాగ్రధవళదీధితిపుంజ-మొలయఁ దేనె లొలుకఁ బలికె నతఁడు.

హృదయము సౌహార్దంబున-సదమలమై యున్కి, చూడ్కి సంతోషంబున్
వెదచల్లుట, సత్సత్కృతి;-యదనము సర్వంబు లౌకికాచార మగున్.

దాన హర్ష మొంది, తనకేల నతఁ డిచ్చు-స్రజము భృంగగీతసద్గుణంబు
నంది, సకియ యామె కగ్రామ్యకాకువా-క్త్రిపితదృష్టి కునిచెఁ గంఠమునను.

వేగ మంతలోన విద్యాధరేంద్రుని-సచివుఁ డైన జనకుశాసనమునఁ
బిలుచు కంచుకులను గలిసి యంగజపీడఁ-దిరిగి తిరిగి కనుచుఁ దరుణి యరిగె.

వనిత గృహంబు చేరి, ఫణివల్లభ భోగసమాన దీర్ఘ బా
హుని సుకుమారమైన తనయుల్లమునం దతనిన్ వహించి, పా
యని మదనజ్వరంబునఁ గృశాంగకముల్, శ్లథనీవిబంధ మై
యనయము వెచ్చనూర్చు చవశాత్మత వాలిచె నొయ్య శయ్యపై.

మొలకవెదురును బోని ముద్దొలుకుమేన-నొలసె, బిసకాండసోదర మొందుచాయ
క్రమలినట్లగు, నిట్టూర్పుగాలిఁ, గెంపుఁ-దునుక తులకింపు గల మోవి దొండపండు.

సకియ, చిరోపగూఢమును సాంద్రము నౌ తనమీఁదివాని ర
క్తి కనుట, రెట్టి యైనస్మరతీవ్రత, ప్రాణము వచ్చినట్టు లై,
ప్రకటవియోగపాండుమధురత్వతదాకృతి వ్రాసి పైఁటపై,
సకలవిధుప్రభాధవళ చారుసరంబు లిఖించెఁ బే రెదన్.

అరుగు చెంటికి మూఁగెడు నళులఁజోపు-కైతవమున మరల్చి త్రికంబు సఖుల
నడుమ నరగంట నేకస్తనంబు దోఁపఁ-దనుఁ గనిన తన్వి దలఁచు నతండు దమిని.

ఆగిరీంద్రము, నచ్చటి యా స్రవంతి-యాలతాసద్మమును, బంతియాటవలన
నలసటను గన్న యాచకోరాక్షి నామె-యలుత నాపుష్పమాలయు నతఁడు వ్రాసె.

నిద్దురను బుల్గుబలుఁగను స ద్దండగు-నద్దరే యిటఁ గన్నుల నశ్రు లలమఁ
గర్ణములకు నాయుష్యము, కరుణ, మొకవిలాప మాలించె నతఁడు నాలుంగఁ దాల్మి.

అకట చూత! హా చంపక! హా లవంగ!-యయ్యొ మాలతి! హా మల్లి! హా కురంగి!
హా మరాళి! హా కేకిని! హా చకోరి! - యయితి స్మర్తవ్య; మీసఖి హా! గతించె.

జగములను గన్న జననీ!- భగవతి! భక్తానురక్త! భద్ర! భవానీ!
యగుతన్ మరుజన్మంబున-మగండు నాకల మనోజ్ఞమారుతసుతుఁడే.

ఆ యువ, దివ్యమాల్య మురమందు ధరించినదాని, బాష్పపుం
దోయమునన్ ముఖాంబుజము దోఁగినదాని, స్మరాస్త్రవేదనన్
హా యనుదాని, వాడిన మృణాళము పోలినదానిఁ, గంఠమం
దాయత మైన వల్లి యురియా జవరాలిని గాంచె నొంటరిన్.

మానుము మానుము, సాహస-మూనకుమీ సుందరీ! మఱొక జన్మమునం
దేనిని వరుఁగ వలచి తెం-దానం బ్రార్థించి, తట్టి దాసుఁడ నేనే.

కన్నియల కభిసారము కాని దంచు-వచ్చె నర్పింప నుసులు భవాని కబల;
వానిఁ గని లజ్జ వణఁకుచు వాంచి మోము - కాలి బొటవ్రేల వ్రాయుచు నేల నిలిచె.

ప్రియమిత్రుఁగాని, యా-కన్నియగానీ, కాన రెదుర; నేలను బడు ము
ద్దియ చూడామణి, మఱి య-ప్పయిదలి ప్రియు వ్రాసికొన్న పయఁటఁ గని రటఁ.

సంతతిని గోరు మద్భక్తజనుల కిలను - బిడ్డ లగుదురు గావుత వీర లిరువు
రంత నన్యోన్య దత్తంబు లగుత వారి - సహజమౌక్తికహారపుష్పస్రజములు.

కాముని గెల్పు లచ్చి యలకన్యయె మల్లిక యీమె యామెకుం
బ్రేమనిధాన మాపవను బిడ్డఁడు మారుతుఁ డీవె నెయ్యురం
దా మెయి నేఁడు గూలె భ్రృగు వం దొకరుం డల ప్రాణమిత్రునిం
గా మది నెంచుకొమ్ము కలకంఠసమాఖ్యను గాంచు నీతనిన్.

నీకై దువ నిహతిం గని-రాకాసితనంబు వోఁయి ప్రాణసఖుండై
యాకసమున నేఁగిన యా-మాకందునిఁ దెలిసికొనుము మఱియొక సఖుఁగా.

నీమెడఁ బొడమి యెదిగి యటు-నా యనురాగంబు ముట్టినం గొట్టకొనన్
బ్రేయసి యిపుడు నవీకృత-మై యగపడుఁ బ్రాగ్జని తలఁపయ్యెడు నాకున్.

కందుకఖేల నభ్రములఁ గన్జిగి నింగి విసీల పూటయున్,
దండిరియానతిన్ జనెడుదారిని నన్ వెనుద్రిప్పి గాంచుటన్,
మెండుగ సాహసించు నిసి నే నురితీవలఁ ద్రెంప లజ్జయున్,
గొంశోకభీతి, హర్షమును గూరిన మోమున నిల్పు టొంచెదన్.

వెలుఁగుల విజ్జఁ జిమ్ముచు, భువిం దిగు చంద్రమసుండొ, పక్షముల్
మొలచి విహారముల్ సలుపఁబూనిన తారధరాధరంబొ; హా!
తెలిసె, నిజధ్వజాగ్రనిహతిప్రచలజ్జలదోచ్చయంబు, ని
ర్మలవియదంబురాశివిచరత్సితనౌక, విమానరాజ మౌ.

వెలిగొడుగువాఁడు, రత్నకుండలధరుండు-స్వర్ణభాస్వత్తనుండు, సచామరుండు,
వరునిఁ గొమరితఁ జూడ విశ్వావసుండు-నాదు చెలికాఁడు వచ్చుచున్నాఁడు నేఁడు.

జనకునకుఁ దనయతోడను-జనియించును శోకరూపశంకువు హృదిలోఁ
దనయంత సడలి చను నది-ననుకూలవరుండు దొరకె నా కన్నియకున్.

ఇచ్చె శేషుండు దీని మహేంద్రునకును;-దైవతాధిపుఁ డొసఁగె విద్యాధరాధి
నాథునకు సాదరంబుగా! నాకు నమ్మ-హాప్రభుండు ప్రసాదించె నమితకరుణ.

కొమరితమై శిరీషసుమకోమలకేసరపేశలంబు; నం
గముజిగి, జాళువాకదళికందళపుందళుకుల్ హసించుఁ; గం
ఠము నెలుఁగుల్, రసాలవననవ్యకుహూమధురంబు; సుందర
త్వము నతులంబు; నన్ని యవె, వానికి నెక్కుడు నంచు నెంచెదన్.

హర్ష నిశ్చలోన్మిషాక్షి పక్ష్మవిమిశ్రి-తాశ్రుమంథరంబు, హసితకోక
నదసమానమైన వదనంబు మల్లిక-వంచుకొనియె లజ్జవలన లలన.

ఇతఁడు పవమానదేవున కెట్టివాఁడొ-తాదృశుఁడ యయ్యెడును బ్రహ్మదత్తునకును
నీకె విశ్వావసుఁడవగు నీకు నెట్టి-యదియె, విశ్వవసున కిప్పు డట్టిద యగు.

ఈపె నిజభర్తృవార్తా-ప్రేషిత నమితాననాబ్జ నేఁ గాంచితి; నా
కీపుత్రికతోఁ బొడమిన-పూపసునోరథము నేఁడు పూర్ణం బయ్యెన్.

నయనానందమృగాంక! కైకొనితి కన్యన్ మల్లికన్, గట్టి దు
ర్ణయ ప్రేలం దరుశాఖశంబరకు; నానందించితిన్ మారుతా!
చెయిపట్టెన్ రమయంతికన్ స్మరజయశ్రీ, విష్ణురాతాత్మజన్
నయమారం గలకంఠుఁడున్, గదిసి తన్మందాకినీవేషతన్.

లలనన్ నేఁ జిరకాంక్షితాసుషభఁ గల్యాణిం బ్రియం బొందితిన్
గలబంధుల్ ముద మొంది రందఱు ద్విజన్మప్రాప్తు; లీమిత్రుఁడౌ
కలకంఠుండును మోద మొందె దయితం గైపట్టి; మాకందునిం
జెలికానిన్ మరలంగఁ గంటిఁ; బ్రియమున్ జెప్పంగ నా కే దిఁకన్.

అయిన నిట్లగుఁగాక (భరతవాక్యము)

భద్ర మయ్యెడుఁగాక ప్రపంచమునకు-భక్తి హరియందొ, హరునందొ ప్రజల కౌత;
శ్రౌతమార్గంబు గాంచుత సతము జయము;-మఱియు విద్వాంసులెల్లఁ శ్రీమంతు లగు!త

---

# అచ్యుత దేవరాయల విజయములు, భాషాసేవ

డాక్టరు యస్. వెంకటరమణయ్య గారు

## ౧

శ్రీ కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౨౯లో మృతి నందెననియు, నతని యనంతరము అచ్యుత దేవరాయలు సింహాసనము నధిష్ఠించెననియు చరిత్రకారులు పల్కుచున్నారు. విజయనగరసామ్రాజ్యచరిత్రమును ప్రథమమున రచించిన సూయల్ గారు అచ్యుతరాయడు పందయనియు శత్రువుల నెదుర్కొనుటకు దగినధీరము లేనివాడనియు వ్రాసియున్నారు.

"(ఈ) క్రొత్తరాజు కృష్ణదేవునిచే (దన పిమ్మట సామ్రాజ్యపదమునందుటకు) నియమింపబడెనని నూనిజ్ చెప్పుచున్నాడు. ఇది నిజమగునేని యీనియామకము అనర్థకరమైనది. ఏలన, అచ్యుతుడు పంద; అతనిరాజ్యకాలమున హిందూసామ్రాజ్యము విచ్ఛిన్నముగాజొచ్చినది."
( Forgotten Empire, p. 165.)

ఇట్టియభిప్రాయ మనేకచరిత్రకారులకు గలదు. ఇట్టియభిప్రాయములకు వ్యతిరేకముగ రాజనాథడిండిమ కవిఐర్యుని అచ్యుతరాయాభ్యుదయమునందు అచ్యుతరాయడు మహాశూరుడనియు దిగ్విజేతయనియును జెప్పబడియున్నది. అందు అచ్యుతరాయల దిగ్విజయయాత్రలు సంపూర్ణముగ వర్ణింపబడియున్నవి. మొదట దక్షిణదేశము జయింపబడెను. చెల్లప్పయను సామంతరాజు చక్రవర్తిపై దిరుగబడి యతనిదండనాథులచే పరాజితుడై చేరసీమజొచ్చి యాదేశపురాజు నాశ్రయించి పాండ్యరాజును తద్రాజ్యమునుండి వెడలగొట్టెను. పాండ్యుని రక్షించి యతని పాండ్యరాజ్యమునందు పునరుద్ధారణము సేయుటకు అచ్యుతరాయలు దండువెడలెను. అచిరకాలమున చంద్రగిరింజేరి యచట కొంతకాలమాగి, తిరుపతి వెంకటేశ్వరుని కాళహస్తీశ్వరుని సేవించి, యచటినుండి బయలువెడలి సైన్యముతోగూడ కంచి తిరువణ్ణామలలమీదుగ శ్రీరంగమును జేరెను. అచట కొంతకాలముండి, శత్రువుపై బోవ నుద్యమించగా, సలకరాజకుమారుడు చెల్లప్పవంటియల్ప సామంతునిపై మహారాజు దండువెడలనవసరము లేదనియు, తన్నాకార్యమునకు నియోగించినదాను కార్యమును సాధించెదననియు పల్కెను. మహారాజందు కంగీకరించగా సలకరాజకుమారుడు మధురాపురిని దాటి తామ్రపర్ణీతీరమున విడిసి, చేరరాజగు దిరువడిపై నొకదండనాథు నంపెను. అతడు దిరువడిని యుద్ధమున నిర్జించి యాతని జోళరాజుతోగూడ పట్టి తెచ్చెను. పిమ్మట సలకరాజపుత్రుడు పాండ్యుని పిత్రార్జితమగు రాజ్యమున నిల్పి అనంతరము సేతువు మొదలగు స్థలములకుబోయి,కడపట శ్రీరంగమున విద్వత్కవివర్యుల గోష్ఠిని కాలము గడుపుచున్న యచ్యుతదేవమహారాయలను సందర్శించెను. అతడును అపరాధియగు చేరరాజును శిక్షింపను, పాండ్యునిపిత్రుపైతామహంబగు రాజ్యమున బ్రభుత్వము నేయనుమదలయిడి యచటినుండి బయలువెడలి కావేరీతీరమున బయనము సాగింపుచు కర్ణాటకదేశమందలి శ్రీరంగపట్టణమును జేరెను. సామంతరాజులొసగిన కానుకలనుగొనియచోటు వాసి యుత్తరాభిముఖుడై బయనముసాగించి స్వరాష్ట్రపుహద్దులను మీరి హయపతిరాజ్యముం జొచ్చి యాతని సైన్యముచే రక్షితమైన ముదుకల్లుదుర్గమును ముట్టడించెను. ముట్టడివార్త విన్నంతటనె ముదుకల్లునందు తాణాయున్న దండుకు సాయముగ నడిల్ షా గొప్పసైన్యము నంపెను. అచ్యుతరాయలసైన్యములకును, బీజపురమునుండి క్రొత్తగావచ్చిన సైన్యమునకును ముదుకల్లుసమీపమున యుద్ధము జరిగెను. అందు యవను లోడి పారిపోయిరి. అచ్యుతరాయలు యవనరాజుయొక్క గుఱ్ఱములను, ఏనుగులను గయికొని కృష్ణానదీతీరమునకు బోయెను. అచ్చట సుల్తాను గొప్పసైన్యమును జేర్చికొని యుద్ధ సన్నాహములు సేయుచుండెను. అప్పుడు కృష్ణ కవ్వలిగట్టున తురకసైన్యమును, ఇవ్వలిగట్టున రాయలసైన్యమును యుద్ధప్రయత్నము సల్పుచు కొంతకాలముండెను. అంతట సుల్తానొకనాడు గృహను

దాటి రాయలశిబిరమునకు వచ్చి అచ్యుతరాయనికి నమస్కరించెను. అట్లు శరణుజొచ్చిన సుల్తానున కభయమిచ్చి నిజరాజధానియగు విజయనగరమునకు రాయలుదరలెను. (Sources of Vijayanagar History, pp. 158-169.)

౨

పై విషయము లందఱకును చిరపరిచితములే. ఈ విషయములను ఆంధ్రమున విజయనగరచరిత్రమును వ్రాసినవారు కొందరు తమ గ్రంథములందు జొన్పియున్నారు. కాని వీనిని చక్కగ సమన్వయపఱచి అచ్యుతరాయల చరిత్రమును విపులముగ వ్రాయరైరి. ఈ సందర్భమున మే మాపనికి బూనుకొనుట లేదు. ప్రస్తుతము కృష్ణరాయనిచే రాధామాధవకవి యను బిరుదును గొన్న చింతలపూడి యల్లయకవివర్యుని తారక బ్రహ్మరాజీయమున మేము గుర్తించిన యొండు రెండు నూతన విషయములను వర్ణించుచున్నాము. పై గ్రంథముయొక్క పీఠికమందీపద్యము గలదు:—

చ. తిరుపతి గెల్చి పాండ్యనర దేవునిపట్టముగట్టి యుత్కలే
శ్వరు గరుణించి మ్రొక్కిన సవాయికిదానభయం బొ
సంగి పెం, పరుదుగ గీర్తిజేకొనిన యచ్యుతరాయల
మంత్రి రత్నమై, తిరముగ నున్ననంజవిభు తిమ్మరు
సుం దగ బ్రస్తుతింపగన్.

పై పద్యములోని తిరుపతియే యచ్యుతరాయాభ్యుదయములోని చేరరాజగు దిరువడి. అతని గెల్చియే కదా అచ్యుతరాయల సేనాని సలకరాజపుత్రుడు "పాండ్యనరదేవుని"కి బట్టముకట్టినది. "మ్రొక్కినసవాయి" బీజపురపుసుల్తాను. ఇతడు అచ్యుతరాయలకు నమస్కరించి యాతని యనుగ్రహమునకు బాత్రుడయ్యెనని డిండిమకవి వల్కియే యున్నాడు గదా! కావున నీరెండు విషయములయందు గ్రొత్తయేమియు గాన్పించదు.

మఱి క్రొత్తవిషయ మేదియన, "ఉత్కలేశ్వరు గరుణించి" యనునదియే! ఈ విషయ మెచ్చటను ఎవ్వరిచేతను చెప్పబడి యుండలేదు. అచ్యుతరాయలు గరుణించిన యుత్కలేశ్వరు డెవ్వడు? గజపతియనుట నిక్కము. అట్లైన ఏగజపతి? యను విషయమును నిర్ణయింపవలసి యున్నది. కృష్ణరాయ నిర్యాణానంతరము గజపతి కర్ణాటముపై దండు వెడలెననియు, అల్లసాని పెద్దన యీక్రిందిపద్యమును జెప్పి యాతని వెనుకకు మరల్చెననియు నొకయైతిహ్యము కలదు:

సీ. రాయరావుత మిండరాచయేనుగు
వచ్చి యారట్లకోట గోరాడు నాడు
సంపెటనరపాల సార్వభౌముడు వచ్చి
సింహాద్రి జయశిల జేర్చునాడు
సెలగోలు సింహంబు చేరి ధిక్కృతి గంచు
తలపుల గరుల డీకొల్పునాడు
ఘనతర నిర్ఝర గండపెండెర మిచ్చి
కూతు రాయల కొన గూర్చునాడు

ఒడ లెఱుంగవో చచ్చితో యుర్వి లేవో
చేరజాలక తలచెడి జీర్ణమైతో
కన్నడంజెట్లు సొచ్చెదు గజపతీంద్ర
తెఱచినిలు కుక్క సొచ్చిన తెఱగు దోప.

ఇట్లు కృష్ణరాయల మరణానంతరము కర్ణాటముపై నెత్తివచ్చినది ప్రతాపరుద్ర గజపతికుమారుడని శ్రీ. వే. వేటూరు ప్రభాకరశాస్త్రి గారు వ్రాసియున్నారు: "కాని కృష్ణరాయల తర్వాత ప్రతాపరుద్ర గజపతి కుమారుడు గాబోలును మరల కన్నడము మీదికి రాగానో, రాబోవగానో, పెద్దనామాత్యు డీక్రింది (అనగా పైనుదాహరించిన) పద్యము జెప్పి యాతని సిగ్గిల జేసెనట!" విభవసంవత్సరాది సంచిక (పుట ౧౪౭).

శ్రీ శాస్త్రిగారు పొరబడినారు. పద్యమును జాగ్రత్తగ జదివియుండిన కృష్ణరాయ నిధనానంతరము గన్నడము పైనెత్తివచ్చినది ప్రతాపరుద్ర గజపతియే యనియు అతనికుమారుడు గాడని [illegible] డెల్లమైయుండెడిది. పైపద్యమున కృష్ణరాయల మరణానంతరము విజయనగరముపై వెడలిన "గజపతీంద్రుడు" "ఘనతరనిర్ఝరగండపెండెర మిచ్చి కూతు రాయల కొనగూర్చి"న వాడట. అట్లు కృష్ణరాయలకు గూతు నిచ్చినవాడు ప్రతాపరుద్రగజపతియే గాని యన్యుడు గాడని తెల్ల

మగుచున్నది గదా. గజపతి కన్నడముపై నెప్పుడెత్తి వచ్చెను? కృష్ణరాయని మరణానంతరమునను, అచ్యుత రాయల సింహాసనారోహణమునకు పూర్వమున నని వైపద్యముయొక్క కనిష్ఠపాదమువల్ల దెలియుచున్నది. గజపతి దండయాత్రనాటి కర్ణాటకస్థితి యెట్టిదన,తలుపు దెఱచిన గృహమువంటిది. తలుపు దెఱచియుంచిన యింటిలో బ్రవేశించు కుక్కకుఅడ్డమేమియు లేనట్లు, కర్ణాటకమును జొచ్చుశత్రువు నడ్డగించు నాథుడెవ్వడును లేకుండెను. అనగా పైజెప్పిన గజపతిదండయాత్ర జరిగినప్పుడు విజయనగర రాజ్య మరాజకస్థితియందుండెను. దేశమును గాపాడుప్రభువు కాన్పింపకుండెను. కావుననే కన్నడము తెఱచిన యింటివలెనుండెనని పెద్దనగారు హృదయవిదారణ మగునట్లు వాపోయిరి. అప్పటి రాజకీయ పరిస్థితులను కె. వి. లక్ష్మణరావుగారు ఇట్లు వర్ణించుచున్నారు:—

కృష్ణరాయలు పరమపదించగా "విజయనగర రాజ్యమును ఆక్రమించుకొనవలయునని అతని కుమారుడైన తిరుమలరాయడును, అల్లుడైన రామరాయలును, తమ్ముడైన అచ్యుతరాయలును ప్రయత్నించుచుండినట్లును, ఎవరికి వీలయినప్పుడు వారు శాసనములు వేయించుట, కాళ్ళిచ్చుట మొదలైనపనులు చేయుచున్నట్లును, ఈ కాలమునందు నెవరియధికారమును స్థిరపడనట్లును దోచుచున్నది." (వ్యాసావళి పుట ౫౩.) రాజ్యములో పేరందిన నాయకు లొండొరులతో నిట్లు పోరాడుటచేత అరాజకత్వము మెండై, ఎల్లప్పుడును వేచియున్న శత్రువులకు గన్నడముపై నెత్తివచ్చుటకు అవసరైనది. ఇట్టి కన్నడరాజ్య సంక్షోభమునకు సంతోషించి సపాదుడు తత్పూర్వము కృష్ణరాయలకాలమున గోల్పోయిన ముదకల్లు రాయచూరు దుర్గములను మరల సాధించెను ఈ విషయమునుగూర్చి ఫెరిష్టా యిట్లు వ్రాయుచున్నాడు.—

ఈ సుల్తాను (అదిల్‌షా)...తనసైన్యము తరలెను, ఉమ్మాద్‌షా అమీర్ బరీదు లనువారు స్వసైన్యములతో నాతనివెంట జనిరి. హీంరాజు మరణానంతర మతనిపుత్రుడగు రామరాజు అధికారములోకి రాగా, అనేకరాజు లాతనిపై తిరుగుబాటు చేయుటచేత విజయనగరరాజ్యమునందు బుట్టిన సంభ్రమమువల్ల, అతనిదాడి నడ్డుపెట్టువారు లేకైరి. మూడునెలలు ముట్టడివేసి, (అంతకుపూర్వము) పదిహేడు సంవత్సరములుగ కాఫరుల స్వాధీనమునందున్న రాయిజోర్ ముద్కల్ దుర్గములను లొంగిపోయిన శత్రువులకడనుండి స్వాధీన పఱచుకొనెను."—Sewell: Forgotten Empire p. 166

కృష్ణరాయలకు దనరాజ్యములోని విశేష భాగమును కూతుతో సమర్పించుకొన్న ప్రతాపరుద్ర గజపతి కిదియేగదా మంచితరుణము పగతీర్చుకొనుటకు. అట్లెత్తివచ్చిన గజపతిని క్రీ. శ. ౧౫౩౬ సంవత్సరమునుండి యుదయగిరి రాజ్యము నేలుచుండిన అచ్యుతదేవరాయలోడించి యుండవచ్చును. ఈవిషయమునే రాధామాధవకవి "ఉత్కలేశ్వరు గరుణించి" యన్నమాటచే దెల్పినాడు.

## 3

మఱియు నింకొకవిశేషము. నరసరాయలు అనేకాంధ్రకవులను బోషించి వారిచే గ్రంథముల వ్రాయించి యంకితము జేయించుకొనెను. ఆంధ్రభోజుడగు కృష్ణరాయల విషయము జెప్పవలసినదే లేదు గదా. అష్టదిగ్గజములే గాక యితరులగు సంస్కృతాంధ్ర ద్రావిడకర్ణాటకవు లాతని యాస్థానమున నుండిరని యందఱెఱిగిన విషయమే. అచ్యుతరాయల పేర నొక్క గ్రంథమైనను తెనుగున రచింపబడినట్లు కాన్పించదు. కృష్ణరాయ నిర్యాణానంతరము అతనిసభ నుండిన కవులలో పెక్కురు విద్యానగరమున నివసించుచుండినట్లు నిదర్శనము లున్నవి.*

* కర్ణాటక దేశజులగు కవులుమాత్రమే కాదు. కళింగదేశజులగు కవులును పండితులును నాకాలమున విద్యానగరమున నుండినట్లు నిదర్శనములు గన్పించుచున్నవి. సంగీతసూర్యోదయ గ్రంథకర్త లక్ష్మీనారాయణుని తండ్రియగు విట్ఠలామాత్యుడు లొల్ల లక్ష్మీధర పండితునివలె కటకమునుండి విద్యానగరమునకు వచ్చినట్లు తెలియుచున్నది. అతడొక గొప్ప విద్వాంసుడు. స్వపాండిత్యప్రకర్షముచేత కటకాధిపుడగు గజపతిని మెప్పించి కనకఘంటలు గొనెనట. ఈవిషయము లక్ష్మీనారాయణునికి భానుకవి యంకితమిచ్చిన 'పంచతంత్రి' యందిట్లు చెప్పబడియున్నది.

"గజపతి మెప్పించి కనకఘంటలుగొని విద్యాప్రవీణత వినుతికెక్కి"

ఇందువల్ల రెండువిషయములను గనమెఱుగుచున్నాము (౧) లక్ష్మీనారాయణుని తండ్రి గజపతి నాశ్రయించియుండిన విద్వాంసుడు (౨) లొల్ల లక్ష్మీధర, విట్ఠలామాత్యాది పండితబృందముచే నిరంతరము సేవితుడైన గజపతి "ప్రతాపరుద్రుడు" కృష్ణరాయలతో సముడగు విద్వత్ప్రభువు.

వారెవ్వరును అచ్యుతుని కొక్క గ్రంథమునైనను నంకితము సేయకుండుటకు గారణమేమో! రాజానుగ్రహము చేదగుటవల్లనా? లేక రాజునకు భాషయం దభిమానము లేకపోవుటవల్లనా? ఈ రెండును కారణములు గావని యచ్యుతాభ్యుదయములోని,

శ్లో. కర్ణాటయామ్యస్యనిద్భిః కావ్యబన్ధైః
కాలక్షేపం కల్పయన్తం కవీంద్రైః॥

అను శ్లోకపాదములవల్ల తెలియుచున్నది. ఇట్లు కవీశ్వరుల గోష్ఠియందు కాలక్షేపము సేయగోరు ప్రభువు కవీశ్వరులను గ్రంథములను రచించుడని ప్రోత్సాహము సేయకుండునా? ఈ ప్రశ్నకు దగుసమాధానము నిచ్చుటకు రాధామాధవకవి గొంత దోడ్పడుచున్నాడు. తారకబ్రహ్మ రాజీయములోని యీ క్రింది వచనమునుదిలకింపుడు.

వ॥ "అమ్మహీశ్వరుండు (నంజవిభు-తిమ్మరుసు) ఒక్కనాడు చతుస్సముద్రముద్రిత మధ్యభూభువనసింహాసనాధీశ్వరుం డగునచ్యుతదేవరాయలకొలువు చేసివచ్చి నిజనివాస భాసుర చంద్రశాలాప్రాఙ్గణ మణిమంటపంబున విజయనగర రాజధానిం గలబంధువర్గంబులును విద్వత్కవీంద్రులును వందివాగధవారకామినీ నికరంబును సముచితప్రకారంబున సేవింప సుఖగోష్ఠిం బ్రవర్తింపుచు నిజస్వామియగునచ్యుతదేవరాయలు ప్రతిసంవత్సరంబు శ్రీవెంకటేశ్వరునకు సత్కావ్య ప్రబంధపుష్పాంజలిసమర్పించుచు గీర్తిసుకృతంబుల నిర్వహించుకొనుచున్నవాడు తదనుమతంబు నవ్విభునకు నాకు నభ్యుదయపరంపరాభివృద్ధియు జతుర్విధపురుషార్థసిద్ధియు నగునట్లుగా నాయిష్టదైవంబగు శ్రీరామవిభునకు నంకింతంబుగా నొకపుణ్యప్రబంధంబు చెప్పింపవలయునని".

ఇందువల్ల కృష్ణరాయలవలె నచ్యుతరాయలును కవిజనతోషకుడును పోషకుడునై యుండెనని తెలియవచ్చుచున్నది. ఈమహారాజు పదునాలుగేండ్లురాజ్యము జేసెను. పదునాలుగు "సత్కావ్యప్రబంధ" ములను వ్రాయించెను. అందొక్కదానినైన దనకంకితము జేయించుకొనక పరమభక్తాగ్రేసరుడగుటచే నాయుద్గ్రంథంబులనుదాగొల్చిన శ్రీ వేంకటేశ్వరునకు నంకితము జేయించి, సత్కావ్యప్రబంధపుష్పాంజలి సమర్పించితృప్తినందినాడు. వెంకటేశ్వరులకు సల్పినట్లె, ఆంధ్రభాషామ తల్లికిని సేవలు సల్పినాడు. అట్టి వాడాంధ్రులకు చిరస్మరణీయుడుగదా!

---

## మార్చినెల భారతిలోని 'రామస్తవము' నందలి సవరణలు :

---

1. 'రామా! నిన్నెదకోటలోనిలిపి' అను పద్యములో 'రోమాంచదద్వయ' 'రోమాంచాద్వయ'గా దిద్దుకొనుడు.
2. 'శివు డారాముడు నేనటంచు' అను పద్యములో, మూడవ చరణము తుదిని 'నీ' అను అక్షరమును జేర్చుకొనుడు.

# శారదాకాంచిక షష్ఠకింకిణీ—ఆంధ్ర వ్యాకరణసర్వస్వతత్త్వము

## కళాప్రపూర్ణ, మహోపాధ్యాయ, వేదము - వేంకటరాయశాస్త్రి గారు

### అవతారిక

ఆంధ్రవ్యాకరణ సర్వస్వమను పేర ఆంధ్రప్రపంచమునకు విక్రమసింహపురంబున ఇప్పుడు కనుపట్టిన చెట్టకు శాంతిచేయవలసి వచ్చినది. గ్రంథకర్తకు అప్రియము గావించుట మదీప్సితము గాదు. ఆంధ్రవిద్యార్థిలోకమునకును, తన్మూలముగా ఆంధ్రభాషాదేవతకును ఇంత యెగ్గు గలిగించు వ్రాఁత ఇంతవట్టుకు మఱియొకటి లేనందున దీని యీవిమర్శచేత ఆంధ్రభాషాదేవతను సేవించుచున్నాఁడను.

ఈ వ్యాకరణము క్రమము తెలియకయు, ఆవశ్యకానావశ్యక వివేచనంబును, సాధ్వసాధు భేదజ్ఞానంబును లేకయు, పూర్వవ్యాసకర్తల బుద్ధిప్రభావమును గననేరకయు, గ్రంథకర్త సంకలనము జేసినట్టిది. 'సర్వస్వ' నామముచే నీపాత్తము అష్టాధ్యాయివంటిదని భ్రమగలుగుచున్నది; ఇందు హలంతప్రకరణమును సర్వనామప్రకరణమును ఇట్టివి ఎన్నియో లేవు. అట్టి దీనిని సర్వస్వమనుట వట్టి యాడంబరము. దీనికి ఇంగ్లీషునం బెట్టిన పేరు ఇంతకన్న ఉచితముగా నున్నది. ఏలయున, ఇందు మౌలికవిషయములకు ఇంచుకంత దిక్ప్రదర్శనము కలదు. ఇట్లు పరస్పరవిపరీతార్థములయిన పేర్లు రెండు భావలయం దిడుకొనుట పటమున ఒక ప్రక్కను సింగము నరునింజీల్చుచున్నట్లును, రెండవప్రక్కను నరుఁడు సింగమును మడియింపుచున్నట్లును, చిత్రించిన చమత్కారముం దలఁపించుచున్నది. ఈ సర్వస్వమును కష్టపడి విశ్వాసపూర్వకముగా పఠించు విద్యార్థులకు ఇఁక నీజన్మములో తెనుఁగున జ్ఞానము కుదురదు. ఈశ్వరకృపచే అసాధారణ కారణములు కలిగినందప్ప దీనిఫలనం గలుగు దోసఁగులు సమయవు.

"కర్తా కారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః;
సుకృతే దుష్కృతే చైవ చత్వారః సమభాగినః"

అనెడి యభియుక్తోక్తిబడి ఈ గ్రంథమును విద్యార్థులకు పఠనీయముగా నియమించు విద్యాధికారులును, దీనిని నేర్పెడి యొజ్జలును, ఉపకారము చేయంగడంగి యపకారము చేసినవారగుదురు. త్రికరణశుద్ధిగా విద్యాపోషణ కావింపలేని విద్యాధికారులు 'విద్యా + అధికారులు' గాక 'విద్యా + అధిక + అరులు' అగుదురు. కావున అట్టివారెల్ల నా కావించుచున్న యీ సేవ నంగీకరించి నన్ను కృతార్థుం జేయుదురు గాక.

మదీయ విమర్శమే పొరఁబాటై, ఈ వ్యాకరణమే సాధువైనయెడల అట్లగుటయే నాకు కరము సంతోషకరము. అట్లుగాక వారి గ్రంథమే పొల్లయి నా విమర్శయే సాధువగునేని అది నా తప్పిదము కాదు గావున అందులకై వ్యాసకర్తగారు నాపై గంటు వహింపకుందురు గాక.

ఈ విమర్శనగ్రంథమును ఆస్థతో గ్రహించి ధరించు విద్యార్థులు ఆంధ్రవ్యాకరణ విషయమున ప్రమాణపదవి నలంకరింతురనుటకు సందేహము వలదు.

* దీనిని వెనుకటిసంచికయందు ప్రకటించిన వ్యాసభాగమునకు పూర్వము చేర్చుకొనవలెను.

—సంపాదకుడు. భారతి.

# ప్రాచీనాంధ్ర వార్తాపత్రికలు (1849—1875)

నిడుదవోలు వేంకటరావు గారు, బి. ఏ.
[ఆంధ్రగీర్వాణ సాహిత్య సమ్మేళనము]

౧. వర్తమానతరంగిణి—క్రీ. శ. 1849 లో నీపత్రిక చెన్నపురమునఁ బ్రకటింపఁ బడుచున్నట్లు బ్రౌను దొరవారు తమ మిశ్రనిఘంటు 1 వం దిట్లు వ్రాసియున్నారు: "గిన్నెకాసు...A gold coin formerly in use worth (Rs. 17—8—0) five pagodas. See వర్తమానతరంగిణి, newspaper of 4th January, 1849, in a list of coins.

పై బ్రౌనుదొరవారి వ్రాతయే గాక 'ఆంధ్ర భాషాసంజీవని' 'వివేకవర్ధని' మొదలగు పత్రికలు వర్తమానతరంగిణి నెంతయుఁ బ్రశంసించినవి. కావున నాంధ్ర దేశమున మిక్కిలి వ్యాప్తిని జెందిన ప్రాచీనపత్రికలలో నీపత్రిక యొకటియని తెలియుచున్నది.

౨. శ్రీయక్షిణి—ఇయ్యది బళ్లారిపురమునందలి పక్షపత్రిక. దీనిశైలి మనోహరముగ నున్నదని వివేకవర్ధని పత్రికాధిపతులు వ్రాసిరి. ఈ పత్రికను క్రీ. శ. 1868 సంవత్సరమున 'తత్వబోధిని' 2 పత్రిక పేర్కొనుటచే నంతకుమును దీపత్రిక వ్యాప్తిలో నున్నట్లూహింపఁదగును.

3. హితవాది:—ఈ పత్రిక బందరుపురమున శివరెండు షర్కీదొరవారివలనఁ బ్రకటింపఁ బడుచుండెను. ఈ దొరవారు సుప్రసిద్ధ క్రైస్తవమతాచార్యుఁడును, నోబిలుకళాశాల సంస్థాపకుఁడును నగు నోబిలుదొరవారికి సహాయుడుఁగా నుండి, ఆంధ్రభాషాపాండిత్యము సంపాదించి, యీపత్రికకు సంపాదకుఁడయ్యెను. ఈతఁడు క్రీ. శ. 1867 లోఁ గీర్తిశేషుఁ డైనకతన నీపత్రిక యంతకుముందే ప్రకటితమగుట నిశ్చయము. ఈ పత్రికను 1868 న తత్వబోధిని పేర్కొనుటచే నిదియు కొంతవఱకు వ్యాప్తిలోనున్నట్లు తెలియుచున్నది. వెండియు క్రీ. శ. 1872 వ సంవత్సరమున దీనిఁ బునరుద్ధరించినట్లు తెలియుచున్నది. 3

౪. తత్త్వబోధిని—ఈపత్రిక క్రీ. శ. 1865 నుండి చెన్నపురి వేదసమాజమువారిచే మాసమునకొకతూరి ప్రకటింపఁ బడుచుండెను. ఇయ్యది ప్రథమమున వేదసమాజప్రదర్శికగ నుండి యాపై బ్రహ్మసమాజప్రదర్శిక యైనది. ఇందు ఋగ్వేద సంహిత కొంతభాగము స్వరయుక్తముగ నాంధ్రభాషా వివరణసమేతముగ ప్రకటింపఁబడియున్నది. మఱియు 'పరమాత్మస్వరూపము, పరిశుద్ధాస్తిక మతస్వరూపము' మొదలగు వేదాంతవిషయికోపన్యాసములును, 'శతావధాన వివరణము' మొదలగు భాషావిషయికోపన్యాసములును నిందు ప్రకటింపఁబడినవి. ఈ పత్రికయందలి స్త్రీ పునర్వివాహవిషయకోపన్యాసములు తమ కెంతయో యుపయోగించినట్లును, నీపత్రికశైలి 'రుచిరఫణితి' నున్నట్లును కీ. శే. వీరేశలింగము పంతులవారు వ్రాసియున్నారు.

౫. సుజనరంజని (1865). ఈ పత్రిక సుప్రసిద్ధ పండితులగు శ్రీమాన్ వింజమూరి కృష్ణమాచార్యులు గారు, బహుజనపల్లి సీతారామాచార్యులుగారు మొదలగు వారలచేఁ జెన్నపురమున రెండేండ్లు ప్రకటింపఁ బడెను. ఈ పత్రికాప్రాముఖ్యము తత్వబోధినియందలి యీక్రింది వాక్యములచేఁ దెలిసికొనవచ్చును: "ఇది యింగ్లీషునందు జర్నల్ ఆఫ్ ఎడ్యుకేషను వంటిదైనను భాషాపరిజ్ఞానము నభివృద్ధిని బొందించుటయందు దానికంటెఁ బలుమడుంగులు మేలుగా నాంధ్రమందు ఈ సుజనరంజని యొప్పుచుండెను. దీని విశేషప్రయోజనము ఆపత్రికను జూచువాండ్రకెల్లఁ దెల్లంబు గనుక నిట దానిం బట్టి వక్కాణించుట యావశ్యకంబు గాదు. ఇది యీలాగు నిలిచిపోవుట త్రిలింగదేశస్థుల దౌర్భాగ్య మనుకొనవలయునుగాని వేఱుగాదు. ఇటువంటి పత్రికను మరల నే పుణ్యాత్ములైనఁ దలయెత్తనిచ్చి లోకులు హర్షమొంద నుద్ధరించిరేని వారికీర్తి యాచంద్రార్కతారకంబై వెలయును. మనబోంట్లందఱు నాయువ్పర్యంతము కృత

1. Dictionary of Mixed Telugu—C. P. Brown (1854), page 25.
2. తత్వబోధిని విభవసం॥ వైశాఖ బ ౧౫, 8వ సంపుటము 7 వ సంచిక 20 పుట.
3. మచిలీ బందరుచరిత్రము-మామిడి సారంగపాణికృతము, 21st May, 1879, బందరు, స్వధర్మప్రకాశినీ ముద్రాక్షరశాల, pages 74 & 102.

ఝులై మెలంగుదుము." మఱియు నీపత్రికను నముద్రిత గ్రంథచింతామణి పత్రిక పేర్కొనినది.

౬. దినవర్తమాని: ఇయ్యది చెన్నపురమున క్రైస్తవమతాచార్యులచే వారమున కొకతూరి, యనఁగాఁ బ్రతి శనివారముసాయంతనమునఁ, బ్రకటింపఁ బడుచుండెను. ఇది క్రీ.శ.1868 నుండి క్రీ.శ.1872 వఱకు నాలుగేండ్లు వర్ధిల్లిన ట్లాంధ్రభాషా సంజీవనివలనఁ దెలియుచున్నది.

౭. స్వదేశజనప్రసిద్ధాభిప్రాయము: ("Native Public Opinion) ఇదియును జెన్నపురి పత్రికయే. ఇదియంతయు నాంగ్లేయభాషలో నున్నను రెండుపుటలు మాత్రము తెలుగుభాషను వెలువడు చుండెడివి. ఆరెండుపుటలుగూడ క్రీ.శ.1870లో నాపివేయబడినవి.

౮. గోదావరి విద్యాప్రబోధిని—ఈపత్రిక క్రీ.శ. 1870 వ సంవత్సరమునకుఁ బూర్వము వ్యాప్తిలో నున్నట్లు వీరేశలింగం పంతులువారు వివేకవర్ధనిలో వ్రాసినారు. మఱియు నీపత్రిక వీరేశలింగ కవిచరిత్రమునఁ బేర్కొనం బడినది.

౯. ఆంధ్రభాషా సంజీవని—ఆంధ్రవార్తాపత్రికలకు సంజీవని యని చెప్పఁదగిన యీపత్రిక మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారిచేఁ జెన్నపురమున క్రీ. శ. 1871 నవంబరు తే ౨౮ ది నుండి ప్రకటింపఁ బడినది. పంతులవా రీపత్రికను ప్రథమున 1883 వఱకును పండ్రెండేండ్లు ప్రకటించి, తిరిగీ క్రీ. శ. 1892 లోఁ బునరుద్ధరించి క్రీ. శ. 1899 వఱకును ప్రకటించిరి. ఈపత్రికఁగూర్చి వారు తమ బిల్వేశ్వరశతకము నందిట్లు చెప్పియున్నారు:—

మ. ధరణిన్సజ్జనులెల్ల మెచ్చ ననవద్యంబా ప్రజోత్పత్తి వ
త్సరమందు న్విజయాదిరాఘవకృప న్సంజీవనీనామవి
స్ఫురితం బై నిడ మాసపత్రిక యదింపుం బెంచి పం
డ్రెండు వ
త్సరము ల్నిండఁగనంతరించె జగదీశా బిల్వనాథేశ్వరా.

శా. శ్రీమన్నందనవత్సరాదిగ వికారి న్భాద్రమంతంబుగా
దామోదమ్మున వెండియుంజిగిరిచెన్ దైవారసంజీవనీ
నామాఢ్యంబదిమాసపత్రిక సుధీనంద్యంబుతైలింగభా
షామాన్యంబుత్వదీయసన్మతిహిమశాబిల్వనాథేశ్వరా.

ఆంధ్రదేశమున నీపత్రిక కత్యధికవ్యాప్తి గల్గినకతన నీపత్రికయే వార్తాపత్రికలలోఁ బ్రథమమని మనవారిలో నభిప్రాయములు పొడసూపినవి. మఱియు నీపత్రిక వలనే ప్రాచీనాంధ్రవార్తాపత్రిక లెన్నియో మనకుఁ దెలియుచున్నవి. వాని నీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను: ఇవియన్నియు సంజీవని తరువాతివి—

| నంబరు | పేరు | స్థాపింపబడిన సం॥ | వెలువడిన స్థలము |
|---|---|---|---|
| ౧ | పురుషార్థప్రదాయిని | 1872 | బందరు. |
| ౨ | స్వధర్మప్రకాశిని | 1873 | బందరు. |
| ౩ | లోకరంజని | 1874 | చెన్నపురి. |
| ౪ | బ్రహ్మాండరంజని | 1874 | చెన్నపురి. |
| ౫ | వివేకవర్ధని | 1874 | రాజమహేంద్రవరము. |
| ౬ | సుధీరంజని | 1874 | కాకినాడ. |
| ౭ | విద్వన్మనోహారిణి | 1874 | నరసాపురము. |
| ౮ | సకలవిద్యాభివర్ధని | 1875 | విశాఖపట్టణము. |
| ౯ | స్వదేశి | 1875 | బరంపురము. |
| ౧౦ | భారతి | 1875 | బళ్లారి. |

పైపత్రికలలో పురుషార్థప్రదాయిని, స్వధర్మప్రకాశిని, వివేకవర్ధని, సుధీరంజని, సకలవిద్యాభివర్ధని మొదలగు పత్రికలు మిక్కిలి వ్యాప్తిలో నుండి భాషావాఙ్మయాభివృద్ధి కెంతయో తోడుపడినవి. వీని నొక్కొకదానిఁ గూర్చి విశేషించి వ్రాయదగి యున్నను విస్తరభీతిచే విరమించుచున్నాఁడను.

సమగ్రమగు నాంధ్రవాఙ్మయ చరిత్రమును రచించుటకుఁ బ్రయత్నములు జరుగుచున్న యీకాలమునందు వాఙ్మయము నందలి వివిధశాఖల చరిత్రములను తొలుదొలుత తెలిసికొనుట యత్యావశ్యకము. అధునాతనాంధ్ర సారస్వతమునందలి ముఖ్యాంగమగు నీవార్తాపత్రికలఁ గూర్చి వ్రాయువారికి పైని వివరించిన పట్టిక కొంతవఱకైన నుపకరింపక పోవదనుతలఁపున దీని వ్రాసినాఁడను. విజ్ఞులు నెఱసు లున్న క్షమించెదరని నమ్ముచున్నాఁడను.

# మైసూరు పురాతన శిల్పకళ



"సౌందర్యము శాశ్వతానందము"

౧

మైసూరు చరిత్రములో, క్రీ. శ. పండ్రెండు పదుమూడు శతాబ్దములు రెండును 'శిల్పయుగము' అని చెప్పవచ్చును. హోయిసలరాజులు తమ రాజ్యమునందంతట–నేటి మైసూరు రాజ్యమున చాలభాగము హోయిసలరాజ్యము–జగద్విఖ్యాతములగు దేవాలయముల నెన్నిటినో గట్టించిన కాలమిదియే. అసాధారణమగు శిల్పసౌందర్యము గల యీ దేవాలయములు హిందూదేశపు మధ్యయుగ శిల్పప్రపంచమున నగ్రస్థానము బడసినవానిలో జేరినవై యున్నవి. హోయిసలులకు బూర్వమీ ప్రాంతము బాలించిన చాళుక్యుల కాలముననే ద్రావిడ బౌద్ధ శిల్పములు పెంపందుచుండినవి. ఈ రెంటిసమ్మేళనముచే నేర్పడి, యీ రెంటియొక్క సాగమై, ప్రత్యేక వ్యక్తిత్వము గలిగియుండిన మరియొక శిల్పమునకు జెందినవి మన యీ మైసూరు దేవాలయములు. ఈ మూడవ శిల్పమునకు చాళుక్యశిల్పమని ఫెర్గూసన్ పేరిడియున్నాడు. కాని యతని తరవాతి చరిత్రకారులు ఈ యభిప్రాయముతో నేకీభవింప లేదు. ఏకీభవింపక పోవుటకు దగినకారణముల కవకాశమున్నది కూడను. 'హోయిసలశిల్ప' మని ప్రత్యేకముగ దీనిని బిలువదగునని వారి యభిప్రాయము. అట్లే నేడది యెల్లరచే నంగీకరింపబడుచున్నది.

ఈహోయిసల శిల్పము భారతదేశములోని యితర ప్రాంతముల శిల్పముతో గొంతవరకు పోలికగలిగియున్న మాట నిజమే. అట్లయ్యు దానికి విస్పష్టములగు ప్రత్యేక లక్షణములు గలవు. ఈ ప్రాంతముల నివసించెడి కన్నడుల విజ్ఞాన సంప్రదాయములతో, ప్రజ్ఞావిశేషముతో దానికి ప్రత్యక్షసంబంధము కలదు. హోయిసల శిల్పమునకు కన్నడదేశమే జన్మస్థానము; కన్నడదేశమే నివాసస్థానము. అందుచే దానిని గర్ణాటక శిల్పమనియు బిలువవచ్చును.

ఈ హోయిసలపద్ధతిని గట్టబడిన దేవాలయములన్నియు–ఇంచుమించు నూరువరకుండును–మైసూరు రాజ్యములోనే యచ్చటచ్చట నన్ని ప్రాంతములయందును గలవు. వీనిలో గొన్ని శైవాలయములు, కొన్ని వైష్ణవాలయములు, మరికొన్ని జైనదేవాలయములు. ఇవి యన్నియు హోయిసల శిల్పముయొక్క ఆయాకళలను విశదపరచుచున్నవి. కాని వందలకొలది యేండ్లు నిర్దయమగు కాలచక్రము క్రింద బడి, నిర్దళితమై కాలచక్రమునకు మాన

వుడు గూడ తోడైనాడు–శిల్పము నలిగిపోయి, నేడా యాలయములు చాలవరకు శిథిలములై చెల్లాచెదరుగ బడి యున్నవి. లేక చాల భాగము రూపుమాసి యున్నవి. ఇంక, శుభ్రముగ బాగుపరచుటకు దగినవి, ఆ శిల్పమున కుదాహరణములుగ నుండ దగినవి, యే కొద్దిగనో మాత్రము కలవు. ప్రపంచమునందలి యసమానములగు శిల్పవస్తువులలో జేరినవని ఫెర్గూసన్ మూలమున పాశ్చాత్య ప్రపంచమునందెల్ల విఖ్యాతిగడించిన యీ దేవాలయములు హోయిసలులచే నిర్మింపఁబడినవి. హోయిసలులు మొదట జైనులుగ నుండి యటుపై వైష్ణవులైనారు. కాని వారి కాలముననే నిర్మింపబడి ఆయా దేవతల కంకితములై యున్న యీ దేవాలయము లన్నియు హోయిసల రాజుల పరమతసహనమును స్పష్టముగ జాటుచున్నవి.

ద్వారసముద్రము(హలెబీడు)లోని హోయిసలులు మొదట రాష్ట్రకూట, చాళుక్యరాజులకు సామంతులుగ నుండెడివారు. శశకపురము, లేక, సొసెవుర్ వీరి యాదిమ నివాసస్థానము–ఇదియే పడపటికనుమలలోని అంగది యని నేడు తలపబడుచున్నది. ‘శలుడు’ అనునతడే హోయిసలరాజ వంశమునకు మూలపురుషుడు. హోయిసల నామమును గూర్చి యీక్రిందికథ ప్రచలితముగనున్నది. “తన కులదేవతయగు వాసంతికాదేవిని సేవించుటకై శలుడొకనాడు శశకపురారణ్యమున నున్న యా దేవియాలయమునకు బోయెను. ఆసమయమున నొకపులి యడవినుండి వెలువడిభీకరగర్జారవములతో నాలయము దెసకు లంఘించి పడినది. ఇంతలో నచ్చటి యర్చకుడొక ‘శలాక’ (ఇనుపకడ్డీ)దీసి కన్నడభాషలో ‘హోయ్, శల’ (ఓశలుడా! పొడువుము.) అని చెప్పుచు దాని నాతని కొసంగెను. శలుని ప్రయోగనైపుణిచే నాపులి యాక్షణమ నేల గూలినది. అటుపై నతడు ‘హోయిసలు’డని తన పేరు మార్చుకొనెను.” అనంతర మాతని వంశము హోయిసల వంశమయినది. నాటినుండి హోయిసలుల పతాకచిహ్నము పెద్దపులి. హోయిసలుల రాజధాని యగు ద్వారసముద్రమును 1010 సం. (?) శలుడే కట్టించెను. అందుండియే యతని వంశమువారు మూడువందలయేండ్లకు పైగ రాజ్యమేలిరి. హోయిసలులలో నెల్లగొప్పవాడు విష్ణువర్ధనుడు. నామమాత్రముగ నతడు చాళుక్యుల చక్రవర్తిత్వము నంగీకరించినను పూర్తిగ స్వతంత్రుడయ్యెననియే చెప్పవచ్చును. తాను జైనమతము వీడి వైష్ణవము స్వీకరించినట్లు తెలియజేయుటకై యతడు క్రీ. శ. 1117 సం॥న బేలూరులోని కేశవదేవాలయమును గట్టించెను. దొడ్డగొడ్డవల్లిలోని లక్ష్మీదేవి యాలయము బహుశః ఇతడు కట్టించిన యాలయములలో మొదటిదై యుండవచ్చును. ఇది క్రీ. శ. 1113 సం నాటిది. ఇతని యేలుబడి తుదివర్షములలో, క్రీ. శ. 1133 సం న గట్టింపబడినది హాలేబీడ్ (Halebid) లోని ‘పార్శ్వనాథబస్తీ’ యను జైనదేవాలయము. క్రీ. శ. 1141 సం॥లో నిర్మింపబడిన హాలేబీడ్‌లోని హోయిసలేశ్వరాలయము విష్ణువర్ధనుని కుమారుడు, నతని తరువాతి యేలికయు నగు మొదటి నరసింహుడు కట్టించినది. నరసింహుని కుమారుడగు వీరబల్లాలుడు (ఇతడే రెండవబల్లాలుడు) కేదారేశ్వరాలయమను మరియొక దేవాలయము దనరాజధానిలో గట్టించెను. తన తాతయగు విష్ణువర్ధనునివలె నతడును మిగుల బరాక్రమశాలి. ఇతని కాలమున హోయిసలరాజ్యము చాళుక్య సామంతత్వము బూర్తిగ ద్రోసివైచి స్వాతంత్ర్యము సంపాదించినది. సోమనాథపురములోని కేశవాలయము క్రీ. శ. 1268సంవత్సరములో మూడవ నరసింహునిచే గట్టింపబడినది.

## ౨

ఈ పద్ధతికి జెందిన దేవాలయములు శిల్పప్రపంచమున, అల్పాంశములలో గూడ, సమగ్రమగు కళాప్రాచుర్యము గలిగియున్నవిగ బేరందినవి. వివిధములగు కళావిశేషములు, విస్పష్టమగు నొకఛాందికయు గలిసి యొక యద్భుతకళాకోశ నిర్మాణమునకు దోడుపడినవి. ఈ యాలయములపై జిత్రింపబడిన విగ్రహములు, పుష్పాదులగు నలంకారచిత్రములు “అన్నియు రాతిచెక్కడములన్నిటిలో సాటిలేని సౌందర్యము గల”వని చెప్పవచ్చును. శిల్పశాస్త్రప్రామాణికుడగు ఫెర్గూసన్, ఇట్లు చెప్పుచున్నాడు.

“తమ సమగ్ర సౌందర్యముచే ప్రపంచమునందెల్ల నత్యుత్తమములుగ జెప్పదగిన శిల్పనిర్మాణములు భారత

దేశమున ననేకములు గలవు. కాని భావనావిశేషమును బట్టియు, చిత్రణస్వాతంత్ర్యమును బట్టియు బేలూరు, హళెబీడ్ దేవాలయములు వానిని గూడ మించుచున్నవి."

చాలవరకీ దేవాలయములు ఇంచుమించుగ ఐదడుగుల యెత్తున నున్న నక్షత్రాకారము గల యున్నత ప్రదేశముపై నిర్మింపబడుచుండును. అందమైన యీ పైకట్టడము గూడ సాధారణముగ క్రిందిదాని యాకారముననేయుండి చుట్టును, ౧౧, ౧౫ అడుగుల ప్రాంగణముతో నొప్పుచుండును. కట్టడమునకు నలువైపులనుండు నాలుగు ప్రధానద్వారములును తక్కినవానికన్న పెద్దవి. వానిలో మూడు పెద్దపెద్దతలుపులు గలవి. నాల్గవది సింహద్వారము. ద్రావిడశిల్పము ప్రకారము కొన్నికొన్నిచోట్ల స్తంభములపై పెద్దపెద్ద క్రూరమృగములు చిత్రింపబడి యుండును. ఈ దేవాలయములయందలి స్తంభములట్లుకాదు. వీనిపై చాలవరకు చెక్కడపుబని తక్కువగనే యుండును. ఐనను, పనితనమును బట్టి యవి చిత్రితములై సరీతినే కన్పించుచు మిగుల స్నిగ్ధములై యుండును. సాధారణముగ నీ స్తంభములు జంటలు జంటలుగ జెక్కబడి ద్రావిడపద్ధతి ననుసరించి నాల్గుకలిసి యొకచోట నేర్పరుపబడి యున్నవి. భిన్నభిన్న స్వరూపములుగల యిట్టి స్తంభములను పెక్కింటిని మన మొక్క దేవాలయములోనే చూడగలము. సుందరములగు నీయాలయములకు అద్భుతావహము, నసామాన్యమునగు మరియొక లక్షణమున్నది. చిత్రితములగు రాతిపలకలు ఆలయపు గోడలలో నమర్చబడి యుండును. లోపలిభాగములకు వెలుతురు నిచ్చుటకివి కిటికీలవలె నుపయోగించుచున్నవి. "సుందరమగు నారేఖాసమ్మేళనము, ఆకృతిచిత్రణము, అలంకరణపైపుణి గోథిక్ (Gothic) శిల్పప్రపంచమున నప్రతిమానము. ఇట్టి సౌందర్యసమావేశనము మధ్యయుగమందలి శిల్పకళాభిజ్ఞుల కేరికి సాధింపరాని దానిని హళెబీడ్ నగరమునందు సమగ్ర స్వరూపమున బ్రదర్శింపగలిగినది."

హోయిసల దేవాలయములు పాలరాయి యంతటి నునుపు గలిగిన యొకవిధమగు నాపరాతితో గట్టబడినవి. గనిలోనుండి తీయునప్పు డీరాయి మిగుల మెత్తపడి యుండును, కాని, బయటికిరాగనే శీఘ్రముగ గట్టిపడిపోవును. రాళ్లను గాలిలో బాగుగ నారబెట్టిన పిమ్మటనే వానిపై చెక్కడపుబని నిర్వహింపబడి యుండుననుట స్పష్టము. సాధారణముగ మలచిన గొగ్గిరాళ్లతో నీ కట్టడములు నిర్మింపబడెడి వనియు ఆ నిర్మాణము పూర్తియైన వెనుకనే వానిపై బొమ్మలు చిత్రింపబడెడి వనియు దెలుపు సూచనలు నేటికి నెన్నియో గలవు. అతి విశాలమై, క్లిష్టమై, మిగుల సున్నితమైనశిల్పము ఈ యాలయములయొక్క వెలుపలిగోడల యలంకరణము నందును, లోపలనుండు గుమ్మటముల బోలిన శిఖరముల సరంబీలయందును ఎక్కువగ గానవచ్చును.

ఈ హోయిసల శిల్పమునకు జేరిన దేవాలయములను నాలుగు రకములుగ విభజింపవచ్చును. ఈ విభాగము అయా యాలయముల ప్రధానభవనము మంటపముల సంఖ్యను బట్టియుండును: ఏకమంటపములు, ద్విమంటపములు, త్రిమంటపములు, చతుర్మంటపములు. ప్రతిమంటపములోను ఒక గర్భగృహము, ఒక ముఖమంటపము నుండును. బేలూరిలోని చెన్నకేశవస్వామి యాలయము పైనజెప్పిన ఏకమంటపాలయముల కొక యుదాహరణము; హళెబీడ్‌లోని హోయిసలేశ్వరాలయము ద్విమంటపము; సోమనాథపురపు కేశవాలయము త్రిమంటపము; దొడ్డగడ్డవల్లి యందలి లక్ష్మీదేవి యాలయము చతుర్మంటపము. మొత్తముమీద హోయిసల దేవాలయములలో చాలవరకు త్రిమంటపములు, తరువాత ద్విమంటపాలయములు. ఏకమంటపములు, చతుర్మంటపములు చాల తక్కువ.

ఇప్పుడు మరికొంచెము విశేషముగ నీకట్టడములనుగూర్చి విచారించినచో, హోయిసలశిల్పమును గూర్చి యింతకన్న బాగుగ దెలిసికొనుట కవకాశము లభించును.

## పశువు - దేహనిర్మాణము

యేజెళ్ల శ్రీరాములు చౌదరిగారు

పశువుశరీరమును ఒక యింటితో సరిపోల్చ వచ్చును. ఇండ్లు కట్టుటకు మట్టి, ఇసుక, రాళ్లు, సున్నము, పెంకులు, కలపసామానులు, స్తంభములు, దూలములు, తలుపులు, కిటికీలు, మరియునేకవిధములగుసామాను లుపయోగ పడుచున్నవి. రక్తము, మాంసము, కండరములు ఎముకలు, కీళ్లు, చర్మము మొదలగునవి పశువు శరీరమునందుండు వివిధభాగములై యున్నవి. శరీరముయొక్క భారము మోయుటకు పైసామగ్రి యంతయు కావలయును. లేనియెడల పశువు నిలువ జాలదు. ఏబరువైనను మోయ జాలదు. అందుకొరకే పశుశరీరము నిలిచి యుండుటకై లోపల నొక యెముకలగూడు గలదు. ఈయెముకల చుట్టును మాంసకండరము లమర్పబడియున్నవి. ఇంకను శరీరభాగములు కదలగలుగుటకు నక్కడక్కడ కీళ్లును గలవు. ప్రతిమానవుడును, పశువు దేహమందలి ముఖ్య అవయవములను వానియుపయోగము లను తెలిసికొనవలెను.

### కన్ను

కండ్లు ఇంద్రియము లన్నిటిలో ప్రధానమైనవి. ఇవి పశువుముఖమునకు దిగువను, ముక్కురంధ్రములకు రెండు ప్రక్కల నుండు ఎముక గూళ్లలో (కనుగుంటలలో) అమర్పబడియున్నవి. వస్తువులయొక్క రూపమును, పరిమాణమును, రంగును, స్థానమును తెలిసికొనుట కుపయోగించు ఇంద్రియ మిదియే. ఇది మిక్కిలి మృదువైన ఇంద్రియ మగుటచే పశువు అజాగ్రత్తగా నున్నయెడల దీనికి భంగము కలుగును ఇది యొకసారి చెడిపోయినయెడల బాగుచేయుట దుర్లభము. కావున దీనిని కాపాడుటకు సృష్టియందే కొన్ని యేర్పాటులు చేయబడియున్నవి. కనుబొమ్మలు, రెప్పల చివరనుండు వెండ్రుకలు, కనురెప్పలు, నేత్రమును గాపాడును. కనుబొమ్మలు పశువునొసలుక్రిందగను, కంటికి పైనైపునను, ఏర్పడియున్న వెండ్రుకలవరుసలు. ఇవి ముఖమునకు అందము నిచ్చుటయేకాక నొసలునందు పుట్టు చెమటను కండ్లలోనికి రానీయకుండ కండ్లను కాపాడును. కనురెప్పలు కంటిలోనికి వెలుతురు చొరకుండ జేయుటకును, కంటికి దెబ్బ తగులకుండ గ్రుడ్లను మూయుటకును, కంటిలో దుమ్ము, పురుగులు మొదలగునవి రాకుండ చేయుటకును ఉపయోగించుచున్నవి.

### ముక్కురంధ్రములు

ముక్కురంధ్రములు వాసనను తెలిసికొనునట్టి ఇంద్రియములు. వీని పై భాగము ఎముకతో చేయబడియున్నది. పశువుముక్కురంధ్రములయొక్క లోపలి భాగము మిక్కిలి మెత్తని తడిచర్మముతో కప్పబడియున్నది. సాధారణముగా పశువులు పీల్చుకొనుగాలి ఈ భాగమందలి తడిచర్మమునకు తగులు

చుండును గాన బలమైన వాసనలు వానికి సులభముగా గోచరమగును. కాని అవి బలహీనముగా నున్న పుడు గాలిని లోపలికి గట్టిగా పీల్చినగాని వానికి వాసన తెలియదు. కుక్కలు ఇట్టిరీతిని పసిపట్టును.

నోరు

పశువుతిను ఆహారము నెత్తురుగా మారు పనియొక్క మొదటి భాగము నోటిచేత చేయబడుచున్నది. నోరు తినినదానిని గ్రహించి సులభముగా మ్రింగుటకును, జీర్ణమగుటకును అనుకూలముగా నమలి కడుపులోనికి త్రోయుచున్నది. ఈ కార్యము చేయుటకు పండ్లు, దౌడలు, నాలుక, ఉమ్మి, నీరు ముఖ్యసాధనములు.

నాలుక

ఇది కండరములతో నిర్మింపబడి దౌడలకు మధ్య నమర్చబడియున్నది. దీనియందు ఎముకలు లేవుగాన అనేకవిధములత్రిప్పుటకును చాపుటకును, ముడుచుటకును పశువునకు వీలగుచున్నది. గడ్డిమొదలగు పదార్థములు పశువు నమలునపుడు ఆయాపండ్లకు తగినపదార్థములను తన గరుకైననాలుకతో క్రింద పడ త్రోసికొనుట కనుకూలమైన సాధనమైయున్నది. నమలిన వెనుక నోటనున్న ఆహారమంతయును నాలుకయే ఒకటిగా కలిపి గొంతులోనికి త్రోయుచున్నది. రుచిని తెలిసికొనుటకు ఏవస్తువైనను నీటిలో కరగవలసియున్నది. కనుకనే పశువునాలుక ఎల్లపుడు తడితో నిండియుండును.

పండ్లు

పశువులు తిను ఆహారము కొఱుకుటకును, చించుటకును, నమలుటకును, తగిన రూపపరిమాణము గలవియై మిక్కిలి దృఢమైన సాధనములుగా చేయబడియున్నవి. ఈపండ్ల సహాయమున మేతను నమలుతఱి ప్రక్కదౌడలయందును, నాలుకక్రిందను నున్న ఉమ్మిగ్రంథులు వెలువరించు నుమ్మినీటితో నామేత తడియును. పశువు నమలునప్పుడు పండ్లనడుమనుండి జయటకు బడినవస్తువులను నాలుక తిరిగి పండ్లసందులలోనికి త్రోయును. ఈయుమ్మినీటివలన ఆమేత తడిసి త్వరలో మెత్తబడును. మరియు ఆతడిలో నుండు పిండి పదార్థములలోని గంజి వంటి భాగములు చక్కెరగా మాఱి జీర్ణమగును. ఆతడిముద్దయును సులభముగ ఆహారకోశములోనికి జారిపోవును. నెమరువేయు జంతువులకు మునిపండ్లు క్రింద తావుననే యుండును. ఎనిమిది పండ్లుండును. పైవైపున మునిపండ్లు లేకుండుటచేత నది తన యాహారమును క్రిందిపండ్లతోను, పై యిగుళ్లతోను బట్టి పెరుకును. అందువలన పశువు మేయునపుడు తల నాడించుచుండును. పశువు శరీరమునందుండు ఎముకలకంటె పండ్లు మిగుల కఠినమైనవి. ఇవి ఒకదానితో నొకటి రాచుకొనుటచేత అఱిగి పోకుండునట్లు చిగుళ్లకు పైన ఒకవిధమైన పూత గలిగియుండును. పశువునకు క్రిందను, మీదను 24 పండ్లు మాత్రముండును. ఈపండ్లను బట్టియే పశువు వయస్సు కనుగొనవచ్చును.

### ఆహారకోశము

నెమరు వేయుజంతువులయం దన్నాశ యను నాలుగుతిత్తులు గలదిగ నుండును. మొదటిది పెద్దతిత్తియందురు. పశువు అటు కొఱుగ మ్రింగినమేత మొదటి తిత్తిలోనికి బోవును. ఈతిత్తియొక్క లోపలిభాగమున ఒక విధమైన పొర లుండును. దీనిచేత తినినమేత ముక్కలుముక్కలుగా నగును. తరువాత నది రెండవ తిత్తిలోనికి జేరును. ఈతిత్తిలో చిప్పల వంటిగోతు లుండుటవలన మేత యంతయు నుండలుండలుగ నేర్పడును. పశువు నెమరు వేయుటకు కావలసిన ఆహారరసము దీనిలో చేరియుండును. ఇది పైతిత్తికంటె దళసరిగ నుండును. ఇంకను రాళ్లు, ఇనుపముక్కలు మొదలగు అన్యపదార్థములు ఈతిత్తిలో చేరి యుండును. పశువు తీరిక మైనప్పుడు మరల పై యుండల నొకటొకటిగ నోటిలోనికి దెచ్చు కొని మెత్తగ నమలి మ్రింగగనే మూడవతిత్తి లోనికి బోవును. ఈమూడవ తిత్తిలోనిభాగము కాగితములవలె పొరలుపొరలుగా నుండును. ఈపొరలకు ఒకవిధమైన సూక్ష్మజీవు లంటియుం డును. పూర్తిగా నెమరు వేయబడిన మేత ఈ తిత్తిలో జేరి బాగుగా జీర్ణమగును. తరువాత నాల్గవతిత్తిలోనికి బోవును. అచట నీమేత జీర్ణ మగుట కారంభించును. ఈ తిత్తిలోపలిభాగ మునందు ఎఱుపు రంగుగల ముడతలుండును. ఇచ్చట జఠరరసము ఉత్పత్తి యగుచున్నది. ఇది పుల్లగ నుండి రుచిగలిగించును. ఇంకను నీరు మొదలగు ద్రవపదార్థములు పశువు మ్రింగిన వెంటనే ఈతిత్తిలోనికి జేరును.

### ఆహారనాళము

ఇది గొంతుక ఎడమప్రక్కన నుండును. ఇది జాలరు సంచివలె నుండును. మేతనీరు దీని గుండా పొట్టలో చేరును. ఈనాళమునకు లో పలి పొరలో జిగురువంటి ద్రవమొకటి వెలు వడు చుండుటచేత పశువు మ్రింగినఆహారము సులభముగ నీనాళము పొడవునను దిగజారి పోగలుగుచున్నది. మరియు నీనాళములో నక్కడక్కడ కొన్ని గ్రంథులు గలవు. వానిలో నుండి జీర్ణక్రియ కనుకూలములైన రసము లూరుచుండును. వీనితో గలియుటచేత నే పశు వు తినునట్టి యాహార ద్రవ్యములు జీర్ణములగు చున్నవి. మరియు పశువు ఈనాళముగుండనే నెమరు తెచ్చుకొనును. దీనికిస్పర్శజ్ఞాన మధికము.

### కాలేయము

పై ఆహారనాళమునకు సంబంధించి జీర్ణ పద్ధతి కనుకూలించు నవయవములు గలవు. దానిలో నొకటి కాలేయము (కార్జము) పై యున్నది. ఇది పశువుకుడిడొక్కలో కుడిపై పున నుండును. ఇది తెలుపు రంగు కలిగి, దీని పైన కఠినమైన పొర క్రమ్ముకొనియుండును. ఇది రక్తమును గ్రహించి దానిలోనుండి పైత్య రసము అనుద్రవమును వెలువరించును. ఈ రసము పసుపురంగు గలిగిన ఆకుపచ్చగ నుం డును. ఇది పులుపు పదార్థములకు వ్యతిరేక గుణములను కలిగియుండును. ఈకాలేయము చేయుపని ఇంక నొకటి కలదు. విషపదార్థము లను పశువు మ్రింగినపుడు ఇది కాపాడి అట్టి పదార్థములు రక్తములో జేరకుండ నాశనము చేయును.

### ప్లీహము

దీనినే నెరడిగుండెయని చెప్పుదురు. ఇది కాలేయమునకంటె పలుచగ నలుపుగ నుండును. దీనిపైన బిగువైన తెల్లనిపొర గ్రమ్మియుండును. ఇది డొక్కలో ఎడమవైపున నుండును. ఇది మెత్తగా నుండి స్పంజివంటి పదార్థముచేత చేయబడియున్నది. పశువునకు దొమ్మ ప్లేగు మొదలగు విషసంకటములు సంభవించినపుడు ఆవిషము దేహమున కపాయము చేయకుండ ఇది కాపాడును. ఈకారణముచేతనే విషజాడ్యము తగిలి చనిపోయిన పశువు ప్లీహము ఉబ్బియుండును.

### ఊపిరితిత్తులు

ఇవి పశువులోపలిభాగమున కుడివైపున ఒకటియు, ఎడమవైపున ఒకటియు, పశువు ఎదలో నుండి పీకె రెండుగా చీలుచోట కలిసి ద్రవముతో కూడిన తెల్లని పొరచేత గ్రమ్ముకొని యుండును. పశువు గాలిని లోనికి బీల్చుకొనినపు డూపిరితిత్తులు పొంగి పెద్దవగుచున్నవి. తిరిగి యవి ముడుచుకొనునపుడు వానిలోనిగాలి బయటికి బోవుచున్నది. పశువు ఏదైనపని చేయునపుడు ఉచ్ఛ్వాసనిశ్వాసములు అతివేగముగా జరుగుచుండును. గాలిని లోపలికి పీల్చుట ఉచ్ఛ్వాసమనియు, బయటికి విడిచివేయుట నిశ్వాసమనియు చెప్పబడును.

### మూత్రపిండములు

ఇవి వెన్నుపూసలకు, నడి పూసలకు నడుమగ వెన్నెముకకు ఇరుప్రక్కలను, అనగా కుడివైపున నొకటియు, ఎడమవైపున నొకటియు, నుండును, ఈపిండములు మూత్రమును తయారు చేయును. మూత్రనాళములు మూత్రమును మూత్రపిండముల నుండి మూత్రాశయమునకు కొనిపోవు చుండును. మూత్రాశయము మూత్రమును కూడబెట్టి కొన్నిసమయములందు బయటకు పంపును. మూత్రనాళములు మూత్రాశయపు గోడగుండ ఏటవాలుగా ప్రవేశించును గాన మూత్రమెల్లపుడు బొట్లుబొట్లుగా ఉచ్చబుడ్డ లోనికి జారుచుండును. మూత్రములో కనబడు అనేక పదార్థములు రక్తములో నున్నవే. ఇవి నీటితోకలసి మూత్రముగా మారుచున్నవి.

### చర్మము

జంతువుల శరీరము మీది చర్మములకు తోళ్లని పేరు. ఈచర్మమే దేహమునకు ఆకారము నిచ్చుచున్నది. చర్మముక్రింద క్రొవ్వు గలదు. ఇది శరీరమునకు నునుపు గలుగజేయుచున్నది. చర్మములో రెండు పొరలు గలవు. పైపొర చాల పలుచనిదైనను లోపలి పొరను భద్రముగా కాపాడుకవచము వంటిది. చర్మము రక్తమునందలి మలినపదార్థములను వెలుపలికి పంపివేయును. దీనికి రబ్బరువలె సాగెడి శక్తి అధికముగా కలదు. పశువుచర్మము నునుపుగానుండును. భూతదర్పణముతో దీనిని పరిశీలించిన దాని మీద అనేకములగు రంధ్రములు కనబడును. ఈరంధ్రములగుండ పశువు కష్టపడి పనిచేసినపుడు చెమట పైకుబుకుచుండును. ఆరోగ్యమగు పశువు చర్మము అంత కఠినముగను, అంత మృదువుగను ఉండక దృఢముగా నుండును. ఇంకను అది వెచ్చగను, కొంచెము తేమగను, నున్నగను, మెత్తగను నుండును.




## కిష్కింధ పంచవటీ స్థలనిర్ణయము

ఇంతనుగురించి భారతి మాఘసంచికయందు నేను వ్రాసినదానిని విమర్శింపుచు గో. రామదాసుగారు చైత్ర సంచికలో వ్రాసియున్నారు.

కిష్కింధ నర్మదానది కుత్తరమునగల వింధ్యపర్వతముల నడుమనుండునని నేను వ్రాసియుంటిని. వింధ్య పర్వతములకు కూడ నుత్తరమున గలదని వారు వ్రాసియున్నారు. భేద మతిస్వల్పము. వారియభిప్రాయమే సరియైనదిగా కన్పించుచున్నది

పంచవటి కిష్కింధ కుత్తరమున గలదని వారు వ్రాసినది యీక్రింది రెండుకారణములను బట్టి పొరబాటనియు తిరుగ విమర్శింపుడనియు వారిని కోరుచుంటిని.

### కారణములు

1. పంచవటి గోదావరీతీరమున గలదని ఆరణ్యకాండయందు మూడుచోటుల చెప్పబడియున్నది. వింధ్యమునకు దక్షిణమున గల గోదావరి కిష్కింధకు కూడ నుత్తరమున నెట్లుండును? పంచవటిగోదావరీ తీరముననే యుండవలయును.

2. రామదాసుగారు వ్రాసినటుల రామలక్ష్మణులు పంచవటినుండి గాని, క్రౌంచాటవినుండిగాని పంపనుండిగాని కేవలము దక్షిణమున కరిగి రనుట రామాయణమున కానరాదు. పంచవటి నుండి నైఋతిగా 3 క్రోశము లరిగి క్రౌంచాటవిని, అటనుండి తూర్పుగా 3 క్రోశములరిగి కబంధుని, అటనుండి పడమరగా నరిగి పంపనూ కనిరని రామాయణమున కాన్పించుచున్నది. పంచవటి నాసిక ప్రాంతమందలి గోదావరీతీరమైనయెడల పై దిశలవివరణము నిందు కనుగుణముగా సమర్థింప వీలుపడును.

[కొచ్చర్ల కోట వెంకట్రామయ్య]



డా. బాల్

జెర్లినులోని మొదటి స్త్రీ 'న్యాయాధిపతి.' ఈమె పలనే యీపదవిని గాంచినది.

### విమర్శచంద్రిక

౧

నంద్యాలపురమున జరిగిన ఆంధ్రమహాసభలో శ్రీ చిలుకూరి వీరభద్రరావు గారికి ఆంధ్రచరిత్రచతురానన బిరుదము నొసంగి, ఆంధ్రులు సుప్రసిద్ధచరిత్రకారుని సత్కరించి, తాము ధన్యులైరి. శ్రీ వీరభద్రరావుగారు తమ ప్రథమచరిత్రగ్రంథమైన 'జీర్ణకర్ణాటరాజ్య చరిత్రము వ్రాసి ఇప్పటికి ముప్పదేండ్లయినది. నాడు మొదలు వా రాంధ్రచరిత్రమునకు రాచబాటవైచి, దుర్గమమగు చరిత్రనిబంధనమార్గమును సుగమమును జేసిరి. ఆంధ్రోద్యమమునకు, ఆంధ్రపత్రికతోబాటు వారి ఆంధ్రుల చరిత్రయు జేయూత నొసంగెను. ఆంధ్రవిశ్వవిద్యాలయము రాధాకృష్ణయ్య, వెంకటరత్నము నా

యుఁడు, వెంకటరాయశాస్త్రిగార్లను గౌరవించి, వారికి సద్బిరుదముల నొసంగెను. శ్రీ వీరభద్రరావు గారిని, చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి గారిని, మఱచినది. ఈ సంవత్సరమున జరుగఁబోయెడి పట్టప్రదానోత్సవము నందైనను నీ కొఱత నాంధ్ర విశ్వవిద్యాలయము తీర్చుకొనును గాక.

౨

ఏరికి పుట్టిన బిడ్డవే, వెక్కి వెక్కి యేడ్చు చుంటి వను లోకోక్తి ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు వర్తించును. పుట్టిన జన్మనక్షత్ర ఫలమేమో ఆవిర్భవించినది మొదలు ఈ మురిపెంపు బిడ్డను ఆల్లారుముద్దుగాఁ బెంచుటకు దత్తమండలమువారు ఉత్తరసర్కారువారు ఒకరితో నొకరు పెనగులాడుచుండిరి. కానక కన్నబిడ్డ గావున, పుట్టుటకు కానక కన్నబిడ్డయే యయ్యెను. ప్రభుత్వము వారికి సవతితల్లి ప్రేమ. ఈ బిడ్డను దీసుకొనిపోయి విశాఖపట్టణం సముద్రతీరస్థ పర్వతిమాలికపై నుంచి, ఉగ్గుపాలునుబోసి పెంచుటకు నిశ్చయించిరి. ఈ బిడ్డ జోక్యము మాకక్కరలేదని దత్తమండలము వారు తప్పుకొనిరి. ఆంధ్రదేశజులందఱు విద్యాలయ కేంద్ర సమస్య పరిష్కరించుకొనలేక, తమ బుద్ధి మాంద్యమునకు సిగ్గును జెందక, నింకను తత్కేంద్ర విషయ నిర్ణయమునకై కయ్యమున కొకరితో నొకరు కాలుఁ దువ్వుచున్నారు.

3

దేశభాషలలోఁ దెలుఁగు లెస్స. ఆంధ్రము భరతఖండములో నధిక సంఖ్యాకులచే మాట్లాడబడు భాషలలో మూఁడవది. మాధుర్యమునకు వన్నెగాంచి, 'Italian of the East' అని పేర్గాంచినది. ఆంధ్రులమై ఆంధ్రమాతాపితలకు జన్మించి, ప్రారబ్ధముచే పరాధీనజీవనము చేయవలసి, అన్యభాషాభ్యాసనమోహముచే, మాతృభాషను మఱచిన మనకు గతులెక్కడివి? భరతఖండమునందలి విశ్వవిద్యాలయములు రాష్ట్రనామమునుగాని తత్కేంద్రస్థ నగరనామమును గాని దాల్చుచున్నవి. మనవిశ్వవిద్యాలయము రాష్ట్రభాషను నిర్దేశించుచున్నది. అట్టి విద్యాలయము దేశభాషలో విద్యగరపుటకు నిశ్చయించుకొనలేదు. దేశనాయకులందరు దేశభాషలో విద్యగావలెనని మొత్తుకొను చున్నారు. నాగపూరు (Nagpur University) విద్యాలయమువారు దేశభాషలోనే విద్యను గఱపుటకు తీర్మానించిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయము దీనికైనను నోచుకొనలేదు. ఆంధ్రవిశ్వవిద్యాలయము మాతృభాష మూలకముగ విద్యనొసంగనిచో, నట్టి విద్యాలయము వలన లాభమేమి?

౪

ఆంధ్రులెప్పుడును ఉద్రేకపూరిత హృదయులు. వీరికి కార్యోత్సాహము పాలపొంగువంటిది. కార్యదక్షత గగనకుసుమము. గోదావరీ, కృష్ణా, పినాకినీ, తుంగభద్రానదీ తోయములం ద్రాగెడి యాంధ్రలోకము, కావేరీ సలిలములం గ్రోలెడి, ద్రావిడ జన సంఘమునకు, పలుకుబడిలోనేమి, పట్టుదలలోనేమి, పనిపాటలలోనేమి, స్వార్థపరత్వములలోనేమి, వెనుకంజ వేయుచున్నది. తమిళనిఘంటువు ప్రచురింపబడుచున్నది. సూర్యరాయాంధ్ర నిఘంటువు పన్యసించియున్నది. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము తన్మాతృప్రారంభాతురమునకైనను వెలువడలేదు. ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడలో గాఢసుషుప్తియందున్నది. రాజమహేంద్ర వరమునందలి ఆంధ్రపరిశోధకమండలివారు కళింగ సంచికనుఁ బ్రచురించు చున్నామని చెప్పి యిప్పటికి మూడేండ్లయినది. కడుపుతో నున్న కాంత కనకమానదని యెప్పటికైనను బిడ్డ బయటపడునేమో?

౫

నేటికాలపు కవిత్వమని చెప్పి యొక సుప్రసిద్ధ పండితుఁడు 'నవీనపద్యకావ్యములు' యందలి కవిత్వ ధోరణిని విపులముగా విమర్శించి, యాంధ్రలోకమునకు మన నూతన కవికుమారులనుజూచి మోహించిన కావ్యకన్య నవలావణ్య విలాస సంపదను బట్టబయలు గావించెను. పద్యకావ్యముల మాట యటుండ నిచ్చి, తెనుఁగు భాషలో నిప్పుడు వెలువడు గద్యకావ్యముల గతి యేమి? మన యాంధ్రభాష కొక ముప్పు ఘటిల్లెననిన విషాదమును జెందవచ్చును. మనకు కోర్టుభాష, రైలుభాష, షైబిలుభాష, తమిళదేశ సంపర్కముచే సంభవించిన సంకర భాష, ఉద్యోగమునందున్న దాస్యజనకోటి వాడుభాష, ఇట్టివెన్నో భాషలు కలసి, మన యాంధ్రభాష తుట్టతుదకు 'తురక ఝ్వారా తురక భాష' యన్నట్లయినది. కాలప్రవాహము నరికట్టు వారెవరు?                చంద్రమౌళి

# సాభిప్రాయ విశేషములు

సైమనుకమిషను పరాజయము

సర్ జాను సైమనుగారికి స్వదేశమునందును నల్ల జెండాలు, ప్రతిఘటన ఘోషలు, ప్రత్యక్షము లైనవి. ఆంగ్లేయులు, హైందవులు ఏర్పాటుచేసిన ప్రతిఘటన ప్రయత్నములకు లండనుపోలీసు జూపిన దురాగతములు బ్రిటిషు ప్రభుత్వ నిరంకుశత్వమును వెల్లడిజేయు చున్నవి. స్వాతంత్ర్యప్రియులైన బ్రిటిషుప్రజలు ప్రతిఘటన ప్రదర్శకులకు దౌర్జన్యమును చూపుట బ్రిటిషుప్రజల నావహించిన భయ భ్రాంతులకు నిదర్శనముగ నున్నది. నల్ల జెండాలను చించివేయుట, ప్రేక్షకులను బలవంతముగ నెత్తుకొనిపోవుట, కొట్టుట మొదలగు దుష్కార్యములు, లండను నగరమునందు సైమను స్వాగత సమయమునందు సంప్రాప్త మగుట బ్రిటిషు రాజ్యాధికారుల దౌర్బల్యమును చాటు చున్నది. రక్షకభటులు అధికారుల ఆజ్ఞలను నిర్వర్తించుచున్నటుల వ్యక్తముచేసిరి. అధికారుల ఆజ్ఞలకు భయభ్రాంతులుగాక వేరు కారణములు దురూహములుగ నున్నవి. పాపము సైమనుకమిషను ఏ దుర్ముహూర్తమున నేర్పడినదో గాని భరతఖండము నందును, బ్రిటిషు ద్వీపములందును బహిష్కరణ ప్రదర్శనములు ప్రత్యక్షమైన విధము కమిషను ప్రయోజనమును నిరర్థకము జేయుచున్నది. సర్ జాన్ సైమను గారు స్వాగత ప్రగల్భములను ప్రకటించినను యథార్థస్థితిని ప్రాజ్ఞులు గ్రహించుచున్నారు. సైమనుకమిషనుమీద పక్షపాతము గల లండను టైమ్సుపత్రిక సైతము యథార్థస్థితిని గ్రహించుచున్నది; భారతవిద్యాధికులు బహిష్కరించిన కమిషనువలన ప్రయోజనము గలుగదని వ్రాయుచున్నది. ఈ తెలివి ఆరంభము నందే యుండియుండిన కొంతయైనను ప్రయోజనము కలిగియుండును. ఇప్పుడైనను పశ్చాత్తాపము గలుగుట శుభసూచకముగ నున్నది. లండను టైమ్సు సైమనుకమిషనుకును, భారతీయనాయకులకును, సాహచర్యావసరమును విశదము జేయుచున్నది. సైమనుకమిషనునకును భారతీయనాయకులకును సాహచర్యము గాగలవిధమును కాలము తెలుపవలసి యున్నది. సర్ జాను సైమనుగారి ప్రసంగములు మాత్రము నిరాశను సూచించుచున్నవి గాని, ఆశను సూచించుటలేదు. భారతీయనాయకులును పార్లమెంటు ఉపసంఘమును కలిసి రాజ్యాంగవిధానమును యోచించుటయే సాహచర్యమునకు సాధనము. నెహ్రూ నివేదికను భారతీయనాయకులును, కాంగ్రెసును నామోదించిన విధము భారతజాతీయాభిప్రాయమును విశదము చేయుచున్నది. బ్రిటిషు ప్రభుత్వాభిప్రాయము మాత్రమే వ్యక్తము గావలసి యున్నది.

* * *

సైమనుకమిషను — బట్లరుకమిషను

సర్ జాను సైమను వారి ప్రసంగము నందు స్వాగతములను, బహిష్కరణములను నిర్లక్ష్యము జేయుచు స్వధర్మనిర్వహణము జేయునటులు ప్రకటించుట విశ్వసనీయము గాకున్నది. ఆంగ్ల రాజకీయపక్షము లన్నియును భారతీయరాజ్యాంగసమస్యలను ఎన్నికలయందు వినియోగింపజనదను సర్ జాన్ సైమను హితోపదేశములు నిరర్థకములై యున్నవి. బ్రిటిషు రాజ్యాధికారు లేపక్షమువా రైనను భారతీయరాజ్యాశయములకు సమానాదరణమునే చూపుచున్నారు. బాల్డ్వినుగా రైనను, లాయడ్జార్జిగా రైనను రామ్సే మాక్డోనాల్డుగా రైనను, హిందూదేశముమీద సమానాదరణమునే చూపుచున్నారు. నాయకుల ఎన్నికల ప్రకటనలందు భారతీయసమస్యలు లేవని వార్తలు తెలుపవలసిన యవసరము లేనేలేదు. సర్ జాన్ సైమనుగారి హితోపదేశమునకు అవకాశము లేదు. స్వహస్తగతమైన విషయములను నిర్లక్ష్యము చేయుట ప్రకృతి ధర్మము. దౌర్భాగ్యస్థితియందున్న భరతవర్షమును యోజింపవలసిన అవసరము బ్రిటిషు రాజకీయపక్షములకు గలుగజాలదు. లాయడుజార్జిగారును, రెడింగుప్రభువును సర్ జాన్ సైమనుగారును వారు చేసిన ఘనకార్యములకు సర్వోర్గ్యప్రశంసలను జేసుకొనుటయందు విచిత్రము గనుపడదు. కావలసినది ఆత్మశ్లాఘనమును, భారతదాస్యమును గాని స్వధర్మనిర్వహణము గాదు. కమిషను నిర్ణయములు సామాన్యరూపమును దాల్చునని వదంతులు వ్యాపించియున్నవి. బట్లరుకమిషను నిర్ణయములు సైమనుకమిషను నిర్ణయములకు ఛాయ యని గ్రహింపదగి యున్నవి. భరతఖండమునండి స్వదేశసంస్థానములను ప్రత్యేకింపదలచిన రాజ్యాంగనీతిజ్ఞులు భరతఖండమునకు స్వరాజ్యప్రదానము చేయుట యసంభవము. బ్రిటీషు రాజ్యనీతి భేదదండోపాయములమీద నాధారపడియున్నది గాని సామదానోపాయములమీద నాధారపడి యుండలేదు. హిందూమహమ్మదీయ విభజనకన్న బ్రిటీషు స్వదేశవిభజనము బ్రిటీషు ప్రాబల్యమునకును భారతీయపరాధీనతకును పరమప్రయోజనకరముగ నుండగలదు. సంస్థానాధీశులు దేవతను గోరితే దయ్యము ప్రత్యక్షమైనది. సంస్థానాధీశులు స్వదేశప్రజలకును మాతృభూమికిని స్వప్రయోజనార్థము చేసిన మహోపకారము స్వప్రయోజనములను సయితము మూలచ్ఛేదము చేసినది. బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులకు గలిగిన యానందమును వారి వ్యాసములు విశదము చేయుచున్నవి. బ్రిటీషు రాజ్యాధికారుల రాజ్యాంగ వ్యూహములు దుర్భేద్యములుగ గనుపడుచు మాతృభూమికి తరణోపాయ మవశ్యము యోచింపదగి యున్నది. ప్రభుత్వ మవలంబించుచున్న దండనమాత్ర ప్రజానాయకులకర్తవ్యము నినుమడింప జేయుచున్నది.

* * * *

నిర్బంధవిధానము

దేశమునం దంతటను నిర్బంధవిధానము వ్యాపకమును గాంచుచున్నది. ౨౦ దినముల క్రితము సాంబమూర్తిగారు నిర్బంధింపబడిరి. క్రమక్రమముగా నిర్బంధవిధానము వ్యాపకమును గాంచుచున్నది. శ్రీయుత సింగార వేలుగారు, సర్కారుగారు మొదలగువారు దారుణమైనశిక్షననుభవించుచున్నారు. పంజాబు నందు కుట్రకేసునకు ప్రజలు నిర్బంధింపబడు చున్నారు. అసెంబ్లి బాంబు నిర్బంధములకు మహావకాశములను గలుగజేసినది. ఉత్తర హిందుస్థానమునం దంతటను నిర్బంధములు సాగినవి. సుప్రసిద్ధ హిందూనాయకులు సత్యపాలుగారుసైతము రాజద్రోహమునకని నిర్బంధింపబడిరి. అఖండమైన నిర్బంధప్రస్థాన మతి వేగముతో వ్యాపింపగల విధమునకే నిర్బంధములు నిదర్శనములుగ నున్నవి. మొదట నిర్బంధములును అనంతరము సంస్కరణములును నిర్ణీతమైన రాజ్యనీతి. ఆ నీతియె యిపుడునునవలంబింప బడుచున్నది. ఒకచేతనిర్బంధములును రెండవచేత సంస్కరణములును ప్రసాదింపబడునపుడు సంస్కరణము లేపాటివైనను నిర్బంధముల యుపసంహారమునకై యంగీకరింపబడుట సహజము. వర్తమాన నిర్బంధప్రస్థాన మిందుల కేర్పడినదని యూహింపదగి యున్నది. బ్రిటిషు ఎన్నికలయందు కన్సర్వేటివుపక్షమునకే విజయము గలిగిన, నిర్బంధప్రస్థానమే విజయమును బడయునని యూహింపదగియున్నది. భారతరాజ్యాంగ సంస్కరణముల విషయమై వివిధపక్షములవారును పూనిన యుదాసీనభావ మిందులకు నిదర్శనముగ నున్నది. బ్రిటీషురాజ్యనీతిజ్ఞులేమి చేసినను భారతీయులు పరస్పర వైషమ్యమును స్వప్రయోజనపరాయణత్వమును బూని కలుగజేయుచున్న సంక్షోభము దేశదార్భాగ్యస్థితిని విశదము చేయుచున్నది. వర్తమాన విషమస్థితియందు ప్రజానాయకులు నిర్వహించవలసినభార మపారమైనను ప్రజాహృదయము నందు సంచలనము గలుగకపోవుట భారతజాతీయహృదయము నావరించిన మహామాంద్యమును వెల్లడి చేయుచున్నది. ముప్పదిమూడుకోట్ల ప్రజల నావరించిన మాంద్యము పోయినపుడు సంకల్పసిద్ధి సులభ సాధ్యము కాగలదు. ప్రజాహృదయమునందు ప్రబోధమును, ప్రత్యభిజ్ఞానమును గలుగుటకు కాంగ్రెసు నిర్ణయించిన కార్యవిధానమును, గాంధిమహాత్ముని యుపదేశములును సాధనములుగ నున్న విధమును మహాత్ముని యాంధ్రదేశసంచారము విశదము చేయుచున్నది.

* * * *

గాంధిమహాత్ముడు—ఆంధ్ర దేశ సంచారము

గాంధిమహాత్ము డాంధ్రదేశ సంచారమును ప్రారంభించి ఒకమాసము దినములు గడిచినవి. గాంధిమహాత్మునకాంధ్రులు సమర్పించినసన్మానస్వాగతము లాంధ్రులభక్తిని కార్యాసక్తిని విశదము చేయుచున్నవి. వేలకొలది ప్రజలు స్త్రీలు, పురుషులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, కాంగ్రెసు పక్షము

వారు, జస్టిసుపక్షమువారు, రయితులు, రాజులు మహాత్మునకు సన్మాన స్వాగతంబుల నొసంగి ప్రజాహృదయము నావరించిన స్వరాజ్యాను తాపమును విశదముచేసిరి. కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి, విశాఖపట్టణము, తూర్పు గోదావరిమండలములందు సంచారము ముగిసినది. ఈమండలములందు ఖద్దరునిధికి దరిద్ర నారాయణులసహాయార్థము రూ 2,00,000 లు సమర్పింపబడినవి. గాంధిమహాత్ముని సందర్శించుటకై ప్రజలు చూపిన యుత్సాహము, ప్రజల భక్తివిశ్వాసములను విశదము చేయుచున్నది. పెదపాడునందు బాల వితంతువు శ్రీ సత్యవతమ్మ గారు సమర్పించిన 1500 రూప్యముల నగలును ప్రజా ప్రవృత్తిని విశదము చేయుచున్నవి. ప్రజ లవసర మేర్పడినపుడు మహాత్యాగమును జేయుటకు సంసిద్ధులైయున్న విధమును ప్రజలు సమర్పించిన పూజానిధులు చెప్పక చెప్పుచున్నవి. గాంధిమహాత్ముని సందేశము శాంతిసందేశము త్యాగసందేశము, సత్యసందేశము, ఆధ్యాత్మిక సందేశమును. ఈసందేశముయొక్క యనుష్ఠానము స్వరాజ్యసంపాదనమునకు సాధనముగ నున్నది. ముక్తికి, భుక్తి మూలాధారముగ నున్నది. దరిద్రనారాయణులకుభుక్తిలేనంతవరకును, హిందూ మహమ్మదీయ సంయోగము గలుగనంతవరకును, అస్పృశ్యు లుద్ధరింపబడనంతవరకును, ప్రజలు ఖద్దరుధారులై స్వరాజ్య దీక్షను బూననంతవరకును స్వరాజ్యము దుర్లభము. గాంధిమహాత్ముడు రెండు నిమిషములు మాటలాడినను, 40 నిమిషములు మాటలాడినను ప్రజల కీసందేశమునె వెల్లడిచేసెను. ప్రజ లీసత్యమును గ్రహించి మహాత్ముని ధర్మ సందేశమును సార్థకముచేయుట ప్రయోజన కరము.

మహాత్మునిసంచారము కేవలము ధన సంపాదనమునకు మాత్రమే కాక ప్రజా ప్రబోధమున కేర్పడినది. ఈ సంవత్సరాంతము నందు స్వరాజ్యప్రస్థానమును చేయుటకు ప్రజలకు గల యధికారమును సంస్కారమును గాంధిమహాత్ముడు స్వయముగ గనుగొన గోరుచున్నాడు. స్వరాజ్యప్రస్థానము సర్వతోముఖమైన ప్రస్థానము గాని సామాన్యప్రస్థానము గాదు. ఆప్రస్థానమునకు ధనబలమువలె ధర్మబలము నవసరముగ నున్నది. ధన బలమును ధర్మబలమును సమకూర్చుటకు మహాత్ము డుపదేశించిన సాధనములు సామాన్యములైనను సకలజనానుష్ఠేయములుగనున్నవి. సత్యశౌచదయాసత్యములు సకలార్థసిద్ధికిని సాధనములుగ నున్నవి. అస్పృశ్యత, మద్యపానము, జాతిభేదములు, మతభేదములు ధర్మార్థసిద్ధికి ప్రతికూలములై జాతీయసత్త్వమును నిర్వీర్యము చేసినవి. జాతీయసత్త్వమును నిర్వీర్యము చేసినదుర్గుణములనునిర్మూలము చేయుటకును, ప్రత్యభిజ్ఞానము గలుగుటకును, ఖద్దరు ధారణము పరమసాధనముగ నున్న విధమును నిత్యానుభవమువిశదము చేయుచున్నది. సర్వ కాలములందును సంతమాత్ములు ప్రత్యక్షముగు

చుందురు. ముఖ్యముగా నాంగ్లసంస్కారులైన భారతీయులు సంశయాత్ములు; స్వధర్మమును విడిచిపరధర్మాచరణమున కధికారులు గాజాలకున్నారు. ఆపండితులు మహాత్ముని యుపదేశములను సావధానచిత్తులై మనన ధ్యానములు చేసి కృతార్థులగుదురు గాత! వృద్ధాప్యమునందు, దుర్బలదశయందు, మండువేసవియందు గాంధిమహాత్ముడు చేయుచున్న అనంతమైన దేశసేవ, ధర్మసేవ, దైవసేవ, దురభిమానపరాయణులకు జ్ఞానోదయమును గలుగజేయుటకు భగవంతు డనుగ్రహించుగాత! ఆంధ్రుల విషయమై మహాత్ముడు చేసిన హితోపదేశము సర్వజనామోదమును బడయదగియున్నది ఆంధ్రుల బుద్ధివైభవము, నమ్రస్వభావము, ఉత్సాహము, విశ్వాసము, సంయోగ సాహచర్యములు గలుగక నిరర్థకమగుచున్న విధమును నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. ఆంధ్ర విశ్వవిద్యాలయ మిందులకు ప్రబలనిదర్శనము. మహాత్ముని యాంధ్ర దేశసంచారమాంధ్రత్వాభివృద్ధికి వినియోగపడునటు లాంధ్రమహాజనులు పాటుపడి భగవదనుగ్రహమునకు పాత్రులగుదురు గాత!

---





Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras

## చిత్రములు



త్రివర్ణ చిత్రములు:—విజయము; హిండోలరాగిణి.

సాధారణ చిత్రములు:—ఆకస్మిక ఛాయాచిత్రములు ౭; ఆబూపర్వత చిత్రములు ౭; అహమ్మదాబాదు చిత్రములు ౨; గ్లాస్గో చిత్రములు ౫; కన్యామహావిద్యాలయ చిత్రములు ౪; అభ్రకపుగనులు చిత్రములు ౨; ఇతరచిత్రములును.

---

☞ భారతి ఆఱవసంపుటము ఒకటవభాగమునకు సంబంధించిన వ్యాసములయు, వ్యాసకర్తలయు అకారాదిసూచిక రానున్న సంచికతో వెలువడును.—సంపాదకుడు, భారతి.




విజయము



చిత్రకారుడు: చామకూర సత్యనారాయణగారు, రాజమం(డ్రి.




చెన్నపట్టణము, జూన్ ౧౯౨౯

సంపుటము ౬     శుక్ల సంవత్సరము జ్యేష్ఠమాసము     సంఖ్య ౬

## దేశభాష

వేలూరి శివరామశాస్త్రిగారు

"తనదు బాస కన్నతల్లి యెవ్వానికి-సత్య మన్యభాష సవతితల్లి
'తనదు ధర్మమందు తాను ద్రుగ్గుటలగ్గు-అన్యధర్మ మది భయావహంబు."

### పూర్వభాగము

౧

పన్నులు కట్టుచుండు జనపాలురు పోవుడు, వారి పెన్‌జమీల్
తిన్నఁగ దిద్ది తత్సుతుల దివ్యులచందము పెంచి వారి న
త్యున్నత విద్యలందులను యుద్ధమునందును బాలనా విధిన్
మిన్నలఁజేసి మీఁదట జమీలకుఁ బంపు 'నకబ్బ' రాదృతిన్.

దుర్వ్యయం బొనరించి యాస్తులను బరుల-కరణ మిడినట్టివారికి భరణ మిచ్చి
ఋణము తీర్చి జమీల వారికి నొసంగు-నల యకబ్బరుసాటియే యధిపు లెందు?

6. 6- 1 23

కాలమునకును ముదిమిం బోకార్చి మరల-జవ్వనం బాడఁగూర్చు వసంతఋతువు
నందు సామంత నృపులతో నచ్చ రవని-కాంతుఁ డెంతయుఁ బేరోలగంబు తీర్చి,

తొలకరి మెఱుఁగులఁ దులఁదూఁగు బీబీలఁ గాన్కలిచ్చెడువారిఁ గలయఁ గాంచి
మైత్రియే కాన్కగా మనఁజేయు రాజపుత్రుల కెదు రేఁగి కౌఁగిళుల నింపి
పర దేశములనుండి వచ్చువర్తకుల రత్నములకు సింహాసనంబుఁ జూపి
పెండిలి కాకుండఁ బెరిఁగిపోవుచునున్న కావ్యకన్యలకు నిక్కాను గట్టి
పలు దివాలాలు దీసిన వారివారి-యాస్తి ఋణములకుం బాపి యప్పగించి
తండ్రు లేఁగిన సుతులఁ బెద్దలగువారి-నెల్ల రను జీరి మెల్లగా నిట్టులనియె.

పరలోకంబున నున్న మీ జనకు లే వాత్సల్యముల్ మీయెడం
బరఁగం జేయుచునుండ్రొ తాదృశమయా వాత్సల్యముల్ మీ ప్రజా
పరివారంబులయందు నెల్లయెడలన్ వర్షించుచుం జక్కగాఁ
బరిపాలింపుఁడి నన్ను నేమరకుఁడీ స్వస్వస్తికాలంబులన్.

అని సభ ముగించె నంతట-జనపాలకుమారవరులు సంతసమున నా
త్మ నివాసంబుల కేఁగిరి-పెనుపంజరములను వీడు పిట్ట లనంగన్.

౨

తండ్రిం దల్లియుఁ గాలధర్మమును జెందన్ మీఁదటన్ డిల్లిలోఁ
బండ్రెండేఁడులు యుద్ధవిద్య నరబీ పార్సీ తురుష్కంబులన్
గొండ్రల్ పోసి సమర్థుఁడై వయసు చేకొన్నందులం గామినీ
పుండ్రేక్షుండగు 'ధర్మసింహుఁడు' పురంబుం జేరెఁ బాలింపఁగన్.

అతనిఁ దలలెత్తి చూచిరి యఖిలప్రజలు-వాచకొనియున్న కన్నుల వాంఛదీఱఁ
గాటకంబునయందు నాకసముమీఁదఁ-గానిపించిన నీలమేఘంబు నటులు.

ధర్మసింహుండు క్రమ్మఱఁ దనదు ప్రజల - మధ్యమున వచ్చి పడుచు సంబరము చెందె
మాతనుండి పృథక్కరింపంగఁ బడిన - దూడ క్రమ్మఱఁ దల్లిని గూడినటులు.

అందఱు ధర్మసింహుని మహాభ్యుదయం బభివాంఛితంబు నాఁ
జందము దోఁప వేడుకలు సల్పిరి గాయకనాయకుల్ మహా
నందముగాఁ దదీయ జననంబును బాడిరి ప్రౌఢ సర్తకీ
బృందము లాడి రెల్లరును వేఁడిరి దేవుని వాని వృద్ధికిన్.

పత్తనమందు తా నిటులు పార్థివవర్యుఁడు కొన్నినాళు ల
త్యుత్తమ గోష్ఠులం గడపియుం దనరాజ్యము చూడఁగోరి సం
పత్తికిఁ బోలు వైభవ మభంగురమై విలసిల్ల నేఁగె లో
కోత్తరమైన చందముగ నూరులుఁ బల్లెలుఁ జిన్ని ఖండ్రికల్.

పల్లెల్ పల్లెలుఁ బ్రోళ్లుఁ బ్రోళ్లు మఱియుం బట్నాలుఁ బట్నాలుఁ దా
నెల్లం గ్రుమ్మరెఁ గాని వాని మది సుంతేనిన్ వినోదంబు సం
ధిల్లన్ లే దల డిల్లిముం దివణపుల్ నిక్కంబు సూ 'డిల్లికిన్
డిల్లే పల్లెకుఁ బల్లెయే' యనుట తా నిర్జీవమై పోవునే?

పురమున కున్ముఖుఁ డగుచును - ధరణీపతి సూనుఁ డంత దాపగు 'పరిష
ద్వర' మను పల్లియయందలి - చిరంతనపుఁ గోటలోన జేసె మకామున్.

3

కరణము వచ్చి రాజసుతుఁ గన్గొని యేలినవారి కిప్పు డీ
చిఱుతకపల్లె మోదమును జేయఁగఁ జాలదు గాని యిందు దే
వరప్రజయూ ముకుందుఁ డను వశ్యవచోవిభవుండు సత్కవీ
శ్వరుఁడు కలండు తత్కులమువారలు మీసభలోఁ గవీశ్వరుల్.

అను నతనిమనవి ముగియక-మునుపే భూవరకుమారు మోమువికాసం
బును బోల్చి మాకు మోదం-బని యనుయాయులు బిరాన నార్చి రేకశ్రుతిన్.

సాయంకాలమునన్ సభాగృహము పుష్పాలం దివాచీలఁ గై
సేయంగాఁబడె ధర్మసింహుఁ డెదుటన్ సింహాసనాసీనుఁడై
శ్రీయొప్పించెను బందుగుల్ సఖులునన్ శ్రేణీద్వయిం దీర్చి నా
రా యాస్థానికిన్ ముకుందుఁ డవలం బ్రాణంబు పోసెన్ వెసన్.

లీలాశారదఁ బోలు నాకవి యనల్పీభూత వాగ్వల్లకిం
జాలన్ మీటుడు ధర్మసింహు గురువంశంబుల్ పునర్జీవిత
శ్రీలాభంబును బొందు చందముగ భాసించెన్ విచిత్రంబుగాఁ
గాళీదాస మహాకవీశ కవితం గాకుత్స్థవంశం బటుల్.

అతని కవిత్వమందు నొక యద్భుతమున్న దదేమి యన్నచో
శ్రుతులవె దోరవెట్టుకొనుచున్ విను విన్నసమస్తకాలమున్

మతికి నొకింతయేనియును మంత్రము తంత్రము యోగమున్ సనా
యతనము లోనుగాఁగలవి యక్కఱలేని సమాధి చొప్పడున్.

ధరణీపాలుని మ్రోలనుం గల సుహృద్వర్గం బిటుల్ వల్కె—ఈ
ధర సర్వంబును ద్రొక్కి చూచితిమి కాదా! యిందు నెందేని యే
గిరియుం బల్లెయుఁ బత్తనంబును నదీక్రీడావనీ శ్రేణి యీ
వరుసన్ మానసమెల్ల మోదమున ముంపంజాలెనే చెప్పఁడా!

అని హర్షించెను గవిమో-మునయందులఁ గాని రాజుమోమునఁ గానీ
యనుమోదం బావంతయుఁ-గనుపట్టఁగలేదు కంటఁ గలికాసకిన్నీ.

తన చెలులు సంతసించిరి-యని వారల సంతసంబు నాత్మీయముగా
ననుకొని నృపుఁ 'డీసత్కవి-మన యాస్థానంబునందు మనుఁగా' కనిమెన్.

కరణము సంతసించె సభ గల్గు జనంబులు ధర్మసింహు స
త్కారణమున్ ముకుందుకవితం గల పాత్రతనున్ గుణించి య
బ్బురమును జెంది రంతట నృపుండు కవీశునితో సఖాళితోఁ
బురమున కేఁగెఁ జూపఱకు ముచ్చట యాయెను వాని చెయ్దముల్.

౪

పదియాఱువన్నెల బంగారుతీఁగల మించు సేలువఁ గప్పించినాఁడు
అంతయు సరిగతో నల్లించి తెప్పించి మంచి వల్వాలను గట్టించినాఁడు
రివ్వురివ్వునఁ బాఱు రెండు తేజీలఁ గట్టించిన తేరి నెక్కించినాఁడు
వెండి పళ్లెరముతో వేనూటఁబదియారు లంచితంబుగను బట్టించినాఁడు
తూఁగుటూయాలలం బొల్చుతోఁటయందు-చెల్వుభవనంబునం దుండఁ జేసినాఁడు
ధర్మసింహుండు నగ శేఁగు తత్ క్షణంబు-నందితస్వాంతుఁడైన ముకుందుచేత.

నడికేయి నేనియును నెవ్వఁడు పారాయిచ్చునేని ప్రశ్న మొకింతే
నడుగక రాజద్వారము-విడివడుచుండును ముకుంద విద్వాంసునకున్.

ఆయాయి దేశంబులందుండి తగు రాజపుత్రులు వచ్చినప్పుడును గాని
అక్బరుపాదుషా యాస్థానినుండి రాట్ పురుషులు వచ్చినప్పుడునుగాని
దేశాంతరములఁ గీర్తిని బూర్తిఁ జేయ రోపడఁతులు వచ్చినప్పుడునుగాని
మాటమంతిని జెప్పి మను రాచబందుగు లలవోక వచ్చినయపుడుగాని

తమ మదికి నింపితంబగు సమయమందు-దాసికలు గారడీంద్రుడును ధార్మికులును
సఖులు చేరెడునట్టి యాసభ లవెల్ల-గవి ముకుందుఁడు లేనిచోఁ గావు సభలు.

తవు విద్వాంసులు సత్కవీశులు నటుల్ ధర్మాత్ము లార్యుల్ గురు
ప్రవరుల్ గాయకనాయకుల్ కథకులున్ భట్టారకుల్ లోనుగా
నెవ రేతెంచిన నేని యా నృపతిచే నిప్పించుఁ దానిచ్చు నా
కవివర్యుండు ముకుందుఁ డంచితకళాకాంతా ప్రియత్వంబునన్.

'కవియని రాజసన్నిధిని గ్రద్దవిధంబున నుండనేమి? భూ
ధవుఁడు కవీంద్రుఁ బెట్టుకొని తాఁ బిశునుండఁను యుండనేమి? తాఁ
గవి యనఁగా ముకుందుఁడె తగం గవిరాజన ధర్మసింహుఁడే
భువి నిఁక రా'జటంచు జనముల్ సభలన్ గణియించి రెంతయున్.

కాని యొక్క రహస్యంబు కలద యిందు-మాతృభాష నెఱుంగఁ డామహీపవరుఁడు
వారు కలిసిన లగ్నంపు బలమువలన-సాఁగుచున్నదిగాక తత్సఖ్య మెలమి.

౨

ఆతఁడే రాజు మఱియు రా జాతఁడేగఁ-గడచిపోవుచునుండెఁ దత్కవివరుండు
రాజకార్యముజోలికి రాఁడు రాజు-గూడఁ గవిరాజుజోలికిఁ బోఁడు సుంత.

పండువునాళులందులను బౌరజనాదరణంబునన్ ముకుం
దుండు సభాంతరంబులను దోఁచుచునుండును గాని యా నృపా
లుండు స్వభావయందులను లోలుఁడు కామిని రామి నాకవీ
శుండు కవిత్వపున్ గొడవఁ జొచ్చుటమానెఁ గ్రమక్రమంబుగన్.

కొన్నినాళులు క్రమముగాఁ జన్నపిదప-నల ముకుందుండు ధర్మసింహావనీశు
ప్రజ యటంచునుమాత్రమే ప్రజల కెఱుక-గాని సంస్థానకవి యని గాదు సుంత.

ఒకపద్యంబును నేని వ్రాయఁగను బెల్లుత్సాహముల్ లేక తీ
రికయున్ లేక ఫలంబు లేక తననుం బ్రేరించువా ర్లేక యూ
రక తించుం దిరుగాడుచుం బరుల'షో-రా'మాటలున్ లేక తా
నొకరుండే మెలఁగున్ ముకుందకవి వాయున్ నోరు లేనట్లుగన్.

"కవియని పేరువెట్టి యధికంబుగ రొక్కము నిచ్చు దాని నే
నవలఁ బరిగ్రహింతు. అతఁడా, ఫలమందఁడు; 'నేనొ, నేర్తు నీ

ద్రవిణము గొందు'నంచు బలితంబగు తుష్టిని బొందఁజాల నీ
వ్యవహృతి చాలఁ జిక్కయిన"దంచు ముకుందుఁడు లోనఁ గుందెడున్.

క్రమముగాఁ గవిరాకపోకలను మానె-వచ్చెనేనియు నెప్పుడో వచ్చి వెళ్లు
రాజు రావేమి? యనఁడును రాకయున్నఁ-గొంత సంతసమునుగూడఁ గొనఁగఁబోలు.

కొన్నాళ్లేఁగినపై ముకుందుఁడని యొక్కం డీప్రదేశంబునం
దున్నాఁడంచును బౌరు లెల్లరునుగా కుద్యోగు లౌవా రెఱుం
గన్నేరర్ నరపాలుఁ డించుక యెఱుంగన్నేర్చునో నేరఁడో
కన్నారంగ ముకుందు నిప్డు కనుపైఁ గాకెట్టులం దేలెడిన్?

౬

'చవు లూరించెడు వాక్కు గల్గు కవివంశంబందులం బొందుగాఁ
గవినై పుట్టితిఁ దండ్రులట్టుల నృపాగారంబునన్ మెట్టితిన్
ద్రవిణం బందితిఁ గాలకర్మగతి నీ రాట్సింహుఁ డింతేనియున్
గవితానంద మెఱుంగఁ డెందులకు నింకన్ నే నిటన్ నిల్వఁగన్.

'ఇల ఠేండ్లు పెంచుచుండిన-పులులును సింగములు పనులు పొనరింపకయే
చెలఁగెడుఁ; గలిగెడు వాని-దిలకించిన వింత: లే దదియు నాయెడలన్.

'పంజరపుఁ జిలుక పలుకుల-కుం జెవు లున్నయవి కాని కోమల కవితా
రంజితుఁడగు కవి పలుకుల-కుం జెవు లవి లేకపోయెఁ గుతలము నందున్.
'క్రొత్తగ వచ్చు రాజతతి కూరిమినెచ్చెలికాంద్ర కంటికిం
దొత్తయి చూచువారిచెవితో విను వారిమనస్సుతో మనున్
'గ్రొత్తలు ప్రాఁతలైన నృపకోటులు నంది యటన్న మిత్రముల్
బత్తిగ నంది యంద్రు మఱి పంది యటన్నను బంది యంద్రొగిన్.

'కవినై కొంచెము కాలము-నవలను మిత్రంబనై యనంతరమందుం
జెవలయ్య నయితి నిచ్చట-శివశివ యీరాజుగ్గారి చిత్తమునందున్.

'ఇందేమి కొంప మునిఁగిన-చందం బది లేదుకాని జనపతి ధన మె
ట్లందికొని తినఁగలాఁడనో?-అందము కాఁ దుండిపోవ నాస్థానమునన్.

'పోయినఁ దిండి చిక్కక యపోవఁగనిమ్ము కడంగి యున్న నా
ల్గీయన సొమ్ము తింటకును నే రచియించిన గ్రంథమెల్ల నేఁ
డీయనకే రహస్యముగ నిచ్చి ఋణం బది శక్తికిం దగన్
బాయఁగఁ జేసికొంచుఁ జన భావ్యము నాకని తోఁచు నెంతయున్.'

అని తలఁచుచుండిన ముకుందుని కడకున్ భార్య సుకల తోతెంచి వడిన్
'మనకున్ వగపేలొక నూతన జనపాలుని నొకింత దర్శింత' మనెన్.

'నూతన భూపు నొక్కని గనుంగొని పొట్టకు వానిఁ గొల్చి యి
ల్లీతని ధర్మసింహుని మహేశులఁబోలు మహీశులందు న
ఖ్యాతి పరీతమూర్తిగను గల్పన చేయఁడు సూ ముకుందుఁ డీ
రాతిరి సాక్షి నానుడుల రాజిలుచుండెడు వాణి సాక్షిగన్.'

అని ముకుందుండు గ్రంథంబు లంటఁగట్టి నెత్తిపైఁ బెట్టుకొని దాసి నీరజాక్షి
కడకుఁ జని యది చనవరిగాన దానితో వచించెను దన కథఁ దీవరముగ.

ఇటులు వచించి యీగ్రంథములు ధర్మసింహాంకితములు గాన వీనిని గ్రంథాగారమునఁ
జేర్పుమని పలికి క్రిందదింపిన నివ్వెఱపడి నీరజాక్షి వాని నందికొని.

అదియుఁ 'గవీశ్వరమయ్యా!-యిది మీదాసే యటంచు నెంచండల్లా
గదిలో నిడకుంటే మీ-పదాలు నఱికేసినట్లు భావించండీ!

అను నీరజాక్షిమాటలకు నలరి దీవించి యాముకుందుం డంతన్
వెనుకకు మరలెను నీలోపున సుకలయు నొక్క-పెద్దపుల్లం గొంచున్.

తన భర్త తనకుఁ బ్రతిజ్ఞాపూర్వకముగా ప్రత్యుత్తరించిన పద్యమును ఎదురు గోడపై
లోఁతుగా అఱువల్లు పడ వ్రాసి బయటికి వచ్చిన.
ఇంతటిలోన ముకుందుఁడు-సొంతగృహంబునకు రాఁగ సుకలయును మనః
కాంతుని లోనికిఁ గొని చనె-నంతట నిద్దురలు గూరి రల యిర్వురున్.

౨

మున్నే యన్నిటిఁ జక్కఁబెట్టుకొని యాభూపాలు నెమ్మోమునుం
గన్నారంగను గాంచిపో నధికమా కాంక్షన్ ముకుందుండు తాఁ
జన్నన్ లేచుచు ద్వారపాలకుఁడు పెల్చన్ 'మీకునున్ దేవిడీ
మన్నా చెప్పిరి కష్టముల్ నొడువునన్ మన్నింపుఁ డో దేవరా!'

అనఁగ ముకుందుఁ డిట్లనియె నాతనితోడను 'నోయి సుబ్బ! నా
కును నిది కస్తికాదు దొరకుం గనిపించుచు నాదునూరు పో
వను దలపోసి వచ్చితిని వార్తను లోనికిఁ బంపి రమ్మటం
చును సెలవైనచో నగరిఁ జొచ్చెద లేనిది లేచిపోయెదన్.'

అని యాతని సమ్మతినిం-గొని ద్వారమునందు వేచికొనియుండియు లోఁ
జను ఠాణేదారునితోఁ-దన మనవిని బనిచె రాజు దగ్గఱ కెలమిన్.

ఈ లో రాజున కేమి క్రొత్తపని తా నేతెంచెనో యాబహి
శ్శాలం జూడఁగ వచ్చి కానఁబడెఁ బెల్చన్ ద్వారపాలాజ్ఞ తా
నాలోనన్ మఱపొంది యక్కవియు నొక్కంగన్ నృపున్ డాసె భూ
పాలుం డుబ్బరపోయి 'మీ రెః యెవరో పై వారటం చెంచితిన్.'

అని చెప్పి 'యిచటఁ గొంచెము-పని యున్నదదై నపైని వచ్చెదఁ బైకిం
జనుఁ' డనియె నాముకుందుఁడు-చనెఁ బ్రాసాదంబుమీఁది సభలోనికిన్.

శ్రమగొని కవి పైనిని నృప-హిమధాముఁడు తాను గ్రింద నెవరికి వారే
యమునాతీరే యనియెడి-క్రమమున నుంషంగఁ గొంత కాలము నడచెన్.

తాను కానలేని తావులనుం జూడఁ-గలుగుఁ గవి యటన్న కచ్చతోడ
నీరజాప్తుఁ డెగసి నెత్తిమీఁదుగ దాఁటె-నల ముకుందు గేలిగొలుప ననఁగ.

కాలము చాల దాఁటె నరకాంతుఁడు రాకయపోయె రిక్తునిం
బోలె ముకుందుఁ డేమిఫలముం గనఁబోవక మెల్లనుండియున్
నేఁకు జాఱు బంతియన నెట్టనదా దిగి యింటి కేఁగె భూ
పాలకుఁ డంగజాలెకుఁ జివాట్లిడి గర్భగృహంబులం జనెన్.

ఆముకుందుఁడు మాపట నాలితోడ-మూటముల్లెలు నెత్తిపై మోసికొంచుఁ
బయనమైపోయి గౌతమీప్రాంతమందు-నొక్కపల్లియలో వాసముండె నెలమి.

గ్రామంబందుల నెల్ల వారలును శాస్త్రంబో మఱేన్ వేదమో
సామాన్యంబుగ నేర్చియుండి కవితాసారస్యమున్ బుద్ధిలో
నేమాత్రంబు నెఱుంగకుండమి నతం డెవ్వారికిన్ దుఃఖమే
నామోదంబును నేని జేయకయ తా నందుండె భిక్షాటుఁడై.

ఉదయంబందునె లేచి గౌతమిని బిట్టోలాడి నాల్గైదు సత్
సదనద్వారములందుఁ 'భవతి భిక్షాం దేహి' వల్లించి తా
నుదరంబుం బరిపూర్తి చేసికొనుటే యుద్యోగముంగాఁ బయిం
బదమో పద్యమొ పాటయో యొకటి సంభావించు నాతం డెదన్.

అల ముకుందుఁడు కవియయి యంతమీఁద-ప్రభువు నాస్థానకవియయి పయి ముకుందుఁ
డై పయిని నెవ్వఁడో యయినట్టివాఁడు-ఇపుడు క్రమ్మఱఁ గవియాయె స్వేచ్ఛఁ జేసి.

పూ ర్వ భా గ ము

---

ఉ త్త ర భా గ ము

౧

ఆయాభాషలయందు బొందుగను వ్రాయంబడ్డ వేదాంతముల్
న్యాయంబుల్ సుకవిత్వముల్ మఱియు జోస్యంబాదులన్ రాజధా
రేయుం డగ్బరు ఫారసీగఁ బరివర్తింపించి జాత్యంతరా
మేయజ్ఞానము గ్రోల నల్దెసలు బంపెన్ మేలి మాల్వీలనున్.

అల కన్నడ మఱవంబును-దెలుఁగు మహారాష్ట్రిమాది దేశపు బాసల్
తెలియఁగ నాస్థానంబుల-వలఁకులకుం జనిరి తురకపండితు లంతన్.

ఆంధ్ర దేశంబులకు నొగి నవతరించి-రాజసంస్థానమందు నాంధ్రంబు నేర్చి
పారసీకంబునందును వ్రాయ నొకఁడు-వచ్చె నల ధర్మసింహభూవరుని కడకు.

అటు లేతెంచిన పారసీకకవి కం దాతిథ్యముం గూర్చి య
ప్పటి శూన్యంబగు నాముకుందు గృహమున్ వాసంబుకై చూపి పి
మ్మట నాంధ్రంబు నెఱుంగు నొక్కబుధు నామాల్వీకిఁ దోడిచ్చి యం
తటితో భారము తీసివైచికొనె భూనాథుండు తా నెంతయున్.

కవులును దత్త్వవేత్తలును గాయకులున్ నటు లల్ల తార్కిక
ప్రవరులు లోనుగాఁ గలుగువారు స్వకీయపు జ్ఞానలోహముల్
ప్రవిమలమా నకబ్బరు సభాభవనం బనుటంకసాల రే
బవలును ముద్రవైచి యొకపారసినాణెము చేసి గాకడన్.

౨

సర్వసామాన్యముగను నీజగతియందు-ఫలమిడని వస్తువుల కమంగళత యబ్బు
అట్టి యపమంగళంబును నపశకునము-ధర్మసింహున కిప్పుడు తలఁగిపోయె.

ధర్మసింహున కల ముకుందకవి వైరి-కాఁడు కాని యతం డిప్డు కానరామిఁ
దన శరీరంబునం దొక్క యనుపయుక్త-మైన యవయవ మది పోయినట్టులుండె.

'ఇతఁ డెవఁడని తన్నడిగిన-నెతఁడని ప్రత్యుత్తరంబు నీఁగల?' ననియే
యతనికి సందేహం బా-యతిసందేహంబు పోయె నతని కిపు డొగిన్.

కాని యొకింతలో నతనికష్ట మభావపదార్థమందులన్
లీనత జెందునట్టులను లేదు. తురుష్కుఁ డెవండొ వచ్చి యా
కానఁగరాని వాని పలుగ్రంథము లెంచి లిఖించుచుండుటన్
వానికిఁ దొంటికంటె నొకవైభవమే కనుపట్టె నెక్కుడై.

'వీఁడునన్ వానిబోలిన పిచ్చివాఁడు-వ్రాసికొనుఁగాక యాపిచ్చివ్రాఁత లన్ని'
అనుకొనుచు నాత్మయందుల నపహసించు-కొనియె నాధర్మసింహుండు కొన్నినాళ్లు.

అల్లముకుందుని నుడి వ-ర్ధిల్లఁగ భాషాంతరీకరించినపయి నా
యల్లా గొలుచుచునుండెడు-ముల్లా మోమెత్తి పద్యమును గనె గోర్కన్.

కనుఁగొని దాని వ్రాసికొని క్రన్నన దచ్చరితం బలంతిగా
జనములు చెప్పఁగా విని విచారము చెంది యనంతరంబు త
జ్జనపతివద్ద నాజ్ఞగొని చయ్యన నగ్బరుశాహిపాలికిం
జనుచు ముకుందు గ్రంథములు సర్వములున్ వినిపించె నాదృతిన్.

విన్నపయిని నగ్బరు 'నే-నెన్నాళ్లకు దేశభాష నిట్టికవితలన్
విన్నాఁడ?' నంచు'నయ్యా!-యెన్నే ళ్లాతనికి? నాతఁ డెటులుండు?' ననన్.

ఆతనిప్రాయమున్ మఱియు నందముచంద మెఱుంగఁగాని య
ల్లాతని సత్కవిత్వమును నద్దమునందు వయోవిహీనపూ
జ్యోతిగఁ గానఁబట్టు ననియున్, గవి పోవుచుఁ జెప్పు పద్య మా
నేతకుఁ బారసీకవి గణించుచుఁ దెల్పిన నాతఁ డిట్లనున్.

'ఈనరపాలుఁ డిట్టిఁడని యే ననుకోఁగను లేదు కాని యి
ద్దానికి నేనె కారణము దానిని బైనిని జూచికొంద మా

స్థానకవీశునిన్ వెడలఁదోఁచినవానిని ఖైదు చేయఁగా
నేను గవీశుపద్యమును నయ్యెడ గోడను వ్రాయఁగా నగున్.'

3

అట్టు లక్బరుపాదుషాయాజ్ఞ గాఁగఁ-గొట్టునం దెట్టయెదుటిదా గోడమీఁద
నక్కవీంద్రుని పద్యంబు చెక్కఁబడియెఁ-బెట్టఁబడె ధర్మసింహుఁ డాకొట్టునందు.

కారాగారమునందు రాజుదరి కక్బర్ పాదుశా యేఁగి 'య
య్యా! రాజా! గ్రహియించియుందు భవదీయంబైన బందిత్వ మీ
ఘోరావాసము చాలఁ గష్టమగు నీకుంగాను వేఱొక్కఁ డీ
కారన్ నిల్చున యేని నిన్ విడుతు' నాఁగా ధర్మసింహుం డొగిన్.

తల వంచి 'అయ్యా! నామం-డలమునఁ జాటింపుఁ డొకఁడు నామిత్రుఁడు తా
వెలసినచో విడిపింపఁగఁ-గలఁ' డనె నల శాహియాజ్ఞ గని భటు లంతన్.

ధర్మసింహుని దేశ మంతయును దిరిగి-రాజు చెఱఁబడె ఆతని ప్రజలు మీర
లెవ్వ రేనిని జెఱ నుందు రేని యతని-విడుతురంచును టమటమా వేసి రంత.

మాకు నోంకార మల్లాకు మాఱు నటంచు బ్రాహ్మణుల్ మోములు వాంచుకొనిరి
వర్ణంబులో పలివారము మే మెటుల్ వత్తు మంచును రాచవారు చనిరి
వారివర్ణమువారె వారిని వదలఁగా మాకేల యంచుఁ గోమటులు చనిరి
మనకుఁగా నెపుడేని మహిపుఁడు చెఱయందుఁ జొచ్చునా? యంచును శూద్రు లనిరి
మాలలును మాదిగలు నందు మనలఁ జేర్చు-కొనఁగ నీరని లో ననుకొనిరి పెలుచ
ఈ యసాహాయ్యకంబును నెంచిమొంచి-ధర్మసింహుండు చెఱయందు తాప మందు.

'నాయుద్యోగుల నెంతమంది పెలుచన్ ద్యాగంబు గావించి నా
నో యల్లాఁ దఱలెక్క లేదుగద యీయుద్యోగియం దేసికల్
స్వాయత్తం బయి యున్నవో యెఱుఁగ నా కారార నాభాష రా
దాయెన్ దక్కవి నెట్లు నేఁ దెలియఁగా నోవాఁడ రామా, హరీ!

'మతిమంతుల్ జగమందులం గవితయన్ మాటే నెఱుంగన్ సమ
ర్థత లేనట్టిరు లేరొకో యలకవిం దర్శించి భర్జించి కొ
ట్టితినా తిట్టితినా? ననుం జెఱను బెట్టింపంగ న్యాయ్యంబొకో
వితగాఁ దోఁపవె పాదుషాపను లోగిన్ విన్నట్టి యెవ్వారికిన్.

'అల కవి నాదువార్త విని యాతురతం బఱతెంచి నాచెలిన్
వెలలఁగఁజేయునేనని గణించుచు నాతనిలోన నేదియో
వెలగల వస్తువున్నదని వేడుక చెందెదఁ గాని నాఁడు వాఁ
డలకని వాఁ డకబ్బరును నంతకునుం బయివాఁడు చూడఁగన్.'

అనుచున్ బోనునఁ బెట్టఁగాఁబడిన పెన్ వ్యాఘ్రంబు చందంబునన్
మనమందుం గినుకన్ మనంబుననె పొందంజేయుచుం బాదుషా
కును విద్వత్కవికిన్ ముకుందునకు జంకుం గింకనుం బూనుచుం
గనుచుండెం జెఱి యన్నివైపులను నాకాశంబునన్ భూమినిన్.

౪

ఈవృత్తాంతమునుం గణేశునకు నెంతేఁ దెల్పఁగాఁబోలుఁ దాఁ
గ్రైవాలెన్ రవి ద్వారపాలురు గవాక్షంబుల్ కవాటంబులున్
వేవే మూయఁగఁజొచ్చి రప్పు డొకఁ డావేగంబుతో మూయఁగాఁ
బోవంగాఁబడు తల్పుజంట నడుమం బొల్పార నిల్వంబడెన్.

నిలిచిన వాని గాంచి పృథివీపతి మెల్లన 'నీవెనీవె! నా
యలఁతను నేడ వింటి వసహాయుఁడ నం చనుకొంటిఁగాని నీ
కలిమిని నే సహస్రగుణకంబుగనున్ ససహాయుఁడం జెలిం
దలఁచుచుఁ దొల్లి భీతిలితి దానిని స్వర్గముఁ జేసి తెంతయున్.

'తాళిం గట్టిన యా లెఱుంగని యవంధ్యంబైన ప్రేమంబు మి
త్రాళుల్ భావనయం దెఱుఁగని మహోదార్యంబు సద్ బంధువుల్
శ్రీలాభంబున కేని తా మొనరుపన్ లేకున్న ధైర్యంబు నీ
వీలోఁ జూపితి వోముకుందకవి! ని న్నెట్లెత్తు నీకారకున్?'

అని ధర్మసింహుఁ డాతని-కి నమస్కారంబు చేసి కీర్తించినఁ దా
విని విని ముకుందుఁ డల్లన - ననిమె 'మహారాజ! ననుఁ గటాక్షింపఁగదే.

'ఏలినవారి చిక్కునకు నేఁగద కారణ మెట్టు లంటిరా
యే లలినేని నీవు చనుమీయని యేనియు జీత మీయఁగాఁ
జాల మటంచు నేని యొకసాకు వచింపరు నేనె పోయి మీ
షాలి కకారణంబుగ నృపా! చెఱసాలగ నైతి నక్కటా!

'ఆతని పుణ్యంబా యని - యీతఁడి నొకపూఁట దొరకె నీకవి దోషం
బేతదుపాయంబున నో-హో తీఱఁగనగును రాజ, యొకకొం తేన్నిఁ.'

అని ముకుంద సుకవి యల ధర్మసింహుతోఁ-బలికి ద్వారపాలుఁ గలయఁ గాంచి
'వీఁడు పూఁట వచ్చినాఁ డింక మారాజు-మాకు వదలుమయ్య మీకు శుభము.'

అనుచుం బల్కిన పాదుషాదరికిఁ బో నాయత్తుఁ డౌ ద్వారపా
లు నిషేధించుచు రాజు పల్కెను నిటుల్ 'పూర్వంబునం దీవు ప
ల్కిన పూఁటన్ గణియింపఁగా వలదు స్వర్గీభూత మీకొట్టు నా
కని యాయగ్బరుపాదుశాహికిని నా యభ్యర్థనం జెల్పుమా!'

నే నిచ్చట నుండెద నన-నేనిచ్చట నుందునంచు నీతిరుగ భూ
జానికిఁ గవికి నడీన న-వీనప్రేమమున జరిగె వివాదంబుల్.

ఆవివాదమధ్య నాద్వారపాలుండు-నలుసు జాతిపోవు లలిని జాతి
పోయి యగ్బరునకు నాయాయివార్తలు-తెలియఁజేసెఁ దేటతెల్లముగను.

౫

చలువచేసిన తెల్లచల్లడంబు షరాయి కడఁద్రోసి యొకగూడకట్టు కట్టి
సరిగకంగులతోడ సంగతంబైన యంగీని బోనాడి లుంగీని దొడిగి
వజ్రముక్తాఫల ప్రచురహా తలపాగ మాఱిచి తలకు రుమాలుచుట్టి
జలతారుతీఁగల జిలుగు ముచ్చెలవీడి పలుచని యాకు జెప్పలను దొడిగి
శౌర్యమొంతయు భక్తిమై చౌకళింపఁ-దాను జేసినదోషంబు తలఁగఁజేసి
కొనఁగఁ బెల్లు ప్రాయశ్చిత్తమును నొనర్పఁ-నటు లకబ్బరు భూవరుఁ డటకు వచ్చి.

'మామహారాజువలన నస్మద్గృహంబు-పావనము చేసితివి కవిభద్ర' యంచు
నాతనికిఁ దానమస్కార మాచరించి-క్రచ్ఛఅను ధర్మసింహుని గౌఁగిలించి.

'నీదియుఁ గాదు నీదియును నిక్కముగాఁగను గాదు మీపనిం
వాదము మానుకొం డిటను వాస్తవమర్థు విచరింతుఁ గారలో
నాదినినుండి యంతమున కంతయు నాయది దాన నేనె స
మ్మోదముతో వసింతు' నని ముదలకుం దగ వచ్చి యంతటన్.

'రాజా లోపమునాది మీ కెవరికిన్ రాడ్భాష యేకాని మీ
శ్రీ జాల్వారెడు జన్మభాష యిచటం జెప్పింపనైతిం గథా
బీజం బిద్ది స్వభాష నేర్చితివయేన్ విజ్ఞుం గవిబ్రహ్మ నీ
వీ జన్మానకు వీడఁగాఁ గలవొకో యేహేతు వేతెంచిరన్.

'కావున జన్మభాష యధికంబుగ నీకది వచ్చునంతకున్.
నే విధియించుకొంటి నొకనీతిగ నీచెఱ నీవు పోయి యీ
ధీవరుఁడౌ ముకుందుకడ దేశపుభాషను నేర్చి పూర్తి కాఁ
గా విడిపింపుమీ నను గారనునుండి దయార్ద్రబుద్ధివై.'

నావుడు ధర్మసింహజననాథుఁ డకబ్బరు వైచికొన్న శి
క్షా విషయంబు తా వినుచుఁ జచ్చిన చావయిపోవ 'రాజరా
జా, విషమంబుగా విధి పొసంగెను నాయెడ; తల్లి యట్టులం
గావుము నాదుదోషమును గారను నన్నె యుఁడ నిమ్మొగిన్.

'ఎఱుఁగిక నేస్తకాండ్రురమాట విని కవిముఖ్యుఁ జేకొనుటయే మొదటిదోసఁగు
చేకొన్నతరువాతఁ జెలువార మాభాష యభ్యసింపమియ రెండవదోసఁగు
అభ్యసింపనిమాట యటులుండె నీతని నాదరింపమియు మూఁడవదోసంగు
ఆదరింపకపోవు టటుపోయెఁ జివరకు నవమతిచేఁత నాల్గవదోసంగు
ఇన్ని దోసఁగులు చేసిన నన్ను విడిచి-నిన్ను నాకయి చెఱలోన నింతువొక్కొ?
ఇంతనింతను జెఱవీఁగి యెట్లు నన్ను-బ్రదుకు మని పంపువాఁడ వోపార్థివేంద్ర!

'చెఱసాలన్ ననుఁ బెట్టి యీ సుకవిచే శిక్షింపఁగాఁ జేసి యే
త్తైఱ నాభాషను నేను నేర్చుపయినే దేవా! తగన్ నా కొగిన్
దొరకంగావలెఁగాక ముక్తి; పృథగా దోషం బుపేక్షింతువే?
దొరలే శిక్ష యొనర్పకున్న యెడలం దోడ్తోఁ బ్రజల్ నిల్తురే?'

ఇప్పగిదిన్ వచించు జగతీశ్వరుఁ గన్గొని పాదుషా 'యొహో
తప్పది నాది రాష్ట్రముల దర్పముచేత జయించినంత నే
కప్పము నాదిగాని వితగాఁగ స్వభాషల మార్చి మాదు వా
కప్పము మీకుఁ గట్టు టది కానిది కూడని దెంత యేనియున్.

'ఇంపుగ మాతృభాషలను నిచ్చటిరాజుల కొక్కనాఁడు చె
ప్పింపమి నీముకుందకవివీరునివంటి కవీశు లెంద ఱే
తంపిని బొందినా తెలివి తక్కువచేత నడంగినారొ యో
జింపుము తప్పు నాదొ నృపశేఖర! నీయదొ యీముకుందుదో?

'కానం జేసిన తప్పు దిద్దికొన నీకారాగృహం బందులన్
నేనే యుండుట న్యాయ్యమై పొసఁగెడున్ నీ వీకవీశానుతో
నానా కావ్య కలాకలాపములకున్ నాథుండవై యెంతవే
గానన్ నన్ విడిపింతువో కనుదు నింకన్ శంక లేకేఁగుమీ.'

అంచుం జెప్పి ముకుందపండితునితో 'నయ్యా, మహీపాలునిం
గొంచుంబోయి స్వశిష్యుఁ జేసికొని నాకున్ బంధముం బాపుమీ'
యంచుం బల్కి నమస్కరించి వడిగా నవ్వారి నవ్వారి బం
పించెం దా నలకొట్టునందు నిలిచెన్ విజ్ఞోపదేశంబుగన్.

౬

అంత ధర్మసింహుఁ డనితర బుద్ధియై-యాఁల ముకుందుకడను నధికభక్తి
దేశభాషఁ బలుచఁ దెలియంగ మొదలిడె-అన్నపానములను నాస్థ విడిచి.

ఈ యూఖ్యానము సర్వదేశములలో నెంతేని వ్యాపింపఁగా
నాయాయీ నరపాలు రెల్లరు స్వకీయంబైన సద్భాష య
ధ్యేయంబంచుఁ దలంచి పండితులతోఁ దేలాడి వ్యాసంగముల్
చేయం జొచ్చిరి తేనిరీతిఁ బ్రజలుం జెన్నారువారల్ కదా!

తనకోస మగ్భరు జనపాలవర్యుండు చెఱసాల యందుల శిక్ష గనుట
తనను గారాగారముననుండి విడిపింప వడిగ ముకుందుండు వచ్చియుంట
తా నొనర్చిన ప్రమాదం బది పదిమంది ప్రజలలోపలఁ జొఱఁబడినదగుట
తా నభ్యసింపఁగాఁ దగు వాఙ్మయంబు జన్మంబుతోడను వచ్చు మంత్రమగుట
అక్బరునకును జెఱనుండు నట్టి వేడ్క - కొలఁది తీఱకమునుపె యాకుతలభర్త
పదుగురును జెప్పుకొనఁదగు పండితుఁడయి - పాదుషా నలచెఱనుండి పాపికొనియె.

ఈకరణిం దురుష్కపతి యీఁగి చెలున్ 'నరపాల! నీదు న
ప్రాకృతబుద్ధివైభవము బట్టుగతిన్ స్వమతిన్ నుతింపనా?
లేక ముకుందు బోధనల లీలకుఁ జేతులు దోయిలింపనా?
నాకును మీరు చేకుఱుట నాసుకృతంబని నాట్యమాడనా?

'నీ వరిగాపవు నాకుఁ - గావుట యటు లుండె నిపుడు నాయాస్థానిఁ
భూవర! విద్వాంసుఁడవై - నావేడుక తీర్పు' మని యనంతర మందుఁ.

'కవిబ్రహ్మ! వాగ్దేవి కానంగ రాఁగా-నెవండేనిఁ గొండాడు నే పొందునేఁ
నివాళింపఁగానేర్తునే నిన్ను నింకఁ-భవత్సత్కవిత్వప్రభావంబు డంబుఁ.

'కవివర! నీవొక కేవల - కవి వొక్కో? నీదు రాజగౌరవమును నా
దవు తప్పు దిద్దఁగల ద్ర-ష్టవు కావా? యింక నాదు చనవును వినుమీ!

'నీ వల ధర్మసింహ ధరణీవరు సత్కవివౌట నాతఁడుఁ
నావిషయంబునందుల ననన్యమనస్కత నొప్పచుండెడుఁ
గావున నాదు నోలగమునఁ సిరిమెంతయు నావహిల్లఁగా
నీవును నిల్చి దాని నిఁక నిత్యము బ్రహ్మసభం బొనర్పుమా!'

అని ప్రార్థించిన.

అల ధర్మసింహుఁ డగ్బరు-పలికిన పలుకులకుఁ దలను వంచుకొనుచు మాఱ్
పలుకకయుండె ముకుందుఁడు-పలికెను బెను పలుకుబడిని బ్రతివచన మిటుల్.

"తనదు బాసకన్న తల్లి యెవ్వానికి-సత్య మన్యభాష సవతితల్లి
'తనదు ధర్మమందు తాను బ్రగ్గుట లగ్గు-అన్యధర్మ మది భయావహంబు."

"చెఱనుండి సరస్వతికిం-జెఱ విడిపించితివి నీకు శ్రీరస్తు! మహా
నరపాలురకుఁ దురాయివి-దురాయి వీక దండి పండితులకును నెల్లఁ."

"ఆరామంబు లగణ్యపుణ్యము లరణ్యంబుల్ కవిత్వానికిఁ
సారంబై తగు జన్మభూములు నృపాస్థానంబు లత్తింప్లు గా
వా? రాజా! యెపుడేని నాకవిత తానర్థించుచో వచ్చెదఁ
మీరల్ పిల్చినయేని వెంటఁగొని నే మిత్రంబనై వచ్చెదఁ."

అను చా యగ్బరుతో వచించి తన కుమ్యాలించి రమ్మంచుఁ బ్రా
ర్థనముం జేసెడు ధర్మసింహునకు నాప్రస్తావమే చెప్పిపో
యెను. ఆ పిమ్మట వారు మూవురును దా మేఁకోటఁ బ్రేమంబుతో
నిను మాత్రైనను గూడకుండఁ జనరై రెన్నే పనుల్ వచ్చినఁ.

---

# 'అధ్యాత్మ, వాల్మీకి రామాయణములందలి కథాభేదములు

పారనంది సర్వేశ్వరశాస్త్రి గారు

రామాయణ మనగా శ్రీ సీతారాముల చరిత మని భావము. ('రామస్యాయనం రామాయణం. అయగతా వితిధాతో ర్భావేల్యుట్ రామచరిత మిత్యర్థః...రామః అయనం ప్రతిపాద్యోయస్యేతివా రామాయణం. రమయా ఇదం చరితం రామం తస్యాయన మితివా వ్యుత్పత్తిః అని శ్రీమద్రామాయణ వ్యాఖ్యాతలు వ్రాసిరి.)

సీతారాముల నామస్మరణము, పూజయు, ధ్యానము నైహికాముష్మిక ఫల ప్రదములు. వారి చరిత్ర మతి పవిత్రము. అట్టిరామాయణము లనేకములు కలవు. అందు పఠన పాఠన శ్రవణాదులచే సత్పురుషులు వాడుక చేయుచున్నవి శ్రీమద్వాల్మీకిరామాయణము, అధ్యాత్మరామాయణము, అను రెండాగ్ర గ్రంథములు. వాటిలో పరస్పరము కొన్ని కథాభేదము లిట్లు చెప్పబడినవి.

## ౧. శ్రీరామావతారకారణము

వాల్మీకి రామాయణము-బాలకాండ-౧౫ సర్గము

శ్లో. "తతో దేవాస్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
భాగప్రతిగ్రహార్థంవై సమవేతా యథావిధి. ౪.
తాస్సమేత్య యథాన్యాయం తస్మిన్ సదసి దేవతాః
అబ్రువన్ లోకకర్తారం బ్రహ్మాణం వచనంమహత్. ౫
భగవన్ త్వత్ప్రసాదేన రావణో నామరాక్షసః
సర్వాన్నో బాధతే వీర్యాచ్ఛాసితుం తం నశక్నుమః. ౬
...వధార్థంతస్యభగవ న్నుపాయం కర్తుమర్హసి. ౧౧
తస్మాత్సమానుషా ద్వధ్యోమృత్యుర్నాన్యోఽస్యవిద్యతే. ౧౪
ఏతస్మిన్నంతరే విష్ణు రుపయాతో మహాద్యుతిః. ౧౫
తమబ్రువన్ సురాస్సర్వేసమభిష్టూయ సన్నతాః. ౧౬
రాజ్ఞోదశరథస్యత్వం అయోధ్యాధి పతేః ప్రభోః
విష్ణో! పుత్రత్వమాగచ్ఛకృత్వాత్మానం చతుర్విధం ౧౯
సమరేజహి రావణం. ౨౦

ఏవముక్తస్తు దేవేశో విష్ణుస్త్రిదశపుంగవః
అబ్రవీ త్త్రిదశాన్ సర్వాన్ సమేతాన్ ధర్మసంహితాన్. ౨౬
భయంత్యజత భద్రం వో హితార్థం యుధిరావణమ్
హత్వాక్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహం
వత్స్యామి మానుషేలోకే పాలయన్పృథివీ మిమాం.

అనియున్నది. అనగా—

దశరథుడు పుత్రకామేష్టి జేయుచుండగ నపుడు హవిర్భాగములకై వచ్చిన దేవతలు, ఋషులు బ్రహ్మతో నిట్లనిరి:

'నీవిచ్చిన వరములచే నజేయుడైన రావణాసురుడు మమ్ములను మిగుల బాధింపుచున్నాడు' అని. అంత బ్రహ్మ మనుష్యునిచే వాడు వధ్యుడని యుపాయము నాలోచింపుచుండ శ్రీవిష్ణువుగూడ హవిర్భాగమునకై యచటికి వచ్చెను.

'దశరథునకు బుత్త్రుడవై నీవు రావణుని సంహరింపవలయు'నని తనను ప్రార్థించి పలికిన బ్రహ్మాదుల పల్కుల నాలించి శ్రీవిష్ణుమూర్తి తథాస్తని పలికెను. అని భావము.

అధ్యాత్మరామాయణము. బాల. ౨ సర్గ.

శ్లో. 'భూమి ర్భారేణ మగ్నా దశవదనముఖా
శేషరక్షో గణానాం
ధృత్వా గోరూప మాద్యా దివిజమునిజనై
స్సాకమబ్జాసనస్య
గత్వాలోకం రుదంతీ వ్యసనముపగతం
బ్రహ్మణే ప్రాణసర్వం
బ్రహ్మా ధ్యాత్వాముహూర్తం సకలమపి హృదా
వేద శేషాత్మకత్వాత్. ౬
తస్మాత్ క్షీరసముద్రతీర మగమ
ద్బ్రహ్మాపి దేవై ర్వృతో

దేవ్యాచా ఖిలలోకహృత్ స్థమజరం
సర్వజ్ఞ మీశం హరిం,
అస్తౌషీచ్ఛ్రుతిసిద్ధనిర్మలపదై
స్తోత్రైః పురాణోద్భవై
ర్భక్త్యా గద్గదయా గిరాతివిమలై
రానందబాష్పైర్వృతః 2
తతస్సన్నిగత్సహస్రాంశు సహస్రకసదృశసభః
ఆవిరాసీద్ధరిః ప్రాచ్యాం దిశాం వ్యపనయం స్తమః.7

బ్రహ్మ—

భగవన్ రావణో నామ పౌలస్త్య తనయో మహాన్
...అత స్త్వం మానుషో భూత్వా జహి దేవరిపుం ప్రభో!

భగవాన్—

కశ్యపస్య వరోదత్త స్తపసాతోషి తేన మే
యాచితః పుత్రభావాయ తథేత్యంగీకృతం మయా స్తి
సఇదానీం దశరథభూత్వా తిష్ఠతిభూతలే
తస్యాహం పుత్రతామేత్య కౌసల్యాయాం శుభేదినే
...యోగమాయాపిసీతేతి జనకస్య గృహే తదా
ఉత్పత్స్యతే తయాసార్ధం సర్వం సంపాదయామ్యహం.

రావణాదిరాక్షసభారమును సహించలేక భూమి గోరూపము దాల్చి బ్రహ్మలోకముఁ జేరి యాతనితో నీసంగతి చెప్ప నతడు నీమెతోగూడ క్షీరసముద్రమునకేగి విష్ణువును ప్రార్థించి తమకుగల్గిన బాధను తన్నివృత్త్యు పాయమును విన్నవింప నతడు అదితికశ్యపులకు నే నిచ్చిన వరముచొప్పున ప్రస్తుత మదితికశ్యపులై భూలోకమున నున్న కౌసల్యా దశరథులకు పుత్త్రుడనై యపుడు జన కునియింట సీతయైయున్న యోగమాయతోగూడ రావ ణుని సంహరింతునని పలికెను. (అని భావము)

## 2. శ్రీరామావతారము

వాల్మీకి బాల. 18 సర్గ. శ్లో. 105.

'కౌసల్యాజనయద్రామం సర్వలక్షణసంయుతం
విష్ణోరర్ధం మహాభాగం పుత్త్రమైక్ష్వాకువర్ధనం.'

అని సాముద్రికశాస్త్రమందు చెప్పబడిన సకల శుభ లక్షణములు గల్గి విష్ణుచిహ్నములు లేని మనుష్యరూపము తోడనే శ్రీరాములవతరించిరని భావము.

అధ్యాత్మ. బాల. 3 సర్గ. శ్లో. మొదలు.

'ఆవిరాసీజ్జగన్నాథః పరమాత్మా సనాతనః
నీలోత్పలదళ శ్యామః పీతవాసాశ్చతుర్భుజః...
శంఖచక్రగదాపద్మ వనమాలావిరాజితః.

కౌసల్యా—

ఉపసంహర విశ్వాత్మన్నదో రూపమలౌకికం
దర్శయస్వమహానంద బాలభావం సుకోమలం
లలితాలింగనాలాపై స్తరిష్యా మ్యుత్కటంతమః. 28

భగవాన్—

యద్యదిష్టంతవా స్త్యంబ తత్తద్భవతు నాన్యథా. 30
ప్రార్థితో రావణంహంతుంమా నుమ.ప్యముపాగతః. 31
అని.

శంఖచక్రాద్యాయుధములు, చతుర్భుజములు మొదఁగు విష్ణుచిహ్నములు గల్గి శ్రీ విష్ణువు కౌసల్యా గర్భమున పుట్టగనే యామె భగవంతు డీతడని తెలిసి కొని. 'ఈ యలౌకికరూపమును చాలించి నీవు ప్రాకృత బాలరూపమును చూపుము. నీ బాల్యక్రీడావినోదములను చూచి యానందింతు, నని చెప్పగ 'సరే' అని విష్ణువు ప్రాకృత బాలు డాయెననియు; రావణవధార్థమై విష్ణువ నగు నేను ఇట్లు అవతరించితినని శ్రీరాములు తల్లితో చెప్పినట్లును యున్నది.

## 3. నారద విజ్ఞాపనము

అధ్యాత్మ. అయో. 1 సర్గ.

శ్లో. 'ఏకదా సుఖమాసీనం రామం స్వాన్తఃపురాజిరే
సర్వాభరణసంపన్నం రత్నసింహాసనే స్థితం. 1½
...నారదోవతరద్ద్రష్టుమంబరాద్యత్ర రాఘవః.' 3
ఉవాచవచనంరామం బ్రాహ్మణాచోదితోస్మ్యహం.
రావణస్యవధార్థాయ జాతోసి రఘుసత్తమ
ఇదానీం రాజ్యరక్షార్థం పితాత్వామభిషేక్ష్యతి. 33
యదిరాజ్యాభిసంసక్తో రావణం నహనిష్యసి
ప్రతిజ్ఞాతేకృతారామ భూభారహరణాయహై. 34
తత్సత్యం కురురాజేంద్ర సత్యసంధస్త్వమేవహి
శ్రుత్వైతన్నారదోదితం రామో నారదం ప్రాహసస్మితం. 35
...రావణస్యవినాశార్థం శ్వోగంతా దండకావనం
...సీతామిషేణతందుష్టం సకులం నాశయామ్యహం.'

అని యున్నది.

శ్రీరాములు సీతను పెండ్లాడి పరశురాముని పరాభూతునింజేసి తన యంతఃపురమున హాయిగ సీతతో సకల రాజభోగముల ననుభవింపుచునుండ నారదమహాముని యచటికి దయచేసి 'శ్రీరామా! బ్రహ్మ నన్ను పంపెను. రావణుని సంహరించుటకు నీవు జన్మించితివి. నీతండ్రి ఇపుడు నిన్ను యౌవరాజ్యపట్టాభిషిక్తునిచేయును. నీవు రాజ్యభోగాసక్తుడ వగుదువేని నీప్రతిజ్ఞ ఏమగును? సత్యప్రతిజ్ఞుడవు కమ్ము; అని చెప్పగ, 'రేపు రావణవధార్థమై దండకారణ్యమును గూర్చి వెళ్లగలను' అని శ్రీరాములు చెప్పిన ట్లున్నది.

వాల్మీకి రామాణములో నీసంగతియే లేదు.

## ౪. శ్రీరాములు పరమాత్మ యని రావణాసురు డెరుంగుట

అధ్యాత్మ. అరణ్య. ౫ సర్గ. రావణవాక్యములు.

శ్లో. 'యద్వా న రామో మనుజః పరేశో
మాంహన్తుకామస్సబలం బహూపైః
సంప్రార్థితోయం ద్రుహిణేనపూర్వం
మనుష్యరూపోఽద్యరఘోః కులేఽభూత్.' ౫౬
'వధ్యోయది స్యాం పరమాత్మనాహం
వైకుంఠరాజ్యం పరిపాలయేఽహం
నోచేదిదం రాక్షసరాజ్యమేవ
భోక్ష్యేచిరం రామమతో వ్రజామి.' ౬౦
'ఇత్థంవిచింత్యాఖిలరాక్షసేంద్రో
రామం విదిత్వా పరమేశ్వరం హరిం
విరోధబుద్ధ్యైవహరిం ప్రయామి
ద్రుతం న భక్త్యా భగవాన్ ప్రసీదేత్.' ౬౧

అని.

దండకారణ్యమున ఖరదూషణాదులతోను (పదునాలుగువేలు రాక్షసులను) యామార్థకాలములో శ్రీరాము లొక్కరు సంహరించిరని శూర్పణఖ రావణునితో చెప్పినపిదప "శ్రీరాముడు మనుష్యమాత్రుడు కాడు. బ్రహ్మచే ప్రార్థితుడైన పరమేశ్వరుడే, నన్ను సంహరించుటకు ఇట్లు మనుష్యరూపము దాల్చెను. ఆతనిచే నేను సంహరింపబడుదునేని వైకుంఠరాజ్యము బాలింతును లేనిచో ఈ రాక్షసరాజ్యము సుస్థిరమగును భక్తిచే భగవంతుడు శీఘ్రముగ ప్రసన్నుడుకాడు. గాన విరోధబుద్ధితోనే రామునియొద్దకు బోవుదును" ఇట్లు రావణుడు నిశ్చయించుకొనెను.

వాల్మీకి. అరణ్య. ౩౬ సర్గ.

శ్లో. 'పిత్రానిరస్తః క్రుద్ధేన సభార్యః క్షీణజీవితః
సహంతా తస్య సైన్యస్య రామః క్షత్రియపాంసనః
దుశ్శీలః కర్కశస్తీక్ష్ణో మూర్ఖో లుబ్ధో జితేంద్రియః
త్యక్తధర్మోహ్యధర్మాత్మా భూతానామహితేరతః.'

ఇందులో శ్రీరాములు భగవంతుడని రావణు డెరిగినట్లు లేదు. సరేకదా. రాముడు క్షత్రియమాత్రుడని భావించి యాతని నిందించుచున్నట్లున్నది.

## ౫. మాయాసీత

అధ్యాత్మ. అరణ్య. ౭-సర్గ.

అథ రామోఽపితత్సర్వం జ్ఞాత్వారావణచేష్టితం
ఉవాచసీతామేకాంతే శృణు జానకి మేవచః. ౧
రావణోభిక్షురూపేణ ఆగమిష్యతి తేన్తికం
త్వంతుఛాయాంత్వదాకారాంస్థాపయిత్వోటజేవిశ.
అగ్నావదృశ్యరూపేణ వర్షంతిష్ఠ మమాజ్ఞయా
రావణస్యవధాంతేమాంపూర్వవత్ప్రాప్స్యసేశుభే. ౩
శ్రుత్వారామోదితంవాక్యం సాపితత్రతథాకరోత్
మాయా సీతాంబహిఃస్థాప్య స్వయమంతర్దధేనలే. ౪

అని.

రావణుడు చెప్పినప్రకారము మారీచుడు మాయామృగమైవచ్చిన పైని యాసంగతినెరిగి సీతతో శ్రీరాము లిట్లనిరి. 'రావణాసురుడు నీవద్దకు భిక్షుకుడై వచ్చును. గాన నీవు నిజస్వరూపమును అగ్నియందొక వత్సరము నాయాజ్ఞచేనుంచి నీయాకారముగల ఛాయ (మాయసీత.) ను సృష్టించి దానినే బహిరంగముగ నుంచుము. రావణవధానంతరము నీవు (అగ్నినుండిపైకివచ్చి) నన్ను ఎప్పటివలె పొందగలవు' అని చెప్పగా, సీత యాప్రకారము చేసెను. మాయాసీతయే మాయామృగమును తెమ్మనెను. అని భావము

వాల్మీకములో:—ఈమాయాసీతాసృష్టిని మూలములో స్పష్టముగ చెప్పలేదు. రావణవధానంతరము సీతాగ్నిప్రవేశమైన పిమ్మట తిరుగా నగ్ని శ్రీరాములకు సీతాసమర్పణము చేయునపుడు 'ఏషా తే రామ, వైదేహీ పాపమస్యాన విద్యతె' (యుద్ధ. ౧౨౧ సర్గ-౫ శ్లో) అని చెప్పెను. దీని వ్యాఖ్యానమున 'ఏషా యాపూర్వంమయి ప్రవిష్టాసైషేత్యర్థః ఏతేనమాయాసీతాగ్నింప్రవిష్టాసాక్షాత్సీతాగ్నినాదత్తేప్రత్యుక్తమ్.

అని గోవిందరాజార్యులు వ్రాసిరి.

## ౬. సీతాపహరణము

అధ్యా. అరణ్యా. ౭ సర్గ శ్లో.

'తతోవిదార్యధరణీం నఖైరుద్ధృత్యబాహుభిః
తోలయిత్వారథేక్షిప్త్వాయయాక్షిప్రంవిహాయసా.

సీతను రావణుడు స్పృశింపకయే ఆమె యుండు భూభాగమును (పెల్లను) గోళ్లచే బ్రద్దలుచేసి ఆపెల్లతోనె సీతను రథము పైనుంచికొని వెళ్లెనని యున్నది.

వాల్మీకి. అరణ్యా. ౪౯ సర్గ.

శ్లో. 'వామేన సీతాంపద్మాక్షీంమూర్ధజేషుకరేణసః
ఊర్వోస్తు దక్షిణేనైవపరిజగ్రాహపాణినా. ౧౩

అని సీతనుస్పృశించినట్లు చెప్పబడినది.

## ౭. రావణుని పాతాళహోమము

అధ్యాత్మ. యుద్ధ. ౧౦ సర్గ.

శ్లో. 'గుహాంపాతాళసదృశీంమందిరేస్వేచకారహ ౧౦
...గుహాంప్రవిశ్యచైకాంమానీ హోమంప్రచక్రమే,
...'తతశ్చసరమానామప్రభాతే హస్తసంజ్ఞయా
విభీషణస్యభార్యాసాహోమస్థానమసూచయత్. ౧౮

ఇంద్రజిద్వధానంతరము రావణుడు (పాతాళ) హోమమును చేసినట్లును, ఆహోమస్థానమును విభీషణుని భార్యయగు 'సరమ' హస్తసంజ్ఞచే వానరసైన్యమునకు సూచించినట్లు నున్నది.

వాల్మీకములో:— ఈహోమమే చెప్పబడలేదు.

## ౮. కాలనేమి చరిత్రము

అధ్యాత్మ. యుద్ధ. ౭ సర్గ శ్లో.

'తస్మిన్ మహాశ్రమేరమ్యేకాలనేమి స్సరాక్షసః
ఇంద్రయోగం సమాస్థాయచకారశివపూజనం, ౧౧
...'విసృజ్యమునివేషంసకాలనేమి ర్మహాసురః ౩౧
యుయుధే వాయుపుత్రేణ నానా మాయావిధానతః
...తతస్సుప్తోత్థిత ఇవబుద్ధ్వాప్రోవాచలక్ష్మణః'౧౭

లక్ష్మణమూర్ఛను పోగొట్టుటకు ద్రోణాచలమును తెచ్చుటకై యాంజనేయులు వెళ్లుచుండగ నీసంగతి నెరిగిన రావణుడు కాలనేమియను రాక్షసుని ఆంజనేయప్రయత్నమునకు విఘ్నముచేయుమని బంప నక్కాలనేమికపటమునివేషము దాల్చియుండగ క్రమముగ వీనికపటవ్యాపారమును మారుతి తెలిసికొని వానిని సంహరించియోషధిపర్వతమును తెచ్చి లక్ష్మణమూర్ఛను పోగొట్టెను. అని యున్నది.

వాల్మీకములో:—లక్ష్మణమూర్ఛయు, తన్నివారణమును ఉన్నవిగాని ఈకాలనేమిచరితము చెప్పబడలేదు.

## ౯. రావణవధ

అధ్యాత్మ. యుద్ధ. ౧౧ సర్గ శ్లో.

'శతమేకోత్తరం భిన్నంశిరసాం చైకవర్చసాం. ౪౮
...నాభిదేశేమృతం తస్యకుండలాకారసంస్థితం. ౫౩
...ఏకేన ముఖ్యశిరసా బాహుభ్యాం రావణోబభౌ
...అగస్త్యసంస్మారయామాస మాతలీరాఘవంతదా...
నైఋతిష్ణిప్రభోర్వధ్యో వస్యఏవహి మర్మణి......
సశరోరావణం హత్వారామతూణీర మావిశత్
...రావణస్యచదేహోత్థం జ్యోతిరాదిత్యవత్ స్ఫురత్
ప్రవివేశ రఘుశ్రేష్ఠం దేవానాం పశ్యతాంసతాం'

అని.

రావణాసురుని శిరస్సులు నూటయొక్కటి శ్రీరాములచే కొట్టబడినవనియు రావణుని నాభిదేశమున నమృతముగలదు గాన దానినాగ్నేయాస్త్రముచే నెండింపుమని విభీషణుడు శ్రీరాములతో చెప్పిన పైనివారట్లు చేసిరనియు పిదప మరికొంత యుద్ధముచేయగ

రావణు డొకముఖ్య శిరస్సుతో రెండు బాహువుల తోడను నున్నట్లును. ఆపైని శ్రీరాములతో మాతలి 'ప్రభో! వీనిశిరస్సుపై గాక మర్మమున బ్రహ్మాస్త్రమును విడువు' మని చెప్పగ శ్రీరాములవా గట్లుచేయగా రావణుడు సంహరింపబడినట్లును, రావణశరీరమునుండి గొప్ప జ్యోతిస్సు బయలుదేరి శ్రీరాముల వారిలో ప్రవేశించి నట్లును చెప్పబడినది.

వాల్మీకములో—

రావణుని నాభిదేశమున నమృతమున్నదని వర్ణింపబడలేదు. మాతలి విజ్ఞాపనమునగూడ బ్రహ్మాస్త్రమును శిరస్సునందు గాక మర్మమున విడువవలయు ననియు లేదు. దశకంఠుని దేహమునుండి జ్యోతి రామునిలో ప్రవేశించినట్లు కనుపడలేదు. మిగిలినదంతయు నీవిషయమున నధ్యాత్మరామాయణమున నున్నట్లే చెప్పబడినది. ఫాల్గున. బ. అమావాస్యనాడు రావణవధ జరిగినట్లు వాల్మీకిరామాయణ వ్యాఖ్యాతలు వ్రాసిరి.

### ౧౦. రామలింగప్రతిష్ఠ

అధ్యాత్మ. యుద్ధ. ౪ సర్గ. శ్లో.

'సేతు మారభమాణస్తు తత్ర రామేశ్వరం శివం
సంస్థాప్య పూజయిత్వాహ రామో లోక హితాయచ.

సేతువు నారంభిచుచున్న వారై శ్రీరాములవారు అచట శ్రీరామలింగేశ్వర ప్రతిష్ఠను చేసిరని భావము.

వాల్మీకములో— ఈ సందర్భమున రామలింగ ప్రతిష్ఠ మూలములో చెప్పబడలేదు. పరేకదా? రావణవధానంతరము శ్రీరాములు సీతాసమేతులై సపరివారముగ తిరిగివచ్చుచు సీత కాయాప్రదేశములను చూపుచున్నపుడు. 'అత్రపూర్వంమహాదేవఃప్రసాదమకరోత్ప్రభుః (యుద్ధ. ౧౨౬ సర్గ. ౨౬ శ్లో.) ఈ శ్లోకవ్యాఖ్యానమున సేతుబంధనమునకుఁ బూర్వమునగాని పరమందు (తిరిగి వచ్చునపుడు) గాని శ్రీరాములు శివలింగప్రతిష్ఠ చేయలేదని. సవిమర్శనముగ గోవిందరాజార్యులు వ్రాసిరి. అచట తిలకవ్యాఖ్యాత సేతుప్రారంభమున శివప్రతిష్ఠ నంగీకరించిన ట్లున్నది.

ఈ రెండు రామాయణములలో నిట్లు కథాభేదములున్నవి. మరికొన్నియు నుండవచ్చును. వీనివలన పరస్పరవిరోధ ముండదనియు, ఇట్టి కథాభేదములను, కల్పాంతర విషయములనుగ నంగీకరింపవచ్చుననియు వ్యాఖ్యాత లచ్చటచ్చట వ్రాసిన సంగతులవలన తోచబడుచున్నది.

ఎట్లనిన— "పురాణాంతరవిరోధః కల్పభేదేనపరిహార్యః" అని పాయసవిభాగ సమయమున వాల్మీకములో గోవిందరాజీయము. 'అత్రపూర్వం మహాదేవః ప్రసాద మకరోత్ప్రభుః, (యుద్ధకాం. ౧౨౬ సర్గ. ౨౬ శ్లో.) దీనివ్యాఖ్యలో "...నచపూర్వ మిత్యస్య పూర్వకల్ప ఇత్యర్థ ఇతివాచ్యం;...పూర్వకల్పకృతే సేతుసద్భావే పునస్తన్నిర్మాణవైయర్థ్యాత్ ... తస్యసద్భావేప్యంతరితత్వసంభవాత్." అనియు గోవిందరాజీయము. ఇట్లున్నందున కథాభేదములు కల్పాంతపరవిషయములని చెప్పవచ్చును.

---

## సేవాంజలి

వేంకటపార్వతీశ్వర కవులు

సిరము పాదములతోఁ జేరిపోయినదాఁక మోదంబుతో నిన్ను మ్రొక్క-నిమ్ము
ఎలుఁగు గద్గదికతో నింకిపోయినదాఁకఁ దెలివితో నిన్నుఁ గీర్తింప నిమ్ము
కన్ను లశ్రువులతోఁ గరఁగిపోయినదాఁకఁ గోర్కి-తో నిన్ను గన్గొనఁగ నిమ్ము
ఒడలు గగ్గురులతో నొల్లబోయినదాఁక నిష్ఠతో నిన్ను ధ్యానింపనిమ్ము
ఆయు వెన్నాళు లుండునో యంతదాఁక-మఱల జన్మంబు గలుగుచో మడియుదాఁకఁ
జిత్త మలరంగ నీసేవ సేయనిమ్ము-సత్కృపాధామ! దేవతా సార్వభౌమ!

---

# కాదంబరి—బాణకవి

కే. యస్. శర్మ గారు

సంస్కృత వాఙ్మయమునందు గవిత్వమున కనేక రీతుల జూపి పెక్కుకవులకు మార్గదర్శకులై కీర్తిగణించినవారిలో నగ్రగణ్యుడు బాణుడు. హిందూదేశమున నుండు శోణనదికి పశ్చిమతీరమునందలి ప్రీతికూటము ఇతని నివాసమని చెప్పుదురు. ఇతనితండ్రి చిత్రభానుడు. బాణునకు పదునాలుగు వత్సరములు గడచినపిదప చిత్రభానుడు చనిపోయెను. తండ్రి మరణానంతర మితడు స్వతంత్రుడై యథేచ్ఛముగ మిత్రులగు నీశానరుద్రనారాయణులతో భరతఖండమంతయు సంచరించి తిరిగి తన పట్టణమును జేరెను. ఈతని జన్మభూమియగు ప్రీతికూటమున కావలిభాగమంతయు హర్షవర్ధనుడు పరిపాలించుచుండెను. హర్షవర్ధనుని సోదరుడగు కృష్ణాహ్వయునితో గొంతకాలమున కీబాణునకు మైత్రి లభించెను. ఈతని పాండిత్య మంతవరకు తన మిత్రులుతప్ప నితరు లెఱుంగరు ఒకనాడు తనమిత్రుడగు రాజసోదరునితో రాజసభను ప్రవేశింప "భుజంగ ఆగతః" అని రాజు నిందింపదన పాండిత్యమును బరిశీలించి తన్ను నిదింపుమని బాణుడనెను. హర్షవర్ధనుడు ఇతని పాండిత్యమును బరిశీలించి యితనిని ప్రధానపండిత పదవియం దుంచెను. బాణుడు కాదంబర్యాది గ్రంథముల రచియించుట కిదియే ప్రారంభము. ఇతడు మధ్యమవయస్సునందుండ మయూరుడను పండితుడు ఇతనికి మిత్రుడయ్యెను. మయూరుడు సూర్యోపాసకుడు. అతడు సూర్యు నుపాసించి తన కుష్ఠరోగమును బాపుకొనియె. అది చూచి బాణుడు తనమిత్రునకుండు శక్తిని దానుగూడ సంపాదింపదలంచి స్వపాదములను ఛేదించికొని చండిని స్తుతించి సపాదు డాయెను. బాణరచితమగు చండీస్తవమునకు చండీశతకమనియు, మయూరుని సూర్యస్తవమునకు సూర్యశతకమనియు నామములు లోకప్రసిద్ధములు. హజిరీనదీ సమీపమున నుండు తారాపట్టణవాసియగు శ్యామలకుడు బాణుని మిత్రుడు. ఒక్కనాడు బాణుడు తనమిత్రుని దర్శింపబోవ నాతడు హర్షచరితమును వ్రాయుమని కోరెను. మిత్రవాత్సల్యముచే నితడు హర్షచరితము రచించెను. ఈ హర్షునకు శ్రీహర్షుడనియు, హర్షుడనియు నామాంతరములు. బాణుడు హర్షచరిత ప్రథమాశ్వాసమున తన జీవితచరిత్రమును వర్ణించెను. హర్షుడు క్రీస్త్వనంతరము ౬౦౬ మొదలు ౬౪౮ వరకు రాజ్యపరిపాలన గావించినట్లు చీనాబౌద్ధయాత్రికుడు తన యాత్రాచరిత్రమున లిఖించుటచే నీబాణుడును నాతనికి సమకాలికుడు. ఇతడు నాస్తికుడని కొందరు చెప్పుదురు కాని తర్కసంగ్రహ వ్యాఖ్యానము నందును, క్షేమేంద్రవిరచితమగు నౌచిత్య విచారచర్చయందును కాదంబరీ పూర్వభాగమందున్న శ్లోకములలో

శ్లో. ॥జయత్యుపేంద్ర స్సచకార దూరతో బిభిత్సయా॥ యనుశ్లోకము నుదాహరించుట చేతను నితడు ఆస్తికుడని నిర్ణయింపదగు. నలచంపూ వ్యాఖ్యానమున బాణకృతమగు చండీశతకము, హర్షచరితము ముకుట తాడితనాటకములలోనుండు శ్లోకము లుదాహరింపబడినవి. మఱియు పార్వతీపరిణయ నాటకమునకును, రత్నావళి నాటకమునకును నీతడే కర్తయని జనశ్రుతిగలదు.

## బాణుని కాలమునందలి దేశాచార వ్యవస్థలు

కవియొక్క కవిత్వమును విచారింపవలయునన్నా కవికాలములోనుండు స్థితిగతులనుగూడ విచారింపవలయును. సాధారణముగ కవి తన గ్రంథమునందు నాకాలపు నాచారపద్ధతులను వర్ణించుటయం దిచ్ఛలేనివాడయ్యును నయత్నముగా నప్పటి యాచారసౌందర్యాది పద్ధతులను, ఆకాలమున జనులకు బరమాత్మవిషయమై యెట్టి యాశయములు గలవో, జనులు దేనిని బరమోత్కృష్టపదార్థముగ నెంచుచుండిరో, వర్తమానకాలస్థితులు యీ అతీతకాలస్థితులకంటె నెట్లు మార్పుచెందినవో యీ విషయముల నన్నిటిని కవి తన గ్రంథములో నుంచును.

కాన నిట్టివి కవి చరిత్ర వ్రాయుటకు ముఖ్యముగ నాధారములు. ఈ క్రింద నుదహరింపబడిన యాచారములను కవి తన గ్రంథమున వర్ణించుటచే తత్కాలమున ననేకులీ యాచారముల నవలంబించియుండిరనియు, నిట్టి యాచారములే కవికిఁగూడ నభిమతములనియు నూహింపనగు. ఇట్టి వర్ణనలుగూడ నీకవి యాస్తికుడని చెప్పుచున్నవి. కాదంబరియందు శూద్రకవర్ణనావసరమున "చిత్రకర్మ సువర్ణ సంకరాః" అని చెప్పుటచే భారతవర్షీయులకు వర్ణవిభాగము ముఖ్యమనియు, నందువలన నాయావర్ణములకు విభక్తములగు ధర్మములు, అనుష్ఠేయములనియు, అచ్చటనే "సంపాదిత పితృజలక్రియో మంత్రపూతేనతోయాంజలినా దివసకర మభిప్రణమ్య" అనుటచే పితృతర్పణ సూర్యార్ఘ్యాగ్ని కార్య భగవత్పూజాదులు అనుష్ఠించుచుండిరనియు తెలియవచ్చును. మఱియు జాబాల్యాశ్రమవర్ణనావసరమున "ఉపచర్య మాణాతిథివర్ణ్యం పూజ్యమాన పితృదైవం" అని చెప్పుటచే అతిథిసత్కారోపచార పితృదైవతార్చనాదులు అవశ్యకరణీయములనియు తెలియబడుచున్నవి. ఇట్లే తారాపీడుని రాజ్యపరిపాలన వర్ణనావసరమునను "శశినా జ్యేష్ఠానుక్రమః" అని వర్ణించి యుండుటచే జ్యేష్ఠాతిక్రమము దోషమని యంగీకరింపబడినది. మఱియు విలాసవతీ వర్ణనావసరమున "చంద్రికేవ చంద్రమసః" అనుటచే భార్యకు ప్రియమనోనుగామిత్వ మావశ్యకమని వర్ణింపబడినది. మఱియు "రక్షాభూతిమివ అభిషేకపయః పాతపూతైః చూడామణిపల్లవైః" అను వైశంపాయన వచనముచే రక్షార్థము భూతి ధరింపబడుచున్నదనియు "ఆయతన తరుకుసుమ సిద్ధమివ శంకరాభ్యర్చనాయ స్వయముద్యతా" అని మహాశ్వేతావర్ణనావసరమున వర్ణించుటచే భారతీయులకు విగ్రహారాధన ప్రాధాన్యమనియు, "అను జ్ఞాతాపిత్రా అనుమోదితా మాత్రా స్వయముపగమ్య గ్రాహయామిపాణిం" అని మహాశ్వేతా వర్ణనావసరమున వర్ణించుటచే స్త్రీలకు స్వాతంత్ర్య రాహిత్యమును నాకాలమున నుండునట్లు తెలియబడుచున్నవి. ఇట్టి యాచారపద్ధతులను వర్ణించు వర్ణన లనేకము లీగ్రంథమున గలవు.

## బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్

ఈ కవి నవనవోన్మేషమును బొందు ప్రతిభగలవాడు. ఈతని కల్పనాచాతుర్యము ననుసరించిరే యనేకులు గృతికర్తలైరి. ఈతడు చండాలకన్యకా వర్ణనావసరమున దన కల్పనాచాతుర్యముచే త్రైలోకములను తృణీకరించెను. మఱియు నీతడు తనకృతియందు, 'కిమిదానీం కర్తవ్యం, కింవాచేష్టితవ్యం, కందేశంగంతవ్యం, కింశరణం, కోవోపాయః, కస్సహాయః, కః ప్రకారః, కాయుక్తిః, కస్సమాశ్రయః' అని మధ్యను పదాంతర ప్రవేశమునకు వీలు గలుగనట్లు కూర్చెను. మఱియు చండాలకన్యకా వర్ణనావసరమున "అసురగృహీతామృతాపహరణకృత కపటకటువిలాసినీవేషస్య శ్యామతయా భగవతో హరస్యేవ అను కుర్వంతీం" అని మోహిన్యవతారకథను, "ఆకపిలగోరోచనారచితతిలక తృతీయలోచనా మీశానుకచితాను రచితకిరాత వేషామివ భవానీం" అని పరమేశ్వరీకిరాతవేషవృత్తాంతమును, "కుపితహరహుతాశన దహ్యమానధూమమలినీ కృతామవరతి" అని కామదహనో దంతమును, "ఉన్మద హలిహలాకర్షణభయ పలాయితామివ కాలిందీం" అని బలరామచరితమును, నౌపమ్యవిధిచే వర్ణించెను. ఇట్టి యనర్గళమగు వాక్ప్రపంచమును, చరిత్రాత్మకమగు కథాప్రపంచమును దనకృతియందు వర్ణించియుండుటచే "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" మని ప్రతీతిగలిగి యుండవచ్చును.

## శూద్రకుని ప్రథమ ప్రవేశము

[కథాభాగము]

శ్వేతకేతుండను దేవమునిని లక్ష్మి మోహింపమానసిక సంగమముచే దన నివాసమగు పద్మమున బుండరీకుడు జన్మించెను. పుండరీకమున జన్మించిన వాడగుటచే నితని కీనామము సార్థక మయ్యెను. కపింజలుడు ఇతనిమిత్రుడు. వీరిరువురు కైలాసప్రాంతమున నివసించుచుండిరి. గహలుండను గంధర్వరాజకుమార్తెయగు మహాశ్వేత పుండరీకుని మోహించెను. పుండరీకుడును మోహమగ్నుడై చంద్రప్రభాసంతప్తమానుండై మృతినొందెను. చనిపోవునపుడు చంద్రునిజూచి ప్రియాసమాగమము గాక

మున్న నన్ను ప్రాణవియుక్తుని గావించితివి గాన నీవు భూలోకమున జన్మించి ప్రియాసమాగమముగాకమున్న మరణింతువని శపించెను. నీవును నాకుసమముగ సుఖ దుఃఖముల నొందుచుండెదవని చంద్రుడు ప్రతిశాపం బిచ్చెను. కపింజలుండు మహాశ్వేతాభవనమునుండి వచ్చు చు నైమానిక నతిక్రమించుటచే నతడు అశ్వంబు గమ్మని శపించెను. అది గారణంబుగ చంద్రుండు తారాపీడుడను రాజునకు జన్మించి చంద్రాపీడుడను నామంబున బరగె. పుండరీకుండు తారాపీడుని మంత్రియగు శుకనాసునకు వైశంపాయనుడై జన్మించి చంద్రాపీడునకు మిత్రుడయ్యె ను. కపింజలుండు వైమానికునిశాపంబున చంద్రాపీడునకు నింద్రాయుధంబను గుఱ్ఱమయ్యెను. ఇట్లుండ చంద్రాపీడుం డు చిత్రరథుండను గంధర్వరాజకుమార్తెయగు కాదంబరి యందలి మోహావేశముచే మరణించి శూద్రకుడై జన్మించెను. వైశంపాయనుడై జన్మించిన పుండరీకుండును మహాశ్వే తను మోహించి యామెచే శపింపబడి చిలుకయై జన్మిం చెను. అశ్వమగు కపింజలుండు చంద్రాపీడుడు మరణించి నంతనే యచ్ఛోదసరస్సునందు మగ్నుడై స్వస్వరూ పము ధరించెను. ఈచిలుక ప్రథమమున జాబాల్యాశ్రమ మున బెంపబడి జాబాలివలన పూర్వజన్మజ్ఞానము గల దియై చండాలకన్యకకు పట్టువడి శూద్రకునకు దనవృత్తా న్తమును జెప్పెను. శూద్రకుడును పూర్వజన్మజ్ఞానముగల వాడై కాదంబరియందలి యనురాగముచే మరణించి చంద్రాపీడుని మృతశరీరమున బ్రవేశించెను. చిలుకయు శుకశరీరమునువీడి పుండరీకుని శరీరమున బ్రవేశించెను. వీరిరువురు కాదంబరీ మహాశ్వేతలను వివాహమాడిరి. కపింజలుండు తిరిగి పుండరీకునకు మిత్రుడయ్యెను. ఇట్టి కథాభాగమున కవి తన కల్పనాచాతుర్యమును జూపు టకై గ్రంథారంభమున శూద్రకుని ప్రవేశ పెట్టెను. లోకమున నైతిహాసికులు తమగ్రంథములయందు నొక కథను వర్ణించునపుడు ఆకథను నొకడు మఱియొకనికి జెప్పినట్లు వర్ణింతురు. కాని యీకవి యట్లుగాక యని తర సాధారణమగు వర్ణనాచమత్కృతినివలె గల్పనాచమ త్కృతినిగూడ జూపుటకై కథాంతఃపాతియగు పాత్ర ముఖముననే యీకథను జెప్పించెను. అట్లయినచో, వైశం పాయనుడు శూద్రకునకు జెప్పునపుడు జాబాలియను మహర్షి ఋషులకు జెప్పినట్లు వైశంపాయనుడు చెప్పియు న్నాడు. కాన నట్టిజాబాలిని గాని కథాంతర్యాతమగు మఱియొక పాత్రనుగాని ప్రవేశపెట్టక శూద్రకుని ప్రవే శపెట్టుటకు గారణమేమని ప్రశ్నింపవచ్చును. కాని వక్తను శ్రోతను అన్యులగ బ్రవేశపెట్టినచో పాత్రగౌర వము ప్రసక్తమగును. మఱియు గ్రంథాంతమున జ్ఞాయ మానమగు శుకశూద్రకుల స్వరూపములను ప్రథమమున బ్రవేశపెట్టినచో పాఠకులకు ధారణాభ్యాసము గలుగ గలదు. ఇట్టి పాత్రప్రవేశము నవలారూపములగు గ్రంథ ములయందు సాధారణముగ జూడనగును. జాబాలి శుక పూర్వవృత్తాంతమును జెప్పునపుడు శుకుడును నక్కడ నుండుటచే శుకునకు పూర్వవృత్తాంతస్మృతి గలిగెను. అటులనే శూద్రకుడు గూడ శుకముఖమున వినుటచే పూర్వస్మృతి సంపాదింపబడవలయునను తలంపున ముందు శూద్రకుని బ్రవేశపెట్టి యుండవచ్చును.

## పత్రలేఖాప్రవేశమునకు ఫలము

చంద్రునిభార్యయగు రోహిణి చంద్రాపీడరూప మున నున్న చంద్రునకు బరిచర్యగావింపదలచి కులూతాధి పతి కుమార్తెయై జన్మించెను. తారాపీడుడు కులూతాధి పతిని జయించి యామెను తన యంతఃపురమం దుంచెను. తల్లియగు విలాసవతి కుమారుడు దిగ్విజయ యాత్రకు వెడలునపుడు దుఃఖితయగు నీమెను కుమారున కొప్పగిం చెను. అందువలన ప్రకృత కథానాయకుడగు నీతని సంచార వర్ణనావసరముల సత్ప్రకుడగు నీతని వర్ణించు టచే కావ్యశోభకు హేతువగును. మఱియు హేమకూట మునుండి వచ్చినపుడు పత్రలేఖను నచ్చటనుంచి వచ్చెను. అనంతరము పత్రలేఖ కాదంబరీవిరహావస్థనంతయు వర్ణించి రాజును ప్రోత్సాహ పరచెను. పత్రలేఖ వార్తాహారిణిగ నుండుటచే కాదంబరి యీపత్రలేఖనుగూడ తన చెలి కత్తెలలో నొకదానినిగ గణించెను. అందువలన పత్రలేఖ రాజకుమారుని దెచ్చుటకును ప్రోత్సాహపరచుటకు గూడ హేతువయ్యెను. ఇట్టి మహాప్రయోజనమును మనస్సు నందుంచియే యీకవి పత్రలేఖను ప్రథమమున బ్రవేశ పెట్టెను.

## కాదంబరి మహాకావ్యము

సామాన్యముగ మహాకవులు తమగ్రంథములయందు శృంగారవీరరసములలో నేదియో యొకదానిని ప్రధానముగ వర్ణింతురు. శృంగారమునందుగూడ సంభోగశృంగారముకన్న విప్రలంభశృంగారము సర్వజనాదరణీయమై యొప్పుచుండును. కావుననే మహాకవులగు కాళిదాసాదులు శాకుంతలాదిగ్రంథముల విప్రలంభశృంగారమును వర్ణించిరి. ఇట్టి శృంగార ముత్తమపురుష సాశ్రయించినపుడే పరిపుష్టమగును. కానిచో "ఏకత్రైవానురాగశ్చేత్తిర్యఙ్మ్లేచ్ఛగతోఽపివా" అని విద్యానాథుడు చెప్పినటుల రసాభాసమన బడును. శయ్యాపాకము మొదలగునవి రసమునకు పరిపోషకములు. బాణునిగ్రంథము క్లిష్టపదములు గలిగియున్నను రసికుడు రసపారవశ్యము నొందునట్లు ద్రాక్షాపాకభూయిష్ఠమై యొప్పుచుండును. "కావ్యాతిశయహేతవస్త్వలంకారాః" అని వామనుడు చెప్పినటుల విశేషముగ నలంకారములను ప్రదర్శించెను. "విషయమును నతిదీర్ఘముగ వర్ణించుటచేతను కథాప్రాంభర మతిగూఢముగ నుండుటచేతను ఒశమమగు మరణావస్థను వర్ణించుటచేతను చండాలకన్యను ప్రవేశింపచేయుటచేతను నీగ్రంథము దుష్టకావ్యమని కొందరు తలంతురు. కాని రసానుబంధులగు సమాసములు కావ్యాపకర్ష హేతువులు గానేరవు. మాఘుడు శ్రీకృష్ణప్రయాణమును విశేషముగ వర్ణించెను. ముద్రారాక్షసమున కథాభాగ మతిగూఢముగ నుండెను. కుమారసంభవకావ్యమున మరణావస్థను వర్ణింపబడెను. ఇట్టి వన్నియు మహాకావ్యములుగ పరిగణింపబడుట లేదా? మఱియు నితడు మరణావస్థను వర్ణించి నను పరకాయప్రవేశమను తలంపు సూచించుటకై పుండరీకచంద్రాపీడుల శరీరముల గాపాడినట్లు వర్ణించెను. చండాలకన్య మహాలక్ష్మి; ఆమె ప్రధాన నాయికగాదు. కావున నిది మహాకావ్యములలో నుత్తమకావ్య మనందగు. ద్రాక్షాపాకభూయిష్ఠమై వర్ణనాచమత్కృతియు, భాషాసౌష్ఠవంబును, కథాసంవిధానచాతుర్యము గలిగి పాఠకులకు పఠనోత్సాహమును గలిగించు నిట్టి మహాకావ్యము రసాస్వాదనతత్పరులకు, ద్రాక్షారసము త్రాగినవానికి నాహారమున నరుచి జనించునట్లు వీరికిని నాహారమున నరుచి జనించుట నిక్కువము; కావుననే "కాదంబరీ రసజ్ఞానామాహారోఽపి నరోచతే" యని మహాకవులు బోధించిరి.

---

## విధి

పెనుమర్తి వెంకటరత్నము గారు

౧

నేనమరలోకమును ప్రయాణించిపోయి
విపులశారదకౌముదీ వీథులందు
హర్మ్యమును గట్టుకొంటి! ననంతకోటి
మహితమాణిక్యదీపముల్ మండుచుండ!
నేనపాంపతిరత్నమందిరములందు
యుగయుగంబులుగా దాగియున్నవాని
విమలవైడూర్యగోమేధికముల నాహ
రించి మామందిర మలంకరించినాను!
దీప్తతారాసహస్ర దీధితులనుండి
తాకరాని రసాతలలోకమునకు
విమలవిద్యుల్లతల్ పెనవేసికట్టి
ఆగుటే లేని యుయ్యాల లూగినాను!

౨

ఈ మహారాజ్యపీఠము నేలునన్ను
నీరసతరంగనాట్యా హంసీరమణుని
వీడవడా! భీషణోగ్ర దర్వీకరుండు
వికృతదంష్ట్రాస్మితంబు లావిష్కరించు.

---

# జయంతి గంగన్నగారి సుమబాల

పారనంది జగన్నాథస్వామి గారు

ఆంధ్రకవిత్వము నూతనావిర్భావము పొందుతూ ఉన్న సమయాన ఉదయించే కవన నక్షత్రములను తరిచి తరిచి అవలోకించుట చాలా ముఖ్యమైన ధర్మము. వాటి కాంతి ఉదయకాలమందు మాత్రమే ప్రకాశించి చల్లారునదా, లేదా శాశ్వతముగా,—మనము. ఆ మాట ఇప్పుడప్పుడే నిర్ణయించలేమని—కొంత కాలమువరకైనా ప్రకాశిస్తూ ఉండేదా అనే సమస్య పరిష్కరించుటకు దాని పోషించే రచనాంశములను విమర్శించవలసి ఉంటుంది. దేశకాలసంకోచము లేకుండా మానవహృదయాన్ని ఒకేలాగు రంజింపజేయగలిగే రసము; పశుసామ్యమునుండి లేవనెత్తగలిగే భావము; ఈ రసభావములకు అనుగుణమై యుండి, చెవికి ఇంపునిస్తూ తరచినకొలదీ స్వారస్యమును వెలిబుచ్చే పదముల గుంభన; సామాన్యానుభవమునకు సానపెట్టే రూపకాదులను నిర్మించగలిగేభావన—వీటి మేళవింపే గదా కావ్యమునకు శాశ్వతత్వమును సంపాదించగలదు. వీటిలో ఏవి ఏపాళ్లలో ఎట్లు సుమబాలలో మేళవింపు పొందియున్నవో చర్చించి చూదాము.

సుమబాలయొక్క గ్రంథవిస్తృతిని జూచి ఖండకావ్యముగా కొందరు అభిప్రాయపడియున్నారు. ఖండగ్రంథానికీ పూర్ణగ్రంథానికీ గల భేదమంతా విస్తృతిలోనే అయితే వారి అభిప్రాయాన్ని మనము ఆమోదిస్తాము. కావ్యానికి ఉండవలసిన లక్షణాలన్నీ, సుమారుగా పట్టియున్నవి. ఏదీ ఖండముగా స్ఫురించదు. కథ పూర్ణమైనది; పాత్రలశీలము పోషింపబడి వ్యక్తమవుతూ ఉంటుంది; కావలసినన్ని వర్ణనలూ, కల్పనలూ ఉన్నవి; భావములూ, శైలీ గభీరముగా ఉండును. కాబట్టి ౧౩౦౨ ద్విపదపంక్తులే అయినా, విస్తృతికి చిన్నదిగా కనిపిస్తున్నా సూచింపబడేదీ, భావనలో స్ఫురించేదీ విస్తారముగా ఉంటుంది. చదువుటకు రెండుగంటలకంటే ఎక్కువ కాలము పట్టకపోయినా, చదవడము పూర్తియైన కొలదీ భావన, ఆలోచనలు ఎక్కువై, ఆ చదివినది ఎంతో లోతుగా ఉన్నట్లు తట్టుటచేత దాని కొక బాహ్యముకాని విస్తృతి ఉన్నట్లు తట్టుతుంది.

కవి అభిప్రాయములో గ్రంథవిస్తృతి ప్రాముఖ్యము వహించే ఉంటే, సులభముగా ఆ కార్యమును సాధించి ఉండగలడని ఊహించగలము. కథను పెంచి వర్ణించుటకు కవి ఒప్పుకొననట్లు తోస్తుంది; కథలో ఏపట్టునా కూడా కథనముకొరకు విలంబనముచేయు రచన కానరాదు. ఇందు ముఖ్యహేతువును నేను ఇట్లు ఊహిస్తాను: కవియొక్క ఆశయము కథాకథనము కాదనినీ్న, సామాన్య కథారీతిని కవి అవలంబించి యుండలేదనినీ్న స్పష్టమవుతూ ఉంటుంది. కావ్యము తొమ్మిది ఆశ్వాసములు కలది; ఒకొక్క ఆశ్వాసములో కథాభాగము

అని యగునా? అనిష్టరూప నివారణార్థమై పూర్వులు బహుళమనిరి.

౫౭. 'నా నీ శబ్దములకు సమాసమున ఉత్తర పదము పరమైనచో ద్వర్ణకము వికల్పముగా నాగమం బగు' నని సూత్రము. ఎచట ఆగమంబగు? నా + నేరము, నీ + కరుణ — ఇవి దునా నేరము, దునీ కరుణ యగునా? కాకుండుటకై తొంటి పెద్దలు దుగాగమంబనిరి. మఱియును ఆగమము అన్నం జాలదా? వర్ణకమని యుం జెప్పనేల? వర్ణమన్నం జాలదా? అనకున్నం జాలదా?

౫౮. చనిన=చన్న. ఈ రూపాంతరములను క్రియాప్రకరణమందే చెప్పుట న్యాయ్యము. చనును నకు తద్ధర్మమున మధ్యమస్వర లోపమనియు నిందు ఉక్తము. 'చనును + ఎ=చన్నె, చనునే' అని యుదాహరణములు: ఇట ఎ ఏ లేల? ఆ ఎ లేక తద్ధర్మరూపము కావా? చనును 'చన్ను' అగునా? కాదేని అగుననుట యెట్లు? ఎ ఏలు పరమయినప్పుడే అగునేని, అట్లని సూత్రముననే చెప్పరాదా?

౫౯. 'పదంబు నడిమి నరలడల యొత్తునకు లోపము వికల్పముగా నగును' అని సూత్రార్థము. ఈ సూత్రమువలన మానుషి, కరుణి, తలని, గడుల ఇత్యాదులు వికల్పంబుగా మాన్షి, తర్ణి, తల్ని, గడ్ల ఇత్యాదులుగా మాఱును. అట్టివి అనిష్టములని పెద్దలు చెప్పుదురు.

౫౬. ఇది ఇకారలోప సూత్రము. ఇటను, 'పదంబులనడుమ' అని యున్నది. ఏపదములలోనో తెలియకున్నది. జనిత్ర, కరిణి, పాలిత్ర, తాడిత్ర అనునవి, జన్త్ర, కర్ణి, పాల్త్ర, తాడ్త్ర అనియు నగు. ఒక్కొక్క సూత్రమును అనిష్టములపుట్టగా నున్నది.

౫౬. ఈ సూత్రమున 'దేశ్యపదముల కడపటి నల డరటలయు (ఉ) త్వము వికల్పముగా లోపించు' నని యున్నది. ఇందువలన,—ఇది నీకక్కా వానికి సెరియుచున్నది; వాఁడు నాకు 'తోఁడ్'; నీకిది 'చేట్' అను రూపములు కలుగును. ఇందు ఈ యుత్వలోపము దేశ్యపదములకే చెప్పఁబడినది. అటుయిన 'నీర్వామి'(=సముద్రము) 'కటిమీఁద ముదుక నీర్కొవిదోవతి పింజ' (జై. భా.) 'తనువు మీనొప్పలవల్చు జాలారిదాన' (భార.) 'సంగరోత్సవోద్భవరభసాతిరేకము బయల్పడు టింపుకతన' (భాగ.) అను ప్రయోగములందు తద్భవములయిన నీరు, మీను, బయలు శబ్దములందలి యు (ఉ) లోపము దుష్టమా? 'తద్భవములకు వేఱు సూత్రము చేసెదము' అందురా? అట్లేల? ఇందే 'తద్భవ' శబ్దమును చొప్పింపరాదా? లేక 'సమేతరమందు' అనరాదా?

౬౧. అను విను మొదలగు ధాతువులకు అని సూత్రారంభము. కను, కొను, తిను, మను అను నాలుగే ఆ మొదలయినవి. సులువుగా వానిని సయితము సూత్రముననే చెప్పియుండవచ్చును. ఆ ధాతువులకు చు వర్ణకము పరమయినప్పుడు కడపటి యుత్తు వికల్పముగా లోపించునఁట — అనుఁగాక. ఈ సూత్రమువలన అను ధాతువునకు చు వర్ణకము రాఁగా, 'అనుచు' అగును. అనంతరము ఉ లోపము వికల్పముగా నయిన 'అన్చు' అని యొక రూపము, 'అనుచు' అని యొకటియు నేర్పడును. 'అన్చు'లో శేషించిన నకారము బిందు వగునఁట. (పూర్ణ బిందు వన వలసినది.) ఆ బిందువుచేఁ 'అంచు' అగును. ఈ బిందువు వైకల్పికము కాదు గావున 'అన్చు' అను రూపాంతరము ఉండదు. కావున 'అనుచు'—'అంచు' అని రెండే రూపములగును. బాలవ్యాకరణముచే త్రైరూప్యము సిద్ధించును. "'అన్చు' అను రూపము నిలువదేని వ్యాకర్త దానిని కల్పించునా? ను వర్ణమునకే వికల్పముగా బింద్వాదేశమును చెప్పఁడా? అందువలన ఆరూపముమాడ నిలుచునట్టిదే యని తెలియును గావున సూత్రమున వికల్పశబ్దమును ప్రయోగింప లేదు"అని భాష్యము పల్కుదురేని, 'పూర్ణబిందువు' అనుటకే తెలియక 'బిందువు' అన్న తాము పై భాష్యము రచించుకొనుపాటి ప్రతిభ తమ విద్యార్థికి ఉండునని తలంచుట వింతగాదా! కావున 'వికల్పముగా' అని సూత్రములోనే పఠించికొనుట యుచితము.

౬౧, ౬౨, ౬౩. ఈ సూత్రములను ఆడంబరముగా కల్పించుటకు మాఱుగా ఈ పదములకు ఈ యీ రూపాంతరములు కలవు అని తెల్పినం జాలును.

"అట్టు-ఇట్టు-ఎట్టు అను పదములకు లు వర్ణకంబు పరంబగునపుడు టు వర్ణము యొక్క యుత్వము వికల్పముగ లోపించును" అని ౬౧-వ సూత్రము. ఇచట ఈ పదములకు లు వర్ణక ప్రసక్తి యెట్టిదో వ్యాకర్త చెప్పలేదు. లు వర్ణకము అనుటచే ప్రథమా బహువచనము తోఁచుచున్నది. "బహువచనమునందు డుంటరల యుత్వంబునకు లోపము వికల్పము." అని బాలవ్యాకరణము ఆచ్ఛిక సూ. ౧౨ అట్లుండ, ఈ మాఁటికిని విశేషించి యిటం జెప్పుటకు నిమిత్త విశేష మగపడలేదు. పాటు, కాటు, చేటు, చెట్టు, దాటు అను వీనికెల్ల బహువచనమున పాట్లు, కాట్లు, చేట్లు, చెట్లు, దాఁట్లు అను రూపములందు ఉత్వలోపము ప్రసిద్ధమే గదా! కావున ఈ ౬౧వసూత్రము అప్రసక్తమే. విశేషాధాయకము కాదు.

సంజ్ఞ ౩౧-వ సూ. లో అట్లు, ఇట్లు, ఎట్లు అని పఠితము లయిన పదములకు ఇది వ్యుత్పత్తిప్రక్రియా ప్రపంచనముగానున్నది. సరిగా చెప్పిన అట్లు, ఇట్లు, ఎట్లు మొదలు ఆ చోటు, ఈ చోటు, ఏచోటు వఱకు శృంఖలం జెప్పఁడగును ఆచోటు, అచ్చోటు, అచ్చొటు, అచ్చటు, అచటు, అటు, అటులు, అట్లు—ఇట్లే ఈచోటు........ఇట్లు; ఏచోటు........ఎట్లు. ఇందులో తుది లంకెను మాత్రము విడఁదివిచిన సేమాయె. పైనిచెప్పిన పాట్వాదులయందు సామాన్యముగా బహువచనములో ఉ లోపమగుట తెలుంగుని యొక్క విలసితముగానున్నది. దీనిని మాని అడులటరలయుత్వలోప సూత్రమును వ్రాయుచ్చిన శ్రేయముగా నుండెడిని. అట్లు చేయమిచే ఈమాఁటందప్ప కడమనామములందు ఈ యు (ఉ) లోపము రాదని యుపదేశము గమ్యమగును. అందువలన ఆ రూపములెల్ల అసాధువు లయ్యెడిని.

౬౪. మధ్యమపురుషయోగంబున అరగాగమము వైకల్పికమనుట. దీనిని సంబోధనంబున అరగాగమమును జెప్పుచోటనే తెలుపుట శ్రేయము.

౬౬. ఆ ఈ ఏ అను సర్వనామములమీఁది హల్లునకు వికల్పముగా ద్విత్వము వచ్చి ఇవి హ్రస్వములగుట. ఈ సూత్రాంశముచేత 'అబ్రాహ్మణుఁడు' అనునది 'అబ్బ్రాహ్మణుఁడు' అగును. తన్నివారణకై 'అసంయుక్త హల్లునకు' అనవలయును.

౬౭. "అనుకరణంబున నమశ్శబ్దవిసర్గకులోపమేని, ఓత్వమేని వికల్పముగా నగు" ననుట. ఈసూత్రమువలన, 'నమః + అనియె' అనియుండఁగా విసర్గకు లోపము రాఁగా 'నమ అనియె' యయి యడాగమముచేత 'నమయనియె' అగును. ఇది యొకరూపము. ఇది రాకున్న 'నమఃఅనియె' అనియే యుండును. ఇది యింకొక రూపము. ఈ రూపమున ఆ విసర్గకు ఓత్వమువచ్చిన, 'నమ + ఓ + అనియె' అని అలౌకికవాక్యమయి, పిమ్మట, యడాగమములచేత 'నమయోయనియె' అని మూఁడవరూపము సిద్ధించును. ఇది అనిష్టరూపమనియు 'నమః అనియె' అనునది ప్రకృతిభావ ప్రస్తావము లేని యిచ్చోట అనుపదేష్టవ్యమనియు, అప్రసక్తమనియు చెప్పవలయునా? పూర్వుల వ్యాకరణములచేత 'నమయో యనియె' అనురూపము ఘటిల్లదు. ఇందువలన అక్కఱకు రాని దొకటియు, విపరీతమొకటియు వచ్చినవి. అక్కఱకు వచ్చు రెంటిలో 'నమయనియె' అనున దొక్కటియె దీనం గుదిరినది. 'నమోయనియె' అనురూపము ఆవశ్యకమయినట్టిది యీ గంధర్వకోలాహలములో కాందిశీకమైనది.

౬౮. 'అనుకృతిని ఉదంతపదములకు విసర్గలోపము వు అను నాగమంబును వచ్చును' అని సూత్రము. 'శంభుః + అనియె' అను వాక్యము విసర్గలోపముచే 'శంభు + అనియె' అగును. అనంతరము ఆగమముచే నేమగును? 'వుశంభనియె' అగునా? కాదు. కాదని యెట్లు తెలియును? అది తెలియుటకే పూర్వులు వుగాగమమనిరి.

ఇది సంధిప్రకరణము.

---

# కాఫీఅయ్యర్

గుండిమెడ వేంకటసుబ్బారావు గారు

సర్వసర్వంసహావ్యాపి సర్వజీవ-జీవనాధారుఁ డగు నొక్క దేవుఁ డెవఁడో
కలఁ డనఁగ విందుఁగాని నిక్కం బెఱుంగ!-వాఁ డదృశ్యుండు! మాకేల వాని గోల?

చండార్క కిరణప్రకాండముల్ చొరలేని దండకారణ్యమధ్యమున నీవు!
పేరు చెప్పినమాత్ర నీరు గడ్డలు కట్టు తుహినాచలాగ్రమందునను నీవు!
కడలేని జలరాశి గర్భమందు నడంగి కనరాని దీవులందునను నీవు!
దిగ్దిగంతరాంత దేశదేశములందుఁ గల యూళ్ల వాడవాడలను నీవు!
అయ్యరూ! యింక నీవు లేనట్టితావు-కలదె పరికింప నెందు భూవలయమందు!
అహహ! యింక సర్వవ్యాపి యనఁగ నెవఁడు!-దేవుఁ డన నింక నెవఁడోయి నీవుగాక!

సకలవిశ్వస్థకీటకకోటి నీ ఫలాహారసామగ్రియం దైక్యమయ్యె!
ఇడెను ముక్కల కాసపడి కుక్క లిప్పుడు మలభక్షణాసక్తి మానుకొనియె!
వాయసంబులు నేఁడు వాయసమ్మార్జన ప్రక్రియల్ మాని నీ పంచఁ జేరె!
గర్భస్థపిండముఖ్యసమస్తమనుజసంఘమ్ము నీ కాత్మార్పణ మ్మొనర్చె!
భళిర! జీవకోట్లిటుల జీవనవిరక్తి-మాని, యనురక్తి నీపాద మానియుండె!
సరికదా! యింక జగతిలో సర్వజీవ-జీవనాధారుఁ డెవఁడోయి నీవుగాక!

అయ్యరూ! పృథ్విలోన మాయామనుష్య-మూర్తిమైన యా రఘురామమూర్తివోలె
ఈవు నినుఁగూర్చి సుంతేని యెఱుఁగవేమొ!-సత్యముగ నీవు దేవాంశసంభవుఁడవు!

పూర్వ మెపుడో విష్ణువు జగన్మోహినియయి-అమృతమును పంచెనంట సురాసురులకు!
ఇట జగన్మోహనుండవై యీవు నిడవె-అమృతరూపాంతరం బైనయట్టి కాఫి!!

టీ యని, కోకో యని, కా-ఫీ యని యెద్దాని వింత పేర్లిడి యమృత
ప్రాయంబుగఁ గొందురో, యది-యే యమృతంబని తలంప రేలనో జనముల్!

నీవె ప్రత్యక్షదైవంబు! నిన్ను మించు-దేవుఁ డన్యుండు లేఁడు పృథ్వీస్థలమున!
కలియుగంబున లోకరక్షణము కొఱకు-అయ్యరను పేర దేవుఁడే యవతరించె!!

---

# రాచపీనుగు తోడులేకుండా వెళ్లదు

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

౧

లోకంలో పెట్టుబడి లేని వృత్తులు రెండే వున్నాయి. ఒకటి బ్రాహ్మణవృత్తీ, రెండోది క్షత్రియవృత్తీనీ. బ్రాహ్మణుడు "భవతి భిక్షాం దేహి" అంటూ చెంబు పుచ్చుకుని బయలు దేరాడంటే వర్ణాశ్రమాచారాలమీద అభిమానం వున్న యిల్లాళ్లంతా తలో పిడికెడు బియ్యమూ వేస్తారు. పూర్వకాలం సంగతి చెప్పలేం గాని యీవృత్తిలో యిప్పుడు వేలు సంపాదించి వడ్డీవ్యాపారంలోకి దిగినవాళ్లున్నారు.

ఇక క్షత్రియవృత్తి సంగతి. ఇదీ తలో కాస్తా యిచ్చేదే; కాని యివ్వడంలోనూ, యిచ్చే వస్తువులోనూ, పుచ్చుకోవడంలోనూ కూడా భేదం వుంది. భేదం అంటే కాస్తా కూస్తా కాదు; ఏనుక్కీ దోమకీ వున్నంత తేడా వుంది. ఆ వృత్తికి మొగమ్మీద దైన్యం తాండవం చేస్తూవుంటుంది. ఈ వృత్తికి శౌర్యం నృత్యం చేస్తూ వుంటుంది. క్షత్రియుడు కత్తి దూసి నుంచున్నాడంటే కనుచూపుమేర వెనకా, ముందూ, పక్కల్నీ కూడా హడల్. అందరూ అతనికి పాదాక్రాంతు లవుతారు. అతని ప్రభుత్వాన్ని శిరసావహిస్తారు. తమ కష్టార్జితంలో కొంతభాగం పన్ను అని పేరుపెట్టి అతని పాదాలదగ్గిర చెల్లించి, "మహాప్రభూ! నీ బిడ్డలం. మమ్మల్ని రక్షించు" అంటూ పడి పడి దణ్ణాలు పెడతారు.

డబ్బు సంపాదించడంలో దానికి కింది మెట్టూ, దీనికి పైమెట్టూ యిక ప్రపంచకంలో మరేమీ లేవు.

అయితే బ్రాహ్మణ వృత్తికి వున్నవూరు విడవనక్కరలేదు. క్షత్రియవృత్తికి వూరేగాదు, వొక్కొక్కప్పుడు దేశమూ, చివరికి ప్రాణాలూ కూడా విడవ్వలిసివస్తుంది.

౨

వొకమాటు యిలాగే తటస్థించింది. అయిదు గోత్రాలకు చెందిన అయిదుగురు క్షత్రియవీరులు వున్నచోట లొంగసాను రాగా దూరదేశంలో డబ్బూ, పదవులూ, వీలయితే రాజ్యాలూ సంపాదించుకోవాలని కుటుంబాలతో బయలుదేరారు. దారి పొడుగునా తమ లాంటివారే కొందరు కొంతకొంత ప్రదేశాన్ని ఆక్రమించుకొని హద్దు లేర్పరచుకొని వుండగా వారింకా ముందుకు సాగారు. చివరికి వొక తురక రాజ్యం తగిలింది. నవాబు చేతికింద అనేకమంది సామంతు లున్నారనీ, వీరుడు వస్తే అతను పోనివ్వక జాగీరిచ్చి నిలుపుతా డనీ వారికి తెలిసింది. వాకబు మీద అక్కడ

అలాంటి పదవులు సంపాదించడం తమికి కష్టం లోది కాదని కూడా తెలిసింది. ఇలా తెలవడంతోటే వారక్కడ ఆగిపోయి వొక సత్రంలో బసచేసి నవాబు చహారంతా వాకబు చేశారు.

వారయిదుగురూ వొకనాడు నవాబు దర్శనానికి బయలుదేరారు. అసలే క్షత్రియులు; అందులోనూ ఆకొన్న సింహాలు; ఇక తేజస్సుకి లోటేమిటి? గాని అలాంటి శౌర్యరాసులు పెద్దబజారులో కాలినడకను వెడుతూ వుంటే ప్రజలంతా చాలాచాలా నొచ్చుకున్నారు.

దేవిడీదగ్గిరికి వెళ్లాటప్పటికి మొదటిద్వారంలో వారి నడ్డుకున్నవారు లేరు. రెండో ద్వారంలో కూడా పలకరించినవారు లేకపోయారు. మూడో ద్వారంలో వున్నవాడు అడగాలని కొంచెం వూగీసలాడాడు గాని ధైర్యం చాలింది కాదు. నాలుగు—అయిదు—ఆరు—యీద్వారాల్లో వున్నవాళ్లు ప్రశ్నించడం మానలేదు; గాని వీరు చెప్పింది వినబడకపోగా చివరికి తామడిగింది కూడా వాళ్లకి జ్ఞాపకం లేకపోయింది. కాని యేడో ద్వారంలో వున్నవాళ్లు సామాన్యులుకారు. అది దాటితే యిక దర్బారే; కనక అక్కడ వుక్కుతునకల్లాంటివాళ్లు న్నారు. ఈ సంగతి కనిపెట్టి క్షత్రియులు, వాళ్లమీా అడక్కముందే తమకి తాఖీదుచుని, "నవాబుగారి దర్శనం కావా" లన్నారు. కావలిస్తే "కావా"లంటే ప్రార్థించడమే; గాని నడికట్లలో కటారులూ, చేతుల్లో పట్టాకత్తులూ, చూపుల్లో కరుకుతనమూ, మీసాల్లో శౌర్యస్ఫురణా—ముఖమ్మీద వీరతేజస్సూ చూశాటప్పటికి వాళ్లకి ఆ 'కావా' లన్నమాట కేవలమూ హుజూరుహుకుంకంటేనూ కూడా యెక్కువగా తోచింది. ఆకారణంచేత వారిలో వొకడు లోపలికి వెళ్లి సెలవు పొంది వచ్చి వారిని తీసుకువెళ్లి నవాబు యెదుట హాజరు పెట్టాడు.

## 3

దర్బారంతా కిటకిటలాడిపోతోంది. వజీర్లూ, ఫౌజుదార్లూ, సరదార్లూ, జాగీరుదార్లూ, రాయబారులూ, అంతా యిలాంటి ప్రజ్ఞావంతులేగాని అక్కడ కేవలం మనుష్యులెవ్వరూ లేరు. రాచవారిని చూసి అలాంటివారంతా చకితులై పోయారు.

రాజులు వీరనమస్కారాలు చేసి పంచపాండవుల్లాగ నుంచోగా నవాబు కూచోమని తల వూపాడు. తరవాత నవాబుయింగితం కనిపెట్టి రాజులలో మొనగాడు లేచి యిలా అన్నాడు:—

"మేము చాలా దూరాన్నుంచి వస్తున్నాం. మేము క్షత్రియులం. మాది యోధజాతి. అంటే మేము కత్తి పట్టడానికే పుట్టాం."

"................"

"ప్రాణాలు పోయాకే మాచేతిలో వున్న కత్తి కింద బడిపోతుంది."

"అంటే?"

"అంటే యేం వుందీ? ఎదటివాణ్ణి చంప కుండా క్షత్రియుడు చావడు. రాచపీనుగు తోడు లేకుండా వెళ్లదు"

"చాలా సాహసమైన మాట."

"క్షత్రియజాతియొక్క సాహసానికి యీ మాటలో వుండుకున్న సాహసం సూచకం మాత్రమే—"

"ఏ జాతిలోనైనా చాలామంది శూరులు వుండవచ్చును. ఎదటివాణ్ణి కొట్టినా కొట్టక పోయినా తాము పోరుతూనే చచ్చిపోవచ్చును; గాని పొడిచిగాని చచ్చిపో మనడం నమ్మరాని మాట."

"తమ కలా తోచడం మాకు భాగ్యమే. అవునంటే కాదంటూ వాగ్వాదం పెంచడాని కిది శాస్త్రవిషయం కాదు. ఇది ప్రత్యక్ష విషయం."

"అవును."

"తమరు పరీక్షించవచ్చు."

"ఎలాగా?"

"మాలో వొకడు తమ సమక్షంలో నుంచుంటాడు. తమ సర్దార్లలో తమ యిష్టం వచ్చినవాణ్ణి తుపాకి యిచ్చి మావాడికి పదిగజాలలో నుంచోమని తుపాకి పేల్చవలసిందని సెలవివ్వండి."

"తరువాత?"

"మా వాడు ముందు గుండుదెబ్బ తింటాడు."

"తిని?"

"తిని వెంటనే తన సర్దారుని పొడిచేస్తాడు."

"....................."

"తరవాతే మావాడు పడిపోతాడు."

అంతటి దర్బారులో యిలాంటి అమానుష ప్రతిజ్ఞ నిదివర కెవరూ విని అయినా వుండలేదు. ఉన్నవారిలో విన్నవారంతా చకితులైనారు. సరదార్లంతా వజీర్ల కేసి చూడగా వజీర్లు నవాబు కేసి చూశారు. నవాబు రాచవారిని చూసి నిరుత్తరుడైనాడు.

కొంతసేపు యెవరూ యేమీ మాట్లాడలేదు. మాట్లాడడాని కిందులో సందెక్కడా? నమ్మడాని కిది అశ్రుతపూర్వం. నమ్మకపోదామంటే రాజులు సవాలు చేస్తున్నారు.

మరికొంతసేపటికి నవాబు "మూడుగంటలికి పరీక్ష" అని క్షత్రియులకు సెలవిచ్చాడు. వజీరు ఆజ్ఞచేత రాచవారికి ఆతిథ్య సత్కారాలు చెయ్యడానికి వొక సర్దారు వారికూడా సత్రానికి వెళ్లాడు.

౪

మూడయింది. దర్బారంతా యిసక వేస్తే రాలకుండా కిక్కిరిసి పోయి వుంది. ఆరుగురు క్షత్రియులు రాగా సభ్యులంతా విరగబడి చూశారు. ఉచితమర్యాదలైన తరవాత రాజుల మొనగాడు "మా వాడు సిద్ధం" అని చెప్పగా నవాబు వొక వజీరుకేసి చూశాడు.

ఆ వజీరు వొక సర్దారుకేసి చూడగా అతగాడు లేచి 'తయా'రన్నాడు.

రాజులలో మొనగాడికొడుకు ముందు తండ్రికీ, తరవాత తక్కిన నలుగురు క్షత్రియు లికీ పాదాభివందనం చెయ్యగా వారైదుగురూ అతని శిరస్సుమీద చేతులు వుంచి దీవించారు.

ఆ దీవనలు శిరసావహించి, రాచకుమా రుడు నవాబుకి సలాం చేసి, కైజారుపిడిమీద కుడిచేతి నుంచుకొని, యుద్ధస్థలంలో నుంచో గా, సరిగా అతనికి పదిగజాల దూరంలో దట్టిం చిన తుపాకీ పట్టుకుని, తురకసరదారు నుంచు న్నాడు.

యోధుల హృదయాలుగూడా గుబగుబ లాడిపోతున్నాయి. తక్కినవారి చూపులు చెదిరిపోతున్నాయి.

చూసిచూసి, నవాబు కన్ను గీటాడు. తుపాకి 'ఢా'మ్మంది. ఆ అగావుకి మూతలుపడ్డ దర్బారుకళ్లు మళ్లీ తెరుచుకునేటప్పటికి దెబ్బ తిన్న రాచకుమారుడు చర్రున కైజారు దూసి, చెంగున ముందు కురికాడు; గాని అయిదు గజాలలో పడిపోయాడు. దానికే దర్బారంతా ఆశ్చర్యపడింది. నవాబు మందహాసం చేశాడు.

కాని రాజుల మొనగాడిదేమీ చూడ లేదు. కుర్చీలోనుంచి వొక్క వుడాం వేశా డతను. పడిపోయివున్న కొడుకు చేతికైజారు వు శాక్కుని మెరుపులాగ బసలోకి పరిగెత్తాడు. కారణం తెలవక వున్నవారందరూ—నవాబు గూడా-తెల్లపోగా, తక్కిన క్షత్రియులు సంగ తులన్నీ గ్రహించి, "మావాడు మళ్లీ యిప్పుడే వస్తాడు. ఎవరూ తొందరపడవద్దు" అని చెప్పారు.

౫

అక్కడ—బసలో భార్య ప్రత్యుత్థానం చెయ్యగా మొనగాడు కైజా రెత్తి, "నిజంచెప్పు. నీపెద్దకొడుక్కి తండ్రి యెవడు!" అని వురి మాడు. రాచకుమాళ్ల కిలాంటి వురుములు నేర్పే మాత ఆమె. క్షణంలో సంగతంతా గ్రహించింది. వెంటనే పైట తొలగించుకొని గుండెలిచ్చి నిలిచి, ఉరగాంగనలాగ వులుకూ వులుకూ చూస్తూ, "ముందు పొడిచేసి, తర వాత అడిగినా జవాబు చెబుతాను. ఏం? పెద్దబ్బాయి రసాభాసం చేసాడా? అనుకు టూనే వున్నాను. అయినా అనుగ్రహం వుంటే వివరాలు చెప్పండి" అంది.

మొనగాడికి మెరుపుదెబ్బ తగిలినట్లయిం ది. "అనుకుంటూనే" వుంది. ఆకళ్లల్లో ఎంత శౌర్యం తొణికిపోతోందీ? అలాంటిస్త్రీ స్తన్యం తాగినందు కేనా ఆ రాచకుమారుడు తండ్రి మాట నిలిపివుండవలసింది.

కోపం తగ్గలేదు; గాని వుద్రేకం అణి గింది. మొలకట్టులో పెట్టలేదు, గాని కైజారు కిందికి దింపాడు. జరిగిందంతా చెప్పి అతను "ఏం చెబుతా" వన్నట్లుగా కనుబొమ్మ లెగ రేశాడు.

"ఎప్పుడు పుట్టిందో మావంశం. మా తల్లులూ, మాతల్లుల తల్లులూ, వారి పూర్వ

లూ గూడా యెప్పుడూ వేలుపెట్టి చూపించుకోలేదు."

"......................"

"గాని మీకిప్పుడిలాంటి సందేహం కలగడంలో ఆశ్చర్యం లేదు."

"......................"

"కారణం కూడా లేకపోలేదు."

"........................"

"పెద్దబ్బాయి పుట్టినప్పుడు నాదగ్గిర పాలు చాలలేదు. అబ్బాయి వెంకటలక్ష్మిపాలతో పెరిగాడు."

దీనితో మొనగాడికి నెమరు తిరిగింది. దాసిపాలు అయిదుగజాల వెనక్కి లాగేశాయి. "ముందు పరీక్షచేసి పంపవలసింది" అని మనస్సు అనగా "అలాంటివాడు పోవడమే మంచిది" అని బుద్ధి చెప్పింది.

"దర్బారులో యేం జరిగిందీ?"

"అబ్బాయి అలా పడ్డాడు. నేనిలా వురికాను. అప్పుడక్కడ లేకపోవడమే మంచిది వుంటే యేం దుష్టుమాట చెవిని బడి వుండునో."

"ఇప్పుడైతే యేమీ? చిన్నబ్బాయిని తీసుకు వెళ్లండి."

తల్లియిలా చెప్పేటప్పటికి రెండోకొడుకు "బాబయ్యగారూ! నేను వస్తాను పదండి" అని ముందుకు వచ్చాడు. తండ్రి 'రా' అన్నాడు. తల్లి దీవించింది.

"వెడుతున్నాను. వీలయితే అబ్బాయి కీర్తిని తీసుకువస్తాను. లేకపోతే___లేకపోతే___"

"ఆ కైజా రిలా యిచ్చి వెళ్లండి."

కైజారు ఇవ్వడంలోనూ, పుచ్చుకోవడంలోనూ చెయ్యీ చెయ్యీ తగిలేయి. ఉభయ విద్యుత్తులూ కలిసినట్లయింది. ఆ వృద్ధ క్షత్ర శౌర్యాన్ని వారిద్దరూ కొడుకులో లీనం చేశారు.

౬

దర్బారంతా సంగతి వినడానికి ఔత్సుక్యం చూపింది; గాని మొనగాడు "ఇప్పుడు పరీక్ష చేయించండి. ఇది చివరిది" అన్నాడు.

"ఇలాంటి అసాధ్యప్రతిజ్ఞ తీర్చుకోవడం కోసం రత్నాలవంటి కొడుకుల్ని బలి యిచ్చుకోవడం మంచిదా?" అని నవాబడిగాడు.

"నా కొడుకులు రత్నాలవంటి వాళ్లని తమరు సెలవిచ్చారు. నా పెద్దకొడుకు అలా నడిదారిలో పడివున్నప్పుడు తమ స్తుతి నింద అవుతోంది గాని ప్రశంస కావడంలేదు. మళ్లీ తనిఖీ చేయించండి" అని మొనగాడు మళ్లీ కోరాడు.

నవాబు దర్బారంతా కళవళపడుతూ వుండడం చూశాడు. గాని యిలాంటి ప్రాణోత్క్రమణాలు లక్షలకొద్దీ చూసిన కళ్లవి. శౌర్యప్రస్తావన వచ్చినప్పుడు కొబ్బరిచెట్టుమీద నుంచి పుచ్చె పడడం యెలాంటిదో మనిషి మెడమీదనుంచి తలకాయ పడడమూ అలాంటిదే,

పైగా యిప్పుడు విఫస్వామ్నికి చెందిన శౌర్యాన్ని పరీక్షించడం. నవాబు వెంటనే అంగీకరించాడు.

తండ్రి తన అన్నగారి కళేబరాన్ని వొక పక్కకి తీసెయ్యగా రాచబిడ్డ వెళ్లి కైజాపు పిడిమీద కుడిచేతి నుంచుకొని నుంచున్నాడు.

తురక సర్దారు తుపాకీ దట్టించుకొని నుంచున్నాడు. మొనగాడు చూపుతూపులతో కొడుకు శౌర్యాన్ని గుచ్చిగుచ్చి రేపెడుతున్నాడు.

నవాబు మళ్లీ కన్ను గీటాడు. తుపాకీ మళ్లీ 'ధా'మ్మంది. సరదారు రాచకుమారుడు గుండుదెబ్బ తినడమూ, కైజారు దుయ్యడమూ, ముందు కురకడమూ కూడా యెరగడు. కెవ్వన కేకమాత్రం వేశాడతను.

నిదానించి చూడగా తురకసర్దారూ, రాచకుమారుడూ వొకరిపక్కని వొకరు పడివున్నారు. సరదారు పేగులు బైటికి వచ్చివున్నాయి.

దర్బారంతా స్తబ్ధమై పోయింది. నవాబు లేచి మందగమనంతో దగ్గిరికి వచ్చి సలాం చేసి 'సెబాస్' అన్నాడు.

ఇద్దరు కొడుకుల్ని యేకకాలంలో పోగొట్టుకున్న రాజుల మొనగాడు నవాబు ప్రశంసని ఆనందతరంగితాలైయున్న కళ్లతో అందుకున్నాడు.

తమకు కలిగిన గౌరవభావం వల్లనూ, నవాబు ఆజ్ఞవల్లనూ దర్బారులో వున్నవారంతా పడివున్న రాచకుమాళ్లని గౌరవించారు. నవాబు వారి దహనసంస్కారానికి తన వుద్యానవనంలో స్థలం యేర్పాటు చేయించాడు. నవాబు సేనాసాగరం ఆ వుద్యానవనాన్ని ముంచివేసింది.

నవాబు క్షత్రియవీరులికి జాగీరు లిచ్చాడు. సైన్యాధిపత్యం యిచ్చాడు. తన దర్బారులో యెగువ పీటలిచ్చాడు. కనకాభిషేకం చేశాడు.

క్షత్రియులు నవాబు ఋణం తీర్చుకున్నారు. ముఖ్యంగా మొనగాడు చేసిన వుపకారం నవాబుకి పరిమితం లేనిది. బ్రతికి వున్నంత కాలమూ అతను నవాబుకి కుడిభుజంగా వుండి చివరికి భార్యతో కూడా అవ్యయానంద నిలయంలో వున్న కుమాళ్లని కలుసుకున్నాడు.

అతని వంశం అంతటితో సరి. అందుచేతనే ఆంధ్రక్షత్రియులలో ఇప్పుడు నాలుగు గోత్రాలు మట్టుకే వున్నాయి.

---

భావగీతము

జనమంచి వేంకటరామయ్య గారు

చెప్పికొనుమీ చిన్నసఖుఁడా చెప్పికొనుమీ చిన్నసఖుఁడా—
చెప్పికొనుమీ చిన్నసఖుఁడా మెప్పు గనుమీ బుద్ధిమంతుఁడ
తప్పుత్రోవను బడక యిదె నా గుప్పిటను గల యర్థమేదో—

కాదు ద్రాక్షామధుర ఫల మిది స్వాదుమోచాఫలమునుర్క
గాదు నారికడంబు నే భూఖండమందలి ఫలముఁ గా దిది—

కాదు భక్ష్యము కాదు భోజ్యము కాదు దృశ్యము చింత్యమును
గాదు కాదను వేదపూరుషు కడుపులోనిదివలె న దేదో—

కాని దెల్లను లేనిదే యగు లేనిదెల్లను గానిదే,
కానిదియునుర్క లేనిదియు ననరానిదగు నావస్తు వేదో—

వ్రక్కలింపఁగఁ జూచెదేమో పట్టి గుప్పిలి చేతులర్క
మొక్కవోవు నృసింహదేవుని యుక్కుగోళుల ముక్కలయినను—

పూలగుత్తియుఁ గాదుసుమి యిది క్రోలఁ బుప్పరసంబుర్క
వ్రాలినంతనె కొదమతుమ్మెదవలెనె యెడఁదకు నింపు గలుగ—

మెఱుఁగుదంతపు బరణి గాదిది మేలికస్తురి వాసనల్
గుఱియ గుప్పున మూఁత యించుక దెఱచినంతనె దిక్కులందు—

సరసశుక్తిపుటమ్ము గా దిది విఱిసి తనకును దానుగా
మెఱసి జలజల రాలు ముత్తెపుసిరుల నీకు నొసంగుటకును—

పెఱికి పుచ్చుకొనంగ రా దిది పిసిఁడిగొంటు పసిండి దా
పటికమట్టలు ప్రాణములనే బలి యిడంగ లభించు నీకు—
చెప్పికొనుమీ చిన్నసఖుఁడా చెప్పికొనుమీ చిన్నసఖుఁడా—

భావకవితల లోఁతు పాతులు పట్టిచూడఁగ నిట్టివే
భావకవి హృదయముల గుట్టును మట్టు గుప్పిటిలోనివే—

అడిగి చూడుము కోఁతవైద్యుని నన్నృతమాడితినేమొ, నీ
కడుపులోని దురాశయములను గత్తిరించు నతండు; డీఁకఁగా—

భావకవితాగాథ విభవవిభావనారతి, నీమతిఁగా
దావలముకొనె నేని చెప్పెదఁ; గేవలము నిశ్శబ్దమై—

యనిల సంచలనం బడంగిన యంతరంగసమాధియో,
కనులు మూయని యోగనిద్రాకలనమో యనఁ బ్రకృతిఁగా—

బెనుపుఁ గూర్చెడి కాలరాత్రిని, విమల గగనాంగణమునన్
మినుకు మినుకను తారకాళి నిమీలనోన్మీలనములే—

యెనయుచుండఁగఁ దాళగతులయి హృదయతంత్రుల మీటుచున్
హృదయగతుఁడగు గాయకుఁడె పలికించెడున్ వినిపించెడున్;
విదితమగు నీ హృదయమున కది వినెడు నేరుపు లేదవిన్.

అపుడు పుట్టిన నీసువు నూరుపుకన్న సున్నిత మయ్యునున్
విపులజలధి గభీరఘోష వినిర్భరాంతర గర్భమై
వినఁగ నయ్యెడు విష్ణునాభీ విమల కమల మిళింద ని
స్వనము లెను నాద మొక్కటి సర్వతోముఖమై; యదే

శ్రవణములకు రసాయనంబగు స్వాంతమున కానందహా
గవన మదియగుఁ గవి యతండగుఁ బ్రవిమలాంతః కరణుఁడై
యెవఁడు విని వినిపింప నేర్చునొ హృదయ మలరఁగ దానినే.

---

# అహమ్మదాబాదు చిత్రములు



౧. అందముగా కట్టిన ఒక మసీదు.



౨. రూపమతి రాణి మసీదునందలి కిటికీ.
అందముగా గట్టినది.



౫. ఆబూపట్టణము దృశ్యము



౬. 'దిల్వార' దేవాలయ మంటపముయొక్క-
పరంబీరాము. సుందరశిల్పము గలది.



౭. 'దిల్వార' దేవాలయమునందలి
ముందు వసారా.
ఇందలి శిల్పము అత్యద్భుతముగ నున్నది.

# పెంపుడుగున్నలు

కల్లూరి సాంబశాస్త్రిమహాముని గారు

పెంచుగోవాలంటే చాలా మోస్తర్లున్నాయి. పిల్లల్ని పెంచడం, పక్షుల్ని పెంచడం, మృగాల్ని పెంచడం అని. పక్షులూ మృగాలూ కూడా పెంచినవాళ్ల యందు వినయవిధేయతగా వుంటాయి. అవే విశ్వాసం గలవి. కాని అన్న భుక్కుల్లో యీ విషయం ఆలోచించవలసిందే! వారిలో కూడ విశ్వాసపాత్రులు చేరనిమాత్రం కేవలం కొట్టేడానికీ వీల్లేదు. నూటికి కోటికి వుంటూంటారు. ఈ పెంపుల్లో చాలా రకాలున్నాయి.

ఎవరిపిల్లలను వాళ్లు పెంచుగోడమన్నది సహజం. కాకిపిల్ల కాకిక్కి ముద్దు. తమపిల్లాళ్లు కోతులైనా కొంకనక్కలైనా తమకు ముద్దు. రక్తస్పర్శ కనుక తప్పదు. ఈ రకంలో ప్రేమన్నది దానంతటదే పిల్లాడి పుట్టుకతోనే పుడుతూంటుంది.

కొన్నివిషయాల్లో పిల్లవాళ్ల తలిదండ్రులు కీర్తిశేషులవడంవల్ల యే పెదతల్లి పినతల్లులో, మాతామహి పితామహులో దగ్గరకు తీసి పెంచడం వుంది. చూశారూ; అది కేవల కరుణారసంతో కూడుకొన్న విషయం. ఈ రకంలో పెంచినవారికీ పెంపబడినవారికీమాత్రం ప్రేమనే తాడు కట్టబడి వుంటుంది సహజంగాను.

కాని పిల్లలు లేనివారు కొందరు అనగా వంధ్యలు యితరుల బిడ్డలను చేరదీసి పెంచడాలు కొన్ని. వీరు కొత్తలో మాత్రం పెంపుడువాణ్ణి కన్నబిడ్డకంటె కోటి డిగ్రీ లెక్కువగా చూస్తూంటారు. తర్వాత చెప్పేదేమిటి? ఎవరితిప్పలు వాళ్ల కెరుక. 'మొదటచూచిన కడు గొప్ప పిదప కురుచ' అన్నవాడు వెర్రాడుకాడు. ఈ పెంపుల్లోనే చాలా లావాదేవీలూ, తబ్బిబ్బులూ, తసనాలూ, టికమికలు వున్నాయి.

కనుక యిప్పుడీరకం పెంపుల్నిగురించి విచారిద్దాం. పెంపంటే ఒక పిల్లలులేని వ్యక్తి మరోపిల్లలున్న వ్యక్తి వద్దనుండి ఓ పుత్రాణ్ణి అడిగి తెచ్చుకొని విధ్యుక్తకర్మలు చేసికొని పెంచుతూ ఔరసపుత్రుళ్లాగ చూస్తూవుండి తన లొడ్డూలొస్కూ వానికి యివ్వడం. దీనినే దత్తం అనీ దత్తత స్వీకారం అని పిలుస్తారు. ఆంగ్లంలో 'Adoption' అంటారు. లేనిది తెచ్చిపెట్టుకోడం అంటే యిదే. ............ ఈ పిల్లాడా ఆసామిని భార్యను వృద్ధాప్యంలో నుద్ధరించి సంరక్షణ చేసి అంత్యాన్ని బుగ్గిచేసి రెండు నీళ్లొదులుతాడని వాళ్ల వుద్దేశ్యం.

దత్తతచేసుకోడాల్లో ఒక్కొక్కరి కొక్కొక్క అభిప్రాయం వుంటూంటుంది. పున్నామనరకవిముక్తి నొందుదాం అని పెంచుగుంటా డొకశాస్త్రిల్లుగారు. తన రాజ్యానికి నా అన్నవాడు లేక అరాజకం అవుతుందని పెంచుగుంటా డొరాచబిడ్డ. తన గల్లాపెట్టెకి కాళ్లొచ్చి కదిలిపోతుం దేమోయని బెంగపెట్టుకొని పెంచుగుంటా డొకోమటిగున్న. దిబ్బమీద దీపమెట్టి ముంతేనా పాలం తెస్తూంటాడని పెంచుగుంటా డొకాపులపుత్రాడు.

ఏలాగైతేం ఓవ్యక్తియొక్క నామరూపాలు నిలువబెట్టుననీ, బాంధవ్యాలు బలపడతాయనీ, కాలూచెయ్యీ వంగినప్పుడు సంరక్షణ జరుగుతుందనీ, అంత్యాన్ని బూడిద చేసేవా ళ్లుండరేమో అని, అమ్మానాన్నా అని పిలుస్తాడని, ఇన్ని నీళ్లొదులుతూ పిండమేస్తాడని మొత్తంమీద యేదో ఒక అభిప్రాయంతో రంగంలో దిగుతారు పెంచుకొనే వాళ్లు.

ఇంక యిచ్చేవాళ్లకథ చూద్దాం. పిల్లలపాతరుండి పెంచదారుఢ్యం లేక కొందరు, పిల్లలు లేని ఆసామికొంప నిలబెట్టి పున్నెంకట్టుకొని తాముకూడా వారి ఆస్తి వేసుకొని వారింట గృహప్రవేశం అవుదామని కొందరు గడుసులు, పుత్రభిక్షం పెట్టి వారి నుద్ధరిద్దామని కొందరు, బాంధవ్యం బలపరుద్దామని కొందరు; పెంపిస్తేనేం

వాళ్ల పిల్లాడైపోయాడా! మన్ని మరచే పోత్తాడా అని యిచ్చేవారు కొందరు వుంటారు. మొత్తంమీద ధనాశే పిల్ల యిచ్చేవారు సెంటు పెర్ సెంటు.

పెంపువళ్లే వాజల సంగతి చూద్దాం. కొందరు పాలు విడువగానే యిచ్చివేయబడుదురు. వారి కీవిషయంలో యేమీ తెలీదు. వీరిలో వెన్ను ముదిరిన రకాలుంటాయి కొన్ని. వీరు మప్పితంగా పెరుగుబిళ్లా గట్రా వేయించుకొని తింటూ గున్నపిట్టగున్నట్లు కూర్చుండా మనిరాజ్యం యేలేద్దామని డబ్బుంతా వేసుకొని కుబేరుళ్లవుదామని, అన్నదమ్ములకన్న మిన్నగావుందామనీ చంకలు వేసుకొంటూ ఒప్పుగుంటారు.

అత్తుకోడాల సంగతి కాసంత ఆలోచిద్దాం. మొదట పెంపుడుబిడ్డంటే చాలా గారాంగా వుంటాడు. పసితనంలో పెంపైతే జనకసంబంధమేమో తెలీదు. పెంపుడు తలిదండ్రులు వాళ్లను మరపిస్తారు. వీళ్లే తలిదండ్రులనుకొని కొన్నిచోట్ల అత్తుకోడాలున్నాయి. ఈ పిల్లాడు చిన్నప్పణ్ణుంచీ వాళ్లను 'అమ్మా' నాన్నా' అంటాడు. పెంచుగునే వాళ్లకు అమ్మా నాన్నా అనిపించుగునే బులుపు తీరుతుంది. పెంపుడు తలిదండ్రులు వీరిచేత పని చేయింపరు, కూర్చోనీరు, నిలుచోనీరు, మాటాడనివ్వరు. కుర్రాడుమాత్రం నవనవలాడుతూ పెరుగుతోటకూరలాగుంటాడు. బలముండదు. కోమట్లలో చెప్పనక్కరలేదు. అసలే అణాయిడ్డేను. ఆపళంగా సిద్ధివినాయకరావై వూరుకుంటాడు.

ఇంకముందర పెంకిడిప్పకాయగాళ్ల సంగతేమిటంటే: వీళ్లు కేవల ధనాశచే వచ్చేవాళ్లేగాని మరేంగాదు. పసితనమునుండే వున్న వాళ్ల కేఅత్తుకోకపోతే వీళ్లకత్తుకొంటుందండం కేవలం ఘోరబాటుతో కూడుకొన్న విషయం. ఈ రకాన్ని పెంచుకోడంవల్ల పెంపుడు తలిదండ్రులకు అమ్మానాన్నా అని పిలిపించుగుందా మన్నవుబలాటం మాత్రం తీరదు. వాళ్లమీదవీళ్లకూ ప్రేముండదు. ఈవెన్నుముదర బెండకాయగాళ్లు విధిలేక పెంపుడు తలిదండ్రులను పిన్నీ బాబూ అనో, పెద్దమ్మా పెదనాన్నా అనో; దొడ్డమ్మా పెదనాన్నా అనో విశేషణపూర్వకంగా పిలుస్తుంటారు. ఇవిగాక నాలుక చిగురునుండి అమ్మానాన్నా అని పిలిచేరకాలు కొన్ని, వినీవినపడకుండా పిలిచేవి కొన్ని, మూకీభావంగా పిలిచేవికొన్ని, ఎవరూ దగ్గరలేనప్పుడు పిలిచేసరుకు కొంత, ఇంట్లో పిలవక యితరులతో మా అమ్మగారు, మా నాన్నగారు అని నోటినిండా పిలిచే పద్దులుకొన్ని, వుత్తరాల్లో పెద్దక్షరాల్లో అమ్మానాన్నా అని వ్రాసే సోకేశాలుకొందరు, వారిడబ్బు తింటున్నాము అమ్మానాన్నా అంటే యేం మునిగిందని చెప్పిపిల్చే పెద్ద మనుష్యులుకొందరు, అమ్మా నాన్నా అన్నంత మాత్రాన్ని ఆయ్యారా? అని పిలిచేవారు కొందరు, పిలుస్తేనే సరా మనసు ప్రధానమని యెక్కొట్టే ఎడ్డిషాళోలు కొందరు కాని మనసారా అమ్మానాన్నా అనేవారుడుట దుర్లభము. పిలుపుకే యింత పీకులాట పంచాంగమైతే అత్తుకోడం మాట అసలేసున్న.

తర్వాత సంగతి పెంపునకర్తలెవరయ్యా! పెంచుకొనే ఆసామీయొక్క యింటిపేరు గోత్రనామాలు సరిపోవురకాలు, ఇంటిపేరుకలసి గోత్రం భేదించేవికొన్ని, గోత్రంమాత్రం సగోత్రమైతే సరిపడేవికొన్ని, ఇవ్వేలేక దగ్గరబంధూలను పెంచుకొనేవికొన్ని, స్నేహితులపిల్లలను పెంచుకొనేవి కొన్నిరకాలు.

దత్తపుత్రుల నామకరణాల విషయంలో కొంత ఆలోచించవలసిన సంగతుంది. ఈ విషయంలో పెంచుకొనే యిస్తోక్కి పట్టుదల మెండు. పిల్లవాని స్వతసిద్ధమగు నామముంచుట అరుదు. అసలు పేరునకు ఆసామీ తండ్రిపేరు కలిపిపెట్టేవి స్వల్పం. అసలు పేరు తీసి యిలవేల్పు పేరు, ఆసామీ తండ్రిపేరు, మామగారు పేరు కలిపిపెట్టేవి కొన్నిరకాలు, యిలవేల్పు పేరు, తండ్రిపేరు, తల్లిపేరు, అత్తమామల పేరు, భార్యను పీకుకొని తినుచున్న చచ్చిన బావమరది గాడి పేరు కలిపిపెట్టేవి కొన్ని వుంటాయి. ఇవే పెద్దాపురపుచేంతాడు పేర్లు. ఐనబర్లు యిముడుతాయిందులో. కాని ఆఖరుముక్కమాత్రం పిలుస్తారు లోకులు. పెంపుడాళ్ల లో చిన్న పేరుండడంఅరుదు. చెప్పొచ్చే దేమిటంటే పెంచుకొనే వాళ్లకు ఒక్కడే పిల్లవాడు కనుక భార్యాభర్తలు ఉభయమాత్రా పదిళరాల

వాళ్ల పేర్లు జ్ఞాపకముంచుకొని వీడికి తగిలిస్తారు. ఇందులో నే తగాదాలు జాస్తీగా వుంటాయి.

మొన్న యీ నామకరణం విషయంలో నే ఓ దంపతులకు గొప్ప వివాదొచ్చి కోర్టెక్కగా న్యాయాధికారిట్లు సమాధానపరచెనట. ఆసామీ తండ్రిపేరులోని తల్లిపేరులోని మామగారి పేరులోని అత్తగారి పేరులోని పిల్లవాని అసలుపేరులోని మొదటి అక్షరాలు విడివిడిగా వ్రాసి లాటరీవేయగా యీ దిగువతీరున వరుసగావచ్చెనట. ఆ అక్షరాలు అత్తుకోగలందులకు కోర్టువారొసన్న దయచేసి భార్యాభర్తల వుభయుల అనుమతి చొప్పున "రావు" అని చేర్చి నామకరణ మొనర్చిరట.

అ = అచ్యుతరావుగారు—ఆసామీ తండ్రిపేరు.
మృ = మృత్యుంజయుడు—ఆసామీ మామగారు.
తా = తాయారమ్మ—తల్లి పేరు.
ం = పేరు అత్తుకోడానికి కోర్టువారిచ్చినది.
జ = జగ్గమ్మ—అత్తగారి పేరు.
న = నరసింహశర్మ—పిల్లవాని అసలుపేరు.
రా, వు = ఉభయుల అనుమతినీ యిచ్చినది.

"అ మృ తా ం జ న రా వు"

పెంపుల్లో పెక్కురకా లున్నాయి. ఇవేనా?

౧. తగిన ఆస్తివుండి పిల్లలే లేక గొడ్డువారైయుండి పెంచుకొనేవారు కొందరు. వీరికి పిల్లలను పెంచుటేమిటో బొత్తిగా తెలీదు. పిల్లలను పెంచుకోవచ్చునుగాని ప్రేమనేదాన్ని పెంచడానికి మనమెవరం, అది సహజంగా పిల్లాడు పుట్టేటప్పుడే తల్లికి పుడుతుంది. నవమాసాలు పిల్లాడితోపాటే వుంటుంది కడుపులో. పిల్లలు పుట్టినవాళ్లకే యీ ప్రేముంటుంది. — — — — లేనివారల కుండనే వుండదు. అంచేతనే కాబోలు "బిడ్డకు ప్లైరుగని గొడ్డువారలకు ప్రేమన్నదెక్కడ పెంపొందునయ్యా" అన్నాడో పెద్దమనిషి.

ప్రేమనేది పుట్టాలేగాని తెచ్చిపెట్టుగుందుకు నగ కాదు. కనుక యీబాబతువారికి సహజప్రేమేమిటి. పిల్లాడు అబ్బరాల కూచెన్న అవుతాడు. వాడు ఆడినది ఆట, పాడినది పాట. డబ్బుమీద నడుస్తాడు. మెజారిటీ పైబడేసరికి శిఖపట్లగోత్రాలు, పంపగాలు, పారీకత్తులు, కోర్టులు, తీర్పులు మొదలైనవి నూటికి యేబది రకాలు తేల్తాయి! విధిలేక పెంపుడాళ్ల కర్మాది కార్యాలు చేస్తాడు గాని మనసారా యెన్నడూ కాదు. అంతా కూలివాని తంతు. వాళ్లఅంత్యాన్ని సర్వాధిపత్యం అనుభవిస్తాడు పుత్రుడు.

౨. ఆడపిల్లలుండి ఆస్తి బాగావుండి పెంచుకొనే పెంపులు కొన్ని. ఈ రకంలో పెంచుగునే ఆసామీ తన పిల్లల తర్వాతా అల్లుళ్ల తర్వాతా పెంపుడు పెద్యాన్నగాణ్ణి చూస్తాడుగాని అంతకుముం దెన్నడూ కాదు. పుట్టినసంతతది; తెచ్చిపెట్టుకొన్న సంతతిది. ఇందులో మరోరకముంది గుడ్డిలో మెల్ల. అదేమిటంటే ఆడపిల్ల గల ఆసామీ ఓచిన్నవానిని పెంచుకొని వానికి పెళ్లిచేసినది. తనదగ్గర చుట్టాల బొట్టయితే అంత నీరసంగా వుండదు. అదో పాయగా పోతుంది. యేలాగైనా నూరు కో వెలల్లో ఓ కాకి పెంపుడాడు.

3. పిల్లలుపుట్టి జారిపోవుటచేత పెంచుకొనే పద్దులు. వీరలకు ప్రేమన్నది కొంత తెలుస్తుంది. ఈ విషయంలో వ్యాపారం తాబీగానే నడుస్తుంది. పెద్దాళ్ల య్యాక సంగతి భగవంతున కెరుక.

౪. ఏ అన్నకూతుర్నో తమ్ముడు బిడ్డనో, వదినగారి చిన్నదానినో, మరదలుగారి దాన్నో, అప్ప బిడ్డనో చెల్లెలిబిడ్డనో, మేనకోడలు పిల్లనో చిన్నప్పటినుంచి పెంచి వారియందున్న మమకారం చేత వదలలేక పిల్లకీడైన అందగానిని తెచ్చి పెంచుకొని పెళ్లిజేసేవారు కొందరు. వీడు యిల్లరికపు టల్లునివలె వుంటాడు. కాని వుత్తరోత్తరా యీ మిథునాని కుదయించే పాళ్లనుబట్టి పెంపుడాడిమీద ప్రేమవుంటుంది పెంపుకుతలిదండ్రులకు.

౫. భర్తపోవవల్ల పెంచుకొనే తరగతి. ఈరకంలో భర్తతరపువాణ్ణి అంటే తమ్ముడుకొడుకునో అన్నగారి వాణ్ణో, స్వకుటుంబీకుణ్ణో, పైకిపోకుండా చేరదీస్తాడు భర్త. ఇట్టి పెంపులో పిల్లాణ్ణిచూస్తే తల్లికొరకొర్లాడు

తుంది. వాడిని కడుపు మాడుస్తూ కోసిపెట్టుతుంది. ఈ పోరుపడలేక వాళ్లకన్నవారింటికి కాలికిబుద్ధిచెప్పి మైనారిటీ వదలిన తక్షణం అమీనాగాడితో హాజరై గృహప్రవేశమవుతాడు కుర్రాడు. ఇందులో పిల్లాడి కీతల్లిదండ్రులకు సుతరామూ అత్తుకోదు.

౭. భార్యపోరు పడలేక పెంచుకొనేమోస్తరు మరొకటి. ఇందులో భార్య తనవాళ్లన్న వాళ్లలో అంటే అన్నదమ్ముల కొడుకునో, అప్పచెల్లెళ్లకొడుకునో పెంచుకునేదాకా మొగుడు కాళ్లక్రింద మంట పెడుతుంది. దానిపోరు పడలేక పెంచుకొంటాడు మొగాడు. అలాటి పిల్లాడిమీద తండ్రికాపేక్షంటే యెక్కడిది? పిల్లాడికి భోజనసదుపాయాలు మాత్రం నమ్మకంగా కుదురుతాయి. అబ్బాయి అణాయిడ్డెను అన్నయ్యవుతాడు. చదువుసంధ్యలు కనుబొమ్మలమీది వెండ్రుకలమోస్తరు.

౮. బంధూల బలవంతంవల్ల పెంచుగొనే క్లాసు. కావలసిన సంబంధం విడిపోకుండా కలుపుగుంటారు. పొత్తులసంగతిలో కొత్తేమీ లేదు.

౯. భర్త బ్రతికున్నప్పుడు విల్లు వ్రాసి రిజిష్టరు చేసిపోయిన పిదప భార్యపెంచుగొనేఫక్కీ. ఈ పద్దు కుర్రాడికి స్వరాజ్యం వంటిది. ఇదే ఫస్టురకం పెంపు. చక్రవర్తిత్వం వాడిదే. చదువురాని తల్లయితే ఒంటికాలి నాట్యంచేస్తాడు. అదుపాజ్ఞలు తక్కువ. పోరు పొక్కూ ఉండదు. సంసారబాధ అచిరకాలంలో టూకీచేస్తాడు కుర్రాడు. పెంపుడుతల్లికి చిప్ప. వానికి జోలిమాత్రం నిరాటంకంగా మిగిలి తీరడం రూఢి.

యాతావాతా చెప్పేదేమిటంటే మొత్తముమీద పెంపులంటే ఉభయపార్టీలకు లావాదేవీలు, తంటాలు, తబ్బిబ్బులు పీకులాటలు, చిక్కులా చాలా వున్నాయి.

ఈ చిక్కులనుభవించుటచేతనే కాబోలు మొన్న సంవత్సరాదినాడు శ్రద్ధానంద ఘాటులో రాజమండ్రి పట్టణమున శ్రీయుత[Ch. V. V. S. S. S. R. L. N. GANDHI SARMA GARU] చావలి వీరవెంకటసూర్యసత్య సీతారామ లక్ష్మణ నరసింహ గాంధీశర్మగారి ఆధిపత్యమున సమావేశమైన (D. P. Society) దత్తపుత్ర సొసైటీవారు యీక్రిందితీర్మానములను జేసిరి.

i. ఇంతటినుండి బిడ్డలులేని దంపతులు తమ తమ పిత్రీయం స్వార్జితం బాపతు సొంత్రలను యే దేవాలయములకో, యేస్వరాజ్యనిధికో, యే అన్నసత్రానికో, యే పాఠశాలకో వినియోగపరచి శాశ్వతకీర్తి పొందుచు యే బెడదా లేకుండానుండి పెంపుల నేవికల్లోనైనా తలపక సుఖముగా నుండురుగాక యని యీ సభవారు నమ్ముచున్నారు.

ii. నేటినుండి జనకతండ్రులు తమతమ బిడ్డలను గొడ్రాండ్ర కీయక కన్నందులకు కడుగో గంజో పోసి పెంచి పెద్దవారల జేసి మాతృదేశ సేవాపరులుగా జేసి శాశ్వతాఖండకీర్తి నొందగలందులకీ సభవారు ప్రార్థించుచున్నారు.

iii. ఇప్పటినుండి దత్తపుత్రులు ముందు సంతతివారలను పెంపకము లీయకుండను, జరుగకుండను, ప్రచారము చేయగలందులకును ధనాశనొంది లేనిపోరు తెచ్చికొనకుందురనియు యీ సభవారు కోరుచున్నారు.

ఈ D. P. సొసైటీవారందరు యీ విషయంలో అనుభవంమీద తీర్మానించి యున్నారు. ఈ తీర్మానములను అమలులో నుంచి పనిచేయు భారము పాఠకమహాశయులమీద నున్నది. కనుక శీఘ్రకాలములో నై తీర్మానములు సఫలమగునని నమ్మకం.

* * *

ప్రోషిత:

చాతకీ! యేల నీ వాకసంబునందె
రెక్కలార్చుచుఁ దిరిగెదు రేయిఁ బవలు?
ఎప్పు డెయ్యది భుజియించి యెవ్విధమున
ప్రాణములు నిల్పుకొందువు శూన్యగగనమున?

చాతకి:

అతివా! నీ వెఱుఁగవా? యొక
వ్రత మున్నది నాకు సతికి బలె; నే నా సు
వ్రత నిర్వహణమునకె యీ
వితమున శూన్యాంతరాళ వీథిఁ జరింతున్.

ప్రోషిత:

ఔనులే—చాతకీ! చిత్రమయ్యె నీదు
పలుకు వైఖరి శ్రుతి సీమఁ బడినయంత
ఇట్లు దీర్ఘోపవాస మిా వెంతదనుకఁ
జేసి నిలిపెదవమ్మ నీజీవనంబు?

చాతకి:

జీవనలబ్ధిఁ గోరియె వ
సించుచునుండెద నభ్రమార్గమం
దోవనజాయతాక్షి! యిట
నొండొకచిత్రము గానరాదు; నా
కావిధినిర్ణయించిన ప
యఃకణలాభము గల్గుదాఁక నే
నీవిధి నిట్టుపాసపడియే
భరియించెద మేను మాననీ!

ప్రోషిత:

అక్కటా! యా నవీనాంబుదాగమంబు
వఱకు నీవిట్లె యెంత నీర్వట్టుఁగొనినఁ
గుతలసంస్పృష్టమగు నీరు గ్రోలవేమి!
యెంత మర్యాదగలదానవే విహంగి!

చాతకి:

నీ కనుదామరపూల సు
ధాకణములు రాల్చకుము సుదారుణముగ నీ
వీకరణి; నిన్ను నేను వి
లోకింపఁగఁజాల నో తలోదరి చనెదన్.

# అమాయిక

"అమ్మా! అమ్మా! ఈ పూలు ఎంత చక్కగా ఉన్నవో చూడమ్మా! నాకు ఇన్ని పువ్వులు ఎవరు ఇచ్చిరో చెప్పుకో! అమ్మా! నీవుకూడా నాతో వస్తే నీకూ పువ్వులు ఇప్పిస్తాను. రావే, అమ్మా! రా" అనుచు లీల వినయాదేవి చిత్రలేఖనమునకు అడ్డువచ్చి ఆమె చెరుగు పట్టి ఈడ్వసాగెను. వినయ "లీలా! ఎక్కడకు వచ్చుట? ఇంతవరకు ఎక్కడ నుంటి వమ్మా? అదుగో, ఆకుంచె నటు పెట్టుము. ఆరంగులను తీయకమ్మా! లీలా, ఇంత మంచి వాసన పుష్పములు ఈ అడవిలో నీ కెవ రిచ్చిరమ్మా! ఇప్పుడిపుడే మీనాయనగారు నీ కొరకై వెదకుచు బోయిరి. ఒక్కచోట నుండవుగదా" అన లీల తల్లిమాటల సరకు గొనకయే "అమ్మా! ఒక్కమాటు రావే! పాపము ఎవరో తాత, ముసలితాత, నా కివన్నీ ఇచ్చినాడమ్మా. చాలా మంచివాడు. నేను మా అమ్మ దగ్గరకు వెళ్లెదను, నన్ను వదలుము వదలుము అని ఎన్ని చెప్పినను వినక నన్నెత్తుకొని ముద్దాడి, ఇవన్నీ నాకిచ్చినాడు. కాని, అమ్మా! ఎందుకే తాత చిన్నపిల్లలాగ ఏడ్చుచున్నాడు. నిజముగా, అమ్మా! నాకు కూడా ఏడుపు వచ్చినదే. మీ అమ్మ కొట్టెనదా అని నేను అడిగితే, గట్టిగా నవ్వినాడే. కాని మళ్లా ఏడుపే! నీవు వచ్చి అడుగవే" అని తొందర చేయసాగెను. వినయాదేవి చిత్తము చిత్రలేఖనమునం దైక్యమై ఉంటచే ఆమెకు లీలమాట లేమియు చెవి కెక్కుటలేదు. లీల మరల మరల ఆమెను తాత ఉన్న స్థలమునకు రా బలవంతము సేయ వినయ "లీలా! చీకటి పడుచున్నది. మనము ఇప్పుడు బయలుదేరినగాని ఇల్లు జేరలేము. ఎచ్చటకు వెళ్లుటకు ఇప్పుడు వేళలేదమ్మా" అన లీల "ఔనమ్మా! నాకప్పుడే ఆకలి వేయుచున్నది. నిద్రకూడ వచ్చుచున్నదే. లే అమ్మా, ఇంటికి పోవుదము లే. పోనీ తాతను నీకు రేపు చూపెదనులే" అన వినయాదేవి లీలను తండ్రిగారు చుట్టుప్రక్కల నుందురు పోయి పిలుచుకొని రమ్మని పంపివైచి, మరల అప్పటి ప్రకృతిలావణ్యమును మిక్కిలి నేర్పుతో చిత్రించుచుండెను.

*    *    *    *

లీలకు నాలుగు సంవత్సరములు. చక్కని చుక్క. అతిచురుకైనది. వయసునకు మించిన బుద్ధి. వినయాదేవిచిత్తరంజనుల ముద్దులపట్టి. చిత్తరంజనుడు శాంతిపురజమీందారు. ప్రాయము. 27 వత్సరములు. తండ్రి మహేంద్రుడీతని చిన్నతనముననే గతించెను. పాపము తల్లిని కూడ ఈతను రెండు వర్షములక్రితమే గోలుపోయెను. మూఢాచార మంతయు ఈమె యందే గలదు. పట్టుదలకు పరిమితి లేదు.

వినయాదేవికూడ మిక్కిలి శ్రీమంతుల ఇంట జన్మించినది. తలిదండ్రుల కేక పుత్రిక. కమలాకరుడను సోదరుడు మాత్రము గలడు. ఈమె విద్య బాగుగా నేర్చియుండెను. గాన విద్యయం దపరభారతియే యనవచ్చును. కుట్టు పనులన్నిటియందును ఈమెకు ప్రవీణత యున్నను, ఇది చిత్రలేఖనమునం దీమె నేర్పుకు సాటిరాదు. సార్థకనామధేయుడు చిత్తరంజనుడు వినయాదేవిని పరిణయం బాడి సుమారు ఆరు వర్షములాయెను. పెండ్లినాటికి వినయ పదునాఱు సంవత్సరముల ప్రాయపు జవ్వని.

చిత్తరంజనునకు దేనియందును లోటు లేదు. ఆతని సౌధము లక్ష్మీదేవి నివాసస్థానమును మరపించుచుండెను. సమస్త సౌకర్యములు గలిగియున్నను, ఏలనో చిత్తరంజనుడు అంత ఉత్సాహముగా నున్నటుల తోపదు. ఏదో గూఢవిచారమొ, మరి ఏదియో ఆతని హృదయశల్యమై రేయింబవళ్లాతని బాధించుచుండెను. పైకిమాత్రము పెదవులయందే జన్మించి అచటనే అంతమగుచున్న విషాదపూరిత మందహాసము మాత్రము సదా చేయుచుండును. ఒంటరిగా నున్నప్పుడు మాత్రము ఈనటనను త్రోసిపుచ్చి ఏదో దీర్ఘాలోచన జేయుచు ఎన్నిగంటలైనను గడుపుచుండును. మరియొకప్పుడు తన కన్నీటిధారచే వక్షస్థలమును దడుపుచు, ఆ విధముగానైన తన హృదయావేదనను చల్లపరుప ప్రయత్నించుచుండెడివాడు. ఎన్ని మోమాటములు "అయిన దానికి విచారించిన లాభము లేదుగదా! అయ్యో, చేయి కాలిన పిమ్మట ఆకులకై వెదుకనేల? చంచలచిత్తుడనై నా అమూల్యమణిని, నా అమాయికను చేతులార వదలుకొంటినే! ఆనాడు కన్నీటిని గాబోలు పైటచే నొత్తుకొనుచు, అమాయిక పోవుచుండ కన్నులార చూచుచుకూడ కమలాకరు డేమనుకొనునో యనుభీతిచే పిరికిపందనై శకటమును దిగి ఆమెను కలిసికొననైతి. అటుపై ఎంత వెదకిన నేమి లాభము? అపుడు చూచియు చూడనట్లు నటించితినే. మొదట ప్రపంచమునకు లెక్కజేయగూడదనిగదా తలంచితి. నేనే గతియని నమ్మిన అమాయికయగు అమాయికను పరిణయం బాడెదనని ఎన్నియో ఆమెకడ ప్రమాణములొనర్చి తుదకు మోసగించితిని గదా! తల్లీ! నిన్నెంత ప్రార్థించినను, వెలికై భయపడి నా గోల అరణ్యారోదనము నొనర్చి, నా జీవితము శూన్యముగా జేసినైచితివిగదా! సర్వేశ్వరా! నా హృదయ మింత కోమలముగా నేల సృజించితివి? కర్కశ హృదయుడనైన యెడల సులభముగా తల్లిమాట నిరాకరించి యుందునే. అయ్యో! ఇపుడు మాత్రము కఠినాత్ముడను గాలేదా! చిత్తరంజనుడగుట కన్న నా తలిదండ్రులు నాకు చంచల చిత్తా యని నామకరణము జేసిన సార్థకనామముగా నుండెడిది" అని తన్ను దా దూషించుకొనుచుండెడివాడు. మరియొకప్పుడు "ఎన్నడో కలుసుకొనిన బాల్యమిత్రుడు కమలాకరుడానాడే—నా అమాయిక కేవియో కొన్ని పుస్తకముల గొన, ఆమెను విడిచి వచ్చిన

నాడే—ఏల కలుసుకొనవలెను వచ్చెనుపో; నన్నేల తన గృహమునకు విందునకు పిలువవలె. పిలచెను పో; అతని సోదరిని వివాహమాడుమని అదివరకె అచటికి వచ్చియున్న నా తల్లి నన్నేల నిర్బంధించవలె. ఆమె ఇదివరకే నాయీపరిణయంబునకై ఏర్పాటు చేసినదని నాకేమి తెలియును? ఇంతకును, ఆమెను చూచినతోడనే నా మనస్సేల చలించవలె? ఆహా, మోహము గ్రుడ్డిదనుట నిజము కదా! పాపము వినయగూడ వినయశీలగదా. ఆమెను మాత్రము నే నేమనగలను? ఏమైన నేమి, నా ప్రేమరాశి, నా పవిత్రప్రేమ పుంజము నాకు దూరమాయెగదా! అయినను బ్రహ్మ నా నుదుట నిటుల వ్రాసినపుడు వేరెటుల జరుగును. పోనిమ్ము! నా అమాయిక ఎచ్చటనో అచట సుఖముగానున్న నా కంతియే చాలును. తండ్రీ జగదీశా! ఆమెను నన్ను మరచునట్లు జేయుము. ఆమె సంతసమే నా సంతసము ఆమెసౌఖ్యమే నా సౌఖ్యము" అని పరిపరి విధంబుల తన అంతరాత్మ తన్ను నిందింప,శోకించుచుండెడివాడు. వినయాదేవి తన్నటుల చూచుట తటస్థించునేని ఎంత వగచునోయని త్వరగా కన్నీరు తుడుచుకొని, పూర్వము వలె ఉండుటకు ప్రయత్నించు చుండెడివాడు. పాపము, వినయ కేమియును తెలియదు. భర్తయన్న పంచప్రాణములు. ఒక్కొక్కతరి చిత్తరంజనుడు విచారముగా నుంట కనిపెట్టియు, అడిగిన ఆతనిమన సింకను నొచ్చునేమో యని ఏమియు తెలియనిదానివలె నటించుచుండెడిది. తల్లిదండ్రులు జ్ఞప్తికిరా నటుల ఉండెనేమో యని కొన్ని సమయములయందు తలచుచుండెడిది. ఏమనుకొన్న నేమి; వినయ చిత్తరంజను నెన్నడును ఆతని నిరుత్సాహమునకు కారణ మడుగలేదు. చిత్తరంజనుడు చెప్పలేదు. ఈ విషయమునుగూర్చి తన ప్రియస్నేహితునును, బావమరదియు నగు కమలాకరుకడ నైనను చిత్తరంజను డెన్నడు ప్రస్తాపించియుండలేదు. వారును వీరును ఎట్టి శాంతవచనములు బల్కినను, ఆతని హృదయాక్షోభము ఇనుమడించునా! కల్ల. ముమ్మాటికి కల్ల. కాన చిత్తరంజను డీ గూఢవిచారమను అమూల్యమణిని తన హృదయ పేటికయందు జీవమునకన్న ఎక్కుడు జాగ్రతగా పరుల కంట బడకుండ కాపాడుచుండెను. ఏడేలనో ఎన్ని విధముల నూరట జెందుదమన్నను ఆతనిహృదయ మాతనికి శాంతి నివ్వకుంటచే చిత్తరంజనుడు భార్యాపుత్ర సమేతుడై తన సౌధమునకు సుమారు నలుబది మైళ్లదూరములో నున్న నిర్మానుష్యమగు ప్రదేశమునకు షికారు వచ్చియుండెను.

* * * *

సూర్యభగవానుడప్పుడే అస్తమించెను. ఇంతవరకును తొంగితొంగి చూచుచు మరుగున నున్న పూర్ణచంద్రుడు ఇపుడు నిశ్చయముగా గగనకాంత ఫాలతలంబున విలసిల్లు కుంకుమ బొట్టుకైవడి పైకి వచ్చెను. ఇట్టి సమయమున చిత్తరంజనుడు లీలను వెదకుచు బిట్టుగా వాపోవుచున్న ముదుసలిని సమీపించెను. ఈలోపుగా

లీల తల్లి వద్దకు మరియొక ప్రక్కనుంచి వచ్చి నది మనము చూచితిమి గదా.

చిత్తరంజనుని చిత్తము ఆ ముదుసలిని చూచినతోడనే కరగిపోయెను. ఆతని దుఃఖమునకు కారణము కనుగొన కుతూహలుడై చిత్తరంజను డాతనిదరికి బోవుచుండ, ఆ లోపుననే ముదుసలితాత తాను దెచ్చిన పుష్పమాలికలను తనప్రక్క నున్న లతాకుంజము నందలి చలువరాతిమండపముపై నుంచి, "తల్లీ ఈనాటికి నీవు నన్ను వదలి పూర్తిగా ఆరు సంవత్సరము లాయెగదా. దిక్కుమాలిన దేవుడు నా కెంకను ఎంతఆయువు పోసెనో" యని విలపించుచు, చిత్తరంజనునిరాక చూడకయే, ప్రక్క ప్రవహించుచున్న నదీతీరమునకు జని అట జతికిలబడెను. చిత్తరంజనున కిదియంతయు ఏదో చిత్రముగా దోచుటయే గాక, ఆ లతాగృహము, ఆబాట పూర్వము తా నెప్పుడో చూచినట్లు తోపసాగెను. కొంతతడవచట నిలిచి, చిత్తరంజనుడు తాత ఉన్నచోటునకే తానును బోయి మెల్లగా, "అయ్యా! తమ రేల ఇటుల వగచుచున్నారు? ఈ నిర్జనప్రదేశము నం దీపాదరిల్లేమి? దీనియందీచలువరాతిమండపమేమి? మీ నామధేయ మెయ్యది? మీ నివాసస్థాన మెయ్యది?" అని మిక్కిలి ఆదరముతో బలుక, తాత తల పైకెత్తి చిత్తరంజనుని నవమన్మథ విగ్రహమును దిలకించి, కన్నీటిని దుడుచుకొనుచు త్వరగా లేచి నిలువబడి, "ఓయీ దేవతా స్వరూపా! నీ వెవరు? నీవు నరుడవని నే నమ్మజాల. దిక్కుమాలిన నావంటి దీనుల మొర నాలింప దేవదేవుడే నిన్నిట కంపియుండనోపు. తండ్రీ! నీవెవరో ముందు తెల్పుమా" యని ఆతని ముఖమును రెప్పవాల్పక చూడసాగెను. చూడజూడ తాత కాతనిముఖము నెప్పుడో చూచినట్లు తోచుచుండెను. చిత్తరంజనుడు "మహాశయా! నేను కేవలము నరమాత్రుడనే కాని తమ రేల ఇటుల వాపోవుచున్నారో వినుట కర్హుడనని మీకుతోచిన నాకు విన్నవింప వేడుకొనెద. మీచరిత్ర వినుటకై నామనం బారాటమొందుచున్నది. కాన, ఆలసించక, తత్క్షణము తెల్పరా" అని దీనముగా వేడుకొన, తాతయు "తండ్రీ! నా కథకష్టపూరితము. అయినను, నీవంత నొక్కి నొక్కి న న్నడుగుచుండుటచే చెప్పెద వినుము. అదియుగాక, నిన్ను చూచి నంతనే నా చరిత్రయంతయు నీకు విశదీకరించి నా జీవముల నిచ్చుటనే విడువవలె ననుబుద్ధి పొడముచున్నది. సర్వేశ్వరుడు నన్నింతకాలము నీరాకకైయే వేచియుండ నియమించినట్లును, నిన్నీనాడు నన్ను జీవన్ముక్తుని జేయ పంపినటులును గూడ నాకు తోచుచున్నది. అవును సందేహము లేదు. అయ్యో కుమారా! ప్రపంచమున జీవన్మృతులును, మృతజీవులును అను రెండు తెగల జీవులు గలరుకదా! వారిలో నాయనా, నేను మొదటి తెగవాడను. నా గారాబుపట్టి, నా అమూల్యరత్నము, మృతజీవిని గదా! ఆమెను తలచుకొనిన అయ్యయ్యో, నా గుండెలు బ్రద్దలగుచున్నవి. తల్లీ! పదునెనిమిది వత్సరములు నిను పెంచి పెద్దదానను

చేసి తుదకు అకాలమృత్యువు నోట నిజితిగదా. బిడ్డా! అమాయిక వగుటచే ఈదిక్కుమాలిన ప్రపంచమున మోసగింపబడి దానికై స్వార్థ త్యాగినివై ఆత్మహత్యకు బాల్పడితివి గదా! తల్లీ నీవే గదా ఎన్నియో మారులు ఆత్మ హత్యవంటి నీచకృత్యము వేరొండు లేదనియు, ఎన్ని ఎంతటి కష్టములు వచ్చినను, అట్టిపనిని గురించి ఆలోచించనైన ఆలోచించనంటివి. నే డాబుద్ధి ఏనీట గలసె" అనుటయు చిత్త రంజను దులికిపడి, 'ఏమీ ఈ చనిపోయిన యువతి నా అమాయిక కాదుగదా! కాదు. కాదు. ఈతాత తనబిడ్డ అమాయికత్వమునకు శోకించుచుండెనుగాని వేరుగాదు. నా అమా యికకు సర్వేశ్వరుడు చిరకాల మాయురా రోగ్యముల నిచ్చుగాత' అని మనస్సు నూర డించుకొని తాత కథను వినసాగెను.

నందలాలు "అయ్యా! నా కూతురు అకా లమరణమునకు కారకుడైన ఆ కలుషాత్ముడు, ఆ కర్కశహృదయు డెన్నడైన నా కన్నుల ఎదుట బడునా? చెప్పుము. తండ్రీ! చెప్పుము" అని వెంటనే "అయ్యో! ఆతని నెన్నడు దూషింపవలదని గదా నాతల్లి నన్ను కడసారి వేడినకోరిక! తనలేఖయం దదియే గదా మరల మరల నను ప్రార్థించినది. దుఃఖాతిశయముచే ఒడలు మరచి నాబిడ్డ ఆజ్ఞోల్లంఘనము చేయు చున్నాను గదా" అని చిత్తరంజనునితో "మహా శయా! నీ వడిగినసంగతియే మరచిపోయితిని. నా కథ విశదముగా జెప్ప ఎన్నిదినము లైనను చాలవు కాన ముఖ్యముగా నా యీప్రస్తుతా వస్థకు సంబంధించిన కథను జెప్పెద వినుము." అని తనకథ నీక్రిందివిధమున జెప్పసాగెను:—

"నన్ను నందలాలందురు. మేము బంగాళా దేశవాసులము. మొదట శ్రీమంతులమైయు న్నను, కొన్ని కొన్ని కారణములచే అచటి మా స్వగృహమును, భూములను అమ్మివైచి, ఇచటికి సుమారు మూడుమైళ్లదూరముననున్న గ్రామమును నివాసస్థానముగా నేర్పచుకొం టిమి. ఈ గ్రామమున మేమే బ్రాహ్మణులము. మిగిలినవా రందరు పసులకాపరులు, మాలలు. అదియంతయు ఇప్పుడేల. ఎందరో బంధు లున్నను మా దీనావస్థలో ఒక్కరును మాకు సహాయము జేయరైరి. దిక్కులేనివారికి దే వుడే దిక్కని రెండువర్షముల బిడ్డతో నేనును, నాభార్యయు ఇచటికి వచ్చి చేరితిమి. వచ్చిన వత్సరము లోపుననే నా భార్య గతించెను. ఈ బిడ్డ నా ముదుసలితనమున జన్మించుటచే నా కామెపై అపరిమిత మమకారము. వరప్రసాదిని గదా! చిన్నతనమునుండియు నా బిడ్డకు తరు గుల్మలతాదులే ప్రియమిత్రులు-ఇక పుష్పముల నినను ఆమె కెంతప్రీతియో నే చెప్పజాల. ప్ర పంచస్వభావ మెరుగనిగోల. నేనే ఆమెకు విద్య బోధించితిని. ఎంతటి తెలివితేటలు. ఎంత చురుకుదనము. అయ్యయో! అంతయు అడ విని గాచిన వెన్నెల—ఇడిగో ఇప్పుడు గాచు చున్న పండువెన్నెల—వలెనే అయినదిగదా! ఎక్కువ భాగ్యవంతుడను గాకపోవుటచే విద్యా విభూషలను దప్ప మరియేమియు బంగారు వెండి నగల నేను నా బిడ్డకు పెట్టలేకపోయితిని.

ఒక్కొక్కప్పుడు నా ప్రియతనూజతో, 'తల్లీ, నీ సర్వాంగములకు వెలగల నగల జేయింప భగవంతుడు నన్ను సమర్థునిగా జేయలేదుగదా' అని ఇంకను ఏమియో పలుకబోవుచుండగనే నామాట కడ్డము వచ్చి, 'నాయనా! ఈ వెండి బంగారు నగలు నా కేల? మిక్కిలిబరువుగదా! పెద్దలమాట శిరసావహించుట యనెడి ఈ వెలగల నగ తలపై ధరింప, తండ్రీ! నీ విచ్చినదేగదా. ఎంతటి వెలగల మణులతో తాపించిన బంగారు బిళ్లలైనను దీనికి సాటివచ్చునా? భూతదయ యను ఈహృదయాభరణమునకు నెట్టి తారహారములైనను సాటియగునే. ఇక జనకా! హస్తములకు దానమను భూషలుండ కంకణము లేల? సత్పథమున నడచుట కన్న కాలికి వేరునగ యేల? కాన తండ్రీ ఇవి నీ విచ్చినవేగదా! ఈ విద్యాభూషలకు నెట్టి వజ్రవైడూర్యములతో గూడిన నగలైనను నాకిచ్చి నగలైనను సాటివచ్చునే? కాన నీవెన్నడును వాటికై చింతింపకుము' అని ఓదార్చుచుండెడిది. నా బిడ్డ విద్యయను బంగారు నిలువుతొడవుతో సరస్వతీదేవిని తిరస్కరించుచుండె ననుటయందు—అయ్యో!—కొంచెమైనను అతిశయోక్తి లేదు. ఇటుల నాగగనకుసుమము, నా అడవిపుష్పము శుక్లపక్ష చంద్రునివలె ప్రవర్ధమాన మగుచుండ, నాపుట్టి మునిగినట్లు ఆమెకు పదియేండ్లైనను పూర్తిగాకుండగనే వివాహము జేసితిని. ఎన్నివిధముల ప్రార్థించినను నా దుర్బుద్ధి తిరుగక ధనమునకాసించి కొంచెము వయసుజెల్లిన వానికి నా చిన్నబిడ్డను బలినివ్వ ప్రోద్బలముజేయ, చేతులార ముక్కుపచ్చలారని నాముద్దుబిడ్డను వానికి కట్టబెట్టితిని. వివాహమైన కొలదినెలలకే ఆ వరుడు గతించెను. ఇక నే నేమి చెప్పగలను? తండ్రీ, నా అమాయికకేమియు తెలియదు. అది పట్టిబేల. ఆమెకు వయసు వచ్చినపిదపగూడ నే నెన్నడు ఆమెతో ఈవిషయమై ప్రసంగించలేదు. ఇంటి కెన్నడైన నీ అట్టివారు వచ్చినపుడు మాత్రము వారితో నా హృదయవేదనను జెప్పుకొని నా కూతునందు జూపిన నిర్దయకై భగవంతుని వేవిధముల నిందించుచుండెడి వాడను. దినములిటులైన గడువకూడదా? భగవంతుని కన్ను కుట్టెగాబోలు. అయ్యో, సరిగా నేటికి ఆరు వత్సరములాయెగదా. నాయనా, ఆరువర్షముల క్రితము ఈ పౌర్ణమిదినముననే పసులకాపరులబిడ్డల వెంట నిడుకొని తనతల్లి విగ్రహమును పూజింప పూలకొరకై యీ ప్రదేశమునకే నా అమాయక సాయంకాలమున వచ్చియుండెను. నీవు చూచిన పొదరిల్లు ఆమె ఏర్పరచినదే సుమా. ఆనాడు ప్రతిదినమువలెగాక, ఆమె ఇంటికి వచ్చుట కాలస్య మగుటచే, ఆమెను వెదకుచు నే నిటకే తెంచితిని. ఆనాడే నా కష్టములు ప్రారంభమాయె గదా! నా బిడ్డ సగముదూరమున నాకెదురుగా వచ్చుచుంట జూచి, 'తల్లీ నే డేల ఇంత ఆలస్యము జేసితివి. నీ చెలికత్తె లేరి' అని యడుగ, 'తండ్రీ! మేము పూవుల గోసుకొని ఇంటికి బయలుదేరి వచ్చుచుండ ఇటకు కొన్నిగజముల దూరముననే తలక్రిందులై పడియున్న శకట

మును, దానికి కొన్ని అడుగుల సమీపము లోనే స్మృతిదప్పి పడియున్న ఒకయువకుని గాంచితిమి. ఆతనికాలికి బాగుగా గాయము తగులుటచే రక్తము స్రవించుచుండెను. తత్క్షణమే నా స్నేహితురాండ్ర సహాయముచే నాతని మెల్లగా నా పొదరింట పరుండజేసి ప్రక్కనున్న నదీజలముతో ఆతనిగాయమును శుభ్రపరిచి కట్టుగట్టితిని. ఇంకను ఆతనికి తెలివి వచ్చినట్లు తోపదు. ఈసంగతి నీకు దెలిపి, పాపము, దీనావస్థలోనున్న ఆతని మన ఇల్లు జేర్ప వచ్చుచుంటిని. నాతో వచ్చినవారిని నే తిరిగి వచ్చువఱ కాతని భద్రముగా జూడ అచ్చటనే ఉంచితి'నని చెప్పి మాకు కొన్ని గజముల దూరములోనున్న శకటమును జూపెను. సరి. వినుచున్నావా! ఆనాడే మృత్యుదేవత నాఇంట ప్రవేశించినది గాబోలు" అని ఇంకను ఏమో చెప్పుచుండ, చిత్తరంజనునకు ఒడలంతయు వేయితేళ్లు కుట్టినట్లాయెను. శరీరమంతయు ఉడికిపోవుచుండెను. లేచి ఇటునటు పచారు చేయుచు, 'అయ్యో! కథనుబోలిన కథ యుండ గూడదా! నా మనస్సేల కీడునే శంకించ వలయును? నిజముగా ఈ చనిపోయిన రమణి నా అమాయికయే యైన, నేను మృత్యుదేవతను గాక మరెవరు? వలదు వలదు! పాడు హృదయమా! కీడును తలపకుము. ఇది ఎన్నటికిని నా అమాయిక కాదు.' అని మనస్సు నూరట నొందించుకొని, మరల తాతప్రక్కను కూలబడెను. నందలాలు "అయ్యా, మీకు ప్రొద్దు పోవుచున్నది కాబోలు"అన, "లేదు లేదు. నాకేదియో జ్ఞప్తికిరాగా పరధ్యానముగానుంటిని గాని వేరుగాదు. చెప్పుము. మహాశయా! నీ కథను సాంతముగా, విశదముగా జెప్పుము" అని చిత్తరంజనుడు బలుక, ఆ ముదుసలి మరల ఇటుల పలుకసాగెను:—

"ఆర్యా! నిన్ను జూచినతోడనే ఆ యువకుడును, నీవును సోదరులేమో యని భ్రాంతి నొందితిని. నీకును, ఆతనికి భేద మేమన, ఆతను నీకంటె వయసున కొంచెము చిన్నవాడు. పూర్తిగా ఇరువది రెండువర్షములైన ఉండియుండవు. కొంచెము నీకన్న పొట్టి. కాని నీముఖమునందలి పాండువర్ణమాతనియందు లేదు. మిక్కిలి ఆరోగ్యముగా నుండెను. ఆతను మిక్కిలి భాగ్యవంతుల ఇంట జన్మించినవాడువలె తోచెను. ఇంతకు, ఆతను నా ఇంట కొన్ని నెలలే గదా యుండెను! అనగా, ఆతని గాయము బాగుగా నిమ్మళించువరకును, అటుపైగూడ కొన్ని దినము లుండెను. నాబిడ్డ కప్పటికి, పదునెనిమిది వత్సరములు. అయ్యో! ఇపుడుగదా జ్ఞప్తికి వచ్చినది. ఆతనిగాంచినది మొదలు నా ముద్దుపట్టి ఆతని తనబహిఃప్రాణమువలె జూచుకొనుచుండెడిది. ఒక్కనిముసమైన ఆతని నెడబాసి యుండెడిదిగాదు. అతడెచటికైన వెడలి ఇంచుక వచ్చుట కాలసించిన, ఆతని కెదురేగుచుండెడిది. ఎన్నియోమారులు నేను 'తల్లీ లోకులేమైన ననుకొనెదరు. దయార్ద్ర హృదయవగుటచే నీవాతని అంతటిదయతో నాదరించుచుంటివి. కాని తాటిచెట్టుక్రింద పాలు దాగినను మరియొక విధముగా నెంతురుగదా' అన,

'తండ్రీ!లోకులు కాకులు. వారిమాటలు లెక్క-జేసిన మన మీాధరిత్రిని జీవించుటయే దుర్లభము. మనము తప్పు జేసిన మనఅంతరాత్మ మనల మన్నించునా? ఎంతటి దండనకైన అది వెనుదీయునా. కాన నాయనా, నను మన్నింపుము. నా యంతరాత్మ నే నెట్టి తప్పును జేయుచుంటివని నాకు జెప్పుటలేదు. కాన నే నీ యువకునియెడ వేరుభంగి ప్రవర్తింపజాల' నని పల్కి- ఈవిషయమునమాత్రము—ఈ ఒక్క-విషయమును మాత్రము—నాతనయ నామాట నిరాకరించెను. ఆపన్నునియందలి దయచే ఇటుల ప్రవర్తించుచుండెనని ఎంచితిని గాని అతనిపై ఆమెకు గాఢానురాగమని నే నెంచనైతి. నాకనులపుడు నిజముగా మూసికొనిపోయినవి. అతనితోగూడ ఎన్నియోమారులు నేను మా కుటుంబాచారమును గురించియు, నా బిడ్డవివాహమును గురించియు సంభాషించియుంటిని. ఇటుల కొన్ని నెలలు గడచిన పిదప అతను నా గృహమునుండి మరల వచ్చెదనని చెప్పి వెడలి, నాటికిని నేటికిని మరల ఈప్రక్కకు రాలేదు. ఆతని సామానంతయు నేటికి గూడ నా గృహమునందే యున్నది. అయ్యో! సామానన్న జ్ఞాపకము వచ్చినది. జీవముల త్యజించుటకు ముందు నా బిడ్డ నా కొకలేఖయు, నాయువకుని కొకటియు వ్రాసియుండెను. నాకు వ్రాసినదానియందే ఆ రెండవలేఖను తన 'మనోహరు' డెన్నడైన కాన్పించిన, ఇవ్వ ప్రార్థించినది—తల్లీ 'మనోహరుడు' అవును. కాకేమి. ముమ్మాటికి మనోహరుడే. ప్రపంచాచారము సరణి పరిణయం బాడకపోయినను ఆమె మనస్సును హరించినవాడుగదా! మనోహరుడు గాక మరెవరు. అదియే తాను మొదటిమాటు పరపురుషు నట్టి నిష్కల్మష ప్రేమతో ప్రేమించితిననియు, కాన అతనే తన హృదయసామ్రాజ్య చక్రవర్తిఅనియు గూడ వ్రాసియుండెను. నా బిడ్డకై ఆయువకు డీక్షణమున నా కంటబడినను, కొమారుని కైవడి ఆలింగన మొనర్పనా? అటుల చేయుమనియే గదా నా తనయ ఆజ్ఞ. ఆహా! ఎట్టినహానము. ఎంతటి శాంతి. తరువాత—నాయనా! ఏల కన్నీరు కార్చుచున్నావు" అని ఇంకను ఏదో పలుకుచుండ, 'తాతా, చెప్పుము. నీకథను చెప్పుము. ఈ నీ యుదంతము నల్లఱాయినైన కరిగించునే. అందరు నావలెనే యుందురా!'అనుటయు, తాత మరల ఇటుల చెప్పదొడగెను: "అయ్యా, వినుము. కొన్ని నెల లైనపిదప ఆతను వెడలిపోయెనని చెప్పితినిగదా! వెడలిన నాలుగైదు దినములకు నా అమాయిక ఒకదినము ప్రాతఃకాలముననే ఎచ్చటికో వెడలి భోజనమైనను లేక రోజంతయు తిరిగి తిరిగి సాయంకాలమునకు ఇల్లు చేరకానెను. ఏమనిన ఆమె సరళహృదయమునకు నొప్పి గల్గునో యని పల్లెత్తి గట్టిగానైన ఎన్నడును ఆమెతో పలుకనైతి. ఆసాయంకాలమునకే వచ్చెదననియు, అటుపై మరునాడు వచ్చెదననియు వర్తమాన మంపి కొన్నిదినములు గడచినను రాకపోవుటచే ఆ యువకుని వెదకుచు అటుల వెడలితినని తన లేఖవల్లగదా ఆమె నాకు తెలియజేసినది.

ఎంతటిపిచ్చి. ఇట్టి అమాయికత్వ మెందైన గలదా? అయ్యో! ఈ నిమిషమున కున్న బుద్ధి మరియొకనిమిషమున కుండని చంచలచిత్తు లగు మానవమాత్రులు అచేతన వస్తువులు గారుకదా ఒక్కచోటనే యుండుటకు. అటుపై ఇంటికి వచ్చినపిదప నాతల్లి ఒకవారము దిన ములు మాత్రమే జీవించినది. అన్నిటియందును విరక్తిభావమును జూపుచుండెడిది. ఆమె శరీర మునందు స్వస్థత లేమి అటుల ఉండెనేమో యని తలచితిని.

"పౌర్ణమిదినము రాత్రి సుమారు ఎనిమిది గంటలకు ఆదినముప్రాతఃకాలమునపనికై పక్క గ్రామమునకు బోయిన నేను ఈయొడ్డుననే వడి వడి ఇల్లుజేర నడుచుచుండ, దూరమున, ఏదియో మనుష్యాకారము గల రూప మొండు కొట్టుకొనివచ్చుట గాన్పించినది. అయ్యో! అది నాముద్దుబిడ్డదని నే నెన్నడైన తలచితినా! కలనైన అట్టిపని, అంతటి సాహసకృత్యము, ఆమె చేయునని, చేయగలదని, ఊహించ నైన ఊహించితినా!—వడివడి నడచుచు దాని పరిశీలించుటకై సమీపించితిని. అయ్యో, రాజహంసవలె నాకన్నతల్లి గ్మే, నదియందు కొట్టుకొని పోవుచుండెను. నాకన్నులు చీకట్లు గ్రమ్మెను. శరీరమున ముచ్చెమటలు బోసెను. తల భారమెక్కెను. 'అమాయికా! నా అమాయికా' అని ఎలుగెత్తి గుండెలవియున ట్లొక కేక వైచి క్రింద పడిపోతిని. అటుపై ఏమి జరిగెనో నాకు తెలియదు. నేను కనులు తెరచి చూచునప్పటికి నా ఇంటియందు మంచముపై బడియుంటిని.

పసులకాపరి యొకడు నాకు పరిచర్య జేయు చుండెను. భగవంతు డింకను ఈ మొండిజీవిని భూమిపై, ఎండుమ్రోడువలె నిలుప వాసిని పంపి యుండనోపు. అపుడు నాతనయ తన మేజాపై నుంచిన రెండు లేఖలను జూచితిని. నాకు వ్రాయబడిన ఉత్తరమును చదివితిని. ఆమెకు ఆ యువకునిపై ఇంతటి గాఢానురాగమని అపుడుగదా తెలిసికొంటిని. వారు మొదట, మొట్టమొదట, ఈలతాకుంజమునకలిసికొంటచే ఆమె తనశరీరమును దానియందు దగ్ధము చేయ తన కడసారి కోరిక యని వ్రాసినది. అతని బాసి ఒకక్షణమైన జీవించుట దుర్లభమనియు, ఆతని తా నీజన్మమున—తనకొరకై ఆతని పలుకష్టములపాలు చేయనిదే—పరిణయంబొ డుట అసంభవమనియు, కాన తన కీజన్మమున సౌఖ్యము లేదనియు, కాన ప్రాణముల త్యజి చితిననియు కూడ వ్రాసినది. ఆమె తుది కోరికప్రకారము, అదే ఆలతా గృహము మధ్య నామెశరీరమును—అయ్యో! నా ప్రియ తనూజ మేలిమిబంగారమును తిరస్కరించు శరీరమును—దగ్ధముజేసి, అట నావద్దనున్న ధన మంతయు వెచ్చించి చలువరాతితిన్నెను ఆమె కోరికప్రకారము గట్టించితిని. ఇక నాకు ధన మేల? ప్రాణ మేల?

"అయ్యో! ఆనా డాయువకు డెన్నియో విధముల నాబాలికకు మరల వివాహము చేయ మని బోధించినను చెవిబెట్టనైతి. మూఢాచార మును వదలనైతి. తల్లీ! ఇపుడు నిజముగా జీవించియుండిన అట్టి వివాహమునకు అభ్యం

తరపెట్టుదునా? అయ్యయో! ఆ యువకు డెన్నడైన నాకన్నుల బడునా? నాబిడ్డ కడసారి కెంతవయాజ్ఞ జెల్లింపకయే నా ప్రాణములు వదల వలయుగాబోలు. ఈ రెండవకమ్మ ఎవరి కిత్తును" అనుచు ఇంకను ఏమియో చెప్పబోవు చుండ చిత్తరంజనుడు తన రహస్యవేదన నిక భరింపలేక కన్నీరు మున్నీరై పార చిన్నబిడ్డ వలె శోకించుచు, "తండ్రీ! ఆ భాగ్యరాశిపేరు చెల్పుమా? అదిగూడ వినినపిదప నాసందే హము పూర్తిగా పటాపంచ లగును" అను ఈమాటల అర్థము పూర్తిగా గ్రహించకయే, "నాయనా! ఇంతవరకును నా సుగుణరాశి నామమే చెప్పలేదా? అయ్యో! పేరున నేమున్నది? అమాయికయే. నా అమాయిక కడు అమాయిక; గోల; కడు బేల. ఆముద్దరాలికి నేను నామకరణమే చేయలేదు. బాల్యమునుండి యు ఆమె అమాయికత్వమును జూచి సర్వజను లును ఆమెను "ఎట్టి అమాయిక, ఎంతటిబేల" యని పలుక అదియే ఆమెకు నామకరణమాయె ను" అని నందలాలు పలుక చిత్తరంజనుని చిత్తము వేయిువ్రయ్యలగున ట్లాతనిగుండియలు అతితీవ్రముగా కొట్టుకొన సాగెను. కాని నిజ ముగా గుండె బ్రద్దలగునెడల ఇప్పటికి ఎంత మంది అట్టి మృత్యువువాత బడియుందురో! ఎట్టి కష్టములైన రానంతవరకే భయముగాని వచ్చిన పిమ్మట వాటిని భరింప శక్తుల చేయుట లేదా?— చిత్తరంజనుడు చిన్నిబాలుని కైవడి విలపిం చుచు, తానే ఆకలుషాత్ముడనియు, కర్కశ హృదయుడనియు, కఠినచిత్తుడనియు, ఆమె మనోహరుడే గాక జీవితాపహారుడుగూడ తా నే యనియు పల్కుచు నందలాలు పాదములపై పడిపోయెను. తాత తలపై పిడుగు పడినట్లా యెను. నోటినుండి మాట రాలేదు. మరల చిత్తరంజనుడు "అయ్యో! నా అమాయికా, నా ప్రియతమా! నీ వెచ్చటనో ప్రాణములతో నుంటివని ఎంచితిని గాని ఇటుల నీప్రాణముల నాకై, నావంటితుచ్ఛునికై, త్యజింతువని ఎన్న డును తలపనైతి. ఓతల్లీ! చూచితివా! బంధు జనుల పరిహాసమునకును, ముఖ్యముగా వెలి యను మానవకల్పిత మగు ఘోరపిశాచము నకును భీతిల్లి నాప్రార్థన నిరాకరించితివిగదా! నన్ను హంతకునిగా, నరహంతకునిగా, తుదకు మార్చితివే. అయినను నిన్నేలదూషింపవలె? స్థిర చిత్తుడను కానందులకు నేనే నన్ను దూషించు కొనవలె. అమాయికా! దిక్కుమాలిన ప్రపంచ మునకు నేనుకూడ కొంచెము వెరచిగదా ప్రాణ ములకన్న నిన్ను ఎక్కుడుగా ప్రేమించియు, పరిణయంబాడక తుదకు నీప్రాణములనే హ రించితి. నాప్రాణముల నీ కర్పించుటకు బదులు, నీవా! నీవా! నా అమాయికప్రాణములా నేను బలిగొనుట! ఛీ. ఛీ. చిత్తరంజనా! కాదు. కాదు. కఠినచిత్తా! నీ వీభూమండలమున నుండదగవు పొమ్ము. నీ అమాయిక ననుస రించి పొమ్ము." అని వేవిధంబుల తన్ను దా నిందించుకొనుచు హృదయము వ్రయ్యలగు నట్లు శోకించుచుండ, నందలాలు మెల్లమెల్ల గా లేచి పొదరింటియందలి చలువతిన్నెపై నున్న లేఖను తడబడు నడుగులతో చిత్తరం

జనునికడకు గొనివచ్చి దాని నాతని కరమునం దిడి,—"సర్వేశా! నా ఆత్మ ఇప్పుడుగదా శాంతి నొందినది. బిడ్డా, నీ తుదికోర్కె నెరవేర్చి ఇదే నిన్ను కలుసుకొనవచ్చుచున్నవాడ" అని పలుకుచు వెనుకకు విరుచుకొని పడిపోయెను. అంతటితో ఆతని ప్రాణపక్షు లెగిరి పోయెను.

* * * *

పండువెన్నెలయందు పొదరింటియందలి చలువరాతిపై ఆసీనుడై పాపము చిత్తరంజనుడు అశ్రుపూరితనయనములలో తన అర్ధాంగి అమాయిక లేఖ ఈ విధముగా చదువసాగెను:

"నాసర్వస్వమా!

"ని న్నేమని సంబోధింపవలెనో తెలియకున్నది. నీకు నేను సర్వస్వమను గాకపోయినను నీవే నాకు సర్వస్వమగుటచే ఆ పైవిధమున వ్రాసినందులకు కినుక వహింపకుము. నా హృదయకమలము నీ కర్పించితిని; స్వీకరించినను, నిరాకరించినను గూడ సంతసమే. మూడు దినములలో వచ్చెదనని చెప్పి గావైతివి. నీకై వెదకి వెదకి వేసారి, తుదకు హతాశనై నీవు లేనిదే జీవించుట దుర్లభమని యెరిగి, ఇదే నా ప్రాణముల నీ కర్పించుచున్నదాన. నీ వేల వెడలిపోతివో ఇపుడు గదా నే గ్రహించితి. కాని నిన్ను నే నెన్నడును—త్రికరణశుద్ధిగా జెప్ప నావాక్యముల నమ్ముము: నమ్ముము, నాపలుకుల నమ్ముము—ఎన్నడును నిందింపజాల; నిందింపను. దీనికై ఈనా చావునకై ఎన్నడైన ఎవరైన ఎవరినైన నిందించినను, దూషించినను, మన సంఘమును గాని మరి ఇతరుల నెవ్వరిని దీనికి కారకులుగా జేయరని నే తలచెద. అటుల జేయరుగాక యనిగూడ ప్రార్థించెద. కాన, ప్రియతమా! నాకొరకై నీ వారాట మించుకంతయైన నొందవలదు. నీ ముఖారవిందము నేనాడు గాంచితినో ఆనాడే నిన్ను నాహృదయసామ్రాజ్య చక్రవర్తినిగా జేసుకొంటి. నీమూర్తి నాహృదయమున పదిలపరచుకొంటి. కాన ఇపుడు నాతో కూడ నిన్ను దీసికొనిపోవుచున్నాననియే నా నమ్మకము. అట్టిసమయమున 'నాథా! నిన్ను వీడిపోవుచున్నాను. సెలవిమ్ము' అని ఎటుల వేడుదును? నీ నిజపాదపద్మములసన్నిధి నాప్రాణముల త్యజింపవలయు ననెడి నా వాంఛ నెరవేరకపోయినను, నా మనోనేత్రమున నీ మూర్తిని సృజించి నీ సన్నిధినే ప్రాణము బాయుచున్నందుల కెంతయు సంతసించుచున్నదాన. కాన, మత్ప్రాణనాథా! జీవితేశ్వరా! నీ వెన్నడు నాకొరకై కన్నీరు నింపకుము.

"ఇక,ఎక్కడనో నీవు జీవించియుంటివనియే నానమ్మకము. అటు గాకపోయిన, ఇదే నిన్ను కలుసుకొనుటకై నే వచ్చుచున్నదాన. లేనియెడ అట నీరాకకై యెదురు జూచెద. లేదు. అటులకాదు—నా యీసూక్ష్మదేహమునకు, నా అంతరాత్మకు, శాంతిలేదు. కాన, అహర్నిశలు, సదా, నేను, ఒకవేళ నీవు వలదనినను కూడ, నీవద్దనే, నీలోనే, నీహృదయకుహరముననే, నివసించుదాన. కాన విచారింపకుము.

నా ఆత్మశాంతి కోరువాడవైన, ఎన్నడును, ఎట్టిసందర్భమునందైనను, నాకొరకై ఈ నా కొరకై, ఈదీనురాలికొరకై, కన్నీ రెన్నడును దేకుము. మరియొకటి: నాకొరకై నీ బందుగుల ద్వేషింపకుము. ప్రియమిత్రుల నిరాకరింప కుము. ఇప్పటికే పరిణయంబాడినయెడల, నా సతిపై ఎన్నడును కినుక నొందకుము. ఇంత వరకు వివాహమాడనిచో, తప్పక నీకు తగిన జవ్వని నొకర్తు చెట్టబట్టుము. ఇదియే నా కడ సారి కోరిక. ఈజన్మమున నెరవేరని ఈప్సిత ములు రాబోవు జన్మయందైనను ఫలింపవా? నాతలిదండ్రులు లొనర్చిన బాల్యవివాహ మను ఘోరాపరాధమునకు నే నిదే ఫల మనుభ వించుచున్న దాన.

"అప్పుడప్పుడు నీసతీపుత్రులతో నాతండ్రి నాకొరకై కట్టు లతాకుంజమునందలి చలువ తిన్నెపై విశ్రమించుచు నన్ను జ్ఞప్తియందుంచు కొనుము.

"మత్ప్రణామములు. పిచ్చిదాని భంగి వ్రాసిన నావ్రాతకు మన్నింపుము. ఇదే, నదీ దేవతకు నా ప్రాణముల నర్పింపబోవుచున్న దాన. నాథా! ఇటుల జేయుచుంటినని నాపై కోపింపకుము. పోవుచున్నదాన. నాథా! ప్రాణముల బాయ బోవుచున్నదాన. సెల విమ్ము. సెలవు. సెలవు. ప్రాణనాథా! సెలవు.

ఇటుల హతభాగిని,

"అమాయిక"

ఉత్తరము పూర్తియగుటకు పూర్వమే "నాన్నా, నాన్నా! ఇంతసే పిచట దాగుకొంటివా? దొంగా! పాపము, అమ్మ నీకొరకై ఎన్నిచోట్లో వెదకినది నాన్నా. అదిగో చూడు. పాపము. ఇక్కడకు వచ్చుచున్నది. మన మేమై పోతిమోయని ఎందరో నౌకరులు ఇంటివద్ద నుంచి దీపములతో వచ్చినారు. రా నాన్నా, రా!" అని బాలిక తండ్రి చేలాంచలమును బట్టి లాగ, చిత్తరంజనుడు నిద్రనుండి మేల్కొనిన వానివలె లేచి అచ్చోటు వదలి, తన సేవకుల కొందరిని నందలాలు దహనమునకై నియమించి భార్యాసమేతుడై గృహోన్ముఖుడాయెను.

"లూలు."

---

## మధుమూర్తి

శ్రీ శ్రీనివాసరావు (కవితాసమితి)

౧

నీ నాట్యమ్ములు నా మనస్స్థలిని కా
నిమ్మోయి! నీ గానలీ
లానైర్మల్యమనోహరశ్రుతులు కా
ల్వగట్టి నాకంఠమం
దే నిండంగ సదింపుమోయి! మధుమూ
ర్తీ! నీకటాక్షద్యుతుల్
రానిమ్మోయి మదీయ జీవితతమి
స్రద్వారముం జీల్చుచున్!

౨

ఈగళమాంద్య మింత నశి
యించును నీ మృదుగానరావముల్
మ్రోగినచో, ధ్వనింతును స
ముజ్జ్వలగీతులు నేనుకూడ నీ
లాగున, త్వద్ధ్వనర్తస క
ళాపరిపూర్ణమె యైన నా మన
స్సాగర మంత తాండవ వి
శారదతన్ వహించు నీవలెన్!

౩

అంతసుఖమ్ము నా కధిక
మై మరపించును మేను, నీఘృణా
సంతకటాక్షమాలికల
యం దతి తన్మయతన్ వహింతు, నా
స్వాంతము సౌఖ్యవేదన న
సంగు, భరింపగజాల కింత ప్రా
ర్థింతు సుఖమ్ము దీసికొని
దీనత నే కరుణింపగా ప్రభూ!

౪

నీవు హసింతు వంతట వి
నిర్మలసాంద్ర సుధామృదూర్మికల్
ప్లావితమై తదీయ తర
ళద్యుతులందు జగమ్ము ముగ్ధమై
పోవును! నే ద్రవింతు రస
పుంజముగా మిహికాస్రవంతిగా
నీ వరహాస కౌముదుల,
నిస్తులమాధురిలో విలీనమై!

---

# లీలా రంగం

"శ్రీమంతులైన మామగారి సన్నిధికి ప్రణామపుర స్సరంగా రంగడు చేయు విన్నపములు:

చెన్నపట్నం చేరగానే వుత్తరం రాస్తానని చెప్పివచ్చి ఇన్ని నాళ్లు గడిచిపోయినప్పటికీ నా సమాచారం తెలిపాను కానని అమ్మ బెంగపెట్టుకొని ఉన్నదని అయ్యరుగారి ద్వారా మీరు రాసిన జాబు అందినది. ఈ నా వుత్తరం ఆమెకు చూపించి నా విషయమై నిశ్చింతగా వుండమని చెప్ప కోర్తాను. మీ అందరి ఆశీర్వాదంవలన, దైవానుగ్రహంవలన నే నిక్కడ క్షేమంగా ఉన్నాను. నేను వచ్చిన పని నిమిత్తం నా శక్తివంచన లేకుండ ప్రయత్నం చేస్తున్నాను. లాయలా కాలేజిలో సీటు దొరికింది కాని భోజనానికీ, ఉండడానికీ ఇంకా వసతి దొరకలేదు. హోస్టల్లో ఉండి అక్కడి ఖర్చును భరించడం నా వంటివాళ్లకు చాలాకష్టం. నే నక్కడ ఆలోచించుకొని వచ్చినలాగే శ్రీయుతులైన కాశీనాథుని నాగేశ్వరరావుగారిని దర్శనం చేయడానికి వారి ఆఫీసు కెళ్లాను ఇవ్వాళ మధ్యాహ్నం. ఆఫీసు దగ్గిర చేరేటప్పటికి సుమారు ఒంటిగంట కావచ్చింది. పంతులుగారు మేడమీద ఉన్నారని తెలిసి అక్కడికి వెళ్లాను. వీరి ఆఫీసు రూం ఝోలీ చెక్కల* ఆఫీసుల్లాగు కళ్లను భ్రమింపచేసేది కాక వారి నిరాడంబరం సూచించే ఒక చిన్నగది. పట్టుమని ఒక్కమాటుగ పదిమందికంటే ఎక్కువ పట్టరు ఆ గదిలో. పంతులుగారి ఎదుట ఉన్న మేజాబల్లమీద ఒక పెద్ద ఉత్తరాలరాశి పడివుంది. వారొక్కొక్కదాన్నే విప్పిచూస్తూ ముఖ్యమైనవాటి కన్నిటికీ జవాబు రాయమని క్లర్కుతో చెప్పుతూ తక్కినవాటి నన్నింటినీ బుట్టదాఖల్ చేస్తున్నారు. అదే సమయంలో హెడ్ఆర్టిస్టు వచ్చి కలకత్తా రంగూన్ పట్నాల్లో కొత్తగా ఏర్పాటుచేసిన అమృతాంజనం బ్రాంచి డిపోల నిమిత్తం తయారుచేసిన కొత్త కొత్త ప్రకటనల నమూనాలను, చిత్రాలనూ చేతి కందివ్వగా వాటిని దేరిపారచూస్తూ నవ్వుతూ బాగా ఉన్నాయని మెచ్చుకొంటున్నారు. ఇంతలో హెడ్ అకౌంటెంటు వచ్చి ఫలానావాడికి బోనసు ఇవ్వమంటారా వద్దంటారా అంటే ఇవ్వండని చెబుతూ వుండగానే ఆంధ్రపత్రికా ఫోర్మన్ వచ్చి కొత్తగా దెప్పించిన మెషీన్ సిలెండర్ తృప్తికరంగా పనిచేయడం లేదనగా దాని కేదో ఉపాయం తెలియచెబుతూవున్న తరుణమందే ఒక కుర్రవాడు గబగబవచ్చి గుప్పెడు ప్రూఫ్ కాగితాలను వారి ముందు బల్లమీదబెట్టి పరుగెత్తాడు. వానిలో నొకదాన్ని తీయబోతున్నారు. ఇంతలోనే మేనేజరు వచ్చి కొత్తగా ఎక్స్టెండు చేయదలచుకొన్న బిల్డింగుకు వలసిన ఖర్చు విషయమై పరామర్శ చేస్తూవున్న సమయమందే ఇంజనీరొకరు వచ్చారు, కొత్తగా తవ్వించదలచుకొన్న చెరువుయొక్క ప్లానును గురించి ఆలోచించడానికి........

వారి టేబులుకు ఈవలగా ఉన్న షేముసోఫా మీద, దానికి వెనకగావున్న కుర్చీలమీద పెద్దమనుషులు కొందరు గూచోని ఉన్నారు. పంతులుగారి కెప్పుడు అవకాశం దొరుకుతుందా, యెప్పుడు వారితో మాట్లాడుదామా అని మహా ఆత్రంతో ఉన్నలాగు నోట జెప్పకపోయినా మొగాలు వెల్లడిస్తూనే ఉన్నాయి. కాని అవకాశం నిమిత్తం డిక్షనరీలో వెతుక్కోవలసిందే గాని

---

* ఝోలీ చెక్కలు: ఝోలీ=జోలె, చెక్క=ఎత్తుట-జోలెలు చంక తగిలించుకొని నడిచేవాళ్లు. ఒకవేపు అసలు హక్కుదారులైన స్వదేశీయులను పీడిస్తూ వారి కష్టార్జితంమీదనే రాజభోగా లనుభవిస్తూ తుదకు కాలము వచ్చినయెడల నెత్తిన గుడ్డ వేసుకొని జోలెలను చంక దగిలించుకొని వారివారి దేశాలకు బరుగెత్తే విదేశీయుల కీనామము రూఢియైయున్నది.

పదికాగడాలుపెట్టి వెదికినా వారిదగ్గరమాత్రం దొరక జాలవని నాకు నిమ్మళంగా తరువాత తెలిసింది, క్రమ క్రమంగా అనుభవంమీద. కొంచెమంటే కొండంత చేసి రాస్తున్నా ననుకొనేరు సుమీ! ఉన్నదాన్ని ఉన్న లాగూడా రాయలేనేమో అని నా భయం. వీరు ఆఫీసు లోకి వచ్చి కూర్చున్నది మొదలుకొని మళ్లీ సాయం కాలం దీపాలుపెట్టిం తరువాత లేచివెళ్లేవరకూ, ఏపని కొరకైతేనేం, వీరిదగ్గిరికి వచ్చేవారి వార్తాలాపాల్ని గురించి ప్రత్యేకంగా టూకీగా రాయబూనుకొన్నప్ప టికీ ఒకగ్రంథ మౌతుంది. కాబట్టి నే నిప్పుడు రాయ బొయ్యేదాన్ని బట్టి గ్రహించుకోండి. ఒంటిగంటప్పుడు గది అంతా మనుష్యులతో నిండివుండడం చూచి కొంచెం తెరపయితే వెళ్లుదామనే ఉద్దేశంతో వెలపలికి వచ్చి అక్కడో బెంచివుంటే దానిమీద గూర్చున్నాను. అరగంటైంది; లోపలివాళ్లేమీ తగ్గినలాగు గన్పించలేదు. మనసు పట్టలేక లేచి వెళ్లి చూస్తే యథాప్రకారం గానే ఉంది గది. ఇవతలికి వచ్చి మళ్లీ బెంచీనే ఆశ్ర యించాను......మళ్లీ వెళ్లాను......మళ్లీ వచ్చాను... ఇక ఎన్నిసార్లు వెళ్లివచ్చానో జ్ఞాపకం లేదు. షుమారు నాలుగున్నర అయ్యేసరికి మరీ ఎక్కువకావడం మొద లెట్టింది జనం. ఆ ఒంటిగంటప్పుడే చొరవజేసుకొని ఎందుకు వెళ్లకబొయ్యానా అని చాలా నొచ్చుకున్నాను. కాని అప్పుడు లాభమేమిటి? పోయిన నీటికి కట్ట కట్టడం లాగు. వారిదర్శనం లభిస్తుందో లభించదో అని విచా రంతో మొగాన్ని తేలేసుకొని మళ్లీ వరాండాలోకే వస్తున్నా.

పంతులుగారి ఆఫీసుకూ వరాండాకూ మధ్య భారతీ ఆఫీసట-ఉంది. ఇదీ చిన్నగదే. లోపల మూడు వేపులా గోడలను ఆనుకొని ఉన్న పుస్తకాల అల్మారీ లే మింగేశాయి గదిలోని ఎక్కువభాగాన్ని. ఆబీర్వాల మధ్య బల్లలూ, వాటికి వెనకా ముందూ రెండు మూడు కురిచీలూ ఉన్నాయి. వీటిలో ముందున్న కుర్చీమీదికి వెళ్లడం కష్టంలేదు. కాని అవతలికి వెళ్లాలంటే బక్క పల్చటి మనిషే కావాలి. స్థూలశరీరానికి ప్రయాసమే అనుకొంటాను. ఆ ఆఫీసులోని వకరు నే నీలా లోపలి కెళ్లడం, మళ్లీ రావడం చూస్తూ, నాముఖనైశిరిని గని పెట్టా రనుకొంటాను, మెల్లగా దగ్గిరికి పిలిచి, "పంతు లుగారికోస మొచ్చారా?" అన్నారు. అవు నన్నాను. "మరి లోపలికి వెళ్లరేం" అన్నారు. "కొంచెం తెరపయితే వెళ్లుదామని కనిపెట్టుకొని కూచున్నాను. తెరపయ్యే లాగే కన్పించడం లేదు. ఒంటిగంటకూ నే నిక్కడకు వచ్చింది. నాలుగున్నర కావచ్చింది. పూర్వంకంటే ఎక్కువైంది జనం" అన్నాను. అప్పు డాయన కొంచెం నవ్వుతూ, "మీ కిక్కడి కిదే మొదటిపర్యాయం రావడం లాగుంది. మా పంతులుగారి సంగతి ఈలాగే ఉంటుంది అస్తమానమూ. ఆలోపలికి వెళ్లివచ్చేవారినే మీరూ ఆశ్రయించండి. లేకపోతే దర్శనం దొరకదు" అన్నారు. అంతట వెనక్కి మళ్లి లోపలికెళ్లేవారి వరసలో చిట్ట చివర నిలుచున్నాను, తిరుణాల్లరోజుల్లో రైల్వేవాళ్ల మూడోక్లాసు టిక్కట్ల కిటికీలదగ్గరలాగు. ఏలాగైతేనేం, అయిదుగంటలైనతర్వాత వారిదర్శనం లభించింది. ఎందుకొచ్చానో టూకీగా వినిపించమన్నారు. ఆలాగే చేశాను. స్తిమితమైన మనస్సుతో విన్నారు. "భక్త్యోప పన్నేషు హి తద్విధానాం-ప్రసాదచిహ్నాని పురఃఫలాని" అనులాగున ఊపిరి విడవడానికైనా అవకాశం దొరకని సమయంలో నామాటలను సావధానంగా విన్నవారి మందహాసముఖం-నా యాశాలతను పల్లవింపచేసింది. నా పేరూ, వూరి పేరూ, పుట్టుపూర్వోత్తరాలూ, అన్నీ అడిగి తెలుసుకొన్నారు. ఒకనిముషం ఆలోచించి మర్నాడు రమ్మన్నారు. రేపు ఆదివారం-మాఘశుద్ధ పౌర్ణమికూడాను. ఆఫీసుకు సెలవు. ఆసంగతి జ్ఞాపకం చేయగా, ఫర్వాలేదు. ఆఫీసు 'లేకుంటే ఇంటిదగ్గరకు రండి' అన్నారు. రేపు తెల్లవారి అక్కడికి వెళ్లుతాను. రేపు మళ్లీ ఉత్తరం రాస్తాను.

చిత్తగించవలెను.

మద్రాసు, 14-6-26. } ఇట్లు విన్నవించువిధేయుడు, రంగారావు."

ఈలాగు ఉత్తరాన్ని ముగించి అప్పుడే పోస్టుచేసి శయనంమీద చేరాడు. ఇకతర్వాత ప్రపంచపుఖబరే లేదు.

రంగారావు అసలు కాపురం బెజవాడ. అక్కడ పూర్వార్జితమైన ఒక చిన్న పెంకుటిల్లు తప్ప వేరే ఆస్తి లేదు. పన్నెండుఏండ్ల వయసున ఇతడు సెకండుఫారం చదువుతూ ఉండగా ఆకస్మికంగా తండ్రిపోవడం తటస్థించింది. అప్పట్నుంచీ మేనమామ బలవంతంవల్ల తల్లీకొడుకు లిద్దరూ ఆయనదగ్గర ఏలూరు లోనే ఉంటూవచ్చారు ఎక్కువకాలం. ఇతని మేనమామ పేరు నరసింహారావు. తల్లి శాంతమ్మ. మునసబుకోర్టులో నౌకరిచేస్తూ ఏలాగో గుట్టుగా గెంజుచెరుగులూ ముడే స్తున్నాడు నరసింహారావు. ద్రవ్యబలం లేకపోయినా దయాస్వభావం కలవాడు. అందుచేత బావగారు గతిం చిన వెంటనే చెల్లెలినీ, మేనల్లుణ్ణీ తీసుకొచ్చి దగ్గర పెట్టుకొని యావత్తు సంసారం తానే జరుపుతూ వచ్చాడు కొంతకాలం. కాని చెల్లెలి కిది న్యాయ మని పించలేదు– తమ భారంకూడా అతని నొక్కనిమీదనే వేయడం. కాబట్టి దానింత పర్యంతమూ వేరొక ఉద్దేశం తో దాచి ఉంచిన తనవగల నన్నింటినీ, అన్నగారు వద్దంటూ వున్నప్పటికీ వినక, అమ్మించి, అందువల్లవచ్చిన పన్నెండువందల రూపాయలూ, పెనిమిటి గతించిన తోడనే దొరికిన ప్రావిడెంటుఫండు బాపతు రూపా యల్లో ఖర్చుకాగా మిగిలిన మూడువందలూ గలిపి మొత్తం పదిహేను వందలనూ తమ చిరపరిచితుడూ, విశ్వాసీ అయిన ఒకజమీందారువద్ద నుంచి, నెల నెలకూ ఆయన వడ్డీక్రింద ఇచ్చే పదిహేనురూపాయలను అన్న చేతికే యిస్తూవచ్చింది. పతిప్రాణమైన శాంతకు రంగడే ప్రాణధారణకు కారకు డైనాడని యీమెను ఎరిగినవా ళ్లంచరూ అంటారు. ప్రస్తుతం రంగనిచింత దప్ప వేరొక చింత లేదు ఈసతీతిలకం మనసులో. కొడుకునూ తల్లి కోరికలను నృథాపుచ్చలేదు. కష్టపడి ఇతడు చేసే అభి వృద్ధి తల్లియొక్క ఆశాలతాపల్లవాలకు వసంతాగమ మైందిగాని శిశిరాగమం కాలేదు. స్కూలు ఫైనల్ వరకూ రంగారావు చదివింది ఏలూరు హైస్కూలునందే. ప్రతి సంవత్సరం ఏదో ఒక బహుమానం వస్తూనే వచ్చింది. తరువాత రాజమండ్రి ఆర్ట్సుకాలేజిలో దాఖలయ్యాడు. అక్కడినీళ్లు పడలేదు, ఒకసంవత్సరం తర్వాత శరీర మస్వస్థమైంది. ఈ హేతువుచేతనే F.A. పరీక్షయందు ఆంధ్రజిల్లాల్లో మొదటివాడుగా వచ్చినాడనీ, లేకపోతే ప్రెసిడెన్సీకే మొదటివాడుగా వచ్చేవాడనీ అన్నారు అతన్నెరిగిన ప్రొఫెసర్లందరూ. ఇతని దేహారోగ్యం తప్పినందున అసల్లోనుంచికూడా రూపాయల్ని ఖర్చు పెట్టవలసివచ్చింది. ఈ అన్నికారణాలమూలాన్ని మళ్లీ చదవడానికి ఆరంభించేయెడల ఇంకా ఏ ఇబ్బందులు వచ్చి మీదబడుతాయో అనేభయంచేత ఇంటర్ పరీక్ష కావడంతోటే ఏదైనా చిన్ననౌకరీకి ప్రయత్నించ మని చెప్పింది తల్లి. కాని ఇతనికి మనస్కరించింది కాదు తల్లి సలహా. క్రీ. శ. ఇరువదో శతాబ్దంలో సమస్త భారత వర్షంలో ఎన్ని యూనివర్సిటీ లున్నాయో వాటి అన్నిటిలో ఇవ్వబడే ఉన్నతవిద్య నూటిలో తొంభై తొమ్మిదిపాళ్లు ఆత్మహననానికి మార్గం జూపేదని ఇతనికి బాగా తెలుసు. కాని ఏదో వెర్రిబులబాటం—ఇంకా చదవాల్ననీ. కాబట్టి నీళ్లు పడవని రాజమండ్రి వెళ్లడం మాని, తల్లినీ, మామనూ ఏలాగో సమాధానపరిచి చెన్న పట్నంచేరాడు రంగారావు, తన భాగ్యదేవతను పరీక్షిం చుకోడానికి.

మేనమామపేర పైన వ్రాసిన ఉత్తరం వలన పట్నంచేరింది మొదలుకొని ఇతడు చేసినదంతా అవగత మైయ్యే ఉండవచ్చు. అదేప్రకారం మర్నాడు సూర్యో దయం గాకపూర్వమే ఆవశ్యక కార్యాలన్నీ దీర్చుకొని ఆరుగంటలకే మైలాపూరు ట్రాంమీద లజ్ చర్చిరోడ్డుచేరి విచారిస్తే కపాలేశ్వరాలయం దగ్గరి రెంటాల హౌసులో పంతులుగా రుంటారని తెలిసి అక్కడికే బయల్దేరాడు రంగారావు. ఇంటిదగ్గర సహితం వారు దర్శకశృంఖలా బద్ధులై య్యే ఉంటారని వినియున్నందున ఏవేళకు దర్శ నం లభిస్తుందో అని యోచిస్తూ మెల్లగా రెంటాల హౌసు చేరేటప్పటికి ద్వారంముందు ఒక చామనచాయ మనిషి నిలుచోని ఉండగా అతనివల్ల పంతులుగారు లోపల ఉండుట తెలిసికొని ఇతనూ వెళ్లాడు లోపలికి. రెండు గుమ్మాలు దాటగానే ఒకచతురశ్రపు అంగణం గన్పించింది. అక్కడ పడమటివేపున ఉన్న వసారాలో ఒక తిరుగుడు కుర్చీమీద కూచోని ఉన్నారు పంతులు

గారు, కుడివేపు చేతికందేదూరాన్ని ఒకచిన్న పుస్తకాల కేసు వుంది. ఎదురుగా ఒక బెంచీ. వేరొక మనిషి వారికి దగ్గరగా నేలమీద స్తంభాన్ని ఆనుకొని కూర్చొని ఏదో లోకాభిరామాయణం సాగిస్తూ ఉన్నాడు. నిన్న ఆఫీసులో వారిస్థితిని జూసిన తరువాత నేడు తనకింతసేపు వారితో మాట్లాడడానికి సమయం దొరుకుతుందని అనుకోలేదు. ఆనాడు ఇతనిఅదృష్టమే అనాలి. సావకాశంగా వార్తాలాపాలు జరిగాయి. అసహాయోద్యమము, స్వరాజ్యపక్షపరిణామము లోనగు తాత్కాలికవిషయాలనుగురించి చాలాసేపు మాట్లాడారు. సంభాషణమైన తర్వాత తాను వచ్చినసంగతి జ్ఞాపకం చేయగా ఆతనికి గావలసిన ఖర్చులను ఇప్పిస్తానని వాగ్దానంచేస్తూ నెలకు ఎంత గావలసినదీ ఉజ్జాయింపునలెక్క వేసికొని తీసుకరమ్మన్నారు. వచ్చిన కార్యం సఫలమైందనే సంతోషంతో వారిదగ్గర సెలవు దీసికొని మళ్లీ బయల్దేరాడు జార్జిటవునుకు. అప్పుడు షుమారు ఎనిమిదింబావు అయివుంటుంది. బీచి గుండా వెళ్లాలని సముద్రంకేసి మళ్లాడు ట్రాముసు వదలి.

౨

ఆనాడు మాఘశుద్ధపౌర్ణమి. మబ్బుపొడన్నమాటలేక నిర్మలంగా ఉంది ఆకాశమంతా. రంగారావు మైలాపూరు ట్రాం పెర్మినసు వీధిగుండా కొంతదూరం నడచివచ్చి సేన్‌థోమ్ చర్చికి వెనగ్గాఉన్న రోడ్డుమీదుగా బీచిలో ప్రవేశించేసరికి అప్పటికే సముద్రతీరమంతా జనులతో నిండిపోయింది. సూర్యకిరణకాంతులు సముద్రతరంగాలమీద ఉయ్యాల్లూగుతున్నాయో లేక వాటితో మల్లయుద్ధమే చేస్తున్నాయో తెలియడంలేదు. రంగురంగువస్త్రాలు ధరించి ఆబాలవృద్ధులైన స్త్రీపురుషులు ఇటూ అటూ తిరుగుతూఉంటే సృష్టియొక్క మినిటూరుచిత్ర మనిపించుతూ ఉంది దూరాన్నించి చూసేవాళ్లకి. పర్వం, అందులోనూ మాఘశుద్ధపౌర్ణమి అని తక్కినపర్వాల్లోకంటే ఆనాడు ఎక్కువగా వచ్చింది జనం. మధ్యయుగంలో, స్వార్థముచేతనైతేనేమి, మరి ఏకారణంవల్లనైతేనేమి, సంఘంలో ప్రవేశించిన దురాచారాలను వదిలిపెట్టినయెడల హిందూమతమంత వైజ్ఞానిక నియమబద్ధమైనమతం ప్రపంచంలో వేరొకటి లేదని పక్షపాతంలేని విద్వాంసు లనేకులు అభిప్రాయ మిచ్చి ఉన్నారు. కాని గర్భదరిద్రుడైన వాని తెలివితేటలు వెలపలికి రావడానికి అవకాశంలేనిట్లు గర్భదాసత్వంలో మునిగిఉన్న హిందువుల మతముల్లోని ఉత్కృష్టత్వాలు గూడా పైకి రాలేకపోవడం అలాఉంచగా, ఇతరుల టీకా టిప్పణీలకు సైతం పాలవుతూ ఉన్నాయి. ధీవనాడు ఒప్పుచేసినా తప్పే; ధనవంతుడు తప్పుచేసినా ఒప్పే. విదేశీయులమాట చెప్పనే అక్కర్లేదు. హిందువుల సుగుణాలుకూడ వీరికళ్లకు అవగుణాలుగానే కనబడుతూ ఉంటాయి. కాని దేశీయులునూ కొందరు కానివాటినీ అయినవాటినన్నింటినీ కానివాటికిందే జమ కట్టుతూఉండడం ఆశ్చర్యం. ఈలాఉండగా ప్రస్తుతం నాగరికతా గండపెండేరం వేసుకొనిఉన్న యూరోపు అమెరికా దేశాల్లోని విజ్ఞానవేత్తలు నిరాటంకమైన సూర్యకిరణ ప్రసారణంలో బాహ్యసేవనమూ, సముద్రపు స్నానాలూ దేహారోగ్యానికి మంచివని ఘోషించడం మొదలిడిన లగాయతూ ఇక్కడ వాటిని కూడదన్న వారికి సహితం ఒప్పుకోవలనేవచ్చింది. హిందూదేశంలో హిందూశాస్త్రాల్లో రాయబడినవన్నీ మూర్ఖప్రలాపాలే కాబట్టి అన్నీ వర్జనీయాలే. అవ్వే ఏజర్మనీ నుంచో, ఏఅమెరికానుంచో, ఏవిదేశభాషాకవచాలతోనో ఇక్కడికి దిగుమతియైనాయంటే శిరసావహనీయాలూ, వంద నీయాలూ, అవశ్యం ఆచరణీయాలూనూ... కానిండు.

మదరాసులోని పేటల్లో సందుగొందుల్లో వెలపలికి రావడానికి అవకాశందొరకక కుళ్లుతూపడివుండే మొగాలన్నీ ఇవ్వాళ విశాలమైన సముద్రతీరంలో శుభ్రమైన సూర్యరశ్మినీ, స్వచ్ఛమైన వాయువునూ సేవిస్తూ మహానందంతో కలకల్లాడుతూ ఉన్నాయి. రంగారావు ఈగుంపుల్లో ప్రవేశించి ఉత్సవాన్ని చూస్తూ టవునుకేసి నడుస్తున్నాడు. మైలాపూరు ట్రిప్లికేను తీరాలు వెనుకపడ్డాయి. క్రమంగా తీరాన్ని జనంతగ్గి తుదకు చేపల వాళ్లు మిగిలారు. కెరటాలు వచ్చి తీసిపోతూఉంటే బయటపడే రొయ్యలనూ గొప్పలనూ బట్టుకొనేవాళ్లు కొంతమందీ, తొడలోతునీళ్లలో వలలువేసేవాళ్లు కొంత

మందీనీ. మెల్లమెల్లగా అక్వేరియం, సెనేటుహౌస్, మరినా, కువ్వంనదీ మొదలైన ప్రదేశాల బీచీలన్నీ కడచి పొయ్యాయి. ఫోర్టుముందరి బీచిలో ప్రవేశించేసరికి హైకోర్టుబీచంతా వెనకచూసిన వాటికంటె ఎక్కువగ స్త్రీపురుషులతో కిటకిటలాడుతూ ఉంది. ఈ జనసముద్రంలో నడుమ నడుమ వేయబడివున్న కొబ్బరాకులపాకలూ ఒకవిశేషసౌందర్యాన్నిస్తూ ఉన్నాయి. ఇక్కడి వేడుకలను గూడా చూసుకొంటూ పోదామనే ఉద్దేశంతో జనసమూహంలో ప్రవేశించి పోతున్నాడు రంగారావు. రండి మనమూ ఇతనితో గలసి కొంతదూరం పోదాం. పెద్దపెద్ద భూచక్రపు గొడుగులనీడని ఊరేగిస్తూ బాజాభజంత్రీలతో, తాళమేళాలతో తీసుకొని వచ్చిన ఉత్సవవిగ్రహాల్ని సముద్రజలాని కెదురుగా ఏలా నిలవబెట్టారో చూశారూ. తడిసిన చీరలవెంటా, ధోవతులవెంటా నీళ్లధారలు కారుతూఉంటే పరుగెత్తుకొని వస్తున్నారు అరుగో, స్త్రీపురుషులు తండోపతండాలుగా, ఈదేవుళ్లకి మొక్కడానికి. భక్తి ఉద్రేకంవల్ల ఇప్పుడు వీళ్లంతరూ శిసువ్రులైపోయ్యారుసుమండీ. లేకపోతే చాకింటిమడత కొంచెం నలిగిందాంటే మాసిపొయిందని అవతల పారేసే ఈయువతీయువకులు సహితం పిల్లల్లాగు ఈలా ఇసకలో బడి పొర్లాడుతారా? చూడండీ! ఏలా సాష్టాంగాలు పడ్డారో. ఆహా! ఏం రకరకాల పూలదండలూ ఇటువేపూ! వాటిపక్కనే ఒకఅమ్మి కూచోని దవనాన్ని కట్టలు గట్టుతూవుంది. ఈ పురోహితులు తడికొల్లాయిగుడ్డలను కింద పరచి వాటిమీద విస్తరంటలూ, వాటిలో కుళతిలాక్షతాది ద్రవ్యాలూ సేకరించుకొని మహాడాబుగా జపిస్తూ కూర్చున్నారు గాని మొగాలమీద సంతోషరేఖలేమీ అగపడడంలేదు. పాపిష్టి కలికాలం. కాండబ్బిచ్చిపితాళ్లుకు నీళ్లు విడిచే పాపాన్ని పోవడంలేదు ఎవరూనూ. అబ్రాహ్మలు వారివేపైనా చూడరు. బ్రాహ్మణులకు భక్తే లేదు. ఇక చింత కాకపోతే సంతోషం ఎక్కణ్నుంచి వస్తుందీ.

ఆహా! ఆనందమంటే ఈ బాలకులదే. నడుములంటి నీటిలో నిలుచోని తరంగం వచ్చినపుడల్లా పైకెగురుతూ బుడుగుబుడుగుమని వరసబెట్టి మునకలేస్తున్నారు. ఆ గృహస్థు ఎవరోగాని తనవాళ్లు నీళ్లలో దిగడానికి భయపడుతూవుంటే బలవంతాన్నిలాక్కెళ్లి ఏలా స్నానం చేయిస్తున్నాడో. ఒడ్డునే చతికిలబడి కెరటం తమదగ్గరకు వచ్చినప్పుడల్లా చెంబులను ముంచుకొని అందులోకి వచ్చిన ఇన్నినీళ్లనూ ఇసకనే నెత్తిని కొట్టుకొంటున్నారు ఈ ఇద్దరు జవ్వనులూ; వీరిది అందరికంటె నిర్భయమైన స్నానం. వహవా! ఏమి ఈవైష్ణవవిలాసినీ భక్తి. స్నానం చేసి జారుముడి వేసుకొని నొసటి తిరుమణి అడ్డరేఖమీద తిరుచూర్ణపు నిలువురేఖ మొగాని కొక కొత్త అందం ఇస్తూవుంటే చేతులెత్తి సూర్యనమస్కారాలు చేస్తూ ఉంది. పాదాలకు జానెడుదూరంలో భూమిమీద నేతితో బెట్టిన జోతి వెలుగుతోంది. అహ్హా! ఘుమ్మనికొట్టడం మొదలెట్టింది దవన మరువాల కమ్మనివాసన. ఎక్కణ్ణుంచి చెప్మా! ఆఁ! మల్లెపూల వాసన కూడానా? సరే! తెలిసింది. ఈలా చూడండి! స్నానం చెయ్యడానికని వెడలించిన ఈకల్యాణుల సుదీర్ఘములైన కేశభారాల్లో చిందులు తొక్కుతూ తప్పటడుగులతో మనకేసి వస్తున్నాడు ఈ సమీరబాలకుడు. అంచేత ప్రవహిస్తూ ఉంది మల్లికా పరిమళమిళితమైన దవన మరువాల సౌరభవాహినీ. పవిత్రమయ్యాం ఈ వాహినీ స్నానంలో. అదిగో ఆమూరాన్ని చూశారూ! జలగల్లాగు బట్టుకొని ఏలా వేధించుకొని తింటున్నారో ఆబిచ్చగాళ్లూ, స్నానంజేసి ఇళ్లకు వెళ్లేవాళ్లనీ?

తన సామీప్యంలో ఇంతమంది జనులు ఇన్నివిధాల అల్లకల్లోలాలు పడుతూఉన్నా వేటినీ పట్టించుకోకుండా నిర్లక్ష్యంగా విరామం లేకుండా తన కల్లోలాలూ తాను వేస్తునేఉంది సముద్రం. ఘోరు కొల్పే భీకరధ్వానాలతో నురుగులు కడుతూ కరుళ్లు వస్తూనే ఉన్నాయి, పోతూనే ఉన్నాయి. సక్రమంటూ ఒక్కొక్కతరంగం గట్టుమీదికిగూడా వ్యాపించి అక్కడ పెట్టివున్న ఏగుడ్డలమూటనో; ఏబూట్లజోడునో నీటితో ముంచి తీసిపోతూ ఉంటే దిగాలబడి చూస్తున్నాడు దూరాన్ని స్నానంచేస్తూ ఉన్ననాటియజమాని. ఒక్కొక్క బలమైన కెరటం తగిలి బోర్లపడేవాళ్లు పడు

తున్నారు; లేచేవాళ్లు లేస్తున్నారు. అవిమాత్రం వీటిని లక్ష్యం చేయడంలేదు. పడ్డవాళ్లు లేచేవరకూ ఆగడమూ లేదు. నిలిచి నిలిచి విశేషాలన్నీ చూసుకొంటూ నడుస్తున్నాడు రంగారావు. అకస్మాత్తుగా సముద్రనిర్ఘోషాన్ని మించిన ప్రచండరావంతో ఒక్కపెట్టున గొల్లుమంది ప్రజఅంతా, ఇతని వెనక వేపున. చప్పున తలదిప్పి చూశాడితను. తానున్నచోటికి పదిగజాల వెనక వందలకొలది జనులు తీరాన్ని పోగై ఆకాశం ఎగిరిపొయ్యేలాగు కేక వేస్తున్నారు, "పిల్లకొట్టుక పోయింది" "పిల్లకొట్టుకపోయిం"దని. సుమారు నలభైఏండ్ల గౌరాంగుడైన గుజరాతీపురుషుడొకడూ తడిసిన ధోవతీతో అడ్డంవచ్చిన వారినందరినీ తోసుకుంటూ సముద్రంలోకి ఉరకపోతున్నాడు, చేతులు చాచుకొని, "హాయ్! బేటీ! హాయ్‌లీలే! హాయ్! మేరీ బేటికో బచావ్"అని రోదనంచేస్తూ మొగం మోదుకొంటూనూ. అతని స్త్రీ కాబోలు ఆలాగే మహాకరుణంగా విలపిస్తూ పురుషునికంటె ముందు సముద్రంలోకి ఉరకాలని చూస్తూంది. మరికొందరు స్త్రీలు వీరివెంట ఉన్నారు ఆక్రందిస్తూ. కాని వీళ్లనందరినీ సముద్రంలోకి బోనివ్వకుండా వెనక్కు లాగుతున్నారు అనేకమంది. అందరిచూపులూ నీళ్లలోపలికి వున్నాయి. ఇంతలో అక్కడికి నలభై యాభై గజాలదూరం సముద్రంలో తెల్లని చీరలాగు నీళ్లమీదికి తేలి ఏదో చప్పున మునిగిపోయింది. క్షణమాత్రంలో అవగతమైంది సంగతంతా రంగారావుకు. దైవప్రేరితంలాగు ఉత్తరీయాన్ని నేల మీద విసరికొట్టాడు.

చొక్కా చినిగేదికూడా తెలియకుండా లాగిపారేసి ధోవతిని పైకెగగట్టుకొని గుభాలుమని దూకాడు సముద్రంలో. అతని కప్పుడేదో ఆవేశం పెరిగినలాగై ఎక్కడలేని బలమూ వచ్చింది. తరంగాలు మహాతీవ్రంగా అడ్డగిస్తూ ఉన్నాయి. వాటి కెదురుపడ్డాడితను. పెద్ద పెద్దతరంగం వచ్చినపుడల్లా మునిగి ముందుకే నెట్టుకొనిపొయ్యాడు శక్తినంతా వినియోగించి. చూస్తూ చూస్తూ ఉండగానే వస్త్రంగాన్పించిన ప్రాంతంలో దేలి తలయెత్తి ఇటూఅటూ చూశాడు. ఒడ్డుమీద నిలుచున్న వాళ్ల సర్వేంద్రియ వ్యాపారాలూ నేత్రేంద్రియ వ్యాపారంలోనే కేంద్రీభవించాయి. నిశ్శబ్దమై పోయింది తీరమంతా. బొమ్మలాగు ఊపిరినిగూడా తిప్పుకోకుండా చూస్తున్నారు వీళ్లందరూ. రంగారావు నీళ్లమీద తేలి ఇటూఅటూ చూడగా అతనిముందు అయిదుగజాలమారంలో మళ్లీ కన్పించింది అదేవస్త్రం- రవంత నీటిమీదా, తక్కిన భాగమంతా నీళ్లలో. వెంటనే దానిమీది కెగిరి దూకాడితను. తాననుకొన్నలాగే అయింది. చేతికి వెంట్రుకలూ, బాలికాశరీరం దొరికాయి. చప్పున నీళ్లమీది కెత్తాడావిగ్రహాన్ని. దొరికిందిదొరికిందనేధ్వనితో మారుమోగిపోయింది. తీరమంతా ఎత్తినదాన్ని ఎత్తినలాగే కుడిచేత్తో పట్టుకొన్నాడు. దేహస్మృతి లేనందున నిర్జీవమైన ప్రతిమలాగు అస్తవ్యస్తంగా పడిఉంది ఆశరీరం ఆతనిదక్షిణహస్తంమీద. అలల ఆర్భాటంవలన ఒకటిరెండుమార్లు తన నెత్తిమీదుగ నీళ్లు ప్రవహించినప్పటికీ బాలికను మాత్రం మునుగనివ్వ లేదు. వెనక కొట్టే అలలతో ముందుకు వచ్చి పడుతూ, మళ్లీ సముద్రంలోకి లాక్కెళ్లేవాటిని మహాప్రయాసం మీద తప్పించుకొంటూ పదిగజాల దూరంలోకి వచ్చేసరికి ఒడ్డుమీదివారంతా ఎగబడి స్త్రీలాబాలికనూ, పురుషులు రంగ నీగట్టుమీదికి చేర్చారు. బాలికకు స్మృతేలేదు. కలిగిన ఆయాసంవల్ల రంగారావుకూడా తీరానికి రావడంతోటే వెల్లకిల బడిపొయ్యాడు. భయంచేతా, ఆయాసంచేతా స్మృతి తప్పిపోయిందిగాని యీ బాలిక జీవించి ఉన్నదనే స్పష్టమైంది. అప్పుడక్కడ ఉండడం తటస్థించిన డాక్టరొకరు ఆమె శరీరంలోని నీళ్లను కొంచెంవెలికి గక్కించి తత్‌క్షణం ఇల్లుచేర్చమన్నారు చికిత్స చేయడానికి. బర్మా షెల్ ఆయిల్ టాంకుల దొడ్డిదగ్గర వీరిమోటరు సిద్ధంగానే ఉంది. దానిని ఆక్షణమందే తెప్పించి కూతును, రంగారావునూ ఎక్కించుకొని మేఘాలమీద ఎగిరిపొయ్యాడు, కృష్ణచందు- ఇదే ఆ గుజరాతీ గృహస్థుని పేరు.

## 3

జార్జిటవున్నుంచి పరసువాకం పోతూ మింటుస్ట్రీటు రాగానే దానిలో కుడిచేతిప్రక్కకు దిరిగి కొంచెము దూరంమాత్రమే గడచిపోయామంటే అక్కడకళ్లకు

# ఆకస్మిక ఛాయా చిత్రములు

## (SNAP SHOTS)



౧. బరువు మోత

ఛాయాచిత్రకారుడు:
శ్రీ. వి. ఆర్. చిత్రగారు.



౨. పాపాయి

ఛాయాచిత్రకారుడు: శ్రీ ఎ. వి. రామచంద్రరావుగారు, హనుమకొండ.



3. ప్రతిబింబము

ఛాయాచిత్రకారుడు: శ్రీ ఎ. వి. రామచంద్రరావు



౪. నేను బడికిరాను, (రెండవ బహుమానము)

చిత్రకారుడు: శ్రీ వి. ఎ. రంగమన్నారుగారు.

౫. మలబారు 'తిరుచూరు' లో జరిగిన 'పూరం' మహోత్సవము
ఛాయాచిత్రకారుడు: శ్రీ యం. కే. రంగస్వామిఅయ్యంగారు, చెన్నపురి.



౬. రేవుదాటుట.
ఛాయాచిత్రకారుడు: ఏ. వి. సుబ్బారావుగారు, భీమవరము.



౭. తల్లి, పిల్లలు.
ఛాయాచిత్రకారుడు: శ్రీ రామారాయ్ వర్మగారు, రాజమహేంద్రవరం

పంసగజేసే నాలుగు అంతస్థుల రంగురంగుల హవేలీ శ్రీమంతులైన సేఠ్ కృష్ణచందుగారిది. కోట్లకుపఃంచిన వ్యాపారం చేస్తూఉండడంవల్ల వీరి నందరూ సేఠని పిలుస్తూఉంటారు కాని బ్రాహ్మణకులోత్పన్నుడీయన. ఔదీచ్య శాఖ. వీరిపూర్వులు అహమదాబాదులో రత్నవ్యాపారులుగా ఉండి లక్షలాది ద్రవ్య మార్జించారు. గుజరాతీలు, సింధీలూ, మార్వాడీలూ ఉద్యోగశూరులూ, పరదేశాటనపరులూనూ. ఆంధ్రుల్లాగు గుమ్మం దాటితే కులం పోతుందని జడిసి ఉన్నచోటే పడివుండేవారుగారు. స్వదేశాన్ని వదలి వేలకొలది మైళ్లదూరంలో ఉన్న విదేశాల్లో ప్రవేశించి వర్తకవ్యాపారాలు చేయడంలో వీరిది పెట్టిందిపేరు. ప్రస్తుతం వందలకొలది మార్వాడీ కుటుంబాలచే నిండిపోయిన మనఆంధ్రదేశమే ఇందులకొక తార్కాణము. ఈలాటి ఉత్సాహసంపన్నుల్లో ఒకడైన శ్రీచందు-కృష్ణచందుని పితామహుడు, అహమదాబాదులోని వ్యాపారంతో తృప్తినొందక బరోడా బొంబాయి నగరాల్లోకూడా గొప్పగొప్ప వర్తకస్థానాలను ఏర్పరచి, ఆరెండుచోట్ల వ్యాపారం బాగుగ స్థిరమైన తర్వాత ఆ సమయానికి ఉచితవయస్సులోనికి వచ్చిన కొడుకును గోపాలచందును నిజాం హైదరాబాదులో వేరొక వ్యాపారాలయం స్థాపించడానికి పంపాడు. కొన్ని పరిమిత సంవత్సరాల్లోనే గోపాలచందువ్యాపారం అశ్వధాటితో పరుగెత్తింది. హైదరాబాదు రెసిడెన్సీ, సికింద్రాబాదు జేమ్సుస్ట్రీటుల్లోని కొన్ని సుందరభవనాలు మాత్రమే గాక ఊరిబయటి దివ్యసౌధాలూ కొన్ని వీరి స్వాధీనమైనాయి. నిజాంఇలాకాలోని ధనవంతులకూ, సంస్థానాధిపతులకూ మాత్రమేగాక నిజాంగారి దర్బారుకూ, వారిజనానాలకూ, గావలసిన రత్నఖచితములైన జవాహిరీలు, సువర్ణమణిమౌక్తికాలూ వీరినుంచే సప్లయి అవుతూవచ్చాయి. ఇంత ఎందుకూ? అవసరం వచ్చినయెడల నిజాందర్బారువారికి కోట్లకొలది ద్రవ్యం ఇవ్వడానికి సిద్ధంగా ఉండేవాడు గోపాలచందు. ఈలాగు భాగ్యపురంలో కలిసివచ్చేసరికి ఈయన కుమారుడు కృష్ణచందునకుగూడ యుక్తవయసురా ఆయన ఇతన్ని మద్రాసు పంపాడు.

అదృష్టవంతుడు పట్టిందల్లాబంగారమే అవుతుంది పట్నంలో చందులవ్యాపారం వాయువేగ మనోవేగాలతో పెరిగింది. కేవలం అయిదారేండ్లకాలములోనే మింటుస్ట్రీటులో ఒకవిశాలమైన పూర్వపు ఇంటిని కొని దానిని బడగొట్టించి కొత్తపునాదులతో ఈనాలు గంతస్థులసౌధాన్ని గట్టించి తాతగారియెడలగల భక్తిగౌరవాలను ప్రకటించుకొనునిమిత్తం దానికి శ్రీవిలాసం అనేపేరు పెట్టాడు కృష్ణచందు. ఇప్పుడింకో మూడంతస్థుల దివ్యభవనం కీల్పాకులోని ఒకసుందరోద్యానం మధ్య ఉంది. దానిపేరు గోపాలవిలాసం-తండ్రి పేరున. ఈ సౌభాగ్యసీమంతినీ ప్రియకుమారుని తండ్రి తాతలిద్దరూ ప్రస్తుతం దృఢకాయులై తమతమ కార్యముల నిర్వహించుకొన సమర్థులై ఉన్నారు. అహమదాబాదు, బరోడా బొంబాయి, హైదరాబాదు, మద్రాసునగరాల్లో వీరి వజ్రాలవ్యాపారం నిరాఘాటంగా జరిగిపోతూ ఉంది. తండ్రి హైదరాబాదులో, తాత అహమదాబాదులో నివాసంగా ఉండి వారివారికి సమీపంలో ఉండే కార్యస్థానాలనూ నిరీక్షిస్తూఉంటారు కృష్ణచందుకు ముగ్గురు కొడుకులూ, ఒక కూతూరూ. అందరిలో పెద్దవాడు లక్ష్మీనందు. పదిహేడు సంవత్సరా లుంటాయి. స్కూలుఫైనల్ పరీక్షయిచ్చి ప్రస్తుతం తాతగారిదగ్గిరికి వెళ్లి ఉన్నాడు హైదరాబాదులో. రెండోసంతానం కూతురు. పేరు లీలావతి. పదిహేనేండ్లు ఉండవచ్చును. మూడోవాడు భువనచందు తొమ్మిదిపదేండ్లకుర్రవాడు. అందరికంటె చిన్నవాడు నాలుగైదేండ్ల పూర్ణచందు. ఈనలుగురూ నాలుగు పోతపోసిన పసిడిబొమ్మలే. అల్పజ్ఞానులయిన మనుషులు పోసేపోతల్లో లోపమేదైనా వస్తే రావచ్చునుగాని సర్వశక్తివంతుడూ, చిత్స్వరూపుడూనైన భగవంతుడు పోసేపోతల్లో లోప మెక్కడనుంచైనా వస్తుందా? వారిలో లీల లీలామానవ విగ్రహమే. మెరుపుతీగలాగే ఆకర్షిస్తుంది ఆబాలిక శరీరకాంతి లోకుల చూపులనీ. తేరిపార చూచినయెడల అట్టివారికి మెరుపుజూపినవాళ్ళకుపట్టేగతే పట్టేది. అతిప్రకాశమానములయిన పదార్థములను చూచినయెడల కొంతసేపటివరకూ ఏవేపు దృష్టి సారించినప్పటికీ ఆచూచినపదార్థము

వంటి పాపలే కనబడుతూఉంటాయి. అదేసమవున లీల నించుకచూసినవాళ్ళకు ఎటువేపు తిలకించినా లీల లీలలే అగపడేవి. ఇక భౌతిక తేజఃపుంజము దీర్ఘానలోకనంచేత ఒక్క నేత్రేంద్రియాన్నే నాశనంచేస్తుంది. కాని లీలా లావణ్యపుంజము సకలేంద్రియాలనూ నాశనము చేస్తుంది. ఏలాగా? లీలను చూస్తే మానసేంద్రియం నష్టమైనట్లే. అది పోయిన తర్వాత పంచేంద్రియాలు ఉండేం? లేకేం? కృష్ణచందు కావడానికి బ్రాహ్మణుడే. కాని అసలైన ఆర్యసమాజీ. ఈయనతండ్రి గోపాలచందు దక్షిణ హైదరాబాదులోని ఆర్యసమాజానికి పోషకుడుగా ఉండి తరుచుగా రెసిడెన్సీలోని సమాజానికి ప్రతి ఆదివారం వెళ్లుతూ అక్కడ సంఘసంస్కరణం నిమిత్తం లెక్చర్లు ఇస్తూవుంటే కొడుకుగూడా వెంటనే వుండి వింటూ ఉండేవాడు. ఖురాను గ్రంథంమీదా, అరబ్బీ భాషమీదా ప్రాణాలువదలడానికి ముసల్మాను లేలాగు తయ్యారుగా ఉంటారో అదేలాగు ఆర్యసమాజకులు వేదంమీదా, సంస్కృతం మీదా ఖుర్బానీ* కావడానికి సిద్ధంగా ఉంటారు. అందుచేత భాగూలాలనే ఒక మంచి విద్వాంసుని ఏర్పాటుచేసి సంస్కృతంనూరిపోయించినాడుకృష్ణచందు లీలకు. ఇదిగాక హిందీ గుజరాతీ, ఇంగ్లీషూ, తెలుగూ భాషలుకూడా తెలుసు నీమెకు. సంగీతమందు మంచి ప్రావీణ్యం ఉంది. ఈలాటి సకలకలానిధిని కలానిధితో పోల్చవచ్చునంటారుగాని, నాకేమో మనసొప్పదు సజీవమైన కుందనపు బొమ్మను జడంతో పోల్చడానికి.

ఆర్యసమాజానికి చెందినప్పటికీ సనాతనాదార్యముంది. కృష్ణచందు దగ్గిర. వచ్చి పోయ్యే బంధుమిత్రాదుల కారణాన్ని (ఎల్లప్పుడూ) నిత్యకళ్యాణం పచ్చతోరణం లాగుంటుంది వీరి శ్రీవిలాసం. ఈలాటి లక్ష్మీ సంపన్నుని ఇంట ఇప్పుడు మనుసుడుపు విందుగా దిగిఉన్నాడు ఘన రంగారావు. ఆనాడు సముద్రతీరాన్ని వందలకొలది ఘనుషులు కళ్లను మిటకరించుకుంటూ. ఒక్కడైనా లోపలి కురకడానికి సాహసించకుండా వున్న సమయంలో తనప్రాణానికి తెగించి నీళ్లలోబడి తనకూతును రక్షించినాడని ఒక్క కృష్ణచంద్రునికే కాదు, ఇంటిల్లిపాదికే కాదు, ఆ వీధిలో లీలను ఎరిగి ఉన్నవారికందరికీ ఇతనిమీద అవ్యాజానురాగం జనించింది. సంబంధ బాంధవ్యాలు జన్మాంతరసంచితాలని మన పెద్దల అభిప్రాయం. ఇందులో సందేహ మేమీ అగపడదు. ఎక్కడో బెజవాడలో పుట్టిపెరిగి, ఏలూరులో కొంతకాలం, రాజమండ్రిలో కొంతకాలం చదువుకొంటూవుంటే నీళ్లు పడవనే నెపం గల్పించి మద్రాసునగరాని కీడ్చుకొని వచ్చి ఈ మహాపట్నంలో జీవనోపాయం, వసతీ ఏలాగ దొరకునోయని విచారిస్తూ ఉన్న ఆంధ్రకుమారుని నెలకొలది మైళ్లమూరమందలి అహమదాబాదునుంచి వ్యాపారంనిమిత్తం వచ్చి ఉండగా కుమారీరక్షణ మనువ్యాజంతో గుజరాతీల ఇంట జేర్చింది అఘటనాఘటన సామర్థ్యంగల విధివిలసితం. సముద్రఘటనం తర్వాత కృష్ణచందు కూతునూ, రంగారావునూ తన ఇంట జేర్చి. డాక్టర్లను బెట్టి వారికి చికిత్స చేయించడమూ, క్రమంగా ఇద్దరికీ పూర్ణారోగ్యం కావడంగురించి వెంచి రాయవలసిన అవసరం లేదు. అక్కడ చేరిన మర్నాడే రంగారావుకు బాగా నెమ్మది కలిగింది. తనబసకు వెళ్లుతానన్నాడు. కాని ఇతని పోనియ్యక, పోవడం అలా ఉండగా నౌకరు సమేతంగానతనిటాక్సీమీద పంపి బసలోనిసామానునంతా తనయింటికే తెప్పించుకొన్నాడు కృష్ణచందు. అప్పటికి మాత్రం రెండుమూడు రోజులపాటుండి బాగా శరీరాయాసం దీరిం తర్వాత పోవచ్చునంటే సరే అని ఒప్పుకున్నాడు రంగారావు అక్కడ ఉన్న ఆ రెండుమూడు రోజుల్లో ఒకనాడు వీరిద్దరికీ చాలాసేపు సంభాషణ జరిగినది. ఇతని పుట్టు పూర్వోత్తరాలూ, ఇంతవరకూ ఎక్కడ ఉన్నదీ, ఏంచేస్తూఉందీ, ఇక్కడి కెందునిమిత్తం వచ్చిందీ, ఈఅన్ని సంగతులనూ అడిగితే ఉన్నదాన్ని ఉన్నలాగు చెప్పాడు రంగారావు.

కృష్ణచందు వీటినన్నింటినీ విని తన యావత్తు సంగతినీ సంగ్రహంగా వినిపించి, వేరొకచోటికి వెళ్లి కష్టపడవలసిన అవసరమేమీ లేకుండా తనదగ్గరే వుండమనీ, చదువు లోనగు వాటికి గావలసినంత ధనం తానే ఇస్తాననీ చెప్పాడు. మొదలు రంగారావుకు సంకోచం గలి

---

* ఖుర్బానీ=బలి,

గా ఉండవనని. కాని కృష్ణచందుని బలవంతం తప్పక పోవడం లేదు. శ్రీ నాగేశ్వర రావుగారి వాగ్దానం పూర్తి వినిపింపగా దాను స్వయంగా వెళ్ళి పంతులుగారిని ప్రార్థిస్తానని ధైర్యాజెప్పి, ఏలాగైతేనేం చివరకు ఒప్పు కునేలాగున చేశాడు రంగారావుని కృష్ణచందు. అది మొదలూ అతని నివాసం శ్రీవిలాసంలోనే. ఒక పర్యా యం పంతులుగారిని దర్శించి జరిగిన సమాచారమంతా వారితో జెప్పగా స్వజాతీయుడైన ఆంధ్రసుపుత్రు డొనరించిన సాహసకార్యం మెచ్చికొని దీవనలిచ్చి పంపారు దేశోద్ధారకులు.

## ౪

రంగారావు కృష్ణచందుగారి శ్రీవిలాసంలో ప్రవే శించి రెండు సంవత్సరాలైంది. ఈ మధ్యకాలంలో ఇతని సద్వర్తనం, ఇతని నిరభిమానమైన జీవనం, ఇతని తెలివితేటలూ ఇంట్లోవాళ్ళందర్నీ మోహముగ్ధుల జేసి వేశాయి. భువనపూర్ణ లింకా పసివాళ్ళే కాబట్టి వాళ్ళను గురించి ఎక్కువ రాయవలసిందేమీ లేదు. కాని లక్ష్మీ చందుకూ ఇతనికీ కలిగిన స్నేహంమాత్రం వర్ణనీయమైంది. ఒకరిని వదలి ఒకరు ఉండలేక పోతూ వచ్చారు. ఇక్క డికి వచ్చింది మొదలుకొని రంగారావు పేరు రావుజీకింద మారింది. మనంకూడా అప్పుడప్పుడు ఈ పేరు నేవాడు కొందాం. ఇతరులతో చెప్పని తన మనసులోని రహస్యాలను రావు జీకి మాత్రం జెప్పి అతని సలహాను దీసికుంటూ ఉండే వాడు లక్ష్మీ. స్కూల్ ఫైనల్ పాసైంది మొదలుకొని ఇత నికి విదేశాల్లో, ముఖ్యంగా యూరపు అమెరికాల్లో, భ్రమణచేయాలనే బుద్ధి పుట్టింది. ఈ సమాచారం కొన్నాళ్ళవరకూ రావుజీకి దప్ప మరెవరికి దెలియదు. అతడితని అభిలాషకు ఆటంకం చెప్పక పోవడం కాకుం డా మీదుమిక్కిలి ప్రోత్సాహం చేశాడు. తలి దండ్రుల కెందుచేతనో ఈ విదేశభ్రమణ మంత రుచిం చలేదు. మరింత పట్టుబడితే తండ్రి వప్పుకొనే వాడేమో కాని, అప్పుడు ఇతను కూడా ఆ వుద్దేశాన్ని మాని ఇంటర్ మీడియేటు తరగతిలో జేరి యథాపూర్వం చదవడం మొదలెడితే తలిదండ్రులు లావ్యాసంగం పోయిం దనుకొన్నారు. ఇప్పుడు రావుజీకి బి. ఏ. పరీక్ష, లక్ష్మీకి ఇంటరు పరీక్ష లయిపోయ్యాయి. పరిణామాలు ఇంకా రాలేదు. పరీక్ష కావడంతోటే లక్ష్మీకి హైదరా బాదుపోవడం వాడుక. కాని రావుజీ వచ్చింది మొదలు కొని అక్కడికి వెళ్ళడం మానాడు. చెన్నపట్నంలోనే వీరికాలం సుఖంగా వెళ్ళిపోతూవచ్చింది. ఈ మధ్యకా లంలో పద్మాలోచను ఇంటిలోని ఆడంగుల బలవంతాన్ని రావుజీ ఉత్తరంవ్రాస్తే అతనితల్లి వచ్చి కొన్నాళ్ళుండి వెళ్ళిపోయింది ఏలూరు. ఆమె ఇక్కడ ఉన్నన్నిరో జులూ కృష్ణనందూ, ఇంటివాళ్ళూ ఆమెయెడల జూపిం చిన ప్రేమపూర్ణమైన గౌరవాదరాలను తిలకించి ఇంటి లోని దాసదాసీలందరూ ఆమెను కృష్ణనందుని చెల్లె లుగా భావించారు గాని పరాయిమనిషి అనుకోలేదు. ఇవన్నీ ఇలాఉండగా, రావుజీమీద గలిగిన అవ్యాజప్రే మమువలన సమయం దొరికినప్పుడల్లా తనదగ్గిర కూర్చుండ బెట్టుకొని వ్యాపారసంబంధమైన రహస్యాలూ, తికమ కలూ తెలియజేస్తూ చాలవరకు అందులోగూడా కుశ లుణ్ని చేశాడు కృష్ణచందు.

తా నిదివరకు సంకల్పించుకొని ఉన్న ప్రకారం దైవచింతనము మొదలగు ధర్మకార్యాల్లో ఎక్కువ సమ యాన్ని వినియోగించుకొనుటకు ఇప్పుడు మంచితరుణం లభించిందని ఒకనాడితడు రావుజీని పిలిచి, "ఇంతవరకూ మీరు పరీక్షా ప్రయత్నాల్లో మునిగి ఉండడంవల్ల అం దుకేమీ విఘ్నం రానియ్యకూడదని మీకు కష్టమిచ్చాను కాను. ఇక ఇప్పుడు సావకాశం దొరికింది. ఇదిగో నే ఉన్న సమయంలో, ముఖ్యంగా లేనిసమయంలో, మన వ్య వహారములన్నీ మీరే చూస్తూఉండండి. అంతగా దెలి యనివిషయ మేదైనా తటస్థిస్తే నేను ఉండనేఉన్నాను" అని తాళంచేతు లతనికి ఒప్పగించి, ఎప్పుడైనా అవసరం వస్తే రావచ్చునని వానికి మారుతాళంచేతు లన్నింటిని తనదగ్గరే ఉంచుకొన్నాడు. ఆహా! కృతజ్ఞత అంటే ఇలాఉండాలి. ఇక లీలసంగతి ఏమిటా? సముద్రఘటన మైన మూడోనాడు ఈమెకు బాగా తెలివి కలిగింది. బలహీనతమాత్రం తగ్గలేదు. అస్వస్థంగా ఉన్నన్నిరో జులూ ఈమె స్నేహితురాండ్రందరూ వీరింట్లోనే ఉం టూవచ్చారు. పిల్లందరూ ఎల్లప్పుడూ ఆమెకొనే మాటల గింది, ముక్కూ మొగమూ ఎరగని వాళ్ళ ఇంట్లో ఏలా

వల్లతా నాదినమున సముద్రస్నానం చేయడానికి పోయింది మొదలుకొని అంతపర్యంతం జరిగినసంగతులన్నీ బాగా విశదమయ్యాయి. ప్రేమోద్రేకంచేత వెలువడిన అశ్రుజలములతో అభిషేకంచేసి మనఃకమల పుష్పాన్ని అర్పణంజేసి తన్ను రక్షించిన అవ్యక్తమూర్తికి ప్రణామం జేసింది కాని శాంతం కలిగింది కాదు. అభీష్టదేవతా సాక్షాత్కారంలేక భక్తికి శాంతం గూడానా? తన్నుగాపాడిన దివ్యమూర్తిని చూడాలనే ఉత్కంఠ జనించింది. ఆనతూహలాన్ని అణచుకోవాలని ప్రయత్నంచేస్తుంది. కాని అది ఈమె చేతిలో ఉందా? ఎంత తగ్గించుకోవాలని ప్రయత్నంచేస్తుందో అంతఎక్కువ అవుతూ వచ్చింది ఆ ఉత్కంఠ. స్నేహితురాండ్రను అడగడానికి మనసొప్పలేదు. అడిగితేమటుకు వారేం చేస్తారూ? కొంతసేపటికి తలిదండ్రులు చూడడానికి వస్తే మనసు ఆపుకోజాలక, "నాన్నా! నన్నెవరో సముద్రములోనుంచి లాక్కొచ్చి బ్రతికించారటా. ఒక్కమాటు వారిన్నా దగ్గిరికి పిలుచుకొనిరావూ? చూస్తాను" అని అడిగింది. చింతగాని ఉద్వేగంగాని కలిగించేపనులనూ ఆమెముందు చేయవద్దని డాక్టరు చెప్పాడు. అందుచేత "వారు మనయింట్లోనే వున్నారు నీఒళ్లు కొంచెం నయమైనతర్వాత పిలుచుకొనివస్తా"నంటే కాదు కూడదని ఘరింతగా అడిగినందువలన రావుజీని తీసుకొని రావడానికి అతనిగదికి వెళ్లాడు తండ్రి.

ఇంతలో వద్దంటూ ఉన్నప్పటికీ వినక లేచి తల్లిని ఆనుకొని కూర్చుంది పక్కమీదనే లీల. కృష్ణచందు రావుజీ లిద్దరూ గడప దాటి లోపల ప్రవేశించగానే చేతులించుక ఎత్తి ప్రణామం చేసింది. ఉద్రేకపూరితమైన ప్రేమభావమూ, కృతజ్ఞతా మిలితమైన సంతోష భావములు రవంత ఎట్టిబారిన ఆ మెముఖంమీద తాండవమాడుతున్నాయి. ఆ కరుణాకరమూర్తిని చూసేసరికి కరిగి నీరై పోయింది రావుజీ హృదయం. కరిగే మాయమైందో లేక అంతరిక్షానికే ఎగిరిపోయిందో! వెంటనే వెతుక్కొన్నప్పటికీ అతని కఠినహృదయం దొరకలేదు. దయాభావం మొగంమీద తొలుకాడుతూవుంటే ఆమెను చూస్తూ కొంచెంసేపు కూర్చున్నాడతనూ ప్రక్కనేఉన్న ఒకకుర్చీమీద. ప్రణామానంతరం ఒక్క క్షణకాలం అతనివదనాన్ని తేరిపార జూచి నిమీలితనేత్రయై పక్కదిండుమీద తలచేర్చి పడుకొంది. లీల నిద్రించు చంటిబిడ్డల వదనాలమీద లాగు అప్పుడప్పుడాబాలికముఖముపై నానావిధభావాలు పుట్టుతూ ఉన్నాయి, పోతూ ఉన్నాయి. ధ్యానిస్తూలాగుంది. ఎవరినీ? కొన్నినిమిషములు ఈప్రకారమున్నతర్వాత, "అమ్మా! నీకు ఇంకా బలహీనంగా ఉంది. నీకు బాగా వొళ్లు కుదిరేవరకూ వీరిని మనఇంట్లోనే వుండమని వేడుకొంటానులే" అని కూతురుతో చెప్పి రావుజీని వెంటగొనిపోయి అతనిగదిలో వదలి తనపనిమీద తాను వెళ్లాడు కృష్ణచందు. ఈసందర్భమున జనించిన ఈప్రేమి ప్రేమికల పరస్పరానురాగం పరస్పరగుణగ్రహణాదోహసంవల్ల దినాభివృద్ధిని పొందుతువకు పరిపక్వమై అన్యోన్యవిరహం సహించనిది గూడనైపోయింది. అంతపర్యంతం ముక్కూ మొగ మెరుగనివాళ్లయినాసరే, ఈ పరస్పరాశ్రితమైన ప్రేమ జనించిందాంటే, దీనిమాహాత్మ్యం ఏలాటిదో తెలియదు. ఒకరికొకరు బలిఇచ్చుకొని అయినా తన ప్రేమే ఎక్కువైందని చూపించుకోడానికి ప్రయత్నంచేస్తూ ఉంటారు. ఈ లాటి ప్రయత్నాలతోనే లీలారంగల సమయం తెలియకుండా గడిచిపోయింది. కేవలం పూర్వాచారపరాయణులైన తలిదండ్రులే అయినయెడల వీరల స్వర్గానందం నరకయాతనకింద పరిణమించి ఉండేదేకాని ఆర్యసమాజకులైనందున వీరి కేలాటిబాధా కలుగలేదు. వైదికకాలంనాటి మన పెద్దలు అవలంబించిన ఆచారాలనే అవలంబిస్తూ తమ సంతానంచేతగూడ ఆలాగే చేయించవలెనని సమాజకుల ముఖ్యోద్దేశము. ఈ కారణంచేత పద్మాకృష్ణులు తమ బిడ్డల సుఖజీవనానికి తోడ్పడుతూ వచ్చారుకాని విఘ్నాలు కల్పించాలని ఎంచలేదు. ప్రేమిప్రేమికలకూ ఇంతమాత్రం సందుదొరికితే ఇక కావలసిందేమిటి?. రాజధాని పట్నంలో లీలా లక్ష్మలతో గలసి రంగారావు దర్శింపని సినీమాలూ, వీక్షింపని నాటకాలూ, విహరింపని సముద్రతీరాలూ, సంచరింపని పార్కులూ, గాలింపని బోటుషికార్లు, ఆలకింపని వీణా

గానసభలు, అనుభవించని ప్లెజర్ ట్రిప్పులు, ఆరగించని ఉద్యానవనభోజనాలు లేనేలేవు. తరుచుగా భువనపూర్ణులు ఈ పార్టీల్లోనే ఉంటారు. ఈలాగే మరికొన్ని రోజులు గడిచిపోయి వుండినయెడల లీలారంగ మైత్రి వివాహరూపంగా పరిణమించి వీరి ప్రేమవృక్షానికి పూలూ, మొగ్గలూ, పిందెలూ పుట్టేవే. కాని అందులకొక మహా విఘాతం సంభవించి, వీరిద్దరి సౌఖ్యాన్నే కాదు, ఈ కుటుంబంవారి అందరి సౌఖ్యాన్ని గూడ నాశనంచేసి వేసింది.

లక్ష్మీచందు విదేశాలకు పోవడానికి తటపటలాడుతూ ఉండి కొన్నాళ్లకా అభిప్రాయం వదలి చదవడం మొదలిడిన తరువాత ఇతని ఉద్దేశం మారిపోయినందుకు తలిదండ్రులు సంతోషించారని పైన వ్రాసి ఉన్నాను. పైకగపడినలాగు ఇతని విదేశభ్రమణాభిలాష - పరదేశాల్లో తిరగాలనే పిచ్చి- మనసులోనుంచి పోలేదు. ఇంటర్ పరీక్ష కావడంతోటే ఆ ఉద్దేశం మరింత తీవ్రంగా మళ్ళీ జనించింది. దీన్ని పూర్తిచేసుకోడానికి ఇతడు చేసిన అవిచారమైన, అనుభవరహితమైన చిన్నతనపుచేత వల్లనే ఈ కుటుంబం వారనుభవిస్తూ వచ్చిన ఆనందరసవాహిని ఒక్క నిమిషంలో అంతరించి పోయింది. రంగారావుకు వ్యవహారపు తాళంచేతులను ఒప్పగించి నిశ్చింతతో దైవధ్యానంలో మునిగి కాలం గడుపుతున్నాడు కృష్ణచందు. క్రమక్రమంగా రావుజీమీదే పడింది భారమంతా. తక్కిన సమయాల్లోలాగు వ్యవహారపు వేళలందుగూడ లక్ష్మీచందు రావుజీ పక్కనే ఉంటాడుగాని యెల్లప్పుడూ పరధ్యానమే. వర్తకపు పనుల్లో ఇతనికి రుచి వున్నలాగు కనబడదు. ఇందుకు ముఖ్యకారణం విదేశానికి పోవాలని పట్టుకుంది చింత. పరీక్షల పరిణామాలు కొద్దిరోజుల్లోనే బయటపడతాయి. అప్పుడితనికో ఆలోచన తట్టింది. ముత్తాతగారి దగ్గిరికి అహమదాబాదు వెడతానని అందరితో చెప్పి బయల్దేరి బొంబాయిలో దిగి అక్కణ్ణుంచి తిన్నగా యూరోపుచేరకోవాలనీ సంకల్పం. కాని ధనమో? తలిదండ్రులతో, రావుజీతో చెప్పితే వెనకలాగే అవుతుందని భయం. అందుచేత ధనంకోసం మరో ఉపాయం పన్నేడు, ఎవరికీ తెలియకుండా కావలసిన ద్రవ్యం తీసుకొని తర్వాత అందరికీ తెలియచేయాలనీ. రావుజీ తాళంచేతులూ, తండ్రిదగ్గిర డుప్లికేటు తాళంచేతులూ ఎక్కడ ఉండేదీ ఇతనికి బాగా తెలుసు. అనేకమాట్లు ఇతనికి ఇనపపెట్టెలు తీయడం వేయడం వాడుకే. ఇంటికైన పెద్దకొడుకూ, యజమాని తర్వాత యజమానంతవాడూ ఇతడేం చేస్తూ ఉంటే ఎవరేం అనుమానపడతారు? కాబట్టి వెళ్లేనాడు కావలసిన ద్రవ్యందీసుకొని జాగ్రత్త చేసుకోవలెనని ఏర్పరుచుకొన్నాడు ప్లాను. ఇంట్లోవాళ్ళకేం తెలుస్తుందీ ఈసంగతి? అందరూ అహమదాబాదే వెళ్లుతాడనుకొన్నారు. అందుకనే తలిదండ్రులితని ప్రయాణానికి మారుమాటాడక సమ్మతించారు. చివరకు ప్రయాణం దినం వచ్చింది. రాత్రి ౮-౩౦ మెయిల్లో బయల్దేరి బొంబయిచేరి అక్కణ్ణుంచి గుజరాతు మెయిల్లో అహమదాబాదు చేరాలని పైకేర్పరుచుకొన్న ఏర్పాటు. పగలంతా ప్రయాణపుసన్నాహాలవుతూనే ఉన్నాయి. ప్రయాణానికి గావలసిన ఆహారపదార్థాలూ, మిఠాయీలూ తయారు చేస్తున్నారు హల్వాయీలు. డ్రెస్ ట్రంకులు, ఆహారపదార్థాల ట్రంకులు, అపరూపపు పదార్థాల కేసులు, పుష్పఫలాదుల బుట్టలు, పుస్తకాల బేగులు, బెడ్డింగులు మొదలగు సామాన్లను సర్దడంతోటే సరిపోయింది దినమంతా. వెళ్లేది ఒక్క లక్ష్మీ.

ఈలాటి లక్ష్మీపుత్రులే లేకుంటే రైల్వేస్టేషన్లలోని రైసెప్సకూలీలగతి ఏంగావాలి? రంగారావు ఏదో పనిమీద వెలుపలికి వెళ్లి ఉండగా తండ్రి మేడమీద ఉండడం గనిపెట్టి తన మనోరథాన్ని నెరవేర్చుకొన్నాడేలాగయితేనేం, ఇతడు. ముప్పైనలభై వేల రూపాయలు ఇనపపెట్టి బందీనుంచి తప్పించుకొని లక్ష్మీచందుచేతి బేగును అలంకరించాయి. ఒకవారం గడవకముందే ఈ వార్తను తండ్రికీ, రంగారావుకూ తెలియచేద్దామనే ఆలోచనేకాని ఇంతలో ఏకొంప మునిగేదీ యోచించలేదు. కొత్తకొత్త దేశాలూ, అక్కడి వింతలూ, విశేషాలూ చూడవలెనని అనివార్యమైన అభిలాష జనించడం మనుష్య స్వభావాల్లో ఒకటి. ఈ ఇచ్ఛాపూర్తిని అనేకులనేక విధాల చేసుకొంటూవుంటారు. పొత్తుగాచేసుకోలేనివాళ్లు

దేవురిస్తూనే ఉంటారు. దగ్గర కావలసినంత ధనం లేక పోయినప్పటికీ, స్థితిగతు లనుకూలించకపోయినప్పటికీ, ఏ అనివార్య హేతువుచేతనో, ఏ అప్పుసప్పో చేసి, రైళ్లు మొదలైన వాటిమీద ప్రయాణంచేస్తూ ఉండేవాళ్లు మొగాలమీద తొలుకాడుతూఉండే సంతోష వికాసాలను చూస్తే స్పష్టమౌతుంది, ఈనవీన విశేషదర్శనాభిలాష, ఈనూతనప్రదేశావలోకనకుతూహలం, మనుష్యుల్లో ఎంతప్రబలంగా ఉండేదీనీ.

యూరోపు అమెరికా నివాసులు బాలకుల విద్యాభ్యాసకాలంలో యువకుల విద్యాపూర్తి అయిన తర్వాత ఇలాటి విదేశదర్శనావకాశాలను సమకూర్చి ఈ పిపాసను కొంతవరకు తీరుస్తున్నారు. ఈ యభిలాషాపూర్తికి తగిన ఏర్పాట్లను మనపూర్వులుగూడ చేసిఉన్నారు. గృహస్థాశ్రమం స్వీకరించే పర్యంతం విద్యాభ్యాసం నిమిత్తం విదేశాలకు వెళ్లాలనీ, తరువాత ఆమరణాంతం తీర్థాలనూ, పుణ్యక్షేత్రాలను సేవించాలనీ మనపెద్దలు చేసిన ఏర్పాట్లఅభిప్రాయం ఏమై ఉంటుంది? వీటి కింకనూకొన్ని కారణా లుండవచ్చునుకాని వాటిలో తప్పకుండా ఇదికూడా ఒకకారణం. ఏమైతేనేం? తన వివేకం, తన వినయ సౌజన్యం, తన గురుజనానురాగం, తనమిత్రవాత్సల్యం లోనగు సద్గుణాలను ఈ ఆశాదేవికి బలిఇచ్చి బయుల్దేరాడు లక్ష్మీచందు. ఏడెనిమిది గంటలకు భోజనాలయ్యాయి. ఆసమయాన్ని శ్రీచందు మొదలగు బంధువులకు నోటిద్వారా పంపవలసిన సందేశాలు, నమ్రతాపూర్వక ప్రణామాలు ఇచ్చారు తలిదండ్రులు. ఆమాయికలు తమ్ములూ, లీలా నొక్కినొక్కి చెప్పారు తాత గారికి చెప్పవలసిన మాటలన్నీనీ పరధ్యానంగా వీటి కన్నింటికీ ఊకొట్టాడు లక్ష్మి.

ఒకటాక్సీలో సామానంతా వేయించుకొని అహమదాబాదుకు పోవలసిన ఇద్దరు నౌకర్లనూ, వెంటబెట్టుకొని గుమాస్తాతొమ్మిది కాకపూర్వమే సెంట్రల్ స్టేషను వెళ్లిపోయ్యాడు, సామానంతా లగేజీచేయించి టిక్కెట్లుకొని సిద్ధంగా ఉండడానికి. తొమ్మిదింబావుకల్లా తండ్రీకొడుకులు రంగారావుతోకలిసి స్టేషనుకు వచ్చేసరికి అంతా సిద్ధంగా ఉంది. మూడోక్లాసు టిక్కెట్లను నౌకర్లకిచ్చి వాళ్ళను సర్వెంట్సుకంపార్టుమెంటులో ఎక్కించి, ఇంతలో ఫస్టుబెల్ కాగా లక్ష్మి తన టిక్కెట్టునూ, సామాను ప్యాసును జేబులో వేసికొని తన ఫస్టుక్లాసు రిజర్వుడుసీటు మీదికి పోయి చేరాడు. మరి రెండు నిముషాల్లో గార్డు విజిల్ ఇవ్వడంతోటే కొడుకును తండ్రితో, మిత్రుని మిత్రునితో ఎడబాపి లాక్కెళ్లింది దయాదాక్షిణ్యాలు లేనిపాడురయిలూ. కృష్ణచందు రావుజీ లిద్దరూ చిన్నబోయి చూస్తూ గార్డుబండికూడా దాటిపోవడంతోటే వెనక్కి మళ్లారు. కొద్దికాలంవరకైనప్పటికీ ప్రియజన విరహదుఃఖం అసహ్యంగానే ఉంటుంది.

౨

లక్ష్మీచందు ఇంటిదగ్గిరినుంచే నౌకర్ల బాధ లేకుండా చేసుకోడానికి చాలామట్టుకు ప్రయత్నించేశాడు కాని వీలైంది కాదు. ఇక్కడ ఎక్కి అక్కడ దిగడం కూడాకాదు, అహమదాబాదు ప్రయాణం. మరీబలవంతం చేసి వద్దంటే తండ్రి ఏం అనుమానపడిపోతాడో అని అప్పటికి మాత్రం తూష్ణీంభావం వహించి, బొంబాయి అహమదాబాదుల మధ్య వీళ్ళకు సెలవిప్పించడానికి నిశ్చయించుకొన్నాడు. ముందుగానే టెలిగ్రాములు వచ్చి ఉండడంచేత బొంబయిలోని వీరి మేనేజరు, మరికొందరు గుమాస్తాలూ రైలుదగ్గిరికి వచ్చి కలుసుకొన్నారు విక్టోరియా టెర్మినసులో దిగడంతోటే. వీరందరూ రెండు మూడురోజులు బొంబాయిలో ఉండమనికూడా ప్రారంభించారు. కాని తొందరపను లున్నాయని మిషపెట్టి లక్ష్మి వారినుండి తప్పించుకున్నాడు. అక్కడ దిగిననాటి రాత్రే అహమదాబాదు ప్రయాణం. రాత్రికి ౮-౩౦కి గుజరాతు మెయిల్ బయుల్దేరుతుంది. యూనిత్తూ తయ్యారు చేసుకొని అరగంటముందుగానే కొలాబాస్టేషనుకు చేరి టిక్కెట్లు తేవడానికి మేనేజరు సిద్ధమయితే అతన్నివారించి తానే వెళ్లి సూరతువరకూ తన నిమిత్తం ఒకఫస్టుక్లాసు టిక్కెట్టూ, నౌకర్లకు అహమదాబాదువరకూ రెండు మూడోక్లాసు టిక్కెట్లనూ కొని వారివి వారికి ఇచ్చి, బండి తయ్యారుగానే ఉన్నందున వెళ్లి ఎవరి బండ్లలో

వారు కూర్చున్నారు. వెంట తీసుకొనిపోవాలనుకొన్న సామానంతా తనదగ్గిరే పెట్టించుకొన్నాడు లక్ష్మి. సరిగ్గా ౮-౩౧కి రైలు కదిలింది. సూరత్ చేరేసప్పటికి ౧౨-౩౦ కావచ్చింది. కార్యాసక్తులకూ, కామాసక్తులకూ నిద్రవస్తుంది గనుకనా. లక్ష్మి మేలుకొనే ఉన్నాడు. కాని గురకలు పెట్టి నిద్రపోతున్నారు నౌకర్లు, ఏమూలనో దేహాన్ని ఆనించి; వారికి ప్రపంచపుగొడవే లేదు. నిద్రకూడా మహా విచిత్రమైందే! హాయిగా ఇంటిపట్టనపట్టెమంచం,పట్టుపరుపూమీద ఈ శరీరాన్ని జేరేస్తే అటుపొర్లడం, ఇటుదొర్లడం– ఇంతేగాని, కంటికింపైన నిద్ర రానేరాదు ఎంతసేపటికీనీ. ఇక రైల్లోఎక్కామా అంటే నిలుచోడానికి చోటు లేకపోయినా సరే, కళ్లు మూరుకొనే పోతూ ఉంటాయి. సూరతుస్టేషన్ రావడంతోటే లక్ష్మి దిగి పోర్టర్లచేత సామాను బట్టించుకొని వెయిటింగురూంలో చేరాడు. పది నిముషాలుండి బండి కదిలిపోయింది. అప్పటికి కుదుటబడింది ఇతని మనస్సు. మళ్లీ అక్కణ్నుంచి బొంబయికి టిక్కట్టు తీసుకొని మూడుగంటలకు అక్కడికి వచ్చే పెషావరు ఎక్స్ప్రెస్ మీద తెల్లవారి ఎనిమిదిగంటలకు బొంబయి చేరాడు. దినమంతా విదేశయాత్రకు అవసరములైన ప్యాసుపోర్టూ, డాక్టరు సర్టిఫికేట్లూ, టిక్కెట్లూ మొదలైనవాని సమకూర్చుకోడంతోటే సరిపోయింది. సుమారు రెండుమూడు గంటలకు లంగరు ఎత్తివేశారు. అనంతసముద్రంలో లీనమైపోయింది. లక్ష్మి ఎక్కినస్టీమరు-సిటీఆఫ్ పారిస్.

ఇక్కడ మద్రాసులో లక్ష్మి వెళ్లినసంగతులన్నీ అందరికీ తెలియగానే ఉంది. కాని ఎక్కువకష్టమనిపించింది లీలారంగలకు. వీరెక్కడికి వెళ్లినా లక్ష్మి తప్పకుండా వుండేవాడు. ఇప్పుడతను లేనిలోపం బాగా కనబడుతూవుంది. మర్నాడు యథాప్రకారం వ్యవహారలన్నీ సాగిపోయ్యాయి. కాని అవసరమేమీ రానందున లక్ష్మిచందు డబ్బుతీసినపెట్టెను ఆనాడు సాయంకాలంవరకూ ఎవరూ తెరిచారుకారు. సాయంత్రం ఆరుగంటలైనతరువాత రావుజీ ఎక్కడికో వెళ్లిపొయ్యాడు మామూలు ప్రకారం. ఇతడు వెళ్లగానే కృష్ణచందుకేదో అవసరం మీద ద్రవ్యం కావలసివచ్చింది. ఆతడు ఘటనావశంగా ఆపెట్టెనే తెరిచిచూశాడు. లోపలంతా ఖాళీగా వుంది. ఏనాలుగైదునోట్లో ఇవతలా అవతలా చెదరిపడివున్నాయి. ఈయన మనస్సునకేదో చప్పున సందేహం తట్టింది. తక్కినపెట్టెలనూ తెరచిచూశాడు. అవన్నీ సరిగ్గానే ఉన్నాయి. మొదట తెరచిన దాంట్లోనే లేనివి లేక పోగా ఉన్నవి అస్తవ్యస్తంగా పడివున్నాయి. ఆఫీసులోని నౌకర్లందరూ వెళ్లిపొయ్యారు మేనేజరు మాత్రం ఇంకా ఉన్నాడు. ఆయన్ని పిలిపించి లెక్కల పుస్తకాల్ని దీయించి చూస్తే క్రిందటి సాయంకాల ముందులో నలభై వేల ఆరువందలరూపాయల రొక్కం జమ వుంచినలాగు వ్రాయబడి వున్నది. ఖర్చైనలాగు ఎక్కడనూ లేదు. క్షణక్షణమితనిమనసులో ఒకవెర్రి ఆందోళనం వృద్ధికావడం మొదలెట్టింది. మేనేజరును వెళ్లిపొమ్మన్నాడు. ఆఫీసు ఖాళీ అయిపోయింది. ఏమి టీచిత్రమని ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఏలాగూ పాలుపోవడం లేదు. "తాళంచేతులు రావుజీ దగ్గరేకదా ఉంటూ, అతనికి తెలియకుండ ఈపని యేలాగు జరిగి ఉంటుంది? కాని ఈవిషయమై అతనిదగ్గిర ఎత్తేది ఏలాగూ? సర్వస్వమూ అతనికే వప్పచెప్పినప్పుడూ అతనికీలాగు చేయవలసినఅవసరం ఏమిటి? రెండేళ్లనుంచీ చూస్తూన్నాను. ఏకరసంగా ఉంది అతని సద్వర్తనము. నా బలసంతంమీద ఏమైనా దీసుకొనేవాడు. కాని స్వతంత్రించి కానైనా తననిమిత్తం దీసికొని యెరుగడు. అలాటి వానిమీదనా నాకు అపనమ్మకం" అని కొంతసేపూ, "ఏమిటో మానవస్వభావం గదా. ద్రవ్యంతో గూడిన పని. ఏదో అవసరం కలిగి ఇవ్వాళ చూశానుకాని ఇదివరకెన్నిమారులైందో ఈలాగు"అని మరికొంతసేపూ, కొత్తవాడేయని లేశమైన విచారించకుండాసర్వస్వాతంత్ర్యమిచ్చాను.అట్టినన్నీలాగువెర్రివాణ్ని చేస్తాడారంగారావు" అని కొంతసేపూ, "ఛీ! నేడు నామతి కేమి వచ్చింది! నా ఆత్మమీద నాకు అపనమ్మకం కలిగినయెడల రావుజీ మీద అపనమ్మకం కలగాలి" అని కొంతసేపూ–ఏమేమో యోచిస్తూ కూర్చున్నాడు. ఇంతలో దీపాలు పెట్టిన తర్వాత రంగారావు వచ్చి ఆఫీసులో ఒంటరిగా కృష్ణచందు కూచొని ఉండడం చూచి తిన్నగా ఆయనదగ్గిరకే వెళ్లాడు. అతన్ని చూడడంతోటే-

"రావుజీ; ఖజానా తాళంచేతులు ఉన్నాయా?"

"ఆ! నావద్దిరే ఉన్నాయి."

"ఏవీ? ఈలా ఇయ్యి." అని తీసుకొని, "రావుజీ! ఈపెట్టెలో ద్రవ్యం ఎంత ఉండాలిసిందీ తెలియునా?"

"ఏ పెట్టెలో?"

"ఇదే! నాలుగో నెంబరుది. మనం కొత్తగా దెప్పించుకొన్నది."

"అందులో నలభై వేలకంటే ఎక్కువ వుండాలనీ నా జ్ఞాపకం. అసలు మొత్తం లెక్కలు చూస్తే తెలుస్తుంది."

"ఇలాగు చూడు - ఈపెట్టెనీ!"

"ఏం" అని దగ్గిరికెళ్లి చూసేసరికి పెట్టంతా ఖాలీ. నోట్లప్యాకెట్లు లేవు. నిన్న సాయంకాలం నాలుగుగంటలవేళ లక్ష్మికి ఇవ్వడానికి వెయ్యిరూపాయల నోట్లు తీసికొని తక్కినవాటి నన్నింటినీ అదేచోట తానే పెట్టాడు. ఇప్పుడంతా శూన్యం. గుండె గుభేలుమంది. తన మేనేజిమెంటు సమయంలో జరిగిందని మొగం వివర్ణమైపోయింది. నిర్ఘాంతపోయి నిలుచున్నాడు.

"ఏమైందా పైకమంతా మరీ?"

"నాకేమీ పాలుపోకుండా ఉంది."

"తాళంచేతులు మీదగ్గరే కదా ఉంటాయి?"

"అవును. ద్రవ్యమేలాగున మాయమైందో నాకేమీ గోచరం కావడం లేదు."

"మీకు తెలియకుండా ఏలా పోయివుంటుంది."

"నేనేమని చెప్పేదీ?"

"ఎందా రెండుపందలా కావూ. నలభై వేలూ గుండం వేసుకొని పోవడమే ఒక్కపాళంగా?"

ఇది విని రావుజీనోటినుంచి మాట రాలేదు. దిగ్భ్రమ చెందినవానివలె నిలుచున్నాడు; అప్పుడు కృష్ణచందు మరల చింతతో గూడిన మొగంతో, "ఈ విషయములో నాకు గలుగుచున్న ఆందోళనము ఇంతింతని చెప్పలేను. లక్ష్మికంటే మీమీద నా కెక్కువవిశ్వాసం. నాసర్వస్వం మీఆధీనం చేశాను. నాశక్తికిమించిన ఉపకారం మీకు చేయాలని ఉండగా ఈఆఘాతం తగిలింది. కొన్నిసంవత్సరాలైనా నాకేమీ తెలిసే ఉండదు. కాని ఒక్కపర్యాయం నలభై వేలరూపాయలు కన్పించకపోవడమూ,—ఎల్లప్పుడూ తాళంచేతులను దగ్గిర ఉంచుకొనే మీ కాసమాచారం తెలియకపోవడమూ. పరమేశ్వరునకే తెలియాలి ఈ రహస్యం" అన్నాడు. ఈ మాటలు రంగారావు హృదయంలో శూలాల్లాగు గుచ్చుకొన్నాయి. సంభావితుడైన పురుషునికి అపనింద మరణంకంటే మించింది. ఇతనికి జవాబు చెప్పడానికే నోరాడలేదు. చెప్పేదేమిటి? పుణ్యం పాపం లేశమాత్రమైనా తెలిస్తేనే గదా. మరి రెండునిముసాలూరకుండి కృష్ణచందు కొంచెం గాంభీర్యం వహించిన మొగంతో, "ఇప్పుడీవిషయాన్ని బయలుపెట్టిన యెడల యేలాగు పరిణమించేదీ మనకు తెలుసును. కాని ఇంకో నలభై వేలు పోయినప్పటికీ నేనేలాటిపని చేయను. మీరు నాకు పరమాప్తులు. మీ మీద నా కెంతమాత్రం అవిశ్వాసం కలగడం లేదు. కాని నామనస్సున కేదో కళవళం కలుగుతున్నది. నిజం నిల్కడమీద తెలియకపోదు. కొన్నాళ్లలో ఈ సంగతి తప్పక బయలుపడుతుంది. అంతవరకూ మన వ్యవహారాలు నేనే చూస్తూఉంటాను. మీకు చేతిఖర్చు నిమిత్తం ఈరొక్కాన్ని తీసుకోండి" అని కొంతపైకమివ్వబోవ రావుజీ "అక్కర్లేదు. ఇప్పుడు నాదగ్గర ద్రవ్యమున్నది. కావలసినపుడు అడిగి తీసుకొంటాను." అన్నాడు. ఇంతలో భువనుడే తెంచి, "నాన్నా! పండితుగారు పూజను ముగించి హారతి యివ్వడానికి నీకోసం చాలా సేపట్నుంచి కనిపెట్టుగుని ఉన్నా"రని చెప్పగా. రావుజీనికూడా రెమ్మని చెప్పుతూ మేడమీదికి వెళ్లాడు కృష్ణచందు. ఒక అరగంట అయినతర్వాత మరోనౌకరు వచ్చినాడు రంగారావును భోజనానికి పిలవడానికి. కాని ఎక్కడున్నాడు రావుజీ. ఆఫీసులో లేడు. మేడమీద లేడు. అతని గదిలో లేడు. ఇంటివెలుపలా లేడూ, లోపలా లేడు. రావుజీ కానరాక, అతనిజాడ అయినా తెలియక, రెండురోజులు గడచిపోయాయి. అతడు మామూలుగా వెళ్లుతూఉండే పట్నంలోని స్నేహితుల ఇండ్లలోగాక చుట్టుప్రక్కల ఏయే ప్రదేశాలకు వెళ్లడం అతని కలవాటో అక్కడంతా వెతికారు.



ఆఖిన జోరే సదా చిత్తచోరే తిహీ మనికంచనఖంభ హిడోరే,
కుంజకే మధి బిరాజే పియా పియదామనీ ముఖపరే దుహూ భోరే,
నాగరినారి అనేక ఝులావత రాగ బిలాస రితే మనుభోరే,
యాబిధ రాగ హిడోల కహావత జా నిబసే అభిలాఖన థోరే.

[జయపుర చిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని ]

కృష్ణచందుపంపిన నౌకర్లు. కొంచెమైనా ఆచూకీ తెలిసిందికాదు. పద్మకీవార్త తెలియగానే దిగ్భ్రమ కలిగింది. నివ్వెరబోయి ఒకటిరెండు క్షణాలుండి తుదకు దీర్ఘనిశ్వాసం వదలి కూతును దలచుకొని కళ్లనీళ్లు పెట్టుకున్నది. ఇక లీలకిది వజ్రప్రహారమే. ఈమెకు దృఢమైనవిశ్వాసం రావుజీ ఈలాటిపనిని ప్రాణంమీదికి వచ్చినప్పటికీ చేయడనీ. కాని ఎవరిమీద వేస్తుందీ చప్పున ఆదోషాన్ని. లోలోపలే కృశించడం మొదలెట్టింది. సజ్జనులైన రంగారావు స్నేహితులందరూ అతడిప్రకారం అకస్మాత్తుగా కనపడకపోవడానికి చాలాదుఃఖించారు. కృష్ణచందు మనస్తిమితం జొత్తిగా పోయింది. కలకల్లాడుతూ నవ్వుతూఉండే ముఖం దైన్యాక్రాంతమైంది. ఏదో ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటాడు. "ముష్టి రూపాయలు, ఎన్ని ఖర్చు అవుతాయో ఈలాటివీ. ఇందుకలన నాకొచ్చిన తక్కువేమిటీ? లేనిపోని రాద్ధాంతం జేసి నాప్రాణంలాంటివాణ్ని పోగొట్టుకొన్నాను" అని చింతిస్తాడు కొంతసేపు. "ఆరోజున ఆ లాగున అతని ప్రశ్నించుట అనుచిత"మని తలుస్తాడు కొంతసేపు "ఒక్కపాళంగా నలభైవేలరొక్కం గన్పడకపోతే రవంత మందలించడమూ దోషమేనా" అని మళ్లీ. "తెలిసినవిషయాన్ని మనసులో రహస్యంగా బెట్టుకొని నిమ్మళంగా నిజమూ కల్లా తెలిసికొంటే బాగుండేది" అని మరికొంతసేపూ. "అయ్యో, రావుజీవంటి సద్గుణుడు—ఎంత వినయం! ఎంత ఓర్పు! ఈలాటి నీచకార్యమా? నేనే తొందరపడి అతని కోమలహృదయాన్ని నొప్పించాను." ఈలాటి తలపులు అనంతంగా వస్తున్నాయి. మతి అతిచంచలమై యెంతస్థిరపరచుకోవా లనుకొన్నా సాధ్యం కావడం లేదు. లక్ష్మి వెళ్లి నాలుగురోజులూ, రావుజీ కనడక మూడురోజులూ అయింది. షుమారు అయిదుగంటలు కావచ్చు. కృష్ణచందు తనగదిలో కూచొని మీద వచించినలాగు ఆలోచనాపరంపరలలో మునిగి ఉన్నాడు. ఆసమయంలో జవా నిచ్చి పోయ్యాడని రెండు టెలిగ్రాములను తండ్రి కిచ్చి వెళ్లాడు భువనం, మేనేజరు దస్కతు చేసి పుచ్చుకున్నాడవీ. అందులో ఒకదాన్ని విచ్చి చూస్తే—



"Ahmadabad:
Laxmichand missing. Servants arrived. Enquire.
Shrichand".

["అహమదాబాదు:లక్ష్మి రాలేదు. నౌకర్లు చేరారు. విచారించవలెను —శ్రీచందు."] అని వ్రాసివుంది. ఇది ఏమిటో ఇతనికి గోచరంకాలేదు. సంభ్రమమూ,ఆశ్చర్యం, విషాదమూ కలసిన మనసుతో రెండోదాన్ని విప్పాడు. అందులో—

"Bombay:
Started for Europe. More information from Aden. Wait.
Laxmichand."

["బొంబయి: యూరోపు కెళ్లుతున్నాను. ఏడెన్నుంచి వివరంగా రాస్తాను.—లక్ష్మిచందు."]

ఈ టెలిగ్రాము చదువుకోగానే అంధకారమంతా విరిసిపోయింది. సంగతులన్నీ చాలవరకు అవగతమైనాయి. ఆశ్చర్యసంభ్రమాలు మాయమై విషాదమొక్కటే నిలిచింది. దానికి పశ్చాత్తాపం తోడయింది. ఏడెన్నుంచి ఎప్పుడు ఉత్తరం వస్తుందాఅని కనుపెట్టుకొని దినాలను లెక్కిస్తున్నాడు. ఆరు రోజులు కడచిపోయిన తర్వాత ఆ కలవరిస్తూఉన్న జాబుకూడా చేతి కందింది. దానిని విప్పి,

"పితాజీ,

మీ విషయమై నేను మహా అపరాధం చేశాను. మీదు మిక్కిలి రావుజీ యెడలా-కాని పుత్రవాత్సల్యంతో మీరు, మిత్రవాత్సల్యంతో వారు క్షమిస్తారనే ధైర్యం న న్నీ కా ర్యా న్ని చే యిం చిం ది. నేను అహమదాబాదు పోతానని చెప్పినదంతా అబద్ధమే. ఆ నాప్రయాణసన్నాహాలన్నీ ఈలా రావడానికే. నేను అహమదాబాదుకని బయల్దేరిన నాటి సాయంకాలం అయిదుగంటలవేళ, రావుజీ ఎక్కడకో పోయివుండగా, మీరు మేడమీద కేదో పనినిమిత్తం వెళ్లి ఉన్నసమయాన్ని మీ తలగడక్రింది డూప్లికేటు తాళంచెవులను దీసికొని నాలుగోనెంబరు కొత్త ఇనుపపెట్టెను తెరిచి అందులో నుంచి నలభైవేలరూపాయలనూ నా ప్రయాణపు ఖర్చుల

నిమిత్తం తీసుకొన్నాను. క్రిందటిమాటు మీరు నా ప్రయాణానికి ఒప్పారుకారనీ ఈలా మీతోగాని, రావుజీతో గాని చెప్పకుండా........."

ఉత్తరం పూర్తిగా చదువుకోడానికి శక్యం కాలేదు. లోపలనుంచి దుఃఖం పొంగివస్తూ అణచుకొన్నా అణగడంలేదు. రావుజీ, అతని సద్గుణాలూ ప్రత్యక్షరూపాలతో అతన్ని ఆక్రమించాయి. లజ్జాభరంచేత శిరం ముందున్న బల్లమీదికి వంగింది. కళ్లు మూసుకొన్నాడు. మూసుకొన్నప్పటికీ మరింత స్ఫుటంగా కనబడుతూనే ఉంది, ఆనాడు తనకట్టెదుట నిలుచున్న రంగారావు యొక్క దీనమయ్యూ విశుద్ధాంతరంగమును వెలిబగచు ముఖం. రెండు చేతులనూ బల్లమీద చాచుకొని వంచిన మొగం ఎత్తకుండా మహావిచారంతో ఉన్నాడు కృష్ణచందు. సరిగ్గా అదే సమయంలో లీల ప్రవేశించి తండ్రి స్థితిని జూచి కొంచెం భయపడింది. దగ్గిరకు వచ్చి చేతుల మధ్య ఉత్తరం పడివుండడం చూచి, "ఏం! నాన్నా! ఆలా ఉన్నావూ! అన్నయ్యదగ్గిర్నుంచి వుత్తరం వచ్చిందా ఏమిటీ?" అని అడిగింది. దానికి నోటితో జవాబు నియ్యజాలక ఆజాబును చేతి కందిచ్చినాడు తండ్రి. ఈవుత్తరం చూచి చదువుతూవుండగానే కళ్ళవెంట గిర్రున తిరగడం మొదలెట్టాయి నీళ్లు లీలకు. పాలరాయి ప్రతిమలాగు నిలిచిపోయింది తండ్రియెదుట. పైకికనబడే తళుకు బెళుకులనూ, రంగుడంగులనూ చూసి ఏవిషయాన్ని గురించి అయినా ఇదమిత్థమని నిర్ధారణం చేసికోడానికి వీల్లేదు. లక్షలకొలది ఆదాయం గల శ్రీమంతులందరూ సౌఖ్యమే సౌఖ్యమనుభవిస్తూ ఉంటారనీ, ఇల్లువాకిలైనా లేనిదరిద్రులందరూ దుఃఖమే అనుభవిస్తూ ఉంటారనీ అనుకోవడం చాలాపొరపాటు. దీనికి తిన్నగా వ్యతిరేకాభిప్రాయంగూడా సరియైనది కాదు కాబట్టి సుఖదుఃఖాలు రెండూ ఈ రెండు తరగతుల వారిలోనూ ఉంటూ ఉంటాయి, కాలాన్నీ, స్థితిగతులనూ అనుసరించీ. ఈ నియమానికి ప్రస్తుతం కృష్ణచందుగారి కుటుంబం తార్కాణమైంది. కోట్లకొలది ద్రవ్యం, కోటల్లాటి మేడలూ, చుట్టపక్కాలూ, మిత్రులూ, నౌకర్లూ చాకర్లూ వందలకొలది ఉన్నప్పటికీ వీటిలో ఏవీగాని వీరిని సౌఖ్యవంతులుగా చేయడానికి సమర్థమైనవి కాలేదు. ఇందుకు మూలకారణం లీలావతీ దుఃఖం. రంగారావు అంతూపొంతూ లేకుండా వెళ్లి రెండు సంవత్సరాలు దాటిపోయ్యాయి. హులియా* లిచ్చి అతన్ని కనుగొన్నవాళ్లకి పదివేలరూపాయలు బహుమాన మియ్యబడునని మొదలు ప్రకటనచేయించి క్రమంగా ఆమొత్తాన్ని ఇరువై అయిదువేలకు పెంచారు. కాని ఈ బహుమానాన్ని తీసుకొనే సౌభాగ్యం ఇప్పటివరకూ ఏ దరిద్రుడికీ లభించలేదు.

లక్ష్మీచందు విదేశభ్రమణం విసుగెత్తేలాగు చేసి ఇంటికి చేరాడు. ఇతడు కేవలం తిరగడానికే ద్రవ్యాన్ని పాడుచేయలేదు. యూరోపునంతా దిరిగి అమెరికాచేరి యచటి వాషింగ్టన్ విశ్వవిద్యాలయంలో విజ్ఞాన మభ్యసించి M. Sc. డిగ్రీనితీసుకొన్నాడు. పరదేశంలో ఉన్నంతకాలం ఇతనికి ఇంటిసంగతులు తెలియబరచకుండా ఉండడమే కాకుండా వాషింగ్టన్‌లో ఉన్న కాలమున ఖర్చుకనిరాస్తే మరికొన్ని వేలు రవాణాచేశాడు కృష్ణచందు కొడుక్కి. దేశభ్రమణమూ, విద్యాభ్యాసమూ పూర్తిచేసుకొని స్వదేశానికి వచ్చి ఇంట్లో కాలుపెట్టేవరకూ ఇతనికి తెలియదు, తన అవిచారపూర్వకమైన కార్యంవల్ల తనకుటుంబానికి ఏలాటిదశ వచ్చిందీ తనచెల్లెలు ఏలాగు శల్యమైపోయిందీనీ మూర్తీభవించిన దైన్యంలాగు. అన్న వచ్చినాడనే సంతోషము ఇంచుకంత ముఖాన్ని తొలకరింపగా మెల్లగా తన దగ్గిరకు వచ్చి చెయ్యి పట్టుకొనబోయ్యేసరికి "ఎవరీపిల్లా! ఇంతచనువుగా నాదగ్గిరికి వచ్చిం"దని సిగ్గుతో వెనక్కు తగ్గబోయి, తేరిపార చూచి లీలని గుర్తించి తెల్లబోయి, "ఇదేం తల్లీ! ఈలా గయ్యా"వని చేరదీసి, కన్నీళ్లు పెట్టుకొన్నాడు లక్ష్మీ, అమెరికానుంచి ఇల్లుచేరిన మొదటినాడు. క్రమక్రమంగా ఇతనికి యావత్తుసంగతులూ విశదమయ్యాయి* కాని ఇప్పుడెంత దుఃఖిస్తే ఏం ప్రయోజనం గలిగించిపోయిందానికీ? తన్ను జూస్తే తనకే సిగ్గూ, వెగటూ జనిం

* హులియా = ఆనవాళ్లు.

* తా నెన్నిసార్లు ఎన్నివుత్తరాలు రాసినప్పటికీ రంగారావు స్వయంగా జవాబియ్యకపోవడం ఆలా ఉండగా, తండ్రికూడా ఆవిషయమై వ్రాయనందుకు గల కారణాలన్నీ విస్పష్టమయ్యాయి.

చాయి. పశ్చాత్తాపం లోపల అగ్నిలాగు దహించడం మొదలెట్టింది. చెల్లెలి శరీరావస్థ చూసి ఇతనికి మతే పోయింది. దీని కంతా కూడా నే కారకుడను గదా అనుశోకావేశం చేత ఒకనాడు "చెల్లెలిసౌఖ్యాన్ని నాశనంచేసిన నా కెందుకూ సౌఖ్య"మని తానుగూడ వివాహమాడనని ప్రతిన చేశాడు లక్ష్మి. ఈ వార్త తలిదండ్రులకు దావానల మైంది. ఇదివరకు కూతురు కోసమే ఏడుస్తూ ఉంటే ఇప్పుడు కొడుకుకూడా తయ్యారయ్యాడు. లీలకో కొత్త చింతపట్టుకొన్నది అన్న విషయమై. ఈలాగున ఈయింటి వారికి దుఃఖం పెరుగుతూనే వచ్చింది. కాని తగ్గలేదు.

స్నేహితురాళ్లు వచ్చి లీలను బలవంతంగా మాట్లాడించాలని ఎంత ప్రయత్నంచేసినా దిగాలబడి వాళ్లని చూస్తూ కూర్చునేది కాని జవాబే ఇచ్చేది కాదు. తమ ప్రియసఖియొక్క మృదుహస్తస్పర్శ విరహంచేత ముఖాలు మలినమై పోయ్యాయా అనేలాగు ఆమె చదువుకొనే పుస్తకాలన్నీ దుమ్ముధూళితో కూడి ఎక్కడివక్కడ పడివున్నాయి. మనస్సు అనేది ఉండాలి ఏపనైనా చెయ్యాలంటే. అది ఇప్పుడీమె దగ్గర లేదు. ఉన్నా ఈమెస్వాధీనంలో లేదు. ఈలాటి స్థితిలో తలిదండ్రులు మొదలైనవారు ఈమెమీద దోషారోపణ చేస్తే ఏం ప్రయోజనమూ—ఆపని చేయదనీ. ఈపని చేయదనీ, తుదకు ఆహారవిహారాలు గూడా మానివేస్తున్నదనీనీ? ఇంట్లో వాళ్లకే మొగం చూపడానికి సిగ్గూ. వెలపలికెక్కడికీ వెళ్లదంటే? మనోహరమైన కలకంఠస్వనాల్ని గూడా కిందుచేసే లీలా కంఠస్వర తరంగాలతో గూడి ఆదోవను రాకపోకలు చేసే మార్గస్థుల హృదయప్రదేశములమీద ఆనంద తుషార వర్షం గురిపించి వారి మనసులను జల్లచేసే శ్రీవిలాసభవన ప్రాంతమండలి వాతావరణము ఇప్పుడు కేవలం శోకరసవర్షాన్నే కురిపిస్తూ ఉంది. "లీల పుట్టిందే రంగడికోరకే! అందుచేతనే ఆనాడు సముద్రంలో బడీ అతనికి దక్కింది: ఇక ఇప్పుడు రంగడు లేక లీలవుండడం ఏలాగూ?" అని చెలికత్తెలు పరస్పర మనుకొంటూ వాపోయ్యేవాళ్లు. "అయ్యో! ఈ రత్నం దక్కదూ తలిదండ్రులకూ?" అని ఇంటికి చూడబోయిన ఇరుగుపొరుగువారు దుఃఖించేవారు. మద్రాసులో వీరిస్థితి ఈలా ఉంది. ఎప్పటికబుర్లు అప్పుడే అహమదాబాదు హైదరాబాదుల్లో ఉన్నవాళ్లకు తెలుస్తూనే వచ్చాయి. ఒకనాడు శ్రీచందుదగ్గిరనుంచి వుత్తరం వచ్చింది. అందులో మనమరాలిని అహమదాబాదుకు తీసికొనిరమ్మనీ, వాయుపరివర్తనంచేత ఆమెకు శరీరారోగ్యం కలగవచ్చుననీ వ్రాశాడు. ఇక్కడి డాక్టర్లుకూడా కొందరూ, కృష్ణచందునిమిత్రులూ కొత్తకొత్త ప్రదేశాలను జూపించడం మంచిదన్నారు. ఈ యన్ని హేతువులచేతా ఇక్కడి సమస్తమూ మేనేజరుపరం జేసి సపరివారంగా, మధ్య దారిలో విశేషాలేమీ లేకుండా, అహమదాబాదు చేరాడు కృష్ణచందు. అక్కడా పదిపన్నెండు రోజులు గడచి పొయ్యాయి. కాని లీలస్థితిలో మార్పేమీ కలగలేదు. లోపల బుట్టిన రోగానికి లోపలికే మందెయ్యాలి గాని బాహ్యోపచారాలు ఎన్ని చేస్తే ఏం ప్రయోజనం?

అహమదాబాదులో శ్రీచందునకూ మహాత్మునకూ చిరపరిచయం. సాబరమతీ గాంధి ఆశ్రమానికి శాశ్వతఫండునిమిత్తం ఇతడూ లక్షో, రెండులక్షలో ఇచ్చాడంటారు. అదిగాక సంవత్సరాంతాన్ని జరిగే నూలు పోటీపందెములలో మొదలుగా గెలిచే వాళ్లకు బహుమతులుకూడా ఇస్తు ఉంటాడు. మహాత్ముడు ఆశ్రమంలో ఉండేరోజుల్లో ఈయనకు అక్కడికి వెళ్లి కొంతసేపు సంభాషిస్తూ ఉండడం వాడుక. మామూలు ప్రకారం ఒకనాడీయన ఆశ్రమంలోకి వెళ్లి మాటలసందర్భంలో తన మనమరాలిని గురించీ, ఆమె వ్యాధినిగురించీ మహాత్మునకు వినిపించి, ప్రస్తుతం వారందరూ తనవద్దనే ఉన్నారని చెప్పాడు. దానిని విని కావలసిన యెడల ఆమెను ఆశ్రమంలో ఉంచుకోవచ్చుననీ, అందులకు తన అభ్యంతరమేమీ లేదనీ, ఆలాగు వుంచినచో పట్టణములోనికంటే అక్కడి వాయువు శుభ్రమైన దగుటవలన అక్కడ ఎక్కువలాభం కలగవచ్చుననీ, చెప్పాడు మహాత్ముడు. ఈ సలహా అందరికీ నచ్చింది. మర్నాడే లీలనూ, ఆమెకు తోడుగా ఉండడానికి తల్లినీ, లక్ష్మీచందునూ ఆశ్రమంలో ఒక కుటీరంలో ప్రవేశపెట్టాడు శ్రీచందు. తక్కినవాళ్ళందరూ ప్రతిరోజూ మోటర్ల మీద వెళ్లి చూస్తూ ఉండే వాళ్లు.

సద్మా మొదలగువారు దిగిన కుటీరానికి రెండు ఫర్లాంగుల దూరంలో ఆశ్రమంయొక్క ముఖద్వారానికి వెళ్లేరోడ్డు ప్రక్కనే ఆకాలంలో యంగ్ ఇండియాను నడుపుతూ ఉన్న బ్రహ్మచారిగారికుటీర మున్నది. మహాత్ముని కెల్లప్పుడూ దేశాటనం వ్యాఖ్యానల తోటే సరి పోతుంది. కాని ఎప్పుడూ స్థిమితంగా ఆశ్రమంలోనే ఉండి పేపరును నడిపించేది ఈ బ్రహ్మచారిగారే. వీరి అసలు పేరు ఏమిటో తెలియదు. ప్రసిద్ధ మైపోవడంవల్ల అందరూ బ్రహ్మచారీజీ అనే పిలుస్తుంటారు. వీరి పుట్టు పూర్వోత్తరాలూ అజ్ఞాతాలే. మహాత్మ డొకపర్యాయం పటణానుంచి బనారసు వెళ్ళుతూ ఉండగా మధ్య మొగల్ సరాయి జంక్షనుదగ్గర వీరిద్దరికీ సమావేశమైంది. పదిపదిహేనునిమిషలు వీళ్లిద్దరికీ సంభాషణలైనాయి. ఈ స్వల్పసమయంలోనే కనిపెట్టాడు గుణగ్రహణపారీణుడైన మహాత్ముడు ఇతడెంతో మంచి కుశాగ్రబుద్ధి అనీ. అదిగాక ఆరోజుల్లో ఈలాటి చురుకైన యువకుడు దొరికినట్లయితే ఆశ్రమానికి తీసికెళ్ళి పేపరును అతని పరం చెయ్యాలనే ఉద్దేశంతో ఉన్నందువలన మరికొంతసే పాయువకునితో మాట్లాడి ఒప్పించుకొని, స్వస్థానంలోకి తీసుకొనివెళ్ళి క్రమంగా పేపరును అతని పరంచేసి నిశ్చింతు డయ్యాడు మహాత్మా. దినాలు కడిచిన కొలదీ, ఇతని తెలివీ యోగ్యతా విశదమాతున్న కొలదీ, ఇతని సౌజన్యశీలాదులు ప్రకటము లవుతున్న కొలదీ మహాత్మునకు ఇతనిమీద పుత్రానురాగం మించిన ప్రేమ వర్ధిల్లుతూ వచ్చింది. సంస్కారం లేకపోవడం వల్ల గావచ్చును, ఆ యువకుని వెండ్రుకలు జడలు గట్టిపోయ్యాయి. చిన్న చిన్న మీసాలూ, గడ్డమూనూ. శరీర మెందుచేతనో కృశించిపోతూ ఉన్నలాగుంది. కాని శరీరలావణ్యం పోలేదు. మదన దహనానంతరం పార్వతి తపస్సుచేస్తూ ఉండగా ఆ దేవి మనఃస్థైర్యాన్ని పరీక్షించడానికి పరిహాసాలాడ వచ్చిన ఈశ్వరుని మాయవేషమైన కపటబ్రహ్మచారి స్మరణకు వస్తున్నాడు ఈయన్నిచూస్తే.

లక్ష్మీనందు మున్నగు వారు అక్కడ ప్రవేశించి కేవలం రెండురోజులైంది. ఆనాడు తెల్లవారి ఆరుగంటలకే వీరి టాక్సీ అహమదాబాదు పోవడానికి బయల్దేరింది ఆశ్రమాన్నుంచి. టాక్సీలో శ్రీచందూ, లక్ష్మీ ఇద్దరూ కూర్చున్నారు, నడపడానికి డ్రైవరు ముందూనూ. చలి మిక్కుటంగా ఉన్నందున శాలువను నెత్తిమీద నుంచి వచ్చేలాగున కప్పుకొని ఉన్నాడు లక్ష్మీ. అందువల్ల బయటివాళ్ల కితనిముఖం బాగా కనపడడంలేదు. ఇతెరులను మట్టుకూ జూడడానికి ఇతనికి మంచి అవకాశముండె. బ్రహ్మచారిగారి కుటీరంముందుగా వెళ్ళింది టాక్సీ. ఆసమయంలో ఎడిటరుగారు వరాండాలో పచారుచేస్తూ మోటరు దగ్గిరకు రా దాన్ని చూడడం మొదలెట్టారు. శాలువ కప్పుకొని కూర్చున్న లక్ష్మీనందు కన్నులు అప్రయత్నంగా వరాండాలోని బ్రహ్మచారిమీద పడ్డాయి. వళ్లు ఝల్లుమంది. అమితమైన ఆశ్చర్యంతో వెనుకకు దిరిగి చూస్తున్నాడావ్యక్తిని. మోటారు రివ్ రివ్‌న ముందుకు పరుగెత్తి పోతుంది మనస్సులో ఆందోళనం మెండైంది. ముఖం కొంచెం గంభీరభావం వహించింది. ఇతని ముఖవైఖరిని చూసి విస్మితుడై ఏమిటని అడిగాడు శ్రీచందు. ఆలోచనా పరవశుడయ్యే ఏమీ లేదన్నాడు. శరీరాన్ని మాత్రం లాక్కొని పోతున్నది మోట రతివేగంతో. కాని మనసు ఆ వరాండలోని వ్యక్తిని వదల్లేదు. పావుగంటలో మోటరు కీరింటిముందు నిలిచింది. శ్రీచందు బండిలోనుంచి దిగుతూ మనమిన్నీ కూడా దిగమంటే మళ్ళీ అప్పుడే వెళ్లతానన్నాడు ఇతను ఆశ్రమానికి. ఇంతలో వీరి సంభాషణం విన్నవారె వరో లోపలనుంచి వచ్చి కొంచెం కాఫీ పుచ్చుగుని వెళ్లమంటూవుంటే ఆమాటే వినిపించుకో లేదు—లక్ష్మీ వెన్నుచరుస్తూ తొందర పెట్టగా ఫుల్ స్పీడు వదిలాడు డ్రైవరు ఫైర్ ఇంజన్ మోటారులాగు టాక్సీని. పోవడానికి పదిహేను నిముషాలు పట్టితే ఇప్పుడు రావడానికి పది నిముషాలే పట్టింది.

కానిమళ్లీ వచ్చేసరికి బ్రహ్మచారి కుటీరంతలుపు తాళంవేసిఉంది. చుట్టుప్రక్క ఉన్నవాళ్లను అతని గురించి అడిగి ఎక్కడికి వెళ్లాడని ప్రశ్నింపగా వాళ్లు తమకు దెలిసినమటుకు లక్ష్మీకి చెప్పి అప్పుడాయన 'యంగ్ ఇండియా' ఆఫీసుకు వెళ్లివుండవచ్చు నన్నారు. అంతట టాక్సీని తమ కుటీరానికి తీసికెళ్ల మని డ్రైవరును ఆజ్ఞాపించి

తాను నడిచే వెళ్లాడు ఆఫీసుకి. రహస్యంగా వెళ్లి తనకు గలిగిన అనుమానం తీర్చుకోవలెనని ఇతని అభిప్రాయం. అందుచేత శాలువను పూర్వంలాగే కప్పుకొని ఆఫీసును సమీపించి, ముఖద్వారంగుండా లోపల ప్రవేశింపక తూర్పుప్రక్క గోడలోని కిటికీలదగ్గరగా వరాండాలోనుంచి ముందుకు వెళ్లుతూ; తన అభిలషిత వ్యక్తి కనబడగానే ఆగి లోపలఉన్న బీర్వానొకదాన్ని అడ్డం చేసికొని అతన్ని పరకాయించి చూడడం మొదలెట్టాడు. లోపలిపురుషుని ముఖం చూసింది మొదలుకొని లక్ష్మి చందుని ఆవరించి అతనికి తత్తరపాటు కలుగజేసింది ఆనందమో, విస్మయమో, ఆవేగమో, సంభ్రమమో, మతిభ్రమమో తెలియదు. క్షణమాత్రం తన్ను తానే ఎరుగడు. ఉత్తేజ మెక్కువై లోపలికి పరుగెత్తబోయి కష్టంమీద ఆలాలసను అణచుకొన్నాడు. దుఃఖాతిరేకంచేత శరీరం కంపిస్తూ ఉంది, పెదవు లదురుతున్నాయి. "ఆహా నే డింతటిసుదినమూ? నే నెంతధన్యుణ్ణి? నామూలమున కలిగిన అనర్థాన్ని బాపుకోడానికి నాకే అవకాశం గలుగచేశాడు భగవంతుడు." అని మనసులో తలచుకొంటూ ఇక నక్కడ ఒక్కక్షణమైన నిలువక కుటీరానికి బరుగెత్తాడు వాయువేగమనోవేగాలతో లక్ష్మి...

ఇక విస్తరించి రాయవలసిన అవసరం లేదు. 'యంగ్ ఇండియా'ను నడుపుతూఉన్న జటాధారి యువకబ్రహ్మచారి మన రంగారావే. ఈవార్త కొన్ని నిముషాల్లోనే ఆశ్రమమంతా తెలిసిపోయింది. నగరంలో శ్రీచందుగారి యింట ఈ సమాచారం తెలియగానే ముహూర్త మాత్రంలో అందరూ ఆశ్రమం చేరారు. నేత్రసాఫల్యం గావలసిన ఆనాటి లీలావదనాన్ని చూసి తీరాలి. రెండేళ్ల రోగం క్షణమాత్రంలో వదిలింది. మహాత్మునికి గలిగిన ఆనందానికి పరిమితే లేదు. వారి సమక్షమందు ఆ యాశ్రమంలోనే కొన్నాళ్లకు లీలారంగ పరిణయం సంపన్నమైంది. అప్పటినుంచే మహాత్మునకు మన ఆంధ్రదేశమంటే ఎక్కువ అభిమానం, ప్రేమానూ.

లక్ష్మిచందు మూలాన్ని విడిపోయి రావుజీ లక్ష్మి కారణాన్నే దొరికాడని అందరూ సంతోషించారు. రావుజీని కనుగొన్నందులకు దొరికిన బహుమానం ఇరువది అయిదువేల రూపాయలనూ ఆశ్రమానికే ఇచ్చివేశాడు లక్ష్మి.

---

# మందమారుతము-ఝంఝామారుతము

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు

౧

లీన సహస్రామృత కరాబ్జతతినిఁ జూచి
ప్రకృతిమాత స్వకీయ పుత్త్రికులఁ బ్రీతి
యొలుకఁ గౌఁగిటికిఁ జేర్చుచున్న దేమొ?

స్వర్గమును బొందినందనవనమునందు
సమద యువతుల కేళీ విహారములకు
మరగి తత్కథల్ వర్ణించు సరసకవుల
యమల రసవత్ప్రబంధ పద్యంబు లేమొ?

వలపుఁగొని యున్న నూత్నదంపతులభావ
బంధురమగు రహస్యంపు భాష లేమొ?

దట్టముగ మింట వ్యాపించి మొట్టమొదట
ఖండ ఖండంబులై క్రమక్రమము గాను
గరగి కరగి యణుత్వంబుఁ గని యగోచ
రంబు లయి పోయిన వలాహకంబు లేమొ?

పటు తిరస్కరిణీ ప్రభావమున డాఁగి
పైఁట చెఱఁగుల దాఁకు స్వర్వనిత లేమొ?

కానిచో నింత హాయియుం గాని యింత
కమ్మఁదన, మింత మెత్తఁదనమ్ము, నింత
చల్లఁదన, మింత మోహాతిశయము గాని
మానవుల కిచ్చునే మందమారుతములు?
ఎవఁడు కల్పించె వీనికి నిట్టి మహిమ?

౨

ఓయి మందానిలంబ! నిన్నొక్క మాట
యడుగఁ దలఁచితి; నీవు బ్రహ్మాండ మెల్లఁ
దఱచు తాల్చి సహస్రావతారములను
దిరుగు చుందువు గద ప్రతిదినముఁ బనిగఁ
గలదు పదునాల్గు భువనముల్ కాక కవి శి
ఖామణులకుఁ బ్రత్యేక లోక మని విందు
నచటి శృంగారవనముల కరిగి నావె?
చెప్పుమా! నాకుఁ దత్తద్విశేషములను
బ్రథిత చారిత్ర గంధ సంవాసిత మయి
పుడమి దుష్కాల భూకంపముల నడంగి
పాడుపడిన పురాతన పట్టణములు
గంటివే? తెల్పు నాకుఁ దత్కథల నెల్ల
నర్థమెఱుఁగని పరభాషలందుఁ జెలఁగు
మంచి కబ్బంపుఁ దోఁటల మసలి నావె?
చెప్పుమా! నాకుఁ దత్తద్విశేషములను
నీ పరిమళమంతయు నిశ్చయముగ
వాని సంబంధి యనుచు భావన మొనర్తు
మరియు నిన్ను రహస్యంపు మాట యొక్క
టడిగెదను గాదునాక సత్యము వచింపు.
మానినీ రత్నములను సమర్పణంబు
నేసి ప్రియులకుఁ గొన్న విశేష పుణ్య
పరిమళము గాదె? యీ నీదు పరిమళంబు.

౩

ఓ మరుద్దేవ! విశ్వ మహోత్సవంబు
నెఱపుదువు సౌమ్యమూర్తివై నింగి మెరసి
యట్టి తఱియందు లేఁడు నీ యట్టిఁ డనుచుఁ
బ్రజలు నుతియింత్రు నిను జగత్ప్రాణమ వని
కాని యున్నట్టు లుండి యకారణముగ
మిక్కిలి భయంకరంబుగా మేను బెంచి
తరులఁ బెఱకుచు, సౌధముల్ విఱుఁగఁదన్ని
చిండ్లకప్పులు లేపుచు; నెల్ల కొండ
లూఁచ ముట్టుగఁ గడల నుఱ్ఱూఁతలూఁపి
వేయుదువ; యంతకంతకుఁ బెరుగ నోడలు
పీనుగుం బెంటఁ జేయుచు విశ్వ మెల్ల
మ్రింగ వేమొగంబుల హుంకరించుకొనుచు
వచ్చుచున్న చందమునఁ గన్పడెదు త్రుటిని
మరియొకప్పుడు నహ్నితో మైత్రి నేసి
చేతమందు లేశముఁ బాప భీతి లేక
లోకసంహారమునకుఁ జాలుదువు మిగుల.
బాల్య దశయందు నినుఁ గన్నవార లెవరు
ని ట్లగుదువంచుఁ గలనైన నెంచియుండ
రీవు కంటికిఁ గాన్పింప నిట్టి వేళ
జనులు కడికండలుగ నిన్నుఁ జలుపకుంద్రె?

౪

ఒడలెఱుంగని సివమెత్తి పుడమిఁ బాడు
పఱచి తుదకుఁ బశ్చాత్తాప పడుచునున్న
కరణి నుఱుముఁ మెఱుఁగెత్తి తెర తెరలుగ
వాన కన్నీరు వరదలై పాఱుచుండ
నెవ్వరికి నాఁపఁగా రాక యేడ్తు; కాని
యేమి లాభంబు గలుగు నీ యేడ్పు చేత
నష్టముం గొన్న బీద జనంబులకును?

౫

అట్టి సుప్రసన్నాకృతి వట్టి మృదుళ
సరళ సుస్వభావుఁడ వట్టి శాంతమతివి.
కాంచుచుండంగనే యిట్లు కాలమృత్యు
వునకు నపరావతారంబవో! యనంగ
నుగ్రమూర్తివై చరియించుచుందువేల?

# అణురూపము

శ్రీమధాటి వెంకటగిరి గారు, బి. ఏ. (M. Sc. విద్యార్థి)

నేడు రసాయన చరిత్రములో నూతన శకము ప్రారంభమయినదని చెప్పవచ్చును. కాలముతో పాటు వాతావరణము, వాతావరణముతో మానవప్రకృతి, మానవప్రకృతితో శాస్త్రములును ఎన్నియో విధముల, ఎన్నియో మార్గముల విస్తరిల్లి పోవుచున్నది. అంతేయును క్రొత్త. ఇది యొక్కటియే కాదు. అన్నియును నూతనజీవములను దాల్చి నూతన రూపములతో తొలుతటికన్న వేగమున సర్వతోముఖముగా వ్యాపించుచున్నవి.

నిరుపమానమగు శేముషీప్రకర్షకు నసాధ్యమగు కార్య మెద్ది గలదు?

రసాయనశాస్త్రము ప్రాపంచిక సృష్టికి ఆధారభూతమని చెప్పిన ఉత్ప్రేక్ష కాదు.

పదార్థవిజ్ఞానశాస్త్రవిచారణమునకును, రసవాదశాస్త్రపరిశోధనకును అణురూపము, దాని తత్త్వమే ప్రధానకారణమై యుండుటచే ఆధునికరసాయనశాస్త్రవేత్తలు కాయక్లేశముల కోర్చి, యావచ్ఛక్తిని వినియోగించి అణుపరిశోధన విషయమునకు తమ యమూల్యములయిన జీవితములను ధారపోయుచున్నారు; ధారపోసినారు

ఈప్రపంచసృష్టితత్త్వమును సంపూర్ణముగ నెరుంగుటకు పదార్థలక్షణమును, దాని నియమమును తెలిసికొనుట ముఖ్యావశ్యకము. ఈ శాస్త్రసంబంధమయిన పరిభాషాపదములు లేకపోయినను రసాయన లోకమున ప్రాధాన్యము వహించిన యీ విషయగ్రహణమే మనకు ముఖ్యావశ్యకము.

మనహిందూశాస్త్రానుసారము అణువుకన్న సూక్ష్మమయిన పరిమాణము లేదని తెలియవచ్చుచున్నది. అణుపరిమాణముకంటె సూక్ష్మపరిమాణముగ విభజించుటకు రసవాదశాస్త్రసంబంధమయిన పరికరములు లేనప్పటికిని నూతనపరిశోధనములచే అణువు భిన్నాంగ మిశ్రితరూపమని నిరూపించినారు. అణువును చిన్నిచిన్ని కణములుగా విభజించుటకు తగినమార్గములు కలవు. అణులక్షణమును, దానివలన మూలపదార్థప్రకృతియు విపులమును, స్వచ్ఛమునైన అణురూపముపై నాధారపడియుండును. కనుక అణురూపవిమర్శనమునకు ప్రథమమున గడంగుదము.

ఈ అణురూప తత్త్వవిమర్శనమున, నవీనపదార్థవిజ్ఞానకారులలో కేమ్‌బ్రిడ్జి విశ్వవిద్యాలయ (Cambridge University) అధ్యాపకుడుగా నున్న (Sir Ernest Rutherford) సర్ అర్నెస్టురూథర్‌ఫోర్డుఅను ఆంగ్లేయశాస్త్రజ్ఞుడు మిగుల మేధావంతుడు. ఇతని విమర్శనముపై భోర్ (Bohr) అను మరియొక శాస్త్రవేత్త అనేకనూతన విషయములను గ్రహించి, ఆ అణురూపవిమర్శనమును వికాసవంత మొనరించెను. ఇతనివాదము ననుసరించి అణువు ధనరాశిసంబంధమయిన విద్యుచ్ఛక్తి (Positive Charge of Electricity) చే నావరింపబడిన నాభిస్థానము కలదనియు, క్షయరాశిసంబంధమైన విద్యుచ్ఛక్తి (Negative Charge of Electricity)తో గూడిన లవలేశములు (Electrons) ఆ బీజస్థానమును పరివేష్టించియుండుననియు తెలియవచ్చుచున్నది. అనాభిస్థానమునందు ధనరాశిసంబంధ విద్యుచ్ఛక్తి మాత్రలు కొన్ని నిర్బంధింపనివియై యుండును. వీని మొత్తము నాభిస్థానమును నావరించియుండు లవలేశములతో సరిసమానముగ నుండును గనుక ఆ అణువు విద్యుద్విహీనమయియుండును. కొంచె మించుమించుగా అణుపరిమాణమంతయు నాభిస్థానమునందు చేరియుండును.

ధనరాశి సంబంధ విద్యుచ్ఛక్తి కణములను అణువుపై మిక్కిలి వేగముగ ప్రసరింపచేసిన దాని ప్రకృతి కొంతమట్టుకు విమర్శనీయ మగును. (Radio active) "రేడియో ఆక్టివ్" అను వస్తువులు కొన్ని కలవు. అవి ఎల్లవేళల ధనరాశిసంబంధమయిన విద్యుచ్ఛక్తి కణములను వెదజల్లుటవలన ఈకార్యమునకు చాలప్రయోజన

కరములైనవి. ఈ కణములే రెండు ధనరాశి సంబంధ మయిన విద్యుచ్ఛక్తిమాత్రలతో కలసిన "హీలయం" (Heliam) అను కణములు. 'హీలయం' అనునది ఒక విధమయిన వాయువు. ఈ హీలయం అను కణములనే ఆంగ్లమున (*Alph aparticles*) 'ఆల్ఫపార్టికల్స్'అని కూడపిలుతురు.

సి. టి. ఆర్. విల్సన్ అను నొక. పదార్థవిజ్ఞాన శాస్త్రకారుడు ఈ 'ఆల్ఫపార్టికల్స్' యొక్క మార్గమును స్పష్టముగా తెలిసికొనుటకును ఆ మార్గముయొక్క ఛాయాపటమును దీయుటకున్న, తగిన సాధనసామగ్రి నంతయు బహు ప్రయాసముపై కనిపెట్టినాడు. ఈ కణములు పూర్ణముగా నలము కొనిన నీటియావిరినుండి ప్రసరింపచేసిన యెడల ఆ కణములమార్గము మంచుతో కలసిన రేకవలె కానిపించును. కొంచె మించుమించుగా ఈ "ఆల్ఫ పార్టికల్స్" అన్నియును వంకరగా కాక తిన్నగా ప్రవేశించును. కాని కొన్ని మాత్రము అరుదుగా త్రోవనుండి విడివడును. ఈ కణముల మార్గమందుండు అణువులద్వారా ఈ 'ఆల్ఫ పార్టికల్స్' చొరగలవని నమ్మటకు నిదర్శనములు గలవు. అణువులనుండి ప్రవేశించు నపుడు అవి నాభిస్థానమును చుట్టుముట్టుకొనియుండు లవలేశములను సమీపించిన వాటిమార్గమున కేమియు నాటంకముండదు. కాని నాభిస్థానమును సమీపించిన యెడల ధనరాశిసంబంధ విద్యుచ్ఛక్తితో కూడిననాభిస్థానము క్షయరాశిసంబంధ విద్యుచ్ఛక్తితో కలసిన ఆ కణములను వెనుకకు నెట్టివేయును. నాభిస్థానపరిమితి అణువుపరిమితి కంటె మిక్కిలి సూక్ష్మముగ నుండును. జలవాయువుయొక్క అణువును భూపరిమితికి తీసికొని వచ్చినయెడల ఆ నాభిస్థాన మొక నారింజపండువలెను, దానిని చుట్టు ముట్టుకొనియుండు లవలేశపరిమితి ఒక గృహమువలెను పొడగట్టును. చాలవరకు ఆ అణువుయొక్క ఘన పరిమాణమంతయు శూన్యప్రదేశమయి యుండును. ఈ యుదాహరణమును పట్టి నాభిస్థానము అణుపరిమితి కన్న మిక్కిలి సూక్ష్మమయినందువలన "ఆల్ఫ పార్టికల్స్" అణువుద్వారా ప్రవేశించునపుడు నాభిస్థానమును సమీపించుట చాల అరుదు. పైని చెప్పిన రీతిని ఈ 'ఆల్ఫ పార్టికల్స్' తమమార్గములనుండి విడివడుటయును కూడ చాల అరుదు. ఈ యథార్థము లన్నియును సి. టి. ఆర్. విల్సన్ కనిపెట్టిన సాధనసామగ్రి సహాయమున ప్రత్యక్షముగా చూడవచ్చును. కనుక 'భోర్' శాస్త్రవేత్తయొక్క అణురూపవాదమును అంగీకరించుటకు గాని, నిదర్శనముగా స్థిరపరచుటకు గాని ఎంతమాత్రమును సందియ మొందు నవసరము లేదు.

నాభిస్థానముయొక్క ఆకారరూపముకన్న దానినావరించియుండు లవలేశముల లక్షణములు స్ఫుటముగా తెలియనగును. గ్రహములు సూర్యబింబమును చుట్టుకొని ఏరీతిని తిరుగునో ఆరీతినే ఈలవలేశములు వేరువేరు మండల మార్గములను చుట్టుచుండును. ఒక మండల మార్గమునందే వివిధ లవలేశము లుండవచ్చును. లేక నానా మండల మార్గములను చుట్టి తిరుగుచుండవచ్చును. లవలేశములు వలయాకార మార్గములనే కాక అండాకార మార్గములందును తిరుగుచుండును. మఱియు ఆ మండలము లొక సమతలమునందే కాక అనేక సమతలములయందును సంచరించుట కూడ గలదు.

జలవాయువుయొక్క అణురూపమును ఉదాహరణముగా గైకొనిన పైని వివరించిన విషయము లన్నిటిని తెలిసికొనుట సులభము కాన దానిని చర్చింతము.

జలవాయువుయొక్క అణుమధ్యమున గల నాభిస్థానమందు ధనరాశిసంబంధవిద్యుచ్ఛక్తిమాత్ర యేకమాత్రముగా నుండును గాన ఈ అణువు విద్యుద్విహీనమయి యుండుటకు దాని నావరించి యుండు లవలేశము కూడ ఒక్కటే యయి యుండవలయును. ఈలవలేశము ఆ అణుమధ్యముననుండు నాభిస్థానము చుట్టు వివిధమండలమార్గములను చుట్టుచుండును. ఇంతియే కాక వివిధ మండలములు చేరి ఒకరాశి (quantum) యందుంట కూడ కలదు. మఱియు లవలేశము అండాకారమార్గమునందుకూడ సంచరించుచుండును. ఈ విషయ మిదివరకే వక్కాణించితిమి.

జలవాయువుయొక్క అణుప్రతిమ ఈక్రింద పొందుపరుపబడినది:—




జలవాయువుయొక్క అణుప్రతిమ (చిత్రము)

ఈప్రతిమయందు, అ, $ఇ_1$, $ఇ_2$, $ఎ_1$, $ఎ_2$ $ఎ_3$, $ఒ_1$, $ఒ_2$, $ఒ_3$, $ఒ_4$, అను వివిధ మండలములయందు ఆ లవలేశము సంచరించుచుండును. $ఒ_1$, $ఒ_2$, $ఒ_3$, $ఒ_4$ చేరి ఒకరాశియందును, $ఎ_1$, $ఎ_2$, $ఎ_3$ మండలములు చేరి ఒకరాశియందును, $ఇ_1$, $ఇ_2$ మండలములు చేరి మరియొక రాశియందును ఇమిడియుండును.

---

# మాంసాశనులకు మనవి

శ్రీ విక్రమదేవవర్మ గారు

ప్రాణి జీవంబుఁ దీయుట యతిసులభము
జీవమొసఁగుట యేరికిం జేతఁగాదు
జీవదుఁడు తదీశుఁడు వాసుదేవుఁ డొకఁడ
కాన దానిని హరియింపఁ బూనఁజనదు.

శవముఁ బూడ్చెడుచోటు శ్మశానమకద
దానిఁ గడుపునఁబూడిచి తనదుకడుపు
వల్లకాడుగాఁ జేయుట భవ్యమగునె?
తెలివి యేపాటిమైనను గలుగునేని.

తృణముఁ దిని మాంసమును బెంచుమృగము [వ్రేలఁ
జేసి మేనిచర్మంబును జీరుచుండ
మాంసమును దిని మాంసంబు మానుగాను
బెంచు నరుగతి యేమానొ పెలుభవమున?

---

# విద్యమానవిద్యావిధానము

పూతలపట్టు శ్రీరాములు రెడ్డి గారు

మన యదృష్టవశమున సంగలి రంగని పాఠముతీసి వేయఁబడినదని సంతసించుచుండఁగా మరల నొక వంక నాశ్చర్యచకితులను గావించుచు మఱొక వాచకమున యాఁడు నెమిలి అందముగా ఆడుచున్నదే? ఈ పడమటిగాలి సోకుడుగాం(డ్రు, వడ్లమాని మనుష్యులు గ్రంథకర్తలగుచుండు నంతకాలము మనకీగతి తప్పదు గాఁబోలు!

కుక్కలు పిల్లులు ఉడుతలు చేఁపలు ప్రేవులు కనుగ్రుడ్లు మున్నగు వెక్కువస్తువులఁ బాఠశాలలలోనికిఁ దెప్పించిచూపి బాలుర ననుభవ విద్యావిశారదులనుగాఁ జేయుచున్నారు. ఇదియెంతమాత్రము ప్రయోజనకారి యగుచున్నదో యెఱయుదము. ఎల్లప్పుడు బాలురు చూచుచుండు కుక్క పిల్లి ఎలుక మున్నగు వాని మరలఁ దెప్పించిచూపుటలోఁ బ్రయోజనమగపడదు. అయ్యవారికంటె బాలునకే వానింగూర్చి యెక్కువ తెలియును. వానితోనే వాఁడాడుకొనుచుండును.

ప్రకృతిశాస్త్రమను పేర నేర్పఁబడు పాఠములు సామాన్యముగా నాకులు పూవులు కప్పలు పిల్లులతో నారంభమై పోనుపోను గారడివిద్యను మెఱపించుచు నవి తమ జీవితవేళయం దెంత ప్రయోజనకారులో తెలియనేరని స్థితిలో నాస్తికతాంకురార్పణముచేసి విడుచుచున్నవి. కృతార్థుఁడైన విద్యార్థి విధివశమున నుపాధ్యాయుఁడయ్యెనేని మరల బాలురకుఁ జెప్ప నుపకరించు మున్న భూగోళశాస్త్రము జ్యోతిశ్శాస్త్రముతో సమ్మేళనమై మనుజుని జీవితదశయందలి భావిఫలితముల నెఱుఁగఁదోడ్పడుచుండె. ఈశాఖయం దిప్పటివిధానముల మార్చినచోఁ బొరుగువారు కొల్లకొల్లఁది నష్టమనుభవింతురు. ఇప్పటి విద్యాఫలితమునందవె జెంగినదియ. ఇందుఁబూర్వశాస్త్రమూషణము పైకారణముచేఁ గాఁబోలుఁ బ్రప్రధానమయ్యె. మనుష్యతత్త్వ మెఱుఁగుటయన్న స్వప్నవార్త. ఆఁ!ఆఁ! ఇంత తెగడికయా? మనుజుని ప్రేవులెంతపొడవు? నరములెన్ని? కనుగ్రుడ్లలో నెన్నిపొరలు? చెవిలోని శబ్దాకర్షక చర్మతత్త్వము, పైత్యరసము, మలమూత్రకోశములు, సంధిబంధములు, అస్థిపంజరము, రక్తాదిద్రవభాగనిర్ణయము, ప్రాణవాయువు, ఉప్పుగాలి, బొగ్గుపులుసుగాలి మున్నగువిషయములఁ బ్రత్యక్షప్రమాణములఁజూపి నేర్పినట్లు నేర్చినట్లు మునుపటివారు నేర్పిరా? నేర్చిరా? ఇట్టి వారికి మనుజతత్త్వము స్వప్నవార్త యెట్లగునని కొందఱనవచ్చును. ఆవు, కుక్క, పిల్లి, ఎలుక, పక్షి మొక్కలు లేని వాచక పుస్తకములు లేనట్టులే, సంపూర్ణాస్థిపంజరము సంపాదింప శక్యముగాకున్నను, నఱిపుర్రె, కుక్కపుర్రె, చచ్చిన బల్లుల పిల్లుల కళేబరములంచి శారదాశాలలఁ బ్రేతశాలలుగాఁ జేసినందులకుఁ జింతింపఁబనిలేదు. శరీరతత్త్వమెఱిఁగినందులకు సంతసింపవలసినదే కాని యాశ్వాసాంతమున సర్వమేకాశ్వాసమనుటకు దుఃఖింపవలసినదే కదా! శరీరతత్త్వముతోఁ బాటు మనస్తత్త్వము(ఈ మనస్తత్త్వమొకచో మాత్రము నేర్పఁబడును ఆపాఠము విషయమునఁ బరీక్షలో విద్యార్థులకధిక ధైర్యము. కారణము చదువరులే యూహింపగలరు.) బుద్ధితత్త్వము, ఆత్మతత్త్వము వీని గతియేమి? మనస్సు పోయిన జాడను బోవలసిన వారికిఁదక్కిన తత్త్వములతోఁ బనియేమని మీరన్నచో నిరుత్తరుఁడనై మఱియొక విషయమునకుఁ గడంగుచున్నాను.

ఇప్పటి భూగోళశాస్త్రము, దేశచరిత్రయు నిట్టిదే. దేశయాత్ర చేయఁ గోరినవాఁడప్పుడు చూచుకొనఁదగిన వానిని బాఠశాలలోఁ జిన్నతనముననే కంఠస్థముచేయవలసియున్నది. దేశయాత్రికుఁగాకున్నను లోకజ్ఞానమునకుఁ బ్రయోజనకారి యనవచ్చుఁగాని స్వదేశవిషయ సంపూర్ణవిస్మృతియుఁ బరదేశ విషయసంస్మృతియు నెంతలాభకారమో యోజింపకుంటపరితాపకరముకాదా! అమెరికాలో నేయే నదులున్నవో దేనిదేనికి సంతెనలున్నవో ముఖస్థముగా బాలురు చెప్పఁగలరుగాని మనదేశమున

నెన్ని జీవనదులున్నవన్న, శెదవులు విఱుతురు. పరదేశ వీరులచరిత్రల నామములాగ్రముగా నొప్పఁజెప్పఁగలరు గాని స్వదేశవీరుల నామములఁగూడ నెఱుగఁరు. ఆఫ్రికాలో నెడారులకు సమీపమున నెన్ని పట్టణములు పల్లెలు న్నవో తొడఁకక వడివడి వాకొనఁగలరుగాని స్వగ్రామమునకుఁ జుట్టునున్న పల్లియల నెఱుఁగరు. ఇట్టి జ్ఞానమెవ్వరి నుద్ధరింపను?

ఇట్లని నేనీవిద్యల నిందింపను. దేనిదేనియం దెవనెవని బుద్ధియాసక్తితోఁ బరుగులువాఱునో దానిదాని వారు శ్రద్ధమెయిఁజదివి మననముచేసి ప్రయోజకులగుచున్నారు. పైతరగతులలో నిది యాదరణీయమైయుండు టెంతయు సమంజసమైయున్నది. అన్నియు నిర్బంధపఠనీయములుగా నుండుటచే బాలురు దేనికిఁ గొఱగాక చెడుచున్నారు. పై తరగతులలో స్వదేశ సంబంధవిద్య సన్నగిలుటవలన ఆకలిగినకొలఁది పాఠమున శ్రద్ధమెయి నంతరింపఁజేయుచున్నారు. దేశభక్తి, దేశోద్ధారక బుద్ధి యెుక వారికెట్లు గలుగును? కలుగుటకు వారికిందేమి గొప్పతన మగపడినది? కావుననే యిప్పటి సభలలో నెచ్చటఁజూచిన దేశభక్తి వలయును, దేశమునుద్ధరింపవలయునను మోఁత్తలు మిన్నుముట్టుచున్నవి.

నిర్బంధపఠనీయ మెయ్యదో వినోదార్థపఠనీయ మెయ్యదో తాత్కాలికావసర పఠనీయమెయ్యదో పారమార్థికమెయ్యదో వివరముగాక కలగూరగంపయై బాలురకు విసుగు భయము గలిగించుచున్నది. పురుషార్థములు ధర్మార్థకామమోక్షములని పూర్వులు నాలుగుమాటలలో నెక్కాణించిరి. వారి త్రోవలకుఁ గంపలుగొట్టితిమిసరిగదా మనత్రోవలు భయదారణ్యసంచారములయ్యెను. వర్ణక్రమ పద్ధతిని వారు బోధించుచుండిరి. అనవసర కాలక్షేపమని మనము బొమ్మలనుజూపి పదములనే మొదలిడితిమి. ఓం నమశ్శివాయ యనివారు ప్రారంభించిరి.తేలు,లత్తుక,వల, పుక్క, ఎలుక, పిల్లియని మనము మొదలిడితిమి. ఈపద్ధతి నడచిన బి. ఎ. విద్యార్థికూడ సంయుక్తాక్షరములను నుచ్చరింపఁజాలకయుఁ గొన్నియక్కరంబు లెఱుంగకయుఁ 'గ్రింనమీాదు చూచుచున్నాఁడు. పూర్వులీవర్ణక్రమపద్ధతి నేల యేర్పఱచిరో యాలోచింతము. "ప్రాణికోటి శబ్దింప నోరు దెఱవఁగనే మొదట "అ" పుట్టుచున్నది. తచ్ఛబ్దదైర్ఘ్యము "ఆ" అగుచున్నది. పదపడి అడ్డముగ వదన గహ్వరము దెఱచిన "ఇ" పుట్టుచున్నది. దాని దీర్ఘభావమే "ఈ" అయ్యెను. ఊర్ధ్వాధః ఫక్కిగను బ్రక్కలకును దెఱచిన పిదపఁ బెదవులఁ గూడి చేసి శబ్దింప వలసియున్నది అందు 'ఉ ఊ' లుత్పన్నములగును. కొననాలుక కొంచెముగ నడఁచిన "ఋౠ" లుదితంబులగు. మరల నాలుక నెక్కువగఁ బైకి నడిమిన 'ౡ ౣ' లేర్పడియె. అపైఁ బ్రాణాక్షరములు పుట్టుటకు వీలులేమిం జేసి మొదటి యక్కరంబును మూఁడవ యక్కరంబును గలుపఁగా (అ + ఇ) "ఎ" ఏర్పడు. ఏతత్క్రిమంబున అ + ఈ = ఏ. అ + ఉ = ఒ. అ + ఊ = ఓ. ఐనవి. జిహ్వాగ్రమును మూర్ధమున నణప 'ఋ ౠ' లేర్పడినట్టులు నాలుక మొదటిభాగము నదిమిన 'క' ఏర్పడును. ఆధ్వని నొత్తిన 'ఖ' అగును. కకారమును సరళముగా నుచ్చరించిన గకారమును దాని నొత్తిన ఘకారము నగు. ఇట్లే సర్వ వర్ణములు స్వభావసిద్ధముగ సముత్పన్నములు—కాఁగా వర్ణక్రమంబును వ్యత్యస్తంబుచేసి బాలుర గష్టపెట్ట నేల? ప్రకృతిసిద్ధంబులే కదా బాలురకు లభ్యంబులు" (సుజ్ఞానబోధిని 4 భా)

ఇట్టి సక్రమపద్ధతిని పాడుచేసి దృష్టిపరిశీలన చేయు భిషక్శిరోమణి కరణిఁ దాఱుమాఱుగఁ బరీక్షచేయుటకు మారుగ నేరుప నేల?

బాలశిక్ష లనుపేరున నిప్పుడున్న పుస్తకములన్నియు నొకమచ్చున దింపినవే గావున నొక యచ్చులోని ప్రతులే యనవచ్చు. ప్రతిబింబము లను నంతమూరము పో నక్కఱయుండదు. పై యెనిమిదవ తరగతి (iii Form) వఱకు నట్టివే. జంతుపాఠములు 4, ప్రాణుల స్వభావములఁ దెలుపునట్టివి పిల్లి, ఎలుక, ఆవు, ఎద్దు మున్నగునవి 4, చరిత్రాంశములఁ దెలుపునట్టి పాఠములు 4, ఇతర కథలు 4, మఱికొన్ని యేవో కలిసి యొకవాచక పుస్తక మగుచున్నది. పుక్క నక్క పిల్లి కప్ప ఆవు పాఠములు లేని వాచకము లగోచరములు; అశ్రుతములు. Non-details అను పేరున నున్న పాఠ్యపుస్తకములు

అశ్రద్ధామూలక పతనీయములు. అవి గొప్ప పుస్తక శాలాధికారులు పలువిధములఁ బ్రకటించుచున్నారు. కొందఱు తమ యుద్దేశముల కానుకూల్యముగ వ్రాయించుచున్నారు. ఉదా—"అక్కడక్కడ తిరుగుచు, తిరుగుచు, బలరాముఁడు చెట్టువద్దకు రాగా, కల్లువాసన వేసినది. తత్క్షణమే మునుపు తాను త్రాగిన సంగతి జ్ఞప్తికి వచ్చినది, మరల మునుపటివలెనే కల్లుత్రాగుటకు బుద్ధి పుట్టినది. చెట్టునుండి కల్లు బొట్టుబొట్టుగా కారుచుండుట చూచి చాలసంతోషించి కొంతకల్లు పట్టి త్రాగెను. రుచిగా నుండుటచేత మఱికొంత పట్టిత్రాగెను. త్రాగగా త్రాగగా కైపెక్కి బుద్ధిచెడి ఇది మంచిది ఇది చెడ్డది అను జ్ఞాపకము పోయినది. తుదకు దేహమున స్మృతి తప్పి తన్నుతాను మఱచినాఁడు. ఏమిటి అనుచున్నాడో తెలియక......"

పైవిషయమునుగూర్చి ఏమనుటకుఁ దోఁపకున్నది.

రెండవతెగవారు మొదటి వారిని నిందించుచుఁ బూర్వుల యౌన్నత్యమునందు వారి యుత్తమ చరిత్రములఁ బఠింపవలయుననియు మేమట్టి చరిత్రములను దగిన ప్రసిద్ధ విద్వాంసులచే వ్రాయించి ప్రకటించితిమనియు గ్రంథపీఠికలయందుఁ నుడువుచు లోభబుద్ధిచేఁ బప్పులో నడుగుపెట్టుచున్నారు. ఒకకంపెనివారొకే గ్రంథకర్తచే నొకసారిగ వ్రాయించి యొకే పరి ముద్రించిన గ్రంథ గ్రంథులనుండి కాఱు సారమునిటఁ జూపుచున్నాఁడను.

గ్రంథనామములు 'బాలనీతి చంద్రిక బాలనీతి ప్రకాశిక, బాలనీతికథావళి, బాలనీతికథలు' అని పర్యాయపద పదలోపమాత్ర భిన్నములు. అందలి విషయములు నంతియ. గ్రంథకర్తకేదో యొక తీరున గ్రంథసంఖ్య పరిమితకాలమునకుఁ గావలసి యుండెఁగాఁబోలు!

ఒక గ్రంథమున

సత్యముపలుకుము (హరిశ్చంద్రుఁడు)
రాజునుసేవింపుము (కర్ణుఁడు)
మాటతిరుగరాదు (బలి)
దేవునియందు భక్తియుంచుము (అంబరీషుఁడు)
దానముచేయుము (శిబి)

రెండవ పుస్తకమున

రాజభక్తియుంచుము (కర్ణుఁడు)
అసత్యమాడరాదు (హరిశ్చంద్రుఁడు)
దైవభక్తియుంచుము (అంబరీషుఁడు)
ఆడినమాట తప్పరాదు (బలి)
దాతృత్వము ఉండవలయును (శిబి)

ఇట్లే మూఁడవ నాల్గవ పాత్రములలోఁ బర్యాయపదభేదములతో నొకేశైలి నొకే పరిమితవ్యాప్తినొందియాకథలే గలవు. ఒకగ్రంథము ననేకగ్రంథములొనర్చి "పేలకంకుల దాసరీ! యన్న రాలినముట్టునకు రాలనీ" యన్న సామెతగా ధనము గడించుటలో వీరద్వితీయులు. ఇప్పుడిట్టి కథలపుస్తకముల యిఁపుళ్లుపుట్ట నోరుతెఱవఁబడినది. బయలుదేఱిన లెక్కచెదలు పాత్రము లొకపరి పరిభ్రమించి పునర్జన్మరాహిత్యమునొందుచున్నవి.

మూఁడవ తరగతివారు పైరెండు తరగతులవారి యవగుణముల వెలిపుచ్చుచు మేము కేవలము లోకోపకారమునకే పాటుపడుచున్నారమని పాఠశాలా పండిత బిరుదములతోఁ బుస్తకప్రకటనముగావించి రెండుమూఁడు విధముల సంతుష్టినందుచున్నారు. ఏవోకొన్నియోగ్యతా వచనముల (సిఫారసు) బలిమి కలిమిని బండిత పదవినందినంతన పండితమానులై గ్రంథనామక శిలీంధ్రముల సృష్టించి పుస్తకవ్యాపారుల కీయఁబోయి స్వామ్యవిక్రయ ధన వివాదమున మాటాటపడి "యోలిసులువున గ్రుడ్డిదానిం బెండ్లాడె"నను న్యాయమున నల్పధన గృహీతగ్రంథులను పుస్తకప్రకాశక శాలాధికారులు నిరాకరింప వారిపైన నూయ వహించి యెవరినో కాళ్లు గడుపులు పట్టి యెరవో సరవో సంపాదించి యచ్చొత్తించి తద్విక్రయకార్యమున పరస్పర పండితసాహాయ్యమత్యావశ్యకమని యితర పండితులఁ బ్రార్థించుచున్నారు.

పైవారిగ్రంథములందుకంటె వీరిపాత్రములయందు గుణముకొంత యెక్కువయుండుఁగాని తప్పులంతకంటె పిరివిగనుండును.

తాము వ్రాసిన తప్పుల తరకలు కొన్ని, పరులచే వ్రాయించి తమపేరుంచు కొన్నవి కొన్ని చేర్చి కొందఱు

ప్రకటించు చున్నారు. ఎట్లు ప్రకటించిన నేమి? తమప్రార్థనముల వలనను మిత్రులమాట సాగుటల వలనను ఎక్కువ కమిషను నిచ్చుటవలనను దమగ్రంథము లమ్ముడు బోవుచున్నవి.

విద్యాశాఖవారు సద్గ్రంథముల నంగీకరించు సభయొండు సమ్యగ్గీతి[?] స్థాపించియున్నారు. అందలి సభ్యులెన్ని గ్రంథములని విమర్శకబుద్ధితోఁ జూడఁగలరు? పైపేళ్లను పుటలను విషయసూచికలఁ గాంచి యంగీకారానంగీకారముల సూచింపఁ దటస్థింపఁవచ్చుఁగదా!

ఉత్తమగ్రంథముల కీకాలమునఁ బ్రచారము లేదు. అట్టిగ్రంథములఁ గైకొను ప్రకాశకులరుదు. వారియొద్దనున్న పండితమ్మన్యులవాత నేమేని షేఁతవేయఁకున్నఁ దమపాత్రము లంగీకరింపఁబడవు. అత్తగోడలి నైరమవని యందెల్లరకు వెల్లడింప మూర్ఖులనలనఁగాదని పండితులపాలఁబడినదన నొప్పి యాగర్భదరిద్రులైన విద్వాంసులకు స్వీయగ్రంథప్రచురణము నైతిగాదు. ఒకవేళ చందాలను పేరున బిచ్చమెత్తియైనఁ బట్టుపట్టుమని కష్టముతో నొక్కపాత్రమును బ్రచురించినచో నది బీదబాలిక లాగునఁ బైయలంకారము లేమియు లేమి మినమినలాడను. మఱియు వెలయెక్కువ యగు. సామాన్యగ్రంథములు సామాన్యలంబోలి పైనిగనిగలు గలిగి కనులకు మిఱుమిట్లు గొలుపుచుండును. వెలయుఁ దక్కువ. ఈ కాలరీతి విజ్ఞులకెఱుకయే. తరువాతి సంగతి స్పష్టము.

ఇప్పుడుత్పత్తియగు గ్రంథములకుఁదోడు గుణముల (మార్కుల) నియమమొండు గలదు. రాముఁడను పదమునకు మూఁడుమార్కు లన్నచో రాఁడని బాలుఁడువ్రాసినచో రెండీయవలసి యుండును. ఈ విధమున నూటికి ముప్పదియైదు మార్కులువచ్చినఁ జాలును. తక్కిన యఱువదియైదు మాట చెప్ప నేల? ఈప్రశ్నము నే యొక బాలుఁడు నన్నడిగెను. చిఱునవ్వుతో వాని మొగము జూచితి. ఏల నవ్వెదరని బాలుఁడు మరలనడుగ నీయట్టి బుద్ధిమంతులు పెక్కండ్రు లేరని నిన్నుఁగని సంతసించుచుంటి నంటిని. పైవారు మన మేలుకొఱకే నూటికి ముప్పదియైదు చాలుననిరని రెండవ బాలుఁడనెను. మన విశాలము కొఱకని నీవెఱుఁగక పోవుట చాల శోచనీయము. మన విద్యలో నఱువదియైదుపాళ్లు నిరర్థకమే కదా యని మొదటి బాలుఁడనెను. సారమూహించిన బాలుఁడెంత ప్రశంసనీయుఁడు!

పై తరగతులలో భావమున కిన్నియని, భాషకిన్నియని యక్షరసౌందర్య పత్రపారిశుద్ధ్యమున కిన్నియని గుణములు విభజింపఁ బడుచున్నవి. వేనిలో బాలుఁడు మార్కులు గొన్నను అవి మొత్తమై వాని యుత్తీర్ణతకు సహాయభూతము లగుచున్నవి. ఇదియుం గడుంగడు విచారణీయాంశము. గుణగణనముం బట్టి బాలునకు విద్యాసక్తి యెంత పొడమునో సులభముగ నూహింపవచ్చు. దీని నెఱుఁగక కొందఱు బాలుర తండ్రులా ముప్పదికిం దక్కువ మఱుంగులుగొన్న తమ బాలురఁ బైతరగతుల కంపుఁడని ప్రార్థించుచున్నారు. బాలుర జ్ఞానాభివృద్ధికిది యొక ప్రక్కశూల వ్యాధియని పాపము వారే మెఱుఁగుదురు! ఏదో యొకవిధమున నీ పరీక్షలోఁ గడతేఱినాఁడని యోగ్యతాపత్రముగొని వోట్లకొఱకువచ్చువారింబట్టుకొని యేదోయొక యుద్యోగ మిప్పింతమని వారి కోరిక.

ఇప్పటి చదువులకుఁ బరిపూర్ణ గమ్యస్థాన ముద్యోగమే యని వారికిఁగూడఁ దెలియును. ఇప్పటి విద్య యుద్యోగేతరవృత్తికి విద్యార్థిని లోఁగింపదని కొందఱు తమ బాలుర నీబళ్లకుఁ బంపఁజాలమనుచున్నారు. లక్షులకధికారులగు వృద్ధులు గృహకృత్యముల నెగ్గించుకొనఁజాలక విద్యమాన విద్యావిశారదులగు కుమారుల వేడుకొన్నను లేఖకుల నుంచుకొమ్మందురు. తాము కచ్చేరిలో లేఖకులై సంపాదించునది నెలకు ముప్పదియైదు రూపికలు ఇంట లేఖకునకు వేతన మేఁబదిరూపాయలు. ఇంటినుండి నెలనెలకుఁ దమకుఁ గావలసినదేఁబది. లేకరులు తమయాస్తి నెంతలేమికిఁ దెచ్చిన నోర్తురుగాని తామా పనిం జూచుకొనుట కేవగింతురు. ఇట్టివా రిప్పుడు పెక్కండ్రున్నారు.

పరీక్షలో నుత్తీర్ణతకు వలయు గుణములసంఖ్య హెచ్చింపవలయునని కోరఁగా మఱికొందఱు మేధాని

ధుల విద్య సమష్టికి సులభసాధ్యమై యుండవలయునని పై ప్రతిపాదనమును నిషేధించిరఁట!

విద్య స్త్రీల కత్యావశ్యకమని యందఱేకగ్రీవముగ సమ్మతించుట సంతోషదాయకము. వలదన్నవారెవరో నిర్ధారణగా నగపడరు. ప్రపంచోద్ధరణమునకు స్తూలస్తంభ ప్రతిష్ఠయగు నిమ్మహాకార్యము నెట్లు నెఱ్ఱవేర్పవలయునో యాలోచింపక పోవుటయే విచారదాయకము. ఏట్టి విద్య వారి కావశ్యకమో నిర్ణయింపఁబడలేదు. తమ నేర్చిన విద్యయే వారికిని దగినదని ప్రత్యేక నిర్ణయము నవసరమని యూహించిరి గాఁబోలు! తాము తమవిద్యలకుఁ దమ యాచారములకుఁ స్వస్తిచెప్పి పర విద్యలఁబఠించి పరాచార సంగ్రహణంబునఁ బంకజాక్షులు పాపిటల గ్రహించిన యనువున నన్నులమిన్నులను దమ విద్యలఁ బరిహరించి పురుషుల విద్యలగ్రహించి పసుపు పాపిటలు పరిత్యజించి శిఖండులై మగమూతులఁ దెచ్చుకొనవలసినదే యని యూహించిరా? జగమున సర్వప్రాణులు సములు. సమవిద్యయే సమాదరణీయమని వేదాంతసూక్తి నాదరించిర? వీరట్లే భావించిరో లేదో కాని నవవిద్యా విశారదలగు నారీమణులు పెక్కురా నూత్రముతోనే గుణపఠకములఁ గ్రుచ్చుచున్నారు. ఇట్టి నేటి విపరీత విద్యావిధానమున సంస్కరణ మావశ్యకము కాదా!



# గ్లాస్గోపట్టణమున భారతీయోత్సాహములు

టి. వెంకాజిరావుగారు

భారతీయ విద్యార్థుల విషయమున గ్లాస్గోవిశ్వవిద్యాలయము లండను, ఎడింబరో విశ్వవిద్యాలయము లంత వాసి కెక్కలేదు. ఎంజినీరింగు ముఖ్యముగ చదువు విద్యార్థులు సాధారణముగ ఈ విశ్వవిద్యాలయమే నయమని యెంతురు; ఏలయన గ్లాస్గోకును, క్లైడునదికిని చుట్టుపట్ల గొప్ప ఎంజినీరింగుసంస్థ లున్నవి. ప్రస్తుతము గ్లాస్గోయందు ౭౦-౮౦ మంది విద్యార్థులకంటె నెక్కువగ లేరు; ఆ ఉన్నవారిలోను ఆంధ్రదేశమునుండి తిన్నగ వచ్చిన విద్యార్థి ఒక్కడు లేడు. ఆర్. యన్. సోదరుల కుటుంబమువారు మాత్రము తెలుగు కొంచెము మాటాడగలరు.

విద్యార్థి జనము కాక భారతీయులగు సరంగులు కూడ పెక్కుమంది యున్నారు. అందు చాలమంది పంజాబు ఉత్తరహిందూస్థానములనుండి వచ్చినవారు. వారొక్కొకపుడు వందమందికూడ కానవత్తురు. వారి నిలుకడ మాత్రము నిత్యము కాదు. సరకు వేసికొనుటకు గాని, శుభ్రముచేయబడుటకు గాని గ్లాస్గోరేవులో లంగరువేయబడు ఓడలతో వచ్చు ఈ సరంగులు కాక అయిదు పది సంవత్సరములనుండి యిచ్చట శాశ్వతవాస మేర్పరచుకొనియున్న సరంగులును గలరు. దుష్ప్రవర్తనమున ఓడలనుండి వెడలగొట్టబడినవారు గాని, నౌకాజీవనమున విసిగినవారు గాని, ఊరక సంచారము చేయువారు గానియై గ్లాస్గోయందు అత్తుకొనిన సరంగులును గలరు. వారు నూరు నూటయేబది మందివఱ కుందురు. వారికొక చక్కనివృత్తి లభించెను. వారు ఆడవాండ్ర చౌకరకము బట్టలు వీథులలో అమ్ముకొని జీవింతురు. ఈ బట్టలకొఱకే చూచుచుండు పేద కూలిబాలికలు ముఖ్యముగా కొనికొందురు. ఈ సరంగు లైదారుగురు కలిసి ఒక అంతస్తున బసచేయుదురు. సాధారణముగ మంచి పడక సదుపాయము లుండవు. నేలపై రెడ్డికము వైచికొని కూరుచుండి, తమ మామూలు చపాతీలు, కూర వండుకొనుచు, హుక్కా గంజాయి గొట్టములు మఱవక, తమ సజాతీయులైన మిత్రుల యిళ్లకు తిరుగుచు వారు కాలక్షేపము చేయుదురు. వారి అంతస్తు లందు రెండేసి గదులుమాత్ర ముండును. ఒకగదిలో ఆదరబాదరగా వేసిన ప్రక్కలపై అడ్డదిడ్డముగ పండుకొందురు. వేఱొకదానియందు వంట, తిండి, సామానుల దాపరికము. నికృష్టజనము నివసించు పాడు పెరళ్ల వంటి దుర్గంధమయములగు పట్టణభాగములందు వీరి బసలు.

వీరిమాట అటుంచి, 'జహంగీర్ అండుకో' అను ఒకభారతీయౌషధ వాణిజ్యనిలయము (Indian Medical Firm) వలన గ్లాస్గో గర్వపడదగును. అదియొక భారతీయ వైద్యుడు నడుపుచున్నాడు. అతడు ౨౧, ౨౫ వత్సరములనుండి ఇచట వర్తకము సాగించుచున్నాడు. నేత్రవైద్యమున మిక్కిలి ప్రసిద్ధుడు. సామెతకు కూడ నెక్కినాడు.

మఱికొందఱు భారతీయ సజ్జనులు ఇచట వర్తకము చేయుచున్నారు. వారిలో అహమదుగా రొకరు. వీరొక బ్రిటిషుస్త్రీని పెండ్లాడి యీదేశములనే స్థిరపడి గ్లాస్గోనుంచి 'బాలచ్'కి మోటారుబస్సులువేసి నడుపుచున్నారు.

ఇంకొక వంగదేశీయు డొక ఐరోపీయస్త్రీని వివాహమాడి యిచ్చట స్థిరపడి, 'మెస్సర్సు వేక అండ్ సై' అనుపేర నొక ఉన్నికొట్టున వర్తకము చేయుచున్నాడు; అతనికిని చాల సంవత్సరములనుండి వర్తకము బాగుగ సాగుచున్నది.

ప్రభుత్వపు ఆసుపత్రియందు కొలదిమాసములు ఉమ్మేదువారీలుగా నుండుటకై భారతీయ వైద్యవిద్యార్థులు కొందఱప్పుడప్పుడు గ్లాస్గోకు వచ్చుచుందురు. ఈ నడుమ నిచటకు వచ్చిపోయినవారిలో పూర్వమంత్రి ఆరోగ్యస్వామి మొదలియారుగారితోబుట్టువుకూతురగు కోటీస్వామికణ్ణన్ కన్యయొకతె; మద్రాసునుండి వచ్చిన మఱియొకామె హోప్‌లాజరస్ కన్య: ఇరువురును ఎడింబరోయందు వైద్యము చదువుచున్నవారే.

భారతీయులకు సంబంధించినవి మూడు సమాజములున్నవి—

౧. గ్లాస్గో భారతీయ సంఘము (The Glasgow Indian Union).

౨. గ్లాస్గో ముస్లిముసమాజము (The Glasgow Moslem Association)

౩. హిందూ మహాసభ (The Hindu Maha Sabha).

## గ్లాస్గో భారతీయ సంఘము

ఇది యెప్పుడు జనించెనో తెలియుటకు తగు రుజువైన ఆధారములు మృగ్యములు కాని, ౧౯౧౮ మహాయుద్ధము మొదలుకొనియు నిదియున్నదనుట నిశ్చయము.

ఈసంఘముయొక్క ఆశయము లివి:— ౧ గ్లాస్గోయందు భారతీయులను ఏకత్ర పతిచి, తగుపరిజ్ఞాన మొసగుచును, భారతదేశమునకు సంబంధించు పుస్తకములు, పత్రికలు మున్నగునవి పంచిపెట్టుచును, అపుడపుడు సభలు, చర్చలు జరుపుచును వారిలో భారతదేశమునకును, భారతీయ ప్రజలకును, సంబంధించు విషయములయెడ ఆసక్తి పెంపొందించుట.

౨. సంఘమునకును, సభ్యులకును మేలుగూర్చు విషయములందు సభ్యులు పరస్పరము విచ్చలవిడిగ సంప్రతించుకొన ప్రోత్సహించుట.

3. బ్రిటిషు జనకోటియందును, విదేశీయులయందును భారతదేశమును గూర్చిన పరిజ్ఞానమును, అచ్చటి ప్రజలయెడ ఆసక్తియు విస్తరింపజేయుట.

౪. అప్పుడప్పుడు గణ సమావేశముల చేతను ఉచితమని తోచు ఇతర విధములచేతను సంఘసభ్యులందు దోస్తీ సంభావనములు పెంపుచేయుట.

ప్రస్తుతపు (౧౯౩౭-౧౯౩౮ నిర్వహణ సభాసభ్యులు:—గౌరవాధ్యక్షులు: ప్రొ. జె. డి. కార్మాక్, డి. యస్-సి., సి. బి. ఇ, యమ్.ఐ. మెక్. యమ్. ఇ సి హెచ్ ) ఇ., డీన్ ఆఫ్ ది ఫాకల్టీ ఆఫ్ ఎంజినీరింగ్, గ్లాస్గో విశ్వవిద్యాలయము.

అధ్యక్షులు: సైయద్ ఆలీ అహ్మాన్, యల్. యమ్. ఇ. (బొం.)

ఉపాధ్యక్షులు: ఎ. యస్. తెహెరా.

కార్యదర్శులు: బి ఆర్. ఘోష్, బి. యస్-సి. (ఎంజినీరింగ్); జె. యల్. సాహా, బి. యస్-సి. (గ్లాస్)

భోగట్టా కార్యదర్శి: సాధుసింగ్.

ఈ పై యుద్యమములు గాక, భారతీయసంఘము Rag day కార్యమున విశ్వవిద్యాలయమునకు తోడ్పడుచుండును. కార్యసన్నాహములందు భారతీయులు దీక్షకును, ఫలవంతమగు నుత్సాహమునకును చాల ప్రశంసాపాత్రు లగుచుందురు. 'రంగు' తెగులు వలన భారతీయులను కొన్ని నర్తనశాలలు రానీయకుంటచే వివిధ నర్తన బుతువులలో ఈసంఘము నర్తన ప్రదర్శనముల నేర్పాటు చేయుచుండును. సభ్యుల యుపకారమునకై యిది వివిధ కార్మిక సంస్థల కెడనెడ సందర్శనార్థ మేగుట కేర్పాటులు చేయుచుండును. దీనితోడి ఛాయాచిత్రము గ్లాస్గోలోని 'మిల్ న గేవీ' యందలి 'ఎల్లాంగో' వను కాగితపు పరిశ్రమాలయము దర్శింపనేగిన ఈ సంఘసభ్యుల దళమునకు సంబంధించినది. ఈ సంఘము ౧౯౩౮ నవంబరు ౨౧వ తేదీని ఒక వ్యాయామశాలను కూడ స్థాపించినది. సభ్యులలో సభ్యులకును, స్థానికములగు టెన్నిసు మండలులతోను తరుచుగ టెన్నిసు పందెములు జరుగుచుండును.

## హిందూ మహాసభ

ఇది ౧౯౩౭ ప్రాంతముల స్థాపితమైనది. దసరా, దీపావళి, వైశాఖ సంతర్పణములు మొదలగు సాంఘికములు, మతసంబంధములు నగు పండుగలు జరుపుచు, అందుమూలమున గ్లాస్గో నివాసులగు హిందువులకు మతానుష్ఠానములందు తోడ్పడుట దీని ఆశయములలో నొకటి. బాల్యవివాహములు, వర్ణాంతరవివాహములు, 'మతము నిరర్థకమా' మొదలగు విషయములపై నిది సభలును చర్చలును జరుపుచుండును. ఈ సభ కావించు ముఖ్యమగు మతి యొకపని సరంగుల మతాంతర స్వీకరణమునకు చెందినది. ధనము శీలసంపదయు కొఱవడిన సరంగులు సులభముగ దుర్భ్యాసములకు లోనై, తమ చిక్కులు తొలగుటకు మతాంతర స్వీకరణము మంచిమార్గమని తలంతురు. హిందూమహాసభ యీ అనావశ్యక పరివర్తనముల మాన్ప సమకట్టి, అచ్చటిభాష తెలియక మిగుల నిబ్బందిపడు వారికి 'పాస్ పోర్టులు' (నిర్గమన అను మతులు) సంపాదింప పాటుపడును.

## గ్లాస్గో ముస్లిము సమాజము

ఈ సమాజము సైతము పెక్కు వత్సరములకు పూర్వమే స్థాపితమయ్యెను. బహుశః, అప్పటి కిట్టి యేర్పాటుల కుజ్జీవన మిచ్చుటకు చాలమంది ముసల్మానులుండియుందురు. ఇప్పుడు దానికి ప్రత్యేక కార్యధోరణియేమియు లేదు; ముసల్మానులును హిందూసోదరులతో కలయుచు మెలయుచు హిందూభోజన సంతర్పణములందే పాల్గొనుచున్నారు. ఇప్పుడీ సమాజము నామమాత్రావశిష్టమై యున్నది. సభ్యులు కడు తక్కువమంది. ఇప్పుడు సభ్యులుగా నున్న వారెల్ల అధ్యక్షుడును, కార్యదర్శిమాత్రమేయని తోచును.

తామీనదము నాంగ్లమున గావించిన రాజాప్రతాప్ ప్రదర్శనము గ్లాస్గోయందలి భారతీయ సమాజములు గాంచిన ఒక ముఖ్యమగు అభ్యుదయము.

# గ్లాస్గో చిత్రములు




గ్లాస్గో విశ్వవిద్యాలయము (౧)




గ్లాస్గో విశ్వవిద్యాలయము (౨)



గ్లాస్గో రాజకీయ చికిత్సాలయము కొరకై Rag day సందర్భమున చందా వసూలు చేయ వెడలిన ఇద్దరు భారతీయవిద్యార్థులు



గ్లాస్గో భారతీయసంఘకార్యదర్శులు



౧౯౩౨ ఆగస్టు ౨ వ తేదీని గ్లాస్గో మిల్న్‌గేవీయందలి ఎల్లెన్‌గోవన్ కాగితపు పరిశ్రమాలయమును సందర్శింప నేగినప్పు డాకస్మికముగ తీసిన భారతీయ సంఘసభ్యుల సముదాయ చ్ఛాయాచిత్రము. ఆ కర్మాగారముననే పనిచేయుచున్న శ్రీ. టి. వెంకాజీగారు వారి కాతిథ్యమిచ్చి కావలసిన విశేషములు చూపించిరి.

ఎడమనుండి కుడికి-పై వరుస

౧. అరవిందకుమార సేను, బి. యస్‌_సి. (కలకత్తా.)
౨. రమణీకుమార మిత్ర, బి. ఏ.
౩. టి. వెంకాజీ, బి. ఏ.
౪. అశోకకుమార రాయి.
౫. పహానీచరణ రాయి.
౬. పన్నామ్ పులము (సింహళము.)
౭. యస్. యమ్. జోషీ.
౮. అబ్దుల్ గఫూర్.

ఆసీనులు

౯. దీనబంధునాథ దాసు.
౧౦. హరిపద పాలు (వ్యవసాయ విద్య.)
౧౧. యోగేశలాలు షహా.
౧౨. బిగజకుమార మజుముదారు.
౧౩. గోస్తాబిహారీ షహా.
౧౪. రామనాథ లాహిరీ.

(౩, ౮, ౧౦-అంకెలవారు తప్ప సందఱును ఎంజినీరింగు చదువువారే.)

# ఆరవీటి వంశచరిత్ర

నేలటూరి వెంకటరమణయ్యగారు, యం. ఏ., పి-హెచ్. డి.

## పీఠిక

ఇందువెంట ప్రకటించిన ౨౮౩ ద్విపదపాదములును ద్విపద బాలభాగవతమను గ్రంథమునుండి కైకొనబడినవి. ఈగ్రంథమును దోనూరి కోనేరునాథు డనుకవి శక. ౧౪౭౨ లో వ్రాసి ముగించి ఆరవీటి బుక్కరాజునకు మునిమనమడును, అళియరామరాజునకు జ్ఞాతియు, సమకాలికుడును నయిన అవుకు చినతిమ్మరాజునకు అంకితమిచ్చెను. ఈకవియే సదరు బాలభాగవతమును పద్యకావ్యముగ వ్రాసి పై చినతిమ్మరాజు నానతిచే నాతని తండ్రియైన ఆరవీటి రామరాజు తిమ్మరాజున కంకితమిచ్చెను. ఈ రెండు గ్రంథములును మద్రాసు ఓరియంటల్ మ్యానుస్క్రిప్టు లైబ్రరీయందు బ్రౌన్‌దొరవారిహయాంనుండి యుంటున్నవి. అయితే యీ గ్రంథములను జదివినవారనేకులు లేరు. లైబ్రరీలోని చెదపురుగులకు ఆహారమగుచు వచ్చినవి. వాఙ్మయపక్షమున వాటివిలువ యెట్టిదైనను అనర్ఘములైన చారిత్రకవిషయము లనేకము లుండుటచే, చరిత్ర రచయిత కవి పెన్నిధులవంటివి. వీటి ప్రాముఖ్యమును పాఠకులకు దెల్పుటకు సదరు లైబ్రరీపండితు లేప్రయత్నమును జేసిన ట్లగపడదు. క్యాటలాగులలోనికి ఎక్కక శిథిలమగుచుండు నుద్గ్రంథము లనేకములు గలవు. క్యాటలాగులోనికెక్కిన గ్రంథములోని ముఖ్య చరిత్రాంశముల సంగ్రహవర్ణనయు బహుఅజాగ్రత్తతో జేయబడియున్నది. కావున చరిత్ర పరిశోధకులు లైబ్రరీ క్యాటలాగులు చూచుటతో తనివినందక, బ్రౌన్‌దొరగారుసంపాదించిన మాతృకలను (చెదపురుగులు వానినుపేక్షించియున్న) కూడ శోధింపవలయునని వేడుకొనుచున్నాను.

ద్విపద బాలభాగవతములోని ఆరవీటివంశావళి నిందు ప్రత్యేకముగ నెత్తివ్రాసి, అందలి ముఖ్యాంశములను గూర్చి నాకెరుకయున్నంతవరకు ఇతరగ్రంథములయందు చెప్పబడిన విషయములను అధోజ్ఞాపికలనుగ బ్రకటించితిని. ఆరవీటిచరిత్ర ద్విపద బాలభాగవతములో రెండుచోట్లయందు వర్ణింపబడియున్నది. పీఠికయందలి వంశచరిత్రసంగ్రహము; కడపట ఈ వంశచరిత్రయే విపులముగ వ్రాయబడియున్నది. ఈకడపటిదానిని ఇచ్చట మూలముగ గ్రహించితిని. పీఠికలోని వంశవర్ణనను తత్తదుచితస్థలములయందు స్క్వేయర్ బ్రాకెట్లలో [ ] నిమిడ్చితిని. ఆరవీటివంశచరిత్రాత్మకము లగు ననేకసమస్యలను గూర్చి నాతోడ జర్చించియు, నిరంతరము నాకు ప్రోత్సాహము కలుగచేసియు నాకు దోడ్పడిన నామిత్రులు మల్లంపల్లి సోమశేఖర శర్మగారికి నా కృతజ్ఞతాపూర్వక నమస్కారముల నర్పించుచున్నాడను.

ఈచరిత్రయం దుదాహృతములయిన గ్రంథములయొక్క సంగ్రహనామ సూచిక

రా. రా.=రామరాజీయము, నర. భూ.=నరసభూపాలీయము, రా. = రామాభ్యుదయము, పరమ.=పరమయోగివిలాసము, సాం. పా. = సాంబోపాఖ్యానము, వసు చ. = వసుచరిత్రము, స్వ. మే.క.=స్వరమేళకళానిధి, ద్వి. బా. భా.=ద్విపద బాల భాగవతము, పద్య బా. భా.=పద్యబాలభాగవతము, సోర్సస్ = ది సోర్సస్ ఆఫ్ ది విజయనగర యెంపైర్, కృ. రా. వి. = కృష్ణరాయవిజయము, క. పూ.=కళాపూర్ణోదయము.

ద్విపద బాలభాగవతంలో వర్ణింపబడిన ఆర్వీటి వంశము.



# ఆరవీటివంశవృక్షము

- తాతపిన్నమ I
  - m. నూరాంబిక — కోటికంటి రాఘవ
  - m. గొంకలదేవి — సోమదేవ
    - రాఘవరాజు
      - పిన్నమ II
        - ఆరవీటి బుక్క m. బల్లమ్మ
          - రామరాజు
            - (1) m. శోభళాంబిక
              - రాయన m. వల్లభదేవి
                - వరద
                - బల్ల
              - గోప m. శోభళదేవి
                - రాయన
            - (2) m. లక్కమ్మ
              - (1) తిమ్మ
              - (2) కొండ
              - (3) శ్రీరంగ
            - (3) m. రంగమ్మ
            - (4) m. అమలమ్మ
              - జగ్గ m. వోబాంబ
                - రంగ
                - రామ
                - జగన్నాథ
                - కృష్ణప్ప
              - శ్రీరంగ m. శ్రీరంగమాంబ
                - తిమ్మ
                - రామ
                - అప్ప
                - జగ్గ
                - శ్రీరంగ
                - శోభళ



(1) m. చెట్టమ్మ
(2) m. లక్ష్మమ్మ
(3) m. గోపమ్మ
(4) m. తిరుమలమ్మ
ండరాజు
తిరుమల
అప్ప
రామ
m. వెంగళాంబ
ఓబళ
తిమ్మ
ఎఱతిమ్మ
కోన
శ్రీరంగ
m. జానమ్మ
(2) m. కోనమాంబ
వెంకటేశ్వర
కోనేరుతిమ్మ
కొండరాజు
తిరుమల
విట్ఠల
చినతిమ్మ
పాపతిమ్మ
మూర్తి m. తిమ్మాంబ
రంగ
ఓబళ
పాంచాల
రామ
కృష్ణ
సింగర
విట్ఠల
(1) m. కొండమ్మ
(2) రంగమ్మ
కోనేటిరాజ
పెదతిమ్మ
చినతిమ్మ
m. తిరుమలదేవి
ఓబళ
కొండ
తిమ్మ
రంగ
m. తిమ్మాంబ
కోన
తిమ్మ
అళియరామ
ఎఱతిమ్మ
వెంకటాద్రి

ద్విపద బాలభాగవతంలో వర్ణింపబడిన ఆర్వీటి వంశము.

# ఆరవీటివంశవృక్షము



- (1) m. నెట్టమ్మ
  - కొండరాజు
    - (1) m. జానమ్మ
      - వెంకటేశ్వర
    - (2) m. కోనమాంబ
      - కోనేరుతిమ్మ
      - కొండరాజు
  - తిరుమల
  - అప్ప
  - రామ m. వెంగళాంబ
    - ఓబళ
- (2) m. లక్ష్మమ్మ
  - తిమ్మ
  - ఎఱతిమ్మ
- (3) m. గోపమ్మ
  - తిరుమల
  - విట్ఠల
  - చినతిమ్మ
  - పాపతిమ్మ
- (4) m. తిరుమలమ్మ
  - కోన
  - శ్రీరంగ

- మూర్తి m. తిమ్మాంబ
  - ఓబళ
  - పంచాల
  - రామ
  - కృష్ణ
  - సింగర
  - విట్ఠల
- రంగ

- (1) m. కొండమ్మ
  - కోనేటిరాజ m. తిరుమలదేవి
    - ఓబళ
    - కొండ
    - తిమ్మ
    - రంగ
  - పెదతిమ్మ
  - చినతిమ్మ
- (2) రంగమ్మ

- m. తిమ్మాంబ
  - కోన
  - తిమ్మ
  - అళియరామ
  - ఎఱతిమ్మ
  - వెంకటాద్రి

## మూ ల ము

నమి తారితాతపిన్న[1] మహీవిభుండు
సమితిలో జెరకు రాచనరేంద్రు గెలిచి[2]
అలవుగా సప్తాంగహరణం బొనర్చి
పొలుపొందె భువి మన్నెపులియనుపేర
బిరుదాంచితుడు తాతపిన్న భూవరుడు.
హరికాంతబోలు సూరాంబికయందు
ఘనశౌర్యుడౌ కోటికంటి రాఘువుని*
గనియె నతండు సంగ్రామంబునందు
రాజిల్లుకంపిలి[లి]రాయసైన్యముల
దేజంబుమెరయంగ దెగువమై గెలిచి
గరిమె గైకొనియె నగ్గండరగూళి
బిరుదంబు సరి నృపుల్ బేర్కొని పొగుడ
మరియు నాపిన్నయ మనుజేంద్రచంద్రు
కొరలు రెండవపత్ని గొంకలదేవి
సోమవంశాంబుధి శోభితసోము
సోమిదేవుండను శూరుని గనియె[3].
నరులకసాధ్యమైన మొసలిమడుగు
ధర నెన్నదగినసాతానికోటయును
కడు నుతింపగజాలు కందనవోలు
కడిమివిశేషంబు గలకల్వకొలను
అరుదైనరాచూరు నలయేతగిరియు
నిరుపమంబగు గంగినేని కొండయును
ననగ నొప్పారు నేడైనదుర్గముల
వినుతధాటీ మహావేశంబు నెరపి

1. రా. రా. 172, 173, 174, 175, 176, 177.

పద్య బా. భా:—"ధర బ్రసిద్ధుండైన తాత పెన్నమరాజు తగ నన్న నేరాజు తాత తాత."

2. చెరకు రాచనరేంద్రునిగూర్చి రా. రా. నందునేమియు చెప్పియుండలేదు. సదరు గ్రంథములోని తాత పిన్నమరాజుయొక్క బిరుదుగద్యయం దారాజుకు "సమస్తదురాచార చెరకు రాచనాయకరాజ సప్తాఙ్గహరణ" యను బిరుదున్నట్లు చెప్పబడియున్నది. ఈ చెరకురాచనాయకు డెవ్వడో, యెచ్చటివాడో తెలియదు. 'సమస్త దురాచార' యన్నమాటవల్ల అతడు దుర్మార్గుడని యెరుకపడుచున్నది.

* ఈకోటికంటి రాఘువునివృత్తాంతము రా. రా. లో కానరాదు. ఇతడు కంపిలిరాజు సైన్యములను జయించి, యతని రాజ్యసంప్రాంగములను, హరించి 'గండరగూళి' యను బిరుదంబు గొనియెనట! ఆరవీటి వంశజులగు రాజులందు కొందరు ఈబిరుదును ధరించినవారు కలరు. ఆరవీటి బుక్కరాయని మనుమడును, అవుకువంశమునకు మూలపురుషుడును నగు రామయ తిమ్మరాజుగూడ కంపిలిరాజును జయించి యాతనిరాజ్యపు సప్తాంగములను హరించి గండరగూళి, యన్నబిరుదును గొన్నట్లు పద్య బా. భా. నందలి "సంగరాంగణచర్య కంపిలిరాయ సప్తాంగ గండరగూళి సద్బిరుదాది సంగ్రహణోజ్వలా" యన్న పద్యభాగమువల్ల దెలియుచున్నది. ఈతిమ్మరాజు కాలమున కంపిలిరాజ్యము లేదు. కావున ఇత డారాజ్యమును గెల్చుట యసంభవము. మఱి, దీనికి సమన్వయ మెట్లన్న "బిరుదులు" వంశపారంపర్యముగ వచ్చుచుండెనని తలచుటయే.

3. సోమిదేవునిచరిత్ర రా. రా. 178–186 పద్యములలో వర్ణింపబడి యున్నది. అందు 179 పద్యములో నితడు పెక్కుయజ్ఞములను జేసినట్లు చెప్పబడినది. "ప్రకటముగ ధనము విప్రతతికి నిడి సవనములు సోమదేవుడొనర్చెన్" అని. మఱియు నీసోమదేవుని ప్రస్తావన మఱికొన్ని గ్రంథములయందును గలదు చూడుడు:

పద్య బా. భా:—"భావజ్ఞుడగు సోమిదేవభూపాలు డేఘర్మప్రవర్తకు తండ్రి తండ్రి."

సురపతియోగి యాశుభ్రాంశువంశ ౨౯½
కరు డొక్కనాడు లగ్గల గొన్నవాడు.[4]
కలిత చౌరాశిదుర్గవిభాళబిరుదు
డలఘుతేజోఘను డారాజమౌళి
దండిమీరంగ నాతడు గంగినేని
కొండలగ్గలచేతగొనియందు పరుల ౩౦.
సుడియంగనీని గుజ్జులవీరినేని
నడబాలయన్న[5]రుద్రప్పనాయకుని[6]
ఘనుని గౌరారెడ్డి[7]గంగినాయకుని[8]
గినిసినరిపులెల్ల గగ్గోడుపడగ
చట్టలు చీరిచి సంరంభ మెసగ ౩౧½
గట్టించెదూరుపుగవనికంబములు[9]
[10]మణిగిల్లదుర్గంబు మదిలోన గలుగు
కణక దాడిగ నేగి కైకొని నిలిచి
గోసంగిమన్నెని గుపితాన్యనృపతి
శాసకుండగుట మస్తకము గొట్టించి ౪౦
ఆరసి తత్పట్టణాగ్రతటాక
భైరవుముంగలబలియొసగించె.
మరియు నతం డాజిమహామండు మలక
గరకరి యలిగి యగ్గలిక బుట్టించి
బెలుకురి యాతండు బిడ్డపే రిడిన ౪౧½
దలకెల్ల దొలగించి దయసేసి కాచె

4. ఈ యేనుదుర్గములను గూర్చి రా. రా. 182 పద్యములో చెప్పబడియున్నది. ద్విపద బా. భా.లో నీయేడుకోటలను సోమదేవు "డొక్కనాడ లగ్గల గొన్నవాడు" అని చెప్పబడియున్నది. ఆరవీటి వంశీకుల శాసనములలో పెక్కింటియం దట్లే యున్నది. రా. రా. లో ఏడుకోటల ప్రస్తావమున్నను, "ఒక్కనాడే" లగ్గలు గొన్న ప్రస్తావము లేదు. దీనినే ఊతగాగొని మామిత్రులు రంగస్వామి సరస్వతిగారు తమ 'సోర్సెస్' లో ఇట్లు వ్రాసియున్నారు: "It (నరపతివిజయం) does not say that he captured them all in a single day which statement is an addition made by tl e latter day courtiers of the empire."

"ఒక్కనాడు లగ్గలుగొన్నవాడు" అనువాక్యము బాలభాగవతమం దున్నట్లు శ్రీ సరస్వతిగా రెఱుగరు. మఱియు నీగ్రంథము రామరాజీయముకంటె పూర్వము అనగా శ. 1469 లో వ్రాయబడినదనియు వీరెఱుగరు. "ఏకదివసఘటికైక ధాటిహఠాహృత కోటరాచూరు, సాతానికోట, కందనవోలు, యాతగిరి, కలువకొల్లు, మొసలిమడుగు, గంగినేని కొండాభిధాన సప్తదుర్గ" అను రా. రా. లోని వాక్యమువంక గన్నెత్తియయిన చూడరైరి. కావుననే యిట్లువ్రాసిరి. నిజమో, అబద్ధమో, సోమదేవుడు పైయేడుకోటలను ఒక్కనాడే పట్టుకొన్నాడన్న ప్రతీతి పురాతనమైనదే.

5. "నడబాలనాయకుని" అని రా. రా. 180.

6. "రౌద్రరసోన్నిద్రు రుద్రపాధిపు" అని రా. రా. 180.

7. "మహాశౌర్య గౌరారెడ్డి" అని రా. రా. 180.

8. "సాహసాంక గంగినాయకుని" అని రా. రా. 180.

9. ఈవిషయము రా. రా. 180 లో వర్ణింపబడి యున్నది.

10. ఈదుర్గము రా. రా. లో పేర్కొనబడలేదు. ఈదుర్గమెచ్చటిదో, యీగోసంగిమన్నీ డెవ్వరో మన కెరుకపడదు. ఒక్కగోసంగిమన్నీ డే కాదు. సోమదేవునిచే జయింపబడిన యితరదుర్గాధిపతు లెవ్వరో మనకు దెలియదు. భావిపరిశోధనవల్ల వారిచరిత్రము బయలుపడవలసి యున్నది.

తెలివి సర్వదినాము తేజీల నచట
గలుగునర్థులకు ద్యాగంబుగా నొసగ[11].
అరుదుగా మరియును నతడరి బిరుద
తురియధట్టసమస్తదుర్గవిభాళ
మాళవరాజేంద్రమస్తకశూల[12]
చాళుక్యచక్రేశ జగనొబ్బగండ
మన్నె సురత్రాణమానిత బిరుద
మన్నెరగండసోమకుల ప్రదీప
ధరణీంద్ర యే బిరుదరగండముఖ్య
బిరుదజాలంబుచే బెంపువహించె[13]
నయవిశారదుడు పిన్నయసోమవిభుడు.
జయశాలిభూపాల సార్వభౌముండు
మనుజేశయతడు కామలదేవియందు.
గనియె మహాత్ము రాఘవదేవనృపతి[14]

11. రా. రా. 180 పద్యమునందు సోమదేవుడు మహమ్మదును పెక్కుపర్యాయము లోడించినట్లున్నది:

సీ. కదనరంగంబునం గరితురంగమవీర వితతితోం బలుమారు విఱుగదోలి
యమితోగ్రశౌర్యు మహమ్మదుబట్టి నీ పేరుబెట్టెదను గుమారున కది
గాక భవత్పాదకమలంబు నదురంట దండంబుబెట్టెద దన్న గాచి
విడువుమున్నను గాచి విడిచియర్థులకును వష్టిశతంబు నశ్వములవాని
తే. చేత నిప్పించి శరణన్న బ్రీతిం గాచు...............

ఈ మహమ్మదుమలక బహమనీ సుల్తానగు మహమ్మదు I అని సరస్వతిగా రనుచున్నారు. అట్లునేని సోమదేవుడు బుక్కరాయలు I కు సమకాలీను డగును.

12. ఈ బిరుదు ఆరవీటి బుక్కరాజు మనుమడును నవుకప్రభువును నగు తిమ్మరాజుకున్నట్లు పద్య. బా. భా. లోని యీ క్రిందిపద్యమువలన తెలియుచున్నది:—

క. మన్నెదళ ధూమకేతువ, మన్నియ మృగబేటకార మాళవరాయా
త్యున్నత మస్తకశూలా, మన్నె సురత్రాణబిరుద మన్నెవిభాశా.

13. రా. రా. లోనిబిరుదు గద్య (183) యందు సోమదేవుని బిరుదులు పెక్కులుగలవు. అందు చరిత్ర పరిశోధకునకు బనికివచ్చునవి యీ క్రిందివి:—

"నాకులపాటి ముదుగంట్యానె గొందికుంతి సరవిజయలక్ష్మీ సమక్షీకరణలక్షిత, నాకులపాటి వీరక్షేత్ర భారతీమల్ల, ముదుగంటి వీరక్షేత్ర భారతీమల్ల, ఆనెగొంది వీరక్షేత్ర భారతీమల్ల, కుంతి వీరక్షేత్రభారతీమల్ల, (సర) వీరక్షేత్ర భారతీమల్ల బిరుదధరితానుభావ, "సత్యగుణవాసుదేవ", ఇత్యాదులు. ఈ బిరుదులగూర్చి చింతించిన సోమదేవుడు పెక్కు కదనరంగములయందు జయలక్ష్మిచే వరింపబడిన ప్రోడయని తోచుచున్నది.

14. ఇతనిచరిత్రము రా.రా.187–193లలో వర్ణింబడియున్నది. రాఘవరాజు పెక్కుజన్నములనుజేసెనట.

"పరబలభేది రాఘవనృపాలుడు పంకజనాభుగూర్చి య
ధ్వరములు నగ్రహారము లుదాత్తమతిన్ దగజేసి ధారుణీ సురులకొసంగె..." రా. రా. 183.

ఇతనిగురించి నర. భూ. లో—"ఘనభుజాశౌర్య రాఘవుడు రాఘవదేవ ధరణీశు డేరాజు తాతతాత" అనియు, పద్య. బా. భా. లో "గురుశౌర్య ధైర్యభాసురుడు రాఘవదేవవసుధీశు డేశూరు తండ్రితండ్రి" అనియు చెప్పబడియున్నది. ఇతనికి పెక్కుబిరుదులున్నట్లు రా. రా. లోని 189 బిరుదుగద్యవల్ల తెలియుచున్నది. అందు చరిత్రాంశములను దెలియజేయునవి యీ క్రిందివి. "యవనబల మర్దనోత్సాహ", "తురుష్క బలసంహార విహార", "శబర కులబల నిహననవినోద". "వాసుదేవ చరణకమల సేవాసక్తచిత్త" అన్న బిరు దీతడు వైష్ణవుడని తెల్పుచున్నది.

అతనికి బిన్నభూపాగ్రణి[15]యొదవె
సతతసౌభాగ్య బాచలదేవియందు
ఆపిన్నభూపాలుఁ డారె వీడనగ
నేపారుపురి దన కిరవుగా నిలిచి[16]
సకలమహీపాలజాలంబు గొలువ ౧౯
ప్రకటితతేజుఁడై రాజ్యంబుఁ జేసె.
ప్రభవించె నతని కౌభళదేవియందు
ప్రభమణి బుక్కభూపాలచంద్రుండు[17]
యెక్కువగుణముల నిమ్మ్యారెవీటి
బుక్కనరేంద్రుండు భువిబుట్టనంత ౨౦
వారిజాప్తోదయవర్ణితవేళ
దారలగతియయ్యె దక్కరాజులకు.
నరనాథమణి సాళ్వనరసింగరాయ
వరసఖుండయ్యె బుక్కవసుధేశుఁ డమరె.[18]
బుక్కభూపాలుండు బుధులకునెల్ల ౨౧
దిక్కతండై యనంగ దేజంబునందె.
[అనవద్యగుణుఁడైన యతని వంశమున
ఘనుఁ డారెవీటి బుక్కనృపాలుఁ డెసగె
నరనాథమణి సాళ్వనరసింగరాయ
వరసఖుండయి బుక్కవసుధేశుఁ డలరె.]

15. పిన్నదేవుని వృత్తాంతము. రా. రా. 194-198 లలో వ్రాయబడియున్నది. ఇతని ప్రస్తావన యితర గ్రంథములలోను కలదు.

పద్య బా. భా. "పెన్నమరాజన్యు డున్నతసౌజన్య వినుతప్రతాపు డేపనునితండ్రి."

నర. భూ. "నగనుతుఁడైన పిన్నమరాజసౌజన్య ధన్యుఁ డేరాజన్యు తాతతండ్రి."

16. ఇచ్చట పిన్నభూపాలుఁ డారెవీడు దనకు ఇరవుగ నిలిచినట్లు జెప్పబడియున్నది గదా. రా. రా. 182 లో నీపిన్నయ తాతయగు సోమదేవునికే ఆరవీడుపురము రాజధానియైనట్లు జెప్పబడియున్నది. "ధరను దొడ్డని వినుతింప దగినయట్టి, యారకీటిపురాధ్యక్షుఁ డనుచుదాత, పిన్ననృపసోమ దేవుండె యెన్నదగియె..." వీటి రెంటికి సమన్వయ మెట్లో?

17. ఆరవీటి బుక్కరాజు రా.రా. 199-206 పద్యములలో వర్ణింపబడియున్నాడు. ఇతరగ్రంథములుగూడ నీతనిగూర్చి చెప్పుచున్నవి. రా. "సోమవంశంబునకు మేటియగు నార్వీటిబుక్కభూపాలసుత్రాముఁ"డని కీర్తింపబడియున్నాడు. మఱియు, క. పూ. లో,

"ఆచంద్రునివంశంబున, భూచంద్రుం డారెవీటిబుక్కనరేంద్రుం
డాచక్రవాళశైల, ప్రాచక్రస్ఫూర్తికీర్తిసాంద్రుఁడు పుట్టెన్." అని ప్రశంసింపబడియున్నాడు.

నర. భూ. లో "యమితవైభవుఁడైన యార్వీటిబుక్కభూతలనాథు డేరాజుతండ్రితండ్రి" అనియున్నది. కృ. రా. వి. "చక్కరవిలుకాని చక్కందనముగల్గి చొక్కమా నార్వీటిబుక్కరాజు". ఇంకను నితనిగురించి పద్య బా. భా. నందును కొంతకలదు.

18. "సాళువ నరసింహరాయరాజ్యప్రతిష్ఠాపనాచార్య" అను రా. రా. లోని బిరుదవాక్యము ఈవిషయమునే దెల్పుచున్నది. మఱియు పద్య బా. భా. లోని

"అతఁడు దన మన్నెపులి యని యఖిలదిశల, జెలగి పొగడ సాళువనరసింగరాయ
రాజ్యసంస్థాపకుండయ్యె బ్రాభినారి, వీటిబుక్కనరేంద్రుఁ డుద్ఘాటితారి."

యనుపద్యము నైతము పైవిషయమునే యెరుకపఱచుచున్నది.

ఆమహీపతికి బల్లాంబికయందు
రామనృపాలుండు రాజేంద్రుఁడొదవె.[19]
హరిపాదతీర్థంబునందు బాంధవులు
గరళంబు వెట్టినగతి యెఱింగియును
తెరగొప్పబుద్ధి తత్తీర్థంబునాని
యరిగించుకొనియె రామావనివిభుఁడు.[20]
[నామహీపతికి బల్లాంబికయందు
రామనృపాలుండు రాజేంద్రుఁడొదవె.
నెందః నెన్నగజాలు నిద్ధశౌర్యమున
గందనవోలి దుర్గంబులోనుండి
బుక్కయరామ భూభుజుఁడెల్లనృపుల
నెక్కువ యిది యని యెన్నంగజాలి
వీరులు డెబ్బదివేవు రాశ్వికులు
జేరి కొల్వంగవచ్చిన సవా నెదిరి
కలనంది పంచబంగాళంబు సేసి
గెలిచె దచ్చరితంబు గీర్తింపదరమె?[21]
వినుతింపదగు నాదవేని దుర్గమున
ననతుఁడై యుండు కాచాధీసు గెలిచి
అరుదుగా సప్తాంగహరణంబు సేసె

19. రామరాజుచరిత్ర రా. రా. 207–215 పద్యములయందు వర్ణితము.

ఇతరగ్రంథములయందును నీతనిప్రస్తావము గలదు. నర. భూ. లో, "అసమానదాన విద్యాధురంధరుఁడగు రామరాజేంద్రుఁడే రాజుతండ్రి."

20. రా. రా. 209. ఈజ్ఞాతులెవ్వరో వారు రామరాజునకేల విషమిడిరో తెలియదు.

21. ఇచ్చట రామరాజుసైన్యమునుగూర్చి యేమియు చెప్పలేదు. రా. రా. లోని 208 పద్యములో సదరు దండుయొక్క వివరణము వర్ణింపబడియున్నది. చూడుడు:

మదకరికోకటి కిర్వదిగుఱ్ఱములు గుఱ్ఱమునకును విలుకాండ్రు ముగురు విచ్చు
కత్తులవారీటెకాండ్రట్ల నర్రిల్ల నిట్టియేనుగులును జట్టు మూడు
వేలయేనూరు నుద్వృత్తితో నడవంగ గందనోల్సాధింపగా దలంచి
మొనదుసించి గట్టిగా ముట్టడిదిగిన నాబిబ్బిని మిక్కిలి యుబ్బణంచి"

అనగా రామరాజుసైన్యములో 3,500 ఏనుగులు, 70,000 గుఱ్ఱములు, 630,000 కాల్బలమును ఉండెను. ఇట్టిభీకర సైన్యముతో 70,000ఆశ్వికులతోవచ్చి కందనవోలును ముట్టడించిన సవాబిబ్బిని(అనగా ఆదిల్ ఖానుని)ఉబ్బణగించెను. ఈవిషయము పద్య.బా. భా. లోగూడ జెప్పబడియున్నది.

"గబ్బుల్ డెబ్బదివేవురాశ్వికులు వేడ్కన్ గొల్వగా గిన్కపె
న్మబ్బుల్ గప్పగ గందనోలు గొను వేడ్కన్ జుట్టుముట్టన్ సవా
ఓబ్బి నుబ్బణగించి తోలె నరిరాడ్భీముండు లంకాసర
న్యబ్బంధ్రాభుడు బుక్కభూవిభుని రామాధీశుఁ డాహో యనన్."

ఈపద్య మెట్లో మ్యాన్యుస్క్రిప్టు లైబ్రరీవారి ట్రయన్నియల్ క్యాటలాగునకెక్కక తప్పించుకొన్నది.

గరిమొన్నతుండు బుక్కయరామవిభుఁడు[22].
మహిమవంతుఁడు చిత్తమతకృతాంతుండు
సహజధైర్యుఁడు రామజనపతి వెలసె.]

*        *        *        *

ఆరామభూపతి కంగనామణులు
పేరైనయోభళాంబిక లక్కమమ్మ
యంబుజనేత్రి రంగమ్మయు నమల ౮౫
మాంబయు ననునల్గు రైరందులోన[23]
ఓభళాంబికకు రాయనరాజుగోప

22. చూడుఁడు : పద్య. బా. భా. "హరిభోగోన్నతు ఁ దవేనిపతి కాచాధీశ సప్తాంగసం| హరణోదంచితు డారవీటి నగరాధ్యక్షుండు బుక్కక్షమా పరపుత్రుండగు రామభద్రుడు హరిద్వల్గ్య ద్యశో జాహ్నవీ| స్థిరసౌభాగ్యుడు దత్సముల్ గలరె ధాత్రిన్ మూడుగాలంబులన్."

ఈపద్యముగూడ మ్యాన్యుస్క్రిప్టులైబ్రరీ ట్రయన్నియల్ క్యాటలాగులో కాన్పించదు.

ఆదవేనికోటమహాబలిష్ఠమైనది. ఈకోట రామరాజుపట్టుకొన్న వృత్తాంతము రా. రా. లోని 210 వ బిరుదగద్యయందలి "నిగవాపాదవనీదుర్గ నివాసికాసవుడయ దుర్మదఖలనిర్మథన" అన్న బిరుదవాక్యముచేత సూచితము. ఈ"కాచాధీశుడు" లేక "కాసవుడయ"డెవ్వరికి "అనతు"డో, తత్కారణముగ రామరాజాతనిపై నేల దండు వెడలవలసివచ్చెనో తెలియదు. ఈకాచాధీశుడు సంగమవంశముపక్షమువాడైయుండి, తద్వంశజులకడనుండి విజయనగరసింహాసనము నొడిచికొన్న సాళువనరసింగరాయలను గికురింపగా ఆతని యధికారమును స్థాపించుటకై ఆరవీటి రామరాజు ఆదవనిపై దండువెడలియుండును. ఇది మాయూహ. నిజము భావిపరిశోధన వల్లగాని బయల్పడదు. రా. రా. ఇతనిబిరుదుల ననేకములను దెలియజేయుచున్నది. (1) "హల్లిసునేనోల్లాసిత సప్తదళ సైంధవ గ్రహణపరాక్రమధుర్య". ఈ హల్లీసునే నెవ్వరు? క్రీ. శ. 1492 మొదలుకొని 1528 వఱకు కళింగదేశముపై ప్రభుత్వమునల్పిన ప్రతాపరుద్ర గజపతి తన "సరస్వతివిలాసము"లో జమునాపురాధీశ్వరుడగు హుసేన సాహియను తురుష్కుడు శరణాగతుడుకాగా శత్రువులనుండి వానిరక్షించితినని చెప్పుకొనియున్నాడు. (విభవసంవత్సరాది సంచిక, పుట 172) ఆరవీటి రామరాజుతండ్రియగు బుక్కరాజు "సాళ్వ నరసింగరాయపరసఖుం"డని బా. భా. తెల్పుచున్నది. ఇంతేగాక ఈబుక్కరాజునకు "సాళ్వనరసింహరాయ రాజ్యప్రతిష్ఠాపనాచార్య" యన్న బిరుదొక్కటి గలదు. కావున ఆరవీటి బుక్కరాజు సాళువ నరసింహరాయలకు సమకాలీనుడని నిస్సంశయముగా మనము నిర్ధారణ చేయవచ్చును. పై ఆరవీటి రామరాజు కుమారుడగు తిమ్మరాజు కృష్ణరాయల యన్నయగు వీరనరసింహరాయల సమకాలీనుడని పద్య బా. భా. తెలియజేయుచున్నది. కావున సదరు రామరాజు సాళువ నరసింహరాయలయొక్కయు, ఇమ్మడి నరసింహరాయల యొక్కయు సమకాలీనుడని మన మనుకొనవచ్చును. ఇందసాధ్యమేదియును లేదు. ఇమ్మడి నరసింహరాయల యధికారము క్రీ. శ. 1505 వఱకు జెల్లెను. ప్రతాపరుద్ర గజపతి 1492 లో సింహాసనము నధిష్ఠించి 1500 లలో దక్షిణ దిగ్జయయాత్రకు బయలువెడలెను.

పైదానివల్ల ఆరవీటి రామరాజుచేత నిర్జితుడైన హల్లీసునేనుడును, ప్రతాపరుద్ర గజపతికి శరణాగతుడై శత్రువులనుండి సంరక్షింపబడిన హుసేనసాహియును నేకకాలమువారగుట నిజము. అయితే వీరొక్కరా లేక భిన్నపురుషులా యనునది చింతింపదగినయంశము.

(2) "దుర్వారతర సవాయి సైనికహరణ." (3) "సవాబిబ్బిరాజ సప్తాంగహరణ మార్గధరణ." (4) "నిగవాపాదవ నీదుర్గనివాసకాసవుడయ దుర్మదఖలనిర్మథన." ఈబిరుదులను గూర్చి యింతకుపూర్వమే చెప్పియున్నాము.

23. ఇచ్చట రామరాజుయొక్క నలుగురు భార్యలపేరులున్న చెప్పబడినవి. వారిసంతతి వర్ణింపబడినది రా. రా. లో లక్కమాంబమాత్రము పేర్కొనబడినది. లక్కమసంతతిమాత్ర మందు వర్ణితము.

భూభుజుండను ననుపుత్రు లైరందు
శ్రీలుండు రాయనక్షితిపతి శీల
లాలితమైన వల్లభ దేవియందు
వరదభూపతి బల్లనసుధేశమణుల
నిరువురు తనయుల నేపార గాంచె
గోపభూవరునకు గుణశీలరూప
దీపితయాభళ దేవి మోదమున
మొనలేని పంచరాజేంద్రుని రాయ
జననాథు గనియె రాజకము నుతింప.[24]
యింక లక్కమదేవి కెనగుసంతాన
మంకించి పలికెద నాలింపు మధిప
ఆరామన్నపులక్కమాంబపుణ్యమున
ధీరత హేమాద్రితిమ్మభూవరుని
వరకీర్తికొండభూవరుని శ్రీరంగ
ధరణీశు మువ్వురు తనయుల గాంచె.[25]
అందగ్రజుండైన యా తిమ్మనృపతి
యిందువంశవతంసు డితడన వెలసె
రాజశిరోమణి రాజులరాజు
రాజచంద్రుడు రామరాజు తిమ్మయ్య.[26]
[యపదృష్టియగు నొక్క యాభీరునకును
నిపుణుండు వెంకటనిలయుండు చక్రి
యొకకంటిచూపు తానొసగి స్వప్నమున
ప్రకటుడై తిమ్మభూపాలు మన్నించి
ఓకృతకృత్య నీ కుర్వీశు లెనమొ?
నీకహో బలపుణ్యనిధి మోక్షమిత్తు
గరుణగోపాలునికడమచూపిమ్ము,
నరనాథయనుచు నానతియిచ్చుటయును
[27]గొలువులో నగ్గోపకునకు చూపొసగె.
బలబలభద్రు డాపాండువంశజుడు
ధన్యుండు రామభూధవు తిమ్మ నృపతి
సైన్యసమేతుడై చైత్రమాసమున
దండువోవుచునుండి తనభటుల్ త్రోవ
నెండిననోళ్ల దప్పెఋగించుటయును
నిండుచిత్తమునదోనిసిరంగరాజు
కొండనెత్తమున వైకుంఠునిదలచి
గోవిందు వేడ్కగ్రక్కుననొక్కబుగ్గ
భూవినుతంబుగా బొడమంగజేసె
నందలు జూడగా సన్నీర మచట
గ్రందుగావిలసిల్లె ఘటికాద్వయంబు.[28]
కడిమిమై మానువకడ రణక్షోణి

24. ఔభళాంబిక సంతానప్రస్తావన రా. రా. లో లేదు. చూ. రంగప్పరాజు సాం. పా. పీఠికను.

25. చూడు: రా. రా. 215, 216.

26. రా. రా. 219:

క. ఆతిమ్మనృపతిభూకాం, తాతిలకం బైన యవుకు దానేలుచు వి
ఖ్యాతిగ నప్పురి పేరక్, బ్రీతిని తనకులము వెలయ బెంపొందె మహిన్.

27. పద్య బా. భా.

"వెంకటేశ్వరునాజ్ఞ విగతదృష్టికి దృష్టి దయమీరనిచ్చె నే ధర్మమూర్తి

* * * *

తిమ్మభూపాలమణికి పుణ్యమ్మగాగ, బలుకజెన్నొందు శ్రీబాలభాగవతము."

28. పద్య బా. భా. "కరుణమీగాములగట్టుపై వేసవి బుట్టించె జలము లేభూనుతుండు." తిమ్మరాజు తనసైనికులడప్పిని డీర్చుటకు జలము లుప్పతిల్ల జేసిన స్థలము ద్వి. బా. భా. లో "దోనిసిరంగరాజు కొండనెత్తమున" అని చెప్పబడియుండగా నిచ్చట "మీగాములగట్టుపై"ననియున్నది. ఇచ్చట దోనిప్రస్తావము

గడుసరి నేదులఖానుజయించె.[29]
విక్రమంబున నాదవేని దుర్గంబు
విక్రాంతు లెన్న వేవేగసాధించి
సిరులతో వీరనృసింహరాయలకు

బరుషాత్ము దుర్గాధిపతి నొప్పగించి
గరిమస్వామిద్రోహగండపెండార
మరిభీకరముగ రాయ లొసంగ నొందె.[30]
లాలితకీర్తివిలాసుండు పద్య

---

లేదు. "చోనిసిరంగరాజుకొండనెత్తము"న్ను, "మీగాములగట్టు"న్ను ఒక్కస్థలముయొక్క పేరులే యని తోచెడిని. స్థలజ్ఞులు ఈసంశయమును దీర్పగలరు. అట్టివారెవ్వరేని భారతిపాఠకులలోనుందురేని, వారు సవరు పత్రికమూలమునగాని, వేరువిధమునగాని మాసంశయమును దీర్పప్రార్థితులు.

29. చూడు: పద్య బా. భా.

"... ... ... ... ... ...
మానవకడసవ బూనిపోరను బరాజయమునొందించె నేశౌర్యశాలి
అట్టిమజ్జనకునకు సత్యాభిరతున, కారవీటిరామక్షితిపాత్మజునకు
తిమ్మభూపాలమణికి బుణ్యమ్ముగాగ, బలుకజెన్నొందు శ్రీబాలభాగవతము."

30. ఈవిషయమే పద్య బా. భా. లోనుండి యిక్రింద నుదాహరించిన పద్యములవల్లను సూచింపబడినది. అయితే, ఈసందర్భమునందు పద్య బా. భా.లో ఆదవేని ప్రస్తావన లేదు.

సీ. "శ్రీవీరనరసింహుచే బత్రిద్రోహర గండపెండార మేఘనుడుగాంచె" మఱియు,

శా. "శ్రీమద్వీరనృసింహరాయనృపతి శ్రేయోదయాసాధిత
స్వామిద్రోహరగండనూపుర విరాజద్దామరాట్తిమ్మభూ
పామిత్యర్జితపుణ్యసత్ఫలసమస్తాశాంతవిశ్రాంతని
స్సీమోర్విప్రతిపాదనప్రతయశా శీతాంశువంశోనిధీ".

ఈసందర్భమునొక సంశయముమనమనస్సునకుఆపాదించుచున్నది. ఈతిమ్మరాజు, తండ్రియగు "బుక్కయరామవిభుడు"

" వినుతింపదగు నాదవేనిదుర్గమున
ననతుడైయుండు కాచాధీశుగెలిచి
యరుదుగాసప్తాంగహరణంబునేసె."

అని పైనజెప్పిబడియున్నదిగదా. మరల నీతిమ్మరాజు ఆదవేనినేల జయించవలసివచ్చెను? కాచాధీశు డోడిపోయిన పిమ్మట నాదవేని యెవ్వరి స్వాధీనమందుండినది? అరవీటి రామరాజు స్వాధీనమందా? అట్లనుకొనుటకు గొంత యెడమున్నది. ఈరామరాజు రెండవకుమారుండైన కొండరాజు ఆదవేని నేలుచుండెననియు, దత్సంతానమునకు ఆదవేనివారని పేరువచ్చెననియు రా. రా. 220 చెప్పుచున్నది.

క. దీనావనుడౌ కొండయ, హీనాధుం డాదవేని నేలుచ బరగెన్
దానును సుతులును దత్సం, తానం బాదవేని ధామము పేరన్.

కావున బుక్కయరామయరాజు ఆదవేనికాచాధీశునిగొట్టి యాదుర్గమును దన ద్వితీయపుత్రుడగు కొండరాజునకిచ్చెననుట సమంజసముగ గన్పట్టుచున్నది. అట్లయిన, వీరనరసింహరాయడు, ఇమ్మడి నరసింహరాయని సింహాసనమునొడిచి కొనగా సదరుకొండరాజాతనిపై గోపించి తిరుగబడెననియు, అతనినిజయించియే రామయ తిమ్మరాజు వీరనరసింహరాయలకృతజ్ఞతకు పాత్రుడై యాతనివల్ల స్వామిద్రోహర గండపెండెరమును బొందెననియును మనముదలంచవలసియున్నది. లేదా, బుక్కయరామరాజుచే జయింపబడిన కాచాధీశుడే ఆదవేనినేలుచుండి వీరనరసింహరాయలు సింహాసనము నధిష్ఠించిన పిమ్మట నాతనికి దిరుగబడగా స్వామిభక్తుడగు తిమ్మరాజు ఆతని జయించియుండవలయును.

బాలభాగవత ప్రబంధనాయకుడు.[31] * * * *

81 ఇతడు దోనేరు కోనేరునాథకవిచే విరచితమైన పద్యబాలభాగవతమునకు కృతిపతి. ఈగ్రంథమునందు తిమ్మరాజునకు సంబంధించిన పెక్కు చారిత్రికాంశములు జెప్పబడియున్నవి. ఇతడు ఉద్దండరాయడను నాతని జయించెను. పట్టి నాడు ప్రభువు నోడించెను.

క. గండరగూళికి గండర, గండని కుద్దండరాయగణవారణ శ్రీ
గండాంకున కెంతెంబర, గండనికిన్ బట్టివాడ గజసింహునకున్.

ఉత్సాహ. పండితాంబుజాతమిత్ర భయదజన్యమేదినీ
ఖండితాహితప్రకాండ కాండమండలీ జితా
ఖండలప్రశస్తశస్త్ర ఘనతరానుభావ వు
ద్దండరాయహృదయ భల్లదానకల్పభూరుహా.

పట్టువాడరాజును జయించినట్లీక్రింది పద్యపాదము సైతము దెల్పుచున్నది:

"... ... ... ... ని
త్యహితశ్రీపదపట్టవాడగజసింహా దానశౌర్యోదయా."

ఇతడు కళింగరాజును జయించెను. మహమదమలకకు ప్రాణదానము నొసగెను.

"సహజాంభోజదినేశ గౌడవరరాజ్యస్థాపనాచార్య ! య
ష్టహరిద్రాయమనోభయంకర ! మహాజన్యస్థలీపార్థశ
స్త్రహతానమ్రనృపాలపాలిత కళాసామ్రాజ్యసంభ్రాజ్య... .."

"కదనధనంజయునకుమహ, మదమల్కప్రాణదాన మతి కొడ్డియరా
యదిశాపట్టునకరిరా, యదళవిభాళునకుపాండవాన్వయపతికిన్."

ఈతిమ్మరాజు అవుకువంశమునకు మూలపురుషుడు. క్రీ. శ. 1505 మొదలు 1542వ సంవత్సరమువరకు కర్ణాటకరాజులయుద్ధములలో తరచు పాల్గొనుచుండెను. కృష్ణరాయల రాజ్యాభిషేక సమయమున నితడు విద్యానగరరాజసభయందుండి, యటుపిమ్మట నారాజునకు సలహానిచ్చుచుండెను.

"సాకల్యముగఁ గీర్తి సర్వదిక్తటులందు ప్రాకటస్థితి నిల్పునౌకువారు"

అను కృ. రా. వి. లోని సీసపాద మీపైయూహ కాధారము. కృష్ణరాయల కళింగదండయాత్రయందు అవుకువారు పాల్గొనిరి. కృ. రా. వి. లోని యీక్రిందిపద్యమువల్ల పైవిషయము దెలియుచున్నది:

ఉ. ఓలిగనౌకువారును కడిందిరహిన్ వెలుగోటివారలా
రావెలవారుగూడుకొని ... ... ..." ఇత్యాది.

కావున కృష్ణరాయలతో కటకమునకు బోయినందుచేత పైబిరుదములను సంపాదించినాడు.

ఇతడు ప్రాణదానమిచ్చిన మహమదుమలక బహమనీసులతాను. అటయిన నే మహమ్మదు? మహమదు IV అని మాయభిప్రాయము. ఇంకను ఈతడు మాళవరాజును తదితరులను జయించినట్లు పద్య బా. భా. లోని యీక్రింది పద్యములవల్ల తెలియుచున్నది:

చాళుక్యనక్రవర్తికి-మాళవమదభంజనునకు మర్దితశకనే
పాళునకుబిరుదమున్నెవి. భాళునకుం మన్నెపులికి భాసురమణికిన్.

మన్నెదళధూమకేతువ-మన్నియమృగబేటకార మాళవరాయా
త్మోన్నతమస్తకశూలా-మన్నె సురత్రాణ బిరుదమన్నెవిభాళా.

మఱియు, నీతని తమ్ముని పుత్రుడగు నళియరామరాజునకు సలకము తిమ్మయను చంపుటయం దీతడు చాలతోడ్పడినట్లున్నది.

సలకయతిమ్మాసురదు-ర్వ్యాలసితవిలసద్బిలగన విహ్వాలవసుధా
వలయస్థితికృతివివృతో-జ్వలతరధరణీవరాహ వరబిరుదాంకా.

ఆవిభునకు సెట్టమమ్మయు లక్ష్మి
దేవి గోపమదేవి తిరుమలదేవి
యనగ నల్గురుభార్య లైరందులోన[32]
సనుమోదమున బెద్దయగు సెట్టమాంబ ౧౧౧
రాజితకీర్తివిక్రములగు కొండ[32 (a)]
రాజును తిరుమలరాజప్పరాజు
రామరాజు ననంగ రహిమించుసుతులు
క్షీమాననీయుల దిరముగా గనియె.
అందుకొండ్రాజు తొయ్యలికోనమాంబ ౧౧౨
యిందుజిద్యశుడు కోనేరుతిమ్మయ్య
బలమకుకొండ్రాజు పొలుపార గనియె.

వెలయంగజానమ్మ వెంకటేశ్వరుని
తులితశాత్రవమహీధుర్యుని గనియె
*   *   *   *
వినుతింపదగురామవిభువెంగళాంబ ౧౨౦.
యిన తేజుడగు నౌభళేశుని గనియె.[33]
అమితవైభవుడైన యప్పలరాజు
రమణీయమైన కూరకచేర్ల యొద్ద
కదునుంచునాజిరంగంబున గడిమి
దొడరిన[స]వాబరీదుల నిర్జయించి ౧౨౧
తరణిమండల విభేదనపూర్వకముగ
సురలోకములకు రాజులు మెచ్చనరిగె[34].

---

32. చూ. సాం. పా. పీఠిక.

32 (a). సాం. పా. పీఠికలో నీతనిగురించి యిట్లు వ్రాసి యున్నది:—

"ఇట్లాత్రేయగోత్ర పవిత్రుండును నాపస్తంబ సూత్రుండును నైరాజిల్లు రాజాధిరాజ పరమేశ్వరాష్టది గ్గాజ మనోభయంకర సమరాంగణ సాహిత్యసార్వభౌమబిరుద సరస నరసవిభుకృష్ణరాయ రాజ్యలక్ష్మి నిరీక్ష పక్ష్మలంబగు కొండవీడక్షిణ కాక్షేయుండగు పినకొండ్రాజును." ఇందువల్లకొండవీట నీపినకొండ్రాజు రాణ్యము ఉండెనని తెలియుచున్నది. రాయవాచకమున కొండవీట కొండయ్యను తాళ్యం వుంచినట్లు చెప్పబడియున్నది. "ఆదుర్గమందు (కొండవీడు) కొండయ్యను తాళ్యంవుంచి" అనియున్నది. ఇతడే మనతిమ్మయ పినకొండ్రాజు.

33. ఈరాజులశాసనములు గలవు. చూ. సాం. పా. పీఠిక.

34. అప్పలరాజు సవాబరీదుల నెప్పుడెదిర్చెను? ఈవిషయమును నిర్ధారణచేసి చెప్పుట బహుకష్టమైనపని. ద్విపద బాలభాగవతము శా. శ. 1469 అనగా క్రీస్తు. 1547 లో వ్రాయబడెను. అంతకుపూర్వము అప్పలరాజు సవాబరీదుల నెప్పుడో యెదిరించి మరణము నందియుండవలయును. ఎప్పుడు? క్రీ. శ. 1500–1547 ల మధ్య మహమ్మదీయులు నాలుగుపర్యాయములు విద్యానగరముపైకి ఎత్తివచ్చినట్లు తెలియుచున్నది. (1) 1512 లో; (2) 1520 లో; (3) 1536 లో; (4) 1541లో. 1512 లో బీజపూరు, గోలకొండ, అహమదనగరపు తురకరాజు లేకీభవించి కృష్ణను దాటిరి. వారిని కృష్ణరాయలు చిదుగబొడిచి తరిమెను. ఇచ్చట బరీదు లేడు. ఆకాలమున సవాబు బరీదుపట్ల గొప్పవైరముండెను. కావున, అప్పుడు సవాబరీదులకు సఖ్యముకుదిరెనని తలచుట కవకాశము లేదు. మామిత్రులు రంగస్వామి సరస్వతిగారు తమ "సోర్సస్" లో కృష్ణరాయలచేత 1512 లో నిర్జితులైన తురకరాజులలో బరీదొకడని రాయవాచకమునం దున్నట్లు చెప్పుచున్నారు.

"There the three Muhammadan Sultans (Adil Shah of Bijapur, Kutbshah of Golkonda and Barid Shah of Bidar) had collected their troops, and crossing the river (Krishna), had fixed their camp on its southern bank, with 100,000 horse and a thousand elephants." P. 112.

రామయ తిమ్మభూరమణుని కీర్తి ధామమౌ రెండవతరుణి లక్ష్మమ్మ
తిమ్మభూవరు నెరతిమ్మనరేంద్రు సమ్మదంబున గాంచె సౌభాగ్యమలర35 ౧౩౦

రాయవాచకములో బరీదుషా ప్రస్తావనయే కాన్పించదు. అందు బీజపుర, గోలకొండ, అహమదనగరరాజులే కృష్ణరాయలపైకి ఎత్తి యాతనిచే నిర్జితులయినట్లు చెప్పబడియున్నది. రాయవాచకము చెప్పినదానిని కృ. రా. వి. బలపరచుచున్నది.

"ఏదులవాహుడు" రహస్యముగా "గోలకొండకు నిజాముశాహునకు", "జాబులంపించె."

"ఆమూడిండ్లదునీలు నేకమగు సౌహార్దంబుతో" కృష్ణరాయల నెదుర్కొనుటకు దగుప్రయత్నములు సేయుచుండిరట. తుదకు పై మూడిండ్లవాండ్రే కృష్ణరాయనిచే జయింపబడిరి. కృష్ణరాయచరిత్రకు మనకుగల యాధారములన్నియు నీసందర్భమున బరీదు ప్రస్తావన సేయక మిన్నకుండగా శ్రీ సరస్వతిగారు మాత్రము పై విధమున వ్రాయుట యేకారణముచేతనో! సరస్వతిగారి యభిప్రాయమెట్లున్నను బరీదు 1512 లో తురకల మూకలలో గలసి కృష్ణరాయనిచే నిర్జింపబడలేదనుట నిక్కము. కావున అప్పలరాజు సవాబరీదుల నెదిర్చి 1512 లో మృతినందుట యసంభవము.

ఇక 1520 లో కృష్ణరాయలతో యుద్ధముచేసినది బీజపురసుల్తానొక్కడే. కాబట్టి బరీదు సవాతోగలిసి రాగా ఆతని నెదిర్చి యప్పలరాజు మరణించినాడనుట కవకాశము లేదు.

1536 లో అచ్యుతరాయలు ప్రార్థింపగా అదిల్‌షా విజయనగరమునకు వచ్చెనట. రాయ డాతనికి విశేషధనము నిచ్చి తరల్చెనట. ఇదంతయు నిజముగాదనియు ఫెరిష్టా పెట్టిన చిక్కనియు మాయభిప్రాయము. ఒకవేళ ఫెరిష్టా చెప్పినదే నిజమైనను బాధకము లేదు. విజయనగరమునకు వచ్చినది అదిల్‌షా యొక్కడే. మఱి యుద్ధప్రసక్తియే కాన్పించదు. యుద్ధమే లేనప్పుడు అప్పలరాజు సవాబరీదుల నెదుర్చుటయు, మృతినందుటయు పొసగియుండెనని యూహించుటకు వీలు లేదు.

మిగిలియుండునది 1542 ఒక్కటియే. వెంకటాద్రి I ని చంపి సలకము తిమ్మయ కర్ణాటక సింహాసనమునెక్కుటకు బ్రయత్నించెను. అరవీటివారిని పురస్కరించుకొని కర్ణాటకపు దొరలాతని కెదురుదిరిగిరి. ఈయవస్థయం దాతడు తురకరాజుల సాయముకోరెను. నాలుగిండ్లవారును స్వసైన్యములతో గూడ విజయనగరమునకువచ్చిరి. "ఈవర్తమానమును చారులవల్ల ఆసలకంతిమ్మయ్య విని తనకు సహాయనిమిత్తము కుతుపుషహా! పరీదుషహా! నిజాంషహా! అల్లి అడల్‌షహా! వీరు మొదలైనవారికి మీరు చతురంగబలసమేతులై వస్తే యీరాజ్యంయావత్తు మీస్వాధీనం చేస్తానని జాబులువ్రాయించి పంపించెను; వారును వచ్చిరి. యుద్ధమున సలకము తిమ్మయ్య మడిసెను. ఇక తురకరాజులను వారిసీమలకు దరుమవలసినపని మిగిలియుండెను. నిజాముశాహుని దరుముటకు హండే హనుమప్పనాయడాతనిపైకి గొప్పసైన్యముతో బంపబడెను. "రామరాయలవారు కొంతసైన్యముతో కుతుబుశాహ మీదికిన్ని, తిరుమల రాయలవారు కొంతసైన్యముతో పరీదుషహా మీదకిన్ని పోయి, అఘోరయుద్ధము నేయగా పాదుషహాలు యుద్ధరంగమునందు నిలువలేక పలాయితులైరి." (సోర్నస్ పుటలు 180-181.) ఇచ్చట అదిల్‌షా యేమయ్యెనో తెల్పబడలేదు. ఒకవేళ బరీదుతోగూడ నతనిగూడ తిరుమలరాయ లెదిర్చి తరిమెనేమో. ఈసందర్భముననే పైయప్పలరాజు మడిసియుండవచ్చును. ఇది మాయూహ. నిజము భావిపరిశ్రమమూలమున బయల్పడవలసియున్నది.

35. వీరివి శాసనములు కలవు. చూడు: సాం. పా. పీఠిక.

ఆపార్థివోత్తము నర్ధాంగలక్ష్మి
గోపమాంబిక సతి గుణనిధానంబు
గోపమాంబయు తిమ్మకుంభినీశుండు
నేపైన భక్తిలక్ష్మీశుబూజించి ౧౩౯
మహిమతో దిరుమలమనుజ నాథుండు
విహితదిగ్విజయుండు విట్టలేశ్వరుడు
రాజిల్లు చినతిమ్మరాజేంద్ర నీవు
తేజంబుగల పాపతిమ్మ భూపతియు
ననునట్టి నలువుర. నాత్మసంభవులు ౧౪౦
గని రిందువంశంబు ఘనతకునెక్కె.36
శూరుండు భూషితసోమ వంశుండు
ధీరత హేమాద్రి తిరుమల నృపతి.

* * * *

అతనికి ననరజుం డతులవైభవుడు
జితవైరి విట్టలక్షితినాయకుండు.37 ౧౪౧
సరినృపుల్ ప్రజలును జయవెట్టచంద్ర

---

36. యాదవాభ్యుదయవ్యాఖ్యలో (సోర్సన్: సరస్వతి)—

"వంశే మహతి సుధాంశోః పాణ్డుసుతప్రవరచరితపరిపూతే
ఆసీ దపారమహిమా మహీశ్వరో రామరాజ ఇతి.
ఉదపాది తిమ్మ స్తస్మా ద్దుగ్ధోదధేరివ సుధామయాన్మణిరాజః;
హృదయంగమం మురారే ర్యఃమలం చక్రే ప్రభేవ గోపీదేవీ.

* * * * * *

ఆరాధ్య వేంకటేశ్వర మలభత లోకోత్తరాన్ పుత్రాన్
తేషు మహత్సు జయతి త్రిదివాధీశేషు పద్మ బంధురివ
శ్రీచిన్నతిమ్మరాజః ప్రతాపనీరాజితక్షమావలయః."

37. విట్టలదేవమహారాయలు గొప్పసేనాని. ద్వి. భా. భా. లో చిన్నతిమ్మరాజువలె వర్ణించిన విజయములీతనినిగూర్చి చెప్పవలయును. ఏలన, సదాశివరాయలను విద్యానగరసింహాసనముపై గూర్చుండబెట్టిన పిమ్మట చక్రవర్తి యధికారమును దిరస్కరించుచుండిన దక్షిణరాజులను మొత్తుటకు వాస్తవముగ కర్ణాటాధీశ్వరుడని పిలువదగిన యళియరామరాజు క్రీ. శ. 1542-3 లో విట్టలరాయలను సర్వసైన్యాధిపతినిగ నియమించి దక్షిణదేశమున కంపెను. చంద్రగిరిరాజ్యము నేలుచున్న చిన్నతిమ్మరాజాతనిగలసిపోయి దక్షిణదేశమునందలి కయ్యములలో పాల్గొనెను. ఈవిట్టలుని ప్రతాపము ద్వి. భా. భా. లో నిట్లు వర్ణింపబడియున్నది:—

సీ. కటకాఖ్యకటకస్థకరటిరాడ్ఘటఘటాసంభూతమదభర స్తంభకంబు
పాండ్యభూమీభృత్సభాసభాజితభటోద్భటభుజాబలగర్వభంజకంబు
మధుర-మహాదుర్గతుర్కారపతి వపుస్థాయి వేపథుసముద్ధానదంబు
ఢిల్లీపురాధీశపల్లవోష్ఠీభావి విప్రలాభకదాభయప్రదంబు
రామనరనాథ తిమ్మభూరమణపుత్రి, విట్టలేశాభిధాన పృథ్వీకళత్ర
ధాటికాగంభ సంభ్రమధ్వనితపటహ, గణసముత్థిత ఘణఘణంధణరవంబు.

ఈపద్యము ప్రథమపాదము ఇంచుక గమనింపదగ్గది. దానివల్ల విట్టలదేవరాయలు కటకమను పేరుగల కోటను ముట్టడించినట్లు తెలియుచున్నది. ఒక కృష్ణరాయలకాలమునందుదప్ప మనకు దెలిసినంతమట్టుకు కర్ణాటకసైన్యము

గిరి ముఖ్యదుర్గముల్ గినిసి కైకొంటి.[38] ౧౩
నిలిచి వెంటాడి తా నెమ్మెలు దిరుగు
ఖలశత్రురాజమృగశ్రేణిమీద

శ్రీరంగనాథుని సిరి నిల్వజేసి
తారసి పలుదుర్మదాంధుల నణచి
నాగూరుగైకొని నవహస్తికముల

లెప్పుడున్ను కటకమును ముట్టడించి యుండలేదు. కృష్ణరాయని కళింగ దండయాత్రలో అవుకువారు బాల్గొనిరని కృ. రా. వి. బల్కుచున్నది గదా. ఈదండయాత్రలోనే రాయలు కటకమును గాల్చెనని అల్లసానిపెద్దన్నగారు చెప్పుచున్నారు. అయితే డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారు పెద్దన్నగారు చెప్పినది నిజముగాదనుచున్నారు. "త్రోలుదొల్త నుదయాద్రిశిలదాకితీండ్రించు" అను మనుచరిత్రపద్యములోని "కటకపురిగాల్చె" అనుమాట పద్యమున కంగమైన రూపకాలంకారమును సంపూర్ణముగ బోషించుటకై పెద్దనగారు కల్పించిరట! కృష్ణరాయలు నిజముగ కటకపురిని కాల్చలేదట. చూడుడు:—

"This historically simple settlement has, however, been complicated by a couple of verses from Peddana's Manucharitra which in high poetical language describes Krishna's valour as a fire set aflame by the conquest of Udayagiri. This grows on increasing till it had grown up to a conflagration at Pottanura and reduced Oddadi to ashes. The heat of his great comet fire made Katak too hot for the Gajapati to remain any longer there, and drove him to the shelter of the Vindhyas. This merely poetical statement beautiful as poetry, and as close to facts as poetry can be to history, has been laid hold of by Rai Sahib H. Krishna Sastry to warrant another invasion of Orissa, or at least a continuation of the one which actually terminated at Simhadri-Pottanura on the farther frontiers of the Vizagapatam District.................On general considerations, it seems extremly unlikely...........Setting fire to her father's capital is by no means the best way of wooing the Gajapati's daughter." (The Yet Remembered Ruler, P. 17).

— పై మనుచరిత్రలోని పద్యములో వర్ణితవిషయములన్నియు చారిత్రాత్మకములట. "కటకపురిగాల్చె" నన్నది కల్పనయట! తమకిష్టమువచ్చినవి చరిత్రాత్మకములు. తక్కినవి కట్టుకథలు. పద్య శా. భా. లో నుంచి పైనుదాహరించినపద్యము విట్ఠలరాయడు కటకమును ముట్టడించెనని చెప్పుచున్నది. కృష్ణరాయల కాలముననే విద్యానగరసైన్యములు కటకమును ముట్టడించుట కవకాశముండెను. కర్ణాటకసైన్యములు కటకపురిని ముట్టడించెనని మనుచరిత్ర పద్య శా. భా. లు రుజువుచేయుచున్నవి.

38. చంద్రగిరిదుర్గము అనాదిగా విజయనగరపురాజులది. ఈచినతిమ్మరాజు క్రీ. శ. 1542 సంవత్సరమున సదాశివరాయలవారితరఫున చంద్రగిరిరాజ్యమును బాలించుచుండెను. అచ్యుతరాయల కాలమున చంద్రగిరి దుర్గమును, రాజ్యమును విజయనగర సింహాసనమునకు అణకువయైయుండెను. అచ్యుతరాయలు క్రీ. శ. 1541 లో మృతినొందెను. తరువాత అతనిపుత్రుడు వెంకటరాయలు I, సింహాసనమునధిష్ఠించి ఆరునెలలు రాజ్యముచేసి పరమపదించెను. అప్పుడు సలకముతిమ్మయ రాజ్యము నాక్రమింప బ్రయత్నించి దక్షిణదేశమున నొకగొప్పవిప్లవముగలుగజేసెను. ఈతిమ్మయకు ప్రతిపక్షులు అళియరాయలు, యఱతిమ్మరాయలు మొదలగువారు. వారిపక్షమువాడే యీచిన తిమ్మరాజు. కావున నీతడు క్రీ. శ. 1542 పూర్వము చంద్రగిరిదుర్గమును బట్టుకొనినది సలకము తిమ్మయొద్దనుండియో లేక అతనియనుచరులకడనుండియో అయియుండవలయును.

ద్యాగంబుబెట్టితెతనియ నర్థులకు.[39]
పరుషత లగ్గలు వట్టించి బోన
గిరి గొంటి వుప్పొంగి కీర్తి దైవార[40] ౧౬౬
తలచినయంతలో దన్నరసునాట[41]

గలమహీపతులచే గప్పంబుగొంటి.
శరణన్నయాపాండ్యజననాథు[42] రాజ్య
పరినిష్టుతుని జేసి పాలించి తర్థి.
బెడిదంబుగల బెట్టుపెరుమాళ్లిమదము[43] ౧౭౦

39. చినతిమ్మరాజు పలుదుర్మదాంధుల నణచి నాగూరు గైకొని, శ్రీరంగనాథునిసిరిని నిల్వజెట్టెనట. రంగనాథునిసిరిని హరింపప్రయత్నముసేయుచుండిన వారెవ్వరు? క్రైస్తవులు. వీరు పరవజాతివారు. ముత్యపుచిప్పలను సముద్రమునుండి దేవి తెచ్చుట వారివృత్తి. వీరికి సహాయము బుడతకీచులు. హీరాసుఫాదిరి ట్లనుచున్నాడు:

"The Franciscan Friars, who from the beginning were estab'ished at St. Thome and at Negapatam, caused several Hindu temples to be descrcrated, and idols destroyed, building in their stead many Christian Churches and Chapels. In the year 1542, they had built at Negapatam two churches, one dedicated to St. Francis and the other to Nossa Senharada Sonde, and about three thousand people embraced the Catholic Faith. The Jesuits who came shortly after followed the example of the Franciscans." (Aravidu Dynasty, p. 67).

నాగూరు-(నాగపట్టణం)లోని రంగనాథునిసిరిని పైక్రైస్తవులు దోచుకొన బ్రయత్నింపగా, విట్ఠలరాయడును, చినతిమ్మరాయడును వారిని నిగ్రహించి, వారియొద్దనున్న నవమౌక్తికములను గొల్లకొట్టినట్టున్నది.

40. ఈరోడ్డుదగ్గర నిట్టిపేరుగల ప్రదేశమొక్కటి యున్నట్లు తెలియుచున్నది.

41. తన్నరసునాటి ఆనవాలు ఇంకను తెలియలేదు.

42. శరణన్నపాండ్య జననాథుడు విశ్వనాథనాయడు. ఇతనియధికారమునకు బ్రబలులగు శత్రువులవల్ల అంతరాయము కలుగునట్లుండెను. వారు ఇరుదెగలవారు. (1) తిరునెల్వేలిమండలమును బాలించుచున్న పాండ్యరాజులు. వీరు అయిదుగురు. వీరిముఖ్యస్థానము తెంకాశి. (2) తూర్పుసముద్రతీరగ్రామములయందు పరవజాతివారు నివసించుచుండిరి. సముద్రమునుండి ముత్తెపుచిప్పలను దేవి తెచ్చుట వీరికులవృత్తి. వీరికిని లబ్బెలకును వైరముపొడమెను. అప్పుడు మధుర నాయకులు లబ్బెలపక్షము నవలంబించిరి. స్వరక్షణార్థమై పరవలు పోర్చుగీసువారి మరుగుజొచ్చి క్రైస్తవమత మవలబించిరి. తదారభ్యము వారు మధురనాయకునికి లొంగియుండరైరి. కప్పముగట్ట నిరాకరించిరి. పోర్చుగీసువారు వారికి సాయముజేయుచుండుటవల్ల, మధురనాయకులకు వారిని స్వాధీనపఱచుకొనుటకు సాధ్యము గాదాయెను. కాబట్టి విశ్వనాథనాయకుడు శత్రుసంహరణార్థము దనయేలిక నాశ్రయించవలసివచ్చెను.

43. ఈ బెట్టు పెరుమాళ్లెవరో నిర్ధారణచేసి చెప్పుటకువీలు లేదు. తెంకాశి పాండ్యరాజులకు పెరుమాళ్ అని పేరుండెడిది. చిన్నతిమ్మని యెలుగోలుమూకలచే నిగ్రహుడైన బెట్టుపెరుమాళ్లు విశ్వనాథనాయకుని శత్రులగు తెంకాశి పాండ్యులలో నొక్కడుగా నుండవచ్చును. కర్ణాటకపు సేనాధిపతి "ఛెట్టబాల్" అనువాడొకడున్నట్టు ఆకాలపు పోర్చుగీసు లేఖలు దెల్పుచున్నవి. హీరాసుఫాదిరి "ఛెట్టమ్మాళ్" అనునది పోర్చుగీసువారు విట్ఠలరాయలకు బెట్టిన పేరనుచున్నాడు. ఇదిపొరబాటు. చిన్నతిమ్మనిచే నిగ్రహితుడయిన బెట్టుపెరుమాళు విజయనగరసైన్యములగలసి తిరువడి రాజ్యముపైకి నడిచెను. పోర్చుగీసు లేఖలలోని "ఛెట్టమాల్" బెట్టుపెరుమాళేగాని యన్యుడుగాడని మాయభిప్రాయము.

ముడిగించి తెలగొలుమూకలచేత.
పంచతిరుపతుల దర్పంబులు చెఱిచి[44]
పంచబంగాళమై పరగంగజేసి
శరణన్న తిరుపతి జక్కగా నిలిపి
తరుదుగా మున్నటియట్లురాజ్యమున.[45]
తోవాళఘట్టాఖ్యదుర్గంబు దాటి[46]
సావి జేరి యనంతశయను సేవించి
అక్షీణగతి నిల్పి తాకన్నెకుమరి
దక్షిణాశాజయ స్తంభంబు మెఱయ.[47]
రణసమాగమవైరి రాజశార్దూల
గణకంఠనవరక్త కణసిక్తమైన
యడిదంబు గడిగితి వంబోధిలోన.

*    *    *    *

[యీ చినతిమ్మరాజేంద్ర చంద్రముని
రాచక్కమేరికి బ్రణుతింప దరమె
ధీరులు కేరళతిరువడి పాండ్య
చేరచోళాధిక క్షితినాధవరులు

*    *    *    *

తెలివిమీరగ జినతిమ్మభూపాలు
కొలువువేళల గాచికొని యుందురర్థి
శ్రీరాఘవుడు దక్షిణదిగంతమున
నాహూఢియున్న శౌర్యము పెంపు నెఱపి
పౌలస్త్యలంకలో పట్టంబుగట్టి
యాకీలనిల్ప లేదమ్యె దిరువడిని,
పదపడి యారామభద్రుడే తనదు
కొదువదీర్చుటకునై గొబ్బునమరల
చినతిమ్మనృపతియై సిరిమించబుట్టి
ఘనతనిద్దిశయెల్ల గ్రమ్మరగెలిచి
బలిమిమై దిరువడి బట్టంబుగట్టె.

*    *    *    *

44. పంచతిరుపతులు అనగా తిరువడిరాజ్యములోని అయిదుభాగములని యర్థము చేసికొనవలయును. సదాశివరాయని కృష్ణాపురంతామ్రశాసనంలో (Ep. Ind. IX, p. 341) "deprived the insolent king of Tiruvadi rajya of the seven parts of his kingdom." అని తిరువడిరాజ్యమునకు యేడుభాగము లున్నట్లు చెప్పబడియుండ, యిచ్చట పంచతిరుపతులని చెప్పియుండుటకు గతమెద్దియో ?

45. మొదట ఎదిరించినను విట్ఠల-చినతిమ్మరాజులధాటికి ఓర్చుకొనజాలక తిరువడిరాజు లొంగిపోయెను. ఇతని పేరు ఉణ్ణికేరళవర్మ. విట్ఠలరాయనితో సంధిజేసుకొన బ్రయత్నముజేసెను; సంధికుదురక పూర్వమే క్రీ. శ. 1516 లో యితడు మృతినందెను. ఇతనికి పిమ్మట తిరువడిరాజ్యపీఠము నెక్కినవాడు-భూతలవీరుడు విట్ఠలునితో సంధి చేసుకొనెను. "The King of Travancore on the occasion went perhaps personally to Tinnevelly to sign the treaty. By this treatv the district of Tinnevelly was ceded for ever to Vijayanagara which in return agreed not to molest Trav.ıncore. (Heras: Aravidu Dynasty of Vijayanagar, p. 150).

46. ఈదుర్గము పాండ్యదేశమునుండి తిరువడిరాజ్యమునకు బోవుమార్గమందలి అరవామొలికనుకు దగ్గర నున్నది. ఈ విషయము నాకెరుగించిన నామిత్రులు, పూర్వము తిరువాన్కూరు శాసనశాఖాధ్యక్షులుగ నుండిన శ్రీ. ఎ. యస్. రామనాధయ్యరుగారికి నాకృతజ్ఞతాపూర్వక వందనములను సమర్పించుకొను చున్నాడ.

47. ఇట్టి జయస్తంభమేదియు నచట లేదు. కన్యకుమరికి సమీపమందున్న సుచీంద్రము దేవాలయమునకు విట్ఠలరాయలు గోపురము గట్టించెనని సదరు దేవాలయములోని శాసనమొకటి తెల్పుచున్నది.

కృతకృత్యునకు చంద్రగిరిదుర్గముఖ్య
వితతమహైశ్వర్య విలసితాత్మునకు

*     *     *     *

తిరువడి రాజ్య ప్రతిష్ఠాపకునకు
విరచితపాండ్య భూవిభుశాసనునకు
చేరచోళాదికక్షితినాథమకుట
హారనీరాజనహృద్యపాదునకు.]

వినుము రామయతిమ్మ విభునకు మరియు
మనుజేంద్ర యాతిరుమలదేవియందు
పౌరుషాఖ్యుడు కోనపక్ష్మావిభుడు ౧౭౯
శ్రీరంగరాజు రాజితయశోధనుడు
గలిగిరి వారలు కల్యాణమతులు
గలుగునర్థులకెల్ల కల్పవృక్షములు.[48]

రామయ తిమ్మభూరమణుని తమ్ము
డైమించు కొండజానాధిపహాళి
అతడు కొండమ్మ రంగమ్మ నాగల్గు
నతివల చేపట్టె హర్షంబుమీర
అందులోకొండమ్మ యను నీరజాక్షి
కుందేందునిభకీర్తి గోనేరినృపతి
బెదతిమ్మరాజును చినతిమ్మరాజు ౧౮౯
నుదధిగంభీరుల నొనరంగ గాంచె
అందు గోనేటయ్య యతివ సౌభాగ్య
మందిరంబగు తిరుమలదేవి వేడ్క
శూరుని నౌభళేశుని గొండనృపతి
ధీరాగ్రగణ్యుని దిమ్మభూపాలు ౧౮౦
శ్రీరంగనరనాథు జిరతరకీర్తి
సారప్రతాపవిస్తారుల గనియె.[49]

రాజేంద్ర వినుమింక రామయతిమ్మ
రాజానుజుండు శ్రీరంగరాజులరు.[50]

---

48. చూ. సాం. పా. పీఠికను.

49. చూ. సాం. పా. పీఠికను.

50. చూ. రా. రా. 221-227. రా. పీఠిక, 49, ౯0. నర. భూ. పీఠిక, 75. వసు చ. పీఠిక 32-34. సాం. పా. పీఠిక. ఇట్లు ఇతర గ్రంథములయందును నీతడు వర్ణింపంబడి యున్నాడు; గాని చరిత్రసంబంధించిన విషయ మాతనిగురించి యేదియు జెప్పబడియుండలేదు. అయితే రా. రా. 222 పద్య మీతడు "కర్ణాటరాజ్యపదస్థు"డని చెప్పుచున్నది.

"కాంగ నసదృశ బాహువిక్రమనిరూఢి, దనరె గర్ణాటరాజ్యపదస్థుడగుచు
దుర్జయాహితరాజ విధుంతుదుండు, రామరాజేంద్ర శ్రీరంగరాజవిభుఁడు."

ఇందువల్ల నీ శ్రీరంగరాజు విద్యానగరమున రాయల యాస్థానమున నుండినట్లు మన మూహింపవచ్చును. ఇంకొక విషయ మిచ్చట గ్రహింపదగ్గది కద్దు. అళియరాయల తండ్రినిగూర్చి సూయల్ దొరగారు గొప్ప చిక్కులోపడ్డారు.

The affairs of Beejanuggur being in confusion owing to the death of Heemraaje who was newly succeeded by his son Ramraaje, against whom rebellions had arisen by several roies, he (the Sultan). met with no interruptions to his arms." (Forgotten Empire, p. 166). ఫెరిష్టా చరిత్రలోనిది ఈ పాసేజీ. దీనిమీద సూయల్ గారీక్రిందివిధమున వ్యాఖ్యానము జేసి యున్నారు: "'Heem' Rajah, or, as Briggs renders the name, 'Tim' Rajah—representing

ఆమనుజేంద్రుని కనమానశీల
కామిని తిమ్మాంబికామణి వెలసె.
వారి కెన్నగ గోన వసుధావరుండు
సారోన్నతుడు తిమ్మ జగతీవిభుండు.[51]

శ్రీసదాశివరాయశేఖరమణికి
భాసురసామ్రాజ్యపదవి నొసంగి
అమితకర్ణాట రాజ్యస్థాపనాంక ౨౦౨
రమణీయుడగునట్టి రామభూపతియు.[52]

---

'Timma', are referring doubtless to Saluva Timma, the great minister of Krishna Deva." ఫెరిస్టాలో హిమ్రాజుకొడుకైన రామరాజు సాళువతిమ్మరసుకుమారుడని సూయల్ నిర్ధారణచేసిరి. ఈ రామరాజే అళియరామరాజని సూయల్ నమ్మినాము. చూడుడు:

"Rama was the elder of the three brothers afterwards to become very famous. He and his brother Tirumala both married daughters of Krishna Deva Raya", (Forgotten Empire, p. 168-9).

సూయల్ భ్రమపడి యిట్లు వ్రాసెను. ఈభ్రమ ఫెరిస్టావ్రాతలవల్ల కలిగినది. ఫెరిస్టా శాస్త్రోక్తముగ తిన్నని నిష్పక్షపాతమైన చరిత్రను వ్రాసెనని నమ్మి యాతనివ్రాతల నాధారము జేసుకొని అచ్యుతరాయల చరిత్రను తారుమారు జేసియున్నాడు. ఆవిషయమును చర్చించుటకిద నిదికాదు. ఇచ్చట అళియరామరాజుతండ్రి సూయలనుకొన్నట్లు సాళువతిమ్మరాజు కాదనియు, శ్రీరంగరాజనియు, అతడు కృష్ణరాయల ప్రధాని యనుటకేయాధారమును లేదనియు తెలుపుచున్నాము.

51. రా. రా. 228-232. రా. పీఠికలో శ్రీరంగరాజ పుత్రులలో వీరు చేర్కొనబడలేదు. నర. భూ. పీఠిక 76-80, సాం. పా. పీఠిక, పరమ. యందును వీరు చేర్కొనబడలేదు. వసు చ. పీఠిక 37-41. కోనరాజును, తిమ్మరాజును విఖ్యాతినిగడించిన ప్రసిద్ధపురుషులుగ గాన్పించరు.

52. ఆరవీటి రామభూపతి శ్రీరంగరాజుపుత్రులలో మేటి. రా. రా. 279-294. రా. పీఠిక 54, 55. నర. భూ. పీఠిక 82, 83. సాం. పా. పీఠిక. పరమ పీఠిక. వసు చ. పీఠిక 43-48. ఇట్లు ఇతరగ్రంథములయందు తనిసరిత్ర కలదు. ద్వి. బా. భా. వ్రాసి ముగించునప్పటికి, అళియరామరాజొనర్చిన ఘనకార్యము సలకము తిమ్మ యనుజంపి, సదాశివరాయలను కర్ణాటకసామ్రాజ్యమున కభిషిక్తునిజేయుటయే. కావున ఆవిషయము మాత్రమిందు చేర్కొనబడినది. మేమును ఆవిషయమును గూర్చి ఇతరగ్రంథములయందున్న సంగతిని చెప్పి విరమించుచున్నాము.

పద్య బా. భా:—

ఉ. "ఏపున ద్రోహిభావము వహించిన సల్కయతిమ్మరాజు ద
త్పాపసహాయు సల్కయయుతంబుగ శౌర్యమువీర ద్రుంచి వి
ద్యాపురియందు చాలఘనుడయ్యె సదాశివరాయరాజ్య సం
స్థాపకుడై సిరంగవసుధావరరామనరేంద్రు డున్నతిన్."

నర. భూ:—

సీ. "ఖలు నతిద్రోహి సల్కయతిమ్మని హరించి సకలకర్ణాటరాజ్యంబునిలిపె"

రా. రా. 280: "సలకవిభుతిమ్మరాజు సేనలను ద్రుంచి-గుత్తి పెనుగొండ మఱి గండికోట కంద
నోలుపుర మాదనే నవలీల గెల్చి-తొలుదొలుత రామనృపతి దోర్బలము మెరసె."

వసు చ:—

సీ. పట్టాభిషేకవిపర్యయంబున బోలు వెడలి ప్రియానుజుల్వెంటగొలువ
జిత్రకూటాభిఖ్య జెలగు పెన్గొండసాంద్ర హరిద్వీపేంద్రనాదవని జేరి
ఖలజనస్థానవాసుల బల్వురవధించి మహిమ సలక ఖరస్మయ మడంచి
హరివీరభట మహోద్ధతి నబ్ధి గంపింప దురమున గదిసిదర్పోద్ధి దునిమి
యనఘుతేరపార్థివేందిర నధిగమించి, సాధుకర్ణాట విభవసంస్థాపనంబు
పూని శరణాగతులనెల్ల బ్రోచె రాము, డతడు నిజచరితంబు రామాయణముగ.

స్వ. మే. క:—

యః ఖడ్గైకసఖః సహానుజయుగో నిర్గత్య విద్యాపురాత్
లబ్ధ్వా గుత్తిగిరౌ సదాశివమహీపాలం నిరాల మ్బవమ్
స్వామిద్రోహకృతః ప్రతీపనృపతిం నిర్జిత్య భద్రాసనే
కర్ణాటే భగవానివ ధ్రువమయం కీర్త్యాసహస్థాపయత్.

సాం. పా: రామరాజుయొక్క ప్రత్యర్థి సలకం పిన తిమ్మయ్యయని తెలియచేయుచున్నది:

మ. మహి నెవ్వా రెనసల్క రాజ చినతిమ్మక్ష్మాపకంఠారుణాం
బుహవిశ్చర్వాతర్పితాసి శిఖికిం బుష్పాయుధస్నిగ్ధ ని
గ్రహసౌభాగ్య పరంపరాపరిధికిం గర్ణాటకైశ్వర్య ని
ర్వహణావార్య భుజద్వయాయుధ పరీవారుండు రామప్రభుఁ.

హండే అనంతపురచరిత్ర:—

సలకంతిమ్మయ్య అనేవాడు రాజ్యం అరాజకమై బొక్కసం తనస్వాధీనంలో వున్నందున, చతురంగబలాన్ని పదిలపరచుకొని, అల్లుండ్లయిన రామరాయ తిరుమలరాయులనుపట్టి చెరవుంచవలెనని యోచించెను. ఈవర్తమానమును వారు విని ఆ దేశమును విడిచి పారిపోయి, పెనుగొండ సంస్థానములో సంచరించుచు కొంత సైన్యమును కూర్చుకొని ఆదవాని చేరి, అక్కడ నాలుగునెలలు నివాసముచేసి, కందనూలు, గద్వాలు ప్రాంతములయందు మఱికొంతిసైన్యమును (కూర్చుకొని)సకలసేనా సమేతులై విద్యానగరంపై దండెత్తివచ్చిరి.......ఈసంగతి రామరాయ తిరుమలరాయలువారు విని పట్టపగలు రణభేరివేయించి, యెదుటవున్న సలకముతిమ్మయ్య సేనమీదపడి యుద్ధము సేయగా, ఆసలకంతిమ్మయ్యసేన "వీడుగొల్ల; ఘనవంతుడై సంస్థానమును ఆక్రమించవలెనని ప్రయత్నంచేసినాడు. వీనికి సహాయముచేస్తే మనకు దైవసహాయము కానేర"దని తలంచి యుద్ధభూమిని తొలగిపోయినందున సలకంతిమ్మయ ఆజగడంలోచిక్కి ప్రాణమువిడిచెను. (సోర్సస్. పుట 179–180.)

తాడిపర్తి కయిఫీయతు:—

"యరతిమ్మానాయుడు (పెమ్మసాని) ప్రభుత్వంచేస్తూవున్న కాలమందు శ్రీవిద్యానగర పట్టణమందు కృష్ణరాయలవారి అల్లుడైన అళియరామరాజుగారు రాజ్యంచేస్తూ వుండగా పూర్వము రాయలవారి జ్ఞాతులు రామరాజులమీద ద్వేషించి రాజసింహాసనం నీకు అక్కరపనిలేదు అని బహుశా వుపద్రవం చాయవలెను అని ప్రయత్నంచేస్తూవుండగా యీరామరాజులవారికి ప్రభుత్వము చేసేదానికి నిర్వాహకములేక విజయనగరపట్నం విడిచి ఘండికోటయేలే తిమ్మానాయని ఆసరాకువచ్చి చేరినందున యీతిమ్మానాయనివారు చాలా భరవుసాయిచ్చి నిలుపుకొని

ధృతిశాలియగునట్టి తిరుమలరాజు[53] నను కుమారులు బుట్టిరాద్రిప్రసిద్ధి
దితవైరి వెంకటాద్రిమహీవరుండు[54] మనుజనాథులబోలు మాన్యవర్తనులు ౨౦౫

వుండిన కాలమందు యీవర్తమానమును విజయనగరములో వున్న రాయలవారి జ్ఞాతులువిని విస్తారము సైన్యముతో కూడావచ్చి యీఘండీకోటలోవుండే తిమ్మానాయనితావుకు పెద్దమనుష్యులను పంపించి రామరాజును తమకు పట్టియియ్యుమని అడిగినందున యీతిమ్మానాయడు చెప్పినది. మాఆసరాకు వచ్చినవారిని మేము పట్టియిచ్చేదిలేదు. మీతో యుద్ధముచేసేము. అని చుట్టూవున్న పాళెగాండ్లనగైరామందిని గూర్చి సైన్యం స్తోమంజేసుకొని యీఅళియరామరాజులవారితో కూడా యీగ్రామానికి మూడుక్రోసులమీద పశ్చిమానయుద్ధంచేసి కోమలినద్ద వారిసైన్యము విరిచిపోయినందున వెంబడించి రామరాజువారు, తిమ్మానాయనివారున్ను విజయనగర పట్నానకుపోయి అక్కడవున్న సలకముతిమ్మన్న వగైరావారిని హతంచేసి శత్రుభయం లేకుండా అయినందున తదారభ్య రామరాజులవారు రాజ్యభారంచేస్తూ యీతిమ్మానాయణివారికి అనేకద్రవ్యంయిచ్చి ......"(L. R. vol. 12, p 213.) నడిమిదొడ్డిపాళెయగాండ్లకయిఫియత్:—

"(కృష్ణరాయలవారు అస్తమించిన వెనుక) రాయలవారి భార్య తిరుములాదేవి ఆనేవారికి వొకకుమార్తెవుండగా ఆచిన్నదాన్ని అల్లుడు రామరాయలవారికి యిచ్చి వివాహంచేసి తమదగ్గరవుంచుకొని వున్నందున అళియరామరాయులు అనేపేరువచ్చెను. ఈరామరాయలవారికి విజయనగరం పట్టాభిషేకం సేయవలెననే యత్నములోవుండగా సలకయ తిమ్మడు అనేవాడు కృష్ణరాయల బొక్కస బండారాలమీదవుండెను. గనుక రామరాయలవారికి పట్టాభిషేకంచేసేది తనకుసరిపడక లోగాలోగానే కొంతిపదార్థం సాగించి తానువెళ్లిపోయి ఫౌజుబందిచేసి అళియరామరాయణ్ణి కొట్టివేయవలెనని విజయనగరానకు కూచు దరకూచుచేయించి ఫౌజుతోవస్తువుండగా యీవర్తమానం అళియ రామరాయలువిని మొహరుతీసుకొనిరాతోరాతువచ్చి పెనుగొండకు దాఖలుఅయి అక్కడినుండి పెమ్మసాని తిమ్మానాయణ్ని, హండేవారిని, మెసా పెద్దనాయణ్ని యింకాజహాగీరుదార్లకు శిఖాపత్రాలుపంపించి మీమీ యావత్ఫవుజులతోకూడా యెకాయెకీవచ్చేదని వ్రాయించివున్నందున అదేప్రకారముగా సకలమైనవారితోకూడా మెసా పెద్దప్పనాయడు పోయినంతలోగా రామరాయలవారు సలకయ తిమ్మనిదుర్మార్గాలు అందరికిచెప్పి తరతరాలనుంచీ మీరు స్వామికార్యములో బహుశామెహన్నతుచేసి కష్టపడి సకల బహుమానాలు బిరుదులు సంపాదించుకొన్నారు. ఇపుడున్ను యీకార్యం నిర్వాహకంచేసి శత్రుఖండనచేస్తిరాయనా మీకు విశేషించి బిరుదులు బహుమానాలు యిప్పిస్తున్నామనిచెప్పి సలకయ తిమ్మయవుండేపూర్వోత్తరము వాడు యెక్కడవుండేది, ఫౌజువుండేరీతి ముందర యేతట్టు సాగివచ్చేసంగతి తెలుసుకొని వచ్చేవారుయెవ్వరు చాతమీతహకీకు వర్తమానంవచ్చేటందుకు చోరుహార్కార్లను పంపించుమనగా అప్పుడు మెసా పెద్దనాయడు ముందుపడి తహకీకు ఖబురు నేను తెప్పిస్తున్నానని తాంబూలం తీసుకొని సలకయ తిమ్మని ఫౌజులోనికి అంపతగినవారిని పంపించి నిజవానం వర్తమానం తెప్పించి యీవత్ఫవుజును వెంటతీసుకొని ఘండికోటవారు సొన్నలాపురంహండే హనుమప్పనాయడు మెసా పెద్దప్పనాయడు తన జమియ్యతుతో ఫౌజు నడిపించి రాతోరాతు ఆవవానికివచ్చి వుత్తరభాగం తుంగభద్రాతీరమందు సలకం తిమ్మని ఫౌజుమీద చప్పాబడి నరికి హతాహతంచేసినందున హతశేషులైన ఫౌజుతో సలకయ తిమ్మడు పారిపోతూవుండగా పెమ్మసానివారు హండేవారు మెసావారు యీముగ్గురు ఖాసాగుర్రాలు వేసుకొనిపోయి సలకయతిమ్మణ్ణి శిరచ్ఛేదనంచేసి ఝూండాకుకట్టి ..." (L. R. 39, p. 16-) ఈపానేజీని నాకుచూపి, వ్రాసియిచ్చిన నామిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారికి కృతజ్ఞుడను.

53. రా. రా. 234-237, పరమ. పీఠిక; నర.భూ.84: సాం.పా.పీఠిక; వసు చ.పీఠిక.49, 55-62; పీఠిక 67.

54. రా.రా. 265-67; పరమ. పీఠిక; నర.భూ. 85-88; సాం.పా.పీఠిక; వసు చ. పీఠిక 51-58; రా.పీఠిక 74.

తెలివొంద లక్కమదేవి సంతాన
మెలమితో నీరీతి నెఱిగి పేర్కొంటి
ఘనశౌర్యుడయిన బుక్కయరామనృపతి
కనువొందనింక మూడవపత్నియైన
రంగమాంబికకు విరాజితమైన
సంగతసంతాన సంపద వినుము.
ఆరామనృపతిరంగాంబకు మూర్తి
ధారుణీశుడు రంగధరణీవిభుండు
నొదవిరి వారిలో నురుసత్యనిష్ఠ
ముదితచిత్తుండైన మూర్తిరాజునకు
అంగనయైన తిమ్మాంబకు గీర్తి
యంగలించినపుత్రు లౌభళేశుండు
పాంచాలుడును రామపార్థివకృష్ణు
లంచితుండగు సింగరయ్య విట్ఠలుడు
అనువార లార్గు రాహవధనంజయులు
జనియించి రిందు వంశము గొనసాగ[55]
కమనీయ కీర్తి బుక్కయరామనృపుని
యమలమదేవుల కభినుతి సేయ
వినుతుండు జగ్గభూవిభుడు శ్రీరంగ
మనుజేంద్రుడును నా గుమారులై రందు
దీపించు జగ్గపార్థివుడు వోబాంబ
జేపట్టి భక్తి లక్ష్మీనాథు గొలిచి
హరిబోలు సుతులు రంగయ్య రామయ్య
నరనుతుండగు జగన్నాథుండు మరియు
నొనరంగ గృష్ణప్పయును ననువారి
గనిరట్టి జగ్గభూకాంతు సోదరుడు.
శ్రీరంగవిభు డతి శ్రీరంగమాంబ
గూరిమి మెఱయ గైకొని పుణ్యవశత
తిమ్మయరామపార్థివు నప్పనృపతి
సమ్మతగుణుడైన జగ్గభూవిభుని
శ్రీరంగరాజును శ్రీయౌభళేశు
గోరి కాంచె నృపాలగుణసమన్వితుల
యివ్విధంబున జాల నెన్నికకెక్కి
యివ్వసుధగ నెల్ల నేపార నిండి
యున్న మీ కులమున నున్నతికెక్కి-
వన్నియగాంచిన వసుధీశమణుల
జెప్పితి......................"[56]

*  *  *  *

చ. "అరుదుగ శాలివాహనశకాబ్దము లెన్న
నిధానతర్కసా, గర శశిసంఖ్యచే వెలయ
గల్గు ప్లవంగ మనంగ మించువ,త్సరమున[57]
బల్కె దిమ్మనసుధాషతిక్త గవి సార్వభౌ
ముడీ[58], హరిహిత బాలభాగవత హరిపద
ద్విపద ప్రబంధముక్."

---

55. చూడుడు: సాం. పా. పీఠిక.

56. చూడుడు: సాం. పా. పీఠిక.

57. శా. శకం 1469, అనగా క్రీ. శ. 1547.

58. దోనేరు కోనేరునాథుడు. "యీ గ్రామానకు (కమలాపురం తా॥ కోడూరునకు) యీశాన్యం పక్షుపరువు దూరమున యఱ్ఱగుంట్ల అనే గ్రామం దోనూరి కోనయ్యగారికి యీనంద్యాలనారశింహరాజుగారే ధారాగ్రహీతంగా యిచ్చిరి. యిందుకు దాఖలా యీ యఱ్ఱగుంట్లగ్రామంయొక్క పొలిమెరచెతుర్దిక్కులయందు వలయ వామనముద్రలు రాతిపైన చక్కి దిగువ దోనూరి కోనయ్యగారి అగ్రహారం యెఱ్ఱగుంట్ల అని ఆపొలిమేర రెండు యేగ్రామం కలుస్తూవున్నదో ఆగ్రామం పేరున్ను వ్రాసినారు. యీదోనూరు కోనయ్య అనే బ్రాంహ్మడే బాల భాగవతం అనే ప్రాకృతగ్రంథం చేసినాడు. అందులో ఆరవేటి బుక్కరాయల ప్రకరణంలో తద్వంశీకులయిన నంద్యాలరాజులవంశావళి వున్నది." (L. R. vol. 33, p. 244.)

ఆబూపర్వత శిఖరము భారతదేశమునందు గల ముఖ్యపవిత్రస్థలములలో నొకటి. హిందువులకు వారణాసి, బదరీనాద్, ఎంత పూజనీయములో, గయ బౌద్ధులకెంత పూజనీయమో, ఆబూపర్వతము జైనులకంత పూజనీయము. సిమ్లా రాజప్రతినిధికి ఎంత యాహ్లాదమునిచ్చునో, ఉదకమండలము చెన్నపురి రాజధాని ప్రజలకెంత యాహ్లాదము నిచ్చునో, ఆబూపర్వతము రాజపుటానా ప్రజలకంత యాహ్లాదము నిచ్చుచున్నది. అజంతా బాఘ్‌లు ఎట్లు పూర్వభారతశిల్పకళావిభూషితములో, టాజమహాల్ ఎట్లుమొగల్ కళావిభూషితమో, ఆబూపర్వతము అట్లు రాజపుత్రచిత్రకళావిభూషితమై విరాజిల్లుచున్నది. ఆబూ శిఖరము ప్రపంచయాత్రికుల నాకర్షించు స్థలములలో నొకటియై ప్రతిదేశమునుండి వేలకువేలు యాత్రికుల నాకర్షించుచున్నది. ఆబూశిఖరము ౪,౫౦౦ అడుగుల యెత్తున సమశీతోష్ణస్థితియందున్న రాజపుటానాలోని షిరాయిసంస్థానపు యాత్రాస్థలము. రాజప్రతినిధిగారి ఏజంటు ఈ స్థలములోనే యుండును. బొంబాయి, బరోడా అండు సెంట్రలు ఇండియా రైల్వేలోనున్న ఆబూరోడ్డుస్టేషనులో యాత్రికుడు దిగి, ౧౭½ మైళ్లు కొండరోడ్డుపై, టోంగాయను గుర్రపుబండిపై ౨½ గంటల కాలము ప్రయాణముచేసిన ఈశిఖరమును చేరును. యాత్రికుల నాదరించి, సుఖములను చేకూర్చు రాజపుటానా హోటలునందు బసచేయవచ్చును.

శిఖరముయొక్క ప్రకృతి శృంగారము కంటె అటనున్న శిల్పకళాసౌందర్యముతో వెలసియున్న జైన దేవాలయము యాత్రికుల మనస్సుల నధికముగా నాకర్షించును.

## దిల్వారాలయములు

జైనులకు ముఖ్యతీర్థములలో మొదటివి దిల్వారాలయములు. దిల్వారాలయములు నాలుగున్నూ ౧౦౦ అడుగుల చతురములో నతిసుందరముగను, నైపుణ్యముగ నుంటచే శిల్పోపాసనాపరుల నాకర్షించును. ఆలయములన్నియు చలువరాతితో నిర్మింపబడినవి ప్రతిరాయి మూలయు నాజూకయిన చేతిపనులచే నలంకరింపబడి ఎంతమంది సుప్రసిద్ధశిల్పులు ఎంతకాలము, ఎంతవ్యయము చేసిరో యీనిర్మాణములకను నాశ్చర్యముజనింపకమానదు.

## ఆదినాథ ఆలయము

నాలుగింటిలో ముఖ్యమయినది ఆదినాథాలయము. దీనిని క్రీ. శ. ౧౦౩౧ సం॥రమున గుజరాతు రాయిగనున్న జైనుఁలభక్తుఁడగు విమలషహ సమారు ౧౮౫,౬౦౦,౧౦౦, రూపాయలు వెచ్చించి ౧౪ వత్సరములలో నిర్మింపజేసెను. ఈ యాలయపు గోపురము యొక్క సుందరశిల్పము వర్ణింప శక్యముగాదు. ఆలయములోనున్న ఆదినాథతీర్థకారుని విగ్రహమును, అలంకార శిల్పమును చూచి ప్రేక్షకులు విస్మయాత్ములగుదురు.

## నేమ్నాథ ఆలయము

గుజరాతురాజుయొక్క మంత్రులును, సోదరులునగు వస్తుపాలు, తేజపాలు అనువారు క్రీ. శ. ౧౨౩౧ తీర్థకార నేమ్నాధ అంకితముగ నీ ఆలయమును నిర్మింపజేసిరి. దీని గోపురమున కమలాకృతిని చలువరాతితో శృంగారములు, నేత్రానందకరములు నగు ననేకచిత్రములును కాననగును. ప్రతిఆలయపుటావరణములోను అందములగు చిన్నగదులు తీర్థకారుల విగ్రహములచే నలంకరింపబడి శోభాయమానముగ నుండును.

వీటిలో ముఖ్యము హాథీఖానా. ఇందు చలువరాతితో ౧౦ ఏనుగుల విగ్రహములు వాటి యలంకారములతో చెక్కబడియున్నవి.

## నక్కిసాగరము

దేవనిర్మితమనబడు యీ నక్కిసరోవరము ఆబూ పర్వతముయొక్క సౌందర్యమును యినుమడి చేయుచున్నది.

## గోముఖి

హిందూ పురాణ ప్రసిద్ధమయిన వసిష్ఠాలయమును, చలువరాతితో చెక్కబడిన గోముఖమునుండి సదా ప్రవహించు చిన్నయేటయు నీ శిఖరమునకు వన్నె తెచ్చుచున్నవి.

ఈపర్వతశిఖరమున ఒకదినము ఉపవసించిన పాపవిమోచనమగుననియు, యొకవత్సరము తపస్సు చేసిన మహాయోగియగుననియు నెంచి, హిందూసన్యాసులు, బౌద్ధభిక్షుకులు, జైనయాత్రికులు, శిల్పసౌందర్య పిపాసువులు నేటేట నాశిఖరోపరిభాగముల తమ యీప్సితార్థముల పొందుచున్నారు. ఆంధ్రులీపర్వతశిఖరమును దర్శించి ఈప్సితార్థముల బడయుదురుగాక!

# ఆబూ పర్వత చిత్రములు*



౧. ఆబూపర్వతముపై నున్న 'దిల్వార' చలువరాతి దేవాలయము—ఒకదృశ్యము



౨. ఆబూపర్వతముపై నున్న 'అచలఘరు కోట'—ప్రాచీనము. జైన దేవాలయములు

* ఈ ఛాయాచిత్రములు శ. శ్రీ వి. ఆర్. చిత్రగారు తీసినవి.



3. ఆబూపర్వతముపై నున్న 'దిల్వార' చలువరాతి దేవాలయము; రెండవదృశ్యము



౪. 'దిల్వార' చలువరాతి దేవాలయమునందలి మంటపము, స్తంభములు, విలువంపుతోరణములు సుందర శిల్పచిత్రములు గలవి

# వినోదశిల్పము—ఇల్లు

కొ. నరసింహాచారి గారు

[ఇదిమొదలు బాలబాలికలకు మనఃపరిణామమును, బుద్ధివికాసమును, ఉత్సాహానందములను పెంపొందించు వాఙ్మయమునకు భారతి ప్రతిసంచికయందును (పదిపుటలకు మించని) తావొసగ సంకల్పించినది. ఆ వాఙ్మయమున చిన్నచిన్నకథలు, ముచ్చటలు గూర్చుపాటలు, పద్యములు, (ప్రాతవి, క్రొత్తవి) అట్ట, బైండు, కాగితము, మట్టి మున్నగువానితో బొమ్మలు చేయు పద్ధతి మొదలయినవిషయములు చేరును. ప్రతివిషయమును సచిత్రముగ నుండవలెను. బొమ్మలుచేయుపద్ధతి 'వినోదశిల్పము' అను ఈ శీర్షికక్రింద వెలువడుచుండును. కావున బాలబాలికలకొఱకయిన వాఙ్మయమున తమకు మంచి ప్రవేశముగల విషయములనుగూర్చి ఆంధ్రసహృదయులు పిల్లలకు సుబోధకముగ నుండునట్లు చక్కనివ్యాసములను ప్రకటింప నొసంగి తెలుగు పిల్లల విజ్ఞానాభివృద్ధితోపాటు భారతి సంకల్పసిద్ధికిని తోడుపడుదురుగాక యని ప్రార్థన.

—సంపాదకుడు, భారతి.

పిల్లలకు బొమ్మలను చూచుటచేత ఆనందము కలుగును. వారు తమకు ఆనందమును గలిగించు బొమ్మలను తామే చేసికొనగలిగినచో మఱింత ఆనందింతురు. అందువలన వారి బుద్ధిసూక్ష్మతయు వృద్ధినందును. కావున నిదిమొదలుకొని పిల్లలకు బొమ్మలు చేసికొనుటను నేర్పు కొన్ని యిట్టి వ్యాసముల నీ భారతియందు క్రమముగ ప్రకటింప దలచితిని.

ఒక ఇంజనీయరు ఒకవంతెననుగాని, ఇంటినిగాని కట్టుటకుముందు దానికితగినప్లానులను తయారుచేసికొనును. ప్లానులు లేనిది ఆయన యేపనిని తలపెట్టడు. ప్లానులో ప్రతిభాగపు కొలతయు వేసియుండును. దాని సహాయమున ఇంజనీయరు తాను తలచినకట్టడమును పూర్తిచేయగలుగును. అట్లే బొమ్మలకు చిత్రములసహాయము మెండుగా కావలసియుండును; విషయమును గ్రహించుటకు ఆచిత్రముల సహాయమును గొనవలెను. విషయమున వర్ణించిన ప్రతిభాగమును చిత్రమున గుర్తించియుండును. దాని కొలతయు చిత్రమునందు వేయబడియుండునుగాన చిత్రమును శ్రద్ధతో నర్థముజేసికొని బొమ్మనుచేయుటకు పూనుకొనవలెను. ఇచ్చట అట్టతో ఇంటిని చేయువిషయమునుగూర్చి చెప్పుచున్నాను. ఇందువచ్చు చదరము లేక చతురము (Square), సమకోణము(Right angle)అను పదములు కొందరికి క్రొత్తలుగా నుండవచ్చును. కాబట్టి వాటినిగురించి కొంత వివరించెదను.

కోణము (Angle) అనగా మూల. రెండు చక్కటిగీతలుఒకచోటచేరిన,ఒకమూలకోణము (Angle) ఏర్పడును. (చి. A). ఒక చక్కటిగీతపై, ఏ భాగమునందైనను ఒకటిగాని ఎక్కువగాని చక్కటిగీతలు వచ్చిచేరిన వాటిమధ్య నంతయు మూలలు (కోణములు-Angles) ఏర్పడును.







(చి. B: 1, 2, 3, 4). ఒక చక్కటి గీతపైన మరియొక్కటే చక్కటిగీత వచ్చిచేరినప్పుడు ఆచేరినగీతకిరుప్రక్కలనుండు మూలలు సమానముగా నుండినయెడల

అట్టిమూలలకు సమకోణములు (Right angles) అని




పేరు. (చి. C). ౧ సమకోణ ఫుపరిమాణము 90 డిగ్రీలు లేక అంశములు. ఒకకోణ మును ఏర్పరచు గీతలకు భుజములు (Arms) అని పేరు. ఏదైన నొక కోణముయొక్క భుజముల కొల తనుబట్టియైనను కోణ పరిమాణము మారదు. ఉదాహరణము: చి. B యందు 4 - కోణమునకు OAయును, OCయును భుజములు. ఈ రెండు భుజములను OA వఱకును, OC వఱకును పెద్దవిగాజేసినను 4-కోణము వెడల్పుగాగాని ఇరుకుగాగాని కాక, ముందున్నరీతిగనే యున్నది: కోణపుకొలత మారలేదు.

కోణములను కొలుచుటకు ఒకసాధనము కలదు. దానికి ప్రొట్రాక్టరు (Protractor) అందురు: ఈసాధనముతో ఏపరిమాణముగల కోణము తన, కొలువవచ్చును. ప్రస్తుతము మనకు కావలసినది ఒక సమకోణముమాత్రనే గాన దానిని ప్రొట్రాక్టరులేకయే కొలుచుకొను ఉపాయము కలదు. ఒక చక్కటియంచుగల కాగితమును క్రింద




1-2 అంచును O వద్ద మడువవలెను. (చి. D.) అప్పుడు O-1యును, O-2యును, ఒకదానిపై నొకటి




చక్కగా ఆనియుండవలెను. (చి. E.) 3-O-1 ఒక సమకోణము.

సమచతురము (Square) అనగా నాలుగుప్రక్కలును ఒకేకొలత గలిగి నాలుగుమూలలును సమకోణములుగా నుండవలెను. ప్రస్తుతము మనకు 8 అంగుళముల ప్రక్కలుగల చదరపు అట్ట కావలెను.

ఒక అట్టమీద 8 అం. గీతను ఒకయంచుసమీపమున వేయవలెను. ఆగీతయొక్క రెండుకొనలయందును చి. E యందుగల సమకోణపుకాగితమును పెట్టి సమకోణ




ములను గుర్తింపవలెను. చి. F లో O O చూడుడు. తర్వాత, ఈ క్రొత్తగావచ్చిన ప్రక్కలకొలత ఎనిమిదేసి యంగుళములుగా గుర్తించి, వాటి పైకొలతను చేర్చుచు మరియొకగీత గీయవలెను.




1, 2, 4, 3 (చి. G.) ఒక సమచతురము. ఈ చదరముయొక్క నాలుగుప్రక్కలను నాలుగేసి సమభాగములుగా భాగింపవలయును. తర్వాత చి. G యందు వలె అడ్డముగాను, నిలువుగాను గీతలు గీచి మొత్తమునకు ౧౬ చిన్నచదరములు వచ్చునట్లు చేయవలెను.

చి. Gయందు మూడువిధము లగు గీతలు కలవు. ——ఇట్లు నేరుగానుండు గీతలు అట్టను అడుగంట కోయవలసినదని సూచించును;—— . ——.——

——. ఇట్లుండు గీతలు అట్టను సగములోతుగా మాత్రము కోయవలెనని సూచించును; - - - - - - - - - - - ఇట్టి గీతలు అట్టను కోయగూడని చోట్లను తెలుపును. ఈవిషయమును చిత్రమునుచూచి, చక్కగా గ్రహించి, తర్వాత కోతలను ప్రారంభించవలెను. తొందరపడి ఆలోచించక తప్పుకోలత వేసినయెడల ఆ అట్ట ముక్క మఱి పనికిరాకపోవును. చి. G యందువలె 5–8, 6–9, 7–10, గీత్రలను వేయవలెను. చి. D. అనునవి తలుపులు. చి. W అనునవి కిటికీలు. ఈవిషయము లన్నిటిని ముందు చిత్రముగా అట్టమీద గుర్తించుకొని తర్వాత కోయవలసినరీతిని గురించి క్రింద వ్రాసినదానిని గమనింపవలెను.

అట్టను కోయవలసిన రీతి:—— అట్టయొక్క అంచులు మనప్రక్కకు వచ్చునట్లు మడువవలెనన్న, (చి. J) కోత వెనుకవైపున సగము లోతుగా పడవలెను.




అంచులు 1, 2 వెనుకకు పోయి, వెన్ను మన




వైపురావలెనన్న కోత మనప్రక్క పడవలెను. (చి. H.) ఈకోతలు పొరపాటున తలక్రిందులుగా చేసినయెడల మనఇష్టానుసారము అట్టను మడచుటకు వీలు లేకపోవును.

కాబట్టి అట్టలోని ఏయేభాగములను, ఏయేప్రక్కలకు మడువవలెనో నిర్ణయించుకొని, తర్వాత దాని వెనుక ప్రక్క కోత వేయవలెను. మంచి పదును గల కత్తి మొనతో రెండుసారులు గీతమీద అట్టను వంచుటకు వీలగునంత లోతుగ కోయవలెను.

అట్టను (చి. G) 6—6మీదుగా సగమునకు మడువవలెను. 6–6 ఇంటిశిఖరము కప్పగును. 5–5, 7–7 మీదుగా మడచిన గోడలు ఏర్పడును. తర్వాత A B చదరములను ఒకదానిపై నొకటి పూర్తిగా కప్పునట్లు మడువవలెను. తర్వాత EF చదరములను A, Bల పైకి మడచి 7–10, 5–8 అంచులను ఒకేమట్టమునకు వచ్చునట్లు చేయవలెను.

అదేరీతిగా కుడిప్రక్కగూడ మడచిన యెడల, ఇల్లేర్పడును. మడచినభాగములను వీడిరానియ్యక, చి. K




యందు 1, 2 వద్దనుండు రీతిగ కుట్టవలెను. ఇంటి పై కప్పునకు పెంకులవలె చిత్రించిన కాగితమును నతికించిన బాగుండును.






## రాధాకృష్ణగారి వీడ్కోలు విందు

ఈ వేసవి గడచి ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయమున 'Comparative Religion and Philosophy' (ఆనుషంగిక మత-తత్త్వముల) కు అధ్యాపకులుగా పోనున్న ప్రొ. రాధాకృష్ణ గారికి కలకత్తాయందలి Post Graduate (బి.ఏ. పైతరగతుల) ఆంధ్రవిద్యార్థు లీనడుమ నొక వీడుకోలు విం దొసగిరి.

## డాక్టరు డి. వి. సుబ్బారెడ్డిగారు

వీరు నెల్లూరివారు. వీరు జెనిటో యూరినరీ అండ్ స్కిన్నువ్యాధు లను గూర్చి మంచి జ్ఞానమును బడయుటకై ఇంగ్లాండునకు పోయి లండను ఎడిన్బరో లలో పెద్దపెద్ద డాక్టరులవద్ద ఎక్కువ సామర్థ్యమును సంపాదించుకొని స్వస్థానమును చేరిరి. వీరి ప్రత్యేకసామర్థ్యమువలన ఆంధ్రదేశము లాభమును బడయును గాక.



శ్రీ డాక్టరు డి. వి. సుబ్బారెడ్డిగారు

---

## బిచ్చగాడు

శ్రీ కర్లపాలెం కుటుంబశాస్త్రిగారు

శ్లో॥ కరనము ననుభవించుచును జనులకు
కరుణరసము కలుగజేయు కవివి నీవు
నేటిభారతీయుల ప్రతినిధివి నీవు
నీదుజీర్ణవస్త్రంపు నువనికల నడుమ
నవ్యభారతదుఃఖాంతనాటకమును
గాంచనగునోయి—
పిచ్చివానివలెనెయుండి బిచ్చగాడ
ఎదియొపాడెదవెపుడు; నీకదె విషాద
గీతి—మనకెల్ల జాతీయగీత మదియె.

---




## కోపము

ఒకప్పు డొకరాజు గొప్పపండిత సన్యాసిని తన గురువుగ చేసికొనెను. ఆ గురువునకు కోప మెక్కువ. మనసును స్వాధీనము జేసికొనక యా స్వామి తన యాశ్రమమునకు గల బాహ్యాచారముల నన్నిటిని శాస్త్రవిధిగ చేయుచుండెను.

ఒకనాడు ప్రాతఃకాలమున నాతడు గంగానదిలో స్నానముచేసి తిరిగి వచ్చుచుండగా నొక పాకీది యాతని ప్రక్కనుండి బోవుచుండెను. అపు డామెనీడ యీ రాజగురువుగారి పాదముల నంటెను. ఇంతటితోనే యీ సన్యాసి కమితమగుకోపము గలిగె తాను మైలపడెనను యావేశముతో సన్యాసి తను జ్ఞానము సహా మరచి యా పాకీ దానిని నానా దుర్భాషలాడెను. పాప మామె దూరముననె నిలిచి క్రిందికి జూచుచుండెను.

"ఓ దుర్మార్గురాలా, చండాలినీ, నేనెవరో నీకు తెలియుట లేదా?" అని తునకా గురువు తీవ్రముగ యడిగెను. కాని "చండాలినీ" యను మాట పలుకుటతోడనే యామె మరింత దగ్గరగ రాజొచ్చెను. కోపముతో నిండియున్న యా సన్యాసి చేయి పట్టుకొని యామె "ఎన్నాళ్లకు నా నాధుని కలుసుకొంటి" నని కౌగలించుకొనెను. అచట నున్న వారంద రామె సాహసమున కచ్చెరునందుచు నా సన్యాసిని విడిపించుట కెంతయో ప్రయత్నించిరి. ఆ గురువును మిగుల సిగ్గుజెంది శక్తివంచన లేక తప్పించుకొన బోయెను. "నాతోగాని నా ప్రాణప్రియునితోగాని మీ కెవ్వరికిని పని లేదు. రాజుగారే మా తగవును దీర్చెద" రని యామె చెప్పెను.

ఎంతబలవంత పరిచిన నొప్పుకొననందున రాజసభాద్వారమున కా యిరువుర నీడ్చుకొనిపోయి వారలు వారిని రాజు యెదుట బెట్టిరి. పాకీదానిచేత జిక్కిన తన గురువుం జూచి రాజున కేమియు దోచక నామె చెప్పినది రుజువుచేయని యెడల నామెను శిరచ్ఛేదము జేయుమని యాజ్ఞాపించెను.

"మహారాజా, సభాసదులారా! నామనవినాలకింపుడు. ఈ భక్తు డెపుడు తన హృదయమందు కోపమునకు తావిచ్చెనో యపుడే నా భర్తయాయెను. సకలశాస్త్రములను బట్టి యుగ్రమగు కోపమనునది తప్పక చండాల రూపమే. కోపమువలన నిదానము చెడిపోవును. కోపము క్రూరకృత్యముల జేయించును. నిజముగ కోపముకంటె యెక్కువ నీచమైనదియు నధఃపతనము గావించునదియు మరొకటి లేదు".

ఈమాట లామె జెప్పుచుండ నా సన్యాసి వాటి యథార్థము బాగుగ దెలిసికొని నిజముగ నమ్రత గలిగి యామెకు బహిరంగ సభలో పాదాక్రాంతుడై యా క్షణమునుండియు నామెను గురువుగ నంగీకరించెను. మంచి మాటలెవరు జెప్పిన వినవలెను గదా!

అంతట యా చండాలిని తనంతట తానే యా స్వామిచేయివదలి కోపరహితుడగు నాతడు తనభర్త కాడని దూరమున నొకకడ నిలిచెను. ఆ సన్యాసితో నిపుడామె కేమియు ప్రసక్తి లేదు గాన జరిగినదానికి వాని క్షమార్పణ వేడెను. అప్పటినుండియు నా సన్యాసికి తిరిగి కోపము రాలేదు. తన హృదయమునందు నిజముగ చండాలినియగు కోపము ప్రవేశించకుండ నాతడుబహుజాగరూకుడై యుండెను. ఇట్లు కాలము గడిచినకొలదియు నాతడు తన ప్రేమను పరాత్పరుడు సృజించిన క్షుద్రజంతువులపై గూడ ప్రసరింపజేసి మిక్కిలి దయార్ద్రహృదయుడాయెను (సెంట్రల్ హిందూకాలేజి పత్రిక ౫ సంపుటము)

## క్రొత్త వింత



ఫిరంగిలో గుండుకు బదులు మనుష్యుని ఉంచి

ఫిరంగిని పేల్చుట. న్యూయార్కులోని లింగ్లింగు బ్రదర్సు సర్కసులో 'హ్యూగో జాకిని' అనువారు పెద్దఫిరంగిలో దూరియుండగా ఫిరంగి పేల్తురు. దానిలోనుండి వీరు నిరపాయముగా పైకి ఎగిరిపోయి ఎదుట దూరమున గట్టియున్న వలలో పడుదురు. ఈ వింతను దెలుపు చిత్రమే యీ మొదటనున్నది.

---

## హిందూ మహమ్మదీయ వివాహము

చెన్నపురి పోలీసు డిప్యూటీ కమిషనరుగారగు శ్రీ జియాఉద్దీన్‌గారు హిందూ ధర్మాదాయముల బోర్డు కమిషనరయిన శ్రీ రావు సూర్యారావుగారి వెలమకులము వారు పుత్రిక శ్రీరావు లక్ష్మీదేవి బి. ఏ. గారిని వివాహ మాడిరి. వధూవరులిరువురు నాంగ్ల విద్యా ప్రవీణులు. ఇద్దఱు నాంధ్రులు. ఆంధ్రులగు హిందూ మహమ్మదీయులలో జరిగిన మొదటి వివాహ మిది. వివాహము అన్యోన్యానురాగమూలకమైనను అనాదిగా విరుద్ధమార్గముల బట్టి పోవుచున్న రెండు భిన్నమతములవారి కిట్లు సంయోగము సమకూడుట యాశ్చర్యజనకము కాకపోదు.





## నీటిపై నడచు ద్విచక్ర శకటము

పారిసుచేరువ నొక గ్రామమున నివసించు రోజర విన్సెంటుగారు 'కెలే'నుండి 'డోవరు' వరకు ఇం



గ్లీషు చానలుపై సముద్రమున ఈ ద్విచక్ర శకటముపై ౬ గంటలలో ప్రయాణించిరి. దీనికి ఆంగ్లమున Hydro cycle అని పేరు.

---

## విమర్శచంద్రిక

### ౧

మనుజునకు భజనార్హములగు వస్తువులలో ముఖ్యమైనవి మూఁడు. అవి మాత; మాతృభూమి; మాతృభాష. మాతృదేవోభవ; న మాతుః పరదైవతం; జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ;యనియుఁ జెప్పుటచే మాతృదేవతాప్రాశస్త్యము వెల్లడి యగుచున్నది. మనుజకోటికి మరణము తప్పదు. తనయుఁడు ముందో, తల్లి ముందో. కావున నెల్లరకు మాతృబుగ్నము దీర్ప నశక్యము. మాతృదేవతారాధన చేధన్యులైనవారు బహ్వల్ప సంఖ్య యని యూహింపఁ జెప్పవచ్చును. రెండవది మాతృభూమి. అంధ్రమాత పరరాజన్యుల కూడిగము చేయుచున్నది. దాస్యజీవనోపాయియై యీటికి గుడ్డకుఁ బరుల కొంపకుఁ జేరినది. మాతృదేశారాధన యొక్కరిచే గాదు. అందఱిచేఁ గాదు. ఇఁక మూఁడవది మాతృభాష. భాష ఆచంద్రతారార్కముండునది. జరామరణభయము లేనిది. ప్రభుత్వములు తారుమారైనను, ప్రళయ ముద్భవించినను భాష కట్టి కీడును పరిఢవిల్లదు.

'ఆదట సప్తసంతతుల యందును నొక్కొక కాలమందు, విచ్ఛేదము కల్గునాటికిఁ - జెప్ప విపర్యయస్థే యుగంబునాఁ లేదు కవిత్వసంతతికి-' (పిన వీరభద్రకవి) కావున మనుజుఁడు తన శక్తి సామర్థ్యములఁదలపోసి, యీ మూఁడింటిలో నొక్కదానినైనను భజించినచో ధన్యుఁడగును. అందుఁ గడపటిది యగు భాషాసేవయె శాశ్వతమైనది. అది యొనర్చువాఁడె ధన్యుఁడు. అతఁడె పూజార్హుఁడు.

### ౨

భాషలో నన్యదేశ్యపదములు గలియుటకుఁ గారణము లనేకములు. కవి యొకదేశమున జన్మించి, తద్దేశభాషలోఁ బరరాజాస్థానములందుండిగాని, వానిచే సత్కారములందిగాని గ్రంథముల రచించినచోఁ దద్దేశ్యపదములు కవిత్వములోనికిఁ జొరకమానవు. అట్టి సన్మానము లందక పోయినను బరదేశవాసముచే నాభాషాపదములు నిజభాషలోఁ గలియక మానవు. ఇందు కుదాహరణము నన్నెచోడుడు నాచనసోముఁడు. వీరు కర్ణాటదేశసంపర్కముచేఁ గన్నడపదముల దమ కవిత్వములోఁ జేర్చిరి. ఒకప్పుడు పరదేశీయుల పొత్తుచే కర్ణాట అన్యదేశ్యములు భాషలోఁ గలియుచుండును. కర్ణాటసామ్రాజ్య కాలమునందు హిందూ మహమ్మదీయ సమ్మేళనముచే, తత్సామ్రాజ్యరాజ్యపోషకులైనయాంధ్రకవులకు పెద్దనాదులు హిందుస్థానీ పదములు వాడియున్నారు. ఇది పరదేశీయుల పొత్తుచే సంభవించినది. కవి యొక దేశీయుఁడై, మఱియొక దేశమునందు గ్రంథ

మును గ్రాయుచోఁ దన స్వభాషాపదముల కవిత్వము నందుపయోగించుటచే నన్యదేశ్యములు భాషలోఁగలియు చుండును. కర్ణాటకుఁడగు కృష్ణదేవరాయకృత ఆముక్త మాల్యదలోఁ గన్నడ పద ప్రయోగములుగలవు. అట్టి సంపర్కముచే సంభవించిన పదజాలము ఆంధ్రసారస్వతమునందు స్వల్పముగా నున్నది.

ఇప్పుడు పరిస్థితులు తారుమారైనవి. ఆంగ్లభాషా సంపర్కముచే నాంధ్రమాంగ్లమై పోయెడి దుస్థితిచే కూడినది. వాడుకలో జనసామాన్యము ఆంధ్రము తక్కువ ఆంగ్ల మెక్కువఁగా వాడుచున్నది. గ్రంథస్థమగు ఆంగ్ల భాషాపదజాల మెక్కుడైపోయినది. సుప్రసిద్ధులగు తిరుపతి వెంకటేశ్వరకవులు ఆంగ్లభాషాపదములు స్వేచ్ఛగాఁ దమగ్రంథములం దుపయోగించిరి. విజయనగరము నందలి యొక కవిశిఖామణి 'పండుగ కట్నము' అను గ్రంథములో నొక పద్యమునంతయు నాంగ్లభాషా పదములతోఁ గూర్చినాఁడు. ఇఁక వాడుకలో ముప్పాతిక భాగ మాంగ్లము-ఒకవంతు ఆంధ్రము—ఈ ఆంధ్రమనేక రూపములఁ దాల్చియున్నది. ఒక్కొక విషయమున కొక్కొక యుదాహరణము నిచ్చుచున్నాను.

## రైలు తెలుగు

౧. 'ఈ కిటికీవద్ద ప్రయాణీకులను ఏకించుక పోవు ప్రతి బండికి 45 నిమిషములు ముందుగా తెరచి వుంచును' (ఇందు కర్త, కర్మ క్రియ లేవో?)

### నిర్ణయించబడిన కూలీల కట్టణములు

ఒక రైలువద్దనుండి మరియొక రైలువద్దకుగాని, రైలువద్దనుండి ప్రయాణీకులకు ఏర్పరుపబఁడిన విడుదలకు (వెయిటింగురూము)గాని, స్టేషన్ ప్రవేశద్వారమునుండి రైలుబండివరకుగాని ప్రయాణీకుల సామానుల మోతకు నిర్ణయించబడిన లైసెన్సు కూలీలకట్టణము సామాను ఒక టెంటకి—

### ౨. ప్రభుత్వమువారి తెలుగు

౧. పోలింగ్ స్టేషనువద్ద ఎలెక్టరుకు సప్లై(సరఫరా) చేయబడు ప్రతి బాలెటు కాగితముపైనను, 6వ విధి క్రింద ప్రకటింపబడిన చెల్లతగిన నామినేషన్ల షెడ్యూలు (పట్టీ)లో చేర్చబడిన, ఎలెక్షను నిమిత్తమైన కాండిడేట్ల పేర్లు అక్షరక్రమము ప్రకారము ఇంగ్లీషు భాషలోను, కమిషనరుయొక్క యిష్టానుసారముగా అవి ఇంగ్లీషులో అచ్చువేయబడిన వరుస ప్రకారము ఎలెక్షను జరుగుచున్న బాపతు డివిజనునందు వాడుకలోనుండు యేదైన దేశ భాషలోనుగూడ అచ్చువేయబడవలెను.

ఇంటిలి పైకము ముట్టినది: (ఈ బిల్లులో తగ్గించి పుచ్చుకొనుట మూలముగా పూరా పైకము మొత్తము వాపసు చేయబడిన) ఈక్రింద వివరింపబడనవితప్ప, ఈ తేదికి 30 దినములు పూర్వము తీయబడిన బిల్లులలో చేర్చబడిన యావత్తుజీతములును, ఇంటి బాడుగలును, నిర్ణీతములైన కంటింజెన్సీలు (అవసర ఖర్చులు)ను, తగిన మనుష్యులకు చెల్లింపబడినవనియు, నా ఆఫీసులో ఫైలు చేయబడిన జీతముల బట్వాడా పట్టీలలో వారి వారి రసీదులు తీసుకొనబడినవనియు నేను తృప్తిపరుచుకొంటినని సర్టిఫై చేయడమైనది.

3. ఇఁక క్రైస్తవ తెలుఁగువారు ప్రచురించుచున్న సువార్తలఁలో జదువవగును.

౪. సాధారణముగా దినచర్యలలో మాట్లాడెడి భాష ఆంగ్లమో, ఆంధ్రమో తెలియదు. చూడుఁడు.

Casual leave credit లో లేదుగా! late గా officeకు వస్తానని చెప్పి Attendance లో absent mark చెయ్యవద్దని request చేసినట్టు Tahsildar గారితో చెప్పు. Twelve అవగానే వస్తాను.

## 3

ఆంధ్ర విశ్వవిద్యాలయ సమస్య పిట్టపోరు పిల్లి తీర్పునను సామెతగ రాజప్రతినిధి పరిష్కరించెను. దత్త మండలమువారు, చిత్తూరు మండలమువారును చివరకు రెంటికిఁ జెడిన రేవని రీతిగనున్నారు. మన మాంధ్రులము గామా? ఆంధ్రదేశములో విశ్వవిద్యాలయ మెచ్చటనున్న నేమి? పూర్వము విశాఖపట్టణము మండలమువారు మన రాసు విశ్వవిద్యాలయ మున్నపుడేమిచేసిరి? 'రాయల సీమ రాయలసీమ' యని యంగలార్చెడి దత్తమండలము వారి దేశభక్తి, ఆంధ్రభాషాభిమానము నిట్టిదియా.

రాయలసీమవారికి ద్రావిడసంపర్కమే శ్రేయస్కరము. ఆంధ్రదేశములో నగరవారి ప్రాధాన్యమెంత హెచ్చుగా నున్నదో యీ క్రింది పట్టికఁ జూడుఁడు.

| 1921 | జనాభా | ఆంధ్రులు | తమిళులు |
|---|---|---|---|
| ఏజెన్సీ | 1,496,3?8 | 297,283 | 2?9 |
| గంజాము | 1,835,562 | 83?,785 | 378 |
| విశాఖపట్టణము | 2,231,874 | 2,150,263 | 1,743 |
| గోదావరి | 1,470,863 | 1,448,209 | ?,480 |
| కృష్ణా | 2,133,314 | 2,0?7,355 | ?,057 |
| గుంటూరు | 1,809,574 | 1,676,140 | 2,998 |
| నెల్లూరు | 1,385,55? | 1,281,582 | 26,226 |
| కడప | ?87,929 | 793,?27 | 2,045 |
| కర్నూలు | 914,890 | 793,?17 | 1,815 |
| బళ్లారి | 862,370 | 271,741 | 5,846 |
| అనంతపురం | 955,917 | 772,984 | 4,337 |
| చిత్తూరు | 1,2?9,157 | 916,7?4 | 270,794 |

విశాఖపట్టణ మండలము భరతఖండములో నెక్కువ విస్తీర్ణము గల జిల్లా. 17000 మైళ్ల విస్తీర్ణము కలదు. జిల్లా యంతయు జమిందారుల వశమైయున్నది. విశ్వవిద్యాలయాధ్యక్షుల వాసము. విజయనగరము మహారాజు బొబ్బిలి రాజు మొదలగు సంపన్నుల కిరవు. విజయనగర మహారాజుగారు ౨౦ లక్షలరూపాయలు, కొన్ని వందల యెకరముల భూమియు విశ్వవిద్యాలయమునకు విరాళ మిచ్చెదరని కింవదంతి కలదని కృష్ణాపత్రిక వ్రాసెను. ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు నిర్యాణ్యోగము గాక!

౪

గ్రంథమూల్యము కొలఁదియు గ్రంథప్రాశస్త్య ముండునని తలంచుట చిత్తభ్రమ. ఆంధ్రగ్రంథముల మూల్యము పెరుగుచున్నది కాని తగ్గుట లేదు. జనసామాన్యమునందు భాషాభివృద్ధి కలుగవలెనన్న మూల్యము తక్కువగ నుండవలెను. గ్రంథప్రకాశకులు గాని, గ్రంథకర్తగాని గ్రంథమూల్యమును హెచ్చించుట ప్రతిష్ఠాపహమైనదిగాను, శ్లాఘనీయ మైనదిగాను దలంచినచో భాషాభివృద్ధి కాటంకమును గలుగఁ జేయుటమే. ఆంగ్లభాషా గ్రంథములు జూడుఁడు. పండ్రెండణాలకు షేక్స్పియర్ నాటకములన్నియు వచ్చును. అరణాలకు సుప్రసిద్ధ గ్రంథకర్తల శాస్త్రమేదియైనను గొనవచ్చును. ఆంధ్రమునందు భారత భాగవత రామాయణాది గ్రంథములఁ గొనవలెనన్న నెలజీతము చాలదు. ఏటి ప్రారబ్ధము! ఈమధ్య యొక మిత్రునకు 'క్రీడాభిరామము' కావలెనని వ్రాయఁగా నతడు పదిరూపాయలు పంపినచో లభ్యమౌనని వ్రాసెను. అట్టి క్రీడాభిరామము వంటి గ్రంథరాజము లాంగ్లభాషలోఁ బదియణా లొసంగిన దొరకును. కొనదగినవారే వెల యిచ్చి కొనఁగలరు. మాకేమి కొదువ యని ప్రకాశకు లూహించినచో నేమి చెప్పవచ్చును.

౫

బెజవాడనుండి విశాఖపట్టణమువఱకు రైలులోఁ బ్రయాణముచేయువారు పుస్తకవిక్రేతలమ్ము గ్రంథరాజములఁ బరికింపనివా రుండరు. చెరకుతుద వెన్నుబుట్టినట్లు ఆంధ్రవాఙ్మయమున తత్సారస్యమును తెలుపుకోయనునన్ని ఇప్పుడు నూతన గ్రంథము లనేకములు ప్రచురింపఁబడుచున్నవి. వాని నామములెంత శ్రవణానందముగా నున్నవో చూడుడు:— 'దురాశ' 'ఘోరకలి' 'అగ్గిరాముఁడు' 'బుగ్గిరాముఁడు' 'పేటికాంతర శవము' 'ఘోరపిశాచి' 'సురానంద' 'ఘోరప్రతిహింస' 'పాతాళగృహము'. ఈ గ్రంథరాజముల ప్రాశస్త్యము పేర్కొనఁ దు వ్రాసెదను.

'చంద్రమౌళి'

---

## కిష్కింధ, పంచవటి, స్థలనిర్ణయము

వైశాఖమాస భారతిలో చిన్నప్రశంస ఈ శీర్షికతో గనిపించింది. అందులో కిష్కింధ స్థలనిర్ణయము విషయములో నేమీ తకరారు లేదు. గాని పంచవటిని నిర్దేశించుటలో తగవు తెగలేదు.

ఈ తగవునకు కారణము రామాయణమునందు జెప్పిన గోదావరియే ఇప్పుడు మనమందరము అనుకుంటూ యున్న గోదావరియని నమ్మకమే! పర్ణశాలనుండి బైలుదేరినది మొదలు రామలక్ష్మణులు వెళ్లిన మార్గమును గమనించిన ఈ సంశయము తీరును.

పర్ణశాలనుండి దక్షిణముగా వెళ్లిరి. మొదట (III. 64-22-24) కొంత దవ్వున జటాయువును జూచిరి.

ఇది జనస్థానప్రాంతము – రావణుడు సీతను దక్షిణదిక్కుగా తీసుకొనిపోయెనని జటాయువు చెప్పినాడు. వానిని దహనముచేసి పశ్చిమమున దక్షిణపువైపున అనగా నైఋతిదిక్కుగా వెళ్లిరి. (III 69-1-2) ఇట్లు జనస్థానమునుండి మూడు క్రోసులు వెళ్లేసరికి దండకారణ్యము దాటి క్రౌంచారణ్యములో ప్రవేశించినారు. అందులో మూడుక్రోసులు ప్రయాణము చేయగా మతంగ వనంలోకి వచ్చినారు. అందులోనే అయోముఖియను రాక్షసి కనిపించుట, తర్వాత కబంధుని బారిబడుట వానిని దహనముచేసిన పిమ్మట వాడు నిజస్వరూపము దాల్చి ఋష్యమూకపర్వతమునకు దారి చెప్పుట. (III. 73.)

కబంధపల్లెనుండి పశ్చిమముగా వెళ్లి రెండు వనములు దాటవలె. అప్పట పంపానది గనిపించును. దానిని దాటి దాని పశ్చిమతీరమున వెళ్లవలెను. కొంతదూరములో శబరి ఆశ్రమము అగుపడును. అదిదాటి వెళ్లగా మళ్లీపంప గనపడును. దాని తీరము వెంట వెళ్లగా మరియొకవనము, కొన్ని సరస్సులు గనపడును. వాటిని దాటగా మళ్లీ పంపకనబడును. అలాగు వెళ్లగా తిరుగా నొకవనము దానిని దాటగానే మళ్లీ పంపా,దాని పశ్చిమతీరమున వెళ్లగా యెదుట ఋష్యమూకము గనబడును. (III. 75-12-25) (iv. 1. 130)

దీనినిబట్టి చూడగా కబంధపల్లికి పశ్చిమముగానున్న వనములకును ఋష్యమూకమునకు మధ్య పంపానది నాలుగువంపులు తిరిగినట్లు దోచుచున్నది. పంపానది పశ్చిమతీరమున రామలక్ష్మణులు ఉత్తరముగావెళ్లినట్లా దక్షిణముగా వెళ్లినట్లా? పంపానదికి పశ్చిమతీరమని చెప్పుటచే, నదియేమో ఉత్తర దక్షిణములకే ప్రవహించుచున్నదని స్పష్టమే. రావణుడు సీతను దక్షిణముగా తీసుకువెళ్లినాడని జటాయువు చెప్పిన వాక్యమునుబట్టి వారు పంపా పశ్చిమతీరమున దక్షిణముగా వెళ్లియుండవలెను. అలాగువెళ్లగా యెదుట ఋష్యమూక మున్నదని జెప్పుటచే పంపానది ఉత్తరవాహినీయనియు దక్షిణమున యున్న పర్వతములలోనుండి ప్రవహించుచున్నదనియు విశదమగుచున్నది. ఋష్యమూకమును దాటిన కిష్కింధ యగుబడును.

ఋష్యమూకమును దాటి, ప్రస్రవణపర్వతమందున్న గుహలో వర్షాకాలము రామలక్ష్మణులు గడపిరి. ఈ గుహయొక్క ద్వారము నైఋతి దిక్కునుండని,దానికి పశ్చిమముగానున్న శిఖరము యెత్తుగానున్నదని చెప్పియున్నది. (IV. 27. 12) ఈ గుహకు సమీపములోనే కిష్కింధయుండెను. ఈపైనచెప్పిన దానినిబట్టి చిన్న ప్లాను వ్రాసిచూస్తే కిష్కింధకు పంచవటి ఉత్తరమున యున్నదో దక్షిణమునయున్నదో తేలుతుంది. అలాగునే నాశికనుండి పైనిజెప్పినట్లు మార్గమును పోల్చిచూస్తే ఆమార్గము వింధ్య కుత్తరముగా వెళ్లునో దక్షిణమునుండే యుండునోకూడా తెలుస్తుంది. పంచవటి కిష్కింధకు ఉత్తరముగా ఉంటే గోదావరేదియని ప్రశ్న గలుగును.

దక్షిణహిందూదేశమందున్న కొన్ని పట్టణములైతే నేమి, నదులైతేనేమి, పర్వతములైతేనేమి ఉత్తర దేశమందున్నవాటిని బట్టియె పేరుపెట్టబడినవి. నర్మదానదిలో బడే ఒక ఉపనదికి కావేరియని పేరున్నది. ఇదిచాలా పుణ్యనదియని మత్స్య, స్కాంగపురాణములలో జెప్పియున్నది. దక్షిణదేశములోకూడా నొక కావేరీనది యున్నది. అయితే మత్స్యపురాణములో జెప్పిన కావేరి యిదియని జెప్పవచ్చునా? అలాగే మధుర-శ్రీకృష్ణునిచరిత్రతో సంబంధించిన మధురయే, దక్షిణమందున్న మధురయనవచ్చునా? అలాగునే వింధ్యకుత్తరమున బండేల్ ఖండు దేశమందు గోదావరియని యొకనది యున్నదట. రాయిబహద్దూర్ హీరాలాల్ గారు యిట్లు వ్రాయుచున్నారు.

रामायणसे ज्ञात होता है कि वह गोदावरीके किनारे थी। प्रख्यात गोदावरी, जो मध्यप्रदेश और निजामके राज्यके बीच सीमा बनाती चली गई है वह, चित्रकूट और अमरकण्टकके दक्षिणमें सकड़ों मीलकी दूरी पर है। उसकी स्थिति नूतन कल्पनाके अनुसार चित्रकूट और अमरकण्टकके बीचमें होनी चाहिए। निरसंदेह इन स्थलोंके बीच गुप्त गोदावरी नामक एक नदी अवश्य है।

Sardar M. V. Kibe Bahadur of Indore కూడా వారు వ్రాసిన Ravana's Lanka located in Central India అను వ్యాసమందు దీనినే ఆమోదించిరి. ఇంతేగాక భాగేల్ ఖండు పరగణాలో నదికి "గోదా" అని అంటారట. ఇట్లు ఆ ప్రాంతమందు

డిప్యూటీ కమిషనరుగా ఉద్యోగము చేసిన రాయిబహదూర్ హీరాలాల్ గారు వ్రాసియున్నారు. గావున పంచవటియనునది గోదావరీతీరమునందున్నదంటే ఆగోదావరి వింధ్యపర్వతముందున్న నదిగాని పశ్చిమ కనుమలలో పుట్టి నిజామురాజ్యముగుండా బారుచున్న నదిగాదు అని నిశ్చయము. ఇందువల్ల గోదావరినది సంశయము తీరుచున్నది.

గొ. రామదాసు.

---

## మహాత్ముడు— దేశభక్త— దేశోద్ధారకులు

గాంధిమహాత్ముడు తన ఆంధ్రదేశ సంచారమును గూర్చి 'యంగ్ ఇండియా' పత్రికయందు వ్రాయుచు, దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారిని, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని గూర్చి కొంత ముచ్చటగ ముచ్చటించెను. తనకు ప్రయాణమున నొదలినప్రేమ గ్రామజనులు తన ఆశయసిద్ధి కొసగిన అద్భుతమగు తోడ్పాటువలనను, స్వచ్ఛందసేవకులవలె హృదయపూర్వకమైన శ్రద్ధాభక్తులవలనను అపనము మొందెనని తెల్పి మహాత్ముడిట్లు నుడువుచున్నాడు:—

నాసౌఖ్యమునకు ప్రధానకారకుడు దేశభక్త కొండవెంకటప్పయ్యగారు. ఈబుతువులో నన్ను ఆంధ్రదేశమునకు తీసికొనివచ్చినందులకును, ఇంతకఠినమగు కార్యక్రమము నియమించినందులకును ఆయన కొంచెము దూరుపడెను. కాని దేనికిని ఆయన పూర్తిగ బాధ్యుడుగాడు. కార్యక్రమ మాంధ్రదేశమంతను నాచ్ఛాదింపవలసియుండెను. తనకున్న వ్యాధిలో ఇంతకంటె సులభతరమగు కార్యక్రమమున కనిపెట్టజాలకపోయెను. ఆంధ్రనాయకులు నన్ను ఫిబ్రవరిమాసమున రావలదనిరి. మార్చినెల బర్మాకు ఈయక తప్పినదికాదు. అందుచేత నిక ఆంధ్రదేశమునకు అయితే ఏప్రిలు మేనెలలు, లేకున్న ఈయేటికి దాటవేట్టులే. దాటవేట్టుటలు ఎన్నో అయినవి. ఇక నప్పుడుకూడ దాటవేట్టుట అసాధ్యమైనది. కాని అపర్యటనశ్రమమును 'దేశభక్తుని' కంటె నెవ్వరును చులుకపలుప జాలియుండరు. వేళపట్టులు కనిపెట్టుచు, సద్దలణచుచు, అంగైనబసలు కుదుర్చుచు, ఆయనచాల నలుగుడుపడిపోయెను. నాకు స్నేహభాగ్యమబ్బజేసిన వారిలో సౌమ్యతములలో ఆయన ఒకడు. కాని ఆపర్యటనమునందాయన తీవ్రమైకఠినమైన గొంతుక తెచ్చుకొనెను. అది ఆయనకు ఎంతయో స్వభావవిరుద్ధమగుటచే ప్రక్కనున్న సహచరులు ఆయన తీవ్రత నొక పెద్దనవ్వులాటగా చేసికొనిరి. ఎక్కడను, ఎంతకంజాయింపునందును ఒక్కొక్కప్పుడు తప్పులు జరుగుచుండుట్ల సహజమే. దానికై ఆయన తెచ్చుకొనుచుండు కోపము నాకు తరుచు పొద్దుబాటలకుండ ఎడతెగకసాగించు మోటారుప్రయాణపు చీకాకును భంగపరుచుచువచ్చెను. దేశభక్తునివంటి పెత్తనదారుని యేర్పాటులందును. ఆంధ్రులవంటి జనమున్నను ఇట్టి పర్యటనములు వందసార్లు చేయవచ్చును.

## విశ్వదాత

దేశభక్త కొండ వెంకటప్పయ్యగారిని గురించి వ్రాయుచు దేశోద్ధారక నాగేశ్వరరావుగారిని నేను మానరాదు. తీమనిపేరు పెట్టి 'ఒకపేటెంటు' తైలము (అమృతాంజనము) వలన డబ్బుచేసికొనుటకు నేను వారినెప్పుడును ఎగతాళి చేయుచుందును. "ఔను, అది తప్పే; ఏమి చేయను? దానివలన వచ్చుడబ్బుతో నేను నా దేశమును సేవింప యత్నింతును. అది సౌమ్యమైన తైలమే కూడ" అనుచు వారెప్పుడును ప్రత్యుత్తరము చెప్పుచుందురు. ఆ 'పేటెంటు' తైలమును గూర్చి నేను పరిహాసము చేసినపు డెంతనిర్లక్ష్యముగ చేసితినో ఈ సమాధానము విన్నప్పుడుగూడ నంతనిర్లక్ష్యముగ వినుచుందును. కాబట్టియే ఆంధ్రదేశమందలి వివిధప్రజాహితోద్యమములకు వారివిక్రయశాల వారిని విశ్వదాతగా నొనర్చిన సద్విషయమును గుర్తించుట నాకు ప్రాప్తిగనుండెను. అతిథేయమగు ఆయనద్వారమునుండి అర్హుడగు యాచకుడొక్కడును ఊరక తిరిగిపోలేదు. నేనెక్కడ కేగిన నక్కడనే నాస్వాగతపత్రములు ఆయనవదాన్యతను పేర్కొనుచునే వచ్చినవి. అస్పృశ్యులకు 'ఆనందాశ్రమము' విషయమువచ్చెనా, నాగేశ్వరరావుగారు ముఖ్యమగు కట్టడములు కట్టిపేయును; పాఠశాలకు సాయము కావలసివచ్చెనా, నాగేశ్వరరావుగారు సహాయకుడైనాడు; డాక్టరు సుబ్రహ్మణ్యముగారు తమఆశ్రమమునకు ముద్రాయంత్రము కోరవచ్చిరా, నాగేశ్వరరావుగారే అచ్చటను ఉద్ధారకులు. ఈవికంటె నేదియు నాయన కెక్కువ యానంద మీయదు. మఱియు, నేనెఱుగగలిగినంతవఱకు, ఆయన కుడిచేయి యిచ్చినది యెడమచేతికి తెలియదు. ఆ 'పేటెంటు దోపిడి'ని గూర్చి నాపరిహాసమున కొకప్రముఖము సమాధానముగ "వారు చేయుచున్న దానికంటె నెక్కువదోపిడి చేయగలిగిన నేను సంతోషింతును. అప్పుడదియంతయు ప్రజోద్యమములకే సాయముగ వినియోగపడును" అని చెప్పెను. అది నాకు వింతగలేదు. జాతీయ కర్మవీరులపై ఆంధ్రులు బిరుదములు కురిపించుటను నేను రహస్యముగ విమర్శించుచువచ్చితిని. కానియీ దేశోద్ధారకుడు అర్హముగ పొందిన బిరుదమును గూర్చి నాకు సమాధానము పొసగినది.

## అభ్రకపు గని

అభ్రకపు గనులు నెల్లూరుజిల్లా రాపూరు తాలూకాలోను నున్నవి. వ్యవసాయమునకు చాలినంత జలాధారము లేని యీ తాలూకా ధనలోపమును ఈ గనులు తీర్చుచున్నవి. వీనివలన పెక్కుమంది బీదవాండ్రు జీవనము చేయుచున్నారు. ఈ గనులను గుత్తకెత్తుకొని హఠాత్తుగా లక్షాధికారులయిన సామాన్య కుటుంబికు లెందరో కలరు. మఱియు వీనివలన నిందుకు విపరీతముగ సంభవించుటయు గలదు. ఇందుకీ క్రింది విషయము తార్కాణము గాగలదు. నెల్లూరునకు తూర్పున యిందుకూరుపేట యను నొక గ్రామము గలదు. ముప్పదియైదు ఏండ్లకు పూర్వ మా గ్రామమున అంచూరు సుబ్బానాయుడు అను సామాన్యుడగు రైతొకడుండెను. అతడు—అదృష్టదేవతయొక్క ప్రేరణము వలననే యగును—ఈ రాపూరుతాలూకాలో నొక అభ్రకపుగనిని సాహసించి గుత్తకు గొనెను. అప్పటికే అక్కడక్కడ నీ గనులపనులు సాగుచుండినవి. కొందఱు లాభమును, కొందఱు నష్టమును పొందుచుండిరి. విదేశీయులును కొందఱు గలరు. అట్టివారిలో నాయుడిగారి గని పొదలకూరికి 3 మైళ్లదూరమున నొక అడవిలో నున్నది. దీనికి 'డి గని' (D mine) అనిపేరు. ఇతడు గనిని త్రవ్వ ప్రారంభించినది మొదలుకొని అభ్రకము అపారముగ లభించుచుండెను. వ్యాపారము బలముకొనెను. విదేశముల కెగబ్రాకెను. కొలదికాలముననే యితనికి కోట్లకొలది ధనము లాభించెను. అభ్రకపు రాజు (Mica King) అని విదేశములయందును ఈతని పేరు ప్రసిద్ధిచెందెను. ఇట్లు మహదైశ్వర్యవంతుడైన ఆతడు ఐహికములగు సకలభోగముల ననుభవించుచుండుటయేకాక పారమార్థికచింతయు గలవాడై యుండెను. ఆతడెందరనో పండితులను సత్కరించెను. ఎందరనో బీదలను పోషించెను. ఎన్నియో జీర్ణదేవాలయముల నుద్ధరించెను. బంగరునాణెములను చిల్లపెంకుల వలె చెల్లించుచుండెను. తఱచు ఈతని దాతృత్వమునకు పాత్రాపాత్రవిచారణయు లేకుండెడిది. ఈతనికి భాగ్యదేవతయో యనదగు కూతురొక్కతెయే యుండెను. ఆమె పెండ్లికి కొన్నిలక్షల రూప్యములను ఈతడు వ్యయించెను. ఈ పెండ్లివిషయములు నేటికిని నెల్లూరుమండలమునం దంతటను కథలుగా వాడుకలో నున్నవి. ఇట్లుండగా నీతనిదశ తిరుగజొచ్చినది. తొలుత గారాబుకూతురు కాలగతిని చెందినది; వర్తకము పాడువారినది; ఐశ్వర్యము క్రమముగా అడుగంట జొచ్చినది. రెండు మూడేడులకాలములోనే నాయుడుగారు మునుపటిస్థితికి చేరుకొనిరి. చంచలస్వభావముగల లక్ష్మి ఎవనిని స్థిరముగ ప్రేమించి యుండదు. కాని తొలుత నీతడు కావించిన సాహసము మాత్రము మెచ్చదగినది. ఇతనికి తరువాత నెందరో ఎన్నియో గనులను గుత్తగొని త్రవ్వి లాభముపొందుచున్నారు. ఈ 'డి గనిని' కూడ నింకొకరు గుత్తగొని త్రవ్వించుచున్నారు. కాని ఎవ్వరును ఇతనిస్థితికి రాకున్నారు. ఈగనులలో అభ్రకముతోపాటు కొన్ని ఉపయోగకరములగు నితరవస్తువులును ఉత్పన్నములు కావచ్చును. వాని విషయము గుత్తదారులకు తెలియమిచే నట్టివి లాభించకపోవుచున్నవి. తత్ శాస్త్రజ్ఞులు పరిశోధనలు కావించినచో వానివలనను అపరిమిత లాభమును బడయవచ్చును. ఈ సంచికయందు 'అభ్రకపు గనుల' ఛాయాచిత్రములు రెండు గలవు. అందు పెద్దది గనిలో నూరుగజముల లోతుననుండి తీసినది. అడుగున మనుష్యుడు నిలిచియున్నస్థలము భూమినుండి ౧౨౦ గజముల లోతున నుండును. అతనికి చేరువనే ఇంకను లోనికిపోవు సొరంగము రెండుమూడు వందల అడుగుల లోతు గలది. ఇనుప నిచ్చెనలపై నుండి లోనికి దిగుదురు. లోపల కటిక చీకటిగా నుండును. కూలీలు చేత క్రొవ్వువత్తి దీపముల నుంచుకొని లోనికి పోవుదురు. లోపల నూరెడు నీటిని యంత్రసహాయమున పైకి తోడుచుందురు.

చిన్నచిత్రము ఇంకను పైనుండి తీసినది. ఈగనులకు చేరువనే గనులనుండితీసిన అభ్రకమును రేకులుగ విడదీసి వివిధపరిమాణములుగ కత్తిరించుపనియు జరుగుచుండును.

ఈ అంచూరు సుబ్బానాయుడి మహదైశ్వర్యచిహ్నము లిప్పటికిని ఆ గని చుట్టుపట్ల శిథిలరూపమున గాన్పించుచుండును. [కే. యస్. ప్రసాదరావు]

---

# శారదాకాంచిక షష్ఠకింకిణి — సవరణ (ఈ సంచికలో)

| పుట | కక్ష్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| ౪౪౬ | ౨ | ౮ | కడపటి | కడపట |
| ,, | ,, | ౧౩ | ముదురను | కుదురను |
| ౪౪౪ | ౧ | ౧౩ | క్రియాపదములును | క్రియారూపములును |
| ,, | ,, | ౨౧ | మ్రోడొడ్డును | మెండొడ్డును |
| ,, | ౨ | ౬ | ద్విత్వమును | ద్విత్వమున |
| ,, | ౨ | ౭ | మడక్ | మఱక్ |
| ౪౪౭ | ౧ | ౧౭ | అనునది విభక్తి | అను విభక్తి |
| ,, | ౨ | ౫ | కిమ.ష్ఠి= | కిమ.ష్ఠి— |
| ౪౪౯ | ౧ | ౧౧ | ఎదురు=ఎదురు | ఎదురు+ఎదురు |
| ,, | ౨ | ౩ | నిషిద్దమైన | నిషిద్ధమైన |
| ,, | ౨ | ౨౬ | అటం | అట |
| ౪౭౦ | ౧ | ౨౫ | నేను | నేనను |
| ౪౭౧ | ౨ | ౬ | ఊర్వశి | ఉర్వశి |
| ౪౭౨ | ౧ | ౧౯ | ఊరకయెట్లు | ఊరకయున్ననెట్లు |
| ,, | ,, | ౩౮ | యథాక్రమముగ | యథాక్రమము |
| ,, | ౨ | ౨ | పదములు | పదముల |
| ,, | ౨ | ౫ | పరుషములకు | పరుషమునకు |
| ౪౭౩ | ౧ | ౯ | విశేషమును | విశేషణమును |
| ,, | ౨ | ,, | ఇఁడుది | ఆఁడుది |
| ౪౭౪ | ౨ | ౧౩ | అసమానాధికరణమని | అసమానాధికరణసమాసమని |
| ,, | ,, | ౧౬ | టుం | టు |
| ,, | ,, | ౧౪ | సమాన గౌరవమునకా! | గౌరవమునకా |
| ,, | ,, | ౨౬ | లనియెడి | అనియెడి |
| ,, | ,, | ౩౩ | సూత్రమునన | సూత్రమున |
| ౪౭౫ | ౧ | ౨౫ | ఏని | ఏనిక్ |
| ,, | ౨ | ౬ | 'వుఁవుఁ' | 'ఁవుఁవుఁ' |
| ౪౭౬ | ౧ | ౧౫ | ఆవివేక | అవివేక |
| ,, | ,, | ౧౯ | పదంబునడిమి | పదంబున నడిమి |
| ౪౭౬ | ౨ | ౮ | (భాగ) | (భార) |

# *అభ్రకపు గనులు



౧. లోపలనుండి తీసిన చిత్రము



౨. పైనుండి తీసిన చిత్రము



* 'కలగూరగంప' యందు చూచునది.

# కన్యామహావిద్యాలయము-జుల్లుందూరు (పంజాబు)



౧. ఆశ్రమముయొక్క వెలుపలి దృశ్యము (భోజనశాల)



3. గాయనీమండలి



౨. ఉద్యోగినీవర్గము



౪. కూరలతోట








## శ్రీ కొత్తా రామమోహన శాస్త్రిగారు : ఒక యౌవన భారతీయకళాకుశలుడు

ఏప్రిల్ నెల 'మాడెర్న్ రివ్యూ'లో ప్రొఫెసర్ సునీతికుమార ఛాటర్జీ, యమ్. ఏ., డి. లిట్. గారిట్లు. వ్రాసియున్నారు:—



శ్రీ కొత్తా రామమోహన శాస్త్రిగారి ఛాయాచిత్రము

శ్రీయుత రామమోహన శాస్త్రిగారను యువకులు ప్రతిభా సమన్వితులగు కళాకుశలురు. చిత్రలేఖన



శ్రీ కొత్తా రామమోహన శాస్త్రిగారి రూపచిత్రము

మందు ముఖ్యముగ వీరిప్రజ్ఞావిశేషము కొనియాడ దగినది. వయస్సున శ్రీ శాస్త్రిగారు ఇరువదియైదు సంవత్సరములకు మించనివారు. ఆంధ్రదేశమందలి మచిలీపట్టణము వీరి నివాసము. ఆంధ్రజాతీయ కళాశాలయందు సంస్కృతమును అభిమానభాషగ విద్యాభ్యాసముచేసి, నాల్గుసంవత్సరము లచట శ్రీప్రమోద కుమార ఛాటర్జీ గారివద్ద చిత్రలేఖన కళాభ్యాస మొనరించిరి. భారతదేశమునం దేర్పరుపబడిన ప్రధానచిత్రకళా ప్రదర్శనములు పెక్కింటియందు శాస్త్రిగారు తమ చిత్రముల

ప్రదర్శించిరి. డాక్టర్ జె. హెచ్. కజిన్స్‌గారు మొదలగు సమర్థులగు కళావిమర్శకులు వీరి చిత్తరువుల నెంతయో ప్రశంసించిరి. వీరి చిత్రము లాకళయందలి ఉన్నతస్థితిని గోచరింపజేయును. దీనిని గ్రహింపజాలిన పాశ్చాత్య కళాభిజ్ఞులును, భారతీయులలో కళాప్రియులనేకులును వీరి చిత్రముల కొన్నింటిని కొనియుండిరి. వీరు రచియించిన ఆంధ్రవిశ్వకళాపరిషత్తు యొక్క ముద్ర సర్వజనసంస్తుతిపాత్ర మయ్యెను. శ్రీ శాస్త్రిగారి కృషియందు నేను కాంచినంతవరకు, రూపచిత్రముల రచించుటయందు వారి కనుపమానమగు శక్తి గలదని తెలియుచున్నది. పెన్సిలుతో వారు చిత్రించెడి వ్యక్తుల రూపలేఖనములు ఎన్నదగిన భావ గాంభీర్యమును, జీవకళలను కలిగి, సంస్తవనీయమగు స్వభావ గ్రహణశక్తి విశదీకరించుచుండును. ఈ కాలమునందు వీరు, కలకత్తా ప్రభుత్వ చిత్రకళాశాలాధ్యక్షులును లోహములపై ద్రావకములచే చిత్రముల రచించుటయందును, రూపచిత్రముల వ్రాయుటయందును ఉత్తమతరగతికి చెందినవారని పేరుగాంచిన శ్రీ ముకుళ దేవు గారిని స్మరింపజేయుదురు. శ్రీ శాస్త్రిగారు దక్షిణ భారత దేశమందలి ఉత్తమ పురుషులందరి చిత్రముల రచియించి ఒక మొత్తముగ ప్రచురింప దలపెట్టి యున్నారు. కళాప్రపంచమున కియ్యది అత్యంత ప్రయోజనకారిగ నుండగలదు.



శ్రీ నందలాల్ బోసుగారి రూపచిత్రము

[శాస్త్రిగారు రచియించిన నందలాల్ బోసుగారి రూపచిత్రమును, శ్రీ నందలాల్ బోస్‌గారు రచియించిన రామ మోహనశాస్త్రిగారి రూపచిత్రమునుకూడ నీపత్రికయందు ముద్రింపబడినవి.]

వృద్ధికి వచ్చుచున్న యీ ఆంధ్ర యువ చిత్రకారుడు చిత్రించిన 'చిత్రకారుడు' అను త్రివర్ణచిత్ర మీనడుమ వెలువడిన 'ఆంధ్ర పత్రిక శుక్ల సంవత్సరాది సంచిక' యందు ముద్రింపబడినది. చిత్రకళయం దుత్తమశిక్షణ నందుకొనుటకు వీరు త్వరలో నింగ్లాండునకు పోవనున్నారని తెలియుచున్నది. వీ రచ్చట చిత్రకళాకౌశలమును పెంపొందజేసికొని ఆంధ్రదేశమునకు పేరు తెత్తురుగాక!

---



## విద్యానగర చరిత్రము

రచయిత: సీరిపి ఆంజనేయులుగారు. ప్రకాశకులు విజ్ఞానవల్లికా గ్రంథమాలవారు, అనంతపురము. క్రౌను సైజు. వెల రు ౨-౧-౦.

ఆంధ్రమున దేశచరిత్రరచన కారంభము చేసినది కీ. శే. కొ. వెం. లక్ష్మణరావు పంతులవారు. వీరు నాటిన బీజము నేటికి చెట్టయినది! మహావృక్షముగానున్నది. విద్యానగర చరిత్రమును మొదట రచించినవారిలో వీరొక్కరు. వీరిమార్గముననే పెక్కురు పోవుటనుచూడ వీరొనర్చిన ప్రయత్నము సఫలీకృతమైనదని తోచుచున్నది. చరిత్రకారుల హుంకారములతో ఆంధ్రదేశము మారుమ్రోగుచున్నది. శాస్త్రిలు, పండితులు, కవులు, అవధానులు వెఱ్ఱిపట్టినట్లు శాసనములు, శాసనములు అని యుద్ఘోషించుచున్నారు. ఆంధ్రదేశ పండిత బృందమంతయు చరిత్రరచనా మహోద్యమమున దగుల్కొనియున్నది. అట్టి యుద్యమము కార్యరూపముగ బరిణమించగ ప్రస్తుతము మనము బరామర్శింపబోవు గ్రంథమువంటివి బయలు వెడలుచున్నవి.

గ్రంథకర్త గ్రంథమును రెండుభాగములుగ విభజించియున్నాడు. పూర్వభాగమున విద్యానగరసామ్రాజ్యచరిత్రమును ఉత్తరభాగమున బ్రకృత శిథిలభాగములను వర్ణింపబడియున్నవి.

మొదట పూర్వభాగమును గూర్చి కొంత చెప్పుచున్నాము. పీఠికలో "నాంగ్లచరిత్ర గ్రంథములు, ౧౪-౧౬ శతాబ్దములలో విద్యానగరమున వెలసిన సంస్కృతాంధ్ర ప్రబంధపీఠికలు, చాటువులు, శాసనములు, గొల్లలుగ నాకు దోడ్పడినవి" అని గ్రంథకర్తగారు వ్రాసియున్నారు. అట్లు వ్రాసియు గ్రంథమునందెచ్చటను పూర్వగ్రంథకర్తల కడనుండి దాము గొన్నయప్పును ఒప్పుకొనకైరి. ఒక్క రిఫరెంసైనను గ్రంథమున గానరాదు. ఇది శాస్త్రగ్రంథరచనాపద్ధతి కాదు. చరిత్రకారకుడు దనచే జెప్పబడు హంశముల కన్నిటికిని రిఫరెంసు నిచ్చుటయతనివిధి. అట్లు సేయకపోవుటచే ఆంజనేయులుగారు లేనిపోని యనుమానముల పాలగుచున్నారు. పైనుదాహృతమైన గ్రంథకర్తగారి వాక్యము వారు రాయవాచకము, తంజావూరు ఆంధ్రరాజుల చరిత్ర, లోకల్ రికార్డ్సు, ఆంధ్రమున వ్రాయబడిన కర్ణాటక సామ్రాజ్యచరిత్రలు మొదలగు నత్యంతావశ్యకముగ బఠింపవలసిన గ్రంథములను బఠింపలేదని తెల్లము. ఇది యొక గొప్పలోపము. 'శాసనములు గొల్లలుగ...దోడ్పడినవి' అని యన్నను పెక్కుశాసనములను జూచినట్లు తోచదు. ఏలన గ్రంథమునందు శాసనములసాయమున బరిష్కారముగాదగిన సమస్యలెన్నియోయుండ, అట్టి సమస్యలను బరిష్కరింప బ్రయత్నము సేయకపోవుటయే గాక, యట్టివి కలవనికూడ చెప్పకపోయిరి. ఇందుకు దార్కాణముగ నొండురెండు విషయములను నచించెదము.

౧. "మల్లికార్జునునకు దరువాత నాతని సోదరుడు (దేవరాయనికి సింహళదేవివలనగలిగిన)విరూపాక్షరాయడు రాజ్యపదము బొందెను. ఈతని పరిపాలన మేమాత్రమును స్వారస్యమైనది కాదు. తులసివనములో గంజాయి మొక్క మొలచినట్లు యశోభరితమైన సంగమవంశమున నీ ప్రమత్తుడు జన్మించెను. ఈభూజాని కేవలము భోగలాలసుడై నిరంతర మంతఃపుర వాసమునసే కాలము గడుపుచుండెను." ఈ వాక్యపరంపరను జదివిన యేపాఠకుడు మల్లికార్జునరాయల కిద్దఱు కొడుకులుండిరనియు; వారిని జంపించి మొలబంటి రక్తపు వరదలో

నడిచి విద్యానగర సింహాసనమును విరూపాక్షుడు అధిష్ఠించెననియు నెఱుగగలడు? ఈ సందర్భమున శాసనములు, ప్రపన్నామృతము మొదలగు గ్రంథములు జర్చింపదగినవే గదా? అయినను మన గ్రంథకర్తగారి కలమీ పట్ల నొక్కమాటనైనను వ్రాయక యద్దుతిరిగినది.

౨. కృష్ణరాయల నిధనకాల మెప్పుడు? విద్యానగర చరిత్ర విషయకమగు గ్రంథములయందు కృష్ణరాయడు క్రీ. శ. ౧౫౩౦ లో నిర్యాణము నందినట్లు వ్రాయబడియున్నది. అనేక శాసనములయం దిట్లే యున్నది. కొన్ని శాసనములయందు కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౨౯ ప్రాంతముల మరణము నందిన ట్లున్నది. ఈసందర్భమున మన మాలోచింపదగిన విషయము వేఱొకటి గలదు. కృష్ణరాయల కడపటిరోజులలో అతనికిని తిమ్మరుసుకును గల సంబంధ మెట్టిది? గ్రంథకర్తగారీసందర్భమున నిట్లు వ్రాసియున్నారు:—

"కాని చరమదశలో, దిమ్మరుసు కృష్ణరాయని కుమారుని కారేండ్లబాలునకు విషముపెట్టి చంపి యాపటకుండిన గౌరవము నెల్ల గోలుపోయెనని తెలియుచున్నది. రాయడు దుస్సహ పుత్రశోకమున దిమ్మరుసును జెరలో నుంచెను. ఈ యమాత్యుడు కారాగారముననే చనిపోయెనట."

గ్రంథకర్తగారు పై విషయము నెచ్చటనుండి గ్రహించిరో తెల్పకున్నను పోర్చుగీసు చరిత్రకారుడగు నన్నీసు గ్రంథములో నుండి యని మనకు దెలియును. ఇచ్చట గ్రంథకర్తగారి చరిత్రరచనా పద్ధతిని గూర్చి యించుక వర్ణింపవలసి యున్నది. తిమ్మరుసు తన కుమారుని చంపెనని కృష్ణరాయ లనుమానపడి తిమ్మరుసును జెరలోనుంచెనని మాత్రము జెప్పెనే కాని యాతనికండ్లు బొడిపించెనని చెప్పి యుండలేదు. కృష్ణరాయలవారి యెడ గ్రంథకర్తగారి కత్యంతాభిమానము. తిమ్మరుసును కండ్లుబొడిపించుట యాతని చారిత్రమున కొక కళంకమని దలచియే మెు ఆ విషయమును స్మరించనైన లేదు. చరిత్రకారుని ధర్మము సత్యాన్వేషణము. పక్షపాతమునకు చరిత్రకారుడు లోనైన దన యుద్దేశ్యమును నెరవేర్చుకొనజాలడు; కావున చరిత్రరచనయం దిట్టిపద్ధతి నవలంబించుట సత్యమును బురఖాలో దాచుట యగును.

ఇక తిమ్మరుసు వాస్తవముగ కృష్ణరాయల పుత్రునకు విషము బెట్టి చంపించెనా? తత్కారణమున కృష్ణరాయ లతని గారాగృహ నిబద్ధుని జేయుటయే గాక, అంధునిగ గూడ జేసెనా? యను విషయములు విమర్శింపదగినవి.

బెంగుళూరుజిల్లాలో నున్న ఒకశాసనము పైవిషయములకు వ్యతిరేకముగ కృష్ణరాయని మరణానంతరము అతని "ఉదరాబ్ధిచంద్రు" డగు తిరుమలదేవ మహారాయడు రాజ్యము సేయుచున్నట్లుగను, అప్పుడు సాళ్వ తిమ్మరుసు జీవించియున్నట్లును తెలియజేయుచున్నది.

ఆశాసనమిది:—

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్ష ౧౪౫౨ నేయ తారణ సంవత్సరద మార్గశిర శుద్ధ ౨ శని స్వస్తి శ్రీమన్ మహారాజాధిరాజ రాజపరమేశ్వర శ్రీవీర భుజబల ప్రతాపగజపతి అశ్వపతిభార శ్రీకృష్ణదేవ మహారాయ ఉదరాబ్ధిచంద్ర శ్రీతిరుమల దేవ మహారాయ వకాలనలు శ్రీమన్ మహాసేనసాళువ చతుస్సముద్రాధీశ్వర తిమ్మన్న దండనాయకర దేశదలు. స్వస్తి శ్రీ అభినవకాంచీపురకలు ఊరవర్ వరదరాజ దేవర ఉత్తమసంధి దభ్యన్నదివ సరకె శ్రీకృష్ణరాయ మహారాయలిగె గంగోదక సేవితిరప్ప... కొనపనాయకరు తిరుమల దేవమహారాయరిగు తిమ్మన్న దన్నాయకరిగు ధర్మవాగబేకు ఎండమారయనహల్లిగె ప్రతినామ దొనయక పురవను కొనపనాయకరు వరదరాజదేవరిగె సమర్పిసిదరు తావుమాడిదసెన అంచంద్రార్కస్థాయివాగి నడయబేకెందు మాడిదసేవె..." (లక్ష్మణరాయ వ్యాసావళి, పుట ౫౦.)

ఈ శాసనము క్రొత్తసమస్య లనేకములను లేవదీయుచున్నది. లక్ష్మణరావుగారన్నట్లు "గంగోదకమును సేవింపజేసె" నన్నందులకు "చరమావస్థయందు గంగగొంతులో బోయుట" యనియే యర్థము. అనగా శకం ౧౪౫౨ మార్గశిర శుద్ధ ౨ శనివారమునకు బూర్వమే కృష్ణరా

యడు పరమపదమును బొందెనని తేలుచున్నది. ఇంతే కాక ఆ మహారాజు మృతినందిన పిమ్మట నతని యొద్ద రాభిచంద్రుడగు తిరుమలదేవ మహారాయలు రాజ్యము నేయుచున్నట్లున్నది. ఇంకను, పై తిరుమలదేవరాయని రాజ్యకాలములో సాళువతిమ్మన్న దండనాయకుడు (అనగా తిమ్మరుసు) సజీవుడై యుంటగాక దేశాధిపతిగ గూడ నున్నట్లు దెలియుచున్నది.

ఈ శాసనము వల్కుచున్నది నిజమైన పోర్చుగీసు చరిత్రకారుల వ్రాతలు నిజము కాజాలవు. పోర్చుగీసు వారి వ్రాతలు నిజమైన యీశాసనము ఫోర్జరీయని చెప్ప వలసివచ్చును. వీటి రెంటిలో నేది నిజము? సమన్వయ మెట్లు? నిజమిదియని తేల్చక ప్రాతదారులు త్రొక్కుచు ఉండు విషయములను చక్కగ శోధించక చరిత్రలు వ్రాయుటవల్ల గలుగు ఫాయిదా యెట్టిది?

ఇట్టి లోపములను పెక్కింటిని శ్రీఆంజనేయులు గారి గ్రంథమున జూపనగును. గ్రంథవిస్తరభీతిచే, వీరికి స్థలజ్ఞానము చాలదనుట కొక్క యుదాహరణమును చూపి విరమించు కొనుచున్నాము.

“విద్యానగరమునకు వందలకొలది మైళ్ల దూరము ననున్న శృంగేరికి సమీపమునందలి కాపలూ”రను నామాంతరము గల హరిహరపురిని, హరిహరుడు కేశవభట్టు కొమారుడగు ననంతసూరికి దానముచేసినట్టు క్రీ. శ. ౧౩౩౬ వ సంవత్సరపు శాసన మొకటి నుడువుచున్నది.”

శృంగేరిసమీపమున కాపలూ రొకటి యుండిన నుండవచ్చును. హరిహరరాయలు క్రీ. శ. ౧౩౩౬ సంవత్సరమున కేశవభట్టు కుమారుడగు ననంతసూరికి దానము చేసిన కాపలూరు చంద్రగిరి రాజ్యములోని సువర్ణముఖి నదీతీరమునం దుండెను.

“.........చంద్రగిర్యాఖ్యరాజ్యేతు -
పడనాండూ స్తూ సీమవి నద్యాః సువర్ణముఖ్యాయాః
స్థలేపుణ్యే మనోహరే। ప్రాగ్భాగేపనలూరోస్తు
చిలలూరోస్తు దక్షిణే। ప్రతీచ్యాం గునుపాడోస్తు
ఉత్తరేచాన్న మేడుతః॥ కాపులూరం మహాగ్రామం.”

(Nellore Dt. Insc. vol. 1.)

ఇందువల్ల హరిహరరాయలు దానముచేసిన కాపలూరుగ్రామము శృంగేరి సమీపమునది కాదనుట తెల్లము. మఱియు,

“రాయఁడు తన్నెదిరించిన ప్రతాపరుద్ర గజపతిని దఱుముకొనుచు బోయి పోయి యుత్కలదేశము నందలి బెల్లముకొండ, నాగార్జునకొండ, అద్దంకి, కేతవరము, అమ్మనబ్రోలు మున్నగు రాష్ట్రభాగములను గూడ జయించి” యని వ్రాసియున్నారు.

పై దేశములలో పెక్కు యిప్పటి గుంటూరు జిల్లాలో నున్నవి. ఒక్కటియును ఉత్కలమున లేదు. సర్వసామాన్యముగ నందఱును దెలిసిన విషయ మిది. గ్రంథకర్తగారి కింతటి స్థలజ్ఞానము లేకపోవుట యాశ్చర్యమే!

ఈచరిత్రయందును, యికనాంధ్రంబున వ్రాయబడు నిట్టి చరిత్రలయందును కేవలము క్రానాలజీ వర్ణనతోడనే కథ ముగియుచున్నది. దేశచరిత్రయనగా దేశములోని జనులయొక్క రాజకీయ, మత, సాంఘిక,ఆర్థిక విషయముల యొక్కయు, వాఙ్మయ, శిల్ప, కళాదుల యొక్క వర్ణనయునై యున్నది. ఇట్టి దాంధ్రమున లేదు. విజయనగర రాజులనాటి దక్షిణదేశమునకు యిట్టి చరిత్ర వ్రాయుటకు ఆధారములు కొల్లలుగ గలవు. తమయింట సుఖాసీనులై ఆయాసములేక చరిత్రలువ్రాసి కీర్తిగడింపగోరు చరిత్రకారుల కివి యందవు. కావున చరిత్రవ్రాయు పండితోత్తము లందరికిని మావిన్నపమే మన ఉన్నయాధారముల నన్నిటిని వ్యయప్రయాసల కోర్చి, పరీక్షించి, విమర్శించి చరిత్రలను వ్రాయుడనియే.

ఇంతవఱకు ప్రస్తుతము విమర్శింపబడు గ్రంథములో మాకు లోపములుగ గన్పించినవానిని వచించితిమి. గ్రంథము కొన్ని హంశములయందు పొగడదగి యున్నది. శైలి యింపైనది. గ్రంథకర్తగారికి కథ నడుపుటయందు నేర్పుగలదు. దీనితోబాటు తగినంతపరిశ్రమయుండిన నెంతయో బాగుగ నుండెడిది.

గ్రంథముయొక్క రెండవభాగమున విజయనగరమునందలి శిథిలములు వర్ణింపబడియున్నవి. అవి యచ్చ

టకు భోవు యాత్రికులకును, ప్రయాణీకులకును మిక్కిలి తోడ్పడగలవు. గ్రంథములలోని చిత్రములు పుస్తకము యొక్క సొంపును చెడగొట్టుచున్నవి. అచ్చు దివ్యమైనది. బైండింగు చక్కనిది. ఈగ్రంథమును ముద్రించిన సాధన ముద్రాక్షరశాలాధికారు లభినందనీయులు.

[వెం. ర.]

## అశోకుని ధర్మశాసనములు

గ్రంథకర్త: చిలుకూరి నారాయణరావు గారు, ఎమ్. ఏ, ఎల్. టి. ప్రకాశకులు: ప్రపంచ మతగ్రంథమాల సంఘమువారు, దానవాయిగుంట, రాజమహేంద్రవరము. వెల రు ౨-౦-౧.

ప్రపంచమునందు సామ్రాజ్యధురంధరులని పేరందిన మహాచక్రవర్తులలో మేటియగు నశోకచక్రవర్తిశాసనములను ఆంధ్రులకు పుస్తకరూపమున సమర్పించుచున్న శ్రీ చిలుకూరి నారాయణరావు పంతులవారు కడుంగడు నభినందనీయులు. దేశచరిత్ర, మతచరిత్రల నెఱుంగగోరు వారికి అశోకచక్రవర్తి శాసనము లవశ్యము పఠనీయములు. వీనిని పఠించిన భారతదేశచరిత్రమున మౌర్యసామ్రాజ్య మెట్టి ప్రాముఖ్యమును వహించినదియు, అశోకచక్రవర్తి హిందూ నాగరకతనే గాక ప్రపంచ నాగరకతనె ట్లభివృద్ధినందించినదియు దెల్లమగును. ఇంతియకాక బుద్ధభగవానుని మతసందేశ మెట్లు భరతఖండముననే గాక ఖండాంతరమందు సైత మీ చక్రవర్తి ప్రోత్సాహమువల్ల విస్తరించినదియు నెఱుకపడును. ఇట్టి శాసనసముదాయము ఇంతకుపూర్వము ఆంగ్లమునందే ప్రకటిత మగుటచేత నాంధ్రపరిశోధక పండితులు దీని బఠింపజాలరైరి. ఇప్పుడు శ్రీ నారాయణరావుగారు ఆంధ్రపండితుల కొరతను దీర్చిరి. వీరు, పై శాసనములను తెలుగక్షరములతో ప్రాకృత మూలములను మాత్రమే గాక, సంస్కృతఛాయను, తెలుగుతర్జుమాను జేర్చి ప్రకటించుటవల్ల అక్షరజ్ఞులగు తెలుగువారెల్ల నీశాసనములను జదివి యందలి విషయములను గ్రహించగలరు. ఆంగ్లము నెఱుగని పరిశోధకమహాశయు లెందఱో యాంధ్రదేశమునందున్నారు. వారికి నారాయణరావుగారొనర్చిన యుపకారము గొప్పది. ఇంతియకాదు. ఆంధ్రభాషయందు చరిత్రరచనమునకు ప్రబల ప్రోత్సాహము నొసంగిరి. నారాయణరావుగారివలెనే యితరు.. ప్రయత్నముచేసి హిందూదేశ చరిత్రరచనకు గావలయుశాసనాదియాధారములను ఆంధ్రములోనికి తర్జుమా చేసిరేని యాంధ్రులకు మహోపకారమును జేసినవారగుదురు.

[వెం. ర.]

## ద్రవ్యశాస్త్రము

ఇది శ్రీ యద్దనపూడి వేంకటరత్నముగారు రచియించినది; డెమ్మి ఆక్టవో సైజున ౨౨౩ పేజీలుగల గ్రంథము. రాజమహేంద్రవరమునందలి సరస్వతీ పవరు ప్రెస్సునందు ముద్రింపబడినది. గ్రంథమూల్యము తెలియరాదు.

అర్థశాస్త్ర విషయిక గ్రంథములు తెనుగున పరకపాటుగ నున్నవి. వెనుక నెన్నడో వేపా సత్యనారాయణగారు, కట్టమంచి రామలింగారెడ్డిగారు, మామిడిపూడి వేంకట రంగయ్యగారు అర్థశాస్త్రవిషయిక గ్రంథములను కొన్నిటిని ఆంధ్రమున వెలయించిరి. శ్రీ యద్దనపూడి వేంకటరత్నముగారు ఇప్పుడు ద్రవ్యశాస్త్రమును రచియించి వెలయించుటలో ఆంధ్రసారస్వతమునకు నొక నూతన కుసుమము నర్పించిరని చెప్పవలసియున్నది.

గ్రంథమున ఆఱు అధ్యాయములు కలవు. ప్రథమాధ్యాయమున ద్రవ్యమనగానేమి మొదలగు విషయములు సమగ్రముగ చర్చింపబడినవి. ద్వితీయాధ్యాయమున వాణిజ్యము-జాతీయత మున్నగు విషయములనెల్ల వివరించిరి. ఆఱు అధ్యాయములలోను ఈ అధ్యాయమున విషయవివరణము మిక్కిలి బాగున్నది. తృతీయాధ్యాయము నాణెములను గూర్చినది. ఈ యధ్యాయమున కాళ్లులేని పుక్కిటి పురాణగాథలు తెచ్చిపెట్టిరి. ఏవో శాస్త్రవిషయికమగు నిట్టిగ్రంథమున శ్రీవారు పిట్టకథలను గొని తెచ్చి గ్రంథప్రాశస్త్యమును చెడగొట్టిరి. నిదర్శనముగా ౬౮-౭౧వ పుటలలోని కథలు రెండును చూడనగును. చతుర్థాధ్యాయమున వడ్డీనిగూర్చియు, పంచమాధ్యాయమున భూమినిగూర్చియు సరసముగ విన

రించి, శ్రీవారు తమ విషయ పరిశీలనశక్తిని బాగుగ వెల్లడించిరి. షష్ఠాధ్యాయములో మారకమునుగూర్చి వ్రాసిరి. క్లుప్తముగ వ్రాయ తలపెట్టుటచే గాబోలు ఈ అధ్యాయములోని విషయము సులభార్థబోధకముగ లేదు. ఇంకను విపులముగ చర్చించిన బాగుండెడిది. మొత్తము మీద గ్రంథము బాగున్నది. నవలలు, నాటకములు, స్కూలుపుస్తకములు కురియించుటలో మునిగియున్న ఆంధ్రదేశమున ఇప్పట్టున నిట్టి శాస్త్రవిషయిక గ్రంథములు-పెక్కులోపములతో నైన-వెలువడు చుండుట శుభావహము.

[ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.]

## ప్రాచీన హైందవ ప్రజాస్వామిక ప్రభుత్వము

దీనిని అనంతపుర కళాశాలయందు చరిత్రాధ్యాపకులగు శ్రీయుత దేశభట్ల లక్ష్మీనరసింహము గారు, ఎమ్. ఏ., ఎల్. టి. రచియించిరి. క్రౌనుఅష్టెవోసైజున ౧౩౦ పేజీలు. రాజమహేంద్రవరము నందలి జాతీయ సారస్వతనిలయమువారు ప్రచురించిరి. వెల ప్రతి ఒక్కంటికి రు. ౦-౧౦-౦.

ప్రాచీన రాజ్యాంగవిషయిక గ్రంథమొకటియు ఆంధ్రసారస్వతమున లేనిలోపమును కొంతవఱకీగ్రంథము తొలగింపగలదు. ఇంతకుముందు వెలువడిన శ్రీ పల్లూరి సూర్యనారాయణగారి రాజ్యాంగతత్త్వము వివిధదేశములందలి రాజ్యాంగవిధానమును ధారావాహికముగ వర్ణించుచున్నదే కాని ప్రత్యేక హిందూదేశ ప్రభుత్వవిధానమును వివరించుట లేదు. ప్రస్తుతము మన విమర్శనమునకు గుఱియైన ఈ గ్రంథమున ప్రత్యేకము హైందవప్రాచీన ప్రజాస్వామిక రాజ్యాంగవిధానములు వివరింపబడినవి.

ఈ గ్రంథమును రచియించుటలో శ్రీవారు పెక్కుగ్రంథములను పరిశోధించిరి. శ్రీవారు సుప్రసిద్ధులైన చరిత్రాధ్యాపకులు. సులభార్థబోధకమగు వారి శైలి వారి చరణసన్నిధానమున కూర్చుండి చరిత్ర మధువును గ్రోలిన నావంటి విద్యార్థులకు మఱపునకు రానేరదు. శాస్త్రవిషయిక గ్రంథమే అయినను ఇది బాలురును, స్త్రీలు కూడ చదివి అర్థముచేసికొనగలిగినంత సులభశైలిలో నొప్పారుచున్నది. వేదకాలమునుండి యీ కాలమువఱకును భారతీయులకు ఏకరాట్ప్రభుత్వములం దెక్కుడు నమ్మకమని శ్రీవారు పీఠికలో వివరించిరి. ఇట్టి అమూల్యగ్రంథముల నింకను రచియించి పరినిష్ఠితమైన తమ చారిత్రకపాండిత్యమును ఆంధ్రలోకమునకు పంచి యీయ గురువర్యులగు శ్రీ దేశభట్ల లక్ష్మీనరసింహము పంతులుగారిని వినీతభావముతో వేడుచున్నాను.

[ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.]

## అల్లాహో అక్బర్

గ్రంథకర్త:—భోగరాజు నారాయణమూర్తి గారు. ప్రకాశకులు:—విజ్ఞానచంద్రికా గ్రంథమాలిక వారు, బెజవాడ. వెల:చందాదారులకు రూ ౧-౮-౦ లు, ఇతరులకు రూ ౧-౧౪-౧లు. ఇది ఈగ్రంథమాలికయందలి 32 వకుసుమము. పారితోషికము నొందిన నవల.

అల్లాహో అక్బర్-అనేపేరును బట్టియే ఈ నవలయందలి ఇతివృత్తము చారిత్రిక మనియు, అందును అయ్యది అక్బరుకాలమునాటి దనియు చెప్పకయే తెలియుచున్నది. జగద్విఖ్యాతమైన మొగలు సామ్రాజ్యమును అక్బరు ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించునాడు భారతీయులగు రాజులలో పెక్కు రంగీకరించి, అతనికి సామంతులుగా నుండుట కిష్టపడిరి. కాని మేవాడరాజసింహమగు ప్రతాపసింహుడు ఒక్కడుమాత్రము మొగలు సామ్రాజ్యము నొప్పుకొనక ఎదురొడ్డినిలచెను. సర్వవిధముల బలపూర్ణుడగు నక్బరుతో ఉత్సాహశౌర్యపుత్రధనుడగు ప్రతాపుడు ఢీకొనుట రాజనీతి ననుసరించి యసమంజసముగా గన్పట్టినను శౌర్యధనులపద్ధతి ననుసరించి సమంజసముగానే యున్నది. ప్రతాపునకును అక్బరునకు జరిగిన యీయుద్ధములో అక్బరుసేనాని ఊపిరి సలుపనీయక యతనిని వెన్నంటి అడవులపాలై దినమొక యడవిగా తిరుగుచు, చివఱకు వంటచేసికొని తినుటకైనను అవకాశము చిక్కనీయకుండ తఱుమ సాగినాడు. కాని అంతటి శౌర్యసాహసములు గలిగినప్రతాపసింహుడును ఈదెబ్బకాగ లేక తాత్కాలికముగ లొంగు

శాటు నగుపఱచి మఱల వెంటనే పోరు సాగించినాఁడు. చివఱకు ప్రతాపునికే జయము కల్గినది. ఆసమయమున నక్బరుకుమారుఁడు ప్రతాపునిచేఁ జిక్కినను నతఁడు ప్రతాపసింహుని యౌదార్యబుద్ధిచే సురక్షితుఁడై అక్బరుపాలికి పంపఁబడెను. దీనితో కేవలము యశస్సుకై జిగీషువైన నక్బరుమానసమునందు ప్రతాపునియెడ నసమానములగు గౌరవప్రపత్తు లంకురించినవి. పిదప నతఁడు ప్రతాపుని తనతో సాటియగు స్వతంత్రరాజుగా అంగీకరించి గౌరవము నెఱపినాఁడు.

ఇది ఇందలి కథాసందర్భము. కథాసందర్భమును బట్టి చివఱకు ప్రతాపునకే జయము కలిగినట్లుండినందున ఈనవలకు ప్రతాపసింహుఁడు అనియే పేరు పెట్టవలసియున్నను, గ్రంథమునం దాదినుండి యంతమువఱకును అక్బరుయొక్క భావౌదార్యమే చిత్రింపబడియుండుట చేతఁ గాఁబోలు—దీనికి "అల్లాహో అక్బర్" అని పేరు పెట్టఁబడినది. అల్లాహో అక్బర్—అను నామకరణమును గ్రంథమునకుంచుట స్థూలదృష్టికి అంతయుక్తముగా తోచకున్నను భారతవర్షమునందలి సమస్తజనము నితనిపరిపాలనమున సంతృప్తులై జయధ్వానములు చేసినట్లు ఈ పేరు చదువరులకు ఒకవిసమైన ధ్వనిని తోపింపజేయుచు నెంతయో ఆకర్షవంతముగా నున్నది.

మొత్తమున నల్లాహో అక్బరునందు 38 ప్రకరణములుగా కథ విస్తరింపఁ బడినది. మొదటిప్రకరణమున అక్బరు స్యాలకుఁడు దిలేర్ఖాఁ సాహాయ్యముతో ప్రతాపుని వెన్నంటుటకై బయలుదేరిన ఘట్టము ప్రదర్శింపబడినది. ఇందు స్యాలకునిరూపము అతి చమత్కారముగా చిత్రితమై భారతకథయందలి ఉత్తరుని కొన్నిచోటులను, మృచ్ఛకటియందలి శకారుని కొన్నిచోట్లను స్ఫురింపజేయుచున్నది. రెండవప్రకరణమునందు ప్రతాపునిగుఱించి ఆకాలజనులు చెప్పికొనెడి యతిమానుషప్రజ్ఞలను వివరించుచుప్రతాపసింహుడు పట్టువడెనన్నవార్తకు అబ్బురపాటునొందిన ప్రకృతిజనుల మానసికాద్యవస్థలు చక్కగా చిత్రింపబడినవి. మూడునాల్గుప్రకరణములలో క్రమముగా కరుణారణమల్లుల పూర్వచరిత్రమును, రణమల్లుని మరణమునుగుఱించిన పరామర్శాదులును ప్రకటింపబడినవి. ఈప్రకరణములలో నక్బరుయొక్క కరుణార్ద్రహృదయమును, ఆశ్రితవాత్సల్యమును చక్కగా వెల్లడింపబడినవి.

పట్టుపడినయతఁడు ప్రతాపుఁడగునా కాదా—యని చక్రవర్తి పరిశీలనమును నెఱపుకథాఘట్టము ఆయిదారు ప్రకరణములలో గలదు. ఇందు చక్రవర్తియొక్క యోజనలు ఆతనిబుద్ధికుశలతను వేయినోళ్ల చాటజాలియున్నవి. ఏడవప్రకరణములో కరుణ—దిలేర్ఖానులును, స్యాలకుని వికృతచేష్టలును ప్రదర్శితములు. ఎనిమిదవదానిలో అక్బరుచక్రవర్తియొక్క ప్రకృతివర్గము—రాష్ట్రసంశోధనము నొనర్చు రీతులను ప్రదర్శించుటతో బాటుగా మాతృకుండగ్రామమును ప్రదర్శించి శక్తిసింగుయొక్క కథను ఆరంభించి క్రమముగా తొమ్మిది పదిపదునొకండు ప్రకరణముల యంత్రముదనుక క్రమపరిణామము జాతీయాభిమానవికాసాదులను స్ఫుటముగా చిత్రించినారు. పండ్రెండవప్రకరణమునందు అక్బరు దక్షిణనాయకత్వమును సోపస్కరముగా నిరూపించినారు. ఇది ఈకథకంతకును ఆయువుపట్టు. ౧౩, ౧౪ వ ప్రకరణములలో స్యాలకదామోదరుని విజయోత్సవప్రయత్నములును, తద్విఘ్నములును, ౧౫ వ దానిలో అక్బరు దర్బారును ఖైదీయుదంతమును వివరించుటతో కథకు చక్కని యాకృతిని కల్పించి చదువరుల నాకర్షించినారు ఈఘట్టములోనే ఈనవలయొక్క కథాంశమంతయును సూత్రింపబడినది. పదునారవప్రకరణము—కేవలము కరుణగొల్పునట్టిది. అక్బరు సేనానిచే తఱుమబడుచున్న ప్రతాపుఁడు పడుపాట్లు ఇందు నల్లరాతినిసైతము కరగించివేయుచున్నవి. ఈకరుణరసప్రవాహము అనేక రీతులతో నిరర్గళముగా ౨౦ వ ప్రకరణము చివఱవఱకు మహోద్దండవేగముతో ప్రవహించి ఇతికర్తవ్యతామూఢుడై శత్రునకు లొంగఁబోవుచున్న ప్రతాపుసిరూపును మన కనుల యెదుట నిలిపి మనస్సుల నుద్భ్రాంత లూపుచున్నది. ౨౧ వ ప్రకరణములో రాష్ట్రసంశోధనకు ఫలముగా బంగరుజరీచీరవృత్తాంతము వివరింపబడినది. ఇదియు నీకథకు మిక్కిలి బలమును కూర్చునట్టి సాధనమే.

ఇక ౨౨ లో ఆగ్రాలోని విశేషములు వర్ణితములు. ఇందు స్యాలకుని పశువర్తనమును, కరుణ అసహాయస్థితియు, ఈమున్నగునవి మిగుల రమ్యములు. ౨౩ ౨౪, ౨౫లలో తాత్కాలికముగా లొంగుబాటును ప్రదర్శించుచున్న ప్రతాపసింహుని సంధికైనయుత్తరమును, అందుపై చక్రవర్తి ప్రకృతివర్గముల యాలోచనములును అక్బర్ దర్బారు నందలి చర్చలును, శత్రువశ్యమునకై తన సేనానియొనర్చిన దుండగముల నతడెఱుంగుటయు మున్నగువిషయములు చాల భావపూర్ణముగా వివరింపబడుచు రాజనీతిధౌరంధర్యమును వేనోళ్ళ చాటుచున్నవి. ౨౬ లో ప్రతాపునిలొంగుబాటును విన్నశక్తిసింగు ప్రయత్నములును, ౨౭ లో జగమల్లు దండయాత్రయును చిత్రితములు.

౨౯ లో ప్రతాపసింహుని నూత్నప్రయత్నములును. ౩౦లో సరోవరతీరమునందలి విచిత్రదృశ్యములును వర్ణితములు. ౩౧, ౩౨, ౩౩, ౩౪లలో మఱల ప్రతాపుడు విజృంభించి చక్రవర్తితో డీకొనుటయును, శత్రుపక్షమునఁజేరిన జగమల్లుని ప్రతాపుడు యుక్తిగా శక్తిసింహునితోపాటు తనవైపునకు ఆకర్షించుకొనుటయు మున్నగునవి అతిసమర్థతతో చిత్రింపబడినవి. ౩౫ ౩౬ ప్రకరణములు యుద్ధవివరములను తెల్పునట్టివి. ౩౭, ౩౮ ప్రకరణములు అక్బరుచక్రవర్తి ప్రతాపుని స్వతంత్రరాజుగా నంగీకరించుటయు, తన్మూలమున సంతుష్టులైన వారిరువురును పరస్పర మౌదార్యమును వెల్లడించుకొనుటయు మున్నగునంశములు చక్కగా చిత్రింపబడినవి.

ఇట్టు లీనవల చక్కని రచనలతోను, ఉపక్రమోపసంహారములందు నైపుణ్యమును ప్రదర్శించు కల్పనా చాకచక్యముతోను ఒప్పి పాత్రపోషణ విధానమునందేమి, భాషానైపుణియందేమి చక్కని యుపజ్ఞను గనంబఱచుచు విలసిల్లుచున్నది. మొత్తమున నీకాలములో నింతటిప్రజ్ఞతో నవలారచనమును సాగింపంగల గ్రంథకర్తలు మిగుల కొలదిమంది మాత్రమే యనుట సాహసము కాఁజాలదు. [పం. ఆ.]



## తీర్థయాత్రా ప్రదర్శిని

గ్రంథకర్త ఇఱ్ఱింకి నరసింహమూర్తిగారు, తోశేరు, వీరవాసరంపోస్టు, పశ్చిమ గోదావరిజిల్లా. వెల రూ. ౧-౧-౦. గ్రంథములు గ్రంథకర్తయొద్ద లభించును.

తీర్థయాత్రాప్రదర్శిని—అన్న పేరునుబట్టియే ఇందలివిషయము చదువరులకు తేటతెల్లముగా తెలియుచునే యున్నది. ఈగ్రంథకర్త రామేశ్వరము దగ్గరనున్న సేతువుమొదలుకొని కైలాసపర్యంతము గల సమస్తతీర్థములను, సమస్తక్షేత్రములను సందర్శించి తనసోదరాంధ్రులలో తినవలెనే తీర్థాటనము సేయగోరువారికి మార్గమున సౌకర్యములు కల్గించుటకై తన అనుభవములన్నిటిని ఈగ్రంథరూపమున వివరించి యెంతయో మేలు చేసియున్నాడు. గ్రంథము చిన్నదైనను గుణమున మిన్న. తగినంతమంది జనుల తోడ్పాటుగాని ఇతరసహాయముగాని లేకయే తీర్థయాత్రలు చేయదలచువారిపాలికిది యెంతో చింతామణి వంటి గ్రంథము

ఆయాక్షేత్రముల యొక్క సంక్షేపమాహాత్మ్యములు, మార్గములు, ప్రయాణసౌకర్యములు, అచ్చటచ్చటగల వివిధపరిస్థితులు, యాత్రికులు గమనింపవలసిన విశేషములు ఇందు ఏపాటి అక్షరాస్యులకైనను తెలియునట్టి శైలితో చాల సరసముగా నిరూపింపబడియున్నవి. మొత్తముమీద గ్రంథకర్తచేసినకృషి యపారము; తప్పక ప్రశంసింపదగినదై యున్నది. [పం. ఆ.]

## నెలవంక

కర్త: ఆనంత్స వేంకటరంగారావు గారు, బి.ఏ., విజయనగరము. డెమ్మీసైజు 89 పుటలు. వెల అ. 8.

ఈ 'నెలవంక' దృష్టి కాకర్షకమైె యాంటిక్ కాగితములపై చక్కని అచ్చుతో అందముగ నున్నది.

ఖండకావ్యముల సంపుటములు నేడనేకములు వెలువడుచున్నవి. యువకవులు తమ ప్రతిభ వెల్లడింప యత్నములు సాగించుచున్నారు: తమ కావ్యసంపుటముల వెలువఱిచి అభిజ్ఞలోకము మెప్పునకై యెదురు

చూచుచున్నారు. కవిత పవిత్రాశయములు గుర్తించి తగు పరిజ్ఞానముతో వ్రాయువారు తక్కువ. రచనోత్సాహము సామగ్రీసామర్థ్యములమాట దిగద్రొక్కి తూలిపోవుచున్న దను వాదునకు నేటి ప్రతి నూత్న కావ్యసంపుటమును జడియవలసి వచ్చుచున్నది. శ్రీ వేంకటరంగారావు గారి తొలికృతియగు 'నెలవంక'యు వెలువడినది. ఇది వివిధవిషయములపయి ఖండకావ్యముల సంపుటము.

ఇందలి రచనయం దెంతయో స్వాతంత్ర్య మున్నది. ప్రతి పాఠకుని దృష్టిని ఇందలి అద్భుతకల్పనలు తరుచుగ ఆకట్టుచుండును. ఛందము, సంధి, ప్రాసము మున్నగు కట్టుబాట్లు వీరి స్వాతంత్ర్యధాటి కాగవాయెను. భావన తీరు క్రొత్త.

'దివి యనంబడు సైకతోద్దేశమందు
చంద్రబింబ జలాశయా సలిలములను
ద్రావ కుండిన మేఘోష్ట్ర రాజి సతము
శిశిరజలపూర్తి జనుల బోషించు టెటుల?'

(ఉద్దేశ మనగా ఉన్నతమగు ప్రదేశమని కవి ఆశయము—పాఠకులు మెలకువతో నర్థము చేసికోవలెను.) ఒంటెలు శిశిరజలపూర్తి జనుల పోషించు టేమి? ఇత్యాదిగ ప్రశ్నించుకొనుట కేపాఠకునికేనియు మతి చాలకపోదు. ఇట్టి క్రొత్తపోకడలు కావలసినన్ని.

'ముత్తైదువల్......పావన మొనర్చె'; 'ఎండ కాలప్రభావమ్ము'; 'ఆటవి'; 'పదలజనరాలు' మున్నగు ప్రయోగములును గలవు.

"దేవాలయము" అను కావ్యమున
'ఈ మహాభూధరశృంగ మే పురాణ
జీర్ణ దేవాలయోత్తుంగ శిఖరతలమొ
*　　*　　*
శ్రావణాంభోధరప్రవర్షంబు కతన
పల్లవిత మైన యీ తాళ పాదపంబు
సవిధసంస్థాపితధ్వజస్థంభ మేమొ.'

ఇత్యాదిగ కవిగారిభావన పరుగులు వారినది. ఈ విధముగ ఏ కవియు (కవిగా) పర్వతశృంగమును దేవాలయ శిఖరముగను, తాటిచెట్టును ధ్వజస్తంభముగను అనుమానింపడు. ఉపమాదికమునకు మాత్రమే యాతడు లోలుపుడగును. వీరో, నిర్మాణ శిథిలావశేషము గాంచి 'ఇది యిట్లు కాబోలు' అని సత్యము ననుమానించురీతిని వ్రాసిరి.

ఈ కావ్యమున 'భూధరశృంగ' మనునెడను, 'ఊడుపు' అను కావ్యమున,

'బొమ్మల వ్రాతరంజకి మనసుగులీల'

అను పాదమునను ఛందస్సు పోయినది. 'భూధరశృంగ' మనియు, 'బొమ్మలవ్రాత' యనియు శవర్ణవకారముల ద్విత్వము పలుకుటను భ్రాంతిచే వీ రివి యొప్పులని ప్రయోగించిరి కాబోలు; కాని యిట ద్విత్వము పలుకరాదు. ఆ 'దేవాలయము'ననే శేత్రోక్తమో,

'పూర్వకాలంబునందు నభోపథాంతరాళ...'

అని యున్నది. ఇచ్చట 'నభః పథాంతరాళము' కవిచేత, యతి వాతబడి రూపు చెడినది.

'బాలారత్నము..............మా।
పెన్ లీలాశయనోత్థ..............'

ఇట ప్రాసము చెడినది.

ఇక—'వృక్షవర్ణములు' అను ఖండకావ్యమున వారు కొన్ని వృక్షములకు బ్రాహ్మణాదిక పంచవర్ణము లొసగిరి.

రావిచెట్లు వైష్ణవులట, 'జువ్విచెట్టులు' శైవులట—ఈ రెండును బ్రాహ్మణవృక్షములు; తురాయి చెట్లు రాచవారట; మఱ్ఱిచెట్లు కోమటులట: సహేతుకముగ వ్రాసిరి. మఱి—

'జీవనము అంపములతోడ నేయు గాన
తాటిచెట్లు వడ్రంగులు తరులలోన;
కరముల లవిత్రములు పూను కారణమున
చింతచెట్లను కాపులు చేసె కవిత.'

అన్నారు; ఇంక—

'నిశితకంటకాకీర్ణ వినీలకాయ
రాజి నస్పృశ్యము లయి పర్యంతభూము
లందు జీవించి సంతాప మందుఁ గాన
తుమ్మచెట్లు పంచములుగాఁ దోచు నాకు.'

అనికూడ అన్నారు. అన్నిచెట్లకు వర్ణదీక్ష యీయ లేదు. ఇది యిందలి యొక ఖండకావ్యము. ఇట్టి కావ్యములకును, వాస్తవిక కవిత్వమునకు నంత చేరిక లేదు.

వీరి కవిత్వమునకు సత్యముతో అంతగ సంబంధము కన్పడదు. ఉన్నతభావము లరుదు. రచనయందు విలక్షణత కన్పడును. సమాసముల అల్లిక కొంత పేలవము. ఒక్కొక అన్వయము సంస్కృతముగ గన్పడదు. ఇందలి ధోరణియందు నుంచిశైలికి నలయు లక్షణము లంతగ కానరావు. భాషాదోషములును చాల గలవు.

'విద్యార్థికుల ప్రోత్సాహము మీదనే ఈ పద్యములు ప్రకటింపఁబడినవని పాఠకులు తెలుసుకొనుటకై' వీరు తమ 'విన్నపము'న తమకవిత్వమునకు సంబంధించిన కథలు కొన్ని వ్రాసిరి. పాఠకు లది తెలిసికొన్నను, వీరాశించు 'రసికజనాహ్లాదము' వీరికవిత అదనముగ గావించినది లేదు.

భావసంపద, భాషాజ్ఞానము బాగుగ నేకరించుకొను నేరిమి కూడినచో నిట్టి కవుల ఉత్సాహ మెంతయేని సార్థకము కాగలదు. మాతృభాషాసేవ అప్పుడు నెఱవేఱును.

## పతివ్రతావిభవము

కర్త: ఆంధ్రసాహిత్యాచార్య విద్వాన్ నారాయణానను కురుత్తాళ్వార్ అయ్యంగారు. మదరాసు నరుశాభరణ ముద్రాక్షరశాలయందు ముద్రితము. క్రౌను 1/8 సైజు 76 పుటలుగల యీ పుస్తకము వెల 6 అణాలు.

ఇందు ఇరువది నలుగురు పతివ్రతలగూర్చిన కథలున్నవని వ్రాత ప్రారంభించిరి కాని సుశీలమహర్షి భార్య సుశీలయొక్కయు, సునీతి సుచులయొక్కయు కథలు మాత్ర మున్నవి. మొత్తముమీద ధ్రువునిగూర్చి పెంచిన కథాభాగ మున్నది. బాలురకును, స్త్రీలకును కూడ మిగుల సులువుగ నుండుటకని ప్రచురింపబడిన యీ పొత్తము పెద్ద పెద్ద సంస్కృతపదములతోను, కొండవీటి చేంతాడు వంటి వాక్యములతోను, మీదుమిక్కిలి నిర్దుష్టముగాని భాషతోను నిండియున్నది. గ్రంథనామమునకు తగు విషయము లేదు!

## శ్రీభగవద్గీత-వచనము

డెమ్మీ 1/16 సైజున ౧౩౬ పుటలుగల యీ చిన్న పుస్తకము వెల 2 అణాలు. ఇది పొన్నూరు హితసమితివారి మొదటి ప్రచురణము. కర్త: ప్రతాప రామకోటయ్యగారు. హితసమితివారి యుద్దేశ్యము "జనసామాన్యమునకు అందుబాటులోనుండు సులభశైలిలోను, మితమూల్యముతోను మతసంబంధ గ్రంథములను ప్రచురించి యథాశక్తిగా ప్రచారమునకు దెచ్చుట". ఈ ఆశయ మెంతయు కొనియాడదగినది. దీని కెంతేని యవసరము కలదు. ఆంధ్రులు ప్రోత్సహింపదగినది.

ఈ గ్రంథమునందు భగవద్గీత ౧౮ అధ్యాయముల శ్లోకముల వరుసక్రమమున వచనమున సారాంశమీయబడియున్నది. క్షిప్తముగనున్న యీ గ్రంథాంశము సులభముగను, సూక్ష్మముగను చదువరుల కుపకరింపగలదు. కాని యిందక్కడక్కడ భావానువాదమునందు స్పష్టత లేకపోవుట ఇది యథామాతృకముగ లేదేమో యను ననుమానమునకు కారణమగుచున్నది. శైలి సులభముగనున్నను నిర్దుష్టముగ లేదు. భాషాదోషములును, మిక్కిలిగ నున్న అచ్చుతప్పులును ఇట్టి ఆదర్శమతగ్రంథముయొక్క గౌరవమునకు తగినవి కావు. వీలగునంతవరకు నికముందు వీరు తమ మతగ్రంథములను నిర్దోషములుగ నుండునట్లు ప్రచురింప ప్రయత్నింతురుగాక.

## బ్రహ్మనామమాహాత్మ్యము; గురుమహాత్త్వము

కర్త: అంగలకుదిటి షణ్ముఖశాస్త్రిగారు, బల్లిపర్రు, పామఱ్ఱుపోష్టు, క్రిష్ణాజిల్లా.

ఇది 1/16 డెమ్మీ 48 పుటలుగల పొత్తము. వెల ౪ అణాలు.

ఈ రెండును గేయరూపమున నున్నవి. శైలి సరళము.

## రఘురామ శతకము

కర్త: మరువాడ గోపాలకృష్ణమూర్తిగారు, పెద్దాపురము. ఫుల్‌స్కేపు చిన్నసైజు 24 పుటలు. వెల 2 అణాలు. ఇందు 'దశావతారములు' అని 10 పద్యములును, 'మంగళాష్టకము' అని 8 పద్యములును కలిసి 108 పద్యము లున్నవి.

## విహంగ విజయము

ఇది జే. టి. కృష్ణశాస్త్రిగారిచే విరచింపబడి రాజమహేంద్రవరమున లలితా ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను. క్రౌను 1/8 సైజున 92 పుటలుగల చిన్నినవల. ఇందు 'ఎన్నికలలో నొకపక్షమున జేరి కడుం గడు శ్రమపడి ప్రతిపక్షుల ప్రచండవాగ్దండన దండితుడై తనపక్షము విజయమందగా నా విషయము నీగ్రంథరూపమున వ్రాసినట్లు పొడకట్టెడిని...ఇందు కొన్ని పద్యములును గలవు...చకోరపక్షి ప్రయత్నము న్యాయసమ్మతమనియు, గంకపక్షి ప్రయత్నము న్యాయవిరుద్ధమనియు గనబడును' అని పుస్తకారంభమున వ్రాయబడిన విషయమే గ్రంథములోని కథాసంవిధానమును సూచించుచున్నది.

## చిలంబు ఆదినారాయణప్ప నాయుడుగారి పవిత్రమగు చరిత్రము

వీరు నీతిశాస్త్రాద్యనేకగ్రంథముల జేసి 'అభినవ భర్తృహరి' అనుబిరుదును బొంది కీర్తిశేషులైనవారట. వీరు 1837 న జన్మించి 1913 లో కీర్తిశేషులైరట.

ఈ పుస్తకము వారికుమారుడు చిలంబు చంద్రశేఖరరావుగారు రచించిరి. రాజమహేంద్రవరము సరస్వతీ పవర్ ప్రెస్‌నందు ముద్రింపబడినది. డెమ్మీ 1/8 సైజు 73 పుటలుగల దీనివెల రూ 1-0-0.

## పెద్దాపురము ముట్టడి

'ఆంధ్రచారిత్రక సమవాకారము'. గ్రంథకర్త: బుద్ధవరపు పట్టాభిరామయ్యగారు, గాంధినగరము, కాకినాడ. డెమ్మీసైజు 112 పుటలు గలది. వెల రు. 1.

చరిత్రమున వాసిగన్న వ్యక్తుల శీలములను, జీవితములను, రాజ్యముల యితిహాసములను లేనిపోని మార్పుల ధ్వంసముచేయుచు, జనులకు తమ పూర్వప్రశస్తి యెడను, సత్యచరిత్రము నెడను గ్రుడ్డితనము గూర్చు కొన్ని రచనలవలె గాక, యీ రూపకము చరిత్రమును చాలవరకు ననుసరించినదై మెచ్చదగియున్నది. పెద్దాపుర చరిత్రము నవలంబించి వ్రాసిన మొదటి నాటక మిది.

ఈ నాటకమున ఏ విషయమును రచయిత గొప్ప నేర్పును చాటదు. పాత్రపోషణమున గొప్ప పొకడలు గన్పడవు. మనఃపరిణామ నిరూపణము చాలదు. 'ఇది యీ గ్రంథమునుండి యుద్ధరించుకొనదగినది' అని యెన్నదగిన పద్యభాగము గాని, గద్యభాగము గాని యించేదియు తగులదు. అయినను ఈ నాటకము కొంతవరకు మనసు నాకర్షించును. కథాప్రాముఖ్యము, సత్యావలంబనము, శైలిసారళ్యము ఈ ఆకర్షణకు హేతువులు. కవికి గల ఉత్సాహము, ఆంధ్రత్వాభిమానము, తన పాత్రల యెడ సానుభూతి గుప్తముగ కొంత మెఱుగు తెచ్చినవి. ఇతివృత్త మందముగనే యున్నను దిద్దుబాటు లేని సంకులతకు పాల్పడినది. నూరుద్దీను, కొంపెల్ల లక్ష్మీసోమిదమ్మ, సుబ్రహ్మణ్య సోమయాజి మున్నగు పాత్రలు బాగుగనే అంకితములైనవి. కాని రచయిత తన పాత్రల నధికముగ పరిపోషించుకొన లేదు. పట్లను బాగుగ గమనించి సమర్థముగ నిర్వహించుకొనను లేదు. రంగమున నొక పాత్రచే జెప్పించిన విషయమే వేరుగ నొకరంగమున- అదనముగ రసస్ఫోరణముగాని, ఇతివృత్త వివరణము గాని కావింపకే- నిరూపించుట, తిరిగి చెప్పించుచుండుట నాటకమునకు దుర్బలత గూర్చును. ఇంకను కళారహస్య పరిజ్ఞానమును, నాటకమున చరిత్రమును లోంగదీసికొను నేర్పును రచయిత అలవఱచుకొన దగును. ఇందువలెనె భాషాదోషములు నాటకరచయితల కప్రశస్తి దెచ్చును. కొన్నియెడల గద్యమున నందము గనెడిభాగములను అనావశ్యకమగు పద్యధోరణి ఆవహించినది. శైలి పటుత్వము లేకున్నను, రంగమున చదువునపుడు ప్రేక్షకునికి విషయము సుబోధముగునట్లు ధారాళముగ నున్నది...
[కొం. జి.]

### ౨౨ శ్రుతులు—స్వరావళి

(అఖిల భారత గాయకమహాసభయందొసంగబడిన యుపన్యాసము.) కర్త: పండిత వింజమూరి వరాహనరసింహాచార్యులుగారు, ఫ్రేజరుపేట, కాకినాడ (తూర్పుగోదావరి). క్రౌనుసైజు ౬౩ పుటలు. వెల ౮ అ.

మన గానపద్ధతియందు ౨౨ శ్రుతులు మాత్రమే కలవని యిందు సిద్ధాంతీకృతమైనది. ఈ విషయమున ఆయాకాలముల వెలసిన పలువురు ప్రాచ్యపాశ్చాత్య సంగీత పండితుల వాదములను ఈ గ్రంథకర్తగారు చాల పరామర్శించినారు. మొత్తముమీద పాశ్చాత్యరచనల ప్రశ్నల మిందు చాలగ కన్పడును. ఒక్కొకచో సుబోధమగు వివరణము లేకున్నను, మొత్తముమీద సంగీతశాస్త్రము కొంత తెలిసినవారికి ఇది చదువదగిన గ్రంథము. అచ్చుతప్పులు, వ్రాతతప్పులు చాల అసౌకర్యము కూర్చుచున్నవి. కొన్ని శ్రుత్యాదుల పేరులు గూడ గ్రంథకర్త సరిగ తెలిసికొనక వ్రాసెను. ధైవతమునకు దైవతము, ద్విశ్రుతికి ద్విశ్రృతి, సముద్వతికి సముద్ధతి, ఛందోవతికి చందోవతి మున్నగు ననేకదుష్టపదములు గ్రంథకర్త వాడినవే. ఆంగ్లలిపిలో అచ్చుపడినవి, ఉచ్చారణరీతి గమనింపక కాబోలు, రచయిత ఉద్ధరించిన కొన్ని సంస్కృతభాగములు కడు దోషభూయిష్ఠములై, కొన్నియెడల నర్థావబోధమే కాకుండుట శోచనీయము. పండితులచే పరిశోధింపజేసి యింకను శ్రద్ధతో వ్రాసికొనుట యుక్తము.

ఆయా స్వరములకు గల శ్రుతులసంఖ్య విషయమున వాడుకలో నున్నదానికంటె భిన్నముగ నిందుగల ప్రతిపాదన విద్వాంసుల తర్కమునకు తగినది. శ్రుతుల యనంతరము స్వరములుగాని స్వరముల యనంతరము శ్రుతులు కావనునది వీరి సిద్ధాంతములలో నొకటి. ఇది శార్ఙ్గదేవాదులచే మున్నె అవలంబితమై నేడు వాడుకలో నుండునదే.

ఇందు నెలయు పథకములు విషయవివరణమునకు చాల తోడ్పడుచున్నవి.

సంగీతవిషయమై వెలువడు గ్రంథజాలమున దీనికి నొకముఖ్యస్థానము లభింపక పోదు. దీనిని శ్రీ విష్ణుదిగంబర్ పులస్కర్ మున్నగు విద్వాంసులు చాల ప్రశంసించి తమ యభిప్రాయము లొసంగియున్నారు.

### శ్రీ తులసీరామాయణము, ఆరణ్యకాండము

ఇది గంజాంజిల్లా బరంపురం, పూడిపెద్దివారి వీధిలోని వేగుఁజుక్క గ్రంథమాల వారి 31 వ పుష్పము. గ్రంథమాలాధిపతులు శ్రీ భాగవతుల నరసింహశర్మ గారు హిందీ తులసీరామాయణము నాధారముచేసికొని నిర్వచన పద్యకావ్యముగ తెనుఁగున రచియించిన బాలకాండ, అయోధ్యాకాండముల తరువాతి దీ ఆరణ్యకాండము. డెమ్మి 1/8 సైజున 143 పుటలు కల యీ గ్రంథమున 687 పద్యము లున్నవి. వెల ఒకరూపాయి. పద్యముల శైలి సరళము.

### శృంగార గాధేయోపాఖ్యానము

క్రౌనుసైజు ౬౨ పుటలు. దళసరి కాగితములపై చక్కగ ముద్రింపబడినది. వెల రు ౧-౦-౦.

వలయువారు జి. యస్. శాస్త్రి అండు కో, పోస్టుబాక్సు ౧౧౦, మదరాసు, అని వ్రాయవలయును.

ఇది శృంగారగ్రంథమండలి వారి ఆరవ ప్రచురణము. ఈ గాధేయోపాఖ్యానము ఏడాశ్వాసముల ప్రబంధము. గ్రంథకర్త అనంతనార్యుడు. ఇప్పుడీపేరున ప్రకటింపబడినది అసలు పుస్తకమునందలి మొదటియాశ్వాసము మాత్రమే. అంబరీషుని యజ్ఞపశువుగా గొనిరాబడిన శునశ్శేపుని విశ్వామిత్రుడు రక్షించుటయు, మేనక గాధేయుని తపస్సు భంగపరచుటయు, విశ్వామిత్రుడు రంభనుశపించుటయు, నతనిబ్రహ్మర్షిత్వప్రాప్తియు నిందలికథాభాగము.

ఇది యొకయాశ్వాసము మాత్రమే యగుటచే ప్రధానమగు 'గాధేయోపాఖ్యానము' మనకిందు అసమగ్రముగానే లభించును. మేనకచే విశ్వామిత్రుని తపోభంగము సందర్భమున గ్రంథకర్త శృంగార రసమున కవసరమైన ప్రాధాన్యమొసంగి యాశ్వాసమును పెంచినాడు. శైలి మధురముగనే యున్నది. కాని రచయిత విశేష

ముగ శబ్దాలంకార ప్రియుడగుటచే గాబోలు నించుమించుగ ప్రతిపద్యమునను కొంత యనావశ్యకమగు శబ్దాడంబరము కాన్పించుచుండును.

## The Beginnings of Local Taxation in the Madras Presidency

నెల్లూరునందలి వెంకటగిరి రాజావారి కళాశాల ప్రధానాచార్యులగు మామిడిపూడి వేంకటరంగయ్యగారు (యం. ఏ.) దీనిని ఆంగ్లమున రచియించిరి. ఆంధ్ర విశ్వవిద్యాలయమున వైసుఛాన్సలరుగారైన కట్టమంచి రామలింగారెడ్డిగారు ఈగ్రంథమునకు పీఠికవ్రాసిరి. మద్రాసునందలి లాంగుమెన్సు కంపెనీ వారు దీనిని ప్రచురించిరి. క్రౌనుసైజు ౧౨౦ పుటలు. కాగితము, బైండు అందముగా నున్నవి.

ఈ గ్రంథరచనమున వేంకటరంగయ్యగారు మిక్కిలిపరిశ్రమ చేసియున్నారు. మూలమూలల నున్న గ్రంథముల నెన్నిటినో వారు పరిశీలించి ఆ గ్రంథములందు ఇమిడియున్న విషయముల సారమును క్లిష్టతలేకుండ సులభబోధకముగ నిందు వివరించియున్నారు. లోకలు పన్నుల ప్రారంభమునకు వారీగ్రంథమున ఈకారణములను చూపిరి:—

౧. ౧౮౭౧-౮౧ సంవత్సరముల మధ్య హైందవకేంద్ర ప్రభుత్వపు బడ్జెటులో గలిగిన తికమకలు.

౨. ఆ తికమకలనుండి తప్పించుకొనుటకు కేంద్ర ప్రభుత్వము స్థానిక ప్రభుత్వములకు కొత్తపన్నులు వేయుటకు, ఇదివఱకు కేంద్రప్రభుత్వమునకు చెందుచున్న కొన్నిపన్నులు తాను వసూలుచేసికొనుటకును అధికారమును పొందుట.

3. కేంద్రప్రభుత్వము వారు పన్నులు వసూలు చేయుటలో కలుగులోపములు కొన్ని సవరణయగుటకును.

౪. ఆదాయమువృద్ధిచేయుటకుమంచిమార్గమగుట.

౫. స్థానికముగా రోడ్లను, విద్యను అభివృద్ధి నొందించుటకు సులువైన మార్గమగుట.

౬. స్వపరిపాలనమున జనులకు తగిన తరిబీయతు నిచ్చుట.

మొదటిదగు ఉపోద్ఘాత ప్రకరణమునను, రెండవ ప్రకరణమునను గ్రంథకర్తగారు ౧౮౭౩ సంవత్సరమునకు బూర్వము లోకలు పన్నుల స్థితిని వివరించిరి. పిమ్మట పైని వివరించిన కారణములను ప్రత్యేకించి ఒక్కొక్క ప్రకరణములో వర్ణించిరి. తొమ్మిదవ ప్రకరణమున లోకలు పన్నుల ప్రారంభపద్ధతిని విమర్శించిరి. ఈ ప్రకరణముననే శ్రీవారి విమర్శనాచాతుర్యము, సునిశిత బుద్ధి వెల్లడియైనవి. ఆ పద్ధతిలోగల లోపములను పేర్కొనుటలో వారు చక్కగా ఒకదానివెంబడి ఒకటిని గజిబిజి ఎట్టిదియు లేక వివరించిరి. పబ్లికు ఫైనాన్సు (Public finance) తమ అభిమానవిద్యగా గైకొనిన బి. ఏ. విద్యార్థులకు లోకలు పన్నులకు సంబంధించిన విషయములకు ఈ గ్రంథ మత్యంత సహకారి కాగలదు. ఏతద్విషయమై వారి పాఠ్యగ్రంథమగు Findlay Shirras గారి పుస్తకములో లేని అనేకవిషయము లిందుగలవు. ఇట్టి అమూల్యగ్రంథము రచియించిన శ్రీయుత మామిడిపూడి వేంకటరంగయ్యగారు అభినందనార్హులు. ఇట్టి ప్రశస్త గ్రంథములు మఱికొన్ని రచియించి వారు దేశసేవ చేయుదురు గాక!

[ఆంధ్ర శేషగిరిరావు, బి.ఏ.]

## మణిభూషణము

(ఒకటి, రెండు భాగములు)

ఈ రెండు భాగములలోను శ్రీమద్భాగవతమునుండి గజేంద్రమోక్షము, రుక్మిణీకల్యాణము, ప్రహ్లాద చరిత్ర మున్నగు కథాభాగములు—మొత్తముమీద నిరువది—ప్రత్యేకముగ కూర్పబడి ముద్రితములైనవి. ఇవి 'ఏర్చికూర్చి' ప్రకటించిన వారు శ్రీయుత తేకుమళ్ల రాజగోపాలరావు గారు.

క్రౌనుసైజున మొదటిభాగము 72 పుటలు. వెల తెలియదు. రెండవభాగము 92 పుటలు. వెల రు 0-10-0.

## శారదా పద్యవాచకములు

(ఏడవవాచకము)

ఇదియు శ్రీయుత తేకుమళ్ల రాజగోపాలరావుగా రేర్చి కూర్చి ప్రకటించిన పద్యముల సంపుటము.

పోతన, శ్రీనాథుడు, పెద్దన మున్నగు నాంధ్ర మహాకవుల రచనములందలి పద్యము లిందు జేర్పబడినవి.

క్రానుసైజు 68 పుటలు వెల రు. 0-8-0.

## ఛందశ్శాస్త్రము

ఇది యొక లక్షణగ్రంథము. గ్రంథకర్త: శ్రీయుత తేపుమళ్ల రాజగోపాలరావుగారు, బి. ఏ. యల్. టి. క్రౌనుసైజు ౭౬ పుటలు. వెల రు ౦-౬-౦.

ఇందు గ్రంథకర్తగారు ఏడుప్రకరణములలో కవిత్వము నేర్చుకొనగోరు వారికి సుబోధకమగునట్లు సోదాహరణముగ ఛందోనియమములను వివరించి యున్నారు.

శ్రీయుత రాజగోపాలరావుగారు మూడవప్రకరణమున అ, రలకు మైత్రి చెల్లునని వాదించు సందర్భమున అ ప్రాసము అనుశీర్షిక క్రింద 'ఱ' యొక్క చరిత్రమునుగూర్చి తమ యభిప్రాయములను గొన్నిటిని వివరించినారు. ఇచ్చట వీరివాదము కొంతవిమర్శకెడమిచ్చుచున్నది. రాజగోపాలరావుగారు 'ఱ యొక్క చరిత్రము' ఆరంభమున నొకచోట "దక్షిణ హిందూదేశపు లిపులలో మొట్టమొదటి లిపులు తెలుగు కన్నడ భాషలవి. క్రీ. శ. ౧౩౦౦ వరకును గూడ నీరెంటికి లిపి యొక్కటియే." యని వ్రాసినారు. (౧౫ పుట). తరువాత కొంచెము సేపటికి "...నన్నయభట్టు కాలమునాటి భారతము లిపి మనకు దొరక లేదు గావునను..." అని వ్రాసియున్నారు. (పుట ౧౯). పై రెండువాక్యములకు సమన్వయ మెట్లో తెలియుటలేదు. నన్నయభట్టు ౧౧ వ శతాబ్దమువాడు. ౧౩౦౦ సంవత్సరము వరకు తెలుగు కన్నడభాషల లిపి యొక్కటే. ఇట్టిచో నన్నయ నాటి భారతము లిపి మనకు దొరకపోవుట యనునట్టిది? మరియొకచోట క్రీ. శ. ౯౮౫ సంవత్సరము వరకు తెలుగులిపిలో ఱ లేనేలేదని వ్రాసినారు. (పు. ౧౮-౧౯) కాని. తెలుగు-కన్నడ శాసనములనుబట్టి చూచినచో ఱ కారమంతకు చాలపూర్వమే వాడుకలోనికి వచ్చియుండెనని తెలియు చున్నది. ౧౩౦౦ సం॥ వరకు తెలుగు కన్నడముల లిపి యొక్కటియే కదా! అట్టిచో ౯౮౫ సం॥ వరకు తెలుగులిపిలో ఱ లేదని యెట్లుచెప్పుట? అందుచేత "నన్నయభట్టారకుని కాలమునాటికి ఱ క్రొత్తగా వచ్చియుండుట చేతను" (పు. ౧౯) అను నభిప్రాయము పొసగుట లేదు.

తరువాత నొకచోట "నన్నయ భట్టారకుని కాలమునాడు ఏవి 'ఱ' కల పదములో మనకుదెలియదు." అని వ్రాసినారు. (పు. ౧౯). నన్నయనాటి భారతము వ్రాతప్రతి దొరకకపోవుటచే, నన్నయ ఱ కారము నెచ్చట వాడెనో తెలియకపోవచ్చును. కాని ఆనాటికి 'ఱ' కల పదములేవో తెలిసికొనుట కవకాశము లేకపోలేదు. శాసనములనుబట్టి యీ విషయము నిర్ణయింపవచ్చును.

శ్రీయుత రాజగోపాలరావుగారు ప్రకృతమున ఱ రల చరిత్ర శోధించుచున్నారని తెలియుచున్నది. అందుచే పై యంశములను గూర్చి వారు వివరముగ నాలోచింతురు గాక యని ప్రార్థన.

గ్రంథము తుదిని ౨ వ యనుబంధములో "నవీన పద్యములు (మా యభిప్రాయములు)" అను శీర్షిక క్రింద ఛందోనిర్బంధములను గూర్చి గ్రంథకర్తగారు కొంత చర్చ గావించినారు. ఈ సందర్భమున కవులకు "పదప్రయోగమునకు స్వేచ్ఛ" కలుగవలయు ననియు, వారు "యతిప్రాస నియమమును బాటింపకయే కంద గీత చంపకాదులను" వ్రాయవలయుననియు, ఇట్టి పద్యములకు నూతనగీతము, నూతనకందము, మున్నగు పేరుల బెట్టవలయుననియు రాజగోపాలరావు పంతులుగారు సూచించినారు. దీనికి కారణము ఇది:—"ఏకాక్షుర ద్వ్యక్షరాది నియమములన్నియు నుత్తమకవిత్వమున కెట్లు నిర్బంధములో యతిప్రాసములును నట్లే నిర్బంధములగును."

ఐన గ్రొత్త క్రొత్త వృత్తములను గనిపెట్టి వ్రాయవచ్చునే యన్నదానికి వీరిష్టపడరు. "వాడుకలో లేని క్రొత్తపద్యములను గల్పించుటకంటె, వాడుకలో నున్న పద్యములయెడఁ గవులకీ వీలునొసఁగుట మంచిది." అని వీరియభిప్రాయము. ఐన ప్రస్తుతము వాడుకలో నున్న పద్యములేవి యని యాలోచింపవలయును. ఇవి కందము, గీతము, సీసము, చంపకమాల, ఉత్పలమాల, శార్దూలవిక్రీడితము, మత్తేభవిక్రీడితము. ఉత్సాహ

మున్నగు నొకటిరెండు ఇతర వృత్తములుగూడ నందందు గానవచ్చును. ఈ యేడెనిమిది పద్యములనే, తనకు యతిప్రాసములతో సరిపడనప్పుడు వాటికి పద్యములలో చోటు లేకుండజేసి, కవి వ్రాయుచుండవలయునని పంతులుగారి యభిప్రాయము. గణములు మాత్రము పాటించి తీరవలెనని వీరి తలంపు.

ఇట్టి పద్ధతి సారస్వతక్షేత్రమును సంకుచిత పరచును. ఛందఃప్రస్తారమును బట్టి వందలకొలది, వేలకొలది వృత్తము లేర్పడుచున్నప్పుడు వానిలో నందమైన వాని నేరి కవులు సారస్వత ప్రపంచమున కితోధిక సౌందర్యము సమకూర్చుట కెంతే నవకాశము కలదు. ఇది నిర్మాణాత్మకమైన పద్ధతి; భాషాప్రపంచము వెంపొందించగల విధానము. పైపద్ధతి నవలంబించుటకు రవ్వంత యోపిక పట్టగలిగినచో నేటి మన కవులను యతి ప్రాసము లంతగ బాధింపవు. రాజగోపాలరావుగారి పద్ధతి నిర్మాణాత్మకము కాదుగదా తద్విరుద్ధము గూడను. శిథిలములై, చినుగులుపడిపోయినను సరే, ఉన్న నాలుగు పంచెలనే ఎట్లో కుట్టుకొని, బ్రతికినన్నాళ్లు వాడవలయునను పద్ధతి.

పై మూడుపుస్తకములు వలయువారు 'తేకుమళ్ల రాజగోపాలరావుగారు, బి. ఏ., యల్. టి., 7, వెళ్లారి వీధి, పరశువాకం, వేపేరిపోష్టు, చెన్నపురి' అని వ్రాయవలెను.

ప్ర. రం.

## సుందరి

మదరాసు, శ్రీ టి. వి. చెల్లప్పశాస్త్రి అండ్ సన్స్‌వారిచే ప్రచురింపబడిన యొక నవల. క్రౌను 1/8 సైజున ౧౫౭ పుటలు గలది. వెల ౧౦ అణాలు. గ్రంథకర్త: విద్వాన్ మంకాల శ్రీపతి గారు.

౨౦ అధ్యాయములు. 'ఇందలి కథాప్రణాళిక శ్రుత పూర్వమయ్యు—నశ్రుతపూర్వ స్వకపోల కల్పనంబుల నియ్యది యొక నూతన గ్రంథ' మట. 'ఇందలి కథయాద్యంతము నౌచిత్యము నతిక్రమింపక శబ్దకాఠిన్యము లేక వ్రాయబడి యున్న'దట. 'సనాతనాధునాతన నాఖిల జనసంప్రదాయములు సమయోచితముగా నందందు పొందింపబడియున్న' దట.

వీ రన్నట్లు ఇందు అశ్రుత పూర్వస్వకపోలకల్పనముగాని, ప్రకృతి కనురూపమగు కథాసంవిధానముగాని, పాత్రలయందు మనస్తత్వ పరిపోషణము గాని, కేంద్రీకృత భావసంపదకాని కాన్పింపకున్నది. శైలి సంస్కృతపదబహుళమై సరళము గాకున్నది.

ఇందు కథాభాగమునకంటె భారతదేశము, దేశభక్తి, సంఘసంస్కారము, స్వరాజ్యము, నాగరకత, కవుల రచనలు—వీనిగూర్చిన నిందలు, మెట్టవేదాంతము, శ్రీరంగనీతులు మిక్కిలిగనున్నవి. 'ఈ కాలమునందెవరికివారు మహాకవులు. గ్రంథములం గనక—మూలము ముట్టక—వ్యాకరణము వల్లింపక—న్యాయప్రయాసములు లేక అడ్డమైనవాడును కవియను బిరుదమును స్వనామముతో జేర్చుకొనుట యిప్పటి సంప్రదాయమై యున్న'దట. ఈ గ్రంథముకూడ అట్టి సంప్రదాయము గల మహాకవుల గ్రంథములవరుసలోనికి చేరదగినదిగనే యున్నది.

దీనిని గ్రంథకర్తగారు 'మనోహరమగు పరిశోధక నవల' యనిరి. ఏమి పరిశోధనమో? గ్రంథమంతయు పరిశోధించినను వీరి పరిశోధన మేమియు కానరాదు. కాని మానవశక్త్యతీతములగు నంశములు మాత్రము గలవు. దీనిని గ్రంథకర్త పంచభూతార్పణము కావించెను.

## శక్తి కుమార్

ఇది వాసిరెడ్డి మల్లికార్జునగారిచే వ్రాయబడి కొండపల్లి వీరవెంకయ్యగారిచే రాజమండ్రినుండి ప్రచురింపబడిన 'అపరాధ పరిశోధకనవల'. డెమ్మీ 1/8 సైజు ౧౩౬ పుటలు. వెల ౧ రూపాయి. 'నవలను చదువుటచే మనస్సు విశాలమగునని నవలను వ్రాస్తిని. ఇద్దానినే కొద్దికాలమునకే వ్రాసియుంటిని గాన యిందు తప్పులుగాని యుండవచ్చును. నా భాషామతల్లికి సేవజేయుటకై ఆంధ్రమున గ్రంథరచనకుం గడంగితిని. చదువరులార! మీర లీగ్రంథమందలి నాచే వ్రాయబడిన సుగుణముల గ్రహింతురని నమ్ముచున్నాను. ఇదొక యపరాధ పరిశోధక కల్పితమైనను యిందు సాంఘికమునకు

కెందు సుగుణములు మెండుగా గలవని రూఢిగ జెప్పగ లను. అవసరము స్త్రీలు సైతము సిగ్గువిడిచి ధైర్యమును బూనవలెను. తమకున్న వస్తువులతో తృప్తిపడవలె గాని దురాశను పోజనదు. నేజెప్పువిషయము లీకొద్దియే.

నావలిస్టు'

అని పీఠికయందు గ్రంథకర్త వ్రాసెను. ఇంక గ్రంథవిషయమును, అందలిభావను విమర్శింప వల యునా ?

## తెలుఁగుకావ్యాదర్శము: అలంకారశాస్త్రము

ఆంధ్రీకర్త, అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. క్రౌను 1/8 సైజు ౨౮౭ పుటలు. వెల ౧_౦_౧. ఆంధ్రగీర్వాణ విద్యాలయము, కొవ్వూరు, పశ్చిమగోదావరి జిల్లాకు వ్రాసిన బడయగలరు.

ఇది దణ్డిమహాకవి కృత సంస్కృత కావ్యాదర్శమునకు తెనుగు. చివర లఘుటీక చేర్చబడినది.

## లోకజ్ఞాన గీతానందము

కర్త: గోటేటి సన్యాసిరాజుగారు. లోకజ్ఞానానందనిలయము, నరసాపురము వారు ప్రచురించిరి. క్రౌను 1/8 సైజు ౨౩ పుటలు. ఇదియొక పద్యకావ్యము.

## అంజలి [హనుమ స్తవము]
## భక్తబృందావనము

ఇవి మహావాది వేంకటరత్నము గారిచే విరచింపబడి తెనాలి రామాకంపెనీ బ్రాంచి వారిచే ముద్రింపబడిన పద్యకావ్యములు.

మొదటిది ౧౦౫ పద్యములు గలది. రెండవది భగవత్స్వరూపాభివర్ణనము, భక్తలక్షణము, మానవప్రకృతి, స్వయంప్రార్థనము అను శీర్షికలక్రింద నున్నది.

క్రౌను 1/16 సైజున ౨౩ పుటలును, ౨౦ పుటలును కలవి: యొక్కొక్కటియు ౨ అణాలు వెల గలవి.

## భక్త కుచేల

ఇది ౬ అంకముల నాటకము. కర్త: వల్లూరి వేంకట కనకయ్యగారు. చిరునామా: శివకేశవనిలయము, వేలూరు, చిలకలూరుపేట పోస్టు, గుంటూరుజిల్లా. డెమ్మి 1/8 సైజు ౭౦ పుటలు, వెల ౧౦ అణాలు. ఇందు గేయములు కలవు. ఈగ్రంథకర్తకు పాపము, మారిషుడో మార్షుడో కూడ తెలియదు. ఇక నాటకమును విమర్శించుట ఏల? వీరి కవితాధోరణి దెలియుటకు మచ్చుగా నీక్రింది పద్యములను గాంచనగును.

...     ...     ...

తననామచింతచే దరియింపగాలేక
సంసారమున జేరి సమసితనుము

...     ...     ...

దీనులనుబ్రోచు సౌభాగ్య ధేనువనుము
శ్రితజనావళి నొకనిగా జేర్పుమనుము
మునిజనంబులతోపాటు బ్రోవుమనుము
అన్నికష్టంబు లెడబాప నతని వనుము.

ఉ. కంటక కర్కశాదిఘన
కాన విశాలగిరీంద్ర సంవృతా
కంటకభూరి క్రూరభుజ
గంబు లవారిత వ్యాఘ్రసంతతుల్
మింటికినంటు దట్టమయి
మిన్నగుపాదప వల్లి కావళుల్
నొంటిగ దాటివచ్చితివె
యోర్చెనె పాదము లట్టితావులన్.

మ. తలపన్ మానధనుండు శాంతగుణుడున్
ధన్యాత్ముఁ డీవిప్రుడున్
కలిసెన్ బాల్యమునందు కావ్యపఠనా
కౌతూహలత్వంబునన్
చెలగెన్ సద్యశభక్తి మాన్యగరిమన్
శ్రేయోవిలాసాఢ్యుడై
నెలదీ ప్రేమలతానుబంధురమునన్
విచ్చేసె నాపాలికిన్.

ఉ. వేలుపు వోలె నన్ను దన
వెంటను తల్పమునందు జేర్చి తా
మేలుగ సత్క్రియల్జరపి
మించిన ప్రేమను గౌగిలించి గో

పాలురు గొల్వగా హరిసు
భావత చారు వధూకరద్వయా
శీలత చామరానిల వ
శీకరణం బొనరించె సత్కృపన్.

ఉ. దైవము వోలె నన్ను గని
దానవవైరి భజించె వేడుకన్
భావమునందు సోదరుని
భాతి దలంచి ప్రపూతచర్యుడై
దేవిరమాసతిన్ విడచి
దిగ్గన లేచి వినమ్రభావుడై
సేవలు జేసె పత్నియుత
శ్రీకరుడై దయనిల్పి భామినీ!

ఈ పద్యములనుబట్టి ఈగ్రంథ సారస్యమును గ్రహించి సహృదయులగు పాఠకమహాశయులు తమకు సమ్మతమేని గ్రంథకర్తను దీని పునర్ముద్రణమునకు ప్రోత్సాహము కల్పింతురుగాక!

## Bricks Between and At Any Cost

వి. వి. శ్రీనివాసయ్యంగారి నాటకమున కనుకరణమట. ఈ తమిళనాటకమును రావ్ బహదూర్ పి. సంబంధమ్, బి. ఏ., బి. యల్. గారు వ్రాసిరి. డెమ్మి 1/8 సైజు ౫౮ పుటలు. వెల ౦–౮–౦.

## నీలి పూలు

శ్రీ యస్. జి. ఆచార్యగారు వ్రాసిన ౧౮ కథలు గ్రంథరూపమును దాల్చి పశ్చిమగోదావరిజిల్లా తణుకుతాలూకా కాకరపర్రులోని సరస్వతీ గ్రంథమాల వారి ౨౧ వ ప్రచురముగా వెలువడినది. డెమ్మి 1/8 సైజు ౧౩౦ పుటలు. వెల ౦–౧౨–౦.

## కథాగుచ్ఛము [మొదటిభాగము]

రవీంద్రనాథఠాకూర్ గారిచే వ్రాయబడిన బంగాళీకథలకు శోభనాదేవి, వైకుంఠరావుగార్ల యనువాదము. ఇందు రాసమణికొడుకు, కాబూలీవాలా, భాయి ఫోటా, హైమంతి, ఎండానీడా అను ౫ కథలున్నవి.

రవీంద్రుని 'పెన్సిల్ స్కెచ్' ఉన్నది. క్రౌను 1/8 సైజు ౨౨౮ పుటలు. వెల రూ ౧–౮–౦.

చిరునామా:—విశ్వభారతి ఏజన్సీ, ౩౨౩, తిరువత్తూరు హైరోడ్, చెన్నపురి.

## మోక్షసోపానములు

ఇది వి. ఎ. కామేశ్వర శర్మగారిచే వ్రాయబడి కాకినాడ ఆల్బర్టు పవర్ ముద్రాశాలయందు ముద్రింపబడియె. 1/16 ఫుల్ స్కేపు చిన్నసైజు ౩౬ పుటలు. వెల ౦–౧–౦.

ఈ చిన్నపొత్తమున జ్ఞానసూత్రములు, సద్గుణాభ్యాసోపాయములు, మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దైవభక్తి, మానసబోధ, జిహ్వాబోధ, ఇంద్రియబోధ, జనబోధ, భగవత్ప్రార్థన, యను శీర్షికల క్రింద సుబోధ వాక్యములు గలవు.

## గృహప్రవేశం

కర్త: రవీంద్రనాథ్ ఠాకూరు. అనువాదకులు శోభనాదేవి, వైకుంఠరావుగార్లు. విశ్వభారతీ గ్రంథమాల—౧. విశ్వభారతి ఏజెన్సీ, 2, ఫిలిప్‌వీధి, చెన్నపురి. క్రౌనుసైజు. ౧౨౩ పుటలు. వెల ౧౨ అణాలు.

ఇది రెండంకాల నాటకం. ఇందులో మానసిక జీవన విశేషం చిత్రితం. ఇది మనఃప్రవృత్తికి సంబంధించిన రచన. దీనిలో అవయవచర్యకంటె ఎక్కువ ఆంతరంగిక వృత్తి ప్రధాన ఘటనాలంబనం.

'జ్యోతీన్' వ్యాపారంలో దివాలా తీశాడు. జీవన వ్యాపారంలో కూడాను—పెద్దజబ్బుతో పడిపోయినాడు. తానప్పటికే కట్టుకొంటూఉన్న దివ్యసౌధం పూర్తి అయి గృహప్రవేశం కావాలని అతని యెడతెగని కోరిక. తనభార్య 'మణి' తనకు 'మమ్‌తాజ్' గాను, ఆ సౌధం 'తాజ్‌మహల్' గాను అతను ఎంచుకుంటాడు. ఆ మమ్‌తాజ్ వలెకాక మణి జీవించే ఉన్నది; కాని ఆతని దృష్టి వేరు. 'నాకిపుడెలా గనిపిస్తుంది తెలుసునా, నాకు కూడా ఆ షాజహాన్ మోస్తరే అయింది. అని. జీవనం

క్షీణించే దిక్కునన్నే నున్నాను. అభివృద్ధిపొందే దిక్కున అతనున్నాడు—మా ఇద్దరికీ ఎంతోదూరం—అతని ఐశ్వర్యం మరి ఇంతా అంతా కాదు కదా. గాని చక్రవర్తికీ ముమ్‌తాజ్ ఉన్నది. నాకూ ఉన్నది నా ముమ్‌తాజ్. ఆమెకే నివేదన చేశాను—నా ఇల్లు నా తాజ్‌మహల్. అందులోనే ఇప్పుడు ఉంది ఆమె, శాశ్వతకాలమూ ఉంటుంది. ఇదేకాదు మా ఇద్దరికీ ఉండే సామ్యం—నాకూ కనబడదు—నా ముమ్‌తాజ్—' ఇదీ అతను చూసిన పోలిక. ఏమంటే, ఇంట్లోనే ఉన్నప్పటికీ, ఆమెకు రోగము, రోగి, ఔషధాలు, మరణము — వీటిపేరు చెపితే బెదురు. ఆమె జోతీన్ పిన్నితో అంటుంది 'ఈ ఇంటికివచ్చి మొదటి చావు చూశాను (తన మామ గారిది); నాకెలాగుందిగదా — ఎలాగైనా వదలించుకొని పారిపోదామని! ఈ తైలాల వాసనచూస్తే ఆసుపత్రి భూతం ఏదో వచ్చి గాలికి పట్టిందా అనిపిస్తూ ఉంది' అని. '...మీ తోటలో మాలీపని ఇవ్వండి నాకు—అది ఎంత చక్కగా చేస్తానో చూదురుగాని' అనిన్ని. దరికి వెళ్లి ఆమె భర్తకు సపర్యలుచేయ లేదు. ఆమెకు ఎంతసేపూ పూలమొక్కలు, కుక్క, పిల్లి, కోతి, చిలక మొదలైన వాటి సంరక్షణం, జంతుప్రదర్శనాలు చూస్తూ ఉండడం—ఇటువంటివి ఇష్టం. ఆమె స్వేచ్ఛగా ఉండడం జోతీన్ ఇష్టం. అపూర్వసౌందర్యం, ప్రశాంతప్రకృతి, సమగ్ర మన స్తేజం—ఆమెకు గలవి దివ్యలక్షణాలు. అట్టి ఆమెమీది ప్రేమతో గొప్పసౌధం నిర్మిస్తున్నాడు జోతీన్. దానికి ఆమెపేర 'మణిసౌధం' అని పేరు పెట్ట దలచుకొంటాడు. అందులో ఆమె గృహప్రవేశం చెయ్యాలి—అది అతని జీవితాశయం. గృహప్రవేశానికి మంచిరోజు వచ్చిందని అతని అంతరాత్మ అతనికి చెపుతూ ఉంటుంది. ఎప్పుడూ మణీ, మణిసౌధం, మణిగృహప్రవేశం—ఇదే అతని ధోరణి. రోగి కావడంచేత, అసత్యములైనా మంచి, సాంత్వనమిచ్చే మాటలు వింటూ ఉంటాడు అతడు పిన్నివలనా, పిన్నిబోధనచేత చెల్లెలు హిమివలనాను. సౌధం మూడవ అంతస్తు ఇటకల పేర్పు అయిందనీ, సింగారాలతో మణి అందులో కూర్చోబెట్టబడిందనీ—తానడిగినవన్నీ నెఱవేతినట్టే వింటాడు. తన మణి అక్కడ ఉండగా తాను చూడాలని వాంఛించినా, అస్వస్థుడాయె వీలుపడదు.—కేవలం కల్పితసౌఖ్యమే అనుభవిస్తూ ఉంటాడు—తన ప్రేమాశయ పరిపూర్తి విషయమై అతను. పిన్ని ఆ ప్రేమసౌధానికి అసత్యపరిపోషణం ఇస్తూ ఉంటుంది, అతని కల్పనాప్రపంచంలో. 'చావు నెత్తి దగ్గిరికి వచ్చి కూర్చుని ఉంటే ఇల్లు తయారైతేనేమి, కాకపోతేనేమి?—ఇందులో వచ్చే దేమిటి, పోయే దేమిటి?—అందుచేతనే నేను అలాగు చెప్తున్నాను—"నువ్వు మనస్ఫూర్తిగా సంకల్పం చేసుకున్న ఇల్లు పూర్తి అయింది" అని. నిజం అంటే మరేమిటి హిమీ, అదే' అంటుంది పిన్ని: ఇది ఆమె ఆశయం.

అన్ని పక్కలా ఆఘాతాలు తగులుతూ ఉంటాయి. అతనికి తెలియకుండానే పిన్ని తొలగింప ప్రయత్నిస్తూ ఉంటుంది. నారవర్తకంలో అంతా నష్టమే వస్తుంది. కావలసినవాడు 'అఖిల్' అనే వకీలు తన సొమ్ము ఎవరిదో అని అప్పిచ్చి, హుళక్కిపార్టీలనుపెట్టి తానే ఈతని ఆస్తి కబళింపచూస్తాడు మణి తనపుట్టింటికి చిన్న చెల్లెలి అన్నప్రాశనకని పట్టుపట్టి వెళ్లిపోతుంది—పిన్ని ఎంత చెప్పినా వినదు. పిన్ని ఏదీ జోతీన్‌కి తెలియనీదు. ఆమె మణి ఆయా సందర్భాలలో ఏ విధమైన ప్రవర్తన అవలంబింపబోతుందో యెఱిగి, జోతీన్‌కి ఇష్టమైన పద్ధతికి ఆమె మనస్సును తిప్పడానికి తాను చేసిన ప్రయత్నం వ్యర్థమైపోతే, జోతీన్‌కి మణి యిష్టం యథార్థంగా తెల్పక, ఆమెకు ఇష్టమైన ఆచరణానికి అనుకూలంగా జోతీన్‌చేత పలికిస్తుంది, అలని యిష్టంగాను —చక్కని చాతుర్యంతోటి. అతనికేదీ అసంతుష్టికలగ గూడదు—అదీ ఆమెకు కావలసినది. మణి ఆ ఔషధాలలోనూ, అశాంతిలోనూ ఉండడంకంటె పుట్టింటికి వెళ్లడం బాగుంటుందని అతను అంటాడు. అయితే ఆమె అక్కడ ఉండడమే అతనికి లోలోపల ఎక్కువ ఇష్టంగా ఉంటుందని కనిపెట్టి పిన్ని వెళ్లమంటే మణి వెళ్లనని యేడిచిందని చెపుతుంది. అతను 'మణి మనస్సు వికసించడం ఆరంభించింది' అనుకుంటాడు ఆ మాటవల్ల. నిజానికి మణి వెళ్లిపోయింది.. ఈవిధంగా జోతీన్ కట్టుతూ ఉన్న సౌధం, ప్రేమ సౌధం కూడా అతను అనుకొంటూ

ఉన్నపాటి పూర్ణతను సత్యంగా పొందలేదు. తగిన సామగ్రి అనుకూలపడలేదు.

'మణి గదిలోకి రావాలనుకుంటూ ఉన్నట్టూ, తలుపు కొంచెం తెరిచి ఉన్నట్టూ, ఊరికే తోస్తూఉంటే తలుపు మరి అంతకంటె విడనట్టూ'జోతీన్ కలగంటాడు. నౌకరువల్ల మణి సీతారాంపూర్ వెళ్లినట్టు తెలిసిన పైని ఆకలప్రభావం మరీ ఎక్కువవుతుంది. 'ఏవిధంగానైనా లోపలికి రాలేకపోయింది. ఎంతో పిల్చాను, గాని ఆమెకు మరి గృహప్రవేశం కాలేదు—కాలేదు—పిన్నీ, కాలేదు. (పిన్ని జబాబులేదు.) తెలిసింది పిన్నీ తెలిసింది. నేను దివాలా, పూర్తిగా దివాలా. అన్ని విధాలా దివాలా. ఇల్లుకూడా—పోయింది. అమ్మకం అయిపోయింది. నా మనస్సుప్తు మాత్రం మాయలో పెట్టుతున్నారు' అంటాడు. ఇల్లు పోలేదని తెలిసి, 'ఎప్పుడో ఆరోజు వచ్చినప్పుడు గృహప్రవేశం చేయించు చెల్లమ్మా. ఏలోకంలో ఉన్నా నాకు తెలుస్తుంది ఆ రోజు' అని ఒప్పజెపుతాడు. పిన్ని అతనికి దుఃఖం కలుగకుండా చేతామని యెంత ప్రయత్నించీ నెగ్గలేకపోయినందుకు చింతిల్లుతుంది. అప్పుడు జోతీన్ అంటాడు:—

'పిన్నీ, ఒక్కమాట మట్టుకు అతిగర్వంతో చెప్పగలను. నాకు దొరకని దానిని దేనినీ బలవంతాన్న సంపాదించుదామని ప్రయత్నం చెయ్యలేదు. యావజ్జీవం చేతులు జోడించుకొని కనిపెట్టుకొని ఉన్నాను. మిథ్య అక్కరలేదు. గనుకనే ఇన్నాళ్లు ఓర్చి ఉన్నాను. ఇక బహుశాసత్యానికి నామీద దయవస్తుంది' అని. పిన్ని త్యాగవాత్సల్యాలసాయంతో ఇదే వస్తువును పరిణతం చేసింది.

చివరికి—

జోతీన్—నిద్రపో అనకు పిన్నీ, మేలుకొని చెయ్యవలసినది కొంచెం ఉంది—......ఇంటితలుపు విడుతుంది ఇక. ............

పిన్ని—బాబూ జోతీన్, ఒక్కమారు కళ్లు విప్పిచూడు. అదుగో వచ్చింది.

జోతీన్—ఏమిటి? కలా?

పిన్ని—కలకాదు నాయనా, మణి! .........

జోతీన్—తలుపు పూర్తిగా విడిపోయిందీ—అంతా?

పిన్ని—అంతా విడిపోయింది.

జోతీన్—పిన్నీ, పాదాలమీద శాలువ తీసేయి ఆశాలువ తీసేయి, అకుంట పెట్టేయి—దూరంగా తోసేయి.

పిన్ని—శాలువకాదమ్మా జోతీన్: మణి నీ పాదాలమీద పడ్డది. తలమీద చెయ్యివేసి ఒక్కమారు ఆశీర్వాదం చెయ్యమ్మా.

ఇది గృహప్రవేశం ముగింపు. కల్కా,శాలునకప్పూ తొలగిపోయి మణి లభించింది; గృహప్రవేశం అయిపోయింది—అని జోతిన్ నమ్మకం కలిగింది.

ఈ నాటకం కవిత్వసంపదతోనిండి ఉంది. సాధారణంగా అన్ని పాత్రలూ కవితాధోరణిని మాటాడడం, సామాన్యవ్యవహారమే కవితాఫక్కిలో నడపడం కనబడుతుంది. పెక్కుపాత్రలు ఒక్కొక్కటీ ఠాకూరుగారిలో అంతర్భాగంగా కనిపిస్తాయి. ఒక్కొక్కచోట నాటకోచితమైన పాత్రల వ్యక్తిత్వపు విశ్లేషణరేఖ కవితాస్వరంలో మాసిపోతూ ఉన్నట్టు కనబడుతుంది. సూచనాపరత్వం కొంత మిక్కుటమై తాత్త్వికస్వరం మీటుతూ ఉంటుంది. సాధారణంగా నాటకసౌందర్యం అంతా చదువరికి సునాయాసంగా గోచరంకాదు. ఈ అస్పష్టతను తరిచిచూస్తే వెలువడే మాధుర్యం మాత్రం అనల్పం.

పాత్రచిత్రణం ప్రశంసనీయం. జోతీన్ నిమకలుష ప్రేమ, మణి అలౌకిక మనోవిన్యాసం, మాతృధారకమైన పిన్ని త్యాగవాత్సల్యాలూ, హిమి సౌభ్రాత్రసారళ్యాలూ కళాభూయిష్ఠంగా నెలకొన్నాయి. పాత్రలలో కోమలమైన విపర్యయ సమావేశం, సమృద్ధం కాకపోయినా, ఇంపుగా ఉంది.

భాషాంతరీకరణంలో ఒక్కొకచోట వాడుక నుడికారానికి భిన్నమైన రచన ఉంది. భాషాంతరీకరణ మని తోపనీయక, స్వతంత్ర రచనలాగున వ్రాయుపలెనంటే అనువాదకు లింకా నాటకాన్ని అడుగడుగుకీ పరికీలిం

చాలి. మొత్తముమీద ఇది సజీవమైన అనువాదం. ఇట్టి గ్రంథాలు తెలుగుభాషలో ఉండవలసినవి. ఈ అనువాదకులీవిధమైన భాషాసేవచేయడానికి అర్హులే. కొం. జ.

## శ్రీ పమిడిపాటి మహాలక్ష్మీశతకము

ఇది శ్రీ సచ్చిదానంద గ్రంథమాలనుండి వెలువడిన తొమ్మిదవ యనుబంధ గ్రంథము. రచయితలు శతావధానులు రామకృష్ణ సీతారామ సోదరకవులు. వెల రు 0-2-0. వలయువారు "శతావధాని గౌరావఝల రామకృష్ణశాస్త్రిగారు, గజ్జెలకొండ పోష్టు, కర్నూల్ జిల్లా" అని వ్రాసిన బడయుగలరు.

## ఆంధ్రనవీన వాచకములు

(సంపు. ౬, సంచిక ౮, పు. ౫౭౫ చూమనది)

ఈవాచకము లాఱు. వీనిని రచియించిన వారైదుగురు. మొదటియిద్దరు డిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ ఆఫీసరులు. మూడవవారు డిప్టిఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు. చివరయిరువురు పాఠశాలలలో పండితపదము నధిష్ఠించియున్నవారు. ఇందఱు చేరి ఈపుస్తకములను వ్రాయుట 'కొండనుత్రవ్వి ఎలుకను పట్టుట'వలె నున్నది. గ్రంథములను వ్రాయుట పండితులపని. వీరిలో మొదటిమువ్వురును పండితులుకూడ కావచ్చును కాని, వారిపాండిత్యముకంటె వారియధికారమే వారిగ్రంథముల చెల్లుబడికి ప్రధానకారణమగును. మఱియు నధికారబలము గుణదోషవివేచన కవకాశము నొసగదు. కావున, పాఠ్యగ్రంథనిర్ణయసంఘమువారిట్టిగ్రంథములను పాఠ్యగ్రంథములుగ నంగీకరింపజనదు. అట్లు చేయకున్న అధికారప్రాబల్యముచే తదితరకర్తృకములగు మంచిపుస్తకములకు తావులేక పాఠశాలలలో నివియే నిండిపోయి విద్యాభివృద్ధిని కుంచించుట కుపకరించును. విద్యాశాఖ యందలి యుద్యోగులు వ్రాసిన వాచకములు మొదలయిన గ్రంథములు ఇప్పటికే చాలా బయలుదేరియున్నవి.

ఈవిషయమును విద్యాశాఖాధికారులు గుర్తించి తచ్ఛాఖోద్యోగులు పాఠశాలల కుపయోగించు గ్రంథములను వ్రాయకుండ నిరోధించుట శ్రేయము.

ఇక ఈవాచకములలో మొదటిదానిని గూర్చి:

ఇది వర్ణసమామ్నాయముతో ప్రారంభమయి కొన్ని కథలతో ముగియుచున్నది. 'చదువురానియల్లుడు','ముగ్గురుచెవిటివాండ్రు','ఆకుపోక','సూర్యుడు', 'శ్రీకృష్ణుడు', 'యేసుక్రీస్తుజననము'అను కథలును,వారములు, నెలలు, నక్షత్రములును కలవు. పెద్దఅక్షరములతో సచిత్రముగ ముద్రితమయి అందముగ నున్నది పుస్తకము. గ్రంథకర్తల యభిప్రాయమునుబట్టి బాలురకు దీనితోడనే విద్యాప్రారంభము కావింపవలసియున్నది. ఇందు అక్షరములను నేర్చుకొనిన తరువాత పదములను చదువనేర్చుకొనుటకుగల అభ్యాసములు రెండుమూడు మాత్రమే కలవు. అట్టివి ఎక్కువ ఉండుటావశ్యకము. గ్రంథకర్తలు కథలనైన మాని వీనిని ఎక్కువ చేర్చియుండిన బాగుండెడిది. ఇక నిందు సంధులు, అర్ధానుస్వారములు (సిద్ధ, సాధ్యములు) ఒకచో పాటించియు, ఒకచో పాటింపకయు బాలురకు శబ్దస్వరూపము విషయమునసే సందేహముకలుగునట్లు చేసియున్నారు. పసిబాలురకు పండితులనే పట్టిచూచు నీశాస్త్రవిషయకములయిన బాధలేలనో! అదియును నోనమాలతోడనే! ఇందు తమలపాకు, పెడుతుంది, చెముడు, బ్రతిమిలాడు, అశ్వని, ఆరుద్ర, ఫాల్గుణము, మున్నగు శబ్దములు కాన్పించుచున్నవి. ఈశబ్దములుసాధువులా? 'దేవతాగణములో దేవుడే గొప్ప.' ఈవాక్యమునకు అర్థమేమి! 'సూర్యుడు' పాఠమున 'సూర్య' మంత్రపునశ్చరణము కావింప బాలురను గోరినారు గ్రంథకర్తలు. ఎందుకో!

ఆంధ్రదేశమునందలి బాలురకు 'శ్రీయేసుక్రీస్తుజననము' అను పాఠమెందుకు? బెథలేహేము మొదలయినపదములను ఇంకను క్షీరకంఠులుగనున్న బాలురుచ్చరింపజాలుదురా! ఇంక నేకథయు కాన్పింపకపోయెనా వ్రాయుటకు? లేక, పెరిగి పెద్దయినతర్వాత కష్టపడుదురని ఇప్పుడే క్రైస్తవమతబీజములను నాటుచున్నారు కాబోలు! దీనికి మారు శ్రీరాముని కథను చెప్పగూడదా!

ఈవాచకమున విషయగ్రహణము కుట్టివాండ్రకుత్సాహము నంతగా గలిగించునది కాదు. శైలియు

పాండిత్యప్రకర్షను చాటుచున్నది కాని బాలురకు రుచించు పాకమున పడినదికాదు.

ఇక చిన్నయసూరిగారు వ్రాసిన యీ తొలిపుస్తకమున వాక్యమును చూడుడు: "ఆసమయమునందు త్రోవనవెళ్లుచున్న యొకఁడు ఇదియంతయును తెలిసికొని వారి ముప్వురకును దగిన సమాధానముచెప్పిపంపి పుంటె గొఱ్ఱెపిల్లను తొసెత్తుకొనివెళ్లెను" అని. ఈ దీర్ఘవాక్యమును అయిదారేండ్లబాలుడు చదివి మననముచేసికొన జాలునా!

బహుకర్తృకమగుటచే ఈవాచకము రచనమునను భేదము కనిపించుట వింతకాదు. ఇట్టి భిన్నమార్గములనున్న భిన్నరచనములలో ప్రవేశముగను బాలురకు ముందు ముందు నొక సరియైనత్రోవ దొరకకపోవుటయు వింత కాదు. ఈబాధ దీనికి తరువాతి పుస్తకములలో ఎక్కుడుగా గనుపట్టుట కవకాశమున్నది. వానినిగూర్చిన విమర్శ మున్ముందు వెలువడును.

ఇప్పటి క్రొత్తవాచకములకన్న బాలురు చదువుటకు చిరకాలము నుండియున్న 'బాలశిక్ష'యనుపుస్తకము సర్వథా శ్రేష్ఠమయినది. దానిని పూర్తిగ జదువునప్పటికి ఇంతలోకజ్ఞానము సైతము బాలురకు కలుగగలదు.

## సంస్కృత లోకోక్తులు

గ్రంథకర్త: చిలుకూరు నారాయణరావుగారు, యం. ఏ., యల్. టి.

* "సంస్కృతవాఙ్మయమును చదువుతూ ఉన్నప్పుడు తమకంటబడిన లోకోక్తుల నన్నిటిని సంగ్రహించి వాటిని ఇదివరకు సంగృహీతములయిన వాటికి చేర్చి తేటమాటలతో తెనుగున అర్థవివరణమును వ్రాసి" రట గ్రంథకర్తగారు. ఇందు అకారాది క్రమమున ౧౩౯౧ లోకోక్తులున్నవి. సంస్కృతవాఙ్మయ ప్రపంచమున శాస్త్రములకు, సాహిత్యమునకు, లోకవ్యవహారమునకు సంబంధించిన లోకోక్తు లనంతముగ గలవు. ఇది వఱకు వీనిని దెలుపుగ్రంథములు మూడు సంస్కృతమున ప్రకటితము లయినవి.

౧. లౌకికన్యాయాంజలి. భారతీయ సైనికోద్యోగిగ నుండినకర్నలు జి. ఏ. జేకబుగారు సంగ్రహించి మూడుభాగములుగా ప్రకటించినారు. ఇందించుమించుగ నైదువందల లోకోక్తులుగలవు. విపులమైన ఇంగ్లీషువివరణము, శాస్త్రప్రమాణదృష్టాంతములు నిందు చేరియున్నవి. ఇది మూడుగ్రంథములలో నుత్తమమయిన దనవచ్చును.

౨. లౌకిక న్యాయసంగ్రహము కర్త: రఘునాథవర్మ ఉదాసీనగారు. కాశీకళాశాలనుండి వెలువడుచుండిన "ది పండిట్" అను సంస్కృత మాసపత్రికయందు ప్రకటితములయిన గ్రంథములలో ౧౫౫వ గ్రంథముగ పునర్ముద్రణమును గాంచినది. ఇందు లోకోక్తులారువందలకు పైబడికలవు.

౩. భువనేశ లౌకికన్యాయసాహస్రి: సేతుపాల పండిత శ్రీహరదత్తశర్మ విరచితము ఇందు వేయి లోకోక్తు లున్నవని పేరే తెలుపుచున్నది. ఇది యట నట దోషజుష్టమయి యున్నది. చాలవఱకు ముద్రణప్రమాదజనితమే యగును. ఈమూడు గ్రంథములను కలిపి పరిశీలించి చూచినచో చాల లోకోక్తులు చక్కగాబోధపడగలవు.

తెలుగున నీసంస్కృతలోకోక్తులను వివరించుగ్రంథమిదివఱకు కానరాలేదు. అట్టిది పరమావశ్యకము. ఇటులుండ ప్రకృతగ్రంథము చేతికివచ్చినతోడనే పరమానందము కలిగినది. మనగ్రంథకర్త బహుభాషాభిజ్ఞులనియు, మిక్కిలి సంస్కృతవాఙ్మయమున మంచిపరిశ్రమ చేసినవారనియు ప్రతీతి. కావున తోడనే పుస్తకమును దెరచి పుటలను త్రిప్పుచు నటనట చదువునప్పటికి తొలుతటి యానందమంతయు నంతరించినది. గ్రంథకర్త చెప్పకున్నను పై నుడివిన గ్రంథములలో మూడవదగు 'భువనేశలౌకిక న్యాయసాహస్రి' అనుగ్రంథమును అనుసరించి తమగ్రంథమును వ్రాసినారని దానినిచూడగ తెలిసినది. తక్కిన రెండుగ్రంథములను చూచినట్లు లేదు. వీరు మూడువందలు లోకోక్తు

* గ్రంథాదినున్న ప్రకాశకులపీఠిక చూచునది.

లు ఎక్కువగ చేర్చినారు. ఈవిషయము సంస్కృతగ్రంథములను మూలతో దీనిని పోల్చిచూచిన తెలియగలదు. వీరియాగ్రంథము విపరీతార్థ, అపార్థ, అనన్వితార్థ, వ్యర్థ వివరణ, అసందర్భోదాహరణాదులకు తావయి యున్న దనుట ఉద్ధృత గ్రంథభాగముల వలన తెల్లమగును.

లోకోక్తులకు వివరణము వ్రాయువారికి చాలినంత సంస్కృతభాషాప్రవేశ ముండవలెను. తత్రాపి, లోకోక్తులు ఎక్కువగ శాస్త్రములయందు ప్రయుక్తములయి యుండుటచేత న్యాయశాస్త్రముల మర్యాదయు కొంతవరైన తెలిసియుండు టావశ్యకము. సర్వవిధముల సమర్థులయినవారే ఇట్టి గ్రంథముల రచనమునకు బూనవలెను. అనర్హులయినవారు ఊహలతో అర్థకల్పనముచేసి గ్రంథముల రచియించుట అనర్థదాయకము. ఈకాలమున కష్టించి గ్రంథాధ్యయనము కావించి భాషాతత్త్వమును సరిగా గుర్తింప ఓలంపుగలవా రరుదు. 'విస్సన్న చెప్పింది వేదం' అన్నట్లు ఎవరేనిగాని – ఏవేనిగాని ఒప్పులో, తప్పులో చూచినతోడనే సులభముగ తెలియునట్లుగ – రచియించిన గ్రంథముల జనుల జనసామాన్యము కోరును. తత్ఫలితముగ చీమపురుగులవలె లెక్కకుమిక్కిలిగ గ్రంథములుపుట్టి వాఙ్మయలతను తలయెత్తనీయక నోరికి వేయుచున్నవి. ఇక ప్రమాణగ్రంథములుగ నుండవలసిన విసైత మిట్టివయిన నేమిచెప్పవచ్చును!!

మనగ్రంథకర్త మూలగ్రంథమున లేనితప్పులను తమ గ్రంథమునజొనిపియు, తద్గ్రంథకర్త పేరయినను ఎత్తక ప్రకాశకులన్న 'ఇదివరకు సంగృహీతములైన వాటికి' అనుమాటతో తృప్తిచెంది యూరకుండిరి. ఇది ధర్మమా! ఒండె, ఈగ్రంథము తను అపారపరిశ్రమఫలముగా లోకమున ప్రసిద్ధిజెందవలయునని వారు తలచిరి కాబోలు!

'ఆర్యవిజ్ఞానము ఘనీభవించి ఏర్పడిన జ్ఞానలడ్డువాలు' అని ప్రకాశకులు గ్రంథము అట్టపైన ప్రకటించినారు. పాపము! 'జ్ఞానలడ్డువాలు' ఈ అసందర్భ వివరణ పంకమునబడి ఉపభోగానర్హములైనవని వారెరుగరు! ఘటీయు, వారు పీఠికలో 'దీనిని ప్రకటింప సాహసించినాము' అని వ్రాసినారు. వీరియాసాహసము ఇట్టిలోపభూయిష్ఠగ్రంథమును ప్రకటించుటవలన చరితార్థమయినది. గ్రంథమునుండి మచ్చునకు:

౩౭. "అతిస్నేహః పాపాశంకీ=స్నేహమెక్కువ అయితే పాపముకలుగుతుందేమో అని భయము". అని గ్రంథకర్త. ఇది మూలగ్రంథమున లేనిది. శాకుంతల నాటకమునుచదివినవా రిట్లు అర్థము చెప్పరు! చూడుడు. శకుంతల దుష్యంతునొద్దకు పోవునపుడు అనసూయా ప్రియంవదలకు శకుంతలకు, జరిగిన సంభాషణము:—

"అన: ప్రియం.—సఖి, యది నామ సరాజర్షిః ప్రత్యభిజ్ఞానమంథరో భవేత్తదా స్మై ఇదం స్వనామధేయాంకితమంగులీయకం దర్శయ.

శకుంతలా—సఖ్యౌ, అనేన, సందేహన వా మా కంపితాస్మి.

అన. ప్రియం.—మాభైషీః, అతిస్నేహః పాపశంకీ."

ఇక్కడ పాపమునకు కీడని అర్థము. అనసూయా ప్రియంవదలకు శకుంతలయెడ మిగుల స్నేహము. కావున వా రామె కెప్పు డేమి కీడుమూడునో యని శంకించుచుండురు.

౬౩. "అనధీతే మహాభాష్యే వ్యర్థా స్యాత్పదమంజరీ;అధీతే ఽపిమహాభాష్యే వ్యర్థా స్యాత్పదమంజరీ.=వ్యాకరణమహాభాష్యము చదువుకోకపోతే శబ్దమంజరి వల్ల ప్రయోజనములేదు. మహాభాష్యము చదువుకొంటే శబ్దమంజరివల్ల ప్రయోజనములేదు" అని గ్రంథకర్త. 'పదమంజరి' అన, 'శబ్దమంజరి', అనియట. ఎంతపొరపాటు! పదమంజరి=హరదత్తమిశ్రకృతమగు కాశికావృత్తివ్యాఖ్య. 'మహాభాష్యము చదువక పదమంజరిని చదివిన ప్రయోజనములేదు. మహాభాష్యము చదివినచో పదమంజరిని చదువుట వ్యర్థము' అని అర్థము. ఈ న్యాయమునూలమున నున్నది. కాని వీరువ్రాసినయర్థము లేదు.

౬౪. "అన్నస్య క్షుధితం పాత్రం=అన్నమునకు ఆకలేకొంచము" అని గ్రంథకర్త. ఈన్యాయము మూలములో లేదు. 'ఆకలిగొన్నవానికి అన్నముపెట్టవలెను'

అనినగదా సరిపోవును! మన గ్రంథకర్త కాయర్థ మెట్లు వచ్చినదో!

౮౩. "అన్యద్భుక్త మన్యద్వాంతం=ఒకడుతింటే మరి ఒకడు వాంతిచేసికొన్నాడట" అని గ్రంథకర్త. ఇది మూలమునగలదు. 'తిన్నదొకటి, కక్కినదొక్కటి' అని కదా యుండవలెను.

౧౩౫. "అశక్తాస్తత్పదంగంతుం తతో నిందాం ప్రకుర్వతే=కొంచెముదూరమే పోలేనివారు, అంతకంటే దూరముగా ఉన్నస్థలమును నిందించుతారు." అని గ్రంథకర్త; ఈన్యాయము "Grapes are sour" అను ఇంగ్లీషుసామెతకు సరిపోవునది. దీనికి గ్రంథకర్త వ్రాసిన యర్థమెట్లుసరిపోవునో. దీనికి మూలమున "స్పష్టః" అని మాత్రమే కలదు.

౨౨౩. "ఊర్ధ్వం ప్రాణావ్యుత్క్రామంతియూనః స్థవిరఆయతి; ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యతే.= ప్రాణములు మీదికి ఎగిరిపోతవి. యౌవనుడు ముసలివాడవుతాడు. పెద్దలను మన్నించి నమస్కరించడముచేత ప్రాణములున్ను యౌవనమున్నువస్తవి." అని గ్రంథకర్త. ఈన్యాయము మూలమున నున్నది. అందుదీనికి వివరణమిట్లు కలదు: "అయం న్యాయో ఽర్థవాదరూపః ప్రత్యుత్థాన ప్రశంసాపరః ———" ఈశ్లోకము మనుస్మృతిలోనిది. 'వ్యుత్క్రామన్తి' అనుదానిని 'హ్యుత్క్రామన్తి' అనియు, 'ఆయతి' అనుదానిని 'ఆగతే' అనియు, దిద్దుకొనవలెను. దీని కర్థము. 'వృద్ధాగమనమున యువకుని ప్రాణములు (సంభ్రమమున) మీదికి పోవును; (అతనిని) ఎదుర్కొనుటచేతను, వందనము చేయుటచేతను మీదికి పోయిన ప్రాణములు మరల కుదుటబడును.' అనిన సరిపోవును.

౨౧౬. "కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పంతదపి దుర్లభమ్=తిందామంటే, కాకిమాంసమయినాదొరకలేదు. కుక్క రుచిచూచిన ఆహారమయినా దొరకలేదట. 'కాని కూడుతిన్న కడుపునిండలేదు' అని తెనుగు సామెత." అని గ్రంథకర్త. ఇది మూలమునగలదు. వివరణమిది: 'అత్యంత నికృష్ట స్యాతితుచ్ఛస్యాపి దుర్లభత్వేఽయం న్యాయః ప్రవర్తత ఇతి". ఇట గ్రంథకర్త అన్వయవైఖరి వింతనుగొలుపుచున్నది. కాకిమాంసము; (అసలు కాకికి మాంసము తక్కున) అందును కుక్కతినగా మిలిగినది; చాల తక్కువ కూడ; అదియును దుర్లభముగ నున్నది." అని కదా అర్థము చెప్పుకొనవలెను.

౩౬౨. "గడ్డరికాప్రవాహః=గ్రుడ్డివాని వెనుక పోయినట్లు. గ్రుడ్డివారివలె ఒకరుపోయిన మార్గముననే, ఇతరులుకూడా పోవడము." ఇది మూలమున ఈవిధము నన్నది: "గడ్డలికా ప్రవాహన్యాయః=యథాగడ్డలికానా మవీనాంగణా దేకాచేత్కూపే పతితా తథా వార్యమాణా అపి సర్వాస్తత్ర పతన్తీతి తథాప్రకృతేపి" అని. మన గ్రంథకర్త వ్రాత కర్థమేమి?

౮౬౩. "జ్వలితంనహిరణ్యరేతసం చయమాస్కందతి భస్మనాంజనః = బంగారుపొడి మండుతూ ఉన్నదని దానినెవ్వడూ విడిచిపెట్టడు." అని గ్రంథకర్త. ఏమి అర్థము?

ఇది 'భారవి' రెండవసర్గలోని శ్లోకభాగము. ఆశ్లోక మిది:

"జ్వలితం నహిరణ్యరేతసం చయ మాస్కందతి భస్మనాం జనః; అభిభూతిభయా దసూనత స్సుఖ ముజ్ఝంతి నధామ మానినః."

వ్యాఖ్యానము: "న స్వల్పస్య మానస్య హేతోః కథం ప్రాణత్యాగ శ్శక్యతే కర్తుం. యతో 'శీఘ్రభద్రాణిపశ్యతీ' త్యాశంక్యాహ—జ్వలితమితి—జనో భస్మనాం చయ మాస్కందతి పాదాదినా ఆక్రమతి. అదాహకత్వాదితిభావః. జ్వలితం జ్వలంతం 'కర్తరి క్తః' మతిబుద్ధీత్యాదినా సూత్రే చకారా ద్వర్తమానార్థత్వం. హిరణ్యం రేతో యస్యతం హిరణ్యరేతసం అగ్నిం నాస్కందతి దాహకత్వా దితిభావః. అతో హేతోర్మానినః అభిభూతిభయా త్పారిభవ లోభేన తేజస్త్యాగే పరిభవో భవిష్యతీతి భయాత్ అసూనేవ సుఖ మక్లిష్ట ముజ్ఝంతి త్యజంతి. ధామ తేజస్తు నోజ్ఝంతి. మానహానికరా జ్జీవనా త్స్వతేజసా మరణమేవ వర మిత్యర్థః పూర్వోత్తరశ్లోకవ దర్థాంతరన్యాసాలంకారః."

ఈలోకోక్తి మూలమునన్నది. అట దీనికి వివరణమేమియు లేదు. 'హిరణ్యరేతసం' అనగా అగ్నిహోత్రుని అని కదా అర్థము!

౪౮౨. "తమోదీపన్యాయము = చీకటి దీపమూ వలె. దీపము చీకటిని పోగొట్టుతుంది. అట్లే జ్ఞానము అజ్ఞానమును పోగొట్టుతుంది." అని గ్రంథకర్త. ఇది మూలమున నున్నది. అందు ఇట్లు వివరింపబడి యున్నది.

"తథాహి – "అజ్ఞానం జ్ఞాతు మిచ్ఛేద్యో మానేనాత్యంతమూఢధీః; సతు నూనం తమః పశ్యే ద్దీపే నోత్తమతేజసా". ఇతి వేదాంతసిద్ధాంతముక్తావళీ" అని. దీపముతో చీకటిని చూడగోరుట అని అర్థము వచ్చును. మన గ్రంథకర్తకు పై అర్థ మెట్లుకుదిరినదో!

౪౯౯. "తుషఖండన న్యాయము" మూలమున "తుషకండన" అనియున్నది.

ఇందులో 'కండన' అనుట తప్పనితలచి కాబోలు మనగ్రంథకర్త 'ఖండన' అని దిద్దినారు. 'కండన' మనగా 'దంచుట' అని అర్థము.

౬౦౦. "నహి మోహయతి ప్రాజ్ఞం లక్ష్మీర్మరుమరీచికా = ఎండమావివంటి లక్ష్మి ప్రాజ్ఞుని మోహింపదు" అని గ్రంథకర్త. 'మోహయతి' అనగా 'మోహింపజేయదు' అనికదా అర్థము.

౬౧౪. "నహీశ్వరవ్యాహృతయః కదాచిత్ పుష్ణంతిలోకే విపరీతమర్థమ్, = ఈశ్వరునికి చేసిన పూజలెప్పుడున్ను అనర్థదాయకములు గావు." అని గ్రంథకర్త. ఇది కుమారసంభవము నందలి శ్లోకభాగము. ఆశ్లోకమిది. "అనన్యభాజం పతి మాప్నుహీతి సా తథ్యమేవాభిహితా భవేన, నహీశ్వరవ్యాహృతయః కదాచిత్ పుష్ణంతిలోకే విపరీతమర్థమ్." దీనికి మల్లినాథుల వ్యాఖ్యానమున "నహీ—మర్థమ్ = తథాహి, ఈశ్వరవ్యాహృతయో మహాపురుషోక్తయః, కదాచిదపి లోకే, భువనే ని, 'లోకస్తు. భువనేజనే' ఇత్యమరః విపరీతం విసంవాదిన మర్థ మభిధేయం నపుష్ణన్తి నబోధయ న్తీత్యర్థః."

ఈశ్లోకమునకు కళాప్రపూర్ణ వేంకటరాయశాస్త్రిలుగారు వ్రాసిన తాత్పర్య మిది:

"(అట్లు ప్రణమిల్లిన పార్వతికి) పరమేశ్వరుఁడు వేఱొకతెను పొందని మగనిం బడయుదువుగాక! అని దీవనయొసంగెను. అదియు పిమ్మట నట్లే నెరవేరెను. మహాపురుషులవాక్కులు ఎప్పుడును పొల్లుపోవుగదా:" ఇటగ్రంథకర్త వ్రాసినఅర్థమేమి! నిరంకుశార్థానుశాసకత్వమా!

౬౬౫. "పటాటోపో భయంకరః = బట్టలడాబుచూస్తే భయకరముగా ఉన్నది." అని గ్రంథకర్త. "విషం భవతు వా మావా స్ఫటాటోపో భయంకరః" అని పెద్దలందరు 'స్ఫటా'కాని 'పటా'కాదు. విషమున్నను లేకున్నను పడగయొక్క ఆటోపము భయంకర ముగనున్నదని అర్థము. ఇది మూలములో లేదు.

౬౭౪. "పథః శుచే ర్దర్శయితార ఈశ్వరాః మలీమసా మాదదతే న పద్ధతిమ్= ఒకరికి శుచిఅయిన మార్గము చూపించేవారు తాము మలినమార్గమునే అవలంబిస్తారు" అని గ్రంథకర్త!- ఏమి అర్థము! 'అవలంబించరు' అని కదాఉండవలెను.

౮౦౩. "పిణ్యాకయాచనార్థంగతస్య ఖారికాతైలదాతృత్వాభ్యుపగమః = తెలికపిండి యాచించడమనకు పోయినవానికి పుట్టెడు నూనె ఇచ్చేవాడు దొరకినట్లు" అని గ్రంథకర్త. ఇది మూలములోనున్నది. కాని, వివరణమున లేదు. 'ఖారికాతైలదాతృత్వాభ్యుపగమః' అనగా పుట్టెడునూనె ఇవ్వవలసివచ్చుట"అని అర్థము కాని "పుట్టెడునూనె ఇచ్చేవాడు దొరకుట" అని కాదు.

౮౩౧. "ప్రణమంత్యనపాయముత్థితం ప్రతిపచ్చంద్రమివప్రజా నృపమ్=తమకు అపాయము కలిగించకుండా అభివృద్ధిపొందే రాజును జూచి పున్నమచంద్రునిచూచినట్లు సంతోషించి నమస్కరిస్తారు" అని గ్రంథకర్త. ఇది భారవి రెండవ సర్గములోని శ్లోకముయొక్క భాగము. ఆశ్లోకమిది:

"క్షయయుక్తమపి స్వభావజం దధతం ధామ శివం సమృద్ధయే; ప్రణమం త్యనపాయ ముత్థితం ప్రతిపచ్చంద్రమివ ప్రజా నృపమ్. వ్యాఖ్యానము:—నను సంక్షీణః

కథం ప్రబలే నాభియుంజీ తేత్యత్రాహ:—క్షు మేతి - క్షయయు క్తమపి తథా క్షీణమపి సంతం, స్వభావజం సహజం శివం సర్వలోకాహ్లాదకం ధామ షాత్త్రిం తేజః ప్రకాశించ దనతం బిభ్రతం సమృద్ధయే అభివృద్ధ్యర్థం ఉత్థితముద్యు క్తం—ఉత్సాహమానమితియావత్ -అన్యత్ర ఉత్థిత ముదితం అతఏవ అనపాయ మవినాశినం వర్ధిష్ణ్వాంత మిత్యర్థః-నృపం ప్రజాః ప్రతిపచ్చంద్రం ద్వితీయాచంద్రమి వేత్యర్థః-ప్రతిపచ్ఛ బ్దేన ద్వితీయా గృహ్యతే:—ప్రతిపది తస్యాదృశ్యత్వాదితి—ప్రణమంతి, ప్రహ్వీభా వేనవ ర్తంత ఇత్యర్థః చంద్రపక్షే తు నమస్కుర్వంతి క్షీణ స్యాప్యు త్సాహః కార్యసిద్ధేర్నిదానత్వ మిత్యర్థః "శ్రియంహి సత తోత్సాహీ దుర్బలోపిసమశ్నుత" ఇతి కామందకః దీనికి గ్రంథక ర్త వ్రాతికీషు ఏమి సంబంధ మున్నదో చూడ దగును.

౪౬౧. "బక బంధనన్యాయము=కొంగను పంజ రములో ఉంచుతే (చిలుకవలెమాట్లాడదు.)" అని గ్రంథ క ర్త. ఇదిమూలమున లేదు.

'పంచపాదికా వివరణ' వ్యాఖ్యానమున నిట్లు గలదు. (లౌకిక న్యాయాంజలి రెండః భాగము చూచునది.)

"నను స్వర్గకామినో యాగక ర్తవ్యతా స్వర్గసాధ నమంతరే ణానుపపన్నా. తచ్చ సాధనత్వం క్షణభంగినః కర్మణోమధ్యవ ర్తి కార్యమంతరే ణానుప పన్నమితి శ్రుతార్థాపత్త్యా అపూర్వం గమ్యతే తత్ర శబ్దస్య సామ ర్థ్యం గృహ్యతఇతి. సోఽయం బకబంధః. ఈవివరణము నకు వ్యాఖ్యానమయిన 'త త్త్వదీపమున' " బకబంధఇతి. బకబంధసమాన న్యాయ ఇత్యర్థః బకగ్రహణే క ఉపా యఇతి కేనచి త్పృష్టే ఖరతరదినకర సంపర్కా త్తన్మ స్తకనిహిత నవనీతబిందుభి ర్నయనయోః పూర్ణతాయాం తద్గ్రహణం సుకరమితి కశ్చిత్తుచ్ఛమతిః ప్రతివ క్తి. నచత దుపపద్యతే. బకగ్రహణ మంతరేణ తన్మ స్తకే నవనీతప్ర క్షేపానుపప త్తేః. తస్మింశ్చ పరిగృహీఽతే తత్ప్రక్షేపోపి ముధా !" అని. మనగ్రంథక ర్త '౧౦౪౮-వృక బంధన న్యాయ'వివరణమున ఈకథను అసందర్భముగా వ్రాసి నారు. ఇది అట్లే వీరిమూలగ్రంథమునను గలదు.

౪౮౪. "బుభుక్షితం (?) నప్రతిభాతి కించిత్= వేసినట్లే లేదు" అని గ్రంథక ర్త.

మూలమున దీనివివరణము "ఉ క్తంచ. జాగర్తు లోకో జ్వలతు ప్రదీపః సఖీజనః పశ్యతు కౌతుకం తే; క్షణైకమాత్రం నకరోమి ధైర్యం బుభుక్షితం నప్రతిభాతి కించిత్. ఇతి పూర్వన్యాయస్య ప్రతివాక్య మిదమితి. ఇమావ్వా న్యాయౌ ప్రశ్నో త్తరరూపౌ జ్ఞేయావితి." పూర్వన్యాయమిది:

"బుభుక్షితః కింద్వికరేణ భుం క్తే. ఇతి న్యాయః. అయం లాలసాతిశయే వ ర్తతే. యథా:—జాగ ర్తి లోకో జ్వలతి ప్రదీపః సఖీజనః పశ్యతి కౌతుకం మే; క్షణైక మాత్రం కురు కాంతి, ధైర్యం బుభుక్షితః కిం ద్వికరేణ భుం క్తే." ఇతి. గ్రంథక ర్త వ్రాసిన ఆకలివేసినట్లే లేదు అను అర్థమెట్లో చూడదగును.

౯౩౪. యన్నివృ త్తి మద్వస్తు తదుత్ప త్తిమదపి= చచ్చిపోయేవస్తువు మరి ఒకవస్తువును పుట్టిస్తూఉంటుంది. అట్లే చచ్చినవానికి పునర్జన్మముకూడా ఉంటుంది. ఆకూ అలమూ, చచ్చి మళ్లి, ఎరువయి మరికొన్ని మొ క్కలు మరింతబలముగా పుట్టడమునకు హేతువులవుతవి." అని గ్రంథక ర్త. ఏమి అకాండతాండవము! ఇది మూలము న నున్నది. దీనివివరణము "ధ్రువంజన్మ మృతస్య చ" ఇతి భగవద్వాక్య మస్మిన్ న్యాయే బీజమ్" అని కలదు. 'ఉత్ప త్తిమత్' అనగామరి ఒకవస్తువును పుట్టిస్తూఉండు నదట. 'పుట్టుకగలది' అనికదా అర్థము.

౯౪౨. యోజనప్రాయాయాం కావేర్యాం మల్ల బంధన న్యాయః=కావేరీనది జ్ఞాపకమునకు రాగానే, చేపలవానిని, (కిడునదిపేవానిని) పట్టి బంధించినట్లు. కావేరిని దాటడమునకు దొరుకుతాడో దొరకడో అని అట్టివాడు కనబడగానే వానిని నిర్బంధించి పట్టుకోవడం ఆచారము; కావేరినది దగ్గర లేకపోయినా ఆనది జ్ఞాపక మునకురాగానే ఒకనిని బంధించడము అధికారదౌర్జన్య మును తెలియజేస్తుంది." అని గ్రంథక ర్త. ఈన్యాయము మూలమునగలదు. ఇదితప్పు. 'ప్రాయాయాం' అనునది 'ప్రాప్యాయాం'అనియుండవలెను. 'మల్ల 'అనునది'కైవర్త'

అనియు, పాఠాంతరముగా గలదు. యోజనేన "యోజన చలనేన ప్రాప్యాయాం' అని మూలమునందలి వివరణమున నుండగా 'యోజన' అనుదానికి 'జ్ఞాపకమునకు రాగానే' అని అర్థమును వ్రాసినారు. యోజన శబ్దము సంస్కృతము. యోజనప్రాప్యాయాం'అనుదానికి యోజనము మేర పోయి పొందదగినది అని అర్థము.

౧౧౦౭. "శతం విహాయ భోక్తవ్యమ్=నూరుపనిని నుండి తప్పించి తానుభోజనము చేయవలెను" అని గ్రంథకర్త. దీనికి అర్థము నూరుపనులైనా మానుకొని భోజనముచేయవలె' నని. ఇట్లు పెద్దలు చెప్పుదురు.

౧౧౧౭. "శవోద్వర్తన న్యాయము = శవమును మేల్కొనజేయ ప్రయత్నించినట్లు" అని గ్రంథకర్త. ఇది మిగుల ప్రచారమున నుండు న్యాయము. ఉద్వర్తనమనగా, 'మేలుకొనజేయుట' అట. ఉద్వర్తనము' అనగా 'నలుగుపెట్టుట' కదా!

౧౧౭౩ "సత్సంగజాని నిధనాన్యపితారయన్తి= సజ్జనసహవాసముచేత చావునుకూడా దాటవచ్చును" అని గ్రంథకర్త. ఇది ఉత్తరరామచరిత్రనాటకము రెండవఅంకములోని శ్లోకభాగము. ఆశ్లోకమిది. "దత్తాభయే త్వయి యమాదపి దండధారే సంజీవితః శిశురయం మమచేయమృద్ధిః; శంబూక ఏష శిరసా చరణౌ నత స్తే సత్సంగజాని నిధనాన్యపి తారయంతి."

శ్రీకళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రులు గారి అనువాదము:

"ఉ. నీవు కృతాంతు నుండియును నిర్భయమిచ్చి ధరింప దండమున్, జీవనమొందె నీశిశువు; చెందితి నిట్టిశుభంబు నేనునున్, దేవర, శంబుకుండను ద్వదీయపదంబుల మ్రోలఁ జేర్చెదన్, జావులుగూడ సాధుజనసంగభవంబులు తారకంబులౌ" అని. పెద్దలగ్రంథముల చూడరాదా! తెలియకున్న పండితులనడిగి తెలుసుకొనరాదా! 'తారయంతి' అనగా తరింపచేయునవి అనికదా అర్థము:

ఇంకను ఎన్నియైన వ్రాయవచ్చును. కాని ఇచట తావులేమిచే తక్కిన వానిలో కొన్నిటికి సంఖ్యలుమాత్రము నీక్రింద సూచితములైనవి. ఈసంఖ్యలు గలవానిని పాఠకులు పరిశీలింప ప్రార్థితులు.

౧౪, ౧౭, ౨౦, ౪౯, ౭౩, ౭౫, ౭౬, ౮౦, ౯౩, ౯౮, ౧౦౧, ౧౧౭, ౧౧౨, ౧౨౫, ౧౫౩, ౧౬౧, ౧౬౯, ౧౭౩, ౧౭౬, ౧౮౨, ౨౧౦, ౨౨౦, ౨౩౬, ౨౫౫, ౨౬౧, ౨౭౮, ౨౮౬, ౨౯౭, ౩౩౧, ౩౪౪, ౩౭౧, ౩౮౮, ౩౮౯, ౪౦౩, ౪౧౧, ౪౧౪, ౪౩౩, ౪౩౭, ౪౪౦, ౪౪౪, ౪౭౦, ౪౭౭, ౪౮౭, ౫౧౭, ౫౧౨, ౫౧౪, ౫౧౭, ౫౭౦, ౫౮౦, ౫౮౮, ౫౯౧, ౫౯౨, ౫౯౫, ౫౯౭, ౬౦౪, ౬౧౯, ౬౧౦, ౬౨౧, ౬౪౫, ౬౮౩, ౬౯౫, ౬౯౯, ౭౦౧, ౭౧౩, ౭౧౫, ౭౨౦, ౭౫౩, ౭౫౯, ౭౭౪, ("ఈ న్యాయము మూలములోను బహూనామను సరణం న్యాయ్యమ్" అని యున్నది. వీరు 'సరణం' అను పదమును "మరణం" అని తప్పుచదివి, ఆ తప్పునకు తగిన అర్థమును వ్రాసినారు.) ౮౩౨, ౮౩౮, ౮౪౬, ౮౫౫, ౮౬౬, ౮౭౩, ౮౭౪, ౯౩౨, ౯౫౨, ౯౬౫, ౯౮౨, ౯౮౭, ౯౯౨, ౯౯౩, ౧౦౦౪, ౧౦౮౦, ౧౧౦౬, ౧౧౨౦, ౧౧౨౩, ౧౧౨౫, ౧౧౩౯, ౧౧౫౫, ౧౧౬౪, ౧౧౭౦, ౧౧౭౯, ౧౨౧౭, ౧౨౩౯, ౧౨౫౦, ౧౨౬౩, ౧౨౭౨; ౧౨౯౬, ౧౩౦౦, ౧౩౦౩. ఇట్లెన్నియైన చూపవచ్చును. విసుగుచేత నింతటితో నాపవలసివచ్చినది. —భారతి.

# పత్రికలు

## ఆనందభారతి

డెమ్మి 1/8 సైజున 40పుటలు గలది. ఇది యస్.జి. ఆచార్యగారి సంపాదకత్వమున చెన్నపురి చాకలిపేటలోని చంద్రికాప్రెస్‌నందు ముద్రింపబడి యన్. వి. గోపాల మొదలియారుచే 37 తిరుప్పళ్లివీథినుండి ప్రచురింపబడుచున్నది. క్రొత్త మాసపత్రిక. సం. ౧౯౨౯ ఏప్రిల్‌లో వెలువడినది. కథలనే ప్రచురించుటకు ప్రత్యేకముగ నేర్పడిన యీ పత్రికయందు నవకవుల పద్యములు,

గ్రంథకర్తల చరిత్రము, రాజకీయనాయకుల నుద్దేశించిన హేళనలు, ప్రజోపయోగసంస్థలకు సంబంధించిన ప్రయత్నములపై వెక్కిరింతలు, అరవనటులగూర్చిన విమర్శ, గ్రాంథికభాషావాదము చేయువారిని ఊరకొనుమనుటలు కూడ నున్నవి.

కథలెక్కువ రాకపోవుటచే కాబోలు మొట్టమొదటిదగు నీసంచికయందు 'కథలకొలిక' అన్న ఉద్దేశ్యము నెరవేఱక పోయినది.

ఈ పత్రిక మున్ముందు నిజాశయములను నెరవేర్చుకొనుచు చిరకాలము వర్ధిల్లుగాక!

## సమదర్శిని, శుక్ల సంవత్సరాది సంచిక

వెల. చందాదారులకు రు ౧: ఇతరులకు రు ౧-౪. పోస్టు ఖర్చులు ౫ అ.

సమదర్శిని రెండవ ఉగాది సంచిక వెలువడినది. ఇది 'కీ. శే. శ్రీరాజా పానుగంటి రామారాయణంగారి దివ్యస్మరణార్థము ప్రచురముచేయబడినది' శ్రీరాజావారి దివ్యమగు త్రివర్ణప్రతిమ సంచికఅట్టపై కడు ఆకర్షకముగ చిత్రితమై యున్నది. రాయలు క్వార్టొసైజున దళసరి కాగితములపై ఇంపైన అచ్చుతో సంచిక ముచ్చటగ నున్నది. పుటలకు అంకెలు లేకపోవుటమాత్ర మసౌకర్యముగనున్నది. ఇందు ఆఱుచక్కని త్రివర్ణచిత్రములుగలవు. ఆంధ్రచిత్రకారుల చిత్ర మొక్కటియు నీసంచికయందు కాన్పింపకుండుట కొంతలోటు. ఛాయాచిత్రములును పెక్కులుగలవు. ప్రముఖులువ్రాసిన గద్యపద్యవ్యాసములు వివిధవిషయముల చర్చించుచు, కళాసౌందర్యముతో నొప్పుచున్నవి.

శ్రీసోమశేఖరశర్మగారి 'అనాదృత వాఙ్మయము' వెంకటాచలముగారి 'రెడ్డిరంగమ్మ' మున్నగు ముఖ్యములగు వ్యాసములు కొన్ని విషయసూచికయందు పేర్కొనబడలేదు. శ్రీకృష్ణదేవరాయల తనయయగు 'మోహనాంగి' వ్రాసినదని 'మారీచీపరిణయ' మను కావ్యమున కొంతభాగము శ్రీ సెట్టి లక్ష్మీనరసింహముగారు స్వసంపాదకత్వమున నిందు ప్రకటించిరి. ఇందలి పీఠికయందలి చారిత్రిక వైషమ్యములు ఇది యధునాతనకవికృతమను నను మానమును బలపఱుచుచున్నవి. ఈకావ్యమునుగూర్చి సంపాదకులేమియు ముచ్చటించరైరి. కృష్ణరాయల తనయ రచించినదని చెప్పుటకు తగినయాధారములు ప్రకటించుట సంపాదకుల కర్తవ్యము. ఇదికాక, ఈసంపాదకుల కవితతో పరిచయముగలవారు ఈ నూత్నకావ్యమును జిలకించునో ఇది సంపాదకులు స్వయముగ వ్రాసినది కాదుగదా యని కొంతయనుమానము గలుగవచ్చును. కావ్యముమాత్రము సరసశైలి నున్నది శ్రీ లింగం వీరభద్రయ్యచౌదరిగారువ్రాసిన'పాశ్చాత్యస్త్రీలు' అను గద్యవ్యాసము ఆశాభంగము గూర్చుచున్నది. పాశ్చాత్యస్త్రీల నెంతయైనపొగడవచ్చును; వారినుండి సద్గుణములు మనదేశపుస్త్రీ లలవరించుకొన ప్రోత్సహింపవచ్చును: కాని మనదేశమున లేనికళంకముల నాపాదించి మనజాతిని, సంఘమును, దేశమును గర్హించుట వ్యాసకర్త జాతీయాభిమానశూన్యతను, పాశ్చాత్యవ్యామోహమును, వివక్షణాలాఘవమును చాటుచున్నది. ఇట్టి వారు మనదేశముననుండి, విదేశముల మిస్ మేయోలు వింత గూర్ప రనిపించును. ఇట్టివిషయములపై వ్రాయవగినదే కాని యిట్లువ్రాయుట తగదు.

ఇందు వ్యభిచారమును గూర్చిన వీరియుపన్యాసము బాగుగలేదు. పది పండ్రెండేండ్ల పిల్లవాడొకడు తల్లి పాలు త్రాగినట్లు తమకెవరో చెప్పిరట. దానిపై వ్యాసకర్తగారు ఇట్టి అనాచారములు, అసహ్యములు పాశ్చాత్యదేశములలో జరుగవనిరి. తాము ఎవరివలననో విన్న ఒక కథ మనదేశమున ఆచారమనుకొనుట యెట్లు? అట్టిది పాశ్చాత్యదేశములలో ఏమూలను జరుగనట్లు కొలది సంవత్సరము లటనివసించివచ్చిన చౌదరిగా రెట్లు చెప్పగలరో! 'ఐశ్వర్యవంతులు, కళాభిజ్ఞులు, రసగ్రహణపారీణులు, నూత్నవస్తురచనాదక్షులునైన పశ్చిమ దేశీయులు తమ దేహసౌష్ఠవమునకు బాటుపడుట, శృంగారించుకొనుట తప్పదు. చక్కనిదైనవస్తు వేకాలమునను సంతోషము నిచ్చును. స్త్రీని నగలతో నలంకరించి చక్కనియాట వస్తువును జేసి యాటలాడుకొను మనము అలంకారప్రియులని, భోగపరాయణు లని ధావళ్యాంతుల మూరు టవి వేకము'అని వారువ్రాసినారు. పాశ్చాత్యస్త్రీ లలంకరించు

కొనుట తప్పుకాదని నుడివినవారికి మనస్త్రీయలంకరణము నిరసన కేల పాత్రముగావలెనో! 'ఆబలాడుకొనుమనము'—ఎంత అరుచికరపదములు! ఈ వాక్యములందు రచయిత మనోవిన్యాసము, తేలికయాలోచనము గోచరించును.

పాశ్చాత్యసంసర్గమువలన స్వదేశమునకు మేలు చేకూర్చుటకు ఇదికాదు సరసపద్ధతి. ఇంతకు అభిమానముకావలెను. బ్ర శ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిలుగారి 'శ్రీసుకుడు'అను వ్యాసము మంచి పరిశోధనమునకు ఫలితము. ఈవ్యాసమున శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారి వ్యక్తిగత విశేషముల విమర్శించుట అసంగతముగ గన్పట్టును. బ్ర. శ్రీ, ఆదినారాయణ శాస్త్రిగారి 'గౌరీగర్వభంగము', శ్రీసోమశేఖరశర్మగారి 'అనాదృతవాఙ్మయము' అనాదృతవాఙ్మయ మాధుర్యమును జనావళికి పొలుపుగ చవిచూపుచు, అట్టి వాఙ్మయముద్ధృతము కావలసిన యావశ్యకతను మనసులకు నాటజేయుచున్నవి. శ్రీ తాపీ ధర్మారావుగారి 'తప్తాశ్రుకణము' ('అభాగ్యకోదండము' అను నాటకమందలి యొకరంగము) కడుహృద్యముగ నున్నది. శారదానికేతన బాలికల నిమిత్తమై వ్రాసిన శ్రీ గురునాథశర్మగారి 'అర్గళరాణి'యు (నాటిక) ముచ్చటగ నున్నది. శ్రీ కవికొండల వేంకటరావుగారి "సుకారిపిల్ల", శ్రీ కృష్ణశాస్త్రిగారి "'కార్తికినుండి' కొన్నిపాటలు", శ్రీబాపిరాజుగారి "పిలుపు" మున్నగు గేయములు హృద్యమగు కవితాకళతో నొప్పుచున్నవి. ఇంకను బ్ర. శ్రీ వద్దాది సుబ్బారాయకవిగారు, దువ్వూరి రామిరెడ్డిగారు, మంగిపూడి వేంకటశర్మగారు మున్నగు కవివతంసులు వ్రాసిన పద్యరత్నము లొప్పుగ నున్నవి. శ్రీవెంకటాచలము గారి 'రెడ్డిరంగమ్మ' యనుకథ గ్రామజీవులు పట్టణాన్యామోహావాగురల దగుల్కొను నొకవిధమును సమర్థముగ చిత్రించుచు రచనానైపుణితో నొప్పుచున్నది.

గా. రామదాసుపంతులుగారి 'గ్రామపరిశ్రమల కల్పనము', డా. భో. పట్టాభిసీతారామయ్య పంతులు గారి 'భీమాకంపెనీలు', డా. బుఱ్ఱా శేషగిరిరావుపంతులు గారి'కళాప్రోత్సాహము', శ్రీ పల్లా శేషగిరిరావుపంతులు గారు రచించిన 'మరణానంతరము' మున్నగు వ్యాసములు సంచికకువిలువ గూర్చుచున్నవి. ప్రస్తుతము, దేశమున విరివిగ నుద్యమమందున్న నాట్యకళాది వివిధవిషయముల పైని, ఇందు తగినవ్యాసములు ప్రకటింపవలసియుండెను. మొత్తముమీద సంచిక చాల బాగుగ నున్నది. ముందుముందింకను నుత్కృష్టవాఙ్మయముతో, మంచి ప్రస్తావనలతో ఈ 'సమదర్శిని' తన వార్షిక సంచికల ప్రకటించి లోకమునకు చూపదగిన ఆధునికాంధ్ర సంపదలలో వానిని నిలుపగలుగుగాత!

---

## మా వ్యాసకర్తలకు

వ్యాసములు చిన్నసైజుకాగితములపై ఒకవైపున మాత్రమే విడిఅక్షరములతో బంతులు దూరదూరముగా, దిద్దుబాట్లు లేకుండ, తిన్నగా వ్రాసి పంప వేడికోలు. లేకున్న ముద్రణకార్యములయందు మిగుల కష్టము కలుగుటయే కాక తప్పులుకూడ నిలిచి పోవునని మనవి. సంపాదకుడు, భారతి.




ఒకొక్కప్పుడు పాపఫలం వెంటనే కనబడుతుంది.




## కన్యామహావిద్యాలయము

పంజాబులో జలంధర్ నగరమున నీవిద్యాలయము ౧౮౯౧ సం. డిసంబరు ౧౪ వ తేదినాడు నెలకొన్నది. జాతీయములు, యోగ్యములు నగు విధానములతో స్త్రీలకు విద్యను గరపుటకీ విద్యాలయ మేర్పడినది. ఎనమండుగురు బాలికలతో నారంభమయిన యీ విద్యాలయమిపుడు ౫౦౦ విద్యార్థినులతో నిండియున్నది. వారిలో రమారమి రెండు వందల విద్యార్థినులకు భోజనాది సౌకర్యములను విద్యాలయమే సమకూర్చుచున్నది. ఈ విద్యాలయము నాలుగులక్షలరూప్యములను వెచ్చించికట్టిన దివ్యభవనమున నున్నది. భవనమును చుట్టుకొని ౩౫ ఎకరముల విస్తీర్ణముగలిగి వివిధతరుల తాకుంజరంజతమైన యుద్యానవనముగలదు. విద్యార్థినులు వేసవికాలమున ఆతోటయందలి చెట్లనీడను, శీతకాలమున నీరెండను గూర్చుండి పాఠముల జదువుదురు. విద్యార్థినులు చదువుకొనుటకు, భుజించుటకు, పరుండుటకు నుపయోగించు భవనములు విశాలములుగను, సకల సౌకర్యసంపన్నములుగను నున్నవి. స్త్రీలు, సుగృహిణులు, అన్వర్థమాతృశబ్దవాచ్యులు, ఉత్తమపౌరులు నగునట్లు చేయుటయే యీ విద్యాలయముయొక్క పరమలక్ష్యము. ఇచ్చట హిందీ భాషతో విద్య నేర్పబడుచున్నది. గృహనిర్వహణము, ప్రపంచజ్ఞానము, దేశసేవ, ప్రజాసేవ, ఆత్మానందము మొదలయిన వానికొఱకుపయోగించు నెల్లవిద్యలు బాలికల ఇచ్ఛానుసారము నేర్పబడును. లౌకికవిద్యలే కాక మతసైతిక ఆధ్యాత్మిక విద్యలును నెల్లరకు విధిగా నేర్పబడును. నేర్పబడు ఎల్లవిద్యలును ప్రయోగపూర్వకముగ మనసున కెక్కునట్లు బోధింపబడును. మఱియు నిచట శరీరవ్యాయామము విధిగ నున్నది.

ఈ విద్యాలయముననే పట్టము గొన్న యొక సమర్థురాలగు యువతీమణి విద్యార్థినులకు భోజనాది సౌకర్యములు చక్కగా సమకూరునట్లు చూచుచుండును.

ఈ విద్యాలయముతో చేరి యొక వితంతుశరణాలయ మున్నది దీనిని కీ. శే. శ్రీమతి పండిత సావిత్రిదేవి ఏబదివేలు రూపాయలు వెచ్చించి కట్టించినది. వితంతువులగు స్త్రీలకు పవిత్రమార్గమున విద్యలను నేర్పి వారుపాధ్యాయలు, మతప్రవక్తలు నయి ప్రజాసేవ చేయుచు స్వతంత్రముగ తమ జీవితమునుగడుపుకొనునట్లు చేయుటయే యీ శరణాలయముయొక్క లక్ష్యము. ఇప్పటికి దాదాపు నూటయేబండ్రు యువతీమణులు దేశమున వివిధప్రదేశములయందు ప్రజాసేవచేయుచున్నారు.

మఱియు నీవిద్యాలయమున కనుబద్ధమయి యొక యనాథశరణాలయ మున్నది. ధనాభావముచే దీనివలని ప్రయోజనము చాలినంత గలుగకున్నను, ఇట పోషణము గన్న పిల్లలు తాము పొందిన సౌఖ్యముల నెన్నటికిని మరువజాలరు. వీరిలో వివాహితలయిన స్త్రీలందఱు సుఖముగ జీవితమును గడుపుచున్నారు. ఏ సంస్థయొక్క ప్రయోజనమునుగాని దానివలన గలుగు ఫలమును పురస్కరించుకొని కదా నిశ్చయింపవలెను. ఈసంచికయందు విద్యాలయమునకు సంబంధించిన చిత్రములు నాలుగు కలవు.

అన్ని మూలల నుండి 'స్త్రీల సర్వతోముఖాభివృద్ధి ఆవశ్యకము' అనుమాట మారు

ప్రమోగి పోవుచున్న యీ కాలమున మన తెలుగు దేశమున స్త్రీల అభివృద్ధి కొఱకు సాగు చున్న ప్రయత్నములు ఇంత మైన కాన్పింప కుండుట యెంతయు విచారకరముగ నున్నది. తుదకు విద్యమైన స్త్రీలకు లభించునట్లు చేసినయెడల పదపడి వారు తమయభివృద్ధికి వలసినత్రోవలను తామే వెదకుకొందురు. కాని అట్లు విద్యనొసగు విద్యాలయములు సైతము మృగ్యములు. అత్తిపూతివలె గుంటూరులో శారదానికేతన మొకటి మొలకెత్తి స్త్రీవిద్యాభి వృద్ధికయి యథోచితముగ పాటుపడుచుండ దానిని వేరూడదీయుటకో యనునట్టు లిటీవల కొన్ని విపరీతప్రవాదములు బయలుదేరినవి. దేశక్షేమమునకు, సంఘాభివృద్ధికి నిట్టి విపరీత వివాదములు మూలచ్ఛేదకములని తెలిసికొన జాలకపోవుట పొరపాటు. అన్ని జాతులవారును, అన్ని మతముల వారును స్త్రీలయభ్యుదయము నాశించు చున్నామని ఘోషించు చున్నారు. కాని తమ ఆశఫలవంతమగుటకు దగిన ప్రయత్నములను మాత్రము చేయక యూర కున్నారు. ఇక వారి ఘోషయంతయు వట్టి బూటకమేయగునని సాహసము కాజాలదు.

వ్రాతలతో మాటలతో స్త్రీలయభివృద్ధియెడ సానుభూతిని చూపుచున్న ఆంధ్రులందరును జాతిమత భేదములను దూరముగనుంచి తెలుగు దేశమునందంతటను చాలినన్ని స్త్రీవిద్యాలయములను నెలకొలుపుటకై నిరంతరము కృషి చేయవలెను. వీరి కృషికి జమీందారులు, ఇతర సంపన్నులు స్వార్థములు, తుచ్ఛములునగు నైహికసుఖములను సమకూర్చుకొనుటకయి వినియోగించు తమయమూల్య సంపదయందు కొంతయేని తోడుచేసి ఆవిద్యాలయములు స్థిర ప్రతిష్ఠము లగునట్లు చూడవలెను. ఇట్లు నెల కొన్న విద్యాలయములయందు స్త్రీజాతి సర్వతోముఖాభ్యుదయపరంపరకు వలసిన యెల్ల విద్యలను జాతీయవిధానముల ననుసరించి బాలికలకు నేర్పవలెను. ఇంతయు పొసగినచో మనసోదరీమణులకు మేలుగలుగ గలదు.



ఇ. మధురం కన్యగారు

యల్. ఆర్. సి. పి., యమ్. ఆర్. సి. యస్., యఫ్. ఆర్. సి. యస్., యమ్. బి. యమ్. యస్.

ఈమె మదరాసు ఘోషా ఆసుపత్రికి సూపరింటెండెంటుగను, లేడీ విల్లింగ్డన్ వైద్యవిద్యాలయమునకు సూపరింటెండెంటుగను నియమింపబడెను.



పి. పారిజాతం కన్యగారు

ఈమె పి. పార్థసారథినాయుడుగారి తనయ. ఈ సంవత్సర మీమె మదరాసు విశ్వవిద్యాలయమునుండి యమ్. ఏ. పరీక్షయం దుత్తీర్ణయయ్యెను.



కమలాదేవి ఛటోపాధ్యాయగారు, బి. ఏ.

ఈమె భారతమహిళామండలి తరఫున ప్రతినిధిగ జినీవాలో జరుగనున్న విద్యాసంస్థల మహాసభకును, డెన్మార్కులో జరుగనున్న ఆధునికవిద్యాప్రపంచమహాసభకును పోవుటకు మేనెలలో 'వైస్రాయి ఆఫ్ ఇండియా' నావపై బొంబాయినుండి బయలుదేరెను. ఈమె సరోజినీదేవిగారి తమ్ముడు కవిఅయిన హరీంద్రనాథుని భార్య.



డాక్టరు మార్తా శేషమ్మగారు

ఈమెది నెల్లూరుజిల్లా. ఈమె రెడ్డి కులమునకు చెందినది. రెడ్డిజనసంఘమువారి ఉపకారవేతన సహాయమున మదరాసులోని వితంతుశరణాలయమునం దుండి యల్. యమ్. పి. వైద్యపరీక్షయం దుత్తీర్ణురాలై నెల్లూరు జిల్లాబోర్డు ఆసుపత్రియందు కొంతకాలము పనిచేసి యిప్పుడు చెన్నపురి రాయపురము ప్రభుత్వవైద్యశాలయందు సబ్ అసిస్టెంట్ సర్జనుగ నియమింపబడినది.



**సి. యన్. నల్లముత్తుఅమ్మాళ్ కన్యగారు**
**యమ్.ఏ.యల్.టి.,బి యస్‌సి.(లండన్) టి.డి (కేంబ్రిడ్జి)**

ఈమె యిపుడు రాజమహేంద్రవర పురపాలక సంఘసభ్యురాలుగ నియమింపబడెను. అవటి స్త్రీసమాజమునకును సోషల్ యూత్ లీగునకు సధ్యక్షురాలుగా నున్నారు. స్త్రీల బోధనాభ్యసనపాఠశాలకు సూపరింటెండెంటుగ నున్నారు. ఇదివరకు జినీవాయందలి జాతిసమితి కార్యాలయమందు కొంతకాలము పనిచేసి యుండిరి. ఈమె డా. ముత్తులక్ష్మిగారి చెల్లెలు.



బాలసుబ్రహ్మణ్యచెట్టిగారి సతీమణి

కోయంబత్తూరునం దీ నెల ప్రారంభమున జరిగిన దేవాంగమహిళాసభాహ్వానసంఘాగ్యక్షురాలయిన ఈమె ఆజిల్లా విద్యాసంఘ సభ్యురాలు, గౌరవమేజస్ట్రేటును.



**ఆషా సేన్ కన్యగారు**

ఈమె ఢిల్లీ విశ్వవిద్యాలయ రిజిస్ట్రారగు యన్. క. సేన్‌గారి కుమారిత. ఈసంవత్సర మీమె ఢిల్లీనుండి అత్యధిక ఘనతతో పట్టభద్రయైనది. ఈమెయే అక్కడి మొదటి గ్రాడ్యుయేట్ అట.



తంబుచెట్టిగారి కుమార్తె
మైసూరుమహారాజావారి హుజూరు కార్యదర్శియగు తంబుచెట్టిగారి తనయ. ఈమె ఫిడేలువాద్యమునందు ఎక్కువ కృషిచేయుటకు ప్యారిస్ నగరమున కేగెను. ఈమె లండన్‌లోనున్న — గానకళాబోధక—ట్రినిటీ కాలేజియందు ఫెల్లోషిప్ బడసినది.

# సాభిప్రాయ విశేషములు

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే.

గతమాస మాంధ్రదేశ జీవయాత్రయందు దశాకాలముగ వెలయుచున్నది. దేశమంతయును ప్రసన్నహృదయముతో తాండవమాడినది. ప్రజలు ధర్మారాధనము జేయుట కప్రయత్నముగ బూనుకొనిరి. సంకుచితములైన భేదావరణముల నతిక్రమించిరి. విశాలమైన పరమేశ్వరావరణమును జేరుటకు భక్తిశ్రద్ధలతో బాటుపడిరి. స్త్రీలు పురుషులు, బాలురు వృద్ధులు, బ్రాహ్మణులు పంచములు, పండితులు పామరులు, సంపన్నులు దరిద్రులు పరమోత్సాహముతో దేవతార్చనను జేయుటకు సమకట్టిరి. ఆర్తులు, జిజ్ఞాసులు, అర్థార్థులు, జ్ఞానులు కామితార్థములను బడయుటకు పూజాద్రవ్యములను సమకూర్చిరి. వేలకొలది ప్రజలు ధర్మసందర్శనమును జేయుటకు మండువేసవియందు రాత్రులందు దుర్గమమార్గములందు దూరప్రయాణములను జేసిరి; నగల నిచ్చిరి; బట్టలను గట్టిపెట్టిరి; సువర్ణదక్షిణలను సమర్పించిరి; పూలహారముల సమకూర్చిరి; దివ్యగుణ సంకీర్తనమును జేయుచు సుస్వాగతము నొసంగిరి. నిద్రావస్థయందున్న ప్రజాహృదయమునందు ప్రబోధకాంతు లుదయించినవి. స్వరాజ్యారాధకులకు స్వరాజ్యదేవత సాక్షాత్కరించినది. సంఘసంస్కర్తలకు సంఘధర్మస్వరూపము గోచరంబైనది. అర్థకాములకు సంపత్ స్వరూపము సువ్యక్తమైనది. దేశారాధకులకు సేవావిధానము గోచరంబైనది. మానవజీవనమునం దిట్టి మహద్దశాకాలములు సంప్రాప్తమగుట బహుదుర్లభము. సంప్రాప్తమైన మహద్దశాకాలమును సద్వినియోగము చేయుట ప్రజలకును నాయకులకును పరమధర్మమై యున్నది. పూర్వకాలమునందు బుద్ధభగవానుని, శ్రీకృష్ణపరమాత్ముని, శ్రీశంకర రామానుజాచార్యాదులను సందర్శించిన విధమున మహాత్ముని సందర్శించుటకు ప్రజలు పరమోత్సాహమును జూపిరి.

గాంధీమహాత్ముడు గతమాసమునందు చేసిన సంచారక్రమ మాంధ్రదేశమునకు సంప్రాప్తమైన మహద్దశాకాల ప్రభావమును విశదము చేయుచున్నది. ప్రజలు గాంధీమహాత్మునకు దేవునకువలె పూజాది సత్కారములను చేయుటకు పూనుకొనిరి. గ్రామములు, పట్టణములు, మహాత్మునకు అపూర్వమైన స్వాగత సన్మానములను సమర్పించినవి. ప్రజలు జాతిభేదములను, కులభేదములను, మతభేదములను విసర్జించి గాంధీమహాత్ముని సత్కరించిరి. ప్రజలు చూపిన నిగ్రహము శాంతస్వభావము

ఆంధ్రప్రజాహృదయమునకు సహజమైన భక్తి స్వభావమును విశదము చేసినవి. వేలకొలది ప్రజలు మహాత్ముని దర్శించుటకై చిరకాలము వేచియుండిరి. మహాత్మునకు కానుకలను సమర్పించి కృతార్థులగుచుండిరి. మహాత్ముని ధర్మోపదేశములనువిని యానందపరవశులగుచుండిరి. గాంధీమహాత్ముని నిరాడంబర జీవనము, ధర్మనిరతి, జ్ఞానసంపత్తి నిగ్రహము ప్రజాహృదయమునందు భక్తివిశ్వాసములను గలుగజేసినవి. లోకమునందు చెప్పెడి గురువులవలె చేసెడి గురువులు గనుపడుట దుర్లభము. శిష్యుల విత్తాపహారులు ప్రత్యక్షమైనటులు శిష్యుల చిత్తాపహారులు ప్రత్యక్షము గాకున్నారు. గురువులు వైరాగ్యత్యాగములను బోధించుటయును, భాగ్యభోగముల ననుభవించుటయును సామాన్య విషయములుగ నున్నవి. త్యాగమూర్తియైన గాంధీమహాత్ముని సరళజీవనము, నిగ్రహము, నియతకర్మానుష్ఠానము, సత్యప్రియత్వము ప్రజాహృదయమునందు మహాప్రబోధమును గలుగజేసినవి. గాంధీమహాత్మునకు 45 దినములలో 4,000 మైళ్లు సంచారము చేసెను. ఖద్దరునిధికి 2,62,000 రూప్యములను ప్రజలుసమర్పించిరి. మహాత్ముడుఅస్పృశ్యతానివారణము, మద్యపాననిషేధము, జాతీయవిద్య,స్వరాజ్యము, ధర్మస్వభావము, దేశారాధనవిధానముమున్నగువిషయములను గురించి ధర్మోపదేశములను జేసి ప్రజాహృదయమునందు భక్తివిశ్వాసములను గలుగ జేసెను. గాంధీమహాత్ముని సంచారవిధానము వారి కార్యదీక్షను, సంకల్పసామర్థ్యమును విశదము చేసినది. చిత్తశుద్ధిలేని కార్యవిధానము సంకల్పసిద్ధికి నిరుపయోగమని గ్రాహ్యమైనది. ఆత్మోపలబ్ధికిని, స్వరాజ్యసిద్ధికిని, ప్రజాసంయోగమునకును, ఖద్దరు యోగము సాధనముగాగల విధమును మహాత్ముని యుపదేశములు విస్పష్టముజేసినవి.

* * * *

ఖద్దరు - స్వరాజ్యసాధనము

ఖద్దరుయోగము ప్రజల యోగక్షేమములకును, స్వరాజ్యసిద్ధికిని భరతఖండమునకు సహజమైన సాధనముగ నున్నది. మూడువంతులు ప్రజలు గ్రామసీమలందు నివసించుచు ఆఱునెలలు పనిపాటులులేక కాలయాపనము చేయుచున్నారు. ప్రజలకు వ్యవసాయవృత్తియే ప్రధానమైన వృత్తిగ నున్నది. దేశమునందు మూడవవంతు ప్రజలు కడుపు నిండ కూడు లేక కృశించుచున్నారు. ఖద్దరు పరిశ్రమను వ్యవసాయవృత్తికి ఉపవృత్తిగ జేయుటకు విశేషావకాశములు గలవు. ఇది తొల్లింటి భారతదేశస్థితి. ప్రజలు నేతపరిశ్రమను బాగుగ వికసింపజేసి విదేశములనుండి ధనరాసుల నాకర్షించుచుండిరి. విదేశములందు భరతఖండము బంగారుగనియని ప్రఖ్యాతిని గాంచినది. వర్తమానకాలమునందు భరతఖండమునుండి సకలసంపదలు విదేశములకు సంతతధారగా బోవుచున్నవి. సంపన్నమైన దేశము వర్తమాన కాలమునందు దారిద్ర్యగ్రస్తమై, ప్రజలన్నవస్త్రములు లేక కృశించుచున్నారు.

అన్నవస్త్రములు లేని ప్రజలను పాశ్చాత్య సభ్యత్వము, పరిశ్రమలు నిస్సహాయుల జేసినవి. ఇట్టి విషాదావస్థయందు ప్రజాపోషణము సకలార్థసాధనములకును మూలాధారముగ నున్నది. వ్యవసాయమే జీవనాధారముగ నున్న ప్రజలకు నేతపరిశ్రమయును సహజమైన గృహపరిశ్రమ మైయున్నది. చిరకాల సంవర్ధితమైన దేశక్షేమమునకు మూలమైన నేతపరిశ్రమను బ్రిటీషుప్రభుత్వము నిర్మూలముచేసిన విధము ప్రపంచేతిహాసములందు దారుణకృత్యముగ నున్నది. సకల జనులకును సౌలభ్యమైన ఖద్దరు పరిశ్రమ దరిద్రనారాయణుల కన్నవస్త్రములను సమకూర్చుటకు సకలవిధములను తగియున్నది. పాశ్చాత్యదేశములందు వ్యాపకమును గాంచిన యంత్రపరిశ్రమ వ్యాపనము దారిద్ర్యగ్రస్తమైన భరతవర్షమునందు సుసాధ్యము గాదు. కడుపునిండ తినుట కన్నములేని దేశమునందు యంత్రపరిశ్రమ వ్యాపనమున కర్బుదముల రూప్యములను సమకూర్చుట సుసాధ్యము గాదు. ఒకవేళ సాధ్యమైనను వాంఛనీయము గాదు. గ్రేటుబ్రిటనునందు యంత్రపరిశ్రమ సమకూర్చిన దుర్నయములు, వ్యాధులు, నిరుద్యోగములు, పరాధీనత్వము విచారమునకు గారణంబైనది. భారతీయులు విషాదపూరితమైన స్వదేశ విదేశ పరిస్థితులను గ్రహించి గాంధీమహాత్ముని ఖద్దరుసందేశమును సఫలము చేయుట పరమధర్మముగ నున్నది.

ఖద్దరుసమస్య కేవలము రూపాయలు అణాలు పైసాల సమస్య గాదు. ఖద్దరు సమస్య ప్రాణరక్షణ సమస్య, ఆత్మసంరక్షణ సమస్య. నిర్జీవమైన దేశమునకు రూపాయలు అణాలు ప్రాణరక్షణము చేయజాలవు. సజీవమైన దేశమునకు సంపదలు పోషణమునకై వినియోగపడగలవు. వ్యాధిగ్రస్తమైన దేహమును బాగుజేయుటకు సకలార్థమును వినియోగించుట వివేకము. దేశక్షేమమునకై శ్రీమంతులును నిరుపేదలును ప్రియమైనను ఖద్దరు పరిశ్రమను పోషించుటకై వారి సంపదలు వినియోగించుట పరమధర్మముగ నున్నది. ఖద్దరు వ్యాపనమునందు కొలదియో గొప్పయో గుణముగలదు గాని కొంచెమైనను దోషములేదు. ఖద్దరు ప్రియమైనను దరిద్ర నారాయణులకు పోషణసాధనమై సౌమ్ము దేశమునందు వినియోగపడుచున్నది. ఖద్దరు ప్రజల కాత్మవిశ్వాసమును ఆత్మోపలబ్ధిని గలుగజేయుటకు పరమ సాధనముగ నున్నది. ఖద్దరు రూపమునందు ప్రత్యక్షమగుచున్న స్వాత్మావలంబనము భావమునందును ప్రత్యక్షమై స్థిరమైన ప్రత్యభిజ్ఞానము గలుగుచున్నది. గాంధీమహాత్ముని ఆంధ్ర దేశసంచారము ఖద్దరు మాహాత్మ్యమును మూలమూలలను వ్యాపింపజేసి ప్రజలకు వారి సంకల్పసిద్ధికి నియత కర్మానుష్ఠానావసరమును సువ్యక్తము చేసినది. గాంధీమహాత్ముని ఖద్దరు సందేశమును సార్థకముచేయుటకు సకల విధముల తగియున్న ఆంధ్రదేశము స్వధర్మ నిర్వహణమును జేయుటకు బూనుకొని మహాత్ముని

సంచారము ఘనవంతము జేయుటకు భగవదను
గ్రహము గలుగుగాత!

* * * *

ఖద్దరు: ఆంధ్రదేశము

ఖద్దరు నిర్మాణమున కాంధ్రదేశమునకు గల మంచి యవకాశము లితర రాష్ట్రములకు లేవని గాంధీమహాత్ముడు తెలిపిన విషయమును సార్థకము చేయవలసిన భారము ప్రజానాయకులమీద గలదు. ప్రాణావశిష్టముగ నున్న ఖద్దరు పరిశ్రమను పోషించి పునరుద్ధరించుట పరమధర్మమై యున్నది. ఆంధ్రదేశమునందు ౧౦ మొదలు ౧౦౦ నంబరువరకును నూలు వడుకగలజనులు నేటికిని సజీవులైయున్నారు. భరతఖండమునం దంతటను ఆంధ్రదేశపు ఖద్దరు ప్రఖ్యాతిబడసినది. నేతయందును, మనుగడయందును, సన్నదనమునందును ఆంధ్రదేశపుఖద్దరునకు గల ప్రసిద్ధి ఇతరరాష్ట్రముల ఖద్దరునకు లేదు. తెలుగు దేశమునందలి అన్ని మండలములయందును ఖద్దరుపరిశ్రమ నేటికిని కొనయూపిరితోనైనను నిలిచియున్న విధమును ఖద్దరునిర్మాణము విస్పష్టము చేసియున్నది. అన్నిమండలములయందును కొనయూపిరితో నున్న ఖద్దరుపరిశ్రమను పోషించి రక్షించుట దేశక్షేమపరాయణులకు నియత ధర్మమై యున్నది. పొందూరునందు సన్నబట్టలను తయారుచేయునట్లే పల్నాడునందు కుప్పడము బట్టను తయారుజేయుటయును, తునియందును ఆత్మకూరు నందును, ఇతర ప్రాంతము లందును ఆయా ప్రాంతములకు పరిపాటియైన ఖద్దరునుతయారుజేయుటయును ఖద్దరువ్యాప్తికి సాధనమై యున్నది. సహజావకాశములు గల ప్రదేశములను వికసింపజేయుట ఖద్దరువ్యాప్తికి సాధనముగాని కేంద్రీకరణవిధానము ఖద్దరు వ్యాప్తికి సాధనము కాదు. ఖద్దరు గృహపరిశ్రమగా నుండుట ప్రయోజనముగాని యంత్రాలయ పరిశ్రమగా జేయుట ప్రయోజనకరము గాదు. ఖద్దరుపరిశ్రమను వ్యవసాయపరిశ్రమకుపపరిశ్రమగా జేయుటయే దేశమునందు ప్రజాపోషణమునకు మూలములైన అన్నవస్త్రములను నిరాటంకముగ నుత్పత్తిజేయుటకు సాధనము గాగలదు. ఇట్టి యవకాశములు గ్రామసీమలయందు విశేషముగా గలవు. గ్రామవాసులను పురవాసులనుగా జేయుట వలనగలిగెడి యనర్థపరంపరలను పాశ్చాత్యనగరములును బొంబయి కలకత్తా మద్రాసు మొదలగు నగరములును వేనోళ్ల చాటుచున్నవి. మానవజీవితమునం దారోగ్యము లేని సంపదలు సుఖప్రదములు కాజాలవు. ఆరోగ్యైశ్వర్యములకు సహజమగు సంబంధమును సంరక్షించుటయే యోగక్షేమములకు సాధనమైయున్నది. పారిశ్రామికజీవనమునకు అలవాటుపడిన పాశ్చాత్యులకు చేతిపరిశ్రమలయందు విశ్వాసము గలుగజాలదు. లాంకషైరు నేతపరిశ్రమకు ప్రధానపణ్యస్థానమైన భరతవర్షమునందు ఖద్దరుపరిశ్రమను పోషించుటకు బ్రిటిషుప్రభుత్వ మెన్నటికిని సమ్మతింపదు. 70 కోట్ల రూప్యముల బట్టల విక్రయము పోయినపుడు బ్రిటిషు ప్రజల భాగ్యము

క్షీణించుటయును నిరుద్యోగ సమస్య ప్రబలు టయును సహజము. ఖద్దరు సమస్యకును, విదేశవస్తు బహిష్కరణసమస్యకును మూల బీజము మానవులకు సహజస్వత్వమైన ఆత్మ సంరక్షణముగాని, అసహజమైన ద్వేషము గాదు. మానవులకు సహజస్వత్వమై విశేషావకాశములు గల ఖద్దరువ్యాపనమునకై యథాశక్తిని ఆంధ్ర దేశము పాటుపడి స్వధర్మనిర్వహణమును చేయుటకు భగవదనుగ్రహము కలుగు గాత.

ఖద్దరు నిర్మాణమునందు ప్రధానప్రతిబంధకములు రెండు గలవు. నేతగాండ్ర కల్తీనేత ఖద్దరు వ్యాపనమునకు ప్రతిబంధకముగ నేర్పడినది. ఈ ప్రతిబంధకమును తొలగించుటకు నేతగాండ్రకు తగిన ప్రతిఫలమునిచ్చి వారి నైతికశీలమును వృద్ధి చేయవలయును. ఖద్దరుదీక్షగల పరిశీలకులు జాగ్రత్తగ పరిశీలన జేయవలయును. దేశమునందంతటను విరివిగ నూలు నుత్పత్తి జేయుచుండవలయును. ఈ పరిస్థితులేర్పడినప్పుడు కల్తీఖద్దరు నేయుట కవకాశములు సహజముగా నంతరించును. అన్నివృత్తులయందును దుర్నయము చేసెడువారు సహజముగా నుందురు. దుర్మార్గులకై సన్మార్గులకు ప్రతిబంధకములను గల్పించుటయును, నిర్బంధించుటయును కార్యసాధనము గాజాలదు. ఖద్దరువ్యాప్తికి రెండవ ప్రతిబంధకము ధనాభావము. గాంధీ మహాత్మునకు ఖద్దరునిధికై ఆంధ్ర దేశము 2, 2000 రూప్యములను సమర్పించి ఖద్దరు నందు గల విశ్వాసాభిమానములను సువ్యక్తము చేసినది. కాని ఖద్దరువ్యాప్తి కవసరమైన ద్రవ్యములో నీద్రవ్యము సహస్రాంశమైనను గాజాలదు. అన్ని మండలములయందును ఖద్దరు వ్యాప్తికిగల యవకాశములను గాంధీ మహాత్ముడు గ్రహించిన విధము వారి ప్రసంగములు విశదము చేసినవి. ఖద్దరుప్రచారకులు ఖద్దరువ్యాపనము చేయ గల విధానమును తయారుచేసి గాంధీమహాత్మునకు సమర్పించిరి. అఖిలభారతచరఖాసంఘము కేంద్రీకరణవిధానమును విధించుచున్నది. కేంద్రీకరణవిధానము కొన్ని రాష్ట్రములకు ప్రయోజనకర మైనను అన్ని రాష్ట్రములకును నీ మార్గమన్వయింప జేయుట ధర్మము గాదు. ఆంధ్ర దేశపరిస్థితులకును నితర దేశపరిస్థితులకును గల భేదమును గమనించి తదనుగుణముగ కార్యవిధానమును నిర్ణయించుట ప్రయోజనకరము. దేశ పరిస్థితుల నెరుగనివారల కిది రుచింపకపోయినను తెలిసినవారి విధానమును విశ్వసించుట యవసరము. కేంద్రీకరణవిధానము వ్యక్తుల నిర్మాణమునకు ప్రతిబంధకముగ నేర్పడుచున్నది. ఆంధ్ర దేశమునందు ఖద్దరువ్యాపనమునకు గల యవకాశములను బాగుగ వికసింప జేయుటకు వ్యక్తుల సహాయము సాధనముగనున్నది. వ్యక్తులకును ప్రత్యేకసంస్థలకును పోషణ మొసంగుటవలన ఖద్దరు విశేషముగ వ్యాపించుటకు వీలుగలదు కాని కేంద్రీకరణ విధానమువలన విశేషముగ వ్యాపించుటకు వీలులేదు. ఆంధ్ర దేశము ఖద్దరువ్యాపనము జేయుటకు విశేషమైన ద్రవ్యము గావలసియున్నది.

చరఖానంఘ మెటులు నిర్ణయించినను ఆంధ్ర ప్రజానాయకులు ఖద్దరువ్యాపనమునకై ధనమును సనుకూర్చుటయును, కట్టుబాట్లు జేయుటయును గాంధీమహాత్ముని సంచారమునందు వారి ప్రసంగములును ప్రచారకుల ప్రసంగములును విశదము జేసినవి. ఆ యనుభవమున కనురూపముగ ప్రజానాయకులు పాటుపడుట ప్రయోజనకరము. గాంధీ మహాత్మ డాంధ్రదేశసంచారవిషయమై తెలిపిన భావములు ఆంధ్రులు గర్వపడుటకు వలెనే వారి భారనిర్వహణమునకును లక్ష్యములుగ నున్నవి. "ఆంధ్రదేశసంచారము నాకు పరమానందమును గలుగజేసినది.........దేశభక్త వెంకటప్పయ్య పంతులుగారివంటి సంచారనిర్వాహకులును,ఆంధ్రులవంటిప్రజలును, ఉన్నప్పుడిట్టి సంచారముల నెన్నిటి నైనను పరమానందముతో చేయగలను" అని యంగ్ ఇండియా యందు మహాత్ముడు తెలిపిన భావములు ఆంధ్రులు గ్రహించి భావికర్తవ్యమును నిర్వహించెదరుగాక.

* * * *

నిర్మాణ కార్యవిధానము

ప్రవృత్తియందు సంకల్పసిద్ధికి వ్యవసాయ పరాయణత్వము సాధనముగనున్నది. సామాన్యముగ సంకల్పము గలిగినంత మాత్రమున కార్యములు సాధ్యములు గావు. గాంధీమహాత్ముడు ఖద్దరునిధి వసూలుచేయుటకును ధర్మోపదేశములను చేయుటకును జేయుచున్న పరిశ్రమ ప్రజలకును, నాయకులకును జ్ఞానోపదేశము జేయుటకు లక్ష్యముగా నుండగలదు. తెల్లవారుజామున మూడుగంటలకులేచి రాత్రి 10 గంటలవరకును విసుగు విరామములేక నిర్వహించెడి కార్యభారము సకల జనులకును భయభ్రాంతుల గలుగజేయుచున్నది. మహాత్ముని స్థితప్రజ్ఞయే వారి నిర్వహణసామర్థ్యమునకు మూలబీజము. గాంధీ మహాత్ముడు మనోగతములైన రాగద్వేషములను విసర్జించి స్వధర్మనిర్వహణము జేయుచు ధర్మానుష్ఠానమును జేయవలసిన విధమును ప్రత్యక్షముగ లోకమునకు బోధించుచున్నాడు. సేవాధర్మమునకు సత్సంకల్పము మూలము. లాభనష్టములు మూలములుగావు. సత్సంకల్పమును వ్యవసాయ పరాయణత్వమును గలిసినపుడు భాగ్యదేవత సామాన్యముగ ప్రత్యక్ష మగుచుండును.గాంధీమహాత్ముడుసులభముగ ఖద్దరు నిధికి ద్రవ్యమును సమకూర్చుట వారి సంకల్పమునకనురూపమైనకార్యనీతునువిశదము చేయుచున్నది. ప్రజలుఖద్దరునిధికి జూపిన యుత్సాహమునే అస్పృశ్యతా నివారణమునకును, మద్యపాన నిషేధమునకును, జాతీయసంయోగమునకును జూపి కామితార్థములను బడయుదురుగాక. కార్యవిధానమునందు చిత్తప్రవృత్తి లగ్నముగానపు డనంత విధములను చిత్తవృత్తి ప్రసరించు చుండును. గాంధీమహాత్ముని నిత్యజీవయాత్ర సకల జనులకును జీవయాత్రను జేయవలసిన విధమును సువ్యక్తము చేయుచున్నది. స్వరాజ్యసంపాదనమున కాత్మవిశ్వాసమునకు సాధనమైన నిర్మాణవిధానము

వలెను ప్రసంగరంగములైన శాసనసభలు సాధనములు గావని గాంధీమహాత్ముని సంచారము విశదము చేసినది. మహాత్ముని దయవలన గలిగిన యీ యనుభవము సార్థకమగునని నమ్ముచున్నాము.

* * * *

శాసనసభలు

శాసనసభలు సహజముగ నీయేడంతము నొందుననియును, క్రొత్తసభ లేర్పడుటకేర్పాటులు జరుగుననియు నాయకులూహించుచుండిరి. రాజప్రతినిధి పండిత మోతీలాలు నెహ్రూగారి కీవిషయమై అభయమొసంగినటులు వార్తలు తెలుపుచున్నవి. సామ్రాజ్య శాసనసభయందీ విషయమై చర్చకవకాశములను లేకుండచేసి శాసనసభల కాలమును పెంచుట యుక్తముగాదు. పండిత మోతీలాలు నెహ్రూగారు వేసిన సవాలునకు ఇర్విను ప్రభువు గారు తగినసమాధానమును చెప్పుట సాధ్యముగాదు. ప్రజాభిప్రాయమును వ్యక్తము జేయుట కవకాశములను నిరోధించుటయును, సభాకాలమును విస్తరింప జేయుటయును న్యాయసమ్మతము గాదు. ఇర్విను ప్రభువు తన యభిప్రాయమును మార్చుకొనినటులు తెలుపుట సహజమైనను నెహ్రూగారి ప్రశ్నకు తగిన సమాధానము గాదు. ఇట్టిసందర్భములందు శాసనసభ్యు లవలంబించవలసిన కార్యవిధానము దురూహ్యముగ నున్నది. శాసనసభావ్యవహారముల పట్ల కాంగ్రెసు పక్షములందు గల భేదాభిప్రాయములు సర్వత్ర తెలిసియున్నవి. శాసనసభాప్రవేశమునే ప్రతిఘటించెడి పక్ష మిప్పటికిని గలదు. శాసనసభాప్రవేశమును జేయుటయును, ప్రతిఘటించుటయును కాంగ్రెసు అవలంబించుచున్న నీతియై యున్నది. ఉద్యోగస్వీకారము నామోదించెడి పక్షమును గలదు. ఇన్ని పక్షములున్న పుడు సభ్యులకు వారి కర్తవ్యమును నిర్ణయించుట సులభసాధ్యము గాదు. మోతీలాలు నెహ్రూగారును కార్యనిర్వాహక వర్గమును సభానిర్గమనమును నిర్ణయించిరి. ఒక పూట శాసనసభనుండి లేచిపోవుట రెండవ పూట తిరిగి సభకుబోవుట రాజనీతిగాని,ధర్మమార్గముగాని కాజాలదు. ప్రజలకును, సభ్యులకును నీ మార్గము రుచింప జాలదు. వర్తమాన సభలున్నంతకాలమును మానుటయో, హాజరగుటయో ప్రయోజనకరముగాని ఇష్టానుసారము హాజరుకాకుండుటయును, వెడలిపోవుటయును ప్రయోజనకరము గాదు. ఒక భాగమువారు ఉద్యోగస్వీకారమును గోరుచుండగ ఇంకొక భాగమువారు సభాబహిష్కారమును గోరుట నిరర్థకము. నాయకుల యహంభావ మిట్టి యసంబద్ధములకు మూలముగ నున్నది. గాంధీమహాత్మునివలెనితరనాయకులును రాజ్యాంగ రంగములందు త్యాగనిగ్రహ సాధనముల నవలంబించుట కార్యసిద్ధికి సాధనముగా గలదు. బొంబయియందు గూడిన అఖిలభారత కాంగ్రెసుకమిటి సమావేశమునందు గాంధి మహాత్ముడు ప్రతిపాదించిన తీర్మానము సకల పక్షాదరమును బొందదగియున్నది. సభ్యులు లేని

కాం[గెసునంస్థలు నిరుపయోగములై కేవలము స్పర్ధలకును కలహములకును కారణంబు లగుచున్నవి.

శాసనసభ్యు లందరును సభలను విడిచి నిర్మాణ కార్యమును సాధించుటకై పాటుపడుట పరమప్రయోజనకరముగనుండగలదు. అఖిలభారత కాం[గెసుసంఘము బొంబయియందామోదించిన తీర్మానము విశేషమైన ప్రచారమును గోరుచున్నది. కాం[గెసు సంఘముల పునరుద్ధరించుటకును, సభ్యులను జేర్చుటకును నాయకులును, ప్రచారకులును గావలసియున్నారు. ప్రజల యందు 400 మందికి ఒకరి చొప్పున కాం[గెసు సభ్యునిగా జేయుటకు గాంధీ మహాత్ముడు ప్రతిపాదించిన తీర్మానము గోరుచున్నది. నిర్ణయించిన విధమున సభ్యులను జేర్చని రాష్ట్రీయ సంఘములు, మండల సంఘములు, తాలూకా సంఘములు కాం[గెసు సంబంధమునుండి తొలగింపబడును. కాం[గెసు సభ్యులు నీతి నియమము లేక ప్రవర్తించుచున్న విధము సర్వత్ర తెలిసియున్నది. సిద్ధాంతమునందు కాం[గెసు సభ్యత్వమును వ్యవహారమునందు ప్రభుత్వ సహకారమును జేసెడి సభ్యులు గలరు. ఇట్టి ద్వంద్వప్రవృత్తులకు బుద్ధి చెప్పుట కేర్పాటులు చేయుటయు యుక్తముగ నున్నది. కాం[గెసునంఘములను పతితస్థితినుండి యుద్ధరించుటకు బొంబయియందు జేసిన తీర్మానములు యుక్తముగ నున్నను ప్రయోగమునందు గలిగెడి ఫలము కాం[గెసు ప్రతిష్ఠను నిరూపించుచున్నది. కాం[గెసుసంఘముల నుద్ధరించుటకు వలెనే విదేశవస్త్ర బహిష్కరణోద్యమమును మద్యపాన నిషేధప్రచారమును జాతీయపతాకోత్సవములను వ్యాపింప జేయుటకు నాయకులు, ప్రచారకులు గావలసియున్నారు. ఇర్విను ప్రభువు చూపిన నిరసన భావమువలననైనను నాయకులు తమ లక్ష్యమును శాసనసభలనుండి నిర్మాణ విధానమునందు లగ్నము చేయుటకు బూనుకొనిమెదరని నమ్ముచున్నాము. శాసనసభల కాలపరిమితిని పెంచుటవలననైనను నుద్యోగస్వీకార సమస్య వెనుకబడుట కాం[గెసు ప్రతిష్ఠను వృద్ధి చేయగలదు. అంతఃకలహములతోను భిన్నభావములతోను గూడిన కాం[గెసు కార్యసిద్ధికి ప్రయోజనకరము గాదు. ప్రజలందరును భేదభావముల విసర్జించి కాం[గెసుసంఘములందు జేరి కాం[గెసు ఆదేశములను త్రికరణశుద్ధిగా శిరసావహించుచు కామితార్థములను బడయుదురు గాత!

*   *   *   *

## బ్రిటీషుపార్లమెంటు ఎన్నికలు

పార్లమెంటు ఎన్నికల ఫలిత మన్ని పక్షములవారికిని సంభ్రమమును గలుగ జేసినది. లేబరుపక్షమునకు విజయము గలిగినను వ్యవహరించుటకు దగినబలము గలుగలేదు. పార్లమెంటునందు గల 615 గురు సభ్యులందును నింతవరకును 287 మంది లేబరుపక్ష సభ్యులెన్నుకొనబడిరి; కన్సర్వేటివులు 254, లిబరలులు 57, ఇండిపెండెంటులు 8 మందియు నెన్ను

కొనబడిరి. శేషించిన 9 మందియును కన్సర్వే టివు లిబరలు పక్షమువారే రావచ్చును. కన్సర్వేటివు పక్షమునకన్నను లేబరుపక్షము బలీయముగనున్నను కీలకము లిబరలు పక్షము వశమునందున్నది. వారి 57 సమ్మతుల మీాదను రాజ్యాంగవిధాన మాధారపడియున్నది. లిబరలు పక్ష నాయకుడు లాయిడు జార్జిగారు తమ పక్షబలమును సద్వినియోగము చేయున టులు ప్రకటించినను వారి ప్రకటనలందు విలువయుండదు. ఏ యాదర్శమునులేని లిబరలు పక్షము వెనుకబడుట సమంజసముగనున్నది. లేబరుపక్ష విజయమునకు స్త్రీలవోట్లు తోడ్పడి నవిధమును రామ్సెమాక్డొనాల్డుగా రంగీకరించిరి. వోటర్లయందు స్త్రీలు 1,51,65,400, పురుషులు 1,36,54,600 కలరు. స్త్రీల వోట్లు లేబరుపక్ష విజయమునకును స్త్రీలవిజయమునకును వినియోగపడినవి. స్త్రీలు పార్లమెంటు సభ్యులుగా నెన్నుకొనబడిరి. లిబరలు పక్షము వలన లేబరుపక్షమునకు సందిగ్ధస్థితి యేర్పడినది. లేబరుపక్షము పరిపాలనమునకు బూనుకొనినను బలములేక చిరకాలము నిలువజాలదు. రామ్సెమాక్డొనాల్డుగారు రెండేండ్ల కాలము పరిపాలించుటకు వీలుగలదని నమ్మినను ఏ క్షణమున నేమి సంప్రాప్తమగునో చెప్పుటకు వీలులేదు. లేబరుపక్షముమీాద భారతీయుల దృష్టి లగ్నమైనను వారి స్వల్పబలస్థితి వలన, వారి పక్షమునకును, భరతవర్షమునకును ప్రయోజనము గలుగజాలదు. లిబరలు పక్షము లేబరుపక్షమువారి సదుద్దేశములను నిష్ఫలము చేయుట సహజము. లేబరుపక్షము పరిపాలనాభారమును వహించినను తగిన బలములేకపోవుటవలన విశేషమైన రాజ్యాంగ సంస్కరణములను స్వదేశమునందును సామ్రాజ్యాంతర్భాగములందును తలపెట్టజాలదు. రాగల ఎన్నికలకు ఎత్తులనువేయుటతోడను, స్వీయాధికారమును సమర్థించుకొనుటతోడను లేబరుపక్షమునకు కాలము సరిపోవును. స్వదేశమునందే సంస్కరణములు సాధ్యముగానపుడు భరతవర్షము విషయమై చెప్పవలసిన యవసరములేదు.

*　　*　　*　　*

లేబరుపక్షము-భరతవర్షము

గ్రేటు బ్రిటనునందే పక్షము పరిపాలనాభారము వహించినను భరత వర్షమునకు సమానప్రయోజనమే కలుగుచున్నది. అధికారములేని సమయమునందు బోధించెడి నీతులన్నియును అధికారమురాగానే మాయమైపోవును. ధర్మోపదేశములను జేసెడి ఓలివియరు ప్రభు వధికారసింహాసనము నెక్కిన వెంటనే నిర్బంధప్రస్థానము నారంభించెను. భరత వర్షము బ్రిటీషు సామ్రాజ్యమునందు బ్రిటీషు ప్రయోజనములకై యేర్పడినది; భారతీయ ప్రయోజనములకై యేర్పడలేదు. బ్రిటీషుప్రయోజనములకు భరతవర్షము తోడ్పడునంత వరకును భారతీయుల రాజభక్తి కంతము గనుపడదు. భారతీయ ప్రయోజనములను తలపెట్టిన తోడనె రాజద్రోహము పొడకట్టుచుండును. సద్భావముతో భారతీయాశయములను హర్షిం

చెడి బ్రిటీషు రాజ్యాధికారులు గనుపడుట దుర్లభము. దయాధర్మముతో భిక్షము పెట్టుట కభ్యంతరము లేకపోయినను భారతీయుల స్వాతంత్ర్యవాంఛ బ్రిటీషు ప్రజల కెవరికిని గిట్టదు. ఇటీవల జరిగిన పార్లమెంటు ఎన్నికల యందు మచ్చునకైనను భారతీయ ప్రయోజనముల నేపక్షమువారును తలపెట్టలేదు. ఎవరైనను తలపెట్టినతోడనె సైడనుహాములు, ఓడ్వయరులు దండయాత్ర కుపక్రమించుదురు. రామ్సెమేక్డొనాల్డు, బాల్డువిను, లాయడుజార్జి గారులు భారతీయులపట్ల సమాన ప్రేమనే చూపుచుందురు. లేబరుపక్ష విజయము భారతీయులకు సంతసమును గలుగజేసినను ప్రయోజనము మాత్రము గలుగదు. భారతీయుల మోక్షము వారి హస్తములందు గాని పార్లమెంటుపక్షములమీద లేదు. భారతీయులు విదేశవస్త్రబహిష్కారమును సఫలము చేసిన బ్రిటీషుపార్లమెంటులోని అన్ని పక్షములవారును కన్నులు తెఱచి భారతీయాశయములను హర్షించుట సహజము. భారతీయుల సంకల్పసిద్ధికి సాధనము వారి హస్తములందు గలదుగాని శాసనసభలయందును పార్లమెంటునందును లేదు. భారతీయు లాత్మబలమును వ్యక్తము చేసినపుడే శాసనసభలును, పార్లమెంటులును ఉపచరించును. ముప్పదిమూడు కోట్ల ప్రజలు గట్టిగా తలపెట్టినపనులు వ్యర్థముగాజాలవు. భారతీయులందరును గాంధీమహాత్మునివలెనే నిరంతర వ్యవసాయ పరాయణులై ఆత్మోద్ధరణమునకును, దేశోద్ధరణమునకును, లోకోద్ధరణమునకును వారిశక్తిసామర్థ్యముల వినియోగించి కృతార్థు లగుదురు గాత!

---



Printed and Published by K. Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras

# AMRUTANJAN

## BEST INDIAN PAIN BALM

అమృతాంజనము



अमृतांजन

அமிர்தாஞ்சனம்



امرتانجن

## BEWARE OF IMITATIONS!!!

## AMRUTANJAN DEPOT

BOMBAY & MADRAS.



ANDHRA PATRIKA PRESS, MADRAS.

